శ్రీరస్తు.

# శ్రీ భవిష్యమహాపురాణము

## బ్రాహ్మపర్వము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1938

# వి ష య సూ చి క.

| అధ్యాయసంఖ్య. | విషయము. | పుటసంఖ్య. |
|---|---|---|

| అధ్యాయసంఖ్య. | విషయము. | పుటసంఖ్య. |
|---|---|---|
| 145 | సప్తమీకల్పమునందు భోజకజ్ఞానవర్ణనము ... | 763 |
| 146 | సప్తమీకల్పమునందు సాంబోపాఖ్యానంబున భోజకవర్ణనము | 767 |
| 147 | సప్తమీకల్పమునందు సాంబోపాఖ్యానంబున భోజకలక్షణవర్ణనము | 770 |
| 148 | సప్తమీకల్పమునందు సాంబోపాఖ్యానంబున కలాచక్రవర్ణనము | 775 |
| 149 | సప్తమీకల్పమునందు సాంబోపాఖ్యానంబున సూర్యదీక్షావర్ణనము | 779 |
| 150 | సప్తమీకల్పమునందు సాంబోపాఖ్యానంబున ఆదిత్యపూజావిధివర్ణనము | 786 |
| 151 | సప్తమీకల్పమునందు సౌరధర్మవర్ణనము ... | 789 |
| 152 | సౌరధర్మములందు ప్రశ్నవర్ణనము ... | 793 |
| 153 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున సూర్యతేజోవర్ణనము... | 795 |
| 154 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున త్రయ్యుపాఖ్యానము... | 806 |
| 155 | సప్తమీకల్పమునందు సౌరధర్మనిరూపణము ... | 810 |
| 156 | సప్తమీకల్పమునందు త్రైసురోపాఖ్యానవర్ణనము ... | 818 |
| 157 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున సూర్యావతారకథా ప్రస్తావవర్ణనము ... | 821 |
| 158 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో సూర్యోత్పత్తివర్ణనము | 827 |
| 159 | సప్తమీకల్పమునందుభయసప్తమీమాహాత్మ్యమున సూర్యావతారవర్ణనము ... | 832 |
| 160 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో బ్రహ్మాదుల సూర్యరూపదర్శనవర్ణనము ... | 835 |
| 161 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున సూర్యపూజాఫల ప్రశ్నవర్ణనము ... | 840 |
| 162 | సప్తమీకల్పమునందు సౌరధర్మవర్ణనము ... | 842 |
| 163 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలోఁ బుష్పపూజావర్ణనము | 848 |
| 164 | సప్తమీకల్పమునందు సూర్యషష్ఠీవ్రతవర్ణనము ... | 853 |
| 165 | సప్తమీకల్పమునందుభయసప్తమీవర్ణనము ... | 870 |
| 166 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున నిక్షుభావ్రతవర్ణనము... | 875 |
| 167 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున నిక్షుభార్కవ్రతము ... | 877 |

| అధ్యాయసంఖ్య. | విషయము. | పుటసంఖ్య. |
|---|---|---|
| 168 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున కామపదస్త్రీవ్రతవర్ణనము | 879 |
| 169 | సప్తమీకల్పమునందు సూర్యవ్రతవర్ణనము ... | 884 |
| 170 | సప్తమీకల్పమునందు గోదానవర్ణనము ... | 886 |
| 171 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున భోజకభోజనానుష్ఠానవర్ణనము | 887 |
| 172 | సప్తమీకల్పమునందు సౌరధర్మము ... | 893 |
| 173 | సప్తమీకల్పమునందు గరుడారుణసంవాదమున సౌరధర్మవర్ణనము | 899 |
| 174 | సప్తమీకల్పమునందు గరుడారుణసంవాదమున సూర్యస్తుతి ... | 902 |
| 175 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో సూర్యాగ్నికార్యము | 907 |
| 176 | సప్తమీకల్పమునందు సౌరధర్మము ... | 912 |
| 177 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున దశముఖాగ్నికార్యవిధి | 913 |
| 178 | సప్తమీకల్పమునందు సౌరధర్మవర్ణనము ... | 916 |
| 179 | సప్తమీకల్పమునందు సౌరధర్మవర్ణనము ... | 922 |
| 180 | సప్తమీకల్పమునందు గరుడారుణసంవాదమున శాంతికవర్ణనము | 927 |
| 181 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో వరుణాదిత్యసంవాదమున స్మృతిభేదవర్ణనము ... | 933 |
| 182 | సప్తమీకల్పమునందు సూర్యారుణసంవాదమున వివాహవిధివర్ణనము | 938 |
| 183 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున శ్రాద్ధవిధికథనము ... | 947 |
| 184 | సప్తమీకల్పమునందు సూర్యాదిత్యసంవాదమున బ్రాహ్మణధర్మవర్ణనము | 951 |
| 185 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున వరుణాదిత్యసంవాదమున మాతృశ్రాద్ధవిధివర్ణనము ... | 957 |
| 186 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో శుద్ధిప్రకరణవర్ణనము | 961 |
| 187 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున ధేనుమాహాత్మ్యవర్ణనము | 967 |
| 188 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో భోజకసత్కారవర్ణనము | 977 |
| 189 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో సప్తాశ్వానూరుసంవాదము | 980 |
| 190 | సప్తమీకల్పమునందు సౌరధర్మములలో సూర్యానూరుసంవాదము | 987 |
| 191 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున సప్తాశ్వతిలకారుణసంవాదము | 989 |
| 192 | సప్తమీకల్పమునందు సౌరధర్మమున సప్తాశ్వతిలకానూరుసంవాదము | 992 |

శ్రీ ర స్తు.

ఓం న మో భగవతే వాసుదేవాయ.

# శ్రీ భవిష్యమహాపురాణము

## బ్రాహ్మ పర్వము.

శ్రీనరనారాయణులకుఁ బ్రణమిల్లి, శ్రీశారదాదేవికి జోహారు లొనర్చి, శ్రీవేదవ్యాసమహర్షికి మ్రొక్కులిడి యనంతరము జయముం గూర్చి వక్కాణించుటకుఁ దలపెట్టవలయును.

తొల్లి యొకనాఁడు భృగువు, నత్రియు, వసిష్ఠుండుఁ, బులస్త్యుఁడు, పులహుఁడుఁ, గ్రతువుఁ, బరాశరుఁడు, వ్యాసుండును, సుమంతుఁడు, జైమిని, పైలుండును, యాజ్ఞవల్క్యుండు, గౌతముఁడును, భరద్వాజుఁడును, నారదుఁడు, పర్వతుఁడు, వైశంపాయనుండు, శౌనకుఁడును, దక్షుండు, నంగిరసుఁడు, గర్గుండును, గాలవుఁడును నను మునిపుంగవులు జనమేజయునిపుత్త్రుఁడగు శతానీకునిఁ జూచుటకై కరినగరమున కరిగిరి. అమ్మహీకాంతుఁడును వారిరాక యెఱింగి సామాత్యపురోహితుండై యెదురేగి యతిథిసత్కారంబు లుచితరీతి నొనరించి తోడ్తెచ్చి యుచితాసనంబుల నాసీనులంగావించి వారిచే ననుజ్ఞాతుఁడై తాను గూడ నిజాసన మధిష్ఠించి

---

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్, దేవీం సరస్వతీం వ్యాసం, తో జయ ముదీరయేత్. ౧. శ్రియావృతం తు రాజానం శతానీకం మహాబలమ్, భిజగ్ముర్మహాత్మానః సర్వే ద్రష్టుం మహర్షయః. ౨. భృగురత్రిర్వసిష్ఠశ్చ పులస్త్యః లహః క్రతుః, పరాశరస్తథావ్యాసః సుమంతుర్జైమినిస్తథా. ౩. మునిః పైలో యాజ్ఞ ల్క్య గౌతమస్తు మహాతపాః, భారద్వాజో మునిర్ధీమాంస్తథా నారదపర్వతౌ. ౪. ైశంపాయనో మహాత్మా శౌనకశ్చ మహాతపాః, దక్షోఽంగిరాస్తథా గర్గో గాలవశ్చ తపాః. ౫. తానాగతాన్నృపశ్రేష్ఠ దృష్ట్వా శతానీకో మహీపతిః, విధివత్పూజయామాస అభిగమ్య మహామతిః. ౬. పురోహితం పురస్కృత్య అర్ఘ్యేం గాం స్వాగతేన చ, పూజ యిత్వా తతః సర్వాన్ప్రణమ్య శిరసా భృశమ్. ౭. సుఖాసీనాంస్తతో రాజా తంకాన్క్ష తక్షమాన్, ఉవాచ ప్రణతో భూత్వా బాహుముద్ధృత్య దక్షిణమ్. ౮.

సవినయముగ, "ఓమునిపుంగవులారా! భవదీయనామస్మరణమాత్రము ననే మానవులు నిఖిలదురితంబులఁ బాసి సుఖింతురు. అట్టియెడ మీరే స్వయముగ నిటకేతెంచుట నాయందలి యపారకరుణచే నన్నుఁ గృతార్థి కరించుటకేగాని వేరేమియు లేదని భావింతు. దానంజేసి నాపుట్టువు ఫలించె. ధన్యతముఁడ నైతిని. మీకారుణ్యముకతన నాయశం బజాం డము నిండె. అయిన నొక్కటి వేఁడెద. పరమగతిప్రాపకమ యి యుత్త మోత్తమంబులగు ధర్మశాస్త్రంబులంగల పరమరహస్యముల [illegible]ంచి నన్నుం గృతార్థుం జేయుఁడు. మున్ను మదీయజనకుం [illegible]త్తమంబగు భారతాఖ్యానంబు విని దురితదూరుఁడయి పరమపదము నొందె. అట్టులే యేను నీధర్మశాస్త్రరహస్యంబులు భవన్ముఖంబున నెఱింగి కృతకృత్యుండ నౌదు." అన, విని యమ్మునులందఱు మహానందము నొంది యేకాభి ప్రాయులై, "రాజేంద్రా! సకలమునిపూజనీయుఁడగు నీవ్యాసమునీం ద్రుఁడు మాకెల్లరకు గురువు. గురుసమక్షమున నెంతటివాఁడయ్యును శిష్యుఁడు ధర్మోపదేశ మొనర్చుట కర్హుండు గాఁడు. తత్సన్నిధి శిష్యునకు సంకోచకరమగుటచే సమర్థుఁడును గాఁజాలఁడు గదా! మేము నట్టివారమే. కావున సర్వజ్ఞుఁడగు నమ్మహాత్మునియనుగ్రహంబు వడసి నీయిష్టము దీర్చు కొనుము." అని, "మఱియు నిమ్మహాత్ముఁడు లోకానుగ్రహకాంక్షతో భార

---

ఇదానీం సఫలం జన్మ మన్యేఽహం భువి సత్తమాః, ఆత్మనో ద్విజశార్దూలా స్తథా కీర్తిర్యశో బలమ్. ౯. ధన్యోఽహం పుణ్యకర్తా చ యతో మాం ద్రష్టుమాగతాః, యేషాం స్మరణమాత్రేణ యుష్మాకం పూయతే నరః. ౧౦. శ్రోతుమిచ్ఛామ్యహం కించిద్ధర్మశాస్త్రమనుత్తమమ్, ఆనృశంస్యం సమాశ్రిత్య కథయధ్వం మహాబలాః. ౧౧. యేనాహం ధర్మశాస్త్రం తు శ్రుత్వా గచ్ఛే పరాం గతిమ్, యథా గతో మమ పితా శ్రుత్వా వై భారతం పురా. ౧౨. తథోక్తాస్తేన రాజ్ఞా వై బ్రాహ్మణాస్తే సమంతతః, సమాగమ్య మిథస్తే తు విమృశ్య చ భృశం తదా. ౧౩. పూజయిత్వా తతో వ్యాస మిదం వచనమబ్రువన్, వ్యాసం ప్రసాదయ విభో ఏష తే కథయిష్యతి. ౧౪. తిష్ఠ త్యస్మిన్మహాబాహో వయం వక్తుం న శక్నుమః, తిష్ఠమానే గురౌ శిష్యః కథం వక్తి మహామతే. ౧౫. అయం గురుః సదాస్మాకం సాక్షాన్నారాయణస్తథా, కృపాలుశ్చ తథా చాయం తథా దివ్యవిధానవిత్. ౧౬. చతుర్ణామపి వర్ణానాం పావనాయ మహాత్మనామ్, ధర్మశాస్త్రమనేనోక్తం ధర్మాద్యైః సుసమన్వితమ్. ౧౭. బిభేతి గహనా చ్ఛాస్త్రాల్లోకో వ్యాధిరివౌషధాత్, భారతస్య చ విస్తారో మునినా వ్యాహృతః

తామ్నాయంబు రచించి యుండె. అయ్యది యాస్తిక్యసౌధంబునకు సోపానంబుపగిది నొప్పుచుండు. స్వర్గప్రాప్తిసాధనంబుల నుపదేశించును. నరకమార్గంబుల నివారించును. తీర్థతపోదేవతాదిమాహాత్మ్యంబుల నెఱింగించును. విష్ణుపారమ్యమును బోధించును. దేవబ్రాహ్మణభక్తి నొదవించును. వేదప్రామాణ్యంబు దిరమొనరించును. ధర్మార్థకామమోక్షములస్వరూపమును [?]త్సాధనోపాయంబుల వివరించును. యాదవపాండవచరిత్రంబుల

ఖిలదుఃఖముల నివారించును. అఖిలసుఖముల నాపాదించును. పుణ్యకార్యప్రవృత్తిని బాపకార్యనివృత్తి నుపదేశించును. మోక్షపథంబును విశదీకరించును. లోకంబునఁ గుశలుండగు చికిత్సకుఁడు ప్రియము పథ్యము నగు నౌషధమున రోగంబులఁ బాపి ప్రాణులకు సౌఖ్యములఁ గూర్చుభంగి నిమ్మహాత్ముని భారతామ్నాయంబు రమ్యంబులు శాసకంబులు నగు నుపదేశంబులచే మానవుల గతకల్మషులఁ గావించి కష్టంబులఁ బారఁద్రోలి సకలశ్రేయంబుల నొడఁగూర్చు" నని పలికిరి. అప్పలుకు లాలించి శతానీకుండు వ్యాసమహర్షిని బూజించి నిటలఘటితాంజలిపుటుండై యిట్లనియె.

"మహాత్మా! నిర్మలంబులగు ధర్మోపదేశములచే సంసారసాగరనిమగ్నుండ నగు నన్నుద్ధరించి కృతార్థుం జేయవే. తొల్లి మదీయజనకుం

---

స్వయమ్. ౧౮. యథా స్వాదు చ పథ్యం చ దద్యాత్స్వం భిషగౌషధమ్, తథా రమ్యం చ శాస్త్రం చ భారతం కృతవాన్మునిః. ౧౯. ఆస్తిక్యారోహసోపానమేతద్భారతముచ్యతే, తచ్ఛ్రుత్వా స్వర్గనరకౌ లోకః సాక్షాదపేక్షతే. ౨౦. దేవతాతీర్థతపసాం భారతాదేవ నిశ్చయః, న జన్యతే నాస్తికతా తస్య మీమాంసకైరపి. ౨౧. విష్ణౌ దేవేషు వేదేషు గురుషు బ్రాహ్మణేషు చ, భక్తిర్భవతి కల్యాణీ భారతాదేవ ధీమతామ్. ౨౨. ధర్మార్థకామమోక్షాణాం భారతాత్సిద్ధిరేవ హి, అజిహ్మో భారతః పంథా నిర్వాణపదగామినామ్. ౨౩. మోక్షధర్మార్థకామానాం ప్రపంచో భారతే కృతః, అసిత్యతాపసంతప్తా భవంతి తస్య ముక్తయే. ౨౪. విపత్తిం భారతాచ్ఛ్రుత్వా పృష్ణిపాండవసంపదామ్, దుఃఖావసానాద్రాజేంద్ర పుణ్యాం చ సంశ్రయేద్బుధః. ౨౫. ఏవంవిధం భారతం వై ప్రోక్తం యేన మహాత్మనా, సోఽయం నారాయణః సాక్షాద్వ్యాసరూపీ మహామునిః. ౨౬. స తేషాం వచనం శ్రుత్వా ప్రతాపీ యో మహీపతిః, ప్రసాదయామాస మునిం వ్యాసం శాస్త్రవిశారదమ్. ౨౭. శతానీక ఉవాచ:— అంజలిః శిరసా బ్రహ్మన్కృతోఽయం పాదయోస్తవ, బ్రూహి మే ధర్మశాస్త్రం

డగు జనమేజయుండు భవత్ప్రభావంబుకతన గాదే కృతార్థుఁడయ్యె"నని యర్థింపఁ, గరుణాతరంగితచిత్తుఁడై వ్యాసమునీంద్రుఁడు సాదరముగ నిట్లనియె:—"రాజేంద్రా! మున్ను మాశిష్యుఁడగు వైశంపాయనుఁడు నీజనకునకుఁ బవిత్రంబగు భారతామ్నాయంబు మాయానతి నెఱింగించి యుండె. ఇప్పుడును మాశిష్యుఁడగు సుమంతుఁడు భవదభిమతంబులగు ధర్మంబు లెఱింగించి నీయభిమతము నీడేర్పఁగలవాఁడు."

అన విని యచ్చటిమునులందఱు నారాజు నీక్షించి "యో..., ...చూడామణీ! గురువర్యునానతిచొప్పున సకలశాస్త్రవిశారదుఁడగు నీసుమంతుఁడు నీయభీష్టము దీర్పంగలవాఁడు. కావున నాతనిఁ బ్రార్థింపుము. మాకును విన వేడుక యయ్యెఁడు" మనిరి. పిదప వ్యాసభగవానుఁడు సుమంతు నీక్షించి "యీరాజున్యనకు భారతాదికథల నెద్ది యిష్టం బద్దాని వినిపింపు" మని యానతిచ్చెను. ఆతండు నట్టులే యని గురునాజ్ఞ దల దాల్చి తక్కటిమునులయనుమతి వడసి యుపన్యసింప సన్నద్ధుండయ్యె. అంత శతానీకుఁడును సుమంతు నుచితరీతిని బూజించి సాష్టాంగప్రణామం బాచరించి, "మునిసత్తమా! ధర్మసూక్ష్మము లెఱింగించి సకలపాపప్రణాశ

యేనాహం పూతతాం వ్రజే. ౨౮. సముద్ధర భవాదస్మాత్కీర్తయిత్వా కథాం శుభామ్, యథా మమ పితా పూర్వం కీర్తయిత్వా తు భారతమ్. ౨౯. తస్యైతద్వచనం శ్రుత్వా వ్యాసో వచనమబ్రవీత్, ఏష శిష్యః సుమంతుస్తే కథయిష్యతి తే ప్రభో. ౩౦. యదిచ్ఛసి మహాబాహో ప్రీతిదం చాద్భుతం శుభమ్, శ్రవ్యం భరతశార్దూల సర్వపాపభయాపహమ్. ౩౧. యథా వైశంపాయనేన పురా ప్రోక్తం పితుస్తవ, మహాభారతవ్యాఖ్యానం బ్రహ్మహత్యావ్యపోహనమ్. ౩౨. అథ తమృషయః సర్వే రాజాన మిదమబ్రువన్, సాధు ప్రోక్తం మహాబాహో వ్యాసేనామితబుద్ధినా. ౩౩. సుమంతుం పృచ్ఛ రాజర్షే సర్వశాస్త్రవిశారదమ్, అస్మాకమపి రాజేంద్ర శ్రవణే జాయతే మతిః. ౩౪. అథ వ్యాసో మహాతేజా సుమంతుమృషిమబ్రవీత్, కథయాస్మై కథాస్తాత యాః శ్రుత్వా మోదతే నృపః, భారతాదికథానాం తు యత్రాస్య రమతే మనః. ౩౫. అసావపి మహాతేజాః శ్రుత్వా భావం మహామతేః, వ్యాసస్య ద్విజశార్దూల ఋషీణాం చాపి సర్వశః. ౩౬. చకార వక్తుం స మనస్తస్మై రాజ్ఞే మహామతిః, వ్యాసస్య శాసనా ద్విప్ర ఋషీణాం చైవ సర్వశః. ౩౭. అథ రాజా మహాతేజా ఆజమీఢో ద్విజోత్తమమ్, ప్రణమ్య శిరసాత్యర్థం ప్రవక్తుముపచక్రమే. ౩౮. శతానీక ఉవాచ:—పుణ్యాఖ్యానం మమ బ్రహ్మన్నావనాయ ప్రకీర్తయ, శ్రుత్వా యద్బ్రాహ్మణశ్రేష్ఠ

కంబులగు నాఖ్యానంబుల వినిపించి నన్ననుగ్రహింపు"మని సవినయముగఁ బ్రార్థించెను. అంత సుమంతుండు "నోయీ! కిల్బిషాపనోదకంబులగు శాస్త్రంబులు పెక్కులు గలవు. వానిలో నెద్దాని వినవలతెఱింగింపు"మన, విని యారాజు "ధర్మబోధకంబులగు శాస్త్రంబు లెయ్యవి యెఱింగింపు" మని యడిగెను. అందుల కాతఁడు రాజును శ్లాఘించి యిట్లని చెప్పం దొడంగె.

"మనువు, విష్ణువు, యముఁడు, నంగిరసుండు, వసిష్ఠుఁడు, దక్షుఁడు, సంవర్తుఁడు, శాతాతపుఁడు, పరాశరుఁడు, నాపస్తంబుఁడు, నుశనుండును, గాత్యాయనుండును, బృహస్పతియు, గౌతముండును, శంఖుండును, లిఖితుఁడును, హారీతుఁడు, నత్రియు ననువారు పెక్కు ధర్మశాస్త్రములు రచించి యుండిరి. వాని నెఱింగి మానవుఁడు శాశ్వతసుఖము లనుభవించుచు దేవలోకమునఁ జిరకాలము వసియించు" నన విని శతానీకుండు "విప్రోత్తమా! నీయానతిచ్చినధర్మశాస్త్రంబు లన్నియు శ్రుతపూర్వంబు లగుట మరల విన వేడుక జనింపదయ్యె. అదియునుంగాక వేదములు మన్వాదిధర్మశాస్త్రంబులు షడంగములును బ్రహ్మక్షత్రియవైశ్యులయధికారములోనివిగాన వానిలో శూద్రున కధికారము లేదయ్యె. నాల్గు వర్ణములవారికిని విశేషించి నాలవజాతివారికిని పురుషార్థసంపాదకంబు

---

ముచ్యేఽహం సర్వపాతకాత్. ౩౯. సుమంతురువాచః—నానావిధాని శాస్త్రాణి సంతి పుణ్యాని భారత, యాని శ్రుత్వా నరో రాజన్ముచ్యతే సర్వకిల్బిషైః. ౪౦. కిమిచ్ఛసి మహాబాహో శ్రోతుం యత్త్వాం బ్రవీమి వై, భారతాదికథానాం తు యాసు ధర్మాదయః స్థితాః. ౪౧. శతానీక ఉవాచః—మతాని కాని విప్రేంద్ర ధర్మశాస్త్రాణి సువ్రత, యాని శ్రుత్వా నరో విప్ర ముచ్యతే సర్వకిల్బిషైః. ౪౨. సుమంతు రువాచః—శ్రూయంతాం ధర్మశాస్త్రాణి మనుర్విష్ణుర్యమోఽంగిరాః, వసిష్ఠ దక్షసంవర్త శాతాతపపరాశరాః. ౪౩. ఆపస్తంబోఽథ ఉశనా కాత్యాయనబృహస్పతీ, గౌతమః శంఖలిఖితౌ హారీతోఽత్రిరథాపి వా. ౪౪. ఏతాని ధర్మశాస్త్రాణి శ్రుత్వా జ్ఞాత్వా చ భారత, బృందారకపురం గత్వా మోదతే నాత్ర సంశయః. ౪౫. శతానీక ఉవాచ.—యాన్యేతాని త్వయోక్తాని ధర్మశాస్త్రాణి సువ్రత, నేచ్ఛామి శ్రోతుం విప్రేంద్ర శ్రుతాన్యేతాని హి ద్విజ. ౪౬. త్రయాణామపి వర్ణానాం ప్రోక్తానామపి పండితైః, శ్రేయసే న తు శూద్రాణాం తత్ర మే వచనం శృణు. ౪౭. చతుర్ణామిహ వరాణాం శ్రేయసే యాని సువ్రత, భవంతి ద్విజశార్దూల శ్రుతాని భువనత్రయే. ౪౮.

లగువాని నానతిమ్ము. ఆగమవిహీనులు నతిదీనులు నగు శూద్రులఁ జూచి నామనంబు పరితపించెడు. కావునఁ బూర్వులగు బ్రాహ్మణోత్తములచేఁ త్రివర్గసాధనంబగునాగమంబు శూద్రుల కెవ్విధి నుద్దేశింపఁబడెనో యానతి" మ్మనవుడు సుమంతుఁ డిట్లనియె.

"చాతుర్వర్ణ్యమువారిశ్రేయమునకు వారిలో శూద్రులధర్మకామార్థసిద్ధికై పవిత్రతమంబులగు నష్టాదశపురాణంబులు నాదికావ్యమగు శ్రీమద్రామాయణంబును రచింపఁబడినవి. అట్లు వేదములు ధర్మశాస్త్రములు నష్టాదశపురాణములును బ్రాహ్మంబు, నైంద్రంబు, యామ్యంబు, రౌద్రంబు, వాయవ్యంబు, వారణసావిత్రంబులును వైష్ణవంబు నను నెనిమిదివ్యాకరణములును లెస్సగా ననుసంధించి సంసారసాగరతరణంబునకై యేర్పడిన మహానౌక యననొప్పు మహాభారతసంహితను బారాశర్యుండు విరచించియుండె. దీని నాకర్ణించి మానవుండు బ్రహ్మహత్యాదిమహాపాపంబులఁ బారఁద్రోలి సుఖించుచుండును. బ్రాహ్మము, పాద్మము, వైష్ణ

విశేషతశ్చతుర్థస్య వర్ణస్య ద్విజసత్తమ. ౯. బ్రాహ్మణాదిషు వర్ణేషు త్రిషు వేదాః ప్రకల్పితాః, మన్వాదీని చ శాస్త్రాణి తథాంగాని సమంతతః. ౧౦. శూద్రాశ్చైవ భృశం దీనాః ప్రతిభాంతి ద్విజప్రభో, ధర్మార్థకామమోక్షస్య శక్తా స్స్యురవనే కథమ్. ౧౧. ఆగమేన విహీనా హి అహో కష్టం మతం మమ, కశ్చైషామాగమః ప్రోక్తః పురా ద్విజమనీషిభిః, త్రివర్గప్రాప్తయే బ్రహ్మఞ్ఛ్రేయసే చ తథోభయోః. ౧౨. సుమంతురువాచ:—సాధుసాధు మహాబాహో శృణు మే పరమం వచః, చతుర్ణామపి వర్ణానాం యాని ప్రోక్తాని శ్రేయసే. ౧౩. ధర్మశాస్త్రాణి రాజేంద్ర శృణు తాని నృపోత్తమ, విశేషతశ్చ శూద్రాణాం పావనాని మనీషిభిః. ౧౪. అష్టాదశపురాణాని చరితం రాఘవస్య చ, రామస్య కురుశార్దూల ధర్మకామార్థసిద్ధయే. ౧౫. తథోక్తం భారతం వీర పారాశర్యేణ ధీమతా, వేదార్థం సకలం యోజ్య ధర్మశాస్త్రాణి చ ప్రభో. ౧౬. కృపాళునా కృతం శాస్త్రం చతుర్ణామిహ శ్రేయసే, వర్ణానాం భవమగ్నానాం కృతం పోతో హ్యనుత్తమమ్. ౧౭. అష్టాదశపురాణాని అష్టౌ వ్యాకరణాని చ, జ్ఞాత్వా సత్యవతీసూనుశ్చక్రే భారతసంహితామ్. ౧౮. యాం శ్రుత్వా పురుషో రాజన్ముచ్యతే బ్రహ్మహత్యయా, ప్రథమం ప్రోచ్యతే బ్రాహ్మం ద్వితీయం చైంద్రముచ్యతే. ౧౯. యామ్యం ప్రోక్తం తతో రౌద్రం వాయవ్యం వారుణం తథా, సావిత్రం చ తథా ప్రోక్తమష్టమం వైష్ణవం తథా. ౨౦. ఏతాని వ్యాకరణాని పురాణాని నిబోధ మే, బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా. ౨౧. తథాన్యన్నారదీయం చ

వము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, సాగ్నేయము, భవిష్యము, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము ననునామంబుల లోకమున నష్టాదశపురాణంబులు ప్రఖ్యాతంబులయి యున్నవి. ఇవి నాల్గువర్ణములవారికిని వినఁదగినవి. అందఱకిని శ్రేయోదాయకంబులు. వీనిలో నీవెద్దాని వినవల తెఱింగింపు"మన, నారాజు "విప్రోత్తమా! మాజనకునియంకతలంబుననుండి భారతసంహితను వినియున్నాఁడ. రామాయణంబును శ్రుతపూర్వంబే. భవిష్యంబు దక్కఁ దక్కినపురాణంబులెల్ల వింటి. కావునఁ గౌతుకావహమగు భవిష్యంబు వినవలతు నానతి"మ్మని వేఁడ నాతనికి సుమంతుఁ డిట్లనియె.

"రాజా! నీకోర్కి యుత్తమమయినది. భవిష్యపురాణంబు వినిన మానవుండు సకలదురితవిముక్తుఁడై సూర్యమండలముఁ జేరి సుఖించు. ఇయ్యది తొల్త బ్రహ్మచేఁ జెప్పఁబడియె. బ్రాహ్మణక్షత్రియులు దక్కఁ దక్కినవారు దీనిం జదువరాదు. శూద్రుండు బ్రాహ్మణునివలన విన

---

మార్కండేయం చ సప్తమమ్, ఆగ్నేయమష్టమం వీర భవిష్యం నవమం స్మృతమ్. ౧౨. దశమం బ్రహ్మవైవర్తం లైంగమేకాదశం స్మృతమ్, వారాహం ద్వాదశం ప్రోక్తం స్కాందం చైవ త్రయోదశమ్. ౧౩. చతుర్దశం వామనం చ కౌర్మం పంచదశం స్మృతమ్, మాత్స్యం చ గారుడం చైవ బ్రహ్మాండం చ తతః పరమ్. ౧౪. ఏతాని కురుశార్దూల ధర్మశాస్త్రాణి పండితైః, సాధారణాని ప్రోక్తాని వర్ణానాం శ్రేయసే సదా. ౧౫. చాతుర్ణ్ణామిహ రాజేంద్ర శ్రోతుమర్హాణి సువ్రత, కిమిచ్ఛసి మహాబాహో శ్రోతుమేషాం నృపోత్తమ. ౧౬. శతానీక ఉవాచ:—భారతం తు శ్రుతం విప్ర తాతస్యాంకగతేన తు, రామస్య చరితం చాపి శ్రుతం బ్రహ్మన్సమంతతః. ౧౭. పురాణాని చ విప్రేంద్ర భవిష్యం న తు సువ్రత, పురాణం వద విప్రేంద్ర భవిష్యం కౌతుకం హి మే. ౧౮. సుమంతురువాచ:—సాధు సాధు మహాబాహో సాధు పృష్టోఽస్మి మానద, శృణు మే వదతో రాజన్పురాణం నవమం మహత్. ౧౯. యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే మానవో నృప, అశ్వమేధఫలం ప్రాప్య గచ్ఛేద్భానౌ న సంశయః. ౨౦. ఇదం తు బ్రహ్మణా ప్రోక్తం ధర్మశాస్త్రమనుత్తమమ్, విదుషా బ్రాహ్మణేనేదమధ్యేతవ్యం ప్రయత్నతః. ౨౧ శిష్యేభ్యశ్చైవ వక్తవ్యం చాతుర్వర్ణేభ్య ఏవ హి. అధ్యేతవ్యం న చాన్యేన బ్రాహ్మణం క్షత్రియం వినా, శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యం కదాచన. ౨౨. దేవార్చాం పురతః కృత్వా బ్రాహ్మణైశ్చ నృపోత్తమ, శ్రోత

నర్హుఁడుగాని యధ్యయనార్హుఁడు గాఁడు. ఈశాస్త్రంబు పఠించుబ్రాహ్మణుండు మనోవాక్కాయసంభవంబులగు దోషంబుల నొందఁడు. భక్తితో నాకర్ణించువారు సకలపాతకంబులు బాసి స్వర్గమున సుఖింతురు. ఇద్దాని నాల్గువర్ణములవారికిని వినిపించువిప్రుండు సర్వవర్ణములకు గురుఁడని చెప్పఁబడును. ఆతండు లోకైకప్రశస్తుఁడై ప్రసిద్ధి వడయు. ఈభవిష్యపురాణము శుభప్రదము నుత్తమోత్తమమును జ్ఞానదాయకమునుగా నెలుంగుము. ఇందు సమస్తధర్మములు కర్మలగుణదోషములు వర్ణాచారములును వర్ణింపఁబడును. శ్రుతివిహిత మగునాచారము పరమధర్మముగాన నద్దాన లగ్నమనస్కుఁడగు విప్రుఁడు పరమశ్రేయస్సుల నందఁగలఁడు. ఆచారవిహీనుఁ డగుద్విజుఁడు వేదఫలము నొందఁజాలఁడు. ఇట్లు తొల్లిటిమునిపుంగవులు ధర్మ మాచారమూలమగుట గుర్తెఱింగి తపస్సునకు సదాచారమే మూలమని తలంచి యాచారమును బహూకరించి గ్రహించియున్నారు. ఋషులేగాక యితరజనులు సైత మిట్టియాశయముచేతనే యాచారముల నాశ్రయించి యుండిరి. ఈరీతి నిప్పురాణమున నాచారప్రాముఖ్యము ప్రశంసింపఁబడినది. పురాణవాచకుమాహా

---

వ్యమేవ శూద్రైశ్చ తథాన్యైశ్చ ద్విజాతిభిః. ౭౩. శ్రౌతం స్మార్తం హి వై ధర్మం ప్రోక్తమస్మిన్నృపోత్తమ, తస్మాచ్ఛూద్రైర్వినా విప్రాన్న శ్రోతవ్యం కథంచన. ౭౪. ఇదం శాస్త్రమధీయానో బ్రాహ్మణః సంశితవ్రతః, మనోవాగ్దేహజైర్నిత్యం కర్మదోషైర్న లిప్యతే. ౭౫. శృణ్వంతి చాపి యే రాజన్భక్త్యా వై బ్రాహ్మణాదయః, ముచ్యంతే పాతకైః సర్వైర్వర్గచ్ఛంతి చ దివం ప్రభో. ౭౬. శ్రావయేచ్చాపి యో విప్రః సర్వాన్వర్ణాన్నృపోత్తమ, స గురుః ప్రోచ్యతే తాత వర్ణానామిహ సర్వశః. ౭౭. స పూజ్యః సర్వకాలేషు సర్వైర్వర్ణైర్నరాధిప, పృథివీం చ తస్మై వేమాం కృత్స్నాం మేకోఽపి సోఽర్హతి. ౭౮. ఇదం స్వస్త్యయనం శ్రేష్ఠమిదం బుద్ధివివర్ధనమ్, ఇదం యశస్యం సతతమిదం నిఃశ్రేయసం పరమ్. ౭౯. అస్మిన్ధర్మోఽఖిలేనోక్తో గుణదోషౌ చ కర్మణామ్, చతుర్ణామపి వర్ణానామాచారశ్చాపి శాశ్వతః. ౮౦. ఆచారః ప్రథమో ధర్మః శ్రుత్యుక్తశ్చ నరోత్తమ, తస్మాదస్మిన్సమాయుక్తో నిత్యం స్యాదాత్మవాన్ద్విజః. ౮౧. ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫలమశ్నుతే, ఆచారేణ చ సంయుక్తః సంపూర్ణఫలభాక్స్మృతః. ౮౨. ఏవమాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్, సర్వస్య తపసో మూలమాచారం జగృహుః పరమ్. ౮౩. అన్యే చ మానవా రాజన్నాచారం సంశ్రితాః సదా, ఏవమస్మిన్పురాణే తు ఆచారస్య తు కీర్తనమ్. ౮౪. వృత్తాంతాని చ రాజేంద్ర

త్మ్యంబును, వ్రతాచరణభంగియు, నాశ్రమాచారపద్ధతియు, స్నాతకుల వ్రతాదికృత్యములును, దారాదిగమనవివేకమును, వివాహలక్షణములును, స్త్రీపురుషలక్షణములును, మహాయజ్ఞవిధానములును, శాశ్వతంబులగు శాస్త్రకల్పంబులును, పృథివీలక్షణంబులును, దేవతారాధనప్రకారములును, వృత్తులలక్షణములును, భక్ష్యాభక్ష్యవిభాగంబును, శుచిత్వసాధనంబులును, ద్రవ్యశుద్ధిప్రకారంబులును, సన్న్యాసప్రకారమును, క్షత్రియధర్మములును, కార్యనిర్వహణపద్ధతులును, సవిత, రుద్రుఁడు, నారాయణుఁడు, భూసురుఁడు, దుర్గాదేవి, తీర్థములు, గ్రంథములు, సత్యము నను వానిమహత్త్వమును, స్త్రీపురుషధర్మవిభాగంబును, ధర్మద్యూతప్రకారంబును, వైశ్యశూద్రులకర్తవ్యములును, సంకీర్ణజాత్యుత్పత్తిప్రకారంబును, నాపద్ధర్మములును, ప్రాయశ్చిత్తవిధానమును, సంధ్యోపాసనవిధియుఁ, బ్రేతశుద్ధియు, స్నానతర్పణవిధియు, దంతకాష్ఠలక్షణంబులు, నుత్తమంబగుచరణవ్యూహంబును సంసారమునకు సంచితప్రారబ్ధాగామికర్మమూల

---

తథా చోక్తాని పండితైః, త్రిలోక్యాస్తు సముత్పత్తిః సంస్కారవిధిరుత్తమః, శ్రవణం చేతిహాసస్య విధానం కథ్యతే నృప. ౧౫. తథాస్మిన్కథ్యతే రాజన్మాహాత్మ్యం వాచకస్య తు, వ్రతచర్యాశ్రమాచారాః స్నాతకస్య పరో విధిః. ౧౬. దారాదిగమనం చైవ వివాహానాం చ లక్షణమ్, పుంసాం చ లక్షణం రాజన్యోషితాం చాత్ర కథ్యతే. ౧౭. మహాయజ్ఞవిధానం చ శాస్త్రకల్పం చ శాశ్వతమ్, పృథివ్యా లక్షణం తాత దేవార్చాయాః సులక్షణమ్. ౧౮. వృత్తీనాం లక్షణం చైవ స్నాతకస్య వ్రతాని చ, భక్ష్యాభక్ష్యం చ శౌచం చ ద్రవ్యాణాం శుద్ధిరేవ చ. ౧౯. స్త్రీధర్మయోగస్తాపస్యం మోక్షః సన్న్యాస ఏవ చ, రాజ్ఞశ్చ ధర్మో హ్యఖిలః కార్యాణాం చ వినిర్ణయః. ౨౦. మాహాత్మ్యం సవితుశ్చాత్ర తీర్థానాం చ విశాంపతే, నారాయణస్య మాహాత్మ్యం తథా రుద్రస్య కథ్యతే. ౨౧. మహాభాగ్యం చ విప్రాణాం మాహాత్మ్యం పుస్తకస్య చ, దుర్గాదేవ్యాస్తథా చోక్తం సత్యస్య చ మహామతే. ౨౨. సంక్షిప్తం సంవిధానం చ ధర్మం స్త్రీపుంసయోరపి, విభాగం ధర్మద్యూతం చ కథకానాం చ శోధనమ్. ౨౩. వైశ్యశూద్రోపచారం చ సంకీర్ణానాం చ సంభవమ్, ఆపద్ధర్మం చ వర్ణానాం ప్రాయశ్చిత్తవిధిం తథా. ౨౪. సంధ్యావిధిం ప్రేతశుద్ధిం స్నానతర్పణయోర్విధిమ్, వైశ్వదేవవిధిం చాపి తథా భోజ్యవిధిం నృప. ౨౫. లక్షణం దంతకాష్ఠస్య చరణవ్యూహముత్తమమ్, సంసారగమనం చైవ త్రివిధం కర్మసంభవమ్. ౨౬. నైఃశ్రేయసం కర్మణాం చ గుణదోషపరీక్షణమ్, దారాణాం లక్షణం ప్రోక్తం తథా పాత్రపరీక్షణమ్. ౨౭.

కత్వంబును, కర్మలగుణదోషవిచారంబును, సత్పాత్రవివేకంబును, భార్యా లక్షణమును, గర్భప్రసూతిప్రకారములును, కర్మఫలపరీక్షయు, వేద ధర్మంబులును, సాహితాగ్నిధర్మములును, జాతిధర్మములు, కులధర్మములును నీభవిష్యపురాణమునఁ బ్రతిపాదింపఁబడును. రాజేంద్రా! యీ పురాణంబును మున్ను మహానుభావుఁడగు శంకరునకు బ్రహ్మ యెఱిఁగించెను. శంకరుఁడు విష్ణునకు నమ్మహాత్ముండు నారదునకును నత్తపసి యింద్రునకును నాతండు పరాశరునకు నాతండు మద్గురువర్యుండగు వ్యాస మునీంద్రునకు నెఱింగించెను. అయ్యాది కృపాళుఁడగు నమ్మహానీయుని వలన యే నెఱింగితిని. అద్దాని నీకెఱింగింతు నాకర్ణింపుము.

పురాణములెల్ల సామాన్యముగ నొక్కొక్కటి పండ్రెండువేల గ్రంథము గలిగియుండు. పలువిధములగు సుపాఖ్యానముల నభివృద్ధి నొంది స్కాందము లక్షసంఖ్యాకమయ్యె. ప్రకృతమగు భవిష్యపురాణ మేఁబదివేల గ్రంథపరిమాణంబు గలిగియుండు. ఏతచ్ఛ్రవణమున నిఖిల శ్రేయంబులు చేకూరును. సావధానముగ నాకర్ణింపుము.

ఇది భవిష్యపురాణమున బ్రాహ్మపర్వంబునఁ బ్రస్తావనారూపమగు
ప్రథమాధ్యాయము.

---

ప్రసూతిం చాపి గర్భస్య తథా కర్మఫలం నృప, జాతిధర్మాన్కులధర్మాన్వేదధర్మాంశ్చ పార్థివ. ౯౮. వైతానప్రతికానాం చ తథాసౌ ప్రోక్తవాన్విభుః, బ్రహ్మా కురుకుల శ్రేష్ఠ శంకరాయ మహాత్మనే ౯౯. శంకరేణ తథా విష్ణోః కథితం కురునందన, విష్ణునాపి పునః ప్రోక్తం నారదాయ మహీపతే. ౧౦౦. నారదాత్ ప్రాప్తవాఞ్ఛక్రః శక్రాదపి పరాశరః, పరాశరాత్తతో వ్యాసో వ్యాసాదపి మయా విభో. ౧౦౧. ఏవం పరం పరాప్రాప్తం పురాణమిదముత్తమమ్, శృణు త్వమపి రాజేంద్ర మత్సకాశాత్పరం హితమ్. ౧౦౨. సర్వాణ్యేవ పురాణాని సంజ్ఞేయాని నరర్షభ, ద్వాదశైవ సహస్రాణి ప్రోక్తానీహ మనీషిభిః. ౧౦౩. పునర్వృద్ధిం గతానీహ ఆఖ్యానైర్వివిధైర్నృప, యథా స్కాందం తథా చేదం భవిష్యం కురునందన. ౧౦౪. స్కాందం శతసహస్రం తు లోకానాం జ్ఞాతమేవ హి, భవిష్యమేతదృషిణా లక్షార్ధం సంఖ్యయా కృతమ్. ౧౦౫. తచ్ఛ్రుత్వా పురుషో భక్త్యా ఇదం ఫలమవాప్నుయాత్, బుద్ధిర్వృద్ధిస్తథా శ్రీశ్చ భవంతి తస్య నిశ్చితమ్. ౧౦౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మేపర్వణి కథాప్రస్తావనే ప్రథమోఽధ్యాయః.

## ద్వితీయాధ్యాయము.

రాజేంద్రా! పంచలక్షణసమన్వితమై బ్రహ్మహత్యాదిమహాపాతక ప్రమాపకమగు నీపురాణంబున బ్రాహ్మమును, వైష్ణవమును, శైవమును, త్వాష్ట్రమును, ప్రతిసర్గమును, నను నైదుపర్వములు గలవు. పంచలక్షణము లనఁగా సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము, నని ప్రసిద్ధమైనవి. మఱియు శిక్షా వ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిష కల్పములను నాలువేదాంగములును, ఋగ్యజుస్సామాథర్వణములను నాల్గువేదములును, మీమాంసాశాస్త్రమును న్యాయశాస్త్రమును పురాణ ములును, ధర్మశాస్త్రములును నను చతుర్దశవిద్యలతో రాజిల్లుచు నాయుర్వేద ధనుర్వేద గాంధర్వవేద అర్థశాస్త్రములతోడం గూడి యుం డును. అందు మొదట సర్వభూతములసృష్టిక్రమం బిందు వర్ణింపఁబడు. ఇది విని నరుఁడు పాపవిముక్తుఁడై యుత్తమమగుశమము నొందును.

వత్సా! సృష్టికిఁ బూర్వము జగమంతయుఁ దమోమయమై యిది యిట్టిదని తెలియరాక సుషుప్త్యాక్రాంత మైనట్లుండెను. పిమ్మట నవ్యక్త స్వరూపమగు పరబ్రహ్మము జగమును వ్యక్తముగఁజేయఁగోరి నిజతేజ మున నంధకారమెల్ల నడంచి మహాభూతాదులను ప్రకాశింపఁజేసెను. ఏమహానుభావుఁ డతీంద్రియుఁడై యెరికిం దెలియరాక సూక్ష్మస్వరూ

---

సుమంతురువాచ:—శృణుష్వేదం మహాబాహో పురాణం పంచలక్షణమ్, యచ్ఛ్రుత్వా ముచ్యతే రాజన్పురుషో బ్రహ్మహత్యయా. ౧. పర్వాణి చాత్ర వై పంచ కీర్తితాని స్వయంభువా, ప్రథమం కథ్యతే బ్రాహ్మం ద్వితీయం వైష్ణవం స్మృతమ్. ౨. తృతీయం శైవమాఖ్యాతం చతుర్థం త్వాష్ట్రముచ్యతే, పంచమం ప్రతిసర్గాఖ్యం సర్వలోకైః సుపూజితమ్. ౩. ఏతాని తాత పర్వాణి లక్షణాని నిబోధ మే, సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ. ౪. వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్, చతుర్దశభిర్విద్యాభిర్భూషితం కురునందన. ౫. అంగాని చతురో వేదా మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ. ౬. ఆయుర్వేదో ధనుర్వేదో గాంధర్వశ్చైవ తే త్రయః, అర్థశాస్త్రం చతుర్థం తు విద్యా హ్యష్టాదశైవ తాః. ౭. ప్రథమం కథ్యతే సర్గో భూతానామిహ సర్వశః, యచ్ఛ్రుత్వా పాపనిర్ముక్తో యాతి శాంతిమనుత్తమామ్. ౮. జగదాసీత్పురా తాత తమోభూతమలక్షణమ్, అవిజ్ఞేయమతర్క్యం చ ప్రసుప్తమివ సర్వశః. ౯. తతః స భగవానీశో హ్యవ్యక్తో వ్యంజయన్నిదమ్, మహాభూతాని వృత్తౌజాః ప్రాదుర్భూత స్తమోనాశనః. ౧౦.

పుఁడై యవ్యక్తుఁడై సనాతనుండై సర్వభూతస్వరూపుఁడు నచింత్య స్వరూపుఁడు నై యుండె నమ్మహాత్ముఁడు స్వయముగ మేల్కానెను. మఱియు నెవ్వఁడు లోకమున నిరుపదాఱవతత్త్వముగ నెంచఁబడుచుండెనో, యెవ్వాఁడు పురుషోత్తమనామంబున వెలయునో యెవ్వాఁడు భాస్కరుఁ డనియుఁ బరబ్రహ్మమనియు వక్కాణింపఁబడు నాతఁ డించుక ధ్యానించి నిజశరీరమునుండి యెల్లలోకము సృజియింప నుద్యోగించి ప్రప్రథమమున నుదకమును సృజించి యందు వీర్యము నిలిపెను. దానినుండి దేవమానవరాక్షసాదివిశిష్టమైన నిఖిలప్రపంచము నుద్భవమందెను. బీజమనియు, శుక్రమనియు, రేతస్సనియు, నుగ్రమనియు, వీర్యమనియుఁ బర్యాయములుగా బ్రహ్మదేవుఁడు నుడివెను. తోయవిసృష్టమగు నావీర్యము స్వర్ణమయమై జ్వాలాసమూహపరివ్యాప్త మగునండముగ నేర్పడెను. అందుండి సర్వలోకపితామహుండును వేల్పుఁబెద్దయు నాల్గు మోములవాఁడు నున్నతస్థానవాసియునగు పితామహుఁ డుద్భవించెను. ఈతఁడే క్షేత్రజ్ఞపురుషవేధోనారాయణ ప్రభృతిశబ్దజాలంబుచే వ్యవహరింపంబడు. అందు నారాయణశబ్దంబున నార అనుపదము జలమును దెల్పును. జ్ఞానమునుండి యుద్భవించుటచే జలమున కీనామంబు గలిగె. ఆజల మీతనికి మూలస్థానముగ నుంటచే నారాయణశబ్దము కంజజవాచకంబగు. కవులందరు శీఘ్రగమనము గలిగియుండుటచే నుదకమున కరమను

యోఽసావతీంద్రియోఽగ్రాహ్యః సూక్ష్మోఽవ్యక్తః సనాతనః, సర్వభూతమయోఽచింత్యః స ఏష స్వయముత్థితః. ౧౧. యోఽసౌ షడ్వింశకో లోకే తథా యః పురుషోత్తమః, భాస్కరశ్చ మహాబాహో పరం బ్రహ్మ చ కథ్యతే. ౧౨. సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః, అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమవాసృజత్. ౧3. యస్మాదుత్పద్యతే సర్వం సదేవాసురమానుషమ్, బీజం శుక్రం తథా రేత ఉగ్రం వీర్యం చ కథ్యతే. ౧౪ వీర్యస్యైతాని నామాని కథితాని స్వయంభువా, తదండమభవద్ధైమం జ్వాలామాలాకులం విభో. ౧౫. యస్మింజజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః, సురజ్యేష్ఠశ్చతుర్వక్త్రః పరమేష్ఠీ పితామహః. ౧౬. క్షేత్రజ్ఞః పురుషో వేధాః శంభుర్నారాయణస్తథా, పర్యాయవాచకైః శబ్దైరేవం బ్రహ్మా ప్రకీర్త్యతే. ౧౭. సదా మనీషిభిస్తాత విరించిః కంజజస్తథా, ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః. ౧౮. తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః, అరమిత్యేవ శీఘ్రాయ

వ్యవహారము గలిగించిరి. ఆజలము సముద్రరూపమై మరింత వేగము గలిగి యుండుట నరశబ్దవ్యపదేశ్యమయ్యె. ఈజలమున కేది కారణమై నిత్యమై సదసద్రూపమై యుండెనది నారమని చెప్పఁబడు. తత్కారణుఁడై యుద్భవించుటచే నాపురుషుఁడు నారాయణశబ్దవ్యపదేశ్యుఁడయ్యె. ఇట్టిమాదిరి పక్షభేదములచే నర్థము నిరూపించి షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు భగవానుఁడు స్వర్ణమయంబగు నాయండమున ప్రపంచస్వరూపమగుతత్త్వము నిరూపించి యించుక ధ్యానించి యాయండమును రెండుగా విభజించి యా రెండుఖండములచే ద్యులోకభూలోకములను నిర్మించెను ఆరెంటి నడుమ నాకసంబును నష్టదిశలును వరుణలోకమును నిర్మించెను. పైభాగమున లోకమంగళమునకై మహత్తత్త్వ ముద్భవించెను. మహత్తునుండి యహంకారమును దానినుండి మహాభూతోత్పత్తికారణంబులును నతిసూక్ష్మములగుట బుద్ధిమాత్రగమ్యములు నగు సత్త్వరజస్తమోనామక గుణములు మూఁడు నుద్భవించె. ఆపంచభూతములకు మూలమైన గుణత్రయమునుండి యింద్రియపంచకంబు మెల్లన గలిగె. మహాతేజస్సంపన్నములగు పంచభూతములవలననే యతిసూక్ష్మములగు పంచతన్మాత్రలు జనించె. ఇటు లుద్భవించిన తన్మాత్రములందు తేజస్సును నిలిపి యథావిధిగ భూతముల నిర్మించెను. ఈభూతావయవముల కాశ్రయములయి యాఱు రసము లుద్భవించె. ఈషడ్రసములును తన్మాత్రలును పంచభూతములును పంచేంద్రియములునుగుణత్రయమును గూడి యుండినమూర్తియే శరీరమని

---

నియతాః కవిభిః కృతాః. ౧౯. ఆప ఏవార్ణవీభూతా సుశీఘ్రాస్తేన తా నరాః, యత్తత్కారణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్. ౨౦. తద్విసృష్టః స పురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే, ఏవం స భగవానండే తత్త్వమేవ నిరూప్య వై. ౨౧. ధ్యానమాస్థాయ రాజేంద్ర తదండమకరోద్ద్విధా, శకలాభ్యాం చ రాజేంద్ర దివం భూమిం చ నిర్మమే. ౨౨. అంతర్వ్యోమ దిశశ్చాష్టౌ వారుణం స్థానమేవ హి, ఊర్ధ్వం మహాన్గతో రాజన్సమంతాల్లోకభూతయే. ౨౩. మహతశ్చాప్యహంకారస్తస్మాచ్చ త్రిగుణా అపి, త్రిగుణా అతిసూక్ష్మాస్తు బుద్ధిగమ్యా హి భారత. ౨౪. ఉత్పత్తిహేతుభూతా వై భూతానాం మహతాం నృప, తేషామేవ గృహీతాని శనైః పంచేంద్రియాణి తు. ౨౫. తద్ధై వావయవాః సూక్ష్మాః షణ్ణామప్యమితౌజసామ్. ౨౬. సన్నివేశ్యాత్మమాత్రాసు స రాజన్భగవాన్విభుః, భూతాని నిర్మమే తాత సర్వాణి విధిపూర్వకమ్. ౨౭. యస్మాన్మూర్త్యవయవాః సూక్ష్మాస్తస్యేమాన్యాశ్రయాణి షట్, తస్మాచ్ఛరీరమిత్యాహుస్తస్య మూర్తిం

ధీమంతులు వక్కాణింతురు. ఈమహాభూతములు గుణకర్మసమన్వితములై విభుమూర్తిం బ్రవేశించును. ఈయేడింటి మూర్తిమాత్రలం దవ్యయము నుండి వ్యయ ముత్పన్నమయ్యె.భూతములు మొదలు మహత్తత్త్వమువఱకు నీజగమంతయు నేవ్యయముచే వ్యాప్తమయి యుండె నద్దానినుండి పురుష పంచక ముద్భవమందె నని కొందరు విద్వాంసులు సృష్టిక్రమము వర్ణించిరి. మఱికొందరు విద్వాంసు లిట్లు వర్ణింతురు ఏపరమాత్ముఁడు మూర్తిని సృజించి ప్రజ్ఞానంతుఁడై నానావిధప్రజను సృజింపఁగోరె నాతనువు పుద్గలము నాఁబరగు. అయ్యది ప్రకృతిలోఁ జొచ్చి కలవరము చేయ నందుండి యనేకవికారము లుద్భవించెను. అందుండి మహత్తు నందుండి భూతాదికము నుద్భవించెను. వానినుండి మాత్రారూపము లగుసూక్ష్మా వయవము లెసఁగె. అందుండి విజ్ఞానము దానినుండి యింద్రియములు నుద్భవించెనని, యివ్విధమున ననేకమతములు శ్రద్ధాళుండవగు నీకు విని పించితిని మఱియు భూతవిస్తరంబు వర్ణింతు నాకర్ణింపుము.

భూతంబు లన్నియు నొకదానికంటె నింకొకటి గుణములచే నాధిక్యత గాంచు. అందు మొదట నాకసము. దాన శబ్దమనున దొక్కటియే గుణము. వాయువునందు స్పర్శశబ్దములు రెండు. తేజస్సున మూఁడు. జల

---

మనీషిణః. ౨౮. మహాంతి తాని భూతాని ఆవిశంతి తతో విభుమ్, కర్మణా సహ రాజేంద్ర సగుణాశ్చాపి వై గుణాః. ౨౯. తేషామిదం తు సప్తానాం పురుషాణాం మహారాజసామ్, సూక్ష్మాభ్యో మూర్తిమాత్రాభ్యః సంభవత్యవ్యయాద్వ్యయమ్. ౩౦. భూతాదిమహతస్తాత యేన వ్యాప్తమిదం జగత్, తస్మాదపి మహాబాహో పురుషాః పంచ ఏవ హి. ౩౧. కేచిదేవం పరాం తాత సృష్టిమిచ్ఛంతి పండితాః, అన్యే౽ ప్యేవం మహాబాహో ప్రవదంతి మనీషిణః. ౩౨. యో౽సావాత్మా పరస్తాత కల్పాదౌ సృజతే తనుమ్, ప్రజనశ్చ మహాబాహో సిసృక్షుర్వివిధాః ప్రజాః. ౩౩. తేన సృష్టః పుద్గలస్తు ప్రధానం విశతే నృప, ప్రధానం క్షోభితం తేన వికారాన్సృజతే బహూన్. ౩౪. ఉత్పద్యతే మహాంస్తస్మాత్తతో భూతాదిరేవ హి, ఉత్పద్యతే విశాలం చ భూతాదేః కురునందన. ౩౫. విశాలాచ్చ హరిస్తాత హరేశ్చాపి వృకాస్తథా, వృకై ర్వృష్ణస్తి చ బుధాస్తస్మాత్సర్వం భవేన్నృప. ౩౬. తద్వైషామేవ రాజేంద్ర ప్రాదుర్భవతి వేగతః, మాత్రాణాం కురుశార్దూల విబోధ స్తదనంతరమ్. ౩౭. తస్మాదపి హ్యాషీకాణి వివిధాని నృపోత్తమ, తధేయం సృష్టిరాఖ్యాతా౽౽రాధ్యతః కురునందన. ౩౮. భూయో నిబోధ రాజేన్ద్ర భూతానామిహ విస్తరమ్, గుణాధికాని సర్వాణి భూతాని పృథివీపతే. ౩౯. ఆకాశమాదితః కృత్వా ఉత్తరోత్తరమేవ హి, ఏకం ద్వే చ తథా త్రీణి

మునన్నాల్గు. పృథివి నైదునని యుత్తరోత్తరాధిక్యము నెఱుంగునది. పిమ్మటఁ బద్ధాసనాసీనుఁడయి షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు బ్రహ్మదేవుఁడు భూతములన్నింటికిని వేర్వేర నామకర్మములను జేసెను తొలుత వేదశబ్దములనుండి వేర్వేరుసంస్థావిశేషములు నిర్మితములయ్యె. తత్తత్కర్మానుసారముగ శరీరధారులగు దేవతలను తుషితులను దేవగణవిశేషమును సనాతనమగు యజ్ఞమును సృజయించి యందఱకును పరమరహస్యము బ్రహ్మరూపమగు యజ్ఞమును సమముగఁ బంచి యిచ్చి యాయజ్ఞంబు నెఱుంగుటకై త్రివేది యనుగోవును పిదికెను. అందుఁ గాలము దద్విభూతులు నక్షత్రములు గ్రహములు ఋతువులు నదులు సంద్రములు కొండలు నిమ్నోన్నత భూభాగంబులుఁ కామక్రోధంబులును వాక్కు నభిలాషంబును లభించెను. ఇవి యన్నియు యజ్ఞసిద్ధ్యుపాయంబులు. మఱియు నానావిధంబులగు ప్రజల సృష్టింపఁ గోరి భూతాదిసృష్టినొనరించె. కర్మలను వేర్వేరుగ నెఱుంగుటకై ధర్మాధర్మముల సృజించెను. సమస్తప్రజలను సుఖదుఃఖాదిద్వంద్వములనుపాశంబులచే బంధించెను. అణురూపములై నశ్వరములై యుండు పంచతన్మాత్రలవలన నీప్రపంచమంతయుఁ గ్రమమున నుద్భవించుచున్నది. సమ్యజ్ఞ్నియుక్తుఁడగు జనునిచేఁ బూర్వమేకర్మ మాచరింపఁబడెనో దానినే మరల మరల నాజనుఁడు పొందుచుండును. సృష్టికాలమున హింసయు, నహింసయు, మృదుతయుఁ. క్రౌర్యము, ధర్మము, నధర్మము, సత్యము, నసత్యము నేదియెట్లుండెనట్లే యనంతరము నాతని నావేశించును. ప్రాక్తనకర్మా

---

చత్వారశ్చాపి పంచ చ. ౪౦. తతః స భగవాన్బ్రహ్మా పద్మాసనగతః ప్రభుః, సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్పృథక్. ౪౧. వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే, కర్మోద్భవానాం దేవానాం సోఽసృజద్దేహినాం ప్రభుః. ౪౨. తుషితానాం గణం రాజన్యజ్ఞం చైవ సనాతనమ్, దత్త్వా వీర సమానేభ్యో గుహ్యం బ్రహ్మ సనాతనమ్. ౪౩. దుదోహ యజ్ఞసిద్ధ్యర్థమృగ్యజుఃసామలక్షణమ్, కాలం కాలవిభక్తీశ్చ గ్రహానృతూంస్తథా నృప. ౪౪. సరితః సాగరాఞ్ఛైలాన్సమాని విషమాణి చ, కామం క్రోధం తథా వాచం రతిం చాపి కురూద్వహ. ౪౫. సృష్టిం ససర్జ రాజేంద్ర సిసృక్షుర్వివిధాః ప్రజాః, ధర్మాధర్మౌ వివేకాయ కర్మణాం చ తథాసృజత్. ౪౬. సుఖదుఃఖాదిభిర్ద్వంద్వైః ప్రజాశ్చేమా న్యయోజయత్, అణ్వ్యో మాత్రావినాశిన్యో దశార్ధానాం తు యాః స్మృతాః. ౪౭. తాభిః సర్వమిదం వీర సంభవత్యనుపూర్వశః, యత్కృతం తు పురా కర్మ సన్నియుక్తేన వై నృప. ౪౮. స తదేవ స్వయం భేజే

నుసారముగ నివియెల్లఁ గల్గును. లోకమునఁ గూడ వసంతాదిఋతువులు నా యా కాలములయందు స్వయముగఁ దత్కాలానుగుణలక్షణంబులు గలిగి యుండును. అటులనే దేహధారులకర్మంబులును స్వయముగఁ దత్కాలానుగుణముగ వారి నొందుచుండును. ప్రపంచవృద్ధికొఱకై ముఖబాహువులు నూరుపాదములు నన వానినుండి వరుసగా బ్రాహ్మణక్షత్రియులు వైశ్య శూద్రులును నిర్మింపఁబడిరి. మఱియు నీతనినాల్గుముఖములనుండి నాల్గు వేదములు బయలువెడలెను. ఓరాజా! ఆవిరాట్పురుషుని పూర్వముఖము నుండి దివ్యజ్ఞానసంపన్నుఁడగు వసిష్ఠునితో ఋగ్వేదసంహితయు, దక్షిణాననమునుండి యాజ్ఞవల్క్యునితో యజుర్వేదసంహితయుఁ, బశ్చిమ వక్త్రమునుండి గౌతమునితో సామవేదమును నుత్తరవదనమునుండి శౌనకునితో నథర్వవేదసంహితయు నూర్ధ్వభాగంబుననుండుపంచమశిరంబునుండి యితిహాసపురస్సరంబుగ నష్టాదశపురాణములును యమమన్వాదిస్మృతులును బయలువెడలెను. పిమ్మట నవ్విరాట్పురుషుఁడు నిజదేహము రెండుగ విభజించెను. అందొక్కభాగము స్త్రీరూపముగను రెండవభాగమును బురుషునిగనొనర్చి యొకద్వంద్వము నేర్పరించెను. తపంబొనర్చి స్వయముగ నెవ్వని సృజించె నాతఁడే విరాట్పురుషుఁడు. అవ్విరాజుండు ప్రజా

---

సృజ్యమానం పునఃపునః, హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మే ఋతానృతే. ౪౯. యద్యథాస్యాభవత్సర్గే తత్తస్య స్వయమావిశత్, యథా చ లింగాన్యృతవః స్వయమేవా నుపర్యయే. ౫౦. స్వాని స్వాన్యభిపద్యంతే తథా కర్మాణి దేహినః, లోకస్యేహ వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః. ౫౧. బ్రహ్మ క్షత్రం తథా చోభౌ వైశ్యశూద్రౌ నృపోత్తమ, ముఖాని యాని చత్వారి తేభ్యో వేదా వినిఃసృతాః. ౫౨. ఋగ్వేద సంహితా త్రాత వసిష్ఠేన మహాత్మనా, పూర్వాన్ముఖాన్మహాబాహో దక్షిణాచ్చాపి వై శృణు. ౫౩. యజుర్వేదో మహారాజ యాజ్ఞవల్క్యేన వై సహ, సామాని పశ్చిమాత్త్రాత గౌతమశ్చ మహానృషిః. ౫౪. అథర్వవేదో రాజేన్ద్ర ముఖాచ్చాప్యుత్తరా న్నృప, ఋషిశ్చాపి తథా రాజఞ్ఛౌనకో లోకపూజితః. ౫౫. యత్తన్ముఖం మహాబాహో పంచమం లోకవిశ్రుతమ్, అష్టాదశ పురాణాని సేతిహాసాని భారత. ౫౬. నిర్గతాని తతస్తస్మాన్ముఖాత్కురుకులోద్వహ, తథాన్యాః స్మృతయశ్చాపి యమాద్యా లోకపూజితాః. ౫౭. తతః స భగవాన్దేవో ద్విధా దేహమకారయత్, ద్విధా కృత్వాత్మనో దేహమర్ధేన పురుషోఽభవత్. ౫౮. అర్ధేన నారీ తస్యాం చ విరాజమసృజత్ప్రభుః, తపస్తప్త్వాసృజద్యం తు స స్వయం పురుషో విరాట్. ౫౯. స చకార తపో రాజఞ్

సృష్టి నిచ్ఛగించి తపం బాచరించెను. తరువాత నాతఁడు ప్రజాపతులగు పదిమంది మహర్షులను దోల్తఁ బుట్టించెను. నారదుండు, భృగుఁడు, మరీచియు, నత్రియు, నంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, ప్రచేతసుఁడు, వసిష్ఠుఁడు ననువారు పదుగురు మహర్షులు. అందు మరీచి ప్రథమప్రజాపతి. వీరిని మఱికొందఱు మహాతేజస్సంపన్నులను సృజించెను. తరువాత దేవదానవమానవమహర్షులను యక్షరాక్షసపిశాచ గంధర్వులను నప్సరోగణమును బితృగణమును సర్పగణమును నాగగణము మున్నగు వివిధగణముల సృజించెను. విద్యుదశనిగణములను మేఘగణములను రోహితములను దండాకారములగు నింద్రధనువులను నుల్కాధూమకేతువులను ప్రళయమును ధ్రువాగస్త్యాదినక్షత్రమండలములను కిన్నరగణమును మత్స్యాదిజలచరములను వరాహాది వన్యములను పక్షులను గజాశ్వగవాదులను మృగములను సింహవ్యాఘ్రాది క్రూరమృగములను కృమికీటాదులను నింకను క్షుద్రజంతువులను స్థావరములగు వృక్షపర్వతాదులను సృజించెను. ఇవ్విధముగ ముల్లోకముల సృజియించెను. ఏభూతమున కెట్టికర్మ చెప్పఁబడెనో పుట్టుకయందలిక్రమ మెట్టిదో సాకల్యముగ నిందు వర్ణింపఁబడును.

రాజా! వీనివిస్తర మాకర్ణింపుము. సింహములు నేనుఁగులు లేళ్లు

---

సిసృక్షుర్వివిధాః ప్రజాః, పతీన్ప్రజానామసృజన్మహర్షీ నాదితో దశ. ౧౦. నారదం చ భృగుం తాత కం ప్రచేతసమేవ హి, పులహం క్రతుం పులస్త్యం చ అత్రిమంగిరసం తథా. ౧౧. మరీచిం చాపి రాజేన్ద్ర యోఽసావాద్యః ప్రజాపతిః, ఏతాంశ్చాన్యాంశ్చ రాజేంద్ర అసృజద్భూరితేజసః. ౧౨. అథ దేవానృషీన్దైత్యాన్సోఽసృజత్కురునందన, యక్షరక్షఃపిశాచాంశ్చ గంధర్వాప్సరసోఽసురాన్. ౧౩. మనుష్యాణాం పితౄణాం చ సర్పాణాం చైవ భారత, నాగానాం చ మహాబాహో ససర్జ వివిధాన్గణాన్. ౧౪. క్షణరుచోఽశనిగణాన్రోహితేంద్రధనూంషి చ, ధూమకేతూంస్తథా చోల్కా నిర్ఘాతాఞ్జ్యోతిషాం గణాన్. ౧౫. మనుష్యాన్కిన్నరాన్మత్స్యాన్వరాహాంశ్చ విహంగమాన్, గజానశ్వానథ పశూన్మృగాన్వ్యాలాంశ్చ భారత. ౧౬. కృమికీటపతంగాంశ్చ యూకాలిక్షకమత్కుణాన్, సర్వం చ దంశమశకం స్థావరం చ పృథగ్విధమ్. ౧౭. ఏవం స భాస్కరో దేవః ససర్జ భువనత్రయమ్, యేషాం తు యాదృశం కర్మ భూతానామిహ కీర్తితమ్. ౧౮. కథయిష్యామి తత్సర్వం క్రమయోగం చ జన్మని, గజా

వివిధములగు పశువులు పిశాచములు మనుష్యులు రాక్షసులును జరాయుజము లనంబరగు. సర్పములు మొసళ్లు చేపలు తాఁబేళ్లు మొదలగునవి యండజము లనఁబడుచుండు. వీనికే ద్విజములనియు వాడుక గలదు. మఱియు తొండలు మొదలగునవి స్థలజములు. శంఖాదులు జలజములు. దంశమశకములు యూకాలిక్షుకమత్కుణములును స్వేదజము లనంబడును. స్వేదమనఁగాఁ బార్థివద్రవ్యతాపనమువలనఁ గల్గుచెమ్మ. పిపీలికాదు లూష్మమువలన జనించును. బీజములనుండి జనించువృక్షాదు లుద్భిజ్జము లనఁబడును. పండ్లు పండువఱకు జీవించి యుండునవి యోషధులు. ఇవి యనేకపుష్పఫలభరితము లై యుండును. పుష్పింపకయే ఫలించునవి వనస్పతు లనఁబడును. మొదటఁ బుష్పించి యనంతరము కాయునవి రెండు విధములుగాఁ జెప్పఁబడుచున్నవి. గుచ్ఛములు (ప్రకాండము లేక మొదట నుండియుఁ దీఁగెలగుంపై యుండు మల్లెతీఁగె మొదలగునవి) అనియు, గుల్మములు (ఒకే మొదలు గలిగి దుబ్బుగాఁ బుట్టునవి యగు రెల్లు చెఱకు మొదలయినవి) అనియు నింకను పలువిధము లయి యున్నవి. ఇట్లే తృణజాతులును వివిధము లయి యున్నవి. ఇవి బీజకాండములవలనఁ బుట్టును. తీఁగెజాతులు ప్రతానములు (అనపవ్రాలు) వల్లులు (తిప్పతీఁగె మున్నగునవి) నని రెండు తెఱంగులయి యుండె. ఈచెప్పిన వృక్షలతాదు లన్నియుఁ దమోగుణముచేతను విచిత్రమగుదుఃఖమే ఫలముగగల యధర్మకర్మములచేతను వ్యాప్తములయి యంతస్సంజ్ఞ గలిగియుండును. వీనికన్నింటికిని సుఖదుఃఖములు గలవు. ఇట్లు బ్రహ్మాదిస్తంభపర్యంతమగు

---

వ్యాలా మృగాస్తాత పశవశ్చ పృథగ్విధాః. ౧౯. పిశాచా మానుషాస్తాత రక్షాంసి చ జరాయుజాః; ద్విజాస్తు అండజాః సర్పా నక్రా మత్స్యాః సకచ్ఛపాః. ౨౦. ఏవం విధాని యానీహ స్థలజాన్యౌదకాని చ, స్వేదజం దంశమశకం యూకాలిక్షుకమత్కుణాః ౨౧. ఊష్మణా చోపజాయంతే యచ్చాన్యత్కించిదీదృశమ్, ఉద్భిజ్జాః స్థావరాః సర్వే బీజకాండప్రరోహిణః. ౨౨. ఓషధ్యః ఫలపాకాంతాః నానావిధఫలోపగాః, అపుష్పాః ఫలవంతో యే తే వనస్పతయః స్మృతాః. ౨౩. పుష్పిణః ఫలినశ్చైవ వృక్షాస్తూభయతః స్మృతాః, గుచ్ఛగుల్మం తు వివిధం తథైవ తృణజాతయః. ౨౪. బీజకాండరుహాణ్యేవ ప్రతానా వల్ల్య ఏవ చ, తమసా బహురూపేణ వేష్టితాః కర్మహేతునా. ౨౫. అంతఃసంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః, ఏతావత్యస్తు గతయః ప్రోద్భూతాః కురునందన. ౨౬. తస్మాద్దేవాద్దీప్తిమంతో భాస్కరాచ్చ మహాః

సృష్టి నెఱింగించితి. సంతతగమనశీలంబై యతిఘోరమగు నీసంసారమున నిట్టిస్థావరజంగమాత్మకమగు జగంబును లోకగురుండును బరుండు నగు పితామహుని సృజించి యాపరాత్పరుఁడు సృష్టికాలమును బ్రళయకాలముచేఁ బీడించుచు నంతర్ధానమందెను. ఎప్పు డాప్రజాపతి మేల్కాంచునో యప్పు డీజగం బుచ్ఛ్వాసనిశ్వాసాహారాదిచేష్టల నొందుచున్నది. ఉపసంహరింప నెంచినవాఁడై యెప్పుడు కనుమూయునో యప్పుడే చరాచరమయంబగు సకలప్రపంచంబు నాతనియందు లీనమగుచున్నది. ఆప్రజాపతి యిచ్ఛావిహీనుఁడై నిద్రించుచుండఁగాఁ గర్మలబ్ధదేహులగువారందఱు దమతమకర్మలనుండి మరలుచున్నారు. మనస్సునింద్రియములును వ్యాపారహీనము లయి యుండును నిఖిలభూతములు నొక్కమారు తనయందు లీనము గాఁగానే యాసర్వేశ్వరుఁడు సంతోషభరితుఁడై సుఖముగ నిద్రించుచున్నాఁడు. జీవ మజ్ఞానమునొంది, చిరకాల మింద్రియాదిసహితమై యుండును. తనయొక్క శ్వాసప్రశ్వాసప్రముఖకర్మముల నాచరించుచుండుట లేదు. అప్పుడే పూర్వదేహమునుండి దేహాంతరము జొచ్చును. ఎప్పుడు జీవ మణుమాత్రమై (అణ్వ్యః మాత్రాః పుర్యష్టకరూపాః యస్య సోఽణుమాత్రికః) వృక్షాదిస్థావరములకు మానుషాది చరములకును హేతువగు బీజమును బ్రవేశించునో యప్పుడు పుర్యష్టకరూపమై కర్మానురూపమగు స్థూలదేహాంతరము స్వీకరించుచున్నది. ఇట్లు నాశరహితుఁడగు నాబ్రహ్మ చరాచరాత్మకమగు నీప్రపంచమును సతతముఁ దన జాగ్రదవస్థచే సృజించుచు స్వప్నావస్థచే నంత మొందిం

---

త్మనః, ఘోరేఽస్మింస్తాత సంసారే నిత్యం సతతయాయిని. ౨౭. ఏవం సర్వం స సృష్ట్వేదం రాజంల్లోకగురుం పరమ్, తిరోభూతః స భూతాత్మా కాలం కాలేన పీడయన్. ౨౮. యదా స దేవో జాగర్తి తదేదం చేష్టతే జగత్, యదా స్వపితి శాంతాత్మా తదా సర్వం నిమీలతి. ౨౯. తస్మిన్స్వపితి రాజేన్ద్ర జంతవః కర్మబంధనాః, స్వకర్మభ్యో నివర్తంతే మనశ్చ గ్లాని మృచ్ఛతి. ౩౦. యుగపత్తు ప్రలీయంతే యదా తస్మిన్మహాత్మని, తదాయం సర్వభూతాత్మా సుఖం స్వపితి భారత. ౩౧. తమో యదా సమాశ్రిత్య చిరం తిష్ఠతి సేన్ద్రియః, న నవం కురుతే కర్మ తతోత్క్రామతి మూర్తితః. ౩౨. యదాహం మాత్రికో భూత్వా బీజం స్థాస్ను చరిష్ణు చ, సమావిశతి సంసృష్టస్తదా మూర్తిం విముఞ్చతి. ౩౩. ఏవం స జాగ్రత్స్వప్నాభ్యామిదం సర్వం జగత్ప్రభుః,

చుచుఁ గల్పాద్యంతములఁ గల్పించుచున్నాఁడు. ఆతనియొక్కదినము కల్పాంతమని చెప్పఁబడును. ఓకురువంశభూషణా! ఇఁకఁ గల్పముయొక్క కాలసంఖ్య నెఱింగింతు నాలకింపుము. అష్టాదశనిమేషములు కాష్ఠ యని చెప్పఁబడును. ముప్పది కాష్ఠల కాలమును కళ యని చెప్పుదురు. ముప్పది కళ లొక్కక్షణమని చెప్పుదురు. పండ్రెండుక్షణము లొక్క ముహూర్తము. అట్టి ముహూర్తములు ముప్పది చేరిన నొక్క యహోరాత్రమని ధీనిధులు వక్కాణించిరి. అట్టి యహోరాత్రములు ముప్పది యొకమాసము. మాస ద్వయ మొకఋతువు. మూఁడు ఋతువు లొక్క యయనము. అట్టి యయనములు రెండు గూడిన నొక సంవత్సరము ననియు వచింతురు. మానుషంబులగు నహోరాత్రములను దేవతలయహోరాత్రములను సూర్యభగవానుఁడు వేఱుచేయుచున్నాఁడు. అట్టియహోరాత్రములలో రాత్రిభాగమున భూతములు నిర్వ్యాపారదశనొందును. పగటిభాగ మున స్వస్వకర్మానుష్ఠాన వ్యాపృతము లగును. మానవుల ముప్పది యహోరాత్రములు (మాసము) పితృదేవతల కొక్క యహోరాత్ర మగును. అందు రెండుపక్షములు విభజింపఁబడెను. అందుఁ గృష్ణపక్షము పితృదేవులకుఁ గర్మానుష్ఠానార్థ మేర్పడియె. రెండవదియగు శుక్లపక్షము వారిసుషుప్తికొఱ కేర్పడెను. ఇవి రెండును వారియహోరాత్రము మనుష్యులసంవత్సరకాలము దేవతల యహోరాత్రము. అయ్యహోరాత్రము దక్షిణాయనము నుత్తరాయణమునని రెండుభాగము లయ్యెను. అం దుత్తరాయణము దేవతలకుఁ బవలు. దక్షిణాయనము రాత్రి.

---

సంజీవయతి చాజస్రం ప్రమాపయతి చావ్యయః. ౧౪. కల్పాదౌ సృజతే తాత అంతే కల్పస్య సంహరేత్, దినం తస్యేహ యత్తాత కల్పాంతమితి కథ్యతే. ౧౫. కాలసంఖ్యాం తతస్తస్య కల్పస్య శృణు భారత, నిమేషా దశ చాష్టౌ చ అష్టః కాష్ఠా నిగద్యతే. ౧౬. త్రింశత్కాష్ఠాః కలామాహుః క్షణస్త్రింశత్కలాః స్మృతాః, ముహూర్తమథ మాహూర్తా వదంతి ద్వాదశక్షణమ్. ౧౭. త్రింశన్ముహూర్తముద్దిష్ట మహోరాత్రం మనీషిభిః, మాసస్త్రింశ దహోరాత్రం ద్వౌ ద్వౌ మాసావృతుః స్మృతః. ౧౮. ఋతుత్రయమప్యయనమయనే ద్వే తు వత్సరః, అహోరాత్రే విభజతే సూర్యో మానుష దైవికే. ౧౯. రాత్రిః స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః, పిత్ర్యేరాత్ర్యహనీ మాసః ప్రవిభాగస్తు పక్షయోః. ౨౦. కర్మచేష్టాస్వహః కృష్ణః శుక్లః స్వప్నాయ శర్వరీ, దైవే రాత్ర్యహనీ వర్షం ప్రవిభాగస్తయోః పునః. ౨౧. అహస్తత్రోదగయ

రాజా! బ్రహ్మయొక్క యహోరాత్రప్రమాణమును గృతాదియుగ చతుష్టయప్రమాణములును సంగ్రహముగ నెఱింగింతు వినుము. కృత యుగప్రమాణము నాల్గువేలవత్సరములు. అందు నూరువత్సరములు పూర్వసంధ్య యనియు నూరువత్సరము లుత్తరసంధ్యయనియుఁ బ్రసిద్ధములు. త్రేతాయుగమానము మూఁడువేలవత్సరములు. అందు నారువందలు పూర్వసంధ్యయు నన్నియే యుత్తరసంధ్యయు నైయుండు. ద్వాపరప్రమాణము ద్విసహస్రవర్షములు. అందుఁ బూర్వసంధ్య నానూరు వత్సరములు నుత్తరసంధ్య నానూఱువత్సరములు నైయుండు. కలియుగప్రమాణము పండ్రెండువందలయేండ్లు. ఈశ్లోకాదిన వర్ణింపఁబడిన మానుషచతుర్యుగములు పండ్రెండువే లయిన నొక్క దేవయుగము. అట్టిదేవయుగములు సహస్రమయిన బ్రహ్మ కొక్క పగలగు. ఇట్టులే రాత్రియునని భావింపనగు. ఈతీరుగ యుగసహస్రద్వయపరిమితమగు బ్రహ్మాహోరాత్రము నెఱుంగువా రహోరాత్రజ్ఞు లనంబడుదురు. ఏత జ్జ్ఞానముచే మనుజులు పుణ్యలోకముల నొందుదురు. ఆబ్రహ్మ సుషుప్తి నొంది యహోరాత్రాంతపుఁదుదిని మేల్కొనుచున్నాఁడు. అటులు మేల్కొని సదసద్రూపమగు మనస్సును బుట్టించుచున్నాఁడు. అదియుఁ బ్రపంచ సృష్టిని పిమ్మట నొనరించుచున్నది. అంత నామనస్సునుండి యాకసము

---

నం రాత్రిః స్యాద్దక్షిణాయనమ్, బ్రాహ్మస్య తు క్షపాహస్య యత్ప్రమాణం మహీపతే ౯౨. ఏకైకశో యుగానాం తు క్రమశస్తన్నిబోధ మే, చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాం తత్కృతం యుగమ్. ౯౩. తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః, త్రేతా త్రీణి సహస్రాణి వర్షాణి చ విదుర్బుధాః. ౯౪. శతాని షట్ చ రాజేన్ద్ర సంధ్యాసంధ్యాంశయోః పృథక్, వర్షాణాం ద్వే సహస్రే తు ద్వాపరే పరికీర్తితే. ౯౫. చత్వారి చ శతాన్యాహుః సంధ్యాసంధ్యాంశయోర్బుధాః, సహస్రం కథితం తిష్యే శతద్వయసమన్వితమ్. ౯౬. ఏషా చతుర్యుగస్యాపి సంఖ్యా ప్రోక్తా నృపోత్తమ, యదేతత్పరిసంఖ్యాతమాదావేవ చతుర్యుగమ్. ౯౭. ఏతద్ద్వాదశసాహస్రం దేవానాం యుగముచ్యతే, దైవికానాం యుగానాం తు సహస్రపరిసంఖ్యయా. ౯౮. బ్రాహ్మమేక మహర్జ్ఞేయం తావతీరాత్రిరుచ్యతే, ఏతద్యుగసహస్రాంతం బ్రాహ్మం పుణ్యమహర్విదుః. ౯౯. రాత్రిం చ తావతీమేవ తేఽహోరాత్రవిదో జనాః, తతోఽసౌ యుగపర్యంతే ప్రసుప్తః ప్రతిబుధ్యతే. ౧౦౦. ప్రతిబుద్ధస్తు సృజతి మనః

దానిగుణమగుశబ్దము నుదయించును. వికారకారణంబగు నాకాశము నుండి సుగంధదుర్గంధములవహించునదయ్యుఁ బరమపవిత్రమైన వాయువు స్పర్శశబ్దయుతమై యుదయమునందుచున్నది. దానినుండి దీప్తిమంతమై తమోనాశకమగుఁదేజ ముదయించె. పూర్వగుణములతో బాటు రూపము గూడ నందుఁ గలిగె. ఆతేజస్సునుండి యుదకములు జనించుచున్నవి. దానిగుణవిశేషము రసము ఉదకమునుండి గంధగుణకమగు పృథివి జనించె. మహాప్రళయానంతరమున భూతసృష్టిక్రమ మిట్టిది.

మున్ను వర్ణించిన దేవయుగమును డెబ్బదియొక్కటిచే గుణించిన లభించుకాలము నొక మన్వంతరమని వచింతురు. ఈమన్వంతరములు సృష్టిప్రళయములచే నసంఖ్యాకము లయినవి. పురాణాంతరముల మాత్రము మన్వంతరములు పదునాలుగని గణింపఁబడియె కాని పండితులు బ్రాహ్మమగునహస్సునఁ బదునలుగురు మనువులని చెప్పుచున్నారు. స్వాయంభువుండనుమనువున కితరమనువు లార్గురు వశ్యులయి యుండిరి. మహాపరాక్రమవంతులును మహానుభావులు నగువారు దమతమప్రజల సృజించిరి. సావర్ణేయుఁడు పాంచభౌత్యుఁడు రౌచ్యుఁడు మొదలగు నేడ్వురు మనువు లికమీఁద జనింతురు. వీరందఱు దమతమయంతరముల నీచరాచరమయప్రపంచంబుఁ బాలించుచున్నారు. ఆవిరించి యివ్విధమున

---

సదసదాత్మకమ్, మనః సృష్టిం వికురుతే చోద్యమానం సిసృక్షయా. ౧౦౧. విపులం జాయతే తస్మాత్తస్య శబ్దం గుణం విదుః, విపులాత్తు వికుర్వాణాత్సర్వగంధవహాశ్శుచిః. ౧౦౨. బలవాంజాయతే వాయుః స వై స్పర్శగుణో మతః, వాయోరపి వికుర్వాణాద్విరోచిష్ణు తమోనుదమ్. ౧౦౩. ఉత్పద్యతే విచిత్రాంశుస్తస్య రూపం గుణం విదుః, తస్మాదపి వికుర్వాణాదాపో జాతాః స్మృతా బుధైః. ౧౦౪. తాసాం గుణో రసో జ్ఞేయః సర్వలోకస్యభావనః, ఆద్భ్యశ్చ గంధగుణా భూమిరిత్యేషా సృష్టిరాదితః. ౧౦౫. యత్ప్రాగ్ద్వాదశసాహస్రముక్తం సౌమనసం యుగమ్, తదేకసప్తతిగుణం మన్వంతరమిహోచ్యతే. ౧౦౬. మన్వంతరాణ్యసంఖ్యాని సర్గః సంహార ఏవ చ, తథాప్యహే సదా బ్రాహ్మే మనవస్తు చతుర్దశ. ౧౦౭. కథ్యంతే కురుశార్దూల సంఖ్యయా పండితైః సదా, మనోః స్వాయంభువస్యేహ షడ్వంశ్యా మనవోఽపరే. ౧౦౮. సృష్టవంతః ప్రజాః స్వాః స్వాః మహాత్మానో మహౌజసః, సావర్ణేయస్తథా పంచభౌత్యో రౌచ్యస్తథాపరః. ౧౦౯. ఏతే భవిష్యా మనవః సప్త ప్రోక్తా నృపోత్తమ, స్వే స్వేంతరే సర్వమిదం పాలయంతి చరాచరమ్. ౧౧౦. ఏవంవిధం దినం తస్య విరించేస్తు మహాత్మనః,

దినాంతమున నీసృష్టినుపక్రమించును. ఓరాజా! ప్రజాపతి క్రీడించువాని పగిది నీసృష్టివిలాసము చేయుచున్నాఁడు. కృతయుగమున సత్యధర్మములు రెండును సర్వావయవోపేతము లయియుండును మానవులు ధర్మవిరుద్ధ మార్గమున ధనమును విద్యను సంపాదింపరు. ఇతరయుగములందు ధన విద్యార్జనములు ధర్మమునెట్లు హీనము లగుచున్నవో యారీతిని మనువు వచించియుండెను. ఓనరదేవోత్తమ! చౌర్యమువలన నసత్యమువలన మాయలవలనను త్రేతాయుగమునందు ధర్మము ప్రతిపాదమునను క్రమముగాఁ గురుచఁదనము నొందుచున్నది. మనుజులకు వేదోక్తమగు నాయువు తగ్గినది. ప్రథమమగు కృతయుగమున రోగవిహీనులును సంకల్పసిద్ధులునై నానూరువత్సరము లాయుఃప్రమాణము గలిగియుండు మానవులయాయువు త్రేతాదియుగములఁ బ్రతిపాదమునను గ్రమక్రమముగ హ్రాసము నొందుచున్నది మఱియు నాశీస్సులు గర్మఫలములు శాపానుగ్రహసామర్థ్యము మొదలగునవి క్రమముగ దరిగిపోవుచున్నవి. కృతయుగధర్మములు వేఱుగను, త్రేతాయుగధర్మములు వేఱొకతీరుగను, ద్వాపరయుగధర్మములు మఱొక్కవిధముగను, గలియుగధర్మము లింకొక దారిని విలక్షణములయియున్నవి. సత్య (కృత) యుగమునఁ దపముత్తమ ఫలదాయకము, త్రేతాయుగమున జ్ఞానమే ముఖ్యఫలదము, ద్వాపరమున యజ్ఞము ఫలప్రదము నని బుధులు వక్కాణింతురు. కలియుగ

---

తస్యాంతే కురుతే సర్గం యథేదం కథితం తవ. ౧౧౧. క్రీడన్నివైతత్కురుతే పరమేష్ఠీ నరాధిప, చతుష్పాత్సకలో ధర్మః సత్యం చైవ కృతే యుగే. ౧౧౨. నాధర్మేణాగమః కశ్చిన్మనుష్యాణాం ప్రవర్తతే, ఇతరేష్వాగమాత్తాత ధర్మశ్చ కురునందన. ౧౧౩. యాదృశాః పరిహీయంతే యథాహ భగవాన్మనుః, చౌర్యాచ్చానృతాద్రాజన్మాయాభిరమితద్యుతే. ౧౧౪. పాదేన హీయతే ధర్మస్త్రేతాదిషు యుగేషు వై, అరోగాః సర్వసిద్ధార్థాశ్చతుర్వర్షశతాయుషః. ౧౧౫. కృతత్రేతాదిషు త్వేషాం వయో హ్రసతి పాదశః, వేదోక్తమాయురాశీశ్చ మర్త్యానాం కురునందన. ౧౧౬. కర్మణాం తు ఫలం తాత ఫలత్యనుయుగం సదా, ప్రభావశ్చ తదా లోకే ఫలత్యేవ శరీరిణామ్. ౧౧౭. అన్యే కృతయుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరే పరే, అన్యే కలియుగే నృణాం యుగధర్మానురూపతః. ౧౧౮. తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే, ద్వాపరే యజ్ఞమిత్యాహుర్దానమేకం కలౌ యుగే. ౧౧౯. సర్వస్య

మున మాత్రము దానముచేతనే పుణ్యము లభించునని చెప్పుచున్నారు. ఆబ్రహ్మ యీసృష్టినంతను రక్షించుటకు నిజముఖాదుల నుద్భవమందిన బ్రాహ్మణాది వర్ణచతుష్టయమునకు వేర్వేరు కర్మలఁ గల్పించెను. అధ్యయనాధ్యాపనములు యజనయాజనములు దానప్రతిగ్రహములు నను షట్కర్మలను బ్రాహ్మణునకుఁ గల్పించెను. రాజన్యునకుఁ బ్రజాపాలనము దానము యజనము నధ్యయనము విషయాసక్తిని (ధర్మోపరోధము లేకుండ) గల్పించెను. పశురక్షణము నిజ్యాధ్యయనదానములు వాణిజ్యము గుసీదము కృషియు ననువానిని వైశ్యునకుఁ గల్పించెను. శూద్రునకు శుశ్రూష యొక్కటియే చెప్పఁబడెను. పురుషునకు బొడ్డుపైభాగము శ్రేష్ఠమైనది. అంతకంటె ముఖము శుచియైనది. అట్టిముఖమునుండి ద్విజ డుద్భవించెనని వేదము చెప్పుచున్నది. న్యాయమునుబట్టి యీసర్వధర్మములకును బ్రాహ్మణుఁడే ప్రభువు. హవ్యకవ్యముల రక్షింపఁ బ్రజాపతి చిరకాలము దపమాచరించి వారిం గాంచెను! వీరిముఖమునుండియే దేవతలు హవ్యములును, పితరులు కవ్యములును భుజించుచున్నారు. ఇంతకన్న నధికమేమి గలదు? భూతములలో బ్రాణముగలవారుత్తములు అందును బుద్ధిబలమున జీవించుప్రాణు లుత్కృష్టములు. అందును

---

రాజన్సర్గస్య గుప్త్యర్థం చ మహాద్యుతే, ముఖబాహూరుపాదానాం పృథక్కర్మాణ్యకల్పయత్. ౧౨౦. అధ్యాపనమధ్యయనం యజనం యాజనం తథా, దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానామకల్పయత్. ౧౨౧. ప్రజానాం పాలనం రాజన్దానమధ్యయనం తథా, విషయేషు ప్రసక్తిం చ తథేజ్యాం క్షత్రియస్య తు. ౧౨౨. పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవ చ, వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషిరేవ చ. ౧౨౩. ఏకమేవ తు శూద్రస్య కర్మ లోకే ప్రకీర్తితమ్, ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనుపూర్వశః. ౧౨౪. పురుషస్య సదా శ్రేష్ఠం నాభేరూర్ధ్వం నృపోత్తమ, తస్మాదపి శుచితరం ముఖం తాత స్వయంభువః. ౧౨౫. తస్మాన్ముఖాద్ద్విజో జాత ఇతీయం వైదికీ శ్రుతిః, సర్వస్యైవాస్య ధర్మస్య ధర్మతో బ్రాహ్మణః ప్రభుః. ౧౨౬. స సృష్ట్వా బ్రహ్మణా పూర్వం తపస్తప్త్వా కురూద్వహ, హవ్యానామివ కవ్యానాం సర్వస్యాపి చ గుప్తయే. ౧౨౭. అశ్నంతి చ ముఖేనాస్య హవ్యాని త్రిదివౌకసః, కవ్యాని చైవ పితరః కింభూతమధికం తతః. ౧౨౮. భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః, బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః. ౧౨౯. బ్రాహ్మణేషు చ

మానవు లధికులు. వారిలోపల బ్రాహ్మణు లుత్తములు. వారియందును విద్వాంసులు నందును గృతమతులును వారిలోఁ గర్తలును వారిలోఁ గూడ బ్రహ్మవేత్తలు నుత్తములని చెప్పుచున్నారు. బ్రాహ్మణునిజననము ధర్మరక్షణముకొఱకని చెప్పఁబడుచున్నది. ధర్మార్థ ముద్భవించిన విప్రుఁడు ధర్మానుగృహీతమగు నాత్మజ్ఞానము గలిగి బ్రహ్మసదనము నొందుచున్నాఁడు. బ్రాహ్మణుఁ డీపృథివియందు సర్వశ్రేష్ఠుఁడై పుట్టి సర్వభూతములధర్మజాతమును రక్షింప సమర్థుఁ డగుచున్నాఁడు. పృథ్వి యంతయు బ్రాహ్మణునిదే. బ్రహ్మముఖోద్భవుండగుట నత్యుత్తముండగు బ్రాహ్మణుఁడే సర్వమును గ్రహింప నర్హుఁడగుచున్నాఁడు. మఱియు నాతఁడు తనయన్నమునే దా భుజించు. తనవస్త్రమే ధరించు. తనవస్తువే యితరులకొసంగును. ఈతనియనుగ్రహమువలననే యితరులు భోజనాదికృత్యములు నిర్వర్తించుకొనుచున్నారు. మిగిలిన వర్ణత్రయమునకు భావాభావనిమిత్తము బ్రాహ్మణుఁడే. ఆతఁడు సంతసించెనేని యెల్లవారు సుఖింతురు. కోపించిన నెల్లవారుఁ జెడుదురు. కావున నాతఁడు పూజ్యతముఁడు అతఁ డుండ నితరుఁడు ప్రభువు గాఁజాలఁడు. అతఁడు లేకున్న లోకమునకు క్షేమము లేదు. కామాధీనుఁడై కర్మంబు లాచరించుచుండు. అందువలనఁ గామము లనుభవించుచున్నాఁడు. బృందారకపురి నొంది భోగము లనుభవించుచున్నాఁడు. అక్కడనుండి మహర్లోకమును నత్తావునుండి

---

విద్వాంసో విద్వత్సు కృతబుద్ధయః, కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః. ౧౩౦. జన్మ విప్రస్య రాజేన్ద్ర ధర్మార్థమిహ కథ్యతే, ఉత్పన్నః సర్వసిద్ధ్యర్థం యాతి బ్రహ్మసదో నృప. ౧౩౧. స చాపి జాయమానస్తు పృథివ్యామిహ జాయతే, భూతానాం ప్రభవాయైవ ధర్మకోశస్య గుప్తయే. ౧౩౨. సర్వం హి బ్రాహ్మణస్యేదం యత్కించిత్పృథివీగతమ్, జన్మనా చోత్తమేనేదం సర్వం వై బ్రాహ్మణోఽర్హతి. ౧౩౩. స్వకీయం బ్రాహ్మణో భుంక్తే విదధాతి చ సువ్రత, కరుణాం కుర్వతస్తస్య భుంజంతీహేతరే జనాః. ౧౩౪. త్రయాణామిహ వర్ణానాం భావాభావాయ వై ద్విజః, భవేద్రాజన్న సందేహస్తుష్టో భావాయ వై ద్విజః. ౧౩౫. అభావాయ భవేత్క్రుద్ధస్తస్మాత్పూజ్యతమో హి సః, బ్రాహ్మణేసతి నాన్యస్య ప్రభుత్వం విద్యతేనృప. ౧౩౬. కామాత్కరోత్యసౌ కర్మ కామగచ్ఛన్నృపోత్తమ, తస్మాద్బృందారకపురీ తస్మాదపి మహఃపునః. ౧౩౭. మహర్లోకాజ్జనోలోకం బ్రహ్మలోకం చ గచ్ఛతి, బ్రహ్మత్వం చ మహాబాహో యాతి విప్రో న సంశయః. ౧౩౮.

బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు. తుట్టతుదకు విప్రుఁడు నిస్సంశయముగ బ్రహ్మత్వమునే బడయుచున్నాఁడు. అన విని శతానీకుం డాతని కిట్లనియె:—

"ఓ భూదేవశిరోభూషణా! బ్రహ్మలోకము బ్రహ్మత్వమును దుష్ప్రాపములు గదా? ఎట్టివిప్రుఁడు బ్రహ్మలోకమును బ్రహ్మత్వమును బొందుచున్నాఁడు? నామమాత్రధరుండగు బ్రాహ్మణుఁడు బ్రహ్మత్వము వడయునా? అది వడయుట కెట్టిగుణము లావశ్యకములో నా కెఱింగింపుము విన వేడుక యయ్యెడిని" అని యడుగ సంతుష్టాంతరంగుఁడై సుమంతుఁడు రాజును శ్లాఘించుచు నిట్లనియె:—

ఓకురువంశభూషణా! నీవడిగినయర్థం బుత్తమమైనది. సావధానముగ నాకర్ణింపుము. వేదములందును మన్వాదిస్మృతులందును జెప్పఁబడిన గర్భాధానము మొదలగు నలువది సంస్కారము లేబ్రాహ్మణునకు సక్రమముగ జరుగునో యట్టివిప్రుఁడు బ్రహ్మలోకమునే గాక బ్రహ్మత్వమునే వడయుచున్నాఁడు. సంస్కారములే బ్రహ్మలోకప్రాప్తికి నిమిత్తములనుటలో సందియము లేదు.

అన విని శతానీకుండు సోత్సాహముగ సుమంతున కనియె. మునిపుంగవా! బ్రహ్మత్వము నీయఁజాలిన యాసంస్కారముల నన్నింటిని సవిశేషముగ నా కెఱింగింపుము. అన విని సుమంతుఁ డాతని కిట్లనియె:—

రాజా! సావధానముగ వేదశాస్త్రప్రతిపాదితములగు సంస్కారముల

---

శతానీకఉవాచ:—బ్రహ్మత్వం నామ దుష్ప్రాపం బ్రహ్మలోకేషు సువ్రత. ౧౩౯. బ్రహ్మత్వం కీదృశం విప్రో బ్రహ్మలోకం చ గచ్ఛతి, నామమాత్రోఽథ కిం విప్రో బ్రహ్మత్వం బ్రాహ్మణః సదా, యాతి బ్రహ్మగుణాః కే స్యుర్బ్రహ్మప్రాప్తా మహోచ్యతామ్. ౧౪౦. సుమంతురువాచ:—సాధుసాధు మహాబాహో శృణు మే పరమం వచః. ౧౪౧. యే ప్రోక్తా వేదశాస్త్రేషు సంస్కారా బ్రాహ్మణస్య తు, గర్భాధానాదయో యే చ సంస్కారా యస్య పార్థివ. ౧౪౨. చత్వారింశత్తథాష్టౌ చ నిర్వృత్తాః శాస్త్రతో నృప, స యాతి బ్రహ్మణః స్థానం బ్రాహ్మణత్వం చ మానద, సంస్కారాః సర్వథా హేతుర్బ్రహ్మత్వే నాత్ర సంశయః. ౧౪౩. శతానీక ఉవాచ:—సంస్కారాః కే మతా బ్రహ్మన్బ్రహ్మత్వే బ్రాహ్మణస్య తు, శంస మే ద్విజశార్దూల కౌతుకం హి మహన్మమ. ౧౪౪. సుమంతురువాచ:—సాధుసాధు మహాబాహో శృణు మే పరమం

వినుము. గర్భాధానము, పుంసవనము, సీమంతోన్నయనము, జాతకర్మయు, నామకరణము, అన్నప్రాశనము, చూడాకర్మయు, నుపనయనము, వేద వ్రతములునాల్గు, స్నాతకము, సహధర్మచారిణీసంయోగము(వివాహము) ఆత్మశ్రేయఃసాధనములగు దేవయజ్ఞ-పితృయజ్ఞ-మనుష్యయజ్ఞ-భూతయజ్ఞ-బ్రహ్మయజ్ఞములును,(పంచమహాయజ్ఞములు) అష్టకాశ్రాద్ధమును,పార్వణ శ్రాద్ధము, శ్రావణియు, నాగ్రహాయణి (మార్గశీర్షపూర్ణిమనాఁటి శ్రాద్ధము) యుఁ, జైత్రియు, నాశ్వయుజియు, విశేషశ్రాద్ధము నను నేడు పాకయజ్ఞములును, అగ్న్యాధానము, అగ్నిహోత్రము, దర్శపూర్ణమా సేష్టి, చాతుర్మాస్యములు, ఆగ్రయణేష్టి, నిరూఢపశుబంధము, సౌత్రా మణీయాగము నను నేడు హవిర్యజ్ఞములును, అగ్నిష్టోమము, నత్యగ్ని ష్టోమము, నక్థ్యము, షోడశియు, వాజపేయము, నతిరాత్రము నను సోమ యాగసంస్థ లేడును గలసి నలువదిసంస్కారములు. ద్విజున కివి ముఖ్యము లయినవి. మఱియు నెనిమిది యాత్మగుణములు కలవు. చెప్పెద వినుము.

అనసూయ, దయ, క్షాంతి, అనాయాసము, మంగళము, అకార్ప ణ్యము, శౌచము, నస్పృహయు నను నివి యెనిమిదియు నాత్మగుణము లనఁబడును. వీనిలక్షణము లెట్టివనిన వినుము. అసూయ యనఁగా గుణ

---

వచః, యే ప్రోక్తా వేదశాస్త్రేషు సంస్కారా బ్రాహ్మణస్య తు, మనీషిభిర్మహాబాహో శృణు సర్వానశేషతః. ౧౪౫. గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనం తథా, జాత కర్మాన్నాశనం చ చూడోపనయనం నృప. ౧౪౬. బ్రహ్మవ్రతాని చత్వారి స్నానం చ తదనంతరమ్, సధర్మచారిణీయోగో యజ్ఞానాం కర్మ మానద. ౧౪౭. పంచానాం కార్య మిత్యాహురాత్మనః శ్రేయసే నృప, దేవపిత్రృమనుష్యాణాం భూతానాం బ్రహ్మణ స్తథా. ౧౪౮. ఏతేషాం చాష్టకాకర్మ పార్వణశ్రాద్ధమేవ హి, శ్రావణీ చాగ్రహాయణీ చైత్రీ చాశ్వయుజీ తథా. ౧౪౯. పాకయజ్ఞా స్తథా సప్త అగ్న్యాధానం చ సత్క్రి యాః, అగ్నిహోత్రం తథా రాజన్దర్శం చ విధుసంక్షయే. ౧౫౦. పౌర్ణమాసం చ రాజేంద్ర చాతుర్మాస్యాని చాపి హి, నిరూపణం పశువధం తథా సౌత్రామణీతి చ. ౧౫౧. హవిర్యజ్ఞా స్తథా సప్త తేషాం చాపి హి సత్క్రియాః, అగ్నిష్టోమోత్యగ్ని ష్టోమ స్తథోక్థ్యః షోడశీం విదుః. ౧౫౨. వాజపేయోతిరాత్రశ్చ అప్తోర్యామేతి వై స్మృతః, సంస్కారేషు స్థితాః సప్త సోమాః కురుకులోద్వహ. ౧౫౩. ఇత్యేతే ద్విజ సంస్కారాశ్చత్వారింశన్నృపోత్తమ, అష్టౌ చాత్మగుణాస్తాత శృణు తానపి భారత. ౧౫౪.

ముల దోషముల నారోపించుట. పరులయున్నతి యోర్వలేకుంట యని భావము. అది లేకుండుట అనసూయ. సర్వభూతములకష్టసుఖముల నాత్మ సంబంధములుగ భావించుట దయ. కాయికముగ గాని వాచికముగ గాని కోపము లేకుండుట క్షమ (క్షాంతి). భక్ష్యాభక్ష్యవివేకము గలిగి హానోపాదానరతుండై సజ్జనసంగతుఁడై సదాచారము గల్గియుంట శౌచ మందురు. అవిహితనిషిద్ధకర్మాచరణముచే నాయాసపడకుండుట యనాయాసము. ప్రశస్తకర్మాచరణము, నప్రశస్తవివర్జనము ననునదే మంగళముగా బ్రహ్మవాదులు వచింతురు. హృదయమున నెట్టిసందియమును లేక కొంచెముగనో గొప్పగనో యన్యులకు దానముజేయుట యకార్పణ్యమని వచింతురు. స్వల్పముగాని యధికముగాని తనకున్నదానితో సంతృప్తిఁజెంది పరద్రవ్యాదుల నాసింపకుండుట యస్పృహా యని వచింతురు. ఎవ్వానిశరీర మీపైఁజెప్పిన సంస్కారములు గలిగి యుండునో ఈయాత్మగుణము లెవ్వఁడు గలిగి యుండునో యాతఁడు బ్రహ్మలోకమును బ్రహ్మత్వమును బొందును. శ్రౌతములు నుత్తమము లగునీసంస్కారములచే బ్రాహ్మణుఁ డుత్తమగతి గాంచుటంజేసి యవశ్య మీసంస్కారము

అనసూయా దయా క్షాంతిరనాయాసం చ మంగలమ్, అకార్పణ్యం తథా శౌచమస్పృహా చ కురూద్వహ. ౧౫౭. య ఏతేష్టగుణాస్తాత కీర్త్యంతే వై మనీషిభిః, ఏతేషాం లక్షణం వీర శృణు సర్వమశేషతః. ౧౫౮. న గుణాన్గుణినో హంతి న స్తౌత్యాత్మగుణానపి, ప్రహృష్యతే నాన్యదోషైరనసూయా ప్రకీర్తితా. ౧౫౯. అపరే బంధువర్గే వా మిత్రే ద్వేష్టరి వా సదా, ఆత్మవద్వర్తనం యత్స్యాత్సా దయా పరికీర్తితా. ౧౬౦. వాచా మనసి కాయే చ దుఃఖేనోత్పాదితేన చ, న కుప్యతి న చాప్రీతిః సా క్షమా పరికీర్తితా. ౧౬౧. అభక్ష్యపరిహారశ్చ సంసర్గశ్చాప్యనిందితైః, ఆచారే చ వ్యవస్థానం శౌచమేతత్ప్రకీర్తితమ్. ౧౬౨. శరీరం పీడ్యతే యేన శుభేనాపి చ కర్మణా, అత్యంతం తన్న కుర్వీత అనాయాసః స ఉచ్యతే. ౧౬౩. ప్రశస్తాచరణం నిత్యమప్రశస్తవివర్జనమ్, ఏతద్ధి మంగలం ప్రోక్తం మునిభిర్బ్రహ్మవాదిభిః. ౧౬౪. స్తోకాదపి ప్రదాతవ్యమదీనేనాంతరాత్మనా, అహన్యహని యత్కించిదకార్పణ్యం తదుచ్యతే. ౧౬౫. యథోత్పన్నేన సంతుష్టః స్వల్పేనాప్యథ వస్తునా, అహింసయా పరస్వేషు సా త్వస్పృహా పరికీర్తితా. ౧౬౬. వపుర్యస్య తు ఇత్యేతైః సంస్కారైః సంస్కృతం ద్విజః, బ్రహ్మత్వమిహ సంప్రాప్య బ్రహ్మలోకం చ గచ్ఛతి. ౧౬౭. వైదికైః

లను జేసియే తీరవలయును. నిషేకాదిసంస్కారము లొనరించినవెనుక గర్భశుద్ధిని ధర్మంబగునాశ్రమలక్షణమును బొంది బ్రాహ్మణుఁడు తప్పక ముక్తుఁడగును. ఈపురాణమునఁ జెప్పినవిధమున బ్రాహ్మణుఁడు ముక్తినే గోరుకొనుచున్నాఁడు. సందియము లేదు. సమీపస్థులు నాశ్రితులు స్వస్తివాదులు నగుద్విజుల విడచి యన్యుల నర్చించి వారి నవమానించునాతనికిఁ జెప్పరానంత పాపము సంభవించును. అక్కతన సమీపస్థులగు ద్విజుల నెల్లవేళల నుచితరీతిని బూజింపవలయును. సతతము నతిథుల నన్నపానాదులఁ దనుపుచుండనగు. బ్రాహ్మణుఁ డన్నివర్ణములకును జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడు నైయున్నాఁడు. ఇందు వివరించిన సంస్కారవృత్తాంతము వినినవాఁడు నెఱింగినవాఁడు జదివినవాఁడు నిహలోకమున నైశ్వర్యవంతుఁడై కీర్తి గలిగి పుత్రమిత్రాదులగు బంధువులఁ గూడి యనంతరము సవితృమండలముగుండా బ్రహ్మలోకముఁ జేరును.

ఇది ద్వితీయాధ్యాయము.

---

కర్మభిః పుణ్యైర్నిషేకాద్యైర్ద్విజన్మనామ్, కార్యః శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ. ౧౬౬. గర్భశుద్ధిం తతః ప్రాప్య ధర్మం చాశ్రమలక్షణమ్, యాతి ముక్తిం న సందేహః పురాణేఽస్మిన్నృపోత్తమ. ౧౬౭. ఉశంతి కురుశార్దూల బ్రాహ్మణా నాత్ర సంశయః, (ఆశ్రితానాం విశేషేణ యే నిత్యం స్వస్తివాదినః. ౧౬౮. నికటస్థాన్ద్విజాన్హిత్వా యోఽన్యాన్పూజయతి ద్విజాన్, సిద్ధం పాపం తదపమానాత్తద్వక్తుం నైవ శక్యతే. ౧౬౯. తస్మాత్సదా సమీపస్థః సంపూజ్యో విధివన్నృప, పూజయేదతిథీంస్తద్వదన్నపానాదిదానతః. ౧౭౦. బ్రాహ్మణః సర్వవర్ణానాం జ్యేష్ఠః శ్రేష్ఠస్తథోత్తమః,) ఏవమస్మిన్పురాణే తు సంస్కారాన్బ్రాహ్మణస్య తు. ౧౭౧. శృణోతి యశ్చ జానాతి యశ్చాపి పఠతే సదా, ఋద్ధిం వృద్ధిం తథా కీర్తిం ప్రాప్యేహ శ్రియముత్తమామ్. ౧౭౨. ధనం ధాన్యం యశశ్చాపి పుత్రాన్బంధూన్సురూపతామ్, సావిత్రం లోకమాసాద్య బ్రహ్మలోకమవాప్నుయాత్. ౧౭౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ద్వితీయోఽధ్యాయః.

---

## తృతీయాధ్యాయము.

పిమ్మట శతానీకుండు మునీంద్రా! వర్ణాశ్రమధర్మములు వినఁగోరెద. వివరింపుమన నాతనికి సుమంతుఁ డిట్లనియె:—

రాజేంద్రా! గర్భాధానాది మౌంజీబంధనపర్యంతములగు సంస్కారములచే బీజగర్భసముద్భవంబు లగుపాపములు నశించును. పిదప నధ్యయనముచేతను వ్రతహోమయాగాద్యనుష్ఠానముచేతను బ్రాహ్మీయగు తను వేర్పడుచున్నది. అవ్విధ మెఱింగింతు ననన్యమనస్కుఁడవై యాకర్ణింపుము. శిశువునకు నాభిచ్ఛేదమునకు ముందు జాతకర్మ చేయవలెనని శ్రుతి శాసించుచున్నది. హిరణ్యాస్పృష్టములయిన మధుసర్పిస్సులు దినిపింపవలయు. నామకరణము దశమదినమున నని కొందఱు, ద్వాదశమున నని మఱికొందఱు, నష్టాదశదినమున నని మఱికొందఱు, నెలగడచినిన వెనక నని యిఁక గొందఱుఁ దలంచుచున్నారు. శుభతిథినక్షత్రములందు సుముహూర్తమున బ్రాహ్మణునకు మంగళకరమగు శర్మాంతనామధేయమును, క్షత్రియునకు వర్మాంతనామధేయమును, వైశ్యునకు వర్ధనాంత నామమును, శూద్రునకు దాసాంతనామముఁ జేయవలయునని, మన్వాదులు నియమించియున్నారు. బ్రాహ్మణునకు శర్మశబ్దయుక్తమును, క్షత్రియ

---

శతానీక ఉవాచ:—జాతకర్మాదిసంస్కారాన్వర్ణానామనుపూర్వశః, ఆశ్రమాణాం చ మే ధర్మం కథయస్వ ద్విజోత్తమ. ౧. సుమంతురువాచ:—గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనం తథా, జాతకర్మాన్నప్రాశశ్చ చూడా మౌంజీనిబంధనమ్. ౨. బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే, స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా శ్రుతైః. ౩. మహాయజ్ఞైశ్చ బ్రాహ్మీయం యజ్ఞైశ్చ క్రియతే తనుః, శృణుష్వైకమనా రాజన్యథా సా క్రియతే తనుః. ౪. ప్రాజ్ నాభికర్తనాత్పుంసో జాతకర్మ విధీయతే, మంత్రవత్ప్రాశనం చాస్య హిరణ్యమధుసర్పిషామ్. ౫. నామధేయం దశమ్యాం తు కేచిదిచ్ఛంతి పార్థివ, ద్వాదశ్యామపరే రాజన్మాసి పూర్ణే తథాపరే. ౬. అష్టాదశేఽహని తథాఽన్యే వదంతి మనీషిణః, పుణ్యే తిథౌ ముహూర్తే చ నక్షత్రే చ గుణాన్వితే. ౭. మంగల్యం తాత విప్రస్య శివశర్మేతి పార్థివ, రాజన్యస్య విశిష్టం తు ఇందువర్మేతి కథ్యతే. ౮. వైశ్యస్య ధనసంయుక్తం శూద్రస్య చ జుగుప్సితమ్, ధనవర్ధనేతి వైశ్యస్య సర్వదాసేతి హీనజే. ౯. మనునా చ తథా ప్రోక్తం నామ్నో లక్షణముత్త

నకు రక్షాంతశబ్దమును, వైశ్యునకు పుష్టిశబ్దసంయుక్తముగను, శూద్రునకు భృత్యశబ్దసంయుక్తముగను నామధేయములు పురుషుల కావశ్యకములు. స్త్రీలనామములు సుఖోచ్చార్యములును, నక్రూరములును, స్పష్టాదుష్టార్థములు, మనోహరములును, మంగళకరములును, దీర్ఘవర్ణాంతములును, నాశీర్వాదయుక్తములు నై యుండవలయును. జననమందిన వెనుకఁ బండ్రెండగునాఁడు నిష్క్రమణము (శిశువును సూర్యునకుఁ జూపుట) చేయవలయును. ఈకర్మ నాల్గవమాసమునఁ జేయవలయునని కొంద అనుచున్నారు ఆఱవమాసమున నన్నప్రాశన మొనరించి యైశ్వర్యముకోలఁది మంగళము చేయవలయును. వర్ణత్రయమువారగు ద్విజులకు చూడాకర్మను యేఁడాదిలోపునఁగాని మూఁడవయేటఁ గాని క్రమముగఁ జేయవలెను. ఉపనయనము మాత్రము బ్రాహ్మణునకు గర్భధారణము మొదలుకొని యెనిమిదగు నేట నిర్వర్తింప నగును. క్షత్రియునకుఁ బదునొకండగునేటను, వైశ్యునకుఁ బండ్రెండగునేట నుపనయనము చేయ నగును. బ్రహ్మవర్చసముఁగోరు విప్రునకుఁ బంచమాబ్దమునఁ జేయవలెను. బలార్థియగుక్షత్రియునకు షష్ఠాబ్దమునఁ జేయవలెను. ధనకాముఁడగు వైశ్యున కెనిమిదగునేట నొనరింపనగును. బ్రాహ్మణునకు షోడశాబ్దములతిక్రమించువరకు సావిత్రి యుండును. క్షత్రియబంధువున కిరువదిరెండవయే డతిక్రమించువఱకును, వైశ్యునకు చతుర్వింశాబ్దాంతమువఱకును

---

మమ్, శర్మ వద్బ్రాహ్మణస్య స్యాద్రాజ్ఞో రక్షాసమన్వితమ్. ౧౦. వైశ్యస్య పుష్టిసంయుక్తం శూద్రస్య ప్రేష్యసంయుతమ్, స్త్రీణాం సుఖోద్యమక్రూరం విస్పష్టార్థమనోరమమ్. ౧౧. మంగల్యం దీర్ఘవర్ణాంతమాశీర్వాదాభిధానవత్, ద్వాదశేఽహని రాజేంద్ర శిశోర్నిష్క్రమణం గృహాత్. ౧౨. చతుర్థే మాసి కర్తవ్యం తథా న్యేషాం మతం విభో, షష్ఠేఽన్నప్రాశనం మాసి యథేష్టం మంగలం కులే. ౧౩. చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామనుపూర్వశః, ప్రథమేఽబ్దే తృతీయే వా కర్తవ్యం కురునందన. ౧౪. గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్, గర్భాదేకాదశే రాజన్ క్షత్రియస్య వినిర్దిశేత్. ౧౫. ద్వాదశేఽబ్దేఽపి గర్భాత్తు వైశ్యస్య వ్రతమాదిశేత్, బ్రహ్మవర్చసకామేన కార్యం విప్రస్య పఞ్చమే. ౧౬. బలార్థినా తథా రాజ్ఞః షష్ఠేఽబ్దే కార్యమేవ హి, అర్థకామేన వైశ్యస్య అష్టమే కురునందన. ౧౭. ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే, ద్వావింశతేః క్షత్రబంధోరాచతుర్వింశతేర్విశః. ౧౮. అత ఊర్ధ్వం

సావిత్రి నశింపదు. అంతవఱకు నుపనీతులు గాకున్న నామీఁద సంస్కార విహీనులగుటచే సావిత్రీపతితులై వ్రాత్యులనఁబడుదురు. వ్రాత్యస్తోమమను క్రతువును ప్రాయశ్చిత్తముగ నొనర్చినచో వారు సంస్కారార్హులగుదురు. ప్రాయశ్చిత్తపురస్సరముగ సంస్కారము నందకున్న నపవిత్రులగువీరలతో బ్రాహ్మణాదులు యజ్ఞాద్యనుష్ఠానముగాని వివాహాద్యనుష్ఠానముగాని చేయఁగూడదు. బ్రహ్మచారులకు అజినములు మూఁడు విధములై యున్నవి. కృష్ణమృగచర్మమును, దుప్పిచర్మమును, అజచర్మము నుపయోగింపవలెను. పై బ్రహ్మచారులకు వరుసగా జనపనారతోఁ జేసిన వస్త్రమును నారబట్టలు మొదలగునవి ధరింపఁదగినవి. బ్రాహ్మణబ్రహ్మచారి ముంజగడ్డితోఁ జేసి ముప్పేటలు గలిగి మృదువగు మొలత్రాడు గట్టుకొననగును. క్షత్రియుఁడు వింటినారిని గట్టవలెను. వైశ్యుఁడు జనపనారత్రాటి నుపయోగింపనగు. ముంజగడ్డి దుర్లభమగుచో దానికి బదులుగఁ గుశాశ్మంతకబల్బజముల నుపయోగింపవలయును. అవియును ముప్పేటగఁ జేసి యొకటిగాని మూఁడుగాని యైదుగాని ముడులు వేసి కట్టుకొనవలెను. ప్రత్తితోఁ జేయఁబడి యూర్ధ్వపుచ్ఛములు గలిగి మూఁడు పేటలుగల యుపవీతమును బ్రాహ్మణుఁడు ధరింపఁదగును. శణ (జనపనార) సూత్రమయమగు నుపవీతమును క్షత్రియుఁడును, ఆవిక (గొఱ్ఱె వెండ్రుకలు) సూత్రములచేఁ జేయఁబడిన యుపవీతము వైశ్యుఁడును ధరింపవలయును. ఈమూఁడు వర్ణములవారికిని మూఁడువిధములగు దండములు ధరింపఁదగినవి. బ్రాహ్మణవటువు బైల్వపాలాశప్లక్షజము లగు

---

తు యే రాజన్యథాకాలమసంస్కృతాః, సావిత్రీపతితా వ్రాత్యా వ్రాత్యస్తోమాదృతే క్రతోః. ౧౯. న చాప్యేభిరపూతైస్తు ఆపద్యపి హి కర్హిచిత్, బ్రాహ్మం యానం చ సంబంధమాచరేద్బ్రాహ్మణః సహ. ౨౦. భవంతి రాజంశ్చర్మాణి వ్రతినాం త్రివిధాని చ, కార్ష్ణరౌరవబాస్తాని బ్రహ్మక్షత్రవిశాం నృప. ౨౧. వసీరంశ్చానుపూర్వ్యేణ వస్త్రాణి వివిధాని తు, బ్రహ్మక్షత్రవిశో రాజఞ్ఛాణక్షౌమాదికాని చ. ౨౨. మౌంజీ త్రివృత్సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా, క్షత్రియస్య చ మౌర్వీ జ్యా వైశ్యస్య శణతాంతవీ. ౨౩. ముఞ్జాలాభే తు కర్తవ్యా కుశాశ్మంతకబల్బజైః, త్రివృతా గ్రంథినైకేన త్రిభిః పఞ్చభిరేవ చ. ౨౪. కార్పాసముపవీతం స్యాద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్, శణసూత్రమయం రాజ్ఞో వైశ్యస్యావికసౌత్రికమ్. ౨౫. పుష్కరాణి తథా చైషాం భవంతి త్రివిధాని తు, బ్రహ్మణో బైల్వపాలాశౌ తృతీయం ప్లక్షజం నృప. ౨౬. వాటఖాదిరౌ

దండములును, క్షత్రియవటువు వటఖదిరవేతసభవంబు లగుదండములును, వైశ్యవటువు పీలూదుంబరాశ్వత్థదండములును ధరింపనగును. బ్రాహ్మణునిదండము కేశాంతమును, క్షత్రియదండము లలాటపరిమితమును, వైశ్యదండము నాసాగ్రపరిమితము నైయుండవలయును. మఱియు బ్రాహ్మణదండము వంకర లేనిదై రమ్యమై సౌమ్యమై త్వక్సహితమై కాల్పఁబడనిదియు నైయుండవలయును. వీరు స్వస్వవర్ణానుకూలములగు దండములలో నీప్సితమగుదానిని ధరించి సూర్యోపస్థానము నిర్వర్తించి గురుని బూజించి విధిచోదితవిధంబున భిక్షాచరణము జేయవలయును. అందు బ్రాహ్మణుఁడు భిక్షనడుగునప్పుడు భవచ్ఛబ్దపూర్వకముగ (భవన్ భిక్షాం దేహి)ను, క్షత్రియవటువు భవచ్ఛబ్దమధ్యముగను, వైశ్యుఁడు భవచ్ఛబ్దాంతముగను వాక్యము నుపయోగింపవలయును. భిక్షాటనము మొదట దల్లి తోడబుట్టువు మొదలగు నుత్తమాంగనలయొద్దఁ జేయవలయును. పైరీతిని యాచింపఁబడిన యావనిత వటువునకు సువర్ణరజతపాత్రముల నేదే నొకదానితో భిక్ష నుంచవలయును. పిమ్మట వటు వాభిక్షను గైకొని నిష్కపటముగ గురువునకు నివేదించి ప్రాఙ్ముఖుఁడై యాచమించి గుర్వాజ్ఞచే భుజింపవలయును. ప్రాఙ్ముఖుఁడై భుజించిన దీర్ఘాయుష్మంతుఁడగును. దక్షిణాభిముఖుఁడై భుజించినఁగీర్తిగాంచు ప్రత్యఙ్ముఖుఁడై భుజించిన లక్ష్మినిపడయును. ఉదఙ్ముఖుఁడై భుజించిన సత్యప్రవర్తనముగలవాఁడగును.

---

"క్షత్రియస్తు తథాన్యం వేతసోద్భవమ్, పైలవోదుంబరౌ వైశ్యస్తథాశ్వత్థజమేవ హి. ౨౭. దండానేతాన్మహాబాహో ధర్మతోఽర్హంతి ధారితుమ్, కేశాంతికో బ్రాహ్మణస్య దండః కార్యః ప్రమాణతః. ౨౮. లలాటసమితో రాజ్ఞః స్యాత్తు నాసాంతికో విశః, ఋజవస్తే తు సర్వే స్యుః బ్రాహ్మణాః సౌమ్యదర్శనాః. ౨౯. అనుద్వేగకరా నృణాం సత్త్వచో నాగ్నిదూషితాః, ప్రగృహ్య చేప్సితం దండముపస్థాయ చ భాస్కరమ్. ౩౦. సమ్యగ్గురుం తథాపూజ్య చరేద్భైక్ష్యం యథావిధి, భవత్పూర్వం చరేద్భైక్ష్యముపనీతో ద్విజోత్తమః. ౩౧. భవన్మధ్యం తు రాజన్యో వైశ్యస్య భవదుత్తరమ్, మాతరం వా స్వసారం వా మాతుర్వా భగినీం నిజామ్. ౩౨. భిక్షేత భైక్ష్యం ప్రథమం యా చైనం నావమానయేత్, సువర్ణం రజతం చాన్నం సా పాత్రేఽస్య వినిర్దిశేత్. ౩౩. సమాహృత్య తతో భైక్ష్యం యావదర్థమమాయయా, నివేద్య గురవేఽశ్నీయాదాచమ్య ప్రాఙ్ముఖః శుచిః. ౩౪. ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్యం దక్షిణాముఖః, శ్రియం ప్రత్యఙ్ముఖో భుంక్తే ఋతం భుంక్తే ఉదఙ్ముఖః. ౩౫. ఉప

ఓరాజా! బ్రాహ్మణుఁడు మొదట నాచమించి యనంతరము భుజింపవలెను. నిర్వికారుఁడై యుండవలెను. భోజనానంతరము గూడ నాచమించి యుదకముచే నింద్రియముల స్పృశింపవలయును. అన్నమును నిందింపరాదు. దానిని జూచినతోడనే యపరిమితానందభరితుఁడై యకల్మషచిత్తుఁడై యుండవలయును. ఇది మనువునాన పూజితమగునన్నము పురుషునకోజోబలముల నొసంగును. లేకున్న విపరీతమగును. ఉచ్ఛిష్టమెరికిఁ బెట్టరాదు. మఱియు నంతరము గలుగఁ దిరిగి భుజింపరాదు. ఎవఁడు భుజించుచున్నయన్నము విడచి కొంచెమాగి మరల లోభమున నాయన్నము దిను నాతఁ డిహపరసుఖంబులఁ బాయును. మున్ను ధనవర్ధనుండను వైశ్యుఁ డిట్లాచరించి గదా వినాశము నొందె ననవుడు రాజు సవిస్తరముగ నవ్విధ మెఱింగింపుమని యడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె.

రాజా! తొల్లి కృతయుగమునఁ బుష్కరద్వీపంబున ధనవర్ధనాభిధానుం డగువైశ్యుఁ డొక్కఁడు వసించుచుండెను. ఆతఁడు మిగుల ధనాఢ్యుఁడు. ఆతఁడు గ్రీష్మకాలమున వైశ్వదేవ మాచరించి పుత్ర మిత్రాదియుతుండై భక్ష్యభోజ్యసమన్వితముగ భుజించుచుండె. అత్తరిని అన్నం అను నతికరుణమగు నార్తనాదము వినిపించెను. ఆతఁ డాసన్నాది

---

స్పృశ్య ద్విజో రాజన్నన్నమద్యాత్సమాహితః, భుక్త్వా చోపస్పృశేత్సమ్యగద్భిః ఖాని చ సంస్పృశేత్. ౩౬. తథాన్నం పూజయేన్నిత్యమద్యాచ్చైతదకుత్సయన్, దర్శనాత్తస్య హృష్యేద్వై ప్రసీదేచ్చాపి భారత. ౩౭. అభినంద్య తతోఽశ్నీయాదిత్యేవం మనురబ్రవీత్, పూజితం త్వశనం నిత్యం బలమోజశ్చ యచ్ఛతి. ౩౮. అపూజితం తు తద్భుక్తముభయం నాశయేదిదమ్, నోచ్ఛిష్టం కస్యచిద్దద్యాన్నాద్యాచ్చైతత్తథాంతరా. ౩౯. యస్త్వన్నమంతరా కృత్వా లోభాదత్తి నృపోత్తమ, వినాశం యాతి స నరః ఇహలోకే పరత్ర చ, యథాభవత్పురా వైశ్యో ధనవర్ధనసంజ్ఞితః. ౪౦. శతానీక ఉవాచ.—స కథమంతరం పూర్వమన్నస్య ద్విజసత్తమ, కిమంతరం తథాన్నస్య కథం వా తత్కృతం భవేత్. ౪౧. సుమంతురువాచ—పురా కృతయుగే రాజన్వైశ్యో వసతి పుష్కరే, ధనవర్ధననామా వై సమృద్ధో ధనధాన్యతః. ౪౨. నిదాఘకాలే రాజేంద్ర స కృత్వా వైశ్వదేవికమ్, సపుత్రభ్రాతృభిః సార్థం తథా వై మిత్రబంధుభిః, ఆహారం కురుతే రాజన్భక్ష్యభోజ్యసమన్వితమ్. ౪౩. అథ తద్భుజ్జతస్తస్య అన్నం శబ్దో మహాన

నాలకించి తినుచున్న యాహారమును విడచి యాధ్వని వచ్చినదిక్కునకుఁ బర్వెలిడి పోయెను. కాని యాతఁడు వచ్చుసరి కాశబ్ద మంతరించెను. పారఁ జూచిన నెవ్వరు నగపడలేదు. అంత నాతం డింటిలోని కేగి తా మున్ను వీడివచ్చిన యన్నముఁ దినెను. వెంటనే యాతఁడు నూరు వ్రక్కలై నేలఁ గూలెను. కావున నోరాజేంద్రా! భుజించునపు డంత రము గలుగ మరల నద్దాని లోభమున భుజింపరాదు. అధికముగఁ గూడఁ దినరాదు. ఉచ్ఛిష్టుఁడై యెక్కడకును బోవరాదు. అతిభోజనము వలన రసము (పుల్తేపు) గలుగును. అజీర్ణరోగము గలుగును అది యంతకంతకుఁ బెరుగ మనుజులు స్నానదానాదికృత్యములకును జప హోమాదులకును దూరగు లగుదురు. మఱియు దానివలన నారోగ్య మడుగంటును. ఆయువు దరుగును. స్వర్గము దూరమున కేగును. పాప మతిశయించును. లోకనిందకు లోనగును. కావున నత్యశనము జేయ రాదు. ఉచ్ఛిష్టము యక్షభూతపిశాచాదులచే నాక్రమింపఁబడును. కావున నిదియు వర్జనీయమే యగును. శ్రుతి (వేదము) శుచి ప్రధానమనియు, నద్దానివలనఁ బురుషుఁ డైహికాముష్మికానందము ననుభవించుననియుఁ జెప్పఁబడుచున్నది. అనవుడు బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణుఁడు శుచిత్వా శుచిత్వముల నెట్లు పొందు నానతిమ్మన నాతనికి సుమంతుఁ డిట్లనియె.

---

భూత్, కరుణః కురుశార్దూల అథ తం స ప్రధావితః. ౪౪. త్యక్త్వా స భోజనం యావ న్నిష్క్రాంతో గృహబాహ్యతః, అథ శబ్దస్తిరోభూతః స భూయో గృహమాగతః. ౪౫. తమేవ భాజనంగృహ్య ఆహారం కృతవాన్నృప, భుక్తశేషం మహాబాహో ఆహారం స తు భుక్తవాన్. ౪౬. భుక్త్వా స శతధా జాతస్తస్మిన్నేవ క్షణే నృప, తస్మాదన్నం న రాజేంద్ర అశ్నీయాదంతరా క్వచిత్. ౪౭. న చైవాత్యశనం కుర్యాన్న చోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్, రసో భవత్యత్యశనాద్రసాద్రోగః ప్రవర్తతే. ౪౮. స్నానం దానం జపో హోమః పితృదేవాభిపూజనమ్, న భవంతి రసే జాతే నరాణాం భరతర్షభ. ౪౯. అనారోగ్య మనాయుష్యమస్వర్గ్యం చాతిభోజనమ్, అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్. ౫౦. యక్షభూతపిశాచానాం రక్షసాం చ నృపోత్తమ, గమ్యో భవతి వై విప్ర ఉచ్ఛిష్టో నాత్ర సంశయః. ౫౧. శుచిత్వమాశ్రయేత్తస్మాచ్ఛుచిత్వాన్మోదతే దివి, సుఖేన చేహ రమతే ఇతీయం వైదికీ శ్రుతిః. ౫౨. శతానీక ఉవాచ—శుచితామియాత్ కథం విప్రః కథం చాశుచితామియాత్, ఏతన్మే బ్రూహి విప్రేంద్ర కౌతుకం పర

విధిపరుం డగువిప్రుండు విధిచోదితవిధంబున నుదకోపస్పర్శనము (స్నానము) చేయుచోఁ బవిత్రుఁ డగుచున్నాఁడు. అది సవిస్తరముగ నెఱింగింతు నాకర్ణింపుము. కాలుసేతులు గడిగికొని ప్రాఙ్ముఖుఁడుగాని యుదఙ్ముఖుఁడుగాని యయి పరిశుద్ధప్రదేశమునఁ గూర్చుండి బ్రహ్మసూత్రసమన్వితుండై బద్ధశిఖుండై దక్షిణహస్తమును మోకాటిలో నుంచుకొని రెండుపాదములు సమముగాఁ జేర్చి పరిశుద్ధోదకముచే నాచమనము చేసిన బ్రాహ్మణుండు శుచి యగుచున్నాఁడు. నిలుచొనిగాని, మాటలాడుచుఁగాని, యన్యమనస్కుఁడై గాని, కుపితుఁడై గాని, త్వరపడుచుగాని యాచమనము చేయరాదు. ఆచమనము చేయునుదకము మధురము, సుగంధమును, సువర్ణము నై యుండవలయును. వెచ్చగగాని, మురికిగాఁగాని, బుడగలుగట్టిగాని, నురుగుగలదిగాఁగాని యుండరాదు. విప్రునిదక్షిణకరంబున దేవతీర్థము, పితృతీర్థము, బ్రహ్మతీర్థము, ప్రాజాపత్యతీర్థము, సౌమ్యతీర్థము నని యైదుతీర్థము లుండును. వసిష్ఠప్రభృతు లగు మునిపుంగవులు "అంగుష్ఠమూలమునకు నుత్తరముగ నుండు రేఖను బ్రాహ్మతీర్థమనియు, చిటికనవ్రేలు మొదల నుండు రేఖను నికాయమనియుఁ

---

మం మమ. ౪౩. సుమంతురువాచ—ఉపస్పృశ్య శుచిర్విప్రో భవతే భరతర్షభ, విధివత్కురుశార్దూల భవేద్విధిపరో హ్యతః. ౪౪. శతానీక ఉవాచ—ఉపస్పర్శవిధిం విప్ర కథయ త్వం మమాఖిలమ్, శుచిత్వమాప్నుయాద్యేన ఆచాంతో బ్రాహ్మణో ద్విజ. ౪౫. సుమంతురువాచ—సాధు పృష్టోఽస్మి రాజేంద్ర శృణు విప్రో యథా భవేత్, శుచిర్భరతశార్దూల విధినా యేన వా విభో. ౪౬. ప్రక్షాల్య హస్తౌ పాదౌ చ ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా, ఉపవిశ్య శుచౌ దేశే బాహుం కృత్వా చ దక్షిణమ్. ౪౭. జాన్వంతరే మహాబాహో బ్రహ్మసూత్రసమన్వితః, సుసమౌ చరణౌ కృత్వా తథా బద్ధశిఖో నృప. ౪౮. న తిష్ఠన్న చ సంజల్పం స్తథా చానవలోకయన్, న త్వరన్కుపితో వాపి త్యక్త్వా రాజన్నుదూరతః. ౪౯. ప్రసన్నాభి స్తథాద్భిస్తు ఆచాంతః శుచితామియాత్, నోష్ణాభిర్న సఫేనాభిర్యుక్తాభిః కలుషేణ చ. ౫౦. వర్ణేన రసగంధాభ్యాం హీనాభిర్న చ భారత, సబుద్బుదాభిశ్చ తథా నాచామేత్పండితో నృప. ౫౧. పంచతీర్థాని విప్రస్య శ్రూయంతే దక్షిణే కరే, దేవతీర్థం పితృతీర్థం బ్రహ్మతీర్థం చ మానద. ౫౨. ప్రాజాపత్యం తథా చాన్య త్తథాన్యత్సౌమ్యముచ్యతే, అంగుష్ఠమూలో త్తరతో యేయం రేఖా మహీపతే. ౫౩. బ్రాహ్మం తీర్థం వదంత్యేతద్వసిష్ఠాద్యా ద్విజో త్తమాః, కాయం

జెప్పుచున్నారు. దేవతీర్థ మంగుళ్యగ్రముల నుండుననియుఁ దర్జన్యంగుష్ఠములమధ్యనఁ బితృతీర్థ మనియును, దేవకర్మప్రశస్తమగు సౌమ్యతీర్థము కరమధ్యగతం బనియు వచించుచున్నారు. దేవతార్చనము, బలిహరణము, ప్రక్షిపణము (దానము) ననునవి దేవతీర్థముచేఁ జేయఁదగినవి. హోమము ప్రాజాపత్యతీర్థముగఁ జేయవలెను. కమండలూపస్పర్శనము దధిప్రాశనమును సౌమ్యతీర్థమునఁ జేయనగు. పితృతర్పణము పితృతీర్థమునఁ జేయవలయు. ఉపస్పర్శనము బ్రాహ్మతీర్థమున గూడఁ జేయఁదగును. కరాంగుళుల దగ్గరఁజేర్చి యేకాగ్రచిత్తుఁడై విచారవిహీనుఁడై ముఖశబ్దము చెయకయే మున్మూరాచమించినయుదకముచే నెట్టిఫలముఁగు విప్రుఁడు పడయునో యెట్లు దేవతలఁ దృప్తిపరచునో చెప్పెద నాకర్ణింపుము. ప్రప్రథమ మాతఁడు త్రాగునీటిచే ఋగ్వేదము తృప్తినొందుచున్నది. రెండవసారి తీసికొనునుదకమున యజుర్వేదము తృప్తమగుచున్నది. మూఁడవపర్యాయము త్రాగిననీటితో సామవేదము తృప్తిగాంచును. దక్షిణాంగుష్ఠమూలముచేతనైన ప్రథమముఖమార్జనముచే నథర్వవేదమును ద్వితీయప్రమార్జనముచే నితిహాసపురాణాదులును తృప్తినొందుచున్నవి. ద్విజుండు మూర్ధాభిషేకముచే రుద్రునిఁ దృప్తుఁ

---

కనిష్ఠికామూలే అంగుల్యగ్రే తు దైవతమ్. ౧౪. తర్జన్యంగుష్ఠయోరంతః పిత్ర్యం తీర్థముదాహృతమ్. కరమధ్యేస్థితం సౌమ్యం ప్రశస్తం దేవకర్మణి. ౧౫. దేవార్చాబలిహరణం ప్రక్షిపణమేవ చ, ఏతాని దేవతీర్థేన కుర్యాత్కురుకులోద్వహ. ౧౬. అన్ననిర్వాపణం రాజంస్తథా సపవనం నృప, లాజహోమం తథా సౌమ్యం ప్రాజాపత్యేన కారయేత్. ౧౭. కమండలూపస్పర్శనం దధిప్రాశనమేవ చ, సౌమ్యతీర్థేన రాజేంద్ర సదా కుర్యాద్విచక్షణః. ౧౮. పితౄణాం తర్పణం కార్యం పితృతీర్థేన ధీమతా, బ్రాహ్మేణ చాపి తీర్థేన సదోపస్పర్శనం పరమ్. ౧౯. ఘనాంగులికరం కృత్వా ఏకాగ్రః సుమనాద్విజః, త్రిః కృత్వా యః పిబేదాపో ముఖశబ్దవివర్జితః. ౨౦. శృణు యత్ఫలమాప్నోతి ప్రీణాతి చ యథా సురాన్, ప్రథమం యత్పిబేదాప ఋగ్వేదస్తేన తృప్యతి. ౨౧. యద్ద్వితీయం యజుర్వేదస్తేన ప్రీణాతి భారత, యత్తృతీయం సామవేదస్తేన ప్రీణాతి భారత. ౨౨. ప్రథమం యన్మృజేదాస్యం దక్షిణాంగుష్ఠమూలతః, అథర్వవేదః ప్రీణాతి తేన రాజన్నసంశయః. ౨౩. ఇతిహాసపురాణాని యద్ద్వితీయం ప్రమార్జతి, యన్మూర్ధానం హి రాజేంద్ర అభిషించతి వై ద్విజః. ౨౪. తేనప్రీణాతి వై రుద్రం

జేయును. శిఖాస్పర్శనమున మహర్షులను, నేత్రస్పర్శనముచే సూర్యుని, నాసికాలంభనముచే వాయువును తృప్తినొందించును. మఱియు శ్రోత్ర స్పర్శనమున దిక్కులను, బాహుస్పర్శముచే నింద్రాగ్ని యమవరుణకుబేరులను, నాభిస్పర్శముచేఁ బ్రాణగ్రంథిని దృప్తిపరచుచున్నాఁడు. ఇటులు వేదము బోధించుచున్నది. మఱియుఁ బాదాభిషేకముచే విష్ణువు సంతృప్తుఁడగును. భూమిని గప్పునుదకము విడుచుటచే వాసుక్యాదినాగకులము తృప్తినొందును. మధ్యబడు జలబిందువులచే నాల్గువిధములగు భూత గ్రామములు తృప్తినొందుచున్నవి.

అంగుష్ఠము (బొటనవ్రేలు) తోడను (తర్జని (చూపుడువ్రేలు) చేతను నేత్రములు స్పృశింపవలయును. అనామికాం (నాల్గవవ్రేలు) గుష్ఠములచే నాసికను స్పృశింపవలయును. మధ్యమాంగుష్ఠములచే ముఖమును స్పృశింపవలయును. కనిష్ఠికాంగుష్ఠములచే శ్రోత్రాలంభము జేయవలయును. నాల్గువ్రేళ్ళచే బాహువులను స్పృశింపవలయును. బొటనవ్రేలిచే నాభిదేశమును స్పృశింపవలయును. అన్నిటిచేతను శిరము స్పృశింపవలయును.

రాజేంద్రా! బ్రాహ్మణునియంగుష్ఠ మగ్నియు, ప్రదేశిని వాయువును, మధ్యమము ప్రజాపతియు, ననామిక సూర్యుఁడు, కనిష్ఠిక

---

శిఖామాలభ్య వై ఋషీన్, యదక్షిణీ చాలభతే రవిః ప్రీణాతి తేన వై. ౨౫. నాసికాలంభనాద్వాయుం ప్రీణాత్యేవ న సంశయః, యచ్ఛ్రోత్రమాలభేద్విప్రో దిశః ప్రీణాతి తేన వై. ౨౬. యమం కుబేరం వరుణం వాసవం చాగ్నిమేవ చ, యద్బాహూ మన్వాలభతే ఏతాన్ప్రీణాతి తేన వై. ౨౭. యన్నాభిమన్వాలభతే ప్రాణానాం గ్రంథిమేవ చ, తేన ప్రీణాతి రాజేంద్ర ఇతీయం వైదికీ శ్రుతిః. ౨౮. అభిషించతి యత్పాదౌ విష్ణుం ప్రీణాతి తేన వై, యద్భూమ్యాచ్ఛాదకం వారి విసర్జయతి మానద. ౨౯. వాసుకిప్రముఖాన్నాగాం స్తేన ప్రీణాతి భారత, యద్బిందవోంఽతరే భూమౌ పతంతీహ నరాధిప. ౩౦. భూతగ్రామం తతస్తేతు ప్రీణంతీహ చతుర్విధమ్. అంగుష్ఠేన ప్రదేశిన్యాచా లభేతాక్షిణీ నృప. ౩౧. అనామికాంగుష్ఠికాభ్యాం నాసికామాలభేన్నృప, మధ్యమాంగుష్ఠాభ్యాం ముఖం సంస్పృశేద్భరతర్షభ. ౩౨. కనిష్ఠికాంగుష్ఠకాభ్యాం కర్ణమాలభతే నృప, అంగులీభిస్తథా బాహుమంగుష్ఠేన తు మండలమ్. ౩౩. నాభిం కురుకులశ్రేష్ఠ శిరః సర్వాభిరేవ చ, అంగుష్ఠోఽగ్నిర్మహాబాహో ప్రోక్తో వాయుః ప్రదేశినీ. ౩౪. అనామికా తథా సూర్యః కనిష్ఠా మఘవా విభో, ప్రజాపతిర్మధ్యమా

యింద్రుఁడు నని తెలియుము. ఇట్లాచమించి విప్రుఁడెల్లప్పుడు నీజగత్తును, సమస్తదేవతలను సర్వలోకములను సంతృప్తిపఱచుచున్నాఁడు. కావుననే బ్రాహ్మణుఁడు సర్వవేదమయుండును, సర్వదేవమయుండు నగును. అది కారణముగ బ్రాహ్మణుఁ డెల్లప్పుడు నెల్లయెడల నెల్లరకు నభ్యర్చ్చనీయుఁడు. బ్రాహ్మణుఁడు బ్రాహ్మతీర్థమునఁగాని ప్రాజాపత్యసౌమ్యతీర్థములఁగాని యుపస్పర్శనము చేయవలయును. పితృతీర్థముతో నెన్నఁడు నొనరింపరాదు. ఉదకము హృద్గతమయిన విప్రుఁడును, కంఠగతములయిన క్షత్రియుఁడును, లోనికిఁ ద్రాగుటచే వైశ్యుఁడును, స్పర్శమాత్రమున స్త్రీశూద్రులును పవిత్రు లగుదురు. ఎడమభుజముమీఁదను గుడిభుజముక్రిందను యజ్ఞోపవీతముండుటచే నప్పు డద్దాని నుపవీతమనిరి. అయ్యది కుడిభుజముమీఁద నెడమభుజముక్రింద నుండినచో నప్పుడు ప్రాచీనావీతమనిరి. హారముపగిది మెడలో జందెము వ్రేలాడుచుండినచో నది నివీతమనియుఁ జెప్పుదురు. మేఖలను, అజినమును, దండమును, కమండలువు నుపవీతమును భ్రష్టము లైనచో నుదకమునఁ బారవైచి సమంత్రకముగ నూతనములు గ్రహింపవలయును. ఎల్లప్పుడు నుపవీతియై హస్తములు మోఁకాళ్లనడుమ నుంచుకొని యాచమింపవలయును. ఈతీరున విప్రుఁ డాచాంతుఁ డయ్యేనేని శుచియగును. బ్రాహ్మణునియరచేత నుండెడిరేఖలు గంగాదినదులని రేఖాశాస్త్రజ్ఞు లగుపండితులనుచున్నారు. అంగుళిపర్వములు పర్వతములని యెఱుంగుము. కావు

---

జ్ఞేయా తస్మాద్భరతసత్తమ. ౬౫. ఏవమాచమ్య విప్రస్తు ప్రీణాతి సతతం జగత్, సర్వాశ్చ దేవతాస్తాత లోకాంశ్చాపి న సంశయః. ౬౬. తస్మాత్పూజ్యః సదా విప్రః సర్వదేవమయో హి సః, బ్రాహ్మేణ విప్రతీర్థేన నిత్యకాలముపస్పృశేత్. ౬౭. కాయత్రైదేశికాభ్యాం వా న పిత్ర్యేణ కదాచన, హృద్గాభిః పూయతే విప్రః కంఠగాభిస్తు భూమిపః. ౬౮. వైశ్యోద్భిః ప్రాశితాభిస్తు శూద్రః స్పృష్టాభిరన్తతః, ఉద్ధృతే దక్షిణే పాణావుపవీత్యుచ్యతే బుధః. ౬౯. సవ్యేన ప్రాచీనావీతీ నివీతీ కంఠసజ్జితే, మేఖలామజినం దండముపవీతం కమండలుమ్. ౭౦. అప్సు ప్రాస్య వినష్టాని గృహ్ణీతాన్యాని మంత్రవిత్, ఉపవీత్యాచమేన్నిత్యమంతర్జాను మహీపతే. ౭౧. ఏవం తు విప్రో హ్యాచాన్తః శుచితాం యాతి, భారత, యాస్త్వేతాః కరమధ్యే తు రేఖా విప్రస్య భారత. ౭౨. గంగాద్యాః సరితః సర్వా జ్ఞేయా భారతసత్తమ, యాన్యంగులిషు పర్వాణి

ననే విప్రునిదక్షిణహస్తము సర్వదేవమయ మైనది. రాజా! సమస్తలోక ములను నేవిధముగ నాచమించిన దివమున కేగునట్టి హస్తోపస్పర్శనవిధి సవిస్తరముగ నీకెఱింగించితిని.

ఇది తృతీయాధ్యాయము.

---

## చతుర్థాధ్యాయము.

సుమంతుండు రాజున కిట్లనియె:—రాజా! బ్రాహ్మణునకుఁ గేశాంతమ (గోదానము)ను సంస్కారము షోడశాబ్దమున నిర్వర్తింపవలయును. ఇరువదిరెండవయేట నిరువదైదవయేటను క్షత్రియవైశ్యులకుఁ జేయవలయును. స్త్రీలకు జాతకర్మచౌలాదులు మంత్రరహితముగఁ జేయవలయును. ఆయాకాలములందు విధిచోదితములయిన సంస్కారములను శరీరసౌఖ్యమునకై స్త్రీల కమంత్రకముగ నొనర్పవలయును. వివాహము మాత్ర ముపనయనస్థానీయ మగుట సమంత్రకముగఁ జేయవలయును. బ్రహ్మచారి గురుకులమున నగ్నికార్యము నిర్వర్తించుకొనుచు నధ్యయనరతుండై నివసింపవలెను. రాజచంద్రమా! ద్విజాతుల యుత్పత్తికినిదాన మీయుపనయనవిధియే యని యెఱుంగుము. ఇఁకఁ గర్మయోగము వివరింతు నాకర్ణింపుము. గురువు శిష్యున కుపనయనము జేసి

---

గిరయస్తాని ద్విధా వై. ౯౩. సర్వదేవమయో రాజన్కరో విప్రస్య దక్షిణః, హస్తోపస్పర్శనవిధిస్తవాఖ్యాతో మహీపతే. ౯౪. ఏషు సర్వేషు లోకేషు యేనాచాంతో దివం వ్రజేత్. ౯౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణ్యుపస్పర్శనవిధివర్ణనం నామ తృతీయోఽధ్యాయః.

---

సుమంతురువాచ—కేశాంతః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే, రాజన్యబంధోర్ద్వావింశే వైశ్యస్య త్ర్యధికే తతః. ౧. అమంత్రికా సదా కార్యా స్త్రీణాం చూడా మహీపతే, సంస్కారహేతోః కాయస్య యథాకాలం విభాగశః. ౨. వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో నైగమః స్మృతః, నివసేద్వా గురోర్వాపి గృహే వాగ్ని పరిక్రియా. ౩. ఏష తే కథితో రాజన్నౌపనాయనికో విధిః, ద్విజాతీనాం మహాబాహో ఉత్పత్తివ్యంజకః పరః. ౪. కర్మయోగమిదానీం తే కథయామి మహాబల, ఉపనీయ గురుః శిష్యం ప్రథమం శౌచమాదిశేత్. ౫. ఆచారమగ్నికార్యం చ సంధ్యో

తొలుత శుభ్రత నాదేశింపవలయును. ఎల్లప్పుడు నాచమనము చేసి యుత్తరాభిముఖుండయి గురుడు సచ్ఛాత్రుల కాచారము నగ్ని శుశ్రూషణమును సంధ్యోపాసనమును నేర్పవలయును. బద్ధాంజలిపుటుండును సూక్ష్మవస్త్రధారియు వినీతవేషుండును స్థిరచిత్తుండు జితేంద్రియుండు నగుశిష్యుఁ డధ్యయనార్హుఁడు. అట్టిశిష్యుఁడు లభించిన నాచార్యుఁడు స్వయముగనేని బిలచి యధ్యాపనము చేయవలయును. అధ్యయనోపక్రమమునను నుపసంహారమునను గురుపాదములు పూజించి నమస్కరింపవలయును. అధ్యయనము జేయునప్పుడు చేతులు మోడ్చికొనవలయును. ఇట్టియవస్థకే బ్రహ్మాంజలి యని పేరు. వ్యత్యస్తపాణియై గురుపాదోపసంగ్రహణము చేయవలయును. అభిముఖాసీనుఁడై దక్షిణహస్తమున దక్షిణపాదమును వామహస్తమున వామపాదమును స్పృశించుట వ్యత్యాసము లేకుండ సిద్ధింపదు. ఆచార్యుఁ డెల్లప్పుడును శిష్యునకు సోమరితనము లేక పఠింపుమని హెచ్చరిక నిచ్చుచుండవలయును. విరామమగుతమనివారింపఁదగును. అధ్యయనమున కాద్యంతముల నోంకారము నుచ్చరింపవలయును. అట్లు చేయకున్న నధ్యయనము నశించును. ఆయోంకారభావనాపద్ధతి నెఱింగింతు నాకర్ణింపుము. ద్విజుఁడు ప్రాఙ్ముఖుఁడై యుచితాసనాసీనుండై దర్భపవిత్రపాణియై ప్రాణాయామత్రయ మొనరించి పవిత్రుఁడై యోంకార ముచ్చరింపవలయును. ఓంకారమున అకార, ఉకార, మకారములను మూఁడంశములు

---

పాసనమేవచ, అధ్యాపయేత్తు సచ్ఛిష్యాన్సదాచాంత ఉదఙ్ముఖః. ౭. బ్రహ్మాంజలికరో నిత్యమధ్యాప్యో విజితేంద్రియః, లఘువాసా స్తథైకాగ్రః సుమనాః సుప్రతిష్ఠితః. ౭. బ్రహ్మారంభేఽవసానే చ పాదౌ పూజ్యౌ గురోః సదా, సంహత్య హస్తావధ్యేయం సహి బ్రహ్మాంజలిః స్మృతః. ౮. వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణంగురోః, సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన తు దక్షిణః. ౯. అధ్యేష్యమాణం తు గురుర్నిత్యకాలమతంద్రితః, అధీష్వ భో ఇతి బ్రూయాద్విరామోఽస్త్వితివారయేత్. ౧౦. బ్రహ్మణః ప్రణవం కుర్యాదాదావంతే చ సర్వదా, స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే. ౧౧. శ్రూయతాం చాపి రాజేంద్ర యథోంకారం ద్విజోఽర్హతి, ప్రాక్కూలాన్పర్యుపాసీనః పవిత్రైశ్చైవ పావితః. ౧౨. ప్రాణాయామైస్త్రిభిః పూత స్తతస్త్వోంకారమర్హతి, ఓంకారలక్షణం చాపి శృణుష్వ కురునందన. ౧౩. అకారం చాప్యుకారం చ

గలవు. ఈమూఁడు వర్ణములును భూర్భువస్స్వరభిధానమగు వ్యాహృతిత్రయమును మూఁడువేదములనుండి గోవును బిదికినట్లు పిదికెను. వ్యాహృతిత్రయవిశిష్టమై తచ్ఛబ్దోపక్రాంతమై యష్టాక్షరపాదత్రయాత్మకమగుసావిత్రి యిదియే. ఈతీరుగ నోంకారసావిత్రులను పరమేష్ఠి యేర్పరచెను. ఈయోంకారమును వ్యాహృతిత్రయపూర్వకమగుసావిత్రిని సంధ్యాద్వయమున జపించువిప్రుఁడు వేదత్రయాధ్యయనఫలము నొందును. వేయిమారు లీత్రికమును వాక్కుతో నభ్యసించిన నెంతటి మహాపాతకమునుండి నైనను ప్రతిమాసమును పాతచర్మము (కుబుసము)చే సర్పము విముక్తమైనపగిది విముక్తుఁడగును. ఈగాయత్రితో నెడతెగని సంబంధము విడచియున్నను తన సకాలక్రియను విడచినను త్రైవర్ణికులు సాధులచే నిందింపఁదగుదురు. రాజా! యింక బ్రహ్మముఖస్వరూప మెఱింగింతు నేకాగ్రచిత్తుండవై యుండుమని యాతనికి సుమంతుఁ డిట్లనియె:—ఓంకారపూర్వకములును నవ్యయములు నగు భూరాదులైన మూఁడువ్యాహృతులును పాదత్రయోపేత యగు సావిత్రియును బ్రహ్మముఖముగా నెఱుంగుము. ఏత్రైవర్ణికుం డనలసుండై మూఁడేండ్లు యీత్రిపాదిని నిత్యము నధ్యయనము చేయునో యాతఁడు దివ్యమూర్తిధరుండై వాయుభూతమై పరబ్రహ్మము నొందుచున్నాఁడు ఏకాక్షరరూపమగు నోంకారము పరబ్రహ్మము ప్రాణాయామము దానిని ప్రకాశింపఁజేయును. సావిత్రికంటె

మకారం చ ప్రజాపతిః, వేదత్రయాత్తు నిర్గృహ్య భూర్భువః స్వరితీతి చ. ౧౪. త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదంపాదమదూదుహత్, తదిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః. ౧౫. ఏతదక్షరమేతాం చ జపన్వ్యాహృతిపూర్వికామ్, సంధ్యయోరుభయోర్విప్రో వేదపుణ్యేన యుజ్యతే. ౧౬. సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతత్త్రికం ద్విజః, మహతోఽప్యేనసో మాసాత్త్వచేవాహిర్విముచ్యతే. ౧౭. ఏతయర్చావిసంయుక్తః కాలే చ క్రియయా స్వయా, విప్రక్షత్రియవిడ్యోనిర్గర్హణాం యాతి సాధుషు. ౧౮. శృణుష్వైకమనా రాజన్పరమం బ్రహ్మణో ముఖమ్, ఓంకారపూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః. ౧౯. త్రిపదా చైవ సావిత్రీ విజ్ఞేయా బ్రహ్మణో ముఖమ్, యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రితః. ౨౦. స బ్రహ్మ పరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్, ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామః

నుత్కృష్టమైనది యెద్దియును లేదు. అందును మానివైయుండిన సత్య శీలుఁడగును. తపశ్చర్య, హోమము, దానము ననునవి యక్షయాంత ములయియుండవలయునని మనువు వచించెను. ప్రజాపతిశబ్దవాచ్యుఁడగు బ్రహ్మయే పైఁజెప్పిన యక్షరాక్షరమని యెఱుంగుము. విధిచోదితమగు యజ్ఞముకంటె జపయజ్ఞ మెల్లెడల నుత్తమ మైనది. అందు సూక్ష్మములగు పెక్కుగుణము లాఖ్యాతము లయియున్నవి. ఉపాంశుస్వరమున జదివిన నుచ్చైస్స్వరముకంటె లక్షగుణాధికఫలము గలుగును. మానసముగ నొనరించిన నసంఖ్యాకముగ నేర్పడును. విధియజ్ఞసమన్వితములగు పాక యజ్ఞములు నాల్గును జపయజ్ఞంపుఁబదునారగునంశమును గూడఁ బోలవు. బ్రాహ్మణుఁడు జపయజ్ఞముచేతనే సర్వార్థసిద్ధి యగుటకు సందియము లేదు. కాయికచేష్టారూపమగు విధియజ్ఞాదికమును జేసినను లేకున్నను బ్రాహ్మణుఁ డుత్తముఁడు, (మైత్రుఁడు) అని చెప్పఁదగును పూర్వసంధ్యాకాలమున సూర్యదర్శన మగువరకు సావిత్రిని జపించుచు నిలుచుండవలయును. పశ్చిమ (సాయం)సంధ్యను బాగుగా నక్షత్రము లగపడువరకు నుప విష్టుఁడై జపింపవలయును. (ఈరెండుచోట్లను సూర్యుఁడు కనుపించు కాలము నక్షత్రములు కనుపించుకాలము నని యర్థము. లేకున్న గగ నము మేఘావృత మైనప్పుడు వానిదర్శనము దుర్లభమగుటఁ గార్యాం తరబాధ మేర్పడును) పూర్వసంధ్య దినారంభమున నుండును. పరసంధ్య

---

పరంతపః. ౨౧. సావిత్ర్యాస్తు పరం నాస్తి మానాత్సత్యం విశిష్యతే, తపః క్రియా హోమక్రియా తథా దానక్రియా నృప. ౨౨. అక్షయాంతాః సదా రాజన్యథాహ భగవాన్మనుః, అవరం త్వక్షరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః. ౨౩. విధియజ్ఞాత్సదా రాజఞ్జపయజ్ఞో విశిష్యతే, నానావిధైర్గుణోద్దేశైః సూక్ష్మాఖ్యాతైర్నృపోత్తమ. ౨౪. ఉపాంశుః స్యాల్లక్షగుణః సాహస్రో మానసః స్మృతః, యే పాకయజ్ఞాశ్చత్వారో విధియజ్ఞేన చాన్వితాః. ౨౫. సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హన్తి షోడశీమ్, జపే చైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః. ౨౬. కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే, పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠేత్సావిత్రీమార్కదర్శనాత్. ౨౭. పశ్చిమాం తు సమాసీనః సమ్యగృక్షవిభావనాత్, దినస్యాదౌ భవేత్పూర్వా శర్వర్యాదౌ తథా పరా. ౨౮. సనక్షత్రా పరా జ్ఞేయా అపరా సదివాకరా, జపం స్తిష్ఠన్పూర్వాం సంధ్యాం నైశమేనో వ్యపోహతి. ౨౯. అపరాం తు సమాసీనో మలం హంతి దివా

రాత్రిముఖమున నుండును. అపర(పూర్వ)సంధ్య సూర్యునితోడను పర సంధ్య నక్షత్రములతోడను గూడియుండును. పూర్వసంధ్యన నిలుచుని జపించుటచే రాత్రి చేసినపాపము నశించును. అపరసంధ్య నాసీనుఁడై జపించిన దివాకృతమగుపాపము దొలంగును. ఎవ్వఁ డీసంధ్యాకాలముల నుభయసంధ్యల నుపాసింపఁడో వాఁడు ద్విజకర్మ లన్నిఁటినుండి శూద్రునివలెనే బహిష్కరింపఁ దగియుండును. తీర్థతీరమున విజితేంద్రియుండై నిత్యవిధి నిర్వర్తించుకొని విజనప్రదేశమున కేఁగి సావిత్ర్యధ్యయనము చేయవలయును. వేదోపకరణములగు వ్యాకరణాద్యంగముల కును నిత్యస్వాధ్యాయమునకును హోమార్థమై యుచ్చరించు మంత్రాదు లందు ననధ్యయనదోషము లేదు. నిత్యకర్మలలో నీదోషము సంక్రమింపదు. ఏలయన నది బ్రహ్మసత్రము (బ్రహ్మయజ్ఞము) గదా? అనధ్యాయమున నైనను బ్రహ్మాహుతిగ వ్రేల్చిన గొప్పపుణ్యము లభించును. యథావిధిగ నియతుఁడై యొక్కఋక్కు నధ్యయించెనేని యాతనికి గొప్పపగిది నాఋక్కు పవిత్రమగుపయస్సును మధురమగు ఘృతము నెల్లప్పుడు నొసంగును. ద్విజుఁడు సమావర్తనమువఱకు నిత్యమనలసుఁడై యగ్ని శుశ్రూషణమును భైక్షచర్యయు నధశ్శయనమును గురుహితాచరణమును గలిగియుండవలయును. ఉపనీతుఁడును, ఆచార్యపుత్రుఁడును, శుశ్రూషారతుఁడును, జ్ఞానమునిచ్చువాఁడును, ధార్మికుఁడును, శుద్ధచిత్తుఁడును, హితము

కృతమ్, నోపతిష్ఠతి యః పూర్వాం నోపాస్తే పశ్చిమాం నృప. ౩౦. స శూద్రవద్బహిష్కార్యః సర్వస్మాద్ద్విజకర్మణః, అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః. ౩౧. సావిత్రీమప్యధీయీత గత్వాఽరణ్యం సమాహితః, వేదోపకరణే రాజన్స్వాధ్యాయే చైవ నైత్యకే. ౩౨. నాత్ర దోషోస్త్యనధ్యాయే హోమమంత్రేషు వా విభో, నైత్యకే నాస్త్యనధ్యాయో బ్రహ్మసత్రం హి తత్స్మృతమ్. ౩౩. బ్రహ్మాహుతిహుతంపుణ్యమనధ్యాయవషట్కృతమ్, ఋగేకాం యస్త్వధీయీత విధినా నియతో ద్విజః. ౩౪. తస్య నిత్యం క్షరత్యేషా పయో మేధ్యం ఘృతం మధు, అగ్నిశుశ్రూషణం భైక్షమధః శయ్యాం గురోర్హితమ్. ౩౫. ఆసమావర్తనాత్కుర్యాత్కృతోపనయనో ద్విజః, ఆచార్యపుత్రశ్శుశ్రూషుః జ్ఞానదో ధార్మికః శుచిః. ౩౬. ఆప్తః శక్తోన్నదః సాధుః స్వాధ్యాయ్యాధ్యాప్య దశ

గోరువాఁడును, సమర్థుఁడు, జీవికనొస[redacted]
పదుగురు జదివింపఁదగినారు. వీరియధ్యయనమే ధర్మాధ్యయనము. అడుగని వానికిని యన్యాయముగ నడుగువానికి నుపదేశింపరాదు. ఎంతటిమేధావి యయ్యును, సర్వజ్ఞుఁడయ్యును జడునిపగిది లోకమున వ్యవహరింపవల యును. ఎవఁడధర్మమార్గమున నుపదేశించునో యెవఁడు ధర్మదూరుఁడై యడుగునో వారిలో నొకఁడు నిత్యప్రేతభావము నొందును. ఇంకొకఁడు లోకవిద్వేషియగును. ఎచ్చట ధర్మానుసారి యగునర్థము లేదో యెచ్చట శుశ్రూషలభింపదో యచ్చట విద్యాబీజము నుంపరాదు. అటు లుంచెనేని యయ్యది యూషరక్షేత్రమున నుంచిన యుత్తమబీజమువలెఁ జెడి పోవును. బ్రహ్మవాదియగు బ్రాహ్మణునకు విద్యతో మరణము శ్రేష్ఠమయి నది. ఎంతటిదుస్సహమగునాపద సంభవించిన నూషరక్షేత్రతుల్యమగు ప్రదేశమున విద్యాబీజము నుంపరాదు. తొల్లి విద్య బ్రాహ్మణునొద్ద కేగి యోయీ! బ్రాహ్మణా! నీకు నేను శేవధి (నిధి) వంటిదానను. కావున నన్నే మరక బ్రోచుచుండుము. అసూయావంతునకు నన్నీయకుము. అట్లయిన నేను మిగుల బలముగల్గియుందును. శేవధి యనఁగా సుఖమును జ్ఞానమును ధరించుటకు మూలమైనదని పండితులు వచింతురు. పరి శుద్ధుఁడై జితేంద్రియుఁడై బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడగు ద్విజునకు నన్నొసం గింపుము. మఱియు నాతఁ డనలసుఁడై నిధిరక్షణశక్తుఁడై యుండవల యును. గుర్వనుజ్ఞ వడయక వేదము నభ్యసించినవానినుండి వేదమును

---

ధర్మతః, నాపృష్టః కస్యచిద్బ్రూయాన్న చాన్యాయేన పృచ్ఛతః. ౩౭. జానన్నపి హి మేధావీ జడవల్లోకఆచరేత్, అధర్మేణ చ యః ప్రాహ యశ్చాధర్మేణ పృచ్ఛతి. ౩౮. తయోరన్యతరః ప్రైతి విద్వేషం వా నిగచ్ఛతి, ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా చాపి తద్విధా, న తత్ర విద్యా వప్తవ్యా శుభం బీజమివోషరే. ౩౯, విద్యయైవ సమం కామం మర్తవ్యం బ్రహ్మవాదినా, ఆపద్యపి హి ఘోరాయాంన త్వేనామిరిణేవపేత్. ౪౦. విద్యా బ్రాహ్మణమిత్యాహ శేవధిస్తేఽస్మి రక్ష మామ్, అసూయకాయ మా ప్రాదా స్తథా స్యాం వీర్యవత్తమా. ౪౧. శేవం సుఖమశస్తీహ కేచిజ్జ్ఞానం ప్రచక్షతే, తౌ ధారయతి వై యస్మాచ్ఛేవధిస్తేన సోచ్యతే. ౪౨. యమేవ తు శుచిం విద్యాన్నియతం బ్రహ్మచారిణమ్, తస్మై మాం బ్రూహి విప్రాయ నిధిపాయాప్రమాదినే. ౪౩. బ్రహ్మ

గ్రహించినను లౌకికవైదికాధ్యాత్మికవ్యవహారము లెఱుగునో వాఁడు కళాష్టకమితంబై యణువగు దేహము ధరించి భీమదర్శమగుట నతిఘోర మగు రౌరవంబను నరకంబు నొందును. తనకు జ్ఞానదాన మొనర్చినగురు నతఁ డొత్తి నభివాదనము చేయవలయును. గాయత్రీమాత్రధారి యయినను వేదాధ్యయనము లేకున్నను తావన్మాత్రముచేతనే బ్రాహ్మణుఁడు సదాచారసంపన్నుఁడై యున్న నుత్తముఁడగును. త్రివేదాధ్యయనము జేసినను యుక్తాహారవిహారాదిరూపసదాచారవిహీనుఁడై నిషిద్ధపదార్థములఁ గూడ విక్రయించుచు నెజ్జపైనను నాసనముమీఁదను భోజనాదికార్యము లొనర్చుచుండువాఁడు శ్రేయము నొందఁజాలఁడు. అట్టి బ్రాహ్మణునకు శయ్యాసనస్థితుఁ డయియే ప్రత్యుత్థానాభివాదనము లాచరింపవలయును. వృద్ధుఁడు గృహమునకు వచ్చినప్పుడు యువకునకుఁ బ్రాణములు పైకి లేచిపోవును. ప్రత్యుత్థానాభివందనము లొనరించిన నవి యథాస్థానము జేరును. అభివాదనశీలుండును వృద్ధోపసేవియు నగు విప్రుఁడు నిత్యము నాయుర్వృద్ధిని ప్రజ్ఞను గీర్తిని బలమును గలిగి యుండును. విప్రుఁడెప్పుడు నభివాదపరుఁడై యుండి పెద్దవారిని నమస్కరింపవలయును. ఆసమయమున "అసౌ నామాఽహమస్మి" అని స్వప్రవరను గీర్తింపవలయును. నామధేయాభివాదము నెఱుగనివారికి స్త్రీలకు నభివాదనము చేయునప్పుడు విప్రుఁడు (అహం) నేను నమస్కరించుచున్నానని మాత్రము చెప్పవలయును. మరియు నభివాదసమయమున

---

యస్త్వననుజ్ఞాతమధీయానాదవాప్నుయాత్. ౪౪. లౌకికం వైదికం వాపి తథాధ్యాత్మికమేవ చ, స యాతి నరకం ఘోరం రౌరవం భీమదర్శనమ్. ౪౫. అణుమాత్రాత్మకం దేహం షోడశార్థమితి స్మృతమ్, ఆదదీత యతో జ్ఞానం తం పూర్వమభివాదయేత్. ౪౬. సావిత్రీసారమాత్రోపి వరో విప్రః సుయంత్రితః, నాయంత్రితస్త్రివేదోఽపి సర్వాశీ సర్వవిక్రయీ. ౪౭. శయ్యాసనేధ్యాచరితే శ్రేయసా న సమావిశేత్, శయ్యాసనస్థశ్చైవేనం ప్రత్యుత్థాయాభివాదయేత్. ౪౮. ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆగతే, ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ప్రతిపద్యతే. ౪౯. అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః, చత్వారి సమ్యగ్వర్ధంతే ఆయుః ప్రజ్ఞా యశో బలమ్. ౫౦. అభివాదపరో విప్రో జ్యాయాంసమభివాదయేత్, అసౌ నామాహమస్మీతి స్వనామ పరికీర్తయేత్. ౫౧. నామధేయస్య యే కేచిదభివాదం న జానతే,

నామాంతమున భోః శబ్దమును గీర్తింపవలయును. మహర్షులు భోశ్శబ్ద మును నామధేయస్వరూపమని వక్కాణించుచున్నారు. నమస్కరించు విప్రుని నాయుష్మంతుఁడ వగుమోయీ సౌమ్యుఁడా! యని యనవల యును. (ఆయుష్మాన్ భవ సౌమ్య.) నామాంతమున అకారము గూడఁ జేర్చి దానివెనుకటియక్షరము ప్లుతముగ నుచ్చరింపవలయును. ప్రత్యభి వాదనవిధి యెఱుఁగనివిప్రుఁడు శూద్రతుల్యుఁ డగుటచేఁ బండితుఁ డైనవాఁ డాతనికి నభివాదనము జేయరాదు. అభివాద మొనర్చినప్పుడు ప్రత్యభివాదనము జేయనివాఁడును ఆశీర్వాదము జేయనివాఁడును ఘోరనరకము నొందును. సందియము వలదు. "అభి" అనునది విష్ణుని బోధించును. "వాదయామి" అనునది శివుని బోధించును. కావున నభి వాదశబ్దముచే విప్రుఁ డయ్యిద్దఱను బూజించును. బ్రాహ్మణుని గుశల మడుగవలయును. క్షత్రియు ననామయము నడుగవలయును. వైశ్యుని క్షేమము నడుగవలయును. శూద్రుని నారోగ్యము నడుగవల యును. యజ్ఞమున దీక్షితుఁడైనవాఁడు వయసునఁ దనకన్నఁ జిన్న వాఁడైనను నామధేయముతో నాతనిఁ బిలువరాదు. భోః శబ్దమునఁగాని భవచ్ఛబ్దమునగాని బిలువవలయును. అని స్వాయంభువ మనువు వచిం చెను. రాజా! అధమయోనిసంజాత యయ్యును బరపత్నియగు యువతి "భవతీ" యనియును, "సుభగురాలా" అనియును, "భగినీ" (సోదరీ) అని యును బిలువఁదగినది. పిన్నవాఁడు, పినతండ్రి, మేనమామ, శ్వశురుఁడు,

తాన్ప్రాజ్ఞోఽహమితి బ్రూయాత్స్త్రియః సర్వాస్తథైవ చ. ౫౨. భోః శబ్దం కీర్తయే దంతే స్వస్య నామ్నోఽభివాదనే, నామ్నః స్వరూపభావో హి భో భావ ఋషిభిః స్మృతః. ౫౩. ఆయుష్మాన్భవ సౌమ్యేతి వాచ్యో విప్రోఽభివాదనే, అకారశ్చాస్య నామ్నోఽన్తే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః. ౫౪. యో న వేత్త్యభివాదస్య విప్రః ప్రత్యభివాదనమ్, నాభి వాద్యః స విదుషా యథా శూద్రస్తథైవ సః. ౫౫. అభివాదే కృతే యస్తు న కరోత్యభి వాదనమ్, ఆశీర్వా కురుశార్దూల స యాతి నరకం ధ్రువమ్. ౫౬. అభీతి భగవాన్విష్ణు ర్వాదయామీతి శంకరః, ద్వావేవ పూజితౌ తేన యః కరోత్యభివాదనమ్. ౫౭. బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్క్షత్రబంధుమనామయమ్, వైశ్యం క్షేమం సమాగమ్య శూద్ర మారోగ్యమేవ తు. ౫౮. న వాచ్యో దీక్షితో నామ్నా యవీయానపి యో భవేత్, భో భవత్పూర్వకత్వేన ఇతి స్వాయంభువోఽబ్రవీత్. ౫౯. పరపత్నీ తు యా రాజన్న సంబద్ధా తు యోనితః. వక్తవ్యా భవతీత్యేవం సుభగే భగినీతి చ. ౬౦. పితృవ్యాన్మాతు

ఋత్విజులు, గురువులు మొదలగువారికిఁ బ్రత్యుత్థాన మొనరించి "అసావహం" (ఈనేను) అని స్వనామము నెఱుకపఱపవలయును. తల్లియుఁ, బినతల్లియు, మేనమామభార్యయు, నత్తగారును, మేనయత్తయు, భ్రాతృపత్నియు గురుపత్నితో సమముగఁ బూజింపఁదగినవారు. జ్యేష్ఠసోదరుని భార్య సవర్ణ యైనచో నామె నెల్లప్పుడు నియతుఁడై పూజించిన విప్రుఁడు విష్ణుపదము నొందఁగలఁడు. ప్రవాసమునుండి మరలివచ్చిన విప్రుఁడు జ్ఞాతిస్త్రీజనమును బంధుయువతులును మొదలగువారిని బూజింపవలయును. తండ్రిసోదరియుఁ దల్లిసోదరియు నిజసోదరియు పూజింపఁదగియుంటచే ననారతము మాతృభావముతో వారి నారాధింపవలయును. వీరందఱికంటెను జనని యుత్తమ యైనది. పుత్రమిత్ర భాగినేయులు తనవలెఁ జూచుకొనఁదగినవారు. పౌరులతోడిసఖ్యము పదియేండ్లును, శ్రోత్రియునితోడిపొత్తు నారేండ్లును, విద్యావంతునిచెలిమి యేనేండ్లును, స్వయోనిజులతోడిసఖ్యము యథేష్టముగను జేయఁదగును. దశవర్షదేశీయుఁడగు బ్రాహ్మణుని శతవర్షవయస్కుఁడగురాజును పితాపుత్రులుగా నెఱుంగుము. బ్రాహ్మణక్షత్రియులకు బ్రాహ్మణుఁడే తండ్రియని పెద్దలు వచించిరి. ఇట్టులే క్షత్రియవైశ్యశూద్రులలోఁగూడఁ దారతమ్య మెఱుంగనగును. క్షత్రియునకుఁ దండ్రియగుట బ్రాహ్మణుఁడు వైశ్యునకుఁ బితామహుఁడును, శూద్రునకుఁ బ్రపితామహుఁడు నగును.

---

లాన్రాజఞ్ఛ్వశురాన్ఋత్విజో గురూన్, అసావహమితి బ్రూయాత్ప్రత్యుత్థాయజఘన్యజః. ౬౧. మాతృష్వసా మాతులానీ శ్వశ్రూరథ పితృష్వసా, సంపూజ్యాగురుపత్నీచ సమాస్తాగురుభార్యయా. ౬౨. జ్యేష్ఠస్యభ్రాతుర్యాభార్యాసవర్ణాహన్యహన్యపి, పూజయన్ప్రయతో విప్రో యాతి విష్ణుసదో నృప. ౬౩. ప్రవాసాదేత్య సంపూజ్యా జ్ఞాతిసంబంధియోషితః, పితుర్యా భగినీ రాజన్మాతుశ్చాపి విశాంపతే. ౬౪. ఆత్మనో భగినీ యా చ జ్యేష్ఠా కురుకులోద్వహ, సదా స్వమాతృవద్వృత్తిమాతిష్ఠేద్భారతోత్తమ. ౬౫. గరీయసీ తతస్తాభ్యో మాతా జ్ఞేయా నరాధిప, పుత్రమిత్రభాగినేయా ద్రష్టవ్యా హ్యాత్మనా సమాః. ౬౬. దశాబ్దాఖ్యం పౌరసఖ్యం పంచాబ్దాఖ్యం కలాభృతామ్, అబ్దపూర్వం శ్రోత్రియాణాం స్వల్పేనాపి స్వయోనిషు. ౬౭. బ్రాహ్మణం దశవర్షంచ శతవర్షంచ భూమిపమ్, పితాపుత్రౌ విజానీయాద్బ్రాహ్మణస్తు తయోః పితా. ౬౮. ఇత్యేవం క్షత్రియపితా వైశ్యస్యాపి

ధనము, బంధువు, వయస్సు, వృత్తి, విద్య యనునవి యైదును గౌరవ స్థానము లయి యున్నవి. అందు నుత్తరోత్తర మత్యుత్తమ మయినది. మూఁడువర్ణములలోను నీయేనింట ననేకములు గుణాధికములై యెవ్వ నియం దుండు నాతఁడు పూజార్హుఁడగును. శూద్రుఁ డైనను దశమా వస్థ (90 యేండ్లు దాట) నున్నచో నాతఁడును మానార్హుఁడే యగును. ఇయ్యది వార్ధకావస్థ కుపలక్షణము. శకటము, వృద్ధుఁడు, రోగి, బరువు మోయువాఁడు, యువతి, స్నాతకుఁడు, రాజు, వరుఁడు (ఉత్తముఁడు, లేక, వివాహముజేసికొనువాఁడు)ను దారిలో నగపడిన వారికి మార్గము నొసంగవలయును. వీరందఱు నొక్కచోటఁ గలసినప్పుడు రాజును స్నాత కుఁడును మార్గ మొసంగి యితరులచేఁ బూజింపఁదగుదురు. ఆయిరువుర కును సమాగమ మేర్పడినచో రాజు స్నాతకుని బూజింపవలయును. ఏబ్రాహ్మణుఁడు శిష్యున కుపనయన మొనరించి సరహస్యకల్పముగ వేదము నధ్యయనముచేయించునో యాతఁడాచార్యుఁ డని పండితులు వచింతురు. వేదమున నేకదేశముగాని వేదాంగములగు వ్యాకరణాదులతోఁగాని జీవికాపేక్షచేఁ జదివించునో యాతఁ డుపాధ్యాయుఁ డనఁబడును. నిషే కాదికార్యముల నొనరించి యధ్యయనము జేయించువాఁడు గురువని చెప్పఁబడును. ఎవనికొరకు వరింపఁబడి యెవ్వఁ డగ్న్యాధానమును పాక యజ్ఞములను నగ్నిష్టోమాదియాగముల నొనరించునో యాతఁ డాతనికి

---

పితామహాః, ప్రపితామహాశ్చ శూద్రస్య ప్రోక్తో విప్రో మనీషిభిః. ౧౯. విత్తం బంధు ర్వయఃకర్మ విద్యా భవతి పంచమీ, ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్. ౨౦. పంచానాం త్రిషు వర్ణేషు భూయాంసి గుణవంతి చ, యస్య స్యుః సోఽత్ర మానార్హః శూద్రోఽపి దశమీం గతః. ౨౧. చక్రిణో దశమీస్థస్య రోగిణో భారిణః స్త్రియాః, స్నాతకస్య తు రాజ్ఞశ్చ పంథా దేయో వరస్య చ. ౨౨. ఏషాం సమాగమే తాత పూజ్యౌ స్నాతకపార్థివౌ, అభ్యాం సమాగమే రాజన్స్నాతకో నృపమానభాక్. ౨౩. అధ్యాపయేద్యస్తు శిష్యం కృత్వోపనయనం ద్విజః, సరహస్యం సకల్పం చ వేదం భరతసత్తమ, తమాచార్యం మహాభాహో ప్రవదంతి మనీషిణః. ౨౪. ఏకదేశం తు వేదస్య వేదాంగాన్యపి వా పునః, యోఽధ్యాపయతి వృత్త్యర్థముపాధ్యాయః స ఉచ్యతే. ౨౫. నిషేకాదీని కార్యాణి యః కరోతి నృపోత్తమ, అధ్యాపయతి చాప్యేన స విప్రో గురురుచ్యతే. ౨౬. అగ్న్యాధేయం పాకయజ్ఞానగ్నిష్టోమాదికాన్మఖాన్, యః కరోతి

ఋత్విగ్జుఁడని చెప్పఁబడును. ఎవఁడవితథముగ వేదముచే రెండుచెవుల నావరించు నాతఁడు తల్లియుఁ దండ్రియు నగును. కావున నాతని నెన్నఁడును ద్రోహము చేయరాదు. పదిమంది యుపాధ్యాయు లొక్క యాచార్యునితోఁ బోల్పఁదగుదురు. అట్టియాచార్యులు నూర్గురైనఁ బితృసమ మగుదురు. వేవురుతండ్రులైన నొకతల్లి యగును. కావున నీతీరుగనే వీరందఱు గౌరవార్హులు. పుట్టించువేదమునిచ్చువారిలో వేదము నిచ్చువాఁ డుత్తముఁడు. ఆతఁడే తండ్రి యనఁ దగును. విప్రునకు వేదముతోడిపుట్టుక యిహపరలోకముల శాశ్వతమయినది గదా? తల్లిదండ్రులు పరస్పరము కామముచేత నీతని నుత్పాదించిరి. ఆకుమారుఁడు వారి యోన్యాదిసంభవుఁడగుటచే వారికిఁ బుత్రుఁడని చెప్పఁబడెను. వేదపారగుఁడగునాచార్యుఁడు సావిత్ర్యుపదేశమూలముగ జరామరణములు లేక శాశ్వతమగు నాజాతిని విధ్యుక్తముగ నుత్పాదించుచున్నాఁడు. ఉపాధ్యాయుఁడు మొదలగు పూజ్యులచరిత్రమెల్ల నిశ్శేషముగ వింటివి గదా? వారందఱిలోను గురువు సర్వవిధముల నధికుఁడని యెఱుంగుము. లక్షమందియాచార్యు లొకటైన నొక్కగురున కీడు గారు. కావుననే యాతఁడు మహాగురువని చెప్పఁబడును. అన విని శతానీకుఁ డిట్లనెను:— "ఓబ్రాహ్మణోత్తమా! ఉపాధ్యాయాదులగురించి సవిస్తరముగ నీవు చెప్ప వినియుంటిని. మహాగురువును గురించి నీవు చెప్పియుండ లేదు

వృతో యస్య స తస్యర్త్విగిహోచ్యతే. ౭౭. య ఆవృణోత్యవితథం బ్రహ్మణా శ్రవణావుభౌ, స మాతా స పితా జ్ఞేయస్తం న ద్రుహ్యేత్కథంచన. ౭౮. ఉపాధ్యాయాదశాచార్య ఆచార్యాణాం శతం పితా, సహస్రేణ పితుర్మాతా గౌరవేణాతిరిచ్యతే. ౭౯. ఉత్పాదకబ్రహ్మదాత్రోర్గరీయాన్బ్రహ్మదః పితా, బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్. ౮౦. కామాన్మాతా పితా చైనం యదుత్పాదయతో మిథః, సంభూతిం తస్య తాం విద్యాద్యద్యోనావభిజాయతే. ౮౧. ఆచార్యస్త్వస్య తాం జాతిం విధివద్వేదపారగః, ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యా సాఽజరామరా. ౮౨. ఉపాధ్యాయమాదితః కృత్వా యే పూజ్యాః కథితాస్తవ, మహాగురుర్మహాబాహో సర్వేషామధికః స్మృతః. ౮౩. సహస్రశతసంఖ్యోఽసావాచార్యాణామిదం మతమ్, చతుర్ణామపి వర్ణానాం స మహాగురురుచ్యతే. ౮౪. శతానీక ఉవాచ:—య ఏతే భవతా ప్రోక్తా ఉపాధ్యాయముఖా ద్విజాః, విదితా ఏవ మే సర్వే న మహాగురురేవ హి. ౮౫. సుమం

గదా! ఆతఁడెవ్వరు? ఆతనిలక్షణ మెయ్యది?" అని యడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె:—జయముమూలమున జీవించువిప్రుఁడు మహాగురు వని చెప్పఁబడును. జయమనఁగా నష్టాదశపురాణములును, రామాయణము, వైష్ణవధర్మములు, శైవధర్మములు, కృష్ణద్వైపాయనోక్తము నైదవ వేదంబు నగుభారతమును, నారదప్రోక్తములగు శ్రౌతధర్మములు నని మహావిద్వాంసులు వచింతురు. ఈతీరున నివి యన్నియు బ్రాహ్మణబృంద మున కెఱింగించువాఁడు ప్రవరుఁ డనఁబడును. ఈసమస్తపురాణములును మహాభారతమును సరహస్యముగ నెఱింగినవాఁడు సర్వజ్ఞుఁడని చెప్పఁ బడును. కావున నాబ్రాహ్మణోత్తముఁడు సర్వవర్ణములకు నర్చనీయుఁడు. ఓయీ! నీవింతదనుక వినియుండ లేదా? భగవంతునియుపదేశము "ఎవఁడు తనజ్ఞానమునకును శాస్త్రమునకును స్వల్పముగనో యధికము గనో యుపకరించు నాతఁడును శాస్త్రోపకారకుఁ డగుటచేత గురువగును. బ్రాహ్మజన్మము గలుగఁజేసినవాఁడును స్వధర్మపరిపాలనము జేసినవాఁడును బాలుఁడయ్యును వృద్ధునకైనను ధర్మమార్గమునఁ బితృసముఁ డగును (తండ్రియే యగును). మున్నాంగిరసుం డనుశిశువు జ్ఞానియై పితరుల కధ్యాపన మొనరించెను. తాను జ్ఞానముచే నధికుఁడగుట వారిని బుత్రకు లారా! యని పిలచెను. వారందులకుఁ గినిసి దేవతలయొద్ద కేగి యా

---

తురువాచ.—జయోపజీవీ యో విప్రః సమహాగురురుచ్యతే, అష్టాదశపురాణాని రామస్య చరితం తథా. ౧౬. విష్ణుధర్మాదయో ధర్మాః శివధర్మాశ్చ భారత, కార్ష్ణం వేదం పంచమం తు యన్మహాభారతం స్మృతమ్. ౧౭. శ్రౌతా ధర్మాశ్చ రాజేంద్ర నారదోక్తా మహీ పతే, జయేతి నామ ఏతేషాం ప్రవదంతి మనీషిణః. ౧౮. ఏవం విప్రకదంబస్య ధారకః ప్రవరః స్మృతః, యస్త్వేతాని సమస్తాని పురాణానీహ విందతి. ౧౯. భారతం చ మహా బాహో స సర్వజ్ఞో మతో నృణామ్, తస్మాత్స పూజ్యో రాజేంద్ర వర్ణైర్విప్రాదిభిః సదా. ౨౦. కిం త్వయా న శ్రుతం వాక్యం యదాహ భగవాన్విభుః, అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి యః, తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా. ౨౧. బ్రాహ్మస్య జన్మనఃకర్తా స్వధర్మస్య చ శాసితా, బాలోఽపి విప్రో వృద్ధస్య పితా భవతి ధర్మతః. ౨౨. అధ్యాపయామాస పితౄనిశ్శురాంగిరసః కవిః, పుత్రకా ఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్య తాన్. ౨౩. తే తమర్థమపృచ్ఛంత దేవానాగత

విషయము నడిగిరి. దేవత లించుక యోచించి శిశువు పలికినది సార్థకమే గాని వ్యర్థము గాదు. తెలియనివాఁడు గదా? బాలుఁ డనఁబడును. జ్ఞానము నిచ్చువాఁడు తండ్రి యగును అజ్ఞుఁడు బాలుండనియు మంత్ర దాత పిత యనియు జయప్రదుఁడు పితామహుఁడనియుఁ బెద్దలు వచింతురు. ఒకేదేహము జయమంత్రవేదరూపమున మూఁడువిధములుగఁ జేయఁబడెను మహర్షు లెవ్వరును ఏండ్లు గడచుటచేఁ గాని తల నెరసి యుండుటచేతఁగాని మైత్రిచేఁగాని బాంధవ్యముచేఁగాని ధర్మోపదేశముఁ జేయుటలేదు. ఎవఁడు సాంగవేదాధ్యయనముఁ జేసి జ్ఞానవీర్యములచే నుత్తముఁ డై యుండు నాతఁడే విచారింప నుత్తముఁడు. నాల్గువర్ణముల వారును జ్యేష్ఠులను నమస్కరించునాచార మున్నది. అందొక సందేహ మున్నది "జ్యేష్ఠుల నెవ్వ"రని. అందు జ్ఞానముచేతను వీర్యముచేతను ధనమునను జన్మమునను సౌశీల్యమువలనను నేమానవు లగ్రగణ్యులో వారే జ్యేష్ఠులని నాయాశయము. వెండ్రుకలు తెల్లనైనంతమాత్రమున నాతఁడు వృద్ధుఁడని యెంచరాదు. యువకుఁడైన నధ్యేత యయ్యెనేని యాతఁడే వృద్ధుఁడనఁదగునని దేవత లెఱుంగుదురు. అధ్యయనము లేని బ్రాహ్మణుఁడు దారునిర్మితంబగు మాతంగంబుపగిదిఁ జర్మనిర్మితంబగు మృగంబుభాతి నామమాత్రమునే ధరించి యుండును. సంతానములేని యాఁడుదాని వలెను వంధ్యయగు గోవువలెను నధ్యయనవిహీనుఁడు వ్యర్థుఁడగుట

---

మన్యవః, దేవాశ్చైతాన్సమేత్యోచుర్న్యాయ్యం వై శిశురుక్తవాన్. ౯౪. అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మంత్రదః, అజ్ఞం హి బాలమిత్యాహుః పితేత్యేవ తు మంత్రదమ్. ౯౫. పితామహేతి జయదమిత్యూచుస్తే దివౌకసః, జయో మంత్రాస్తథా వేదా దేహమేకం త్రిధా కృతమ్. ౯౬. న హాయనైర్న పలితైర్న మిత్రేణ న బంధుభిః, ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్. ౯౭ బ్రాహ్మణక్షత్రియ విశాం శూద్రాణాం చ విశాంపతే, జ్యేష్ఠం వదంతి రాజేంద్ర సందేహం శృణు వై యథా. ౯౮. జ్ఞానతో వీర్యతో రాజన్ ధనతో జన్మతస్తథా, శీలతస్తు ప్రధానాయే తే ప్రధానా మతా మమ. ౯౯. న తేన స్థవిరో భవతి యేనాస్య పలితం శిరః, యో వై యువాప్యధీయానస్తందేవాః స్థవిరం విదుః. ౧౦౦. యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః, యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి. ౧౦౧. యథా యోషాఽఫలా స్త్రీషు యథా గౌర్గవి చాఫలా, యథాచాజ్ఞేఽఫలం దానం యథా విప్రోఽనృచోఽ

నాతని కిచ్చుదానము నిష్ఫలమైనది. సమస్తవేదాధ్యయన మొనర్చినను బ్రాహ్మణుఁడు వైశ్వదేవముఁ జేయకయు నతిథిసత్కారముఁ జేయకయు నున్నచో నాతఁడు వృషలుఁ డనఁదగును. ఋక్కును బఠింపనివారును, వాణిజ్యముఁ జేయనేర్చినవారును, గాయకులును, శూద్రదాస్యము జేయువారును, వైద్యముచేయువారును బ్రాహ్మణులు కారని యెఱుంగుము. వ్రతముల నాచరింపక యధ్యయనము నేయక కేవలము భైక్షచర్య యొనరించువారు చోరు లనఁదగుదురు. అట్టివారికిఁ దావిచ్చి పోషించు గ్రామము చోరనివాస మనఁదగును. కావున రాజట్టిగ్రామములఁ దండింపవలయును. నిత్యసంతోషియు నిత్యాగ్నిహోత్రుఁడు నగుద్విజుఁడు సాఫల్యము వడయునని వేదములు బోధించుచున్నవి. ఒకప్పుడు వేదములన్నియుఁ బ్రజాపతియొద్దకుఁ బోయి, "మహాత్మా! భూలోకమున విప్రులగ్నిహోత్రాదివిహితకర్మల నాచరింపక మమ్మధ్యయనముఁ జేసి ఫలాకాంక్షులై యేలొకో క్లేశము లనుభవించుచున్నారు! అనుష్ఠానవిహీనులై కేవలము మమ్ము మాత్ర మధ్యయనము చేయువారికి శ్రమముకన్న నింకేమియు మిగులదని చూచుచున్నారము. మమ్మధ్యయించుటకన్నఁ గర్మలనుష్ఠించుటే యుత్తమముగాఁ దోఁచుచున్నది" యని వచించినవి. కావున నోరాజేంద్రా! కేవలవేదాధ్యయనముకన్నఁ గర్మానుష్ఠానమే యుత్తమము. వేదాధ్యయనపరు లగువిప్రులు ముగ్గురుగాని నలుగురు

---

ఫలః. ౧౦౨. వైశ్వదేవేన యే హీనా ఆతిథ్యేన వివర్జితాః, సర్వే తు వృషలా జ్ఞేయాః ప్రాప్తవేదా అపి ద్విజాః. ౧౦౩. నానృగ్బ్రాహ్మణో భవతి న వణిఙ్న కుశీలవః, న శూద్రః ప్రేషణం కుర్వన్న స్తేనో న చికిత్సకః. ౧౦౪. అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్షచరా ద్విజాః, తం గ్రామం దండయేద్రాజా చోరభక్తప్రదో హి సః. ౧౦౫. సంతుష్టో యత్ర వై విప్రః సాగ్నికః కురునందన, యాతి సాఫల్యతాం వేదైర్వైరేవం హి భాషితమ్. ౧౦౬. వేదైరుక్తం యథా వీర సురజ్యేష్ఠముపేత్య వై, వేపంతే బ్రాహ్మణా భూమావభ్యస్యంతి హ్యనగ్నికాః, క్లిశ్యంతే తే కిమర్థం హి మూఢా వై ఫలకాంక్షయా. ౧౦౭. అనుష్ఠానవిహీనానామస్మానభ్యసతాం భువి, క్లేశో హి కేవలం దేవ నాస్మదభ్యసనే ఫలమ్. ౧౦౮. అనుష్ఠానం పరం దైవమస్మత్స్వభ్యసనాత్సదా, ఇత్యేవం రాజశార్దూల వేదా ఊచుర్హి వేధసమ్, తస్మాచ్చ వేదాభ్యసనాదనుష్ఠానం పరం మతమ్. ౧౦౯. చత్వారో వా త్రయో వాపి యద్బ్రూయుర్వేదపారగాః, స ధర్మ

గాని కూడి వచించిన ధర్మము. అంతేగాని యితరులు వేవురు గూడి వచించినను నది ధర్మము గాఁజాలదు. అజ్ఞానాంధత సవ్యాప్తులగుమూర్ఖులు ధర్మాధర్మముల నెఱుంగక ధర్మమని యుపదేశించిరేని దానివలన నగు పాతకము నూరువిధములై వక్తలఁ జెందును. సదాచారదూరుఁడై వ్రతభ్రష్టుఁడై వేదాధ్యయనము చేయనివిప్రున కన్నమిడినచో నాయన్నమయ్యో నేనేమిపాప మొనరించితినని విలపించును. జపోపజీవి కొసంగినప్పు డాయన్నము రెండుచేతుల నెత్తి యమందానందముతో నాట్యము చేయును విద్యాతపస్సంపన్నుఁడగు బ్రాహ్మణుఁడు గృహమునకు రాఁగానే యేమెల్ల నత్యుత్తమపదంబు నొందఁగలమని యోషధులన్నియు గంతులువైచును వ్రతము మంత్రము జపము లేని వారలకు దానమీయరాదు. దానివలన ఫలమునొందఁజాలఁడు. ప్రతిగ్రహము గూడఁ జేయరాదు. ఱాయి ఱాతిని దరింపఁజేయఁజాలదు గదా? ఎల్లప్పుడును హవ్యకవ్యములను శ్రోత్రియునకే యీవలయును. అశ్రోత్రియున కిచ్చినచో నవిదేవతలనుగాని పితరులనుగాని జెందఁజాలవు. ఏగృహస్థునకు గృహమున మూర్ఖుఁడును బైట బహుశ్రుతుఁడు నుండురో యాతఁడు యోచించి హవ్యకవ్యములను దూరమున నున్నను బహుశ్రుతునకే యీవలయును. మూర్ఖవ్యతిక్రమదోష మాతనిం జెందదు. జపములేనివానియెడను మూర్ఖునందును బ్రాహ్మణాతిక్రమ (తిరస్కార)

---

ఇతి విజ్ఞేయో నేతరేషాం సహస్రశః. ౧౧౦. యద్వదంతి తమోమూఢా మూర్ఖా ధర్మమజానతః, తత్పాపం శతధా భూత్వా వక్తౄన్నేవానుగచ్ఛతి. ౧౧౧. శౌచహీనే వ్రతభ్రష్టే విప్రే వేదవివర్జితే, దీయమానం రుదత్యన్నం కిం మయా దుష్కృతం కృతమ్, ౧౧౨. జపోపజీవినే దత్తం యదాత్మానం ప్రపశ్యతి, నృత్యతి స్మ తదారాజన్కరావుద్ధృత్య భారత. ౧౧౩. విద్యాతపోభ్యాం సంపన్నే బ్రాహ్మణే గృహమాగతే, క్రీడంత్యోషధయః సర్వా యాస్యామః పరమాం గతిమ్. ౧౧౪. అవ్రతానామమంత్రాణామజపానాం చ భారత, ప్రతిగ్రహో న దాతవ్యో న శిలా తారయేచ్ఛిలామ్. ౧౧౫. శ్రోత్రియాయైవ దేయాని హవ్యకవ్యాని నిత్యశః, అశ్రోత్రియాయ దత్తాని న పితౄన్నాపి దేవతాః. ౧౧౬. యస్య చైవ గృహే మూర్ఖో దూరే చాపి బహుశ్రుతః, బహుశ్రుతాయ దాతవ్యం నాస్తి మూర్ఖవ్యతిక్రమః. ౧౧౭. బ్రాహ్మణాతిక్రమో నాస్తి మూర్ఖే జపవివర్జితే, జ్వలంతమగ్నిముత్సృజ్య న హి భస్మని హూయతే.

దోషము కలుగదు. హోమము చేయఁగోరువాఁడు మండుచున్న నిప్పును విడచి బూడిదలో వ్రేల్చిన నెంతఫలంబు వడయునో యంతియ ఫలంబిందును గలుగును. పితృదేవతలుగాని దేవతలుగాని గుణము లున్నను లేకున్నను బ్రాహ్మణమాత్రుఁడు పరమదైవమని యంగీకరించుటలేదు. సగుణుఁడగు బ్రాహ్మణుఁడే దైవమనుచున్నారు. బ్రాహ్మణకార్యములలో గృహమున నాసీనుఁడయిన బ్రాహ్మణు నతిక్రమింపరాదు. అట్లుచేసినవాఁడు రౌరవంబను నరకంబునొందును గాయత్రీమాత్రసారుఁడయ్యును బ్రాహ్మణుఁడు పూజింపఁదగినవాఁడు. గృహమునకుఁ జేరువనున్నచో మఱియు విశేషము. కాని యాతఁడు పతితుఁడు మాత్రమయి యుండరాదు. ధాన్యశూన్యమగు గ్రామముపగిది నిర్జలంబగుకూపంబుభాతి ననధీయానుఁడగు బ్రాహ్మణుఁడు నామమాత్రధారియై వ్యర్థుఁడని యెఱుఁగుము. పలువు రొక్కబారున నారగించునపుడు స్నేహమునఁగాని భయమునఁగాని ధనాశచేతగాని విషమముగా (హెచ్చుతగ్గులుగా) భోజనము నిడినవాఁడు బ్రహ్మహత్యాపాతకము నొందునని వేదమున నున్నదని మునులు వచించుచున్నారు. భూతజాతములశ్రేయము గోరువాఁడు తొలుత నహింసనే పాటింపవలయును. ధర్మముగోరువాఁడు మృదుమధురగంభీరవచనములుపయోగింపవలయును. ఏవానివాఙ్మనసములు పరిశుద్ధములును సత్యరక్షితములు నై యుండునో యాతఁడే వేదాంతోపదిష్టమగుఫలము నొందఁగలఁడు. తా నార్తుఁడయ్యు నితరుల బాధింపరాదు. ఇతరులకు

---

౧౧౮. న చైతదేవ మన్యంతే పితరో దేవతాస్తథా, సగుణం నిర్గుణం వాపి బ్రాహ్మణం దైవతం పరమ్. ౧౧౯. నాతిక్రమేద్గృహాసీనం బ్రాహ్మణం విప్రకర్మణి, అతిక్రమన్ మహాబాహో రౌరవం యాతి భారత. ౧౨౦. గాయత్రీమాత్రసారోఽపి బ్రాహ్మణః పూజ్యతాం గతః, గృహాసన్నో విశేషేణ న భవేత్పతితస్తు సః. ౧౨౧. ధాన్యశూన్యో యథా గ్రామో యథా కూపశ్చ నిర్జలః, బ్రాహ్మణశ్చానధీయానస్త్రయస్తే నామధారకాః. ౧౨౨. యస్త్వేకపంక్త్యాం విషమం దదాతి స్నేహాద్భయాద్వా యది వార్థహేతోః, వేదేషు దృష్టమృషిభిశ్చ గీతం తాం బ్రహ్మహత్యాం మునయో వదంతి. ౧౨౩. అహింసయైవభూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్, వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా. ౧౨౪. యస్య వాఙ్మనసీ శుద్ధే సత్యగుప్తే చ భారత, స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్. ౧౨౫. నారుంతుదః స్యాదార్తోఽపి న పరద్రోహ

ద్రోహము గలిగించుపనులయం దాసక్తుఁడై యుండరాదు. లోకమునకు బాధ కలుగునట్లు మాటలాడరాదు ఎట్లు మాటాడిన లోకమునకు సుఖంబు గలుగు నట్లు మాటాడవలయును. పురుషునకు మధురముగ భాషింపఁబడినవాక్కు సంతోషము గలిగించునట్లు చంద్రుఁడుగాని శీత లోదకముగాని చందనరసముగాని శీతలవృక్షచ్ఛాయగాని కలిగింపనేరవు. పూజనీయుఁడగు బ్రాహ్మణుఁడు పూజవలన విషమునుండివలె బాధనొం దును. అమృతమును గోరినట్లు లవమానమును గోరుకొనును. ఆతఁడవ మతిఁ జెందెనేని సుఖముగ నిద్రించును; సుఖముగ మేల్కొనును; సుఖ ముగఁ బ్రపంచమున సంచరించును. అతని కవమానము గావించినవాఁడు నశించును. రాజా! వెనుకజెప్పినవిధానము ననుసరించి సంస్కృతుఁడైన బ్రాహ్మణుఁడు గురుకులంబున వసించి బ్రహ్మజ్ఞానాదితపములను నేకరింప వలయును. విప్రుఁడు పలువిధములగు తపోవిశేషములచేతను విధ్యుక్త వివిధవ్రతానుష్ఠానముచేతను సరహస్యంబుగ వేదములను సాధింపవల యును. ద్విజుఁడు తపంబాచరించుచు వేదాధ్యయనముఁ జేయ వలయును. వేదాభ్యాసమే విప్రునకు శ్రేష్ఠమగుతపమని చెప్పఁబడు చున్నది. ఏద్విజుఁడు సుప్తుండయ్యుఁ బ్రత్యహము వేదాధ్యయనము చేయునో యాతం డంగుష్ఠాగ్రమమున నిలఁబడి యాచరించుతపంబు

---

కర్మధీః, యయాఽస్యోద్విజతే లోకో న తాం వాచముదీరయేత్. ౧౨౬. యత్కరోతి శుభం వాచా ప్రోచ్యమానా మనీషిభిః, శ్రూయతాం కురుశార్దూల సదా చాపి తధో చ్యతామ్. ౧౨౭. న తథా శశీ న సలిలం న చందనరసో న శీతలచ్ఛాయా, ప్రహ్లాద యతి చ పురుషం యథా మధురభాషిణీ వాణీ. ౧౨౮. అర్హణాద్బ్రాహ్మణో నిత్యము ద్విజేతవిషాదివ, అమృతస్యేవ చాకాంక్షేదపమానస్య సర్వదా. ౧౨౯. సుఖం హ్యవమతః శేతే సుఖం చ ప్రతిబుధ్యతే, సుఖం చరతి లోకేఽస్మిన్నవమంతావినశ్యతి. ౧౩౦. అనేన విధినా రాజన్ సంస్కృతాత్మా ద్విజః శనైః, గురౌ వసన్ సంచినుయాద్బ్రహ్మాధిగమిదం తపః. ౧౩౧. తపోవిశేషైర్వివిధైర్వ్రతైశ్చ వివిధోదితైః, వేదః కృత్స్నోఽధిగంతవ్యః సర హస్యోద్విజన్మనా. ౧౩౨. వేదమేవాభ్యసేన్నిత్యం తపస్తప్యంద్విజోత్తమః, వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే. ౧౩౩. ఆహైవ స నఖాగ్రేభ్యః పరమం తప్యతేతపః, యః సుప్తోఽపి ద్విజోఽధీతే స్వాధ్యాయం శక్తితోఽన్వహమ్. ౧౩౪. యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమమ్, స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః.

ఫలంబు నందుననుట సందియము లేదు. వేదాధ్యయనంబు విడచి యిత రము నభ్యసించువాఁడు జీవించి యుండఁగనే వంశముతోఁ గూడ శూద్రుఁడగును. వేదతపోవిద్యావిహీనుఁడగువిప్రుఁడు శూద్రతుల్యుఁ డగునని భగవంతునియాదేశము. బ్రాహ్మణునకు జననివలన నుపనయనము వలనను యజ్ఞదీక్షవలనను నని మూఁడుజన్మములు గలవు. అందు మౌంజీ బంధనిబంధనంబగు ద్వితీయజననంబున సావిత్రి జనయిత్రి యనియు, నాచార్యుఁడు జనకుఁడనియుఁ జెప్పఁబడుచున్నారు. వేదప్రదాత యగుట నాచార్యుఁడు తండ్రి యగునని మనువు వచించెను ద్విజునకు మౌంజీ బంధనమగువఱకు విహితకర్మ లెవ్వియును లేవు. స్వధానినయనము మాత్రమున్నది అంతవఱకు నాతఁడు శూద్రతుల్యుఁడే యగును. ఉప నయనానంతరమున వ్రతాచరణము వేదసంగ్రహణము విధ్యుక్తక్రమం బున నొనరించుచుండవలెను. గురుగృహమునసుండి వెనుకఁజెప్పినవిధమున సూత్రచర్మ మేఖలావస్త్రదండములు ధరింపవలయును. ఇంద్రియనిగ్రహము గలవాఁడై తపోవృద్ధికొఱకు దేవర్షిపితృతర్పణములఁ జేయుచు నిత్య మును స్నాతుఁడై ప్రయత్నపూర్వకముగ మనుష్యులకుఁ గూడ నుదకపత్రపుష్పాదుల నొసంగి పూజించి సమిదాధాన మొనరించుకొని

---

౧౩౫. న యస్య వేదో న జపో న విద్యాశ్చ విశాంపతే, స శూద్ర ఏవ మంతవ్య ఇత్యాహ భగవాన్విభుః. ౧౩౬. మాతురగ్రే చ జననం ద్వితీయో మౌంజిబంధనమ్, తృతీయో యజ్ఞదీక్షాయాం ద్విజస్య విధిరీరితః. ౧౩౭. తత్ర యద్బ్రహ్మ జన్మాస్య మౌంజీబంధనచిహ్నితమ్. ౧౩౮. తత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే, వేదప్రదానాత్త్వాచార్యం పితరం మనురబ్రవీత్. ౧౩౯. న హ్యస్య విద్యతే కర్మ కించిదామౌంజిబంధనాత్, నాభివ్యాహారయేద్బ్రహ్మ స్వధానినయనాదృతే. ౧౪౦. శూద్రేణ తు సమం తావద్యావద్వేదే న జాయతే, కృతోపనయనస్యాస్య వ్రతాదేశన మిష్యతే, బ్రహ్మణో గ్రహణం చైవ క్రమేణ విధిపూర్వకమ్. ౧౪౧. యత్సూత్రం చాపి యచ్చర్మ యామౌ చాస్య చ మేఖలా, వసనం చాపి యో ధండస్తద్వై తస్య వ్రతేష్వపి. ౧౪౨. సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్, సన్నియమ్యే న్ద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః. ౧౪౩. బృన్దారకర్షిపితౄణాం కుర్యాత్తర్పణమేవ హి, నరాణాం చ మహాబాహో నిత్యం స్నాత్వా ప్రయత్నతః. ౧౪౪. పుష్పం తోయం ఫలం చాపి సమిదాధానమేవ చ, నానావిధాని కాష్ఠాని మృత్తికాం చ తథా కుశాన్.

నానావిధములగు కాష్ఠములు మృత్తును గుశదర్భలును సంపాదించి వ్రతములు సలుపవలయును. మధుమాంసములను భక్షింపక గంధమాల్యములు ధరింపక స్త్రీసాన్నిధ్యము సర్వవిధముల వర్జించి శుక్లవస్త్రాదులను గఠినవచనములను వర్జించి ప్రాణిహింసనము జేయక సుఖమునకై తైలాభ్యంగమును నేత్రాంజనమును పాదుకలను గొడుగును కామజంబగు సంకల్పంబును క్రోధలోభములను గానవాదనములను నాట్యమును ద్యూతమును జనులతో వాక్కలహాదికము నన్నృతమును పరిహసించుటను దూరముననే విడిచి యుండవలయును. స్త్రీని చూచుటగాని స్పృశించుటగాని తగదు. ఇతరుల కుపరోధము చేయఁదగదు. జారిణి యగుస్త్రీతో నెట్టిసంబంధమును గూడదు బహుదూరమున నుండవలయును. ఎట్టిప్రదేశమున నైన నొంటిగఁ బరుండవలయు. ఎచ్చటను వీర్యము స్రవింపఁజేయరాదు. కామాధీనుండై రేతస్సును స్రవింపఁజేసెనేని యాతనివ్రతంబు నశించును. బ్రహ్మచారి నిద్రించునప్పుడకామమూలకముగ రేతస్సు స్రవించెనేని యాతఁడుషఃకాలమున స్నానము చేసి సూర్యోపాసన మొనరించి "పునర్మాం" అను ఋక్కును జపింపవలయును. ఈవిషయమున మనువచనము గూడఁ గలదు. ఉదకుంభమును పుష్పములను గోమయంబును మృత్తును గుశలను వలయునంతవఱకు నిత్యముఁ దెచ్చుకొనవలయును. నిత్యమును భిక్షాచరణ మేయేగృహ

---

౧౮౫. వర్జయేన్మధు మాంసం చ గంధమాల్యరథాక్ స్త్రియః, శుక్లాని చైవ సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్. ౧౮౬. అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్, సంకల్పం కామజం క్రోధం లోభం గీతం చ వాదనమ్. ౧౮౭. నర్తనం చ తథా ద్యూతం జనవాదం తథానృతమ్, పరివాదం చాపి విభో దూరతః పరివర్జయేత్. ౧౮౮. స్త్రీణాం చ ప్రేక్షణాలంబో రపవీతం పరస్య చ, పుంశ్చలీభిస్తథా సంగం న కుర్యాత్కురునందన, ౧౮౯. ఏకః శయీత సర్వత్ర న రేతః స్కందయేత్క్వచిత్, కామాద్ధి స్కందయన్రేతో హినస్తి వ్రతమేవ తు. ౧౯౦. సుప్తఃక్షరన్బ్రహ్మచారీ ద్విజః శుక్రమకామతః, స్నాత్వార్కమర్చయిత్వా తు పునర్మామిత్యృచం జపేత్. ౧౯౧. మనోరపి తథా చాత్ర శ్రూయతే పరమం వచః, ఉదకుంభం సుమనసోగోశకృన్మృత్తికాం కుశాన్, ఆహరేద్యావదర్థాని భైక్షం చాపి హి నిత్యశః. ౧౯౨. గృహేషు యేషాం కర్తవ్యం తాఞ్ఛృణుష్వ నృపోత్తమ, స్వకర్మసు రతాయే వై తథా వేదేషు యే రతాః. యజ్ఞేషు

ములఁ జేయవలయునో యెఱింగింతు వినుము. స్వకర్మానుష్ఠానపరాయణులును వేదాధ్యయనపరులును యజ్ఞములందు శ్రద్ధగలవారును నగు గృహస్థులయిండ్ల బ్రహ్మచారి ప్రతిదినము భైక్షము దెచ్చుకొనవలయును. గురుకులమునను స్వగృహమునను దాయాదులయిండ్లను సన్నిహితబంధువులయిండ్లను భైక్షము దేకూడదు. అన్యగోత్రమున లభింపకున్న స్వగోత్రమునఁ గూడఁ జేయఁదగును. అలాభమున గుర్వాదిగృహములఁగూడ భిక్షింపవచ్చును. పూర్వోక్తులగు గృహస్థు లగపడకున్న నూరంతయుఁ దిరుగవలయును. చతుర్థవర్ణము మాత్రము విడువవలయును. అని యిట్లు మనువుపదేశించెను. భిక్షాచరణసమయమున బ్రహ్మచారి వాఙ్నియమము గలిగి యితరుల బాధింపకుండను స్తుతిచేయకుండ నుండవలయును. ఉత్తమకులమున లభింపనిచో నధమవర్ణమున భిక్షదేవచ్చును. చేరువనుండి సమిధలను దెచ్చి యింటిపై నుంచుకొని యాసమిత్తులతో నిత్యమనలసుఁడై సాయంప్రాతరాహుతుల నొనర్పవలయును. శక్తుఁడయ్యును భైక్షాచరణము నగ్నిసమింధనము నాచరింపనివాఁడు సప్తరాత్రకాల మవకీర్ణివ్రతము సలుపవలయును. ఆవ్రతకాలమున భైక్షచర్యతోడన యుండవలయునని పండితులు వచించిరి. కావున బ్రహ్మచారి భైక్షము భుజింపవలయునేగాని యేకాన్నము నెన్నఁడును భక్షింపరాదు. వ్రతికి భైక్షచర్య యుపవాసతుల్యమైనది. దేవపితృకార్యముల సన్న్యాసివలెను ఋషివలెను గృహమేధు లర్థింప వాది

---

చాపి రాజేంద్ర యే చ శ్రద్ధాసమాశ్రితాః. ౧౪౩. బ్రహ్మచార్యాహరేద్భైక్షం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్, గురోః కులే న భిక్షేత స్వజ్ఞాతికులబంధుషు. ౧౪౪. అలాభే త్వన్యగోత్రాణాం పూర్వం పూర్వం వివర్జయేత్, సర్వం చాపి చరేద్గ్రామం పూర్వోక్తానామసంభవే, అంత్యవర్జం మహాబాహో ఇత్యాహ భగవాన్విభుః. ౧౪౫. వాచం నియమ్య ప్రయతస్త్వగ్నిం శస్త్రం చ వర్జయేత్, చాతుర్వర్ణ్యం చరేద్భైక్షమలాభే కురునందన. ౧౪౬. ఆరాదాహృత్య సమిధః సన్నిదధ్యాద్గృహోపరి, సాయం ప్రాతస్తు జుహుయాత్తాభిరగ్నిమతంద్రితః. ౧౪౭. భైక్షాచరణమకృత్వా న తమగ్నిం సమిధ్య వై, అనాతురః సప్తరాత్రమవకీర్ణివ్రతం చరేత్. ౧౪౮. వర్తనం చాస్య భైక్షేణ ప్రవదంతి మనీషిణః, తస్మాద్భైక్షేణ వై నిత్యం నైకాన్నాదీ భవేద్వ్రతీ. ౧౪౯. భైక్షేణ వ్రతినో వృత్తిరుపవాససమా స్మృతా, దైవత్యే వ్రతవద్రాజన్పిత్ర్యే కర్మణ్య

యిచ్ఛవచ్చినవిధంబున భుజింపవచ్చును. వ్రతము లోపింపదు. ఇయ్యది బ్రాహ్మణబ్రహ్మచారికి మాత్రమే యని యెఱుంగుము. రాజన్యవైశ్య బ్రహ్మచారుల కియ్యది విధింపఁబడకుండుటచే వారికిక్కార్యము నాచరింప రాదు. అధ్యయనసంబంధము నాచార్యహితము గోరుటయు ముగ్గురకుఁ దుల్యములే. జ్ఞానేంద్రియములను మనస్సును శరీరమును వాక్కును నియమించుకొని బద్ధాంజలియై గురుముఖమును వీక్షించుచు నిలుచుండ వలయును. ఎల్లప్పుడు నుద్ధృతపాణియై శుభాచారముగల్గి నియతుఁడై కూర్చొనుమని గురు వాజ్ఞయొసంగినవెనుకఁ దదభిముఖముగఁ గూర్చుండ వలయును. గురుసన్నిధానమున వస్త్రవేషములుగాని యన్నాద్యాహార ములుగాని గలిగియుండరాదు. ఆచార్యునికన్న ముందు లేవవలెను. వెనుకఁ గూర్చొనవలయును. గురునితోడి సంభాషణముగాని యాజ్ఞా శ్రవణముగాని శయ్యపైనుండి యొనరింపరాదు. మఱియు నాసీనుఁడై గాని భుజించుచుఁగాని నిలఁబడిగాని వెనుదిరిగిగాని గురునితో సంభాషణాదు లొనరింపరాదు. ఆసీనుఁడగు గురువునకు నిలచియు, నిలచియున్న గురున కెదురుగవచ్చుచు, నరుగుచున్న గురుని వెంటా డుచుఁ, బరుగిడుగురుని బరుగిడుచుఁ, బరాఙ్ముఖుఁడగు గురున కభిముఖుఁడగుచు, దూరస్థుఁడగు గురునకు దరికేఁగుచుఁ, బరుండినగురుని నమస్కరించుచు నెల్లప్పుడు నాతనియాదేశము నిర్వర్తింపవలయును. శిష్యునిశయ్యయు నాసనమును గురునిశయ్యాసనములకన్న నన్నివిధముల

ధర్మి వత్, కామమభ్యర్థితోఽశ్నీయాద్వ్రతమస్య న లుప్యతే. ౧౬౦. బ్రాహ్మణస్య మహాబాహో కర్మ యత్సముదాహృతమ్, రాజన్యవైశ్యయోర్నైతత్పండితైః కురునందన. ౧౬౧. చోదితోఽచోదితో వాపి గురుణా నిత్యమేవ హి, కుర్యాదధ్యయనే యోగ మాచార్యస్య హితేషు చ. ౧౬౨. బుద్ధీంద్రియాణి మనసా శరీరం వాచమేవ హి, నియమ్య ప్రాంజలిస్తిష్ఠేద్వీక్షమాణో గురోర్ముఖమ్. ౧౬౩. నిత్యముద్ధృతపాణిః స్యాత్సాధ్వాచారస్తు సంయతః, ఆస్యతామితి చోక్తః సన్నాసీతాభిముఖం గురోః. ౧౬౪. వస్త్రవేషైస్తథాన్నైస్తు హీనః స్యాద్గురుసన్నిధౌ, ఉత్తిష్ఠేత్ప్రథమం చాస్య జఘన్యం చాపి సంవిశేత్. ౧౬౫. ప్రతిశ్రవణసంభాషే తల్పస్థో న సమాచరేత్, న చాసీనో న భుంజానో న తిష్ఠన్న పరాఙ్ముఖః. ౧౬౬. ఆసీనస్య స్థితః కుర్యాదభి గచ్ఛంశ్చ తిష్ఠతః, ప్రత్యుద్గంతా తు వ్రజతః పశ్చాద్ధావంశ్చ ధావతః. ౧౬౭. పరాఙ్ముఖస్యాభిముఖో దూరస్థస్యైత్య చాంతికమ్, నమస్కృత్య శయానస్య నిదేశే తిష్ఠేత్సర్వదా. ౧౬౮. నీచం శయ్యాసనం చాస్య సర్వదా గురుసన్నిధౌ, గురోశ్చ

నీచములై యుండవలయును. గురునెదుట యథేష్టాసనమునఁ గూర్చొనరాదు. గురుపరోక్షమున నాతని నామోచ్చారణము మాత్రము చేయనగు. ఆతనిగమనభాషణచేష్టితముల ననుకరింపరాదు. గురుతిరస్కారము ప్రవర్తించుచోటఁ జెవులు మూసికొనవలయును. లేకున్న నత్తావు విడచి వేరొకచెంతకేని బోవలయును. గురుతిరస్కారము గార్దభజన్మము గలుగఁ జేయును. ఆచార్యనింద శునకజన్మకు నిమిత్తము. ఆచార్యధనాపహరణము కృమిజన్మ కారణము. ఆచార్యునందలిమత్సరము కీటజన్మమునకుఁ గారణమగును. దూరముననుండి యాచార్యు నర్చింపరాదు. కోపముతోడను స్త్రీసమీపమున నుండియు నాచార్యున కభివాదనము చేయరాదు. యానాసనగతుండైన నటనుండిదిగి యభివాదనము చేయవలయును. గురువుతో నేకాసనమునఁ గూర్చుండరాదు. గురువు విననిచో నెట్టివిషయమునుగీర్తింపరాదు. గోయానాశ్వయానోష్ట్రయానములయందును ప్రాసాదప్రస్తరకటములయందును శిలాఫలకములయందును నావలందును మాత్రము గురుపుతోఁ గూర్చొనవచ్చును. ఆచార్యు నాచార్యుఁడు సన్నిహితుఁడైనప్పుడు నిజాచార్యునివలె గౌరవింపనగును. అటులనే గురుపుత్రులును, ఆర్యులును గురుబంధువులును మాననీయులు. యజ్ఞకర్మసంబంధముగలవాఁడు నధ్యయనముజేయించువాఁడు నగు గురుసుతుఁడు వయసునఁ దనకు సముఁడైనను బిన్నవాఁడైయున్నను గురునిపగిది సత్కారమున కర్హుఁడు. శరీరో

[1] చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్. ౧౬౯. నామోచ్చారణమేవాస్య పరోక్షమపి సుప్రత, న చైనమనుకుర్వీత గతిభాషణచేష్టితైః. ౧౭౦. పరీవాదస్తథా నిందా గురోర్యత్ర ప్రవర్తతే, కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః. ౧౭౧. పరీవాదాద్రాసభః స్యాచ్ఛ్వా సరమేయస్తు నిందకః, పరిభోక్తా కృమిర్భవతి కీటో భవతి మత్సరీ. ౧౭౨. దూరస్థో నార్చయేదేనం న క్రుద్ధో నాంతికే స్త్రియాః, యానాసనగతో రాజన్నవరుహ్యాభివాదయేత్. ౧౭౩. ప్రతికూలే సమానే తు నాసీత గురుణా సహ, అశృణ్వతి గురౌ రాజన్న కించిదపి కీర్తయేత్. ౧౭౪. గోఽశ్వోష్ట్రయానప్రాసాదప్రస్తరేషు కటేషు చ, ఆసీత గురుణా సార్ధం శిలాఫలకనౌషు చ. ౧౭౫. గురోర్గురౌ సన్నిహితే గురువద్వృత్తిమాచరేత్, గురుపుత్రేషు చార్యేషు గురోశ్చైవ స్వబంధుషు. ౧౭౬. బాలః సమానజన్మా వా విశిష్టో యజ్ఞకర్మణి, అధ్యాపయన్గురుసుతో

స్మర్దనము చేయుట స్నానము జేయించుట యుచ్ఛిష్టము భుజించుట కాళ్లు గడుగుట యనునవి గురుపుత్రులయెడ వర్జనీయములు. సవర్ణలగు గురుపత్నులు గురునివలెఁ బూజింపఁదగుదురు. అసవర్ణ లైనచో నభ్యుత్థానాభివాదనములు మాత్రమే యొనర్పనగును. గురుపత్నియెడ గూడ నభ్యంజనము స్నపనము గాత్రోన్మర్దనము కేశప్రసాధనమును వర్జనీయములు. గురుపత్ని యౌవనవతి యైనచోఁ బాదవందనము జేయరాదు. ఈనిషేధము గుణదోషాభిజ్ఞుఁడై యిరువదేండ్లు నిండినశిష్యునకు మాత్రమే యని యెఱుంగుము. ఆవయస్సున స్త్రీలకును బురుషులకును దూషణము ప్రకృతిసిద్ధమయి యున్నది గదా? బుద్ధిమంతులు మాత్ర మట్టియెడఁ బ్రమాదము నొందరు. లోకమున నవిద్వాంసుఁడైనను విద్వాంసుఁడైనను కామక్రోధాధీనుఁడగుపురుషు నున్మార్గమునకుఁ గొంపోవ నాఁడువాండ్రు చాలియుందురు. తల్లితోనైనను సోదరితోనైనను దుహితతోనైనను విజనప్రదేశమునఁ బురుషుఁడు గూర్చుండఁగాదు. ఎంత విద్వాంసునైనను బలవంతమగునింద్రియసమూహము లాగికొనిపోవును. రాజా! యువకుఁడగు శిష్యుఁడు గురుపత్నులగుయువతులకు యథావిధిగ నసావహమ్మనుచు నమస్కరింపవలయును. పూజ్యులగు సత్పురుషులధర్మమును స్మరించుచు ననుదినము గురుపత్నులకుఁ బాదోపసంగ్రహణాభివాదనము నాచరింపఁ

గురువన్మానమర్హతి. ౧౭౭. ఉత్సాదనమథాంగానాం స్నాపనోచ్ఛిష్టభోజనే, పాదయోర్నేజనం రాజన్గురుపుత్రేషు వర్జయేత్. ౧౭౮. గురువత్ప్రతిపూజ్యాస్తు సవర్ణా గురుయోషితః, అసవర్ణాస్తు సంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః. ౧౭౯. అభ్యంజనం చ స్నపనం గాత్రోత్సాదనమేవ చ, గురుపత్న్యా న కార్యాణి కేశానాం చ ప్రసాధనమ్. ౧౮౦. గురుపత్నీం తు యువతీం నాభివాదేత పాదయోః, పూర్ణవింశతివర్షేణ గుణదోషౌ విజానతా. ౧౮౧. స్వభావ ఏవ నారీణాం నరాణామిహ దూషణమ్, అతోర్థాన్న ప్రమాద్యంతి ప్రతిపాద్య విపశ్చితః. ౧౮౨. అవిద్వాంసమలం లోకే విద్వాంసమపి వా పునః, ప్రమదా హ్యుత్పథం నేతుం కామక్రోధవశానుగమ్. ౧౮౩. మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్, బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి. ౧౮౪. రాజేంద్ర గురుపత్నీనాం యువతీనాం యువా భువి, విధివద్వందనం కుర్యాదసావహమితి బ్రువన్. ౧౮౫. విప్రోఽస్య పాదగ్రహణమన్వహం చాభివాదనమ్, గురుదారేషు కుర్వీత సతాం ధర్మమనుస్మరన్. ౧౮౬. యథా ఖనన్ఖని

దగు. నూతిని ద్రవ్వువాఁడు నీరు వడయునట్లు గురుగతమగువిద్యను శుశ్రూషువగుశిష్యుఁడు పొందుచున్నాఁడు. బ్రహ్మచారి ముండితమస్తకుఁడైగాని శిఖ గలవాఁడుగా గాని జడదారిగాగాని యుండవలయును. మఱియు నీతఁడు సూర్యునుదయాస్తమయసమయంబుల నిద్రింపరాదు. అటు నిద్రించెనేని యొకదినముపవసించి సావిత్రిని నిష్ఠతో జపింపవలయును. ఇట్లు ప్రాయశ్చిత్తము చేసికొనకున్నచో నాతఁడు మహాపాతకము నొందును. సాయంప్రాతఃకాలముల నాచాంతుఁడై సావధానచిత్తుఁడై పరిశుద్ధప్రదేశమున విధివిధానంబుచొప్పున సావిత్రి నుపాసింపవలయును. స్త్రీశూద్రు లనుష్ఠించినది యైనను శ్రేష్ఠమైనచోఁ దా నది యనుష్ఠింపనగును. తనమనమునకు సంతోషమున్నచో నెద్దానినైన నాచరింపఁదగును. ధర్మార్థములు శ్రేష్ఠములని కొందఱును, కామార్థము లుత్తమములని కొందఱును, ధర్మమొక్కటియే ప్రశస్తమని మఱికొందఱును, నర్థమే ముఖ్యమని వేఱొకకొందఱును దలంచుచున్నారు. తా నార్తుఁడయ్యును తల్లిదండ్రులను సోదరుల నాచార్యుని నవమానింపరాదు. బ్రాహ్మణుఁ డిట్టియకార్యము నెన్నఁడు నాచరింపరాదు. ఆచార్యుఁడు బ్రహ్మస్వరూపుఁడు. తండ్రి ప్రజాపతిస్వరూపుఁడు. తల్లి యదితిస్వరూపము. సోదరుఁ డాత్మస్వరూపుఁడు. మనుష్యులయుత్పత్తివిషయమున

---

త్రేణ జలమాప్నోతి మానవః, తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి. ౧౮౬. ముణ్డో వా జటిలో వా స్యాదథ వా స్యాచ్ఛిఖీ జటీ, నైనం గ్రామేఽభినిమ్లోచేదర్కో నాభ్యుదియాత్క్వచిత్. ౧౮౭. తం చేదభ్యుదియాత్సూర్యః శయానం కామకారతః, నిమ్లోచేద్వాప్యవిజ్ఞానాజ్జపన్నుపవసేద్దినమ్. ౧౮౮. సూర్యేణ హ్యభినిర్ముక్తః శయానోఽభ్యుదితశ్చ యః, ప్రాయశ్చిత్తమకుర్వాణో యుక్తః స్యాన్మహతైనసా. ౧౮౯. ఉపస్పృశ్య మహారాజ ఉభే సంధ్యే సమాహితః, శుచౌ దేశే జపఞ్జప్యముపాసీత యథావిధి. ౧౯౦. యది స్త్రీ యద్యవరజః శ్రేయః కించిత్సమాచరేత్, తత్సర్వమాచరేద్యుక్తో యత్ర వా రమతే మనః. ౧౯౧. ధర్మార్థావుచ్యతే శ్రేయః కామార్థౌ ధర్మమేవ చ, అర్థ ఏవేహ వా శ్రేయస్త్రివర్గ ఇతి సంస్థితిః. ౧౯౨. పితా మాతా తథా భ్రాతా ఆచార్యాః కురునందన, నార్తేనాప్యవమంతవ్యా బ్రాహ్మణేన విశేషతః. ౧౯౩. ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాపతేః, మాతాప్యథాదితేర్మూర్తిర్భ్రాతా స్యాన్మూర్తిరాత్మనః. ౧౯౪. యన్మాతా పితరౌ క్లేశం సహేతే సంభవే

జననీజనకులు పడుక్లేశమునకు నూరువర్షములకైనను నిష్కృతి (ఋణ విముక్తి) జేసికొనఁజాలఁడు. మనుష్యుఁ డెల్లవేళలయందును దల్లిదండ్రులకు నాచార్యునకుఁ బ్రియము నాచరించుచుండవలయును. ఆముగురను దృప్తులఁజేయుటయే యాతని యనూనతపశ్చరణ మై యున్నది. వారి శుశ్రూషణమే యుత్తమోత్తమంబగుతపంబు. వారియనుజ్ఞ వడయక స్వతంత్రించి తానెట్టిధర్మము నాచరింపఁజనదు. వారు ముగ్గురును మూఁడులోకములు; మూఁడాశ్రమములు; మూఁడువేదములు త్రేతాగ్నులును వారే. అందు గార్హపత్యాగ్ని తల్లియు, దక్షిణాగ్ని తండ్రియు, నాహవనీయ మాచార్యుఁడు నై యుండిరి. అప్పుడు త్రేతాగ్నులకన్న నీత్రితయమే యుత్తమ మైనది. ఈముగ్గురను నిత్యమును సంతృప్తులఁజేయుగృహమేధి ముజ్జగంబులు గెలుచును. సశరీరుఁడై స్వర్గమునకేగి దేవతలఁగూడి సకలసౌఖ్యము లనుభవించును. పితృభక్తిచే నిహలోకమును మాతృభక్తిచే నంతరిక్షలోకమును గురుభక్తిచే స్వర్గలోకమును జెందఁగలుగుచున్నాఁడు. ఈముప్పుర నాదరించువాఁడు సర్వధర్మముల నాదరించినట్లు పరిగణింపఁబడుచున్నాఁడు. వీరినాదరింపక యెన్నిధర్మకార్యము లాచరించిన నవియన్నియు నిష్ఫలము లగును. ఈ ముగ్గురు జీవించియున్నంతవఱకు నితర కార్యసంబంధమువీడి వారిశుశ్రూష

---

నృణామ్, న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి. ౧౯౬. తయోర్నిత్యం ప్రియం కుర్యాదాచార్యస్య చ భారత, తేషు హి త్రిషు తుష్టేషు తపః సర్వం సమాప్యతే. ౧౯౭. తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే, న తైరనభ్యనుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్. ౧౯౮. త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవ చ త్రయో వేదాస్త ఏవోక్తాస్త్రయోఽగ్నయః. ౧౯౯. మాతా వై గార్హపత్యాగ్నిః పితా వై దక్షిణః స్మృతః, గురురాహవనీయశ్చ సాగ్నిత్రేతా గరీయసీ. ౨౦౦. త్రిషు తుష్టేషు చైతేషు త్రీంల్లోకాన్ జయతే గృహీ, దీప్యమానః స్వవపుషా దేవవద్దివి మోదతే. ౨౦౧. ఇమం లోకం పితృభక్త్యా మాతృభక్త్యా తు మధ్యమమ్, గురుశుశ్రూషయా చైవ గచ్ఛేచ్ఛక్రసలోకతామ్. ౨౦౨. సర్వే తేనాదృతా ధర్మా యస్యైతే త్రయ ఆదృతాః, అనాదృతాస్తు యేనైతే సర్వాస్తస్యాఫలాః క్రియాః. ౨౦౩. యావత్త్రయస్తే జీవేయుస్తావన్నాన్యత్సమాచరేత్, తేష్వేవ నిత్యం శుశ్రూషాం కుర్యాత్ప్రియహితే రతః. ౨౦౪. తేషామనుపరోధేన పార్థక్యం యద్య

యొనర్చుచు వారికిఁ బ్రియహితముల నొనర్చుచుండవలయును. వారి శుశ్రూషణమునకుఁ బ్రతిరోధము లేకుండఁ బరలోకప్రాప్తిసాధనము లగు సత్కర్మముల మనోవాక్కాయకర్మలచే నాచరించుచు నవ్విధంబు వారికి నివేదించుచుండవలయును. పురుషుఁడు జననీజనకులకును గురునకుఁ జేయఁదగినశుశ్రూషావిధానము సాంగముగా ముగిసినది. ఈధర్మ మత్యుత్తమము. ఇతరమగు నగ్నికార్యాదిధర్మ ముపధర్మమనియు నితరధర్మము జఘన్యములని చెప్పఁబడుచున్నవి శ్రద్ధాళువు తనకన్న పిన్నవానివద్దనుండియు విద్యాస్వీకారముఁ జేయనగును. అంత్యజునివలనను ధర్మము దెలియంగఁ దగును. సుగుణవతియైన యువతిని దుష్కులమునుండియైనను గ్రహింప వచ్చును. విషమునుండి అమృతమును గ్రహింపవచ్చును సుభాషితమయి నచో బాలునుండియయినను గ్రహింపవచ్చును. సత్ప్రవర్తనమును శత్రు నొద్దనైనను సంపాదించవచ్చును. కాంచనము నమేధ్యమునుండి యైనను తేవచ్చును. ఇట్లు స్త్రీ, రత్నము, నీతి, విద్య, శౌచము, ధర్మము, సుభాషితము, సద్వర్తనము, వివిధశిల్పములు ననువాని నెట్టివారలనుండి యైనను గ్రహింపఁజెల్లును. ఆపత్కాలముననే బ్రాహ్మణేతరునివలన విద్యాస్వీకారము చేయవలయును అధ్యయనము సేయునంతకాలము గురుశుశ్రూషానుసరణములు చేయవలయును ఉత్తమగతి నభిలషించు శిష్యుఁడు, అబ్రాహ్మణుఁడగుగురునింటఁగాని సాంగవేదాధ్యయనములేని బ్రాహ్మణగురునిగృహమునఁ గాని చిరకాలము నివసింపఁజనదు.అత్యుత్తమం బనుగతి నభిలషించుశిష్యుఁడు గురునిశరీరమోక్షపర్యంతము నాతని విడువక యతనినే సేవించుచు నాతనియింటనే యుండఁదగును. గురునిశరీరము

దాచరేత్, తత్తన్నివేదయేత్తేభ్యో మనోవచనకర్మభిః. ౨౦౫. త్రిష్వేతేష్వితి కృత్యం హి పురుషస్య సమాప్యతే, ఏష ధర్మః పరః సాక్షాదుపధర్మోఽన్య ఉచ్యతే. ౨౦౬. శ్రద్దధానః శుభాం విద్యామాదదీతావరాదపి, అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి. ౨౦౭. విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితమ్, అమిత్రాదపి సద్వృత్తమమేధ్యాదపి కాంచనమ్. ౨౦౮. స్త్రియో రత్నం నయో విద్యా ధర్మః శౌచం సుభాషితమ్, వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వశః. ౨౦౯. అబ్రాహ్మణాదధ్యయనమాపత్కాలే విధీయతే, అనువ్రజ్యా చ శుశ్రూషా యావదధ్యయనం గురోః. ౨౧౦. నాబ్రాహ్మణే గురౌ శిష్యో వాసమాత్యంతికం వసేత్, బ్రాహ్మణే చాననూచానే కాంక్షన్గతిమనుత్తమామ్. ౨౧౧. యది త్వాత్యంతికో వాసో రోచతే చ గురోః కులే,

సిద్ధినొందువఱకు నాతనిసేవించుశిష్యుఁడు జ్ఞానియై శాశ్వతంబగు బ్రహ్మ పథము జేరును. ధర్మవేత్త స్నాతకవ్రతమునకు మున్ను గురున కెట్టిఁయుప కృతిని చేయరాదు స్నాతకవ్రతానంతరము గురునియాజ్ఞచే శక్తికొలఁది నాతనికి గురుదక్షిణ సమర్పింపవలెను. క్షేత్రమును, బంగారమును,గోవును, గుఱ్ఱమును, గొడుగును, పాదుకలను, ధాన్యమును, వస్త్రములను, కూర గాయలను ననువీనిలో గురునకిష్టములగుపదార్థములఁ దీసికొనిరావలెను గురుండు పరమపదించినపిమ్మట గురుపుత్త్రుఁడుగాని, గురుపత్నిగాని, యాతనిదాయాదులుగాని, గురునిపగిది పూజింపఁదగుదురు. వీరెవరు లేకున్నచో నగ్నిసమీపముననే స్థానాసనవిహారములుగలిగి యగ్ని శుశ్రూష జేయుచు, నిజదేహమును సాధించుకొనవలయును. గురు శుశ్రూషణము చేయువాఁడు వీరులతో సమానముగా ఉత్తమలోకమును బొందుచున్నాఁడు. ఇట్లు బ్రహ్మచర్యము జరుపువిప్రుఁడు బ్రహ్మలోకము నొంది యాతనితో సంతతానంద మనుభవించుచున్నాఁడు. రాజేంద్రా! యిది బ్రహ్మచారి ధర్మము. ఇఁక గృహస్థధర్మము జెప్పెద. సావధాన చిత్తుండవై యాకర్ణింపుము. ఆయాఋతువుల నాచరింపఁదగినవ్రతముల నాచరించుచు వ్రతసంరక్షణము చేయువాఁడు బ్రహ్మసాయుజ్యము నందుచున్నాఁడు. వసంతఋతువునందు బ్రాహ్మణున కుపనయనసంస్కా-

---

యుక్తః పరిచరేదేనమాశరీరవిమోక్షణాత్. ౨౧౨. ఆసమాప్తేః శరీరస్య యస్తు శుశ్రూషతే గురుమ్, స గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణః సద్మ శాశ్వతమ్. ౨౧౩. న పూర్వం గురవే కించిదుపకుర్వీత ధర్మవిత్, స్నాస్యంస్తు గురుణాజ్ఞప్తః శక్త్యా గుర్వర్థ మాహరేత్. ౨౧౪. క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమేవ చ, ధాన్యం వాసాంసి శాకం వా గురవే ప్రీతమాహరేత్. ౨౧౫. స్వర్గతే గాం పరిత్యజ్య గురౌ భరతసత్తమ, గుణాన్వితే గురుసుతే గురుదారేఽథ వా నృప, సపిండే వా గురోశ్చాపి గురువద్వృత్తిమాచరేత్. ౨౧౬. ఏతేష్వవిద్యమానేషు స్థానాసనవిహారవాన్, ప్రయుంజానోఽగ్నిశుశ్రూషాం సాధయేద్దేహమాత్మనః, వీరస్య కుర్వంఛుశ్రూషాం యాతి వీరసలోకతామ్. ౨౧౭. చరత్యేవం హి యో విప్రో బ్రహ్మచర్యమవిప్లుతః, స గత్వా బ్రహ్మసదనం బ్రహ్మణా సహ మోదతే. ౨౧౮. ఇత్యేష కథితో ధర్మః ప్రథమం బ్రహ్మచారిణః, గృహస్థస్యాపి రాజేంద్ర శృణు ధర్మమశేషతః. ౨౧౯. కాలే ప్రాప్య వ్రతం విప్ర ఋతుయోగేన భారత, ప్రపాలయన్వ్రతం యాతి బ్రహ్మ సాలోక్యతాం విభో. ౨౨౦. సదోపనయనం శస్తం వసంతే బ్రాహ్మణస్య తు, క్షత్రి

రము చేయనగును. అట్టులే రాజన్యునకు గ్రీష్మకాలమునను, వైశ్యునకు శరత్కాలమున నుపనయనసంస్కార మాచరింపవలయునని మనువు వచించెను. బ్రహ్మచర్యవ్రతాచరణమునకు మూఁడుకాలము లిట్లు చెప్పఁబడినవి.

ఇది చతుర్థాధ్యాయము

## పంచమాధ్యాయము.

బ్రహ్మచర్యము నాశ్రయించి ముప్పదియారేండ్లు గురుకులమున వసించి వేదత్రయము నధ్యయనము జేయవలయును అట్లు కానిచోఁ బదునెనిమిదేండ్లుగాని తొమ్మిదేండ్లుగాని చేయవలయును. లేకున్న నెంతకాలమున నన్ని వేదము లభ్యసింపఁగలఁడో యంతవఱకును గురుకులవాసము జేయవలయును. మూఁడువేదముల నభ్యసింపలేకున్న రెండింటినిగాని యొక్కదానిని గాని యభ్యసింపవలయును. ఇట్లు వ్యసనదూరుఁడై బ్రహ్మచర్యవ్రతములు సలిపి పిదప గురునను జ్ఞచొప్పున గృహస్థాశ్రమము స్వీకరింపవలయును. ఇవ్విధమున నాచార్యజనకులయొద్ద వేదమును దాయమును గ్రహించి స్వధర్మముచేఁ బ్రసిద్ధుఁడగు విప్రుని గుసుమదామమున నలంకరించి యుత్తమతల్పమున నాసీనుంగావించి తొలుత గోవునిచ్చి పూజింపవలయును. ఆచార్యానుజ్ఞ వడసి యథాశాస్త్రము సమావర్తన మొనరించి బ్రాహ్మణుఁడు సౌభాగ్యాదిసులక్షణములు గలిగి సవర్ణసంభవ యగుకన్యను బాణిగ్రహణముఁ జేయవల

యస్య తతో గ్రీష్మే ప్రశస్తం మనురబ్రవీత్. ౨౨౧. ప్రాప్తే శరది వైశ్యస్య సదోపనయనం పరమ్, ఇత్యేవ త్రివిధః కాలః కథితో వ్రతయోజనే. ౨౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఉపనయనవిధివర్ణనం నామ
చతుర్థోఽధ్యాయః.

సుమంతురువాచ:—షట్త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్, తదర్థికం పాదికం వా గ్రహణాంతికమేవ చ. ౧. వేదానధీత్య వేదౌ వా వేదం వాపి నృపోత్తమ, అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్. ౨. తం ప్రతీతం స్వధర్మేణ బ్రహ్మదాయహరం పితుః, స్రగ్విణం తల్ప ఆసీనమర్హయేత్ప్రథమం గవా. ౩. గురుణా సమనుజ్ఞాతః సమావృత్తో యథావిధి, ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్.

యును. అన విని శతానీకుండు "మునీంద్రా! స్త్రీలక్షణము లెట్టివో యెఱుఁగఁజెప్పుము. ఎట్టిలక్షణములు గలవనిత నుద్వహించినఁ బురుషుఁడు సుఖము లనుభవింపఁగలుగును? అనుఁడు సుమంతుఁ డాతని కిట్లనియె:—రాజా! తొల్లి చతుర్ముఖుఁడు ఋషిగణపరివృతుఁడై యుండి వారందఱడుగ లోకమంగళము నపేక్షించి శుభాశుభఫలదాయకంబయి యుత్తమోత్తమంబగు స్త్రీలక్షణము నానతిచ్చి యున్నాఁడు. అద్దాని నెఱింగింతు నాకర్ణింపుము. స్త్రీలక్షణములు సాంగముగా నెఱుంగఁగలవు. ఓయీ! నీవిప్పుడు నన్న డిగినట్టులే మున్ను పితామహునికొలుఁపుకూటమున కేగి మహర్షులందఱు సాష్టాంగముగ నాతనికి నమస్కరించి సవినయముగఁ గేలు మొగిచి యోదేవా! లోకమునకు శ్రేయము గలిగింపఁజాలు స్త్రీజాతిలక్షణంబుల నానతిచ్చి మమ్ముఁ గృతార్థులం జేయవే! యని యడుగ వారలకోర్కి మన్నించి శతానందుఁ డిట్లనియె:—ద్విజసత్తములారా! నాయెఱింగింపఁబోవు స్త్రీలక్షణముల నేకాగ్రచిత్తులై యాకర్ణింపుఁడు మిట్టపల్లములు లేక సమానమగు నడుగుభాగము గలిగి యెఱ్ఱకలువలవలె నెఱ్ఱనగు చరణములు గలిగియుండుయువతి యుత్తమభోగము లనుభవించును. వక్రములును మాంసరహితములునై కఠినములై సగమునగము నరములతోఁ గూడియుండినపాదములు గల్గియున్నచో నాయువతి దారిద్ర్యమును దౌర్భాగ్యమును గలిగి

౪. శతానీక ఉవాచ:—లక్షణం ద్విజశార్దూల స్త్రీణాం వద మహామునే, కీదృగ్లక్షణ సంయుక్తా కన్యా స్యాత్సుఖదా నృప. ౫. సుమంతురువాచ:—యదుక్తం బ్రహ్మణా పూర్వం స్త్రీలక్షణముత్తమమ్, శ్రేయసే సర్వలోకానాం శుభాశుభఫలప్రదమ్. ౬. తత్తే వచ్మి మహాబాహో శృణుష్వైకమనా నృప, శ్రుతేన యేన జానీషే కన్యాం శోభనలక్షణామ్. ౭. సుఖాసీనం సురశ్రేష్ఠమభిగమ్య మహర్షయః, పప్రచ్ఛుర్లక్షణం స్త్రీణాం యత్పృష్టోఽహం త్వయాఽధునా. ౮. ప్రణమ్య శిరసా దేవమిదం వచనమబ్రువన్, భగవన్బ్రూహి నః సర్వం స్త్రీణాం లక్షణముత్తమమ్. ౯. శ్రేయసే సర్వలోకానాం శుభాశుభఫలప్రదమ్, ప్రశస్తామప్రశస్తాం చ జానీమో యేన కన్యకామ్. ౧౦. తేషాం తద్వచనం శ్రుత్వా విరించో వాక్యమబ్రవీత్, శృణుధ్వం ద్విజశార్దూలా వచ్మి యుష్మాస్వశేషతః. ౧౧. ప్రతిష్ఠితతలౌ సమ్యగ్రక్తాంభోజసమప్రభౌ, ఈదృశౌ చరణౌ ధన్యౌ యోషితాం భోగవర్ధనౌ. ౧౨. కరాలైరతినిర్మాంసైః రూక్షైరర్ధశిరాన్వితైః,

యుండును. వనితలకు నొకదానితో నింకొకటి కలసి వర్తులములును స్నిగ్ధములు (దట్టని మృదువైన) ను సూక్ష్మనఖసమన్వితములు నగువ్రేళ్లు రాణివాసము మహదైశ్వర్యమును గూర్చును. కురుచనగువ్రేళ్లు సుఖ జీవనమును గలిగించును కురుచనై సన్నముగనుండిన విత్తనాశము గలు గును. చాల గురుచవ్రేళ్లు దారిద్ర్యము నిచ్చును. విస్తారములైన యంగుళులు దాస్యము గలిగించును. ఒకదానిపై నింకొకటి యుండి హ్రస్వములై గుండ్రనివై కణుపులు గలిగియుండువ్రేళ్లు గలయువతులు భర్తలను జంపుదురు. దాస్యము గూడ సంపాదింతురు. ఎత్తుకణుపులు గల బొటనవ్రేళ్లు సన్నతాగ్రములై కోమలములగునంగుళులు గలిగియుండిన యువతికి మణులు బంగారమును లభించును. ఇందుకు వ్యతిరేకముగ నున్నచో విపత్తులు గలుగును. సన్ననిగోళ్లుగల స్త్రీ సౌభాగ్యవతి యగును. ఎఱ్ఱనిగోళ్లు గలిగిన ధనసమృద్ధి నడయును ఉన్నతము లగునఖ ములు గలిగియుండిన వనిత పుత్రవతి యగును. సూక్ష్మనఖములు గలిగిన లేమ రాజ్ఞియగును తెల్లనిగోళ్లును నల్లనిగోళ్లును బూడిదరంగుగోళ్లును గలిగియుండిన యువతులును పగిలినవియు గఠినములు నగునఖములు గలయువతులును ధనవిహీన లగుదురు పచ్చనిగోళ్లుగలిగిన దినరానివస్తు వులు తిందురు. స్నిగ్ధములై వర్తులములై సువ్యక్తమగునరములు గలచీల మండలు గలిగినవారు బందుగు లిచ్చినయందెల ధరింతురు. నరములు లేనివియు రెల్లుతో నెనయగు కాంతిగలిగి గుండ్రనివియు సూక్ష్మరోమ

---

దారిద్ర్యం దుర్భగత్వం చ ప్రాప్నువంతి న సంశయః. ౧౩. అంగుల్యః సంహతా వృత్తాః స్నిగ్ధాః సూక్ష్మనఖాస్తథా, కుర్వంత్యత్యంతమైశ్వర్యం రాజభావం చ యోషితః, ౧౪. హ్రస్వాః సుజీవితం హ్రస్వా విరలా విత్తహానయే, దారిద్ర్యం మూలమగ్నాసు ప్రేష్యం చ పృథులాసు చ. ౧౫. పరస్పరసమారూఢైస్తనుభిర్వృత్తపర్వభిః, బహూ నపి పతీన్హత్వా దాసీ భవతి వై ద్విజాః. ౧౬. అంగుష్ఠోన్నతపర్వాణస్తుంగాగ్రాః కోమలాన్వితాః, రత్నకాంచనలాభాయ విపరీతా విపత్తయే. ౧౭. సుభగత్వం నఖైః స్నిగ్ధైరాతామ్రైశ్చ ధనాఢ్యతా, పుత్రాః స్యురున్నతైరేభిః సుసూక్ష్మైశ్చాపి రాజతా. ౧౮. పాండురైః స్ఫుటితై రూక్షైర్నీలై ర్ధూమ్రైస్తథా ఖరైః, నిఃస్వతా భవతి స్త్రీణాం పీతైశ్చాభక్ష్యభక్షణమ్. ౧౯. గుల్ఫాః స్నిగ్ధాశ్చ వృత్తాశ్చ సమంగూఢశిరా స్తథా, యది స్యుర్నూపురాన్ దధ్యుర్బాంధవాద్యైః సమాప్నుయుః. ౨౦. అశిరాః

ములుగలవియు నగుపిక్కలు స్త్రీలకు సౌభాగ్యమును గజాశ్వాదియాన ములను గలిగించును. అధికరోమములు గలపిక్కలుండిన యువతి యాత్రాస్థత్యమూని చరించును. కాకిపిక్కలవంటి పిక్కలు గలిగిన భర్తృ ఘాతిని యగును. కపిలవర్ణములగు పిక్కలుగలిగియుండిన బహుభాషిణి యగును. మోకాలు పిల్లికివలెగాని సింగంబునకువలెగాని యున్నచో నాయువతి దీర్ఘసుమంగలియై సంపదలుగలిగి పుత్రవతి యగును. ఘట వర్ణములగు మోకాళ్లు గలిగినయువతి దేశసంచారముచేయును. నిర్మాం సములగుజానువులున్నచో జారిణియగును. మోకాట నరము లఘుకముగ నున్నచోఁ గ్రూరస్వభావము గలిగియుండును. విశ్లిష్టజానువులచే నిర్ధన యగును. మిగుల వంకరలై బిరుసై కొనలు పగిలి బెల్లపువన్నెగలిగి వివిధ ప్రదేశముల నుత్పన్నములయినరోమములు నట్టివే యగుకేశములు గల యువతి విషతుల్య యగును. పింగలవర్ణము గలనారి విషము వగిది పది దినములలో భర్తను చంపును. ఏనుఁగుతొండమువంటి తొడలుగలయు వతియు, అరఁటికంబములవంటి యూరువులుగలదియు నెల్లపుడు మదన సౌఖ్యమునందును. మాంసబద్ధములగునూరువులచే దౌర్భాగ్యమునందును అధికరోమములుగలిగి యూరువులచే బంధనములుగలది యైయుండును. సూక్ష్మమగునూరువులచే హాత్యాపరు రాలగును. రంధ్రములుగల యూరువులచే నసమర్థయై యుండును. సంధ్యాకాలము వర్ణముగలిగి సుందరములై సూక్ష్మరోమములుగలిగి విశాలములగు పిరుదులుగల

---

శరకాండాభాః సువృత్తాల్పతనూరుహాః, జంఘాః కుర్వంతి సౌభాగ్యం యానం చ గజవాజిభిః. ౨౧. క్లిశ్యతే రోమజంఘా స్త్రీ భ్రమత్యుద్ధతపిండికా, కాకజంఘా పతిం హంతి వాచాటా కపిలా చ యా. ౨౨. జానుభిశ్చైవ మార్జారసింహజాన్వనుకారిభిః, శ్రియమాప్య సుభాగ్యత్వం ప్రాప్నువంతి సుతాంస్తథా. ౨౩. ఘటాభైరధ్వగా నార్యో నిర్మాంసైః కులటాః స్త్రియః, శిరాలైరపి హింస్రాః స్యుర్విశ్లిష్టైర్ధనవర్జితాః. ౨౪. అత్యంతకుటిలై రూక్షైః స్ఫుటితాగ్రైర్గుడప్రభైః, అనేకజైస్తథా రోమైః కేశైశ్చాపి తథావిధైః. ౨౫. అత్యంతపింగలా నారీ విషతుల్యేతి నిశ్చితమ్, సప్తాహాభ్యంతరే పాపా పతిం హన్యాన్న సంశయః. ౨౬. హస్తిహస్తనిభైర్వృత్తై రంభాభైః కరభోపమైః, ప్రాప్నువంత్యూరుభిః శశ్వత్స్త్రియః సుఖమనంగజమ్. ౨౭. దౌర్భాగ్యం బద్ధమాంసైశ్చ బంధనం రోమశోరుభిః, తనుభిర్వధమిత్యాహుర్మధ్యచ్ఛిద్రైస్త్వనీశతా. ౨౮. సంధ్యా వర్ణం సమం చారు సూక్ష్మరోమాన్వితం పృథు, జఘనం శస్యతే స్త్రీణాం రతిసౌఖ్యకరం

యువతి రతిసౌఖ్యమునందును. రోమములు లేక సమమై సంగతమైన యోని యున్నచో నాయువతి నీచకులమునఁ బుట్టినను రాజపత్ని యగును. రావియాకునకు సమమై తాఁబేటి వీపువలె నున్నతమై చంద్రబింబనిభమై కలశాకారమైనభగము వనితల కత్యంత ప్రశస్తము. రతిసౌఖ్య, భాగ్యవర్ధకము లగుచున్నది. నూవుపూవువంటి భగము నగ్రమున డెక్కవలెనుండు భగమునుగలయువతులు దాస్యముచేయువారలై దరిద్రులగుదురు. భగము రోటివలెనున్న శోకమునందుదురు. వివృతముఖమైనచో శీఘ్రమరణము నొందుదురు. విరూపము దుర్గంధయుక్తము నిర్మాంసము నగుభగము గల స్త్రీలును, నల్లనిరోమములుగలయువతులును దుశ్శీలలై దౌర్భాగ్యము గాంతురు. వెలగపండువంటిముడుతలు లేని బలిసినపయోధరములు స్త్రీలకు ప్రశస్తములు ఇతరములు నింద్యములు. స్తనభారముచే నమ్రము రోమావళిచే రమ్యము చంచలవళిత్రయముచే సుందరము నగునడుము స్త్రీలకు శుభావహము. పణవమువలెను మృదంగమువలెను మధ్యభాగమున యవధాన్యముతో సమానమైన ముడతలుగలిగి యున్న స్త్రీలు భయమును, ప్రవాసమును, క్లేశమును, దురాచారము నొందుచున్నారు. వనితలపృష్ఠభాగము వంకరలేక నున్ననై యరోమ మైయున్న వివిధాస్తరణములను, నానావిధరతిసౌఖ్యములను గల్గించును. కురుచనిది, దొప్పవలెనున్నది, రోమములుగలది యగు ప్రష్ఠభాగము స్వప్నముననైన

---

ద్విజ. ౨౯. అరోమకో భగో యస్యాః సమః సుశ్లిష్టసంస్థితః, అపి నీచకులోత్పన్నా రాజపత్నీ భవత్యసౌ. ౩౦. అశ్వత్థపత్రసదృశః కూర్మపృష్ఠోన్నతస్తథా, శశిబింబనిభశ్చాపి తథైవ కలశాకృతిః, భగః శస్తతమః స్త్రీణాం రతిసౌభాగ్యవర్ధనః. ౩౧. తిలపుష్పనిభో యశ్చ యద్యగ్రే ఖురసంనిభః, ద్వావప్యేతౌ పరప్రేష్యం కుర్వాతే చ దరిద్రతామ్. ౩౨. ఉలూఖలనిభైః శోకం మరణం వివృతాననైః, విరూపైః పూతిసిర్మాంసైర్గజసంనిభరోమభిః, దౌఃశీల్యం దుర్భగత్వం చ దారిద్ర్యమధిగచ్ఛతి. ౩౩. కపిత్థఫలసంకాశః పీనో వలివివర్జితః, స్ఫీతః ప్రశస్యతే స్త్రీణాం నిందితశ్చాన్యథా ద్విజాః. ౩౪. పయోధరభరానమ్రప్రచలత్త్రివలీగురుః, మధ్యః శుభావహః స్త్రీణాం రోమారాజీవిభూషితః. ౩౫. పణవాభైర్మృదంగాభైస్తథా మధ్యే యవోపమైః, ప్రాప్నువంతి భయాంవాసక్లేశదౌఃశీల్యమీదృశైః. ౩౬. అవక్రానుల్బణం పృష్ఠమరోమశమగర్హితమ్, నానాస్తరణపర్యంకరతిసౌఖ్యకరం పరమ్. ౩౭. కుబ్జమద్రోణికం పృష్ఠం రోమశం

స్త్రీలకు సుఖము లేకుండ చేయును. అట్టి యువతులు భర్తృఘాతుక లగుదురు. విశాలములైనను, సుకుమారములు నగుకుక్షులచే బహుసంతానము వడయుదురు. మండూకకుక్షిగల స్త్రీరాజుని గాంచును. ఉన్నతములగు వళులు గలయువతి గోత్రాలగును. బాగుగా వర్తులములగువళులు గల యువతులు, జారిణులు, సన్యాసినులు నగుదురు. రొమ్ము పల్లముగల యువతి నీచురాలగును. మిట్టపల్లములు గలవనిత వ్యతిరేకి యగును. రొమ్ము త్తెగ రోమ్ముగలిగిన నుత్తమురాలగును. సమముగనున్న నాయు రైశ్వర్యములు గలిగియుండును. వర్తులములు, పీనములు, నాత్యున్నతములు, దీర్ఘములు నగు స్తనములు యువతులకు ప్రశస్తములు. విపరీతములగు స్తనములు దుఃఖహేతువు లగుచున్నవి. మొదటి కాన్పున నేయువతి వామపయోధర మున్నతముగ నుండునో యామె కన్యను ప్రసవించును. దక్షిణకుచ మున్నతమైనచో నావనిత పురుషుని ప్రసవించును. దీర్ఘములయిన కుచాగ్రములు గలయువతి ధూర్తయై మైథున ప్రియురాలగును. వర్తులములగుకుచాగ్రములు గలవనిత సర్వకాలముల పురుషుల ద్వేషించును పాముపడగవలెను, కుక్కనాలుకవలెను నేయువతి పయోధరములుండునో యామె పురుషచేష్టలు గలదిగాను, దరిద్రురాలు నగును. సమము, మాంసలము, సుందరము, నిరోమము నగువక్షము గల యువతి యిష్టభోగముల ననుభవించును. వక్షము వంకరయైనయువతి

---

యది యోషితః, స్వప్నాంతరే సుఖం తస్యా నాస్తి హన్యాత్పతిం చ సా. ౩౮. విపులైః సుకుమారైశ్చ కుక్షిభిః సుబహుప్రజాః, మండూకకుక్షిర్యా నారీ రాజానం సా ప్రసూయతే. ౩౯. ఉన్నతైర్వలిభిర్వంధ్యాః సువృత్తైః కులటాః స్త్రియః, జారకర్మ రతాస్తాః స్యుః ప్రవ్రజ్యాం చ సమాప్నుయుః. ౪౦. ఉన్నతా చ నతైః క్షుద్రా విషమైర్విషమాశయా, ఆయురైశ్వర్యసంపన్నా వనితా హృదయైః సమైః. ౪౧. సువృత్తమున్నతం పీనమదూరోన్నతమాయతమ్, స్తనయుగ్మమిదం శస్తమతోఽన్యద సుఖావహమ్. ౪౨. ఉన్నతిః ప్రథమే గర్భే ద్వయోరేకస్య భూయసీ, వామే తు జాయతే కన్యా దక్షిణే తు భవేత్సుతః. ౪౩. దీర్ఘే తు చూచుకే యస్యాః సా స్త్రీ ధూర్తా రతిప్రియా, సువృత్తే తు పునర్యస్యా ద్వేష్టి సా పురుషం సదా. ౪౪. స్తనైః సర్పఫణాకారైః శ్వజిహ్వాకృతిభిస్తథా, దారిద్ర్యమధిగచ్ఛంతి స్త్రియః పురుషచేష్టితాః, అవష్టబ్ధఘటీతుల్యా భవంతి హి తథా ద్విజాః. ౪౫. సుసమం మాంసలం చారు శిరో

క్రూరయగును. రోమములున్న దుస్స్వభావముగలది యగును. మాంస మేమియు లేకున్న విధవ యగును. విశాలముగనున్న కలహప్రియ యగును. ఏయువతి కరమున గంభీరాకారములును స్నిగ్ధములు నగు నాల్గు రేఖలుండునో యామె సుఖము ననుభవించును. విచ్ఛిన్నములగు రేఖలచే నసమర్థ యగును. ఏయువతికరమున రేఖ చిటికినివ్రేలి మొదటినుండి చూపుడువ్రేలివరకు నుండునో యావె నూరేండ్లు జీవించును. అట్లా రేఖస్థితినిబట్టి ఆయువతిసంగతి తెలియనగును. వృత్తములు, సమములు, కణుపులుగలదియు, తీక్ష్ణములగుకొనలుగలవియు మృదువగు చర్మముగలవియు నగునంగుళులు గలయువతి భోగవర్ధని యగును. మంకెనపూవుచందమున నరుణములగు నఖములుగలస్త్రీ యైశ్వర్యవంతురాలగును. తీక్ష్ణములు, వక్రములు, వివర్ణములు తెల్లనివి పచ్చనివియు నగునఖములచే ననాథ యగుచున్నది. ఛిద్రములేనివియు రక్తములును మృదువులు నగునంగుళులు గలప్రమదలు సర్వసంపదలఁ దులఁదూఁగుచున్నారు. పొక్కులుగలిగి నిమ్నోన్నతములై కఠినములగుహస్తములు గలయువతులు క్లేశభాగిను లగుచున్నారు. బొటనవ్రేలికణుపులందు యవాకారమైన సమరేఖగలయువతులు సౌఖ్యమును, నపరిమితమైన ధనధాన్యములు గలిగియుందురు. మణికట్టు నవిచ్ఛిన్నములుగాని మూఁడు రేఖలుండిన నయ్యది యువతుల కాయురైశ్వర్యముల నొసంగును.

---

రోమవివర్జితమ్, వక్షో యస్యా భవేన్నార్యా భోగాన్భుక్తే యథేప్సితాన్. ౪౬. హింస్రా భవతి వక్రేణ దౌఃశీల్యం రోమశేన తు, నిర్మాంసేన తు వైధవ్యం విస్తీర్ణే కలహప్రియా. ౪౭. చతస్రో రక్తగంభీరా రేఖాః స్నిగ్ధాః కరే స్త్రియాః, యది స్యుః సుఖమాప్నోతి విచ్ఛిన్నాభిరనీశతా. ౪౮. రేఖాః కనిష్ఠికామూలాద్యస్యాః ప్రాప్తాః ప్రదేశినీమ్, శతమాయుర్భవేత్తస్యాస్త్రియాణామున్నతే క్రమాత్. ౪౯. సంవృత్తాః సమపర్వాణస్తీక్ష్ణాగ్రాః కోమలత్వచః, సమా హ్యంగులయో యస్యాః సా నారీ భోగవర్ధినీ. ౫౦. బంధుజీవారుణైస్తుంగైర్నఖైరైశ్వర్యమాప్నుయాత్, ఖరైర్వక్రైర్వివర్ణాభైః శ్వేతపీతైరనీశతా. ౫౧. రక్తైర్మృదుభిరైశ్వర్యం సచ్ఛిద్రాంగులిభిర్ద్విజాః, స్ఫుటితైర్విషమైరూక్షైః, క్లేశం పాణిభిరాప్నుయుః. ౫౨. సమరేఖా యవా యాసామంగుష్ఠాంగులిపర్వసు, తాసాం హి విపులం సౌఖ్యం ధనం ధాన్యం తథాఽక్షయమ్. ౫౩. మణిబంధో ఽవ్యవచ్ఛిన్నో రేఖాత్రయవిభూషితః, దదాతి న చిరాదేవ భోగ్యమాయుస్తథా

శ్రీవత్సము, ధ్వజము, పద్మము, సూర్యబింబము, గజము, నశ్వము, చక్రము, స్వస్తికము, వజ్రము, ఖడ్గము, నంకుశము, పూర్ణకుంభము, ప్రాసాదము, ఛత్రము, ముకుటము (కిరీటము) హారము, కేయూరములు (కంకణములు), కుండలములు, శంఖము, తోరణము నిర్యూహము ననువానియాకృతులు గలరేఖలు హస్తములయందుండినచోఁ బ్రమదలు రాజపత్నులగుదురు. ఎట్టినియూపస్తంభములును కుండికలును హస్తముల గాని పాదములగాని గలుగుయువతులు యజ్ఞదీక్షితులకుఁ బత్నులగు దురు. వీథ్యాపణతులాకారములైన రేఖలు గలవనితలు రత్నములును బంగారమును గలవణిజులకుఁ బత్నులగుదురు. కొడవలి, పలుపు, కాడి, ఫలము, రోలు, నాఁగలి యనువానియాకృతిగల రేఖలతో విరాజిల్లు నంగనలు ధనధాన్యాఢ్యులగు కృషీవలులపత్నులగుచున్నారు. అనున్న తములగు నాడులసంధులుగలిగి పీనము లోమశూన్యమునై గోపుచ్ఛా కృతి గలిగియుండు భుజయుగళము స్త్రీలకు శుభకరమగును. రోమములు లేక నిగూఢములగుగ్రంథులు గలిగియుండు మోచేతులును సుందర ములు నాతిస్థూలములును వర్తులములును గోమలములు నున్నతావన తములు నరోమశములు నగుబాహువులు వనితలకు శుభదాయకములు, సుఖదాయకములును నగును. సౌభాగ్యారోగ్యములఁగూడఁ బెంపొందించును. వనితలకు మూపులు స్థూలములగుచో భారవహములగును.

---

క్షయమ్. ౫౪. శ్రీవత్సధ్వజపద్మాక్షగజవాజినివేశనైః, చక్రస్వస్తికవజ్రాసిపూర్ణకుంభ నిభాంకుశైః. ౫౫. ప్రాసాదచ్ఛత్రముకుటైర్హారకేయూరకుండలైః, శంఖతోరణ నిర్యూహైర్హస్తస్థైర్నృపస్త్రియః. ౫౬. యస్యాః పాణితలే రక్తా యూపకుంభాశ్చ కుండికాః, దృశ్యంతే చరణే యస్యా యజ్ఞపత్నీ భవత్యసౌ. ౫౭. వీథ్యాపణతులా మానైస్తథా ముద్రాదిభిః స్త్రియః, భవంతి వణిజాం పత్న్యో రత్నకాంచనశాలి నామ్. ౫౮. దాత్రయోక్త్రయుగాబంధఫలోలూఖలలాంగలైః, భవంతి ధనధాన్యాఢ్యాః కృషీవలజనాంగనాః. ౫౯. అనున్నతశిరాసంధి పీనం రోమవివర్జితమ్, గోపుచ్ఛాకృతి నారీణాం భుజయోర్యుగలం శుభమ్. ౬౦. నిగూఢగ్రంథయో యస్యాః కూర్పరౌ రోమవర్జితౌ, బాహూ వై లలితౌ యస్యాః ప్రశస్తౌ వృత్తకోమలౌ. ౬౧. ఉన్నతావనతౌ చైవ నాతిస్థూలౌ న రోమశౌ, సుఖదౌ తు సదా స్త్రీణాం సౌభాగ్యారోగ్య వర్ధనౌ. ౬౨. స్థూలే స్కంధే వహేద్భారం రోమశే వ్యాధితా భవేత్, వక్రస్కంధే

స్కంధముల యధోభాగము రోమబహుళమైనచో వ్యాధిపీడిత యగును. మూఁపులు వక్రము లయినచో గొడ్రాలగును. ఉన్నతాననముగలయువతి కులట యగును. చతురంగుళపరిమాణమై స్పష్టములగుమూఁడు రేఖలఁ గంఠమున దాల్చువనిత మణికనక ముక్తామయము లగుభూషణములఁ దాల్చును. కృశించిన కంఠముగలవనిత నిర్ధనురాలగును. నిడుపు మెడగలది బంధకిని యగును. కురుచ మెడగల్గిన మృతాపత్యయు లావు మెడగలిగిన దుఃఖితయు నగును. ఏయువతి ముచ్చిలిగుంట (కంఠము వెనుకభాగము) యున్నతముగాక మాంసలమై సమముగనుండు నాపె దీర్ఘాయువై సుమంగలి యగును. నిర్మాంసము, బహుమాంసము, నాడీబహుళము, రోమశము, గుటిలము, వికటము, విస్తృతము నగు ముచ్చిలిగుంట యువతులకుఁ బ్రశస్తముగాదు. నాతిస్థూలము, నాతికృశము, నవక్రము, నరోమము నగు దౌడ (చెంప) స్త్రీలకు శుభకరము. విపరీతము విపరీతమే. స్త్రీవదనము నాల్గుపలకలుగ నున్నయెడల నామె ధూర్త యగును. గుండ్రముగ నున్న మంగళప్రదురా లగును. గుఱ్ఱపుమోరగలయువతి యనపత్య యగును. విశాలముఖి దౌర్భాగ్యము గలిగియుండును. కుక్కవలెగాని, తోఁడేలువలెగాని, పందివలెగాని, గుడ్లగూబవలెగాని, మర్కటమువలెగాని మోముండినఁ గ్రూరస్వభావముగలవారై పాపకర్మలు చేయుదురు. సంతానవిహీనలై బంధువులు గూడ లేనివారై యుందురు. మాలతీకుసుమము, పొగడపుష్పము, పద్మము, నీలోత్పలములవలె

---

భవేద్వంధ్యా కులటా చోన్నతాననే. ౬౩. స్పష్టం రేఖాత్రయం యస్యా గ్రీవాయాం చతురంగుళమ్, మణికాంచనముక్తాఢ్యం సా దధాతి విభూషణమ్. ౬౪. అధనా స్త్రీ కృశగ్రీవా దీర్ఘగ్రీవా చ బంధకీ, హ్రస్వగ్రీవా మృతాపత్యా స్థూలగ్రీవా చ దుఃఖితా. ౬౫. అనున్నతా సమాంసా చ సమా యస్యాః కృకాటికా, సుదీర్ఘమాయు స్తస్యాస్తు చిరం భర్తా చ జీవతి. ౬౬. నిర్మాంసా బహుమాంసా చ శిరాలా రోమశా తథా, కుటిలా వికటా చైవ విస్తీర్ణా న చ శస్యతే. ౬౭. న స్థూలో న కృశోఽత్యర్థం న వక్రో న చ రోమశః, హనురేవంవిధః శ్రేయాం స్తతోఽన్యో న ప్రశస్యతే. ౬౮. చతురస్రముఖీ ధూర్తా మండలాస్యా శివా భవేత్, అప్రజా వాజివక్త్రా స్త్రీ మహావక్త్రా చ దుర్భగా. ౬౯. శ్వవరాహవృకోలూకమర్కటాస్యాశ్చ యాః స్త్రియః, క్రూరాస్తాః పాపకర్మిణ్యః ప్రజాబాంధవవర్జితాః. ౭౦. మాలతీవకులాంభోజనీలోత్పలసుగంధి

సుగంధమగు వనితావదన మెల్లప్పుడుఁ బానభోజనతాంబూలసేవనాసక్త మయి యుండును. తామ్రవర్ణముగలిగి యీషత్స్పర్శగలదై నాతిస్థూల కృశమయి యున్నతమగు నధరోష్ఠము వనితల కెల్లకాలము సుఖభోగ ములు గలిగించును. అధరము స్థూలమగుచోఁ గలహప్రియ యగును. వెలతెలగానున్న దుఃఖిత యగును పైపెదవి తీక్ష్ణముగ నున్నచో వనితకుఁ గోపము మెండు. మిగులఁ బలుచనై వంకరగలిగి పొడవై యెఱ్ఱని దగునాలుక స్త్రీకిఁ బ్రశస్తమయినది. స్థూలము, హ్రస్వము, వివర్ణము, వక్రము, ఖిన్నము నగునాలుకగలయువతి నింద్య యగును. నాత్యున్నతములు స్నిగ్ధములు సందులు లేనివియునై శంఖకుందేందుల వడువున ధవళములగు దంతములు గలయువతులు మిష్టాన్నంబు భుజింతురు. సూక్ష్మములు నత్యంతకృశములును హ్రస్వములు, స్ఫుటి తములు, విరళములు, రూక్షములు నగుదంతములు గలయువతి దుఃఖము నొందును. వికటములగు దంతములు గలవనిత కోపశీల యగును. స్వచ్ఛ మగుదర్పణంబు చందంబునను, జంద్రబింబంబు పోల్కినుండువదనము స్త్రీల కభీష్టఫలము లొసంగును. అస్థూలము నకృశము వక్రము నాతిదీర్ఘము నున్నతము నగునాసిక గలవనిత ధన్యురాలును శుభకరియు నగును. ఉన్నతము మృదులము శుద్ధము నసంగతము నగురేఖగలదియు సూక్ష్మము వక్రసమము నగు కనుబొమ స్త్రీలకు సుఖావహము. వింటి

---

యత్, వదనం ముచ్యతే నైతత్పానతాంబూలభోజనైః. ౨౧. తామ్రాభః కించిదా లంభః స్థౌల్యకార్శ్యవివర్జితః, అధరో యది తుంగశ్చ నారీణాం భోగదః సదా. ౨౨. స్థూలే కలహశీలా స్యాద్వివర్ణే చాతిదుఃఖితా, ఉత్తరోష్ఠేన తీక్ష్ణేన వనితా చాతి కోపనా. ౨౩. జిహ్వా తనుతరా వక్రా తామ్రా దీర్ఘా చ శస్యతే, స్థూలా హ్రస్వా వివర్ణా యా వక్రా భిన్నా చ నిందితా. ౨౪. శంఖకుందేందుధవలైః స్నిగ్ధైస్తుంగైరసం ధిభిః, మిష్టాన్నపానమాప్నోతి దంతైరేభిరనున్నతైః. ౨౫. సూక్ష్మైరతికృశైర్హ్రస్వైః స్ఫుటితైర్విరలైస్తథా, రూక్షైశ్చదుఃఖితా నిత్యం వికటైర్భామినీ భవేత్. ౨౬. సుమృష్ట దర్పణాంభోజపూర్ణబింబేందుసంనిభమ్, వదనం వరనారీణామభీష్టఫలదం స్మృతమ్. ౨౭. న స్థూలా న కృశా వక్రా నాతిదీర్ఘా సమున్నతా, ఈదృశీ నాసికా యస్యాః సా ధన్యా తు శుభంకరీ. ౨౮. ఉన్నతా మృదులా యా చ రేఖా శుద్ధా న సంగతా, భ్రూర్వక్రతుల్యా సూక్ష్మా చ యోషితాం సా సుఖావహా. ౨౯. ధనుస్తుల్యాభిః సౌభాగ్యం

కైనయగుకనుబొమచే సౌభాగ్యము గలుగును. దీర్ఘరోమములచే వంధ్య యగును. పింగళములు హ్రస్వములు నసంగతములు నగురోమములు దారిద్ర్యకారణములై యున్నవి. నల్లకలువలవలె నల్లగాను నీషద్రక్తముగా నుండుకనురెప్పలు గలనేత్రములతో విరాజిల్లువనిత సౌభాగ్య భాగిని యగును. కాటుకపిట్టలవంటి కన్నులు గలిగి యున్నవరాంగన లెచ్చట జన్మించినను మహాభోగముల ననుభవింత్రు. వరాహాక్షియు నేణాక్షియు నగుయువతి గూడ నిట్టులే యని యెఱుంగుము. మధువువిధమునఁ బింగళములై యగంభీరములై యసంశ్లిష్టములై వివిధరేఖాలంకృతము లగునేత్రములు గలయువతి రాజపత్ని యగును. సుందరములై యకలుషములై దీర్ఘాపాంగములుగలిగి వాయసాకృతు లగునేత్రములు గలవనిత లైశ్వర్యకారణభూత లగుదురు. స్త్రీలనేత్రములు గంభీరములు (లోఁతైనవి) పింగళవర్ణములు నైనచో నాయువతులు చిరాయువులయి బహుదుఃఖము ననుభవింతురు. ఉన్నతాక్షి యగుయువతి వయోమధ్యముననే ప్రాణములఁ బాయును. రక్తాక్షియు విషమాక్షియు ధూమ్రాక్షియుఁ బ్రేతలోచనయు శునకనేత్రయు నగువనిత దూరమున విడువఁదగినది. ఉద్భ్రాంతములు తీక్ష్ణములు చిత్రములు నగునయనములతోఁ గూడియుండు నారీమణులు మద్యమాంసప్రియలై చపల లగుదురు. కరాళాకారముగలిగి దూరశబ్దము గ్రహించు యువతీకర్ణపుటములు దివ్యతేజోవిరాజితంబు లగుమణిహేమభూషణములు ధరించును. గాడిద

---

వంధ్యా స్యాద్దీర్ఘరోమభిః, పింగలాసంగతా హ్రస్వా దారిద్ర్యాయ న సంశయః. ౨౦. నీలోత్పలదలప్రఖ్యైరాతామ్రైశ్చారుపక్ష్మభిః, వనితా నయనై రేభిర్భోగసౌభాగ్యభాగినీ. ౨౧. ఖఞ్జనాక్షీ మృగాక్షీ చ వరాహాక్షీ వరాంగనా, యత్ర యత్ర సముత్పన్నా మహాంతం భోగమశ్నుతే. ౨౨. అగంభీరై రసంశ్లిష్టైర్బహురేఖావిభూషితైః, రాజపత్న్యో భవంతీహ నయనైర్మధుపింగలైః. ౨౩. వాయసాకృతినేత్రాణి దీర్ఘాపాంగాని యోషితామ్, అనావిలాని చారూణి భవంతి హి విభూతయే. ౨౪. గంభీరైః పింగలైశ్చైవ దుఃఖితాః స్యుశ్చిరాయుషః, వయోమధ్యే త్యజేత్ప్రాణానున్నతాక్షీ తు యాంగనా. ౨౫. రక్తాక్షీ విషమాక్షీ చ ధూమ్రాక్షీ ప్రేతలోచనా, వర్జనీయా సదా నారీ శ్వనేత్రా చైవ దూరతః. ౨౬. ఉద్భ్రాంతకైః కరైశ్చిత్రైర్నయనైస్త్వంగనా స్త్రీహ, మద్యమాంసప్రియా నిత్యం చపలాశ్చైవ సర్వతః. ౨౭. కరాలాకృతయః కర్ణా నభః శబ్దాస్తు సంస్థితాః, వహంతి వికసత్కాంతి హేమరత్నవిభూషణమ్. ౨౮.

చెవులవలెగాని యొంటెచెవులవలెగాని ముంగిచెవులవడువునగాని గుడ్లగూబచెవులవలెగాని చెవులుండినను గపిలవర్ణముగల కర్ణములుండినను యువతులు బహుదుఃఖము లనుభవింతురు. తరుచుగ సన్న్యాసమునే గ్రహింప గలరు. అంతటను గొంచెము తెల్లని రంగు గలిగి బాగుగా పర్వము లేర్పడియున్న చెక్కిండ్లుగలవనిత ప్రశస్తయైనది. రోమకూపములతో నిండియున్నచో నిందింపఁ దగియుండును. వరాంగనలఫాలము (నొసలు) నీరోమమై యర్ధచంద్రు నాకారముగలిగి విశాలమై మనోహరమయియున్న నాయువతి భోగారోగ్యములు గలిగియుండును. స్త్రీలతల కట్టు వైశాల్యమున లలాటముకన్న రెండింతలు గలిగియున్నఁ బ్రశస్తమగును. అట్లుగాక యేనుంగుతలవలె నున్నచో నధన్య యగును. సూక్ష్ములయి నల్లనివియు నై మృదువులై దట్టమై కుంచవలె నుండుకొనలుగలిగిన శిరోరుహములు స్త్రీలకు శ్రేయోదాయకములు. వ్యతిరిక్తములు క్లేశశోకములు గలిగించును. నారీమణులకంఠస్వనము హంసధ్వనివలెను కోయిల కంఠధ్వనివలెను నెమిలికూతవలెను తుమ్మెదలసంగీతమువలె నుండవలయును. మరియు వేణు (పిల్లనగ్రోవి) వీణాస్వనములు గలిగియుండవలయును. అట్టివారలు బహుభోగముల ననుభవించుచు నధిపురాంద్రగుదురు. బ్రద్దలైన కంచుమ్రోత కెనయగు కంఠధ్వనిగలదియు ఖగవాయస సమధ్వనిగలదియు వ్యాధిని భయమును శోకమును దారిద్ర్యమును బొందును. హంసగోవృషభచక్రవాకమత్తమాతంగగమనముల కెనయగు

---

ఖరోష్ట్రనకులోలూకకపిలశ్రవణాః స్త్రియః, ప్రాప్నువంతి మహద్దుఃఖం ప్రాయశః ప్రవ్రజంతి చ. ౮౯. ఈషదాపాండుగండా యా సువృత్తా పర్వణి త్విహ, ప్రశస్తా నిందితా త్వన్యా రోమకూపకదూషితా. ౯౦. అర్ధేందుప్రతిమాభోగమరోమ తు సమాహితమ్, భోగారోగ్యకరం శ్రేష్ఠం లలాటం వరయోషితామ్. ౯౧. ద్విగుణం పరిణాహేన లలాటం విహితం చ యత్, శిరః ప్రశస్తం నారీణామధన్యా హస్తిమస్తకా. ౯౨. సూక్ష్మాః కృష్ణా మృదుస్నిగ్ధాః కుఞ్చితాగ్రాః శిరోరుహాః, భవంతి శ్రేయసే స్త్రీణామన్యే స్యుః క్లేశశోకదాః. ౯౩. హంసకోకిలవీణాలిశిఖివేణుస్వరాః స్త్రియః, ప్రాప్నువంతి బహూన్భోగాన్భృత్యానాజ్ఞాపయంతి చ. ౯౪. భిన్నకాంస్యస్వరా నారీ ఖరకాకస్వరా చ యా, రోగం వ్యాధిం భయం శోకం దారిద్ర్యం చాధిగచ్ఛతి. ౯౫. హంసగోవృషచక్రాహ్వమత్తమాతంగగామినీ, స్వకులం ద్యోతయేన్నారీ మహిషీ పార్థి

గమనముగలిగిన వనితామతల్లులు నిజకులము వెలయింతురు. రాజునకుఁ బట్టపుదేవు లగుదురు. కాకజంబుకశునకాదుల కైనయగు గమనముగల వనిత నింద్యయు మృగగమనదాసియు శీఘ్రగామిని బంధకినియు నగు చున్నది. ప్రేంఖణపువన్నెయు గోరోచనవర్ణమును బంగారురంగును గుంకుమప్రభయును యువతులకు శుభదాయకము. దూర్వాంకురవర్ణమును బ్రశస్తమైనదియే అత్యంతస్వేదజనకములుగాక మృదువులగు రోమములును పరిమళగాత్రములు నగు యువతులు పూజింపఁబడు చున్నారు. కపిలవర్ణముగలకన్యను బరిగ్రహింపరాదు. అధికాంగములు గలిగినఁగాని న్యూనాంగములుఁ గలిగినగాని,రోగవతియైనఁగాని,రోమము లేమియు లేనిదానినిగాని, యధికముగ నున్నదానినిగాని, మిక్కిలి కురుచైనగాని, బహుభాషిణినిగాని పింగళవర్ణము గలదానినిగాని, నదీ వృక్షనక్షత్రపర్వతాదులనామము గలదానినిగాని, పక్షిసర్పదాస్యాది నామము గలదానినిగాని, భయంకరనామముగలదానినిగాని పెండ్లాడఁ గూడదు. సర్వాంగసౌష్ఠవముగలదియు సౌమ్యమగునామముగలదియు హంసగజ గమనయు సూక్ష్మరోమకేశములును సూక్ష్మదంతములును గలదియు సుకుమారగాత్రియు నగునంగనను బరిణయమాడవలయును. హీనక్రియ లాచరించుచుఁ బురుషశూన్యమై వేదాధ్యయనవిరహితమై యధికరోమములుగలిగి యర్శోరోగదూషితమై క్షయరోగములకు మూలకందమై యపస్మారబహుళమై కుష్ఠశ్వేతాది మహావ్యాధులకుఁ బుట్టినిల్లై యింక నసంఖ్యాకములగు రోగములకు నిదానమగువంశము

వస్య చ. ౯౬. శ్వసృగాలగతిర్నింద్యా యా చ వాయసవద్వ్రజేత్, దాసీ మృగగతిర్నారీ ద్రుతగామీ చ బంధకీ. ౯౭. ఫలినీరోచనా హేమకుంకుమప్రభ ఏవ చ వర్ణః శుభకరః స్త్రీణాం యశ్చ దూర్వాంకురోపమః. ౯౮. మృదూని మృదురోమాణి నాత్యంతస్వేదకాని చ, సురభీణి చ గాత్రాణి యాసాం తాః పూజితాః స్త్రియః. ౯౯. నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్, నాలోమికాం నాతిహ్రస్వాం న వాచాటాం నపింగలామ్. ౧౦౦. నర్క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికామ్ న పక్ష్యహిప్రేష్యనామ్నీం న చ భీషణనామికామ్. ౧౦౧. అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీమ్, తనులోమకేశదశనాం మృద్వంగీముద్వహేత్స్త్రియమ్

నను౯ జెందినయువతి మహాధనధాన్యాదులు లంభిపనున్నను బరిగ్రహింప రాదు. పూర్వులగుమునీంద్రులు శరీరమును దశవిధములుగా విభజించిరి. అందు౯ జీలమండలతోఁ గూడినపాదములు ప్రథమభాగమును మోకాటి చిప్పలతోఁ గూడినపిక్కలు రెండవభాగమును మేఢ్రగుహ్యములు మూఁడవభాగమును నాభికటిప్రదేశములు నాలుగవభాగము నుదర మైదవదియు హృదయస్తనము లారవదియును భుజములు బాహుమూలములు నేడవభాగమును కంధరోష్ఠము లెనిమిదవభాగమును కనుబొమ్మలతోఁ గూడిననేత్రములుతొమ్మిదవభాగమును లలాటశిరస్సులు పదియవభాగంబులై యున్నవి. ఈస్థానములన్నియు నశుభలక్షణవిశిష్టములయినచో, దశాఫల మశుభమును శుభలక్షణములు గలిగియున్నచో శుభఫలమును గలుగును. ఈయుదంతమును మున్ను శచీలగ్నచిత్తుఁ డగునింద్రుఁడు బృహస్పతి నడుగ నాతఁ డాతనికి సవిశేషముగ నెఱింగించియుండెను. ఓబ్రాహ్మణోత్తములారా! నావలననే పురుషధర్మములుగూడ వినుఁడు. ఇపుఁడు మీరు వినియుండినలక్షణము లన్నియుఁ గలిగి సద్వర్తనముగల కన్యను వివాహమాడవలెను. ఈలక్షణములకన్న సద్వర్తనమే ప్రశస్తమైనది. కావున నాసద్వృత్తము వివరించెద నాకర్ణింపుఁడు. ఇట్టికన్యను

---

౧౦౨. మహాంత్యపి సమృద్ధాని గోజావిధనధాన్యతః, స్త్రీసంబంధే దశైతాని కులాని పరివర్జయేత్. ౧౦౩. హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసమ్, క్షయామయావ్యపస్మారిశ్విత్రకుష్ఠికులాని చ. ౧౦౪. పాదౌసుగుల్ఫౌ ప్రథమం ప్రతిష్ఠా జంఘే ద్వితీయం చ సుజానుచక్రే, మేఢ్రోగుహ్యం చ తతస్తృతీయం నాభిః కటిశ్చేతి చతుర్థమాహుః. ౧౦౫. ఉదరం కథయంతి పఞ్చమం హృదయం షష్ఠమథ స్తనాన్వితమ్, అథ సప్తమమంసజత్రుణీ కథయంత్యష్టమమోష్ఠకంధరే. ౧౦౬. నవమం నయనే చ సభ్రుణీ సలలాటం దశమం శిరస్తథా, అశుభేష్వశుభం దశాఫలం చరణం చరణాద్యశుభేషు శోభనమ్. ౧౦౭. ఇదం మహాత్మా స మహానుభావః శచీనిమిత్తం గురుర్బ్రవీదిద్విజాః, శక్రేణ పృష్టః సవిశేషముత్తమం సంలక్ష్యముక్తం వరయోషలక్షణమ్. ౧౦౮. మత్సకాశాత్పునః శ్రుత్వా లక్షణం పురుషస్య చ, యథాధునా భవద్భిస్తు శ్రుతం మత్తో ద్విజోత్తమాః. ౧౦౯. లక్షణేభ్యః ప్రశస్తం తు స్త్రీణాం సుద్వృత్తముచ్యతే, సద్వృత్తమాస్థాయ యా స్త్రీ సా ప్రశస్తా న చ లక్షణైః. ౧౧౦. ఈదృగ్లక్షణసంపన్నాం

విధ్యుక్తముగఁ బరిణయమైనపురుషుఁడు నిత్యము ధనసమృద్ధిగలిగి వృద్ధియు సద్యశమును గాంచుచుండును.

ఇది పంచమాధ్యాయము.

---

## షష్ఠాధ్యాయము.

శతానీకుండు సుమంతున కనియె. ఓమునిచంద్రమా! స్త్రీలసద్వృత్తమును విన నిచ్చ బొడముచున్నది. సవిస్తరముగా నద్దాని నానతిమ్ము. యువతులతోటిసంబంధములలో నుత్తమ మధ్యమాధమములను గూడ వినుపింపుము. అన విని ఆతఁ డిట్లనియె. శతానీకా! మున్నొకనాఁడు ఋషిపుంగవులందఱు బ్రహ్మనివాసమున కేగి యాలోకపితామహునివలన స్త్రీలక్షణములను సాకల్యముగ నెఱింగి వారల సద్వృత్తమును గూడ నానతిమ్మని సవినయముగ ప్రార్థింప బ్రహ్మయు నందఱల కియ్యకొని యిట్లని చెప్పందొడంగె. ఓమునివర్యులారా! గృహమేధులకుఁ ద్రివర్గ ప్రాప్తిసాధనం బగుస్త్రీ సద్వృత్తము లోకానుగ్రహకాంక్షచేఁ దొలుతఁ మీకు తెలుపుచున్నాను. సావధానముగ వినుఁడు. తొలుదొల్త బ్రహ్మచర్యమున విద్యలనన్నింటి సంగ్రహింపఁజనును. పిమ్మట వానిచే ధనము నార్జింపఁదగును. అనంతర మన్నిట సదృశయగుకన్యను వేదోక్తవిధంబునఁ బాణిగ్రహణము చేయవలయును. నిర్ధనులకు గృహస్థాశ్రమము విడం

---

సుకన్యాముద్వహేత్తు యః, బుద్ధిర్వృద్ధిస్తథా కీర్తిస్తత్ర తిష్ఠతి నిత్యశః. ౧౧౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీలక్షణవర్ణనం నామ
పఞ్చమోఽధ్యాయః.

---

శతానీకఉవాచ:—సద్వృత్తం శ్రోతుమిచ్ఛామి దేవస్త్రీణాం సువిస్తరాత్, ఉత్తమాధమమధ్యం చ సంబంధే స్త్రీకృతే యథా. ౧. సుమంతురువాచ.—శతానీక మహాబాహో బ్రహ్మలోకే పితామహః, ఉక్త్వా స లక్షణం స్త్రీణాం సద్వృత్తం చోక్తవాన్పునః. ౨. యథోక్తం బ్రహ్మణాం తేషామృషీణాం కురునందన, స ప్రేయోవచనంశ్రుత్వా బ్రహ్మా వచనమబ్రవీత్. ౩. శృణుధ్వం ద్విజశార్దూలాః స్త్రీణాం సద్వృత్తమాదితః, వక్ష్యే యుష్మానశేషం వై లోకానుగ్రహకామ్యయా. ౪. త్రివర్గప్రాప్తయే వక్ష్యే స్త్రీవృత్తం గృహమేధినామ్, ప్రాగ్విద్యాగ్రీనుపాదాయ తైరర్థాంశ్చ యథాక్రమమ్, విందేత సదృశీం భార్యాం శాస్త్రదృష్టేన కర్మణా. ౫. గృహాశ్రమో హి నిఃస్వానాం మహా

బనాప్రాయమగుట కన్యార్థమును, ముస్ముందు కుటుంబభరణముకొఱకును దగినవిత్తము నాయత్తపరుపఁదగును. తీవ్రమైన నరకవేదనయైన భరింపఁ దగునుగాని నట్టింట నాకటనల్లాడు భార్యాపుత్రులం జూచుటచేఁ గల్గు వేదన భరింప శక్యముగాదు. దారిద్ర్యమున ప్రార్థనాతత్పరుండును రోద నముచేయువాఁడు నగుశిశువును జూచి యాతనికోర్కె నెరవేర్పఁజాలక జీవించియుండువాఁడు వజ్రహృదయుఁడు. అట్లు గాదేని వానిహృదయ మేల వ్రక్కలు గాకుండును చినిఁగినచీర గట్టుకొని యాకలిచేఁ గృశించిన సాధ్వియగు ప్రియురాలిని చూడఁగల్గుదుఃఖమునకు సాటిలేదు వికృతా కారముగలవారును, వివర్ణులును, ఆఁకలిగొన్నవారును, నేలపైఁ బరుండు వారును నగుదారపుత్రులఁ జూచునరులకుఁ జేయఁదగనికార్య మేముం డును? బాహువులే యుత్తరీయముగాఁ గల్గువాఁడును, క్షుద్బాధచేఁ గృశించినవాఁడును, దీనాననుండు నగుసుతుని జూచుపురుషులకు మరణ ముత్సవము, జీవితము వ్యసనము నగును. సంతానము నానాటికిఁ గృశించు చుండ దీనయై యవనతముఖియగు ప్రియురాలిని జూడ వేయివిధ ముల భిన్నాంగుఁడు గానియాతఁడు వజ్రకాయుఁడు. కావున నిర్ధనుం డగుపురుషుఁడు దారపరిగ్రహముచేసి త్రివర్గముల సాధింపనేరఁడు. అట్టి వానికి దారపరిగ్రహము యాతనావహము. భార్యావిహీనుఁడు గృహ స్థాశ్రమమున కనర్హుఁడగునట్లే ధనములేనివాఁ డెద్దానికిని అర్హుండు

---

త్యేషా విడంబనా, తస్మాత్పూర్వముపాదేయం విత్తమేవ గృహైషిణా. ౬. వరం సోఢా మనుష్యేణ తీవ్రా నరకవేదనా, న త్వేవ చ గృహే దృష్టం పుత్రదారం క్షుధార్దితమ్. ౭. అసంభవే శిశుం దృష్ట్వా రుదంతం ప్రార్థనాపరమ్, వజ్రసారమయం మన్యే హృదయం యన్న దీర్యతే. ౮. సాధ్వీం భార్యాం ప్రియాం దృష్ట్వా కుచైలాం క్షుత్కృశీకృతామ్, అస్య దుఃఖస్య తన్నాస్తి సుఖం యత్సమతాం వ్రజేత్.౯.రూక్షా న్వివర్ణాన్ క్షుధితాన్ భూమిప్రస్తరశాయినః, పుత్రదారాన్నిజాన్దృష్ట్వా కిమకార్యం భవేన్నృణామ్. ౧౦. బాహూత్తరీయం క్షుత్క్షామం దృష్ట్వా దీనముఖం సుతమ్, మృత్యు రేవోత్సవః పుంసాం వ్యసనం జీవితం ద్విజాః. ౧౧. పరిసీదత్స్వపత్యేషు దృష్ట్వా దీన ముఖీం ప్రియామ్, వజ్రకార్యశరీరాస్తే యే న యాంతి సహస్రధా. ౧౨. తస్మాదర్థ విహీనస్య పుంసో దారపరిగ్రహాత్, కుతస్త్రివర్గసంసిద్ధిర్యాతనైవ హి తస్య సా. ౧౩. అభార్యస్యాధికారోఽస్తి న ద్వితీయాశ్రమే యథా, తద్వదర్థవిహీనానాం సర్వత్ర

గాఁడు. పురుషులకుఁ ద్రివర్గప్రాప్తిసాధన మపత్యమని కొందఱు, ధనమని మఱికొందఱు, కళత్రమని వేఱొకకొందఱును నీతివేత్తలు వచించుచున్నారు. ధర్మము రెండువిధములు. ఒకటి యిష్టాపూర్త క్రియాత్మకము; రెండవది దారాత్మకము. ఇట్టి రెండు తెఱంగుల ధర్మములకు నర్థమే ముఖ్యసాధనము. లోకము దరిద్రుఁ డగుబంధుఁగుని స్వజనమని చెప్పుటకు సిగ్గిలుచున్నది. పరాయిద్దైనను ధనికుఁ డైనచో స్వజనుఁడనుచున్నది. సమీపస్థుఁడైనను నిర్ధనుఁడు గౌరవింపఁబడుటలేదు. దూరముననున్నను ధనవంతునే యెల్లరు సేవించుచున్నారు. కావున ధనమే త్రివర్గమునకు గౌరవమునకు గుణములకును మూలంబగుట నెల్లవారును దొలుదొల్త నద్దాని సాధింపవలయును. కులశీలాదులు లేకున్నను ధనాఢ్యుఁ డుత్తముఁ డగుచున్నాఁడు. నిర్ధనుఁడు విద్యా కులాదిసంపన్నుఁ డయ్యును లేనివారిలోఁ బరిగణింపఁబడుచున్నాఁడు. శాస్త్రములు, శిల్పములు, కళలు, కర్మములుమున్నగునవి యర్థసాధనములు. అర్థము త్రివర్గసాధనము. సాధనములకుఁ ద్రివర్గము గలదు. త్రివర్గసాధ నార్థముగాని పురుషునిజన్మ మజాగళస్తనమువలె వ్యర్థము. పూర్వపుణ్య ములచే ధర్మకామాదిసాధనంబగుసంపద గలుగును. తిరిగి యాధర్మకామ ములచే సద్వినియోగంబు నిమిత్తంబుగ సంపదలు గలుగును. మరల దానివలన నాధర్మకామము లుద్భవమునందును. ఇటు లన్యోన్యహేతువు

---

నాధికారితా. ౧౪. కేచిత్త్వపత్యమేవాహుస్త్రివర్గావాప్తిసాధనమ్, పుంసామర్థః కలత్రం చ యేఽన్యే నీతివిదో విదుః. ౧౫. ధర్మోఽపి ద్వివిధో యస్మాదిష్టాపూర్త క్రియాత్మకః, స చ దారాత్మకః సర్వం జ్ఞేయమర్థైకసాధనమ్. ౧౬. నిజేనాపి దరిద్రేణ లోకే లజ్జతి బంధునా, పరోఽపి హి మనుష్యాణామైశ్వర్యాత్స్వజనాయతే. ౧౭. న దరిద్రం సమీపేఽపి స్థితవంతం ప్రపశ్యతి, దూరస్థమపివిత్తాఢ్యమాదరాద్భజతే జనః. ౧౮. తస్మాత్ప్రయత్నతః పూర్వమర్థమేవ ప్రసాధయేత్, స హి మూలం త్రివర్గస్య గుణానాం గౌరవస్య చ. ౧౯. సర్వేఽపి హి గుణా విద్యాకులశీలాదయో నృణామ్, సంతి తస్మిన్నసంతోఽపి సంతి సంతోఽపి నాసతి. ౨౦. శాస్త్రం శిల్పం కలాః కర్మ యచ్చాన్యదపి చేష్టితమ్, సాధనం సర్వమర్థానామర్థా ధర్మాదిసాధనాః. ౨౧. సాధనానాం త్రివర్గోఽస్తి తం వినా కేవలం నృణామ్, అజాగలస్తనస్యేవ సిధనాయైవ సంభవః. ౨౨. ప్రాక్పుణ్యైర్విపులా సంపద్ధర్మకామాదిహేతుజా, భూయో ధర్మేణ సాముత్ర తయా

లగుట వీనికి చక్రకమని పేరు. బాహుద్వయముచేత బుద్ధిమంతుఁడు త్తర మధ్యమాధరముల బాగుగ నెఱింగి త్రివర్గమును సేవింపఁజనును. అట్లు చేసినచో నాతఁడు నూరువత్సరములు గడుచుచుండ నుత్తరోత్తంబగు పదంబు గాంచఁగలఁడు. ఈత్రివర్గమునం దపత్నీకునకుఁగాని ధనహీనునకుఁగాని యధికారము లేదు. పురుషుఁడు భార్యవచ్చుటకుఁ బూర్వము ధనమునే యార్జింపవలయును. దాయక్రమమునవచ్చిన ధనముచేఁగాని స్వార్జితమగు ధనముచేఁగాని దారను పరిగ్రహింపనలెను. శ్రుతము విత్తము క్రియలు మొదలగువానిచే ననురూపమగు కులమునఁబుట్టి ధర్మశ్రద్ధ గలిగి యనురూప యగుకన్యను బరిగ్రహింపవలయును. పురుషుఁడు భార్యాస్వీకరణము జేయునంతవఱకు నర్ధశరీరుఁడే యగుచున్నాఁడు కావున సకాలమున దారపరిగ్రహము జేయవలయును. ఏకచక్రమగు రథము నేకపక్షమగు పక్షియు నెట్లు కార్యసాధనములు గావో యట్టులే భార్యావిహీనుఁ డెట్టికర్మకును యోగ్యుఁడు గాఁజాలఁడు. దారపరిగ్రహముచేఁ ద్రివర్గము సిద్ధించును. యజ్ఞాదికర్మలలో సహాధికారము చెప్పియుండుటచే ధర్మము పత్నివలన సిద్ధించును. కార్యములయట్ల సదుపాయబోధనముచే బహులాభము గూర్చుటవలన నర్థమును, నకల్మషమగుప్రేమ గలిగియుండుటచేఁ గామమును సిద్ధించును. లోకమున వివాహమున మూఁడుతరగతు లున్నవి. హీనులతో సంబంధమునను

---

తావితి చ క్రమః. ౨౩. ఏకచక్రకమేతద్ధి ప్రోక్తమన్యోన్యహేతుకమ్, పూర్వపశ్చిమ బాహుభ్యాముత్తరాధరమధ్యమాః. ౨౪. విజ్ఞాయ మతిమానేవం యస్త్రివర్గం నిషేవతే, సంఖ్యాశతసమాయుక్తైరవాప్నోత్యుత్తరోత్తరమ్. ౨౫. నాభార్యస్యాధికారోఽస్తి త్రివర్గే నిర్ధనస్య వా, నాభార్యాయామతః పూర్వమర్థమేవ ప్రసాధయేత్. ౨౬. తస్మాత్క్రమాగతైరర్థైః స్వయం వాధిగతైర్యుతః, క్రియాయోగ్యైః సమర్థశ్చ కుర్యాద్దారపరిగ్రహమ్. ౨౭. అనురూపే కులే జాతాం శ్రుతవిత్తక్రియాదిభిః, లభేతానిందితాం కన్యాం మనోజ్ఞాం ధర్మసాధనామ్. ౨౮. పుమానర్ధపుమాంస్తావద్యావద్భార్యాం న విందతి, తస్మాద్యథాక్రమం కాలే కుర్యాద్దారపరిగ్రహమ్. ౨౯. ఏకచక్రో రథో యద్వదేకపక్షో యథా ఖగః, అభార్యోఽపి నరస్తద్వదయోగ్యః సర్వకర్మసు. ౩౦. పత్నీపరిగ్రహాద్ధర్మస్తథార్థో బహులాభతః, సత్ప్రీతియోగాత్కామోఽపి త్రయమస్యాం విదుర్బుధాః. ౩౧. త్రిధా వివాహసంబంధో హీనతుల్యాధికైః సహ, తుల్యైః సహ

సములతోఁ సంబంధమున నధికులతోడిపొందున నని యెఱుంగుము. అందు సములతోఁ సంబంధమే సర్వవిధముల నుత్తమమయినది. హీనాధికములు నీచమును మధ్యమము నగును. నీచసంబంధము జేసిన సజ్జనులు నిందింతురు. అధికమగుసంబంధము గానించినచో వారివలన నెప్పుడుఁ బరాభవింపఁబడుచుండును. తుల్యులతోఁ సంబంధ మొనర్చిన నందఱును గౌరవింతురు గావున నట్టిపొందే యుత్తమమయినది. ఎవ్వఁడేనియుఁ దెలియక యధికసంబంధముజేసెనేని యాతఁడు నిక్కముగ లెస్సగ నవమానము పొందును. వారి ననుసరించి నడుచుకొనుట యుక్తముగాదు. ఇట్టులే నీచులతోఁగూడ నొనరింపరాదు. నీచులతోడిసంబంధ ముత్తమునకైనను నీచమే యగును. కావున నట్టిసంబంధములను బుద్ధిమంతులు పరిత్యజింపవలయు. లేకున్న సాటివారు నధికులు నిందింతురు. పండితులు విజాతీయులతోఁ సంబంధము నంగీకరించుటలేదు. అట్టి సంబంధము జేసికొనినవాఁడుభయకులభ్రష్టుఁ డగును. కోకిలతోడిసంబంధము చేసినశుకము రెండుజాతులకును జెందకున్నదిగదా? కులబాహ్యమగుటవలన నవమానకరమగుటవలన గౌరవహీనమగుటవలనను నట్టి విజాతీయసంబంధము జేయుట ప్రశస్తముగాదు. నీచులు తమచేతను దా ముత్తములచేతను బరిహాసింపఁబడుచుండుటచే మధ్యములు లా రెండు సంబంధముల నొల్లరు. శుభకర్మలయం దన్యోన్యాభిమానములచే నొకరి నింకొకరు గౌరవించుకొనుచుండు వారిసంబంధములు ప్రశస్తములయినవి. సుఖదుఃఖములయందుఁ

సమాస్తేషామితరా నీచమధ్యమా. ౩౨. అసమైర్నింద్యతే సద్భిరుత్తమైః పరిభూయతే, తుల్యైః ప్రశస్యతే యస్మాత్తస్మాత్సాధుతమో మతః. ౩౩. కృత్వైవాధికసంబంధమపమానం సమశ్నుతే, న చైషామానతిం గచ్ఛేన్నైవ నీచైః సహేష్యతే. ౩౪. ఉత్తమోఽపి చ సంబంధో నీచైస్తత్సమతాం వ్రజేత్, అతస్తం వర్జయేద్ధీమాన్నిందితం సహృశోత్తమైః. ౩౫. విజాతీయైశ్చ సంబంధం నహేచ్ఛంతి న సూరయః, ఉభయోర్భ్రశ్యతే తేన యథా కోకిలయా శుకః. ౩౬. తద్బాతి కులబాహ్యత్వాదవశ్యం చావమానతః, ప్రతిపత్తేరశక్యత్వాచ్చోత్తమోఽపి న శస్యతే. ౩౭. ఏకేఽపి పరిహర్తవ్యా అన్యే పంహరంత్యుత, తస్మాద్ద్వావపి నైవేష్టౌ సంబంధావధమోత్తమౌ. ౩౮. ఏకపాత్రాదిభిర్యేషాముపచారైః పరస్పరమ్, ప్రత్యహం వర్ధతే స్నేహః సంబంధః సోఽభిధీయతే. ౩౯. యత్రావాహావివాహాదావన్యోన్యాః ప్రతిపత్తయః, స్పర్ధయైవ ప్రవర్ధంతే తం

దమ ధనమానప్రాణములను గణనఁజేయక ప్రవర్తించువారిసంబంధము శ్లాఘనీయము. స్నేహాభివ్యక్తికిని గృతజ్ఞతకును సుఖదుఃఖము లొరిపిడి రాళ్ళని యెఱుంగుము. అట్టి యమూల్యస్నేహము మనుజులలోఁ దుల్యుల యెడఁ గానవచ్చుచున్నది. ఈసామ్యము ధనము కులము స్వభావము నను మూఁడింటివిషయమున ముఖ్యముగ నుండఁదగియున్నది అట్లె తన వివాహసంబంధము నన్యోన్యము సమపక్షిగ నుండుమనుజులే యొనర్చు కొనఁదగుదురుగాని న్యూనాధికులు చేసుకొనఁదగరు. అని యిట్లు వచించి లోకపితామహుండు మరల వారి కిట్లనియె.

ఇది షష్ఠాధ్యాయము.

---

## సప్తమాధ్యాయము.

తల్లితో నేకపిండసంబంధము లేనిదియుఁ దండ్రికి సగోత్ర గాని దియు నగువనిత మైథునమునకు దారకర్మములందును బ్రాహ్మణున కుచిత యగును. పుత్రసంతానము లేనివంశమునుండి కన్యను దెచ్చుకొనరాదు. పుత్రులు లేకుండుటచే నీపెయందుఁ గలిగినసంతానము నావంశము నుద్ధ రించునని యామెజనకుఁడు సంకల్పించుకొని యుండును. దీనినే పుత్రికా కరణమని యందురు. కావున దానిని బరిగ్రహింపరాదు. ఇట్లులే తండ్రి

---

సంబంధం విమర్శ బుధాః. ౪౦. వ్యసనేభ్యుదయే వాపి యేషాం ప్రాణైర్ధనైరపి, సహైక ప్రతిపత్తిత్వం సంబంధానాం స ఉత్తమః. ౪౧. స్నేహవ్యక్తౌ మనుష్యాణాం ద్వావేవ నికషోపలౌ, తథా కృతజ్ఞతాయాం చ వ్యసనాభ్యుదయాగమౌ. ౪౨. స చ స్నేహో నృణాం ప్రాయః సమేష్వేవ హి దృశ్యతే, సామ్యం చాప్యుపగంతవ్యం విత్తశీలకులాదిభిః. ౪౩. తస్మాద్వివాహసంబంధం సఖ్యమేకాంతకారిణామ్, సదృశైరేవ కుర్వీత నోత్తమే నాప్యనుత్తమైః. ౪౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీలక్షణసద్వృత్తవర్ణనం నామ
షష్ఠోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:— అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః, సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే. ౧. సహజో న భవేద్యస్యా న చ విజ్ఞాయతే పితా, నోపయచ్ఛేత తాం ప్రాజ్ఞః పుత్రికాధర్మశంకయా. ౨. బ్రాహ్మణానాం

యొకరో తెలియనికన్యను గూడఁ బరిగ్రహింపరాదు. బ్రాహ్మణునకు సవర్ణ జాతియువతియే పరిగ్రహయోగ్యయయినది. ఇతరజాతినుండి పరిగ్రహించుట కేవలము కామాభిలాషముచేతనే గాని ధర్మార్థ ముపయోగపడదు. క్షత్రియునకు సవర్ణావివాహ ముత్తమము. తక్కటి యధమములు రెండును గామప్రయుక్తములు. ఇట్టులే వైశ్యునకును సవర్ణయే శ్రేష్ఠయగును. తక్కటి యధమ కామప్రయుక్త. శూద్రునకు శూద్రయే సవర్ణగాన ధర్మపత్ని యదియే. ఈనాల్గువర్ణములవారికిని బరిణయ మొనర్పువాఁడు బ్రాహ్మణుఁడే. బ్రాహ్మణక్షత్రియులకు మహాపదలు సంభవించి సవర్ణలు లభింపకున్నను నేసమయమునన్నైనను శూద్రకన్య భార్యగా నుండఁజనదు. కామముచేగాని యజ్ఞానముచేగాని హీనజాతికన్య నుద్వహించినద్విజులు పుత్రపౌత్రపారంపర్యముగ నిజవంశములను నిశ్చయముగ శూద్రకులములుగఁ జేయుచున్నారు. ము న్నత్రిమహాముని నిజశయ్యపై శూద్రు నుంచి పతితుఁ డాయెను. ఉతథ్యుఁడు శూద్రవనిత యందుఁ బుత్రుం గాంచి పతితత్వము నొందెను. శూద్రకుమారుని నేవించి శౌనకుఁడు శూద్రుఁ డాయెను. ఇట్టులే భృగ్వాదిమహర్షులును పాతిత్యమునొందిరి శూద్రయువతినిసెజ్జపైఁజేర్చినద్విజుఁ డధోగతిపాలగుచున్నాఁడు. దానియందు సుతు నుత్పాదించి బ్రాహ్మణ్యమునే బాసిపోవు

---

ప్రశస్తా స్యాత్సవర్ణా దారకర్మణి, కామశస్తు ప్రవృత్తానామిమాః స్యుః క్రమశోఽవరాః. ౩. క్షత్రస్యాపి సవర్ణా స్యాత్ప్రథమా ద్విజసత్తమాః, ద్వే చావరే తథా ప్రోక్తే కామతస్తు న ధర్మతః. ౪. వైశ్యస్యైకా వరా ప్రోక్తా సవర్ణా చైవ ధర్మతః, తథా వరా కామతస్తు ద్వితీయా న తు ధర్మతః. ౫. శూద్రైవ భార్యా శూద్రస్య ధర్మతో మనురబ్రవీత్, చతుర్ణామపి వర్ణానాం పరిణేతా ద్విజోత్తమః. ౬. న బ్రాహ్మణక్షత్రియయోరాపద్యపి హి తిష్ఠతోః, కస్మింశ్చిదపి వృత్తాంతే శూద్రా భార్యోపదిశ్యతే. ౭. హీనజాతిస్త్రియం మోహాదుద్వహంతో ద్విజాతయః, కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతామ్. ౮. శూద్రమారోప్య వేద్యాం తు పతితోఽత్రిర్బభూవ హ, ఉతథ్యః పుత్రజననాత్పతితత్వమవాప్తవాన్. ౯. శూద్రస్య పుత్రమాసాద్య శౌనకః శూద్రతాం గతః, భృగ్వాదయోఽప్యేవమేవ పతితత్వమవాప్నుయుః. ౧౦. శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిమ్, జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే. ౧౧. దైవపిత్ర్యాతిథేయాని తత్ప్రధానాని యస్య తు, నాదంతి పితరో దేవాః స చ స్వర్గం

చున్నాఁడు. ఎవఁడు తనదైనకార్యములను పితృకార్యములను నతిథికార్యములనట్టివానితో నిర్వర్తించునో యట్టివానిహవ్యకవ్యములను దేవతలును పితరులును గ్రహింపరు. అక్కార్యములచే నాతఁడు స్వర్గంబు నడయఁజాలఁడు. శూద్రకన్యాధరపానం బొనర్చువానికిని దానినిశ్వాసవాయువు పీల్చువానికిని దానియందుఁ బుట్టినవానికిని నిష్కృతియే లేదని యెఱుంగవలయును. ఓ బ్రాహ్మణపురందరులారా! యీనాల్గుజాతులవారికిని నైహికాముష్మికము లగుహితాహితములను వివాహభేదములను నెఱింగింతు నాకర్ణింపుఁడు. వివాహము, బ్రాహ్మము, దైవము, నార్షము, ప్రాజాపత్యము, నాసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము నని యెనిమిదివిధము లయియున్నది. ఇందుఁ బైశాచ మధమాధమము ఏవర్ణమున కెయ్యవి ధర్మములో యేవేవి గుణదోషములో వానిని ప్రసవమున గుణదోషములును వివరించెదను వినుఁడు. బ్రాహ్మణునకు మొదటి నాల్గువివాహములు ధర్మ్యములు. క్షత్రియునకుఁ దుదినాల్గును ధర్మ్యములు. వైశ్యశూద్రులకు రాక్షసవివాహము విడచి మూఁడుమాత్రమే యుక్తములని కొందఱందురు. మఱికొందఱు క్షత్రియునకు రాక్షసము మాత్రమే తగును. వైశ్యశూద్రుల కాసురమే తగుననిరి. మఱికొందఱు క్షత్రియునకు మూఁడు ధర్మసమ్మతములు. వైశ్యులకు రెండుధర్మ్యములు. పైశాచము నాసురము నెన్నఁడు నెవ్వరును జేయరాదు. వేర్వేఱుగాగాని సాంకర్యముచేగాని వెనుకజెప్పిన గాంధర్వరాక్షసములు క్షత్రియులకు

---

న గచ్ఛతి. ౧౨. వృషలీఫేనపీతస్య నిఃశ్వాసోపహతస్య చ, తస్యాం చైవ ప్రసూతస్య నిష్కృతిర్న విధీయతే. ౧౩. చతుర్ణామపి విప్రేంద్రాః ప్రేత్యేహ చ హితాహితమ్, సమాసతో బ్రవీమ్యేష వివాహాష్టకముత్తమమ్. ౧౪. బ్రాహ్మో దైవస్తథా చార్షః ప్రాజాపత్యస్తథాసురః, గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః. ౧౫. యో యస్య ధర్మ్యో వర్ణస్య గుణదోషౌ చ యస్య యౌ, శృణుధ్వం తద్ద్విజశ్రేష్ఠాః ప్రసవే చ గుణాగుణమ్. ౧౬. విప్రస్య చతురః పూర్వాన్ క్షత్రస్య చతురోఽవరాన్, విట్శూద్రయోస్తు త్రీనేవ విద్యాద్ధర్మ్యానరాక్షసాన్. ౧౭. చతురో బ్రాహ్మణస్యాద్యాన్ప్రశస్తాన్కవయో విదుః, రాక్షసం క్షత్రియస్యైకమాసురం వైశ్యశూద్రయోః. ౧౮. క్షత్రియాణాం త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ, పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన. ౧౯. పృథక్పృథగ్వా మిశ్రౌ వా వివాహౌ పూర్వచోదితౌ, గాంధర్వో

ధర్మ్యములు అనిరి. ఇందు యథేష్టముగ నాచరించుకొనవలయును. వస్త్రాభరణాదులచేఁ గన్య నాచ్ఛాదించి పూజించి శాస్త్రము సదాచారము గలవరునకు స్వయముగఁ దానే యాహ్వానించి యిచ్చుట బ్రాహ్మవివాహ మనఁబడును. యజ్ఞమున నార్త్విజ్య మొనరించు ఋత్విజునకు సాలంకార యగు కన్యామణి నిచ్చుట దైవవివాహము. ఒకటిగాని రెండుగాని గోమిథునములను వరునొద్దఁ గైకొని విధ్యుక్తవిధముగ నాతనికిఁ గన్య నిచ్చుట యార్షము. మీరిరువురునుగూడి ధర్మము ననుష్ఠింపుఁడని యాదేశించి చేసినకన్యాదానము ప్రాజాపత్యము. జ్ఞాతులకు ధనము నొసంగి యథాశక్తిగఁ గన్యకుఁ గూడ ధనము నొసంగి కన్యను పరిగ్రహించిన నాసురము. వధూవరులు పరస్పరానురాగముతో నొండొరులు సంగమించిన నది కామప్రధానమగు గాంధర్వము. ఛేదనభేదనహననాది దుష్కృత్యములచే రోదనముచేయుచున్న కన్యను గృహమునుండి గొని పోవుట రాక్షసము. నిద్రచే నొడలెఱుంగకున్నను మధుపానముచే నొడలు మఱచియున్నను ప్రమత్తయై యున్నను నట్టియువతిని బొందుట పైశాచము. ఇది యన్నింటిలో నధమాధమమైనదని యెఱింగించియుంటిని. బ్రాహ్మణోత్తములకుఁ గన్యాదాన ముదకపూర్వకముగనున్న నుత్తమ మగును. ఇతరవర్ణములకు వారివారియిష్టానుసారమే. వీనిలో నేయేవివా

---

రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌ స్మృతౌ. ౨౦. ఆచ్ఛాద్య చార్చయిత్వా తు శ్రుతశీలవతే స్వయమ్, ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః. ౨౧. వితతే చాపి యజ్ఞే తు కర్మ కుర్వతి చార్త్విజి, అలంకృత్య సుతాదానం దైవో ధర్మ ఉదాహృతః. ౨౨. ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః, కన్యాప్రదానం విధివదార్షో ధర్మ ఉచ్యతే. ౨౩. సహోభౌ చరతం ధర్మమితి వాచానుభాష్య తు, కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యవిధిః స్మృతః. ౨౪. జ్ఞాతిభ్యో ద్రవిణం దత్త్వా కన్యాయాశ్చైవ శక్తితః, కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే. ౨౫. ఇచ్ఛయాన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ, గాంధర్వః స విధిర్జ్ఞేయో మైథున్యః కామసంభవః. ౨౬. హత్వా ఛిత్త్వా చ భిత్త్వా చ క్రోశన్తీం రుదతీం గృహాత్, ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే. ౨౭. సుప్తాం మత్తాం ప్రమత్తాం చ రహో యత్రోపగచ్ఛతి, స పాపిష్ఠో వివాహానాం పైశాచః కథితోఽష్టమః. ౨౮. జలపూర్వం ద్విజాగ్ర్యాణాం కన్యాదానం ప్రశస్యతే, ఇతరేషాం తు

[redacted]తో యెఱింగింతు వినుఁడు. బ్రాహ్మవివాహ మున జనించుసత్పుత్త్రుఁడు గడచినపదితరములను రానున్నపదితరములను తనను నిర్విధి నిరువదొక్కతరమును దరింపఁజేయును దైవవివాహో త్పన్నసత్పుత్త్రుఁడు వెనుకటితరము లేడును ముందుతరము లేడును తాను నను పదునైదుతరములను దరింపఁజేయుచున్నాఁడు. ఆర్షవివాహో త్పన్నుఁడు పూర్వాపరములగు నేడుతరములఁ దరింపఁజేయును. బ్రాహ్మాదు లగు నాల్గువివాహములలోను వరుసగ బ్రహ్మతేజోవిరాజమానులై శిష్టసమ్మతు లగుపుత్త్రులు జనింతురు. మఱియు సురూపము సాత్త్వికభావ మును గలిగి ధనవంతులును యశోవిశాలులును పుత్త్రవంతులునై ధర్మ రతులై నూఱేండ్లు జీవింతురు. ఇతర వివాహములలో ఘాతుకులును నసత్యవచనులు నగుపుత్త్రులు జనింతురు.మఱియు నీదుష్టవివాహములలో జనించినవారు వైదికధర్మద్వేషులై మెలఁగుదురు. అనిందితవివాహములచే సంతాన మనింద్యమగును. నిందితవివాహములచే నింద్యమగును, కావున నింద్య వివాహముల నొనరింపరాదు. పాణిగ్రహణమును సంస్కారము లును సవర్ణస్త్రీపురుషులలో సంభవించును.అసవర్ణావివాహమునమాత్రము బ్రాహ్మణుఁడు క్షత్త్రియను గ్రహించునప్పుడు క్షత్త్రియస్త్రీ బాణము పట్టుకొనవలయును. వైశ్యకన్య కొరడాను పట్టుకొనవలయును. శూద్ర

---

వర్ణానామితరేతరకామ్యయా. ౨౯. యో యస్యైషాం వివాహానాం విభూనాం కీర్తితో గుణః, తం నిబోధత వై విప్రాః సమ్యక్కీర్తయతో మమ. ౩౦. కులాని దశ పూర్వాణి తథాన్యాని దశైవ తు, స హి తాన్యాత్మనా చైవ మోచయత్యేనసో ధ్రువమ్. ౩౧. బ్రాహ్మీపుత్త్రః సుకృతకృద్దైవోఢాజం సుతం శృణు, దైవోఢాజః సుతో విప్రాః సప్త సప్త పరావరాన్, ఆర్షోఢాజః సుతః స్త్రీణాం పురుషాంస్తారయేద్ద్విజాః. ౩౨. బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః, బ్రహ్మవర్చస్వినః పుత్త్రా జాయంతే శిష్టసంమతాః. ౩౩. రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః, పుత్త్రవంతోఽథ ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః. ౩౪. ఇతరేషు నిబోధధ్వం నృశంసానృతవాదినః, జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషః సుతాః. ౩౫. అనిందితైః స్త్రీవివాహై రనింద్యా భవతి ప్రజా, నిందితైర్నిందితా నౄణాం తస్మాన్నింద్యాన్వివర్జయేత్. ౩౬. కరగ్రహణసంస్కారాః సవర్ణాసు భవంతి వై, అసవర్ణాస్వయం జ్ఞేయో విధిరుద్వాహ కర్మణి. ౩౭. బాణః క్షత్త్రియయా గ్రాహ్యః ప్రతోదో వైశ్యకన్యయా, వసనస్య దశా

కన్య యుత్తముని వివాహమాడునప్పుడు చేలాంచలము గ్రహింపవల యును. విద్వాంసుఁడగుకన్యాజనకుఁడు శుల్కమును కొంచెముగనైన గ్రహింపరాదు. అట్లు శుల్కము గొనినచో నాతఁడపత్యవిక్రయము వలని పాపమునొందును. మఱియు నేబాంధవులయిన స్త్రీధనముల నజ్ఞాన ముచేఁగాని కారణాంతరముచేఁగాని యుపజీవించినను స్త్రీవాహనములను వస్త్రముల నుపయోగించుకొనినను వారు పాపులయి యధోగతి నొందు దురు. ఆర్షవివాహమున గోమిథునము శుల్కమని కొంద అనుచున్నారు. కాని యది యబద్ధము. వరునియొద్దఁ దీసికొనినది కొంచెమైనను గొప్ప దైనను నది శుల్కమే యగును. ఏకన్యజ్ఞాతులు శుల్కమును గ్రహిం పరో వారికి కన్యావిక్రయదోషము గలుగదు. కన్యకల కిచ్చుధనము వారిసంతోషమునకుఁగాని శుల్కముగాదు. ఈతీరున నుత్తమకన్యాపరి గ్రహ మొనరించి సుయశోభిలాషియగు ద్విజోత్తముఁడుత్తమంబగు ప్రదేశమున వసింపవలయును. అన విని ఋషు లిట్లనిరి. ఓపితామహా! యేదేశ ముత్తమమై పవిత్రమైనదని నీయభిప్రాయము? ఎట్టిదేశమున నున్నఁగీర్తికాములు కీర్తిగాంతు రానతీయవే? యన విని పితామహుఁడు వారి కిట్లనియె. విప్రోత్తములారా! ఏప్రదేశమున సమస్తధర్మము నాల్గు పాదములఁ బ్రవర్తించుచుండునో యాదేశము పవిత్రము నుత్తమము నైనదిగా నెఱుంగుఁడు. మఱియు నేదేశమున విద్వాంసులు ధర్మమును సేవించుచు నాచరించుచు వ్యాపింపజేయుచుందురో యదియు శాస్త్ర

---

గ్రాహ్యా శూద్రయోత్కృష్టవేదనే. ౩౮. న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయా చ్ఛుల్కమణ్వపి, గృహ్ణాన్హి శుల్కం లోభేన స్యాన్నరోఽపత్యవిక్రయీ. ౩౯. స్త్రీధ నాని తు యే మోహాదుపజీవంతి బాంధవాః, నారీయానాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిమ్. ౪౦. ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవ తత్, అల్పో వాపి మహాన్వాపి విక్రయస్తావదేవ సః. ౪౧. యాసాం నాదదతే శుల్కం జ్ఞాతయో న స విక్రయః, అర్హణం తత్కుమారీణామానృశంస్యం చ కేవలమ్. ౪౨. ఇత్థం దారా న్సమాసాద్య దేశమగ్ర్యం సమావసేత్, బ్రాహ్మణో ద్విజశార్దూల య ఇచ్ఛేద్విపులం యశః. ౪౩. ఋషయ ఊచుః—కో దేశః పరమో బ్రహ్మన్కశ్చ పుణ్యో మతస్తవ, ప్రవసన్యత్ర విప్రేంద్ర యశః ప్రాప్నోతి కంజజ. ౪౪. బ్రహ్మోవాచ:—న హీయతే యత్ర ధర్మశ్చతుష్పాత్సకలో ద్విజాః, స దేశః పరమో విప్రాః స చ పుణ్యో మతో

సమ్మతమగు ధర్మము గలదేశము నుత్తమమని యెఱుంగుఁడు. అన విని మునులు దేవముఖ్యా! విద్వాంసులు సేవించుధర్మములును శాస్త్రోక్త ధర్మములునెట్టివో సోత్కంఠులమగు మా కెఱిఁగింపు' మనఁ బితామహుండు వారి:కిట్లనియె. సతమును ద్వేషరాగములు వర్జించి ప్రవర్తించు విద్వాంసులచే నారాధింపఁబడుచు వారిహృదయముచే నభ్యనుజ్ఞాతమగుధర్మము నెఱింగింతు నాకర్ణింపుఁడు. కామములు గలిగియుండుట యుత్తమము గాదు. ప్రపంచమున నొక్కఁడేనియు నకాముఁడు లేఁడు. వేదము నధ్యయించుట వేదోక్తకర్మ లాచరించుటయుఁ గామమూలములు గదా? మానసికసంకల్పమువలనఁ గామమును యజ్ఞాదికర్మములును నిఖిలవ్రతములును నియమధర్మములును మొదలగునవన్నియు జనించుచున్నవి. ఈప్రపంచమున నెచ్చటనైన నెన్నఁడైనను పనులుచేయుటకుఁ గామముకన్న వేఱు కారణ మగపడదు. పురుషుఁ డేయేపనులు చేయునో యవియన్నియుఁ గామవ్యాపారములే. వేదములును స్మృతులును వైదికులగుశిష్టుల యాచారములును ధర్మమును జ్ఞాపకములగుచున్నవి. అట్టులే సాధువుల యాచారమును నాత్మతుష్టియు ధర్మజ్ఞాపకములే. దీనినంతను జ్ఞానేంద్రియముతో బాగుగా విమర్శించి నిశ్చయింపవలయును. విద్వాంసుఁడు శ్రుతులకుఁ బ్రాధాన్యము నొసంగి ధర్మరతియై యుండఁదగును.ఎల్లప్పుడు

---

మము. ౪౫. విద్వద్భిః సేవితో ధర్మో యస్మిన్ దేశే ప్రవర్తతే, శాస్త్రోక్తశ్చాపి విప్రేంద్రాః స దేశః పరమో మతః. ౪౬. ఋషయ ఊచుః—విద్వద్భిః సేవితం ధర్మం శాస్త్రోక్తం చ సురోత్తమ, వదాస్మాసు సురశ్రేష్ఠ కౌతుకం పరమం హి నః. ౪౭. బ్రహ్మోవాచ:— విద్వద్భిః సేవితః సద్భిర్నిత్యమద్వేషరాగిభిః, హృదయేనాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తం నిబోధత. ౪౮. కామాత్మతా న ప్రశస్తా న చేహాస్త్యప్యకామతా, కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః. ౪౯. సంకల్పాజ్జాయతే కామో యజ్ఞాద్యాని చ సర్వశః, వ్రతా నియమధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః. ౫౦. కామాదృతే క్రియాకారీ దృశ్యతే నేహ కర్హిచిత్, యద్యద్ధి కురుతే కశ్చిత్తత్తత్కామస్య చేష్టితమ్. ౫౧. నిగమో ధర్మమూలం స్యాత్స్మృతిశీలే తథైవ చ, తథాచారశ్చ సాధూనామాత్మనస్తుష్టిరేవ చ. ౫౨. సర్వం తు సమవేక్షేత నిశ్చయం జ్ఞానచక్షుషా, శ్రుతిప్రాధాన్యతో విద్వాన్స్వధర్మే నివసేత వై. ౫౩. శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్సదా నరః, ప్రాప్య చేహ పరాం కీర్తిం

మనుష్యుఁడు శ్రుతిస్మృతిప్రోక్తములగు ధర్మముల నాచరించి యీలోక మున ననమానయశంబు నార్జించి యింద్రసాలోక్యము నొందును. శ్రుతి యన వేదము. స్మృతి యన ధర్మశాస్త్రము. ఇవి రెండు సర్వకార్యములం దును బాగుగ విచారింపఁదగినవి. వీనినుండియే గదా ? ధర్మము ప్రకా శమునొందెను. ఏద్విజుఁడు యుక్తులతో నిండియుండుశాస్త్రముల నాశ్ర యించి యీ రెంటి నవమానించునో వాఁడు వేదనిందయొనర్పుటచే నాస్తికుఁడు గావున సాధువులు వానిఁ దఱిమివేయవలయును. శ్రుతి స్మృతిసదాచారములు కులవృద్ధులకుఁ బ్రియములు.దనకును బ్రియములు. ధర్మమునకు లక్షణములై యున్నవి. అర్థకామముల సంబంధములేక సప్రమాణముగ ధర్మజిజ్ఞాసఁ జేయువారికి వైదికమగు నుత్తమధర్మజ్ఞానము గలుగును. నిషేకము మొదలు శ్మశానమువఱకు నున్నవిధాన మెవ్వరికి సమంత్రకముగఁ జెప్పఁబడినదో యాతఁడే వేదములయందును జపముల యందు నధికారి యగును. సరస్వతీదృషద్వతులను దేవనదుల మధ్యదేశ మగుబ్రహ్మావర్తము పవిత్రమగుదేశము. ఏయేదేశమున నేయేయాచా రము వంశపారంపర్యాగతమయి యుండెనో యది యాదేశముననున్న నాల్గువర్ణములవారికి ననులోమప్రతిలోమసంకరులకును సదాచారమని యెఱుఁగనగును. బ్రహ్మావర్తమునకుఁ దరువాతఁ గురుక్షేత్రము మత్స్య దేశము పంచాలదేశము శూరసేనదేశము ననునవి బ్రహ్మర్షిదేశము లయి

---

యాతి శక్రసలోకతామ్. ౧౪. శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః, తే సర్వార్థేషు మీమాంస్యే తాభ్యాం ధర్మో హి నిర్బభౌ. ౧౫. యోఽవమన్యేత తే చోభే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః, స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః. ౧౬. వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః, ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్. ౧౭. ధర్మజ్ఞానం భవేద్విప్రా అర్థకామేష్వసజ్జతామ్, ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణాస్త్యాగమం పరమ్. ౧౮. నిషేకాదిశ్మశానాంతో మంత్రై ర్యస్యోదితో విధిః, అధికారో భవేత్తస్య వేదేషు చ జపేషు చ. ౧౯. సరస్వతీదృష ద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్, తదేవ నిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే. ౨౦. యస్మిన్దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః, వర్ణానాం సాంతరాలానాం స సదా చార ఉచ్యతే. ౨౧. కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పంచాలాః శూరసేనయః, ఏష బ్రహ్మర్షిదేశో వై బ్రహ్మావర్తాదనంతరమ్. ౨౨. ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్ర

యుండుటచేఁ బవిత్రములయినవి. ఈదేశముల నుద్భవమందిన యగ్ర జన్మునియొద్దనుండి క్షోణితలముననున్న సర్వమానవులు స్వస్వచరిత్రములను నేర్చుకొనుచున్నారు. హిమవద్వింధ్యనగంబుల మధ్యభాగంబును గురుక్షేత్రప్రాగ్భాగంబును ప్రయాగపశ్చిమభాగంబు నగుదేశము మధ్యదేశ మనఁబడును. పూర్వపశ్చిమసముద్రములకు దక్షిణోత్తరనగంబులకు మధ్యనుండుదేశ మార్యావర్తమని చెప్పుదురు. ఏదేశమున నల్లని యావును కృష్ణమృగమును స్వభావసిద్ధముగ విచ్చలవిడిగ సంచరించునో యాదేశము యజ్ఞానుష్ఠానయోగ్యమని యెఱుఁగవలయును. మంగళదాయకములగు నీప్రదేశములలో ద్విజసత్తములు నిత్యము వాసముచేయవలయును. చతుర్థవర్ణుఁడు తనసేవావృత్తికై యిష్టమైనతావున నుండవచ్చును. బ్రాహ్మణులారా! ధర్మనిమిత్తములు తదుత్పత్తిప్రకారమును సంగ్రహముగా నెఱింగించితిని.

ఇది సప్తమాధ్యాయము.

---

జన్మనః, స్వం స్వం చరిత్రం శిక్షంతి పృథివ్యాం సర్వమానవాః. ౬౩. హిమవద్వింధ్యయోర్మధ్యే యత్ప్రాగ్వినశనాదపి, ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః. ౬౪. ఆసముద్రాత్తు వై పూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్, తయోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః. ౬౫. అటతే యత్ర కృష్ణో గౌర్మృగో నిత్యం స్వభావతః, స జ్ఞేయో యాజ్ఞికో దేశో మ్లేచ్ఛదేశ స్త్వతః పరః. ౬౬. ఏతాన్నిత్యం శుభాన్దేశాన్సంశ్రయేత ద్విజోత్తమః, యస్మిన్కస్మింశ్చ నివసేత్పాదజో వృత్తికర్శితః. ౬౭. ప్రకీర్తితేయం ధర్మస్య బుద్ధైర్యోనిర్ద్విజోత్తమాః, సంభవశ్చాస్య సర్వస్య సమాసాన్న తు విస్తరాత్. ౬౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి వివాహధర్మవర్ణనం నామ
సప్తమోఽధ్యాయః.

## అష్టమాధ్యాయము

చతుర్ముఖుఁ డామునుల కిట్లనియె ఓభూదేవోత్తములారా! గృహస్థు లాచరింపఁదగినశాస్త్రసమ్మతము లగుధర్మముల సవిస్తరముగ నెఱింగింతు నాకర్ణింపుఁడు. గృహమేధి యుత్తమప్రదేశమున వసించువాఁడై ధర్మపత్నీసమేతుఁడై వైవాహికాగ్నియందు గృహ్యకర్మలను యథావిధిగ నాచరింపవలయును గృహస్థు నాశ్రయము లేనిచో దారధనాదుల రక్షణము జరుగనేరదు. కావున నాతఁడు ధనములను దారలను సంరక్షింపవలయును. రక్షణము లేకపోవుటచే నివి త్రివర్గమునకు విరోధు లగుచున్నవి. స్త్రీలు స్వభావమువలనను బురుషునియం దసంతృప్తిగలిగియుండుటవలనను గుణదోషవిచారము లేకుంటను దుష్టసంసర్గమునుండి ముఖ్యముగ రక్షింపవలయును గృహస్థునకుఁ బురుషుఁడు స్థానము గృహమునను నాశ్రయత్రయము గలదు. విత్తరక్షణమునకు నపూర్వవిషయవిజ్ఞానమునకుఁ గులీనుఁడు, నీతిమంతుఁడు, ప్రాజ్ఞుఁడు, సత్యసంధుఁడు, దృఢవ్రతుఁడు, వినీతుఁడు, ధర్మపరుఁడు నగుపురుషుని ప్రాపు గృహస్థునకత్యావశ్యకమైనది. గృహమేధి నగరమునఁగాని ఖర్వటమునఁగాని (చతుఃశతగ్రామమధ్యదేశము) ఖేటమునఁగాని వంశపరంపరాగతమైన గ్రామమునఁగాని యాత్రాసమయమున ధార్మికాదిజనసమన్విత మగుదేశమునఁగాని గురునిచేఁగాని గ్రామనాయకునిచేఁగాని యనుజ్ఞాతుఁడై యిరుగుపొరుగిండ్లవారికిఁ బ్రతిబంధకముగాని ప్రదేశముననైనను నివేశనము

---

బ్రహ్మోవాచ—కర్తవ్యం యద్గృహస్థేన తదిదానీం నిబోధత, గదతో ద్విజశార్దూల విస్తరాచ్ఛాస్త్రత స్తథా. ౧. వైవాహికేఽగ్నౌ కుర్వీత గృహ్యం కర్మ యథావిధి, శుభదేశాశ్రయశ్చైవ పత్నీ వైవాహికీ గృహే. ౨. స్వాశ్రయేణ వినా శక్యం న యస్మాద్రక్షణాదికమ్, విత్తానామివ దారాణామత స్తద్విధిరుచ్యతే. 3. హేతవో హి త్రివర్గస్య విపరీతాస్తు మానద, అరక్షణాద్భవంత్యస్మాదమీషాం రక్షణం మతమ్. ౪. నిసర్గాత్పుంస్యసంతోషాద్గుణదోషవిమర్శ తః, దుష్టానాం చాపి సంసర్గాద్రక్ష్యా ఏవ చ యోషితః. ౫. పురుషస్థానవేశ్మాని త్రివిధం ప్రాహురాశ్రయమ్, విత్తానాం రక్షణాద్యర్థ మపూర్వాధిగమాయ చ. ౬. కులీనో నీతిమాన్ప్రాజ్ఞః సత్యసంధో దృఢవ్రతః, వినీతో ధార్మికస్త్యాగీ విజ్ఞేయః పురుషాశ్రయః. ౭. నగరే ఖర్వటే ఖేటే గ్రామే చాపి క్రమాగతే, యాత్రావశాద్వా నివసేద్ధార్మికాద్యజనాన్వితే. ౮. గురుణానుమత స్తత్ర గ్రామ

గల్పించుకొనవలయును. గృహస్థుఁడు పురద్వారమునకును చతుష్పథము నకును శాలలకును శిల్పిగృహములకును గల్లుపాకలకును ద్యూతహింసక నటక రాజానుజీవులగృహములకును పాఖండదేవాలయవీథులకు రాజ మార్గములకును దూరమగునట్లుగను భద్రముగను నిజజీవిక నైశ్వర్యాను రూపముగ నొనర్చుకొనవలయును. కవాటముతోఁగూడిన యొకముఖ ద్వారముగలిగి పృష్ఠభాగమంతయు శుద్ధముగనుండి సద్వర్తనముగల యాప్తజనులగృహములచేఁ బరివేష్టితమై యిరుగుపొరుగుల దుష్టజనము లేకుండి యీశానదిశాభివ్యాప్తమై వాస్తుశాస్త్రసమ్మత మగుగృహమున వసింపవలయును. మఱియు నాప్రదేశము ప్రవిభక్తములగుపనులఁ గోరుచు నన్నిఋతువుల మనోహరమై పూజామందిరము స్నానగృహము నుదకగృహము (కూపము) గోస్థానము మహానసము (వంటయిల్లు) గోశా లయు నశ్వశాలయు దాసీభృత్యులగుడిసెలును బాహ్యాభ్యంతర దేశ ముల స్త్రీసమాజసమన్వితము నయి సర్వోపకరణవిశిష్టమై యుండవల యును. మఱియు వేరువేరు శయనోద్దేశములు గలదియును నాప్తవృద్ధ జనసమాకీర్ణము నయియుండవలయును స్త్రీలనురక్షింపనిచో వర్ణసంక రము మున్నగు పెక్కుదోషములు గలుగును. కావున వారి నతిజాగ రూకుఁడై రక్షింపవలయును, వారికుత్సాహమును గలిగించుచుండవల యును. స్వాతంత్ర్య మీయఁజనదు. స్త్రీలను విశ్వసింపరాదు. విశ్వసించి నట్లు నటించుచు న్యాయమార్గమున శిక్షించుచుండవలయును. యువతు

---

ణ్యాదిజనేన వా, ప్రతివేశ్మాద్యబాధేన శుద్ధం కుర్యాన్నివేశనమ్. ౯. ద్వారచత్వర శాలానాం సర్వకారుకవేశ్మనామ్, ద్యూతసూనాసురావేశనటరాజానుజీవినామ్. ౧౦. పాఖండదేవవీథీనాం రాజమార్గ కులస్య చ, దూరాత్సుగుప్తం కర్తవ్యా జీవికా విభ వోచితా. ౧౧. సాపిధానైకనిష్క్రాశం శుద్ధపృష్ఠం సమంతతః, సద్వృత్తాప్తజనాకీర్ణ మదుష్టప్రాతివేశికమ్. ౧౨. ప్రాగుదక్ప్రవణే దేశే వాస్తువిద్యావిధానతః, ప్రవిభక్త క్రియాకాంక్షం సర్వర్తుకమనోహరమ్. ౧౩. అర్చాస్నానోదకాగారగోష్ఠాగారమహా నసైః, యుక్తం గోవాజిశాలాభిః సదాసీభృత్యకాశ్రయైః. ౧౪. బహిరంతఃపురస్త్రీకం సర్వోపకరణైర్యుతమ్, విభక్తశయనోద్దేశమాప్తవృద్ధైరధిష్ఠితమ్. ౧౫. అరక్షణాద్ధి దారాణాం వర్ణసంకరజాదయః, దృష్టా హి బహవో దోషాస్తస్మాద్రక్ష్యాః సదా స్త్రియః, ౧౬. న హ్యాసాం ప్రమదం దద్యాన్న స్వాతంత్ర్యం న విశ్వసేత్, విశ్వస్తవచ్చ

లకుఁ బాకాదికర్మలయందు మాత్ర మధికారము నొసంగవలయును. స్త్రీలు గ్రామవాసినులయి సుశిక్షితలైనచో నుపభోగయోగ్య లగుదురు. వనితలను గృహకృత్యముల నియోగించి యితరవ్యాసంగముల కవకాశము లేకుండ చేయవలయును. ఇట్లుండుటచే నాఁడువాండ్రు విద్యనభ్యసించుటకుఁగాని యాశ్రయాంతరముఁజేరుటకుఁగాని యవకాశములభియింపదు. దుర్గతిగలిగియుండుటయు నతిసౌందర్యము, దుష్టసహవాసము, స్వాతంత్ర్యము, పానతత్పరత, భోజనప్రియత్వము, కథాశ్రవణాసక్తియు, గోష్ఠిప్రియత్వమున కర్మశీలతయు, వంచకులతోడను సోదెచెప్పువారితోడను విధవలతోడను వేశ్యలతోడను బిచ్చమెత్తుకొని జీవించువారితోడను బాలెంతరాండ్రతోడను నసత్స్వభావులగు లింగియాచకశిల్పులతోడను గూడియుండుటయు, సంవాహోద్యానయాత్రలయందు నుద్యానములందు నామంత్రణాదులయందు ప్రసంగము గలిగియుండుటయు, తీర్థయాత్రలందును ధర్మఖ్యాపనమునందును భర్తతోడివియోగమును తత్కాలమున జ్ఞాతిబంధ్వాదులును ద్రవ్యమును లేకుండుటయు, నమాధుర్యము పిసినిగొట్టుతనము (కదర్యత్వము) నధికముగఁ బురుషసమాచారములు వినుచుండుట వారిని దూషించుట యతిక్రౌర్యము గలిగియుండుటయు, నతిక్షాంతియు నత్యంతభీతిజనకత్వము స్త్రీలవలనఁ బరాజయము నీమొదలగునవన్నియు నిక్కముల గుదోషములు. స్త్రీలోలుఁడయి వారి కధీనుఁడగుపురుషుఁడు నిందింపఁబడుచున్నాఁడు. భృత్యుల యయోగ్యతకు

---

చేష్టేత న్యాయ్యం భర్త్సనమాచరేత్. ౧౭. నాధికారం క్వచిద్దద్యాద్భృతే పాకాది కర్మణః, స్త్రీణాం గ్రామిణవత్తా హి భోగాయాలం సుశాసితా. ౧౮. నిత్యం తత్కర్మయోగేన తాః కర్తవ్యా నిరంతరాః, ఇత్యేవం సర్వదా వ్యాప్తేః స్యాదవిద్యాపరాశ్రయా. ౧౯. దౌర్గత్యమతిరూపం చాప్యసత్సంగః స్వతంత్రతా, పానాశనకథాగోష్ఠీప్రియత్వాకర్మశీలతా. ౨౦. కుహకేక్షణికాముండాభిక్షుకీసూతికాదిభిః, గోప్రసూహైస్తథాసద్భిర్లింగియాచకశిల్పిభిః. ౨౧. సంవాహోద్యానయాత్రాసూద్యానేష్వామంత్రణాదిషు, ప్రసంగస్తీర్థయాత్రార్థం ధర్మేషు ప్రకటేషు చ. ౨౨. విప్రయోగః సదా భర్త్రా తజ్జ్ఞాతికులనిఃస్వతా, అమాధుర్యకదర్యత్వే భృశం పుంసాం చ వాచ్యతా. ౨౩. అతిక్రౌర్యమతిక్షాంతిరత్యంతాభీతిపాతనమ్, స్త్రీభిర్జితత్వమత్యర్థం సత్యం తాస్తాః సదోషతాః. ౨౪. స్త్రీణాం పత్యురధీనత్వాత్పుమానేవ హి నింద్యతే, భర్తురేవ హి తజ్జాడ్యం

స్వామిజడత్వమే కారణము. కావున నీదోషములేవియు సంభవింపకుండ శాసనతాడనాదులచే స్త్రీలను రక్షించుకొనవలయును. తత్తత్కాలము లం దుపలాలనములతోఁ గూడ భార్య నుపచరించుచుండవలయును. పెక్కండ్రు భార్య లుండినచో వారినందఱను సమభావముతో నుపచరింప వలయును. వారలకందఱకు యథాక్రమముగఁ గర్మదానసత్కారనివాస ముల నిచ్చి ప్రోవవలయును ప్రథమగౌరవస్థానము ధర్మము, తరువాత యోగ్యత, సుపుత్రులు గలిగియుండుటయు నగును. పక్షాంతరమున ధన మట్టిదగుచున్నది. స్త్రీలకు గౌరవకారణ మదియై యున్నదిగదా ? కావున మానము నీయరాదు. ఇచ్చినమానమును విడువనురాదు. గౌరవమున కైన నవమానమునకైన సత్పురుషుల ప్రవర్తనములే కారణములు. విజ్ఞానవంతుఁడగుపురుషుఁడు లాఘవగౌరవముల నాకస్మికముగఁ బ్రయో గించుచు నసంపూర్ణముగఁ జేయుచుండుటచే లాఘవమునే పొందు చున్నాఁడు. అకారణముగ మానావమానములను బ్రయోగించెనేని యదినిమిత్తముగ నాతనియాశ్రితులు జనత్యాగమునందు యత్నింతురు. స్త్రీలకును బిడ్డలకును గౌరవకారణము నిమిత్తము గలిగినప్పుడు గుల యోగ్యతలఁ బ్రధానముగఁ జూచుటయే. ఆస్త్రీలసంపర్కమువలనఁ బురుషులకు సుఖమును వియోగమువలన దుఃఖమును గలుగును. స్వార్థ మునకుఁ బ్రియకరమైనను స్త్రీసంగప్రాప్తిని విడువవలయును. లోకమం

---

యద్భృత్యాసామయోగ్యతా. ౨౬. తస్మాద్యథోదితాస్తే వతా రక్ష్యాః శాసనతాడనైః, తాడనైశ్చ యథాకాలం యథావత్సముపాచరేత్. ౨౬. పరిగృహ్యా బహూన్దారా నుపచారైః సమో భవేత్, యథాక్రమోచితైః కర్మ దానసత్కారవాసనైః. ౨౭. ప్రథమోభిజనో ధర్మో యోగ్యత్వం చ సుపుత్రతా, పక్షే విత్తం విశేత్ స్త్రీణాం మానస్తత్కారణం తథా. ౨౮. తస్మాన్మానో న కర్తవ్యో హేయశ్చాపి న తత్కృతః, గురుత్వే లాఘవే వాపి సతాం కార్యం నిబంధనమ్. ౨౯. ఆకస్మికే ప్రయుంజానః ప్రేక్షావాన్మానలాఘవే, స యత్కించనకారిత్వాచ్ఛాయమేవైతి లాఘవమ్. ౩౦. యథామానాపమానౌ హి ప్రయుజ్యేతానిమిత్తతః, తన్నిమిత్తా జనత్యాగే ప్రయతంతే తదాశ్రితాః. ౩౧. ఏతదేవ హ్యపత్యానాం జ్ఞేయం మాననకారణమ్, యత్స్వాపత్య నిమిత్తేషు ప్రధానే కులయోగ్యతే. ౩౨. తత్సంయోగాత్సుఖం పుంసాం మహద్దుఃఖం

తయు స్వార్థైకపరాయణమై నశించుచున్నది. అవసానమైనవెనుకగాని స్వార్థపరత్వమునందలి దోషము వ్యక్తము గాఁజాలదు. కావున భార్యాది భృత్యపర్యంతము నున్న పరిజనమును జాగ్రతగా శిక్షించుచుండవలయును. అట్లుచేసిన నైహికాముష్మికము లగుశ్రేయముల నొందుదురు. ధర్మార్థకామములయెడ యువతుల నవమానింపరాదు. ధర్మాదిసాధనమున మనుష్యునకు భార్య యర్ధశరీరమగుటచే నాతిరస్కారము తననే జెందును. కనుక వారలకు ప్రతికూలించి వ్యధను గల్గింపరాదు. బహుపత్నీకుఁడు యజ్ఞోత్సవాదులలో నన్యమును విశేషముగ గౌరవింపరాదు. వస్త్రతాంబూలము లొసంగునప్పుడును సమాగమమునను సమభావము గలిగియుండవలయును. రహస్యగతమైన ప్రియాప్రియత్వములు భేదభావమును కామమువలనఁ గలుగును. ఉపచారములచేతను ప్రియవాక్యములచేతను దుల్యముగ వర్తించువాఁడు ప్రశస్యుఁడగును. ఋతుకాలము వచ్చినప్పుడు ప్రేమ యున్నను లేకున్నను నిర్విశేషముగ సంగమము చేయవలయును. ప్రథమభార్య గౌరవనీయమగుధర్మముకొఱకును తరువాతవారు పుత్రాదులకొఱకు ననుకొనవలయును. ఇట్టివిధానమునఁ బ్రతిఋతుకాలమున నుపగమనము చేయవలయును. తుల్యవర్తనముగల

---

వియోగతః, తత్ప్రాప్తిః ప్రతిహాతవ్యా స్వార్థాయైవ ప్రియాణ్యపి. ౩౩. అతః స్వార్థైకనిష్ఠోఽయం లోకః సర్వోఽవసీయతే, తత్ప్రసిద్ధిర్భవేదస్తమానాద్భ్రాంతివిధాయకః. ౩౪. తతో దారాదికా భృత్యా నియంతవ్యాస్తథా ద్విజాః, యథేహాముత్ర వా శ్రేయః ప్రాప్నుయాదుత్తరోత్తరమ్. ౩౫. స్త్రీణాం ధర్మార్థకామేషు నాతిసంధానమాచరేత్, తాసాం తేష్వభిసంధానాద్భవేదాత్మాభిసంహితః. ౩౬. జాయా త్వర్ధం శరీరస్య నృణాం ధర్మాదిసాధనే, నాతస్తాసు వ్యథాం కాంచిత్ప్రతికూలం సమాచరేత్. ౩౭. యజ్ఞోత్సవాదౌ నాకస్మాత్కాంచిదాసాం విశేషయేత్, వస్త్రతాంబూలదానాదౌ ప్రతిపత్తౌ సమో భవేత్. ౩౮. ప్రియాప్రియత్వం భేదో హి కామతస్తు రహోగతః, ఉపచారైః పునర్వాక్యైస్తుల్యవృత్తిః ప్రశస్యతే. ౩౯. ఆర్తవే తు పునః సర్వా ఉపగమ్యాః ప్రియా ఇవ, పూర్వాభిజాతధర్మార్థా పుత్రిణీ చోత్తరోత్తరమ్. ౪౦. ఉదగ్గచ్ఛేదనేనైవ విధినా నిత్యమార్తవే, తుల్యవృత్తిర్యథాకాలం స్వం స్వం వాసముఖండ

వాఁడై యథాకాలముగ వారివారి నివాసములను రక్షింపవలయును. నిత్యపర్యాయములను నివాసములను దీసివైచిన వారిప్రాణములు దీసినట్లే యగును. ఋతుసంబంధమగుదుఃఖమును పూర్వప్రమోదమును యింకొకయువతితో యుక్తముగాని యయుక్తముగా రహోగతమగు దుఃఖమును ఉత్కంఠయును మొదలగువానిని సపత్నులకుఁ జెప్పఁగూడదు. అన్యసంబద్ధ మగువిషయ మన్యథా యొనరించి రహస్యమున వనిత చెప్పినను దానిని విని నిర్వేదము నొందఁగూడదు తనంతఁ దాను సూక్ష్మముగ యోచింపవలయును పరస్పరము వైరముగలిగించు వృత్తాంతములు వర్ణించి మాటతోనైన వారిని భయపెట్టరాదు. గుణదోషము లెఱింగి లెస్సగఁ బరిశీలించి యారెంటిని సార్థకములు జేయవలయును. వారిసంతానములు నిజాపత్యము లగుటచే మాతృదోషములు దలంపక వస్త్రాలంకారభోజ్యాదులలో సమదృష్టి గలిగియుండవలయును. ఒకరి దోషములచే నింకొకనిని దూషించుట నీతియుక్తము గాఁజాలదు. వారియపత్యములన్నియుఁ దనకు నపత్యములే యైయున్నవి గదా? పురుషుఁడెల్లకాలమును బాహ్యాభ్యంతరము లగుస్త్రీలయొక్క ప్రేమ విరోధపూరితము లగునభినయములను శౌచాశౌచములను గమనాగమనములను గూఢచారులగుదాసులవలన లెస్సగ నెఱుంగవలయును. చిత్తవ్యాపారములందుఁ దాఁగూడ నసమర్థుఁడగుట గుర్తెఱింగి సర్వావినయములకుఁ బుట్టినిండ్లగు స్త్రీజాతులను విశ్వసింపరాదు. వయసు

యస్. ౪౧. నిత్యపర్యాయవాసానామపాదానమసూన్విదుః, ఋతుదుఃఖం ప్రమోదశ్చ తథా పూర్వం సమాగతః. ౪౨. అన్యయా సహ యద్దుఃఖం సదసద్వా రహోగతమ్, ఉత్కంఠితం వా యత్కించిత్సపత్నీషు న తద్వదేత్. ౪౩. యత్కించిదన్యసంబద్ధమన్యథా కథితం మిథః, తస్య కుర్యాదనిర్వేదమాత్మనైవ విచింతయేత్. ౪౪. అన్యోన్యమత్సరాఖ్యానైర్న తా వాచాపి భర్త్సయేత్, గుణదోషౌ చ విజ్ఞాయ స్వయం కుర్యాన్న నిష్ఫలౌ. ౪౫. వస్త్రాలంకారభోజ్యాదౌ తదపత్యేష్వనుక్రమాత్, మాతృదోషానసావృశ్య తుల్యదృష్టిః పితా భవేత్. ౪౬. అన్యస్యాన్యగతైర్దోషైర్దూషణం న హి నీతిమత్, యత్తు తేషామపత్యం తు తత్తుల్యముభయోరపి. ౪౭. ప్రీతిం ద్వేషమభిప్రాయం శౌచాశౌచగతాగమాన్, బహిరంతశ్చ జానీయాద్దాసగూఢచరైః సదా. ౪౮. ఆత్మానమపి విజ్ఞాయ చిత్తవృత్తేరనీశ్వరమ్, విశ్వసేత కథం

గడచిన దాసీజనములును గులక్రమాగత లగుదాదులును పరిచారి
కలుగను వారివృద్ధమాతాపితరులును నితరులగు షండులును గూఢ
చారులుగ నుండవలయును. నానావిధములగు కథాఖ్యానములచేఁ
దుల్యశీలము దయ మొదలగువానితోఁ గూడియుండు సకాలప్రయుక్త
చారులచే నంతిపురంబులు ప్రవేశించి వారియాంతరంబులగు నభిప్రాయం
బుల నెఱుంగనగును. ఆయాకథాసందర్భములఁ జెప్పునప్పుడు వారిభావ
మును పరిశీలింపవలయును. సర్వకాలములందును వారిముఖాకారము
మొదలగుచిహ్నములచే వారిమనోగతం బగుభావంబు గ్రహింపనగును.
సీతామహాదేవియు నరుంధతీదేవియు శకుంతలయు మొదలగుపతివ్రత
లయు నితర యువతులయు సదసచ్చరిత్రముల నచ్చట వర్ణించి యక్కా
లమున వారిప్రవృత్తి యెట్లుండునది యెఱుంగవలయును. దుష్టులకు
నిర్దుష్టకథాప్రబంధశ్రవణమునను, సాధువులకు దుష్టకథాప్రబంధశ్రవణ
మునను బ్రేమయధికము. అదిమూలముగఁ బురుషులందు స్త్రీలకు సఖ్యము
గలుగును. ఈతీరుగ నాగమమువలనను ప్రత్యక్షదుష్టత్వమువలనను సద్హే
తుసమన్వితమగు ననుమానముచేతను యథార్థమగుస్త్రీల యభిప్రాయ
ములను లెస్సఁగ నెఱింగి యథోచితముగఁ బ్రవర్తింపవలయును. విరోధ
మున్నచో నాఁడువాండ్రు ప్రాణవియోగమును గూడఁ గావించు
చుండుట రాచకొలమున మనము గని యున్నారము గదా! అందుచేతనే
మహాప్రయత్నములచే నాఁడువాండ్రను రక్షింపవలయును. తొల్లి శుభ

---

స్త్రీషు సర్వావిషయథామను. ౪౯. వృద్ధదాస్యః క్రమాయాతా ధాత్ర్యశ్చ పరి
చారికాః, తన్మాతృపితృకాద్యాశ్చ షండవృద్ధాశ్చరా మతాః. ౫౦. వివిధైస్తత్కథా
ఖ్యానైస్తుల్యశీలదయాన్వితైః, ప్రవిశ్యాంతరభిప్రాయం విద్యాత్కాలే ప్రయోజితైః.
౫౧. తేషు తేషు కథార్థేషు కథ్యమానేషు లక్షయేత్, ముఖాకారాదిభిర్లింగైరభి
ప్రాయం మనోగతమ్. ౫౨. సీతారుంధతిసంబంధైస్తథా శాకుంతలాదిభిః, సదసచ్చరితా
ఖ్యానైర్భావం విద్యాత్ప్రవృత్తితః. ౫౩. తద్దుష్టానామదుష్టేషు సాధూనామితరేషు
చ, ప్రీతిః కథాప్రబంధేషు స్యాత్సఖ్యం పురుషేష్వతః. ౫౪. ఏవమాగమదుష్టాభ్యా
మనుమిత్యా చ తత్త్వతః, స్త్రీణాం విదిత్వాభిప్రాయం వర్తేతాశు యథోచితమ్. ౫౫.
స్త్రీభ్యో విప్రతిపన్నాభ్యః ప్రాణైరపి వియోజనమ్, దృష్టం హి చ యథా రాజ్ఞామతో
రక్షేత్ప్రయత్నతః. ౫౬. వేణ్యా గూఢేన శస్త్రేణ హతో రాజా శుభధ్వజః, మేఖలా

ధ్వజుం డను రాజు వేణియను తనభార్యచే గూఢశస్త్రనిహతుఁ డయ్యె. సౌవీరుఁ డను రాజు నిజపత్ని యొక్క మొలనూలునందలిమణిచే హతుఁ డయ్యె. భద్రసేనుండు భార్యాచోదితుఁ డగు సోదరునిచే నిపాతితుం డయ్యె. కారూషుండు నిజపుత్రునిచే నద్దమువంటికత్తితోఁ జంపఁబడియె. లోకపూజ్యులగు నిద్దఱు కాశిరాజులు మున్నానందాపురమునందలి యువతిచే విషప్రయోగమున హతులైరి గదా! ఇదేవిధమున నెందఱో మహానుభావు లగురాజన్యులును బ్రాహ్మణోత్తములును గూడ స్త్రీలచే నధోగతిఁ బొందింపఁబడినప్పు డితరులవిషయముఁ జెప్పనేల? కావున నిత్యము జాగరూకుం డై యుండి సర్వవిధముల భార్యారక్షణము జేయవలయును. గుణదోషములకుఁ దగినట్లుగ నుచితరీతి నుపచారములుగూడ నొనర్పవలయును. ఉపచారముల హెచ్చుతగ్గు లున్నను నిమిత్తము లేకయే వికారమేర్పడినను విశేషించి సవతుల యాకస్మికవేదనలవలనను బదార్థముల సమవిభాగముఁ జేయకున్నను బ్రసక్తి లేకున్నను వాక్పారుష్యదండపారుష్యములవలనను స్త్రీలకు మగలపైఁ గోప ముద్భవించి యధికమగుచుండును. తరువాతఁ బురుషునకు వార్ధకము వచ్చుకొలఁది శత్రుత్వమే వృద్ధినొందుచుండును కావున వెనుకఁ జెప్పిన యకృత్యములను వంశవినాశకము లగుట యెఱింగి యాండ్రపైఁ బ్రయోగింపం జనదు. ఆఁడువాండ్రు స్వకులాచారములుగాని స్వధర్మమునుగాని స్వగుణములనుగాని స్వాభావికముగ నతిశీఘ్రముగ నుపేక్షింపరు. అట్టియెడఁ

---

మణినా దేవ్యా సౌవీరశ్చ నరాధిపః. ౫౭. భ్రాత్రా దేవీప్రయుక్తేన భద్రసేనో నిపాతితః, తథా పుత్రేణ కారూషో ఘాతితో దర్పణాసినా. ౫౮. ద్వౌ కాశిరాజౌ వైవంద్యౌ చానందాపురయోషితా, విషం ప్రయుజ్య పంచత్వమానీతౌ పూజితాత్మకౌ. ౫౯. ఏవమాది మహాభాగా రాజానో బ్రాహ్మణాశ్చ హ, స్త్రీభిర్యత్ర నిపాత్యంతే తత్రాన్యేష్వివహ కా కథా. ౬౦. తస్మాన్నిత్యాప్రమత్తేన జాయా రక్ష్యాశ్చ నిత్యశః, యథావదుపచర్యాశ్చ గుణదోషానురూపతః. ౬౧. వైషమ్యాదుపచారాణాం వికారైశ్చానిమిత్తజైః, విశేషేణ సపత్నీకైరకస్మాచ్చాపి వేదనైః. ౬౨. అసంభాగే చ వాగ్దండపారుష్యాదప్రసంగతః, ప్రద్వేషో భర్తరి స్త్రీణాం ప్రకోపశ్చాపి జాయతే. ౬౩. తతశ్చాయాతి వార్ధక్యముద్వోఢుశ్చాపి శత్రుతామ్, తస్మాన్న తాన్ప్రయుంజీత దోషాన్దారవినాశకాన్. ౬౪. న చైతాః స్వకులాచారమధర్మం వాపి చాంజసా, న గుణాంశ్చ

బీడింపఁబడినప్పుడు నిజగుణములను విడువరనుట కైముత్యసిద్ధమే గదా; తరచుగానాఁడువాండ్రు సతులై యుండుటకుమూఁడు కారణము లున్నవి. అందు మొదటిది పరపురుషులయెడ నభిప్రాయము లేకుండుట, రెండవది భర్తయెడఁ బ్రేమగలిగియుండుట, మూఁడవది యాత్మరక్షణము. కావున యథోచితములగు నుపచారములచే నెల్లవేళల రక్షించుచు సంతోష పెట్టుచు నిత్యకర్మల నాసక్తిగలిగియుండున ట్లాండ్ర నుపచరించి యుంచు చుండవలయును. ఉత్తమగుణములుగలిగి యుత్తమజాతి యగుయువతిని సామదానములచేతను, మధ్యమను దానభేదములచేతను, నధమమను భేద దండములచేతను స్వాధీనముచేసుకొనవలయును. తొలుత భేదదండము లుపయోగించియును నందుచేఁ గోపించియున్నవారి నపత్యప్రాప్తి నపే క్షించువాఁడు సామదానములచే లోఁబరుచుకొనవచ్చును. ఆఁడువాండ్రు దుశ్చారిత్రముగలిగి పతిహితముగాక యిచ్చవచ్చినచొప్పునఁ బ్రవర్తింతు రేని గాలకూటతుల్యలగు నాయువతులను బ్రాజ్ఞుఁడగుపురుషుఁడు శీఘ్ర ముగఁ బరిత్యజింపవలయును. భర్తయభిప్రాయము ననుసరించి ప్రవర్తిం చుచు సత్కులసంభూతలయి వినయవతులును భర్తృవత్సలలు నగుసాధ్వీ మతల్లులు సర్వకాలములందును సంప్రదాయము ననుసరించి యత్యధిక ముగ మాననీయలై యుందురు. ఈవిధమున నిర్దేశింపఁబడిన స్త్రీనృత్తము నెవఁ డనుష్ఠించునో యాతఁడు ప్రపంచకారణమగు త్రివర్గఫలమును

---

వ్యపేక్షంతే ప్రకృత్యా కిము పీడితాః. ౧౫. సతీత్వే ప్రాయశః స్త్రీణాం ప్రదృష్టం కారణత్రయమ్, పరపుంసామసంప్రీతిః ప్రియే ప్రీతిః స్వరక్షణే. ౧౬. తస్మాత్సురక్షితా నిత్యముపచారైర్యథోచితైః, సుభృతా నిత్యకర్మాణః కర్తవ్యా యోషితః సదా. ౧౭. ఉత్తమాం సామదానాభ్యాం మధ్యమాభ్యాం తు మధ్యమామ్, పశ్చిమాభ్యాముభాభ్యాం చ అధమాం సంప్రసాధయేత్. ౧౮. భేదదండౌ ప్రయుజ్యాపి ప్రాగపత్యాద్యపే క్షయా, తచ్ఛిష్టానాం తదా పశ్చాత్సామదానప్రసాధనే. ౧౯. యాస్తు విధ్వస్త చారిత్రా భర్తృశ్చాహితకారికాః, త్యాజ్యా ఏవ స్త్రియః సద్భిః కాలకూటవిషోపమాః, ౨౦. ఇష్టాః కులోద్గతా సాధ్వ్యో వినీతా భర్తృవత్సలాః, సర్వదా సాధనీయాస్తాః సంప్రదాయోత్తరోత్తరైః. ౨౧. ఏవమేవ యథోద్దిష్టం స్త్రీవృత్తం యోఽనుతిష్ఠతి,

నిస్సంశయముగఁ బొందుచున్నాఁడు. అని యిట్లానతిచ్చి యాలోకపితామహుండు పరమమునుల కిట్లనియె.

ఇది అష్టమాధ్యాయము.

---

## నవమాధ్యాయము.

ఓద్విజోత్తములారా! వెనుకఁ బురుషులు స్త్రీలపట్ల నడువవలసిన విధిని సంగ్రహముగ నెఱింగించియుంటిని. ఇఁకఁ బురుషులయెడ యువతులు మెలంగవలసినరీతి నెఱింగింతు నాకర్ణింపుఁడు. వనితలు తమభర్తలఁ జక్కఁగ నారాధించుటచేఁ బరస్పరానురాగ మభివృద్ధిఁ గాంచును. వర్తనము జక్కఁబడును పుత్రవతులగుదురు. స్వర్గాద్యాముష్మికమున దృష్టమును సిద్ధించును. కావునఁ బతిసేవ వనితల కవశ్యాచరణీయ మైయున్నది. చేయఁదగినకర్మ లెల్ల విధ్య (అదృష్టము) పేక్షము లయియున్నవి. ప్రారంభింపఁబడినకర్మ విధియొక్క యానుకూల్యప్రాతికూల్యములఁబట్టి సాఫల్యవైఫల్యములు పొందుచున్నది. అల్పమైన నధికమైనను గర్మ సామాన్యము విధినిబంధనమై యున్నది. విశేషించి త్రివర్గసాధనములగు మహారంభకర్మలన్నియు విధినిబంధనములే యగును. సమస్తఫలములును తత్సాధనములను నెఱుంగుట వేదమువలన మాత్రమే సాధ్యమగును. ఆసాధ్యము దృష్టాదృష్టభేదంబుల రెండువిధములై విధియందును నిషేధమునందు నుండును. ఇట్లిదియంతయు వేదైకవేద్యమగుటచేతను స్త్రీలకు

---

ప్రాప్నోత్యేవ స సంపూర్ణం త్రివర్గం లోకసంభవమ్. ౭౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి వివాహధర్మేషు స్త్రీవిషయే నరవృత్తవర్ణనం నామ అష్టమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—ఏవం స్త్రీషు మనుష్యాణాం వృత్తిరుక్తా సమాసతః, సాంప్రతం చ మనుష్యేషు స్త్రీణాం సముపదిశ్యతే. ౧. సమ్యగారాధనాత్పుంసాం రతిర్వృత్తిశ్చ యోషితః, పుత్రాః స్వర్గాద్యదృష్టం చ తస్మాదిష్టో హి తద్విధిః. ౨ కర్తవ్యం నామ యత్కించిత్సర్వం విధిమపేక్షతే, వ్యక్తిమాయాతి వైఫల్యం తదేవారబ్ధమన్యథా. ౩ విధ్యపేక్షీణి సర్వాణి కార్యాణ్యవిఫలాన్యపి, హేతుభూతా స్త్రివర్గస్య మహారంభా విశేషతః. ౪. సర్వసాధ్యావిధిజ్ఞానమాగమైకనిబంధనమ్, సాధ్యం దృష్టమదృష్టం చ ద్వయం విధినిషేధయోః. ౫. శాస్త్రాధికారో న స్త్రీణాం న గ్రంథానాం చ ధారణే, తస్మా

వేదాధికారముగాని గ్రంథధారణాధికారముగాని లేదు. కావున పైఁజెప్పిన స్వర్గాద్యదృష్టసిద్ధి యాఁడువారి కుచితముగాదని కొందఱి యాశయము. వైదికక్రియాసంబంధమునందును భర్తృమరణానంతరము జేయఁదగినకార్యములందును స్త్రీల కధికారము యుక్తమే యని స్మృతి వచనము గలదు. కావునఁ బ్రాజ్ఞులు వేదమువలనఁ గార్యాకార్యముల నెఱింగి రాజు ప్రజల నియోగించునట్లు స్త్రీలను గుణదోషములందు శాసింపఁజనును. మున్ను గొందఱుయువతులు విశేషవిహితము లగువేద భాగముల నధ్యయనముచేసియే యున్నారు. కావునఁ గొందఱు వచించిన శాస్త్రాధికారము స్త్రీలకు లేదనువృత్తాంతము ప్రమాణములేనిది. స్త్రీలకుఁ గూడ స్వర్గాద్యదృష్టలాభ మున్నది. లోకమునఁ గొందఱు బ్రాహ్మణులు వేదవిదులయియుండియు శ్రద్ధలేక లోకమును వంచించుటకు శ్రోత్రియవేషమును నిత్యనైమిత్తికాదిక్రియలును జేయుచున్నారు. అట్టులున్నను జాతిమాత్రముచేత వారలే యీకర్మలలో నధికారులు. వేదశాస్త్రప్రవీణు లగుపురుషులచే వైదికలౌకికక్రియ లనుష్ఠింపఁబడు చున్నవి. ఈపనుల కన్నింటికిని శాస్త్రమే మూలము. వేటకాండ్రును పల్లెవాండ్రును గోపాలురు మొదలగు నిమ్నజాతులుగూడ *విష్టి భౌమ వాసర భానువాసర ప్రభృతిదినములయందుఁ దమతమకర్మల నిషేధించుట మనము చూచుచున్నారముగదా; గమ్యాగమ్యాదికార్యములలో నీవిధముగ నాచారము లోకమున వ్యవస్థితమయి యున్నది. సర్వవిధముల

దిహాన్యే మన్యంతే తచ్ఛాసనమనర్థకమ్. ౬. అగమైకక్రియాయోగే స్త్రీణామధ్యధికారితా, మృతే భర్తరి సాధ్వీ స్యాదిత్యాదౌ స్మృతిభాషితమ్. ౭. తస్మాత్కార్యమకార్యం వా విజ్ఞాయ ప్రభురాగమాత్, గుణదోషేషు తాః సమ్యక్ఛాస్తి రాజా ప్రజా ఇవ. ౮. సంత్యేవ ప్రమదాః కాశ్చిద్విశేషాధిగతాగమాః, యత్తు శాస్త్రాధికారిత్వం వచనం స్యాన్నిరర్థకమ్. ౯. కేచిద్వేదవిదో విప్రాః కృత్యైర్వేషక్రియాపరాః, తథాపి జాతిమాత్రేణ త ఏవాత్రాధికారిణః. ౧౦. క్రియంతే వేదశాస్త్రజ్ఞైః ప్రయోగాః శాస్త్రలౌకికాః, స్థితమేషా మదూరేపి శాస్త్రమేవ నిబంధనమ్. ౧౧. వ్యాధధీవర గోపాల ప్రభృతీనాం చ దృశ్యతే, విష్ట్యంగారకసౌర్యాదిదినానాం పరివర్జనమ్. ౧౨.

*విష్టి యనఁగా భద్ర యనుకరణము అని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధి గలదు. ఆకరణముతోఁగూడినతిథియు శుభకర్మలకు నిషిద్ధమైనది.

శాస్త్రములే లోకములకుఁదమయిష్టమునకు నిదానములయిన ప్రాణములు. కావున నాల్గువర్ణములవారికిని నాలుగాశ్రమములవారికి ముఖ్యముగఁ గాని యప్రధానముగఁగాని యెల్లభంగుల శాస్త్రాధికార మున్నదనుటకు సందియములేదు. కాని గమ్యాగమ్యాదులలో శాస్త్రము లోకము నను రెండుప్రమాణము లేర్పడినను లోకము మొదటిదా? శాస్త్రము మొద టిదా? యని వీనిలోఁ బౌర్వాపర్యము నిర్ణయింప సాధ్యపడదు. అయి నను శాస్త్రమే ప్రమాణముగ గ్రహింపఁదగును. కర్మానుసారముగ శరీరము లభియించునట్లే యిదియు నని యెఱుంగవలయును. వేదము నందును బురాణమునందును నాస్తికులకు ద్వికోటి కసంశయజ్ఞాన మేర్ప డును. ఆస్తికులకు లేదు. ఆస్తికుఁడగువాఁడు మహాత్ములసంప్రదాయ మున వికల్పితమతియై యనుష్ఠింపవలయును. గృహస్థధర్మములకెల్లఁ బతి వ్రతలగునారీమణులే మూలకారణమై యుండుట యువతులకుఁ బాతి వ్రత్య మత్యుత్తమమైనది. అది పతిసమారాధనమువలన సిద్ధించును. అందులకై స్త్రీలకుఁ బతిసమారాధనవిధాన మింకమీఁద నెఱింగింతు నాకర్ణింపుఁడు.

ఇది నవమాధ్యాయము.

---

గమ్యాగమ్యాదికార్యేయం నియతాచారసంస్థితిః, లోకానాం శాస్త్రవాక్యానాం ప్రాణాస్తే వష్టనిబంధనాః. ౧౩. తస్మాచ్చతుర్ణాం వర్ణానామాశ్రమాణాం చ సర్వశః, ముఖ్యగౌణాదిభేదానాం జ్ఞేయా శాస్త్రాధికారితా. ౧౪. పౌర్వాపర్యం తు విజ్ఞాతు మశక్యం లోకశాస్త్రయోః, తచ్ఛాస్త్రమేవ మంతవ్యం యథా కర్మశరీరవత్. ౧౫. ఆగమే చ పురాణే చ ద్వికోటైవ నాస్తికగ్రహమ్, మార్గం మహద్భిరాచీర్ణం ప్రపద్యేతా వికల్పధీః. ౧౬. మూలం గృహస్థధర్మాణాం యస్మాన్నార్యః పతివ్రతాః, తస్మాదాసాం ప్రవక్ష్యామి భర్తురారాధనే విధిమ్. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆగమప్రశంసానామ
నవమోఽధ్యాయః.

## దశమాధ్యాయము.

బ్రాహ్మణోత్తములారా! ఆరాధనయోగ్యులగువారల కెల్లరకు నారాధనమునందు వారిహృదయమును బుద్ధిని ననుసరించి యుండుట వారిహితమునె యెల్లవేళలఁ గోరియుండుటయు విహితము లయి యున్నవి. స్త్రీలు కన్యా-పునర్భూ-వేశ్యా భేదమున మూఁడువిధము లయియున్నవారు. అట్టులే ప్రియ, మధ్య (ఉదాసీన), అప్రియ యునియు; యోగ్య, మధ్య (ఉదాసీన), యయోగ్య యనియు నవాంతరభేదములు గూడఁ గలవు. మఱియు సమ, శ్రేష్ఠ, నీచ యని మూఁడువిధముల నున్నారు. ఇందుత్తమజాతికివలె మధ్యమాధమజాతి యువతులకుఁగూడఁ బ్రియవచనముగాని యప్రియవచనముగాని వచింపక జీవనము నొసంగుచుండవలయును. సర్వాధికారమును సంపాదించుకొని యభక్ష్యభక్షణాదినిషేధ్యములనే ప్రయత్నపూర్వకముగ నాచరించు యువతు లధమజాతికి నప్రియజాతికిని జెందుదురు. పెద్దతనంపుఁజారిత్రమునం దేకత్వద్విత్వబహుత్వాదు లగుపూర్వోక్తభేదముల సవిశేషముగ నెఱుంగవలయును. స్త్రీచారిత్రము రెండుతెఱంగులయి యున్నది. భర్తకంటె నితరజనమునందలి చారిత్రము బాహ్యము, స్వశారీరమాంతరము నని యెఱుంగునది. ఆబాహ్యవృత్తము గూడ జ్ఞాతులవిషయము, దదితర విషయమునని యిరుదెఱంగు లయియున్నది.అదియు బూజ్యులవిషయము, దుల్యులవిషయము, గనిష్ఠులవిషయము నని వేర్వేర మూఁడువిధము లయియున్నది. నిజశారీరమగు నాంతరవృత్తము గూడ రహస్యము ననభివ్యక్తము, ప్రకాశము నని మూఁడువిధము లయియున్నది. ఇది

---

బ్రహ్మోవాచః—ఆరాధ్యానాం హి సర్వేషామయమారాధనే విధిః, చిత్తజ్ఞానానువృత్తిశ్చ హితైషిత్వం చ సర్వదా. ౧. కన్యా పునర్భూర్వేశ్యా చ త్రివిధా ఏవ యోషితః, ప్రియా మధ్యాప్రియా చైవ యోగ్యామధ్యేతరా తథా. ౨. సమా శ్రేష్ఠా చ నీచా చ భూయోఽపి త్రివిధాః పునః, పూర్వవత్పరయోర్వృత్తిరిష్టానుక్త్వా ప్రియాప్రియే. ౩. అధమాప్రియయోరత్ర పతిపత్న్యాదికా మతాః, నిషిద్ధానాం తు భక్ష్యాది తద్ధి యత్నాద్విధీయతే. ౪. ఏకద్విత్వబహుత్వాద్యా యే భేదాః సముదాహృతాః, జ్యేష్ఠాదివృత్తే వక్ష్యామస్తానశేషాన్ద్విజోత్తమాః. ౫. వృత్తం చ ద్వివిధం స్త్రీణాం బాహ్యమాభ్యంతరం తథా, భర్తురన్యజనే బాహ్యం తస్యాః శారీరమాంతరమ్. ౬. జ్ఞాతీతరవిభాగేన తద్బాహ్యం ద్వివిధం పునః, పూజ్యం తుల్యం కనిష్ఠం చ తత్ప)

యంతయు భర్తయొక్క చిత్తవృత్తి ననుసరించి తగురీతి నాచరింపవలయును. జననీజనకులును, సోదరులును, బినతండ్రియు, నాచార్యుండును, మాతులుండును, సవతి యగుభగినియు, భర్తయు, నాతనిసోదరియుఁ బినతల్లియు, మేనత్తయుఁ, బోషించినదియుఁ, దక్కుంగల వృద్ధాంగనలును, నితరులగు నాప్తులును, నిజభర్తచేఁ బ్రథమోఢ యగుసవతియు స్త్రీలకు గౌరవనీయులై యుండిరి. ఈపైఁజెప్పిన మాన్యులసంతతియు, భగినీభ్రాతృప్రభృతులును, దనమఱందులును, వారిభార్యలు మొదలగువారు నాప్తసములని యెఱుంగుము. ఇతరులగు నాజ్ఞానువర్తులు హీనులని యెఱుంగునది. స్త్రీలయందుఁ బుత్రసౌభాగ్యాదిరూప మగుప్రఖ్యాతి యేర్పడువఱకు గౌరవనీయత లేదు. గురువులకుఁగాని భర్తకుఁగాని యేకార్యమున నభిలాష ముండునా యాకార్యములందుఁ దదభిలాషానుకూలముగ వర్తించుట నిజపూజాచారములకు విరుద్ధమైనను బ్రశస్యతరమైనది. పరిహాసక్రియోచితులైన మఱదులు మగనిచెలికాండ్రు మొదలగువారితో విజనప్రదేశమున నుండుటయు, వారితో నర్మవచనాదులను వర్జింపవలయును. తరచుగా నాఁడువారిశీలము జెడుటకు దుష్టులతోఁ గూడి వివిక్తవాసముజేయుటయు, నెల్లవేళల స్వాతంత్ర్యము నధికనర్మమును గారణము లయియున్నవి. స్త్రీలకు దుష్టసంగతియం దాసక్తియు యువజనముతోడి నర్మోక్తులు నుచితములు గావు. స్వాతంత్ర్యముగలవారి భయరహితస్వభావము రహస్యప్రదేశమున సాఫల్యము నొందును. మఱియు

---

త్యేకం పునస్త్రిధా. ౬. రహోరతం ప్రకాశం చ శారీరమపి తత్త్రిధా, భర్తుశ్చిత్తానుకూల్యేన ప్రయోక్తవ్యం యథోచితమ్. ౭. మాతా పితా స్వసా భ్రాతా పితృవ్యాచార్యమాతులా, సభార్యాభగినీ భర్తా భర్తృమాతృపితృష్వసా. ౮. ధాత్రీ వృద్ధాంగనాదిశ్చ యస్తత్రాప్తసమో జనః, ప్రథమోఢా సపత్నీ చ స్త్రీణాం మాన్యతమో గణః. ౧౦. ఏషామేవ త్వపత్యాదిభగినీభ్రాతరస్తథా, కనిష్ఠా భర్తురిత్యాదిభార్యాశ్చాప్తసమో మతః. ౧౧. హీనోఽన్యః శాసనీయస్తు తత్ర తావన్న విద్యతే, యోగ్యతా సుతసౌభాగ్యైర్యా యావత్సా ప్రతిష్ఠితా. ౧౨. యత్రాపి గురుభర్తౄణామానుకూల్యేన సర్వదా, వృత్తిః ప్రశస్యతే స్త్రీణాం పూజాచారావిరోధినీ. ౧౩. దేవరైః పతిమిత్రైశ్చ పరిహాసక్రియోచితైః, వివిక్తదేశావస్థానం వర్జయేదితి నర్మ చ. ౧౪. ప్రాయశో హి కులస్త్రీణాం శీలవిధ్వంసహేతవః, దుష్టయోగో రహోనిత్యం స్వాతంత్ర్యమతినర్మతా. ౧౫. దుష్టసంగే త్వరా స్త్రీణాం యువభిర్నర్మ నోచితమ్, నిర్భేషతా స్వతంత్రాణాం

నాఁడువాండ్రు బురుషుల దురభిప్రాయప్రయుక్తములగు దుష్టచేష్టితములను దుష్టాకారములను సోదరభావముతోఁడను బితృభావనతోఁడను వారి నీక్షించుచు దూరముగఁ ద్యజింపఁదగుదురు. పురుషుఁ డింకొక ర్తను గ్రహించినఁ దద్విషయములగు నాలాపములను, సస్మితవిశేషదృష్టులును, ద్రవ్యగ్రహణప్రత్యర్పణాదులు గాలభేదముచే నిజహస్తములతో నాచరించుటయు, ద్వారముకడ నిలచియుండుట, రాజమార్గముల నవలోకించుచుండుట, వింతలు చూడఁగోరుట, యుద్యానముల విహరింపఁగోరుటయు, నాలయప్రదేశములను విసర్జింపవలయును. మఱియుఁ బదుగురదృష్టిపథమున నుండుట, నేత్రచాంచల్యము వచనచాంచల్యము శరీరచాంచల్యమును గలిగియుండుట, యుమియుచుండుట, సీత్కారముతోఁగూడిన యట్టహాసములును ప్రలాపములును గలిగియుండుట, సన్న్యాసిదర్శనము చేయుటయు నట్టివారితోఁ గలసియుండుటయు,దుష్టస్త్రీసాంగత్యము గలిగియుండుటయు, బిచ్చగాండ్రతోడిసంబంధము గలిగియుండుటయు, దోషైకదృక్కులతోఁ గలసి మెలంగుటయు, మాంత్రికులసాంగత్యము నొందుటయు,సంఘసాంగత్యము గలిగియుండుటయు, సంవసనములం దాసక్తియు, నీమొదలగు దుర్వృత్తములు దరుచుగ దుష్టజనోచితము లయియుండుటచే, నుత్తమాంగన లవియెల్ల నతిదూరమున విడువవలయును. ఇటులున్న యువతివలన నామె మాతృవంశము, బితృవంశము, భర్తృవంశమును స్తుతిభాజనమై వెలయును. వేఱువిధముగ వర్తించిన నీమెవలన నామూఁడువంశములును నింద్యములగును.

ఇది దశమాధ్యాయము.



సాఫల్యం రహసి వ్రజేత్. ౧౬. పుంసో దుష్టేంగితాకారాన్దుష్టభావప్రయోజితాన్ భ్రాతృవత్పితృవచ్చైతాన్పశ్యతీ పరివర్జయేత్. ౧౭. పుంసోఽన్యాగ్రహమాలాపస్మితప్రేక్షితాని చ, కరాంతరేణ ద్రవ్యాణాం నిబంధం గ్రహణార్పణమ్. ౧౮. ద్వారప్రదేశావస్థానం రాజమార్గావలోకనమ్, ప్రేక్షోద్యానాదిశీలత్వం నిరుధ్యాద్దేశమాలయమ్. ౧౯. బహూనాం దర్శనే స్థానం దృష్టివాక్కాయచాపలమ్, ష్ఠీవనత్వం ససీత్కారముచ్చైర్హసితజల్పితమ్. ౨౦. సాంగత్యం లింగిదుష్టస్త్రీభిక్షుకీక్షణికాదిభిః, మంత్రమండలదీక్షాయాం సక్తిః సంవసనేషు చ. ౨౧. ఇత్యేవమాదిదుర్వృత్తం ప్రాయో

## ఏకాదశాధ్యాయము.

బ్రహ్మ యిట్లని వచించె. బ్రాహ్మణోత్తములారా! యేవనిత మనోవాగ్దేహకర్మలచేఁ బతిని దైవముగాఁ గొలుచునో యాతని యర్ధశరీరమై యుద్భవించినట్లు సర్వకాలముల నాతనికి హిత మొనరించుచుండునో యాతనిప్రియమే దనకుఁ బ్రియముగను ద్వేష్యమును ద్వేష్యముగను భావించుచుండునో యాతనియధర్మములతోడ ననర్ధములతోడ సంబంధము లేకయుండునో యీతని కెయ్యదిప్రియ మెయ్యదిహితము నెయ్యది సమమని విచారించి తెలిసికొని సర్వభృత్యుల నేమరక బ్రోచుచుండునో భర్తయొక్క దేవకార్యములందును బితృకార్యములందు స్నానభోజనాదికమునందు నతిథిసత్కారమునందును యథోచితముగఁ బ్రవర్తించునో యామె యుత్తమయని యెఱుంగునది. స్త్రీలశరీరము గృహమనియు నాత్మయని రెండుగ విభజింపఁబడెను. అందుఁ దనశరీరముకన్న మున్నే గృహమును సమ్మార్జనాదులచే సంస్కరింపవలయును. తరువాత శరీర సంస్కారముల నొనరించుకొని తిరిగి గృహమును జక్కజేసికొనవలయును. మూఁడువేళల గృహమును లెస్సగ శోధించి తనశరీరవ్యాపారములకుఁ గర్మలకు నుపభోగములకు నుచితమై యుండున ట్లేమరక యుంచుకొనుచుండవలయును. ప్రాహ్ణమధ్యాహ్నపరాహ్ణములందు బాహ్యాభ్యంతరమధ్యదేశముల గృహసమ్మార్జన మొనరింపవలయును. రాత్రి కసవు

---

దుష్టజనోచితమ్, వర్జయేత్పరిరక్షంతీ కులత్రితయవాచ్యతామ్. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీదుర్వృత్తవర్ణనంనామ దశమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ :—యా పతిం దైవతం పశ్యేన్మనోవాక్కాయకర్మభిః, తచ్ఛరీరార్ధజాతేవ సర్వదా హితమాచరేత్. ౧. తత్ప్రియాం ప్రియవత్పశ్యేత్తద్ద్వేష్యాం ద్వేష్యవత్సదా, అధర్మానర్థయుక్తేభ్యోఽయుక్తా చాస్య నివర్తతే. ౨. ప్రియం కిమస్య కిం పథ్యం సామ్యం చాస్య కథం భవేత్, జ్ఞాత్వైవం సర్వభృత్యేషు న ప్రమాద్యేత వై ద్విజాః.౩.దేవతాపితృకార్యేషు భర్తుః స్నానాశనాదిషు, సత్కారేఽభ్యాగతానాం చ యథౌచిత్యం న హాపయేత్. ౪. వేశ్మాత్మా చ శరీరం హి గృహిణీనాం ద్విధా కృతమ్, సంస్కర్తవ్యం ప్రయత్నేన ప్రథమం పశ్చిమాదపి. ౫. కృత్వా వేశ్మ సుసమృష్టం త్రికాలవిహితార్చనమ్, వృత్తకర్మోపభోగానాం సంస్కర్తవ్యం యథోచితమ్. ౬. ప్రాతర్మధ్యాపరాహ్ణేషు బహిర్మధ్యాంతరేషు చ, గృహసంమార్జనం కృత్వా

మాత్ర మెత్తివేయరాదు. ఇట్టులే గోష్ఠములను గేదెలఁగట్టు చావడు లును వానిపురీషము నెత్తివైచి సమ్మార్జని (పొలికట్ట లేక, చీపురు)చే శుభ్రముచేయవలయును. బాహ్యాభ్యంతరములగుఁగర్మలనొనరించుభృత్యు లను బోషించువిధమును గర్మల ననుష్ఠించుపద్ధతియు నెఱుంగవలయును. మఱియు గృహిణి యాయాకాలమున నుండుకూరగాయలు, గందమూల ఫలాదులను, లతావిశేషములను, నౌషధములను, సారవంతములగు వివి ధములైన విత్తనములను శక్తికొలఁది సంగ్రహముచేయుచుండవలయును. రాగి కంచు నినుము దారువు వెదురు రాయి మృత్తు ననువానితోఁ జేసిన నానావిధములగు భాండములను సంగ్రహింపవలయును. కుండలు మొద లగు నుదకపాత్రములను, గలశాదులగు నుదకాహరణయోగ్యపాత్ర ములును, సొరబుఱ్ఱ మున్నగు నానావిధశాకపాత్రములును దైలాదిస్నిగ్ధ ద్రవ్యములను, గోరసములగు క్షీరదధిఘృతాదులు నుంచుటకు యోగ్యము లగునట్లుగ నార్జింపవలయును. రోలు రోకలి తిరుగలి చేట జల్లెడ పిండి జల్లెడ పాలుబిదుకుపాత్రము కవ్వపుత్రాడు గవ్వము మీఁగడ ముంతలు కవ్వము గట్టుగొలుసులు పట్టికారు చల్లచట్టి శూలములు చర్మముతోఁ గూడినరావికొమ్మ (చల్లగుంజ) కుదుటిరాయి బరిణెలు పళ్లెరములు దారవ ములు (కొయ్యవి)ను, లోహికములు (ఇనుపవి) నగుగరిటెలు మంగలము మొదలగు భర్జనసామగ్రులును, స్ఫుటలకము (చేట) త్రాసు కుంచము మొదలగు తూనికకొలతలపరిమాణములును, చీపురుకట్టలున్ను, పిండి సామానులును, లేక పిడకలు మొదలగునవియు నగు గృహోపకరణము లెల్ల నెల్లవేళలఁ దనభాగ్యము ననుసరించి ప్రయత్నముచే సంపాదింప

---

నిష్కారాన్న నిశి క్షిపేత్. ౭. గోమహిష్యాదిశాలానాం తత్పురీషాదిమాత్రకమ్, వ్యప నేయం తు యత్నేన సంమార్జన్యా ప్రసాధనమ్. ౮. దాసకర్మకరాదీనాం బాహ్యాభ్యంతర చారిణామ్, పోషణాదివిధిం విద్యాదనుష్ఠానం చ కర్మసు. ౯. శాకమూలఫలాదీనాం వల్లీనామౌషధస్య చ, సంగ్రహః సర్వబీజానాం యథాకాలం యథాబలమ్. ౧౦. తామ్రకాంస్యాయసాదీనాం కాష్ఠవేణుమయస్య చ, మృన్మయానాం చ భాండానాం వివిధానాం చ సంగ్రహమ్. ౧౧. కుండకాదిజలద్రోణ్యా కలశోదంచతాలుకాః, శాక పాత్రాణ్యనేకాని స్నేహానాం గోరసస్య చ. ౧౨. ముసలం కండనీయం తు యంత్రకం చూర్ణచాలనీ, దోహన్యో నేత్రకం మంథా మండన్యః శృంఖలాని చ. ౧౩. సందంశః కుండికా శూలాః పట్టపిప్పలకో దృషత్, డావికాహస్తికో దర్వీ భ్రాష్టస్ఫుటలకాని చ. ౧౪. తులాప్రస్థాదిమానాని మార్జన్యః పిటకాని చ, సర్వమేతత్ప్రకుర్వీత ప్రయత్నేన

నగును. మఱియు నింగువు, జాజికాయలు, పిప్పళ్లు, మిరియములు, నల్లావాలు, దనియములు, సొంటి, మూఁడునాలుగువిధములగు సుగంధి ద్రవ్యములును, పలువిధములగు లవణములు, వివిధములగు కారపు ద్రవ్యములు, సౌవీరకము (గంజిసామానులు), పరూషకము (కఠిన ద్రవ్యము), రెండాకులయుసిరికలు, చింతపండు, వివిధములగుస్నేహ ద్రవ్యములు, నెండుకట్టెలు, శుష్కమాంసములు మొదలగుకృత్రిమ సామగ్రులు పిష్టవికారములు, మాషవికారములు, పయోవికారములు, నానావిధములగుదుంపజాతులు మొదలగువస్తుజాలమును నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానయోగ్యములుగ విభవము ననుసరించి యేమరక సంగ్రహింప వలయును. కార్యావసరములందుఁ జేకూర్చుటకు వీలుగానివస్తువుల నంతకుఁబూర్వమే ప్రయత్నించి లభించినంతవఱకు జాగ్రత్తచేసి యుంచ వలయును. మఱియు నెండినధాన్యాదులును, పిండిచేయఁబడినవియు, దంపి నవియుఁ, బొల్లుదీసినవియు, నధికశుష్కములు నార్ద్రములు నగుసిద్ధపదార్థ ములు నెంతవఱకుఁ దరిగినవో యెంత పెరిగినవో విచారించి తెలిసికొన వలయును.

ఇది యేకాదశాధ్యాయము.

---

చ సర్వదా. ౧౬. హింగ్వాదికమథో జాజీ పిప్పల్యో మరిచాని చ, రాజికా ధాన్యకం శుంఠీ త్రిచతుర్జాతకాని చ. ౧౭. లవణం క్షారవర్గాశ్చ సౌవీరకపరూషకౌ, ద్విదలా మలకం చించా సర్వాశ్చ స్నేహజాతయః. ౧౭. శుష్కకాష్ఠాని వల్లూరమరిష్టా పిష్టమాషయోః,వికారాఃపయసశ్చాపి వివిధాః కందజాతయః. ౧౮. నిత్యనైమిత్తికానాం హి కార్యాణాముపయోగతః, సర్వమిత్యాది సంగ్రాహ్యం యథావద్విభవోచితమ్. ౧౯. యత్కార్యాణాం సముత్పత్తావుపాహర్తుం న దృశ్యతే, తత్ప్రాగేవ యథా యోగం సంగృహ్ణీయాత్ప్రయత్నతః. ౨౦. ధాన్యానాం ఘృష్టపిష్టానాం క్షుణ్ణోప హతయోరపి, భృశం శుష్కార్ద్రసిద్ధానాం క్షయవృద్ధీ నిరూపయేత్. ౨౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి గృహధర్మవర్ణనం నామ
ఏకాదశోఽధ్యాయః.

---

## ద్వాదశాధ్యాయము

బ్రహ్మ మఱల మునుల కిట్లనియె. వ్రీహి(వరి)ధాన్యముయొక్కయు, కోద్రవ (ఆళ్లు) ధాన్యముయొక్కయు, సారము సమభాగములుగఁ జేర్చిన యుదారక మనఁబడును. కంగు (కొఱ్ఱలు) ధాన్యము కోద్రవధాన్యము నైదుపాళ్లు చేర్చిన వరట మనఁబడును. ప్రియంగు (కొఱ్ఱ) ధాన్య మైదుపాళ్లును, శాలి (రాజనాలు) ధాన్యము బదునొకండుపాళ్లును, సెన గలు మూఁడుపాళ్లును జేర్చి సమముగ నలుగఁగొట్టిన నది త్రయ మనఁ బడును. ఉదకమును యవధాన్యము గోధుమలు పిండిధాన్యమును సమ భాగములుచేసి మేళగించినఁ జతుష్టయ మనఁబడును. పెసలు, మినుములు, నువ్వులు, యవలు నైదైదుభాగములు జేర్చి యొండించి యన్నియ గోధు మలును సక్తువులును (వేచిన చూర్ణము), కుల్మాషములు (అలచందలు), పిష్టమాంసములును నర్ధభాగములు జేర్చి మేళగించిన సిద్ధ మనఁబడును. ఇదియే ద్విగుణ మనఁబడును. పున్నాకములు యావకములు (అల చందలు) కంగులయు కోద్రవములయు నన్నము చణకోదారకములయన్న మును యవాన్నమును త్రిగుణ మనఁబడును. చీనక (ఇఱ్ఱిజాతివి)ములయు వ్రీహులయు నన్నము చతుర్గుణము. శాల్యన్నము పంచగుణమును బుష్టి కరములని యిందువలన నెఱుంగవలయును. ఇది యాయాపదార్థముల గుణమని యెఱుంగనగును. యత్నపూర్వకపాకవిశేషప్రభృతులవలన వృద్ధిమాత్రమే యెఱుంగవలయును. వరాన్నమునకుఁ బాకాదినిమిత్తము వలన ద్విగుణమగువృద్ధి యేర్పడును. అంతకంటె నధికముగ విరూఢాన్న

---

బ్రహ్మోవాచ:—వ్రీహీణాం కోద్రవాణాం చ సారధర్మముదారకః, కంగుకోద్రవ యోర్జ్ఞేయో వరటః పంచభాగకః. ౧. పంచభాగాన్ప్రియంగూనాం శాలీనాం చ త్రయోఽష్ట చ, చణకానాం తృతీయాంశః సమక్షుణ్ణం త్రయం విదుః. ౨. పానీయ యవగోధూమం పిష్టధాన్యచతుష్టయమ్, తుల్యమేవావగంతవ్యం ముద్గా మాషా స్తిలా యవాః. ౩. పంచభాగాదికా ఘృష్టా గోధూమాః సక్తవ స్తథా, కుల్మాషాః పిష్టమాంసం చ సమ్యగర్ధాదికం భవేత్. ౪. సిద్ధం తదేవ ద్విగుణం. పున్నాకో యావక స్తథా, కంగు కోద్ర వయోరన్నం చణకోదారకస్య చ. ౫. ద్విగుణం చీనకానాం చ వ్రీహీణాం చ చతు ర్గుణమ్, శాలేః పంచగుణం విద్యాత్పురాణే త్వతిరిచ్యతే. ౬ క్రియాపాకవిశేషాస్తు వృద్ధిరేవోపదిశ్యతే, నిమిత్తస్య వరాన్నస్య తద్వృద్ధిర్ద్విగుణా భవేత్. ౭. తస్మాద్భూయో

మునకుఁ జతుర్గుణమగువృద్ధి యేర్పడును. పేలాలు అడుకులు కలాయ ములు (గుండ్రనిసెనగలు)ను వేయించినచో ద్విగుణవృద్ధి గలిగియుండును. ఇతరములగు భ్రష్టవ్య (వేచఁదగిన) పదార్థముల కైదవభాగము వృద్ధిగలు గును. చాపకచూర్ణములఁబాదోన ద్విగుణవృద్ధి యేర్పడును. ముద్గమాష ములకును మసూరముల(చిరుసెనగలు)కు ముప్పాతిక వృద్ధి యేర్పడును. ఆర్ద్రపదార్థములకును శుష్కపదార్థములకును వరాన్నమునకును హాని కంటె వృద్ధి యధికము. శోధ్యపదార్థములలో నర్ధమును ముద్గమాషము లందును మసూరములందు నాఢకమున నైదవభాగమును క్షయము నొందును. అతసీ (నల్లయగిసె) తైలమునను సిద్ధార్థక (తెల్లావాలు) కపిత్థ (వెలగ)తైలములను నారవపాలు పోవును. ఇట్టులే నింబతైలమునను గదంబతైలమునను నైదవభాగము దరుగును. తిలభవంబు నింగుదీ(గార) జాతంబు మధూక (ఇప్పచెట్టు) సంభవంబు నగుతైలంబులను, కానుగు చెట్టుపువ్వు గుసుమపువ్వులతైలములను నాల్గవపాలు పోవును. ఇతర ద్రవ్యములన్నియు నధికముగ క్షయమునొందునుగాన నవి దుష్టములని వచింతురు. తృణాదిదోషములవలన గోక్షీరమునకును మహిషీఘృతము నకును బ్రస్థ (కుంచము)పరిమితమగుక్షయ మేర్పడును. భూమియుఁ దృణ మును కాలమును మంచిగ నున్నచో నంతటివృద్ధి యేర్పడును. మేకల కును గొఱ్ఱెలకును బాదాధికమగుప్రస్థము హానియేర్పడును. అటులనే సుభూమ్యాదులవలన వృద్ధియేర్పడునని పశుశాస్త్రజ్ఞులయాశయము.

---

విరూఢస్య చతుర్భాగో వివర్ధతే, లాజా ధానాః కలాయాశ్చ భృష్టాద్ద్విగుణవృద్ధయః. ౮. భ్రష్టవ్యానామతోఽన్యేషాం పంచభాగోఽధికో మతః, చాపకానాం చ పిష్టానాం పాదహీనాః కలాయజాః.౯. ముద్గమాషమసూరాణామర్ధపాదావరోభవేత్, క్లిన్నశుష్క వరాన్నానాం హానిర్వృద్ధిర్విశిష్యతే. ౧౦. తథార్ధేన తు శోధ్యానామాఢక్యా ముద్గ మాషయోః, మసూరాణాం చ జానీయాత్క్షయం పంచమభాగకమ్. ౧౧. షడ్భాగేనా తసీతైలం సిద్ధార్థకకపిత్థయోః. తథా నింబకదంబాదౌ విద్యాత్పంచమభాగకమ్. ౧౨. తిలేంగుదీమధూకానాం నక్తమాలకుసుంభయోః, జానీయాత్పాదకం తైలం ఖల మన్యత్ప్రచక్షతే. ౧౩. క్షేత్రకాలక్రియాదిభ్యః క్షయాదేర్వ్యభిచారతః, ప్రత్యక్షీ కృత్య తాన్సమ్యగనుమిత్యావధారయేత్. ౧౪. క్షీరదోషే గవాం ప్రస్థం మహిషీణాం చ సర్పిషః, పాదాధికమజావీనాముత్పాదం తద్విదో విదుః. ౧౫. సుభూమిత్తృణ

కావున వానికన్నింటికి నాయాభూతృణాదులవలను వృద్ధిక్షయవిభాగము నెఱుంగవలయును. ఆయాపదార్థములలోని గుణదోషములను బక్షమాసాదులచే యత్నించి ప్రత్యక్షముజేసికొని గవాదులక్షీరాద్యుత్పత్తులను గూడ నిర్ణయించుకొనవలయును. ప్రత్తిపనులను గృములతోఁ జేయుపనులను పుష్పములతోఁ జేయఁదగినపనులను ఆగిసెతోఁ జేయఁదగిన పనులను ఉన్నితోఁ జేయఁదగినపనులను పట్టువగైరాలు కత్తిరించుటయును నీమొదలగునవన్నియు నవిటివారును గుంటివారును గ్రుడ్డివారును భర్తృవిహీనలు నగుస్త్రీలచే నొనర్పింపవలయును. బాలురకును వృద్ధులకును గ్రుడ్డివారలకును దీనులకును ముఖ్యముగఁ జేయవలసినశుశ్రూషలు వారలకుఁ బ్రియమగునట్లుగఁ జేయుటకు సేవకుల నియోగింపవలయును. మగఁడూర లేనప్పుడు పనుల కంతరాయముగలిగనేని నిత్యకర్మవిరోధము లేకుండగ నవియన్నియు గృహిణియే చేయవలయును. మఱియు సూత్రము(దారము)లయొక్క లావుసన్నదనములను బాహుల్యమును వానిలోని లాభనష్టములను, లేక భృత్యులగుశూద్రులలో స్థూలసూక్ష్మతలను బహుత్వమును వ్యయావ్యయములను బాగుగా నెఱింగి ప్రాణిసంరక్షణమునందు విశేషముగఁ బనిచేయవలయును. వస్త్రధాన్యాదులను దనయాప్తులగు వృద్ధులయధీనము చేయవలయును. సేవకులవృద్ధిక్షయములననుసరించి వేతనములు నిర్ణయించుచుండవలయును. దారముల వృద్ధిక్షయములు బాగుగా నెఱుంగవలయును. క్షౌమకార్పాసముల దారమునం దైదవభాగము క్షయమునొందును. ఇయ్యది దేశమును

---

కాలేభ్యో వృద్ధిర్వా క్షీరసర్పిషామ్, అతస్తేషాం విధాతవ్యో హ్యర్థాదేవ వినిశ్చయః. ౧౬. ప్రత్యక్షీకృత్య యత్నేన పక్షమాసాంతరే తథా, పయోర్వ్యైత్తైర్గవాదీనాం కుర్యాత్సంభవనిర్ణయమ్. ౧౭. కార్పాసకృమికోశౌమార్ణకక్షౌమాదికర్తనమ్, కుణిపంగ్వంధయోషాభిర్విధవాభిశ్చ కారయేత్. ౧౮. బాలవృద్ధాంధకార్పణ్యే యత్కర్తవ్యమవశ్యతః, వినియోగం నయేత్సర్వం ప్రియోపగ్రహపూర్వకమ్. ౧౯. కర్మణామంతరాలేషు ప్రోషితే చాపి భర్తరి, స్వయం వై తదనుష్ఠేయం నిత్యానాం చావిరోధతః. ౨౦. శూద్రాణాం స్థూలసూక్ష్మత్వం బహుత్వం చ వ్యయావ్యయౌ, మత్వా విశేషం కుర్వీత చేతనప్రతిపత్తిషు. ౨౧. కారయేద్వస్త్రధాన్యాది స్వాప్తవృద్ధైరధిష్ఠితమ్, శూద్రాణాం క్షయవృద్ధ్యాది మంతవ్యం వేతనాని చ. ౨౨. క్షౌమకార్పాసయోర్విద్యా

గాలము ననుసరించి ప్రత్యక్షముగ నిర్ణయించుకొననగును. దంపకము చేత దూదిలో నిరువదవభాగము నశించును. ఉన్నిని వస్త్రాదులచే నాచ్ఛాదించినపుడు గాలి తగిలినచో నంతియ నాశమేర్పడును. దారమునకు హస్తాదిలేఖనముచేత నేఁబదవభాగము నశించును. మండ (మీఁగడ) సంపర్కమువలనఁ బదిగాని పదునొకండుగాని పాళ్లు వృద్ధియగు. దట్టమగు దారమునకు సగమునకుఁ బైననే వృద్ధియగును. మధ్యరకమున నున్నదారమునకు వృద్ధిలేదని యెఱుంగనగును. స్థూలములగు సూత్రములకుఁగల మూల్యమునందు మూఁడుపాళ్లు వాలచేతన (వెండ్రుకలవస్తువులు.) మగును. దేశకాలభేదముల ననుసరించి కర్మ బహువిధములై యుండును గానఁ దదభిజ్ఞుల నాశ్రయించి వాలచేతననిర్ణయము నొనరింపనగును. స్థూలమునకు మూఁడుపగళ్లు వాలచేతనము జేయవలయును. మధ్యమమునకు మూఁడహోరాత్రములు చేయవలయును. సూక్ష్మమునకుఁ బదునైదు దినములు చేయవలయును. నెలదినములు సంస్కారములు చేసినచో నయ్యది శుద్ధమగును. వీనియందంతటను వృద్ధిక్షయములు సామాన్యన్యాయముచేఁ జెప్పఁబడినవి. కాలభేదమునఁగాని కర్తృభేదమునఁగాని మార్పు కలుగుచుండుటయుఁ గలదు. పలువిధములగు శయ్యాసనములను నలుచదరపుకంబళములను శంఖములును విశాలములై రక్తాదివర్ణమధ్యములై యుండుప్రదేశములను గురువులకును బాలురకును వృద్ధులకు నతిథులకు నుపభోగయోగ్యముగఁ బలుభంగుల భర్తయు భార్యయుఁ

---

తూన్త్రం పంచమభాగకమ్, దేశకాలాదిభాగాత్తు ప్రత్యక్షాదేవ నిర్ణయః. ౨౩. అవఘాతేన తూలస్య క్షయో వింశతిభాగకః, ఘనానాం వ్యాప్తాం తు వాతేన తద్వదూర్ణాం ప్రచక్షతే. ౨౪. పంచాశద్భాగికీం హానిం సూత్రే కుర్వీత లక్షణాత్, వృద్ధిస్తు మండసంపర్కాద్దశైకాదశికా భవేత్. ౨౫. శ్లక్ష్ణమధ్యమసూత్రాణామర్ధాధికసమం భవేత్, స్థూలానాం తు పునర్మూల్యాత్పాదోనం వాలచేతనమ్. ౨౬. కర్మణో భూరిభేదత్వాద్దేశకాలప్రభేదతః, తద్విద్భ్య ఏవ బోద్ధవ్యో వాలచేతననిశ్చయః. ౨౭. స్థూలం దినత్రయం దేయం మధ్యమం చ త్రిరాత్రికమ్, సూక్ష్మమాపక్షతో మృష్టం మాసాత్తత్పరికర్మకమ్, యదత్ర క్షయవృద్ధ్యాది తదుత్సర్గాత్ప్రదర్శితమ్. ౨౮. కాలకర్త్రాదిభేదేన వ్యభిచారోఽపి దృశ్యతే, శయ్యాసనాన్యనేకాని కంబలాశ్చతురాశ్రికాః. ౨౯. శంబుకాశ్చావకోషాశ్చ మధ్యా రక్తాశ్చ భూరిశః, గురుబాలాది వృద్ధానామభ్యాగత

గలసి యొనరింపవలయును. ఈపైఁజెప్పిన గుర్వాదులకును మగని మామ మొదలగువారలకును విశేషించి మగనికిని జేయఁదగిన శయనకల్పనాద్యుపచారముల నితరులచేఁ జేయింపరాదు. భార్యయే స్వయముగఁ జేయవలయును. మఱఁది మొదలగువారు విశేషముగ ధరించిన వస్త్రమాల్యాభరణములను ధరింపరాదు. వారిశయనములను బాదాదులచే నాక్రమింపనురాదు. గానుగుపిండి, ఆళ్లు, గోళ్లతోఁ బొల్లుతీసినవి, నల్లనివి కఠినాకారములు నగుపదార్థములును, పర్యుషితాన్నము (దుర్గంధయుక్తము)ను హేయములగుటచే గవాదులకై వినియోగింపవలయును. బహుధేనువులు గలకులములలో గవాధ్యక్షులకును గోశాలలలో జీవించువారలకును వార్తాహారులకును గోపాలురకును భోజనాద్యర్థమై యుపయోగింపవలయును. పెరుఁగునుండి నేతిని సంపాదింపవలయును. వత్సమునకుఁ బీడ కలుగకుండునట్లుగఁ బాలుపిదుకవలయును. వర్షకాలమునను శరత్కాలమునను వసంతకాలమునను రెండువేళల దోహనము చేయవలయును శునకవరాహాదులను రక్షించుటకు మజ్జిగనైనను పైఁజెప్పిన రూక్షాదిద్రవ్యముల నుపయోగింపవలయును. గానుగుపిండి యూరఁబెట్టుటకు మజ్జిగ నుపయోగింపవలయును. బహుధేనుకగృహములలో మజ్జిగను విక్రయమునందు వినియోగింపవచ్చును. గోపాలకాదులకు జీవనమున్నకై ధనధాన్యముల నొసంగవలయును. లేకున్న క్షీరపాణస్వభావము గలిగి యుండుటచే వారు లోభమున గోకులమును హింసింతురు. ఆవులఁ

---

జనస్య చ ౩౦. భోగాయామనుగతో భర్త్రా కుర్యాద్వివిధమాత్రకమ్, యదస్య శ్వశురాదీనాం కల్పితం శయనాదికమ్. ౩౧. భర్తుశ్చైవ విశేషేణ తదన్యేన న కారయేత్, వస్త్రం మాల్యమలంకారం విధృతం దేవరాదిభిః. ౩౨. న ధారయేన్న చైతేషామాక్రమేచ్ఛయనాని వా, పిణ్యాకనకకుట్టాశ్చ కాలరూక్షాణి యాని చ. ౩౩. హేయం పర్యుషితాద్యన్నం గోభక్తేనోపయోజయేత్, కులానాం బహుధేనూనాం గోఽధ్యక్షవ్రజజీవినామ్. ౩౪. కిలాటగవిశాదీనాం భక్తార్థముపయోజనమ్, దధ్నః సమాహరేత్సర్పిర్దోహద్వత్సాన్న పీడయేత్. ౩౫. వర్షాశరద్వసంతేషు ద్వౌ కాలావన్యదా సకృత్, తక్రం వాప్యుపయుంజీత శ్వవరాహాదిపోషణే. ౩౬. పిణ్యాకక్లేదనార్థం వా విక్రేయం వా తదర్హయేత్, వృత్తిం ధాన్యహిరణ్యేన గోపాదీనాం ప్రకల్పయేత్.

బిడుకువాఁడు దోహకాలము నతిక్రమింపరాదు. పశువులఁ గాచుట నీరు దాపుటయు గోపకులుచేయఁదగుదురు. పెరుఁగుద్రచ్చుట వగైరాలు మంథకులు చేయఁదగుదురు. వత్సమును మొదటిమాసమున స్తన్యమునంతను దాపవలయును. మరునెల రెండు స్తనములను దాపవలయును. అటమీఁద నెల్లప్పుడు నొక స్తనముగాని రెంటినిగాని దానికై విడువవలయును. తరువాత నువ్వుపిండియును ముద్దగాఁ జేయఁబడిన పదార్థములును గటికయులవణము నుదకమును గాలానుకూలముగ నొసంగి వానినిఁ బోషింపవలయును. ముదుసలియావు గర్భముదాల్చినయావు పాలిచ్చునావు దూడ లేఁగదూడయు నను నీయేనింటికిని సమముగా సంఘములో ఘాసాద్యాహారముగల్పింపవలయును.ఒకగోపాలుఁడుగాని యిరువురుగాని ముగ్గురుగాని పశుయూథమున గాపుగా నుండవలయును వృద్ధాదిపంచకమునకు నొకబాలుఁ డుండవలయును. నేర్పరులగుగోపాలురుమాత్రము ప్రత్యేకముగ నుండవలయును. వీరందఱును బశువుల కాహారము దెచ్చుటకు సర్పములు మొదలగునపాయకరములైన జంతువులఁ బారదోలుటకు నుద్యుక్తులై యుండవలయును. పశువులచెవులకు రక్షణమునకు నలంకారమునకును గంటలు గట్టుచుండవలయును. పశుసంచారయోగ్యమును సర్పాదిక్రూరసత్త్వవిరహితమును విరివిగఁ దృణజలములు గలదియును భూతాదిదూషితముగానిదియు నగునరణ్యమునఁగాని సామాన్యదేశమునఁ గాని గోకులము నెల్లప్పుడు నుంచవలయును. మేఁకలును గొఱ్ఱెలును

---

౩౭. తే హి క్షీరవ్రతా లోభాదుపహన్యుస్తదన్వయాన్, దోహకాలం గవాం దోగ్ధా నాతివర్తేత వై ద్విజాః. ౩౮. ప్రసరోదకయోర్గోపా మంథకస్య చ మంథకాః, మాసమేకం యథా స్తన్యం మాసమేకం స్తనద్వయమ్. ౩౯. సతతం పాయయేదూర్ధ్వం స్తనమేకం స్తనద్వయమ్, తిలపిష్టాభిః పిండాభిస్తృణేన లవణేన చ, వారిణా చ యథాకాలం పుష్టిమాదితి వత్సకాన్. ౪౦. జరద్గుర్గర్భిణీ ధేనుర్వత్సా వత్సతరీ తథా, పంచానాం సమభాగేన ఘాసం యూథే ప్రకల్పయేత్. ౪౧. ఏకో గోపాలకస్తస్య త్రయాణామథ వా ద్వయమ్, పంచానాం వత్సకశ్చైకః ప్రవరాస్తు పృథక్పృథక్. ౪౨. గోచరస్యానయనార్థం వ్యాలానాం త్రాసనాయ చ, ఘంటాః కర్ణేషు బధ్నీయుః శోభారక్షార్థమేవ చ. ౪౩. పశవ్యే వ్యాలనిర్ముక్తే దేశే భూరితృణోదకే, అభూతదుష్టే వారణ్యే సదా కుర్వీత గోకులమ్. ౪౪. సగుప్తమటవీవాసం నిత్యం కుర్యా

సురక్షితమగునరణ్యమున నుండవలయును చైత్రమాసమున నాశ్వయుజ మాసముననుఉన్నిని దీయవలయును. ఆపశుయూథములోఁ బదిగాని నైదుగాని నాలుగుగాని యాఁబోతులు నశ్వోష్ట్రమహిషాదులును సుఖసేవితములై యుండవలయును. రక్షితులు భూములలో సరిగ వ్యవసాయము చేయుచున్నారో లేదో గమనింపవలయును. వారుచేయు పనులకుఁ దగిన ట్లాయాకాలపరిస్థితుల ననుసరించి జీవనార్థమై వేతనము నిచ్చుచుండవలయును. విత్తులు వేయఁదగిన భూములందును బైరు పెరిగినవరిపొలము మొదలగువానియందును గృహములందును బనులు చేయుభృత్యులను బంటకళ్లములలోఁ బనిచేయువారిని సరిగాఁ జేయుచున్నారా? లేదా యని యనుక్షణముఁ బరికించుచుండవలయును. భృత్యులలో నెవ్వఁడైన బుద్ధిమంతుఁడై శ్రద్ధగఁ బనిచేయుచు విశ్వసనీయుఁడై యుండెనేని వానికి భోజనవసనములు తైలాభ్యంగాదులు మొదలగువానిని విశేషముగ నొసంగి పోషింపవలయును. పద్మములు శాకములు మొదలగువానివిత్తనములువేసి మొలిపించుట కందమూలాదులను మొలిపించుట సమస్తబీజములను సంగ్రహించుటయు సకాలమున సుక్షేత్రములందు వానిని నాటుటయు నుండవలయును ఉత్పన్నములగులతాదులను రక్షించుట రక్షించినవానిని బ్రోవుచేయుటయు నట్లు సంగ్రహించిన వస్తువులను యథాకాలముగ నుపయోగించుటయును జేయఁదగినవి. స్త్రీలు గృహమునకు మూలమగుటను గృహస్థాశ్రమము ధాన్యమూలమైయుండుటను ధాన్యములందును జీవనో-

---

దజావికమ్, ఊర్ణాం వర్షే ద్విరాదద్యాచ్చైత్రాశ్వయుజమాసయోః. ౪౫. యూథే వృషా దశైతాసాం చత్వారః పంచ వా గవామ్, అశ్వోష్ట్రమహిషాణాం చ యథా స్యుః సుఖసేవితాః. ౪౬. విద్యాత్కృషీవలాదీనాం యోగం కృషికకర్మసు, భక్తవేతనలాభం చ కర్మకాలానురూపతః. ౪౭. క్షేత్రకేదారవాటేషు భృత్యానాం కర్మ కుర్వతామ్, ఖలేషు చ విజానీయాత్క్రియాయోగం ప్రతిక్షణమ్. ౪౮. యోగ్యతాతిశయం మత్వా కర్మయోగేషు కస్యచిత్, గ్రాసాచ్ఛాదశిరోభ్యంగైర్విశేషం తస్య కారయేత్. ౪౯. పద్మశాకాదివాపానాం కందబీజాదిజన్మనామ్, సంగ్రహః సర్వబీజానాం కాలే వాపః సుభూమిషు. ౫౦. జాతానాం రక్షణం సమ్యగ్రక్షితానాం చ సంగ్రహః, తేషాం చ సంగృహీతానాం యథావన్నివపక్రియా. ౫౧. గృహమూలం

పాయములందును ముక్తహస్తత్వము (అలక్ష్యభావము) గలిగియుండ రాదు. సర్వకాలములందును ధాన్యమును బ్రోవుచేయుచుండవలయును. జీవనవ్యయము మితముగఁ జేయవలయును గృహిణీజనమున కన్నాది విషయమయి యలక్ష్యభావము ప్రశస్తము గాదు. అన్నవిషయమై స్వల్పమే గదా; యని తిరస్కారభావము జూపరాదు. మధుపదార్థము లయు వల్మీకములయు వృద్ధిక్షయముల నెఱుంగవలయును. ఇట్టులే యాపథములగు నంజనములయొక్క వృద్ధిక్షయములు గూడ నెఱుంగ వలయును. ఇచ్చట స్త్రీధర్మములు మాత్రమే నిరూపింపఁదగియున్నను స్త్రీపురుషులకు దానాదులలో సహాధికార ముండుటవలన నిరువురును గలసి యొక్కటే యగుటచేతఁ గొన్ని పురుషులు చేయఁదగినకార్యములు గూడ నిందు నిరూపింపఁబడినవని యెఱుంగవలయును. ఈలోకమున స్త్రీప్రధానులగుపురుషులు వేనవేలున్నారు. హితాహితోపదేశముల చేతఁ బురుషులకు స్త్రీలు ప్రవర్తికలై యుండుటవలన నయ్యది దుష్టము గానేరదు. అంతమాత్రముచేతఁ బురుషునకు స్వాతంత్ర్యము నశింపలేదు. ఇట్టి యోగ్యత గలిగి సౌభాగ్యము నుద్యమముగలిగి భర్తను శుశ్రూషించి యాతని దనయధీనునిగా నొనర్చుకొనవలయును.

ఇది ద్వాదశాధ్యాయము.

---

స్త్రియశ్చైవ ధాన్యమూలో గృహాశ్రమః, తస్మాద్ధాన్యేషు భక్తేషు న కుర్యాన్ముక్తహస్తతామ్. ౫౨. ధాన్యం తు సంచితం నిత్యం మితో భక్తపరివ్యయః, న చాన్నే ముక్తహస్తత్వం గృహిణీనాం ప్రశస్యతే. ౫౩. అల్పమిత్యేవ నావజ్ఞాం చరేదన్నేషు వై ద్విజాః, మధువల్మీకయోర్వృద్ధిం క్షయం దృష్ట్వాంజనస్య చ. ౫౪. యే కేచిదిహ నిర్దిష్టా వ్యాపారాః పురుషోచితాః, దంపత్యోర్ధ్వైక్యమాస్థాయ తద్ధి దానప్రసంగతః. ౫౫. సంత్యేవ పురుషా లోకే స్త్రీప్రధానాః సహస్రశః, తేషు తాసాం ప్రయోక్తృత్వా దదోష ఇతి గృహ్యతామ్. ౫౬. ఏవం యోగ్యతయా యుక్తా సౌభాగ్యే నోద్యమేన చ, సమ్యగారాధ్య భర్తారం తత్రైనం వశమానయేత్. ౫౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీధర్మవర్ణనం నామ
ద్వాదశోఽధ్యాయః.

---

## త్రయోదశాధ్యాయము.

పితామహుఁడు మరల నిట్లనియె. గేస్తురాలు దాసదాసీజనముకన్నను వృద్ధాప్తాదులకన్నను ముందుగ నిద్రలేచి కాల్యకృత్యములఁ బ్రవర్తింపవలయును. భృత్యజనము గూడ భుజించినవెనుక దా భుజింపవలయును. అందఱు శయనించినవెనుక శయనింపవలయును. భర్తృవిహీనయగువనిత యత్తమామలు గూడ లేకున్న నెంతటి యాపత్కాలముననుగడపను దాటిచనరాదు. వనిత భర్తకన్న మున్నే లేచి యాతఁ డెఱుంగకుండ నెందును బోఁజనదు. రాత్రి సావశేషముగ నున్నప్పుడుగాని యర్ధరాత్రమునందుఁగాని యెందును బోవఁజనదు. ఉషఃకాలముననే గృహసమీపమున నిలచి కార్మికులనందఱి మేల్కొలుపవలయును. వారివారి పనులయందు వారిని నియోగింపవలయును. మగఁడు నిద్ర లేచినవెనుక నప్పు డాతనికిఁ జేయవలసిన యావశ్యకశుశ్రూషణము లొనరింపవలయును. జాగరూకతతో గృహకృత్యము లన్నియు నెఱవేర్చుకొనవలయును. శయనగృహమునకుఁదగినట్లు ధరించిన వేషమును విడచి కార్మికవేషము నూనవలయును. పిదప వరుసగ నాయావేళలఁ జేయఁదగినపనులు చేయవలయును. వంటయింటిని లెస్సగ నలంకరించి పొయ్యి మొదలగు పరికరముల నాయత్తపఱచి సర్వోపకరణోపేతమై యసంబాధమై నిర్మలమునై యుండున ట్లొనరింపవలయును. మహానసము మిగుల రహస్యముగఁగాని మిగులఁ బ్రకటముగ (వెల్లడి) గాని యుండరాదు. విభజింపఁ

---

బ్రహ్మోవాచ:— ప్రథమం ప్రతిబుధ్యేత ప్రవర్తేత స్వకర్మసు, పశ్చాద్భృత్యజనస్యాపి భుంజీత చ శయీత చ. ౧. భర్త్రా విరహితా స్త్రీ చ శ్వశురాభ్యాం విశేషతః, దేహలీం నాతివర్తేత ప్రతీకారే మహత్యపి. ౨. ఉత్థాయ ప్రథమం భర్తురవిజ్ఞాతా న నిష్క్రమేత్, క్షపాయాం సావశేషాయాం రాత్రౌ వా వాసరాదిషు. ౩. తద్వాసభవనస్యైవ శనైరాహూయ కార్మికాన్, స్వవ్యాపారేషు తాన్సర్వాంస్తత్ర తత్ర నియోజయేత్. ౪. విబుద్ధస్య తతో భర్తుర్నిర్వర్త్యావశ్యకం విధిమ్, గృహకార్యాణి సర్వాణి వివధీతాప్రమాదతః. ౫. ముక్త్వా వాసకనేపథ్యం కర్మయోగ్యం విధాయ చ, తత్కాలోచితకర్తవ్యమనుతిష్ఠేద్యథాక్రమమ్. ౬. మహానసం సుసంమృష్టం చుల్ల్యాదివిహితార్చనమ్, సర్వోపకరణోపేతమసంబాధమనావిలమ్. ౭. న చాతిగుహ్యం ప్రకటం ప్రవిభక్తక్రియాశ్రయమ్, భర్తురాప్తజనాకీర్ణం గూఢం కక్షాదివర్జితమ్. ౮.

బడిన వేర్వేరుపనుల కనుకూలమై యాశ్రయమై యుండవలయును. మఱియు మగని యాప్తజనములచే నావృతమై ఘూసాదిమలరహితమై యుండవలయును. మఱియు నచ్చటఁ బాకాదిసాధనము లగుభాండము సున్నము మొదలగుచూర్ణములచే బాహ్యాభ్యంతరదేశముల శోధింపవలయును. భాండాదుల నన్నింటిని రాత్రివేళ నిప్పుతోడను బగలు సూర్యరశ్మితోడను శోధింపవలయును. పెరుఁగుకడవల నెప్పుడు నతిగుప్తముగా నుంపవలయును. పగటివేళ నెండచే శుద్ధముచేయఁబడిన పూర్వోక్తపాత్రములందు యుక్తమగురీతిని బాలు పిదికి సునిపుణముగఁ గాచి రుచిగలపెరుఁగు లభించునట్టు లందుఁ గొంచెము పెరుఁగు జేర్పవలయును. వెన్నపిడతలు గూడ మంచినెయ్యి యగునట్లు పాకము జేయవలయును. తరువాత మగనికిఁ బాకాదివిధులలో నధికారమువహించి షడ్రసములలో నాతని కెద్ది యిష్ట మద్దానిఁ జేయవలయును. అగ్నికార్యమునకుఁ గావలసినవి సమకూర్చవలయును. మఱియు నాతని కెయ్యది పథ్యమో యపథ్యమో యెద్దానిమూలమున భర్తకు స్వాస్థ్యము చేకూరునో యదియంతయు లెస్సగ నెఱింగి దానిఁ జేకూర్చుచుండవలయును. మగనియెడ నిత్యానురాగము గలిగియుండవలయును. ఎల్లప్పుడు సత్కారము జేయుచుండవలయును. సుపరీక్షితమగునాహారము నిచ్చుచుండవలయును. కులక్రమాగతులయిన యాప్తులను మహానసాదులందు నిలిపి గౌరవింపనగును. శత్రువులు, దాయాదులు, వారిబంధువులు, క్రుద్ధులు, భీతులు, నవమానమునొందినవారు, నింద్యుల నాశ్ర

తత్ర పాకాదిభాండాని బహిరంతశ్చ కారయేత్, నిర్ణిక్తమలపంకాని శుక్తివల్కాదిచూర్ణకైః. ౯. నిశి కుర్వీత ధూమార్చిః శోధితాని దివాతపైః, దధిపాత్రాణి కుర్వీత సదైవాంతరితాని చ. ౧౦. సాధుకారితదుగ్ధేషు శోధితేషు దివాతపే, ఈషద్ధ్రవాద్యుక్త పాత్రేషు స్వచ్ఛం యేన భవేద్దధి. ౧౧. స్నేహగోరసపాకాది కృత్వా సుప్రత్యవేక్షితమ్, కుర్యాత్స్వయమధిష్ఠాయ భర్తుః పాకవిధిక్రియామ్. ౧౨. కిం ప్రియం చ కిమాగ్నేయం షడ్రసాభ్యంతరేషు చ, కిం పథ్యం కిమపథ్యం చ స్వాస్థ్యం వాస్య కథం భవేత్, ఇతి యత్నాద్విజానీయాదనుష్ఠేయం చ తత్తథా. ౧౩. నిత్యానురాగం సత్కారమాహారం సుపరీక్షితమ్, మహానాసాదౌ కుర్వీత జనమాప్తం క్రమాగతమ్. ౧౪. శత్రుం దాయాదసంబంధం క్రుద్ధభీతావమానితమ్, అవాచ్యోపగృహీతం వా నైవ

యించినవారు ముస్నగువారిని మహానసాదుల నియోగింపరాదు. తానే మహానసాదుల కధికారిణియై కావలసినవస్తువులను బ్రతిష్ఠాపించుచుఁ దనయధికారమును గుప్తముగ నుంచుకొనవలయును. ప్రమాదలేశము గూడ నొందక మగని కాహారపానాదు లాచరింపవలయును. పాక వ్యాపారము ముగించి పరివారపునలసట దీర్చి ప్రదేశము సమ్మార్జనముచే శుద్ధిచేసి చందనతాంబూలమాల్యాదుల నల్పముగా నాయితము గావించి యుచితసమయమున సవినయసంభ్రమముగ యథాయోగ్యముగ నాహారాదుల నిచ్చుచుండవలయును. స్వాస్థ్యముగలవేళను వ్యాధితో నుండు సమయమున నాహారవిపర్యయము నెల్లవేళల నేమరక యొనరించుచుండ వలయును. వైపరీత్యముతోడనే యాయాకాలముల నాహారపానాదు లారోగ్యము నొసంగునని యారోగ్యశాస్త్రజ్ఞులయభిప్రాయము. భర్త యెవ్వరెవ్వరిని హీనముగను దుల్యముగ నధికముగఁ జూచునో వారిని దాను నట్లే న్యాయము ననుసరించి గౌరవించుచుండవలయును. సవతుల సంతానమును దనసంతానముకన్న నెక్కుడు ప్రేమతోఁ బెంపవలయును. సవతులఁ దనచెల్లెండ్రవలెను వారిబాంధవుల నిజబాంధవులవలెను జూచుకొనవలయును. గ్రాసాచ్ఛాదనాభ్యంజనాభవ్యవహారాదుల నలంకరణములను దొలుత సవతులకును వారియాశ్రితులకు నొసంగి పిదపఁ దాఁజేసుకొనవలయును.తనకుగానిసవతులకుగాని యాశ్రితజనమునకుగాని. యేదైన వ్యాధిసంభవించినఁ దన్నివృత్తికగు నౌషధాదుల నాదరముతో

---

మాదీని యోజయేత్. ౧౭. పునః పునః ప్రతిష్ఠాప్య గుప్తం స్వయమధిష్ఠితమ్, భర్తు రాహారపానాది విదధ్యాదప్రమాదతః. ౧౬. పాకం నిర్వర్త్య మాత్రాణాం కృత్వా స్వేదప్రమార్జనమ్, గంధతాంబూలమాల్యాది కించిదాదాయ మాత్రయా. ౧౭. యథా చిత్యాదితత్కాలే భర్తుర్వినయసంభ్రమైః, తత్కాలానుగతాత్యర్థమాహారముపపాద యేత్. ౧౮. స్వభావామయకాలానాం వైపరీత్యేన సర్వదా, సర్వమాహారపానాది ప్రయోజ్యం తద్విదో జగుః. ౧౯. హీనతుల్యాధికత్వేన భర్తా పశ్యతి యం యథా, తం తథైవాధికం పశ్యేన్న్యాయతః ప్రతిపత్తిషు. ౨౦. సాపత్న్యకాన్యపత్యాని పశ్యే త్స్వేభ్యో విశేషతః, భగినీవత్సపత్నీశ్చ తద్వధూన్నిజబంధువత్. ౨౧. గ్రాసాచ్ఛాద శిరోభ్యంగ స్నానమండనకాదికమ్, సపత్నీనామకృత్వా తు ఆత్మనోఽపి న కారయేత్. ౨౨. వ్యాధితానాం చికిత్సార్థమౌషధాదిక మాదరాత్, విదధ్యాదాత్మనస్తాసాం

నిచ్చుచుండవలయును. వారు శోకించుచున్నఁ దాను నట్లే యుండ వలయును. వారు సంతోషించుచుండఁ దానును ముదమందవలయును. భృత్యులు బందుగులు సవతులు ననువారితో సమానములగు సుఖ దుఃఖములు గలిగియుండవలయును. యథావకాశముగ నిద్రింపవచ్చును. రాత్రి నిద్రించుచు నడుమలేచి యస్థానవ్యయమునుగుఱించి మగనికి రహస్యముగ బోధించుచుండవలయును. సవతుల యవినయమును స్వయముగ భర్త కెఱిఁగింపరాదు. వారిదుశ్శీలత యపాయకరమైనచో రహస్యమునఁ దప్పక మగని కెఱిఁగింపవలయును. దౌర్భాగ్యము గలిగియున్నను సంతానవిహీన యైయున్నను మగనిచే నవమానింపఁబడినను సవతి దుష్ట స్వభావముగలది గాకున్న మంచిమాటలఁదేర్చి మగనితోనామెను గూర్ప వలయును. అట్టులే వాక్పారుష్యముచేఁగాని దండపారుష్యముచేఁగాని మగనిచేఁ బీడింపఁబడిన భృత్యాదులఁ గూడ నాశ్వాసించి విధేయులుగాఁ జేయవచ్చును. దానివలన దోషము సంభవింపనుండెనేని యట్లొనరింప రాదు. బహుకాలము గడచినవెనుక నంతదనుకఁ దనకు సంతానము గలుగనిచో నందులకై మగనిజేరి యాత్మనివేదనము జేయవలయును. మఱియు మగఁ డెద్ది యొనరింప నెంచియుండె నద్దాని నెఱుంగనిదానివలె నటించి యెఱింగి యాతనియెదుట సిద్ధముగఁ జేయవలయును. మఱియు నాతఁడు మఱియొక వివాహము జేసుకొనఁగోరియుండెనేని యత్యుత్సాహముతోఁ దానే ముందంజవైచి యథావిధిగ వివాహ మొనరించి యాపరిణీ

---

సర్వాశ్రితజనస్య చ. ౨౩. తచ్ఛోకే శుచమాదద్యాత్తత్తుష్టౌ ముదమావహేత్, భృత్యబంధుసపత్నీనాం తుల్యదుఃఖసుఖా భవేత్. ౨౪. లబ్ధావకాశా స్వప్యాచ్చ నిశి సుప్తోత్థితా క్రమాత్, అన్యత్ర వ్యయకర్తారం పతిం రహసి బోధయేత్. ౨౫. యదవద్యం సపత్నీనాం స్వయమస్మై న తద్వదేత్, దౌఃశీల్యాది తు సాపాయం గూఢమస్మై నివేదయేత్. ౨౬. దుర్భగామనపత్యాం వా భర్త్రా చాతితిరస్కృతామ్, అదుష్టాం సమ్యగాశ్వాస్య తేనైతామనుకూలయేత్. ౨౭. తథా వాగ్దండపారుష్యైర్జనం భర్త్రా విపీడితమ్, కుర్యాద్విధేయమాశ్వాస్య న చేద్దోషాయ తద్భవేత్. ౨౮. మత్వాత్మనోన పత్యత్వం కాలం చాపి గతం బహుమ్, సంతానాదికముద్దిశ్య కార్యమాత్మనివేదనమ్. ౨౯. యచ్చాన్యదపి జానీయాత్కించిదస్య చికీర్షితమ్, తత్కిలాజానతీవాస్య సిద్ధమేవ ప్రదర్శయేత్. ౩౦. వైవాహికం విధిం భర్తుః సర్వం కృత్వా ససంభ్రమమ్, పరిణీతాం

తను దనచెలియలివలెఁ జూచుకొనవలయును. సంతోషితస్వాంతముతో నానవోఢయొక్క బంధువర్గమును బూజించి వారికి మనోహరములయి మంగళకరములగు నాభరణములఁ గానికలుగా నొసంగవలయును. మఱియు నానవోఢను జననిపగిదిఁ గార్యకాలముల శిక్షించుచు నిర్మత్సరయై యామె పట్లఁ జరింపవలయును. ఆచార్యకము వహించి యత్నమున నామె కన్ని విషయము లుపదేశించుచుండవలయును. ఇట్లు భర్త యభిప్రాయము నంతను సక్రమముగ నెఱవేర్చుచుండవలయును. సర్వకాలావస్థలందును నారీమణికి భర్తయే యధిదేవత. కావున సుఖము లభింపలేదని యాతని నిందింపరాదు. వర్ణములకు బ్రాహ్మణుఁడును నాతని కగ్నియుఁ బ్రజలకు రాజన్యుఁడును దేవతలు. స్త్రీలకు ధర్మార్థకామములను త్రివర్గము సిద్ధించుటకుఁ గారణములు రెండుద్దిష్టములయ్యె. అందు మొదటిది భర్త కనుకూలరై యుండుట. స్థిరమగుసత్స్వభావము గలిగియుండుట రెండవయది. మగనిని లోఁబరచుకొనుటలో భర్తృచిత్తానుసరణమువలె నామె యౌవనముగాని సౌందర్యముగాని యలంకారములుగాని సమర్థములు గావనుట నిక్కువము. ప్రియానుకూలత్వ మొక్కటియే దానికి దివ్యౌషధమువంటిది. యౌవనలావణ్యాదు లెన్నియున్నను మనోహారిణులయియున్నను దుర్భగలగు యువతులు పెక్కురగపడుచున్నారు గదా. రూపాదులు లేకున్నను యౌవనము గతించినను వల్లభలగువారును బెక్కురు గలరు. కావున లోకమున యోగ్యతకు మూలకారణము ప్రియత్వ మొక్కటియే. అది లేకయుండిన మిగతగుణము లెన్నియున్నను

---

చ తాం పశ్యేన్నిత్యం భగినికామివ. ౩౧. పూజాం సంబాధివర్గస్య మంగలం మండలాని చ, కుర్యాదభినవోఢాయాః సుప్రహృష్టేన చేతసా. ౩౨. మాతృవచ్ఛిక్షయేదేనాం గృహకృత్యేష్వమత్సరా, ప్రదేశికవిధిం వాస్యా విదధ్యాద్యత్నతః స్వయమ్. ౩౩. ఏవం భర్తురభిప్రాయ సర్వమిత్యాది కారయేత్, సుఖార్థం వాపి సంత్యజ్య స్త్రీణాం భర్తాధిదేవతా. ౩౪. భర్తాధిదేవతా నార్యా వర్ణా బ్రాహ్మణదేవతాః, బ్రాహ్మణా హ్యగ్నిదేవాస్తు ప్రజా రాజన్యదేవతాః. ౩౫. తాసాం త్రివర్గసంసిద్ధౌ ప్రదిష్టం కారణద్వయమ్, భర్తుర్యదనుకూలత్వం యచ్చ శీలమవిప్లుతమ్. ౩౬. న తథా యౌవనం లోకే నాపి రూపం న భూషణమ్, యథా ప్రియానుకూలత్వం సిద్ధం శశ్వదనౌషధమ్. ౩౭. వయోరూపాదిహారిణ్యో దృశ్యంతే దుర్భగాః స్త్రియః, వల్లభా మందరూపాశ్చ

వంధ్యవలె నిష్ప్రయోజనము లగును. అవియనర్థమునకుఁగూడఁగారణము లగును. అదిగాన నెంతయత్నించియైన నాత్మ యోగ్యతను సంపాదించుకొనవలయును. మఱియుఁ బరాభిప్రాయాభిజ్ఞత్వము సర్వకర్మమూలభూతమైయున్నందున నందులకై యత్నింపవలఁయును. పెనిమిటి బయటకుఁబోయి వచ్చుసమయము నెఱింగి తత్కాలోచితముగ గేహదేహము లలంకరించుకొని యాతని కాసనము సిద్ధపఱచి యాతనిరాక కెదురుచూచుచు నేమి యానతిచ్చునో యని యవసరమును వేచియుండవలయును. ఆతఁ డేతేర నుత్సుకయై ససంభ్రమముగ స్వయముగ నాతనికిఁ బాదప్రక్షాళన మాచరించి పరిచారికను జీరి వీవన మొదలగువానిచే నుపచరింపఁజేసి యాతని యలసట దీర్చి స్వేదాపనోదనము జేయవలయును. స్నానపానాదులయెడ నాతనియింగిత మెఱింగి తదభిమతపదార్థముల నాయత్తపఱచి యాతనికిఁ దెలుపవలయును. సపత్నులకును మగనిచుట్టములకు నతనిమనస్సున కనుకూలమగున ట్లుపచారములు జేయనగును. తనబంధువులయెడ మాత్ర మట్టిశ్రద్ధ గలిగియుండరాదు. పెనిమిటిమనస్సు తనబందుగులయెడను దనయెడల నెట్లు ప్రవర్తించునో యెఱింగి యాతనిచిత్తప్రసాదము సంపాదింపవలయును. ఆతనిచిత్తము నిర్మలమైయున్నను తనవారివిషయమున గౌరవము బాటింప నక్కరలేదు. భర్త కభిమతయై భర్తృకులవాసిని యగునారి స్వబంధులను భర్త్రభిమతములగు సత్కారములచే సత్కరించిన నింద్యురాలు గానేరదు. సర్వావస్థలందును యువతులసంబం

---

బహోర్వ్య గలితయావనాః. ౩౮. తస్మాత్ప్రియత్వం లోకానాం నిదానం యోగ్యతా పరమ్, తాం వినాన్యే గుణా వంధ్యాః సర్వేఽనర్థకృతోఽపి వా. ౩౯. తస్మాత్సర్వప్రయత్నేన విదధ్యాదాత్మయోగ్యతామ్, పరచిత్తజ్ఞతా చాస్యా మూలం సర్వక్రియాస్వితి. ౪౦. బహిరాగచ్ఛతో జ్ఞాత్వా కాలం సంమృజ్య భూమికామ్, సజ్జీకృతాసనా తిష్ఠేత్తస్యాజ్ఞాం ప్రతి తత్పరా. ౪౧. స్వయం ప్రక్షాలయేత్పాదావుత్థాప్య పరిచారికామ్, తాలవృంతాదికైః కుర్యాచ్ఛ్రమస్వేదాపనోదనమ్. ౪౨. ఆహారస్నానపానాదౌ సస్పృహం యత్ర లక్షయేత్, తదింగితజ్ఞా తత్తేన సిద్ధమస్మై నివేదయేత్. ౪౩. సపత్నీపతిబంధూనాం భర్తృచిత్తానుకూల్యతః, ప్రతిపత్తిం ప్రయుంజీత స్వబంధూనాం న వై తథా. ౪౪. తేషు చాత్మని చ జ్ఞాత్వా భర్తృచిత్తం ప్రసాదయేత్, ప్రతిపత్తిం తథాప్యేషాం నాద్రియేత స్వబంధుషు. ౪౫. అపి భర్తురభిప్రేతం నారీ తత్కుల

ధమే పూజనీయమైనది. అట్టిచో సత్కులప్రసూతుఁ డగుపురుషుఁడు స్త్రీసంబంధముకంటె నింకొకయుపకారము బొంద నిచ్ఛగించునా? వరుని బూజించి విధ్యుక్తముగఁ దనకూఁతు నాతని కొసంగి పిమ్మట యామెనుండి యేమైన నొంద నిచ్ఛగించుటకన్న నకార్య మేమి గలదు? కన్నె నిచ్చి తమకు వృత్తిని గల్పించుకొనుట దాసభండనటాదులు జేయవలసినది గాని యుత్తముల త్రోవ గాదు. అక్కతన వధూబంధువులు సర్వకాలములను సంబంధులనుండి ప్రీతిమాత్రసాధనంబై ప్రసంగసంప్రాప్తమగు గౌరవమును మాత్రమే కోరఁదగుదురు. దానినే కైకొనఁదగుదురు. పుత్రికకు నల్లునకుఁ బరస్పరప్రేమ లభివృద్ధినొందించి లోకనిందనుండి కాపాడఁదగియుందురు. సాధువర్తనముగలజనులు వాస్తవమగుజనాపవాదము దనయెడ లేకున్న నున్నట్టులే భావించి తదనుకూలముగఁ బ్రవర్తించుచుందురు. ఇటులు సద్వర్తనము నెఱింగి యువతి యెల్లప్పుడు నట్లు ప్రవర్తింపఁదగును. ఎటులు ప్రవర్తించిన మగనిపరివారమునకును మగనికి నభిమతయై ప్రియయై సద్వర్తనముగలదై సర్వజనాభినందనపాత్రమునై యసమానయశోవిరాజితయై వెలయునో! వస్తుతః లేకున్నను సంభావితమగు జనాపవాదముచేత నేగదా! సీతామహాదేవి సుదారుణమగు ననర్థమును బొందెను. అందలు ననుభవించుటకు యోగ్యయై యుండుటచేతను గుణదోషముల నెఱుంగకుండుటచేతను తఱుచుగా నవినయమునకుఁ బుట్టినిల్లయి యుండుటచేతను స్త్రీలవృత్తము దుష్కరమే యగును.

---

వాసినీ, సత్కారైర్నిజబంధూనాం తేన నోపైతి వాచ్యతామ్. ౪౬. పూజ్య ఏవ హి సంబంధః సర్వావస్థాసు యోషితామ్, కస్తతోఽప్యుపకారాంశం లిప్సేత కులజః పుమాన్. ౪౭. సంపూజ్య స్వసుతాం తస్మై విధివత్ప్రతిపాద్యతే, తతోఽస్యా లిప్సతే నామ కిమకార్యమతః పరమ్. ౪౮. కన్యాం ప్రదాయ యైర్వృత్తిరాత్మనః పరికల్ప్యతే, దాసభండనటాదీనాం మార్గోయం న మహాత్మనామ్. ౪౯. తస్మాత్స్త్రీ న బాంధవా నిత్యం ప్రీతిమాత్రైకసాధినీమ్, ప్రతిపత్తిం సమాదద్యుః సంబంధిభ్యః ప్రసంగినీమ్. ౫౦. తస్యా భర్తరి రక్షేత ప్రీతిం లోకే చ వాచ్యతామ్, ఆత్మనోఽసత్ప్రవాదం చ చేష్టేరన్సాధువృత్తయః. ౫౧. ఏవం విజ్ఞాయ సద్వృత్తం స్త్రీ వర్తేత తథా సదా, యేన తత్పరివర్గస్య భవేద్భర్తుశ్చ సంమతా. ౫౨. ప్రియాపి సాధువృత్తాపి విఖ్యాతాభిజనాపి చ, జనాపవాదాత్సంప్రాప సీతానర్థంసుదారుణమ్. ౫౩. సర్వస్యామిషభూతత్వాద్గుణదోషానభిజ్ఞతః, ప్రాయేణావినయాచిత్యాత్ స్త్రీణాం వృత్తం హి దుష్కరమ్. ౫౪.

మనోనిగ్రహము దుష్కరమై యుండుటను తలుచు గపటస్వభావము గలిగి యుండుటచేతను లోకము నిరంకుశమై యుండుటను సౌశీల్యము గలిగి యున్న యువతులయినను జనాపవాదమునకు లోనగుదురు. స్త్రీల చిత్తము పరిశుద్ధమైనను దైవయోగమునఁగాని, చిత్తవృత్తి నిరోధింప లేకుండుటచేఁగాని వ్యవహారజ్ఞానము లేకుండుటచేఁగాని జనప్రవాదము నాపదలును సంభవించుచుండుట గాంచుచున్నాము. వారలకు దైవకృతమునకుఁ బ్రతీకార మనుభవముకన్న వేరేమియు లేదు. మిగత రెండింటికిని నుత్తమచారిత్రమును లోకవృత్తాంతాభిజ్ఞత్వమును దివ్యౌషధములగును. చిత్తవిభ్రమహేతువు లగుపల్లకి మొదలగువానిలోని విహారములందుఁ బ్రసంగము గలిగియుండి రాత్రివేళలఁ జరించుయువతిని విటకాండ్రతో రమించుచు స్వేచ్ఛగ విహరించువిధవను, సత్స్వభావము గలిగి యున్నను యానగానాదిసంబంధముగల వృద్ధపత్నీ ప్రభృతులను సతులని యెవ్వఁడును విశ్వసింపఁడు. ఆమె స్వతఃసాధుశీలయే యైననియ్యది లోకస్వభావ మైయున్నది. సందిగ్ధార్థమును వెలిబుచ్చుయువతులయింగితాకృతులతత్త్వపరిజ్ఞానము యోగిప్రత్యక్షవిషయము గావలయునుగాని సామాన్యమానవులకుఁ బ్రత్యక్షము గాదు. అక్కతనఁ బైఁజెప్పినచొప్పున నతిజాగరూకతతో నెల్లప్పుడును యువతి సదాచారము ననుష్ఠించుచుండవలయును. అసత్యమూలకముగ నుద్భవించినను జనాపవాదము కులమును గంపింపఁజేయక మానదు. కులవధువులు

---

అగృహ్యత్వాన్మనోవృత్తేః ప్రాయః కపటదర్శనాత్, నిరంకుశత్వాల్లోకస్య నిర్వాచ్యా విరలాః స్త్రియః. ౫౫. దైవయోగాదయోగత్వాద్వ్యవహారానభిజ్ఞతః, వాచ్యతాపత్తయో దృష్టాః స్త్రీణాం శుద్ధేఽపి చేతసి. ౫౬. తాసాం దైవప్రతీకారో నోపభోగాదృతే భవేత్, చారిత్రం లోకవృత్తం చ ఏతయోర్విదురౌషధమ్. ౫౭. హిందోలకాది క్రీడాయాం ప్రసక్తాం తరుణీం నిశి, రమమాణాం విటైః సార్ధం విధవాం స్వైరచారిణీమ్. ౫౮. వృద్ధాదిభార్యాం సజ్జాయాం యానగేయాదిసంగినీమ్, కః శ్రద్దధ్యాత్సతీత్యేవం సాధ్వీమపి హి యోషితమ్. ౫౯. యాః చాసామింగితాకారా సందిగ్ధార్థప్రసాధకా, తయోస్తత్త్వపరిజ్ఞానం విషయో యోగినాం యది. ౬౦. తస్మాద్యథోక్తమాచారమనుతిష్ఠేత్సుసంయతా, మిథ్యాలగ్నోఽప్యసద్వాదః కంపయత్యేవ తత్కులమ్.

పితృమాతృభర్తృకులములను నిందపాలొనరింపరాదు. సద్యశము గలి గించి వెలయింపవలయును. భర్తకు సత్సంతానము గలిగించి త్రివర్గంబు సిద్ధింపఁజేయవలయును కులవధువు దుఃశీలయయినచోఁ దనను మూఁడు వంశములను గూడ ఘోరనరకముపాలు జేసియే తీరును. సుశీలతయే భూషణముగా గొనుసాధ్వీమతల్లులు తమతోఁబాటు మూఁడువంశములను గూడ వెంటనే యుద్ధరింతురు. భర్తృచిత్తానువర్తనముగలిగి యవిప్లుత మగుశీలముతో నొప్పారుయువతులకురత్న సువర్ణాద్యాభరణములు భార రూపము లేగాని యలంకరణములు గావు. పవిత్రకులసంభవలగు యువతు లకు సర్వాధికమగు లోకజ్ఞానమును శాశ్వతమగు పతిభక్తియు నను నీరెండును కులవ్రతములుగా నెఱుంగనగును. కావున నేవనిత లోక మును భర్తను లెస్సగ నారాధించునో యామె పాపదూరయై శాశ్వత ముగ ధర్మార్థకామములఁ బడయును. ఇందేమియు ననుమానము లేదు.

ఇది త్రయోదశాధ్యాయము.

---

## చతుర్దశాధ్యాయము

పితామహుండు మఱియు నిట్లు చెప్ప మొదలిడెను. సుశీలలగు యువతులకు భర్త ప్రోషితుఁడైనకాలమున మంగళసూచకమగు నాభర

---

౬౧. త్రికుల్యా వాచ్యతా రక్ష్యా ప్రతిష్ఠాప్యాః సంతతిః, భర్తుస్త్రివర్గసిద్ధిశ్చ సాధ్యం తత్కులయోషితామ్. ౬౨. పాతయంత్యేవ దౌఃశీల్యాదాత్మానం సకులత్రయమ్, ఉద్ధరంతి తదైవైతాః స్త్రియశ్చారిత్రభూషణాః. ౬౩. భర్తృచిత్తానుకూలత్వం యాసాం శీలమవిచ్యుతమ్, తాసాం రత్నసువర్ణాది భార ఏవ న మండనమ్. ౬౪. లోక జ్ఞానే పరా కోటిః పత్యౌ భక్తిశ్చ శాశ్వతీ, శుద్ధాన్వయానాం నారీణాం విద్యాదేత త్కులవ్రతమ్. ౬౫. తస్మాల్లోకశ్చ భర్తా చ సమ్యగారాధితో యయా, ధర్మమర్థం చ కామం చ సైవాప్నోతి నిరత్యయా. ౬౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి వివాహధర్మేషు స్త్రీధర్మకథనం నామ త్రయోదశోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ—ప్రోషితే మండనం స్త్రీణాం పత్యౌ మంగలమాత్రకమ్, నిష్ప్రా

ణముమాత్రమే ధార్యమగును. ప్రారంభించిన కార్యము ముగింపకయే భర్త ప్రవసించెనేని యాకార్యమును ప్రయత్నపూర్వకముగ నిష్పాదింపవలయును. గురుసాన్నిధ్యమున శయ్య గల్పించుకొనఁ జనును. శరీరమున కెట్టి సంస్కారము నాచరించుకొనరాదు. కావలసినయర్థముల నార్జింపవలయును. వ్యయము మాత్ర మొనరింపరాదు. వ్రతములందు నుపవాసములందు నాసక్తి గలిగియుండవలయును. అనుక్షణమును మగని యుదంత మరయుచుండవలయును. దైవజ్ఞులను సోదెచెప్పువారిని బిలచి మగనిగూర్చి ప్రశ్నించి తెలిసికొనుచుండవలయును. దేవతల నారాధించుచుండవలయును. ప్రతిదినముఁ బతియాగమనము నాశంసించుచు నాతనికి క్షేమము గలుగుఁగాతమని యిష్టదైవతముల మ్రొక్కుచుండవలయును. సర్వజనచిత్తాకర్షణమయి యత్యుజ్జ్వలమగు వేషము ధాల్పరాదు తైలాభ్యంగాదులను విసర్జింపవలయును. అత్యవసర కార్యమున కేనియు జ్ఞాతిగృహములకుఁ బోరాదు. గురువుల (అత్తమామలు) యానయున్న చో మగనియాప్తజనముతోఁగూడి పోనగును. అప్పుడైనఁ బోయిన చోటఁ జిరకాలము వసింపరాదు. అట స్నానాదులు గూడఁ జేయరాదు. పనియగునంతవర కొక్కక్షణము మాత్ర మట నిలచి. యతిత్వరితముగ నిజగృహముఁ జేరవలయును. ప్రియుఁడు ప్రవాసము ముగించి యిట చేరఁగనే తాను దాత్కాలికవిధుల నిర్వర్తించుకొనవలయును. ఆతఁడు జలకమాడి హితమగునాహారము భుజించి యుండఁగా వెనుకటికన్న నెక్కువగాఁ దన్నలంకరించుకొని సంతోషపరిపూరితాంతరంగయై మున్నొనర్చిన దేవపూజాదులయుపహారముల నన్నింటిని నాతనికి నివే

---

దనం చ యత్నేన తదారబ్ధస్య కర్మణః. ౧. శయ్యా గురుసమీపే స్యాద్దేహసంస్కారవర్జనమ్, సముపార్జనమర్థానాం వ్యయానాం పరిహాపణమ్. ౨. వ్రతోపవాసతాత్పర్యం తద్వార్తాపరిమార్గణమ్, దైవజ్ఞేక్షణికప్రశ్నో దేవానాముపయాచనమ్. ౩. నిత్యం తస్యాగమాశంసా క్షేమార్థం దేవపూజనమ్, న చాత్యుజ్జ్వలవేషత్వం న సదా తైలధారణమ్. ౪. జ్ఞాతివేశ్మ న గంతవ్యం సకామగమనేన చ, గురూణామాజ్ఞయా యావద్భర్తురాప్తజనైః సహ. ౫. తత్రాపి న చిరం తిష్ఠేత్స్నానాదీన్యాపి నాచరేత్, యావదర్థం క్షణం స్థిత్వా తతః శీఘ్రం సమాచరేత్. ౬. ఆగతే ప్రకృతిస్థైవ కృత్వా తాత్కాలికం విధిమ్, ముక్తప్రవాసనే పథ్యే స్నాతే భుక్తవతి ప్రియే. ౭. ఆత్మానం సమలంకృత్య సవిశేషం ముదాన్వితా, దేవపూజోపహారాదీన్ దద్యాత్ప్రాగుపపాదితాన్. ౮.

దింపవలయును. ఆతనిభార్యలలోఁ దాఁ గనీయసియగుచోఁ దనకన్నఁ బెద్దదానిని తల్లివలె నామె సంతానమును తనవలెను నామె పరివారమును దనపరివారమువలెను జూడఁదగును. ఆమెయెదుటఁ దానాసనమునఁ గూర్చుండరాదు. భర్తను బిలువరాదు. జ్యాయసి యగుసపత్ని యానతి చొప్పున సర్వకార్యములు నిర్వర్తించుచుండవలయును. ఆమెకు విరోధులగువారితోఁ గలియరాదు. ఆపెకుఁ బ్రియులగువారితో సఖ్యము జేయవలయును. శీలమునకు విరోధము గలుగకున్నచో నిట్టు లాచరింపనగును. పెనిమిటికి నామెకు నాప్తతమమగుజనము నెల్లవేళల సన్మానింపవలయును. పుట్టినింటినుండి తెచ్చినధనమును సుగంధద్రవ్యములను దొలుత మగనికి నివేదించి పిదపఁ దా నుపయోగించుకొనవలయును. ఆతఁడు నామెకుఁ బ్రీతి గలుగునట్టు లావస్తువులలో నల్పమూల్యమగు నొకవస్తువును గ్రహింపవలయును అట్లు గ్రహించిన యావస్తువును రహస్యముగ దాచి తల్లియెడకన్న నెక్కుడభిమానముతోఁ జూచుకొనుచు నతిప్రేమతో నావస్తువు నుపయోగింపవలయును అటులు గ్రహింపక యూరకున్నను గ్రహించి యభిమానింపకున్నను భార్యకు వైమనస్యము గలుగును. తరువాత నావస్తువును ప్రసంగముగలిగినప్పుడు సగౌరవముగ నామెకే యొసఁగవలయును. ఆఁడువారికిఁ దఱుచుగ మాత్సర్య ముద్భవించుట కసమానమగు కారణము సవతులు గలిగియుండుటకన్న వేఱెద్దియు లేదు. కావునఁ బురుషుఁ డత్యుదారస్వభావముగలిగి యాసాపత్న్యమును బరిహరించుకొనవలయును. ఉదారభావము గలపురుషుఁడు భార్యలనంద

---

కనిష్ఠా మాతృవజ్జ్యేష్ఠాం తదపత్యాని చాత్మవత్, పశ్యేత్తత్పరివర్గం తు నిత్యం స్వపరివర్గవత్. ౯. తత్పురోనాసనే తిష్ఠేత్పతిం నామంత్రయేత చ, తదభిప్రాయతః కుర్యాత్ప్రవృత్తిం సర్వకర్మసు. ౧౦. న సంసృజేత తద్విష్టైః సఖ్యం కుర్వీత తత్ప్రియైః, జనమాప్తతమం తస్య సదా భర్తుశ్చ మానయేత్. ౧౧. పైతృకాత్సముపానీతం వసుసౌగంధికాదికమ్, తస్మై నివేద్యాత్మతయా తదా తదుపయోజయేత్. ౧౨. సోఽపి తత్ప్రీతయే కించిడాదద్యాదల్పమూల్యకమ్, సంగోప్య మాతృవత్సేయం తత్తథైవోపయోజయేత్. ౧౩. తత్ప్రీత్యర్థం గృహీతం యద్వైలక్ష్యాదినివృత్తయే, సవిశేషం ప్రసంగేన తస్యై తత్ప్రతిపాదయేత్. ౧౪. స్త్రీణాం యదేతత్సాపత్న్యం పరం మాత్సర్యకారణమ్, తస్మాత్తత్పరిహర్తవ్యం పరమోదారచర్యయా. ౧౫. తథా కల్పితనేపథ్యా భర్తుః పర్యాయవాసరే,

అను బర్యాయముగ గౌరవింపవలయును. అందుఁ బ్రతియువతియుఁ దనవంతువచ్చినదినమునఁ జక్కఁగ నలంకరించుకొని పెనిమిటికడ కరుగఁ జనును. అట్లు చని యేకాంతమున మగని గూడి యాతనియభిప్రాయమున కనుకూలముగఁ దత్కాలోచితములగు నానావిలాసములతో నాతని నుపచఱింపవలయును. పిమ్మట నుచితసమయమున మేల్కని సలజ్జయయి నిజగృహమునకుఁ బోవలయును. చిన్నయామె పెద్దలయొద్దకుఁ బోఁజనును. జ్యేష్ఠకుఁ బ్రతికూలముగాకయునికియు నితరయువతులకు హితముగ నుండుటయు నెల్లవారికి యోగ్యమయినది. ఇటులుండి యితరసవతుల కన్నఁ దనయెడ నభిమానము గలిగియుండునట్లు మగని నొనరించుకొనవలయును. బాహ్యములగు పాకాదికర్మలచేతను రహస్యగతములగు నఱువది నాల్గుకళలచేతను బెద్దభార్యయెడకన్నఁ దనయెడ నభిమానము పెరుగునట్లు భర్తను రంజింపఁజేయవలయును. స్త్రీలకు రహస్యమునఁ బ్రాగల్భ్యమును వేఱుసమయములందు లజ్జాధిక్యము నుచితమయినవి. మనస్సును బుద్ధిని ననుసరించి భర్తను సేవించుట యుత్తమంబగుధర్మము. ఈవిధముగ భర్త నారాధించి వశపఱచుకొని క్రమముగ గృహము గూడ నాక్రమించి వశపఱచుకొనవలయును. ఇటులైనను జ్యేష్ఠాదు లందు గౌరవప్రతిపత్తులను మాత్రము విడువరాదు. అట్టిమాదిరిగనే గృహవ్యాపారములందును దానములందును బెద్దదగుసవతి యోర్వ లేమిచే నధికారబలమునఁ దనను నిర్బంధించువిషయమును భర్తకు నిగూఢ

---

ప్రియమాదయమానేవపతిం గచ్ఛేద్విసర్జితా. ౧౬. గత్వా రహసి భర్తారం తత్కాలో చితసంభ్రమైః, తద్భావానుగతైస్తైస్తైః సవిశేషముపాచరేత్. ౧౭. ప్రతిబుధ్య తతః కాలే సవిశేషం త్రపాన్వితా, జ్యేష్ఠాయా వసతిం గచ్ఛేద్విశేషేణ తథా పునః. ౧౮. అప్రాతికూల్యం జ్యేష్ఠాయా హితమన్యత్ర యోషితః, తతః శనైస్త్వవచ్ఛిద్య పతిం స్వవశమానయేత్. ౧౯. బహిష్పాకాదియోగేన చతుఃషష్ట్యా రహోగతమ్, జ్యేష్ఠా మతిశయానేవ భర్తారముపరంజయేత్. ౨౦. ప్రాగల్భ్యం రహసి స్త్రీణాం లజ్జాధిక్యం తతోఽన్యదా, చిత్తజ్ఞానానువృత్తిశ్చ పత్యౌ సంసేవనం పరమ్. ౨౧. ఏవమారాధ్య భర్తారం గృహమాక్రమ్య చ క్రమాత్, గౌరవం ప్రతిపత్తిం వా జ్యేష్ఠాదిషు న హాపయేత్. ౨౨. గృహవ్యాపారదానేషు పతిం గూఢం తథా వదేత్, అధికుర్యా దనిచ్ఛంతీ జ్యేష్ఠైవేనాం యథా బలాత్. ౨౩. సాపి విజ్ఞాయ భర్తారం కనిష్ఠాకృష్ట

ముగ నెఱింగింపవలయును. జ్యేష్ఠయుఁ బతి కనిష్ఠావశవర్తి యగు టెఱింగి విశ్రామమును బ్రార్థింపవలయును. మఱియుఁ జిన్నసవతినిఁ గూఁతువలెఁ బ్రేమింపవలయును. ఆమెపై నధికారము గలిగియుండవలయును. పెనిమిటియిష్టము నెఱింగి తనగౌరవము గాపాడుకొనుచు నాతనియభిమతము నొడగూర్చుచు నతని నానందింపఁజేయవలయును. లోకమున భృత్యులు స్వామియిష్టమునకు విరుద్ధముగ నెన్నఁడు నాచరింపరాదు. అటులు పరాయత్తజీవనుఁడైనను జనుఁడు మూఢుఁడై స్వతంత్రించి క్లేశభాజన మగుచున్నాఁడు. కావున సర్వకాలసర్వావస్థలందును మనోవాక్కాయకర్మలచే స్వామ్యనుకూలుఁడై యుండుట సేవకునకు హితమైనది. అందును వనితల కది ముఖ్యమయియున్నది. ఆజ్యేష్ఠయు సుగుణములకతనఁ బతిని గృహతంత్రమును లోఁబరచుకొని ధీరయై వెనుకటియవస్థను మఱువరాదు. సౌభాగ్యమువలనిమదము బొందరాదు. ఔద్ధత్యాది వికారములను విడువఁదగును. ఎల్లవేళల గృహతంత్రాదుల నిర్వర్తించుచు నమ్రురాలై యుండవలయును. అటుగాకున్న యనార్య (దుష్ట) యని నిందింతురు. మగనియెడ యోగ్యత సంపాదించుకొనుటచే సౌభాగ్యమెట్లు వృద్ధినొందునో యట్టులే కులవధువులకుఁ బరస్పరస్పర్ధవలన సద్భావము సౌశీల్యమును వృద్ధిఁబొందును. ఇట్టివిధమున మగనిఁ బూజించి యాతనిపనులందును బూజ్యులగుగుర్వాదులఁ బూజించుటయందును భృత్యులను బోషించుటయందును నిత్యము నప్రమత్తయై యుండవలయును. ఇట్టులే సుగుణసంగ్రహమునందు శీలాదిరక్షణమునందును వర్తింప

---

మానసమ్, విశ్రామం ప్రార్థయేదేనామధికుర్యాత్సుతామివ. ౨౪. మత్వా భర్తురభిప్రేతం రక్షంతీ నిజగౌరవమ్, కృతం భర్త్రనుకూలం స్యాత్తదిష్టాయాను మోదయేత్. ౨౫. స్వామినో యదభిప్రేతం భృత్యైః కిం క్రియతేఽన్యథా, క్లిశ్యతే తత్ర మూఢాత్మా పరతంత్రో వృథా జనః. ౨౬. తస్మాత్సర్వాస్వవస్థాసు మనోవాక్కాయకర్మభిః, హితం స్వామ్యనుకూలత్వం నారీణాం తు విశేషతః. ౨౭. సాపి జ్యేష్ఠాపతిం చైవ గృహతంత్రం చ సర్వదా, సమావర్జ్య గుణైర్ధీరా ప్రాగవస్థాం న విస్మరేత్. ౨౮. న సౌభాగ్యమదం కుర్యాన్న చౌద్ధత్యాదివిక్రియామ్, నితరామానతిం గచ్ఛేత్సదానార్యభయాదివ. ౨౯. యథా యోగ్యతయా పత్యౌ సౌభాగ్యమభివర్ధతే, స్పర్ధయేచ్చ కులస్త్రీణాం ప్రశ్రయోపాధికం తథా. ౩౦. ఏవమారాధ్య భర్తారం తత్కార్యేష్వప్రమాదినీ, పూజ్యానాం

వలయును. ఇట్లు చరించుసాధ్వి యనుత్తమంబులై సర్వోత్కృష్టములగు నైహికాముష్మికసుఖముల ననుభవించును.

ఇది చతుర్దశాధ్యాయము.

## పంచదశాధ్యాయము.

పితామహుం డిట్టు లనియె. భర్తృగౌరవమునకుఁ బాత్రముగాని యువిద సర్వకాలములందు నుపవాసాద్యాసక్తి గలిగి బాహ్యములగు భర్తృకార్యములం దధికముగ శ్రద్ధవహించి యుండవలయును. సవతులఁ బ్రస్తుతించుటయుఁ దనను నిందించుకొనుటయు గుణములందు దోషముల నారోపించుటయుఁ బతికిఁ దనయెడఁ గోపము గలుగుటయుఁగాని ప్రణయమునుగాని కనుబరుపరాదు ఏయువతియేనియు నావలె నిట్టి యనిర్వాచ్యఖేదము ననుభవించుచున్నదా? ఎందువలన నీదుర్భగురాలు మీఁచే భార్య యనియైనఁ బిలిపించుకొనుటకుఁ గూడ నోఁచుకొనలేదుగద! ఇత్యాది భావములు వెలిబుచ్చఁ జనదు. భూషణము లేమియు లేకుండఁగాఁగాని యుద్ధతములగుభూషణములు దాల్చిగాని యుండఁ జనదు. భర్త కుపచరించుసమయమున నేగాని యితరకాలముల గంధమాల్యాదుల గ్రహింపరాదు. అప్పుడైనను మగనికి విశేషముగ వల్లభయగుయువతికన్నఁ

---

పూజనే నిత్యం భృత్యానాం భరణేషు చ. ౩౧. గుణానామర్జనే నిత్యం శీలవత్పరిరక్షణే, ప్రేత్య చేహ చ నిర్ద్వంద్వం సుఖమాప్నోత్యనుత్తమమ్. ౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీధర్మేషు సపత్నీకర్తవ్యవర్ణనం నామ
చతుర్దశోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—దుర్భగా చ పునర్నిత్యముపవాసాదితత్పరా, బాహ్యేషు పతికృత్యేషు స్యాద్విశేషాభియోగినీ. ౧. న ప్రశంసాం సపత్నీషు నిందాం చాపి తథాత్మని, అసూయాం భర్తురీర్ష్యాం వా ప్రణయం వాపి దర్శయేత్. ౨. మద్విధా యా హి బహ్వేత త్తచ్చాత్యంతికమత్నుతే, యదస్యాయుష్మతో యాయాద్భార్యాశబ్దాభిధేయతామ్. ౩. న చ నిర్భూషణా తిష్ఠేన్న చాప్యుద్ధతభూషణా, నాన్యదా గంధమాల్యాది గ్రాహ్యం పత్యుపచారతః. ౪. తన్యూనం సర్వశో గ్రాహ్యం వల్లభాయా

దక్కవగానే గ్రహింపఁదగును. భర్తకుఁ దనయెడ వాల్లభ్యము గలుగు వఱకును భూషణగంధమాల్యాదు లలంకృతములై యుండవలయును. ఒరిపిడిగలతావులఁ జెమ్మ దుడుచుచుండవలయును. దంతనాసాదులందలి మలమును దుర్గంధమును బోకడచి శోధింపఁదగును. ఈమొదలగు వానిలో నేదో యొకనిమిత్తమును సర్వావస్థలందు నెదురుచూచుచుండ వలయును. ఈవిధానమున వల్లభయగుయువతియుఁ బ్రియుఁడు గలసి యున్నపుడు దదంగమార్జనమునకై యత్నింపరాదు. ఎల్లప్పుడును సవ తులకందఱ కనుకూలభావమున వర్తింపవలయును. మగని కత్యంతప్రేమా స్పదమగువనితకడఁ బ్రబ్బలిచెట్టువర్తనము గలిగియుండవలయును. ఇతరు లగు తనతోడియువిదల కెయ్యది యనుష్ఠింపఁదగునో యేది యొసంగిన నష్టముగలుగకుండునో యద్దానిని భర్తకు విరుద్ధము గాకున్నచో నాతఁ డెఱుఁగకుండఁగనే యీఁదగును. కోశాధికారము వస్త్రాన్నపానగంధ మాల్యతాంబూలసమర్పణములు నౌషధప్రదానాదులు ననియుక్తలు గలిగియుండరాదు. అట్లొనర్చిన దోషము విరోధము నేర్పడును. చేయఁ దగిన గృహసమ్మార్జనాదులు జేయకున్నచో స్త్రీలనియుక్తలైయును వాని ననుష్ఠింపవలయును. మగనికి సవతులందుఁ గలిగినసంతానమునకుఁ దల యంటుట నలుగువెట్టుట జలకమార్చుట భోజనమిడుట యలంకరించు టయుసాదరమతితో దాదివలెఁ జేయవలయును. ఆపిల్లలను నిత్యానుసరణ మునఁ దనవలెఁ గాపాడవలయును. తనధనములచేఁగూడ నాయపత్యముల

---

విశేషతః, భూషణం గంధమాల్యం తు తావత్కాలమలంకృతమ్. ౫. సంబాధానాం ప్రదేశానాం నిత్యం స్వేదాదిమార్జనమ్, దంతనాసాదిపంకానాం విగంధస్య చ శోధ నమ్. ౬. నిమిత్తం భర్తురేతాసాం యత్కించిదభిలక్షయేత్, నానేన వా తయోర్యత్నం విదధ్యాదంగమార్జనే. ౭. సర్వాసాం చ సపత్నీనాం సర్వత్రానుగతా భవేత్, వైతసీం వృత్తిమాస్థాయ వల్లభాయా విశేషతః. ౮. అన్యస్యా యదనుష్ఠేయం యన్న సీదేత్సమ ర్పితమ్, భర్తుశ్చావిదితం యత్నాత్తత్కుర్యాదవిరోధి చేత్. ౯. కోశవస్త్రాన్నతాంబూల గంధపానౌషధాదికమ్, తత్సర్వమనియుక్తానాం దోషవత్వాద్విరుధ్యతే. ౧౦. యత్తు ముక్తమనుష్ఠేయం గృహసంమార్జనాదికమ్, స్త్రీణామనధికారోఽపి ప్రాయస్తద్విధి రుచ్యతే. ౧౧. అభ్యంగోద్వర్తనం స్నానం భోజనం మండనాని చ, కుర్యాద్భర్తురప త్యానాం ధాత్రీకర్మాణి సాదరమ్. ౧౨. ఆత్మవత్తాన్యపత్యాని సాధయత్యనుయోగతః,

కలంకారాదులఁ గల్పింపఁదగును. స్త్రీవిత్తమునకు రెండువిధములగు నుప
యోగమున్నది. భర్త తానే యనుభవించుటగాని తనయపత్యాదు లను
భవించుటగాని; యింతేగాని వేరొండువిధములేదు. అందును దొలివయ
స్సున నభినందించుటయు మఱువయస్సున ననుభవించుటయును సహజ
ములు, ఈరెండు నుండుటయు లేకుంటయు వేర్వేఱు పూర్వకర్మలవలనఁ
బుట్టునవి. ఎట్టివారైనను సద్వర్తనమునందు యత్నపురస్సరముగ నధిక
మగువిఖ్యాతినిఁ గాంచనగును. లోకమున నేయువతియుఁ బుట్టువుతోడనే
దుర్భగయైగాని సుభగయైగాని యుద్భవించుటలేదు. స్నేహవైరముల
పగిది వారివారివ్యవహారములవలన నవి యేర్పడును. మగనిహృదయ
భావము గ్రహింపలేకుంటను సమ్యగనుష్ఠానము లేకుండుటను లోక
విరుద్ధములగువృత్తములచేతను వెలందులు దుర్భగురాండ్రగుదురు. చిత్త
వృత్తి ననుసరించి యుండునేని పెరవాఁడయ్యుఁ బ్రియుఁడగును. ప్రతి
కూలుఁడై యుండెనేని తన కత్యంతప్రియుఁ డయ్యును ద్వేష్యుఁడే
యగును. కావున నెల్లవేళలఁ గరణత్రయంబుచే యువతి భర్తృచిత్తాను
సారిణియై ప్రియమునే యొనర్చుచుండవలయును. మఱియు మనో
నాథుండు సవతులలో వేరొకతె నెవ్వతెనయినఁగోరినచో నామె నాతనికిఁ
గూర్పవలయును. కారణాంతరమునఁగుపితయగు ప్రియురాలిని భర్తయెడఁ
బ్రసన్నఁగాఁ జేయవలయును. భర్తృపాదశుశ్రూషణమునందును గాత్ర
సంవాహనాదులందును శిరోమర్దనాదులందును నైపుణ్యము నభ్యసింప

---

స్వేనాప్యమీషాం విత్తేన విదధ్యాన్మండనాదికమ్. ౧౩. భోగః స్వయమపత్యైర్వా
స్త్రీవిత్తస్య పతిర్ద్విధా, పూర్వే వయస్యభినంద్య పశ్చిమే చోపయోజనమ్. ౧౪. ఉప
యోగస్తు వా మా వా కర్మజః పృథగేవసః,సద్వృత్తే త్వధికాం ఖ్యాతిం కుర్వీత క్రియయా
పునః. ౧౫. న కాపి దుర్భగా నామ సుభగా నామ జాతితః, వ్యవహారాద్భవత్యేష
నిర్దేశో రిపుమిత్రవత్. ౧౬. భర్తృచిత్తాపరిజ్ఞానాదననుష్ఠానతోఽపి వా, వృత్తైర్లోక
విరుద్ధైశ్చ యాంతి దుర్భగతాం స్త్రియః. ౧౭. అనుకూల్యాన్మనోవృత్తేః పరోఽపి
ప్రియతాం వ్రజేత్, ప్రాతికూల్యాన్నిజోఽప్యాశు ప్రియః ప్రద్వేషతామియాత్.౧౮.
తస్మాత్సర్వాస్వవస్థాసు మనోవాక్కాయకర్మభిః, ప్రియం సమాచరేన్నిత్యం తచ్చిత్తాను
విధాయినీ.౧౯.యామన్యాం కామయేత్తాసాం తం తయా సంప్రయోజయేత్, కుపితాం
చ ప్రియాం కాంచిద్యత్నాదస్మై ప్రసాదయేత్.౨౦. తత్పాదపరిచర్యాయాం గాత్రసం

వలయును. శరీరావస్థ ననుసరించి మృదువుగను మధ్యమముగను ముఖ గాత్రాద్యవయవములం దాతనికి సుఖముగలుగునట్లు మర్దనముచేయవల యును. బాహువులందు నూరుయుగమందుఁ బృష్ఠమందును గటిదేశము నను మూపునందును శిరమందుఁ బాదద్వయమునందును దఱచుగ గాఢ మర్దనము నపేక్షింతురు. ఇతరప్రదేశముల మధ్యమముగ నపేక్షింతురు. నిర్మాంసప్రదేశములందును బొక్కిలి మొదలగు మర్మదేశములందును హృదయదేశమునను జెక్కులయందును మృదుమర్దనము నపేక్షింతురు. మఱియు మేల్కనియున్నెడ గాఢముగను సగము నిద్రనుండునెడ మధ్యమముగను మృదువుగ గాఢముగను నిద్రించునప్పుడు గొంచెము మృదువుగను మర్దనము చేయవలయును. అట్టియెడ వ్యథగలిగింపరాని మర్దనముచేయకుంటయు నుత్తమమే. శరీరమంతటను విశేషించి వెంట్రు కలు గలతావులను దురదగలిగినచో విరుద్ధముగ రుద్దుట తైలాభ్యక్త ప్రదేశములందు మర్దనముచేయుట రోమాంచముగలుగునట్లు స్పృశించు టయు మెల్లఁగ గోళ్లతో గీరుటచే శిరమునను గాత్రములను బులకాంకు రము గల్గించుటయుఁ బార్శ్వములందుఁ గండూతి నపనయించుటయు నాయాదేశముల నాయావిధములగు నుపచారములు ప్రయోగించు చుండఁదగును. అట్లుచేసినఁ దత్కాలమున సుఖముగ నిద్రించును. తనయం దనురాగమును గలుగును. ఆతఁడు నిలచియున్నను గూరువోనియున్నను మేల్కనియున్నను నిద్రించుచున్నను మిక్కిలి సుఖావహమగుటచే

---

వాహనే తథా, పీడనే శిరసశ్చైవ పరం కౌశలమభ్యసేత్. ౨౧. పీడనం మృదు మధ్యం చ గాత్రావస్థావిశేషతః, ముఖగాత్రాదిభిర్లింగైః ప్రయోజ్యం తత్సుఖావహమ్. ౨౨. బాహూరుకటిపృష్ఠేషు స్కంధేశిరసి పాదయోః,గాఢమర్దనమిచ్ఛంతిప్రాయోఽన్యత్రాపి మధ్యమమ్ ౨౩. నిర్మాంసేషు ప్రదేశేషు నాభిమూలేషు మర్మసు, హృద్గండకకపోలాదా విచ్ఛంతి మృదుమర్దనమ్. ౨౪. గాఢం జాగ్రదవస్థాయామర్ధసుప్తస్య మధ్యమమ్, కించిత్సపరిఘూతం చ మృదుసుప్తస్య నేతి వా. ౨౫. విరుద్ధం సర్వగాత్రేషు లోమవత్సు విశేషతః, ఉత్కండూయత్సు సోద్ధర్షం స్నేహాక్తేషు చ మర్దనమ్. ౨౬. స్పర్శా ద్రోమాంచజననం సనఖచ్ఛురితం శనైః, పులకోల్లేఖనోపేతం శిరః కండూశ్చ పార్శ్వయోః. ౨౭. తేషుతేషు చ గాత్రేషు తత్ప్రయోజ్యం తథాతథా, నిద్రాగమాయ తత్కాలే రాగసంధుక్షణాయ చ. ౨౮. తిష్ఠతశ్చోపవిష్టస్య జాగ్రతః స్వపతోఽపి వా,

సంవాహనము నపేక్షించును. ఆతనియవయవములందు నైశ్చల్యమును పులకసముద్గతియు నేత్రనిమీలనమును స్పర్శాదికమునఁ దత్తత్ప్రదేశముల నగపడువికారములను దెలిసికొని యేసమయమున నెట్టిమర్దనాదిక మపేక్షితమో యట్టితీరున నొనర్చుచుండవలయును. మఱియు నూరుమూలాదులగు నేయేప్రదేశములలో మగఁడు స్వపాణిపీడనము సలుపుకొనుచుండునో యట్టిసమయముల నిపుణముగ నెఱింగి యచ్చోట నధిక మర్దనాదు లాచరింపవలయును. ఈవిధముగ నుద్దిష్టమగు స్త్రీవర్తనమేజవ్వని యనుష్ఠించుచుఁ బతినారాధించు నాయువిద సంపూర్ణమగు త్రివర్గఫలమును బడయఁగలదు.

ఇది పంచదశాధ్యాయము.

---

## షోడశాధ్యాయము.

సుమంతుఁడు శతానీకున కిట్లనియె. రాజచూడామణీ! యిప్పుగిది ముజ్జగంబులతాత సాకల్యముగ స్త్రీలక్షణములను వారిసద్వర్తనమును నాదివ్యమునుల కెఱింగించి నిజాలయమున కేగెను. అంత మహర్షులు నట్లే స్త్రీలక్షణములను దద్వృత్తము నెఱింగి యెల్లరు నిజనివాసముల కరిగిరి. రాజేంద్రా! యిట్టిశుభలక్షణసనాథ యగుభార్యను గూడి గృహస్థాశ్రమమున నున్నవాఁ డేయేవిధులు నిర్వర్తింపవలయునో యింకమీఁద

---

సంవాహనం ప్రశంసంతి యదత్యర్థం సుఖావహమ్. ౨౯. నైష్పంద్యం పులకోద్భేదో గాత్రాణామక్షిమీలనమ్, తత్ప్రదేశార్పణం కించిదోష్ఠభేద్వికృతిదర్శనమ్. ౩౦. ఊరుమూలాదిదేశే చ తత్పాణిప్రతిపీడనమ్, లక్షయేన్నిపుణా యత్ర తత్రైవాధికమాచరేత్. ౩౧. ఏవమేవ యథోద్దిష్టం స్త్రీవృత్తం యానుతిష్ఠతి, పతిమారాధ్య సంపూర్ణం త్రివర్గం సాధిగచ్ఛతి. ౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి స్త్రీధర్మవర్ణనం నామ
పంచదశోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—ఇత్యుక్త్వా భగవాన్బ్రహ్మా స్త్రీలక్షణమశేషతః, సద్వృత్తం చ తథా స్త్రీణాం జగామ స నిజాలయమ్. ౧. ఋషయశ్చ తథా జగ్ముః స్వాని ధిష్ణ్యాన్యశేషతః, స్త్రీలక్షణం తథా వృత్తం శ్రుత్వా కృత్స్నం మహీపతే. ౨. ఇత్థం లక్షణ

నెఱింగింతు నవధానమున నాకర్ణింపుము. ఈగృహస్థుఁ డనుదివసమును విధ్యుక్తవిధానంబున నిజగృహ్యము ననుసరించి స్మార్తకర్మలను వివాహహోత్పాదితమగునగ్ని లో నిర్వర్తించుచుండవలయును. మఱియుఁ బంచమహాయజ్ఞముల నొనరించి పాకముఁ జేయనగును. గృహస్థునికడ నెల్లప్పుడైదుహింస లాశ్రయముగొని వసించుచుండును. దానం జేసి యాతఁడు స్వర్గమునకు నిర్గమింపనోఁపఁడు. గృహస్థునింట రోలు, సన్నికల్లు, ప్రొయ్యి, నీటికడవ, చీపురు ననె డుపకరణపంచక ముండును. ఈయేనును హింసాకారణములగుటచే నేతన్నిమిత్తకం బగుపాపపంచకంబు గృహస్థున కేర్పడును. తత్ప్రాయశ్చిత్తమునకై పంచమహాయజ్ఞము లుద్దిష్టంబులయ్యె. అవి యెవ్వియనఁగా భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము నని చెప్పంబడు భూతయజ్ఞ మనఁగా భూతములకు బలియిడుట; మనుష్యయజ్ఞ మనఁగా నతిథులఁ బూజించుట. పితృయజ్ఞ మనఁగాఁ బితరులకుఁ దర్పణము లిచ్చుట. దేవయజ్ఞ మనఁగా దేవతలగుఱించి యాగహోమాదుల నిర్వర్తించుట. బ్రహ్మయజ్ఞ మనఁగా వేదాధ్యాపనము నధ్యయనము జేయుట. ఈయేనింటిని బ్రత్యహ మనుష్ఠించుగృహమేధి పంచసూనాదోషదూషితుఁడు గాఁజాలఁడు. 'దేవతలు నతిథులు పితరులు భృత్యులు తాను' అను నీయేవురకును తృప్తియొనర్పనివాఁడు బ్రదికియుండియుఁ జచ్చినవాఁడే యగును. అన విని శతానీకుం డోసుధీవరా! యేగృహస్థునిగృహమున నిత్యము నగ్నిహోత్రము జరు

---

సంపన్నాం భార్యాం ప్రాప్య మహీపతే, కర్తవ్యం యద్గృహస్థేన తదిదానీం నిబోధ మే. ౩. వైవాహికాగ్నౌ కుర్వీత గృహ్యం కర్మ యథావిధి, పంచయజ్ఞవిధానం తు పక్తిం కుర్యాత్సదా గృహీ. ౪. పంచ సూనాగృహస్థస్య తేన స్వర్గం న గచ్ఛతి, కండనీ పేషణీ చుల్లీ ఉదకుంభీః ప్రమార్జనీ. ౫. ఆసాం క్రమేణ సర్వాసాం విశుద్ధ్యర్థం మనీషిభిః, పంచోద్దిష్టా మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినామ్. ౬. అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞశ్చ తర్పణమ్, హోమో దైవో బలిర్భౌమ స్తథాన్యోఽతిథిపూజనమ్. ౭. పంచైతాన్యో మహాయజ్ఞాన్న హాపయతి శక్తితః, స గృహేఽపి వసన్నిత్యం సూనాదోషైర్న లిప్యతే. ౮. దేవతాతిథిభృత్యానాం పితౄణామాత్మనశ్చ యః, న నిర్వపతి పంచానా ముచ్ఛ్వసన్న చ జీవతి. ౯. శతానీక ఉవాచః—యస్య నాస్తి గృహే త్వగ్నిః స మృతో నాత్ర సంశయః, న స పూజయితుం శక్తో దేవాదీన్బ్రాహ్మణో

గదో వాఁడు మృతప్రాయుఁడు. అట్టి బ్రాహ్మణుఁడు దేవాదుల నర్చింప నర్హుండును శక్తుండును గాఁజాలఁడు. అగ్నివిహీనుఁడగు ద్విజునెడల దేవాదు లెట్లు ప్రీతులగుదురు? ఆతనికి శాంతి యెట్లు చేకురఁగలదు? సవిస్తరముగ నానతీవే యని యడుగ నాతనిం దిలకించి సుమంతుఁ డిట్లనియె. రాజా! నీయడిగినయర్థం బత్యుత్తమము సమాధానార్హము నైయున్నది. అవధాన మొసంగుము. వ్రతములు నుపవాసములు బహువిధదానములు ననువానిచే నగ్నికార్యానుష్ఠానము లేనివిప్రులు దేవతాదులఁ దృప్తిఁగొందించి వారియనుగ్రహమునకుఁ బాత్రులగుచున్నారు. శ్రద్ధాళులై యుత్తమతిథుల నుపవసించువారియెడ దేవతలు ప్రీతు లగుచున్నారు. అన విని రాజుత్సుకుఁడై విప్రోత్తమా! ఆయాతిథులను వానియందుఁ జేయఁదగినపనులను, భోజనమును గృహ్యాధర్మముల నుపవాసవిధులను నాకు సదయుఁడవై సాకల్యముగ నెఱింగింపుము. అయ్యది పాపనిర్వాపకమును సంసారసాగరతారకమును శ్రేయోదాయకంబు నయియున్నది. అనుడు సుమంతుఁ డిట్లనియె. రాజా! శ్రవణమాత్రమున నే పాపఘ్నములై యుపవాసఫలప్రదంబులును తిథులమర్మముల నాశ్రయించియుండుకర్మల నెఱింగింతు నాకర్ణింపుము. పాడ్యమినాఁడు పాలాహారము గొనియుండ నగును. విదియన లవణవర్జితభోజనము జేయనగును. తదియనాఁడు తిలాన్నము దినఁదగును. చవితినాఁడు క్షీర

---

త్తమః. ౧౦. నిరగ్నికస్య విప్రస్య కథం దేవాదయో ద్విజ, ప్రీతాః స్యుః శాంతయే తస్య పరం కౌతూహలం మమ. ౧౧. సుమంతురువాచ:—సాధు పృష్టోఽస్మి రాజేంద్ర శ్రూయతాం పరమం వచః, అనగ్నయస్తు యే విప్రాస్తేషాం శ్రేయోఽభిధీయతే. ౧౨. వ్రతోపవాసనియమైర్నానాదానైస్తథా నృప, దేవాదయో భవంత్యేవ ప్రీతాస్తేషాం న సంశయః. ౧౩. విశేషాదుపవాసేన తిథౌ కిల మహీపతే, ప్రీతా దేవాదయస్తేషాం భవంతి కురునందన. ౧౪. శతానీక ఉవాచ. భగవంస్త్వం తిథీన్బ్రూహి తిథీనాం చ విధిం హి మే, ప్రాశనం గృహ్యధర్మాంశ్చ ఉపవాసవిధీనపి. ౧౫. ముచ్యేయ యేన పాపౌఘాత్త్వత్ప్రసాదాద్ద్విజోత్తమ, సంసారాచ్చాపి విప్రేంద్ర శ్రేయసే జగతస్తథా. ౧౬. సుమంతురువాచ:—శృణు కౌరవ కర్మాణి తిథిగుహ్యాశ్రితాని తు, శ్రుతాని ఘ్నంతి పాపాని ఉపోషితఫలాని చ. ౧౭. ప్రతిపది క్షీరప్రాశనం ద్వితీయాయాం లవణవర్జనమ్, తృతీయాయాం తిలాన్నం ప్రాశ్నీయా

పాణుఁడు గావలెను. పంచమీతిథియందు ఫలములు దినవలయును. షష్ఠి నాఁడు శాకాహారియై సప్తమిని బిల్వ (మారేడు) పత్త్రాదుల మేసవ నగును. అష్టమినాఁడు పిష్టభుక్కు గావలయు. నవమి నగ్నిపక్వముగాని యాహారము గొనవలయును. దశమినాఁడు నేకాదశియందును ఘృతప్రాశ నము జేయవలయును. ద్వాదశిని పాయసము భుజింపవలయును. త్రయో దశినాఁడు గోమూత్రము నుపయోగింపవలయును. చతుర్దశినాఁడు యవా న్నము భుజింపవలయును. పూర్ణిమనాఁడు కుశోదపానం బొనరింపవల యును. అమావాస్యదినమున హవిష్యము నుపయోగింపవలయును. ఇది ప్రాశనవిధానము. ఏద్విజుఁడు యథోక్తవిధమ్మున నొక్కపక్షము గడు పునో యాతఁడు దశాశ్వమేధఫలము నొందును. స్వర్గమున కేగి కొన్ని మన్వంతరముల కటనే వసించును. అచ్చరలచేతను గంధర్వులచేత నుప గీయమానుఁడై మూఁడునాల్గునెలలకాలము పూర్వోక్తవిధి ననుసరించు వాఁడు రాజసూయాశ్వమేధములకన్న శతగుణమ్మగుఫలము నందును. అప్సరోగంధర్వాదులచే జేగీయమానుఁడై వేయిచతుర్యుగములకాలము స్వర్గమునఁ గాపురముండును. అష్టమాసములు వర్తించినచో రాజసూ యాశ్వమేధములకు వేయిరెట్లధికమగుఫల మొందును. స్వర్గమందుఁ బదునాల్గుమన్వంతరములు వసించును. గంధర్వాదులచే గేయుఁడగును. ఇవ్విధమున నియతుఁడై యొక్కయేఁడు వర్తించిన యాతఁడు సవితృమం

---

చ్చతుర్థ్యాం క్షీరాశనశ్చ పంచమ్యామ్, ఫలాశనః సదా షష్ఠ్యాం శాకాశనః సప్తమ్యాం బిల్వాహారోఽష్టమ్యాం తు. ౧౮. పిష్టాశనో నవమ్యామనగ్నిపాకాహారో దశమ్యామేకా దశ్యాం ఘృతాహారో ద్వాదశ్యాం పాయసాహారః, త్రయోదశ్యాం గోమూత్రా హారశ్చతుర్దశ్యాం యావాన్నాహారః. ౧౯. కుశోదక ప్రాశనః పౌర్ణమాస్యాం హవిష్యా హారోఽమావాస్యాయామ్, ఏష ప్రాశనవిధిస్తిథీనామేవ చానేన విధినా పక్షమేకం యో వర్తయతి. ౨౦. సోఽశ్వమేధఫలం దశగుణఫలమవాప్నోతి స్వర్గే మన్వంతరాణి యావత్ప్రతివసతి. ౨౧. ఉపగీయమానోప్సరోగంధర్వైర్మాసత్రయచతుష్టయమ్, సోఽశ్వ మేధరాజసూయానాం శతగుణమవాప్నోతి. ౨౨. స్వర్గే ఉపగీయమానోప్సరోగంధ ర్వైశ్చతుర్యుగానాం దశశతీర్యావత్ప్రతివసతి, తథాష్టమాసపారణే రాజసూయాశ్వ మేధాభ్యాం సహస్రగుణఫలమవాప్నోతి. ౨౩. స్వర్గే చతుర్దశ మన్వంతరాణి యావ త్ప్రతివసతి, ఉపగీయమానోప్సరోగంధర్వైర్య ఏవం నియమమాస్థాయ వర్షమేకం

ఫలమున నొక్కమన్వంతర ముండును. ఏమానవుఁ డిట్టినియమముతో
నాశ్వయుజమాసంపు నవమినిగాని మాఘమాసంపు సప్తమినాఁడుగాని
వైశాఖమాసంపుఁ దదియనుగాని కార్తికపూర్ణిమనాఁడుగాని యీతిథి
వ్రతము గ్రహించునో యట్టి బ్రహ్మచారిగాని గృహమేధిగాని వాన
ప్రస్థుఁడుగాని స్త్రీశూద్రాదులుగాని యీజన్మమున దీర్ఘాయుష్మంతులై
యుండి జన్మాంతమున సవితృసాలోక్యము నొందుచున్నాఁడు. వెనుకఁ జెప్పఁ
బడిన తెఱఁగున నాయాతిథులందుఁ బూర్వజన్మమున నుపవాసాదిక మొన
రించినవాఁడును పలువిధములగు దానములఁ దపోనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మ
ణుల కొసంగువారును త్రిరాత్రోపవాసము సలిపినవారును తీర్థయాత్రా
తపోనిరతులయినవారును గురుపితృశుశ్రూషణనిరతులగువారును వివిధం
బులగు స్వర్గోపభోగము లనుభవించి పుణ్యశేషముచే మఱల నీమనుష్య
లోకమున కేతెంచిన వారి *ఫలోత్పత్తిచిహ్నములు సర్వజనప్రత్యక్షము
లయియున్నవి. ఏనుఁగు, గుఱ్ఱము, వాహనములు, శకటములు, వృషభ
ములు, ధనరత్నకనకములును, సువర్ణాద్యాభరణములగుమురుగులు
మొదలగుభుజాలంకారములును, గేయూరములును, గంఠభూషణము
లును, వడ్డాణములును, బ్రహ్మసూత్రములును, కర్ణశిరోభూషణములును,
నుత్తమంబులగు వస్త్రనారీవిలేపనాదులను, సురూపసుగుణదీర్ఘాయుష్య
ములును గలవారై యాధివ్యాధులులేనివారై నృత్యగీతవాదిత్రమంగళ

వర్తయతి. ౨౮. స సవితుర్లోకే కాలం మన్వంతరం ప్రతివసతి. ౨౯. య ఏవం
నియమాన్రాజన్నాశ్వయుజనవమ్యాం మాఘమాసస్య సప్తమ్యాం వైశాఖతృతీయాయాం
కార్తికపౌర్ణమాస్యాం తిథివ్రతాని గృహ్ణాతి బ్రహ్మచారీ గృహస్థో వనస్థో నారీ నరో
వా శూద్రః ప్రయతమానసః దీర్ఘాయుష్యం సవితుః సాలోక్యం వ్రజతి. ౩౦.
యైశ్చాపి పురా రాజన్ననేన విధినా ఏతాసు తిథిష్వన్యజన్మాంతరే ఉపవాసవిధిః కృతః
దానాని దత్తాని వివిధప్రకారాణి బ్రాహ్మణానాం తపస్విజనేషు వా ౩౧. త్రిరాత్రోప
వాసినాం తీర్థయాత్రా తపోగురుమాతాపితృశుశ్రూషానిరతానాం తేషాం స్వర్గాదిభోగ
వాసనాదిహాగతానాం ఫలనిష్పత్తిచిహ్నని మనుష్యలోకే ప్రత్యక్షత ఏవ దృశ్యంతే.
౩౨. హస్త్యశ్వయాన యుగ్యధనరత్నకనకహిరణ్యకటకకేయూరగ్రైవేయకకటిసూత్ర
బ్రహ్మసూత్రకర్ణాలంకారముకుటవరవస్త్రవరనారీవరవిలేపనసురూపగుణదీర్ఘాయుషో విగ
తాధివ్యాధయో దానోపవాసరతానాం ఫలాన్యేతాని నృత్యగీతవాదిత్రమంగలపాఠక

పాతకశబ్దములచేఁ బ్రబోధింపఁబడువారునై జనులు ప్రత్యక్ష మగుచున్నారు గదా! ఇట్టులే వెనుకజన్మమున నుపవాసవ్రతములు సలుపనివారును, దానము లీయనివారును, పుణ్యకర్మ లాచరింపనివారును నగు మానవులు గ్రుడ్డివారును, కుష్ఠురోగులును, బధిరులును, మూకులును, మూర్ఖులును, వికలాంగులును, రోగపీడితులును, దరిద్రులును, నుపద్రవపరిభూతులు నల్పాయుష్మంతులునై మనకుఁ గానఁబడుచున్నారు. అనఁగా విని శతానీకుండు సుమంతున కిట్లనియె. ద్విజవంశభూషణా! సంగ్రహముగ నీయానతిచ్చినయంశము నాలకించితిని. తిథులఁగూర్చి విస్తరముగ వినవలతు నానతిమ్ము. తిథిరహస్యములను దేవతాభిమతంబు లగుతిథులను దేవతలవిచేష్టితమ్మును భోజ్యపదార్థములను నియమవిశేషములను వివరింపుము. నీవు ధర్మవిదుత్తముఁడవు గద! దీని విని పూతాత్ముండై భేదభావంబు తొలంగినవాఁడనై యాగఫలంబులన్నియు నందుదునని వేఁడుకొన నాతనికి సుమంతుఁ డిట్లనియె. శతానీకా! తిథులరహస్యములను భోజనవిధిని ఫలములను దేశకాలానుగుణములగునియమములను విశేషించి స్త్రీజనంపునియమములును మొదలగు నీరహస్యము నెల్ల యెఱింగింతు వినుము. నీయందలిస్నేహాతిరేకముచే నింతకుము న్నెట్టియాప్తునకేని యెఱింగింపనిరహస్యములన్నియు నేయేదేవత కేయేతిథు లిష్టము లైనవియో దేవరహస్యము లెయ్యవియో వ్రతనియమాదు లెయ్యవియో

---

శబ్దైరిహాద్యాపి పుణ్యకృతో బోధ్యమానా దృశ్యంత ఇతి. ౨౯. తథాఽకృతోపవాసా అపి హి దృశ్యంతే. ౩౦. తథా అదత్తదానా అకృతపుణ్యాశ్చ ప్రత్యక్షత ఏవ దృశ్యంతే. ౩౧. తద్యథా కాణకుష్ఠిబధిరజడమూకవ్యంగా రోగదారిద్ర్యోపసర్గవ్యాధిహతా యుషశ్చ దృశ్యంతేఽద్యాపి మానవాః. ౩౨. శతానీక ఉవాచ:—ద్విజేన్ద్ర) తిథయః ప్రోక్తాః సమాసేన త్వయా బుధ, విస్తరేణైవ మే భూయః ప్రబ్రూహి ద్విజసత్తమ. ౩౩. రహస్యం యత్తిథీనాం తు దేవానాం చ విచేష్టితమ్, యానీష్టాని చ దేవానాం భోజ్యాని నియమాస్తథా. ౩౪. తాని మే వద ధర్మజ్ఞ యేన పూతో భవేన్వహమ్, నిర్ద్వంద్వో హి యథా విప్ర లభే యాగఫలాని తు. ౩౫. సుమంతురువాచ:—రహస్యం యత్తిథీనాం చ భోజనం ఫలమేవ తు, యావచ్చ యేన నియమో విశేషాత్స్త్రీజనస్య చ. ౩౬. ఏతత్తే సర్వమాఖ్యామో రహస్యం తన్నిబోధ మే, యన్మయా నోక్తపూర్వం హి కస్యచిత్సుప్రియస్య హి. ౩౭. తత్తేఽహం సంప్రవక్ష్యామి యస్య దేవస్య యా తథిః, దేవ

వానినెల్ల నెఱింగింతు వినుము. ఓజ్ఞానప్రదా! తొలుతఁ దిథ్యుత్పత్తి ప్రకారంబు సంక్షేపించి యెఱింగింతును. మున్ను జగంబంతయుఁ దమోమయమై యలక్ష్యమై యిదమిత్థమని నిర్ణయింపఁజాలని స్థితినుండెను. అంతట బ్రహ్మ తనంతదానె యందుద్భవించెను. ఇట్టు లాపరాత్మ యుద్భవించి షడ్గుణైశ్వర్యసంపన్నుఁడై యుంట మొదట నిజశక్తిచే సృజింపఁబడినయండము నుండి బయలువెడలెను. ఈతఁడే నారాయణాఖ్య బ్రహ్మంబు. పిదప యితఁడు జగము సృజింప నిచ్ఛగించి యాగ్రుడ్డుయొక్క రెండుడిప్పలను ద్యులోకభూలోకములుగ నొనర్చెను. అందు నాల్గుదిక్కులును నాల్గు మూలదిక్కులును దేవదానవాదులను ప్రతిపత్తని విఖ్యాతమగు పూర్వా తిథిని నుద్భవింపఁజేసెను. ఈతిథి యితరతిథులకన్న నుత్తమమగునని బ్రహ్మవచనముచేతను తొలుతఁ బ్రతిపాదింపఁబడుటచేతను బ్రతిపత్తని వ్యవహరింపఁబడుచుండెను. మిగతతిథులన్నియు నీతిథి కనంతరము జెప్పఁబడియున్నందున మొదట దీనివృత్తాంతము నుత్తమమగు నుపవాసవిధిని నిరూపించి వానిని బిదప బోధింతును. కార్తికపూర్ణిమయందును, మాఘసప్తమియందును, వైశాఖమునందలి యుగ్మతిథులయందును శాస్త్రవిధానవిదుండు తొలుదొలుత నియమోపవాసమును స్వీకరింపవలయును. ఏతిథిని నియమాచరణమునకు భక్తితో ననువర్తించునో యాతిథి యందలి విధానక్రమము నెఱింగింతు వినుము. ఓజనాధిపా! ప్రతిపత్తున

---

తానాం రహస్యాని వ్రతాని నియమాస్తథా. ౩౮. తాఞ్ఛృణుష్వ మహాబాహో గదతో మమ నారద, సృష్టిం పూర్వం వదిష్యామి సంక్షేపేణ తిథిం ప్రతి. ౩౯. తమోభూతమిదం త్వాసీదలక్ష్యమవితర్కితమ్, జగద్బ్రహ్మా సమాగత్యాసృజదాత్మానమాత్మనా. ౪౦. సంభూతాత్మైవ ఆత్మాసావండమధ్యాద్వినిఃసృతః, ఆత్మనైవాత్మనో హ్యండం సృష్ట్వా స విభురాదితః. ౪౧. బ్రహ్మా నారాయణాఖ్యోఽసౌ సృష్టిం కర్తుంసముద్యతః, తాభ్యాం సోఽండకపాలాభ్యాం దివంభూమిం చ నిర్మమే. ౪౨. దిశశ్చోపదిశశ్చైవ దేవాదీన్దానవాంస్తథా, తిథిం పూర్వామిమాం రాజంశ్చకారాథ విభుః స్వయమ్. ౪౩. తిథీనాం ప్రవరా యస్మాద్బ్రహ్మణా సముదాహృతా, ప్రతిపాదితా పరే పూర్వే ప్రతిపత్తేన తూచ్యతే. ౪౪. అస్మాత్పదాత్తు తిథయో యస్మాత్వచ్యాః ప్రకీర్తితాః, అస్యాం తే కథయిష్యామి ఉపవాసవిధిం పరమ్. ౪౫. కార్తిక్యాం మాఘసప్తమ్యాం వైశాఖస్య యుగాదిషు, నియమోపవాసం ప్రథమం గ్రాహయేత విధానవిత్. ౪౬. యాం తిథిం నియమంకర్తుం భక్త్యా సమనుగచ్ఛతి, తస్యాం తిథౌ విధానం యత్తన్నిబోధ జనాధిప. ౪౭.

నియమగ్రహణముజేయ నెంచుమనుజుఁడు చతుర్దశినాఁ డాహారమొన రించి దినాంతమున వ్రతసంకల్ప మొనరించి యమావాస్యనాఁడు నిరాహారుఁడై యుండవలయును. త్రికాలస్నాన మొనరింపవలయును. పూతాత్మశరీరుఁడై ప్రణవవ్యాహృతిపూర్వకముగ గాయత్రిని సర్వకాలముల జపింపవలయును. అంతఁ బ్రభాతంబగుడు బ్రాహ్మణోత్తముల నాహ్వానించి గంధమాల్యాదులచే నర్చనలిచ్చి సర్వాతీతుఁడగు బ్రహ్మ నాయెడఁ బ్రీతుఁడగుతమని యథాశక్తి క్షీరమును వారి కొసంగవలయును. అనంతర మీపూర్వోక్తవిధానమున గోక్షీరమును గ్రహించి క్రోలవలయును. మిగిలినతిథులందు నిదియే యనుష్ఠానక్రమము. ఇట్టు లొకసంవత్సరముకాలము గడువ నీవ్రతము సమాప్తమగును. వ్రతాంతమునఁ గలుగుఫలము దెలిసికొనుము. ఈవ్రతముచే సకలపాతకవిముక్తుఁడై విశుద్ధాంతరంగుఁడై దివ్యదేహుఁడగు దేహియెడ ముదితాత్ముఁడై బ్రహ్మదేవుఁడు నిస్సమానతేజోవిరాజితంబున విహతగతియు దివ్యంబుఁ గిన్నరాప్సరోగణనిషేవితంబునగు నొక్కదేవయానము నాతని కొసంగును. ఆతఁడును దానితో దేవలోకమున కేగి దేవతలతోఁ గూడి చిరకాలము సుఖము లనుభవించి తిరిగి పుడమికి దిగి పదితరములవఱకును బ్రాహ్మణజాతినే యుద్భవించును. వేదవేదాంగపారంగతుండై దీర్ఘాయుష్మంతుఁడై ప్రభాగుణవిభూషితుండై యసమానభోగవంతుఁడై

యదా తు ప్రతిపద్యాం వై గృహ్ణీయాన్నియమం నృప, చతుర్దశ్యాం కృతాహారః సంకల్పం పరికల్పయేత్. ౪౮. అమావాస్యాం న భుఞ్జీత త్రికాలం స్నానమాచరేత్, పవిత్రో హి జపేన్నిత్యం గాయత్రీం శిరసా సహ. ౪౯. అర్చయిత్వా ప్రభాతే తు గంధమాల్యైర్ద్విజోత్తమాన్, శక్త్యా క్షీరం ప్రదద్యాత్తు బ్రహ్మా మే ప్రీయతాం ప్రభుః. ౫౦. తతో భుఞ్జీత గోక్షీరమనేన విధినా నృప, ఏష ఏవ విధిర్దృష్టః సర్వాసు తిథిషు నృప. ౫౧. సంవత్సరగతే కాలే వ్రతమేతత్సమాప్యతే, వ్రతాంతే యత్ఫలం తస్య తన్నిబోధ నరాధిప. ౫౨. విముక్తపాపః శుద్ధాత్మా దివ్యదేహస్య దేహినః, బ్రహ్మా దదాతి సంతుష్టో విమానమతితేజసమ్, అవ్యాహతగతిం దివ్యం కిన్నరాప్సరసైర్యుతమ్. ౫౩. రమిత్వా సుచిరం తత్ర దైవతైః సహ దేవవత్, ఇహ చాగత్య విప్రత్వం దశ జన్మాన్యసౌ లభేత్. ౫౪. వేదవేదాంగవిద్యశ్చ దీర్ఘాయుశ్చైవ సుప్రభః, భోగీ ధనపతి

ధననాథుఁడై వదాన్యుఁడై కృతయుగమున జన్మించును. మున్ను విశ్వామిత్రుండు బ్రాహ్మణత్వసిద్ధి నభిలషించి దివౌకసులకు సంతాపముగలిగించు ఘోరతపం బొనరించెను. అందువలన నాతనికి బహువిఘ్నములు గల్గెఁ గాని యభిలషితమ్మగు బ్రాహ్మణత్వము మాత్రము లభింపలేదు. తరువాత నాతఁడు తిథినియమ ముత్తమమని యెఱింగి యందును బ్రథమతిథి బ్రహ్మప్రియ యగుట బహువిధుండగుటచే నెఱింగి ప్రతిపత్తున నుపవాస నియమము సలిపెను. అంతట సంతుష్టుఁడై బ్రహ్మదేవుఁ డాతని కాదేహముతోడనే సుదుర్లభంబగు బ్రాహ్మణత్వముఁ బ్రసాదించెను. ఈతిథియే సర్వతిథులలో శ్రేష్ఠమై యుత్తమమైనది. దీనిమహిమచే క్షత్రియుఁడును వైశ్యశూద్రులును గూడ బ్రాహ్మణత్వము నొందుదురు. రాజా! సర్వకామప్రదమై కంజసంజాతున కతిప్రియమై యుండునీతిథియందలి మర్మములనెల్ల నెఱింగించితిని. ఇంతకుమున్నిది యెవ్వరికి నెఱింగింపఁబడలేదు. బ్రాహ్మణత్వాభిలాషంబునంజేసి హైహయులును తాలజంఘులును యవన తురుష్కులు శకులును నీతిథియం దుపవసించిరి. ఇటు లుత్తమంబును బుణ్యఫలదంబును మంగళకరంబును పాపాపహంబునగు నీప్రతిపత్తిథిచరితంబును తన్మాహాత్మ్యంబు నుపాసించినను బఠించినను వినినను మాన

---

ర్దాతా జాయతేఽసౌ కృతే యుగే. ౫౫ విశ్వామిత్రస్తు రాజేంద్ర బ్రాహ్మణత్వజిగీషయా, తపశ్చచార విపులం సంతాపాయ దివౌకసామ్, బ్రాహ్మణత్వం న లేభేఽసౌ లేభే విఘ్నాననేకశః. ౫౬. తతస్తు నియమాత్తేషాం తిథీనాం ప్రవరా తిథిః, ఉపోషితా బహువిధా జ్ఞాత్వా బ్రహ్మప్రియాం తిథిమ్. ౫౭. తతో దేవో దదౌ బ్రహ్మా విశ్వామిత్రాయధీమతే, ఇహైవ తేన దేహేన బ్రాహ్మణత్వం సుదుర్లభమ్. ౫౮. తిథీనాం ప్రవరా హ్యేషా తిథీనాముత్తమా తిథిః, క్షత్రియో వైశ్యశూద్రౌ వా బ్రాహ్మణత్వమవాప్నుయుః. ౫౯. ఏవం తిథిరియం రాజన్కామదా కంజజప్రియా, సరహస్యా మయా ప్రోక్తా యా నోక్తా యస్య కస్యచిత్. ౬౦. హైహయైస్తాలజంఘైశ్చ తురుష్కైర్యవనైః శకైః, ఉపోషితా ఇహాత్రైవ బ్రాహ్మణత్వమభీప్సుభిః. ౬౧. ఇత్యేషా పరమా పుణ్యా శివా పాపహరా తథా, పఠితోపాసితా రాజన్ఛ్రద్ధయా చ శ్రుతా తథా. ౬౨. మాహాత్మ్యం చాపి యోఽప్యస్యాః శృణుయాన్మానవో నృప,

వుఁడు వృద్ధిని బుద్ధిని సద్యశంబును మంగళమునుగాంచి స్వర్గము నొందును. సర్వసౌఖ్యము లనుభవించును.

షోడశాధ్యాయము.

---

## సప్తదశాధ్యాయము.

శతానీకుండు సుమంతునిఁ జూచి యోద్విజపుంగవా! సాదర మతితో సవిస్తరముగఁ బ్రతిపత్కృత్యమును బ్రహ్మపూజావిధానంబును పూజనఫలంబు నెఱింగింపవే యని యడుగ సుమంతుఁ డిట్లనియె. రాజా! ఇదియే చెప్పుచున్నాను. ఏకాగ్రచిత్తుండవై శాంతిప్రద మగు నీవృత్తాంత మును వినుము. మున్ను బ్రపంచమంతయు నొక్క సముద్రమై భయం కరాకార మైయుండ స్థావరజంగమాభిధభూతజాతంబు నష్టంబుగాఁగా స్వయంప్రభవుఁడు సురజ్యేష్ఠుఁడునగు నలుమొగంబులవేలు పావిర్భవించి లోకములను దేవతలను నానావిధభూతజాతమ్మును సృజించెను. కాయ మనోవాక్యములచే జంగమస్థావరాత్మకం బగుప్రపంచమును సృష్టించు టచే సర్వదేవతలకుఁ దండ్రియనియు భూతములకు బితామహుఁడు నని వ్యవహరింపఁబడునుగాన లోకగురుపగుటచే నెల్లర కెల్లవేళల నారా ధింపఁదగినవాఁడు. ఈతఁడే ముజ్జగంబుల సృజించి పెంచి యడఁగించును.

---

బుద్ధిం వృద్ధిం తథా కీర్తిం శివం చాప్య దివం వ్రజేత్. ౬౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ప్రతిపత్కల్పవర్ణనం నామ
షోడశోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—బ్రూహి మే విస్తరాద్బ్రహ్మన్ప్రతిపత్కృత్యమాదరాత్, బ్రహ్మపూజావిధానం చ పూజనే యచ్చ వై ఫలమ్. ౧. సుమంతురువాచః—శృణు ష్వైకమనా రాజన్కథయామ్యేష శాంతిదమ్, పూర్వమేకార్ణవే ఘోరే నష్టే స్థావర జంగమే. ౨. స్వయంభూరభవద్దేవః సురజ్యేష్ఠశ్చతుర్ముఖః, ససర్జ లోకాన్ దేవాంశ్చ భూతాని వివిధాని చ. ౩. కాయేన మనసావాచా జంగమస్థావరాణి చ,పితా యః సర్వ దేవానాం భూతానాంచ పితామహః. ౪. తస్మాదేష సదా పూజ్యో యతో లోకగురుః పరః,సృజత్యేష జగత్కృత్స్నం పాతి సంహరతే తథా. ౫. రుద్రోఽస్య మనసో జాతో

పద్ముఁడీతనిమానసపుత్రుఁడు. విష్ణు వీతని వక్షోదేశమునఁ బుట్టెను. ఈతనినాల్గుముఖములనుండి నాల్గువేదములును శిక్షాదివేదాంగషట్కం బును సంపూర్ణముగ నుద్భవించినవి. సురనాయకుఁడగు బ్రహ్మదేవుని దేవ తలు నచ్చరలును గంధర్వులును యక్షపన్నగరాక్షసులును సర్వకాలములఁ బూజించుచుందురు. ఈప్రపంచమంతయు బ్రహ్మమయమైనది. అంతయును బ్రహ్మంబునందే యిమిడియున్నది. కావున శ్రేయస్కాముఁడు సర్వకాల ముల బ్రహ్మపూజనము జేయవలయును ఎవ్వాఁడు భక్తియుక్తి వేల్పు బెద్ద నారాధింపఁ డాతఁడు స్వర్గమునకుఁ గాని రాజ్యమునకుఁగాని మోక్షమునకుఁగాని యోగ్యుఁడు గాఁజాలఁడు ఏవాఁడు భక్తిభరితుఁడై త్రిభువనేశ్వరుఁ డగువిరించి నారాధించునో యాతఁడు నాకలోకమున కును రాజ్యమునకును మోక్షసామ్రాజ్యమునకును శీఘ్రముగ భాజన మగుచున్నాఁడు. కావునఁ బ్రశాంతచిత్తుఁడై యభినివేశముగలిగి బ్రదికి యున్నంతకాలము నాపత్పరంపరాపీడితుండయ్యు బ్రహ్మదేవు నర్చించి ఫలము నొందఁదగును. పద్మసంభవునిఁ బూజింపకయుంటకన్న దేహత్యాగ మొనర్చుటయు నారకావాస మొనరించుటయు లెస్సయగును. ఎల్లవేళల నేమానవుఁ డసమానభక్తిభాసితుఁడై యీపద్మజన్ము నర్చించునో యాతఁడు మనుష్యచర్మమునఁ గప్పఁబడిన బ్రహ్మయేగాని వేరొండుగాదు. ఇందేమియు సందియము లేదు. ఈప్రపంచమున బ్రహ్మార్చనముకన్న నభ్య ధికమగు పుణ్యకర్మము గాన్పింపదు. ఇట్టి పరమరహస్యము నెఱింగి యెల్ల

---

విష్ణుర్జాతో౽స్య వక్షసః, ముఖేభ్యశ్చతురో వేదా వేదాంగాని చ కృత్స్నశః. ౬. దేవాప్సరసగంధర్వాః సయక్షోరగరాక్షసాః, పూజయంతి సదా వీర విరించిం సురనాయ కమ్.౭.సర్వో బ్రహ్మమయో లోకః సర్వం బ్రహ్మణి సంస్థితమ్,తస్మాత్సమర్చయేద్బ్రహ్మన్య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః. ౮. యో న పూజయతే భక్త్యా సురజ్యేష్ఠం సురేశ్వరమ్. న స నాకస్య రాజ్యస్య న చ మోక్షస్య భాజనమ్.౯. యస్తు పూజయతే భక్త్యావిరించిం భువ నేశ్వరమ్, స నాకరాజ్యమోక్షేషు క్షిప్రం భవతి భాజనమ్. ౧౦. తస్మాత్సైమ్యమనా భూత్వా యావజ్జీవం ప్రతిజ్ఞయా, అర్చయిత్వా సదా దేవమాపన్నో౽పి నరో నృప. ౧౧. వరం దేహపరిత్యాగో వరం నరకసమ్భవః, న త్వేవాపూజ్య భుంజంతి దేవం వై పద్మసంభవమ్. ౧౨. సదా పూజయతే యస్తు వీర భక్త్యా పితామహమ్, మనుష్య చర్మణా నద్ధః స వేధా నాత్ర సంశయః. ౧౩. న హి వేధో౽ర్చనాత్కించిత్పుణ్య

వారు నెల్లవేళలఁ బ్రయత్నపూర్వకముగ వేధోఽర్చనముఁ జేయవల యును. ఎవఁడజ్ఞానాద్యభిభూతుఁడై సర్వదేవనమస్కృతుఁడగు బ్రహ్మను ద్వేషించునో యాతఁడు నిరయమునొందును. అట్టివానితోఁ గలసిమెలసి మాటాడువారు గూడ నరకము నొందుదురు. బ్రహ్మార్చనము విధ్యుక్త క్రమముగఁ బ్రయత్నమున బ్రతిష్ఠించువాఁ డెట్టి పుణ్యఫలము వడ యునో యెఱింగింతు నిశ్చలచిత్తుఁడవై యాలకింపుము. విరించిని బ్రతి ష్ఠించి పూజించువాఁడు యజ్ఞాచరణమునఁ గల్గుఫలముకన్నను దపశ్చరణ మునఁ గల్గుఫలముకన్నను దానఫలంబుకన్నను దీర్థయాత్రలఫలముకన్నను వేదాధ్యయనఫలంబుకన్నను గోటిగుణితంబగు పుణ్యఫలంబు నందు చున్నాఁడు. మనోహరమగుమండపముగట్టి యందు బ్రహ్మను నిలిపిననదుం డాగమోదితఫలంబును కోటికోటిగుణితముగఁ బొందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు మాతృవంశమున నేడుతరములను బితృవంశమున నేడుతరములను శ్వశురకులమున నేడుతరముల నను నిరువదొక్కతరము లను దరింపఁజేసి బ్రహ్మలోకమునఁ బూజలు గొనఁగలుగును. మఱియు నట నానావిధభోగము లనుభవించి ప్రళయకాలమున జ్ఞానయోగంబు వడసి మోక్షము నందుచున్నాఁడు. అట్లు మోక్షము నాసింపక రాజ్యమును మదిఁగోరుచో జన్మాంతరమున సప్తద్వీపసమన్వితంబును సముద్రవేష్టితంబు నగు నీమహీమండలమున కేలిక యగును. పున్నమనాఁడును బాడ్యమి

---

మభ్యధికం భవేత్, ఇతి విజ్ఞాయ యత్నేన పూజనీయః సదా విధిః. ౧౪. యో బ్రహ్మాణం ద్వేష్టి మోహాత్సర్వదేవనమస్కృతమ్, నరో నరకగామీ స్యాత్తస్య సంభాష ణాదపి. ౧౫. బ్రహ్మణోఽర్చాం ప్రతిష్ఠాప్యసర్వయత్నైర్విధానతః,యత్పుణ్యం ఫలమా ప్నోతి తదేకాగ్రమనాః శృణు. ౧౬. సర్వయజ్ఞతపోదానతీర్థవేదేషు యత్ఫలమ్, తత్ఫలం కోటిగుణితం లభేద్వేధః ప్రతిష్ఠయా. ౧౭. కఞ్జజం స్థాపయేద్యస్తు కృత్వా శాలాం మనోరమామ్, సర్వాగమోదితం పుణ్యం కోటికోటిగుణం లభేత్. ౧౮. మాతృ జాన్పితృజాంశ్చైవ యాం చైవోద్వహతే స్త్రియమ్, కులైకవింశముత్తార్య బ్రహ్మ లోకే మహీయతే. ౧౯. భుక్త్వా తు విపులాన్ భోగాన్ప్రలయే సముపస్థితే, జ్ఞాన యోగం సమాసాద్య స తత్రైవ విముచ్యతే. ౨౦. అథ వా రాజ్యమాకాంక్షేజ్జాయతే సంభవాంతరే, సప్తద్వీపసముద్రాయాః క్షితేరధిపతిర్భవేత్. ౨౧. త్రిసంధ్యం యో జపేద్బ్రహ్మ కృత్వాష్టదలపంకజమ్, పౌర్ణమాస్యాం ప్రతిపది తస్య పుణ్యఫలం శృణు.

నాఁడును మూఁడుసంజలఁబద్మాసనోపవిష్టుఁడై బ్రహ్మజపంబు నొనరించు వాని కగుపుణ్యము నెఱింగింతు వినుము. అట్టివాఁడు మర్త్యదేహము దాల్చి పుడమికివచ్చిన బ్రహ్మయేగాని యొరుండు గాఁడు. ఆతనిదర్శనస్పర్శనములచే సకలమానవులకుఁ గలపాపము లన్నియుఁ బటాపంచలగును. మఱియు నాతఁ డిరువదియొక్కతరములవారిని జేతుల లేవనెత్తి భూలోకమునుండి నాకలోకమున నుంచి పుణ్యానుభవానంతరమున వారితోఁ గూడి భూలోకమునకు దిగి నిత్యసంతోషియై వెలయుచున్నాఁడు. ఒక్కవారముదినములు సర్వకామప్రదుండగు పద్మోద్భవు నారాధించునాతఁడు పద్మాసనస్థితమగు బ్రహ్మమూర్తి నుపాసించువాఁడును బ్రహ్మలోకమున కేఁగుచున్నాఁడు. పుణ్యము దరిగినపిదప భూలోకమున మఱల జనించి పుడమికి ఱేఁడగుచున్నాఁడు. కాకున్న వేదవేదాంగతత్త్వవిదుండగు బ్రాహ్మణుఁడుగ నైన జన్మించుచున్నాఁడు. బ్రహ్మభక్తిపరాయణులు బ్రహ్మపదము నందిన ట్లుగ్రతపంబు నాచరించినవారుగాని మహామఖంబు లనుష్ఠించినవారుగాని యద్దానిఁ బడయఁజాలరు. మృత్తునఁగాని దారువునఁగాని యిటుకలచేఁగాని శైలమునఁగాని యావాసము గట్టి యందు బ్రహ్మప్రతిష్ఠ యొనర్చినవాఁడు ముయ్యేడుతరంబులం గూడి బ్రహ్మసదనమునఁ గాపురముండి పూజలఁ గొనఁగలఁడు. మృణ్మయగృహనిర్మాణము కన్న దారుమయేష్టకామయగృహములు నిర్మించుటవలనఁ గోటిగుణిత ఫలంబు లభించును శిలామయంబగుసదనంబు నిర్మించినవా రిటుకలయిల్లు కట్టినవానికన్న రెట్టింపుఫలము గైకొనుచున్నాఁడు. ఆడుకొనునపుడైన

౨౨. అనేనైవ స దేహేన బ్రహ్మా సంతిష్ఠతే క్షితౌ, పాపహా సర్వమర్త్యానాం దర్శనాత్స్పర్శనాదపి. ౨౩. ఉద్ధృత్య దివి సంస్థాప్య కులానామేకవింశతిమ్, తైః కులైః సహితో నిత్యం మోదతే గోగతో నృప. ౨౪. అప్యేకవారం యో భక్త్యా పూజయేత్పద్మసంభవమ్, పద్మస్థం మూర్తిమంతం వా బ్రహ్మలోకం స గచ్ఛతి. ౨౫. పుణ్యక్షయాత్క్షితిం ప్రాప్య భవేత్క్షితిపతిర్మహాన్, వేదవేదాంగతత్త్వజ్ఞో బ్రాహ్మణశ్చాపి జాయతే. ౨౬. న తత్తపోభిరత్యుగ్రైర్న చ సర్వైర్మహామఖైః, గచ్ఛేద్బ్రహ్మపురం దివ్యం ముక్త్వా భక్తిపరాత్మకాన్. ౨౭. మృద్దారైర్వేష్టకైశ్శైలైర్వా యః కుర్యాద్బ్రహ్మణో గృహమ్, త్రిఃసప్తకులసంయుక్తో బ్రహ్మలోకే మహీయతే. ౨౮. మృన్మయాత్కోటిగుణితం ఫలం దార్విష్టకామయే, ఇష్టకాద్ద్విగుణం పుణ్యం కృతే శైలమయే గృహే. ౨౯.

నెవఁడు బ్రహ్మశాలను నిర్మించునో యానరుండు బ్రహ్మలోకమున నెల్ల కోర్కులు దీర్పఁజాలువిమానము నొందఁగలఁడు. ఆదేవయానము పూల మాలికలతోడను జిరుగంటలతోడను నలంకృతంబై యూయెలలతోఁ గూడిగంటలు వింజామరములు ముత్యాలసరులు మొదలగువానితో నల రారుచు సూర్యప్రభాసమానమై యప్సరోగణపరివృతమయిసర్వకామము లను సుఖములను జేకూర్చుచుండును. అట్టి విమానమున వసించి దివౌక సులఁగూడి క్రీడించుచు నతులభోగంబు లనుభవించుచుఁగొండొక కాలం బుండి పిదప యీలోకమున ధార్మికుండగు రాజగుచున్నాఁడు. అట్టి యాలయమును బ్రత్యహమును గాంచుచు మెల్లన జంతువుల నివా రించుచు సమ్మార్జనముసేయువాఁడు చాంద్రాయణఫలము నొందును. నిర్మలమగునుదకముచే నాయాలయమును శుభ్రపఱచుచు నిత్యము దర్శిం చుచు నసంబాధముగ జంతుసమ్మర్దమును బరిహరించుచు నుండువాఁడును దత్ఫలము నందును పదునైదునాళ్లు నిర్విఘ్నముగ సమ్మార్జన మొనర్చి యర్చించునరుండు శతకోటియుగాంతము బ్రహ్మలోకమున వసించి బహు మతి వడయుచుండు. అటులుండి యాతఁడు దుదిని నాల్గువేదములఁ జదివి యందగాఁడయి ప్రియదర్శనుఁడయి ధనాఢ్యుండు సమస్తసద్గుణసమన్వి తుఁడు నయి ధార్మికుండగు రాజయి జన్మించును. ఓశతానీకా! కపట స్వభావముచేతనేనియు బ్రహ్మశాలను నిర్మించి సమ్మార్జనాదులు సలుపు

---

క్రీడమానోఽపి యః కుర్యాచ్ఛాలాం వై బ్రహ్మణో నృప, బ్రహ్మలోకేన లభతేవిమానం సర్వకామికమ్. ౩౦. పుష్పమాలాపరిక్షిప్తం కింకిణీజాలభూషితమ్, దోలావిక్షేపసంపన్నం ఘంటాచామరభూషితమ్. ౩౧. ముక్తాదామవితానేన శోభితం సూర్యసుప్రభమ్, అప్సరోగణసంకీర్ణం సర్వకామసుఖప్రదమ్. ౩౨ తత్రోషిత్వా మహాభోగీ క్రీడమానః సదా సురైః, పునరాగత్య లోకేఽస్మిన్ రాజా భవతి ధార్మికః. ౩౩. పశ్యన్పరిహరన్ జంతూన్మృదుపూర్వం మహీపతే, శనైః సమ్మార్జనం కుర్వంశ్చాంద్రాయణఫలం వ్రజేత్. ౩౪. వస్త్రపూతేన తోయేన యః కుర్యాదుపలేపనమ్, పశ్యన్పరిహరన్ జంతూంశ్చాంద్రా యణఫలం లభేత్. ౩౫. నైరంతర్యేణ యః కుర్యాత్పక్షం సమ్మార్జనార్చనమ్, యుగ కోటిశతం సాగ్రం బ్రహ్మలోకే మహీయతే. ౩౬. తస్యాంతే స చతుర్వేదః సురూపః ప్రియదర్శనః, ఆఢ్యః సర్వగుణోపేతో రాజా భవతి ధార్మికః. ౩౭. కపటేనాపి యః కుర్యాద్బ్రహ్మశాలాం సుమానద, సమ్మార్జనాది వై కర్మ సోఽపి ప్రాప్నోతి తత్ఫలమ్,

వాఁడున్నైత మిట్టిఫలము నొందును. మానవులు బ్రహ్మభక్తులు గానంత వఱకు దుఃఖశోకభయములనొంది యీసంసారమునఁ గ్రిందుమీఁదు లగుచున్నారు. ఏవానిచిత్తము బ్రహ్మసంలగ్నమగునో యెవ్వఁడు చిత్తము తదాయత్తము గావించి ధ్యాననిరతుఁడై యుండునో యట్టివారీసంసృతిబంధమునుండి విముక్తిఁజెందుచున్నారు. బ్రహ్మశాలయందు నుద్యానావసథాదులందును విరుగుళ్లను బగుళ్లను సరిచేయుచుండునేని ముక్తిబడయును. బ్రహ్మకు దీటగు దేవుఁడు లేఁడు; గురుఁడును లేఁడు. బ్రహ్మజ్ఞానసమమగు జ్ఞానమును లేదు. బ్రహ్మార్చనముకన్న నుత్తమమగుతపమొండు లేదు. ప్రతిపదాదులగు నుత్సవదివసంబులందును పుణ్యములగు పర్వకాలములను బున్నమనాఁడును గీతాదులతోడను శంఖభేర్యాది మహానిర్ఘోషంబులతోడను సురనాయకుఁ డగుచతుర్ముఖునకు నీరాజనమొసంగవలయును. మానవుఁ డెన్ని పర్వదినముల విధ్యుక్తవిధానమునఁ బితామహునకు నీరాజనము సమర్పించునో యన్ని వేలయుగంబులాతఁడు బ్రహ్మలోకమునఁ బూజితుఁడగును. మూఁడుసంధ్యలస్నానకాలమునఁ బితామహునెదుట నృత్తగీతవాద్యాదులు నెరపువారును నిజకళాకౌశలము నెరపువారును బొందుఫలంబు నిక వినిపింతు వినుము. ఎన్ని దినములు గానాదు లొనరింతు రన్ని వేలయుగంబులు బ్రహ్మలోక

---

౩౮. తావద్భ్రమంతి సంసారే దుఃఖశోకభయప్లుతాః, న భవంతి సురశ్రేష్ఠే యావద్భక్తా మహీపతే. ౩౯. సమాసక్తం యథా చిత్తం జంతోర్విషయగోచరే, యద్యేవం బ్రహ్మణి న్యస్తం కో న ముచ్యేత బంధనాత్. ౪౦. ఖండస్ఫుటితసంస్కారం శాలాయాం యః కరోతి వై, ఆరామావసథాద్యేషు లభతే మౌక్తికం ఫలమ్. ౪౧. నాస్తి బ్రహ్మసమో దేవో నాస్తి బ్రహ్మసమో గురుః, నాస్తి బ్రహ్మసమం జ్ఞానం నాస్తి వేధఃసమం తపః. ౪౨. ప్రతిపద్యాదిసర్వేషు దివసేషూత్సవేషు చ, పర్వకాలేషు పుణ్యేషు పౌర్ణమాస్యాం విశేషతః. ౪౩. శంఖభేర్యాదినిర్ఘోషైర్మహద్భిర్గేయసంయుతైః, కుర్యాన్నీరాజనం దేవే సురజ్యేష్ఠే చతుర్ముఖే. ౪౪. యావత్పర్వాణి విధినా కుర్యాన్నీరాజనం నృప, తావద్యుగసహస్రాణి బ్రహ్మలోకే మహీయతే. ౪౫. స్నానకాలే త్రిసంధ్యం తు యః కుర్యాన్నృత్యవాదనమ్, గీతం వా ముఖవాద్యం వా తస్య పుణ్యఫలం శృణు. ౪౬. యావన్త్యహాని కురుతే గేయనృత్యాదివాదనమ్, తావద్యుగసహస్రాణి

వాసులు సుఖులును నగుదురు. కుశోదకముతోఁగూర్చిన కపిలగోవుయొక్క పంచగవ్యముల మంత్రపూతముల గావించి వానిచేఁ జతురాననుని నభిషేకింపఁదగును అయ్యది బ్రాహ్మస్నానము. కపిలగోవుపంచగవ్యమునఁగాని దధిక్షీరఘృతములచేఁగాని యభిషేకించిన నితరాభిషేకములకన్న నూరురెట్లుత్తమమయినఫలము గలుగును దేవకార్యములకు నగ్నికార్యములకును బ్రాహ్మణక్షత్రియవైశ్యులు కపిలగోవును బోషింపఁదగుదురు. శూద్రుఁడు కపిలగోవును బోషింపరాదు. దేవకార్యములకు నియమింపఁబడిన కపిలగోక్షీరమునుగాని మఱిదేనినైనఁ ద్రాగుశూద్రుఁడు ఘోరంబగు నిరయసాగరమున మునిఁగి చిరకాలము తపించుచుండును. వేయికోటులవత్సరములనుండి యార్జించినఘోరపాతకము సురజ్యేష్ఠునకు ఘృతాభిషేక మొనర్పుటచే నిశ్శంకముగఁ దీరిపోవును. కల్పకోటిసహస్రమున నార్జించిన మహాపాతకమైనను శుష్కేంధనము లగ్నిచేఁ గాల్పఁబడినట్లు పితామహుని ఘృతాభిషేకముచేఁ గాల్పఁబడును. ప్రతిపత్తిథి నొక్కమారు పితామహునకు ఘృతాభిషేక మొనరించినవాఁడు ముయ్యేఁడుతలలఁ దరింపఁజేసి విష్ణులోకమునఁ బూజ్యతగాంచును. మనుజుండు వస్త్రాభరణాదులతోఁ బదివేలమొదవులఁదొలిపలుకులనిజమెఱిఁగిన పాఱుల కిచ్చి యెట్టిపుణ్యము గాంచునో యాఫలమును బ్రహ్మకుఁ బాల నభిషేకము సల్పినవాఁడు పొందును. ఒక్కమారు నేతితోఁగాని

---

బ్రహ్మలోకే మహీయతే. ౪౭. కపిలాపంచగవ్యేన కుశవారియుతేన చ, స్నాపయే న్మంత్రపూతేన బ్రాహ్మం స్నానం హి తత్స్మృతమ్. ౪౮. కపిలాపంచగవ్యేన దధిక్షీర ఘృతేన చ, స్నానం శతగుణం జ్ఞేయమితరేషాం నరాధిప. ౪౯. దేవాగ్నికార్య ముద్దిశ్య కపిలామాహరేత్సదా, బ్రహ్మక్షత్రవిశశ్చైవ న శూద్రస్తు కదాచన. ౫౦. కాపిలం యః పిబేచ్ఛూద్రో దేవకార్యార్థనిర్మితమ్, స పచ్యేత మహాఘోరే సుచిరం నరకార్ణవే. ౫౧. వర్షకోటిసహస్రైస్తు యత్పాపం సముపార్జితమ్, సురజ్యేష్ఠఘృతా భ్యంగాద్దహేత్సర్వం న సంశయః. ౫౨. కల్పకోటిసహస్రైస్తు యత్పాపం సముపా ర్జితమ్, పితామహఘృతస్నానం దహత్యగ్నిరివేంధనమ్. ౫౩. ఘృతస్నానం ప్రతిపది సకృత్కృత్వా తు కాంజజమ్, కులైకవింశముత్తార్య విష్ణులోకే మహీయతే. ౫౪. అయుతం యో గవాం దద్యాద్భక్త్యా వై వేదపారగే, వస్త్రహేమాదియుక్తానాం క్షీర స్నానేన యత్ఫలమ్. ౫౫. సకృదాజ్యేన పయసా విరించిం స్నపయేత్తు యః,

పాలతోఁగాని విరించి నభిషేకించినమానవుఁడు గాంగేయమగువిమానముతో బ్రహ్మసాలోక్యము నొందుచున్నాఁడు. దధిచే నొక్కపర్యాయము బ్రహ్మ నభిషేకింప విష్ణుపదము లభించును. తేనెతో నభిషేకించువాఁడు వీరులు వసించులోకమును బొందును. చెఱకుపానకమున నభిషేకించువాఁడు నిజతేజంబున నాకసము వెలిఁగించుచు సవితృసాలోక్యము నొందుచున్నాఁడు. శుద్ధోదకమునఁ బద్మజు నభిషేకించుభక్తులు పాపరూపమగు శుక్లశోణితసంబంధం బెడబాసి శాశ్వతముగ బ్రహ్మసాలోక్యము నొందుచున్నారు. వడియగట్టినయుదకముచేఁబితామహు నొక్కపర్యాయమభిషేకించువాఁడు సర్వకాలములను తృప్తుఁడై వశీకృతసర్వలోకుఁడై యుండును. ఓషధులచే నభిషేకించి కాంచనవిమానారూఢుండై బ్రహ్మలోకమునఁ బూజనీయుండగును. ఏమానవుఁ డంబుజాతసంజాతుని బరిమళభరితంబగు చందనోదకమున జలకమార్చునో యాతఁడు తప్తకాంచనసచ్ఛాయశరీరుఁడై రుద్రలోకమున వసించుచున్నాఁడు. సుగంధసంవాసితములై సుస్థిరములగు పాటలపుష్పములు నుత్పలములు పద్మములు కరవీరసుమంబులు నభిషేకావసరమున నుపయోగింపఁ దగియున్నవి. రాజోత్తమా! వెనుకనిరూపించిన యభిషేకముల నేదే నొక్కయభిషేచనమును గంజజాతున కొనరించిననరుండు పాపకలిలంబు బాసి బ్రహ్మలోకమున సమ్మానింపఁబడును. కర్పూరాగురుజలముల నభిషేకిం

గాంగేయేన స యానేన యాతి బ్రహ్మసలోకతామ్. ౧౬. స్నాప్య దధ్నా సకృద్వీర కంజజం విష్ణుమాప్నుయాత్, మధునా స్నపయిత్వా తు వీరలోకే మహీయతే. ౧౭. స్నానమిక్షురసేనేహ యో విరించేః సమాచరేత్, స యాతి లోకం సవితుస్తేజసా భాసయన్నభః. ౧౮. శుద్ధోదకేన యో భక్త్యా స్నపయేత్పద్మసంభవమ్, ఉత్సృజ్య పాపకలిలం స యాత్యేవ సలోకతామ్. ౧౯. వస్త్రపూతేన తోయేన స్నపయేద్యః సకృద్విభుమ్, స సర్వకాలం తృప్తాత్మా లోకవశ్యత్వమాప్నుయాత్. ౨౦. సర్వౌషధీభిర్యో భక్త్యా స్నపయేత్పద్మసంభవమ్, కాంచనేన విమానేన బ్రహ్మలోకే మహీయతే. ౨౧. గంధచందనతోయేన స్నాపయేద్యోఽంబుజోద్భవమ్, రుద్రలోకమవాప్నోతి తేజసా హేమసన్నిభః. ౨౨. పాటలోత్పలపద్మాని కరవీరాణి సర్వదా, స్నానకాలే ప్రయోజ్యాని స్థిరాణి సురభీణి చ. ౨౩. ఏషామేకతమం స్నానం భక్త్యా కృత్వా తు వేధసి, విధూయ పాపకలిలం విధిలోకే మహీయతే. ౨౪. కర్పూరాగరుతోయేన స్నపయే

చినఁ బాపపటలంబు భేదించి బ్రహ్మలోకము నందుదురు. గాయత్ర్యష్టో త్తరశతముచే జపింపఁబడినయుదకముచేఁ దానమాడించినను నరుం డాలోకము నొందుచున్నాఁడు భక్తిభరితాంతరంగుఁడై కంజసంజాతునకుఁ దొలుత శీతలోదకములను బిదప సద్యోదుగ్ధక్షీరములచేతను సటుప్పైని ఘృతముచేతను స్నానము సమర్పింప మానవులపాపంబులెల్లఁ దొలఁగిచనును. ఈమూఁడుస్నానములుచేయించి భక్తితోఁ బూజించినమానవుఁ డశ్వమేధసహస్రఫలము గాంచును. మంటికుండలచేతను రాగికడవల చేతను నభిషేకించిన శతగుణితఫలంబు గల్గును. వెండికుండలచేఁగాని బంగారుకలశములచేఁగానియభిషేకించిన లక్షగుణితమును గోటిగుణితమగుఫలము వరుసగఁ గలుగును. బ్రహ్మదర్శనముననే పుణ్యము గలుగును. అంతకన్న స్పర్శన ముత్తమము. అంతకన్న నర్చనము శ్రేయోదము. అంతకన్నను ఘృతస్నాన మత్యుత్తమము. పద్మసంభవుఁడు వాచికమానసంబులగు దేహధారులపాతకంబుల ఘృతస్నానసంతుష్టుఁడై నాశ మొందించుఁగావున ఘృతస్నానము సమర్పింపవలయును స్నానము చేయించి పూజింపవలసినవిధానము నాలకింపుము. తానును స్నానమాచరించి శుభ్రవస్త్రములు ధరించి పూజామండపమున కేగి యంగకరన్యాసాదు లొనరించి నాల్గుచేతులు వైశాల్యముగల్గి నాలుగుభాగములుగ విభక్తమగు నొకపద్మచిత్రము లిఖించి దానిమధ్యభాగమున ద్వాదశదళ

---

ద్యస్తు కంజజమ్, సర్వపాపవిశుద్ధాత్మా బ్రహ్మలోకే మహీయతే. ౬౫. గాయత్రీశత జప్తేన విమలేనాంభసా విభుమ్, స్నపయిత్వా సకృద్భక్త్యా బ్రహ్మలోకమవాప్నుయాత్. ౬౬. విభుం శీతాంబునా స్నాప్య ధారోష్ణపయసా తతః, తతః పశ్చాద్ ఘృతస్నానం కృత్వా పాపైర్విముచ్యతే. ౬౭. ఏతత్స్నానత్రయం కృత్వా పూజయిత్వా తు భక్తితః, అశ్వమేధసహస్రస్య ఫలం ప్రాప్నోతి మానవః. ౬౮. మృత్కుంభైస్తామ్రజైః కుంభైః స్నానం శతగుణం భవేత్, రౌప్యే లక్షోత్తరం ప్రోక్తం హైమైః కోటిగుణం భవేత్. ౬౯. బ్రహ్మణో దర్శనం పుణ్యం దర్శనాత్స్పర్శనం పరమ్, స్పర్శనాదర్చనం శ్రేష్ఠం ఘృతస్నానమతః పరమ్. ౭౦. వాచికం మానసం పాపం ఘృతస్నానేన దేహినామ్, క్షీణుతే పద్మజో యస్మాత్తస్మాత్స్నానం సమాచరేత్. ౭౧. స్నపయిత్వార్చయేద్భక్త్యా యథా తచ్ఛృణు భారత, శుచివస్త్రధరః స్నాతః కృతన్యాసశ్చ భారత. ౭౨. చతుర్హస్తం లిఖేత్పద్మం చతుర్భాగవిభాగితమ్, మధ్యే తస్య లిఖేచ్చక్రం దళైర్ద్వాదశభి

సంచితమగుచక్రమును వ్రాయవలయును. తరువాత సరోజదళములతో నంతట నక్షరచిహ్నము లుంచవలయును. పద్మముయొక్క ప్రత్యేకభాగములనక్షరములు లిఖింపవలయును. ఇవి యన్నియు ననేకరంగులచే వరుసగ వ్రాయవలయును. అందు మధ్యదేశము కృష్ణవర్ణముతోడను ప్రదేశాంతరములు పాటలవర్ణముతోడను జిత్రింపవలయును. మఱియు మధ్యభాగము తెల్లగఁ బరిశుద్ధముగ గుండ్రముగ నుండవలయును. ఆచక్రనాయకునిచుట్టును ప్రభాసమన్వితములగు దీపముల నుంచవలయును. కాంతిమంతములగు కుండలములచే నలంకరింపవలయును. ఈవిధమునఁ జక్రనాయకుని లిఖించి సప్రయత్నముగ మూలమంత్రము నిక్షేపింపవలయును. పండితుండగువాఁడు చక్రపురుషునిశిరమునుండి పాదమువఱకు నోంకారము నుంచవలయును శబ్దశూన్యమై యుండుప్రదేశమున నాదము నుంచవలయును. తరువాత శిరమునందు "తత్" కారమును ముఖమండలమున "స" కారమును, గంఠదేశమున "వి" కారమును, సంగసంధులందు "తుర్" కారమును, వక్షోమధ్యదేశమున "వ" కారము, నుభయపార్శ్వముల "రే" కారమును దక్షిణకుక్షిని "ణీ" కారమును, వామకుక్షిని "యం" కారమును, కటినాభిదేశముల "భ" కారమును, జానుపర్వంబుల "ర్గో" కారమును, జంఘలందు "దే" కారమును, పాదపద్మముల "వ" కారమును, నంగుష్ఠముల "స్య" కారమును, నురమున

---

శ్చితమ్. ౨౩. సరోజాని తతోఽన్యస్య అక్షరాణి సమంతతః, అక్షరం విహితం చాన్యత్పత్రభాగే ప్రకీర్తితమ్. ౨౪. నానావర్ణకసంయోగాల్లిఖేచ్చైవానుపూర్వశః, కృష్ణోత్కటం తు మధ్యం, స్యాత్పీతరక్తం తథా పరమ్. ౨౫. సితం శుద్ధం తు కర్తవ్యం మధ్యభాగే తు వర్తులమ్, ప్రభామండలకైర్వాహ్యే ర్వేష్టయేచ్చక్రనాయకమ్. ౨౬. ఏవమాలిఖ్య యత్నేన మూలమంత్రం తతో న్యసేత్, మూర్ధ్నః పాదతలం యావత్ప్రణవం విన్యసేద్బుధః. ౨౭. నాదరూపం న్యసేత్తావద్యావచ్ఛబ్దస్య శూన్యతా, తత్కారం విన్యసేన్మూర్ధ్ని సకారం ముఖమండలే. ౨౮. వికారం కంఠదేశే తు తుకారం సర్వసంధిషు, వకారం హృది మధ్యే తు రేకారం పార్శ్వయోర్ద్వయోః. ౨౯. ణకారం దక్షిణే కుక్షౌ యకారం వామసంజ్ఞకే, భకారం కటినాభిస్థం ర్గోకారం జానుపర్వసు ౩౦. దేకారం జంఘయోర్న్యస్య వకారం పాదపద్మయోః, స్యకారమంగు

"ధీ" కారమును, జానువులందు "మ" కారమును, గుహ్యమున "హి" కారమును, హృదయమున "ధి" కారమును, నోష్ఠద్వయమున "యో" కారద్వయమును, నాసికాగ్రమున "నః" కారమును, నేత్రముల "ప్ర" కారమును, భ్రూమధ్యంబున "చో" కారంబును, ప్రాణమున "ద" కారమును, మూర్ధమున "యా" కారమును, కేశముల "త్" కారమును న్యసింపవలయును. తొలుత నిజదేహమున న్యాసమొనరించుకొని పిదప దేవున కొనర్పనగును. ఆతనికి సర్వోపచారము లొసంగి బాగుగా దర్శింపవలయును. కుంకుమాగురుకర్పూరచందనమిశ్రితమగు పరిమళజలమును ప్రణవవ్యాహృతిపురస్సరముగ గాయత్రిచే నభిమంత్రించి యనంతరమునఁ బూజాద్రవ్యములనెల్లఁ దిలకింపవలయును. పిమ్మటఁ బూజమొదలిడి చక్రగ్రంథులన్నిట నోంకార ముంచవలయును. సర్వతోముఖమ్మగు ప్రణవంబును ప్లుతస్వరమున నుచ్చరించి చిత్రితపద్మమధ్యభాగంబునఁ బీఠము నేర్పరుపవలయును. సర్వప్రాణులకు నాధారమగుపృథివి యాసన మనఁబడును. అదియు హ్రస్వమగు నోంకారము నాశ్రయించియుండును. దీర్ఘోంకార మాశ్రయించి దేవరా జుండును. ప్లుతమగునోంకారము మోక్షప్రదమై యమృతరూపమగుపదార్థమును వ్యాపించియుండును. ప్రాణపరాయణుఁ డగుయోగి యొకయత్నమున నుండుటచే నందుండి

---

ష్ఠయోర్న్యస్య ధీకారం చోరసి న్యసేత్. ౮౧. మకారం జానుదేశే తు హికారం గుహ్యమాశ్రితమ్, ధికారం హృదయే న్యస్య యోకారం చౌష్ఠయోర్న్యసేత్. ౮౨. నకారం నాసికాగ్రే తు ప్రకారం నేత్రమాశ్రితమ్, చోకారం తు భ్రువోర్మధ్యే దకారం ప్రాణమాశ్రితమ్. ౮౩. యాకారం విన్యసేన్మూర్ధ్ని తకారం కేశమాశ్రితమ్, న్యాసం కృత్వాత్మనో దేహే దేవే కుర్యాత్తథా నృప, సర్వోపచారసంపన్నం కృత్వా సమ్యఙ్ నిరీక్షయేత్. ౮౪. కుంకుమాగురుకర్పూరచందనేన విమిశ్రితమ్, గంధతోయ ముపస్కృత్య గాయత్ర్యా ప్రణవేన చ, ప్రోక్షయేత్సర్వద్రవ్యాణి పశ్చాదర్చనమాచరేత్. ౮౫. చక్రగ్రన్థిషుసర్వాసు ప్రణవం వినివేశయేత్, భూయః ప్లుతం సముచ్చార్య ప్రణవం సర్వతోముఖమ్. ౮౬. విన్యసేత్పద్మమధ్యే తు పీఠనిష్పత్తిహేతవే, ఆసనే పృథివీ జ్ఞేయా సర్వసత్త్వధరా మతా. ౮౭. హ్రస్వోంకారే మతా సా తు దీర్ఘోంకారే తు దేవరాట్, ప్లుతస్తు వ్యాపయేద్భావం మోక్షదం చామృతాత్మకమ్ ౮౮. యత్నస్థో న నివర్తేత యోగీ ప్రాణపరాయణః, ఆవాహనం తతః కుర్యాదక్షరేణ పరేణ తు. ౮౯.

నివర్తించుటలేదు. కావున నింకొకయక్షరముతో నావాహనము చేయవలయును. అట్లావాహన మొనర్చినతేజోరూపము చెంత మంత్రశ్రేష్ఠముల న్యసింపవలయును. పిమ్మటఁ బద్మముననుండు సర్వజగత్స్రష్టయు విష్ణురుద్రులనిర్మించినవాఁడు నగుచతురాననుని భావింపఁదగును. అట్లాతని భావనజేసి యనంతరమున విధివిధానము భక్తియుక్తుఁడై యర్చనము మొదలిడవలయును. గంధపుష్పాదిపూజాసంభారములు సమకూర్పవలయును. అన్నిక్రియలును గాయత్రీమంత్రోచ్చారణపురస్సరముగనొనర్పవలయును. మఱియుఁ బుష్పములు ధూపదీపనైవేద్యములు, శర్కరలడ్డు శ్రీవేష్టము (దేవదారునిర్యాసనిర్మితధూపద్రవ్యము) కాసారము నశోకమును పలువిధములగువర్తికలు స్వస్తికములు (మంగళద్రవ్యవిశేషాదులు) నుల్లోపికదుగ్ధతిలావేష్టతిలాఢికాప్రముఖభక్ష్యవిశేషములును ఫలములును మాంగళికము లగుఖండగుడ (పటికబెల్లము)ములును నానావిధములగునప్పములను నింక ననేకముగ నాయాకాలమున నుండు విశేషవస్తువులను యథాశక్తిగ నీమొదలగువానినెల్ల నివేదింపవలయును. పిమ్మట మూలమంత్రముచే నాదేవుని దేహమును విశేషముగ భావనచేసి నీకుఁ జెప్పువిధమున నాతనిఁ బూజింపవలయును. దేహశుద్ధికొఱకుఁ బ్రాణాయామత్రయము నాచరించి పిదప వాగాధారుఁ డగుననంతుని నందావాహన మొనర్చియాతని ధ్యానించి యాపెన్కఁబద్మకేసరమధ్యసంస్థితుఁడగు

ఆవాహ్య తేజోరూపం తు న్యసేన్మన్త్రవరాంస్తతః, తతో విభావయేద్దేవం పద్మస్థం చతురాననమ్. ౯౦. స్రష్టారం సర్వజగతాం విష్ణురుద్రవిధానగమ్, సంభావ్య విధివద్భక్త్యా పశ్చాచ్చార్చనమాచరేత్. ౯౧. గంధపుష్పాదిసంభారాన్క్రమాత్సర్వాన్ప్రకల్పయేత్, గాయత్రీముచ్చరన్మన్త్రం సర్వకర్మాణి కారయేత్. ౯౨. పుష్పం ధూపం తథా దీపం నైవేద్యం సుమనోహరమ్, ఖండలడ్డుకశ్రీవేష్టకాసారాశోకవర్తికాః. ౯౩. స్వస్తికోల్లోపికాదుగ్ధతిలావేష్టతిలాఢికాః, ఫలాని చైవ పక్వాని లగ్నఖండగుడాని చ. ౯౪. అన్యాంశ్చ వివిధాన్ద్రవ్యాన్పూపాని వివిధాని చ, ఏవమాదీని సర్వాణి దాపయేచ్ఛక్తితో నృప. ౯౫. మూలమన్త్రేణ దేవస్య తతో దేహం విభావయేత్, పూజయేచ్చాపి విధినా యేన తం తే బ్రవీమ్యహమ్. ౯౬. ప్రాణాయామత్రయం కృత్వా దేహసంశోధనాయ వై, ఆవాహయేత్తతో౽నన్తం ధారయన్తం వచఃసదా. ౯౭. ధ్యాత్వానన్తం

రుద్రుని ధ్యానింపవలయును. అటుపైని పద్మోదరుఁడై యుద్భవించిన విష్ణు దేవుని ధ్యానించి న్యాసముచేయవలయును. ఇప్పగిది మూఁడుమూర్తుల విఖ్యాతుఁడైన పద్మసంభవునిఁ బద్మమధ్యమున మూలమంత్రముచేఁ బూజింపవలయును. ఋగ్యజుస్సామవేదములఁ బూజింపవలయును. మఱియుఁ బండితుండు జ్ఞానవైరాగ్యముల నైశ్వర్యధర్మములను లెస్సగఁ బూజింపవలయును. ఈనాలుగింటి నీశానప్రభృతులగు విదిశలందుఁ బూజింపవలయును. శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము ఛందము జ్యోతిషము ననుషడంగముల, నుపవేదములను, నితిహాసపురాణములను యథాక్రమముగను యథాయోగ్యముగను నారాధింపవలయును. ఆతనిసమ్ముఖమున నిత్యమును శిక్షాకల్పవ్యాకరణములఁ బూజించుచుండవలయును. మిగిలినవన్నియు దిశలందును విదిశలందును బూజింపఁదగినవి. ప్రణవసమన్వితముగ మహావ్యాహృతుల నన్నింటిని యథావిధిగఁ బూర్వాదిదిక్క్రమంబునఁ బూజింపవలయును. ఈవ్యాహృతులు లోకరూపములును మంత్రరూపములు నగుబ్రహ్మదేవునిశక్తులగుట యత్నపురస్సరముగఁ బూజనార్హములు యంత్రదళములమధ్యనుండు షట్సముద్రములను బూజింపఁదగును. దేవతోత్తములందు వ్యవస్థితులగు గ్రహరాశినక్షత్రములను న్యాయమార్గమున నారాధింపవలయును నాగములు

---

తతో రుద్రం పద్మకింజల్కమధ్యగమ్, ధ్యాయేద్విష్ణుం తతో దేవం న్యసేత్పద్మోదరోద్భవమ్. ౯౮. ఏవం త్రిదేవతారూఢం పద్మమధ్యేఽంబుజోద్భవమ్, పూజయేన్మూలమన్త్రేణ పద్మోదరభవం నృప. ౯౯. ఋగ్వేదం తు యజుర్వేదం సామవేదం చ పూజయేత్, జ్ఞానవైరాగ్యమైశ్వర్యం ధర్మం సంపూజయేద్బుధః. ౧౦౦. ఈశానాదిక్రమాద్రాజన్విదిశాసు సమంతతః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్ద ఏవ చ. ౧౦౧. జ్యోతిషం చ మహాబాహో ఉపవేదాశ్చ కృత్స్నశః, ఇతిహాసపురాణాని యథాయోగ్యం యథాక్రమమ్. ౧౦౨. శిక్షా కల్పో వ్యాకరణం దేవస్య పురతః సదా, కల్పాదయస్తతశ్చాన్యే దిశాసు విదిశాసు చ. ౧౦౩. మహావ్యాహృతయః సర్వాః ప్రణవేన సమస్వితాః, పూర్వాదిక్రమయోగేన పూజయేద్విధినా నృప. ౧౦౪. శక్తయో బ్రహ్మణస్త్వేతా లోకరూపా వ్యవస్థితాః, పూజనీయాః ప్రయత్నేన మన్త్రరూపాః స్థితాః స్వయమ్. ౧౦౫. అరకాంతరసంస్థాంశ్చ షట్ సముద్రాన్సమర్చయేత్, నక్షత్రాణి గ్రహాశ్చైవ రాశయశ్చ విశేషతః, పూజ్యాః సర్వే యథాన్యాయం సురాగ్రేషు వ్యవస్థితాః. ౧౦౬.

గరుడుఁడు దేవతలు ఋషులు కులశైలములు బ్రహ్మతేజోమయంబులగు జ్యోతిస్సులును పూజింపఁదగియున్నవి. మంత్రపూతంబగునుదకంబున విధివిధానమున నాచమించి హృదయాదులందుఁ గృత్స్నముగ హృదయాద్యంగన్యాస మొనరింపవలయును శిఖానేత్రచర్మాస్త్రములను మాహేంద్ర్యాది నాల్గుదిక్కుల విధివత్తుగఁ బూజింపవలయును. మూలమంత్రముచే మొదట నాతనియెదుటనుండి హృదయము పిదప వెనుకనుండి శిరమునను నీక్రమమ్మున సర్వాంగములను మూలమంత్రమునఁ బూజింపవలయును. పిమ్మట ముద్రాంకుశప్రదర్శనముచే నుత్సర్జనము సలుపవలయును. ఓపురుషవ్యాఘ్రా! ఆహ్వాన (ఆవాహన) మునందుఁ బద్మముద్రను జూపవలయును. ఈవిధముగ నెవ్వఁడు పంచదశి నుపవసించి ప్రతిపత్తున నియతుఁడై దేవునిఁ బూజించునో యాతఁడు పరమపదము నొందునని వచించి సుమంతుండు వెండియు నిట్లనియె. "ఆపోహిష్ఠా" యనుమంత్రము హృదయమును, "ఋతం సత్య" మను మంత్రము శిఖను, "ఉదుత్యం" అనుమంత్రము నేత్రమును, "చిత్రం దేవానాం" అనుమంత్రము మస్తకమును జూపునని సర్వలోకవిఖ్యాతమై యున్నది. మఱియు "వర్మణా తేచ్ఛాదయామి" అనుమంత్రము కవచమును "భూర్భువఃస్వః" అనునది శిరస్సును చూపును గాయత్రి మూలాధార

---

నాగాశ్చ గరుడశ్చైవ పూజనీయస్తథాగ్రతః, దేవతా ఋషయశ్చైవ సహితాః కులపర్వతాః, తత్తేజోనిలయాః సర్వే పూజనీయాః ప్రయత్నతః. ౧౦౭. ఆచమ్య విధివత్పూర్వం మంత్రపూతేన వారిణా, హృదయాదీన్న్యసేదంగాన్ హృదయాదిషు కృత్స్నశః. ౧౦౮. శిఖా నేత్రం తథా చర్మ అస్త్రం చ భరతర్షభ, మహేంద్రాది దిశశ్చైతాః పూజయేద్విధివన్నృప. ౧౦౯. హృదయం పురతః పూజ్యం శిరో దేవస్య పృష్ఠతః, పూర్వం సంపూజయేద్దేవం మూలమంత్రేణ కృత్స్నశః. ౧౧౦. విసర్జయేద్దర్శయిత్వా ముద్రాం తు భరతర్షభ, అంకుశం నరశార్దూల హ్యాహ్వానే కంజమాదిశేత్. ౧౧౧. యస్త్వేవం పూజయేద్దేవం ప్రతిపన్నిత్యమేవ చ, ఉపోష్య పంచదశ్యాం తు స యాతి పరమం పదమ్. ౧౧౨. సుమంతురువాచ—ఆపో హిష్ఠేతి మంత్రోఽయం హృదయం పరికీర్తితమ్, ఋతం సత్యం శిఖా ప్రోక్తా ఉదుత్యం నేత్రమాదిశేత్. ౧౧౩. చిత్రం దేవానాం మస్తమితి సర్వలోకేషు విశ్రుతమ్, వర్మణా తేచ్ఛాదయామి కవచం సముదాహృతమ్. ౧౧౪. భూర్భువః స్వరితి తథా శిరసే పరి

ముగగలవాఁడు సర్వకర్మలు సాధించును. ప్రణవమున నభిమంత్రణమొన రించి దేవుని గాయత్రిచేఁ బూజింపవలయును. ఋగ్వేదాదుల నన్నింటిని బ్రణవముచేఁ బూజింపవలయును. బ్రహ్మ నాహ్వానించుటకును బూజించుట కును విసర్జించుటకును వేదమాతయగు గాయత్రియే పరమమంత్రము. ఎవఁడు గాయత్ర్యక్షరతత్త్వార్థములచే దేవత నారాధించునో యాతఁడు చేరి యనుభవింపరాని బ్రహ్మస్థానము నొందును.

ఇది సప్తదశాధ్యాయము.

---

## అష్టాదశాధ్యాయము.

సుమంతుఁ డిట్లనియె. పౌర్ణమాస్యుపవాసము సలిపి యోరాజా! భక్తియుక్తుఁడై యీవిధిచేఁ బ్రతిపత్తున విరించి నారా ధించువాఁడు బ్రహ్మపదము నొందును. ఋక్కులచే విరించనుని దేవి యును వాస్తుదేవతలును విశేషముగఁ బూజింపఁదగుదురు. కార్తిక మాసమునఁ జతుర్ముఖునకు రథయాత్ర యొనర్పవలయును. దానిని భక్తితో నిర్వర్తించినమనుజుఁడు బ్రహ్మసాలోక్యము నొందును. మఱియుఁ గార్తికమునఁ బున్నమనాఁడు చతుర్ముఖుని మృగచర్మమున నాచ్ఛాదించి

---

కీర్తితమ్, గాయత్రీమూలతంత్రస్తు సాధకః సర్వకర్మణామ్. ౧౧౫. గాయత్ర్యా పూజయే ద్దేవ మోంకారేణాభిమంత్రితమ్, ప్రణవేనాపరాన్సర్వానృగ్వేదాదీన్ప్రపూజయేత్. ౧౧౬. ఆహ్వానే పూజనే వీర విసర్గే బ్రహ్మణస్తథా, గాయత్రీ పరమో మంత్రో వేద మాతా విభావినీ. ౧౧౭. గాయత్ర్యక్షరతత్త్వైస్తు పూజయేద్యస్తు దేవతామ్, స గచ్ఛే ద్బ్రహ్మణః స్థానం దుర్లభం యద్దురాసదమ్. ౧౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ప్రతిపత్కల్పే బ్రహ్మణోఽర్చనవిధివర్ణనం నామ సప్తదశోఽధ్యాయః.

---

సుమంతురువాచ:— పౌర్ణమాస్యుపవాసం తు కృత్వా భక్త్యా నరాధిప, అనేన విధినా యస్తు విరించిం పూజయేన్నరః. ౧. ప్రతిపద్యాం మహాబాహో స గచ్ఛే ద్బ్రహ్మణః పదమ్, ఋగ్భిర్విశేషతో దేవీ విరించేర్వాస్తుదేవతాః. ౨. కార్తికే మాసి దేవస్య రథయాత్రా ప్రకీర్తితా, యాం కృత్వా మానవో భక్త్యా యాతి బ్రహ్మసలోక తామ్. ౩. కార్తికే మాసి రాజేంద్ర పౌర్ణమాస్యాం చతుర్ముఖమ్, మార్గేణ చర్మణా

సావిత్రి జపించుచు నానావాద్యఘోషములతో నగరమంతట నూరేగింప వలయును ఇటు లూరేగించి మఱల యథాస్థానమున స్థాపింపవలయును. బ్రాహ్మణునకు మొదట భోజనమిడి పిదప శాండిలేయు నర్చించి మంగళ వాద్యఘోషములచేఁ జతుర్ముఖుని రథ మెక్కింపవలయును. శాండిలేయుని బూజించి రథాగ్రమున నిలిపి బ్రాహ్మణులచే వేదములు జదివించి పుణ్యాహ మొనరించి రథమును దేవుఁ డధిష్ఠించినది మొదలు జాగరణము జేయవలయును. పుష్కలములయి పలువిధములగు వినోదముల తోడను బ్రహ్మఘోషములతోడను జాగరణముచేసి మఱునాఁ డుదయమున బహుభక్ష్యభోజ్యసమన్వితముగా బ్రాహ్మణునకుఁ గుడువంబెట్టి యాతనికి వజ్రబీజపయఃపాయసాదులఁ దృప్తియొనరించియథాశక్తినాతనిఁ బూజించి బ్రాహ్మణులచే స్వస్తివాచ్యములు వైదికవిధిచేఁ గొని పుణ్యాహంబు జేయించి రథనిర్గమము జేయింపనగును. చతుర్వేదవిదులగువిప్రులచే నారథము ద్రిప్పింపవలయును. అట్టులే బహ్వృచులు నాథర్వణులు నను వారిచేతను సామగులచేత నధ్వర్యులచేతను నడిపింపవలయును. వారందఱును నధ్యయనముచేయుచు నాదేవదేవునిరథము ద్రిప్పవలయును. నిమ్నోన్నతముగాక సమమగుప్రదేశమునఁ బ్రదక్షిణముగఁ

---

సార్ధం సావిత్ర్యా చ పరంతప. ౪. భ్రామయేన్నగరం సర్వం నానావాద్యైః సమన్వితమ్, స్థాపయేద్భ్రామయిత్వా తు సలోకం నగరం నృప. ౫. బ్రాహ్మణం భోజయిత్వాగ్రే శాండిలేయం ప్రపూజ్య చ, ఆరోపయేద్రథే దేవం పుణ్యవాదిత్రనిస్వనైః. ౬. రథాగ్రే శాండిలీపుత్రం పూజయిత్వా విధానతః, బ్రాహ్మణాన్వాచయిత్వా చ కృత్వా పుణ్యాహమంగలమ్. ౭. దేవమారోపయిత్వా తు రథే కుర్యాత్ప్రజాగరమ్, నానావిధైః ప్రేక్షణకైర్బ్రహ్మఘోషైశ్చ పుష్కలైః. ౮. కృత్వా ప్రజాగరం హ్యేవం ప్రభాతే బ్రాహ్మణం నృప,భోజయిత్వా యథాశక్త్యా భక్ష్యభోజ్యైరనేకశః. ౯. పూజయిత్వా జనం వీర వజ్రేణ విధివన్నృప, బీజేన చ మహాబాహో పయసా పాయసేన చ౧౦. బ్రాహ్మణాన్వాచయిత్వా చ ఛ్ఛందేన విధినానృప,కృత్వా పుణ్యాహ శబ్దం చ రథం చ భ్రామయేత్పురే. ౧౧. చతుర్వేదవిద్భిర్విప్రైర్భ్రామయేద్బ్రహ్మణో రథమ్, బహ్వృచాథర్వణోచ్చారైశ్ఛందోగాధ్వర్యుభిస్తథా. ౧౨. భ్రామయేద్దేవదేవస్య సురజ్యేష్ఠస్య తం రథమ్, ప్రదక్షిణం పురం సర్వం మార్గేణ సుసమేన తు. ౧౩. న

బురమును ద్రిప్పవలయును. శుభముగోరుశూద్రుఁడు బ్రహ్మారథమును మోయరాదు. అర్చనసేయువాఁడుదక్క నితరులగుప్రాజ్ఞు లేరును రథము నధిష్ఠింపరాదు. బ్రహ్మదక్షిణపార్శ్వమున సావిత్రి నుంచవలెను. ఎడమ వైపున భోజకుఁ డుండవలయును. ఈయిరువురు నాకంజజాతునియెదుట నుండవలయును ఇట్లు తూర్యఘోషములతోడను బుష్కలములగు శంఖశబ్దములతోడను ప్రదక్షిణముగ రథసంచార మొనరించి మఱల యథాస్థానమునకుఁ దోడ్తెచ్చి నీరాజన మొసంగి స్వపీఠమున దేవుని స్థాపింపవలయును. ఈతీరుగ యాత్ర యొనర్చువాఁడును చూచువాఁడును రథమును లాగువాఁడును భక్తిప్రభావమున బ్రహ్మపదము నొందును. కార్తీకమాసమున నమావాస్యనాఁడు బ్రహ్మశాలలో దీపారాధన మొనర్చువాఁడును బ్రహ్మపదము నొందును. పాడ్యమినాఁడు బ్రాహ్మణులకుఁగూడ గుడమిశ్రప్రదీపములచేతను నూతనవస్త్రములచేతను బూజలు సలుపువాఁడు బ్రహ్మపదము నొందును. మఱియు నానాఁడు తనను గూడ గంధపుష్పములచేతను నూత్నవస్త్రములచేతను బూజించుకొనువాఁడు బ్రహ్మపదము నొందును. ఈతిథి యతిపవిత్రమైనది. బలిచక్రవర్తికి రాజ్య మొసంగిన దిదియే. బ్రహ్మదేవున కత్యంతప్రియ మిదియే. దీనికి బాలేయ యను నామాంతరవిఖ్యాతి గలదు. ఈనాఁడు బ్రాహ్మణులను తనను గూడ

---

వోఢవ్యో రథో వీర శూద్రేణ శుభమిచ్ఛతా, నారుహేత రథం ప్రాజ్ఞో ముక్త్వైకం-భోజకం నృప. ౧౪. బ్రహ్మణో దక్షిణే పార్శ్వే సావిత్రీం స్థాపయేన్నృప, భోజకో వామపార్శ్వే తు పురతః కంజజం న్యసేత్. ౧౫. ఏవం తూర్యనినాదైస్తు శంఖశబ్దైశ్చ పుష్కలైః, భ్రామయిత్వా రథం రాజన్పురం సర్వం ప్రదక్షిణమ్, స్వస్థానే స్థాపయేద్భూయః కృత్వా నీరాజనం బుధః. ౧౬. య ఏవం కురుతే యాత్రాం భక్త్యా యశ్చాపి పశ్యతి, రథం చాకర్షతే యస్తు స గచ్ఛేద్బ్రహ్మణః పదమ్. ౧౭. కార్తికే మాస్యమావాస్యాం యస్తు దీపప్రదీపనమ్, శాలాయాం బ్రహ్మణః కుర్యాత్స గచ్ఛేద్బ్రహ్మణః పదమ్. ౧౮. ప్రతిపది బ్రాహ్మణాంశ్చాపి గుడమిశ్రైః ప్రదీపకైః, వాసోభిరహతైశ్చాపి స గచ్ఛేద్బ్రహ్మణః పదమ్. ౧౯. గంధైః పుష్పైర్నవైర్వస్త్రైరాత్మానం పూజయేచ్చ యః, తస్యాం ప్రతిపదాయాం తు స గచ్ఛేద్బ్రహ్మణః పదమ్. ౨౦. మహాపుణ్యా తిథిరియం బలిరాజ్యప్రవర్తినీ, బ్రహ్మణః సుప్రియా నిత్యం బాలేయా పరికీర్తితా. ౨౧. బ్రాహ్మణాన్పూజయిత్వాస్యామాత్మానం చ విశేషతః, స యాతి పరమం

విశేషముగఁ బూజించి యప్రతిమప్రభావుఁడగు విష్ణుదేవునియుత్తమపదంబున కేగును. చైత్రమాసంపుఁబాడ్యమి యతిపవిత్రమైనది. అందు శ్వపాకుఁ డగుమ్లేచ్ఛుని స్పృశించినను స్నానముచేసి శుద్ధిఁ బొందును. వానికి దురితములుగాని యాధివ్యాధులుగాని సంక్రమింపవు. కావున నానాఁడు స్నాన మొనరింపనగును. దివ్యమగు నీరాజనము సర్వరోగములను శమింపఁజేయును. గోష్ఠాదులనున్న గోమహిష్యాదులనెల్లఁ దైలశస్త్ర వస్త్రాదుల నలంకరింపవలయును. వానినన్నింటిని బహిర్ద్వారముచెంగట నుండి తీసికొనిపోవలయును ఓశతానీకా! యాదినమున బ్రాహ్మణులకుఁ గుడువఁబెట్టవలయును. కార్తికము, నాశ్వయుజము, చైత్రము నను నీమూఁడుమాసములందలి యీతిథు లుత్తమములని వచింపఁబడుచున్నవి. కార్తికమాసంపుఁ దొలిదినమున స్నానదానాదు లొనరుప నూరురెట్లు పుణ్యము లభించును. ఇయ్యదియే కద! బలిచక్రవర్తికి రాజ్యప్రాప్తి గావించినతిథి. మఱియు నియ్యది పాపంబులఁ బోఁద్రోలి యశుభంబులడంచి సుఖంబులు జేకూర్చును.

ఇది అష్టాదశాధ్యాయము

---

స్థానం విష్ణోరమితతేజసః. ౨౨. చైత్రే మాసి మహాబాహో పుణ్యా ప్రతిపదా పరా, తస్యాం యః శ్వపచం స్పృష్ట్వా స్నానం కుర్యాన్నరోత్తమ.౨౩. న తస్య దురితం కించి న్నాధయో వ్యాధయో నృప, భవంతి కురుశార్దూలతస్మాత్స్నానం ప్రవర్తయేత్. ౨౪. దివ్యం నీరాజనం తద్ధి సర్వరోగవినాశనమ్, గోమహిష్యాది యత్కించిత్తత్సర్వం భూషయేన్నృప. ౨౫. తైలశస్త్రాదిభిర్వస్త్రైస్తోరణాధ స్తతో నయేత్, బ్రాహ్మణానాం తథా భోజ్యం కుర్యాత్కురుకులోద్వహ.౨౬.తిస్రో హ్యేతాః పరాః ప్రోక్తాస్తిథయః కురునందన, కార్తికేఽశ్వయుజే మాసి చైత్రే మాసే చ భారత. ౨౭. స్నానం దానం శతగుణం కార్తికే యా తిథిర్నృప, బలిరాజ్యాప్తిసుఖదా పాంశులాశుభనాశినీ. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ప్రతిపత్కల్పసమాప్తివర్ణనం నామ అష్టాదశోఽధ్యాయః.

## ఏకోనవింశాధ్యాయము.

సుమంతుఁ డిట్లనియె. రాజేంద్రా! మున్ను చ్యవనమహర్షి విదియనాఁడు యజ్ఞముచేసి యందశ్వినీదేవతలకు సోమరసము నింద్రుఁడు చూచుచుండఁగనే యిచ్చి త్రాగించెను. అన విని శతానీకుం డోమహాత్మా! దేవేంద్రుఁడును దేవతలును జూచుచుండఁగాఁ జ్యవనుఁడు వారి నెట్లు సోమపులఁగావించె నానతిమ్ము. ఆహా! మహానుభావుఁ డగుచ్యవనముని తపోమహత్త్వ మెట్టిదో! ఇంద్రునిబలమున నదేవత్వమునొందిన యశ్వినులను నాతఁ డీక్షించుచుండఁగ నిశ్శంకముగ సోమపులఁగావించెను అని యడుగ నాతనికి శతానీకుఁ డిట్లనియె పూర్వయుగంపుఁ దుదిభాగమునఁ జ్యవనమహాముని యోగనిష్ఠుఁడై గంగానదియొడ్డున చిరకాలము వసించెను. అచ్చటి కొక్కనాఁడు శర్యాతి యనురాజచంద్రుండు సాంతఃపురముగ స్నానముచేయఁగోరి యేగెను. అట్లేగి యాతఁడు స్నానమొనరించి పితృదేవార్చనలుగావించి గమనోన్ముఖుఁడై సపరివారముగ వెడలి మధ్యే మార్గమునఁ జలించుచున్న మూఢజనాకీర్ణమగు నొక్కజనపదంబు గాంచె. అయ్యది మలమూత్రోత్సర్జనములచే సంరుద్ధసర్వప్రదేశము నగ్నిజ్వాలా సమావృతమయియుంట నిర్వ్యాపారమునై యచ్చటచ్చటనే పరిభ్రమించుచున్న బలముగలదై యుండెను. అట్లున్న బలము నీక్షించి శర్యాతిమహారాజు విచారాక్రాంతచిత్తతఁ బురోగతులగు నమాత్యుల దిక్కు మొగంబై యిది చ్యవనునాశ్రమము గద! ఎవరు నపరాధమొన

---

సుమంతురువాచ:—ద్వితీయాయాం తు రాజేంద్ర అశ్వినౌ సోమపీతినౌ, చ్యవనేన కృతౌ యజ్ఞే మిషతో మఘవస్య చ. ౧. శతానీక ఉవాచ.—కథమింద్రస్య మిషతః కృతౌతౌ సోమపీతినౌ, చ్యవనేన హి దేవానాం పశ్యతాం తద్వదస్వ మే. ౨. అహో మహత్తపస్తస్య చ్యవనస్య మహాత్మనః, యదింద్రస్య బలాదేవ దేవత్వం ప్రాపితౌ శుభౌ. ౩. సుమంతురువాచ:—పురాతనయుగే సంధౌ పశ్చిమేఽథ నరాధిప, చ్యవనో యోగమాస్థాయ గంగాకూలేఽవసచ్చిరమ్. ౪. తత్ర శర్యాతిరాయాతః స్నాతుమంతః పురైః సహ, స్నాత్వాభ్యర్చ్య పితౄన్దేవాన్గమనాయోపచక్రమే. ౫. తత్ర మూఢం జనపదమపశ్యత్పథి చేష్టనమ్, విణ్మూత్రోత్సర్గసంరుద్ధం జ్యోతిరాక్షిప్తనిష్క్రియమ్, భ్రమంతం తత్ర తత్రైవ సమీక్ష్య స బలం నృపః. ౬. ఉవాచ దుర్మనా రాజా అమాత్యాన్సాన్పురోగమాన్, చ్యవనస్యాశ్రమోయం హి నాపరాద్ధం తు కేనచిత్. ౭.

రించి యుండదగదా? అని యడుగుచుండ నొక్కఁడును బదులుపలుక లేదు. అటులు వారు తనతండ్రి ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమీక మిన్నకుండుట గాంచి సుకన్య యనునాతనికూఁతురు తండ్రి కిట్లనియె. తండ్రీ! మున్నొకమారు నాసఖురాండ్రతో నిటకు వచ్చియుంటిని. అత్తఱి మేమందఱ మిట నొకవింతసంగతి గనుఁగొంటిమి. అయ్యది యవధరింపుము. మేమందఱ మిక్కానకుఁ బలువిధముల నగలు దాల్చి వచ్చి కొంతవడి గానముజేయుచుఁ గొంతవడి వేడుకఁగా విలపించుచుఁ గ్రీడలుసల్పుచుంటిమి. అట్టి కోలాహలావసరమున వ్యక్తావ్యక్తమును హీనస్వరము నగు కోకిలాలాపము విననయ్యె. అయ్యది యొకవల్మీకమునుండి యిట్లు వెలువడెను. "సుకన్యా! రమ్ము రమ్ము" అని. ఈవింతఁజూడ నాపుట్టచెంత కరుగ నందు దీపములవలె వెలుఁగుచు నిశ్చలములగు పావకజ్వాలలు రెండగపడినవి. తరువాత నోతండ్రీ! యది యేమియని యెఱుంగనేరనిదాననై కౌతుకమునఁ గొన్ని దర్భముండ్లు కేలంగొని యారెండిటిని బొడిచితిని. తోడనే యావెలుంగు తిరోహితమయ్యెను అని విన్నవింప భయకంపితుఁడై శర్యాతి యతిత్వరితముగ నాచ్యవనమునియాశ్రమమున కేగెను. అచ్చోట నామునితల్లజుం డొక్కపుట్టలో నుండెను. రాజు నచ్చట నాతనిం గాంచి సమీపించి "యోమహానుభావా! నమస్కారము. ఏను నీయెడ నొక్కయపరాధ మొనరించితిని. కావున నాతప్పు సైరించి నన్ను క్షమింపుము." అని వేడుకొనిన యంత నామునివృషభుఁడు "రాజా!

---

న చోవాచ యదా కశ్చిత్తస్య రాజ్ఞస్తు పృచ్ఛతః, తదా సుతా సుకన్యాస్య ప్రోవాచ పితరం వచః. ౮. మయా దృష్టం తు యత్తాత సఖిభిః సహ కౌతుకమ్, తత్తే వచ్మి నిబోధ త్వం శృణు తాత మహాద్భుతమ్. ౯. శింజితారావబహులాః కాంచీనూపురమేఖలాః, గాయన్త్యో విలపన్త్యశ్చ క్రీడన్త్యశ్చాత్ర కాననే. ౧౦. కోకిలధ్వనిమశ్రౌషం వ్యక్తావ్యక్తాక్షరం కృశమ్, సుకన్యే హ్యేహి హ్యేహీతి వల్మీకాద్వాచముద్గిరన్. ౧౧. తత్ర గత్వాద్భుతం తాత పశ్యామః కిల పావకౌ, దీపావివాచలశిఖౌ భూయః కన్యా ఉవాచ హ. ౧౨. మయా చ కౌతుకాత్తాత కిమేతదిత్యబుద్ధితః, సూదితౌ దర్భసూచ్యాగ్రైస్తత్తేజః సముపారమత్. ౧౩. తచ్ఛ్రుత్వా నృపతిస్త్రస్తస్తూర్ణం తద్వనమాగమత్, యత్రాస్తే భార్గవః కష్టం వల్మీకాంతర్గతో మునిః. ౧౪. గత్వా స తత్ర ప్రోవాచ ప్రణిపత్య ద్విజోత్తమమ్, అపరాద్ధం మయా దేవ తత్క్షమస్వ నమోఽస్తు తే. ౧౫.

నీయపరాధము నెఱింగితిని. నేను సుకన్యను బెండిలియాడ నెంచితిని కావున నాకన్యను నాకిమ్ము. అట్లులొనరించిన సుఖింపఁగలవు” అనెను శర్యాతియు నించుకేని శంకింపక వెంటనే నిజతనయ నాతని కొసంగెను. అనంతర మారాజు స్వపురముఁ జేరి పెక్కేండ్లు సుఖియై రాజ్యంబుఁ బాలించెను. అంత నిట సుకన్యయు రాజకన్యాభూమికను విడనాడి నార చీరలుగట్టి లేడిచర్మము దాల్చి యట్టిమహనీయుఁడు భర్తయైనందులకు నెమ్మనమున ముదమంది యాతని నతిభక్తి నారాధించుచుండెను. ఇట్లు గొండొకకాలంబు గడువ సర్వర్తువతంసమగు వసంతర్తు వేతెంచెను. అట్టి వసంతకాలమునఁజ్యవనుఁడు రూపౌదార్యగుణసమన్వితయుఁదపఃప్రభావ సంపన్నయు ఋతుస్నాతయు నగునారాజపుత్రినిం గాంచి మృదుమధుర భాషణంబుల “నోకళ్యాణీ! యిటు రమ్ము నీకు శుభంబగుఁగాక. శయన మునకు రమ్ము. రెండుకులముల నుద్ధరింపఁజాలు నపత్యంబు నీగర్భమున నుద్భవించు.” అనవుడు నాబాలామణియుఁ గృతాంజలియై నాథున కి ట్లనియె. “ఓదేవా! నిమ్నోన్నతమగు నీస్థండిలప్రదేశమున సంగమ మనుచితంబని తోఁచెడిని. ఇప్పటికి నాయీముద్దు చెల్లింపుము. నేను మా జనకునింటఁ బలువిధము లగురంగులచేఁ జిత్రింపఁబడిన యందమగుశయనీ యమ్మున వస్త్రాలంకారగంధమాల్యాదుల దేహ మలంకరించుకొనియుం దును. అప్పట్టున నన్నిక్కార్యమునకు నియమింపుము. నీవు తరుణవయ

స తం ప్రోవాచ నృపతిం మయా జ్ఞాతం నరాధిప, సుకన్యాం మే ప్రయచ్ఛస్వ నివే శార్థీ హ్యహం నృప, అనుక్రమస్సుకన్యాం తు దత్వా రాజన్సుఖీ భవ. ౧౬. ఇత్యుక్తః ప్రదదౌ రాజా సుకన్యామవిచారయన్, తతః స్వపురమాగమ్య అవసత్సుచిరం సుఖీ. ౧౭. సుకన్యాపి పతిం లబ్ధ్వా సుప్రీతారాధయత్తదా, రాజ్యశ్రియం పరిత్యజ్య వల్క లాజినధారిణీ. ౧౮. గతే బహుతిథే కాలే వసంతే సముపస్థితే, తపోద్యోతితసర్వాంగీం రూపౌదార్యగుణాన్వితామ్, స్నాతాం స్వభార్యాం చ్యవన ఉవాచ మధురాక్షరమ్. ౧౯. ఏహ్యేహి భద్రే భద్రం తే శయనీయం సమాశ్రయ, అపత్యం జనయస్వాద్య కులద్వయ వివర్ధనమ్. ౨౦. ఏవముక్తా తు సా కన్యా ప్రాంజలిః పతిమబ్రవీత్, నార్హస్యద్య సుకల్యాణ సంగమం స్థండిలేఽసమే. ౨౧. మమ ప్రియం కురుష్వాద్య తతో మామాహ్వ యస్వ చ, పితృగేహే యథాతిష్ఠం శయనీయే సుసంస్కృతే. ౨౨. బహుభిర్గైరికవర్ణాద్యైః శ్వేతపీతారుణాకులే, వస్త్రాలంకారగంధాద్యైస్తథా త్వమపి తత్కురు. ౨౩. ఆత్మానం

స్కుండవు రూపసంపన్నుండవు వస్త్రాభరణచందనసుమదామాదిశోభిత శరీరుండవును నగుము. నీయాకృతి యప్పట్టున నా కాదరము గొల్పు నదిగా నుండుఁగాక" యని. అది విని యామహర్షి కపటభాషణముల నాయువిద కిట్లనియె. "కల్యాణీ! యేను నీజనకునివలె ధనవంతుఁడుగాను. నిరుపేదనగు నాకు భూషణంబు లెట్లు సమకూరు? సుభగుఁడ నెట్లగుదును? చెప్పు"మన విని సుకన్య బద్ధాంజలియై నెమ్మొగమ్మునఁ జిరునగవు మొలకలెత్త నాతని కిట్లనియె. "నాథా! ధనమును గుబేరుండును సౌభాగ్యమును వైరోచనుం డగుబలియు నొసంగియున్నారు గదా!" అనుడుఁ జ్యవనుండు తపోవ్యయము నిందులకై యొనరుపుమందువా! యని సమాధిబూని చిరకాల ముగ్రమగుతపంబు గావించెను అటులుండఁ బిదప కొంతకాలమునఁ గాలక్రమము దప్పుటచే నశ్వినీదేవత లచ్చటకేతెంచి సుమనోహరంబులగు రూపయావనములతో దేవకన్య నానొప్పు నప్పడంతిం గాంచి యామెను డాసి "సుందరీ నీవెవ్వతెవు? ఈనిర్జనవనమున నిటు లొంటి చరింపఁ గతంబేమి? నీకాశ్రయ మెవ్వరు?" అని యడుగ తన్వంగియు నేను శర్యాతి యను మధ్యమలోకపాలకునిపుత్రికను. చ్యవనమహామునికిఁ బత్నిని మీర లెవ్వరు? వచింపుఁడని నిజవృత్తాంత మెఱింగించి వారి నడుగ, వా రిట్లు వాక్రుచ్చిరి. "సుందరీ! మేము దేవతలము. నీకిట్లు జీర్ణించి కృశించియున్న యీతపసివలన నేమి

వయసోపేతం రూపవన్తం సువర్చసమ్, వస్త్రాలంకారగంధాఢ్యం పశ్యేయం యేన సాదరమ్. ౨౪. సుకన్యాయా వచః శ్రుత్వా చ్యవనః ప్రాహ దుర్మనాః, న మేఽస్తి విత్తం కల్యాణి పితుస్తేఽస్తి యథా వనే. ౨౫. స కథం భూషయామ్యద్య సురూపశ్చ కథం వద, ప్రోవాచ సా పతిం భూయః ప్రహసంతీ కృతాంజలిః, విత్తం దదావైలబిలో రూపం వైరోచనోదదత్. ౨౬. చ్యవనః ప్రాహ భార్యాం తాం న కరిష్యే తపోవ్యయమ్, ఏవముక్త్వా తపశ్చోగ్రం తతాప సుచిరం తదా. ౨౭. అథ తత్రాగతౌ వీరావశ్వినౌ కాలపర్యయాత్, దృష్టవన్తౌ సుకన్యాం తౌ దీప్త్యా వై దేవతామివ. ౨౮. ఉపగమ్యోచతుస్తాం తౌ కా త్వం సుందరి రూపిణీ, కిమర్థమిహ ఏకా త్వం తిష్ఠసే కస్తవాశ్రయః. ౨౯. సా తావువాచ తన్వంగీ శర్యాతిదుహితా హ్యహమ్, భర్తా చ చ్యవనో మహ్యం కౌ చ వాం మే తథోచ్యతామ్. ౩౦. ఊచతుశ్చాశ్వినౌ దేవావావాం విద్ధి నృపాత్మజే, కిం కరిష్యసి తేన త్వం జీర్ణేన చ కృశేన చ, ఆవయోర్వృణు

ప్రయోజనము గలుగును? మాలో నీ కనురూపుఁడగు నొక్కరుని వరింపుము" నావుడు నాకన్యామణియు వారితో "దివౌకసులారా! మీ కిట్లంట పాడియే? మేము స్వాహావైశ్వానరులవడువునఁ బరస్పరాసక్త చిత్తంబుల నిటులుంటిమి. కావున భర్తయఁ దనురక్తయగు నన్నుఁ గామింపఁ జన" దన నశ్వును లిట్లనిరి. "సరియే. ఆతఁడు గంగాజలమున నాప్లవన మొనరించివచ్చును అటుపై మాయిరువురిలో నొక్కని వరింపుము. అదిగాక నీవు నీపతి నడుగుము. ఆతనియనుమతి వడసియే మాయొద్దకు రమ్ము. నీవచ్చువఱకు నే మిట నే వేచియుందుము" అన నామెయుఁ జ్యవనునొద్దకుఁ బోయి "దేవా! అశ్వినులు నాయొద్దికి వచ్చి "నీపతిని రూపవంతుం గావింతుము. నీకు మాయిరువురిలో నెవని రూపము యుక్తమో వచింపుము. అనిరి. ఇందుల కేమందువు." అని యడుగ నాతఁడు వల్లె యనియు నీయుచ్చవొప్పునఁ గానిమ్మనియు నాన యొసంగెను. అనంతర మాపె యాతని వెంటనిడుకొని యాదేవవైద్యు లున్నతావున కేగె. అంతటఁ జ్యవనుఁ "డోయాశ్వినేయులారా! మీరు వచించినట్టులే కానిండు. సుకన్యయు నొక్కని గోరుకొనును." అనుడు నాదేవత లిరువురును చ్యవనుతోఁ గూడి గంగయందు మునింగి యొక్క ముహూర్తకాల మట్లే యుండి పిమ్మట నందుండి యపూర్వరూపసంపన్నులై నిలఁబడిరి. కల్పాదిని గంజజునికలశమున నుండునాకాశముపగిది

---

భర్తారమేకమేవ యమిచ్ఛసి. ౩౧. సాత్వబ్రవీచ్చ మా మైవం వక్తుమర్హా దివౌకసౌ, భర్తారమనురక్తాంగీ యథా స్వాహా విభావసోః. ౩౨. అశ్వినావూచతుః—ఆయాతు చ విశత్వద్య చ్యవనో వైష్ణవీజలమ్, తతో నా మధ్యగం హ్యేకం వృణీష్వాన్యం యమిచ్ఛసి. ౩౩. తావబ్రూతాం సుకన్యాం తు గత్వా పృచ్ఛ స్వకం పతిమ్, తం చ పృష్ట్వా పునశ్చాత్రాగచ్ఛ నౌ సంనిధౌ పునః. ౩౪. ఆవామత్రైవ తిష్ఠావో యావదాగమనం తవ, సా గత్వా ప్రాహ భర్తారమశ్వినావేవమూచతుః. ౩౫. రూపవంతం చ భర్తారం కరిష్యావో యమిచ్ఛసి, అథ మధ్యగతం హ్యేకం భర్తృత్వేన వరిష్యసి. ౩౬. ఏవమస్త్వితి తాం ప్రాహ స భార్యాం చ్యవనస్త్వరన్, సా తం గృహ్య జగామాశు యత్ర తౌ భిషజావుభౌ. ౩౭. స తావువాచ చ్యవనో యథోక్తం భవతోర్వచః, కురుతం హ్యశ్వినౌ క్షిప్రం సుకన్యా చేప్సితం వృణోత్. ౩౮. తౌ తం సంగృహ్య గంగాయాం ప్రవిష్టౌ మునినా సహ, ముహూర్తాత్తు సముత్తిష్ఠన్ రూపతశ్చ శ్రియా వృతాః. ౩౯. శోభంతే స్మ మహాబాహో కముద్భిద్య తపోయుతాః, కల్పాదౌ కలశే

నుదకమునుండి వెలువడిన యాముగ్గురు తుల్యరూపు లయియుండిరి. సుకన్యయు దేవరూపుఁ డగుభర్తను గాంచి యానందాబ్ధి నోలలాడుచు వారిలో నిజనాథుఁ డెవ్వరో యెఱుంగఁజాలకుండెను. వారందఱును సమానాకృతులును సమానవయస్కులు సమరూపులును వస్త్రాలంకారములందు సదృశులు నైయుండిరి. అట్టిమూర్తులఁ దిలకించి చింతాక్రాంత చిత్తయై చిరకాలముండి యాతన్వంగి దేవతల కిట్లనియె. బీభత్సస్వరూపుఁ డయ్యు నాభర్త నాచేఁ ద్యజింపఁబడలేదు. రూపయౌవనముల మీకు దీటగుమగని నిప్పట్టున వీడి యొరు నెట్లు వరింపఁగలను? కావున నో దేవతలారా! నాపతిని నాకనుగ్రహింపుఁ డనుచు బద్ధాంజలిపుటయై సగౌరవముగ వారిం బ్రార్థింప నాదేవతలు తమలక్షణముల మార్చుకొనిరి. అంత నామెయు వివశయైయు నిపుణముగఁ బరికించెను. వారియెడ రజోగుణములేదు. నిమేషములు లేవు. వారిపాదము లిలపైఁ బడుటలేదు. చ్యవనుండు రజోగుణసహితుఁడై వైవర్ణ్యముగలిగి నిమేషములు గలిగి యిలపై నిలచియుండెను. అది యానవాలుగాఁ జేసికొని యాకోమలి చ్యవనుని గ్రహింపఁగలిగెను. అట్లాయువతి చ్యవనుని వరింపఁగనే యాకసము నుండి విరులవాన గురిసెను. దేవదుందుభులు మ్రోసెను. అనంతర మాచ్యవనుం డిట్టి దివ్యరూపము లభించినందున సంతసించి సుప్రీతుఁడై యశ్వి

---

యద్వత్కుంజాక్షి వ్యోమ వేధసః, ఉదకాదుత్థితా స్తస్మాత్సర్వే తే సమరూపకాః. ౪౦. సుకన్యా తు తతో దృష్ట్వా భర్తారం దేవరూపిణమ్, హర్షేణ మహతావిష్టా న చ తం వేద భారత. ౪౧. సమకాయాః సమవయః సమరూపాః సమశ్రియః, వస్త్రాలంకార సదృశాన్దృష్ట్వా చింతాం గతా చిరమ్. ౪౨. సా చింతయిత్వా సుచిరం వైద్యదేవావువాచ హ, బీభత్సోఽపి మయా భర్తా పరిత్యక్తో న కర్హిచిత్. ౪౩. భవద్భిరాత్మసదృశం కథం త్యక్త్వా వృణే పరమ్, తస్మాత్తమేవ భర్తారం ప్రయచ్ఛధ్వం దివౌకసః. ౪౪. తయా సబహుమానం తౌ ప్రాంజల్యా ప్రార్థితౌ తదా, దేవచిహ్నాని స్వాన్యేవ ధారయన్తౌ సుపూజితౌ. ౪౫. సుకన్యా నిపుణం తౌ తు సునిరీక్ష్య చ విహ్వలా, న రజో న నిమేషో వై న స్పృశేతే ధరాం పదే. ౪౬. అయం చ సరజా మ్లానో భూమిమాశ్రిత్య తిష్ఠతి, నిమేషం చైవ తస్యైవం జ్ఞాత్వా వై చ్యవనో వృతః. ౪౭. చ్యవనే వృతే సుకన్యయా పుష్పవృష్టిః పపాత హ, దేవదుందుభయశ్చైవ ప్రావాద్యంత అనేకశః. ౪౮. తతస్తు చ్యవనస్తుష్టో దివ్యరూపధరస్తదా, ఉవాచ తౌ తు సుప్రీత అశ్వినౌ

నుల కిట్లను, "దేవవరులారా! మీ కే నేమి ప్రత్యుపకారము గావించి ధన్యాత్ముఁడ నగుదును? దేవదుర్లభం బగురూపంబుఁ బ్రసాదించితిరి. భార్య నొసంగితిరి. ఉపకారులఋణము దీర్చుకొననిమానవుఁడు క్రమముగ నిరువదియొక్కనరకముల ననుభవించును. మీయుపకృతికిఁ బ్రీతిఁజెంది యమానుషమైన ప్రత్యుపకారము మీకుఁజేయ నిశ్చయించినాఁడ. ఎల్లదేవతలకును దుర్లభంబగు యజ్ఞభాగఫలంబు నిత్తు" నని వచించి యామునివారిపపురను విడిచిపుచ్చెను. అంత భార్యాసమేతుఁడై పుణ్యంబగు నిజాశ్రమంబున కేతెంచె. తరువాత శర్యాతి "చవ్యనుఁడు దేవరూపము నొందె" ననువృత్తాంతము నాకర్ణించి మహాతేజస్సంపన్నుఁడగు నాతని దర్శింపఁగోరి యాతనియాశ్రమపదంబున కేఁగెను. అట్లేగి యాతనిం గాంచి నమస్కరించి పూజించి తనకు మ్రొక్కిన సుకన్యను దీవించి యామె యభ్యున్నతి నభినందించి శిరము మూర్కొని కౌఁగలించి తొడపై నిడుకొని ముద్దాడెను. ఆమెయు నానందాశ్రుపరిప్లుతాంగి యగుచుఁ బితరులను భక్తిపూర్వకముగ నాలింగన మొనరించెను. ఆపితరు లిరువురు నామెను బుజ్జగించిరి. అంత నమ్ముని సంప్రీతచేతస్కుఁడై యానరనాథున కిట్లనె. "రాజేంద్రా! జన్నంబు నొకదాని నీచే జేయింప సమకట్టితిని. అద్దానికి వలయువస్తువుల నాయత్తపరుపుము" నావుడు నృపాలుండు వల్లెయని యాతనికి నమస్కరించి యజ్ఞసంభారసంభరణమునకై నిజపురికేగి

కిం కరోమి వామ్. ౪౯. భార్యా దత్తా కృతం రూపం దేవానామపి దుర్లభమ్, ఉపకారం వరిష్ఠం యో న కరోత్యుపకారిణః. ౫౦. ఏకవింశత్సగచ్ఛేచ్చ నరకాణి క్రమేణ వై, తస్మాదహం వరిష్ఠం వై కరిష్యేఽహమమానుషమ్. ౫౧. ఉపకారం భవద్భ్యాం తు ప్రీతః కుర్యాం సునిశ్చితమ్, యజ్ఞభాగఫలం దద్యాం యద్దేవేష్వపి దుర్లభమ్. ౫౨. ఏవముక్త్వా తు దేవేశౌ విససర్జ మహామునిః, ఆజగామాశ్రమం పుణ్యం సహభార్యో ముదాన్వితః. ౫౩. అథ శుశ్రావ శర్యాతిశ్చ్యవనం దేవరూపిణమ్, జగామ చ మహాతేజా ద్రష్టుం మునివరం వశీ. ౫౪. తం దృష్ట్వా ప్రణిపత్యాదౌ ప్రతిపూజ్య యథార్హతః, సుకన్యాం తు తతో దృష్ట్వా ప్రణిపత్యాభినంద్య చ. ౫౫. సస్వజే మూర్ధ్ని ఆఘ్రాయ తతోత్సంగం సమానయత్, సా తస్యాః సస్వజే ప్రేమ్ణా ఆనందాశ్రుపరిప్లుతా, సంస్థాప్య తాం ముదా యుక్తో నృపతిః సహ భార్యయా. ౫౬. భూయోఽబ్రవీత్సుసంతుష్టం చ్యవనస్తం నరాధిపమ్, సంభారం కురు యజ్ఞార్థం యాజయిష్యే నరాధిప. ౫౭. ఏవముక్తః స నృపతిః ప్రణిపత్య మహామునిమ్, జగామ స్వపురం హృష్టో యజ్ఞార్థం యత్నా

సేవకులచే యజ్ఞమునకు వలయువస్తువులనెల్ల నాయత్తపఱచెను మంత్రి పురోహితాచార్యాదుల నచ్చటికి రావించెను. ఇటు లారాజన్యుండు యజ్ఞపరికరములఁగూర్చ నమ్మునియు సపత్నీకుఁడై యటకు విచ్చేసి యభ్యర్చితుండై దేవతలయసమానమగుత్యాగమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. అంతట నత్రి యంగిరసుండు భార్గవుండు మొదలగు పెక్కురు మహర్షులతోఁ గూడి యజ్ఞము ప్రక్రాంతమయ్యెను. నృపశేఖరుఁడు యజమానుఁడై యజ్ఞదీక్షితుఁడై ఋత్త్విజులచే నార్త్విజ్య మొనరుపుచు హుతాశనునందు వేల్చుచుండెను. అప్పుడు స్వాగతపురస్సరముగఁ ద్రిదివనివాసులెల్లరు నాహూతులయి శాస్త్రోక్తవిధానమున ననుష్ఠింపఁబడు యజ్ఞభాగములు గొనుటకై యేతెంచిరి. చ్యవనునిచే నభిహూతులై యాశ్వినేయులు నేతెంచిరి. అశ్వినీదేవతల నాహ్వానించునపు డింద్రుండు చ్యవనునితో "నోమునీంద్రా! వీరికి యజ్ఞభాగము లేదే! వీరు దేవవైద్యులుగాని దేవతలుకారుగద! కావున వీరు భాగార్హులుగాఁజాలరు." అనెను. చ్యవనుండు నామాటలు విని యింద్రునితో "వీరును దేవతలే. నాకు మహోపకారులగు వీరికిఁ దప్పక హవిర్భాగ మొసంగుదును" అనెను. పిమ్మట నింద్రుండు కోపారుణితలోచనుండై "మునిపుంగవా! నీవు వీరికి యజ్ఞభాగ మొసంగుదువేని వజ్రంబుచే నిన్ను వధింతును." అన నప్పలు

---

మాచరత్. ౫౮. స ప్రేష్యాన్ప్రేషయత్ క్షిప్రం యజ్ఞార్థే ద్రవ్యమాహరత్, మంత్రిపురోహితాచార్యానానయామాస సత్వరమ్. ౫౯. సమానీతేషు సర్వేషు తేషు ద్రవ్యేషు భారత, ఆజగామ విశుద్ధాత్మా చ్యవనః సహ భార్యయా. ౬౦. సంపూజితశ్చ శుశ్రావ మహాంతం త్యాగమాజసమ్, అన్యైశ్చ బహుభిః సార్ధమత్ర్యంగిరసభార్గవైః. ౬౧. ప్రవర్తితే మహాయజ్ఞే యజమానే నృపోత్తమే, ఋత్విక్త్వకర్మనిరతే హూయమానే హుతాశనే, ఆహూతాః స్వాగతాః సర్వే భాగార్థం త్రిదివాలయాః. ౬౨. యజ్ఞభాగే ప్రవృత్తే తు శాస్త్రోక్తేన విధానతః, ఆగతావశ్వినౌ తత్ర ఆహూతౌ చ్యవనేన తు. ౬౩. ఆహ్వానే క్రియమాణే తు అశ్విభ్యాం తు తదా నృప, ప్రోవాచేంద్రోఽథ చ్యవనం నైతౌ భాగాన్వితౌ కురు, దేవానాం భిషజావేతౌ న భాగార్హౌ న దైవతౌ. ౬౪. చ్యవనస్త్వింద్రమాహేదం దేవౌ హ్యేతావుభావపి, మమోపకారిణావేతౌ దద్మి భాగం న సంశయః. ౬౫. తతో హ్యువాచ సక్రోధః స శక్రశ్చ్యవనం రుషా, విప్రర్షే ప్రహరిష్యామి యది భాగం ప్రయచ్ఛసి. ౬౬. ఏవముక్తస్తు విప్రర్షిర్న చోవా

కులు సరకుగొనక యాశ్వినేయులకు స్రువమునెత్తి సమంత్రకముగ మహర్షి సత్తముండు రెండుభాగముల నిచ్చెను. అత్తఱి దేవనాథుండు మునిని వధించుటకుఁగాను వజ్రము నెత్తెను. కాని యమ్ముని ప్రభావంబుకతన నాతఁడు చిత్తరువువలె స్తంభితుఁడై నిలచియుండెను. అట్లు లామునిముకుటుండింద్రుని బంధించి యశ్వినులకు హవిర్భాగము లొసంగి యథావిధిగ జన్నము సమాప్తినొందించెను. అంతట లోకపితామహుం డచ్చోటున కేతెంచి చ్యవను నభినందించి "యోయీ! దేవనాథు ననుగ్రహింపుము. విగతబంధునిఁజేయుము. నాసత్యులకు యజ్ఞభాగము లొసంగుము." అని యాదేశించెను. అంతటనింద్రుఁడు స్వస్థుఁడై సంప్రీతుఁడై చ్యవనునినుతించి యోమునిపుంగవా! అసమానమగు నీతపశ్శక్తి నెఱుంగుటకును అద్దాని నెల్లరకువెల్లడిచేయ నెంచి యిట్లాచరించితిని. నేఁడు మొద లశ్వినులకు దేవత్వముయజ్ఞభాగభాక్త్వము నుండుఁగాక. నీ యీతపఃప్రభావవర్ణనమును బఠించువాఁడును వినువాఁడు నెట్టిఫలంబు నందుదురో యెఱింగింతు నాకర్ణింపుము. అట్టివాఁడు సూర్యచంద్రలోకములనుగాని రుద్రలోకమునుగాని విష్ణుపదమునుగాని పొంది యౌవనవంతుఁడై క్రీడించుచుండును. ఇందు సందియములేదు. అని యిట్లు వచించి వశి యగు మహేంద్రుండు నిజనివాసమున కేగెను. చ్యవనుండును భార్యాసమేతుఁడై శర్యాతితో నిజాశ్రమమున కేగెను. అట్లేగి యందొక్కదివ్య

---

చాపి కించన, భాగౌ దదౌ చ సోఽశ్విభ్యాం స్రువముద్యమ్య మంత్రతః. ౧౭. అథ ఉద్యమ్య భిదురం మోక్తుకామో దివస్పతిః, స్తంభితశ్చ్యవనేనాథ సవజ్రః స నరాధిప. ౧౮. స స్తంభయిత్వా త్విన్ద్రం తు భాగం దత్వాశ్వినోర్వశీ, సమాపయామాస తదా యజ్ఞకర్మ యథార్థవత్. ౧౯. కంజజోఽథాజగామాశు ఆహ చ చ్యవనం తదా, ఉత్తంభ్యతామయం లేఖో భాగశ్చాస్త్వశ్వినోరిహ. ౨౦. తథేంద్రస్తమువాచేదం చ్యవనం ప్రీతమానసః, జానామి శక్తిం తపసశ్చ్యవనేహ తవోత్తమామ్. ౨౧. ఖ్యాపనార్థం హి తపసస్తవ ఏతత్కృతం మయా, అద్యప్రభృతి భాగోఽస్తు దేవత్వం చాశ్వినోస్తథా. ౨౨. యస్త్విమాం తపసః ఖ్యాతిం త్వదీయాం వై పఠిష్యతి, శృణుయాద్వాపి శుద్ధాత్మా తస్య పుణ్యఫలం శృణు. ౨౩. విరోచనసదో గత్వా గత్వా పుష్పసదస్తథా, కాలేశవామదేవస్య ముంజకేశసదస్తథా, యౌవనయుక్తః సక్రీడం స్తిష్ఠతీతి న సంశయః. ౨౪. ఏవముక్త్వా జగామాశు దేవః స్వభవనం వశీ, చ్యవనోఽపి సభార్యో వై శర్యాతిశ్చాశ్రమం

విమానమననొప్పి దేవనిర్మితమగు గృహమును గాంచెను. శయ్యాసనములు నుద్యానములు దిగుడుబావులు మున్నగువానితో సర్వకామసమృద్ధమై యింద్రునిచేఁ గొనిరాఁబడిన యాగృహము గోలోక సన్నిభంబై పొల్చుచుండెను. దివ్యభూషణములు రత్నములు దివ్యాంబరములు ప్రకృష్టములగు నావరణములు మొదలగువానితోఁ గూడియున్న యాగృహంబును భార్యాసమేతుఁడై యీక్షించి యపరిమితానందకందళితహృదయారవిందుఁడై యింద్రు ననేకభంగులఁ బ్రశంసించెను. ఈద్వితీయా తిథి యాశ్వినేయుల కిట్లభిమతము. ఈనాఁడే వారికి దేవత్వము యజ్ఞభాగము ను గలిగెను. సురూపముగోరువారు విదియనాఁ డుపవసించి వాంఛితార్థసిద్ధిఁ బడయఁగలరు. మానవుఁ డొక్కయేఁడావి నియతాత్ముఁడై యాయాఋతువులఁ బుష్పించుపుష్పముల హవిష్యముగాఁ (వ్రతాదుల భక్షణీయమగు ద్రవ్యవిశేషము) జేకొనుచుఁ గార్తికశుద్ధవిదియనాఁడు బ్రాహ్మణులకు బంగారుపూవులుగాని వెండిపూవులుగాని జలజములుగాని సాధారణపుష్పములుగాని శక్తికొలఁది సమర్పించినచో నశ్వినులు వ్రతముచే సంతసిల్లినవారై వ్రతాంతమున నాతనికి స్వేచ్ఛాసంచారయోగ్యమగు దివ్యవిమానము నొసంగుదురు. అంత నామానవుఁడు దానితో దివంబునకేగి యశ్వినులలోకమున దివ్యాంగనలతోఁ గ్రీడించుచుఁ

---

గతః. ౨౫. అథాపశ్యద్విమానాభం భవనం దేవనిర్మితమ్, శయ్యాసనవరైర్జుష్టం సర్వకామసమృద్ధిమత్. ౨౬. ఉద్యానవాపిభిర్జుష్టం దేవేంద్రేణ సమాహృతమ్, గోఖణ్డసన్నిభం రేజే గృహం తద్భువి దుర్లభమ్. ౨౭. సుభూషణాని దివ్యాని రత్నవంతి మహాంతి చ, అరజాంసి చ వస్త్రాణి దివ్యప్రావరణానిచ. ౨౮. దృష్ట్వా తత్సర్వమఖిలం సహ పత్న్యా మహామునిః, ముదం పరమికాం లేభే శక్రం చ ప్రశశంస హ. ౨౯. ఏవమిష్టా తిథిరియం ద్వితీయా అశ్వినోర్నృప, దేవత్వం యజ్ఞభాగం చ సంప్రాప్తావిహ భారత. ౩౦. ఉపోష్యా విధినా యేన తం శృణుష్వ నరాధిప, రూపం సురూపం యో వాంఛేద్ద్వితీయాయాం నరాధిప. ౩౧. కార్తికే శుక్లపక్షస్య ద్వితీయాయాం నరాధిప, పుష్పాహారో వర్షమేకం భవేత్స నియతాత్మవాన్. ౩౨. కాలప్రాప్తాని యాని స్యుర్హవిష్యం కుసుమాని తు, భుఞ్జీయాత్తాని దత్వా తు బ్రాహ్మణేభ్యో నరాధిప. ౩౩. సౌవర్ణరౌప్యపుష్పాణి అథ వా జలజాని చ, వ్రతాంతే తస్య సంతుష్టౌ దేవౌ త్రిభువనేఽశ్వినౌ. ౩౪. దదతుః కామగం దివ్యం విమానమతితేజసమ్, సుచిరం దివి నారీభిర్లోకేఽసౌ రమతేఽశ్వినోః.

జిరకాలము వసింతురు. కల్పాంతమున మరల భూలోకమున కేతెంచి యేడుపుట్టువులవఱకు వేదతదంగవిత్తముఁడగు బ్రాహ్మణోత్తముఁడై జన్మించును. మఱియు నాతఁడు కృతయుగమునఁ బ్రతిజన్మమునను బ్రాహ్మణత్వ యజ్ఞపతిత్వ వక్తృత్వములు గలిగి యాధివ్యాధులు లేక పుత్రపౌత్రపరివృతుండై భార్యాసమేతుఁడై చిరకాలము వసించును. మధ్యదేశమున నుత్తమపత్తనంబున ధర్మాత్ముఁడగు రాజుగాఁ గూడ నుద్భవించును ఓశతానీకా! ఇట్లు పుష్పసంజ్ఞితంబగు ద్వితీయాతిథిమాహాత్మ్యంబు వినిచితిని. ఫలసంజ్ఞితంబగు వేరొక్కతిథి గలదు. అయ్యది విష్ణునియభిషేకము గలిగి పవిత్రమై పాపనాశకమై విష్ణుప్రియమయి "అశూన్యశయన" నా బ్రసిద్ధయయ్యె. శ్రద్ధాభక్తులతో నాతిథి నుపవసించు నరుఁడు వృద్ధియు సమృద్ధియు సంపత్తులు గలిగి భార్యాసమేతుఁడై సంతతానంద మనుభవించును.

ఇది ఏకోనవింశాధ్యాయము.

---

౮౫. ఇహ చాగత్య కల్పాంతే జాతో విప్రః పురస్కృతః, వేదవేదాంగవిదుషః సప్త జన్మాంతరాణ్యసౌ. ౮౬. జాతో జాతో భవేద్విద్వాన్బ్రాహ్మణోఽసౌ కృతే యుగే, దాతా యజ్ఞపతిర్వాగ్మీ ఆధివ్యాధివివర్జితః. ౮౭. పుత్రపౌత్రైః పరివృతః సహ పత్న్యాఽవసచ్చిరమ్, మధ్యదేశే సునగరే ధర్మిష్ఠో రాజ్యభాగ్భవేత్. ౮౮. ఇత్యేషా కథితా తుభ్యం ద్వితీయా పుష్పసంజ్ఞితా, ఫలసంజ్ఞా తథాన్యా స్యాత్సు తే వై ముఞ్జకేశిని. ౮౯. సుష్ఠు పుణ్యా పాపహరా విష్ణోశ్శయనః ప్రియా, అశూన్యశయనా లోకే ప్రఖ్యాతా కురునందన. ౯౦. తాముపోష్య నరో రాజఞ్ఛ్రద్ధాభక్తిపురస్కృతః, బుద్ధిం వృద్ధిం శ్రియం వాథ భార్యయా సహ మోదతే. ౯౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ద్వితీయాకల్పే శర్యాత్యాఖ్యానే
పుష్పద్వితీయావర్ణనం నామ
ఏకోనవింశోఽధ్యాయః.

## వింశాధ్యాయము

ఓద్విజపుంగవా ! ఫలసంజ్ఞితమగు విదియదినమునుగూర్చి సవిస్తారముగ నుపన్యసింపుము. ఏతిథియం దుపవసించినపుణ్యపురుషుఁ డిహజన్మమున స్త్రీవియోగమును యువతి పురుషవియోగమును బొందక యుండునో యట్టిస్త్రీపుంస శ్రేయోదాయకమగుతిథినిగుఱించి యెఱుంగ నామన ముత్తలపడుచున్నది. అని యివ్విధమున శతానీకుఁ డడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె. ఓభరతకులదీపా ! అశూన్యశయనయను ద్వితీయను వివరింతు నాకర్ణింపుము. ఆతిథియం దుపవసించి యువిద వైధవ్యము నొందదు. పురుషుఁడును భార్యలేనివాఁడై యెకప్పుడు నుద్భవింపఁడు. ఏసమయమున జగన్నాథుఁడగు కృష్ణభగవానుఁడు లక్ష్మీసమేతముగ శయనించియుండునో యప్పు డాతిథియశూన్యశయన యనఁ దగును. శ్రావణమాసమునఁ గృష్ణపక్షమున ద్వితీయనాఁడు సుస్నాతుఁడై శ్రీవత్సలాంఛనుఁడు దేవోత్తముఁడు నగుజగన్నాథుని భక్తితో నమస్కరించి లక్ష్మీసమేతుఁడగు నాదేవు నర్చించి యిట్లు ప్రార్థింపవలయును. ఓశ్రీవత్సలాంఛనా ! త్రివర్గసాధనంబగు నా యీగృహస్థాశ్రమము నశింపకుండ ననుగ్రహింపుము. ఓశ్రీరమణా! గోవులుగాని నాబంధు

---

శతానీక ఉవాచ:—బ్రూహి మే ద్విజశార్దూల ద్వితీయాం ఫలసంజ్ఞితామ్, యాముపోష్య నరో యోషిద్వియోగం నేహ గచ్ఛతి. ౧. పత్న్యా నరో మునిశ్రేష్ఠ భార్యా చ పతినా సహ, తామహం శ్రోతుమిచ్ఛామి విధవా స్త్రీ న జాయతే, ఉపోషితేన యేనార్య పత్న్యా చ సహితో నరః. ౨. తన్మే బ్రూహి ద్విజశ్రేష్ఠ శ్రేయోఽర్థం నరయోషితామ్, యేన మే కౌతుకం బ్రహ్మన్నిచ్ఛ్రిత్వాపూర్వం ప్రసర్పతి. ౩. సుమంతురువాచ:—అశూన్యశయనాం నామ ద్వితీయాం శృణు భారత, యాముపోష్య న వైధవ్యం స్త్రీ ప్రయాతి నరాధిప, పత్నీవియుక్తశ్చ నరో న కదాచిత్ప్రజాయతే. ౪. శేతే జగత్పతిః కృష్ణః శ్రియా సార్ధం యదా నృప, అశూన్యశయనా నామ తదా గ్రాహ్యా హి సా తిథిః. ౫. కృష్ణపక్షే ద్వితీయాయాం శ్రావణే మాసి భారత, ఇదముచ్చారయేత్స్నాతః ప్రణమ్య జగతః పతిమ్, శ్రీవత్సధారిణం దేవం భక్త్యాభ్యర్చ్య శ్రియాసహ. ౬. శ్రీవత్సధారిఞ్ఛ్రీకాంత శ్రీవత్స శ్రీపతేఽవ్యయ, గార్హస్థ్యం మా ప్రణాశం మే యాతు ధర్మార్థకామదమ్. ౭. గావశ్చ మా ప్రణశ్యన్తు మా ప్రణశ్యన్తు మే

జనులుగాని నశింపకుండుదురుగాక. ఓయవ్యయా! నావలనగాని దాంపత్యభేదమునగాని కులస్త్రీలు నశింపకుండుదురుగాక. ఓపరాత్పరా! నీవలె నేను లక్ష్మీవియోగము నొందకుండునట్లు ననుగ్రహింపుము. ఓదేవదేవా! కళత్రవియోగము నాకెన్నఁడును సంభవింపకుండుఁగాక. ఓశ్రియఃపతీ! నీశయ్య లక్ష్మీశూన్యముగానట్లు నాశయ్యయు శూన్యముగాకుండున ట్లనుగ్రహింపుము. అని యిట్లు ప్రార్థనము సలిపి శ్రీశ్రీపతుల కర్చన లొనరించి వారి కభీష్టంబులగుఫలముల నివేదింపవలయును. రాత్రి గృహమునఁ బ్రణమిల్లి వాగ్యతుఁడై హవిస్సును భుజింపఁదగును. మరునాఁడు బ్రాహ్మణునకు యథాశక్తి దక్షిణ నీయవలయును. అన విని శతానీకుండు దేవా! దేవదేవునకు శయ్యయందు సమకూర్పఁదగిన యభీష్టఫలంబుల నానతిమ్ము. మఱియు నోద్విజోత్తమా! భక్తులగుద్విజులు రెండవదినమున ద్విజునకుఁ జేయఁదగినదాన మెద్ది? యెఱింగింపు మన నాతనికి సుమంతుఁ డి ట్లనియె. దేవదేవునిశయనమున నాయాకాలములనుండు మధురఫలంబుల యథాశక్తి సమకూర్పఁదగును. అయ్యవి తీవ్రములైగాని కటువుగఁగాని యుండరాదు. మధురఫలంబుల నొసంగుటచేత నరుఁడు స్త్రీవాల్లభ్యము నువిద భర్తృవాల్లభ్యమును బొందుదురు. కావునఁ గటుకములు తీవ్రములు స్త్రీసంజ్ఞితములు నగుఫల

---

జనాః. ౮. జామయో మా ప్రణశ్యంతు మత్తో దాంపత్యభేదతః, లక్ష్మ్యా వియుజ్యేహం దేవ న కదాచిద్యథా భవాన్. ౯. తథా కలత్రసంబన్ధో దేవ మా మే వియుజ్యతామ్, లక్ష్మ్యా న శూన్యం వరద యథా తే శయనం సదా. ౧౦. శయ్యా మమాప్యశూన్యాస్తు తథా తు మధుసూదన, ఏవం ప్రమాద్య పూజాం చ కృత్వా లక్ష్మ్యాస్తథా హరేః. ౧౧. ఫలాని దద్యాచ్ఛయాయామభీష్టాని జగత్పతిమ్, నక్తం ప్రణమ్యాయతనే హవిర్భుఞ్జీత వాగ్యతః. ౧౨. బ్రాహ్మణాయద్వితీయేఽహ్ని శక్త్యా దద్యాచ్చ దక్షిణామ్. ౧౩. శతానీక ఉవాచ:—కాని తాని అభీష్టాని కేశవస్య ఫలాని తు, యోజ్యాని శయనే విప్ర దేవదేవస్య కథ్యతామ్. ౧౪. కిం చ దానం ద్వితీయేఽహ్ని దాతవ్యం బ్రాహ్మణస్య తు, భక్తైర్ద్విజైర్ద్విజశ్రేష్ఠ దేవదేవస్య శక్తితః. ౧౫. సుమంతురువాచ:—యాని తత్ర మహాబాహో కాలే సంతి ఫలాని తు, మధురాణి సుతీవ్రాణి న చాపి కటుకాని తు. ౧౬. దాతవ్యాని నృపశ్రేష్ఠ స్వశక్త్యా శయనే నృప, మధురాణి ప్రదత్తాని నరో వల్లభతాం వ్రజేత్. ౧౭. యోషిచ్చ కురుశార్దూల భర్తుర్వల్లభతామియాత్, తస్మాత్కటుక

ములు వర్జింపఁదగును. మానవుండు తనశక్తికొలఁదిఁ దెల్లనిముచ్చికలుగల ఖర్జూరమాతులుంగాదిఫలముల ననంతుశయనమున సమర్పవలయును. విప్రున కీఫలములనే బంగారముతోఁ జేర్చి మరుదినమున భక్తితో యథాశక్తిఁ బూజించి సమర్పింపఁదగును. ఫలప్రదానముతోబాటు ధాన్యవస్త్రదానము గూడఁ జేయఁదగును. బంగార మొసంగుతరి నద్దానితో విశేషముగ ధాన్యదానమును జేయవలయునని చెప్పుదురు. ఇప్పగిది నాలుగు నెలలు వ్రతమునల్పునరుఁడు మూఁడుజన్మములవఱకు గృహభంగము నొందఁడు. మఱియు నశూన్యశయనుఁడు ధర్మకామార్థనిరతుఁడు నవిహతైశ్వర్యుఁడు నగుచున్నాఁడు. ఓరాజా! సర్వధర్మవిదురాలగు వనిత యీవ్రతము నాచరింప నామె బంధువర్గమునకు శోచనీయురాలై యుండదు. మఱియు నాపె మూఁడుజన్మములనడుమ వైధవ్యమునుగాని దౌర్భాగ్యమునుగాని భర్త్రవమతినిగాని దరిజేరనీయదు. కటుకఫలముల నీయక మధురములగుఫలములను ఖర్జూరమాజీఫలములను నింక నుత్తమ ఫలంబులను బ్రాహ్మణున కిచ్చి పూజించిన నిట్టిఫలమే గలుగును. రాజా! యీకృష్ణద్వితీయ నుపవసించినమానవుఁడు వృద్ధిసమృద్ధుల నందుచున్నాఁడు. ఇయ్యది ద్వితీయాతిథివృత్తాంతము ఇంక నేమివినవల తడుగు

---

తీవ్రాణి స్త్రీలింగాని వివర్జయేత్. ౧౮. ఖర్జూరమాతులింగాని శ్వేతేన శిరసా సహ, ఫలాని శయనే రాజన్యజ్ఞభాగహరస్య తు. ౧౯. దేయాని కురుశార్దూల స్వశక్త్యా ముజ్జకేశినే, ఏతాన్యేవ తు విప్రస్య గాంగేయసహితాని తు. ౨౦. ద్వితీయేఽహ్ని ప్రదేయాని భక్త్యా శక్త్యా చ భారత, వాసోదానం తథా ధాన్యఫలదానసమన్వితమ్, గాంగేయస్య విశేషేణ ధాన్యదానం ప్రచక్షతే. ౨౧. ఏవం కరోతి యః సమ్యఙ్నరో మాసచతుష్టయమ్, తతో జన్మత్రయం వీర గృహభంగో న జాయతే. ౨౨. అశూన్యశయనశ్చాసౌ ధర్మకామార్థసాధనః, భవత్యవ్యాహతైశ్వర్యః పురుషో నాత్ర సంశయః ౨౩. నారీ చ రాజన్ధర్మజ్ఞా వ్రతమేతద్యథావిధి, యా కరోతి న సా శోచ్యా బంధువర్గస్యజాయతే. ౨౪. వైధవ్యం దుర్భగత్వం చ భర్తృత్యాగం చ సత్తమ, నాప్నోతి జన్మత్రితయమేతచ్చీర్త్వా మహావ్రతమ్. ౨౫. అదత్వా కటుకానీహ ఫలాని కురునందన, ఖర్జూరమాతులింగాని బృహత్ఫలశిరాంసి చ. ౨౬. దత్వా ద్విజేభ్యో రాజేంద్ర మధురాణి పరాణి చ, తస్మాత్స్వశక్త్యా యత్నేన దేయాని మధురాణి చ. ౨౭. ఇత్యేషా కథితా కృష్ణద్వితీయా తిథిరుత్తమా, యాముపోష్య నరో రాజన్నృద్ధిం వృద్ధిం తథా

మన నాతనికి శతానీకుఁ డిట్లు లనియె. "ఓ బ్రాహ్మణోత్తమా! ఉత్తమం బగు ద్వితీయాంతిథినిగూర్చి చెప్పితివి. కాని యీతిథి యాశ్వినేయులకుఁ బ్రియమైనదని మున్ను వినియుంటిని. ఆతిథియే పద్మాసమేతుఁడగు జనార్దనునకుఁ బ్రియ మెట్లయ్యె? ఆదినమున నాతని నెట్లు పూజింపవచ్చును? నాదు నెమ్మనమ్మున నీవిషయము గొప్పవింత గల్గించుచున్నది. విన వేడుక యయ్యెడు నెఱింగింపవే" యని యడుగ సుమంతుఁ డిట్లనియె. రాజా! నీవడిగినది యుక్తమే. అది యట్టిదియే. అది యశ్వినులతిథియే. అయిన నొక్కమాట చెప్పెద నెఱుంగుము. అశ్వినులే మహానుభావుఁడగువిష్ణుదేవుని ప్రీతికొఱ కీతిథి నశూన్యశయన యనునామముతో నాతని కొసంగిరి. ఇందుఁగూడ నశ్వినులే పూజింపఁబడుచున్నారు. వారినుండి కైకొను టచే విష్ణుఁడు నాతనిసాహచర్యమున లక్ష్మియును బూజింపఁబడుచు భావితులగుచున్నారు.

ఇది వింశాధ్యాయము.

---

ప్రజేత్. ౨౮. శతానీక ఉవాచ:—భవతా కథితేయం వై ద్వితీయా తిథిరుత్తమా, అశ్విభ్యాం ద్విజశార్దూల కథమస్యాం జనార్దనః. ౨౯. సంపూజ్యః ఫలసంజ్ఞాయాం కథితః పద్మయా సహ, తదత్ర కౌతుకం మహ్యం సుమహజ్జాయతే ద్విజ. ౩౦. సుమంతురువాచ:—ఏవమేతన్న సందేహో తథా వదసి భారత, అశ్వినోర్దైవ తిథిరియం కిం తు వాక్యం నిబోధ మే. ౩౧. అశూన్యశయనా దత్తా విష్ణోరమితతేజసః, అశ్విభ్యాం కురుశార్దూల ప్రీతయే మంజకేశినః. ౩౨. తావేవ కురుశార్దూల పూజ్యేతేఽత్ర మహీపతే, నాసత్యౌ భగవాన్విష్ణుర్దత్తశ్చ శ్రీర్విభావ్యతే. ౩౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ద్వితీయాకల్పసమాప్తా వింశోఽధ్యాయః.

## ఏకవింశాధ్యాయము.

సుమంతువు శతానీకున కిట్లనియె. పతియే తన ప్రాణముగ నెంచి పతిశుశ్రూషణనిరతయై శుచి యగుపతివ్రత తృతీయా (తదియ) తిథియం దుపవసించి లవణము విసర్జింపవలయును. ఇట్లు మరణాంత మాచరించు పడంతికి గౌరీదేవి సంతసిల్లి సురూపమును సౌభాగ్యమును పతివశీకార యోగ్యమగు లావణ్యమును నిచ్చును. లవణవర్జముగా గౌరీవ్రతము నాచరించుపురుషునకు మనోరమ యగుభార్యయు యువతికి మనోహరుఁ డగుభర్తయును లభించును. రాజేంద్రా! తొల్లి యొకనాఁడు ధర్మరాజున కీవ్రతము నుపదేశించుచు నుమాదేవి యానతిచ్చినవాక్యములు కొన్ని గలవు. అవి యెఱింగింతు వినుము. మనుష్యులకు సౌభాగ్యకారణంబగు నీవ్రతరాజము నేనే సృజించితిని. మర్త్యలోకమున నుండు మానవతీశిరోమణు లీవ్రతము ననుష్ఠింపఁగలరు. అట్టు లాచరించు నప్పడంతి నన్నుఁబోలి భర్తృవియోగమునొందక యాతనింగూడి సంతతానందము ననుభవించును. అందకత్తె యయ్యుఁ బతిని బడయఁజాలనికన్నియ యీవ్రతము నుద్దేశించి యక్షారలవణభోజన గాఁదగును. ఆకన్నియ నాయందు లగ్నమగుచిత్తముగలిగి నాకు భక్తురాలై స్వర్ణమయమగు గౌరీప్రతిమ నొకదాని నిర్మించి యద్దానిని వస్త్రగంధమాల్యాభరణాదుల నలంకరించి లవణమును గుడమును ఘృతతైలములను యథాశక్తిగ నాదేవికి నివేదించు

---

సుమంతురువాచ:—పతివ్రతా పతిప్రాణా పతిశుశ్రూషణే రతా, ఏవంవిధాపి యా ప్రోక్తా శుచిః సంశోభనా సతీ. ౧. సోపవాసా తృతీయాం తు లవణం పరివర్జయేత్, సా గృహ్ణాతి చ వై భక్త్యా వ్రతమామరణాంతికమ్. ౨. గౌరీ దదాతి సంతుష్టా రూపం సౌభాగ్యమేవ చ, లావణ్యం లలితం హృద్యం శ్లాఘ్యం పుంసాం మనోరమమ్. 3. పుంసో మనోరమా నారీ భర్తా నార్యా మనోరమః, గౌరీవ్రతేన భవతి రాజంల్లవణవర్జనాత్. ౪. ఇదం వ్రతం ప్రతి విభో ధర్మరాజస్య శృణ్వతః, ఉమయా చ పురా ప్రోక్తం యద్వాక్యం తన్నిబోధ మే. ౫. మయా వ్రతమిదం సృష్టం సౌభాగ్యకరణం నృణామ్, మర్త్యే తు నియతా నారీ వ్రతమేతచ్చరిష్యతి, సహ భర్త్రా స మోదేత యథా భర్తా హరో మమ. ౬. యా చ కన్యా న భర్తారం విందతే శోభనా సతీ, సా త్విదం వ్రతముద్దిశ్య భవేదక్షారభోజనా, మచ్చిత్తా మన్మనాః కుర్యాన్మద్భక్తా మత్పరిగ్రహా. ౭. గౌరీం సంస్థాప్య సౌవర్ణీం గంధాలంకారభూషితామ్, వస్త్రాలంకారసంవీతాం పుష్పమండలమండితామ్. ౮. లవణం గుడం ఘృతం తైలం దేవ్యై శక్త్యా

చుండవలయును. మఱియుఁ గటువగుపదార్థములును జీలకఱ్ఱయు నాకు కూరలును గుడఘృష్టములను నపూపంబులును వస్త్రఖండములను వ్రత సంపన్నుఁడును బండితుఁడు నగుబ్రాహ్మణోత్తమున కీవలయును. శుక్ల పక్షమున నెల్లప్పుడును ధనవంతులు శక్తికొలఁది హిరణ్మయి యగుప్రతి మను బూజింపవలయును. నిర్ధనుండు మధువృక్షనిర్మిత ప్రతిమను బూజింప వలయును. ఈవిధముగఁ బ్రతిమను (అర్చావిగ్రహము) నిర్మించి గౌరి నెల్లకాలమునను సన్నిధానమునవసించి పూజింపవలయును. ఆవిగ్రహ మున గౌరి సన్నిహితరై యుండుననుటకు సందియము లేదు. రాత్రి వేళ మౌనవ్రతముగలిగి యక్షారలవణముగ భుజించి గౌరీదేవిసన్నిధానమున నేలపై దర్భాసనము వైచుకొని యందుఁ బరుండవలయును. ఇట్టినియ మముగలవారికిఁ గలుగుఫలము వచింతు వినుము. కన్య తనమనమున కను కూలుఁడై తనకిష్టుఁడగుమగని బడయును. చిరకాల మాతనితోఁ గ్రీడించి సుసంతానముఁబడసి వాసి కెక్కి తుద నాతనితోఁగూడి సూర్యలోకమునో చంద్రలోకమునో సప్తర్షిమండలమునో పొంది యటనుండి రుద్రునిసన్ని ధానము జేరును. ఓరాజేంద్రా! యేతద్వ్రతపరాయణయగు విధవ నియ తముగ భర్త నుద్దేశించి నిత్యార్చన లొనరించుచు నుండెనేని యాపె దేహాంతమున యమపురికేగి యందు యమకింకరులచేఁ బీడింపఁబడుభర్త

నివేదయేత్, కటుఖండం జీరకం చ పత్రశాఖం చ భారత. ౯. గుడఘృష్టాంస్తథా పూపాన్ఖండవేష్టాంస్తథా నృప, బ్రాహ్మణే వ్రతసంపన్నే ప్రదద్యాత్సుబహుశ్రుతే. ౧౦. శుక్లపక్షే సదా దేయా యథా శక్త్యా హిరణ్మయీ, ధనహీనే తు భక్త్యా చ మధువృక్షమయీ నృప. ౧౧. అర్చాయ్య నిత్యం సన్నిధానాత్తత్ర గౌరీ న సంశయః, అక్షారలవణం రాత్రౌ భుంక్తే చైవ సువాగ్యతా. ౧౨. గౌరీ సన్నిహితా నిత్యం భూమౌ ప్రస్తరశాయినీ, ఏవం నియమయుక్తస్య దేవ్యా యత్సముదాహృతమ్. ౧౩. తచ్ఛృణుష్వ మహాబాహో కథ్యమానం మహాఫలమ్, భర్తారం తు లభేత్కన్యా యం వాంఛతి మనోనుగమ్, ౧౪. సుచిరం సహ వై భర్త్రా క్రీడయిత్వా ఇహైవ సా, సంతతిం చ ప్రతిష్ఠాప్య సహ తేనైవ గచ్ఛతి. ౧౫. సూర్యలోకం చన్ద్రలోకం లోకం చిత్రశిఖండినః, గత్వా యాతి సదో రాజన్నామదేవస్య భారత. ౧౬. విధవా తు యదా రాజన్దేవ్యా వ్రతపరాయణా, భర్తారం నియతానిత్యం సదార్చనపరాయణా. ౧౭. ఇహ చోత్సృజ్య దేహం స్వం దృష్ట్వా హరిపురే ప్రియమ్, ఆక్షిప్య యమ

నీక్షించి యాదూతలను బోద్రోలి యాతనిం దోడ్కొని దివికేగి యాతనిఁగూడి పదికోట్లయేండ్లు దివ్యభోగముల ననుభవించి యనంత రము మర్త్యలోకమున కేతెంచి మగనితోఁగూడి వెనుకఁజెప్పినఫలమును బొందఁగలదు. రాజా! మున్ను దేవనాథుని దేవేరియుఁ బుత్రార్థినియై యీవ్రతము నాచరించి వ్రతాంతమున జయంతనాముఁ డగుపుత్రుని బడసెను. అట్టులే వసిష్ఠమునీంద్రుని బరిణయింప నెంచి యరుంధతి గూడ నీవ్రతము నాచరించెను. ఆమె యిప్పుడును వసిష్ఠునిసమీపమున వియత్త లమునఁ గాన్పించుచున్నది. ఇట్టులే రోహిణి లవణవర్జనముజేసి సవతుల గుంపులనెల్ల నణఁగఁద్రొక్కి గౌరియనుగ్రహమున నచలమగు సౌభాగ్య ముతో దివి నున్నది. ఇట్లీతృతీయాతిధి తృతీయాంతిధి యనియే సర్వలోక ములఁ బూజనీయమై యున్నది. అందును వైశాఖమాసముననుండు తృతీయ విశేషముగఁబుణ్యప్రదమైనది. భాద్రపదమాఘమాసములందును విశేషమగుపున్నెము నొసంగును. సంశయములేదు. మాఘభాద్రపదము లందుఁ దృతీయ స్త్రీలయెడఁ గల్పవృక్షమై యున్నది ఇతరతృతీయయు వైశాఖతృతీయయు సర్వలోకమునకును శ్రేయముఁగూర్చునది. ఓరాజా! మాఘతృతీయనాఁడు గుడలవణదానము స్త్రీపురుషులకు శ్రేయఃప్రదము. గుడము ప్రతిగ్రహించువానికి సంతోషము నొసంగును. లవణము విశ్వ కారణుఁ డగుదేవునకు ముదము గొల్పును. భాద్రపదమాసమున బెల్ల ముతోఁ జేసినయప్పములు దానము చేయవలయును. మఱియు మాఘ

---

దూతేభ్యః సహ భర్త్రా రమేద్దివి. ౧౯. వర్షకోటిం దశగుణాం రమిత్వా సా ఇహా గతా, భర్త్రా సహైవ పూర్వోక్తం లభతే ఫలమీప్సితమ్. ౧౯. ఇన్ద్రాణ్యాపి వ్రత మిదం పుత్రార్థిన్యా నరాధిప, లబ్ధః పుత్రో వ్రతస్యాంతే జయంతో నామ నామతః. ౨౦. అరుంధత్యా తథా చీర్ణం వశిష్ఠం ప్రతి కామతః, దృశ్యతే దివి చాద్యాపి వశిష్ఠస్య సమీపతః. ౨౧. రోహిణ్యా లవణత్యాగాత్సపత్నీగణమర్దనమ్, లబ్ధం దేవ్యాః ప్రసాదేన సౌభాగ్యమచలం దివి. ౨౨. ఇత్యేషా తిథిరిత్యేవ తృతీయా లోకపూజితా, సదా విశేషతః పుణ్యా వైశాఖే మాసి యా భవేత్. ౨౩. పుణ్యా భాద్రపదే మాసి మాఘేఽప్యేవం న సంశయః, మాఘే భాద్రపదే చాపి స్త్రీణాం ధన్యా ప్రచక్షతే. ౨౪. సాధారణీ తు వైశాఖే సర్వలోకస్య భారత, మాఘమాసే తృతీయాయాం గుడస్య లవణస్య చ, దానం శ్రేయస్కరం రాజన్ స్త్రీణాం చ పురుషస్య చ. ౨౫. గుడేన తుష్యతే దత్తో లవణేన తు విశ్వభూః, గుడపూపాస్తు దాత

తృతీయనాఁడు మహేశ్వరుని ప్రీతికై మోదకములను జలమును దానము చేయుట ప్రశస్తమైనది. వైశాఖతృతీయనాఁడు చందనోదకముచే విధాతృఁడును మోదకములచే భీముఁడును సంతుష్టులగుదురు. చందనదానము వలనఁ గంజసుజాతుఁడు తృప్తుఁడగును. ఓకురుశార్దూలా! వైశాఖ తృతీయ "అక్షయ" అని లోకమునను దేవతలచేతఁ గూడ నభినందింపఁ బడుచున్నది. ఈతిథియందు దానమొసంగిన రజతము హేమము నన్నము ఘృతము ననునవి యక్షయములయి వృద్ధిబొందుచుండుటంజేసి యీతిథి కక్షయ యని నామంబు గలిగినట్లు వచింతురు. ఈనాఁడు స్వల్పముగఁగాని యధికముగఁగాని పరుల కిచ్చునది యక్షయ మగును. అక్కారణమున నీతిథి యక్షయ యని వ్యవహరింపఁబడియె. ఈనాఁడు సువర్ణము నుదకముతో నిచ్చువాఁడు సూర్యమండలము నొందుచున్నాఁడు. ఈతిథి నుపవసింప బుద్ధివృద్ధులు గలుగుట నిది యుత్తమమైనది.

ఇది ఏకవింశాధ్యాయము.

---

వ్యా మాసి భాద్రపదే తథా. ౨౬. తృతీయాయాం తు మాఘస్య వామదేవస్య ప్రీతయే, వారిదానం ప్రశస్తం స్యాన్మోదకానాం చ భారత. ౨౭. వైశాఖే మాసి రాజేన్ద్ర తృతీయా చందనస్య చ, వారిణా తుష్యతే వేధా మోదకైర్భీమ ఏవ హి, దానాత్తు చందనస్యేహ కంజజో నాత్ర సంశయః. ౨౮. యా త్వేషా కురుశార్దూల వైశాఖే మాసి వై తిథిః, తృతీయా సాఽక్షయా లోకే గీర్వాణైరభినందితా. ౨౯. ఆగతేయం మహాబాహో భూరి చంద్రం వసువ్రతా, కలధౌతం తథాన్నం చ ఘృతం చాపి విశేషతః, యద్యద్దత్తం త్వక్షయం స్యాత్తేనేయమక్షయా స్మృతా. ౩౦. యత్కించిద్దీయతే దానం స్వల్పం వా యది వా బహు, తత్సర్వమక్షయం స్యాద్వై తేనేయ మక్షయా స్మృతా. ౩౧. యోఽస్యాం దదాతి కరకాన్వారిబీజసమన్వితాన్, స యాతి పురుషో వీర లోకం వై హేమమాలినః. ౩౨. ఇత్యేషా కథితా వీర తృతీయా తిథిరుత్తమా, యాముపోష్య నరో రాజన్నృద్ధిం వృద్ధిం శ్రియం భజేత్. ౩౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి తృతీయాకల్పవిధివర్ణనం నామ
ఏకవింశోఽధ్యాయః.

## ద్వావింశాధ్యాయము

శతానీకుం గాంచి సుమంతుం డిట్లనియె. ఓరాజేంద్రా! చతుర్థీ తిథియం దెల్లకాలము నిరాహారవ్రతమూని విప్రునకుఁ దిలాన్నంబు గుడువంబెట్టి తానును దిలాన్నము భుజించుచు రెండువత్సరము లీవ్రతము ననుష్ఠించి ముగించునరునకు వినాయకుండు ప్రసన్నుండై యభిమతఫలంబుల నొసంగుచున్నాఁడు. అట్లాచరించుమనుజుఁడు సర్వ భాగ్యావాసంబగు దేవనివాసంబునొంది యనేకభోగముల నట గుడిచి క్రీడించుచుండును. ఆపుణ్యము క్షీణించినవెనుక నీలోకమున కేతెంచి యేడుజన్మములవఱకును దివ్యతేజోవిరాజితుండై యశస్సంపన్నుఁడై బుద్ధిమదుత్తముఁడు ధృతిమంతుఁడు వాగ్మియునై మహదైశ్వర్యవంతుఁడై యుండి యితరుల కసాధ్యమగు నెట్టిపనినైనను క్షణమాత్రమున సాధింపఁ జాలి హస్త్యశ్వరథసంపన్నుఁడై మిత్రకళత్రపుత్రపౌత్రప్రభృతిసహాయ సమేతుఁడై దీర్ఘాయుష్మంతుఁడునై రాజుగా నగును. విఘ్ననివారకుఁడగు వినాయకుఁడే యిట్టిఫలము నొసంగుచున్నాఁడు. అనఁగా శతానీకుఁ డోవిప్రోత్తమా! యీమహాభాగుఁడు విఘ్నవినాయకుఁ డనువేర్వడ యుట కెవ్వనికి విఘ్నములు గూర్చినాఁడో? ఈవిఘ్నేశుని విఘ్నకారణము నాకుఁ దెలియఁబలుకు మన నాతనికి సుమంతుఁ డిట్లనియె. మున్ను గుమారస్వామి స్త్రీపురుషులకు వేర్వేరు కౌమారలక్షణము వేరుపఱుచు నెడ నీదేవుఁడు విఘ్నము లొనరించెను. అది యెటులంగి కార్తికేయుఁడు

---

సుమంతురువాచ:—చతుర్థ్యాం తు సదా రాజన్నిరాహారవ్రతాన్వితః, దత్త్వా తిలాన్నం విప్రస్య స్వయం భుంక్తే తిలాదనమ్. ౧. వర్షద్వయే సమాప్తిర్హి వ్రతస్య తు యదా భవేత్, వినాయకస్తస్య తుష్టో దదాతి ఫలమీహితమ్. ౨. యాతి భాగ్యనివాసం హి క్రీడతే విభవైస్సహ, ఇహ చాగత్య పుణ్యాంతే దివ్యో దివ్యవపుర్యశాః. ౩. మతి మాన్ధృతిమాన్వాగ్మీ భాగ్యవాన్కామకారవాన్, అసాధ్యాన్యపి సాధ్నోతి హ క్షణాదేవ మహాంత్యపి. ౪. హస్త్యశ్వరథసంపన్నః పత్నీపుత్రసహాయవాన్, రాజా భవతి దీర్ఘాయుః సప్తజన్మాన్యసౌ నృప, ఏతద్దదాతి సంతుష్టో విఘ్నహంతా వినాయకః. ౫. శతానీక ఉవాచ:—విఘ్నః కస్య కృతస్తేన యేన విఘ్నవినాయకః, ఏతద్వదస్వ విఘ్నేశవిఘ్న కారణమద్య మే. ౬. సుమంతురువాచ:—కౌమారే లక్షణే పుంసాం స్త్రీణాం చ సుకృతే కృతే, విఘ్నం చకార విఘ్నేశో గాంగేయస్య వినాయకః. ౭. తం తు విఘ్నం

కోపించి యాతనిదంత మూడఁబెరికి యాతనిఁ జంపఁబూనెను. అత్తఱి నత్తావునకు దేవదేవుఁ డగుమహేశుఁ డరుదెంచి యాతని నివారించి వత్సా! యెందుల కిట్లు కోపించితివి? అని యడిగెను. కుమారుఁడును తానొనరించు స్త్రీపుంసలక్షణములఁ దండ్రి కెఱింగించి యాతఁ డందులకు విఘ్న మొనరించెనని తనకోపకారణ మెఱింగించెను. పిమ్మటఁ జిఱునగవు మోమునఁ దొలుకరింపఁ గుమారు నీక్షించి మహాదేవుఁడు "వత్సా! నాయం దేమిలక్షణముఁ జూచుచుంటివి? అది నాకుఁ దెలుపుము. అన నాతఁడును నీచేత ద్విజలక్షణోపేతమగు కపాలము నించుకేని విచారింపక యుంచుకొనుటచే నీవు కపాలి వగుదు" వనెను. అంత నమ్మహాదేవుఁడు కోపించి యాకపాలలక్షణమును సముద్రమునఁ బారవైచెను. అంతట దేవసభలో బ్రహ్మరుద్రులకుఁ బరస్పరము నేఁబెద్ద నేఁబెద్ద నని వివాదము ప్రారంభమయ్యెను. అప్పుడు శివుఁడు నీదుపుట్టు వెఱింగిన వారు గలరు. నాకు లేరు. కావున నేఁబెద్ద ననెను. శివుఁ డిట్టు లనుచుండ బ్రహ్మదేవునియేనవతల పెద్ద యట్టహాసము నొనరించి యోయీ! శివా! నిన్ను నేనెఱుంగుదు ననెను. అంతట రుద్రుఁడు కోపించి యా బ్రహ్మయొక్క పంచమశిరంబును నఖాగ్రములతో వ్రక్కలించెను. అదియుఁ దోడనే యాతనికరము నంటి యూడిరాకుండె. అంత రుద్రుఁడాశిరోహస్తముతోడ విష్ణుని దర్శింపఁగోరి యాతనినివాసమగు మేరు

విదిత్వాసౌ కార్తికేయో రుషాన్వితః, ఉత్కృష్య దంతం తస్యాస్యాద్ధంతుం తం చ సముద్యతః. ౮. నివార్యాపృచ్ఛద్దేవేశో రోషః కార్యః కుతస్త్వయా, తం చాచఖ్యౌ స పిత్రే వై కృతం పూరుషలక్షణమ్, తత్ర విఘ్నకృతే మహ్యాం యోషితా న చ లక్షణమ్. ౯. అథోవాచ మహాదేవః ప్రహసన్నవసుతం కిల, మమ కిం లక్షణం పుత్ర పశ్యసే త్వం వదస్వ మే. ౧౦. స చోవాచ కరే తుభ్యం కపాలం ద్విజలక్షితమ్, అవిచారేణ సంస్థాప్యం కపాలీ తేన చోచ్యసే, స తల్లక్షణమాదాయ సముద్రే ప్రాక్షిపద్రుషా. ౧౧. అథ దేవసమాజే వై ప్రవృత్తే బ్రహ్మరుద్రయోః, అహం జ్యాయానహం జ్యాయాన్వివాదోఽభూత్తయోర్ద్వయోః, తవ సంభూత్యభిజ్ఞోఽస్తి మాం తు వేద న కశ్చన. ౧౨. ఏవం శివేఽతి బ్రువతి బ్రహ్మణః పంచమం శిరః, ముక్తాట్టహాసం ప్రోవాచ త్వామహం వేదితా భవ. ౧౩. ఏవం బ్రువతు రుద్రేణ బ్రాహ్మం హాయశిరో మహత్, నఖాగ్రేణ నికృత్తం చ తస్యైవ చ కరే స్థితమ్. ౧౪. కరస్థేనైవ తేనాసావాగచ్ఛ

పర్వతమున కేగి జితేంద్రియుఁడై తపమొనరించెనఁట. అంత నిట బ్రహ్మ యొక్క పంచమశిరము దెగినతోడనే యాప్రదేశమునుండి బ్రహ్మ కోపమువలనఁ దెల్లనికుండలములు గలయొకపురుషుఁ డుద్భవించెను. అటు లావిర్భవించి నఖశిఖపర్యంతము గవచముదొడిగి శరశరాసనములు దాల్చి యిదమిత్థమని నిర్దేశింపరానిశరీరము గలిగి స్రగ్వియై యేమిపని యని యడుగ నాతనికిఁ గోపమున మండిపడుచు బ్రహ్మ నీవు పోయి దుష్టబుద్ధి యగు నారుద్రుని సంహరింపుమని యాదేశించెను. తోడనే యాతఁడును కోపారుణితలోచనుఁడై రుద్రుఁ డేగినత్రోవ నాతనిపిరుంద నేగె. అట రుద్రుఁడును విష్ణుతేజోవ్యాప్తుఁడై సత్త్వనివిష్టుఁడై యుండి యుత్తమం బగుతపంబుఁ జేయుచున్న యపరాజితుఁడు వికుంఠాసంభవుఁడు దేవోత్త ముఁడు నగునారాయణుని గాంచెను. ఆనారాయణుఁడును తనయొద్దకు వచ్చినహరునిఁ జూచి కార్యము నెఱింగి శూలపాణియగు నాతని కిట్లనియె. ఓదేవా! నీవచ్చినకార్య మేనెఱుంగుదు నీశూలముతో నాభుజము భేదింపుము. నావు డమ్మహాతేజస్వి నిజశూలమున విష్ణునిభుజముఁ జీల్చెను. తోడనే యాభుజమునుండి భూమ్యాకాశముల నింపుచు నూర్ధ్వ ముఖమై రక్తప్రవాహము వెలువడి కొంతదవ్వేగి మరలివచ్చి యాకపాల మునఁబడెను. అట్లు కపాలమునఁ బడినరక్తమును ప్రదేశినిచే వృద్ధినొందిం చెను. అంత నాదేవుఁడు రక్తప్రవాహము నరికట్టి జలమయమగుతనువు

---

ద్యత్ర వై హరః, తపస్తేపే తదా మేరౌ తత్రాసౌ భగవాన్వశీ. ౧౫. కృత్తే హయ శిరే తస్మిన్స్థానాత్తస్మాత్తు బ్రహ్మణః, రోషాద్వినిఃసృతస్త్వన్యః పురుషః శ్వేతకుండలీ. ౧౬. కవచీ సశిరస్కశ్చ సశరః సశరాసనః, అనిర్దేశ్యవపుః స్రగ్వీ కిం కరోమి స చాబ్రవీత్. ౧౭. అథోవాచ రుషా బ్రహ్మా హన్యతాం స సుదుర్మతిః, స తు మార్గేణ రుద్రస్య ఆగచ్ఛద్రోషతో ద్రుతమ్. ౧౮. రుద్రోఽపి విష్ణుతేజోభిః ప్రవిష్టః స త్వధి ష్ఠితః, స ప్రవిశ్య తదాపశ్యత్తపంతం చోత్తమం తపః, హరో నారాయణం దేవం వైకుంఠమపరాజితమ్. ౧౯. హరం దృష్ట్వాథ సంప్రాప్తం కార్యం చాస్య విచింత్య చ, ఉవాచ శూలినం దేవో భింధి శూలేన మే భుజమ్. ౨౦. స బిభేద మహాతేజా భుజం శూలేన తం హరః. ౨౧. శూలభేదాదసృక్చోర్ధ్వం జగామావృత్త్య రోదసీ, వినివృత్య తతః పశ్చాత్కపాలే నిపపాత హ. ౨౨. అసృక్కపాలే పతితం ప్రదేశిన్యా వ్యవర్ధ యత్, యదా హి వినివృత్తిస్స్యాద్దేవస్య రుధిరం ప్రతి. ౨౩. తదా తు వ్యసృజత్తోయం

నాశ్రయించి నీటిని విడిచెను. అంతట రక్తమయమగు శిరఃకపాలము తోయ పరిప్లుత మయ్యెను. అంత రుద్రుఁడు కపాలగతమగురక్తమునందుఁ జూపుఁడువ్రేలితో రక్తవర్ణుఁడై కవచధారియై రక్తకుండలియగు నొక్క పురుషుని సృజించెను. ఆపురుషుఁడు నటు పుట్టి భవునకు నమస్కరించి యేమిచేయుదు నని యడుగ నదుగో బ్రహ్మచే సృష్టుఁడగు శ్వేతకుండలి యని చూపెను. అంత నానూత్నపురుషు లిరువురును ధనుర్వరపాణులై మహాబలశాలులై యుగాంతమునఁ గుజకేతువులవలె ద్వంద్వయుద్ధ మొనరించిరి. ఇట్లు వారిరువురుఁ బోరునెడ నొక్కప్రళయము గడచనెను. కాని యంతవట్టు నొక్కనికేనియు జయము గలుగలేదు. అంత నంతరిక్షమునుండి యశరీరిణి యగువాణి యిట్లు దోఁచెను. "ఓవీరులారా! నాతోఁగూడ మీకు నవతారముగాఁగలదు. దేవతలతోఁ గూడి పార్థివంబగుభారంబు వాపవలయును. అప్పుడు దేవకార్యసిద్ధికై యొకమహాశ్చర్యము జరుగఁగలదు. భూలోకభార మపనయించి యాయాశ్చర్యము మగిడి దేవలోకముఁ జేరఁగలదు." అని యిట్లు వినఁబడినతోడనే వైకుంఠుం డాయిరువురిలో నొకనిని సూర్యున కిచ్చెను. సూర్యుఁడు ముదాన్వితుఁడై బలవంతుఁడగు శ్వేతకుండలుని గ్రహించెను. తరువాత వైకుంఠుఁడు రక్తకుండలు నింద్రున కొసంగెను. అంత నింద్రుఁ డాతనిం గైకొని ముదమంది నిజనగరమున కేగెను. ఇప్పగిదిఁ గోపమున నుద్భ

---

స కృత్వా వారుణీం తనుమ్, తోయే ప్రవృత్తేఽసృగ్భూతే కపాలే యత్ర తచ్ఛిరః. ౨౪. కపాలే తు ప్రదేశిన్యా రుద్రోఽసౌ రుధిరేఽసృజత్, ఆముక్తకవచం రక్తం రక్తకుండలినం నరమ్. ౨౫. అథోవాచ భవం దేవం కిం కరోమీతి మానద, అసావపి ససర్జాథ శ్వేతకుండలినం నరమ్. ౨౬. తావుభౌ సమయుధ్యేతాం ధనుష్ప్రవరధారిణౌ, యథా రాజన్బలీయాంసౌ కుజకేతూ యుగాత్యయే. ౨౭. తయోస్తు యుధ్యతోరేవం సంవర్తశ్చాధికో గతః, న చాదృశ్యత విజయ ఏకస్యాపి తదా తయోః. ౨౮. అథాంతరిక్షే తౌ దృష్ట్వా వాగువాచాశరీరిణీ, అవతారోఽథ భవితా యువయోర్హి మయా సహ. ౨౯. భారాపనోదః కర్తవ్యః పృథివ్యర్థే సురైః సహ, తదాశ్చర్యో హి భవితా దేవకార్యార్థసిద్ధయే. ౩౦. భూలోకభారం నిర్ధూయ భూయో గంతా సురాలయమ్, ఏవముక్త్వా తు వైకుంఠో దదావేకం రవేస్తదా. ౩౧. శ్వేతకుండలినం దృష్ట్వా తం జగ్రాహ రవిర్ముదా, ఇన్ద్రస్యాపి తతః పశ్చాద్రక్తకుండలినం దదౌ. ౩౨. జగ్రాహ చ ముదాయుక్త ఇన్ద్రః స్వం

వించిన యాపురుషులు సూర్యేంద్రులతోఁ బోయినవెనుక దేవదేవుఁడు కమలాసనుఁడై యుండి యోశివా! నీవును కపాలపాణివై కపాలవ్రతము సల్పుచు నీవుగూడ నేగుము. మర్త్యలోకమున నీవ్రత మవతరింపఁగలదు. ఏమానవులు నీవ్రతమును బూల్తురో వారలకు లోకద్వయమునందును దుర్లభ మొక్కటియు నుండదు." అని యిట్లు మంచిమాటలు ప్రసంగించి యాతని నభినందించి సముద్రుని బిలచి విచారింపకయే యిట్లు చెప్పెను. ఓయీ! స్త్రీల కాభరణమే చిహ్నముగనుండ నొనర్పుము. కార్తికేయుఁ డొనర్చిన విలక్షణలక్షణంబు నీవు వచింపుము. అన నంతట సముద్రుఁడు దేవా! పురుషలక్షణము నాపేరున నుండున ట్లనుగ్రహింపు మన నాదే వుండును నీవనినట్లే యగుఁగాక యని ప్రతినగావించెను. కార్తికేయునిఁ బిలచి యోయీ! స్త్రీపురుషలక్షణములు నీవు చెప్పినట్టులే యగును. నీవిప్పు డూడఁబెరికిన విషాణము నీవినాయకున కిమ్ము. ప్రతిమనుష్యునకును భూతమును భవితవ్యము మొదలగునదంతయుఁ గామితమైనచో వినాయకునను గ్రహము లేక జరుగుటలేదు. యాదృచ్ఛికమైనచో నాతని యనుకంప లేకయే యగును. నీవుచెప్పినలక్షణములతోఁబాటు సాముద్ర చిహ్నము గూడ గ్రహింపుము. సముద్రనామాంకితమగు స్త్రీపురుష లక్షణము శ్రేష్ఠమైనది. దేవోత్తముఁడగు వినాయకునకు సవిషాణమగు

---

చ పురం యయౌ, గతౌ రవీంద్రౌ ప్రగృహ్య పురుషౌ క్రోధసంభవౌ. 33. అథోవాచ తదా రుద్రం దేవః కమలసంస్థితః, గచ్ఛ త్వమపి కాపాలే కపాలవ్రతచర్యయా, అవతారో వ్రతస్యాస్య మర్త్యలోకే భవిష్యతి. 34. యే చ వ్రతం త్వదీయం వై ధారయిష్యంతి మానవాః, న తేషాం దుర్లభం కించిద్భవితేహ పరత్ర చ. 35. ఏవం సంలప్య బహుశః సుముఖం ప్రతినంద్య చ, ఆహూయ చ సముద్రం స ప్రత్యువాచ విచారయన్. 36. కురుష్వాభరణం స్త్రీణాం లక్షణం యద్విలక్షణమ్, కార్తికేయేన యత్ప్రోక్తం తద్వదస్వావిచారయన్. 37. స చాహ మమ నామ్నేదం భవేత్పురుషలక్షణమ్, దేవేన తత్ప్రతిజ్ఞాతమేవమేతద్భవిష్యతి. 38. కార్తికేయేన యత్ప్రోక్తం తద్వదస్వావిచారయన్. 39. ప్రయచ్ఛాస్య విషాణం వై నిష్కృష్టం యత్త్వయాఽధునా, అవశ్యమేవ తద్భూతం భవితవ్యం తు కస్యచిత్. 40. ఋతే వినాయకం తద్దైవ దైవయోగాన్న కామతః, గృహాణ ఏతత్సాముద్రం యత్త్వయా పరికీర్తితమ్. 41. స్త్రీపుంసోర్లక్షణం శ్రేష్ఠం సాముద్రమితి విశ్రుతమ్, ఇమం చ సవిషాణం వై కురు దేవ

లక్షణము నిడుము. అన విని బాహులేయుండు (కుమారస్వామి) మత్సర భావము నాశ్రయించి నారాయణునితో నిట్లనియె. నీయాజ్ఞానుసార మీతనికి విషాణము నొసంగుదును. ఈతఁడీకొమ్మును విడచి చరించెనేని యావిషాణ మాతని భస్మముజేయవలయును. అట్లంగీకరింపుమన నాదేవుఁ డట్టులే యని విషాణ మాతనిచేతి కొసంగెను. కార్తికేయునియందలి యభిమానంబుకతన దేవేశుఁ డిట్లు సలిపెను ఆవినాయకుఁ డిప్పుడును విషాణపాణియై ప్రతిమలలో నగపడుచున్నాఁడు గదా? మహాత్ముఁడు మహాభుజుఁడు నగుభీమసూనునకు విఘ్నకర్తృతాబోధకమగు నీదేవ రహస్యమును నీకెఱింగించితిని దేవలోకమునన్నైన దేవతలకేని దుర్లభ మగు నీరహస్యమును బ్రసన్నుఁడనై యెఱింగించితిని. తిథిసందర్భవశ మున నియ్యుత్తమరహస్యము నీకెఱింగించితిని. ఈయాఖ్యానమును విద్వాంసుఁడు వేదాధ్యయనపరులై వేదపారగులగు బ్రాహ్మణులకును స్వవృత్తి ననుసరించు క్షత్రియులకును సుగుణసంపన్నులగు వైశ్యశూద్రు లకును వినిపించినచో నాతని కిహపరములందుఁ బొందరాని దేదియులేదు. ఆతఁడు దుర్గతినిగాని పరాభవమునుగాని పొందఁడు. విఘ్నములు లేక

---

వినాయకమ్. ౪౨. అథోవాచ స దేవేశం బాహులేయః సమత్సరమ్, విషాణం దద్మి చాస్యాహం తవ వాక్యాన్న సంశయః. ౪౩. యదా త్వయం విషాణం చ ముక్త్వా తు విచరిష్యతి, తదా విషాణముక్తస్సన్భస్మ ఏతం కరిష్యతి. ౪౪. ఏవమస్త్వితి తం చోక్త్వా విషాణం తత్కరే దదౌ, వినాయకస్య దేవేశః కార్తికేయమతే స్థితః. ౪౫. సవిషాణకరో ద్యాపి దృశ్యతే ప్రతిమా నృప, భీమసూనోర్మహాబాహోర్విఘ్నం కర్తుం మహాత్మనః. ౪౬. ఏతద్రహస్యం దేవానాం మయా తే సముదాహృతమ్, యత్ర దేవో న వై వేద దేవానాం భువి దుర్లభమ్. ౪౭. మయా ప్రసన్నేన తవ గుహ్యమేతదుదాహృతమ్, కథితం తిథిసంయోగే వినాయకకథామృతమ్. ౪౮. య ఇదం శ్రావయేద్విద్వాన్బ్రాహ్మ ణాన్వేదపారగాన్, క్షత్రియాంశ్చ స్వవృత్తిస్థాన్వైట్యాన్ఛూద్రాంశ్చ గుణాన్వితాన్. ౪౯. న తస్య దుర్లభం కించిదిహ చాముత్ర విద్యతే, న చ దుర్గతిమాప్నోతి న చ యాతి పరా భవమ్. ౫౦. నిర్విఘ్నం సర్వకార్యాణి సాధయేన్నాత్ర సంశయః, బుద్ధిం వృద్ధిం

యెల్లకార్యములు సాధించును. ఇందేమియు సందియము లేదు. మఱియు దానభోగాదులకుఁ దఱుగులేని సిరుల ననుభవింపఁగలుగును.

ఇది ద్వావింశాధ్యాయము.

---

## త్రయోవింశాధ్యాయము.

శతానీకుండు విప్రోత్తమా! యీభీమపుత్త్రుఁడు ప్రమథగణమున కధిపుఁ డెట్లయ్యెను? మఱియు విఘ్నములకు భర్తయు నధికారియు నెట్టులయ్యె? వివరింపవే యని యడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె. ఓరాజవతంసమా! వినాయకుని విఘ్నకారకత్వమును తన్నియోజకము లగు విఘ్నకారణములను గుఱించి యుక్తరీతి నడిగితివి. సవిస్తరముగ నెఱింగింతు నేకాగ్రత నాలింపుము. తొల్లింటి కృతయుగమునఁ బ్రజలు సృజింపఁబడిరి. నిర్విఘ్నముగఁ గర్మలెల్ల సిద్ధించినవి అంతటఁ బ్రజలెల్ల నగతక్లేశులై గర్వించియుండిరి. ఇదియంతయుఁ బరికించి బ్రహ్మవిష్ణురుద్రు లించుక యోచించి ప్రజలకర్మసమృద్ధికొఱకు వినాయకుని నియమించిరి. మఱియు నాతనికి గణాధిపతిత్వమును గూడ నొసంగిరి. ఆవినాయకునిచే విసృష్టములగు విఘ్నముల లక్షణముల నెఱింగింతు వినుము.

---

శ్రియం చాపి విందేత భరతోత్తమ. ౫౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పవర్ణనం నామ
ద్వావింశోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః— కేనాయం భీమజో విప్ర ప్రమథాధిపతిః కృతః, భర్తృత్వే చాపి విఘ్నానామధికారీ కథం బభౌ. ౧. సుమంతురువాచః— సాధు పృష్టోఽస్మి రాజేన్ద్ర) యదర్థం విఘ్నకారకః, యైర్వాపి విఘ్నకరణైః నియుక్తోఽపి వినాయకః, తత్తే వాచ్మి మహాబాహో శృణుష్వైకమనాధునా. ౨. ఆద్యే కృతయుగే వీర ప్రజాసర్గమవాప హ, దృష్ట్వా కర్మాణి సిద్ధాని వినా విఘ్నేన భారత. 3. అగతక్లేశాం ప్రజాం దృష్ట్వా గర్వితాం కృత్స్నశో నృప, బహుశశ్చింతయిత్వా తు ఇదం కర్మ మహీపతే. ౪. వినాయకః సమృద్ధ్యర్థం ప్రజానాం వినియోజితః, గణానాం చాధిపత్యే చ భీమః కంజజసాత్వతైః, తతోపసృష్టో యస్తస్య

స్వప్నమున నధికముగ నీట మునింగియుండును. ముండితమూర్ధుల నీక్షించును. కాషాయవస్త్రములను దాల్చినముండులనుగూడఁ జూచును. రాక్షసులపై నెక్కును కడజాతివారితోడను గాడిదలతోడను లొట్టియలతోడను గూడి యొకతావున వసించును. తాను వెడలుచున్నట్లును దన్నితరు లనుగమించుచున్నట్టులు దలఁచును. కారణములేకయే వికలచిత్తుఁడై నిరర్థకకార్యకారియయి మిక్కిలి వ్యథనొందును. తాను కరడినెక్కినయట్లును నీటిలో మునిఁగిపోవుచున్నట్లును యుద్ధభటులు చుట్టుముట్టినయట్లును మరణమువఱకుఁ బోవుచున్నట్లును స్వప్నాంతమున నిస్సంశయముగఁ బరికించును. ఆతనిచిత్తము వికృతాకారమై కరవీరముచే నలంకరింపఁబడి యుండును. ఇత్తెఱంగున నాతనిచే నెవనికిఁ గల్పింపఁబడునో వానికి వంశక్రమాగత మగు రాజ్యము లభింపదు. కన్య మగని బొందఁజాలదు. గర్భవతి యగువనిత యపత్యముఁ బడయఁజాలదు. శ్రోత్రియుఁ డాచార్యుఁడు గాఁజాలఁడు. శిష్యు లధ్యయనము చేయఁజాలరు. వైశ్యుఁడు వ్యాపారలాభమును బొందఁజాలఁడు. రయితులు వ్యవసాయము జేయఁజాలరు. ఇట్లు విఘ్నాక్రాంతుఁడగు నాతనికి నొక్క పుణ్యాహంబున దెల్లావాలచూర్ణమును నూత్నముగ గరగించిన నేతిలో గలిపి వడియకట్టి స్నానము చేయింపవలెను. మఱియు శుక్లపక్షచతుర్థి (చవితి) యందు గురువారమునఁ బుష్యమినక్షత్రమున సర్వౌషధముల చేతను వివిధపరిమళద్రవ్యములచేతను దలయంటిన యాతని కట్టెదుర

---

లక్షణాని నిబోధ మే.౫. స్వప్నేవగాహతేఽత్యర్థం జలం ముండాంశ్చ పశ్యతి, కాషాయవాససశ్చైవ క్రవ్యాదాంశ్చాధిరోహతి. ౬. అంత్యజైర్గర్దభైరుష్ట్రైః సహైత్రావతిష్ఠతే. వ్రజమానస్తథాత్మానం మన్యతేఽనుగతం పరైః. ౭. విమనా విఫలారంభః ససీదత్యనిమిత్తతః, కరటారూఢమాత్మానమంభసోంతరగం తథా. ౮. పత్తిభిశ్చావృతం యాంతం సంగమనాంతికం నృప, పశ్యతే కురుశార్దూల స్వప్నాంతే నాత్ర సంశయః. ౯. చిత్తం చ వికృతాకారం కరవీరభూషితమ్, తేనోపసృష్టో లభతే న రాజ్యం పూర్వసంభవమ్, ౧౦. కుమారీ న చ భర్తారమపత్యం గర్భిణీ తథా, ఆచార్యత్వం శ్రోత్రియశ్చ శిష్యాశ్చాధ్యయనం తథా, వణిగ్లాభం చ నాప్నోతి కృషిం చైవ కృషీవలః. ౧౧. స్నపనం తస్య కర్తవ్యం పుణ్యేఽహని మహీపతే, గౌరసర్షపకల్కేన సాజ్యేనోత్సాదితేన తు, ౧౨. శుక్లపక్షే చతుర్థ్యాం తు వాసరే ధిషణస్య చ. తిష్యే చ సిరనక్షత్రే తస్యైవ పురతో నృప. ౧౩. సర్వౌషధైః సర్వగంధైర్విలిప్తశిరసస్తథా, భద్రాసనోపవిష్టస్య

నొకభద్రాసనముంచి యాతని నందుఁ గూర్చుండఁబెట్టి మంగళకారణులగు బ్రాహ్మణులచే స్వస్తివాచనములు చేయించి మహేశ్వరునిఁ బార్వతిని భీమపుత్రునిని బూజించి యక్షేశని సూర్య సోమ భార్గవులను బృహస్పతి బుధులను భూపుత్రుని రాహుకేతులను గుమారస్వామిని నందకాయుధుఁ డగువిష్ణునిఁ బూజించి గుఱ్ఱపుసాలనుండియు, గజశాలనుండియు, వల్మీకమునుండియుఁ, జతుష్పథమునుండియు హ్రదమునుండియు, మృత్తిక గొనితెచ్చి శుభ్రపఱచి గంధములను గుగ్గిలమును మృత్తులను జలమున నునిచెడిని. ఆజలమ్మును హ్రదమునుండి యొకే వర్ణముగల కలశముల నాల్గింటిచేఁ గొనిరావలయును. ఎఱ్ఱనివృషభ చర్మమునందు భద్రాసనము స్థాపింపవలయును. వేయిరంధ్రములుగలిగి శతధారమగుపాత్రము పవిత్రమని ఋషులు నియమించియున్నారు. అట్టిదానిచే నిన్నభిషేకింపుచున్నాను. పవమానసూక్తముచేఁ బూతము లగుజలములు నిన్ను బవిత్రముజేయుఁగాక. జలాధిపుఁడగు వరుణదేవుఁడు నీకు జ్ఞానము నిచ్చుఁగాక. సూర్యుఁడును, బృహస్పతియు, నింద్రవాయువులును, సప్తమహర్షులును, వర్చః ప్రభృతుల నొసంగుదురుఁగాక. నీవెంట్రుకలయందును, సీమంతమునందును, శిరమునందును, ఫాలభాగమునను, కర్ణనేత్రములందును నేదౌర్భాగ్యముగల దద్దాని నప్పులు నశింపఁజేయుఁగాక. ఇట్లు స్నానమైనవెనుక ఆచనూనెను ఔదుంబరముతోఁ జేసిన స్రువముతో నెత్తి దర్భలను సవ్యకరమున గ్రహించి మూర్ధమున

స్వస్తి వాచ్య ద్విజాఞ్ఛుభాన్. ౧౪. వ్యోమకేశం తు సంపూజ్య పార్వతీం భీమజం తథా, కృష్ణం సపితరం తాత పవమానం సితం తథా. ౧౫. ధిషణం చేన్దుపుత్రం చ కోణం కేతుం చ భారత, విధుంతుదం బాహులేయం నందకస్య చ ధారిణమ్. ౧౬. అశ్వస్థానాద్గజస్థానాద్వల్మీకాత్సంగమాద్ధ్రదాత్, మృత్తికాం రోచనాం గంధాన్ గుగ్గులం చాప్సు నిక్షిపేత్. ౧౭. యదాహృతం హ్యేకవర్ణైశ్చతుర్భిః కలశైర్హ్రదాత్, చర్మణ్యానడుహే రక్తే స్థాప్యం భద్రాసనం తథా. ౧౮. సహస్రాక్షం శతధారమృషిభిః పావనం కృతమ్, తేన త్వామభిషించామి పావమాన్యః పునంతు తే. ౧౯. భగం తే వరుణో రాజా భగం సూర్యో బృహస్పతిః, భగమింద్రశ్చ వాయుశ్చ భగం సప్తర్షయో దదుః. ౨౦. యత్తే కేశేషు దౌర్భాగ్యం సీమంతే యచ్చ మూర్ధని, లలాటే కర్ణయోరక్ష్ణోరాపస్తద్ ఘ్నంతు తే సదా. ౨౧. స్నాతస్య సార్షపం తైలం స్రువేణౌ

హోమము జేయవలయును మితము, సమ్మితము, శాలకంటకము, కూశ్మాండము నను నుత్తమాగ్నులు స్వాహాదేవితోఁగూడ నగ్నినామములచేతను బలిచేతను నమస్కారసమన్వితములగు మంత్రములచేతను గుశాస్తీర్ణమగు నొక శూర్ప (చేట) మున నీయగ్నులనుంచి చతుష్పథమున నుంచవలయును. ముడిబియ్యమును (చేబియ్యమును) మాంసాన్నమును వండినచేపలనుపచ్చి చేపలను వండినమాంసమును వండనిమాంసమును చిత్రవర్ణము గలిగి పరిమళయుక్తములగుపుష్పములను గౌడీమాధ్వీపైష్టులను మూఁడు విధములగుసురలను గందమూలములను గడ్డినిఁ నపూపముల నుండ్రాళ్ల దండలను దధిపాయసములనన్నమును మోదకములు మొదలగుగుడమిశ్రపదార్థములను నొసంగి వినాయకునిజననియిత్రియగు నంబిక నుపస్థానము జేయవలయును. గఱికెతోడ నావాలతోడను బుష్పములతోడను మూఁడుపుష్పాంజలు లొసంగి "యో భగవతీ! నాకు సురూపమును యశమును భగమును బుత్రులను ధనమును మొదలగుసర్వకామముల నొసంగుము. సుస్థిరమగుబుద్ధిని నాకొసంగుము. భూలోకమున విశుద్ధమగుఖ్యాతిని నొసంగుము." అని యిట్లు సేవించి పిమ్మట శుక్లాంబరములు ధరించి తెల్లనిమాల్యములు వైచుకొని చందనాద్యనులేపనము లొనరించి బ్రాహ్మణులకు భోజనముఁ బెట్టవలయును గురువునకు వస్త్రయుగ్మము నొసంగవలయును. ఈవిధమున వినాయకుని గ్రహములను

---

దుంబరేణ తు, జుహుయాన్మూర్ధని కుశాన్నవ్యేన పరిగృహ్య తు. ౨౨. మితశ్చ సంమితశ్చైవ తథా చ శాలకంటకః, కూష్మాణ్డో రాజపుత్రశ్చ స్తేఽగ్నయః స్వాహాసమన్వితాః. ౨౩. నామభిర్బలిమంత్రైశ్చ నమస్కారసమన్వితైః, దద్యాచ్చతుష్పథే శూర్పే కుశాస్తీర్య సర్వతః. ౨౪. కృతాకృతాంస్తండులాంశ్చ పలలౌదనమేవ చ, మత్స్యాన్పక్వాంస్తథైవామాన్మాంసమేతావదేవ తు. ౨౫. పుష్పం చిత్రం సగంధం చ సురాం చ త్రివిధామపి, మూలకం పూరికాః పూపాం స్తథైవోండేరికాస్రజమ్, దధిపాయసమన్నం చ గుడపిష్టాన్నమోదకాన్. ౨౬. వినాయకస్య జననీముపతిష్ఠేత్తతోఽంబికామ్, దూర్వాసర్షపపుష్పాణాం దత్త్వా పుష్పాంజలిత్రయమ్. ౨౭. రూపం దేహి యశో దేహి భగం భగవతి దేహి మే, పుత్రాన్దేహి ధనం దేహి సర్వాన్కామాంశ్చ దేహి మే, అచలాం బుద్ధిం మే దేహి ధరాయాం ఖ్యాతిమేవ చ. ౨౮. తతః శుక్లాంబరధరః శుక్లమాల్యానులేపనః, భోజయేద్బ్రాహ్మణాన్దద్యాద్వస్త్రయుగ్మం గురోరపి. ౨౯. ఏవం

విధ్యుక్తముగఁ బూజించి కర్మఫలమును గాంచఁగలఁడు. అత్యుత్తమైశ్వర్యమును బొందఁగలఁడు. సర్వకాలములందు నాదిత్యపూజనమును స్వామియగు వినాయకరాజువ్రతమును సలిపి సర్వసిద్ధులు బొందఁగలరు.

ఇది త్రయోవింశాధ్యాయము.

## చతుర్వింశాధ్యాయము.

శతానీకుఁ డిట్లనియె. ఓమహామతీ! మున్ను కుమారుఁడు స్త్రీపురుషలక్షణములు వచించుటయు నీశ్వరుఁడు కోపముచే లక్షణములను మహోదధిలో విడుచుటయు మఱల నాలక్షణములు కృష్ణానుగ్రహమున సముద్రుఁ డర్పించుటయును నీవలన వినియుంటిని. ఆలక్షణములను బాహులేయుఁ డేపగిదిని బొందఁగలిగెనో! వినవలతు నెఱిఁగింపు మన సుమంతుఁ డిట్లనియె. రాజేంద్రా! గుహుఁడు వచించిన స్త్రీపుంసలక్షణముల నెఱింగింతు నాకర్ణింపుము. మున్ను గుహుఁడు శక్తిచేఁ గ్రౌంచనగమును భేదింప ముదమంది బ్రహ్మదేవుఁడు "ఓయనఘా! నీసామర్థ్యమునకు మెచ్చితిని నీకిష్టమగువర మడుగు మనెను. అంత నమ్మహాతేజస్వి

---

వినాయకం పూజ్య గ్రహాంశ్చైవ విధానతః, కర్మణాం ఫలమాప్నోతి శ్రియం ప్రాప్నోత్యనుత్తమామ్. ౩౦. ఆదిత్యస్య సదా పూజాం తిలకం స్వామినస్తథా, వినాయకపతేశ్చైవ సర్వసిద్ధి మవాప్నుయాత్. ౩౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పవర్ణనం నామ
త్రయోవింశోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—నరాణాం యోషితాం చైవ లక్షణాని మహామతే, ప్రోక్తాని యాని విప్రేంద్ర వ్యోమకేశస్య సూనునా. ౧. క్రుద్ధేన యాని క్షిప్తాని ఈశ్వరేణ మహోదధౌ, కృష్ణస్య వచనాద్భూయః సముద్రేణార్పితాని వై. ౨. అర్పితాని తతస్తస్య తేన ప్రాప్తాని వై కథమ్, బాహులేయేన విప్రేంద్ర తాని మే వద సువ్రత. ౩. సుమంతురువాచ:—యథా గుహేన రాజేంద్ర స్త్రీపుంసాం లక్షణాని వై, ప్రోక్తాని కురుశార్దూల తథా తే కథయామి వై. ౪. శక్తిపాతాద్గతే క్రౌంచే వ్యోమకేశస్య సూనునా, బ్రహ్మా తుష్టోఽబ్రవీదేనం వరం వరయ మేఽనఘ. ౫. అసావపి మహాతేజాః

విభుఁడగు పితామహునకు నమస్కరించి యోమహాత్మా! పురుషులకును స్త్రీలకును లక్షణము దెలుపుము. మున్ను నేఁజేసినలక్షణమును నాతండ్రి కోపముచే సముద్రమునఁ బాఱవైచెను. అది కృష్ణప్రసాదమున మఱల లభించినది. అయిన నిశ్శేషముగ విస్మృతమయ్యె”నన విని బ్రహ్మదేవుఁడాతని కిట్లనియె. భీమనాముఁడగు మహాదేవున కానందమును బెంపొందించు నోదేవేశా! నీవు లెస్సగ నడిగితివి. సముద్రునిచేఁ బొందఁబడిన యుత్తమమధ్యమాధమములగు పురుషలక్షణములనెల్ల నిశ్శేషముగ నెఱింగింతు వినుము. బుద్ధిమంతుఁడు శుభగ్రహములతోడను శుభనక్షత్రముతోడను గూడి సూర్యుఁడు శుభప్రదుఁడై యుండులగ్నముగల శుభదినమున మంగళలక్షణోపేతమగు పూర్వాహ్ణంబునఁ బురుషులప్రమాణమును స్నేహమును నీడను గమనమును సర్వావయవలక్షణములను దంతకేశనఖశ్మశ్రువులను గురుతులను పరీక్షింపవలయును. తొలుత నాయుః పరీక్షణము జేసి పిదప లక్షణములఁ దెలుపవలయును. ఆయువు క్షీణించి యున్నచో మనుష్యులకు లక్షణములతో నేమి యుపయోగ ముండును? పురుషప్రమాణముతొంబదియంగుళములున్నచోజఘన్యమ(అధమము)నఁబడును. నూఱంగుళములున్నచో మధ్యమమును నూటెనిమిదియంగుళములున్నచో నుత్తమము నని శుభాశుభసూచకమగు ప్రమాణలక్షణమును మున్ను సముద్రుఁ డొసంగినదానిని నీకెఱింగించితి. ఇఁకమీఁద శరీరావ

---

ప్రణమ్య శిరసా విభుమ్, పితామహం బభాషేదం లక్షణం బ్రూహి మే విభో. ౬. నరాణాం యువతీనాం చ కౌతుకం పరమం మమ, యన్మయోక్తం పురా దేవ ప్రక్షిప్తం లవణార్ణవే. ౭. మత్పిత్రా దేవదేవేశ సక్రోధేన పురా తథా, ప్రాప్తం చ విస్మృతం భూయ స్తన్మే బ్రూహి హ్యశేషతః. ౮. బ్రహ్మోవాచ:—సాధు పృష్టోఽస్మి దేవేశ భీమస్యానందవర్ధన, లక్షణాని నిబోధ త్వం పురుషాణామశేషతః, అథ మోత్తమమధ్యాని యాని ప్రాప పయోనిధిః. ౯. శివే హని సునక్షత్రే గ్రహే సౌమ్యే శుభే రవౌ, పూర్వాహ్ణే మంగలైర్యుక్తే పరీక్షేత విచక్షణః. ౧౦. ప్రమాణం సంహతిం ఛాయాం గతిం సర్వాంగలక్షణమ్, దన్తకేశనఖశ్మశ్రు ఏతత్సర్వం విచక్షణః. ౧౧. పూర్వమాయుః పరీక్షేత పశ్చాల్లక్షణమాదిశేత్, క్షీణే హ్యాయుషి మర్త్యానాం లక్షణైః కిం ప్రయోజనమ్. ౧౨. జఘన్యో నవతిః ప్రోక్తో మధ్యమస్తు శతాంగులః, అష్టోత్తరశతం యస్య ఉత్తమం తస్య లక్షణమ్. ౧౩. ప్రమాణలక్షణం ప్రోక్తం సముద్రేణ శుభాశుభమ్,

యవముల లక్షణములు వచించెదను వినుము. పురుషునకుఁ బాదములు మాంసపుకండలుగలిగి నునుపై యెరుపువర్ణముగలిగి సౌమ్యాకారములై మిక్కిలి యందములై యున్నతములై చెమ్మగిలనివై నాడులు కనుపింపక యున్నచో నాతఁడు రాజగును. ఎవనియరికాల నంకుశమునంటి రేఖ యుండునో యాతఁడు సర్వకాలములను సుఖములనే యనుభవించు చుండును. చెమ్మలేక మెత్తనివై పద్మమధ్యమున కెనయై పరస్పరశ్లిష్టము లగువ్రేళ్లుగలిగి యెఱ్ఱనిగోళ్లుగలిగి సుందరములగు పార్శ్వములుగలిగి యుష్ణములై నాడులులేనివై చీలమండ లవ్యక్తములై యుండి తాఁబేటి మూపువలె నున్నతములై యుండుపాదములు పార్థివునకు విఖ్యాతము లయినవి. చేటయాకారముగలిగి కఠినములై తెల్లనిగోళ్లుగలిగి వంకరలు గలిగి నాడులచే నావరింపఁబడి నీరసములై సూక్ష్మములగు నంగుళులు గలిగి యుండుచరణములు దారిద్ర్యమును దుఃఖమునుగూర్చు నోయీ! భీమనందన! మఱియు నో దేవోత్తమా! కాలినమట్టితో సమానములగు చరణములు బ్రహ్మఘాతుకములు. పచ్చనివర్ణము గలపాదము లున్న పురుషుఁ డగమ్యాగమననిరతుఁడగును. నల్లగనుండిన సురాపానరతుం డగును. తెల్లగనుండిన యభక్ష్యముల భక్షించుచుండును. మఱియు నో సేనాపతివతంస! బొట్టనవ్రేళ్లు విశాలముగ నున్నచో భాగ్యహీనుఁ డగును. అయ్యవి వికృతాకారము లయియున్నచోఁ గాలినడకలుగలిగి

---

యస్మై పురా దేవవర మయా వై కథితం తవ, అతః పరం ప్రవక్ష్యామి దేహావయవ లక్షణమ్. ౧౪. పాదైః సమాంసకైః స్నిగ్ధై ర్రక్తైః సౌమ్యైః సుశోభనైః, ఉన్నతైః స్వేదరహితైః శిరాహీనైశ్చ పార్థివః. ౧౫. యస్య పాదతలే రేఖాసాంకుశేవ ప్రకాశతే, సతతం హి సుఖం తస్య పురుషస్య న సంశయః. ౧౬. అస్వేదనౌ మృదుతలౌ కమలోదర సన్నిభౌ, శ్లిష్టాంగులీ తామ్రనఖౌ సుపార్ష్ణీ వ్యోమకేశజ. ౧౭. ఉష్ణౌ శిరావిరహితౌ గూఢగుల్ఫౌ చ భీమజ,కూర్మోన్నతౌ చ చరణౌ ప్రఖ్యాతౌ పార్థివస్య తు.౧౮.శూర్పాకృతీ మహాబాహో రూక్షౌ శ్వేతనఖౌ తథా,వక్రౌ శిరాసన్తతౌ చ సంశుష్కా విరలాంగులీ. ౧౯. దారిద్ర్యదుఃఖదౌ జ్ఞేయౌ చరణౌ భీమనందన, బ్రహ్మఘ్నౌ దేవశార్దూల పక్వమృత్సదృశౌ పదౌ. ౨౦. పీతావగమ్యానిరతౌ కృష్ణౌ పానరతౌ సదా, అభక్ష్య భక్షణే శ్వేతౌ జ్ఞేయౌ సేనాధిపోత్తమ. ౨౧. అంగుష్ఠౌ పృథులౌ యేషాం తే నరా భాగ్యవర్జితాః, క్లిశ్యన్తే వికృతాంగుష్ఠాస్తే నరాః పాదగామినః. ౨౨. చిపిటైర్వికృతైర్భ

కష్టపడుదురు. చట్టివలె నడచుకొనియుండి వికృతరూపములై భగ్నము లగునంగుష్ఠము లున్నచో వారు మిగుల నిందితులై యుండుదురు. అటు లనే వంకరలై భగ్నములై కురుచలగు నంగుష్ఠములున్నఁ గ్లేశము లను భవింతురు. శూర్పాకృతులై నిమ్నోన్నతములై వికృతములై వక్రము లయి నాడీవ్యాప్తములై చెమ్మగిలుస్వభావముగలిగి తెల్లగను కరకుగ నుండినచరణములున్నను నిందితులగుదురు. ఎవనిపాదమున రెండవవ్రేలు దీర్ఘమై యంగుష్ఠము నతిక్రమించియుండునో యాపురుషుఁ డనారతము స్త్రీసంభోగము నొందును. ఇందు సందియము లేదు. చిటికనవ్రేలు పొడవై యుండెనేని సువర్ణము గలవాఁడగును. ఎవనివ్రేళ్లు చట్టులై సూక్ష్మములై శుష్కములై యుండునో వాఁడు నిత్యదుఃఖితుఁడై నిర్ధనుఁడునై యుండును. మఱియు నోగుహా! తెల్లనిగోళ్లున్నను కఠినములగు గోళ్లున్నను బురుషులు దుఃఖజీవనముగలిగియుందురు. చెడినగోళ్లుగలిగిన వారు కుత్సితస్వభావము గలిగి కామభోగములు లేకయుండుదురు. వికృతాకారములును బ్రద్దలైనవియు రూక్షములు నగునఖములుగలిగి దారిద్ర్య మనుభవింతురు. పచ్చనిగోళ్లు గలపురుషులు బ్రహ్మహత్య గావింత్రు. మఱియు నట్టివారు బంధువియోగముగలిగి కులక్షయము గావింతురు. వజ్రతుల్యములగు నఖములుండిన నృపతులగుదురు. శంఖము వలెగాని సుడులవలెగాని గోళ్లుండినఁ బార్థివుఁడగును. ఎఱ్ఱనిగోళ్లుండిన నతులైశ్వర్యమునొందును. పద్మసచ్ఛాయము లగునఖములచే మానవులు

---

వైగ్న్యరంగుష్ఠైరతినిన్దితాః, వక్రైర్భగ్నైస్తథా హ్రస్వైరంగుష్ఠైః క్లేశభాగినః. ౨౩. శూర్పాకారైశ్చ వికృతైర్భగ్నైర్వక్రైః శిరాతతైః, సస్వేదైః పాణ్డురూక్షైశ్చ చరణై రతినిన్దితాః. ౨౪. యస్య ప్రదేశినీ దీర్ఘా యా అంగుష్ఠం అతిక్రమేత్, స్త్రీభోగం లభతే నిత్యం పురుషో నాత్ర సంశయః,కనిష్ఠాయాం తు దీర్ఘాయాం సువర్ణస్య తు భాగినః.౨౫. చిపిటా విరలాః శుష్కా యస్యాంగుల్యో భవన్తి వై, సభవేద్దుఃఖితో నిత్యం ధనహీనశ్చ వై గుహ. ౨౬. శ్వేతైర్నఖై ర్విరూక్షైశ్చ పురుషా దుఃఖజీవినః, కుశీలాః కునఖై ర్జ్ఞేయాః కామభోగవివర్జితాః, వికృతైః స్ఫుటితైరూక్షైర్నఖైర్దారిద్ర్యభాగినః.౨౭. బ్రహ్మహత్యాం చ కుర్వన్తి పురుషా హారితైర్నఖైః, బంధుభిశ్చ వియుజ్యన్తే కులక్షయకరాశ్చ తే. ౨౮. ఇంద్రగోపకసంకాశైర్నఖైర్నృపతయః స్మృతాః, శంఖావర్తప్రతీకాశైర్నఖైర్భవతి పార్థివః. ౨౯. తామ్రైర్నఖైస్తథైశ్వర్యం ధన్యాః పద్మనఖా నరాః, రక్తైర్నఖైస్తథైశ్వర్యం

ధన్యాత్ములగుదురు. (ధనవంతులు) ఇట్టులే రక్తవర్ణము గలిగియున్నను సంపదలఁగాంతురు. పుష్పసమములై యున్న సుభగుఁడగును. ఇంచుక బలిష్ఠములై తామ్రవర్ణము లగునఖములచే నృపతు లగుదురు. పిక్కలు మెండగురోమములు గలిగియున్నచోఁ బురుషులు దుఃఖదారిద్ర్యములు గాంతురు. కురుచలగు పిక్కలుగలిగిన బంధనము నొందుదురు. ఐశ్వర్యవంతులు నగుదురు. మృగములఁబోలు జంఘలుండిన నిస్సంశయముగ రాజులగుదురు. పొడవగు పిక్కలుగలిగియున్నను లావుబారినపిక్కలుండినను సర్వకాలముల దౌర్భాగ్యదామోదరు లగుదురు. ఇట్టులే నక్కలఁబోలు పిక్కలుండినను భాగ్యములేనివారగుదురు. మఱియు వాయసజంఘులు దుఃఖభాజనము లగుదురు. కండగలిగిన పిక్కలున్నచో నిస్సంశయముగ నైశ్వర్యవంతులగుదురు. సింహసమజంఘులును వ్యాఘ్రసమజంఘులును ధనవంతులని చెప్పఁబడిరి. రోమకూపముల నొక్కొకదానియం దొక్కొకరోమముండిన వాఁడు పార్థివుఁడే యగును. ఓబుద్ధిమద్వరా! ఆరోమములు రెండురెండుగఁగూడి యొక్కొకకూపమున నుండినఁ బండితుఁడు శ్రోత్రియుఁడునగును. అట్టులే మూఁడేసిచేరియుండిన మానవులు నిర్ధనులై దుఃఖాక్కులగుదురు. ఇట్టులే తలవెండ్రుకలు గూడఁ బూజ్యములు నింద్యములు నగును. మోకాటమాంసము లేకుండెనేని యాతఁ డో శివకుమారా! ప్రవాసమున నపగతప్రాణుఁ డగును. స్వల్పమాంసముగలిగిన సౌభాగ్యమునొందును. వికటముగనుండిన దారి

పుష్పితైః సుభగో భవేత్, సూక్ష్మైరుపచితైస్తామ్రైర్నఖైర్నృపతయః స్మృతాః. ౩౦. రోమశాభ్యాం చ జంఘాభ్యాం దుఃఖదారిద్ర్యభాగినః, బంధనం హ్రస్వజంఘానామైశ్వర్యం చైవ నిర్దిశేత్. ౩౧. మృగజంఘాశ్చ రాజానో జాయన్తే నాత్ర సంశయః, దీర్ఘజంఘాః స్థూలజంఘా నిత్యం భాగ్యవివర్జితాః. ౩౨. శృగాలజంఘాః పురుషానిత్యం భాగ్యవివర్జితాః, కాకజంఘానరా యే తు భవేయుర్దుఃఖభాగినః. ౩౩. పీనజంఘా స్తదైశ్వర్యం ప్రాప్నువన్తి నసంశయః, సింహవ్యాఘ్రసమా జంఘా ధనినః పరికీర్తితాః. ౩౪. పార్థివానాం భవేద్రోమ చైకైకం రోమకూపకే, పండితశ్రోత్రియాణాం చ ద్వేద్వే జ్ఞేయే మహామతే. ౩౫. త్రిభిస్త్రిభిస్తథా నిఃస్వా మానవా దుఃఖభాగినః, కేశాశ్చైవ మహాబాహో నిన్దితా పూజితాస్తథా. ౩౬. నిర్మాంసజానుర్మ్రియతే ప్రవాసే శివనందన. ౩౭. సౌభాగ్యమల్పైః కథితం దారిద్ర్యం వికటైస్తథా, నిమ్నైః స్వస్త్రీజితా జ్ఞేయాః సమాం

ద్రవ్యమునొందును. పల్లముగనున్న జానువులుగలిగినచో స్వస్త్రీజితులగుదురు. అవియే మాంసభూయిష్ఠము లైయున్నచో రాజ్యభాక్కులగుదురు. హంసవలెగాని భాసమువలెగాని శుకమువలెగాని గతిగలిగియుండిన యాతఁడు సర్వలోకపూజ్యుఁడై పార్థివుఁడగునని సముద్రుఁడు వచించెను. తక్కుంగల విఖ్యాతములగుపక్షుల కైనయగుగతి శుభప్రదయగును. వృషగమనమును సింహగమనమును గజేంద్రగమనమును భోగవర్ధనమగును. నీటిపై యలలమాదిరిగగాని కాకోలూకములవలెగాని గతియుండిన ద్రవ్యవిహీనులై దుఃఖశోకభయములఁ బొందుదురు. ఇట్లే కుక్కవలె నొంటెపగిది నెనుబోతుపగిదిని గాడిదమాఁడ్కి పందివడువునను మేఁకవలెను గమనముండిన భాగ్యహీనులగుదురు.

ఇది చతుర్వింశాధ్యాయము.

---

## పంచవింశాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె. దక్షిణావర్తమగులింగము గలిగిననరుఁడు పుత్రసంతతివడయును. వామావర్తలింగియగునేని పుత్రికల గాంచును. స్థూలలింగియును శిరాల (నాడీవ్యాప్తము) లింగియును విషమలింగియును దారిద్ర్యమునొందును. ఋజువులై గుండ్రనియాకారములు గలిగియుండెనేని పుత్రవంతులగుదురు. నిమ్నదేశమునఁ గూర్చుండునపుడు లింగము

---

నైః రాజ్యభాగినః. ౩౮. హంసభాసశుకానాం చ తుల్యా యస్య గతిర్భవేత్, స భవేత్పార్థివః పూజ్యః సముద్రవచనం యథా. ౩౯. అన్యేషామపి శస్తానాం పక్షిణాం చ శుభా గతిః, వృషసింహగజేంద్రాణాం గతిర్భోగవివర్ధినీ. ౪౦. జలోర్మిసదృశీ యా చ కాకోలూకసమా చ యా, గతిర్ద్రవ్యవిహీనానాం దుఃఖశోకభయంకరా. ౪౧. శ్వానోష్ట్రమహిషాణాంచ ఖరసూకరయోస్తథా, గతిస్మేషసమాయేషాం తే నరా భాగ్యవర్జితాః. ౪౨

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే పురుషలక్షణవర్ణనం నామ చతుర్వింశోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—దక్షిణావర్తలింగశ్చ నరో వై పుత్రమాన్భవేత్, వామావర్తే తథా లింగే నరః కన్యాం ప్రసూయతే. ౧. స్థూలైః శిరాలైర్విషమైర్లింగైర్దారిద్ర్యమాదిశేత్, ఋజుభిర్వర్తులాకారైః పురుషాః పుత్రభాగినః. ౨. నిమ్నపాదోపవిష్టస్య భూమిం స్పృశతి

భూమికిఁ దగులుచుండెనేని యాతండు దుఃఖితుఁడని యెఱుంగుము. అట్లు భూమిపైఁ బాదములు మోపి కూర్చొనియుండ లింగము చీల మండలనంటునేని యాతఁ డీశ్వరుఁ (ప్రభువు)డనియుఁ బ్రమదాజనమనో వల్లభుఁడనియు నెఱుంగుము. సింహవ్యాఘ్రములఁబోలు లింగముండిన యాతనిన శేషభోగములఁదేలు భోగినిగా నెఱుంగుము. మఱియు నెవని మేహనమున మణి కాంతిగల్గు రేఖ యుండునో యాతఁడు పార్థివుఁడగు నని సముద్రుఁడు వచించెను. బంగారు, వెండి, ముత్తియములు, రత్న ములు ననువాని కెనయగు వర్ణముగలవియుఁ జిగురాకుఁబోలినవియు నగు మణినామము లగులింగములుగలవారు పార్థివులగుదురు. మఱియుఁ దెల్లనివియు మలినములు పరుషములు దీర్ఘములు వ్యస్తములు నగులింగ మూలములుండెనేని దేశద్రిమ్మరులగుదురు. సమములైగాని యున్నత ములైగాని యుండి మిక్కిలి నునుపుగలమణులు (లింగములు) గలిగి యుండెనేని వారు గృహమేధులై ధనపాలురై స్త్రీభోక్తలగుదురు గద! మధ్యపల్లములగు మణులుండెనేని వారు యువతులకుఁ దండ్రులగుదురు. మఱియు నో మహాబాహూ! వారు నిర్ధనులు నగుదురు. అనుల్బణములై యున్నచో ధనవంతులగుచున్నారు. మఱియు నో వీరాగ్రణీ! మూత్ర ధార యొక్కటియై దక్షిణపార్శ్వమునకుఁ దిరుగుచుఁ బడెనేని యాతఁడు పుడమిరేఁడగునని సముద్రుఁడు చెప్పెను. అట్టులే స్నిగ్ధములగు రెండు

---

మేహనః, దుఃఖితం తం విజానీయాత్పురుషం నాత్ర సంశయం. 3. భూమా పాదోప విష్టస్య గుల్ఫౌ స్పృశతి మేహనః, ఈశ్వరం తం విజానీయాత్ప్రమదానాం చ వల్ల భమ్. ४. సింహవ్యాఘ్రసమో యస్య హ్రస్వో భవతి మేహనః, భోగవాన్స తు విజ్ఞే యోఽశేషభోగసమన్వితః. ౫. రేఖాకృతిర్మణిర్యస్య మేహనే హి విరాజతే, పార్థివః స తు విజ్ఞేయః సముద్రవచనం యథా. ౬. సువర్ణరజతప్రఖ్యైర్మణిముక్తాసమప్రభైః, ప్రవాలసదృశైః స్నిగ్ధైర్మణిభిః పార్థివో భవేత్. ౭. పాండురైర్మలినై రూక్షైర్దీర్ఘవ్యా సైర్ద్విశో ప్రజేత్, సమైస్తథోన్నతైశ్చాపిసుస్నిగ్ధైర్మణిభిర్గృహీ. ౮. ధనరక్షాస్తథా స్త్రీణాం భోక్తారస్తే భవంతిహి, మణిభిర్మధ్యనిమ్నైస్తు పితరస్తే భవంతి హి. ౯. యువతీనాం మహా బాహో నిఃస్వాశ్చాపి భవంతి తే, నోల్బణైశ్చాపి ధనినో నరా వీర భవంతి హి. ౧౦. మూత్రధారా పతేదేకా వలితా దక్షిణా యది, స భవేత్పార్థివః పృథ్వ్యాః సముద్ర

ధారలు పడెనేని యాతఁడు ధనికుఁడు భోగియు నగును. పెక్కుధారలు రూక్షములై రొద జేయుచుఁ బడెనేని యధముఁడగును. మీనగంధియగు రేతస్సుగలవాఁడు ధనవంతుఁడగును. పుత్రవంతుఁడును గాఁగలఁడు. హవిర్గంధి యగుచో ధనాఢ్యుఁడై శ్రోత్రియుఁడగును. మూషకగంధము గలిగియుండెనేని పుత్రవంతుఁడును, పద్మగంధము గలిగియుండెనేని నృపతియు నగుదురు. లక్కవాసన గలిగియున్నచో నాతనికిఁ బెక్కురుకన్నియ లుదయింతురు. మద్యగంధి యగునేని యుద్ధనిపుణుఁడగును. ఉప్పువాసనగలిగియున్నను క్షారగంధి యైయున్నను దరిద్రుఁడగును. శీఘ్రమైథునముగల వాఁడు దీర్ఘాయువగును. అటుకాకున్న నల్పాయువు. ఇందేమియు శంకింపంబనిలేదు. స్వల్పమగుశుక్రముగలవాఁడు స్త్రీజనకుఁడగును. మాంసగంధియగుశుక్లముగలవాఁడు భోగియగును. పద్మవర్ణమగురక్తము గలిగియుండెనేని నరుండు ధనాఢ్యుండగును. కించిద్రక్తనీలమగుశోణితము గలిగియుండెనేని వాఁడెల్లపుడు దుఃఖభాజనమై యధముఁడగునని యెఱుంగుము. శోణితము ప్రవాళసదృశమై సుస్నిగ్ధమై యుండునేని యాతఁడు సప్తద్వీపాధిపతియగును. పురుషులకు మాంసలము స్నిగ్ధము విస్తీర్ణమునగు పొత్తికడుపు (బస్తి) ప్రశస్తమయినది. నిర్మాంసము వికటము రూక్షము నగుబస్తి గల్గియుండుట యశుభము ఎవనిపొత్తికడుపు నక్క కుక్క యొంటె దున్నలవలె నుండునో వాఁడు దుఃఖితుఁడని యెఱుంగును. ఒక్కవృషణము

---

వచనం యథా. ౧౧. ద్వే ధారే చ తథా స్నిగ్ధే ధనవాన్భోగవాన్ స్మృతః, బహుధారాస్తథా రూక్షాః సశబ్దాః పురుషాధమాః. ౧౨. మీనగంధి భవేద్రేతో ధనవాన్పుత్రవాన్భవేత్, హవిర్గంధి భవేద్యస్య ధనాఢ్యః శ్రోత్రియః స్మృతః. ౧౩. మూషగంధిర్భవేత్పుత్రీ పద్మగంధిర్నృపః స్మృతః, లాక్షాగంధిర్భవేద్యశ్చ బహుకన్యః ప్రజాయతే, మద్యగంధిర్భవేద్యోద్ధా క్షారగంధిర్దరిద్రకః. ౧౪. శీఘ్రమైథునగామీ యః స దీర్ఘాయురతోఽన్యథా, అల్పాయుర్దేవశార్దూల విజ్ఞేయో నాత్ర సంశయః. ౧౫. తనుశుక్రః స్త్రీజనకో మాంసగంధీ చ భోగవాన్, పద్మవర్ణం భవేద్రక్తం స నరో ధనవాన్భవేత్. ౧౬. కించిద్రక్తం తథా కృష్ణం భవేద్యస్య తు శోణితమ్, అధమః స తు విజ్ఞేయః సదా దుఃఖైకభాజనమ్. ౧౭. ప్రవాలసదృశం స్నిగ్ధం భవేద్యస్య చ శోణితమ్, రాజానం తం విజానీయాత్సప్తద్వీపాధిపం గుహ. ౧౮. విస్తీర్ణా మాంసలా స్నిగ్ధా బస్తిః పుంసాం ప్రశస్యతే, నిర్మాంసా వికటా రూక్షా బస్తిర్యేషాం న తే శుభాః. ౧౯. గోమాయుసదృశీ యస్య

గలవాఁడు నీటఁజచ్చును. విషమవృషణుఁడు స్త్రీలోలుఁడగును. సమము లగుచో రాజన్యుఁడగును. మఱియు నరుఁ డూర్ధ్వవృషణుఁడయిన నల్పాయువును లంబవృషణుఁడు శతవర్ష జీవియు నగును. ఎఱ్ఱనివృషణముల చే ధనవంతులగుదురు. కటిదేశములు స్థూలములయియున్నచో క్షేమము నొందును. మాంసలము లైనచో ద్రవ్యయుక్తుఁడగును. వ్యాఘ్రము వంటికటిమండలమున్నచో రాజగును. మండూకస్ఫిక్కు-యిన(కటియయిన) నరాధిపుఁ డగుచు రెండుమండలముల నేలును. సింహస్ఫిక్కు-గునేని సార్వభౌమపదము నొందును. మఱియు నోధీమంతుఁడా! భీమనందనా! ఉష్ట్ర వానరములవంటి పిరుదులుగలిగెనేని యాతఁడు ధనధాన్యవిహీనుఁ డగును. మృగోదరుఁడయి యుంటయు మయూరోదరుఁ డయియుండు టయుఁ బురుషునకుఁ బ్రశంసనీయము వ్యాఘ్రోదరుఁ డయియుండెనేని నరనాథుఁడగును. సింహోదరుఁడై యుండుచో రాజగును. మఱియు నెవ్వనియుదరము మండూకోదరతుల్యమైయుండునో యాతఁడును బృథ్వి యందుఁ బార్థివుఁడన నెగడునని సముద్రవచనము గలదు. మాంసలములై ఋజువులయి వర్తులములగుపార్శ్వములుగలవాఁడు నృపతి యగును. వ్యాఘ్రపృష్ఠముగలపురుషుఁ డీశ్వరుఁడును సేనాధిపతియు నగును. సింహపృష్ఠముగలిగియుండెనేని యాతఁడు బంధితుఁడగును. కూర్మపృష్ఠులు రాజు

---

శ్వానోష్ట్రమహిషస్య చ, స భవేద్దుఃఖితో నిత్యం పురుషో నాత్ర సంశయః. ౨౦. యస్యైకవృషణస్తాత జలే ప్రాణాన్విముంచతి, స్త్రీచఞ్చలస్తు విషమైః సమై రాజ్యం ప్రచక్షతే. ౨౧. ఊర్ధ్వైరల్పాయుషశ్చాపి హ్రస్వాయుః శతంజీవీ ప్రలంబధృక్, మానవాశ్చాపి రక్తైస్తుధనవంతో భవంతి వై. ౨౨. స్థూలస్ఫిగ్భవతి క్షేమీ ద్రవ్యయుక్తః సమాంస ధృక్, వ్యాఘ్రస్ఫిఙ్మండలో రాజా మండూకస్ఫిఙ్నరాధిపః, ద్విమండలో మహాబాహో సింహస్ఫిక్సార్వభౌమతా. ౨౩. ఉష్ట్రవానరయోర్యస్తు ధారయేత్స్ఫిజ్ఞ్మహామతే, ధనధాన్యవిహీనోఽసౌ విజ్ఞేయో భీమనందన. ౨౪. పుమాన్మృగోదరో ధన్యో మయూరోదర ఏవ చ, వ్యాఘ్రోదరో నరపతీ రాజా సింహోదరో భవేత్. ౨౫. మండూకసదృశం యస్య పురుషస్యోదరం భవేత్, స భవేత్పార్థివః పృథ్వ్యాం సముద్రవచనం యథా. ౨౬. మాంసలై ర్ఋజుభిర్వృత్తైః పార్శ్వైర్నృపతయః స్మృతాః, ఈశ్వరో వ్యాఘ్రపృష్ఠస్తు సేనాయాశ్చైవ నాయకః. ౨౭. సింహపృష్ఠో నరో యస్తు బంధనం తస్య నిర్దిశేత్, కూర్మపృష్ఠాస్తు రాజానో ధనసౌభాగ్యభాగినః. ౨౮. విస్తీర్ణం

లుగను ధనసౌభాగ్యవంతులుగ నుందురు. మాంసలమై రోమములచే వ్యాప్తమై విశాలమగువక్షస్స్థలముగలవారు నూరేండ్లు జీవించి మహా ధనవంతులై భోగవంతులునై యుందురని యెఱుంగుము. ఎవనికరంబున నంగుళులు పలుచనై యెండినవియునై పరుషములై యుండునో యాతఁడు దరిద్రుఁడై యెప్పుడును దుఃఖించుచుండును. ఎవనికరంబున మీనసమమగురేఖయుండునో యాతనికిఁ గర్మసిద్ధి యగును. మఱియు నాతఁడు ధనవంతుఁడును బహుపుత్త్రకుండు నగును. ఎవనికరమధ్యదేశమునఁ దుల (త్రాసు) గాని వేది (అరుగు) గాని యగపడునో యాపురుషునకు వాణిజ్యలాభము గలుగును. ఏద్విజునకుఁ బాణితలములు (అరచేతులు) సౌమ్యము లయియుండునో యాతఁడు విశేషముగ యజ్ఞములుజేయుచు బహుధనవంతుఁ డయియుండును మఱియు నెవనికరమధ్యమున శైలముగాని వృక్షముగాని యగపడునో యాతఁడు శాశ్వతైశ్వర్యయుక్తుఁడై బహుభృత్యులతోఁ గూడియుండును మఱియు నెవ్వనిహస్తమున శక్తితోమరబాణాసిసమములగురేఖలుండునో యాతఁడును ధనురాకారరేఖగలవాఁడును యుద్ధమున శత్రుల జయించును. ధ్వజముగాని శంఖముగాని యెవనికరంబునడుమ గన్పడునో యాతఁడు రాజయి శత్రుసైన్యములఁ జించి చెండాడునని యెఱుఁగుము. మఱియు నెవ్వానిదక్షిణకరంబున బొట్టనవ్రేల యవాకారమగు రేఖయుండునో

---

హృదయం యేషాం మాంసలోమచితం సమమ్, శతాయుషో విజానీయాద్భోగభాజో మహాధనాన్. ౨౯. విరలాః శుష్కాస్తథా రూక్షా, దృశ్యంతేంఽగులయః కరే, స భవేద్దుఃఖితో నిత్యం నరో దారిద్ర్యభాజనమ్. ౩౦. యస్య మీనసమా రేఖా కర్మసిద్ధిశ్చ తస్య తు, ధనవాన్స తు విజ్ఞేయో బహుపుత్రశ్చ మానవః. ౩౧. తులా యస్య తు వేదీ వా కరమధ్యే తు దృశ్యతే, తస్య సిధ్యతి వాణిజ్యం పురుషస్య న సంశయః. ౩౨. సౌమ్యే పాణితలే యస్య ద్విజస్య తు విశేషతః, యజ్ఞయాజీ భవేన్నిత్యం బహువిత్తశ్చ మానవః. ౩౩. శైలం వాప్యథ వా వృక్షః కరమధ్యే తు దృశ్యతే, అచలాం శ్రియమాప్నోతి బహుభృత్యసమన్వితః. ౩౪. శక్తితోమరబాణాసిరేఖా చాపోపమా తథా, యస్య హస్తే మహాబాహో స జయేద్విగ్రహే రిపూన్. ౩౫. ధ్వజశ్చాప్యథ వా శంఖః కరమధ్యే తు దృశ్యతే, సముద్రయాయీ స భవేద్ధనీ చ సతతం గుహ. ౩౬. శ్రీవత్సమథ వా పద్మం వజ్రం వా చక్రమేవ చ, రథో వాప్యథ వా కుంభో యస్య

యాతఁడు సమస్తవిద్యలునేర్చి ప్రవచనమొనరించును. ఇందుంచుకేనియు శంకింప నెడములేదు. మఱియు నెవ్వానిపాణితలమునఁ (అరచేత) జిటికెన వ్రేలిమొదటినుండి వెడలి చూపుడువ్రేలిమధ్యభాగము నాక్రమించి యుండునో యాతఁడు నూరేండ్లు నిశ్శంకముగ జీవించును.

ఇది పంచవింశాధ్యాయము.

---

షడ్వింశాధ్యాయము.

బ్రహ్మయిట్లనియె ఓమహాదేవకుమారా! సమమగుకుక్షిగలవాఁడు భోగవంతుఁ డగును. నిమ్నకుక్షియగువాఁడు ధనాపహారకుఁ డగును. విషమకుక్షిగలవాఁడు మాయావియు నీర్ష్యాళువు నగును. మఱియు నిమ్నకుక్షి యగునరుఁడు మహాబలసంపన్నుఁడై ప్రజారంజకుఁడై సార్వభౌమపదవి గాంచును. పాముపొట్టగలనరుఁడు దరిద్రుఁడు నమితాహారుఁడు నగును. మండలాకారమును విస్తీర్ణము నున్నతము నగునాభి యున్నచో సుఖవంతులు వీరులు ధనధాన్యసమేతులు నగుదురు. బొడ్డు లోఁతుగ నుండినను స్వల్పమైయున్నను గ్లేశము లనుభవింతురు. వళి (ముడత) మధ్యగతమై విషమమై యున్నచో నధికముగ ధనహాని

---

హస్తే ప్రకాశతే, రాజానం తం విజానీయాత్పరసైన్యవిదారణమ్. ౩౭. దక్షిణే తు కరాంగుష్ఠే యవో యస్య తు దృశ్యతే, సర్వవిద్యాప్రవక్తా చ భవేదైవ నాత్ర సంశయః. ౩౮. యస్య పాణితలే రేఖా కనిష్ఠామూలముత్థితా, గతా మధ్యం ప్రదేశిన్యాః స జీవేచ్ఛరదః శతమ్ ౩౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే పురుషలక్షణవర్ణనం నామ
పంచవింశోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—సమకుక్షిర్భవేద్భోగీ నిమ్నకుక్షిర్ధనాపహః, మాయావీ విషమాకుక్షిస్తథా కుహకకృత్సదా. ౧. రాజా స్యాన్నిమ్నకుక్షిస్తు సార్వభౌమో మహాబలః, సర్పోదరా దరిద్రాః స్యుర్బహుభక్షాశ్చ సువ్రత. ౨. విస్తీర్ణాభిర్మండలాభిరున్నతాభిశ్చ నాభిభిః, భవంతి సుఖినో వీరా ధనధాన్యసమన్వితాః. ౩. నిమ్నాభిరథ స్వల్పాభిః క్లేశభాజో భవంతి హి, వలిర్మధ్యంగతా వీర విషమా చ విశేషతః, ధనహానిం తథా శూలం

జేయును. మఱియు గర్భశూలలను గూడ గలిగించును. ఎడమకుఁ దిరిగి యున్ననాభి యెల్లవేళల శాంతిఁ గూర్చునని విద్వాంసు లెఱుంగుదురు. దక్షిణావర్తమై యున్నచోఁ బురుషుఁడు మేధానిధి (ధారణాశక్తిగల వాఁడు) యగునని యెఱుంగుము. మఱియు నో దేవవర్మా! ప్రక్కలకుఁ బొడవై యున్నచో నాతఁడు దీర్ఘాయువు నూర్ధ్వాయతమై యున్నచో నైశ్వర్యమును గలిగియుండును. అధోభాగవ్యాప్తమై యున్నచో గోసమృద్ధుఁ డగునని బుధు లెఱుంగుదురు. తామరపువ్వునందలి జూకాతో సమానమగుకాంతిగలనాభి పురుషునకు భూపతిపదము నొసంగును. సమోదరుఁడు భోగవంతుఁడును, విషమోదరుఁడు నిర్ధనుఁడును, సూక్ష్మోదరుఁడు వాక్చాతుర్యముగలవాఁడును బహువిధసంపదలుగల వాఁడు నగును. ఉదరమున నొక్కముడతయున్న శస్త్రహతుఁ డగును. రెండుముడత లుండిన స్త్రీభోగి యగును. వళిత్రయముచే మనుజు లాచార్యులును బహుపుత్రులు నగుదురు. అని యిట్లు వననిధి వచించెను. ఋజువులగువళులచే ధనికుఁడు భోగియు. బరదారదూషకుఁడు నగును. విషమము లైయున్నచో నగమ్యాగమన మొనర్చును. మాంసవిశిష్టములై మృదువులగుపార్శ్వములచేఁ దప్పక రాజగును. ఊర్ధ్వవ్యాప్తము గాని గడ్డమును గలిగియున్నచో మానవుఁడు సుభగుఁడగును. విషమము దీర్ఘమునగు చుబుకము గలిగియున్నచో నిర్ధను లగుదురు. మఱియు

---

నిత్యం జనయతే విభో. ౪. వామావర్తా సదా శాంతిం కరోతీతి విదుర్బుధాః, కరోతి మేధాం దక్షిణేన సంప్రవృత్తా దివస్పతే. ౫. పార్శ్వాయతా దీర్ఘమాయు రైశ్వర్యమూర్ధ్వతః స్మృతమ్, గవాఢ్యతామధస్తాత్తు కరోతీతి విదుర్బుధాః. ౬. శతపత్రకర్ణికాభా నాభిర్యస్య మహామతే, భూపత్వం కురుతే సా తు పురుషస్య న సంశయః. ౭. సమోదరో భవేద్భోగీ నిస్స్వః స్యాద్విషమోదరః, సూక్ష్మోదరో భవేద్వాగ్మీ బహుసంపత్సమన్వితః. ౮. శస్త్రేణాంతం వ్రజేద్వీర స్త్రీభోగం చాప్నుయాత్తథా, ఆచార్యో బహుపుత్రశ్చ యథాసంఖ్యం వినిర్దిశేత్, ౯. వలిభిర్దేవశార్దూల ఇత్యాహ స పయోనిధిః, అగమ్యాగామినో జ్ఞేయా విషమాభిర్న సంశయః. ౧౦. ఋజుభిర్వసుభోగీ స్యాత్పరదారవినిందకః, మాంసలైర్మృదుభిః పార్శ్వైశ్వ రాజా స్యాన్నాత్ర సంశయః. ౧౧. అనూర్ధ్వచిబుకా యే తు సుభగాస్తే భవంతి వై, నిర్ధనా విషమై

నోభీమాంగసంభవా! పీనములై కండదేరిన నిమ్నములగుస్కంధములచేఁ బురుషులు రాజులై సుఖవంతులై యుందురు. సందియములేదు. సమము నున్నతమునై యుండు హృదయదేశమును సమమై విశాలమై యుండు హృదయమును నిష్కంపమై మాంసలమగుహృదయమును పార్థివుల కుండును. గార్దభరోమములవలెఁ దీవ్రములగు రోమములుగలిగి నాడీ సమూహముచే నావృతమగు హృదయము విశేషముగ నిర్ధనుల కుండును. మఱియు నోదేవోత్తమా! సమవక్షులగునరులు ధనికులును బలసినఱొమ్ము గలవారు శూరులు నగుదురని బుధులయాశయము. స్వల్పవక్షముగల వారు ద్రవ్యహీను లగుదురు. విషమవక్షులు కొంచెమేనియు ద్రవ్యా దులు లేక యుండుదురు. మఱియు శస్త్రహతినొందుటలో సంశయింపఁబని లేదు. ఓవీరా! విషమములగుదౌడలు గలమానవులు పునరుత్పత్తిశూన్యు లగుదురు. ఎత్తైనదౌడలుగలవారు భోగులగుచున్నారు. నిర్మాంసములు విషమములు నిమ్నములు నగుహనువులు గలనరులు దరిద్రులగుదురు. పీనములగుహనువులు గలనరులు ధనభోగములతో సుఖింతురు. విషమ హనువులు గలమనుజులు ధనహీనులు దుఃఖభాజనములు నగుదురు. చట్టివలె నుండుగ్రీవగలవారు దుష్టులగుదురు. అటులు లోకమున విఖ్యాతులగుదురు. దున్నమెడవంటి మెడగలమానవుఁడు శూరాగ్ర గణ్యుండగును. లేడిమెడగలవాఁడు భీరువగును. శంఖమువంటి మెడ గలవాఁడు రాజగును. లంబకంఠుఁడగుట యుత్తమలక్షణము. కురుచ మెడగలుగువారు ధనవంతులు సుఖవంతులు భోగవంతులు నగుదురు.

---

ర్దీర్ఘైర్భవంతీహ సువీరజ. ౧౨. పీనైశ్చోపచితైర్నిమ్నైః స్కంధైర్భీమాంగసంభవ, రాజానః సుఖినశ్చాపి భవంతీహ న సంశయః. ౧౩. సమోన్నతం తు హృదయం సమం చ పృథు చైవ హి, అవేపనం మాంసలం చ పార్థివానాం న సంశయః. ౧౪. ఖరరోమ చితం వీర సిరాలం చ విశేషతః, అధనానాం భవేదేవ హృదయం రుభవోత్తమ, సమ వక్షసోఽర్థయుతాః పీనైః శూరాః స్మృతా బుధైః. ౧౫. తనుభిర్ద్రవ్యహీనాః స్యు ర్విషమైశ్చాప్యకించనాః, బధ్యంతే చాపి శస్త్రేణ నాత్ర కార్యావిచారణా. ౧౬. హనుభి ర్విషమైర్వీర జన్మహీనో భవేన్నరః, యస్యోన్నతో భవేద్ధనుః స భోగీ స్యాన్న సంశయః. ౧౭. నిర్మాంసైర్విషమైర్వీర నిఃస్వో నిమ్నైః ప్రచక్ష్యతే, ధనవాంశ్చ భవేత్పీనైః సుఖ భోగసమన్వితః, విషమైరర్థహీనః స్యాద్దుఃఖభాగీ సదా నరః. ౧౮. చిపిటగ్రీవకో దుష్టో మతో లోకే స వై గుహ, శూరః స్యాన్మహిషగ్రీవో మృగగ్రీవో భయాతురః. ౧౯.

నిర్మాంసములు రోమబహుళములు భగ్నములు నల్పములు నగుభుజశిర స్సులు పురుషుని నిర్ధనుని జేయును. ఓభీమనందనా! ధనికుల వీపు రోమములు లేనిదై యుండును. అట్టులే నిర్ధనులవక్త్రములు రోమయుక్తము లయియుండును. ధనికులబాహుమూలములు (చంకలు) స్వేదరహిత ములు నున్నతములు పీనములు సమరోమములునయి సుగంధయుక్తము లగునని తెలియుము. శూరులయంసములు వ్యచ్ఛిన్నములు (ఖండ రూపములు) గాక శ్లిష్టములును విశాలములు నయియుండును. ఊర్ధ్వ ములై పెరిగినబాహువు లున్నచో వధమును బంధమును బొందును. దీర్ఘబాహుండు రాజగునని సముద్రవచనము గలదు బాగుగ ప్రేలాడు బాహువులుండిన సకలసుగుణసమన్వితుఁడగును. కురుచచేతులవాఁడు దాసుఁడుగాని యాజ్ఞాకరుఁడుగాని యగును. వామావర్తము లగుభుజ ములుగలవాఁడు దీర్ఘములు విశాలములు నగు భుజములుగలవారును సంపూర్ణబాహువులవారును రాజులగుదురని పయోనిధి వచించెను మెడ వెనుకభాగము శంఖరేఖ గలిగి యుండెనేనియు వర్తులాకారమయి యుండెనేనియుఁ బుడమిపై నెల్లదుష్టులశిక్షించుచుఁ బార్థివుఁడగును. దీర్ఘ గ్రీవులును బకగ్రీవులును శుకగ్రీవులు నగుమానవులు నుష్ట్రగ్రీవులు గజ

---

కంబుగ్రీవో భవేద్రాజా లంబకంఠోఽగ్రలక్షణః, హ్రస్వగ్రీవస్తు ధనవాన్సుసుఖీ భోగవాం స్తథా. ౨౦. నిర్మాంసౌ రోమశౌ భగ్నావల్పౌ వాపి విశేషతః, నిర్ధనస్యేదృశావంసౌ ప్రఖ్యాతౌ వ్యోమకేశజ. ౨౧. భవేదరోమశం పృష్ఠం ధనినాం భీమసంభవ, సలోమశం తథా వక్త్రం నిర్ధనానాం బలాధిప. ౨౨. అస్వేదనావున్నతౌ చ తథా పీనౌ షడానన, సమరోమసుగంధా చ కక్షా జ్ఞేయా ధనాన్వితౌ. ౨౩. అవ్యుచ్ఛిన్నౌ తథా శ్లిష్టౌ విపులౌ చ సురాధిప, శూరాణామీదృశావంసౌ నగజానందవర్ధన. ౨౪. ఊర్ధ్వవృద్ధ బాహుకో యస్తు వధబంధనమాప్నుయాత్, దీర్ఘబాహుర్భవేద్రాజా సముద్రవచనం యథా. ౨౫. ప్రలంబబాహుర్విజ్ఞేయో నరః సర్వగుణాన్వితః, హ్రస్వబాహుర్భవేద్దాసః పరప్రేష్యకరోఽపి వా. ౨౬. వామావర్తభుజా యే తు దీర్ఘాయతభుజాశ్చ యే, సంపూర్ణబాహూ రాజా స్స్యాదిత్యాహ స పయోనిధిః. ౨౭. గ్రీవా చ వర్తులాకారా కంబురేఖాసమావృతా, స భవేత్పార్థివో భూమౌ సర్వదుష్టనిబర్హణః. ౨౮. దీర్ఘగ్రీవా బకగ్రీవా శుకగ్రీవాశ్చ యే నరాః, ఉష్ట్రగ్రీవాః కరిగ్రీవాః సర్వే తే నిర్ధనాః

గ్రీవులు నగువారును నిర్ధను లగుదురు. పార్థివులబాహువులు యేనుఁగు తొండమువలె గుండ్రనై సమములై మోఁకాళ్లవఱకును వ్రేలాడునవి యై యుండును. మఱియు నోసురపుంగవా! దరిద్రులబాహువులు లోమశములు హ్రస్వములు నని యెఱుంగుము. మఱియు నోసువ్రతా! తస్కరులబాహువులు స్థూలములై విషమములై సూక్ష్మములు నై యుండును. పల్లమగు నరచేయిగలవానికిఁ బైతృకధన ముండదు. మఱియు నాతఁడు భీరుఁడగును. వర్తులము సూక్ష్మము నిమ్నము నగునరచేయిగలవాఁడు ధనాఢ్యుఁడగును. మిట్ట యరచేత గల్గిననరుఁడు దాత యగును. కరతలము లెక్కువ నిమ్నములైనను విషమములైనను మానవులు విషము లగుచున్నారు. లాక్షా (లక్క) సమకాంతిగలయరచేయి యీశ్వరునిఁ జేయును. చేయి పచ్చనగుచో నగమ్యాగమనముఁ జేయును. రూక్షము లగుచో నిర్ధనులగుదురు. నల్లనియరచేతులుగలవా రెల్లప్పుడు నపేయపానము నొనరింతురు. ధనికులహస్తముల నిమ్నస్నిగ్ధములగు రేఖ లుండును దరిద్రుల కటుగాదని సముద్రుఁడు చెప్పుచున్నాఁడు. చేతి వ్రేళ్లెడములై యున్నచో దరిద్రులని చెప్పఁబడుదురు. పరస్పరసంసక్తము లగు నంగుళులుగలవారువిత్తాఢ్యులగుదురు. ముఖము మండలాకారముగ నున్న యాతఁడు ధర్మశీలుఁడగును. శుండాననులు నిశ్శంకముగ దుర్భగు లగుదురు. హరివక్త్రులును గుటిలవక్త్రులు వికృతాస్యముగలవారును

---

స్మృతాః ౨౯. ఇభాంగసదృశౌ వృత్తౌ సమాపీనౌ చ సువ్రత, ఆజానులంబినౌ బాహూ పార్థివానాం న సంశయః. ౩౦. దరిద్రాణాం లోమశౌ హ్రస్వౌ బాహూ జ్ఞేయౌ సురోత్తమ, తస్కరాణాం చ విషమౌ స్థూలౌ సూక్ష్మౌ చ సువ్రత. ౩౧. నిమ్నం కరతలం యస్య పితృవిత్తం న తస్య వై, భవేదార్భవశార్దూల తథా భీరుశ్చ మానవః. ౩౨. సువృత్తతనునిమ్నేన ధనవాన్కరతలేన తు, ఉత్తానకరతలో దాతా భవతీతి న సంశయః. ౩౩. విషమా భవంతి విషమైర్నిమ్నైశ్చాపి విశేషతః, కరతలైర్దేవశార్దూల లాక్షాభై రీశ్వరాః స్మృతాః. ౩౪. అగమ్యాగమనం పీతై రూక్షైర్నిర్ధనతా స్మృతా, అపేయ పానం కుర్వంతి నీలకృష్ణైః సదైవ హి. ౩౫. నిమ్నాః స్నిగ్ధా భవేన్నరాణాం రేఖా కరతలే గుహ, ధనినాం న దరిద్రాణామిత్యాహ స పయోనిధిః. ౩౬. విరలాంగులయో యే తు తే దరిద్రాః ప్రచక్షతే, ధనినస్తు మహాబాహో యేఘనాంగులయో నరాః. ౩౭. వదనం మండలం యస్య ధర్మశీలం తమాదిశేత్, శుండవక్త్రా నరా యే తు దుర్భగాస్తే న సంశయః. ౩౮. హరివక్త్రా జిహ్మవక్త్రా వికృతాస్యాస్తథా నరాః, భగ్నవక్త్రాః కరాలాస్యాః

భగ్నాననులును భయంకరవదనులును తస్కరులగుదురు. పూర్ణచంద్రాననులును గజసింహాననులును రాజులగుదురు. గొఱ్ఱెమొగముగాని వానరవక్త్రముగాని కలిగియుండిన ధనవంతులని చెప్పఁబడిరి. ఎవనిచెక్కులు పరిపూర్ణములయి తామరరేకునుబోలు కాంతిగలిగి యుండునో యాతఁడు వ్యవసాయము జేయుచు బహుధనవంతుఁడగును. సింహవ్యాఘ్రగజంబులఁబోలు కపోలములున్న మహాభోగియు సేనాధిపుఁడు నగునని యెఱుంగుము. సమానమై మృదువై యాహ్లాదజనకమై గుండ్రమగుముఖమున్న వాఁడు పృథివీపతి యగును. విపరీతలక్షణోపేతమగు వదనముదుఃఖనిదానమగును. ముఖము పెద్దదైయున్న దౌర్భాగ్యము గలిగించును. స్త్రీతుల్యముఖము గలిగియున్నచోఁ నాతనికిఁ బుత్రులు నశింతురు. మండలాకారమై యున్నచో సుఖియగును. దీర్ఘముఖము ద్రవ్యనాశముజేయునదియుఁ బాపహేతువు భయదమునగు. చతురస్రమైయున్నచో నాతఁడు ధూర్తుఁడగును. పుత్రసంతానము నశించును. నిమ్నాననుఁడు పుత్రులకు హానిచేయును. హ్రస్వముఖుఁడు రహస్యముల వెలిబుచ్చుస్వభావముగల కీనాశుఁడగును. మనోహర మైయున్న మహాభోగముల నొసంగును. ఎఱ్ఱనియధరోష్ఠముగలవాఁడు రాజన్యుఁడగును. కమలనిభమగు నధరముగలవాఁడు ధనపతి యగును. స్థూలమగునధరముగలవాఁడును దౌడలవరకు వ్యాపించుపెదవులుగలవాఁడు నెండినపెదవులుఁగలవాఁడును దీర్ఘాధరముగలవాఁడును దుఃఖితుఁడగును. కొనలు చీలికలుగాక దట్టమై వంగి

---

సర్వే తే తస్కరాః స్మృతాః. ౩౯. సంపూర్ణవక్త్రా రాజానో గజసింహాననా స్తథా' ఛాగవానరవక్త్రాశ్చ ధనినః పరికీర్తితాః. ౪౦. యస్య గండౌ సుసంపూర్ణౌ పద్మపత్రసమప్రభౌ, కృషిభాగీ భవేన్నిత్యం బహువిత్తశ్చ మానవః. ౪౧. సింహవ్యాఘ్రగజేంద్రాణాం కపోలైః సదృశో యది, మహాభోగీ స విజ్ఞేయః సేనాయాశ్చైవ నాయకః. ౪౨. వదనం తు సమం శ్లక్ష్ణం సౌమ్యం సంవృతమేవ హి, పార్థివానాం మహాబాహో విపరీతం తు దుఃఖదమ్. ౪౩. మహాముఖం తు దేవేశ దుర్భగత్వం ప్రయచ్ఛతి, స్త్రీముఖం పుత్రనాశాయ మండలం సుఖితాం వ్రజేత్. ౪౪. ద్రవ్యనాశాయ వై దీర్ఘం పాపదం భయదం తథా, ధూర్తానాం చతురస్రం స్యాత్పుత్రహానికరం శృణు. ౪౫. నిమ్నవక్త్రం చ దేవేన్ద్ర పుత్రహానికరం భవేత్, హ్రస్వం భవతి కీనాశే పూర్ణకాంతం చ భోగినామ్. ౪౬. రక్తాధరో నరపతిర్ధనవాన్కమలాధరః, స్థూలోష్ఠా హనుమూలాశ్చ శుష్కైస్త్రీక్ష్ణైశ్చ దుఃఖితాః. ౪౭. అస్ఫోటితాగ్రం స్నిగ్ధం చ నతం మృదు తథా గుహ,

మృదువుగనుండి సంపూర్ణమగు మీసముండినచో నాతఁడు భూపతి యగును. ఎఱ్ఱగ స్వల్పముగ కఠినముగ మీసలుండినచో వారు చోరులు పరాంగనాసక్తులు నగుదురు. ఎవనికర్ణపుటములు నిర్మాంసములై యుండునో యాతఁడు సంగ్రామమృతి నొందును. చిప్పలవంటిచెవులుండిన భోగి యగును. చిన్నచెవులుగలవాఁడు కృపణుఁడగును. శంకు (గర్ధభము లేక యొంటె) కర్ణుఁడు భూనాథుఁడై సర్వశత్రుభయంకరుఁడగును. కర్ణములు వెండ్రుకలుగలిగియున్నచో దీర్ఘాయువగును విశాలకర్ణములుగలవాఁడు నరాధిపులును భోగసంపన్నులును దేవతలను బ్రాహ్మణులను బూజించు వారు నగుదురు లంబకర్ణుఁడును నాడీసంయుతకర్ణుఁడును క్రూరుఁ డగు నని యెఱుంగుము. ఓగిరిసుతాతనయా! మాంసముగల కర్ణములు సుఖ ప్రదములు. గండములు పల్లములై యున్నచో భోగవంతు లగుదురు. సంపూర్ణకపోలములుగలవారు మంత్రులగుదురు. చిలుకముక్కు గల వారు శుభంబులు గాంతురు. శుష్కనాసికగలవారు చిరజీవు లగుదురు. (మొల్ల) మల్లెమొగ్గలవలె ప్రకాశించు పలువరుసగలవారు నృపాలురగు దురు. ఎలుగువలెగాని వానరమువలెగాని దంతములుండిన నెల్లప్పుడు నాకటఁ దపించుచుందురు. ఏనుఁగుదంతములు గలవారును గర్ధభదంతు లును దట్టమగుదంతములుగలవారును నునుపగుదంతములుగలవారును గుణవంతులగుదురు. భయదములగు దంతములున్నను నెడగలుగు దంతములున్నను గఠినములైయున్నను దుఃఖజీవనము గలవారగు

---

సంపూర్ణం చ సదా శస్తం శ్మశ్రు భూమిపతేర్గుహ. ౪౮. రక్తైశ్చాచలైస్తథా రూక్షైః శ్మశ్రుభిర్భీమనందన, నరాశ్చోరా భవంత్యేవ పరదారరతాస్తథా. ౪౯. నిర్మాంసౌ యస్య వై కర్ణౌ సంగ్రామాన్నాశమృచ్ఛతి, చిపిటాభ్యాం భవేద్భోగీ హ్రస్వౌ చ కృపణస్య చ. ౫౦. శంకుకర్ణశ్చ భూనాథః సర్వశత్రుభయంకరః, దీర్ఘాయూ రోమ శాభ్యాం తు విపులాభ్యాం నరాధిపః, భోగీ చ స భవేన్నిత్యం దేవబ్రాహ్మణపూజకః. ౫౧. శిరావబద్ధౌ క్రూరస్య వ్యాలమ్బౌ చ విశేషతః, మాంసలౌ సుఖదౌ జ్ఞేయౌ శ్రవణౌ వ్యోమకేశజ. ౫౨. భోగీ స్యాన్నిమ్నగణ్డో వై మంత్రీ సంపూర్ణగండకః, శుభభాక్శుక నాసస్తు చిరజీవీ శుష్కనాసికః. ౫౩. కుందకుడ్మలసంకాశైః ప్రకాశైర్దశనైర్నృపః, ఋక్షవానరదంతాశ్చ నిత్యం క్షుత్పరిపీడితాః. ౫౪. హస్తిదంతాః ఖరదంతాః స్నిగ్ధ దంతా గుణాన్వితాః, కరాలైర్విరలై రూక్షైర్దశనైర్దుఃఖజీవినః. ౫౫. ద్వాత్రింశద్దంతా

దురు. ముప్పదిరెండు దంతములుండిన రాజు లగుదురు ముప్పది యొకటియుండిన భోగసంపన్నుఁడగును. ముప్పదిదంతములుండిన మనుజు లెల్లప్పుడును సుఖదుఃఖములతో మిశ్రితమైనజీవనము గలిగి యుండు దురు. అందు నొకటి తగ్గియున్నచోఁ గేవలము దుఃఖమునే యను భవింతురు. నల్లనినాలుక యుండినజనులు దాస్యము నాచరింతురు. బలి ష్ఠమై స్థూలమై కఠినమగుజిహ్వయుండినఁ గోపస్వభావుఁడగును. తెల్లని నాలుకగలపురుషులు శౌచాచారసక్తులై యుందురు. తామరరేకున కెనయై పలుచనై పొడవైననాలుక మంగళదాయకమగును. స్థూలమై విస్తీర్ణముగానిజిహ్వ మనుజునకున్నచో నాతఁడు మానవనాథుఁడగును. పల్లమై నునుపుగలిగి కురుచనై యెఱ్ఱనికొనగల జిహ్వ యున్నచో నాతఁడు నిశ్శంకముగ సర్వవిద్యలు నేర్చి ప్రవచన మొనరించును ముఖా వయవమగుతాలువు నల్లగనుండు నేని యాతఁడు కులము నశింపఁజేయును. పచ్చనితాలువులుగలవాఁడు సుఖదుఃఖముల రెండిటి ననుభవించును. నరా ధిపుఁడగును. వికృతము స్ఫుటితము రూక్షము నగుతాలువుగలవాఁడు ప్రశస్యుఁడు కాఁడు. గజసింహసమతాలువులు గలవాఁడు ధరాధిపుఁ డగును. అట్టులే పద్మవర్ణములగుతాలువులు గలిగియున్నను నరాధిపుఁ డగును. తెల్లనితాలువులుగలవాఁడు ధనాఢ్యుఁడగును. హంసనుబోలు కంఠధ్వనిగలవాఁడు ధన్యతముఁడగును. మేఘగర్జనమువలె గంభీరమగు కంఠధ్వనిగలవారును క్రౌంచపక్షులవంటి కంఠరవముగలవారును రాజు లును భోగసంపన్నులు ధనసమృద్ధులు నగుదురు. చక్రవాకమునుబోలు

---

రాజాన ఏకత్రింశచ్చ భోగవాన్, త్రింశద్దంతా నరా నిత్యం సుఖదుఃఖిత్వభాగినః, ఊనత్రింశచ్చ దశనైః పురుషా దుఃఖభాగినః. ౧౬. కృష్ణజిహ్వో భవేత్ప్రేష్యః సబ లయా తు జిహ్వయా, భవేత్కోపస్య కర్తా వై స్థూలరూక్షశ్చ జిహ్వయా. ౧౭. శ్వేతజిహ్వా నరా జ్ఞేయాః శౌచాచారసమన్వితాః, పద్మపత్రసమా జిహ్వా సూక్ష్మా దీర్ఘా సుశోభనా, స్థూలా చ న చ విస్తీర్ణా యేషాం తే మనుజాధిపాః. ౧౮. నిమ్నా స్నిగ్ధా చ హ్రస్వా చ రక్తాగ్రా రసనా యది, సర్వవిద్యాప్రవక్తారస్తే భవంతి న సంశయః. ౧౯. కృష్ణతాలుర్నరో యస్తు స భవేత్కులనాశనః, సుఖభాగీ దుఃఖభాగీ పీతతాలుర్నరాధిపః. ౨౦. వికృతం స్ఫుటితం రూక్షం తాలుకం న ప్రశస్యతే, సింహ తాలుర్నరపతిర్గజతాలుస్తథైవ చ, పద్మతాలుర్భవేద్రాజా శ్వేతతాలుర్ధనేశ్వరః. ౨౧. హంసస్వరా నరా ధన్యా మేఘగమ్భీరనిఃస్వనాః, క్రౌంచస్వనాశ్చ రాజానో భోగ

కంఠనిస్వనముగలవారు ధర్మవత్సలులగురాజులయి ధన్యులగుచున్నారు. కుంభదుందుభినిస్వనముగలవారు నరపతులై పొల్చెదరు. రూక్షము తీవ్రము నగుకంఠరవముగలవారు క్రూరులగుదురు; కాని పశుతుల్యులు గారు. బొంగురుచప్పుడుగలవారు క్లేశభాజను లగుదురు. పాలపిట్టవంటి కంఠధ్వనిగలవారును బ్రద్దలయిన కాంస్యమున కెనయగు గొంతుచప్పుడు గలవారును భాగ్యవంతులై భాసిలుచుందురు. క్షీణము భిన్నము నగు ధ్వనిగలవారు "అధములు" అని చెప్పఁబడుదురు. (తను) చిన్నముక్కు గలవారు పార్థివులు. పెద్దముక్కుగలవారు భోగులు. హ్రస్వనసులు ధర్మశీలురగుదురు. ఏనుఁగు గుఱ్ఱము సింహామునువానిబోలు ముక్కులు గలవారు సూదిముక్కుగలవారు వాణిజ్యమున నశ్వవిక్రయమునను లాభము గాంచుదురు. ఎవనినాసిక వికృతము స్థూలము నగుకొనగలిగి విరూప మైయుండునో వానినిఁ బాపకర్మునిగా నెఱుంగుము ఇట్లు సాముద్రనియాదేశము నేత్రములు దానిమ్మపూవులఁ బోలి యున్నచో నానరుండు సప్తద్వీపాధిపతియై ప్రకాశించును. పులికన్నులుగలవారు కోపశీలురగుదురు. కర్కటా (ఎండ్రకాయ) క్షులు కలహప్రియులగు చున్నారు. పిల్లికన్నులు హంసకన్నులును గలవా రధములగుదురు. నెమలికన్నులుగలవారును ముంగికన్నులుగలవారును మధ్యములు. ఇప్పపూవులవంటికన్నులుగలవారు సంపన్నులగుదురు. ఈషత్పింగల

వంతో మహాధనాః. ౬౨. చక్రవాకస్వనా ధన్యా రాజానో ధర్మవత్సలాః, కుమ్భస్వనో నరపతిర్దుందుభిస్వన ఏవ చ, రూక్షదీర్ఘస్వరాః క్రూరాః పశూనాం సదృశా న తు. ౬౩. గుర్గురస్వరసంయుక్తాః పురుషాః క్లేశభాగినః, చాషస్వనా భాగ్యయుతా భిన్నకాంస్యస్వరాశ్చ యే, క్షీణభిన్నస్వరా యేస్యురధమాస్తే ప్రకీర్తితాః. ౬౪. పార్థివాస్తనునాసాశ్చ దీర్ఘనాసాశ్చభోగినః, హ్రస్వనాసా నరా యే తు ధర్మశీలాస్తు తే మతాః. ౬౫. హస్త్యశ్వసింహనాసాశ్చ సూచీనాసాశ్చ యే నరాః, తేషాం సిధ్యతి వాణిజ్యం హయానాం చైవ విక్రయః. ౬౬. వికృతా నాసికా యస్య స్థూలాగ్రా రూపవర్జితా, పాపకర్మా స విజ్ఞేయః సాముద్రవచనం యథా. ౬౭. దాడిమీపుష్పసంకాశే భవేతాం యస్య లోచనే, భూపతిః స తు విజ్ఞేయః సప్తద్వీపాధిపో గుహ. ౬౮. వ్యాఘ్రాక్షాః కోపనాక్షేయాః కర్కటాక్షాః కలిప్రియాః, బిడాలహంసనేత్రాశ్చ భవంతి పురుషాధమాః. ౬౯. మయూరనకులాక్షాశ్చ నరాస్తే మధ్యమాః స్మృతాః న శ్రీస్త్యజతి సర్వజ్ఞ పురుషం

ములగు నేత్రములుండిన సర్వభోగము లనుభవించుచు రాజులగుదురు. గోరోజనమువలెను, అరదళము (హరితాలము) వలెను, బూసగురువెంద పూవువలె నుండుకన్నులుగలవారు ధనేశ్వరులగుదురు. మఱియు నట్టి బలసత్త్వములుగలిగి పృథ్వికిఁ జక్రవర్తులగుదురు. రెంపుమాత్రలకాలము ఱెప్పవాల్పక చూచువారు పరుల నాశ్రయించి జీవింతురు. మూఁడు మాత్రలకాలము జూడగలవారు సుఖవంతులగుదురని యెఱుంగుము నాల్గుమాత్రలకుఁ బైన ఱెప్పపాటువేయువారు సమర్థులగుదురు. పంచ మాత్రనిమేషముగలవారు దీర్ఘాయువులు ధర్మరతుల్నునై యుందురు. హ్రస్వకర్ణులు మహాభాగు లగుదురు. మహాకర్ణులు నట్టిరే యగుదురు. సుడిదిరుగు చెవులుగలవారును స్నిగ్ధకర్ణములుగలవారును ధనవంతులగుదురు. ముత్తెపుచిప్పలవంటి కర్ణములుగలవారు దీర్ఘాయువు లగుదురు. శంఖముబోలు చెవులుగలవారు మహాధనులగుదురు. దీర్ఘకర్ణులు దీర్ఘాయువులు లంబకర్ణులు తపస్వులునై ధన్యాత్ములగుదురు. అర్ధచంద్రునిఁబోలు నెమ్మోముగలవారు పుడమిపతులై పాల్చెదరు. విపులమగు లలాటము గలవారు బహుధనవంతు లగుదురు. స్వల్పమగునుదుటిచే నరులు ధర్మరతులగుదురు. నుదుట నైదురేఖలుండిన యువతిగాని పురుషుఁడుగాని నూరేండ్లు జీవించి యఖిలైశ్వర్యములఁ గాంతురు. నాలుగు రేఖ లుండిన నెనుబదేండ్లు జీవింతురు. మూఁడురేఖలున్న నరులు డెబ్బదేండ్లు బ్రదుకు

మధుపింగలమ్. ౨౦. ఆపింగలాక్షా రాజానః సర్వభోగసమన్వితాః, రోచనా హరితాలాక్షా గుఞ్జాపింగా ధనేశ్వరాః, బలసత్వగుణోపేతాః పృథివీచక్రవర్తినః. ౨౧. ద్విమాత్రావీక్షణా నిత్యం జీవంతి పరమాశ్రితాః, త్రిమాత్రాస్పందినో జ్ఞేయాః పురుషాః సుఖభాగినః. ౨౨. చతుర్మాత్రానిమేషైశ్చ నయనైరీశ్వరాః స్మృతాః, దీర్ఘాయుషోధర్మరతాః పంచమాత్రానిమేషిణః. ౨౩. హ్రస్వకర్ణా మహాభాగా మహాకర్ణాశ్చ యే నరాః, ఆవర్తకర్ణా ధనినః స్నిగ్ధకర్ణాస్తథైవ చ. ౨౪. దీర్ఘాయుషః శుక్తికర్ణాః శంఖకర్ణా మహాధనాః, దీర్ఘాయుషో దీర్ఘకర్ణా లంబకర్ణాస్తపస్వినః. ౨౫. లలాటేనార్ధచన్ద్రేణ భవంతి పృథివీశ్వరాః, విపులేన లలాటేన మహాధనపతిః స్మృతః, స్వల్పేన తు లలాటేన నరోధర్మరతః స్మృతః. ౨౬. రేఖాః పంచ లలాటే తు స్త్రియా వా పురుషస్య వా, శతం

దురు. రెండురేఖలుగలవా రరువదేండ్లు జీవించియుందురు. ఒక్కరేఖయే యుండిన నలువదేండ్లు జీవింత్రు. లలాటము రేఖాశూన్యమయి యుండుచో నిరువదేనేండ్లు జీవింతురు. అని యెఱుఁగవలయును. ఉత్తమమధ్యమాధములను రేఖాచ్ఛేదములవలన నెఱుంగవలయును. అల్పరేఖలచే నల్పాయువులు వ్యాధిపీడితులు నగుదురు ఎవని లలాటమునఁ ద్రిశూలరేఖగాని పట్టిశ (ఆయుధవిశేషము) రేఖగాని యుండునో యాతఁడీశ్వరుఁడై భోగవంతుఁడై కీర్తికాంతారమణుఁడై యుండునని యెఱుంగుము. బ్రహ్మరంధ్రము పల్లమై స్వల్పోపహతమగు శిరమును చంద్రాకారమగుశిరమును నరేంద్రుల కుండును. మఱియు నట్టి శిరముగలవాఁడు గోధనసంపన్నుఁడు మంగళాకారుఁడు నగును. దరిద్రులతల విషమముగను దుఃఖవంతులతల దీర్ఘముగ నుండును. కుంజరకుంభనిభంబగు శిరంబుగలవాఁడు రాజగును. సమశిరస్కుఁడు భోగి యగును. కపిలవర్ణములుగలిగి కొనలు చీలి స్థూలములు రూక్షములునై నడితలనున్న వెండ్రుకలచేతను మీసములచేతను నరుఁడు దుఃఖితుఁడగును. పరుషములు వివర్ణములు తేజోరహితములు స్థూలములు తీక్ష్ణములు నాత్యల్పాధికములు నగుశిరోజములచే నరులు దుఃఖభాగులగు

---

జీవతి వర్షాణామైశ్వర్యం చాధిగచ్ఛతి. ౨౭. చతూరేఖామశీతిం తు త్రిభిః సప్తతిమేవ చ, ద్వాభ్యాంషష్టిం తు రేఖాభ్యాం చత్వారింశత్తథైకయా, అరేఖేన లలాటేన విజ్ఞేయా పంచవింశతిః. ౨౮. రేఖాచ్ఛేదైస్తు విజ్ఞేయా హీనమధ్యోత్తమా నరాః, అల్పాయుష స్తథాల్పాభిర్వ్యాధిభిః పరిపీడితాః. ౨౯. త్రిశూలం పట్టిశం వాపి లలాటే యస్య దృశ్యతే, ఈశ్వరం తం విజానీయాద్భోగినం కీర్తిమాశ్రితమ్. ౩౦. ఉత్క్రాంతనిమ్నం తు శిరః స్వల్పోపహతమేవ చ, చంద్రాకారం నరేన్ద్రాణాం గవాఢ్యం మంగలం స్మృతమ్. ౩౧. విషమం తు దరిద్రాణాం శిరో దీర్ఘం తు దుఃఖినామ్, నాగకుంభనిభం రాజ్ఞః సమం సర్వత్ర భోగినః. ౩౨. కపిలైః స్ఫుటితై రూక్షైః స్థూలైశ్చ శిఖరేశజైః, దుఃఖితాః పురుషా జ్ఞేయా రోమశ్మశ్రుభిరేవ చ. ౩౩. రూక్షా వివర్ణా నిస్తేజాః ఖరాః స్థూలాశ్చ మూర్ధజాః, నాతిస్తోకా న బహులో మూర్ధజా దుఃఖ

చున్నారు. విరళములు మృదువులు స్నిగ్ధములునై తుమ్మెదను గాటుకను బోలు తలవెండ్రుకలుగలనరులు పృథివీపతు లగుచున్నారు.

ఇది షడ్వింశాధ్యాయము

## సప్తవింశాధ్యాయము.

ఈప్రకారముగాఁ బితామహుఁడు పురుషలక్షణముల నెఱింగింప విని కార్త్తికేయుండు సోత్సాహమ్మున నోపండితోత్తమా! శరీరసంజాతములై శుభములగు రాజలక్షణములను సంక్షేపముగ నెఱింగింపుమని యడుగ నాతనికిఁ జతుర్ముఖుఁ డిట్లనియె. ఓగౌరీకుమారా! నరసమాజములోఁ బార్థివు నెఱుంగుట కనువగుశుభలక్షణముల నెఱింగింతు వినుము. ఏనరునకు మూఁడుతావులు విపులములుగను నారుచోట్లున్నతములుగను మూఁడుప్రదేశములు గంభీరములుగను నాల్గుప్రదేశములు హ్రస్వములుగను నేడుస్థలములు రక్తములుగను నైదుతావులు పొడవుగను నైదు సూక్ష్మములుగ నుండునో యాతఁడు పార్థివలక్షణుఁడని యెఱుంగుము. వానిని వివరింతు వినుము. నాభిదేశము, సంధి, స్వనము ననుమూఁడు గంభీరములై యుండఁదగును. ముఖము, నుదురు, వక్షము

భాగినః. ౨౮. విరలాశ్చమృదుస్నిగ్ధా భ్రమరాంజనసప్రభాః, కచా యస్య తు దృశ్యంతే స భవేత్పృథివీపతిః. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యం సంహితాయాం బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే పురుషలక్షణవర్ణనం నామ షడ్వింశోఽధ్యాయః.

కార్త్తికేయ ఉవాచ:—సంక్షేపతో మమ విభో లక్షణాని నృపస్య తు, శుభాని చాంగజాతాని బ్రూహి మే వదతాం వర. ౧. బ్రహ్మోవాచ:—శృణు వక్ష్యేఽంగజాతాని పార్థివస్య శుభాని చ, పార్థివో జ్ఞాయతే యైస్తు నరాణాం మధ్యభాగతః. ౨. త్రీణి యస్య మహాబాహో విపులాని నరస్య తు, ఉన్నతాని తథా షడ్ వై గంభీరాణి చ త్రీణి వై. ౩. చత్వారి చాపి హ్రస్వాని సప్తరక్తాని వా విభో, దీర్ఘాణి చాపి సూక్ష్మాణి భవంతి యస్య పంచ వా. ౪. నాభిః సంధిః స్వనశ్చేతి గంభీరాణి చ త్రీణి వై, వదనంచ లలాటంచ దంతోత్తమ ఉరస్తథా. ౫. విస్తీర్ణమేతత్త్రితయం వీర యస్య

ననునీమూఁడును విపులములై యుండఁదగును. ముచ్చిలిగుంట, ముఖము, గోళ్లు, వక్షము, నాసిక, కక్షములుననునీయాఱు నున్నతములుగా నుండ వలయును. లింగము, పృష్ఠము, మెడ, పిక్కలు ననునాల్గును పొట్టిగా నుండఁజనును. నేత్రాంచలములును హస్తపాదములును, తాలోష్ఠము లును, నాలుకయు, గోళ్లుననునీయేడును రక్తవర్ణములయి యుండఁ జనును. మఱియు నోదేవోత్తమా! చర్మము, గోరులు, జుట్టు, పల్లు నను నాల్గును సూక్ష్మములై యుండఁజనును. సూక్ష్మము లైదని బుధులందురు. నాసికయు, నేత్రములును, బాహువులు, స్తనమధ్యభాగము, దౌడలు ననునీయేనును దీర్ఘముగ నుండవలయును. రాజు లొక్కతడవ తుమ్ము దురు. ఒక్కసారి రెండుమూఁడుతుమ్ములు తుమ్మువారు దీర్ఘాయువులగు దురు. అట్టులే యావులించినను దీర్ఘాయువులగుదురు. నవ్వుగూడ నట్టులే యని బుధు లెఱుంగుదురు. ఓశివనందనా! ధనికులనేత్రములు పద్మపత్ర నిభములై యుండును. ఎఱ్ఱనికొనలుగలనేత్రములు సంపత్కరములగును. ఇప్పపూవువంటికన్నులు గలవారు మహాత్ములగుదురు కృశించినకన్నులుగల వారు భీరువులు. మండలాకారముగఁగాని చక్రాకారముగఁగాని యున్నఁ జోరులగుచున్నారు. మెల్లకన్నులుగలవారు క్రూరులగుదురు. గంభీరము లగుకన్ను లర్థసంపదల నతిశయింపఁజేయును నీలోత్పలములవంటి నేత్ర ములుగలవారు వేదవిదులని యెఱుంగుము. యాచకులకన్నులు మిక్కిలి

---

నరస్య తు, స రాజా నాత్ర సందేహః శృణుష్వేవోన్నతాని చ. ౬. కృకాటికా తథా చాస్యం నఖా వక్షోథ నాసికా, కక్షే చాపి మహాబాహో షడేతాని విదుర్బుధాః. ౭. లింగం పృష్ఠం తథా గ్రీవా జంఘా హ్రస్వాని సువ్రత, నేత్రాంతే హస్తపాదౌ తు తాలోష్ఠౌ చ సురోత్తమ, జిహ్వా రక్తా నఖాశ్చైవ సప్తైతాని మహామతే. ౮. త్వచః కరరుహాః కేశా దశనా ఋభవోత్తమ, సూక్ష్మాణ్యేతాని చ గుహ పంచ చాపి విదు ర్బుధాః. ౯. నాసికాలోచనే బాహూ స్తనయోరంతరం హనుః, ఇతి దీర్ఘమిదం ప్రోక్తం పంచకం భూభుజాం నృప.౧౦. క్షుతం రాజ్ఞాం సకృద్ద్విస్త్రిర్వాదితం ప్రోదితం తథా, దీర్ఘాయుషాం ప్రయుక్తం తే హసితం చ విదుర్బుధాః. ౧౧. పద్మపత్రనిభే నేత్రే ధనినాం శివనందన, భార్గవీమాప్నుయాత్సోఽపి రక్తాంతే యస్య లోచనే. ౧౨. మధుపింగైర్మహాత్మానో నరా జ్ఞేయాః సురాధిప, భీరవో హి కృశాక్షాస్తు చోరా మండలచక్రకైః. ౧౩. క్రూరాః కేకరనేత్రాస్తు గంభీరై రర్థసంపదః, నీలోత్పలాభై ర్వేద

నల్లగ నుండును. స్థూలనేత్రులు మంత్రులగుదురు. ఆకుపసుపుతోఁజేరిన నలుపుగల (శ్యామ) నేత్రములుగలవారు సుభగులగుదురు. దీనదృష్టులు గలవారు దరిద్రులు. విపులములగునేత్రములుగలవారు భోగవంతులని యెఱుంగుము. ఉన్నతనేత్రములవా రల్పాయువులు. విశాలములగు నేత్రములుగలవారు సుఖులగుదురు. విషమనేత్రులు దరిద్రులు ధనికుల కనుబొమలు బాలచంద్రునింబోలియుండును.ఒండొంటితోఁ గలసి దీర్ఘము లగు కనుబొమలుగలవారు నిర్ధనులగుదురు. కనుబొమలు క్షీణములగు నెడ నర్థవిహీనులగా నెఱుంగుము మధ్యభాగమున వంగినకనుబొమలు గలవారు పరదారాసక్తులగుదురు విరళములు నున్నతములునగు నొస లెముకలచే ధనాఢ్యులును ధన్యులు నగుదురు. పల్లంపుటెముకలచే స్తుతి పాఠకు లగుదురు. ఉన్నతములైనచో రాజేంద్రులై యొప్పెదరు. విషమ లలాటముగలవారు సర్వకాలముల విగతధనులగుదురు. ముత్తెపుచిప్పలఁ బోలు లలాటములచే నరు లాచార్యకము నొందుదురు. మఱియు వారు ఖ్యాతిఁ గాంతురు. ఉన్నతశిరస్కు లెల్లవేళల నాఢ్యులగుదురని యెఱుం గుము నిమ్నలలాటముగలవారు వీరులయ్యు వధబంధనములఁబొందుదురు. మూర్ఖులలలాటములు మిక్కిలి యెత్తై యుండును. మిక్కిలి నతములైన చో దీనులగుదురు. ఎటువంటివదనము నరులకు శుభావహమో యెఱిం గింతు వినుము. దైన్యములేక స్నిగ్ధమై చిరునగవు దోపుచుండువదనము

---

విదో భృశం కృష్ణైస్తథార్థితా, మంత్రిత్వం స్థూలసదృశో వదంతి భువి తద్విదః. ౧౪. శ్యామాక్షాః సుభగా జ్ఞేయా దీనాక్షైశ్చ దరిద్రతా, విస్తీర్ణైర్భోగినో జ్ఞేయా విపులైశ్చ తథా గుహ. ౧౫. అభ్యున్నతాభిర్హ్రస్వా ఋద్విశాలాభిః సుఖీ భవేత్, దరిద్రో విష మాభిస్తు తతో జ్ఞేయః సురోత్తమ. ౧౬. భ్రువో బాలేందుసదృశా ధనినామార్భవో త్తమ, దీర్ఘాభిస్నిర్ధనో జ్ఞేయః సంసక్తాభిస్తు సువ్రత. ౧౭. క్షీణాభిరర్థహీనాః స్యుర్వరా జ్ఞేయాః సురోత్తమ, మధ్యే నతభ్రువో యే చ పరదారరతాస్తు తే. ౧౮. విరలై రున్నతైః శంఖైర్ధన్యాః స్యుర్నాత్ర సంశయః, నిమ్నైః స్తుత్యర్థసంసక్తా ఉన్నతైశ్చ జనాధిపాః. ౧౯. విషమలలాటా విధనాః సదా స్యుర్దేవసత్తమ, ఆచార్యాః శుక్తిసదృశై ర్నరాః స్యుర్నాత్ర సంశయః. ౨౦. ఉన్నతశిరోభిరాఢ్యా నరా జ్ఞేయాః సదా గుహ, వధబంధభాగినో వీరా నరా నిమ్నలలాటినః, భృశమున్నతైశ్చ మూర్ఖాశ్చ కృపణాశ్చ తథా నతైః. ౨౧. శుభావహంమనుష్యాణాంవదనంస్యాద్యథా శృణు, అదీనమాననం స్నిగ్ధం

విశేషశుభప్రదమగును. కన్నీరుగలిగి దీనమై రూక్షము నస్నిగ్ధము నగు వదనము నిందితము. ఓపర్వతవిభేదీ! అట్టి నరులముఖము దర్శనీయము గాదు. గాత్రచలనములేని హసితము నరులకు శుభదము. పాపాత్ములు నవ్వునపుడు కన్నులు మూసికొనియుండును. మండలాకారమగు శిరము గలవాఁడు గవాఢ్యుఁడగును. గొడుగువంటితలగలవాఁడు రాజగును. చట్టిపలెనున్న తలగలవాఁడు పితరుల వధించును. గంటనుబోలు తలగల వాఁడు పాంథుఁడై త్రిమ్మరుచుండును.నిమ్నమగుశిరము నరున కనర్థదాయకము.గుడములు(బెల్లపురన్నెగలవి.) స్నిగ్ధములు నట్టులే నల్లనివియు నభిన్నాగ్రములు నాతిబహుళములు మృదువులు నగువెండ్రుకలుగలిగియుండెనేని యాతఁడు నరాధిపుఁడగును. అధికముగను గపిలవర్ణములుగను స్థూలముగను విషమముగను స్ఫుటితాగ్రములుగ పరుషములుగను హ్రస్వములుగ నతికుటిలముగ నుండు కేశములు దరిద్రులకేగాని యితరుల కుండవు. ఓకార్తికేయా! ఇట్లు మనుజుల శుభాశుభలక్షణములఁ జెప్పితిని. ఇక మీఁద స్త్రీలక్షణముల వివరింతును సావధానుఁడవై యాకర్ణింపుమని పితామహుండు గుహున కనియె. —

ఇది సప్తవింశాధ్యాయము.

---

సస్మితం చ విశేషతః. ౨౨. సాశ్రు దీనం తథా రూక్షమస్నిగ్ధం నిందితం గుహ, అసంభావ్యం ముఖం జ్ఞేయం నరాణాం నగదారణ. ౨౩. అకంపం శుభదం జ్ఞేయం నరాణాం హసితం గుహ, నిమీలితాక్షం పాపస్య హసితం చార్భవోత్తమ. ౨౪. ఆమండలం శిరో యస్య స గవాఢ్యో నరో భవేత్, ఛత్రాకృతి శిరో యస్యస భవేన్నృపతిర్నరః. ౨౫. చిపిటాకారితశిరా హన్యాద్వై పితరౌ నరః, ఘుంటాకృతి శిరోఽధ్వనమసకృత్సేవతే నరః, నిమ్నం శిరోఽనర్థదం స్యాన్నరాణామార్భవోత్తమ. ౨౬. గుడైః స్నిగ్ధైస్తథా కృష్ణైరభిన్నాగ్రైస్తథైవ హి, కేశైర్న చాతిబహులైర్మృదుభిః పార్థివో భవేత్. ౨౭. బహులాః కపిలాః స్థూలా విషమాః స్ఫుటితాస్తథా, పరుషా హ్రస్వాతికుటిలా దరిద్రాణాం కచా ఘనాః. ౨౮. ఇత్యుక్తం లక్షణం నృణాం శుభం వాశుభమేవ చ, యోషితాం తదిదానీం తే లక్షణం వచ్మి భీమజ. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే పురుషలక్షణవర్ణనం నామ
సప్తవింశోఽధ్యాయః.

## అష్టావింశాధ్యాయము.

ఓకార్తికేయా! మున్నేను నారదున కెఱింగించినపగిది నుత్తమ స్త్రీలక్షణములఁ జెప్పెద వినుము. ఇది యెఱింగిన శుభాశుభములందలి తత్త్వ మవగతము గాఁగలదు. నిందితస్త్రీలక్షణములును ప్రశస్తస్త్రీలక్షణములును వేర్వేర నెఱింగింతును. మాతాపితరులును భ్రాతృమాతులులును ననునలువురిలో రెండుబింబములు పరీక్షింపవలయునని సముద్రుఁడు నియమించెను. ఒకశుభతిథియందు సుపూజితనక్షత్రమునందు నొక్క శుభముహూర్తమున శాస్త్రవిదుండు బ్రాహ్మణులతోఁ గూడిగాని స్వయముగ నొంటిగగాని యేగి కన్నె నీక్షింపవలయును హస్తములను, బాదములను, వ్రేళ్లను, గోళ్లను, నరచేతిని, బిక్కలను, గటిదేశమును, నాసిక, నూరుదేశమును, జఘనము, నుదరమును, వీపును, స్తనములను, కర్ణములను, నట్లే భుజములను, నాలుకను, బెదవులను, దంతములను, జెక్కులను, గంఠమును, నట్టులే కనుగొనలును, లలాటమును, శిరస్సును, వెండ్రుకలను, నట్టులే రోమరాజిని, గంఠస్వరమును, వర్ణమును, సుడులను పలుమాఱులు పరీక్షింపవలయును. ఏకన్నియకు మెడపై రేఖ యుండునో నేత్రాంతములు రక్తములై యుండునో యట్టికన్నియ యెవనిగృహమునకు వచ్చునో యాతనిగృహమున సుఖము దినదినాభివృద్ధియగును. మఱియు నేపిల్లకు లలాటమున దేవనిర్మితమగు త్రిశూల

---

బ్రహ్మోవాచః—శృణ్విదానీం మహాబాహో స్త్రీలక్షణమనుత్తమమ్, యన్మయోక్తం పురా వీర నారదస్య మహాత్మనః. ౧. తత్వం విజ్ఞాయతే యేన శుభాశుభమవస్థితమ్, నిందితం చ ప్రశస్తం చ స్త్రీణాం వక్ష్యామి లక్షణమ్. ౨. మాతరం పితరం చైవ భ్రాతరం మాతులం తథా, ద్వౌ తు బింబౌ పరీక్షేత సముద్రస్య వచో యథా. ౩. ముహూర్తే తిథిసంపన్నే నక్షత్రే చాభిపూజితే, ద్విజైస్తు సహ వాగమ్య కన్యాం వీక్షేత శాస్త్రవిత్. ౪. హస్తౌ పాదౌ పరీక్షేత అంగులీర్నఖమేవ చ, పాణిమేవ చ జంఘే చ కటినాసోరు ఏవ చ. ౫. జఘనోదరపృష్ఠం చ స్తనౌ కర్ణౌ భుజౌ తథా, జిహ్వాం చోష్ఠౌ చ దంతాశ్చ కపోలం గలకం తథా. ౬. చక్షుర్నాసా లలాటం చ శిరః కేశాంస్తథైవ చ,రోమరాజింస్వరం వర్ణమావర్తాని తు వాపునః.౭. యస్యాస్తు రేఖా గ్రీవాయాం యా చ రక్తాంతలోచనా, యస్య సా గృహమాగచ్ఛేత్తద్గృహం సుఖమేధతే. ౮. లలాటే దృశ్యతే యస్యాస్త్రిశూలం దేవనిర్మితమ్, బహూనాం స్త్రీసహ

రేఖ యగపడునో యాకన్య యనేకవేలస్త్రీలకు స్వామిని యగునని చెప్ప వలయును. మఱియు నేకన్య రాయంచనడ గలిగియుండునో యేవనిత మృగనేత్రియైయుండునో యేనాతి మృగవర్ణము గలిగియుండునో యేపడఁతి దంతాగ్రములు ముందుపల్లును సమములై తెల్లగనుండునో యాకన్య నుత్తమకన్యగా నెఱుంగుదురు. కప్ప కెనయగుకడుపుగలిగిన కన్య న్యగ్రోధపరిమండలాభిధమగు స్త్రీజాతిలోఁ జేరును. ఆపె యొక్క పుత్రునే గనును. ఆతఁడును రాజు గాఁగలఁడు. హంసస్వరయు మృదువచనము నగుకన్య మధుపింగల యనుజాతిలోఁ జేరును. అక్కన్నియ యెనమండ్రుపుత్రులఁ గనును. ధనధాన్యములను వృద్ధిబొందించును. మఱియు నేకన్యకుఁ జెవులు పొడవయి యుండునో నాసిక యందముగ నుండునో కనుబొమ లింద్రాయుధమువలె నుండునో యాకన్య మిగుల సుఖము లనుభవించును తన్వంగియు సురూపయు శ్యామకృష్ణవర్ణములుగలదియు స్నిగ్ధములగునంగములు గలదియు మృదుభాషణములు వలుకునదియు శంఖమువలెను మల్లెమొగ్గలవలెను జంద్రునవలె నున్న దంతములుగలదియు నైశ్వర్యములు గాంచును. ఏకన్యకు జఘనము విస్తీర్ణమయి యుండునో యేకన్నియనడుము వేదివలె నుండునో నేత్రములు విశాలములై పొడవరి యుండునో యాకన్య రాజపత్ని యగును. ఏకన్నియకు వామపయోధరమునగాని వామహస్తమునగాని వామకర్ణమునగాని గళమునగాని నల్లనిమచ్చయుండునో యాకన్య తొలుతఁ గుమారుఁ బ్రసవించును అవ్యక్తములగుచీలమడిమలు నంగుళులు నాడులును స్వల్పము

---

స్త్రాణాం స్వామినీం తాం వినిర్దిశేత్. ౯. రాజహంసగతిర్యస్యా మృగాక్షీ మృగవర్ణికా, సమశుక్లాగ్రదంతా చ కన్యాం తాముత్తమాం విదుః. ౧౦. మండూకకుక్షీ యా కన్యా న్యగ్రోధపరిమండలా, ఏకం జనయతే పుత్రం సోఽపి రాజా భవిష్యతి. ౧౧. హంసస్వరా మృదువచా యా కన్యా మధుపింగలా, అష్టౌ జనయతే పుత్రాన్ధనధాన్యవివర్ధినీ. ౧౨. ఆయతౌ శ్రవణౌ యస్యాః సురూపా చాపి నాసికా, భ్రువౌ చేన్ద్రాయుధాకారౌ సాత్యంతం సుఖభాగినీ. ౧౩. తన్వీ శ్యామా తథా కృష్ణా స్నిగ్ధాంగీ మృదుభాషిణీ, శంఖకుందేందుదశనా భవేదైశ్వర్యభాగినీ. ౧౪. విస్తీర్ణం జఘనం యస్యా వేదిమధ్యా తు యా భవేత్, ఆయతే విపులే నేత్రే రాజపత్నీ తు సా భవేత్. ౧౫. యస్యాః పయోధరే వామే హస్తే కర్ణే గలేఽపి వా, మశకం తిలకం వాపి సా పూర్వం జనయే

లగుపార్ష్ణి (చీలమండక్రింది) భాగములును గలిగి సుమధ్యమయై యెఱ్ఱని కన్నులును చరణములును గలిగియున్నకన్య మిక్కిలి సుఖభాగిని యగును. తాఁబేలువంటి మీఁదిభాగముగలవియు నాయతములగు నఖములుగలవియు నునుపులేనివియు వంకరవ్రేళ్లుగలవియు నగుపాదములు గలకన్యను దూరముగ విడువవలయును. ఏదే నొకభాగమునఁ గారణాంతరమున మాంసము విశేషముగ వృద్ధిబొందెనేని యాకన్య రాసభజాతిలోఁ జేరినది. అట్టికన్యకుఁ గళ్యాణము జేయరాదు. అందులకుఁ దగునదిగాదు. ఏకన్య చరణమున రెండవవ్రేలు బొటనవ్రేలుకన్నఁ బొడవయి యుండునో యాకన్య దుఃశీలయు దుర్భగయు నగునని యెఱింగి యాకన్యను విడువవలయును. మఱియు నేకన్నియచరణమున నడిమివ్రేలు భూమి నంటదో యాకన్నియ కౌమారముననే కామచారిణియు స్వచ్ఛందవృత్తియు నయియుండి శ్లాఘాపాత్రము గాఁజాలదు. పాదమున నాలుగవవ్రేలగు ననామిక క్షితినంటదేని యాకన్నియ రెండవవానిని గూడ మ్రింగి మూఁడవవానిఁ జేపట్టును. చిటికెనవ్రేలు నేలనంటకుండిన నాకన్యయు నిరువురఁ జంపి మూఁడవవానిఁ జేరును. దేవసంబంధము గల కన్యను ధనవంతులకన్యను ధాన్యప్రతినామముగలకన్యను లతావృక్షాది తుల్యనామముగలకన్యను బరిగ్రహింపరాదు. అట్టులే యింద్రుఁడు చంద్రుఁడు మొదలగుపురుషనామముగలకన్యనుగూడ వీడవలెను. నక్షత్ర

---

త్సుతమ్. ౧౬. గూఢగుల్ఫాంగులిశిరా అల్పపార్ష్ణిః సుమధ్యమా, రక్తాక్షీ రక్తచరణా సాత్యంతం సుఖభాగినీ. ౧౭. కూర్మపృష్ఠాయతనఖౌ స్నిగ్ధభావవివర్జితౌ, వక్రాంగులితలౌ పాదౌ కన్యాం తాం పరివర్జయేత్. ౧౮. యేన కేనచిదంశేన మాంసం యస్యా వివర్ధతే, రాసభీం తాదృశీం విద్యాన్న సా కల్యాణమర్హతి. ౧౯. పాదే ప్రదేశినీ యస్యా అంగుష్ఠం సమతిక్రమేత్, దుఃశీలా దుర్భగా జ్ఞేయా కన్యాం తాం పరివర్జయేత్. ౨౦. పాదే మధ్యమికా యస్యాః క్షితిం న స్పృశతే యది, రమతే సా న కౌమారే స్వచ్ఛందా కామచారిణీ. ౨౧. పాదే అనామికా యస్యాః క్షితిం న స్పృశతే యది, ద్వితీయం పురుషం హత్వా తృతీయే సా ప్రతిష్ఠితా. ౨౨. పాదే కనిష్ఠా యస్యాస్తు క్షితిం న స్పృశతేయది, ద్వితీయం పురుషం హత్వా తృతీయే సా ప్రతిష్ఠితా. ౨౩. న దేవికా న ధనికా న ధాన్యప్రతినామికా, గుల్మవృక్షసనామ్నీ చ కన్యాం తాం పరివర్జయేత్. ౨౪. ఇంద్రచంద్రాదిపురుషసనామ్నీ చ యదా భవేత్, నైతాః పతిషు రజ్యంతే యాశ్చ

నామముగలకన్యలనుగూడఁ గొనరాదు. వీరలకు మగలయెడ ననురాగ ముండదు. ఏకన్య వీపు మొదలు నాభివఱకును సుడిగలిగియుండునో యా కన్య కగుసంతానము హ్రస్వమగు నాకారముగలిగియట్టియాయువే గలిగి యుండును. వెనుక సుడియుండినకన్యకు మగఁడు మృతినొందును. బొడ్డున సుడియుండినఁ బతివ్రత యగును. మొలయందు సుడియుండిన స్వైరిణి యయి యెకప్పుడేని నిజవృత్తినుండి విరక్తిఁజెందదు. ఏకన్య నవ్వునెడఁ జెక్కులు గుంటలుపడునో యది స్వచ్ఛందముగఁ గార్యము లొనర్చుచుఁ గౌమారమునఁగూడ జనులను రమింపఁజేయదు. ఏకన్నియ నడచునెడఁ బిక్క టిక్కుటిక్కుమని ధ్వనించునో యాకన్య పుత్రునిఁ బతిఁగాఁ జేసి కొనుటలో సందియములేదు. మఱియు నేకన్య స్థూలపాదయైయుండునో సర్వాంగములందును లోమములు గలిగియుండునో స్థూలహస్తయై యుండునో యాకన్య దాసిగాఁగలదని బుధుఁ డెఱుంగవలెను. మఱియు నేకన్నియపాదములు కటకములకు దగక యెత్తుగను ముఖము వికృత ముగనుండునో పై పెదవిని రోమములుండునో యాకన్నియ శీఘ్రముగఁ బతిని భక్షించును. ఏకన్నియకు లలాటము నుదరము గటిదేశము నను నీమూఁడును వ్రేలాడుచుండునో యాకన్నియ మఱఁదిని మామను మగని నను మ్గురను భక్షించును. అలంకరింపఁబడినచారిత్రముగలది (పలువుర కాదర్శమయి) యు గురుభక్తురాలును పతివ్రతయు దేవబ్రాహ్మణభక్తు

నక్షత్రనామికాః. ౨౫. ఆవర్తః పృష్ఠతో యస్యా నాభిం సమనువిందతి, తదపత్యం భవేద్ధ్రస్వం హ్రస్వాయుశ్చ వినిర్దిశేత్. ౨౬. పృష్ఠావర్తా పతిం హంతి నాభ్యావర్తా పతివ్రతా, కట్యావర్తా తు స్వచ్ఛందా న కదాచిద్విరజ్యతే. ౨౭. యస్యాస్తు హస మానాయా గండే జాయేత కూపకమ్, రమతే సా న కౌమారే స్వచ్ఛందా కార్యకారిణీ. ౨౮. యస్యాస్తు గచ్ఛమానాయాష్టిట్టికాయతి జంఘికా, పుత్రం వ్యవస్యైతాన్ కర్తుం పతిత్వే నాత్ర సంశయః. ౨౯. స్థూలపాదా చ యా కన్యా సర్వాంగేషు చ లోమశా, స్థూలహస్తా చ యా స్యాద్వై దాసీం తాం నిర్దిశేద్బుధః. ౩౦. యస్యాశ్చోత్కటకౌ పాదౌ ముఖం చ వికృతం భవేత్, ఉత్తరోష్ఠే చ రోమాణిసా క్షిప్రం భక్షయేత్పతిమ్. ౩౧. త్రీణి యస్యాః ప్రలంబంతే లలాటముదరం స్ఫిచౌ, త్రీణి భక్షయతే సా తు దేవరం శ్వశురం పతిమ్. ౩౨. సమద్భూషితచారిత్రా గురుభక్తా పతివ్రతా, దేవబ్రాహ్మణ

రాలు నగువనితను మానుషము గలదానిగా నెఱుంగవలయును. ఎల్లప్పుడును స్నానముచేసి సుగంధములుగలదై యెల్లప్పుడును బ్రియమునే బలుకు నలవాటుగలదియు నల్పాహారము గుడుచునదియు నల్పరోషము గలదియు నగుకన్నియను దేవతగా నెఱుంగవలయును. ఏవనిత పాప మొనరించినను రహస్యముగ నొరులెఱుఁగకుండునట్లు చేయునో జనాప వాదమునుండి యాత్మరక్షణము జేసికొనఁగలుగునో యేమానిని హృదయము నిపుణమతులైన గ్రహింపఁజాలరో యాకన్నియ మార్జారి యని యెఱుఁగవలయును. ఏకన్యయెల్లప్పుడును నవ్వుచు నాడుచుఁ గోపించుచుఁ బ్రసన్నురాలగుచునుండునో యెల్లప్పుడు నీచసంఘములో రమించుచుండునో యాకన్య రాసభి యని యెఱుంగవలయును. ఎల్లప్పుడు మగనికిని బంధుగులకును బ్రతికూలముగఁ బ్రవర్తించుచు స్వచ్ఛందముగఁ దిరుగుటయం దాసక్తిగలుగువనిత యాసురి యని యెఱుంగవలయును. అమితముగ భుజించుచు నమితముగ నప్రకృతముగఁ బ్రలపించుచు నెల్లప్పుడు నప్రియములే బలుకుచు భర్తను బాధలుపఱచువనితయుఁ బతిని జంపువనితయు రాక్షసి యనఁదగును. శౌచాచారములులేక రూపములేక భయంకరమూర్తియై యధికముగఁ జెమ్మటలుగార్చుచు మలినయై యుండువనిత పిశాచి యనఁదగును. నిచ్చలు జలకమాడి సుగంధములలంది మాంసమద్యములను బ్రియముగ మెసవువనితయు వృక్షములందు

---

భర్తా చ మానుషీం తాం వినిర్దిశేత్. ౩౩. నిత్యం స్నాతా సుగంధా చ నిత్యం చ ప్రియవాదినీ, అల్పాశిన్యల్పరోషా చ దేవతాం తాం వినిర్దిశేత్. ౩౪. ప్రచ్ఛన్నం కురుతే పాపమపవాదం చ రక్షతి, హృదయం స్యాచ్చ దుర్గ్రాహ్యం మార్జారీం తాం వినిర్దిశేత్. ౩౫. హసతే క్రీడతే చైవ క్రుద్ధా చైవ ప్రసీదతి, నీచేషు రమతే నిత్యం రాసభీం తాం వినిర్దిశేత్. ౩౬. ప్రతికూలకరీ నిత్యం బంధూనాం భర్తురేవ చ, స్వచ్ఛందే లలితాంచైవ ఆసురీం తాం వినిర్దిశేత్. ౩౭. బహ్వాశీ బహువాక్యా చ నిత్యం చాప్రియవాదినీ, హినస్తి స్వపతిం యా తు రాక్షసీం తాం వినిర్దిశేత్. ౩౮. శౌచాచారపరిభ్రష్టా రూపభ్రష్టా భయంకరా, ప్రస్వేదమలపంకా చ పిశాచీం తాం వినిర్దిశేత్. ౩౯. నిత్యం స్నాతాం సుగంధాం చ మాంసమద్యప్రియాదినీమ్, వృక్షోద్యాన

నుద్యానములందును దిరుగనేర్చువనితయు గాంధర్వి యనఁదగును చిత్తాదీంద్రియచాంచల్యమును సర్వాంగచాపల్యమును గలదై యెల్ల వేళల దిక్కులఁ బరికించుచుండువనితయుఁ జపలస్వభావము గలవనితయు లుబ్ధురాలును వానరి యని యెఱుంగనగును. పూర్ణచంద్రునిబోలు నెమ్మోముగలిగి మంగళదాయకములగు నంగములుగలిగి మత్తవారణముగతి నడచుచు నీషద్రక్తములగు నఖములు హస్తములును గలిగి యుండువనితను విద్యాధరి యని బుధుఁ డెఱుంగనగును. వీణావాదిత్రాదులశబ్దమునం దాసక్తిగలిగి పిల్లనగ్రోవిపాటలధ్వనియం దాసక్తయై యెల్లప్పుడును పుష్పములు దాల్చుట ధూపములు వేసుకొనుటలయెడల నాసక్తిగలిగియుండువనితయు గాంధర్వి యనఁదగును. అని యివ్విధమున మహానుభావుఁడగు వేధలోకపూజ్యమగు స్త్రీలయుఁ బుంస్త్వవంతులయు లక్షణములు గుహ్యన కెఱింగించి నిజమందిరమున కరిగెనని సుమంతుఁడు రాజున కెఱింగించెను. —

ఇది అష్టావింశాధ్యాయము.

---

ప్రసక్తాం చ గాంధర్వీం తాం వినిర్దిశేత్. ४०. చపలా చంచలా చైవ నిత్యం పశ్యేద్దిశస్తథా, చలస్వభావా లుబ్ధా చ వానరీం తాం వినిర్దిశేత్. ४१. చంద్రాననాం శుభాంగీం తు మత్తవారణగామినీమ్, ఆరక్తనఖహస్తాం తు విద్యాద్విద్యాధరీం బుధః. ४२. వీణావాదిత్రశబ్దేన వంశగీతరవేణ చ, పుష్పధూపప్రసక్తాం చ గాంధర్వీం తాం వినిర్దిశేత్. ४३. సుమంతురువాచ:—ఇత్యేవముక్త్వా స మహానుభావో జగామ వేధా నిజమందిరం వై. స్త్రీణాం తథా పుంస్త్వవతాం చ వీర యల్లక్షణం పార్థివ లోకపూజ్యమ్. ४४.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే స్త్రీలక్షణవర్ణనం నామ అష్టావింశోఽధ్యాయః.

# ఏకోనత్రింశాధ్యాయము.

శతానీకుండు సవినయముగ నోద్విజోత్తమా! గకారాక్షరదేవుఁడగు గణేశుని సాంగము సమంత్రకము నగు నారాధనవిధిని సదయుఁడవై యానతిమ్ము నావుడు సుమంతుఁడు రాజున కిట్లనియె. ఓరాజచూడామణీ! గణపతిపూజనమునకుఁ దిథియు నక్షత్రము నావశ్యకములు గావు. ఉపవాసమును జేయనక్కరలేదు. స్వేచ్ఛానుసారముగ నాచరించువారికిఁ గూడ నిష్టసిద్ధి గలుగును. తెల్లజిల్లేడువేరును సేకరించి దానితోఁ బద్మాసనమున నంగుష్ఠపర్వమాత్ర పరిమాణముగల గణపతిని జేయవలయును. గణపతి చతుర్భుజుఁడు త్రినేత్రుఁడు సర్వాభరణభూషితుఁడునై నాగములను యజ్ఞోపవీతములుగా గొనియుండఁదగును. మఱియు శశాంకరేఖ శిరోభూషణముగ నుండవలయును. ఎడమచేత దంతమును దక్షిణహస్తమున జపమాలయు మూఁడవహస్తమునఁ బరశువును నాలవచేత మోదకము నుంచవలయును. కుంకుమచందనములను మైపూత యొసంగవలయును. వస్త్రాలంకారములచేతను రక్తమాల్యములచేతను నారాధింపవలయును. మఱియు నాగణనాథునకు సుగంధములగుధూపము లర్పించి మోదకములను నివేదింపవలయును. ఇట్లు పూజించి యాదేవు నెదుటనే విద్వాంసుఁ డొకబ్రాహ్మణుని గుడువఁబెట్టవలయును. ఆబ్రాహ్మణు నెదుట నొకపొట్టివాని నొకమరుగుజ్జువానిఁగూడఁ గుడువఁబెట్టవలయును. పిమ్మట నాబ్రాహ్మణునివలన నాశీర్వాదములు పొంది సిద్ధిఁబొందును. ఈవిధాన

---

శతానీక ఉవాచ:—గకారాక్షరదేవస్య గణేశస్య మహాత్మనః, ఆరాధానవిధిం బ్రూహి సాంగం మంత్రసమన్వితమ్. ౧. సుమంతురువాచ:—న తిథిర్న చ నక్షత్రం నోపవాసో విధీయతే, యథేష్టం చేష్టతః సిద్ధిః సదా భవతి కామికా. ౨. శ్వేతార్కమూలం సంగృహ్య కుర్యాద్గణపతిం బుధః, అంగుష్ఠపర్వమాత్రం తు పద్మాసనగతం తథా. ౩. చతుర్భుజం త్రినేత్రం చ సర్వాభరణభూషితమ్, నాగయజ్ఞోపవీతాంగం శశాంకకృతశేఖరమ్. ౪. దంతం సవ్యే కరే దద్యాద్ద్వితీయే చాక్షసూత్రకమ్, తృతీయే పరశుం దద్యాచ్చతుర్థే మోదకం న్యసేత్. ౫. కుంకుమం చందనం చాపి సమాలంభనముచ్యతే, వాసోభిర్భూషణై రక్తైర్మాల్యైశ్చారాధయేద్గణమ్. ౬. ధూపేన చ సుగంధేన మోదకైశ్చాపి పూజయేత్, ఏవం పూజ్యాగ్రతస్తస్య భోజయేద్బ్రాహ్మణం బుధః. ౭. వామనం కుబ్జకం చాపి భోజయేత్పురతో ద్విజమ్, ఆశీర్వాదం తతస్తస్మాత్ప్రాప్య సిద్ధి

మునఁ గలమంత్రపదముల నెఱింగింతు భక్తిమెయి నాలకింపుము. స్వాహా కారముతోడ నోంకారముతోడను గూడియున్న "గం" అనునది మూల మంత్రము. "గాం నమః" అని హృదయము జూపనగును. "గీం నమః" అనునక్షరమున శిరము జూపవలయును. "గూం నమః" అని శిఖను జూప వలయును. "గైం నమః" అని కవచము జూపవలయును. "గౌం నమః" అని నేత్రములు జూపవలయును. "గః ఫట్" అను ఫట్కారాంత మంత్ర మస్త్రమును జెప్పును. పైఁజెప్పినవన్నియు నాయాస్థానములందు నమస్కారములు. గణపతి నావాహనము జేయునపుడు "ఆగచ్ఛోల్కాముఖాయ" అనుమంత్రముఁ బఠింపవలయును. "గం గణేశాయ నమః" అని గంధము నొసంగవలయును. "పుష్పోల్కాయ నమః" అనునది పుష్ప మంత్రము, "ధూపోల్కాయ నమః" అనునది ధూపమంత్రము, "దీపోల్కాయనమః" అనునది దీపమంత్రమును అని యెఱుంగవలయును. "ఓం గం మహోల్కాయ నమః" అని బలిమంత్రము. "ఓం సంసిద్ధోల్కాయ నమః" అను నిమ్మంత్రము విసర్జనమునం దుపయోగింపవలయును "ఓం మహాకర్ణాయ విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయాత్" అను గాయత్రీఛందస్కమగుమంత్రమును బూర్వభాగమున జపింపవలయును. మఱియు నోవీరుఁడా! "మహాగణపతయే స్వాహా" యని దక్షిణమున జపింపవలయును. "మహోల్కాయ స్వాహా" యని పశ్చిమభాగమున జపింపవలయును. "కూశ్మాండాయ స్వాహా" యని

---

మవాప్నుయాత్. ౮. భక్త్యా కురుకులశ్రేష్ఠ శృణు మంత్రపదాని వై, గం స్వాహా మూలమంత్రోయం ప్రణవేన సమన్వితః. ౯. గాం నమో హృదయం జ్ఞేయం గీం శిరః పరికీర్తితమ్, శిఖా చ గూం నమో జ్ఞేయో గైం నమః కవచం స్మృతమ్. ౧౦. గౌం నమో నేత్రముద్దిష్టం గః ఫట్ కామాస్త్రముచ్యతే, ఆగచ్ఛోల్కాముఖాయేతి మంత్ర ఆవాహనే హ్యయమ్. ౧౧. గం గణేశాయ నమో గంధమంత్రః ప్రకీర్తితః, పుష్పోల్కాయ నమః పుష్పమంత్ర ఏష ప్రకీర్తితః. ౧౨. ధూపోల్కాయ నమో ధూపమంత్ర ఏష ప్రకీర్తితః, దీపోల్కాయ నమో దీపమంత్ర ఏష ప్రకీర్తితః. ౧౩. ఓం గం మహోల్కాయ నమో బలిమంత్రః ప్రకీర్తితః, ఓం సంసిద్ధోల్కాయ నమో మంత్రశ్చాయం విసర్జనే. ౧౪. ఓం మహాకర్ణాయ విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయాత్ గాయత్రీజపః పూర్వతః. ౧౫. మహాగణపతయే వీర స్వాహా దక్షిణతః సదా, మహోల్కాయ పశ్చిమతః కూశ్మాండాయోత్తరేణ తు, ఏక

యుత్తరభాగమున జపింపవలయును. మఱియు నో వీరా! ఆగ్నేయభాగమున "నేకదంతత్రిపురాన్తకాయ స్వాహా" యని జపింపవలయును. "ఓం శివదత్తవికటహారహాసప్రాణాయ స్వాహా" యని నైరృతియందు జపింపవలయును. "తులంబనాత్యచలదంతకాయ స్వాహా" యని వాయవ్యమున జపింపనగును. "పద్మదంష్ట్రాయ నరాయ స్వాహా" యని యీశాన్యమున జపింపనగును. ఈమంత్రములతోడనే బుధుఁడు హోమములు చేయవలయును. "హుం ఫట్, హుం ఫట్" అని కరతాళధ్వనులు నవ్వుచు గంతులువేయుచుఁ జేయవలయును. మృదునర్తనముచే గణపతిదేవునకు ముద్రను జూపి యావెనుక హోమము చేయవలయును. ఇతరులు తనకు వశ్యులు కాకున్న వశ్యులుగఁ జేసుకొననెంచువారు నల్లనువ్వులతో నెనిమిదివేలహోమము లొనరించిన మూఁడురాత్రులందు రాజువశ్యుఁడగును. తిలయవలు కలిపి హోమముచేసినచో సర్వజనపదములును వశ్యములగును. మిక్కిలి సౌందర్యముగలకన్యయైనను బోవువానిని వెంబడించును. శనగలు బియ్యము హోమముచేసినచో నజితుఁడగును. వేపాకుతోఁ గూడిన తిలలు హోమముచేసిన శత్రువులు లేనివాఁడగును. చంద్రగ్రహణసమయమున నుదకమధ్యమున దిగి నిలచి యెనిమిదివేలు జపించిన యుద్ధమున నపరాజితుఁడగును. ఆదిత్యాభిముఖుఁడై యుండి "ఓం లంబరాజ్ఞే నమః" అనుమంత్రము నెనిమిదివేలు జపింప నాదిత్యుఁడు ప్రసన్నుఁడై వరము నొసంగును. శుద్ధచవితినాఁ డుపవసించి గంధపుష్పాదుల

---

దంత త్రిపురాంతకాయ ఆగ్నేయ్యాం వీర నిర్దిశేత్. ౧౬. ఓం శివదత్త వికటహారహాస ప్రాణాయ స్వాహా నైరృత్యాం, తులంబనాత్యచలదంతకాయ స్వాహా వాయవ్యామ్. ౧౭. పద్మదంష్ట్రాయ నరాయేతి ఐశాన్యాం హోమయేద్బుధః, హుం ఫట్ హుం ఫట్ హస్తతాలధ్వనిర్హాసనకూర్దనః. ౧౮. మృదునర్తనగణపతిర్దేవస్య ముద్రాం తతో హోమం సమాచరేత్, న యదా వశ్యా భవతి, కృష్ణతిలాహుతిమష్టసహస్రం జుహుయా త్త్రిరాత్రేణ రాజా వశ్యో భవతి. ౧౯. తిలయవహోమేన సర్వే జనపదా వశ్యా భవంతి, అతిరూపవతీ కన్యా గచ్ఛంతమనుగచ్ఛతి. ౨౦. చణతండులహోమేనాజితో భవేత్, నింబపత్రసమైస్తైలై ర్విద్వేషణం కరోతి, సోమగ్రహణే ఉదకమధ్యే అవతీర్య అష్టసహస్రం జపేత్, సంగ్రామే అపరాజితో భవతి. ౨౧. (ఓం లంబరాజ్ఞే నమః.) ఆదిత్యాభిముఖో భూత్వా అష్టసహస్రం జపేత్, ఆదిత్యో వరదో భవతి. ౨౨.

నభ్యర్చించి తిలతండులములతో హోమములుచేసి వానిని శిరమునఁ దాల్చినచో నపరాజితుఁడగును. ఉత్తరేణిసమిత్తులతో నగ్నినిఁ బ్రజ్వాలింప జేసి ప్రతిదినము నిర్యేడాహుతు లొసంగుచుండెనేని మూఁడు రాత్రులు గడచినవెనుక శత్రువులను సంహరించును. ఇఁకఁ బైని చెప్ప బోవువిధముగఁగూడమంత్రము వివరింతును. ఒకవృక్షమూలమునఁ గాటు కను నేకరించి యేడుమంత్రములచే మంత్రించి కనుల కద్దానిఁ బూసినచోఁ దాఁజూచువారెల్లఁ దనకు వశమగుదురు. పుష్పమును ఫలమును కంద మూలములను నెనిమిదివేలచే నభిమంత్రించి యెవ్వరికొసంగునో వారు వశులగుదురు. వెనుకటిమూలమంత్రముచే నేకార్యము చేయునో యది యెల్ల సిద్ధించును. అన్నిగ్రహములు సుప్రీతములుగ నుండును. కోట గుమ్మముదాపుజేరి యెనిమిదివేలతో ద్వారము నిరూపించుచో నాద్వార ముచేఁ బురము గృహీతమగును ప్రాఙ్ముఖుఁడై యజించిన ద్వారము తెరుచుకొనును. అభిముఖుఁడై జపించిన దొంగలు పారిపోయెదరు. గడ్డి స్వయముగనే లూనమగును. కాష్ఠములు భిన్నములగును. గజరాజుతోఁ గూడఁ బోరును. జలమధ్యంబున నేడురాత్రులు జపించిన నకాలమున నైనను వర్షముఁగలుగును. తలఁచినచోఁ గూపతటాకములుగూడ నెండిపోఁ జేయును. చిత్తరువునందలి బొమ్మనుగూడ నాట్యముచేయించును. ఆకర్షించును. స్తంభించునట్లుచేయును. నూరుయోజనములనుండియైనను స్త్రీపురు

---

శుక్లచతుర్థ్యాముపోష్య గంధపుష్పాదిభిరర్చనం కృత్వా తిలతండులాన్ జుహుయాత్, శిరసా ధారయంస్తైరపరాజితో భవతి. ౨౩. అపామార్గసమిద్భిరగ్నిం ప్రజ్వాల్య ఏకవింశత్యాహుతీర్యో జుహుయాత్, త్రిరాత్రాచ్ఛత్రుం వ్యాపాదయతి. ౨౪. అథోత్తరేణ మంత్రం వ్యాఖ్యాస్యే, వృక్షమూలే కజ్జలం సంగృహ్య సప్తభిర్మంత్రితం కృత్వా నేత్రాణ్యంజయేద్యం పశ్యతి స వశీ భవతి. ౨౫. పుష్పం ఫలం మూలం చాష్టసహస్రాభిమంత్రితం కృత్వా యస్మై దదాతి స వశ్యో భవతి. ౨౬. యత్కించిన్మూలమంత్రేణ కరోతి తత్సిధ్యతి, సర్వే గ్రహాః సుప్రీతా భవంతి, నగరద్వారం గత్వా అష్టసహస్రం ద్వారం నిరూపయేత్. ౨౭. పురం ద్వారేణ గృహ్యతే ప్రాఙ్ముఖో యజతి స ఉచ్చాటయతి, సమ్ముఖో జయతి చోరాన్విద్రావయతి. ౨౮. తృణాని లూనయతి, కాష్ఠాని చ్ఛేదయతి. ౨౯. గజరాజేన యుద్ధయతి, జలమధ్యే సప్తరాత్రం జపేత్, అకాలే వర్షయతి, కూపతడాగాఞ్ఛోషయతి, ప్రతిమాం నృత్యయతి, ఆకర్షయతి, స్తంభయతి,

షుల నాకర్షింపవచ్చును. వేయింటిచే మంత్రించిన గోరోజనము హస్తమున ముడిచికొని నూరువే లామడలైనను పోయిరాఁగలఁడు. అటుగాక స్త్రీనిగాని పురుషునిగాని చంపఁగోరువాఁడు చంద్రకట్టితో శంకువు నిర్మించి పాతిపెట్టినచో నుత్తరక్షణముననే వారు మృతులగుదురు. సర్వపాతక నాశన మపేక్షించి యిట్లొనరించిన పాపవిముక్తుఁడగును. అగ్నిసమతేజస్కుఁడై యెల్లవారికి నపరాజితుఁడగును. "ఓం వక్రతుండాయ స్వాహా" "ఓం ఏకదంష్ట్రాయ స్వాహా" "ఓం కృతకృష్ణాయ స్వాహా" "ఓం గజకర్ణాయ స్వాహా" "ఓం లంబోదరాయ స్వాహా" "ఓం వికటాయ స్వాహా" "ఓం ధూమ్రవర్ణాయ స్వాహా" "ఓం గగనకూజాయ స్వాహా" "ఓం వినాయకాయ స్వాహా" "ఓం గణపతయే స్వాహా" "ఓం హస్తిముఖాయ స్వాహా" అని యీస్వాహాకారాంతమంత్రములతో హోమములు చేయవలయును.

ఇది ఏకోనత్రింశాధ్యాయము.

---

యోజనశతాత్ స్త్రీపురుషానాకర్షయతి. ౩౦. గోరోచనాం చ సహస్రాభిమంత్రితాం కృత్వా హస్తే బద్ధ్వా యోజనశతసహస్రం గత్వా పునరాగచ్ఛతి. ౩౧. అథ మారయితుకామః ఖదిరకీలకం కృత్వా స్త్రీపురుషం విచింత్య హృదయే నిఖనయేత్, క్షణాదేవ మ్రియతే. ౩౨. సర్వపాతకవిముక్తో భవతి, అగ్నితేజాః సర్వేభ్యోఽపరాజితో భవతి. ౩౩. ఓం వక్రతుండాయ స్వాహా, ఓం ఏకదంష్ట్రాయ స్వాహా, ఓం కృతకృష్ణాయ స్వాహా, ఓం గజకర్ణాయ స్వాహా, ఓం లంబోదరాయ స్వాహా, ఓం వికటాయ స్వాహా, ఓం ధూమ్రవర్ణాయ స్వాహా, ఓం గగనకూజాయ స్వాహా, ఓం వినాయకాయ స్వాహా, ఓం గణపతయే స్వాహా, ఓం హస్తిముఖాయ స్వాహా. ౩౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే గణపతికల్పవర్ణనం నామ
ఏకోనత్రింశోఽధ్యాయః.

## త్రింశాధ్యాయము

సుమంతుండు శతానీకునితో మఱియు నిట్లనియె. రాజా! వేప కఱ్ఱతో నంగుష్ఠపర్వమాత్రప్రమాణముగ గణపతిప్రతిమఁజేసి యెల్లప్పుడును గంధధూపాదులచే నర్చించుచు శిరమున మరుగుపఱచుకొని సంచరించినచో నెల్లజనులకుఁ బ్రియుఁడగును. తెల్లజిల్లేడువ్రేలితో నంగుష్ఠపర్వప్రమాణమగు ప్రతిమజేసి ధూపాదుల నర్చనలు సలుపుచుండిన సర్వవర్ణములవారును వశులగుదురు తెల్లని గంధపుచెక్కతో నంగుష్ఠపర్వప్రమాణమగు గణపతిప్రతిమను గావించి పుష్పగంధాదుల నర్చించి శుద్ధచవితినాఁడుగాని యష్టమీతిథియందుఁగాని దధిపాయసములతో బలియొసంగి వానితోనే యెనిమిదివేలు వ్రేల్చిన రాజైనను దనచేతికీలుబొమ్మ యగును. ఎఱ్ఱనిచందనముతో వెనుకజెప్పిన ప్రతిమజేసి భూతబలి నొసంగి దధిమధుఘృతములతో గణపతి కెనిమిదివేలహోమము లొనర్చినచోఁ దాన పేక్షించిన ప్రజలనెల్ల వశపఱచుకొనును. ఎఱ్ఱగన్నేరువ్రేలితో వెనుకటిప్రతిమజేసి రక్తపుష్పగంధముల నర్చించి రక్తోపహారములచే బలి నొసంగి నువ్వులనుప్పును నేతి నెనిమిదివేలు హోమమొనర్చినఁ బదిగ్రామములు వశమగును. తెల్లగన్నేరుతోఁ బ్రతిమగావించి తెలికిపిండి పెరుగు నెయ్యి పాలు పసుపు కలిపి యెనిమిదివేలు వ్రేల్చిన వేశ్యయు వశమగును. రావిమొదలుతో గణపతిని జేసి

---

సుమంతురువాచ:—నింబమయమంగుష్ఠపర్వమాత్రం గణపతిం కృత్వా నిత్య ధూపగంధాదిభిరర్చయిత్వా ప్రచ్ఛన్నం శిరసి బద్ధ్వా గచ్ఛేత్. సర్వజనప్రియో భవతి. శ్వేతార్కమూలాంగుష్ఠమాత్రం గణపతిం కృత్వా ధూపాదిభిరర్చయిత్వా సర్వాన్వర్ణాన్వశమానయతి. శ్వేతచందనమంగుష్ఠమాత్రం గణపతిం కృత్వా పుష్పగంధాదిభిరర్చయిత్వా శుక్లచతుర్థ్యామష్టమ్యాం వా బలిం కుర్యాదష్టసహస్రం జుహుయాద్దధ్నా పాయసేన రాజానం వశమానయతి. రక్తచందనమయం గణపతిమంగుష్ఠమాత్రం కృత్వా భౌతికం బలిం దద్యాద్దధిమధుఘృతాహుతీనాం గణపతిమష్టసహస్రం జుహుయాదాత్మప్రాపికాం ప్రజాం వశమానయతి. రక్తకరవీరమూలాంగుష్ఠపర్వమాత్రం గణపతిం కారయేత్. రక్తపుష్పగంధోపహారైర్బలిం దద్యాత్. తిలలవణఘృతేనాష్టసహస్రం జుహుయాత్. దశగ్రామాన్వశమానయతి. శ్వేతకరవీరాంగుష్ఠపర్వమాత్రం గణపతిం కృత్వా తిలకిష్టదధిఘృతక్షీరహరిద్రామిశ్రేణాష్టసహస్రం జుహుయాద్వేశ్యాం

గంధపుష్పధూపబలుల నొసంగి నూరుహోమములుచేసిన శత్రుఁడు లొంగియుండును. జిల్లేడు మొదలున బొమ్మచేసి గంధపుష్పధూపబలుల నొసంగి తిందుక (నల్లతుమికిచెట్టు) సమిత్తులతో నెనమన్నూరు హోమములు వ్రేల్చినను శత్రువు వశుఁడగును మారేడు మొదలుతో నంగుష్ఠమాత్రప్రమాణమగు గణపతిబొమ్మను జేసి గంధపుష్పధూపములచే నర్చించి మూఁడుమధువులతోఁ బూయఁబడిన సమిత్తులను వహ్నిలో నెనిమిదివేలువ్రేల్చిన రాజామాత్యులను వశపఱచుకొనవచ్చును. ధూపములు శిరమున ధరించి రాజద్వారముకడ కేగ విరోధము గలిగినచో జయము లభించును. ఏనుఁగుదంతముతోఁడను మృత్తికతోఁడను గణపతిని జేయించి గణపతిని గంధపుష్పధూపములచే నర్చించి బహుళచవితినాఁడు దిగంబరుఁడై యర్చించి యేడుదినములు నియతముగ మూలమంత్రము జపియింప నారీమణులకు వలపులయిక్క యగును. ఎద్దుకొమ్ముమృత్తులతోఁ బ్రతిమ యొనరించి గంధపుష్పముల నర్చించి గుగ్గిలము పొగవైచినచో ఘోషపతి (పశువులుగలవాఁడు)ని వశపఱచుకొనుచున్నాఁడు. అటు కాదేని పుట్టమన్ను దెచ్చి యంగుష్ఠపర్వపరిమితంబగు గణపతివిగ్రహంబు జేయించి కటుకతైలమున లేపన మొసంగి యున్మత్తకఱ్ఱలతో నగ్నిని జ్వలింపఁజేసి యెనిమిదివేలయాహుతులు నువ్వులు నావాలును గలిపి

---

వశమానయతి, అశ్వత్థమూలాంగుష్ఠపర్వమాత్రం గణపతిం కృత్వా గంధపుష్పధూపబలిం దత్త్వా శతం జుహుయాచ్ఛత్రుం వశమానయతి. అర్కమూలాంగుష్ఠపర్వమాత్రం గణపతిం కృత్వా గంధపుష్పధూపబలీన్ దద్యాత్. తిందుకాష్టశతం జుహుయాచ్ఛత్రుం వశమానయతి. బిల్వమూలమయమంగుష్ఠపర్వమాత్రం గణపతిం కృత్వా గంధపుష్పధూపార్చితం కృత్వా త్రిమధ్వక్తానామష్టసహస్రం జుహుయాద్రాజామాత్యాన్వశమానయతి. శిరసి ధూపాన్ధృత్వా గచ్ఛేద్రాజద్వారం విగ్రహే జయో భవతి. హస్తిదంతమృత్తికామయమంగుష్ఠపర్వమాత్రం గణపతిం కారయేత్. గంధపుష్పధూపార్చితం కృత్వా కృష్ణచతుర్థ్యాం నగ్నో భూత్వాభ్యర్చయేత్. సప్తవారాన్ జపేన్నిత్యం నారీణాం సుభగో భవతి. వృషభశృంగమృత్తికాంగుష్ఠమాత్రం గణపతిం కారయేత్. గంధపుష్పార్చితం కృత్వా గుగ్గులుధూపం దద్యాద్ఘోషపతిం వశమానయతి. అథవా వల్మీకమృత్తికాంగుష్ఠపర్వమాత్రం గణపతిం కారయేత్. కటుకతైలేన ప్రతిమాం లేపయేత్. ఉన్మత్తకకాష్ఠేనాగ్నిం ప్రజ్వాల్యాహుతీనామష్టసహస్రం జుహుయాత్తిల

చేయవలయును. సమస్తధూపముల నొసంగి త్రికటుకముతో లేపనము జేయవలయును. (శొంటి పిప్పళ్లు మిరియాలు యేలకులు ఆకుపత్రి లవంగాలు కటుకము లనఁబడును) అగరుధూప మొసంగవలయును. ఇటు చేసిన రాజును వశపఱచుకొననగు. శత్రులకుఁ గూడఁ బ్రియుఁడగు. తన శరీరమునకు రక్తచందనముతోఁ బొగవైచుకొనినచో (నందగాఁడు) సుభగుఁడగును. "ఓం గణపతయే, వక్రతుండాయ, గజదంతాయ, గులుగులేతినినాదాయ, చతుర్భుజాయ, త్రినేత్రాయ, ముసలపాశవజ్రహస్తాయ, సర్వభూతదమనాయ, సర్వలోకవశంకరాయ, సర్వదుష్టోపఘాతజననాయ, సర్వశత్రునిమర్దనాయ, సర్వరాజ్యసమీహానాయ, రాజానమిహావశమానయ, హానహాన, పచపచ, వజ్రాంకుశేన గణేశ ఫట్ స్వాహా" గణాధిపునకును, వంకరతుండము గలవానికి, నేనుఁగుదంతముగలవానికిని, గులుగులు ధ్వనిగలవానికి, నాల్గుభుజములుగలవానికి, మూఁడుకన్నులవానికిని, రోఁకలి త్రాడు వజ్రమును జేతఁగొనినవానికిని, సర్వభూతములను శిక్షించువానికిని, సర్వలోకమును వశపఱచువానికిని, సమస్తదుష్టులకును విఘ్నములుగూర్చువానికి, సర్వశాత్రవులను విశేషముగ మర్దించువానికిని, సర్వరాజ్యమును బాలించువానికిని నమస్కారము. ఓగణేశా! ఇచ్చట రాజును వశునిగావింపుము. సర్వశత్రువులను వజ్రముచేత నంకుశముచేతను చంపుము, చంపుము. వండుము. వండుము. జయమగుఁగాక. అని స్వాహాకారాంత మంత్రముతో హోమము చేయవలయును. "ఓం-గాం-గీం గూం-గైం-గౌం-గః-స్వాహా" అనుమూలమంత్రముతో హృదయమునకు నమస్కరింపవలయును. "ఓం కః" అని శిరమును, "ఓం ఖః" అని శిఖను, "ఓం గః" అని హృదయమును, "ఓం గుం" అని వక్త్ర

---

సర్షపమిశ్రేణ సర్వధూపం దద్యాత్త్రికటుకేన లేపయేత్. అగరుధూపం దద్యాద్రాజానం వశమానయతి. పరేషాం చ వల్లభో భవతి. రక్తచందనేనాత్మానం ధూపయేత్సుభగో భవతి. (ఓం గణపతయే వక్రతుండాయ గజదంతాయ గులగులేతి నినాదాయ చతుర్భుజాయ త్రినేత్రాయ ముసలపాశవజ్రహస్తాయ సర్వభూతదమనాయ సర్వలోకవశంకరాయ సర్వదుష్టోపఘాతజననాయ సర్వశత్రువిమర్దనాయ సర్వరాజ్యసమీహానాయ రాజానమిహ వశమానయ హానహాన పచపచ వజ్రాంకుశేన గణేశ ఫట్ స్వాహా. ఓం గాం గీం గూం గైం గౌం గః స్వాహా నమః హృదయం మూలమంత్రస్య. ఓం కః శిరః, ఓం ఖః శిఖా, ఓం గః హృదయమ్, ఓం గుః వక్త్రమ్, ఓం గైం నేత్రమ్‌

మును, "ఓం గ్రైం" అని నేత్రమును, "ఓం ఘః" అని కవచమును నమస్కరింపవలయును. "ఓం జః" అని యావాహనము చేయవలయును. ఇవియన్నియును హృదయావాహనాంగములు. "ఓం నమః" అనునది మూలమంత్రమునకు హృదయమగును. "ఓం గాః" అనునది శిరమగును. "ఓం గ్రైః నమః" అనునది శిఖ "ఓం గౌః నమః" అనునది కవచము. "ఓం గం నమః" అనునది నేత్రములు. "ఓం గః ఫట్" అనునది యస్త్రము నగును. "ఓం అంగుష్ఠోల్కాయ స్వాహా" అని హృదయమున కావాహానము జేయవలయును. "స్వాహా" అని విసర్జనము జేయవలయును. "ఓం గంధోల్కాయ స్వాహా" అనునది గంధమంత్రమగును. "ఓం ధర్మభూతోల్కాయ స్వాహా" అనునది పుష్పమంత్రమగును. "ఓం దుర్జయాయ" అని తూర్పునను, "ఓం ధూర్జటయే" అని దక్షిణమునను, "ఓం లంబోదరాయ" అని పడమటను, "ఓం గణపతయే" యని యుత్తరమునను, "ఓం గణాధిపతయే" యని యీశాన్యమూలను, "ఓం మహాగణపతయే" యని యాగ్నేయమూలను, "ఓం కూశ్మాండాయ" అని నైరృతిమూలను, "ఓం ఏకదంతత్రిపురఘాతినే త్రినేత్రాయ" అని వాయవ్యమూలను పూజింపవలయును. "ఓం మహాగణపతయే విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయాత్" అను నీగాయత్రిని జపింపవలయును. పద్మముద్రను, దంతముద్రను, మాలాముద్రను, ప్రకర్షణీముద్రను, పరశుముద్ర నంకుశముద్రను, పాశముద్రను, పటహాముద్రను నను నీయెనిమిదిముద్రలను దొలుతః బ్రదర్శించి యావెనుక

---

ఓం ఘః కవచమ్, ఓం జం ఆవాహనం హృదయస్య ఆవాహనాంగాని భవంతి ఓం నమః హృదయం మూలమంత్రస్య, ఓం గాః శిరః, ఓం గ్రైః నమః శిఖా, ఓం గౌః నమః కవచమ్, ఓం గం నమః నేత్రే, ఓం గః ఫట్ అస్త్రమ్, ఓం అంగుష్ఠోల్కాయ స్వాహా ఆవాహనం హృదయస్య స్వాహా విసర్జనం హృదయస్య ఓం గంధోల్కాయ స్వాహా. గంధమంత్రః. ఓం ధర్మభూతోల్కాయ స్వాహా. పుష్పమంత్రః. దుర్జయాయ పూర్వేణ. ఓం ధూర్జటయే దక్షిణేన. ఓం లంబోదరాయ పశ్చిమతః. ఓం గణపతయే ఉత్తరతః. ఓం గణాధిపతయే ఐశాన్యామ్. ఓం మహాగణపతయే ఆగ్నేయ్యామ్. ఓం కూశ్మాండాయ నైరృత్యామ్. ఓం ఏకదంతత్రిపురఘాతినే త్రినేత్రాయ వాయవ్యామ్. ఓం మహాగణపతయే విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయాత్ గాయత్రీ. పద్మదంష్ట్రామాలాప్రకర్షణీపరశ్వంకుశపాశపటహాముద్రా అష్టౌ ముద్రా

గర్మల ననుష్ఠింపవలయును. నల్లనువ్వులయాహుతుల నెనిమిదివేలు చేయ వలయును. అట్లు చేసెనేని రాజును వశపఱచుకొనును. ఆవాహనము మొదలు పదునొకండుముద్రలు నైవేద్యములును చేయవలయును. ఇది యంతయు వరుసగఁ జేయవలయును. త్రినేత్రుఁడును శూలపాణియు నగుహరునకు నేవిధి నారాధనము సలుపుదురో యావిధినే విఘ్నే శుఁడగు గణనాథుని గూడ నారాధింపవలయును. ఇచ్చటను మండల విధాన మదియే. అంగన్యాసములు నట్టులే. ఇట మంత్రపదములు దక్క దక్కినవన్నియు సమానములే యని యెఱుంగుము. ఎవఁడు విఘ్నే శుఁడు నేకదంతుఁడు నగునుమాతనయుని బూజించునో యాతని కన్ని విఘ్నములును నశించును. అరిష్టము లెప్పుడును గలుగఁబోవు. ఏమానవుఁడు చవితినాఁ డుపవాస మొనరించి యాతని బూజించునో యాతనికి సర్వకార్యములు నిర్విఘ్నముగ సిద్ధమగును. ఇందు సందియము లేదు. మంగళదములగు రెండుకులముల కానందముగూర్చు నోరాజా! విఘ్నేశుఁ డేవానికిఁ గార్యసమయములఁగాని యితరసమయములఁగాని యనుకూలుఁడై యుండునో యాతనికి సర్వకర్మలందును సమస్తజగంబు ననుకూలమయియుండును. కావున మానవుఁడు భక్తిశ్రద్ధలుగలిగి యాత నిని గుంకుమాగరుధూపము చేతను నట్టులే యుండ్రాళ్లదండలచేతను, మాంసముచేత నుచ్చావచంబులచేతను, జాజియుమ్మెత్తలచేతను, శుక్లపక్ష చతుర్థియందుఁ బూర్వోక్తవిధముగఁ బూజింపవలయును. ఆతనికి నిర్విఘ్న

---

దర్శయిత్వా తతః కర్మాణి కారయేత్. కృష్ణతిలాహుతీనామష్టసహస్రం జుహుయాత్. రాజానం వశమానయేత్. ఆవాహనాద్యేకాదశముద్రా నైవేద్యాంతం క్రమాద్దర్శయేత్. ఆరాధయేద్యేన విధినా త్రినేత్రం శూలినం హరమ్, తేనైవారాధయేద్దేవం విఘ్నేశం గణపం నృప. ౧. తదేవ మండలం చాస్య అంగన్యాసస్తథైవ చ, ఋతే మంత్రపదా నీహ సమానం సర్వమేవ హి. ౨. పూజయేద్యస్తు విఘ్నేశమేకదంతముమాసుతమ్, నశ్యంతి తస్య విఘ్నాని న చారిష్టం కదాచన. ౩. యశ్చోపవాసం కృత్వా తు చతుర్థ్యాం పూజయేన్నరః, సర్వే తస్య సమారంభాః సిధ్యేయుర్నాత్ర సంశయః. ౪. యస్యాను కూలో విఘ్నేశః శివయోః కులనందన, తస్యానుకూలం సర్వం స్యాజ్జగదైవ సర్వకర్మసు. ౫. తస్మాదారాధయేదేనం భక్తిశ్రద్ధాసమన్వితః, కుంకుమాగురుధూపేన తథైవోండేరక స్రజా, పలలోల్లాపికాభిశ్చ జాతీకోన్మత్తకైస్తథా. ౬. శుక్లపక్షే చతుర్థ్యాం తు విధి

ముగ సర్వకార్యములు సిద్ధించును. సంశయము లేదు. ఏకదంతుఁడును జగన్నాథుఁడు నగుగణేశుఁడు సంతోషించెనేని యోభరతవంశోద్దీపక! పితరులు దేవతలు మనుష్యులు మొదలగువారందఱు సంతోషింతురు. కావుననే యెల్లకాలమును భక్తిపురస్సరముగ నీదేవు నారాధింపవలయును. కర్ణ లేపములు పుండరీకములు మోదకములు ననువానిచే సర్వకాలములను నాయేకదంతుని విఘ్ననాశమునకై పూజించుచుండవలయును.

ఇది త్రింశాధ్యాయము.

---

## ఏకత్రింశాధ్యాయము.

సుమంతువు మఱియు నిట్లనియె. ఓరాజచూడామణీ! యీచవితి (చతుర్థి) "శివ" యనియు, "శాంత" యనియు, "సుఖ" యనియు మూఁడు విధములుగ స్మరింపఁబడుచున్నది. భాద్రపదమాసమున శుక్లపక్షమున వచ్చుచవితి శివ యనఁబడును. అయ్యది సర్వలోకములఁ బూజింపఁబడుచున్నది. ఆనాఁడు స్నానము నుపవాసము దానము జపము నొనర్చినచో నాదంతిదేవు ననుగ్రహమున శతగుణితమగుఫలము గలుగును. మఱియు నానాఁడు బెల్లము నుప్పు నెయ్యియు దానమిచ్చిన శుభము గలుగును. మఱియు నోవీరా! బ్రాహ్మణులకు బెల్లపుటప్పములతో భోజనములిడినఁ

---

నానేన పూజయేత్, తస్య సిధ్యతి నిర్విఘ్నం సర్వకర్మ న సంశయః. ౭. ఏకదంతే జగన్నాథే గణేశే తుష్టిమాగతే, పితృదేవమనుష్యాద్యాః సర్వే తుష్యంతి భారత. ౮. తస్మాదారాధయేదేనం సదా భక్తిపురఃసరమ్, కర్ణలేపైస్తుండికాభిర్మోదకైశ్చ మహీపతే, పూజయేత్సతతం దేవం విఘ్నవినాశాయ దంతినమ్. ౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే వినాయకపూజావిధినిరూపణం నామ త్రింశోఽధ్యాయః.

---

సుమంతురువాచ.—శివా శాంతా సుఖా రాజంశ్చతుర్థీ త్రివిధా స్మృతా, మాసి భాద్రపదే శుక్లా శివా లోకేషు పూజితా. ౧. తస్యాం స్నానం తథా దానముపవాసో జపస్తథా, క్రియమాణం శతగుణం ప్రసాదాద్దంతినో నృప. ౨. గుడలవణఘృతానాం తు దానం శుభకరం స్మృతమ్, గుడాపూపైస్తథా వీర పుణ్యం బ్రాహ్మణ

బుణ్యము గలుగును. ఏయువతు లానాఁడు నియతముగఁ బూజించి యత్తమామలకు గుడలవణాపూపములతోఁ బూజలు సల్పుదురో వారందఱును విఘ్నేశునిసంతోషనిమిత్తమున సౌభాగ్యసంపన్న లగుదురు. కన్యక లీనాఁడు విశేషముగ నీవిధిని బూజింపవలయును. ఇయ్యది శివాచతుర్థీ కల్పము. అని సుమంతుఁ డిట్లనియె. ఓమహీకాంతా! యిట్టులే మాఘమాసమున శుక్లపక్షమున వచ్చుచతుర్థి సర్వకాలములయందును శాంతి గూర్చుచుండుటచే శాంత యని యన్వర్థనామము గలది. ఈనాఁడొనరించిన స్నానదానాదులు దంతిదేవునియనుగ్రహమున సహస్రగుణితము లగును. ఆనాఁడు కృతోపవాసుఁడై విఘ్ననాయకుని హోమాదులచేఁ బూజింపవలయును. ఆకర్మలన్నియు సహస్రగుణితము లగును. ఉప్పు బెల్లము కాయకూర బెల్లపుటప్పములును భక్తితో బ్రాహ్మణుల కొసంగినను సహస్రగుణితమగుఫలము గలుగును. విశేషించి యువతు లానాఁడు గుడలవణఘృతములతో గురువుల నర్చించి సకలభాగ్యసంయుక్తలగుదురు. ఇయ్యది శాంతాకల్పమని వచించి సుమంతుఁడు మరల నిట్లనియె. అధికమగుసుఖమును గలిగించి సుఖరూపమై సౌభాగ్యకారణమై యుండునది చతుర్థి. అయ్యది రూపసౌభాగ్యశుభముల నొసంగును. ఈసుఖావ్రతము గొప్పపుణ్యమును సురూపసౌభాగ్యములను నొసంగును. మఱియు నిది

---

భోజనమ్. ౩. యాస్తస్యాం నరశార్దూల పూజయంతి సదా స్త్రియః, గుడలవణపూపైశ్చ శ్వశ్రూం శ్వశురమేవ చ. ౪. తాః సర్వాః సుభగాః స్యుర్వై విఘ్నేశస్యానుమోదనాత్, కన్యకా తు విశేషేణ విధినానేన పూజయేత్. ౫. (ఇతి శివాకల్పః) సుమంతురువాచ.—మాఘే మాసి తథా శుక్లా యా చతుర్థీ మహీపతే, సా శాంతా శాంతిదా నిత్యం శాంతిం కుర్యాత్సదైవ హి. ౬. స్నానదానాదికం కర్మ సర్వమస్యాం కృతం విభో, భవేత్సహస్రగుణితం ప్రసాదాత్తస్య దంతినః. ౭. కృతోపవాసో యస్తస్యాం పూజయేద్విఘ్ననాయకమ్, తస్య హోమాదికం కర్మ భవేత్సాహస్రికం నృప. ౮. లవణం చ గుడం శాకం గుడపూపాంశ్చ భారత, దత్త్వా భక్త్యా తు విప్రేభ్యః ఫలం సాహస్రికం భజేత్. ౯. విశేషతః స్త్రియో రాజన్పూజయన్త్యో గురుం నృప, గుడలవణఘృతైర్వీర సదా స్యుర్భాగ్యసంయుతాః. ౧౦. (ఇతి శాంతాకల్పః) సుమంతురువాచ.—సుఖావహా చ సుసుఖా సౌభాగ్యకరణీ పరమ్. ౧౧. చతుర్థీ కురుశార్దూల రూపసౌభాగ్యదా శుభా, సుఖావ్రతం మహాపుణ్యం రూపదం భాగ్యదం తథా.

మిక్కిలి సూక్ష్మమై సుఖముగఁ జేయఁదగినదియునై యీలోకమున నుత్తమసుఖము లొసంగును. పరలోకమున దివ్యరూపము నొసంగి యుత్తమఫలము నిచ్చుటచే ధన్యమగును. మఱియు నానాఁడు నవ్వుట మృదువుగమాటలాడుట మొదలగుచేష్టితములు సుఖము నొసంగును. సవిలాసముగ భుజవిక్షేపములుచేయుట గంతులువేయుట ప్రదక్షిణములు చేయుట శుభకరములగును. ఈసుఖావ్రతముచే నెల్లవారికి సుఖము గలుగును. శివతనయుఁడగు విఘ్నేశుని విధ్యుక్తముగఁ బూజింపవలయును. ఏమాసమున శుక్లపక్షమునఁ జతుర్థి మంగళవారముతోఁ జేరియుండునో యది సుఖదయగు సుఖాచతుర్థి యగునని యెఱుంగునది. ఓమహాబాహూ! మున్నొకప్పుడు హిమాచలతటంబులందు వసించి యుమామహేశులు రతికేళి సలుపుచుండ రక్తబిందు వొండు జారి యిల పైఁబడెను. అట్లు పడినబిందువు నతిప్రయత్నముచే నీతిథి సుఖముగ ధరించెను. అంతఁగొన్నాళ్లకుదానివలన రక్తసముద్భవుఁడగుటచే రక్తవర్ణుఁడగు కుజుఁడు జనించెను. అహం శబ్దవాచ్యుఁడగు భగవంతునియంగమునుండి యుద్భవమందుటం జేసి యంగారకనాముఁ డయ్యెను. ఈతఁడు శరీరకారకుఁడును శరీరమున కుపకారముచేయువాఁడును నవయవముల నిచ్చువాఁడయి యుండుకతనను సౌభాగ్యాదుల నిచ్చుకతనను నీతఁ డంగారకుఁ డనఁబడును. ఏమానవుఁడు భక్తిశ్రద్ధలుగలిగి చవితినాఁటిరాత్రి

---

౧౨. సుసూక్ష్మం సుకరం ధన్యమిహ పుణ్యసుఖావహమ్, పరత్ర ఫలదం వీర దివ్యరూపప్రదాయకమ్. ౧౩. హసితం లలితం చోక్తం చేష్టితం చ సుఖావహమ్, సవిలాసభుజక్షేపశ్చంక్రమశ్చేష్టితం శుభమ్. ౧౪. సుఖావ్రతేన సర్వేషాం సుఖం కురుకులోద్వహ, కృత్యేన పూజితే చేశే విఘ్నేశే శివయోః సుతే. ౧౫. యదా శుక్లచతుర్థ్యాం తు వారో భౌమస్య వై భవేత్, తదా సా సుఖదా జ్ఞేయా చతుర్థీ వై సుఖేతి చ. ౧౬. పురా మైథునమాశ్రిత్య స్థితాభ్యాం తు హిమాచలే, భీమోమాభ్యాం మహాబాహో రక్తబిందుశ్చ్యుతః క్షితౌ. ౧౭. మేదిన్యాం స ప్రయత్నేన సుఖేన విధృతోఽనయా, జాతోఽస్యాః స కుజో వీర రక్తో రక్తసముద్భవః. ౧౮. మమాంగతో యథోత్పన్న స్తస్మాదంగారకో హ్యయమ్, అంగదోంగోపకారశ్చ అంగానాం తు ప్రదో నృణామ్. ౧౯. సౌభాగ్యాదికరో యస్మాత్తస్మాదంగారకో మతః, భక్త్యా చతుర్థ్యాం నక్తేన యో

యుపవసించునో యాపురుషుఁడుగాని యట్టియువిదఁగాని యనన్యచిత్తులై కుజని భక్తిపురస్సరముగ రక్తపుష్పములచేతను విలేపనములచేతను బూజింపవలయును. ప్రథమమున గణేశుని శ్రద్ధాసమన్వితుఁడయి యర్చించువానికి సంతోషించి యాదేవుఁడు సౌభాగ్యమును రూపసంపదల నొసంగును. తొలుత మనసున సంకల్పించుకొని యథావిధిగ జలకమాడి మృత్తిక గైకొని యీచెప్పఁబోవుమంత్రముతో వందనముచేయవలయును. "ఓమృత్తికా! ఈలోకమున మున్నీవు నిన్నుద్ధరించుకృష్ణునిచే నమస్కరింపఁబడితివి కద! కావున నాచే నుతిగొని వెనుక జన్మములనుండి యింతవరకార్జించినపాపమునంతను భస్మముచేయుము" అను నీయర్థము గల "ఇహత్వం వందితాపూర్వం కృష్ణేనోద్ధరతాకిల, తస్మాన్మేదహపాప్మానం యన్మయాంపూర్వసంచితమ్" మంత్రమును పఠించుచు నామృత్తిక నాదిత్యునకుఁ గనుపఱచి యనంతర మాదిత్యకిరణములచేఁ బవిత్రమై గంగాజల బిందువులచేఁ బ్రోక్షింపఁబడిన యామృత్తికను దొలుత శిరమునఁ దాల్చి పిదప సర్వాంగములనుంచుకొనవలయును. పిదప స్నానము జేయవలయును. మఱల జలము నిట్లు మంత్రింపవలయును. "ఓజలమా! నీవే సమస్తులయిన దైత్యదానవులకు దేవతలకును గారణమవు. స్వేదజములకు నండజములకు నుద్భిజ్జములకును నీవే కారణము. అట్టి నిఖిలరసాధిపతి యగు నీకు నమస్కారము. సర్వతీర్థములందును సర్వప్రవాహములందును సర్వతటాకములయందును మానసాదిసరోవరములందు నఖాతములగు నదులందును

---

వై శ్రద్ధాసమన్వితః. ౨౦. ఉపవత్స్యతి నా రాజన్నారీ వా నాన్యమానసా, పూజయేచ్చ కుజం భక్త్యా రక్తపుష్పవిలేపనైః. ౨౧. గణేశం ప్రథమం భక్త్యా యోఽర్చయేచ్ఛ్రద్ధయాన్వితః, యస్య తుష్టః ప్రయచ్ఛేత్స సౌభాగ్యం రూపసంపదమ్. ౨౨. పూర్వం చ కృతసంకల్పః స్నానం కృత్వా యథావిధి, గృహీత్వా మృత్తికాం వందేన్మంత్రేణానేన భారత. ౨౩. ఇహ త్వం వందితా పూర్వం కృష్ణేనోద్ధరతా కిల, తస్మాన్మే దహ పాప్మానం యన్మయా పూర్వసంచితమ్. ౨౪. ఇమం మంత్రం పరస్వీర ఆదిత్యాయ ప్రదర్శయేత్, ఆదిత్యరశ్మిసంపూతాం గంగాజలకణోక్షితామ్. ౨౫. దత్త్వా మృదం శిరసి తాం సర్వాంగేషు చ యోజయేత్, తతః స్నానం ప్రకుర్వీత మంత్రయేత జలం పునః. ౨౬. త్వమాపో యోనిః సర్వేషాం దైత్యదానవద్యౌకసామ్, స్వేదాండజోద్భిదాం చైవ రసానాం పతయే నమః. ౨౭. స్నాతోఽహం సర్వతీర్థేషు సర్వప్రస్రవణేషు చ, తడాగేషు చ సర్వేషు మానసాదిసరఃసు చ. ౨౮. నదీషు దేవ

పుణ్యతీర్థహ్రదములందును స్నానముచేసితిని" అనునర్థముగల "త్వమాపో యోని స్సర్వేషాం దైత్యదానవదైవౌకసాం, స్వేదాండజోద్భిజ్జాం చైవ రసానాంపతయే నమః. స్నాతో౽హం సర్వతీర్థేషు సర్వప్రస్రవణేషు చ, తడాగేషు చ సర్వేషు మానసాదిసరస్సుచ.' నదీషు దేవఖాతేషు సుతీర్థేషు హ్రదేషువై." యీమంత్రమును బఠించుచు ధ్యానముజేయుచు స్నానమాడవలయును. స్నానముచేసినవెనుక నాచమనములచే శుచియై గృహమునకేగి గఱికను రావిచెట్టు జమ్మిని స్పృశింపవలయును మంత్రజ్ఞుఁడు సమంత్రముగ వీనిని స్పృశించి గోవును గూడ స్పృశింపవలయును. పరిశుద్ధమగు నేలనుబుట్టినగడ్డిని మంత్రముతో నమస్కరింపవలయును. "ఓదూర్వా! నిన్ను సర్వజనులు నమృతమందురు. సర్వదేవతలు నిన్ను నమస్కరింతురు. నేనిపుడు నీకు నమస్కరించుచున్నాను. నేఁజేసిన పాపంబులనెల్ల భస్మము గావింపుము" అనునర్థముగల "త్వం దూర్వే౽మృతనామాసి సర్వదేవైస్తువందితా, వందితాదహతత్సర్వం దురితం యన్మయా కృతమ్" అనుమంత్రము దూర్వయొద్దఁ బఠింపవలయును. ఓమహీకాంతా! శమీమంత్రము నెఱింగింతు వినుము- "పవిత్రాణాంపవిత్రాత్వం కాశ్యపీ ప్రథితా శ్రుతౌ, శమీ శమయ మే పాపం నూనం వేత్సిధరాధరాన్" అని శమీమంత్రము. "ఓశమీ నీవు పవిత్రములలో నెల్లఁ బవిత్రమవు. నీపేరు వేదములందుఁ గాశ్యపి యని ప్రసిద్ధమైనది. నాపాపముల నుపశమింపఁజేయుము. నీవు పర్వతాదులను వృక్షముల నన్నింటఁ నెఱుంగుదువు" అని యర్థము. ఓవీరవతంసా! అశ్వత్థమును స్పృశించునపుడు చెప్పఁదగిన మంత్రము వచింతు వినుము. "నేత్రస్పందాదిజం

ఖాతేషు సుతీర్థేషు హ్రదేషు వై, ధ్యాయన్నపఠన్నిమం మంత్రం తతః స్నానం సమాచరేత్. ౨౯. తతః స్నాత్వా శుచిర్భూత్వా గృహమాగత్య వై స్పృశేత్, దూర్వాశ్వత్థౌ శమీం స్పృష్ట్వా గాం చ మంత్రేణ మంత్రవిత్. ౩౦. దూర్వాం నమస్యమంత్రేణ శుచౌ భూమౌ సముత్థితామ్, త్వం దూర్వే౽మృతనామాసి సర్వదేవైస్తు వందితా. ౩౧. వందితా దహ తత్సర్వం దురితం యన్మయా కృతమ్. ౩౨. శమీమంత్రం ప్రవక్ష్యామి తన్నిబోధ మహీపతే, పవిత్రాణాం పవిత్రా త్వం కాశ్యపీ ప్రథితా శ్రుతౌ, శమీ శమయ మే పాపం నూనం వేత్సిధరాధరాన్. ౩౩. అశ్వత్థాలంభనే వీర మంత్రమేతం నిబోధ మే, నేత్రస్పందాదిజం దుఃఖం దుఃస్వప్నం దుర్వి

దుఃఖం దుఃస్వప్నం దుర్విచింతనం, శక్తానాం చ సముద్యోగమశ్వత్థ త్వం క్షమస్వ మే" అని ఈమంత్రము పఠించుచు విద్వాంసుఁడశ్వత్థమును స్పృశింపవలయును. తరువాత నోవీరా! దేవికి సదక్షిణముగా గోవు నొసంగవలయును. తొలుతఁ గరముతో దాకి పిదప యీమంత్రము పఠింపవలయును. "సర్వదేవమయీ దేవి మునిభిస్తు సుపూజితా, తస్మాత్స్పృశామి వందే త్వాం వందితా పాపహా భవ" అను నీమంత్రమును భక్తిశ్రద్ధలతోఁ బఠించుచు మద్దిచెట్టునకుఁ బ్రదక్షిణ మాచరించెనేని యాతఁడు భూప్రదక్షిణము జేసినట్లే యగును. సందియము లేదు. ఇటు లాచరించి పిదప మౌనముద్రవహించి యటనుండి వహ్నిగృహముకడ కేగి మృత్తికజలముతోఁ బాదప్రక్షాలన మాచరించుకొని యగ్నిగృహ మును జొచ్చి యాచాంతుఁడై యుత్తమములగు చెప్పఁబోవు మంత్రములచే హోమములు చేయవలయును. "శర్వాయశర్వపుత్రాయ, క్షోణ్యుత్సంగభవాయ, కుజాయ, లలితాంగాయ, లోహితాంగాయ" అనువాని కోంకారము పూర్వముననుస్వాహాకారము పిదపనుంచి "ఓం శర్వాయ స్వాహా" యిత్యాదిమంత్రములతో నూటెనిమిదిగాని యిరువది యెనిమిదిగాని యే బదినాల్గుగాని కోరిక ననుసరించియు శక్తి ననుసరించియు భక్తితో హోమములు చేయవలయును. చంద్రకట్టెలసమిధలును నేయి పాలు యవలు నువ్వులును నానావిధములగుభక్ష్యాదులును దెచ్చి యథా

---

చింతనమ్, శక్తానాం చ సముద్యోగమశ్వత్థ త్వం క్షమస్వ మే. ౩౪. ఇమం మంత్రం పఠన్వీర కుర్యాద్వై స్పర్శనం బుధః, తతో దేవ్యై తు గాం దద్యాద్వీరం కృత్వా ప్రదక్షిణామ్, సమాలభ్య తు హస్తేన తతో మంత్రముదీరయేత్. ౩౫. సర్వదేవమయీ దేవి మునిభిస్తు సుపూజితా, తస్మాత్స్పృశామి వందే త్వాం వందితా పాపహా భవ. ౩౬. ఇమం మంత్రం పఠన్వీర భక్త్యా శ్రద్ధాసమన్వితః, ప్రదక్షిణం తు యః కుర్యాదర్జునం కురునందన, ప్రదక్షిణీకృతా తేన పృథివీ స్యాన్న సంశయః. ౩౭. ఏవం మౌనేన చాగత్య తతో వహ్నిగృహం వ్రజేత్, ప్రక్షాల్య చ మృదా పాదావాచాంతోఽగ్నిగృహం విశేత్, హోమం తత్ర ప్రకుర్వీత ఏభిర్మంత్రపదైర్వరైః. ౩౮. శర్వాయ శర్వపుత్రాయ క్షోణ్యుత్సంగభవాయ చ, కుజాయ లలితాంగాయ లోహితాంగాయ వై తథా. ౩౯. ఓంకారపూర్వకైర్మంత్రైః స్వాహాకారసమన్వితైః, అష్టోత్తరశతం వీర అర్ధార్ధమర్ధ మేవ చ. ౪౦. ఏతైర్మంత్రపదైర్భక్త్యా శక్త్యా వా కామతో నృప, ఖాదిరైః సుసమిద్భిస్తు చాజ్యదుగ్ధైర్యవైస్తిలైః. ౪౧. భక్ష్యైర్నానావిధై

శక్తిగ భక్తితోఁ గూడినవాఁడై యాహుతుల వ్రేల్చి యనంతరము దేవుని భూమిలో స్థాపింపవలయును. సౌవర్ణముగాని, రాజతముగాని, దారుమయముగాని, దేవదారుమయముగాని యగు దేవప్రతిమను శ్రీఖండచందనములతోఁగాని, యాజ్యకుంకుమకేసరములచేఁగాని, యింక నెట్టినిపుష్పము లాకులు పండ్లతోఁగాని, యింక వివిధములగు రక్తపదార్థములచేఁగాని, రాగిపాత్రమునఁగాని, వెండిపాత్రమునఁగాని యుంచి పూజింపవలయును. అట్టి ట్టననేల? శక్తికొలఁది పూజింపవచ్చును. ధనవంతుఁడు భక్తుఁడై యెంతధనమును విడుచునో యంతకు లక్షగుణిత మగుచుఁ బుణ్యమువృద్ధిబొందును. ఇతరజనులు రాగిపాత్రముననో, వెదురుపాత్రముననో, మంటిపాత్రముననో యథాశక్తి కుంకుమకేసరములచేఁ బురుషాకృతి యొనరించి యుంచి మంత్రములచే నర్చింపవలయును. "అగ్నిర్మూర్ధా" అనుమంత్రముచేతను గంధపుష్పాదులచేతను ధూపములచేతను నర్చించి విధ్యుక్తవిధమున బ్రాహ్మణునకు గుడాన్నము నెయ్యి పాలు గోధుమలు శాలితండులములును దరిద్రుఁడును ధనవంతుఁడును తనశక్తిని బరిశీలించి యీవలయును. ధనమున్నప్పుడు విత్తశాఠ్యము (వంచనము) చేయఁదగదు. అటుల విత్తశాఠ్యముజేసినచోఁ బరలోకమున బలమును బొందఁజాలఁడు. అన విని శతానీకుఁ డో విప్రోత్తమా! అంగారకచతుర్థిరాత్రి భోజనముల నుపవసింపవలె నంటివి. అటు లెన్నిపర్యా

---

శ్చాన్తైః శక్త్యా భక్త్యా సమన్వితః, హుత్వాహుతీస్తతో వీర దేవం సంస్థాపయేత్క్షితౌ. ౪౨. సౌవర్ణం రాజతం వాపి శక్త్యా దారుమయం నృప, దేవదారుమయం వాపి శ్రీఖండచందనైరపి. ౪౩. తామ్రే పాత్రే రౌప్యమయే చాజ్యకుంకుమకేసరైః, అన్యైర్వా లోహితైర్వాపి పుష్పైః పత్రైః ఫలైరపి, రక్తైశ్చ వివిధైర్వీర అథ వా శక్తితోఽర్చయేత్. ౪౪. యావద్విసృజతే విత్తం విత్తవాన్వీర భక్తితః, తావద్వివర్ధతే పుణ్యం దాతుః శతసహస్రికమ్. ౪౫. అన్యే తామ్రమయే పాత్రే వంశజే మృన్మయేపి వా, పూజయంతి నరాః శక్త్యా కృత్వా కుంకుమకేసరైః, పురుషాకృతికృతం పాత్ర ఇమం మంత్రైః సమర్చయేత్. ౪౬. అగ్నిర్మూర్ధేతి మంత్రేణ గంధపుష్పాదిభిస్తథా, ధూపైరభ్యర్చ్య విధివద్బ్రాహ్మణాయ ప్రదీయతే. ౪౭. గుడౌదనం ఘృతం క్షీరం గోధూమాఞ్ఛాలితండులాన్, అవేక్ష్య శక్తిం దద్యాద్వై దరిద్రో విత్తవాంస్తథా. ౪౮. విత్తశాఠ్యం న కర్తవ్యం విద్యమానే ధనే నృప, విత్తశాఠ్యం హి కుర్వాణో నాముత్ర బలభాగ్భవేత్. ౪౯. శతానీకఉవాచ—అంగారకేణ సంయుక్తా చతుర్థీ నక్తభోజనైః,

యము లుపవసింపవలయును ? లేక యొకపర్యాయ ముపవసించినం జాలునా? యని యడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె. ఏయేచతుర్థియం దంగారకసంయోగ మేర్పడునో అయ్యది యంగారకచతుర్థి యనఁబడును. ఆయాతిథియందెల్ల నుపవసింపవలయును. విధ్యుక్తముగా గుడదానము చేయవలయును. ఇప్పగిదిఁ గుజసంయుక్తములగు నాలుగు చవితిరాత్రులం దుపవసింపవలయును. అందొక్కొకదానియందును విధాన మెట్టిదో యెఱింగింతు వినుము. పదినాణెముల బంగారముతోఁగాని యైదింటితోఁ గాని యందర్ధభాగముతోఁగాని వినాయకుని గుజుని జేయవలయును. పది నాణెములతోఁ జేయుట ముఖ్యము. సౌవర్ణపాత్రమునఁగాని, వెండి పాత్రమునఁగాని, తామ్రపాత్రమునఁగాని భక్తితో నుంచి పూజింపవల యును. ఆపాత్రములు ఇఱువదిపలములుగాని పదిగాని బరువుగలిగి యుండవలయును. లేకున్న నిరువదికర్షములుగాని తదర్ధముగాని యుండవలయును. వెండిపాత్రలపరిమాణము పలముగాని పలార్ధముగాని తదర్ధముగాని చేయవలయును. శక్తిచేతను విత్తముచేతను భక్తిచేతను తామ్రపాత్రప్రమాణము నిర్ణయించుకొనవలయును. ఇట్టిపాత్రమునందు గ్రహపతిని బ్రతిష్ఠాపించి వస్త్రములచే నాచ్ఛాదించి యలంకార యోగ్యములగు వివిధరక్తభూషణములచేతను రక్తపుష్పములచేతను నలంకరించి యెల్లప్పుడును స్వస్తివచననిరతుఁడు సద్గుణసంపన్నుఁడు నుత్త ముఁడు నగుబ్రాహ్మణునకు సదక్షిణముగా నొసంగవలయును. తిథులలో

---

ఉపోష్యా కలిమాత్రా తు ఉతాహో సకృదేవ తు. ౫౦. సుమంతురువాచః—చతుర్థీ సా చతుర్థీ తు యదాంగారకసంయుతా, ఉపోష్యా తత్ర తత్రైవ ప్రదేయో విధివ ద్గుడః. ౫౧. ఉపోష్య నక్తేన విభో చతస్రః కుజసంయుతాః, చతుర్థ్యాం చ చతుర్థ్యాం చ విధానం శృణు యాదృశమ్. ౫౨. సౌవర్ణం తు కుజం కృత్వా సవినాయకమాద రాత్, దశసౌవర్ణికం ముఖ్యం దశార్ధమర్ధమేవ చ. ౫౩. సౌవర్ణపాత్రే రౌప్యే వా భక్త్యా తామ్రమయేఽపి వా, వింశత్పలాని పాత్రాణి వింశత్యర్ధపలాని వా. ౫౪. వింశ త్కర్షాణి వా వీర వింశదర్ధార్ధమేవ వా, రౌప్యసంఖ్యం పలం కార్యం పలార్ధమర్ధమేవ చ. ౫౫. శక్త్యా విత్తైశ్చ భక్త్యా చ పాత్రే తామ్రమయేఽపి తు, ప్రతిష్ఠాప్య గ్రహేశం వై వస్త్రైః సంపరివేష్టితమ్, వివిధైః సాధకై రక్తైః పుష్పై రక్తైః సమ న్వితమ్. ౫౬. బ్రాహ్మణాయ సదా దద్యాద్దక్షిణాసహితం నృప, వాచకాయ మహా

నెల్ల నుత్తమయుఁ బవిత్రయు నగు నీతిథిని నీకెఱింగించితిని. ఇం దుపవ సించిననరుఁడు దివ్యరూపముఁ బొందును. కాంతియందుఁ జంద్రతుల్యుఁ డును దేజమున రవిసన్నిభుఁడును వెలుఁగులోఁగూడ సూర్యసముఁడును బలమున వాయుతుల్యుఁడు నగును. ఇట్టిరూపమును బొంది యంగారక మండలమున కేగును. రాజా! దీనిఁ బఠించినను వినినను విశేషించి యను ష్ఠించినను విఘ్నేశప్రసాదమున బ్రహ్మహత్యాదిపాపములు నశించును. వృద్ధిసమృద్ధులను లక్ష్మిని బొందును. ఇందు సందియము లేదు.

ఇది ఏకత్రింశాధ్యాయము.

## ద్వాత్రింశాధ్యాయము.

సుమంతుఁ డిట్టులనియె. రాజేంద్రా! పంచమీతిథి పాముల కిష్ట మయినది. నందివర్ధని యని దానికిఁ బేరుగలదు. పంచమిరోజున నేగదా నాగులకు గొప్పయుత్సవము గలుగునని వాసుకి, తక్షకుఁడు, కాళి యుఁడు, మణిభద్రకము, నైరావతుఁడు, ధృతరాష్ట్రుఁడు, కర్కోటక ధనంజయములు మున్నగునాగులు ప్రాణుల కభయము నొసంగి సుఖజీవు లుగా నొనరించినవి. ఏమానవుఁ డీలోకమునఁ బంచమినాఁడు నాగులకు

---

భావతో గణితే శ్రేయసే నృప. ౫౭. ఇతి తే కథితా పుణ్యా తిథీనాముత్తమా తిథిః, యాముపోష్య నరో రూపం దివ్యమాప్నోతి భారత. ౫౮. కాంత్యాత్రేయసమం వీరం తేజసా రవిసన్నిభమ్, ప్రభయా రవికల్పం చ సమీరబలసంశ్రితమ్. ౫౯. ఈదృగ్రూపం సమాప్యేహ యాతి భౌమసదో నృప, ప్రసాదాద్విఘ్ననాథస్య తథా గణపతేర్నృప. ౬౦. పఠతాం శృణ్వతాం రాజన్కుర్వతాం చ విశేషతః, బ్రహ్మహత్యాదిపాపాని క్షీయంతే నాత్ర సంశయః, బుద్ధిం వృద్ధిం తథా లక్ష్మీం లభతే నాత్ర సంశయః. ౬౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి చతుర్థీకల్పే సుఖావహాంగారకచతుర్థీవ్రతనిరూపణం నామైకత్రింశోఽధ్యాయః.

---

సుమంతురువాచః—పంచమీ దయితా రాజన్నాగానాం నందివర్ధినీ, పంచమ్యాం కిల నాగానాం భవతీత్యుత్సవో మహాన్. ౧. వాసుకిస్తక్షకశ్చైవ కాలియో మణి భద్రకః, ఐరావతో ధృతరాష్ట్రః కర్కోటకధనంజయౌ, ఏతే ప్రయచ్ఛంత్యభయం ప్రాణినాం ప్రాణజీవితామ్. ౨. పంచమ్యాం స్నపయంతీహ నాగాన్క్షీరేణ యే నరాః,

క్షీరాభిషేక మొనరించునో యాతనికులమున కవి భయరహితమగు జీవనము దక్షిణగా నొసంగుచున్నవి. మున్ను తల్లిశాపముకతన నాగములు రాత్రింబవళ్లు తపించుచు గోక్షీరమిశ్రితములయిన స్నానములచే నాతాపము వాపుకొన్నవి. ఏమానవులు భక్తియుక్తులై శ్రద్ధతో నాగములకు క్షీరాభిషేకమున స్నానముచేయింతురో వారికులమునకు సర్పము వలని భయములేకుంట నిశ్చయము. అన విని శతానీకుండు పాములకుఁ దల్లివలన శాపముగలుగుటకుఁ గారణమేమి? తరువాత నెవ్వరియనుగ్రహమున వాని కానందముగలిగెను? వివరింపు మన నాతనికి సుమంతుఁ డిట్లనియె. మున్ను చైచశ్శ్రవమను తెల్లనియుత్తమాశ్వ మమృతమునఁ బుట్టియుండెను. అది భూమిపైఁ దిరుగుచుండ దాని నీక్షించి నాగమాతయగు కద్రువ చెల్లెలితో నిట్లనియె. చెల్లెలా! అమృతసంభవమై శ్వేతమగు నీయశ్వరత్నమును జూచుచున్నావా? తోకమాత్రము నల్లగ నున్నది చూచుచున్నావా? లేకున్న నాకసమున దానినిగూడ తెల్లగనే యున్నట్లు గనుచున్నావా? అని యడిగెను. వినత యిట్లనియె. ఈహాయవరము సర్వశ్వేతమయి యున్నదిగాని నల్లగఁగాని యెఱ్ఱగఁగాని లేదే. అట్టియెడ నీవెట్లు నలుపును జూచుచున్నావు? అన విని కద్రువ నేనొక్కకన్నుతోనే కృష్ణవాలసమన్వితముగఁ గాంచుచున్నాను. ఏమే వినతా! నీకు రెండుకండ్లున్నను కనుపించుటలేదా? పందెము వేయుదువా? అని

---

తేషాం కులే ప్రయచ్ఛంతి తేఽభయప్రాణదక్షిణామ్. ౩. శప్తా నాగా యదా మాత్రా దహ్యామానా దివానిశమ్, నిర్వాపయంతి స్నపనైర్గవాం క్షీరేణ మిశ్రితైః. ౪. యే స్నాపయంతి వై నాగాన్భక్త్యా శ్రద్ధాసమన్వితాః, తేషాం కులే సర్పభయం న భవేదితి నిశ్చయః. ౫. శతానీక ఉవాచ.—మాత్రా శప్తాః కథం నాగాః కిం సముద్దిశ్య కారణమ్, కథం చానందకరణం కస్య వా సంప్రసాదజమ్. ౬. సుమంతురువాచ.—ఉచ్చైః శ్రవా అశ్వరత్నం శ్వేతో జాతోఽమృతోద్భవః, తం దృష్ట్వా చాబ్రవీత్కద్రూర్నాగానాం జననీ స్వసామ్. ౭. అశ్వరత్నమిదం శ్వేతం సంప్రేక్షేఽమృతసంభవమ్, కృష్ణాంశ్చ వీక్షసే బాలాన్సర్వం శ్వేతముతాంబరే. ౮. వినతోవాచ.—సర్వశ్వేతో హాయవరో నాస్య కృష్ణో న లోహితః, కథం పశ్యసి కృష్ణం త్వం వినతోవాచ తాం స్వసామ్. ౯. కద్రూరువాచ.—వీక్షేఽహ మేకనయనా కృష్ణబాలసమన్వితమ్, ద్వినేత్రా త్వం తు వినతే న పశ్యసి పణం కురు. ౧౦. వినతోవాచ.—అహం దాసీ భవిత్రీ తే

యడుగ వినత ధైర్యోత్సాహములతో నోకద్రూ! నీవు గుఱ్ఱమునకు నల్లనితోక జూపుదువేని నీకు నేదాసి నగుదును. చూపలేకున్న నీవే దాసివి గావలయును. అని యిట్లు నారిరువురును పందెములు వైచుకొని కోపముతో నింటికేగిరి. వినత యకపటశీలయగుటచే సుఖముగ నారేయి నిద్రించెను. కద్రువ నిద్దురరాక కపటోపాయ మాలోచించుచుండెను. పుత్రులను బిలచి యిట్లనెను. ఓకుమారురాలా! వినతయు నేను నుచ్చైశ్శ్రవముతోకకై గొప్పపందెములు వైచుకొనియుంటిమి. మీరు పోయి యాయుత్తమహయంపుదోకనవెండ్రుకలవలె వ్రేలాడుఁడు. అటు చేసిన జయాభిలాషతోనున్న వినతను జయింతును. అన విని యానాగములు తల్లికపటస్వభావమును నిందించుచు నమ్మా! నీవు పెద్దయధర్మముఁ జేయఁబూనితివి. అట్టియెడ మాతవైనను నీవచనము నాదరించి మేమిక్కార్యముఁ జేయఁజాలమని చెప్పినవి. అందుల కామె మండిపడుచు నగ్నిదేవుఁడు మిమ్ము భస్మముజేయుఁగాక యని శపించెను. చాలకాలము చనినవెనుక బాండువంశమున జనమేజయుఁ డనురాజు జన్మించి భూలోకమున నెవ్వరు నొనర్పరానిసర్పయాగము జేయఁగలఁడు. ఆసత్రయాగమున నుష్ణజ్వాలలు గలపావకుఁడు మిమ్ము నిశ్శేషముగ భస్మము చేయఁగలవాఁడని యిట్లు కోపాతిరేకమున దిట్టి యామె యొండెద్దియుఁ బలుకదయ్యె. అంత నానాగులు తల్లివలన శాపమువడసి యేమిచేయవలయునో యెఱుంగరైరి. అప్పట్టునఁ బితామహుఁ డేతెంచి శాపదుఃఖితుఁ డగు వాసుకి నోదార్చి యోవాసుకీ! విచారింపకుము. ఉత్తమమగు

---

కృష్ణే కేశే ప్రదర్శితే, న చేద్దర్శయసే కద్రు మమ దాసీ భవిష్యసి. ౧౧. ఏవం తే విపణం కృత్వా గతే క్రోధసమన్వితే, వినతా శయనే సుప్తా కద్రూర్జిహ్మమచింతయత్. ౧౨. ఆహూయ పుత్రాన్ప్రోవాచ బాలా భూత్వా హయోత్తమే, తిష్ఠధ్వం విపణే జేష్యే వినతాం జయగర్ధినీమ్. ౧౩. ప్రోచుస్తే జిహ్మబుద్ధిం తాం నాగా మాతాం విగృహ్య తు, అధర్మ్యమేతన్మాతస్తే న కరిష్యామ తే వచః. ౧౪. తాఞ్ఛశాప రుషా కద్రూః పావకో వః ప్రధక్ష్యతి, గతే బహుతిథే కాలే పాండవో జనమేజయః. ౧౫. సర్పసత్రం స కర్తా వై భువి హ్యాసై్యః సుదుష్కరమ్, తస్మిన్సత్రే స తిగ్మాంశుః పావకో వః ప్రధక్ష్యతి. ౧౬. ఏవం శప్త్వా రుషా కద్రూః కించిన్నోక్తవతీ తు సా, మాత్రా శప్తస్తథా నాగాః కర్తవ్యం నాన్వపద్యత. ౧౭. వాసుకిం దుఃఖితం జ్ఞాత్వా

నాపలుకు వినుము. యాయావరవంశమున జరత్కారుఁడను ద్విజుఁ డొకఁడుండెను. ఆతఁడు మహాతేజస్సంపన్నుఁడై తపోనిధియై యక్కాలమున నుండఁగలఁడు. జరత్కారువను నీభగినినాతనికీఁగలవు ఆతని కాస్తీకుఁడను విఖ్యాతపురుషుండు పుత్త్రుండై జన్మింపఁగలఁడు. ఆతఁడు ప్రవృద్ధమై సర్పములకు భయజనకమగు నాగోప్పసత్త్రము నత్యుత్తమములగు వాక్కులచే నిషేధింపఁగలఁడు. అప్పుడు ప్రత్యుపకారముగ నీభగిని నాతని కొసంగుదువు. కావున నీవు విచారింపక జరత్కారువును జరత్కారు మహర్షి కొసంగుము. మఱియు నీవు నీశ్రేయ మపేక్షింతువేని యరణ్యమున నాతఁ డెప్పు డెయ్యది వాంఛించునో యేకొంచము పలుకునో దానినెల్ల శంకలేక యొనరుప నర్హుండవు. అని యిట్లు లోకపితామహుఁడు వచింప నాకర్ణించి వాసుకి యాతని కభివాదన మొనరించి పరమ ప్రయత్నపురస్సరముగ నాతఁడు చెప్పినచొప్పొనరించెను. ఆపితామహునియాదేశమును విని యెల్లనాగులు ప్రహర్షవికసితనేత్త్రులయి చచ్చి మరలఁ బుట్టినయట్లు తమ్ము భావించుకొనిరి. తరువాత నోమహాభుజా! నీతండ్రి ఋత్విజులతోఁగూడి యెల్లలోకముల దుష్కరమగు సత్త్రముచేయ నారంభించెను. మున్ను ధీనిధియగుధర్మపుత్త్రునకు శ్రీకృష్ణ భగవానుఁడు "ధర్మనందనా! పాములకు నాశకారణమగువాఁడు పరీ

---

ప్రహృష్టః ప్రోవాచ సాంత్వయన్, మా శుచో వాసుకేఽత్యర్థం శృణు మద్వచనం పరమ్.
౧౮. యాయావరకులే జాతో జరత్కారురితి ద్విజః, భవిష్యతి మహాతేజాస్తస్మి
న్కాలే తపోనిధిః. ౧౯. భగినీం చ జరత్కారుం తస్మై త్వం ప్రతిదాస్యసి, భవితా
తస్య పుత్త్రోఽసావాస్తీక ఇతి విశ్రుతః. ౨౦. స తత్సత్త్రం ప్రవృద్ధం వై నాగానాం
భయదం మహత్, నిషేధేత్సుమతిర్వాగ్భిరగ్ర్యాభిస్తం నవిష్యతి. ౨౧. తదిమాం భగినీం
రాజంస్తస్య త్వం ప్రతిదాస్యసి, జరత్కారుం జరత్కారోః ప్రదద్యా అవిచారయన్.
౨౨. యదాసౌ ప్రార్థ్యతేఽరణ్యే యత్కించిద్ధి వదిష్యతి, తత్కర్తవ్యమశంకేన యదీచ్ఛేః
శ్రేయ ఆత్మనః ౨౩. పితామహవచః శ్రుత్వా వాసుకిః ప్రణిపత్య చ, తథాకరో
ద్యథా చోక్తం యత్నం చ పరమాస్థితః. ౨౪. తచ్ఛ్రుత్వా పన్నగాః సర్వే ప్రహర్షో
త్ఫుల్లలోచనాః, పునర్జాతమివాత్మానం మేనిరే భుజగోత్తమాః. ౨౫. తత్ర సత్త్రం
మహాబాహో తవ పిత్రా ప్రవర్తితమ్, ఋత్విగ్భిః సహితేనేహ సర్వలోకేషు దుష్క
రమ్. ౨౬. ప్రోక్తం చ విష్ణునా పూర్వం ధర్మపుత్త్రస్య ధీమతః, అవశ్యం తస్య భవితా

క్షీత్తునకు నూరేండ్లకుఁ బైఁబడిన కాలము గడువ నుద్భవించును. అప్పుడు సర్పక్షయకరమై ఘోరమగుసత్త్రయాగము తప్పక జరుగును. అందు ధర్మదూరులు విషాధికులు నగునాగులు కోటులకొలఁదికి మీరి యహర్నిశమును వహ్నిలోఁబడఁగలవు. ఇట్లు ఘోరమై భయంకరమై యభూతపూర్వమగు నగ్నిసాగరమున మునిఁగియున్న యానాగులను వహ్నిసాగరమునందు నౌకవలె నాస్తీకుఁడువచ్చి రక్షింపఁగలఁడు అనెను. అగ్నిని రాజును ఋత్త్విజుల నిట్లు చేయుచున్నవారింగా విని యాస్తీకుఁ డటకేగి సర్పనాశహేతువు నాయాగమును నివారింపఁగలఁడు. ఆనాఁడు పంచమి. ఆపంచమియందు బ్రహ్మదేవుఁ డచ్చట దోఁచి సర్పముల కిట్లనియె. ఓనాగులారా! మీకీతిథి యెల్లప్పుడు నానందముఁ గూర్పుగాక యని. ఇట్లు బ్రహ్మదేవుఁడు పంచమిని నాగసంతోషవర్ధనిగా నొసంగుటచే నీపంచమి యెల్లప్పుడును బాములకుఁ బ్రియమయినది. కోరిక ననుసరించి బ్రాహ్మణులకు భోజనము లిడి గౌరవించి యేయేపాము లిలపై నున్నవో యెయ్యవి యేలకులపొదలనుమిరియములపొదల నంతరిక్షమున నున్నవో సూర్యమండలమున నెయ్యవి యున్నవో మహానదులందును సరస్వతీనది యందును దిగుడుబావులయందును తటాకములయందు నెయ్యవి యున్నవో యానాగములెల్లఁ దృప్తినొందుఁగాక. వారికందఱకును జోహారు. అని యిట్లు బ్రాహ్మణులను నాగములను యథాశక్తిగఁ

---

నాగానాం భయకారకమ్. ౨౭. తస్మాత్కాలాంతరాద్రాజన్నాస్త్రే వర్షశతే గతే, తత్సత్త్రం భవితా ఘోరం నాగానాం క్షయకారకమ్. ౨౮. యాస్యంత్యధర్మభరితా దందశూకా విషోల్బణాః, కోటిసంఖ్యా మహారాజ నిపతిష్యంత్యహర్నిశమ్. ౨౯. అపూర్వే తు నిమగ్నానాం ఘోరే రౌద్రాగ్నిసాగరే, ఆస్తీకస్తత్ర భవితా తేషాం నౌర్వహ్నిసాగరే. ౩౦. శ్రుత్వా స చాగ్నిం రాజానమృత్విజస్తదనంతరమ్, నివర్తయిష్యతే యాగం నాగానాం మోహనం పరమ్. ౩౧. పంచమ్యాం తత్ర భవితా బ్రహ్మా ప్రోవాచ లేలిహాన్, తస్మాదియం మహాబాహో పంచమీ దయితా సదా, నాగానామానందకరీ దత్తా వై బ్రహ్మణా పురా. ౩౨. కృత్వా తు భోజనం పూర్వం బ్రాహ్మణానాం తు కామతః, విసృజ్య నాగాః ప్రీయంతాం యే కేచిత్పృథివీతలే. ౩౩. యే చ హేలిమరీచిస్థా యేఽంతరే దివి సంస్థితాః, యే నదీషు మహానాగా యే సరస్వతిగామినః, యే చ వాపీతడాగేషు తేషు సర్వేషు వై నమః. ౩౪. నాగాన్విప్రాంశ్చ

బూజించి విడచి యావెనుక భృత్యులతోఁగూడ భుజింపవలయును. తొలుత మధురపదార్థము భుజింపవలయును. ఆవెనుక యథేష్టముగ భుజింపవచ్చును. ఇట్టి నియమముతోఁ బంచమీవ్రతము సల్పువానికిఁ గలుగుఫలము వచింతు వినుము. ఈలోకమున నీభౌతికశరీరము విడచిన వెనుక నాగలోకమున కేగి యప్సరోగణసేవితుఁడై పూజితుండై విమానారూఢుండై యిచ్చవచ్చినన్నినాళ్లు భోగము లనుభవించును. ఓరాజా! అనంతర మాతఁ డీలోకమునఁ బదివేవురలో నుత్తముఁడై రాజగును. మఱియు నిఖిలరత్నములతో సమృద్ధుఁడై సర్వవాహనాఢ్యుఁడునై జన్మించును మఱియు నాతఁ డైదుపుట్టువులవఱకుఁ బ్రతిద్వాపరమునను రాజై జన్మించును. ఆధివ్యాధులు లేక పత్నీపుత్రసహాయోపేతుఁడై యుండును. కావున నెల్లప్పుడును ఘృతముచేతను బాయసముచేతను గుగ్గిలముచేతను నాగులను బూజించుచుఁ బోషించుచుండవలయును. అన విని శతానీకుం డో బ్రాహ్మణోత్తమా! పాములు కోపముచే నెవ్వనిఁ గఱచునో యానరునకుఁ గల్గున దెద్దియో విశదీకరింపుమన సుమంతుఁ డిట్లనియె. రాజా! సర్పదష్టుఁడగునరుండు మృతుండై యధోలోకమున కేగును. అట్టులేగి యచట నాతఁడు విషములేనిసర్పమై జనించును ఇందు సందియములేదు. అన విని శతానీకుండు "తండ్రిగాని, సోదరుఁడుగాని, కూఁతురుగాని, తల్లిగాని, పుత్త్రుఁడుగాని, భార్యగాని నాగ

---

సంపూజ్య విసృజ్య చ యథార్థతః, తతః పశ్చాత్తు భుంజీత సహ భృత్యైర్నరాధిప. ౩౫. పూర్వం మధురమశ్నీయాత్తతో భుంజీత కామతః, ఏవం నియమయుక్తస్య యత్ఫలం తన్నిబోధ మే. ౩౬. మృతో నాగపురం యాతి పూజ్యమానోఽప్సరోగణైః, విమానవరమారూఢో రమతే కాలమీప్సితమ్. ౩౭. ఇహ చాగత్య రాజాసావయుతానాం వరో భవేత్, సర్వరత్నసమృద్ధః స్యాద్వాహనాఢ్యశ్చ జాయతే. ౩౮. పంచ జన్మాన్యసౌ రాజా ద్వాపరే ద్వాపరే భవేత్, ఆధివ్యాధివినిర్ముక్తః పత్నీపుత్రసహాయవాన్, తస్మాత్పూజ్యాశ్చ పాల్యాశ్చ ఘృతపాయసగుగ్గులైః. ౩౯. శతానీక ఉవాచ.— దశంతి యే నరం విప్ర నాగాః క్రోధసమన్వితాః, భవేత్కిం తస్య దష్టస్య విస్తరాద్బ్రూహి మే ద్విజ. ౪౦. సుమంతురువాచ.— నాగదష్టో నరో రాజన్ప్రాప్య మృత్యుం ప్రజత్యధః, అధో గత్వా భవేత్సర్పో నిర్విషో నాత్ర సంశయః. ౪౧. శతానీక ఉవాచ.— నాగదష్టః పితా యస్య భ్రాతా వా దుహితాపి వా, మాతా పుత్రోఽథ వా

దష్టులై మరణించినచో వారలకొఱ కేమి చేయవలయునో యెఱింగింపుము. విప్రేంద్రా! వారికి మోక్షము లభించుటకు దానవ్రతోపవాసములు చేయవలయునా? అదియంతయు నాకెఱింగింపుము. నేనొనరింతును. అన నాతనికి సుమంతుఁ డిట్లనియె రాజేంద్రా! నాగములకుఁ బుష్టినొసంగు పంచమి నుపవసింపవలయును. నీకొక్క విధానము జెప్పెద వినుము. భాద్రపదమాసమునఁ గృష్ణపక్షమున వచ్చు పంచమీతిథి నాగులకు బలసంతోషముల నొసంగును. ఆసుదినమున నుపవసించి యథోక్తవిధానమున నాగార్చన మాచరింపఁదగును. రాజా! యేఁడాదిలోఁగృష్ణపంచమీతిథులు పండ్రెండుగద యేతెంచును. చతుర్థినాఁ డేకభుక్త మొనరించి (రాత్రి మాత్రము భుజించి) బంగారముతోఁ గాని, వెండితోఁగాని, దారువుతోఁ గాని లేకున్న మృత్తుతోఁగాని నైదునాగములుచేసి వానినిఁ గరవీరపుష్పములచేతను, దామరలచేతను, జాతీసుమములచేతను, దీపధూపముల చేతను, గంధములచేతను నాతిథుల నర్చింపవలయును. అనంతుఁడు, వాసుకి, శంఖుఁడు, పద్మuఁడు, కంబలుఁడు, కర్కోటకుఁడు, నశ్వతరుఁడు, ధృతరాష్ట్రుఁడు, శంఖపాలుఁడు, కాళియుఁడు, తక్షకుఁడు, పింగళుఁడు నని పన్నిద్దఱు మహానాగులు గలరు. వీరిలో నొక్కొక్కరి నొక్కొక్క మాసమున వెనుకఁజెప్పినచొప్పునఁ బూజింపనగును అనంతరము ఘృత

భార్యా కిం కర్తవ్యం వదస్వ మే. ౪౨. మోక్షాయ తస్య విప్రేంద్ర దానం వ్రత ముపోషణమ్, బ్రూహి తద్ద్విజశార్దూల యేన తద్వై కరోమ్యహమ్. ౪౩. సుమంతు రువాచ.—ఉపోష్యా పంచమీ రాజన్నాగానాం పుష్టివర్ధనీ, త్వమేవమేకం రాజేంద్ర విధానం శృణు భారత. ౪౪. మాసి భాద్రపదే యా తు కృష్ణపక్షే మహీపతే, మహాపుణ్యా తు సా ప్రోక్తా గ్రాహ్యాపి చ మహీపతే. ౪౫. జ్ఞేయా ద్వాదశ పంచమ్యో హాయనే భరతర్షభ, చతుర్థ్యాం త్వేకభక్తం తు తస్యాం నక్తం ప్రకీర్తితమ్. ౪౬. భువి చిత్రమయాన్నాగానథ వా కలధౌతకాన్, కృత్వా దారుమయాన్వాపి అథ వా మృన్మయాన్నృప. ౪౭. పంచమ్యామర్చయేద్భక్త్యా నాగానాం పంచకం నృప, కరవీరైః శతపత్రైర్జాతీపుష్పైశ్చ సువ్రత. ౪౮. తథా గంధైశ్చ ధూపైశ్చ పూజ్యా పంచక ముత్తమమ్, బ్రాహ్మణం భోజయేత్పశ్చాద్ ఘృతపాయసమోదకైః. ౪౯. అనంతో వాసుకిః శంఖః పద్మః కంబల ఏవ చ, తథా కర్కోటకో నాగో నాగో హ్యశ్వతరో

పాయసలడ్డుకములచే బ్రాహ్మణులఁ దనుపుచుండవలయును. అట్లాచరించి వత్సరాంతమున బహుబ్రాహ్మణసంతర్పణముతోఁ బారణము సలుపవలయును. గైరికచే నిర్మితమగు నొక్కనాగమును స్వస్తివచనశీలుఁడు నితిహాసనిపుణుఁడు నగు నొక్కబ్రాహ్మణున కొసంగి పూజింపవలయును. ఇయ్యది నాగపంచమీవ్రతవిధి యని బుధులు వచించిరి. తండ్రికి మోక్షము లభించుటకై నీతండ్రి యగుజనమేజయుఁ డీవ్రతము సలిపియుండెను. ఓభరతర్షభా! నీవొక్కొక్కపంచమికిని బారువుబంగారముతో నిర్మించిన యొక్కొకనాగమును నట్టిగోవును వ్యాసున కొసంగుము. అట్లొనర్చితివేని నీవు పితౄణమునుండి విడివడఁగలవు. నీతండ్రి యీతీరున పంచమ్యుపాసనము జేయ ననృణుఁడయ్యెఁగదా! నీపితామహుఁడు దానిచే నాగరూపము వీడి పుష్పములకన్నఁ గోమలమగు పుష్పసదమను స్థానమునకు నటనుండి యింద్రసదస్సునకు నటనుండి రుద్రసదస్సునకు నేగి యటనుండి స్వాయంభువుఁడగు పద్మసంభవునిలోకమున కేగెను. ఇతరులు గూడ నెవ్వార లీవ్రతము నొనరింతురో వారికులమున సర్పదష్టులై మృతినొందినవారు పాపవిముక్తులై శుభస్థానముఁ జేరఁగలరు. ఈయుపాఖ్యానమును భక్తిశ్రద్ధలతో నాలకించువారివంశమున నాగ

---

నృప. ౫౦. ధృతరాష్ట్రః శంఖపాలః కాలియస్తక్షకస్తథా, పింగలశ్చ తథా నాగో మాసి మాసి ప్రకీర్తితాః. ౫౧. వత్సరాంతే పారణం స్యాద్బ్రాహ్మణాన్భోజయేద్బహూన్, ఇతిహాసవిదే నాగం గైరికేణ కృతం నృప, తథార్చనా ప్రదాతవ్యా వాచకాయ మహీపతే. ౫౨. ఏష వై నాగపంచమ్యా విధిః ప్రోక్తో బుధైర్నృప, తవ పిత్రా కృతశ్చైవ పితుర్మోక్షాయ భారత. ౫౩. త్వమేకమేకం వై వీర పంచమ్యాం భరతర్షభ, సువర్ణభారనిష్పన్నం నాగం దత్త్వా తథా చ గామ్. ౫౪. వ్యాసాయ కురుశార్దూల పితురానృణ్యమాప్నుయాః, తవ పిత్రా కృతా హ్యేవం పంచమ్యుపాసనా నృప. ౫౫. ఉత్సృజ్య నాగతాం వీర తవ పూర్వపితామహాః, పుష్పోత్తరం సదో గత్వా తథా పుష్పసదో నృప. ౫౬. సునాసీరసదో గత్వా తదా భర్గసదో గతః, స్వభూసదస్తతో గత్వా కంజజస్య సదో గతః. ౫౭. అన్యేఽపి యే కరిష్యంతి ఇదం వ్రతమనుత్తమమ్, దష్టకో మోక్ష్యతే తేషాం శుభం స్థానమవాప్స్యతి ౫౮. యశ్చేదం

ములనుండి యెట్టివిపత్తును సంభవింపదు. నాగభయమనునదియే యుండదు.

ఇది ద్వాత్రింశాధ్యాయము.

---

## త్రయస్త్రింశాధ్యాయము.

సర్పముల కెన్నిరూపము లున్నవి? యేయేవర్ణము లున్నవి? వాని లక్షణమేమి ? జాతి యెట్టిది ? ఏయోనికులముల బుట్టుచున్నవి ? వివరింపవే యన శతానీకునకు సుమంతుఁ డిట్లనియె. రాజా! మున్ను పర్వతోత్తంసమగు మేరుగిరియందుఁ దపోనిధి యగుకశ్యపప్రజాపతిని జూచి శిరము వంచి నమస్కరించి గౌతముఁడు భక్తితో నాతని కిట్లనియె. మహాత్మా! సర్పముల కెన్నిరూపము లున్నవి ? వానియభిజ్ఞానము లెయ్యవి ? జాతికులవర్ణములు నెయ్యవి ? అన్నియు నెఱింగింపుము. సర్ప మెట్టు లుద్భవించుచున్నదో ? యెట్లు విషము గ్రక్కుచున్నదో? విభుఁడవగుటచే నీవెఱుంగుదువు. విషవేగము లెన్నివిధములు? విషనాడు లెయ్యవి? వానికోఱ లెన్నిభంగు లయియున్నవి ? విషమువచ్చుటకుఁ గారణమేమి ? ఎప్పుడు గర్భము దాల్చును? ఎప్పుడు ప్రసవించును?

---

శృణుయాన్నిత్యం నరః శ్రద్ధాసమన్వితః, కులే తస్య న నాగేభ్యో భయం భవతి కుత్రచిత్. ౫౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే నాగపంచమీవ్రతవర్ణనం నామ ద్వాత్రింశోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ.—సర్పాణాం కతి రూపాణి కే వర్ణాః కిం చ లక్షణమ్, కా జాతిస్తు భవేత్తేషాం కేషు యోనికులేషు వా. ౧. సుమంతురువాచ.—పురా మేరౌ నగవరే కశ్యపం తపసాం నిధిమ్, ప్రణమ్య శిరసా భక్త్యా గౌతమో వాక్యమబ్రవీత్. ౨. సర్పాణాం కతి రూపాణి కిం చిహ్నం కిం చ లక్షణమ్, జాతిం కులం తథా వర్ణాన్బ్రూహి సర్వం ప్రజాపతే. ౩. కథం వా జాయతే సర్పః కథం ముంచేద్విషం ప్రభో, విషవేగాః కతి ప్రోక్తాః కత్యేవ విషనాడికాః. ౪. దంష్ట్రాః కతివిధాః ప్రోక్తాః కిం ప్రమాణం విషాగమే, గృహ్ణీతే తు కదా గర్భం కథం చేహ ప్రసూయతే. ౫. కీదృశీ

వానిలో స్త్రీ యెట్టిది? పురుషనాగ మెట్లుండును? నపుంసక మెట్లుండును? కఱచుట యన నేమి ? యిదియంతయు నోసువ్రతా! యెఱింగింపవే యని యడుగ నాతనికిఁ గశ్యపప్రజాపతి యిట్లు బదులు పలికెను. ఓగౌతమా! యథార్థముగ సర్పలక్షణముల వివరింతు వినుము. జ్యేష్ఠాషాఢమాసము లందు భుజగకులము మిక్కిలి మదించియుండును. అప్పుడే స్త్రీపురుష నాగములు మైథునమునకు దొరకొనును. అంత నాఁడుపాము వర్ష కాలము నాల్గునెలలు గర్భము దాల్చియుండును. అంతఁ గార్తికమాసమున గ్రుడ్లు ప్రసవించును. ఆగ్రుడ్లు రెండునూర్లును రెండిరువదులు (ఇన్నూటనలువది) నుండునని యెఱుంగనగును. ఆస్త్రీనాగము ప్రసవానంతర మాగ్రుడ్లనే భక్షించుచు నందు మూఁడుభాగములు తినినవెనుక దయగలిగి తక్కినభాగమును విడుచును. అందులో బంగారువన్నెగాని సూర్యకాంతిగాని కలయండమున్నచో దానినుండి పురుషసర్పము జనించును. ఆసర్పము వానినే యిరువదియహోరాత్రములు భుజించును. అందు బంగారు మొగలిపూవులవర్ణముగలిగి పొడవగు రాజీవ (కలువభేదము) మున కీడగునండమునుండి స్త్రీసర్పము ప్రభవించును. దిరిసెనపువ్వురంగు గలయండమునుండి నపుంసక ముత్పన్నమగును. ఇట్లు లారుమాసములకు గ్రుడ్లన్నియుఁ బగులును. అంతట నందుండి వాడమిన సర్పకుమారు లందఱుఁ బ్రీతిపురస్సరముగ నొండొరులు మైత్రిగలిగియుందురు. అంతఁ బురుషపన్నగము నేడురాత్రులు గడువఁ గృష్ణమగును. సర్పముల కాయుః

---

స్త్రీ పుమాంశ్చైవ కీదృశశ్చ నపుంసకః, కిం నామ దశనం చైవ ఏతత్కథయ సువ్రత. ౬. తస్య తద్వచనం శ్రుత్వా కశ్యపః ప్రత్యభాషత, శృణు గౌతమ తత్త్వేన సర్పాణామిహ లక్షణమ్. ౭. మాస్యాషాఢే తథా జ్యేష్ఠే ప్రమాద్యంతి భుజంగమాః, తతో నాగోఽథ నాగీ చ మైథునే సంప్రపద్యతే. ౮. చతురో వార్షికాన్మాసాన్నాగీ గర్భమధారయత్, తతః కార్తికమాసే తు అండకాని ప్రసూయతే. ౯. అండకానాం తు విజ్ఞేయే ద్వేశతే ద్వే చ వింశతీ, తాన్యేవ భక్షయేత్సా తు భాగైకం ఘృణయా త్యజేత్. ౧౦. స్వర్ణార్కవర్ణాద్వై తస్మాత్పుమాన్సంజాయతేఽండకాత్, తాన్యేవ ఖాదతే సర్ప అహోరాత్రాణి వింశతిమ్. ౧౧. స్వర్ణకేతకవర్ణాభాద్దీర్ఘరాజీవసన్నిభాత్, తస్మాదుత్పద్యతే స్త్రీ వై అండాద్బ్రాహ్మణసత్తమ. ౧౨. శిరీషపుష్పవర్ణాభాదండకాత్స్యాన్నపుంసకః, తతో భినత్తి చాండాని షణ్మాసేన తు గౌతమ. ౧౩. తతస్తే ప్రీతిసంబంధాత్స్నేహం బధ్నంతి బాలకాః, తతోఽసౌ సప్తరాత్రేణ కృష్ణో భవతి

ప్రమాణము నూటయిరువదియేండ్లని చెప్పుదురు. వానికి మృత్యువుగూడ నెనిమిదివిధములుగ నుండును. వరుసగ వినుపింతు వినుము. మయూరము నుండియు మనుష్యునుండియుఁ జకోరమునుండియు గోవులడెక్కల నుండియు బిడాలమునుండియు నకులమునుండియు వరాహమునుండియు వృశ్చికమునుండియు నని. ఈయెనిమిదింటిబారినుండి తప్పించుకొని యుండెనేని నూటయిరువదేండ్లు జీవించును. ఏడురాత్రులావెనుక నిండ దంతములు వచ్చును. ఆవెనుక నందు విషము ప్రవేశించును. అంతట నొకచోటఁ గఱచి కఱచి విష ముత్పన్నమయ్యెనని యెఱింగి యవ్వల విషకర్మల నారంభించును. ఇట్లు జన్మము మొదలు ముయ్యేడురాత్రులకు విషదంతము లేర్పడును. నాగిచెంతఁ దిరుగుచు నది బాలసర్ప మనఁబడును. ఇరువదైదురాత్రులు గడచిననాగు కఱచెనేని వెంటనే ప్రాణములు గతించును. ఆరుమాసములు గడచినవెనుక కుబుసమును విడుచును. సర్పములకుఁ బాదములు గూడ యిన్నూటనలువదియుండునని యెఱుఁగ వలయును. గోవులరోమములవలెనుండి పాదములు లోనఁ జొచ్చును. వానితోఁ బాములు నడుచుచుఁగూడ నుండును. సర్పముయొక్కసంధులు గూడ యిన్నూటనలువదియే యందురు. అంగుళులు గూడ రెండువందల నలువదియే యని యెఱుంగనగును. ఏసర్పము లకాలమునఁబుట్టునో యవి విషము లేనివని యెఱుంగునది. డెబ్బదియైదేండ్లు వాని కాయుర్దాయమై

పన్నగః. ౧౪. ఆయుః ప్రమాణం సర్పాణాం శతం వింశోత్తరం స్మృతమ్, మృత్యుశ్చాష్టవిధో జ్ఞేయః శృణుష్వాత్ర యథాక్రమమ్. ౧౫. మయూరాన్మానుషాద్వాపి చకోరాద్గోఖురాత్తథా, బిడాలాన్నకులాచ్చైవ వరాహాద్వృశ్చికాత్తథా, ఏతేషాం యది ముచ్యేత జీవేద్వింశోత్తరం శతమ్. ౧౬. సప్తాహే తు తతః పూర్ణే దంష్ట్రాణాం చాధిరోహణమ్, విషస్యాగమనం తత్ర నిక్షిపేచ్చ పునః పునః. ౧౭. ఏవం జ్ఞాత్వా తు తత్త్వేన విషకర్మారభేత వై, ఏకవింశతిరాత్రేణ విషదంష్ట్రా సుజాయతే, నాగీపార్శ్వసమావర్తీ బాలసర్పః స ఉచ్యతే. ౧౮. పంచవింశతి రాత్రస్తు సద్యః ప్రాణహరో భవేత్, షణ్మాసాజ్జాతమాత్రస్తు కంచుకం వై ప్రముంచతి. ౧౯. పాదానాం చాపి విజ్ఞేయే ద్వే శతే ద్వే చ వింశతీ, గోలోమసదృశాః పాదాః ప్రవిశంతి క్రమాతి చ. ౨౦. సంధీనాం చాస్య విజ్ఞేయే ద్వే శతే వింశతీ తథా, అంగుల్యశ్చాపి విజ్ఞేయా ద్వే శతే వింశతీ తథా. ౨౧. అకాలజాతా యే సర్పా నిర్విషాస్తే ప్రకీర్తితాః, పంచసప్తతి

యున్నది. ఎఱ్ఱని పచ్చని తెల్లనిదంతములు గలవి నల్లనియొడలు లేనివి మందమగువేగము గలవియు నల్పాయువులని యెఱుంగునది. ఇతరము లన్నియు భీరువులు. పామునకు ముఖమొక్కటియు నాలుకలు రెండు నై యున్నవి. అన్నిపన్నగములకును ముప్పదిరెండుదంతము లుండును. సందియము లేదు. వానిలో నాలుగుదంష్ట్రలు మిక్కిలి విషపూరితములై యుండును. అయ్యవి మకరీ, కరాళీ, కాలరాత్రీ, యమదూతీ, యను నామములుగలిగి యితరదంతము లన్నింటికిని దేవతలై యుండునని చెప్పుదురు. ఆనాలుగింటిలో మొదటిదగుమకరి బ్రహ్మదైవత్యము, రెండవది విష్ణుదైవత్యము, మూఁడవది రుద్రదైవత్యము, నాలుగవది యమదైవత్యము నై యున్నవి. ఇట్టిదని నిరూపించు ప్రమాణముచే హీనమగు నాలుగవదంష్ట్ర యెడమకన్నుకడ నుండును. దానియందు మంత్రౌషధాదిచికిత్స లుపయోగింపరాదు. దానియందు మృత్యువు లిఖింపఁబడుటచే వైద్యుఁడు వెనుదిరిగిపోవును అందుఁ బండితులు చికిత్సలు చేయనక్కఱ లేదు. ఆతని కాయు వంతటితో ముగియును. ఒకమాసమునకు మకరి యనుదంష్ట్ర యేర్పడును. రెండవమాసమునకుఁ గరాళి యేర్పడును. మూఁడవమాసమునకుఁ గాలరాత్రి యేర్పడును. నాల్గుమాసములకు యమదూతి యనునంతిమదంష్ట్ర యేరుపడును. మకరీదంష్ట్రకు గుడాన్నము నుపయోగింపవలయును. కరాళికకుఁ గషాయాన్నము నిడవలయును.

---

వర్షాణి ఆయుస్తేషాం ప్రకీర్తితమ్. ౨౨. రక్తపీతశుక్లదంతా అనీలా మందవేగినః, ఏతే అల్పాయుషో జ్ఞేయా అన్యే చ భీరవః స్మృతాః. ౨౩. ఏకం చాస్య భవేద్వక్త్రం ద్వే జిహ్వే చ ప్రకీర్తితే, ద్వాత్రింశద్దశనాః ప్రోక్తాః పన్నగానాం న సంశయః. ౨౪. తేషాం మధ్యే చతస్రస్తు దంష్ట్రా యాః సువిషావహాః, మకరీ కరాలీ కాలరాత్రీ యమదూతీ తథైవ చ. ౨౫. సర్వాసాం చైవ దంష్ట్రాణాం దేవతాః పరికీర్తితాః, ప్రథమా బ్రహ్మదేవత్యా ద్వితీయా విష్ణుదేవతా, తృతీయా రుద్రదేవత్యా చతుర్థీ యమదేవతా. ౨౬. హీనా ప్రమాణతః సా తు వామనేత్రం సమాశ్రితా, నాస్యాం మంత్రాః ప్రయోక్తవ్యా నౌషధం నైవ భేషజమ్. ౨౭. వైద్యః పరాఙ్ముఖో యాతి మృత్యుస్తస్యా విలేఖనాత్, చికిత్సా న బుధైః కార్యా తదంతం తస్య జీవితమ్. ౨౮. మకరీం మాసికాం విద్యాత్కరాలీ చ ద్విమాసికా, కాలరాత్రీ భవేత్త్రీణి చతుర్థీ యమదూతికా. ౨౯. మకరీం గుడౌదనం దద్యాత్కషాయాన్నం కరాలికామ్, కా

కాలరాత్రికిఁ జేదుగలిగినయన్న మిడవలయును. యమదూతికిసన్ని పాతము (పరిత్యాగము) నే జేయవలయును. మకరిదంష్ట్ర శస్త్రాకృతిగలదియుఁగరాళి వాయసచరణాకృతియుఁ గాలరాత్రి హస్తాకృతియు యమదూతి కూర్మా కృతియు నై యున్నది. మకరీదంష్ట్ర వాతప్రకోపముగలదియై యుండును. కరాళి పిత్తప్రకోపముగలది. కాలరాత్రి కఫప్రకోపముగలది. యమ దూతి సన్నిపాతముగలదియై యుండును. మఱియు మకరి శుక్లవర్ణము గలదిగా నెఱుంగుము. కరాలి రక్తమున కెనయగును. కాలరాత్రి పసుపువన్నె గలది. యమదూతిక కృష్ణవర్ణముగలది యగును. ఎడమ వైపుననున్నదంష్ట్ర యెఱుపు నలుపులు గలిగియుండును. కుడివైపునున్నది రక్తపీతవర్ణములు గలిగియుండును. ఈవర్ణములవలనిజాతులు సంగ్రహ ముగ వచింతు వినుము. శుక్లవర్ణముగలదంష్ట్ర బ్రాహ్మణజాతియగును. రక్తదంష్ట్ర క్షత్రియజాతి యగును. పీతదంష్ట్ర వైశ్యజాతి యగును. కృష్ణవర్ణయగుదంష్ట్ర శూద్రజాతి యని యెఱిఁగెడిని. ఇఁకమీఁద దంతము లందలి విషలక్షణముల నెఱుంగుము. భుజంగమజాతికి సర్వకాలములను దంతములందు విషములేదు. ఎప్పుడును విషము పాముల కుడికన్ను నాశ్రయించి యుండును. ఆవిషము సర్పమునకుఁ గోపము గలిగినపుడు మస్తకమున కెక్కును. అటనుండి ధమనియను పెద్దనాడి కెక్కును. ఆవెనుక నెల్లనాడులఁ బ్రవేశించును. అంత నానాడులనుండి దంష్ట్ర

రాత్రీం కటుయుతం దూతీం వై సాంనిపాతికమ్. ౩౦. మకరీ శస్త్రకం విద్యాత్కరాలీ కాకపాదికా, కరాకృతిః కాలరాత్రిర్యామ్యా కూర్మాకృతిః స్మృతా. ౩౧. మకరీ వాతులా జ్ఞేయా కరాలీ పైత్తికీ స్మృతా, కఫాత్మికా కాలరాత్రీ యమదూతీ సాన్ని పాతకీ. ౩౨. శుక్లా తు మకరీ జ్ఞేయా కరాలీ రక్తసన్నిభా, కాలరాత్రీ భవేత్పీతా కృష్ణా చ యమదూతికా. ౩౩. వామా శుక్లా చ కృష్ణా చ రక్తా పీతా చ దక్షిణా, సమాసేన తు వక్ష్యామి యథైతా వర్ణతః స్మృతాః. ౩౪. శుక్లా తు బ్రాహ్మణీ జ్ఞేయా రక్తా తు క్షత్రియా స్మృతా, వైశ్యా తు పీతికా జ్ఞేయా కృష్ణా శూద్రా తు కథ్యతే, అతః పరం ప్రవక్ష్యామి దంష్ట్రాణాం విషలక్షణమ్. ౩౫. దంష్ట్రాణాం తు విషం నాస్తి నిత్యమేవ భుజంగమే, దక్షిణం నేత్రమాసాద్య విషం సర్పస్య తిష్ఠతి. ౩౬. సంక్రుద్ధ స్యేహ సర్పస్య విషం గచ్ఛతి మస్తకే, మస్తకాద్ధమనీం యాతి తతో నాడీషు గచ్ఛతి. ౩౭. నాడీభ్యః పద్యతే దంష్ట్రాం విషం తత్ర ప్రవర్తతే, తత్సర్వం కథయిష్యామి యథా

యందుఁ జేరియుండును. అంతట నాగు నిజకార్యము జేయఁబూనును. అది ప్రవర్తించుటకుఁ గలకారణములు క్రమముగ వివరింతు వినుము. పాముకఱచుట కెనిమిదికారణము లున్నవి. సందేహము లేదు. అందు మొదటిది దానినిఁ బాదాదులచే నాక్రమించుట. వెనుకటి విరోధ ముండుట రెండవది. మూఁడవది భయపడుట. మదించి గర్వించియుండుట నాలుగవది. ఆకలిగలిగియుండుట యైదవది. విష మధికముగనుండుట యాఱవది. సంతానమును గాపాడుకొనసుండుట యేడవది. కాలముచేఁ బ్రేరేపింపఁబడుట యెనిమిదవది. ఈయెనిమిదింటిలో నేదేని నిమిత్తముం డినఁ దప్పక కఱచితీరును. ఏపాము కఱచి కోరలను వలయాకారముగను భుగ్న(దర్భపవిత్రవిశేషము)సమాకృతిగనుదరము చెంతకుఁద్రిప్పుకొనునో యది యాక్రమణముచేఁ గఱచెనని యెఱుంగుము. ఎవనికిఁ బాముగరువ లోఁతయిన గాయము కనుపించునో యాతఁడు పామునకుఁ బూర్వవైరి యనియు నందుచేఁ బాము కఱచెననియు నెఱుంగవలయునని కశ్యపుని వచనము. ఎవని కొకే కోరగురుతు వ్యక్తమును గల్పితము గాక యుండునో యాతనియెడఁ బాము భీతిజెంది కఱచెనని యెఱుంగు మని ప్రజాపతియగు కశ్యపునివచనము. ఎవనికి దంతపురేఖ యగపడునో యాతనియెడ మదదంశనము నూహింపవలయునని కశ్యపుఁడు పలికెను. రెండుదంతములగుర్తులును గొప్పదెబ్బయు దష్టునందుఁ గాన్పించెనేని యాపాము క్షుధార్తమై కఱచెనని యెఱుంగవలయునని ప్రజాపతి వచించెను. ఎవనియందైన రెండు దంష్ట్రాపదములు రక్తసంకులములై

---

పదనుపూర్వశః. ౩౮. అష్టభిః కారణైః సర్పో దశతే నాత్ర సంశయః, ఆక్రాంతో దశతే పూర్వం ద్వితీయం పూర్వవైరిణమ్. ౩౯. తృతీయం దశతే భీతశ్చతుర్థం మద దర్పితః, పంచమం తు క్షుధావిష్టః షష్ఠం చేహ విషోల్బణః, సప్తమం పుత్రరక్షార్థ మష్టమం కాలచోదితః. ౪౦. యస్తు సర్పో దశిత్వా తు ఉదరం పరివర్తయేత్, బల భుగ్నాకృతిం దంష్ట్రామాక్రాంతం తం వినిర్దిశేత్. ౪౧. యస్య సర్పేణ దష్టస్య గభీరం దృశ్యతే వ్రణమ్, వైరదష్టం విజానీయాత్కాశ్యపస్య వచో యథా. ౪౨. ఏకం దంష్ట్రా పదం యస్య అవ్యక్తం న చ కల్పితమ్, భీతదష్టం విజానీయాద్వ్యధోవాచ ప్రజాపతిః. ౪౩. యస్య సర్పేణ దష్టస్య రేఖా దంతస్య జాయతే, మదదష్టం విజానీయాత్కాశ్య పస్య వచో యథా. ౪౪. ద్వే చ దంష్ట్రాపదే యస్య దృశ్యంతే చ మహాక్షతమ్, క్షుధా

యుండెనేని యది విషోల్బణమై కఱచిన ట్లెఱుంగనగుననుట నిస్సందిగ్ధము. మూఁడుదంతములగంట్లు కాకికాలువలె నుండెనేని యాపాము తనసంతానమును రక్షించుకొనుటకై కఱచెనని యెఱుంగవలయును. సందేహము వలదు. మహానాగము గఱచెనేని కాలచోదితమై కఱచెనని నిర్దేశింపవలయును దీనిలక్షణము "అయ్యది కఱచినచోటు మూఁడువిధము లగును. వెంటనే యాదేశము పచ్చఁబడును" అని కశ్యపుఁడు వచించెను. సర్పవిషమునుండి మూఁడవభాగము గాటునఁజేరు. కరువగనే యుదరముగనఁబఱచెనేని యది యుద్ధతమైనదని యెఱుంగనగును. విషవేగముచే దద్దురులెత్తెనేని యది విషములేనిపామగును. పాము నాల్గుకోరలతో గఱచెనేని యసాధ్యమని యెఱుంగనగును. స్వల్పముగ గఱచెనేని విషసంబంధమున మెడ యిటునటు ద్రిప్పుచుండును. ఇటు గఱచిన నటు శుద్ధమై వ్యంతర మనఁబడును.

ఇది త్రయస్త్రింశాధ్యాయము.

---

విష్టం విజానీయాద్యథోవాచ ప్రజాపతిః. ౪౫. ద్వే దంష్ట్రే యస్య దృశ్యేతే క్వచిద్రుధిరసంకులే, విషోల్బణం విజానీయాద్దంశం తం నాత్ర సంశయః. ౪౬. అపత్యరక్షణార్థాయ జానీయాత్తం న సంశయః, యత్తు కాకపదాకారం త్రిభిర్దంతైస్తు లక్షితమ్. ౪౭. మహానాగ ఇతి ప్రోక్తం కాలదష్టం వినిర్దిశేత్, త్రివిధం దష్టజాతైస్తు లక్షణం సముదాహృతమ్. ౪౮. దష్టానుపీతం విజ్ఞేయం కశ్యపస్య వచో యథా, విషభాగాత్తు సర్పస్య త్రిభాగస్తత్ర సంక్రమేత్. ౪౯. ఉదరం దర్శయేద్యస్తు ఉద్ధతం తం వినిర్దిశేత్, ఛర్దితం విషవేగేన నిర్విషః పన్నగో భవేత్. ౫౦. అసాధ్యశ్చాపి విజ్ఞేయశ్చతుర్దంష్ట్రాభిపీడితః, గ్రీవాభంగో భవేత్కించిత్సందష్టో విషయోగతః, ఇతో దంశస్తతః శుద్ధో వ్యంతరః పరికీర్తితః. ౫౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం

బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే సర్పదంష్ట్రావర్ణనం నామ

త్రయస్త్రింశోఽధ్యాయః.

---

## చతుస్త్రింశాధ్యాయము.

గౌతమా! ఇఁకఁ గాలచోదితమై కాటువైచిన పాముకాటును గుఱించి వివరింతు నాకర్ణింపుమని కశ్యపుఁడు మరల నిట్లనియె. కాలచోదిత మగుభుజంగముచేఁ గాటొందిననరుఁడు జిహ్వాభంగమును (నాలుక విరిగి నట్లుండుట) హృదయశూలమును గాంచుచున్నాఁడు. అట్టి నరునకుఁ గన్నులు కానుపింపవు. ఆకాటు వడినచోటు మాడిపోయినటులుండి బాగుగఁ బండిన నేరేడుపండువలె నుండును. దంతములు శ్యావ (నలుపు పసుపు) వర్ణముగలిగి వివర్ణములై యుండును. శరీరమున సర్వాంగము లును పట్టుదప్పిపోవును. పురీషము విరివిగ నగుచుండును. మూపునఁ గటి యందు గంఠమునను భంగము లేర్పడును. ఊర్ధ్వదృష్టియు నధోముఖుండు నై యుండును. ఒడలంతయు మంట లెత్తును. గడగడవడంకుచుండును. మాటి మాటికి నిదురించుచుండును. శస్త్రముచే ఛేదించినను దేహము నెత్తురు గ్రక్కదు. కఱ్ఱతోఁగొట్టినను వాతలుపడవు. పాముకాటునగాక పదము మిక్కిలి నల్లనై నేరేడుపండువలెనుండి మాటిమాటికిఁ జిక్కని నెత్తురు గలిగి యెత్తై నెత్తుటదోగిన యవయవములుగలిగి యారక్త మతికష్టము మీఁద నిలుపఁదగియుండినచో నెక్కిళ్లు నూరుపులు నధికమై కంఠము నిరుద్ధమైనచో జర్మమంతయు మిక్కిలిగ బాలిపోయియున్నచో నయ్యది కాలచోదితసర్పదంశమని శాస్త్రనిపుణులగువిద్వాంసు లెఱుంగుదురు. ఎవ్వానికి బాముకాటున వాపగపడునో మిక్కిలి చలించుచు ముడుతలు

---

కశ్యపఉవాచ.—అతః పరం ప్రవక్ష్యామి కాలదష్టస్య లక్షణమ్, శృణు గౌతమ తత్త్వేన యాదృశో భవతే నరః. ౧. జిహ్వాభంగోఽథ హృచ్ఛూలం చక్షుర్భ్యాం చ న పశ్యతి, దంశం చ దగ్ధసంకాశం పక్వజంబూఫలోపమమ్. ౨. వైవర్ణ్యం చైవ దంతానాం శ్యావో భవతి వర్ణతః, సర్వేష్వంగేషు శైథిల్యం పురీషస్య చ భేదనమ్. 3. భగ్నస్కంధకటిగ్రీవ ఊర్ధ్వదృష్టిరధోముఖః, దహ్యతే వేపతే చైవ స్వపతే చ ముహుర్ముహుః. ౪. శస్త్రేణ ఛ్ఛిద్యమానస్య రుధిరం న ప్రవర్తతే, దండేన తాడ్యమానస్య దండరాజీ న జాయతే. ౫. దంశే కాకపదం సునీలమసకృజ్జంబూఫలాభం ఘన ముచ్ఛూనం రుధిరార్ద్రసేకబహులం కృచ్ఛ్రాన్నిరోధో భవేత్, హిక్కాశ్వాసగల గ్రహాశ్చ సుమహాన్పాండుస్త్వచా దృశ్యతే శుష్కాంగం ప్రవదంతి శాస్త్రనిపుణా స్తత్కాలదష్టం విదుః. ౬. దంశే యస్యాథ శోథః ప్రచలితవలితం మండలం వా సునీలం

దేలినదగునో మిక్కిలి నీలముగనుండునో చెమ్మటలు గ్రమ్మి గాత్రభేద మేరుపడునో రక్తము స్రవించుచుండునో ముక్కుమాటలు మాటాడునో దంతములు బెదవులు కలియకయుండునో హృదయము చలించుచుండునో తీవ్రమగు నాడీసన్నిరోధము సంభవించునో యాతని కాకాటు కాలచోదితసర్పదంశమని యెఱుంగుము. మాటిమాటికి దంతములతో దంతములు తాకుచు దృష్టి యలసటచే విన్ననై యుండి స్థూలమగు దంశమునుండి నల్లబారుచు నొకకన్ను చూడఁజాలకయుండినచో విషతిరస్కృతుఁడై నిట్టూర్పు లెడలేక విడచుచు ముక్కుతో మాటలాడుచుఁ బలుకరానిపలుకులెల్లఁ బలుకుచునుండెనేని యాతఁడు కాలదష్టుఁడని చెప్పుచున్నారు. తీవ్రమగువేదనచే గడగడ వడంకుచు గనులెఱ్ఱబారి మెడవిరుపుగలిగి నాభిదేశ మదరుచుండెనేని కాలదష్టమని వచింపవలెను. అద్దమునగాని యుదకమునగాని తననీడను జూడకయున్నను, కిరణములు మందములై మిక్కిలి వేడిగలిగియు దేజోవిహీనుఁడగు సూర్యుఁ డగపడెనేని బాధకు వెఱచి వడఁకుచుండెనేని రక్తనేత్రుఁడయి యుండెనేని యాతండు కాలదష్టమగుటచే వెంటనే మృతిజెందును. అష్టమియందుగాని నవమినాడుగాని కృష్ణచతుర్దశినిగాని నాగపంచమినిగాని సర్పదష్టులగు వారు జీవించుట సందియమే. మఱియు నార్ద్రానక్షత్రమున నాశ్లేషయందును మఘయందును భరణికృత్తికలందును స్వాత్యాదిపంచకమునను

---

ప్రస్వేదో గాత్రభేదః స్రవతి చ రుధిరం సానునాసం చ జల్పేత్, దంతోష్ఠాభ్యాం వియోగో భ్రమతి చ హృదయం సన్నిరోధశ్చ తీవ్రో దివ్యానామేష దంశః స్థలవిపుల మయోవిద్ధి తం కాలదష్టమ్. ౭. దంతైర్దంతాన్స్పృశతి బహుశో దృష్టిరాయాసఖిన్నా స్థూలో దంశః స్రవతి రుధిరం కేకరం చక్షురేకమ్, ప్రత్యాదిష్టః శ్వసితి సతతం సానునాసం చ భాషేత్పాపం బ్రూతే సకలగదితం కాలదష్టం తమాహుః. ౮. వేపతే వేదనా తీవ్రా రక్తనేత్రశ్చ జాయతే, గ్రీవాభంగశ్చలా నాభిః కాలదష్టం వినిర్దిశేత్. ౯. దర్పణే సలిలే వాపి ఆత్మచ్ఛాయాం న పశ్యతి, మందరశ్మిం తథా తీవ్రం తేజోహీనం దివాకరమ్. ౧౦. వేపతే వేదనాత్రస్తో రక్తనేత్రశ్చ జాయతే, స యాతి నిధనం జంతుః కాలదష్టం వినిర్దిశేత్. ౧౧. అష్టమ్యాం చ నవమ్యాం చ కృష్ణపక్షే చతుర్దశీమ్, నాగపంచమిదష్టానాం జీవితస్య చ సంశయః. ౧౨. ఆర్ద్రాశ్లేషామఘాభరణీ కృత్తికాసు విశేషతః, విశాఖాం త్రిషు పూర్వాసు మూలస్వాతీశతాత్మకే, సర్పదష్టా

శతభిషమునందును బాముగఱచినను విషపానముజేసినను జీవింపరు. జన సంచారములేనియింటను శ్మశానమునను నెండిపోయినచెట్టునందును శూన్యతిథియగు నక్షత్రమునందును సర్పదష్టులగుమనుష్యులు జీవింపరు. సర్వప్రాణులకు నూటయెనిమిదిమర్మస్థానము లుండునని చెప్పుదురు. అందును బంద్రెండునాడులు శ్రేష్ఠములయినవి. అవియేవనఁగా "కణతలు, కన్నులు, నొసలు, (భూర్మధ్యము) పొత్తికడుపు, వృషణముల పైభాగము, కక్షములు, మూపు, హృదయము, నడుము, దౌడలు, గడ్డము, గుదము"ననునవి యని చెప్పుదురు. ఈపంద్రెండు మర్మస్థానము లందును శస్త్రములచేగాని దంశ (సర్పము) ములచేగాని హతుఁడగు మానవుఁ డీలోకమున గాలదష్టతజీవింపఁడని యెఱుంగనగును. అవ్యక్తా క్షరములుగలుగునట్లు మాటాడుచు బ్రలాపములుచేయువారు జీవింపరు. గతించినదానినే మాటిమాటికి బలుకుచున్నను దలతిరుగువడుచున్నను నాతనికిఁ గాలము చేరువయయ్యెను. ఉత్తమునకు నీచుఁడగుదూత కను పించిన నధమునకు నుత్తమదూత యగపడినను తొలుత సర్పదష్టునినామ మును స్పష్టముగాఁ బలికి యావెనుక యవ్యక్తభాషణముల నక్షరములు మార్చి పలుకుచుండునేని యాయిరువురును సములగు కాలముచేరువ యగువానికి దూతలగుదురు. దూత దండహస్తుఁడై యున్నను రెండు పాశములు కేలఁగీలించియున్నను నల్లనియెఱ్ఱవస్త్రమును ధరించియైనను

---

న జీవంతి విషం పీతం చ యైస్తథా. ౧౩. శూన్యాగారే శ్మశానే చ శుష్కవృక్షే తథైవ చ, న జీవంతి నరా దష్టా నక్షత్రే తిథిసంయుతే. ౧౪. అష్టోత్తరం మర్మశతం ప్రాణినాం సముదాహృతమ్, తేషాం మధ్యే తు మర్మాణి దశ ద్వే చాపి కీర్తితే. ౧౫. శంఖే నేత్రే భ్రువోర్మధ్యే వస్తిభ్యాం వృషణోత్తరే, కక్షే స్కంధే హృది మధ్యే తాలుకే చిబుకే గుదే. ౧౬. ఏషు ద్వాదశమర్మేషు దంష్ట్రైః శస్త్రేణ వా హతః, న జీవతి నరో లోకే కాలదష్టం వినిర్దిశేత్. ౧౭. అకచటతపయశాం వదంతి ప్రోక్తా జీవంతి న తత్ర హి, గతం బ్రూయాద్యది స్ఖలతి శిరస్తస్య సంప్రాప్తకాలః. ౧౮. భవతి చ యది దూతో హ్యుత్తమస్యాధమో వా యది భవతి చ దూత ఉత్తమో వాధమస్య, ఆదౌ దష్టస్య నామ యది వదతి క్వచిద్వక్తి తస్యాథ పశ్చాత్తం వర్ణభేదో యది భవతి సమః ప్రాప్తకాలస్య దూతః. ౧౯. దూతో వా దండహస్తో భవతి చ యుగలం పాశహస్తస్తథా వా రక్తం వస్త్రం చ కృష్ణం ముఖశిరసి గతమేకవస్త్రశ్చ

ఒకేవస్త్రమును గట్టినయైనను శరీరమంతటను నూనెబూసికొని తొందర తొందరగా నడచుచు వెండ్రుకలు విరియబోసికొని దూత యెవని కగ పడునో అప్పు డెవఁడు కరచరణయుగళములచే గొప్పభయంకరమైన శబ్దము గలిగించునో యాతని కాదూత కాలముచేరువ యగుటచే నగ పడెనని యెఱుంగునది. ఈశానుండు వచించినతెలుంగున నాగోత్పత్తి నెఱింగింతు వినుము. మున్ను బ్రహ్మదేవుఁడు గ్రహములను నాగము లను బెక్కింటి సృజించెను. అనంతుఁ డనునాగరాజు భాస్కరగ్రహ మని యెఱుంగనగును. వాసుకి చంద్రుఁడని యెఱుఁగనగును. తక్షకుఁ డంగారకుఁ డగును. కర్కోటకుఁడు బుధుఁడు. పద్ముఁడు బృహస్పతి యని యెఱుంగునది. మహాపద్ముఁడు శుక్రగ్రహమగును. కులికుఁడును శంఖ పాలుఁడును శనైశ్చరుఁడు. అందు నిత్యమును బూర్వపాదము శంఖ పాలుఁడును ద్వితీయపాదము కులికుఁడు నని వేఱువేఱు నెఱుంగునది. వేఱువేఱు కాలములగుదినమును రాత్రియు ననువానిలో శుక్రసోములు మధ్యాహ్నమునను గుజుఁ డుదయమునను శనైశ్చరుఁడు దివారాత్రము యొక్క యెనిమిదవభాగమున నుండునని చెప్పుదురు. మిగిలినభాగము లను గ్రహాంతరము లనుభవించును. ఎల్లప్పుడును రవివారమున బది యవ పదునాలుగవపాదములును సోమవారమున నెనిమిదవ పండ్రెండవ భాగములును మంగళవారమున నారవ పదియవభాగములును బుధవార మున నవమభాగమును బగటిభాగమున రాహు వాక్రమించియుండును.

---

దూతః, తైలాభ్యక్తశ్చ తద్వద్యది త్వరితగతిర్ముక్తకేశశ్చ యాతి యః కుర్యాద్ఘోరశబ్దం కరచరణయుగైః ప్రాప్తకాలస్య దూతః. ౨౦. నాగోదయం ప్రవక్ష్యామి ఈశానేన తు భాషితమ్, బ్రహ్మణా తు పురా సృష్టా గ్రహా నాగాస్త్వనేకశః. ౨౧. అనంతం భాస్కరం విద్యాత్సోమం విద్యాత్తు వాసుకిమ్, తక్షకం భూమిపుత్రం తు కర్కోటం చ బుధం విదుః. ౨౨. పద్మం బృహస్పతిం విద్యాన్మహాపద్మం చ భార్గవమ్, కులికః శంఖపాలశ్చ ద్వావేతౌ తు శనైశ్చరః. ౨౩. పూర్వపాదః శంఖపాలో ద్వితీయః కులికస్తథా, నిత్యం భాగే యథోద్దిష్టే దినరాత్రీ తథైవ చ. ౨౪. శుక్రసోమౌ చ మధ్యాహ్నే ఉదయే తు క్షమాసుతః, శనిః ప్రాగష్టమే భాగే దివారాత్రే త్విహోచ్యతే. ౨౫. గ్రహాశ్చ భుంజతే చైవ శేషం భాగస్య లక్షణమ్, రవివారే సదా జ్ఞేయా పాదౌ దశ చతుర్దశ. ౨౬. అష్ట ద్వాదశ వై చంద్రే దశ షష్ఠే కుజే తథా,

మఱియు గురువారమున రెండును ఆఱును బదునాఱును భాగములు నాతఁడాక్రమించియుండుటచే నాభాగములు విడువవలయును. మఱియు భాస్కరవారమున బగటివేళ నాలుగవభాగము బదియవభాగము నెనిమిదవభాగమును శనైశ్చరునివారమున ద్వితీయద్వాదశషోడశభాగములు నతిదారుణములగుటచే వర్జనీయము లగును. ముహూర్త మనఁగా గడియకుఁ బైఁబడినకాలము. ఇరువదినాలుగుభాగములు. (నిమేషములు)గడియనఁబడును. నేత్రములు మూసి తెఱచికొనుకాలము నిమేష మనఁబడును. ఇది కాలలక్షణమని యెఱుంగుము.

ఇది చతుస్త్రింశాధ్యాయము.

---

## పంచత్రింశాధ్యాయము.

కశ్యపుఁడు మఱియు నిట్లని చెప్పందొడంగె. పామున కిరుప్రక్కలనుండుకోఱలలో యమదూతి యెప్పుడును విషపూరితమైయే యుండును. దానికి లోనగువాఁడు గతాయువని చెప్పవలయునేగాని యెంతటిమాంత్రికుఁడైనను జికిత్సజేయఁబూనరాదు. రాత్రిబవలులందు నొక్కొక్కయరజామున కొక్కొక్కనిగ బదునార్గురను భుజించు(కఱచు)వఱకు నాదంష్ట్రకు విషోదయ ముండును. అట్టికాలమున హతుఁడైనను విద్ధుఁడైనను విదారితుఁడైనను బ్రయోజనములేదు. వాఁడు కాలదష్టుఁ

---

బుధస్య నవమే పాదే రాహా చ దివసస్య చ. ౨౭. గురోర్ద్వితీయః షష్ఠశ్చ షోడశస్య తు వర్జయేత్, భాస్కరస్య దినే ప్రోక్తే చతుర్థే దశమేఽష్టమే. ౨౮. శనైశ్చరదినే పాదం త్యజేచ్చైవ సుదారుణమ్, ద్వితీయం ద్వాదశం చైవ షోడశస్య తు వర్జయేత్. ౨౯. ముహూర్తఘటికాదూర్ధ్వం ఘటికా చతుర్థం భాగం వింశతిశ్చ, కుహూసుతం బుద్బుదం నిమేషమేతత్కాలస్య లక్షణమ్. ౩౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే దంశదష్టకదూతలక్షణవర్ణనం నామ
చతుస్త్రింశోఽధ్యాయః.

---

కశ్యప ఉవాచ.—సవిషా దంష్ట్రయోర్మధ్యే యమదూతీ తు వై భవేత్, న చికిత్సా బుధైః కార్యా తం గతాయుం వినిర్దిశేత్. ౧. ప్రహరార్ధం దివారాత్రావేకైకం భుంజతే బహిః, ఏకస్య చ సమానం చ ద్వితీయం షోడశం తథా. ౨. నాగో

డని యెఱుంగనగునని కశ్యపుఁడు వక్కాణించుచున్నాఁడు. నీటముంచి యెత్తినతోఁక కొననుండి యెన్నినీటిబొట్టులుపడునో యంతవిషము దంష్ట్ర నుండి దారుణముగ స్రవించుచుండును. ఆనూటయెనిమిదినాడులును విషపూరితములైనవెనుక విషము దేహమందంతట జొరబడును. అయ్యది యడుగు కదల్చునంతలో జేయిముడిచి చాచునంతలో త్రుటికాలము ననే మస్తకము నధిష్ఠించును. విషవేగ మధికమగుకొలఁది నూరులు వేలు నుగా కంపములు జనించును. అంతట నయ్యది రక్తమును జేరి గాలివలన నగ్నిహోత్రమువలె వృద్ధిబొందును. నూనెబొట్టు నీళ్లలో వైచిన నెంత వేగముగ వృద్ధిబొందునో యెండుకట్టెలబొందిన యగ్నిహోత్రుఁడు వాయుప్రేరితుఁడై యెటులు వృద్ధిబొందునో యట్టులే యిదియు వృద్ధి బొందును. తరువాత నూరుస్థానములుజొచ్చి త్వగింద్రియమును జేరును. విషము త్వగింద్రియమున ద్విగుణము రక్తములందు జతుర్గుణము పిత్తము నందు త్రిగుణము శ్లేష్మమునందు షోడశగుణమును వాతమున త్రింశ ద్గుణము మజ్జయందు షష్టిగుణము నగును. అంతట ప్రాణముల బ్రవే శించి యొడలంతయు విషమయసముద్రమగును. అంతట సర్వగాత్రము లను సంధించును. శ్రోత్రనిరోధమైనచో నాదష్టుఁ డసాధ్యవిషము గల వాఁడగును. అంతట నుచ్ఛ్వాసనిశ్శ్వాసములులేక మరణించును. అంత జీవుఁడు వెడలిచన భూతము పంచతనొంద బాంచభౌతికమగుశరీరము

---

దయో యముద్దిశ్య హతో విద్ధో విదారితః, కాలదష్టం విజానీయా త్కశ్యపస్య వచో యథా. ౩. యన్మాత్రం పతతే బిందుర్వాలాగ్రం సలిలోద్ధృతమ్, తన్మాత్రం స్రవతే ద్రంష్ట్రా విషం సర్పస్య దారుణమ్. ౪. నాడీశతే తు సంపూర్ణే దేహే సంక్రమతే విషమ్, యావత్సంక్రామయేద్బాహుం కుంచితం వా ప్రసారయేత్. ౫. అనేన క్షణ మాత్రేణ విషం గచ్ఛతి మస్తకే, వేపతే విషవేగే తు శతశోఽథ సహస్రశః. ౬. వర్ధతే రక్తమాసాద్య తతో వాతైః శిఖీ యథా, తైలబిందుర్జలం ప్రాప్య యథా వేగేన వర్ధతే. ౭. శిఖండీ ఆశ్రయం ప్రాప్య మారుతేన సమీరితః, తతః స్థానశతం ప్రాప్య త్వచాస్థానం విచేష్టితమ్. ౮. త్వచాసు ద్విగుణం విద్యాచ్ఛోణితేషు చతుర్గుణమ్, పిత్తే తు త్రిగుణం యాతి శ్లేష్మే వై షోడశం భవేత్. ౯. వాయౌ త్రింశద్గుణం చైవ మజ్జాషష్టిగుణం తథా, ప్రాణే చైకార్ణవీభూతే సర్వగాత్రాణి సంధయేత్. ౧౦. శ్రోత్రే నిరుధ్యమానే చ యాతి దష్టస్త్వసాధ్యతామ్, తతోఽసౌ మ్రియతే జంతుర్నిఃశ్వాసో చ్ఛ్వాసవర్జితః. ౧౧. నిష్క్రాంతే తు తతో జీవే భూతే పంచత్వమాగతే, తాని

నుండి పృధివి యప్పులు తేజము గాలియు నాకసము ననుభూతపంచకము దమతమస్వభావము ననుసరించి నిజరూపము గ్రహించును. ఈపంచభూతముల సేరికయేగదా! శరీర మనఁబడును. శరీరమునందలి పార్థివభాగము పృథివిని జేరును. నీరు నీటఁగలియును తేజ మాదిత్యునిఁజేరును మారుతము మారుతునిజేరును జీవ మేగిన వెంటనే యాకస మాకసమునగలియును. ఇటు లొండొంటి నియమించుకొని స్వస్వనిలయముల జేరుచున్నవి. ఓసువ్రతా! జననమరణాత్మకమగు నీప్రపంచమున నొక్కఁడేని శాశ్వతముగ జీవించియుండఁడు. ఈభావముచే మాత్రము విషార్తు నుపేక్షింపరాదు. శీఘ్రముగ జికిత్సజేయవలయును ప్రపంచమున నంతట నొకవిధమగు విషమున్నది. అట్లులే ద్వితీయ తృతీయాదిరూపమును బహువిధములుగగూడ నున్నవి. అవియన్నియును స్థావరములే. మొదటి విషవేగమున నొడలంతయు రోమహర్ష మేర్పడును. రెండవవిషవేగమున గాత్రములందు జెమ్మట లేర్పడును. మూఁడవవిషవేగమున నొడలు కంపించును. నాలుగవవిషవేగమున శ్రోత్రాంతరముల నిరోధము గలుగును. ఐదవవిషవేగమున నెక్కిళ్లుగలుగును. ఆరవవిషవేగమున బ్రాణము లెగిరిపోవును. ఈవిషములు శరీరమునందు ధాతుసప్తకము నాశ్రయించి ప్రాణము లుండుననియు నీవిషవేగములు వాని నాక్రమించుననియు

---

భూతాని గచ్ఛంతి యస్య యస్య యథాతథమ్. ౧౨. పృథివ్యాపస్తథా తేజో వాయురాకాశమేవ చ, ఇత్యేషామేవ సంఘాతః శరీరమభిధీయతే. ౧౩. పృథివీ పృథివీం యాతి తోయం తోయేషు లీయతే, తేజో గచ్ఛతి చాదిత్యం మారుతో మారుతం వ్రజేత్. ౧౪. ఆకాశం చైవమాకాశే సహ తేనైవ గచ్ఛతి, స్వస్థానం తే ప్రపద్యంతే పరస్పరనియోజితాః. ౧౫. న జీవేదాగతః కశ్చిదిహ జన్మని సువ్రత, విషార్తం న ఉపేక్షేత త్వరితం తు చికిత్సయేత్. ౧౬. ఏకమస్తి విషం లోకే ద్వితీయం చోపపద్యతే, యథా నానావిధం చైవ స్థావరం తు తథైవ చ. ౧౭. ప్రథమే విషవేగే తు రోమహర్షోఽభిజాయతే, ద్వితీయే విషవేగే తు స్వేదో గాత్రేషు జాయతే. ౧౮. తృతీయే విషవేగే తు కంపో గాత్రేషు జాయతే, చతుర్థే విషవేగే తు శ్రోత్రాంతరనిరోధకృత్. ౧౯. పంచమే విషవేగే తు హిక్కా గాత్రేషు జాయతే, షష్ఠే చ విషవేగే తు ప్రాణేభ్యోఽపి ప్రముచ్యతే, సప్తధాతువహా హ్యేతే వైనతేయేన భాషితాః. ౨౦.

వినతాతనయుఁడు వక్కాణించెను. త్వక్కునందు విషము జొరఁబడెనేని దానికిఁ గలుగురూపములు వివరింతు వినుము. అంగములన్నియుఁ దిమిరమయము (చీఁకటు)లై యుండును. మాటిమాటికి దాపము గలుగును. ఇట్టిలక్షణము లుండెనేని యాత్వక్కు విషవ్యాప్తమయ్యెనని యెఱుంగ నగును. దానివలనిబాధ తొలంగి సుఖము జేకురుట కౌషధము జెప్పెద వినుము. జిల్లేడు మొదలు నుత్తరేణి పిప్పళ్లు తగరము (నంద్యావర్తము)ను గలిపియిచ్చినచో సుఖముగలుగును. అదియిచ్చినను విషము నివర్తింపదేని యటనుండి యది త్వక్స్థానమును భేదించుకొని రక్తస్థానము జేరును. అప్పుడు శరీరస్థితిని వర్ణింతు వినుము. గాత్రమంతయు దహింపఁబడుచున్నది. మాటికిమాటికి మూర్ఛవచ్చుచున్నది. శీతలోపచారముల నధికముగ వాంఛించుచున్నది. ఇట్టిలక్షణములున్నచో నాతనికి విషము రక్తగతమైనదని యెఱుంగవలయును. అట్టియెడ సుఖప్రదమగువైద్యము నెఱింగింతు వినుము. వట్టివేరు, చందనము, (కుష్ఠ) కోష్ఠకము, కలువతగరము, మునిణిచెట్టుమూలములు, సిందువారంపుమూలము, నింగిలీకము, మిరియములు ననువానిని ప్రథమవేగమున నుపయోగింపవలయును. ద్వితీయవేగమున బృహతి (వాకుడుచెట్టు, నేలములక), వృశ్చిక (తెల్లగలిజేరు), కాలి (నల్లజీలకఱ్ఱ, నీలిచెట్టు పొలముబచ్చలి), ఇంద్రము (కాకి

---

త్వచః స్థానే విషే ప్రాప్తే తస్య రూపాణి మే శృణు, అంగాని తిమిరాయంతే తపంతే చ ముహుర్ముహుః. ౨౧. ఏతాని యస్య చిహ్నాని తస్య త్వచి గతం విషమ్, తస్యాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౨౨. అర్కమూలమపామార్గం ప్రియంగుం తగరం తథా, ఏతదాలోడ్య దాతవ్యం తతః సంపద్యతే సుఖమ్. ౨౩. తతస్తస్మిన్కృతే విప్ర న నివర్తేత చేద్విషమ్, త్వచః స్థానం తతో భిత్త్వా రక్తస్థానం ప్రధావతి. ౨౪. విషే చ రక్తం సంప్రాప్తే తస్య రూపాణి మే శృణు, దహ్యతే ముహ్యతే చైవ శీతలం బహు మన్యతే. ౨౫. ఏతాని యస్య రూపాణి తస్య రక్తగతం విషమ్, తత్రాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౨౬. ఉశీరం చందనం కుష్ఠముత్పలం తగరం తథా, మహాకాలస్య మూలాని సిందువారనగస్య చ, హింగులం మరిచం చైవ పూర్వవేగే తు దాపయేత్. ౨౭. బృహతీ వృశ్చికా కాలీ ఇంద్ర

వెదురు), వారుణిమూలకము (చాగచెట్టు మొదలు), సప్తగంధఘృతము ననువానిచేఁ జికిత్సింపవలయును. తృతీయ వేగమున సిందువారము నింగువయుఁ జేర్చి త్రాగించిన బ్రతిక్రియగలుగును. మఱియు నా రెండును జేర్చి కాటుకజేసి లేపనము చేయవలయును. ఈయుపచారముచే సుఖమును బొందఁగలఁడు. ఇట్టి యుపచారములచేగూడ విషవేగము వెనుదిరుగక రక్తస్థానమునుండి యొకప్పుడు పిత్తనాడిని జేరును. అట్టియెడ మనుష్యునివిషరూపముల వర్ణింతు వినుము. అనుక్షణము లేచి పడుచుండును. దహింపఁబడుచుండును. మోహమునందుచుండును. శరీరము పచ్చబడును. కన్నులు పచ్చబడుటచే దిక్కులు మొదలగునవి పచ్చగనున్నట్లు కనుపించును. అతిబలవంతముగ మూర్ఛగలుగును. ఒడలెఱుంగకయే పడియుండును. అట్టియవస్థలోఁగూడ సుఖము జనించునట్లు విషచికిత్స జేయవలయును. అచ్చోటనుండి విషము శ్లేష్మస్థానమును బ్రవేశించునప్పటిచికిత్స వినుము. పిప్పళ్లు, యష్టిమధుకము, తేనె, కలకండ, నేయి, మధుసారము, సొరకాయ, జాజికాయ, శంకరవాలుక, యింద్రమూలము, వారుణికామూలము ననువస్తువులను గోమూత్రముతో నూరి దానిలో గొంత నస్యముగను, మఱికొంత యంజనము నింకొకకొంత మైపూతయును జేయవలయును. అదియే లోపలికిఁ ద్రాగింపవలయును. ఈయుపచారములతో బ్రాణి నిర్విషుఁడగుచున్నాఁడు. విషము శ్లేష్మస్థానము జేరియుండునెడ వానిరూపముల నెఱింగింతు వినుము అట్టివానికి గాత్ర

---

వారుణిమూలకమ్, సప్తగంధఘృతం చైవ ద్వితీయే పరికీర్తితమ్. ౨౮. సిందువారం తథా హింగుం తృతీయే కారయేద్బుధః, తస్య పానం చ కుర్వీత అంజనం లేపనం తథా. ౨౯. ఏతేనైవోపచారేణ తతః సంపద్యతే సుఖమ్, రక్తస్థానం తతో గత్వా పిత్తస్థానం ప్రధావతి. ౩౦. పిత్తస్థానగతే విప్ర విషరూపాణి మే శృణు, ఉత్తిష్ఠతే నిపతతే దహ్యతే ముహ్యతే తథా. ౩౧. గాత్రతః పీతకః స్యాద్వై దిశః పశ్యతి పీతికాః, ప్రబలా చ భవేన్మూర్ఛా న చాత్మానం విజానతే, విషక్రియాం తస్య కుర్యాద్యయా సంపద్యతే సుఖమ్. ౩౨. పిత్తస్థానమతిక్రమ్య శ్లేష్మస్థానం చ గచ్ఛతి. ౩౩. పిప్పల్యో మధుకం చైవ మధు ఖండం ఘృతం తథా, మధుసారమలాబూం చ జాతిం శంకర వాలుకామ్, ఇంద్రవారుణికామూలం గవాం మూత్రేణ పేషయేత్. ౩౪. నస్యం తస్య ప్రయుంజీత పానమాలేపనాంజనమ్, ఏతేనైవోపచారేణ తతః సంపద్యతే సుఖమ్. ౩౫. శ్లేష్మస్థానం తతః ప్రాప్తే తస్య రూపాణి మే శృణు, గాత్రాణి తస్య రుధ్యంతే

నిరోధముగలుగును. ఉచ్ఛ్వాసనిఃశ్వాససంచార మడుగంటును. చొంగ గారును. కంఠమున ఘుర్ఘురధ్వని గలుగును. ఇట్టిలక్షణము లుండెనేని విషము శ్లేష్మస్థానమును వ్యాపించెనని యెఱుంగునది. ఇట్లు సంపూర్ణముగ శ్లేష్మస్థానము నాక్రమించినప్పటిచికిత్స యెఱింగింతు వినుము. శుంఠి, పిప్పలి, మిరియాలు, యేలకులు, ఆకుపత్రి, లవంగాలు, విరుగుడుచెట్టు, లొద్దుక, మధుసారకము ననువస్తువులు సమభాగములుగ సేకరించి గోమూత్రముతో నూరి శరీరమునకు బూయవలయును. లోపలికి ద్రాగ వలయును. కాటుకవేయవలయును. ఇట్లాచరింప విషనివృత్తి గలుగును. ప్రాణి సుఖమందును. శ్లేష్మస్థానమునుండి వాయుస్థానము జేరినయప్పటి శరీరస్థితి వర్ణింతు వినుము. జఠరము ధ్వనిజేయుచుండును. చూపు నశించును. బాంధవులనేని జూడఁజాలడు. వికృతరూపము గలుగును. ఇట్టి లక్షణములబట్టి విషము వాయుస్థానమున బ్రవేశించెనని తెలిసికొనవలయును. దీని కౌషధము జెప్పెద వినుము. పెండలము, ప్రియాలము, నింగిలీకము, గజపిప్పలి, భారంగి, నల్లవస, పిప్పళ్లు, దేవదారు, విప్పపూవును, మధూకసారము, సిందువారము, నింగువ యనువస్తువులు చూర్ణించి మాత్రలుచేసి యీవలయును. ఆమందుతోడనే శరీరమునకు లేపనము జేయవలయును. అంజనముగగూడ నుపయోగింపవలయును.

---

నిఃశ్వాసశ్చ న జాయతే, లాలా చ స్రవతే తస్య కంఠో ఘురుఘురాయతే. ౩౬. ఏతాని యస్య రూపాణి తస్య శ్లేష్మగతం విషమ్, తస్యాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౩౭. త్రికటుకీ శ్లేష్మాతకో లోధ్రంచ మధుసారకమ్, ఏతాని సమభాగాని గవాం మూత్రేణ పేషయేత్. ౩౮. తస్య పానం చ కుర్వీత అంజనం లేపనం తథా, ఏతేనైవోపచారేణ తతః సంపద్యతే సుఖమ్. ౩౯. శ్లేష్మస్థానమతిక్రమ్య వాయుస్థానం చ గచ్ఛతి, తత్రరూపాణి వక్ష్యామి వాయుస్థానగతే విషే. ౪౦. ఆధ్మాయతే చ జఠరం బాంధవాంశ్చ న పశ్యతి. ఈదృశం కురుతేరూపం దృష్టిభంగశ్చ జాయతే. ౪౧. ఏతాని యస్య రూపాణి తస్య వాయుగతం విషమ్, తస్యాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౪౨. శోణామూలం ప్రియాలం చ రక్తం చ గజపిప్పలీమ్, భార్జీం వచాం పిప్పలీం చ దేవదారుం మధూకకమ్. ౪౩. మధూకసారం సహసిందువారం హింగుం చ పిష్ట్వా గుటికాం చ కుర్యాత్, దద్యాచ్చ తస్యాంజనలేపనాది విషోఽగదః

ఈయౌషధము సర్వవిషనాశకము. నస్యాంజనములు శీఘ్రముగ నీవల యును. విషము వాయుస్థానమువిడచి మజ్జాస్థానము జేరినప్పటికి రూప విశేషమును జెప్పుచున్నాను. అంగములన్నియు వ్రేలఁబడును. దృష్టి నశించును. ఇట్టిలక్షణములు విషము మజ్జాగతమగుట దెలుపుచున్నవి. అప్పటి యౌషధవిశేషముల నెఱింగింతు వినుము. నెయ్యి మధుశర్కర లతోఁగూడిన వట్టివేళ్లు, చందనమును మిశ్రముచేసి పేయముగాను నస్యముగాను నుపయోగింపవలయును. పిమ్మట దుఃఖము నివర్తించి సుఖము ప్రాప్తించును ఈసుయోగముచే విషము తప్పక నివర్తించు చున్నది. విష మటనుండి మర్మస్థానము జొచ్చినచో గలుగువిశేషము నెఱుంగుము. నిశ్చేష్టుఁడై భూమిమీఁదబడియుండును. శ్రోత్రేంద్రియము నశించుటచేఁ బిలచినను పలుకఁడు. శరీరమున నీరుబోసినను రోమహర్షము గలుగదు. కఱ్ఱతో మోదినను గురుతులు కానరావు. కత్తితోఁగోసినను రక్తము గన్పడదు. తలవెండ్రుకలు గొరిగినను బాధయుండదు. చెవులు డొక్కలు కాలునేతులు సంధులును శిథిలములగును. ఇట్టిలక్షణములున్న ప్రాణి మృతినొందెనని నిరూపింపనగును. ఇట్టిలక్షణములు లేనంతవఱకు బ్రాణి మృతిజెందినట్లు నిర్ణయింపఁగూడదు. అని యిట్లు కశ్యపప్రజాపతి

---

సర్వవిషాణి హన్యాత్. ౪౮. అంజనం చైవ నస్యం చ క్షిప్రం దద్యాద్విషాన్వితే, వాయుస్థానం తతో ముక్త్వా మజ్జాస్థానం ప్రధావతి. ౪౯. విషే మజ్జాగతే విప్ర తస్య రూపాణి మే శృణు, దృష్టిశ్చ హీయతే తస్య భృశమంగాని ముంచతి. ౪౬. ఏతాని యస్య రూపాణి తస్య మజ్జాగతం విషమ్, తస్యాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౪౭. ఘృతమధుశర్కరాన్వితముశీరం చందనం తథా, ఏతదాలోడ్య దాతవ్యం పానం నస్యం చ సువ్రత. ౪౮. తతః ప్రణశ్యతే దుఃఖం తతః సంపద్యతే సుఖమ్. అథ తస్మిన్కృతే యోగే విషం తస్య నివర్తతే. ౪౯. మజ్జాస్థానం తతో గత్వా మర్మ స్థానం ప్రధావతి, విషే తు మర్మ సంప్రాప్తే శృణు రూపం యథా భవేత్. ౫౦. నిశ్చేష్టః పతతే భూమౌ కర్ణాభ్యాం బధిరో భవేత్, వారిణా సిచ్యమానస్య రోమహర్షో న జాయతే. ౫౧. దండేన హన్యమానస్య దండరాజీ న జాయతే, శస్త్రేణ ఛిద్య మానస్య రుధిరం న ప్రవర్తతే. ౫౨. కేశేషు లుచ్యమానేషు నైవ కేశాన్ప్రవేదతే. యస్య కర్ణౌ చ పార్శ్వే చ హస్తపాదం చ సంధయః, శిథిలాని భవంతీహ స గతా సురితి శ్రుతిః. ౫౩. ఏతాని యస్య రూపాణి విపరీతాని గౌతమ, మృతం తు న

వచించుచున్నాఁడు. అసమర్థులగువైద్యు లట్టిలక్షణములు లేకున్నను సామాన్యలక్షణములచేతనే యీతఁడు మృతుఁడయ్యెనని యెంచి యా చెంతకుఁ బోవరు. సమర్థుఁడు నేర్పుకాఁడు నగువైద్యుఁడు మంత్రౌషధి సమన్వితుఁడై చికిత్స చేయఁబూనును. అట్టివాని కీశ్వరుఁడు యిట్టియౌష ధము నుపయోగింపవలయునని యుపదేశించుచున్నాఁడు మయూరపిత్తము, మార్జారీపిత్తము, గంధనాడీమూలము, కుంకుమతగరము, కుష్ఠము (చెంగలికోష్టు), కాసమర్దచర్మము (కసివెంద చెట్టు), నల్లకలువ, పద్మకింజల్క ములు, కుముదకింజల్కములు ననువస్తువులను సమభాగములుగఁ జేర్చి గోమూత్రముతో నూరవలయును. ఈయౌషధము హస్తముననున్న చో బాముకాటుచే బ్రాణభీతి యుండదు. కాలసర్పము గఱచినను నిర్విషుఁడే యగును. మృతసంజీవనియగు నీయౌషధమును బాముకఱచినవెంటనే లోనికీయవలయును. దీనినే యంజనముగను నస్యముగనుగూడ నుపయో గింపవలయును.

ఇది పంచత్రింశాధ్యాయము.

---

విజానీయాత్కాశ్యపస్య వచో యథా. ౧౪. వైద్యాస్తస్య న పశ్యంతి యే భవంతి కుశిక్షితాః, విచక్షణాస్తు పశ్యంతి మంత్రౌషధిసమన్వితాః. ౧౫. తస్యాగదం ప్రవక్ష్యామి స్వయం రుద్రేణ భాషితమ్, మయూరపిత్తం మార్జారపిత్తం గంధనాడీమూలమేవ చ. ౧౬. కుంకుమం తగరం కుష్ఠం కాసమర్దత్వచం తథా, ఉత్పలస్య చ కింజల్కం పద్మస్య కుముదస్య చ. ౧౭. ఏతాని సమభాగాని గోమూత్రేణ తు పేషయేత్, ఏషోఽగదో యస్య హస్తే దష్టో న మ్రియతే స వై, కాలాహినాపి దష్టేన క్షిప్రం భవతి నిర్విషః. ౧౮. క్షిప్రమేవ ప్రదాతవ్యం మృతసంజీవనౌషధమ్, అంజనం చైవ నస్యం చ క్షిప్రం దద్యాద్విచక్షణః. ౧౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే ధాతుగతవిషక్రియావర్ణనం నామ పంచత్రింశోఽధ్యాయః.

## ౩౦ త్రింశాధ్యాయము.

ఓకశ్యపప్రజాపతీ! పురుషసర్పము గఱచిన నెట్టిలక్షణము లుండును? స్త్రీసర్పముగఱచిన నెట్టిలక్షణము లుండును? బాలసర్పము గఱచిన నెట్లుండును? పుఱిటిలో నున్నపాము గఱచిన నెట్లుండు? నపుంసకసర్పము గఱచిన నెట్టిరూపము గలుగును? వ్యంతరదంశనము నెట్లు నిర్ణయింపఁబోలు? నాయీప్రశ్నములకు సహుత్తరములొసంగి నాకోర్కి యీడేర్పుమని యడుగ గౌతమునకు గశ్యపప్రజాపతి యిట్లనియె. ఓద్విజపుంగవా! యింకమీఁద నీప్రశ్నలకు సంగ్రహముగ బదులుచెప్పెద నాకర్ణింపుము. నాగములరూపలక్షణములగూడ జెప్పెదను వినుము. మగసర్పము కఱచినచో నూర్ధ్వదృష్టి గలుగును. అట్లులే యాఁడుపాము కఱచెనేని యధోదృష్టి గలుగును. పురుషబాలసర్పము గఱచిన దృష్టిదక్షిణపార్శ్వమున కేగును. స్త్రీబాలసర్పము గఱచిన నెడమదృష్టి గలుగును. గర్భిణి యగుపాము గరువ జెమ్మటలు గలుగును. ప్రసవించిన పాము గఱచిన రోమాంచమును గంపమును గలుగును. నపుంసకసర్పము గఱచెనేని యొడలు విరిగినట్లుండును. ఆఁడుసర్పమునకు రాత్రివేళ విషము విరివిగ నుండును. పురుషసర్పమునకుఁ బగటివేళ విష మధికముగ నుండును. సంధ్యాకాలములందు నపుంసకమునకు విష మధికముగ నుండును. అని కశ్యపుఁడు వచించుచున్నాఁడు. అంధకారమునం దుదకమునగాని నిర్జనవనమునగాని నిద్దురబోవునపుడుగాని ప్రమత్తుఁడై

---

గౌతమ ఉవాచ.—కీదృశం సర్పదష్టస్య సర్పిణ్యాః కీదృశం భవేత్, కుమారదష్టః కీదృక్స్యాత్సూతికాదంశితస్య చ. ౧. రూపం నపుంసకే నేహ వ్యంతరేణ చ కీదృశమ్, ఏతదాఖ్యాహి మే సర్వమేభిర్దష్టస్య లక్షణమ్. ౨. కశ్యప ఉవాచ.—అతః పరం ప్రవక్ష్యామి నాగానాం రూపలక్షణమ్, సర్పదష్టస్య చ తథా సమాసాద్ద్విజపుంగవ. ౩. అథ సర్పేణ దష్టస్య ఊర్ధ్వదృష్టిః ప్రజాయతే, సర్పీదష్టస్య చ తథా అధోదృష్టిః ప్రజాయతే. ౪. కన్యాదష్టస్య వామా స్యాద్దృష్టిర్ద్విజవరోత్తమ, కుమారేణాపి దష్టస్య దక్షిణా ఏవ జాయతే. ౫. గర్భిణ్యా వాథ దష్టస్య తథా స్వేదశ్చ జాయతే, రోమాంచః సూతికాయాస్తు వేపథుశ్చాపి జాయతే, నపుంసకేన దష్టస్య అంగమర్దః ప్రజాయతే. ౬. పన్నగ్యః ప్రభవో రాత్రౌ దివా సర్పో విషాధికః, నపుంసకస్తు సంధ్యాయాం కశ్యపేన తు భాషితమ్. ౭. అంధకారే తు దష్టో య ఉదకే

యుండినపుడుగాని పాము గఱచినచో నాసర్పమును జూడక దంశరూపములు గుర్తింపలేకున్నపుడు వైద్యచికిత్స యెట్లుచేయఁదగునో యెఱుఁగవలయును. పన్నగములు నాలుగువిధములుగ దర్వీకరములు, మండలులు, రాజిలములు, వ్యంతరములు నని యుండునని మహాత్ములు వచించుచున్నారు. దర్వీకరములు వాతవిషములుగలవగును. మండలములు పిత్తవిషములు గలిగియుండును రాజిలములు శ్లేష్మవిషముగలవగును. వ్యంతరములు సన్నిపాతవిషము గలిగియుండును. ఈసర్పములకు రక్తపరీక్షణము గూడ వేర్వేరజేయవలయును. దర్వీకరములకు రక్తము నల్లనిదై యధికముగ బ్రవహించుచుండును. మండలీసర్పములకు రక్తవర్ణమగునెత్తురు ఘనమై యుండును. రాజిలములకు రక్తము స్వల్పమై గడ్డకట్టియుండును. వ్యంతరములకును స్వల్పముగనే యుండును. ప్రపంచముననుండు సర్పములన్నియు నీనాలుగుజాతులలోనివే యగును. వేరొకజాతి యైదవది లేదు. ఈనాలుగుజాతులకును వరుసగ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రనామముల వ్యవహారము గలుగును. బ్రాహ్మణజాతియందు మధురపదార్థము నొసంగవలయును. క్షత్రియసర్పముగఱచిన దిక్తపదార్థ మొసంగవలయును. వైశ్యసర్పముగఱచిన గర్షఫలము (తాడిచెట్టుపండు) నొసంగవలయును. శూద్రసర్పమునకుఁ ద్రిస్థానము నొసంగవలయును. బ్రాహ్మణసర్పముగఱచినచో గాత్రములందు దాహ మేర్పడును. ప్రబలమగు మూర్ఛ గలుగును. ఒడలు వివశమగును ముఖము శ్యామవర్ణమగును. ఎముకలలోనిచేవ స్తంభించును. అట్టివానికి సుఖముగలుగున ట్లీప్రతీ

గహనే వనే, సుప్తో వా చేత్ప్రమత్తో వా యది సర్పం న పశ్యతి, దష్టరూపాణ్యజానన్నైవ కథం వైద్యచికిత్సితమ్. ౮. చతుర్విధా ఇహ ప్రోక్తాః పన్నగాస్తు మహాత్మనా, దర్వీకరా మండలినో రాజిలా వ్యంతరాస్తథా. ౯. దర్వీకరా వాతవిషా మండలాః పైత్తికాః స్మృతాః, శ్లేష్మలా రాజిలా జ్ఞేయా వ్యంతరాః సాన్నిపాతికాః. ౧౦. రక్తం పరీక్షయేదేషాం సర్పాణాం తు పృథక్పృథక్, కృష్ణం దర్వీకరాణాం తు జాయతే నాల్పముల్బణమ్. ౧౧. రక్తం ఘనం చ బహుశః శోణితం మండలీకృతమ్, పిచ్ఛిలం రాజిలే స్వల్పం తద్వద్వ్యంతరకే తథా. ౧౨. సర్పా జ్ఞేయాస్తు చత్వారః పంచమో నోపలభ్యతే, బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చైవ చతుర్థకః. ౧౩. బ్రాహ్మణే మధురం దద్యాత్తిక్తం దద్యాత్తథోత్తరే, వైశ్యే కర్షఫలం దద్యాచ్ఛూద్రే త్రిస్థానమేవ చ. ౧౪. బ్రాహ్మణేన తు దష్టస్య దాహో.గాత్రేషు జాయతే, మూర్ఛా చ

కారముచేయునది. పెన్నేరు, నుత్తరేణి, సిందువారము (వావిలి), సురామయము ననువినుసులను నేతితోఁ జేర్చి పేయముగను నస్యముగను నుపయోగింపవలయును. ఈయుపచారముచే బ్రాహ్మణసర్పదష్టుఁడు సుఖము బొందఁగున్నాఁడు. క్షత్రియసర్పముగఱచినచో గాత్రములందు గంపము గలుగును. మూర్ఛబొందును. మత్తుచే నొడలెఱుంగకుండును. బాధ గలుగును. ఊర్ధ్వదృష్టి గలిగియుండును. అట్టివానికి సుఖము చేకురునట్లు ప్రతీకారము చేయవలయును. జిల్లేడివేళ్లు, నుత్తరేణి, ప్రియంగువు, నింద్రవారుణియు నేతిలోఁ గలిపి పానసస్యములుగ నుపయోగించిన నీయుపచారముచే నాతఁడు స్వస్థతగాంచును. వైశ్యసర్పము గఱచినప్పటి విశేషములు వినుము. శ్లేష్మ మధికమగును. చొంగగారును. స్మృతి దప్పియుండును. ప్రబలమగు మూర్ఛగలిగి యొడలు మఱచును. అట్టివానికి సుఖముఁగలుగున ట్లీప్రతిక్రియ జేయవలయును. అశ్వగంధను గోమూత్రముతోఁ గలిపి యింటిపొగదీసి గుగ్గిలముతోఁ జేర్చి దిరిసెనపత్రి, జిల్లేడాకు, కొండగోగు తెల్లనిదియు గోమూత్రముతో మిశ్రముచేసి పానసస్యములుగ నుపయోగించినచో నీవిధానమున వైశ్యసర్పదష్టుఁడు

---

ప్రబలా స్యాద్యైవ నాత్మానమభిజానతే. ౧౫. శ్యామవర్ణం ముఖం చ స్యాన్మజ్జాస్తంభశ్చ జాయతే, తస్య కుర్యాత్ప్రతీకారం యేన సంపద్యతే సుఖమ్. ౧౬. అశ్వగంధాప్యపామార్గః సిందువారం సురామయమ్, ఏతత్సర్పిః సమాయుక్తం పానే నస్యే చ దాపయేత్, ఏతేనైవోపచారేణ సుఖీ భవతి మానవః ౧౭. క్షత్రియేణ తు దష్టస్య కంపో గాత్రేషు జాయతే, మూర్ఛా మోహస్తథా స్యాద్యైవ నాత్మానమభివేత్తి సః. ౧౮. జాయతే వేదనా తస్య ఊర్ధ్వం చైవ నిరీక్షతే, తస్య కుర్యాత్ప్రతీకారం యేన సంపద్యతే సుఖమ్. ౧౯. అర్కమూలమపామార్గం ప్రియంగుమింద్రవారుణీమ్, ఏతత్సర్పిః సమాయుక్తం పానం నస్యం చ దాపయేత్, ఏతేనైవోపచారేణ సుఖీ భవతి మానవః. ౨౦. వైశ్యేనాపి హి దష్టస్య శృణు రూపాణి యాని తు, శ్లేష్మప్రకోపో లాలా చ న చోద్వహతి చేతనామ్. ౨౧. మూర్ఛా చ ప్రబలా యస్య ఆత్మానం నాభినందతి, తస్య కుర్యాత్ప్రతీకారం యేన సంపద్యతే సుఖమ్. ౨౨. అశ్వగంధా సగోమూత్రా గృహధూమం సగుగ్గులమ్, శిరీషార్కపలాశేన శ్వేతా చ గిరికర్ణికా. ౨౩. గోమూత్రేణ సమాయుక్తం పానం నస్యం చ దాపయేత్, ఏష వైశ్యేన దష్టానా

గతవిషుండై సుఖించును. మఱియు నోగౌతమా! శూద్రసర్పముచేఁ గఱువఁబడినవానితత్త్వమును వర్ణింతు నాకర్ణింపుము. మిక్కిలి బాధ నొందును. కంపము గలుగును. జ్వరమును శీతమును గలుగును. అంగములు జిలుజిలుమనుచుండును. ఇది శూద్రదష్టునిలక్షణము. ఇందు సుఖప్రదమగు నౌషధము వచింతు వినుము. పద్మము, లొద్దుకపువ్వు, తేనె, పద్మకేసరములు, మధూకసారము, క్షౌద్రము, తెల్లకొండగోరింట యను నీవస్తువులను జన్నీళ్లతో నూరి పానలేపాంజననస్యములుగ నిచ్చిన శూద్రసర్పదష్టుఁడు సుఖము గాంచఁగలుగుచున్నాఁడు. మఱియు బ్రాహ్మణసర్పము పూర్వాహ్ణమునఁ జరించును. క్షత్రియసర్పము మధ్యాహ్నమునఁ జరించును. అపరాహ్ణమునవైశ్యసర్పము సంచరించును శూద్రసర్పము సంధ్యాకాలములఁ ద్రిమ్మరుచుండును. మఱియు బ్రాహ్మణసర్పమునకుఁ బుష్పములు వాయువు నాహారమని యెఱింగి బుధులు వక్కాణించుచుండిరి. ఓద్విజసత్తమా! క్షత్రియసర్పమునకు మూషికము లాహారమగును. వైశ్యసర్పము మండూకములను భక్షించును. శూద్రసర్ప మది యిది యనక కనఁబడినదానినెల్ల మెక్కుచుండును. బ్రాహ్మణసర్పము పురోభాగమునఁ గఱచును. క్షత్రియసర్పము దక్షిణపార్శ్వమునఁ గఱచును. వైశ్యసర్పమెల్లప్పుడును వామపార్శ్వముననే గఱచును. శూద్రసర్పము వెనుకభాగమునఁ గఱచును. బాగుగా మదించియున్నప్పుడు మదముచేఁ బీడ్య

---

మగదః పరికీర్తితః. ౨౪. శూద్రేణాపి హి దష్టస్య శృణు తత్త్వేన గౌతమ, కుథ్యతే వేపతే చైవ జ్వరః శీతం చ జాయతే. ౨౫. అంగాని చులుచులాయంతే శూద్రదష్టస్య లక్షణమ్, తత్రాగదం ప్రవక్ష్యామి యేన సంపద్యతే సుఖమ్. ౨౬. పద్మం చ లోధ్రకం చైవ క్షౌద్రం పద్మస్య కేసరమ్, మధూకసారం మధు చ శ్వేతాం చ గిరికర్ణికామ్. ౨౭. ఏతాని సమభాగాని పేషయేచ్ఛీతవారిణా, పానలేపాంజనైర్నస్యైః సుఖీ భవతి మానవః. ౨౮. పూర్వాహ్ణే చరతే విప్రో మధ్యాహ్నే క్షత్రియశ్చరేత్, అపరాహ్ణే చరేద్వైశ్యః శూద్రః సంధ్యాచరో భవేత్. ౨౯. ఆహారో వాయుపుష్పాణి బ్రాహ్మణానాం విదుర్బుధాః, మూషికా క్షత్రియాణాం చ ఆహారో ద్విజసత్తమ, వైశ్యా మండూకభక్షాశ్చ శూద్రాః సర్వాశినస్తథా. ౩౦. అగ్రతో దశతే విప్రః క్షత్రియో దక్షిణేన తు, వామపార్శ్వే సదా వైశ్యః పశ్చాచ్ఛూద్ర ఆదశేత్. ౩౧. మదకాలే తు సంప్రాప్తే పీడ్యమానా మహావిషాః, అవేలాయాం దశంతే వై మైథునార్తా

మానములై మహావిషముగల భుజంగమములును మైథునార్తములగు భుజంగమములు హద్దుమీరి కలియుచుండును. విప్రసర్పము పుష్పగంధమై యుండును. క్షత్రియసర్పము చందనపరిమళము గలిగియుండును. వైశ్య సర్పము ఘృతగంధమై యుండును. శూద్రసర్పము మత్స్యగంధియయి యుండును. ఈనాలుగుజాతులకును వరుసగ నివాసదేశములు గూడ వచింతు వినుము. దిగుడుబావులందును, నూతులందును, జెలువులందును, సెలయేళ్ళలందును, గ్రామద్వారమునందును, జతుష్పథమునందును బ్రాహ్మణసర్పములు నివసించుచుండును. ఉద్యానములందును, పవిత్ర ములు శుభ్రములు నగుదేవాలయాదులందును, బహిర్ద్వారమునందును, సరస్సులయందును క్షత్రియసర్పములు వసించుచుండును. శ్మశానము లందును, భస్మశాలలయందును, గడ్డియందును, గట్టులయందును, గోశాల లందును, మార్గమునందును, వృక్షములయందును వైశ్యసర్పములు వసించుచుండును. శూద్రసర్పములు వివిక్తప్రదేశములందును, నిర్జనార ణ్యములందును, శూన్యగృహమునందును, శ్మశానములందును వాసము చేయును. తెల్లనివి కపిలవర్ణముగలవియు నగ్నిప్రభగలవియు నగుసర్ప ములు సాత్త్వికములై యభిమానముగలవియై బ్రాహ్మణసర్పము లను పించుకొనును. రక్తవర్ణముగలిగి సువర్ణమువంటి ప్రభగలిగి చిగు రాకువలెను మణివలెనుండి సూర్యప్రభగలభుజంగమములు క్షత్రియము లనఁబడును. వైశ్యభుజంగమములు విచిత్రములై యనేకవిధములగు

భుజంగమాః. ౩౨. పుష్పగంధాః స్మృతా విప్రాః క్షత్రియాశ్చందనావహాః, వైశ్యాశ్చ ఘృతగంధా వై శూద్రాః స్యుర్మత్స్యగంధినః. ౩౩. వాసం తేషాం ప్రవక్ష్యామి యథా వదనుపూర్వశః, వాపీకూపతడాగేషు గిరిప్రస్రవణేషు చ, వసంతి బ్రాహ్మణాః సర్పా గ్రామద్వారే చతుష్పథే. ౩౪. ఆరామేషు పవిత్రేషు శుచిష్వాయతనేషు చ, వసంతి క్షత్రియా నిత్యం తోరణేషు సరఃసు చ. ౩౫. శ్మశానే భస్మశాలాసు పలాలేషు తటేషు చ, గోష్ఠేషు పథి వృక్షేషు విప్ర వైశ్యా వసంతి చ. ౩౬. అవివిక్తేషు స్థానేషు నిర్జనేషు వనేషు చ, శూన్యాగారే శ్మశానే చ శూద్రా విప్ర వసంతి చ. ౩౭. శ్వేతాశ్చ కపిలాశ్చైవ యే సర్పాస్త్వనలప్రభాః, మనస్వినః సాత్త్వికాశ్చ బ్రాహ్మణాస్తే బుధైః స్మృతాః. ౩౮. రక్తవర్ణాః సువర్ణాభాః ప్రవాలమణిసన్నిభాః, సూర్యప్రభాస్తథా విప్ర క్షత్రియాస్తే భుజంగమాః. ౩౯. నానావిచిత్రరాజీభిరతస్సీ

చారలుగలిగి యొప్పునవియు నల్లయగిసెపూవువన్నెగలవియు, బాణపుష్పువన్నెగలవియు నగును. కాకోదరసన్నిభములు కాటుకవన్నెగలవియుఁ, గాకిరంగుగలవియు, ధూమ్రవర్ణముచే నొప్పునవియు శూద్రసర్పములని చెప్పఁబడుచున్నవి. పాముకాటు బొటనవ్రేలంత రంధ్ర (వ్యవధానము)ము గలిగియుండెనేని యద్దాని బాలసర్పదంశముగా నెఱుంగవలయును. రెండంగుళములపరిమాణము గలిగియుండెనేని యది వయసుపాముకాటని యెఱుంగునది. రెండున్నరయంగుళము లుండెనేని వృద్ధసర్పము గఱచెనని నిరూపింపవలయును. ఇది కశ్యపునియాదేశము. అనంతుఁ డగ్రభాగమును బరికించును. వాసుకి యెడమభాగమును, దక్షకుఁడు దక్షిణభాగమును, గర్కోటకుఁడు పృష్ఠభాగమును బరికించును. పద్మమనునాగము కదలుచుఁ దిరుగుచుండును. మహాపద్మము మునుగుచుండును. శంఖపాలము మాటిమాటికి సంజ్ఞావిహీన మగుచుండును. కులికమనుపన్నగోత్తమము సమస్తులకు రూపముచేయును. (అన్నిఁటిని జూచుచుండును.) అనంతునకుఁ దూర్పుదిక్కును, వాసుకి కాగ్నేయమును, దక్షకునకు దక్షిణదిక్కును, కర్కోటకునకు నైరృతిమూలయుఁ, బద్మమునకుఁ బశ్చిమమును, మహాపద్మమునకు వాయవ్యదిక్కును, శంఖపాలమునకుఁ గుబేరదిశయుఁ, గంబలమున కైశానియు నివాసములుగ నుండును. మఱియు ననంతునకుఁ బద్మము, వాసుకి కుత్ప

---

వర్ణసన్నిభాః, బాణపుష్పసవర్ణాభా వైశ్యాస్తే వై భుజంగమాః. ౪౦. కాకోదరనిభాః కేచిద్యే చ అంజనసన్నిభాః, కాకవర్ణా ధూమ్రవర్ణాస్తే శూద్రాః పరికీర్తితాః. ౪౧. యస్య సర్పేణ దష్టస్య దంశమంగుష్ఠమంతరమ్, బాలదష్టం విజానీయాత్కశ్యపస్య వచో యథా. ౪౨. యస్య సర్పేణ దష్టస్య దంశం ద్వ్యంగులమంతరమ్, యౌవనస్థేన దష్టస్య ఏతద్భవతి లక్షణమ్. ౪౩. యస్య సర్పేణ దష్టస్య సార్ధం ద్వ్యంగులమంతరమ్, వృద్ధదష్టం విజానీయాత్కశ్యపస్య వచో యథా. ౪౪. అనంతః ప్రేక్షతే పూర్వం వామపార్శ్వే తు వాసుకిః, తక్షకో దక్షిణే నేహ కర్కోటః పృష్ఠతస్తథా. ౪౫. చలతే భ్రమతే పద్మో మహాపద్మో నిమజ్జతి, విసంజ్ఞస్తిష్ఠతే చైవ శంఖపాలో ముహుర్ముహుః. ౪౬. సర్వేషాం కురుతే రూపం కులికః పన్నగోత్తమః, అనంతస్య దిశా పూర్వా వాసుకేస్తు హుతాశనీ. ౪౭. దక్షిణా తక్షకస్యోక్తా కర్కోటస్య తు నైరృతీ, పశ్చిమా పద్మనాభస్య మహాపద్మస్య వాయుజా, ఉత్తరా శంఖపాలస్య ఐశానీ కంబలస్య తు.

లము, తక్షకమునకు స్వస్తికము, కర్కోటకునకుఁ బంకజమును, పద్మునకుఁ బద్మమును, తదితరమగుమహాపద్మమునకు శూలము, శంఖపాలమునకు గొడుగు, కులికమున కర్ధచంద్రకము నగును. అనంతకులికములు విప్రులనియు, శంఖవాసుకులు క్షత్రియులు, మహాపద్మతక్షకులు వైశ్యులును, పద్మకర్కోటకులు శూద్రులనియు మనీషు లెప్పుడు దెలిసికొనుచున్నారు. అనంతకులికులు శుక్లవర్ణులై బ్రహ్మవలన జనించిరి. వాసుకియు శంఖపాలుఁడు నగ్నిసముద్భవు లగుటచే రక్తవర్ణులయిరి. తక్షకమహాపద్ములు కొంచెము పచ్చనిరంగు గలిగియుందురు. పద్మకకర్కోటకములు కృష్ణవర్ణము గలిగియుందురు. గుఱ్ఱము నేనుంగు నెద్దును గొడుగును రాజును నగ్నిహోత్రమును ధరణి నుత్పాదించి ధరించియుండుటచే నివి సర్వసిద్ధికరములని తెలుసుకొనుచున్నారు. పూర్ణకుంభమును ధ్వజమును బంగారమును మణులను శిరీషమును కంఠమునందలి మణిహారమును జూచుటయు 'జీవజీవ' అనుశబ్దమును శ్రేష్ఠములయినవి. ఒకనిని బ్రసవించిన కన్యయు శ్రేష్ఠమైనది యని ప్రాసంగికమని యెఱుంగునది. పాములలోఁ బడగలుగలవి కొన్నియు, లేనివి కొన్నియు, నవియన్నియుఁ జేరి యఱువది నాలుగువిధములుగ నున్నవి. అందు ముప్పదియాఱుసర్పములు దృగ్గోచరములుగావు. మిగతవి దృశ్యములై భూమిపైఁ దిరుగుచుండును. ఇరువది

---

౮౮. అనంతస్య భవేత్పద్మం వాసుకేః స్యాత్తథోత్పలమ్, స్వస్తికం తక్షకస్యోక్తం కర్కోటస్య తు పంకజమ్. ౮౯. పద్మస్య తు భవేత్పద్మం శూలం పద్మేతరస్య తు, శంఖపాలే భవేచ్ఛత్రం కులికస్యార్ధచంద్రకమ్. ౯౦. అనంతకపిలౌ విప్రౌ క్షత్రియౌ శంఖవాసుకీ, మహాపద్మస్తక్షకశ్చ వైశ్యౌ విప్ర ప్రకీర్తితౌ, పద్మకర్కోటకౌ శూద్రౌ సదా జ్ఞేయౌ మనీషిభిః. ౯౧. అనంతకులికౌ శుక్లౌ వర్ణతో బ్రహ్మసంభవౌ, వాసుకిః శంఖపాలశ్చ రక్తౌ హ్యగ్నిసముద్భవౌ. ౯౨. తక్షకశ్చ మహాపద్మ ఈషత్పీతౌ బభూవతుః, పద్మకర్కోటకౌ విప్ర సర్పౌ కృష్ణౌ బభూవతుః. ౯౩. హయం యానం వృషం ఛత్రం రాజానమథ పావకమ్, ధరణీముత్పాద్య ధృతానేతాన్సిద్ధికరాన్విదుః. ౯౪. పూర్ణకుంభః పతాకా చ కాంచనం మణయస్తథా, శిరీషం మాణికం కంఠే జీవజీవేతి సువ్రత, ఏతేషాం దర్శనం శ్రేష్ఠం కన్యా చైకప్రసూయికా. ౯౫. చతుః షష్టిః సమాఖ్యాతా భోగినో యే తు పన్నగాః, అదృశ్యాస్తేషు షట్త్రింశద్దృశ్యాస్త్రింశ

సర్పములు మాలలుగలవై యుండును. ఏడుసర్పములు ఫణామండల ములు గలిగియుండును. చారలుగలవి పదియున్నవి. ఇరువదియొక్కసర్ప ములు దర్వివంటిపడఁగలు గలవగును. దుందుభము డుండుభము చేట భము నింద్రవాహనము నాగపుష్పముతో సమానమగుకాంతి గలవియు నట్టి యాఖ్యలు గలవియు నగుపన్నగములు నిర్విషములగును. ఈతీరుగ నూటతొంబదిరెండుసర్పము లున్నవని స్మరించుచున్నారు. వరాహకర్ణియు, గజపిప్పలియు, గాంధారికయుఁ, బిప్పలము, దేవదారువు, మధూకసారము, సిందువారము, యింగువ యనువస్తువులను జూర్ణముచేసి మాత్రలు కట్టవలయును. అని యిట్లు కశ్యపప్రజాపతి గౌతమునకు సర్వనాగము లయు లక్షణములను రూపజాతులను విషభేదములను వివరించెనని చెప్పి సుమంతుఁడు రాజున కిట్లనియెను. అదిగావున నోరాజా! సర్వ కాలములందును భక్తియుక్తుఁడై నాగపూజను బ్రతిమానవుఁడు నొనర్ప వలయును. పంచమినాఁడు ముఖ్యముగాఁ బాలచేతను బాయసముచేతను బూజింపవలయును. మఱియు నోరాజా! శ్రావణశుక్లపంచమినాఁడు ద్వారమున కిరుప్రక్కల గోమయముచే విషోల్బణము లగుపాములను లిఖించి విధ్యుక్తముగ నాద్వారమును దధిదూర్వాక్షతకుశములచేఁ బూజింపవలయును. గంధపుష్పోపహారములతో బ్రాహ్మణులఁ దృప్తినొం దింపవలయును. ఈలోకమున నెవ్వరైన నీతిథియందు భక్తిపురస్సరముగ

---

న్మహీచరాః. ౫౬. వింశచ్చ ప్రగ్విణః ప్రోక్తాః సప్త మండలినస్తథా, రాజీవంతో దశ ప్రోక్తా దర్వ్యః షోడశ పంచ చ. ౫౭. దుందుభో డుండుభశ్చైవ చేటభశ్చేంద్ర వాహనః, నాగపుష్పసవర్ణాఖ్యా నిర్విషా యే చ పన్నగాః, ఏవమేవ తు సర్పాణాం శతద్వినవతి స్మృతమ్. ౫౮. వరాహకర్ణీం గజపిప్పలీం చ గాంధారికాం పిప్పలదేవ దారు, మధూకసారం సహసిందువారం హింగుం చ పిష్ట్వా గుటికా చ కార్యా. ౫౯. సుమంతురువాచ.—ఇత్యుక్తవాన్పురా వీర గౌతమస్య ప్రజాపతిః, లక్షణం సర్వ నాగానాం రూపవర్ణౌ విషం తథా. ౬౦. తస్మాత్సంపూజయేన్నాగాన్సదా భక్త్యా సమన్వితః, విశేషతస్తు పంచమ్యాం పయసా పాయసేన చ. ౬౧. శ్రావణే మాసి పంచమ్యాం శుక్లపక్షే నరాధిప, ద్వారస్యోభయతో లేఖ్యా గోమయేన విషోల్బణాః ౬౨. పూజయేద్విధివద్ద్వారం దధిదూర్వాక్షతైః కుశైః, గంధపుష్పోపహారైశ్చ బ్రాహ్మ

నాగులఁ బూజించినచో వారలకు సర్పములవలనిభయ మెన్నఁడును గలుగఁ బోవదని యిట్లు వచించి యవ్వలివృత్తాంతము వినుమని యిట్లనియె.

ఇది షట్త్రింశాధ్యాయము.

## సప్తత్రింశాధ్యాయము.

మఱియు నోశతానీకా! వెనుకటివిధముగనే భాద్రపదపంచమి నాఁడును శ్రద్ధాసమన్వితుఁడై మానవుఁడు నలుపు మొదలగువర్ణకములచే నాగచిత్రములు లిఖించి గంధపుష్పములచేఁ బూజింపవలయును. గుగ్గిలముచేఁ బొగ వేయవలయును. నేయిని బాయసమును నివేదింపవలయును. ఇట్టు లొనరించువానియెడఁ దక్షకాదిమహానాగములు సంతుష్టములై యేడవతరమువఱకు నాతనివంశమున జనించువారికి సర్పభయము లేకుండ వరంబొసంగును. కావున విద్వాంసుఁడగుమనుజుఁడు సర్వప్రయత్నముల చేతను నాగపూజన మొనరింపవలయును.

ఇది సప్తత్రింశాధ్యాయము.

---

ణానాం చ తర్పణైః. ౬౩. యే త్వస్యాం పూజయంతీహ నాగాన్భక్తిపురఃసరాః, న తేషాం సర్పతో వీర భయం భవతి కర్హిచిత్. ౬౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే శ్రావణికనాగపంచమీవ్రతవర్ణనం నామ షట్త్రింశోఽధ్యాయః.

సుమంతురువాచ.—తథా భాద్రపదే మాసి పంచమ్యాం శ్రద్ధయాన్వితః, ఆథాలేఖ్య నరో నాగాన్కృష్ణవర్ణాదివర్ణకైః. ౧. పూజయేద్గంధపుష్పైశ్చ సర్పిః పాయసగుగ్గులైః, తస్య తుష్టిం సమాయాంతి పన్నగాస్తక్షకాదయః. ౨. ఆసప్తమాత్కులాత్తస్య న భయం నాగతో భవేత్, తస్మాత్సర్వప్రయత్నేన నాగాన్సంపూజయేద్బుధః. ౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే భాద్రపదికనాగపంచమీవ్రతవర్ణనం నామ సప్తత్రింశోఽధ్యాయః.

## అష్టత్రింశాధ్యాయము.

ఓకురునందనా! యిట్టులే యాశ్వయుజమాసమునఁ బంచమి నాఁడును గుశలతో నాగములను నిర్మించి గంధాదులతోఁ బూజింపవలయును. ఓనరనాథా! ఘృతోదకములచేతను క్షీరములచేతను నభిషేకింపవలయును. పాలలో నానబెట్టినగోధుమలను నానావిధములగు భక్ష్యములను నివేదింపవలయును. ఓకురుశార్దూలా! యేమానవుఁడు శుచియై భక్తియుక్తుఁడై విధ్యుక్తముగ నీతిథియందు నాగములఁ బూజించునో యాతనియెడ శేషాదిమహానాగములు ప్రసన్నములయి యాతని కధిక సుఖము లొసంగును. ఈలోకమున నాతఁడు మిగుల శాంతిఁ బొందుచున్నాఁడు. తరువాత నాతఁ డిటనుండి శాంతిలోకమునకేగి శాశ్వత సంవత్సరములు సుఖము లనుభవించును. ఓవీరా! యివ్విధమున నుత్తమమగు నీపంచమీవ్రతమును నీకుఁ జెప్పితిని. ఈవ్రతతిథియందు సర్వసర్పములవలనిబాధను నివారించుటకై "ఓం కురుకుల్లే ఫట్ స్వాహా" అను నీయుత్తమమంత్రమును జపింపవలయును. ఇయ్యది పంచమీవ్రతకల్పము.

ఇది అష్టత్రింశాధ్యాయము.

---

సుమంతురువాచ.—తథా చాశ్వయుజే మాసి పంచమ్యాం కురునందన, కృత్వా కుశమయాన్నాగాన్గంధాద్యైః సంప్రపూజయేత్. ౧. ఘృతోదకాభ్యాం పయసా స్నాపయిత్వా విశాంపతే, గోధూమైః పయసా స్విన్నై ర్భక్ష్యైశ్చ వివిధైస్తథా. ౨. యస్త్వస్యాం విధివన్నాగాఞ్ఛుచిర్భక్త్యా సమన్వితః, పూజయేత్కురుశార్దూల తస్య శేషాదయో నృప. ౩. నాగాః ప్రీతా భవంతీహ శాంతిమాప్నోతి వా విభో, స శాంతిలోకమాసాద్య మోదతే శాశ్వతీః సమాః. ౪. ఇత్యేష కథితో వీర పంచమీకల్ప ఉత్తమః, యత్రాయముచ్యతే మంత్రః సర్వసర్పనిషేధకః. ౫. (ఓం కురుకుల్లే ఫట్ స్వాహా.)

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి పంచమీకల్పే సమాప్తికథనం నామ
అష్టత్రింశోఽధ్యాయః.

## ఏకోనచత్వారింశాధ్యాయము.

సుమంతుండు శతానీకున కిట్లనియె. ఓరాజా! షష్ఠినాఁడు విశేషించి కార్తికమాసమున షష్ఠితిథియం దుపవసించి ఫలాహారియైయున్న చో రాజ్యభ్రష్టుఁడగు రాజు స్వల్పకాలములో నిజరాజ్యమును బొందఁగలఁడు. ఓమహారాజా! యీషష్ఠీతిథి యెల్లవేళల నెల్లకోర్కుల నొసంగుచున్నది. జయార్థి యగువాఁడు సర్వకాలముల నీతిథియందుఁ బ్రయత్నపూర్వకముగ నుపవసింపవలయును. మహాతిథియగు నీషష్ఠి కార్తికేయుఁడగు కుమారస్వామికిఁ బ్రియమైనది. ఈతిథియం దమ్మహాత్ముఁడు దేవసేనాధిపత్యమును వహించెను. ఏమికారణముచే స్కందస్వామి యీతిథియందు శ్రేయముగాంచెనో యందువలననే సర్వమానవులును షష్ఠియందు రాత్రిమాత్రమే భుజించి యెల్లవేళల నీప్సితములు బడయఁగలుగుచున్నారు. ఆనాఁడు దక్షిణాభిముఖుఁడై నిలఁబడి కార్తికేయున కర్ఘ్యమునొసంగి దధిఘృతోదకములచేతను బుష్పములచేతను "సప్తర్షిదారజ స్కంద స్వాహాపతిసముద్భవ, రుద్రార్యమాగ్నిజ విభో గంగాగర్భ నమోఽస్తుతే. ప్రీయతాం దేవసేనానీః సంపాదయతు హృద్గతమ్." అనుమంత్రముచేఁ బూజించి తనసొత్తు నన్నము మొదలగుదానిని విప్రున కొసంగి యావెనుక దాను భుజింపవలయును. సప్తర్షులభార్యలందు జనించినస్కందా! స్వాహాపతియగు నగ్నిహోత్రునందుఁ బుట్టినవాఁడా! రుద్రసూర్యవహ్నిమూర్తుల వలనఁ బుట్టినవాఁడా! షడ్గుణైశ్వర్యసంపన్నుఁడా! గంగాదేవిగర్భమున జనించినవాఁడా! నీకు నమస్కారము. దేవసేనానాయకుఁడు సంతో

---

సుమంతురువాచ.—షష్ఠ్యాం ఫలాశనో రాజన్విశేషాత్కార్తికే నృప, రాజ్యచ్యుతో విశేషేణ స్వం రాజ్యం లభతేఽచిరాత్. ౧. షష్ఠీ తిథిర్మహారాజ సర్వదా సర్వకామదా, ఉపోష్యా తు ప్రయత్నేన సర్వకాలం జయార్థినా. ౨. కార్తికేయస్య దయితా ఏషా షష్ఠీ మహాతిథిః, దేవసేనాధిపత్యం హి ప్రాప్తం తస్యాం మహాత్మనా. ౩. అస్యాం హి శ్రేయసా యుక్తో యస్మాత్స్కందో భవాగ్రణీః, తస్మాత్షష్ఠ్యాం నక్తభోజీ ప్రాప్నుయాదీప్సితం సదా. ౪. దత్త్వార్ఘ్యం కార్తికేయాయ స్థిత్వా వై దక్షిణాముఖః, దధ్నా ఘృతోదకైః పుష్పైర్మంత్రేణానేన సువ్రత. ౫. సప్తర్షిదారజ స్కంద స్వాహాపతిసముద్భవ, రుద్రార్యమాగ్నిజ విభో గంగాగర్భ నమోఽస్తు తే ప్రీయతాం దేవసేనానీః సంపాదయతు హృద్గతమ్. ౬. దత్త్వా విప్రాయ చాత్మాన్నం

షించుఁగాక! మదీయహృద్గతంబగు నభిప్రాయమును సంపాదించుఁగాక. అని మంత్రమునకు భావము. ఆతఁడు రాత్రివేళనే భూమినే భోజన పాత్రముగ నొనరించుకొని భుజింపవలయును. ఇట్టు లీషష్ఠీవ్రతమును స్కందదేవుఁడే స్నేహభరితుఁడై యత్నముతో వచించియుండెను. అద్దాని నంతను నీకే నిపు డెఱిఁగింతు వినుము. ఓమహారాజా! యెవఁడు షష్ఠి నాఁడు ఫలాహారుఁడై నక్తాహారుఁడునై యుండునో శుక్లకృష్ణపక్షముల షష్ఠీతిథులందు నియతేంద్రియుఁడై బ్రహ్మచారియై సమాహితచిత్తుఁడై యుండునో యాతనికిఁ గార్యసిద్ధియు ధైర్యమును సంతోషమును రాజ్య మును నాయుష్యమును నారోగ్యమును నైహికాముష్మికఫలముల స్కందుఁడు సంతుష్టుఁడై యొసంగును. సందియమందఁబనిలేదు. ఏవాఁడు నక్తోపవాస మొనర్చునో యాతఁడు నక్తవ్రత మనుష్ఠింపవలయును. అట్టి వాఁ డిహపరలోకముల నుత్తమఖ్యాతిఁగాంచును. స్వర్గమున నియత కాలము వసించును. అందు సంశయమువలవదు. అంతఁ బ్రళయాంతమున నిటకేతెంచి పైఁజెప్పినభోగముల నందును. ఆతఁడు దేవతలకుఁగూడ వంద్యుఁడై రాజరాజగును. ఓకురుకులోద్వహా! యెవ్వాఁ డీషష్ఠీకల్ప మును వినునో యాతనికి సిద్ధియు ధృతియుఁ దుష్టియు నుత్తమఖ్యాతియుఁ గలుగును.

ఇది ఏకోనచత్వారింశాధ్యాయము.

---

యచ్చాన్యదపి విద్యతే, పశ్చాద్భుఙ్క్తే త్వసౌ రాత్రౌ భూమిం కృత్వా తు భాజనమ్. ౭. ఏవం షష్ఠ్యాం వ్రతం స్నేహాత్ప్రోక్తం స్కందేన యత్నతః, తన్నిబోధ మహారాజ ప్రోచ్యమానం మయాఖిలమ్. ౮. షష్ఠ్యాం యస్తు ఫలాహారో నక్తాహారో భవిష్యతి, శుక్లాకృష్ణాసు నియతో బ్రహ్మచారీ సమాహితః. ౯. తస్య సిద్ధిం ధృతిం తుష్టిం రాజ్య మాయుర్నిరామయమ్, పారత్రికం చైహికం చ దద్యాత్స్కందో న సంశయః. ౧౦. యో హి నక్తోపవాసః స్యాత్స నక్తేన వ్రతీ భవేత్, ఇహ వాముత్ర సోఽత్యంతం లభతే ఖ్యాతిముత్తమామ్, స్వర్గే చ నియతం వాసం లభతే నాత్ర సంశయః. ౧౧. ఇహ చాగత్య కాలాంతే యథోక్తఫలభాగ్భవేత్, దేవానామపి వంద్యోఽసౌ రాజ్ఞాం రాజా భవిష్యతి. ౧౨. యశ్చాపి శృణుయాత్కల్పం షష్ఠ్యాః కురుకులోద్వహ, తస్య సిద్ధి స్తథాతుష్టిర్ధృతిః స్యాత్ఖ్యాతిసంభవా. ౧౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యం సంహితాయాం బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పవర్ణనం నామ ఏకోనచత్వారింశోఽధ్యాయః.

## చత్వారింశాధ్యాయము.

ఓమహాత్మా! అతికష్టమగు నీప్రశ్నముగుఱించి నానెమ్మనమున సంశయము గలుగుచున్నది. కార్తికేయునిమహాత్త్వమును వినిన యాశ్చర్యము గలుగుచున్నది. అనేకములవలన జననమందిన కార్తికేయుని మిక్కిలి గొప్పదగుమహిమ మిట్టిదని యెట్లు లూహింపఁగుదును? ఓపండితలోకవీర! పురుషునకు గొప్పతనము నిచ్చునది జాతియా? లేక కర్మయా? ఈకృత్తికాతనయుని జూచిన నాకీవిషయమున గొప్పసంశయము గలుగుచున్నది. దీనినంతను బాగుగ విమర్శించి యెఱింగి నాసంశయము నపనయింపుము. మఱియు నోద్విజపుంగవా! జన్మకర్మముల నెయ్యది యుత్తమమో గూడ నాకెఱింగింపుమని యడుగ శతానీకునకు సుమంతుఁడిట్లనియె. రాజా! యీయర్థమును మున్ను విద్వాంసులగుశిష్యు లడుగ బ్రహ్మదేవుఁడు వివరించియుండెను. అద్దాని నీకెఱింగింతు నాకర్ణింపుము. మున్ను మహర్షులు సుఖాసీనుఁడగు సురజ్యేష్ఠునియొద్దకేగి నమస్కరించి యోమహాబాహూ! విశ్వామిత్రునకుఁ గలిగినవిప్రత్వమునుగుఱించి గొప్పవిస్మయము జనించుటచే జాతకౌతూహలులై భక్తిశ్రద్ధాసమన్వితులై వినయావనతశిరస్కులై యిట్లు లడిగిరి. ఓబ్రహ్మా! మొదటికల్పమున బ్రాహ్మణ్య మనఁగా జాతి యధ్యయనము దేహాత్మసంస్కారములు నాచారకర్మలు ననువానిలో నెయ్యది యగును. మనోవాక్కాయకర్మ

---

శతానీక ఉవాచ:—అహో ప్రశ్నం మహత్కష్టం సంశయో హృది వర్తతే, కార్తికేయస్య మాహాత్మ్యం శ్రుత్వా జన్మ తథా ద్విజ. ౧. అనేకజనితస్యేహ కార్తికేయస్య సువ్రత, మాహాత్మ్యం సుమహద్విప్ర కథమేతద్విభావ్యతే. ౨. జాతిః శ్రేష్ఠా భవేద్వీర ఉత కర్మ భవేద్వరమ్, సంశయస్తు మహానత్ర దృష్ట్వా మే కృత్తికాసుతమ్. ౩. ఏతద్వద వినిశ్చిత్య న యథా సంశయో భవేత్, జన్మతః కర్మణశ్చైవ యజ్జ్యాయస్తద్బ్రవీహి మే. ౪. సుమంతురువాచ:—ఇమమర్థం పురా పృష్టో బ్రహ్మా శిష్యైర్మనీషిభిః, యదుక్తం తేన తేషాం చ తత్తే వచ్మి నిబోధ మే. ౫. సురజ్యేష్ఠం సుఖాసీనమభిగమ్య మహర్షయః, ప్రణమ్య చ మహాబాహో విశ్వామిత్రస్య విప్రతామ్. ౬. దృష్ట్వా విస్మయమాగత్య కౌతూహలసమన్వితాః, భక్తిం శ్రద్ధాం పురోధాయ ప్రణమ్యానతకంధరాః. ౭. ఋషయ ఊచుః—భో బ్రహ్మన్నాదికల్పే హి బ్రాహ్మణ్యం బ్రూహి కిం భవేత్, జాత్యధ్యయనదేహాత్మసంస్కారాచారకర్మణామ్. ౮. బాహ్యాభ్యంతరసామాన్య

జాతిద్రవ్యగుణాత్మకములగు బాహ్యములు నాభ్యంతరములు నైన సామాన్యవిశేషములు కృత్రిమములా? ప్రసిద్ధములును వాస్తవములు నగు జాతిభేదవిధాయకములు పరోక్షములగు ప్రమాణములచే నిశ్చితములుగామి విడువవలయునా? మనుష్యులజాతిభేదవిధి యవ్యక్తమగు నాగమముచే సిద్ధించుచున్నదా? ఇట్టి వికల్పముండుటచే బ్రహ్మజ్ఞానమున బలము తగ్గుచున్నది. వచింపు మన వారికి బ్రహ్మ యిట్లనియెను. ఓమునులారా! మీరు వాక్రుచ్చినయంశము సత్యమే. అది యట్టులే సందేహింపఁబనిలేదు. శిష్యులశ్రేయమునకై తర్కించి వచించిన యోగీశ్వరుని వచన మాలకింపుఁడు. వేఱువేఱర్థముల బోధించు విరుద్ధప్రమాణములు ప్రసిద్ధములై యుండుటచే జాత్యాదులచే బ్రాహ్మణ్యము నిర్ధరింపరాదని యోగీశ్వరుఁడు వచించుచున్నాఁడు. దాని వివరింతు వినుఁడు. స్పష్టమై యోగ్యమగునర్థమును విషయీకరించుప్రమాణము ప్రత్యక్షముగాఁ దెలిసికొనుచున్నారు. సామాన్యము నతీంద్రియములునగు సర్వవిషయములు గ్రహించునది సిద్ధాంతమని యొప్పుకొనుచున్నారు. సర్వశక్తిసంపన్నమగుట నది యొక్కటియే ప్రమాణమని మాత్ర మెంచరాదు. అట్టు లంగీకరించిన నీవిధముగ ననేకసంకటములు వికల్పము లగును. వేదముయొక్క యపౌరుషేయత్వము నిత్యమగుజాతిని నిరూపించును. వేద మపౌరుషేయమగుటచే వేదోక్తకర్మ లెల్ల నాచరింపవలయును. దీనిచే వైదికకర్మాచరణము బ్రాహ్మణ్యమని తెలియుచున్నది. ఆచరణ

---

విశేషా యది కృత్రిమాః, మనోవాక్కర్మశారీరజాతిద్రవ్యగుణాత్మకాః. ౯. సంత్యక్తవ్యాః ప్రసిద్ధా యే జాతిభేదవిధాయినః, వస్తుభూతాః పరోక్షైర్వా ప్రమాణైర్న వినిశ్చితాః. ౧౦. అవ్యక్తాగమసిద్ధశ్చేజ్జాతిభేదవిధిర్నృణామ్, వికల్పోఽయం దృష్టాతి భవతః శేముషీబలమ్. ౧౧. బ్రహ్మోవాచ:—ఏవమేతన్న సందేహో యథా యూయం వదంతి హ, శృణుధ్వం యోగినో వాక్యం సతర్కం శిష్యశ్రేయసే. ౧౨. యోగేశ్వర ఉవాచ.—ప్రమాణే హి ప్రసిద్ధే తు భిన్నార్థవిషయే యతః, స్పష్టయోగ్యార్థవిషయం ప్రత్యక్షం తావదీక్షతే. ౧౩. సామాన్యాతీంద్రియగ్రాహీ సిద్ధాంతోఽభ్యుపగమ్యతే, స ఏవ భగవానేకః ప్రమాణమితి చేన్న సత్. ౧౪. యస్మాద్వివిధమేతత్తే సంకటం భద్ర వర్తతే, వేదస్య పౌరుషేయత్వం నిత్యజాతిసమర్థకమ్. ౧౫. కార్యా విశేషా వేదోక్తా న యుక్తమకృతం వచః, తాల్వాదికరణానాం చ వ్యాపారా

శూన్యమగువచన మెప్పుడును బలుకఁదగదు. తాల్వాదులగు నుచ్చారణ సాధనముల వ్యాపారము గలిగినవెనుక శ్రుతికి వ్యాపారము గలుగు చున్నది. అది లేకున్న నిదియు లేదు. అను నన్వయవ్యతిరేకములచేఁ దాల్వాదులవ్యాపారమున్న శ్రోత్రవ్యాపారముండును లేకుండిన లేదు. అట్టిమాదిరిగనే కర్మాచరణముండిన బ్రాహ్మణ్య ముండును. అది లేకుండిన నిదియు లేకుండును. కావుననే వహ్నియుండిననే ధూమముండును. లేకుండిన లేదని యన్వయవ్యతిరేకములచేఁ దెలిసికొనుచున్నారు. ఇట్లు లే క్రియయుండిన ఫలముండును. లేకున్న లేదు అని చెప్పవచ్చును వ్యాపారము లేకున్నను వచించుచుండుట యుపపన్నమగును గావున నన్యథానుపపత్తియు లేదు. బ్రాహ్మణత్వాదిరూపమగుజాతి పురుషవిశేషముల ననుసరించి యుండునని చెప్పుటకు నవకాశము లేదు. ప్రత్యక్షముగ ననేక వర్ణములుగల బ్రాహ్మణు లగపడుచుండుటచే నద్దానికి విరుద్ధము. గోవర్గము నడుమ నశ్వము జేరియుండునేని విచారసమర్థులగుబుధులు దాని నశ్వముగా నెఱుంగునట్లు మనుష్యజాతినుండి శూద్రునికంటె వేఱువిధమగు బ్రాహ్మణత్వజాత్యాదుల నెఱుంగఁజాలరు. అందఱు మనుష్యులందు నున్న మనుష్యత్వజాతికంటె విశేషము బ్రాహ్మణత్వజాతియం దగపడుట లేదు. అటులయిన శూద్రులనుండి ద్విజుల వేఱుపఱచువిశేషము లెయ్యవి యందురేని వినుఁడు. ఆమనుష్యత్వజాతి సంస్కారములతోడను క్రియలతోడను గూడియుండునేని యదియే శూద్రజాతికి దీనికిని వ్యత్యస్తమని చెప్పనగును. యాథార్థ్య మెఱుఁగనిమానవులు జీవుఁడు గూడ బ్రాహ్మణుఁడనియే కొందఱు చెప్పుచున్నారు. కాని వారంద

---

నంతరం శ్రుతేః. ౧౬. వ్యాపారాత్పరత స్తస్య ప్రాగభావవిశేషతః, తద్భావానువిధాయిత్వమన్వయవ్యతిరేకతః. ౧౭. తస్మాద్ధూమాగ్నివద్వార్థఫలభావోఽవతిష్ఠతే, న చ వ్యాపారవచసోరన్యథానుపపత్తితః. ౧౮ పురుషానుగతా జాతిర్బ్రాహ్మణత్వాదికాస్తి చేత్, ద్వివర్ణజాతిభేదేన ప్రత్యక్షార్థోపలక్షణాత్. ౧౯. గోవర్గమధ్యం చ గతో యథాశ్వో నిర్ధార్యతే జ్ఞైః సువిచక్షణత్వాత్, మనుష్యభావాదవిశిష్యమాణస్తద్వద్ద్విజః శూద్రగణాన్న భిన్నః. ౨౦. మనుష్యజాతేర్న పరో విశేషో యః కల్ప్యతే సర్వనరానుయాయీ, సంస్కారయుక్తా హి క్రియావిశిష్టా ద్విజన్మనాం శూద్రవివేకహేతుః. ౨౧. జీవోఽపి బ్రాహ్మణః ప్రోక్తో యైరతత్త్వజ్ఞమానవైః, ప్రభ్రష్టబ్రాహ్మ

రదికారణముగ బ్రాహ్మణత్వజాతినుండి మిగుల భ్రష్టులై విప్రసంబంధము గలిగి జనింతురు. ముదుసలితనము జన్మాంతరములు క్లేశములు నను క్రూరనక్రములగుంపులచే నావృతమై యాకులమై మనుష్యులు తిర్యక్కులు దుష్టులు శూద్రులు మొదలగువారి యోనిసంబంధమువలని దుఃఖములను తరంగములును దుఃస్థితి రోగము శోకము నార్తిగలజనులు నాబడు సుడులుగలదియునై కుక్క పంది చండాలుర కృములు కూర్మాదులు నగు కాయికములు గలిగినటువంటి సంసారమను ఘోరసముద్రములో మునుఁగుచుఁ దేలుచు మహాపాపభరముచే నాక్రాంతుఁడై యుండుజీవుఁడు బ్రాహ్మణుఁ డెట్టులగును? అని బ్రహ్మ మఱియు నిట్లనియె. ఇందొకకథ జెప్పెదను. మనువు సప్తవ్యాధులకథను జెప్పియున్నాఁడు. దానిని వినినతోడనే నిత్యమగుజాతి లేదని తెలిసికొనఁగలరు. దశార్ణదేశమునన్న సప్తవ్యాధులు కాలంజరపర్వతమున మృగములుగను శరిద్ద్వీపమున జక్రవాకములుగను మానససరస్సున హంసలుగను గురుక్షేత్రమునఁ వేదాధ్యయననిరతులై పారముజేరిన విప్రులుగ నుద్భవించిరి. దూరమార్గమున వెడలి యెండుల కిట్లు శ్రమపడియెదరు. ఒకేజీవుఁడిన్ని జాతులు గలిగియుండుటచే జీవునందు బ్రాహ్మణ్యము నేమెచ్చటను నెట్టులను గాంచఁజాలము. శస్త్రాదులు గలిగియుండుట భార్గవాది జాతులకు లక్షణమగును. ఏనుఁగు గుఱ్ఱము గోవు నజము నుష్ట్రము ఖరము మున్నగువానిలో వానివానిశక్తి నంగములను వర్ణధర్మముల

---

ణత్వాత్తే జాయంతే విప్రసంగతః. ౨౨. జరాజన్మాంతరక్లేశదుష్టగ్రాహకులాకులమ్, నరతిర్యగసచ్ఛూద్రయోనిదుఃఖోర్మిసంకటమ్. ౨౩. దౌఃస్థిత్యరోగశోకార్తిజనావర్త సమన్వితమ్, శ్వానశూకరచాండాలకృమికూర్మాదికాయకమ్. ౨౪. సంసారసాగరం ఘోరం మగ్నః ఖలు పరిప్లవన్, భూరిపాపభరాక్రాంతః స జీవో బ్రాహ్మణః కథమ్. ౨౫. బ్రహ్మోవాచ.—సప్తవ్యాధకథా విప్రా మనునా పరికీర్తితా, తాం నిశమ్య యదుశ్రేష్ఠ నిత్యం జాతిపదం త్యజేత్. ౨౬. సప్తవ్యాధా దశార్ణేషు మృగాః కాలంజరే గిరౌ, చక్రవాకాః సరిద్ద్వీపే హంసాః సరసి మానసే. ౨౭. తేఽపి జాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః, ప్రస్థితా దీర్ఘమధ్వానం యూయం కిమవసీదథ. ౨౮. తస్మాన్న జీవే బ్రాహ్మణ్యం పశ్యామో హి కథఞ్చన. ౨౯. శస్త్రాదిమద్భార్గవ జాతియుక్తో గజాశ్వగోజోష్ట్రఖరాదికానామ్, శక్త్యాకృతో హ్యంగజవర్ణధర్మైర్భేదః

ననుసరించి జాతిభేదము స్ఫుటమైయున్నట్లు భార్గవాదులలోఁగూడ జాతి నిర్ణయము లక్షణముతోఁ జేయవచ్చును. అట్టిమాదిరిలక్షణము బ్రాహ్మణు లందు లేకుండుటచే మనుష్యులలో బ్రాహ్మణ్యమను నొకజాతి వేఱుచేయఁ దగదు. పశ్వాదులందువలె నుత్తమభేదము సిద్ధమగుటకు మనుష్యులలో నవాంతరభేదరూపమగు నిత్యాకృతి(జాతి) కాన్పింపదు. తెలుపు మొదలగురూపము లొక్కొక్కని కసాధారణములై యుండుటంజేసి వాని సనాతనమగు వర్ణభేదము సిద్ధింపనేరదు. ఇయ్యది యనుమానముచేఁ గూడ నిరూపింపవచ్చును. బ్రాహ్మణ్యమను నీజాతి యధ్రువముగదా! కృత్రిమమై యున్నదిగాన, ఎయ్యది కృత్రిమ మయ్యది యధ్రువము ఘటాదులవలె ధర్మజ్ఞసమయసిద్ధమగుటచే నకృత్రిమమందువేని జన్మాంతరము నందలి పుణ్యలేశవిశేషములచేత లబ్ధము గనుక సాంకేతిక మగును. వాణిజ్యముచేయువారు వణిజు లనఁబడుచున్నారు. వైద్యముచేయువారు వైద్యు లనఁబడుచున్నారు గదా! కావున జాతిభేదములు సాంకేతికము లగును. సుకృతమును విడుచువారేమి బ్రాహ్మణులగుదురు (కుత్సితబ్రాహ్మణులు). లోకమును బాలింపనివారేటి రాజులు (కుత్సితప్రభువులు). అట్టులే స్వధర్మచ్యుతులగువారేటి వైశ్యులు (కుత్సితులు). అట్టులే శూద్రులు తమముఖ్యధర్మమగు ద్విజశుశ్రూషణమునుండి హీనులయినచో వారేటి శూద్రులు (కుత్సితులు). కావున మానవులలో గవాశ్వాదులలోవలె దృఢమగు జాతిభేదము లేదు. ఇఁక లోకవ్యవహారమెట్టులు సరిపడునందురేని తత్తత్కార్యశక్తి ననుసరించి సాంకేతికము

---

స్ఫుటం లక్షణతోఽత్ర యద్వత్. ౩౦. తదుత్తరాన్నైవ వికర్తనీయా బ్రాహ్మణ్యజాతిర్నృషు నాస్తి కాచిత్, నిత్యాకృతిర్నానుపభేదరూపా యథా హి భేదః పరమోత్ర సిధ్యేత్, సితాద్యసాధారణతుల్యరూపాః సనాతనోఽంగేషు న వర్ణభేదః. ౩౧. బ్రాహ్మణ్యమధ్రువమిదం కిల కృత్రిమత్వాదకృత్రిమం భవతి సామయికత్వయోగాత్, సాంకేతికం సుకృతలేశవిశేషలబ్ధం వాణిజ్యభేషజకృతామివ జాతిభేదాః. ౩౨. కిం బ్రాహ్మణా యే సుకృతం త్యజంతి కిం క్షత్రియా లోకమపాలయంతః, స్వధర్మహీనా హి తథైవ వైశ్యాః శూద్రాః స్వముఖ్యక్రియయా విహీనాః. ౩౩. తస్మాన్న గోశ్వవత్కశ్చిజ్జాతిభేదోఽస్తి దేహినామ్, కార్యశక్తినిమిత్తస్తు సంకేతః కృత్రిమో భవేత్. ౩౪. ఏవం ప్రమాణైః ప్రతిషిధ్యమానాం సాంకేతికీం యాతి నరో వ్యవస్థామ్, స్వకీయసిద్ధాంస్వమతైర్నిషిద్ధాం

కృత్రిమమునై యేర్పడెను. ఇట్లు ప్రమాణపురస్సరముగ నిషేధింపఁబడిన జాతివ్యవస్థను సాంకేతికముగఁ బొందుచున్నాఁడు మానవుఁడు. ఇట్లు స్వకర్మచే సిద్ధమయినజాతిని పూర్వులు నిషేధించినటులు మూఢాత్ముఁడగు నీచుఁ డెఱుంగలేకున్నాఁడు. గోవులు, మహిషులు, మేఁకలు, గుఱ్ఱములు, లొట్టియలు, వనమృగములు, ఏనుంగులు, సింగములు, ప్రేష్యులు, వార్ధుషికులు, నకార్యములుచేయుట కుద్యోగించువారు, వణిజులు, కంచరి, కమ్మరి మొదలగు కారువులు మొదలగువారు బ్రాహ్మణజాతియందుఁ బుట్టువుచే దివ్యులయినను గర్మలచేత వినష్టులగుచున్నారు. ఇట్టులే మాంసాశనులును, గాయకులును, పలాండులశునభక్షకులును, లేడిపాలను లొట్టియలపాలును ద్రావువారును, మాంసమును సమస్తరసవర్గములను క్షీరములను గొనుచు నమ్ముచుండువారును, లేచిపోయి మరలవచ్చి సంస్కృతయగుపునర్భువును వృషలయువతిని జాండాలిని సేవించువారును, శూద్రాన్నరసములతోఁ బెరుగువారును, ప్రేతవస్త్రములు ధరించి ప్రేతాన్నంబు భుజించువారును, మరణాశౌచము గలవారియొక్కయు సూతికాశౌచము గలవారియొక్కయు నన్నపానములతో జీవించువారును నగు ద్విజాతులు వేదాధ్యయనమునుండి యజ్ఞాద్యనుష్ఠానమునుండియుఁ బితృకార్యములనుండియు భూతబలులనుండియు నాతిథ్యమునుండియు బహిష్కరింపఁబడుచున్నారు. మాత్సర్యము మదము ద్వేషము తృష్ణ కామము నజ్ఞానము ననువానిచేఁ గప్పఁబడిన దేహచిత్తాదులుగలవారును హీనాచారులును నితరులగు పిశునమానవులగు ద్విజులును వీరందఱును పలువిధములుగ నాశము నొందుచున్నారు. జాతిభ్రష్టులగుచున్నారు.

---

న బుధ్యతే మూఢమనా వరాకః. ౩౫. గోమహిష్యజవాజ్యుష్ట్రవానేయేభగజాధిపాః ప్రేష్యవార్ధుషికాకార్యకరణోద్యతమానసాః. ౩౬. వణిక్కారుక్రియావిష్టా దివ్యాస్తేఽపి చ యే ద్విజాః, వినష్టాస్తే తు విజ్ఞేయాః క్రవ్యాదాశ్చ కుశీలవాః. ౩౭. పలాండులశునాదాశ్చ మృగ్యుష్ట్రీక్షీరపాయినః, మాంససర్వరసక్షీరక్రయవిక్రయకారిణః. ౩౮. పునర్భూవృషలీవేశ్యాచాండాలస్త్రీనిషేవిణః, శూద్రాన్నరసపుష్టాంగాః ప్రేతవస్త్రాన్నభోజనాః. ౩౯. మృతసూతకలబ్ధాన్నపానాద్యభ్యవహారిణః, బ్రహ్మదేవపితృభూతమనుష్యేషుబహిష్కృతాః. ౪౦. మాత్సర్యమదవిద్వేషతృష్ణాకామతమోమయాః, హీనాచారాహియే కేచిదపరేపిశునా ద్విజాః, ప్రకారైర్బహుభిః సర్వే తే ప్రణశ్యంతి నాన్యథా.

నియతమగుజాతి యుండినచో నిదియంతయు సరిపడకపోయెడిని. ఇట్లు శాస్త్రోదితమార్గభ్రష్టులగు ద్విజులు విశిష్టగోత్రముల బుట్టినను సంస్కార కలాపములచే సంస్కృతు లయియున్నను శ్రుతిక్రమము ననుసరించి యధ్యయనముచేసి వేదముల మాణవకుల నధ్యాపనముచేయుచున్నను దురాచారప్రవర్తకులగుటచే బ్రాహ్మణత్వప్రచ్యుతులుగ నగుచున్నారు. కావున నొక్కయెడఁగూడ నిత్యానపాయినిరైయె వస్తురూపమగుజాతి యొక్కటిలేదు. నశ్వరముగ నుండుటచేత నది యూహింపరాదు. ఇచ్చట మానవములగు శ్లోకములను దెలిసికొనుచున్నారు. మాంసవిక్రయ మును, లాక్షావిక్రయమును, లవణవిక్రయమును జేయుమానవుఁడు వెంటనే పతితుఁడగును. క్షీరవిక్రయ మొనరించుబ్రాహ్మణుఁడు మూఁడు దినములలో శూద్రుఁడగును. గోరక్షకులును, వాణిజ్యముచేయు వారును, కారువృత్తినుండువారును, గాయకులు, నూడిగముచేయు వారును, వడ్డీవ్యాపారముచేయువారును, బ్రాహ్మణజాత్యుత్పన్నులైనను శూద్రులే యని మనువు వచించెను. ఉత్తమకర్మలచే శూద్రుఁడును బ్రాహ్మణత్వమునొందును. నీచకర్మలచే బ్రాహ్మణుఁడు శూద్రత్వమును గాంచును. ఇట్టులే క్షత్రియుఁడును విప్రత్వము నొందును. అట్టులే వైశ్యుఁడును విప్రత గాంచును. అని తెలిసికొనవలయును.

ఇది చత్వారింశాధ్యాయము.

---

४౧. ఏవం శాస్త్రోదితన్యాయమార్గభ్రష్టాస్తు యే నరాః, విశిష్టగోత్రసంస్కారకలాపస కలాత్మకాః. ४౨. వేదానధ్యాపయంతోఽపి తేఽధీయానాః శ్రుతిక్రమాత్, బ్రాహ్మ ణత్వాద్విహీయంతే దురాచారవిధాయినః. ४३. తస్మాన్న జాతిరేకత్ర భూతాత్మాస్త్యన పాయినీ, నాశిత్వాదత్ర చ శ్లోకాన్మానవాః సమధీయతే. ४४. సద్యః పతతి మాంసేన లాక్షయాలవణేన చ. త్ర్యహేణ శూద్రో భవతి బ్రాహ్మణః క్షీరవిక్రయీ. ४౫. గోరక్షకాన్వాణిజికాంస్తథా కారుకుశీలవాన్, ప్రేష్యాన్వార్ధుషికాంశ్చైవ శూద్రాం స్తాన్మనురబ్రవీత్. ४౬. శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్, క్షత్రియోయాతి విప్రత్వం విద్యాద్వైశ్యం తథైవ చ. ४౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే కార్తికేయవర్ణనే జాతివర్ణనం నామ చత్వారింశోఽధ్యాయః.

## ఏకచత్వారింశాధ్యాయము.

బ్రహ్మదేవుఁడు మరల నిట్లనియె మునులారా! వేదాధ్యయనముగూడ బ్రాహ్మణ్యమునే బొందుచున్నది. విప్రునివలెనే రాజన్యులను వైశ్యులనుగూడఁ బొందుచున్నది. రావణాదులగు రాక్షసులును శునకభక్షులును చాండాలురును దాసులును లుబ్ధకాభీరులును ధీవరులును (వేఁటకాండ్రు, గొల్లలు పల్లెవాండ్రు) నితరులగు వృషలులు మొదలగు నధములెల్లరునుగూడ వేదముల నధ్యయనముచేయుచున్నారు. శూద్రులు దేశాంతరములకేగి విప్రతుల్యములగు వ్యాపారము నాకారము భాషణము మొదలగువానిని గల్పించి బ్రాహ్మణత్వమునో క్షత్రియత్వమునో యాశ్రయించి సర్వవేదములగాని రెండువేదములుగాని యొక్క వేదమునుగాని యథాక్రమముగ నధ్యయించి శుద్ధబ్రాహ్మణజాతియం దుద్భవమంది శుభలక్షణసంపన్నయగుకన్య నుద్వాహము జేసుకొనుచున్నారు. అటుకాదేని వారు క్షత్రియవైశ్యులలోఁ జేరి వేదములు నేర్చి గౌడబ్రాహ్మణులనిగాని దాక్షిణాత్యులనిగాని జాతిని నిర్మించుకొనుచున్నారు. శూద్రత్వము తెలియకయుండుటచే నిచ్ఛానుసారముగ బ్రాహ్మణ్యము నొందుచున్నారు. కావున వేదాధ్యయనక్రియాకృతమగు బ్రాహ్మణత్వమునకు లక్షణము దుర్లభము. ఈవిషయమునే న్యాయమార్గానుగతులగుశాస్త్రజ్ఞులు శాస్త్రప్రవర్తకులును జెప్పుచున్నారు. వార లుత్తమమతము విని మత్సరములు బాసి సత్పురుషులయియుందురు. ఆచారహీను

---

బ్రహ్మోవాచ:—వేదాధ్యయనమప్యేతద్బ్రాహ్మణ్యం ప్రతిపద్యతే, విప్రవద్వైశ్యరాజన్యౌ రాక్షసా రావణాదయః. ౧. శ్వాదచాండాలదాసాశ్చ లుబ్ధకాభీరధీవరాః, యేన్యేఽపి వృషలాః కేచిత్తేఽపి వేదానధీయతే. ౨. శూద్రాదేశాంతరం గత్వా బ్రాహ్మణ్యం క్షత్రియం శ్రితాః, వ్యాపారాకారభాషాద్యైర్విప్రతుల్యైః ప్రకల్పితైః. ౩. వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్, ప్రోద్వహంతి శుభాం కన్యాం శుద్ధబ్రాహ్మణజాం నరాః. ౪. అథ వాధీత్య వేదాంస్తు క్షత్రవైశ్యేషు వా నరాః, గౌడపూర్వాం కృతామేయుర్జాతిం వా దాక్షిణాత్యజామ్. ౫. అపరిజ్ఞాతశూద్రత్వాద్బ్రాహ్మణ్యం యాంతి కామతః, తస్మాన్న జ్ఞాయతే భేదో వేదాధ్యాయక్రియాకృతః. ౬. శాస్త్రకారైస్తథా చోక్తం న్యాయమార్గానుసారిభిః, తే సాధు మతమాకర్ణ్య సంతః సంతి విమత్సరాః. ౭. ఆచారహీనాన్న పునంతి వేదా యద్యప్యధీతాః సహ

లగుమానవులు షడంగసమన్వితముగ వేదము నధ్యయనముచేసినను వారలు పునీతులు గాఁజాలరు. బ్రాహ్మణునకు వేదాధ్యయనము శిల్పము వంటి వృత్తము. ఇది యొక బ్రాహ్మలక్షణమును బోధించుచున్నది. నాలుగువేదములు జదివియు సద్వృత్తిహీను నుండఁడేని యాతనివలన నేమియుఁ బ్రయోజనము లేదు. స్త్రీరత్నముచేత నపుంసకుఁ డేమిసాధించుచున్నాఁడు? శిఖాధారణము నోంకారజపమును సంస్కారములను సంధ్యోపాసనమును మేఖలాదండాజినపవిత్రప్రభృతులును నిరంకుశము లయి శూద్రులందును బ్రవర్తించుచున్నవి. శూద్రుల కధ్యయనాది ప్రసంగము నివారింప శక్యముగాదు. దేవోత్తములగు త్రిమూర్తుల నుండి గూడ నరులు స్వయముగనే మరలిపోవుచున్నారు. కావున నీపైన జెప్పిన యజ్ఞోపవీతమేఖలాసంస్కారచూళికాదులు మనుష్యులకు వైలక్షణ్యమును బోధింపఁజాలవు. ఆభిచారికమంత్రములు లోనగువాని చేత దుర్లభత్వాదిభాషణములచేతను నీశక్తి బ్రాహ్మణునకే యుండునందు రేని యద్దాని నెవ్వఁడు నశింపఁజేయఁగలఁడు? తపము సత్యము మొదలగు మాహాత్మ్యమువలన దేవతకాలము స్మరింపఁబడుచున్నవి. అట్టులే మంత్ర యుతమగుశక్తి యెల్లరకు నుండును. సర్వజనులును దుష్టవచనునియానతి గూడ ననుష్ఠించుచుఁ గనఁబడుచున్నారు. కావున శూద్రబ్రాహ్మణులు యిట్టివారని భేదము నిరూపింప నలవిగాదు. శాపానుగ్రహములు

---

షడ్భిరఙ్గైః, శిల్పం హి వేదాధ్యయనం ద్విజానాం వృత్తం స్మృతం బ్రాహ్మణలక్షణం తు. ౮. అధీత్య చతురో వేదాన్యది వృత్తే న తిష్ఠతి, న తేన క్రియతే కార్యం స్త్రీరత్నే నేవ షండకః. ౯. శిఖాప్రణవసంస్కారసంధ్యోపాసనమేఖలాః, దండాజినపవిత్రాద్యాః శూద్రేష్వపి నిరంకుశాః. ౧౦. ప్రసఙ్గోఽపి హి శూద్రాణాం న శక్యో విని వారితుమ్, దేవోత్తమత్రయేణాపి నివర్తంతే నరాః స్వయమ్. ౧౧. తస్మాన్నైతేఽపి లక్ష్యంతే విలక్షణతయా నృణామ్, యజ్ఞోపవీతసంస్కారమేఖలాచూలికాదయః. ౧౨. ఆభిచారికమంత్రాద్యైర్దుర్లభత్వాదిభాషణైః, బ్రాహ్మణస్యైవ శక్తిశ్చేత్కేనాస్య విని హన్యతే. ౧౩. తపః సత్యాదిమాహాత్మ్యాద్దేవతాసమయస్మృతిః, మంత్రశక్తిర్నృణా మేషాం సర్వేషామపి విద్యతే. ౧౪. వంచనం దుర్వచస్యాపి క్రియతే సర్వమానవైః, శూద్రబ్రాహ్మణయోస్తస్మాన్నాస్తి భేదః కథంచన. ౧౫. శాపానుగ్రహకారిత్వం శక్తి

చేయఁదగినశక్తి బ్రాహ్మణ్యమని చెప్పెదువేని యదియు యుక్తము గాదు. మనుష్యులకు దొంగలవలన విలాసముగ మాటలాడువారివలన రాజన్యుల వలన దుర్జనులు మొదలగువారివలన నభిఘాత మేర్పడినప్పుడు తనను దుఃఖమునుండి తప్పించుకొనుటకును స్వబంధువులు మొదలగువారిని రక్షించుకొనుటకుగాని శూద్రుఁ డెట్టులు సమర్థుఁడగుటలేదో యట్టులే బ్రాహ్మణుఁడు నసమర్థుఁడగుచున్నాఁడు గదా! కలియుగమున నీదేశమున నకార్యము లాచరించు బ్రాహ్మణునందు శాపానుగ్రహశక్తిలేదు. ఇతర యుగముల నన్యదేశకాలముల నతిశయితగుణోపేతులగు బ్రాహ్మణులకు శాపానుగ్రహముల సామర్థ్యముండును. ఇంకను వారికి బ్రహ్మసాధన హేతువగు నాధ్యాత్మికజ్ఞానము గూడ నుండును. అని యిట్లు కొందఱు చెప్పుచున్నారు. సంసారమున మెండగునను రాగముగలిగి యజ్ఞాన కామాద్యంధకారములచే నావృతులైనవారు కుత్సితమార్గములను గోతులలోఁ బడిపోవుచు నగ్ని కెదురై పడు మిడుతలకరణి నుంటున్నారు. శ్రుతిసాంగత్యమువలన శూద్రులకు సిద్ధింపనివిశేషజాతిధర్మ మొండు విప్రజాతులం దగపడుటలేదు. అయినను బండితులు విప్రజాతి కైదు విధములుగ భేదము నిరూపింతురు. యోనిసాధ్యమగు గర్భాధానాది సంస్కారముగానిసామగ్రీప్రభవమగుసంస్కారముగాని ద్విజసాధారణమై శూద్రులకంటె నతిశయమును బోధించునని చెప్పుచున్నారు. కాని యది యుక్తముగాదు. విప్రునందు జాతివలనగాని వేదమువలనగాని యొక విశేషము సరియగుయుక్తి లేకుండుటచే నంగీకరింపఁదగదు. శాశ్వతమగు

---

భేదో న విద్యతే, చౌరచాటాదిరాజన్యదుర్జనాభిహతే నృణామ్. ౧౬. ఆత్మదుఃఖో దయాపాయం స్వేషు జంతుషు రక్షణమ్, కర్తుం న ప్రభవేచ్ఛూద్రో బ్రాహ్మణస్తద్వదేవ హి. ౧౭. మా భూద్యుగే కలావేతద్దేశే చాకార్యకృద్ద్విజే, స్యాదన్యదేశకాలాదౌ ద్విజానామతిశాయినామ్. ౧౮. శాపానుగ్రహసామర్థ్యమన్యదాధ్యాత్మగోచరమ్, బ్రహ్మసాధనమేతద్ధి లింగం కేచిత్ప్రచక్షతే. ౧౯. సంసారారక్తచేతస్కా మోహాంధతమసావృతాః, పతంత్యున్మార్గగర్తేషు ప్రత్యగ్ని శలభా యథా. ౨౦. జాతిధర్మః స్వయం కించిద్విశేషః శ్రుతిసంగమాత్, అసిద్ధః శూద్రజాతీనాం ప్రసిద్ధో విప్రజాతిషు. ౨౧. సంస్కారో యోనిసాధ్యో వా సామగ్రీప్రభవోఽథ వా, శూద్రేభ్యోఽతిశయం ధత్తే యః సాధారణతాగుణః. ౨౨. విప్రాణాం పంచధా భేదః కల్పనీయస్తు పండితైః,

వస్తువునకు గ్రమికములు నక్రమములు నగుక్రియలు సంభవింపవు. వేద విశేషక్రియ లనుష్ఠించుట గర్భబాహ్యులయియుండు ద్విజులయెడ నిత్య మగుహేతువు గాఁజాలదు. శూద్రునిసన్నిధానమున వసించుటచే బ్రాహ్మ ణుఁడు తత్సముఁడే యగుచున్నాఁడు. వాఁడయుక్తమగు కాలయాప నము జూచుచున్నాఁడు. కావున వైదికక్రియానుష్ఠానము లేదు. మాన సికవ్యాపారపరాయణుఁడై శ్రుతియోగమున జనించువాఁడు నితరవేద ములస్వభావము నెఱుంగమి నితరుల కజ్ఞాతుఁడగుచున్నాఁడు. విశిష్ట మగు నధ్యేతలధర్మము గలిగియుండుటచే బ్రహ్మసంగతి యేర్పడునందు వేని యది కృత్రిమమగును. ఎవనియం దతిశయమున్నదో వాని కితరుల యాశ్రయము లేదుగాన నతిశయము నిరపేక్షమై బ్రాహ్మణ్యమును సాధించునందువేని యప్పుడు విప్రత్వము దృష్టరూపమని నీయభి ప్రాయమా ? లేక యదృష్టరూపమనియా ? దృష్టరూపమందువేని సర్వ జనులు దానిని జూడవలయును. లేకున్న దానికి వేఱుగతిలేదు. బ్రాహ్మణ గాత్రములందు సామగ్రి లేకుండుటచే విశేషము గోచరముగాదని భూమి దేవులుకానివారు (అబ్రాహ్మణులు) స్మరించుచున్నారు. కావున నాత్మ నిష్ఠ పుణ్యపాపములు బ్రాహ్మణ్యబోధకములని చెప్పుటయు యుక్తము గాదు. సామగ్రీవిశేషముగలిగి సద్గుణములు ననుష్ఠానములు గలిగి ద్విజు లతో సమానులగుశూద్రు లున్నారు గదా ! కావున ద్విజులకు శూద్రు లకు నంతర్నిమిత్తకముగాని బాహ్యనిమిత్తకముగాని విశేష మొండు

న జాతిజస్త్రియాజో వా విశేషో యుక్తిబాధకాత్, క్రమాక్రమక్రియాః సంతి న సనాతనవస్తునః. ౨౩. నిత్యో న హేతుర్విగతక్రియత్వాద్ధేతుర్భవేద్వేదవిశేషతః సః, స తత్సమస్తత్ప్రతిసన్నిధానాత్కాలాత్యయేక్షిత్వమయుక్తమేవ. ౨౪. స్వాంతఃశరీర వృత్తిస్థః శ్రుతియోగాదుదేతి యః, సోఽనన్యవేదవిజ్ఞాతస్వభావోఽన్యైర్న గమ్యతే. ౨౫. విశిష్టాధీతిధర్మత్వే కృత్రిమా బ్రహ్మసంగతిః, యస్యాస్త్యతిశయస్తస్య నాన్యో నాశ్రయతే యది. ౨౬. దృశ్యస్వభావం కిమభీష్టమేతద్బ్రాహ్మణ్యమాహోస్విదదృష్ట రూపమ్, సర్వైః ప్రతీయేత హి దృశ్యరూపం తతోఽన్యథావద్గతిరేవ న స్యాత్. ౨౭. సామగ్ర్యభావాత్పరమం విశేషం భూదేవగాత్రస్థమభూమిదేవాః, స్మరంతి తేనాత్మని పుణ్యపాపం యథా తథేత్యేతదయుక్తముక్తమ్. ౨౮. సామగ్ర్యనుష్ఠానగుణైః సమగ్రా శూద్రా యతః సంతి సమా ద్విజానామ్, తస్మాద్విశేషో ద్విజశూద్రనామ్నోర్నాహ్యథా

కాన్పింపదు సంస్కారములవలన నావిశేషము గలుగునందువేని యంద
అకు నతిశయితసంస్కారములవలన నాజాతి యేర్పడును. వ్యాసాదులచే
సంస్కృతుఁడై యెవఁడు విప్రగణప్రధానుఁడై యుండునో యాతనితో
సామ్యము శూద్రునకు లేకున్న నితరులతో సామ్యము గలదు గదా!
జన్మాదులు కృతకములు గాకుండుటచే నెల్లరకుఁ దుల్యములుగాన నివి
హేతువులు కాఁజాలవు. జననము కృతకము గాదు గావుననే విశేషించి
యధ్యయనము చేయుటలేదు. సమస్తమానవులయొక్క పాంచభౌతికశరీ
రమునకు విశేషవ్యవస్థాయకమయిన సంస్కారాతిశయము లేదుగాన గలిసి
యున్నప్పుడు బ్రాహ్మణత్వాబ్రాహ్మణత్వములను నిర్ణయింప వీలులేదు.
మఱియును వేదనిందకులగునాస్తికులందును మ్లేచ్ఛయవనాదిజనులందును
వేదోక్తములగుపనులకంటె వెలియగు దుష్కర్మలు చేయుదురాత్ములందును
క్రూరసాహసికాదులయందును ధర్మమువలన గొప్పతన మగపడుచున్నది.
కావున బ్రాహ్మణులయం దట్టియతిశయము జాత్యాదిసామగ్రీవిశేషముల
వలనఁ బుట్టినదిగాదు. కావున బ్రాహ్మణాబ్రాహ్మణులకు లోపలగాని,
వెలుపలగాని, విశేషకమగుభేద మించుకయు లేదు. సుఖదుఃఖములందు
గాని, యైశ్వర్యమునగాని, యాజ్ఞలయందుగాని, యభయమునందుగాని,
బలమునగాని, యాకారమునగాని, జ్ఞానమునగాని, చేష్టితమునగాని,
యాయుస్సునగాని, యవయవపుష్టియందుగాని, యవయవదౌర్బల్యమున
గాని, చిత్తస్థైర్యమునగాని, చాపలమునగాని, బుద్ధియందుగాని, వైరాగ్య

---

త్మికో బాహ్యానిమిత్తకో వా. ౨౯. సంస్కారతః సోఽతిశయో యది స్యాత్సర్వస్య
పుంసోఽస్త్యతిసంస్కృతస్య, యః సంస్కృతో విప్రగణప్రధానో వ్యాసాదికైస్తేన న
తస్య సామ్యమ్. ౩౦. హేతుత్వం ఘటతే నైషాం జాత్యాదీనామసంభవాత్, జాతే
రకృతకత్వాచ్చ అధీతే న విశేషతః. ౩౧. సంస్కారాతిశయాభావాదంతరస్యాగతే
పరైః, భౌతికత్వాచ్ఛరీరస్య సమస్తానామసంహతైః. ౩౨. కిం చాన్యనాస్తికమ్లేచ్ఛ
యవనాదిజనేష్వలమ్. ౩౩. వేదోదితబహిర్దుష్టచరితేషు దురాత్మసు, ధర్మాదతిశయో
దృష్టః క్రూరసాహసికాదిషు, తస్మాద్విప్రేషు జాత్యాదిసామగ్రీప్రభవో న సః. ౩౪.
తస్మాన్న చ విభేదోఽస్తి న బహిర్నాంతరాత్మని, న సుఖాదౌ న చైశ్వర్యే నాజ్ఞాయాం
నాభయేష్వపి. ౩౫. న వీర్యే నాకృతౌ నాక్షే న వ్యాపారే న చాయుషి, నాంగే
పుష్టే న దౌర్బల్యే న స్థైర్యే నాపి చాపలే. ౩౬. న ప్రజ్ఞాయాం న వైరాగ్యే న

మునగాని, ధర్మములందుగాని, పరాక్రమమునగాని, ధర్మార్థకామముల యెడగాని, నేర్పునందుగాని, సౌందర్యాదులందుగాని, యౌషధములందు గాని, డాంబికములందుగాని, స్త్రీగర్భమును బొందుటలోగాని, యట నుండి వెలువడుటలోగాని, దేహమలముల శోధించుకొనుటలోగాని, యస్థివారములగాని, రంధ్రములగాని, ప్రేమలోగాని, ప్రమాణమున గాని, లోమములందుగాని, శూద్ర బ్రాహ్మణులకు సర్వధర్మములందును భేదము దేవతలందఱు గూడి వెదకినను గానరాదు. ఇట్లు విచారక్రమ ముచే నేర్పఱుపఁబడిన యీవిసంవాదవాక్యమును వృద్ధులగుబృందారకా ధీశులును తిరస్కరింపఁగూడదు. బ్రాహ్మణజాతివారు చంద్రకిరణముల బోలి శుభ్రవర్ణములు గలవారుకారు. క్షత్రియులు కింశుకపుష్పసచ్ఛా యులునుగారు. ఈలోకమున వైశ్యులు హరితాళమున కెనయగువారును గారు. శూద్రులయినచో బొగ్గున కెనయగువన్నె గలవారునుకారు. పాద ప్రచారములచేతను, శరీరములచేతను, వర్ణములచేతను, వెండ్రుకల చేతను, సుఖదుఃఖములచేతను, శోణితముచేతను, చర్మముచేతను, మాంసముచేతను, మేదస్సుచేతను, నెముకలచేతను, రసములచేతను, సమానులై యుండునపుడు నాలుగుభేదము లెట్లు సిద్ధించును? వర్ణము ప్రమాణము నాకృతియు గర్భవాసము వాక్కు బుద్ధి కర్మము నింద్రియ ములు జీవితము ననువానియందును బలమునను త్రివర్గమునను రోగ ములయందు నౌషధములందును జాతికృతమగువిశేష మేదియు నగ పడుటలేదు. ప్రజలకందఱకు నుత్పాదకుఁడగు నాతఁ డొక్కఁడై యుండ

---

ధర్మే న పరాక్రమే, న త్రివర్గే న నైపుణ్యే న రూపాదౌ న భేషజే. ౩౭. న స్త్రీగర్భే న గమనే న దేహమలసంప్లవే, నాస్థిరంధ్రే న చ ప్రేమ్ణి న ప్రమాణే న లోమసు. ౩౮. శూద్రబ్రాహ్మణయోర్భేదో మృగ్యమాణోఽపి యత్నతః, నేక్ష్యతే సర్వధర్మేషు సంహతైస్త్రిదశైరపి. ౩౯. ఉక్తమాత్రా విసంభూతిర్విచారక్రమకారిభిః, వృద్ధ బృందారకాధీశైరప్రధృష్యమిదం వచః. ౪౦. న బ్రాహ్మణాశ్చంద్రమరీచిశుభ్రా న క్షత్రియాః కింశుకపుష్పవర్ణాః, న చేహ వైశ్యా హరితాలతుల్యాః శూద్రా న చాంగారసమానవర్ణాః. ౪౧. పాదప్రచారైస్తనువర్ణకేశైః సుఖేన దుఃఖేన చ శోణితేన, త్వఙ్మాంసమేదోస్థిరసైః సమానాశ్చతుష్ప్రభేదా హి కథం భవంతి. ౪౨. వర్ణప్రమాణా కృతిగర్భవాసవాగ్బుద్ధికర్మేంద్రియజీవితేషు, బలత్రివర్గామయభేషజేషు న విద్యతే జాతికృతో విశేషః. ౪౩. స ఏక ఏవాత్ర పతిః ప్రజానాం కథం పునర్జాతికృతః ప్రభేదః, ప్రమాణదృష్టాంతనయప్రవాదైః పరీక్ష్యమాణో విఘటత్వమేతి. ౪౪.

జాతికృతభేద మెట్లు సిద్ధించును? ఈవిషయమునఁ బ్రమాణములు దృష్టాంతములు న్యాయములు ప్రవాదములు గైకొని పరీక్షించినచో నాభేదము విఘటితమగును ఒకతండ్రికి నలువురుకొడుకు లున్నప్పుడా డానలు గురకు నొక్కటియేగద జాతియుండును. అట్టులే ప్రజలకందఱకుఁ దండ్రి యొక్కఁడే గదా! తండ్రియొక్కఁడగుటవలనఁ బుత్రులలో జాతిభేదము నాపాదింపరాదు. ఉదుంబరమను నొకవృక్షజాతిలో మూలమధ్యాగ్ర భాగములఁ బండ్లుండునప్పు డవియన్నియు వర్ణముచేత నాకారముచేతను స్పర్శరసములచేతను సమానము లైయున్నట్టులు ఒక్కమూలమునుండి యుత్పన్నమైనవారిలో నెదురువిచారములేక యొక్కటియేజాతి. కౌశిక గోత్రము, కాశ్యపగోత్రము, గౌతమగోత్రము, కౌండిన్యమాండవ్య వసిష్ఠగోత్రములు, నాత్రేయకౌత్సాంగిరసగోత్రములు, గర్గగోత్రము, మౌద్గల్యకాత్యాయనభార్గవగోత్రములు నీమొదలగుగోత్రములన్నియు నానావిధజాతులు భ్రాతలు, గోడండ్రు, భార్యలు, పుత్రులు మొదలు వివేకములు నివియన్నియు వివాహకర్మసముద్భవములుగాని వర్ణభేద ములుగావు. ఇవియన్నియు భేదభావముగలవారిశిల్పములు. ఇంక నితరు లగుపండితమానవులు దేవతలు బ్రాహ్మణులు నని యతిశయము వర్ణించు చున్నారు. అయ్యది వారిదృష్టిదోషజనితమగు నజ్ఞానాంధకారముగాని తథ్యముగాదు. ఆయజ్ఞానమును దొలఁగించి దయగలిగి తుదకు గొప్ప సుఖముగూర్పగల దివ్యౌషధములచేతను న్యాయాంజనములచేతను సంస్కరించి ప్రయత్నపూర్వకముగ మంచిదృష్టిగలవారినిగా జేయుదము. మూర్తిమత్తులగుపదార్థములన్నియు నశ్వరములు నశ్వరములగుటవలన

---

చత్వార ఏకస్య పితుః సుతాశ్చ తేషాం సుతానాం ఖలు జాతిరేకా, ఏవం ప్రజానాం హి పితైక ఏవ పిత్రైకభావాన్న చ జాతిభేదః. ౪౫. ఫలాన్యథోదుంబరవృక్షజాతే ర్యథాగ్రమధ్యాంతభవాని యాని, వర్ణాకృతిస్పర్శరసైః సమాని, తథైకతో జాతిరతి ప్రచింత్యా. ౪౬. యే కౌశికాః కాశ్యపగౌతమాశ్చ కౌండిన్యమాండవ్యవశిష్ఠగోత్రాః, ఆత్రేయకౌత్సాంగిరసః సగర్గా మౌద్గల్యకాత్యాయనభార్గవాశ్చ. ౪౭. గోత్రాణి నానా విధజాతయశ్చ భ్రాతృస్నుషామైథునపుత్రభావాః, వైవాహికం కర్మ న వర్ణభేదాః సర్వాణి శిల్పాని భవంతి తేషామ్. ౪౮. యే చాన్యే పండితాః ప్రాహుర్దేవాబ్రాహ్మ ణతాం నరాః, తేషాం దుర్దృష్టితిమిరమపనీయానుకంప్య చ. ౪౯. న్యాయాంజనౌషధై ర్దివ్యైః పరిణామసుఖావహైః, ఉపనీతైః ప్రయత్నేన సుదృష్టిం సంవిదద్మహే. ౫౦. మూర్తిమత్త్వాచ్చ నాశిత్వం నాశిత్వాచ్ఛేషభూతవత్, దేహాధారనివిష్టానాం బ్రహ్మణ్యం

మిగిలినభూతజాతములవలె దేహమను నాధారమునఁ బ్రవేశించియుండురు. అట్టియెడ బ్రాహ్మణ్యమును గల్పింప వీలులేదు. ఆభూతములలో నొక్కొక్కయవయవము బ్రాహ్మణ్యమును బొందుట లేదు. అనేకములగు నవయవములందును బ్రాహ్మణ్యమున్నదంటకు వీలులేదు. ఎటు చెప్పినను పంచభూతపరిణామము తుల్యమైయుండుటచేత నతిప్రసంగము గలుగను. దేహమువలన బ్రాహ్మణత్వము సర్వభూతములకును సమానముగనే సిద్ధించును. యథార్థమెఱుఁగనికొందఱు దేహమునకే బ్రాహ్మణత్వము జెప్పుచున్నారు. అట్టివారికి శరీరసంస్కారమువలన బ్రాహ్మణత్వమెట్లు సిద్ధించును. ప్రయత్నించి యన్వేషించినను దేహమునందు బ్రాహ్మణత్వము కనుపడుటలేదే. కావున దేహమున బ్రాహ్మణత్వములేదు. దేహమును బ్రాహ్మణ్యము గాఁజాలదు. దేహమునకే విప్రత్వము జెప్పుదురేని వర్ణదూషితులు చండాలురు శునకభుక్కులు మొదలగువారికిఁ గూడ బ్రాహ్మణత్వము తప్పక యంగీకరించినవారగుదురు. దేహమునందలి శక్తిగుణములు క్షీణించినపుడు కాయము భస్మాదిరూపమునుజెందుట యందరియందును దుల్యమే. కావున బ్రాహ్మణ్యము దేహాత్మకమునందు లేదు. మఱియు నయ్యది కర్మజనితమును గాదు.

ఇది యేకచత్వారింశాధ్యాయము.

---

న ప్రకల్ప్యతే. ౧౦. ఏకైకోవయవస్తేషాం న బ్రాహ్మణ్యం సమశ్నుతే, న చానేకసమూహేఽపి సర్వథాతిప్రసంగతః. ౧౨. పృథివ్యుదకవాయ్వగ్నిపరిణామావిశేషతః, దేహతః సర్వభూతానాం బ్రాహ్మణత్వప్రసంగతః. ౧౩. దేహస్య బ్రాహ్మణత్వం యైరతత్త్వజ్ఞైః ప్రకల్ప్యతే, సంస్కర్తౄణాం శరీరస్య తేషాం న బ్రహ్మతా భవేత్. ౧౪.

మృగ్యమాణే ప్రయత్నేన దేహే తన్నోపలభ్యతే, తస్మాన్న దేహే బ్రాహ్మణ్యం నాపి దేహాత్మకం భవేత్. ౧౫. వర్ణాపసదచాండాలశ్వాదాదీనాం ప్రసజ్యతే, యది దేహస్య విప్రత్వం భవద్భిరుపగమ్యతే. ౧౬. దేహాశక్తిగుణైః క్షీణైః కాయభస్మాదిరూపవత్, తస్మాద్దేహాత్మకే నైతద్బ్రాహ్మణ్యం నాపి కర్మజమ్. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం

బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే బ్రాహ్మణ్యవివేకవర్ణనం నామ

ఏకచత్వారింశోఽధ్యాయః.

## ద్విచత్వారింశాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె. మఱియు నిచ్చట మఱి కొందఱు సదాచార యుక్తులు స్థిరచిత్తులు మహాసత్త్వులు నగు విద్వాంసులు చెప్పిన సుభాషితములుగల వాలకింపుఁడు. వారు నానావిధములగు వనస్పతులను శంఖములను జీమలను దుమ్మెదలను వారణములు మొదలగుజాతుల నుదాహరించి సంసారగతులందుఁ గర్మప్రమితుఁడై జంతువు దివ్యమగు జ్ఞానము నొందఁజాలక నటునివలె భ్రమించుచుండు ననిరి. రూపైశ్వర్యములచేతను జ్ఞానకులములచేతను, విభవములచేతను భ్రమితుఁడవై ధర్మపథమును విడుతువేని భువనములఁ బొందుచు నాత్మగృహమగుశరీరము భస్మమైన వెనుక నేమగుదువో నేఁజెప్పఁజాలను. జాతి కులము రూపము వయస్సు వర్ణము బహుపాండిత్యము మున్నగువానివలని మదముచే నంధులైన క్లీబులు ఇహపరములందు హితమైనయర్థము గనుఁగొనఁజాలక యున్నవారు. ఈసంసారచక్రమునందుఁ గోటిశతసహస్రజన్మములందు హీనోత్తమమధ్యమత్వముల నెఱింగినవిద్వద్వరులు జాతిమదము నుంచుకొనరు. మానవులు తమతమ కర్మవశమున నింద్రియ నివృత్తిపూర్వకములగు నానాజాతులను బొందుచున్నారు. ఇందెవరికి శాశ్వతమగు నొక్కజాతి గలదు? పండితులసభలోఁ గూరుచొని యెవ్వఁడేని సంస్కారములచే బ్రాహ్మణత్వముఁబొందితినని చెప్పునేని న్యాయవేత్తలు న్యాయానుసారములగు వాక్యములచేత నాతనిని నిరాకరించుచున్నారు. గర్భాధానము,

---

బ్రహ్మోవాచ.—అపరైశ్చ సదాచారయోగయుక్తైర్మనీషిభిః, యదకారి మహాసత్త్వైః సుభాషితమిదం శృణు. ౧. బహువనస్పతిశంఖపిపీలికాభ్రమరవారణజాతిముదాహరన్, గతిషు కర్మమితో నటవత్సదా భ్రమతి జంతురలబ్ధసుదర్శనః. ౨. రూపైశ్వర్యజ్ఞానకులైర్విభవైర్వర్మితో భూత్వా ధర్మపథం చేద్విజహాసి, న వక్ష్యే ప్రజన్మభవనాని త్వమటిష్యం స్తస్మాదభిభస్మీభూతే మద ఆత్మనః. ౩. జాతికులరూపవయోవర్ణానేకశ్రుతమదాంధాః క్లీబాః, పరత్ర చేహ చ హితమప్యర్థం న పశ్యంతి. ౪. జ్ఞాత్వా భవపరివర్తే జాతీనాం కోటిశతసహస్రేషు, హీనోత్తమమధ్యత్వం కో జాతిమదం బుధః కుర్యాత్. ౫. నైకాజ్జాతివిశేషానింద్రియనివృత్తిపూర్వకాన్సర్వాన్, కర్మవశాద్గచ్ఛత్యత్ర కస్యైకా శాశ్వతీ జాతిః. ౬. విద్వత్సదసి యోప్యాహ సంస్కారాద్బ్రాహ్మణో భవన్, న్యాయజ్ఞైః స నిరాకార్యో వాక్యైర్న్యాయానుసారిభిః. ౭. గర్భాధానం

పుంసవనము, సీమంతము, జాతకర్మ నామకరణములు, నన్నప్రాశనము, శిఖాకరణము, నుపనయనము, వ్రతాదేశనము, సమావర్తనము, పాణిగ్రహణము, నితరము నీమొదలగు సంస్కారములచే నతిసంస్కృతులయి ఎవరుందురో యెవ్వరి కెడతెగని కోరుక్కలుండునో వారే బ్రాహ్మణులు. ఎందువలనఁ గృతసంస్కారులగు బ్రాహ్మణులచే బ్రాహ్మణులు జనించిరో వారును బ్రాహ్మణు లగుదురందువేని వారియం దాయుఃశక్తులుగాని కాంత్యాదులుగాని విశేషము స్పష్టముగఁ గాన్పించుటలేదు. బ్రాహ్మణమగుగాత్రమునుండి యుద్భవించిన సంస్కృతాసంస్కృతదేహులు నిష్టప్రాప్త్యనిష్టానాప్తులలో నొండొరులు భేదించుటలేదు. సంస్కారము లున్నను జ్ఞానము నధ్యయనము విమర్శనము నియమములు నింద్రియ నిగ్రహమును లేకున్నచో నాతనికి శూద్రునికి భేదము లేదు. ఆచేయఁబడుసంస్కారము శూద్రునందుఁ జేయఁబడుటలేదు. సంస్కృతాంగుఁడు పాపములనుండి నివర్తించినట్లు కనుపించుటలేదు. విలాసినీయువతులమాదిరి భుజంగములవలె మదవిహ్వలులై సదాచారమునుండి వ్యామోహమును బొంది బ్రాహ్మణ్యమునుండి పతితులగుచున్నారు. సంస్కరింపఁబడియు దురాచారముగలవాఁడు నరకమునొందుచున్నాఁడు. సంస్కారములేకున్నను సదాచారుఁడు సర్వకాలముల విప్రోత్తముఁడే యగును. మంత్రపూతుఁడై శరీరసంస్కారములు బడసియున్నను తరు

---

పుంసవనం సీమంతోన్నయనం తథా, జాతకర్మ నామకర్మ తథాన్నప్రాశనం చ వై. ౮. చూడోపనయనం చాస్య వ్రతాదేశస్తథైవ చ, సమావర్తనమప్యన్యత్పాణిగ్రహణమేవ చ. ౯. ఇత్యేవమాదిసంస్కారవిధానై ర్యేతిసంస్కృతాః, త ఏవ బ్రాహ్మణాయేషాం నైరంతర్యేణ కామనాః. ౧౦. యస్మాద్వై బ్రాహ్మణా జాతా బ్రాహ్మణైః కృతసంస్కృతైః, నాయుః శక్తిర్హి కాంత్యాదివిశేషో విద్యతే స్ఫుటః. ౧౧. తౌ వా బ్రాహ్మణగాత్రోత్థౌ సంస్కృతాసంస్కృతౌ నరౌ, ఇష్టానిష్టాప్త్యనాప్తిభ్యాం న భిద్యేతే పరస్పరమ్. ౧౨. జ్ఞానాధ్యయనమీమాంసానియమేంద్రియనిగ్రహైః, వినాసంస్కారయోగేఽపి పుంసః శూద్రాన్న భిన్నతా. ౧౩. సంస్కారః క్రియమాణశ్చ న శూద్రే చ ప్రవర్తతే, సంస్కృతాంగశ్చ పాపేభ్యో న పశ్యతి నివర్తతే. ౧౪. విలాసినీభుజంగాదిజనవన్మదవిహ్వలాః, వ్యాముహ్యంతి సదాచారాద్బ్రాహ్మణత్వాత్పతంతి చ. ౧౫. సంస్కృతోఽపి దురాచారో నరకం యాతి మానవః, నిఃసంస్కారః సదాచారో భవేద్విప్రోత్తమః సదా. ౧౬. మంత్రపూతాత్మసంస్కారయుక్తోఽపి ప్లవతే న తు,

వాత దుశ్చారిత్రముగలమానవుఁడు నిర్వికల్పముగ బ్రాహ్మణత్వమునుండి చ్యుతుఁడగును. దురనుష్ఠానపరులగు పురుషులకు దురనుష్ఠానబలముననే పతనము గలుగుచున్నది. కావున బ్రాహ్మణ్యమునుండి నిశ్చయముగ విముక్తుఁడగును. పురుషపుంగవులెందైననీవిషయము నీక్షించియున్నారా? స్పర్ధ యున్నంతమాత్రమున నీయత్యయము యుక్తమా? అప్పు డదృష్టము నందఱకుఁ దుల్యముగఁజేయ నుత్సహింతువా? చెప్పుము. సదాచారము ననుష్ఠించు వ్యాసాదిమహామునులు గర్భాధానాది సంస్కారకలాపములు లేనివారేకదా! కొందఱు సర్వలోకనమస్కృతులై లక్ష్మీసంపన్నులై విప్రోత్తములై చాలమందిచేఁ గీర్తింపఁబడుచున్నారు. వారిని తెలిసికొనుఁడు. మహనీయుఁడగు వ్యాసుఁడు కైవర్తి(పల్లెజాతిది)కి జనించెను. పరాశరుఁడు కుక్క మాంసము వండుదానికి జనించెను. శుకయోగి చిలుకకు జనించెను. కణాదముని గుడ్లగూబకు సుతుఁడయ్యెను. ఋష్యశృంగుఁడు మృగీగర్భమున జనించెను. వసిష్ఠుఁడు వేశ్యాపుత్రుఁడయ్యెను. మందపాలుఁ డను మునిశ్రేష్ఠుఁడు పడవ నడుపుదాని పుత్రుఁడయ్యెను. (లావిక యని పాఠాంతరము పక్షివిశేషమువలనఁ బుట్టెను.) మాండవ్యుఁడనుమునిరాజు కప్పయందు జనించెను. ఇంకను బెక్కురు వెనుకఁ జెప్పినచొప్పున విప్రత్వమును బొందియున్నారు. ఈవచనము రమ్యమగు చరిత్రములచే నర్చింపఁదగియున్నది. దీనినంత నాలోచించి యుత్తమాచారము జేయువాఁడు నాయాచారముచే వృద్ధిబొందిన తేజము గలిగియుండును. హరిణీగర్భ

---

బ్రాహ్మణ్యాదవికల్పం స పశ్చాద్దుశ్చరితో నరః. ౧౭. సామర్థ్యాత్పతనం తస్మాద్బ్రాహ్మణ్యాన్మచ్యతే ధ్రువమ్, దురనుష్ఠానసక్తానాం పుంసాం పురుషపుంగవైః. ౧౮. కిం క్వచిద్దృష్టమేవైతత్కిం వా స్పర్ధావిదత్యయమ్, తుల్యముత్సహసే కర్తుమప్యదృష్టం తదా వద. ౧౯. ఆచారమనుతిష్ఠంతో వ్యాసాదిమునిసత్తమాః, గర్భాధానాదిసంస్కారకలాపరహితాః స్ఫుటమ్. ౨౦. విప్రోత్తమాః శ్రియం ప్రాప్తాః సర్వలోకనమస్కృతాః, బహవః కథ్యమానా యే కతిచిత్తాన్నిబోధత. ౨౧. జాతో వ్యాసస్తు కైవర్త్యాః శ్వపాక్యాశ్చ పరాశరః, శుక్యాః శుకః కణాదాఖ్యస్తథోలూక్యాః సుతోఽభవత్. ౨౨. మృగీజోఽథర్శ్యశృంగోఽపి వసిష్ఠో గణికాత్మజః, మందపాలో మునిశ్రేష్ఠో నావికాపత్యముచ్యతే. ౨౩. మాండవ్యో మునిరాజస్తు మండూకీగర్భసంభవః, బహవోఽన్యేఽపి విప్రత్వం ప్రాప్తా యే పూర్వవద్ద్విజాః. ౨౪. యచ్చైతచ్చారుచరితైరర్చ్యముచ్చరితం

మునఁ బుట్టినబుష్యశృంగుఁడను మునీంద్రుఁడు తపస్సుచేత బ్రాహ్మణుఁ డాయెను. కావున సంస్కారమే బ్రాహ్మణత్వమునకుఁగారణము. శ్వపాకీగర్భ సంభూతుఁడును వ్యాసునితండ్రియు నగుపరాశరుఁడు తపముచే బ్రాహ్మణుఁ డయ్యెను. కాన సంస్కారము బ్రాహ్మణ్యమునకుఁ గారణము. ఉలూకీగర్భ సంభవుఁ డగుకణాదుఁడనుమహాముని తపస్సుచే బ్రాహ్మణుఁడయ్యెను. కాన సంస్కారమే కారణము. గణికాగర్భసంభవుఁడగు వసిష్ఠుఁడు తపస్సుచే బ్రాహ్మణుఁడయ్యెను. కావున సంస్కారమే కారణము. నావికాగర్భసంభూ తుఁడగు మందపాలమహాముని తపస్సుచే బ్రాహ్మణుఁడయ్యెను. అందుచే సంస్కారమే కారణము. వేదములచేతను శాస్త్రములచేతను నుత్పన్నము లైన సంస్కారకలాపములందు నిపుణులగువారును విద్యాతపోధనముల బలముచే నుత్కృష్టఫలమును గాంచుచున్నారు. దేహసంస్కారము లన్నియుఁ గలిగియున్నను మనుజులు మహాపాతకు లైయున్నచో వారి నుండి బ్రహ్మత్వము తొలఁగిపోవుచున్నది. కావున బ్రాహ్మణ్య మనునది సాంకేతికముగాని యనాదియై నిత్యముగాదు. అని విద్వాంసులు తెలుసు కొనుచున్నారు.

ఇది ద్విచత్వారింశాధ్యాయము.

---

వచః, తద్విచార్యాచరన్నుచ్చైరాచారోపచితద్యుతిః. ౨౫. హరిణీగర్భసంభూత ఋష్య శృంగో మహామునిః, తపసా బ్రాహ్మణో జాతః సంస్కారస్తేన కారణమ్. ౨౬. శ్వపాకీ గర్భసంభూతః పితా వ్యాసస్య పార్థివ, తపసా బ్రాహ్మణో జాతః సంస్కారస్తేన కార ణమ్. ౨౭. ఉలూకీగర్భసంభూతః కణాదాఖ్యో మహామునిః, తపసా బ్రాహ్మణో జాతః సంస్కారస్తేన కారణమ్. ౨౮. గణికాగర్భసంభూతో వసిష్ఠశ్చ మహామునిః, తపసా బ్రాహ్మణో జాతః సంస్కారస్తేన కారణమ్ ౨౯. నావికాగర్భసంభూతో మందపాలో మహామునిః, తపసా బ్రాహ్మణో జాతః సంస్కారస్తేన కారణమ్. ౩౦. వేదతంత్రజ సంస్కారకలాపనిపుణైరపి, విద్యాతపోధనబలాదుత్కృష్టం లభ్యతే ఫలమ్. ౩౧. లబ్ధ సంస్కారదేహాశ్చ మహాపాతకినో నరాః, యస్మాన్నివర్తతే బ్రహ్మ తస్మాత్సాంకేతికం విదుః. ౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే బ్రాహ్మణ్యసంస్కారవివేకవర్ణనం నామ ద్విచత్వారింశోఽధ్యాయః.

## త్రిచత్వారింశాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె—మఱియు నోమహాజనులారా! వేదమంత్రవిదులగు మిమ్మొకవిషయ మడుగఁదలఁచితిని. సంస్కార మెవరికిఁ జేయవలయునని మీర లంగీకరింత్రు. దేహమునకా? లేకున్న దేనివలన నీస్వభావమలినము శుక్రశోణితములచేఁ బుట్టునదియుఁ బురీషోత్పన్నకీటతుల్యము నగుశరీరము గలుగుచున్నదో దానికా? నిషేకము మొదలు శ్మశానము వఱకునుండు నానావిధవిధులచే దేహియగునాత్మ యం దతిశయముగలుగుచున్నదని కొందఱంగీకరించుచున్నారు. వారు రహస్యములగు మనోవాక్కాయజములగుదుష్టచేష్టితములచేతను సుచేష్టితములచేతను ననిబద్ధసర్వేంద్రియులై యుండిరి. అట్టివారియభిప్రాయమును నేనిదె దూషించుచున్నాను. వేదమునఁ జెప్పిన సకలసంస్కారములు బొంది తత్సారమోయనఁనొప్పు ద్విజన్ములు సమస్తకార్యకరులకన్నను సద్వశూద్రులకన్న నధికులయినఁ గాజనును. క్రూరకర్మము లాచరించువాఁడును, విరుద్ధనిషిద్ధకర్మలనున్నవారును, బ్రహ్మహత్య నొనరించినవారును, గురుభార్యాగమన మొనర్చినవారును, దొంగతన మొనరించినవారును, గోవధ మొనరించినవారును కల్లుద్రావినవారును, పరవనితాక్రీడనాసక్తులును,నసత్యవచనశీలురును,మదపిచ్చియెత్తినవారును,నాస్తికులును,వేదములు నిందించువారును, గ్రామమునకు యాజకులును, గ్రంథము లెఱుంగనివారును, పెక్కుదోషములు గలవారును, దరిజేరరానివారును, నిషిద్ధాచారముల నెల్లప్పుడు సేవించుచుండువారును, రహస్యముగ దొంగిలించువారును,

---

బ్రహ్మోవాచ.—కిం చాన్యదపరం యూయం వేదమంత్రవిదో జనాః, ప్రష్టవ్యా కస్య సంస్కారే విశేషముపగచ్ఛత. ౧. కిం దేహస్యోత యేనాసౌ నిసర్గమలినః స్థితః, శుక్రశోణితసంభూతః శమలోద్భవకీటవత్. ౨. నిషేకాదిశ్మశానాంతైర్వివిధైర్విధివిస్తరైః, దేహినోఽతిశయం కేచిదుపగచ్ఛంతి మానవాః. ౩. తేషాం గూఢమనః కాయవాగ్విదుష్టైః సుచేష్టితైః, అసంయతమనుష్యాణాం పక్షోఽయం దూష్యతే మయా. ౪. వైదికాఖిలసంస్కారసారభూతా ద్విజాతయః, సర్వకార్యకరాన్సర్వాన్వృషలానతిశేరతే. ౫. చండకర్మా వికర్మస్థో బ్రహ్మహా గురుతల్పగః, స్తేనో గోఘ్నః సురాపాణః పరస్త్రీరమణప్రియః. ౬. మిథ్యావాదీ మదోన్మత్తో నాస్తికో వేదనిందకః, గ్రామయాజకనిర్గ్రంథా బహుదోషా దురాసదః. ౭. నిషిద్ధాచారసంసేవీ చోరశ్చాటో

చాటులును, మదించినవారును, ధూర్తులును నటులును శఠులును పాప కార్యములుజేయువారును, నిషిద్ధములు గూడ భుజించువారు, నన్నివస్తువులు విక్రయించువారును, దుష్టములగు వాక్కాయమనోవ్యాపారములచేఁ దినస్కృతులైనవారును నగుబ్రాహ్మణాధములు నూరులకొలఁది యజ్ఞము లనుష్ఠించినను నీలోకమున శుద్ధిబొందనేరరు. జన్మస్వభావముచేతనే శూద్రుల కేయనిష్టములు గలుగునో యవి యన్నియు నిరాటంకముగ బ్రాహ్మణులకుఁ గూడ నున్నవి గదా! కావున మంత్రము గాని యగ్నిహోత్రముగాని యజ్ఞవేదికపైఁ బశువులను వధించుటగాని బ్రాహ్మణత్వమునందు హేతువులు గాఁజాలవు శూద్రులుగూడ నాకర్మలు చేయుటకు సమర్థులే కద! మఱియు నెవ్వరు కర్మపాశములఁ గట్టుపడి బాధపడుచున్నారో సంసారమను ననలముచేఁ గాల్పఁబడి వివశముగఁ జేయఁబడిన చిత్తములుగలవారై యుండువారో వారలందఱు జననమరణములను నరణ్యములో సుఖమనునమృతము గ్రోల నెంచి యొకనీచు నాశ్రయించి తిరుగుచు నొకప్పుడేని సంతోషమును బొందుటలేదు. చతుర్వర్ణులగు నేనరులుగలరో యాయావీర్యములవలన నుద్భవించినయా నరాధములకన్నిట నన్నిభంగుల నెల్లధర్మములచేతను సాంకర్యమునొందుచున్నారు. పుట్టువునందు శూద్రవిప్రాదు లొండొరులు భేదించుటలేదు. అన్నిధర్మములు నందఱకును సమానములై యుండుటచే సంస్కారములు నిష్ప్రయోజనములగును. ఆసంస్కారములు సరియగువిధానమునఁ జేయక యున్నను బంధ్వాదివియోగమరణాదులందును నితరములగు నకార్యా

---

మదోద్ధతః, ధూర్తో నటః శఠః పాపీ సర్వాశీ సర్వవిక్రయీ. ౮. వాఙ్మనః కాయజైర్దుష్టైర్హతా యే బ్రాహ్మణాధమాః, తే న శుద్ధిం ప్రజంతీహ అపి యజ్ఞశతైరపి. ౯. శూద్రాణాం యాన్యనిష్టాని సంపద్యంతే స్వభావతః, విప్రాణామపి తాన్యేవ నిర్విఘ్నాని భవంతి న. ౧౦. తస్మాన్మంత్రోఽగ్నిహోత్రం వా వేద్యాం పశువధోఽపి వా, హేతవో నహి విప్రత్వే శూద్రైః శక్యా క్రియా యథా. ౧౧. యే చాపి కర్మబంధేన బద్ధాః సీదంతి జంతవః, సంసారానలసంతాపవిక్లబీకృతమానసాః. ౧౨. తే జన్మమరణాటవ్యాం సుఖామృతపిపాసవః, కృపణస్యాశ్రయేఽటంతో లభంతే నైవ నిర్వృతిమ్. ౧౩. చతుర్వర్ణా నరా యే తు తత్తద్వీర్యే నరాధమాః, తేషాం సర్వాత్మనా సర్వైర్ధర్మైః సాంకర్యమిష్యతే. ౧౪. శూద్రవిప్రాదయో యోనౌ న భిద్యంతే పరస్పరమ్, సర్వధర్మసమానత్వాత్సంస్కారాది నిరర్థకమ్. ౧౫. తదనుష్ఠానవైధర్మ్యవియోగమరణాదిభిః,

చరణములందును శూద్రబ్రాహ్మణులు సమానులే యగుచున్నారు. జ్ఞానము చేతను, శక్తిచేతను, స్వభావముచేతను, ధర్మములచేతను, జాతి మొదలగువానిచేతను, సంపదలచేతను, పుణ్యపాపములకు సంబంధించిన పనులచేతను, సర్వశరీరముననున్న శల్యములచేతను, బంధనములచేతను, నిరోధములచేతను, నానావిధములగు యాతనాసాధనములవలని పీడల చేతను, శిక్షలచేతను, వానివలనిదుఃఖములచేతను, రోదనములచేతను, దండింపకుండుటచేతను, సత్త్వగుణసంభవములగు ప్రీతిధర్మాదులచేతను, రాజసములగుచిత్రవేషవస్త్రాదులచేతను, తమోగుణసంజాతములగు తాప మోహాదులచేతను మాటికిమాటికిఁ బరితపించువారును మహాబీభత్స ములగు వాతపిత్తశ్లేష్మాదులచేఁ గొన్నిచోట్లవృత్తియు మఱికొన్నియెడల నివృత్తియుఁ గలిగియుండుటచేతను, సత్యానృతములచేతను, హితాహిత ములచేతను, నాభరణముల నుపయోగించుటచేతను, మన్మథాదిచేష్టల చేతను, ధనమురావలె ననునాసచేఁ జేయు ననేకజంతుసంఘాతములఁ బడవేయుటలచేతను, నానావిధములగు కోర్కులచేతను, గార్యసిద్ధికి గతిగాంచుచున్నారు. తనవారియెడల స్నేహముచేతను, బరులయందలి ద్వేషముచేతను, సంపాదించినద్రవ్యముల రక్షించుకొనుటలచేతను; మిక్కిలి బలిసియుండుటచేతను, సంక్షోభముచేతను, మిక్కిలిగ దుమ్ముట చేతను, క్షీణించి యుండుటచేతను, సహనముచేతను, రోగముల చేతను బాధించు నుపాయములు చాడీలు చెప్పుస్వభావములు లేకుం డుటచేతను, శాంతిచేతను, నశ్లే యప్రశస్తానుష్ఠానములచేతను, నాపదల

---

అసేవ్యసేవనైరన్యైః శూద్రవిప్రాదయః సమాః. ౧౬. బుద్ధ్యా శక్త్యా స్వభావేన ధర్మైర్జాత్యాదిభిః శ్రియా, కర్తవ్యైః పుణ్యపాపాభ్యాం శస్త్రైః సర్వశరీరగైః. ౧౭. బంధనై రోధనైర్నానాయాతనోపాయపీడనైః, దణ్డైరదణ్డకరణైర్విషాదపరివేదనైః. ౧౮. సాత్త్వికైః ప్రీతిధర్మాద్యై రాజసైశ్చిత్రవేష్టితైః, తామసైస్తాపమోహాద్యై ర్ధూయమానాః పునః పునః. ౧౯. శ్లేష్మమారుతపిత్తాద్యైర్మహాబీభత్సదర్శనైః, క్వచి ద్వృత్తినివృత్తిభ్యామృతానృతహితాహితైః. ౨౦. అలంకారోపయోగేన మన్మథా ద్యైర్విచేష్టితైః, ధనలాభాశయానైకజంతుసంఘాతపాతనైః. ౨౧. అధిసిద్ధిగతిం యాతి నానావిధమనోరథైః, ఆత్మస్నేహపరద్వేషస్వీకృతద్రవ్యరక్షణైః. ౨౨. అతిక్షీబత్వ సంక్షోభక్షుతక్షామక్షమామయైః, ఘాతనోపాయపైశున్యశూన్యతోపశమైస్తథా. ౨౩.

చెంతనుండుట యందఱకును సమానమే. హింసయొనర్చువారును, పాపములు నసత్యము లగుమాటలు మాటాడువారును, సజ్జనుల నిందించువారును, ప్రత్యక్షముగా దొంగతనముచేయువారును, దయలేనివారును, పరదారపరాయణులును, నీచకర్మల లెస్సగ నాచరించువారును, పిశాచములవలె నెల్లవస్తువులు దినువారును, దుష్టకులములఁ బుట్టినట్టివారును, దురాచారముగలవారును, రాజుల నాశ్రయించి బ్రదుకువారును, బ్రాహ్మణకార్యముల నుండువారును, వికర్మలనుండువారును, ధనవంతులును, దుష్టబుద్ధిగలవారును, వేఁటకాండ్రు వనమున మృగములవధించి వసించుపగిది వనమున వసించి వానిని భక్షించువారును, చాడీలు చెప్పువారును, పెక్కురు క్రియలుచేయించుటకై వేదవాదములు పఠించువారును, ప్రాణివధములను గీర్తించువారును, కపటములచేఁ గార్యములు పోషించుకొనువారును, వేదవిక్రయ మొనరించునధములును, మాయావులును, ద్వేషపిశాచగ్రస్తులును, లుబ్ధులు మూఢులు మదమత్తులు చాటులు కార్పటికులు క్రూరులు నింద్యులు కలహప్రియులు వాచాటులు దుష్టకులములఁ జరించువారును, దాసులతోఁ దిరుగువారును, భండమాన్యులును, పటాటోపములచేతను భటాటోపములచేతను మిక్కిలి కోపించువారును, బాగుగా దోపిడిచేయువారును, నూరకదిరుగువారును, భటవృత్తిని జీవించువారును, స్తుతిపాఠములు చేయువారును, విక్రయింపఁదగనివాని నన్నింటిని విక్రయించువారును, తినరానివస్తువులు దినువారును, శూద్ర

---

అప్రశస్తైరనుష్ఠానైః సమీపస్థాపదః సమాః, హింసకాః ప్రాణినః పాపవితథాలాపభాషిణః. ౨౪. సాధూనాం భాషకాః స్తేనా నిర్దయాః పారదారికాః, నీచకర్మసమాచారాః సర్వభక్షాః పిశాచవత్. ౨౫. దుష్కులీనా దురాచారా నృపాణాముపజీవినః, విప్రకార్యా వికర్మస్థా ధనినో దుష్టచేతసః. ౨౬. లుబ్ధకా హరిణాన్హత్వా వాసం కృత్వా యథా వనే, తథా ఖాదంతి పిశునా బహవశ్చ క్రియావశాత్. ౨౭. వేదవాదమధీయానాః ప్రాణిఘాతాభిశంసినః, పుష్ణంతి కపటైరర్థాన్వేదవిక్రయిణోఽధమాః. ౨౮. మాయినో మత్సరగ్రస్తా లుబ్ధా ముగ్ధా మదోద్ధతాః, చాటాః కార్పటికాః క్రూరాః కదర్యాః కలహప్రియాః. ౨౯. వాచాటా దుష్టకులటా అటన్తో భాటకైః సహ, భండమాన్యా భటాటోపైః సంక్రుద్ధాః సువిలుంఠకాః. ౩౦. పర్యటా భాటకా జీవాః కట్టకశ్లోకభాషిణః, విక్రీణతే హ్యవిక్రేయమభక్ష్యద్రవ్యభక్షిణః. ౩౧. శూద్రకర్మాను

కర్మలుచేయువారును, తపముజేయని నరాధములును, సేవకవృత్తినుండు వారును, నధ్యాపకవృత్తి నుండువారును, వాణిజ్యముచేయువారును, వ్యవసాయము మొదలగుపనులు చేయువారును, కర్మబాహ్యులనుండి ద్రవ్యములు ధనధాన్యములు మొదలగుసంపదలకై కొనువారును, కోపావేశముచేత మానసికములగు కామాదిదోషములను దుష్టాభిలషితములను విడువనివారు, విశిష్టులగుమానవులకు గేశసంస్కారాదు లొనరించు శ్రేష్ఠులును, తీసికొనదగని వస్త్రాదులనెల్లప్పుడు దీసికొనుద్విజులును, విడువదగినవస్తువులు మొదలగువానిని విడువనివారు నీలోకమునఁ బూజనీయు లెట్లగుదురు. దండధరులును, డిండికులును, భండులును, చండాలచేష్టలు జేయుచుండులును, వైతండికులు నగుమానవులు సింహములు మృగములను బశువులను వధించినట్లు వధించుచున్నారు. గ్రంథవాసనలేని మునిని గాంచి యాతఁడు గొప్పవాఁడని తలంచుచు నాతని బరివేష్ఠించి యుండువారు శూన్యహృదయులు నాత్మవైరులు నగుటచే నిందింపఁదగియున్నారు. కావున సంసారులగుజీవులందఱు చెడుశీలములచేతను చెడుమనస్సులచేతను నింక నీమొదలగువానిచేతను సమానమగుబంధన మందఱకు నుండుటచే నందఱును జిత్తక్లేశములచేఁ గళంకితు లగుచున్నారు. బ్రాహ్మణుఁడు మైథునమునకై యనురాగముగల శూద్రయువతిని బ్రేమించుచున్నాఁడు. అదియు మదనసంతాపనాశకమగు సంగమము గలిగినతోడనే గర్భము దాల్చుచున్నది. కామాతురలై యున్నచో

---

తిష్ఠంతో నిస్తపాస్తే నరాధమాః, సేవాధ్యాపనవాణిజ్యకృష్యాద్యారంభలంభితాః, గృహ్ణంతః సంపదో బాహ్యద్రవ్యధాన్యధనాదికాః. ౩౨. క్రోధాదాభ్యంతరాన్దోషాం స్తథా దుష్టమనోరథాన్, అత్యజంతో విశిష్టానాం శ్రేష్ఠాస్తే కచమర్దినః. ౩౩. నోపాదేయాని వస్త్రాణి నిత్యమాదదతే ద్విజాః, హాపయంతి న హేయాని కథం తే గురవః క్షితౌ. ౩౪. దండికా డిణ్డికా భండాశ్చండాశ్చండాలచేష్టితాః, వైతండకాస్తే నిఘ్నంతి యథా సింహో మృగాన్పశూన్. ౩౫. నిర్గ్రంథం మునిమాలోక్య మన్యమానాః సమున్నతమ్, పరిభూయావతిష్ఠంతే ధిక్తాన్రిక్తాన్స్వవైరిణః. ౩౬. తస్మాత్సంసారికాః సత్త్వాశ్చిత్తక్లేశకలంకితాః, దౌఃశీల్యదౌర్మనస్యాద్యైస్తుల్యజాతీయబంధనాత్. ౩౭. శూద్రాం ప్రరోచతే విప్రో రాగిణీం మైథునం ప్రతి, సా కామదుఃఖవిగమే గర్భం ధత్తే సమా

బ్రాహ్మణస్త్రీలయినను శూద్రపురుషులను గూడ మైథునమునకై యధిక ముగ నపేక్షించుచున్నారు. ఆశూద్రులు నాయువతులకుఁ గామసుఖముల నొసంగుచున్నారు. ఇది భిన్నజాతీయులగుమానవులలోని వృత్తాంతము. ఇక భిన్నజాతులగు గోవులు గుఱ్ఱములు ఒంటెలు నేనుంగులు మొద లగు పశువులన్నవో సుఖాపేక్షయున్నను విజాతీయములగు జంతువుల యందు గర్భములు దాల్చుటలేదు. ఆఁబోతులు గోవుల కామముచే సంగ మముచేత నింపుచున్నవి. గుఱ్ఱములును గుఱ్ఱములందే లెస్సగ రతిఁ జేయుచున్నవి. ఆఁడుయేనుఁగుగున్న భర్తయగుమగయేనుఁగుగున్న నే జేరి మోదముతో రమించుచున్నది. పెద్దగజమునే బతిగాఁ గొని హస్తిని సుఖ మనుభవించుచున్నది. తిర్యగ్జంతువులు మనుష్యస్త్రీలతో మైథున మొనరించినను దానియందు గర్భము గలిగించుటలేదు. సుఖమును గలి గించుటలేదు. మనుజాంగనయే కోరి తిర్యగ్జాతిపురుషునితో మైథున మొన రించినను దానివలన గర్భము దాల్చుటలేదు. ఆరెండుతెగలకును మైథు నము యుక్తముగాదు. ఇట్టివిభాగము మనుష్యస్త్రీపురుషులకు మైథున విషయమై యొక్కింతయేనియుఁ గానరాదు. అట్టివిభాగముండినచో ద్విజశూద్రులకు భేదము స్పష్టముగఁ దెలిసియుండును. ఈభేదము వేద పాఠమువలని కపటముచేఁ గలిగినదిగాని క్రియాజనితముగాదు. ఒక సామాన్యస్థానమునఁ బెక్కుజడసంఘములచే నీఫక్కిక నిర్మింపఁబడెను.

---

గమే. ౩౮. కామం కామాతురాభ్యస్తు రోచంతే శూద్రమానవాః, మైథునం ప్రతి బ్రాహ్మణ్యో తేఽపి తాసాం సుఖావహాః. ౩౯. యే తు జాత్యాదిభిర్భిన్నా గవాశ్వోష్ట్ర మతంగజాః, తే విజాతిషు నో గర్భం కుర్వతేఽపి సుఖార్థినః. ౪౦. అనడ్వానేవ గోశేవ కామం పుష్ణాతి సంగమే, ఘోటకాశ్చ రతిం సమ్యక్కుర్వతే బడబాసు చ. ౪౧. పతిం కరభమేవాప్య కరభీ రమతే ముదా, గజమేవ పతిం లబ్ధ్వా సుఖం తిష్ఠతి హస్తినీ. ౪౨. తిర్యగ్జాతిః స్త్రియా సాకం కుర్వాణాఽపి హి మైథునమ్, న తస్యాః కురుతే గర్భం నరో నాపి సుఖాసికామ్. ౪౩. తిరశ్చా సహ కుర్వాణా మైథునం మనుజాంగనా, నాధత్తే తత్కృతం గర్భం న యుక్తం మైథునం తయోః. ౪౪. నైవం కశ్చిద్విభాగోఽస్తి మైథునే స్త్రీమనుష్యయోః, యేన సంతీయతే భేదః ప్రస్ఫుటం ద్విజ శూద్రయోః. ౪౫. వేదపాఠచ్ఛలేనాయం న క్రియాభిః ప్రపద్యతే, బహుభిర్జడ

అశుచియై యశాశ్వతమగు దేహమునందును నాముష్మికమగు దేహియందును రాగద్వేషాదులగు దోషములచే నంతట నధికముగఁ బీడింపఁబడినదియు విషయసాగరమునబడి కులాలచక్రమువలెఁ దిరుగాడుమనస్సుగలదియును ఘోరములగు దుఃఖభయములచే నాక్రాంతమగు నాస్తికసమాజమునందును జననమరణజరాశోకముల చేతను ననిష్టసంప్రాప్తియను నగ్నిచేతను పీడితమైయుండు సత్త్వహీనము లగుశరీరములందు నించుకేనియు విశేష మూహింపఁబడుటలేదు. కావున బ్రాహ్మణ్యాబ్రాహ్మణ్యములను నీ మనుష్యభేదము సంకేతబలముచే నేర్పడినది. బ్రాహ్మణునితోడి నిరంతర సాంగత్యమువలన బ్రాహ్మణస్త్రీయును బ్రాహ్మణ్యమును బొందుచున్నది. బ్రాహ్మణి భర్తను విడచి ముఖాస్వాదమునం దాసక్తిగలిగి మదలాలసులగు మనుజులఁబొంది వారిచే ననుభవింపఁబడుచున్నది. విటునిజేరి పదిమందిని బ్రేమించి రమించునదియై చేటులతోఁ గూడియుండును. వీండ్రెల్లరును మహాపాపాత్ములచే ననుభవింపఁబడి మహాపాతకులై బ్రాహ్మణ్యమునుండి నిశ్శేషముగఁ జ్యుతులగుచున్నారు. కావున జాత్యాదినిర్మాణము సత్యేతరమూలకముగాని తథ్యముగాదు.

ఇది త్రిచత్వారింశాధ్యాయము.

---

సంఘాతైరవిశిష్టే పదేఽహని. ౪౬. దేహే దేహిని చాముష్మిన్నశుచావనవస్థితే, రాగద్వేషాదిభిర్దోషైరధికం పరిపీడితే. ౪౭. కులాలచక్రవద్భ్రాంతమానసే విషయార్ణవే, ఘోరదుఃఖభయాక్రాంతే సమాజేఽనీశ్వరాత్మని. ౪౮. జన్మమృత్యుజరాశోకానిష్టయోగాగ్నిపీడితే, హీనసత్త్వశరీరాదౌ న విశేషో విభావ్యతే. ౪౯. తస్మాన్మనుష్యభేదోఽయం సంకేతబలనిర్మితః, బ్రాహ్మణ్యం బ్రాహ్మణాసంగాద్బ్రాహ్మణీ చోపసేవతే. ౫౦. పతిం త్యక్త్వా ముఖాస్వాదలాలసైర్మదలాలసైః, ఆసేవ్యతే విటం గత్వా బంధకీ చేటకైరపి. ౫౧. బ్రాహ్మణ్యాత్ప్రచ్యవంతేన్యే మహాపాతకసేవితాః, వ్యలీకకల్పనైవైషా తస్మాజ్జాత్యాదికల్పనా. ౫౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే వర్ణవ్యవస్థావర్ణనం నామ
త్రిచత్వారింశోఽధ్యాయః.

## చతుశ్చత్వారింశాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియెను. ఏమానవులు విడువఁదగినవియు గ్రహింపఁదగినవియు నగుపదార్థముల యాథార్థ్యము నెఱింగియుందురో యన్యాయమార్గముల నన్యాయాగమములను విడచి వర్తింతురో యింద్రియ మనోవచనముల జయించి సదాచారపరాయణులై యుందురో నియమము నాచారములును గలవర్తనము గలిగియుండెదరో హితమును వెదకు నాస్తి గలిగియుందురో సంసారమును బోషించుట కుపాయములగు క్రియా కలాపముల లగ్నమనోరథు లైయుందురో చక్కనిశాస్త్రజ్ఞానము గలిగి యుందురో సమాహితచిత్తు లైయుందురో క్రోధమును బోనడగింతురో స్వాధ్యాయమునందే యాసక్తి గలిగియుందురో సంగపరిత్యాగ మొనరించి విగతమత్సరు లైయుందురో మదశోకములు లేక యుందురో శాంతస్వభావులై సర్వప్రాణులకు హితముగోరుచుండుదురో సుఖదుఃఖములందు సములైయుందురో సమ్మర్దములేనిస్థానమున వసింత్రో వ్రతముల నుపయోగించు సర్వాంగములు గలిగియుందురో ధర్మబుద్ధిగలారును బాపభీతి గలవారు నైయుందురో మమతాహంకారముల విసర్జించి యుందురో దాన శూరులు దయాపరులు నయి సత్యస్వరూపమగు పరబ్రహ్మము నెఱింగి శాంతమానసులై సర్వశాస్త్రముల నెఱింగినవా రైయుందురో యట్టివారు సమస్తలోకమునకు హితముగూర్చు నుపాయములఁ బ్రవర్తించునట్టియు స్వయంసంజాతుఁడును వాగీశ్వరుఁడును దేవోత్తముఁడు నాభేయుఁడును సంసారనాశనుఁడు నగుబ్రహ్మచేఁ బూజితులై బ్రాహ్మణులన నెగడుదురు.

---

బ్రహ్మోవాచ.— హేయోపాదేయతత్త్వజ్ఞాస్త్యక్తాన్యాయపథాగమాః, జితేంద్రియమనోవాచః సదాచారపరాయణాః. ౧. నియమాచారవృత్తస్థా హితాన్వేషణతత్పరాః, సంసారరక్షణోపాయక్రియాయుక్తమనోరథాః. ౨. సమ్యగ్దర్శనసంపన్నాః సమాధిస్థా హతక్రుధః, స్వాధ్యాయభక్తహృదయాస్త్యక్తసంగా విమత్సరాః. ౩. విశోకా విమదాః శాంతాః సర్వప్రాణిహితైషిణః, సుఖదుఃఖసమాలోకా వివిక్తస్థానవాసినః. ౪. వ్రతోపయుక్తసర్వాంగా ధార్మికాః పాపభీరవః, నిర్మమా నిరహంకారా దానశూరా దయాపరాః. ౫. సత్యబ్రహ్మవిదః శాంతాః సర్వశాస్త్రేషు నిష్ఠితాః, సర్వలోకహితోపాయ ప్రవృత్తేన స్వయంభువా. ౬. వాగీశ్వరేణ దేవేన నాభేయేన భవచ్ఛిదా, బ్రాహ్మణా కృతమర్యాదాస్త ఏవ బ్రాహ్మణాః స్మృతాః. ౭. మహాతపోధనై

సకలజగదారాధ్యులును సర్వప్రాణులకు నభయప్రదులు నగు మహాతపో
ధనులు సర్వలోకములకు హితముజేయ నెంచి నిపుణముగ దీనిఁ బ్రతి
ష్ఠించిరి. సర్వోన్నతుఁ డగుటచే భగవంతుఁడగు బ్రహ్మ నాభేయుఁ డనఁ
బడును. ఏజను లాతనియెడ నకల్మషమగు భక్తిగలిగి ప్రపన్నులై
యుందురో వారే బ్రాహ్మణులని చెప్పఁబడుచున్నారు అపాయమునుండి
రక్షించువారు క్షత్రియు లనఁబడుచున్నారు. వార్తాప్రవేశనము (జీవికో
పాయపరిజ్ఞానము) వలన వైశ్యులు వచ్చుచున్నారు. ఎవరు వేదమునుండి
ద్రుతు (చ్యుతు) లగుచున్నారో వారే యిట శూద్రులని వ్యవహరింపఁ
బడుచున్నారు. కొందఱు సదాచారసంపన్నులు హృదయమున కిష్టమైన
ఫలమును బ్రశంసించుటకై బ్రహ్మవాదియెడ బ్రాహ్మణ్య మున్నదని
వక్కాణించుచున్నారు. క్షమయు దమమును దయయును దానంబు సత్య
శౌచములును ధైర్యమును గరుణయు మార్దవము ఋజుతయు సంతో
షంబు ననహంకారము తపము శాంతియు ధర్మమును జ్ఞానము నపైశున్య
మును బ్రహ్మచర్యమును మౌఢ్యము లేకుండుటయు ధ్యానంబునాస్తితా
బుద్ధియు ద్వేషములేకుండుటయు వైరాగ్యమును శమస్వరూపము
గలిగియుండుటయుఁ బాపభయంబును నస్తేయంబు నిర్మాత్సర్యశీలము
నాశయు నిస్సంగత్వమును గురుశుశ్రూషణమును మనోవాక్కాయముల
నియమించుకొనుటయు నీమొదలగు నాచారముల నేమానవు లను
ష్ఠింతురో వారియెడ నెల్లప్పుడు బ్రాహ్మణ్యము పుష్కలమై దినదిన

---

రార్యైః సర్వసత్త్వాభయప్రదైః, సర్వలోకహితార్థాయ నిపుణం సుప్రతిష్ఠితమ్. ౮.
బృహత్త్వాద్భగవాన్బ్రహ్మా నాభేయస్తస్య యే జనాః, భక్త్యాసక్తాః ప్రపన్నాశ్చ
బ్రాహ్మణాస్తే ప్రకీర్తితాః. ౯. క్షత్రియాస్తు క్షతత్రాణాద్వైశ్యా వార్తాప్రవేశ
నాత్, యే తు శ్రుతేర్ద్రుతిం ప్రాప్తాః శూద్రాస్తేనేహ కీర్తితాః. ౧౦. యే చాచార
రతాః ప్రాహుర్బ్రాహ్మణ్యం బ్రహ్మవాదినః, తే తు ఫలం ప్రశంసంతి యత్సదా మనసే
ప్సితమ్. ౧౧. క్షమా దమో దయా దానం సత్యం శౌచం ధృతిర్ఘృణా, మార్దవార్జవ
సంతోషా నహంకారతపః శమాః. ౧౨. ధర్మో జ్ఞానమపైశున్యం బ్రహ్మచర్యమమూఢతా,
ధ్యానమాస్తిక్యమద్వేషో వైరాగ్యం చ శమాత్మతా. ౧౩. పాపభీరుత్వమస్తేయమమా
త్సర్యమతృష్ణతా, నైఃసంగ్యం గురుశుశ్రూషా మనోవాక్కాయసంయమః. ౧౪. య
ఏవం భూతమాచారమనుతిష్ఠంతి మానవాః, బ్రాహ్మణ్యం పుష్కలం తేషాం నిత్యమేవ

ప్రవృద్ధమై యుండును. వారు తమమతము నెఱింగియుండుటచేత లబ్ధమగువర్ణాచారములు గలిగి యమితతేజస్సంపన్నులై యెల్లశాస్త్రములకు విరోధములేకుండ వర్తించుచుఁ బవిత్రహృదయులయి సాధుసమ్మతులై ప్రజ్ఞాధనసంపన్నులై పురాణముల నాగమముల మెండగుపాండితి గలిగి యెడతెగక కీర్తించు నాగమాచారములు గలవారలై వసించుచున్నారు. స్మృతినిర్మాతలు గూడ నీవిషయమునే తమస్మృతుల నిబంధించుచున్నారు. అన్నిమన్వంతరములందును విభక్తములగు నాలుగేసి యుగములందు నుత్తమోత్తమమగు వర్ణాశ్రమాచారసంభవమైన కర్మ సిద్ధించుచున్నది ఇప్పగిదిఁ గర్మ సిద్ధించినపిదప స్వాయంభువుఁడు పరస్పరము వారలలో వెనుకజెప్పినమర్యాదను వ్యవస్థాపించెను. వారిలో నెవ్వారు సత్త్వమునను బలమున నధికులై యితరుల నాపత్సముద్రములనుండి (క్షతములనుండి) రక్షించుచుఁ బరిగ్రహించి యుండిరో వారు క్షత్రియులై యుండిరి. వారి నాశ్రయించి యాచనచే యాత్ర! గడుపుచు .నర్మవాక్కుల నుపదేశించుచు నెల్లప్పుడు శాశ్వతమగు సత్యబ్రహ్మ నుపాసించుచు దానినే బలుకుచు నుండువారు బ్రాహ్మణులై యుండిరి. మఱియు నేయితరులు దుర్బలులై వైశ్యకర్మమునందు నివిష్టులై పృథ్వియందు ననలసులై బాధలు నశింపఁజేయుచున్నారో వారు వైశ్యులని చెప్పుచున్నారు. వారు కుత్సితములు నశింపఁజేయుటచేఁ గీనాశులని చెప్పఁబడుచున్నారు. మఱియు నేమానవులు దుఃఖించుచుఁ బారుచుఁ

---

ప్రవర్ధతే. ౧౫. తే స్వమతాస్వాదలబ్ధవర్ణాచారా మహౌజసః, సర్వశాస్త్రావిరోధేన పవిత్రీకృతమానసాః. ౧౬. సజ్జనాభిమతాః ప్రాజ్ఞాః పురాణాగమపండితాః, గీతగీతాగమాచారాః స్మృతికారాః పఠంతి చ. ౧౭. మన్వంతరేషు ,సర్వేషు చతుర్యుగవిభాగశః, వర్ణాశ్రమాచారకృతం కర్మ సిద్ధ్యత్యనుత్తమమ్. ౧౮. సంసిద్ధాయాం తు వార్తాయాం తతస్తేషాం స్వయం ప్రభుః, మర్యాదాం స్థాపయామాస యథారబ్ధాం పరస్పరమ్. ౧౯. యే వై పరిగృహీతారస్తేషాం సత్వబలాధికాః, ఇతరేషాం క్షతత్రాణాత్ స్థాపయామాస క్షత్రియాన్. ౨౦. ఉపతిష్ఠంతి యే తాన్వై యాచంతో నర్మదాః సదా, సత్యబ్రహ్మ సదాభూతం వదంతో బ్రాహ్మణాస్తు తే. ౨౧. యే చాన్యేఽప్యబలాస్తేషాం వైశ్యకర్మణి సంస్థితాః, కీలాని నాశయంతి స్మ పృథివ్యాం ప్రాగతంద్రితాః, వైశ్యానేవ తు తానాహ కీనాశాన్వృత్తిమాశ్రితాన్. ౨౨. శోచంతశ్చ ద్రవంతశ్చ

బరిచర్యాసక్తమానసులయి తేజోవిహీనులు నల్పబలులు నయియుండురో వారు శూద్రులు నని యాస్వాయంభువుఁడు వ్యవస్థచేసెను బ్రాహ్మణ క్షత్రియవైశ్యులను త్రైవర్ణికులకును శూద్రులకు నొండొరులస్వభావ సంజనితములగు గుణగణములచే గర్మలు వేఱువేఱుగ నేర్పఱుపఁబడెను. శమదమములును తపశ్శౌచములును క్షాంత్యార్జవములును లోకజ్ఞానము నాధ్యాత్మికజ్ఞానమును ఆస్తిక్యబుద్ధియు నివియన్నియు స్వభావసంభూతములగు బ్రాహ్మణకర్మలు. పరాక్రమము ప్రతాపము ధైర్యమును సామర్థ్యమును సంగరరంగమున వెన్నిచ్చి పారకుండుటయు నీవియుఁ బ్రభుత్వమును స్వభావసంభూతమగు క్షాత్రకర్మము క్షేత్రకర్షణము గోరక్షణము వర్తకము స్వభావజమగు వైశ్యకర్మ. శుశ్రూషణమనునదియు శూద్రునకు స్వాభావిక మయియున్నది. చిత్తవ్యాపారము లరికట్టుటయుఁ జాంద్రాయణాది తపశ్చరణమును భూతదయయును దానమును సత్య నిష్ఠయు ధర్మానుష్ఠానమును వేదమును కరుణయు బాహ్యాభ్యంతర విజ్ఞానమును శాస్త్రజ్ఞానమును బ్రహ్మాస్తిత్వబుద్ధియు నిదియంతయు బ్రాహ్మణలక్షణము. ఎవనికి జ్ఞానమయమగు శిఖయును తపోరూపమగు పవిత్రము నుండునో యాతనికి బ్రాహ్మణ్యము పుష్కలమై యుండునని స్వాయంభువుఁడగుమనువు వచించెను. ఏవర్ణమున నైనను నుత్తమమధ్య మాధములలో నెవ్వఁడైనను పాపకర్మములనుండి నివర్తించెనేని యాతండు బ్రాహ్మణుఁడే యగునని విధింపఁబడును. శీలసంపన్నుఁడై

---

పరిచర్యాసు యే నరాః, నిస్తేజసోల్పవీర్యాశ్చ శూద్రాంస్తానబ్రవీత్తు సః. ౨౩. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరస్పరమ్, కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః. ౨౪. శమస్తపో దమః శౌచం క్షాంతిరార్జవమేవ చ, జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. ౨౫. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్య పలాయనమ్, దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. ౨౬. కృషిగోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్, పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. ౨౭. యోగస్తపో దయా దానం సత్యం ధర్మశ్రుతిర్ఘృణా, జ్ఞానం విజ్ఞానమాస్తిక్య మేతద్బ్రాహ్మణలక్షణమ్. ౨౮. శిఖా జ్ఞానమయీ యస్య పవిత్రం చ తపోమయమ్, బ్రాహ్మణ్యం పుష్కలం తస్య మనుః స్వాయంభువోబ్రవీత్. ౨౯. యత్ర వా తత్ర వా వర్ణే ఉత్తమాధమమధ్యమాః, నివృత్తః పాపకర్మభ్యో బ్రాహ్మణః స విధీయతే. ౩౦.

యుండెనేని శూద్రుఁడైనను బ్రాహ్మణునికన్న నధికుఁడగును. ఆచార దూరుఁడై యుండెనేని బ్రాహ్మణుఁడేయైనను శూద్రునికన్న మిక్కిలి హీనుఁడగును. ఏశూద్రుఁడు సురాపానమొనరింపక యంగడులందుఁగాని యిండ్లలోఁగాని దానిని విక్రయింపఁడో వాఁడు సచ్ఛూద్రుఁడని గదా చెప్పఁబడుచున్నాఁడు. అటుగాన స్ఫుటమగుజాతి యొక్కటియే. జాతిభేదములు కృత్యముల ననుసరించి యేర్పడుచున్నవి. అటుకాదేని యైక్యజ్ఞాన పరిచ్ఛిన్నమగుజాతి యితరధర్మసంబంధమువలన నొక్కొక్కటిగ సమస్త భావములకు భేదోత్పత్తి స్థితిప్రళయములవ్యాపినియై నానావిధములై యుండును. ఇట్టిజాతివిషయము తత్తత్క్రియానుసారముగ విభక్తమై యుండుట మనుష్యులజ్ఞానమునకు గోచరమగుట లేదా? అందఱకును నీభేదము జ్ఞానగోచరమే యగును.

ఇది చతుశ్చత్వారింశాధ్యాయము.

---

## పంచచత్వారింశాధ్యాయము.

అని పలికి బ్రహ్మ మఱియు నిట్లనియె. శిష్యోత్తములారా! సవిమర్శమగు నీ నావచనము వింటిరి గదా! జాతికర్మములవిషయమై మీ మనస్సులను నుద్భవించిన సంశయము తీరినదా? మఱల సంగ్రహముగ

---

శూద్రోఽపి శీలసంపన్నో బ్రాహ్మణాదధికో భవేత్, బ్రాహ్మణో విగతాచారః శూద్రాద్ధీనతరో భవేత్. ౩౧. న సురాం సంధయేద్యస్తు ఆపణేషు గృహేషు చ, న విక్రీణాతి చ తథా సచ్ఛూద్రో హి స ఉచ్యతే. ౩౨. యద్యేకా స్ఫుటమేవ జాతిరపరా కృత్యాత్పరం భేదినీ యద్వా వ్యావృతిరేకతామధిగతా యచ్చాన్యధర్మం యయా, ఏకైకాఖిలభావభేదనిధనోత్పత్తిస్థితివ్యాపినీ కిం నాసౌ ప్రతిపత్తిగోచరపథం యాయాద్విభక్త్యా నృణామ్. ౩౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే వర్ణవిభాగవివేకవర్ణనం నామ
చతుశ్చత్వారింశోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ.—ఇదం శృణు మయాఽఽఖ్యాతం తర్కపూర్వమిదం వచః, యుష్మాకం సంశయే జాతే కృతే వై జాతికర్మణోః. ౧. పునర్వచ్మి నిబోధధ్వం సమా

వచింతు నాకర్ణింపుఁడు. మీరు విసుగుఁజెందుదురుగాన విస్తరించి చెప్పను. మానవు లుత్తమజాతి నుద్భవించి యుత్తమకర్మము లాచరించుచుండిరేని జాతికర్మముల సముచ్చయమువలన దైవపురుషకారసముచ్చయముచేఁ గార్యములు సిద్ధించుచున్నట్టులు వారలకు నుత్తమసిద్ధి గలుగును. కావున సంసిద్ధినిగోరుకొనుపురుషుఁడు జాతికర్మసముచ్చితుఁడై యుండవలయును. ఈవిధముగ మహాతేజస్సంపన్నుఁడగు యోగీశ్వరుఁడు నిజశిష్యులకు బోధించుచు మున్ను ప్రారంభమున వచించియుండెనని బ్రహ్మ మున్ను మహర్షు లడుగ సవిమర్శముగ జాతికర్మవిప్రకర్షముల నెఱింగించెనని పలికి సుమంతుండు రాజున కిట్లనియె. కావున సోమమహాభుజ! రాజా! కార్తికేయునిగుఱించి నీవిట్లాశ్చర్యము జెందనక్కరలేదు. దేవతలేనియు నీవిష యమును లెస్సగ నెఱుంగఁజాలరనిన మానవులెంత? అని వచించి సుమం తుఁడు మఱల నిట్లనియె.

ఇది పంచచత్వారింశాధ్యాయము.

---

## షట్చత్వారింశాధ్యాయము.

ఓభరతసత్తమా! భాద్రపదమాసమున వచ్చు నీషష్ఠీతిథి మిక్కిలి పవిత్రమైనది పాపముల నశింపఁజేయునదియు మంగళప్రదమైనదియు

---

సాన్న తు విస్తరాత్, సంసిద్ధిం యాంతి మనుజా జాతికర్మసముచ్చయాత్. ౨. సిద్ధిం గచ్ఛేద్యథా కార్యం దైవకర్మసముచ్చయాత్, ఏవం సంసిద్ధిమాయాతి పురుషో జాతి కర్మణోః. ౩. ఇత్యేవముక్తవాన్పూర్వం శిష్యాణాం బోధనే పురా, యోగీశ్వరో మహా తేజాః సమాసాన్న తు విస్తరాత్. ౪. సుమంతురువాచ.—ఇతి పృష్టః పురా బ్రహ్మ ఋషిభిః ప్రోవాచ భారత, సవితర్క మిదం వాక్యం విప్రకర్షే జాతికర్మణోః. ౫. తస్మా త్త్వయా మహాబాహో న కార్యో విస్మయో నృప, కార్తికేయం ప్రతి సదా దేవానాం దుర్విదా గతిః. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి షష్ఠీకల్పే కార్తికేయవర్ణనం నామ
పంచచత్వారింశోఽధ్యాయః.

---

సుమంతురువాచ.—యేయం భాద్రపదే మాసి షష్ఠీ చ భరతర్షభ, సుపుణ్యేయం

శాంతమై గుహున కతి ప్రియమైనదియు నగుచున్నది. ఈతిథియందుఁ జేసిన స్నానదానాదులు సర్వము నక్షయమగును. ఏమానవు లీనాడు దక్షిణాపథమున నున్న గంగాపుత్రుఁడగు గుహుని సేవింతురో వారు నిస్సంశయముగ బ్రహ్మహత్యాదిమహాపాతకములనుండియు విముక్తులగుచున్నారు. కావున నెల్లప్పుడు నీతిథియందుఁ గార్తికేయుని దర్శింపవలయును. ఏమానవులు భక్తియుక్తులై యీదినమున గుహుని బూజింతురో వారీలోకమున సర్వసుఖములను సకలకామముల ననుభవించి జన్మాంతమున నింద్రసాలోక్యమును బొందుచున్నారు. మఱియు నేమానవుఁడు కార్తికేయునకు దారువుతోగాని శిలలతోగాని సుదృఢమగు నాలయమును గట్టించి భక్తిశ్రద్ధలతో నందుఁ గార్తికేయుని బ్రతిష్ఠించునో యాతఁడు పవిత్రమగు గాంగేయమనువాహనము నెక్కి గాంగేయునిసదనమున కేగుచున్నాఁడు. ఆగుహునాలయమున నేమానవుఁడు ధ్వజప్రతిష్ఠాపన మొనరించి యాలయసమ్మార్జనాదు లొనరించుచుండునో యాతఁడు రుద్రసదనమున కేగుచున్నాఁడు. చందనాగురుకర్పూరములచే లేపన ధూపనీరాజనాదు లొసంగి పూజించినవారు హస్త్యశ్వ రథవాహనాదిపరివారసమేతమగు సేనకు నాయకు లగుదురు. ఓమహీకాంతా! యీకార్తికేయుఁడు రాజుల కెల్లవేళలఁ బూజనీయుఁడని చెప్పుచున్నారు. రాజులకుఁ గార్తికేయునికన్నఁ బూజ్యమగుదైవము లేదు. సంగ్రామము జేయఁబోవురాజు కృత్తికాతనయుని బూజించెనేని

---

పాపహరా శివా శాంతా గుహప్రియా. ౧. స్నానదానాదికం సర్వం యస్యామక్షయ్యముచ్యతే, యేఽస్యాం పశ్యంతి గాంగేయం దక్షిణాపథమాశ్రితమ్. ౨. బ్రహ్మహత్యాదిభిః పాపైర్ముచ్యంతే నాత్ర సంశయః, తస్మాదస్యాం సదా పశ్యేత్కార్తికేయం నృపోత్తమ. ౩. పూజయంతి గుహం యేస్యాం నరా భక్తిసమన్వితాః, ప్రాప్యేహ తే సుఖాన్కామాన్గచ్ఛంతీంద్రసలోకతామ్. ౪. యస్తు కారయతే వేశ్మ సుదృఢం సుప్రతిష్ఠితమ్, దార్వం శైలమయం చాపి భక్త్యా శ్రద్ధాసమన్వితః, గాంగేయం యానమారుహ్య గచ్ఛేద్గాంగేయసద్మ వై. ౫. సమ్మార్జనాది యః కర్మ కుర్యాద్గుహగృహే నరః, ధ్వజస్యారోపణం రాజన్స గచ్ఛేద్రుద్రసద్మ వై. ౬. చందనాగరుకర్పూరైర్యశ్చ పూజయతే గుహమ్, గజాశ్వరథయానాఢ్యం సైనాపత్యమవాప్నుతే. ౭. రాజ్ఞాం పూజ్యః సదా ప్రోక్తః కార్తికేయో మహీపతే, కార్తికేయమృతే నాన్యం రాజ్ఞాం పూజ్యం ప్రచక్షతే. ౮. సంగ్రామం గచ్ఛమానో యః పూజయేత్కృత్తికాసుతమ్, స

  

యుద్ధమున నింద్రుఁడు దానవుల జయించినట్లు శత్రువుల జయించును. కావున నన్నియత్నములచేతను శంకరాత్మజాతుని బూజింపవలయును. ఆతనిని భక్తిసమన్వితుఁడై చంపకము మొదలగు నానావిధపుష్పములతోఁ బూజించువారు సర్వపాపములనుండి విముక్తులై యంతమున శివనిలయముఁ జేరుచున్నారు. షష్ఠీతిథియందు నూనెను భుజియింపరాదు. పగటివేళగూడ భుజియింపరాదు. మఱియు నోకురువంశసంభవా! భరతవంశోద్దీపకా! యేమానవుఁడు షష్ఠియందు నక్తవ్రతముఁజేయునో యాతఁడు సర్వపాపనిర్ముక్తుఁడై గాంగేయునిసదనమున కేగును. మూఁడవతడవలు దక్షిణాపథమున కేగి శ్రద్ధాసమన్వితుఁడై దేవదేవుఁడు నీశ్వరుఁడు నగుగుహుని బూజించువాఁడు శాంతనికేతనమున కేగును. ఇంతట షష్ఠీకల్పము ముగిసెను.

ఇది షట్చత్వారింశాధ్యాయము.

---

## సప్తచత్వారింశాధ్యాయము.

సుమంతుఁడు శతానీకున కిట్లనియె. సర్వమానవులును సప్తమీతిథియం దుపవాసము చేయవలయును. శక్తిచాలకయుండెనేని రాత్రివేళ

---

శత్రుం జయతే వీర యథేంద్రో దానవాన్రణే. ౯. తస్మాత్సర్వప్రయత్నేన పూజయేచ్ఛంకరాత్మజమ్, పూజమానస్తు తం భక్త్యా చంపకైర్వివిధైర్నృప, ముచ్యతే సర్వపాపేభ్యస్తదా గచ్ఛేచ్ఛివాలయమ్. ౧౦. తైలం షష్ఠ్యాం న భుంజీత న దివా కురునందన, యస్తు షష్ఠ్యాం నరో నక్తం కుర్యాద్భి భరతర్షభ, సర్వపాపైః స నిర్ముక్తో గాంగేయస్య సదో వ్రజేత్. ౧౧. త్రిః కృత్వో దక్షిణామాశాం గత్వా యః శ్రద్ధయాన్వితః, పూజయేద్దేవదేవేశం స గచ్ఛేచ్ఛాంతిమందిరమ్. ౧౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మేపర్వణి షష్ఠీకల్పే కార్తికేయమాహాత్మ్యవర్ణనం నామ షట్చత్వారింశోఽధ్యాయః.

ఇతి షష్ఠీకల్పః సమాప్తః.

---

సుమంతురువాచ.—సప్తమ్యాం సోపవాసస్తు నక్తాహారోఽపి వా భవేత్,

మాత్రమే యాహారము చేయవలయును. అయ్యది దేవదేవుఁడవతారము గైకొన్న దినము. దేవదేవుఁడు తొలుత నండముతో జనియించి యందు నిలచి యావెనుక జ్ఞానసంపన్నుఁ డయ్యెను. ఆతఁ డట్టు లండమున నుండఁ గనే దక్షప్రజాపతి ప్రపంచమున నందకత్తెలలో మిన్నయగుటచే నన్వర్థమగురూపిణి యనుపేరుగల నిజతనయ నాతనికి భార్యగా నొసంగెను. ఆదేవదేవుఁ డాయండమున చిరకాల ముండుటచే మార్తండుఁ డను నామము గాంచెను. తరువాత దక్షునియాజ్ఞచేతఁ జిత్రకారుఁడగు విశ్వకర్మ యాతనిశరీరమునకుఁ బ్రకాశము గలుగఁజేసెను. ఆప్రకాశముచే నాతనికిఁ బ్రసిద్ధిగలిగెను. అటు లాయండమున నున్నయాతనికి యమున యనుకూఁతురును యముఁ డనుకొడుకును జనించిరి. అంతట నాతని భార్యయు దక్షకన్యయు నగు నాతన్వంగి నాథునివేఁడిమికిఁ బాళఁజాలక వైరాగ్యముపొంది దుఃఖనిర్విణ్ణచిత్తయై యిట్లని చింతించెను. "ఆహా! మహానుభావుఁడగు నాకాంతుని కాంతిమంతమగుసుందరమూర్తి తేజోమయమైయున్నది. ఈతనియంగముల నొక్కటియుఁ దేజోవిహీనమై యుండ లేదు. నాదేహము మంగళకరమును బంగారువన్నెగలదియుఁ గాంతియుతమునై మిగుల నందమైనది. అట్టి సుకుమారదేహము గూడ నిప్పట్టున నీతనితేజముచేఁ గాల్పఁబడి నల్లబారియున్నది. కావున నే నిట నుండి యుత్తరకురుదేశములకేగి తప మొనరింతును. నేనిట లేకుండుటెఱింగెనేని నాథుఁడు శపించును. కావున నానెచ్చెలియగు ఛాయ నిట

సప్తమ్యాం దేవదేవేన లబ్ధం స్వం రూపమాదరాత్. ౧. అండేన సహ జాతో వై అండస్థో బుద్ధిమాప్తవాన్, అండస్థస్యైవ దక్షేణ భార్యాం దత్త్వా స్వకాం సుతామ్. ౨. నామ్నా రూపేతి రూపేణ నాన్యా నారీ తథా భవేత్, అండస్థ ఏవ సుచిరం స్థితో మార్తాండ ఇత్యతః. ౩. దక్షాజ్ఞయా విశ్వకర్మా వపురస్య ప్రకాశయన్, ప్రకాశతస్తతో నామ తస్య జాతం నరాధిప, అండస్థస్యైవ సంజాతో యమునా యమ ఏవ చ. ౪. దాక్షాయణీ తస్య భార్యా వైరాగ్యాత్తనుమధ్యమా, చింతయామాస సా దేవీ దుఃఖాన్నిర్వేదమాగతా. ౫. అహో తేజోమయం రూపం కాంతం కాంతస్య కాంతిమత్, న చాస్య కించిత్పశ్యామి అంగం తేజోవిమోహితం. ౬. శుభం కనకతుల్యం మే రూపం కాంతం సుకాంతిమత్, సాంప్రతం శ్యామతాం యాతం దగ్ధమేతస్య తేజసా. ౭. తస్మాత్తప్స్యే తపశ్చాహం గత్వా వై ఉత్తరాన్కురూన్, స్వాం ఛాయామత్ర

నిలిపి యేగుదును." అని నిశ్చయించి యాబాలారత్నము నటనుంచి నావిషయ మాతని కెఱింగింపవలదని యామెకు బాసచేసి తా నుత్తర కురుభూముల కేగెను. అట్టు లేగి నిజరూపము నొకచో దాచియుంచి యాఁడుగుఱ్ఱపురూపము దాల్చి యట జరించు మృగములతోఁ గూడి పెక్కేండ్లగములందే జరించెను. రాజా! అంత నిట నీమార్తండుఁడును ఛాయ తనభార్య యనియే తలంచి యెప్పటివలెఁ గ్రీడించుచు నామె యందుఁ గొంతకాలమునకుఁ దపతి యనుకన్నెను శని యను కుమారునిఁ గాంచెను. అంతట ఛాయ పుత్రస్నేహముమూలమున నిజసుతుల నతిప్రేమతోఁ బెనుచుచు యమునాయములను మిక్కిలిగఁ బ్రేమింప కుండెను. ఇటులుండుటచేత నాసూర్యపుత్రికలగు యమునాతపతులకు వివాద మేర్పడెను. అంత టొకన్నియ లిరువురు వాదించుకొనుచు నొండొరులు గోపావేశమున ననిష్టములగు ప్రసంగములఁ గావించు కొనిరి. (శపించుకొనిరి.) ఆవాక్కులచే నాయిరువురు నదులై యుండిరి. యమునాసోదరుఁ డగుయముఁడును ఛాయచే మిగుల దండింపఁబడి యాగ్రహమునఁ గాలెత్తి యామె కెదురుగ నిలచెను. అంత నామెయు నినుమడించినకోపముతో నోరీ! దురాగ్రహముచే నాపైకిఁ గాలూది నిలచితివి గదా? అందునంజేసి నీకృత్యమెన్నఁడును భయంకరమై ప్రాణి హింసాకరమై సూర్యచంద్రులున్నంతవరకును చిరకాల ముండఁగలదు.

---

నిక్షిప్య భయాచ్ఛాయపస్య రూపిణీ. ౮. నిక్షిప్యోవాచ తాం బాలాం మా చాస్మై వై వదిష్యసి, ఏవం సా నిశ్చయం కృత్వా గతా వై ఉత్తరాన్కురూన్. ౯. స్వరూపం తత్ర నిక్షిప్య బడబారూపధారిణీ, చచార సా మృగైః సార్థం బహూన్వర్షగణాన్నృప. ౧౦. అసావపి చ మార్తండశ్ఛాయాం భార్యామమన్యత, శనిం చ తపతీం చైవ ద్వే అపత్యే చ జజ్ఞివాన్. ౧౧. అథ చ్ఛాయాత్మాపత్యాని స్నేహేన పరిపాలయేత్, నాతిస్నేహేన చాపశ్యద్యమునాం యమమేవ చ. ౧౨. అథ తాభ్యాం వివాదోఽభూ దాదిత్యదుహిత్రోర్ద్వయోః, తే ఉభే వివదంత్యౌ తు పరస్పరమసంమతమ్, యమునా తపతీచోభే నిమ్నగే సంబభూవతుః. ౧౩. యమోఽపి యమునాభ్రాతా ఛాయయా తాడితో భృశమ్, పాదముద్యమ్య తస్యా వై తస్థ్యౌ సమ్ముఖ ఏవ సః. ౧౪. ఛాయా శశాప తం రోషాద్యస్మాత్పాదోద్యతో మమ, తస్మాత్తే కర్మ బీభత్సం ప్రాణినాం ప్రాణ హింసనమ్. ౧౫. భవిష్యతి చిరం మాఢ ఆచంద్రార్కం న సంశయః, పాదం చ యది

నీవు క్రూరుఁడవగుదువుగాక; యని మఱియు నీయెత్తినపాదము మరల భూమిపైఁ బెట్టితివేని నాశాపముచేఁ గలుషితమైయుండుటచేఁ గృములు భక్షింపఁగలవని శపించెను. అట్లు వారందఱు గలహించుచుండ నచ్చోటికి మార్తాండుఁ డేతెంచెను. అట్టు లేతేర లోకపావనుఁడు మహానుభావుఁడు నగుమార్తండునకు మ్రొక్కి యముఁడు "తండ్రీ! యీమె నిత్యమును మమ్ముఁ గ్రూరభావముతోఁ జూచుచున్నది. మానలువురలో నీమెకు సమదృష్టి లేదు. ఉన్నట్లు తోఁచుటలేదు. అన విని మార్తండుఁడు మిగులఁ గోపించి "యోసీ మూఢురాలా! నీవేల నీబిడ్డలనందఱను సమముగాఁ జూడవు" అని యామెను గద్దించి యడిగెను. అది విని యముఁడు తండ్రీ! యీమె మాతల్లి కాదు. ఈపాపాత్మురాలు మాతల్లియొక్క ఛాయ. తండ్రీ! యీక్రూరురాలు నన్ను శపించినది. అనునెడ యమునయుఁ దపతి వృత్తాంతము నామూలాగ్రముగ వచించెను. అదియెల్లవిని మార్తండుఁడు వారల కిట్లనియె. యమా! నీపాదము ఛాయ చెప్పినచొప్పున భూమిపైఁబడకుండగనే యుండుఁగాక. పురుగులు మాంసమును రుధిరము నాహారముగఁ గొని భూతలము నాశ్రయించును. యమునాజలము గంగాజలమువలెఁ బవిత్రమై యుండుఁగాత! తపతీజలము నర్మదానదితోయమువలెఁ బవిత్రమై యుండుఁగాక! తపతి వింధ్యపర్వతపు దక్షిణపార్శ్వమున నదియై ప్రవహించును. దానితో సాయుజ్యమునుబొంది పవిత్రయగుగంగ ప్రవ

---

భూమౌ త్వమిమం సంస్థాపయిష్యసి. ౧౬. కృమయో భక్షయిష్యంతి మచ్ఛాపకలుషీకృతమ్. ౧౭. తేషాం వివదమానానాం మార్తండోఽభ్యాగమత్తతః, యమోప్యాహ మహాత్మానం మార్తండం లోకపావనమ్. ౧౮. తాత నిత్యమియం చాపి క్రూరభావేన పశ్యతి, న చాస్మాః సుసమా దృష్టిరస్మాస్వస్తీతి లక్ష్యతే. ౧౯. ప్రోవాచాథ స తాం ఛాయాం మార్తండో భృశకోపనః, సమే అపత్యే కిం మూఢే సమత్వం నానుపశ్యసి. ౨౦. యమః ప్రోవాచ పితరం నేయం మాతా పితర్మమ, మాతుశ్ఛాయా త్వియం పాపాశప్తోఽహమనయా పితః, యమునా తపతీవృత్తం తత్సర్వం విన్యవేదయత్. ౨౧. అథ ప్రోవాచ మార్తండో మా తే పాదో మహీతలే, మాంసం రుధిరమాదాయ కృమయో యాంతు భూతలమ్. ౨౨. యమునాయాశ్చ యత్తోయం గంగాతుల్యం భవిష్యతి, నర్మదాయాస్తపత్యాశ్చ సమం పుణ్యేన వై ద్విజ. ౨౩. వింధ్యస్య దక్షిణే నేహ తపతీ ప్రవహిష్యతి, తత్సాయుజ్యతయా సార్థం గంగా యాస్యతి శోభనా. ౨౪. గంగా

హింపఁగలదు. యమునయు నాగంగను జేరి గంగయే యగును. సౌర (సూర్యపుత్రి)యగు తపతియు సోమపుత్రి యగునర్మదయుఁ బవిత్రములై యెల్లపాపముల నశింపఁజేయును. సూర్యతనయ యగుయమునయు విష్ణు పాదసంభవయగు గంగయు నీరెండును మహాపాపములవలని భయము నపనయించును. ఓతనయా! నీవు బ్రహ్మదేవునియాజ్ఞను గౌరవించి లోకపాలపదవి గైకొనుము. నేఁడాదిగ నీఛాయ నాదేహమున వసింపఁగలదు. అని యిట్లు వ్యవస్థజేసి తనభార్యను సంతానము నోదార్చి దక్షునియొద్దకేగి యీవృత్తాంతమాతని కెఱింగించెను. ఆతఁడు నదియెల్ల నెఱింగి మార్తండుని జూచి యోభాస్వంతుఁడా! నీతేజంబున కోడి నీభార్య యుత్తరకురుభూముల కేగియున్నది. ఆమె నీయెడ రూపంబు గానక యేగెనుగాన నీరూపమును నేను ప్రకటము జేయుదును. బాధను భరింపఁగలవా? యని యడుగ నాతఁడు నట్టులే సహింతును. నారూపంబుఁ బ్రకాశింపఁజేయుమనియెను. అంత దక్షుఁడు సానబట్టువానిని స్మరింప వెంటనే యాతఁ డేతెంచి యేమిపని యని యడుగ దక్షుం "డోయీ! యీమార్తండునిరూపము ప్రకాశింపఁజేయవలయును" అని యాదేశించెను. తోడనే యాకర్మరుఁడు మార్తండుని జేరి బాధనోర్చు కోఁగలవా? యని యడుగ మార్తండుఁడును దక్షునిచేఁ బ్రేరితుఁడై సహింతునని బదులు వలికెను. అంతఁ గర్మరుఁడు సూర్యునిరూపమును

మాసాద్య యమునా గంగా సైవ భవిష్యతి, సౌరసౌమ్యే ఉభే పుణ్యే సర్వపాపప్రణాశనే. ౨౫. సౌరీ చ వైష్ణవీ చోభే మహాపాపభయాపహే, త్వం పుత్ర లోకపాలత్వం బ్రహ్మణోఽజ్ఞాం సభాజయన్, అద్యప్రభృతి ఛ్ఛాయేయం స్వదేహస్థా భవిష్యతి. ౨౬. ఏవం సంస్థాప్య స్వాం భార్యామపత్యాని తథైవ చ, ఆజగామ సకాశం వై దక్షస్యాహ చ కారణమ్, దక్షో విజ్ఞాయ తత్సర్వం మార్తండమిదమాహ వై. ౨౭. రూపం న పశ్యతీ తుభ్యం సా భార్యా ఉత్తరాన్గతా. ౨౮. రూపం తే ప్రకటిష్యామి యది శక్ష్యసి వేదనామ్, అసౌ ప్రోవాచ శక్ష్యేఽహం ప్రకాశీ కురు మే వపుః. ౨౯. అథ సస్మార తక్షాణం స్మృత ఏవాజగామ సః, ప్రోవాచ దక్షస్తక్షాణం మార్తండం వై ప్రకాశయ. ౩౦. తక్షా ప్రోవాచ మార్తండం వేదనాం విసహిష్యసే, విసహిష్యేథ ప్రోవాచ తక్షాణం దక్షచోదితః. ౩౧. అథ తక్షా ప్రకాశం వై తస్య రూపం విభావసోః, ముఖాదారభ్య పాదాంతం తతక్ష కరణైః స్వకైః, కిరణైస్తుద్యమానేషు తస్యాంగేషు పునః

సానబట్టు నుపకరణములచే నాపాదచూడముగఁ బ్రకాశింపఁజేసెను. అంతట నాకిరణములచే మాటిమాటికి సర్వావయవములు వ్యథనొందుచుండ వేదనాతురుఁడై మార్తండుఁ డనుక్షణము మూర్ఛమునుంగుచుండెను. అట్టియెడ నాతక్షుఁడు మార్తండుఁడు కినిసి శాపమొసంగు ననుభీతిచేఁ జీలపుడిమలుగాక దక్షిణభాగమును నెమ్మదిగ సానబట్టి రూపము గలుగఁ జేసెను. చీలమండలక్రిందిభాగము నంగుళులు మాత్రము నిరాకారముగానై యుండెను. అంతట మార్తండుఁ డోయీ! తక్షా! కృత్యము ముగిసినదా? నే నీవేదనకుఁ దాళలేకున్నవాఁడను. అని వచింప నాతండు నోగోపతీ! వేదనను విడువుము. గన్నేరుపుష్పములును రక్తచందనమును నీచేయి మొదలగు నెల్లయంగములకు లేపన మొనరింతును. అని వచించి యట్లు గావించెను. అంతట సూర్యుఁడు స్వస్థచిత్తుఁడయ్యెను. కావున నోరాజా! మార్తండునకు వెనుకజెప్పిన యర్చనలవలనఁ బ్రీతి జనించును. గన్నేరుపూవులు రక్తచందనమును దెచ్చి పూజింపవలయును. అని యివ్విధమున నాదేవుఁడు నిజపూజావిధాన మనూరున కెఱింగించెను. "గన్నేరుపూవును రక్తచందనమును నితిహాసపురాణములతో నొసంగి శ్రేష్ఠమగు గుగ్గిలమును ధూపము వేయవలయును ఇట్టు లేమానవుఁడు భక్తియుక్తుఁడై యివియెల్ల నొసంగునో యాతఁడు నాకుఁ బ్రాణదాన మొనరించినట్లే యొసంగు. కావున భక్తియుక్తుఁడగు బుద్ధిమంతుఁ డింతకన్న నితరము లీనవసరము లేదు." ఈమార్తండునియండముననుండి తేజస్సును

---

పునః, క్షణే క్షణే మూర్ఛయతి మార్తండో వేదనాతురః. ౩౨. తస్య శాపభయాత్తక్షా పాదౌ గుల్ఫాదియావతః, చకారాధో నిరాకారా అంగుల్యో న ప్రకాశయత్. ౩౩. పర్యాప్తం తక్షకర్మేదం వేదనా మమ బాధతే, తక్షా ప్రోవాచ మార్తండం వేదనాం జహి గోపతే. ౩౪. కరవీరస్య పుష్పాణి రక్తచందనమేవ చ, కరాదారభ్య గాత్రాణి విలింపే దేహజాని తే. ౩౫. తత్తత్కృతం తథా తేన స రుజం త్యక్తవాన్రవిః, అతశ్చేమాని చేష్టాని మార్తండస్యేహ భూపతే. ౩౬. కరవీరస్య పుష్పాణి తథా వై రక్తచందనమ్, ఇదమాహ పురా దేవో హ్యనూరోరగ్రతో నృప. ౩౭. కరవీరస్య పుష్పాణి రక్తచందనమేవ హి, ఇతిహాసపురాణాభ్యాం సుపర్ణగుగ్గులం తథా. ౩౮. యః ప్రయచ్ఛతి మే భక్త్యా స మే ప్రాణాన్ప్రయచ్ఛతి, తస్మాన్న దేయమన్యస్మై భక్తియుక్తేన జానతా. ౩౯. మార్తండస్యాండజం తేజో గృహీత్వా కిల భారత, చకార వజ్ర

గొని దేవనాథుఁడు దృఢమగువజ్రమును నిర్మించెను. అంత మార్తండుఁడు నిజరూపలాభము గాంచి వ్యథలడంగి సంతోషించెను. తరువాత నాతఁడు నిజపత్నీదర్శనలాలసుఁడై వేవేగ నుత్తరకురుదేశములకుఁ బోయెను. అట్టులేగి తనదివ్యజ్ఞానంబుకతన నాఁడుగుఱ్ఱమై మృగమధ్యంబునఁ జరించుచున్న భార్యను గాంచి ముదితాత్ముండై తాను నశ్వరూపము గైకొని యట నామెతోఁ జరిరచుచుఁ గ్రీడించుచు మదనవేగముచే నాయాఁడుగుఱ్ఱమునెక్కి రేతోవిసర్జన మొనరించెను. తోడనే యామెయు నాతఁడు పరపురుషుఁడని భావించి యెదురుగ నిలచి యాతేజస్సును నాసాపుటములచే నొక్కసారి ఛీత్కారమొనరించి చిమ్మివైచెను. అమోఘమగు నావీర్యమునుండి యిరువురు దేవవైద్యులు నాసత్యులనియు నశ్వినులనియు నామములు గలిగి యుదయించిరి. రేతస్సుయొక్క యంతమున (శేషము) నుండి రేవంతుఁ డనుపుత్రుఁడు జనించెను. ఈరేవంతుఁడు సూర్యునిదేహమున నున్నఛాయయందు మహామహిమోపేతుఁడై జనియించెను. ఈతనితోఁ గూడ ఛాయకు ముగ్గురుబిడ్డ లుదయించిరి. ఈతనికే సావర్ణియను నామాంతరము గలదు. తపతియు శనియు సావర్ణియు ననువారు ఛాయాపత్యములనియు, యమునాయములు సంజ్ఞా (రూపిణి) పత్యములనియు నెఱుంగవలయును. ఇట్టు లాభాస్వంతుఁడగు దేవునకు భార్యాపుత్రులును దివ్యదేహమును నీసప్తమీతిథియందు సంప్రాప్తించెనుగాన నాదేవునకు సర్వకాలమున నీసప్తమి యిష్టమైనది. ఏమానవుఁడు సప్తమినాఁ డుపవాసిగాని నక్తాహారుఁడుగాని యైయుండునో

---

మజరం శత్రులేఖాదినాశనమ్. ౪౦. మార్తండః పరితుష్టోఽభూల్లబ్ధ్వా రూపం గతవ్యథః, జగామ స కురూన్వేగాత్స్వభార్యాదర్శనోత్సుకః. ౪౧. మృగమధ్యగతాం దృష్ట్వా బడబారూపధారిణీమ్, అశ్వరూపం తతః కృత్వా స్వభార్యామధిరుహ్య సః, అవాసృజత్స్వకం తేజో వేగేనారుహ్య సోఽశ్వవత్. ౪౨. పరపురుషాశంకయా సా స్థితా దేవస్య సమ్ముఖీ, తేజో నాసాపుటాభ్యాం తు యుగపత్సాక్షిపత్పునః. ౪౩. తత్ర జాతౌ దేవభిషజౌ నాసత్యావశ్వినావితి, రేతసోఽంతే తు రేవంతో విరోచనసుతో మహాన్. ౪౪. తపతీ శనిశ్చ సావర్ణిశ్ఛాయాపత్యాని వై విదుః, యమునా యమశ్చ పూర్వోక్తౌ సంజ్ఞాయాశ్చ తథాత్మజౌ. ౪౫. భార్యా లబ్ధా వపుర్దివ్యం తథా పుత్రాశ్చ భారత, సప్తమ్యాం దేవదేవస్య సర్వమేవమిదం యతః, అనేన కారణేనేష్టా

యేమానవుఁడు షష్ఠి నుపవసించి పంచమి నేకభుక్త మొనరించునో యాతఁడు రుచిగల కూరలెల్ల వండి భక్ష్యభోజ్యసమన్వితముగ దేవునకు నివేదించి బ్రాహ్మణుల కొసంగి తా వాగ్యతుఁడై రాత్రివేళ భుజించుచు బ్రదికియున్నంతకాలము నీవ్రతము నాచరింపవలయును. అట్టులొనరించు మానవుఁడు సంపదలను విజయమును ధర్మకామార్థములను వృద్ధి బొందించుకొనును. జన్మాంతంబున స్వర్గమునకేగి దివ్యవిమానారూఢుఁడై యనేకమన్వంతరములు సూర్యమండలమున సంచరించుచు ముదమందును. మగుడఁ గాలాంతరమున నిహలోకమున కేతెంచి శాంతమూర్తియగు నృపుఁడై పుత్రపౌత్రపరివారసమేతుఁడై వదాన్యోత్తముఁడై చిరకాలము జీవించును. శాత్రవులనెల్ల వశపఱచుకొని యజితుఁడై యుండును. మఱియు నోరాజద్విపీ! యేమానవుఁడు శాకమాత్రాహారుఁడై యుపవసించునో యాతఁడు పైతృకమగు వైరాజమను తీర్థమును బొందును. మీపూర్వపురుషుఁడగుకురువు శాకాహారుఁడై సప్తమీవ్రత మొనరించి వివస్వంతు నను గ్రహమున ధర్మక్షేత్ర మనఁదగు కురుక్షేత్రమును నిర్మించెను. రాజా! సప్తమియు నవమియు షష్ఠియుఁ దృతీయయుఁ బంచమియు నను నీతిథు లీలోకమున స్త్రీపురుషులకుఁ గామములనిచ్చుచుండును. మాఘమాసమున వచ్చు సప్తమియు నాశ్వయుజమాసమున వచ్చు నవమియు

---

సదా దేవస్య సప్తమీ. ౪౬. సప్తమ్యాం సోపవాసస్తు రాత్రౌ భుంజీత యో నరః, కృత్వోపవాసం షష్ఠ్యాం తు పంచమ్యామేకకాలభుక్. ౪౭. దత్త్వా సుసంస్కృతం శాకం భక్ష్యభోజ్యైః సమన్వితమ్, దేవాయ బ్రాహ్మణేభ్యశ్చ రాత్రౌ భుంజీత వాగ్యతః. ౪౮. యావజ్జీవం నరః కశ్చిద్వ్రతమేతచ్చరేదితి, తస్య శ్రీర్విజయశ్చైవ త్రివర్గశ్చాపి వర్ధతే. ౪౯. మృతశ్చ స్వర్గమాయాతి విమానవరమాస్థితః, సూర్యలోకే స రమతే మన్వంతరగణాన్బహూన్, ఇహ చాగత్య కాలాంతే నృపః శాంతిసమన్వితః. ౫౦ పుత్రపౌత్రైః పరివృతో దాతా స్యాన్నృపతిశ్చిరమ్, భునక్తి హి ధరాం రాజన్విగ్రహైశ్చాజితః పరైః. ౫౧. యే నరా రాజశార్దూల శాకాహారేణ సప్తమీమ్, ఉపోష్య లబ్ధం తత్తీర్థం పిత్ర్యం వైరాజసంజ్ఞికమ్. ౫౨. కురుణా తవ పూర్వేణ శాకాహారేణ సప్తమీమ్, ధర్మక్షేత్రం కురుక్షేత్రం కృతం తస్య వివస్వతా. ౫౩. సప్తమీ నవమీ షష్ఠీ తృతీయా పంచమీ నృప, కామదాస్తిథయో హ్యేతా ఇహైవ నరయోషితామ్,

(మహానవమి) భాద్రపదమున షష్ఠియు వైశాఖతృతీయయు నాగపంచమి యనఁదగు భాద్రపదపంచమియు పవిత్రములు ధన్యములు నైనవి. ఇవియెల్ల నాయామాసములందు విశేషతిథులై యున్నవి.-ఈతిథులందు సుసంస్కృత మగుశాకమును యథాశక్తిగ భక్తిభరితుఁడై యొక బ్రాహ్మణున కొసంగి వ్రతనియమములతో రాత్రిం దా భుజింపవలయును. ఈసప్తమీవ్రతము కార్తీకశుక్లపక్షమునఁ బ్రారంభించి నాలుగుమాసములకుఁ బారణ మొన రింపవలయును. ఈవ్రతకాలమున భాస్వంతున కగస్త్యకుసుమములఁ బూజలు సలుపవలయును. కుంకుమవిలేపన మొనరుపవలయును. రాజ భూతవ్యాధుల నపనయింపఁజాలు విష్ణుక్రాంతము ననుసోమెదపు జిగురు వలనను ధూపములు (అపరాజిత) వేయవలయును. పంచగవ్యమున స్నాన మొనరించి యద్దానినే ప్రాశన మొనరింపవలయును. ఇచ్చట దేవదేవు నకుఁ బాయసమును నివేదింపవలయును. ఆపాయసమునే శాకభక్ష్యసమ న్వితముగ విప్రుల కొసంగవలయును. పిమ్మట దానును మంచి కూరలు పిండివంటకములు పానద్రవ్యములును భుజింపవలెను. ఇయ్యది మొదటి పారణము. రాజా! రెండవపారణమున మంగళప్రదమగు పరిమళముగల పుష్పములను దేవునకు సమర్పించి శ్వేతచందనమలంది యగురుధూపము లిచ్చి గుడాపూపముల నివేదింపవలెను. ఈపారణమునఁ గుశోదకస్నాన

౧౪. సప్తమీ మాఘమాసే తు నవమ్యాశ్వయుజే మతా, షష్ఠీభాద్రపదే ధన్యా వైశాఖే తు తృతీయికా. ౧౫. పుణ్యా భాద్రపదే ప్రోక్తా పంచమీ నాగపంచమీ, ఇత్యేతా స్తేషు మాసేషు విశేషాస్తిథయః స్మృతాః. ౧౬. శాకం సుసంస్కృతం కృత్వా యశ్చ భక్త్యా సమన్వితః, దత్వా విప్రే యథాశక్త్యా పశ్చాద్భుంక్తే నిశి వ్రతీ. ౧౭. కార్తికే శుక్లపక్షస్య గ్రాహ్యేయం కురునందన, చతుర్భిర్వాపి మాసైస్తు పారణం ప్రథమం స్మృతమ్. ౧౮. అగస్త్యకుసుమైశ్చాత్ర పూజా కార్యా విభావసోః, విలేపనం కుంకుమం తు ధూపశ్చైవాపరాజితైః. ౧౯. స్నానం చ పంచగవ్యేన తమేవ ప్రాశ యేత్తతః, నైవేద్యం పాయసం చాత్ర దేవదేవస్య కీర్తితమ్. ౨౦. తదేవ దేయం విప్రాణాం శాకం భక్ష్యమథాత్మనా, శుభశాకసమాయుక్తం భక్ష్యపేయసమన్వితమ్. ౨౧. ద్వితీయే పారణే రాజఞ్శుభగంధాని యాని వై, పుష్పాణి తాని దేవస్య తథా శ్వేతం చ చందనమ్. ౨౨. అగురుశ్చాపి ధూపోఽత్ర నైవేద్యం గుడపూపకాః, స్నానం

మును గోమయప్రాశనమును జేయవలయును. మూఁడవపారణమున గన్నేరుపూవుల నర్చించి రక్తచందనమలంది గుగ్గులు ధూప మొసంగిన దేవదేవునకుఁ బ్రియము కలుగును. మఱేను నోధీమంతుఁడా! యీనాఁడు పెరుగుగలిపిన శాల్యన్నమును నివేదింపవలయును. ఆశాల్యన్నమునే భక్ష్యవ్యంజనసమేతముగ బ్రాహ్మణుల కొసంగి యాయాకాలమున లభించుశాకముల వండిపెట్టి విచక్షణుఁడై యుచితరీతిని బూజింపవలయును. ఈపారణమునఁ దెల్లయావాలపొడి కలిపిననీటితో స్నానప్రాశనములు చేసిన సర్వపాపములు నశించునని బుధులు వక్కాణించుచున్నారు. ఈతృతీయపారణాంతమున గొప్ప బ్రాహ్మణసంతర్పణము చేయవలయును. పురాణశ్రవణ మొనరించి స్వస్తివాచనములు గైకొనవలయును. ఈ పురాణశ్రవణాదికము దేవునియెదుటను బ్రాహ్మణులయెదుటను వసించి వాచకుఁడగు బ్రాహ్మణునివలనఁ జేయవలయును. ఇతరవర్ణసంజాతునుండి యొనరింపరాదు. పిమ్మట నాబ్రాహ్మణులనందఱను భక్తిసమన్వితుఁడై శక్తికొలఁదిఁ బూజింపవలయును. పౌరాణికునకు నిర్మలములగు రెండు వస్త్రములను నివేదింపవలయును. ఇట్లు పౌరాణికుఁడు పూజింపఁబడిన భాస్కరుఁ డెల్లప్పుడు వానియెడ సంతోషించును. ఆసవితృనకు గన్నేరు పువ్వులును రక్తచందనమును గుగ్గిలమును పాయసమును మోదకములను

---

కుశోదకేనాత్ర ప్రాశనం గోమయస్య తు. ౬౩. తృతీయే కరవీరాణి తథా రక్తం చ చందనమ్, ధూపానాం గుగ్గులశ్చాత్ర ప్రియో దేవస్య సర్వదా. ౬౪. శాల్యోదనం తు నైవేద్యం దధిమిశ్రం మహామతే, తమేవ బ్రాహ్మణానాం చ భక్ష్యలేహ్యసమన్వితమ్, కాలశాకేన చ విభో యుక్తం దద్యాద్విచక్షణః. ౬౫. గౌరసర్షపకల్కేన స్నానం చాత్ర విదుర్బుధాః, తస్యైవ ప్రాశనం ధన్యం సర్వపాపహరం శుభమ్. ౬౬. తృతీయే పారణస్యాంతే మహద్బ్రాహ్మణభోజనమ్, శ్రవణం చ పురాణస్య వాచనం చాపి శస్యతే. ౬౭. దేవస్య పురతస్తాత బ్రాహ్మణానాం తథాగ్రతః, బ్రాహ్మణాద్వాచకాచ్ఛ్రావ్యం నాన్యవర్ణసముద్భవాత్, అథ తాన్బ్రాహ్మణాన్సర్వాన్భక్త్యా శక్త్యా చ పూజయేత్. ౬౮. వాచకస్యామలే రాజన్వాససీ సంనివేదయేత్, వాచకే పూజితే దేవః సదా తుష్యతి భాస్కరః. ౬౯. కరవీరం యథేష్టం తు తథా రక్తం చ చందనమ్, యథేష్టం గుగ్గులం తస్య యథేష్టం పాయసం సదా. ౭౦. యథేష్టా మోదకాస్తస్య

తామ్రభాజనమును ఘృతమును పౌరాణికుఁడును పురాణమును నెల్ల ప్పుడు బ్రియములైనవి. ఈసప్తమి శాక యనుపేరఁ బ్రసిద్ధయై గోపతి యగు సూర్యునకుఁ బ్రియమై పవిత్రమైనదియు నైయున్నది. దీనియం దుపవాసము చేయుభక్తులు భాగ్యవంతులయి జనియింతురు.

ఇది సప్తచత్వారింశాధ్యాయము.

---

## అష్టచత్వారింశాధ్యాయము.

ఓభూదేవోత్తమా! యుత్తమమగు నీసప్తమీవ్రతకల్పమును మహానుభావుఁడగు భాస్కరదేవుని మహాభాగ్యమును విస్తరించి చెప్పవే యని యడుగ శతానీకునకు సుమంతుఁ డిట్లనియె.—రాజా! ఈవిషయ మున మహాత్ము లుత్తమము పవిత్రము నగు నొకసంవాదము నుదాహ రించుచున్నారు. మున్ను గృష్ణుఁడు సత్త్వగుణసంపన్నుఁడగు నిజ పుత్రున కీవృత్తాంత మెఱింగించియుండెను. అది యెఱింగింతు వినుము. మున్ను సాంబుఁడను కృష్ణకుమారుఁడు జగములకు గురువగు వాసుదేవు నకుఁ బ్రణమిల్లి యథావిధిగ భక్తితో నర్చించి తండ్రీ! ఐహికాముష్మిక హితదాయకమగు నుత్తమజ్ఞానము నుపదేశింపుమని యడిగి యిట్లనియెను. ఈలోకమునఁ బుట్టిన జంతువు లీజన్మములందు దుఃఖములచే నెవ్విధిని

---

యథా వై తామ్రభాజనమ్, యథేష్టం చ ఘృతం తస్య యథేష్టో వాచకః సదా, పురాణం చ యథేష్టం వై సవితుః కురునందన. ౭౧. ఇత్యేషా సప్తమీ పుణ్యా శాకాహ్వా గోపతేస్సదా, యాముపోష్య నరో భక్త్యా భాగ్యవాంశ్చ ప్రజాయతే. ౭౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే శాకసప్తమీవ్రతవర్ణనం నామ సప్తచత్వారింశోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—విస్తరాద్వద విప్రేన్ద్ర సప్తమీకల్పముత్తమమ్, మహాభాగ్యం చ దేవస్య భాస్కరస్య మహాత్మనః. ౧. సుమంతురువాచః—అత్రైవాహుర్మహాత్మానః సంవాదం పుణ్యముత్తమమ్, కృష్ణేన సహ సత్త్వేన స్వపుత్రేణ మహీపతే. ౨. భక్త్యా ప్రణమ్య విధివద్వాసుదేవం జగద్గురుమ్, ఇహాముత్ర హితం సాంబః పప్రచ్ఛ జ్ఞానముత్తమమ్. ౩. జాతో జంతుః కథం దుఃఖైర్జన్మనీహ న బాధ్యతే, ప్రాప్నోతి

బాధలు బొందకుండుదురో యేపగిదిని వివిధభోగములఁ బొందుదురో యేపగిదిని జన్మాంతమున నుత్తమమగు స్వర్గలోకమున కేగి వివిధసుఖము లనుభవించి యుచితసమయమున నెప్పగిదిని ముక్తికాంతాకరగ్రహణ మొనరింతురో యెఱింగింపవే; మధుసూదనా! ఈవిషయమునంతను పర్యాలోచనముచేయ నామనమున నిర్వేద మధిక మగుచున్నది. వ్యాధియుఁ గలుగుచున్నది. ఇది యెల్లఁ జూచిన నాకు నిముసమేనియు జీవితముపం దాస లేకున్నది. అయినను నేను గృతార్థుఁడను గాకుండు టచేఁ బ్రాణములు వెడలిపోవుటలేదు. ఓజనార్దనా! ఏయుపాయముకతన జరారోగసంకులంబగు నీసంసారమునఁ బడకుందునో యట్లు వెంటనే ప్రసాదింపవే; మఱియు నోసువ్రతా! యెట్టు లాధివ్యాధులబారినుండి విడివడుదునో యట్టు లుపదేశింపుమన నాతనికి వాసుదేవుఁ డిట్లనియె—వత్సా! యెల్లవారలకు సుఖములకు దేవతయనుగ్రహమే యత్యుత్త మము సార్వకాలికము నిత్యమునగు నుపాయము. ఇయ్యది యుపాయాంత రములకంటె నన్నివిధముల వేఱయినదని నానిశ్చయము. ఈవిషయ మును నేను హేతువాదములచేత నాగమాదులచేతను లెస్సగ నుప పాదించియుంటిని. ఈవిషయము నొకప్పు డొక్కెడ నొక్కఁడు బుద్ధి కౌశలమున వేఱువిధముగఁ జేసినఁ జేయవచ్చును. ఆరాధనక్రమ మెఱిం గిన యేవిద్వాంసులు దేవత నుద్దేశించి లెస్సగ నారాధనక్రియ జేయు దురో వారలకు దేవతాప్రసాదము లభించును. విశిష్టగుణోపేతయగు

---

వివిధాన్కామాన్కథం చ మధుసూదన. ౪. పరత్ర స్వర్గమాప్నోతి సుఖాని వివిధాని చ, అనుభూయోచితం కాలం కథం ముక్తిమవాప్నుతే. ౫. దృష్ట్వైవం మమ నిర్వేదో జాతో వ్యాధిర్జనార్దన, దృష్ట్వేమం జీవితాశాపి రోచతే న హి మే క్షణమ్. ౬. కిం త్వేవమకృతార్థోఽస్మి యస్మే ప్రాణా న యాంతి హి, సంసారే న పతిష్యామి జరావ్యాధిసమన్వితే. ౭. యేనోపాయేన తస్మేఽద్య ప్రసాదం కురు సువ్రత, ఆధివ్యాధి వినిర్ముక్తో యథాహం స్యాం తథా వద. ౮. వాసుదేవ ఉవాచ:—దేవతాయాః ప్రసా దోఽన్యః సర్వస్య పరమో మతః, ఉపాయః శాశ్వతో నిత్య ఇతి మే నిశ్చితా మతిః. ౯. అనుమానాగమాద్యైశ్చ సమ్యగుత్పాదితామయా, కదాచిదన్యథా కర్తుం ధీయతే కేనచిత్క్వచిత్. ౧౦. ప్రసాదో జాయతే తస్య సమ్యగారాధనక్రియా, యదా తాం చ సముద్దిశ్య కృతా తద్వేదినా తథా. ౧౧. విశిష్టా దేవతా సమ్యగ్విశిష్టేనైవ

దేవత విశిష్టకులసంభవుఁడగు పురుషునిచే నారాధింపఁబడి విశిష్టమగు నీప్సితఫలము నొసంగును. అన విని సాంబుఁడు వాసుదేవా! దేవతను గుఱించి సత్తావిషయకసందేహము లేనివారెవరు? లేదనునిశ్చయము గలవారెవ్వరు? విశిష్టగుణసంపన్ను లెవరు? వివరింపు మన నాతనికి వాసుదేవుఁ డిట్లనియె—దేవత యున్న దనునంశ మాగమమువలనఁ దెలియుచున్నది. కావున నాగమప్రామాణ్యము నంగీకరించువారికి దేవతాస్తిత్వనిశ్చయమున్నది. ఆగమప్రామాణ్యము నంగీకరింపకున్న ననుమానమువలననైన సాధింపవచ్చును. అనుమానము ప్రమాణముగ నంగీకరించువారి కనుమానమువలన దేవతాస్తిత్వబుద్ధి యేర్పడును. మఱియు నీదేవతాస్తిత్వము ప్రత్యక్షప్రమాణముచేఁ గూడ సాధింప నలవియగును. ప్రత్యక్షమనునది సర్వప్రాణులకును ముఖ్యప్రమాణముగ నున్నది గద! అప్రసిద్ధములగు తిర్యగ్యోనిజాతములు ప్రత్యక్షగమ్యములై మునుపటివలెనే యున్నవిగాని క్రొత్తగ నస్తితావ్యవహారము వానిలో జనించుట లేదు. కావునఁ బ్రత్యక్షప్రమాణముచే నెల్లరు దెలిసికొనవచ్చును. అన విని సాంబుఁ డోదేవా! సమస్తదేవతలు ప్రత్యక్షముచే లెస్సగఁ జూడఁబడుదురేని వారిని దెలిసికొనుటకై యేరుపడిన యనుమానాగమములు వ్యర్థములు కావా? యని యడుగ నాతనికి వాసుదేవుఁ డిట్లనియె—వత్సా! యెల్లదేవతలు నెచ్చటను బ్రత్యక్షముచేతనే యుపలభ్యమానులు కారు. కొందఱు ప్రత్యక్షముచేతను మఱికొందరు హేతు

దేహినా, ఆరాధితా విశిష్టం చ దదాతి ఫలమీహితమ్. ౧౨. సాంబ ఉవాచః— అస్తిత్వే న చ సందేహః కేషాంచిద్దేవతాం ప్రతి, నాస్తీతి నిశ్చయోఽన్యేషాం విశిష్టాస్త్వం కథాః కురు. ౧౩. వాసుదేవ ఉవాచః—సిద్ధం తు దేవతాస్తిత్వమాగమేషు బహుష్వథ, ప్రమాణమాగమో యస్య తస్యాస్తిత్వం చ విద్యతే. ౧౪. అనుమానేన వాప్యద్య తదస్తిత్వం ప్రసాధ్యతే, ప్రమాణమస్తి యస్యేదం సిద్ధాయస్యేహ చాస్తితా.౧౫. ప్రత్యక్షేణాపి చాస్తిత్వం దేవతాయాం ప్రసాధ్యతే, తచ్చావశ్యం ప్రమాణం చ దృష్టం సర్వశరీరిణామ్. ౧౬. యది నామా వివిక్తాస్తు తిర్యగ్యోనిగతా అపి, నోత్పద్యతే తథా హ్యస్తి వ్యవహారో యథా స్థితః. ౧౭. సాంబ ఉవాచః—ప్రత్యక్షేణోపలభ్యంతే సమ్యగ్యైవ యది దేవతాః, అనుమానాగమాభ్యాం చ తదర్థం న ప్రయోజనమ్. ౧౮. వాసుదేవ ఉవాచః—ప్రత్యక్షేణోపలభ్యంతే న సర్వా దేవతాః క్వచిత్, అనుమానా

వాదాగమములచేతను నెఱుఁగఁబడుదురు. ఆగమానుమానములచే వేన వేలు దేవత లుపలభ్యమాను లగుచున్నారు గద! అన విని సాంబుఁడు "ప్రత్యక్షగోచరమై విశిష్టమగు నిష్టఫలము నీయఁజాలు దేవతనుగుఱించి ముందుగ నాకెఱిఁగింపుము. తరువాత నాపై విషయమును వచింపుము." అని యడుగ నాతనికి వాసుదేవుఁ డిట్లనియె—వత్సా! ప్రత్యక్ష దేవత సూర్యుఁడు. ఆతఁడే జగంబునకు నేత్రమువంటివాఁడు. పగటిని గలుగఁ జేయును. ఆతనికంటె నధికగుణములుగలదియు శాశ్వతము నగుదేవత యొండు లేదు. ఎవ్వనివలన నీజగ ముద్భవించి లయమొందునో కృత త్రేతాదిలక్షణమగుకాల మెవనివలనఁ బుట్టునో యాతఁడే సాక్షాత్తుగ దివాకరుఁడు. గ్రహనక్షత్రములు, యోగములు, రాసులు, కరణములు, నాదిత్యులు, వసువులు, రుద్రులు, నశ్వినులు, వాయువులు, నగ్నిహోత్రుఁడు, నింద్రప్రజాపతులు నెల్లరును భూర్భువస్స్వర్లోకములును వృక్షపర్వతములును నాగకులమును సరిత్సాగరములును సమస్తమగు భూతజాతమును స్వయముగ దివాకరునివలననే యుత్పన్నములయినవి. ఈతని యిష్టముచేతనే జంగమస్థావరాత్మకమగు సమస్తప్రపంచము నుత్పన్నమైనది. ఇటు లుత్పన్నమై నిలచి తమతమ కార్యములందుఁ బ్రవర్తించుచు సర్వప్రవర్తకుఁడగు దివాకరు ననుసరించి ప్రవర్తించుచున్నది. ఈదేవు ననుగ్రహముననే యీలోకము చేష్టలు గలిగియున్న ట్లగపడు

---

గమైర్గమ్యాః సంతి చాన్యాః సహస్రశః. ౧౯. సాంబ ఉవాచ:—యా చాక్షుగోచరా కాచిద్విశిష్టేష్టఫలప్రదా, తామేవాదౌ మమాచక్ష్వ కథయిష్యస్యథాపరామ్. ౨౦. వాసుదేవ ఉవాచ:—ప్రత్యక్షం దేవతా సూర్యో జగచ్చక్షుర్దివాకరః, తస్మాదభ్యధికా కాచిద్దేవతా నాస్తి శాశ్వతీ. ౨౧. యస్మాదిదం జగజ్జాతం లయం యాస్యతి యత్ర చ, కృతాదిలక్షణః కాలః స్మృతః సాక్షాద్దివాకరః. ౨౨. గ్రహనక్షత్రయోగాశ్చ రాశయః కరణాని చ, ఆదిత్యా వసవో రుద్రా అశ్వినౌ వాయవోఽనలః. ౨౩. శక్రః ప్రజాపతిః సర్వే భూర్భువః స్వస్తథైవ చ, లోకాః సర్వే నగా నాగాః సరితః సాగరా స్తథా, భూతగ్రామస్య సర్వస్య స్వయం హేతుర్దివాకరః. ౨౪. అస్యేచ్ఛయా జగత్సర్వ ముత్పన్నం సచరాచరమ్, స్థితం ప్రవర్తతే చైవ స్వార్థే చానుప్రవర్తతే. ౨౫. ప్రసాదాదస్య లోకోఽయం చేష్టమానః ప్రదృశ్యతే, అస్మిన్నభ్యుదితే సర్వముదేదస్త

చున్నది. ఈతఁ డుదయింప నెల్లలోకము లుదయించును. ఈతఁ డస్తమింప నన్నియును నస్తమించును. ఈవిషయ మెల్లఁ బ్రత్యక్షము జేసుకొనియే యిప్పుడు చెప్పుచున్నాను. కావున నీతనికన్న నెక్కుడగు దేవత యిందనుక లేదు. ముందు నుండఁ బోదు. ఎవ్వాఁడు నిఖిలవేదములను పరమాత్మయని విఖ్యాతుఁడయ్యెనో, యితిహాసములందుఁ బురాణములందును నంతరాత్మయన నెగడుచుండెనో యాతఁడే యీబహిఃప్రకాశుఁడగు నాత్మయై సూర్యుఁడన నెగడుచున్నాఁడు. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందుఁ గూడ నుండును. సర్వకాలముల నుండువాఁడయ్యును నస్తంగతుఁ డగుచున్నాఁడనుట యగపడకుండుటచేఁగాని వాస్తవమగు నాశముగాదు. నేఁజెప్పునది యేమి? ఇది యెల్ల రెఱింగినదియే. కావున నింతకన్నఁ బరుఁడగు దేవుఁ డెప్పుడును లేఁడు. ఉండనుబోవఁడు. సమస్త దేహధారులకుఁ బ్రవర్తకుఁడై యుండుటచేత "వాహుఁ" డని యీతఁడు విఖ్యాతుఁడై యుండుకతన నీతఁడు లేక చరాచరములందే యొక్కటియు లేదు. సకలవేదములచేతను వేదవిదులచేతను బెక్కేండ్లు శ్రమపడియు విస్తరించి చెప్పనలవిగాని యీదేవునిమహత్త్వమునే నీస్వల్పకాలమున సంక్షేపించి చెప్పఁబూనుట యసాధ్యము. అతఁ డనిరూప్యమహిముఁడు. కావుననే యీతఁడు సర్వలోకముల గుణాకరుఁడని విఖ్యాతుఁడయ్యె. ఈతఁడే సర్వప్రపంచమును శాసించువాఁడును సర్వమును నిర్మించువాఁడును సర్వమును బోషించువాఁడును నిత్యుఁడు నై యుండెను. ఈమహేశ్వరు ననుకంపవలననే మర్త్యాబ్దు లగుజంతువులు సమ్య

మితే సతి, అస్తం యాతీత్యదృశ్యేన కిమేతత్కథ్యతే మయా. ౨౬. తస్మాదతః పరం నాస్తి న భూతం న భవిష్యతి, యో వై వేదేషు సర్వేషు పరమాత్మేతి గీయతే. ౨౭. ఇతిహాసపురాణేషు అంతరాత్మేతి గీయతే, బాహ్యాత్మేతి సుషుప్తస్థః స్వప్నస్థో జాగ్రతః స్థితః.. ౨౮. అస్తం యాతీత్యదృష్టేన కిమేతత్కథ్యతే మయా, తస్మాదతః పరం నాస్తి న భూతం న భవిష్యతి. ౨౯. యస్మ వాహ ఇతి ఖ్యాతః ప్రేరకః సర్వదేహినామ్, నానేన రహితం కించిద్భూతమస్తి చరాచరమ్. ౩౦. యో వేదైర్వేదవిద్భిశ్చ విస్తరేణేహ శక్యతే, వక్తుం వర్షశతైర్నాసౌ శక్యః సంక్షేపతో మయా. ౩౧. తస్మాద్గుణాకరః ఖ్యాతః సర్వత్రాయం దివాకరః, సర్వేశః సర్వకర్తాయం సర్వభర్తాయమవ్యయః. ౩౨. జాతా మర్త్యాబ్దయః సమ్యగ్గతిమన్తో మహే

గ్గమనము గలిగియున్నవి. మఱియు నితని మండలకరణాదికము గూడ యథార్థముగ నెఱుంగుదును. అది వచింతు వినుము. ఈదేవునకు మండలము నిర్మించి ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నములం దీతని జేరియుండు వాఁడుత్తమగతిఁ బ్రాపించును. అట్టియెడ నెవఁడు మండలస్థుఁడగు దేవునిగుఱించి యథార్థభావముతో జపమొనర్చునో యాతనివిషయమున వేఱుగఁ జెప్పవలయునా? ఆతనికిఁ బలువిధములగు సిద్ధులు గలుగును. ఇందేమియు నచ్చెరియము లేదు. మండలసంస్థితుఁడును స్వదేహాపరిచ్ఛిన్నుఁడు నగునీదేవు నెవ్వాఁడజ్ఞానమోహములు లేక చూచుచున్నాఁడో యాతఁడే చూచువాఁడనఁబడును. ఇట్లు మండలదేహముల నున్న దేవుని ధ్యానించి పూజించువాఁడును జపించువాఁడు వేల్చువాఁడును సర్వకామముల ననుభవించుచు ధర్మపదమును బొందును కావున వత్సా! నీవు దుఃఖనాశమును గోరుదేని యీలోకమున భోగముల ననుభవింపను బరమగులోకమున శాశ్వతమోక్షలక్ష్మిని గైకొనను వాంఛింతేని యర్కమండలస్థుఁడవై యెల్లప్పుడు మంత్రములచే నర్కదేవు నారాధింపుము. సర్వాంగములచే నావృతమై శాస్త్రరీతిగ శోధింపఁబడిన యుత్తమస్థానమున సూర్యాకారమగుమండలమును నిర్మించి యందు సర్వశరీరావయవములునుంచి కవచముచేఁ గప్పి యస్త్రమంత్రములచే నెల్లెడల రక్షణము చేసి యారాధింపవలయును. ఇట్లు యత్నముచే నారాధించితేని యీప్సిత

---

శ్వరాత్, మండలవ్యతిరిక్తం చ జానామి పరమార్థతః. 33. తథాస్య మండలం కృత్వా యో హ్యేనముపతిష్ఠతే, ప్రాతః సాయం చ మధ్యాహ్నే స యాతి పరమాం గతిమ్. 34. కిం పునర్మండలస్థం యో జపతే పరమార్థతః, వివిధాః సిద్ధయస్తస్య భవంతి న తదద్భుతమ్. 35. మండలే చ స్థితం దేవం దేహే చైనం వ్యవస్థితమ్, స్వబుద్ధ్యైవమసంమూఢో యః పశ్యతి స పశ్యతి. 36. ధ్యాత్వైవం పూజయేద్యస్తు జపేద్యో జుహుయాచ్చ యః, స సర్వాన్ప్రాప్నుయాత్కామాన్గచ్ఛేద్ధర్మధ్వజం తథా. 37. తస్మాత్త్వమిహ దుఃఖానామంతం కర్తుం యదీచ్ఛసి, ఇహాముత్ర చ భోగానాం భుక్తిం ముక్తిం చ శాశ్వతీమ్. 38. ఆరాధయార్కమర్కస్థో మంత్రైరిహ తదాత్మని, అంగైర్వృతం వృతే చైవ స్థానే శాస్త్రేణ శోధితే. 39. కవచేన చ సంగుప్తే సర్వతోఽస్త్రేణ రక్షితే, ఏవం ప్రాప్స్యసి యత్నేన సర్వదా ఫలమీప్సితమ్.

ముల బొందఁగలవు. ఇట్లు చేసినచో నాధ్యాత్మికము నాధిభౌతికము నాధిదైవికము నగునత్యుగ్రదుఃఖత్రయము గలుగఁబోవదు. సర్వధర్మములు వర్జించి దివాకరుని బూజించువారికి భయములేదు. తూట్లుపడని యిహపరసుఖములు నిశ్చయముగ వారికిఁ గలుగును. ఈయుత్తమజ్ఞానాఖ్యానమును మున్నే బహుకాల మారాధింపఁ బ్రసన్నుఁడై యాదిత్యుఁడు నాకెఱింగించెను. ఇటు లారాధించినవానికి ధర్మధ్వజనిబద్ధమగు నుత్తమపదము లభించును. ఇయ్యది శీఘ్రముగ ఫలము నిచ్చును. అని యిట్లు సంక్షేపముగఁ జెప్పితిని. ఇది సర్వోత్తమమగుటచే నింతకన్న నుత్తమము లేదని సూర్యుఁడే స్వయముగ వచించెను ఇట నీయుపాయము సంక్షేపముగ నీకెఱింగించితిని. శరీరుల కింతకన్నఁ బరమగు హితోపాయము వేరొండు లేదు.

ఇది అష్టచత్వారింశాధ్యాయము.

---

## ఏకోనపంచాశాధ్యాయము.

వాసుదేవుఁడు మరల నిట్లనియె—తొలుత ధర్మధ్వజుఁడగు సూర్యుని సర్వోత్తమమగు నర్చనవిధానము నెఱింగింతు వినుము. అయ్యది సర్వకామముల నొసంగునదియుఁ బవిత్రమును విఘ్ననాశకమును

---

౪౦. దుఃఖమాధ్యాత్మికం నేహ తథా చైవాధిభౌతికమ్, ఆధిదైవికమత్యుగ్రం న భవిష్యతి తే సదా. ౪౧. న భయం విద్యతే తేషాం ప్రపన్నా యే దివాకరమ్, ఇహాముత్ర సుఖం తేషామచ్ఛిద్రం జాయతే సుఖమ్. ౪౨. సూర్యేణేదం మమోద్దిష్టం సాఖ్యాద్యజ్ఞానముత్తమమ్, ఆరాధితేన విధివత్కాలేన బహునా తథా. ౪౩. ప్రాప్యతే పరమం స్థానం యత్ర ధర్మధ్వజః స్థితః, ఏతత్సంక్షిప్తముద్దిష్టం క్షిప్రసిద్ధికరం పరమ్, యథా నాన్యదతోఽస్తీతి స్వయం సూర్యేణ భాషితమ్. ౪౪. ఉపాయోయం సమాఖ్యాతస్తవ సంక్షేపతస్త్విహ, యస్మాత్పరతరో నాస్తి హితోపాయః శరీరిణామ్. ౪౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యవర్ణనం
నామాష్టచత్వారింశోఽధ్యాయః.

---

వాసుదేవ ఉవాచః—అథార్చనవిధిం వక్ష్యే ధర్మకేతోరనుత్తమమ్, సర్వకామ

దురితనివారకము నై వెలయుచున్నది. అందును దొలుత సూర్యమంత్రములచే స్నానమొనరించి యావెనుక నామంత్రములచేతనే యజింపవలెఁ గావున నాదిని స్నానమును సంక్షేపముగ వచింతు వినుము. ఆచమించి శుచిముద్రచే జలమును డగ్గరి నీరాజన మొసంగి యావెనుక జలమును శోధించి హృదయమును పవిత్రముజేయుమంత్రముచే స్నానముచేసి యోకుమారా! యీవెనుక జలమునుండి లేచి యామంత్రముచే నాచమించి యామంత్రముతోడనే వస్త్రములు ధరించి రెండుతడవ లాచమించి సప్తాక్షరమంత్రముచె దేహమున జలము ప్రోక్షించి లేచి మరల నాచమించి యామంత్రజలములచే సూర్యున కర్ఘ్య మొసంగి యామంత్రముతోడనే తనసొత్తును దానముజేసి యామంత్రమును జపించి చిత్తమున నర్కుని ధ్యానించి శుద్ధమగు సూర్యునియాయతనమును జేరి యాయర్కుతనువునుగూర్చి యాగముచేయవలయును. సమాహితమనస్కుఁడై యోంకారముతోఁ బూరకకుంభకరేచకముల నొనరించి మనఃకాయసంభవములగు దోషములఁ బోఁగొట్టుకొనవలయును. ఆత్మసిద్ధికొఱకై వాయవ్యమంత్రములచేతను, నాగ్నేయమంత్రములచేతను, మాహేంద్రమంత్రములచేతను, వారుణమంత్రములచేతను, వరుసగఁ బాపశోధనము జేసుకొనవలయును. వరుణమంత్రములచేఁ బూతములగుజలములచేఁ గూడఁ బాపశోధనము జేయవలయును. అట్టులే వాయవ్యధారణచే శోషణమును నాగ్నేయధారణచే దాహమును

---

ప్రదం పుణ్యం విఘ్నఘ్నం దురితాపహమ్. ౧. సూర్యమంత్రైః పురః స్నాతో యజేత్తైనైవ భాస్కరమ్, యతస్తతః ప్రవక్ష్యామి స్నానమాదౌ సమాసతః. ౨. ఆచాంతస్తముపాలభ్య ముద్రయా శుచిశుద్ధయా, కృత్వా నీరాజనం పుత్ర సంశోధ్య చ జలం తతః. ౩. స్నానాద్ధృదయపూతేన మంత్రేణ మత్కులోద్వహ, ఉత్థాయాచమ్య తేనైవ వాససీ పరిధాయచ. ౪. ద్విరాచమ్యాథ సంప్రోక్ష్య తనుం సప్తాక్షరేణ చ, ఉత్థాయాచమ్య తేనైవ రవేః కృత్వార్ఘ్యమేవ చ. ౫. దత్వా తేన జపిత్వా తం స్వకం ధ్యాత్వార్కవద్ధృది, గత్వా చాయతనం శుభ్రమార్కమార్కీం తనుం యజేత్. ౬. పూరకం కుంభకం కృత్వా రేచకం చ సమాహితః, కృత్వోంకారేణ దోషాంస్తు హన్యాత్కాయాదిసంభవాన్. ౭. వాయవ్యాగ్నేయమాహేంద్రవారుణీభిర్యథాక్రమమ్, కిల్బిషం వారుణాద్భిశ్చ హన్యాత్సిద్ధ్యర్థమాత్మనః. ౮. శోషణం దహనం స్తంభం

నింద్రధారణచే స్తంభనమును జనధారణచేఁ బ్లావనమును జేసి శుద్ధ స్వరూపుఁడగు నాత్మను ధ్యానించి యతచిత్తుఁడై సర్వవ్యాపియగు నర్కునకు మ్రొక్కి యాధ్యానముచేతనే పంచభూతమయంబగు స్థూల సూక్ష్మాకారమైన దేహమును నింద్రియముల నాయాస్థానముల గల్పించి ఖకారాదులచే నంగవిన్యాస మొనరించి హృదాద్యక్షరములచే హృద యాదుల న్యాస మొనరింపనగును. "ఖ స్వాహా" అని సూర్యుని హృదయ మును "ఖం" అని సూర్యునిశిరమును "ఉల్కా స్వాహా" యని యర్కుని శిఖయును "హ్రైమై హుం" అని యుత్తమమగు కవచమును "ఖాం ఫట్" అని యస్త్రమును నోంకారముచే నుపక్రమోపసంహారములును జేయ వలెను. మంత్రప్రసిద్ధికిని దదొోధితకర్మప్రసిద్ధికిని దొలుత నోంకారమును నిర్దేశింపవలయును. ఈమంత్రములచే మూఁడుమారులు జలము నభి మంత్రించి యాజలముచే స్నానీయములగు ద్రవ్యములనెల్ల బాగుగఁ బ్రోక్షించి మంగళదాయకములగు గంధపుష్పాదులచే సూర్యుని బూజింప వలయును సర్వావయవములందును బూజలు సలుపవలయును. రాత్రియందగ్నిలోఁ బూజలు సలుపవలయును. ప్రాతఃకాలమునఁ బ్రాఙ్ము ఖముగను సాయంకాలమునఁ బశ్చిమాభిముఖముగను రాత్రులం దుత్తరాభిముఖముగ నుండి సప్తాక్షరమంత్రరాజమును ధ్యానించి యామంత్రముచేఁ దామరమొగ్గను వెనుకఁ జెప్పినకాలముల నాయా దిక్కులం దగ్రములు గలదిగాఁజేసి యాముకుళమున నాదిత్యమండలాం

---

ప్లావనం చ యథాక్రమాత్, వాయ్వగ్నీంద్రజనాఖ్యాభిర్ధారణాభిః కృతే సతి. ౯. ధ్యాత్వా విశుద్ధమాత్మానం ప్రణమేదర్కమాస్థితమ్, దేహం తేనైవ సంచిన్త్య పంచ భూతమయం పరమ్. ౧౦. సూక్ష్మం స్థూలం తథాక్షాణి స్వస్థానేషు ప్రకల్ప్య చ, విన్యస్యాంగాని ఖాదీని హృదాద్యాని హృదాదిషు. ౧౧. ఖస్వాహా హృదయం భానోః ఖమర్కాయ శిరస్తథా, ఉల్కా స్వాహా శిఖార్కస్య హ్రైమై చ హుం కవచం పరమ్, ఖాం ఫడస్త్రం చ సంహారశ్చాదితః ప్రణవః కృతః. ౧౨. స పూర్వే ప్రణవస్యాథో మంత్రకర్మప్రసిద్ధయే, ఏభిర్జలం త్రిధా జప్త్వా స్నానద్రవ్యాణి తేన చ. ౧౩. సంప్రోక్ష్య పూజయేత్సూర్యం గంధపుష్పాదిభిః శుభైః, తతో మూర్తిషు సర్వాసు రాత్రా వగ్నౌ ప్రపూజయేత్. ౧౪. ప్రాక్పశ్చిమోదగభ్యగ్రాం ప్రాతః సాయం నిశాసు వై, సప్తాక్షరేణ సన్మంత్రం ధ్యాత్వా చ పద్మకర్ణికామ్. ౧౫. ఆదిత్యమండలాన్తస్థం తత్ర

తర్గతమగు దేహమును కల్పింపవలయును. వెనుకటివలెనే కాంతిమండల మధ్యమున నున్న దేహమును సర్వలక్షణములతో నిండియున్నట్లును వేయికిరణములతో వెలుంగుచున్నట్లును ధ్యానించి యెఱ్ఱని గంధముల తోడ నెఱ్ఱపూవులచేతను చరువు (సూర్యునకిష్టమగుహవిర్విశేషము)ల తోడను బలులచేతను రక్తచందనమిశ్రితములై శుభములగు వస్త్రాభర ణాదులచేతను గూడియున్నట్లును ధ్యానించి యేకాగ్రచిత్తంబుతోఁ గర్మక్రమము నెఱింగి విద్వాంసుఁడు సర్వకాలముల నావాహనాదు లొనర్చి రక్ష జేయుచుండవలయును. మంత్రములతో నావాహనము జేసి యొక్కెడ స్థాపింపవలయును. యాగము ముగియువఱకు నాదేవ తాయతన సన్నిధానమున వసింపవలయును. శక్తికొలఁది పాద్యాదు లొసంగి యర్ఘ్యంబు నొసంగి విధ్యుక్తముగ జపించి ధ్యానించి యావెనుక విసర్జనము జేయవలయును. ఇయ్యది యెల్ల దేవతలకు యజనక్రమము ననుసరించి చేయవలసిన కర్మక్రమము. ఇక (జపయోగ్య దేశమును బద్మినీనాథుని యావరణములను వచింతును.) బద్మినీకాంతుని యావరణ (మండలము) మున జపస్థానము నెఱింగింతు వినుము. ముకు శమునం దాదిత్యుని రేకులయందుఁ దదంగములను వరుసగఁ బూర్వాది దిశలందుఁ జంద్రుఁడు మొదలు రాహువువఱకున్న యెనిమిదిగ్రహాము లను నుత్తరదిక్కు మొదలగు నావరణాంతరములలో విభూత్యాదిమూర్తి విశిష్టులగు లోకపాలురను స్థాపించి వరుసగ నాయామంత్రముచే

---

దేహం ప్రకల్పయేత్, ప్రభామండలమధ్యస్థం ధ్యాత్వా దేహం యథా పురా, సర్వలక్షణ సంపూర్ణం సహస్రకిరణోజ్జ్వలమ్. ౧౬. రక్తైర్గంధైశ్చ పుష్పైశ్చ చరుభిర్బలిభిస్తథా, రక్తచందనమిశ్రైర్వా వస్త్రైరావరణైః శుభైః. ౧౭. ఆవాహనాదికర్మాణి రక్షాం తు హృదయేన చ, తచ్చిత్తశ్చ సదా కుర్యాజ్జ్ఞాత్వా కర్మక్రమం బుధః. ౧౮. కృత్వా చావాహనం మంత్రైరేకత్ర స్థాపనం తతః, యావద్యాగావసానం తు సాన్నిధ్యం తత్ర కల్ప్య చ. ౧౯. దత్వా పాద్యాదికాం పూజాం శక్త్యా వార్ఘ్యం నివేద్య చ, జపిత్వా విధివద్ధ్యాత్వా తతో దేవీం విసర్జయేత్. ౨౦. ఏష కర్మక్రమః ప్రోక్తః సర్వేషాం యజనక్రమాత్, ప్రవక్ష్యామి జపస్థానం పద్మేశావరణే తథా. ౨౧. ఆదిత్యం కర్ణికా సంస్థం దలేష్వంగాని పూర్వశః, సోమాదీన్రాహుపర్యంతాన్గ్రహాంశ్చైవోదగాదితః. ౨౨. మూర్తిమల్లోకపాలాంశ్చ క్రమాదావరణేష్వథ, తదస్త్రాణి చ రక్షార్థం స్వమంత్రైః

రక్షణార్థములగు వస్త్రములనుంచి పూజింపవలయును. ప్రణవముల చేతను నర్థస్థాపకములగు మంత్రములచేతను నాలుగువిధములగు నభియోగముల చేతను బూజింపవలయును. అందఱకును మంత్రములు వెనుకఁజెప్పిన యట్టులే యని యెఱుంగుము. ఇఁకమీఁద ముద్రల నెఱిఁగింతును. వ్యోమముద్రయు, రతిముద్రయుఁ, బద్మముద్రయు, మహాశ్వేత ముద్రయు, నస్త్రముద్రయు నని యైదుముద్రలు సర్వకర్మలు ప్రకృష్టముగ సిద్ధించుటకై యేర్పఱుపఁబడినవి. రెండుచేతులను వెల్లకిలఁతగాఁ జేసి వ్రేళ్లన్నియుఁ గ్రమముగా నొండొంటితోఁ గలిపి చూపుడువ్రేలివఱకు నవియుండునట్లు జేయవలయును. అటుకాకున్న రెండుచూపుడువ్రేళ్లను సమముగనధోముఖముగనుంచి నడిమివ్రేలిమీఁదగాని యంగుష్ఠముమీఁద గాని యవి యుండున ట్లొనరించినచో నియ్యది యెల్లముద్రలలో నుత్త మమై వ్యోమముద్ర యనఁబడును. సర్వకర్మలయందును సంబంధముగలిగి యున్నది యున్నట్టు లుండుట రతిముద్ర యనఁబడును. అన్నివ్రేళ్లను బద్మమువలెఁ జాపఁబడియున్నచోఁ బద్మముద్ర యనఁబడును. సూర్యుఁడు నిత్యము రథారూఢుఁడై శీఘ్రగామియై యుండునెడ మహాశ్వేతముద్ర యాతని కిష్టమైనది. రెండుహస్తముల నూర్ధ్వముఖములుగా నుంచి యెడమబొటనవ్రేలితోఁ గలిపియుంచినచో నస్త్రముద్ర యనఁబడును. ద్రవ్యశుద్ధికొఱకును విశేషించి రక్షకొఱకు నీముద్రను ధరింపవలయును.

---

పూజయేత్క్రమాత్. ౨౩. ప్రణవైశ్చాభిధానైశ్చ చతుర్థ్యా హ్యభియోజితైః, సర్వేషాం కథితా మంత్రా ముద్రాశ్చ కథయామ్యతః. ౨౪. వ్యోమముద్రా రతిః పద్మా మహాశ్వేతాస్త్రమేవ చ, పంచముద్రాః సమాఖ్యాతాః సర్వకర్మప్రసిద్ధయే. ౨౫. ఉత్తానౌ తు కరౌ కృత్వా అంగుల్యో గ్రథితాః క్రమాత్, తర్జనీం యంతి యావత్తాః సమే వాధోముఖే స్థితే. ౨౬. తర్జన్యా మధ్యమస్యైవ జ్యేష్ఠాగ్రే వానుగోపరి, ముద్రేయం సర్వముద్రాణాం వ్యోమ ముద్రేతి కీర్తితా, సర్వకర్మసు యోగోయం తథా స్థానం ప్రకల్పతే. ౨౭. పద్మవత్ప్రసృతాః సర్వా మహాశ్వేతా రవేః స్మృతా, జవసంనిహితో నిత్యం రథారూఢో రవిః స్మృతః. ౨౮. హస్తావూర్ధ్వముఖౌ కృత్వా వామాంగుష్ఠేన యోజితౌ, ద్రవ్యాణాం శోధనే యోజ్యా రక్షార్థం చ విశేషతః. ౨౯. అనయా

ఇయ్యస్త్రముద్రచే నెల్లవస్తువులు రక్షితములై శుద్ధములై యుండును. అర్ఘ్యము నొసంగి ముద్రాధారణము జేయవలయును. పూజ ముగిసిన వెనుక విశేషముగ ముద్రను ధరింపవలయును. కార్యసిద్ధి నభిలషించువారందఱును జపావసానమునను ధ్యానాంతమునను గూడ ముద్రాధారణ మొనరించి యీవిధానమున నిచ్చలు నొక్కయబ్దము శ్రద్ధాళులరై జపింపవలయును. ఆతఁ డిహపరలోకముల నీప్సితములగు కామముల ననుభవించును. ఇందు సందియము లేదు. మఱియు రోగములచేఁ బీడింపఁబడువాఁడు రోగవిముక్తుఁ డగును. ధనహీనుఁడు ధనము బొందును. రాజ్యభ్రష్టుఁడు రాజ్యమును బొందును. పుత్త్రార్థియగువాఁడు పుత్త్రులఁ బడయును. బుద్ధిని ధారణాశక్తిని సమృద్ధిని గూడఁ బొందును. మఱియు నాతఁడు చిరకాలము జీవించియుండును. పురుషుఁడు సత్కులప్రసూతయు సురూపయు నగుకన్యను బొందఁగలుగుట నిశ్చయము. కులీనయగు యువతి సౌభాగ్యమును బొందును. కన్నియ యుత్తమగుణుఁడగు మగని జేపట్టును. విద్యలురానివాఁడు విద్యావంతుఁడగును. అని యిట్టిఫలవిశేషములను మున్ను భాస్కరుఁడే యెఱింగించియుండెను. ఈయాగము నిత్యమయినది. కావున ఫలాపేక్ష లేనివారైనను దీని నెల్లప్పు డనుష్ఠించుచుండవలయును. ఇది నిత్యమైనను దీనివలన నకామునకుఁ గూడ ధనధాన్యములును సుఖములును బ్రజాభివృద్ధియుఁ బశువృద్ధియుఁ గలుగును. మఱియు నీతనియజించు పుణ్యోత్తముఁడగు నరోత్తముఁడు భక్తినిమిత్తంబున జన్మాంతమున దివంబునకేగి యందు నుతింపఁబడుచు మహద్యశంబున

---

ముద్రయా సర్వం రక్షితం శోధితం భవేత్, అర్ఘ్యం దత్వా ప్రయోక్తవ్యా పూజాంతే చ విశేషతః. ౩౦. జపధ్యానావసానే చ యదీచ్ఛేత్సిద్ధిమాత్మనః, అనేన విధినా నిత్యం జపేదబ్దమతంద్రితః. ౩౧. స లభేతేప్సితాన్కామానిహాముత్ర నసంశయః, రోగార్తో ముచ్యతే రోగాద్ధనహీనో ధనం లభేత్. ౩౨. రాజ్యభ్రష్టో లభేద్రాజ్యమపుత్రః పుత్రమాప్నుయాత్, ప్రజ్ఞామేధాసమృద్ధీశ్చ చిరం జీవతి మానవః, సురూపాం లభతే కన్యాం కులీనాం పురుషో ధ్రువమ్. ౩౩. సౌభాగ్యం స్త్రీ కులీనాపి కన్యా చ పురుషోత్తమమ్, అవిద్యో లభతే విద్యామిత్యుక్తం భానునా పురా. ౩౪. నిత్యయాగః స్మృతో హ్యేష ధనధాన్యసుఖావహః, ప్రజాపశువివృద్ధిశ్చ నిష్కామస్యాపి జాయతే. ౩౫. తద్దైకః స్తూయతే స్వర్గే శబ్ద్యతే చ నరోత్తమః, భక్త్యా తం పూజయేద్యస్తు నరః

విరాజిల్లుచుండును. ఈలోకంబున నిఖిలకామంబు లనుభవించి జన్మాంత మున మను(సూర్య)లోకమున కేగును. ఎల్లద్విజులును నాదిత్యు ననుగ్రహమున నపూర్వతేజోవిరాజితులయి దేవసన్నిభులై యుందురు.

ఇది ఏకోనపంచాశదధ్యాయము.

## పంచాశదధ్యాయము.

వాసుదేవుఁ డిట్లనియె. సాంబా! నిత్యయజ్ఞము నెఱింగించితిని. ఇఁక మీఁద సంక్షేపముగ నైమిత్తికము నెఱింగింతును వినుము. సప్తమీతిథి యందునుపరాగములయందు నుత్తరాయణాదిసూర్యసంక్రమణములయందును నీయజ్ఞము జేయవలయును. విశేషించి శుక్లపక్షసప్తమినాఁడు పగటి వేళ నొక్కసారియే హవిస్సు నారగించి యథావిధిగ నాచమించి సంధ్యా సమయమున నమస్కృతులొనర్చి యతేంద్రియుఁడై సత్యస్మరణ మొన రించుచు నధశ్శయనుఁడై యుండవలయును. క్రింద దర్భశయనము వైచుకొని శయనించి రాత్రిగడపి వేకువనే నిద్రలేచి జలకమాడి సంయతచిత్తుఁడై సంధ్యోపాసన మొనర్చి వెనుక జెప్పినచొప్పున మంత్రమును జపింపవలయును. తరువాత నగ్నిసూర్యులను గల్పించి వహ్నిలో హోమముచేయ వలయును. సూర్యాగ్నిపరికల్పనమును తర్పణమును సంక్షేపించి విను

పుణ్యాతరః సదా. ३८. ఇహ వై కామికం ప్రాప్య తతో గచ్ఛేన్మనోః పదమ్, ద్విజాస్తస్య ప్రసాదేన తేజసా బుధసన్నిభః. ३९.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యమాహాత్మ్యవర్ణనం నామ ఏకోనపంచాశత్తమోఽధ్యాయః.

వాసుదేవ ఉవాచ—నైమిత్తికం తతో వక్ష్యే యజ్ఞాత్వా చ సమాసతః, సప్తమ్యాం గ్రహణే చైవ సంక్రాంతిషువిశేషతః. ౧.శుక్లపక్షస్య సప్తమ్యాం హవిర్భుక్త్వైవ కదా దివా, సమ్యగాచమ్య సంధ్యాయాం వారుణం ప్రణిపత్య చ. ౨. ఇంద్రియాణి చ సంయమ్య కృతం ధ్యాత్వా స్వపేదధః, దర్భశయ్యాగతో రాత్రౌ ప్రాతః స్నాతః సుసం యతః. ३.తతః సంధ్యాముపాస్యాథ పూర్వోక్తం చ మనుం జపేత్, జుహుయాచ్చ తదా వహ్నిం సూర్యాగ్నీ పరికల్ప్య చ. ४. సూర్యాగ్నికరణం వక్ష్యే తర్పణం చ సమాసతః,

పింతు వినుము. అర్చనగృహము నిర్మించి యందుఁ జొచ్చి యర్కమంత్రములచే నాదిత్యు నర్చించి యాహుతు లొనరించి దర్భాస్తరణములు వైచి పాత్రములు మొదలగు నుపకరణములను వరుసగ నంటి కొనలు గల్గి ప్రాదేశపరిమితములగు రెండుదర్భలచేఁ బవిత్రము నిర్మించి దానితో జలమును గ్రహించి పాత్రప్రోక్షణ మొనరించి పరిశుద్ధములు గావించి యవేక్షణమను సంస్కార మొనరించి (చూచి) తరువాత నుత్తరాగ్రమగు పాత్రమున నుండుచున్న కొరవిని ద్రిప్పి చుట్టు నగ్ని యుండున ట్లొనరించి (పర్యగ్నికరణ మొనరించి) పవిత్రముచే హోమద్రవ్యమగు నాజ్యమును ముమ్మారుత్పవన మొనరించి (శుద్ధిచేసి) దర్భలచేత గనుబొమలు మొదలగుమర్మములఁదుడిచి జలము ప్రోక్షించి యావెనుక నన్నింటిని వహ్నిలో హోమము చేయవలయును. అందు మునుపటివలెనే సూర్యసన్నిధానమున నుండవలయును. విద్వాంసుఁడు పాత్రము ననాచ్ఛాదితభూపృష్ఠమున నుంచక యంతరిక్షమున నిడక యొకయున్నతదేశమున హస్తలూనమగుదర్భముష్టిచే నాచ్ఛాదించి యునిచి దక్షిణహస్తంబున స్రువము (హోమసాధనము)ను గ్రహించి పావకునకు హోమములు చేయవలయును. వెనుక జెప్పినవిధులన్నియు మానసికములుగ జేయఁదగును. సూర్యుడుండుదిక్కు మొదలు సంజ్ఞయుండుదిక్కువఱకు మౌని యై నిలచి హోమము నీవలయును. మాఘసప్తమిని వరుణునకు వరుణమంత్రములతో నూరాహుతు లొసంగవలయును. శక్తికొలఁది బ్రాహ్మణులకు

---

అర్చనాగారముల్లిఖ్య ప్రవిశ్యార్చ్య జపైర్జనమ్. ౫. ప్రక్షిప్యాస్తీర్య దర్భైశ్చ పాత్రాద్యాలభ్య చ క్రమాత్, పవిత్రం ద్వికుశం కృత్వా సాగ్రం ప్రాదేశసంమితమ్. ౬. తేన పాత్రాణి సంప్రోక్ష్య సంశోధ్యాథ విలోక్య చ, ఉదగగ్రే స్థితే పాత్రే ప్రజ్వాల్యాథోల్ముకేన చ. ౭. పర్యగ్నికరణం కృత్వా తథాజ్యోత్పవనం త్రిధా, పరిమృజ్య స్రువాదీంశ్చ దర్భైః సంప్రోక్షయేత్తతః. ౮. జుహుయాత్ప్రేక్ష్య తాన్వహ్నౌ తత్రార్కం పూర్వవద్వ్రజేత్, అభూమౌ స్థితపాత్రేణ విష్టరేణ తు పాణినా, దానేన యదుశార్దూల నాన్తరిక్షే స్థలే క్వచిత్. ౯. దక్షిణేన స్రువం గృహ్యా జుహుయాత్పావకం బుధః, హృదయేన క్రియాః సర్వాః కర్తవ్యాః పూర్వచోదితాః. ౧౦. అర్కాదారభ్య సంజ్ఞార్థందద్యాత్తూష్ణీం హుతిం స్థితః, వరుణాయ శతైర్మాఘే సప్తమ్యాం వరుణం ఘుజేత్. ౧౧. యథాశక్త్యా తు విప్రేభ్యః ప్రదద్యాత్ఖణ్డవేష్టకాన్, దద్యాచ్చ

వస్త్రఖండములను దక్షిణలను నొసంగవలయును. ఇటు లొనరించెనేని యిష్టఫలములు గాంచఁగలఁడు. ఇట్టులే సూర్యుని ఫాల్గునమాసమునను వైశాఖమునను బూజింపవలయును. చైత్రమాసంబునను బూజింపవల యును. వైశాఖమాసమున నింద్రుని బ్రహ్మదేవుని బూజింపవలయును. జ్యేష్ఠమాసమున రవిని బూజించి యజింపవలయును. ఆషాఢశ్రావణము లందు నాకాశాధిష్ఠానమగు నభోదేవతను భాద్రపదంబున యముని నాశ్వినమాసంబునఁ బర్జన్యునిఁ గార్తికమాసంబునఁ ద్వష్టను యజింపవల యును. మార్గశీర్షమున మిత్రదేవతను పౌషమాసమున విష్ణువును యజింపవలయును. ఇట్లు యాగమొనరించి దేవతల నారాధించినచో ననుదినమును భక్తిశ్రద్ధాన్వితుఁడై వ్రతము సలిపి సంవత్సరానుష్ఠాన మునఁ గాంచఁదగు నిష్టఫలముల నన్నింటిని శీఘ్రముగాఁ గాంచఁగలఁడు. ఇట్టు లొక్కసంవత్సరము నిండ నొకకాంచనరథంబు జేయించి యందేడు కాంచనవాహముల నమర్చి నానాజాతులగురత్నముల నలంకరించి దాని నడుమ స్వచ్ఛమగు పదార్వన్నె బంగారముతో మంగళదర్శనమగు నాదిత్యప్రతిమ నొకదానిని నానారత్నాలంకారముల నలంకరింపఁబడి బంగరుతామరమీద నుండునట్లు చేయించి స్థాపించి యారథమున ముందటికడ నొక సారథిప్రతిమను నిలువబెట్టి వరుసగఁ బండ్రెండుమాస ములకు నధిదేవత లనఁదగు పన్నిద్దఱు బ్రాహ్మణులు పరివేష్టించి యున్న ట్లును వారినడుమ నిజాచార్యుఁ డున్నట్లును నిర్మించి శ్రుత్యుక్తధర్మము ననుసరించి పూజించి యాదిత్యునివర్ణమును స్మరించి దానిని వస్త్రముల

---

దక్షిణాం శక్త్యా ప్రాప్నోతి యాచితం ఫలమ్. ౧౨. ఏవం వై ఫాల్గునే సూర్యం చైత్రే వైశాఖ ఏవ చ, వైశాఖే మాసి ధాతారమింద్రం జ్యేష్ఠే యజేద్రవిమ్. ౧౩. ఆషాఢే శ్రావణే మాసి నభం భాద్రపదే యమమ్, తథాశ్వయుజి పర్జన్యం త్వష్టారం కార్తికే యజేత్. ౧౪. మార్గశీర్షే చ మిత్రం చ పౌషే విష్ణుం యజేద్యది, సంవత్సరేణ యత్ప్రోక్తం ఫలమిష్టందినేదినే,తత్సర్వమాప్నుయాత్క్షిప్రం భక్త్యా శ్రద్ధాన్వితో వ్రతీ. ౧౫. ఏవం సంవత్సరే పూర్ణే కృత్వా వై కాంచనం రథమ్, సప్తభిర్వాజిభిర్యుక్తం నానారత్నోపశోభితమ్. ౧౬. ఆదిత్యప్రతిమాం మధ్యే శుద్ధహేమ్నా కృతాం శుభామ్, రత్నైరలంకృతాం కృత్వా హేమపద్మోపరిస్థితామ్. ౧౭. తస్మిన్రథవరే కృత్వా సారథిం చాగ్రతః స్థితమ్, వృతం ద్వాదశభిర్విప్రైః క్రమాన్మాసాధిపాత్మభిః. ౧౮. మధ్యే కృత్వా స్వమాచార్యం పూజయిత్వా యథాశ్రుతి, సంచిన్త్యాదిత్యవర్ణం వై వస్త్ర

చేతను రత్నాదులచేతను నలంకరించి పూజింపవలయును. ఇట్లు మాసాధిపతులగువిప్రులను లెస్సగఁ బూజించి యావెనుక నాచార్యునకు రథమును ఛత్రమును గ్రామమును మంగళాకారయగు గోవును భూమిని నివేదింపవలయును. మాసాధిపులు పన్నిద్దఱకు నశ్వరాజములు నివేదింపవలయును. ఇప్పగిదిని భక్తిభరితుఁడై యథాశక్తిగ బంగారము మణులు మొదలగుభూషణములను నాదేవునకు నాచార్యాదులకు నొసంగి నమస్కరించి వ్రతము సమాప్తమయ్యెనని నివేదింపవలయును. ఆటుపైని వ్రతము చేయకయున్నను దోషముండదు. ఇట్టులగుగాతవఃని విప్రబృంబారకనాథులు నాచార్యుఁడు ననుమతింప వారలవాంఛితములనెల్ల శక్తికొలఁది నొసంగి "సంతోషింత్రుగాక" యని ప్రార్థింపవలయును. వత్సా! సూర్యు నేకామముచే వ్రతము నొనరించి పూజించితివో యాయాకామమును నీకిచ్చును. వ్రతము గూడ సంపూర్ణమగును. భాస్కరుఁడు బ్రాహ్మణరూపములచే స్వయముగ నాచార్యులందుఁ బ్రవేశించుచున్నాఁడు. కావున నాచార్యబ్రాహ్మణపూజాతోషితుఁడై పరలోకసుఖము గూడఁ దప్పక యొసంగును. అని యిట్లు భానుమూర్తి స్వయముగ వచించెను. గుణవంతులగు విప్రులకును విశేషించి నిర్ధనులకును దీనులకు నంధులకుఁ గృపణులకును యథాశక్తి దక్షిణ నొసంగి బ్రాహ్మణులకు భోజనమిడి వ్రతమును బూర్తిచేయవలయును. ఇట్లైయంగున సప్తమీవ్రతము నొక్కయేడాది జరిపినచో రాజయి ధార్మిక

---

రత్నాదినార్హయేత్. ౧౯. ఏవం మాసాధిపాన్విప్రాన్సంపూజ్యాథ నివేదయేత్, ఆచార్యాయ రథం ఛత్రం గ్రామం గాశ్చ మహీం శుభామ్. ౨౦. అశ్వాన్మాసాధిపేభ్యస్తు ద్వాదశభ్యో నివేదయేత్, ఏవం భక్త్యా యథాశక్త్యా హేమరత్నాదిభూషణమ్. ౨౧. దత్వా తస్య నమస్కృత్య వ్రతం పూర్ణం నివేదయేత్, అత ఊర్ధ్వం న దోషోఽత్ర వ్రతస్యాకరణేష్వపి. ౨౨. ఏవమస్త్వితి విప్రేంద్రైః సహాచార్యైః పునః పునః, ఋహీష్వాశైచవాశిషో దత్వా ప్రవదేత్ప్రీయతామితి. ౨౩. ఆదిత్యో యేన కామేన త్వయా ఆరాధితో వ్రతైః, తుభ్యం దదాతు తం కామం సంపూర్ణం భవతు వ్రతమ్. ౨౪. ఆచార్యాన్విప్రరూపైస్తు ప్రవిష్టో భాస్కరః స్వయమ్, దాస్యత్యేవ పరం కర్తుమిత్యుక్తం భానునా స్వయమ్. ౨౫. విప్రేభ్యో గుణవద్భ్యశ్చ నిస్స్వేభ్యశ్చ విశేషతః, దీనాంధకృపణేభ్యశ్చ శక్త్యా దత్వా చ దక్షిణామ్, బ్రాహ్మణాన్భోజయిత్వా చ వ్రతమేతత్సమాపయేత్. ౨౬. కృత్వైవం సప్తమీమబ్దం రాజా భవతి ధార్మికః, పురుషః

పురుషుఁడగును. స్త్రీలు మహారాజులకుఁ బ్రియురాండ్రగుదురు. నూఱామడ వైశాల్యము గలిగి శత్రువులు లేకయుఁ జోరాదులవలని బాధ లేకుండను మండలవిభాగముతో నుండను రాజ్యము నొనరించి నూఱేండ్లకుఁ బైఁబడినకాలమువఱకు సుఖియై భోగము లనుభవించును. ధనము లేకున్నను భక్తిపరుఁడు తామ్రమయమగు రథమును నిర్మించి యీవలెను. వ్రతావసానమునఁ బూర్వోక్తక్రమముగ సర్వకార్యముల నిర్వర్తించి యెనుబదియామడలు వైశాల్యముగల భూమండలమునకు రాజై యుండును. ఇట్టులే ధనహీనుఁడగు నేమానవుఁడు పిష్టమయంబుగ రథం బొనరిచి వెనుకఁజెప్పినవిధి ననుష్ఠించునో యాతఁడు నరువదియోజనముల వైశాల్యముగల భూమండలము నేలి నిఖిలభోగము లనుభవించి దీర్ఘాయువై వ్యాధిలేనివాఁడై సుఖించుచు జన్మాంతంబున నర్కమండలముఁ జొచ్చి కల్పాంతకాలము నట వసించి మగిడి యిహలోకమున కేతెంచి వెనుకఁజెప్పినఫలముల నెల్ల ననుభవించును. ఇట్టులే భక్తి కలిగి బాహ్యకర్మ మొనరుపఁజాలకున్నను మానసికముగనేని యొనరింపవలయును. అట్టులు సర్వకాలావస్థలందు నేమఱక యర్కయజ్ఞమును మానసికముగ నొనర్చువాఁడు నీలోకమున నొకప్పుడేని వ్యాధుల కెడమీకుండును. మఱియు నాదిత్యుని నీహారపటలంబు చేరఁజాలనిమాడ్కి నాపదలు నట్టివానిని జేరియుండఁజాలవు. సంకల్పమాత్రముననే యిట్టిఫలము లభించుచుండ నియమపూర్వకముగ వ్రతానుష్ఠాన మొనరించుచు మంత్రరక్షితుఁడై యుండువానియెడ వేఱుగఁ జెప్పవలయునా? దీనిమహత్త్వమిట్లుండుటచే నెల్లవారును గల్పచోదితమగు విధానము నెఱింగి యనా

---

స్త్రీ భవేద్రాజ్ఞాం తాదృశామథ వల్లభా. ౨౭. శతయోజనవిస్తీర్ణం నిఃసపత్నమకంటకమ్, నిష్పన్నమణ్డలం భుంక్తే సాగ్రం వర్షశతం సుఖీ. ౨౮. విత్తహీనోఽపి యో భక్త్యా కృత్వా తామ్రమయం రథమ్, దద్యాద్వ్రతావసానే తు కృత్వా సర్వం యథోదితమ్, సోఽశీతియోజనం భుంక్తే విస్తీర్ణం మణ్డలం నృపః. ౨౯. ఏవం పిష్టమయం యోఽపి విత్తహీనః కరోతి నా, అషష్టియోజనం భుంక్తే దీర్ఘాయుర్నీరుజః సుఖీ, సూర్యలోకే చ కల్పాంతం యావత్థిత్వేదమాప్నుయాత్. ౩౦. మనసాపి చ యో భక్త్యా యజేదర్కమతంద్రితః, సర్వావస్థాసు సోఽప్యత్ర వ్యాధిభిర్ముచ్యతే భృశమ్. ౩౧. ఆపదో న స్పృశంత్యేనం నీహారా ఇవ భాస్కరమ్, కిం పునర్వ్రతసంపన్నం భక్తం మంత్రైశ్చ రక్షితమ్. ౩౨. యత ఏవం తతో జ్ఞాత్వా విధానం కల్పచోదితమ్, సుఖేన ఫలసిద్ధ్యర్థం

యాసముగ వాంఛితఫలములు సిద్ధించుటకై యించుకేని లోటులేకుండ నీవ్రతము ననుష్ఠింపఁదగుదురు. ఓసాంబా! శుభప్రదంబగు నీవ్రత రాజము సూర్యభగవానునివలన మున్నే నెఱింగితిని. ఈకల్పము మొదటి కల్పమున నెల్లకాలము నాచే రక్షితమై రహస్యముగ నుండెను. కుమారా! ఉత్తమఫలములఁ గోరుమానవు లీవిధానము ననుసరించి పరిశుద్ధచిత్తులై త్వరితముగ భానుమూర్తి నారాధింపవలయును. ఈభాస్కర దేవు ననుగ్రహంబుననే వేలకొలఁది పుత్రరత్నముల నే గాంచితిని. అసురులనెల్ల నిర్జించితిని. దేవతాగణముల జోహారు లందికొనియుంటిని. నీవును నీకల్పరాజమును సురక్షితము గావించుకొనుము. ఇయ్యది సూర్య సమ్మతమగుటచే నేతత్కల్పప్రభావమున నాదిత్యుఁ డెల్లప్పుడును సన్నిధాన మొసంగును. ఈనాసుదర్శనాయుధము సూర్యకిరణాధిష్ఠితమై యుంటచేతనే దీనిచే సురాసురులు నరులు నురగులు నిర్జితులైరి. అట్లు కాదేని యీచక్రము నిష్ప్రభమై నిష్ప్రయోజనమే యగును. నేను సర్వకాలావస్థలందు నీదేవోత్తముని జపించుచు యజించుచు ధ్యానించుచు నుండుటంజేసి యెల్లకామములకు నర్హునీయుఁడనైతిని. ప్రతాపమున సర్వాతీతుఁడనైతిని. నీవును మానసికకర్మచేఁగాని వాచికకర్మచేఁగాని కాయికచేష్టచేఁగాని భక్తితో దీని నభ్యసింపుము. వెనుకఁజెప్పినవిధానము నాదరింపుము. అట్టులొనరించితేని ఫలసిద్ధియేర్పడును. పుత్రకా! యేమానవుఁ డీకల్పరాజము నాదినుండి శ్రద్ధాభక్తిసమన్వితుఁడై యాకర్ణించునో

---

కుర్యాత్సర్వమశేషతః. 33. ఇత్యేతత్కథితం సాంబ పురా సూర్యేణ మే శుభమ్, కల్పోఽయం ప్రథమే కల్పే సర్వదా గోపితో మయా. 34. అనేన విధినా వత్స విశుద్ధేనాంతరాత్మనా, భానుమారాధయేత్క్షిప్రం యదీచ్ఛేత్ఫలముత్తమమ్. 35. మయాస్యైవ ప్రసాదేన ప్రాప్తాః పుత్రాః సహస్రశః, అసురా నిర్జితాశ్చైవ సురాః సర్వే వశీకృతాః. 36. త్వయాప్యయం గోపితవ్యః కల్పః సూర్యస్య సంమతః, ప్రసాదాదస్య కల్పస్య సదా సన్నిహితో రవిః, చక్రేఽస్మిన్నిర్జితా యేన సురాసురనరోరగాః. 37. యది నాధిష్ఠితం చక్రమిదం సూర్యాంశుభిః స్వయమ్, సతతం స్యాత్ప్రభాయుక్తం కథ మధ్యాహతం భవేత్. 38. అహమేతం జపన్నిత్యంయజన్ధ్యాయంశ్చ శక్తితః, జాతోఽస్మి సర్వకామానాం పూజ్యః శ్రేష్ఠశ్చ తేజసా. 39. త్వమభ్యస్యైవ మనసా వాచా వా కర్మణాపి వా, కురుభక్తిమనేనైవ విధినా ఫలసిద్ధయే. 40. శృణుయాద్భక్తియుక్తో యో

యెవ్వాఁడీసప్తమీవ్రతము ననుష్ఠించునో యాతఁడు నాతండును సమస్తకామితముల ననుభవించి యారోగ్యవంతుఁడై యెల్లెడల జయమునే గాంచుచుండును. మఱియు నాతఁడు జన్మాంతమున నుత్తమలక్ష్మీ సనాథుఁడై యాదిత్యునిసదస్సును జేరియుండును.

ఇది పంచాశత్తమాధ్యాయము.

## ఏకపంచాశత్తమాధ్యాయము.

వాసుదేవుఁడు సాంబునకు మఱియు నిట్లనియె. యదుకులదీపా! మాఘశుక్లపక్షంబునఁ బంచమినాఁ డెల్లకాలము నేకభుక్త మొనరించి షష్ఠినాఁడు నక్తాహార మొనర్పవలయుననియు సప్తమి నుపవసింపవలయు ననియుఁ గొందఱు తలంతురు. ఉపవాసము షష్ఠినాఁడనియుసప్తమియందుఁ బారణమనియు మఱికొందఱి యాశయమైయున్నది. పండితుండగు మానవుఁడు షష్ఠినాఁ డుపవాస మొనరించి రక్తచందనాదులచేతను గన్నేరు పువ్వులచేతను భాస్కరుని బూజింపవలయును. మఱియు నోమహాభుజా! సువ్రతా! గుగ్గిలముచేతను సుగంధవృక్షముల నిర్యాసములచేతను ధూపము లొసంగవలయును. ఇట్లు మంగళకారణుఁడును జ్యోతిష్మంతుఁడును దేవదేవుఁడును నగు రవిని బూజింపవలయును. ఈవిధముగ

---

నరః శ్రద్ధాసమన్వితః, విధానమాదితః పుత్ర సప్తమీం కురుతే చ యః. ౭౧. సేహ ప్రాప్యాఖిలం కామమారోగ్యం చ జయం తథా, భార్గవ్యా పరయా యుక్తో గచ్ఛేత్సౌరోచనం సదః. ౭౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సప్తమీమాహాత్మ్యవర్ణనం నామ
పఞ్చాశత్తమోఽధ్యాయః.

వాసుదేవ ఉవాచః—మాఘస్య శుక్లపక్షే తు పఞ్చమ్యాం మత్కులోద్వహ, ఏకభక్తం సదాఖ్యాతం షష్ఠ్యాం నక్తముదాహృతమ్. ౧. సప్తమ్యాముపవాసం తు కేచిదిచ్ఛంతి సువ్రత, షష్ఠ్యాం కేచిద్వదంతీహ సప్తమ్యాం పారణం కిల. ౨. కృతోపవాసః షష్ఠ్యాం తు పూజయేద్భాస్కరం బుధః, రక్తచందనమిశ్రైస్తు కరవీరైశ్చ సువ్రత. 3. గుగ్గులేన మహాబాహో సంయావేన చ సువ్రత, పూజయేద్దేవదేవేశం శంకరం భాస్కరం

మాఘమాసము మొదలు నాలుగుమాసములు భాస్కరు నారాధింప వలయును. ఆత్మశుద్ధ్యర్థమై గోమయప్రాశన మొనరుపవలయును. ఆత్మశుద్ధికొఱకే గోమయమిశ్రతోయముల జలకమాడవలయును. అపారమహిమోపేతులగు బ్రాహ్మణులకు శక్తికొలఁది విందుచేయవలయును. జ్యేష్ఠము మొదలగుమాసములందు శ్వేతచందనము నుపయోగింపవలయును. పరిశుద్ధములై శుభపరిమళమిళితములగు తెల్లనిపుష్పములతోఁ బూజింపవలయును. కృష్ణాగరుధూపము నొసంగవలయును. పాయసము నివేదింపవలయును. దానినే సంతుష్టాంతరంగులగు బ్రాహ్మణులకు భోజనమునకై యొసఁగవలయును. పంచగవ్యముతో స్నానప్రాశనములొనర్పవలయును. కార్తికాదిమాసములం దగస్తికుసుమములతోఁబూజలు సలుపవలయును. అపరాజితములచే ధూప మొసంగవలయును. గుడాపూపములను జెఱకురసమును నివేదింపవలయును. వానిచేతనే శక్తికొలంది బ్రాహ్మణులకుఁగుడువంబెట్టవలయును కుమారా! నీవు నిట్టులేయొనర్పుము. మఱియు నాత్మవిశుద్ధికై కుశకూర్చోదకముతో స్నానమును ప్రాశనమును జేయుము. ఓధీనిధీ! యిట్టులు వ్రత మొనరించుచు మూఁడవపారణము ముగిసినపిదప మాఘమాసమున వెనుకటికన్న రెండురెట్లధికముగ భోజనదానములు చేయవలయునని చెప్పుదురు. అట్టులే విద్వాంసులు శక్తివంచనము లేకుండునట్లు దేవదేవుఁడగు దివాకరునకుఁ బూజలునేయ

---

రవిమ్. ౪. ఏవం హి చతురో మాసాన్మాఘాదీన్పూజయేద్రవిమ్, ఆత్మనశ్చాపి శుద్ధ్యర్థం ప్రాశనం గోమయస్య చ. ౫. స్నానం చ గోమయేనేహ కర్తవ్యం చాత్మశుద్ధయే, బ్రాహ్మణాన్దివ్యభోమాంశ్చ భోజయేచ్చాపి శక్తితః. ౬. జ్యేష్ఠాదిష్వథ మాసేషు శ్వేతచందనముచ్యతే, శ్వేతాని చాపి పుష్పాణి శుభగంధాన్వితాని వై. ౭. కృష్ణాగరుస్తథా ధూపో నైవేద్యం పాయసం స్మృతమ్, తేనైవ బ్రాహ్మణాంస్తుష్టాన్భోజయేచ్చ మహామతే. ౮. ప్రాశయేత్పఞ్చగవ్యం తు స్నానం తేనైవ పుత్రక, కార్తికాదిషు మాసేషు అగస్తికుసుమైః స్మృతమ్. ౯. పూజయేన్నరశార్దూల ధూపైశ్చైవాపరాజితైః, నైవేద్యం గుడపూపాస్తు తథా చేక్షురసం స్మృతమ్. ౧౦. తేనైవ బ్రాహ్మణాంస్తాత భోజయస్వ స్వశక్తితః, కుశోదకం ప్రాశయేథాః స్నానం చ కురు శుద్ధయే. ౧౧. తృతీయే పారణస్యాంతే మాఘే మాసి మహామతే, భోజనం తత్ర దానం చ ద్విగుణం సముదాహృతమ్. ౧౨. దేవదేవస్య పూజా చ కర్తవ్యా శక్తితో బుధైః, రథస్య చాపి

వలయును. మఱియు నోసువ్రతా! విభవముండునపుడు వ్రతసిద్ధికై రథ యాత్ర జేయవలయును. రథదాన మొసంగవలయును ఐశ్వర్యమున్న నాఁడు లోభింపక వెనుక జెప్పినరథమును బంగారముతో నిర్మించి యీవలయును ఓపుత్రరత్నమా! యీయుత్తమశుభకల్పము రథసప్తమీకల్పమనియు మహాసప్తమి యనియు విఖ్యాతమై యతి పవిత్రమై యభివృద్ధికరమై యున్నది. ఇందుపవసించుమానవుఁడు ధనపుత్రులను సత్కీర్తి నాత్మవిద్య మొదలగు విద్యలను బడసి నిఖిలమహీమండలమున విఖ్యాతుఁడగు. కాంతిచేఁ జంద్రుని దిరస్కరించుచు వెలుఁగుచుండును.

ఇది ఏకపంచాశత్తమాధ్యాయము.

## ద్విపంచాశత్తమాధ్యాయము.

అని యివ్విధమున శంఖచక్రగదాప్రభృతులగు నాయుధములు ధరించిన దేవోత్తముఁడగు నాభగవంతుఁడు సాంబున కీవృత్తాంతంబువినిచి యాతఁడు చూచుచుండఁగనే యంతర్హితుఁ డయ్యెను. ఇట సాంబుఁడును విధ్యుక్తముగ రథసప్తమి యనఁదగు సప్తమిని బూజించి యాధులకు వ్యాధులకు దూరుఁడై త్వరితముగ నిజమందిరమున కేగెను. అని యిట్లు సుమంతుఁడు శతానీకున కెఱింగింప నాతఁడు సుమంతునిదిక్కు మొగంబై

దానం తు రథయాత్రా తు సువ్రత. ౧౩. వ్రతస్య ప్రాప్తిహేతోర్వై కర్తవ్యా విభవే సతి, దానం స్వర్ణరథస్యేహ యథోక్తం విభవే సతి, ఇత్యేషా కథితా పుత్ర రథాహ్వా సప్తమీ శుభా. ౧౪. మహాసప్తమీ విఖ్యాతా మహాపుణ్యా మహోదయా॥ యాముపోష్య ధనం పుత్రాన్కీర్తిం విద్యామవాప్నుయాత్. ౧౫. తథాఖిలం కువలయం చన్ద్రేణ చ సమోర్చిషా. ౧౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే మహాసప్తమీవ్రతవర్ణనం నామ ఏకపఞ్చాశత్తమోఽధ్యాయః.

సుమంతురువాచః—ఇత్యుక్త్వా భగవాన్దేవః శంఖచక్రగదాధరః, అన్తర్ధానం గతో వీర సాంబస్యేహ ప్రపశ్యతః. ౧. సాంబోఽపి కృత్వా విధివత్సప్తమీం రథసప్తమీమ్, ఆధిభిర్వ్యాధిభిర్ముక్తో జగామాశు స్వమందిరమ్. ౨. శతానీక ఉవాచః—

"మహాత్మా! రథయాత్ర యొనరుపవలసినవిధమును రవి యధిరోహించు రథమును జేయవలయువిధంబును దెలుపఁగోరెదను. ఈమర్త్యలోకమున రథయాత్రను బ్రవర్తింపఁజేసినవా రెవ్వరు? సవిస్తరముగఁ దెలుపనగును. అని యడుగ నాతఁడు శతానీకున కిట్లనియె. రాజా! నీయడిగినయర్థంబు మున్ను రుద్రుండు పద్మసంభవుఁడగు ప్రజాపతి నడిగియుండె నది వినుము. ఓకురువంశవ్యాఘ్రా! మున్నొకప్పుడు మేరుశిఖరంబున సుఖముగ నాసీనుఁడై యున్న పద్మాసనుండును పద్మయోనియు నగు ప్రజాపతిని దర్శించి దేవోత్తముఁడగురుద్రుండు భక్తితోఁ బ్రణమిల్లి వినయవినమితోత్తమాంగుండై యాతని కిట్లనియె. పితామహా! యేదేవుఁడు నిజతేజోవిశేషంబుచే నెల్లలోకంబుల వెలిఁగించుచుండెనో యట్టిభాస్కరదేవుఁడు రథారూఢుఁడై నిర్మలదేహుఁడై యెల్లప్పుడు నెట్లు సంచరించునో యానతీవే యనఁ బితామహుఁ డిట్లనె. ఓమహాదేవా! ముక్కంటిదేవరా! సూర్యుఁడు రథారూఢుఁడై యెల్లప్పుడు ద్యులోకమున భ్రమించు తెఱంగును తేరుతెఱంగు నెఱింగింతు నాకర్ణింపుము. సూర్యుఁ డొంటిచుట్టు గలిగి యైదంచులుగలిగి మూఁడుసుడులుగలదై సుందరమై స్వర్ణమయమయి యెనిమిదిపట్టలుగల యొంటియంచు గలచక్రముగలిగి దేదీప్యమానమగు తేరెక్కి దివమున సంచరించుచున్నాఁడు. ఆరథపువైశాల్యము పదివేలామడలని వక్కాణించుచున్నారు. రథమునంటియున్న నొగ (పోలుకట్టు) యేఁడికోలకు మూఁడింతలై విస్తీర్ణమయి యుండును. అం

---

రథయాత్రా కథం కార్యా రథః కార్యః కథం రవేః, కేనేహ మర్త్యలోకేషు రథయాత్రా ప్రవర్తితా. ౩. సుమంతురువాచ:—ఇమమర్థం పురా పృష్టః పద్మయోనిః ప్రజాపతిః, రుద్రేణ కురుశార్దూల ఆసీనః కాంచనే గిరౌ. ౪. పద్మాసనం పద్మయోనిం సుఖాసీనం ప్రజాపతిమ్, ప్రణమ్య శిరసా దేవో రుద్రో వాచముదైరయత్. ౫. శ్రీరుద్ర ఉవాచ.— య ఏష భగవాన్దేవో భాస్కరో లోకభాస్కరః, కథమేష భ్రమేద్దేవో రథస్థో విమలః సదా. ౬. బ్రహ్మోవాచ.—యథా దివి భ్రమేత్తాత రథారూఢో రవిః సదా, తథా తే వర్తయిష్యేఽహం రథం చాస్య త్రిలోచన. ౭. రథేనైకచక్రేణ పఞ్చారేణ త్రిణాభినా, హిరణ్మయేన కాంతేన అష్టబంధైకనేమినా. ౮. చక్రేణ భాస్వతా చైవ దివి సూర్యః ప్రసర్పతి, దశయోజనసాహస్రో విస్తారోఽప్యస్య కథ్యతే. ౯. త్రిగుణా చ రథోపస్థాదీషా దణ్డప్రమాణతః, యుగమస్య

దనూరుఁడు గూరుచొని సారథ్య మొనరించుచుండును. దివ్యతేజోవిరాజమానమై బంగారువికారమగు కాడి యుండును. అందు వాయువేగములగు నశ్వములఁ గూర్తురు. గాయత్రీప్రభృతులగు వేదచ్ఛందస్సులు నశ్వరూపములై యున్నవి. చక్రముండుప్రక్కన నశ్వములు నిబద్ధములగును. ఇట్లు మహోన్నతమై భాస్వంతమగురథము నధిరోహించి దివస్పతి యాకసమునఁ బరిభ్రమించును. తరువాత నీభాస్కరునిరథమునందలి యవయవవివేకము నెఱుంగుము. ఈయంగములన్నియు సంవత్సరావయవములచేఁ గల్పితములైనవి. వరుసగ నెఱుంగవలయును. చక్రముననున్న మూఁడునుడులును గ్రీష్మవర్షాశీతములను మూఁడుకాలములనియుఁ బంచారములు ఋతుపంచకమనియు నేమి యారవఋతువనియు నెఱుంగవలయును. రథముననున్న వేదికలు రెండు నుత్తరదక్షిణాఖ్యమగు నయనద్వయమని యెఱుంగునది. పగ్గములు ముహూర్తము లనఁబడును. ఇరుసుననున్న చీలలు కళలనఁబడును. రథముయొక్కమూలలు కాష్ఠలనఁబడును. (పదునెన్మిది నిమేషము లొక కాష్ఠ యనఁబడును. ఆకాష్ఠలు ముప్పది చేరిన నొక్కకళ యగును. అట్టికళలు ముప్పది చేరిన నొకక్షణమగును. ఆక్షణములు పండ్రెండొక్క ముహూర్తము). ఇరుసుకఱ్ఱ క్షణము లనఁబడును. కాడికఱ్ఱకు నిరుసునకుఁ గట్టుత్రాడు కర్షమనఁబడును. ఆరథకర్షములు నిమేషములనఁబడును. నొగ లవము లనఁబడును. రథము నాచ్ఛాదించుచర్మము వరూథము నాఁబడు. అయ్యది రాత్రి. ఊర్ధ్వముఖముగఁ గట్టఁబడినధ్వజము ధర్మమనఁబడును. కాఁడియంచులను నందలి

తు విస్తీర్ణమరుణో యత్ర సారథిః. ౧౦. ప్రాసంగః కాంచనో దివ్యో యుక్తః పవనగైర్హయైః, ఛన్దోభిర్వాజిరూపైస్తు యతశ్చక్రం తతః స్థితైః. ౧౧. యేనాసౌ పర్యటేద్వ్యోమ్ని భాస్వతా తు దివస్పతిః, అథైతాని తు సూర్యస్య ప్రత్యంగాని రథస్య తు. ౧౨. సంవత్సరస్యావయవైః కల్పితాని యథాక్రమమ్, నాభ్యస్త్రీస్త్రస్తు చక్రస్య త్రయః కాలాః ప్రకీర్తితాః. ౧౩. అరాః పఞ్చర్తవస్తస్య నేమ్యః షడృతవః స్మృతాః, రథవేదీ స్మృతే తస్య అయనే దక్షిణోత్తరే. ౧౪. ముహూర్తా ఇషవస్తస్య శమ్యాశ్చాస్య కలాః స్మృతాః, తస్య కాష్ఠాః స్మృతాః కోణా అక్షదండః క్షణాః స్మృతాః.౧౫. నిమేషాశ్చాస్య కర్షాః స్యాదీషాదండో లవాః స్మృతాః, రాత్రిర్వరూథో ధర్మోఽస్య ధ్వజ ఊర్ధ్వం ప్రతిష్ఠితః. ౧౬. యుగాక్షకోటీ తే తస్య అర్థకామావృభౌ

రంధ్రములును నర్థకామము లై యున్నవి. అశ్వరూపములై గాయత్రి, త్రిష్టుబ్, జగతి, అనుష్టుప్, పంక్తి, బృహతి, ఉష్ణిక్ అను నేడు ఛందస్సులును వామభాగముననుండి రథము మోయుచున్నవి. చక్రము (చుట్టు) యిరుసుకుండ సమర్పఁబడియున్నది. ఆకుండయును ధ్రువమగునిరుసునఁ జేర్పఁబడియున్నది. కావునఁ జక్రసమన్వితమై యక్షము భ్రమించుచున్నది. ఆయక్షము నిరుసుకట్టును జుట్టియే భ్రమించుచున్నది. ఇట్లు చక్రము తిరిగిన నక్షము నిరుసుచుట్టును దిరుగుచుండుటచే నీరెండిటికి నొండొంటితో సంబంధము స్థిరమగుకతన వియుక్తములై యుండనేరవు. ఆరెండును జేరియే ధ్రువమునాశ్రయించి భ్రమినొందును. ఇట్టియక్షము నాధారము జేసుకొని రథసన్నివేశ మేర్పడినది. ఇట్లు చక్రాక్షాదిసంయోగములచే నేర్పడిన భాస్వద్రథరాజము నాయత్తపఱచి యధిరోహించి నిఖిలలోక నుతుండగు నాదేవోత్తముఁడు నభోమార్గంబున నెల్లవేళలఁ జరించుచుండును. కాడియంచులకును నిరుసుకుండలయంచులకును గట్టఁబడిన రెండురథరశ్ములు ధ్రువమునందు భ్రమించుచున్నవి. ఆపగ్గములు చక్రమునకు కాడికిని సంబంధించి తిరుగవు. సూర్యుఁడు రథారూఢుఁడై మండలాకారములుగఁ దిరుగుచుండును. ఆరథము మండలపునలుదిక్కులను గుమ్మరిచక్రమువలెఁ దిరుగుచుండును. రథపుదక్షిణపార్శ్వమున యుగాక్షములయంచులు ఋగ్యజుస్సులచేఁ బట్టువడి చక్రము నశ్వములునులేకుండ ధ్రువమునందు రశ్మి లమర్పఁబడియుండును. ఉత్తరాయణ

---

స్మృతౌ, అశ్వరూపాణి చ్ఛందాసి వహంతే వామతో ధురమ్. ౧౭. గాయత్రీ చైవ త్రిష్టుప్ చ జగత్యనుష్టుబేవచ, పంక్తిశ్చ బృహతీ చైవ ఉష్ణిగేవ తు సప్తమీ. ౧౮. చక్రమక్షనిబద్ధం తు ధ్రువే చాక్షః సమర్పితః, సహచక్రో భ్రమత్యక్షః స చాక్షో భ్రమతి ధ్రువే. ౧౯. అక్షః సహైవ చక్రేణ భ్రమతేఽసౌ ధ్రువే స్థితః, ఏవమక్ష వశాత్తస్య సంనివేశో రథస్య తు. ౨౦. తథా సంయోగభావేన సంసిద్ధో భాస్కరో రథః, తేన చాసౌ రవిర్దేవో నభః సంసర్పతే సదా. ౨౧. యుగాక్షకోటిసంబద్ధే ద్వే రశ్మీ స్యందనస్య తు, ధ్రువే తే భ్రమతో రశ్మీ న చక్రయుగయోస్తు వై. ౨౨. భ్రమతో మండలాన్యస్య రవేరస్య రథస్య తు, కులాలచక్రవద్యాతి మణ్డలం సర్వతోదిశమ్. ౨౩. యుగాక్షకోటీ తే తస్య దక్షిణే స్యందనస్య తు, ఋగ్యజుర్భ్యాం గృహీతేన విచక్రాశ్వేన వై ధ్రువే. ౨౪. హ్రసేతే తస్య రశ్మీ తు మణ్డలేషూత్తరాయణే, దక్షిణేఽథ సమృద్ధే

మున రథపుమండలసంచారములందుఁ బగ్గములు కురుచలగును. దక్షిణాయనమున మండలభ్రమణములం దవి సమృద్ధములై యుండును. మండలములందు రథమునందలి యుగాక్షములకొనలు భ్రమించుచుండును. రథము నలుదిక్కులను గలిసి కలియనివిధమున మండలముగఁ దిరుగుచుండును. ధ్రువమునఁ దగిల్చినపగ్గములు లాగినచో సమముగ నిలచియుండును. అప్పుడు దేవుఁడు మండలముల నడుమనడుమయే భ్రమించును. మరల ధ్రువమునుండి యాపగ్గములు సడలవిడిచినచో వెలుపల దూరదూరముగ మండలములఁ దిరుగుచుండును. రెండయనములలో (రెండుకాష్ఠలకాలములో) నెనిమిదివేలమండలముల రథారూఢుఁడై దేవదేవర్షిసనాథుఁడై విశేషముగ భ్రమించును. గంధర్వులచేత నప్సరోగణములచేతను సర్పములచేతను నాయకులచేతను రాక్షసులచేతను బరివేష్టితుఁడై వరుసగ నొక్కొకగణముతో రెండేసినెలలు సూర్యుఁడు మండలములఁ జరించుచుండును. ధాతయు నర్యముఁడును బులస్త్యపులహులను ప్రజాపతులును ఖండకుండును వాసుకియుఁ గర్ణరశ్మియుఁ దుంబురునారదులను గానవిశారదులగు గంధర్వులును క్రతుస్థలయుఁ బుంజికస్థలయు ననునిద్దరచ్చరలును రథకృత్స్నరథౌజులను నశ్వతరకులజులగు గ్రామణులును రక్షోహేతియుఁ బ్రహేతియు ననునిరువురు రక్కసులును ననునీగణము మధు (చైత్ర) మాసమునను

---

తు భ్రమతో మణ్డలాని తు. ౨౫. యుగాక్షకోటీ తే తస్య భ్రమే తే స్యందనస్య తు, సక్తాసక్తం చ భ్రమతే మణ్డలం సర్వతోదిశమ్. ౨౬. ఆకృష్యేతే ధ్రువేణేహ సమం తిష్ఠతి సువ్రత, తదా సాభ్యంతరం దేవో భ్రమతే మండలాని తు. ౨౭. ధ్రువేణ ముచ్యమానే తు పునా రశ్మియుగేన వై, తథైవ బాహ్యతః సూర్యో భ్రమతే మండలాని తు. ౨౮. ఆశీతిమండలశతం కాష్ఠయోరుభయోరపి, సరథోఽధిష్ఠితో దేవైర్విభ్రమే దృషిభిః సహ. ౨౯. గంధర్వైరప్సరోభిశ్చ సర్పగ్రామణిరాక్షసైః, ఏతైర్వసతి వై సూర్యే మాసౌ ద్వౌ ద్వౌ క్రమేణ తు. ౩౦. ధాతార్యమా పులస్త్యశ్చ పులహశ్చ ప్రజాపతిః, ఖణ్డకో వాసుకిశ్చైవ సకర్ణో రశ్మిరేవ చ. ౩౧. తుంబురుర్నారదశ్చైవ గంధర్వౌ గాయతాం వరౌ, క్రతుస్థలాప్సరశ్చైవ యా చ సా పుంజికస్థలా. ౩౨. గ్రామణీరథకృత్స్నశ్చ రథౌజాశ్వతరావుభౌ, రక్షోహేతిః ప్రహేతిశ్చ యాతుధానౌ చ తావుభౌ. ౩౩. మధుమాధవయోరేష గణో వసతి భాస్కరే, తథా గ్రీష్మే తు

మాధవ (వైశాఖ) మాసమునను భాస్కరుని బరివేష్టించును. అట్టులే గ్రీష్మర్తుగతములగు రెండుమాసములందును మిత్రావరుణులును, నత్రిమునియు వసిష్ఠుఁడును, తక్షకానంతపన్నగములును, మేనకాసహాజన్య లనునప్సరలును, హాహాహూహూవులను గంధర్వులును రథస్వన రథచిత్రు లను నిద్దఱు గ్రామణులును, పౌరుషేయుఁడు వధుఁడు నను మహాబలులగు నిద్దరు రాక్షసులును నను నీగణము శుచి(ఆషాఢ) మాసమునను శుక్ర (జ్యేష్ఠ) మాసమునను దివాకరుఁ బరివేష్టించియుండును. ఇంద్రవివస్వంతు లను భృగ్వంగిరసులును శంఖపాలైలాపర్ణులను పన్నగులును ప్రమ్లోచదుండుకులను గంధర్వులును భానుదుర్ధురులను యాతుధాను లును సర్పుఁడు బ్రాహ్మఁడు ననుయాతుధానులును వీరందఱును నభో (శ్రావణ) మాసమునను నభస్య (భాద్రపద) మాసమునను దివాకరుం బరివేష్టించి యుందురు. శరత్కాలమున శుభ్రమూర్తులగు పర్జన్యుఁడు పూషయు గౌతమభారద్వాజులును చిత్రసేనవసురుచులను గంధర్వులును విశ్వాచీఘృతాచీనామలగు పుణ్యలక్షణ లిరువు రప్సరలును నైరావత ధనంజయులను నాగులును సేనజిత్తు సుషేణుఁడునను సేనాపతి గ్రామణులును ఆపుఁడు వాతమునను యాతుధానులును వీరందఱును గాలవిపరిణతిచే నిష (ఆశ్వయుజ) మాసమున నూర్జ (కార్తిక) మాసమునను సూర్యునందు వసింతురు. హేమంతమునందలి మాసద్వయమునఁ బై

ద్వౌ మాసౌ మిత్రశ్చ వరుణశ్చ హ. ౩౪. ఋషిరత్రిర్వసిష్ఠశ్చ తక్షకోఽనంత ఏవ చ, మేనకా సహాజన్యా చ గంధర్వౌ చ హాహా హూహూః. ౩౫. రథస్వనశ్చ గ్రామణ్యౌ రథచిత్రశ్చ తావుభౌ, పౌరుషేయో వధశ్చైవ యాతుధానౌ మహాబలౌ. ౩౬. శుచిశుక్రౌ తు ద్వౌ మాసౌ వసంత్యేతే దివాకరే, ఇంద్రశ్చైవ వివస్వాంశ్చ అంగిరా భృగురేవ చ. ౩౭. ఏలాపర్ణస్తథా సర్పః శంఖపాలశ్చ పన్నగాః, ప్రమ్లోచా దుందుకాశ్చైవ గంధర్వౌ భానుదర్దురౌ. ౩౮. యాతుధానౌ తథా సర్పస్తథా బ్రాహ్మశ్చ తావుభౌ, ఏతే నభో నభస్యౌ చ నివసంతి దివాకరే. ౩౯. శరద్యేతే పునః శుభ్రా నివసంతి స్మ దేవతాః, పర్జన్యశ్చైవ పూషా చ భారద్వాజః సగౌతమః. ౪౦. చిత్రసేనశ్చ గంధర్వస్తథా వసురుచిశ్చ యః, విశ్వాచీ చ ఘృతాచీ చ తే ఉభే పుణ్యలక్షణే. ౪౧. నాగస్త్వైరావతశ్చైవ విశ్రుతశ్చ ధనంజయః, సేనజిచ్చ సుషేణశ్చ సేనానీర్గ్రామణీస్తథా. ౪౨. ఆపో వాతశ్చ ద్వావేతౌ యాతుధానౌ ప్రకీర్తితౌ, వసంత్యేతే తు వై సూర్యే ఇషోర్జౌ కాలపర్యయాత్. ౪౩. హైమంతికౌ తు

జెప్పఁబోవువారు సూర్యునియం దుందురు. అంశుఁడు భగుఁడు నను సూర్యమూర్తు లిరువురును కశ్యపక్రతువులును మహాపద్మఁడను భుజంగమును కర్కోటకమను సర్పమును నాపవాతులను నిరువురు యాతుధానులును చిత్రాంగదారుణాయువులను గంధర్వులును సహో (మార్గశీర్ష) మాసమునను సహస్య (పౌష) మాసమునను దివాకరునందు వసింత్రు. పూషుఁడు జిష్ణుండును జమదగ్నియు విశ్వామిత్రుండును కద్రూతనయులగు కంబళాశ్వతరులను మహానాగులును ధృతరాష్ట్రసూర్యవర్చసులను గంధర్వులును తిలోత్తమయు రంభయు నను ముల్లోకముల గణనకెక్కిన యచ్చరలును మహాతపస్సంపన్నులగు సేనజిత్తు సత్యజిత్తు నను గ్రామణులును బ్రహ్మాహాదులగు యజ్ఞాయజ్ఞులను రక్కసులును వీరందఱును తపో (మాఘ) మాసమునను తపస్య (ఫాల్గున) మాసమునను దివాకరునందు నివసించుచున్నారు. ఇంకను నితరులగు మందప్రజ్ఞులగు రాక్షసాధిపతులు దేవదేవుని గుహ్యాదేశములను రక్షించుటకై యస్మదాదులగు నిఖిలదేవతలచేత నియుక్తులై యున్నవారు. వారిని గుఱించి గూడ నీకెఱింగింతు నో మహాదేవా! యన విని రుద్రదేవుఁడు సోత్కంఠుఁడై బ్రహ్మా! యే నిట కేద్దాని నెఱుంగఁగోరి యేతెంచితి నట్టి దివ్యకథను సదయుఁడవై నాకెఱింగింపవే మహానుభావా! ద్యులోకస్థితుఁడగు భాస్కరుని దర్శించి నమస్కరించువిధానమును గర్మసమాపన

---

ద్వౌ మాసౌ వసంత్యేతే దివాకరే, అంశో భగశ్చ ద్వావేతౌ కశ్యపశ్చ క్రతుస్తథా. ౪౪. భుజంగశ్చ మహాపద్మః సర్పః కర్కోటకస్తథా, ఆపో వాతశ్చ ద్వావేతౌ యాతుధానౌ ప్రకీర్తితౌ. ౪౫. చిత్రాంగదశ్చ గంధర్వోఽరుణాయుశ్చైవ తావుభౌ, సహే చైవ సహస్యే చ వసంత్యేతే దివాకరే. ౪౬. పూషా జిష్ణుర్జమదగ్నిర్విశ్వామిత్రస్తథైవ చ, కాద్రవేయౌ మహానాగౌ కంబలాశ్వతరావుభౌ. ౪౭. గంధర్వో ధృతరాష్ట్రశ్చ సూర్యవార్చాశ్చ తావుభౌ, తిలోత్తమా చ రంభా చ సర్వలోకేచ విశ్రుతే. ౪౮. గ్రామణీః సేనజిచ్చైవ సత్యజిచ్చ మహాతపాః, బ్రహ్మోపేతశ్చ వై రక్షో యజ్ఞో యజ్ఞస్తథైవ చ, ఏతే తపస్తపస్యే చ నివసంతి దివాకరే. ౪౯. అన్యేఽపి యే మందేహా రాక్షసాధిపతయో దేవదేవగుహ్యాతమస్య రక్షార్థం సకలదేవైరస్మదాదిభిః సంనియుక్తాస్తాన్ఛవ తే కథయామి. ౫౦. రుద్ర ఉవాచ.—వద బ్రహ్మన్కథాం దివ్యాం యామహాం ప్రష్టుమాగతః, తామేవ విస్తరేణైవ కథయాశు మమ ప్రభో. ౫౧.

మున లభించుఫలమును విశదీకరింపుమన నాతనికి బ్రహ్మ యిట్లనిగెను. ఓమహాదేవా! రుద్రా! సూర్యుని నమస్కరించువాడు రోగదుఃఖములనుండి విముక్తులై పాపంబులు భస్మంబు గావించుకొందురు. కావున నట్టి సూర్యనమస్కారవిధిని సంక్షేపముగ నెఱింగింతు నాకర్ణింపుము. సైకతాదులచే స్థండిలము నిర్మించి యందు ద్వాదశాంగుళ ప్రమాణపరిమితమగు మండలముజేసి తత్కాలమున గోమయలేపంబునఁ బూతంబుగావించి యందు రవి నావాహనముచేయవలయును. ఆమండల సమీపమున గణేశముఖులగు దేవతలను వాసుదేవుని సాత్యకిని సత్యభామను లక్ష్మీదేవి నుమాదేవిని శంకరుని స్థాపించి పూజలొసంగి వేద మంత్రవేత్తయగుపురుషుఁడు వారలకుఁ బ్రదక్షిణమాచరించియొక్కమారు గాని నూరుతడవలుగాని వేయిపర్యాయములుగాని పదివేలసారులు గాని లక్షమారులుగాని యధికముగఁగాని నిజపాపప్రాబల్యము ననుసరించి దండప్రణామము లాచరింపవలయును. ఇట్లు నియమితచిత్తుఁడై ప్రణమిల్లి యుచ్ఛ్వసింపకయే సమాహితచిత్తుఁడై విప్రునకు దక్షిణ యొసంగవలయును. అందు నూరుహిరణ్యములుగలవాఁడు రెండు రక్తిక (నాలుగు మినుగులలోఁ బదియగుపాలు) ల నీవలయును. వేయిహిరణ్యములుగలవాఁడు నాలుగు మినుగులపరిమాణము (మాషక) నొసంగవలయును. పదివేలుండెనేని నలువదిమాషకముల నొసంగవలయును.

---

దివిష్ఠం భాస్కరం దృష్ట్వా నమేత్కేన విధానతః, కిం ఫలం తస్య వా దేవ సమాప్తే భవతి కర్మణి. ౫౨. బ్రహ్మోవాచ—శృణు రుద్ర సమాసేన భాస్కరస్య నతిక్రియామ్, యాం కృత్వా రోగదుఃఖార్తా ముచ్యంతే పాపసంచయాత్. ౫౩. స్థండిలే మండలం కృత్వా ద్వాదశాంగులమానతః, సద్యో గోమయలిప్తే చ తత్రైవావాహయేద్రవిమ్. ౫౪. పూజయిత్వా గణేశాదీన్వాసుదేవం చ సాత్యకిమ్, సత్యభామాం తథా లక్ష్మీముమాం దేవీం చ శంకరమ్. ౫౫. మండలస్య సమీపస్థానూర్వోక్తాన్వేదమంత్రవిత్, తతః ప్రదక్షిణీకృత్య దండవత్ప్రణమేత్సకృత్. ౫౬. శతం సహస్రమయుతం లక్షం వా నిజపాపతః, దృష్ట్వా శక్తిం ప్రణమ్యాథ సదా సంయతమానసః. ౫౭. విప్రాయ దక్షిణాం దద్యాన్నిరుచ్ఛ్వాసః సమాహితః, రక్తికే చ హిరణ్యస్య శతమాత్రే సహస్రకే. ౫౮. మాషకాణాం చతుష్కం చాయుతం దశగుణం దిశేత్,

లక్షపరిమాణముగుహిరణ్యము (ధనము) గలరోగార్తుఁ డగువాఁడు రోగవిముక్తికై నన్నూరుమాషకములపరిమాణమును పూర్వోక్తవిధి నొసంగవలయును. ఇట్టులొనరించెనేని యోవిరూపాక్షా! మానవుఁడు సర్వరోగములనుండి విముక్తుఁడగును. ఈపరమరహస్యము నాకర్ణించు మానవుఁడు సూర్యునను గ్రహమున నెల్లరోగములఁ బాయును. మఱి యొకవిషయమును నీవడిగియున్నావు గదా! అయ్యది రథసారథుల సంబంధమైనది. దాని నెఱింగింతు నాకర్ణింపుమని బ్రహ్మ యిట్లనియె.

ఇది ద్విపంచాశత్తమాధ్యాయము.

---

## త్రిపంచాశత్తమాధ్యాయము.

మహాదేవా! తొల్లి నాచే వినతాతనయుఁడగు ననూరుఁడు (అరుణుఁడు) సూర్యునకు సారథిగా నియమింపఁబడెను. ఇంద్రునిచే మాఠరుఁ డనువాఁడును వాయువుచేఁ గల్మషుఁ డనువాఁడును వినతా తనయునిచేఁ దార్క్ష్యుఁ డనువిమలదేహుఁడగు పక్షిరాజు గోళ్లు ముక్కు నాయుధములుగాఁ గలిగియు సూర్యునిముందు నడచువారుగ నియుక్తులైరి. కాలునిచేఁ బెనుదండ మాయుధముగఁగొన్న దండుఁడును నీచే నిఖిల మహాగణాధిపతులును సోమునిచే వసుభిత్తునాయుధాంగారికుఁడు నగ్ని

---

దక్షే దశగుణం ప్రోక్తం దద్యాద్రోగవిముక్తయే. ౪౯. ఏవం కృతే విరూపాక్ష సర్వరోగా ద్విముచ్యతే, ఇదం రహస్యం పరమం శృణుయాద్యో హి మానవః. ౫౦. తస్య రోగా వినశ్యంతి మార్తండస్య ప్రసాదతః, అన్యచ్చ తే ప్రవక్ష్యామి యచ్చాపృష్టముమాపతే, తచ్ఛృణుష్వ మయా ప్రోక్తం రథయన్తృనియామకమ్. ౫౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యపూజావర్ణనం నామ
ద్విపంచాశత్తమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—తత్రారుణో మయా పూర్వం సారథ్యే సన్నియోజితః, ఇంద్రేణ మాఠరో నామ వాయునా కల్మషేణ తు. ౧. వైనతేయేన తార్క్ష్యోపరి విమలో నఖతుండప్రహరణః పురోగామీ నియుక్త ఇతి, కాలేన దండో మహాదండాయుధో భవతా శేషా మహాగణాధిపాః. ౨. వైశాఖేన రాజ్ఞా వసుభిదాయుధాంగారికా

హోత్రునిచేతఁ బింగళుఁడును సారథులుగా నియుక్తులయిరి. మఱియు మహాగణాధినాథుఁ డగు శేషుఁడు మహాదండాయుధుండై యాదిత్యునకు సంయుతగా నీ సీ నియుక్తుఁడయ్యెను. యమునిచేతఁ బాశహస్తుఁడగు హస్తుఁడును వరుణునిచే సమిద్ధనుఁడును నలకాధినాథుఁడగు కుబేరునిచే విష్ణుఁడును దేవవైద్యులగు నశ్వినులచే విషయాభిలాషులగు కాలోప కాలులును నరనారాయణులచేఁ గుటిలము శీఘ్రము నగు గమనముగల ధిషణకృష్ణులును నియమింపఁబడిరి. విశ్వేదేవులు దిక్కులను మూలదిక్కులను రక్షింపుటకై వైరాజుఁడు శంఖపాలుఁడు పర్జన్యుఁడు రజుఁడు ననువారిని నియమించిరి. మరుత్తులను దేవగణము లోకమాతల నేదువ్వర నొసంగెను. మఱియు నోంకారము వషట్కారము వేదస్వరము పినాకపాణియు వినాయకుఁడును శేషుఁడును ననంతుండును వాసుకియు నాదిత్యు రథమును బరివేష్టించియుండిరి. అందు శేషాదులు సర్వవిధములఁ దమకు దీటగు వేవురు మహానాగులచేఁ గొల్వంబడుచు వచ్చి చుట్టియుండిరి. గాయత్రియు సావిత్రియు సాయంప్రాతస్సంధ్యారూపములై రథమున నున్నవి. ఈయుత్తమదేవతాద్వయము సర్వకాలములను షడ్గుణైశ్వర్య సంపన్నుఁడగు సహస్రకిరణుఁ బట్టుకొనుటకై రవిమండలము నెడఁగలుగక వర్తించుచుండును. ఇట్లగుటంజేసి యీమండలము సర్వదేవమయ మనఁబడును. ఈమండలమును బ్రహ్మవాదిసమూహము బ్రహ్మమనియు యజ్ఞప్రాధాన్యవాదులసమూహము యజ్ఞమనియును బొగడుచున్నారు. దేవోత్తముఁడగు నీయాదిత్యుఁడు భగవద్భక్తులకు విష్ణువనియు మహే

---

ద్వౌ అగ్నినా పింగలః, సంయంతా మహాదండాయుధో భవతా శేషో మహాగణాధిపః. ౩. హస్తౌ యమేన పాశహస్తోంబుపతినా సమిద్ధనః, అలకాధిపతినా విష్ణుః. ౪. అశ్విభ్యాం కాలోపకాలౌ వాత్సప్రధానకౌ, నరనారాయణాభ్యాం క్షురా ధారా ధిషణకృష్ణౌ. ౫. వైరాజశంఖపాలపర్జన్యరజసాం దిశాసు విదిశాసు దిశాం పాలనం విశ్వేదేవా దదుః. ౬. సప్తైతాలోకమాతరః సర్వమరుతోఽదదన్, ఓంకారో వషట్కారో వేదనిస్వనః పినాకీ వినాయకః శేషోఽనన్తో వాసుకిశ్చ నాగసహస్రైణాత్మతుల్యైనాదిత్యస్య రథమనుయాంతి. ౭. గాయత్రీ సావిత్రీ రథే స్థితే ఉభే సంధ్యే సదా సా దేవతా యా రవిమండలం నాప్నైతి, భగవంతం సహస్రకిరణమవలంబితుమ్. ౮. ఏతద్ధ్వి సర్వదైవత్యం మండలం బ్రహ్మవాదినం బ్రహ్మయజ్ఞవాదినీం యజ్ఞః, భగవ

శ్వరభక్తులకు మహేశుఁడనియుఁ దోఁచుచు నుతికెక్కుచున్నాఁడు. మఱియు నో వృషభధ్వజా! వెనుకఁజెప్పిన దేవతలెల్లరు స్థానాభిమానులై యుండుటచేతఁ గాంతులకెల్లఁ గాంతియగు నీయుత్తమతేజోరూపుఁడగు సూర్యుని సంతోషపెట్టుచున్నారు. మహర్షులెల్లరు నీరవిని యుక్తరీతి నిబద్ధంబులగు నిజవాక్యంబులచే స్తుతిచేయుచున్నారు గంధర్వులు నప్సరోగణములును గానములచే నాట్యములచేతను నీతని నుపాసించుచున్నారు. ఆకసమున సంచరించునప్పుడు రథమున నున్న పగ్గములు జారిపోవకయుండునట్లు సర్పములు రక్షించుచు మోయుచున్నవి. రాక్షసులును మోయుచు రథమును దేశాంతరమునకుఁ గొంపోవుచున్నారు. వాలఖిల్యనాములగు నంగుష్ఠమాత్రప్రమాణము గలమహర్షు లుదయకాలమునుండి యుపచరించుచు నాదిత్యుని నమస్కరింతురు. ఇంద్రుఁడును స్వయంభువుఁడు నగ్రభాగమున నామడదూరమున నడచుచుందురు. భర్గుండు (శివుఁడు) దక్షిణపార్శ్వమును బద్మజుఁడు వామపార్శ్వమునను వసింతురు. లోకపూజితములగు సోమాది సకలగ్రహములును సూర్యుని వెనుక నుందురు. ఉపరాగగ్రహమగు రాహువును గేతువును (నగ్నిహోత్రుఁడును) గూడ ముందరనే నడతురు. ఇందులకేమియు సందేహింపఁబనిలేదు. మఱియు ధనపతి దక్షిణభాగమునను వరుణుఁ డుత్తరభాగమునను వసించి యాయాదిత్యునకు ముందు నడచుచుందురు. వామభాగమున వీతిహోత్రుఁడును బృష్ఠభాగమున హరియు నుందురు. రథమున

---

దృక్తానాం పరమాదిత్యోఽయం విష్ణుర్మాహేశ్వరాణాం మహేశ్వరః. ౯. స్థానాభిమానినో హ్యేతే సదా వై వృషభధ్వజ, సూర్యమాప్యాయయంత్యేతే తేజసాం తేజ ఉత్తమమ్. ౧౦. గ్రథితైః స్వైర్వచోభిస్తు స్తువంతే ఋషయో రవిమ్, గంధర్వాప్సరసశ్చైవ గీతనృత్యైరుపాసతే. ౧౧. వియద్భ్రమణతో రక్షాం కుర్వంతి స్మ ఇషుగ్రహమ్, సర్పా వహంతి వై సూర్యం యాతుధానాస్తు యాంతి చ. ౧౨. వాలఖిల్యా నమంత్యేతం పరిచార్యోదయాద్రవిమ్, దివస్పతిః స్వభూశ్శోభా అగ్రగా యోజనస్య తు. ౧౩. భర్గోఽథ దక్షిణే పార్శ్వే కంజజో వామతః స్థితః, సర్వే తే పృష్ఠగా జ్ఞేయా గ్రహా లోకేషు పూజితాః. ౧౪. ఉపరాగశిఖిచోభావగ్రతో నాత్ర సంశయః, [illegible]వ్యధర్మా దక్షిణత ఉత్తరేణ ప్రచేతసః. ౧౫. సంభవంతి తథా కృష్ణ ఉభావేతౌ

నున్న గద్దియపై నుమాదేవియు మధ్యంబున నభంబు నుండును. రథ కాంతిని నభము నాశ్రయించి పగటిభాగము గలుగుచున్నది. ధ్వజమును ధ్వజదండమును దానియెదుట నుండువృషవాహనము నెఱింగింతు వినుము. ఓపార్వతీప్రియా! బుద్ధియు, సమృద్ధియు, నైశ్వర్యము ననునవి ధ్వజ మనంబడును. ధ్వజదండము నెదుట గరుడవాహనమును నాతనియెదుట సముద్రుండు నుండును. గొడుగునకు దగుల్చబడ్డ మైనాకపర్వతమనియు గొడుగు తుహినాచలమనియుఁ గొందఱు చెప్పుదురు. ఈలోకమున మఱి కొందఱు విద్వాంసులు ఛత్రమును ఛత్రదండమును గూడ క్లేశమ యని వచించుచున్నారు. ఈదేవతలందఱును వీర్యవంతులును వీర్యమునకుఁ దగినట్లు తపముచేయువారును చిత్తవృత్తి యెంతగ నిరుద్ధమైయుండు నంతగ సత్త్వగుణసమృద్ధులును సత్త్వమునకుఁదగినట్లు బలముగలవారును నై యుండిరి. ఈసూర్యుఁడు నిజసిద్ధతేజంబుచే వారలను దపింపఁజేయు చుండెను. వారు నాతనిచేఁ దప్తులై లోకమును దపింపఁజేయుచు వర్షించుచుఁ బ్రయాణముచేయుచున్నారు. మఱియుఁ బ్రపంచంబు సృష్టిచేయు చున్నారు. నిఖిలభూతములచేఁ గీర్తింపఁబడుచు వారి యశుభకర్మల నంత మొందించుచున్నారు. ఈదేవతలందఱును సానుచరులై జపతపంబు లొనర్చుచు భూతముల నానందింపఁజేయుచు సూర్యునితోఁ జేరియే ద్యులోకమునఁ బరిభ్రమించుచున్నారు. వారలీలోకమునఁ గరుణామయులై

---

సదాగ్రగా, వామేన వీతిహోత్రస్తుపృష్ఠతస్తు హరిః సదా. ౧౬. రథపీఠే క్షమా జ్ఞేయా అంతరాలే నభస్తథా, ఆశ్రిత్య రశ్మీనాం కాంతిం ఖం దివః సమయః స్థితః. ౧౭. ధ్వజో దండశ్చ విజ్ఞేయౌ ధ్వజాగ్రే వృష ఏవ చ, బుద్ధిర్వృద్ధిస్తథా శ్రీశ్చ పతాకా పార్వతీ ప్రియ. ౧౮. ధ్వజదండాగ్రే గరుడస్తదగ్రే వరుణాలయః, మైనాకశ్ఛత్రదండస్తు హిమవాంశ్ఛత్రముచ్యతే. ౧౯. కేచిదేవం వదంతీహ లోకే చాన్యే మహామతే, ఛత్రదండస్తథా క్లేశః క్లేశం ఛత్రం విదుర్బుధాః. ౨౦. ఏతేషామేవ దేవానాం యథా వీర్యం తథా తపః, యథాయోగం తథా సత్త్వం యథా సత్త్వం తథా బలమ్. ౨౧. తథా తపత్యసౌ సూర్యస్తేషాం సిద్ధః స్వతేజసా, ఏతే తపంతి వర్షంతి యాంతి విశ్వం సృజంతి చ. ౨౨. భూతానామశుభం కర్మ వ్యపోహంతి చ కీర్తితాః, ఏతే సహైవ సూర్యేణ భ్రమంతే సానుగా దివి. ౨౩. తపంతశ్చ జపంతశ్చ హ్లాదయంతశ్చ వై ద్విజాః, గోపాయంతి స్మ భూతాని ఇహ తే హ్యనుకంపయా. ౨౪.

భూతములఁ బ్రోచుచున్నారు. ఈయాదిత్యుఁడు సోమసూక్తములచే వృద్ధిబొందించుచు నమృతముచే దేవతలకుఁ బారణము నొసంగు చున్నాఁడు శుక్లపక్షమున దినక్రమముచే సోమునిఁ బూర్ణునిఁగాఁ జేయును. ఇట్లు పూర్ణుఁడైన యాసోమునిఁ గృష్ణపక్షమున దేవతలు గ్రోలుదురు. ఇట్లుపానముసేయఁగఁ గొన్నాళ్లకు సోముఁడు రెండుకళలు మాత్రము మిగిలినవాఁడై ప్రకాశించుచుండును. అట్టి సుధామృతరూపుఁ డగుచంద్రునిఁ గృష్ణపక్షాంతమున నూర్జులు సౌమ్యులు కల్పులు నను పితృదేవతలు ద్రావుచున్నారు. ఈరెండుతెగలదేవతలును సూర్యుని కిరణములచే నాకృష్టములై మఱల విడువఁబడిన సమృద్ధజలములచేతను నోషధులచేతను సర్వకాలముల నమృతప్రాశన మొనరించి యిచ్చచొప్పున నధికముగఁ ద్రావుటచే నాకలియుడిగియుండిరి. దేవతల కుదకములచే నర్ధ మాసము తృప్తిగలుగును. స్వధానినయనముచే నొక్కమాసమువఱకుఁ జాలిన తృప్తి పితృదేవతల కేర్పడును. ఈసూర్యుఁడు మర్త్యుల కన్నముచే నెల్లకాలములఁ దృప్తి నొసంగుచున్నాఁడు. కిరణజాలముచే నిఖిలజగముల భరించుచున్నవాఁడు. మఱియు నీయాదిత్యుఁ డొంటిచుట్టు తేరెక్కి యేడుగుఱ్ఱములు గట్టి యొక్క యహోరాత్రకాలమున నేడుదీవులుగలిగి మున్నీరుచెలియలికట్టగాఁగల నేలను జుట్టివచ్చుచున్నాఁడు. గాయత్రీ ప్రభృతులగుఛందస్సులే హయరూపములై, చక్రముప్రక్కన గట్టఁబడి కామరూపములై యున్నవి. ఈవాజుల నొకేసారి రథయుగమున

---

ప్రీణాతి దేవానమృతేన సూర్యః సోమేన సూక్తేన వివర్ధయిత్వా, శుక్లేన పూర్ణా దివస క్రమేణ తం కృష్ణపక్షే విబుధాః పిబంతి. ౨౫. పీతం హి సోమం ద్వికలావశేషం కృష్ణే తు పక్షే రుచిభిర్జ్వలంతమ్, సుధామృతం తత్పితరః పిబంతి ఊర్జాశ్చ సౌమ్యాశ్చ తథైవ కల్పాః. ౨౬. సూర్యేణ గోభిశ్చ సముద్ధృతాభిరద్భిః పునశ్చైవ సముజ్ఝితాభిః, తథౌషధీభిః సతతం పిబంతి అత్యంతపానేన క్షుధా జయంతి. ౨౭. మాసార్ధతృప్తిస్తు మతాభిరద్భిర్మాసేన తృప్తిః స్వధయాం పితౄణామ్, అన్నేన శశ్వద్విదధాతి మర్త్యం స్వయం జగచ్చైవ బిభర్తి గోభిః. ౨౮. అహోరాత్రం రథేనాసావేకచక్రేణ వై భ్రమన్, సప్తద్వీపసముద్రాంతం సప్తభిశ్చ హయైః సహ. ౨౯. ఛందోభిర్వాజిరూపైస్తైర్యతశ్చక్రం తతః స్థితైః, కామరూపైః సకృద్యుక్తైరంతరస్థైర్మనోజవైః. ౩౦. హరిభి

బంధించెను. సహమనడుమ శ్రమదీర్చుకొనుటకై విప్పికట్టుట లేదు. అయ్యవి మనోజవంబులై వియన్మధ్యచారులై జితేంద్రియములై యాకలి దప్పులు నలసటయు లేకుండ నున్నవి. ఆయశ్వములు నర్షమున కనుబడిరంగినసూడులు మండలములు జట్టినప్పుడు. ఆమండలములు నక్షత్రములు నమునుంచి లోపను వెలుపలను గూడఁ జట్టఁబడు చుండును. ఈయశ్వములు స్పష్ట్యాని నిబద్ధములై ప్రళయమునఁ జెడనెడల్లోక పథము నాగునెరయించును. సృష్టిప్రళయముల మధ్యకాలమునంతయు వాలఖిల్యమునులచేఁ బరివృతములై భ్రమించుచున్నవి. సూర్యుఁడు సుమనోహరములగు వచనములచే మహర్షులు తనను నుతింప గంధర్వా ప్సరోగణములు గీతనృత్యములచే వినోదంబు సలుప నత్యుత్సాహంబున నడచుచు డుముకుచుఁ బక్షులిహనశ్వరాజములతో భ్రమించుచు ద్యులోక మున నుత్తమమగు వియన్మధ్యమార్గమున నక్షత్రములతోఁ గూడి చంద్రుఁడు చరించువడువునఁ జరించుచుండును. ఈభాస్కరదేవుఁడు మేరుపర్వతముచుట్టుఁ బ్రదక్షిణ మొనరించునప్పుడు ప్రాగ్దిశనున్న యమరావతియందు మధ్యాహ్నమయ్యెనేని యామ్యదిగ్భాగమున నుదయమగుచుండును. పశ్చిమదిశయగు సుఖయం దర్ధరాత్రమగును. విభానామ్నియగు నుత్తరదిక్కున నస్తమానమగును. సూర్యుఁడుయామ్య పట్టణమధ్యగతుండై యుండెనేని యప్పుడు సుఖాభిఖ్యయగు పశ్చిమ దిక్కున నుదయించుచున్నట్లగపడును. విభాభిఖ్యయగు నుత్తరదిక్కున నర్ధరాత్రము నమరావతి నస్తమానమును దోఁచును. అట్టులే సూర్యుఁడు

రవ్యర్యమైర్వైశ్యైః తుధాత్రమవివక్షితైః ద్వ్యశీతిమండలశతమిహాంత్యబ్దేన వై హయాః. 31. బాహ్యతోఽభ్యంతరం చైవ మండలం దివసక్రమాత్, కల్పాదౌ సంప్రయుక్తాస్తే వహంత్యాభూతసంప్లవమ్. 32. ఆవృతా వాలఖిల్యైస్తే భ్రమంతి తాన్యహాని తు, గ్రథితైః స్వైర్వచోభిస్తు స్తూయమానో మహర్షిభిః. 33. సేవ్యతే నృత్యగీతైశ్చ గంధర్వైరప్సరోగణైః, పతంగైః పతగైరశ్వైర్వసతే భ్రమయన్దివి. 34. వీథ్యాశ్రయాణి చరతే నక్షత్రాణి యథా శశీ, మధ్యగశ్చామరావత్యాం యదా భవతి భాస్కరః. 35. వైవస్వతే సంయమనే ఉత్తిష్ఠన్దృశ్యతే తదా, సుఖాయామర్ధరాత్రం తు విభాయామస్తమేతి చ. 36. వైవస్వతే సంయమనే మధ్యమస్తు రవిర్యదా, సుఖాయామథ వారుణ్యాముత్తిష్ఠన్దృశ్యతే తదా. 37. రాత్ర్యర్ధం చామరావత్యామస్తమేతి యమస్య

వారుణీమధ్యయున నుండెనేని విభయందుదయమును నమరావతి నర్ధ రాత్రమును యామ్యమున నస్తమానము నగును. విభయందు మధ్య గతుఁడై యర్కుఁ డుండెనేని యమరావతి నుదయమును యామ్యపత్త్రన మున నర్ధరాత్రమును వారుణపురమున నస్తమానము నై యుండును.ఈ తెఱఁగున నాదిత్యుఁడు మేరుపర్వతంబున నాలుగువైపులను బ్రదక్షిణము చేయుచు మాటికి మాటికినుదయాస్తమయములనొందుచుండును.మధ్యా హ్నమునకు ముందుభాగమునను వెనుకభాగమునను రెండేసి దేవసదన ముల వెలిఁగించును. ఆకిరణము లన్నింటిచేతను మధ్యాహ్నకాలమున నొక్కమధ్యభాగమునే వెలయించును. ఉదయించిన యాదిత్యుఁ డను క్షణమును బెరుగుచున్నకిరణములచే మధ్యాహ్నమువఱకును దపిం చును. మధ్యాహ్నము గడచినవెనుక ననుక్షణము దరుగుచున్న కిరణము లచే నస్తంగతుఁ డగుచున్నాఁడు. ఏదేశమున నెవరికి సూర్యుఁడు వెలికేతెంచుచున్నట్లగపడునో యది వారి కుదయమనియు నంతర్హితుఁ డగుదేశమున నస్తమానమనియుఁ జెప్పఁబడుచున్నది. ఇట్లు భాస్కరుఁడు గగనమధ్యమునఁ దిరుగుచుండును.ఆదిత్యుఁ డొక్కముహూర్తకాలమున భూమిలో ముప్పది యగునంశమును దిరుగుచున్నాఁడు. ఒక్కముహూర్త కాలమున నాతఁడు చరించుయోజనములసంఖ్య వివరింతు వినుము. ముహూర్తకాలమునసూర్యగమనముపూర్ణమగులక్షయు నేఁబదివేలునై యొకప్పు డుండును. మఱియొకప్పుడు కించిదూనముగలక్షయు నేబదియు

---

వై, సోమపుర్యాం విభాయాం తు మధ్యగశ్చార్యమా యదా. ౩౮. మాహేంద్ర్యస్యా మరావత్యాముత్తిష్ఠతి దివాకరః, అర్ధరాత్రం సంయమనే వారుణ్యామస్తమేతి చ. ౩౯. ఏవం చతుర్షు పార్శ్వేషు మేరోః కుర్వన్ప్రదక్షిణమ్, ఉదయాస్తమనే చాసావుత్తిష్ఠతి పునః పునః. ౪౦. పూర్వాహ్ణే చాపరాహ్ణే చ ద్వౌ ద్వౌ దేవాలయౌ పునః, తపత్యేకం తు మధ్యాహ్నే తాభిరేవ గభస్తిభిః. ౪౧. ఉదితో వర్ధమానాభి రామధ్యాహ్నాత్తపేద్రవిః, తతః పరం హ్రసంతీభిర్గోభిరస్తం నియచ్ఛతి. ౪౨. యత్రో ద్యన్దృశ్యతే సూర్యః స తేషాముదయః స్మృతః, ప్రణాశం గచ్ఛతే యత్ర స తేషా మస్తముచ్యతే. ౪౩. ఏవం పుష్కరమధ్యేన తదా సర్పతి భాస్కరః, త్రింశద్భాగం తు మేదిన్యా ముహూర్తేన స గచ్ఛతి. ౪౪. యోజనాగ్రేణ సంఖ్యాం తు ముహూర్తస్య నిబోధ మే, పూర్ణం శతసహస్రాణాం సహస్రం తు త్రిలోచన. ౪౫. పంచాశచ్చ

[illegible]లకధికముగను యోజనములు గడచుచుండును. ఒక్కనిమేషమాత్రమున రెండువేల యిన్నూటరెండు యోజనములు దినమునఁ బ్రాకుచున్నాఁడు. ఈతఁడు తైలయంత్రమునయుండు చక్రమువలె శీఘ్రముగఁ జుట్టుతిరుగును. ఇట్లు తిరుగుచు భ్రమించుచుండు నక్షత్రములతోఁ జేరి చరించును. ప్రాతఃకాలమున నింద్రుఁడు ఉదయించుచున్నవానిని పూజించుచున్నాఁడు. మధ్యాహ్నగతుఁడగు దివాకరుని వైవస్వతుం డారాధించుచున్నాఁడు. అస్తమించు (సాయం) కాలమున వరుణుఁడు కొలుచుచున్నాఁడు. సర్వకాలముల నర్ధరాత్రములందున సోముఁడు భాస్కరుని పూజించుచున్నవాఁడు. ఓరుద్రా! నీవు నేనును విష్ణువు నుషఃకాలమున నాదిత్యుని పూజింతుము. ఇట్లే వైశ్వానరుఁడు నిఋతియు వాయువు నీశానుఁడు ననువిదిశాధిపతులును భ్రమించుచున్న దివాకరుని వరుసగఁ బూజించుచున్నారు. ఓదేవోత్తమా! నిశ్శ్రేయసలాభమపేక్షించి బ్రహ్మాదిదేవతలందఱు నీయాదిత్యు నెల్లప్పుడుఁ గ్రమముగ నారాధించుచుందురు.

ఇది త్రిపంచాశత్తమాధ్యాయము.

---

తథాల్పాని సహస్రాణ్యధికాని తు, మౌహూర్తికీ గతిర్హ్యేషా సూర్యస్య తు విధీయతే. ౪౬. యోజనానాం సహస్రే ద్వే ద్వే శతే ద్వే చ యోజనే, నిమేషాంతరమాత్రేణ దివి సూర్యః ప్రసర్పతి. ౪౭. స శీఘ్రమేవ పర్యేతి భాస్కరోఽలాతచక్రవత్, భ్రమన్వై భ్రమమాణేషు ఋక్షేషు విచరత్యసౌ. ౪౮. ఇంద్రః పూజయతే సూర్యముత్తిష్ఠంతం దివౌకసే, మధ్యాహ్నే చ యమః పశ్చాదస్తం యాంతమపాం పతిః. ౪౯. సోమస్తథార్ధరాత్రే తు సదా పూజయతే రవిమ్, విష్ణుర్భవానహం రుద్రః పూజయామ నిశాక్షయే. ౫౦. ఏవమగ్నిర్నిరృతిశ్చ వాయురీశాన ఏవ చ, పూజయంతి క్రమేణైవ భ్రమమాణం దివాకరమ్, శ్రేయోర్థం దేవశార్దూల సర్వే బ్రహ్మాదయః సురాః. ౫౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి రథసప్తమీకల్పే సూర్యగతివర్ణనం నామ
త్రిపంచాశత్తమోఽధ్యాయః.

---

## చతుష్పంచాశత్తమాధ్యాయము.

ఓలోకపితామహా! సదాగతియగుభాస్కరుని యుత్తమచరిత్రము నీతీరున వర్ణించితివి. కాని యింకను దనివిసనదయ్యె. కాన నీభాస్కరుని మాహాత్మ్యమును మఱలఁ జెప్పుమని యడుగ రుద్రునకుఁ బితామహుఁ డిట్లనియె. ఓమహాదేవా! చరాచరరూపమగు నీలోకత్రయము నాదిత్య మంత్రనిబద్ధమై యున్నది. దేవరాక్షసమానవాదిసమన్వితమగు సర్వజగత్తు నాదిత్యునివలననే జనించుచున్నది. రుద్రుఁడు నింద్రుఁడు నుపేంద్రుఁడు మున్నగు మహాతేజస్సంపన్నులగు దేవతలతేజమెల్ల నాదిత్యునివలననే గలిగినది. నిఖిలప్రపంచతేజస్సు నాతనిదే. దేవదేవుఁడగు సూర్యుఁడు సర్వాకారుఁడును సర్వలోకాధారుఁడును బ్రజోత్పాదనరక్షణాదినిమిత్తుఁ డును మూలభూతమగు నుత్తమదైవము నై యుండెను అగ్నిలో లెస్సగ వ్రేల్వఁబడిన యాహుతి యాదిత్యుని జేరును. ఆదిత్యునుండి వర్షణ మేర్పడును. వృష్టివలన నన్నము నద్దానినుండి ప్రజయు నేర్పడు చున్నది. సమస్తమును సూర్యునివలనఁ గలుగుచున్నది. ఆతనియందే యడంగుచున్నది. లోకములయుత్పత్తి తదభావములు తొలుత నాదిత్యుని వలననే యేర్పడినవి. ఈతేజమే ధ్యానాసక్తులకు ధ్యానమును మోక్ష కాములకు మోక్షమునై యున్నది. ఇందే యెల్లప్రజలు నిర్వాణము నుత్ప త్తిని గాంచుచున్నారు. క్షణములు ముహూర్తములు పగళ్లు రాత్రులు

---

రుద్ర ఉవాచ:—అహో హంసస్య మాహాత్మ్యం వర్ణితం భవతేదృశమ్, కథ్యతాం పునరేవేదం మాహాత్మ్యం భాస్కరస్య తు. ౧. బ్రహ్మోవాచ:—ఆదిత్యమంత్రమఖిలం త్రైలోక్యం సచరాచరమ్, భవత్యస్మాజ్జగత్సర్వం సదేవాసురమానుషమ్. ౨. రుద్రేంద్రో పేంద్రచంద్రాణాం విప్రేంద్ర త్రిదివౌకసామ్, మహాద్యుతిమతాం కృత్స్నం తేజో యత్సార్వలౌకికమ్. ౩. సర్వాత్మా సర్వలోకేశో దేవదేవః ప్రజాపతిః, సూర్య ఏష త్రిలోకస్య మూలం పరమదైవతమ్. ౪. అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముప తిష్ఠతి, ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః. ౫. సూర్యాత్ప్రసూయతే సర్వం తత్ర చైవ ప్రలీయతే, భావాభావౌ హి లోకానామాదిత్యాన్నిఃసృతౌ పురా. ౬. ఏతత్తు ధ్యానినాం ధ్యానం మోక్షం చాప్యేష మోక్షిణామ్, అత్ర గచ్ఛంతి నిర్వాణం జాయంతేఽస్మాత్పునః ప్రజాః. ౭. క్షణా ముహూర్తా దివసా నిశాః పక్షాశ్చ

పక్షములు మాసములు ఋతువులు సంవత్సరములు యుగములు నీమొదలగు నిత్యకాలపరిమాణము సూర్యుఁడులేనిచో నేరుపడదు. కాలము లేదేని నియమముగాని యగ్నిహోత్రముగాని హోమములుగాని కలుగనేఱవు. ఋతువిభాగము లేకున్నఁ దత్తత్కాలికపుష్పములు ఫలములు మూలము (దుంప) లు నెట్లు నేర్పడును? సస్యజాతమును తృణములు నోషధులు మున్నగునవియు నెట్లు గలుగును? ముల్లోకములందును నిఖిలజంతువులకును వ్యవహారములే లేకపోవును. జలము శోషింపఁజేయు భాస్కరుఁడు లేకున్న జగత్తునఁ దాప మెట్లు గలుగును? వృష్టిలేకున్న సూర్యుఁడు తపింపఁడు. సంచారముచే సంతటను జొరఁబడఁడు. వికారమునుగూడ బొందఁడు. ఉదకముచేతనే యాదిత్యునకు దీప్తి కలుగుచున్నది. ఈసూర్యుఁడు వసంతకాలమునఁ గపిలవర్ణుఁడు గ్రీష్మమునఁ గాంచనప్రభాయుతుఁడు వర్షాసమయమున శ్వేతవర్ణుఁడు శరత్సమయమునఁ బాండువర్ణుఁడు నై యుండును. హేమంతమున రాగివర్ణమును శిశిరమున రక్తవర్ణమును గలిగియుండును. ఇవియన్నియు నాదిత్యుని వర్ణములు. వీనిఫలములు వినుము. కృష్ణవర్ణము జగత్తునకు భయము నిచ్చును. తామ్రవర్ణము సేనాధిపులఁ జంపును. పీతవర్ణము రాజపుత్త్రుల మ్రింగును. శ్వేతవర్ణము పురోహితులఁ దినును. చిత్రవర్ణమును ధూమ్రవర్ణము గలసూర్యుఁ డూర్ధ్వలోకమును గిరణములచే నాకులము

---

విశ్వశః, మాసాః సంవత్సరాశ్చైవ ఋతవోఽథ యుగాని చ. ౮. సదాదిత్యాదృతే హ్యేషా కాలసంఖ్యా న విద్యతే, కాలాదృతే న నియమో నాగ్నిర్న హవనక్రియా. ౯. ఋతూనామవిభాగాచ్చ పుష్పమూలఫలం కుతః, కుతః సస్యవినిష్పత్తిస్తృణౌషధిగణాః కుతః. ౧౦. అభావో వ్యవహారాణాం జంతూనాం దివి చేహ చ, జగత్ప్రతపనమృతే భాస్కరం వారితస్కరమ్. ౧౧. నావృష్ట్యా తపతే సూర్యో నావృష్ట్యా పరివిశ్యతే, నావృష్ట్యా వికృతిం ధత్తే వారిణా దీప్యతే రవిః. ౧౨. వసంతే కపిలః సూర్యో గ్రీష్మే కాంచనసప్రభః, శ్వేతో వర్ణేన వర్షాసు పాండుః శరది భాస్కరః. ౧౩. హేమంతే తామ్రవర్ణస్తు శిశిరే లోహితో రవిః, ఇతి వర్ణాః సమాఖ్యాతాః శృణు వర్ణఫలం హర. ౧౪. కృష్ణో భయాయ జగతస్తామ్రః సేనాపతిం వినాశయతి, పీతో నరేంద్రపుత్రం శ్వేతస్తు పురోహితం హంతి. ౧౫. చిత్రోఽథవాపి ధూమ్రో రవీ రశ్మివ్యాకులం కరోత్యుచ్చైః, తస్కరశస్త్ర

చేయును. చోరులవలెఁ గిరణములఁ బరపి శీఘ్రముగ జలము నపహరించును. శీఘ్రముగ జలమును విసర్జింపఁడు.

ఇది చతుష్పంచాశత్తమాధ్యాయము.

## పంచపంచాశత్తమాధ్యాయము.

రుద్రుండు పితామహున కిట్లనియె—"పితామహా! సూర్యునకు రథయాత్ర చేయవలయునని చెప్పితివి. అద్దాని మానవు లెట్టు లొనరింపవలయును? అట్టియాత్రలు చేయువారి కేమి ప్రయోజనము లభింపఁగలదు? ఏకాలమున నెవ్విధి నద్దాని నొనర్పవలయును ఆదివసకరుని రథమున నునిచి యెటులు త్రిప్పవలయును? ఏమానవులు భక్తిశ్రద్ధలతో దేవునిరథము మోయుదురో వారేమిఫలము నొందుదురు? ఆదేవునిరథము నెదుట నృత్యముచేయుమానవు లేఫలముగాంతురు? ఆదేవునివెంటఁ దిరుగుచు నర్తనగానములతోఁ బ్రొద్దుపుచ్చువారును భక్తిశ్రద్ధలుగలిగి యాదేవు నెదుట జాగరణమొనర్చువారును రథము నిర్మించి యాదేవున కొసంగువారును భక్తిపురస్సరముగ నిరువదిదినములకుఁ జాలునాహారమును బలి యొసంగువారు నేయేఫలముల నందఁగలరు? ఓసురజ్యేష్ఠా! ఈవిషయ మెల్ల సవిస్తరముగ నెఱింగింపుము. లోకములకు శ్రేయము గలిగించు

---

నిషాత్తైర్యది న సలిలమాశు పాతయతి. ౧౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి రథసప్తమీకల్పే సూర్యమహిమవర్ణనం నామ
చతుష్పంచాశత్తమోఽధ్యాయః.

---

రుద్ర ఉవాచ:—రథయాత్రా కథం కార్యా భాస్కరస్యేహ మానవైః, ఫలం చ కిం భవేత్తేషాం యాత్రాం కుర్వంతి యే రవేః. ౧. విధినా కేన కర్తవ్యా కస్మిన్కాలే సురోత్తమ, కథం చ భ్రామయేద్దేవం రథారూఢం దివాకరమ్. ౨. దేవస్య యే రథం భక్త్యా భ్రామయంతి వహంతి చ, తేషాం చ కిం ఫలం ప్రోక్తం యే చ నృత్యకరా నరాః. ౩. భ్రమన్తి యే చ దేవేన నృత్యగీతపరాయణాః, ప్రజాగరం చ కుర్వంతి భక్త్యా శ్రద్ధాసమన్వితాః. ౪. తేషాం చ కిం ఫలం ప్రోక్తం రథం యచ్ఛంతి యే రవేః, బలిం భక్తం చ యే భక్త్యా దిశంత్యాహ్నికభోజనమ్. ౫. ఏతన్మే బ్రూహి నిఖిలం సురజ్యేష్ఠ

ట్టకే నాయనమున మిగుల కుతూహలము గలిగియున్నది. కావున నెఱింగింపవే" యని యడుగ సర్వేశోత్తమునకుఁ బితామహుఁ డిట్లనియె—ఓభూత నాథా ! ముక్కంటీ ! సమస్తగణములను నడుపువాఁడ లెస్సగ నడిగితివి. వినఁగ నుత్సాహ మొసఁగుదును. ఏకాగ్రచిత్తుఁడవై యాకర్ణింపుము. మహానుభావుఁడగు భాస్కరదేవుని రథోత్సవమును నింద్రోత్సవమును మర్త్యలోకమున జనులకు మంగళార్థమై యేనే చెప్పియుంటిని. ఈ దేవ మహోత్సవములు రెండును నేదేశమునఁ బ్రవర్తించునో యాదేశమున రాచవారములవలనఁగాని ముచ్చుమూఁకలవలనఁగాని యుపద్రవములు గలుగ నేరవు. కావున నన్నిదేశములందును వర్షములు లేకపోవుట మొదలగు దుర్భిక్షదోషములు నివర్తించుటకై భక్తిపురస్సరముగ నీరెండుత్సవములను జేయుందగియున్నవి. ఓహరా! భాద్రపదమాసమున శుక్లపక్ష సప్తమినాఁడు పవిత్రములగు ముఖశృంగాద్యంగపంచకములుగల కపిల గోఘృతముచే నాదిత్యున కభ్యంగము చేయవలయును. మఱియు గ్రహాధి నాథుఁడగు నాదిత్యున కనుదినమును నానావర్ణచిత్రములుగల యభ్యం జనమందిరముగట్టి యందునిచి యావపెండినూనెతో నభ్యంజనము భక్తితో నొనరుపవలయును. ఇట్టు లొనరించువాఁడు రాలతోఁ జేయఁ బడి చిరుగంటలచే నందమైయుండు విమానము నెక్కి గంధర్వాప్సరో గణనిషేవితమగు వైశ్వానరుని దివ్యపట్టణము నొందును. శర్కరాఖండ మిశ్రితమగు శాల్యన్నంబును భక్ష్యములను వానితో గూడినచిత్రాహార

---

సవిస్తరమ్, లోకానాం శ్రేయసే దేవ పరం కౌతూహలం హి మే. ౬. బ్రహ్మోవాచ—సాధు పృష్టోఽస్మి భూతేశ గణేశోసి త్రిలోచన, శృణుష్వైకమనా వచ్మి యథాప్రశ్నం సవిస్తరమ్. ౭. దేవస్య రథయాత్రేయం భాస్కరస్య మహాత్మనః, ఇంద్రోత్సవస్తథా రుద్ర మయా హ్యేతౌ ప్రకీర్తితౌ. ౮. మర్త్యలోకే శాంతిహేతో ర్లోకానాం లోకపూజిత, ప్రవర్తితావుభౌ యస్మిన్దేశే దేవమహోత్సవౌ. ౯. న తత్రోపద్రవాః సంతి రాజతస్కరసంభవాః, తస్మాత్కార్యావిమౌ భక్త్యా దుర్భిక్షస్యేహ శాంతయే. ౧౦. శుక్లపక్షే తు సప్తమ్యాం మాసి భాద్రపదే హర, ఘృతేనాభ్యంగయే ద్దేవం పంచపూతాంగజేన వై. ౧౧. అభ్యంగయేద్గ్రహేశం యః సర్షపైః శ్రద్ధయాన్వితః, దినే దినే జగన్నాథం ప్రవిష్టం వర్ణకే రవిమ్. ౧౨. స గచ్ఛేద్యానమారూఢో ఘంటికం కింకిణీకృతమ్, వైశ్వానరపురం దివ్యం గంధర్వాప్సరశోభితమ్. ౧౩. శాల్యోదనం

మును దినదినము నాదిత్యునకు నివేదించువాఁడు జ్వాలాసమూహముచేఁ బర్యాకులమై శుభదర్శనమగు విమానమునెక్కి మహర్షులు నుతించుచుండ మదీయపట్టణమును జేరును. కావున నోశివా! మానవులు నిఖిల యత్నము లొనరించి చిత్రమందిరగతుండగు భాస్కరునకు వర్ణభక్త (చిత్రాన్న)ము నివేదింపవలయును. సమృద్ధమగు ఘృతమును ఖండశర్కరయుఁ గాసారమును మోదకంబులును క్షీరంబులును దధ్యన్న పాయసములును గుడాపూపములును సంయావము (అలచందలతోఁగాని నల్లమినుగులతోఁగాని చేసినభక్ష్యము)లును భాస్కరున కొసంగువారు నానావర్ణవిచిత్రితమగు నామందిరము బొందఁగలరు. ఇందావంతేని యనుమానింపఁబనిలేదు. ప్రతిదినము నేమానవుఁడు భాస్కరుని యభ్యంగముకొఱకు ఘృతము నొసఁగునో యాతఁ డుత్తమ గతి గాంచును. అట్టులే యేమానవుఁడు భక్తియుక్తుఁడై నిచ్చలు నాదేవునకు వర్ణభక్తము నొసంగునో యాతఁడీలోకమున శుభప్రదములగు నిష్టభోగము లనుభవించి జన్మాంతమ్మున రుద్రసాలోక్యము గాంచును. ఆదిత్యునకు శుభము లొసంగఁజాలు నలుగుపిండి నొసంగనేని యాతఁడు దివాకరుని నెలవగు నుత్తమపదము నొందును ఇప్పగిది నిచ్చలుఁ బూజించుచుండి పిదపఁ బుష్యమాసము ప్రవేశింప శుక్లపక్షసప్తమినాఁడు

---

ఖండమిశ్రం వజ్రం వజ్రసమన్వితమ్, వర్ణభక్తం ప్రయచ్ఛేద్యో భాస్కరాయ దినే దినే. ౧౪. ఆరూఢః స విమానం తు జ్వాలామాలాకులం శుభమ్, గచ్ఛేన్మమ పురం దేవ స్తూయమానో మహర్షిభిః. ౧౫. తస్మాత్సర్వప్రయత్నేన భాస్కరాయ నరైః శివ, వర్ణభక్తం ప్రదాతవ్యం ప్రవిష్టస్యేహ వర్ణకమ్. ౧౬. ఘృతపూర్ణం ఖండవేష్టం కాసారం మోదకం పయః, దధ్యోదనం పాయసం చ సంయావం గుడపూపకాన్. ౧౭. యే ప్రయచ్ఛంతి దేవస్య భాస్కరస్యేహ వర్ణకమ్, తే గచ్ఛంతి న సందేహో నరా వై మందిరం మమ. ౧౮. అహన్యహని యో భక్త్యా భాస్కరాయ ప్రయచ్ఛతి, అభ్యంగాయ ఘృతం దేయం స యాతి పరమాం గతిమ్. ౧౯. తథా యో వర్ణభక్తం చ అహన్యహని భక్తితః, స ప్రాప్యేహ శుభాన్కామాన్గచ్ఛేత్స భవసాలయమ్. ౨౦. చూర్ణముద్వర్తనాయేహ యః ప్రయచ్ఛేచ్ఛుభం రవేః, స యాతి పరమం స్థానం యత్ర దేవో దివాకరః. ౨౧. తతస్తం స్నాపయేద్దేవం పౌషే మాసి విధానతః, సప్తమ్యాం

విధ్యుక్తవిధంబున దేవునకు స్నాన మొసర్పవలయును. అవ్విధానంబు వినుతు సాపధానుఁడ వగుము. పుణ్యతీర్థముల యుదకమునుగాని యది లభింపకున్న నితరశుభజలమునుగాని కొనితెచ్చి వేదమునఁ జెప్పిన విధుల ననుసరించి శుద్ధదేశమునఁ బ్రతిమను స్థాపించి విద్వాంసుఁడగు మానవుఁడు తీర్థములనామములెల్లఁ జిత్తమునఁ దలంచుచు యజింపవల యును. ప్రయాగమును దేవనివాసమగు పుష్కరమును గురుక్షేత్రమును నైమిషారణ్యమును బృథూదకమ్మును జంద్రభాగానదిని శోణనదంబును గోకర్ణంబును బ్రహ్మావర్తకుశావర్తదేశములను బిల్వకంబును నీలాచల మును బవిత్రమగు గంగాద్వారంబును బవిత్రమగు గంగాసాగరసంగ మంబును కాలప్రియుని, మిత్రవనంబును శుండేరస్వామినిఁ బుణ్యనిదాన మగు చక్రతీర్థమును మంగళాయతనంబగు రామతీర్థమును సంతోషకారణ మగుత్రోవగల వితస్తానదియును దేవికానదియును గంగయు సరస్వతీ నదియు సింధునదియుఁ జంద్రభాగానదియు నర్మదయు విపాశయు యమునయుఁ దపతియు శుభప్రద యగువేత్రవతీనదియు గోదావరియుఁ బయోష్ణియుఁ గృష్ణవేణీనదియు శుతుద్రియుఁ (శతరుద్రా)బుష్కరిణియుఁ గౌశికియు సరయూనదియు సమస్తమహాసముద్రములు నన్యే యితరనదు లును బుణ్యాశ్రమములును దివ్యములగు దేవతాయతనములును సాన్నిధ్య మొసఁగుఁగాతమని మనమున ధ్యానింపవలయును. ఇట్లు ధ్యానించి విధ్యుక్తముగ స్నానవిధిని ముగించి యర్చన లొసంగి నమస్కరించి

---

శుక్లపక్షస్య శృణుష్వైకమనాస్తథా. ౨౨. తీర్థోదకముపానీయ అన్యద్వాథ జలం శుభమ్, వేదోక్తేన విధానేన ప్రతిమాం స్థాపయేద్బుధః. ౨౩. యజేద్ధి తీర్థనామాని మనసా సంస్మరన్బుధః, ప్రయాగం పుష్కరం దేవం కురుక్షేత్రం చ నైమిషమ్. ౨౪. పృథూదకం చంద్రభాగాం శోణం గోకర్ణమేవ చ, బ్రహ్మావర్తం కుశావర్తం బిల్వకం నీలపర్వతమ్. ౨౫. గంగాద్వారం తథా పుణ్యం గంగాసాగరమేవ చ, కాలప్రియం మిత్రవనం శుండీరస్వామినం తథా. ౨౬. చక్రతీర్థం తథా పుణ్యం రామతీర్థం తథా శివమ్, వితస్తా వార్షపంథా వై తథా వై దేవికా స్మృతా. ౨౭. గంగా సరస్వతీ సింధు శ్చంద్రభాగా సునర్మదా, విపాశా యమునా తాపీ శివా వేత్రవతీ తథా. ౨౮. గోదావరీ పయోష్ణీ చ కృష్ణా వేణ్యా తథా నదీ, శతరుద్రా పుష్కరిణీ కౌశికీ సరయూ స్తథా. ౨౯. తథాన్యే సాగరాశ్చైవ సాంనిధ్యం కల్పయంతు వై, తథాశ్రమాః పుణ్యతమా దివ్యాన్యాయతనాని చ. ౩౦. ఏవం స్నానవిధిం కృత్వా అర్చయిత్వా ప్రణమ్య

యర్ఘ్యమును ధూపము నొసంగి దేవుని ప్రతిమను మూఁడురాత్రులు గాని యేడురాత్రులుగాని పదునైదురాత్రులుగాని యొకమాసముగాని యం దధివసింపఁజేయవలను. ఇట్లు స్నానగృహమున నున్న దేవుని భక్తితోఁ బూజింపవలయును. నిజమందిరముముంగిట నాలుగుకోణములు గలశుభప్రదమగు వేదికను గోమయముతో శుద్ధముగావించి నలుదిక్కులను దెల్లనికడవలుగలిగి యందములగు చాందినీలతో వెలుఁగుచు నుండునట్లు చేయవలయును. ఓ త్రిపురసంహారా! మాఘమాసంబునఁ గృష్ణసప్తమినాఁడు యథావిధిగ నగ్నికార్యంబు నిర్వర్తించి బ్రాహ్మణభోజనంబు లొనరించి పుష్కలములగు శంఖభేరీనినాదములచేతను వేదఘోషములచేతను నానావిధములగు పుణ్యాహవచనశబ్దములచేతను బ్రాహ్మణుల స్వస్తివాచనములచేతను బరమభక్తియుక్తుఁడై పరమాత్మయగుసూర్యుని గన్నులపండువుజేయుచుఁ జిరుగంటలు తోరణములవలె సమర్పఁబడి మ్రోగుచుండుటచే నాకులమై యున్నరథమున స్థాపించి మహోత్సవ మొనరించుచు నాదేవు నూరేగింపవలయును. మాఘశుక్లపక్షమున నాదిత్యుని రథమున నెక్కించి విధ్యుక్తముగ నగ్నికార్యము లాచరించి బ్రాహ్మణసంతర్పణములు చేయించి దక్షిణ లిచ్చుటచేతను భోజనము పెట్టుటచేతను సమస్తజనులను సంతోషపఱచి దివ్యతేజోవిరాజమానులు నుత్తములు సువచనులు నగుబ్రాహ్మణులఁ బూజింపవలయును. బ్రాహ్మణోత్తము లితిహాసములను బురాణములను వాచనము జేయవలయును.

---

చ, ధూపమర్ఘ్యం ప్రదత్త్వా తు ప్రతిమామధివాసయేత్. ౩౧. త్రిరాత్రం సప్తరాత్రం వా మాసం మాసార్ధమేవ చ, స్థితం స్నానగృహే దేవం పూజయేద్భక్తితో నరః. ౩౨. చత్వరే లేపయేద్వేదిం చతురస్రాం శుభే కృతామ్, చతుర్దిశం శ్వేతకుంభైర్వితానవరశోభితామ్. ౩౩. కృష్ణపక్షే తు మాఘస్య సప్తమ్యాం త్రిపురాంతక, కృత్వాగ్నికార్యం విధివత్కృత్వా బ్రాహ్మణభోజనమ్. ౩౪. శంఖభేరీనినాదైస్తు బ్రహ్మఘోషైశ్చ పుష్కలైః, పుణ్యాహఘోషైర్వివిధైర్బ్రాహ్మణాన్స్వస్తివాచ్య చ. ౩౫. తతోఽస్య పరయా భక్త్యా సూర్యస్య పరమాత్మనః, రథేన దర్శనీయేన కింకిణీజాలమాలినా, సూర్యశ్చ భ్రామయేద్దేవం మహోత్సవపురఃసరమ్. ౩౬. శుక్లపక్షే తు మాఘస్య రథమారోపయేద్రవిమ్, కృత్వాగ్నిహోమం విధివత్తథా బ్రాహ్మణభోజనమ్. ౩౭. ప్రీణయిత్వా జనం సర్వం దక్షిణాభోజనాదినా, ప్రపూజ్య బ్రాహ్మణాన్దివ్యాన్శుభమాంశ్చాపి సువాచకాన్.

అట్టి బ్రాహ్మణులను బూజింపవలయును. అటమీఁద యత్నపురస్సరముగ నిష్టదేవతారాధనముగూడఁ జేయవలయును. మాఘశుద్ధపంచమినాఁ డేక భుక్తము సేయవలయును. చవితినాఁడు యాచింపక యాదృచ్ఛికముగ లభించినదానిని భుజింపవలయును. షష్ఠినాఁడు రాత్రి యాహారము సేయవలయునని చెప్పుదురు. సప్తమినాఁ డుపవాసమునే చేయవలయును. ఇట్లుపవాస మొనరించి మందిరమునుండి యాదిత్యుని రథమున నునిచి రథము ముందర నగ్నికార్య మొనరింపవలయును. ఓభూతనాథా! షష్ఠినాఁడు రాత్రి తేరాయితముజేసి వెనుకఁజెప్పినచొప్పున విప్రవరులను భుజింపఁజేసి మాఘశుక్లసప్తమినాఁడు సూర్యదేవాలయము నెదుట నిఖిలభూత వంద్యుఁడగు నాదిత్యునిరథము నధిరోహింపఁజేయవలయును. ఆనాఁ డచ్చటనే యాదేవు నుంచి యాతనియెదుట నారాత్రి జాగరణము సలుపవలయును. ఆజాగరణసమయమున నానాజాతులగు వినోదముల తోడను నృత్యములందు దీపములనుంచి విచిత్రములుగ నొనరించుట చేతను బుష్కలములగు శంఖతూర్యధ్వనులతోడను వేదఘోషముల తోడను నాదేవునెదుటనే వసించి కాలయాపనము చేయవలయును. అంత మఱునాఁ డష్టమిని రథస్థితుఁడగు దేవుని యత్నముతో శంఖభేరీ నినాదములతోఁ దొలుత నుత్తరద్వారమునఁ గొంపోవలయును. ఆవెనుకఁ దూరుపువాకిటను నావెనుక దక్షిణద్వారమునను నామీఁదట బశ్చిమద్వార

---

౩౮. ఇతిహాసపురాణాభ్యాం వాచకో బ్రాహ్మణోత్తమః, తతో దేవశ్చ ఇష్టశ్చ సంపూజ్యో యత్నతస్తదా. ౩౯. మాఘస్య శుక్లపక్షస్య పంచమ్యామేకభక్తకమ్, అయాచితం చతుర్థ్యాం తు షష్ఠ్యాం నక్తం ప్రకీర్తితమ్. ౪౦. సప్తమ్యాముపవాసం తు ఆశ్రమాద్రోపయేద్రథమ్, అగ్నికార్యం తు వై కృత్వా రథస్య పురతః శివ. ౪౧. షష్ఠ్యాం చ రాత్రౌ భూతేశ రథస్యాధివాసనమ్, బ్రాహ్మణాన్భోజయిత్వా తు దివ్యాన్భామాంశ్చ పంచకాన్. ౪౨. రథమారోపయేద్దేవం సప్తమ్యాం భూతభావనమ్, సితాయాం మాఘమాసే తు తస్య దేవాలయాగ్రతః. ౪౩. తత్రస్థస్యైవ దేవస్య కుర్యాద్రాత్రౌ ప్రజాగరమ్, నానావిధైః ప్రేక్షణకైర్దీపవృక్షోపశోభితైః. ౪౪. శంఖతూర్యనినాదైశ్చ బ్రహ్మఘోషైశ్చ పుష్కలైః, కుర్యాత్ప్రజాగరం భక్త్యా దేవస్య పురతో నిశి. ౪౫. తతోఽష్టమ్యాం చ యత్నేన దేవం రథగతం నయేత్, నగరస్యోత్తరం ద్వారం శంఖభేరీనినాదితమ్. ౪౬. తతః పూర్వం దక్షిణం చ ద్వారం చాపి తథాపరమ్, ఏవం హి క్రియ

మునను గొంపోవలయును. ఇప్పగిది నొక్కయేడాది రథయాత్ర యొనరించు మానవులు సుఖులై వృద్ధిబొందుదురు. రాజగువాఁడు శత్రుజయము గాంచును. జనులెల్లరు నాతని రాజ్యమున రోగములఁ బాసి సుఖింత్రు. అట్టులే యాతనిరాజ్యమున గోవులు శాంతియుతములై వర్తించును. రథయాత్ర యొనరించుపుణ్యాత్ములు స్వర్గసుఖము ననుభవించుచున్నారు. రథమును లాగుపవిత్రగాత్రులు నోవత్సా! సూర్యలోకమును బొందుదురు గదా! అన విని యోబ్రహ్మా! ఒకచో స్థాపింపఁబడిన ప్రతిమ గదల్చుట కెట్లు వీలుగలుగును? ఈయంశమున నానెమ్మనమ్మున గొప్పసందియము గలుగుచున్నది. దేవా! నాదగు నాసంశయము దీర్పవే యని రుద్రుఁ డడుగ నాతనికిఁ బితామహుఁ డిట్లనియె. మహాదేవా! మున్ను సహస్రాంశుండగు నిమ్మహాత్ముని యాత్రకొఱకే సంవత్సరావయవములగు మాసాదులచే నొక్కయరదము నేనే యొనరించియుంటిని. అయ్యరదము ప్రపంచముననున్న యెల్లరథంబులకును మొదటిదై యున్నది. ఈయరదంబును జూచి చిత్రకారుఁడగు విశ్వకర్మ సోముఁడు మొదలగు నెల్లదేవతలు నెక్కుటకు వీలగు పెక్కరదములు జేసెను. విశ్వకర్మనిర్మితమగు నరదము గైకొని యాదిత్యదేవుఁడు నేనిచ్చిన రథమును నిజపూజాసంసిద్ధికై మనువున కొసంగియుండెను. ఆమనువు నారథమును మనుజులందఱు నాదిత్యుని బూజింత్రు గాక యని యాదేశించి యిక్ష్వాకుభూపాలున కొసంగె. అదిమొదలు

మాణాయాం యాత్రాయాం వత్సరావధౌ. ౪౭. మానవాః సుఖమేధంతే రాజా జయతి చాహితాన్, నీరుజశ్చ జనాః సర్వే గవాం శాంతిర్భవేత్తథా. ౪౮. కర్తారశ్చాపి యాత్రాయాః స్వర్గభాజో భవంతి హి, వోఢారశ్చ తథా వత్స సూర్యలోకం ప్రజంతి వై. ౪౯. రుద్ర ఉవాచ:—కథం సంచాల్యతే బ్రహ్మన్ స్థాపితా ప్రతిమాసకృత్, ఏతన్మే వద దేవేశ సుమహాన్సంశయో హి మే. ౫౦. బ్రహ్మోవాచ:—పూర్వమేవ సహస్రాంశోర్యానహేతోర్మహాత్మనః, సంవత్సరస్యావయవైః కల్పితో౽స్య రథో మయా. ౫౧. సర్వేషాం తు రథానాం వై స రథః ప్రథమః స్మృతః, తం దృష్ట్వా తు తతస్త్వన్యే స్యందనా విశ్వకర్మణా. ౫౨. కల్పితాః సర్వదేవానాం సోమాదీనామనేకశః, విశ్వకర్మకృతం ప్రాప్య రథం దేవేన పుత్రక. ౫౩. పూజార్థమాత్మనో దత్తం మనవే వత్సలోద్వహా, మనునేక్ష్వాకవే దత్తం మర్త్యైః సంపూజ్యతాం రవిః. ౫౪. అతస్తు రథ

సూర్యునకు రథయాత్రచే స్థానము గదల్చుట విహితమై నడచుచున్నది. కావున సవితృదేవునకుఁ జాలనమున నించుకేనియు దోసంబు వాటిల్లదు. అతఁడు సర్వకాలములఁ జలించుచునే యుండును గదా! ఆభాస్కరుఁడు రథమునెక్కి యెల్లలోకమును జుట్టివచ్చుచున్నాఁడు గదా! కాని యాతఁడుగాని యాతనిమండలముగాని పోవుచున్నట్లును చలించు చున్నట్లును గనఁబడుట లేదు అంతమాత్రముచే నాదిత్యుఁడు చలించుట లేదని యెంచుట యనుచితము. కావున నోపార్వతీప్రియా! సూర్య చాలనమున దోసము లేదు. ఈచాలనవిధము రథయాత్రయును సూర్యుని విషయమున విద్వాంసు లంగీకరించియున్నారు. ఇతర దేవతలకు మాత్రము చాలనము సమ్మతముగాదు. విధివిధానమునఁ బ్రతిష్ఠింపఁబడిన బ్రహ్మవిష్ణు శివాదు లగు దేవతలకుఁ జాలనము లేదు. అదిగాన నేఁటేటను సర్వకాలము లను బ్రజలకు శాంతిగలుగుటకై యాదిత్యదేవునకు రథయాత్ర చేయ వలయును. బంగారముతోగాని వెండితోగాని చేవగలకొయ్యతోగాని దృఢములగు నిరుసులు నొగచక్రమును గలిగి బాగుగ నమర్పఁబడిన యరదము నొకదాని నిర్మించి బాగుగ నలంకరించి యందమై శ్రేష్ఠమగు నయ్యరదంబునఁ బ్రతిమ నధిరోహింపఁజేసి యత్నపురస్సరముగ శుభా కారములును హరితవర్ణములును సులక్షణములును శోభనాననములునై జితేంద్రియములై కుంకుమలిప్తాంగములై చామరంబులతోడను సుమ దామంబులతోడను భూషితములై యున్న యుత్తమాశ్వమ్ములఁ గట్టి రథ

---

యానేన చాలనం విహితం రవేః, తస్మాన్న చాలనే దోషః సవితుశ్చల ఏవ సః. ౪౫. యస్మాద్రథేన పర్యేతి భాస్కరః పృథివీమిమామ్, గచ్ఛన్న దృశ్యతే చైతన్మండలం సవి తుస్తథా. ౪౬. అదృష్టం చలతే యస్మాత్తస్మాద్వై పార్వతీప్రియ, తదేవం రథయాత్రా సు దృష్టం భానోర్మనీషిభిః. ౪౭. అన్యేషాం చాలనం నేష్టం దేవానాం పార్వతీప్రియ, బ్రహ్మవిష్ణుశివాదీనాం స్థాపితానాం విధానతః. ౪౮. తస్మాద్రథేన దేవస్య యాత్రా కార్యా విధానతః, ప్రజానామిహ శాంత్యర్థం ప్రతిసంవత్సరం సదా. ౪౯. కాంచనో వాథ రౌప్యో వా దృఢదారుమయోఽపి వా, దృఢాక్షయుంగచక్రశ్చ రథః కార్యః సుయంత్రితః. ౫౦. తస్మిన్రథవరే శ్రేష్ఠే కల్పితే సుమనోరమే, ఆరోప్య ప్రతిమాం యత్నాద్యోజయేద్వాజినః శుభాన్. ౫౧. హరిల్లక్షణసంపన్నాన్సుముఖానశ్వవర్తినః, కుంకుమేన సమాలబ్ధాంశ్చామరస్రగ్విభూషితాన్. ౫౨. సదశ్వాన్యోజయిత్వా తు రథ

మున కర్ఘ్యము నొసంగి ధూపములచేతను మాలికలచేతను చందనాద్యను లేపనములచేతను నిఖిలగీర్వాణులఁ బూజించి నానావిధములగు నాహార ములచే బ్రాహ్మణోత్తములఁ దనియించి యథాశక్తిగ దీనుల నంధులఁ గృపణుల నెల్లర నానందింపఁజేసి తృప్తిపఱచి యాత్రచేయవలయును. విస్తారమగు నాదిత్యయజ్ఞమునం దుత్తమమధ్యమాధముల నొక్కఁడేని విముఖుఁడై యుండరాదని జ్ఞానులందురు. ఆసమయమున నాకలిమంటచే మాఁడుచు యాచించువాఁడు భగ్నాశుఁడై విచారగ్రస్తుఁడై యుండె నేని యాతనివిచారముచే నన్నము మొదలగుదాని నొసంగని కర్త యొక్క పితృదేవతలు స్వర్గమునుండి క్రిందఁబడుదురు. దక్షిణలేక సూర్యయజ్ఞము ప్రశస్తము గానేరదు. కావున నీయజ్ఞమొనర్చువాఁడు పలువిధములగు నభిలాషలు పూర్తిచేసి వివిధభక్ష్యవ్యంజనసమన్వితభోజ నములచేత సర్వజనంబుఁ బూజించి యీచెప్పనున్నమంత్రము నుచ్చరింప వలయును. ఓదేవతలారా! ఆదిత్యులారా! వసువులారా! మరుత్తు లారా! అశ్వినులారా! రుద్రులారా! గరుడులారా! పన్నగులారా! గ్రహములారా! అసురులారా! యాతుధానులారా! రథమునవసించు నితరదేవతలారా! దిక్పాలురారా! లోకపాలకులారా! విఘ్నహంత లారా! మీరందఱు నాయొసంగుబలిని గ్రహింపుఁడు. దివ్యప్రభావ సంపన్నులగు మహర్షులు జగత్తునకు శుభములు గూర్తురుగాక. నేఁజేయు పనులందు విఘ్నములు లేకుండుఁగాక. పాపము లేకపోవుఁగాక. విరో

---

స్యార్ఘ్యం ప్రదాయ చ, విబుధాన్పూజయిత్వా తు ధూపమాల్యానులేపనైః. ౬౩. ఆహారైర్వివిధైశ్చాపి భోజయిత్వా ద్విజోత్తమాన్, దీనాంధకృపణాదీంశ్చ సర్వాన్సంత ర్ప్య శక్తితః. ౬౪. న కంచిద్విముఖం కుర్యాదుత్తమాధమమధ్యమమ్, సూర్యక్రతౌ తు వితతే ఏవమాహుర్మనీషిణః. ౬౫. యశ్చింతయతి భగ్నాశః క్షుధావాతప్రపీడితః, అదాతుర్హి పితౄంస్తేన స్వర్గస్థానపి పాతయేత్. ౬౬. యజ్ఞశ్చ దక్షిణాహీనః సవితుర్న ప్రశస్యతే, తస్మాన్నానావిధైః కామైర్భక్ష్యలేహ్యసమన్వితైః. ౬౭. పూజ యిత్వా జనం సర్వమిమముచ్చారయేన్మనుమ్, బలిం గృహ్ణంతు మే దేవా ఆదిత్యా వసవ స్తథా. ౬౮. మరుతోథాశ్వినౌ రుద్రాః సుపర్ణాః పన్నగా గ్రహాః, అసురా యాతు ధానాశ్చ రథస్థా యాస్తు దేవతాః. ౬౯. దిక్పాలా లోకపాలాశ్చ యే చ విఘ్నవినా యకాః, జగతః స్వస్తి కుర్వంతు యే చ దివ్యా మహర్షయః. ౭౦. మా విఘ్నం మా

ధులు గలుగకుందురుగాత. సమస్తదేవతలును నిఖిలభూతగణంబులును సౌమ్యులయి నాయీపూజనముచేఁ బరితుష్టు లగుదురుగాక. అని యిట్లు ప్రార్థించి వామదేవదేవతాకములు నతిపవిత్రములు నగుమంత్రజాలములను రథంతరమను నొకసామముతోఁ బఠింపవలయును. "ఆకృష్ణేన రజసా వర్తమానః" అను నొక్కఋక్కును బఠింపవలయును. తరువాత బుణ్యాహఘోషంబులతోడను నానావాద్యఘోషంబులతోడను మిట్టపల్లములు లేనిమార్గమున రథము నడుపవలయును. సూర్యభక్తులగు పురుషులు మాత్రమే రథవహనము జేయవలయును బాగుగ ముప్పేటలతోఁజేయఁబడినపగ్గములను బరువుమోయఁగఁజాలు నెడ్లనైనను గట్టవలయును. మిట్టపల్లములగు త్రోవనగూడ రథభ్రమణము జాగ్రత్తగ నొనరుపవలయును. ఉపవాస మొనరించి దివ్యులు భోములు నగు బ్రాహ్మణోత్తములు ముప్పదుగురుగాని పదార్గురుగాని కలసి భాస్కరప్రతిమను స్వస్థానమునుండి కదల్చి రథమున జాగ్రత్తగ మెల్లఁగ నెక్కింపవలయును. అమ్మహాత్ముని దేవేరులగురాజ్ఞియు, నిక్షుభయు నాతని యుభయపార్శ్వంబుల నిలుపఁదగుదురు. నిక్షుభను దక్షిణపార్శ్వమునను రాజ్ఞిని వామపార్శ్వమునను మెల్లఁగా నిలుపవలయును. దివ్యుఁడు భోముఁడు నను నిర్వురు బ్రాహ్మణోత్తములఁగూడ నుభయపార్శ్వముల నుండునటులు జేయవలయును. అట్టులే బ్రహ్మసమ్మితుఁడగు నొకభోముండు

---

చ మే పాపం మా చ మే పరిపంథినః, సౌమ్యా భవంతు తృప్తాశ్చ దేవా భూతగణాస్తథా. ౨౧. వామదేవ్యైః పవిత్రైశ్చ మానస్తోకరథంతరైః, ఆకృష్ణేన రజసా ఋచమేకాముదాహరేత్. ౨౨. తతః పుణ్యాహశబ్దేన కృతవాదిత్రనిఃస్వనైః, రథక్రమణకం కుర్యాద్వర్త్మనా సుసమేన తు, పురుషైశ్చాపి వోఢవ్యః సూర్యభక్తిసమన్వితైః. ౨౩. సుకృతైః ప్రగ్రహైర్దాంతైర్బలీవర్దైరథాపి వా, యథా పర్యటనం చ స్యాద్విషమే పథి గచ్ఛతః. ౨౪. ఉపవాసస్థితైర్విప్రైర్దివ్యైర్భోమైశ్చ సువ్రతైః, త్రింశద్భిః షోడశైర్వాపి ప్రతిమాం భాస్కరస్య తు. ౨౫. స్థానాత్ప్రచాల్య వై రుద్ర రథమారోపయేచ్ఛనైః, రాజ్ఞీ చ నిక్షుభా రుద్ర భార్యే తస్య మహాత్మనః. ౨౬. శనైరారోపయేద్రుద్ర ఉభయోః పార్శ్వయో రథే, నిక్షుభాం దక్షిణే పార్శ్వే రాజ్ఞీం చాప్యుత్తరే తథా. ౨౭. ద్వావేవ బ్రాహ్మణౌ తస్మిన్దివ్యో భోమశ్చ పార్శ్వయోః, బ్రహ్మకల్పస్తథా భోమః

నాగలెక్కవలయును. వెనుకవైపున జిత్రగతులుగల గరుడు నుంచవల
యును. అట్టులే బంగారుకఱ్ఱగలిగి యెందును సాటిలేనికాంతిగలిగి యచ్చ
టచ్చట బూవుల కెనయగునీరు బంగారుబొట్టులచే జిత్రితమై మణుల
తోడను ముత్తెములతోడను బ్రకాశించు వెలిగొడుగును గల్పింపవల
యును. అటుపైని యింద్రధనస్సున కెనయై నక్కులులేనిదై పతాకాలం
కృతమై స్వర్ణదండనిర్మితమగుధ్వజమును గల్పింపవలయును. ఓభూతపతీ!
పలురంగులుగల యేడుజండాలు కట్టవలయును. ఓకామధ్వంసీ! ఆధ్వజము
మీఁద నరుణుఁ డుండునట్లు చేయవలయును. రథముఖమున బ్రాహ్మణుల
నిలిపి యారథమును వెడలింపవలయును. తనశ్రేయమునుగోరువాఁ డెల్ల
ప్పుడు నారథమునందు సారథ్య మొనరింపవలయును. శ్రద్ధలేకయుండె
నేని యాత్మశ్రేయము గోరుమానవుఁడు రథము నధిష్ఠింపరాదు. ఆత్మ
శ్రేయోభిలాషియగు శూద్రుఁడును రథమెక్కరాదు. అట్టివాడు రథ
మెక్కినచో వెంటనే యాతనిసంతానము నశించును. ఆదేవదేవునిరథ
మును సర్వకాలములను బ్రాహ్మణక్షత్రియవైశ్యులు లాగవలయును.
శూద్రు లెప్పుడును మోయరాదు. ఇతరదేవతల నారాధించువారును
మద్యపాన మొనరించుచుఁ దద్వ్యాపార మొనరించువారును తదితర
శూద్రులు నెప్పుడును వహింపరాదు. ఇట్టిదోషములులేని త్రైవర్ణికులు
మాత్రమే మోయ నర్హులు. పార్వతీకాంతా! ముఖ్యముగ నుపవాస
వ్రతములు సలుపునుత్తములు రథము మోయఁదగుదురు. ఇట్లు స్వస్థా

---

కూబరస్యోపరి స్థితః. ౭౮. గరుడం పృష్ఠతశ్చాస్య వల్గమానం ప్రకల్పయేత్, ఆతపత్రం
తథా శ్వేతం స్వర్ణదండమనౌపమమ్. ౭౯. సువర్ణబిందుభిశ్చిత్రం మణిముక్తాఫలోజ్జ్వ
లమ్, తతస్త్విన్ద్రధనుఃప్రఖ్యం స్వర్ణదండమథావ్రణమ్. ౮౦. ధ్వజం ప్రకల్పయేత్తస్య
పతాకాభిరలంకృతమ్, భూతేశనానావర్ణాభిస్సప్తభిః కామనాశన. ౮౧. ధ్వజోపరిచరం
వ్యోమ అరుణాధిష్ఠితం భవేత్, రథతుండగతాన్విప్రాన్నయేద్రథవరం రవేః. ౮౨. సార
థ్యం రుద్ర కుర్యాద్వై శ్రేయోఽర్థమాత్మన స్సదా, నారుహేత రథేఽశ్రద్ధో యది
చ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః. ౮౩. రథమారోహతస్తస్య క్షయం గచ్ఛతి సంతతిః, స రథో దేవ
దేవస్య వోఢవ్యో బ్రాహ్మణైః సదా. ౮౪. క్షత్రియైశ్చాపి వైశ్యైశ్చ న తు శూద్రైః
కదాచన, యే త్వన్యదేవతాభక్తా యే చ మద్యప్రవర్తకాః. ౮౫. నైతైః శూద్రైశ్చ
వోఢవ్య ఇతరైస్తు సదోహ్యతే, ఉపవాసవ్రతోపేతైరోఢవ్యః పార్వతీప్రియ. ౮౬.

నమునుండి కదలి రథము నెక్కియున్న యాదిత్యుని దొలుత నగరమునఁ దూర్పుగుమ్మమునొద్దకుఁ గొంపోవలయును. అచ్చట రాజుచేఁ బూజ లందికొని యొకదినము వసింపవలయును. పలుతెఱంగుల వినోదముల తోడను బురాణశ్రవణములతోడను నానావిధములగు బ్రహ్మఘోష ములతోడను బ్రాహ్మణతర్పణములతోడ నాయష్టమితిథి తుదివఱకు నట నుండి నవమినాఁ డుదయమున నటవెడలి నగరదక్షిణద్వారమును జేర వలయును. ఓముక్కంటిదేవరా! అంధకవిధ్వంసీ! అట నాదినము వసించి క్షత్రియులచేతను నభిషిక్తులచేతను సామాన్యనరపతులచేతను బూజలు గైకొని మరునాఁడు (దశమిని) విశాలమగు పశ్చిమద్వారమునకేగి యట విధ్యుక్తవిధంబున శూద్రులచే నర్చితుండై యాదిన మాదిత్యుఁ డట వసించి మరునాఁడుత్తరద్వారమున కేగి యందును శూద్రాదుల పూజ లందికొని మఱునాఁ డటనుండి నగరమధ్యభాగమున వసించి యచ్చట శ్రద్ధాసమన్వితులై బ్రాహ్మణులు శంఖవాద్యఘోషములతోడ నుత్తమ వినోదములతోడను నానావిధములగు సామాదివేదఘోషములతోడను మంగళదీపదర్శనములతోడను నానావిధములగు దానములతోడను బ్రాహ్మణసంతర్పణములతోడను దీనుల నంధులఁ గృపణులను దృప్తినొం దించుటలతోడను బూజింప నానాఁ డందు వసించి యట గదలి యాది త్యుఁడు నిజమందిరముదగ్గఱ కేతెంచి మందిరద్వారమున నిలువవల యును. ఇట్లు నగరమంతయు భ్రమించి మందిరముకడ కేతెంచియున్న

స్వస్థానాచ్చలితో రుద్ర పూర్వద్వారం వ్రజేత వై, దినమేకం వసేత్తత్ర పూజ్యమా నో నృపేణ వై. ౧౭. నానావిధైః ప్రేక్షణకైః పురాణశ్రవణేన చ, నానావిధైర్బ్ర హ్మఘోషైర్బ్రాహ్మణానాం చ తర్పణైః. ౧౮. స్థిత్వా తు తత్రాష్టమ్యంతం నవమ్యాం చలతే పునః, వ్రజేత దక్షిణం ద్వారం నగరస్య త్రిలోచన. ౧౯. తత్రాపి దినమేకం తు తిష్ఠతేంధకసూదన, స్థితేత్ర తైః పూజ్యమానో యథా రాజ్ఞా తథా నృపైః. ౨౦. తస్మాదపిచలేద్భద్ర ద్వారం పశ్చాత్తతోత్తరమ్, తత్రాపి పూజ్యః శూద్రైస్తు విధివత్ప్రియ దర్శన. ౨౧. తస్మాచ్చ చలతే రుద్ర వ్రజేన్మధ్యం పురస్య తు, తత్రస్థం పూజయంతి స్మ బ్రాహ్మణాః శ్రద్ధయాన్వితాః. ౨౨. శంఖవాదిత్రనిర్ఘోషైస్తథా ప్రేక్షణకైర్వ రైః, బ్రహ్మఘోషైశ్చ వివిధైః సమంతాద్దీపకైః శుభైః. ౨౩. నానావిధైర్విత్తదానై ర్బ్రాహ్మణానాం చ తర్పణైః, దీనాంధకృపణానాం చ తర్పణైస్త్రిపురాంతక. ౨౪. పుర మధ్యాత్తు చలితస్తిష్ఠేత్ప్రాప్య స్వమందిరమ్, ఇత్థం ప్రాప్య స్థితో దేవః పురతో మందిర

యా దేవుని రథస్థుఁడై యుండఁగనే నిఖిలపౌరులును బూజింపవలయును. ఇట్టు లయ్యహోరాత్రములు గడపి మఱుదినమున నాదరముతోఁ జిరంతన మగు నిజమందిరమునఁ ద్రయోదశి గడచినవెనుక జతుర్దశినాఁడు యథా పూర్వముగ నాదిత్యుని నిజమందిరమునఁ బ్రవేశింపఁజేయవలయును. ఇట్టు లెల్లకాలమును దురితనివారకుఁడగు నాగ్రహరాజును సపరివార ముగను సానుచరంబుగను భ్రమింపఁజేయుచుండవలయును. ఇట్టు లప్పర మేశు నర్చించుట యుత్తములత్రోవ యని యెఱుంగుము. అని యెఱిం గింప నాకర్ణించి రుద్రుండు పితామహున కిట్లనియె.

ఇది పంచపంచాశత్తమాధ్యాయము

## షట్పంచాశత్తమాధ్యాయము.

ఓపితామహా! శాశ్వతుఁడై రథముననున్న యా దేవుని ప్రచా లన మెవ్విధి జేయవలయునో యీతని కనుచరు లెవ్వరో యెట్టు లను చరులైరో వరుసగ నా కెఱింగింపుము. మాటిమాటికి శ్రేయోభిలాషచే నిట్లడుగుచుంటిని. అది విన మిక్కిలి యుత్కంఠ జనించుచున్నది. సర్వము నెఱింగింపవె జగన్నాథా! యని యడుగ నాతనికి బ్రహ్మ యిట్లనియె. ఓరుద్రా! మిట్టపల్లములు లేనిత్రోవన నెమ్మదిగా రథము బఱపవలయును.

---

స్య తు. ౯౫. తత్ర స్థితః పూజనీయో భవేత్పౌరేణ కృత్స్నశః, పూజ్యమానస్త్వహో రాత్రం రథారూఢస్తు తిష్ఠతి. ౯౬. అపరే దినే వ్రజేత్స్థానం తచ్చిరంతనమాదరాత్, త్రయోదశ్యాం వ్యతీతాయాం చతుర్దశ్యాం త్రిలోచన. ౯౭. సదైవం భ్రామయేద్దేవం గ్రహేశం దురితాపహమ్, పరివారయుతం రుద్ర సానుగం పరమేశ్వరమ్. ౯౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి రథసప్తమీకల్పే రథయాత్రావర్ణనం నామ
పంచపంచాశత్తమోఽధ్యాయః.

---

శ్రీరుద్ర ఉవాచః—కథం ప్రచాలయేద్బ్రహ్మన్రథస్థం తమనాశనమ్, అను గాశ్చ కథం చాస్య కే చ తే అనుగాః క్రమాత్. ౧. భూయోభూయః సురశ్రేష్ఠ విస్తరాన్మమ శ్రేయసే, వద సర్వం జగన్నాథ పరం కౌతూహలం హి మే. ౨. బ్రహ్మో వాచః—శనైర్నయేద్రథం రుద్ర వర్త్మనా సుసమేన తు, యథా పర్యటనం తు స్యా

విషమమార్గమున బయిపినచో సంచారము యుక్తరీతిని జరుగనేరదు. జాగ్రతగఁ జేయఁగల్గియున్నచో నట్టిదేశమునఁగూడఁ జేయవచ్చును. అందు ద్వారపాలకునియరదము త్రోవబరిశీలించి శుద్ధముచేయుటకై తొలుత బయనముచేయవలయును. ఆవెనుక నత్యాదరమున దండనాథుని యరదము నావెనుక నాదిత్యునిపార్శ్వవర్తియగు పింగళునియరదము నావెనుక రక్షకద్వారకులయరదములను బరగింపవలయును. వారివెను కను దేవునియెదుటను డిండి యను ననుచరునరదముపై నెక్కింపవల యును. అటుపైని సూర్యున కిష్టుఁడగు లేఖకుఁడు (లెక్కలువ్రాయు వాఁడు) రథముమీఁద నుండవలయును. ఆవెనుక దేవునియరదమునుంచి ప్రయత్నపూర్వకముగ మెల్లమెల్లగ రథచాలనము చేయవలయును. భ్రమణకాలమున నొగలు నిరుసులు చక్రము మొదలగునవి విఱుగ కుండున ట్లతిజాగరూకత మెలఁగవలయును. నొగవిఱిగెనేని బ్రాహ్మణుల కుపద్రవము గలుగును. ఇరుసులువిఱిగిన క్షత్రియులకు నాశమేర్పడును. తులవిఱిగెనేని వైశ్యులకు క్షయముగలుగును. శయ్యాస్థానము భగ్న మయ్యెనేని శూద్రక్షయ మేర్పడును. కాడి విఱిగిన ననావృష్టిదోషము సంభవించును. గద్దియ విఱిగినచోఁ బ్రజలకు భీతిగలుగును. రథచక్రము భగ్నమయ్యెనేని పరచక్రము ప్రబలమై యీరాజ్యము నాక్రమించును. ధ్వజము విఱిగిపడెనేని నృపాలునకు భంగముకలుగునని తెలియవల యును. ప్రతిమయే వికలాంగమయ్యెనేని రాజునకు మరణము గలుగునని తెలియవలయును. గొడుగువిఱిగెనేని యువరాజునకు భయముగలుగును.

---

ద్విషమే పథి గచ్ఛతః. 3. ప్రతీహారరథం పూర్వం నయేన్మార్గవిశుద్ధయే, తస్మాదనంతరం రుద్ర దండనాయకమాదరాత్. ౪. పింగలం చ తతస్తస్య పృష్ఠగం చాదరాన్నయేత, రక్షో ద్వారకో యస్మాద్రథారూఢౌ తు పృష్ఠతః. ౫. రథారూఢస్తథా డిండీ దేవస్య పురతః స్థితః, తస్మాదపి తథా రుద్ర లేఖకో భాస్కరప్రియః. ౬. శనైశ్శనైర్నయే ద్రుద్ర రథం దేవస్య యత్నతః, యుగాక్షచక్రభంగో వా యథా న స్యాత్త్రిలోచన. ౭. ఈషాభంగే ద్విజభయం భగ్నేఽక్షే క్షత్రియక్షయః, తులాభంగే తు వైశ్యానాం శయ్యాశూద్రక్షయో భవేత్. ౮. యుగభంగే త్వనావృష్టిః పీఠభంగే ప్రజాభయమ్, పరచక్రాగమం విద్యాచ్చక్రభంగే రథస్య తు. ౯. ధ్వజస్య పతనే చాపి నృపభంగం వినిర్దిశేత్, వ్యఙ్గితప్రతిమాయాం తు రాజ్ఞో మరణమాదిశేత్. ౧౦. ఛత్రభంగాద్భ యం రుద్ర యువరాజ్ఞో వినిర్దిశేత్, ఉత్పన్నేష్వేవమాద్యేషు ఉత్పాతేష్వశుభేషు

ఇట్టిమాదిరి యమంగళములగు నుత్పాతములు జరిగినప్పుడు తిరిగి బలికర్మ మొనరించి శాంతిహోమములు సలిపి బ్రాహ్మణులచే స్వస్తివాచనములుచేయించి మగుడ దానములఁ గూడఁ జేయవలయును. రథమున వైశ్వానరియం దగ్నిప్రతిష్ఠ యొనరించి నేతితోఁ దడిపిన సమిత్తులచే నగ్నిహోత్రమునందు స్వాహాశబ్దములు నుడువుచు వరుసగ దేవతలకును గ్రహములకును బ్రజలకును వారివారినామముల నుగ్గడించుచు హోమములు చేయవలయును. మొదట "అగ్నయే స్వాహా" యనియుఁ బిదప "సోమాయస్వాహా" యనియు నావెనుక "ప్రజాపతయేస్వాహా"యనియు వరుసగ నాహుతు లొనరింపవలయును. "ఇట నెల్లబ్రాహ్మణులకును రాజునకును మంగళములు చేకురుగాక; గోవులకు శుభంబుగలుగుఁగాక; ప్రజలకును మంగళమవుగాక; జగంబునకు శాంతిగల్గుఁగావుత; ద్విపదులమగు మాకెల్లరకు భద్రంబగుత; సర్వకాలములను జతుష్పాత్తులకు శాంతి చేకురుగాక; ప్రజలకు శుభంబులగుఁగాక; అట్టులే యంతరాత్మునకు శుభంబవుగాక; "భూః" అనువ్యాహృతికి శాంతియగుఁగాక; దేవదేవా! అట్టులే "భువః" అనువ్యాహృతికిని "స్వః" అనువ్యాహృతికిని శాంతి లభించునుగావుత; ఎల్లవేళల నెల్లెడల నాదిత్యునకు శాంతి యగుఁగావుత;"మని ప్రార్థింపవలయును. మఱియు నాదిత్యభగవాను నుద్దేశించి "యోదేవా! నీవేగద యీజగము నెల్లఁ బుట్టించినవాఁడవు. పోషించు ప్రోడవును నీవెగా; కావున నో గ్రహనాథా! ప్రజారక్షకా! పగలు

---

చ. ౧౧. బలికర్మ పునః కుర్యాచ్ఛాంతిహోమం తథైవ చ, బ్రాహ్మణాన్వాచయేద్భూయో దద్యాద్దానాని చైవ హి. ౧౨. పూర్వోత్తరే చ దిగ్భాగే రథస్యాగ్నిం ప్రకల్పయేత్, సమిద్భిస్తు ఘృతాక్తాభిర్హోమయేజ్జాతవేదసమ్. ౧౩. స్వాహాకారాన్వదన్సమ్యగ్దైవతేభ్యస్త్వనుక్రమాత్, గ్రహేభ్యశ్చ ప్రజాభ్యశ్చ నామాన్యుద్దిశ్య హోమయేత్. ౧౪. ప్రథమం చాగ్నయే స్వాహా స్వాహా సోమాయ చైవహి, స్వాహా ప్రజాపతయేచ దేయాఆహుతయః క్రమాత్.౧౫.స్వస్త్యస్త్వహ చ విప్రేభ్యః స్వస్తి రాజ్ఞే తథైవ చ, గోభ్యః స్వస్తి ప్రజాభ్యశ్చజగతః శాంతిరస్తు వై.౧౬.శం నోఽస్తు ద్విపదే నిత్యం శాంతిరస్తు చతుష్పదే, శం ప్రజాభ్యస్తథైవాస్తు శం సదాత్మని చాస్తు వై. ౧౭. భూః శాంతిరస్తు దేవేశ భువః శాంతిస్తథైవ చ, స్వశ్చైవాస్తు తథా శాంతిః సర్వత్రాస్తు తథా రవేః. ౧౮. త్వం దేవ జగతః స్రష్టా పోష్టా చైవ త్వమేవ హి, ప్రజాపాల గ్రహే

జేయుదేవరా! సర్వశాంతినిగలుగఁజేయువేని ప్రార్థింపవలయును. మహేశా! శాంతిలభించుటకు వేఱొండుపాయంబుగూడ గలదు వక్కాణింతు నాలకింపుము. సూర్యునకు రథయాత్ర జేయుపురుషునకు జన్మకాలమున నుండుగ్రహకూటమును బరిశీలించి దుష్టస్థానముల నుండుగ్రహముల నెఱింగి యాగ్రహములను శాంతి నొనర్పవలయును. జేనెడునిడుపుగల సమిత్తుల సేకరింపవలయును. అందు సూర్యునకు జిల్లేడు సమిధలును జందురునకు మోదుగుసమిధలు నుపయోగింపవలయు నని స్మరించుచున్నారు. భూమిపుత్త్రుఁడగు నంగారకునకు చంద్రసమిత్తులు ప్రియమైనవి. చంద్రునితనయుఁడగు బుధునకు నుత్తరేణిసమిత్తు లిష్టమైనవి. బృహస్పతికి రావిపుల్లలు సమిధలుగఁ జేయవలయును. శుక్రాచార్యున కత్తిచెట్టుపుల్లలు సమిత్తులుగాఁ జేయవలయును. నీలదేహుఁడగు శనైశ్చరునకు జమ్మిసమిధ (లతో హోమము) లీవలయును. రాహువునకు గఱికయును కేతువునకుఁ గుశంబులును సమిత్తులుగా నెఱుంగవలయును. ఇక వారల కొసంగవలయు దక్షిణావిశేషముల వివరింతు నవధరింపుము. సూర్యునకు శుభలక్షణసమన్విత యగుగోవు నొసఁగవలయును. చంద్రునకు శంఖము నొసంగవలయును. ఎఱ్ఱనియెద్దు నొక్కదాని నంగారకున కొసంగవలయును. సోమతనయునకు బంగారము నొసంగవలయును. జీవు (బృహస్పతి) నకు శుభ్రవస్త్రయుగళ మొసంగవలయును. శుక్రునకుఁ దెల్లనిగుఱ్ఱము నీవలయును. శనైశ్చరునకు నల్లావు నీవలెను.

---

శాన శాంతిం కురు దివస్పతే. ౧౯. ఇదమన్యచ్చ వక్ష్యామి శాంత్యాః పరమకారణమ్, యాత్రాకారణభూతస్య పురుషస్య స్వజన్మనః. ౨౦. దుఃస్థానగ్రహాంశ్చ విజ్ఞాయ గ్రహశాంతిం సమాచరేత్, ప్రాదేశమాత్రాః కర్తవ్యాః సమిధోఽథ ప్రమాణతః. ౨౧. అర్కమయ్యో రవేః కార్యాః పాలాశ్యః శశినః స్మృతాః, ఖాదిర్యశ్చైవ భౌమాయ అపామార్గోఽబ్జసూనవే. ౨౨. ఆశ్వత్థ్యశ్చాథ జీవాయ ఔదుంబర్యః సితాయ చ, అసితాయ శమీమయ్యో దూర్వా కార్యాస్తు రాహవే. ౨౩. కేతవే తు కుశాః కార్యాః దక్షిణాశ్చాప్యతః శృణు, సూర్యాయ శోభనాం ధేనుం శంఖం దద్యాదథేందవే. ౨౪. రక్తమనడ్వాహం భౌమాయ కాంచనం సోమసూనవే, జీవాయ వాససీ దేయే శుక్రాయాశ్వం సితం హర. ౨౫. శనైశ్చరాయ గాం నీలాం రాహవే

రాహువునకుఁ గుండలోవండిన పాయసమును, కేతువునకు మేఁకపోతు నొసంగవలయును. ఇక నీగ్రహములకుఁ బ్రియములగుభోజనముల వివరింతు వినుము. సూర్యునకు బెల్లముగలిపినయన్నమును, సోమునకు నేయిపోసినపాయసమును, భూపుత్రునకు హవిష్యాన్నమును, సోమతనయునకు క్షీరాన్నమును, బృహస్పతికి పెరుగన్నమును, శుక్రునకు నేతియన్నమును సూర్యపుత్రుఁడగుశనికి మినుగులు తెలికపిండియు నొసంగఁదగినవి. రాహువునకు మాంసము నొసంగవలయును. కేతువునకు చిత్రాన్నమును సువీరదేశమున వాడుకలోనున్న యారనాళమను నానినవిత్తులతోఁ దయారయిన గంజినీళ్ల నొసంగవలయును. ఇది గ్రహశాంతిక్రమము. ప్రపంచమున బాణపుదెబ్బలు తప్పించుకొనుటకుఁ గవచ మెట్లు సాధనమని చెప్పుదురో యట్లే దైవమువలనఁ గలుగుబాధలకు శాంతియే నివారకమైయున్నది. హింసలొనరింపక సహనశీలురై ధనములు ధర్మమార్గమున సంపాదించుచు నెల్లకాలమును వ్రతనియమములు గలిగియుండు మహాత్ములయెడ సర్వకాలములందు గ్రహములు దయగలిగి వర్తించును. కావున నోరుద్ర! విశాలయశంబు వాంఛించుమానవులు సర్వకాలములను గ్రహపూజన మొనర్పవలయును. శ్రీకాముఁడు శాంతింగోరువాఁడును, వర్షముగోరువాఁడు, నాయువుగోరువాఁడును, బలమునుగోరువాఁడును, శత్రువుల వధింపఁగోరువాఁడు నేమరక గ్రహయాగ మొనరింపవలయును. ఏనారీశిరోమణులు సంతానములేనివారుగాని దుష్టసంతానముగలవారుగాని యగుదురో వారు నేమానవతికి

---

ఖాండపాయసమ్, ఛాగం తు కేతవే దద్యాచ్ఛృణ్వేషాం భోజనాన్యపి. ౨౬. గుడౌదనం తు సూర్యాయ సోమాయ ఘృతపాయసమ్, హవిష్యమన్నం భౌమాయ క్షీరాన్నం సోమసూనవే. ౨౭. దధ్యోదనం తు జీవాయ శుక్రాయాథ ఘృతాశనమ్, తిలపిష్టాంశ్చ మాషాంశ్చ సూర్యపుత్రాయ దాపయేత్. ౨౮. రాహవే దాపయేన్మాంసం కేతవే చిత్రమోదనమ్, సౌవీరమారనాలం చ స్విన్నబీజం చ కాంజికమ్. ౨౯. యథా బాణప్రహారాణాం వారణం కవచం స్మృతమ్, తథా దైవోపఘాతానాం శాంతిర్భవతి వారణమ్. 3౦. అహింసకస్య దాన్తస్య ధర్మార్జితధనస్య చ, నిత్యం చ నియమస్థస్య సదా సానుగ్రహా గ్రహాః. 3౧. గ్రహాః పూజ్యాః సదా రుద్ర ఇచ్ఛతా విపులం యశః, శ్రీకామః శాంతికామో వా గ్రహయజ్ఞం సమాచరేత్. 3౨. వృష్ట్యాయుః పుష్టికామో వా తథైవాభిచరన్పునః, యానపత్యా భవేన్నారీ దుష్ప్రజా శ్చాపి యా భవేత్. 33.

జనించిన సంతానము మృతినే బొందుచుండునో యెవ్వతె స్త్రీసంతానమునే గాంచుచుండునో వారందఱు నీగ్రహయజ్ఞము నొనరుపవలయును. మఱియు రాజ్యభ్రష్టుఁడగు రాజునకు దీర్ఘరోగములు గలమానవులకును నీమున్న గుమానవుల కెల్ల విద్వాంసు లీగ్రహయజ్ఞముల నేర్పరచియుండిరి. కావున శ్రేయోభిలాషియగు విద్వాంసుఁ డెల్లవేళల నీయజ్ఞ మొనరుపవలయును. సూర్యుఁడు నంగారకుఁడును చంద్రుఁడును గురుఁడును భృగుమందులును రాహుకేతులు నీగ్రహములు సర్వకాలములందును విద్వాంసులచేఁ బూజింపఁబడుచున్నారు. రాగితోఁగాని స్ఫటికముతోఁగాని యెఱ్ఱనిచందనముతోఁగాని బంగారముతోఁగాని వెండితోగాని యినుముతోఁగాని సీసముతోఁగాని యత్నముతో గ్రహప్రతిమలు చేయవలయును. అందులకు శక్తిచాలకయుండెనేని శుభ్రమగువస్త్రమున శాస్త్రమునఁ జెప్పినచొప్పున గ్రహచిత్రములు వ్రాయించవలెను. ఆయా గ్రహములవర్ణములకుఁ దగినచందమున వస్త్రములు పూవులు గంధములు నైవేద్యములును జేయవలయును. గుగ్గిలముతోఁ బొగవేయవలయును. ప్రతిదేవతకును మంత్రములతో హవిష్యముల నొసంగవలయును. బలులువేయవలయును. "ఆకృష్ణేనరజసా" "ఇమందేవాః" "అగ్నిర్మూర్ధా" "దివః కకుత్" "ఉద్బుధ్యస్వ" అను నీఋక్కులను వరుసగ నొక్కొక్క దేవత కొక్కటిగఁ బఠింపవలయును. అట్టులే "బృహస్పతే అతియదర్యః" "అన్నాత్పరిస్రుతః" "శంనో దేవీ" కాండాత్కాండాత్ప్రరోహంతీ "కేతుం కృణ్వన్" అను

---

బాలా యస్యాః ప్రమ్రియంతే యా చ కన్యాప్రజా భవేత్, రాజ్యభ్రష్టో నృపో యస్తు దీర్ఘరోగీ చ యో భవేత్. ౩౪. గ్రహయజ్ఞః స్మృతస్తేషాం మానవానాం మనీషిభిః, తస్మాదసౌ సదా కార్యః శ్రేయోఽర్థం జానతా హర. ౩౫. దత్తపుష్పః క్రూరదృక్చ పుష్పజో ధిషణస్తథా, సితాసితౌ తథా రుద్ర ఉపరాగః శిఖీ తథా. ౩౬. ఏతే గ్రహా మహాబాహో విద్వద్భిః పూజితాః సదా, తామ్రకాత్స్ఫాటికాద్రక్తచందనాత్స్వర్ణకాదపి. ౩౭. రాజతాదాయసాత్సీసాద్గ్రహాః కార్యాః ప్రయత్నతః, స్వర్ణే వాథ పటే లేఖ్యా యథాశాస్త్రం మహేశ్వర. ౩౮. యథావర్ణం ప్రదేయాని వాసాంసి కుసుమాని చ, గంధాశ్చ బలయశ్చైవ ధూపో దేయశ్చ గుగ్గులః. ౩౯. కర్తవ్యా మంత్రవంతశ్చ చరవః ప్రతిదైవతమ్, ఆకృష్ణేన ఇమం దేవా అగ్నిర్మూర్ధా దివః కకుత్. ౪౦. ఉద్బుధ్యస్వ ఏయథాసంఖ్యమృచ ఏతాః ప్రకీర్తితాః, బృహస్పతే అతియదర్యస్తథైవాన్నాత్పరిస్రుతః. ౪౧. శం నో దేవీ తథా కాండాత్కేతుం

నీబుక్కులను గూడ వరుసఁగఁ బఠింపవలయును. ఈబుక్కులతో వెనుక నుదాహరించిన సమిత్తులను యథాశాస్త్రముగ వ్రేల్వవలయును. ఒక్కొక్కగ్రహమునకు నూటయెనిమిదిగాని యిరువదెనిమిదిగాని తేనె నెయ్యి పెరుగులుగూర్చి హోమములు చేయవలయును. మొదట-చెప్పిన యట్టులే బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. శక్తికొలఁది కొరకి నంతవఱకు దక్షిణలు గూడ విధ్యుక్తముగ నొసంగవలెను. ఏమానవున కేగ్రహ మేకాలంబున దుష్టమైయుండునో యకాలమున నాగ్రహమున కాతఁడు యత్నముతోఁ బూజలు సలుపవలయును మున్నీగ్రహములకు నేనే "మిమ్ముఁ బూజించువారిని బూజింపుఁ" డని వరమిచ్చియుంటిని. రాజులయౌన్నత్యము నధోగతియు గ్రహాధీనములై యున్నవి. ప్రపంచపుస్థితిగతులన్నియు గ్రహములవలననే యేర్పడుచున్నవి. కావున గ్రహము లెల్లప్పుడు మిగులఁ బూజింపఁదగియున్నవి. గ్రహములు, గోవులు, రాజులు, గురువులు, బ్రాహ్మణులును పూజింపఁబడియుండిరేని వారిని బూజించువారు వారిచేఁ బూజింపఁబడుదురు. పైవారి నవమానించినచో వారివలన నిందలను బొందుదురు. ప్రబలమగు యంత్రము యంత్రముచే నణఁగినట్లు గ్రహాదులవలనఁ బుట్టినపీడ గ్రహాదులశాంతిక్రియచే మాయును. యాగములు చేయువారికిని సత్యమునే చెప్పువారికి నట్లే నియతమగు నాహారముచే నిత్యము నుపవసించువారికిని జపములందు హోమములందు నాసక్తి గలిగియుండువారికి నెల్లదోషములు తొలఁగి నశించును. ఇప్పగిదిఁ బ్రజలకు శాంతియొనరించి బ్రాహ్మణు

---

కృణ్వన్నిమాః క్రమాత్, పూర్వోక్తాఃసమిధస్తత్ర యథాశాస్త్రం ప్రహోమయేత్. ౪౨. ఏకైకస్యాష్టశతకమష్టావింశతిరేవ వా, హోతవ్యా మధుసర్పిర్భ్యాం దధ్నా చైవ సమన్వితాః. ౪౩. పూర్వోక్తభోజనం యద్ధి బ్రాహ్మణేభ్యో నివేదయేత్, శక్తితో వా యథాలాభం దక్షిణా తు విధానతః. ౪౪. యశ్చ యస్య యదా దుఃస్థః స తం యత్నేన పూజయేత్, మయైషాం హి వరో దత్తః పూజితాః పూజయిష్యథ. ౪౫. గ్రహాధీనా నరేంద్రాణాముచ్ఛ్రియాః పతనాని చ, భావాభావౌ చ జగతస్తస్మాత్పూజ్యతమా గ్రహాః. ౪౬. గ్రహా గావో నరేంద్రాశ్చ గురవో బ్రాహ్మణాస్తథా, పూజితాః పూజయంత్యేతే నిర్దహంత్యవమానితాః. ౪౭. యథా సముత్థితం యంత్రం యంత్రేణైవ ప్రహన్యతే, తథా సముత్థితాం పీడాం గ్రహశాంత్యా ప్రశామయేత్. ౪౮. యజ్వనాం సత్యవాక్యానాం తథా నిత్యోపవాసినామ్, జపహోమపరాణాం చ సర్వం దుష్టం ప్రశామ్యతి. ౪౯. ఏవం కృత్వా ప్రజాశాంతిం కృత్వా చ స్వస్తివాచ

లచే స్వస్తివాచనముచేయించి మగిడి రథంబు సన్నద్ధంబు గావించి పయనమై మిగిలియున్న త్రోవను గడిపి యాదిత్యునిదేవాలయముచెంత కరిగి యట మున్ను వచించిన రథదేవతలనెల్లఁ బూజించి యాదేవుని మందిరమున స్థాపింపవలయును. ఉత్పాతములు గలిగినప్పుడు గ్రహములన్నియు నెట్లు బూజింపఁదగియున్నవో అట్టులే రథము నాశ్రయించియున్నరథ దేవతలందఱు పూజింపఁదగియున్నారు.

ఇది షట్పంచాశత్తమాధ్యాయము.

---

## సప్తపంచాశత్తమాధ్యాయము.

బ్రహ్మ రుద్రున కిట్లనియె. ఓముక్కంటీ! బ్రహ్మదేవునకు క్షీరమును గంజియును త్తమమగుభోజనము. కృత్తికాతనయుని ప్రీతికొఱకై యాతనికి ఫలముల నొసంగవలయును. అట్లే వివస్వంతునకు (సూర్యునకు) మద్యమాంసములును తేనెయు నొసంగవలయును. అనుచరులగు దేవతలకు నింద్రునకు భక్ష్యములను నివేదింపవలయును. (అగ్నిదేవునకును విష్ణునకును నేయి మొదలగు మంచివస్తువులతోఁ జేర్చిన హవీరూపమగు నన్నము శ్రేష్ఠమైనది) హవిస్సు నగ్నిహోత్రునకు నుత్తమాన్నము విష్ణునకు నొసంగవలయును. రాక్షసులకు మద్యమును మాంసముతోఁ జేర్చినయన్నము నొసంగవలెను. ఓహరా! బాగుగవండిన మాంసాన్న

---

నమ్, పునః సజ్జం రథం కృత్వా కుర్యాత్ప్రక్రమణం హర. ౫౦. మార్గం శేషం నయిత్వా తు నయేద్దేవాలయం రవిమ్, పూజయిత్వా తతః పూర్వా యాః ప్రోక్తా రథదేవతాః. ౫౧. యథా పూజ్యా గ్రహాః సర్వే ఉత్పాతేషు త్రిలోచన, రథదేవాస్తథా పూజ్యా యాః స్థితా రథమాశ్రితాః. ౫౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యమహిమవర్ణనం నామ
షట్పంచాశత్తమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—క్షీరం యవాగూర్బ్రహ్మణే స్యాత్పరమాన్నం త్రిలోచన, ఫలాని కార్తికేయస్య దద్యాద్భక్తేశ ప్రీతయే, వివస్వతే మధు మాంసం తథా మద్యం చ సువ్రత. ౧. పురుహూతాయ భక్ష్యాణి సానుగాయ నివేదయేత్, హవిరన్నమగ్నయే స్యాదగ్ర్యాన్నం విష్ణవే తథా. ౨. రాక్షసేభ్యః సమైరేయం దద్యాన్మాంసౌదనం హర,

ము ను రేవతున కొసంగవలయును. త్రిపురాంతకా! పితృపతియగు యమునకు నువ్వులయన్నము నొసంగవలయును. అశ్వముల నశ్వినీదేవత లకును వసువులకు మాంసాన్నమును పితృదేవతలకు నెయ్యి తేనెలు చేర్చిన పాయసము నొసంగవలయును. కాత్యాయనీ(పార్వతి)దేవికి యవాగు(గంజి)వును సిరికి పెరుఁగును సరస్వతికి మూఁడుతియ్యని వస్తువు లును నివేదింపఁదగియున్నవి. వరుణునకుఁ జెఱకురసముతోఁ జేర్చినయన్న మును ధనపతియగుకుబేరునకుఁ గలకండచేర్చినయన్నము నట్టియన్నమునే మిత్రదేవతకును నివేదింపవలయును. మరుత్తులను దేవగణమునకు వెన్న తీయనిమజ్జిగ తృప్తికరమని స్మరింపఁబడుచున్నది. కాన వారలకద్దాని నొసం గవలయును. ఏడ్వురు మాతృదేవతలకును మాంసాన్నంబును పప్పన్నం బును నివేదింపవలయును. భూతగణమున కుల్లేపికల(తినుబండములలో భేద ము)ను సూర్యునకు జలము నివేదింపవలయును. గణాధినాథునకు లడ్డుం డలు నివేదింపవలయును. మఱియు నో త్రిపురనాశనా! భూతగణాధిపా! నైరృతునకు శష్కులులను (జంతికలు) నివేదింపవలయును. విశ్వేదేవులకు సంపూర్ణముగ సమస్తభక్ష్యముల నివేదింపవలయును. మహర్షులకు క్షీరా న్నమును క్షీరంబును నాగగణంబునకునొసంగవలయును. సూర్యునిరథము నకు నిఖిలభూతముల కొసఁగఁదగుబలి నొసఁగవలయును. సూర్యునివాజు లకు మాంసమద్యములతో నలుఁగిడవలయును. బ్రహ్మదేవున కాజ్యము

సంస్కృతం పిశితాన్నం చ రేవతాయ నివేదయేత్. ౩. తిలాన్నం పితృరాజాయ దద్యాత్త్రిపురసూదన, అశ్వినాభ్యామపూపాంస్తు వసుభ్యో మాంసమోదనమ్. ౪. పితృభ్యః పాయసం దద్యాద్ఘృతాక్తం మధునా సహ, కాత్యాయన్యై యవాగూం చ శ్రియై దద్యాత్తథా దధి. ౫. సరస్వత్యై త్రిమధురం వరుణాయేక్షురసౌదనమ్, ఖాండ వాన్నం ధనపతావేవం మిత్రే త్రిలోచన. ౬. నవ్నీహీన తు తక్రేణ మరుద్భ్యస్తర్పణం స్మృతమ్, మాంసాన్నభక్తసూపాంశ్చ మాతృభ్యో వై నివేదయేత్. ౭. ఉల్లేపికాశ్చ భూతేభ్యో జలం సూర్యాయ వై హర, దద్యాద్గణాధిపతయే మోదకాంస్త్రిపురాంతక. ౮. శష్కుల్యస్తు నైరృతాయ దేయాః స్వర్గణనాయక, సర్వభక్ష్యాణి విశ్వేభ్యో దాతవ్యాని సమంతతః. ౯. క్షీరౌదనమృషిభ్యస్తు క్షీరం నాగేభ్య ఏవ హి, సూర్య రథాయ బలిం దద్యాత్కుర్యాద్వై సార్వభౌతికమ్. ౧౦. ఉద్వర్తనం సురా మాంసం

నొసంగవలయును. తిలలను త్ర్యంబకున కొసంగవలయును. స్వాహానందనుఁడగు కార్తికేయునకు లాజ (పేలాలు) ల నొసంగవలయును. భాస్కరదేవునకు సర్వకాలములను ఎఱ్ఱకాంచన పుష్పముల నొసంగవలయును. ఓముక్కంటీ! యింద్రునకు రాజవృక్షము (రేలచెట్టు)ను పావకునకు హవిష్యమును విష్ణునకు గోధూమ మొదలగున సధాన్యములలో నేవేని యేడుధాన్యములను నివేదింపవలయును. గరుడునకుఁ జేఁపల నాహారముగ నొసంగవలయును. యక్షగణమునకుఁ బలువికములయన్నము నొసంగవలయును. రేవతునకు వృక్షనిర్యాసమును విడువవలయును. యమునకు పుల్లవెలగపూవులదండలు వేయవలయునని చెప్పఁబడుచున్నది. ఓవృషవాహనా! అశ్వినీదేవతలకు కొండగోఁగుపువ్వుల నొసంగవలయును. లక్ష్మీదేవికి తామరపువ్వుల నొసంగునది. చండికకు సువాసనఁగల మంచిగంధమును సరస్వతికి వెన్నను వినతకు (గరుడునితల్లి) మాంసమును నచ్చరమచ్చకంటులకు మాలతీకుసుమములు నిష్టములని చెప్పఁబడినవి. వరుణునకుఁ గూరనెల్లిపండ్లను నిర్ృతికిఁ గందమూలములను గుబేరునకు మారేడుఫలములను మరుత్తులకు వెలగపండ్లను గంధర్వులకు రేలపండ్లను నొసంగవలయును. వసువులకుఁ గర్పూరమును గణాధిపునకు దేవదారువును బితరులకు రుచిగల రసద్రవ్యమును (పిండము) కందమూలములను భూతములకుఁ ద్రాండ్రపండ్లను నొసంగవలయును. గోవులకు యవల నొసంగవలయును.

---

తద్వాహేభ్యశ్చ భారత, ఆజ్యం చ బ్రహ్మణే దద్యాత్త్ర్యంబకాయ తిలాంస్తథా. ౧౧. స్వాహాతనయే వై లాజాదాతవ్యాస్త్రిపురాంతక, భాస్కరాయ సదా దద్యాత్తోకవిదారం త్రిలోచన. ౧౨. రాజవృక్షం తథేంద్రాయ హవిష్యం పావకాయ చ, చక్రిణే సప్తధాన్యం చ గరుడే మత్స్యమోదనమ్. ౧౩. యక్షేభ్యో వివిధాన్నాని నిర్యాసం రేవతే త్యజేత్, వైకంకతస్రజో రుద్ర యమాయ పరికీర్తితాః. ౧౪. దేయం స్యాత్కర్ణికారం తు అశ్విభ్యాం వృషభధ్వజ, శ్రియై పద్మాని దేయాని చండికాయై సుచందనమ్, ౧౫. నవనీతం సరస్వత్యై వినతాయై తథామిషమ్, పుష్పాణ్యప్సరసాం రుద్ర మాలత్యాః పరికీర్తితమ్. ౧౬. వరుణాయాగ్నిమంథం తు ఫలం మూలం నిర్ృతయే, బిల్వం దద్యాత్కుబేరాయ కపిత్థం మరుతాం తథా. ౧౭. గంధర్వేభ్యస్త్వారగ్వధం దద్యాత్త్రిపురసూదన, వాసవేభ్యస్తు కర్పూరం దద్యాద్దారు గణాధిపే. ౧౮. పితృభ్యః పిణ్డమూలాని భూతేభ్యశ్చ విభీతకమ్, గోభ్యో యవాన్ప్రదద్యాద్వై మాతృభ్యశ్చాక్షతాన్హర ౧౯.

మాతృదేవతల కక్షత లొసంగవలయును. విఘ్నేశునకు గుగ్గిలమును విశ్వేదేవులకు యోగ్యమగు నోదనము నొసంగవలయును. ఋషులకు గంగరావిచెట్టు నుత్తమమగు విషము నాగులకు నొసంగవలయును. ఓగణాధిపా! ఈరథయాత్రలో భాస్కరునకు సమస్తవస్తువుల నొసంగ వలయును. జేగురుబంగారము తేనె నెయ్యి మొదలగు వెనుకజెప్పిన వన్నియు నొసంగవలెను ఆతనితేజీలకు భక్తిపురస్సరముగ మఱ్ఱిపాలు మొదలగునవి నివేదింపవలెను. సాయంతనమున నుదయమున మధ్యాహ్నమున నెల్లకాలమున నిశ్చలచిత్తుండై విచారశీలుండును సమర్థుండు నగు మానవుండు సర్వదేవతలకు భక్తికొలంది శక్తి ననుసరించి ధూపములనొసంగవలయును. మఱియు నోదేవశార్దూలా! యేద్రవ్యము లెవ్వని కిష్టములని మున్ను జెప్పంబడియున్నవో యాద్రవ్యములను మంత్రముతో నాదేవతల కొసంగవలయును. అట్లు చేసిన శాంతి యేర్పడును. మఱియు విచక్షణుం డగువాండు బ్రాహ్మణులకు గ్రహాదులశాంతికై నూవులు దాన మీవలయును. లేకున్న నేతిలో గలిపి వైశ్వానరునందు హోమింపవలయును. ఈనేతితోం గలసిననువ్వులు దేవతల కమృతముగను బితరులకు స్వధామృతముగను బ్రాహ్మణులకు సర్వసమయముల రక్షకములుగను బుధులు తెలియుదురు. ఈనువ్వులు కశ్యపప్రజాపతియంగము నుండి యుద్భవించుటచే నతిప్రభావసంపన్నములు పవిత్రములు నైయున్నవి. స్నానమునందును దానమునందు నట్టులే హోమము లందును తర్పణమునందును భోజనమునందు నియ్యవి శ్రేష్ఠము

గుగ్గులం విఘ్నపతయే విశ్వేభ్యో దేయ మోదనమ్, ఋషిభ్యో బ్రహ్మవృక్షం తు నాగేభ్యో విషముత్తమమ్. ౨౦. భాస్కరస్యేహ దేయాని సకలాని గణాధిప, మధుసర్పిస్తథోక్తాని గైరికస్య త్రిలోచన. ౨౧. న్యగ్రోధం తస్య వాహేభ్యో భక్త్యా రుద్ర నివేదయేత్, సాయం ప్రాతస్తు మధ్యాహ్నే సదైకాగ్రమనా హర. ౨౨. సర్వేషాం శక్తితో భక్త్యా దహేద్ధూపం విచక్షణః, మంత్రతో దేవశార్దూల యో యస్యేహ ప్రకీర్తితః. ౨౩. శాన్త్యర్థం బ్రాహ్మణేభ్యస్తు తిలాన్దద్యాద్విచక్షణః, వైశ్వానరే వా జుహుయాత్ ఘృతేన సహితాన్హర. ౨౪. దేవానామమృతం హ్యేతే పితౄణాం హి స్వధామృతమ్, శరణం బ్రాహ్మణానాం చ సదా హ్యేతాన్విదుర్బుధాః. ౨౫. కశ్యపస్యాంగజా హ్యేతే పవిత్రాశ్చ తథా హర, స్నానే దానే తథా హోమే తర్పణే హ్యశనే పరాః. ౨౬.

లైనవి గదా; ఇప్పుగిది దేవతలను గ్రహములను యత్నపురస్సరముగఁ బూజించి యరదమునుండి యాదిత్యు నవతారించి తిరుగ మండలమున స్థాపింపవలయును. ప్రయత్నముతో దీపములతోను రంగునీళ్లతోడను యవాక్షతములతోడను ప్రత్తిగింజలతోడ నుప్పుపొల్లులచేతను దృష్టి దోష ముపశమించుటకై ఆరాత్రికము (దృష్టిదోషమువలని పీడ నివర్తించుటకై చేయు దిగదుడుపు)ను జేయవలయును. ఆవెనుక దేవీ సనాథుఁడగు నాదిత్యుని గద్దియపై నుంచునది. అట్లు వేదికపై స్థాపితుఁడైనయాదేవునిఁ బదిదినములు విమలనిష్ఠతోఁ బూజింపవలయును. "దశాహిక" (పదిదినములు చేయఁబడునది) యని భూతలంబున నేపూజ విఖ్యాతమైయుండెనో యాపూజను దేవునకుఁ జేయవలయును. నాలుగవ దినమునఁగూడ విశేషముగఁ బూజింపవలయును. మఱియు నాలవనాఁడు యత్నించి సూర్యున కభ్యంగ మొనరించి స్నానము చేయింపవలెను. ఆవెనుకఁ బూజాపురస్కారములతోడను భోజనాదులతోడను లెస్సగఁ బూజింపవలయును. ఈవిధానము ననుసరించి పదినాళ్లు దివాకరుని లెస్సగఁ బూజించి యావెనుక నామండలమునుండి యుద్వాసన మొనరించి పురాతనమగు నాదిత్యునాలయమున నాప్రతిమను జేర్పవలయును. అని యెఱింగించి పితామహుండు వెండియు రుద్రున కిట్లని చెప్పందొడంగె.

ఇది సప్తపంచాశత్తమాధ్యాయము.

---

ఇత్థం దేవాన్గ్రహాంశ్చైవ పూజయిత్వా ప్రయత్నతః, అవతార్య రథాచ్చైనం మణ్డలే స్థాపయేత్పునః. ౨౭. కృత్వా త్వారాత్రికం యత్నాద్దీపతోయయవాక్షతైః, కార్పాస బీజలవణతుషైర్దృష్టిశాంతయే. ౨౮. వేదీమారోపయేత్పశ్చాత్పత్నీభ్యాం సహ సువ్రత, తత్రస్థం పూజయేద్దేవం దినాని దశ సువ్రత. ౨౯. దశాహికేతి విఖ్యాతా యా పూజా భూతలే హర, తయా సంపూజయేద్దేవం చతుర్థేఽహ్ని తథా హర. ౩౦. చతుర్థేఽహని కర్తవ్యం యత్నాద్ధి స్నపనం రవేః, అభ్యంగభోజనాద్యైస్తు పూజా సత్కారమండలైః. ౩౧. అనేన విధినా పూజ్య దశాహాని దివాకరమ్, తతో నయేత్పరం స్థానం యత్తత్పూర్వమథాలయమ్. ౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి రథసప్తమీకల్పే ఆదిత్యమహిమవర్ణనం నామ సప్తపఞ్చాశత్తమోఽధ్యాయః.

## అష్టపంచాశత్తమాధ్యాయము.

ఓమహాదేవా! యేభాగవతోత్తముఁడైనను మహాతేజస్సంపన్నుఁడగు నాదిత్యదేవునకు వెనుకజెప్పినచొప్పున రథయాత్ర యొనరించినను చేయించినను నాతఁడు పరార్ధసంవత్సరములకాలము సూర్యలోకమున వసించి పూజితుండగును. అట్టి పుణ్యపురుషునికులమున నొక్కఁడేని దరిద్రుండుగాని రోగపీడితుఁడుగాని జనింపఁబోవఁడు. భాస్కరు నభ్యంజనమునకు ఘృతము నొసంగువాఁడును, చిత్రతిలకము నొసంగువాఁడును కామధేనుసదనమును సూర్యసదనమును గాంచును. ఎవ్వాఁడు పుణ్యతీర్థములయుదకముగాని గంగాతోయంబునుగాని భక్తితోఁ గొని తెచ్చి యాదిత్యు నభిషేకించునో రత్నకంబళముల మూఁటి నాసనములుగా నొసంగునో చిత్రవర్ణము లొసంగునో యాతఁ డీలోకమున నెల్లకోర్కులు లెస్సగ సంపాదించి జన్మాంతమున వరుణలోకమున కేగును. ఎట్టిరంగుగల హవిష్యమును గుడాన్నమును భాస్కరున కొసంగువాఁడు దేదీప్యమానుఁడై యుత్తమమగు సూర్యపురమును జేరును. అటనుండి ప్రజాపతి యుత్తమనగరమునకుఁగూడ జనును. భాస్కరుని భక్తితో స్నానము చేయించి పూజించువాఁడును నిస్సంశయముగ దీప్తిమంతుఁడై యాదిత్యలోకమున కేగును. ఎవ్వాఁడు సూర్యునిరథ మెక్కించునో యెవ్వాఁడు తేరునడచుత్రోవను శుభ్రపఱచునో యాతఁడు గాలి కెనయగు చేవఁగలిగి

---

బ్రహ్మోవాచః—అనేన విధినా యస్తు కుర్యాద్వా కారయేత వా, యాంత్రాం భగవతో భక్త్యా భాస్కరస్యామితౌజసః. ౧. స పరార్థం తు వర్షాణాం సూర్యలోకే మహీయతే, కులే న జాయతే తస్య దరిద్రో, వ్యాధితోఽపి వా. ౨. అభ్యంగాయ ఘృతం యస్తు భాస్కరాయ ప్రయచ్ఛతి, కృతే తు వర్ణతిలకే స గచ్ఛేత్సురభీపురమ్. 3. తీర్థోదకం తు యో భక్త్యా గంగాయాశ్చ తథోదకమ్, స్నానార్థమానయేద్యస్తు భాస్కరస్య త్రిలోచన. ౪. భక్త్యా వర్ణత్రయం దద్యాద్భాస్కరస్య త్రిలోచన, సమాప్యేహాఖిలాన్కామాన్ప్రాప్నుయాద్వరుణాలయమ్. ౫. రక్తవర్ణం తు యో దద్యాద్ధవిష్యాన్నం గుడౌదనమ్, స గచ్ఛేద్దీప్తిమాన్రుద్ర సూర్యలోకం పురం వరమ్. ౬. గచ్ఛేత్పురవరే రుద్ర యత్ర దేవః ప్రజాపతిః, స్నాపయేద్యస్తు వా భక్త్యా భాస్కరం పూజయేత్తథా. ౭. స గచ్ఛేద్దీప్తిమాన్ రుద్ర సూర్యలోకం న సంశయః, రథమారోపయేద్యస్తు రథమార్గం ప్రమార్జతి. ౮. స యాతి వాతసాలోక్యం వాతతుల్యపరాక్రమః,

గాలితో సరియగుతావును జేరును. రథము పోవుమార్గమున మండలములు రమ్యముగఁ జిత్రించువాఁడు పవిత్రమగు మరుల్లోకమున కేగును. ఇందేమియు ననుమానము వలవదు. రథారూఢుండై సూర్యుఁడు సంచరించునెడ నామార్గమును రమ్యమండలయుక్తముగ నొనరించు నాతఁడును పుణ్యలోకమును బొందును. ఏవాఁడు సూర్యసంచార మార్గమును శ్రద్ధతోఁ బూవులదండలతో నలంకరించియు మంగళాకరము లగు తోరణములు గట్టియు శంఖము లూదించియుఁ దూర్యఘోషము లొనరించియుఁ బలు తెఱంగుల వినోదములు సల్పియు నా దేవుని సేవించునో యాతఁడు సూర్యునినివాసమగు పరమపదమును బొందును. ఆదేవునితోఁ గూడ భ్రమణముచేయుచు నర్తనగానములచేఁ బూజించుచు భక్తిపురస్సరముగ గొప్ప వేడుకజేయునాతఁ డుత్తమస్థానముఁ బొందును సూర్యదేవుని రథము నెక్కించి జాగరముచేయు పుణ్యమూర్తి శాశ్వతకాలము సుఖము లనుభవించుచు నానందించుచుండును. పరిచారకులను భక్తులను బ్రబోధించి సూర్యునకు సేవచేయించునాతఁడు నిఖిలభోగముల నిహలోకమున ననుభవించి సూర్యలోకమును బొందును. ఓ దేవచూడామణీ! రథము నధిరోహించి భ్రమించు నాదిత్యునిదర్శనము మిగుల దుర్లభమైనది. అందు నుత్తరాభిముఖుఁడై భ్రమించునప్పుడును దక్షిణాభిముఖుఁడై భ్రమించునప్పుడును బురోభాగమున నేగుచు భక్తవత్సలుఁడు దేవేశుఁడు

---

రథస్య గచ్ఛతో యస్తు మార్గే కుర్యాత్సుమణ్డలమ్. ౯. స లోకం ప్రాప్నుయాత్పుణ్యం మారుతం నాత్ర సంశయః, సూర్యస్య గచ్ఛతో యస్తు మార్గం కుర్యాత్సుమణ్డలమ్. ౧౦. స లోకం ప్రాప్నుయాత్పుణ్యం యః కుర్యాన్మార్గమాదరాత్, పుష్పప్రకరశోభాఢ్యం శుభతోరణమండితమ్. ౧౧. శంఖతూర్యనినాదాఢ్యం తథా ప్రేక్షణకాన్వితమ్, స యాతి పరమం స్థానం యత్ర దేవో విభావసుః. ౧౨. దేవేన సహితో యస్తు నృత్యన్గాయంస్తథార్చయన్, కుర్యాన్మహోత్సవం భక్త్యా స యాతి పరమం పదమ్. ౧౩. ప్రజాగరం యస్తు కుర్యాద్దేవే రథగతే రవౌ, స సుఖీ పుణ్యవాన్నిత్యం మోదతే శాశ్వతీః సమాః. ౧౪. భక్తదాసాదికం సర్వం యో దదాతి రవేర్నరః, సంప్రాప్యేహాఖిలాన్కామాన్సూర్యలోకమవాప్నుయాత్. ౧౫. రథారూఢస్య సూర్యస్య భ్రమతో దర్శనం హర, దుర్లభం దేవశార్దూల విశేషాత్పురతో వ్రజన్. ౧౬. ఉత్తరాభిముఖం యాంతం తథా వై దక్షిణాముఖమ్, ధన్యాః పశ్యతి దేవేశం భాస్కరం

నగుభాస్కరుని దర్శనముజేసికొనువాఁడు మిగుల ధన్యతముఁడగును. ఇట్టులు రథభ్రమణ మొనరించి సంవత్సరము గడువ యాత్ర చేయు దినము వచ్చినప్పు డేదేని నిమిత్తవశమున రథభ్రమణ మొనరింప లేని యది మొదలు పండ్రెండవయేఁడు వచ్చునంతకును నడుమ ప్రక్రమణము జేయు టుచితము గాదు. మంగళములుగోరువాఁడు పండ్రెండగు నేట భ్రమణము చేయవలయును. ఇట్టులే యింద్రధ్వజోత్సవమును గూడ రెండవయేట యాత్రకాలమునఁ జేయకున్నచోఁ బండ్రెండగు వత్సరముననే జేయవలయునుగాని నడుమఁ జేయరాదు. ఓవృషభధ్వజా! సూర్యునిరథయాత్రకు భంగముగలిగించువారు మందేహులను రాక్షసులుగ జన్మింతురు. సందేహములేదు. ధర్మధ్వజుండగు సూర్యునకు రథయాత్ర యొనరించుమానవు లింద్రాదిదేవతలుబోలె పరమపదముపొంది యింద్రాదిదేవతలే యగుదురు. ఓమహేశా! యీయాత్రావిధాన మునే మఱల సంక్షేపమున నెఱింగింతు వినుము. ఈసంక్షేపవిధానము నేని యాకర్ణించువారు నిఖిలపాపములు వాయుదురు. సందియమందఁ బని లేదు. మాఘమాసము జరుగునపుడు దేవగణపరివృతమై సూర్యరథము గగనమార్గమున నుండునపు డారథముపై నాదిత్యుని మనస్సుతో స్థాపింపవలయును. ద్యులోకమును భూలోకమును వెనుకటివలె సూర్యపత్ను లిరువురిరూపములుగ నెమ్మనమ్మునఁ దలఁచి స్థాపింపవలెను. అందు ద్యులోకము రాజ్ఞియు భూలోకము నిక్షుభయు నని స్మరింతురు ఈదేవీ

---

భక్తవత్సలమ్. ౧౭. అథ సంవత్సరే ప్రాప్తే భానోర్యాత్రాదినే యది, రథప్రక్రమణం తత్ర న కథంచిత్కృతం భవేత్. ౧౮. తతో వై ద్వాదశే వర్షే కర్తవ్యం భూతిమిచ్ఛతా, ఇంద్రధ్వజస్య చాప్యేవం యది నోత్థాపనం కృతమ్. ౧౯. తతో వై ద్వాదశే వర్షే కర్తవ్యం నాన్తరా పునః, యాత్రాయాశ్చాపి యే భంగం కుర్వంతి వృషభధ్వజ. ౨౦. మన్దేహా నామ తే జ్ఞేయా రాక్షసా నాత్ర సంశయః, యే కుర్వన్తి తథా యాత్రాం నరా ధర్మధ్వజస్య తు. ౨౧. ఇంద్రాదిదేవాస్తే జ్ఞేయా గతాశ్చ పరమం పదమ్, పునర్యాత్రావిధిం చేమం సమాసాత్కథయామి తే. ౨౨. యం శ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః, వర్తమానే తు వై మాఘే రథే దేవగణాశ్రితే. ౨౩. స తస్మిన్నేవ మనసా స్థాపనీయో రథోపరి, ద్యౌర్మహీ చ ద్విమూర్తిస్థే యథా పూర్వం ప్రతిష్ఠితే. ౨౪. తత్రైవ రాజ్ఞీ ద్యౌర్జ్ఞేయా నిక్షుభా పృథివీ స్మృతా, ఏతా

ద్వయమునకుఁగూడ దేవునితోఁ బాటు రథనిరూపణము చేయవలయును. అటులనే దిండి పింగళుఁడు మొదలగుపరివారమునకును విశాలమగు రథ క్రమమును మానసికముగఁ జేయవలయును. ఇట్టులే యితర దేవతలను గూడ నాయాస్థానములందు మానసికముగ స్థాపింపవలయును. లోక పాలకులను దిక్కుల నేలువారిని గూడ మనస్సుచేతనే గల్పింపవల యును. ఈయాదిత్య దేవుఁడు సర్వదేవమయుఁడును సర్వవేదమయుఁడు నై యున్నాఁడు. ఈసూర్యునిమండలము ఋక్కులసమూహము. గాయత్రి, త్రిష్టుభ్, జగతి, అనుష్టుభ్, పంక్తి, బృహత్, అను నీయారు నేడవదగు నుష్ణిక్ ఛందస్సును సూర్యునివదనమే యని చెప్పుదురు. అదిగాన నీతఁడు దేవమయుఁడై యుండుటవలన ఛందస్సులు గల్పించుటను అదికారణ ముగ (ఛందస్సులు గల్పించుటచే) వేదమయుఁడై యుండుటను సూర్యుఁడు సర్వలోకములకును బూజార్హుఁ డయి యున్నాఁడు. రథ యాత్రలోసూర్యుఁడు—బ్రహ్మవాదులు నుపవాసముల నాసక్తిగలవారు నింద్రియనిగ్రహముగలవారు చిత్తవ్యాపారము నరికట్టినవారు వేదముల నంగములను లెస్సగ నభ్యసించి ముగించినవారు నగుబ్రాహ్మణోత్తము లచే మోయఁదగియున్నాఁడు. భాస్కరునితేరును శూద్రుఁ డెక్కఁ గూడదు. అట్టులెక్కనేని యాశూద్రుఁడు నిక్కముగ నధోగతి నొందఁ గలఁడు. చెప్పినచొప్పున నెల్లకాల మనుష్ఠించినచో మనుష్యులకు శాంతి యేర్పడును. పగటినిజేయు నీవేలుపుల రేఁడు సమస్తదేవతలకు నాయ

---

భ్యామపి దేవీభ్యాం యథైవ సవితుస్తథా. ౨౫. దిండినః పింగలాదీనాం పృథుః కార్యో రథక్రమః, మనసా చిన్తయేదన్యాం యథాస్థానేషు దేవతామ్. ౨౬. దిక్పాలాఁ ల్లోకపాలాంశ్చ కల్పయేన్మనసైవ తు, దేవో వేదమయశ్చాయం సర్వదేవమయస్తథా. ౨౭. మండలమృఙ్మయం చైవ ఛందాంస్యాస్యం ప్రకీర్తితమ్, గాయత్రీ చైవ త్రిష్టుప్చ జగత్యనుష్టుబేవ చ. ౨౮. పంక్తిశ్చ బృహతీ చైవ ఉష్ణిగేవ చ సప్తమీ, తతో దేవమయత్వాచ్చ ఛ్ఛందసాం చైవ కల్పనాత్. ౨౯. తతో వేదమయత్వాచ్చ తరణి ర్లోకపూజితః, రథప్రక్రమణాత్సూర్యో వోఢవ్యో బ్రహ్మవాదిభిః. ౩౦. ఉపవాస పరైర్యుక్తైర్వేదవేదాంగపారగైః, రథం తు నారుహేచ్ఛూద్రో భాస్కరస్య త్రిలో చన. ౩౧. ఆరుహ్య తరణేర్యానం వ్రజేచ్ఛూద్రో హ్యధోగతిమ్, యథోక్తకరణాద్రుద్ర సదా శాంతిర్భవేన్నృణామ్. ౩౨. నాయకశ్చాపి సర్వేషాం దేవానాం తు దివాకరః,

కుఁడు గదా రథములన్నియు దేవగృహములలో నుంపవలెను. తరువాత ముందుగ నాదిత్యునకు ధూపములతోడఁ గానికలతోడను పూజలు సలుపవలెను. తరువాత దిక్పతులను దేవతలను వారియనుచరులను పూజింపవలయును. అట్లొనర్చినచో నెల్లప్పుడు నైశ్వర్యములతోఁ దుల దూగుచుందురు తొలుత సూర్యపూజ యొనర్పక యితరదేవతలఁ బూజించినచో నాయాదేవతలకుఁ జేయఁబడినపాద్యాదులను వారు గ్రహింపరు. యాత్రసమయములందు దీక్షనుగ్రహించిన సూర్యునిశరీరమును భక్తితోఁ దిలకించుమానవులు నిష్కల్మషులగుదురు. పున్నమ నాఁడు నమావాస్యనాఁడును యాత్రాదర్శనము మిగులఁ బుణ్యము నొసంగును. ఇట్లులే సూర్యదినమగు సప్తమినాఁడును షష్ఠినాఁడును భానువాసరమునను ఆషాఢకార్తికమాఘమాసముల సప్తములందును దర్శన ముత్తమమయినది. ఈతిథులకుఁ బుణ్యమును గొప్పభాగ్యమును ఫలములని శాస్త్రములు చెప్పుచున్నవి. కార్తికమున వచ్చుతిథి మహాకార్తికి యనఁబడును. ఇట్టి యుత్తమకాలసంబంధము యాత్రాకాలములలోనెల్ల సారముగలది. అట్టియాత్రను చూచుటయు గొప్పపుణ్యము నొసఁగును. సర్వపాతకముల దిగమ్రింగును. అట్టియాత్రాకాలముననే మానవుఁ డుపవసించి నియతచిత్తుఁడై వ్రతము సలుపుచు భక్తితో రవిని బూజించునో యాతఁ డుత్తమగతి గాంచును. యజ్ఞమూర్తియగు నీయాదిత్యదేవుఁడు లోకము ననుగ్రహింప నెంచి విగ్రహములలోఁ బ్రవే

---

విన్యసేత్తు రథానాం తు దేవతాయతనేషు చ. ౩౩. తతో ధూపోపహారైస్తు పూజయేత్ప్రథమం రవిమ్, దిగ్దేవానుచరాంశ్చైవ పూజయేత్పూజ్యతే శ్రియా. ౩౪. అపూజ్య ప్రథమం సూర్యమపరాన్యస్తు పూజయేత్, తత్తద్భూతకృతం పాద్యం న ప్రగృహ్ణంతి దేవతాః. ౩౫. యాత్రాకాలే తు సంప్రాప్తే సవితుర్దీక్షితాం తనుమ్, యే ద్రక్ష్యంతి నరా భక్త్యా తే భవిష్యంత్యకల్మషాః. ౩౬. పౌర్ణమాస్యామమాయాం చ దర్శనం పుణ్యదం స్మృతమ్, సప్తమ్యాం చ తథా షష్ఠ్యాం దినే తస్య రవేస్తథా. ౩౭. ఆషాఢీ కార్తికీ మాఘీ తిథ్యః పుణ్యతమాః స్మృతాః, మహాభాగ్యం తిథేః పుణ్యాం యథా శాస్త్రేషు గీయతే. ౩౮. కార్తిక్యాం తు విశేషేణ మహాకార్తిక్యుదాహృతా, ఏవం కాలసమాయోగాద్యాత్రాకాలో విశిష్యతే. ౩౯. దర్శనం చ మహాపుణ్యం సర్వపాపహరం భవేత్, ఉపవాసపరో యస్తు తస్మిన్కాలే యతవ్రతః. ౪౦. పూజయేత్తు రవిం భక్త్యా స గచ్ఛేత్పరమాం గతిమ్, దేవోఽయం యజ్ఞపురుషో లోకానుగ్రహా

శించి యనుగ్రహముతోఁ బూజల నందుకొనుచున్నాఁడు. పురుషుఁడు యాత్రాకాలమున స్నానదానములచేతను జపహోమములచేతను దేవ కర్మసంబంధముచేతను కూర్చనిర్మాణముచేతను దీక్షవహింపవలయును. సూర్యభక్తులగుమానవు లెప్పుడును కేశవపనము చేయించుకొనవల యును. ఇట్లు చేసినచోఁ బురుషుఁడు సూర్యయజ్ఞమునందు దీక్షితుఁ డగును. నాలుగుజాతులవారికిని సూర్యునందు భక్తి నిత్యమై యుండఁ దగును. ఈయజ్ఞము నిట్లుచేయునరులు నిత్యదీక్షితు లనఁబరఁగుదురు. అట్టివారు వ్రతము ననుష్ఠించి మహానుభావసంపన్నులై యుత్తమగతిని బొందఁ గలరు. రుద్రా! దివస్పతియగు సూర్యదేవుని యీరథయాత్ర నీ కెఱింగించితిని. దీనిని విన్నవారును చదివించినవారును చదివినవారును సమస్తరోగములనుండి విముక్తులగుదురు. భక్తితోఁ బైవిధానముచొప్పున యాత్ర చేసిన మనుష్యుఁడు సూర్యసభను బొందును. మంగళకరయగు నీసప్తమికి రథసప్తమి యని ప్రసిద్ధి. అద్దాని నీకిప్పుడు సంగ్రహించి విని చితిని. మరలఁగూడ నీసప్తమివృత్తాంతముఁ జెప్పెద నాలకింపుము. అని బ్రహ్మ మరల నిట్లనియె.

ఇది అష్టపంచాశత్తమాధ్యాయము.

---

కాంక్షయా. ౪౧. ప్రతిమావస్థితో భూత్వా పూజాం గృహ్ణాత్యనుగ్రహాత్, స్నానా ద్దానాత్తథాద్ధోమాత్సంయోగాద్దేవకర్మణః. ౪౨. కూర్చానాం వపనాచ్చైవ దీక్షితః పురుషో భవేత్, కచానాం వాపనం కార్యం సూర్యభక్తైః సదా నరైః. ౪౩. సూర్య క్రతౌ శుచిస్త్వేవం దీక్షితః పురుషో భవేత్, చతుర్ణామపి వర్ణానాం భక్త్యా సూర్యస్య నిత్యదా. ౪౪. ఏవం యేఽత్ర కరిష్యంతి తే నరా నిత్యదీక్షితాః, చీర్ణవ్రతా మహాత్మానస్తే యాస్యంతి పరాం గతిమ్. ౪౫. ఇత్యేషా కథితా రుద్ర రథయాత్రా దివస్పతేః, యాం శ్రుత్వా వాచయిత్వా చ సర్వరోగైర్విముచ్యతే. ౪౬. కృత్వా చ విధివద్భక్త్యా యాతి సూర్యసదో నరః, రథాహ్వా కథితా రుద్ర సమాసాత్సప్తమీ శుభా. ౪౭. భూయోఽపి శ్రూయతాం రుద్ర సప్తమీం గదతో మమ. ౪౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే రథయాత్రావర్ణనం నామ అష్టపంచాశత్తమోఽధ్యాయః.

## ఏకోనసప్తతమాధ్యాయము.

ఓ దేవోత్తమా! మాఘమాసమున శుక్లపక్షమున నింద్రియములఁ జిక్కఁబట్టి షష్ఠినాఁ డుపవాసముచేసి దినకరునకు గంధము పుష్పములు నైవేద్యములతోఁ బూజలొనర్చి రాత్రి యాదేవుని సన్నిధానమునఁ బరుండి నిద్రించి సప్తమినాఁడు వేకువన మేల్కాంచి భక్తితో సూర్యు నారాధింపవలయును. తరువాత బ్రాహ్మణులకుఁ దృప్తియగున ట్లన్నము పెట్టవలయును. డబ్బునందు లోభముచేయరాదు. కలకండ లడ్డులు చెఱుకులు బెల్లపుటప్పములు మొదలగువానిని బ్రాహ్మణుల కొసంగవలయును. తరువాత సంవత్సరమునిండ సప్తమీతిథినాఁడు దేవదేవుఁడగు భాస్కరునకుఁ బూర్వవిధానముచొప్పున విద్వాంసుఁడు రథయాత్ర చేయింపవలయును. ఎవ్వాఁడు కృష్ణపక్షమున సూర్యుని రథారోహణముచేయించి భక్తితో నాజగన్నాథుని సందర్శించునో యాతఁడు పరమపదమును బొందును తదియనాఁ డొక్కభోజనమును చవితినాఁడు రాత్రి యాహారమును పంచమినాఁడు యాచింపక లభించినదానిని గ్రహింపవలయు ననుచున్నారు. షష్ఠియం దుపవాసమొనరించి మఱునాఁడు సప్తమిని రథస్థితుఁడగుదేవుని దర్శించి విధ్యుక్తరీతిగ శక్తికొలఁది భక్తివినమ్రుఁడై పూజించి పారణము చేయవలయును. బంగారురథ మొక్కటి చేయించి యొకరాగిపాత్రమునందుంచి రథమధ్యదేశమున

---

బ్రహ్మోవాచ:— మాఘే మాసి తథా దేవ సితే పక్షే జితేంద్రియః, షష్ఠ్యా ముపోషితో భూత్వా గంధపుష్పోపహారతః. ౧. పూజయిత్వా దినకరం రాత్రౌ తస్యా గ్రతః స్వపేత్, విబుద్ధస్త్వథ సప్తమ్యాం భక్త్యా భానుం సమర్చయేత్. ౨. బ్రాహ్మణా న్భోజయేత్పశ్చాద్విత్తశాఠ్యం వివర్జయేత్, ఖండవేష్టైర్మోదకైశ్చ తథేక్షుగుడపూపకైః. ౩. అథ సంవత్సరే పూర్ణే సప్తమ్యాం కారయేద్బుధః, దేవదేవస్య వై యాత్రాం పూర్వోక్తవిధినా హర. ౪. కృష్ణపక్షే తు యః కృత్వా రథమారోహితం రవిమ్, పశ్యేద్భక్త్యా జగన్నాథం స యాతి పరమాం గతిమ్. ౫. తృతీయాయామేకభక్తం చతుర్థ్యాం నక్తముచ్యతే, పంచమ్యామయాచితం స్యాత్షష్ఠ్యాం చైవముపోషణమ్. ౬. సప్తమ్యాం పారణం కుర్యాద్దృష్ట్వా దేవం రథే స్థితమ్, పూజయిత్వా చ విధినా శక్త్యా భక్త్యా త్రిలోచన. ౭. సౌవర్ణం తు రథం కృత్వా తామ్రపాత్రోపరి స్థితమ్, రథ

మణులతో నలంకృతమగు నవకాశము గల్పించి యందు నడుమఁ బద్మ రాగము నుంపవలెను. తూరుపువైపున ముత్యముల నుంచునది. ఇంద్ర నీలమును దక్షిణదిక్కునఁ బశ్చిమదిశన మరకతమణి నుత్తరదిక్కున వజ్ర మును బ్రవాళరత్నమును విన్యాసము చేయవలయును. మఱియు నోయంధకధ్వంసీ! తెల్లనివస్త్రమును పచ్చనివస్త్రమును నల్లనివస్త్రమును నెఱ్ఱనివస్త్రమును నాలుగుదిక్కుల నుంపవలెను. ధ్వజపటాకారముగలిగి గంటలతో నాభరణములతోడ నలంకరించి పూలదండలు వైచి రథము నంతను నుక్తరీతి నలంకరించి పూజించి యాదిత్యునకు నివేదింపవల యును. లేకున్న బ్రాహ్మణులఁ దినిపించి యాచార్యున కెఱింగింపవల యును. ఏమానవుఁడు చరిత్రవర్ణనముతోఁగూడ సప్తమీకల్పమును పఠిం చునో యాతఁ డాచార్యుఁ డనఁబడును. ఆద్విజన్ముఁడే యెల్లజాతులకును వరుసగ సూర్యభక్తులకు విష్ణుభక్తులకును శివభక్తులకునుగూడ నాచార్యుఁ డగును. రథముచేయుటకు బంగారము దొరకకున్న వెండితోఁ జేయవల యును. అదియు నలభ్యమైన రాగితోనే రథమును వ్యోమమును నిర్మింపవలయును. అదియును లేకున్నఁ బిష్టముతోనైనఁ జేయవలయును. అద్దాని నించుక హిరణ్యముతోఁ జేర్చి యొకతామ్రపాత్రమున నునిచి రెండుపట్టువస్త్రములతోఁ గూడ బ్రాహ్మణున కొసంగవలయును. ఓమహా

---

మధ్యే న్యసేద్వ్యోమ పూజితం మణిభిర్వ్హర. ౮. పద్మరాగం న్యసేన్మధ్యే. మౌక్తికం పూర్వతో న్యసేత్, ఇంద్రనీలమధో యామ్యాం వారుణ్యాం మరకతం హర. ౯. ప్రవాలముత్తరే రుద్ర సవజ్రం విన్యసేద్ బుధః, శ్వేతం పీతాసితం చాపి రక్తం చాంధక సూదన. ౧౦. ఏతాని తాత వస్త్రాణి దిక్షు సర్వాసు విన్యసేత్, పతాకాకారసంస్థానం ఘంటాభరణభూషితమ్. ౧౧. పుష్పైర్దామైరలంకృత్య రథం రుద్ర సమంతతః, యథా న్యాయం పూజయిత్వా భాస్కరాయ నివేదయేత్. ౧౨. భోజయిత్వాథ వా విప్రా నాచార్యాయ నివేదయేత్, యోఽధీతే సప్తమీకల్పం సోపాఖ్యానం చ భారత. ౧౩. ఆచార్యః స ద్విజో జ్ఞేయో వర్ణానామనుపూర్వశః, సౌరాణాం వైష్ణవానాం తు శైవానాం పార్వతీప్రియ. ౧౪. అలాభే తు సువర్ణస్య రథం రాజతమాదిశేత్, తదలాభే తామ్రమయం రథం వ్యోమ చ కారయేత్. ౧౫. అభావే చాపి తామ్రస్య రథః పిష్టమయః స్మృతః, సహిరణ్యో మహాదేవ తామ్రభాజనమాశ్రితః. ౧౬. కౌశేయ యుగ్మసహితం బ్రాహ్మణాయ నివేదయేత్, పూర్వోక్తాయ మహాదేవ వాచకాయ

దేవా! వెనుకఁజెప్పిన మహాత్ముఁడగు పౌరాణికునకు నైదుమణులను బరిమళితగంధాదులును శక్తికొలఁది నుపహారముగ నొసంగవలయును. అందు ధనలోభము చేయరాదు. ఓహరా! రథనామ యగు నీసప్తమి పవిత్రమును పాపశోధనము నైయున్నది. మిగుల గొప్పదియగు నీవ్రతము విస్తరించి నీకెఱింగింపఁబడియె. ఈతిథియందు గ్రహరాజునకు స్నానము దానము హోమము పూజ మొదలగున వొనరించిన లక్షగుణములగును. ఈమాఘసప్తమి మిక్కిలి పుణ్యమైనదిగాఁ జెప్పఁబడినది. ఇందుపవసించి మానవుఁడు భక్తుఁడై సూర్యసపర్య యొనరించినచో నాతఁడు బ్రాహ్మణుఁడేని దేవత్వము నొందును. క్షత్రియుఁడు బ్రాహ్మణుఁడగును. వైశ్యుఁడు క్షత్రియుఁడగును. శూద్రుఁడు వైశ్యుఁ డగుచున్నాఁడు. కన్యయైనచో విద్యవినయములుగలమగనిఁ జేపట్టును. పుత్రులులేనిది పుత్రులఁ గాంచును. సౌభాగ్యముకోరునది యద్దాని బొందును. మగఁడులేనివనిత యీజన్మమున భక్తితో నీసప్తమినాఁ డుపవసించెనేని రాఁబోవుపుట్టువుల నొకదానిలోనైనను వైధవ్యదుఃఖమును బొందదు. ఓపార్వతీప్రియా! ఆయువతి పెక్కురు తనయులఁ గాంచి బహుధనముగలిగి భర్తయనురాగమున కిక్కయగును. ఏడుజన్మములవఱకును స్త్రీలును పురుషులును సుఖములు విడువరు. ఇట్టియత్యుత్తమమగు సప్తమీకల్పము నీకెఱింగించితిని. ఓవృషభధ్వజా! ఈయాఖ్యానమును

---

మహాత్మనే. ౧౭. పఞ్చరత్నసమాయుక్తం శుభగంధాధివాసితమ్, స్వశక్త్యా తు విరూపాక్ష విత్తశాఠ్యం వివర్జయేత్. ౧౮. ఏషా పుణ్యా పాపహరా రథాహ్వా సప్తమీ హర, కథితా తే మయా రుద్ర మహతీయం ప్రకీర్తితా. ౧౯. స్నానం దానమథో హోమః పూజా గ్రహపతేర్హర, శతసాహస్రం భవేదస్యాం కృతం భూధర విద్యతే. ౨౦. ఏవమేషా పుణ్యతమా మాఘే ప్రోక్తా తు సప్తమీ, యాముపోష్య నరో భక్త్యా సూర్యస్యానుచరో భవేత్. ౨౧. బ్రాహ్మణో యాతి దేవత్వం క్షత్రియో విప్రతాం వ్రజేత్, వైశ్యః క్షత్రియతాం యాతి శూద్రో వైశ్యత్వమేతి చ. ౨౨. విద్యావినయసంపన్నం భర్తారం కన్యకా లభేత్, అపుత్రా స్త్రీ సుతం విందేత్సౌభాగ్యం చ గణాధిప. ౨౩. విధవా చాప్యుపోష్యేమాం సప్తమీం త్రిపురాంతక, నాన్యజన్మసు వైధవ్యం ప్రాప్నుయాత్పార్వతీప్రియ. ౨౪. బహుపుత్రా బహుధనా పత్యుర్వల్లభతాం వ్రజేత్, యావద్వై సప్త జన్మాని స్త్రియస్తు పురుషాస్తథా. ౨౫. ఏవంవిధా

భక్తితో వినినమానవుఁడు బ్రహ్మహత్యామహాపాతకమునుండియు విముక్తుఁడగును. అని యిట్లు బ్రహ్మరుద్రులసంవాదంబు వినిచి శతానీకునకు సుమంతు విట్లనియె.

ఇది ఏకోనషష్టితమాధ్యాయము.

---

## షష్టితమాధ్యాయము.

సుమంతుండు శతానీకున కిట్లనియె. ఓమహాభుజా! సాటిలేని తేజస్సుగల భాస్కరునిరథయాత్ర యిట్టిదియని మూఁడుకన్నులవేలుపున కెఱింగించి యానలుమొగంబులవేలుపుబెద్ద తొందరగఁ దన యునికిపట్టున కేగెను. అనఁగా విని శతానీకుండు సుమంతున కిట్లులనియె. సమస్తజగమునకు రక్షకుఁడగు నేదేవు నారాధించి నావంశమునఁ బూర్వులగు తాతలు మొదలగువారు బ్రాహ్మణులఁ దృప్తిపరుప నాలుగువిధములగు నన్నమును బొందియుండిరో అట్టిదేవుని నిచ్చలు దేవతలచేతను మునులచేతను సిద్ధగణములచేతను మానవులచేతను బొగడువడుచున్నవాని మహిమాతిశయము జాలవఱకు నాచే వినఁబడియె. తిరుగునవియు దిరుగనివియు నగుభూతములకెల్ల నెవ్వాఁడు మూలకారణమో, ఎవ్వానికి జననము లేదో అట్టిమహానుభావుని నుతింప నెవ్వఁడు చాలి

---

సప్తమీ తే కథితా వృషభధ్వజ, యాం శ్రుత్వా మానవో భక్త్యా ముచ్యతే బ్రహ్మహత్యయా, ౨౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే రథసప్తమీమాహాత్మ్యవర్ణనం నామ
ఏకోనషష్టితమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—ఇత్యుక్త్వా స జగామాశు సురజ్యేష్ఠం త్రిలోచనమ్, రథయాత్రా మహాబాహో సూర్యస్యేత్యమితౌజసః. ౧. శతానీక ఉవాచ—యమారాధ్య జగన్నాథం మమ పూర్వపితామహాః, తుష్ట్యర్థం బ్రాహ్మణానాం తు అన్నమాపుశ్చతుర్విధమ్. ౨. తస్య దేవస్య మాహాత్మ్యం శ్రుతం చ బహుశో మయా, దేవర్షిసిద్ధమనుజైః స్తుతస్య హి దినేదినే. ౩. కః స్తోతుమీశస్తమజం యస్యైతత్సచరాచరమ్, అవ్యయస్యాప్రమేయస్య విబుధ్యేతోదయాజ్జగత్. ౪. కరాభ్యాం యస్య దేవేశా

యున్నాఁడు? నాశములేక యింతయని చెప్ప నలవిగాని యేదేవుని యుదయమునం జేసి యీజగంబు మేలుకొనుచున్నదో, ఎవనిహస్తముల నుండి లోకమున మెప్పువడసినవారును దేవతలకుఁ బ్రభువులు నగుబ్రహ్మ విష్ణువులును ముఖమునుండి మూఁడుపురముల మాయించిన ముక్కంటియుఁ బొడమియుండిరో, అట్టివెలుఁగులఱేని యెల్లమహిమంబుల నెవ్వరు వక్కాణింపఁజాలియున్నారు? ఓబ్రాహ్మణోత్తమా! అట్టి నే నాదేవుని దగు నెట్టిపూజచే సంసార మనుసముద్రమును దాటఁగలుగుదునో యట్టి యారాధనమును సర్వమును వినఁగోరుచున్నాను. ఏయుపాయముచే నేవేదమంత్రములచే నేరహస్యములచే నెట్టిసేవచే నెట్టిదానములచేత నెట్టివ్రతములచే నుపవాసములచేత నేహోమములచే నేజపములచేఁగాని యారాధింపఁబడి యట్టివారికష్టముల కెల్ల హాని గలిగించును. ఎద్దానివలన నన్నిటికిఁ గారణమగు దేవుఁడు సంతసించునో అదొక్కటియే యెల్లవిద్యల నడుమ విద్య యనఁదగును. ఏశాస్త్రమున భానుదేవునికీర్తనము లుండునో యదియే శాస్త్రములలో నెల్లఁ బుణ్యమయినది. ఏరహస్యముచే నెప్పుడును సంచరించుదేవుఁడు ప్రసన్నుఁ డై యుండు నదియే రహస్యములలో నెల్ల నుత్తమ రహస్యము. ఏమంత్రము భానుమూర్తికిఁ గృప గలిగించు నది యొక్కటియే శ్రేష్ఠమగు మంత్రము. ఏవ్రతముచే నాతఁడు ప్రసన్నుఁడగు నది యొక్కటియే యుత్తమ వ్రతము. ఏయుపవాసముచే నాతనికిఁ బ్రీతిగలుగునో యది యొక్కటియే యుపవాసము. ఏనాలుక యెల్లప్పుడు నామార్తండు నుతించునో అది యొక్క

---

కవిష్ణూ లోకపూజితౌ, ఉత్పన్నౌ ద్విజశార్దూల లలాటాత్త్రిపురాంతకః. ౫. తస్య దేవస్య కైః శక్యా వక్తుం సర్వా విభూతయః, సోఽహమిచ్ఛామి దేవస్య తస్య సర్వాత్మనా ద్విజ. ౬. శ్రోతుమారాధనం యేన నిస్తరేయం భవార్ణవమ్, కేనోపాయేన మంత్రైర్వా రహస్యైః పరిచర్యయా. ౭. దానైర్వ్రతోపవాసైర్వా హోమైర్జాప్యై రథాపి వా, ఆరాధితః సమస్తానాం క్లేశానాం హానిదో భవేత్. ౮. సైకా విద్యా హి విద్యానాం యయా తుష్యతి సర్వకృత్, శ్రుతానామపి తత్పుణ్యం యత్ర భానోః ప్రకీర్తనమ్. ౯. రహస్యానాం రహస్యం తద్యేన హంసః ప్రసీదతి, ఏకః శ్రేష్ఠతమో మంత్రస్తదేకం పరమం వ్రతమ్. ౧౦. ఉపోషితం చ తచ్ఛ్రేష్ఠం యేన భానుః ప్రసీదతి, సా చైకా రసనా ధన్యా మార్తండం స్తౌతి యా సదా. ౧౧. తదేకం నిర్మలం చిత్తం

టియే ధన్యతగాంచిన నాలుక. ఏమనస్సు సతతమును రవియందుఁ దగిలి యుండునో యది యొక్కటియే మురికిలేని నెమ్మనము ఓబ్రాహ్మణ శ్రేష్ఠుఁడా! యేహస్తములు నిచ్చలు నాభానునకుఁ బూజలు సలుపు చుండునో యవియే యిచ్చటను లోకాంతరమును గీర్తింపఁదగిన వానిలోనెల్లఁ గీర్తింపఁదగియున్నవి. ఏశరీరము సూర్యునిపవిత్రములగు నామాక్షరముల నుచ్చరించినవెంటనే గగుర్పాటు నొందునో ఆశరీర మొక్కటియే సమస్తజీవలోకమునను ముఖ్యముగ ధన్యతగొన్నది. ఏనాలుక సూర్యునిగుణములఁ గీర్తింపదో అది కంఠమునకును దౌడల కును మధ్యనున్ననాలుకను బోలు చిత్తరువుగాని నాలుకయాకారముగల యొక రోగముగాని యగును. అంతేగాక యది నాలుకగాదు. ఓపురుష పుంగవా! ఆవరణములతోఁ గూడియున్న యీదేహమను పురమునఁ దొమ్మిదిద్వారము లున్నవి. అయ్యది శ్రద్ధగలిగి సూర్యునుతిలేని శబ్దముల నాకర్ణింపుచుండినచో వ్యర్థములే యని విద్వాంసులు తెలిసికొను చున్నారు. ఎల్లపుడును పురుషులచేష్టలు శ్రేయము నిచ్చునవి కాదు గద? జీవించియున్నపుడు భాస్కరు నాశ్రయించి యొనరించినసేవ తొలుతఁ జొరరానిదియుఁ బిదపఁ దరిజేరరానిదియగు సంసారమను మహారణ్యమునఁ బడి యిటునటు బరిభ్రమించు మానవులకు వ్యర్థముగాదు. సూర్యనమ స్కార మొక్కటియే సంసారమను మహాసముద్రమునుండి దరిఁజేర్చునది. బంగరుకొండ రతనములకెల్లఁ బుట్టినిల్లు. అన్నివినోదములకు నాకసము గనియై యున్నది. సకలతీర్థములకు నిలువనీడ గంగానది. సమస్తదేవ

---

యద్గతం సతతం రవౌ, శ్లాఘ్యానామపి తౌ శ్లాఘ్యావిహ లోకే పరత్ర చ. ౧౨. యా సదా ద్విజశార్దూల భానోః పూజాకరౌ కరౌ, తదేకం కేవలం ధన్యం శరీరం సర్వజంతుషు.౧౩. యదేవ పులకోద్భాసి భానోర్నామానుకీర్తనే, సా జిహ్వా కణ్ఠతాల్వాక మథ వా ప్రతిజిహ్వికా. ౧౪. అథ వా సాపరో రోగో యా న వక్తి రవేర్గుణమ్, నవద్వారాణి సంత్యస్మిన్పురే పురుషసత్తమ. ౧౫. ప్రాకారైస్త్వావృతే విష్వగ్వ్యర్థా తాని విదుర్బుధాః, దత్తావధానం యచ్ఛబ్దే విసైవ, రవిసంస్తుతిమ్. ౧౬. శ్రేయసాం న హి సంప్రాప్తా పురుషాణాం విచేష్టితమ్, జన్మన్యవిఫలా సేవా కృతా యాశ్రిత్య భాస్కరమ్. ౧౭. దుర్గసంసారకాంతారమపారమభిధావతామ్, ఏకో భానునమస్కారః సంసారార్ణవతారకః. ౧౮. రత్నానామాకరో మేరుః సర్వాశ్చర్యమయం నభః, తీర్థా

తలకు నాశ్రయము సూర్యుఁడు. ఈ మొదలగు సమస్తగుణములును భోగములును మహాతేజస్సంపన్నుఁడగు భానున కున్నట్లు బహువిధములుగ సిద్ధులచేతను దేవతలచేతను గానము చేయఁబడుచుండఁగా నేవింటిని. అట్టి నేను సప్తలోకములకు నుత్తమమగు రక్షకుఁడును కాంతి యుతుఁడు పగటిని జేయువాఁడును సమస్తజగత్తునకు హృదయదేశమున వసించువాఁడును ప్రభువులకెల్లఁ బ్రభుఁడును కాంతిమంతములగు కిరణములుగలవాఁడు నపరిమితమగు తేజముగలవాఁడు నెల్లలోకములకు నాధారుఁడును తలఁచినంతనే భక్తులపాపములఁ బోఁద్రోలువాఁడునగు నామార్తాండదేవు నారాధించుతెఱంగు సవిస్తారముగ నెఱింగి యాతని నారాధింపఁగోరుచున్నాఁడను. అనియడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె.

ఇది షష్టితమాధ్యాయము.

---

## ఏకషష్టితమాధ్యాయము.

రాజా! ఒక్కఁడును నాశములేని దివ్యధామము సదసత్తులకన్న వేఱయినవాఁడును సర్వోత్కృష్టుఁడు నత్యంతభేదము నత్యంతాభేదము లేని యుభయమిశ్రితమగు స్వరూపమున నున్నవాఁడునగు నారవిని నమస్కరించి మున్ను మహానుభావుఁడగు బ్రహ్మదేవుఁడు మహర్షులకుఁ జెప్పిన చొప్పున నీకే నెఱింగింతును. అద్దానిఁ దెలిసికొనుము. ఓనరనాథా!

---

నామాశ్రయో గంగా దేవానామాశ్రయో రవిః. ౧౯. ఏవమాదిగుణో భోగో భానో రమితతేజసః, శ్రుతో మే బహుశః సిద్ధైర్గీయమానైస్తథామరైః.౨౦.సోఽహమిచ్ఛామి తం దేవం సప్తలోకపరాయణమ్, దివాకరమశేషస్య జగతో హృద్యవస్థితమ్. ౨౧. ఆరాధయితుమీశేశం భాస్కరం చామితౌజసమ్, మార్తండం భువనాధారం స్మృతమాత్రాఘుదారిణమ్. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యపరిచర్యావర్ణనం నామ
షష్టితమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—తమేకమక్షరం ధామ పరం సదసతోర్మహత్, భేదాభేద స్వరూపస్థం ప్రణిపత్య రవిం నృప. ౧. ప్రవక్ష్యామి యథాపూర్వం విరించేన మహాత్మనా, ఋషీణాం కథితం పూర్వం తం నిబోధ నరాధిప. ౨. ఆరాధనాయ సవితుర్మ

కమలమునఁ బుట్టిన యమ్మహాత్ముఁడు మహర్షులకు సూర్యుని యారాధనము నకై బ్రహ్మప్రతిపాదకమగు యోగరాజము నెట్టు లెఱింగించియుండె నట్టులే యవధరింపుము. ఆయోగరాజము బాహ్యవృత్తుల నన్నింటి నరికట్టి ముక్తిని బ్రతిపాదించును. అప్పుడు సమస్తజగత్తును బాలించు బ్రహ్మదేవుఁడు మహర్షులందఱు విచ్చేసి సవినయముగ మ్రొక్కి యడుగఁ బ్రజాహితముగోరి సర్వవృత్తుల నరికట్టుటచేఁ బుట్టు మోక్షసాధనమగు నీయుత్తమయోగమును వారలకు వివరించెను. ఓజగత్తునకుఁ బ్రభువా! భగవంతుఁడగు బ్రహ్మచే మానసికవ్యాపారము నడ్డగించుటచే జనించు నేయోగము చెప్పఁబడెనో అట్టియోగోత్తంస మనేకజన్మములచేఁగాని పొందనలవిగాదు. ఓజితేంద్రియా! మనుష్యులనేత్రాదులగు నింద్రి యములఁ దమయొద్దికి లాగికొనువిషయముల జయించుట కలవికాదు. చంచలమగు మనస్సుగలవారు మానసికవృత్తుల నరికట్టఁజాలరు గదా! నూరేండ్లుయత్నించినను రాగము వైరము మొదలగు వికారములు జయింప నలవికానివి. రాగాదులు నశింపనప్పుడు మనస్సు చిత్తవృత్తి నిరోధ మనుయోగమునకు యోగ్యము కాఁజాలదు. ఓపితామహా! ఈపురుషు లుత్తమమగు కృతయుగమునను త్రేతాద్వాపరయుగము లందును గూడ నత్యల్పమగు నాయుర్దాయము కలిగియున్నారు. అట్టి యెడ నధమమగు కలియుగమున వేరచెప్పనేల? అట్టి యర్ధాయువు లెట్లు రాగాదులనొంచి చిత్తవృత్తిని నిరోధించి యోగమునకు యోగ్యు లగుదురు. ఓభగవానుఁడా! నిన్ను శరణొందితిమి. దయగలిగి

---

హోత్మా పద్మసంభవః, యోగం బ్రహ్మపరం ప్రాహ మహర్షీణాం యథా ప్రభుః. ౩. సమస్తవృత్తిసంరోధాత్కైవల్యప్రతిపాదకమ్, తదా జగత్పతిర్బ్రహ్మా ప్రణిపత్య మహర్షిభిః. ౪. సర్వైః కిలోక్తో భగవానాత్మయోనిః ప్రజాహితమ్, యోయం యోగో భగవతా ప్రోక్తో వృత్తినిరోధజః. ౫. ప్రాప్తుం శక్యః స త్వనేకైర్జన్మభిర్జగతఃపతే, విషయా దుర్జయా నౄణామింద్రియాకర్షిణః ప్రభో. ౬. వృత్తయశ్చేతసశ్చాపి చఞ్చలస్యాపి దర్ధరాః, రాగాదయః కథం జేతుం శక్యా వర్షశతైరపి. ౭. న యోగ యోగ్యం భవతి మన ఏభిరనిర్జితైః,అల్పాయుషశ్చ పురుషా బ్రహ్మన్కృతయుగేఽప్యమీ. ౮. త్రేతాయాం ద్వాపరే చైవ కిము ప్రాప్తే కలౌ యుగే, భగవంస్త్వాముపాసీనాన్ప్ర సన్నో వక్తుమర్హసి. ౯. అనాయాసేన యేనైవ ఉత్తరేమ భవార్ణవమ్, దుఃఖాంబు

ఋూవిషయ మానతిమ్ము. శ్రమనుగలిగింపని యేయుపాయముచే సంసార సముద్రమును దాటఁగల్గుదుమో; దుఃఖమను మున్నీట మునిఁగియున్న పురుషులు దానిగడుచునట్టి పడవయెయ్యది.? మేమందర మెవ్విధి సంసార జలనిధి దాటఁజాలుదు మట్టియుపాయము నాలోచింపుము. అని యిట్టు మునులు తన్నడుగ నప్పు డాబ్రహ్మ మహానుభావులగు నాఋషిపుంగవులకు లోకమునకు హితముచేయు తలఁపుగలిగి కర్మయోగమును తొలుత వారల కుపదేశించెను. ఓమునులారా! మీరనలసులై బాహ్యములగు నాధారములనెల్ల నపేక్షింపక నిత్యుఁడగుటచేఁ బుట్టువులేనివాఁడును జగత్తుఁ బాలించువాఁడును నిఖిలప్రపంచమును శిక్షించువాఁడునగు దివాకరు నారాధింపుఁడు. రాత్రింబవళ్లు యాగములచేతను పూజలచేతను నమస్కారములచేతను నాతనికథలు వినుట మొదలగువానిచే సేవించుటచేతను పలువిధములగు వ్రతములచేత నుపవాసములచేతను బ్రాహ్మణులకు భోజనాదులచేఁ దృప్తిచేయుటచేతను మఱియు నాయాయిష్టములగు కోరికలచేతను నేయేవస్తువులచే మనస్సునకు సంతోషము గలుగునో యట్టివస్తువులచేతను నింతయని చెప్పనలవిగాని మహిమగల యాభాస్కరదేవు నారాధింపుఁడు. ఆతనియందు భక్తిగలిగి బుద్ధి నాతనియందు నిలిపి యాతనిపనులుచేయుచు నాతఁడే రక్షకుఁడని భావింపుచు నాతనియందు దృష్టిని మనస్సును నిలిపి యాతఁడు సర్వాకారుఁడనియు సర్వవ్యాపకుఁడనియు నిశ్చయముగలవారై యన్నికర్మలు నాపరమాత్మునందే సర్వావయవములతోడ నడఁగియున్నవని యెఱింగి ధ్యానించుచు సన్యసింపుఁడు. (ఫలాపేక్ష మానుఁడు). అంత నాతఁడే మీయజ్ఞానావరణములను నశింపఁ

---

మగ్నాః పురుషాః ప్రాప్య బ్రహ్మన్మహోప్లవమ్. ౧౦. ఉత్తరేమ భవాంభోధిం తథా త్వమనుచింతయ, ఏవముక్తస్తదా బ్రహ్మా క్రియాయోగం మహాత్మనామ్.౧౧. తేషామృషీణామాచష్ట నరాణాం హితకామ్యయా, ఆరాధయత విశ్వేశం దివాకరమతంద్రితాః. ౧౨. బాహ్యాలంబనసాపేక్షాస్తమజం జగతః పతిమ్, ఇజ్యాపూజానమస్కారశుశ్రూషాభిరహర్నిశమ్. ౧౩. వ్రతోపవాసైర్వివిధైర్బ్రాహ్మణానాం చ తర్పణైః, తైస్తైశ్చాభిమతైః కామైర్యే చ చేతసి తుష్టిదాః. ౧౪. అపరిచ్ఛేద్యమాహాత్మ్యమారాధయత భాస్కరమ్, తన్నిష్ఠాస్తద్గతధియస్తత్కర్మాణస్తదాశ్రయాః. ౧౫. తద్దృష్టయస్తన్మనసః సర్వస్మిన్సన్ ఇతి స్థితాః, సమస్తాన్యథ కర్మాణి తత్ర సర్వాత్మనాత్మని.

జేయఁగలాఁడు. ఈతేజమే నాశములేనిదై నిత్యమగు నాబ్రహ్మము. సర్వవ్యాపియగు నేబ్రహ్మమునందు మహత్తత్వమును పురుషుఁడు నను రెండుతేజములు నిలచియున్నవో యట్టిబ్రహ్మ మీతఁడే. ఉత్తమములగు వానిలోనెల్ల నత్యుత్తముఁ డీతఁడే. ఈతఁ డొక్కఁడె సుమీ దేవతల కెల్లఁ బూజ్యుఁడు పండితులకును బూజ్యుఁడు ఈప్రపంచమంతయు నెవ్వనికన్న వేరయియున్నదో యేది స్థావరమో యేది జంగమమో యదియంతయు నీతనివలననే యుత్పన్నమైనది. అట్టిమోక్షము నిచ్చు వాఁడు నిరూపింపరానివాఁడును మనస్సుచే జింతింపను గూడ నలవికాని వాఁడు నేరికిఁ బట్టువడనివాఁడునగు నాజగన్నాథుని లెస్సగ నారాధించి కర్మబంధములనుండి విడివడఁగలరు. అని యిట్లీపరమరహస్యమును బ్రహ్మ వలన నెఱింగి యామునిపుంగవులు మనుష్యులమేల్గోరి యిహలోకమునఁ గర్మయోగము జేయునవియుఁ జాలవఱకు ముక్తిమార్గమును బోధించు నవియు నగు యోగశాస్త్రములఁ బెక్కింటిని నిర్మించినారఁట సూర్య సంబంధములగుకర్మ లనుష్ఠించుటలో మెండగు నాసక్తిగలవారిచేత సర్వ మునకు నీశ్వరుఁడును సమస్తవస్తువులఁ బుట్టించువాఁడును నిఖిలజగము నకు నధిపతియుఁ బరమాత్ముఁడునగు నామార్తండదేవుఁ డారాధింపఁబడు చున్నాఁడు. ఇంకను ఆదేవునిగుఱించి మున్ను పితామహుండు మునుల కేయేయంశముల నెఱిఁగించియుండెనో నిఖిలపాతకములను నిర్మూలించు నాయంశములనెల్ల నోకురుకులభూషణా! కురుకుమారా! యిప్పుడు నీకెఱింగింతు నాకర్ణింపుము. ఇయ్యది యుత్తమోత్తమ మగురహస్యము.

---

౧౬. సంన్యసథ్వం స వః కర్తా సమస్తావరణక్షయమ్, ఏతత్తదక్షరం బ్రహ్మ ప్రధానపురుషా వుభౌ. ౧౭. యతో యస్మిన్వ్యథా చోభౌ సర్వాః వ్యపిన్యవసితౌ, పరః పరాణాం పరమః సైకః సుమనసాం పరః. ౧౮. యస్మాద్భిన్నమిదం సర్వం యచ్చేదం యచ్చ నేంగతి, మోక్షకారణమవ్యక్తమచిన్త్యమపరిగ్రహమ్, సమారాధ్య జగన్నాథం క్రియాయోగేన ముచ్యతే. ౧౯. ఇతి తే బ్రహ్మణః శ్రుత్వా రహస్యమృషిసత్తమాః. ౨౦. నరాణా ముపకారాయ యోగశాస్త్రాణి చక్రిరే, క్రియాయోగపరాణీహ ముక్తికారీణ్యనేకశః. ౨౧. ఆరాధ్యతే జగన్నాథస్తదనుష్ఠానతత్పరైః, పరమాత్మా స మార్తండః సర్వేశః సర్వభావనః. ౨౨. యాన్యుక్తాని పురా తేన బ్రహ్మణా కురునందన, తాని తే కురు శార్దూల సర్వపాపహరాణ్యహమ్. ౨౩. వక్ష్యామి శ్రూయతామద్య రహస్యమిదముత్త

సంసారసముద్రమున మునిఁగి వెలుపలిపూఁబోఁడులు మొదలగువిషయము లచే నాక్రమింపఁబడినచిత్తముగల మానవులకు సర్వకాలములందును సంచరించునాదిత్యుఁ డనునొక లేక రక్షకమగునది వేరొం డెద్దియులేదు. నిలచి యున్నప్పుడు రవియనుపేర సూర్యుని స్మరింపుము. నడచుచు గోపతి యనుపేర స్మరింపుము. భోజనముచేయునపుడు మార్తండుని దలఁపుము. నిద్రించునెడఁ గూడ భాస్కరుని స్మరింపుము. ఇప్పగిది నేకాగ్ర(నిశ్చల) చిత్తముగలిగి నీ వెల్లవేళల నారవిని లెస్సగ నాశ్రయించి యుందువేని జననమరణములను మొసళ్లతోఁ గూడిన సంసారమహాజలమును గడచి పోవంగలవు. ఏమానవులు సర్వేశ్వరుఁడు సర్వవరదుఁడు పురాణపురుషుఁడు జగమును బుట్టించినవాఁడు జన్మములేనివాఁడు నిత్యుఁడు ప్రభుఁడునగు గ్రహారాజైన రవి నాశ్రయించియుందురో అట్టిముక్తులగు జనులకు సంసారబాధ యుండదు.

ఇది ఏకషష్టితమాధ్యాయము.

---

## ద్విషష్టితమాధ్యాయము.

సుమంతుండు శతానీకున కిట్లనియె. రాజా! రహస్యముగల యింకొక్కసంవాదము సమగ్రముగ నికమీఁద వివరింతు వినుము. సూర్యునిదండనాథుఁడగు దిండి యను నొకభక్తునకు నాదిత్యునకు

---

వమ్, సంసారార్ణవమగ్నానాం విషయాక్రాంతచేతసామ్. ౨౭. హంసపోతం వినా నాన్యత్కించిదస్తి పరాయణమ్, ఉత్తిష్ఠంశ్చింతయ రవిం వ్రజంశ్చింతయ గోపతిమ్. ౨౮. భుంజంశ్చింతయ మార్తండం స్వపంశ్చింతయ భాస్కరమ్, ఏవమేకాగ్రచిత్తస్త్వం సంశ్రితః సతతం రవిమ్. ౨౯. జన్మమృత్యుమహాగ్రాహం సంసారాంభస్తరిష్యసి. ౩౦. గ్రహేశమీశం వరదం పురాణం జగద్విధాతారమజం చ నిత్యమ్, సమాశ్రితా యే రవిమీశితారం తేషాం భవో నాస్తి విముక్తిభాజామ్. ౩౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యయోగమహిమవర్ణనం నామ
ఏకషష్టితమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అథాన్యం సరహస్యం తు సంవాదం వచ్మి తేఽఖిలమ్,

నయ్యది గలిగెను. అద్దాని నాలకించిన నెల్లపాపములు బుగ్గియగును. మున్నొకప్పుడు దిండి బ్రహ్మహత్యామహాపాతకముచేఁ దిరస్కృతుఁడై (బ్రహ్మహత్య యొనరించి) గొప్ప తపంబుచేయుచు మహానుభావుఁడగు సూర్యు నారాధించుటకు స్తోత్రముచేసెను. అర్థయుక్తమగు నాతని యా స్తోత్రము నాలకించి దేవతలకెల్ల నుత్తముఁడు భగవంతుఁడు నగు సూర్యుఁడు సంతోషించి గణనాథుఁడగు నాదిండి కిట్లనియె. ఓపుణ్యాత్మా! దిండీ! ఆశ్చర్యముగలిగించు నీభక్తికిని స్తోత్రమునకు నే మెచ్చితిని. ధర్మముల నెఱింగినవాఁడా! నీమనస్సున కెద్ది యిష్టమో యట్టివరము గోరుకొనుము. అని యానతిచ్చు నాదిత్యునకు దిండి యిట్లనియె. ఓమహాత్మా! అజ్ఞానినగు నాయొద్దకు నీవిపు డేతెంచుటయే మిక్కుటముగఁ బొగడఁదగిన యుత్తమవరమై యున్నది. పుణ్యముచేయనివారలకుఁ గలలోనైన నీదర్శనము దుర్లభము గద! లోకనిందితమగు నీబ్రహ్మహత్య నన్నెట్టులాక్రమించెనో అదియెల్ల సమస్తజంతువులకు హృదయమున వాసము చేయుచున్న సర్వేశ్వరుఁడవగు నీవెఱింగియే యున్నావు గదా! ఓప్రభూ! నీయనుగ్రహంబుకతన నాయీమహాపాతకము నాశము నొందుఁగాక. అట్టులే యితరమగు లోకనిందితమగు దురితజాలమంతయు నశించుఁగాక. మఱియు నే నేయేప్రయోజన మభిలషించుచున్నానో అదియెల్ల నోదివస్పతీ! నాకుఁ జేకురుఁగాత. ఇట్టులయ్యెనేని యీకారణముచే ననుమానించి నీవు ప్రసన్నుండవైతివనియే దెలిసికొందును. సూర్యుఁడు ప్రసన్నుఁడు

---

సూర్యస్య దిండినా సార్థం సర్వపాపప్రణాశనమ్. ౧. బ్రహ్మహత్యాభిభూతస్తు పురా దిండిర్మహాతపాః, ఆరాధనాయ దేవస్య స్తోత్రం చక్రే మహాత్మనః. ౨. శ్రుత్వా తస్యార్థతః స్తోత్రం తుతోష భగవాన్రవిః, ఉవాచ దేవదేవస్తం దిండినం గణనాయకమ్. ౩. ఆదిత్య ఉవాచః—హంత దిండే ప్రసన్నోఽస్మి భక్త్యా స్తోత్రేణ తేఽనఘ, వరం వృణీష్వ ధర్మజ్ఞ యత్తే మనసి వర్తతే. ౪. దిండిరువాచ.—ఏష ఏవ వరః శ్లాఘ్యో యత్వాప్తోఽసి మమాంతికమ్, త్వద్దర్శనమపుణ్యానాం స్వప్నేష్వపి చ దుర్లభమ్. ౫. యత్రైషా బ్రహ్మహత్యా మే ఆగతా లోకగర్హితా, భవాఞ్జానాతి సర్వేశో హృదిస్థః సర్వదేహినామ్. ౬. త్వత్ప్రసాదాన్మమేశాన నాశమాశు ప్రయాతు వై, తథా చ దురితం సర్వం యచ్చాన్యల్లోకగర్హితమ్. ౭. యద్యదిచ్ఛామ్యహం తత్తత్సర్వమస్తు దివస్పతే, ఏతేనైవానుమానేన ప్రసన్నో భగవన్నితి. ౮. జ్ఞాతం మయాహి మార్తండే

గాకున్నచో నైశ్వర్యములు గలుగవు గదా! కావున నీవు సమస్తసుఖము లకు నానందములకు మధ్యనున్నవాఁడవయ్యు నట్టికిరణములు గలవాఁడ వయ్యును మిక్కిలి లోఁతైన సంసారదుఃఖమున మునిఁగియున్న నన్ను నింద్యమని యెంచక చేయిచాచి పైకి దీయఁదగియున్నవాఁడవు. ఎవరు తొలుత సుఖములఁ బడసి కడకు దుఃఖములకుఁ లోనగుదురో అయ్యది సుఖమే కాదు. అట్లు రానున్నదుఃఖమునకుఁ గారణ మేమయియుండునో అని యోచింప నిషిద్ధవస్తువులు భక్షించుట మొదలగుపాపము లొనరించుటచేఁ గలుగునని తోఁచుచున్నది. కావున నోమహాత్మా! లోక నాయకా! నీ వీలోకమున జంతువులదుఃఖములు పోఁగొట్టి యను గ్రహింపుము. ఎట్టిజ్ఞానము కలిమి నే నీసంసారసముద్రము దాఁటఁగలనో అట్టియుత్తమజ్ఞానము నొసంగుము. అని యిట్లు ప్రార్థింప యోగజ్ఞోత్తముఁ డగుమార్తండుఁడు దుఃఖసంబంధము గలవారలకు ఔషధము బీజా క్షరవిహీనమునగు నొక్కయోగము నాతని కుపదేశించెను. ఆదిండియు నిర్బీజమై నిష్కళమైయున్న యాయోగము నాకర్ణించి మిక్కిలి వెలిఁ గెను. తర్వాత నామహాతేజస్సంపన్నుఁడు సూర్యునకు నమస్కరించి యీ వచనమును వక్కాణించెను. ఓచీఁకట్లగొంగా! వేలుపులతేఁడా! నీ యీచెప్పినయోగరాజము నాకుఁ బొందరాకుండుటయేగాక యింద్రియ నిగ్రహములేని యితరమానవుల కందఱకుఁగూడఁ బొందరానిదై యున్నది. పురుషులచే నింద్రియముల నాకర్షించుస్త్రీ మొదలగువిషయములు సర్వ కాలముల జయింప నలవిగానివి. చిత్తవృత్తి నడ్డగింపఁజాలనివాఁడు సమర్థ

వాప్రసన్నే విభూతయః, ఏవం సర్వసుఖాహ్లాదమధ్యస్థోఽపి హి భానుమాన్. ౯. త్వం మామగాధే సంసారే మగ్నముద్ధర్తుమర్హసి, సుఖాని తాని చైవాంతే యేషాం దుఃఖం న తత్సుఖమ్. ౧౦. యదా తు దుఃఖమాగామి కిం వా కస్యైవ భక్షణాత్, తత్ప్రసాదం కురు విభో జగతాం త్వం జగత్పతే. ౧౧. జ్ఞానదానేన యేనైవముత్తరేయం భవార్ణవమ్, ఇత్యుక్తస్తేన మార్తండః కథయామాస యోగవిత్. ౧౨. యోగం నిర్బీజమత్యంతం దుఃఖసంయోగభేషజమ్, శ్రుత్వా యోగం తు తం దిండిర్నిర్బీజం నిష్కలం బభౌ. ౧౩. ప్రణిపత్య మహాతేజా ఇదం వచనమబ్రవీత్, దేవదేవ త్వయా యోగో యః ప్రోక్తో ధ్వాన్తనాశన, నైష ప్రాప్యో మయా నాన్యైర్జ్ఞానవైరజితేంద్రియైః. ౧౪. విషయా దుర్జయాః పుంభిరింద్రియాకర్షిణః సదా, ఇంద్రియాణాం జయో యుక్తః కః

ములగు నింద్రియముల నెవ్వఁడును జయింపఁజాలఁడు. నేను నాది యను విరుద్ధజ్ఞానముగల చంచలమగు మనస్సెరికిని జయింప నలవిగానిది. అట్టులే రాగాదులును విడువరానివి. అయ్యవి జన్మాంతరసంస్కారములచే విడువఁ బడునందువేని యద్దానినే గోరుచున్నాను. ఓదేవరాజా! నీయనుగ్రహమున రాగాదుల జయింపకయే దేవత్వమును శాశ్వతమగుముక్తిని గోరుచున్నాను. ఇతరు లెవ్వరేని యిట్లుండి పాపములఁబాసి యమర్త్యత్వముఁ బొందియున్నచో నెఱుఁగఁజేయ వేఁడెదను. అనిన నాతని కాదిత్యదేవుఁ డిట్లనియె. ఓగణాధిపా! నీవీరీతిగ ముక్తిని గోరుదువేని యవ్విధ మెఱింగింతు నాకర్ణింపుము. అయ్యది యన్నికష్టముల నంత మొందించు కర్మయోగము. నన్నే మనమున ధ్యానించుచు నాయందు భక్తుఁడవై నన్నే యజించుచు నన్నే మ్రొక్కుచుండుము. నన్నే ప్రాప్యముగా నాత్మలోఁ దలఁచియుంటివేని నన్నే బొందఁగలవు. నన్నే భావించుచు నన్నే యజించుచు నాయెడ భక్తులై మత్పరాయణులై నన్నే పూజించుచున్నమానవులు నాలోఁ గలియుదురు. అన్నిభూతములందు నున్న సర్వేశ్వరుఁడగు నన్నుఁ జూచుచు నేవిధి యొనరించినను దోషదూరుఁడ వగుదువు. నలుగడల జంగమస్థావరరూపమగు ప్రపంచమంతయు నాయందున్నదని యెఱింగి పేరాస యభిలాష మొదలగువానిని వీడియుండుటచేఁ గృతార్థత్వము గలుగును. భక్తి మిక్కుటమైయున్నను మిక్కిలి ప్రేమగలిగి యుండుకతన మనస్సు చపలము గనుక నద్దాని బంధించి నాయందు

---

శక్తానాం కరిష్యతి. ౧౫. అహంమమేతివిఖ్యాతిర్దుర్జయం చంచలం మనః, రాగాదయస్తథా త్యక్తుం శక్యా జన్మాన్తరైర్యది. ౧౬. సోఽహమిచ్ఛామి దేవేశ త్వత్ప్రసాదాదనిర్జితైః, రాగాదిభిరమర్త్యత్వం ప్రాపుః ప్రక్షీణకల్మషాః ౧౭. ఆదిత్య ఉవాచ— యద్యేవం ముక్తికామస్త్వం గణనాథ శృణుష్వ తమ్, క్రియాయోగం సమస్తానాం క్లేశానాం హానికారకమ్. ౧౮. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః. ౧౯. మద్భావనా మద్యజనా మద్భక్తా మత్పరాయణాః, మమ పూజాకరాశ్చైవ మయి యాంతి లయం నరాః. ౨౦. సర్వభూతేషు మాం పశ్యన్సమవస్థితమీశ్వరమ్, కర్తాసి కేన చైవ త్వమేవం దోషాన్ప్రహాస్యసి. ౨౧. జంగమాజంగమే జ్ఞాతే మయ్యాసక్తే సమంతతః, రాగలోభాది నాశేన భవిత్రీ కృతకృత్యతా. ౨౨. భక్త్యాతి ప్రణయస్యాపి చంచలత్వాన్మనో యది,

లయింపఁజేసి మాటిమాటికి నారూపమును నీతనువునఁజేర్చి ధ్యానించుచుండుము. నారూపమును బంగారముతోఁగాని వెండితోఁగాని రాతితోఁగాని మృత్తికతోఁగాని కఱ్ఱతోఁగాని తయారొనరించి మూఁడుకన్నులుగలిగి త్రిలోచనుఁడ నగునన్ను వివిధములగు పూజలచేతను కానుకలచేతను బాగుగఁ బూజించి సర్వవిధముల నావిగ్రహము నాశ్రయించియున్న నాతనువును భక్తితోఁ బూజించి ధ్యానించినచో నయ్యది నీకుపకారము నొనరించును. పోవునప్పుడు నిలచియున్నపుడు నిద్రించునప్పుడు భుజించునప్పుడును ముందు వెనుకలను క్రిందుమీఁదులను ప్రక్కలయిరుప్రక్కలను దన్మయుఁడవై యాతనువునే చింతించుచుఁ బుణ్యతీర్థముల యుదకమున స్నానములచేతను మనోహరములగు పుష్పములచేతను గంధములు పూయుటచేతను వస్త్రములు నాభరణములు నొసంగుటచేతను రుచిగల భక్ష్యముల నివేదించుటచేతను నింపగు సంగీతవాద్యములచేతను మఱియు నేయే తినఁదగినవస్తువులు మొదలగునవి నీకిష్టములయియున్నవో వాని చేతను భక్తిచే వంగినవాఁడవై నాతనువును తృప్తిపరుపు మోగణాధిపా! వత్సా! గాయకుల కభిముఖముగనుండి సంగీతముచే నాకర్షింపఁబడితివేని నాయందు బుద్ధినిలిపి నాకథలు పాడుము నీమనము కథలచేఁ దృప్తినొందునేని ప్రీతితో నాస్వరూపమును దెలియఁజేయు నాకథల నాలకింపుము. ఇప్పుగిది నాయందుఁ జేర్చినచిత్తముగలవాఁడవై యితరములగు హేయములగు నిఖిల మనోవికారములను విడచి సుఖివగుము. రాగద్వేషములు నశింపకున్నను నాకుఁ బ్రియుఁడవై యుత్తమమగు

---

మయ్యావేశం దధద్భూయః కురు మద్రూపిణీం తనుమ్. ౨౩. సువర్ణరజతాద్యైర్వా త్వం శైలమృద్దారులేఖనమ్, పూజోపహారైర్వివిధైః సంపూజయ త్రిలోచనమ్. ౨౪. తస్యాశ్రితం సమావిశ్య సర్వభావేన సర్వదా, పూజితా సైవ తే భక్త్యా ధ్యాతా చైవోపకారిణీ. ౨౫. గచ్ఛంస్తిష్ఠన్స్వపన్భుంజంస్తామేవాగ్రే చ పృష్ఠతః, ఉపర్యధస్తథా పార్శ్వే చింతయంస్తన్మయశ్చ వై. ౨౬. స్నానైస్తీర్థోదకైర్హృద్యైః పుష్పైర్గంధానులేపనైః, వాసోభిర్భూషణైర్భక్ష్యైర్గీతవాద్యైర్మనోరమైః. ౨౭. యద్యద్యత్తవేష్టం వై కించిద్భోజ్యాదికం తవ, భక్తినమ్రో గణశ్రేష్ఠ ప్రీణయస్వ కృతిం మమ. ౨౮. రాగేణాకృష్యతే తాత గంధర్వాభిముఖం యది, మయి బుద్ధిం సమావేశ్య గాయేథా యాః కథా మమ. ౨౯. కథయా రమతే చేతో యది తద్భవతో మమ, శ్రోతవ్యాః ప్రీతియోగేన మత్స్వరూపోదయాః కథాః. ౩౦. ఏవం సమర్పితమనాశ్చేతసో యేఽర్థ ఆశ్రయాః, హేయాంస్తాన్నిఖిలాన్హిత్వా పరిత్యజ్య సుఖీ భవ. ౩౧. అక్షీణరాగద్వేషోఽపి

నాస్థానమును జేరఁగలవు. భయపడకుము నాయందు మనము లయింపఁ జేయుము ఓగణాధిపా! నీవు నీదగుసమస్తమును నాత్మను నాయందు నిక్షేపింపుము. ప్రయత్నమును వీడకుము. నాకై కర్మల నాచరింపుము. ధర్మవిరుద్ధముగ మాత్ర మెద్దియు నాచరింపకుము ఇప్పగిది నీవు సమస్త పాపములను బారద్రోలి పిదప బ్రహ్మచే సంసారమునుండి విడిపింపఁబడఁ గలవు. ఈయుపదేశము చేతనే క్రియాయోగమునంతను నీకుఁ దెలిపితిని. ఇమ్మహాయోగము నాశ్రయించి చిత్తము నాయధీనము గావింపుము. అన విని దిండి "యోజగన్నాథా! అమృతమున కెనయగు నీక్రియాయోగ మును నాకు హితంబుగోరుదేని దయచేసి విస్తరముగ నెఱింగింపుము. ప్రసన్నుఁడవైతేని నీవు సమస్తదుఃఖములను నశింపఁజేయుదువు గద? ఓలోకగురూ! మిగుల మరుగైనదియుఁ బవిత్రమైనదియునగు నీయర్థ మును నీవుదక్క నితరు లెవ్వరును వివరింప సమర్థులు లేరు. కావునఁ బ్రసన్నుండవై నా కీయర్థంబు భాషింపవే" యని యడుగ నాదిత్యుండు "గణనాయకా! నిస్సంశయముగ నీయర్థము పిదప నీకుఁ జెప్పఁబడఁ గలదు" అని యాదేశించి యాలోకముల వెలిఁగించుప్రోడయటఁ గనబడక పోయెను. గొప్పమహిమగల దిండియు నతివేగముగ నభోమార్గమున నేగెనఁట అని చెప్పి సుమంతుండు రాజున కిట్లనియె.

ఇది ద్విషష్టితమాధ్యాయము.

---

మత్ప్రియః పరమః పరమ్, పదమాప్స్యసి మా భైషీర్మయ్యర్పితమనా భవ. ౩౨. మయి సంన్యస్య సర్వం త్వమాత్మానం యత్నవాన్భవ, మదర్థం కురు కర్మాణి మా చ ధర్మవ్యతి క్రమమ్. ౩౩. ఏవం వ్యపోహ్య పాప్మానం త్వం బ్రహ్మణా మోక్ష్యసే భవాత్, ఏతేనైవో పదేశేన వ్యాఖ్యాతమఖిలం తవ. ౩౪. క్రియాయోగం సమాస్థాయ మదర్పితమనా భవ, ౩౫. దిండిరువాచ.—మద్ధితాయ జగన్నాథ క్రియాయోగామృతం మమ, విస్తరేణ సమాఖ్యాహి ప్రసన్నస్త్వం హి దుఃఖహా. ౩౬. త్వామృతే న హి తద్వక్తుం సమర్థోఽ న్యో జగద్గురో, గుహ్యామేతత్పవిత్రం చ తదాచక్ష్వ ప్రసీద మే. ౩౭. ఆదిత్య ఉవాచ.—ఆఖ్యాస్యతే తదఖిలం నిర్వికల్పం గణాధిప, ఇత్యుక్త్వాంతర్దధే దేవః సర్వ లోకప్రదీపకః. ౩౮. స చ దిండిర్మహాతేజా జగామాశు నభోగతిమ్. ౩౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి దిండ్యాదిత్యసంవాదవర్ణనం నామ ద్విషష్టితమోఽధ్యాయః.

## త్రిషష్టితమాధ్యాయము.

రాజా! అటువెడలి యాదిండి సూర్యునిబోలి ప్రకాశించుచు సత్యలోకమునకేగి శిరము వంచి వేలుపులపెద్దయగు నానలుమొగంబుల వేలుపును లోకనాథుని నమస్కరించి యాదరముతో నిట్లనియె. "ఓమహాత్మా! దేవదేవుఁడగు సూర్యదేవుఁడు నన్నాజ్ఞాపించెను. "అమృత తుల్యమగు క్రియాయోగమును సర్వమును నీవు చెప్పఁగలవు. నీయొద్దకుఁ బొమ్మని. కావున నోపితామహా! ఆయర్థము నెఱుంగఁగోరియే నిన్నుఁ బ్రార్థించుచున్నాను. సర్వకాలము నేపగిది నాదేవుని బ్రీతునిఁజేయఁజాలి యుందు నవ్విధి నెఱింగింపఁదగియున్నాఁడవు." అన నాతనికి బ్రహ్మ యిట్లనియె. ఓయీ! గణాధిపా! రమ్ము. నాచెంతకు రమ్ము. ఆమహాత్ముని జూచినవెనువెంటనే నీదగు బ్రహ్మహత్యాదోషము బుగ్గియైనది. ఓభూత పతీ! గొప్పతేజముగల భాస్కరదేవునకు నీవనుగ్రహింపవలసినవాఁడవై యున్నావు. అందులకుఁ గారణము నీచిత్తమాతని నారాధించుటయందుఁ గృతనిశ్చయమై యుండుటయే. భగవంతుండు నాద్యంతములు లేని వాఁడు దేవతలకెల్లఁ బ్రభువునగు నాభానుభగవాను నారాధింప నిచ్ఛ గింతువేని దీక్షయను మహాగుణమునకు నీహృదయమున నవకాశ మొసంగుము. దీక్షబూననివాఁడు భానుమూర్తిని యథార్థముగ నెఱుంగుటకుఁ గాని నుతిచేయుటకుఁగాని చూచుటకుఁగాని సమర్థుఁడు కాఁజాలఁడు. అట్టియెడ నట్టిమూఢు లాదేవు నెట్లు చేరఁగలరు? అనేకజన్మములెత్తి

---

సుమంతురువాచ:—ప్రణమ్య శిరసా దేవం సురజ్యేష్ఠం చతుర్ముఖమ్, ఉవాచ స మహాతేజా దిండిర్లోకేశమాదరాత్. ౧. దేవదేవేన భవతాదిష్టోఽస్మి చ మహాత్మనా, క్రియాయోగామృతం సర్వమాఖ్యాస్యతి భవాన్కిల. ౨. స త్వాం పృచ్ఛామ్యహం బ్రహ్మన్క్రియాయోగం నిరంతరమ్, సంతోషయితుమీశేహం యథావద్వక్తుమర్హసి. ౩. బ్రహ్మోవాచ.—ఏహ్యేహి మత్సకాశం చ మత్సమీపే గణాధిప, బ్రహ్మహత్యా ప్రణష్టా తే దర్శనాదేవ తస్య తు. ౪. అనుగ్రాహ్యోఽసి భూతేశ భాస్కరస్యామితౌజసః, ఆరాధనాయ భూతేశ యదీశే ప్రవణం మనః. ౫. యది దేవపతిం భానుమారాధయితుమిచ్ఛసి, భగవంతమనాద్యంతం భవ దీక్షాగుణాన్వితః. ౬. న హ్యదీక్షాన్వితైర్భానుర్జ్ఞాతుం స్తోతుం చ తత్వతః, ద్రష్టుం వా శక్యతే మూఢైః ప్రవేష్టుం కుత ఏవ హి. ౭. జన్మభి

యాదేవునందు మనసును లయింపఁజేసి పవిత్రులై దీక్షాగుణములతో నొప్పుచు సూర్యభక్తులై సౌరు లనఁబరఁగుదురు. పురుషున కనేకజన్మమరణ పరంపరలచే నేర్పడుసంసారమున సంపాదింపఁబడిన పాపసమూహములు క్షీణములుగాక సూర్యునందు భక్తి కలుగనేరదు. ఎవ్వాఁడు సూర్యునందు ద్వేషము మిక్కుటముగఁ గలిగియుండునో, బ్రాహ్మణులను వేదములను నిందించునో ఆమానవుఁడు పాపముచేఁ గప్పఁబడిన విత్తునుండి జనించినవాఁడని యెఱుంగునది. విష్ణుదేవుని మహామాయ యనునుదకమునఁ బడియుండు చెడునడతగల పురుషులకు నాస్తికులు వేదనిందకులు నగుపాఖండులయం దభిమానము మిక్కుటముగఁ గలుగును. మఱియు వారు ప్రత్యక్షమువలనఁ గలుగు కారణములచేఁ గంటికగపడని వస్తువు లేదను నీమొదలగువాదములందు నిపుణులై యట్టివారల కనుకూలురై యుందురు. ఎప్పుడు మనుజులకుఁ బాపములు నశించునో అప్పుడే వేదములందును బ్రాహ్మణులందును దేవతలకెల్ల దేవుఁడు ప్రభువునగు రవియందును నచ్చపుబత్తి యేర్పడును. చక్కనిశ్రద్ధ గలుగును. మనుష్యులకుఁ బాపసంఘములు కించిన్మాత్రావశిష్టములై యంతరింప నావెన్క దీక్షాగుణము లొక్కొక్కటిగ నన్నియుఁ గలుగును. ఇందు సంశయములేదు. పాపములకెల్ల దుర్గమగు నీసంసారమున దరిగానక యిటునటు భ్రమించుచున్నమనుష్యులకు భక్తికిమెచ్చిన భానుమూర్తి యొక్కఁడే చేయూతయొసఁగి రక్షింపఁగలవాఁడు. కావున నీచెప్పినచొప్పున నీవు సర్వవిధముల నాతనియందు భక్తిగలిగి సమస్తపాపముల నంతమొందించురవి నిచ్చట

---

ర్బహుభిః పూతా నరాస్తద్గతచేతసః, భవంతి భగవన్సౌరాస్తదా దీక్షాగుణాన్వితాః. ౮. అనేకజన్మసంసారచితే పాపసముచ్చయే, నాక్షీణే జాయతే పుంసాం మార్తండాభిముఖీ మతిః. ౯. ప్రద్వేషం యాతి మార్తండే ద్విజాన్వేదాంశ్చ నిందతి, యో నరస్తం విజానీయాత్పాపబీజసముద్భవమ్. ౧౦. పాఖండేషు రతిః పుంసాం హేతువాదానుకూలతా, జాయతే విష్ణుమాయామ్భః పతితానాం దురాత్మనామ్. ౧౧. యదా పాపక్షయః పుంసాం తదా వేదద్విజాదిషు, రవౌ చ దేవదేవేశే శ్రద్ధా భవతి నిశ్చలా. ౧౨. యదా స్వల్పావశేషస్తు నరాణాం పాపసంచయః, తదా దీక్షాగుణాన్సర్వే భజంతే నాత్ర సంశయః. ౧౩. భ్రమతామత్ర సంసారే నరాణాం పాపదుర్గమే, హస్తావలంబదో హ్యేకో భక్తిప్రీతో దివాకరః. ౧౪. సర్వభాగవతో భూత్వా సర్వపాపహరం

నారాధింపుము. ఆదేవుఁడు భక్తికిఁ బ్రసన్నుఁడు కాఁగలఁడు. అనఁగా విని దిండి "యోకమలసంభవా! ఎటువంటిమనుష్యులు దీక్షవహింపఁదగి యున్నారు? అటులు దీక్షగైకొనిన మానవు లేయేకార్యములు చేయ వలయును? అవియెల్ల సవిస్తరముగ నా కెఱుఁగఁజేయవే"యని యడుగఁ బితామహుం డాతని కిట్లనియె. గణనాథా! ఎవ్వాఁడే ప్రాణికిని మన స్సుచేఁగాని మాటచేఁగాని శరీరచేష్టచేఁగాని బాధగలిగింపక స్వభావము చేతనే సూర్యునందు భక్తుఁడై యుండునో ఆతనిదీక్ష గుణముగలది యగును. ఎవ్వాఁ డెల్లప్పుడును దేవబ్రాహ్మణులకు మ్రొక్కులిడుచుఁ దగవులవేళఁగూడ ద్రోహముచేయకుండునో యాతఁడు మార్తండుని బూజింపఁదగినవాఁడు. మఱియు నేమానవుఁడు సూర్యుని సమస్తదేవతా మయునిగను సర్వలోకములను సూర్యమండలముగను దెలిసికొను చున్నాఁడో తనను గూడ వారికంటె వేఱుగ భావింపఁడో యాతఁడు సౌరుఁ డనఁబడును. యతీశ్వరులందును దేవతను మనుష్యుని నితరుని గాని పశువులను పక్షులను చీమలనుగాని వృక్షములను రాలను కట్టె లను భూమ్యాకాశములను నీటిని దిక్కులనుగాని తనను గాని దేవ నాథుఁడగు దివాకరునికన్న వేఱుగా నెవ్వరెఱుంగరో వారలే దీక్షా గుణములు గలిగియుందురు. ఎవ్వాఁడు కరణత్రయముచే నిఖిలభూతము లందుఁ బాపబుద్ధిని జేయఁడో యాతఁడే దీక్షాగ్రహణమునకుఁ దగి యున్నాఁడు. బాగుగ శరీరము నెండించి యింద్రియముల బంధించి

---

రవిమ్, ఆరాధయేహ తం భక్త్యా ప్రీతిమేష్యతి భాస్కరః. ౧౫. దిండిరువాచ.—కిం లక్షణా నరా దీక్షామర్హంతి పద్మసంభవ, యచ్చ దీక్షాన్వితైః కార్యం తన్మే కథయ పద్మజ. ౧౬. బ్రహ్మోవాచ.—కర్మణా మనసా వాచా ప్రాణినాం యో న హింసకః, భావభక్తశ్చ మార్తండే తస్య దీక్షా గుణాన్వితా. ౧౭. బ్రాహ్మణాంశ్చైవ దేవాంశ్చ నిత్యమేవ నమస్యతి, న చ ద్రోగ్ధా పరం వాదే స మార్తండం సమర్చతి. ౧౮. సర్వా న్దేవాన్రవిం వేత్తి సర్వలోకాంశ్చ భాస్కరమ్, తేభ్యశ్చ నాన్యమాత్మానం స నరః సౌరతాం వ్రజేత్. ౧౯. దేవం మనుష్యమన్యం వా పశుపక్షిపిపీలికాన్, తరుపాషాణ కాష్ఠాని భూమ్యంభో గగనం దిశః. ౨౦. ఆత్మానం చాపి దేవేశాద్వ్యతిరిక్తం దివా కరాత్, యో న జానాతి యతిషు స వై దీక్షాగుణాన్వ్రజేత్. ౨౧. భావం న కురుతే యస్తు సర్వభూతేషు పాపకమ్, కర్మణా మనసా వాచా స తు దీక్షాం సమర్హతి. ౨౨.

యిటనొనరించిన తపముచేగాని మితిలేని దక్షిణలతో నొనరించిన యజ్ఞములచేగాని మానవులు సూర్యభక్తులుపొందు నుత్తమగతి నొందఁజాలరు. ఓగణేశా! యేమానవుఁడు సర్వావయవములచేతను సర్వవిధములను సూర్యునందు భక్తితో మనస్సు నర్పించునో యాతఁడే సంపాదింపఁబడిన ఫలముగలవాఁడై యుండుకతనఁ గొనియాడఁదగి సౌరనామమును గాంచుచున్నాఁడు. ఎవ్వానిచే భగవంతుఁడగు భానుఁడు భక్తిభావముతో నుపాసింపఁబడునో అట్టిధన్యాత్ముఁడు కులము వెలిఁగించువాఁడు మనకులమునఁ బుట్టునా? అని యెల్లరకుఁ గోరఁదగియున్నాఁడు సూర్యునకు హృదయము తృప్తినొందునట్లు దేవతార్చన మొనరించువాఁడు పాపములఁ గడిగికొని సూర్యలోకమును బొందుచున్నాఁడు. భానునకు భక్తితో స్థిరమగుదేవాలయమును గట్టించువాఁడు తనవంశమున నేడు తరములవారిని సూర్యలోకమునకుఁ గొంపోవుచున్నాఁడు. సూర్యమందిరమునం దెన్ని యేండ్లు దేవతార్చనము నిలచునో అన్ని వేలేండ్లు సూర్యలోకమునఁ బూజలు గొనుచున్నాఁడు. ఎవనిగృహమున దేవపూజ శాస్త్రోక్తలక్షణములు గలదై యుండునో యెల్లప్పుడు వేదపాఠము జరుగుచుండునో యెవనిచిత్తము కోరిక లుడిగియుండునో యాతఁడు నాశరహితుఁడగు సూర్యునితో సముఁడగుచున్నాఁడు (సారూప్యము నొందుచున్నాఁడు). ఏపురుషుఁడు నిర్మలచిత్తుఁడై యెల్లప్పుడును వేయికిరణముల వేలుపున కందమై వాసనగలపుష్పములచేఁ బూజలుసలుపునో యెవ్వాఁడు పలువిధములగు నాయాధూపముల నొసంగి పరిమళముగల మైపూత

---

సత్త్రేనేహ తపసా యజ్ఞైర్వా బహుదక్షిణైః, తాం గతిం న నరా యాంతియాం గతాః సూర్యమాశ్రితాః. ౧౩. యేన సర్వాత్మనా భానౌ భక్త్యా భావో నివేశితః, గణేశ్వర కృతార్థత్వాచ్ఛ్లాఘ్యః సౌరః స మానవః. ౧౪. అపి నః స కులే ధన్యో జాయతే కులపావనః, భగవాన్భక్తిభావేన యేన భానురుపాసితః. ౧౫. యః కారయతి దేవార్చాం హృదయాలంబనం రవేః, స నరో భానుసాలోక్యమాప్నోతి ధుతకల్మషః. ౧౬. యస్తు దేవాలయం భానోర్భక్త్యా కారయతి ధ్రువమ్, స సప్త పురుషాల్లోకం భానోర్నయతి మానవః. ౧౭. యావంత్యబ్దాని దేవార్చా రవేస్తిష్ఠతి మందిరే, తావద్వర్షసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౧౮. దేవార్చా లక్షణోపేతా తద్గృహే సంతతో విధిః, నిష్కామం చ మనో యస్య స యాత్యక్షరసామ్యతామ్. ౧౯. పుష్పాణి చ సుగంధీని

యొసంగునో యాతఁడు నిచ్చలును సూర్యారాధనమను యజ్ఞము చేయును. యజ్ఞేశ్వరుఁడును సర్వమును బోషించువాఁడునగు నా భగవంతుఁ డెల్లప్పుడు క్రతువులచే యజింపఁబడుచున్నాఁడు. ఓదిండీ! వేదోక్తములగు జ్యోతిష్టోమాదియజ్ఞములు చాల సాధనములు కలవగుటను ననేకద్రవ్యసమూహములచే విస్తారమయియుండుటచేతను గొంచెముగఁ గూడఁబెట్టిన ద్రవ్యముగల మనుష్యులచే నొనరింపరానివై యున్నవి. సూర్యునకు భక్తితో గడ్డిపోఁచలతోనైనను పూజలు సలిపినచో నయ్యది యక్షయమై సమస్తయజ్ఞములచేఁగూడఁ బొంద నలవిగాని యుత్తమఫలము నిచ్చుచున్నది. ఓదిండీ! ఏపుష్పములు మనోహరములో యేచందనము మైపూతప్రియమైనదో యేయాభరణ మిష్టమైనదో యేవస్త్రము లా దేవునకుఁ బ్రీతిజనకములో యేతినుబండములును పండ్లును తినఁదగియున్నవో వానినన్నింటిని సూర్యునందు మనసు నిలిపి యాతనికొసంగుము. శక్తికివంచనముచేయక సర్వభూతములకును మొదటివాఁడును సకలభువనములకు నాధారమై యుండువాఁడునగు నాదిత్యుఁడనుగ్రహించున ట్లాచరింపుము. అదేవు నారాధించిన మానవుఁడు నిక్కముగ నాతనియందే లీనుఁడగుచున్నాఁడు. పుష్పములచేతను పుణ్యతీర్థములయుదకముచేతను గంధములచేతను తేనెచేతను నేతితోడను పాలచేతను గ్రహాధిపతియు లోకనాథుఁడును గగనమార్గసంచారము చేయువాఁడును నగుభానుని స్నానము చేయింపవలెను. ఇట్టు లొనరించినమాన

---

మనోజ్ఞాని చ యః పుమాన్, ప్రయచ్ఛతి సహస్రాంశోః సదా ప్రయతమానసః. ౩౦. ధూపాంశ్చ తాంస్తాన్వివిధాన్గన్ధాఢ్యం చానులేపనమ్, నరః సోఽనుదినం యజ్ఞం కరోత్యారాధనం రవేః. ౩౧. యజ్ఞేశో భగవాన్సూపా సదా క్రతుభిరిజ్యతే, బహూపకరణా యజ్ఞా నానాసంభారవిస్తరాః. ౩౨. న తే దిండిన్నవాప్యంతే మనుష్యైరల్పసంచయైః, భక్త్యా తు పురుషైః పూజా కృతా దూర్వాంకురైరపి, భానోర్దదాతి హి ఫలం సర్వయజ్ఞైః సుదుర్లభమ్. ౩౩. యాని పుష్పాణి హృద్యాని ధూపగంధానులేపనమ్, దయితం భూషణం యచ్చ ప్రీతయే చైవ వాససీ. ౩౪. యాని చాభ్యవహార్యాణి భక్ష్యాణి చ ఫలాని వై, ప్రయచ్ఛ తాని మార్తండే భవేథాశ్చైవ తన్మనాః. ౩౫. ఆద్యం తం భువనాధారం యథాశక్త్యా ప్రసాదయ, ఆరాధ్య యాతి తం దేవం తస్మిన్నేవ నరో లయమ్. ౩౬. పుష్పైస్తీర్థోదకైర్గంధైర్మధునా సర్పిషా తథా, క్షీరేణ

వుఁడు పుణ్యములగు పెరుగు పాలకొలనులు పొంది యావెనుక దేనె లోలుకు లోకముల బొందఁగలఁడు. అసమానమైన సంతోషమును బొందుచున్నాఁడు. స్తోత్రములచేతను సంగీతములచేతను వాద్యముల చేతను బ్రాహ్మణభోజనములచేతను మనస్సు నితరవ్యాపారములఁ జొర నీక యాతనియందే జేర్చియుంచి యాదివాకరు నారాధించుచుండుము. ఆజగన్నాథు నారాధించి యాతని యనుగ్రహముచేతనే యేను ప్రపంచ సృష్టి నారంభించితిని. ఆదివాకరు నారాధించియే విష్ణుదేవుఁడు లోకములఁ బాలించుచున్నాఁడు. రుద్రుఁడు నాతనియనుగ్రహముననే సర్వమంగళ ములు జేకూర్చు భవానీదేవిని జేపట్టెను. ఆదివాకరు నారాధించియే మహర్షులు ప్రకాశించుచున్నారు నీవు నాతని నారాధింపఁ గోరుదేని పైఁజెప్పనవిధానములచేత నుపవాసములచేతను నొక్కయేఁ డాతని బూజించి తృప్తిపరుపుము. అంత నాతఁడు సంతోషించి బ్రహ్మజ్ఞానము నొసంగి సంసారసంబంధ మెడఁబాపి ద్వంద్వము నడఁగించును. అని వచింప నాపితామహునకు దిండి యిట్లనియె.

ఇది త్రిషష్టితమాధ్యాయము.

---

స్నాపయేద్భానుం గ్రహేశం గోపతిం ఖగమ్. ౩౭. దధిక్షీరహ్రదాన్పుణ్యాంస్తతో లోకాన్మధుచ్యుతః, ప్రయాస్యతి గణశ్రేష్ఠ నిర్వృతిం చ విలక్షణామ్. ౩౮. స్తోత్రై ర్గీతైస్తథా వాద్యైర్బ్రాహ్మణానాం చ తర్పణైః, మనసశ్చైవ యోగేన ఆరాధయ దివాకరమ్. ౩౯. ఆరాధ్య తం జగన్నాథం మయా సర్గః ప్రవర్తితః, విష్ణుశ్చ పాలయే ల్లోకాంస్తమారాధ్య దివాకరమ్. ౪౦. రుద్రశ్చ ప్రాప్తవాన్దేవీం భవానీం తత్ప్రసాదతః, దీప్యంతే ఋషయశ్చాపి తమారాధ్య దివాకరమ్. ౪౧. స త్వమేభిః ప్రకారైస్త ముపవాసైశ్చ భాస్కరమ్, తోషయాబ్దం హి తుష్టోఽసౌ భానుర్ద్వంద్వ ప్రశాంతిదః. ౪౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే బ్రహ్మదిండిసంవాదే ఆదిత్యక్రియాయోగవర్ణనం నామ త్రిషష్టితమోఽధ్యాయః.

## చతుష్షష్టితమాధ్యాయము.

ఓసురజ్యేష్ఠా! యేవిధినుపవాసములచేభాస్కరుఁడుసంతుష్టుఁడగునో, ఉపవాసములు చేయువా రేయేవస్తువులను బరిత్యజింపవలయునో, మానవులచే సూర్యారాధనమున నేయేకార్యము చేయవలయునో, అదియంతయు నున్నదున్నట్లు విస్తరముగ నెఱుంగఁజేయఁదగుదువు. కాన నానతిమ్మన నాతనికిఁ బితామహుఁడు సాదరమతితో నిట్లనియె. సమస్తములగు నైహికభోగము లనుభవించువారైనను ధ్యానించి ధూపములతోడను బుష్పములతోడ నన్నములచేతను బూజించినచో నాదిత్యుఁ డట్టివారికిఁ గూడ నుపకారము చేయఁజాలియున్నాఁడు. అట్టియెడ నుపవాసవ్రతములతో నారాధించువారివిషయము వేరచెప్పవలఁయునా? ఉపవాసమనఁగాఁ బాపములనుండి మరలి గుణములతోఁ గూడియుండుట ఐహికభోగముల విసర్జించుటయు నని యెఱుంగుము. ఏమానవుఁ డొక్కరాత్రిగాని రెండు రాత్రులుగాని మూఁడురాత్రులుగాని యేకభుక్తముచేఁగాని యుపవసించి భక్తితో సూర్యుని ధ్యానించునో ఆతని నామములు జపించుచు నాతని పనులం దభిలాషగలిగి యాతనియందు మనస్సునిలిపి కోర్కులు విడనాడియుండునో యాతఁడు పరబ్రహ్మము నొందును. మఱియు నేకోర్కి దలఁచి భాస్కరునందు మనసు నిలిపి యుపవసించునో యాకోర్కినంతను సూర్యదేవుఁ డనుగ్రహింపఁ బడయుచున్నాఁడు. నావిని దిండి యాతని కిట్లనియె. "పద్మసంభవా! సంసారమను బురదగుంటలోఁబడియున్న బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులును స్త్రీలు నెవ్విధి మంచిగతి గాంచఁ

---

దిండిరువాచ:—ఉపవాసైః సురశ్రేష్ఠ కథం తుష్యతి భాస్కరః, పరిహారాంస్తథాచక్ష్వ యే త్యాజ్యాశ్చోపవాసిభిః. ౧. యద్యత్కార్యం యథా చైవ భాస్కరారాధనే నరైః, తత్సర్వం విస్తరాద్బ్రహ్మన్యథావద్వక్తుమర్హసి. ౨. బ్రహ్మోవాచ.—స్మృతః సంపూజితో ధూపపుష్పాన్నైర్భానురాదరాత్, భోగినాముపకారాయ కిం పునశ్చోపవాసినామ్. ౩. ఉపావృత్తస్య పాపేభ్యో యస్తు వాసో గుణైః సహ, ఉపవాసః స విజ్ఞేయః సర్వభోగవివర్జితః. ౪. ఏకరాత్రం ద్విరాత్రం వా త్రిరాత్రం నక్తమేవ చ, ఉపవాసీ రవిం యస్తు భక్త్యా ధ్యాయతి మానవః. ౫. తన్నామజాపీ తత్కర్మరతస్తద్గతమానసః, నిష్కామః పురుషో దిండే స బ్రహ్మ పరమాప్నుయాత్. ౬. యం చ కామమభిధ్యాయ భాస్కరార్పితమానసః, ఉపోషతి తమాప్నోతి ప్రసన్నే ఖగమేఽఖిలమ్. ౭. దిండిరువాచ.—బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైః శూద్రైః స్త్రీభిశ్చ

గల్గుదురో యెఱింగింపవే మహాత్మా!" నావుడు బ్రహ్మ యాతని కిట్లనియె. దిండీ! సమస్తతేజస్సుల కధిపతియై చీఁకటులకు విరోధియగు నాజగన్నాథుని గపట మెఱుంగనిచిత్తముతో నారాధింపక యెవ్వఁడు సద్గతి నొందఁగలఁడు. ఎవనిమనస్సు సూర్యుని దలఁపక బాహ్యవిషయములు గ్రహించునదగునో అట్టివాఁడు పాపమను బురదచే నొడలంతయు నలంది యుండుటచే నెట్లు సద్గతి గాంచఁగల్గుచున్నాఁడు? నీవు సంసారదుఃఖముచే వ్యథజెంది సద్గతి గాంచఁజూతువేని వెంటనే సర్వేశ్వరుఁడు నిఖిలతేజస్సులకుఁ బ్రభువునగు భాస్కరుని వాసనగలిగి మనోహరములగు పుష్పములచేతను గంధము నగురు మున్నగు ధూపములచేతను వస్త్రాభరణాదులచేత నుపవాసముల నాసక్తిగలవాఁడవై యారాధింపుము. సంసారక్లేశమును భజింపఁజాలక సద్గతిఁ బడయఁగోరుదేని భక్తితో నిండియున్నచిత్తముతో వెంటనే మార్తండు నారాధింపుము. నీకుఁ బుష్పములు దొరకకున్న మంచిచెట్లచిగురాకులచేఁగాని యవియు లేనప్పుడు గఱికపోచలతోనైన నాతని నర్చింపుము. పూవు లాకులు నీరు ధూపములతోఁ దన యైశ్వర్యమునకుఁ దగినరీతి నిశ్చలమగుభక్తితోఁ బూజించిన నా దేవుఁడు మిగులఁ బ్రీతిఁజెందును. ఎల్లప్పుడు సూర్యదేవాలయమందు సమ్మార్జన మొనరించువాఁడు పాపములెల్లఁబాసి యుత్తమపదమున కేఁగుచున్నాఁడు. సూర్యునాలయమున నెన్నిపాంసుకణములు నిత్యమును దుడుపఁబడు

---

కంజజ, సంసారగర్తే పంకస్థే సుగతిః ప్రాప్యతే కథమ్. ౮. బ్రహ్మోవాచ.—అనారాధ్య జగన్నాథం గోపతిం ధ్వాన్తనాశనమ్, నిర్వ్యలీకేన చిత్తేన కః ప్రయాస్యతి సద్గతిమ్. ౯. విషయగ్రాహి వై యస్య న చిత్తం భాస్కరార్పితమ్, స కథం పాపపంకాక్తో నరో యాస్యతి సద్గతిమ్. ౧౦. యది సంసారదుఃఖార్తః సుగతిం గంతుమిచ్ఛసి, తదారాధయ సర్వేశం భాస్కరం జ్యోతిషాం పతిమ్. ౧౧. పుష్పైః సుగంధైర్హృద్యైశ్చ ధూపైః సాగరుచందనైః, వాసోభిర్భూషణైర్భక్త్యైరుపవాసపరాయణః. ౧౨. యది సంసారనిర్వేదాదభివాంఛసి సద్గతిమ్, తదారాధయ మార్తండం భక్తిప్రవణచేతసా. ౧౩. పుష్పాణి యది తే న స్యుః శస్తపాదపపల్లవైః, దూర్వాంకురైరపి డిండే తదభావేఽర్చయార్యమమ్. ౧౪. పుష్పపత్రాంబుభిర్ధూపైర్యథావిభవమాత్మనః, పూజితస్తుష్టిమతులాం భక్త్యా యాత్యేకచేతసా. ౧౫. యః సదా[illegible]నే భానోః కురుతే మార్జనక్రియామ్, స యాత్యుత్తమకే స్థానే సర్వపాపం వ్యపోహతి. ౧౬. యావత్యః పాంసుకణికా మార్జ్యన్తే భాస్కరాలయే, దినాని దివి తావంతి తిష్ఠత్య[illegible]మో నరః. ౧౭. అహన్యా

చున్నవో అన్నిదినములు సూర్యున కెనయై స్వర్గలోకమున వసించుచున్నాఁడు. గణేశా! ప్రతిదినము నేపాపము నెంతగ నార్జించుచున్నాఁడో దానినంతను సూర్యునాలయమున నావుతోలుపఱచిన యంతమేర నూడ్చి పోఁగొట్టుకొనుచున్నాఁడు. సూర్యునాలయమును గోమయముతో నలికి శుద్ధముచేయువాఁడును స్వర్గలోకమును బొంది సూర్యునితోఁ గూడి సంతసించుచున్నాఁడు. మంటిచేఁగాని కొండలలోని ధాతువికారములచేఁగాని రంగులతోఁగాని గోమయముతోఁగాని యలికి శుభ్రముచేయువాఁడు విమానము నెక్కి నాదులోకమును బొందుచున్నాఁడు. నీరుచల్లువాఁడు వరుణలోకమున కేగుచున్నాఁడు. అలికి శుద్ధముచేసిన సూర్యునాలయమున వాసనపువ్వులను మిక్కుటముగ వెదజల్లినవాఁడు దుర్గతి నెన్నఁడేనియుఁబొందఁడు. దీపారాధన మొనర్చువాఁడు మిక్కుటమగు వెలుఁగు గలిగి యన్నిఋతువులందును సుఖములఁగూర్చువిమానము నొందుచున్నాఁడు. ఒక్కయేడాది నూవులతో నిండినపాత్రమును దానమొసంగువాఁడును ధ్వజపటము గట్టువాఁడు నీలోకమున సమస్తఫలములుబొందును. వీవనగొని వీచువాఁడు తెలియకచేసినపాపములఁ గడుగుకొనుచున్నాఁడు పాపములుచేసినవాఁడు రాత్రింబవళ్లు సూర్యునాలయమునఁ జీఁకట్లుగొంగయగు సూర్యుని గీతవాద్యాదులతో సేవించెనేని యాతఁడు విమానము నెక్కి నృత్యగీతములచే గంధర్వులు గొల్వ వెలుఁ

---

హాని యత్పాపం కురుతే గణనాయక, గోచర్మమాత్రం సంమార్జ్య. హంతి తద్భాస్కరాలయే. ౧౮. యశ్చానులేపనం కుర్యాద్భానోరాయతనే నరః, సోఽపి లోకం సమాసాద్య హంసేన సహ మోదతే. ౧౯. మృదా ధాతువికారైర్వా వర్ణకైర్గోమయేన వా, ఉపలేపనకృద్యాతి మత్పురం యానమాస్థితః. ౨౦. ఉదకాభ్యుక్షణం భానోర్యః కరోతి సదా గృహే, సోఽపి గచ్ఛతి యత్రాస్తే భగవాన్యాదసాం పతిః. ౨౧. పుష్పప్రకరమత్యర్థం సుగంధం భాస్కరాలయే, అనులిప్తే నరో దత్వా న దుర్గతిమవాప్నుయాత్. ౨౨. విమానమతిశోభాఢ్యం సర్వర్తుసుఖభూషితమ్, సమాప్నోతి నరో దత్వా దీపకం భాస్కరాలయే. ౨౩. యస్తు సంవత్సరం పూర్ణం తిలపాత్రప్రదో నరః, ధ్వజం చ భాస్కరే దద్యాత్సమమత్ర ఫలం లభేత్. ౨౪. విధూతో హంతి వాతేన దాతురజ్ఞానతః కృతమ్, పాపం కర్తుర్గృహే భానోర్దివా రాత్రౌ నరాధిప. ౨౫. గీతవాద్యాదిభిర్భానుం య ఉపాస్తే తమోపహమ్, గంధర్వైర్నృత్యగీతైః స విమానస్థో

గొందుచున్నాఁడు. పురాణము చదువువాఁడు వెనుకజన్మమున తాను ఏజాతిలోఁ బుట్టినదియు నెంత తెలివి గలిగియున్నదియుఁ దెలిసికొను చున్నాఁడు. అవసానకాలమున జ్ఞానమును పొందుచున్నాఁడు. ఇట్టులే భక్తితో సూర్యు నారాధించువాఁడు కొనియాడఁదగిన యేయేకోరికను మనస్సునఁ గోరుచున్నాఁడో దానినెల్లఁ బొందుచున్నాఁడు. కొందఱు జనులు దేవత్వమును మఱికొందఱు గంధర్వత్వమును నింకఁ గొందఱు విద్యాధరత్వమును గోరుచున్నారు. వీరందఱు నాదివాకరు నారాధించి యాయాఫలములఁ గాంచుచున్నారు ఇంద్రుఁడు నూఱుజన్మముల నావెలుఁగులతేని నారాధించి దేవేంద్రపదమును బొందియున్నాఁడు. కాన నంతకన్న నొరుఁడెందును బూజింపఁదగువాఁడు లేఁడు. బ్రహ్మచారులకు గృహస్థులకు వానప్రస్థులకును వెలఁదులకును దివాకరునివిడచి యొరుఁ డారాధింపఁ దగఁడు. జితేంద్రియులు మహాత్ములునగు సన్న్యాసులలోఁగూడ వేయికిరణములుగల సూర్యుని బూజించినవారే మోక్ష ద్వారమునఁ బ్రవేశించుచున్నారు.ఇట్టులే సమస్తాశ్రమములకును సహస్ర కిరణుఁడే చేరఁదగినస్థానము. సర్వవర్ణములవారికిని గ్రహనాథుఁడే యుత్తమగతి. ఇఁకమీఁదఁ గామ్యములగు నితరోపవాసవ్రతములఁ దెలుపుదును వినుము. డిండీ! గొప్పపుణ్యఫలములుగలిగి సమస్తపాతకములు హరించి మంగళములఁగూర్చు నీసప్తమియను నుత్తమతిథిని భాస్కరా

---

నిషేవ్యతే. ౨౬. జాతిస్మరత్వం మేధాం చ తథైవోపరమే స్మృతిమ్, ప్రాప్నోతి గణశార్దూల కృత్వా పుస్తకవాచనమ్. ౨౭. ఏవం ఖగేశ్వరో భక్త్యా యేన భానురుపాసితః, స ప్రాప్నోతి గతిం శ్లాఘ్యాం యాం యామిచ్ఛతి చేతసా. ౨౮. దేవత్వం మనుజైః కైశ్చిద్గంధర్వత్వం తథా పరైః, విద్యాధరత్వమపరైః సంరాధ్యేహ దివాకరమ్. ౨౯. శక్రః క్రతుశతేనేశమారాధ్య జ్యోతిషాం పతిమ్, దేవేంద్రత్వం గతస్తస్మాన్నాన్యః పూజ్యతమః క్వచిత్. ౩౦. బ్రహ్మచారిగృహస్థానాం వనస్థానాం గణాధిప, నాన్యః పూజ్యస్తథా స్త్రీణామృతే దేవం దివాకరమ్. ౩౧. మధ్యే పరివ్రాజకానాం సహస్రాంశుం మహాత్మనామ్, మోక్షద్వారం విశంతీహ తం రవిం విజితాత్మనామ్. ౩౨. ఏవం సర్వాశ్రమాణాం హి సహస్రాంశుః పరాయణమ్, సర్వేషాం చైవ వర్ణానాం గ్రహేశో వై గతిః పరా. ౩౩. శృణుష్వ గదతః కామ్యానుపవాసాంస్తథాపరాన్, శృణు దిండే మహాపుణ్యఫలకాం సప్తమీం పరామ్. ౩౪. ఆదిత్యారాధనార్థైనాం సర్వపాపహరాం

రాధనమునకై ముఖ్యమునుగా నెఱుంగుము. సావధానముగ వినుము. ఇందు భక్తిగలిగి యుపోష్యముచేసినవాఁడు సమస్తపాతకములనుండి ముక్తుఁడగుచున్నాఁడు. మహాతేజస్సంపన్నుఁడగు నాదిత్యునిలోకమును బొందుచున్నాఁడు. భాద్రపదమాసమున శుక్లపక్షంబు జనుదేర నందు వచ్చుసప్తమీతిథిని మొదట నుపవసింపవలయును. వత్సా! దానివిధాన మెఱింగింతు నవధరింపుము. చవితినాఁడు యాచింపక లభించినదానిని భుజింపవలెను. పంచమినాఁ డేకభుక్తము చేయవలయును షష్ఠినాఁడు కోపమును విడచి జితేంద్రియుఁడై యుపవాసపరుఁడై యుండవలయును. ఆనాఁడు సూర్యునకు గంధధూపములతో నర్చనలిచ్చి నైవేద్యము లొసంగి యారేయి మనసున సమస్తప్రాణులకు నార్తిని దొలఁగించు నాదిత్యుని బాగుగఁ దలఁచుచు నాదేవునెదుటఁ గటికినేలపైఁ బరుండవలయును. సమస్తదోషములును సర్వపాపములును పోవుటకై యాదేవునెదలోఁ దలఁచుకొనుచుండవలయును. మరునాఁడు వేగ నిద్రలేచి కృత్యములు దీర్చి సప్తమిని బ్రాహ్మణులకు భోజనములిడి సూర్యునకుఁ బుష్పములను మైఁపూఁతలను ధూపములను బూజలుసలిపి పండ్లు నివేదింపవలయునని పెద్దలు చెప్పుచున్నారు. అందు ఖర్జూరఫలములును కొబ్బరికాయలును మామిడిపండ్లును మాతులింగఫలములు నుత్తమములుగాన వీనినే నివేదింపవలయునని చెప్పుచున్నారు. ఈపండ్లనే బ్రాహ్మణభోజనమునకై యొసంగి తానును దృప్తిగా భుజింపవలయును. ఇయ్యవి లభింపకున్న

---

శివామ్, యాముపోష్య నరో భక్త్యా ముచ్యతే సర్వపాతకైః. ౩౫. తథా లోకమవాప్నోతి సూర్యస్యామితతేజసః, అథ భాద్రపదే మాసి శుక్లపక్షే సమాగతే. ౩౬. సోపోష్యా ప్రథమం తాత విధానం శృణు తత్ర వై, అయాచితం చతుర్థ్యాం తు పంచమ్యామేకభోజనమ్. ౩౭. ఉపవాసపరః షష్ఠ్యాం జితక్రోధో జితేంద్రియః, అర్చయిత్వా దినకరం గంధధూపనివేదనైః. ౩౮. పురతః స్థండిలే రాత్రౌ స్వప్యాద్దేవస్య పుత్రక, ప్రధ్యాయన్మనసా దేవం సర్వభూతార్తినాశనమ్. ౩౯. సర్వదోషప్రశమనం సర్వపాతకనాశనమ్, విబుద్ధస్త్వథ సప్తమ్యాం కుర్యాద్బ్రాహ్మణభోజనమ్. ౪౦. పూజయిత్వా దినకరం పుష్పధూపవిలేపనైః, నైవేద్యం తాత దేవస్య ఫలాని కథయంతి హి. ౪౧. ఖర్జూరనాలికేరాణి తథా చామ్రఫలాని తు, మాతులింగఫలాన్యేవ కథితాని మనీషిభిః. ౪౨. ఏతైశ్చ భోజయేద్విప్రాన్నాత్మనా చ ప్రభక్షయేత్, తథైషాం చాప్య

నితరవస్తువుల నివేదింపవలెను. వానిని వినుము. శాలిధాన్యమును గోధూమములను పిండిచేసి బెల్లమునందుఁగలిపి నేతితో వండి నాలుగు యావకములు కలిపి సూర్యునకు నివేదింపవలయును. తరువాత నగ్ని కార్యము ముగించి వెనుక నుగ్గడించి బ్రాహ్మణభోజన మిప్పుడు చేయ వలయును. ఇప్పగిదిఁ బండ్రెండు నెల లీయుత్తమవ్రతముఁ జేయవలయును. ప్రతిమాసమునను ఫలము లాహారముచేయుచు వానినే దానము చేయుచు వానితోఁ బూజలుసలుపుచు నుండవలయును. తరువాత సంవ త్సరము పూర్తియైనప్పుడు శక్తికొలఁది బ్రాహ్మణభోజనములు చేయవల యును. స్నానమునకుఁ బ్రాశనమునకుఁగూడ వలయువిధానము వివరింతు నో సువ్రతా! వినుము. ఆవుపాలు, పెరుఁగు, నెయ్యి, పంచితము, దర్భ కొనలనీరు, నువ్వులయు నావగింజలయుఁ జూర్ణము, తెల్లమన్ను, పచ్చిక రసమును చేర్చిననెయ్యి, ఆవుకొమ్ములుగడిగిననీరు, జాతిపుష్పముల పొదల లోనినిర్యాసమున్ను స్నానమునకు శ్రేష్ఠములైనవి. ప్రాశనమునకుఁగూడ నివియే శ్రేష్ఠములు. అన్ని పాపములు నశింపఁజేయును. ఈద్రవ్యములను భాద్రపదమాసమును తొలిగాఁజేసి వఱుసగ నొక్కొక్కనెల కొక్క ద్రవ్యముగఁ బండ్రెండునెలలు స్నానప్రాశనముల కుపయోగింపవలయును. ఇప్పగిది సంవత్సరాంతంబువఱకు నిర్వర్తించి వర్షావసానమున బ్రాహ్మణో త్తములకు దివ్యభోగసమన్వితముగఁ గుడువంబెట్టి శక్తికొలఁది బంగారు

---

భావేన శృణు చాన్యాని సువ్రత. ౪౩. శాలిగోధూమపిష్టాని కారయేద్గణనాయక, గుడగర్భకృతానీహ ఘృతపాకేన పాచయేత్. ౪౪. చాతుర్యావకమిశ్రాణి ఆదిత్యాయ నివేదయేత్, అగ్నికార్యమథో కృత్వా బ్రాహ్మణాన్భోజయేత్తతః. ౪౫. ఇత్థం ద్వాదశ వై మాసాన్కార్యం వ్రతమనుత్తమమ్, మాసి మాసి ఫలాహారః ఫలదాయీ ఫలార్చనః. ౪౬. వర్షాంతే త్వథ కుర్వీత శక్త్యా బ్రాహ్మణభోజనమ్, స్నానప్రాశనయోశ్చాపి విధానం శృణు సువ్రత. ౪౭. గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్, తిలసర్షపయోః కల్కం శ్వేతా మృచ్చాపి సువ్రత. ౪౮. దూర్వాకల్కం ఘృతం చాపి గోశృంగక్షాలితం జలమ్, జాతిగుల్మవినిర్యాసః ప్రశస్తః స్నానకర్మణి. ౪౯. ప్రాశనే చాప్యథైతాని సర్వపాపహరాణి వై, ఆదౌ కృత్వా భాద్రపదం యథా సంఖ్యం విదుర్బుధాః. ౫౦. ఇత్థం వర్షాంతమాసాద్య భోజయిత్వా ద్విజోత్తమాన్, దివ్యాన్భోగాన్మహాదేవ తతస్తేభ్యో నివేదయేత్. ౫౧. ఫలాని తాత హైమాని యథా

ఫలముల నివేదింపవలయును. లేకున్న దూడతోనున్న యావునుగాని పైరుతోనిండియున్న భూమినేని దాన మీవలయును. శక్తియున్నచో మంచి కట్టడము గలిగి ధనధాన్యాదులతో నొప్పుమేడ నొకదాని నీవల యును. తెల్లనివస్త్రములను విద్రుమములతో నిండిన రాగిపాత్రమును శక్తియున్నప్పుడీ మొదలయిన వెలగలవస్తువులను బ్రాహ్మణులకు దక్షిణాగా నొసంగవలయును. దరిద్రుఁడు చేయవలసినదానముల వివరింతు వినుము. పండ్లు పిండ్లు నువ్వులపిండిచేర్చిన భక్ష్యములు మొదలగువానిని బ్రాహ్మణుల భుజింపఁజేసి వెండితోఁజేసిన ఫలముల నొసఁగవలెను. జేగురు వేసినవస్త్రములజతను తనయాచార్యునకు నివేదింపవలయును. అందు శక్తికొలఁది బంగారమును మణులనుగూడఁ జేర్పవలయును. ఇప్పగిది వార్షికోత్సవముజేసి పారణము ముగించునది మిక్కిలి పవిత్రమై పాప నాశకమైన సప్తమివిధాన మిట్టిది. ఈనాఁ డుపవాసము సలిపినవాఁడు సూర్యునితో సమానమగులోకమును బొందుచున్నాఁడు. ఆలోకమున నీతని నిఖిలదేవతలు గంధర్వులతోడ నచ్చరమచ్చకంటులతోడను గూడి పూజించుచుందురు. ఈవిధానముచే నిత్యము భాస్కరుని బూజించు మానవుఁడు దారిద్ర్యమువలనఁ గలుగుదుఃఖమును పాపములను దొరగి సూర్యుని జేరుచున్నాఁడు. బ్రాహ్మణుఁడు మోక్షము గాంచుచున్నాఁడు. క్షత్రియుఁడు నింద్రపదమును బొందుచున్నాఁడు. కోమటి కుబేరుఁడుండు లోకమున కేఁగుచున్నాఁడు. శూద్రుఁడు బ్రాహ్మణత్వమును బొందు చున్నాఁడు. సంతానములేనివాఁడు పుత్రుని దురదృష్టవంతురా లదృష్ట

---

శక్త్యా గణాధిప, సవత్సామథ వా ధేనుం భూమిం సస్యాన్వితామథ. ౫౨. ప్రాసాదమథ వా ధామం సర్వధాన్యసమన్వితమ్, దద్యాచ్ఛుక్లాని వస్త్రాణి తామ్రపాత్రం సవిద్రుమమ్. ౫౩. శక్తియుక్తస్య చైతాని దరిద్రస్య తు మే శృణు, ఫలాని పిష్టకాన్యేషాం తిల చూర్ణాన్వితాని తు. ౫౪. భోజయిత్వా ద్విజాన్దద్యాద్రాజతాని ఫలాని తు, ధాతు రక్తం వస్త్రయుగ్మమాచార్యాయ నివేదయేత్. ౫౫. సహిరణ్యం మహాదేవ పంచ రత్నసమన్వితమ్, ఇత్థం సమాప్యతే తాత పారణం వార్షికాంతికమ్. ౫౬. ఇత్యేషా వై పుణ్యతమా సప్తమీ దురితాపహా, యాముపోష్య నరాః సర్వే యాంతి సూర్యసలోక తామ్. ౫౭. పూజ్యమానః సదా దేవైర్గంధర్వాప్సరసాం గణైః, అనయా మానవో నిత్యం పూజయేద్భాస్కరం సదా. ౫౮. దారిద్ర్యదుఃఖదురితైర్ముక్తో యాతి దివాకరమ్, బ్రాహ్మణో మోక్షమాయాతి క్షత్రియశ్చేంద్రతాం వ్రజేత్. ౫౯. వైశ్యో ధనదసా లోక్యం శూద్రో విప్రత్వమాప్నుయాత్, అపుత్రో లభతే పుత్రం దుర్భగా సుభగా

మును బొందును. లోకపూజితమగు నీసప్తమితిథిని భక్తితో మగఁడులేని వనిత లుపవసించి రవిని బూజించినచో మరుజన్మమున వైధవ్యదుఃఖము ననుభవింపరు. ఈతిధి మహిమంబునఁ జింతారత్నమున కెనయైయున్నది. దీనిని ఫలసప్తమియని బుధులు వక్కాణింతురు. దిండీ! ఈసప్తమీ మాహాత్మ్యమును జదివినను వినినను సమస్తవాంఛితములు దీరునని పండితులు స్మరించుచున్నారు.

ఇది చతుష్షష్టితమాధ్యాయము.

---

## పంచషష్టితమాధ్యాయము.

ఇఁకమీఁద రహస్య యను వేఱొక్క సప్తమినిగుఱించి విస్తరించి చెప్పెదను వినుము. ఈసప్తమీవ్రతము ననుష్ఠించినవెంటనే మనుష్యులను సంసారమునుండి దాటించును. చేసినవారినే కాక వారివంశమున వెనుకవారి నేడ్వురను ముందువారి నేడ్వురను మొత్తము పదునేవురు పితృదేవతలను నిశ్శంకముగఁ దరింపఁజేయును. నివారింప నలవిగానిరోగముల నివారించును. గెలువరానిశత్రువు నోడించును. ఈనామసప్తమీ వ్రతముచేయువాఁడు పొందనలవికాని యర్థముల నెల్లఁబొందుచున్నాఁడు. కన్నెనుగోరువాఁ డద్దాని బొందుచున్నాఁడు. ధనముగోరువాఁడు

---

భవేత్. ౬౦. యాముపోష్య చ నారీమాం సప్తమీం లోకపూజితామ్, విధవా వా సతీ భక్త్యా అనయా పూజయేద్రవిమ్. ౬౧. నాన్యజన్మని వైధవ్యం నారీ ప్రాప్నోతి మానద, చింతామణిసమా హ్యేషా విజ్ఞేయా ఫలసప్తమీ. ౬౨. పఠతాం శృణ్వతాం దిండే సర్వకామప్రదా స్మృతా. ౬౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి బ్రహ్మదిండిసంవాదే సప్తమీకల్పే ఫలసప్తమీవర్ణనం నామ చతుఃషష్టితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—అతః పరం ప్రవక్ష్యామి రహస్యాం నామ సప్తమీమ్, సప్తమీ కృతమాత్రేయం నరాంస్తారయతే భవాత్. ౧. సప్తాపరాన్సప్త పూర్వాన్పితౄంశ్చాపి న సంశయః, రోగాంశ్ఛినత్తి దుశ్ఛేద్యాన్దుర్జయాఞ్జయతే ద్విషః. ౨. అర్థాన్ప్రాప్నోతి దుష్ప్రాప్యాః కుర్యాన్నామ సప్తమీమ్, కన్యార్థీ లభతే కన్యాం ధనార్థీ లభతే

ధనము గాంచుచున్నాఁడు. పుత్రులఁగోరువాఁడు పుత్రులఁ బడయును. ధర్మముగోరువాఁడు నద్దాని బడయును. చెప్పఁబోవునియమముల నన్నింటిని రక్షించుచుఁ గడునేర్పుతో నీవ్రతము సలుపవలయును. ప్రపంచశ్రేయమునకై యీవ్రతమునందు నియమముల నెఱింగింతు వినుము. సూర్యభక్తుఁడగుపురుషుఁడు సప్తమినాఁడు సర్వభూతములందును నేస్తముచేయవలయును దివాకరుని ధ్యానించుచుండవలయును. సప్తమినాఁడు నూనె తాకఁగూడదు. నల్లవస్త్రము గట్టరాదు. ఉసిరికచూర్ణములచే స్నానముచేయరాదు. ఒకప్పుడేనియుఁ గలహముచేయరాదు. నావిని దిండి తమ్మిచూలీ! సప్తమినాఁడు తైలమును ముట్టిన నేమిదోషము? నల్లబట్ట కట్టిన నేమిదోషము? దీని నెఱుంగఁగోరి యడుగుచున్నాను సదయుఁడవై యెఱింగింపవే యని యడుగ నాతని కాలోకపితామహుండు సావధానముగ వినుమని యిట్లనియె. దిండీ! నీలాంబరధారణమువలనిదోషము నామూలాగ్రముగ నెఱింగింతు వినుము. నల్లరంగును రక్షించినను విక్రయించినను దానితో సత్కార్యము లొనరించినను దానినే జీవనాధారముగ నుంచుకొనినను బ్రాహ్మణుఁడు పతితుఁడగును. మూఁడుకృచ్ఛ్రప్రాయశ్చిత్తములచేఁ బరిశుద్ధుఁడగును. బ్రాహ్మణుఁడు నల్లరంగు వైచిన వస్త్రముతో స్నానము దానము జపము హోమము వేదాధ్యయనము నధ్యాపనము పితృతర్పణము మొదలగు నేయేకార్యములు చేయుచున్నాఁడో యాకార్యములన్నియు వృథాచేష్టలగును మహాయజ్ఞ

---

ధనమ్.౩.పుత్రార్థీ లభతే పుత్రాన్ధర్మార్థీ ధర్మమాప్నుయాత్, సమయాన్పాలయన్సర్వాన్సత్కార్యాచ్ఛేమాం విచక్షణః.౪.సమయాఞ్ఛృణు భూతేశ శ్రేయసే గదతో మమ,ఆదిత్యభక్తః పురుషః సప్తమ్యాం గణనాయక.౫. మైత్రీం సర్వత్ర వై కుర్యాద్భాస్కరం వాపి చింతయేత్, సప్తమ్యాం న స్పృశేత్తైలం నీలం వస్త్రం న ధారయేత్. ౬. న చాప్యామలకైః స్నానం న కుర్యాత్కలహం క్వచిత్, దిండిరువాచ.—కిమర్థం న స్పృశేత్తైలం సప్తమ్యాం పద్మసంభవ. ౭. కశ్చ దోషో భవేద్దేవ నీలవస్త్రస్య ధారణాత్.—బ్రహ్మోవాచ.—శృణు దిండే మహాబాహో నీలవస్త్రస్య ధారణే. ౮. దూషణం గణశార్దూల గదతో మమ కృత్స్నశః, పాలనం విక్రయశ్చైవ సద్వృత్తిరుపజీవనమ్. ౯. పతితస్తు భవేద్విప్రస్త్రిభిః కృచ్ఛ్రైర్విశుద్ధ్యతి, నీలీరక్తేన వస్త్రేణ యత్కర్మ కురుతే ద్విజః. ౧౦. స్నానం దానం జపో హోమః స్వాధ్యాయః పితృతర్పణమ్, వృథా తస్య మహా

ములు గూడ నీలవస్త్రధారణముకతన వ్యర్థములగును. నల్లరంగువైచిన వస్త్రమును బ్రాహ్మణుఁడు శరీరమునఁ దాల్చెనేని యొకరేయుంబవలు నుపవసించి పంచగవ్యప్రాశన మొనరించినచో శుద్ధిబొందును. ప్రమాదమున నేని యొకచో బ్రాహ్మణుఁ డీనీలిరంగునకుఁ గారణమగువృక్షముల మధ్యమునగాని నల్లరంగు దగిల్చిన వస్త్రములనడుమగాని ప్రవేశించెనేని యొక్క యహోరాత్ర ముపవసించి పంచగవ్యప్రాశమున శుద్ధిగాంచును. ఆనీలిరంగే బ్రాహ్మణునకు రోమకూపముల నించుకేని ప్రవేశించునో యాతఁడు పతితుఁడగును. మూఁడుకృచ్ఛ్రములచే శుద్ధుఁడగును నీలివృక్షమును నఱకినచో బ్రాహ్మణునిశరీరమున రక్తము వెలువఱచిన యంతదోషము గలుగును. అటులొనరించిన బ్రాహ్మణుఁడు చాంద్రాయణ ప్రాయశ్చిత్తము చేసుకొనవలయును. ఎవఁడే నెఱుంగక నీలిచెట్టుపుల్లతో దంతధావన మొనరించినచో రెండు కృచ్ఛ్రములు సలిపి శుద్ధిబొందును. సంశయింపఁబనిలేదు.ఏ క్షేత్రములో నీలివిత్తనమునాటుదురో యాభూమి యపవిత్ర యగును. అట్టిభూమి పండ్రెండేండ్లు గడచినవెనుకఁ బరిశుద్ధమగును. సప్తమినాఁడు నూనె దాకినచోఁ బ్రియపత్ని మృతిబొందును. ఇయ్యది తైలమునందును నల్లరంగున నుండుదోషము. సమగ్రముగ నీకెఱింగింపఁబడినది. ఇటులనే విద్వాంసుఁ డానాఁడు మాంసము దినరాదు. మద్యము ద్రాగరాదు. ఎవ్వరికిని ద్రోహముచేయరాదు. ఎవ్వరి యెడను మాటలలోఁగాని పనులలోఁగాని పరుసదన ముపయోగింపరాదు.

---

యజ్ఞా నీలసూత్రస్య ధారణాత్. ౧౧. నీలీరక్తం యదా వస్త్రం విప్రస్త్వంగేషు ధారయేత్, అహోరాత్రోషితో భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి. ౧౨. రోమకూపే యదా గచ్ఛేద్రక్తం నీలస్య కస్యచిత్, పతితస్తు భవేద్విప్రస్త్రిభిః కృచ్ఛ్రైర్విశుద్ధ్యతి. ౧౩. నీలీమధ్యం యదా గచ్ఛేత్ప్రమాదాద్బ్రాహ్మణః క్వచిత్, అహోరాత్రోషితో భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి. ౧౪.నీలీదారు యదా భింద్యాద్బ్రాహ్మణానాం శరీరకే, శోణితం దృశ్యతే యత్ర ద్విజశ్చాంద్రాయణం చరేత్. ౧౫. కుర్యాదజ్ఞానతో యస్తు నీలేర్వా దంతధావనమ్, కృత్వా కృచ్ఛ్రద్వయం దిండే విశుద్ధః స్యాన్న సంశయః. ౧౬. వాపయేద్యత్ర నీలీం తు భవేత్తత్రాశుచిర్మహీ, ప్రమాణద్వాదశాబ్దాని తత ఊర్ధ్వం శుచిర్భవేత్. ౧౭. సప్తమ్యాం స్పృశతస్తైలమిష్టా భార్యా వినశ్యతి, ఇత్యేష నీలీతైలస్య దోషస్తే కథితో మయా. ౧౮. న చైవ ఖాదేన్మాంసాని మద్యాని న పిబేద్బుధః,న ద్రోహం కస్యచిత్కుర్యాన్న పారుష్యం సమాచరేత్. ౧౯. నావభాషేత చాండాలం

చండాలునైన నవమానింపరాదు. రజోవతియగు వెలఁదిని జెలుపరాదు. కులము తక్కువవానినిగాని గుణము తక్కువవానినిగాని స్పృశింపరాదు. శవమును జూడరాదు. పరాక్రమలక్షణములగు భుజము లప్పళించుట మొదలగునవి చేయరాదు. వికటముగ నవ్వరాదు. పాడరాదు. మిక్కుటమగు నభిలాషచే నాడుట వాద్యములు వాదించుట మున్నగునవి చేయరాదు. ఆఁడువారితోఁగలసి పరుండరాదు జూదమాడఁగూడదు. కన్నీరుగార్చుచు నేడువరాదు. శోకమును గలిగించుమాటలు పలుకరాదు. తలలోనివేలను బయటకు లాగఁగూడదు. వ్యర్థముగ వాదులాడరాదు. ఇతరున కనిష్టముచెప్పరాదు. అతిశోకమును విడువవలయును. ఏజంతువును గొట్టఁగూడదు. మితిదప్పి భుజింపరాదు. పగటివేళ నిదురింపరాదు. డంబమును కపటమును విడువవలయును. వీథులందుఁ దిరుగుట గూడ యత్నపూర్వకముగ విడువవలయును. త్రిపురాంతకా! ఇందు వేఱొక్కవిధి కలదు. అద్దాని వినుము. చైత్రము మొదలుకొని పండ్రెండు నెలలు నామసప్తమీవ్రతము చేయవలయును. చైత్రమాసమున దివాకరుఁడు ధాతృనామముతోఁ బూజింపఁదగియున్నాఁడు. వైశాఖంబున నర్యమణుం డనుపేర నారాధింపఁదగియున్నాఁడు. జ్యేష్ఠమాసమున మిత్రనామముతోఁ గొలువఁదగియున్నాఁడు. ఆషాఢమాసమున వరుణనామముతో నారాధ్యుఁడై యున్నవాఁడు. శ్రావణమాసంబున నింద్రాఖ్యతోఁ బూజ్యుఁడని చెప్పుచున్నారు. భాద్రపదమాసంబున వివస్వంతుం డను

---

స్త్రియం నైవ రజస్వలామ్, న వాపి సంస్పృశేద్దీనం మృతకం నావలోకయేత్. ౨౦. నాస్ఫోటయేన్నాతిహసేద్గాయేచ్చాపి న గీతకమ్, న నృత్యేదతిరాగేణ న చ వాద్యాని వాదయేత్. ౨౧. న శయీత స్త్రియా సార్ధం న సేవేత దురోదరమ్, న రుద్యాదశ్రుపాతేన న చ వాచ్యం చ శోకికమ్. ౨౨. ఆకృషేన్న శిరోయూకా న వృథా వాదమాచరేత్, పరస్యానిష్టకథనమతిశోకం చ వర్జయేత్. ౨౩. న కఞ్చిత్తాడయేజ్జన్తుం న కుర్యాదతిభోజనమ్, న చైవ హి దివా స్వప్నం దంభం శాఠ్యం చ వర్జయేత్. ౨౪. రథ్యాయామటనం వాపి యత్నతః పరివర్జయేత్, అథాపరో విధిశ్చాత్ర శ్రూయతాం త్రిపురాంతక. ౨౫. చైత్రాత్ప్రభృతి కర్తవ్యా సర్వదా నామ సప్తమీ, ధాతేతి చైత్రమాసే తు పూజనీయో దివాకరః. ౨౬. అర్యమేతి చ వైశాఖే జ్యేష్ఠే మిత్రః ప్రకీర్తితః, ఆషాఢే వరుణో జ్ఞేయ ఇంద్రో నభసి కథ్యతే. ౨౭. వివస్వాంశ్చ

నామంబునను నాశ్వయుజ్మాసంబునఁ బర్జన్యుఁ డనుపేరను బూజ్యుఁడయి యున్నాఁడు. పూషనామంబునఁ గార్తికమాసంబునను మార్గశీర్షమున నిషునినియును పుష్యమాసమున భగుఁడనియును పూజ్యుఁడై యున్నట్లు విద్వాంసులు వచించుచున్నారు. మాఘమాసంబునఁ ద్వష్ట్రనాముఁడగు నాదిత్యుఁడు ప్రశస్తుఁడై యున్నాఁడు. ఫాల్గునమాసమ్మున విష్ణువనుపేర నాదిత్యుఁడు పూజనీయుఁడును వందనీయుఁడు నై యున్నవాఁడు. విద్వాంసుఁడు ప్రతిసప్తమియందును భోజనప్రియులగు బ్రాహ్మణులకు నేతితో నిడిన భోజనము నొసంగవలెను. ఇట్లు విధ్యుక్తముగఁ గుడువంబెట్టువారికే యొకొక్కనికి మినపగింజప్రమాణముగల సువర్ణమును దక్షిణగా నొసంగవలయును. రక్తవస్త్రములుగూడ నొసంగవలయును. అట్టివారు దొరకకున్న నుత్తమశ్రద్ధాయుక్తుఁడై ద్విజోత్తములకు భోజనములుపెట్టి దక్షిణల నొసంగవలయును. విశేషించి పురాణముచెప్పువాఁడును వ్రతకల్పముల నెఱింగినవాఁడు నగుబ్రాహ్మణుఁడు పూజింపఁదగియున్నాఁడు. ఓగణనాథా! నామసప్తమీకల్పములు సాంగముగ నెఱింగించితిని. ఈ సప్తమీకల్పము విన్నవారికి సర్వపాపములు నమసి సూర్యలోకప్రాప్తి యగును.

పంచషష్టితమాధ్యాయము.

---

వభస్యేఽథ పర్జన్యోఽశ్వయుజి స్మృతః, పూషా కార్తికమాసే తు మార్గశీర్షేషురుచ్యతే. ౨౮. భగః పౌషే భవేత్పూజ్యస్త్వష్టా మాఘే తు శస్యతే, విష్ణుశ్చ ఫాల్గునే మాసి పూజ్యో వంద్యశ్చ భాస్కరః. ౨౯. సప్తమ్యాం చైవ సప్తమ్యాంభోజయేద్భోజకాన్బుధః, సఘృతం భోజనం దేయం భోజయిత్వా విధానతః. ౩౦. భోజకాయైవ విప్రాయ దక్షిణాం స్వర్ణమాషకమ్, సఘృతం భోజనం దేయం రక్తవస్త్రాణి చైవ హి. ౩౧ అభావే భోజకానాం తు దతిణీయా ద్విజోత్తమాః, తద్వైవ భోజనీయాశ్చ శ్రద్ధయా పరయా విభో. ౩౨. విశేషతో వాచకశ్చ బ్రాహ్మణః కల్పవిత్సదా, ఇత్యేషా కథితా తుభ్యం సప్తమీ గణనాయక. ౩౩. శ్రుతా సతీ పాపహరా సూర్యలోకప్రదాయినీ. ౩౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మేపర్వణి బ్రహ్మాదిండిసంవాదే సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యవర్ణనే సప్తమీవర్ణనం నామ పఞ్చషష్టితమోఽధ్యాయః.

---

## షట్షష్టితమాధ్యాయము.

రాజా! యీవిధముగ బ్రహ్మదేవుఁడు దిండి కెఱిఁగించి యంత ర్ధానమొందెను. అంత నాదిండియు నాదిత్యు నారాధించుచు నాతని యనుచరులలో ముఖ్యుఁడై యుండెను. నావుడు శతానీకుండు బ్రాహ్మణోత్తమా! భాస్కరునిమాహాత్మ్యము విన్న కొలందికిఁ దృష్ణ యధికమగు చున్నది. అమృతపాన మొనర్చువానికిఁ దనివిసనునా? కావున సదయుండ వై మఱల నాదేవునిమాహాత్మ్యంబు వర్ణింపవే యని యడుగ నాతనికి సుమంతు విట్లనియె. రాజా! నీకు శంఖబ్రాహ్మణులసంవాద మొక్కటి తెలుపుదును సావధానముగ నాకర్ణింపుము. ఈసంవాదము విన్నమానవుఁడు సర్వపాపముఁ బాయును. ఒకనాఁ డొకబ్రాహ్మణోత్తముఁడు శంఖుఁడనుమునీంద్రు నిజాశ్రమమునఁ గూర్చున్నవాని నీక్షింపఁగోరి యేఁగెనఁట. ఆతనియాశ్రమము పండ్లబరువుచే వంగినకొమ్మలుగలిగి దట్ట మగునీడ నొసంగుచెట్లగుంపులచే జిగిబిగియై యొండొంటిని కొమ్ములచే గీరుకొనులేళ్లగములచే నందమై దర్భవనములచేతను నారచీరలుగట్టి నీర్ల తెచ్చునప్పు డానీటిధారలచే నేలపైఁబడుచారికలచేతను నందమై విస్తార మగు కుసుమపరిమళములచేతను మదించినతుమ్మెదలపాటలచేతను నొప్పు గలిగి సిద్ధులు గంధర్వులు దేవమునులు మొదలగువారు సేవించుటచేఁ బవిత్రములైన జలములుగలిగి బోడిబుఱ్ఱలవారు జడదారులు నగుతాప సులు గొలువ నింపుగొల్పునదై యుండెను. అట్టి పుణ్యాశ్రమమున సుఖ

---

సుమంతురువాచ:—ఇత్యుక్త్వా భగవాన్బ్రహ్మా జగామాదర్శనం విభోః, సూర్య మారాధయద్దిండీ సూర్యస్యానుచరోఽభవత్. ౧. శతానీక ఉవాచ.—భూయః కథయ విప్రేంద్ర మహాత్మ్యం భాస్కరస్య మే, శృణ్వతో నాస్తి మే తృప్తిరమృత స్యేవ సువ్రత. ౨. సుమంతురువాచ.—శృణుష్వావహితో రాజన్సంవాదం ద్విజ శంఖయోః, యం శ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే మానవో నృప. ౩. ఆసీనమా శ్రమే శంఖం ద్విజో ద్రష్టుం జగామహ, ఫలభారానతచ్ఛాయే వృక్షబృన్దసమాకులే.౪. పరస్పరమృగశృంగకణ్డూయితమృగావృతే, బర్హిర్వనాంబరానీతతీర్థకన్దోపభోగిని. ౫. ప్రభూతకుసుమామోదషట్పదోద్గీతశాలిని, సిద్ధదేవర్షిగంధర్వతీర్థసేవితవారిణి. ౬. ముణ్డైశ్చ జటిలైశ్చైవ తాపసైరుపశోభితే, ఆశ్రమే తం మునిశ్రేష్ఠం శంఖాహ్వం

ముగ మంచినిష్ఠగలిగి సహస్రకిరణుని నుతించుట కుద్యుక్తుఁడై తద్భక్తుఁడై యాతఁడే ముఖ్యముగఁ బొందఁదగినతావనియుండి యాసనమునఁ గూర్చుండియున్న శంఖుఁడనుమునిపుంగవుని నతిశీఘ్రముగ సమీపించి భోజకరాజకుమారులు వినయాన్వితులై చెంతజేరి శాస్త్రానుసారముగఁ బేరులుచెప్పుచు నభివాదన మొనరించి తమతమయాసనముల నాగురు నాజ్ఞచే నాసీనులైరి. ఇట్టు లాతనియెదుటఁ గూర్చుండి సవినయముగ "మహానుభావా! నాలుగువేదములందును మాకు లెక్కలేనన్ని సంశయము లున్నవి. వానిని దీర్ప వేఁడుచున్నార"మని విన్నవింప నమ్ముని శ్రేష్ఠుండు మహావినయసంపన్నులగు నక్కుమారవరులకుఁ బ్రీతుఁడై నిత్యములగు నాలుగువేదములను చదివించెను. వారును చదువుచుండఁగా దైవవశమునఁ దపస్సంపన్నుఁడగు వెనుకటిబ్రాహ్మణోత్తముఁడు శంఖునాశ్రమమునఁ గుమారు లధ్యయనముచేయుచోటున కేతెంచి మహాతేజస్సంపన్నుఁడగు నాశంఖమునిచే సత్కృతుఁడై యాకుమారు లభివాదనములుచేయఁ బ్రీతచిత్తుఁడై యుండెను. అంత శంఖముని యారాజకుమారులతో "మాణవకులారా! శిష్టులువచ్చినదిన మనధ్యాయమని ధర్మశాస్త్రము గలదు గదా! అట్టిది యీనాఁడు వచ్చినది. కాన నధ్యయనము చాలింపుఁడు" అన నాకుమారులును గురువులయాజ్ఞ యెట్టు లటులే యగుఁగాక యని చదువునిలిపిరి. పిమ్మట నాబ్రాహ్మణోత్తముఁడు మునీంద్రునితో "ఈకుమారు లెవరు? ఏమి చదువుచున్నారు?" అని యడుగ నమ్మునీంద్రుఁడను అయ్యా! వీరు మహారాజగు భోజకునికుమారులు. వైదిక

---

సుఖమాస్థితమ్. ౭. స్తోత్రైః స్తోతుం సహస్రాంశుం తద్భక్తం తత్పరాయణమ్, తతః సంహత్య సహసా తం భోజకకుమారకాః. ౮. వినీతా ఉపసంగమ్య యథావదభివాద్య చ, ఆసనేషూపవిష్టాస్త ఉపవిష్టమథాబ్రువన్. ౯. భగవన్త్సర్వవేదేషు ఛ్ఛింధి నః సంశయో మహాన్, వినయేనోపపన్నానాం కుమారాణాం తతో మునిః. ౧౦. అనాదీం శ్చతురో వేదానువాచ ప్రీతమానసః, తేషాం తు పఠతామేవ ఆశ్రమం తు యదృచ్ఛయా. ౧౧. మునిశ్రేష్ఠోఽథ తం దేశమాజగామ ద్విజో నృప, యథావదర్చితస్తేన శంఖేనామితతేజసా. ౧౨. వందితశ్చ కుమారైస్తైరభవత్ప్రీతమానసః, అథైతానబ్రవీ చ్ఛంఖస్తాన్భోజకకుమారకాన్. ౧౩. శిష్టాగమాదనధ్యాయః స చ జాతో విరమ్యతామ్, యథాజ్ఞాపయసీత్యాహుః కుమారాస్తే ఋషిం తతః. ౧౪. పప్రచ్ఛ సిద్ధిదశ్చైతాన్కేహ్యేతే కిం పఠంతిచ, శంఖోవాచ మహారాజకుమారా భోజకాత్మజాః. ౧౫.

కర్మలవరుసను దెలుపుసూత్రములు కల్పములతోఁగూడ నాల్గువేదములు చదువుకొనుచున్నారు. సప్తమీవ్రతకల్పమున భాస్వంతుని పరిచర్యావిధానంబును నగ్నిప్రతిష్ఠ మొదలుకొని యగ్నికార్య మొనరించుతెఱంగును సూర్యుని యంగపూజాదిలక్షణములను సూర్యునకొనర్చు నభ్యంగస్వరూపమును రథయాత్రావిధానమును నీమొదలగునవన్నియుఁ జదువుకొనుచున్నారు. నాపుడు బ్రాహ్మణోత్తముఁ డిట్లనెను. ఓతపోధనా! సప్తమినాఁడు సూర్యారాధన మేల చేయవలెను? దానివిధిక్రమ మెట్టిది? సూర్యమందిరమున నుంచుగంధపుష్పములకును దీపారాధనమునకు నేమిఫలము గలుగును? ఏయేదానములచేతను వ్రతనియమములచేతను నాతఁడు సంతసించును? సూర్యునకు ధూప మెద్దాన నొసంగవలయును? పుష్పము లెట్టివి సమర్పింపవలెను? కానిక లెట్టి వీవలయును? దీనినంతను వినఁగోరుచున్నాను. కాన నెఱింగింపుము. విశేషించి యాభాస్కరుని మహిమాతిశయంబు వినఁగోరుచున్నాను. అద్దాని దొలుత నెఱింగింపవే. నాపుడు శంఖుఁ డాతని కిట్లనియె. బ్రాహ్మణోత్తమా! నీవడిగిన యీయర్థమును మున్ను వసిష్ఠుఁడు వాసుదేవకుమారుఁడగు సాంబు నడుగ నాతఁ డాతనికిఁ దెలిపినక్రైవడి నీకుం దెలిపెద వినుము పుణ్యతీర్థములలోనెల్ల నుత్తమమయి మిగులఁ బవిత్రమగు నీయాశ్రమమున నియతశరీరుఁడై యున్నమునిశ్రేష్ఠుఁడగువసిష్ఠుని వినయముతో సమీపించి యాతనిపాదములకు సాగిలపడి భక్తితోఁదలవాల్చి వాసుదేవునికుమారుఁ

---

పసూత్రకల్పాంశ్చతురో విప్ర వేదానధీయతే, తథైవ సప్తమీకల్పే పరిచర్యాం చ భాస్వతః, ౧౬. అగ్నికార్యవిధానం చ ప్రతిష్ఠాకల్పమాదితః, అభ్యంగలక్షణం బ్రహ్మన్ రథయాత్రావిధిం తథా. ౧౭. ద్విజ ఉవాచ.—కథం క్రియేత సప్తమ్యాం కశ్చార్చవిధిక్రమః, గంధపుష్పప్రదీపానాం కిం ఫలం రవిమందిరే. ౧౮. కేన తుష్యతి దానేన వ్రతేన నియమేన చ, ధూపపుష్పోపహారాది కిం చ దేయం వివస్వతే. ౧౯. ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం తన్మే బ్రూహి తపోధన, విశేషతస్తు మాహాత్మ్యం బ్రూహి మాం భాస్కరస్య హి. ౨౦. శంఖ ఉవాచ.—ఇమమర్థం వసిష్ఠేన పృష్టః సాంబో యథా పురా, స చోవాచ వసిష్ఠాయ తదహం కథయామి తే. ౨౧. అత్రాశ్రమే పుణ్యతమే తీర్థానాముత్తమే ప్రభుః, వవన్దే నియతాత్మానం వసిష్ఠం మునిసత్తమమ్. ౨౨. వినయేనోపసంగమ్య వవన్దే చరణౌ మునేః, కృతప్రణామం సాంబం తు భక్తిప్రహ్వీకృతాన

డగు సాంబుఁడు కట్టెదుర నిలువ నీక్షించి ప్రీతచిత్తుఁడై మునికులతిల కుండు కడు వేడుకతో "వత్సా! నీదేహము మున్ను గొప్పకుష్ఠమునకు లోనై బ్రద్దలుగఁ జీలి యతిఘోరము తీవ్రమునై యుండెడిది గదా! అది యెల్ల నిప్పు డెద్దాన గతించె? మిక్కుటమగు కాంతిగలిగె నెట్లు? ఏరీతి సందము గలిగె? మిగుల గొప్పదియగు వెలుఁ గెట్లు గలిగెను? ఇంతటి సౌకుమార్య మెట్లు లభించెను?" అని యడుగ నాతనికి సాంబుఁ డిట్లని యె. మహాత్మా! యేను లోకనాథుఁడగు దివాకరుని సహస్రనామములచే స్తోత్రముచేయ నా కాతఁడు దర్శన మొసంగి వరము లిచ్చెను. నావుడు వసిష్ఠుఁడు "యాదవకుమారా! ఆసూర్యు నెట్టు లారాధించితివి? ఏయే వ్రతములు తపములు దానములు నొనరుప నా దేవుఁడు సాక్షాత్కార మొసంగెను." నావిని సాంబుఁ డాతనికి నిట్లనె—ఓ బ్రహ్మర్షిసత్తమా! నాచే నా దేవుఁ డెట్లారాధింపఁబడె నదియెల్ల దెలుపుదు నవధరింపుము. ఏవిధి నాతఁడు నాయెడ సంతసించినదియుఁ దెలిపెద వినుము. మున్నొక్క ప్పుడు కోపస్వభావుఁడగు దుర్వాసమునీంద్రుఁడు కనుపింప గర్వముచేత నజ్ఞానముచేత నొడలుమరచి యాతని నుల్లసములాడితిని. అందుల కాతఁడు కినిసి కుష్ఠముచేఁ బీడింపఁబడుదువుగాక యని శపియించెను. అంత నేనును వెనువెంటనే కుష్ఠము నాయొడలంతయు నాక్రమింప బాధకుఁ దాళలేక నాతండ్రియొద్దకేగి గర్వముగలవాఁడనౌటచే సిగ్గిలుచు నిటులంటిని. తండ్రీ! నాశరీరము క్షీణదశకు వచ్చుచున్నది స్వరము సన్న

---

నమ్. ౨౩. విలోక్య పరమప్రీతో మునిః పప్రచ్ఛ తం తదా, సర్వతః స్ఫుటితం గాత్రం కుష్ఠేన మహతా తవ. ౨౪. ఘోరరూపేణ తీవ్రేణ కథం తద్విగతం తవ, కథం చ లక్ష్మీరధికా రూపం చాతిమనోహరమ్. ౨౫. తేజస్వితాతిమహతీ తథైవ సుకుమారతా. ౨౬. సాంబ ఉవాచ.—స్తుతో నామసహస్రేణ లోకనాథో దివాకరః, దర్శనం చ గతః సాక్షాద్దత్తవాంశ్చ వరాన్మమ. ౨౭. వసిష్ఠ ఉవాచ—కథమారాధితః సూర్యస్త్వయా యాదవనందన, కైశ్చ వ్రతతపోదానైర్దర్శనం భగవాన్ గతః. ౨౮. సాంబ ఉవాచ.— శృణుష్వావహితో బ్రహ్మన్సర్వమేవ మయాయథా, తోషితో భగవాన్సూర్యో విధినా యేన సువ్రత. ౨౯. మోహాన్మయోపహసితో దుర్వాసాః కోపనో మునిః, తతోఽహం తస్య శాపేన మహాకుష్ఠమవాప్తవాన్. ౩౦. తతోఽహం పితరం గత్వా కుష్ఠయోగాఖి పీడితః, లజ్జమానోఽతిగర్వేణ ఇదం వాక్యమథాబ్రవమ్. ౩౧. తాత సీదతి మే గాత్రం

గిలినది. భయంకరాకారమగు నీవ్యాధి నాశరీరమును హింసింపఁగోరు చున్నది. క్రూరకర్మమగు నీరోగరాజము నన్ను పీడించుచున్నది. వైద్యులచేత నోషధివిశేషములచేత నీవ్యాధి యడంగుట కల్ల. కావున దయగొని నీవనుజ్ఞ నొసంగుదేని జీవితమును విడువఁగోరుచున్నాను. నేను నీకనుగ్రహింపఁదగియున్నవాఁడనేని నన్ను నీవ యనుగ్రహింపఁ దగియున్నవాఁడవు. అనుగ్రహింపుమన నాజనకుఁడు పుత్రశోకముచేఁ బీడితుఁడై యింతుకతడ వెద్దియో యోచించి పిమ్మట నాతో నిట్లనియె. "పుత్రరత్నమా! ధైర్యము జిక్కఁబట్టుము. చిత్తమును శోకమున కాయత్తపఱపకుము. శోకాయత్తమై క్షీణించియున్న మనస్సును బాగుగా నెండినగడ్డిపరకను నిప్పుకణమువలె వ్యాధి నాశమొందఁజేయఁగలదు. కావున శోకము విడుఁ దేవతారాధనమున మనముగూర్పుము" నావుడు "తండ్రీ! యేదేవత నారాధింతును? ఏదేవత నారాధించినచో సమస్త రోగములనుండి విడివడుదు నని యేనడుగ నాతండ్రి నాకిట్లనియె. కుమారా! మున్నీయర్థమును బద్మసంభవుఁడు యోగీశ్వరుఁడు, మహానుభావుఁడు నగుయాజ్ఞవల్క్యమునీంద్రుఁ డడుగ నాతనికి వచించెను. ఆతఁ డాతని కెఱింగించినవిధి నీ కేనెఱింగింతు శుచివై యాకర్ణింపుము. నీకు మేలగును. ప్రజాపతియుఁ బద్మసంజాతుఁడు నగువేల్పులపెద్ద సుఖముగఁ గూర్చొనియుండ నాతనికడ కేతెంచి మహానుభావుఁడగు యాజ్ఞ

---

స్వరశ్చ పరిహీయతే, ఘోరరూపో మహావ్యాధిర్వపురేష జిఘాంసతి. ౩౨. అశేషవ్యాధిరాజ్ఞాహం పీడితః క్రూరకర్మణా, వైద్యైరోషధిభిశ్చైవ న శాంతిర్మమ విద్యతే. ౩౩. సోఽహం త్వయాభ్యనుజ్ఞాతస్త్యక్తుమిచ్ఛామి జీవితమ్, యది వాహమనుగ్రాహ్యస్తతోఽనుజ్ఞాతుమర్హసి. ౩౪. ఇత్యుక్తవాక్యః స పితా పుత్రశోకాభిపీడితః, పితా క్షణం తతో ధ్యాత్వా మామేవం వాక్యముక్తవాన్. ౩౫. ధైర్యమాశ్రయతాం పుత్ర మా శోకే చ మనః కృథాః, హంతి శోకార్దితం వ్యాధిః శుష్కం తృణమివానలః. ౩౬. దేవతారాధనపరో భవ పుత్రక మా శుచః, ఇత్యుక్తే చ మయా ప్రోక్తో దేవమారాధయామి కమ్. ౩౭. కమారాధ్య విముచ్యేఽహం తాత రోగైః సమంతతః, ఇత్యేవముక్తో భగవాన్మామువాచ పితా మమ. ౩౮. ఇమమర్థం పురా పృష్టః పద్మయోనిః సనాతనః, యాజ్ఞవల్క్యేన ఋషిణా యోగీశేన మహాత్మనా. ౩౯. యదువాచ మహాతేజాస్తస్మై స యదునందన, తచ్ఛృణుష్వ శుచిర్భూత్వా ఆత్మనః శ్రేయసే సుత. ౪౦. సురజ్యేష్ఠం

వల్క్యుఁడు సవినయముగ నాతని కిట్లనియె. ఓమహాత్మా! నామనమున నొక్క శంకయున్నది. దానిం దీర్పఁగోరెదను. అందు నీయాత్మగతమగు నభిప్రాయము వినఁగోరుచున్నాను. దేవతారాధనముచేతగదా; మానవులు సంసారవిముక్తులగుదురు. గృహస్థుఁడుగాని, బ్రహ్మచారిగాని, వానప్రస్థుఁడుగాని, సన్న్యాసిగాని యెవ్వఁడేనియు మోక్షము నొందఁగోరినచో నేదేవత నారాధింపవలయును? ఈతనికి శాశ్వతమగుస్వర్గ మెవనివలనఁ గలుగును? మోక్షసుఖ మెవ్వరివలనఁ గలుగును? స్వర్గమున కేఁగినవాఁడు నటనుండి మరలిరాకుంటకై యేమిచేయవలయును? దేవతలకెల్ల నెవ్వఁడు దేవత ? పితరులకెల్ల నెవ్వఁడు పితృదేవత ? ఆదేవతాదిగణముకన్న నత్యుత్తమమైన దెద్ది? ఇదియంతయుఁ దెలుపవే పితామహా! చరాచరాత్మకమగు నీప్రపంచమంతయు నెవ్వనిచేఁ బుట్టింపఁబడెను? ప్రళయమున నీజగ మెవ్వనిజేరును? అదియంతయు వివరముగఁ దెలుప నీవ యర్హుండవు" నావుడు నమ్మునీంద్రునకుఁ బితామహుం డిట్టులనియె. "ఓధీమంతుఁడా! బాగుగఁ బ్రశ్నించితివి. మిగుల సంతసించితిని. పుణ్యములచే నధికుఁడు సర్వోత్తముఁడు నగుదేవునకు దోసిలియొగ్గి శిరము వంచి వందన మాచరించి నీసంశయము దీర్తును. నిశ్చలచిత్తుఁడవై యాలకింపుము. నీశ్రేయముగోరుదేని శుచివై సమాహితచిత్తుఁడవై యుండుము. ఏదేవుఁ డుదయించుచు(పైకిలేచి నడచుచు)నిజకిరణములచేఁ బ్రపంచమునఁ

---

సుఖాసీనం పద్మయోనిం ప్రజాపతిమ్, యాజ్ఞవల్క్యో మహాతేజాః పర్యపృచ్ఛత్పితామహమ్. ౪౧. భగవఞ్ఛ్రోతుమిచ్ఛామి కించిదాత్మమనోగతమ్, సమారాధ్య విభో దేవం నరో ముచ్యేత వై భవాత్. ౪౨. గృహస్థో బ్రహ్మచారీ వా వానప్రస్థోఽథ భిక్షుకః, య ఇచ్ఛేన్మోక్షమాస్థాతుం దేవతాం కాం యజేత సః. ౪౩. కుతో హ్యస్య ధ్రువః స్వర్గః కుతో నైఃశ్రేయసం సుఖమ్, స్వర్గతశ్చైవ కిం కుర్యాద్యేన న చ్యవతే పునః. ౪౪. దేవతానాం తు కో దేవః పితౄణాం చైవ కః పితా, తస్మాత్పరతరం యచ్చ తన్మే బ్రూహిపితామహ. ౪౫. కేన సృష్టమిదం విశ్వం బ్రహ్మస్థావరజంగమమ్, ప్రలయే చ కమభ్యేతి తన్మే త్వం వక్తుమర్హసి. ౪౬. బ్రహ్మోవాచ.—సాధు పృష్టోఽస్మి భవతా తుష్టశ్చాస్మి మహామతే, ప్రణమ్య శిరసా దేవం పుణ్యోత్తరమనుత్తమమ్. ౪౭. కథయిష్యే ద్విజశ్రేష్ఠ శృణుష్వైకమనాధునా, ఆత్మనః శ్రేయసే విప్ర శుచిర్భూత్వా సమాహితః.

జీకట్ల నడఁగించునో ఆతనికంటె నుత్తముఁడగు దేవుఁ డెక్కడ నొక్కఁడును లేఁడు. ఇంతకంటె వేరేమి చెప్పుదును. ఈదేవుఁడు జననమరణములు లేనివాఁడు గద! జ్ఞానస్వరూపుఁడు గద! హెచ్చుతగ్గులులేక యెప్పుడు నొకేతీరున నుండువాఁడు. ఈరవి కాంతిమంతములగు నిజకిరణములచే ముల్లోకముల వెలిఁగించుచున్నాఁడే. ఈతఁడే సర్వదేవతాస్వరూపుఁడై యున్నాఁడు గదా! తనతేజముచే నితరతేజస్సులఁ దపించుచున్నాఁడు. జగత్తంతకు నీతఁడే నాథుఁడు. ఈతఁడే శుభాశుభకర్మములకు సాక్షియై యున్నాఁడు. ఈతఁడే నిఖిలభూతముల నంతమొందించుచున్నాఁడు. మరల నెల్లభూతముల సృజించుచున్నాఁడు. ఈతఁడే వెలుఁగుచున్నాఁడు. తపించుచున్నాఁడు. కిరణములచే వృద్ధిబొందుచున్నాఁడు. ఈతఁడే పుట్టించువాఁడును పెంచువాఁడును పోషించువాఁడు నైయున్నాఁడు. ప్రకృతితత్త్వ మెఱింగినమేటి; ఈసూర్యుఁడు శాశ్వతమగు మండలమున వెలుఁగుచుండును. ఈతనికి నాశ మెన్నఁడును లేదు. ఈతఁడే ప్రకృతి. ఈతఁడే పితృదేవతలకుఁ బితయు దేవతలకు దేవతయు నైయున్నాఁడు. ఈతఁడే యెల్లవారలకు శాశ్వతమగునిలయమని విద్వాంసులు వచించుచున్నారు. ఈతఁడే జగత్తున కాధారమనుచున్నారు. ఈతనినుండియే సృష్టికాలమునఁ జరాచరరూపమగు నీప్రపంచమంతయు నుద్భవించుచున్నది. ప్రళయకాలమున మండుచున్నతేజముగల యీయాదిత్యుని జేరుచున్నది. యోగాభ్యాస మొనర్చుధీరులును గృహమును శరీరమును విడచి వాయురూపులై తేజోరాశియగు దివాకరు

---

౮౮. ఉద్యన్నేష కురుతే జగద్వితిమిరం కరైః, నాతః పరతరో దేవః కిమన్యత్కథయామి తే. ౮౯. అనాదినిధనో హ్యేషః పురుషః శాశ్వతోఽవ్యయః, దీపయత్యేవ లోకాంస్త్రీన్రవీ రశ్మిభిరుల్బణైః. ౯౦. సర్వదేవాత్మకో హ్యేష తపసా చాంశుతాపనః, సర్వస్య జగతో నాథః కర్మసాక్షీ శుభాశుభే. ౯౧. క్షపయత్యేష భూతాని తథా విసృజతే పునః, ఏష భాతి తపత్యేష వర్ధతే చ గభస్తిభిః. ౯౨. ఏష ధాతా విధాతా చ పూషా ప్రకృతిభావన, న హ్యేష క్షయమాయాతి నిత్యమక్షయమండలః. ౯౩. పితౄణాం హి పితా హ్యేష దేవతానాం చ దేవతా, ధ్రువం స్థానం స్మృతం హ్యేష ఆధారోజగతస్తథా. ౯౪. సర్వకాలే జగత్కృత్స్నమాదిత్యాత్సంప్రసూయతే, ప్రలయే చ తమభ్యేతి ఆదిత్యం దీప్తతేజసమ్. ౯౫. యోగినశ్చాత్ర సంలీనాస్త్యక్త్వా గృహకళే

నందుఁ జొచ్చి యంతర్హితు లగుచున్నారు ఆతని వేయికిరణములను పక్షులు కొమ్మలనువలె నాశ్రయించి దేవతలతోఁగూడ సిద్ధిబొంది వసించుచున్నారు. జనకుఁడు మొదలు గృహస్థులగురాజులు యోగధర్మము గలిగి యుండిరి. వాలఖిల్యులు మొదలు మునులందఱు బ్రహ్మచారులై యోగ ధర్మము గలిగియుండిరి. వ్యాసుఁడు మొదలగువారు వానప్రస్థులు భిక్షులునై పంచశిఖలు దాల్చి యోగాభ్యాసరతులైరి. ఇటులు వీరందఱు యోగాభ్యాసవశంబున నాదిత్యమండలముఁ జొచ్చియుండిరి. వ్యాసుని కుమారుఁడును సర్వైశ్వర్యయుక్తుఁడు నగుశుకయోగీంద్రుఁడు యోగ ధర్మము నాశ్రయించి బాలయోగియై యాదిత్యకిరణములు పానముజేసి పునర్జన్మము లేనివాఁడయ్యెను. బ్రహ్మవిష్ణుశివాదులగు దేవతలందఱును శబ్దముచేత మాత్రమే యెఱుంగఁదగి శ్రవణసుఖము గలిగించుచున్నారు. ఈసూర్యదేవుఁడు సమస్తలోకమున జ్ఞానాంధకార మడఁగించుచుఁ బ్రత్యక్షదైవమై యగపడుచున్నాఁడు. ఇట్టులే స్మృతులు ఘోషించుచున్నవి. కావున నితరవ్రతములందు శుభముగోరుమానవుఁడు భక్తిగలిగి ప్రవర్తింపరాదు. నిత్యమగుస్వర్గాద్యదృష్టము దృష్టవస్తువుచేతనే సిద్ధించుచున్నది గద! కావున నో బ్రాహ్మణోత్తమా! నీవెల్లప్పుడును దివసకరు నర్చనచేయుచుండుము" నావుడు యాజ్ఞవల్క్యుఁ డిట్టులనె. పితామహా! నీవు నాకిపు డేదేవునిగుఱించి వక్కాణించితో యాభాస్కరుఁడే సర్వ దేవతలకు దేవతయై యున్నవాఁడనుటలో నేమియు వింతలేదు. ఇది

---

వరమ్, వాయుభూతా విశంత్యస్మిం స్తేజోరాశౌ దివాకరే. ౧౬. తస్యరశ్మిసహస్రాణి శాఖా ఇవ విహంగమాః, వసంత్యాశ్రిత్య మునయఃసంసిద్ధా దైవతైః సహ. ౧౭. జనకాదయో గృహస్థాస్తు రాజానో యోగధర్మిణః, వాలఖిల్యాదయశ్చైవ మునయో బ్రహ్మచారిణః. ౧౮. వ్యాసాదయో వనస్థాశ్చ భిక్షుః పంచశిఖస్తథా, సర్వే తే యోగమాస్థాయ ప్రవిష్టాః సూర్యమండలమ్. ౧౯. శుకో వ్యాసాత్మజః శ్రీమాన్యోగధర్మమవాప్య తు, ఆదిత్యకిరణాన్పీత్వా న పునర్భవమాప్తవాన్. ౨౦. శబ్దమాత్రాః శ్రుతిసుఖా బ్రహ్మ విష్ణుశివాదయః, ప్రత్యక్షోఽయం స్మృతో దేవః సూర్యస్తిమిరనాశనః. ౨౧. తస్మాదన్య వ్రతే భక్తిర్న కార్యా శుభమిచ్ఛతా, దృష్టేన సాధ్యతే యస్మాదదృష్టం నిత్యమేవ హి, త్వయాతః సతతం విప్ర అర్చనీయో దివాకరః. ౨౨. యాజ్ఞవల్క్య ఉవాచ.—అహో య ఏష కథితో భవతా భాస్కరో మమ, దేవతా సర్వదేవానాం నైతన్మిథ్యా

యొకప్పుడు నసత్యము గానేరదు. ఆదేవునిమహిమాతిశయంబు వేయి విధంబుల వినియుంటిని. ఇమ్మహాత్ము నెల్లప్పుడును దేవతలు ఋషులు సిద్ధులు మనుష్యులు నుతించుచుందురుగద! ఏమహాత్మునివలన నీచరాచరమయప్రపంచమంతయు నేర్పడి యెవ్వనిదై యున్నదో నాశములేక యింతయని వచింపనలవిగాని యేదేవునికిరణములవలన నన్నియుఁ బుట్టుచున్నవో అట్టిజన్మరహితుఁడైన దేవు నెవ్వఁడు నుతింపఁజాలియున్నాఁడు? ఏమహాత్ముని దక్షిణభాగమున నున్నకిరణముచే భగవంతుఁడగువిష్ణుదేవుఁ డుద్భవించెనో, యెడమవైపుకిరణమువలనఁ బద్మనిలయుఁడవగు నీవు జన్మించితివో, యెవ్వని నొసటనున్నకిరణముచే రుద్రుఁ డుద్భవమందెనో, అట్టిదేవునితోఁ బోల్పఁదగు దేవతాంతరము కలదా? ఆదేవునిగుణజాలమును వర్ణింప నెవ్వాఁడు సమర్థుఁడు? కావున సర్వాకారుఁడు సర్వశక్తిసంపన్నుఁడు నగునాయాదిత్యదేవుని యారాధనక్రమము నే వినఁగోరుచున్నాను. అది యెఱింగి సంసారార్ణవము దాటిపోవంగలుగుదును. ఏయుపాయముచే నేరహస్యమంత్రములచేఁ బరిచర్యచే నాదేవుఁడు తృప్తి నొందును? ఏయేదానములచేతను వ్రతోపవాసములచేతను జపహోమములచేతను బూజితుఁడై సమస్తక్లేశములు నశింపఁజేయును? ప్రజాపతీ! ఆదేవుఁడు బాగుగ నారాధించుట కెవ్విధిని సమర్థుఁడై యున్నాఁడు? (ఆతని నెట్లారాధింపవలయును.) ధర్మార్థకామములను వర్గత్రయమును సంపాదించుటకై యత్నించుపురుషుల జన్మమువంది వ్యర్థముకాని క్రియ

ప్రజాయతే. ౬౩. తస్య దేవస్య మాహాత్మ్యం శ్రుతం సుబహుశో మయా, దేవర్షిసిద్ధమనుజైః స్తుతస్యేహ మహాత్మనః. ౬౪. కః స్తౌతి దైవతమజం యస్యైతత్సచరాచరమ్, అక్షయస్యాప్రమేయస్య కిరణోద్గమనాద్భవేత్. ౬౫. దక్షిణాత్కిరణాద్యస్య సంభూతో భగవాన్హరిః, వామాద్భవాంస్తథా జాతః కిరణాత్కిల కంజజ. ౬౬. లలాటాద్యస్య రుద్రస్తు కా తుల్యా తేన దేవతా, తస్య దేవస్య కః శక్తః ప్రవక్తుం గుణవిస్తరమ్. ౬౭. సోఽహమిచ్ఛామి దేవస్య తస్య సర్వాత్మనః ప్రభోః, శ్రోతుమారాధనం యేన నిస్తరేయం భవార్ణవమ్. ౬౮. కేనోపాయేన మంత్రైర్వా రహస్యైః పరిచర్యయా, దానైర్వ్రతోపవాసైర్వా హోమైర్జప్యైరథాపి వా. ౬౯. ఆరాధితః సమస్తానాం క్లేశానాం హానిదో రవిః, శక్యః సమారాధయితుం కథం శంస ప్రజాపతే.

౦. ధర్మార్థకామసంప్రాప్తౌ పురుషాణాం విచేష్టతామ్, జన్మన్యవితథా సైకా క్రియా

యాదిత్యపరిచర్య యొక్కటియే. దుర్గమగుసంసారమను మహారణ్యము నడుమఁ జొచ్చి దరికానక సంతటఁ బర్వులిడుమూఢాత్ములకు ముక్తి మార్గము నుపదేశించునది సూర్యనమస్కార మొక్కటియే. కావున నేను సప్తలోకములకు ముఖ్యాధారుఁడై కాలముగలిగించువాఁడై సమస్త భూతముల హృదయసీమ వసించువాఁడును భూమిని రక్షించువాఁడును గ్రహములగు చంద్రాదుల కధిపతియు మహాతేజస్సంపన్నుఁడు లోకము లకు మంగళముచేయువాఁడు జగత్తును వెలిఁగించువాఁడును దలఁచిన మాత్రముననే పాపములవాపువాఁడును నాద్యంతములులేనివాఁడును వేల్పుబెద్దయునగు నాదేవు నారాధించి ప్రసన్నుంజేసుకొనఁ గోరుచున్నాఁ డను. ఉపదేశమొసంగి యనుగ్రహము జూపుము. నావుడు భక్తిభరిత మగు నాతనివచనము నాకర్ణించి పితామహుఁ డింతింతనరాని సంతోష మును బొంది యాతని కిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! సూర్యారాధన మునుగుఱించిన వ్రతోపవాసజపాదివిశేషక్రియలను లెస్సగ నడిగితివి. సావధానముగ నాకర్ణింపుము. మొదలులేనిదియు నింద్యవస్తువుల విడచి యున్నదియు సర్వభూతములందును వ్యాప్తమైయున్నట్లు తోఁచునదియు సదసత్తులకన్న వేఱయినదియునగు నేపరబ్రహ్మమువలన సృష్ట్యారంభమున నిత్యములు మహామహిమసంపన్నములు నగుప్రధాన (మహాత్)మునకుఁ బురుషునకు క్షోభము జనించుచున్నదో బ్రహ్మాండమంతయు నెవనిచేఁ

---

యార్కం సమాశ్రితా. ౨౧. దుర్గసంసారకాంతారమపారమభిధావతామ్, ఏకః సూర్య నమస్కారో ముక్తిమార్గస్య దేశి(శ)కః. ౨౨. సోఽహమిచ్ఛామి తం దేవం సప్తలోక పరాయణమ్, కాలాయనమశేషస్య జగతో హృద్యవస్థితమ్. ౨౩. ఆరాధయితుం గోపాలం గ్రహేశమమితౌజసమ్, శంకరం జగతో దీపం స్మృతమాత్రాఘనాశనమ్. ౨౪. తమనాద్యం సురశ్రేష్ఠం ప్రసాదయితుమిచ్ఛతః, ఉపదేశప్రదానేన ప్రసాదం కర్తుమర్హసి. ౨౫. తస్యైతద్వచనం శ్రుత్వా భక్తిముద్వహతో రవౌ, జగామ పరి తోషం స పద్మయోనిర్మహాతపాః. ౨౬. బ్రహ్మోవాచ.—యత్పృచ్ఛసి ద్విజశ్రేష్ఠ సూర్యస్యారాధనం ప్రతి, వ్రతోపవాసజప్యాది తదిహైకమనాః శృణు. ౨౭. అనాది యత్పరం బ్రహ్మ సర్వహేయవివర్జితమ్, వ్యాప్యయత్సర్వభూతేషు స్థితం సదసతః పరమ్. ౨౮. ప్రధానపుంసోరనయోర్యతః క్షోభః ప్రవర్తతే, నిత్యయోర్వ్యాపినోశ్చైవ జగ దాదౌ మహాత్మనోః. ౨౯. తత్క్షోభకత్వాద్బ్రహ్మాండం సృష్టేర్హేతుర్నిరంజనః, అహేతురపి

గలంతనొంది యుద్భవించుచున్నదో అట్టి బ్రహ్మాండముయొక్క సృష్టికి మూలకారణమై యవ్యక్తమై సర్వాకారమై తనకెద్దియుఁ గారణము లేనిదై యుండునో అట్టి పరబ్రహ్మమగుపరమేశ్వరుఁడు కారణములేకయే జననము నొందుచున్నాఁడు. అట్టి యీశ్వరునివిలాసములే ప్రధానమును పురుషుఁడు నగుచున్నవి. కావున నీవిధముగ సకారణజన్ముఁడగునీశ్వరుఁడు ప్రభువై యుండుటచేఁ బ్రపంచమును సృజించునభిలాషంబు నెమ్మనంబునఁ దోఁప బ్రహ్మత్వమునొంది సృష్టిఁజేసెను. తరువాత నాసృష్టిని బ్రోచుట కిచ్ఛగించి విష్ణుఁడన నొప్పెను. ప్రపంచసంహార మభిలషించి రుద్రరూపము దాల్చెను. ఇవియెల్ల జగన్నాథుఁడగు నీరవియే యిష్టాను సారముగఁ జేయుచున్నాఁడు. అట్టి యద్వితీయు నక్షరుని సర్వదేవవంద్యుని భేదాభేదరూపు నాదిత్యదేవుని నమస్కరించి యాతని నారాధించువిధంబు సర్వంబు నున్నదియున్నట్లు నీకడ వర్ణించెదను. ఆభాస్కరుని రహస్యము గూడఁ జెప్పెద వినుము. మున్నుభాస్కరదేవుఁడు నాయారాధనమునకు మెచ్చి యీపరమరహస్యము నెఱింగించియుండెను. అవ్విధి నెఱింగింతు నవధాన మొసంగుము.

## షట్షష్టితమాధ్యాయము.

---

సర్వాత్మా జాయతే పరమేశ్వరః. ౧౦. ప్రధానపురుషత్వం చ తస్యైవేశ్వరలీలయా, సముపైతి తతశ్చైవం బ్రహ్మత్వం ఛందతః ప్రభుః. ౧౧. తతః స్థితౌ పాలయితా విష్ణుత్వం జగతః క్షయే, రుద్రత్వంచ జగన్నాథః స్వేచ్ఛయా కురుతే రవిః. ౧౨. తమేకమక్షరం ధామ సర్వదేవనమస్కృతమ్, భేదాభేదస్వరూపం తం ప్రణిపత్య దివాకరమ్, వర్ణయిష్యేఽఖిలం విప్ర తస్యైవారాధనం రవేః. ౧౩. గుహ్యాం చాపి తథా తస్య భాస్కరస్య శృణుష్వ వై, తుష్టేన హి పురా మహ్యం కథితం భాస్కరేణ తు. ౧౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి యాజ్ఞవల్క్యబ్రహ్మసంవాదే సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యవర్ణనం నామ షట్షష్టితమోఽధ్యాయః.

---

## సప్తషష్టితమాధ్యాయము.

బ్రహ్మ యాజ్ఞవల్క్యున కిట్లనియె. మున్ను సూర్యునందు భక్తి గలిగి నాకు మూర్తి గలుగుటకై విగ్రహారాధన మొనరించుచు నుదయమున నాదేవు నుతించుచు నాపరాత్పరుని యజించుచు భక్తినమ్రుఁడనై యుండ నామహానుభావుండు ప్రసన్నుండై నాయెదుట సాక్షాత్కరించి యొక్క పరమరహస్యమును నా కెఱింగించెను. సాక్షాత్కరించిన యాదేవుని మ్రోల నిలచి యంజలిఘటించి యొక్క ప్రశ్న మడిగితిని. "దేవా! సాంగోపాంగములగు నాలుగువేదములందును బురాణములందును నీవజుఁడవనియు నిత్యుఁడవనియు నెల్లభూతముల నుత్తముఁడవనియు జగత్కారణమనియు గానము చేయఁబడుచున్నాఁడవు. భూతభవిష్యద్రూపమగు నీచరాచరమయప్రపంచమంతయు నీయందే ప్రతిష్ఠితమై యుండెను. గార్హస్థ్యము నాధారముగఁజేసికొనిన నాలుగాశ్రమములవారును వేలువేలుమూర్తుల నాశ్రయించి యనుదినము నిన్నే యజించుచున్నారు; సర్వభూతములకును బ్రధానదైవతము తల్లిదండ్రులే గదా! నీవు నిత్యుఁడవు గద! నీకారాధ్యుఁడైన దేవుఁ డెవ్వరు? ఎవని నీవు నిచ్చలు యజించుచున్నావో యెఱుంగనేరకున్నవారము. అది విన నామనము వేడుకపడుచున్నది. సదయుఁడవై తెలుపవే దేవదేవా!" నావుఁ డాతఁడు నా కిట్లనియె. బ్రహ్మ! నీవడిగిన యీయాత్మగుహ్యము సనాతనమైన పరమరహస్యము. ఒరుల కెఱింగింపరాదు. అయినను నీవు భక్తియుక్తుఁడవై

---

బ్రహ్మోవాచః—ప్రభాతే సంస్తుతో దేవో మూర్తిహేతోర్మయా పురా, యజంతం చాపరం దేవం భక్తినమ్రం మహామతిః. ౧. ప్రత్యక్షత్వమథో గత్వా రహస్యం ప్రోక్తవాన్మమ, అహం చ కృతవాన్ప్రశ్నం దృష్ట్వా ప్రత్యక్షతో రవిమ్. ౨. వేదేషు చ పురాణేషు సాంగోపాంగేషు గీయసే, త్వమజః శాశ్వతో ధాతా మహాభూత మనుత్తమమ్. ౩. ప్రతిష్ఠితం భూతభవ్యం త్వయి సర్వమిదం జగత్, చత్వారో హ్యాశ్రమా దేవ సర్వే గార్హస్థ్యమూలకాః. ౪. యజంతే త్వామహరహర్నానామూర్తిం సమాశ్రితాః, పితా మాతా హి సర్వస్య దైవతం త్వం హి శాశ్వతమ్. ౫. యజసే చైవ కం దేవమేతం చాపి న విద్మహే, కథ్యతాం మమ దేవేశ పరం కౌతూహలం హి మే. ౬. ఇత్థం మయోక్తో భగవానిదం వచనమబ్రవీత్, అవాచ్యమేతద్వక్తవ్యమాత్మగుహ్యం సనాతనమ్. ౭. తవ భక్తిమతో బ్రహ్మన్వక్ష్యామిహ యథాతథమ్,

యుండుకతన నద్దానిని యథార్థముగ నీకెఱింగింతును సావధానుఁడవై యాకర్ణింపుము. ఏలయన నే నారాధించుదైవతము సూక్ష్మమైయుండుటచేఁ దెలియరాక యవ్యక్తముగను గదలకయుండుటచే ధ్రువముగను నింద్రియములకు నింద్రియార్థములగు సర్వభూతములకును వెలియయి యున్నది గద! ఆదేవుఁడే యెల్లభూతములకు నంతర్యామి యనియు క్షేత్రజ్ఞుఁడనియుఁ గీర్తింపఁబడుచున్నాఁడు. ఈతఁడే సత్త్వరజస్తమోరూపములగు మూఁడుగుణములకు వెలియై పురుషుఁడని కీర్తింపఁబడుచున్నాఁడు. ఆతఁడే భగవంతుఁడగు హిరణ్యగర్భుఁడగుచు బుద్ధియని స్మరింపఁబడుచున్నాఁడు. యోగశాస్త్రములందు మహత్తని చెప్పఁబడుచున్నాఁడు. ఆతఁడే (హిరణ్యగర్భుఁడే) సాంఖ్యశాస్త్రములందుఁ బ్రధానుఁడని పఠింపఁబడుచున్నాఁడు. ఇప్పగిది నెల్లప్పుడు నానానామములచేఁ గీర్తింపఁబడుచు సర్వమును బొంది విశ్వరూపుఁడై విశ్వమునకు మూలకందమై విశ్వాత్ముఁడై యున్నవాఁడు. ఈత్రైలోక్యము నాతనిచే ధరింపఁబడుచున్నది. ఆతఁ డశరీరుఁడయ్యును సమస్తశరీరముల నున్నాఁడు. కాని కర్మలచేఁ బూయఁబడియుండుట లేదు. ఆతఁడే నాకును నీకును నెల్ల శరీరధారులకు నంతరాత్మయై యున్నాఁడు. అందఱి శుభాశుభకర్మలకు సాక్షియై యున్నాఁడు. తానేమియుఁ జేయుట లేదు. కర్మలేపము నొందుట లేదు. ఆతఁడే సగుణుఁడయ్యును గుణములు లేనివాఁడై సర్వవ్యాపియై జ్ఞానమాత్రముచే నెఱుంగఁదగియున్నాఁడు. ఎటు చూచిన నాతనిపాదములే. ఆతనిహస్తములే. నలుగడల నాతనికన్నులే ఆతనిశిరములే. ఆతని

---

యతః సూక్ష్మమవిజ్ఞేయమవ్యక్తమచలం ధ్రువమ్. ౮. ఇంద్రియైరింద్రియార్థైశ్చ సర్వభూతైశ్చ వర్జితమ్, స హ్యంతరాత్మా భూతానాం క్షేత్రజ్ఞశ్చేతి కథ్యతే. ౯. త్రిగుణవ్యతిరిక్తోఽసౌ పురుషశ్చేతి కథ్యతే, హిరణ్యగర్భో భగవానేన్షవ బుద్ధిరితి స్మృతః. ౧౦. మహానితి చ యోగేషు ప్రధానశ్చేతి కథ్యతే, సాంఖ్యే చ పఠ్యతే శాస్త్రే నామభిర్బహుభిః సదా. ౧౧. విశ్వగో విశ్వభూతశ్చ విశ్వాత్మా విశ్వసంభవః, ధృతం చైవాత్మకం యేన ఇదం త్రైలోక్యమాత్మనా. ౧౨. అశరీరః శరీరేషు లిప్యతే న చ కర్మభిః, మమాంతరాత్మా తవచ యే చాన్యే దేహసంజ్ఞకాః. ౧౩. సర్వేషాం సాక్షిభూతోఽసౌ న కరోతి న లిప్యతే, సగుణో నిర్గుణో విజ్ఞుర్జ్ఞానగమ్యో హ్యసౌ స్మృతః. ౧౪. సర్వతః పాణిపాదోఽసౌ సర్వతోఽక్షిశిరోముఖః, సర్వతః శ్రుతి

ముఖములే. అంతట నాతనిచెవులే. ఇప్పగిది నెల్లజగంబును దానన్నై యావరించియున్నాఁడు. ఆతనికిఁ బ్రపంచమే శిరమును భుజములు పాదములు నేత్రములు నాసికయు నయియున్నది. ఆతఁ డొక్కఁడే యెల్ల క్షేత్రములందును స్వేచ్ఛగ యథాసుఖముగ సంచరించుచున్నాఁడు. ఈతఁడు సంచరించుక్షేత్రములే యీసర్వశరీరములు. శుభాశుభంబులు విత్తనములు. ఈబీజములవలనఁ గలిగినశరీరముల నెవ్వఁడు ధ్యానముచే నెఱుంగుచు నున్నవాఁడో యాతఁడే క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. ఆదేవుఁ డిది యెఱింగియుండుకతన క్షేత్రజ్ఞనామమును బొంది యున్నాఁడు. అవ్యక్తమై జలమయమగుపురమున (శరీరమున) శయనించి యున్నందున నాదేవుఁడే పురుషుఁ డనఁబరగుచున్నాఁడు. విశ్వమనఁగ నానావిధములైనది యని యెఱుంగవలయును. ఆదేవుఁ డంతటనుండు వాఁడగుటచే బహురూపములు గలిగియున్నందున విశ్వరూపుఁ డనఁ బడుచున్నవాఁడు. ఈసనాతనపురుషుఁడే మహాపురుషుఁ డనఁబరఁగుచున్న వాఁడు. ఆదేవుఁడు తనయవిద్య నాశ్రయించి వికారమునుబొంది తనంత దానే యొకరూపము గైకొనును. ఆకాశమునుండి దిగజారినయుదకము పుడమిపైఁబడి దానిరసవిశేషములచే వేఱువేఱురుచులఁ బొందుపగిది గుణములు వేర్వేరయి యుండుకతన వానినాశ్రయించి యీదేవుఁడు వేఱువేఱువికారములఁ బొందుచుండును. ఒక్కఁడయ్యును వాయువు శరీరమున స్థానభేదముచేఁ బ్రాణాపానాదిరూపముల నైదువిధము లయి యుండుపగిది నావిశ్వరూపుఁడును భేదము నొందుచున్నాఁడు. అగ్ని

---

యుక్తోఽసౌ సర్వమావృత్య తిష్ఠతి. ౧౫. విశ్వమూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షినాసికః, ఏకశ్చరతి క్షేత్రేషు స్వైరచారీ యథాసుఖమ్. ౧౬. క్షేత్రాణ్యస్య శరీరాణి బీజం చాపి శుభాశుభమ్, తాని వేత్తి స యోగాత్మా అతః క్షేత్రజ్ఞ ఉచ్యతే, అవ్యక్తే పురే శేతే తేనాసౌ పురుషః స్మృతః. ౧౭. విశ్వం బహువిధం జ్ఞేయం స చ సర్వత్ర విద్యతే, తస్మాత్స బహురూపత్వాద్విశ్వరూప ఇతి స్మృతః. ౧౮. మహాపురుషశబ్దం హి బిభర్త్యేష సనాతనః, స తు వై విక్రియాపన్నః సృజత్యాత్మానమాత్మనా. ౧౯. ఆకాశాత్పతితం తోయం యాతి స్వాద్వన్తరం యథా, భూమే రసవిశేషేణ తథా గుణవశాత్తు సః. ౨౦. ఏక ఏవ యథా వాయుర్దేహే తిష్ఠతి పంచధా, ఏకత్వం చ పృథక్త్వం చ తథా తస్య న సంశయః. ౨౧. స్థానాంతరవిశేషేణ యథాగ్నిర్లభతే

హోత్రుఁడొక్కఁడయ్యు నాయాస్థానవిశేషములఁబట్టి దావాగ్ని మొదలగు ననేకనామములచే వ్యవహరింపఁబడుమాదిరి యీతఁడును వేర్వేఱు నామములఁ దాల్చుచున్నాఁడు. వేయిదీపము లొక్కదీపమునుండి పుట్టినటుల వేలకొలఁదిరూపము లీతఁడొక్కనివలననే బుట్టుచున్నవి. ఈయంతరాత్మ వికారముడిగి యెప్పుడు తననుదాఁ దెలియునో యప్పు డొక్కఁడేగాయుండును. ఈతనికిఁ బ్రళయకాలమున నేకత్వమును సృష్టిస్థితులు జరుగునప్పుడు బహుత్వమును గలుగుచున్నవి. ఈజగత్తున నెచ్చటను బీజభూతుఁడగు నీపురుషుఁడుదక్క నొండెద్దియు స్థావరజంగమములలో నిత్యవస్తువు లేదుగదా; ఆపురుషుఁడే యెందును నాశరహితుఁడు నియత్త లేనివాఁడును సర్వవ్యాపియు నని చెప్పఁబడుచున్నాఁడు ఆపురుషు నుండియేసర్వజగత్తునకుఁ గారణమై సత్త్వరజస్తమోగుణములతోఁగూడిన యవ్యక్తము (అవిద్య) జనించినది. ఆయవ్యక్తమే వ్యక్తమని తోఁచుచు వ్యక్తమై ప్రకృతి యనఁబరగుచున్నది అదియే సదసద్రూపుఁడగుబ్రహ్మకు నివాసమని యెఱుంగనగును. ఆతనికన్న నుత్తముఁడు వేరెలేఁడు. ఆతఁడే తండ్రి; ఆతఁడే ప్రజలను పాలించువాఁడు. ఇట్టి మహానుభావుఁ డెవ్వఁడో యాతఁడే నాకాత్మ. కాన నాతనినే యేఁబూజించుచున్నాను. ఎవ్వరేనియుఁ గొందఱు పుణ్యములచే స్వర్గమున కేగియు నాశరీరు లచ్చటఁ గూడ నాదేవుని నమస్కరించుచుండిరేని వా రాతనియనుగ్రహమున నాతనియాజ్ఞచే నుత్తమగతిఁ బొందుచున్నారు. ఆతనినే వేర్వేఱుమత

---

పరామ్, సంజ్ఞాం దావాగ్నికాద్యేషు తథా దేవో వ్యాసౌ స్మృతః. ౨౨. యథా దీపసహస్రాణి దీప ఏకః ప్రసూయతే, తథా రూపసహస్రాణి స ఏవైకః ప్రసూయతే. ౨౩. స యదా బుధ్యతేత్మానం తదా భవతి కేవలః, ఏకత్వం ప్రలయే చాస్య బహుత్వం స్యాత్ప్రవర్తనే. ౨౪. నిత్యం హి నాస్తి జగతి భూతం స్థావరజంగమమ్, ఋతే తమేకమీశానం పురుషం బీజసంజ్ఞితమ్. ౨౫. అక్షయశ్చాప్రమేయశ్చ సర్వగశ్చ స ఉచ్యతే, తస్మాదవ్యక్తముత్పన్నం త్రిగుణం సర్వకారణమ్. ౨౬. అవ్యక్తావ్యక్తభావస్థా యా సా ప్రకృతిరుచ్యతే, తాం యోనిం బ్రహ్మణో విద్ధి యోసౌ సదసదాత్మకః. ౨౭. నాస్తి తస్మాత్పరో హ్యన్యః స పితా స ప్రజాపతిః, ఆత్మా మమ స విజ్ఞేయస్తతస్తం పూజయామ్యహమ్. ౨౮. స్వర్గతాశ్చాపి యే కేచిత్తం నమస్యంతి దేహినః, తే తత్ప్రసాదాద్గచ్ఛంతి తేనాదిష్టాః పరాం గతిమ్. ౨౯. తందేవాశ్చాసురాశ్చైవ నానామతసమాశ్రితాః,

ముల నాశ్రయించి దేవతలు రాక్షసులును భక్తితో నారాధించు చున్నారు. ఆతఁడును వారలకుఁ బుణ్యగతుల నొసంగుచున్నాఁడు. ఆదేవుఁడు సర్వవ్యాపియనియు గుణహీను (లెక్కలేనిగుణములుగలవాఁ) డనియుఁ గీర్తింపఁబడుచున్నాఁడు. ఇదియెల్లఁ దెలిసినవాఁడనై సనాతనుఁ డగు నాయంతర్యామిని బూజించుచున్నాఁడను. సర్వభూతములకు నీశ్వ రుఁడు నచ్యుతుఁడు దేవతలకెల్ల దేవతయగువాఁడు నీశ్వరుఁడునగు నాభాస్కరునే యేనెప్పుడు బూజించుచున్నాను. ఇటు లీపరమరహస్య మును మున్నే బ్రశ్నింప నాదివాకరుఁ డానతిచ్చె. బ్రాహ్మణోత్తమా! నీవమ్మహాత్ముని మహాతపస్సంపన్నుని బూజింపుము.

ఇది సప్తషష్టితమాధ్యాయము.

---

## అష్టషష్టితమాధ్యాయము.

బ్రహ్మ మఱల యాజ్ఞవల్క్యున కిట్లనియె. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లేదేవుని నిత్యము బరాయణముగఁ బూజించుచున్నారో అట్టి సర్వదేవ నమస్కృతుని నీకెఱిఁగింతు వినుము. బ్రహ్మ యెల్లప్పుడు పద్మాకృతియగు దివాకరుని బద్మములచేతను గుగ్గిలముచేతను బూజించుచున్నాఁడు. మహాదేవుఁ డెల్లవేళల వ్యోమాకారుఁడగు దివాకరుని జాతికుసుమముల చేతను విజయధూపముచేతను బూజించుచున్నాఁడు. వృషణము (అడ్డ

---

భక్త్యా సంపూజయంత్యాద్యం గతిం చైషాం దదాతి | స॥ ౩౦. స హి సర్వగతశ్చైవ నిర్గుణశ్చాపి కథ్యతే, ఏవం జ్ఞాత్వా తమాత్మానం పూజయామి సనాతనమ్, భాస్కరం దేవదేవేశం సర్వభూతేశమచ్యుతమ్. ౩౧. బ్రహ్మోవాచ.—ఇత్యుక్తవాన్పురా పృష్టో మయా దేవో దివాకరః, పూజయ త్వం మహాత్మానం తపంతం విపులం తపః.౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి బ్రహ్మయాజ్ఞవల్క్యసంవాదే సప్తమీకల్పే సూర్యమహిమవర్ణనం నామ సప్తషష్టితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—వచ్మి తే పరమం దేవం సర్వదేవైశ్చ పూజితమ్, ఆరాధయంతి యం దేవం బ్రహ్మవిష్ణుమహేశ్వరాః. ౧. పద్మాకృతిం సదా బ్రహ్మా నలినైర్గుగ్గులేన తు, వ్యోమరూపం సదా దేవం మహాదేవోఽర్చతే రవిమ్. ౨. జాతిపుష్పైర్ధ్విజశ్రేష్ఠ ధూపేన

పరము). సిహ్లాకము (అందుగుబంక) శ్రీఖండము (తామర) అగురు, కర్పూరము, తుంగముస్త, చర్మముగల శర్కర అను నీవస్తువులెల్లఁగూర్చి చేసిన ధూపద్రవ్యము విజయంబునాఁబడు. ఇది యాదేవుఁడే స్వయముగ నిర్మించెను. విష్ణుమూర్తి చక్రాకారుఁడగురవిని నిచ్చలుఁ దాను నల్లకలువ రేకులవలె నల్లనివాఁడు గనుక దనకుఁ బ్రియములగు నల్లకలువలచేతను గడిమిపువ్వులచేతను నగురుధూపముచేతను భక్తిశ్రద్ధలతోఁ బూజించు చున్నాఁడు. మున్నొకప్పుడు నే నాదేవునొద్దకేగి యాతని యారాధనము నెఱుంగఁగోరి యెల్లప్పుడు భాస్కరుని యారాధనమునం దేయేపుష్పము లిష్టమైనవని యడుగ నాదేవుఁడు తనపూజకుఁ గావలయుపుష్పములనెల్లఁ దానే యెఱింగించెను. దానినెల్ల వివరింతు వినుము. మల్లెపుష్పము లతోఁ బూజించినమానవుఁడు సుఖములుగలవాఁడగును తెల్లతామర లచేఁగాని యెఱ్ఱతామరలచేఁగాని పూజించి శాశ్వతసౌభాగ్యము నొందు చున్నాఁడు. పరిమళయుక్తములై యప్పుడు తెచ్చినకుటజకుసుమములచే మహదైశ్వర్యమును గాంచుచున్నాఁడు. ఈపుష్పములతోఁ బ్రతిదినము పూజించువాఁ డక్షయఫలమును బొందుచున్నాఁడు. మందారపుష్పము లచే రవిని బూజించినచోఁ బదునెన్మిదికుష్ఠవ్యాధులు నంతరించును మారేడిపత్రితోఁగాని పూవులతోఁగాని పూజించి గొప్పకాంతి నైశ్వర్య మును బొందును. జిల్లేడుపూవులతో మాలలుగట్టి వానిచేఁ బూజించి నచో నాదిత్యుఁడు ప్రసన్నుఁడై సర్వకామితముల నొడఁగూర్చును.

---

విజయేన తు, వృషణం సిహ్లాకం విప్ర శ్రీఖణ్డమగరుస్తథా. ౩. కర్పూరం చ తథా ముస్తా శర్కరా సత్వచా ద్విజ, ఇత్యేష విజయో ధూపః స్వయం దేవేన నిర్మితః. ౪. కేశవశ్చక్రరూపం తు సదా సంపూజయేద్రవిమ్, నీలోత్పలదలశ్యామో నీలోత్పలకదంబకైః. ౫. ధూపేనాగురుసంజ్ఞేన భక్తిశ్రద్ధాసమన్వితః, మయా స పృష్టో దేవేశస్తస్యైవారాధనాయ వై. ౬. కాని పుష్పాణి చేష్టాని సదా భాస్కరపూజనే, తేన చోక్తాని పుష్పాణి స్వయం తాని నిబోధ మే. ౭. మల్లికాయాస్తు కుసుమైర్భోగవాఞ్జాయతే నరః, సౌభాగ్యం పుండరీకైశ్చ భజత్యేవ చ శాశ్వతమ్. ౮. గన్ధకుటజకైః పుష్పైః పరమైశ్వర్యమశ్నుతే, భవత్యక్షయమత్యన్తం నిత్యమర్చయతో రవిమ్. ౯. మన్దారపుష్పైః పూజా తు సర్వకుష్ఠవినాశనీ, బిల్వపత్రైశ్చ కుసుమైర్మహతీం శ్రియమశ్నుతే. ౧౦. అర్కస్రజా భవత్యర్థం సర్వకామఫలప్రదః, ప్రదద్యాద్రూపిణీం

వకుళపుష్పములమాలతోఁ బూజించిన నుత్తమరూపముగలకన్య లభించును. కింశుకపుష్పములతోఁ బూజించినవానికి సూర్యునివలన వేఁడి మొదలగుబాధ లుండవు. అగస్త్యకుసుమములతోఁ బూజించినచో నెల్లవారి కనుకూలుఁడగును. కరవీరపుష్పములతోఁ బూజించినవాఁడు సూర్యానుచరుఁ డగును. ముద్గరపుష్పములతో దివాకరుని బాగుగఁ బూజించినచో సూర్యునిరథమునెక్కి తత్సాలోక్యము నొందును. పెద్ద సదాపుష్పములు వేయింటితోఁ బూజించెనేనియుఁ బూషునిసాలోక్యము నొందుచున్నాఁడు. బకపుష్పములఁ బూజించినచో భానునితో నొక్క లోకమున వసించుచున్నాఁడు. నాలుగువర్ణములుగల గంధముతోఁ బూజించినఁబంచభూతములకు నిలయమగు పరమాత్మునిపదముఁబొందును. ఇందేమియు ననుమానములేదు. భక్తితో సూర్యదేవాలయము తుడిచి యలికినవాఁడు రోగములెల్లఁ దొలఁగి శీఘ్రకాలమున బహుధనమార్జించును. ఆతనియాలయమును గైరికధాతువు వగైరాలతో నలికినయట్లైన మహైశ్వర్యములు శరీరకాంతిని బొంది రోగవిముక్తుఁడగును. మంటితో నలికినయట్లైనఁ బదునెన్మిది కుష్ఠములు నితరములగు మహావ్యాధులు నన్నియు నశించును అన్నిపూతలలోను రక్తచందనమును బూయుట యుత్తమమైనది యందురు. పుష్పములలోనెల్లఁ గరవీరపుష్పము లుత్తమములని చెప్పుచున్నారు. ఇంతకంటె వేఱొండెద్దియు

---

కన్యామర్చితో వకులస్రజా. ౧౧ కింశుకైరర్చితో దేవో న పీడయతి భాస్కరః, పూజితోఽగస్త్యకుసుమై రానుకూల్యం ప్రయచ్ఛతి. ౧౨. కరవీరైస్తు విప్రేన్ద్ర సూర్యస్యానుచరో భవేత్, తథా ముద్గరపుష్పైశ్చ సమభ్యర్చ్య దివాకరమ్. ౧౩. హంసయుక్తేన యానేన రవేః సాలోక్యతాం వ్రజేత్, శతపుష్పసహస్రైస్తు పూష సాలోక్యతాం వ్రజేత్, బకపుష్పైర్ద్విజశ్రేష్ఠ యాతి భానుసలోకతామ్. ౧౪. చతుః సమేన గంధేన సమభ్యర్చ్య దివాకరమ్, పఞ్చభూతాలయస్థానమాప్నుయాన్నాత్ర సంశయః. ౧౫. దేవాగారం తు సంమార్జ్య భక్త్యా యస్తు ప్రలేపయేత్, స రోగాన్ముచ్యతే క్షిప్రం ద్రవ్యలాభం చ విందతి. ౧౬. తస్య చాయతనం భక్త్యా గైరికేణోపలేపయేత్, ప్రాప్నుయాన్మహతీం లక్ష్మీం రోగైశ్చాపి ప్రముచ్యతే. ౧౭. అష్టాదశేహ కుష్ఠాని యే చాన్యే వ్యాధయో నృణామ్, ప్రలయం యాంతి తే సర్వే మృదా యద్యుపలేపయేత్. ౧౮. విలేపనానాం సర్వేషాం రక్తచందనముత్తమమ్, పుష్పాణాం కరవీరాణి ప్రశస్తాని ప్రచక్షతే. ౧౯. నాతః పరతరం కించిద్భాస్వ

భాస్కరునకుఁ బ్రియమైన వస్తువు లేదు. ఈద్రవ్యములతో సూర్యు నారాధించువాని కీలోకమునఁ బొందరానిదెద్ది? శ్రద్ధాయుక్తుఁడై కరవీర కుసుమములతో భాస్కరు నారాధించినవాఁడు భూలోకమున సర్వకామము లనుభవించి సూర్యునే కామితముగఁ బడసి యాతని సాయుజ్యము నొందును. ఆలయమును బాగుగ సలికి శుభకరమగు మండలమును జేసినచో సూర్యలోకమును బొంది శాశ్వతసంతోషము ననుభవించును. ఒకమండలము జేసినచో ధనవంతుఁడగును రెండుమండలములతో నారోగ్యవంతుఁ డగును. మూఁడింటితోఁ బుత్రపౌత్రాదిరూపమగు నవిచ్ఛిన్నసంతతి గలుగును. నాలుగింటిచే లక్ష్మీసమేతుఁ డగును ఏనింటితో విస్తారమైన ధాన్యము నొందుచున్నాఁడు ఆఱుమండలములతో నాయుష్మంతుఁడై బలమును యశంబును గాంచును. ఏడుమండలములతో భూమండలమున కధిపతి యగును. మఱియు నాయుష్మంతుఁడయి ధనపుత్రాదులతోఁగూడి సూర్యలోకమునఁబూజలనందుచున్నాఁడు. నేతిదీపారాధనమిచ్చినచో మంచినేత్రములు గలవాఁడగును. కటువగు నూనెదీపము నిచ్చినచో శత్రువుల జయించును. నువ్వులనూనె దీపము నిచ్చినచో సూర్యలోకమునఁ బూజలందుకొనును మధూకతైలముతో దీపముంచినచో గొప్పసౌభాగ్యమును బొందును. శాస్త్రప్రకారముగ నాదిత్యుని బుష్పధూపాదులతోఁ బూజించువిద్వాంసుఁడు శక్తికొలఁది నైవేద్యమును భక్తితో నీవలయును. పుష్పములనడుమఁ బ్రశస్తమైనది

---

తస్తుష్టికారకమ్, కిం తస్య న భవేల్లోకే యస్త్వేభిః స్వర్చయేద్రవిమ్. ౨౦. కరవీరైః పూజయేద్యో భాస్కరం శ్రద్ధయాన్వితః, సర్వకామసమృద్ధోఽసౌ సూర్యకామమవాప్నుయాత్. ౨౧. విలేప్యాయతనం యస్తు కుర్యాన్మణ్డలకం శుభమ్, స సూర్యలోకమాసాద్య మోదతే శాశ్వతీః సమాః. ౨౨. ఏకేనాస్య భవేదర్థో ద్వాభ్యామారోగ్యమశ్నుతే, త్రిభిః సన్తత్యవిచ్ఛిన్నా చతుర్భిర్భార్గవీం లభేత్. ౨౩. పఞ్చభిర్విపులం ధాన్యం షడ్భిరాయుర్బలం యశః, సప్తమండలకారీ స్యాన్మండలాధిపతిర్నరః. ౨౪. ఆయుర్ధనసుతైర్యుక్తః సూర్యలోకే మహీయతే, ఘృతప్రదీపదానేన చక్షుష్మాఞ్జాయతే నరః. ౨౫. కటుతైలప్రదానేన స శత్రూఞ్జయతే నరః, తిలతైలప్రదానేన సూర్యలోకే మహీయతే. ౨౬. మధూకతైలదానేన సౌభాగ్యం పరమం వ్రజేత్, సంపూజ్య విధివద్దేవం పుష్పధూపాదిభిర్బుధః. ౨౭. యథాశక్త్యా తతః పశ్చాన్నైవేద్యం భక్తితో

జాతిపుష్పము. ధూపములలో నెల్ల విజయధూపము ప్రశస్తమైనది. గంధద్రవ్యములలో నెల్లఁ గుంకుమము శ్రేష్ఠమైనది. మైపూతలలో రక్తచందన ముత్తమమైనది. దీపములన్నింట నేతిదీపము లెస్స. నైవేద్యముల నెల్ల మోదక ముత్తమము. వీనితో నాదేవుఁడు సంతసించి సాన్నిధ్యము నిచ్చును. ఇటుల విధ్యుక్తముగఁ బూజించి వలగొని దేవదేవుఁడగు నాదివాకరునకు శిరమువంచి నమస్కరింపవలయును. ఆమీఁద సూర్యు నెదుట నాతనిమండలము దిలకించుచు నాసనమున సుఖముగఁ గూర్చుండ వలయును ఒకసిద్ధార్థమును నీటిలోఁ గలిపి హస్తమునఁ జేర్చుకొని యేదే నొక్క కోరికను మనమునఁ దలఁచి దంతములకుఁ దగులకుండునటుల నొక్క సారి యాసిద్ధార్థజలమును ద్రాగవలయును. ఇయ్యది తొలిసప్తమినాఁటి చర్య. రెండవసప్తమినాఁడు రెండుసిద్ధార్థముల నీటిలోఁగలిపి సేవింపవల యును. ఇటులే మూఁడవసప్తమినాఁడు మూఁడుసిద్ధార్థములు, నాలుగవ సప్తమిని నాలుగు నైదవసప్తమినాఁ డేనింటిని నారవసప్తమినాఁ డారింటిని సేవింపవలయునని వేదపురుషుని యాజ్ఞ కలదు. అటులనే యేడవ సప్తమినాఁ డేడుసిద్ధార్థములు ద్రావనగును. మొదటినుండియుఁ దుదివఱకు నీజలము నభిమంత్రించుటకు మంత్రము చెప్పుచున్నాను. "నీవు నిజముగ సిద్ధార్థకుఁడవే. అందఱకును సిద్ధి నొసంగుచుండుటచే నెల్లరు నిన్నటులఁ గీర్తించుచున్నారు. నిన్ను సేవించుటచే నన్నుగూడ నా

---

న్యసేత్, పుష్పాణాం ప్రవరా జాతీ ధూపానాం విజయః పరః. ౨౮. గంధానాం కుంకుమం శ్రేష్ఠం లేపానాం రక్తచందనమ్, దీపదానే.ఘృతం శ్రేష్ఠం నైవేద్యే మోదకః పరః. ౨౯. ఏతైస్తుష్యతి దేవేశః సాన్నిధ్యం చాధిగచ్ఛతి, ఏవం సంపూజ్య విధివత్కృత్వా చాపి ప్రదక్షిణమ్. ౩౦. ప్రణమ్య శిరసా దేవం దేవదేవం దివాకరమ్, సుఖాసీనస్తతః పశ్యేద్ద్రవేరభిముఖే స్థితః. ౩౧. ఏకం సిద్ధార్థకం కృత్వా హస్తే పానీయ సంయుతమ్, కామం యథేష్టం హృదయే కృత్వా తం వాంఛితం నరః. ౩౨. పిబేత్స తోయం తం విప్ర అస్పృష్టం దశనైః సకృత్, ద్వితీయాయాం తు సప్తమ్యాం ద్వౌ గృహీత్వా తు సువ్రత. ౩౩. తృతీయాయాం తు సప్తమ్యాం గ్రహీతవ్యాస్త్రయోఽపి చ, జ్ఞేయాశ్చతుర్థ్యాం చత్వారః పఞ్చమ్యాం పఞ్చ ఏవ హి. ౩౪. షట్ పిబేచ్చాపి షష్ఠ్యాం తు ఇతీయం వైదికీ శ్రుతిః, సప్తమ్యాం సప్తమాయాం తు సప్త చైవ పిబేన్నరః. ౩౫. ఆదౌ ప్రభృతి విజ్ఞేయో మంత్రోఽయమభిమంత్రణే, సిద్ధార్థకస్త్వం హి లోకే సర్వత్ర శ్రూయసే యథా, తథా మామపి సిద్ధార్థమర్థతః కురుతాం రవిః. ౩౬. తతో

దిత్యుఁడు ప్రయోజనము నొసఁగి సిద్ధార్థునిజేయుఁగాత" (సిద్ధార్థక స్త్వం హి లోకే సర్వత్ర శ్రూయతే యథా, తథా మా మపి సిద్ధార్థం అర్థతః కురుతాం రవిః) అని మంత్రము చదువవలయును. పిమ్మట హవిస్సునంటి యిష్టమగుజపము చేయవలయును. తరువాత యథాశాస్త్రముగ నగ్నిలో హోమములు చేయవలయును. ఇప్పగిది నుత్తమములగు నేడుసప్తములు వ్రతముచేయవలయును. ఈయుదకసప్తమీవ్రత మొకటి మొదలేడింటి వఱకును జేయఁదగినది. మొదటిసప్తమి నీటితోఁ జేయవలయును. నేతితోఁ గలిపి రెండుసిద్ధార్థకములను రెండవసప్తమిని జేయవలయును. తేనెగలిపిన సిద్ధార్థకములమూఁడిటిని మూఁడవసప్తమిని పెరుగుగలిపిన నాల్గు సిద్ధార్థకములు నాలవసప్తమిని వ్రతము చేయవలయును. పాయసాన్నము గలిపిన యైదుసిద్ధార్థకముల నైదవసప్తమిని గోమయముచేర్చిన యాఱు సిద్ధార్థకముల నారవసప్తమిని పంచగవ్యముతోఁ గలిపిన యేడుసిద్ధార్థకముల నేడవసప్తమిని పానముచేయవలయును. సిద్ధార్థకమనఁగా ఆవగింజ. ఈసప్తమీవ్రతమునకు సర్షపసప్తమీవ్రతమని పేరు. ఈవ్రతమును యథావిధి నొనర్చినవాఁడు బహుపుత్రధనయుక్తుఁడై యెప్పుడును సిద్ధార్థుఁడై యుండును. జన్మాంతమున విభావసునిసాలోక్యము నొందును. కావున నీవిధాన మనుసరించి భాస్కరదేవుని బాగుగ బూజింపవలయును.

ఇది అష్టషష్టితమాధ్యాయము.

---

హవిరుపస్పృశ్య జపం కుర్యాద్యదభీప్సితమ్, హుతాశనం చ జుహుయాద్విధిదృష్టేన కర్మణా. ౩౭. ఏవమేవ పరాః కార్యాః సప్తమ్యః సప్తసర్వదా, ఏకాత్ప్రభృతి కార్యా సా సర్వదోదకసప్తమీ. ౩౮. ఏకం తోయేన సహితం ద్వే చాపి ఘృతసంయుతే, త్రీంస్తథా మధునా సార్ధం దధ్నా చతుర ఏవచ. ౩౯. యుక్తాన్నపయసా పఞ్చ షట్ చ గోమయసంయుతాన్, పఞ్చగవ్యేన వై సప్త పిబేత్సిద్ధార్థకాన్ద్విజ. ౪౦. అనేన విధినా యస్తు కుర్యాత్సర్షపసప్తమీమ్, బహుపుత్రో బహుధనః సిద్ధార్థశ్చాపి సర్వదా. ౪౧. ఇహ లోకే నరో విప్ర ప్రేత్య యాతి విభావసుమ్, తస్మాత్సంపూజయే ద్దేవం విధినానేన భాస్కరమ్. ౪౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సిద్ధార్థసప్తమీవ్రతవర్ణనం నామ అష్టషష్టితమోఽధ్యాయః.

## ఏకోనసప్తతితమాధ్యాయము.

బ్రహ్మ యాజ్ఞవల్క్యునకిట్లనియె. సప్తమినాఁడు వ్రతముచేయు వానికి స్వప్నమువచ్చునేని దానిఫలములగుఱించి వచింతు వినుము. సప్తమినాఁడు పురుషుఁడు వ్రతనియమములతోఁగూడి శాస్త్రానుసారముగ వలయుసగ జపహోమాదిక్రియలన్నియు ముగించి తనయైశ్వర్యమునకుఁ దగిన ట్లాదినాథు నారాధించి యారాత్రి యాదేవు నెదలోఁ దలఁచుచు శయ్యపైఁ బరుండి నిద్రింపవలయును. అట్లు శయనించి బాగుగ నిద్రించుచు స్వప్నమున నుదయించుసూర్యుని నింద్రధ్వజమును జందురుని నీక్షించినచో సర్వసంపదలు గలుగును. ఇటులనే చూడఁదగిన యుత్తమ జనులను శక్తిని బూలమాలిక దాల్చినవానిని గోవును దానియరపును బిల్లనగ్రోవి మొదలగువెదుళ్లధ్వనిని తెల్లతామరను చామరమును నద్దమును బంగారుకత్తిని బుత్రునిజననమును రక్తము కారుటను రక్తముతోఁ దడుపుటను రక్తము ద్రావుటను జూచినచో నైశ్వర్యము గలుగును. ఐదుచోటులు పవిత్రములు (ఐదుపవిత్రవస్తువులు)గ గల తెల్లనిజంతువు (గోవు మొదలగునవి) నీక్షించినయట్లైన వృద్ధి గలుగును. లింగము నేతితో లేపనముచేయఁబడినట్లు కనుపించెనేని పుత్రుఁడు గలుగును. ప్రశస్తములగు వృక్షముల నెక్కినయట్లు దోఁచెనేని శీఘ్రకాలమున నైశ్వర్యము గలుగును. గేదె సింగము మొదవు మొదలగుపాలిచ్చు జంతువులు తనముఖమునఁ బాలుకురిసినటులును విల్లంబులు పొక్కుట దూరి శీఘ్రముగ వెడలినయెడలను దానే స్వయముగ నెదురేగి శత్రు

---

బ్రహ్మోవాచః—సప్తమ్యాముషితో విప్రః స్వప్నదర్శనముచ్యతే, స్వప్నే దృష్టే చ సప్తమ్యాం పురుషో నియతవ్రతః. ౧. సమాప్య విధివత్సర్వం జపహోమాదికం క్రమాత్, పూజయిత్వా దినేశం తు యథావిభవమాత్మనః. ౨. తతః శయీత శయనే దేవదేవం విచింతయన్, సంప్రసుప్తో యదా పశ్యేదుదయంతం దివాకరమ్. 3. శక్రధ్వజం తథా చంద్రం తస్య సర్వాః సమృద్ధయః, దృశ్యం జనం తథాశక్తిం స్రగ్విగోవేణు నిస్వనాః. ౪. శ్వేతాబ్జచామరాదర్శకనకాసిసుతోద్భవమ్, రుధిరస్య స్రుతిం సేకం పానం చైశ్వర్యకారకమ్. ౫. శ్వేతాయాః పంచపూతాయా, దర్శనం వృద్ధికారకమ్, ప్రజాపతేర్ఘృతాక్తస్య దర్శనం పుత్రదం స్మృతమ్. ౬. శస్తవృక్షాభిరోహశ్చ క్షిప్రమైశ్వర్యకారకః, దోహనం మహిషీసింహీగోధేనూనాం స్వకే ముఖే. ౭. ధనుషాం చ శరాణాం

వులఁ జంపును. సింహములను గోవులను భుజగములను స్వాయముగ ననుభవించును. (వానినెల్లఁ దనయధీనమున నుంచుకొనును.) తనశరీరము నుండి తలగోసి యగ్నిలో వ్రేల్వఁబడినయటులు దోఁచెనేని యెదుటనే లక్ష్మి నిలచి సాక్షాత్కరించును. వెండిపాత్రలోగానిబంగారుగిన్నెలోగాని తామరాకులోగాని పాయసాన్నమును భుజించినట్లు చూచుబ్రాహ్మణు నకు నితరులకును మిక్కిలి బలముగలుగును. జూదమునఁగాని వాదమునఁ గాని యుద్ధమునఁగాని విజయము గాంచినయట్టులు దోఁచెనేని సుఖము లనుభవించును. అగ్నిని మ్రింగినయట్లు దోఁచిన జఠరాగ్ని బాగుగ దీపించును. ఒడలు మండుచున్నట్లును తల బాధగలిగియున్నట్లును దోఁచిన నైశ్వర్యము గలుగును. తెల్లనిపూలదండలును ప్రశస్తమైన తెల్లపక్షులును నమేధ్యమున నొడలంతయుఁ బూసికొనినట్లు నీక్షించినచో నెల్లప్పుడును లాభమే గలుగునని కీర్తించుచున్నారు. తనయంగమేదేని కోసినయట్లును విసరివైచినయట్లును (నిందితమైనట్లు) రథయాత్ర యొనరించుచున్నట్లును స్వప్నమువచ్చెనేని సంతతిలభించును. పెక్కుతల లున్నట్లును బెక్కుచేతులున్నట్టును గాంచినచో హస్తములకు మిక్కిలి శోభ కలుగును పొందరానియువిదను బొందినయటులు దోఁచినను లక్ష్మి లభించును. శోకించినట్లు కలగనిన నధ్యయనముచేయును. దేవబ్రాహ్మణులు నాచార్యగురువులు వృద్ధులు తపముచేయువారు నెద్ది పలుకుదురో యది యెల్ల నిక్కమే యని యెఱుంగవలయును. ప్రశస్తవస్తువును జూచినచో రాజ్యలక్ష్మి కభిషిక్తుఁడగును. తలనఱికినట్లును పలువిధములుగ బద్ధలై

---

చ నాభౌ చ ద్రుతనిర్గతిః, అభిహన్యాత్స్వయం ఖాదేత్సింహాన్గా భుజగాంస్తథా. ౮. స్వాంగశీర్షం హుతవహే తస్య శ్రీరగ్రతః స్థితా, రాజతే హైమనే పాత్రే యో భుంక్తే పాయసం ద్విజః. ౯. పద్మపత్రే యథా విప్ర స్తస్య జంతోర్బలం భవేత్, ద్యూతే వాదేథ వా యుద్ధే విజయో హి సుఖావహః. ౧౦. అగ్నేస్తు గ్రసనం విప్ర ఆగ్నేయం వృద్ధికారకమ్, గాత్రస్య జ్వలనం విప్ర శిరోవేధశ్చ భూతయే. ౧౧. మాల్యాంబరాణాం శుక్లానాం శస్తానాం శుక్లపక్షిణామ్, సదా లాభం ప్రశంసంతి తథా విష్ఠానులేపనమ్. ౧౨. స్వాంగస్య కర్తనే క్షేపే రథయానే ప్రజాగమః, నానాశిరోబాహుతా చ హస్తానాం కురుతే శ్రియమ్. ౧౩. అగమ్యాగమనం చైవ శోకమధ్యయనం తథా, దేవద్విజజనాచార్యగురువృద్ధతపస్వినః. ౧౪. యద్యద్వదంతి తత్సర్వం సత్యమేవ హి నిర్దిశేత్, ప్రశస్తదర్శనం చైవ అభిషేకో నృపశ్రియాః. ౧౫. స్యాద్రాజ్యం శిరశ్ఛేదేన

నటును దోఁచిన రాజ్యము గలుగును. ఏడ్చినట్లు తోఁచిన హర్షము గలుగును. సంకెలలు తగిలినట్లుతోఁచిన రాజ్యము లభించును. గుఱ్ఱము నెద్దును పద్మమును రాజును వెలియేనుఁగును దర్శించుటయు భయమువిడచి వాని నెక్కుటయు గొప్ప నైశ్వర్యమును గూర్చును. గ్రహనక్షత్రములఁబట్టి మ్రింగినట్లును, నేలను జుట్టివచ్చినటులును, కొండలు పెకలించినట్లును జూచిన రాజ్యలాభము పొందును. దేహమునుండి ప్రేవులు వెలువడినట్లు గాని వాని నొకచెట్టునకుఁ జుట్టినపగిదిగాని సముద్రమునను నదులందును బడినట్లునుగాని కాంచిన సుఖముల నైశ్వర్యములను బొందును. సముద్రమునుగాని నదినిగాని దాటినట్లు దోఁచిన నెల్లప్పుడు నంతు గనుఁగొనఁ గలఁడు. కొండదాటినయట్టులు దోఁచెనేని ధనము జయము నాయుష్యమును గలుగును. మేనికాంతితో వెలుఁగునంగన యేతెంచి తనతొడపై నున్నయట్లు తోఁచిన నెల్లప్పుడు నుత్తమస్త్రీల యాశిషముల వడయుచుండును. పురుగులు తనశరీరమును దినుచున్నట్లు దోఁచెనేని త్వరితముగ నర్థలాభము కలుగును. స్వప్నమునందే స్వప్నముగనినట్లు తోఁచినను చూచినదానిని జెప్పుచున్నట్లును శుభకరములగు నెల్లవస్తువుల యుత్తమదర్శనము కలిగినట్లు నుత్తమవస్తువులతో సంబంధంబున్నట్లును గాంచెనేని యారోగ్యధనములు లభించును. ఏస్వప్నము ఐశ్వర్యముల నిచ్చునని వెనుకఁజెప్పఁబడినదో ఆస్వప్నము రోగులను వానినుండి విడిపించుచున్నది. ఇందు సందియములేదు. మంచికల గనినవెనుక నిద్రింప

---

బహుధా స్ఫుటితేన తు, రుదితం హర్షసంప్రాప్త్యై రాజ్యం నిగడబంధనే. ౧౬. తురంగం వృషభం పద్మం రాజానం శ్వేతకుంజరమ్, మహదైశ్వర్యమాప్నోతి యోఽభీకశ్చాధిరోహతి. ౧౭. గ్రసమానో గ్రహాంస్తారా మహీం చ పరివర్తయన్, ఉన్మూలయన్పర్వతాంశ్చ రాజ్యలాభమవాప్నుయాత్. ౧౮. దేహాన్నిష్క్రాన్తిరంత్రాణాం తైర్వా వృక్షస్య వేష్టనమ్, పాతః సముద్రసరితామైశ్వర్యాణి సుఖాని చ. ౧౯. ఉదధిం సరితం వాపి తీర్త్వా పారం ప్రయాతి చ, అద్రిం లంఘయతశ్చాపి భవంత్యర్థజయాఽఽయుషః.౨౦. ఉజ్జ్వలాస్త్రీ వి శేదంకమాశీర్వాదపరాః స్త్రియః, భవత్యర్థాగమః శీఘ్రం కృమిభిర్యది భక్ష్యతే. ౨౧. స్వప్నే స్వప్న ఇతి జ్ఞాతం దృష్టప్రకథనం తథా, మంగలానాం చ సర్వేషాం శుభం దర్శనమేవ చ. ౨౨. సంయోగశ్చైవ మంగల్యైరారోగ్యధనకారకః, ఐశ్వర్యరాజ్యలాభాయ యస్మిన్స్వప్న ఉదాహృతః. ౨౩. తైర్దృష్టై రోగిణో రోగా

రాదు. వేకువనే లేచి రాజునకును బరిశుద్ధులగు భోజకబ్రాహ్మణులకును లోనవెలుపలను శుచిర్గయి యాస్వప్నవృత్తాంతమును గీర్తింపవలయును.

ఇది ఏకోనసప్తతితమాధ్యాయము.

---

## సప్తతితమాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె. ఆవెనుక మధ్యాహ్నకాలమున జలకమాడి నియమముగలచిత్తముతో వెనుకఁజెప్పినచొప్పున యథావిధిగ యథాసుఖముగ నెల్లదేవతలను బూజించి మౌనముద్రవహించి బాగుగ జపమొనరించి హోమములు వ్రేల్చి దేవతాయతనమునుండి వెడలి భోజనశాలకేగి యావెనుక భోజకబ్రాహ్మణులకు భోజనము లొసంగవలయును. అటులనే యితిహాసపురాణవేత్తలగు విప్రులను వేదవేత్తలగు విప్రోత్తములను ద్యులోకవాసులును భూలోకవాసులు నగుదేవతల భుజింపఁజేసి భోజకున కెఱ్ఱనివస్త్రములు గోవులు సుగంధమాల్యములు హావిష్యాన్నము పాడిమొదవు మొదలగునవియు నింకను దనకేద్దియిష్ట మదియెల్ల నొసంగవలయును. భోజకబ్రాహ్మణులు లభింపకున్న జయముచే జీవించువారితోఁ గార్యము నిర్వర్తింపవలయును. మంత్రవేత్తలగు బ్రాహ్మణు

---

స్మచ్యంతే నాత్ర సంశయః, న స్వప్నం శోభనం దృష్ట్వా స్వప్యాత్ప్రాతశ్చ కీర్తయేత్, రాజభోజకవిప్రేభ్యః శుచిభ్యశ్చ శుచిర్నరః. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే స్వప్నదర్శనవర్ణనం నామ
ఏకోనసప్తతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—తతో మధ్యాహ్నసమయే స్నాతః ప్రయతమానసః, తథైవ దేవాన్విధివత్పూజయిత్వా యథాసుఖమ్. ౧. సమ్యక్కృతజపో మౌనీ వరో హుతహుతాశనః, నిష్క్రమ్య దేవాయతనాద్భోజకాన్భోజయేత్తతః. ౨. తథా పురాణవిదుష ఇతిహాసవిదో ద్విజాన్, తథా వేదవిదశ్చైవ విప్రాన్సంభోజయేచ్ఛుచివ్రత. ౩. రక్తాని వస్త్రాణి తథా చ గావః సుగంధమాల్యాది హావిష్యమన్నమ్, పయస్వినీ చాప్యథ భోజకాయ దేయా తథాన్యత్ప్రియమాత్మనో యత్. ౪. భవేదలాభో యది భోజకానాం విప్రాస్తదా స్థాంతి జయోపజీవినః, యే మంత్రవిద్బ్రాహ్మణపాఠకాశ్చ యే యేఽపి సామాథ్యయ

లును బ్రాహ్మణభాగము బఠించువారును సామాధ్యయనసంపన్నులును గౌరవింపఁదగియున్నారు. తొలుతఁ బురాణవిద్వాంసులతోఁగూడ భోజక బ్రాహ్మణులకు భోజనమొసంగవలయును. వారు లభింపకున్న మంత్ర వేత్తలును వేదవిదులు నగుబ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. ఈవిధముగ మానవుఁడు భక్తియుక్తుఁడై యేడుసప్తముల వ్రత మాచ రించి శ్రద్ధాళుఁడై యసూయలేక యుండెనేని తుదిలేనిసుఖము నను భవించును. పదియశ్వమేధయజ్ఞము లొనరించిన నేఫలము గలుగునో దాని నీసప్తసప్తమీవ్రతమును భక్తితో నొనరించినవాఁడు పొందును. ఈ వ్రతముచేఁ బొందరాని దెద్దియు నేలోకంబునను లేదు. ఈవ్రతముచేయు టచే నివర్తింపనిరోగ మొక్కటియు లేదు. ఎట్టి యౌషధమునకైన లొంగని సర్వకుష్ఠములు గూడ నిశ్చయముగ నీవ్రత మనుష్ఠించుటచేత గరుత్మంతునిభయమునఁ బాములు పఱచుపగిదిఁ బర్వులిడిపోవును. ధర్మ స్వభావుఁడగుమానవుఁడు వ్రత (ఉపవాస)ముచేత నియమముచేతను తపముచేత నీయేడుసప్తమీతిథులను విధ్యుక్తముగ నిట నిర్వర్తించి యీలోకమున శాస్త్రము ధనము సంతానము భాగ్యము నారోగ్యమును పుణ్యము ననువీనితోఁ గూడియుండి జన్మాంతమున శాశ్వతమగు సూర్య లోకమును బొందును బ్రాహ్మణోత్తమా! ఈసప్తమీవ్రతవిధానమును వినినను జేసినను మానవుఁడు జన్మాంతమున సహస్రకిరణుఁడగు సూర్యునిఁ జేరును. ఇందావంతయు విచారింపనక్కఱ లేదు. దేవతలచేతను మునుల

---

నేషు యుక్తాః. ౫. ప్రథమం భోజకా భోజ్యాః పురాణవిద్భిః సహ, తేషామృతే మంత్రవిదస్తథా వేదవిదో ద్విజాః. ౬. కృత్వైవం సప్తమీః సప్త నరో భక్త్యా సమన్వితః, శ్రద్దధానోఽనసూయశ్చ అనంతం ప్రాప్నుయాత్సుఖమ్. ౭. దశానామశ్వ మేధానాం కృతానాం యత్ఫలం భవేత్, తత్ఫలం సప్తమీః సప్త కృత్వా ప్రాప్నోతి మానవః. ౮. దుష్ప్రాపం నాస్తి తల్లోకే అనయా యన్న లభ్యతే, న చ రోగోస్త్యసౌ లోకే ఏనయాగౌ నశామ్యతి ౯. కుష్ఠానిచాపి సర్వాణి దురుచ్ఛేద్యాన్యపి ధ్రువమ్, అపయాంతి యథా నాగా గరుడస్య భయార్దితాః. ౧౦. వ్రతనియమతపోభిః సప్తమీః సప్త ఏవం విధివదిహ హి కృత్వా మానవో ధర్మశీలః, శ్రుతధనసుతభాగ్యారోగ్యపుణ్యైరుపేతో వ్రజతి తదనులోకం శాశ్వతం తిగ్మరశ్మేః. ౧౧. ఇమం విధిం ద్విజశ్రేష్ఠ శ్రుత్వా కృత్వా చ మానవః, సహస్రరశ్మిం స విశేన్నాత్ర కార్యా విచారణా. ౧౨. సురైర్వా మునిభిర్వాపి పురాణజ్ఞైరిదం శ్రుతమ్, సర్వే తే పరమాత్మానం పూజయంతి దివాకరమ్.

చేతను పౌరాణికులచేతను నిది వినఁబడెను. వారందఱు పరమాత్ముఁడగు దివాకరుని బూజించుచున్నారు. బ్రాహ్మణోత్తమా! నీకేఁజెప్పిన యీ యాఖ్యానము మహర్షిపుంగవుల సంప్రదాయమున వచ్చినది. కావున దీని నెప్పుడును సూర్యభక్తునకే యొసంగవలయును. ఇతరునకెన్నఁడును నీయఁ జనదు. నిత్యము నీకల్పమును వినుపించువాఁడును వినువాఁడును నిశ్శంకముగ నాసహస్రార్చియగు సూర్యునిఁ జేరును. రోగములచే బాధల నొందువాఁ డీవ్రతము నాకర్ణించి రోగవిముక్తుఁడగును. మఱియును నీకథను మూలమట్టుగ వినఁగోరువాఁడు గూడ సర్వకామములు బొందును. భక్తి కలవాఁడు సూర్యలోకమును బొందును. దారినడచుచు నీకథ జపించెనేని యాపదలులేక సుఖముగ దారిగడచుచున్నాఁడు. ఎవఁ డేకోరిక గోరుచున్నాఁడో, ఆతఁ డాకోరికలెల్ల ననుభవించును. ఇది నిశ్చయము. నిశ్చలచిత్తుఁడై రహస్యదేశమున రహస్యమగు భావముకలిగి యీయుత్తమ రహస్యమును దెలుసుకొని సూర్యవ్రతము ననుష్ఠించు మానవుఁడు మహానుభావుఁ డగుభాస్కరుని పవిత్రపదమును జేయుచున్నాఁడు. స్త్రీకి గర్భముననున్న పిండము అడ్డుతిరిగియుండెనేని దీని గొప్పతనమున నది సరియగును. గర్భిణియగుయువతి యేతత్ప్రభావమునఁ గుమారునిఁ గనును. గొడ్రాలయినను బిడ్డను గనును. పుత్రపౌత్రాదులతో నామె వంశము వృద్ధియగును. ఇట్టిఫలములుగల యీయాఖ్యానము మున్ను గొప్పతేజముగల భాస్కరుఁడు నాకెఱింగించెను. అద్దాని నిప్పు డా సూర్యునిమీఁది భక్తివెంపున నీకెఱింగించితిని. సమస్తపాతకములు నశించుటకై యాభానుఁడు నీ కారాధింపఁదగియున్నవాఁడు. ఆతఁడే కదా!

---

౧౩. ఇదమాఖ్యానమాఖ్యేయం యన్మయాభిహితం తవ, సూర్యభక్తాయ దాతవ్యం నేతరాయ కదాచన. ౧౪. యశ్చైతచ్ఛ్రావయేన్నిత్యం యశ్చైతచ్ఛృణుయాన్నరః, స సహస్రార్చిషం దేవం ప్రవిశేన్నాత్ర సంశయః. ౧౫. ముచ్యేదార్తస్తథా రోగాచ్ఛ్రుత్వేమామాదితః కథామ్, జిజ్ఞాసుర్లభతే కామాన్భక్తః సూర్యగతిం లభేత్. ౧౬. క్షేమేణ గచ్ఛతేఽధ్వానం యస్త్విదం పఠతేఽధ్వని, యో యం ప్రార్థయతే కామం స తం ప్రాప్నోతి చ ధ్రువమ్. ౧౭. ఏకాంతభావోపగత ఏకాంతే సుసమాహితః, ప్రాప్యేత త్పరమం గుహ్యం భూత్వా సూర్యవ్రతో నరః. ౧౮. ప్రాప్నోతి పరమం స్థానం భాస్కరస్య మహాత్మనః, లగ్నగర్భా ప్రముచ్యేత గర్భిణీ జనయేత్సుతమ్. ౧౯. వంధ్యా ప్రసవమాప్నోతి పుత్రపౌత్రసమన్వితమ్, ఏవమేతన్మమాఖ్యాతం భాస్కరేణామితౌజసా, మయాపి తవ చాఖ్యాతం భక్త్యా భానోరిదం ద్విజ. ౨౦. పూజనీయస్త్వయా భానుః

యెల్లజగత్తును బుట్టించువాఁడును రక్షించువాఁడు నైయున్నాఁడు. జగత్తునకు గురుఁ డాతఁడే కద! ఏ దేవుఁ డుదయించుచుఁ దనకిరణములచే నెల్లలోకమున నంధకారము నంతరింపఁజేయుచున్నాఁడో, అట్టి పండ్రెండు మూర్తులు గలదేవేశుఁడు, ఆయదితికొమరుఁడు ప్రీతినొందునుగాక.

ఇది సప్తతితమాధ్యాయము.

---

## ఏకసప్తతితమాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె. ఏనామముల నుతించిన నాదేవునకుఁ దృప్తి కలుగునో యానామములను వఱుసగఁ గీర్తింతు నెఱుంగుము. నమము సూర్యునకు, రవికి, నిత్యునకుఁ, గార్యభానునకు, భాస్కరునకు, మతంగునకు, మార్తండునకు, వివస్వంతునకు, నాదిత్యునకు, నాదిదేవునకు. 10. వందనము రశ్మిమాలికి, దివాకరునకు, దీప్తునకు, నగ్నికి, మిహిరునకుఁ, బ్రభాకరునకు, మిత్రునకు, నదితిసంభవునకు, గోపతికి, దిక్పతికి నమము. 20. ధాతకు, విధాతకు, నర్యమణునకు, వరుణునకును, పూషకు, భగునకు, మిత్రునకుఁ, బర్జన్యునకు, నంశునకు నమము హితకృత్తునకు నమము. 30. నిత్యము

---

సర్వపాపోపశాంతయే, స హి ధాతా విధాతా చ సర్వస్య జగతో గురుః. ౨౧. ఉద్యన్యః కురుతే నిత్యం జగద్వితిమిరం కరైః, ద్వాదశాత్మా స దేవేశః ప్రీయతాం తేఽదితేః సుతః. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యే సర్వపసప్తమీవర్ణనం నామ సప్తతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—నామభిః సంస్తుతో దేవో యైరర్కః పరితుష్యతి, తాని తే కీర్తయిష్యామి యథావదనుపూర్వశః. ౧. నమః సూర్యాయ నిత్యాయ రవయే కార్యభానవే, భాస్కరాయ మతంగాయ మార్తండాయ వివస్వతే. ౨. ఆదిత్యాయాదిదేవాయ నమస్తే రశ్మిమాలినే, దివాకరాయ దీప్తాయ అగ్నయే మిహిరాయ చ. ౩. ప్రభాకరాయ మిత్రాయ నమస్తేఽదితిసంభవ, నమో గోపతయే నిత్యం దిశాం చ పతయే నమః. ౪. నమో ధాత్రే విధాత్రే చ అర్యమ్ణే వరుణాయ చ, పూష్ణే భగాయ మిత్రాయ పర్జన్యాయాంశవే నమః. ౫. నమో హితకృతే నిత్యం ధర్మాయ తపనాయ

మ్రొక్కెద ధర్మునకుఁ, దపనునకు, హరికి, హరితాశ్వునకు, విశ్వపతికి, విష్ణునకు, బ్రహ్మకును, నిత్యమును త్ర్యంబకునకు, నాత్మకును, సప్తలోకేశునకును. 40. జోహారు సప్తసప్తికి, నొక్కనికి, నేకచక్రరథునకు, జ్యోతిష్పతికి, సర్వప్రాణభృతునకును, సర్వభూతహితునకు, శివునకు, నార్తిహరునకుఁ, బద్మప్రబోధునకు, వేదాదిమూర్తికిని. 50 నీకు మ్రొక్కెదను కాధిజునకును, తారాసుతునకు, భీమజునకుఁ బావకునకును, ధిషణునకు నమస్సు. కృష్ణున కెప్పుడును నమస్కరింతును. అదితిపుత్త్రునకు నమస్కారమగుఁగాక. లక్ష్యునకు నిత్యము వందనము. 53. ఓమంచినిష్ఠగలవాఁడా! ఈయాదిత్యనామము లన్నియు సమస్తకామముల నెదలో నిడికొని దేవు నారాధించుటకై మున్నే నే యేర్పరించితిని. సాయంకాలమున నుదయకాలమునను శుచియై చిత్తము నియమించి యీనామములు పఠించుమానవుఁడు సమస్తకామములను మున్నే బొందినయట్లు పొందఁగలఁడు. కాంతిమంతములగు కిరణములుగల మహాత్ముఁడగు నాదేవు ననుగ్రహముకతన నైశ్వర్యమునుగోరువాఁ డైశ్వర్యమును ధర్మముగోరువాఁడు ధర్మమును బడయుచున్నాఁడు. ఆతురుఁడు రోగములఁబాయును. సంకెలలుగలవాఁడు విడివడును. రాజ్యముగోరువాఁడు రాజ్యమును, కామములఁ గోరువాఁడు కామములను బొందును. ఇదియే జపింపఁదగుమంత్రము.

---

చ, హరయే హరితాశ్వాయ విశ్వస్య పతయే నమః. ౬. విష్ణవే బ్రహ్మణే నిత్యం త్ర్యంబకాయ తథాత్మనే, నమస్తే సప్తలోకేశ నమస్తే సప్తసప్తయే. ౭. ఏకస్మై హి నమస్తుభ్యమేకచక్రరథాయ చ, జ్యోతిషాం పతయే నిత్యం సర్వప్రాణభృతే నమః. ౮. హితాయ సర్వభూతానాం శివాయార్తిహరాయ చ, నమః పద్మప్రబోధాయ నమో వేదాదిమూర్తయే. ౯. కాధిజాయ నమస్తుభ్యం నమస్తారాసుతాయ చ, భీమజాయ నమస్తుభ్యం పావకాయ చ వై నమః. ౧౦. ధిషణాయ నమో నిత్యం నమః కృష్ణాయ నిత్యదా, నమోఽస్త్వదితిపుత్త్రాయ నమో లక్ష్యాయ నిత్యశః. ౧౧. ఏతాన్యాదిత్యనామాని మయా ప్రోక్తాని వై పురా, ఆరాధనాయ దేవస్య సర్వకామేన సువ్రత. ౧౨. సాయం ప్రాతః శుచిర్భూత్వా యః పఠేత్సుసమాహితః, స ప్రాప్నోత్యఖిలాన్కామాన్యథాహం ప్రాప్తవాన్పురా. ౧౩. ప్రసాదాత్తస్య దేవస్య భాస్కరస్య మహాత్మనః, శ్రీకామః శ్రియమాప్నోతి ధర్మార్థీ ధర్మమాప్నుయాత్. ౧౪. తురో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బన్ధనాత్, రాజ్యార్థీ రాజ్యమాప్నోతి కామార్థీ కామమాప్ను

రహస్యము ఇదియే సంధ్యోపాసనము. ఇది జపించినమాత్రముననే మనుష్యుఁడు పాపములనుండి విముక్తి నొందును.

ఇది ఏకసప్తతితమాధ్యాయము.

---

## ద్విసప్తతితమాధ్యాయము.

సుమంతువు రాజున కనియె. రాజా! యీప్రకారముగ బ్రహ్మ నుడివినపలుకులు విని యోగీశ్వరుఁడగు యాజ్ఞవల్క్యముని వ్యోమాకారుఁడగు దివాకరు నారాధించి సూర్యసాలోక్యము నొందెను. అప్పగిది నీవు నో రాజేంద్రా! విభావసుని బూజించి దేవతలకయినను దుర్లభమగు నుత్తమస్థానము నొందఁగలవు. నాపుడు శతానీకుండు "మహామునీ! జంబూద్వీపమున నాదిత్యునకుఁ దొలినెల వెచ్చట? ఎచ్చట విధ్యుక్తముగఁ బూజింప నద్దాని నాతఁడు గ్రహించు? నానతీయవే"యని యడుగ నాతనికి సుమంతు విట్లనియె. రాజా! యీద్వీపమున నాభాస్కరదేవునకు మూఁడునెలవు లున్నవి. అందు మొదటిది యింద్రవనమనునది. రెండవది ముండీరము. మూఁడవది కాలప్రియము నని ముల్లోకముల విఖ్యాతమైనది. ఇట్టిమాయెరిగనే యింకొకదానిని బ్రహ్మ వచించెను. దానిని

---

యాంత్. ౧౫. ఏతజ్జప్యం రహస్యం చ సంధ్యోపాసనమేవ చ, ఏతేన జపమాత్రేణ నరః పాపాత్ప్రముచ్యతే. ౧౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే బ్రహ్మప్రోక్తసూర్యనామవర్ణనం నామ
ఏకసప్తతితమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—ఇత్థం బ్రహ్మవచో యోగీ శ్రుత్వా రాజన్దివాకరమ్, వ్యోమరూపం సమారాధ్య గతః సూర్యసలోకతామ్. ౧. తథా త్వమపి రాజేంద్ర పూజయిత్వా విభావసుమ్, గమిష్యసి పరం స్థానం దేవానామపి దుర్లభమ్. ౨. శతానీక ఉవాచ.—ఆద్యం స్థానం రవేః కుత్ర జంబూద్వీపే మహామునే, యత్ర పూజాం విధానోక్తాం ప్రతిగృహ్ణాత్యసౌ రవిః. ౩. సుమంతురువాచ.—స్థానాని త్రీణి దేవస్య ద్వీపేఽస్మిన్భాస్కరస్య తు, పూర్వమింద్రవనం నామ తథా ముండీరముచ్యతే. ౪. కాలప్రియం తృతీయం తు త్రిషు లోకేషు విశ్రుతమ్, తథాన్యదపి తే వచ్మి యత్పురా

వినుము. చంద్రభాగానదియొడ్డున సాంబపురమను విఖ్యాతిగల పత్తనము కలదు. అయ్యది యీద్వీపమున నాదిత్యునకు శాశ్వతమగుస్థానము. అందే సూర్యుఁ డెల్లప్పుడును వసించును. భక్తుఁడగు సాంబునందుఁ బ్రీతిచేతను జనుల ననుగ్రహించుటకును తనమూర్తిలోఁ బండ్రెండవభాగమున మిత్రనామమునఁ గరుణముతో నిండినదృష్టితో నట వసించెను. మంగళము లిచ్చుటకై యెల్లలోకము నీక్షించుచు నిలచియున్నాఁడు. అచ్చట విధ్యుక్తముగఁ జేయుపూజను స్వయముగ గ్రహించుచున్నాఁడు. నావిని శతానీకుం డీసాంబుఁ డెవఁడు? ఎవనికుమారుఁడు? దివాకరుఁ డెవనికిఁ బ్రీతుఁడగును? పుణ్యకర్మలుచేయు నేయుత్తమునకు భగవంతుఁ డగు సహస్రకిరణుఁడు వరము నొసంగుచున్నాఁడో; అట్టిసాంబుఁ డెవరో యెఱింగింపుమన నాతనికి సుమంతు విట్లనియె. మహాబలులగు పన్నిద్దఱు సూర్యులు వెలుంగుచున్నారుగదా! వారిలో ముల్లోకములను విఖ్యాతుఁ డయిన విష్ణువను నొకమూర్తి కలఁడు కదా! ఆభగవానుఁ డీలోకమున వాసుదేవుఁడై జన్మించెనట కదా! ఆతనికి జాంబవతి యనుపత్నియందు మహాబలుఁడగుసాంబుఁ డనుకొడుకు పుట్టెను. ఆతఁడు తండ్రిశాపముచే గొప్పదగు కుష్ఠవ్యాధిని బొందెను. ఆతఁ డీసూర్యు నచ్చట స్థాపించి పూజించెను. తనపేర నొకపట్టణము గట్టించెను. అనవిని శతానీకుం "డేమి కారణమునఁ దండ్రి కుమారు నట్లు శపించెను? ఆకారణము కొద్దిదై యుండదే! ఇంత నెక్కుడుగ శపింపఁబడెను. కారణము గొప్పదియే కావలయును. వివరింపవే యన నాతనికి సుమంతు విట్లనియె రాజా! ఆతని

---

బ్రహ్మణోదితమ్. ౫. చంద్రభాగాతటే నామ్నా పురం యత్సాంబసంజ్ఞితమ్, ద్వీపే స్మిఞ్ఛాశ్వతం స్థానం యత్ర సూర్యస్య నిత్యతా. ౬. ప్రీత్యా సాంబస్య తత్రార్కో జనస్యానుగ్రహాయ చ, తత్ర ద్వాదశభాగేన మిత్రో మైత్రేణ చక్షుషా. ౭. అవలోక జ్జగత్సర్వం శ్రేయోఽర్థం తిష్ఠతే సదా, ప్రయుక్తాం విధివత్పూజాం గృహ్ణాతి భగవా న్స్వయమ్. ౮. శతానీక ఉవాచ.—కోఽయం సాంబః సుతః కస్య కస్య ప్రీతో దివాకరః, యస్య చాయం సహస్రాంశుర్వరదః పుణ్యకర్మణః. ౯. సుమంతురువాచ.— య ఏతే ద్వాదశాదిత్యా విరాజంతే మహాబలాః, తేషాం యో విష్ణుసంజ్ఞస్తు సర్వ లోకేషు విశ్రుతః. ౧౦. ఇహాసౌ వాసుదేవత్వమవాప భగవాన్విభుః, తస్మాత్సాంబః సుతో జజ్ఞే జాంబవత్యాం మహాబలః. ౧౧. స తు పిత్రా భృశం శప్తః కుష్ఠరోగ మవాప్తవాన్, తేనాయం స్థాపితః సూర్యః స్వనామ్నా చ పురం కృతమ్. ౧౨. శతానీక ఉవాచ.—శప్తః కస్మిన్నిమిత్తేఽసౌ పిత్రా చైవాత్మసంభవః, నాల్పం హి

శాపకారణమును సావధానముగ నాకర్ణింపుము. దుర్వాసుఁడను నొక సమర్థుఁడగుముని రుద్రునంశమున జనించియున్నాఁడు. వింటివి కదా! ఆభగవానుఁడు తిరుగుచు ముల్లోకములను బాగుగ సంచరించెను. ఇట్లు తిరుగుచు మధుసయనువిఖ్యాతిగల ద్వారకను జేరెను. అచ్చట నాముని నీక్షించి సాంబుఁడు నేనే రూపవంతుఁడనని విఱ్ఱవీగి పచ్చనికన్నులు జడలు ఎండినయొడలు వికృతరూపమును గలిగి మిక్కిలి కృశించియున్న యత్తపసినడకను చూపును ననుకరించుటకు వీలయినట్లుగ నిశ్చయించి యాతనిముఖ మాలోకించి తనముఖమునుగూడ నాతనికివలెనే వంకరగఁ జేసెను. ఇట్లు యౌవనగర్వముచేఁ జేసినపని చూచి కోపించి మహాతేజో నంతుఁడును ఋషిశ్రేష్ఠుఁడు నగుదుర్వాసుఁడు తనముఖమును వణకించుచు నాసాంబునితో "ఓయీ! నీవు రూపగర్వితుఁడవై విరూపుఁడ నగు నన్నుఁ జూచి చూపునను నడకను నన్ననుకరించి చేష్టించితివి. కావున శీఘ్రకాలములోఁ గుష్ఠరోగముచేఁ బీడింపఁబడియుందువుగాక" అని శాపవచనములు పలికెను.

ఇది ద్విసప్తతితమాధ్యాయము.

---

కారణం విప్ర యేనాసౌ శప్తవాన్సుతమ్. ౧౩. సుమంతురువాచ.—శృణుష్వావహితో రాజం స్తస్య యచ్ఛాపకారణమ్, దుర్వాసా నామ భగవాన్ రుద్రస్యాంశసముద్భవః. ౧౪. అటమానః స భగవాంస్త్రీంల్లోకాన్ప్రిచచార హ, అథ ప్రాప్తో ద్వారవతీం మధు సంజ్ఞోచితాం పురా. ౧౫. తమాగతమృషిం దృష్ట్వా సాంబో రూపేణ గర్వితః, పింగాక్షం క్షుధితం రూక్షం విరూపం సుకృశం తథా. ౧౬. అనుకారాస్పదం చక్రే దర్శనే గమనే తథా, దృష్ట్వా తస్య ముఖం సాంబో వక్రం చక్రే తథాత్మనః. ౧౭. ముఖాం కురుకులశ్రేష్ఠ గర్వితో యౌవనేన తు, అథ క్రుద్ధో మహాతేజా దుర్వాసా ఋషిసత్తమః. ౧౮. సాంబం చోవాచ భగవాన్విధున్వన్సుఖమాత్మనః, యస్మాద్విరూపం మాం దృష్ట్వాస్వాత్మరూపేణ గర్వితః. ౧౯. గమనే దర్శనే మహ్యమనుకారం సమాచరః, తస్మాత్తు కుష్ఠరోగిత్వమచిరాత్త్వం గమిష్యసి. ౨౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబాయ దుర్వాససా శాపవిసర్జనం నామ ద్విసప్తతితమోఽధ్యాయః.

## త్రిసప్తతితమాధ్యాయము.

"సుమంతుండు రాజున కిట్లనియె. అయ్యవసరముననే నారదుని మూలమునఁగూడ సాంబునకు శాపము కలిగెను. బ్రహ్మసంకల్పమున బుట్టిన నారదుఁ డనుభగవంతుఁ డగుమునికుంజరుండు జగత్త్రయవిఖ్యాతుఁడై యున్నాఁడు గద! ఆతఁ డెల్లప్పుడును లోకసంచారము సలుపుచునే యుండును. ఎల్లప్పుడును భగవంతుఁడగు వాసుదేవునిదర్శనమునకై ద్వారకకుఁ బోవుచుండును. ఆతనివెనువెంట ననేకజడదారులు నేతెంచుచుందురు. ఇట్లు వచ్చునెడ నిత్యమును ప్రద్యుమ్నప్రభృతులగు యదుకుమారులందఱు వినయముతో వారికి నమస్కరించి యర్ఘ్యపాద్యాదులచే వారలకందఱకుఁ బూజలు సల్పుచుందురు. సాంబుఁడు మాత్రము రూపవంతుఁడననియు యువకుఁడననియు గర్వపడుచు నాటపాటల నాసక్తి మెండుగఁ గలిగి నిత్యమును శాపమొసంగఁదగునంతటి యపరాధముగ నామహామునియెడఁ దిరస్కారభావము జూపుటయేగాక నెదుటనే యాతని దిరస్కరించుచుండును. ఇట్టు లవినీతుఁడై యున్న యక్కుమారుఁ జూచి యమ్ముని యిట్లు చింతించెను. "ఈయవినీతునకుఁ జక్కనివినయముఁ గూర్తునుగాక" అని యిట్టు లాలోచించి వాసుదేవునొద్ది కేగి యిట్లనెను. ఓయదువంశతిలక! యీపదార్వేలయాండ్రును సాంబుఁడు రూపవంతుఁ డగుటచేత నాతనియందుఁ జిత్తముఁ జేర్చుచున్నారు. నీకుమారుఁడగు

---

సుమంతురువాచః—ఏతస్మిన్నేవ కాలే తు నారదో భగవానృషిః, బ్రహ్మణో మానసః పుత్రస్త్రిషు లోకేషు విశ్రుతః. ౧. సర్వలోకచరః సోఽథ అటమానః సమంతతః, వాసుదేవం స వై ద్రష్టుం నిత్యం ద్వారవతీం పురీమ్. ౨. ఆయాతి ఋషిభిః సార్ధం క్రోధనో మునిసత్తమః, అథాగచ్ఛతి తస్మింస్తు సర్వే యదుకుమారకాః. ౩. ప్రద్యుమ్నప్రభృతయో యే ప్రహ్వాశ్చావనతాః స్థితాః, అభివాద్యార్ఘ్యపాద్యాభ్యాం పూజాం చక్రుః సమంతతః. ౪. సాంబస్త్వవశ్యభావిత్వాత్తస్య శాపస్య కారణమ్, అవజ్ఞాం కురుతే నిత్యం నారదస్య మహాత్మనః. ౫. రతః క్రీడాసు వై నిత్యం రూపయౌవనగర్వితః, అవినీతం తు తం దృష్ట్వా చింతయామాస నారదః. ౬. అస్యాహమవినీతస్య కరిష్యే వినయం శుభమ్, ఏవం సంచింతయిత్వా తు వాసుదేవమథాబ్రవీత్. ౭. ఇమాః షోడశ సాహస్ర్యః స్త్రియో యాదవసత్తమ, సర్వాసాం హి సదా సాంబే భావో దేవ సమాశ్రితః. ౮. రూపేణాప్రతిమః సాంబో లోకేస్మిన్సచరాచరే, సదా హీచ్ఛంతి తాస్తస్య దర్శనం

సాంబుఁడు చరాచరరూపమగు నీలోకమున నెందును సాటిలేనిరూపము కలవాఁడు. ఆయువిద లెప్పుడు నాతనిదర్శనమునే కోరుచున్నారు" నావు డామాట విని కేశవుఁడు నారదునివాక్యమునకు వేఱుకారణ మున్నదా ? యిదియే నిక్కమా ? అని సంశయించి "ఔను. ఇంతకన్న వేరేముండును. స్త్రీలకుఁ జాపల మధికమని యీలోకమున వచించుచున్నారు గద! ఈవిషయమున మున్ను స్త్రీచిత్తము లెఱిఁగినవిద్వాంసులు వాక్కు-ిచ్చిన రెండుపద్యములుకూడ నున్నవికదా!"పౌంశ్చల్యాత్ చల చిత్తత్వాత్ నైస్నేహ్యాచ్చ స్వభావతః, రక్షితాస్సర్వతో హ్యేతాః (రక్షితాయత్నతోపీహాభర్తృష్వేతావికుర్వతే) వికుర్వంతి హి భర్తృషు. నైతారూపం పరీక్షంతే నాసాం వయసి (సంస్థితిః) నిశ్చయః, సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే" స్త్రీలు పుట్టుకతోడనే పురుషుల మోహించి సంచరించుట చిత్తము చంచలమైయుండుట స్నేహము లేకుండుటలు కలిగియుండుటచే నెల్లభంగుల మగలు రక్షించుచున్నను వారియెడ విరోధమే కలిగియుందురు. ఈయాఁడువారు రూపమును పరీక్షింపరు. వయస్సువాఁడు కావలయునని నియమమునులేదు. అందముగ నున్నను సరియే. లేకున్ననుసరియే; పురుషుఁడైనఁజాలును. పురుషుఁడనియే వానితో ననుభవించుచున్నారు" అని. అట్టియెడ రూపయౌవనశాలి యగు నీసాంబునివిషయము వేర చెప్పవలయునా ? అని యిట్లు చిత్తమున నాలోచించి నారదున కిట్లనియె. "నారదా! నీవుచెప్పిన యీమాటను నేనంతగా విశ్వసింపఁజాలను" అనుచున్న యాదేవునకు నారదుఁ డిట్లనియె. అటులేని యీవిషయమున నీకు నమ్మకము కలుగునట్లు నేఁజేసె

---

చాపి హి స్త్రియః. ౯ శ్రుత్వైవం నారదాద్వాక్యం చింతయామాస కేశవః, యదేత న్నారదేనోక్తమన్యదత్ర తు కిం భవేత్. ౧౦. వచనం శ్రూయతే లోకే చాపల్యం స్త్రీషు విద్యతే, శ్లోకా చేమా పురా గీతా చిత్తజ్ఞైర్యోషితాం ద్విజైః. ౧౧. పౌంశ్చల్యాచ్చ లచిత్తత్వాన్నైః స్నేహ్యాచ్చ స్వభావతః, రక్షితాః సర్వతో హ్యేతా వికుర్వన్తి హి భర్తృషు. ౧౨. నైతా రూపం పరీక్షంతే నాసాం వయసి నిశ్చయః, సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే. ౧౩. సుమంతురువాచ.—మనసా చింతయన్నేవ కృష్ణో నారదమబ్రవీత్, న హ్యహం శ్రద్దధామ్యేతద్యదేతద్భాషితం త్వయా. ౧౪. బ్రువాణమేవం దేవం తు నారదో వాక్యమబ్రవీత్, తథాహం తత్కరిష్యామి యథా

దనులే. అని యాతఁడు వచ్చినత్రోవన స్వర్గలోకమున కేగి మఱలఁ గొన్ని దినములకు ద్వారకానగరమున కేతెంచెను. ఆదినముననే వాసుదేవుఁ డంతఃపురకాంతాసమూహముతో జలక్రీడలు సలిపి రైవతకపర్వతమున ననేకద్రుమములచే నలంకరింపఁబడి యెల్లప్పుడు నాఱుఋతువుల పుష్పములు వాసనవెదజల్లు నలుగడలుకలిగి వికసించిన పెక్కుకొలఁకులు తామరలుగల దిగుడుబావు లింపుగొలుప రాయంచలు చెంగలువలను గూయుచుండ జక్కవలు చేరి కొలుప సందమగు పూఁదోఁటఁజొచ్చి ముత్యాలసరములు సందెలు దండకడియములు వడ్డాణము మున్నగుతొడవులఁ దొడవులై యొప్పుసుందరాంగులు చేరికొలువ మధుపాన మొనరింపనెడ నాకాంతారత్నంబులును మంగళపరిమళయుక్తంబగు మధువు గ్రోలి మదముచే నొడలు మఱచి యుండిరి. వారియవస్థం దిలకించి మునీశ్వరుఁడు సాంబునిఁ జీరి "యోకుమారా! లెమ్ము! దేవుఁడగు వాసుదేవుఁడు నిన్ను బిలుచుచున్నవాఁడు. కావున నీకిట నుండఁదగదు. నావు డతనివాక్యపు గూఢాభిప్రాయ మెఱుంగకయే యాతనివార్త ననుసరించియే వేగిరపాటుతోఁ బ్రభువగు తండ్రియొద్దకేగి యథాశాస్త్రముగ సాష్టాంగముగఁ బాదములఁ బడి మ్రొక్కులిడెను. అయ్యవసరమున నటనున్న సత్త్వగుణము సుంతేని యగపడనికాంతలందఱును సుందరరూపుఁడగు నాసాంబు నీక్షించి కలఁతపడినచిత్తముచేఁ జేష్టలుదక్కియుండిరి. ఆయంతః

---

శ్రద్ధాస్యతే భవాన్. ౧౫. ఏవముక్త్వా యయౌ స్వర్గం నారదస్తు యథాగతః, తతః కతిపయాహోభిర్ద్వారకాం పునరభ్యగాత్. ౧౬. తస్మిన్నహని దేవోఽపి సహాన్తః పురికైర్జనైః, అనుభూయ జలక్రీడాం పానమాసేవతే రహః. ౧౭. రమ్యే రైవతకోద్యానే నానాద్రుమవిభూషితే, సర్వర్తుకుసుమైర్నిత్యం వాసితే సర్వకాననే. ౧౮. నానాజలజఫుల్లాభిర్దీర్ఘికాభిరలంకృతే, హంససారససంఘుష్టే చక్రవాకోపశోభితే. ౧౯. తస్మిన్నరమతే దేవః స్త్రీభిః పరివృతస్తదా, హారనూపురకేయూరరశనాద్యైర్విభూషణైః. ౨౦. భూషితానాం వరస్త్రీణాం చార్వంగీనాం విశేషతః, తాభిః సంపీయతే పానం శుభగంధాన్వితం శుభమ్. ౨౧. ఏతస్మిన్నంతరే బుద్ధా మద్యపానాత్తతః స్త్రియః, ఉవాచ నారదః సాంబం సాంబోత్తిష్ఠ కుమారక. ౨౨. త్వాం సమాహ్వయతే దేవో న యుక్తం స్థాతుమత్ర తే, తద్వాక్యార్థమబుద్ధ్వైవ నారదేనాథ చోదితః. ౨౩. గత్వా తు సత్వరం సాంబః ప్రణామమకరోత్ప్రభోః, సాష్టాంగం చ హరేః సాంబో విధివద్వల్లభస్య చ. ౨౪. ఏతస్మిన్నంతరే తత్ర యాస్తు వై స్వల్పసాత్త్వికాః, తం దృష్ట్వా సుందరం సాంబం

పురకాంత లింతకుము న్నెన్నఁడు నీతని నీక్షింపకుండుటచేతను మద్యము త్రావియున్నందున మతిదప్పియుండుటచేతను వెనుకటియవస్థను బొందిరి. వారు స్వభావముచేతనే యల్పబలము కలిగిఁయుండుటచేఁ బిరుదులు జాఱి పోయినవి. పురాణముల నీపద్య మొక్కటి యిలపై వినఁబడుచున్నది కద! బ్రహ్మచర్యము చేయుచున్నను పతివ్రతాశిరోభూషణమైయున్నను యువతికి సుందరుఁడగుపురుషుఁడు కనఁబడెనేని గుహ్యము తడియును, స్రవించును. మాంసాహారము లుపయోగించుటచేతను రుచిగలసీధుసురా సవ (పండినచెఱకురసముతోఁ జేర్చినకల్లు, వట్టికల్లు, పండ్లతోఁ దీయఁబడిన మద్యము)ములు త్రావుటచేతను పరిమళవస్తువులచేతను నింపగువస్త్రముల చేతను వారికిఁ గామ మభివృద్ధిబొందుచున్నది. అందుచే నెంతటిమానవతు లయ్యును సిగ్గువిడచియే వర్తించుచున్నారు. మున్ను శుక్రాచార్యులు సర్వకాలమునను లోకక్షేమము కోరుచు సీధుప్రయుక్తదోషము నివా రించుటకై "జ్ఞానవంతుఁడగు పురుషుఁ డెల్లప్పుడును మద్యపానము చేయ రాదు" అని శాసించెను. అని వచించి సుమంతుఁడు రాజున కిట్లనియె. ఇట నారదుండు సవ్విధమున సాంబుని దంబ్రికడ కంపి యాతనిపిరుందన వాసుదేవునొద్ద కేగ నమ్మునికుంజరు నీక్షించి మదించియున్నవనితలందఱు తొందఱగ లేచి నిలువంబడిరి. అట్టియెడ వారుకట్టిన పుట్టంబులెల్ల సడలి యూరులపైఁబడినవి. అదియు వారెఱుంగరైరి. వారి నీక్షించి హరి

---

సర్వాశ్చుక్షుభిరే స్త్రియః. ౨౫. న స దృష్టః పురా యాభిరంతఃపురనివాసిభిః, మద్య దోషాత్తతస్తాసాం స్మృతిలోపాత్తథా నృప. ౨౬. స్వభావతోఽల్పసత్వానాం జఘనాని విసుస్రువుః, శ్రూయతే చాప్యయం శ్లోకః పురాణప్రథితః క్షితౌ. ౨౭. బ్రహ్మచర్యేఽపి వర్తన్త్యాః సాధ్వ్యా హ్యపి చ శ్రూయతే, హృద్యం హి పురుషం దృష్ట్వా యోనిః సంక్లిద్యతే స్త్రియాః. ౨౮. లోకేఽపి దృశ్యతే హ్యేతన్మద్యస్యాత్యర్థసేవనాత్, లజ్జాం ముంచంతి నిఃశంకా హ్రీమత్యో హ్యపి హి స్త్రియః. ౨౯. సమాంసైర్భోజనైః స్నిగ్ధైః పానైః సీధుసురాసవైః, గంధైర్మనోజ్ఞైర్వస్త్రైశ్చ కామః స్త్రీషు విజృంభతే. ౩౦. సీధుప్రయుక్తం శుక్రేణ సతతం సాధు హీచ్ఛతా, మద్యం న పేయమత్యర్థం పురుషేణ విపశ్చితా. ౩౧. నారదోఽప్యథ తం సాంబం ప్రేషయిత్వా త్వరాన్వితః, ఆజగామాథ తత్రైవ సాంబస్యానుపదేన తు. ౩౨. ఆయాంతం తాశ్చ తం దృష్ట్వా ప్రియం సౌమ నసమ్మృషిమ్, సహసైవోత్థితాః సర్వాః స్త్రియస్తం మదవిహ్వలాః. ౩౩. తాసామథో

కోపించి "యేకారణముచే మీహృదయములు నన్నుబాసి యొండెడ కేగినవో అందుకై మీరు చచ్చినవెనుక మగనితోడి లోకములఁ బొందఁజాలరు. మగనిలోకమునుండియు స్వర్గమార్గమునుండి భ్రష్టత్వము నొందుదురుగాక ! మఱియు రక్షకులులేక దొంగలకుఁ జేఁజిక్కుదురుగాక!" అని యెల్లవారి నొక్కపెట్ల దిట్టెను. ఆశాపదోషంబుకతమనే హరి స్వర్గమున కేగ నర్జునుండు చూచుచుండఁగనే పంచనదప్రాంతవాసులగు దొంగలచే వార లపహరింపఁబడిరి. కొద్దిబలముగల యువతులెల్ల యిట్టిదోషమును బొందిరి. రుక్మిణీసత్యభామలును బ్రియురాలగు జాంబవతియును స్వబలముచే రక్షితలై దొంగలకుఁ జిక్కలేదు. ఆవాసుదేవుఁ డిప్పగిది నాండ్రఁదిట్టి సాంబునిఁగూడ నావెనుక శపించెను. "వత్సా! అందమగు నీరూపము జూచి యీయువిదలెల్ల క్షోభముఁబొందిరి. కాన నీవు వికారముగోలుపు కుష్ఠురోగమును బొందుము." అని యిట్లు పలికిన వెన్నునిపలుకులు విని పెద్దగ నవ్వుచు దుర్వాసశ్శాపమును దలంచుచు "తండ్రీ ! నాచిత్తమున నెట్టిదోషమును లేకున్నను నకారణముగ నీవు శపించితివి. కాని యిది నీశాపము కాదు. మున్నాగ్రహించి దుర్వాసముని యొసంగినయదియే. కాన నాకిందేమియు విచారమునుబొంద నెలవులేదు." అని చెప్పెను. సుమంతుండు వెండియు నిట్లనియె. ఇట్లకారణముగఁ దండ్రి శపియింప

---

స్థితానాం తు వాసుదేవస్య పశ్యతః, భిత్వా వాసాంసి శుభ్రాణి పత్రేషు పతితాని తు. ౩౪. తా దృష్ట్వా తు హరిః క్రుద్ధః సర్వాస్తాశ్శప్త వాన్ స్త్రియః, యస్మాద్గతాని చేతాంసి మాం ముక్త్వాన్యత్ర చ స్త్రియః. ౩౫. తస్మాత్పతికృతాంల్లోకా నాయుషోంతే న యాస్యథ, పతిలోకపరిభ్రష్టాః స్వర్గమార్గా త్తథైవ చ. ౩౬. భూత్వా చాశరణా యూయం దస్యుహస్తం గమిష్యథ. ౩౭. సుమంతురువాచ.—శాపదోషా త్తత స్తస్తాః స్త్రియః స్వర్గ తే హరౌ, హృతాః పాంచనదైశ్చోరై రర్జునస్య తు పశ్యతః, అల్పసత్వాస్తు యాస్తా వ్యసన్గ తాస్తా దూషణం స్త్రియః. ౩౮. రుక్మిణీ సత్యభామా చ తథా జాంబవతీ ప్రియా, నైతా గతా దస్యుహస్తం స్వేన సత్వేన రక్షితాః. ౩౯. శప్త్వైవ తాః స్త్రియః కృష్ణః సాంబమప్యశపత్తతః, యస్మాదతీవ తే కాంతం రూపం దృష్ట్వా ఇమాః స్త్రియః. ౪౦. క్షుబ్ధాః సర్వా యత స్తస్మాత్కుష్ఠరోగమవాప్నుహి, తస్య తద్వచనం శ్రుత్వా సాంబః కృష్ణస్య భారత. ౪౧. ఉవాచ ప్రహసన్రాజన్సంస్మరన్నృషిభాషితమ్, అనిమిత్తమహం తాత భావదోషవివర్జితః, శప్తో న మే త్ర వై క్రుద్ధో దుర్వాసా అన్యథా వదేత్. ౪౨. సుమంతురువాచ.—అస్మిఇచ్ఛత్తేఽనిమిత్తేఽసౌ పిత్రా

నాజాంబవతికుమారుఁడు కుష్ఠముచే విరూపుఁడయ్యెను. అంత నింకొక్క నాఁడును దుర్వాసున కాగ్రహము కలుగఁజేయ నాతఁడు శపించుటంజేసి యాదవకులనాశకమగు ముసలము (రోఁకలి) జనించినది. కావున నో క్ష మానాథ! సాంబుఁ డొనర్చునవినయములవల్ల నాతఁ డనుభవించు దుష్ట ఫలములను విని యెల్లవారును దేవబ్రాహ్మణగురువులయెడ వినయము కలిగియుండవలయును. అందఱు నిష్టపడునట్లు ప్రియవాక్యమునే పలుక వలయును. మున్ను పితామహుఁడుచేసిన రెండుశ్లోకములు నీవు విని యుండలేదా ? దేవదేవుఁడగు మహాదేవుఁడు వినుచుండఁ బితామహుం డాశ్లోకములు జెప్పెను. "ఏమనుజుఁ డెల్లప్పుడును ధర్మస్వభావముకలిగి యభిమానమును రోషమును జయించి విద్యావినయసంపన్నుఁడై యిత రుల నించుకేని బాధింపక తనభార్యతోడనే కూడి సంతసించుచుఁ బర యువతులఁ గన్నెత్తియైనఁజూడక మెలఁగునో ఆతని కేలోకమున నించు కేనియు భయము కలుగదు. చల్లని యుదకముకాని, చందనరసముకాని చల్లనిచెట్టునీడగాని యింపుగా మాటలాడుమాట యానందముగూర్చి నట్లులు పురుషుల కానందము గూర్పఁజాలవు." తరువాత శాపములచేఁ దిరస్కృతుఁడైన సాంబుఁడు విధ్యుక్తముగ లెస్సగ భాస్కరు నారాధించి యారోగ్యభాగ్యంబును వెనుకటియుత్తమరూపంబును తిరుగఁబడసెను. ఇటు లుత్తమరూపము నారోగ్యమును సూర్యుని మూలమున సంపాదించి సాంబుండు సూర్యభక్తుఁడై యాతని కొకయాలయమును దనపేర నొక

---

జాంబవతీసుతః, ప్రాప్తవాన్కుష్ఠరోగిత్వం విరూపత్వం చ భారత. ౪౩. సాంబేన పునరప్యేవ దుర్వాసాః కోపితో మునిః, తచ్ఛాపాన్ముసలం జాతం కులం యేనాస్య ఘాతితమ్. ౪౪. శ్రుత్వా హ్యవినయాద్దోషాన్సాంబేనాప్తాన్మహీపతే, నిత్యం భావ్యం వినీతేన గురుదేవద్విజాతిషు. ౪౫. ప్రియం చ వాక్యం వక్తవ్యం సర్వప్రీతికరం విభో, కిం త్వయా న శ్రుతౌ శ్లోకౌ యావుక్తౌ వేధసా పురా, శృణ్వతో దేవదేవస్య వ్యోమ కేశస్య భారత. ౪౬. యో ధర్మశీలో జితమానరోషో విద్యావినీతో న పరోపతాపీ, స్వదారతుష్టః పరదారవర్జితో న తస్య లోకే భయమస్తి కించిత్. ౪౭. న తథా శీతల సలిలం న చందనరసో న శీతలా ఛాయా, ప్రహ్లాదయతి చ పురుషం యథా మధుర భాషిణీ వాణీ. ౪౮. తతః శాపాభిభూతేన సమ్యగారాధ్య భాస్కరమ్, సాంబేనాప్తం

పురంబు చంద్రభాగానదియొడ్డునఁ గట్టించి యందు నిర్మించి సూర్యప్రతిష్ఠ యొనరించెను.

ఇది త్రిసప్తతితమాధ్యాయము.

---

## చతుస్సప్తతితమాధ్యాయము

బ్రాహ్మణోత్తమా! చంద్రభాగాతీరమున నాదిత్యుఁడు సాంబునిచే స్థాపింపఁబడెనేని నీచెప్పినచొప్పున నాతని కాస్థానము మొదటి దెట్లగును? నావిని సుమంతుఁడు శతానీకున కనియె. రాజా! సావధానముగ నాకర్ణింపుము. సూర్యున కాస్థాన మాద్యమయినవిధంబును బిదప సాంబుఁడు ప్రతిష్ఠించినవిధంబును విస్తరింతును. మున్ను లోకనాథుఁడు నాద్యుఁడు నంశుమాలియు నగుదివాకరుఁడు మిత్రనామముతో నానది యొడ్డునఁ దపము గావించెను. జననమరణములు లేక నిత్యుఁడై బ్రహ్మస్వరూపుఁడగు నాదిత్యుఁడు ప్రజాపతులను నిఖిలప్రజాసమూహమును సృష్టించి ముఖమునుండి తొలుతఁ బద్మసన్నిభుఁడగు దేవుని బుట్టించెను. తరువాత వక్షమునుండి పద్మజుని బుట్టించెను. ఆవెనుక లలాటమునుండి పద్మాక్షుఁడగు దివాకరుని దిసమొలవానిం గనెను. పిమ్మట నమ్మహాత్ముని

---

తథారోగ్యం రూపం చ పరమం పునః. ౪౯. రూపమాప్య తథాఽఽరోగ్యం భాస్కరా ద్ధరిసూనునా, నివేశితో రవిర్భక్త్యా స్వనామ్నా త్మాధిపేశ్వర. ౫౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబకృతసూర్యారాధనవర్ణనం నామ
త్రిసప్తతితమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—స్థాపితో యది సాంబేన సూర్యశ్చన్ద్రసరిత్తటే, తస్మా న్నాద్యమిదం స్థానం యథైతద్భాషతే భవాన్. ౧. సుమంతురువాచ.—ఆద్యం స్థానమిదం భానోః పశ్చాత్సాంబేన భారత, విస్తరేణాస్య చాద్యస్య కథ్యమానం నిబోధ మే. ౨. అత్రాద్యో లోకనాథోఽసౌ రశ్మిమాలీ జగత్పతిః, మిత్రత్వే చ స్థితో దేవ స్తపస్తేపే పురా నృప. ౩. అనాదినిధనో బ్రహ్మా నిత్యశ్చాక్షయ ఏవ చ, సృష్ట్వా ప్రజాపతీన్బ్రహ్మా సృష్ట్వా చ వివిధాః ప్రజాః. ౪. ససర్జ ముఖతో దేవం పూర్వ మంబుజసన్నిభమ్, కంజజస్తం తతో దేవం వక్షస్తో నిర్మమే నృప. ౫. లలాటాత్కురు శార్దూల నీరజాక్షం దిగంబరమ్, బుధవః పాదతః సర్వే సృష్టాస్తేన మహాత్మనా. ౬.

పాదములనుండి యెల్ల దేవతలు జనించిరి. తరువాత వేనవేలుకిరణములుగల యవ్యక్తుఁడగు నాపురుషుఁడు స్వయముగఁ దనదేహమును పండ్రెండుగాఁ జేసి యదితిదేవిగర్భమునఁ జొచ్చి పండ్రెండుమూర్తులుగ నుద్భవించెను. ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, పూష, త్వష్ట, అర్యమణుఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, నంశుఁడు, విష్ణుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు నని వారి నామములు. ఈపండ్రెండాదిత్యమూర్తులతోఁడ నమ్మహాత్మునిచే నీప్రపంచ మంతయు వ్యాపింపఁబడియుండె. ఆపండ్రెండుమూర్తులలో నింద్రుఁడను మొదటిమూర్తి దేవరాజపదముపొంది దానవుల నసురుల నాశ మొం దించుచున్నది. రెండవదగు ధాతృమూర్తి ప్రభాపతిత్వమున నిలచి ప్రజ లను సృష్టిచేయుచున్నది. ఆతని మూఁడవమూర్తియగు పర్జన్యమూర్తి యాతనికిరణములందే వసించి యమృత(ఉదక)మును వర్షించుచున్నది. నాలుగవది యగుపూష యనువిఖ్యాతిగలమూర్తి వైదికమంత్రముల వసించి ప్రజలను పోషించుచున్నది. త్వష్ట యని విఖ్యాతిజెందిన యైదవ మూర్తి వనస్పతు(వృక్షలతాదు)లందు నోషధులందును నిత్యముగ వసించును. అర్యముఁడను పేరఁబరఁగు నారవమూర్తి ప్రజాసంరక్షణార్థమై శరీరములనెడు పురములనే వసించి యెల్లప్పుడు నుండును. భగుఁడని విఖ్యాతిగల యేడగుమూర్తి భూమియందును బర్వతములందు నున్నది.

---

తతః శతసహస్రాంశురవ్యక్తః పురుషః స్వయమ్, కృత్వా ద్వాదశధాత్మానమదిత్యాముద పద్యత. ౭. ఇంద్రో ధాతా చ పర్జన్యః పూషా త్వష్టార్యమా భగః, వివస్వానంశుర్విష్ణుశ్చ వరుణో మిత్ర ఏవ చ. ౮. ఏభిర్ద్వాదశభిస్తేన ఆదిత్యేన మహాత్మనా, కృత్స్నం జగదిదం వ్యాప్తం మూర్తిభిస్తు నరాధిప. ౯. తస్య యా ప్రథమా మూర్తిరాదిత్యస్యేన్ద్రసంజ్ఞితా, స్థితా సా దేవరాజత్వే దానవాసురనాశినీ. ౧౦. ద్వితీయా చాస్య యా మూర్తిర్నామ్నా ధాతేతి కీర్తితా, స్థితా ప్రజాపతిత్వే సా విధాత్రీ సృజతే ప్రజాః. ౧౧. తృతీయా తస్య యా మూర్తిః పర్జన్య ఇతి విశ్రుతా, కరేష్వేవ స్థితా సా తు వర్షత్యమృతమేవ హి. ౧౨. చతుర్థీ తస్య యా మూర్తిర్నామ్నా పూషేతి విశ్రుతా, మంత్రేష్వవస్థితా సా తు ప్రజాః పుష్ణాతి భారత. ౧౩. మూర్తిర్యా పంచమీ తస్య నామ్నా త్వష్టేతి విశ్రుతా, వనస్పతిషు సా నిత్యమోషధీషు చ వై స్థితా. ౧౪. షష్ఠీ మూర్తిస్తు యా తస్య అర్యమేతి చ విశ్రుతా, ప్రజాసంవరణార్థం సా పురేష్వేవ స్థితా సదా. ౧౫. భానోర్యా సప్తమీ మూర్తిర్నామ్నా భగ ఇతి స్మృతా, భూమౌ వ్యవస్థితా సా తు

వివస్వంతుఁడను నెనిమిదవమూర్తి యగ్నిలో నిలచి దేహధారుల కన్నము వండి యిచ్చుచున్నది. చిత్రభానుని నవమమూర్తి యగునంశుమూర్తి చంద్రునందు నిలచి జగత్తును తృప్తిపఱచుచున్నది. పదియవమూర్తియగు విష్ణుమూర్తి నిత్యము దేవవైరుల నంతమొందించుచుఁ బ్రాదుర్భవించు చుండును. భానుని పదునొకండవమూర్తియగు వరుణమూర్తి జలములకెల్ల నాధారమగు సముద్రము నాశ్రయించి నిఖిలప్రపంచమును బ్రదికించు చున్నది. అప్పు(జలము)లకు స్థానము సముద్రముగాన వరుణుఁ డందు వసించుటంజేసి యాసాగరమునకు వరుణాలయమను పేరు కలిగెను. మిత్రుఁడను భానుని పండ్రెండవమూర్తి లోకహితార్థమై చంద్రభాగానదియొడ్డున వసించి వాయుభక్షకమై దయాదృష్టిగలిగి యెల్లప్పుడు భక్తులకు నానా విధములగు వరము లొసంగుచుఁ దప మాచరించుచుండెను. కావున నాదేవున కీస్థాన మాద్యమై మిత్రపదంబు నాఁబడు. ఆస్థానమున మిత్రుఁడు వసించుటంజేసి యద్దాని కీవిఖ్యాతి(మిత్రపదమని)గలిగె. అట నామూర్తిచే నాదిత్యు నారాధించి యమితతేజోవంతుండగు సాంబుండు నాతని యను గ్రహావశమున నాతని యాజ్ఞానుసారముగ నచ్చోట నామూర్తికిఁ బ్రతిష్ఠ గావించెను. ఈపండ్రెండుమూర్తులచే నమ్మహాత్ముఁడు భాస్కరుండు సమస్తప్రపంచమును వ్యాపించియున్నాఁడు. కాన నాపండ్రెండుమూర్తు

---

ష్వాధరేషు చ భారత. ౧౬. అష్టమీ చాస్య యా మూర్తిర్వివస్వానితి సంజ్ఞితా, అగ్నౌ వ్యవస్థితా సా తు పచతేఽన్నం శరీరిణామ్. ౧౭. నవమీ చిత్రభానోర్యా మూర్తిరంశురితి స్మృతా, పీర చంద్రే స్థితా సా తు ఆప్యాయయతి వై జగత్. ౧౮. మూర్తిర్యా దశమీ తస్య విష్ణురిత్యభిధీయతే, ప్రాదుర్భవతి సా నిత్యం గీర్వాణారివినాశినీ. ౧౯. మూర్తిస్త్వేకాదశీ యా తు భానోర్వరుణసంజ్ఞితా, జీవాయయతి సా కృత్స్నం జగద్ధి సముపాశ్రితా. ౨౦. అపాం స్థానం సముద్రస్తు వరుణోఽత్ర ప్రతిష్ఠితః, తస్మాదేవ ప్రోచ్యతే పీర సాగరో వరుణాలయః. ౨౧. మూర్తిర్యా ద్వాదశీ భానోర్నామతో మిత్రసంజ్ఞితా, లోకానాం సా హితార్థం తు స్థితా చంద్రసరిత్తటే. ౨౨. వాయుభక్షా తపస్తేపే యుక్తా మైత్రేణ చక్షుషా, అనుగృహ్ణన్సదా భక్తాన్వరైర్నానావిధైః సదా. ౨౩. ఏవమాద్యమిదం స్థానం పుణ్యం మిత్రపదం స్మృతమ్, తత్ర మిత్రః స్థితో యస్మాత్తస్మాన్మిత్రపదం స్మృతమ్. ౨౪. తయారాధ్య మహాబాహో సాంబేనామితతేజసా, తత్ప్రసాదాత్తదాదేశాత్ప్రతిష్ఠా తస్య వై కృతా. ౨౫. అభిర్ద్వా

లందు నాదిత్యుండు నమస్కరింపను నుతింపను దగియున్నవాఁడు. భక్తి యుక్తులై యాదిత్యునకు నిత్యము నమస్కరించుపుణ్యాత్ములు పద్మినీ నాథుని యుత్తమపదము నొందఁగలుగుదురు. ఇవ్విధ మెఱింగి పండ్రెండు మూర్తులుగల యాదిత్యుని బూజించువాఁడు సర్వపాపనిర్ముక్తుఁడై హేలి(సూర్యుఁడు)సాలోక్యము నొందుచున్నాఁడు.

ఇది చతుస్సప్తతితమాధ్యాయము.

---

## పంచసప్తతితమాధ్యాయము.

సాంబుఁడు సూర్యు నెవ్విధి నాశ్రయించెను? ఎవరిమూలమున నాతఁ డాతని నాశ్రయించెను? తీవ్రమగుశాపమును బొంది యాతఁడు తండ్రితో నేమి యనెను? నావుడు సుమంతుండు శతానీకున కిట్లనియె. ఓవీరవరా! ఆయాదవకుమారుఁడు శాపమునొందినవిధమును మున్నే యెఱింగించియుంటిని. అప్పగిదిఁ జక్రధరుఁడగు హరి శపియింప దానిచేఁ దిరస్కృతుఁడై సాంబుఁడు తండ్రిపాదముల కెఱఁగి లేచి వినయమున వంగి తలవాల్చి దోసిలియొగ్గి యిట్లని వేఁడుకొనెను. దేవా! నేనే మపకా

---

దశభిస్తేన భాస్కరేణ మహాత్మనా, కృత్స్నం జగదిదం వ్యాప్తం మూర్తిభిస్తు నరాధిప. ౨౬. తస్మాత్త్వంద్యో నమస్యశ్చ ద్వాదశస్వపి మూర్తిషు, యే నమస్యంతి చాదిత్యం నరా భక్తి సమన్వితాః. ౨౭. తే యాస్యంతి పరం స్థానం తిష్ఠేద్యత్రాంబుజేశ్వరః, ఇత్యేవం ద్వాదశాత్మానమాదిత్యం పూజయేత్తు యః. ౨౮. స ముక్తః సర్వపాపేభ్యో యాతి హేలిసలోకతామ్. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యద్వాదశమూర్తివర్ణనం నామ చతుఃసప్తతితమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—కథం సాంబః ప్రపన్నోఽర్కం కేన వా ప్రతిపాదితః, ఉగ్రం శాపం చ తం ప్రాప్య పితరం స కిముక్తవాన్. ౧. సుమంతురువాచ.— ఉక్తమేవ పురా వీర యథా శప్తః స యాదవః, పిత్రా సాంబో మహారాజ హరిణాం బుజధారిణా. ౨. అథ శాపాభిభూతస్తు సాంబః పితరమబ్రవీత్, వినయావనతో భూత్వా ప్రాంజలిః శిరసా గతః. ౩. కిం మయాపకృతం దేవ యేన శప్తోఽస్మ్యహం

(చా)ర మొనరించితిని? నీచే నెందులకు శపింపఁబడితిని? నీవాజ్ఞయిడిన వెనువెంటనే యతిత్వరితగతి నీసన్నిధి కేతెంచితినే! ఇంచుకేనియు నీయెడ నప కా(చా)రము గావింపని నాపై యిట్టి ఘోరశాపము లిడుట న్యాయమే? నేనించుకేనియుఁ దప్పిదమెఱుంగను. నన్ననుగ్రహింపుము. ప్రభూ! శాపమును మరల్పుము. పాపాభిభూతుఁడనగు నాకీపాపంబు వాయునుపాయం బుపదేశింపుము. నావుడుఁ గృష్ణుండు కుమారు ననపరాధిగా నెఱింగి యాతని నోదార్చి యిట్లనియె. కుమారా! యారోగమును మాయింప నేశక్తుండను కాను. ఈప్రపంచమున కంతకును నాథుఁడు పండ్రెండుమూర్తులుగల దివాకరుఁడు. ఆవేయి చేతులవేలుప దితిపట్టియే యీవ్యాధి నడఁగింపఁజాలువాఁడు. ఇప్పుడు నే నీవిషయమంతయు యోగదృష్టి నెఱింగితిని. మహానుభావుఁడగు నారదముని నీయెడఁ గోపించియున్నాఁడు. ఆకోపముననే నిన్ను నా యొద్దికిఁ బంపెను. కావున నీవేగి యామునిపుంగవుని బ్రసన్నుంగావించి వేఁడుకొనుము. ఆతఁడే నీ యీశాప మపనయింపఁజాలు దేవుని నీకెఱింగింపఁగలఁడు. ఆతనికడ కేగుము.” నావుడు జాంబవతికుమారుండు తండ్రిపలుకులు విని చిన్నబోయి శోకమున నాకులుఁడై చింతిలుచుండెను. అంత నొక్కనాఁడు ద్వారవతినున్న విష్ణుని సేవించుటకై యేతెంచిన నారదమునీంద్రుని వినయముతో సమీపించి “యోమహాత్మా! నీవు

---

త్వయా, అహం త్వదాజ్ఞయా దేవ త్వరమాణోఽత్ర ఆగతః. ౪. కస్మాన్ని పాతితః శాపో మయి తేఽనపకారిణి, న వై జానామ్యహం కించిత్ప్రసీద జగతః పతే. ౫. శాపం నియచ్ఛ మే దేవ ప్రసాదం కురు మే ప్రభో, కశ్మలేనాభిభూతోఽహం యేన ముచ్యేయ కిల్బిషాత్. ౬. తమువాచ తతః కృష్ణః సాంబం బుద్ధ్వా హ్యనాగసమ్, నాహం పుత్ర పునః శక్తో రోగస్యాస్య వ్యపోహనే. ౭. అస్యాయం జగతో నాథో ద్వాదశాత్మా దివాకరః, సహస్రరశ్మిరాదిత్యః శక్తః పుత్ర వ్యపోహితుమ్. ౮. జ్ఞాతం మయాధునా చైవ యథా త్వం నారదేన తు, రోషాద్విసర్జితః పుత్ర మత్సకాశం మహాత్మనా. ౯. తస్మాత్తమేవ పృచ్ఛ త్వం ప్రసాద్య ఋషిసత్తమమ్, ఆఖ్యాస్యతి స తే దేవం శాపం యస్తేఽపనేష్యతి. ౧౦. అథైతత్స పితుర్వాక్యం శ్రుత్వా జాంబవతీసుతః, దీనః శోకపరీతాత్మా తతః సఞ్చింత్య భారత. ౧౧. ద్వారవత్యాం స్థితం విష్ణుం కదాచి ద్ద్రష్టుమాగతమ్, వినయాదుపసంగమ్య సాంబః పప్రచ్ఛ నారదమ్. ౧౨. భగవ న్స్నేహసః

బ్రహ్మపుత్త్రుఁడవు సర్వజ్ఞుఁడవు. మంచినియమము కలవాఁడవు. కావున నిన్నుశరణంటిని. కరుణింపుము. నాశరీరము రోగము బాసియుండునట్లుగను పాపము నశించునట్లుగను నొక్కమహాయోగంబు బ్రసాదింపవే; నానత నికి నారదుం డనియె. "ఎవఁడు సర్వదేవతలకు స్తుత్యుఁడు నమస్యుఁడు పూజ్యుఁడు నై యున్నవాఁడో యాదేవు నతిరయముగఁ బూజించి త్వరితముగ వ్యాధినుండి విడివడఁగలవు." అనవుడు సాంబుండు "మహాత్మా! ఏదేవుఁడెల్ల దేవతలకుఁబూజ్యుఁడు స్తుత్యుఁడునమస్యుఁడు నై యున్నాఁడు? సర్వవ్యాపియు నెల్లరకు రక్షకుఁడు నెవ్వరు? ఎవ్వాని నే శరణందుదును? మహామునీ! తండ్రిశాపాగ్నిచేఁ గాల్పఁబడుచున్న నాతాప ముపశమింప నేదేవుని శరణముబొందుదును?" అని యడుగ జాలిగొల్పు నాసాంబుని పలు కాలించి తొల్లింటికోపమును విడనాడి నారదుఁ డిట్లనియె. ఓయదు సింహామా! నీవనఘుఁడవు. స్తోత్రముచేతను నభివాదనమునకుఁ బూజకు నమస్కారమునకు సేవకును బ్రహ్మాదులకుఁ గూడ భానుఁడే యర్హుఁడు. ఆభాస్కరుఁడే యెల్లవు డారాధ్యుఁ డై యున్నాఁడు. ఇందుఁ దొల్లింటి వృత్తాంతమును వర్ణింతు వినుము.

పంచసప్తతితమాధ్యాయము.

---

పుత్ర సర్వలోకజ్ఞ సువ్రత, ప్రసాదం కురు మే విప్ర ప్రణతస్య మహామతే. ౧౩. యేన మే నీరుజం కాయం కశ్మలం చ ప్రణశ్యతి, తం యోగం బ్రూహి మే విప్ర ప్రణతస్యాస్య సువ్రత. ౧౪. నారద ఉవాచ.—యః స్తుత్యః సర్వదేవానాం నమస్యః పూజ్య ఏవచ, పూజయిత్వాశు తం దేవం తతో వ్యాధిం ప్రహాస్యసి. ౧౫. సాంబ ఉవాచ.—కః స్తుత్యః సర్వదేవానాం నమస్యః పూజ్య ఏవ చ, కః సర్వగశ్చ సర్వత్ర శరణం యం వ్రజామ్యహమ్. ౧౬. పితృశాపానలేనాహం దహ్యమానో మహామునే, శాంత్యర్థమస్య కం దేవం శరణం వ వ్రజామ్యహమ్. ౧౭. ఏతచ్ఛ్రుత్వా తు సాంబస్య వచనం కరుణావహమ్, హిత్వా తు కామజం వీర నారదో వాక్యమబ్రవీత్. ౧౮. స్తుత్యో వంద్యశ్చ పూజ్యశ్చ నమస్య ఈడ్య ఏవ చ, భాస్కరో యదుశార్దూల బ్రహ్మాదీనాం సదానఘ. ౧౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సాంబోపాఖ్యానే సాంబం ప్రతి కృష్ణశాపే
సాంబస్య నారదోపసంగమనవర్ణనం నామ
పఞ్చసప్తతితమోఽధ్యాయః.

## షట్సప్తతితమాధ్యాయము

మున్నొక్కప్పుడు నేను మూఁడులోకములు సంచరించుచు సూర్యలోకమున కేగితిని. అచ్చట సమస్తదేవగణములు పరివేష్టింప గంధర్వాప్సరోగణములును నాగులును యక్షరాక్షసులును జేరి కొలువ నాసీనుఁడై యున్న యాదిత్యు నీక్షించితిని. అట గంధర్వులు పాడుచుండిరి. అచ్చరలు నాట్యమాడిరి. యక్షులు రాక్షసులు పన్నగులు నాయుధపాణులై రక్షించుచుండిరి. ఋగ్యజుస్సామవేదము లొడలుదాల్చియున్నవి. ఆవేదమూర్తు లొనరించిన వివిధస్తోత్రములచే ఋషులు సూర్యుని స్తుతి చేయుచున్నారు. శుభాననలగు మూఁడుసంధ్యలు మూర్తిమంతము లయి యున్నవి.ఆమూఁడుసంధ్యలును వజ్రములను విల్లంబులను గొని సూర్యుని బరివారించి యుండినవి. అందు మొదటిది వర్ణమునుబట్టి యరుణ యనఁబడును. మధ్యసంధ్య చంద్రనిభమై యున్నది. మూఁడవసంధ్య యంగారకునివర్ణము గలది. (పద్మసంకాశమై దేవతలచేఁ గొల్వఁబడుచున్నదని పాఠాంతరము.) ఆదిత్యగణదేవతలును వసువులును రుద్రులును మరుత్తులు నశ్వినులు నితరదేవతలును మూఁడుసంధ్యలందును సూర్యుని బూజించుచున్నారు. ఇంద్రుఁడు జయజయవెట్టుచు నటనే యుండెను. మూఁడు కన్నులవేలుపు కవియై మూఁడుసంధ్యలను స్తోత్రముచేయుచున్నారు. ఇప్పగిది నెల్లవారా దేవుని బూజించుచున్నారు. ప్రాతఃకాలమున నంబుజాకారము నంబుజాసనము గలదేవుని బద్మాసనుఁడు బూజిం(పవల

---

నారద ఉవాచః—కదాచిత్పర్యటఁల్లోకాన్సూర్యలోకమహం గతః, తత్ర దృష్టో మయా సూర్యః సర్వదేవగణైర్వృతః. ౧. గంధర్వైరప్సరోభిశ్చ నాగైర్యక్షైశ్చ రాక్షసైః, తత్ర గాయంతి గంధర్వా నృత్యన్త్యప్సరసస్తథా. ౨. రక్షంత్యుద్యతశస్త్రాస్తం యక్షరాక్షసపన్నగాః, ఋచో యజూంషి సామాని మూర్తిమంతీహ సర్వశః, తత్కృతై ర్వివిధైః స్తోత్రైః స్తువంతి ఋషయో రవిమ్. ౩. మూర్తిమత్యః స్థితాస్తత్ర తిస్రః సంధ్యాః శుభాననాః, గృహీతవజ్రనారాచాః పరివార్య రవిం స్థితాః. ౪. అరుణా వర్ణతః పూర్వా మధ్యమా చేన్దుసన్నిభా, తృతీయా క్ష్మాజసంకాశా సంధ్యా చైవ ప్రకీర్తితా. ౫. ఆదిత్యా వసవో రుద్రా మరుతోఽథాశ్వినౌ తథా, త్రిసంధ్యం పూజయంత్యర్కం తథాన్యే చ దివౌకసః. ౬. ఈరయఞ్జయశబ్దం తు ఇన్ద్రస్తత్రైవ తిష్ఠతి, కవిస్తు త్ర్యంబకో దేవస్త్రిసంధ్యం పూజయంతి వై. ౭. దినాదావంబుజాకారం పూజయే

యు)చును. మధ్యాహ్నమునఁ జక్రాకారుఁడు దీప్తకిరణుఁడు నగు దేవుని విష్ణువు బూజిం(పవలయుఁయు)చును. రాత్రియందు విస్తారమగు నాజ్య రూపము దాల్చి సగణుఁడగు దేవు నా(రాధింపవలయును.)దిత్యు నీవిధముగఁ జంద్రశేఖరుఁడు భక్తితో నెల్లప్పుడును రవి నారాధించు (చుండె) ను. గరుడాగ్రజుఁ డెల్లప్పుడు నాతనికి సారథ్య మొనర్చు చున్నాఁడు. ఆతఁడు కాలావయవములగు మాసాదులచే నిర్మింపఁబడిన దివ్యరథమును హరితములగు వాజులననొప్పు నేడు ఛందస్సులను గట్టి వహించుచున్నాఁడు. ఆతని యిరుప్రక్కలను రాజ్ఞి నిక్షుభ యను నిరు వురుభార్య లాతని సేవించుచుండిరి. ఇట్టులే యితరనామములుగల దేవ తలు గూడ నాతని బరివారించియుండిరి. అటఁ బింగళుఁడు లెక్కలు వ్రాయుచుండెను. ఇతరుఁ డొక్కఁడు దండనాథుఁడై యుండెను. కల్మాష పక్షులు రెండు రాజసేవకవేషులై వాకిలి కావలివారై యుండిరి. తరు వాత మేరుసమానలక్షణమైయున్న యాకసము నాల్గుకొమ్ములు(కోణములు) నాతని సేవించుచున్నవి. ఎదుట దిండియు నెనిమిదిదిక్కుల నితర దేవతలు నుండిరి. ఇట్లు సర్వవ్యాపియై జగత్తున మిక్కిలి వెలుఁగొందుచు సర్వగీర్వా ణులచేత బ్రహ్మపురస్సరముగఁ బూజితుఁ డగుచున్న దేవోత్తముని, గ్రహనాయకుని, భువనేశ్వరు, నాదిత్యుని శరణొందుము. నావు డాత నికి సాంబుఁ డిట్లనియె. మహాత్మా! రవి యెట్లు సర్వగతుఁడయ్యెనో? ఆతని కెన్నికిరణము లున్నవో? యెన్నిమూర్తు లున్నవో? రాజ్ఞి

---

దంబుజాసనమ్, చక్రరూపం తు మధ్యాహ్నే ఘృతార్చిః పూజయేత్సదా. ౮. పూజయే త్సగణం రాత్రౌ విపులాజ్యస్వరూపిణమ్, రవిం భక్త్యా సదా దేవం కంజార్ధకృతశేఖరః ౯. సారథ్యం కురుతే తస్య పతగస్యాగ్రజః సదా, వహమానో రథం దివ్యం కాలావయవ నిర్మితమ్. ౧౦. హరితైః సప్తభిర్యుక్తం ఛందోభిర్వాజిరూపిభిః. ౧౧. ద్వే భార్యే పార్శ్వ యోస్తస్య రాజ్ఞీనిక్షుభసంజ్ఞితా, తథాన్యైర్నామభిర్దేవాః పరివార్య రవిం స్థితాః. ౧౨. పింగలో లేఖకస్తత్ర తథాన్యో దండనాయకః, రాజాశ్రోషౌ చ ద్వౌ ద్వారే స్థితౌ కల్మాషపక్షిణౌ. ౧౩. తతో వ్యోమ చతుః శృంగం మేరోః సదృశలక్షణమ్, దిండిస్తథా గ్రత స్తస్య దిక్షు చాన్యే స్థితాః సురాః. ౧౪. ఏవం సర్వగమం దేవం ప్రదీప్తం జగతి ద్విజ, బ్రహ్మాద్యైః సంస్తుతం దేవం గీర్వాణైర్వృషభోత్తమమ్, గ్రహేశం భువనేశానమా దిత్యం శరణంవ్రజ. ౧౫. సాంబ ఉవాచ.—తత్త్వతః శ్రోతుమిచ్ఛామి కథం సర్వగతో

యెవరో? నిక్షుభ యెవ్వతెయో? దండనాయకుఁ డెవ్వరో? పింగళుఁ డెవరో? యేమి వ్రాయుచున్నాఁడో? రాజశ్రోషులగుకల్మాషపక్షు లెవ్వరు? మేరుసమానలక్షణమగు వ్యోమమున కెయ్యది దైవము? ఎదుట దిండి యెవరు? దిక్కులనున్న దేవత లెవ్వరు? ఇదియంతయు యథార్థముగ సప్రమాణముగ విస్తరించి వచింపుము. వినఁగోరుచున్నాను అట్టివానితత్త్వము నెఱింగి యాతని శరణొందుదును.

ఇది షట్సప్తతితమాధ్యాయము

---

## సప్తసప్తతితమాధ్యాయము.

అనవుడు నారదుం డతని కిట్లనియె. తొలుత విస్తరించి వలుసగ నాదిత్యునితత్త్వంబు వర్ణింతు నాకర్ణింపుము. ఆమీఁద నావివస్వంతునకుఁ బ్రణమిల్లి తక్కుంగలవారిచరిత్రంబు వర్ణింతును. ప్రకటము కాక యెల్ల లోకములకును మూలకారణమై నిత్యమై సదసద్రూపమై యేతేజంబుండు నదియే యాదిత్యుఁడు. తత్త్వవిచారముచేయు ధీనిధులు ప్రకృతి యనియుఁ బ్రధానమనియు నెవ్వని బలుకుచున్నారో ఆతఁడే సూర్యుఁడు.

---

రవిః. ౧౬. కతివా రశ్మయస్తస్య మూర్తయశ్చ కతి స్మృతాః, కా రాజ్ఞీ నిక్షుభా కా చ కశ్చాయం దండనాయకః. ౧౭. పింగలశ్చాపి కస్తత్ర కిం చాసౌ లిఖతే సదా, రాజశ్రోషౌ చ కౌ తత్ర కౌ చ కల్మాషపక్షిణౌ. ౧౮. కిం దైవత్యం చ తద్వ్యోమ మేరోః సదృశలక్షణమ్, కో దిండిరగ్రతస్తత్ర కే దేవా దిక్షు యే స్థితాః. ౧౯. తత్త్వతో నిగమైశ్చైవ విస్తరేణ వదస్వ మామ్, యేనాహం తత్త్వతో జ్ఞాత్వా వ్రజామి శరణం ద్విజ. ౨౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే నారదసాంబ
సంవాదే సూర్యపరివారవర్ణనం నామ
షట్సప్తతితమోఽధ్యాయః.

---

నారద ఉవాచ:—విస్తరేణానుపూర్వ్యా చ సూర్యం నిగదతః శృణు, తతః శేషాన్ప్రవక్ష్యేఽహం నమస్కృత్య వివస్వతే. ౧. అవ్యక్తం కారణం యత్తన్నిత్యం సదసదాత్మకమ్, ప్రధానం ప్రకృతిశ్చేతి యమాహుస్తత్వచింతకాః. ౨. గంధైర్వర్ణై

ఆతఁడు వెలుపలివగు గంధరూపరసశబ్దస్పర్శములులేక వేరయియుండెను. జగత్తునకుఁ గారణమై మహాభూతమై శాశ్వతమగు పరబ్రహ్మం బీయాదిత్యుఁడే. ఈయాదిత్యుఁడే సర్వభూతముల నడఁగించువాఁడై యవ్యక్తుఁడై యుండెఁగదా ? ఆద్యంతములులేక పుట్టుకలేక సూక్ష్మముల కెల్ల సూక్ష్మమైయుండు నాతఁడు సత్త్వరజస్తమములను గుణముల నాశ్రయించి యుత్పత్తిప్రళయములఁ బొందును. పరమార్థమున నాతని కాకారమే లేదనియుఁ దెలియరానివాఁడనియుఁబరుఁడగుపురుషుఁడనియు విద్వాంసులయాశయము. అమ్మహాత్ముని స్వరూపముచే నీప్రపంచమంతయు వ్యాప్తమై యుండెను ఆయీశ్వరుని ప్రతిమ (విగ్రహము) జ్ఞానమును, వైరాగ్యమునే అయియున్నవి. అభిమానఘనుఁడగు నాదేవునకు ధర్మ ప్రభావముకతన నేర్పడు బ్రహ్మజ్ఞానమే బుద్ధి ఆయవ్యక్తము మనమున నెద్దాని వాంఛించునో అదియెల్లఁ గలుగును. బ్రహ్మత్వమును వాంఛించి చతుర్ముఖుఁడగును. కాలమును వాంఛించెనేని రుద్రుఁడు (యముఁడు) గ నగును. స్థితిని గోరెనేని వేయితలలుగల పురుషుఁడగును. ఇట్లు ఆస్వయం భువునకు మూఁడవస్థలు కలుగును బ్రహ్మత్వము నొందియున్నప్పుడు సత్త్వరజోగుణములచేరిక గలిగియుండును. కాలరూపము దాల్చినప్పుడు రజస్తమోగుణములచేరిక గలిగియుండును. పురుషరూపమున నున్నప్పుడు సత్త్వగుణ మొక్కటియే కలిగియుండును. ఇటు లాదేవునకు గుణపరి వర్తన మేర్పడుచున్నది. బ్రహ్మత్వమును దాల్చియున్నప్పుడు లోకములఁ బుట్టించుచున్నాఁడు. కాలత్వమును దాల్చినప్పుడు సంహరించును. పురు షత్వము దాల్చినప్పు డుదాసీనుఁడై యుండును. ఇబ్భంగి నాప్రజాపతికి

---

రసైర్హీనం శబ్దస్పర్శవివర్జితమ్, జగద్యోనిం మహద్భూతం పరం బ్రహ్మ సనాతనమ్. 3. నిగ్రహం సర్వభూతానామవ్యక్తమభవత్కిల, అనాద్యంతమజం సూక్ష్మం త్రిగుణం ప్రభవాప్యయమ్. ౪. అనాకారమవిజ్ఞేయం తమాహుః పురుషం పరమ్, తస్యాత్మనా సర్వమిదం జగద్వ్యాప్తం మహాత్మనః. ౫. తస్యేశ్వరస్య ప్రతిమా జ్ఞానవైరాగ్యలక్షణా, ధర్మైశ్వర్యకృతా బుద్ధిర్బ్రాహ్మీ తస్యాభిమానినః. ౬. అవ్యక్తాజ్జాయతే తస్య మనసా యద్యదిచ్ఛతి, చతుర్ముఖస్య బ్రహ్మత్వే కాలత్వే చాంతకృద్భవేత్. ౭. సహస్ర మూర్ధా పురుషస్తిస్రోఽవస్థాః స్వయంభువః, సత్వం రజశ్చ బ్రహ్మత్వే కాలత్వే చ రజస్తమః. ౮. సాత్వికం పురుషత్వే చ గుణవృత్తం స్వయంభువః, బ్రహ్మత్వే సృజతే లోకాన్కాలత్వే చాపి సంక్షిపేత్. ౯. పురుషత్వే ఉదాసీనస్తిస్రోఽవస్థాః ప్రజాపతేః,

మూఁడవస్థలు కలుగుచున్నవి. తనరూపమును మూఁడుగ విభజించి మూఁడువేళలఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడు. ఆమూఁడురూపములచేతను స్వయముగఁ బుట్టించి గిట్టించి చూచుచున్నాఁడు. ఆస్వయంభువునుండి తొలుత హిరణ్యగర్భుఁ డుద్భవమందెను. ఈతఁడు మొదటిదేవుఁడై యుండుకతన నాదిత్యుఁడనియుఁ బుట్టనివాఁడగుట నజుఁడనియు స్మరింపఁ బడియున్నాఁడు. ఆతఁడే దేవతలకెల్ల గొప్పదేవతయై యుండుట మహా దేవుఁడని తలంపఁబడుచున్నాఁడు. అన్నిట సమర్థుఁడై యుండుట నంద అకు నధిపతియై యుండుటను నీశ్వరుఁడన నెగడుచున్నాఁడు. బృహా (పెద్ద) ద్రూపుఁడై యుండుకతన బ్రహ్మ యనియు, అన్నిటికిఁ గారణమై యుండుటచే భవుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ప్రజలందఱు నాతని వలనఁ గలుగుటంజేసి యాతఁడు ప్రజాపతినామంబు వడసె. పురమున (శరీరమున) శయనించి యుండుటంజేసి పురుషుఁ డనంబరఁగుచున్నాఁడు. ఇతరులచేఁ బుట్టింపఁబడకయుండుటను నితనికిఁ బూర్వ మెవ్వఁడును లేకుండుటచేతను స్వయంభువుఁడన విఖ్యాతిఁగాంచె. బంగారుగ్రుడ్డు నడుమనుండుటచే హిరణ్యగర్భుఁ డనునామమును, ద్యులోకమునకుఁ బతియై యుండుట నెల్లగ్రహముల కీశుఁడై యుండుటను దివస్పతి గ్రహేశనామములను దేవదేవుఁడగు నాదివాకరుఁడు వహించెను. అప్పులు (ఉదకములు) నారములని తత్త్వవేత్తలగుమునులు వచించు చున్నారు ఆదేవున కాయప్పులు నివాసమై యుండుకతన నాదేవుఁడు నారాయణనామముం బడసె. "అర" అనునది "శీఘ్రము" అనునర్థమున

---

త్రిధా విభజ్య చాత్మానం త్రికాలం సంప్రవర్తతే. ౧౦. సృజతే గ్రసతే చైవ వీక్షతే చ త్రిభిః స్వయమ్, అగ్రే హిరణ్యగర్భస్తు ప్రాదుర్భూతః స్వయంభువః. ౧౧. ఆదిత్య స్యాదిదేవత్వాదజాతత్వాదజః స్మృతః, దేవేషు స మహాన్దేవో మహాదేవః స్మృతస్తతః. ౧౨. సర్వేశత్వాచ్చ లోకస్య అధీశత్వాచ్చ ఈశ్వరః, బృహత్వాచ్చ స్మృతో బ్రహ్మా భవత్వాద్భవ ఉచ్యతే. ౧౩. పాతియస్మాత్ప్రజాః సర్వాః ప్రజాపతిరతః స్మృతః, పురే శేతే చ వై యస్మాత్తస్మాత్పురుష ఉచ్యతే. ౧౪. నోత్పాద్యత్వాదపూర్వత్వా త్స్వయంభూరితి విశ్రుతః. ౧౫. హిరణ్యాండగతో యస్మాద్గ్రహేశో వై దివస్పతిః, తస్మాద్ధిరణ్యగర్భోఽసౌ దేవదేవో దివాకరః. ౧౬. ఆపో నారా ఇతి ప్రోక్తా ఋషిభి స్తత్వదర్శిభిః, అయనం తస్య చా ఆపస్తేన నారాయణః స్మృతః. ౧౭. అర ఇత్యేష

నిపతితము (అకారణముగ నొకయర్థము చెప్పుట)అని కవులు స్మరించు చున్నారు. త్వరగాఁ బోవునవి యని యర్థము. అప్పులే సముద్రమును జేరి తద్రూపములై యుండుకతన శీఘ్రత్వమును విడుచుటచే నరము లనఁ బడుచున్నవి. మున్ను స్థావరజంగమాత్మకమగు నీప్రపంచము సర్వము నేకార్ణవమై నశింప నాసమయమున నారాయణుఁడనుపురుషుఁ డాజల మున నిదురించెను. ఆపురుషుఁడు వేయితలలు వేయికన్నులు వేయిపాద ములు వేయిచేతులు గలిగియుండెను. ఏపురుషుఁడు తొల్లింటివాఁడై ప్రజాపతియై వేదమార్గమున నుతికెక్కుచున్నాఁడో యాతఁడొక్కఁడే యాదిత్యుఁడై భువనమును రక్షించుచున్నాఁడు. ఆతఁడే తనకుఁ బూర్వులు లేక యేకాకియై పురాణపురుషుఁ డనఁబడుచున్నాఁడు. ఆపురుషుఁడే మహానుభావుఁడై హిరణ్యగర్భుఁడై కటికిచీఁకటికి వెలుపల నున్నవాఁడు. ఇతరములన్నియుఁ జీఁకటికి లోనైయున్నవి. ఈతఁడు మాత్రము మహాత్ముఁడగుట దానికి లోనుగాఁడయ్యెను.

ఇది సప్తసప్తతితమాధ్యాయము.

---

శీఘ్రార్థో నిపాతః కవిభిః స్మృతః, ఆప ఏవార్ణవా భూత్వా న శీఘ్రాస్తేన తా నరాః. ౧౭. ఏకార్ణవే పురా తస్మిన్నష్టే స్థావరజంగమే, నారాయణాఖ్యః పురుషః సుష్వాప సలిలే తదా, సహస్రశీర్షా సుమనాః సహస్రాక్షః సహస్రపాత్. ౧౮. సహస్రబాహుః ప్రథమః ప్రజాపతిస్త్రయీపథే యః పురుషో నిగద్యతే, ఆదిత్యవర్ణో భువనస్య గోప్తా అపూర్వ ఏకః పురుషః పురాణః. ౨౦. హిరణ్యగర్భః పురుషో మహాత్మా సంపద్యతే వై తమసః పరస్తాత్. ౨౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యవర్ణనం నామ
సప్తసప్తతితమోఽధ్యాయః.

## అష్టసప్తతితమాధ్యాయము.

వేయియుగములకు సరియైన రాత్రికాలమున నాదేవుఁడు సుఖాసనాసీనుఁడై రాత్రి యవసానమున సృష్టిచేయవలయు నను నఖిలంపు పెంపున బ్రహ్మత్వము నవలంబించుచున్నాఁడు. అతఁడు నీటిలోమునిఁగి యున్న పుడమి నీక్షించి కార్యమాలోచించి వెంటనే వరాహరూపము దాల్చి సమర్థుఁడై జలమునఁ జొరఁబడెను. ఇటులు జొచ్చి భూమి నుద్ధరింప నిచ్ఛగించి యుత్సహించి యమ్మహార్ణవమునుండి భూమి నుద్ధరింప నారంభించెను. అట్టియెడ నీటఁదడిసిన బొజ్జగలిగి భూమిని జేతఁబట్టి విదళించుచున్న యమ్మహావరాహమూర్తియొక్క వేదమయంబగు శరీరము నాతని రోమమధ్యగతు లగుమునులు జపించుచున్నారు. ఇప్పగిది భూమిని జలమునుండి లేవనెత్తి ప్రజాసృష్టి యొనరింప సమకట్టెను. అంత మొదటఁ దనతో సమానులగు శుభాకారుల మానసపుత్త్రులను భృగువు, అంగిరసుఁడు, అత్త్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, మరీచి, దక్షుఁడు, వసిష్ఠుఁడు ననువారిఁ దొమ్మండ్రు ప్రజాపతుల నుత్పాదించెను. ఆవెనుక నప్పురుషోత్తముఁడు ప్రజలకు హితముఁజేయఁగోరి యదితికుమారుఁడై యుద్భవించెను. మరీచునుండి కశ్యపుఁ డుద్భవించెను. ఈతనినే బ్రహ్మ నీటిలో బ్రహ్మసమానమగు తేజము నొసఁగి దశమప్రజాపతినిగ నుత్పాదించెను. ఈకశ్యపప్రజాపతికి దక్షకన్యయగు నదితి భార్య యయ్యెను.

---

నారద ఉవాచః—తుల్యం యుగసహస్రస్య నైశం కాలముపాస్య సః, శర్వర్యంతే ప్రకురుతే బ్రహ్మత్వం సర్గకారణాత్. ౧. సలిలేనాప్లుతాం భూమిం దృష్ట్వా కార్యం విచింత్య సః, భూత్వా స తు వరాహో వై అపః సంవిశతే ప్రభుః. ౨. సఇచ్ఛంస్త్వేవం స దేవేశో భూమేరుద్ధరణే క్షమః, మహీం మహార్ణవే మగ్నాముద్ధర్తుముపచక్రమే. ౩. ఉత్తిష్ఠతస్తస్య జలార్ద్రకుక్షేర్మహావరాహస్య మహీం విధార్య, విధున్వతో వేదమయం శరీరం రోమాంతరస్థా మునయో జపంతి. ౪. ఉద్ధృత్యోర్వీం స సలిలాత్ప్రజాసర్గమకల్పయత్, మనసా జనయామాస పుత్రానాత్మసమాఞ్ఛుభా[illegible]. ౫. భృగ్వంగిరసమత్రిం చ పులస్త్యం పులహం క్రతుమ్, మరీచిమథ దక్షం చ వశిష్ఠం నవమం తథా. ౬. నవ ప్రజాపతీన్సృష్ట్వా తతః స పురుషోత్తమః, ప్రాదుర్భూతోఽదితేః పుత్రః ప్రజానాం హితకామ్యయా. ౭. మరీచాత్కశ్యపం పుత్రం యం వేధా జనయజ్జలే, ప్రజాపతీనాం దశమం తేజసా బ్రహ్మణః సమమ్. ౮. దక్షకన్యాఽదితి

భూర్భువస్స్వర్లోకములతోఁ గూడినయండము నొకదాని నామె కాంచెను. ఆయండమునుండి సహస్రాంశుఁడై పండ్రెండుమూర్తులుగలిగి దివాకరుఁ డుద్భవించెను. ఇమ్మహాత్ముని విస్తీర్ణము తొమ్మిదివేలయోజనములు. ఈవిభావసుని వైశాల్యము విస్తారమునకు మూఁడింత లధికము. కడిమి పుష్పము నలుగడలఁ గేసరము (జూకా)లతో నావృతమై యున్నట్లు సూర్యుని తేజోగోళమునకు నలుగడలఁ గిరణము లావరించియున్నవి. సహస్రశీర్షుఁడగు పురుషుఁడు బ్రాహ్మయోగంబు దెలియఁజేయుచు నా తేజోగోళంబునడుమ నున్నాఁడు. ఆతఁడు తన వేయికిరణముల సంతటఁ బరఁగించి నదులనుండియు సముద్రములనుండియు బావులనుండియు హ్రదములనుండియు నీటిని లాగుకొనుచున్నాఁడు. దేవుఁడగు దివా కరుఁ డస్తమించినవెనుక నాతనికాంతి యగ్నిని బ్రవేశించును. అక్కతన నగ్నిదేవుఁడు రాత్రులం దెంతదూరమున నున్నను వెలుఁగుచున్నాఁడు. సూర్యుఁ డుదయింప నగ్నియందలి యాతేజము మఱల సూర్యుని జొచ్చును. అగ్నితేజమునుండి నాలవపాలు గ్రహించి యాదిత్యుండు పగలు తపించుచున్నాఁడు. వెలుఁగు వేఁడిమి యను నీరెండును సూర్యునం దగ్నియందు నున్నవని కీర్తించుచున్నారు. ఈదేవత లిరువురును రేయుం బవలు నొండొరులఁ జొచ్చి లోకమును దృప్తిపఱచుచున్నారు. కిరణ ములవ్యాప్తియు వానినామములను వివరింతు వినుము. హేతులు

---

ర్నామ్నా పత్నీ సా కశ్యపస్య తు, అండం సా జనయామాస భూర్భువః స్వస్త్రి సంయుతమ్. ౯. తత్రోత్పన్నః సహస్రాంశుర్ద్వాదశాత్మా దివాకరః, నవయోజనసాహస్రో విస్తారోఽస్య మహాత్మనః, విస్తారాత్త్రిగుణశ్చాస్య పరిణాహో విభావసోః. ౧౦. యథా పుష్పం కదంబస్య సమంతాత్కేశరైర్వృతమ్, తథైవ తేజసాం గోలం సమంతాద్రశ్మిభి ర్వృతమ్. ౧౧. సహస్రశీర్షా పురుషో బ్రాహ్మం యోగముదాహరన్, తైజసస్య చ గోలస్య స తు మధ్యే వ్యవస్థితః. ౧౨. ఆదత్తే స తు రశ్మీనాం సహస్రేణ సమంతతః, అపో నదీసముద్రేభ్యో హ్రదకూపేభ్య ఏవ చ. ౧౩. సౌరీ ప్రభా యా దేవస్య అస్తం యాతే దివాకరే, అగ్నిమావిశతే రాత్రౌ తస్మాద్దూరాత్ప్రకాశతే. ౧౪. ఉదితే చ తతః సూర్యే తేజ ఆగ్నేయమావిశత్, పాదేన తేజసశ్చాగ్నేస్తస్మాత్స తపతే రవిః. ౧౫. ప్రకాశత్వం తథోష్ణత్వం సూర్యేఽగ్నౌ చ ప్రకీర్తితే, పరస్పరానుప్రవేశా దాప్యాయేతే దివానిశమ్. ౧౬. వ్యాపకత్వం చ రశ్మీనాం నామాని చ నిబోధ మే,

(హేతయః), కిరణములు (కిరణాః), గోవులు (గావః), రశ్ములు (రశ్మయః), గభస్తులు (గభస్తయః), అభీషులు (అభీషవః), ఘనములు (ఘనాః), ఉస్రములు (ఉస్రాః), వసువులు (వసవః), మరీచులు (మరీచయః), నాడులు (నాడ్యః), దీధితులు (దీధితయః), సాధ్యములు (సాధ్యాః), మయూఖములు (మయూఖాః), భానువులు (భానవః), అంశువులు (అంశవః), సప్తార్చులు (సప్తార్చయః), సుపర్ణులు (సుపర్ణాః), కరములు (కరాః), పాదములు (పాదాః)ను అని యీయిరువదియు రశ్మిపర్యాయములని స్మరించు చున్నారు. వీనికే వేర్వేఱుగఁ జందనాదినామములు గలవు వాని వివరింతు వినుము. వత్సా! యీవేయికిరణములును శీతమును వర్షమును వేఁడిని గలిగించుచుండును. వానిలోనన్నూఱుకిరణములు చిత్రమూర్తులై వర్షించుచున్నవి. ఆకిరణములకుఁ జందనములనియు, మందములనియును, కోతన(గౌతమ)ములనియు, మానుమములనియు, నమృతములనియు నామములు గలకిరణములన్నియు (400) వృష్టికారణములై యున్నవి. ఇతరములగు మున్నూఱుకిరణములు హిమమును గలిగించునవి. ఆకిరణములు చంద్రనామముగలిగి పచ్చనై యుండును. సౌమ్యములు నీశ్వరములు వామములు హ్లాదులు నను నామంబుల కిరణములన్నియు హిమమును విడుచుచున్నవి. శుక్లములు కకుప్పులు విశ్వభృత్తులు ననుకిరణములు శుక్లవర్ణముకలవై మున్నూఱు వేఁడిని గలిగించునవి. ఈకిరణములన్నియు దేవతలను మనుష్యులను సమముగ భరించుచున్నవి. ఓషధు

---

హేతయః కిరణా గావో రశ్మయోఽథ గభస్తయః. ౧౭. అభీషవో ఘనం చోస్రా వసవోఽథ మరీచయః, నాడ్యో దీధితయః సాధ్యా మయూఖా భానవోఽంశవః. ౧౮. సప్తార్చయః సుపర్ణాశ్చ కరాః పాదా స్తథైవ చ, ఏషాం తు నామ్నాం రశ్మీనాం పర్యాయా వింశతిః స్మృతాః. ౧౯. చందనాదీని వక్ష్యామి నామాన్యేషాం పృథక్పృథక్, సహస్రం తాత కథితం శీతవర్షోష్ణనిఃశ్రవమ్. ౨౦. తేషాం చతుఃశతం నాడ్యో వర్షంతే చిత్రమూర్తయః, చందనాశ్చైవ మందాశ్చ కోతనామానుమా స్తథా, అమృతా నామ తే సర్వే రశ్మయో వృష్టిహేతవః. ౨౧. హిమోద్వహా స్తు తత్రాన్యే రశ్మయస్త్రిశతం స్మృతాః, చంద్రాస్తే నామతః సర్వే పీతా స్తే తు గభస్తయః. ౨౨. సౌమ్యాశ్చైవ వామశ్చ హ్లాదినో హిమసర్జనాః, శుక్లాశ్చ కకుభశ్చైవ గావో విశ్వభృత స్తథా. ౨౩. శుక్లాస్తే నామతః సర్వే త్రిశతం ధర్మసర్జనాః, సమం బిభ్రతి తే సర్వే మనుష్యా

లచే మనుష్యులను, స్వధచేఁ బితృదేవతలను అమృతముచే నెల్లదేవతలను, మూఁడువిధములగు కిరణములు మూఁడుజాతుల నిప్పగిదిఁ దృప్తిపఱచు చున్నవి. వసంతగ్రీష్మర్తువులయందు సూర్యుఁడు మున్నూఱుకిరణములచేఁ దపించుచున్నాఁడు. వర్షాశరత్కాలములందు నన్నూటిచేఁ దపించుచు వర్షించుచున్నవాఁడు. హేమంతశిశిరములలో మున్నూటిచే హిమో త్సర్గముచేయుచున్నాఁడు. ఓషధులందు బలము జేర్చుచున్నాఁడు. స్వధ యందుఁదృప్తినుంచుచున్నాఁడు. అమరులం దమృతము నిలుపుచున్నాఁడు. ఇప్పగిది నాదిత్యుఁడు మూఁటిని ముగ్గురిలో నియమించియున్నాఁడు. కాలుఁడు నగ్నియు వత్సరమునై పండ్రెండుమూర్తులుగల సురజ్యేష్ఠుఁ డగు ప్రజాపతి సచరాచరముగ ముల్లోకములఁ దపించుచున్నాఁడు. ఈతఁడే బ్రహ్మయు విష్ణువు నైయున్నాఁడు. ఈతఁడే మహేశ్వరుఁడు. ఋగ్యజుస్సామములు నీతఁడే.ఇందావంతేనియు సంశయింపవలదు.పూర్వా హ్ణంబున ఋక్కులచే స్తోత్రముచేయఁబడుచున్నాఁడు. మధ్యాహ్నమున యజుస్సులచే నెల్లప్పుడు నుతిజేయఁబడుచున్నాఁడు. సామములచే నప రాహ్ణంబులయందు మహాత్ములచే నుతింపఁబడుచుఁ బూజితుఁ డగు చున్నాఁడు. ఇప్పగిది నెల్లరచే నిత్యముఁ బూజింపఁబడుచుఁ దపించు చున్నాఁడు. తేజోరాశియు దీప్తిమంతుఁడు నగు నీదేవుఁడు సర్వకాల ముల సర్వలోకముల సంచరించుచుఁ బ్రక్కలను మీఁదను క్రింద నంత టను దపింపఁజేయుచున్నాఁడు. మూఁడువేళల నెల్లప్పుడు బ్రహ్మవిష్ణు

---

దేవతాస్తథా. ౨౪. మనుష్యానోషధీభిస్తు స్వధయా చ పితౄనపి. అమృతేన సురా న్సర్వాం స్త్రయస్త్రిభిరతర్పయన్. ౨౫. వసంతే చైవ గ్రీష్మే చ శతైః స తపతే త్రిభిః, వర్షాశరత్సు చైవేశ స్తపతే సంప్రవర్షతే. ౨౬. హేమన్తే శిశిరే చైవ హిమోత్సర్గం చ స త్రిభిః, ఓషధీషు బలం ధత్తే స్వధాయాం చ స్వధాం పునః, అమరేష్వమృతం సూర్య స్త్రయం త్రిషు నియచ్ఛతి. ౨౭. కాలోఽగ్నిర్వత్సరశ్చైవ ద్వాదశాత్మా ప్రజాపతిః, తపత్యేషు సురశ్రేష్ఠ స్త్రీంల్లోకాన్సచరాచరాన్. ౨౮. ఏష బ్రహ్మా తథా విష్ణురేష ఏవ మహేశ్వరః, ఋచో యజూంషి సామాని ఏష ఏవ న సంశయః. ౨౯. ఋచాభిః స్తూయతే పూర్వం మధ్యాహ్నే యజుర్భిః సదా, సామభిస్త్వపరాహ్ణేషు మహే శానైః ప్రపూజ్యతే. ౩౦. పూజ్యమానస్తు నిత్యం వై తపత్యేష దివస్పతిః, సదైష తేజసాం రాశిర్దీప్తిమాన్సర్వలోకగః. ౩౧. పార్శ్వతోర్ధ్వమధశ్చైవ తాపయత్యేష సర్వతః, బ్రహ్మావిష్ణుమహేశానైః పూజ్యమానస్తు నిత్యశః. ౩౨. యథా సర్వగతో

మహేశ్వరులు పూజించుచున్నారు. వాయువు సర్వగతుఁడై సర్వమును వహించుచున్నట్లు సహస్రకిరణుఁడు గ్రహరాజు దివస్పతియు నగు సూర్యుఁడు కిరణములచే నిఖిలజగత్తు నంతట వెలిఁగించుచున్నాఁడు. అందు మున్నూఱుకిరణములచే భూర్లోకమును వెలిఁగించుచున్నాఁడు. అట్లే చెరి మున్నూఱుకిరణములచే భువస్స్వర్లోకములఁ దపింపఁజేయుచున్నాఁడు. మిగత నూఱుకిరణములచేఁ గ్రిందనున్న పాతాళమును దపింపఁజేయుచున్నాఁడు. ఈవేయికిరణములుకల సూర్యమండలము భాస్వరశుక్లమై హేలి యనఁబడును. ఈమండలమే నక్షత్రములకు (అశ్విన్యాదులకు) గ్రహములకు (అంగారకాదులకు) సోమునకుఁ బ్రతిష్ఠాకారణమై యున్నది. చంద్రగ్రహనక్షత్రములన్నియు సూర్యునుండి జన్మించినవిగా నెఱుంగవలయును. సూర్యునకు వేయికిరణము లున్నవని మున్నె తెలిపియుంటినిగదా! వానిలో నుత్తమములగు నేడుకిరణములు నేడుగ్రహము లనఁబడుచున్నవి. సుషుమ్ణము, హరికేశము, విశ్వకర్మ, సూర్యుఁడు, విష్ణువు, సనత్త్వము, సర్వబంధువు నని వానినామములు. అవి యెల్లజగంబును జీవన మొసంగి రక్షించుచున్నవి. అందు మొదటిది సప్తజమనియు, రెండవది కంజజమనియు, మూఁడవది తారేయమనియు నాలవది దేవగురువనియు నైదవగ్రహము వనమాలియగు వాసుదేవుని తనయుఁడగు నుగ్రుఁడనువాఁడనియు నారవది కము (రాహువు) అనియు నేడవది సర్పమనియు నీయేడుకిరణములు నిప్పుగిది వ్యవహరింపఁబడు

---

వాయుర్వహమానస్తు తిష్ఠతి, తద్వత్సహస్రకిరణో గ్రహరాజో దివస్పతిః. ౩౩. సూర్యో గోభిర్జగత్కృత్స్నమాదీపయతి సర్వశః, త్రీణి రశ్మిశతాన్యస్య భూర్లోకం ద్యోతయన్తి వై. ౩౪. త్రీణి త్రీణి తథా చాన్యౌ ద్వౌ లోకౌ తాపయన్త్యుత, శతం చాపి అధస్తాత్తు పాతాలం తాపయన్త్యుత. ౩౫. ఇత్యేతన్మణ్డలం శుక్లం భాస్వరం హేలి సంజ్ఞితమ్, నక్షత్రగ్రహసోమానాం ప్రతిష్ఠాయోనిరేవ చ, విధుబుక్షగ్రహాః సర్వే విజ్ఞేయాః సూర్యసంభవాః. ౩౬. రవేః కరసహస్రం యత్ప్రాఙ్మయా సముదాహృతమ్, తేషాం శ్రేష్ఠాః పునః సప్త రశ్మయో గ్రహసంజ్ఞితాః. ౩౭. సుషుమ్ణో హరికేశశ్చ విశ్వకర్మా తథైవ చ, సూర్యశ్చైవాపరో రశ్మిర్నామ్నా విష్ణురితి స్మృతః. ౩౮. సనత్వః సర్వబన్ధుస్తు జీవాయతి చ వై జగత్, సప్తజః ప్రథమస్తత్ర కఞ్జజశ్చ తథా పరః. ౩౯. తారేయశ్చాపరస్తత్ర గురుః సుమనసాం తథా, ఉగ్రాహ్వః పంచమస్తేషాం పుత్రోన్యో వనమాలినః, కః శేషః సప్తమస్తేషామేతే వై సప్త రశ్మయః. ౪౦.

చున్నవి. చరాచరమయంబగు నీత్రైలోక్యంబు సర్వము నాదిత్యమూలకమే. దేవతలు నసురులు మానవులు మొదలగు జగత్తంతయు నీతనివలననే యుద్భవించుచున్నది. రుద్రుఁడు, నింద్రుఁడు, నుపేంద్రుఁడును, బ్రాహ్మణోత్తములును, దేవతలును మున్నగు సర్వలోకంబుననుండు గొప్పవెలుఁగంతయు దివాకరునిదే. ఆసూర్యుఁడే సర్వాత్ముఁడై సర్వలోకనాథుఁడై ప్రజాపతియయి దేవతలకెల్ల దేవుఁడై యీముల్లోకములకును మూలకారణమగు ముఖ్యదైవము. అగ్నిలో బాగుగ వేల్వఁబడిన యాహుతి యాదిత్యునిఁ జేరును. ఆదిత్యునుండి వర్షము కురియుచున్నది. దానినుండి యన్నము కలుగుచున్నది. దానినుండి ప్రజ లేర్పడుచున్నారు. అంతయు సూర్యునుండియే వచ్చుచున్నది. అందే యడఁగుచున్నది. మున్ను లోకములయొక్క యుండుట లేకపోవుట యను రెండును సూర్యునుండియే యేర్పడినవి. ఈయాదిత్యమండలమే ధ్యానించువారికి ధ్యానము; మోక్షమందు వారికి మోక్షము నైయున్నది. ప్రజయంతయు నిటనే యడఁగుచున్నది. మఱల యిటనుండియే పుట్టుక నందుచున్నది. క్షణములు, ముహూర్తములు, పగళ్లు, రాత్రులు, పక్షములు, మాసములు, సంవత్సరములు, ఋతువులు, యుగములు మొదలగు నిత్యము ప్రవర్తించు కాలసంఖ్య యాదిత్యుఁడు లేక కలుగుటలేదు. కాలములేక నియమము లేవియు నేర్పడుటలేదు. అగ్నివిహారక్రియ మొదలే

---

ఆదిత్యమూలమఖిలం త్రైలోక్యం సచరాచరమ్, భవత్యస్మాజ్జగత్సర్వం స దేవాసుర మానుషమ్. ౪౧. రుద్రేన్ద్రోపేన్ద్రచన్ద్రాణాం విప్రేన్ద్ర త్రిదివౌకసామ్, మహాద్యుతి మతః కృత్స్నం తేజో యత్సార్వలౌకికమ్. ౪౨. సర్వాత్మా సర్వలోకేశో దేవదేవః ప్రజాపతిః, సూర్య ఏవ త్రిలోకస్య మూలం పరమదైవతమ్. ౪౩. అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే, ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః. ౪౪. సూర్యాత్ప్రసూయతే సర్వం తస్మిన్నేవ ప్రలీయతే, భావాభావౌ తు లోకానామాదిత్యాన్నిఃసృతౌ పురా. ౪౫. ఏతత్తు ధ్యానినాం ధ్యానం మోక్షశ్చాప్యేవ మోక్షిణామ్, అత్ర గచ్ఛన్తి నిర్వాణం జాయన్తేఽస్మాత్పునః ప్రజాః. ౪౬. క్షణా ముహూర్తా దివసా నిశాః పక్షాస్తు నిత్యశః, మాసాః సంవత్సరాశ్చైవ ఋతవోఽథ యుగాని చ, అథాదిత్యమృతే హ్యేషాం కాలసంఖ్యా న విద్యతే. ౪౭. కాలాదృతే న

యుండదు. ఋతువిభాగము లేనప్పుడు పుష్పఫలాదు లెటనుండి యాయా కాలముల వచ్చును? స్వర్గమునగాని యిటగాని జంతువులవ్యవహారము లేవియు జరుగనేరవు. నీవు దొంగిలించుసూర్యుఁడు లేక జగత్తు దపింపఁ నేరదు. వృష్టిలేకున్న నాదిత్యుఁడు తపింపఁడు. పరివేషింపఁడు. ఈ యాదిత్యునకు సామాన్యనామములు పండ్రెండును, విశేషనామములు పండ్రెండు నున్నవి. వానిని వేర్వేఱుగ నెఱింగింతును. అందు— "ఆదిత్యుఁడు, సవిత, సూర్యుఁడు, మిహిరుఁడు, అర్కుఁడు, ప్రతాపనుఁడు, మార్తండుఁడు, భాస్కరుఁడు, భానుఁడు, చిత్రభానుఁడు, దివాకరుఁడు, రవి" అనునీపండ్రెండును సామాన్యనామములని యెఱుంగునది. "విష్ణువు, ధాత, భగుఁడు, పూష, మిత్రుఁడు, ఇంద్రుఁడు, వరుణుఁడు,అర్యమణుఁడు, వివస్వంతుఁడు, అంశుమంతుఁడు, త్వష్ట, పర్జన్యుఁడు," అను నీపండ్రెండును విశేషనామములు. వీరినే ద్వాదశాదిత్యు లందురు. వీరిని వేర్వేరుగ నెఱింగించితిని. ఈపన్నిద్దఱును వఱుసగఁ బండ్రెండుమాసములఁ దమ తమపనులు చేయుచున్నారు. అందు విష్ణువను నాదిత్యుఁడు చైత్రమాస మునఁదపించుచున్నాఁడు. వైశాఖంబున నర్యమణుఁడు తపించుచున్నాఁడు. జ్యేష్ఠమాసమున వివస్వంతుఁడు, నాషాఢమున నంశుమంతుఁడును తపించు చున్నారు. పర్జన్యుఁడు శ్రావణమాసమునను, వరుణుఁడు భాద్రపదము నను, నింద్రుఁ డాశ్వయుజమునను, ధాతృఁడు కార్తికమునను, మార్గ

---

నియమా నాగ్నేర్విహరణక్రియా, ఋతూనామవిభాగాచ్చ పుష్పమూలఫలం కుతః ౪౮. అభావో వ్యవహారాణాం జంతూనాం దివి చేహ చ, జగత్ప్రతాపనమృతే భాస్కరం వారితస్కరమ్. ౪౯. నావృష్ట్యా తపతే సూర్యో నావృష్ట్యా పరివేష్యతే, ఆదిత్యస్య చ నామాని సామాన్యానీహ ద్వాదశ. ౫౦. ద్వాదశైవ పృథక్త్వేన తాని వక్ష్యామ్యనేకశః, ఆదిత్యః సవితా సూర్యో మిహిరోఽర్కః ప్రతాపనః. ౫౧. మార్తండో భాస్కరో భానుశ్చిత్రభానుర్దివాకరః, రవిరైవ ద్వాదశశ్చైవ జ్ఞేయః సామాన్యనామభిః. ౫౨. విష్ణుర్ధాతా భగః పూషా మిత్రేన్ద్రౌ వరుణోఽర్యమా, వివస్వానంశుమాంస్త్వష్టా పర్జన్యో ద్వాదశ స్మృతాః. ౫౩. ఇత్యేతే ద్వాదశాదిత్యాః పృథక్త్వేన ప్రకీర్తితాః, ఉత్తిష్ఠంతి సదా హ్యేతే మాసైర్ద్వాదశభిః క్రమాత్. ౫౪. విష్ణుస్తపతి చైత్రే చ వైశాఖే చార్యమా తథా, వివస్వాజ్జ్యేష్ఠమాసేతు ఆషాఢే చాంశుమాంస్తథా. ౫౫. పర్జన్యః శ్రావణే మాసి వరుణః ప్రోష్ఠసంజ్ఞకే, ఇంద్రశ్చాశ్వయుజే

శీర్షమున మిత్రుఁడును, పౌషమాసమునఁ బూషనామక దివాకరుఁడును, మాఘమాసమున భగుఁడును, ఫాల్గునమాసమునఁ ద్వష్టయుఁ దపించుచున్నారని యెఱుంగవలయును. విష్ణు వెల్లప్పుడు పండ్రెండువందలకిరణములచే దీపింపఁబడుచున్నాఁడు అర్యమణుఁడు వేయునుమున్నూఱు కిరణములచేఁ బ్రకాశించుచున్నాఁడు. వేయినన్నూటిచే వివస్వంతుఁడును వెయ్యిన్నరకిరణములచే నంశుమంతుఁడును వివస్వంతునివలెఁ బర్జన్యుండు నర్యమణునివలె వరుణుఁడును వెలుఁగుచున్నారు. ఇంద్రుండు పండ్రెండు నూఱులచేతను ధాత పదునొకండువందలచేతను నిట్టులే మిత్రభగత్వష్టలును వెలుంగుచున్నారు. ఉత్తరాయణప్రారంభమునుండి సూర్యునికిరణము లెల్లవేళల నానాఁటికి వృద్ధిఁబొందును. దక్షిణాయనముఁ బ్రవేశింప నానాఁటికి సూర్యరశ్ములు మిక్కిలి కృశించిపోవుచున్నవి. ఈసూర్యుని వేయికిరణములు లోకోపకారము నెల్లప్పుడును సాధించుచుండును. ఆయాఋతుమాసాదులచే మాత్రము వేయికిరణములు వేరగుచున్నవి. ఒక్కసూర్యునకే యీయిరువదినాలుగుపేరు లుండుట విస్తరముగా వినిచితిని. ఈవేయింటివృత్తాంతమును గొప్పయత్నముచే వేర్వేరుదర్శనములు కలవిగ వక్కాణించుచున్నారు. తమోగుణగరిష్ఠులగు మానవులు కొందఱు బుద్ధిమోహముచే నిందుఁ గొన్నిదృష్టాంతము లుదాహరించుచున్నారు. కొంద అన్నింటికిని మూలకారణము బ్రహ్మ యనియు మఱి

---

మాసి ధాతా తపతి కార్తికే. ౧౬. మార్గశీర్షే తథా మిత్రః పౌషే పూషా దివాకరః, మాఘే భగస్తు విజ్ఞేయస్త్వష్టా తపతి ఫాల్గునే. ౧౭. త్రైశ్చ ద్వాదశభిర్విష్ణూ రశ్మీనాం దీప్యతే సదా, దీప్యతేగోసహస్రేణ శతైశ్చ త్రిభిరర్యమా. ౧౮. ద్విసప్తకైర్వివస్వాంస్తు అంశుమాన్పంచకైస్త్రిభిః, వివస్వానివ పర్జన్యో వరుణశ్చార్యమా ఇవ. ౧౯. ఇంద్రస్తు ద్విగుణైః షడ్భిర్ధాతైకాదశభిః శతైః, మిత్రవద్భగవత్త్వష్టా సహస్రేణ శతేన చ. ౨౦. ఉత్తరోపక్రమేఽర్కస్య వర్ధంతే రశ్మయః సదా, దక్షిణోపక్రమే భూయో హ్రసన్తే సూర్యరశ్మయః. ౨౧. ఏవం రశ్మిసహస్రం తు సౌర్యం లోకార్థసాధకమ్, భిద్యతే ఋతుమాసైస్తు సహస్రం బహుధా భృశమ్. ౨౨. ఏవం నామ్నాం చతుర్వింశదేకస్యైషా ప్రకీర్తితా, విస్తరేణ సహస్రం తు పునరేవం ప్రకీర్తితమ్. ౨౩. ఆసాం పరమయత్నేన బ్రువతే భిన్నదర్శనాః, తామసా బుద్ధిమోహాచ్చ దృష్టాన్తాని బ్రువంతి హి. ౨౪. బ్రహ్మాణం కారణం కేచిత్కేచిదాహుర్దివాకరమ్, కేచిద్భవం పరత్వేన ఆహుర్విష్ణుం

కొందఱ అగ్నియనియు వచించుచున్నారు. కొందఱు భవుఁడ (శివుఁడ) నియు నింకఁగొందఱు విష్ణుఁడనియు వచించుచున్నారు. వీరందఱు వేర్వేరు పనులం దనేకముగఁ గారణములై యుండుకతన నట్లు వచింపఁబడు చున్నారు. కాని ముఖ్యకారణము వేర్వేరురూపముల నాస్వయంభువుఁడే యని విఖ్యాతమయ్యె. అరుణసహాయుఁడై యున్న సర్వోత్తముఁడగు నా స్వయంభువునే యుగ్రుఁడగు నీశ్వరునిగను వనమాలియగు వాసుదేవుని గను ద్యులోకమున వెలుఁగునంతకుని నేత్రమునుగను చతుర్ముఖుఁడగు స్వయంభువునిగను పలువిధముల వక్కాణించుచున్నారు. ఒక్కస్ఫటికమే యెటుల నానావిధవర్ణములు గూర్చి వేర్వేరగుచున్నదో అటులనే యీ స్వయంభువునకు గుణభేదములఁబట్టి భేదము కలుగుచున్నది. మేఘ మొక్కటియయ్యు వర్ణమునను, రూపమునను వేరయి భిన్నభిన్నములుగఁ బ్రతిష్ఠింపఁబడుచున్నదో అటులనే గుణములచే నీతఁడు వేరగు చున్నాఁడు. ఆకసమునుండి జారినయుదకము భూమియందలి రసవిశేష ములచే వేఱువేఱురుచులఁ బొందునట్లు గుణభేదమున నీతఁడును వేరగు చున్నాఁడు. అగ్ని యొక్కఁడయ్యును కట్టెలభేదములఁబట్టి రూపవర్ణముల వేరగుభంగి నీతఁడును గుణవశమున వేరగుచున్నాఁడు. వాయు వొక్కఁ డయ్యు నాయాద్రవ్యవిశేషముల సంబంధముంబట్టి సుగంధిగను, బూతి గంధి (దుర్గంధముకలవాఁడు)గ నిట్లే పెక్కురకము లగుచున్నట్లు గుణ వశమున నీతఁడును భేదమును గాంచుచున్నాఁడు. ఎవ్విధి గార్హ

---

తథాపరే. ౧౫. కారణం తు స్మృతా హ్యేతే నానార్థేషు సురోత్తమాః, ఏకః స తు పృథక్త్వేన స్వయంభూరితి విశ్రుతః. ౧౬. వనమాలినముగ్రేశం దివి చక్షురివాంతకమ్, తం స్వయంభూరితి ప్రోక్తం స సౌవర్ణమనౌపమమ్. ౧౭. యథానురజ్యతే వర్ణైర్వివిధైః స్ఫాటికో మణిః, తథా గుణవశాత్తస్య స్వయంభోరనురంజనమ్. ౧౮. ఏకో భూత్వా యథా మేఘః పృథక్త్వేన ప్రతిష్ఠితః, వర్ణతో రూపతశ్చైవ తథా గుణవశాత్తు సః. ౧౯. నభసః పతితం తోయం యాతి స్వాద్వాంతరం యథా, భూమే రసవిశేషేణ తథా గుణవశాత్తు సః. ౨౦. యథేంధనవశాదగ్ని రేకస్తు బహుధాయతే, వర్ణతో రూపతశ్చైవ తథా గుణవశాత్తు సః. ౨౧. యథా ద్రవ్యవిశేషాచ్చ వాయురేకః పృథగ్భవేత్, సుగంధిః పూతిగంధిర్వా తథా గుణవశాత్తు సః. ౨౨. యథా వా గార్హపత్యోఽగ్ని

పత్యాగ్ని దేశకర్మ భేదములచే దక్షిణాగ్నియనియు నాహవనీయమనియు నామాంతరములఁ బడయుచున్నదో, అటులనే యీతఁడును దేశకర్మ భేదమున బ్రహ్మా మొదలగునామములఁ బొందుచున్నాఁడు. ఇప్పగిది నాదేవుఁడొక్కఁడై యుండుటకు వేర్వేరుగ నుండుటకును గారణములు విస్తరించితిని. కాన నీదివాకరదేవునందు సర్వకాలముల నుత్తమభక్తి చేయవలయును. ఈతఁడే యండమునఁ బుట్టిన హిరణ్యగర్భుఁడు. ఈతఁడే యుత్తమమగు గమ్యస్థానము. సాక్షియు నీతఁడే. ఈతఁడే భృగువు. ఈతఁడే రజస్తమస్సత్త్వగుణములు. ఈతఁడే వేదములు యజ్ఞములు; సర్వము నీతఁడే. సంశయింపఁబనిలేదు. చరాచరమయమగు నీప్రపంచమంతయు సూర్యునిచే వ్యాప్తమైయున్నది. ఎల్లవేళల నడచుటంజేసి యానస్వరూపుఁడగు నీరవియే యిచ్చట యజింపఁ బూజింపఁబడుచున్నాఁడు. మూర్తులచేత నామములచేత నంతట నీసవితయే యున్నవాఁడు. అగ్నివాయువులందును గగనమున నీటను నీతఁడే యున్నవాఁడు. ఈసూర్యుఁడిట్టివాఁడగుటంజేసి బుద్ధిమంతుల కందఱకుఁ బూజ్యుఁడై యున్నాఁడు. ఎవ్వఁ డివ్విధి నాదిత్యు నెఱుంగునో యాతఁడు నిక్క మాతనియందే లీనుఁడగును. ఎవఁడు సూర్యునినామముల నొక్కదానినైనను దానిమూలమగుధాతువు దానియర్థము నిగమము మొదలగువిశేషములతోఁ దెలిసికొనుచున్నాఁడో యాతఁడు నిఖిలరోగములు నిఖిలపాపములును తొలంగినవాఁడగును. సాంబా! సూర్యునందుఁ బాపాత్మునకు భక్తికలుగనేరదు. కావున నీవు నట్టులే యుత్తమభక్తితో దివాకరు నాశ్రయించి

---

రన్యత్సంజ్ఞాంతరం వ్రజేత్, దక్షిణాహవనీయాది బ్రహ్మాదిషు తథా హ్యసౌ. ౭౩. ఏకత్వే చ పృథక్త్వే చ ప్రోక్తమేతన్నిదర్శనమ్,తస్మాద్భక్తిః సదా కార్యా దేవే హ్యస్మిన్దివాకరే. ౭౪. ఏషాండజోఽథిగశ్చైవ ఏష ఏవ భృగుస్తథా, ఏష రజస్తమశ్చైవ ఏష సత్త్వగుణస్తథా. ౭౫. ఏష వేదాశ్చ యజ్ఞాశ్చ సర్వశ్చైవ న సంశయః, సూర్యవ్యాప్తమిదం సర్వం జగత్స్థావరజంగమమ్. ౭౬. ఇజ్యతే పూజ్యతే చాసావత్ర యానాత్మకో రవిః, సర్వత్ర సవితా దేవస్తనుభిర్నామభిశ్చ సః. ౭౭.వసత్యగ్నౌ.తథా వాతే వ్యోమ్నితోయే తథా విభో, ఏవంవిధో హ్యయం సూర్యః సదా పూజ్యో విజానతా. ౭౮. ఆదిత్యం వేత్తి యస్త్వేవం స తస్మిన్నేవ లీయతే, అప్యేకం వేత్తి యో నామ ధాత్వర్థనిగమై రవేః. ౭౯. స రోగైర్వర్జితః సర్వైః సద్యః పాపాత్ప్రముచ్యతే, న హి పాపకృతః సాంబ భక్తిర్భవతి భాస్కరే. ౮౦. తథా త్వం పరయా భక్త్యా ప్రపద్యస్వ దివాకరమ్, యేన

సేవింపుము. దానిచే నీవు వ్యాధివిముక్తుఁడవై సర్వకామముల నొందఁ గలవు. ఆతని నారాధించియే నీతండ్రియు బ్రహ్మయు హరుండు సర్వకామములఁ బొందిరి. వీరెల్లరు గుణవశమున నాతని భేదములే కద! మేఘ మొక్కటయ్యు రూపవర్ణభేదమున వేఱైమినొందునట్లు గుణభేదములచే నానానామములఁ బొందుచున్నాఁడని మున్నె యెఱింగించితిని. కావున సర్వాకారుఁడగు నాదేవుని బూజింపుము.

ఇది అష్టసప్తతితమాధ్యాయము.

## ఏకోనాశీతితమాధ్యాయము.

అంత నాజాంబవతీతనయుండు సర్వము నాకర్ణించి సంతసించి మిగుల నుత్సాహంబున మఱల నారదున కిట్లనియె. "ఓమహానుభావా! ఆనందమొందితిని. హర్షవర్ధనమగు సూర్యమాహాత్మ్యమునంతను వర్ణించితివి. దీనిచే నా కాదేవునందు భక్తి యినుమడించినది. ఇఁకమీఁద నాతని పత్నులగు రాజ్ఞియు నిక్షుభయు దిండిపింగళప్రముఖులయుఁ జరిత్రము నెఱింగింపుము" నాపుడు నారదుం డతని కిట్లనె. రాజ్ఞియనియు నిక్షుభయనియు నర్కున కిరువురుభార్య లున్నారని మున్ను జెప్పియున్నాను. వారిలో రాజ్ఞి యనునది ద్యులోకము. నిక్షుభ పృథివియు నని యెఱుం

వ్యాధివినిర్ముక్తః సర్వాన్కామానవాప్స్యసి. ౨౧. యథా తవ పితా సాంబ యథా వేధా యథా హరః, యథా గుణవశాత్తస్య స్వయంభోరనురంజనమ్. ౨౨. ఏకీభూయ యథా మేఘః పృథక్త్వేన ప్రతిష్ఠతే, వర్ణతో రూపతశ్చైవ తథా గుణవశాత్తు సః. ౨౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యమహిమవర్ణనం నామ అష్టసప్తతితమోఽధ్యాయః.

సుమంతురువాచ:—ఏతచ్ఛ్రుత్వా తు కార్త్స్న్యేన హృష్టో జాంబవతీసుతః, జాతకౌతూహలో భూయః పరిపప్రచ్ఛ నారదమ్. ౧. సాంబ ఉవాచ.—అహో సూర్యస్య మాహాత్మ్యం వర్ణితం హర్షవర్ధనమ్, యేన మే భక్తిరుత్పన్నా పరా హ్యస్మిన్విభావసౌ. ౨. తతో రాజ్ఞీం మహాభాగాం నిక్షుభాం చ మహామునే, దిండినం పింగలాదీంశ్చ సర్వాన్కథయ మే మునే. ౩. నారద ఉవాచ.—ప్రాగుక్తేఽర్కస్య ద్వే భార్యే రాజ్ఞీ నిక్షుభసంజ్ఞితే, తయోర్హి రాజ్ఞీ ద్యౌర్జ్ఞేయా నిక్షుభా పృథివీ స్మృతా,

గుము. పౌషమాసమున శుక్లసప్తమినాఁడు సూర్యుఁడు ద్యులోకమగు రాజ్ఞితోఁ గలసియుండును. మాఘకృష్ణసప్తమినాఁడు పృథివియగు నిక్షుభతోఁ గలసియుండును. భూమియు భగవంతుఁడగు నాదిత్యుఁడును సంగమింతురు. అప్పుడు ఋతుస్నాతయగు పృథివి యాసంగమమున భాస్కరునివలన గర్భము దాల్చుచున్నది. ఇటులనే దివియు నాతనితో సంగమించి గర్భము దాల్చుచున్నది. అంతట వర్షాకాలమున దివి భూతలమున జలమును గనుచున్నది. ఆవెనుక ముల్లోకములసేమమునకై పృథివి సస్యములఁ బ్రసవించుచున్నది. సస్యములలాభముచే సంతసించి ద్విజులు ఆహుతులు వ్రేల్చుచున్నారు. స్వాహాకారములచే దేవతలను స్వధాకారములచేఁ బితరులను యజించుచున్నారు. అన్నములచేత నోషధులచేతను మనుష్యులను సుధచేఁ బితరులను నమృతముచే దేవతలను బుట్టించుటంజేసి పృథివి నిక్షుభనామముం బడసె. (నితరాం క్షోభయతి, చాలయతీతి నిక్షుభా, అందఱకును శక్తినొసఁగి బాగుగఁ జలింపఁజేయునది. వారివారిపనులయం దుంచునది యని యర్థము) ఈరాజ్ఞియు రెండుతెగలయిన చందంబును నెవ్వరిపుత్రి యయినదియు నామెసంతానము లెవ్వియునియు సర్వమును వచింతు వినుము. మరీచి యనుబ్రహ్మతనయుఁ డొక్కఁడు కలఁడు. ఆతనికుమారుఁడు కశ్యపుఁడు. ఆతనికుమారుండు హిరణ్యకశిపుఁడు. ఆతనిసుతుండు ప్రహ్లాదుండు. ఆప్రహ్లాదునకు విరోచనుఁడను విఖ్యాతిగల సుతుఁడుకలఁడు. ఆవిరోచనునకు సోదరి యొక్కతె

---

౪. సౌమ్యమాసస్య సప్తమ్యాం ద్యావార్కః సహ యుజ్యతే, మాఘకృష్ణస్య సప్తమ్యాం మహ్యా సహ భవేద్రవిః, భూరాదిత్యశ్చ భగవాన్గచ్ఛతః సంగమం తథా. ౫. ఋతుస్నాతా మహీ తత్ర గర్భం గృహ్ణాతి భాస్కరాత్, ద్యౌర్జలం సూయతే గర్భం వర్షాస్విహ చ భూతలే. ౬. తతస్త్రైలోక్యభూత్యర్థం మహీ సస్యాని సూయతే, సస్యోపయోగసంహృష్టా జుహ్వత్యాహుతయో ద్విజాః. ౭. స్వాహాకారస్వధాకారైర్యజంతి పితృదేవతాః. ౮. నిక్షుభా సూయతే యస్మాదన్నౌషధిసుధామృతైః, మర్త్యాన్పితౄంశ్చ దేవాంశ్చ తేన భూర్నిక్షుభా స్మృతా. ౯. యథా రాజ్ఞీ ద్విధా భూతా యస్య చేయం సుతా మతా, అపత్యాని చ యాన్యస్యాస్తాని వక్ష్యామ్యశేషతః. ౧౦. మరీచిర్బ్రహ్మణః పుత్రో మరీచేః కశ్యపః సుతః, తస్మాద్ధిరణ్యకశిపుః ప్రహ్లాదస్తస్య చాత్మజః. ౧౧. ప్రహ్లాదస్య సుతో నామ్నా విరోచన ఇతి శ్రుతః, విరోచనస్య భగినీ సంజ్ఞాయా

కలదు. ఆమెయే సంజ్ఞకు జనని. శుభ యనునది దితిపుత్రుఁడగు హిరణ్యకశిపునకు మనుమరాలు. ఆమె విశ్వకర్మకుఁ బుత్రికయైయుండియు బుధులచేఁ బ్రహ్లాదునిపుత్రికయని చెప్పఁబడుచున్నది. ఇఁక వెనుకటిమరీచికి సురూప యనుశుభాంగి యగుకూఁతురు కలదు. ఆమె నాతఁడంగిరసునకుఁ బత్నిగా నొసంగెను. ఆమెయం దాతనికి బృహస్పతి యనుపుత్రుఁడును బ్రహ్మవాదిని యనుపుత్రికయును జన్మించిరి. ఆబ్రహ్మవాదిని వసువులను దేవతలలో నెనిమిదవవాఁడగు ప్రభాసునకుఁ బత్నియయ్యెను. ఆతఁడామెయందు దేవశిల్పియగు విశ్వకర్మను గాంచెను. ఆతనిపేరు త్వష్ట. ఆతఁడు దేవతలకు వడ్రంగముచేయువాఁడు దేవతల కాచార్యుఁడునై యున్నవాఁడు. ఆవిశ్వకర్మనకుఁ బుత్రియై సురేణువనుభామిని ముల్లోకముల వెలింగెను. ఆమెయే రాజ్ఞియనియు, సంజ్ఞయనియు, త్వాష్ట్రి యనియు, ప్రభయనియు నెంచఁబడుచున్నది. ఆమె తనుచ్ఛాయయే పృథివిరూపముగల నిక్షుభ నాఁబరగె. ఆమెయే భగవంతుఁడు మహాత్ముఁడు నగుమార్తండునకుఁ బత్నియై సాధుశీలయుఁ బతివ్రతయు రూపయౌవనసంపన్నయు నై వెలయుచున్నది. ఆమెయందు సూర్యుఁడు మున్ను నరరూపముతో సంగమింపలేదు. ఆయాదిత్యునిరూపము మిక్కుటమగు నిజతేజముచే నావృతమై శరీరావయవములగు కరచరణాదు లగపడకయుండుట నంతసుందరముగఁ దోఁపదయ్యె. అటులు గాత్రములు తెలియక

జననీ శుభా. ౧౨. హిరణ్యకశిపోః పౌత్రీ దితేః పుత్రస్య సా స్మృతా, సా విశ్వకర్మణః పుత్రీ ప్రాహ్లాదీ ప్రోచ్యతే బుధైః. ౧౩. అథ నామ్నా సురూపేతి మరీచేర్దుహితా శుభా, పుత్రీ వ్యాంగిరసః సా తు జననీ తు బృహస్పతేః. ౧౪. బృహస్పతేస్తు భగినీ విశ్రుతా బ్రహ్మవాదినీ, ప్రభాసస్య తు సా పత్నీ వసూనామష్టమస్య తు. ౧౫. ప్రసూతా విశ్వకర్మాణం సర్వశిల్పకరం వరమ్, స వై నామ్నా పునస్త్వష్టా త్రిదశానాం చ వార్ధకిః. ౧౬. దేవాచార్యశ్చ తస్యేయం దుహితా విశ్వకర్మణః, సురేణురితి విఖ్యాతా త్రిషు లోకేషు భామినీ. ౧౭. రాజ్ఞీ సంజ్ఞా చ ద్యౌస్త్వాష్ట్రీ ప్రభా సైవ విభావ్యతే, తస్యాస్తు యా తనుచ్ఛాయా నిక్షుభా సా మహీమయీ. ౧౮. సా తు భార్యా భగవతో మార్తండస్య మహాత్మనః, సాధ్వీ పతివ్రతా దేవీ రూపయౌవనశాలినీ. ౧౯. న తు తాం నరరూపేణ సూర్యో భజతి వై పురా, ఆదిత్యస్యేహ తద్రూపం మహతా స్వేన తేజసా. ౨౦. గాత్రేష్వప్రతిరూపేషు నాతికాంతమివాభవత్,

యుండునెడ నాతనిమండలము నీక్షించి పితామహుండు "దివాకరా! నీవిఁకమీఁద మార్తుఁడవును (మూర్తిమంతుఁడవును), అండుఁడవును (మండలాకారుఁడు)గ నైయుండుము. అందుచే నీకికమీఁద మార్తండుఁ డని నామము కలుగుఁగాక. ఎల్లదేవతలకు నాదివై యుండుకతన నాదిత్యుఁ డని నిన్ను బిలుతురు" అని చెప్పెను. ఇఁకమీఁద నమ్మహాత్మునిసంతానమును వివరింతు వినుము. రవి మూఁడపత్యములను సంజ్ఞయందుఁ గాంచెను. ఆసంజ్ఞాదేవి పుట్టినింటనే వెయ్యేండ్లు వసించెను. మగనిచెంతకుఁ బొమ్మని తండ్రి యెంత చెప్పినను వినక తుద కాతఁ డెఱుంగకుండుచందంబున నిజ రూపంబు విడచి యాఁడుగుఱ్ఱము రూపముదాల్చి యుత్తరకురుభూముల కేగి తృణములు మేయుచున్నదట. ఆపె పోవునప్పుడు తనచ్ఛాయను నిజ రూపమొసంగి పుట్టింట నుంచిపోయెను. ఆఛాయయుఁ దండ్రియనుమతిచే సంజ్ఞారూపధారిణియై సూర్యునిచెంత కేగెను. ఆమెను సంజ్ఞ యనియే తలంచి యాదిత్యుఁడు సంగమించి యిరువురుపుత్రులను రూపవతియగు నొక్కకన్నెను గాంచెను. ఆయిరువురును మొదటివాఁడగు మనువునకుఁ బోలియుండిరి. ధర్మజ్ఞుఁడగు శ్రుతశ్రవుఁడనియు శ్రుతకర్ముఁడనియు వారి నామములు. వారిలో శ్రుతశ్రవుఁడు మనువయ్యెను. ఆతనికే సావర్ణి యను నామాంతరము కలదు. శ్రుతకర్ముఁడే శనైశ్చరుఁడను విఖ్యాత మగుగ్రహము. ఆకన్నియపేరు తపతి. సాటిలేనిరూపముకలది. ఛాయా

---

అనిష్పన్నేషు గాత్రేషు గోలం దృష్ట్వా పితామహః. ౨౧. మార్తస్త్వం భవచాండస్తు మార్తండస్తేన స స్మృతః, దేవానాం చ యతస్త్వాదిస్తేనాదిత్య ఇతి స్మృతః. ౨౨. అతః పరం ప్రవక్ష్యామి ప్రజాస్తస్య మహాత్మనః, త్రీణ్యపత్యాని సంజ్ఞాయాం జనయామాస వై రవిః. ౨౩. వర్షాణాం తు సహస్రం వై వసమానా పితుర్గృహే, భర్తుః సమీపం యాహీతి పిత్రోక్తా సా పునః పునః. ౨౪. అగచ్ఛద్వడవా భూత్వా త్యక్త్వా రూపం యశస్వినీ, ఉత్తరాంశ్చ కురూన్గత్వా తృణాన్యనుచచార హ. ౨౫. పితు స్సమీపం యా భార్యా సంజ్ఞా యా వచనేన సా, సంజ్ఞాయా ధారయద్రూపం ఛాయా సూర్యముపస్థితా. ౨౬. ద్వితీయాయాం తు సంజ్ఞాయాం సంజ్ఞేయమితి చింతయన్, ఆదిత్యో జనయామాస పుత్రౌ కన్యాం చ రూపిణీమ్. ౨౭. పూర్వజస్య మనోస్తుల్యౌ సాదృశ్యేన చ తావుభౌ, శ్రుతశ్రవాశ్చ ధర్మజ్ఞః శ్రుతకర్మా తథైవ చ. ౨౮. శ్రుతశ్రవా మనుస్తాభ్యాం సావర్ణిర్యో భవిష్యతి, శ్రుతకర్మా తు విజ్ఞేయో గ్రహో యో వై శనైశ్చరః. ౨౯. కన్యా చ తపతీ నామ రూపేణాప్రతిరూపిణీ, సంజ్ఞా తు

రూపయగు నీసంజ్ఞ తనపుత్రుల కుపచారములచే సుఖముగూర్చినటులఁ బూర్వజులకుఁ గూర్చుటలేదు. ఆమెచర్యను పూర్వజుఁడగుమనువు సహించుకొనుచున్నాఁడు. యముఁడు మాత్రము క్షమింపఁజాలఁడయ్యె. తండ్రిపెండ్లాము (సవతితల్లి)చే మిగుల వెతఁజెంది దురపిల్లుచు బాలుఁడౌటకతనఁ గోపముబట్టఁజాలక రాఁబోవుఫలము బలవంతమై యుండుకతన నామెను పాదమెత్తి చూపి భయపెట్టెను. అంత నాచ్ఛాయయు మిగులఁ గోపించి యిటుల శపించెను. ఓయీ! నీవు చిన్నవయ్యు నీతండ్రిపెండ్లామను నీకన్న బెద్దదానను అగు నన్ను గాలెత్తి భయపెట్టితివిగాన నీయీ పాదము భ్రష్టమగునుగాక. నావు డాతఁడు నాశాపంబుకతనఁ గలతపడిన చిత్తముతో మనుసహాయుఁడై జనకునొద్దకేగి తల్లివృత్తాంతము సర్వము నివేదించెను. తండ్రీ! యీతల్లి మాయెడ సమానప్రీతి గలిగియుండుట లేదు. పెద్దవారమగుమమ్ము స్నేహమునఁ జూడక చిన్నబుచ్చుచున్నది. అందులకేఁ గనలి యామె కెదురుగఁ గాలెత్తితిని. కాని యామెమీఁదఁ బడవేయలేదు. అది బాల్యముచేఁగాని యజ్ఞానముచేఁగాని జరిగినదిగాన క్షమింపుము. అట్టిపాదమునందు నన్నాపె శపియించెను. నీవనుగ్రహించి యాశాపభయమునుండి నాపాదమును గాపాడుము. నానతనికి రవి యిట్లనియె. "వత్సా! యిందు నిక్కముగ నేదియో గొప్పకారణ ముండి

---

పార్థివీ తేషామాత్మజానాం యథాకరోత్. ౩౦. న స్నేహం పూర్వజానాం తు తథా కృతవతీ తు సా, మనుస్తు క్షమతే తస్యా యమస్తస్యా న చక్షమే. ౩౧. బహుశో యాత్యమానస్తు పితుః పత్న్యా సుదుఃఖితః, స వై కోపాచ్చ బాల్యాచ్చ భావినోఽర్థస్య వై బలాత్. ౩౨. పదా సంతర్జయామాస సంజ్ఞాం వైవస్వతో యమః, తం శశాప తతః క్రోధాత్ సంజ్ఞా సా పార్థివీ భృశమ్. ౩౩. పదా తర్జయసే యస్మాం పితుర్భార్యాం గరీయసీమ్, తస్మాత్తవైష చరణః పతిష్యతి న సంశయః. ౩౪. యమస్తు తేన శాపేన భృశం పీడితమానసః, మనునా సహ తన్మాతుః పితుః సర్వం న్యవేదయత్. ౩౫. స్నేహేన తుల్యమస్మాసు మాతా దేవ న వర్తతే, నిఃస్నేహాజ్జ్యాయసో హ్యస్మాన్కనీయాంసం బుభూషతి. ౩౬. తస్యా మయోద్యతః పాదో న తు దేవ సపాతితః, బాల్యాద్వా యది వా మోహాత్తద్భవాన్ క్షంతుమర్హతి. ౩౭. శప్తోఽహమస్మిఁల్లోకేశ జనన్యా తపతాం వర, తవ ప్రసాదాచ్చరణస్త్రాయతాం మహతో భయాత్. ౩౮. రవిరువాచ—అసంశయం మహత్పుత్ర భవిష్యత్యత్ర కారణమ్, యేన త్వామావి

తీరును. లేకున్న ధర్మజ్ఞుండవు ధర్మస్వభావుండవు నగు నీకేల గోపము కలుగును? లోకమున నెల్లశాపములకును బ్రతిఘాతము (నివృత్త్యుపాయము)న్నది. కాని తల్లి శపియించినచో దానికి మాత్ర మిట నెందును మోక్షము లభింపనేరదు. ఈ నీజననీశాపము నసత్యముచేయుటకు నాకు శక్తిచాలదు. అయినను బుత్రస్నేహంబునం జేసి యించుక యనుగ్రహము మాత్రము చూపుదును. ఆమెవచన మమోఘమగుట నీపాదము క్రింద నిలుపఁబడదు. క్రిందఁ బడినచోఁ బురుగులు తినుననుటచేఁ బురుగులు మాంసాహారములై మహీతలముఁ జేరఁగలవు వానిబాధ లేమిం జేసి నీవును రక్షితుఁడవైతివి." అని యాతని నోదార్చి యాదిత్యుఁడు చాయ దగ్గఱకుఁబోయి యేమికతంబున నీకుమారులనందఱను దుల్యముగఁ బ్రేమింపవు? తుల్యులలో నొక్కరియెడ మిక్కుటమగు ప్రేమ జూపుదు వేల? నావు డామె యించుకేనియు వెనుకటివృత్తాంతము చెప్పదయ్యె. అంతదివ్యదృష్టిచే నావృత్తాంత మెఱింగి యాదిత్యుండు తనమనంబు దిట్టపఱచుకొని యామెకుఁ గనలి శాప మొసంగ నుద్యుక్తుఁడయ్యెను. అంత నామెయు వెఱగంది జరిగినకథయెల్ల నామూలాగ్రంబుగ వివస్వంతునకు నివేదించెను. అంత నదివిని వివస్వంతుఁడు మిగులఁ గోపించి మామయొద్ద కేగెను. ఆతఁడు నల్లుఁడగు దివాకరు నుచితరీతి నర్చించి తగులవేయు నంతటికోపముతో నున్న యాతని జూచి మంచిమాటల నాతనిం దేర్చి యిట్లనియె. నీరూపము మిక్కుటమగు తేజముచే నావిష్టమై యోర్వ

---

శతో(ఽ)సి త్వం ధర్మజ్ఞం ధర్మశాలినమ్. ౩౯. సర్వేషామేవ శాపానాం ప్రతిఘాతస్తు విద్యతే, న తు మాత్రాభిశప్తానాం క్వచిన్మోక్షో భవేదిహ. ౪౦. న శక్యమేతన్మిథ్యా మే కర్తుం మాతుర్వచస్తవ, కించిత్తేఽహం విధాస్యామి పితృస్నేహాదనుగ్రహమ్. ౪౧. కృమయో మాంసమాదాయ యాస్యంతి తు మహీతలే, కృతం తస్యా వచః సత్యం త్వం చ త్రాతో భవిష్యసి. ౪౨. సుమంతురువాచ—ఆదిత్యస్త్వబ్రవీచ్ఛాయాం కిమర్థం తనయావుభౌ, తుల్యేష్వభ్యధికః స్నేహ ఏకత్ర క్రియతే త్వయా. ౪౩. సా తత్పరిహరంతీ నాచచక్షే వివస్వతే, ఆత్మానం స సమాధాయ వక్తుం తస్యామపశ్యత. ౪౪. తాం శప్తుకామో భగవానుద్యతః కుపితస్తతః, తతశ్ఛాయా యథావృత్తమాచచక్షే వివస్వతే. ౪౫. వివస్వాంస్తు తతః క్రుద్ధః శ్రుత్వా శ్వశురమాగతః, స చాపి తం యథాన్యాయమర్చయిత్వా దివాకరమ్, నిర్దగ్ధుకామం రోషేణ సాంత్వయామాస తం శనైః. ౪౬. విశ్వకర్మోవాచ—తవాతితేజసావిష్టమిదం రూపం సుదుస్సహమ్, అసహంతీ

రామిని నీభార్యయగుసంజ్ఞ పచ్చికగలవనములకేగి చరించుచున్నయది. ఆమెయు నట నీకు సురూపంబు లభించుటకై యుత్తమంబగుతపంబు గావించుచున్నది. అట్టి శుభచరిత్రయగు నీభార్యను నీవటకేగి చూడఁ గలవు. బ్రహ్మ యాదేశము ననుసరించి నీకు రూపమున నభిలాషయుండె నేని యిప్పుడే లోకశ్రేయమునకై తరచి సురూపము నొసంగుదును. అది విని మహాతేజస్సంపన్నుఁడగు నాయాదిత్యుఁడు నాతని బహుమానిం చెను. అటు బహుమానించి విశ్వకర్మ కనుజ్ఞ యొసంగెను. ఆవిశ్వ కర్మయు నాతని యనుజ్ఞఁగొని శాకద్వీపమునకేగి సూర్యుని శానచక్ర ముపై నెక్కించి యాతనితేజంబెల్ల నొరిసెను. అతినేర్పుగ మోఁకాలు వఱకు నొరువ నాబాధను భరింపలేక దానిని శ్లాఘింపక యిఁకఁజాలు నిలుపు మని యాతని నివారించెను. అప్పు డాతనిరూపము సానబట్టినతేజస్సుచే మిక్కిలి ప్రకాశితమయి యందములకెల్ల మిక్కిలి యందమై యధికముగ శోభించెను. అంతట ధ్యానముననుండి సర్వభూతములకుఁ జూడరాక నిజ తేజంబున నావృతయై గుప్తమైయున్న తనభార్యను దిలకించి తాను గూడఁ దదనురూపముగ గుప్తమై యామెచెంతకేగి పరపురుషుఁడనుశంకచే నిటు నటుతిరుగు నామెయెదుట ముఖముచెంత నామెం గూడెను. అంత రేతః పాతమగుడు బడబ యావివస్వంతునిశుక్రమును నాసారంధ్రముల ధరిం

తు సంజ్ఞా చ వనే చరతి శాద్వలే. ౪౭. ద్రక్ష్యతే తాం భవానద్య స్వాం భార్యాం శుభచారిణీమ్, రూపార్థం భవతోరణ్యే చరంతీం సుమహత్తపః. ౪౮. రూపం తే బ్రహ్మణో వాక్యాద్యది వై రోచతే విభో, ప్రశాతయామి దేవేంద్ర శ్రేయోఽర్థం జగతః ప్రభో. ౪౯. సంతుష్టస్తస్య తద్వాక్యం బహు మేనే మహాతపాః, తతోఽన్వ జానాత్త్వష్టారం రూపనిర్వర్తనాయ తు. ౫౦. విశ్వకర్మా హ్యనుజ్ఞాతః శాకద్వీపే వివస్వతః, భ్రమిమారోప్య తత్తేజః శాతయామాస తస్య వై. ౫౧. ఆజానులిఖిత శ్చాసౌ నిపుణం విశ్వకర్మణా, లేఖనం నాభ్యనందత్తు తతస్తేన నివారితః. ౫౨. తత్ర తద్భాసితం రూపం తేజసా ప్రకృతేన తు, కాంతాత్కాంతతరం భూత్వా అధికం శుశుభే తతః. ౫౩. దదర్శ యోగమాస్థాయ స్వాం భార్యాం బడబాం తథా, అదృశ్యాం సర్వభూతానాం తేజసా స్వేన సంవృతామ్. ౫౪. అశ్వ రూపేణ మార్తండస్తాం ముఖేన సమాసదత్, మైథునాయ విచేష్టంతీం పరపుంసో విశంకయా. ౫౫. సా తం వివస్వతః శుక్రం నాసాభ్యాం సమధారయత్, దేవా

చెను ఆశుక్రమునుండి భిషగ్వరులగు నశ్వినులు కవలై జన్మించిరి. ఆయిరువురును నాసత్యుఁడనియు దస్రుఁడనియు నామములు గలిగియుండిరి. ఆవెనుక నామెకు భాస్కరుఁడు నిజరూపముఁ జూపెను. ఆమెయు నాదివ్యరూపము దిలకించి ముదమంది మోహించెను. తరువాత నామెయు నిజరూపము గ్రహించి యాతనిని సంగమించి సూర్యున కెనయగుతేజమును నిజరూపమున కెనయగురూపమునుగల రేవంతుఁడు నానొకపుత్రరత్నముఁ గాంచెను ఆతఁడు జనించిన వెనువెంటనే తండ్రియశ్వములలో నెన్మిదవయశ్వమును గొని పలాయితుఁడయ్యెను. అట్లొక్కపరి యెక్కిన యాయశ్వము నాతఁడు విడువఁడయ్యె. అంత నాదిత్యుఁడు దండనాయకుని బింగళుని బిలచి యాయశ్వము నాతనిని వంచనముచేఁ గొనితెండు. బలాత్కారము మాత్రము చూపవలదని యాదేశింప వారు నాతనిఛిద్రముల నన్వేషించుచున్నారు కాని యింతవఱకును వారలకందు రంధ్రము లభింపలేదు. సంజ్ఞమనమున కానందము గూర్చుచు నక్కుమారుండు గగనమార్గమున నెగురుచుఁ బోవుచుండుటంజేసి వారికి లభింపఁడయ్యెను. రేయనుశబ్దముతోఁ బోవుటచే నాతఁడు రేవంతుఁడయ్యె. ("రేవృ" అనుధాతువుమీఁద నీరూపము వచ్చినది) ఇది యిట్లగుటంజేసి రవికి మనువు, యముఁడు, యమి, (యమున) సావర్ణి, శనైశ్చరుఁడు, తపతి, అశ్వినులు, రేవంతుఁడు నని యపత్యము లుద్భవించెను. ఈతెఱఁగునఁ జెప్పఁబడిన సంజ్ఞ మొదటిది. రెండవసంజ్ఞ పార్థివి (ఛాయ) యని మున్నె

---

తస్యామజాయేతామశ్వినౌ భిషజాం వరౌ. ౧౬. నాసత్యశ్చైవ దస్రశ్చ తౌ స్మృతౌ నామతోఽశ్వినౌ, అతః పరం స్వకం రూపం దర్శయామాస భాస్కరః, తద్దృష్ట్వా చాపి సంజ్ఞా తు తుతోష చ ముమోహ చ. ౧౭. తతస్తు జనయామాస సంజ్ఞా సూర్యసుతం శుభమ్, రూపేణ చాత్మనస్తుల్యం రేవతం నామ నామతః. ౧౮. పితుర్గృహీత్వాష్టమం సోఽశ్వం జాతమాత్రః పలాయత, స తస్మిన్సకృదారూఢస్తమశ్వం నైవ ముంచతి. ౧౯. తతోఽర్కేణ సమాదిష్టౌ దండనాయక పింగలౌ, అశ్వం ప్రత్యానయేథాం మే మా బలాచ్ఛిద్రతోఽస్య తు. ౨౦. పార్శ్వస్థౌ తిష్ఠతస్తస్య అశ్వచ్ఛిద్రాభికాంక్షిణౌ, న ఛిద్రం తు లభేతే తౌ తస్యాద్యాపి మహాత్మనః. ౨౧. ప్లవన్గచ్ఛత్యసౌ యస్మాత్సంజ్ఞాయాః శాంతిదః సుతః, రేవృస్తు చ గతౌ ధాతూ రేవంతస్తేన స స్మృతః. ౨౨. మనుర్యమో యమీ చైవ సావర్ణిః స శనైశ్చరః, తపతీ చాశ్వినౌ

చెప్పఁబడినది. ఈసంజ్ఞయే రాజ్ఞి యనఁబరఁగుచున్నది. పార్థివియగు రెండవ సంజ్ఞయే నిక్షుభ యనంబడును. "రాజృ దీప్తౌ" అనుధాతువుమీఁద రాజ్ఞీ యగును. మొదట "రాజా" అగును. ఎల్లప్పుడు వెలుఁగువాఁడగుటం జేసి యాతనికి రాజని పేరుకలిగె ఈదివాకరుఁడు సర్వభూతములకన్న నెక్కుడుగ వెలుఁగుచున్నవాఁడు. అధికారణముగ రాజశబ్దము సూర్యుని దెలుపుచున్నది. రాజునకుఁ బత్ని యగుటం జేసి యాతనిభార్య రాజ్ఞి నాఁ బరగె. నిక్షుభా యనునది "క్షుభ సంచలనే" అనుధాతువునుండి యేర్పడెను. సంచలించునది క్షుభ యనఁబడు. అట్టి చలనము లేకుండుటను దెలుపు "ని" యనునది ప్రక్కనుండుటచేఁ జలనము లేనిది యనునర్థము నిక్షుభపదమునకుఁ గలుగును. భూమి యట్టిదగుటం జేసియు ఛాయ యట్టిదగుటం జేసియు నిక్షుభాభిధానమయ్యె. జనులపీడలఁ జూచి దయగలిగి ధర్మమున వారి నానందింపఁ జేయుట ధర్మరాజనామంబు గలిగె. నిర్మలమగు కర్మచే శుభముచే నధికతేజోవంతుఁడై పితరులయాధిపత్యమును లోకపాలపదము నాధర్మరాజు వహించెను. ఇప్పుడు ప్రజాపతియై లోకమునందున్న యాతఁడే సూర్యపుత్రుఁడగు మనువు. ఈతనివంశమున నే శంఖచక్రములను గదను దాల్చినవాసుదేవుఁడు పుట్టువు నొందెను. యముని సోదరి యగు యమి యనుకన్య కీర్తిమతియై లోకమును బవిత్రము చేయునది

---

చైవ రేవంతశ్చ రవేః సుతాః. ౬౩. ఏవమేషా పురా సంజ్ఞా ద్వితీయా పార్థివీ స్మృతా, యా సంజ్ఞా సా స్మృతా రాజ్ఞీ ఛాయా యా సా తు నిక్షుభా. ౬౪. రాజృదీప్తౌ స్మృతో ధాతూ రాజా రాజతి యత్సదా, అధికః సర్వభూతేభ్యో రాజతే చ దివాకరః. ౬౫. అధికం రాజతే యస్మాత్తస్మాద్రాజా స ఉచ్యతే, రాజ్ఞః పత్నీ తు సా యస్మాత్తస్మాద్రాజ్ఞీ ప్రకీర్తితా. ౬౬. క్షుభ సంచలనే ధాతుర్నిశ్చలా తేన నిక్షుభా, భవన్తీత్యథ వా యస్మాత్స్వర్గీయాః క్షుద్వివర్జితాః, ...యాం తాం విశతే దివ్యాం స్మృతా సా తేన నిక్షుభా. ౬౭. దృష్ట్వా జనం సదా తాత భృశం పీడితమానసమ్, ధర్మేణ రంజయామాస ధర్మరాజస్తతః స్మృతః. ౬౮. శుద్ధేన కర్మణా తాత శుభేన పరమద్యుతిః, పితౄణామాధిపత్యం చ లోకపాలత్వమాప చ. ౬౯. సాంప్రతం వర్తతే యోఽయం మనుర్లోకే మహామతే, యస్యాన్వవాయే జాతస్తు శంఖచక్రగదాధరః. ౭౦. యమస్య భగినీ యాతు యమీ కన్యా యశస్వినీ, సాక్షివత్సరితాం శ్రేష్ఠా యమునా లోకపావనీ. ౭౧. మనుః ప్రజాపతిస్త్వేష సావర్ణిః

లలో నుత్తమస్సై యమున నాఁబరగు. మను విప్పటి ప్రజాపతి యయ్యె. మహాయశుండు సావర్ణి యెనిమిదియవమనువు కాఁగలవాఁడు. అతఁడిప్పుడు నింద్రియమ్ముల బంధించి మేరుకందరమున దివ్యతపం బొనరించు చున్నవాఁడు. ఆతనిసోదరుఁడగు శనైశ్చరుఁడు గ్రహత్వమునుబొంది నవగ్రహములలో నొకఁడై యున్నాఁడు వారలతోఁబుట్టువును పెద్దదియునగు తపతి యనుకన్యారత్నము సంవరణుఁ డనురాజునకుఁ బత్నియై శుభాంగియై యున్నది. ఈమెయే తాపి యనునదియై వింధ్యపర్వతము నుండి వెలువడి తనలో జలకమాడుజనులను పవిత్రముజేయుచుఁ బశ్చిమ సముద్రమును జేరుచున్నది. ఆనదియుఁ జంద్రభాగానదితోఁగలసి గంగతోఁ గలసినయమునవలె సమస్తపాపములను భయములను దనను సేవించు వారికి లేకుండఁజేయుచున్నది. అశ్వినీదేవతలు దేవవైద్యపదము నొందిరి. ఈలోకమునసున్న వైద్యులెల్లరు వారికర్మ నాశ్రయించి బ్రదుకు చున్నారు. రూపమున సూర్యునిబోలు రేవంతుఁడు తండ్రియనుమతి నశ్వాధిపతియయ్యె. ఆ రేవంతుని మార్గమునఁ బూజించువాఁడు సుఖముగ మార్గము గడచిపోవుచున్నాఁడు. ఈతఁడే యెల్లరకు సుఖముగఁ బ్రసన్నుఁడగువాఁడు. ఓయదువంశభూషణా! విశ్వకర్మ సూర్యునానతిచే సానబట్టిన యాతనితేజమున సూర్యుని బూజించుటకై భోజులను (అర్చకులు)గ నుత్పాదించెను. ఈదేవుఁడు వివస్వంతునియొక్కయు నాతని

స మహాయశాః, భవిష్యన్న మనుస్తాత అష్టమః పరికీర్తితః. ౭౨. మేరుపృష్ఠే తపో దివ్యమద్యాపి చరతే ప్రభుః, భ్రాతా శనైశ్చరస్తస్య గ్రహత్వం స తు లబ్ధవాన్. ౭౩. తపతీ నామ యా సామ్నా తయోః కన్యా గరీయసీ, సా బభూవ శుభా పత్నీ రాజ్ఞః సంవరణస్య తు. ౭౪. తాపీ నామ నదీ చేయం వింధ్యమూలాద్వినిఃసృతా, నిత్యం పుణ్యజలా స్నానే పశ్చిమోదధిగామినీ. ౭౫. సౌమ్యయా సంగతా సా తు సర్వపాప భయాపహా, వైవస్వతీ యథా వీర సంగతా శివకాంతయా. ౭౬. అశ్వినౌ దేవ వైద్యత్వం లబ్ధవంతౌ యదూత్తమ, తయోః కర్మోపజీవంతి లోకేఽస్మిన్భిషజః సదా. ౭౭. రేవంతో నామ యోఽర్కస్య రూపేణార్కసమః సుతః, అశ్వానామాధిపత్యే తు యోజితః స తు భానునా. ౭౮. క్షేమేణ గచ్ఛతేఽధ్వానం యస్తం పూజయతే పథి, సుఖప్రసాద్యో మర్త్యానాం సదా యదుకులోద్వహ. ౭౯. త్వష్టాపి తేజసా తేన మార్తండస్యైవ చాజ్ఞయా, భోజానుత్పాదయామాస పూజార్థం తస్య సువ్రత. ౮౦.

మహాతేజస్వులగు పుత్త్రులయొక్కయు నీజన్మగాథను విన్నవారుఁ జదివిన వారును సర్వపాపంబులుబాసి సూర్యసాలోక్యము నొందుచున్నారు. అటులు కొంతకాలము సూర్యలోకమున నిలచి సుఖములఁ బొంది పుణ్యముక్షీణింప మరలి భువి కేతెంచి రాజత్వమునే బొందుచున్నారు. ఇందావంతయు శంకింప నక్కఱలేదు.

ఇది ఏకోనాశీతితమాధ్యాయము.

---

## అశీతితమాధ్యాయము.

ఇప్పగిది సూర్యమాహాత్మ్యబోధకమగు నీదివ్యకథ నాకర్ణించి సాంబుండు మునికుంజరుఁడగు నారదుని మఱల నిట్లడిగెను "ఓబ్రాహ్మణోత్తమా! సూర్యుని బూజించిన నేమిఫలంబు కలుగునో, యాతనిపేర దానములిచ్చిన నేమిఫలమో, నమస్కరించినను గీతవాద్యాదు లొనరించిన నేమిఫలము కలుగునో, సమగ్రముగ నదియెల్ల నెఱింగింపుము. అదియెల్లఁ దెలిసి దేవపూజితుఁడగు నాదేవుని లెస్సగఁ బూజింతును" నావుడు నారదుం డతని కిట్లను. యదుకుమారా! నీవడిగిన యీయర్థమునే మున్ను దిండి లోకపితామహుఁడగు బ్రహ్మదేవు నడిగెను. దాని వివరింతు వినుము. మున్నొకప్పుడు దిండియను గణాధిపుఁడు సత్యలోకమున కేగి సుఖముగఁ

---

య ఇదం జన్మ దేవస్య శృణుయాద్వా పఠేత వా, వివస్వతో హి పుత్త్రాణాం సర్వేషామమితౌజసామ్. ౮౧. సర్వపాపవినిర్ముక్తో యాతి సూర్యసలోకతామ్, ఇహ రాజా భవత్యేవ పునరేత్య న సంశయః. ౮౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యవర్ణనం నామ
ఏకోనాశీతితమోఽధ్యాయః.

---

సుమంతురువాచ.—ఇత్థం శ్రుత్వా కథాం దివ్యాం హేలిమాహాత్మ్యమాశ్రితామ్, సాంబః పప్రచ్ఛ భూయోఽపి నారదం మునిసత్తమమ్. ౧. సాంబ ఉవాచ.—సూర్యపూజాఫలం యచ్చ యచ్చ దానఫలం మహత్, ప్రణిపాతే ఫలం యచ్చ గీతవాద్యే చ యత్ ఫలమ్. ౨. భాస్కరస్య ద్విజశ్రేష్ఠ తన్మే బ్రూహి సమంతతః, యేన సంపూజయామ్యేష భానుం దేవైః సదార్చితమ్. ౩. నారద ఉవాచ.—ఇమమర్థం పురా పృష్టో బ్రహ్మా లోకపితామహః, దిండినా యదుశార్దూల శృణుష్వైకాగ్రమానసః.

కూర్చొనియున్న లోకపితామహుని దేవజ్యేష్ఠుని గాంచి సవినయముగ శిరమువాల్చి నమస్కరించి యిట్లని యడిగెను. "ఓ దేవోత్తమా! సూర్య పూజాఫలమును దానఫలమును నమస్కారప్రయోజనమును దేవు నెదుట నృత్తగీతవాద్యములఫలమును నితిహాసపురాణశ్రవణముచేయిం చినఁ గలుగుఫలమును దేవదేవునిమందిరము నూడ్చిన నలికినఁ గలుగుఫల మును జగంబుల తాతవగుట నీవు సర్వజ్ఞుఁడవుగాన దయతో నాకాన తీవే" నావుడు బ్రహ్మ యాతని కిట్లనియె. సూర్యస్తుతి సూర్యజపము సూర్యపూజయు నొనర్చువాఁడు నుపహారము లొసంగువాఁడు షష్ఠినాఁ డుపవాసముచేయువాఁడును సమస్తపాపములు వాయుచున్నాఁడు శిర మును భూమిపై నుంచి సూర్యునకు మ్రొక్కులిడువాఁడు నిస్సంశయ ముగ వెంటనే సర్వపాపములనుండి విడివడుచున్నాఁడు. భక్తుఁడై సూర్యు నకుఁ బ్రదక్షిణముచేయువాఁడు సప్తద్వీపములుకల పృథివికిఁ బ్రదక్షిణము చేసినంతటి ఫలము నొందుచున్నాఁడు. అట్టి యుత్తమఫలముఁ బొంది సర్వరోగములుబాసి సూర్యలోకమును బొందుచున్నాఁడు. ప్రదక్షిణాదు లొనరించునపుడు చెప్పులు దూరమున విడిచి రావలయును. లేకున్న నరక మును బొందును. చెప్పులు దొడిగికొని సూర్యమందిరమునఁ గాలిడిన వాఁడు ఘోరమగు నసిపత్రవన మనునరకమును బొందుచున్నాఁడు.

---

౪. సుఖాసీనం తథా దేవం సురజ్యేష్ఠం పితామహమ్, ప్రణమ్య శిరసా దిండిరిదం వచన మబ్రవీత్. ౫. దిండిరువాచ.—సూర్యపూజాఫలం బ్రూహి బ్రూహి దానఫలం తథా, ప్రణామేయత్ఫలం దేవ యచ్చోక్తం తౌర్యకత్రయే. ౬. ఇతిహాసపురాణాభ్యాం కారితే శ్రవణేతథా, పురతో దేవదేవస్య యత్ఫలం స్యాత్తదుచ్యతామ్. ౭. మార్జనే లేపనే యచ్చ దేవదేవస్య మందిరే, భాస్కరస్య కృతే బ్రూహి మమ లోకపితామహ. ౮. బ్రహ్మోవాచ.—స్తుతిజప్యోపహారేణ పూజయా చ నరో రవేః, ఉపవాసేన షష్ఠ్యాం చ సర్వపాపైః ప్రముచ్యతే. ౯. ప్రణిధాయ శిరో భూమౌ నమస్కారపరో రవేః, తత్క్షణాత్సర్వపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః. ౧౦. భక్తియుక్తో నరో యస్తు రవేః కుర్యాత్ప్రదక్షిణామ్, ప్రదక్షిణీకృతా తేన సప్తద్వీపా భవేన్మహీ. ౧౧. సూర్య లోకం వ్రజేచ్చాపి ఇహ రోగైశ్చ ముచ్యతే, ఉపానహౌ పరిత్యజ్య అన్యథా నరకం వ్రజేత్. ౧౨. సోపానత్కో నరో, యస్తు ఆరోహేత్సూర్యమందిరమ్, స యాతి నరకం ఘోరమసిపత్రవనం విభో. ౧౩. సూర్యం మనసి యః కృత్వా కుర్యాద్వ్యోమ

సూర్యునెదలోఁ దలఁచుచు నాకాశ ప్రదక్షిణము లొనరించినను సమస్త దేవతలను మ్రొక్కిన ఫలము గాంచును. దానిచే దేవతలందఱు మిగుల సంతోషించి యాతనికి శుభగతి నొసంగుచున్నారు. సమస్తదేవతలు కోర్కులు తీర్చుచుందురు. షష్ఠినాఁ డొక్కపరి భుజించి సూర్యు నారాధించి సప్తమినాఁడును బూజించుచున్న యాతఁడు సూర్యలోకము నొందుచున్నాఁడు. రాత్రింబవ ళ్లుపవసించి భక్తితో భాస్కరుని సప్తమినాఁడుగాని షష్ఠినాఁడుగాని పూజించినవాఁ డుత్తమగతిఁ గాంచుచున్నాఁడు. కృష్ణపక్షసప్తమినాఁ డుపవసించి జితేంద్రియుఁడై యెఱ్ఱనికానికలతో భాస్కరుని బూజించువాఁడును, పద్మములచేతను కరవీరంబులచేతను కుంకుమజలమును జందనముతోడను మోదకములచేతను బూజించువాఁడును సూర్యలోకంబున కేగుచున్నారు. శుక్లపక్షసప్తమి నుపవాసరతుఁడై తెల్లనియుపహారములచే జాతికుసుమముద్గరకములతోడను తెల్లని కలువపూవులచేతను పాయసముచేతను నర్చించువారు సర్వపాపముక్తులై చంద్రసమానకాంతికలిగి హంసయానమునెక్కి యాదిత్యలోకమున కేగుచున్నారు. అన విని దేవా! ఉత్తమమగు సప్తమీవ్రతమును విస్తరముగఁ దెలుపుము. సప్తమ్యుపవాసముచేసి యాదేవునే శరణొందుదును. నావుడు బ్రహ్మ యాతని కిట్లనియె. గణాధీశా! సప్తమీకల్పమును గుఱిం

ప్రదక్షిణామ్, ప్రదక్షిణీకృతా స్తేన సర్వే దేవా భవంతి హి. ౧౪. పరితుష్టాశ్చ తే సర్వే ప్రయచ్ఛంతి గతిం శుభామ్, సర్వే దేవా మహాబాహో హ్యభీష్టం తు పరంతప. ౧౫. ఏకాహారో నరో భూత్వా షష్ఠ్యాం యోఽర్చయతే రవిమ్, సప్తమ్యాం వా మహాబాహో సూర్యలోకం స గచ్ఛతి. ౧౬. అహోరాత్రోపవాసీ చ పూజయేద్యస్తు భాస్కరమ్, సప్తమ్యాం వాథ షష్ఠ్యాం వా స గచ్ఛేత్పరమాం గతిమ్. ౧౭. కృష్ణపక్షస్య సప్తమ్యాం సోపవాసో జితేంద్రియః, సర్వరక్తోపహారేణ పూజయేద్యస్తు భాస్కరమ్. ౧౮. పంకజైః కరవీరైర్వా కుంకుమోదకచందనైః, మోదకైశ్చ గణశ్రేష్ఠ సూర్యలోకం స గచ్ఛతి. ౧౯. శుక్లపక్షస్య సప్తమ్యా ముపవాసరతః సదా, సర్వశుక్లోపహారేణ పూజయేద్యస్తు భాస్కరమ్. ౨౦. జాతీముద్గరకైశ్చైవ శ్వేతోత్పలకదంబకైః, పాయసేన తథా దేవం సవర్జేణార్చయేద్రవిమ్. ౨౧. సర్వపాపవిశుద్ధాత్మా విధుః కాంత్యా న సంశయః, హంసయుక్తేన యానేన హంసలోకమవాప్నుతే. ౨౨. దిండిరువాచ.—బ్రూహి మే విస్తరాద్దేవ సప్తమీకల్పముత్తమమ్, ఉపోష్య సప్తమీం యేన గమిష్యే శరణం రవేః. ౨౩. బ్రహ్మోవాచ.—సాధు పృష్టోఽస్మి భవతా సప్తమీకల్ప

చినవిషయమును లెస్సగ నడిగితివి. మున్ను విషయము నరుణుఁడు సహస్ర కిరణుని బ్రశ్నింప మనుష్యుల మేల్గోరి భానునిచే నేడుసప్తమీవ్రతము లాతనికిఁ జెప్పఁబడినవి. ఒక్కప్పుడు దివాకరుఁడు ధ్యానము నాశ్రయించి యుండునెడ నేదో యొకకారణమున నరుణుం డాతనిచెంత కేగి యాతని యునికిం దిలకించి యిట్లని యడిగెను. "ఓ దేవదేవా! యేమికతంబున ధ్యానంబునాశ్రయించియున్నావు. దినముగడచుటలేదు ఇందలి కారణమే వినఁదగుదునేని నచింప వేఁడెదను. సమస్తలోకమును రక్షించుచు లోకము దిరుగుము" నావుడు సూర్యుఁ డాతని కిట్లనియె. "ఓపక్షిరాజా! నేను ధ్యానము నెందుల కాశ్రయించితినో యెఱింగింతు వినుము. అర్వావసుఁ డను నొకబ్రాహ్మణోత్తముఁడు సంతానము లేమికిఁ గడుంగడు వగచి గంధ పుష్పాదుల నుపహారంబులను నన్నారాధించుచున్నాఁడు. కాని యేవిధి నారాధించిన నేను పుత్రు నొసంగుదునో యవ్విధి మాత్ర మాతఁ డెఱుఁగఁజాలఁడయ్యెను. ఏవిధి నారాధించిన మానవులకు నేను ప్రీతుఁడ నగుదునో యెఱింగింతు వినుము. అన్నివిధులలోను సప్తమీవ్రతవిధి యనునది మిక్కిలి యుత్తమమైనది. ఎవ్వఁ డావిధి ననుసరించి నన్నారా ధించునో యాతనికిఁ దప్పక పుత్రుల నొసంగుదును. కావున నీ వీసప్తమీ కల్పంబు గొంపోయి యేతీరుగ నారాధించి చాలమందిపుత్రులఁ గాంచ

---

ముత్తమమ్, యథా సహస్రకిరణః పురా పృష్టోఽరుణేన వై. ౨౪. కథితాః సప్త సప్తమ్యో భానునా శ్రేయసే నృణామ్, అరుణస్య గణశ్రేష్ఠ పృచ్ఛతః కారణాంతరే. ౨౫. కస్యచిత్త్వథ కాలస్య దేవదేవం దివాకరమ్, ధ్యానమాశ్రిత్య తిష్ఠన్తమరుణో వాక్య మబ్రవీత్. ౨౬. కిమర్థం దేవదేవేశ ధ్యానమాశ్రిత్య తిష్ఠసి, దినం న యాతి దేవేశ కారణం మమ కథ్యతామ్. ౨౭. కురు చంక్రమణం దేవ వహమానో దివస్పతే, ఇత్యేవం భగవాన్పృష్ట ఇదం వచనమబ్రవీత్. ౨౮. శృణు త్వం ద్విజశార్దూల యదర్థం ధ్యాన మాశ్రితః, అర్వావసుర్ద్విజశ్రేష్ఠః స చాపుత్రః ఖగోత్తమ. ౨౯. ఆరాధయతి మాం నిత్యం గంధపుష్పోపహారకైః, పుత్రకామః ఖగశ్రేష్ఠ న చ జానాత్యయం యథా. ౩౦. పుత్రదోఽహం భవే యేన విధినా పూజితః ఖగ, శ్రూయతాం చ విధిః సర్వో యేన ప్రీతో భవే నృణామ్. ౩౧. సప్తమీకల్పసంజ్ఞో వై విధీనాముత్తమో విధిః, యస్తు మాం పూజయేన్నిత్యం తస్య పుత్రాన్దదామ్యహమ్. ౩౨. గృహీష్వ సప్తమీకల్పం గత్వా బ్రూహి ద్విజోత్తమమ్, యేనాహం బహుపుత్రత్వం దద్యాం తస్య తథా ఖగ.

గలఁ డట్టితెఱంగున నాతని కుపదేశించిరమ్మని యాదేశింప నాఖగరాజు వెంటనే యాతనియొద్ద కేగి సూర్యుఁ డుపదేశించినచందంబున మూలమట్టుగ వ్రతవిధానము నెఱింగించెను. ఆబ్రాహ్మణుఁడు నాసప్తమీవ్రతమును పక్షిరాజగు నరుణుని సుఖ చేసి మనుసరించి యాచరించెను. అంత నావ్రతప్రభావమున బహువిధసంపత్తులను వృద్ధినారోగ్యంబును బహుపుత్రసంతానమును బడసి యీలోకమున సుఖము లనుభవించి జన్మాంతమున నాదిత్యలోకమున కేగి సూర్యుని కెనయగుతేజంబుతో వెలుంగుచు నందే వాసము చేయుచుండెను” అని మఱియు బ్రహ్మదేవుఁడు దిండికిట్లనియెను.

ఇది అశీతితమాధ్యాయము.

---

## ఏకాశీతితమాధ్యాయము.

జయ, విజయ, జయంతి, అపరాజిత, మహాజయ, నంద, భద్ర, అని యేడు సప్తము లున్నవి. అందు శుక్లపక్షమున సప్తమి భానువారముతోఁ గూడియుండెనేని యాసప్తమి విజయసప్తమి యనఁబడును అందొసంగిన దానము గొప్పఫలముగలది. ఒకదానమే యననేల? స్నానము దానము

---

33. శ్రుత్వా భానోః క్షణాదేవ జగామ స ఖగోత్తమః, కథయామాస తత్సర్వం భానోర్వచనమాదితః. 34. బ్రాహ్మణస్య ఖగశ్రేష్ఠ స చ శ్రుత్వా ద్విజోత్తమః, చకార సప్తమీకల్పం యథాఖ్యాతం ఖగేన తు. 35. బుద్ధిం వృద్ధిం తథారోగ్యం ప్రాప్య పుత్రాంశ్చ పుష్కలాన్, గతోఽసౌ సూర్యలోకం చ తేజసా తత్సమోఽభవత్. 36.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పమాహాత్మ్యవర్ణనం నామ
అశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—జయా చ విజయా చైవ జయంతీ చాపరాజితా, మహాజయా చ నందా చ భద్రా చాన్యా ప్రకీర్తితా. 1. శుక్లపక్షస్య సప్తమ్యాం సూర్యవారో భవేద్యది, సప్తమీ విజయా నామ తత్ర దత్తం మహాఫలమ్. 2. స్నానం దానం తథా

హోమము నుపవాసము మొదలన్నియు విజయసప్తమి నొనర్చిన మహా పాతకములెల్ల నశించును. ఆవ్రతమునందుఁ బంచమినాఁ డయాచితముగ లభించినదాని నొకవేళ భుజించి షష్ఠిని రాత్రియే భుజించి సప్తమి నుపవసించి యష్టమినాఁడు పారణము చేయవలయును. ఇట్లు కొందఱు చెప్పుచున్నారు. మఱికొంద ఱిట్లు కాదనుచున్నారు. షష్ఠినాఁ డుపవసింపవలయునని నానిశ్చితాభిప్రాయము. చవితినాఁ డేకభుక్తము నొనరించి పంచమిని రాత్రిభోజనముచేసి షష్ఠినాఁ డుపవసించి సప్తమినాఁడు పారణముచేయవలయును. షష్ఠినాఁ డుపవాసము నొనరించి విద్వాంసుఁడు భక్తిశ్రద్ధలతోఁ గూడి గంధపుష్పోపహారములచే నొక్కఁడేఁడాది యాదిత్యునిఁ బూజింపవలయును. ఉపవసించినరాత్రి బాగుగఁ బూజించి యాదేవునెదుటఁ గటికి నేలపైఁ గాయత్రినిగాని యాదిత్యసూక్తమునుగాని జపించుచుఁ బరుండవలయును. సత్త్వరూపమును సత్యరూపమునగు నోంకారమునుగాని షడక్షరమంత్రమునుగాని జపింపవలయును. అంత సప్తమినాఁ డుదయమున మేల్కాంచి కాల్యకృత్యములు దీర్చి జలకమాడి గ్రహరాజు నారాధించి విధ్యుక్తముగ హోమములు గావించి శక్తికొలంది భక్తితో బ్రాహ్మణులఁ గుడువంబెట్టునది. శాల్యన్నము నప్పములను మధురపదార్థములను శక్తికొలఁది నేయిచేర్చినపాయసమును బ్రాహ్మణుల కొసంగి యథాశక్తి దక్షిణలు తాంబూలములు నొసంగి బ్రాహ్మణుల విసర్జింపవలయును. ఇది

---

హోమ ఉపవాసస్తథైవ చ, సర్వం విజయసప్తమ్యాం మహాపాతకనాశనమ్. ౩. పంచమ్యామేకభక్తం స్యాత్షష్ఠ్యాం నక్తం ప్రచక్షతే, ఉపవాసస్తు సప్తమ్యామష్టమ్యాం పారణం భవేత్. ౪. కేచిద్దేవమశంత్యేవ నేతి చాన్యే గణాధిప, అభిప్రేతస్తు మే షష్ఠ్యాముపవాసో గణోత్తమ. ౫. చతుర్థ్యామేకభుక్తం తు పంచమ్యాం నక్తమాదిశేత్, ఉపవాసస్తు షష్ఠ్యాం స్యాత్సప్తమ్యాం పారణం భవేత్. ౬. ఉపవాసపరః షష్ఠ్యామబ్దేశం పూజయేద్బుధః, గంధపుష్పోపహారైశ్చ భక్త్యా శ్రద్ధాసమన్వితః. ౭. ప్రకల్ప్య పూజాం భూమౌ తు దేవస్య పురతః స్వపేత్, జపమానస్తు గాయత్రీం సౌరసూక్తమథాపి వా. ౮. అక్షరం వా మహాశ్వేతం షడక్షరమథాపి వా, విబుద్ధస్త్వథ సప్తమ్యాం కృత్వా స్నానం గణాధిప. ౯. గ్రహేశం పూజయిత్వా తు హోమం కృత్వా విధానతః, బ్రాహ్మణాన్భోజయేద్భక్త్యా శక్త్యా చ గణనాయక.౧౦. శాల్యోదనమపూపాంశ్చ ఖండవేష్టాంశ్చ శక్తితః, సఘృతం పాయసం దద్యాత్తథా విప్రేషు శక్తితః. ౧౧. దత్వా చ

పవిత్రమగు విజయసప్తమీవ్రతవిధానము. ఇం దుపవసించినమానవుఁడు సూర్యపదమును జేరును. ఎఱ్ఱగన్నేరుపూవులు కుంకుమలేపనము విజయ ధూపము ననుమూఁడును సూర్యునకు ముదముఁగూర్చునవి. ఈసప్తమి పవిత్రయగుటచే నెల్లమహాపాతకముల నడఁగించును. ఇందిచ్చినదానము హోమమును క్షీణింపవు. స్నానదానహోమములు పితృదేవతలను దేవతలను బూజించుటయు నిందుఁగలిగినచో మహాపాతకములగు బ్రహ్మహత్యాదులు నశించును. ఈవిజయసప్తమి యాదివారముతోఁ గూడి యున్నదని స్మరింపఁబడెను. ఇవ్విధమున నెల్లకోర్కులఁదీర్చు విజయసప్తమీవ్రతమును నీకెఱింగించితిని ఈసప్తమినాఁడు నీవ్రతరాజంపుఁ జరిత్రమును గీర్తించినను విన్నను స్మరించినను మానవులు ధన్యులు యశోవంతులు నాయుష్మంతులునై పుణ్యఫలములఁ గాంతురు. నావుడు దిండి బ్రహ్మదేవున కిట్లనెను.

ఇది ఏకాశీతితమాధ్యాయము.

---

దక్షిణాం భక్త్యా తతో విప్రాన్విసర్జయేత్, ఇత్యేషా కథితా దేవ పుణ్యా విజయసప్తమీ. ౧౨. యాముపోష్య నరో గచ్ఛేత్పదం వైరోచనం పరమ్, కరవీరాణి రక్తాని కుంకుమం చ విలేపనమ్. ౧౩. విజయం ధూపమస్యాం తు భానోస్తుష్టికరాణి వై, ఏషా పుణ్యా పాపహరా మహాపాతకనాశినీ. ౧౪. అత్ర దత్తం హుతం చాపి క్షీయతే న గణాధిప, స్నానం దానం తథా హోమః పితృదేవాభిపూజనమ్. ౧౫. సర్వం విజయసప్తమ్యాం మహాపాతకనాశనమ్, ఆదిత్యవారేణ యుతా స్మృతా విజయసప్తమీ. ౧౬. ఇత్యేషా కథితా వీర సర్వకామప్రదాయినీ, ధన్యం యశస్యమాయుష్యం కీర్తితం శ్రవణం తథా. ౧౭. స్మరణం తు తథాస్యాం తు పుణ్యదం త్రిపురాంతక. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే విజయసప్తమీవర్ణనం నామ
ఏకాశీతితమోఽధ్యాయః.

## ద్వ్యశీతితమాధ్యాయము.

ఓ బ్రహ్మా! భానువారమున నాదిత్యుని బూజించువారును స్నాన దానాదు లొనరించువారు నేఫలములఁ గాంతురో నాకెఱుకపరుపుము. భానువాసరముతోఁగూడిన సప్తమి విజయసప్తమి యనియు నది మిగులఁ బవిత్రమైనదనియు వచించితివి. దానిపవిత్రత యెట్టిదియో గూడ వివరింపవే." నావుడు విధాతృఁ డాదిండి కిట్లనియె. ఏమానవులు భానువాసరమున శ్రాద్ధము నొనర్తురో వారి కేడుపుట్టువులవఱకును రోగము లుండవు. ఏమానవు లానాఁడు రాత్రి యుపవసించి చిత్తస్థైర్యము కలిగి జపింపఁదగిన యాదిత్యహృదయము జపించుచున్నారో వార లీలోకమున నారోగ్యవంతులై జన్మాంతమున సూర్యునిలోకమున కేఁగుచున్నారు. ఎవ్వా రాదివారముల నెల్లప్పుడు నుపవాసవ్రతము సలిపి మహాశ్వేత మంత్రము జపియింతురో వారు కోరినఫలముల నెల్లఁ బొందుచున్నారు. ఒక్కయహోరాత్రమునఁగాని యొక్కరాత్రిగాని మూఁడురాత్రులుగాని నియమముతో మహాశ్వేతామంత్రము జపియించువా రిష్టమైనఫలముల నెల్లఁ బొందుదురు. అందును విశేషించి సూర్యవారమున జపించువాఁడు పొందును. అటులనే షడక్షరమంత్రమును శ్వేతామంత్రము నాదివారమున జపించువాఁడు సూర్యలోకమును బొందును. మహాత్ముఁడగు సూర్యునకుఁ బండ్రెండువారములు ముఖ్యములని స్మరించుచున్నారు. నందవారము, భద్రవారము, సౌమ్యవారము, కామదవారము, పుత్రద

దిండిరువాచ:—యే త్వాదిత్యదినే బ్రహ్మన్పూజయంతి దివాకరమ్, స్నానదానాదికం తేషాం కిం ఫలం స్యాద్బ్రవీతు మే. ౧. పుణ్యా సా సప్తమీ ప్రోక్తా యుక్తా తేన పితామహ, విజయేతి తథా నామ వర్ణ్యతామస్య పుణ్యతా. ౨. బ్రహ్మోవాచ:—యే త్వాదిత్యదినే బ్రహ్మఞ్ఛ్రాద్ధం కుర్వంతి మానవాః, సప్తజన్మసు తే జాతాః సంభవంతి నిరోగిణః. ౩. నక్తం కుర్వంతి యే తత్ర మానవాః స్థైర్యమాశ్రితాః, జపమానాః పరం జాప్యమాదిత్యహృదయం పరమ్. ౪. ఆరోగ్యమిహ వై ప్రాప్య సూర్యలోకం వ్రజంతి తే, ఉపవాసం చ యే కుర్యురాదిత్యస్య దినే సదా. ౫. జపంతి చ మహాశ్వేతాం తే లభంతే యథేప్సితమ్, అహోరాత్రేణ నక్తేన త్రిరాత్రనియమేన వా. ౬. జపమానో మహాశ్వేతామీప్సితం లభతే ఫలమ్, విశేషతః సూర్యదినే జపమానో గణాధిప. ౭. షడక్షరం తథా శ్వేతాం గచ్ఛేద్వై వైరోచనం పదమ్, ద్వాదశేహ స్మృతా వారా ఆదిత్యస్య మహాత్మనః.

వారము, జయవారము, జయంతవారము, విజయవారము, ఆదిత్యాభిముఖవారము, హృదయవారము, రోగహరవారము, మహాశ్వేతవారము నని వానినామములు. మొదటిది మాఘమాసమున శుక్లపక్షమున షష్ఠినాఁడనుష్ఠింపఁదగినది. మాఘశుక్లషష్ఠినాఁడు వచ్చుభానువాసరమునఁ జేయు వ్రతము నందసప్తమీవ్రతమని (రూపసప్తమి) యెఱుంగవగును. సర్వపాపములవలని భయంబు నది వాపఁగలదు. ఈవ్రతమున నాదిత్యునకు రాత్రివేళ నేతితో నభ్యంజనమొసంగి జలకమార్చుట పుణ్యము నొసంగును. ఇం దాతని కగస్త్యకుసుమంబు లానందము నిచ్చునవి. మైపూఁతకుఁ బరిమళయుక్తమగు తెల్లచందన ముత్తమమైనది. ధూపములలో గుగ్గులు ధూప ముత్తమమైనది. నైవేద్యములలో నపూపములు శ్రేష్ఠములయినవి. నైవేద్యమయినవెనుక నాయప్పములను బ్రాహ్మణునకు శక్తికొలఁదికి నొసంగి యామీఁద మౌనముతోఁ దాను భుజింపవలయును. ఈ వ్రతము నక్తమునఁ గదా చేయవలయు ననిరి. అందు నక్త మనఁగాఁ గొందఱు నక్షత్రము లగపడుకాలమనియు, మఱికొందఱు విద్వాంసులు ముహూర్తకాలము కొఱవుగనుండు పగలని చెప్పుచున్నారు. నేనును నక్షత్రదర్శనకాలమేయని తలంచుచున్నాను. కుంచపుటడుగు ప్రమాణము కలిగి గోధూమచూర్ణముతోఁ జేసిన యప్పములు నివేదింపవలయును. గోధూమములు దొరకకున్న యవబియ్యముపిండితో నేయి బెల్లము చేర్చి చేసినయప్పములైన నివేదించి హిరణ్యముతోఁ గూడ నాయప్పముల నొకయితిహాసవిశారదుం డగుబ్రాహ్మణున కొసంగవలయును.

---

౮. నందో భద్రస్తథా సౌమ్యః కామదః పుత్రదస్తథా, జయో జయంతో విజయ ఆదిత్యాభిముఖస్థితః. ౯. హృదయో రోగహా చైవ మహాశ్వేతప్రియోఽపరః, శుక్లపక్షస్య షష్ఠ్యాం తు మాఘే మాసి గణాధిప. ౧౦. యః కుర్యాత్స భవేద్భూపః సర్వపాపభయాపహః, అత్ర నక్తం స్మృతం పుణ్యం ఘృతేన స్నపనం రవేః. ౧౧. అగస్త్యకుసుమానీహ భానోస్తుష్టికరాణి తు, విలేపనం సుగంధస్తు శ్వేతచందనముత్తమమ్. ౧౨. ధూపస్తు గుగ్గులః శ్రేష్ఠో నైవేద్యం పూపమేవ హి, దత్వా పూపం తు విప్రస్య తతో భుఞ్జీత వాగ్యతః. ౧౩. నక్షత్రదర్శనాన్నక్తం కేచిదిచ్ఛంతి మానద, ముహూర్తోనం దినం కేచిత్ప్రవదంతి మనీషిణః. ౧౪. నక్షత్రదర్శనాన్నక్తమహమ్మన్యే గణాధిప, ప్రస్థమాత్రం భవేత్పూపం గోధూమమయముత్తమమ్. ౧౫. యవోద్భవం వా కుర్వీత సగుడం సర్పిషాన్వితమ్, సహిరణ్యం చ దాతవ్యం బ్రాహ్మణే సేతిహాసకే. ౧౬. భామే

ఆతఁడు దొరకనప్పుడు మంత్రవేత్తయగు బ్రాహ్మణునకుఁగాని జాతిబ్రాహ్మణునకుఁగాని యొసంగవలయును. అట్టివారును లభింపకున్న నాదిత్యునెదుట నుంచవలయును. బ్రాహ్మణుల కిచ్చునప్పుడు మంత్రపూర్వకముగ నీయవలయును. నేయి మొదలగుజిడ్డువస్తువులసత్తుచేఁ దయారయిన యీయప్పములు మంత్రముతోడనే గ్రహింపవలయును. దానము చేయువాఁ డాదిత్యాభిముఖుఁడై భక్తితో నాతనికిఁ బ్రణమిల్లి "ఆదిత్యతేజసోత్పన్నం రాజ్ఞీకరవినిర్మితం, శ్రేయసే మమ విప్ర త్వం ప్రతీచ్ఛాపూపముత్తమమ్" "ఓబ్రాహ్మణా! సూర్యునితేజమువలన గలిగి సూర్యపత్నియగు రాజ్ఞిహస్తములచే నిర్మితమగు నీయుత్తమమయిన యప్పమును నాశ్రేయస్సునకై గ్రహింపుము." అను నీదానమంత్రము నుచ్చరింపవలయును. "కామదం సుఖదం ధర్మ్యం ధనదం పుత్రదం తథా, సదాఽస్తు తే ప్రతీచ్ఛామి మండకం భాస్కరప్రియమ్." "కోరికలను సుఖమును ధనమును పుత్త్రులను నీకొసఁగుచు ధర్మనిబద్ధమై యిది యుండుఁగాక. సూర్యప్రియమగు నీమండకమును నేగ్రహించుచున్నాను." అను నీప్రతిగ్రహమంత్రము గ్రహించువాఁ డుచ్చరింపవలయును. ఈమంత్రములు రెండును దానప్రతిగ్రహములందు సూర్యున కిష్టమైనది. అప్పము లిచ్చునప్పుడు తీసికొనినప్పుడు నీమంత్రములు పఠించిన నిక్కముగ శ్రేయము గలుగును. ఓబుద్ధిమంతుఁడా! యీనందసప్తమీవిధానమును లోకశ్రేయమునకై యెఱింగించితిని. ఈవిధానముచొప్పున నేమానవుఁడు సూర్యుని బూజించునో యాతఁడు సమస్తపాతకములు బెడబాసి సూర్యలోకమునఁ బూజలఁగొనుచుండును. అమ్మహానీయునికులమున

---

దివ్యేఽథ వా దేయం న్యసేద్వా పురతో రవేః, దాతవ్యో మంత్రతశ్చాయం. మండకో గ్రాహ్య ఏవ హి. ౧౭. భూత్వాదిత్యేన వై భక్త్యా ఆదిత్యం తు నమస్య చ, ఆదిత్యతేజసోత్పన్నం రాజ్ఞీకరవినిర్మితమ్, శ్రేయసే మమ విప్ర త్వం ప్రతీచ్ఛాపూపముత్తమమ్. ౧౮. కామదం సుఖదం ధర్మ్యం ధనదం పుత్రదం తథా, సదాస్తు తే ప్రతీచ్ఛామి మండకం భాస్కరప్రియమ్. ౧౯. ఏతౌ చైవ మహామంత్రౌ దానాదానే రవిప్రియౌ, అపూపస్య గణశ్రేష్ఠ శ్రేయసే నాత్ర సంశయః. ౨౦. ఏష నందవిధిః ప్రోక్తో నరాణాం శ్రేయసే విభో, అనేన విధినా యస్తు నరః పూజయతే రవిమ్, సర్వపాపవినిర్ముక్తః సూర్యలోకే మహీయతే. ౨౧. న దారిద్ర్యం న రోగశ్చ కులే తస్య మహా

దారిద్ర్యము కాని రోగము కాని కలుగనేరవు. ఈవిధానంబున భానుని బూజించువానికి సంతానము నశింపదు. సూర్యలోకమున సుఖము లనుభవించి పుణ్యము క్షీణింపఁ బుడమికిఁ దిగి రాజగుచున్నాఁడు. అనేక విధములగు రత్నములతోఁగూడి తేజస్సున నగ్నిసమానుఁడై యుండును. ఈవిధానముఁ జదువువారికిని వినువారికి నాదిత్యుఁడు శాశ్వతమగు సుఖము నొసంగును. శాశ్వతైశ్వర్యమును గూడ నొసంగును.

ఇది ద్వ్యశీతితమాధ్యాయము.

---

## త్ర్యశీతితమాధ్యాయము.

గణనాయకా! భాద్రపదశుక్లపక్షమున (కృష్ణపక్షమున, అని పాఠాంతరము) వచ్చుభానువాసరమును షష్ఠియుఁ జేరియుండునేడ నాదినము భద్రమని చెప్పఁబడును. ఆనాఁ డెవ్వఁడు రాత్రిగాని పూర్తిగ నారోజంతయుఁగాని యుపవసించునో యాతఁడు హంసవాహనము నెక్కి సూర్యలోకమున కేగును. ఈవ్రతమున నాదిత్యపూజకై మాలతీ కుసుమములను శ్వేతచందనమును విజయధూపము నుత్తమమగు పాయసము నైవేద్యమును నుపయోగింపవలయును. ఇప్పగిది నాదేవదేవుని బూర్వాహ్ణంబునఁ బూజించి మధ్యాహ్నమున యథాశక్తిగ దక్షిణలిచ్చి

---

త్మనః, యోఽనేన పూజయేద్భానుం న క్షయః సంతతేస్తథా. ౨౨. సూర్యలోకాచ్చ్యుత శ్చాసౌ రాజా భవతి భూతలే, బహురత్నసమాయుక్తస్తేజసా ద్విజసన్నిభః. ౨౩. పఠతాం శృణ్వతాం చేదం విధానం త్రిపురాంతక, కం దదాత్యచలం దివ్యమంబుజామచలాం తథా. ౨౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే నందవిధివర్ణనం నామ
ద్వ్యశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—మాసి భాద్రపదే వీర శుక్లే పక్షే తు యో భవేత్, షష్ఠ్యాం గణకులశ్రేష్ఠ స భద్రః పరికీర్తితః. ౧. తత్ర నక్తం తు యః కుర్యాదుపవాసమథాపి వా, హంసయానసమారూఢో యాతి హంససలోకతామ్. ౨. మాలతీకుసుమానీహ తథా శ్వేతం చ చందనమ్, విజయం చ తథా ధూపం నైవేద్యం పాయసం పరమ్. ౩. పూజాయాం భాస్కరస్యేహ కుర్యాత్త్రిపురసూదన, ఇత్థం సంపూజ్య దేవేశం మధ్యాహ్నే

నేయి బెల్లముచేర్చినపాయసమును మౌనముతో భుజింపవలయును. ఇప్ప గిది నెవ్వాఁడు భక్తుఁడై అజ్ఞానమనుచీఁకటి నడఁగించుభాస్కరుని బూజించునో యాతఁడు పుత్రదారధనాదులగు సమస్తాభీష్టఫలములఁ గాంచి యీలోకమున సుఖించి సమస్తపాపములు బాసి జన్మాంతమున భాను సాలోక్యము నొందును. గణాధిపా! నీకేనెఱింగించిన యీభద్రావ్రత విధానము నెవ్వాఁడాలకించునో యెవ్వాఁడనుష్ఠించునో వారిరువురును సమస్తపాపములనుండియు విముక్తు లగుచున్నారు.

ఇది త్ర్యశీతితమాధ్యాయము.

---

## చతురశీతితమాధ్యాయము.

ఓవీరుఁడా! రోహిణీనక్షత్ర మేసూర్యవారమున వచ్చునో యా వారము మిగుల సౌమ్యమయియుండుట సౌమ్యంబునాఁబరగె. ఆదినమున మహాత్ముఁడగు సూర్యుని బూజించుచు స్నానదానజపహోమములు పితృ తర్పణము దేవతర్పణము మున్నగువాని జేసినచో నయ్యది యక్షయం బగును. ఈదినమున నక్తవ్రతము నాశ్రయించి భాస్కరు నారాధించు మానవుఁడు భాస్కరదేవునిలోకమున కేగుచున్నాఁడు. సందేహము లేదు.

---

చ దినాధిపమ్. ౪. దత్వా తు దక్షిణాం శక్త్యా తతో భుంజీత వాగ్యతః, పాయసం గణశార్దూల సగుడం సర్పిషా సహ. ౫. య ఏవం పూజయేద్భక్త్యా మానవస్తిమిరాప హమ్, సర్వకామానవాప్నోతి పుత్రదారధనాదికాన్. ౬. విముక్తః సర్వపాపేభ్యో వ్రజేద్భానుసలోకతామ్, ఏష భద్రావిధిః ప్రోక్తో మయా యస్తే గణాధిప. ౭. శ్రుత్వా కృత్వా చ యత్పాపాన్ముచ్యతే మానవో భువి. ౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే భద్రవిధివర్ణనం నామ త్ర్యశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—నక్షత్రం రోహిణీ వీర యదా వారేస్య వై భవేత్, యాత్యసౌ సౌమ్యతాం వీర స సౌమ్యః పరికీర్తితః. ౧. స్నానం దానం జపో హోమః పితృదేవాదితర్పణమ్, అక్షయం స్యాన్మ సందేహస్తవ్రత్ర వారే మహాత్మనః. ౨. నక్తం సమాశ్రితో యోఽత్ర పూజయేద్భాస్కరం నరః, యాతి లోకం స దేవస్య భాస్కరస్య

ఆవ్రతమునందు సూర్యపూజకై యెఱ్ఱకలువలు రక్తచందనము సుగంధ ధూపమును పాయసనైవేద్యము నుపయోగింపవలయును. అనంతర మాపాయసము నొకబ్రాహ్మణున కొసంగి తానును భుజింపవలయును. ఎవఁ డీవిధానమున లోకనాథుఁడు చిత్రభానుని సౌమ్యవారమునఁ బూజించునో యాతఁడు పాపవిముక్తుఁడై విశ్వకర్మనిర్మితమైనకాంతిని (సూర్య మండలము) బొందుచున్నాఁడు.

ఇది చతురశీతితమాధ్యాయము.

---

## పంచాశీతితమాధ్యాయము.

మార్గశీర్షమాసమున శుక్లపక్షమున షష్ఠినాఁడువచ్చు రవివారము కామదభానువారమని తెలియవలయును. ఈవారము భాస్కరునకు మిగులఁ బ్రియమైనది. ఆదినమున భక్తిశ్రద్ధలుకలిగి సూర్యుని బూజించువాఁడు సర్వపాపవిముక్తుఁడై యింద్రలోకమున కేగును. (సూర్యుని జేరును). ఇందు భాస్కరునకు గన్నేరుపూవులు రక్తచందనము ధూపమును నేతితో హోమములు నుపయోగింపవలయును. నైవేద్యము పరిమళముగలిగి కఠినములగు జంతికలు మొదలగువాని జేయవలయును.

---

న సంశయః. ౩. రక్తోత్పలాని వై తత్ర తథా రక్తం చ చందనమ్, సుగంధశ్చాపి ధూపస్తు నైవేద్యం పాయసం తథా, బ్రాహ్మణాయ చ దాతవ్యం భోక్తవ్యం చాత్మనా తథా. ౪. య ఏవం పూజయేత్సౌమ్యే చిత్రభానుం గవాంపతిమ్, స విముక్తస్తు పాపేభ్యస్త్వాష్ట్రీం కాంతిమవాప్నుయాత్. ౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే సౌమ్యవిధివర్ణనం నామ
చతురశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—ప్రాప్తే మార్గశిరే మాసి శుక్లషష్ఠ్యాం తు యో భవేత్, స జ్ఞేయః కామదో వారః సదేష్టో భాస్కరస్య తు. ౧. తత్ర యః పూజయేద్భానుం భక్త్యా శ్రద్ధాసమన్వితః, విముక్తః సర్వపాపైస్తు ప్రాప్నుతే నందనాధిపమ్. ౨. రక్తచందనమిశ్రాణి కరవీరాణి సువ్రత, ధూపం ఘృతాహుతిం వీర భాస్కరాయ ప్రయోజయేత్. ౩. నైవేద్యం చాపి కృశరం సుగంధం తీక్ష్ణమేవ చ, కృత్వోపవాసమథ వా

ఇందుఁగూడఁ బూర్తియుపవాసమునుగాని నక్తవ్రతముగాని చేయవల యును. ఇటులీవ్రతమునఁ బూజితుఁడై లోకభాస్కరుఁడగు భాస్కరుఁడు మెచ్చి సర్వకామముల నిచ్చుచున్నాఁడు. కాననే యీతిథివారము కామద మనంబరగె. ఆతఁడు పుత్రకామునకుఁ బుత్రుని ధనకామునకు ధనమును విద్యాకామునకు శ్రేష్ఠవిద్యను రోగియగువాని కారోగ్య మును నింక నితరములగు వివిధకామములను మంత్రములతోఁబూజితుఁడై యిచ్చుచున్నాఁడు. కావున నీయాదిత్యుఁడు కామదుఁ డనఁజెల్లె. ఈవ్రత మున నాదిత్యునకు మండకమును (నేయి మొదలగువానితోఁ జేసిన యప్పము) నివేదించువాఁడు గోత్రమున కలంకారమై యింద్రసమాన తేజంబుగలిగి సూర్యమండలము నొందుచున్నాఁడు.

ఇది పంచాశీతితమాధ్యాయము.

---

## షడశీతితమాధ్యాయము.

ఏభానువాసరమున నైదుచుక్కలుగలనక్షత్రములు (రోహిణి, పునర్వసు, మఘ, హస్త, విశాఖ, మూల,) వచ్చునో ఆవారము పుత్రద వారము నాఁబడు. అందుపవాసమును శ్రాద్ధమును మధ్యమపిండప్రాశన మును ముఖ్యములని చెప్పఁబడియె. నరుం డానాఁడు భక్తితో నుపవసించి

---

నక్తం త్రిపురసూదన.౪.ఇత్థం ప్రపూజితో హ్యత్ర భాస్కరో లోకభాస్కరః, కామాన్ద దాతి సర్వాన్వై అతోఽయం కామదః స్మృతః.౫. స పుత్రం పుత్రకామస్య ధనకామస్య వా ధనమ్, విద్యార్థినే శుభాం విద్యామారోగ్యం రోగిణే విభో. ౬. అన్యాంశ్చ వివిధా న్కామాన్మంత్రైః సంపూజితో రవిః, దదాతి గణశార్దూల అతోఽయం కామదః స్మృతః. ౭.దద్యాద్యో మండకం చాత్ర గోపతేర్గోత్రభూషణః,గోత్రారి తేజసా తుల్యో గోపతే ర్గోపురం వ్రజేత్. ౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే కామదవిధివర్ణనం నామ
పంచాశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—పంచతారం భవేద్యత్ర నక్షత్రం తే వృషధ్వజ, వారే తు దేవదేవస్య స వారః పుత్రదః స్మృతః. ౧. ఉపవాసో భవేత్తత్ర శ్రాద్ధం కార్యం తథా

సూర్యుని దివ్యగంధముగల ధూపములు మాల్యములు నుపహారంబులు మొదలగువానితోఁ బూజించి యాదేవునెదుటనే యారాత్రి కటికినేలపైఁ బవళించి శ్వేతామంత్రమును జపించవలయును. అంత మఱునాఁడుదయమున మేల్కాంచి స్నానముచేసి సూర్యున కర్ఘ్యము నొసంగి రక్తచందనమునను గన్నేరుపూవులను సంతోషవంతుఁడగు గ్రహరాజును బూజించి యామీఁద శ్రాద్ధముచేయవలయును. అందు దివ్యులు భౌములునగు నేవురబ్రాహ్మణుల నియోగింపవలయును. అందు దివ్యులగు బ్రాహ్మణు లిరువురును "మ, గ" అను నక్షరములు నామములందు కలిగియుండవలయును. (మఘునామములై యుండవలయునని పాఠాంతరము) మిగత ముగ్గురుబ్రాహ్మణులను భీమనామములు గలవారినిగా భౌముల నియోగింపవలయును. ఇటుల నియమించి సూర్యున కిష్టమగునట్లు పార్వణశ్రాద్ధము చేయవలయును. ఈశ్రాద్ధము ముగిసినపిదప సూర్యుని కెదురుగ నిలచి నడిమిపిండము నందుకొని "స ఏషపిండో దేవేశ యోఽభీష్టస్తవ సర్వదా, అశ్నామి పశ్యతే తుభ్యం తేన మే సంతతిర్భవేత్. ప్రసాదాత్తవ దేవేశ ఇతి మే భావితం మనః." "ఓదేవనాథా! నీకెల్లప్పుడు నెయ్యది ప్రియమో, అదియే యీపిండము. నీవు చూచుచుండఁగ దీనిని నే భుజించుచున్నాను. దీన నాకు సంతానము గలుగవలయును. నీయను గ్రహమున నామనము నిష్కల్మషమై యున్నది." అను నీమంత్రము పఠించి భుజింపవలయును. ఇప్పగిది నీవ్రతమున నాదిత్యుఁడు పూజితుఁడై

---

భవేత్, ప్రాశనం చాపి పిండస్య మధ్యమస్య ప్రకీర్తితమ్. ౨. సోపవాసస్తు యో భక్త్యా పూజయేదత్ర గోపతిమ్, ధూపమాల్యోపహారైస్తు దివ్యగంధసమన్వితైః. ౩. ఏవం పూజ్య వివస్వంతం తస్యైవ పురతో నిశి, భూమౌ స్వపితి వై వీర జపఞ్ఛ్వేతాం మహామతే. ౪. ప్రాతరుత్థాయ చ స్నానం కృత్వా దత్వార్ఘ్యముత్తమమ్, రక్తచందనసంమిశ్రైః కరవీరైర్గణాధిప. ౫. ప్రపూజ్య గ్రహభూతేశమంశుమంతం త్రిలోచన, వీరం చ పూజయిత్వా తు తతః శ్రాద్ధం ప్రకల్పయేత్. ౬. పంచభిర్బ్రాహ్మణైర్దేవ దివ్యైర్భౌమైశ్చ సువ్రత, మగసంజ్ఞౌ తత్ర దివ్యౌ బ్రాహ్మణౌ పరికల్పయేత్. ౭. త్రీనత్ర బ్రాహ్మణాన్భీమాన్పరికల్ప్యాంధకసూదన, కుర్యాదేవం తతః శ్రాద్ధం పార్వణం భాస్కరప్రియమ్. ౮. శ్రాద్ధే త్వథ సమాప్తే తు దద్యాత్పిండం తు మధ్యమమ్, పురతో దేవదేవస్య స్థిత్వా మంత్రేణ సువ్రత. ౯. స ఏష పిండో దేవేశ యోఽభీష్టస్తవ సర్వదా, అశ్నామి పశ్యతే తుభ్యం తేన మే సంతతిర్భవేత్. ౧౦. ప్రసాదాత్తవ దేవేశ ఇతి మే భావితం

పుత్త్రుల నిచ్చువాఁడగును. కావున నీరవివారము పుత్త్రదవారంబునా నెగడె. ఇప్పుగిది నీవారమున నేనరుండు భక్తితో సూర్యుని బూజించి యుపవాసపరుఁడై శ్రాద్ధమొనర్చునో యాతఁడు నిశ్చయముగఁ బుత్త్రుని గాంచును. ధనధాన్యహిరణ్యములను సుఖారోగ్యములనుగూడఁ గాంచి సూర్యలోకమున కేగి పిదప మఱలి కాలాంతరమున భువి కేతెంచి మను ష్యులలో రాజయి వెలుఁగును నరుణునకును గాంతిలోఁ జంద్రునకును ప్రతాపమున నాదిత్యునకు గాంభీర్యమున సాగరమునకును సాటియై వెలయును.

ఇది పుత్త్రదవిధివర్ణనము.

దక్షిణాయనసంక్రాంతిలో వచ్చురవివారము జయవార మనఁ బడును. అం దుపవాసము నక్తవ్రతముచేఁ జేయవలయును. స్నానదాన జపములఁ జేయవలయును. ఇదియంతయు భాస్కరునకుఁ బ్రీతిగలిగించు టచే నూఱురెట్లెక్కుడుగ ఫలము నొసంగును. కావున నీజయవ్రతము నక్తమున నారంభించి శతగుణితఫలమును బొందవలయును. ఇది యాది త్యున కభిమతమైనది.

ఇది షడశీతితమాధ్యాయము.

---

మనః,- ఇత్థం సంపూజితో హ్యత్ర భాస్కరః పుత్రదో భవేత్. ౧౧. అతోఽయం పుత్రదో వారో దేవస్య పరికీర్తితః, ఏవమత్ర సదా యస్తు భాస్కరం పూజయేన్నరః. ౧౨. ఉపవాసపరః శ్రాద్ధే స పుత్రం లభతే ధ్రువమ్, ధనం ధాన్యం హిరణ్యం చ ఆరోగ్యం సుఖదం తథా, సూర్యలోకం చ సంప్రాప్య తతో రాజా భవేన్నృషు. ౧౩. ప్రభయా ద్విజసంకాశః కాంత్యా చాంబుజసన్నిభః, వీర్యేణ గోపతేస్తుల్యో గాంభీర్యే సాగరోపమః. ౧౪.

ఇతి పుత్రదవిధివర్ణనమ్.

బ్రహ్మోవాచ:—దక్షిణే త్వయనే యః స్యాత్స జయః పరికీర్తితః. ౧౫. అత్రోపవాసో నక్తం చ స్నానం దానం జపస్తథా, భవేచ్ఛతగుణం దేవ భాస్కర ప్రీతయే కృతమ్. ౧౬. తస్మాన్నక్తాది కర్తవ్యం యత్స్యాచ్ఛతగుణం విభోః. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే జయవారతిథివర్ణనం నామ షడశీతితమోఽధ్యాయః.

## సప్తాశీతితమాధ్యాయము.

ఉత్తరాయణసంక్రాంతిలో వచ్చు భానువారము జయంత మనఁబరఁగును. అందు ముఖ్యముగ దివాకరుని బూజింపవలయును. అందుఁ బూజింపఁబడునాదిత్యుఁడు భక్తులకు వేయిరెట్లెక్కుడుఫలము నొసంగును కావున నిందు స్నానదానాదికర్మలు ముఖ్యముగఁ జేయవలయును. నేయి పాలు చెఱకురసములతో స్నానమును కుంకుమవిలేపనము నాదిత్యునకుఁ బ్రశస్తమై ప్రియమైనది. గుగ్గులుధూపమును లడ్డుకముల నైవేద్యము నొసంగవలయును. ఇటు లాదేవుని బూజించి నువ్వులతో హోమములు చేయవలయును. ఆవెనుక లడ్డులతోడను నువ్వులుచేర్చిన చక్కిలములను బ్రాహ్మణులకు భోజనము లిడవలయును. ఇట్లుగివి నే మానవుఁడు మంత్రములతో భక్తిగ భాను నారాధించునో యాతని స్నానదానజపోపవాసములకు వేయిరెట్లుగ ఫలము నొసంగుచున్నాఁడు.

ఇది సప్తాశీతితమాధ్యాయము.

---

బ్రహ్మోవాచ:—జయన్తో హ్యుత్తరే జ్ఞేయశ్చాయనే గణనాయక, వారో దేవస్య యః స్యాద్వై తత్ర పూజ్యో దివాకరః. ౧. పూజితస్తత్ర దేవేశః సహస్ర గుణితం ఫలమ్, దదాతి దేవశార్దూల స్నానదానాదికర్మణామ్. ౨. ఘృతేన పయసా యత్ర స్నానమిక్షురసేన తు, విలేపనం కుంకుమం తు ప్రశస్తం భాస్కరే ప్రియమ్. ౩. ధూపక్రియా గుగ్గులేన నైవేద్యే మోదకః స్మృతః, ఇత్థం సంపూజ్య దేవేశం కుర్యాద్ధోమం తతస్తిలైః, బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాన్మోదకాంస్తిలశష్కులీః. ౪. ఇత్థం యః పూజయేద్భానుం మంత్రైశ్చైవ గణాధిప, సహస్రగుణితం తస్య ఫలం దేవో దదాతి వై. ౫ స్నానదానజపాదీనాముపవాసస్య వై విభో. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం

బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే జయంతవిధివర్ణనం నామ

సప్తాశీతితమోఽధ్యాయః.

## అష్టాశీతితమాధ్యాయము.

శుక్లపక్షసప్తమినాఁడు రోహిణీనక్షత్రముతో చేరిన యాదిత్య వారము వచ్చెనేని యీదినమును విజయదిన మందురు. అయ్యది సర్వ పాపములవలనిభయంబు వాపును. అం దొనర్చిన పుణ్యకర్మలకు కోటి గుణితమగుఫలమును బూజితుఁడయిన చందనాధిపుఁడగు నాదిత్యుఁ డొసంగుచున్నాఁడు. ఇందు స్నానదానజపహోమములు పితృదేవాది పూజనము రాత్త్ర్యుపవాసము సర్వమును సూర్యుఁడు కోటిగుణితముగఁ జేయును. కావున నీదినమున నెప్పుడు భక్తితో నాదిత్యదేవుని బూజింప వలయును. సప్తద్వీపాధిపతియు సప్తాశ్వవాహనుఁడునగు సర్వేశ్వరుని సప్తప్రకృతికారణుని సప్తమినాఁ డారాధించి యేడు రశ్మలచేతను సప్తలోకాధిపత్యము వహించువాఁడగును.

ఇది అష్టాశీతితమాధ్యాయము.

---

## నవాశీతితమాధ్యాయము.

మాఘమాసమునఁ గృష్ణపక్షసప్తమినాడు భానువారమువచ్చెనేని యయ్యది యాదిత్యాభిముఖ రవివారము నాఁబరగును. ఉత్తమమగు

---

బ్రహ్మోవాచ:—శుక్లపక్షస్య సప్తమ్యాం ప్రాజాపత్యర్క్షసంయుతః, స జ్ఞేయో విజయో నామ సర్వపాపభయాపహః. ౧. తత్ర కోటిగుణం సర్వం ఫలం పుణ్యస్య కర్మణః, దదాతి భగవాన్దేవః పూజితశ్చందనాధిపః. ౨. స్నానం దానం జపో హోమః పితృదేవాదిపూజనమ్, నక్తం చాప్యుపవాసస్తు సర్వమత్ర దివాకరః. ౩. కుర్యాత్కోటి గుణం సర్వం పూజితో హ్యత్ర గోపతిః,తస్మాదత్ర సదా దేవం పూజయేద్భక్తిమాన్నరః. ౪. సర్వేశం సప్తద్వీపేశం సప్తసైంధవవాహనమ్, సప్తమ్యాం తు సమారాధ్య సప్త ప్రకృతిసంభవమ్. ౫. సప్తలోకాధిపత్యం తు ప్రాప్నుతే సప్తరశ్మిభిః. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే విజయవారవిధివర్ణం నామ అష్టాశీతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—కృష్ణపక్షస్య సప్తమ్యాం మాఘమాసే భవేత్తు యః, సాదిత్యాభి ముఖో జ్ఞేయః, శృణు చాస్య విధిం పరమ్. ౧. కృత్వైకభక్తం కృష్ణస్య వారే

దానివిధానము నాకర్ణింపుము. శనివారమున నేకభుక్త మొనరించి మరునాఁ డాదివార ముదయమున స్నానముచేసి యర్ఘ్యము మొదలగు వానిచే దివాకరుం బూజించి సూర్యాస్తమయ మగువఱకు నాతని కభిముఖముగ నిలువవలయును. ఎక్కువఫలము వాంఛించువాఁడు మహాశ్వేతా మంత్రంబు జపింపవలయును. ఎఱ్ఱగంధపుఁగొయ్యతో నాలుగుచేతులు గలిగి వంకరలేక నున్నగ మృదువుగ బొడుపులు మొదలగునవి లేక సమమై దృఢమగుస్తంభము నొకదానిం జేసి దానికడ నిలచి యుత్తమ భక్తితో దేవదేవుఁడగు దివాకరు నీక్షించుచు నాతఁ డస్తమించువఱకును శ్వేతాఋక్కునైనను జపింపవలయును. గంధపుష్పములను పాయసములను దివాకరు బూజించి బ్రాహ్మణునకు దక్షిణయొసంగి మౌనియై తాను భుజింపవలయును. సూర్యుని ప్రీతికొఱకు వెనుకఁ జెప్పినచొప్పున నీవ్రతము చేసినవానికి సూర్యుఁడు ప్రీతుఁడై సర్వము నొసంగుచున్నాఁడు. ధనము, ధాన్యము, నారోగ్యమును, పుత్త్రులను, లక్ష్మిని, యశము నీమొదలగునవి యెల్లఁ గలుగును. కావున నీవాఁ డాగీర్వాణాధిపతిని దప్పక యారాధింపవలయును.

నవాశీతితమాధ్యాయము.

---

త్రిపురసూదన, ప్రాతః కృత్వా తతః స్నానం పూజయిత్వా దివాకరమ్. ౨. ఆదిత్యాభిముఖస్తిష్ఠేద్యావదస్తమనం రవేః, జపమానో మహాశ్వేతాం లాభమాశ్రిత్య సువ్రత. ౩. చతుర్హస్తమృజుం శ్లక్ష్ణమవ్రణం సుసమం దృఢమ్, రక్తచందనవృక్షస్య స్తంభం కృత్వా గణాధిప. ౪. తమాశ్రిత్య మహాభక్త్యా దేవదేవం దివాకరమ్, పశ్యమానో జపఞ్ఛ్వేతాం తిష్ఠేదస్తమనాద్రవేః. ౫. గంధపుష్పపహారైస్తు పూజయిత్వా దివాకరమ్, బ్రాహ్మణే దక్షిణాం దత్వా తతో భుఞ్జీత వాగ్యతః. ౬. ఇత్థమేతం తు యః కుర్యాదాదిత్యప్రీతయే నరః, భానుమాంస్తస్య ప్రీతః స్యాత్సర్వం ప్రీతో దదాతి హి. ౭. ధనం ధాన్యం తథా పుత్ర మారోగ్యం భార్గవీం యశః, తస్మాత్సంపూజయేదత్ర గీర్వాణాధిపతిం హర. ౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే ఆదిత్యాభిముఖవిధివర్ణనం నామ
నవాశీతితమోఽధ్యాయః.

## నవతితమాధ్యాయము.

దక్షిణోత్తరాయణములకన్న నితరములగు సూర్యసంక్రమణములం దాదిత్యవారము వచ్చెనేని యది యాదిత్యహృదయమునకుఁ బ్రియమగుటం జేసి హృదయవారంబు నాఁ బరగు. అందు నక్తవ్రతము నాశ్రయించి భక్తితో దేవుని బూజించి సూర్యసదనముఁ జేరి యాదిత్యాభిముఖుఁడై యెనమన్నూరుమారులుగాని యస్తమించువఱకుఁగాని యాదిత్యహృదయమును జపించుచు హృదయమున భాస్కరునే ధ్యానించుచు నిలచి యామీఁద గృహమున కేతెంచి యథాశక్తిగ బ్రాహ్మణులకు భోజనము లిడి పాయసంబు భుజించి నేలమీఁదనే బరుండవలయును. ఎవఁడీనాఁడు భక్తితో శ్రద్ధతోను భానుని బూజించునో యాతఁడు నిజ హృదయమునందున్న భాస్కరునివలనఁ దావాంఛించుకోర్కులెల్లఁ బడయుచున్నాఁడు. ఆతఁడు తేజముననుయశస్సునను వెలుఁగునను మహాత్ములగు మహేంద్రసూర్యారుణులకు పాటిరైయి గోలోకమున వెలయుచున్నవాఁడు.

ఇది నవతితమాధ్యాయము.

---

బ్రహ్మోవాచ:—రవిసంక్రమణే యః స్యాద్రవేర్వారో గణాధిప, స జ్ఞేయో హృదయో నామ ఆదిత్యహృదయప్రియః. ౧. తత్ర నక్తం సమాశ్రిత్య దేవం సంపూజ్య భక్తితః, గత్వా చ సదనే భానో రాదిత్యాభిముఖస్థితః. ౨. జపేదాదిత్య హృదయం సంఖ్యయాష్టశతం బుధః, అథ వాస్తమనం యావద్భాస్కరం చింతయే ద్ధృది. ౩. గృహమేత్య తతో విప్రాన్భోజయేచ్ఛక్తితః శివ, భుక్త్వా తు పాయసం వీర తతో భూమౌ స్వపేద్బుధః. ౪. యోత్ర సంపూజయేద్భానుం భక్త్యా శ్రద్ధా సమన్వితః, స కామాల్లభతే సర్వాన్భాస్కరాద్ధృదయస్థితాన్. ౫. తేజసా యశసా తుల్యః ప్రభయైషాం మహాత్మనామ్, శక్రగోపాండజానాం తు గోపతేర్గోవృషేక్షణ. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే హృదయవారవిధివర్ణనం నామ నవతితమోఽధ్యాయః.

## ఏకనవతితమాధ్యాయము.

పూర్వఫల్గునీనక్షత్రమును రేవతినక్షత్రము నేయాదివారమునఁ గలియునో యది యుత్తమమై సర్వరోగములను హరించుటం జేసి రోగహరవారంబు నాఁబరగె. అందు శుభగంధములచేతను విలేపనములచేతను సూర్యు నారాధించువాఁడు సమస్తరోగంబులఁ బెడఁబాసి భానుసాలోక్యము నొందును. ఎవ్వాఁడు జిల్లేడాకులదొప్పలో జిల్లేడుపూవుల నుంచుకొని రాత్రివేళ భక్తితో సూర్యునెదుట నుంచి వానితో నాదేవుని బూజించి జిల్లేడాకులరసము నొకబ్రాహ్మణునకుఁ ద్రోల నొసంగి జిల్లేడు పూలను దక్షిణ నాబ్రాహ్మణునకొసఁగి భక్తితో నాతనికిఁ బాయసం బొసంగి రాత్రివేళ నేలపైఁ బరుండి యుండునో యాతఁ డుత్తమఫలముల నందుచున్నాఁడు. ఇదియే యీవ్రతంపువిధానము. ఎవ్వఁడేని యీవిధి ననుసరించి యీనాఁ డీరవిని బూజించెనేని యాతఁడు సమస్తవ్యాధులను జయించి సుఖించి జన్మాంతమున సూర్యమండలమున కేగును. అంతేగాక యటనుండి సప్తర్షిమండలమునుండి సత్యలోకమున కేగును.

ఇది ఏకనవతితమాధ్యాము.

---

బ్రహ్మోవాచ:—పూష్ణా భవేద్యదా ఋక్షం భవేచ్చ భగదైవతమ్, వాసరః స మహానోప్రోక్తః సర్వరోగభయాపహః. ౧. యోఽత్ర పూజయతే భానుం శుభగంధ విలేపనైః, సర్వరోగవినిర్ముక్తో యాతి భానుసలోకతామ్. ౨. అర్కపత్రపుటే కృత్వా పుష్పాణ్యర్కస్య సువ్రత, దేవస్య పురతో రాత్రౌ భక్త్యా యః స్థాపయేద్బుధః. 3. పూజయిత్వార్కపుష్పైస్తు అర్కమర్కప్రియం సదా, ప్రాశయిత్వార్కపుష్పం తు దత్వా విప్రాయ దక్షిణామ్. ౪. భక్త్యా చ పాయసం వీర రాత్రౌ స్వపితి భూతలే, అనేన విధినా యస్తు పూజయేదత్ర వై రవిమ్. ౫. స ముక్తః సర్వరోగైస్తు గచ్ఛేద్దినకరాలయమ్, తస్మాదపి వ్రజేల్లోకం ఫుంకారారవహేలినః. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యకల్పే రోగహారవిధివర్ణనం నామ
ఏకనవతితమోఽధ్యాయః.

## ద్వినవతితమాధ్యాయము.

ఏ రవివార మాదిత్యగ్రహణముతోఁ జేరియుండునో యది ప్రశస్తమైన దని చెప్పుచున్నారు. అది యెల్లలోకములకుఁ గర్ణాభరణమై యున్నది. ఆదినమున నెవ్వాఁడు సూర్యప్రియుఁడగు నసూరుని గంధపుష్పోపహారములచేఁ బూజించునో యాతఁడు సూర్యలోకమును బొందును. సూర్యగ్రహణము వచ్చినప్పుడు శుచియై యుపవాసంబు సల్పి మహాశ్వేతామంత్రముగాని ఖపోషమంత్రము గాని శివసూక్తము గాని జపించుచు నాజగద్రక్షకు నంధకారనాశకుని శీఘ్రగమను బూజింపవలయును. తొలుత ఖపోషమును మహాశ్వేతను బూజించి యావెనుక జపింపవలయును. మహాశ్వేతను బూజించిన వెనుకనే రవిని బూజింపవలయును. మొదట మహాశ్వేతను బ్రతిష్ఠించి గంధపుష్పాదులచే నర్చించి యామండపమునకు వెలుపల నొకపరిశుద్ధప్రదేశమున నియమితచిత్తుఁడై స్థండిలము చేయించి, యందు బ్రయత్నముతో వీరాకారుడగు నాదిత్యునిం బ్రతిష్ఠించి స్నానముచేసి నూవులతోడను విశేషించి నేతితోడను హోమములు చేయవలయును. సూర్యగ్రహణకాలమున శ్వేతామంత్రమును జపింపవలయును. అంత మోక్షంబగుడు స్నానమాచరించి సమాహితచిత్తుఁడై మహాశ్వేతను మహాతేజస్సంపన్నుఁడగు గ్రహరాజును బూజించి బ్రాహ్మణులచె స్వస్తివాచనములు చేయించి యావెనుక మౌనముతో భుజింపవలయును. ఆదిత్యగ్రహణముతోఁ గూడిన యీవారమున నేయే

---

బ్రహ్మోవాచ:—యస్త్వాదిత్యగ్రహస్యాస్య వారో దేవస్య సువ్రత, శస్యః ప్రోక్తః ప్రియో లోకే ఖ్యాతో గోశ్రుతిభూషణః. ౧. యస్తు పూజయతే తస్మిన్పతంగం పతగప్రియమ్, గన్ధపుష్పోపహారైస్తు సూర్యలోకం స గచ్ఛతి. ౨. సోపవాసో గణశ్రేష్ఠ ఆదిత్యగ్రహణే శుచిః, జపమానో మహాశ్వేతాం ఖపోషమథ వా శివమ్. 3. పూజయేజ్జగతాంమీశం తమోనాశనమాశుగమ్, పూజయిత్వా ఖపోషం తు మహాశ్వేతాం తతో జపేత్. ౪. పూజయిత్వా మహాశ్వేతాం రవిం దేవం సమర్చయేత్, మహాశ్వేతాం ప్రతిష్ఠాప్య గన్ధపుష్పైః సుపూజితామ్. ౫. తస్యా ఏవ బహిః కార్యం స్థండిలం సుసమాహితః, శుచౌ భూమివిభాగే తు వీరం సంస్థాప్య యత్నతః. ౬. కుర్యాద్ధోమం తిలైః స్నాతః సర్పిషా చ విశేషతః, ఆదిత్యగ్రహవేలాయాం జపేచ్ఛ్వేతాం మహామతే. ౭. ముక్తే దినకరే పశ్చాత్స్నానం కృత్వా సమాహితః, పూజయిత్వా మహాశ్వేతాం ఖగోల్కం చ గ్రహాధిపమ్. ౮. బ్రాహ్మణాన్వాచయిత్వా చ తతో భుఞ్జీత వాగ్యతః, ఆదిత్యగ్రహయుక్తేఽస్మిన్వారే త్రిపురసూదన. ౯. యత్కర్మ క్రియతే

పుణ్యకర్మ మొనర్పఁబడునో అది యెల్ల సకలశుభముల గూర్చునదియే యగును. ఈనాఁడు స్నానదానజపాదులగు పుణ్యకర్మల కనంతమగు ఫలము కలుగును. ఇయ్యది భాస్కరదేవుని వచనమే. కావున బుణ్యకర్మరతులయిన బ్రాహ్మణాదులు తప్పక యేకభుక్తమున నుపవాస మొనరించి యీవ్రత మనుష్ఠింపవలెను. ఈవ్రతము నాదివారమున నెవ్వ రాచరింతురో వారు పరమపదము నొందుదురు. ఈవ్రతము ధర్మబద్ధము బుణ్యము కీర్తి ప్రదము సంతానప్రదము సర్వకామదము నైయున్నది. ఈనాఁ డప్పము లను దానముచేసినచో గోదానఫలము కలుగును. మహాత్ముఁ డగుభానుని యీపండ్రెండుదినములు సంతోషము నిచ్చునవియగుచు జపవువారికి వినువారికివిశేషించి యనుష్ఠించువారికి సర్వపాపముల నశింపఁజేయఁగలవు. ఈపండ్రెండింటిలో నేదో యొక్కవారమును విధ్యుక్తముగ ననుష్ఠించె నేని వృషభములు మొదలగు మూఁడుత్తమవస్తువులు నచలయగులక్ష్మియు లభించును. ఆవెనుక నాతఁడు మహాత్ముఁ డగువృషభవాహనుని యుత్తమ లోకమును జెందును. తేజమున సూర్యసమానుఁడును వెలుఁగున నరుణ సమానుఁడును వీర్యమున వజ్రాయుధముఁ బోలినవాఁడును గాంతిలోఁ జంద్రసమానుఁడు నైయుండును.

ఇది ద్వినవతితమాధ్యాయము.

---

పుణ్యం తత్సర్వం శుభదం భవేత్, స్నానదానజపాదీనాం కర్మణాం గోవృషధ్వజ. ౧౦. అనన్తం హి ఫలం తేషాం భవత్యస్మిన్న సంశయః, కృతానాం తు గణశ్రేష్ఠ భాస్కరస్య వచో యథా. ౧౧. తస్మాద్ద్విజగణైః కార్యం పుణ్యకర్మవిచక్షణైః, ఏకభక్తం చ నక్తం చ ఉపవాసం గణాధిప. ౧౨. యే వాదిత్యదినే కుర్యుస్తే యాంతి పరమం పదమ్, ధర్మ్యం పుణ్యం యశస్యం చ పుత్రీయం కామదం తథా. ౧౩. తస్మిన్దానమపూపస్య గోదానేన సమం భవేత్, ద్వాదశైతే మహాబాహో వీరభానోర్మహాత్మనః. ౧౪. తుష్టిదాః కథితా స్తుభ్యం సర్వపాపభయాపహాః, పఠతాం శృణ్వతాం తాత కుర్వతాం చ విశేషతః. ౧౫. కృత్వైకమేషాం విధివద్వారం వృషభవాహన, వృషాదిత్రితయం ప్రాప్య చాత్రిజామచలాం తథా. ౧౬. తతో యాతి పరం లోకం వృషకేతోర్మహాత్మనః, తేజసాంబుజసంకాశః ప్రభయాం డజసన్నిభః. ౧౭. పవిహేతిసమో వీర్యే కాన్త్యా చంద్రసమప్రభః. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి ఆదిత్యవారకల్పే మహాశ్వేతవారవిధివర్ణనం నామ
ద్వినవతితమోఽధ్యాయః.

## త్రినవతితమాధ్యాయము.

ఏమానవులు చేయు ధర్మక్రియ లన్నియు భాస్కరుని గురిచేసి యొనర్పఁబడునో యామానవులవలనుండ నెవ్వఁడు దరిద్రుఁడు గాని, రోగపీడితుఁడు గాని పుట్టఁడు.సూర్యదేవాలయపు నేలను గోమయముతో భక్తికలిగి యేమానవుఁ డలుకునో యాతఁడు వెనువెంటనే పాపవిముక్తుఁ డగుచున్నాఁడు. తెలుపు ఎఱుపు పసుపు వన్నెలలో నేదేనొక వన్నెగల మంటితోఁ బూయువాఁడు కోరినఫలము నొందును. చిత్రకిరణుఁ డగు సూర్యుని నిర్మించి పరిమళము గలపుష్పములతోఁ బూజించి యుపవాసము సల్పువాఁ డిష్టఫలములఁ బొందుచున్నాఁడు. నేతితోఁ గాని నువ్వులనూనెతోఁ గాని సూర్యునకు దీపదానము చేయువాఁడు జన్మాంతమున నూరుకోట్లదీపములతో వెలుఁగొందుచు, సూర్యలోకమున కేగును. దీపమునకు నూనె యొసంగినచో నరకము జూడఁబోవఁడు. దీపమున కిచ్చు తైలమును నువ్వులును మహాపాతకముల నెల్ల నడఁగించును. ఎవ్వాఁ డెల్లప్పుడును సూర్యునాలయమునను నాలుగుత్రోవలు కలసిన తావులను పుణ్యతీర్థములందును దీపదానము చేయునో యాతఁడు మంచిరూపమును తేజస్సును గలిగి జన్మించును. ఎవ్వాఁడు భక్తియుతుఁడై సూర్యునకు దీపదానము చేయించునో యాతఁ డీలోకమున నెల్లకోర్కులు దీర్చుకొని జన్మాంతమున దేవలోకమున కేగుచున్నాఁడు ఎవఁడు చందనాగురు

---

బ్రహ్మోవాచ:—యేషాం ధర్మక్రియాః సర్వాః సదైవోద్దిశ్య భాస్కరమ్, న కులే జాయతే తేషాం దరిద్రో వ్యాధితోఽపి వా. ౧. దేవాయతనభూమేస్తు గోమయే నోపలేపనమ్, యః కరోతి నరో భక్త్యా సద్యః పాపాత్ప్రముచ్యతే. ౨. శ్వేతయా రక్తయా వాపి పీతమృత్తికయాపి వా, ఉపలేపనకర్తా వై చిన్తితం లభతేఫలమ్. 3. చిత్రభానుం విరచ్యైవ కుసుమైర్యః సుగన్ధిభిః, పూజయేత్సోపవాసస్తు స కామానీప్సితాఁల్లభేత్. ౪. ఘృతేన దీపకం జ్వాల్య తిలతైలేన వా రవేః, ప్రయాతి సూర్యలోకం స దీపకోటిశతైర్వృతః. ౫. దీపతైలప్రదానేన న యాతి నరకం నరః, దీపతైలం తిలాశ్చైవ మహాపాతకనాశనాః. ౬. దీపం దదాతి యో నిత్యం భాస్కరాయతనేషు చ, చతుష్పథేషు తీర్థేషు రూపౌజస్వీహ జాయతే. ౭. యస్తు కారయతే దీపం రవేర్భక్తిసమన్వితః, స కామానీప్సితాన్ప్రాప్య వృన్దారకపురం వ్రజేత్. ౮. యః సమాలభతే సూర్యం చందనాగురుకుంకుమైః, కర్పూరేణ విమిశ్రైశ్చ తథా కస్తూరికా

కుంకుమములతోడను కస్తూరితోడను కర్పూరముతోడను బాగుగఁ బూజించునో యాతఁడు నూరుకోటుల శుభదినములు శివలోకమున విహరించి కాలాంతరమునఁ బుడమి కేతెంచి రాజుల కెల్ల రాజయి చక్రవర్తి యనఁ బ్రసిద్ధిఁగాంచును. ఆతఁడు సర్వకామములు కొఱత లేక యనుభవించి యెల్లరకు నమస్కరింపఁ దగియుండును. సూర్యునకు గంధపుష్పములు చేర్చిన యుదకముచే నర్ఘ్యమిచ్చినయాతఁడు పుత్రపౌత్రులు భార్యయు వెంటరా నాకలోకమున కేగి పూజలఁ గొనుచున్నాఁడు. పరిమళము గల యుదకమును పుష్పములను సూర్యున కర్ఘ్య మొసంగువాఁడు దేవలోకమున కేగి చాలకాల ముండి మగుడఁ గాలాంతరమున భువి కేతెంచి రాజగుచున్నాఁడు. బంగారముతోఁ గూడిన యర్ఘ్యమును గాని యెఱ్ఱనీటి యర్ఘ్యమును గాని యొసఁగినచో నూఱేండ్లు తుదివఱకు స్వర్గలోకమున గౌరవింపఁబడును. పద్మములతో నాదిత్యున కర్చనలిచ్చువారు స్వర్గలోకమున కేగి వేయేండ్లు నూర్గురు స్త్రీరత్నములు సేవింప సుఖముగ నివసించును. భక్తితో నాదిత్యునకు నేతితోఁ జేర్చిన గుగ్గిలము పొగ వైచిన వెనువెంటనే యెల్లపాపములనుండి విముక్తి వడయుచున్నాఁడు. పదునైదుదినములు గుగ్గులుధూప మొసంగెనేని బ్రహ్మహత్య తొలఁగి పోవును. ఏఁడాది యొసర్చెనేని యశ్వమేధఫలము లభించును. అందుగు బంకతోఁ జేసిన పరిమళధూపముతో స్వర్గలోకమును జేరును. కర్పూ

---

న్వితైః. ౯. శుభం కాలం కోటిశతం విహృత్య చ భవాలయే, పునః సఞ్జాయతే భూమౌ రాజరాజో న సంశయః, సర్వకామసమృద్ధాత్మా సర్వలోకనమస్కృతః. ౧౦. చందనోదకమిశ్రైశ్చ దత్త్వార్ఘ్యం కుసుమై రవేః, సపుత్రపౌత్రపత్నీకః స్వర్గలోకే మహీయతే. ౧౧. సుగంధోదకమిశ్రైస్తు దత్త్వార్ఘ్యం కుసుమై రవేః, దేవలోకే చిరం స్థిత్వా రాజా భవతి భూతలే. ౧౨. సహిరణ్యేన చార్ఘ్యేణ రక్తోదకయుతేన వా, కోటీశతం తు వర్షాణాం స్వర్గలోకే మహీయతే. ౧౩. పద్మైరభ్యర్చనం కృత్వా రవేః స్వర్గగతో నరః, పద్మే వసతి వర్షాణాం స్త్రీపద్మశతసంవృతః. ౧౪. గుగ్గులం సఘృతం దత్త్వా రవేర్భక్తిసమన్వితః, తత్క్షణాత్సర్వపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః. ౧౫. పక్షం తు గుగ్గులం దత్త్వా ముచ్యతే బ్రహ్మహత్యయా, సంవత్సరేణ లభతే అశ్వమేధఫలం శివ. ౧౬. ధూపేన లభతే స్వర్గం తురుష్కేణ సుగంధినా, కర్పూరాగురు

రము, అగరు చేర్చి ధూపమిచ్చినచో రాజసూయాధ్వరఫలంబు కలుగును. పగటి మొదటిజామున భక్తిశ్రద్ధలతో నాదిత్యు నర్చించువాఁడు నూఱుకపిలగోవుల దానమిచ్చిన ఫలము నొందుచున్నాఁడు. మధ్యాహ్నమున స్థిరుఁడై యింద్రియముల బంధించి సూర్యు నారాధించువాఁడు భూమి నిచ్చినఫలమును నూఱుగోవుల నిచ్చినఫలమును గాంచుచున్నాఁడు. సాయంసంధ్యాకాలమున శుచియై తెల్లవస్త్రములుకట్టి తెల్లని పాగజుట్టి భాస్కరు నారాధించువాఁడు గోసహస్రఫలము నొందును. అర్ధరాత్రమున నాదిత్యుని భక్తితో నారాధించువాఁ డెద్దులుకలవాఁడై యెన్ని జన్మములకైన జాతిస్మరత్వము గలిగి యుత్తమకులమున జన్మించును. కనుచీఁకటివేళ భాస్కరు నారాధించువాఁడు దేవలోకమున కతిరయమున నేగి క్రీడించుచుండును. తెల్లవారుజామున నరుణోదయకాలమునను బూజించి దేవలోకమును బొందుచున్నాఁడు. ఇప్పుగిదిఁ బైని జెప్పఁబడిన కాలములను హద్దులేని కాలమునను మనము దిట్టపఱచి జిల్లేడుపూవులతో నాదిత్యుని భక్తితోడఁ బూజించువాఁడు తేజమున సూర్యున కెనయగుచు నాతనిలోకమునఁ బూజింపఁబడును. ఉత్తరాయణమునగాని దక్షిణాయనమునగాని భక్తితో నాతనిఁ బూజించినవాఁడు బ్రహ్మలోకమును జేరుచున్నాఁడు. అట వసించి యెల్ల దేవతలచేఁ బూజలందు

---

ధూపేన రాజసూయఫలం లభేత్. ౧౭. పూర్వాహ్ణే మానవో భక్త్యా శ్రద్ధయా యోఽర్చయేద్రవిమ్, స తత్ఫలమవాప్నోతి యద్దత్తే కపిలాశతే. ౧౮. మధ్యాహ్నే యోఽర్చయేత్సూర్యం ప్రయతాత్మా జితేన్ద్రియః, లభతే భూమిదానస్య గోశతస్య చ తత్ఫలమ్. ౧౯. పశ్చిమాయాం తు సంధ్యాయాం యోఽర్చయేద్భాస్కరం నరః, శుచిః శుక్లాంబరోష్ణీషీ గోసహస్రఫలం లభేత్. ౨౦. అర్ధరాత్రే తు యో హేలిం భక్త్యా సంపూజయేన్నరః, జాతిస్మరత్వమాప్నోతి కులే జాతో వృషాన్వితః. ౨౧. ప్రదోషరాత్రివేళాయాం యః పూజయతి భాస్కరమ్, స గత్వా సహసా వీర క్రీడేత్స్వమనసం క్షయమ్. ౨౨. దండనాయకవేలాయాం ప్రభాతసమయే పునః, పూజయిత్వా రవిం భక్త్యా వ్రజేదనిమిషాలయమ్. ౨౩. ఏవం వేలాసు సర్వాసు అవేలాసు చ మానవః, భక్త్యా పూజయతే యోఽర్కమర్కపుష్పైః సమాహితః, తేజసా దిత్యసంకాశో హ్యర్కలోకే మహీయతే. ౨౪. అయనే తూత్తరే సూర్యమథ వా దక్షిణాయనే, పూజయేద్యస్తు వై భక్త్యా స గచ్ఛేత్కఞ్జజాలయమ్. ౨౫. తత్రస్థః

కొనుచు సూర్యుఁడో యన నొప్పియుండును. సూర్యోదయాస్తమయములు సమముగనుండుకాలమునను గ్రహణమునను షడశీతిమొదలగు పుణ్యకాలములను భక్తితో నాదిత్యునిఁ బూజించి తాను దుఃఖముల పాలుగాక సుఖించును. ఇతరులవలన నెఱింగికాని స్వయముగఁగాని యాదిత్యునకు భక్తితో నమస్కరించువానియెడఁ బ్రీతుఁడై యాతని కిష్టఫలము నొసంగుచున్నాఁడు. కృసరపాయసము నప్పములు మాంసము మోదకములును సూర్యునకు బలి యొసంగి సర్వకామముల నొందనగును. మోదకములు పాయసము నిచ్చుటచేతను మధుమాంసరసముల నొసంగుటచేతను భాస్కరుఁడు మిగులఁ బ్రీతిఁజెందుచున్నాఁడు. నేతితో నాదిత్యునకు తర్పణముచేసిన నెల్లప్పుడు మానవుఁ డెల్లరకు స్నేహితుఁడే యగును. మాంసముతో తర్పణమిచ్చినఁ బాపములనుండి వెంటనే విడివడును. సూర్యోదయకాలమున నొక్కనాఁడు నేతితో నాతనిని స్నానముచేయించిన లక్షగోదానములఫలము కలుగును. ఆవుపాలతోఁ దృప్తినొందించిన గజదానఫలము కలుగును. తీపిమొదలగురసములతో స్నానమొసంగిన నశ్వమేధఫలంబు కలుగును. సూర్యునకు వయసునసున్న పాడిమొదవును దానమొసంగిన శాశ్వతైశ్వర్యము కలిగెడిని. జన్మాంతంబున నాకలోకవాసముకూడ నగును. గోవుశరీరమున నెన్నిరోమము

---

పూజ్యతే కేశైః సర్వైః సుమనసైస్తథా, గోపతిః పూజ్యతే యద్వద్గోపతిప్రముఖైః సురైః. ౨౬. విషువేషూపరాగేషు షడశీతిముఖేషు చ, పూజయిత్వా రవిం భక్త్యా నాత్మానం శోచతే నరః. ౨౭. విబుధ్య వా స్వయం వాపి యో నమస్కురుతే రవిమ్, సంతుష్టో భాస్కరస్తస్మై గతిమిష్టాం ప్రయచ్ఛతి. ౨౮. కృశరాపాయసాపూపపలలోన్మిశ్రమోదకైః, బలిం కృత్వా తు సూర్యాయ సర్వకామమవాప్నుయాత్. ౨౯. మోదకానాం ప్రదానేన పాయసస్య చ సువ్రత, మధుమాంసరసైశ్చాపి ప్రీయతేఽతీవ భాస్కరః. ౩౦. ఘృతేన తర్పణం కృత్వా సదా స్నిగ్ధో భవేన్నరః, తర్పయిత్వా తు మాంసేన సద్యః పాపాత్ప్రముచ్యతే. ౩౧. ఘృతేన స్నపనం కృత్వా ఏకాహముదయే రవేః, గవాం శతసహస్రస్య దత్తస్య ఫలమశ్నుతే. ౩౨. గవాం క్షీరేణ సంతర్ప్య పుండరీకఫలం లభేత్, రసేన స్నాపయేద్దేవమశ్వమేధఫలం లభేత్. ౩౩. సూర్యాయ తరుణీం ధేనుం గామేకాం యః ప్రయచ్ఛతి, కఞ్జజామచలాం ప్రాప్య పునర్లేఖపురం వ్రజేత్. ౩౪. గోశరీరే తు రోమాణి యావంతి త్రిపురాంతక,

లున్నవో యన్నికోట్ల వత్సరముల నాతఁడు నాకలోకమున గౌరవము గాంచును. నూరుగోవుల నాదిత్యున కొసంగి రాజసూయఫలము నొందును. వేయింటి నిచ్చువాఁ డశ్వమేధఫలంబు నొందును. గుగ్గిలమును దేవదారు పొడిని నేతితోఁ జేర్చి ద్రవముగఁ జేసి నిత్యము దహించి ధూపము వేయవలయును. నేతితో హోమ దేవతల కెల్లప్పుడు స్వభావముగనే ప్రియమైనవి. భేరీమృదంగాదివాద్యములు శంఖము పిల్లనగ్రోవి మొదలగువాని చప్పుడులును దేవతలకుఁ బ్రియములైనవి. వాని నొసంగువారు సూర్యమందిరమున కేగుచున్నారు. భక్తితో నెవ్వఁడు సూర్యునకు వజ్రములఁ గాని పుణ్యతీర్థజలమునుగాని యొసగునో యాతఁడు పెక్కుమందియువతులతోఁ గలకలలాడు విమానముతో నాడుకొనుచు దేవలోకమున వసించి కాలాంతరమున మనుష్యుఁడై ధార్మికుఁడగు రాజుగ నగుచున్నాఁడు. ఏమానవుఁడు భక్తికలిగి బంగారుకఱ్ఱల గొడుగులు జెండాలు చాందినీలు చామరములు మొదలగువాని నొసంగునో యాతఁడు చిరుగంటలగుంపులతో నందమగు దివ్యవిమానము నెక్కి సూర్యలోకమున కేగి యచ్చరమచ్చకంటులవలపుల చెలికాఁ డగును. అటులచ్చటఁ జిరకాలముండి యావెనుకఁ బుడమి కేతెంచి మానుషవేషము దాల్చి యెల్ల రాజులు మ్రొక్కులిడగ రాజయి వెలయుచుండును. వస్త్రాభరణముల నాదిత్యున కొసంగి జనలోకమున కేగి ప్రళయకాలమువరకు నందుఁ

---

స తావద్వర్షకోటీస్తు లేఖలోకే మహీయతే. ౩౫. గోశతం భానవే దత్త్వా రాజ
సూయఫలం లభేత్, అశ్వమేధఫలం తస్య యః సహస్రం ప్రయచ్ఛతి. ౩౬. గుగ్గులుం
దేవదారుం చ దహేన్నిత్యం ఘృతస్రవమ్, ఆజ్యహోమో హి దేవానాం ప్రకృత్యైవ
ప్రియః సదా. ౩౭. భేర్యాదీని చ వాద్యాని శంఖవేణ్వాదికాని చ, యే ప్రయచ్ఛంతి
సూర్యాయ యాంతి తే హంసమందిరమ్. ౩౮. వజ్రమాహరతే యస్తు రవేర్భక్తిసమ
న్వితః, తీర్థోదకమథైవాన్యః స యాతి విబుధాలయమ్. ౩౯. విమానైః స్త్రీశతాకీర్ణైః
క్రీడయిత్వా చిరం నరః, మానుషత్వమనుప్రాప్య రాజా భవతి ధార్మికః. ౪౦ ఛత్రం
ధ్వజం వితానం చ పతాకాశ్చామరాణి చ, హేమదండాని వై దద్యాద్రవేర్యో
భక్తిమాన్నరః. ౪౧. విమానేన స దివ్యేన కింకిణీజాలమాలినా, సూర్యలోకమతో గత్వా
భవత్యప్సరసాం పతిః. ౪౨. తత్రోష్య సుచిరం కాలం స్వర్గాత్ప్రత్యాగతః పునః,
మానుష్యే జాయతే రాజా సర్వరాజనమస్కృతః. ౪౩. దత్త్వా వాసాంసి సూర్యాయ

గ్రీడలు సలుపుచుండును. సూర్యునెదుట గీతవాదిత్రములను నాట్యములను చేయుచు జాగరణము చేయవలయును. అట్టివాఁడు గంధర్వులతోడ నచ్చరలతోడను గూడి యాడుకొనును. గంధపుష్పములచేతను పత్రములచేతను గాని నానావిధములగు స్తోత్రములచేతగాని సూర్యుని బూజించి నుతించువారు సూర్యలోకముఁ గాంతురు. ఉషఃకాలమున స్తోత్రముచేయువారు స్వర్గమున కేగి చారణులు పాఠకులును నుతింప సంతసించుచుందురు. ఎవఁడు సూర్యునకుఁ గాడికట్టులను గుఱ్ఱములుగట్టిన రథమును బంగారముతోఁగాని వెండితోఁగాని మణులతోఁగాని నిర్మించి యొసంగునో యాతఁడు సూర్యప్రభకలిగి చిఱుగంటలు గలగలమ్రోగ నందమగు విమానము నెక్కి యిటనుండి దివి కేగి యచ్చరలతో నాడుకొనును. కొయ్యరథము జేసి యొసంగువాఁడు సూర్యసమానవర్ణము కల విమానము నెక్కి యర్కమండలమున కేగును. సంవత్సరముగాని యారుమాసములుగాని సూర్యునకు రథయాత్ర సలుపు భక్తుల పుణ్యఫలంబు వివరింతు నాకర్ణింపుము. ధ్యానముచేయువారును యోగీశ్వరులు నేఫలము నొందుచున్నారో దానినే సూర్యమార్గమున నున్నవారును బొందఁగలరు. ఏమానవులు భక్తితో భానుమూర్తిరథమును

అలంకారాంస్తథైవ చ, క్రీడతే జనలోకస్థో యావదాభూతసంప్లవమ్. ౪౪. గీతవాదిత్రనృత్యైశ్చ కుర్యాజ్జాగరణం రవేః, గంధర్వాప్సరసాం మధ్యే క్రీడతే సుచిరం నరః. ౪౫. గంధైః పుష్పైస్తథా పత్త్రైః స్తోత్రైర్వా వివిధైస్తథా, యే స్తువంతి రవిం భక్త్యా తే యాంతి పతగాలయమ్. ౪౬. ఉషః స్తువంతి యే సూర్యముపగాయంతి తే సదా, పాఠకాశ్చారణాశ్చైవ సర్వే తే స్వర్గగామినః. ౪౭. అశ్వయుక్తం యుగైర్యుక్తం యో దద్యాద్రవయే రథమ్, కాంచనం వాపి రౌప్యం వా మణిరత్నాన్వితం శుభమ్. ౪౮. స యానేనార్కవర్ణేన కింకిణీజాలమాలినా, స్వర్గలోకమితో గత్వా క్రీడతేఽప్సరసా సహ. ౪౯. యస్తు దారుమయం కుర్యాద్రవే రథముత్తమమ్, స యాత్యర్కసవర్ణేన విమానేనార్కమండలమ్. ౫౦. యాత్రాం కుర్వంతి యే భానోర్నరాః సంవత్సరాదపి, షణ్మాసాద్వా గణశ్రేష్ఠ తేషాం పుణ్యఫలం శృణు. ౫౧. షణ్మాసాన్వా గణశ్రేష్ఠ తేషాం కర్మఫలం శృణు, ధ్యానినో యోగినశ్చైవ ప్రాప్నువంతీహ యాం గతిమ్, తాం గతిం ప్రతిపద్యంతే సూర్యవర్త్మావగాహినః. ౫౨. రథం వహంతి యే భానోర్నరా భక్తి

మోయుదురో వారు జన్మజన్మమునందును రోగములు దారిద్ర్యము లేని వారై జన్మింతురు. భాస్కరునకు రథయాత్ర యొనర్చువారు సూర్య లోకమున కేగి సుఖముగ విహరించుచున్నారు. అజ్ఞానముచేఁ గాని కోప ముచేఁ గాని రథయాత్రకు భంగము తెచ్చువారు మందేహులు పాప కార్యములు చేయువారునై రాక్షసు లగుదురు. ధనమును వస్త్రములను ధాన్యహిరణ్యములను నాదిత్యునకు భక్తితో నిచ్చువారు పరమగతిని గాంచుచున్నారు. ఎవఁడేని గోవులను గాని గేదెలను గాని యేనుం గులఁ గాని శోభనహయంబులఁ గాని యాదిత్యున కొసంగిన లభించు పుణ్యఫలము వివరింతు వినుము. అట్టి దాతకు సర్వకామములు నక్షీణము లగును. అశ్వమేధ ఫలంబు లభించును. కొంచెముగ నొసంగిన నది వేయి రెట్లగును. ఎవఁడు దున్ని పైరులు వైచి పండించిన భూమి నాదిత్యున కొసంగునో యాతఁడు పదిమంది వెనుకటివారిని బదిమంది ముందటివారిని దరింపఁజేయువాఁడగును. దివ్యవిమానము నెక్కి సూర్యలోకమున కేగును. అప్సరసలనడుమ నాఁడు యేనుంగులనడుమ నేనుఁగులరాజువోలె రాజిలుచుఁ గ్రీడించును. ఏధీమంతుఁ డాదిత్యునకు గ్రామము నొసంగునో యాతఁడు సూర్యతేజంబగు విమానంబు నెక్కి యుత్తమగతికిఁ బోవును. ఎవరు భక్తియుక్తులై భానుమూర్తికిఁ బత్రపుష్పఫలములతో విలసిల్లు

---

సమన్వితాః, అరోగాశ్చాదరిద్రాశ్చ జాతౌ జాతౌ భవంతి తే. ౪౩. కర్తారో రథ యాత్రాయా యే నరా భాస్కరస్య తు, తే భానులోకమాసాద్య విహరంతి యథా సుఖమ్. ౪౪. యాత్రాభంగం తు యో మోహాత్క్రోధాద్వా కురుతే నరః, మందే హాస్తే నరా జ్ఞేయా రాక్షసాః పాపకారిణః. ౪౫. ధనం ధాన్యం హిరణ్యం వా వాసాంసి వివిధాని చ, యే ప్రయచ్ఛంతి సూర్యాయ తే యాంతి పరమాం గతిమ్. ౪౬. గా వాథ మహిషీర్వాపి గజానశ్వాంశ్చ శోభనాన్, యః ప్రయచ్ఛతి సూర్యాయ తస్య పుణ్యఫలం శృణు. ౪౭. అక్షయం సర్వకామీయమశ్వమేధఫలం లభేత్, సహస్ర గుణితం తచ్చ దానమస్యోపతిష్ఠతి. ౪౮. మహీం దదాతి యోఽర్కాయ కృష్టాం ఫల వతీం శుభామ్,స తారయతి వై వంశ్యాన్దశపూర్వాన్దశాపరాన్.౪౯.విమానేన చ దివ్యేవ గోపురం గోపతేర్వ్రజేత్, క్రీడత్యప్సరసాం మధ్యే కరీవ కరిణీగణే. ౫౦. గ్రామం దదాతి యో భక్త్యా సూర్యాయ మతిమాన్నరః, విమానేనార్కవర్ణేన స యాతి పరమాం గతిమ్. ౫౧. ఆరామాన్యే ప్రయచ్ఛంతి పత్రపుష్పఫలోపగాన్, భానవే భక్తియుక్తాస్తు

సుద్యానముల నొసంగుదురో వారు నుత్తమగతిఁ బొందుదురు. అట్టివారికి మనసున గాని పలుకుల గాని శరీరచేష్టల గాని యేదేని పాపమున్నను సూర్యప్రసాదంబుకతన నది యెల్ల నశించును. ఏదేని బాధ కలిగినను వ్యాధి కలిగినను దరిద్రుఁడై యున్నను దుఃఖితుఁడై యున్న నట్టివాఁ డాదిత్యుని శరణుబొందునేని వానిసన్నింటిని బారఁద్రోలును. ఒకేదిన మున సూర్యపూజవలనఁగలుగుఫలము నూరుయజ్ఞములొనరించిన లభించు ఫలమునకు సమానమగును. సూర్యాలయమునఁ జిత్రకళలచే వినోదము చేయువారికి సర్వకామములు నక్షయములై రాజసూయఫలంబు లభించును ఆదిత్యునకు భక్తితో వినోదమునకై వేశ్యావనితల నొసంగువాఁ డుత్తమపదమగు సూర్యపత్తనమునకుఁ బోవుచున్నాఁడు. భారతకథను బోధించు గ్రంథము నాదిత్యునొద్ద నిడువాఁడు సర్వపాపములు బాసి విష్ణులోకమున గౌరవింపఁబడును. రామాయణపుస్తకము నొసంగువాఁడు వాజపేయయజ్ఞంపుఫలము నొంది సూర్యలోకమున కేగును. భవిష్యము గాని సాంబము (శివపురాణము)ను గాని సూర్యున కొసంగువాఁడు రాజసూయాశ్వమేధఫలముల నొందును. అన్నికోర్కులు ననుభవించి సూర్యసాలోక్యము నొంది యందుఁ జిరకాలము వసించి యామీఁద నటనుండి బ్రహ్మలోకమున కేగి నూరుప్రళయములవరకు వసించి కాలాంతరమున

తే యాంతి పరమాం గతిమ్. ౧౨. మానసం వాచికం వాపి కర్మజం యచ్చ దుష్కృతమ్, సర్వం సూర్యప్రసాదేన అశేషం చ ప్రణశ్యతి. ౧౩. ఆర్తో వా వ్యాధితో వాపి దరిద్రో దుఃఖితోఽపి వా, ఆదిత్యం శరణం గత్వా నాత్మానం శోచతే నరః. ౧౪. ఏకాహేనాపి యద్భానోః పూజాయాః ప్రాప్యతే ఫలమ్, తద్వై క్రతుశతైరిష్టైః ప్రాప్యతే ఫలముత్తమమ్. ౧౫. కృత్వా ప్రేక్షణకం భానోర్దివ్యమాయతనే శుభమ్, అక్షయం సర్వకామీయం రాజసూయఫలం లభేత్. ౧౬. వేశ్యాకదంబకం యస్తు దద్యాత్సూర్యాయ భక్తితః, స గచ్ఛేత్పరమం స్థానం యత్ర తిష్ఠతి భానుమాన్. ౧౭. పుస్తకం భానవే దద్యాద్భారతస్య గణాధిప, సర్వపాపవిముక్తాత్మా విష్ణులోకే మహీయతే. ౧౮. రామాయణస్య దత్వా తు పుస్తకం త్రిపురాంతక, వాజపేయఫలం ప్రాప్య గోపతేః పురమావ్రజేత్. ౧౯. భవిష్యం సాంబసంజ్ఞం వా దత్త్వా సూర్యాయ పుస్తకమ్, రాజసూయాశ్వమేధాభ్యాం ఫలం ప్రాప్నోతి మానవః. ౨౦. సర్వాన్కామానవాప్నోతి యాతి సూర్యసలోకతామ్, సూర్యలోకే చిరం స్థిత్వా బ్రహ్మలోకం వ్రజే

మసల భువి కేతెంచి రాజగుచున్నాఁడు. గణాధిపా! సూర్యాలయమునఁ బాసశాలను (చలివేంద్రమును) చేయువాఁ డుత్తమమగు దేవలోకమును బొందును. శీతకాలమున వలినడంపునేసను సూర్యమందిరమున నొసగించువాఁ డశ్వమేధఫలము నొందును. ఇతిహాసములను పురాణములను జపియించి నిత్యము వాచనమునకగు యత్నము చేయువాఁడు వేయశ్వమేధముల ఫలము నొందును. ఒకప్పుడు దానివలనఁగలుగు ఫలము వేయశ్వమేధములచేఁ గూడఁ గలుగదనవచ్చును. కావున నెల్లయత్నముల చేత నాదిత్యమందిరమున నితిహాసములను బురాణములను శుభమగు వాచనము చేయవలయును. సూర్యునకుఁ బుణ్యచరిత్రకథనములు తృప్తిని పుష్టిని గలుగఁజేయుభంగి వేరొండు కలిగింపనేరదు. కావున నన్నింటికన్న నెక్కుడు శ్రద్ధతో వాచనము చేయింపవలయును.

ఇది త్రినవతితమాధ్యాయము.

---

త్స్వనః, స్థిత్వా కల్పశతం తత్ర రాజా భవతి భూతలే. ౭౧. భానోరాయతనే యస్తు ప్రపాం కుర్యాద్గణాధిప, స యాతి పరమం స్థానం దివ్యం సౌమనసం నరః. ౭౨. శీతకాలే ఘనం దద్యాన్నరాణాం శీతనాశనమ్, భానోరాయతనే దేవ అశ్వమేధఫలం లభేత్. ౭౩. ఇతిహాసపురాణాభ్యాం పుణ్యం పుస్తకవాచనమ్, అశ్వమేధసహస్రం యో నిత్యం కర్తుం ప్రవర్తతే, న తత్ఫలమవాప్నోతి యదాప్నోత్యస్య కర్మణః. ౭౪. తస్మాత్సర్వప్రయత్నేన కార్యం పుస్తకవాచనమ్, ఇతిహాసపురాణాభ్యాం భానోరాయతనే శుభమ్. ౭౫. నాన్యత్తుష్టికరం భానోస్తథా తుష్టికరం పరమ్, పుణ్యాఖ్యానకథాయాస్తు యథా తుష్యతి భాస్కరః. ౭౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే భానుమహిమవర్ణనం నామ త్రినవతితమోఽధ్యాయః.

## చతుర్నవతితమాధ్యాయము.

ఈవిషయమునఁ బాపహారమై మంగళదాయక మగు పితామహ కుమారసంవాదమను నొక్క యాఖ్యానంబు కల దద్దాని నెఱింగింతు వినుము. మున్ను లోకములఁ బుట్టించు పితామహుఁడు (నేను) సుఖముగఁ గూర్చొని యుండఁ గుమారస్వామి నాకడ కేతెంచి భక్తినమ్రుఁడై తల వాల్చి నమస్కరించి యిట్లనెను ఓ మహానుభావా! యీవేళ నేను దివాకరదేవుని దర్శింపఁగోరి యట జని యాదేవుని వలగొని పూజించి భక్తిశ్రద్ధలతో నమస్కరించి యాతనియనుజ్ఞచే నొక యుచితాసనమున నాసీనుండనైతిని. అంత నచ్చట నొక్క యాశ్చర్యము నాకంటఁ బడెను. చిరుగంటలతోరణములు గట్టి మణులు ముత్తియములచేఁ జిత్రమై వైడూర్యముల గద్దియలు కలిగి యొప్పారు బంగారువిమానంబొండు తోఁచెను. అందొక్క మహాపురుషుఁ డేతేర నాదిత్యదేవుఁడాతని దిలకించి తొందరతో నాసనము డిగ్గి యెదురు నడచి దక్షిణకరంబున నాతనిం గీలించి శిరము మూర్కొని పూజించెను. అంత నాతని నాసనంబునఁ గూర్చుండఁ బెట్టి "యోపుణ్యాత్మా! నీరాక మేలుచేసె. నీపుణ్యకర్మకు సంతసించితిని. నేఁ డాదిగ నీవు ప్రళయమగు దనుక నాకడనే యుండుము. ఆమీఁద నిటనుండి బ్రహ్మపదంబున కేగఁగలవు." అనునెడ నింకొక్క మహాపురుషుఁ

---

బ్రహ్మోవాచః—అత్రాఖ్యానముశంతీహ సంవాదం గణపుంగవ, పితామహకుమారాభ్యాం పుణ్యం పాపహరం శివమ్.౧. స్రష్టారం సర్వలోకానాం సుఖాసీనం పితామహమ్, ప్రణమ్య శిరసా దేవం శ్రద్ధాభక్తిసమన్వితః. ౨. కుమారో దేవశార్దూల ఇదం వచనమబ్రవీత్, గతోఽహమద్య భగవన్ద్రష్టుం దేవం దివాకరమ్.౩.కృత్వా ప్రదక్షిణం దేవః స మయా పూజితో రవిః, ప్రణమ్య శిరసా భక్త్యా పరయా శ్రద్ధయా విభో. ౪. అనుజ్ఞాతస్తతస్తేన సుఖాసీనో హ్యహం స్థితః, ఆసీనేన మయా తత్ర దృష్ట మాశ్చర్యమద్భుతమ్. ౫. కాఞ్చనేన విమానేన కింకిణీజాలమాలినా, మణిముక్తావిచిత్రేణ వైదూర్యవరవేదినా. ౬. ఆగతం పురుషం తత్ర దృష్ట్వా దేవో దివాకరః, ససంభ్రమం సముత్థాయ ఆసనాదేవ సత్తమ. ౭. గృహీత్వా దక్షిణే పాణౌ పురతః ప్రాప్య తం నరమ్, శిరస్యాఘ్రాయ దేవేశ పూజయామాస వై రవిః. ౮. ఉపవిష్టం తు తం భానురిదం వచనమబ్రవీత్, సుస్వాగతం భద్ర సుఖకృతా ప్రీతాస్త్వయా వయమ్. ౯. సమీపే మమ తిష్ఠ త్వం యావదాభూతసంప్లవమ్, పునర్యాస్యసి తత్స్థానం యత్ర

డుత్తమవిమానమునెక్కి యాదేవునొద్ద కేతెంచెను. ఆతని గూడ నాదిత్యుఁడు వెనుకవిధంబునఁ బూజించి మంచిమాటలు వలికెను. అంత నాపురుషుఁడు వినయవినమితోత్తమాంగుఁడై నిలచెను. అచ్చట వారల కాదిత్యుఁడు చేయుపూజలఁదిలకింప నాకు మిగులఁ గుతుకము జనించెను. అంత నిలువఁజాలక సూర్యు నిట్లని యడిగితిని.'దేవోత్తమా! యీ మొదట వచ్చినవాఁ డేమి పుణ్యము గావించెనో, యిప్పగిది నీయొద్ద కేతెంచి సంతోషించిన నీవలన బూజలఁ గొనినాఁడు? ఇందు నానెమ్మనమ్మునఁ గౌతుకము నాశ్చర్యమును వొడముచున్నవి. అటులనే యీ రెండవవానికిఁ గూడఁ బూజ యొనర్చితివి. ఈమానవోత్తము లిరువురు నెల్లభంగులఁ బుణ్యకర్మ లాచరించినవారు. లేకున్న నెల్లప్పుడును బ్రహ్మవిష్ణుశివాదులచేఁ గూడఁ బూజింపఁబడుచున్న నీవే స్వయముగ వీరిని బూజించితివి ఓ దేవ దేవా! ఇంతటి పుణ్యఫలము నీయఁజాలు పుణ్యకర్మ నెద్దాని నీయిరువు రాచరించిరో విన వేడుక యయ్యెడు' నావుడు దివాకరుఁ డాతని కిట్లనియె. "ఓమహామతీ! లెస్సపలుకు వలికితివి. ఈతఁ డొనరించిన పుణ్యకర్మను గురించిన నిర్ణయ మెల్లరకు వినఁదగిన యది. ఏకర్మచే సూర్యు నొద్ద కేతెంచె నద్దాని వినుము. భూమండలమున నాయంశమునఁ బుట్టిన (సూర్యవంశపు)

బ్రహ్మా స్వయం స్థితః. ౧౦. ఏతస్మిన్నంతరే చాన్యో విమానవరమాస్థితః, ఆగతః పురుషో దేవో యత్ర తిష్ఠతి భాస్కరః. ౧౧. స చాప్యేవం నరో దేవ పూజితో భానునా తదా, సామపూర్వం తథోక్తస్తు ప్రశ్రయావనతః స్థితః. ౧౨. తత్ర మే కౌతుకం జాతం దృష్ట్వా పూజాం కృతాం తయోః, భానునా దేవశార్దూల పృష్టో భానుర్మయా తతః. ౧౩. కిమనేన కృతం దేవ యోఽయం పూర్వమిహాగతః, నరస్తవ సకాశం వై యస్య తుష్టో భవాన్భృశమ్. ౧౪. యదస్య భవతా పూజా కృతా హి స్వయమేవ తు, అత్ర మే కౌతుకం జాతం విస్మయశ్చ విశేషతః. ౧౫. తథైవాస్య కృతా పూజా ద్వితీయస్య నరస్య చ, సర్వథా పుణ్యకర్మాణావిమౌ నరవరోత్తమౌ. ౧౬. బ్రహ్మవిష్ణు శివాద్యైస్తు పూజ్యతే భగవాన్సదా, యస్త్వమాభ్యాం పరం పూజాం కృతవాన్దేవ సత్తమ. ౧౭. కథ్యతాం మమ దేవేశ కిమేతౌ కర్మ చక్రతుః, యస్యేదృక్పరమం పుణ్యం ఫలం దివ్యమవాపతుః, శ్రుత్వా తద్వచనం దేవం, ఇదం వచనమబ్రవీత్. ౧౮. సూర్య ఉవాచ:—సాధు పృష్టోఽస్మి భవతా కర్మణో నిర్ణయం పరమ్. ౧౯. యదనేన కృతం కర్మ నరేణ మునిసత్తమ, యోఽసౌ సూర్యమిహాయాతస్తచ్ఛృణుష్వ మహామతే. ౨౦.

రాజులు పాలించు నయోధ్యయను విఖ్యాతపుర మొందు కలదు గద! అందీతఁడు ధనపాలుఁడనుధనికుఁడగునొక వైశ్యపుంగవుఁడు. ఈతఁడాపత్త నమున దివ్యమగు మందిరము గట్టించి యందు వేదపూజకై వేదవేదాంగ విదులగు బ్రాహ్మణులసమూహమును బూజించి యితిహాసపురాణములు వచించు వాచకుఁడగు బ్రాహ్మణోత్తమునకు విశేషముగఁ బూజలు సలిపి చదువఁదగిన పుస్తకమును గూడ గంధపుష్పముల నుపహారములను బూజించి యాబ్రాహ్మణబృందమునకును వ్యాసమునీంద్రునకు నెదుట నుచితాసనమున వాచకుఁడగు నమ్మునిపుంగవుని గూర్చుండఁబెట్టి "యో బ్రాహ్మణోత్తమా! యిడుగో యిచ్చట దేవేశుఁడగు సహస్రకిరణుఁడు రవి యున్నవాఁడు. ఇదిగో యిదియంతయు వినఁగోరు నాలుగువర్ణములవారి బృందము. నీవిట నిలచియుండుము వరదుఁడగునాదిత్యుఁడు మెచ్చి యేడు జన్మములవరకుఁ జాలినవరము నొసంగునట్లు పుస్తకవాచనము చేయుము. ఒక్క యేడాది చదువవలయును. అంతదనుక నీకుటుంబమునకుఁ జాలిన జీవనము గొనుము. ఇది ముగిసిన వెనుక నాశ్రేయమునకును నీశ్రేయము నకును నూరుబంగారు నాణెముల నిత్తును. చదువుమని ప్రార్థించి యాత నిచే వాచనము చేయించుచుండెను. ఇప్పగిది నాలుమాసములు గడచును నప్పటికి దైవవశమునఁ గర్మమధ్యముననే యావణిజుఁడు కాలధర్మము

---

యేయం మదంశసంభూతైః పార్థివైః పాలితా సదా, అయోధ్యా నామ నగరీ ప్రఖ్యాతా పృథివీతలే. ౨౧. తత్రాసౌ వైశ్యజాతీయో ధనపాల ఇతి స్మృతః, తస్యాం పుర్యాం ద్విజశ్రేష్ఠ దివ్యమాయతనం వ్యధాత్. ౨౨. తస్మిన్నాయతనే దివ్యే వ్యాసస్యార్థం తథాశ్రితః, బ్రాహ్మణానాం విశిష్టానాం పూజయిత్వా కదంబకమ్. ౨౩. ఇతిహాసపురాణాభ్యాం వాచకం చ విశేషతః, పూజయిత్వా ద్విజశ్రేష్ఠ మునిశ్రేష్ఠం మహామునిమ్. ౨౪. పుస్తకం చాపి సంపూజ్య గంధపుష్పోపహారతః, తస్య విప్రకదంబస్య వ్యాసస్య చ యథాగ్రతః. ౨౫. ప్రకల్ప్యోక్తో ద్విజోఽనేన పాఠకో వాచకోత్తమః, ఏష తిష్ఠతి దేవేశః సహస్రకిరణో రవిః. ౨౬. చాతుర్వర్ణ్యమిదం వాపి శ్రోతుకామం కదంబకమ్, తిష్ఠ చేహ ద్విజశ్రేష్ఠ కురు పుస్తకవాచనమ్. ౨౭. యేన మే వరదో భానుః సప్త జన్మాని వై భవేత్, యావత్సంవత్సరం విప్ర ప్రగృహ్య వృత్తిముత్తమామ్. ౨౮. స్వర్ణనిష్కశతం విప్ర తతో దాస్యే తథాపరమ్, పూర్ణే వర్షే ద్విజశ్రేష్ఠ శ్రేయోఽర్థమహమాత్మనః. ౨౯. ఏవం ప్రవర్తితే తస్మిన్పుణ్యే పుస్తకవాచనే, షణ్మాసాగతమాత్రే తు కాలే సురవరోత్తమ, తత్రైవాంతరతశ్చాయం కాలధర్మముపేయివాన్.

నొందెను. ఆతఁడు వ్రతముచేయునెడ నేనొక్క దివ్యవిమానము నాతని కడ కనిపి యుంటిని. ఆతఁడే యీతఁడు. ఇయ్యది పుణ్యాఖ్యానముతోఁ గూడిన కర్మవలని తృప్తి గంధపుష్పోపహారములచే నాకింతటి సంతోష మెన్నఁడును గలుగదు. శ్రేష్ఠమగు పురాణమనిన నాకుం గడుప్రీతి. గోవులను సువర్ణమును ధనమును వస్త్రములను గ్రామనగరముల నొసంగుట నాకుఁ మిగుల బ్రీతింగలిగించును. కాని యితిహాసపురాణశ్రవణమునఁ బ్రీతి జనించినట్లు మాత్రము వానివలనఁ బ్రీతి జనింపనేరదు. కర్ణశ్రాద్ధము (వినఁదగుదానియందు శ్రద్ధగలిగియుండుట)యందు నాకుఁ బ్రీతి గలుగు వడువున భోజ్యశ్రాద్ధమువలనఁ బ్రీతి కలుగనేరదు. కావునఁ బలుతెఱఁగుల భక్ష్యభోజ్యములచే నాకు శ్రాద్ధము చేయుటకన్నఁ బుస్తకవాచనమున శ్రాద్ధముచేయుటయే యుత్తమము. వేయేల పుణ్యకథలకన్న వేఱొం డెద్దియు నాకుఁ బ్రీతిజనకము కాదు. ఇదియే నా పరమరహస్యము. ఈ రెండవపురుషుఁడు బ్రాహ్మణోత్తముఁడని యెఱుఁగుము. ఈతఁడు నాపత్త నముననే వసించు బ్రాహ్మణోత్తముఁడు. ఒకప్పు డీతఁ డుత్తమములగు ధర్మగాథల నాకర్ణింపఁగోరి యుత్తమభక్తిశ్రద్ధలతోఁ గూడి యేగి యా పుణ్యాఖ్యానము నాకర్ణించి మహాత్ముఁడగు నప్పౌరాణికుని వలగొని యాతని కొక్క బంగారు మాషకము (మినపగింజ) నొసంగెను. ఇటు

---

౩౦. మయా చాస్య విమానం తు ప్రేషితం కుర్వతో వ్రతమ్, ఇత్యేషా కర్మణస్తుష్టిః పుణ్యాఖ్యానకజార్చితా. ౩౧. గంధపుష్పోపహారైస్తు న తథా జాయతే మమ, ప్రీతిర్దేవవర శ్రేష్ఠ పురాణశ్రవణే యథా. ౩౨. గోసువర్ణహిరణ్యానాం వస్త్రాణాం చాపి కృత్స్నశః, గ్రామాణాం నగరాణాం చ దానం ప్రీతికరం మమ. ౩౩. న తథా స్యాత్సురశ్రేష్ఠ యథా ప్రీతికరం గుహ, ఇతిహాసపురాణాభ్యాం శ్రవణం సురసైన్యప. ౩౪. శ్రాద్ధం కుర్వంతి యే మహ్యం భక్ష్యభోజ్యైరనేకశః, న కరోతి తథా ప్రీతిర్యథా పుస్తకవాచనమ్. ౩౫. కర్ణశ్రాద్ధే యథా ప్రీతిర్మమ స్యాత్సురసత్తమ, న తథా జాయతే ప్రీతిర్భోజ్యశ్రాద్ధే తథైవ చ. ౩౬. అథ కిం బహునోక్తేన నాన్యత్ప్రీతికరం మమ, పుణ్యాఖ్యానాదృతే దేవ గుహ్యమేతత్ప్రకీర్తితమ్. ౩౭. యశ్చాయమపరో విప్ర ఇహాయాతో నరోత్తమః, అయమాసీద్ద్విజశ్రేష్ఠస్తస్మిన్నేవ పురోత్తమే. ౩౮. ఏకదా తు గతశ్చాయం ధర్మశ్రవణముత్తమమ్, శ్రోతుం భక్త్యా ద్విజశ్రేష్ఠ శ్రద్ధయా పరయా వృతః. ౩౯. శ్రుత్వా తత్ర తతో భక్త్యా పుణ్యాఖ్యానమనుత్తమమ్, కృత్వా ప్రదక్షిణం తస్య వాచకస్య మహాత్మనః, ఏష విప్రోమరశ్రేష్ఠ దత్తవాన్సువర్ణమాషకమ్.

లాపోగాణికోత్తమునకు దక్షిణ యొసంగి గని దొరకినవానివలె నత్యానందము నొందెను. ఇదియే యాతని పుణ్యకర్మము. ఇంకేమియు నీతఁడొనర్చి యుండలేదు. మహాత్ముఁడగు వాచకున కొనరించిన పూజయను పుణ్యకర్మమునకు ఫలమే స్వయముగ నే నాతనిఁ బూజించుట. ఎవఁడు శ్రద్ధాభక్తియుతుండై వాచకుని బూజించునో యాతనిచే నేనును బ్రహ్మయు విష్ణుఁడు శివుఁడును బూజింపఁబడుచున్నారము. ఎవఁడు భక్తితో నుత్తమభోజ్యవస్తువులచే వాచకునకు భోజనమిడునో యాతఁడు నన్నే పదునైదేండ్లు పూజించినవాఁడగును. నాకు వాచకుఁడు ప్రేమాస్పదమైన యట్లు యముఁడో, యమియో, శనియో, మనువో, తపతియో, ప్రేమాస్పదులు కాఁజాలరు. వాచకుని సత్కరించినను గుడువంబెట్టినను నాకిన్నూరేండ్లు తృప్తికలుగును. ఆతనికి భోజన మిడినచో నాకే గాదు. ఇంద్రాదిదేవతల కెల్లఱకును బ్రీతి జనించును ఆవాచకుఁడే బ్రహ్మవిష్ణుశివాదులకుఁ గూడఁ బ్రియుఁ డగుచున్నాఁడు. ఆతఁడు ప్రీతినొందెనేని యెల్లవేల్పులు ప్రీతి నొందుదురు. సంశయము లేదు. వీరొనర్చిన పుణ్యకర్మములను సమగ్రముగ నెఱింగించితిని. వాఱింతకన్న నింకేమియు నొనరించి యుండలేదు. వేరేమి వినఁగోరెదవు ?" అనవుడు నే నాశ్చర్యభరితుఁడనై నీయొద్ద కేతెంచితిని. ఇందలి యథార్థ మెయ్యది? చెప్పుము.

---

దత్వా తు దక్షిణాం తస్మై వాచకాయామితౌజసే, ఆనందమగమద్విప్రః ప్రాప్తవాన్కాంచనం యథా. ౪౧. ఏతద్ధి సఫలం చాస్య న చాన్యత్కృతవానయమ్, యదనేన కృతా పూజా వాచకస్య మహాత్మనః, ఫలం హి కర్మణస్తస్య యన్మయా పూజితః స్వయమ్. ౪౨. వాచకం పూజయేద్యస్తు శ్రద్ధాభక్తిసమన్వితః, తేనాహం పూజితః స్యాం వై కో విష్ణుః శంకరస్తథా. ౪౩. వాచకం భోజయేద్యస్తు భక్త్యా భోజ్యైరనుత్తమైః, తేనాహం పూజితః స్యాం వై దశ వర్షాణి పంచ చ. ౪౪. న యమో నయమీ చాపి న మందో న మనుస్తథా, తపతీ న తథాన్విష్టా యథేష్టో వాచకో మమ. ౪౫. వాచకే సత్కృతే దేవ భోజితే సురసైన్యప, తృప్తిర్భవతి మే దేవ సంవత్సరశతద్వయమ్. ౪౬. న కేవలం మమ ప్రీతిర్వాచకే భోజితే భవేత్, కృత్స్నశో దేవతానాం చ ఇంద్రాదీనాం తథా భవేత్. ౪౭. బ్రహ్మవిష్ణుశివాదీనాం స చేష్టో వాచకో మమ, ప్రీతే తస్మిన్దేవతాః స్యుః సర్వాః ప్రీతా న సంశయః. ౪౮. ఇత్యేతత్కథితం సర్వమంభ్యాం కర్మ మహా ౹౹. ౪౯. న చాన్యచ్చక్రతుః కర్మ కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి, ఏతద్దృష్ట్వాహమాశ్చర్యం

విన వేడుక యయ్యె. అన నాకుమారువాక్యంబు నాకర్ణించి లోకపితామహుం డిట్లనియె 'ఆహా! దేవసేనానీ! నీ వెంతటి పుణ్యాత్ముఁడవు. నిన్ను బోలుపుణ్యుఁ డెచ్చటను లేఁడు. పుణ్యకర్మలు చేయు నాపుణ్యపురుషుల దర్శించి వచ్చితివి కద. వత్సా! సూర్యుఁడు పచించిన దంతయు నట్టిదెయే. ఆవంతేని యను నసత్యము లేదు. లోకపూజితమగు నాతొలిముఖమునుండి లోకహితార్థమై సమస్తములగు నితిహాసపురాణము లుద్భవమందినవి. నాకీపురాణము లిష్టములై యుండునటుల నాల్గువేదములు కాని వాని యంగములగు వ్యాకరణాదులు గాని యిష్టములు కావు. ఈపురాణముల నెవ్వరు భక్తిశ్రద్ధలుకలవారై వాచకునకు జీవనము నొసంగి యాకర్ణింతురో వారు పరమపదమును బొందుచున్నారు. ధర్మార్థకామమోక్షములను నాలుగుపురుషార్థములను విశదముచేయుటకై యితిహాసపురాణములఁ బుట్టించితిని. ప్రసిద్ధములగు నాలుగువేదములు నెల్లప్పుడును గూఢార్థములై యున్నవి. కావున సులభముగ నెఱుంగుటకై యీయితిహాసపురాణములు సృజించితిని. ఎవఁడు నిత్యము నుత్తమధర్మశ్రవణము చేయునో యాతఁ డాదిత్యానుగ్రహంబున భాస్కరుని పరమపదము నొందుచున్నాఁడు. అచ్చట దక్షిణయొసంగినవాఁ డాదిత్యపురము జేరును. సురవరా! ఇందేమి వింతయున్నది. ఆవాచకుఁ డుత్తమమగు

---

తవాఖ్యాతమిహాగతః, కిమత్ర తథ్యం దేవేశ కథ్యతాం కౌతుకం మమ. ౧౦. శ్రుత్వా కుమారవచనం సర్వలోకపితామహః.౧౧. బ్రహ్మోవాచ:—హంత భోః సాధు పుణ్యోఽసి నాస్తి తుల్యస్త్వయాపరః, యద్దృష్టౌ భవతా తౌ హి సుపుణ్యౌ పుణ్యకారిణౌ. ౧౨. యదుక్తం భానునా వత్స తత్తథా నాన్యథా భవేత్, యదాసీన్మే ముఖం పుత్ర ప్రథమం లోకపూజితమ్. ౧౩. తస్మాదేతాని సర్వాణి నిర్గతాని సమంతతః, ఇతిహాసపురాణాని లోకానాం హితకామ్యయా. ౧౪. యథైతాని మమేష్టాని పురాణాని మహామతే, న తథా వై చతుర్వేదీ న చాంగాని మహామతే. ౧౫. శృణ్వంత్యేతాని యే భక్త్యా నిత్యం శ్రద్ధాసమన్వితాః, దత్వా తు వాచకే వృత్తిం తే గచ్ఛంతి పరం పదమ్. ౧౬. ధర్మార్థకామమోక్షాణాం స్పష్టీకరణముత్తమమ్, ఇతిహాసపురాణాని మయా సృష్టాని సువ్రత. ౧౭. చత్వారో య ఇమే వేదా గూఢార్థాః సతతం స్మృతాః, అతస్త్వేతాని సృష్టాని బోధాయైషాం మహామతే. ౧౮. యస్తు కారయతే నిత్యం ధర్మశ్రవణముత్తమమ్, ఆదిత్యాద్భాస్కరం ప్రాప్య యాతి తత్పరమం పదమ్. ౧౯. దత్వా తు దక్షిణాం తత్ర ఆదిత్యస్య పురం వ్రజేత్, కిమాశ్చర్యం సురశ్రేష్ఠ దానపాత్రం హి

దానపాత్రము గదా! ఇంద్రుఁడు దేవతలలో నెల్ల నెటుల నుత్తముఁడో, ఆయుధములలో నెల్ల వజ్రాయుధ మెటు లుత్తమమో, అటులనే బ్రాహ్మణులలో నెల్ల వాచకబ్రాహ్మణుఁ డుత్తముఁ డనుటకు శంకింపఁ బని లేదు. తేజముల నెల్ల సూర్యకిరణము నదుల నెల్ల సముద్రము వలె ద్విజులలో నెల్ల వాచకుఁడు శ్రేష్ఠుఁడు. ఏమానవుఁడు భక్తితో వాచకుని బూజించునో యాతనిచే సకలప్రపంచమును బూజింపఁబడినదే యగును. సందేహము లేదు. సూర్యునిచే సత్యమే చెప్పఁబడినది. నిస్సందేహము. వాచనికునితో సమమగు దానపాత్రము వేరొండెద్దియును నెందు నెన్నఁడును గలుగదు." అన నా బ్రహ్మపలుకులు విని కుమారుఁ డిట్లని యెను. "ఆహా! ఎంతటి యాశ్చర్యము. పుణ్యకథాశ్రవణము చేయువాఁ డెంతటి ధన్యాత్ముఁడు. వాచకునకు దాన మధికముగ నొసఁగువాని యుత్తమపుణ్యము నింతని వర్ణింపఁదరమే." అని యివ్విధి నాసంవాదము నెఱింగించి బ్రహ్మ "దిండీ! యీవిధి నెల్లప్పుడు నేపుణ్యుఁడు దేవదేవుని మందిరమున ధర్మశ్రవణము చేయుచున్నాఁడో యాతఁడు నిక్కముగ నుత్తమగతిం బొందు"నని యెఱింగించి వెండియు నిట్లనియె.

ఇది చతుర్నవతితమాఽధ్యాయము.

---

తత్పరమ్. ౬౦. యథా దేవవరో లేఖో యథా హేతిః పరం పవిః, బ్రాహ్మణానాం తథా శ్రేష్ఠో వాచకో నాత్ర సంశయః. ౬౧. హేతిర్యథా తేజసాం తు సరసాం సాగరో యథా, తథా సర్వద్విజేభ్యస్తు వాచకః ప్రవరః స్మృతః. ౬౨. వాచకం పూజయేద్యస్తు నరో భక్తిపురఃసరమ్, పూజితం సకలం తేన జగత్స్యాన్నాత్ర సంశయః. ౬౩. సత్యముక్తం న సందేహో భానునా మత్కులోద్వహ, వాచకేన సమం పాత్రం న జాత్వన్యద్భవేత్క్వచిత్. ౬౪. తచ్ఛ్రుత్వా బ్రహ్మణో వాక్యం కుమారో వాక్యమబ్రవీత్. ౬౫. అహో హి ధన్యతా తస్య పుణ్యశ్రవణకారిణః, దానం చ దదతోఽత్యర్థం పుణ్యతా వాచకాయ వై. ౬౬. బ్రహ్మోవాచః—ఇత్థం డిండే సదా యస్తు దేవదేవస్య మందిరే, కుర్యాత్తు ధర్మశ్రవణం స యాతి పరమాం గతిమ్. ౬౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం

బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే పుణ్యశ్రవణమాహాత్మ్యవర్ణనం నామ

చతుర్నవతితమోఽధ్యాయః.

## పంచనవతితమాధ్యాయము.

మహామహులు వలగొని యేమానవులు నేలనంటిన తలతో నేమగుర్త్రాలంజలిపటకు మ్రొక్కు లిడుదురో వారు పరమపదమును బొందుచున్నారు. చెప్పులు తొడిగికొని దేవాలయమునఁ బాదము నిడు మానవుఁడు తామిస్ర మను ఘోరనరకమును బొందును. తెమడను గాని మూత్రపురీషములను గాని విడచుచు దేవాలయము జొచ్చువాఁడు వరుసగ నెల్లనరకముల ననుభవించును. నేయి, తేనె, పాలు, నీరు నుత్తమ మగు చెఱకురసమును దేవదేవుని స్నానమున కొసంగుమానవులు సర్వ కామము లనుభవించి సూర్యునిమండలమున కేగుచున్నారు. స్నానము చేయించు రవి నెవ్వరు భక్తితోఁ బరికింతురో వా రశ్వమేధఫలమును బొంది మహేశునందు లయమొందుచున్నారు. భక్తితో భానుని స్నానముచేయించువారు రాజసూయాశ్వమేధఫలము నందుకొను చున్నారు. ఎవ్వఁడును సూర్యుని స్నానకాలము నతిక్రమించి నడువ కుండునట్లు యత్నింపవలయును. అతిక్రమించువానికి సుఖములు నశిం చును. అతిక్రమించినవాఁడు తామిస్రము రౌరవము మొదలగు నరక ములఁ బొందును. కావున నెల్లయత్నములచేతను వేళ యతిక్రమింపక స్నానము చేయింపవలయును. నేతితో నభిషేకించి సూర్యుని బొందును.

---

బ్రహ్మోవాచ:—త్రిభిః ప్రదక్షిణం కృత్వా యో నమస్కురుతే రవిమ్, భూమౌ గతేన శిరసా స యాతి పరమాం గతిమ్. ౧. సోపానత్కో దేవగృహమారోహేద్యస్తు మానవః, స యాతి నరకం ఘోరం తామిస్రం నామ నామతః. ౨. శ్లేష్మమూత్రపురీషాణి సముత్సృజతి యస్తు వై, దేవస్యాయతనే భానోః స గచ్ఛేన్నరకం క్రమాత్. ౩. ఘృతం మధు పయస్తోయం తథేక్షురసముత్తమమ్, స్నపనార్థం తు దేవస్య యే దదతీహ మానవాః, సర్వకామానవాప్యేహ తే యాంతి హేలిమండలమ్. ౪. స్నాప్యమానం రవిం భక్త్యా యే పశ్యంతి వృషధ్వజ, తేశ్వమేధఫలం ప్రాప్య లయం యాంతి వృషధ్వజే. ౫. స్నపనం యే చ కుర్వంతి భానోర్భక్తిసమన్వితాః, లభంతే తత్ఫలం భీమ రాజసూయాశ్వమేధయోః. ౬. యథా న లంఘయేత్కాశ్చిత్స్నపనం భాస్కరస్య తు, తథా కార్యం ప్రయత్నేన లంఘితం హ్యసుఖావహమ్. ౭. తామిస్రం నరకం యాతి లంఘయేచ్చ స రౌరవాన్, తస్మాత్సర్వప్రయత్నేన కార్యం స్నపనమాదితః. ౮. ఘృతేన స్నాపయేద్దేవం కంజమాప్నోతి మానవః, మధునా ప్రియ

తేనెతో నభిషేకించి సర్వప్రియుఁడగును. నీట నభిషేకించి ఘృతసమృద్ధి కలవాఁడగును. చెఱకురసమునను క్షీరములను స్నానముచేయించి విష్ణులోకమును బొందును. ఇటు లీద్రవ్యములచే నాదిత్యుని జలకమార్చి మానవు లీప్సితఫలముల నొందఁగలరు. అన విని దిండి యాతని కిట్లనియె.

ఇది పంచనవతితమాధ్యాయము.

---

## షణ్ణవతితమాధ్యాయము.

“పితామహా! వెనుక జెప్పిన యేడుసప్తములలో మొదటిసప్తమిని గుఱించిన చరితమంతయు నీవలన వింటిని. ఇతరములగు నాఱుసప్తములయు చరిత్రము నానతిమ్ము. వానినన్నింటి నుపవసించి సూర్యసదనమున కేగుదును.” నావుడు దిండికి బ్రహ్మ యిట్లనియె. విశుద్ధసప్తమినాఁడు పంచతార(ఐదుచుక్కలు కలది)ములగు మఘ మొదలగునక్షత్రముల నేదే నొక్కటి వచ్చునో యాసప్తమి జయాసప్తమి యనఁబరగును. అందొనరించిన దానహోమజపతర్పణములు దేవపూజనము నంతయు సూర్యునందు నూరింత లగును. ఈసప్తమి సూర్యప్రియమైనది. ఎల్లపాపముల నడఁగించును. ధన్యము కీర్తిప్రదము పుత్రప్రదము కామదమునై లక్ష్మిని

---

మాయాతి తోయేనాపి ఘృతౌకసమ్. ౯. ఇక్షురసేన సంస్నాప్య పయసా కంజశధ్వజమ్, ఏవమేభిః స్నాపయేద్వై రవిమీహితమాప్నుయాత్. ౧౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యాలయమాహాత్మ్యవర్ణనం నామ
పంచనవతితమోఽధ్యాయః.

---

దిండిరువాచః—యాశ్చైతా సప్త సప్తమ్యో భవతా కథితా మమ, తాసాం యా ప్రథమా దేవ కథితా సా సవిస్తరా. ౧. యాస్త్వన్యా దేవశార్దూల తాః సర్వాః కథయస్వ మే, యేనోపోష్య తతస్తాస్తు వ్రజేహం హేలిసద్మ వై. ౨. బ్రహ్మోవాచః—శుక్లపక్షస్య సప్తమ్యాం నక్షత్రం పంచతారకమ్, యదా స్యాత్సా తదా జ్ఞేయా జయా నామేతి సప్తమీ. ౩. తస్యాం దత్తం హుతం జాపస్తర్పణం దేవపూజనమ్, సర్వం శతగుణం ప్రోక్తం పూజా చాపి దివాకరే. ౪. భాస్కరస్య ప్రియా హ్యేషా సప్తమీ పాపనాశినీ, ధన్యా యశస్యా పుత్ర్యా చ కామదా కంజజాఽవహా. ౫. విధినానేన

గూడ నొసంగును. దాని ననుష్ఠింపవలయువిధి నెఱింగింతు వినుము. ఆవిధి ననుష్ఠించినఫలము లభింపఁగలదు. సూర్యుఁ డాకాశము నధిష్ఠింప నీశుక్ల సప్తమి నుపవాసంబు మొదలిడి పూజన మారంభించి యథావిధిగఁ బూజ సలిపి యది మొదలు మూఁడవదినమునఁ బారణము చేయవలయును అటు లొనరించినచో గోవులు నాఁబోతులు మొదలగునవి పుష్కలములై యాతనియింట నుండఁగలవు. మొదటిపారణము నాల్గునెలలందుఁ జేయ వలయునని బుధులు వచించుచున్నారు. ఈవ్రతమున గన్నేరుపూవులు నెఱ్ఱనిచందనము నుత్తమమగు ధూపగుగ్గిలము బాగుగవండిన కాంసార మున నైవేద్యమును భాస్కరున కొసంగవలయును. ఇవ్విధమున దేవ నాథుఁడగు మార్తండుని విధ్యుక్తముగఁ బూజించి యావెనుక భక్ష్య భోజ్యములచే యథావిధిగ బ్రాహ్మణులకుఁ గుడువంబెట్టవలయును. ఈ మొదటిపారణమునఁ గాంసారమునే బ్రాహ్మణభోజనమున కొసంగవల యును. తాను నటులే స్థిరచిత్తుఁడై మౌనియై కాంసారమును భుజింపవల యును పంచమినాఁ డేకభుక్తి యొనరించి షష్ఠినాఁడు నక్తవ్రతము సలిపి సప్తమి నుపవసించి యష్టమినాఁడు పారణము చేయవలయును. సప్తమ్యుప వాసము షష్ఠితోఁగూడిన సప్తమినాఁడే యొనరుపవలయును. అష్టమితోఁ జేరిన సప్తమినిమాత్ర ముపవసింపరాదు. ఈయభిప్రాయముతోడనే యుప వాసము షష్ఠినాఁడే యని బుధులందురు. ద్వాదశి నుపవసింపఁగోరు మానవు లేకాదశియందే యుపవాసము సలుపుచున్నారుకద! అటులనే

---

కర్తవ్యా తిథిర్యా మమ విద్యతే, తం శృణుష్వ విధిం మత్తో యేన కృత్వార్థమశ్నుతే. ౬. హంసే హంససమారూఢే శుక్లేయం సప్తమీ పురా, సముపోష్య చ కర్తవ్యా విధినానేన శంకర. ౭. పారణా తృతీయాఽహే స్యాత్కథితం గోవృషావహమ్, ప్రథమం చతురో మాసాన్పారణం కథితం బుధైః. ౮. కథితాన్యత్ర పుష్పాణి కరవీరస్య సువ్రత, చందనం చ తథా రక్తం ధూపార్థం గుగ్గులం పరమ్. ౯. కాంసారం తు సుపక్వం చ నైవేద్యం భాస్కరాయ వై, అనేన విధినా పూజ్యమార్తండం విబుధాధిపమ్. ౧౦. పూజయే ద్బ్రాహ్మణాన్నిమ భక్ష్యభోజ్యైర్యథావిధి, కాంసారం భోజయేద్విప్రాన్పారణేఽస్మి న్విచక్షణః, స్వయమేవ తథాశ్నీయాత్ప్రయతో మానమాశ్రితః. ౧౧. పంచమ్యామేక భక్తం తు షష్ఠ్యాం నక్తం ప్రవర్తతే, కృతోపవాసం సప్తమ్యామష్టమ్యాం పారణం భవేత్. ౧౨. షష్ఠ్యా సమేతా కర్తవ్యానాష్టమ్యేయం కదాచన, యస్యోపవాసనా మైవ షష్ఠ్యామాహురుపోషితమ్. ౧౩. యథైకాదశ్యాం కుర్వంతి ఉపవాసం మనీషిణః,

యిదియు నని యెఱుంగునది. ఈవ్రతమునందు తెల్లావగింజలయుదకమున సమంత్రకముగ స్నానముచేయవలయును సూర్యుఁడు నాకుఁ బ్రీతుఁడగుఁ గాక యనుమంత్రముతోఁ గోమయప్రాశనము చేయవలయును. జిల్లేడు పుడకను దంతకాష్ఠముగఁ జేయవలయును. వత్సా! యిది మొదటిపారణంపువిధి. ఇఁక రెండవపారణము వివరింతు వినుము. మాలతీకుసుమములను శ్రీఖండచందనమును పాయసనైవేద్యమును విజయధూపము నొసంగవలయును బ్రాహ్మణులకు భోజనములిడి యామీఁదఁ దా భుజింపవలయును. రవి నాయెడఁ బ్రీతుఁడగుఁగాక యని యాదేవునామము నుచ్చరింపవలయును. పంచగవ్యప్రాశనము చేయవలయును. దంతధావనమునకుఁ జంద్రపుల్ల నుపయోగింపవలయును. ఇయ్యది రెండవపారణంపు విధానము. ఇఁక మూఁడవపారణము నెఱింగింతు వినుము. ఈపారణమున నగస్త్యకుసుమములతో భానుని బూజింపవలయును. ముఖ్యముగ నీవ్రతమున దేవుని స్పృశింపవలయును. శ్రీఖండచందనమును వానికుసుమములను అందుగుబంకధూపము నొసఁగవలయును. ఆదిత్యున కివి మిక్కిలి ప్రియమైనవి. శాల్యన్ననైవేద్యమును చూతఫలములను నొసంగవలయును. దానినే బ్రాహ్మణులకొసంగి తానును భుజింపవలయును. కుశోదకమును బ్రాశనము చేయవలయును. బదరీకాష్ఠముతో దంతధావనము చేయవలయును. వికర్తనుఁడు నాయెడఁ బ్రీతుండవుఁగాత. అని దేవుని

---

ఉపవాసనాయ ద్వాదశ్యాం తథేయం పరికీర్తితా. ౧౪. సిద్ధార్థకైః స్నానమంత్రః ప్రాశనం గోమయస్య తు, భానుర్మే ప్రీయతామత్ర దంతకాష్ఠం తథార్కజమ్. ౧౫. ఇత్యేష కథితస్తాత ప్రథమే పారణే విధిః, ద్వితీయం శ్రూయతాం భీమ పారణం గదతో మమ. ౧౬. మాలతీకుసుమానీహ శ్రీఖణ్డం చందనం తథా, నైవేద్యం పాయసం భానోర్ధూపం విజయమాదిశేత్. ౧౭. బ్రాహ్మణాన్భోజయేద్వాపి తథాశ్నీయాత్స్వయం విభో, రవిర్మే ప్రీయతామత్ర నామ దేవస్య కీర్తయేత్. ౧౮. ప్రాశయేత్పంచగవ్యం తు ఖదిరం దంతధావనే, ద్వితీయే పారణే వీర విధిరుక్తో మయాధునా. ౧౯. తృతీయం పారణం చాపి కథ్యమానం నిబోధ మే, అగస్తికుసుమైరత్ర భాస్కరం పూజయేద్బుధః. ౨౦. సమాలంభనమత్రోక్తం శ్రీఖండం కుసుమం తథా, సిహ్లకో ధూప ఉద్దిష్టో భానోః ప్రీతికరః పరః. ౨౧. శాల్యోదనం తు నైవేద్యం రసాలోపరిసంయుతమ్, బ్రాహ్మణానాం తు దాతవ్యం భక్షయేత తథాత్మనా. ౨౨. కుశోదకప్రాశనం తు బదర్యా దంతధావనమ్, వికర్తనః ప్రీయతాం మే నామ దేవస్య కీర్తయేత్. ౨౩. వర్షాసు దేవదేవస్య

రాయియు నుచ్చరింపవలయును. వర్షాకాలమున విధ్యుక్తముగ దేవదేవు నకుఁ బూజ యొనర్పవలయును. గంధపుష్పోపహారములచేతను పలుతెఱంగుల వినోదములచేతను గోదానముచేతను భూదానములచేతను బ్రాహ్మణ తర్పణములచేతను బూజింపవలయును. ఇట్లు పూజించి యాదేవు నెదుట నిలచి యుత్తమము ధన్యమునగు పుస్తకవాచనము చేయింపవలయును. వస్త్రగంధధూపములచే వాచకుఁడగు బ్రాహ్మణుని బూజింపవలయును. తరువాత నాదేవు నెదుట నిలచి యీచెప్పఁబోవు మంత్రము పఠింపవలయును. "దేవదేవ జగన్నాథ సర్వరోగార్తినాశన, గ్రహేశ లోకనయన వికర్తన తమోఽపహ. కృతేయం దేవదేవేశ జయానామేతి సప్తమీ, మయా తవ ప్రసాదేన ధన్యా పాపహరా శివా." దేవతలకెల్ల దేవుఁడవు. జగంబునకెల్ల నీశ్వరుఁడవు. సమస్తరోగబాధలు నశింపఁజేయువాఁడవు. గ్రహరాజవు. లోకములకు నేత్రమవు. పాపములఁ బారద్రోలువాఁడవు. చీఁకటిని బోఁగొట్టువాఁడవు. "ఓయీశా! నీయనుగ్రహముచే జయయను నామంబున మంగళకరము పాపహరము ధన్యమునగు సప్తమివ్రతము నాచేఁ జేయఁబడినది." ఎవఁ డీవిధానముచొప్పున నీసప్తమీవ్రతము చేయునో యాతని స్నానదానాదులన్నియు శతగుణితము లగును. ఈ వ్రతము నొనర్చువాఁడు శాశ్వతకీర్తిని ధనధాన్యసువర్ణముల నాయుర్బల ములను పుత్రులను లక్ష్మిని బొందఁగలఁడు. ఇవియెల్ల నిట వడసి జన్మాంత

---

పూజా కార్యా విధానతః, గంధపుష్పోపహారైస్తు నానాప్రేక్షణకైస్తథా. ౨౪. గోదానైర్భూమిదానైర్వా బ్రాహ్మణానాం చ తర్పణైః, ఇత్థం సంపూజ్య దేవేశం దేవస్య పురతః స్థితః. ౨౫. కారయేత్పరమం పుణ్యం ధన్యం పుస్తకవాచనమ్, వస్త్రైర్గంధైస్తథా ధూపైర్వాచకం పూజయేత్తతః. ౨౬. దేవస్య పురతః స్థిత్వా తతో మంత్రముదీరయేత్, దేవదేవ జగన్నాథ సర్వరోగార్తినాశన, గ్రహేశ లోకనయన వికర్తన తమోఽపహ. ౨౭. కృతేయం దేవదేవేశ జయా నామేతి సప్తమీ, మయా తవ ప్రసాదేన ధన్యా పాపహరా శివా. ౨౮. అనేన విధినా వీర యః కుర్యాత్సప్తమీమిమామ్, తస్య స్నానాదికం సర్వం భవేచ్ఛతగుణం విభో. ౨౯. కృత్వేమాం సప్తమీం వీర పురుషః ప్రాప్నుయాద్యశః, ధనం ధాన్యం సువర్ణం చ పుత్రమాయుర్బలం శ్రియమ్. ౩౦. ప్రాప్యేహ

మున సూర్యలోకమున కాలఁడు చనుచున్నాఁడు. అటఁ గొంతకాలముండి యావెనుక మగిడి ధరిత్రికేతెంచి రాజరాజపదము గాంచును. వీరవరా! యిత్తెఱఁగున నీజయసప్తమీవ్రతవిధానము నెఱింగించితిని. దీనిననుష్ఠించి నను స్మరించినను విన్నను నిశ్చయముగ సూర్యలోకవాసము లభించును.

ఇది షణ్ణవతితమాధ్యాయము.

---

## సప్తనవతితమాధ్యాయము

మార్గశీర్షసప్తమీతిథి జయంతి యనఁబడును. అయ్యది పవిత్ర మగుటంజేసి పాపంబులు హరించును. శుభంబు లొసంగును. అందుఁ బ్రతిమానవులును విధ్యుక్తముగ నుపవాసము చేయవలయును. ఆవిధి నెఱింగింతు వినుము. ఈవ్రతమున నాలుగుపారణములు చేయవలయు నని పండితు లనుచున్నారు. పంచమినాఁ డేకభుక్తి యొనర్చి షష్ఠినాఁడు రాత్రివ్రతముసలిపి సప్తమినాఁ డుపవసించి యష్టమినాఁడు పారణము చేయవలయును. అందు మాఘఫాల్గునచైత్రమాసంబుల నందమగు బక పుష్పములు కుంకుమలేపనము మోదకములనైవేద్యమును నేతిధూపము నొసంగవలయును. పంచగవ్యప్రాశనము మిగుల పవిత్రమైనదగుట నెల్ల

---

దేవశార్దూల సూర్యలోకం స గచ్ఛతి, తస్మాదేత్య పునర్భూమా రాజరాజో భవేద్బుధః. ३०. ఇత్యేషా కథితా వీర జయా నామేతి సప్తమీ, కృతా స్మృతా శ్రుతా సా తు హేలిలోకప్రదాయినీ. ३१.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే జయానామ సప్తమీమాహాత్మ్యవర్ణనం నామ షణ్ణవతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—మాఘస్య శుక్లపక్షే తు సప్తమీ యా త్రిలోచన, జయంతీ నామ సా ప్రోక్తా పుణ్యా పాపహరా శివా. १. సోపోష్యా యేన విధినా శృణు తం పార్వతీప్రియ, పారణాని తు చత్వారి కథితాన్యత్ర పండితైః. २. పంచమ్యామేక భక్తం తు షష్ఠ్యాం నక్తం ప్రకీర్తితమ్, ఉపవాసస్తు సప్తమ్యామష్టమ్యాం పారణం భవేత్. ३. మాఘే చ ఫాల్గునే మాసి తథా చైత్రే చ సువ్రత, బకపుష్పాణి రమ్యాణి కుంకుమంచ విలేపనమ్. ४. నైవేద్యం మోదకాంశ్చాత్ర ధూప ఆజ్యము దాహృతః, ప్రాశనం పంచగవ్యం తు పవిత్రీకరణం పరమ్. ५. మోదకైర్భోజయేద్విప్రాన్యథాశక్త్యా గణా

శరీరధారులకుఁ బాపంబుల వాపును. శక్తికొలఁది లడ్డులతోఁ బ్రాహ్మణు లకు భోజనము లొసఁగవలయును. శాల్యన్నమునుగూడ వారల కొసంగ వలయును. అన్ని పారణములందు నీవిధముగ లోకపూజితుఁడగు భాస్కరు నెవరారాధింతురో వారల కశ్వమేధఫలము లభించును. ఇది మొదటి పారణము. వైశాఖ జ్యేష్ఠాషాఢమాసములయందు వ్రతమునలిపి రెండవ పారణమునఁ గూడ నిటులే పూజించిన రాజసూయఫలంబు కలుగును. శ్రావణమాసమున సూర్యపూజను నూరు రేకులు గల కుశేశయములను కమలముల నుపయోగింపవలయును. తెల్లనిచందనమును గుగ్గిలధూపము నొసంగవలయును. బెల్లముతో చేసిన యప్పములు నైవేద్య మొసంగవల యును. గోమయప్రాశనము చేయవలయును. బ్రాహ్మణభోజనమున బెల్లపు టప్పము లుపయోగింపవలయును. ఇది పాపహారమగు రెండవపారణము. మూఁడవపారణమున నాదిత్యుఁ బూజించిన రాజసూయాశ్వమేధముల ఫలంబు లభించును. అం దాతని పూజావిధి నెఱింగింతు వినుము. భాద్ర పదాశ్వయుజకార్తికమాసములయందు రక్తచందనమును మాలతీకుసుమ ములును విజయధూపమును ముఖ్యములైనవి. నేతితోఁ జేసినయప్పములు నివేదింపవలయును. దానినే బ్రాహ్మణభోజనమునకు వినియోగింపవల యును. కుశోదకప్రాశన మొనర్చినచో శరీరశుద్ధి కలుగును. ఇయ్యది పాప నాశనమగు మూఁడవపారణము. నాలుగవపారణమున నాదిత్యుఁబూజిం

---

ధిప, శాల్యోదనం చ భూతేశ దద్యాచ్ఛక్త్యా ద్విజేషు వై. ౬. ఇత్థం సంపూజయే ద్యస్తు భాస్కరం లోకపూజితమ్, సర్వస్మిన్పారణే వీర సోఽశ్వమేధఫలం లభేత్. ౭. ద్వితీయే పారణే పూజ్య రాజసూయఫలం లభేత్, వైశాఖాషాఢజ్యేష్ఠేషు శ్రావణే మాసి సువ్రత, పూజార్థమథ భానోర్వై శతపత్రాణి సువ్రత. ౮. శ్వేతం చ చందనం శ్రీమ ధూపో గుగ్గులురుచ్యతే, నైవేద్యం గుడపూపాస్తు ప్రాశనం గోమయస్య తు, భోజనే చాపి విప్రాణాం గూడపూపాః ప్రకీర్తితాః. ౯. ద్వితీయమిదమాఖ్యాతం పారణం పాపనాశనమ్, రాజసూయాశ్వమేధాభ్యాం ఫలదం భాస్కరప్రియమ్. ౧౦. తృతీయం శృణు దేవస్య పూజార్థే భాస్కరస్యతు, మాసి భాద్రపదే వీర తథా చాశ్వ యుజే విభో. ౧౧. కార్తికే చాపి మాసే తు రక్తచందనమాదిశేత్, మాలతీకుసుమానీహ ధూపో విజయ ఉచ్యతే. ౧౨. నైవేద్యం ఘృతపూపాస్తు భోజనం చ ద్విజన్మనామ్, కుశోదకప్రాశనం తు కాయశుద్ధికరం పరమ్. ౧౩. తృతీయమపి చాఖ్యాతం పారణం

చిన రాజసూయాశ్వమేధముల ఫలము లభించును. పాపనాశనమగు నాపారణమును గూడ వివరింతు వినుము ఈపారణము సర్వజనులకును శ్రేయోదాయకమై యున్నది. మార్గశీర్షమాసమునను బుష్యమాసమునను మాఘమాసమునను బూజింపవలయును. అందనేకపుణ్యఫలములు లభించును. ఎఱ్ఱగన్నేరుపూవులు నెఱ్ఱగందము నమృతధూపము పాయసనివేదనము నుత్తమములయినవి. వెన్నతీయనిమజ్జిగ త్రాగవలయును. అగరు, చందనము, తుంగముస్తలు, అడుగుజిగురు, త్ర్యూషణమును సమాంశములుగ జేర్చినద్రవ్యమున కమృతమని నామము. ఈపారణమున మహాత్ముఁడగు నాదిత్యునినామములఁ గీర్తింపవలయును. "చిత్రభానుఁడు, భానుఁడు, ఆదిత్యుఁడు, భాస్కరుఁడు," అని నామములు కీర్తింపవలయును. అనఁగా 'జిత్రభానుఁడు, ప్రీతుఁడగుత'మని ప్రథమపారణమునను, 'భానుఁడు ప్రీతినొందుఁగాక' యని రెండవపారణమునను, 'ఆదిత్యుఁడు ప్రీతుఁడగుఁగాక' యని మూఁడవపారణమునను, 'భాస్కరుఁడు ప్రీతుఁడగుఁ గాక'యని నాలుగవపారణమున నుచ్చరింపవలయును. ఈవిధానమున నాయాతిథులందు సూర్యునకుఁ బూజలుసలుపువాఁడు పరమపదము నొందును. ఎల్లకోర్కులు దీర్చుకొనుచున్నాఁడు. పుత్రులఁగోరినఁ బుత్రులను ధనముగోరినధనమును బొందుచున్నాఁడు. రోగియగువాఁ డారోగ్యమును బడయును. సంపూర్ణశుభములఁ బడయును సంవత్సరము ముగిసిన

---

పాపనాశనమ్, రాజసూయాశ్వమేధాభ్యాం ఫలదం భాస్కరప్రియమ్. ౧౪. చతుర్థమపి తే వచ్మి పారణం పాపనాశనమ్. రాజసూయాశ్వమేధాభ్యాం ఫలదం భాస్కరప్రియమ్. ౧౫. తదద్య దేవశార్దూల పారణం శ్రేయసే శృణు, మాసి మార్గశిరే వీర పౌషే మాసి తథా శివ. ౧౬. మాఘే చ దేవశార్దూల శృణు పుణ్యాన్యశేషతః, కరవీరాణి రక్తాని తథా రక్తం చ చందనమ్. ౧౭. అమృతాఖ్యస్తథా ధూపో నైవేద్యం పాయసం పరమ్, అర్జనీయం తథా తక్రం ప్రాశనం పరమం స్మృతమ్. ౧౮. అగరుం చందనం ముస్తం సిహ్లాకం త్ర్యూషణం తథా, సమభాగైస్తు కర్తవ్యమిదం చామృతముచ్యతే. ౧౯. నామాని కథితాన్యత్ర భాస్కరస్య మహాత్మనః, చిత్రభానుస్తథా భానురాదిత్యో భాస్కరస్తథా. ౨౦. ప్రీయతామితి సర్వస్మిన్పారణే విధిమాదిశేత్, అనేన విధినా యస్తు కుర్యాత్పూజాం విభావసోః. ౨౧. తస్యాం తిథౌ దేవదేవ స యాతి పరమం పదమ్, కృత్వైవం సప్తమీం భీమ సర్వకామానవాప్నుతే. ౨౨. పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ లభతే ధనమ్, సరోగో ముచ్యతే రోగైః శుభమాప్నోతి పుష్కలమ్. ౨౩. పూర్ణే

వెనుక గంధపుష్పోపహారములచే దివాకరుని బూజింపవలయును. బ్రాహ్మణ తర్పణములు చేయవలయును. పలుతెఱఁగుల వినోదములు చేయవల యును. పౌరాణికుని బూజింపవలయును. ఇప్పగిది దేవబ్రాహ్మణవాచకులఁ బూజించి యిట్లు ప్రార్థింపవలయును. "ఓదేవా! నాకెల్లప్పుడును ధర్మ కార్యములందును, అర్థకార్యములందును, కామకార్యములందును జయము లభించుచుండుగాక." ఇట్లు ప్రార్థించి బ్రాహ్మణపౌరాణికులను బయనము చేయింపవలయును. ఈవిధానముచొప్పున నీవ్రతముచేయు వాఁడు నిక్కముగ జయముగాంచును. సమస్తపాపములు దొరగి సూర్య లోకమును జెందును. బ్రహ్మనిర్మితమగు దివ్యవిమానమునెక్కి తేజంబున రవికిని వెలుఁగున నరుణునకు నెనయై యాదిత్యలోకమున విలసిల్లును.

ఇది సప్తనవతితమాధ్యాయము.

---

## అష్టనవతితమాధ్యాయము.

గణాధిపా! భాద్రపదశుద్ధసప్తమి యపరాజితసప్తమి యనఁబడును. మహాపాతకముల నడఁగించును. చవితినాఁడొక్కపొద్దారగించి పంచమి

---

సంవత్సరే భీమ కార్యా పూజా దివాకరే, గంధపుష్పోపహారైస్తు బ్రాహ్మణానాం చ తర్పణైః, నానావిధైః ప్రేక్షణకైః పూజయా వాచకస్య తు. ౨౪. ఇత్థం సంపూజ్య దేవేశం బ్రాహ్మణాంశ్చాభిపూజ్య చ, వాచకం చ ద్విజం పూజ్య ఇదం వాక్యముదీ రయేత్. ౨౫. ధర్మకార్యేషు మే దేవ అర్థకార్యేషు నిత్యశః, కామకార్యేషు సర్వేషు జయో భవతు సర్వదా. ౨౬. తతో విసర్జయేద్విప్రాన్వాచకం తు ద్విజోత్తమమ్, ఇత్థం కుర్యాదిదం యస్తు స జయం ప్రాప్నుయాత్ఫలమ్, సర్వపాపవిశుద్ధాత్మా సూర్యలోకం స గచ్ఛతి. ౨౭. విమానవరమారూఢః కంజజోద్భవముత్తమమ్, తేజసా రవిసంకాశః ప్రభయా పతగోపమః. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే జయంతీకల్పవర్ణనం నామ
సప్తనవతితమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—మాసి భాద్రపదే శుక్లా సప్తమీ యా గణాధిప, అపరాజితేతి విఖ్యాతా మహాపాతకనాశినీ. ౧. చతుర్థ్యామేకభక్తం తు పంచమ్యాం నక్తమాదిశేత్,

నాఁడు నక్తవ్రతము సలిపి షష్ఠి నుపవసించి సప్తమిని పారణము చేయవలయును. ఇందును నాలుగుపారణములు చేయవలయునని విద్వాంసులనుచున్నారు. గన్నేరుపువ్వులు రక్తచందనము గుగ్గులుధూపము గుడపూపనైవేద్యము నుపయోగింపవలయును. భాద్రపదము మొదలు మూఁడుమాసముల నీవిధి యనుష్ఠింపఁదగును. తెల్లపువ్వులు, తెల్లచందనము, నేతిపొగ, పాయసనైవేద్యమును మార్గశీర్షము మొదలగు మూఁడుమాసముల నాదిత్యపూజలో నుపయోగింపవలయును. అగస్త్యకుసుమములు కుంకుమలేపనమును సిహ్లాక(అంమఁగు)ధూపమునో లేక రవివర్ణకమునో యుపయోగించి ఫాల్గునాదిమాసములందు శాల్యన్నమును షడ్రసోపేతముగ నివేదింపవలయును. జ్యేష్ఠాదిమాసములందు నెల్లకలువలు, నగురుచందనములు, అనంతధూపము, శర్కరాపూపములు నైవేద్యము నొసంగవలయును. శ్రీఖండము, గ్రంథి, అగురు, సిహ్లాకము, ముస్త, ఇంద్రము, శర్కర అను నీవస్తువులు చేర్చి మూఁడురోజులు శుద్ధి చేసినచో నది యనంతధూప మనంబడును. ఇందుఁ జెప్పఁదగిన దేవనామములు ప్రాశనములు వివరింతు వినుము. సుధాంశువు, అర్యముఁడు, సవిత, త్రిపురాంతకుఁడు, అని నాలుగుపారణములయందును నాలుగు నామములు పలికి ప్రీతుఁడగుఁగాక యని ప్రార్థింపవలయును. గోమూ

---

ఉపవాసం తథా షష్ఠ్యాం సప్తమ్యాం పారణం స్మృతమ్. ౨. పారణాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః, పుష్పాణి కరవీరస్య తథా రక్తం చ చందనమ్. ౩. ధూపక్రియా గుగ్గులేన నైవేద్యం గుడపూపకాః, భాద్రపదాదిమాసేషు విధిరేష ప్రకీర్తితః. ౪. శ్వేతాని భీమ పుష్పాణి తథా శ్వేతం చ చందనమ్, ధూపమాజ్యమిహాఖ్యాతం నైవేద్యం పాయసం రవేః. ౫. మార్గశీర్షాదిమాసేషు విధిరేష ప్రకీర్తితః, తతోఽగస్త్యస్య పుష్పాణి కుంకుమం చ విలేపనమ్. ౬. ధూపార్థం సిహ్లాకం ప్రోక్తమథ వా రవివర్ణకమ్, శాల్యోదనం చ నైవేద్యం సరసం ఫాల్గునాదిషు. ౭. రక్తోత్పలాని భూతేశ సాగురుం చందనం తథా, అనంతో ధూప ఉద్దిష్టో నైవేద్యం ఖండపూపకాః. ౮. శ్రీఖండం గ్రంథిసహితమగురుః సిహ్లాకం తథా, ముస్తా తథేంద్రం భూతేశ శర్కరా గృహ్యాతే త్ర్యహమ్. ౯. ఇత్యేష ధూపోఽనంతస్తు కథితో దేవసత్తమ, జ్యేష్ఠాదిమాసేషు తథా విధిరుక్తో మనీషిభిః. ౧౦. శృణు నామాని దేవస్య ప్రాశనాని చ సువ్రత, సుధాంశురర్యమా చైవ సవితా త్రిపురాంతకః. ౧౧. పారణేష్వేవ సర్వేషు ప్రీయతామితి

త్రము, పంచగవ్యము, నెయ్యి, వేఁడిపాలు పెరుఁగును ప్రాశనము చేయ వలయును. ఎవఁ డీవిధానముచొప్పున నీసప్తమిచేయునో యాతఁ డెల్ల ప్పుడు శత్రువులకు జయింపరానివాఁడే యగును. శత్రువుల నోడించి ధర్మకామార్థముల ననుభవించును. ఇటుఁ ద్రివర్గము ననుభవించి సూర్య పురమునకు స్వర్లోకమున కేగును. ఇప్పగిదిఁ బండ్రెండునెలలు నిండ శక్తి కొలఁది గంధపుష్పోపహారములచేతను పురాణశ్రవణముచేతను దేవుని బూజించి యశ్వదానము చేయవలయును. బ్రాహ్మణతర్పణములు చేయ వలయును. సూర్యప్రియుండగు పౌరాణికుని బూజింపవలయును. పలు విధములగు రత్నములతో నలంకరింపఁబడిన ధ్వజముల నాదిత్యున కొసంగ వలయును. ఈవిధముగా నెవ్వఁ డీసప్తమి నెల్లప్పుడు యత్నముతోఁ జేయునో యాతఁడు శత్రువుల జయించి సూర్యసాలోక్యము నొందును. తెల్లగుఱ్ఱము నెక్కనింద్రుఁడు నిర్మించినవిమానమును నీటనడచుదాని ధ్వజములుగలదాని నెక్కి వరుణసమానుఁడై వరుణలోకమున కేగును.

ఇది అష్టనవతితమాంధ్యాయము.

---

కీర్తయేత్, గోమూత్రం పంచగవ్యం తు ఘృతం చోష్ణం పయో దధి. ౧౨. యస్త్వేతాం సప్తమీం కుర్యాదనేన విధినా నరః, అపరాజితో భవేత్సోసౌ సదా శత్రుభిరాహవే. ౧౩. జిత్వా శత్రుం లభేతాపి త్రివర్గం నాత్ర సంశయః, త్రివర్గ మథ సంప్రాప్య స్వర్భానోః పురమశ్నుతే. ౧౪. తతః పూర్ణేషు మాసేషు పూజయే చ్ఛక్తితః ఖగమ్, గంధపుష్పోపహారైస్తు పురాణశ్రవణేన చ. ౧౫. అశ్వదానేన చ విభో ర్బ్రాహ్మణానాం చ తర్పణైః, వాచకం పూజయిత్వా చ భాస్కరస్య ప్రియం సదా. ౧౬. భాస్కరాయ ధ్వజాన్దద్యాన్నానారత్నవిభూషితాన్, య ఇత్థం కురుతే వీర సప్తమీం యత్నతః సదా. ౧౭. స పరాజిత్య వై శత్రుం యాతి హంసలోక తామ్. ౧౮. శుక్లాశ్వోద్వహయానేన ఆపగేన పతాకినా, ఆపగాధిపసంకాశ ఆపగాను చరో భవేత్. ౧౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే అపరాజితావర్ణనం నామ అష్టనవతితమోఽధ్యాయః.

---

## ఏకోనశతతమాధ్యాయము.

శుక్లసప్తమినాఁడు సూర్యసంక్రమణము వచ్చునేని యాతిథి మహాజయాసప్తమి యనఁబడును. అది సూర్యప్రియమైనది. ఇందొనర్చిన స్నానదానజపహోమపితృదేవపూజనములన్నియుఁ గోటిగుణితము లగును. ఇది భాస్కరునివచనము. ఈనాఁ డేమానవుఁడు భక్తితో దేవునకు ఘృతాభిషేక మొనర్చునో యాతఁ డశ్వమేధఫలమును బొంది స్వర్గలోకమును బొందును. భక్తితో క్షీరాభిషేక మొనర్చువాఁడు సర్వపాపవిముక్తుఁడై సూర్యలోకమున కేఁగును. కర్పూరముతోఁ జేసిన దివ్యవిమానమును చిరుగంటలమాలలు గలదానినెక్కి తేజంబునఁ గాంతిని సూర్యసమానుఁడై యటఁ జిరకాలము వసించి శీఘ్రకాలమునఁ బుడమిఱేఁడగును. ఇయ్యది మహాజయ యనఁబడును. ఇందు భక్తితో నుపవసించిన మానవుఁడు సూర్యలోకమునుబొంది యటనుండి నిర్మలానందరూపమగు పరబ్రహ్మము నొందును. అటుపైని దుఃఖముల నొందఁడు.

ఇది ఏకోనశతతమాధ్యాయము.



---

బ్రహ్మోవాచ:—శుక్లపక్షేతు సప్తమ్యాం యదా సంక్రమతే రవిః, మహాజయా తదా సా వై సప్తమీ భాస్కరప్రియా. ౧. స్నానం దానం జపో హోమః పితృదేవాభిపూజనమ్, సర్వం కోటిగుణం ప్రోక్తం భాస్కరస్య వచో యథా. ౨. యస్తస్యాం మానవో భక్త్యా ఘృతేన స్నాపయేద్రవిమ్, సోఽశ్వమేధఫలం ప్రాప్య స్వర్గలోకమవాప్నుయాత్. ౩. పయసా స్నాపయేద్యస్తు భాస్కరం భక్తిమాన్నరః, విముక్తః సర్వపాపేభ్యో యాతి సూర్యసలోకతామ్. ౪. కార్పూరేణ విమానేన కింకిణీజాలమాలినా, తేజసా హరిసంకాశః కాంత్యా సూర్యసమస్తథా. ౫. స్థిత్వా తత్ర చిరం కాలం రాజా భవతి చాంజసా, మహాజయైషా కథితా సప్తమీ త్రిపురాంతక. ౬. యాముపోష్య నరో భక్త్యా భవతే సూర్యలోకగః, తతో యాతి పరం బ్రహ్మ యత్ర గత్వా న శోచతి. ౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే మహాజయాకల్పవర్ణనం నామ
ఏకోనశతతమోఽధ్యాయః.

## శతతమాధ్యాయము.

మార్గశిరశుద్ధసప్తమి "నందసప్తమి" యనఁబడును. ఆతిథి యెల్లరకు నానందముఁగూర్చును మంగళముల నందిచ్చును. ఇందుఁ బంచమినాఁడేకభుక్తమును షష్ఠినాఁడు నక్తవ్రతమును సప్తమినాఁ డుపవాసమును జేయవలయునని విద్వాంసు లనుచున్నారు. ఈవ్రతమునఁ బారణములు మూఁడు చేయవలయుననియుఁ జెప్పుచున్నారు. ఇందాదిత్యపూజకై మాలతీకుసుమములను వాసనగలచందనమును కర్పూరాగరులు చేర్చిన ధూపము నుపయోగింపవలయును. ఖండశర్కరయు దధ్యన్నమును భాస్కరప్రియములగుట నైవేద్యమున కుపయోగింపవలయును. దాని తోడనే బ్రాహ్మణులకు భోజనము లిడి యామీఁదఁ దాను నద్దాని భుజింపవలయును. మొదటిపారణమున భాస్కరునకు ధూపము మొదలగువాని విధాన మిట్టిదని యెఱుంగుము. మోదుగుపువ్వులును, కర్పూరము, చందనము, కుష్ఠము, అగరు, అందుగు, గ్రంథి, వృషణము, కుంకుమము, గృంజనము, హారీతకి యనునీద్రవ్యములు చేర్చినధూపద్రవ్యము పతుకంబు నాఁబడు నద్దానినిగాని శక్తికొలంది నేదో యొకధూపమునుగాని రెండవపారణమున నుపయోగింపనలయును. ఈపగిదినే ప్రబోధమని ధూపాంతరము కలదు. జున్ను పటికబెల్లమును నివేదింపవలయును. నల్లయగరు, తెల్లతామరదుంప, బాలకము, వృషణము, చందనము, తగరము, తుంగముస్త అనునీ ద్రవ్యములతో శర్కర చేర్చి యొనర్చిన ధూప

---

బ్రహ్మోవాచ:—యా తు మార్గశిరే మాసి శుక్లపక్షే తు సప్తమీ, నందా సా కథితా వీర సర్వానందకరీ శుభా. ౧. పంచమ్యామేకభక్తం తు షష్ఠ్యాం నక్తం ప్రకీర్తితమ్, సప్తమ్యాముపవాసం తు కీర్తయంతి మనీషిణః. ౨. పారణాన్యత్ర వై త్రీణి శంసంతీహ మనీషిణః, మాలతీకుసుమానీహ సుగంధం చందనం తథా. ౩. కర్పూరాగరుసంమిశ్రం ధూపం చాత్ర వినిర్దిశేత్, దధ్యోదనం సఖండం చ నైవేద్యం భాస్కరప్రియమ్ ౪. తమేవ దద్యాద్విప్రేభ్యోఽశ్నీయాచ్చ తదను స్వయమ్, ధూపార్థం భాస్కరస్యైవ ప్రథమే పారణే విధిః. ౫. పలాశపుష్పాణి విభో ధూపో యః శక్య ఏవ చ, కర్పూరం చందనం కుష్ఠమగురుః సిహ్లకం తథా. ౬. సగ్రంథి వృషణం భీమ కుంకుమం గృఞ్జనం తథా, హారీతకీ తథా భీమ ఏష పతుక ఉచ్యతే. ౭. ధూపః ప్రబోధ అభీష్టో నైవేద్యం ఖండమండకాః, కృష్ణాగరుః సితం కంజం బాలకం వృషణం తథా౮. చందనం తగరో ముస్తా ప్రబోధశర్కరాన్వితా, భోజయేద్బ్రాహ్మణాంశ్చాపి

ద్రవ్యమ ప్రబోధ మనఁబడును. ఇట్లు పూజించి నివేదించిన ఖండమండక ములను బ్రాహ్మణుల కొసంగి తాను వేపాకుపసము బ్రాశించి యావల మానముతో భుజింపవలయును. ఇది రెండవ పారణంపువిధానము. మూఁడవపారణమున శుభ్రములగు నల్లకలువల నాదిత్యపూజకును గుగ్గి లము ధూపమునకును పాయసము నైవేద్యమునకు నుపయోగింపవల యును. ఇవి యాదిత్యునకుఁ బ్రీతికరములు. ఇట్లులే విలేపనమునకుఁ జంద నము నుపయోగింపవలయును. చందనోదకమునే ప్రాశనము చేయవల యును. ఇయ్యది యుత్తమమగు తృతీయపారణవిధిక్రమము ఈవ్రత మునఁ బొడఁదగిన దేవునిపావననామముల నెఱింగింతు వినుము. వీనిచే మానవు లెప్పుడును పవిత్రులగుదురు. విష్ణువు, భగుఁడు, ధాత యని నామముల వరుసగ మూఁడుపారణముల నుచ్చరించి ప్రీతుఁడవుఁగాత యని ప్రార్థింపవలయును ఈవిధిచొప్పున నియతచిత్తుఁడై యేమానవుఁ డీవ్రతము సల్పునో యాతఁడు సమస్తకామితములఁ బడసి శాశ్వత కాలము మోదమందును. తరువాత జన్మాంతమున సూర్యగృహమున కేగి సంతసించును. సంతోషము నొదవఁజేయు నీసప్తమిచరితమును నీ కెఱింగించితిని. ఇందుఁ దొల్త నుపవసించి యామీఁద భుజించువాఁడు సూర్యసన్నిధానమున నానంద మనుభవించును.

ఇది శతతమాధ్యాయము.

---

ఖండఖాద్యైర్గణాధిప, నింబపత్త్రం తు సంప్రాశ్య తతో భుంజీత వాగ్యతః. ౯. పార ణస్య ద్వితీయస్య విధిరేష ప్రకీర్తితః. ౧౦. నీలోత్పలాని శుభ్రాణి ధూపం గొగ్గులమా హరేత్, నైవేద్యం పాయసం దేయం ప్రీతయే భాస్కరస్య తు. ౧౧. విలేపనం చంద నం తు ప్రాశనే విధిరుచ్యతే, తృతీయస్యాపి తే వీర కథితో విధిరుత్తమః. ౧౨. శృణు నామాని దేవస్య పావనాని నృణాం సదా, విష్ణుర్భగస్తథా ధాతా ప్రీయతామిద్ది రేచ్ఛ వై. ౧౩. అనేన విధినా యస్తు కుర్యాత్ప్రయతమానసః, స కామానిహ సంప్రాప్య నందతే శాశ్వతీః సమాః, ౧౪. తతః సూర్యసదో గత్వా నందతే నందవర్ధన, ఏషా తు నందజననీ తవాఖ్యాతా మయా శివ. ౧౫. యాముపోష్య తతో భుక్త్వా నందతే హంస మాప్య వై. ౧౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే నందానామసప్తమీవర్ణనం నామ శతతమోఽధ్యాయః.

## ఏకాధికశతతమాధ్యాయము.

శుక్లపక్షసప్తమినాఁడు సూర్యుఁడు దేవతగ గలనక్షత్రము (హస్తానక్షత్రము) కలిసియున్నో ఆసప్తమి భద్రతిథి యనఁబడును. ఆనాఁడు దేవునకు ఘృతాభిషేకము చేయవలయును. అటులనే క్షీరాభిషేకము నిక్షురసాభిషేకము నొసంగవలయును. ఇట్టు లభిషేకించి చందనముతో మైపూఁతయొసంగవలయును. గుగ్గిలము దగులవైచి ధూప మొసంగవలయును ఆమీఁద మంగళము చేయింపవలయును. ఆమంగళమునందు స్వచ్ఛమై చంద్రునితో సమానమగు గోధుమచూర్ణమును వజ్రమును బెల్లమును జేర్చి నివేదింపవలయును. రక్తపుష్పములతో నలంకరింపవలయును. ఆ గోధుమచూర్ణముతోఁ జేసిన భద్రకమున నీశానమూలనున్న శిఖరమున ముత్యము లుంచవలయును. ఆగ్నేయమూలనున్న శిఖరమున మాణిక్యమునుగాని యెఱ్ఱనిమణినిగాని యుంచవలయును. నైరృతిమూలన మరకతము (మకరము)ను వాయవ్యమూలఁ బద్మరాగము నుంచవలయును. దాని నడుమ యథాశక్తిగ బంగారము నుంచవలయును. ఈవ్రతమునఁ జవితినాఁ డేకభుక్తమును పంచమినాఁడు నక్తవ్రతమును జేయవలయును. షష్ఠినాఁడు కోరకవచ్చినదానిం గొనవలయును. ఆమీఁద సప్తమినాఁ డుపవసింపవలయును. సప్తమినాఁ డుపవసించి విద్వాంసుఁడు పాషండులను విరుద్ధకర్మలు చేయువారిని బిల్లివలె వ్రతముసల్పువారిని చండాలురను కర్మవిఘ్నము చేయకుండునట్లు కాపాడుకొనవలయును. పగటినిద్రను విడువవలయును.

---

బ్రహ్మోవాచః—శుక్లపక్షే తు సప్తమ్యాం నక్షత్రం సవితుర్భవేత్, యదా ప్రథమతా చైవ తదా వై భద్రతాం వ్రజేత్. ౧. స్నపనం తత్ర దేవస్య ఘృతేన కథితం బుధైః, క్షీరేణ చ తథా వీర పునరిక్షురసేన చ. ౨. స్నాపయిత్వా తు దేవేశం చందనేన విలేపయేత్, దత్త్వా తు గుగ్గులం తస్య దద్యాద్భద్రం తథాగ్రతః. ౩. గోధూమచూర్ణం నివపన్విమలం శశిసన్నిభమ్, సవజ్రం సగుడం చైవ రక్తపుష్పోపశోభితమ్. ౪. యదస్య శృంగమైశానం తత్ర వై మౌక్తికం న్యసేత్, యదాగ్నేయం తత్ర మాణిక్యం న్యసేద్వా లోహితం మణిమ్. ౫. నైరృత్యే మకరం దద్యాద్వాయవ్యే పద్మరాగిణమ్, గాంగేయమంతతస్తస్య స్వశక్త్యా విన్యసేద్బుధః. ౬. చతుర్థ్యామేకభక్తం తు పంచమ్యాం నక్తమాదిశేత్, షష్ఠ్యామయాచితం ప్రోక్త ఉపవాసో హ్యతః పరః. ౭. పాషండినో వికర్మస్థాన్బైడాలవ్రతికాంత్యజాన్, సప్తమ్యాం పాలయేత్ప్రాజ్ఞో

ఈవిధిచే నేమానవుఁడు భద్రసప్తమీవ్రతము సల్పునో యాతని కెల్ల దేవతలు నెల్లప్పుడు భద్రములు గూర్చుచుందురు. ఈవ్రతమున భద్రము నొసంగుమానవునకు మంగళాకారుఁడగు సుతుఁడు జన్మించును.మంగళము నధిష్ఠించి యెల్లప్పుడు మంగళములందే నిలచియుండును. నావిని దిండి యిట్లను.భద్రమనఁగా నేమి? దీని కలంకార మెట్లు చేయవలయును? ఇటులొసంగిన నేమిఫలము గలుగును? ఏవిధి నద్దాని నొసంగవలయును? నాపుడు బ్రహ్మ యాతని కిట్లనియె. భద్రమనఁగా దేవలక్షణములుకలిగి సాటిలేని ప్రభావముగల వ్యోమమే యని యెఱుంగునది. సూర్యరూపమగు నద్దాని గ్రహించి ధరించి సర్వపాపములనుండి విముక్తుఁడగును. రాజనాల పిండితో నావునెయ్యి ఖండశర్కరయును జేర్చి నాల్గుమూలలు గల పిండము చేయవలయును. అందు మరియుఁ జాతుర్జాతకచూర్ణమును ద్రాక్షపండ్లును నారికేళఫలములును విశేషముగఁజేర్చి సుగంధముగఁ జేయవలయును. ప్రాజ్ఞుఁడగు మానవుఁ డాభద్రముయొక్క మధ్యభాగమున నింద్రనీలములను శక్తికొలఁది నుంచవలయును. పుష్పరాగమును మరకతమును, పద్మరాగమును సాటిలేని మాణిక్యమును వరుసగ నాలుగుమూలల నుంచవలయును. ఆభద్రమును వాచకుఁడగు బ్రాహ్మణునకుగాని, భోజకబ్రాహ్మణునకుగాని తుది నొసంగవలయును. ఈవిధి

---

దివా స్వాపం వివర్జయేత్. ౮. అనేన విధినా యస్తు కుర్యాద్వై భద్రసప్తమీమ్, తస్మై భద్రాణి సర్వాణి యచ్ఛంతి బుధవః సదా. ౯. భద్రం దదాతి యస్త్వస్యాం భద్రస్తస్య సుతో భవేత్, భద్రమాసాద్య భూతేశ సదా భద్రేణ తిష్ఠతి. ౧౦. దిండిరువాచ:—కోఽయం భద్ర ఇతి ప్రోక్తః కథం కార్యం ప్రభూషణమ్, దత్త్వా చ కిం ఫలం విద్యాద్విధినా కేన దీయతే. ౧౧. బ్రహ్మోవాచ:—వ్యోమ భద్రమితి ప్రోక్తం దేవచిహ్నమనూపమమ్, యద్ధృత్వేహ నరః సూర్యం ముచ్యతే సర్వకిల్బిషైః. ౧౨. శాలిపిండమయం కార్యం చతుష్కోణమనూపమమ్, గవ్యేన సర్పిషా యుక్తం ఖండశర్కరయాన్వితమ్. ౧౩. చాతుర్జాతకపూర్ణం తు ద్రాక్షాభిశ్చ విశేషతః, నాలికేరఫలైశ్చైవ సుగంధం చ గణాధిప. ౧౪. మధ్యేంద్రనీలం భద్రస్య న్యసేత్ప్రాజ్ఞః స్వశక్తితః, పుష్పరాగం మరకతం పద్మరాగం తథైవ చ. ౧౫. అనౌపమ్యం చ మాణిక్యం క్రమాత్కోణేషు విన్యసేత్, వాచకాయాథ వా దద్యాదథ వా భోజకే

నీవ్రతము నాచరించి యెవఁడు భద్రమునొసంగునో యాతఁడే సర్వభద్ర ముల సంపాదించి సూర్యమందిరమున కేగును. అటనుండి విమానా రూఢుఁడై నిశ్శంకముగ బ్రహ్మలోకమున కేగును. తేజమునను కాంతి లోను సూర్యకిరణముల కెనయై వెలుఁగున నాదిత్యునకెనయై బలమున గోపరుడగు నింద్రునకుఁ దుల్యుఁడై యట వసించి కాలాంతరము బుడమి కేతెంచి నిక్కముగ గోపతియగును. సూర్యునను గ్రహమున సర్వజ్ఞుఁడై రాజపూజితుఁడై యుండును. ఇయ్యది భద్రాసప్తమీవ్రతవిధానము. ఇం దుపవసించినమానవుఁడు బ్రహ్మలోకమును బొందును. ఈయాఖ్యా నము వినువారును జదువువారును నీవ్రతము చేయువారును భద్ర మును బొంది శాశ్వతబ్రహ్మపదముఁ జేరుచున్నారు. అని యీప్రకార ముగా మున్ను పితామహుఁడు సప్తమీవ్రతమును దిండికిఁ దెలిపెనని చెప్పి సుమంతువు మరల నిట్లనియె. రాజా! యీ సప్తమీవ్రతవిధాన మెల్ల నెఱిఁగినయంతవట్టు వినినవిధమున నీకెఱింగించియున్నాను. ఈ సప్తమీకల్పమునుగొని యేమానవుఁడు భూతలమునఁ గొన్నాళ్లు చరించి పిదప భయమునగాని కామముచేగాని విడనాడునో యాతఁడు మూఢుఁడై జాతిభ్రష్టుఁడగుచున్నాఁడు. కావున నోవీరా! నీ వీవ్రతమును విడువక ధరింపుము. ధరించి విడచితివేని యెత్తెక్కి పడుదువు. ఎవ్వఁడు

---

స్వయమ్. ౧౬. అనేన విధినా యస్తు కృత్వా భద్రం ప్రయచ్ఛతి, స హి భద్రాణి సంప్రాప్య గచ్ఛేద్గోపతిమందిరమ్.౧౭. బ్రహ్మలోకం తతో గచ్ఛేద్యానరూఢో నసంశయః, తేజసా గోజసంకాశః కాంత్యా గోజసమ స్తథా. ౧౮. ప్రభయా గోపతేస్తుల్య ఊర్జసా గోపరస్య చ, తస్మాదేత్య పునర్భూమౌ గోపతిః స్యాన్న సంశయః, ప్రసాదాద్గోపతేర్వీర సర్వజ్ఞాధిపపూజితః. ౧౯. ఇత్యేషాకథితా భీమ భద్రా నామేతి సప్తమీ, యాముపోష్య నరో భీమ బ్రహ్మలోకమవాప్నుయాత్ .౨౦. శృణ్వంతి యే పఠంతీహ కుర్వంతి చగణా ధిప, తే సర్వే భద్రమాసాద్య యాంతి తద్బ్రహ్మశాశ్వతమ్. ౨౧. సుమంతురువాచ.— ఇత్యుక్తవాన్పురా బ్రహ్మా దిండినే సప్తమీవ్రతమ్. ౨౨. మయాప్యుక్తం తవ విభో యథాజ్ఞాతం యథా శ్రుతమ్. ౨౩. గృహీత్వా సప్తమీకల్పం మానవో యస్తు భూతలే, త్యజేత్కామాద్భయాద్వాపి స జ్ఞేయః పతితోఽబుధః. ౨౩. తస్మాద్ధారయ తద్వీర న త్యాజ్యం సప్తమీవ్రతమ్, త్యజమానో భవేద్వీర ఆరూఢపతితో నరః. ౨౪. శ్రావయే

భక్తియుతుఁడై యీసప్తమీకల్పాఖ్యానమును వినుపించునో యాతఁ డశ్వమేధఫలమునొంది యామీఁదఁ బరమపదము నొందుచున్నాఁడు.

ఇది ఏకాధికశతతమాధ్యాయము.

---

## ద్వ్యధికశతతమాధ్యాయము.

ఈవిధముగ దేవదేవుఁడగు భాస్కరుని యీసప్తమియే భర్తకుఁ బెక్కురు భార్యలున్న నొక్కతె మిక్కిలి ప్రియమై యుండునట్లు సర్వతిథులు నాదిత్యునకు భార్యలైయున్నను నాతనికిఁ బ్రియమైనది. కావునఁ బ్రతిమానవుఁడు నీసప్తమినాఁడు దివాకరుని దప్పక పూజింపవలయును. నావుఁడు శతానీకుం డిట్లనియె అన్నితిథులకు నాదిత్యుఁడే యధిపతి యయ్యెనేని యేమికతంబునఁ బండితులు సప్తమినాఁడే సూర్యయాగము జేయుచున్నారు? అని యడుగ నాతనికి సుమంతుఁ డిట్లనియె. రాజా! మున్నీయర్థమును దేవుఁడగు పితామహునియొద్దకేగి శిరస్సుతో నమస్కరించి శ్రీకృష్ణదేవుఁ డడుగ నాతనికి బ్రహ్మ యెఱింగించెను. అది నీకెఱింగింతును. సావధానముగ నాకర్ణింపుము. మున్నొకప్పుడు సురజ్యేష్ఠుఁడగు లోకపితామహుఁడు సుఖాసీనుఁడై యుండ నాతనియొద్దకేగి నమస్కరించి భగ

---

వ్యస్తు భక్త్యా చ సప్తమీకల్పమాదితః, సోఽశ్వమేధఫలం ప్రాప్య తతో యాతి పరం పదమ్. ౭౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే భద్రాకల్పవర్ణనం నామ
ఏకాధికశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—ఏవం యా దేవదేవస్య సప్తమీ భాస్కరస్య తు, యథా బహూనాం భార్యాణాం భర్తుః కాచిత్ప్రియా భవేత్. ౧. సర్వాశ్చ తిథయో హ్యస్య ప్రియాః సూర్యస్య భారత, తస్మాదస్యాం నరేణేహ పూజనీయో దివాకరః. ౨. శతానీక ఉవాచ:—తిథీనామధిపః సూర్యః సర్వాసాం కథితో యది, సప్తమ్యామేవ యాగోఽస్య కిమర్థం క్రియతే బుధైః. ౩. సుమంతురువాచ:—ఇదమర్థం పురా పృష్టః సురజ్యేష్ఠో దివి స్థితః. విష్ణునా కురుశార్దూల తేనోక్తం హరయే యథా, తథా తే సర్వమాఖ్యాస్యే శృణుష్వైకమనా విభో. ౪. సుఖాసీనం సురజ్యేష్ఠం పురా దేవం పితా

వంతుఁడగు కృష్ణుఁ డిట్లనియె. 'బ్రహ్మా! భానుమంతుఁడు సర్వతిథులకు నధిపుఁడని స్మృతులు చెప్పుచున్నవి. అయినను సప్తమినాఁడే యేలఁ బూజింపఁబడుచున్నాఁ' డనవుడు సురజ్యేష్ఠుఁడు నవ్వుచు నావిష్ణున కిట్లనియె. మున్ను మహాత్ముఁడగు భాస్కరుఁడు సప్తమి యొకండుదక్క దక్కిన తిథులనెల్ల లెస్సగ నారాధించుటకై దేవతల కొసంగెను. ఏదేవత కేదినము నొసంగె నాదినమున కాతఁడే యధిపుఁడయి యున్నాఁడు. కావున నాయాదినముల నాయా నిజమంత్రములతోఁ బూజితుఁడై దేవుఁడు వరదుఁడగుచున్నాఁడు. నాఁతనికి విష్ణువిట్లనియె. సూర్యుఁడు మహాత్ముఁడై యేయేతిథుల నెవరి కొసంగెను? ఏయేస్వదినముల స్వమంత్రములచేఁ బూజితుఁడై ధ్రువముగ వరము లిచ్చుచున్నాఁడు? అని యడుగ నాదేవునకుఁ బితామహుఁ డిట్లనియె. అగ్నిదేవునకుఁ బ్రతిపత్తు (పాడ్యమి) నొసంగెను. బ్రహ్మకు విదియ నొసంగెను. తదియను యక్షరాజగు కుబేరున కిచ్చెను. చవితిని గణేశ్వరున కిచ్చెను. సర్పాధిపుఁడగు వాసుకికి పంచమి నిచ్చెను. షష్ఠిని గృత్తికాతనయుఁడగు సుబ్రహ్మణ్యున కొసంగెను. నడుమనున్న సప్తమిని మాత్రము తనకొఱకే యుంచుకొనెను. రుద్రదేవున కష్టమి నొసంగెను. నవమితిథిని దుర్గాదేవి కొసంగెను. యమధర్మరాజునకు దశమితిథి నొసఁగెను. విశ్వేదేవతల కెల్లప్పుడు నారాధనమునకై

---

మహామ్, ప్రణమ్య శిరసా దేవ కృష్ణో వచనమబ్రవీత్. ౫. యద్యేష భానుమాన్దేవ స్తిథీనామధిపః స్మృతః, కిమర్థం పూజ్యతే బ్రహ్మన్సప్తమ్యాం బ్రూహి మే విభో. ౬. ఏవముక్తః సురజ్యేష్ఠో విష్ణునా ప్రభవిష్ణునా, ప్రహస్య భగవాన్దేవ ఇదం వచనమబ్రవీత్. ౭. బ్రహ్మోవాచ:— దేవేభ్యస్తిథయోదత్తా భాస్కరేణ మహాత్మనా, ముక్త్వైకాం సప్తమీం సర్వాం సమ్యగారాధనేన వై. ౮. యస్యైవ యద్దినం దత్తం స తస్యైవాధిపః స్మృతః, స్వదినే పూజితస్తస్మాత్స్వమన్త్రైర్వరదో భవేత్. ౯. విష్ణురువాచ:— అర్కేణ కతరత్కస్మై దినం దత్తం మహాత్మనా, స్వదినే పూజితేఽస్మిన్నైవ స్వమన్త్రైర్జాయతే ధ్రువమ్. ౧౦. బ్రహ్మోవాచ:— అగ్నయే ప్రతిపద్దత్తా ద్వితీయా బ్రహ్మణే తథా, తృతీయా యక్షరాజాయ గణేశాయ చతుర్థ్యపి. ౧౧. పంచమీ నాగరాజాయ కార్తికేయాయ షష్ఠ్యపి, సప్తమీ స్థాపితాత్మార్థం దత్తా రుద్రాయ చాష్టమీ. ౧౨. దుర్గాయై నవమీ దత్తా యమాయ దశమీ స్వయమ్, విశ్వేభ్యశ్చాథ దేవేభ్యో దత్తా చైకాదశీ

యేకాదశి నొసంగెను. ద్వాదశిని విష్ణుఁడవగు నీకొసంగెను. త్రయోదశిని మన్మథున కొసంగెను. చతుర్దశిని శంకరున కొసంగెను. సోమునకుఁ బూర్ణిమనిచ్చెను పుణ్యమునిచ్చు నపరపక్షంపుఁ బదునైదవదినము (అమావాస్య)ను పితృదేవతల కిచ్చెను. మొదటఁ బదునైదు తిథులును చంద్రునివి. ఆతిథులన్నియుఁ గృష్ణపక్షమునఁ బైనఁ జెప్పిన దేవతలచేఁ బానము చేయఁబడుచున్నవి. అందు మిగిలిన యొకకళతోఁ బదునాఱుకళలు గలిగి నిండింపఁబడుచున్నవి. ఆయొక్కొక్కతిథియు నక్షయమైనది అందెల్లప్పుడు సాక్షాత్కరించి సూర్యుఁడున్నవాఁడు. ఇటులుండి యాదేవుఁడు క్షయమును వృద్ధిని జేయుచున్నాఁడు. కావున నాతిథుల కెల్ల నతఁడే యధిపతియని నుడువఁబడుచున్నాఁడు. భక్తుల ధ్యానమునందు మాత్రమే నిలచి యాదిత్యుండు భక్తులకు క్షీణింపనిగతి నొసంగుచున్నాఁడు. ఇతర దేవతలును వారివారితిథులయందుఁ బూజితులై యనాయాసముగ భక్తులయభీష్టములు నెరవేర్చుచున్నారు కృష్ణా! ఆఫలవిశేషములన్నియు సంగ్రహముగఁ దెలుపుదును వినుము. పాడ్యమినాఁ డగ్నికి యాగముసల్పి హవిస్సుతో హోమములుసలుపునేని యమృతరూపమగు ఘృతమును సమస్త ధాన్యములును మితిలేనిధనమును లభించును. విదియనాఁడు బ్రహ్మను బాగుగఁబూజించి యొక బ్రహ్మచారికి భోజనము పెట్టినేని యన్నిచదువుల నంతు కనుఁగొనువాఁడగును. తదియనాఁడు గుబేరుని బూజించి నిక్కువముగ ధనాఢ్యుఁడగును. క్రయవిక్రయవ్యవహారములలో నమితమగు

---

సదా. ౧౩. ద్వాదశీ విష్ణవే దత్తా మదనాయ త్రయోదశీ, చతుర్దశీ శంకరాయ దత్తా సోమాయ పూర్ణిమా. ౧౪. పితౄణాం భానునా దత్తా పుణ్యా పంచదశీ సదా, తిథ్యః పంచదశైతాస్తు సోమస్య పరికీర్తితాః. ౧౫. పీయతే కృష్ణపక్షే తు సురైరేభిర్యథోదితైః, శుక్లపక్షే ప్రపూర్యంతే షోడశ్యా కలయా సహ. ౧౬. అక్షయా సా సదైవైకా తత్ర సాక్షాత్స్థితో రవిః, క్షయవృద్ధికరో హ్యేవం తేనాసౌ తత్పతిః స్మృతః. ౧౭. దదాతి గతిమక్షీణాం ధ్యానమాత్రస్థితో రవిః, అన్యేప్సీష్టాన్యథా కామాన్ప్రయచ్ఛంతి సుఖేన వై. ౧౮. తథా సర్వం ప్రవక్ష్యామి కృష్ణ సంక్షేపతః శృణు, అగ్నిమిష్ట్వా చ హుత్వా చ ప్రతిపద్యమృతం ఘృతమ్, హవిషా సర్వధాన్యాని ప్రాప్నుయాదమితం ధనమ్. ౧౯. బ్రహ్మాణం చ ద్వితీయాయాం సంపూజ్య బ్రహ్మచారిణమ్, భోజయిత్వా చ విద్యానాం సర్వాసాం పారగో భవేత్.

లాభము కలుగును. చవితినాఁడు గణనాధుఁ బూజించినచో నెల్లకర్మలు విఘ్నములేకుండ సిద్ధించును. ఆతనిశత్రువులకు విఘ్నములు నిస్సంశయముగఁ గలుగును. పంచమినాఁడు నాగపూజయొనర్చి సర్పవిషముచే తిరస్కరింపఁబడఁడు. దానివలని భయములేదు. ఉత్తమవనితను బరిణయించును. సుపుత్రులఁగాంచును. గొప్పయైశ్వర్యము నాతనికి లభించును. షష్ఠినాఁడు కార్తికేయునిబూజించి పదుగురిలో శ్రేష్ఠుఁడగును. ధారణాశక్తి కలవాఁడగును మనోహరరూపుఁడగును. కీర్తిని బెనుచును. సప్తమినాఁడు రక్షకుఁడు నీశ్వరుఁడు చిత్రకిరణుఁడు నగుదివాకరు నారాధించి సురక్షితుఁడగును. అష్టమినాఁడు వృషభధ్వజుఁడగు రుద్రదేవుఁబూజించి యుత్తమజ్ఞానము నుత్తమశోభను బొందుచున్నాఁడు. ఆదేవుఁడు పూజితుఁడై మృత్యువునడంచి జ్ఞానమునొసంగును. బంధనముల నెడబాపును. నవమినాఁడు కోర్కితో దుర్గాదేవిని బూజించి యెల్లదుర్గములఁ దరించుచున్నాఁడు. యుద్ధములందును వ్యవహారములందును నెల్లప్పుడును విజయముగాంచుచున్నాఁడు. దశమినాఁడు యమునారాధించి ధ్రువముగ సర్వరోగముల హరించువాఁడగును ఆదేవుఁ డట్టివానిని నరకమునుండియు మృత్యువునుండియు నుద్ధరించుచున్నాఁడు. ఏకాదశినాఁడు శాస్త్రమునఁ జెప్పఁబడిన విశ్వేదేవతలు బాగుగఁబూజింపఁబడిరేని యుత్తమసంతానము పశుధనధాన్యములు భూములును లభించును. ద్వాదశినాఁ డీలోకమున

---

౨౦. తృతీయాయాం చ విత్తేశం విత్తాఢ్యో జాయతే ధ్రువమ్, క్రయాదివ్యవహారేషు లాభో బహుగుణో భవేత్. ౨౧. గణేశపూజనం కుర్యాచ్చతుర్థ్యాం సర్వకర్మసు, అవిఘ్నం విద్విషాం విఘ్నం కుర్యాచ్చాస్య న సంశయః. ౨౨. నాగానిష్ట్వా చ పంచమ్యాం న విషైరభిభూయతే, స్త్రియం చ లభతే పుత్రాన్పరాం చ శ్రియమాప్నుయాత్. ౨౩. సంపూజ్య కార్తికేయం తు షష్ఠ్యాం శ్రేష్ఠః ప్రజాయతే, మేధావీ రూపసంపన్నో దీర్ఘాయుః కీర్తివర్ధనః. ౨౪. సప్తమ్యాం పూజ్య రక్షేశం చిత్రభానుం దివాకరమ్, అష్టమ్యాం పూజితో దేవో గోవృషాభరణో హరః. ౨౫. జ్ఞానం దదాతి విపులం కాంతిం చ విపులాం తథా, మృత్యుహా జ్ఞానదశ్చైవ పాశహా చ ప్రపూజితః. ౨౬. దుర్గాం సంపూజ్య దుర్గాణి నవమ్యాం తరతీచ్ఛయా, సంగ్రామే వ్యవహారే చ సదా విజయమశ్నుతే. ౨౭. దశమ్యాం యమమాతిష్ఠేత్సర్వవ్యాధిహరో ధ్రువమ్, నరకాదథ మృత్యోశ్చ సముద్ధరతి మానవమ్. ౨౮. ఏకాదశ్యాం యథోద్దిష్టా విశ్వేదేవాః ప్రపూజితాః, ప్రజాం పశుం ధనం ధాన్యం ప్రయచ్ఛన్తి మహీం తథా. ౨౯.

విష్ణునారాధించి యెల్లకాలమును విజయశీలుఁడయి యుండును. సూర్యుని వలెను మహేశ్వరునివలెను సర్వలోకములను బూజింపఁబడుచుండును. త్రయోదశినాఁడు కామదేవునారాధించి ధ్రువముగ నందగాఁడై పుట్టును. తనమనమున కిష్టమై రూపవతియగుభార్యను జెట్టఁబట్టును. సంపూర్ణకాముఁడగును. చతుర్దశినాఁడు శంకరనాముఁడగు నీశ్వరునారాధించి సేవించుకొని సర్వైశ్వర్యముల నొందును చాలమంది కొడుకులను చాల ధనమును గలవాఁడగును. ఇందు దావంతేని సందియము లేదు. పూర్ణిమనాఁడు భక్తియుక్తుఁడై సోమునారాధించువాఁడు స్వర్గలోకమున కధిపతియగును. ఆతని కన్నియు సంపూర్ణములే యగును. కొంచెమేనియు క్షీణింపదు. స్వదినమగు నమావాస్యనాఁడు పూజితులై పితరులు సర్వకాలము లందును బ్రజావృద్ధి కలుగఁజేతురు. ధనము రక్షను బలము నాయువు నొసంగువా రగుదురు. ఉపవాసములు చేయకున్నను బూజచేతను హోమములచేతను సంతసించినవారగుచు నెల్లప్పుడు నాదేవతలు చెప్పిన ఫలముల నొసఁగుచున్నారు. మూలమంత్రములచేతను సంజ్ఞలచేత నంశమంత్రములచేతను గీర్తితులై యొసంగుచున్నారు. వెనుకటివలె నీదేవతలను గూడఁ బద్మమధ్యమున స్థాపింపవలయును. శక్తికొలఁది గంధపుష్పోపహారములచే నాంతరంగికముగ లేకున్నను బాహ్యాడంబరముచే విధ్యుక్తముగఁ బూజించినను ఫలముల నొసంగుదురు. చిత్తశాంతి గలిగి యాజ్యధారలచేతను సమిత్తులచేతను దధ్యన్నముచేతను క్షీరాన్నముచేతను

---

ద్వాదశ్యాం విష్ణుమిష్ట్వైవ సర్వదా విజయీ భవేత్, పూజ్యశ్చ సర్వలోకానాం యథా గోపతిగోకరః. ౩౦. కామదేవం త్రయోదశ్యాం సురూపో జాయతే ధ్రువమ్, ఇష్టాం రూపవతీం భార్యాం లభేత్కామాంశ్చ పుష్కలాన్. ౩౧. దృష్ట్వేశ్వరం చతుర్దశ్యాం సర్వైశ్వర్యసమన్వితః, బహుపుత్రో బహుధనస్తథా స్యాన్నాత్ర సంశయః. ౩౨. పౌర్ణమాస్యాం తు యః సోమం పూజయేద్భక్తిమాన్నరః, స్వాధిపత్యం భవేత్తస్య సంపూర్ణం న చ హీయతే. ౩౩. పితరః స్వదినే దిండే హృష్టాః కుర్వంతి సర్వదా, ప్రజావృద్ధిం ధనం రక్షాం చాయుష్యం బలమేవ చ. ౩౪. ఉపవాసం వినాప్యేతే భవంత్యుక్తఫలప్రదాః, పూజయా జపహోమైశ్చ తోషితా భక్తితః సదా. ౩౫. మూలమంత్రైశ్చ సంజ్ఞాభిరంశమంత్రైశ్చ కీర్తితాః, పూర్వవత్పద్మమధ్యస్థాః కర్తవ్యాశ్చ తిథీశ్వరాః. ౩౬. గంధపుష్పోపహారైశ్చ యథా శక్త్యా విధీయతే, పూజా బాహ్యేన విధినా కృతాపి చ ఫలప్రదా. ౩౭. ఆజ్యధారాసమిద్భిశ్చ దధిక్షీరాన్నమాక్షికైః,

తేనెచేతను హోమములుసలిపి జపమొనరించినచో మీాదజెప్పినఫలములు గలుగఁగలవు. జపమునకు మూలమంత్రములును అంగమంత్రముల నాయాదేవతల నామములఁ జేర్చి యుపయోగింపవలయును. భక్తి గలిగి చెప్పినచొప్పునఁ బండ్రెండుమాసములను బండ్రెండుయజ్ఞము లొనర్చిన వెనుకటిఫలములన్నియుఁ గలుగును. ఒకప్పు డధికముగఁగూడ గలుగును. మంత్రజ్ఞుఁడగు మానవుఁడు లోకమున నితని నాశ్రయించి యెవ్వఁడెట్టి సుఖములఁ బడయుచున్నాఁడో యటులనే యాయాదేవతలఁ బూజించి యాతిథియున్నంతవఱకును వారిలోకములందే నిలుచును. ఆదేవునను గ్రహమున నరిష్టములెల్ల నశించును. ఆదేవత కెనయగురూపము గలవాఁడగును. మంచిరూపము గలవాఁడగును. ధర్మశీలుఁడగును. శాత్రవుల నడఁగించి మహీపతి యగును. స్త్రీయైనను నపుంసకుఁడేయైనను బురుష శ్రేష్ఠుఁడై జన్మించును. కృష్ణా! నేనెఱింగించిన యీాతిథులన్నియు నక్షత్ర దేవతలగుచు నక్షత్రములందే యుండును వానియందే యుండి కోరిన కోర్కులనెల్ల నొసంగుచుండును. ఆతిథులను వానిఫలముల నెఱింగింతు వినుము. చంద్రుఁ డేనక్షత్రమున నెల్లప్పుడు మిగులవృద్ధిగలిగియుండునో యానక్షత్రము దేవతాయజ్ఞ మనఁబడును. ఆతిథి ఫలమునిచ్చును. నక్షత్రదేవతలను గూడ వరుసగ వివరింతు వినుము నక్షత్రములన్నియు వేత్త్వర యజ్ఞములగును. అందులో నశ్వినినక్షత్రమున నశ్వినీదేవతలను యజించి నరుఁడు దీర్ఘాయువగును. అన్నిరోగములు నశించును. భరణి

---

యథోక్తఫలదో హోమో జపః శాంతేన చేతసా. ౩౭. మూలమంత్రాశ్చ సఙ్జ్ఞాభి రంగమంత్రాశ్చ కీర్తితాః, కృత్వా యజ్ఞాన్దశ ద్వే చ ఫలాన్యేతాని భక్తితః. ౩౯. యథోక్తాని తథోక్తాని లభేతేహాధికాన్యపి, ఇహ యస్మాద్యథాన్యస్మిన్యో వసేద్యః సుఖీ సదా. ౪౦. తేషాం లోకేషు మంత్రజ్ఞో యావత్తేషాం తిథిః స్థితా, దహేత్తస్మాత్తథారిష్టం తద్రూపో జాయతే నరః. ౪౧. సురూపో ధర్మసంపన్నో క్షపితారిర్మహీపతిః, స్త్రీ వా నపుంసకో వాపి జాయతే పురుషోత్తమః. ౪౨. ఇత్యేతాః కథితాః కృష్ణ తిథయో యా మయా తవ, నక్షత్రదేవతాః సర్వా నక్షత్రేషు వ్యవస్థితాః. ౪౩. ఇష్టాన్కామాన్ప్రయ చ్ఛన్తి యాస్తా వక్ష్యే మహీధర, చంద్రమా యత్ర నక్షత్రే మహావృద్ధ్యా స్థితః సదా. ౪౪. ఉక్తస్తు దేవతాయజ్ఞస్తదా సా ఫలదా భవేత్, దేవతాశ్చ ప్రవక్ష్యామి నక్షత్రాణాం యథాక్రమమ్. ౪౫. నక్షత్రాణి చ సర్వాణి యజ్ఞాశ్చైవ పృథక్పృథక్,

నక్షత్రమున యముని శుభకరములగు నల్లనికుసుమములచేతను శుభ్రములగు గంధములచేతను బూజించినచో నకాలమరణము దుర్మరణమును గలుగనేరవు. కృత్తికానక్షత్రమున నగ్నిహోత్రుని రక్తమాల్యాదుల చేతను హోమములచేతను బూజించినచో ధ్రువమగుఫలము నొసంగును. రోహిణీనక్షత్రమునఁ బ్రజాపతినిబూజించినచో యజించినచోఁ బశుధనము లభించును. మృగశీర్షమున సోమునారాధించిన నెల్లప్పుడు నారోగ్యవంతుఁ డగును. జ్ఞానవంతుఁ డగును. ఆర్ద్రానక్షత్రమున రుద్రు నారాధించి విజయము గాంచును. దివ్యరూపముగల పద్మాదులతోఁబూజింప నాదేవుఁడు శుభములనిచ్చును. అటులనే పునర్వసునక్షత్రమున నదితి దేవలోకమున నెల్లప్పుడుఁ బూజింపఁబడుచున్నది. బృహస్పతి యారాధింప సంతసించి యాతనిని జననివలెఁ బాలించుచున్నది. పుష్యమి నక్షత్రమున బృహస్పతి పూజితుఁడై విస్తారమై శుభకరమగు బుద్ధి నొసంగుచున్నాఁడు. ఆశ్రేషానక్షత్రమునఁ బాములకు గీతగంధాదులతో న్యాయప్రకారముగ స్వచ్ఛములై మధురములగు భక్ష్యములచేఁ బూజించి తృప్తిఁజేసినచో నెల్లప్పుడు రక్షించుచుందురు. మాంసాదులచేఁ బ్రీతులై యాతనికిఁ బ్రీతిఁజేయుదురు మఘానక్షత్రమున హవ్యకవ్యములచేఁ బూజింపఁబడి పితృదేవతలందఱు ధనధాన్యములను

---

అశ్విన్యామశ్వినావిష్ట్వా దీర్ఘాయుర్జాయతే నరః. ౪౬. వ్యాధిభిర్ముచ్యతే క్షిప్రమత్యర్థం వ్యాధిపీడితః, భరణ్యాం యమ ఉద్దిష్టః కుసుమైరసితైః శుభైః. ౪౭. తథా గన్ధాదిభిః శుభ్రైరపమృత్యోర్విమోచయేత్. ౪౮. అనలః కృత్తికాయాం తు ఇహ సంపూజితః పరః, రక్తమాల్యాదిభిర్దద్యాత్ఫలం హోమేన చ ధ్రువమ్. ౪౯. పూజ్యః ప్రజాపతిః ప్రీత ఇష్టో దద్యాత్పశూంస్తథా, రోహిణ్యాం దేవశార్దూల పూజనాదిహ గోపతే, మృగశీర్షే సదా సోమో జ్ఞానమారోగ్యమేవ చ. ౫౦. ఆర్ద్రాయాం తు శివం పూజ్య పశ్చాద్విజయమాప్నుయాత్, పద్మాదిభిః స దివ్యైశ్చ పూజితః శం ప్రయచ్ఛతి. ౫౧. తథా పునర్వస్వదితిః సదా సంపూజ్యతే దివి, గురుణా తర్పితా చైవ మాతేవ పరిరక్షతి. ౫౨. పుష్యే బృహస్పతిర్బుద్ధిం దదాతి విపులాం శుభామ్, గీతైర్గంధాదిభిర్నాగా ఆశ్లేషాయాం ప్రపూజితాః. ౫౩. తర్పితాశ్చ యథాన్యాయం భక్ష్యైర్మధురైః సితైః, రక్షామిషాదిభిస్తైస్తైః ప్రీతిం కుర్వంతి మానద. ౫౪. మఘాసు పితరః సర్వే హవ్యైః కవ్యైశ్చ

భృత్యులను పుత్రపశువుల నొసంగుదురు. పూర్వఫల్గునీనక్షత్రమునఁ బూషనాముఁడగు సూర్యుఁడు మంగళకరములగుపుష్పాదులచేఁ బూజింపఁబడియు యజింపఁబడియు విజయము గూర్చుచున్నాఁడు. ఉత్తరఫల్గునిలోఁ బూజితుఁడై జ్ఞానము నొసంగుచున్నాఁడు. కన్య పూజించినచో నిష్టమగు మగని గూర్చును. పురుషునకు రూపవతియై యనుకూలయగుభార్య నొసంగును. ఈజన్మమున సురూపమును ధనమును సంపత్తును గలుగును. సమస్తతేజస్సులకు నిధియగు సవితృదేవుని హస్తానక్షత్రమున నానారకములగు గంధపుష్పాదులతోఁ బూజించి విపులధనము గలవాఁడగును. చిత్తానక్షత్రమున త్వష్టృదేవత నారాధింప నిష్కంటకమగు రాజ్యము లభించును. స్వాతీనక్షత్రమున వాయువునుబూజించి తృప్తివరుప నుత్తమమగుబలము కలుగును. విశాఖానక్షత్రమున నెఱ్ఱపువ్వులతో నింద్రాగ్నులను బూజింప ధనధాన్యములు లభించును. ఎల్లప్పుడును తేజోవంతుఁడై యుండును. అనూరాధానక్షత్రమున మిత్రనాముఁడగు సూర్యుని రక్తపుష్పములతోఁ బూజించి యైశ్వర్యవంతుఁ డగును. చిరకాలము జీవించును జ్యేష్ఠానక్షత్రమున వెనుకటివలె నింద్రునారాధించి పుష్టిగలవాఁడగును. గుణములనుగర్మలనుధనమునను నెల్లరకుఁ బెద్దవాఁడగును. మూలానక్షత్రమున దేవతలను పితరులనందఱను వెనుకటివలె భక్తితోఁ బూజించి వెనుకటివలె ఫలముగాంచును. స్వర్గలోకమున శాశ్వ

---

పూజితాః, ప్రయచ్ఛంతి ధనం ధాన్యం భృత్యాన్పుత్రాన్పశూం స్తథా. ౫౫. ఫాల్గున్యా మథ వై పూషా ఇష్టః పుష్పాదిభిః శుభైః, పూర్వాయాం విజయం దద్యాదుత్తరాయాం భగం తథా. ౫౬. భర్తారమీప్సితం దద్యాత్కన్యాయై పురుషాయ తామ్, ఇహ జన్మని యుంజ్యేత రూపద్రవిణసంపదా. ౫౭. పూజితః సవితా హస్తే విశ్వతేజోనిధిః సదా, గంధపుష్పాదిభిః సర్వం దదాతి విపులం ధనమ్. ౫౮. రాజ్యం తు త్వష్టా చిత్రాయాం నిఃసపత్నం ప్రయచ్ఛతి, ఇష్టః సంతర్పితః ప్రీతః స్వాత్యాం వాయుర్బలం పరమ్. ౫౯. ఇంద్రాగ్నీ చ విశాఖాయాం జాతరక్తైః ప్రపూజ్య చ,ధనధాన్యాని లబ్ధ్వేహ తేజస్వీ నివసేత్సదా. ౬౦. రక్తైః కిం త్రమనూరాధాస్వేవం సంపూజ్య భక్తితః, శ్రియో భజంతి సర్వేషాం చిరం జీవంతి సర్వదా. ౬౧. జ్యేష్ఠాయాం పూర్వవచ్ఛక్రమిష్ట్వా పుష్టిమవాప్నుయాత్, గుణైర్జ్యేష్ఠశ్చ సర్వేషాం కర్మణా చ ధనేన చ. ౬౨. మూలే దేవపితౄన్సర్వాన్భక్త్యా సంపూజ్య పూర్వవత్, పూర్వవత్ఫలమాప్నోతి స్వర్గస్థానే

తముగ వసించును. పూర్వాషాఢానక్షత్రమున సద్దేవతను వెనుకటివలె హోమములతోఁ బూజించిన శారీరములుగాని మానసములుగాని యగు సంతాపములను బాయుచున్నాఁడు. ఉత్తరాషాఢయందు విశ్వేదేవతలను విశ్వేశ్వరుని బుష్పాదులచేఁబూజించి యెల్లకోర్కులు బొందుదురు. శ్రవణ నక్షత్రమున విష్ణుని దెలుపు పసుపునీలవర్ణము గలపుష్పములతోఁ భక్తిగ నారాధించి లక్ష్మిని విజయమును బొందుచున్నాఁడు. ధనిష్ఠానక్షత్రమున వసువులను యజించి యొక్కెడనేనియు భయములేనివాఁడగును శుభము లగు గంధపుష్పాదులతోఁ బూజించి గొప్పభయమునుండి విడువఁబడును. శతభిషక్‌నక్షత్రమున నింద్రునారాధించి వ్యాధినిర్ముక్తుఁడగును, ఇది నిక్కువము. రోగార్తుఁడగువాఁడు నిక్కముగ నారోగ్యవంతుఁడై బల యుతుఁడై యైశ్వర్యమును బొందుచున్నాఁడు. పూర్వాభాద్రయందు శుద్ధమగుస్ఫటికముతో సమానముగనున్న యజుని బూజించి యుత్తమ భక్తిని విజయమును గాంచుచున్నాఁడు. ఉత్తరాభాద్రయందు మహా శ్వాస నహిర్బుధ్న్యనాము నారాధించి యుత్తమమగుశాంతిని బొందును. రేవతీనక్షత్రమునఁ బూషనాముఁడగు సూర్యుని శుభములగు శ్వేతపుష్ప ములచే నెల్లప్పుడు బూజించువారు మర్యాదయును ధైర్యమును గలిగి విజయము గాంచుచున్నారు. ఈయజ్ఞములన్నియు నీకే యేను సంక్షేప ముగ జితేంద్రియులగు మానవులహితమునకై యెఱింగించితిని. ఇవి

ధ్రువో భవేత్. ౬౩. పూర్వాషాఢే హ్యాపః పూజ్యా హుత్వా తత్రైవ పూర్వవత్, సంతాపాన్ముచ్యతే క్షిప్రం శారీరాన్మానసా త్తథా. ౬౪. ఆషాఢాసు తథా విశ్వానుత్తరా షాఢయోగతః, విశ్వేశం పూజ్య పుష్పాద్యైః సర్వమాప్నోతి మానవః. ౬౫. శ్రవణే తు సితైర్విష్ణుం పీతైర్నీలైశ్చ భక్తితః, సంపూజ్య శ్రియమాప్నోతి పరం విజయమేవ చ. ౬౬. ధనిష్ఠాసు వసూనిష్ట్వా నభయం భజతే క్వచిత్, మహతోఽపి భయాన్ముక్తైర్గంధ పుష్పాదిభిః శుభైః. ౬౭. ఇంద్రం శతభిషాయాం చ వ్యాధిభిర్ముచ్యతే ధ్రువమ్, ఆతురః పుష్టిమాప్నోతి స్వాస్థ్యమైశ్వర్యమేవ చ. ౬౮. అజం భాద్రపదాయాం తు శుద్ధస్ఫటికసన్నిభమ్, సంపూజ్య భక్తిమాప్నోతి పరం విజయమేవ చ. ౬౯. ఉత్తరాయా మహిర్బుధ్న్యం పరాం శాంతిమవాప్నుయాత్, రేవత్యాం పూజితః పూషా దదాతి సతతం శుభమ్, సితైః పుష్పైః స్థితిం ధైర్యం ధృతిం విజయమేవ చ. ౭౦. తవైతే

యన్నియు నక్షత్రదేవతాయజ్ఞము లనఁబడును. ఇవి యన్నియు భక్తి గలిగి డబ్బుకొలఁది యారాధితములై యెల్లప్పుడు ఫలమునొసంగును. ప్రారబ్ధము గడుపుటకుఁగాని క్రియలను పూర్తిజేయుటకుఁగాని యభిలాష కలిగెనేని యీనక్షత్రదేవతాయజ్ఞముల నాచరింపవలయును. ఆమీఁదనే యాకర్మల నారంభింపవలయును. ఇట్టు లొనరించినచో సూర్యుని రథయాత్రకగు ఫలముగలుగును. ప్రయాణములును గర్మలును ఫలించును. అని యీవృత్తాంతము సూర్యుఁడే వచించెను. యజ్ఞమొనరించుచు విజయమును గ్రియాపూర్తి నిష్టప్రకారముగఁ జేయఁగలరు. కాలచక్రమున నాదిత్యునిగాని మేషాదిరాశిచక్రమునఁ గళాత్ముఁడగు నాదిత్యునిగాని సమస్తతేజోనిధిని ధ్యానించి యిచ్ఛచొప్పున నెల్లకార్యములు చేయవచ్చును. క్రియలచే శాస్త్రముల జెప్పిన నైశ్వర్యములెల్లఁ గలుగును. చెప్పినక్రియలన్నియు యత్నముతో నిర్వర్తించి యోగముచే ముక్తిని సాధింపవలయును సూర్యారాధనమువలననైనను ముక్తి గలుగును. కావున భక్తితో నీవు రవి నారాధింపుము. రాత్రింబవళ్లును యాగము, పూజ, నమస్కారము, శుశ్రూష, పలువిధములగు వ్రతములు నుపవాసములు బ్రాహ్మణతర్పణములు మొదలగువానిచే సూర్యునిహృద

సమాఖ్యాతా యజ్ఞాః సంక్షేపతో మయా, నక్షత్రదేవతానాం చ సాధకానాం హితాయ వై, భక్త్యా విత్తానుసారేణ భవంతి ఫలదాః సదా. ౨౧. గంతుమిచ్ఛేదనంత్యం వా క్రియాం ప్రారబ్ధమేవ చ, నక్షత్రదేవతాయజ్ఞం కృత్వా తత్సర్వమాచరేత్. ౨౨. ఏవం కృతే హి తత్సర్వం యాత్రాఫలమవాప్నుయాత్, క్రియాఫలం చ సంపూర్ణమిత్యుక్తం భానునా స్వయమ్. ౨౩. యజ్ఞాత్స విజయం కుర్యాత్క్రియాం కుర్యాద్యథేప్సితామ్, కాలచక్రేఽథ వా సూర్యం రాశిచక్రే కళాత్మనా. ౨౪. విశ్వతేజోనిధిం ధ్యాత్వా సర్వంకుర్యాద్యథేప్సితమ్, విభూతిరేషా చోద్దిష్టా క్రియాభిః సాధ్యతే ధ్రువమ్. ౨౫. ఉద్దిష్టాభిః ప్రయత్నేన ముక్తియోగేన సాధ్యతే, భానోరారాధనాద్వాపి ప్రాప్యతే ముక్తిరేవ హి, తస్మాదారాధయ రవిం భక్త్యా త్వం మధుసూదన. ౨౬. ఇజ్యా పూజా నమస్కారశుశ్రూషాభిరహర్నిశమ్, వ్రతోపవాసైర్వివిధైర్బ్రాహ్మణానాం చ తర్పణైః. ౨౭. యః కారయతి దేవార్చాం హృదయాలంబనం రవేః, స నరో భానుసాలోక్య

యమున కాధారమగు దేవార్చనము నెవఁడు చేయించునో యాతఁడు గతకల్మషుఁడై సూర్యసాలోక్యము నొందుచున్నాఁడు.

ఇది ద్వ్యధికశతతమాధ్యాయము.

---

## త్ర్యధికశతతమాధ్యాయము.

బ్రహ్మ యిట్లనియె. "వాసుదేవా! భక్తి కలిగి యేమానవుఁడేని సూర్యునకు దేవాలయము నొకదాని దిరముగఁ గట్టించెనేని యాతఁడు తనవంశమున నేడుతరములవారిని సూర్యలోకములఁ జేర్పఁగలుగుచున్నాఁడు. ఎన్నియేండ్లు సూర్యదేవాలయమున నెవ్వఁడు దేవతార్చనముచేయునో, ఆతఁ డన్నివేలయేం డ్లాదిత్యలోకమున వసించి ముదముగాంచును. అన్నిలక్షణములతోఁ గూడి యెవనిగృహమున దేవతార్చనవిధి యెల్లప్పుడు దరుగకయుండునో యెవనిచిత్తము నిష్కామమయి యుండునో యాతఁడు సూర్యసమానుఁ డగుచున్నాఁడు. మిగుల సువాసనగలిగి మనోహరములగు పుష్పముల నేమానవుఁడు చిత్తము నాదిత్యునందుఁజేర్చి యాతనికొసంగునో, పలువిధంగులగు నాయాధూపములను పరిమళముగల మైపూతలను దీపములను బలులను కానికలను తనకిష్టములగు నితరవస్తువులను నేమానవుఁ డొసంగునో యాతఁ డనుదినము నాదిత్యారాధనయజ్ఞమువలనఁ దనయభీష్టముల నెల్లఁ బొందుచున్నాఁడు.

---

ముపైతి గతకల్మషః. ౭౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే నక్షత్రపూజావిధివర్ణనం నామ
ద్వ్యధికశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—యశ్చ దేవాలయం భక్త్యా భానోః కారయతే స్థిరమ్, స సప్త పురుషాన్లోకాన్భానోర్నయతి మానవః. ౧. యావంత్యబ్దాని దేవార్చా రవేస్తిష్ఠతి మంగిరే, తావద్వర్ష సహస్రాణి సూర్యలోకే స మోదతే. ౨. దేవార్చా లక్షణోపేతా యద్గృహే సంతతో విధిః, నిష్కామం వా మనో యస్య స యాతి రవిసామ్యతామ్. ౩. పుష్పాణ్యతిసుగంధీని మనోజ్ఞాని చ యః పుమాన్, ప్రయచ్ఛతి హి దేవేశం తద్భావగతమానసః. ౪. ధూపాంశ్చ వివిధాంస్తాంస్తాన్గంధాఢ్యం చానులేపనమ్, దీపబల్యుపహారాంశ్చ యచ్చాభీష్టమథాత్మనః. ౫. నరఃసోఽనుదినం యజ్ఞాత్సౌరిర్హిత్యారాధనా

యజ్ఞేశ్వరుఁడయి యుండుకతన భగవంతుఁ డగునాదిత్యుఁడు యజ్ఞముల చేతఁ గూడ సంతోషించుచున్నాఁడు. యజ్ఞములు చేయుటకుఁ జాల సాధనములు వలసియున్నవి. చాలగ ద్రవ్యములు సరకులు కావలసియున్నవి. కావున యజ్ఞములన్నియు ధనవంతులు సంఘబలముకలవారు నగు మానవులచేఁ జేయఁదగియున్నవి. పూజయన్ననో యేమానవులైనను జేయనలవియైనవి. భక్తి కలిగి దూర్వాంకురములచేత నేనియుఁ బూజింప నాదిత్యునను గ్రహంబున నిఖిలయజ్ఞములచేఁ గూడఁ బొందరాని యుత్తమ ఫలము కలుగును. కావున నోవాసుదేవా! యేపుష్పము లేభక్ష్యములు నేధూపము లేగంధము లేయనులేపనము లేయాభరణము లేరంగు వస్త్రము లేనైవేద్యము లేఫలము లాదేవునకుఁ బ్రీతిజనకములో వాని నన్నింటిని భక్తితో నాదేవునకుఁ గల్పింపుము. ఆతనియందే మనసు నిలుపుము. సమస్తప్రపంచమునకు మొదటివాఁడగు నాయజ్ఞపురుషుని శక్తి కొలఁది సంతోషపరుపుము. ఇటు లారాధించి మందిరమున స్థాపించిన యాదేవుని బవిత్రతీర్థోదకములచేతను గంధములచేతను మధుసర్పిస్సుల చేతను క్షీరముచేతను జిత్రభానుఁడగు దివాకరదేవు నభిషేకింపవలయును. ఇట్లు లభిషేకించినమానవుఁ డీలోకమునఁ బెరుఁగుపాలు సమృద్ధిగ గలిగియుండి మధుస్రావముగల స్వర్గలోకములఁ బొంది శాశ్వతానందము నొందుచున్నాఁడు. స్తోత్రములచేతను గానములచేతను వాద్యముల చేతను బ్రాహ్మణతర్పణములచేతను నేకాగ్రచిత్తుండవై యావిభావసు

---

ద్రవైః, యజ్ఞైశ్చ భగవాన్భానుర్మఖైరపి చ తోష్యతే. ౬. బహూపకరణా యజ్ఞా నానాసంభారవిస్తరాః, ప్రాప్యంతే తైర్ధనయుతైర్మనుష్యైర్లోకసంచయైః. ౭. భక్త్యా తు పురుషైః పూజా కృతా దూర్వాంకురైరపి,రవేర్దదాతి హి ఫలం సర్వయజ్ఞైః సుదుర్లభమ్. ౮. యాని పుష్పాణి భక్ష్యాణి ధూపగంధానులేపనమ్, దయితం భూషణం యచ్చ రక్తకే చైవ వాససీ. ౯. యాని చాభ్యుపహారాణి భక్ష్యాణి చ ఫలాని చ, ప్రయచ్ఛ తాని దేవేశ భవేథాశ్చైవ తన్మనాః. ౧౦. ఆద్యం తం యజ్ఞపురుషం యథాశక్త్యా ప్రసాదయ, ఆరాధ్య స్థాపితం దేవం తస్మిన్నేవ నరాలయే. ౧౧. పుణ్యైస్తీర్థోదకైర్గంధైర్మధునా సర్పిషా తథా, క్షీరేణ స్నాపయేద్దేవం చిత్రభానుం దివాకరమ్. ౧౨. దధిక్షీరహ్రదాన్యాతి స్వర్గలోకాన్మధుచ్యుతాన్, ప్రయాస్యతి యదుశ్రేష్ఠ నిర్వృతిం వాపి శాశ్వతీమ్. ౧౩. స్తోత్రైర్గీతైస్తథా వాద్యైర్బ్రాహ్మణానాం చ తర్పణైః, మన

నారాధింపుము. మున్నీవిధముగఁ బూజించి విదేహదేశీయులు డెబ్బ
దేడ్వురు పురుషులును హైహయులు నేఁబదుండ్రు నమరత్వమును బొందిరి.
కావున నీవు నీవిధముగ నుపవాసాదులచే నాదిత్యుని సంతోషపఱుపుము
ఆతఁడు సంతుష్టుఁడై శాంతి నొసంగువాఁడు. నావుడుఁ గృష్ణుం డో ప్రజా
పతీ! ఉపవాసములచే నాదిత్యుఁ డెట్లు సంతసించుచున్నాఁడు? ఆతని
కెట్లు పరిచర్య చేయవలయును? ఉపవాస మొనర్చువాఁ డేయేపనులు
చేయవలయును? ప్రతిమానవుఁడు నాదిత్యారాధనమున నెప్పుడెప్పు
డేయే కార్యములు చేయవలయునో విస్తరముగ దానినంతను వచింప
నర్హుఁడవు" అనవుడు విధాత యాతని కిట్లనియె. ఉపవాసాదులు లేక
యైహికభోగాసక్తులయి యుండువారైనను స్మరించి ధూపపుష్పాదు
లతో నెల్లప్పుడుఁ బూజింప నాదిత్యుఁడు ప్రసన్నుఁడై యుపకార
మొనర్చుచుండ నిఁక నిత్యోపవాసములు చేయువారలకుఁ బ్రసన్నుఁడై
యుపకరించుటనుగూర్చి వేఱుగఁ జెప్పవలయునా? ఉపవాసమనఁగాఁ "బాప
ములనుండి మరలి గుణములతోఁ గూడి యుండుట" యని గదా చెప్పు
చున్నారు. ఐహికభోగములన్నియు విడిచిననే గదా యది చేకూరును.
ఒక రేయుఁబవలుగాని, లేక రెండుగాని, మూఁడుగాని, రేయుంబవళ్లుప
వాస మొనరించి భక్తితో నాదిత్యు నేమానవుఁడు ధ్యానించునో,
యాతని దివ్యనామములనే యజించుచు నాతనిపనులు చేయుచు నాతని

---

స్త్వైకతాయోగాదారాధయ విభావసుమ్. ౧౪. ఆరాధ్య తం విదేహానాం పురుషాః
సప్తసప్తతిః, హైహయానాం చ పంచాశదమృతత్వం సమాగతాః. ౧౫. స త్వమేభిః
ప్రకారైస్తముపవాసైస్తు భాస్కరమ్, సంతోషయహి తుష్టోఽసౌ భానుర్భవతి శాంతిదః.
౧౬. కృష్ణ ఉవాచ:—ఉపవాసైశ్చిత్రభానుః కథం తుష్టః ప్రజాయతే, పరిచర్యా
కథం కార్యా యా కార్యా చోపవాసినా. ౧౭. యద్యత్కార్యం యదా
చైవ భానోరారాధనం నరైః, తత్సర్వం విస్తరాద్బ్రహ్మన్యథావద్వక్తుమర్హసి. ౧౮.
బ్రహ్మోవాచ:—స్మృతః సంపూజితో ధూపపుష్పాద్యైః స సదా రవిః, భోగినాముప
కారాయ కిం పునశ్చోపవాసినామ్. ౧౯. ఉపావృత్తస్తు పాపేభ్యో యస్తు వాసో
గుణైః సహ, ఉపవాసః స విజ్ఞేయః సర్వభోగవివర్జితః. ౨౦. ఏకరాత్రం ద్విరాత్రం
వా త్రిరాత్రమథ వా హరే, ఉపవాసీ రవిం యస్తు భక్త్యా ధ్యాయతి మానవః. ౨౧.
తన్నామయాజీ తత్కర్మరతస్తద్గతమానసః, నిష్కామః పూజయిత్వా తం పరం బ్రహ్మాధి

యందే మనంబు నిలిపియుండునో, నిష్కాముఁడై యుండునో యాతఁడు
పూజాప్రభావమున నాపరబ్రహ్మంబునే బొందును. మఱియు నెవ్వఁ
డేనియు నొకకోర్కి మనంబునఁ దలఁచి భాస్కరునందుఁ జిత్తముఁ జేర్చి
యుపవసించెనేని ప్రసన్నుఁడగు మహేశ్వరుననుగ్రహమున నాకోర్కి
నాతఁడు బడయఁగలఁడు. నానతనికిఁ గృష్ణుఁ డిట్లనియె. "సంసారమను
గోతిలోఁ బడి దరిగానకయున్న బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులకును
స్త్రీలకును సద్గతి గల్గు టెట్లు?" అని యడుగ నతనికి బ్రహ్మ యిట్లనియె.
వాసుదేవా! చెప్పెదను వినుము. జగన్నాథుఁడును చీఁకటుల నడంచు
వాఁడు నగు భాస్కరుని నకల్మషచిత్తముతో నారాధించి సద్గతిని బొంద
నగును. ఎవనిచిత్తము కాంతాదివిషయములకుఁ జిక్కి భాస్కరార్పితము
కాదో పాపాత్ముఁడగు నానరున కెప్పగిది సద్గతి గలుగును? సంసారదుఃఖ
మునఁ బీడింపఁబడియుండుకతనసద్గతిఁబొందఁగోరుదేని సర్వేశ్వరుఁడు లోక
పూజితుఁడునగు గ్రహరాజు నారాధింపుము. ఉపవాసరతుండవై సుగంధ
ములగు పుష్పములచేతను, మనోజ్ఞములగు చందనాగరుధూపముల
చేతను,వస్త్రాలంకార భక్ష్యములచేతను బూజింపుము.సంసారదుఃఖితుఁడవై
సద్గతిగోరుదేని కాలనాథునారాధింపుము. నీవేదేని కోరియున్నను చిత్తము
నాతనియందుఁ జేర్చి యాదిత్యు నారాధింపుము. పుష్పములు లభింప
కున్నఁ బ్రశస్తవృక్షములచిగురాకులచే నర్చింపుము. అవియు లేకున్న

గచ్ఛతి. ౨౨. యశ్చ కామమభిధ్యాయ భాస్కరార్పితమానసః, ఉపోషతి తమాప్నోతి
ప్రసన్నే తు వృషధ్వజే. ౨౩. శ్రీకృష్ణ ఉవాచః—బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైః
శూద్రైః స్త్రీభిస్తథా విభో, సంసారగర్తపంకస్థైః సుగతిః ప్రాప్యతే కథమ్. ౨౪.
బ్రహ్మోవాచః—అథారాధ్య జగన్నాథం భాస్కరం తిమిరాపహమ్, నిర్వ్యలీకేన
చిత్తేన ప్రయాస్యతి చ సద్గతిమ్. ౨౫. విషయగ్రాహవైషమ్యం న చిత్తం భాస్కరా
ర్పణమ్, స కథం పాపకర్తా వై నరో యాస్యతి సద్గతిమ్. ౨౬. యది సంసార
దుఃఖార్తః సుగతిం గంతుమిచ్ఛసి, తదారాధయ సర్వేశం గ్రహేశం లోకపూజితమ్.
౨౭. పుష్పైః సుగంధైర్హృద్యైశ్చ ధూపైః సాగురుచందనైః, వాసోవిభూషణైర్భక్ష్యై
రుపవాసపరాయణః. ౨౮. యది సంసారనిర్వేదాదభివాంఛసి సద్గతిమ్, తథారాధయ
కాలేశం యచ్చేష్టం తవ చేతసా. ౨౯. పుష్పాణి యది తేన స్యుః శస్తం పాదపపల్లవైః

దూర్వాంకురములచేతనైనను సూర్యునారాధింపుము. తనయైశ్వర్యము ననుసరించి పత్రపుష్పములచేత నుదకములచేతను ధూపములచేతను భక్తితో నేకాగ్రచిత్తులై యారాధించువారిగూడ నాదిత్యుఁడు మిగుల సంతోషించుచున్నాఁడు. ఎల్లప్పుడు నాదిత్యమందిరమున సంమార్జనము చేయునరుఁ డాధూళి యెడలిపోవునటుల జేసి సర్వపాపములనుండియు విముక్తుఁ డగుచున్నాఁడు. ఎన్ని ధూళిరేణువు లాదిత్యమందిరమునఁ దుడుపఁబడునో యన్ని దేవదినములు స్వర్గలోకమున వసించి మోదించుచున్నాఁడు. ఎవఁడు సూర్యునాయతనమును లోపల వెలుపలఁ గూడ బాగుగఁ దుడుచునో యాతనికాయము లోపలను వెలుపలను నిష్కల్మషమై యుండును. సూర్యునాలయమును గోమయాదులతో నలుకువాఁడు సూర్యలోకమునకేగి ముదమందును. మృత్తికచేఁగాని, రంగులచేఁగాని గోమయముచేఁగాని భక్తితో ననులేపనముచేయునరుఁడు సూర్యుని జేరుచున్నాఁడు. నీరుచల్లువాఁడు నాలోకమునకే యేగును. అలికినవెనుక బాగుగ పరిమళించుపుష్పములు వెదజల్లవలయును. అట్లొనర్చినవాఁడు సూర్యునుత్తరగృహమున కేగును. (ఉత్తరద్వారగృహమున నాదిత్యుఁడుండును. ఆగృహమునకాదిత్యుఁడు రత్నమయమగు దివ్యవిమానమెక్కి వచ్చును.) సూర్యునాలయమున దీపదానమొనర్చువారు రత్నమయమగు దివ్యవిమానమును బొంది సూర్యునియుత్తరగృహమున కేగుచున్నారు.

---

దూర్వాంకురైరపి కృష్ణ తదభావేఽర్చయేద్రవిమ్. ౩౦. పుష్పపత్రాంబుభిర్ధూపైర్యథా విభవమాత్మనః, పూజితస్తుష్టిమతులాం భక్త్యా యాత్యేకచేతసామ్. ౩౧. యః సదాయతనే భానోః కుర్యాత్సంమార్జనం నరః, స పాంసుదేహసంయోగాత్సర్వపాపైః ప్రముచ్యతే. ౩౨. యావత్యః పాంసుకణికా మార్జ్యంతే భాస్కరాలయే, దినాని దివి దివ్యాని తావంతి మోదతే నరః. ౩౩. సబాహ్యాభ్యంతరం వేశ్మ మార్జతే భాస్కరస్య యః, స బాహ్యాభ్యంతరస్తస్య కాయో నిష్కల్మషో భవేత్. ౩౪. యశ్చానులేపనం కుర్యాద్భానోరాయతనే నరః, స హేలిలోకమాసాద్య మోదతే గోగతే హరౌ. ౩౫. మృదా వా మృద్వికారైర్వా వర్ణకైర్గోమయేన వా, అనులేపనకృద్భక్త్యా నరో గోపతిమాప్నుయాత్. ౩౬. ఉదకాభ్యుక్షణం భానోర్యః కరోతి తథా క్షయే, స గచ్ఛతి నరః కృష్ణ యత్రాస్తే గోపతిః సదా. ౩౭. పుష్పప్రకరమత్యర్థం సుగంధం భాస్కరాలయే, అనులిప్తే నరో దద్యాత్సూపోత్తరగృహం వ్రజేత్. ౩౮. విమానవరమభ్యేతి సర్వరత్నమయం దివి, సంప్రాప్నోతి నరో దత్త్వా దీపకం భాస్కరాలయే. ౩౯. యస్తు

ఏనసం డొక్కయేడాది నూవులతో నిండిన పాత్రమును సూర్యునందు ధ్వజమునొసంగునో యాతఁడు సర్వఫలముల నొందును. వానినొసంగు దాతల కజ్ఞానమునఁ గలిగిన పాపమునంతను మహావాతమువలె దూర ముగ నాదిత్యుఁడు త్రోసిపుచ్చును. వారికేగాక వారిగృహమున నుండు వారలు రాత్రింబవళ్లజ్ఞానమునఁ జేసిన పాతకములఁ గూడఁ ద్రోసివేయు చున్నాఁడు. గీతవాద్యాదులతో విభావసు నుపాసించువాఁడు విమానము నెక్కి గంధర్వుల నృత్యగీతాదులచే సేవింపఁబడుచున్నాఁడు. సూర్యు నాలయమునఁ బుణ్యగాథల నుపాఖ్యానముచేయు పుణ్యపురుషుఁడు పూర్వజన్మస్మృతిని మంచిబుద్ధిని గాంచి యావెనుక నుత్తమగతిఁ బొందు చున్నాఁడు. కావునఁ బుణ్యకథాఖ్యానము యత్నముతోఁ జేయవల యును. అటుకాదేని పౌరాణికుని బూజింపవలయును. ఎందును బుణ్యా ఖ్యానమును విడచి యింకొక్కట యాదిత్యునకుఁ బ్రీతినిచ్చునది లేదు. సూర్యునకు సాష్టాంగముగ భక్తితో నొక్క నమస్కారముచేసినను అయ్యది పది యశ్వమేధమునందలి యవభృథస్నానములకుఁ దుల్యమైనది. పది యశ్వమేధము లొనరించినవాఁడు తిరుగ జన్మమునొందును. సూర్యు నమస్కార మొనర్చినవాఁడు మరల జన్మమునొందఁడు. ఈవిధముగ భక్తితో దేవదేవుఁడగు భాను నుపాసించుమానవుఁడు చిత్తమున నేయుత్తమపదము వాంఛించు నద్దానిని శ్లాఘ్యముగుదానిని బొందు చున్నాఁడు. ఆతని నారాధించియే నే నీబ్రహ్మపదము నొందితిని. లోక మాన్యుఁడనై యుంటిని. సూర్యతనయుఁడు యముఁ డిష్టఫలమును

---

సంవత్సరం పూర్ణం తిలపాత్రప్రదో నరః, ధ్వజం చ భాస్కరే దద్యాత్సమమత్ర ఫలం లభేత్. ౪౦. విధునోత్యతివాతేన దాతురజ్ఞానతః కృతమ్, పాపం దాతుర్గృహే భాను ర్దివారాత్రౌ న సంశయః. ౪౧. గీతవాద్యాదిభిర్దేవం య ఉపాస్తే విభావసుమ్, గంధర్వ నృత్యైర్వాద్యైశ్చ విమానస్థో నిషేవ్యతే. ౪౨. జాతిస్మరత్వం వృద్ధిం చ తతస్తు పరమాం గతిమ్, ప్రాప్నోతి హేలేరాయతనే పుణ్యాఖ్యానకథాకరః. ౪౩. తస్మాత్కార్యాత్ప్రయ త్నేన పూజయేద్వాపివాచకమ్, నాన్యత్ప్రీతికరం భానోః పుణ్యాఖ్యానాదృతే క్వచిత్. ౪౪. ఏకోఽపి హేలేః సుకృతః ప్రణామో దశాశ్వమేధావభృథేన తుల్యః, దశాశ్వ మేధీ పునరేతి జన్మ హేలిప్రణామీ న పునర్భవాయ. ౪౫. ఏవం దేవేశ్వరో భక్త్యా యేన భానురుపాసితః, స ప్రాప్నోతి గతిం శ్లాఘ్యాం యామిచ్ఛతి చ చేతసా. ౪౬. తమారాధ్య మయా ప్రాప్తం బ్రహ్మత్వం లోకపూజితమ్, సౌర్యేర్య ఈప్సితం ప్రాప్తం త్వయా తస్మాత్పురానఘ. ౪౭. బ్రహ్మహత్యాభిభూతస్తు గోశ్రుతాభరణో హరః,

బొందెను. నీవును మున్నిష్టఫలము నొందితివి. మున్ను బ్రహ్మహత్యా తిరస్కృతుఁడై వృషభవాహనుఁ డగుహరుఁడు భక్తితో రవి నారాధించి యా బ్రహ్మహత్యనుండి విముక్తుఁడయ్యెను. ఈదివాకరునివలననే కొందఱు మానవులు దేవత్వము, నికకొందఱు గంధర్వత్వమును, మఱి కొందఱు విద్యాధరత్వమును బొందిరి. లేఖుఁడనునాతఁడు నూరుయజ్ఞములచే నీశ్వరుఁడగు నీదివాకరు నారాధించి యింద్రపదంబు వడసెను. కాన నితనికన్న నితరుఁడు పూజింపఁదగువాఁడు లేఁడు. బ్రహ్మచారియగు బాలునకు దేవతలకన్నను మిక్కిలిగఁ బూజింపఁదగినవాఁడు గురువేకదా! అందఱకు నీతఁడే గురుఁడు. కాన నీయజ్ఞపురుషుఁడు వివస్వంతుఁడు సర్వ మానవులకుఁ బూజ్యుఁడై యున్నాఁడు కదా! వనితలకునుభర్తకన్న నధికముగ నాదిత్యుఁడే పూజ్యుఁడైయున్నవాఁడు. గృహస్థుఁడగు భర్తకుఁ గూడ నంశుమంతుఁడే పూజ్యుఁడైయున్నాఁడు. వైశ్యులకుఁ గూడఁ దపములచే నీతమోనాశకుఁడే యారాధ్యుఁడై యున్నాఁడు. సన్న్యాసులకుఁ గూడ నెల్లప్పుడు నీదేవుఁడే ధ్యానింపఁదగియున్నవాఁడు. ఇప్పగిది నెల్లయాశ్రమములవారికి నెల్లవర్ణములవారికిని సర్వకాలములను చిత్రభానుఁడే పరాయణమై యున్నవాఁడు. కాన నాతని నారాధించి యుత్తమ గతిఁ బొందుచున్నారు.

ఇది త్ర్యధికశతతమాధ్యాయము.

---

తమారాధ్య రవిం భక్త్యా ముక్తోఽసౌ బ్రహ్మహత్యయా. ౪౮. దేవత్వం మనుజైః కైశ్చిద్గంధర్వత్వం తథాపరైః, విద్యాధరత్వమపరై రేవాప్తం హి దివాకరాత్. ౪౯. లేఖః క్రతుశతేనేశమారాధ్యైనం దివాకరమ్, ఇన్ద్రత్వమగమత్తస్మాన్నాన్యః పూజ్యో దివాకరాత్. ౫౦. దేవేభ్యోఽప్యతిపూజ్యస్తు స్వగురుర్బ్రహ్మచారిణా, తస్మాత్స యజ్ఞపురుషో వివస్వాన్పూజ్య ఏవ హి. ౫౧. స్త్రియాశ్చ భర్తారమృతే పూజ్యోఽత్యంతం విభావసుః, భర్తుర్గృహస్థస్య సతః పూజ్యో గోపతిరంశుమాన్. ౫౨. వైశ్యానామపి చారాధ్యస్తపోభిస్తమనాశనః, ధ్యేయః పరివ్రాజకానాం సదా దేవో విభావసుః. ౫౩. ఏవం సర్వాశ్రమాణాం హి చిత్రభానుః పరాయణమ్, సర్వేషాం చైవ వర్ణానాం తమారాధ్యాప్నుయాద్గతిమ్. ౫౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యపూజామహిమవర్ణనం నామ
త్ర్యధికశతతమోఽధ్యాయః.

## చతురధికశతతమాధ్యాయము.

వాసుదేవా! ఇఁకమీఁద నేకాగ్రచిత్తుఁడవై యాకర్ణింపుము. కామ్యములగు నుపవాసముల వచింతును. ఆయాకోర్కులను హృదయమునఁ గాంక్షించి చిత్తమున కనువైనయటు లాయుపవాసములఁ జేయవలయును. ఫాల్గునశుక్లసప్తమినాఁ డేమానవుఁడు భక్తితో మాటిమాటికి "హేలి"యను నాదిత్యుని దివ్యనామమును జపించునో దేవతార్చనసమయమున స్నానముచేసి శుచియై నూటయెనిమిదిమారులు జపించునో ప్రయాణకాలమునను లేచునప్పుడు దొట్రువడినయప్పుడును తుమ్ము వచ్చినసమయమునను శ్రద్ధతో నాదిత్యు నర్చింపవలయును. పాఖండుల తోడను పతితులతోడను అన్యాయవర్తనము గలవారితోడను నించుకేనియు మాటాడరాదు. సూర్యునందు మనస్సునుసంధించి తదేకనిష్ఠతో నీప్రార్థనము నుదాహరింపవలయును. "హంస హంస కృపాళు స్త్వ మగతీనాం గతిర్భవ, సంసారార్ణవమగ్నానాం త్రాతా భవ దివాకర" ఓ దివాకరా! నీవు సర్వపాపములను హింసించువాఁడవు. శీఘ్రముగ నడుచువాఁడవు. దయగలవాఁడవు. గతిలేనివారికి గతివగుము. సంసారసముద్రమున మునిఁగినవారికి రక్షకుఁడవగుము. అని ప్రార్థింపవలెను. ఇటులు ప్రార్థించి యుపవసించి నియతచిత్తుఁడై పూర్వాహ్ణముననే యొక్కసారియే యాచమనజలమును బ్రాశింపవలయును. స్నానముచేసి యర్చించి మరల హంసనామము గీర్తింపవలయును. దేవునిపాదములయందు మూఁడు వజ్ర

---

శృణుష్వ సంయతః కామ్యానుపవాసాం స్తథాపరాన్, తాంస్తానాశ్రిత్య యానాక్కామాన్కురుతేప్సితమానసః. ౧. సప్తమ్యాం శుక్లపక్షే తు ఫాల్గునస్యేహ మానవః, జపన్హేలీతి దేవస్య నామ భక్త్యా పునః పునః. ౨. దేవార్చనే చాష్టశతం కృత్వైవతచ్ఛ జపేచ్ఛుచిః, స్నాతః ప్రస్థానకాలే తు ఉత్థానే స్ఖలితే క్షుతే. ౩. పాఖండాన్పతితాంశ్చైవ తథైవాన్యాయశాలినః, నాలపేత తథా భానుమర్చయేచ్ఛ్ర ద్ధయాన్వితః, ఇదం చోదాహరేద్భానౌ మనః సంధాయ తత్పరః. ౪. హంసహంస కృపాలుస్త్వమగతీనాం గతిర్భవ, సంసారార్ణవమగ్నానాం త్రాతా భవ దివాకర. ౫. ఏవం ప్రసాద్యోపవాసం కృత్వా నియతమానసః, పూర్వాహ్ణ ఏవ చ సకృత్ప్రాశ్యా చ్చాచమనీయకమ్. ౬. స్నాత్వార్చయిత్వా హంసేతి పునర్నామ ప్రకీర్తయేత్, వజ్ర

ధారలను ముమ్మారు విసరివేయవలయును. అటులనే చైత్రవైశాఖ మాసములయందును జ్యేష్ఠమాసమునను బూజించువాఁడు మర్త్యలోకమున శ్రేష్ఠమగుగతిని బొందును. జన్మాంతమున మహేశ్వరానుగ్రహంబు కతమున నింద్రలక్ష్మీసమేతుఁడై దివ్యమగు సూర్యనాలయమును బొందును. ఆషాఢశ్రావణమాసములందును భాద్రపదాశ్వయుజమాసములందు నీవిధానముచొప్పున నుపవసించి పూజించి "మార్తండ" అను సూర్యని దివ్యనామమును గీర్తింపవలయును. ఉపవాసకాలమున గోమూత్రప్రాశనముచే బవిత్రుఁడై ధనవంతుఁడై యీలోకమున సుఖించి జన్మాంతమునఁ గుబేరునిపురమున కేగును. మరణకాలమున భాస్కరదేవుని నామస్మృతి గూడ కలుగఁగలదు. కార్తికము మొదలగు నాలుగు మాసములందును విధిననుసరించి క్షీరప్రాశనము చేయవలయును. ఆ విధిచే "భాస్కర"యను సూర్యనామమును గీర్తింపవలయును. అట్టివాఁడు మరణకాలమున భాస్కరుని స్మరింపఁగలుగును. తరువాత భానుసాలోక్యము నొందును. ప్రతియొక్కొకమాసమున నిష్టముకొలఁది బ్రాహ్మణులకు దాన మొసంగవలయును. ప్రతినాల్గుమాసములకు నొకసారి పుస్తకవాచనముచేయించి భాస్కరునికథనుగాని సంగీతమునుగాని ధర్మధ్వజుఁడగు నాదిత్యునిధర్మశ్రవణము సర్వకాలమును జేయుచుండవలయును

---

ధారాత్రయం చైవ క్షిపేత్త్రిర్దేవపాదయోః. ౭. చైత్రవైశాఖయోశ్చైవ తద్వజ్జ్యేష్ఠే తు పూజయన్, మర్త్యలోకే గతిం శ్రేష్ఠాం కృష్ణ ప్రాప్నోతి వై నరః. ౮. ఉత్క్రాంతస్తు వ్రజేత్కృష్ణ దివ్యం హంసాలయం శుభమ్, వృషధ్వజప్రసాదాద్వై సంక్రందనశ్రియా వృతః. ౯. ఆషాఢే శ్రావణే చైవ మాసి భాద్రపదే తథా, తథైవాశ్వయుజే చైవ అనేన విధినా నరః. ౧౦. ఉపోష్య సంపూజ్య తథా మార్తండేతి చ కీర్తయేత్, గోమూత్రప్రాశనాత్పూతో ధనీ ధనపురం వ్రజేత్. ౧౧. ఆరాధితస్య జగతామీశ్వరస్యావ్యయాత్మనః, ఉత్క్రాంతికాలే స్మరణం భాస్కరస్య తథాప్నుయాత్. ౧౨. క్షీరస్య ప్రాశనం కృష్ణ విధిం చైవ యథోదితమ్, కార్తికాది యథాన్యాయం కుర్యాన్మాసచతుష్టయమ్. ౧౩. తేనైవ విధినా కృష్ణ భాస్కరేతి చ కీర్తయేత్, స యాతి భానుసాలోక్యం భాస్కరం స్మరతి క్షయే. ౧౪. ప్రతిమాసం ద్విజాతిభ్యో దద్యాద్దానం యథేప్సితమ్, చాతుర్మాస్యే తు సంపూర్ణే కృత్వా పుస్తకవాచనమ్. ౧౫. కథాం తు భాస్కరస్యేహ సంగీతకమథాపి వా, ధర్మశ్రవణమభీష్టం

తొలుత వాచకునిఁబూజించి యామీఁద విద్వాంసుఁడు సూర్యశ్రాద్ధమును వేఱొండుపాకముతో నాదిత్యప్రియులగు వాచకబ్రాహ్మణులకును దివ్యబ్రాహ్మణున కిష్టమగునటులఁ జేయవలయును. ఇటులఁ బూజించి దేవనామమును గీర్తించినపుఁ డెల్లప్పుడు నుత్తమమైన ముల్లోకంబుల మూఁడు తెఱంగులగు పదమునుబొందుచున్నాఁడు. (ముల్లోకముల నభీష్టఫలములఁ బొందుచున్నాఁడు.) మొదటఁ జెప్పిన పారణము జేసినచో మానవుఁడు గోవులను భూమిని ధనమును ప్రభుత్వమును నిఖిలభోగములను బొందుచున్నాఁడు. రెండవపారణముచేత సమస్తభోగముల ననుభవించుచున్నాఁడు. మూఁడవపారణముచేత సూర్యలోకమున కేగుచున్నాఁడు. ఓదేవవరా! యిప్పుగిది నీసప్తమీవ్రతమునఁ జెప్పిన సద్గతిప్రాపకమగు నుత్తమకథావిధానము సవిస్తరముగా నెఱుకపఱచితిని. ఈమూఁడుపారణములే లోకత్రయ మనబరగుచున్నవి. శుభమగునను ష్ఠానముగల శ్వేతాసప్తమీవ్రతమును భక్తితో శ్రద్ధతోఁ బురుషుఁడుకాని యువతిగాని సలిపి మూఁడు తెఱంగులగు నుత్తమగతిని బొందుదురు. ఈతిధి నుపాసించువారి కిది ధన్యతఁగూర్చుటం జేసి ధన్యయయ్యె. పాపములెల్ల హరించును. ఎల్లప్పుడు నాదిత్యు నారాధించుట కీవ్రత ముత్తమమయినది. ఇది వినువారికిఁ జదువువారికి సర్వపాపభయముల హరించును. ధన్యయుఁ బుణ్య

---

సదా ధర్మధ్వజస్య తు. ౧౬. వాచకం పూజయిత్వా తు తస్మాత్కార్యం విపశ్చితా, శ్రాద్ధమన్యేన పక్వేన వాచకేన ద్విజేన తు, దివ్యేన చ యథాయుక్తమభీష్టం భాస్కరస్య హి. ౧౭. ఏవమేవ గతిం శ్రేష్ఠాం దేవానామనుకీర్తనాత్, ప్రాప్నుయాత్రివిధాం కృష్ణ త్రిలోకాఖ్యాం నరః సదా. ౧౮. కథితం పారణం యత్తే ప్రథమం గోధరాధనమ్, ఆధిపత్యం తథా భోగాంస్తతః ప్రాప్నోతి మానుషః. ౧౯. ద్వితీయేన తథా భోగాన్నోపతేః ప్రాప్నుయాన్నరః, సూర్యలోకం తృతీయేన పారణేన తథా ప్నుయాత్. ౨౦. ఏవమేతత్సమాఖ్యాతం గతిప్రాపకముత్తమమ్, విధానం దేవశార్దూల యదుక్తం సప్తమీవ్రతే. ౨౧. యః శ్వేతాం సప్తమీం కుర్యాత్సుగతిం శ్రద్ధయా నరః, తథా భక్త్యా చ వై నారీ ప్రాప్నోతి త్రివిధాం గతిమ్. ౨౨. ఏషా ధన్యా పాపహరా తిథిర్నిత్యముపాసితా, ఆరాధనాయ యస్తేషాం యదా భానోర్ధరాధర. ౨౩. పఠతాం శృణ్వతాం చాపి సర్వపాపభయాపహా, తథా ధన్యా చ పుణ్యా చ త్రివర్గా

యునై యెల్లప్పుడు ధర్మార్థకామాదుల నొసంగును.

ఇది చతురధికశతతమాధ్యాయము.

---

## పంచాధికశతతమాధ్యాయము.

ఫాల్గునశుక్లసప్తమినాఁ డుపవసించి స్త్రీపురుషులలో నెవ్వరైనను సూర్యుని బాగుగనర్చించి భక్తితో సూర్యనామములను జపించుచు మితభోజనులై యింద్రియములబంధించి నిదురించునవస్థయందైనను మేల్కొను సమయమునందైనను సూర్యునే గీర్తించుచుండవలయును. అంత మఱునాఁ డష్టమి ప్రాప్తింప రవియందుఁ జిత్తము నిలిపి స్నానముచేసి దేవతార్చన మొనరించి బ్రాహ్మణునకు దక్షిణ యొసంగవలయును. సూర్యునకై వహ్నిలో నాజ్యహోమములు చేయవలయును. తరువాత నాజగన్నాథునకు నమస్కరించి యీవాక్కు నుచ్చరింపవలయును. మున్నే దేవు నారాధించి సావిత్రీదేవి సర్వాభీష్టములఁబొందెనో ఆదేవదేవుఁడు విభావసుఁడు నాకు సర్వకామముల నొసంగుఁగాక. ఇచ్చవచ్చినకోరికలెల్ల మనమున నిడుకొని బాగుగఁ బూజించితిని. ఆతఁడు నాయెడఁ బ్రసన్నుఁడై యాకోర్కులన్నియు నొసంగుచున్నాఁడు. రాజ్యభ్రష్టుఁడయ్యు దేవేం

---

దీప్టదా సదా. ౨౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే త్రివర్గసప్తమీవ్రతనిరూపణం నామ చతురధికశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—ఫాల్గునామలపక్షస్య సప్తమ్యాం క్ష్మాధరాన్వయ, ఉపోషితో నరో నారీ సమభ్యర్చ్య తమోఽపహమ్. ౧. సూర్యనామ జపన్భక్త్యా మితభోక్తా జితేంద్రియః, ఉత్తిష్ఠన్ప్రస్వపం శ్చైవ సూర్యమేవాభికీర్తయేత్. ౨. తతోఽన్య దివసే ప్రాప్తే త్వష్టమ్యాం ప్రయతో రవిమ్, స్నాత్వా దేవం సమభ్యర్చ్య దద్యాద్విప్రాయ దక్షిణామ్. 3. రవిముద్దిశ్య వై చాగ్నౌ ఘృతహోమకృతక్రియః, ప్రణిపత్య జగన్నాథమితి వాణీముదీరయేత్. ౪. యమారాధ్య పురా దేవీ సావిత్రీ కామ నాయ వై, స మే దదాతు దేవేశః సర్వాన్కామాన్విభావసుః. ౫. సమభ్యర్చ్య ఇతి ప్రాప్తాన్కృత్వాన్కామాన్యథేప్సితాన్, స దదాత్యఖిలాన్కామాన్ప్రసన్నో మే

ద్రుఁడు దివస్పతి నాదిత్యునారాధించియే సమస్తకామములను రాజ్యమును బొందెను. కావున నాదేవుఁడు నాకును వాంఛితము లిచ్చుఁగాక. అని యిట్లు పూజించి పూజావసానమున స్థిరచిత్తుఁడై హవిష్యాన్నము భుజింపవలయును. ఫాల్గునమున నారంభించి చైత్రవైశాఖజ్యేష్ఠమాసములలోఁగూడఁ బూజించి జ్యేష్ఠాంతమునఁ జాతుర్మాస్యమగు పారణ మొనరింపవలయును. ఈనాల్గుమాసములను గన్నేరుపువ్వులతో భక్తిగ నాదిత్యుని బూజింపవలయును. కృష్ణాగరుధూపము నొసంగవలయును. గోశృంగమునఁ బుట్టినజలము ద్రావవలయును. ఖండవేష్టములు నివేదింపవలయును. బ్రాహ్మణులకును వానినే యొసంగవలయును. ఇఁక రెండవచాతుర్మాస్యక్రియావిధానమును వినుము. ఆషాఢాదిమాసములందు సూర్యపూజకై జాతీకుసుమము లుత్తమములు. గుగ్గులుధూపముత్తమము. బావిజలమును ద్రాగవలయును. పాయసము నివేదింపవలయును. బ్రాహ్మణపూర్వకముగదానాపాయసంబునే భుజింపవలయును. మిగిలినపనులన్నియు వెనుకటివలెనే చేయవలయును. కార్తికాదిమాసములందు గోమూత్రము ప్రాశించిన శరీరశుద్ధి కలుగు. మహాంగమను ధూపము నొసంగవలయును. ఎఱ్ఱకలువలతోఁ బూజసలుపవలయును. కాంసారనైవేద్యమును భాస్కరునకు నివేదింపవలయును. ప్రతియొక్కొకమాసమునను బ్రాహ్మణునకు దక్షిణ యొసఁగవలయును. కర్పూరము, చందనము, ముస్తలు

---

దివస్పతిః. ౬. భ్రష్టరాజ్యశ్చ దేవేన్ద్రో యమభ్యర్చ్య దివస్పతిః, కామాన్త్సం ప్రాప్తవాన్రాజ్యం స మే కామం ప్రయచ్ఛతు. ౭. ఏవమభ్యర్చ్య పూజాం చ నిష్పాద్యైవ వివస్వతః, భుఞ్జీత ప్రయతః సమ్యగ్ఘవిష్యం పతగధ్వజ. ౮. ఫాల్గునే చైత్రవైశాఖజ్యేష్ఠే యస్య సమాపనమ్, చతుర్భిః పారణం మాసైరేభిర్నిష్పాదితం భవేత్. ౯. కరవీరైశ్చతురో మాసాన్భక్త్యా సంపూజయేద్రవిమ్, కృష్ణాగురుం దహేద్ధూపం ప్రాశ్యం గోశృంగజం జలమ్. ౧౦. నైవేద్యం ఖండవేష్టాంస్తు దద్యాద్విప్రేభ్య ఏవ చ, తతశ్చ శ్రూయతామన్యా హ్యాషాఢాదిషు యా క్రియా. ౧౧. జాతీపుష్పాణి శస్తాని ధూపో గౌగ్గుల ఉచ్యతే, కూపోదకం సమశ్నీయాన్నైవేద్యం పాయసం మతమ్. ౧౨. స్వయం తదేవ చాశ్నీయాచ్ఛేషం పూర్వవదాచరేత్, కార్తికాదిషు మాసేషు గోమూత్రం కాయశోధనమ్. ౧౩. మహాంగో ధూప ఉద్దిష్టః పూజా రక్తోత్పలైస్తథా, కాంసారం చాత్ర నైవేద్యం నివేద్యం భాస్కరాయ వై. ౧౪. ప్రతిమాసం చ విప్రాయ దాతవ్యా

అగరు, తగరము, ఊషణము, శర్కర, సిహ్లాకము ననుద్రవ్యములు మేళ గించి చేసిన ధూపద్రవ్యమునకు మహాంగమని నామము. ఈధూప మీపారణమున నెల్లప్పుడు నాదిత్యున కిష్టమైనది. ప్రతిపారణమునందును సూర్యునకు శక్తికొలఁది శరీరచేష్టలచేఁ బ్రీతిఁగలుగఁజేయవలయును. తగిన రీతిని దొరకినయంతవట్టు శక్తికిఁ దగురుండఁగ లోభమును వీడి యొనరింప వలయును. అయ్యేడుగుఱ్ఱాలవజీరుండు మంచినడవడికచేతనే పూజలఁగొని సంతసించును. గాన లోభాదులు కూడవు. పారణాంతమున యథాశక్తిగఁ బూజించి స్నానముచేయింపఁ బ్రీతిజెంది యాదిత్యుఁ డవ్యాహతముగఁ గోరినకోర్కులన్నియు నొసంగును. ఈసప్తమి పుణ్యమై పాపముల హరిం చునదై సర్వకామములనిచ్చుటంజేసి కామదనాఁబడు. ఈసప్తమినాఁ డుప వాసవ్రతముసల్పినరుఁడుకోరినకోర్కులెల్లఁ బడయఁగలఁడు. మున్నింద్రుఁ డీసప్తమినుపవసించి ముల్లోకముల కధిపుఁడయ్యెను. సావిత్రీదేవి పుత్రుని గాంచెను. అదితి పెక్కురుకొమరులఁ గాంచెను. యదువులు సౌందర్యము మొదలగుఫలములఁ బొందిరి. ధౌమ్యుఁడు సర్వవేదముల నధ్యయనము చేసెను. నీవును భృగుపుత్రియగులక్ష్మిని బొందితివి. శంకరుఁడు పాప విశుద్ధి నొందెను. ఆతనియనుగ్రహముననే యేను లోకపితామహుఁడ నైతిని. ఆతని నారాధించియే యితరులును పెక్కురు కామితములఁ బొందిరి. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులును స్త్రీలు నేయే కోర్కుల

---

దక్షిణా తథా, కర్పూరం చందనం ముస్తామగరుం తగరం తథా. ౧౬. ఊషణం శర్కరా కృష్ణ సుగంధం సిహ్లాకం తథా, మహాంగోఽయం స్మృతో ధూపః ప్రియో దేవస్య సర్వదా. ౧౭. ప్రీణనం చేష్టయా భానోః పారణే పారణే గతే, యథాశక్తి యథా యోగం విత్తశాఠ్యం వివర్జయేత్. ౧౭. సద్భావేనైవ సప్తాశ్వః పూజితః ప్రీయతే యతః, పారణాంతే యథాశక్త్యా పూజితః స్నాపితో రవిః. ౧౮. ప్రీణితశ్చేప్సితా న్కామాన్దద్యాదవ్యాహతం హరే, ఏషా పుణ్యా పాపహరా సప్తమీ సర్వకామదా. ౧౯. యథాభిలషితాన్కామాన్ లభతే గరుడధ్వజ, ఉపోష్యైతాం త్రిభువనం ప్రాప్త మింద్రేణ వై పురా. ౨౦. పుత్రం ప్రాపచ్చ సావిత్రీ పుత్రాంస్తు అదితిస్తథా, యదవః కామనాం ప్రాప్తా ధౌమ్యో వేదమవాప్తవాన్. ౨౧. త్వయాప్తా భార్గవీ కృష్ణ శంకరః శుద్ధిమాప్తవాన్, పితామహత్వం ప్రాప్తోఽహం తత్ప్రసాదాజ్జనార్దన. ౨౨ అన్యైశ్చాధిగతాః కామాస్తమారాధ్య న సంశయః, బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైః

నెమ్మనమునఁదలఁచి యుపవసింతురో యాకోర్కులనెల్లఁ బొందుచుందురు. సంశయము లేదు. సూర్యారాధనమువలన జనుఁ డెల్లఫలముల నిస్సందేహముగఁ బొందుచున్నాఁడు. సంతానములేనివాఁడు పుత్రసంతానంబుగని జన్మాంతమున గోలోకమున కేగి ముదితుఁడగును. రోగములకు లొంగియుండువాఁడు వానింబాసియారోగ్యవంతుఁ డగును. కన్నియయుత్తమ భర్తను బొందును. మగఁడు ప్రవాసగతుడయ్యెనేని యీనాఁడుపవసించిన నాదిత్యునను గ్రహమున నాతనిని బొందును. సర్వకామముల ననుభవించి గోలోకమున కేగి ముదితాత్ముఁడగును. ఇం దుపవాసవ్రతమును సలిపినవనితలుగాని పురుషులుగాని యెక్కడను సంతానహీనులుగాని ధనహీనులుగాని జనవిరోధులుగాని దయావిహీనులుగాని యయి జన్మింపరు. గోలోకమును సూర్యలోకమును బొంది శాశ్వతకాలము నానందించును. గైరికధాతువులచేఁ జిత్రితమగు విమానమునెక్కి తేజంబున సూర్యునకెనయై వెలుంగుచు నటవసించి కాలాంతరమునఁ బుడమికేతెంచి గోపతియనుగ్రహమున నుత్తమరాజపదము నొందుచున్నాఁడు. ఇందావంతేనియు ననుమానములేదు.

పంచాధికశతతమాధ్యాయము.

---

శూద్రైర్మ్లేచ్ఛైర్ద్విజైరేవ చ. ౨౩. యం యం కామమభిధ్యాయేత్తం తం ప్రాప్నోత్యుపోషణాత్, జనః ప్రాప్నోత్యసందిగ్ధం భానోరారాధనాద్యతః. ౨౪. అపుత్రః పుత్రమాప్నోతి గోగతశ్చాపి మోదతే, రోగాభిభూత ఆరోగ్యం కన్యా విందతి సత్పతిమ్. ౨౫. సమాగత్య ప్రవసిత ఉపోష్యైతదవాప్నుయాత్, సర్వాన్కామానవాప్నోతి గోగతశ్చాపి మోదతే. ౨౬. నాపుత్రో నాధనో వాపి న హానిష్టో న నిర్ఘృణః, ఉపోష్యైతద్వ్రతం మర్త్యః స్త్రీజనో వాపి జాయతే. ౨౭. గోహేలిలోకమాసాద్య మోదతే శాశ్వతీః సమాః, గైరికం యానమారూఢస్తేజసా రవిసన్నిభః. ౨౮. పునరేత్య మహీం కృష్ణ ఘనాఘనసమో నృపః, త్క్మాతలే స్యాన్న సందేహః ప్రసాదాద్గోపతేర్నరః. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే కామదాసప్తమీవ్రతనిరూపణం నామ
పంచాధికశతతమోఽధ్యాయః.

---

## షడధికశతతమాధ్యాయము.

ఓమహాభాగా! సూర్యుఁడు దేవతలకుఁజెప్పిన యుత్తమమగు తిథిమాహాత్మ్యమును గూడ వచింతు వినుము నావుడు కృష్ణుఁ డిట్లనియె. ఓసురశ్రేష్ఠా! అతిజయకరమగు విజయసప్తమియు, మహాతిథియగు జయంతీతిథియు నీవలన నెఱుంగఁబడినవి. పాపనాశినియగు సప్తమినిఁ వినఁగోరుచున్నాను. అటులనే సూర్యారాధనమున ప్రశస్తమైన యుత్తరాయణమును నెందుఁ బూజింప నాదిత్యుఁడు ప్రసన్నుఁడై సర్వపాపముల నడఁగించునో దానిని ఫలములతోఁ గూడ వినఁగోరుచున్నాను. భక్తితో నడుగుచున్నాను. కావున వాని నాకెఱింగింపుము. అనవుడు బ్రహ్మ యిట్లనియె. ఏశుద్ధసప్తమినాఁడు హస్తానక్షత్రము కలియునో యది మహాపవిత్రమై పాపనాశిని యనఁబడును. ఆనాఁడు జగద్గురుఁడగు చిత్రభానుఁ బూజించి నిస్సంశయముగ నేడుజన్మముల నార్జించిన పాపములనుండి విముక్తిఁ బడయుచున్నాఁడు. నియతచిత్తుఁడై యుపవాసముచేయువాఁడు సర్వపాపములు దొరంగి సూర్యలోకమునఁ బూజలఁ గొనుచున్నాఁడు. ఆ దివాకరునకై యొనర్చుదానము హోమమును కొంచెమైన నది యక్షయ మగును. శ్రద్ధగలిగి యాదేవునెదుట ఋగ్వేదమున నొకభాగమును బఠించినను సమస్తఋగ్వేదఫలము లభించును. ఒక్కసామముఁ జదివినను సంపూర్ణసామవేదమును జదివినఫలము లభించును. ఒక్కయజుర్మంత్రము జదివినను యజుర్వేదఫలము లభించును. ఒక్కయథర్వవేదమంత్రముఁ

---

బ్రహ్మోవాచ.—పునశ్చైతన్మహాభాగ శ్రూయతాం గదతో మమ, ప్రోక్తం ఖగేన దేవానాం తిథిమాహాత్మ్యముత్తమమ్. ౧.విష్ణురువాచ:—విజయాతిజయా చైవ జయంతీ చ మహాతిథిః, త్వత్తః శ్రుతా సురశ్రేష్ఠ బ్రూహి మే పాపనాశినీమ్.౨.తథోత్తరాయణం బ్రూహి శస్తం యద్భాస్కరార్చనే, యత్ర సంపూజితో భానుర్భవేత్సర్వాఘనాశనః, తన్మే కథయ యత్నేన భక్త్యా పృష్టోఽక్షయం ఫలమ్. ౩. బ్రహ్మోవాచ:—శుక్లపక్షే తు సప్తమ్యాం యదర్క్షం తు రవేర్భవేత్, తదా స్యాత్సా మహాపుణ్యాసప్తమీ పాపనాశినీ. ౪. తస్యాం సంపూజ్య దేవేశం చిత్రభానుం జగద్గురుమ్, సప్తజన్మకృతాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః. ౫. యశ్చోపవాసం కురుతే తస్యాం నియతమానసః, సర్వపాపవిముక్తాత్మా సూర్యలోకే మహీయతే. ౬. దానం యద్దీయతే కించిత్తముద్దిశ్య దివాకరమ్, హోమో వా క్రియతే తత్ర తత్సర్వం చాఽక్షయం భవేత్.౭.ఏకఋగ్వేదః పురతో జప్తః శ్రద్ధాపరేణ తు, ఋగ్వేదస్య సమస్తస్య యచ్ఛ్రుతేసత్ఫలం ధ్రువమ్.౮.సామ

బఠించిన నాయథర్వవేదఫలము లభించును. ఈనాఁడు దివాకరుని బాగుగ నర్చించి యాతనియనుగ్రహమున రేయుంబవలును నక్షత్రములవలెఁ గాంతిగలిగి వెలుఁగుచుందురు.పూజించువారల పాపములనెల్ల నాదిత్యుఁడు ధ్వంసము వేయుచున్నాఁడు. కావున నీసప్తమి యనుష్ఠితమై పాపనాశిని యగుచున్నది. ఇందుఁ బాగుగనర్చించి మానవుఁడు కర్పూరముతోఁజేసిన యుత్తమవిమానమునెక్కి సూర్యలోకమునకుఁ నేగుచున్నాఁడు. తేజమున భార్గవు (శుక్రు)నకును వెలుఁగునసూర్యునకును కాంతిలోఁజంద్రునకును శౌర్యమున నింద్రునకును (సింహము) సముఁడై చాలకాలము బృందారక బృందంబుఁగూడి ముదమందును కాలాంతరమున మగుడ భూలోకమున కేతెంచి రాజరా జగుచున్నాఁడు.

ఇది షడధికశతతమాధ్యాయము.

---

## సప్తాధికశతతమాధ్యాయము.

ఓధర్మజ్ఞా! ఇంకొక్కటి వచింతు వినుము. జగములసృష్టిచేయు దివాకరునకు రెండుపదము లున్నవి. అవి రెండును పాదపీఠమున నుంపఁ

---

వేదఫలం సామ యజుర్వేదఫలం యజుః,అథర్వా అథర్వాంగిరసో నిఖిలం యచ్ఛతే రవిః. ౯. తారకా ఇవ రాజంతే ద్యోతమానా దివానిశమ్, సమభ్యర్చ్య చ సప్తమ్యాం దేవదేవం దివాకరమ్. ౧౦. యత్ర పాపమశేషం వై నాశయత్యత్ర భాస్కరః, కర్తవ్యా సప్తమీ కృష్ణ తేనోక్తా పాపనాశినీ. ౧౧. అస్యాం సమభ్యర్చ్య రవిం యాతి సౌరపురం నరః, విమానవరమారుహ్య కర్పూరోద్భవముత్తమమ్. ౧౨. తేజసా కవిసంకాశః ప్రభయా సూర్యసన్నిభః, కాంత్యాత్రేయసమః కృష్ణ శౌర్యే హరిసమః సదా. ౧౩. మోదతే తత్ర సుచిరం బృందారకగణైః సహ, పునరేత్య భువం కృష్ణ భవేద్వైవిష్టాధిపాధిపః. ౧౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే పాపనాశినీవ్రతవిధివర్ణనం నామ
షడధికశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—తథాన్యదపి ధర్మజ్ఞ శృణుష్వ గదతో మమ, పదద్వయం, జగద్ధాతుర్దేవదేవస్య గోపతేః. ౧. యదేకపాదపీఠం హి తత్ర న్యస్తం పదద్వయమ్.

బడుచున్నవి. లోకహితమును గోరి సూర్యుఁడు స్వయముగ నాపద ద్వయము నేర్పఱచెను. అం దాతని యెడమపదము నుత్తరాయణముగా నెఱుంగుము. నిఖిలదేవతలకు నమస్కార్యమగు దక్షిణపదము దక్షిణాయనము. కృష్ణా! యేను నీవును శ్రద్ధతోఁ దక్షిణపాదము నర్చించుచున్నారము. ఇంద్రుఁడు నీశ్వరుఁడు నాతనివామపాదమును భక్తితో నర్చించుచున్నారు. ఆపాదద్వయమునం దేమానవుఁడు భక్తితో ననుదినము నాదిత్యున కారాధనము సలుపునో యాతని కెల్లప్పుడు భానుమంతుఁడు ప్రీతుఁడయియుండును అనవిని కృష్ణుండు సూర్యున కాదినమున నారాధన మెట్లుచేయవలయునో యెఱింగింపుమని యడుగఁ బితామహుం డతని కిట్లనియె. కృష్ణా! ఉత్తరాయణమున విధ్యుక్తముగ స్నానమాచరించి స్థిరచిత్తుఁడై నేయిపాలు మొదలగువానితోఁ దిమిరవైరియగు దివాకరు నభిషేకింపవలయును. శుభ్రవస్త్రములు నుపహారములు పుష్పధూపానులేపనములు నొసంగవలయును. పూజముగించి బ్రాహ్మణతర్పణములు చేయవలయును. సూర్యునందుఁ జిత్తము జేర్చి రెండుపదములను వ్రతముచేయఁబూనువాఁడు తొలుత జలకమాడి చిత్రకిరణుఁడగు సూర్యునకు నమస్కరింపవలయును. అన్నముతినునెడఁ బ్రయాణముచేయునెడను జిత్రభానునే యర్చించుచుండవలయును. నిదురించునప్పుడు మేల్కొనునప్పుడు నాతనికే మ్రొక్కు లిడుచుండవలయును. హోమములచే

---

స్వయమంశుమతా కృష్ణ లోకానాం హితకామ్యయా. ౨. వామనస్య పదం కృష్ణ జ్ఞేయం వై ఉత్తరాయణమ్., దేవాద్యైస్సకలైర్వంద్యం దక్షిణం దక్షిణాయనమ్. ౩. అహం త్వం చ సదా కృష్ణ దక్షిణం పాదమర్చతః, శ్రద్ధాన్వితౌ భాస్కరస్య హరీశౌ వామమర్చతః. ౪. తస్మిన్యః ప్రత్యహం సమ్యగ్దేవదేవస్య మానవః, కరోత్యారాధనం తస్య తుష్టః స్యాద్భానుమాన్సదా. ౫. విష్ణురువాచ:—కథమారాధనం తస్య దేవదేవస్య గోపతేః, క్రియతే దేవశార్దూల తత్సమాఖ్యాతుమర్హసి. ౬. బ్రహ్మోవాచ:— ఉత్తరే త్వయనే కృష్ణ స్నాతో నియతమానసః, ఘృతక్షీరాదిభిర్దేవం స్నాపయేత్తిమిరాపహమ్. ౭. చారువస్త్రోపహారైశ్చ పుష్పధూపానులేపనైః, సమభ్యర్చ్య తతః సమ్యగ్బ్రాహ్మణానాం చ తర్పణైః. ౮. పదద్వయం వ్రతం యస్య గృహ్ణీయాద్భానుతత్పరః, వందేత్స్నాతశ్చిత్రభానుం .తతశ్చ గరుడధ్వజ. ౯. భుక్త్వాన్నం చిత్రభానుం తు చిత్రభానుం వ్రజం స్తథా, స్వపన్విబుధ్య ప్రణమన్హోమం కుర్వం స్తథార్చయేత్. ౧౦.

నర్చించుచుండవలయును. ఎల్లప్పుడును చిత్రభానునామమునే గీర్తించు
దును. ఈదినము మొదలు దక్షిణాయనము వచ్చువఱకును నడచునప్పు
డును హుంకరించినప్పుడును వేదాధ్యయనము చేయునప్పుడు నెల్లప్పుడు
నుత్తరాయణము వచ్చునఱకును చిత్రభానునే గీర్తింతును. బ్రదికి
యున్నంతకాలము నే కొంచెమైనను తెలిసియో తెలియకయో చేయుదు
నేని యప్పుడావిభునామములఁ గీర్తింతును. ఎన్నఁడైన నించుకైన
నసత్యము పలుకుదునేని యప్పుడాదేవునికథలు పలుకుదును. తెలిసియు
దెలియకయు నాతనినే గీర్తింతును. అని యిట్లు మనమున నిశ్చయించు
కొని యాఱునెలలు చిత్రకిరణుఁడగు నాదేవుని స్మరించుచు మరణించు
వాని కేయుత్తమగతి కలుగునో యాగతి నాకుఁ గలుగుఁగాక. ఆరునెలల
నడుమ నాకుమృత్యువుగల్గునేని యీనాశరీరము నాదేవునందు నివేదించి
తిని. ఎవనిని బరమాత్ముఁడగు బ్రహ్మంబుగను చిత్రభానునిగను నవసాన
కాలమున స్మరింతునో యాభానుఁడే నాకు గతి. ఉదయమునఁగాని
మధ్యాహ్నమునఁగాని సాయంసమయమునఁగాని యాఱుమాసముల
నడుమ జపింతునేని చిత్రభానువ్రతమయంబగు న్యాసముచేసి యుందును.
ఓజగన్నాథా! నీవు స్వర్గలోకమునకును బరాయణుఁడవు గద! చిత్ర
భానుండవు గద! ఎటుల శక్తి ననుసరించి యొనరించిన నీవే నాకు గతి

---

చిత్రభానోరనుదినం కరిష్యే నామకీర్తనమ్, యావదద్య దినాత్ప్రాప్తం క్రమశో
దక్షిణాయనమ్. ౧౧. చలితే హుంకృతే చైవ వేదారంభేఽపి వా సదా, తావద్వక్ష్యే
చిత్రభానుం యావదేవోత్తరాయణమ్. ౧౨. యావజ్జీవం చ యత్కించిజ్జ్ఞానతోఽ
జ్ఞానతోఽపి వా, కరిష్యేఽహం తథా చైవ కీర్తయిష్యామి తం ప్రభుమ్. ౧౩.
యదానృతం కించిద్వక్ష్యే తదా వక్ష్యామి తద్వచః, అజ్ఞానాదథ వా జ్ఞానాత్కీర్త
యిష్యామి తం ప్రభుమ్. ౧౪. షణ్మాసమేకమనసా చిత్రభానుమయం పరమ్, తం
స్మరన్మరణే యాతి యాం గతిం సాస్తు మే గతిః. ౧౫. షణ్మాసాభ్యంతరే మృత్యుర్యది
తస్మిన్భవేన్మమ, తన్మయా భాస్కరస్యేహ స్వయమాత్మా నివేదితః. ౧౬. పరమాత్మ
మయం బ్రహ్మ చిత్రభానుమయం పరమ్, యమంతే సంస్మరిష్యామి స మే భానుః పరా
గతిః. ౧౭. యది ప్రాతస్తథా సాయం మధ్యాహ్నే వా జపామ్యహమ్, షణ్మాసా
భ్యంతరే న్యాసః కృతో వ్రతమయో మయా. ౧౮. తథా కురు జగన్నాథ స్వర్గలోక
పరాయణః, చిత్రభానో యథా శక్త్యా భవాన్భవతి మే గతిః. ౧౯. ఏవముచ్చార్య

యగుదు నట్టితెఱంగు జేయుము. అని యిట్లు ప్రార్థనావాక్యములఁ బలికి యాఱుమాసములు చిత్రభానువ్రతము దక్షిణాయనము ముగియువఱకు నాచరించి శక్తికొలంది విభావసునకుఁ బ్రీతిఁజేయవలయును. దివ్యులు భూములునగు బ్రాహ్మణులకు భోజనము లొసంగి దక్షిణలతోఁ దృప్తినటు పవలయును. సూర్యునెదుటఁ బుణ్యాఖ్యానములఁ జదివవల యును భక్తితో వాచకుని బూజింపవలయును. శక్తికొలఁది. బత్రకారుని బూజింపవల యును. ఇటు లీవ్రతము నెవ్వఁడు ధరించునో యాతఁడు నిక్కముగ నీలోకముననే యెల్లపాపములనుండి విముక్తుఁడగును. ఆఱుమాసముల నడుమ మరణము సంభవించెనేని యుపవాసముచేయువాని కగుఫలమును బొందుచున్నాఁడు. అట్టివాఁ డీపదద్వయమును బాగుగ నర్చించినవాఁడే యగునని మున్ను వృత్తాంతమును చంద్రుఁ డడుగ భానుఁడే యోకించి యుండెను.

ఇది సప్తాధికశతతమాధ్యాయము.

---

షణ్మాసం చిత్రభానుమయం వ్రతమ్, తావన్నిష్పాదయేద్యావత్సంపూర్ణం దక్షిణాయనమ్. ౨౦. తతశ్చ ప్రీణనం కుర్యాద్యథాశక్త్యా విభావసోః, భోజయేద్బ్రాహ్మణాన్దివ్యా న్భూమాంశ్చాపి సదక్షిణాన్. ౨౧. పుణ్యాఖ్యానకథాం కుర్యాన్మార్తండస్య తథాగ్రతః, పూజయేద్వాచకం భక్త్యా యథాశక్త్యా చ లేఖకమ్. ౨౨. ఏవం వ్రతమిదం కృష్ణ యో ధారయతి మానవ, ఇహైవ దేవశార్దూల ముచ్యతే సర్వకిల్బిషైః. ౨౩. షణ్మాసా భ్యంతరే చాస్య మరణం యది జాయతే, ప్రాప్నోత్యనశనస్యోక్తం యత్ఫలం తదసంశ యమ్. ౨౪. పదద్వయం చ దేవస్య సమ్యక్త్వేన సదార్చితమ్, భవత్యేతజ్జగౌ భానుః పురా చంద్రాయ పృచ్ఛతే. ౨౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే భానుపాదద్వయవ్రతవర్ణనం నామ సప్తాధికశతతమోఽధ్యాయః.

---

## అష్టాధికశతతమాధ్యాయము.

మాఘకృష్ణపక్షమున వచ్చు సర్వాప్తిసప్తమీవ్రతమును వినుము. అం దుపవసింప నెల్లకోర్కులు నుభయలోకములను లభించును. సూర్య భక్తుఁడగువాఁడు పాఖండపతితాదులతోఁ బ్రసంగింపరాదు. ఏకాగ్ర చిత్తుఁడై యా దేవునకుఁ బ్రణమిల్లి పూజింపవలయును. మాఘము మొద లాఱుమాసములఁ జేయుపారణము సాంక్రాంతిక మనఁబడును. అందు మొదటిమాసపునామము "మార్తండుఁ" డనియు ద్వితీయమున "కః" అనియు మూఁడవది "చిత్రభానుఁ"డనియు నాలుగవది "విభావసుఁ" డనియు నైదవది "భగుఁ"డనియు నారవది "హంసుఁ"డనియుఁ జెప్పఁబడు చున్నది. ఆరుమాసములు నిండినవెనుక స్నానప్రాశనములకుఁ బంచ గవ్యము ప్రశస్తమైనదియుఁ బాపముల నశింపఁజేయునదియు నని యుదా హరింపఁబడినది. యథావిధిగ దేవునకుఁ బూజానమస్కారము లొనరించి శక్తికొలఁది శ్రద్ధతో బ్రాహ్మణులకు దక్షిణ యొసంగవలయును. పార ణము ముగిసినవెనుక భక్తిచే నా దేవుని బ్రీతుఁ జేయవలయును. సూర్యుఁడు భక్తికే లోఁబడువాఁడు గదా; నక్తాహారుఁడును నూనె యుప్పు మొద లగునవి విడచువాఁడునై యుండవలయును సప్తమినాఁడు రాత్రి జాగ రము చేయవలయును. శక్తిలేకున్నఁ బగలైనను జాగరము చేయవల యును. ఇం దుపవసించి జాగరణము చేయువాఁడు ధర్మజ్ఞుఁడై సూర్యుని

---

బ్రహ్మోవాచః—కృష్ణపక్షే తు మాఘస్య సర్వాప్తిం సప్తమీం శృణు, యాముపోష్య సమాప్నోతి సర్వాన్కామాంస్తథా పరాన్. ౧. పాఖండాదిభిరాలాపం న కుర్యాద్భానుతత్పరః, పూజయేత్ప్రణతో దేవమేకాగ్రమనసా శుభమ్. ౨. మాఘాద్యైః పారణం మాసైః షడ్భిః సాంక్రాన్తికం స్మృతమ్, మార్తండః ప్రథమం నామ ద్వితీయం కః ప్రకీర్తితమ్. ౩. తృతీయం చిత్రభానుశ్చ విభావసురతః పరమ్, భగోఽపి పంచమం జ్ఞేయం షష్ఠం హంసః స ఉచ్యతే. ౪. పూర్ణేషు షట్సు మాసేషు పంచగవ్యముదాహృతమ్, స్నానే చ ప్రాశనే చైవ ప్రశస్తం పాపనాశనమ్. ౫. ప్రణామం దేవదేవస్య కృత్వా పూజాం యథావిధి, విప్రాయ దక్షిణాం దద్యాచ్ఛ్రద్ధధానశ్చ శక్తితః. ౬. పారణాంతే చ దేవస్య ప్రీణనం భక్తిపూర్వకమ్, కుర్వీత భక్త్యా విభవద్రవిభక్త్యా తు గృహ్యతే. ౭. నక్తభోజీ తథా విష్ణో తైలక్షారవివర్జితః, కృష్ణ జాగరణం రాత్రౌ సప్తమ్యామథ వా దివే. ౮. ఏతాముషిత్వా ధర్మజ్ఞో హంసప్రీణన

బ్రీతుఁజేయుటయం దాసక్తి గలిగి సూర్యు ననుగ్రహమున సర్వపాపముల నుండి విముక్తుఁడై సర్వకామములఁ బొందుచున్నాఁడు. ఈసప్తమివలన మనస్సునఁగోరిన ఫలములనెల్లఁ బొందుచుండుటంజేసి లోకమున నీసప్తమి సర్వార్థావాప్తి సప్తమి యని విఖ్యాత యయ్యె. ఈసప్తమి ధర్మపరులగు విద్వాంసులచే నభిలషితమై యారంభింపఁబడి యనుదినము నెల్ల కోర్కులను వారలకు నిండించుచుండును. అందుచే నిది సర్వార్థావాప్తిసప్తమి యని సుప్రసిద్ధ యగుచున్నది. కావున నీవు ఖగవాహనా! యీనాఁ డారవిని మున్ను నక్షత్రేశ్వరుఁడగు చంద్రుఁ డారాధించినట్టు లారాధింపుము.

ఇది అష్టాధికశతతమాధ్యాయము.

---

## నవాధికశతతమాధ్యాయము.

మార్తండసప్తమిని వచింతును. శుభదాయకమగు నాతిథిని సావధానముగ నాకర్ణింపుము. దానిని బాగుగ ననుష్ఠించిన నభిమతఫలము లభించును. పౌషమాసమున శుక్లపక్షమున సప్తమినాఁ డుపవసించి మార్తండనామమున నాదిత్యుని బాగుగఁ బూజించి మార్తండజపము

---

తత్పరః, సర్వాన్కామానవాప్నోతి సర్వపాపైః ప్రముచ్యతే. ౯. యతః సర్వమవాప్నోతి యద్యదిచ్ఛతి చేతసా, అతో లోకేషు విఖ్యాతా సర్వార్థావాప్తిసప్తమీ. ౧౦. కృతాభిలషితా హ్యేషా ప్రారబ్ధా ధర్మతత్పరైః, పూరయత్యఖిలాన్కామాన్పుత్రతా చ దినేదినే. ౧౧. తమారాధయస్వ రవిం తథాత్వ గరుడధ్వజ, యథారాధితవాన్భానుం భగణాధిపతిః పురా.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సర్వార్థావాప్తిసప్తమీవర్ణనం నామ
అష్టాధికశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—మార్తండసప్తమీం కృష్ణ యథాన్యాయం వచ్మి తేఽనఘ, శృణు చైకమనా వీర గదతో మే శుభప్రదామ్. ౧. యస్యాః సమ్యగనుష్ఠానాత్ప్రాప్నో త్యభిమతం ఫలం, పౌషే మాసే సితే పక్షే సప్తమ్యాం సముపోషితః. ౨. సమ్యక్సంపూజ్య మార్తండం మార్తండ ఇతి వై జపేత్, పూజయేత్కృతపం భక్త్యా శ్రద్ధయా

చేయవలయును. భక్తిశ్రద్ధలతోఁ గుతపకాలమును ధూపపుష్పోపహారాదులచేత నుపవాసములచేతను నిశ్చలచిత్తుఁడై పూజింపవలయును. ఆదేవునందే మనము జేర్చి మార్తండనామజపమును పూజావసానమునఁ గూడఁ జేయవలయును. శక్తికొలఁది బ్రాహ్మణులకు దక్షిణ యొసంగవలయును. నిద్రించుచు మేల్కొనుచుఁ దొట్రుపడుచు నామార్తండునే గీర్తింపవలయును. పాషండవికర్మస్థాదులతోడి సల్లాపమును విడువవలయును. ఆవు పంచితము, ఆవుపాలు, పెరుఁగులలో నేదో యొకదానిని దేహశుద్ధికొఱకై ప్రాశనము చేయవలయును. మరునాఁ డుదయమున స్నానము చేసి మఱల వెనుకటివలె నాదిత్యార్చనము సలిపి మార్తండనామమునే జపించి బ్రాహ్మణునకు దక్షిణ యొసంగి యామీఁద నావుపాలవలనఁ గలిగిన పెరుఁగు వెన్న మొదలగువానితోఁగూడిన యాహారమును భుజింపవలయును. ఇటులనే పండ్రెండునెలల నుపవసించి శుచియై నియతాత్ముఁడై పూజించి శక్తికొలఁది బ్రాహ్మణులకు గోవులు మొదలగువానిని దానము చేయవలయును. సంవత్సరము నీవ్రతము నవలంబించి శక్తికొలఁది నాదిత్యునకు గవాదిదానము జేసినఁ గలుగుఫలమును వినుము. పంచమినాఁడు బంగారుకొమ్ములుగలగోవు నొసంగవలయును. షష్ఠినాఁడు బంగారుకొమ్ములవృషభము నొసంగవలయును. వీనిని బ్రతిమాసమునను ద్విజాతుల కొసంగిన నెంతఫలము గలుగునో యంతటిఫలము నీవ్రతమున నుపవసించినవాఁడు పొందుచున్నాఁడు. మార్తండుఁడు వసించు

---

పరయాన్వితః. ౩. ధూపపుష్పోపహారాద్యై రుపవాసైః సమాహితః, మార్తండేతి జపన్నామ పున స్తద్గతమానసః. ౪. విప్రాయ దక్షిణాం దద్యాద్యథాశక్త్యా ఖగధ్వజ, స్వపన్విబోధన్స్ఖలితో మార్తండేతి చ కీర్తయేత్. ౫. పాషండాదివికర్మస్థైరాలాపం చ వివర్జయేత్, గోమూత్రం గోపయో వాపి దధి క్షీరమథాపి వా. ౬. గోదేహతః సముద్భూతం ప్రాశ్నీయాదాత్మశుద్ధయే, ద్వితీయేఽహ్ని పునః స్నాత స్తథైవాభ్యర్చనం రవేః. ౭. తేనైవ నామ్నా సంభూయ దత్త్వా విప్రాయ దక్షిణాం, తతో భుంజీత గోదోహసంభూతేన సమన్వితమ్. ౮. ఏవమేవాఖిలాన్మాసానుపోష్య ప్రయతః శుచిః, దద్యాద్గవాదికం విప్రాన్ప్రతిమాసం స్వశక్తితః. ౯. ధారితా చేత్పునర్వర్షే యథాశక్త్యా గవాదికం, దత్త్వా పరం రవేర్భూయః శ్రుణు యత్ఫలమశ్నుతే. ౧౦. స్వర్ణశృంగీం చ పంచమ్యాం షష్ఠ్యాం చ వృషభం నరః, ప్రతిమాసం ద్విజాతిభ్యో యద్దత్త్వా ఫలమ్

లోకమును బొందుచున్నాఁడు. తేజమున శాండిలేయున కెనయై యుండును. ఈమార్తండసప్తమి నారాధించి యుపవసించి యాకసమున నీదేవగణములన్నియు వెలుఁగుచు నిష్పాపును లోకముచేఁ జూడఁబడుచున్నవి కావున నోవాసుదేవా! నీవు నాయూరిదేవు నీశు నాగ్రహరాజును భాస్కరుని వెనుకఁజెప్పినవిధానము ననుసరించి గోళాకారమున నర్చింపుము.

ఇది నవాధికశతతమాధ్యాయము.

## దశాధికశతతమాధ్యాయము.

అచ్యుతా! భాద్రపదమాసమున శుక్లపక్షమున సప్తమినాఁడు శిరము వంచి యాదిత్యునకు నమస్కరించి యాసప్తాశ్వునిఁ బుష్పధూపాదులచేతను కుతపతర్పణములచేతను బూజింపవలయును. పూజాకాలమునఁ బాషండులు మొదలగువారితో నాలాపము లాడక నియమితచిత్తుఁడై యుండవలయును. బ్రాహ్మణులకు దక్షిణ యొసంగి మౌనముతో రాత్రి భుజింపవలయును. నిలచియున్నను శయనమైనను పోవునపుడును తుమ్ములు తొట్రుపడుట మొదలగునవి కలుగునప్పుడు నాదిత్యనామస్మర

---

శ్నుతే. ౧౧. తత్ప్రాప్నోత్యఖిలం సమ్యగ్వ్రతమేతదుపోషితః, తం చ లోకమవాప్నోతి మార్తండో యత్ర తిష్ఠతి. ౧౨. శాండేలేయసమః కృష్ణ తేజసా నాత్ర సంశయః, మార్తండసప్తమీమేతాముపోష్యైతే గణా దివి. ౧౩. విద్యోతమానా దృశ్యంతే లోకైరద్యాపి భూధర, తస్మాత్త్వమాదిదేవేశం గ్రహేశం భాస్కరం రవిం, అనయార్చయ గోవింద గోపతిం గోలసన్నిభమ్. ౧౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే మార్తండసప్తమీవర్ణనం నామ నవాధికశతతమోఽధ్యాయః.

బ్రహ్మోవాచ:—శుక్లపక్షే తు సప్తమ్యాం మాసి భాద్రపదేఽచ్యుత, ప్రణమ్య శిరసాదిత్యం పూజయేత్సప్తవాహనమ్. ౧. పుష్పధూపాదిభిర్వీర కుతపానాం చ తర్పణైః, పాషండాదిభిరాలాపమకుర్వన్నియతాత్మవాన్. ౨. విప్రాయ దక్షిణాం దత్త్వా నక్తం భుంజీత వాగ్యతః, తిష్ఠన్వ్రజన్ప్రస్థితశ్చ క్షుతప్రస్ఖలితాదిషు. ౩. ఆదిత్య

ణముచేయుచు నాతనినామమే యుచ్చరించుచునుండవలయును. ఈవిధా నముచేఁ బండ్రెండు నెలలు వరుసగ నుపవాసములు సలిపి పారణాంతమున నాజగద్గురు నర్చనచేసి పుణ్యకథాశ్రవణముచేఁ బ్రీతుంజేయవలయును. అటు లొనరించువాఁడు పుష్టి గలిగియుండును. పుణ్యకథలు వినుపించుట వలనిష్ట సుఖంతముగాన బానితోడనే యాదేవు నర్చింపవలయును. దా ని. విక్రమముగ నాఫలముం బొందియుండు. ఇవ్విధముగ నేపురుషుం శుచియై యాదిత్యారాధనము చేయునో యాతఁ డీలోకమున ధర్మార్థములు వలని మహాభోగములెల్ల ననుభవించి జన్మాంతమున గంధర్వగానాదు లతోఁ గూడిన దివ్యము నవ్యయము నగు పరలోకమున కేగి నిర్మలానం దము నొందుచున్నాఁడు. వనితయైనను స్వర్గలోకమున కేగి యనంతఫల మనుభవించును.

ఇది దశాధికశతతమాధ్యాయము.



## ఏకాదశోత్తరశతతమాధ్యాయము.

శ్రావణమాసమున శుక్లపక్షమున సప్తమినాఁడు దేవోత్తముఁ డగు సప్తవాహానుని ధూపపుష్పాదులచే శుచియై యారాధించి పాషండా

నామస్మరణం కుర్వన్నుచ్చారణం తథా, అనేనైవ విధానేన మాసాన్ ద్వాదశ వై క్రమాత్. ౪. ఉపోష్య పారణే పూర్ణే సమభ్యర్చ్య జగద్గురుం, పుణ్యేన శ్రావణే నేహ ప్రీణయన్పుష్టిమశ్నుతే. ౫. అనంతం శ్రావణే నేహ యతః ఫలముదాహృతం, తేనాదిత్యం సమభ్యర్చ్య తదేవ లభతే ఫలమ్. ౬. ఏవం యః పురుషః కుర్యాదాదిత్యా రాధనం శుచిః, ప్రాప్యేహ విపులం భోగం ధర్మమర్థం తథావ్యయమ్. ౭. అముత్ర లోకమాయాతి దివ్యే ఖే గీతసంయుతే, నారీ వా స్వర్గమభ్యేత్య వ్యానంతం ఫల మశ్నుతే. ౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే అనంతరసప్తమీవ్రతవర్ణనం నామ
దశాధికశతతమోఽధ్యాయః.

బ్రహ్మోవాచ:— శ్రావణే మాసి దేవాగ్ర్యం సప్తమ్యాం సప్తవాహనం, శుక్ల పక్షే సమభ్యర్చ్య పుష్పధూపాదిభిః శుచిః. ౧. పాఖండాదిభిరాలాపమకుర్వన్నియతాత్మ

దులతో సంభాషింపక నియమితచిత్తుఁడై బ్రాహ్మణునకు దక్షిణ నొసంగి మౌనముతో రాత్రి భుజింపవలయును. ఏటేట నాదిత్యదేవున కభ్యంగము చేయవలయును. సప్తమినాఁడు శ్రేష్ఠము శుభ్రము నూతనమునగు నన్నమే శుభకరమైనది ఇతరములగు నైశ్వర్యము లున్నయపుడు వాద్యములు గూడఁ జేయవలయును. అటులనే యీమాసమున నాదేవున కభ్యంగము శ్రేష్ఠముగా నెంచఁబడుచున్నది. ఏనరుఁడు భక్తితో భాస్కరున కభ్యంగముజేసి విధ్యుక్తముగ శక్తికొలఁది బ్రాహ్మణులకు భోజనము లిడి శంఖతూర్యనినాదములతోడను పుష్కలములగు వేదఘోషములతోడ నాదేవుని బూజించునో యాతఁడు దివ్యవిమానము నెక్కి సూర్యలోకమున కేగును. ఈవిధానముచేఁ బండ్రెండుమాసములను వరుసగ నుపవసించి పారణము పూర్తిఁజేసి విప్రునకు దక్షిణ యొసంగవలయును. ఇప్పగిది నాదిత్యారాధనవ్రతమును శుచియై యొనరుచు పురుషుఁడు వనమాలాధరుఁడగు విష్ణుదేవుని దివ్యపదమును బొందును.

ఇది ఏకాదశోత్తరశతతమాధ్యాయము.

---

వాన్, విప్రాయ దక్షిణాం దత్త్వా నక్తం భుంజీత వాగ్యతః. ౨. అభ్యంగం దేవదేవస్య వర్షే వర్షే నియోజయేత్, సప్తమ్యామన్నమేవాగ్ర్యం శుభం శుక్లం నవం తథా. ౩. విభవేషు తథాన్యేషు వాదిత్రాణ్యేవ వై విదుః, తథా దేవస్య మాసేఽస్మిన్నభ్యంగః పరిగీయతే. ౪. యస్తు చారాధయేద్భక్త్యా భాస్కరస్య నరోఽచ్యుత, అభ్యంగం విధివచ్ఛక్త్యా కృత్వా బ్రాహ్మణభోజనమ్. ౫. శంఖతూర్యనినాదైశ్చ బ్రహ్మఘోషైశ్చ పుష్కలైః, స దివ్యం యానమారూఢో లోకమాయాతి హేలినః. ౬. అనేనైవ విధానేన మాసాన్ ద్వాదశ వై క్రమాత్, ఉపోష్య పారణే పూర్ణే దద్యాద్విప్రాయ దక్షిణామ్. ౭. వ్రతం యః పురుషః కుర్యాదాదిత్యారాధనం శుచిః, స గచ్ఛేత్పరమం లోకం దివ్యం వై వనమాలినః. ౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే అభ్యంగసప్తమీవర్ణనం నామ
ఏకాదశోత్తరశతతమోఽధ్యాయః.

## ద్వాదశోత్తరశతతమాధ్యాయము.

కృష్ణా! ఈప్రకారముగ నెల్లకాలము భక్తి కలిగి యథావిధిగ సలిలముచేతనైనను మానవులు పూజింప నాభానుమూర్తి సంతుష్టుండై పొందరానిదైన నొసఁగును. భానుఁ డుదకములచే గాని పుష్పఫలములచేఁగాని యారాధింపఁబడఁడు. కేవలము మిక్కిలి నిర్మలమగుహృదయముచేతనే యారాధింపఁబడుచున్నాఁడు. రాగలోభాదులకు వెలియగు హృదయమును, అనృతాదులచే దుష్టముగానివాక్కును హింసలేనికర్మయును నీమూఁడును సూర్యారాధనత్రయ మనఁబడుచున్నవి. రాగాదులచే దూషింపఁబడిన చిత్తమున నాదిత్యుఁడు చలింపఁడు అట్టినరు నొకప్పుడు చీఁకటియను బురదనీటితోఁ గట్టిపెట్టుచున్నవాఁడు. ఎల్లప్పుడును చీఁకటుల నడఁగించుటలోఁ జంద్రకళ చాలియున్నది గదా? హింసాదులచే దూషింపఁబడినకర్మచే నెందుల కారాధింపవలయును? చిత్తము ప్రసన్నము గాకుండెనేని యేనరుఁడును తమోనాశకుని బొందఁజాలఁడు. కావున సత్యస్వభావముచేతను సత్యవాక్యముచేతను హింసారహితకర్మచేతను భానుఁడు స్వభావముగనే సంతోషించుచున్నాఁడు. స్వభావము కుటిలమైయుండఁ దనసర్వస్వము వ్యయపరచి పూజించినను ఆతఁడు దేవదేవుఁడగు దివాకరుని బూజింపలేదనియే యర్థము. హృదయమును రాగాదులయధీనముచేయక భాస్కరునందుఁ జేర్పుము. ఆమీఁదఁ బొందనలవిగాని భాస్కరు ననాయాసముగ నయత్నముగఁ బొందఁగలవు. నావు

---

బ్రహ్మోవాచ:—ఏవం కృష్ణ సదా భానుర్నరైర్భక్త్యా యథావిధి, ఫలం దదాత్యసులభం సలిలేనాపి పూజితః. ౧. న భానుర్జీవదానేన న పుష్పైర్న ఫలైస్తథా, ఆరాధ్యతే సుశుద్ధేన హృదయేనైవ కేవలమ్. ౨. రాగాదపేతం హృదయం వాగ్దుష్టా నానృతాదిభిః, హింసావిరహితం కర్మ భాస్కరారాధనత్రయమ్. ౩. రాగాదిదూషితే చిత్తే నాస్పందీ తిమిరాపహః, బధ్నాతి తం నరం హంసః కదాచిత్కర్దమాంభసి. ౪. తమసో నాశనాయాలం చేందోర్లేఖా హ్యనారతం, హింసాదిదూషితం కర్మ కేశవారాధనే కుతః. ౫. జనశ్చిత్తాప్రసాదాద్వై న చాప తిమిరాపహం, తస్మాత్సత్యస్వభావేన సత్యవాక్యేన చాచ్యుత. ౬. అహింసకేన చాదిత్యో నిసర్గాదేవ తోషితః, సర్వస్వమపి దేవాయ యో దద్యాత్కుటిలాశయః. ౭. స నైవారాధయేదేవం దేవదేవం దివాకరం, రాగాదపేతం హృదయం కురు త్వం భాస్కరార్పణం, తతః ప్రాప్స్యసి

డాతనికిఁ గృష్ణుఁ డిట్లనియె. 'కామ్యఫలప్రదుఁడగు దేవేశుఁ డాదిత్యుని చరితము నీవలన వింటిని. ఆరాధనవిధినంతను మరలఁ బ్రశ్నించుచున్నాఁడను. దానిని వచింపుము. సత్కులజననమును, ఆరోగ్యమును, ధనవృద్ధియు నను నీమూఁడును దుర్లభము లైనవి. ఈమూఁడు నెటుల లభించునో యెఱుఁగఁజేయుము' నావుఁ డా దేవుఁడు బ్రహ్మదేవుఁ డిట్లనియె. మాఘమాసమున శుక్లపక్షమున సప్తమినాఁడు పగటివేళ హస్తానక్షత్రయోగమున జగత్కారణుఁడగు భానుని నుపవాసముచేతను ధూపపుష్పోపహారములచేతను వరాన్నములచేతను బూజింపవలయును. గృహస్థుఁడగు మానవుఁడు పుష్పములతోఁ బూజసలిపి దానాదులతోఁ గూడ నొక్కయేఁడాది వ్రతము చేయవలయును. మునిశ్రేష్ఠులకు దానము లీవలయును. దాని తెఱం గెఱింగింతు వినుము. వజ్రములను, నువ్వులను, వ్రీహియవధాన్యములను, హిరణ్యమును, యవాన్నము, నుదకమును, పడిగండ్లను, పాదుకలను, గొడుగులను, బెల్లముతోఁ జేసిన యుత్తమపదార్థములను వరుసగ నొసఁగవలయును. ఏతిథియం దాజగద్గురుని బూజించి సంవత్సరవ్రతము బూనునో యదిమొదలు ఈవిధిగ దానములు చేయవలయును. ఇఁకమీఁద దేహశుద్ధిని జేయుప్రాశనముల వివరింతు వినుము. గోమూత్రము నుదకమునను రెండురసద్రవ్యములును కూర, గఱిక, పెరుఁగు, వ్రీహులు,

---

దుష్ప్రాప్యమయత్నే నైవ భాస్కరమ్. ౮. విష్ణురువాచ.—దేవేశః కథితః సమ్యక్కామ్యోఽయం భాస్కరో మయి, ఆరాధనవిధిం సర్వం భూయః పృచ్ఛామి తం వద. ౯. కులే జన్మ తథారోగ్యం ధనవృద్ధిశ్చ దుర్లభా, త్రితయం ప్రాప్యతే యేన తన్మే వద జగత్పతే. ౧౦. బ్రహ్మోవాచ.—మాసే తు మాఘే సితసప్తమేఽహ్ని హస్తర్క్షయోగే జగతః ప్రసూతిం, సంపూజ్య భానుం విధినోపవాసీ సుగంధధూపాన్నవరోపహారైః. ౧౧. గృహీ తు పుష్పైః ప్రతిపాద్య పూజాం దానాదియుక్తం వ్రతమబ్దమేకం, దద్యాచ్చ దానం మునిపుంగవేభ్యస్తత్కథ్యమానం వినిబోధ ధీర. ౧౨. వజ్రం తిలాన్వ్రీహియవాన్హిరణ్యం యవాన్నమంభః కరకాముపానహం, ఛత్రోపపన్నం గుడఫేణితాఢ్యం దద్యాత్క్రమాద్వస్తు అనుక్రమేణ. ౧౩. యద్యేవ వర్షే విధినోదితేన యస్యాం తిథౌ లోకగురుం ప్రపూజ్య, అశ్నంతనాన్యాత్మవిశుద్ధిహేతోః సంప్రాశనానీహ నిబోధతాని. ౧౪. గోమూత్రమంభశ్చ రసేను శాకం దూర్వా దధి వ్రీహితిలాస్యవాంశ్చ, సూర్యాంశుతప్తం జలమంబుజాక్ష క్షీరం చ మాసైః క్రమశః ప్రయుజ్యాః. ౧౫. కులే ప్రధానే

యవలు, నువ్వులు, సూర్యకిరణములు తగిలి వేడిమైననీరును, క్షీరమును, మాసములు పండ్రెండిటియందును వఱుసగ నుపయోగింపవలయును. ఇటు లొనరించినవాఁ డుత్తమకులమున ధనధాన్యలక్ష్ముల కాలవాలమై దుఃఖము లెఱుఁగని ప్రదేశమున హెచ్చుతగ్గులు వగైరాలు లేని యింద్రియాదులుగలిగి యారోగ్యవంతుఁడు బుద్ధిమంతుఁడు సుఖియునై జననము నొందుచున్నాఁడు. కాన నీవు నమోఘవీర్యుండ వగుటంజేసి యప్రమత్తుఁడవై ప్రభావముతో దివాకరారాధన మొనరించి సర్వకామముల ననుభవింపుము.

ఇది ద్వాదశోత్తరశతతమాధ్యాయము.

---

## త్రయోదశోత్తరశతతమాధ్యాయము.

ఓసురజ్యేష్ఠా! ఇంకను కొన్ని విషయము లామూలాగ్రముగ నెఱుఁగఁగోరి యడుగుచున్నాను. సూర్యదేవాలయము గట్టించువాని కేమి ఫలము కలుగును? దేవతా(ర్చనము)ర్చావిగ్రహమును చేయించువారి కేమి పుణ్యము కలుగును? యథావిధిగఁ బూజించువానికిని శుభ్రముగ నామందిరము నలుకువానికి నేమిఫలము కలుగును? ఏయే మాల్యము లాదేవుని పూజకై ప్రశస్తములైనవి? వేనిని నాభాస్కరుఁడు కైకొనఁడు? ఆతని కిష్టములగుధూపము లెయ్యవి? ఎయ్యవి త్యాజ్యములు? ఉపచార

---

ధనధాన్యపూర్ణే పద్మావృతే హ్యస్తసమస్తదుఃఖే, ప్రాప్నోతి జన్మాఽవికలేంద్రియశ్చ భవత్యరోగో మతిమాన్సుఖీ చ. ౧౬. తస్మాత్త్వమప్యేతదమోఘవీర్య దివాకరారాధన మప్రమత్తః, కురు ప్రభావం భగవంతమీశమారాధ్య కామానఖిలాను పేహి. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే తృతీయపదవ్రతవర్ణనం నామ ద్వాదశోత్తరశతతమోఽధ్యాయః.

---

విష్ణురువాచ:— సురజ్యేష్ఠ పునర్బ్రూహి యత్పృచ్ఛామ్యహమాదితః, యత్ఫలం సమవాప్నోతి కారయిత్వా రవేర్గృహమ్. ౧. దేవార్చాం కారయిత్వా తు యత్పుణ్యం పురుషోఽశ్నుతే, పూజయిత్వా చ విధివదనులిప్య చ యత్ఫలమ్. ౨. కాని మాల్యాని శస్తాని కాని నార్హతి భాస్కరః, కే ధూపా భానుదయితాః కే వర్జ్యాశ్చ జగత్పతేః.

ములు చేయుటవలని ఫల మెయ్యది? గానవాదనాదులఫలము లెయ్యవి? నేయి పాలు మొదలగువానితో భాస్కరాభిషేకము సల్పినఁ బ్రయోజన మేమి? సూర్యగృహ మూడ్చుటచేతను నీటఁ జల్లుటచేతను లభించుఫల మేమి? ఇదియంతయు విస్తరముగ నాకెఱుఁగఁజేయుమ యని వాసుదేవుఁ డడుగ, పితామహుం డాతని కిట్లనియె. కృష్ణా! నీప్రశ్న ప్రశంసింపఁ దగి. బాగు బాగు. పవిత్రమగుసూర్య గృహ్ర... వినుము... గనా! ఏకాగ్రచిత్తుండవై యాలకింపుము. ఏమానవుండైన దారువుతోఁ గాని శిలలతోఁగాని మంటితోఁగాని సూర్యదేవాలయమును గట్టించునో యాతని కగుపుణ్యఫలమును వినుము. ప్రతిదినమునను యజ్ఞములచే దేవతలయజించువారి కేమహాఫలము కలుగునో, అట్టిఫలమును సూర్యునకు మందిరము గట్టించువాఁడు పొందుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు తనకులమున రాఁబోవు నూఱువంశములను గడచిన నూఱువంశములను సూర్యలోకమునందు జేర్చుచున్నాఁడు. ఏడుజన్మముల నార్జించినపాపము కొంచెమైనను గొప్పదైనను సూర్యదేవాలయము నిర్మించుయత్నమును మొదలిడుటచేతనే నశించును. సూర్యుఁడే కదా యేడులోకములు నై యున్నాఁడు; అట్టిభానున కెవరు గృహనిర్మాణము చేయుదురో వారు సప్తలోకములందును ఖ్యాతి గణించుచున్నారు. ఉత్తమపవిత్రదేశముఁ బవిత్రప్రదేశమునఁ బ్రశస్తమగు సూర్యమందిరమును గట్టించువాఁ

---

3. ఉపచారఫలం కిం స్యాత్కిం ఫలం గీతవాదితే, ఘృతక్షీరాదినా యత్తు స్నాపితే భాస్కరే ఫలమ్. ౪. యద్ధోపలేపనాదౌ చ ఫలమభ్యుక్షితేన తు, దివాకరగృహే తాత తదశేషం వదస్వ మే. ౫. బ్రహ్మోవాచ.—సాధు పృష్ట యదేతత్త్వం మార్తణ్డస్యేహ పృచ్ఛసి, శుశ్రూషణే విధిం పుణ్యం తదిహైకమనాః శృణు. ౬. యస్తు దేవాలయం భానోర్దార్వం శైలమథాపి వా, కారయేన్మృన్మయం చాపి తస్య పుణ్యఫలం శృణు. ౭. అహన్యహని యజ్ఞేన యజతో యన్మహత్ఫలమ్, ప్రాప్నోతి తత్ఫలం భానోర్యః కారయతి మన్దిరమ్. ౮. కులానాం శతమాగామి సమతీతం కులం శతమ్, కారయేద్భగవద్ధామ స నయేదర్కలోకతామ్. ౯. సప్తజన్మకృతం పాపం స్వల్పం వా యది వా బహు, భానోరాలయవిన్యాసప్రారంభాదేవ నశ్యతి. ౧౦. సప్తలోకమయో భానుస్తస్య యః కురుతే గృహమ్, ప్రతిష్ఠాం సమవాప్నోతి స నరః సాప్తలౌకికీమ్. ౧౧. ప్రశస్తదేశభూభాగే ప్రశస్తం భవనం రవేః, కారయేదక్షయాంల్లోకాన్స నరః ప్రతిపద్యతే. ౧౨.

డక్షయలోకములఁ బొందును. ఇటుకలు వరుసగ పతికించిన నెన్నియేం డ్లుండునో యన్ని వేలయేండ్లు స్వర్గలోకమున దానిం గట్టినవాఁ డుపవసించును. శుభలక్షణములు (సౌమ్యదృష్టి మొదలగునవి) గలదివాకరప్రతిమను చేయించువా రక్షయమగు సూర్యలోకమును బొందుదురు. అఱువదివేలవర్షసహస్రములు ప్రత్యేకముగ దేవలోకమున వసించి ముదమందును సూర్యుని యర్చావిగ్రహము నొక ప్రశస్తప్రదేశమునఁ బ్రతిష్ఠించినమానవుఁడు కృతకృత్యుఁడై యుండును. దోషఫలము నొందఁడు. ఆతనికులమున నెవరు కల్పాంతమువఱకు రానున్నారో యెవరు గడచిరో వారినందఱ నాయర్చావిగ్రహప్రతిష్ఠాపనమువలనఁ దరింపఁజేయువాఁడగును. మున్ను త్రాళ్లు కఱ్ఱలు చేతఁబూని ప్రజాపీడయం దుద్యోగించు యమకింకరులను యముఁ డిట్లని యాజ్ఞాపించి యున్నాఁడు గదా; ఓభటులారా! న్యాయము తప్పకుండఁగా విహరింపుఁడు. నాయాజ్ఞను పాలింపుఁడు ఎచ్చటను జంతువులు మీయాజ్ఞకు భంగముచేయరు. ఎవ రెప్పుడును జగన్మూలమగు వివస్వంతు నాశ్రయించియుందురో అట్టివారిని మీరు విడువవలయును. వారి కిచ్చట నవకాశము లేదు. ఏసూర్య భక్తులు లోకమున సూర్యునందుఁ జిత్తముఁజేర్చి తత్పరాయణులై యెల్లప్పుడు భానునే యారాధింతురో వారిని జాలదూరమున విడచిపుచ్చుఁడు.

---

ఇష్టకాచయవిన్యాసో యావద్వర్షాణి తిష్ఠతి, తావద్వర్షసహస్రాణి తత్కర్తుర్దివి సంస్థితిః. ౧౩. ప్రతిమాం లక్షణవతీం యః కారయతి మానవః, దివాకరస్య తల్లోకమక్షయం ప్రతిపద్యతే. ౧౪. షష్టిర్వర్షసహస్రాణాం సహస్రాణి స మోదతే, లోకే సుమనసాం వీర ప్రత్యేకం మధుసూదన. ౧౫. ప్రతిష్ఠాప్య రవేరర్చాం సుప్రశస్తే నివేశనే, పురుషః కృతకృత్యోఽస్తి న దోషఫలమశ్నుతే. ౧౬. యే భవిష్యంతి యేఽతీతా ఆకల్పం పురుషాః కులే, తాంస్తారయతి సంస్థాప్య దేవస్య ప్రతిమాం రవేః. ౧౭. అనుశిష్టాః కిల పురా యమేన యమకింకరాః, పాశదండకరాః కృష్ణ ప్రజా సంయమనోద్యతాః. ౧౮. యమ ఉవాచ.—విహరంతు యథాన్యాయం నియోగో మేఽనుపాల్యతామ్, నాజ్ఞాభంగం కరిష్యంతి భవతాం జంతవః క్వచిత్. ౧౯. కేవలం యే జగన్మూలం వివస్వంతముపాశ్రితాః, భవద్భిః పరిహర్తవ్యాస్తేషాం నైవేహ సంస్థితిః. ౨౦. యే తు వైవస్వతా లోకే తచ్చిత్తాస్తత్పరాయణాః, పూజయంతి సదా భానుం తే చ త్యాజ్యాః సుదూరతః. ౨౧. తిష్ఠంశ్చ ప్రస్వపన్గచ్ఛన్నుత్తిష్ఠన్స్ఖలితే క్షుతే, సంకీర్తయతి దేవం

నిలచియున్నను నిద్రించినను నడచుచున్నను తొట్రుపడినను తుమ్ము చున్నను నెగుడుచున్నను సర్వావస్థలందు నెవం డాదేవదేవునే కీర్తించు చుండునో యాతఁడును మనకు దూరముగ విడువఁదగియున్నాఁడు. నిత్య నైమిత్తికకర్మలచే నాదేవుని యజించుపుణ్యమూర్తులను మీరలు కన్నెత్తి చూడనైనఁ గూడదు. సూర్యధ్యానము మీసంచారము నడ్డగించును. పుష్పధూపవస్త్రములచేతను ప్రియములగు నాభరణములచేతను నిత్యము నాదిత్యు నర్చించువారిని మీరు గ్రహింపవలదు. వారందఱు నాజనకుని యాశ్రితులు. అలుకువారు నాతనిమందిరము దుడుచువారును విడువఁ దగుదురు. అంతేగాక వారికులమున మూఁడుతరములవారిని గూడ గ్రహింపరాదు. ఏపురుషుఁ డాదిత్యునిగృహమును గట్టించునో యాతని కులమునఁ బుట్టినపురుషుని మీరలు చెడుదృష్టితోఁ బరికింపఁదగదు. మాన వులలో నెవ్వఁడు భక్తితో నాజనకుని శుభమగు నర్చావిగ్రహము చేయించునో యెవ్వఁ డర్చించునో ఆతనికులము నెల్లప్పు డతిదూరదేశ మున విడచి చనవలయును. సూర్యాశ్రితులముద్రలు గొని మీరు చరించుచుండ నెందు నొక్కఁడేనియు మీయాజ్ఞకు భంగముచేయువాఁ డుండఁడు. అని యిట్లామహాత్ముఁ డాజ్ఞాపింప నాకింకరులు రాజాజ్ఞ నతిక్ర మించి యిచ్చవొప్పున సంచరించుచు సత్రాజిత్తునొద్ద కేగిరి. ఆతఁడు సూర్యభక్తుఁడై యుండుకతన నాతనితేజమున కోడి చెట్లనుండి పక్షులు క్రిందఁబడుమాడ్కి వారెల్లరుఁ గ్రిందఁబడిరి. ఇట్టి మహాఫలముగల

---

యః స నస్త్యాజ్యః సుదూరతః. ౨౨. నిత్యనైమిత్తికై ర్దేవం యే యజంతి తు భాస్కరమ్, న చాలోక్యా భవద్భిస్తే తద్ధ్యానం హంతి వో గతిమ్. ౨౩. యే పుష్పధూపవాసోభి ర్భూషణైశ్చాపి వల్లభైః, అర్చయంతి న తే గ్రాహ్యా మత్పితుస్తే పరిగ్రహాః. ౨౪. ఉపలేపనకర్తారః కర్తారో మార్జనస్య యే, అర్కాలయే పరిత్యాజ్యం తేషాం త్రిపురుషం కులమ్. ౨౫. యేన వాయతనం భానోః కారితం తత్కులోద్భవః, పుమాన్స నావలోక్యో వై భవద్భిర్దుష్టచక్షుషా. ౨౬. యేనార్చా భగవద్భక్త్యా మత్పితుః కారితా శుభా, నరాణాం తత్కులం వీరాః సదా త్యాజ్యం సుదూరతః. ౨౭. భవతాం భ్రమతాం యత్ర భానుసంశ్రయముద్రయా, న చాజ్ఞాభంగకృత్కశ్చిద్భవిష్యతి నరః క్వచిత్. ౨౮. ఇత్యుక్తాః కింకరాస్తేన యమేన సుమహాత్మనా, అనాశ్రిత్య వచః కృష్ణ సత్రాజితమథో గతాః. ౨౯. తస్య తే తేజసా సర్వే భానోర్భక్తస్య సువ్రత, మోహితాః పతితా భూమౌ యథా చ విహగా నగాత్. ౩౦. ఏతాం మహాఫలాం యోఽర్చాం

యర్చావిగ్రహనిర్మాణమును సూర్యగృహనిర్మాణమును నీకెఱింగించితిని. లోకమున యజ్ఞములు మానవులపాపజాలముల భస్మముగావించి సర్వకామముల నొడఁగూర్చుభంగి సర్వయజ్ఞమయుఁడగురవి యజింపఁబడి పాపనాశనుఁడై సర్వాభీష్టముల నొడఁగూర్చును.

ఇది త్రయోదశోత్తరశతతమాధ్యాయము.

---

## చతుర్దశోత్తరశతతమాధ్యాయము.

ఆలయమున స్థాపించిన సూర్యప్రతిమను బాగుగఁ బూజించి మానవుఁ డేయే కోరిక గోరుకొనునో యాయా కోర్కులెల్ల నిస్సంశయముగఁ గాంచును. దేవప్రతిమను ఘృతముతో నభిషేకించునరుఁడు ప్రతి ప్రస్థమునను బ్రాహ్మణోత్తములకు గోవుల నూఱేంటి నిచ్చినవాఁడగును. బ్రాహ్మణుల కిచ్చిన నూఱుగోదానముల కేఫలము కలుగునో యట్టిఫలము ప్రస్థపరిమితమైన యాజ్యముతో స్నానముచేయించువారికిఁ గలుగును. భూరిద్యుమ్నుఁ డనురాజు మున్ను ఘటజలముచే మార్తండప్రతిమ నభిషేకించి సప్తద్వీపవసుంధరాతలమున కధిపతియయ్యెఁగదా! కృష్ణపక్షమున నష్టమినాఁడు లోకనాథుఁడగు నాదిత్యుని ప్రతిమను ఘృతముచే

---

భానోః కారయతే నరః, తవాఖ్యానం మహాబాహో గృహం కారయితుశ్చ యత్. ౩౧. యజ్ఞా నరాణాం పాపౌఘనాశకాః సర్వకామదాః, తథైవేష్టో జగద్భానుః సర్వయజ్ఞమయో రవిః. ౩౨

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యాలయవర్ధనమార్జనాదివర్ణనం నామ త్రయోదశోత్తరశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—స్థాపితాం ప్రతిమాం భానోః సమ్యక్సంపూజ్య మానవః, యం యం ప్రార్థయతే కామం తం తం ప్రాప్నోత్యసంశయమ్. ౧. యః స్నాపయతి దేవస్య ఘృతేన ప్రతిమాం రవేః, ప్రస్థేప్రస్థే ద్విజాగ్ర్యాణాం స దదాతి గవాం శతమ్. ౨. గవాం శతస్య విప్రేభ్యో యద్దత్తస్య భవేత్ఫలమ్, ఘృతప్రస్థేన తద్భానోర్భవేత్స్నాతకయోగినామ్. ౩. భూరిద్యుమ్నేన సంప్రాప్తా సప్తద్వీపా వసుంధరా, ఘటోదకేన మార్తండప్రతిమా స్నాపితా కిల. ౪. ప్రతిమామసితాష్టమ్యాం ఘృతేన జగతీపతేః,

నభిషేకించి సమస్తపాపములనుండి విడివడుచున్నాఁడు. సప్తమినాఁడు గాని షష్ఠినాఁడుగాని యావునేతితో నాదిత్యప్రతిమను నభిషేకించుట యుత్తమము. సర్వపాతకముల నశింపఁజేయును. తెలిసియో తెలియకయో మానవులు చేసిన పాపములన్నియు సంధ్యాకాలమున నాదిత్యప్రతిమను పసుఁజేయు ఘృతాభిషేకమున క్షాళితము లగును. సూర్యుఁడు సర్వయజ్ఞస్వరూపుఁడై యున్నవాఁడు. అన్నిహవిస్సులలో ఘృత ముత్తమమైనది. ఆ రెండిటిసంగమము సర్వపాతకములను గడిగివైచును. ఏలోకములలో క్షీరనదులు ప్రవహించునో హ్రదములు పాయసమే బురదగ గలిగి యుండునో యాలోకములను సూర్యునకు క్షీరస్నాన మొనర్చువారు పొందుదురు. క్షీరాభిషేకపరుఁడగుమానవుఁడు సప్తజన్మములందు నాహ్లాదమును తృప్తి నారోగ్యమును సౌందర్యమును బొందుచున్నాఁడు. పెరుఁగు మొదలగు వికారములన్నియుఁ బాలనుండి యేర్పడినపగిది నిర్మలమైనక్షీరము సంతోషదాయకమైనటుల సూర్యుఁడు సర్వప్రపంచమునకుఁ గారణము. నిర్మలమగుజ్ఞానము సంతోషదాయకము నగుటలో సంశయలేశంబు నుండదు. క్షీరాభిషేకమునఁ బ్రీతిఁజెంది భగవంతుఁడగు భానుమూర్తి భక్తులకు గ్రహము లనుకూలముగ నుండునట్లును బలము గలిగియుండునట్లును నిఖిలజనులందును బ్రీతిఁ గలిగియుండునట్లు నను గ్రహించుచున్నాఁడు. అట్టివా రెల్లఱకును మిత్రులగుచున్నారు.

---

స్నాపయిత్వా సమస్తేభ్యః పాపేభ్యః కృష్ణ ముచ్యతే. ౫. సప్తమ్యామథ షష్ఠ్యాం వా గవ్యేన హవిషా రవేః, స్నపనం తు భవేచ్ఛ్రేష్ఠం మహాపాతకనాశనమ్. ౬. జ్ఞానతో౽జ్ఞానతో వాపి యత్పాపం కురుతే నరః, తత్క్షాలయతి సంధ్యాయాం ఘృతేన స్నపనం రవేః. ౭. సర్వయజ్ఞమయో భానుర్హవ్యానాం పరమం ఘృతమ్, తయోరశేషపాపానాం క్షాలకః సంగమో భవేత్. ౮. యేషు క్షీరవహా నద్యో హ్రదాః పాయసకర్దమాః, మోదతే తేషు లోకేషు క్షీరస్నానకరో రవేః. ౯. ఆహ్లాదం నిర్వృతిస్థానమారోగ్యం చారురూపతామ్, సప్తజన్మాన్యవాప్నోతి క్షీరస్నానపరో రవేః. ౧౦. దధ్యాదీనాం వికారాణాం క్షీరతః సంభవో యథా, యథా చ విమలం క్షీరం యథా నిర్వృతికారకమ్, తథా చ నిర్మలం జ్ఞానం భవత్యపి న సంశయః. ౧౧. గ్రహానుకూలతాం పుష్టిం ప్రియత్వమఖిలే జనే, కరోతి భగవాన్భానుః క్షీరస్నపనతోషితః. ౧౨. సర్వస్య స్నిగ్ధతామేతి దృష్ట

చూచుమాత్రముననే ప్రసన్నుఁడగుచున్నాఁడు. ఇదియంతయుఁ దిమిర నాశకుని ఘృతక్షీరాభిషేకములచేఁ గలుగుచున్నది.

ఇది చతుర్దశోత్తరశతతమాధ్యాయము.

---

## పంచదశోత్తరశతతమాధ్యాయము.

మున్ను సురాలయమున గౌతమితోఁ గౌసల్యకు జరిగిన భాస్కర విషయమగు(గాథ)సంవాదమును మహాత్ములు ప్రశంసించుచున్నారు. అది వినుము మున్ను స్వర్గలోకమునఁ బతితోఁ గూడి మిక్కిలిగఁ బ్రకాశించుచున్న కౌసల్యను జూచి యాశ్చర్యమునొంది బ్రహ్మపత్నియగు గౌతమి యిట్లనియె. ఓకౌసల్యా! యిట వందలకొలఁది స్వర్గవాసులగు దేవతలు దేవపత్నులును సిద్ధులు సిద్ధపత్నులు నున్నవారు. కాని వారికీపరిమళముగాని కాంతిగాని సురూపముగాని శుభ్రవస్త్రములుగాని లేవు. నీమగనికిని నీకును మాత్రమే యున్నవి. నీయాభరణములును నీ మగనియాభరణములును రాజిల్లునట్లు స్వర్గనివాసులగు దేవతలయాభరణములు రాజిల్లుటలేదు. ఇంద్రుఁడు మొదలు దిక్పాలురగొప్పతనమునకన్న నెక్కుడై మీయిరువురియౌన్నత్యము స్నానవస్త్రధారణములవలననే యుత్పన్నమై వృద్ధిక్షయములు లేక యెల్లప్పుడు నొకేతీరుగ నున్నది.

---

మాత్రే ప్రసీదతి, ఘృతక్షీరేణ దేవేశే స్నాపితే తిమిరాపహే. ౧౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం

బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యస్నాపనయోగవర్ణనం నామ

చతుర్దశోత్తరశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచ:—ప్రశంసంతి మహాత్మానః సంవాదం భాస్కరాశ్రయమ్, గౌతమ్యా సహ కౌశల్యా సుమనాయాం సురాలయే. ౧. స్వర్గేఽతిశోభనాం దృష్ట్వా కౌశల్యాం పతినా సహ, బ్రహ్మాణీ గౌతమీ నామ పర్యపృచ్ఛత విస్మితా. ౨. గౌతమ్యువాచ.—శతశః సంతి కౌశల్యే దేవాః స్వర్గనివాసినః, దేవపత్న్యస్తథైవైతాః సిద్ధాః సిద్ధాంగనాస్తథా. ౩. న తేషామీదృశో గంధో న కాంతిర్న సురూపతా, న వాససీ శోభనే యే యథా తే పతినా సహ. ౪. నైవాభరణజాతాని తేషాం భ్రాజంతి వై తథా, యథా తవ యథా పత్యుర్హి చ స్వర్గనివాసినామ్. ౫. సుస్నాతచైలతశ్చైవ

మీరాయిరువురకు నిట్టి యౌన్నత్యము తపఃప్రభావముచేఁ గలిగెనా? దానముచేతఁగాని హోమములచేతఁగాని పూజలచేఁగాని లభించెనా? అదియెల్ల విస్తరముగ నాకుం జెప్పవే వనితామణీ! అది యెఱింగి యేను నట్టియున్నతత్వమును బొందుదును. నావుడు కౌసల్య యాంపె కిట్లనియె. ఓవనితారత్నమా! మున్నొకప్పుడు మేమిరువురము యజ్ఞరూపుఁడు యజ్ఞేశ్వరుఁడు నగుభానుని బూజించియుంటిమి. ఆతఁడు మాయెడఁ బ్రీతుఁడై యుండుకతన నుత్తమఫలమగు స్వర్గప్రాప్తి మాకుఁ గలిగెను. ఆతనిపూజవలననే సురూపము, చూచువారలకుఁ బ్రీతి, చక్కనివేషమును నేర్పడినవి. వానినెల్ల వివరింతు నాలకింపుము. తీర్థోదకములచేతను గంధములచేత నాదిత్యు నభిషేకించుటంజేసి యీకాంతి లభించెను. ముల్లోకముల నేలుదేవతల నిందుచేతనే యతిక్రమించియున్నారము. మనస్సు నిర్మలమగుట సౌమ్యుఁడయియుండుట, సంతోషించుచుండుట, సర్వప్రియుఁడైయుండుటయు నివియన్నియు ఘృతస్నానమువలనఁ గలుగును. రాజ్యంబు పాలించునెడ నాభర్తకును నాకు నేయే వస్త్రము లభీష్టములైయున్నవో యేభూషణము లిష్టమైనవో యేరతనము లిష్టమైనవో యేమైపూఁత లిష్టమైనవో యేధూపమాల్యము లిష్టములైనవో వానినన్నింటిని సర్వజ్ఞుఁడు సర్వరక్షకుఁడు నగుభానున

---

యువయోరతిరిచ్యతే, లేఖాద్యానామపీశానాం త్వయాతిశయవర్జితః. ౬. తపః ప్రభావో దానం వా హోమో వా కర్మసంజ్ఞితః, యువయోర్యత్సమాచక్ష్వ తత్సర్వం వరవర్ణిని, యేన మే విక్రమే బుద్ధిర్మనుజా యేన సంగతాః. ౭. కౌశల్యోవాచ.—యజ్ఞో యజ్ఞేశ్వరో భానురావాభ్యాం జాతు తోషితః, స్వర్గప్రాప్తిరియం తస్య కర్మణః ఫలముత్తమమ్. ౮. సురూపతా తతః ప్రీతిః పశ్యతాం చారువేషితా, యత్పృచ్ఛసి మహాభాగే తదప్యేషాం వదామి తే. ౯. తీర్థోదకైస్తథా గంధైః స్నాపితో యద్దివాకరః, తేన కాంతిరియం నిత్యం దేవాంస్త్రిభువనేశ్వరాన్. ౧౦. మనః ప్రసాదః సౌమ్యత్వం శరీరే యే చ నిర్వృతాః, యత్ప్రియత్వం చ సర్వం స్యాత్తద్ఘృతస్నపనాత్ఫలమ్. ౧౧ యాన్యభీష్టాని వాసాంసి యచ్చాభీష్టవిభూషణమ్, రత్నాని యాన్యభీష్టాని యత్ప్రియం చానులేపనమ్. ౧౨. యే ధూపా యాని మాల్యాని జయితాన్యభవన్సదా, మమ భర్తుస్తదైవాస్య తదా రాజ్యం ప్రశాసతః.౧౩. తాని సర్వాణి సర్వజ్ఞ సర్వపాతరి

కర్పించితిమి. ఇప్పటి గంధధూపాత్మకమగు సుగుణము వానివలనఁ గలిగిన దని యెఱుంగుము. ముల్లోకములు గలిగించు నాదేవున కేయే యాహారములు ప్రియమై పవిత్రములైనవో వానినన్నింటి నివేదించితిమి. దాని వలనఁ దృప్తియనుసద్గుణము లభించెను. స్వర్గకాములమై మేమిద్దర మీవ్రతము సలిపితిమి. కావునఁ బునర్జన్మంబులేక శాశ్వతముగ స్వర్గ వాసము మాకు లభించినది. కోరికలులేక యేనరులు బాగుగఁ బూజింతురో వారియెడ నావిశ్వేశ్వరుఁడు ప్రీతుఁడై, శాశ్వతమోక్షము నొసంగుచున్నాఁడు ఇయ్యది మావృత్తాంతము. అని యెఱింగించెనని వారిసంవాదమును కృష్ణున కెఱింగించి పితామహుండు వెండియు నిట్లనియె. కృష్ణా! నేను నీవిధముగ దేవనాథుఁడు లోకగురుఁడు నగు మార్తండు నర్చించి శాశ్వతకాలము నభిమతములగు కామములఁ బొందఁ గంటిని. చందనము, అగరు, కర్పూరము, కుంకుమము, వట్టివేరు, పద్మ పరాగము మొదలగువానితో మానవులు మైపూత లొసంగ నాదిత్యుఁడు ప్రసన్నుఁడై యైశ్వర్యముల నొసంగుచున్నాఁడు కాలేయకము, తురుష్కము, రక్తచందనమును నెల్లప్పుడు నాదేవున కెయ్యవి యిష్టములో యట్టిప్రశస్తధూపములను సేకరింపుము. మఱియు నే గంధము మంగళకరమో యేధూపములు విజయప్రదములో వానినన్నింటి నెల్లప్పు డాదిత్యునకు నివేదింపవలయును. దేవతారాధనము చేయఁ బూనినధర్మజ్ఞుఁడు సూర్యునకు ధూపమునకై సల్లకీక్షీరమునుగాని

---

ఖాని, దత్తాని తత్సముత్థోఽయం గంధధూపాత్మకో గుణః. ౧౪. ఆహారా దయితా యే చ పవిత్రాశ్చ నివేదితాః, త్రైలోక్యకర్తుః సవితుస్తృప్తిస్తద్గుణసంభవా. ౧౫. స్వర్గకామేన మే భర్త్రా మయా చ శుభదర్శనే, కృతమేతద్వ్రతేనాభూదావయోర్భవ సంక్షయః. ౧౬. యే హ్యకామా నరాః సమ్యక్తత్కుర్వంతి చ శోభనే, తేషాం దదాతి విశ్వేశో భగవాన్ముక్తిమీశ్వరః. ౧౭. బ్రహ్మోవాచ.—ఏవమభ్యర్చ్య మార్తండమర్కం దేవేశ్వరం గురుమ్, ప్రాప్తోస్మ్యభిమతాన్కామాన్కృష్ణాహం శాశ్వతీః సమాః. ౧౮. చందనాగురుకర్పూరకుంకుమోశీరపద్మకైః, అనులిప్తో నరైర్భక్త్యా దదాతి సాగరోద్భవామ్. ౧౯. కాలేయకం తురుష్కం చ రక్తచందనమేవ చ, యాన్యాత్మనః సదేష్టాని తాని శస్యాన్యహాతురు. ౨౦. గంధాశ్చాపి శుభా యే చ ధూపా యే విజయోదయాః, దివాకరస్య ధర్మజ్ఞ నివేద్యాస్సర్వదాచ్యుత. ౨౧. న దద్యాత్సల్లకీక్షీరం నో ముఖేన చ

యుచ్ఛిష్టమునుగాని యుపయోగింపరాదు. మాలతి, మల్లిక, అతిముక్తకము, (పచ్చగన్నేరు)పాటలములు, గన్నేరు, జపా, సేవంతి, కుంకుమము, తగరము, కొండగోగు, కేసరము, చంపకము, కేతకము, కుందము, బాణబర్బరములమాలలు, అశోకము, తిలకము, లొద్దుగు, ఆటరూషకము, శతపత్రములు, ధన్వములు, బకాహ్వములు, అగస్తి, కింశుకము మొదలగు పుష్పజాతులన్నియు భాస్కరారాధనమునకుఁ బ్రశస్తములైనవి. బిల్వపత్రము, శమీపత్రము, భృంగరపత్రము. తమాలపత్రము నెల్లప్పుడు నాభగవంతునకుఁ బ్రీతిజనకములైనవి, తులసి, కాలతులసి, రక్తచందనము, కేతకీకుసుమమును వెనువెంటనే యాదేవునకుఁ దుష్టినిచ్చునవి. పద్మములును కలువలలోని యెఱుపు నలుపు మొదలగు కలువలును సూర్యునకు మిగులఁ బ్రియమైనవి. అటులనే కృష్ణలోన్మత్తకములను గిరిమల్లికలును ప్రియములై యున్నవి. కేవలము కర్ణికారికాపుష్పమును మాత్ర మెవ్వఁడును భాస్కరునకు నివేదింపరాదు. కుటజపుష్పము, శాల్మలీపుష్పము మొదలగు వాసనలేనిపువ్వుల నివేదించినచో భయమును రోగమును దారిద్ర్యమును గలుగును. ఏపుష్పములు ప్రతిషేధింపఁబడలేదో యేపుష్పములు సుగంధము నుత్తమవర్ణముగలవియై యుండునో వానినెల్ల లోకభానుఁడగు

---

సంహృతమ్, దద్యాదర్కాయ ధర్మజ్ఞ ధూపమారాధనోద్యతః. ౨౨. మాలతీ మల్లికా చైవ యూథికా చాతిముక్తికః, పాటలాః కరవీరశ్చ జపా సేవంతిరేవ చ. ౨౩. కుంకుమస్తగరశ్చైవ కర్ణికారః సకేశరః, చంపకః కేతకః కుందో బాణబర్బరమాలికా. ౨౪. అశోకస్తిలకో లోధ్రస్తథా చైవాటరూషకః, శతపత్రాణి ధన్వాని బకాహ్వానీ విశేషతః. ౨౫. అగస్తిం కింశుకం తద్వత్పూజార్థం భాస్కరస్య తు, అమీ పుష్పప్రకారాస్తు శస్తా భాస్కరపూజనే. ౨౬. బిల్వపత్రం శమీపత్రం పత్రం వా భృంగరస్య చ, తమాలపత్రం చ హరే సదైవ భగవత్ప్రియమ్. ౨౭. తులసీ కాలతులసీ తథా రక్తం చ చందనమ్, కేతకీ పత్రపుష్పం తు సద్యస్తుష్టికరం రవేః. ౨౮. పద్మోత్పలసముత్థాని రక్తం నీలోత్పలం తథా, సితోత్పలం తు భానోస్తు దయితాని సదాచ్యుత. ౨౯. కృష్ణలోన్మత్తకం కాంతం తథైవ గిరిమల్లికా, న కర్ణికారికాపుష్పం భాస్కరాయ నివేదయేత్. ౩౦. కుటజం శాల్మలీపుష్పం తథాన్యద్గంధవర్జితమ్, నివేదితం భయం రోగం నిఃస్వతాం చ ప్రయచ్ఛతి. ౩౧. యేషాం న ప్రతిషేధోఽస్తి గంధవర్ణాన్వితాని చ, తాని పుష్పాణి

భానుఁ బొసంగవలయును. పరిమళముగలమురు,మాంస,కర్పూరాగరుచంద నముల చేతను నితరములగు శుభ్ర ద్రవ్యములచేత నీవనమాలిని బూజింప వలయును. దుకూలపట్టములు కౌశేయములు వృక జాతములు కార్పా సము మొదలగు వస్త్రములచేతను నాత్మ ప్రియములగువానిచేతను నాదిత్యుఁ బూజింపవలయును. ఏయేభక్ష్యములు తమకిష్టములో వానినెల్ల నివే దింపవలయును అభిమతంబులగుభోజ్యములను తన కత్యంత ప్రియంబగు ఫలమును సువర్ణమణిముక్తారజతములను వివిధదక్షిణలను మఱియు నిత రములగు ప్రియపదార్థములను దేవాధిదేవుండగు భాస్కరునకు నివేదింప వలెను. తననే భాస్కరునిగాఁ దలంచుచు భాస్కరధ్యానమును జేయ వలెను. ఈపదార్థముల నన్నింటిని యవ్యక్తరూపుండగు భాస్కరునకు నివేదింపవలెను.

ఇది పంచదశోత్తరశతతమాధ్యాయము.

---

## షోడశోత్తరశతతమాధ్యాయము.

కృష్ణా! యయాతికులసంజాతుఁడగు సత్రాజితుఁడను మహా రాజుగలఁడు. ఆచక్రవర్తి ప్రభావతేజస్సౌందర్యశౌర్యధైర్యగాంభీర్యసం

---

దేయాని భానవే లోకభానవే. ३౨. సుగంధైశ్చ మురామాంసీకర్పూరాగరుచందనైః, తథాన్యైశ్చ శుభైర్ద్రవ్యైరర్చయేద్వనమాలినమ్. ३३. దుకూలపట్టకౌశేయవార్క్ష కార్పాసకాదిభిః, వాసోభిః, పూజయేద్భానుం యాని చాత్మప్రియాణి తు. ३४. భక్ష్యాణి యాన్యభీష్టాని భోజ్యాన్యభిమతాని చ, ఫలం చ వల్లభం యత్స్యాత్తత్తే దేయం దివా కరే. ३౫. సువర్ణమణిముక్తాని రజతం చ తథాచ్యుత, దక్షిణా వివిధా చేహ యచ్చాన్య దపి వల్లభమ్, తత్తు దేవాధిదేవాయ భాస్కరాయ నివేదయేత్. ३౬. ఆత్మానం భాస్కరం మత్వా యజ్ఞం తస్మై నివేదయేత్, తత్తదవ్యక్తరూపాయ భాస్కరాయ నివేద యేత్. ३౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యమాహాత్మ్యే సూర్యపూజావిధివర్ణనం నామ పఞ్చదశోత్తరశతతమోఽధ్యాయః.

---

బ్రహ్మోవాచః—కృష్ణ రాజా మహానాసీద్యయాతికులసంభవః, సత్రాజిదితి

సన్నుఁడును, దాతయు, పరాక్రమవంతుఁడును, బ్రాహ్మణభక్తుఁడును, కవియును, శూరుండును, కామాదిషడ్వర్గమున కవశ్యుండును, సాధనాది పంచాంగములయం దాసక్తుఁడును, ధనంబున సాటిలేనివాఁడును,ధనవంతుఁడయ్యును, భోగములయం దిచ్ఛలేనివాఁడును, సత్త్వశ్రద్ధోపేతుఁడును, లక్ష్మికి వరణీయుండును, చంద్రగరుడాత్రేయవిశ్వామిత్రబ్రహ్మభీష్మబృహస్పతీంద్రవాల్మీకవ్యాసపరశురాములగు ఋషులతోఁ గూడినవాఁడును, బలమున భీష్మునితో సమానుఁడును, అంతటను గమనీయుండును నై యుండి సప్తద్వీపయుతంబగు పుడమిని పాలించెను. సత్రాజితమహారాజు నేయే దేశమున పురాణవేత్తలు గానముచేయుచుండిరో సూర్యప్రకాశ మెంత పర్యంతము వ్యాపించియుండెనో యాభూమియంతయు సాత్రాజితమను యథార్థనామమును బొందెను. మున్నా మహాబలుండు చక్రవర్తియై సమస్తసముద్రాంతర్గతంబులగు సప్తద్వీపములుఁగల భూమండలమునంతను ధర్మమార్గమున శాసించెను. ఆరాజెన్నఁడును అన్యాయ్యం బెఱుంగనివాఁడు. శక్తియుక్తుఁడును, దాతృత్వగుణసంపన్నుఁడును, బలవంతుఁడును నై యుండెను. ఆసత్రాజితమహారాజునకు ధర్మరక్షకులును, సకుంతిత

---

విఖ్యాతశ్చక్రవర్తీ మహాబలః. ౧. ప్రభావైస్తేజసా కాన్త్యా క్షాంత్యా బలసమన్వితః, ధైర్యగాంభీర్యసంపన్నో వదాన్యో యశసాన్వితః. ౨. బుద్ధ్యా విక్రమదక్షశ్చ సంపన్నో బ్రాహ్మణా యతః, కృతీ కవిస్తథా శూరః షట్పదార్థైర్యర్న నిర్జితః. ౩. సదా పంచసు రక్తశ్చ వసుమద్భిర్న నిర్జితః, రుద్రతా వసుభిర్జాతైః సత్వశ్రద్ధాసమన్వితః. ౪. అంబుజస్యాండజస్యేవ ఆత్రేయస్య తథాచ్యుత, అంబుజాయాస్తథా కృష్ణ వార్యపాత్రం స వై విభో. ౫. గాంగేయేన బలే తుల్యః పౌలస్త్యార్చాశ్రమో యథా, గాంగేయస్య తథా కృష్ణ ధిషణస్య హరేర్యథా. ౬. కావ్యశ్చ ద్విజభక్తస్తు తథా వాల్మీకివత్సదా, వ్యాసస్య దేవశార్దూల జామదగ్న్యస్య వా విభోః. ౭. ఏషాం నైకైర్గుణైర్యుక్తః స రాజా త్మాతలే విభో, శశాస స మహాబాహుః సప్తద్వీపాం వసుంధరామ్. ౮. యస్మిన్గాథాం ప్రగాయంతి యే పురాణవిదో జనాః, సత్రాజితే మహాబాహో కృష్ణ ధాత్రీం సమాశ్రితే. ౯. యావత్సూర్య ఉదేతి స్మ యావచ్చ ప్రతితిష్ఠతి, సాత్రాజితం తు తత్సర్వం క్షేత్రమిత్యభిధీయతే. ౧౦. స సర్వరత్నసంయుక్తాం సప్తద్వీపవతీం మహీమ్, శశాస ధర్మేణ పురా చక్రవర్తీ మహాబలః. ౧౧. నాన్యాయకృన్న చాశక్తో వదాన్యో

ప్రజ్ఞులును నగు నలుగురుమంత్రులు గలరు. మఱియు నారాజునకు రక్త చందనవిలిప్తుండును, జగత్ప్రకాశకుఁడును నగు సూర్యదేవునియందు నక్కృత్రిమమగుభక్తి మిక్కుటమై యుండెను. ఆసత్రాజితమహారాజుయొక్క మహిమము లోకమునకే గాక తనకును మిక్కిలి యాశ్చర్యమును గలిగించెను. ఇట్లు సర్వసంపదలచే విస్మితుఁడై యిట్లు చింతించెను. ఇంతటి యుత్తమైశ్వర్యము రాఁబోవు జన్మములఁ గూడ నెట్లు లంభింపఁగలదో గదా! ఓయదుభూషణా! మహాయశస్సంపన్నుఁడగు నారాజు భావిజన్మమునందును నీసంపద నాకెట్లు గలుగునని బహువిధములఁ జింతించియు నందులకుఁ గారణ మూహింపఁజాలకుండె. లక్ష్మీప్రియుఁడగు (మహదైశ్వర్యవంతుఁడు) రాజు తనమనస్సునందలి నిశ్చయమును దెలిసికొనలేక నిర్జనమైన యంతిపురినిఁ జొచ్చి ధర్మజ్ఞులగు బ్రాహ్మణోత్తముల రావించి సుఖాసీనులగు వారలకు నమస్కరించి వారివలన శాసనమును గ్రహించుటకై వారల నడిగెను. ఓబ్రాహ్మణోత్తములారా! మీరు నాయందు విశ్వాసముగలవారగుటచే మిమ్ముల నడుగుదానిని మీదానున కనుగ్రహించుటకుఁ దగియున్నారు. సద్విద్యాజనితమగు విజ్ఞానముచేత శుద్ధాంతరాత్ములగుమీరు నాయందు ననుగ్రహబుద్ధిగలవారేని నే నేవిధమున మిమ్ము నడిగియుంటినో యట్లు దయచేయుటకు నర్హులై యున్నారు. భూదేవులారా!

---

బలవత్తరః, తస్యాసన్ పురుషా రాజ్ఞః సమ్యగ్ధర్మానుశాసినః. ౧౨. చత్వారః సచివాస్తస్య రాజ్ఞః సత్రాజితస్య తు, బభూవురప్రతిమాత్మాః సదా వాతిబలస్య వై. ౧౩. తస్య భక్తిరతీవాసీన్నిసర్గాదేవ భూపతేః, దివాకరే జగద్భానౌ రక్తచందనమాలిని. ౧౪. తస్యోర్ధ్వమహిమానం చ విలోక్య పృథివీపతేః, న కేవలం జనస్యాపి హ్యభవత్తస్య విస్మయః. ౧౫. సంచిన్తయామాస నృపః సమృద్ధ్యా విస్మితస్తథా, కథం స్యాత్సంపదేషా మే పునరప్యన్యజన్మని. ౧౬. ఏవం స బహుశో రాజా తదా కృష్ణ మహాయశాః, చింతయన్నపి తన్మూలం నాసదన్నిశ్చయాన్వితః. ౧౭. యదా న నిశ్చయం రాజా స యయౌ భార్గవీప్రియః, తదా పప్రచ్ఛ ధర్మజ్ఞాన్స విప్రాన్సముపాగతాన్. ౧౮. సర్వాంశ్చ ససుఖాసీన వివిక్తాంతఃపురస్థితః, ప్రణిపత్య మహాబాహుర్గృహీతుం శాసనక్రియాః. ౧౯. విశ్వాసానుగ్రహో బుద్ధిర్భవతాం మయి సత్తమాః, తదహం ప్రష్టుమిచ్ఛామి కించిత్తద్వక్తుమర్హథ. ౨౦. సద్విద్యాఖిలవిజ్ఞానసమ్యగ్ధౌతాంతరాత్మభిః, భవద్భిర్యద్యనుగ్రాహ్యః స్యామహం వేదవిత్తమాః. ౨౧. తద్యథావన్మయా పృష్టా

మీరు విద్వాంసులును సర్వోపకారులును నైయుండుటచే మిమ్ముల బ్రార్థించుచుంటిని. అనిన బ్రాహ్మణు లిట్లనిరి. ఓరాజా! నీమనస్సునందలి సందేహమును వచింపుము. న్యాయానుసారముగ సమాధానముఁ జెప్పి సంతుష్టునిఁ జేతుము నీప్రజాపాలనసామర్థ్యముచేతను నీదాతృత్వము చేతను మిక్కిలి సంతసించితిమి. విప్రులు సంతుష్టులైనచో తృప్తిగ భుజించుట ధర్మసంశయముల నశింపఁజేయుట హితమార్గము నుపదేశించుట యహితమార్గమునుండి నివర్తింపఁజేయుటయు కర్తవ్యకృత్యములై యున్నవి. నావిని మరల బ్రాహ్మణోత్తముల నడుగఁబోవుచున్న రాజున కంతరాయముగఁ దత్పత్నియగు విమలావతి వచ్చి తనపతిపాదములకు నమస్కరించి యిటువంటివిషయములందు స్త్రీలు వచించుట యుక్తముగాదు. ఐనను చెప్పుచుంటిని. మీసంశయమును మఱియొకతూఱి తీర్చుకొనవచ్చును. ఇటువంటిసంపద జన్మాంతరమందు లభింపదు. ఈప్రశ్నను విడచి మఱి యొకప్రశ్నను నడుగఁగోరెదను. నేనెల్లప్పుడు నంతగపురమందు నుండు దాననుగాన నోపురుషశ్రేష్ఠుఁడా! నాయం దనుగ్రహయుక్తుఁడవై తేని ఋషులను నాసంబంధమగుప్రశ్నను నడుగుదువని నమ్ముచున్నాను. అనిన విని సత్రాజిత్తు ఇట్లనియె. ఓమంగళప్రదురాలా! నీకిష్టమగుప్రశ్న ఋషీశ్వరుల నడిగెదను. దానిని నాకుం జెప్పుము. నీవడిగినప్రశ్నము లకు నుత్తరములు బడసినవెంటనే నాప్రశ్నములకు సమాధానములఁ

---

భవన్తో మత్ప్రసాదినః, వక్తుమర్హాథ విద్వాంసః సర్వస్యైవోపకారిణః. ౧౫.
బ్రహ్మోవాచ.—యస్తే మనసి సందేహస్తం పృచ్ఛాద్య మహీపతే, వదిష్యామో యథా న్యాయం యత్తే మనసి వర్తతే. ౧౬. వయం హి నృపశార్దూల భవతా పరితోషితాః, సమ్యక్ప్రజాం పాలయిత్రా దదతా భోజనం సదా. ౧౭. సంతుష్టో బ్రాహ్మణో౽ఽక్షీయాచ్ఛిందద్యాద్వా ధర్మసంశయమ్, హితం చోపదిశేద్వర్త్మ అహితాద్వా నివర్తయేత్ ౧౮. వివక్షుమథ భూపాలం భార్యా తస్యైవ ధీమతః, ప్రణిపాతేన చాహేదం వినయాత్ప్రణయాన్వితమ్. ౧౯. న స్త్రీణామవనీపాల వక్తుమీదృగిహేష్యతే, తథాపి భూపతే వక్ష్యే సంపదీదృక్సుదుర్లభా. ౨౦. భూయో౽పి సంశయాన్ప్రష్టుమలమీశో భవానృషీన్, నన్వహం పురుషవ్యాఘ్ర సదాంతః పురచారిణీ. ౨౧. తత్ప్రసాదం యది భవాన్కరోతి మమ పార్థివ, తన్మదీయమృషీన్ప్రష్టుం సందేహం పార్థివార్హసి. ౨౨.
సత్రాజిత ఉవాచ.— బ్రూహి సుభ్రూర్మతం యత్తే ప్రష్టవ్యా యన్మయా ద్విజాః,

బడసెదననిన విమలావతి యిట్లనియె. ఓరాజా! పూర్వకాలమున నీభూమి నేలినరాజు లెవ్వరెవ్వరు? ఆరాజులలో నేరాజు సంపద మీ కెట్లు సంక్రమించినదియు, నశేషమగు నీసంపదకు నివాసభూతులమగుట యేకర్మపరిపాకముచేతనో, యేయుత్కృష్టకర్మాచరణముచే రాజభార్య లలో నగ్రగణ్యనైతినో, యవియన్నియుఁ దెలుపవలెనని కోరు చుంటిని లోకములో నితరజనులలోఁ గూడ సంపత్సమృద్ధి యగుపడు చున్నను నితరజనులయందుఁ జూడఁబడెడి సంపద నతిశయించుటచేత ననల్పకర్మపరిపాకజనితమై మనసంపద యుండనోపు. కానఁ బూర్వజన్మ యందు మీరు ఏసత్కర్మ నాచరించితిరో నేను నేకర్మానుష్ఠానముచేత మీభార్యలలో నగ్రగణ్య నైతినో, ఋషీశ్వరుల నడిగి తెలిసికొనఁ గోరుచున్నాను. బ్రహ్మ యిట్లనియె. సత్రాజితుమహారాజు భార్య చెప్పిన వాక్యములచేత విస్మితమనస్కుఁడై ఋషులందఱిముందటను విమలావతి నిట్లు ప్రశంసించెను. దేవీ! నీవు చాలయుక్తముగఁ బల్కితివి. "భార్య పురుషులయొక్క స్వార్థమని" మునులు చెప్పువాక్యము సత్యమని తెలిసి నదిగాన నీమహానుభావులగు మునీంద్రులను నీవడిగినవిషయమునుగూర్చి ప్రశ్నించెదను ఆమహనీయుల కగోచరంబగువిషయము మూఁడు లోకంబులయం దుండదు. అని ప్రియురాలితోఁ జెప్పి సత్రాజితమహారాజు మునీంద్రులకు నమస్కరించి పూర్వము విమలావతీదేవి చెప్పినట్లు

---

భూయోఽహమాత్మసందేహం ప్రక్ష్యామ్యేతద్ద్విజోత్తమాన్. ౩౦. విమలవత్యువాచ.—శ్రూయన్తే పృథివీపాల నృపా యే తు చిరంతనాః, యేషాం చ సంపద్భూపాల యథా తేద్య కిలాభవత్. ౩౧. తదీదృక్సంపదో ధామ తవాశేషం క్షితీశ్వర, యేన కర్మవిపాకేన తద్వదంతు మహర్షయః. ౩౨. అహం చ భవతో భార్యా సర్వసీమంతినీవరా, అతీవ కర్మణా యేన తద్విజ్ఞానే కుతూహలమ్. ౩౩. తథా సంపత్సమృద్ధత్వమన్యేష్వపి హి విద్యతే, నిరస్తాతిశయత్వేన నూనం నాల్పేన కర్మణా. ౩౪. తదన్యజన్మచరితం నరనాథ నిజం భవాన్, మునీన్పృచ్ఛ త్వయా చాహం యన్మయా చ పురా కృతమ్. ౩౫. బ్రహ్మోవాచ.—స తథోక్తస్తయా రాజా పత్న్యా విస్మితమానసః, మునీనాం పురతో భార్యాం ప్రశంసన్వాక్యమబ్రవీత్. ౩౬. సాధు దేవి మతం యన్మే త్వయా యదిదమీరితమ్, సత్యం మునివచః పుంసాం స్వార్థం వై గృహిణీ తథా. ౩౭. సోఽహమేతన్మహాభాగే పృచ్ఛామ్యేతాన్మహామునీన్, తేషామవిదితం కించిత్త్రిలోకేషు న విద్యతే. ౩౮. ఏవముక్త్వా ప్రియాం రాజా ప్రణిపత్య చ తానృషీన్, యథావదేతదఖిలం పప్రచ్ఛ

సర్వము తెలియఁజేయుఁడని మునీశ్వరుల నడిగి, మఱియు నిట్లనియె. ఓపూజ్యులారా! నాయం దనుగ్రహవంతులు గలిగి నాకు నీసర్వము నేవిధముగా జరిగినదియు, నేను జన్మాంతరమునం దేసుకృతమును జేసి నదియు జన్మాంతరమునందు నే నెవ్వఁడనో యేయేకార్యములఁ జేసి తినో నాప్రియురాలైన యీసుకుమారగాత్రిచేత నేసుకృతము వలనఁ బడెనో భూలోకమునం దితరప్రాణ్యలభ్యమైన యీలక్ష్మి యేసుకృతము వ మూను లభించెనో, అకుంఠితపరాక్రములగు నట్టి మంత్రులు గల్గుట, సమస్తరాజలోకమును వశ్యముగుట, అక్షయమగుధనము గల్గియుండుట, యెదురులేనిబలము గలిగియుండుట, శరీరమున కారోగ్యము గల్గుట, నాభార్యయందు కాంతిచేత లోకమంతయు భాసించుచుండుట, నాశరీర కాంతి నెవ్వరును సహింపలేకుండుట యివిమొదలగునన్నియు నేకర్మపరిపాకములని తెలిసికొనఁ గోరుచున్నవాఁడనై బ్రాహ్మణోత్తములగు మిమ్ములఁ బ్రార్థించుచున్నాను. బ్రహ్మదేవుం డిట్లనియె.—ఇట్లు తపోధనులు రాజుచే నడుగఁబడినవారై పరావసువునుగూర్చి యీ రాజడిగిన విషయముల కుత్తరముఁ జెప్పుమని పల్కిరి. మహానుభావుఁడును బుద్ధిశాలియు నగుపరావసువు ధర్మాత్ములైన ఋషులచేఁ బ్రేరితుఁడై చాల కాలము విధ్యుక్తముగా యోగము నధిష్ఠించి నిశ్చలమనస్కుఁడై సత్రాజితమహారాజుయొక్క పూర్వజన్మకృతకర్మ మంతయు తెలిసికొని,

---

ధరణీధరః. ౩౯. రాజోవాచ.—భగవంతో మమాశేషం ప్రసాదావృతచేతసః, కథయంతు యథావృత్తం యన్మయా సుకృతం కృతమ్. ౪౦. కోఽహమాసం పురా విప్రాః కింస్విత్కర్మ మయా కృతమ్, కిం వానయా తు చార్వంగ్యా మమ పత్న్యా కృతం ద్విజాః. ౪౧. యేనావయోరియం లక్ష్మీర్మర్త్యలోకే సుదుర్లభా, చత్వారశ్చాప్రతిహతా అమాత్యా మమ గచ్ఛతః. ౪౨. అశేషా భూభృతో వశ్యా ధనస్యాంతో న విద్యతే, బలం చైవాప్రతిహతం శరీరారోగ్యమేవ చ. ౪౩. ప్రతిభాతి చ మే కాంత్యా భార్యాయామఖిలం జగత్, మమాపి వపుష స్తేజో న కశ్చిత్సహతే ద్విజాః. ౪౪. సోఽహమిచ్ఛామి తజ్జ్ఞాతుం తథైవేయమనిందితా, నిజానుష్ఠానమఖిలం యస్యాశేషమిదం ఫలమ్. ౪౫. బ్రహ్మోవాచ.—ఇతి పృష్టా నరేంద్రేణ సమస్తాస్తే తపోధనాః, పరావసు మూచు స్తే కథ్యతామస్య భూభృతః. ౪౬. చోదితః సోఽపి ధర్మజ్ఞైర్మహాశూరో మహామతిః, యోగమాస్థాయ సుచిరం యథావద్యతమానసః. ౪౭. జ్ఞాతవాన్నృపతే స్తస్య పూర్వదేహవిచేష్టితం,

జిజ్ఞాసువును, మహాత్ముఁడును, శత్రుఘ్నుఁడును, అభిమానవంతుఁడును, పత్నీయుక్తుఁడును నైనరాజునుగూర్చి సత్యవాగ్వ్రతులగు బ్రాహ్మణు లందఱు వినుచుండఁగా నిట్లు చెప్పెను. ఓమహారాజా! యిదియంతయు నేసుకృతఫలమో చెప్పెద వినుము. ఈరాజ్యాదికము, యీలలితాంగి యగుభార్యయు నేసుకృతమువలన లభించెనో చెప్పెద నాకర్ణింపుము. ఓరాజా! నీవు పూర్వజన్మమునందు పరపీడాతత్పరుండును, కుష్ఠరోగ పీడితుఁడును, సర్వజంతువులయందును నిర్దయుఁడును నగు శూద్రజాతీ యుండవు. ఈవిశాలేక్షణయగు నీభార్యయు నెల్లప్పుడు నీయందు లగ్నమైన మనముగలదై నీయొక్క శుశ్రూషయందే యాసక్తి గలదై యుండెను. పతివ్రతాశిరోమణియును పూజ్యురాలును నగు నీమె యతికఠినముగా నీచేఁ బీడింపఁబడుచున్నదయ్యును నీమాటల నతి క్రమింపక నీకర్మలయందు తోడుపడుచుండెను. దారిద్ర్యమువలన బంధువులచే విడువంబడి యసహాయుఁడవైనను నీయొక్క సర్వకర్మములందును తోడ్పడుచుండెను. నీప్రపితామహార్జితంబగు ధనము వ్యయమగుటంజేసి కృషిపరుఁడవైతివి. ఆకృషియును నీదురదృష్టముచే విఫలమయ్యెను. ఆకారణముచే నీవితరులకు భృత్యుఁడవైతివి. నీ వీమెను విడువవలయునని ప్రయత్నించినను నీమె మాత్రము నిన్ను విడువదయ్యెను. తరువాత

స తమాహ మునిర్భూపం విజ్ఞానేచ్ఛుం మహామతిమ్. ౪౮. సత్రాజితం మహాత్మానం జిత శత్రుం మనస్వినం, సపత్నీకం మహాబుద్ధిం బ్రాహ్మణాన్సత్యవాదినః. ౪౯. పరావసు రువాచ.—శృణు భూపాల సకలం యస్యేదం కర్మణః ఫలం, తవ రాజ్యాదికం సుభ్రూ శ్చేయం చాసీన్మహీపతే. ౫౦. త్వమాసీః శూద్రజాతీయః పరహింసాపరాయణః, కుష్ఠార్తో దండపారుష్యే నిఃస్నేహః సర్వజంతుషు. ౫౧. ఇయం చ భవతో భార్యా పూర్వమప్యాయతేక్షణా, నిత్యం బభూవ త్వచ్చిత్తా భవచ్ఛుశ్రూషణే రతా. ౫౨. పతివ్రతా మహాభాగా భర్త్స్యమానాపి నిష్ఠురం, త్వద్వాక్యేషు చ సర్వేషు వీర కర్మసు చోద్యతా. ౫౩. నైశ్వర్యాదసహాయస్య త్యజ్యమానస్య బంధుభిః, క్షయం జగామ యోర్థోఽభూత్సంచితః ప్రపితామహైః. ౫౪. తస్మిన్ క్షీణే కృషిపరస్త్వమాసీః పృథివీపతే, సాపి కర్మవిపాకేన కృషిర్విఫలతాం గతా. ౫౫. తతో నిఃస్వం పరిక్షీణం పరేషాం భృత్యతాం గతం, తత్యాజ సాధ్వీ నేయం త్వాం త్యజ్యమానాపి పార్థివ. ౫౬. అనయా తు సమం సాధ్వ్యా భానోరావసథే త్వయా, కృతం శుశ్రూషణం

పతివ్రతయగు నీమెతో సూర్యునియొక్క గృహమందు సమ్మార్జనాది క్రియలం జేయుచుంటివి. సమస్తమైన కోరికలయందు దాశలేనివాఁడవై తన్మయుఁడవై మనమును సూర్యునియందునిచి ప్రతిదినమందును విశ్వాసమువలనఁ గాన్యకుబ్జపురమునయున్న సూర్యునియొక్క గృహమందు బాగుగా శుశ్రూషఁజేసితివి. ఈసూర్యాలయమందు ప్రతిదినము నందును మార్జనాదుల నాచరించితివి. నీవిశ్వానువర్తిని యగు నీ పత్నితోఁ బ్రతిదినమందును తోయాభిషేకమును అనులేపనకార్యమును నెరవేర్పించితివి. ఇతిహాసపురాణములయందలి పుణ్యకథలను వినిపించి తివి. మఱియు నాపురాణాఖ్యాపకునకుఁ బిత్రుదత్తమగు సంగుళీయకము నిచ్చితివి. పత్నీసహితుఁడవై యేకర్మఁజేయుచుంటివో యాకర్మయందే తన్మయుఁడవగుటచే పాపము క్రమముగా క్షీణదశనొందెను. యెల్లప్పుడును భానుని యారాధనముఁ జేయవలయుననియేగాని యిది ప్రభాతము ఇది ప్రభాతముగా దనియెడుచింత యెంతమాత్రమును లేదు. యెప్పుడును నీయాలయము రమ్యముగను సుఖావహము గను బ్రకాశించుచుండవలయునని కోరుచుండెడివాఁడవు. యోగాభ్యాసము యోగుల కెట్లు సుఖకరమో అట్లే నాకును గాఁగల దని నిశ్చయించుకొని దివారాత్రములు యోగసమాధియందే మనమును స్థిరపఱచితివి. ఇట్లు తదేకమనస్కుండవై భూతపతియగు సూర్యునిగూర్చి శాస్త్రోక్తమైనదానికంటె నధికముగా తపమాచరించుచు నిశ్చలచిత్తుండవై సూర్యుని నిత్యము స్మరించుటచే నీవు చేసినపాపమంతయు నిశ్శేష

వృత్త్యా భక్త్యా సమ్మార్జనాదికమ్. ౫౭. నిఃస్పృహః సర్వకామేభ్యస్తన్మయస్త్వం సదర్పణః, అహన్యహని విస్రంభాత్తస్మిన్నావసథే రవేః. ౫౮. కాన్యకుబ్జపురే వీర మహా శుశ్రూషితం త్వయా, దివాకరాలయే నిత్యం కృతం తన్మార్జనం త్వయా. ౫౯. తథైవాభ్యుక్షణం భూప నిత్యం చైవానులేపనం, పత్న్యానయా నృప తథా యుష్మచ్చిత్తానువృత్తయా. ౬౦. కారితం శ్రవణం పుణ్యమితిహాసపురాణయోః, దత్త్వాంగులీయకం రాజన్పితృదత్తం తు వాచకే. ౬౧. అహన్యహని యత్కర్మ యువయోర్నృప కుర్వతోః, తత్రైవ తన్మయత్వేన పాపహానిరజాయత. ౬౨. భానోః కార్యం మయా కార్యం పరం శుశ్రూషణం తథా, నాప్రభాతం ప్రభాతం వా చింతేయమభవన్నిశి. ౬౩. ఏవమాయతనం రమ్యమిత్యేవం చ సుఖావహం, సూర్యవచ్చైవ మేతత్స్యాదిత్యాసీత్తే మనస్తదా. ౬౪. యోగినాం సుఖదం కర్మ తథైవ సుఖమిత్యపి, భవచ్చిత్తమభూత్తత్ర యోగ

ముగా శాంతిఁబొందెను. తరువాత నంతకంటె యధికముగా దేవాలయము నలుకుట యూడ్చుట మొదలగు ననేకవిధకృత్యములను పత్నీసహితుఁడవై జేసితివి. ఈమెయు సర్వవిధవృత్తిత్యాగముఁజేసి వాచకునివలన నెల్లప్పుడు పుణ్యకథాశ్రవణముఁ జేసినది. మఱియు నానావర్ణవికారములచేతను గోమయముచేతను మంటిచేతను భక్తిపూర్వకముగా సూర్యదేవాలయమునకు భార్యతోఁ గూడ పూతఁబెట్టితివి. ఇట్లుండ నొకనాఁడా ప్రదేశమునకు మహాసైన్యసమేతుఁడును గజాశ్వాదివాహనసహితుండును నగు కువలయాశ్వుం డనురాజు విచ్చేసెను. సర్వసంపద్యుక్తుఁడును, సర్వాలంకారభూషితుండును, భార్యాసహస్రపరివృతుండును, దేవేంద్రతుల్యప్రకాశుండును నగురాజును జూచి రమ్యకిరీటోద్భాసితుండగు రాజశ్రీవియందుఁ గోఱికగలవాఁడవైతివి. నీవుచేయు సూర్యాశ్రితమైనవ్రతము సర్వకామప్రదంబగుటంజేసి యీసమస్తమైన రాజ్యమును చతుస్సముద్రముద్రితంబగు భూమిని బొందితివి. లోకాతీతంబగు నీతేజము నీకెట్లు గల్గెనో తెల్పెద నాకర్ణింపుము. మహారాజా! నేను యోగప్రభావముచేఁ దెలిసికొనినదాని నంతను నీకుఁ జెప్పెద. ఆసూర్యదేవాలయమం దున్న దీపము తైలశోషమువలన క్షీణించిపోయెను. మఱల నీవు భోజనములో

---

కర్మణ్యహర్నిశమ్. ౧౫. ఏవం తన్మనసస్తత్ర కృతోద్యోగస్య పార్థివ, భూతానుమానినః సమ్యగ్యథోక్తాధికకారిణః. ౧౬. స్మరతో గోపతిం నిత్యం చిత్తేనాపి దృఢాత్మనః, నిఃశేషముపశాంతం తే పాపం సూర్యనిషేవణాత్. ౧౭. తతోఽధికం పురస్తస్మాదగారస్యానులేపనం, సంమార్జనం చ బహుశః సపత్నీకేన యత్కృతమ్. ౧౮. కేవలం ధర్మమాశ్రిత్య త్యక్త్వా వృత్తిమశేషతః, అనయా శ్రవణం పుణ్యం కారితం వాచకాత్సదా. ౧౯. నానాధాతువికారైస్తు గోమయేన మృదా తథా, ఉపలేపనం కృతం భక్త్యా త్వయా పూర్వం సురాలయే. ౨౦. అథాజగామ వై తత్ర కువలాశ్వో మహీపతిః, మహాసైన్యపరీవారః ప్రభూతగజవాహనః. ౨౧. సర్వసంపదుపేతం తం సర్వాభరణభూషితం, వృతం భార్యాసహస్రేణ దృష్ట్వా సంక్రందనోద్బలం, స్పృహా కృతా త్వయా తత్ర చారుమాలిని పార్థివే. ౨౨. సర్వకామప్రదం కర్మ క్రియతే భాస్కరాశ్రితం, తేనైతదఖిలం రాజ్యమశేషం చాప్తవాన్మహీమ్. ౨౩. తేజశ్చైవాధికం యత్తే తత్తైవ శృణు పార్థివ, యోగప్రభావతో లబ్ధం కథయామ్యఖిలం తవ. ౨౪. తత్రైవాపసథే దీపః ప్రశాంతః స్నేహసంక్షయాత్, నిజభోజనతైలేన పునః ప్రజ్వాలితస్త్వయా.

నుంచుకొనఁబోవు తైలముచే దీపమును ప్రజ్వలింపఁజేసితివి. నీభార్యయగు విమలావతి యుత్తరీయమును జింపి వర్తిజేసి ఆవత్తిని స్వయముగ వెలిఁగించెను. స్వయముగా వెలిఁగించి వృద్ధిఁబొందించుటచే నీభార్యయగు నీమెకుఁ గాంతి యగ్గలంబాయెను. నీకారణముచే నీకును సమస్తరాజలోకమునకుఁ జిత్తక్షోభకరమైన కాంతి గల్గెను. ఇంతకే యింత గలిగిన సూర్యారాధనమున నధికముగఁ గల్గునని వేరే చెప్పవలయునా? ఇట్లు సత్రాజితమహారాజు సూర్యకర్మాసక్తుఁడై తన్మయత్వముచేత గొప్పదగుమహిమను బొందెను. ఏమానవుఁడు నిత్యము భక్తితో శుశ్రూషయందే యాదరముగలవాఁడై నిష్కాముఁడును అనన్యమనస్కుఁడును నై దేవుఁడగు సూర్యు నారాధించునో యామానవుఁడు సత్రాజితమహారాజుచే ననుభవింపఁబడుచున్న సమస్తసంపదలను బొంది సర్వలోకోత్కృష్టుఁడై ప్రకాశించును. లోకేశుఁడగు సూర్యునిఁ బూజించి యెవఁడును కష్టమును బొందఁడు. పుష్పములచేతను ధూపములచేతను వస్త్రగంధమాల్యాదులచేతను సూర్యు నారాధించి తద్దేవాలయమును సమ్మార్జనానులేపనాదులచేఁ బ్రకాశింపఁజేయుచు నేవస్తువు తమకిష్టతమమో యెయ్యది దుర్లభమో దానిని జగద్రక్షకుఁడైన భాస్కరున కర్పించిన కష్టములు గలుగవు. ఆవస్తువు తనకు సులభముగా లభించుచుండును. గంధయుక్తమైన యగురు కర్పూరము చందనము కుంకుమ వస్త్రములు పలువిధములగు ధూపములు పుష్పములు స్రజములు చామ

---

౨౫. అనయా చోత్తరీయేణ వీర వర్త్యోపబృంహితః, తవ పత్న్యా స్వయం జ్వాల్య కాంతిరస్యాస్తతోఽధికా. ౨౬. తవాప్యఖిలభూపాలమనఃక్షోభకరం పునః, తేజో నరేంద్ర ఏతస్మాత్కిముతారాధ్య భాస్కరమ్. ౨౭. ఏవం నరేంద్రః సత్రాజిద్భానుకర్మపరాయణః, తన్మయత్వేన సంప్రాప్తో మహిమానమనుత్తమమ్. ౨౮. కిం పునర్యో నరో భక్త్యా నిత్యం శుశ్రూషణాదృతః, కరోతి సతతం పూజాం నిష్కామో నాన్యమానసః. ౨౯. సర్వామృద్ధిమిమాం లబ్ధ్వా సర్వలోకమహేశ్వరః, పూజయిత్వార్కమీశేశం తమారాధ్య న సీదతి. ౩౦. పుష్పైర్ధూపైస్తథా వాసైర్దీపైర్వస్త్రానులేపనైః, ఆరాధయార్కం తద్వేశ్మ సదా సమ్మార్జనాదినా. ౩౧. యస్యాభీష్టతమం కించిద్యద్యదన్యత్తు దుర్లభం, తద్దత్వా చ జగద్ధాత్రే భాస్కరాయ న సీదతి. ౩౨. సుగంధాగురుకర్పూరచందనాగురుకుంకుమైః, వాసోభిర్వివిధైర్ధూపైః పుష్పైః స్రక్చామరధ్వజైః.

రములు మొదలైనవానిచేతను క్షీరాభిషేకములచేతను, గీతవాదిత్ర నృత్యములచేత నాదరముతో సూర్యుని సంతోషపెట్టుము. ఓమహా రాజా! నీవు పుణ్యరాత్రులయందు నృత్తగీతాదులచేత జాగరణముచేసి శుచివై యుజ్జ్వలుండగు సూర్యునిగూర్చి హోమముం జేయవలయును. ఇతిహాసపురాణాదుల శ్రవణముచేతఁ బుణ్యములగు ఋక్సామయజురాత్మక వేదఘోషములచేతను భగవంతుఁడగు సూర్యుని భక్తిపూర్వకముగా సంతోషపెట్టవలయును. అట్లు నరులచే సంతోషపెట్టఁబడినవాఁడై సంసారచ్ఛేదకుండగు సూర్యుఁడు భక్తుల కభిమతమైన వాంఛితముల వైవస్వత రూపము నిచ్చుచుండును. దేవతారాధనతత్పరులగు ప్రాణులయొక్క స్తోత్రములచే సంతోషభరితుఁడై భగవంతుఁడగు సూర్యుఁడు సమస్త వాంఛితంబుల నిచ్చుచుండును. ఇట్లు కోరికలనిచ్చుట నదవదులచేత రత్నసముదాయములచేత పుష్పధూపాద్యలంకారములచేతను సంభవింపదు. సద్భావముచేత మాత్రమే సూర్యుఁడు సంతుష్టుఁడగునని చెప్పఁబడియున్నది. ఏకాగ్రబుద్ధితో గృహసమ్మార్జనాద్యల్పకార్యముల నాచరించితివిగాన ననితరసులభంబగు రాజ్యమును బొందితివి. నీభార్యయగు విమలావతియు సూర్యదేవాలయమునందు పుణ్యకథాశ్రవణముం జేసి యిటువంటిసంపదను పురాణకథకునిఁ బూజించి నీపత్నీత్వమును బొందెను. ఎవఁడు సమస్తోపకరణములను సంపాదించి నిశ్చలమానసుండై

---

౮౩. అన్యోపహారైర్వివిధైః కృతక్షీరాభిషేచనైః, గీతవాదిత్రనృత్యాద్యైస్తోషయస్వార్కమాదరాత్. ౮౪. పుణ్యరాత్రిషు మార్తండం నృత్యగీతైరథోజ్జ్వలం, భూప జాగరణైర్భక్త్యా హోమః కార్యః సదా శుచిః. ౮౫. ఇతిహాసపురాణానాం శ్రవణేన విశేషతః, తథా వేదస్వనైః పుణ్యైర్ఋక్సామయజుభిర్నృప. ౮౬. ఏవం సంతోష్యతే భక్త్యా భగవాన్భవభంగకృత్, భూయో వైవస్వతో భూత్వా భవహృద్భాస్కరో నరైః. ౮౭. తోషితో భగవాన్భానుర్దదాత్యభిమతం ఫలం, దైవకర్మసమర్థానాం ప్రాణినాం స్మృతిసంభవైః. ౮౮. తోషితో భగవాన్కామాన్ప్రయచ్ఛతి దివాకరః, నైవ వృత్తైర్న రత్నౌఘైః పుష్పైర్ధూపానులేపనైః, సద్భావేనైవ మార్తండస్తోషమాయాతి సంస్మృతః. ౮౯. త్వయైకాగ్రమనస్కేన గృహసమ్మార్జనాదికం, కృత్వాల్పమీదృశం ప్రాప్తం రాజ్యమన్యేన దుర్లభమ్. ౯౦. అనయా శ్రవణం పుణ్యం కారయిత్వా గృహే రవేః, ఈదృశా ప్రాప్తా సంపదియం పూజాం కృత్వా తు వాచకే. ౯౧. ప్రాప్తోపకరణై

సర్వేశ్వరుండగు సూర్యుని సంతోషపెట్టునో వానికి దేవేంద్రుడును సమానుఁడు గానేరఁడు. కాన నీవు నీభార్యయగు విమలావతితోడ భాస్కరారాధనవిషయమై ప్రయత్నమును జేయుము. బ్రహ్మదేవుం డిట్లనియె. ఓయదుశ్రేష్ఠుఁడా! సత్రాజితమహారాజు పరావసువుచెప్పిన యీవాక్యములను విని సంతుష్టాంతరంగుఁడై భార్యతోఁగూడి తనను గృతకృత్యునిగాఁ దలఁచి నమస్కరించినవాఁడై యిట్లని చెప్పెను. ఓబ్రాహ్మణోత్తమా! ఏప్రకారముగా వాయువు గొప్పదైనబలమును నమరత్వమును బొంది యుత్కృష్టసౌఖ్యమును బొందుచుండెనో యట్లే కృతకృత్యుఁడనైన నేనును నీవాక్యములచేత ననాయాసముగ పరమసుఖమును బొందితిని. అజ్ఞానాంధకారచ్ఛన్నుఁడనై నీయొసంగిన జ్ఞానదీపముచేఁ దెలివొందితిని. నేనును నాభార్యయు నైశ్వర్యనాశభీరులమై యుండియు నిప్పుడైశ్వర్యబీజమును మీవాక్యములచేతఁ దెలిసికొనఁగల్గితిమి. ఓబ్రాహ్మణోత్తమా! సంపదలకుఁ గారణముఁ జెప్పితివి. నీముఖద్వారమునుండి వెలువడినవాక్యార్థములను గ్రహించితిని. కేవలము రత్నములచేతను, ధనములచేతను, పుష్పమాల్యాదులచేతను భగవంతుఁడగుసూర్యుని ఫలప్రదునిగాఁ జేసికొనఁజాలరు. ధనరహితులైనను మానవులు బాహ్యార్థములయం దపేక్షలేనివారై జగన్నాథుఁడైన భాస్కరునిఁ బూజించిన

---

ర్యస్తమేకాగ్రమతిరండజం, సంతోషయతి నేంద్రోఽపి భవతా వై సమః క్వచిత్. ౯౨. తస్మాత్త్వమనయా దేవ్యా సహాత్యంతవినీతయా, భాస్కరారాధనే యత్నం కురు ధర్మభృతాంవర. ౯౩. బ్రహ్మోవాచ.—ఏతన్ము నేర్వచో వీర నిశమ్య స నరాధిపః, భార్యాసహాయః స తదా సంప్రహృష్టతనూరుహః. ౯౪. కృతకార్యమివాత్మానం మన్యమాన స్తదాభవత్, ఉవాచ ప్రణతో భూత్వా రాజా సత్రాజితోఽచ్యుత. ౯౫. సత్రాజిత ఉవాచ.—యథామరత్వం సంప్రాప్య యథా వాయుర్బలం పరం, పరం నిర్వాణమాప్నోతి తథాహం వచసా తవ. ౯౬. కృతకృత్యః సుఖాసీనో నిర్వృతిం పరమాం గతః, అజ్ఞానతమసాచ్ఛన్నే యత్ప్రదీపస్త్వయా ధృతః. ౯౭. అహం మేషా చ తన్వంగీ విభూతిభ్రంశభీరుకః, ద్రవ్యమాపాదితం బ్రహ్మన్నిహాద్య వచసా తవ. ౯౮. సంపదః కథితం బీజమావయోర్భవతా మునే, త్వద్వక్త్రాదుద్ధృతా వాచో విజ్ఞాతా హి ద్విజోత్తమ. ౯౯. న రత్నైర్న చ విత్తౌఘైర్న చ పుష్పానులేపనైః, ఆరాధ్యశ్చ జగన్నాథో భావకూన్యైర్దివాకరః. ౧౦౦. బాహ్యార్థనిరపేక్షైశ్చ మనసైవ మనోగతిః, నిఃస్వైరారా

ఫలప్రదునిగాఁ జేసికొనఁగల్గుదురు. నిర్ధనులగుపురుషులచేత భాస్కరుఁడు మనస్సుచేతనే పూజింపఁబడును. ఇదిమొదలగు మీరుచెప్పిన యావదర్థము గ్రహించితిని. ఇఁకముందు దేనిని దెలిసికొనవలయునని నాకుఁ గోరిక గల్గునో దాని ప్రశ్నించెదను. దానినిఁ గృపాతరంగితాంతఃకరణులరై చెప్ప వేఁడెదను. ఓమహాభాగా! భగవంతుఁడగు భాస్కరుఁడు స్త్రీపురుషులచే నేవిధముగ నారాధింపఁబడి సంతుష్టుఁడగునో యాయావిషయములను జెప్ప వేఁడెదను. ఏతిథి యాదేవున కిష్టమో సూర్యదేవతారాధన తత్పరుండనగు నాకు తెలియఁజెప్పి యందలిరహస్యములను తెలియఁజేయఁ గోరెదను. నావుడుఁ బరావసు విట్లనియె ఓమహారాజా! ఘోరమగు సంసారార్ణవమున మగ్నులగు నేస్త్రీపురుషులచేత సూర్యుఁడు గృహములయం దారాధింపఁబడునో వారు జగన్నాథుఁడైన భాస్కరుని నిశ్చలమనస్కులై పూజించి భాస్కరప్రీతికొఱకు కార్తికమాసమునఁ దనభక్తమును రెండుగా భాగించి యొకదానిని తమరు భుజించి రెండవ దానిని బ్రాహ్మణార్పణము చేయవలయును. పూర్వ(కౌమార) వయస్సునందుఁ బ్రయత్నపూర్వకముగ నీవ్రత మాచరించిన జ్ఞానాజ్ఞానకృతంబులగు నేపాపంబులైనను లోపించును. ఈవిధిప్రకారము మార్గశీర్షమాసమున మరకతమణిని విధిప్రకారముగ నర్చించి భగవత్ప్రీతికొఱకు ఆమణిని బ్రాహ్మణులకొఱకీయవలయును. అట్లిచ్చినవానికిఁ గల్గుఫలమును

---

ధ్యతే దేవో భానుః సర్వేశ్వరేశ్వరః. ౧౦౧. సర్వమేతన్మయా జ్ఞాతం యత్త్వమాత్థ మహామునే, యచ్చ పృచ్ఛామి తన్మే త్వం ప్రసాదసుముఖో వద. ౧౦౨. కథమారాధితో దేవో నరైః స్త్రీభిశ్చ భాస్కరః, తోషమాయాతి విప్రేంద్ర తద్వదస్వ మహామునే. ౧౦౩. రహస్యాని చ దేవస్య ప్రీతయే యా తిథిః సదా, చాన్యశేషాణి మే బ్రూహి అర్కారాధనకాంక్షిణః. ౧౦౪. పరావసురువాచ.— శృణు భూపాల యైర్భానుర్గృహేష్వారాధ్యతే జనైః, నారీభిశ్చాతిఘోరేఽస్మిన్పతితాభిర్భవార్ణవే. ౧౦౫. సమభ్యర్చ్య జగన్నాథం దేవమర్కం సమాధినా, ఏకమశ్నాతి యో భక్తం ద్వితీయం బ్రాహ్మణార్పణమ్. ౧౦౬. కరోతి భాస్కరప్రీత్యై కార్తికం మాసమాత్మనా, పూర్వే వయసి యత్నేన జానతాఽజానతాపివా. ౧౦౭. పాపమాచరితం తస్మాద్భిద్యతే నాత్ర సంశయః, అనేనైవ విధానేన మాసి మార్గశిరే పునః. ౧౦౮. సమభ్యర్చ్య మరకతం విప్రేభ్యో యః ప్రయచ్ఛతి, భగవత్ప్రీణనార్థాయ ఫలం తస్య శృణుష్వ మే.

వినుము. మధ్యమవయస్సునందు స్త్రీలచేతనుగాని పురుషులచేతఁగాని యే పాపములు చేయఁబడెనో యవియన్నియును వార్ధకమునఁ జేయఁబడిన పాపములన్నియును నీదానముచే ముక్తములగునని చెప్పఁబడియుండెను. ఓమహారాజా! పుష్యమాసమున దివాకరునిఁ బూజించి యొక భక్తమును బ్రాహ్మణున కిచ్చినచో నతఁడయిను సూర్యుని సంతుష్టుఁజేసి స్త్రీపురుషులను వార్ధకకృతమగు పాపమునుండి విడిపింపఁజేయును. ఓరాజా! మూఁడు మాసములచేఁ జేయఁదగిన యీవ్రతము నెరవేర్చువాఁడు యీతఁడు సూర్యుని సంతోషపెట్టుటవలన లఘుపాపవిముక్తుఁడగును. ఓరాజా! రెండవసంవత్సరమునం దీవ్రత మాచరించినచో నుపపాతకములు నశించును. అట్లే మూఁడవసంవత్సరమునఁ జేసిన మహాపాతకములు నశించును. ఈవ్రతము స్త్రీలచేఁగాని, పురుషులచేఁగాని సంవత్సర మొక్కింటికి మూఁడుమాసములచొప్పున మూఁడుసంవత్సరములు చేసినఁ బూర్వోక్త ప్రకారము ఫలములు లభించును. మూఁడుమాసము లీవ్రతము ననుష్ఠించుటవలన మూఁడువిధములైన పాతకములనుండి భగవంతునియొక్క మూఁడు నామములు విడిపింపఁజేయును. అనేకసంవత్సరములనుండి యుండిన పాపములను గూడ విడిపింపఁజేయును. భాస్కరారాధనయందు సర్వపాప ప్రశామకమగు నీవ్రతమును సంపూర్ణముగ నీప్రశ్నము ననుసరించి నీయందలికరుణచేఁ జెప్పితిని. అనిన సత్రాజితుం డిట్లనియె. ఓబ్రాహ్మణ

---

౧౦౯. మధ్యే వయసి యత్పాపం యోషితా పురుషేణ వా, కృతమస్మాచ్చ తేనోక్తో విమోక్షః పరమాత్మనా. ౧౧౦. తథా చైవైకభక్తం తు యస్తు విప్రాయ యచ్ఛతి, దివాకరం సమభ్యర్చ్య పౌషే మాసి మహీపతే. ౧౧౧. తత్తచ్చ ప్రీణయత్యర్కం వార్ధకేనైవ యత్కృతమ్, స తస్మాన్ముచ్యతే రాజన్నుమాన్యోషిదథాపి వా. ౧౧౨. త్రిమాసికం వ్రతమిదం యః కరోతి నరేశ్వర, స భానుప్రీణనాత్పాపైర్లఘుభిః పరిముచ్యతే. ౧౧౩. ద్వితీయే వత్సరే రాజన్ముచ్యతే చోపపాతకైః, తద్వత్తృతీయేఽపి కృతం మహాపాతకనాశనమ్. ౧౧౪. వ్రతమేతన్నరైః స్త్రీభిస్త్రిభిర్మాసైరనుష్ఠితమ్, త్రిభిః సంవత్సరైశ్చైవ ప్రదదాతి ఫలం నృణామ్. ౧౧౫. త్రిభిర్మాసైరనుష్ఠానాత్త్రివిధాత్పాతకాన్నృప, త్రీణి నామాని దేవస్య మోచయంతి చ వార్షికైః. ౧౧౬. యత స్తతో వ్రతమిదం వివిధం సముదాహృతమ్, సర్వపాపప్రశమనం భాస్కరారాధనే పరమ్. ౧౧౭. సత్రాజిత ఉవాచ.—కతమాయ తు విప్రాయ దాతవ్యం భక్తితో మునే, ద్వితీయే

శ్రేష్ఠుఁడా! యే బ్రాహ్మణునికొఱకు భక్తితో వస్త్రము రెండవదాని నీయవలయునో యావిషయము సవిస్తరముగాఁ జెప్ప వేఁడెదననినఁ బరావసు విట్లనియె. పురాణవాచకుఁడైన విప్రోత్తమునకు వస్త్రయుగ్మము నీయవలయును. మఱియు భాస్కరుం డరుణునకుఁ జెప్పినవాక్యములను గూడ వినుము. అరుణుఁ డొకనాఁ డుదయాచలసంస్థితుండును అంధకార ధ్వంసకుండును నగుసూర్యుని నమస్కరించి యిట్లనియె. దేవా! తమ యొక్క పూజావిధియం దెల్లప్పు డేయే వస్తువులు ప్రియంబులై యుండును? పుష్పములలో నేవి సర్వకాల ప్రియంబు లగును? గ్రహణ ములయందు వస్త్రదానములయం దేది ప్రియమైనదో? అదియంతయు నాకుఁ జెప్పుమనిన విని భాస్కరుం డిట్లనియె. ఓభక్తుఁడా! పుష్పము లలో నెఱ్ఱగన్నేరుపుష్పములును రక్తచందనమును గుగ్గిలధూపము మోదకనైవేద్యమును నాకుఁ బ్రియమైనవి. పూజచేయువాఁడు భోజకుఁ డును నేతిదీపము నాకు బ్రియములు. ఓపక్షీంద్రుఁడా! వాచకుని కిచ్చు శ్రేష్ఠమైన దానమును నాకభిమతము. ఓపక్షీంద్రుఁడా! నన్నుద్దేశించుచు నేదాన మియ్యఁదలఁతురో యాదానమును వాచకున కొసంగవలయును. అది నాకు సంతోష కారణమగును. ఇతిహాసపురాణకోవిదుఁడును బ్రాహ్మ ణుఁడును నగువాచకుని నాసంప్రీతికొఱకుఁ బూజింపవలయును. ఆవాచకుఁ డగు బ్రాహ్మణుఁ డెల్లప్పుడు పూజితుఁడైనచో నిస్సంశయముగా నేను

---

ద్విజశార్దూల కథయస్వాఖిలం మమ. ౧౧౮. పరావసురువాచ.— దేయే పురాణవిదుషే వస్త్రే విప్రోత్తమాయ చ, శ్రూయతాం చాపి వచనం యదుక్తం భాస్కరేణ చ, అరుణాయ మహాబాహో పృచ్ఛతే యత్పురా నృప. ౧౧౯. ఉదయాచలమారూఢం భాస్కరం తిమిరాపహమ్, ప్రణమ్య శిరసా నూనమిదం వచనమబ్రవీత్. ౧౨౦. కాని ప్రియాణి తే దేవ పూజనే సంతి సర్వదా, పుష్పాదీనాం సమస్తానామారాధన విధౌ సదా, ఉపరాగాదివస్త్రాదౌ బ్రాహ్మణానాం తథా రవే. ౧౨౧. భాస్కర ఉవాచ.— పుష్పాణాం కరవీరాణి తథా రక్తం చ చందనమ్, గుగ్గులశ్చాపి ధూపానాం నైవేద్యే మోదకాః ప్రియాః. ౧౨౨. పూజాకరో భోజకస్తు ఘృతదీపస్తథా ప్రియః, దానం ప్రియం ఖగశ్రేష్ఠ వాచకాయ ప్రదీయతే. ౧౨౩. మాముద్దిశ్య చ యద్దానం దీయతే మానవైర్భువి, వాచకాయ తు దాతవ్యం తన్మమ ప్రీతయే ఖగ. ౧౨౪. ఇతిహాస పురాణాభ్యామభిజ్ఞో యస్తు వాచకః, బ్రాహ్మణో వై ఖగశ్రేష్ఠ సంపూజ్యః ప్రీతయే మమ.

గూడ పూజింపఁబడినవాఁడ నగుదును. ఆతఁడు నాకిష్టుఁడగుటవలన నత నిచేఁ జేసినయుపచారములన్నియు నా కువియే యని భావింపవలయును. ఓపక్షీంద్రుఁడా! వేదఘోషముచేత, వీణాస్వనములచేతను, మృదంగ ధ్వనిచేతను, గంధలేపనముచేతను నాకు సంతోషము గల్గును. ఇతిహాస పురాణములు నాకుఁ బ్రియములైనవి. అంతకంటెఁ దద్వాచకుఁడును భోజ కుఁడును గూడ నాకుఁ బ్రియతములు

ఇది షోడశోత్తరశతతమాధ్యాయము

---

## సప్తదశోత్తరశతతమాధ్యాయము.

ఓదేవేశా! భోజకుఁడైన యర్చకుఁడు నీకెట్లు ప్రియుండయ్యె. ఇతరులగు బ్రాహ్మణాదులు నీకుఁ బ్రియు లెందులకుం గారు. ఈ భోజకుఁ డనఁగా నెవ్వరు? ఎవనికుమారుఁడు. ఏస్వరూపముగలవాఁడు? వానియొక్క వర్ణమేమి? వ్యాపారమేమి?అను నీమొదలగు యావద్విషయములను జెప్ప వేఁడెదను. అని వరుణుఁడడుగ సూర్యుం డిట్లనియె. ఓవైనతేయా! మహా బుద్ధిసంపన్నుఁడ వగుటకుఁ దగినట్లుగా నన్ను మంచివిషయము నడిగితివి. కాన నిశ్చయమానసుండవై నేఁజెప్పెడిదానిని వినుము. బ్రాహ్మణులు గాని యితరవర్ణమువారు గాని శ్రద్ధాభక్తియుక్తులై దేవాలయముల నన్నుఁ

---

౧౨౫. పూజితేఽస్మిన్సదా విప్రే పూజితోఽహం న సంశయః, భవామి ఖగశార్దూల యతస్త్విష్టః స మే సదా. ౧౨౬. వేదవీణామృదంగైశ్చ నాతిగంధవిలేపనైః, తథా మే జాయతే ప్రీతిర్యథా శ్రుత్వా ఖగోత్తమ. ౧౨౭. ఇతిహాసపురాణాని వాచ్యమానాని వాచకైః, అతః ప్రియో వాచకో మే పూజాకర్తా చ భోజకః. ౧౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సత్రాజితోపాఖ్యానే రవిపూజావిధివర్ణనం నామ షోడశోత్తరశతతమోఽధ్యాయః.

---

అరుణ ఉవాచ:—కిమర్థం భోజకస్తుభ్యం ప్రియో దేవేశ కథ్యతామ్, నాన్యే విప్రాదయో వర్ణా దేవతాయతనేషు వై. ౧. కశ్చాయం భోజకో దేవ కస్య పుత్రః కిమాత్మకః, వర్ణతశ్చాస్య మే బ్రూహి కర్మ చాస్య సమంతతః. ౨. ఆదిత్య ఉవాచ.—సాధు పృష్టోఽస్మి భద్రం తే వైనతేయ మహామతే, శృణుష్వైకమనాః సర్వం గదతో మమ ఖేచర. ౩. విప్రాదయస్తు యే త్వన్యే వర్ణాః కశ్యపనందన, తే పూజయంతి మాం

బూజింతురేని అట్టివారు దేవతావృత్తిచే దేవలకులని చెప్పఁబడుదురు. ఆకారణముచే నాకు భోజకుఁడె ప్రియతముఁడు. ఆభోజకుఁడు బ్రాహ్మణ వంశసంజాతుఁడును స్వకర్మానుష్ఠానతత్పరుఁడునై యుండవలెను స్వకర్మానుష్ఠానవిహీనుఁడైనయెడ నిశ్చయముగా నరకముఁ బొందును. కాన భోజకు లెప్పుడును స్వకర్మానుష్ఠానము త్యజింపఁగూడదు ఈభోజకుఁడు నాపూజానిమిత్తమై నాతేజస్సుచేత నిర్మింపఁబడి నీవు ఈకార్యమును జేయుమని నాచే నియమింపఁబడెను. శాకద్వీపమునందు మేధాసంపన్నుఁడగు ప్రియవ్రతునియొక్క కుమారుఁడు రాజై యుండెను. ఆరాజు నాకొఱకై స్వీయదేశమునందు దివ్యవిమానసదృశంబగు శిలామయగృహమును నిర్మించెను. ఆగృహమునందు సువర్ణమయమును సులక్షణయుక్తమును నాయర్చారూపమునగు విగ్రహమును బ్రతిష్ఠించుటకై యెవఁడు సమర్థుఁడని చింతించిన చింతకుఁ బారమును బొందలేక నన్ను శరణంబు వేఁడెను. ఓవైనతేయా! యాతనిభక్తికి సంతసించినవాఁడనై దర్శనఫలమనుభవింపఁజేసి యిట్లు పల్కితిని. ఓమహారాజా! దేనినిఁగూర్చి యిట్లు చింతించుచుంటివి? ఎందులకై నీకుఁ జింతగలిగెనో నీమనమునందున్న చింతాకారణమును ధీరముగాఁ జెప్పుము. ఆకార్యమంతయు నేను సమకూర్చెదను నీవు నిశ్చలమనస్కుఁడవై యుండుము. ఆకార్య మతిదుష్కరమైనను నిస్సంశయముగాఁ జేయఁగలను. అనిన రాజిట్లనియె.

---

నిత్యం భక్తిశ్రద్ధాసమన్వితాః. ౪. దేవాలయేషు యే విప్రాః ప్రీత్యా మాం పూజయంతి హి, అన్యాశ్చ దేవతావృత్త్యా తే స్యుర్దేవలకాః ఖగ, ఏతస్మాత్కారణాన్మహ్యం భోజకో దయితః సదా. ౫. వర్ణతో బ్రాహ్మణశ్చాయం స్వానుష్ఠానపరో యది, అనుష్ఠానవిహీనో హి నరకం యాత్యసంశయమ్. ౬. న త్యాజ్యం భోజకైస్తస్మాత్స్వకం కర్మ కదాచన, మయాసౌ నిర్మితః పూర్వం తేజసా స్వేన వై ఖగ. ౭. పూజార్థమాత్మనో నూనం కర్మ చాస్య ప్రకీర్తితమ్, ప్రియవ్రతసుతో రాజా శాకద్వీపే మహామతిః. ౮. తేన మే కారితం దివ్యం విమానప్రతిమం గృహమ్, తస్మిన్ద్వీపే తదాత్మీయే దివ్యం శిలామయం మహత్. ౯. స మదర్చాం కారయిత్వా కాంచనీం లక్షణాన్వితామ్, ప్రతిష్ఠాపనాయ వై తస్యాశ్చింతయామాస సువ్రతః. ౧౦. కృతమాయతనం శ్రేష్ఠం తేనేయం ప్రతిమా కృతా, కో వై ప్రతిష్ఠాపయితా దేవమర్కం శుభాలయే. ౧౧. ఏవం సంచింతయిత్వా తు జగామ శరణం మమ, భక్తిం తస్య చ సంచింత్య ఖగాహం

దేవా! యీశాకద్వీపమునందు దేవదేవుఁడవగు నీయాలయమును నిర్మించి యాదేవాలయమునందు నిన్నుఁ బ్రతిష్ఠించుటకై భక్తిచే సువర్ణవిగ్రహమును జేయించితిని. ఎవఁడీవిగ్రహమును దేవాలయమునందుఁ బ్రతిష్ఠింపవలయునో అట్టివాఁ డెవఁడు నీద్వీపమునందు నగపడఁడు. క్షత్రియవైశ్యశూద్రులు మాత్రమె యీద్వీపమునం గలరు. వారు నేను జేయుమని చెప్పినను నీయొక్క ప్రతిష్ఠను జేయరు. నిను బూజించుటకు బ్రాహ్మణులెవ్వరును లేరు. ఆకారణముచే నాకీచింత శల్యమువలె బాధించుచున్నది. ఓవైనతేయా! యారాజునుగూర్చి ఓరాజా! నీవు చెప్పినదియంతయు సత్యము. అయ్యది యెంతమాత్రము నసత్యము కానేరదు. ఈద్వీపమునందు క్షత్రియవైశ్యశూద్రులను మూఁడువిధములజాతులె గలవు. సందేహము లేదు. వారు నాయొక్క ప్రతిష్ఠకుఁగాని పూజావిధికిఁగాని యర్హులు కారు. కాన నీశ్రేయముఁ గోరినవాఁడనై నాప్రతిష్ఠకొఱకు నగ్రవర్ణమునందు భగసంజ్ఞగల యనుపమపురుషుని సృజించెదనని రాజును గూర్చి చెప్పినవాఁడనై కార్యసిద్ధినిగూర్చి మిక్కిలి చింతించితిని. ఇట్లు చింతించుచుండఁగా నాయొడలినుండి మల్లెలతోను జంద్రునితోను, సమా

---

పార్థివస్య తు. ౧౨. గతోఽహం దర్శనం తస్య ఉక్తశ్చాపి మయా ఖగ, కిం చిన్తయసి రాజేంద్ర కుతశ్చింతా సమాగతా. ౧౩. బ్రూహి యత్తే హృది ప్రౌఢం చింతాకారణమాగతమ్, సంపాదయిష్యే తత్సర్వం విమనా భవ మా నృప. ౧౪. అత్యర్థం దుష్కరమపి కరిష్యే నాత్ర సంశయః, ఇత్యుక్తః స మయా రాజా ఇదం వచనమబ్రవీత్. ౧౫. ద్వీపేఽస్మిన్దేవదేవస్య కృతమాయతనం తవ, మయా భక్త్యా జగన్నాథ తథేయం ప్రతిమా కృతా. ౧౬. ప్రతిష్ఠాం కారయేద్యస్తు తవ దేవాలయే ఖగ, యత్ర సంతి త్రయో వర్ణా ద్వీపేఽస్మిన్క్షత్రియాదయః. ౧౭. తే మయోక్తా న కుర్వంతి ప్రతిష్ఠాం తవ కృత్స్నశః, న చాప్యర్చాం జగన్నాథ బ్రాహ్మణాశ్చాత్ర విద్యతే. ౧౮. తేనేయమాగతా చింతా హృది శల్యం తమూర్పితం, తతో మయోక్తో రాజాఽసౌ వైనతేయ వచః శుభమ్. ౧౯. ఏవమేతన్న సందేహో యథాత్థ త్వం నరాధిప, క్షత్రియాస్త్రయో వర్ణా ద్వీపేఽస్మిన్నాత్ర సంశయః ౨౦. తే చ నార్హంతి మే పూజాం న ప్రతిష్ఠాం కదాచన, తస్మాత్తే శ్రేయసే రాజన్ప్రతిష్ఠామాత్మన స్తథా. ౨౧. సృజామి ప్రథమం వర్ణం భగసంజ్ఞమనౌపమం, ఇత్యుక్త్వా తమహం వీర రాజానం ఖగసత్తమ. ౨౨. జగామ పరమాం చింతాం తస్య కార్యస్య సిద్ధయే, అథ మే చింతయానస్య స్వశరీరాద్వినిః

నులును మహాబలసంపన్నులును, సాంగములగు వేదములను, ఉపనిషత్తు
లను బఠించువారలును, కాషాయవస్త్రధారులగు నెనమండుగు రుద్భవిం
చిరి. ఫాలప్రదేశమునుం డిద్దఱు, మఱి వక్షఃస్థలమునుం డిద్దఱు, మఱిద్దఱు
చరణములనుండియు, మఱిద్దఱు పాదములనుండియు నుద్భవించిరి. మహాను
భావులగువారందఱును నమస్కరించినవారై నన్నే తండ్రినిగఁ దలంచు
కొని యిట్లు పల్కిరి. ఓతండ్రీ! దేవదేవ! లోకరక్షకా! జగత్ప్రభూ!
యెందుకొఱకు తమదేహమునుండి మమ్ములను సృష్టించితిరి? ఆనతీయుఁడు
సమస్తమగు మీయాదేశమును నెఱవేర్చుటకు సంసిద్ధులమై యున్నా
రము. పూజ్యులగు మీరు మాకు గురువులు. మేము పుత్రులము. సందే
హములేదని చెప్పఁగా వారినిఁ జూచి యోపుత్రులారా! యీతఁడు ప్రియ
వ్రతుఁ డనురాజకుమారుఁడు. ఈతనివాక్యమును బరిపాలింపుఁడు. అని
చెప్పితిని. తరువాత రాజుతో నోరాజా! శాకద్వీపాధిపా! బ్రాహ్మణశ్రేష్ఠు
లును, బూజనీయులును నగువీరు నాకుమారులు. వీరందఱిచేఁ బ్రతిష్ఠ
చేయింపుము. నాపూజయందుఁ గూడ వారినే నియోగింపుము. తరువాత
పూజాలయమునంతను వీరియధీనముచేయుము. వీరు నాయొక్క పూజల
యందును బ్రతిష్ఠావిధియందును మిక్కిలి యోగ్యులు. భోజకులకొఱకు

---

స్మృతాః. ౨౩. శశికుందేందుసంకాశాః సంఖ్యయాష్టౌ మహాబలాః, పఠంతి చతురో
వేదాన్సాంగోపనిషదః ఖగ. ౨౪. కాషాయవాససః సర్వే కరండాంబుజధారిణః, లలాట
ఫలకాద్ద్వౌ తు ద్వౌ చాన్యౌ వక్షసస్తథా. ౨౫. చరణాభ్యాం తథా ద్వౌ తు పాదాభ్యాం
ద్వౌ తథా ఖగ, అథ తే చ మహాత్మానః సర్వే ప్రణతకంధరాః. ౨౬. పితరం మన్య
మానా మామిదం వచనమబ్రువన్, తాతతాత మహాదేవ లోకనాథ జగత్పతే. ౨౭.
కిమర్థం భవతా సృష్టా వయం దేవస్య దేహతః, బ్రూహి సర్వం కరిష్యామ ఆదేశం
భవతోఽఖిలమ్. ౨౮. పితాస్మాకం భవాన్దేవో వయం పుత్రా న సంశయః, ఇత్యుక్తవంత
స్తే సర్వే మయోక్తా దేవసంభవాః. ౨౯. ప్రియవ్రతసుతో యోయమస్య వాక్యం
కరిష్యథ, స చాప్యుక్తో మయా రాజా శాకద్వీపాధిపః ఖగ. ౩౦. య ఏతే మత్సుతా
రాజన్నష్టౌ బ్రాహ్మణసత్తమాః, కారయంతు ప్రతిష్ఠాం మే సర్వైరేభిర్మహీపతే. ౩౧.
కారయిత్వా ప్రతిష్ఠాం తు మమార్చాయాం నరాధిప, పశ్చాదాయతనం సర్వమేషా
మర్పయ పూజనే. ౩౨. ఏతే మత్పూజనే యోగ్యాః ప్రతిష్ఠాసు చ సర్వశః, సమాప్య
న ప్రహర్తవ్యం భోజకేభ్యః కదాచన. ౩౩. సర్వమాయతనార్థం తు గృహక్షేత్రాదికం

నిచ్చి తిరిగి యపహరింపఁగూడదు. నాదేవాలయమునకు సంబంధించిన ధనధాన్యాదికమును, గృహక్షేత్రాదికమును, సువర్ణాదికమును మఱియు నాసంబంధమగు నేవస్తువైనా నగరమందుఁగాని గ్రామమునందుఁగాని యున్నను గ్రహించుటకు సర్వవిధముల భోజకులె యర్హులై యున్నారు. ఇంతయేకాని బ్రాహ్మణు లెంతమాత్రమును నర్హులు గారు. తండ్రిచే సంపాదింపఁబడిన ద్రవ్యమునకుఁ బుత్రుఁడు భోక్తగా నెట్లగు చున్నాఁడో యట్లె నాసంబంధమైన సమస్తధనమునకు నాయనుకూలులైన భోజకులే యర్హులగుచున్నారు. అని నాచేఁ జెప్పఁబడినవాఁడై రాజు నేను జెప్పినప్రకారము ప్రతిష్ఠావిధిని నెఱవేర్చి నాసంబంధమైన యావద్ద్రవ్యమును భోజకులకు సమర్పించి గొప్పదైన యానందమును బొందెను. కాన నో వైనతేయా! యీప్రకారముగా భోజకులు నాచే సృష్టింపఁబడిరి. ఆకారణముచే నేను వారలకు మూలపురుషుఁడను విద్వాంసులగు వీరు నాపుత్రులతో సమానులుగాన నెల్లప్పుడు నాకు హితులనుగాఁ దెలిసికొనవలయును. కాన వారల కెప్పుడు నియ్యవల యునేగాని యెుకప్పుడును వారినుండి హరింపఁగూడదు. లోభముచేఁ గాని ద్వేషముచేఁగాని భోజకునిద్రవ్యము నపహరించినచో వాఁడు ఘోరతామిస్రమనునరకమును శాశ్వతముగా ననుభవించును. కాన

---

చ యత్, ధనధాన్యాదికం రాజన్యన్మమాయతనే భవేత్. ౩౪. తత్సర్వం భోజకేభ్యస్తు దాతవ్యం నాత్ర సంశయః, ధనధాన్యసువర్ణాది గృహక్షేత్రాదికం చ యత్, యన్మదీయం భవేత్కించిద్గ్రామే వా నగరే క్వచిత్. ౩౫. తస్య సర్వస్య రాజేంద్ర మది యస్య సమంతతః, అధిపా భోజకాః సర్వే నాన్యే విప్రాదయో నృప. ౩౬. యథాధికారీ పుత్రస్తు పితృద్రవ్యస్య వై భవేత్, తథా మదీయవిత్తస్య భోజకాః స్యుర్న సంశయః. ౩౭. ఇత్యుక్తేన మయా రాజ్ఞా తథా సర్వం ప్రవర్తితం, కారయిత్వా ప్రతిష్ఠాం తు దత్త్వా సర్వస్వమేవ హి,భోజకేభ్యః ఖగశ్రేష్ఠ తతో హర్షమవాప్తవాన్ ౩౮. ఏవమేతే మయా సృష్టా భోజకా గరుడాగ్రజ, అహమాత్మా తతో హ్యేషాం సర్వే సుమనసస్తథా. ౩౯. మత్పుత్రేణ సమా జ్ఞేయాస్తథా మమ హితాః సదా, తస్మాత్తేభ్యః ప్రదాతవ్యం న హర్తవ్యం కదాచన. ౪౦. భోజకస్య హరేద్యస్తు లోభాద్ద్వేషా త్తథాపి వా, స యాతి నరకం ఘోరం తామిస్రం శాశ్వతీః సమాః. ౪౧. తస్మా

గ్రామము మొదలగు నా ద్రవ్య మేకొంచెమైనను దండ్రిచే సంపాదింపఁ బడిన ద్రవ్యమువలె భోజకుని చేతనే గ్రహింపఁబడవలెను ఓఖగేంద్రా! భోజకునివిషయమై యితరులు చేయఁదగిన యాచారమును జెప్పితిని. ఇఁకను భోజకుఁ డెట్లుండవలయునోఁ జెప్పెద నాకర్ణింపుము. స్వకర్మాను ష్ఠానపరుఁడై వేదాధ్యయనము దారసంగ్రహము అభ్యంగనము త్రిష వణము నాయాజ్ఞానుసారముగఁ జేయుచుండవలయును. ఈభోజకుఁడు రాత్రింబవళ్లైదుపర్యాయములు నన్ను పూజింపవలయును దేవబ్రాహ్మ ణుల నెప్పుడును నెచ్చటను నిందింపఁగూడదు. ఇతరదేవతలయొక్క ప్రతిష్ఠను జేయఁగూడదు. ఏకాకియై నాయొక్క ప్రతిష్ఠను గూడఁ జేయఁగూడదు. నాకు నివేదనచేసిన యన్నమునంతను భోజకుఁ డొక్కఁడె భుజింపఁగూడదు. శూద్రునియింటికిఁ బోయి భుజింపఁగూడదు. ఈభోజకులు శూద్రభుక్తశేషమును ప్రయత్నపూర్వకముగాఁ బరిత్య జింపవలయును. ఓఖేచరా! యేభోజకులు నిత్యమును శూద్రాన్నమును శూద్రగృహమునందు భుజింతురో వారు నాయొక్క పూజాఫలము నొందఁజాలరు. కాన శూద్రునియింటికేగి యెన్నఁడును భుజింపఁగూడదు శూద్రాన్నము స్వగృహమునకు వచ్చినను దానినిఁ బరిత్యజింపవలయునే గాని యనుభవింపఁగూడదు. భోజకుఁడు నిత్యమును నాయెదుట

---

గ్రామాదికం ద్రవ్యం యత్కించిన్మమ విద్యతే, తత్సర్వం భోజకస్వం హి పితృపర్యా గతం మమ. ౪౨. భోజకశ్చ భవేద్యాదృక్తత్తే వచ్మి ఖగేశ్వర, మమాజ్ఞాం పాలయే ద్యస్తు స్వానుష్ఠానపరః సదా. ౪౩. వేదాధిగమనం పూర్వం దారసంగ్రహణం తథా, అభ్యంగధారణం నిత్యం తథా త్రిషవణం స్మృతమ్. ౪౪. పంచకృత్వః సదా పూజ్యో హ్యహం రాత్రౌ దినే తథా, దేవబ్రాహ్మణవేదానాం నిందా కార్యా న వై క్వచిత్. ౪౫. నాన్యదేవప్రతిష్ఠా తు కార్యా వై భోజకేన తు, మమాపి చ న కర్తవ్యా తేన ఏకాకినా క్వచిత్. ౪౬. సర్వమేవ నివేద్యాన్నం నాశ్నీయాద్భోజకః సదా, న భుంజీత గృహం గత్వా శూద్రస్య గరుడాగ్రజ. ౪౭. శూద్రోచ్ఛిష్టం ప్రయత్నేన సదా త్యాజ్యం హి భోజకైః, యేఽశ్నంతి భోజకా నిత్యం శూద్రాన్నం శూద్రవేశ్మని. ౪౮. తే వై పూజాఫలం చాత్ర కథం ప్రాప్స్యంతి ఖేచర, గత్వా గృహం తు శూద్రస్య న భోక్తవ్యం కదాచన. ౪౯. గృహాగతం చ శూద్రాన్నం తచ్చ త్యాజ్యం తథైవ చ, అఘ్రాతవ్యోమ్బుజో నిత్యం భోజకేనాగ్రతో మమ. ౫౦. సకృత్ప్రివాదితే శంఖే మమ

శంఖధ్వనినిఁ జేసినయెడల నాకు సంతోషము గలుగును అట్లాలుమాస ములుచేసిన నిస్సంశయముగాఁ గల్గును. పురాణశ్రవణము గూడ నాకు నట్లే ప్రీతిని గలుగఁజేయును. కాన భోజకుఁడు నిత్యమును శంఖధ్వని చేయుటయందు శ్రద్ధధానుఁడై యుండవలయును. నాయొక్క భుక్తశేషమే వారికి జీవనము గనుక భోజకులనియు, అభక్ష్యభక్షణము జేయరు గాన భోజకులనియుఁ జెప్పఁబడిరి. ఓవైనతేయా! ఇతరులకు భుజింపఁదగని నాకు నివేదింపఁబడిన యన్నమును నిత్యము భుజించుటయె వీరివృత్తిగాన వీరికి భోజకులను నామము సార్థకమయ్యెను. మగమును ధ్యానించుటచే మగధులనియు నన్ను భుజింపఁజేయుటచే భోజకులనియుఁ జెప్పఁబడిరి. భోజకుఁడు ప్రతిదినమును ప్రయత్నపూర్వకముగా శుద్ధి కరమగు నభ్యంగమును జేసికొనవలయును అట్లు చేయనిభోజకుఁడు నిస్సందేహముగా నశుచి యగును. ఏభోజకుఁ డభ్యంగస్నానముఁ జేయక నన్ను పూజించునో వాఁడు సంతానవిహీనుఁ డగును. అదియునుంగాక వానియందు నాకుఁ బ్రేమ గూడ నశించును. శిరస్సున శిఖ నుంచుకొని వపనము చేయించుకొనవలయును ఓవైనతేయా!ఆదివారమునాఁటిరాత్రి యందును షష్ఠిరోజునను నాయొక్క సంక్రమణములయందును నాప్రీతి కొఱకు విధిగా నుపవసింపవలయును. త్రిసంధ్యలయందును నాయెదుట గాయత్రీమంత్రముఁ జపింపవలయును. మౌనమునువహించి క్రోధమును

---

ప్రీతిర్హి జాయతే, షణ్మాసాన్నాత్ర సందేహః పురాణశ్రవణం తథా. ౧౧. తస్మా చ్ఛంఖః సదా వాద్యో భోజకేన ప్రయత్నతః, తస్యేయం పరమా వృత్తిర్నైవేద్యం యన్మదీయకమ్. ౧౨. నాభోజ్యం భుంజతే యస్మాత్తేనైతే భోజకా మతాః, మగం ధ్యాయంతి తే యస్మాత్తేన తే మగధాః స్మృతాః. ౧౩. భోజయంతి చ మాం నిత్యం తేన తే భోజకాః స్మృతాః, అభ్యంగం చ ప్రయత్నేన ధార్యం శుద్ధికరం పరమ్. ౧౪. అభ్యంగహీనో హ్యశుచిర్భోజకః స్యాన్న సంశయః, యస్తు మాం పూజయేద్వీర అభ్యం గేన వినా ఖగ. ౧౫. న తస్య సంతతిః స్యాద్వై న చాహం ప్రీతిమాన్భవే, ముణ్డనం శిరసా కార్యం శిఖా ధార్యా ప్రయత్నతః. ౧౬. నక్తం చాదిత్యదివసే తథా షష్ఠ్యాం ప్రవర్తయేత్, సప్తమ్యాముపవాసస్తు మమ సంక్రమణే తథా. ౧౭. కర్తవ్యో భోజకే నైవ మత్ప్రీత్యై గరుడాగ్రజ, త్రికాలం చాపి గాయత్రీం జపేద్వాచా పురో మమ. ౧౮. ముఖమావృత్య యత్నేన పూజనీయోఽహమాదరాత్, మౌనం చాస్య ప్రయ

వదలి నోరుమూసికొని యత్యాదరముతో నన్ను పూజింపవలయును. ఓవైనతేయా! భోజకుఁడు లోభమువలనఁగాని మోహమువలనఁగాని శూద్రులకొఱకుఁగాని వైశ్యులకొఱకుఁగాని నాయొక్క నిర్మాల్యము నిచ్చునో వాఁడు నిశ్చయముగ నరకమును బొందును. ఓవైనతేయా! యేభోజకుఁడు నాకొఱకై తేఁబడిన పుష్పములను నాకర్పింపక లోభము చేత నితరుల కర్పించునో వాఁడు నాకు గొప్పశత్రువును నాయొక్క పూజ కనర్హుఁడు నగుచున్నాఁడు. నాయొక్క నిర్మాల్యమును బ్రాహ్మణాదిమనుష్యులలో నీయవలయును. నాసంబంధమైన నైవేద్యాన్నము నెప్పుడును భుజించుచుండవలయును. హోమాన్నముతో సమానమగు నీయన్నమును భుజించి పరిశుద్ధుఁ డగును. నాశరీరమునం దుంచఁబడిన పుష్పములను తత్క్షణమే తీసినయెడల నితరుల కిడక నాభుక్తశేషమును జలమునందుఁ బారవేయవలయును. ఈద్రవ్యముల రెంటిని వాఁడు నిస్సంశయముగా పంచగవ్యములతో సమానముగా చూచుకొనవలయును. ఓవైనతేయా! నాశరీరలగ్నమగు గంధమునుగాని పుష్పమునుగాని వైశ్య శూద్రుల కొసగఁగూడదు. భోజకుఁడే గ్రహించి స్వయముగ నుపయోగించుకొనవలయును. లోభావిష్టుఁడై విక్రయింపఁగూడదు. లోకములో నెవరైనను నాకొఱ కర్పింపఁబడిన పుష్పములను నాకలంకరింపక హరించునో వాఁడు నిశ్చయముగా నరకమును బొందును. నాస్నానద్రవ్యము

---

త్నేన త్యక్త్వా క్రోధం చ దూరతః. ౧౯. శూద్రేభ్యో యస్తు వైశ్యేభ్యో లోభాత్కామాత్ప్రయచ్ఛతి, నిర్మాల్యం మమ వై వత్స స యాతి నరకం ధ్రువమ్. ౨౦. లోభాద్వై భోజకో యస్తు మత్పుష్పాణి ఖగాధిప, యచ్ఛతేఽన్యస్య దుష్టాత్మా మయ్యనారోప్య ఖేచర. ౨౧. స జ్ఞేయో మే పరః శత్రుః స మామర్హో న చార్చితుం,నిర్మాల్యం మమ దేయం స్యాద్బ్రాహ్మణాదిషు వై నృషు. ౨౨. నైవేద్యం యన్మదీయం తు తదశ్నీయాత్సదైవ హి, తేనాసౌ శుద్ధ్యతే నిత్యం హావిష్యాన్నసమం తథా. ౨౩. తత్క్షణాదుత్క్షిపేద్యస్తు మమాంగాత్పుష్పమేవ హి, నాన్యస్య దేయం నైవేద్యం మదీయముదకే క్షిపేత్. ౨౪. పంచగవ్యసమం తస్య మన్మతం నాత్ర సంశయః, మమాంగలగ్నం యత్కించిద్గంధం పుష్పమథాపి వా. ౨౫. దాతవ్యం న చ వైశ్యాయ న శూద్రాయ కదాచన, ఆత్మనా తద్గ్రహీతవ్యం న విక్రేయం కథంచన. ౨౬. యస్తు నారోప్య పుష్పాణి అవ్యంగాని మమోపరి, యః కశ్చిదాహరేల్లోకే స యాతి నరకం ధ్రువమ్.

లను నాయొక్కనిర్మాల్యమును అగ్నిహోత్రమును లంఘించినయెడల ధృవముగా భయంకరమగు నరకమును బొందును. భోజకుఁడు నిత్యము నాకు స్నపనముఁ జేయవలయును ఆస్నపనమునితరులు దాటకుండఁగను కుక్కలు పిల్లులు మొదలగునవి భక్షింపకుండఁగను చేయవలయును. ఏభోజకుఁడైనను నాకొఱకుఁ జేయఁబడిన స్నానీయద్రవ్యము నశ్రద్ధతోఁ జూచినను భక్షించినను వాఁడు తామిస్రమనుఘోరమగునరకము ననుభవించును. భోజకుఁడెల్లప్పుడును ఏకభుక్తమును త్రికాలస్నానమును జేయుచు మూఁడువస్త్రములను ధరింపవలయును. పూజానైవేద్యకాలములయందుఁ గ్రోధమును విడచి శాంతస్వరూపుఁడై యుండవలయును. ఆపూజాసమయమునం దమంగళవాక్యములఁ బలుకఁగూడదు. శుభములనేఁ బల్కుచుండవలయును. ఈరీతి నిర్వర్తించుచు భోజకుఁడు పూజాకరుఁడైనచో నాకెల్లప్పుడును బ్రేమాస్పదుండగును కాన విప్రాదిచాతుర్వర్ణ్యమునకు నేనెట్లు పూజనీయుఁడనో యీభోజకుఁడును నట్లే పూజనీయుఁడగును. ఎవఁడైనను భోజకునివిషయమై క్రియారూపమైన నవమానమును జేయునో వానియందుఁ గోపించినవాఁడనై శీఘ్రకాలములో వాని కుటుంబమునంతను నశింపఁజేసెదను కాన నో వైనతేయా! భోజకుఁడు నీవలెనే నాకుఁ బ్రియుఁడు అలుకుటయు నూడ్చుటయు మొదలగు కృత్యములఁ జేయువారును నీవలెనే ప్రియతములు పరావసు విట్లనియె.

---

౧౭. స్నపనం మమ నిర్మాల్యం పావకం యస్తు లంఘయేత్, స నరో నరకం యాతి సరౌద్రం రౌరవం ఖగ. ౧౮. భోజకేన సదా కార్యం స్నపనం మే ప్రయత్నతః, యథా న లంఘయేత్కశ్చిద్యథా శ్వా నాపి భక్షయేత్. ౧౯. యస్త్వయత్నపరః కుర్యాద్భోజకః స్నపనం మమ, యథా వై లంఘితమతిర్భక్ష్యతాం చ ఖగాధిప. ౨౦. స యాతి నరకం రౌద్రం తామిస్రం నామ నామతః, ఏకభక్తం సదా కార్యం స్నానం త్రైకాలమేవ హి. ౨౧. త్రిచైలం పరివర్తేత భవితవ్యం దినేదినే, పూజాకాలేఽర్ఘ్యకాలే చ క్రోధస్త్యాజ్యః ప్రయత్నతః. ౨౨. అమాంగల్యం న వక్తవ్యం వక్తవ్యం చ శుభం తదా, ఈదృగ్భూతో భోజకో మే ప్రేయాన్ పూజాకరః సదా. ౨౩. సన్మాన్యః పూజనీయశ్చ విప్రాదీనాం యథాస్మ్యహం, యః కరోత్యవమానం తు వృత్తిరూపం తు భోజకే. ౨౪. తస్యాహం రోషమేత్యాశు కులం హన్మి సమంతతః, ప్రియో మే భోజకో నిత్యం యథా త్వం వినతాసుత. ౨౫. ఉపలేపనకర్తా చ సంమార్జనపరశ్చ

ఓసత్రాజితమహారాజా! భగవంతుఁడగు సూర్యుఁ డిట్లు చెప్పినవాఁడై తనరథము నధిష్ఠించి ప్రయాణముఁజేసెను సూర్యోక్తవాక్యములను విని అరుణుఁడు మిక్కిలి సంతుష్టుఁడయ్యెను. కాన నోమహారాజా! వాచకుని కంటె భోజకుఁడె మిక్కిలి పూజ్యుఁడు. ఆకారణముచే వాచకునకు ద్వితీయభోజనము నీయవలయును. బ్రహ్మదేవుం డిట్లనియె. ఇట్లు సత్రాజితమహారాజు పరావసుచేఁ జెప్పఁబడి తనపూర్వజన్మకృతమగు వ్రత ఫలమును దెలిసికొని గొప్పసంతోషమును బొందెను. ఆరాజు భూలోకమున నేయే స్థలములయందు సూర్యదేవాలయమును జూచునో ఆ ప్రదేశమందంతటను ఉపలేపనసమ్మార్జనాది కృత్యములను ఆదరముతోఁ జేయుచుండెను. ఆతనిభార్యయగు విమలావతియు నొకవాచకునికి వేతన మిచ్చి సూర్యదేవాలయమున నిత్యమును పుణ్యకథాశ్రవణముఁ జేయు చుండెను. ఇట్లు సత్రాజితమహారాజు భార్యతోఁగూడ సూర్యారాధనఁజేసి సంతుష్టుఁడై పరమున నుత్కృష్టగతినిఁ బొందెను.

ఇది సప్తదశోత్తరశతతమాధ్యాయము.



---

యః, పరావసురువాచ.—ఇత్యుక్త్వా భగవాన్భానుర్బభ్రామ రథమాస్థితః. ౭౮. అరుణోఽపి తథా శ్రుత్వా ముదయా పరయా నృప, పూజ్యస్తస్మాన్మహారాజ భోజకస్తు మహీపతే. ౭౭. తస్మాద్దేయం వాచకాయ ద్వితీయమశనం నరైః. ౭౮. బ్రహ్మోవాచ.—ఇత్థం శ్రుత్వా స రాజా తు కర్మణః ఫలమాత్మనః, పురాతనం మహాబాహుర్ముదమాప మహీపతిః, ౭౯. యద్యదాయతనం భానోః పృథివ్యాం పశ్యతే నృపః, తస్మింస్తస్మిన్కారయతి ఉపలేపనమాదరాత్. ౮౦. భార్యా తస్యాపి సుశ్రోణిః పుణ్యాశ్రవణమాదరాత్, వాచకే వేతనం దత్వా భానోర్దేవస్య మందిరే. ౮౧. ఇత్థం రాజా సపత్నీకః పూజ్య భక్త్యా దివాకరమ్, ప్రాప్తావుభౌ పరాం ప్రీతిం గతిం చానుత్తమాం తథా. ౮౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఉపలేపనస్నాపనమాహాత్మ్యవర్ణనం నామ సప్తదశోత్తరశతతమోఽధ్యాయః.



## అష్టాదశోత్తరశతతమాధ్యాయము.

బ్రహ్మదేవుం డిట్లనియె. ఏమనుష్యుండు సూర్యదేవాలయమునఁ దీపమును వెలిఁగించుచుండునో యాతఁడు సూర్యునితో సమానమైన తేజముఁగలవాఁడై సర్వయజ్ఞఫలమును బొందును. కార్తికమాసము నందు దీపదానమును జేసిన నితరాలభ్యమగుఫలమును బొందును. ఓకృష్ణా! మహాత్ముఁడగు భద్రుఁడను బ్రాహ్మణోత్తమున కనుజస్సులతో నడచిన పాపనాశకమగు సంవాదమును జెప్పెద నాకర్ణింపుము. ఈ లోకమునందు పూర్వకాలమున రమ్యమగు మాహిష్మతి యనుపట్టణము గలదు. ఆపట్టణమునందు నాగశర్మ యను ప్రసిద్ధుఁడగు బ్రాహ్మణుఁ డుండెను. ఆబ్రాహ్మణునకు భాస్కరానుగ్రహమున నూర్వురు పుత్రు లుదయించిరి. ఆబ్రాహ్మణపుత్రులలోఁ గనిష్ఠుఁడైన భద్రుఁడు విద్వాంసుఁ డై యుండెను. ఆభద్రుఁడు నిత్యమును జగత్ప్రకాశకుఁడును దేవ దేవుఁడు నగు సూర్యునకు దీపములను బెట్టుటకు వత్తులఁ జేయుట యందును తైలాహరణమునందును ప్రయత్నముఁ జేయుచున్నవాఁడై సూర్యదేవాలయమునం దహోరాత్రములు వేయిదీపములను వెలిఁగించు చుండెను. ఆకారణముచేత నాభద్రునికిఁ గాంతి యధికమయ్యెను. అట్టి భద్రునిఁ జూచి సోదరులందఱు సత్యాదరముతో ఓభద్రా! సోదరుఁడా! నీకెల్లప్పుడును భద్రంబగుఁగాక. మేము కుతూహలము గలవారమై

---

బ్రహ్మోవాచ:—దీపం ప్రయచ్ఛతి నరో భానోరాయతనే తు యః, తేజసా రవిసంకాశః సర్వయజ్ఞఫలం లభేత్. ౧. కార్తికే తు విశేషేణ కౌమారే మాసి దీప కమ్, దత్వా ఫలమవాప్నోతి యదన్యేన న లభ్యతే. ౨. కృష్ణకృష్ణాత్ర తే వచ్మి సంవాదం పాపనాశనమ్, భ్రాతృభిః సహ భద్రస్య బ్రాహ్మణస్య మహాత్మనః. 3. జగ త్యస్మిన్పురీ రమ్యా నామ్నా మాహిష్మతీ పురా, తస్యామాసీద్ద్విజః కృష్ణ నాగశర్మేతి విశ్రుతః. ౪. తస్య పుత్రశతం జాతం ప్రసాదాద్భాస్కరస్య చ, తేషాం కనిష్ఠో భద్రస్తు తత్పుత్రాణాం విచక్షణః. ౫. స చ నిత్యం జగద్ధాతుర్దేవదేవస్య భాస్వతః, దీపవర్తిపర స్తద్వత్తైలాద్యాహరణోద్యతః. ౬. భానోరాయతనే తస్య సహస్రం భార్గవీప్రియ, ప్రదీపానాం తు జజ్వాల దివారాత్రమనిందితమ్. ౭. తస్య దీప్త్యా పరాభూతా స్తస్య లావణ్యధర్షితాః, సర్వేతే భ్రాతరో భద్రం పప్రచ్ఛురిదమాదరాత్. ౮. భో భద్ర వద వై భ్రాతర్భద్రంతేస్తు సదా ద్విజ, కౌతూహలపరాః సర్వే యత్పృచ్ఛామ స్తదుచ్యతామ్.

నిన్నొకదాని నడిగెదము దానిని మాకు నిశ్శేషముగఁ జెప్పవలయునని పల్కిరి. తరువాత భద్రుఁడు వారలవాక్యములను విని విషయమున్న యెడల చెప్పనేవలయును. నేను మాత్సర్యముగలవాఁడను గాను, రాగ దూషితుఁడను గాను. మీరందఱు నాకు సోదరులును గురువులు నై యు న్నారు. పుత్రసముఁడనగు నేను కష్టమైనదైనను నావిషయమును తప్పక చెప్పెదను. కాన మీరునన్నడుగఁదలచిన విషయమును వెంటనే జెప్ప వేఁడె దనని పల్కెను ఆవాక్యములను విని సోదరులిట్లని పల్కిరి. ఓభద్రుఁడా! నీవు దివారాత్రములు సూర్యదేవాలయమునందు దీపములను వెలిఁగించు టయం దెట్టియాసక్తిగలదో ఆరీతిగ పుష్పధూపములయందును బ్రాహ్మణ పూజనమునందును నట్టిప్రయత్న మగుపడుటలేదు. ఇంతకంటె దీపదాన మునం దధికప్రయత్నములను నీయెడఁ జూచుచున్నాముగాన నీ దీపదాన మున కెట్టిఫలమును గ్రహించితివో దానిని దెలిసికొనఁ గుతూహల మధిక మగుచున్నదిగాన దానిని సవిశేషముగా చెప్పవలయునని చెప్పిరి. భద్రుఁ డిట్లు సోదరప్రేరితుఁడై దయగలవాఁడై సమస్తమును నిరవశేషముగాఁ జెప్పెను. ఓయన్నలారా! మీకిట్టి యల్పవిషయమునఁ గోర్కె జనించెగాన నావ్రతమును మీ కుపదేశించెదను. వినుఁడు. పూర్వకాలము నిక్ష్వాకు

౯. తేషాంతద్వచనం శ్రుత్వా భద్రో వచనమబ్రవీత్, విషయే సతి వక్తవ్యం యన్మయా తదిహోచ్యతామ్. ౧౦. నాహం మత్సరయుక్తో వై న చ రాగాదిదూషితః, భవంతో మమ సర్వే వై భ్రాతరో గురవస్తథా. ౧౧. కథం న కథయామ్యేష భవతాం పుత్ర సమ్మితః, తస్మాచ్ఛృణ్వంతు మాం సర్వే భ్రాతరో యద్వివక్షితమ్. ౧౨. భ్రాతర ఊచుః.— న తథా పుష్పధూపేషు న తథా ద్విజపూజనే, సుప్రయత్నం తు పశ్యామో భానో రాయతనే పరమ్. ౧౩. యథాహాని తథా రాత్రౌ యథా రాత్రౌ తథాహాని, తవ దీప ప్రదానాయ యథా భద్ర సదోద్యమమ్. ౧౪. తత్త్వం తత్కథయాస్మాకం హంత కౌతూహలం పరమ్, యన్నామ దీపదానస్య భవతా విదితం ఫలమ్. ౧౫. తదేతత్కథయా స్మాకం సవిశేషం మహాబల, ఏవముక్తస్తతస్తైస్తు భ్రాతృభిశ్చోదితో ముదా. ౧౬. వ్యాజహార స భ్రాతౄణాం న కించిదపి సువ్రత, పునః పునరసౌ తైస్తు భ్రాతృభిశ్చోదితో ముదా. ౧౭. దాక్షిణ్యాసారో భద్రస్తు కథయామాస కృత్స్నశః, భవతాం కౌతుకం చైతదతీ వాల్పేఽపి వస్తుని. ౧౮. తదేష కథయామ్యద్య యద్వ్రతం మమ సువ్రత, ఇక్ష్వాకురాజ్ఞస్తు

మహారాజునకు వశిష్ఠమహర్షి పురోహితుఁడై యుండెను. ఆవశిష్ఠమహర్షి సరయూనదీతీరమున సూర్యదేవాలయమును నిర్మించెను. ప్రతిదినము నందును పుష్పధూపగంధాదులచేతను, దీపదానముచేతను వాసూర్య దేవునకు శుశ్రూషజేయుచుండెను. ఒకనాఁడాద్విజుఁడు కార్తికమాసము నందు సూర్యదేవునియొక్క యర్చావిగ్రహమున కెదుట భక్తిపూర్వక ముగా దీపము నుంచెను. ఆదీపము చల్లారినదాయెను. ఆసమయమునం దాదేవాలయమున వ్యాధిచేఁ బీడితుఁడనై నెత్తురు నోడ్చుచు తొఱ్ఱి ముక్కుగలవాఁడనై గుఱ్ఱుపుధ్వనిచేయుచు దుర్గంధమునఁ బడి సూర్య దేవునందు దుర్బుద్ధికలవాఁడనై లోకులు సూర్యదేవునికొఱకు తెచ్చి యిచ్చిన దీపవర్తికాదులను పుష్పగంధమాల్యాదుల ననుభవించి సంతు ష్టుఁడ నగుచుంటిని. ఓబ్రాహ్మణోత్తములారా! ఒకనాఁటిరాత్రి నేను సూర్యదేవాలయమునకుఁ బోయియుంటిని. అచ్చట జాగరణమునకై వచ్చిన కొంతమంది భక్తులఁ జూచి సానునయముగాఁబ్రార్థించి దయార్ద్రాంతరంగు లగువారి యనుగ్రహముఁ బడసి యచ్చటనుంటిని. ఈతఁడు వ్యాధి గ్రస్తుఁడగుటచేతనే దీనుఁడై యున్నాఁడని తలఁచి సద్బుద్ధిగలవారై స్థాన మొసంగిరి. తరువాత నేనగ్నిహోత్రము చెంత వారలసమీపమునందుఁ గూర్చుండి దుర్బుద్ధిగలవాఁడనై సూర్యదేవుని దివ్యాభరణమును హరించు

---

పురా వసిష్ఠోఽభూత్పురోహితః. ౧౯. తేన చాయతనం భానోః కారితం సరయూతటే, అహన్యహని శుశ్రూషాం పుష్పధూపానులేపనైః. ౨౦. దీపదానాదిభిశ్చైవ చక్రే తత్ర స వై ద్విజః, కార్తికే దీపకో భక్త్యా ప్రదత్తస్తేన వై సదా. ౨౧. ఆసీన్నిర్వాణ ఏవాసౌ దేవార్చాపురతో నిశి, దేవతాయతనే చాహమవసం వ్యథితో భృశమ్. ౨౨. పూయశోణితనిష్యందం ప్రావహన్కాయతః సదా, శీర్ణఘ్రాణో వ్యార్వరవో దుర్గంధపతి తస్తథా. ౨౩. దుష్టబుద్ధ్యా సదా యుక్తః సప్తాశ్వం ప్రతి సువ్రత, యదృచ్ఛయా దీపదానం వర్త్యాదీనాం విభావసౌ. ౨౪. తత్తద్భుక్త్వా సదా తుష్టిం వ్రజామి ద్విజ సత్తమాః, ఏకదా తు తత స్తస్మిన్భానోరాయతనే గతః. ౨౫. రాత్రౌ దృష్టా మయా తత్ర భక్తా జాగరణాగతాః, ప్రతిశ్రయం ప్రార్థితాశ్చ తైశ్చ దత్తో దయాన్వితైః. ౨౬. వ్యాధితోఽయం సుదీనశ్చ ఇతి కృత్వా మతిం శుభామ్, తతోఽహమగ్ని మాశ్రిత్య స్థిత స్తేషాం సమీపతః. ౨౭. దుష్టాం బుద్ధిం సమాశ్రిత్య హర్తుకామో విభ వస్వతః, దివ్యమాభరణం భానోశ్ఛిద్రాన్వేషీ ద్విజోత్తమాః. ౨౮. స్థితోఽహం భోజకా

టకు సమయము నన్వేషించుచుంటిని. భోజకులు నిద్రించినయెడల నీదివ్యా భరణమును హరింపవచ్చునని యాలోచించుచుంటిని. ఇట్లుండఁగాఁ గొంత సేపటికి భోజకులు నిద్రించిరి. దీపములు తైలశోషముచేఁ జల్లారినవి. అప్పుడు నేనతిశీఘ్రముగా ముదమందుచు లేచి యగ్నిహోత్రుని జ్వాలగాఁజేసి దీపమును వెలిఁగించుకొని సూర్యదేవునియెదుట నాభర ణామునుహరించుట కుద్యుక్తుఁడనై నిలచితిని. ఇంతలో సూర్యపుత్రులగు భోజకులు మేల్కాంచి అర్చావిగ్రహమున కెదురుగా దీపమును ధరించి యున్న నన్నుఁ జూచి పట్టుకొనిరి. తరువాత నేను భాస్కరతేజస్సుచేత మూఢుఁడనై యతిదీనముగా నేడ్చుచు వారలయొక్క పాదములందుఁ బడితిని. ఆభోజకులు నాయందు దయఁదలఁచినవారై నన్ను విడచివైచిరి తరువాత రాజభటులు వచ్చి నన్ను పట్టుకొని 'ఓరి దుర్మార్గుఁడా! దేవదేవుఁ డైన సూర్యునియొక్కయాలయమున దీపమును వెలిఁగించి నీవేమిచేసితివి? దానినంతము సవిస్తరముగా చెప్పుము. అని శస్త్రపాణులై నన్ను జుట్టు ముట్టిరి. తరువాత నోబ్రాహ్మణోత్తములారా! నేను వ్యాధిగ్రస్తుఁడ నగుట చేతను భీతుఁడనగుటచేతను ప్రాణములను విడచి సాక్షాత్సూర్యనివాసం బగు లోకమున కేగియుంటిని. అచ్చట ఒకకల్పమువఱకు నుండి తరువాత

---

వ్యాత్ర యది నిద్రాం ప్రజంతి తే, యేనాస్య వైరివద్భానోర్హ రామ్యాభరణం శుభమ్. ౨౯. అథ సుప్తా భోజకాస్తే నిద్రయా మోహితాస్తదా, నిర్వాణాశ్చాపి దీపాస్తు తతోఽహముత్థితస్త్వరన్. ౩౦. ముదా పరమయా యుక్తో గతో వైశ్వానరం ప్రతి, ప్రజ్వాల్య పావకం యత్నాద్దీపవర్తిం తతో మయా. ౩౧. యోజయిత్వా తు వై దీపే ధృతో దీపోఽగ్రతో రవేః, హర్తుకామేనాభరణం భానోర్దేవస్య సువ్రత. ౩౨. అథ తే భోజకాః సర్వే వృద్ధా దేవస్య పుత్రకాః, తైస్తు దృష్టో హ్యహం తత్ర దీపహస్తో విభావసోః. ౩౩. పురః స్థితో ద్విజశ్రేష్ఠా గృహీతశ్చాపి తైరిహ, తతోఽహం తేజసా మూఢో భాస్కరస్య మహాత్మనః. ౩౪. విలపన్కరుణం తేషాం పాదయోరవనిం గతః, తైశ్చాపి కరుణాం కృత్వా ముక్తోఽహం భోజకైస్తదా. ౩౫. గృహీతో రాజపురుషైః పృష్టశ్చాపి సమంతతః, కిమిదం భవతారబ్ధం దేవదేవస్య మందిరే. ౩౬. దీపం ప్రజ్వాల్య దుష్టాత్మన్కథ్యతాం మా చిరం కురు, ఇత్యుక్త్వా తు తతస్తైస్తు శస్త్రహస్తైః సమావృతః. ౩౭. తతోఽహం వ్యాధినా క్లిష్టో భయేన చ ద్విజోత్తమాః, హిత్వా ప్రాణాన్గతో యత్ర స్వయం దేవో విభావసుః. ౩౮. స్థిత్వా కల్పం తతస్తత్ర యుష్మాకం భావితాత్మనాం

ద్విజోత్తములగు మీకు భ్రాతృత్వమును బొందితిని. ఓసువ్రతులారా! కార్తీకమాసమున దీపదానముయొక్క ప్రభావ మిదియని తెలిసికొండు. సూర్యదేవాలయమున దీపమునుబెట్టిన కారణముచే నాకీప్రభావము లభించెను. నేను దుర్బుద్ధిచే దీపమును బెట్టినను సూర్యదేవాలయమునందుఁ జేసినదగుటచే నీఫలము ననుభవించు చుంటిని. ఆఁకలిచేఁ బీడితుండ నగు నేను దేవదేవుఁడగు సూర్యునియొక్కభూషణము నపహరింపఁదలఁచినని కోరికచే దీపదానముఁ జేయుటచే నాకుఁ బూర్వజన్మస్మృతియు బ్రాహ్మణ గృహమునందు జన్మమునులభించెను. ఈదీపదానముచేతఁ గుష్ఠరోగార్తుఁడ నగుశూద్రుఁడనైనను నుత్తమబ్రాహ్మణుండ నైతిని. నానావిధశాస్త్రములను సాంగములైనవేదములను జదివితిని. దుర్బుద్ధిచేఁ జేసినదీపదానమునకే యిట్టిఫలము ననుభవించుచుంటిని. అకృత్రిమమగుభక్తితో నెవ్వఁడు చేయునో వానివిషయమై యేమి చెప్పవలయును? నే నీఫలము నెఱిఁగిన వాఁడ నగుటచేత సూర్యదేవాలయమునందు దివారాత్రములు దీపదానమును జేయుచుంటిని. ఓసువ్రతులారా! మీయందలి స్నేహముచేత దీనినంతను జెప్పితిని. సందేహము లేదు. కార్తీకమాసమునందు దీపదానమునకు ఫల మిదియని తెలిసికొనుఁడు. సూర్యదేవాలయమునందు దీపమునకుఁ బూర్వమురీతిగ నీఫలమును భద్రుఁడు చెప్పెను. ఏమనుజుఁడు సమాహితమనస్కుఁడై సూర్యనామసంకీర్తనముఁ జేయుచు సూర్యదేవాలయ

గతః, ఏష ప్రభావో దీపస్య కార్తికే మాసి సువ్రతాః. ౩౯. దత్తస్యార్కస్య భవనే యస్యేయం వ్యుష్టిరుత్తమా, దుష్టబుద్ధ్యా కృతం యత్తు మయా దీపప్రవర్తనమ్. ౪౦. భగాయతనదీపస్య తస్యేదం భుజ్యతే ఫలం, క్షుధాభిభూతేన మయా దేవదేవస్య భూషణమ్. ౪౧. దీపశ్చ దేవపురతో జ్వాలితో భాస్కరస్య తు, తతో జాతిస్మృతిర్జన్మ ప్రాప్తం బ్రాహ్మణవేశ్మని. ౪౨. కుష్ఠినా చాపి శూద్రేణ ప్రాప్తం బ్రాహ్మణ్యముత్తమం, నానావిధాని శాస్త్రాణి సాంగం వేదం సమాప్తవాన్. ౪౩. దుష్టబుద్ధ్యా ధృతాద్దీపాత్ఫలమేతన్మహాద్భుతం, ప్రాప్తం మయా ద్విజశ్రేష్ఠాః కిం పునర్దీపదాయినామ్. ౪౪. ఏతస్మాత్కారణాద్దీపానహమేవమహర్నిశం. ప్రయచ్ఛామి రవేర్ధామ్ని జ్ఞాతమస్య హి యత్ఫలమ్. ౪౫. యుష్మాకమిదముక్తం వై స్నేహాత్సత్యం న సంశయః, ఏష ప్రభావో దీపస్య కార్తికే మాసి సువ్రతాః. ౪౬. అర్కాయతనదీపస్య భద్రోఽవోచద్యథా పురా, దినేదినే జపన్నామ భాస్కరస్య సమాహితః. ౪౭. దదాతి కార్తికే యస్తు భగాయత

ముఁదందుదీపము వెలిఁగించునో వానికిఁ బూర్వజన్మస్మృతియు బుద్ధిబలమును ప్రకాశమును సర్వేంద్రియములయందు వికారము లేకుండుటయు సంభవించును. మఱియు దీపదానముఁ జేయుమనుజుఁడు జీవించునంతకాలము నవ్యాహతమగు చక్షురింద్రియముకలవాఁడై గొప్పధీశాలి యగును. తమస్సంజ్ఞాకమగు నరకముంగూడఁ బొందఁడు. ప్రతిపక్షంబున షష్ఠిసప్తముల యందు మనుష్యుఁడు దీపదానముఁజేసిన నేఫలమునుబొందునో దానిం దెలుపుదు. వినుము ఓకృష్ణా! అట్లుచేసినయెడల సువర్ణవికారమును మణిగణయుక్తమును దీపమాలాలంకృతమునైన విమానము నధిష్ఠించును. ఆకారణముచే నెల్లపుడును సూర్యదేవాలయమందు దీపదానము చేయుచుండవలయును. ఆదీపములను వెలిఁగించి తైలశోషణశంకచే చల్లార్పఁగూడదు. తైలవియోజితములఁ జేయరాదు. అట్లు దీపముఁ జల్లార్చినవాఁడు అంధుఁడును మూషకమునై జన్మించును గాన సూర్యాలయమందలి దీపముంచవలయునేగాని యపహరింపఁగూడదు.

ఇది అష్టాదశోత్తరశతతమాధ్యాయము.

---

నదీపకం, జాతిస్మరత్వం ప్రజ్ఞాం చ ప్రాకాశ్యం సర్వజంతుషు. ౪౮. అవ్యాహతేంద్రియత్వం చ సమాప్నోతి న సంశయః, సర్వకాలం చ చక్షుష్మాన్మేధావీ దీపదో నరః. ౪౯. జాయతే నరకం చాపి తమఃసంజ్ఞం న పశ్యతి, షష్ఠీం వా సప్తమీం వాపి ప్రతిపక్షం చ యో నరః. ౫౦. దీపం దదాతి యత్నాద్యత్ఫలం తస్య నిబోధ మే, కాంచనం మణియుక్తం చ మనోజ్ఞమతిశోభనమ్. ౫౧. దీపమాలాకులం దివ్యం విమానమధిరోహతి, తస్మాదాయతనే భానోర్దీపాన్ దద్యాత్సదాచ్యుత. ౫౨. తాంశ్చ దత్త్వా న హింస్యాచ్చ న చ తైలవియోజితాన్, కుర్వీత దీపహర్తా తు మూషకోఽంధశ్చ జాయతే. ౫౩. తస్మాద్దద్యాన్నాహరేద్వై శ్రేయోఽర్థీ దీపకం నరః. ౫౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే భద్రోపాఖ్యాన ఆదిత్యాయతనదీపదానఫలవర్ణనం నామ అష్టాదశోత్తరశతతమోఽధ్యాయః.

## ఏకోనవింశోత్తరశతతమాధ్యాయము.

బ్రహ్మదేవుం డిట్లనియె. అంధతమసంబను పేరుగల నరకంబునందుఁ బడి క్షుబ్ధులై యేడ్చుచున్న ప్రాణులంజూచి యమకింకరులు ఓ ప్రాణులారా! మీ రేడ్పులం జాలింపుఁడు. ఏడ్చుటవలన నేమి ప్రయోజనము? ప్రమాదాదులచే మీయాత్మ సముపేక్షితమైనది! పూర్వ మాలోచించినట్లుగా పర్యవసానమం దెట్లు జరుగును? కాన నిప్పు డేడ్పులం జాలించి యాతన ననుభవింపుఁడు. దేహములకు దినములు స్వల్పము, విషయము లతిదుర్బలములు. వీటినన్నిటినిఁ దెలిసికొనియే మీరు ప్రమాదముం జెందితిరి. జంతువు వేయిజన్మల నొకప్పుడు మాత్రమే మనుష్యుఁడగును అప్పుడు గూడ నట్లే చేయుచుండిన నెట్లు సిద్ధుఁడగును? అట్లయ్యును మూఢాత్ముఁడై భోగములంగుఱించి యేల ప్రయత్నింపవలెను? పుత్త్రులు భార్య క్షేత్రము మొదలగువానియొక్క హితమునందే యుద్యుక్తులై కొంచెమైనను ఆత్మహితమును మూఢులై గుర్తెఱుంగఁజాలరు. నేను వంచితుఁడనైతిని. దీనిని నేనుఁబొందితినను నీవిషయములను పాపాభిముఖుఁడైన మనుష్యుఁడు తెలిసికొనఁజాలఁడు. సూర్యచంద్రాదులను కాలమును ఆత్మను శుభాశుభములకు సాక్షిభూతులనుగాఁ దెలియఁజాలరు ఈ ప్రాణులకుఁ బుత్త్రదారాదిరూపములైన అనేకజన్మములు లభించును దేనికొఱకు ఏ కర్మను జేయునో వాఁడు ఆకర్మానుభవమునకై జన్మశతమును బొందును.

---

బ్రహ్మోవాచ.—అంధే తమసి దుష్పారే నరకే పతితాన్కిల, సంక్రోశమానాన్సంక్షుబ్ధానువాచ యమకింకరః. ౧. విలాపైరలమత్రేతి కిం వో విలపితే ఫలమ్, యత్ప్రమాదాదిభిః పూర్వమాత్మాయం సముపేక్షితః. ౨. పూర్వమాలోచితం నైతత్కథమంతే భవిష్యతి, ఇదానీం యాతనాం భుఙ్ధ్వం కిం విలాపం కరిష్యథ. ౩. దేహో దినాని స్వల్పాని విషయాశ్చాతిదుర్బలాః, ఏతల్లోకో న విజానాతి యేన యూయం ప్రమాదినః. ౪. జంతుర్జన్మసహస్రేభ్య ఏకస్మిన్మానుషో యది, స తత్రాప్యతిమూఢాత్మా కిం భోగానభిధావతి. ౫. పుత్రదారగృహక్షేత్రహితాయ సతతోద్యతాః, న జానంతి తతో మూఢాః స్వల్పమప్యాత్మనో హితమ్. ౬. వంచితోఽహం మయా లబ్ధమిదమస్మాదుపాగతమ్, న వేత్తి మోహితః కశ్చిత్ప్రాక్రాంతనరకో నరః. ౭. న వేత్తి సూర్యచంద్రాదీన్కాలమాత్మానమేవ చ, సాక్షిభూతానశేషస్య శుభస్యేహాశుభస్య చ. ౮. జన్మాన్యన్యాని జాయంతే పుత్రదారాదిదేహినామ్, యదర్థం యత్కృతం కర్మ తస్య జన్మ

ఆ మోహము ఎట్టి నరకమునందుఁ బీడింపఁబడుచున్నను ఓయమ్మా! ఓయయ్యా! యనియెడు మమత్వమును విడువఁజాలరు. విషయాకృష్టచిత్తు లగువారికి పరమార్థబుద్ధి జనింపదు. ఎల్లపుడును విషయాసక్తియందే మనమును వినియోగింతురు. సూర్యనామసంకీర్తనమునందు జనులయొక్క జిహ్వా కేమిభారము గలుగును? స్వల్పమూల్యముగలిగిన వర్తియందును తైలమునందును నేమి వ్యయమగును? ఆవర్తివలననేగదా అమృతమువంటి వస్తువు లభించుచున్నది దానినుండి గలుగులాభమునుగుఱించి చింతిల్లుట వలన నేమిప్రయోజనము? దీర్ఘములైనహస్తములు స్వాధీనములై యుండఁగా మహాఫలప్రదమగు సూర్యదేవాలయమందలి నరకాంతకమగు దీపమును బెట్టక దానిఫలము ననుభవించుచు ఏడ్చుచుందురు. స్వాతంత్ర్యము లేనప్పుడు ఏడ్చునట్టియు, స్వాతంత్ర్యము గలిగినపుడు అభిమానముగలట్టియు ప్రాణులయొక్క ప్రాణములు అవశ్యము పాపమును బొందును. గాన భోక్తయగుజీవుఁడు అహర్నిశములు విషయముల ననుభవించుటకుఁ గోఱుచుఁ జేసినకర్మ ననుభవించుచుండును. దుష్కృతములచేత నీప్రదేశము ప్రాప్యముగా చూడఁబడుచున్నది. కాన నిప్పు డేడ్చుటవలనఁ బ్రయోజన మేమున్నది? సహింపవలయును. మాకుఁ బ్రాప్తమైన యీదుఃఖము నభీష్టమైనయెడల మాయొక్కబుద్ధిని పాపమునం దెన్నఁడును విని

---

శతాని తు. ౯. అహో మోహస్య మాహాత్మ్యం మమత్వం నరకేష్వపి, క్రందతే మాతరం తాతం పీడ్యమానోఽపి యత్స్వయమ్. ౧౦. ఏవమాకృష్టచిత్తానాం విషయైః స్వాదుతర్పకైః, నృణాం న జాయతే బుద్ధిః పరమార్థవిలోకినీ. ౧౧. తథా చ విషయాసంగే కరోత్యవిరతం మనః, కో హి భారో రవేర్నామ్ని జిహ్వాయాః పరికీర్తనే. ౧౨. వర్తితైలేఽల్పమూల్యే చ యద్వర్తిర్లభ్యతే సుధా, అతో వై కతరో లాభః కాతశ్చింతా భవేత్తదా. ౧౩. యేనాయతేషు హస్తేషు స్వాతంత్ర్యే సతి దీపకః, మహాఫలో భానుగృహే న దత్తో నరకాపహః. ౧౪. నరో విలపతే కించిదిదానీం దృశ్యతే ఫలం, అస్వాతంత్ర్యే విలపతాం స్వాతంత్ర్యే సతి మానినామ్. ౧౫. అవశ్యం పాతినః ప్రాణా భోక్తా జీవోఽప్యహర్నిశం, దత్తం చ లభతే భోక్తుం కామయన్విషయానపి. ౧౬. ఏతత్స్థానం దుష్కృతైర్వా యుక్తం చాద్య మయేక్షితం, ఇదానీం కిం విలాపేన సహధ్వం యదుపాగతమ్. ౧౭. యద్యేతదనభీష్టం వో యద్దుఃఖం సముపస్థితం, తద

యోగింపరాదు. అజ్ఞానమువలన నెవ్వఁడైనను జేసినయెడలఁ దత్పాప నాశకమగు సూర్యదేవతారాధనమును జేయుఁడు. బ్రహ్మదేవుం డిట్లనియె. ఓకృష్ణా! ఆనారకులందఱు యమకింకరవాక్యములను విని ఆఁకలిచేతను ఎండిపోయిన కంఠమును నాలుకయుఁ గలవారును దుఃఖితులును నగు వారై, ఓసత్పురుషుఁడా! మేము ఏకర్మ నాచరించితిమో చెప్పఁగోరెద ము. ఎందువలన నరకస్థులమై యీకర్మఫలపాపమును బొందుచుంటిమో దానిని చెప్పఁగోరుచున్నాము. అని యడుగ యమకింకరుఁడు వారల కిట్ల నియె. యౌవనమదముచేత సంతుష్టులై యవివేకమతులై మీరు ఘృతము నందలి లోభముచేత సూర్యగృహమునుండి దీపమును అపహరించితిరి. ఆకారణముచే మీరు ఆఁకలి దప్పులచేఁ బీడింపఁబడుచున్నవారై చలి గాలిచే బ్రద్దలైన శరీరముగలవారై ఘోరమైన యీనరకమునందు బాధల ననుభవించుచుంటిరి. బ్రహ్మదేవుఁడు చెప్పెను. ఓకృష్ణా! సూర్య దేవాలయమునందు దీపముంచుటవలనఁ బుణ్యమును అపహరించుటవలనఁ బాపమును ఈ రెండింటిని విశదముగా చెప్పితిని. అన్నిస్థలముల యందును దీపదానము ప్రశస్తమే యగును. సూర్యదేవాలయమునందుఁ జేయఁబడిన దీపదానము విశేషఫలప్రదమగును. అంధులు, మూకలు, బధిరులు, పిచ్చివారు, అజ్ఞానులు, దీపదానోపకరణహీనులును అగువారు

---

ద్భుతమతిః పాపే న కర్తవ్యా కదాచన. ౧౮. కృతేఽపి పాపకే కర్మణ్యజ్ఞానాదఘనాశనం, కర్తవ్యమనవచ్ఛిన్నం పూజనం సవితుః సదా. ౧౯. బ్రహ్మోవాచ.—నారకాస్తద్వచః శ్రుత్వా తమూచురతిదుఃఖితాః, క్షుత్క్షామకంఠాస్స్ఫుట్ తాపవిసంస్ఫుటితతాలుకాః. ౨౦. భోభోః సాధో కృతం కర్మ యదస్మాభిస్తదుచ్యతాం, నరకస్థైర్విపాకోఽయం భుజ్యతే యత్సుదారుణః. ౨౧. కింకర ఉవాచ.—యుష్మాభిర్యౌవనోన్మాదాన్ముదితైరవివేకిభిః, ఘృతలోభేన మార్తండగృహాద్దీపః పురా హృతః. ౨౨. తేనాస్మిన్నరకే ఘోరే క్షుత్తృష్ణాపరిపీడితాః, భవంతః పతితాస్తీవ్రే శీతవాతవిదారితాః. ౨౩. బ్రహ్మోవాచ.—ఏతత్తే దీపదానస్య ప్రదీపహరణస్య చ, పుణ్యం పాపం చ కథితం భాస్కరాయతనేఽచ్యుత. ౨౪. సర్వత్రైవ హి దీపస్య ప్రదానం కృష్ణ శస్యతే, విశేషేణ జగద్ధాతుర్భాస్కరస్య నివేశనే. ౨౫. యేంధా మూకా బధిరా నిర్విపకాహీనాస్తైస్తైర్దానసాధనైర్వర్జితాః, తైస్తైర్దీపాః సాధులోకప్రదత్తా దేవాగారాదన్యతః

ఇతరదేవాలయమునుండి దీపములను దెచ్చి వినియోగించినను లోభ మూలకము గాకుండుటచే దోషము గానేరదు.

ఇది ఏకోనవింశోత్తరశతతమాధ్యాయము.

---

## వింశోత్తరశతతమాధ్యాయము.

విష్ణుదేవుం డిట్లనియె. ఓపూజ్యుఁడా! ప్రాణులందఱు విషరోగాద్యుపద్రవములచేతను దుష్టగ్రహోపఘాతములచేతను సర్వకాలమును నుపద్రవములను బొందుచున్నవారై ఆభిచారికహోమములచేతను దారుణములగు నంటువ్యాధులచేతను బీడితులై యుండిరి. ఏయేకర్మవిపాకముచే విషరోగాద్యుపద్రవములు సంభవించుచున్నవో అదియంతయు సవిస్తరముగాఁ దెలుపఁగోరెద ననిన బ్రహ్మదేవుం డిట్లనియె. ఓదేవా! పూర్వజన్మమునందు వ్రతోపవాసములచేత సూర్యుని సంతోషపెట్టని నరులు గ్రహరోగములు ననుభవింతురు. ఏమనుష్యులు సూర్యదేవతాసక్తులై సర్వకాలమును ధ్యానింపరో వారు విషగ్రహవ్యాధులచేఁ బీడింపఁబడుచుందురు పూర్వజన్మమునందు సూర్యుని సంతోషపెట్టుటవలన ఆరోగ్యమును బుద్ధిసంపదను మఱి దేనినిఁ గోరునో వాని నన్నింటినిఁ బొందఁగలఁడు. సూర్యుని సంతుష్టునిఁ జేసినయెడల మనోవ్యాధులను

---

కృష్ణ నీతాః. ౨౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే దీపదానమాహాత్మ్యవర్ణనం నామ
ఏకోనవింశోత్తరశతతమోఽధ్యాయః.

---

విష్ణురువాచః—భగవన్ప్రాణినః సర్వే విషరోగాద్యుపద్రవైః, దుష్టగ్రహోపఘాతైశ్చ సర్వకాలముపద్రుతాః. ౧. ఆభిచారికకృత్యాభిః స్పర్శరోగైశ్చ దారుణైః, సదా సంపీడ్యమానాస్తు తిష్ఠంత్యంబుజసంభవ. ౨. యేన కర్మవిపాకేన విషరోగాద్యుపద్రవాః, ప్రభవంతి నృణాం తన్మే యథావద్వక్తుమర్హసి. ౩. బ్రహ్మోవాచ.— వ్రతోపవాసైర్యైర్భానుర్నాన్యజన్మని తోషితః, తే నరా దేవశార్దూల గ్రహరోగాదిభాగినః.౪. యైర్న తత్ప్రవణం చిత్తం సర్వదైవ నరైః కృతం, విషగ్రహజ్వరాణాం తే మనుష్యాః కృష్ణ భాగినః. ౫. ఆరోగ్యం పరమాం వృద్ధిం మనసా యద్యదిచ్ఛతి, తత్తదాప్నోత్య

రోగములను విషభయములను గ్రహబాధను అంటువ్యాధులను బొందరు. అట్లు చేయువానికి దుష్టగ్రహములన్నియు సౌమ్యములగును. ఎవఁడు సూర్యుని సంతోషపెట్టునో వాఁడు దేవతలకును బూజ్యుఁడగును. ఎవఁడు సర్వభూతములయందును తనయందువలె సమానప్రతిపత్తి గలిగి యుండునో ఉపవాసాదులచే సూర్యుని సంతోషపెట్టునో ఆనరుఁడు సిద్ధమనోరథుఁడును రోగవిముక్తుఁడును నిత్యసుఖియును బహుధర్మసమన్వితుఁడును నయియుండును. అట్టి మనుష్యులకు శత్రుభయము శరీరవిషయకమైన యభిచారము గ్రహరోగాదిబాధ లేమియుఁ గలుగనేరవు ఆసూర్యదేవునియొక్క అవ్యాహతములైన ధనసముదాయము లాపత్కాలమునందు రక్షించునని చెప్పిన విష్ణుదేవుం డిట్లనియె ఓకమలసంభవా! పూర్వజన్మమునందు సూర్యదేవు నారాధింపక విషరోగాదిపీడితులై దుఃఖించువారు మఱల నీరోగు లెట్లగుదురో నాకుఁ జెప్పుమనిన బ్రహ్మదేవుం డిట్లనియె. ఓకృష్ణా! దేవేశుండును ననుపముఁడు నగు సూర్యదేవునిఁ బుష్పములచేత నారాధించి విగతకల్మషుఁడై నీరోగుఁడై సంతోషమును బొందును. అనిన విష్ణుదేవుం డిట్లనియె. దోషాభిభూతదేహముగల మనుష్యులు తమమేలు కోరి యేవిధముగ భక్తితో నాదిత్యు నారాధింపవలయునో వినఁగోరెదను. నేను భక్తుఁడనని నాయెడ నీకనుగ్రహము

---

సంగ్ధం పరత్రాదిత్యతోషణాత్. ౬. నాధీన్ప్రాప్నోతి న వ్యాధీన్న విషగ్రహబంధనం, కృత్యాస్పర్శభయం వాపి తోషితే తిమిరాపహే. ౭. సర్వే దుష్టాః సమాస్తస్య సౌమ్యాస్తస్య సదా గ్రహాః, దేవానామపి పూజ్యోఽసౌ తుష్టో యస్య దివాకరః. ౮. యః సమః సర్వభూతేషు యథాత్మని తథా హితే, ఉపవాసాదినా యేన తోష్యతే తిమిరాపహః. ౯. తోషితేఽస్మిన్ప్రజానాథే నరాః పూర్ణమనోరథాః, అరోగాః సుఖినో నిత్యం బహుధర్మసుఖాన్వితాః. ౧౦. న తేషాం శత్రవో నైవ శరీరాద్యభిచారకం, గ్రహరోగాదికం చాపి పాపకార్యుపజాయతే. ౧౧. అవ్యాహతాని దేవస్య ధనజాలాని తం నరం, రక్షంతి సకలాపత్సు యేన శ్వేతాధిపోఽర్చితః. ౧౨. విష్ణురువాచ.—అనారాధితమార్తండా యే నరాః దుఃఖభాగినః, తే కథం నీరుజః సంతు విజ్వరా గతకల్మషాః. ౧౩. బ్రహ్మోవాచ.—ఆరాధయంతు దేవేశం పుష్పైరేవమనౌపమం, భాస్కరం తు జగన్నాథం సర్వదేవగురుం పరమ్. ౧౪. విష్ణురువాచ.— దోషాభిభూతదేహైస్తు కథమారాధనం రవేః, కర్తవ్యం వద దేవేశ భక్త్యా శ్రేయోఽర్థమాత్మనః.

గలదేని యీవిషయమును సదయుఁడవై యనుగ్రహింపఁగోరుచున్నాను. కాన సూర్యదేవుని మహదారాధనమును నా కుపదేశింపుము. అనంతుఁడును, ముసలితనములేనివాఁడును, సందేహనాశకుఁడు నగు దేవుని నీ యనుగ్రహమును బొంది చూచుటకును నారాధించుటకును కోరుచున్నాను. నీప్రసాదముచే నేనెట్లు లోకాతిశయితమగు విక్రమముకలవాఁడ నగుదునో దానినిఁ జేయుటకుఁ గోరుచున్నాను. అనిన బ్రహ్మదేవుం డిట్లనియె. కృష్ణా! నీమనము తత్పూజాసక్తమైనయెడల నవ్యక్తజన్ముఁడగు దేవదేవుని యారాధన కనుగ్రహపాత్రుఁడ వగుచున్నావు. నీవు దేవదేవుఁడును, నాద్యంతరహితుఁడును భగవంతుఁడగు వివస్వంతుని పూజయం దాసక్తుఁడవైతివేని వైవస్వతుఁడవు గమ్ము. ఆవైవస్వతులచే సూర్యుఁడు దర్శనస్తవముల కర్హుఁడుకాఁడు. సూర్యుని భక్తిచేఁ బ్రార్థించి పూతులైన మనుజులు వైవస్వతు లనఁబడుదురు. వారు సూర్యుని జేపుదురు. అనేకజన్మలయందు సంసారమున సంపాదింపఁబడిన పాపసముచ్ఛయము నశింపక పురుషులకు మార్తాండాభిముఖమగు బుద్ధి గలుగదు. మార్తాండునియందు ద్వేషమునే పొందుచు బ్రాహ్మణులను వేదములను నిందించిన మనుష్యుఁడు రాక్షసాంశసంభూతుఁడని తెలియవలెను. అట్టివారు పాషండస్నేహము కుతర్కములయందు బుద్ధి డాంబికవృత్తి మాయాప్రవర్తనముగలవారై యుందురు. ఎప్పుడు పురుషులకుఁ బాప

---

౧౫. అనుగ్రాహ్యోఽస్మి యది తే మమాయం భక్తిమానితి, తన్మయోపదిశ త్వం చ మహదారాధనం రవేః. ౧౬. అనంతమజరం దేవం దుష్టసందేహనాశనం, ఆరాధయితుమిచ్ఛామి భగవంస్త్వదనుజ్ఞయా, యేనాహం త్వత్ప్రసాదేన భవేయమతివిక్రమః. ౧౭. బ్రహ్మోవాచ.—అనుగ్రాహ్యోఽసి దేవస్య నూనమవ్యక్తజన్మనః, ఆరాధనాయ తే విష్ణో యదేతత్ప్రవణం మనః. ౧౮. యది దేవపతిం భానుమారాధయితుమిచ్ఛసి, భగవంతమనాద్యం చ భవ వైవస్వతోఽచ్యుత. ౧౯. న హ్యవైవస్వతైర్భానుర్జ్ఞాతుంస్తోతుం చ శక్యతే, ద్రష్టుం వా శక్యతే మూఢైః ప్రవేష్టుం కుత ఏవ తు. ౨౦. తద్భక్తి ప్రార్థితాః పూతా నరాస్తద్భక్తిచేతసః, వైవస్వతా భవంత్యేవం వివస్వంతం విశంతి చ. ౨౧. అనేకజన్మసంసారచితే పాపసముచ్చయే, నాక్షీణే జాయతే పుంసాం మార్తండాభిముఖీ మతిః. ౨౨. ప్రద్వేషం యాతి మార్తండే ద్విజాన్వేదాంశ్చ నిందతి, యో నరస్తం విజానీయాదసురాంశసముద్భవమ్. ౨౩. పాషండేషు రతిః పుంసాం హేతువాదానుకూలతా,

క్షయము గల్గునో యప్పుడు బ్రాహ్మణులయందును వేదములయందును సూర్యునియందును అగ్నిహోత్రునియందును నైష్ఠికమగు శ్రద్ధ గల్గును. ఎప్పుడు పురుషుల పాపసముచ్చయము స్వల్పముగానుండునో అప్పుడు భోజకునియందును విప్రులయందు సూర్యునియందును బూజలు సల్పు చుందురు. కర్మచే దుర్గమమగు సంసారమునందు భ్రమించునట్టి నరులకు భక్తిప్రీతుండైన సూర్యుఁ డొక్కఁడే కరావలంబముఁజేసి రక్షించువాఁడు. కావున వైవస్వతుఁడవై సర్వపాపక్షయకరుండగు సూర్యుని భక్తితో నారాధింపుము. భాస్కరుఁడు భక్తికి సంతోషించునని చెప్పిన విష్ణుదేవుం డిట్లనియె. వైవస్వతు లనఁగ నెట్టివారు? ఏలక్షణము లుండ వలయును? వైవస్వతులకార్యము లెయ్యవి? అవియన్నియును విశద ముగాఁ జెప్పఁగోరెదను. అనిన బ్రహ్మదేవుం డిట్లనియె. ఓకృష్ణా! మనో వాక్కాయకర్మములచే నెవ్వఁడు ప్రాణిహింసకుఁడు గాక, మానసికమైన మార్తాండభక్తి గలిగినవాఁడు వైవస్వతుఁడని చెప్పఁబడును. ఎవఁడు నిత్యమును భోజకులను బ్రాహ్మణులను దేవతలను నమస్కరించునో, పరద్రవ్యముల నపేక్షింపఁడో యట్టివాఁడు వైవస్వతుఁ డనఁబడును. కృష్ణా! మఱియు నెవ్వఁడు సమస్తదేవతలను సూర్యునిగను, సమస్తలోక ములను సూర్యమయముగను వానికంటె సూర్యు నభిన్నునిగను తెలిసి కొనినవాఁడు వైవస్వతుఁ డనఁబడును దేవుని మనుష్యుని నితరమైనపశు

---

జాయతే దంభమాయాంధః పతితానాం దురాత్మనామ్. ౨౪. యదా పాపక్షయం పుంసాం తదా వేదద్విజాతిషు, భానౌ చ యజ్ఞపురుషే శ్రద్ధా భవతి నైష్ఠికీ. ౨౫. యదా స్వల్పావశేషస్తు నరాణాం పాపసంచయః, తదా భోజకవిప్రేషు భానౌ పూజాం ప్రకుర్వతే. ౨౬. భ్రమతామత్ర సంసారే నరాణాం కర్మదుర్గమే, కరావలంబనో హ్యేకో భక్తిప్రీతో దివాకరః. ౨౭. స త్వం వైవస్వతో భూత్వా సర్వపాపహరం హరిం, ఆరాధయ సమం భక్త్యా ప్రీతిమభ్యేతి భాస్కరః. ౨౮. విష్ణురువాచ.—కింలక్షణా భవంత్యేతే నరా వైవస్వతా గుణైః, యచ్చ వైవస్వతం కార్యం తన్మే కథయ కంజజ. ౨౯. బ్రహ్మోవాచ.—కర్మణా మనసా వాచా ప్రాణినాం యో న హింసకః, భావభక్తశ్చ మార్తండే కృష్ణ వైవస్వతో హి సః. ౩౦. యో భోజకద్విజాన్ దేవాన్నిత్యమేవ నమస్యతి, న చ భోక్తా పరస్వాదేర్విష్ణో వైవస్వతో హి సః. ౩౧. సర్వాన్దేవాన్ రవిం వేత్తి సర్వాంల్లోకాంశ్చ భాస్కరం, తేభ్యశ్చానన్యమాత్మానం కృష్ణ వైవస్వతో

వులను, చీమలను, వృక్షములను, పాషాణములను, భూమిని, సముద్రములను, తన్ను దేవేశుఁడైన సూర్యునికంటె వ్యతిరిక్తముగాఁ దెలిసికొనఁడో అట్టివాఁడును వైవస్వతుఁడని చెప్పఁబడును. భూతవర్తమాన స్థితియంతయు వైవస్వతమని తెలిసికొనువాఁడును, వైవస్వతుఁడని చెప్పఁబడును "భక్తిభావముచే ధ్యానింపఁబడినవాఁడై సూర్యుఁడు సంసార భీతిని హరించును." అనుభావము ఎవనికిఁ గలుగునో అట్టివాఁడును వైవస్వతుఁ డనఁబడును. ఏమనుష్యుఁడు సర్వభూతములయందును త్రికరణ శుద్ధిగాఁ బాపబుద్ధిని గలుగనీయఁడో అట్టివాఁడును వైవస్వతుఁ డనఁబడును. ఎవ్వఁడు బాహ్యార్థములం దపేక్షలేనివాఁడై సూర్యునియందు భక్తిచేత వ్యాపారమునంతను మానసికముగా నెఱవేర్చునో అట్టివాఁడును వైవస్వతుఁ డనఁబడును. ఎవ్వరు శత్రువులు, మిత్రులు అను భేదబుద్ధ్యాక్రాంతులు గాక సర్వమును భానునిగాఁ జూతురో అట్టివారును వైవస్వతులగుదురు. ఈవైవస్వతుఁడు బొందుగతిని భక్తికృతమైన తపస్సుచేతఁగాని భూరిదక్షిణాయుక్తములగు యజ్ఞములచేతఁగాని మనుష్యులు బొందనేరరు. సర్వవిధములచేత నెవ్వఁడు సూర్యునియందు భక్తిభావము నుంచునో వాఁడే కృతార్థుఁడు. అట్లగుటవలన నాతఁడు శ్లాఘ్యుఁడైన వైవస్వతుఁడగును ఎవఁడు భక్తిభావముచే భాస్కరునిఁ బూజించునో

---

హి సః. ౩౨. దేవం మనుష్యమన్యం వా పశుపక్షిపిపీలికం, తరుపాషాణకాష్ఠాదిభూమ్యం భోధిం దివం తథా. ౩౩. ఆత్మానం చాపి దేవేశాద్వ్యతిరిక్తం దివాకరాత్, యో న జానాతి తం విద్యాత్కృష్ణ వైవస్వతం నరమ్. ౩౪. సర్వో వైవస్వతో భాగో యద్భూతం యద్వ్యవస్థితం, ఇతి వై యో విజానాతి స తు వైవస్వతో నరః. ౩౫. భవ భీతిం హరత్యేష భక్తిభావేన భావితః, వివస్వానితి భావో యః స తు వైవస్వతో నరః. ౩౬. భావం న కురుతే యస్తు సర్వభూతేషు పాపకం, కర్మణా మనసా వాచా స చ వైవస్వతో నరః. ౩౭. బాహ్యార్థనిరపేక్షో యః క్రియాం భక్త్యా వివస్వతః, భావేన నిష్పాదయతి జ్ఞేయో వైవస్వతో హి సః. ౩౮. నారయో యస్య న స్నిగ్ధా న భేదాధీనవృత్తయః, వీక్షతే సర్వమేవేదం భానుం వైవస్వతో హి సః. ౩౯. సుతప్తేనేహ తపసా యజ్ఞైర్వా బహుదక్షిణైః, తాం గతిం న నరా యాంతి యాం తు వైవస్వతో గతః. ౪౦. యేన సర్వాత్మనా భానౌ భక్త్యా భావో నివేశితః, దేవశ్రేష్ఠ కృతార్థత్వా చ్ఛ్లాఘ్యో వైవస్వతో హి సః. ౪౧. అపి వః స కులే ధన్యో జాయేత కులపావనః

అట్టి కులపావనుఁడగుధన్యుఁడు మనకులమునఁ బుట్టునా యని కోరుచు హృదయావలంబిమగు దేవతార్చనము నెవ్వఁడు చేయునో యాతఁడు ధర్మస్వరూపుఁడును అనుపముఁడును నగుసూర్యుని బొందుచున్నాఁడు. ఎవ్వఁడు సూర్యదేవునియాలయము సుస్థిరముగఁ జేయునో వాఁడేడు పురుషాంతరములను భానులోకమునకుఁ గొనిపోఁగలఁడు. ఎన్ని సంవత్సరము లీసూర్యునిగృహమందు సూర్యదేవతార్చన జరుగునో యాతఁ డన్ని వేలసంవత్సరములు సూర్యలోకమునందు వసించును. దేవార్చాలక్షణమగునివి యెవ్వనిగృహమందు నెల్లపు డుండునో, ఎవ్వనిమనము వాంఛారహితమైనదియో వాఁడు నాశనరాహిత్యమును బొందఁగలఁడు. ఎవ్వఁడు సుగంధయుక్తములును మనోహరములును నగుపుష్పములను జ్యోతిష్పతియును సప్తాశ్వుఁడును జగన్నాథుఁడును నగుసూర్యునియందుంచునో యాతఁడు సనాతనజ్యోతిస్థానమగు పరమోత్కృష్టస్థానమును బొందుచున్నాఁడు. ఎవరెవ రేయేవస్తువులచే హీనులగుదురో వారు వాటిని బొందుదురు. అనేకవిధములగుధూపములను,అనేకవిధములగు గంధలేపనములను, దీపవర్తులును ఇతరమైనయుపహారములను మఱియుఁ దనకు నభీష్టవస్తువులును ననుదినమును సూర్యునియొక్క యారాధనమున కిచ్చుటవలన యజ్ఞముల నేచేయుచున్నారు. యజ్ఞేశ్వరుఁడైన సూర్యభగవానుఁడు యజ్ఞములచే గూడఁ బరితుష్టుఁడగును. యజ్ఞములు అనేకోపకరణసాధ్య

---

భాస్కరం భక్తిభావేన యస్తు వై పూజయిష్యతి. ౪౨. యః కారయతి దేవార్చాం హృదయాలంబినీం రవేః, స నరోఽర్కమవాప్నోతి ధర్మధ్వజమనౌపమమ్. ౪౩. యశ్చ దేవాలయం భక్త్యా భానోః కారయతే స్థిరం, స సప్త పురుషాంల్లోకాన్భానోర్నయతి మానవః. ౪౪. యావంతోఽబ్దాని దేవార్చా రవేస్తిష్ఠతి మందిరే, తావద్వర్షసహస్రాణి పుష్పోత్తరగృహే వసేత్. ౪౫. దేవార్చాలక్షణోపేతో యద్గృహే సంతతో విధిః, నిష్కామం చ మనో యస్య స యాత్యక్షరసామ్యతామ్. ౪౬. పుష్పాణ్యతిసుగంధీని మనోజ్ఞాని చ యః పుమాన్, ప్రయచ్ఛతి జగన్నాథే సప్తాశ్వే జ్యోతిషాం పతౌ, స యాతి పరమం స్థానం యత్ర జ్యోతిః సనాతనమ్. ౪౭. యస్యయస్య విహీనో యో దేశో యద్వర్జితం చ యత్, ధూపాంశ్చ వివిధాంస్తాంస్తాన్గంధాఢ్యం సువిలేపనమ్. ౪౮. దీపవర్త్యుపహారాంశ్చ యచ్చాభీష్టమథాత్మనః, నరః సోనుదినం యజ్ఞాన్కరోత్యారాధనాద్రవేః. ౪౯. యజ్ఞేశో భగవాన్భానుర్మఖైరపి స తోష్యతే, బహూపకరణా యజ్ఞా

ములు, బహుసంభారభావ్యములగుటచే ధనవంతులగు మనుష్యులచేతనే సాధ్యములగును. అల్పధనులచే సాధనీయములు కానేరవు. భక్తిచేత సూర్యునికి చేసినపూజ పచ్చికసవుచే జేసినను బహుద్రవ్యసాధ్యమగు యజ్ఞములకు దుర్లభమగుఫలము దీనిచేతనే పొందనగునుగాన మనోహరములగు పుష్పధూపగంధాదులచేతను ఇష్టమగుభూషణముల చేతను రక్తవస్త్రములచేతను రుచికరములగు భక్ష్యములచేతను సూర్యునారాధించి సూర్యునియందు తన్మయమైన మనస్సుగలవాఁడవై యుండుము ఆదిపురుషుఁడైన భగవంతుని భక్తికొలఁది ప్రసాదముచేసికొనుము. ఆదేవు నారాధించినఁ బరబ్రహ్మస్థానమును బొందఁగలరు. నాశరహితుఁడైన జగత్పతిని మధుఘృతక్షీరములచేత నభిషేకముచేసి పుణ్యములైన దధిక్షీరహ్రదములను మధువుస్రవించునట్టిలోకమును శాశ్వతసుఖమును బొందఁగలరు. మనోరంజకములగు స్తోత్రములచేతను, వాద్యములచేతను, బ్రాహ్మణులను తృప్తిపఱచుటచేతను, ఏకాగ్రమనస్కుఁడవై దివాకరు నారాధింపుము. ఆతని నారాధించియే యీశ్వరుఁడు మహాదేవబిరుదమును బొందెను. ఓజనార్దనా! నేనావివస్వంతు నారాధించి తత్ప్రసాదము వలన సర్వలోకసృష్టికారకుఁడనైతిని హృషీకేశా! నీవును నాతనియనుగ్రహమువలన దేవశత్రువులగురాక్షసులను జంపుటకు సమర్థుఁడవైతివి.

---

నానాసంభారవిస్తరాః, సంప్రాప్యంతే ధనయుక్తైర్మనుష్యైర్నాల్పసంచయైః. ౫౦. భక్త్యా తు పురుషైః పూజా కృతా దూర్వాంకురైరపి, రవేర్దదాతి హి ఫలం సర్వయజ్ఞైః సుదుర్లభమ్. ౫౧. యాని పుష్పాణి హృద్యాని ధూపగంధానులేపనం, దయితం భూషణం యచ్చ తథా రక్తే చ వాససీ. ౫౨. యాని చాభ్యవహార్యాణి భక్ష్యాణి చ ఫలాని చ, ప్రయచ్ఛ తాని మార్తండే భవేథాశ్చైవ తన్మనాః. ౫౩. ఆద్యం తం యజ్ఞపురుషం యథా భక్త్యా ప్రసాదయ, ఆరాధ్య యాతి తం దేవం యత్తద్బ్రహ్మ పరం స్మృతమ్. ౫౪. పుణ్యైస్తీర్థోదకైః పుష్పైర్మధునా సర్పిషా తథా, క్షీరేణ స్నాపయేద్దేవమచ్యుతం జగతాం పతిమ్. ౫౫. దధిక్షీరహ్రదాన్పుణ్యాంస్తతో లోకాన్మధుచ్యుతః, ప్రయాస్యసి యదుశ్రేష్ఠ నిర్వృతిం చాపి శాశ్వతీమ్. ౫౬. స్తోత్రైర్హృద్యైర్యథా వాద్యైర్బ్రాహ్మణానాం చ తర్పణైః, మనసా చైకతాయోగాదారాధయ దివాకరమ్. ౫౭. ఆరాధ్య తం మహాదేవో మహచ్ఛబ్దమవాప్తవాన్. ౫౮. అహం చాపి సమస్తానాం లోకానాం సృష్టికారకః, తమారాధ్య వివస్వంతం తత్ప్రసాదాజ్జనార్దన. ౫౯. త్వమప్యేతం హృషీకేశ తత్ప్రసాదాన్న సంశయః, సమర్థో దేవశత్రూణాం దైత్యానాం నాశనే సదా.

నిస్సంశయము. ఈవివస్వంతుని దక్షిణకిరణమునందు వేదవేదాంగసమ్మతుఁడ నగునేను ద్భవించితిని. ప్రకాశమాలావ్యాకులమైన వామకిరణము నుండి పార్వతీపతియగు నీశ్వరుఁ డుదయించెను. శంఖచక్రగదాధరుఁడవైన నీవు వక్షఃస్థలమునుండి పుట్టితివి. లక్ష్మీదేవియు నాతనివక్షఃస్థలము నుండియే పద్మహస్తయై జనియించెను. అట్టిభగవంతు నారాధించి బలమును గీర్తిని సంపదను బొందితిని అట్లే నీవు నోరాజేంద్రా! సూర్యునారాధించి యేయేకామములను బొందవలయునని కోరుచుంటివో వాని నన్నింటినిఁ బొందఁగలవు. ఎవఁ డీబ్రహ్మవిష్ణువులయొక్క సంవాదమును వినునో వాఁడు గొప్పకోరికలనుపొంది తరువాతఁ దల్లోకమును బొందఁగలఁడు. అట మాతంగాశ్వయుక్తము రైరికము నగురథము నధిష్ఠించి తేజస్సునం దగ్నిసమానుఁడును ప్రభచే గరుడసమానుఁడును కాంతియందుఁ జంద్రసమానుఁడును నై దేవగణపరివృతుండై గంధర్వగణములచే గానముచేయఁబడుచు నప్సరఃపరివృతుఁడై యుండును

ఇది వింశోత్తరశతతమాధ్యాయము.

---

౬౦. దక్షిణః కిరణస్తస్య యో దేవస్య వివస్వతః, అహం తస్మాత్సముత్పన్నో వేదవేదాంగసమ్మితః. ౬౧. వామో యః కిరణః కృష్ణ రశ్మిమాలాకులః సదా, తస్మాదీశః సముత్పన్నః పార్వతీదయితోఽచ్యుత. ౬౨. వక్షసస్త్వం సముత్పన్నః శంఖచక్రగదాధరః, తథాంబుజకరా దేవీ అంబుజాననవల్లభా. ౬౩. తమారాధ్య బలం కీర్తిం శ్రియం చావాప్తవానహం, తథా త్వమపి రాజేంద్ర తమారాధ్య దివాకరం, యాన్యానిచ్ఛసి కామాంస్త్వం తాంస్తాన్సర్వానవాప్స్యసి. ౬౪. య ఇదం శృణుయాన్నిత్యం సంవాదం విధికృష్ణయోః, సోఽపి కామానవాప్యాగ్ర్యాంస్తతో లోకమవాప్నుయాత్. ౬౫. రైరికం యానమారూఢో యుక్తం కుంజరవాజిభిః, తేజసాంబుజసంకాశః ప్రభయాండజసన్నిభః. ౬౬. కాంత్యా చంద్రసమో రాజన్వృందారకగణైర్వృతః, గంధర్వైర్గీయమానస్తు తథా చాప్సరసాం గణైః. ౬౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యపూజావర్ణనం నామ వింశోత్తరశతతమోఽధ్యాయః.

## ఏకవింశోత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. ఓపూజ్యుఁడా! భగవంతుఁడగు సూర్యుని శరీరలేఖనమునుగూర్చి సంక్షేపముగాఁ జెప్పితివి. దానిని సవిస్తరముగాఁ జెప్ప వేఁడుచున్నాను. అనిన సుమంతుం డిట్లనియె. సూర్యునిభార్యయగు సంజ్ఞాదేవి పితృగృహమున కేగఁగా సూర్యుఁడు సంజ్ఞయే నారూపము నకుఁ గారణమని చింతించుచుండెను. ఇంతలో బ్రహ్మదేవుఁ డచ్చటికి వచ్చి సూర్యునిఁ జూచి మధురమును శుభమును సంతోషదాయకమును నగు వాక్యమును బలికెను. దేవా! నీవు దేవతలలో నాద్యుఁడవైతివి. ఈ జగమునంతను వ్యాపించియుంటివి. నీకు మామయైన విశ్వకర్మయే నీరూప మును నిర్మింపఁగలఁడు. ఇట్లు సూర్యునితోఁ జెప్పి విశ్వకర్మతో నీవు సూర్యునిరూపము నతిసుందరముగాఁ జేయుమని యాజ్ఞాపించెను. తరు వాత విశ్వకర్మ బ్రహ్మదేవునియాజ్ఞ ననుసరించి సూర్యునివిగ్రహమును క్రమముగాఁ జేసెను. తరువాత నావిగ్రహమును జూచి బ్రహ్మదేవుఁడు దేవతలు, గుహ్యులు, సంతోషించి నానావిధములగు స్తోత్రములంజేసిరి. వేదవేదాంగపారగులగు బ్రాహ్మణోత్తములును, ఘర్మకారకుఁడును, హిమకారకుఁడును, వర్షకారకుఁడును నగునోజగన్నాథా! నీకు క్షేమ మగుఁగాక; ఓదేవా! సర్వలోకములకు శాంతిగలుగుఁగాక యని యాశీర్వ దించిరి. తరువాత రుద్రుఁడును, విష్ణువును "ఓజగత్పూజ్యుఁడా! నీ

---

శతానీక ఉవాచ:—శరీరలేఖనం భానో రుక్తం సంక్షేపతస్త్వయా, విస్తరా చ్ఛ్రోతుమిచ్ఛామి తన్మమాచక్ష్వ సువ్రత. ౧. సుమంతురువాచ.—పితుర్గృహం తు యాతాయాం సంజ్ఞాయాం కురునందన, భాస్కరశ్చింతయామాస సంజ్ఞా మద్రూప కారిణీ. ౨. ఏతస్మిన్నంతరే బ్రహ్మా తత్రాగత్య దివాకరమ్, అబ్రవీన్మధురాం వాచం రవేః ప్రీతికరాం శుభామ్. ౩. ఆదిదేవోఽసి దేవానాం వ్యాప్తమేతత్త్వయా జగత్, శ్వశురో విశ్వకర్మా తే రూపం నిర్వర్తయిష్యతి. ౪. ఏవముక్త్వా రవిం బ్రహ్మా విశ్వ కర్మాణమబ్రవీత్, త్వం నిర్వర్తస్వ మార్తండం స్వరూపం తత్సుశోభనమ్. ౫. తతో బ్రహ్మ సమాదేశాద్భ్రామిమారోప్య భాస్కరమ్, రూపం నిర్వర్తయామాస విశ్వకర్మా శనైః శనైః. ౬. తతస్తుష్టావ తం బ్రహ్మా సర్వదేవగణైః సహ, గుహ్యైర్నానావిధైః స్తోత్రైర్వేద వేదాంగపారగైః. ౭. స్వస్తి తేఽస్తు జగన్నాథ ఘర్మవర్షహిమాకర, శాంతిస్తే సర్వ లోకానాం దేవదేవ దివాకర. ౮. తతో రుద్రశ్చ విష్ణ్వాద్యాః స్తువంతస్తం దివాకరమ్,

తేజస్సు చిత్తరువునందును, వృద్ధిఁబొందుఁగాక; యని స్తోత్రమును జేసిరి. తరువాత నింద్రుఁడు వచ్చి ప్రభూ! జయము గలుగుఁగాక. తత్వప్రదుఁడవైతివని స్తోత్రముజేసెను. తరువాత సప్తఋషులును విశ్వామిత్రుని ముందిడుకొని అనేకవిధముల స్తోత్రములఁ జేసిరి. వాలఖిల్యాదిమహామునులు వేదోక్తములగు ననేకాశీర్వచనములచే స్తోత్రముఁజేసిరి. స్వామీ! నీవు మోక్షార్థులకు మోక్షమవు. ధ్యానముజేయువారలకు ధ్యేయుఁడవు. సర్వభూతములకు నీవే గతి. సర్వమును నీయందే ప్రతిష్ఠితమైయున్నది. ప్రజలకును మాకును క్షేమము కలుగుఁగాక. జగముయొక్క క్షేమమే నీయధీనమై యున్నది. ఈజగమంతయు నీవలననే జరుగుచున్నది. నీయందే లీనమగుచున్నది. నీవొక్కఁడవే (జీవపరమాత్మలు) రెండువిధములుగను, (త్రిమూర్తులు) మూఁడువిధములుగను ప్రకాశించుచుంటివి. సంశయములేదు. ఈజగమంతయు నీవొక్కనిచేతనే సృష్టింపఁబడుచున్నది. ప్రబోధింపఁబడుచున్నది. అని పలికిరి. తరువాత విద్యాధరయక్షపన్నగులు కృతాంజలులై శిరమును వంచి సూర్యునికి నమస్కరించి శ్రోత్రసుఖప్రదములగు వాక్యములను బలికిరి. ఓసర్వరక్షకా! నీతేజము సర్వభూతములకు సహ్యమగుఁగాక అని పలికిరి. తరువాత హాహా హూహూ తుంబురు నారదుఁడు షడ్జ మధ్యమ గాంధార

---

తేజస్తే వర్ధతాం దేవ లిఖ్యతేఽపి దివస్పతే. ౯. ఇంద్రశ్చాగత్య తం దేవం లిఖ్యమానమథాస్తువత్, జయ దేవ జయస్వేతి తత్వదోఽసి జగత్పతే. ౧౦. ఋషయస్తు తతః సప్త విశ్వామిత్రపురోగమాః, తుష్టువుర్వివిధైః స్తోత్రైః స్వస్తి స్వస్తీతి వాదినః. ౧౧. వేదోక్తాభిరథాశీర్భిర్వాలఖిల్యాశ్చ తుష్టువుః, త్వం నాథ మోక్షిణాం మోక్షో ధ్యేయస్త్వం ధ్యానినామపి. ౧౨. త్వం గతిః సర్వభూతానాం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్, ప్రజాభ్యశ్చైవ దేవేశ శం నోఽస్తు జగతః పతే. ౧౩. త్వత్తో భవతి వై నిత్యం జగత్సంలీయతే త్వయి, త్వమేకస్త్వం ద్విధా చైవ త్రిధా చ త్వం న సంశయః. ౧౪. త్వయైకేన జగత్సృష్టం త్వయైకేన ప్రబోధితమ్, తతో విద్యాధరగణా యక్షరాక్షసపన్నగాః. ౧౫. కృతాంజలిపుటాః సర్వే శిరోభిః ప్రణతా రవిమ్, ఊచురేవంవిధా వాచో మనః శ్రోత్రసుఖప్రదాః. ౧౬. సహ్యం భవతు తే తేజో భూతానాం భూతభావన, హాహా హూహూస్తతశ్చైవ తుంబురుర్నారదస్తథా. ౧౭. ఉపగాతుం సమారబ్ధా గాముచ్చైః కుశలా రవిమ్, షడ్జమధ్యమగాంధారగ్రామత్రయవిశారదాః,

గ్రామములను మూఁడిటియందుఁ గుశలులుగాన సూర్యునిగూర్చి యున్న
తముగా గానము జేయుటకు ప్రారంభించిరి. మూర్ఛనములచేతను ధైవత
పంచమస్వరములచేతను అనేకవిధానుభావములుగల త్రివిధసాధనప్రకా
రములచేత వాద్యతాళములచేతను విశ్వాచీ ఘృతాచీ ఊర్వశీ తిలో
త్తమా మేనకా సహజన్య రంభా మొదలగునప్సరోంగనలు, హావభావ
విలాసములచే బహువిధాభినయములఁ జేయుచు మిక్కిలి మధురములగు
పాటలను గూడఁ బాడుచుండిరి. మఱియు సర్వదేవతలకు శ్రోత్రసుఖ
ప్రదములగు వీణా (పిల్లనగ్రోవి) వేణు ప్రభృతి (మొదలగు) వాద్యవిశే
షములును, పణవము పుష్కరము మృదంగము పటహము శంఖము
మొదలగుదేవదుందుభులు మ్రోయింపఁబడెను. గానము జేయుచున్న
గంధర్వులచేతను, నాట్యము చేయుచున్న అప్సరఃస్త్రీలచేతను గొప్పకోలా
హలము జరిగెను. తరువాత సమస్తదేవతలు నిటలఘటితకరాంజలులై
వివస్వంతుని నమస్కరించిరి. సర్వదేవసమాగమమువలన నిట్లు కోలా
హలము జరుగుచుండఁగా విశ్వకర్మ సూర్యవిగ్రహమునకు తేజస్సును
వృద్ధిపొందించెను శీతకాలము వర్షకాలము వేసవికాలము అను వీనికి
హేతువగు రవికి హరకమలాసనవిష్ణులచేఁ జేయఁబడిన స్తోత్రములను విని

౧౮. మూర్ఛనాభిస్తతశ్చైవ తథా ధైవతపంచమైః, నానానుభావమంద్రైశ్చ
అర్ధమంద్రైస్తథైవ చ. ౧౯. త్రిసాధనైః ప్రకారైస్తు వాద్యతాలసమన్వితైః, విశ్వాచీ
చ ఘృతాచీ చ ఉర్వశీ చ తిలోత్తమా. ౨౦. మేనకా సహజన్యా చ రంభా చాప్స
రసాం వరా, హావభావవిలాసైశ్చ కుర్వత్యోఽభినయాన్బహూన్. ౨౧. తతోఽతీవ
కలం గేయం మధురం చ ప్రవర్తతే, సర్వేషాం దేవసంఘానాం మనః శ్రోత్రసుఖ
ప్రదమ్. ౨౨. ప్రవాద్యం తు తతస్తత్ర వీణావంశాది సువ్రత, పణవాః పుష్కరా
శ్చైవ మృదంగాః పటహాస్తథా. ౨౩. దేవదుందుభయః శంఖాః శతశోఽథ సహస్రశః,
గాయద్భిశ్చైవ గంధర్వైర్నృత్యద్భిశ్చాప్సరోగణైః. ౨౪. తూర్యవాదిత్రఘోషైశ్చ
సర్వం కోలాహలీకృతమ్, తతః కృతైః కరపుటైః పద్మకుడ్మలసన్నిభైః. ౨౫. లలాటోపరి
విన్యస్తైః ప్రణేముః సర్వదేవతాః, తతః కోలాహలే తస్మిన్సర్వదేవసమాగమే. ౨౬.
తేజసః శాతనం చక్రే విశ్వకర్మా శనైః శనైః. ౨౭. ఇతి హిమజలఘర్మకాలహేతో

తరువాత సూర్యలేఖనమును వినిన జీవితాంతమున సూర్యలోకమును బొందుదురు.

ఇది ఏకవింశోత్తరశతతమాధ్యాయము.

---

## ద్వావింశోత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె ఓపూజ్యుఁడా! ఆకాలమునందుఁ జిత్రగతుఁడగు దివస్పతిని బ్రహ్మ మొదలగు దేవతలు ఎట్లు స్తుతించిరో నాకు విశదముగాఁ జెప్ప వేఁడెదను. అన విని సుమంతుఁ డిట్లనియె. రాజా! పూర్వము చిత్రగతుఁడగు సూర్యుని బ్రహ్మాదిదేవతలును మహర్షులను ఎట్లు స్తోత్రముజేసిరో చెప్పెదను. ఏకాగ్రమనస్కుఁడవై యాకర్ణింపుము "దేవా! ప్రణతులగు హితులందు దయగలట్టియు స్వరూపముచేతనే లోకమునంతను జూచునట్టి నీకు సమస్కారము. పద్మసముదాయమును వికసింపఁజేయు నీకు నమస్కారము. అంధకారపటలమును నశింపఁజేయు నీకు నమస్కారము. పావనములును, పుణ్యస్వరూపమైనట్టియు ననేకములగు కామములను వైభవముల నిచ్చునట్టియు భాస్వంతములును నిర్మలములును నగు కిరణములుగలట్టి సర్వలోకహితకరుఁడైన నీకు నమస్కారము. అజన్యుఁడును లోకత్రయముచే భావనజేయఁబడునట్టియు సర్వభూతస్వరూపుఁడవైనట్టియు కాంత్యాశ్రయుఁడైన నీకు నమస్కా-

---

ర్హారకమలాసనవిష్ణుసంస్తుతస్య, తదుపరి లిఖనం నిశమ్య భానోర్వ్రజతి దివాకరలోకమాయుషోఽంతే. ౨౮

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే విశ్వకర్మకృతసూర్యతేజఃశాతనం నామ ఏకవింశోత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—తస్మిన్కాలే సమారూఢో లిఖ్యమానో దివస్పతిః, బ్రహ్మాదిభిః స్తుతో దేవైర్యథా వై తద్వదస్వ మే. ౧. సుమంతురువాచ.—శృణుష్వైకమనా రాజన్యథా దేవో దివస్పతిః, బ్రహ్మాదిభిః స్తుతో దేవైరృషిభిశ్చ పురానఘ. ౨. ప్రయత్నతః ప్రణతహితానుకంపినే స్వరూపతో లోకవిభావినే నమః, దివస్పతే కమలకులావబోధినే నమస్తమఃపటలపటావపాటినే. ౩. పావనాతిశయపుణ్యాకర్మణే నైకకామవిభవప్రదాయినే, భాసురామలమయూఖమాలినే సర్వలోకహితకారిణే నమః. ౪. అజాయ లోకత్రయభావనాయ భూతాత్మనే గోపతయే ప్రియాయ, నమో మహా

రము. మహాకరుణాసముద్రుండగు సూర్యునికొఱకు నమస్కారము. జగత్ప్రతిష్ఠాహేతువైనట్టియు, జ్ఞానస్వరూపమైన అంతరాత్మగలట్టియు, జగద్ధితమునుగోఱునట్టియు, వివస్వంతునకు నమస్కారము. అకారణజన్ముండును సమస్తలోకైకచక్షువును సురోత్తముండును, అమితతేజశ్శాలియు నగు నీకు నమస్కారము. దేవశ్రేష్ఠా! నీకు నమస్కారము. నీకు నీవే జనకుండవైనట్టియు, జగన్మహితుండవైనట్టియు, గొప్పదైన కిరణతాపము గలట్టియు, జగత్తునందు నాశరహితుండు అంధకారచ్ఛేదకుండు వనతిమిర మనెడు మద్యపానముచేఁ బొందఁబడిన లోహితవిగ్రహత్వమును బొంది నట్టి నీవు మమ్ములను రక్షింపుము. కిరణసముదాయములచేఁ ద్రిభువనములయందలి యంధకారమును నశింపఁజేయు నీకు నమస్కారము. జగద్ధితమును గోరి రథారూఢుండవై యెల్లప్పుడు సంచరించుచున్న నీకు నమస్కారము" ఈమొదలగు విధమున బ్రహ్మదేవుఁడును విష్ణుమహేశులును స్తుతించిరి.

ఇది ద్వావింశోత్తరశతతమాధ్యాయము.

---

కారుణికోత్తమాయ సూర్యాయ లోకత్రయభావనాయ. ౫. వివస్వతే జ్ఞానకృతాంతరాత్మనే జగత్ప్రతిష్ఠాయ జగద్ధితైషిణే, స్వయంభువే లోకసమస్తచక్షుషే సురోత్తమాయామితతేజసే నమః. ౬. నిజోదయాయ సురగణమాలిమణే జగతాం త్వం మహిత స్త్వమురుమయూఖసహస్రతపాః, జగతి విభో. వతమసతుద పనతిమిరాసవపావన మదాద్భవతి విలోహితవిగ్రహతాతిమిరవినాశినముగ్రం సుతరాం త్రిభువనభాప్రకరైః. ౭. రథమారుహ్య సమామయం భ్రమసి సదా జగతో హితదః. ౮. ఇత్యేవం సంస్తుతో దేవో భాస్కరో వేధసా పురా, దైవతైశ్చ మహాబాహో శివవిష్ణ్వాదిభిర్నృప. ౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఆదిత్యస్తవో నామ
ద్వావింశోత్తరశతతమోఽధ్యాయః.

## త్రయోవింశత్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. మహాభాగా ! సూర్యసమాశ్రితమగు కథను మఱియొకపర్యాయము చెప్పుము. నాకుఁ దృప్తి గలుగలేదుగాన నాయందు దయగలవాఁడవై చెప్పు మనిన సుమంతుం డిట్లనియె. పూర్వము లోకకర్తయగు బ్రహ్మదేవునిచేఁ జెప్పఁబడిన సర్వపాపనాశకమగు పుణ్యమైన భాస్కరకథను జెప్పెదను. బ్రహ్మలోకమునందు ఋషులు సూర్యకిరణతాపితులై సూర్యునిచే మోహితులై బ్రహ్మదేవుని నిట్లడిగిరి. దేవా ! అగ్నిసమానమగు కాంతిమంతుఁడును మహాతేజస్సంపన్నుఁడును నగు నీతఁ డెవఁడో తెలిసికొనవలయునని కోరుచున్నాము. ఇట్టి ప్రభావ మితని కెట్లు లభించెనో మాకుఁ దెలుపుము. అనిన బ్రహ్మదేవుం డిట్లనియె. స్థిరచరరూపమైన ప్రపంచమంతయు నశించి అంధకారావృతమై యుండఁగా గుణహేతుత్వము ప్రవృత్తమై ప్రథమమున బుద్ధియు దానివలన మహాభూతప్రవర్తకమగు నహంకారమును, వాయువు అగ్ని జలములు ఆకాశము భూమి బ్రహ్మాండమును బుట్టెను. ఆబ్రహ్మాండమునందు నీయేడులోకములు ప్రతిష్ఠింపఁబడినవి. అందు భూమి యేడుద్వీపములచేత నేడుసముద్రములచేతను కూడియుండెను. అట్టిభూమియందే నేనును విష్ణువు మహేశ్వరుఁడును నివసించియుంటిమి. సమస్తమైనజనులును అంధకారముచే మూఢులై యీశ్వరుని ధ్యానిం

---

శతానీక ఉవాచః—భూయోఽపి కథయస్వేమాం కథాం సూర్యసమాశ్రితామ్, న తృప్తిమధిగచ్ఛామి శృణ్వన్నేతాం కథాం మునే. ౧. సుమంతురువాచ.—భాస్కరస్య కథాం పుణ్యాం సర్వపాపప్రణాశినీమ్, వక్ష్యామి కథితాం పూర్వం బ్రహ్మణా లోకకర్తృణా. ౨. ఋషయః పరిపృచ్ఛంతి బ్రహ్మలోకే పితామహమ్, తాపితాః సూర్యకిరణై స్తేజసా సంప్రమోహితాః. ౩. ఋషయ ఊచుః.—కోఽయం దీప్తో మహాతేజా హవీరాశిసమప్రభః, ఏతద్వేదితుమిచ్ఛామః ప్రభావోఽస్య కుతః ప్రభో. ౪. బ్రహ్మోవాచః—తమోభూతేషు లోకేషు నష్టే స్థావరజంగమే, ప్రవృత్తే గుణహేతుత్వే పూర్వం బుద్ధిరజాయత. ౫. అహంకారస్తతో జాతో మహాభూతప్రవర్తకః, వాయ్వగ్నిరాపః ఖం భూమి స్తతస్త్వండమజాయత. ౬. తస్మిన్నండ ఇమే లోకాః సప్త వై సంప్రతిష్ఠితాః, పృథ్వీ చ సప్తభిర్ద్వీపైః సముద్రైశ్చాపి సప్తభిః. ౭. తత్రైవావస్థితో హ్యాసమహం విష్ణుర్మహేశ్వరః, ప్రమూఢాస్తమసా సర్వే ప్రధ్యాతా ఈశ్వరం

చిరి. తరువాత సంధకారమును భేదించి యుత్పన్నుఁడైన తమోనాశకుని ధ్యానయోగము చేత సవిత్రాత్మునుగాఁ దెలిసికొని యందఱును వేర్వేరుగా దివ్యములగు స్తోత్రములచే సూర్యుని స్తోత్రము జేయుట కారంభించిరి. ఓ దేవదేవ! సనాతనా! దేవతలలో నాద్యుఁడవు. ఈశ్వరులకు నీశ్వరుఁడవు. సర్వభూతములకు నాదికర్తవు. దేవతలకు,గంధర్వులకు,రాక్షసులకుఁ బ్రాణమవు. మునులకును, కిన్నరులకును, సిద్ధులకు నురగపక్షులకును జీవనమవు. నీవే బ్రహ్మవు. నీవే యీశ్వరుఁడవు. నీవే విష్ణుఁడవు. నీవే ప్రభుఁడవు. వాయువు, ఇంద్రుఁడు, అగ్నియు, వరుణుఁడును నీవే. కాలము సృష్టికర్తయు, సంహర్తయు, పరిపాలకుఁడును నీవే. నదులును, సముద్రములును, పర్వతములును, మెఱుంగులును, యింద్రధనువులును, వ్యక్తావ్యక్తస్వరూపుఁడును, సనాతనుఁడవగు నీవే యగుచున్నావు. ఈశ్వరునికంటెఁ బరము విద్యయు, విద్యకంటెఁ బరము శివుఁడును, శివునికంటెఁ బరతముఁడవైన దేవుఁడవును నీవే. మఱియును అన్ని వైపులకుఁ గరచరణములు గలవాఁడవును, అన్ని వైపులకు నేత్రములు, శిరములు, ముఖములు గలవాఁడవు గనుకనే నీవు సహస్రాంశుఁడవైతివి. ఓ ప్రకాశకుఁడా ! భూలోకము, భూర్లోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము అను నివి నీతేజస్సుచే దీప్తిపంతములుగాఁ జేయఁబడినవి. సురేంద్రులకు దుర్నిరీక్ష్యమగు స్వరూపము

---

పరమ్. ౮. తతో భిద్య మహాతేజః ప్రాదుర్భూతం తమోనుదమ్, ధ్యానయోగేన చాస్మాభిర్విజ్ఞాతం సవితుస్తథా. ౯. జ్ఞాత్వా చ పరమాత్మానం సర్వ ఏవ పృథక్పృథక్, దివ్యాభిస్తుతిభిర్దేవం సంస్తోతుముపచక్రముః. ౧౦. ఆదిదేవోఽసి దేవానామీశ్వరాణాం త్వమీశ్వరః, ఆదికర్తాసి భూతానాం దేవదేవ సనాతన. ౧౧. జీవనం సర్వసత్వానాం దేవగంధర్వరక్షసామ్, మునికిన్నరసిద్ధానాం తథైవోరగపక్షిణామ్. ౧౨. త్వం బ్రహ్మా త్వం మహాదేవస్త్వం విష్ణుస్త్వం ప్రజాపతిః, వాయురింద్రశ్చ సోమశ్చ వివస్వాన్వరుణస్తథా. ౧౩. త్వం కాలః సృష్టికర్తా చ హర్తా త్రాతా ప్రభుస్తథా, సరితః సాగరాః శైలా విద్యుదింద్రధనూంషి చ, ప్రలయః ప్రభవశ్చైవ వ్యక్తావ్యక్తః సనాతనః. ౧౪. ఈశ్వరాత్పరతో విద్యా విద్యాయాః పరతః శివః, శివాత్పరతరో దేవస్త్వమేవ పరమేశ్వర. ౧౫. సర్వతః పాణిపాదస్త్వం సర్వతోఽక్షిశిరోముఖః, సహస్రాంశుస్త్వం తు దేవ సహస్రకిరణస్తథా. ౧౬. భూరాదిభూర్భువఃస్వశ్చ మహార్జనస్తపస్తథా, ప్రదీప్తం దీప్తిమన్నిత్యం

గల నీకు నమస్కారము. సురలచేతను, సిద్ధగణములచేతను, భృగ్వత్రి పులహాదిమునులచేతను, సేవలందిన శుభాకారముగల దివ్యదేహముతోఁ గూడిన నీకు నమస్కారము. పంచభూతములను దశదిశలను పదునొకండు మూర్తుల నతిక్రమించి యర్ధమాసమున కధికమై సూర్యమండలమున నుండు దివ్యరూపముగల నీకు సర్వదేవతలు నమస్కరించుచున్నారు. విశ్వకర్తయు, విశ్వాత్మకమును, అగ్నిదేవతార్చితమును, విశ్వస్థితమును, అచింత్యమును నగు రూప మేది గలదో అద్దానికి నమస్కారము. యజ్ఞముకంటెను, దేవునికంటెను, స్వర్గలోకముకంటెను, దురతిక్రమణీయ మని యేది విఖ్యాతమైనదో, దానికంటె నుత్కృష్టమై పరమాత్మయని ప్రసిద్ధిబొందిన యేరూపము గలదో, అద్దానికి నమస్కారము. అజ్ఞేయుఁడును, అచింత్యుఁడును, అధ్యాత్మగతుఁడును, జన్మనాశరహితుఁడును, నగు నెవ్వఁడు ప్రకాశించుచుండెనో అట్టి నీకు నమస్కారము. కారణకారణుఁడవగు నీకు నమస్కారము. పాపవిధ్వంసనుఁడవగు నీకు నమస్కారము. ఋష్యాదులచేత నమస్కరింపఁబడు నీకు నమస్కారము. రోగవినాశకుఁడ వగునీకు నమస్కారము. సర్వవరము నిచ్చునీకు నమస్కారము. సమస్తబలము నిచ్చునీకు నమస్కారము. పదునైదు స్వరూపములుగల నీకు నమస్కారము. అనియీ మొదలగుస్తోత్రములచేత సూర్యుఁడు స్తోత్రము చేయఁబడినవాఁడై తేజోరూపము నాశ్రయించి

---

సర్వలోకప్రకాశకమ్, దుర్నిరీక్ష్యం సురేంద్రాణాం యద్రూపం తస్య తే నమః. ౧౬. సురసిద్ధగణైర్జుష్టం భృగ్వత్రిపులహాదిభిః, శుభం పరమమవ్యగ్రం యద్రూపం తస్య తే నమః. ౧౭. పంచాతీతస్థితం తద్వై దశైకాదశ ఏవ చ, అర్ధమాసమతిక్రమ్య స్థితం తత్సూర్యమండలే, తస్మై రూపాయ తే దేవ ప్రణతాః సర్వదేవతాః. ౧౮. విశ్వకృద్విశ్వభూతం చ విశ్వానరసురార్చితమ్, విశ్వస్థితమచింత్యం చ యద్రూపం తస్య తే నమః. ౨౦. పరం యజ్ఞాత్పరం దేవాత్పరం లోకాత్పరం దివః, దురతిక్రమేతి యః ఖ్యాత స్తస్మాదపి పరం పరాత్, పరమాత్మేతి విఖ్యాతం యద్రూపం తస్య తే నమః. ౨౧. అవిజ్ఞేయమచింత్యం చ అధ్యాత్మగతమవ్యయమ్, అనాదినిధనం దేవం యద్రూపం తస్య తే నమః. ౨౨. నమోనమః కారణకారణాయ నమోనమః పాపవినాశనాయ, నమోనమో వందితవందనాయ నమోనమో రోగవినాశనాయ. ౨౩. నమోనమః సర్వవరప్రదాయ నమోనమః సర్వబలప్రదాయ, నమోనమో జ్ఞాననిధే సదైవ నమోనమః పంచదశాత్మకాయ. ౨౪. స్తుతః స భగవానేవం తేజసాం రూపమాస్థితః, ఉవాచ వాచం కల్యాణీం

మీా కేచరము గాపలయునని శుభకరమగు వాక్యమును బలికెను. మహాభాగా! అతి తేజోయుక్తమగు నీరూపమును సహించుటకు మేము అసమర్థులమై యున్నాము గాన నీరూపమును సర్వజనులకు సహ్యమగు నట్లుగాఁ జేయుము. అనిన సూర్యుఁ డట్లే యని సర్వకర్తయగు తానే లోకకార్యసిద్ధికొఱకు వేసవిని, వర్షమును, మంచు నిచ్చువాఁడై యుండెను. ఆ కారణముచే సాంఖ్యులును, యోగులును, మఱియు నితరు లగు మోక్షార్థులును, ధ్యానపరులై హృదయస్థుఁడగు భాస్కరుని నిత్య మును ధ్యానమునుచేయుచుండిరి సర్వలక్షణహీనుఁడైనను, సర్వపాప యుతుఁడైనను సూర్యదేవతారాధనమును జేసినయెడల అన్నిటిని దాటఁ గలఁడు. అగ్నిహోత్రములు, వేదములు, భూరిదక్షిణాయుక్తములగు యజ్ఞములును భక్తితోఁ జేసిన సూర్యనమస్కారములోఁ బదునాఱవ పాలైనను గానేరవు. తీర్థములలో నగ్రగణ్యమగు తీర్థమును, మంగళ ములకు మంగళమును, పవిత్రమైనవాటికంటె పవిత్రుఁడును నగుదివా కరుని శరణము బొందుచున్నాను. బ్రహ్మాదిదేవతలచే స్తోత్రముచేయఁ బడిన భాస్కరు నెవ్వరు పూజించుచున్నారో వారు సర్వపాపవిముక్తులై సూర్యగృహమునందు నివసించుచున్నారు. ఏప్రకారముగా సూర్యుఁ డుపచారసాధ్యుఁడని వేదములందుఁ జెప్పఁబడెనో అట్లే లోకములకు నుపచారముచే సాధ్యుఁడగును. అనిన శతానీకుం డిట్లనియె. దేవతల

---

కో వరో వః ప్రదీయతామ్. ౨౫. తవాతితేజసా రూపం న కశ్చిత్సహతే విభో, సహనీయం భవత్వేతద్ధితాయ జగతః ప్రభో. ౨౬. ఏవమస్త్వితి గాముక్త్వా భగవా న్సర్వకృత్స్వయమ్, లోకానాం కార్యసిద్ధ్యర్థం ఘర్మవర్షహిమప్రదః. ౨౭. అతః సాంఖ్యాశ్చ యోగాశ్చ యే చాన్యే మోక్షకాంక్షిణః, ధ్యాయన్తి ధ్యానినో నిత్యం హృదయస్థం దివాకరమ్. ౨౮. సర్వలక్షణహీనోఽపి యుక్తో వా సర్వపాతకైః, సర్వం తరతి వై పాపం దేవకర్మసమాశ్రితః. ౨౯. అగ్నిహోత్రం చ వేదాశ్చ యజ్ఞాశ్చ బహుదక్షిణాః, భానోర్భక్త్యా నమస్కారకలాం నార్హంతి షోడశీమ్. ౩౦. తీర్థానాం పరమం తీర్థం మంగలానాం చ మంగలమ్, పవిత్రం చ పవిత్రాణాం తం ప్రపద్యే దివాకరమ్. ౩౧. బ్రహ్మాద్యైః సంస్తుతం దేవైర్యే ప్రపద్యన్తి భాస్కరమ్, నిర్ముక్తాః కిల్బిషైః సర్వైస్తే యాన్తి రవిమన్దిరమ్. ౩౨. ఉపచర్యాదిభిః సాధ్యో యథా వేదే దివస్పతిః, లోకానామిహ సర్వేషాం తథా దేవో దివాకరః. ౩౩. శతానీక ఉవాచ.—

చేతను, ఋషులచేతను, శరీరలేఖనము సూర్యునియం దెట్లు చెప్పఁబడెనో దానిని నాకుఁ జెప్పుమనిన సుమంతుం డిట్లనియె. సురాసురులు ఋషులందఱును కలసి బ్రహ్మలోకంబున సుఖాసీనుఁడై యున్న బ్రహ్మదేవుని సమీపించి యిట్లని విన్నవించిరి. "పూజ్యుఁడా! దేవపుత్త్రుఁడగు నే యీతఁడు అంతరిక్షమునఁ బ్రకాశించుచుండెనో యాతనిచే నంధకారమంతయు నశింపఁజేయఁబడెను. ఈతఁడు మిక్కిలి ప్రకాశించుచుండుట వలన నీతని తేజంబునఁ జరాచరాత్మకమగు జగమంతయు నీటిరాపిడిగల నదీతటమువలెనే నాశముఁ బొందుచున్నది ఆతేజముచే మోహితులమై చాల బాధ ననుభవించుచుంటిమి తమకు జన్మస్థానమగుపద్మమును శోషమును బొందుచున్నది. స్వర్గమునందును, భూమియందును, అంతరిక్షమందును మేము సుఖము ననుభవించుటలేదు ఈతేజ మెట్లు శాంతించునో అట్లు చేయుము." అని దేవతలచేఁ జెప్పఁబడినవాఁడై పద్మసంభవుఁడు విష్ణువు మొదలగుదేవతలనుగూర్చి యిట్లు చెప్పెను. "మహాదేవుని తోడను మహాత్ముఁడగు నింద్రునితోడనుకలసి యచ్చటికి వెళ్లి యాదేవునే మనమందఱము శరణము వేఁడుదము." అని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలగుదేవతలందఱును గలసి భగవానుఁడగు భాస్కరుని శరణు బొందిరి. కేశాదిదేవతలందఱును భక్తిభావము గలవారై స్తోత్రము

శరీరలేఖనం సూర్యే కథం వై ప్రతిపాదితమ్, దేవైః సఋషిభిర్వాపి తన్మమాచక్ష్వ సువ్రత. ౩౪. సుమంతురువాచ.—బ్రహ్మలోకే సుఖాసీనం బ్రహ్మాణం తే సురాసురాః, ఋషయః సముపాగమ్య ఇదమూచుః సమాహితాః. ౩౫. భగవన్దేవతాపుత్రో య ఏష దివి రాజతే, తేనాంధకారో నికృత్తః సోఽయం జాజ్వలితీతి హి. ౩౬. అస్య తేజోభిరఖిలం జగత్థ్సావరజంగమమ్, నాశమాయాతి దేవేశ యథా క్లిష్టం నదీతటమ్. ౩౭. వయం చ పీడితాః సర్వే తేజసా తస్య మోహితాః, పద్మశ్చాయం యథా మ్లానో యోఽయం యోనిస్తవ ప్రభో. ౩౮. దివి భువ్యంతరిక్షే చ శర్మ నోపలభామహే, తథా కురు సురజ్యేష్ఠ యథా తేజః ప్రశామ్యతి. ౩౯. ఏవముక్తః స భగవాన్పద్మయోనిః ప్రజాపతిః, ఉవాచ భగవాన్బ్రహ్మా దేవాన్విష్ణుపురోగమాన్. ౪౦. మహాదేవేన సహితా ఇంద్రేణ చ మహాత్మనా, తమేవ శరణం దేవం గచ్ఛామః సహితా వయమ్. ౪౧. తతస్తే సహితాః సర్వే బ్రహ్మవిష్ణ్వాదయః సురాః, గత్వా తే శరణం సర్వే భాస్కరం లోకభాస్కరమ్. ౪౨. స్తోతుం ప్రచక్రముః సర్వే భక్తినమ్రాః సమంతతః, కేశాది

చేయుట కారంభించిరి. బ్రహ్మావిష్ణుమహేశ్వరులు సూర్యభగవానుని గుఱించి "సురశ్రేష్ఠుఁడా! తీక్ష్ణతేజముగల నీకు నమస్కారము. దేవతలచే స్తోత్రముచేయఁబడిన నీకు నమస్కారము. జడులను, మూకులను, బధిరులను, కుష్ఠురోగులను, బొల్లిగలవారలను, అంధులను, అనేకవిధ వ్రణపీడితులను క్రొత్తవారలనుగా చేయుచుండెడి కరుణాసముద్రుఁడవగు నీకు నమస్కారము. ఔదరమగు నేజఠరాగ్నికలదో, చాక్షుషమగు నేతేజముగలదో, యజ్ఞములయం దాహితమగు నేయగ్నికలదో, యవి యన్నియు నీస్వరూపములే. సముద్రోదకనివాసులును తీక్ష్ణములైన పాశము ఖడ్గము పరశువు మొదలగు నాయుధములు గలరాక్షసులును భూమియందు నాశముఁ బొందుచున్నారు. నీవు సమస్తమైనతీర్థములకు ఫలముగాఁ బ్రకాశించుచున్నావు. యజ్ఞములయందు నిత్యము నివసించు నీకు నమస్కారము. ఈవిషయమై జిజ్ఞాసతోఁ బనిలేదు. నీ వేతపస్సుచే నరులకు శాంతికరుఁడవౌదువో ఆతపస్సునే తపస్సుగాఁ బండితులు చెప్పుదురు." బ్రహ్మాదిదేవతలచే నిట్లు స్తోత్రముఁజేయఁబడినవాఁడై నైశ్చల్యమును బొందెను. మఱల నాదేవతలు బ్రహ్మవిష్ణుమహేశ్వరులతోఁ గూడి భక్తిచే నమ్రులై "మూఁడులోకములకు నైశ్వర్యమునిచ్చు నీకు నమ

---

దేవతాః సర్వా భక్తిభావసమన్వితాః. ౪౩. బ్రహ్మావిష్ణీశా ఊచుః.—నమో నమః సురవర తిగ్మతేజసే నమోనమః సురవర సంస్తుతాయ వై, జడాంధమూకాన్బధిరాన్సకుష్ఠాన్సశ్విత్రిణోంఽథాన్వివిధవ్రణావృతాన్, కరోషి తానేవ పునర్నవాన్సదా అతో మహాకారుణికాయ తే నమః. ౪౪. యదౌదరం జ్యోతిరతీవ్రరమ్యహృద్యదల్పతేజో యదపీహ చక్షుషాం, యదత్ర యజ్ఞేష్వపనీతమాహితం తవైవ తద్రూపమనేకతః స్థితమ్. ౪౫. సురద్విషః సాగరతోయవాసినః ప్రచండపాశాసిపరశ్వధాయుధాః, సముచ్ఛ్రితాస్తే భువి పాపచేతసః ప్రయాంతి నాశం తవ దేవ దర్శనాత్. ౪౬. యతో భవాంస్తీర్థఫలం సమస్తం యజ్ఞేషు నిత్యం భగవానవస్థితః, నమో భవన్నత్ర విచారణాస్తి సదా సమః శాంతికరో నరాణాం, యచ్చాపి లోకే తవ ఉచ్యతే బుధైస్తత్తే మహాతేజ ఉశంతి పండితాః. ౪౭. స్తుతః స భగవానేవం ప్రజాపతిముఖైః సురైః, అవధానం తతశ్చక్రే శ్రవణాభ్యాం మహీపతే. ౪౮. స్తువంతి తే తతో భూయః శివవిష్ణుపురోగమాః, కృత్వా మాం పురతః సర్వే భక్తినమ్రాః సమం తతః. ౪౯. నమోనమస్త్రిభువనభూతిదాయినే. క్రతుక్రియాసత్ఫలసంప్రదాయినే,

స్కారము. యాగములకు సత్ఫలమునిచ్చు నీకు నమస్కారము. ప్రతి దినమునందును చేయుకర్మకు సాక్షిభూతుఁడవగు నీకు నమస్కారము. సహస్రకిరణుఁడవగు నీకు నమస్కారము. సప్తాశ్వయుక్తమగు రథముగల నీకు నమస్కారము." అని యీరీతిని స్తుతించిరి. "ఓమహానుభావా! వాలఖిల్యాదిమహర్షులచేతను, అప్సరఃకిన్నరోరగులచేతను, సిద్ధపిశాచగంధర్వులచేతను, మనుష్యులచేతను, యక్షరక్షోగణగుహ్యకోత్తములచేతను స్తోత్రముచేయఁబడు నీకు నమస్కారము. మానవశరీరములయందుఁ గిరణములచే మంచును చెమటను కలుగఁజేయుచున్నావు. లోకమునంతను శుష్కింపఁజేయుచున్నావు. ఆకారణముచేతనే నీవు లోకమున విశోషకుఁడవైతివి." అని నుతించిరి. తరువాత భాస్కరుఁడు వారలయభిప్రాయమును దెలిసికొని ప్రియముం జెప్పెను. దేవతలందఱు నాసూర్యునివద్ద ననుజ్ఞఁబొంది సంతుష్టాంతరంగులై విశ్వకర్మను త్రికరణశుద్ధిగాఁ బూజించిరి. విశ్వకర్మయును నీయాజ్ఞవలన నీకు సౌమ్యతను కలుగఁజేయుఁగాక. యని రవినిఁ బ్రార్థించిరి. సర్వకార్యనిపుణుఁడును తేజోరాశియు నగు సూర్యుని యంత్రమునందుంచి అమృతముచేత సూర్యు నభిషేకించి తేజమును శాంతిపరచెను. సురాసురపూజితుండగు సూర్యుఁడు జానువులపర్యంతము లిఖింపఁబడినవాఁడై తరువాత రాయుటయం దిష్టము లేనివాఁడయ్యెను. ఈకారణముచేతనే యిది మొదలుకొని సూర్యదేవునిపాద

---

నమోనమః ప్రతిదినకర్మసాక్షిణే సహస్రసందీధితయే నమోనమః. ౧౦. ప్రసక్తసప్తాశ్వయుజే తుయాయ ధ్రువైకరశ్మిగ్రథినే నమోనమః, సవాలఖిల్యాప్సరకిన్నరోరగైః ససిద్ధగంధర్వపిశాచమానుషైః, సయక్షరక్షోగణగుహ్యకోత్తమైః స్తుతః సదా దేవ నమో నమస్తే. ౧౧. యతో రసాన్సంక్షిపసే శరీరిణాం గభస్తిభిర్హిమజలఘర్మనిస్రవైః, జగచ్చ సంశోషయసే సదైవ అతోసి లోకే జగతో విశోషణమ్. ౧౨. బ్రహ్మోవాచ.—జ్ఞాత్వా తేషామభిప్రాయమువాచ భగవాన్వచః, లబ్ధ్వానుజ్ఞాం తతః సర్వే సురాః సంహృష్టచేతసః. ౧౩. త్వష్టారం పూజయామాసుర్మనోవాక్కాయకర్మభిః, విశ్వకర్మా తవాదేశాత్కరోతు తవ సౌమ్యతామ్. ౧౪. తతస్తు తేజసో రాశిం సర్వకర్మవిధానవిత్, భ్రమిమారోపయామాస విశ్వకర్మా విభావసుమ్. ౧౫. అమృతేనాభిషిక్తస్య తదా సూర్యస్య వై విభోః, తేజసః శాతనం చక్రే విశ్వకర్మా శనైః శనైః. ౧౬. ఆజానులిఖితశ్చాసౌ ససురాసురపూజితః, నాభ్యనందత్తతో దేవ ఉల్లేఖనమతః పరమ్. ౧౭. తతః ప్రభృతి

ములు నిత్యమును సంవృతములై యున్నవి. అప్పటినుండియు సూర్యుఁడు లోకానుపద్రవకరమగు తేజముకలవాఁడయ్యెను. ఈతనిసంబంధమగు నేతేజము తగ్గింపఁబడెనో దానిచే విష్ణుచక్రము చేయఁబడెను. ఆచక్రము చేతనే విష్ణువు దైత్యులను చంపుచున్నాఁడు. మఱియు నీతేజముచేతనే శూలము, శక్తి, గద, వజ్రము, ధనువు, పరశువు వీటిని నిర్మించి దేవతల కిచ్చెను బ్రహ్మవిష్ణుమహేశ్వరులచేఁ జేయఁబడిన యీస్తోత్రము నుభయ సంధ్యలయందును జపించినయెడలఁ బురుషుఁడు కులమునంతను పవిత్రముగాఁ జేయును. వ్యాధులచేతను పీడింపఁబడఁడు. సంతానవంతుఁడును కృతకృత్యుఁడునై నూఱుసంవత్సరములకన్న నధికమగుకాలము జీవించును. పుత్రవంతుఁడును ధనధాన్యసంపన్నుఁడునై అన్నిస్థలములయందును అపరాజయమును బొందును భూతమయంబగు పురంబువీడి సూర్యపురమున కేగుచున్నాఁడు. మఱల దేవర్షులందఱును వచ్చి యిట్లని స్తుతించిరి. సూర్యరూపుఁడవగు నీకు నమస్కారము. చంద్రరూపుఁడవగు నీకు నమస్కారము. యజుస్స్వరూపుఁడవగు నీకు నమస్కారము. అధర్వస్వరూపుఁడవగు నీకు నమస్కారము. జ్ఞానమునకు ముఖ్యస్థానమగు నట్టియు నష్టమైన యజ్ఞానముఁగలట్టియు నీకు నమస్కారము. శుద్ధతేజస్స్వరూపుఁడవు నిర్మలస్వరూపుఁడవు నగునీకు నమస్కారము. వ్యాప్త

---

దేవస్య చరణౌ నిత్యసంవృతౌ, తాపయన్ గ్లాపయంశ్చైవ యుక్తతేజోఽభవత్తదా. ౧౮. యచ్చాస్య శాతితం తేజస్తేన చక్రం వినిర్మితం, యేన విష్ణుర్జఘానోగ్రాన్సదా వై దైత్యదానవాన్. ౧౯. శూలశక్తిగదావజ్రశరాసనపరశ్వధాన్, దేవతానాం దదౌ కృత్వా విశ్వకర్మా మహామతిః. ౨౦. త్రిదేవనిర్మితం స్తోత్రం సంధ్యయోరుభయో ర్జపన్, కులం పునాతి పురుషో వ్యాధిభిర్న చ పీడ్యతే. ౨౧. ప్రజావాన్సిద్ధకర్మా చ జీవేత్సాగ్రం శరచ్ఛతం, పుత్రవాన్ ధనవాంశ్చైవ సర్వత్ర చాపరాజితః, హిత్వా పురం భూతమయం గచ్ఛేత్సూర్యమయం పురమ్. ౨౨. భూయోఽపి తుష్టువుర్దేవాస్తథా దేవర్షయో రవిం, వాగ్భిరిత్థమశేషస్య త్రైలోక్యస్య సమాగతాః. ౨౩. దేవా ఊచుః.— నమస్తే రవిరూపాయ సోమరూపాయ తే నమః, నమో యజుఃస్వరూపాయాథర్వాయాంగిరసే నమః. ౨౪. జ్ఞానైకధామభూతాయ నిర్ధూతతమసే నమః, శుద్ధజ్యోతిఃస్వరూపాయ నిస్తత్త్వాయామలాత్మనే. ౨౫. నమోఽఖిలజగద్వ్యాప్తిస్వరూపాయాత్మమూర్తయే, సర్వకారణభూతాయ నిష్ఠాయై జ్ఞానచేతసామ్. ౨౬. నమోఽస్తు జ్ఞేయ

మైన స్వరూపముఁగలట్టియు జ్ఞానచేతస్కుల నిష్ఠయైనట్టియు సర్వకారణ భూతుఁడవైనట్టియు జ్ఞేయరూపుఁడును, దృశ్యమానరూపుఁడు నగునీకు నమస్కారము. శబ్దకర్తయు సంసారహేతువును సంధ్యాజ్యోత్స్నలను కలుగఁజేయునట్టియు నీకు నమస్కారము. నీవు సర్వమైనజగత్తును ద్రిప్పు చున్నావు. చరాచరరూపమగు నీబ్రహ్మాండమంతయు భ్రాంతరూపమై యున్నది. నీకిరణములతో సంబంధించుటవలన జగమంతయు శుభ్రమైనది. నీకిరణస్పర్శచే జలాదులు శుద్ధములగుచున్నవి. హోమదానాదికర్మలు నీవీ జగమునందెంతపర్యంతము సంయోగింపవో అంతపర్యంతము ఉపకారక ములు గానేరవు. నీవుదయింపఁగఁ జేయుహోమము ప్రశస్తము. ఋగ్వే దములు, యజుర్వేదములు నీస్వరూపమై ప్రకాశించుచున్నది. సమస్త మగు సామవేదములున్ను నీయందే ప్రకాశించుచున్నవి. ఎల్లప్పుడు నీ జగంబంతయు నీచేఁ బ్రకాశింపఁజేయఁబడుచున్నది. జగత్ప్రభుఁడవగు నోభాస్కరా! ఋగ్వేదమయుండవు. యజుర్వేదమయుండవు. సామవేద మయుండవుగానఁ ద్రయీమయుండవై యున్నావు. పరబ్రహ్మయు నపర బ్రహ్మయుఁగూడ నీవై యుంటివి. నీవు శరీరముకలవాఁడవు. లేనివాఁడవు. స్థూలసూక్ష్మరూపంబులఁ బ్రవర్తించువాఁడవు మఱియు నీవు నశ్వరం బగు నిమేషాదిరూపకాలమయుండవుగానఁ దేజోమయంబగు నీస్వరూప మును స్వేచ్ఛచే నుపసంహరింపుము. ఇట్లు దేవతలచేతను దేవర్షులచేతను

---

రూపాయ ప్రకాశే లక్షరూపిణే, భాస్కరాయ నమస్తుభ్యం తథా శబ్దకృతే నమః. ౧౭. సంసారహేతవే చైవ సంధ్యాజ్యోత్స్నాకృతే నమః, త్వం సర్వమేతద్భగవా జ్జగదై వ భ్రమతి త్వయా. ౧౮. భ్రమత్యావిద్ధమఖిలం బ్రహ్మాణ్డం సచరాచరమ్, త్వదం శుభిరిదం సర్వం సంస్పృష్టం జాయతే శుచి. ౧౯. క్రియతే త్వత్కరస్పర్శాజ్జలాదీనాం పవిత్రతా, హోమదానాదికో ధర్మో నోపకారాయ జాయతే. ౨౦. తావద్యావన్న సంయోగీ జగత్యత్ర భవాన్ఛుచిః, ప్రాతర్హోమం ప్రశస్తం హి ఉదితే త్వయి జాయతే. ౨౧. ఋచోఽథ సకలా హ్యేతా యజూంషి త్వం జగత్పతే, సకలాని చ సామాని తపత్యేవం జగత్సదా. ౨౨. ఋఙ్మయస్త్వం జగన్నాథ త్వమేవ చ యజుర్మయః, తథా సామమయశ్చైవ తతో నాథ త్రయీమయః. ౨౩ త్వమేవ బ్రహ్మణో రూపం పరం చాపరమేవ చ, మూర్తోఽమూర్తస్తథా సూక్ష్మః స్థూలరూప తయా స్థితః. ౨౪. నిమేషకాష్ఠాదిమయః కాలరూపః క్షయాత్మకః, ప్రసీద స్వేచ్ఛయా

స్తోత్రము చేయఁబడినవాఁడై సూర్యభగవానుఁడు తీక్ష్ణమగు తనతేజస్సును విడచెను. ఈసూర్యునియొక్క ఋగ్వేదమయంబగు తేజస్సుచేత భూమి యుత్పన్నంబయ్యె యజుర్వేదమయంబగు తేజస్సుచేత స్వర్గం బుత్పన్నం బయ్యె. సామమయంబగుభాగము సూర్యుఁడుగా నుండె. సూర్యుని యొక్క సంహృతమగుతేజస్సునం బదునేనుభాగంబులు నీశ్వరునియొక్క శూలంబుగా నిర్మింపఁబడియె. విష్ణుమూర్తియొక్క చక్రమున్ను అష్టవసువులయొక్కయు శంకరునియొక్కయు దారుణాయుధములున్ను షణ్ముఖుని శక్తియుఁ గుబేరునిశిబికయు మఱియుఁ దక్కుంగలదేవతల భయంకర శస్త్రంబులును యక్షవిద్యాధరులయొక్క యాయుధంబులును తత్తేజో భాగంబుచేతనే నిర్మింపంబడియె. సూర్యుఁడు పదునాఱవభాగమును ధరించియుండెను. ఆపదునైదుభాగంబులను విశ్వకర్మ యుపసంహరించెను. ఆకారణముచేత సూర్యుఁడు దర్శనీయరూపముగలవాఁడై యుత్తర కురుదేశంబులకు వెడలి బడబారూపమునుధరించిన సంజ్ఞయనువనితం గాంచెను. ఈమొదలగు నాచేఁ జెప్పఁబడిన సూర్యునికథను వినినమనుజుఁ డశ్వమేధయాగఫలమును బొందఁగలఁడు.

ఇది త్రయోవింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

రూపం స్వతేజోమయమాదిశ. ౭౫. ఇత్థం సంస్తూయమానస్తు దేవైర్దేవర్షిభిస్తథా, ముమోచ స్వం తదా తేజస్తేజసాం రాశిరవ్యయః. ౭౬. యత్తస్య ఋఙ్మయం తేజో భవితా తేన మేదినీ, యజుర్మయేనాపి దివం స్వయం సామమయో రవిః. ౭౭. శాతితా స్తేజసో భాగా యే చ స్యుర్దశ పంచ చ, తస్యైవ తేన శర్వస్య కృతం శూలం మహాత్మనా. ౭౮. చక్రం విష్ణోర్వసూనాం చ శంకరస్య చ దారుణమ్, షణ్ముఖస్య తథా శక్తిః శిబికా ధనదస్య చ. ౭౯. అన్యేషాం చాసురారీణాం శస్త్రాణ్యుగ్రాణి యాని వై, యక్షవిద్యాధరాణాం చ తాని చక్రే స విశ్వకృత్. ౮౦. తతశ్చ షోడశం భాగం బిభర్తి భగవాన్రవిః, తత్తేజసః పంచదశ శాతితా విశ్వకర్మణా. ౮౧. తతః సురూప దృగ్భానురుత్తరానగమత్కురూన్, దదర్శ తత్ర సంజ్ఞాం చ వడవారూపధారిణీమ్. ౮౨. ఇత్యేతన్నిఖిలం భానోః కథితం మునిసత్తమాః, శృణుయాద్యో నరో భక్త్యా అశ్వమేధ ఫలం లభేత్. ౮౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే బ్రహ్మర్షిసంవాదే పరితేఖవర్ణనం నామ త్రయోవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## చతుర్వింశత్యుత్తరశతతమాధ్యాయము.

బ్రహ్మదేవుం డిట్లనియె. సూర్యుని సర్వప్రధానంబులగు విషయంబులఁ జెప్పెద వినుఁడు. పూర్వకాలమున నీశ్వరుఁడు బ్రహ్మశిరఃకపాలమును ధరించి యుత్తమంబును ఫలపుష్పసమృద్ధంబునగు నొక్కయాశ్రమము సమీపించి దిగంబరుఁడై సంచరించుచుండెను. అచ్చటిమునులును మునిపత్నులును భిక్షాటనంబుజేయుచున్న సర్వేశ్వరునింజూచి క్షుభితమనస్కులైరి. మునులందఱును ఆదిగంబరుని జూచి వికృతహాస్యములం జేయుచు జాల రువ్వుచుఁ గఱ్ఱలచేఁ గొట్టుచు మిగుల బాధించుచుండిరి. తరువాత నీశ్వరుఁడు వారిబాధను సహింపఁజాల కాయాశ్రమమును వీడి సూర్యలోకంబున కేగెను. అట్లు పోవుతఱి మార్గమధ్యంబునఁ బ్రమథగణంబులు వానిం గాంచి యిట్లు పల్కిరి. దేవేశా! నీవెందులకై లోకమంతయు నిట్లు దిరుగుచుంటివి? అన నీశ్వరుం డిట్లనియె నేను పాపవిమోచనంబునకై తీర్థంబులను దేవాలయంబులను దిరుగుచుంటిని. అనిన విని ప్రమథగణంబులు "నీ వీసూర్యునియెదుటనే యుండుము. ఈసూర్యభగవానుఁడే నిన్నుఁ బవిత్రునింగాఁ జేయఁగలఁడు. నీవుపరిశుద్ధుఁడవై రుద్రలోకంబున కేగఁగలవు." అని చెప్పఁగా రుద్రుండు సూర్యపరితోషణార్థ మచ్చటనే నివసించి యుండెను. ఇట్లుండఁగా సూర్యుఁడు దిగంబరుఁడును జటాధారియుఁ ద్రిలోకతిరస్కృతమగు

---

బ్రహ్మోవాచః—వక్ష్యామ్యహం వః పునరేవ డిండేః సూర్యస్య సర్వప్రవర ప్రధానమ్, వ్యోమ్నః పరం తిష్ఠతి యస్తు మగ్నః స ముచ్యతే రుద్ర ఇహాపి డిండీ. ౧. స్థిత్వా పురా బ్రహ్మశిరః కిలాసౌ ప్రగృహ్య తత్తస్య శిరః కపాలమ్, తతో హ్యసావాశ్రమముత్తమం శివో బహూదకైః పుష్పఫలైః సమృద్ధమ్. ౨. నగ్నో యదా దారువనే మునీనాం దృష్ట్వా చ తం భైక్ష్యచరం సురేశమ్, మోషిత్సుతాః సంక్షుభితాస్తు సర్వే జగ్ముర్గృహం తం మునయః సుతుష్టాః. ౩. స హన్యమానో మునిముఖ్యసంఘైర్గృహీతలోష్టైర్ఋషిదండకాష్ఠైః, విహాయ డిండిః స తు తాన్సురర్షీంస్తతో రవేర్లోకమథాజగామ. ౪. ఆగచ్ఛమానం ప్రమథాస్తమూచుర్దేవేశ నిత్యం భ్రమసే కిమర్థమ్, స ప్రాహ తాన్పాపవిమోచనార్థమటామి తీర్థాని సురాలయాంశ్చ. ౫. తే భూయ ఊచుః ప్రమథాస్తమేవ మత్రైవ తిష్ఠస్వ రవేః పురస్తాత్, శుద్ధిం తవైష ప్రకరిష్యతీతి శుద్ధస్తతో యాస్యసి రుద్రలోకమ్. ౬. ఇత్యేవముక్తః ప్రమథైస్తు రుద్రస్తత్రైవ తస్థౌ రవితోషణాయ, నగ్నో

రూపముగలవాఁడు నగు నీశ్వరునింజూచి సంతుష్టుఁడై దేవేశా! నీవు నా యాశ్రమమునకు వచ్చుటచే సంతసించితిని. అస్మద్దర్శనముననే నీవును శుద్ధుఁడవై దిండి యనుపేరుతోఁ బ్రకాశించెదవు. అష్టాదశ ప్రమథగణంబులు, సూర్యరథస్థితులగు పదునల్గురు దేవతలు, ఋషిశ్రేష్ఠులు, గంధర్వులు, సర్పములు, యక్షులు, సిద్ధులు, నిశాచరులు. అప్సరఃకన్యలు సాయంప్రాతఃసంధ్యలయందు సూర్యునియందు నివసింతురు వారిసంఖ్య యెనుబదినాలుగు. వీరు ధాత్వర్థయోగముచే నన్వర్థసంజ్ఞులు, అనిన ఋషీశ్వరులు "కమలసంభవా! ధాతుశబ్దజులైన ప్రవరులను విస్తరముగా వినుటకుఁ గోరుచున్నాము." అనిన బ్రహ్మదేవుం డిట్లనియె. దండనాయకుఁడు, పింగళుఁడు, రాజ్ఞుఁడు, స్రోషుఁడు, దిండి మొదలగు వారలవిషయముఁ జెప్పెదను పూర్వ మీవిషయమును దేవతలు నాతోఁ జర్చించియుండిరి. ఉదయాసంపన్నుఁడగు సూర్యుఁడు రాక్షసులతో యుద్ధముఁజేయుచుండఁగా వారు వరముల సంపాదించి అమాత్యులు మొదలగువారలతోఁ గూడి సూర్యునిఁ జంపుట కుద్యుక్తులయిరి. ఆ కారణముచే మేము వారల విఘాతముకొఱకు ప్రవరులమై జన్మించితిమి. ఆరాక్షసులు మాచేఁ బ్రతిషేధింపఁబడినవారలై సూర్యునిఁ దేరిచూడ

---

జటీ ముష్టికపాలపాణీ రూపేణ చైవాప్రతిమస్త్రిలోకే. ౭. ఉక్తః స తుష్టేన తతః సవిత్రా ప్రీతోఽస్మి దేవాగమనాత్తవాహమ్, మద్దర్శనాదేవ భవాన్విశుద్ధో దిండీతి నామ్నా భవితాసి లోకే. ౮. అష్టాదశైతే ప్రమథాస్తు భానోశ్చతుర్దశాన్యే తు రవే రథస్థాః, హే దేవతే ద్వే చ ఋషిప్రధానా గంధర్వసర్పావపి తావదేవ. ౯. యక్షా చ సిద్ధా చ నిశాచరా చాదిత్యాత్మజావప్సరసాం ప్రధానా, వసంతి తే హ్యాస్తముషశ్చ సూర్యే తేషామశీతిశ్చతురోత్తరా సా. ౧౦. ఇత్యాదిదేవప్రవరాస్తు సర్వే ధాత్వర్థశబ్దైశ్చ భవంతి సిద్ధాః. ౧౧. ఋషయ ఊచుః.—విస్తరాద్బ్రూహి నో బ్రహ్మన్ప్రవరాన్ధాతుశబ్దజాన్, యతశ్చ కౌతుకం బ్రహ్మన్నస్మాకమిహ జాయతే. ౧౨. బ్రహ్మోవాచ.—భూయశ్చ వః ప్రవక్ష్యామి దండనాయకపింగలౌ, రాజ్ఞస్రౌషాదయశ్చాన్యే దిగ్దేవా దిండినా సహ. ౧౩. మయా సహ సమాగమ్య పురా దేవైర్విచారితమ్, ఏష కారుణికః సూర్యో యుధ్యతే దానవైః సహ. ౧౪. తే తు లబ్ధవరా భూత్వా అమాత్యాద్యా హ్యభీక్ష్ణశః, ఆదిత్యం మన్యమానాస్తే తపంతం హంతుముద్యతాః. ౧౫. తస్మాత్తేషాం విఘాతార్థం ప్రవరాశ్చ భవామహే,

లేరు. అని యిట్లాలోచించి కుమారస్వామి సూర్యునకు వామభాగమున నిలచెను. ఆతఁడే దండనాయకుఁడై లోకరక్షకుఁ డయ్యెను. అప్పుడు సూర్యుఁడు దండనాయకునింజూచి నీవు ప్రజలకు దండనమును విధించువాఁడవు గనుక దండనాయకుఁ డను పేరు నీకు సార్థకమైనది. మఱియుఁ బ్రజల సుకృత దుష్కృతములను వ్రాయుటచేతను దండనాయకుఁడను పేరును బొందితివి. అగ్నిదేవుఁడు దక్షిణపార్శ్వమునందుఁ బింగళవర్ణము గలవాఁడై యుండుటచేఁ బింగళుఁడని చెప్పఁబడియె. అశ్వినులు సూర్యున కుభయపార్శ్వములయం దుండిరి. అశ్వరూపమునఁ బుట్టుటచే అశ్వినులైరి. రాజ్ఞుఁడు స్రౌషుఁడు అను మహాబలోపేతులగు ద్వారపాలకు లిద్దఱు గలరు. రాజ్ఞుఁడనగఁ గుమారస్వామియు, స్రౌషుఁడన నీశ్వరుఁడును చెప్పఁబడును. "రాజృ దీప్తౌ" అను ధాతువునకు నకార ప్రత్యయము చేర్చుటచే రాజ్ఞశబ్ద ముత్పన్నమగును. సురసేనాపతిగాఁ బ్రకాశించుటవలనఁ గార్తికేయుఁడు రాజ్ఞసంజ్ఞ గలవాఁడయ్యెను. "స్రుగతౌ" అను ధాతువునకు (స) అను ప్రత్యయము చేర్పఁగా "స్రౌష" యను శబ్ద ముత్పన్నమగును రహస్యముగా వెళ్లుచున్నాఁడు అని దానియర్థమగుటవలన నీశ్వరునకు స్రౌషుఁ డనుసంజ్ఞ గలిగెను. బ్రాహ్మణోత్తములారా! ధర్మార్థాశ్రితంబగు ప్రథమద్వారమున లోకపూజితులగు నీరాజ్ఞ స్రౌషదేవు లిద్దఱును పాలకులైయుండిరి. రెండవ

---

అస్మాభిః ప్రతిరుద్ధాస్తే న ద్రక్ష్యంతి దివాకరమ్. ౧౬. సమ్మంత్ర్యైవం తతః స్కందో వామపార్శ్వే రవేః స్థితః, దండనాయకసంజ్ఞస్తు సర్వలోకస్య స ప్రభుః. ౧౭. ఉక్తశ్చ స తదార్కేణ త్వం ప్రజాదండనాయకః, దండనీతికరో యస్మాత్తస్మాత్త్వం దండనాయకః. ౧౮. లిఖతే యః ప్రజానాం చ సుకృతం యచ్చ దుష్కృతమ్, అగ్నిర్దక్షిణపార్శ్వే తు పింగలత్వాత్స పింగలః. ౧౯. అశ్వినౌ చాపి సూర్యస్య పార్శ్వయోరుభయోః స్థితౌ, అశ్వరూపాత్సముత్పన్నౌ తేన తావశ్వినౌ సురౌ. ౨౦. ద్వారపాలౌ స్మృతౌ తస్య రాజ్ఞః శ్రేష్ఠౌ మహాబలౌ, కార్తికేయః స్మృతో రాజ్ఞః స్రౌషశ్చాపి హరః స్మృతః. ౨౧. రాజృదీప్తౌ స్మృతో ధాతుర్నకారస్తస్య ప్రత్యయః, సురసేనాపతిత్వేన స యస్మాద్దీప్యతే సదా, తస్మాత్స కార్తికేయస్తు నామ్నా రాజ్ఞ ఇతి స్మృతః. ౨౨. స్రుగతౌ చ స్మృతో ధాతుర్యస్య స ప్రత్యయః స్మృతః, గచ్ఛతీతి రహస్తస్మాత్పర్యాయాత్స్రౌష ఉచ్యతే. ౨౩. ప్రథమం యద్భవేద్ద్వారం ధర్మార్థాభ్యాం సమా

ద్వారమునం దతిరస్కృతబలోపేతులగు గరుడుఁడును ప్రేతనాయకుఁడగు యముఁడును రక్షకులై యుండిరి. వారలకుఁ గల్మాషపక్షులనిగూడఁ బేరు గలదు. శబలవర్ణము గలవాఁడగుటచే యముఁడు కల్మాషుఁడనియు, ఱెక్కలుగలవాఁడగుటచే గరుడుఁడు పక్షియనియుఁ జెప్పఁబడియె. ఆదేవునకు యముఁడు దండహస్తుఁడై దక్షిణపార్శ్వమున నుండెను. కుబేరుఁడును, వినాయకుఁడును, సూర్యుని యుత్తరపార్శ్వమున నుండిరి. కుబేరుఁడు ధనదుఁడనియు వినాయకుఁడు హస్తిరూపుఁడనియుఁ దెలియవలయును కోపముచే నీబడిన కుత్సితశరీరము గలవాఁడవుగమ్ము అను శాపమునకుఁ బాత్రుఁడగుటచే నీధనదుఁడు గుబేరుఁడనునామము గలవాఁడయ్యెను. సర్వజంతువులకు నాయకుఁడగుటచే నాయకుఁడనియు "వివిధం నయతేయస్మాత్ స వినాయకః" అను విగ్రహామువలన వినాయకుఁడని చెప్పఁబడియె. రైవతుఁడును దిండియు సూర్యుని యుభయపార్శ్వముల యందుండిరి. రుద్రుఁడు దిండియని చెప్పఁబడియెను. సూర్యునికుమారుఁడగు రేవతుఁడు ప్లుతమును బొందినవాఁడగుటచే (రేవృ ప్లవగతౌ) అను ధాతువుచే రైవతుఁ డనుపేరు బొందెను. "డీఙ్ గతౌ" అను ధాతువు నుండి దిండిశబ్దము నిపతింపఁబడెను. ఈదిండి యెల్లప్పుడు నెగురుచుండుటచేఁ దిండియను నామముచేఁ బ్రసిద్ధిఁబొందెను. ఈప్రకారముగాఁ బ్రవరులధాత్వర్థములను శాస్త్రోక్తముగాఁ జెప్పితిని. వారలసంఖ్యనుగూడ

---

శ్రీతమ్, తత్రైతౌ సంస్థితౌ దేవౌ లోకపూజ్యౌ ద్విజోత్తమాః. ౨౪. ద్వితీయాయాం తు కక్షాయామప్రధృష్టౌ వ్యవస్థితౌ, పక్షిప్రేతాధిపౌ నామ్నా స్మృతౌ కల్మాషపక్షిణౌ. ౨౫. వర్ణస్య శబలత్వాచ్చ యమః కల్మాష ఉచ్యతే, పక్షావస్యేతి యః పక్షీ గరుడః పరికీర్తితః. ౨౬. స్థితో దక్షిణతస్తస్య దండహస్తసమన్వితః, ఉత్తరేణ స్థితోఽర్కస్య కుబేరశ్చ వినాయకః. ౨౭. కుబేరో ధనదో జ్ఞేయో హస్తిరూపో వినాయకః, కుత్సయా కుప్యతా శప్తం కుశరీరమజాయత, కుబేరః కుశరీరత్వాత్స నామ్నా ధనదః స్మృతః. ౨౮. నాయకః సర్వసత్త్వానాం తేన నాయక ఉచ్యతే, వివిధం నయతే యస్మాత్స తు తస్మాద్వినాయకః. ౨౯. రైవతశ్చైవ దిండిశ్చ తౌ రవేః పూర్వతః స్థితౌ, తతో దిండిః స్మృతో రుద్రో రేవతస్తనయో రవేః. ౩౦. ప్లుతం గచ్ఛత్యసౌ యస్మాత్సర్వలోకనమస్కృతః, రేవృ ప్లవగతౌ ధాతూ రేవతస్తేన స స్మృతః. ౩౧. డీఙ్గతావస్య వై ధాతోర్దిండిశబ్దో నిపాత్యతే, డయతేఽసౌ సదా దిండీ తేన దిండీ ప్రకీర్తితః. ౩౨. ఇత్యేతే ప్రవరాః ప్రోక్తా ధాత్వర్థా నైగమైః శుభైః, ఏషాం

సంక్షేపముగాఁ జెప్పెదను. అశ్వినీదేవత లిద్దఱును, దండనాయకపింగళులును, సూర్యద్వారపాలకులగు రాజ్ఞ స్రోషులును, రైవతుఁడును, దిండియు అను నీమొదలగు పదునెనమండ్రు ప్రవరులు గలరు. ఈ ప్రవరులందఱును రాక్షసులను సంహరింపవలయు నను మనీషతో నాయుధపాణులై సూర్యు నావరించియుండిరి. సమానరూపులు, అన్యరూపులు, విరూపులు, కామరూపులు నగు వీరందఱును మహాబలసంపన్నుఁడగు గరుత్మంతుఁడును సూర్యు నావరించియే యుండిరి. 'దివ్ క్రీడాయాం' అను ధాతువునుండి దేవతాశబ్దము పుట్టెను. క్రీడాసంపన్నులని యర్థము. ఆకారణమున దేవతలని చెప్పఁబడిరి. ఋగ్యజుస్సామవేదము లనువానిని నేను పూర్వమందుఁ జెప్పియుంటినే అవి యన్నియు సూర్యుని నానారూపములై లోకమందంతటను వ్యాపించియుండెను. సుమంతుం డిట్లనియె ఈఋషులందఱు పూర్వోక్తప్రకారముగా బ్రహ్మచేఁ జెప్పఁబడినవారై సూర్యదేవునారాధించి సిద్ధిమంతులై సూర్యలోకమునం దుండిరి.

ఇది చతుర్వింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

సంక్షేపతో భూయః సంఖ్యాం వో నిగదామి వై. 33. అశ్వినౌ తౌ తతో జ్ఞేయౌ దండనాయకపింగలౌ, తౌ సూర్యద్వారపౌ జ్ఞేయౌ రాజ్ఞస్రోషౌ తతః స్మృతౌ. 34. రేవతశ్చైవ దిండిశ్చ ఇత్యేతే ప్రవరా మయా, అష్టాదశ సమాఖ్యాతాః సంక్షేపాత్సంఖ్యయా మయా. 35. ఇత్యేభిర్నామభిస్త్వన్యే దానవానాం జిఘాంసయా, పరివార్య స్థితాః సూర్యం నానాప్రహరణాయుధాః. 36. సరూపాశ్చాన్యరూపాశ్చ విరూపాః కామరూపిణః, పరివార్య స్థితాః సూర్యం గరుడశ్చ మహాబలః. 37. ధాతుర్దివితి వై ప్రోక్తో క్రీడాయాం స తు ఉచ్యతే, క్రీడంతే దివి వై యస్మాత్తస్మాత్తే దైవతాః స్మృతాః. 38. ఋచో యజూంషి సామాని యాన్యుక్తానీహ వై మయా, నానారూపైః స్థితాన్యేవ రవేస్తాని సమన్తతః. 39. సుమంతురువాచ.— ఇత్యేవముక్తవాన్బ్రహ్మా ఋషీణాం పృచ్ఛతాం పురా, తే శ్రుత్వారాధ్య దేవేశం సంసిద్ధా దివి సంస్థితాః. 40.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే బ్రహ్మర్షిసంవాదే ప్రవరవర్ణనం నామ చతుర్వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

## పంచవింశత్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా ! సూర్యునియెదుట వీక్షింపఁబడు నీయాకాశ మెవనిస్వరూపమో అది యెట్టిదియో తెలియఁ గోరుచుంటిని. అనిన సుమంతుం డిట్లనియె. రాజా ! సూర్యాయుధమగు నాకాశమునుగూర్చి చెప్పుచుంటిని అది యెవ్వని స్వరూపమో దాని యందు దేవత లెట్లుండిరో అట్టిచతుశ్శృంగమైనట్టియు విస్తృతమై వ్యోమశబ్దాభిధేయమగు సూర్యునియాయుధమునుండి యాకాశము బుట్టెను. ఈ వ్యోమ కలిపురుషునకు భూమిగాఁ జెప్పఁబడినది. మఱియు నీవ్యోమ వరుణునకు పాశమువలె బ్రహ్మదేవునకు హుంకారమువలె విష్ణువునకుఁ జక్రమువలె, ఈశ్వరునకుఁ ద్రిశూలమువలె ఇంద్రునకు వజ్రాయుధమువలె, సూర్యునకు నాయుధముగాఁ జెప్పఁబడియెను. ఆ యాకాశమునందు యజ్ఞసంబంధులగు ముప్పదిముగ్గురు దేవతలు క్రీడించుచుందురు. వార లెవ్వరనిన హరుఁడు, వర్షశుద్ధుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, వృషాకపి, శంభుఁడు, రైవతుఁడు, ఈశ్వరుఁడు, భువనుఁడు, రుద్రుఁడు అనువారు ఏకాదశరుద్రు లనఁబడుదురు. సూర్యుని యొక్క నామములును, విష్ణువు, చక్రము, అష్టవసువులు కలసి ముప్పది ముగ్గురు ఆర్యముఁడు, మిత్రుఁడు, భగుఁడు, వరుణుఁడు, వివస్వంతుఁడు

---

శతానీక ఉవాచ.—యదేతద్దృశ్యతే వ్యోమ సూర్యస్య పురతో ద్విజ, తదుచ్యతే కిమాత్మా చ కథంభూతశ్చ కథ్యతామ్. ౧. సుమంతురువాచ.—హంత వ్యోమ ప్రవక్ష్యామి సూర్యప్రహరణం శుభమ్, యదాత్మకం హి యత్ప్రోక్తం యథా వసంతి దేవతాః. ౨. పురస్తాచ్చ చతుశ్శృంగం తద్వ్యోమాయతనం రవేః, వ్యోమశబ్దం చతుశ్శృంగం సర్వదేవమయం చ యత్. ౩. గైరికార్ణవసంభూతం యదంతర్గర్భమాశ్రితమ్, తత్రోత్పన్నమిదం వ్యోమ కలేర్వ్యోమ మహీ స్మృతా. ౪. వరుణస్య యథా పాశో హుంకారో వేధసో యథా, విష్ణోశ్చాపి యథా చక్రం త్రిశూలం త్ర్యంబకస్య చ. ౫. ఇంద్రస్య చ యథా వజ్రం తథా వ్యోమ రవేః స్మృతమ్, తస్మిన్వ్యోమ్ని త్రయస్త్రింశత్క్రీడన్తో యజ్ఞియాః సురాః. ౬. హరశ్చ వర్షశుద్ధశ్చ త్ర్యంబకశ్చాపరాజితః, వృషాకపిశ్చ శంభుశ్చ కపర్దీ రైవతస్తథా, ఈశ్వరో భువనశ్చైతే రుద్రా ఏకాదశ స్మృతాః. ౭. ఆదిత్యానాం చ నామాని విష్ణోశ్చక్రస్య దీయతామ్, అర్యమా చ తథా మిత్రో భగోఽథ వరుణస్తథా. ౮. వివస్వాన్సవితా చైవ పూషా త్వష్టా

సవితృఁడు, పూషుఁడు, త్వష్టృఁడు, అంశుఁడు, భగుఁడు, అతితేజుఁడు, ఆదిత్యుఁడు అను నీ పదునిద్దఱును ద్వాదశాదిత్యులని చెప్పఁబడుదురు. ధ్రువుఁడు, ధరుఁడు, సోముఁడు, జలము, అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాతుఁడు అను నీయెనమండుగురును అష్టవసువులని చెప్పఁబడుదురు. నాసత్యుఁడు, దస్రుఁడు అను నీయిద్దఱు అశ్వినులని చెప్పఁబడుదురు. ఇక విశ్వేదేవులనుగూర్చి చెప్పెదఁ దెలిసికొనుము. క్రతువు, దక్షుఁడు, వసువు, సత్యుఁడు, కాలుఁడు, కాముఁడు, ధృతి, కురువు, శంకుమాత్రుఁడు, వామనుఁడు అను నీపదుగురును విశ్వేదేవులు. ఈపదుగురును ఇప్పుడున్న విశ్వేదేవులు. భవిష్యత్కాలికవిశ్వేదేవులఁ జెప్పెద నాకర్ణింపుము. యముఁడు, తుషితులు, వసువులు, వశవర్తినులు, సత్యులు, భూతరజస్కులు, సాధ్యులు. వీరు వారలకు అనంతరకాలికులగు విశ్వేదేవులు మన్వంతరమునకుఁ బన్నిద్దఱచొప్పున నాఱుమన్వంతరములు దేవతలును, పారావతులును, ఇతరులును, తుషితులతోఁగూడ నుందురు. సాధ్యదేవతలనామముల వివరించెద నాకర్ణింపుము. మనుఁడు అనుమంత్రుఁడు, ప్రాణుఁడు, నరుఁడు, నారాయణుఁడు, వృత్తిలంబుఁడు, మనువు, సముఁడు, ధర్ముఁడు, వీర్యవంతుఁడు, విత్తస్వామి, ప్రభువు అను నీపదునిద్దఱు సాధ్యులని చెప్పఁబడుదురు. ఈదేవతలు యజ్ఞహావిర్భాగభోక్తలగుటచే సర్వలోకపూజితులై యుందురు వీరదితియందుఁ గశ్యపు

---

తథైవ చ, అంశో భగశ్చాతితేజా ఆదిత్యా ద్వాదశ స్మృతాః. ౯. ధ్రువో ధరశ్చ సోమశ్చ ఆపశ్చైవానిలోనలః, ప్రత్యూషశ్చ ప్రభాతశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః. ౧౦. నాసత్యశ్చైవ దస్రశ్చ స్మృతౌ ద్వావశ్వినావుభౌ, విశ్వేదేవాన్ప్రవక్ష్యామి నామతస్తాన్నిబోధత. ౧౧. క్రతుర్దక్షో వసుః సత్యః కాలకామౌ ధృతిః కురుః, శంకుమాత్రో వామనశ్చ విశ్వేదేవా దశ స్మృతాః. ౧౨. వర్తమానా ఇమే దేవా భవిష్యానంతరే శృణు, యమశ్చ తుషితాశ్చైవ వసవో వశవర్తినః. ౧౩. సత్యాశ్చ భూతరజసః సాధ్యాశ్చ తదనంతరాః, షట్సు మన్వంతరేష్వేవం దేవా ద్వాదశద్వాదశ, పారావతాస్తథా చాన్యే తే హ్యసంస్తుషితైః సహ. ౧౪. సాధ్యాన్దేవాన్ప్రవక్ష్యామి నామతస్తాన్నిబోధ మే, మనోఽనుమంతా ప్రాణశ్చ నరో నారాయణస్తథా. ౧౫. వృత్తిలమ్బో మనుశ్చైవ సమో ధర్మశ్చ వీర్యవాన్, విత్తస్వామీ ప్రభుశ్చైవ సాధ్యా ద్వాదశ కీర్తితాః. ౧౬. ఏతే యజ్ఞభుజో దేవాః సర్వలోకేషు పూజితాః,

నకు జన్మించిరి. విశ్వమునందు వసువులును సాధ్యులును ధర్మసూనులుగాఁ దెలిసికొనవలయును. ఈరీతిగనే ధర్మసుతుఁడగు సోముఁడు మూఁడవ వసువుగాఁ జెప్పఁబడియెను. ఈధర్ముఁడు బ్రహ్మకుమారుఁడని పురాణముల యందు నిశ్చితమైయున్నది. తరువాత నింద్రులను (మను) వసువులను దెలియఁజేతు వినుమని మఱల నిట్లనియె. ప్రథమమున స్వాయంభువ మనువు, స్వారోచిషమనువు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు అను నీయాఱుగురు నతిక్రమించిరి. ఇప్పు డేడవమనువు. వైవస్వతమను వనువాఁడు వచ్చెనని తెలుసుకొనవలయును. రాఁబోవు వారును ఏఁడుగురు గలరు. అర్కసావర్ణి, బ్రహ్మసావర్ణి, భవసావర్ణి, ధర్మసావర్ణి, దక్షసావర్ణి అని ఐదుగురు సావర్ణులు. రౌచ్యభౌవ్య అను వారలతోఁ గలసి ఏడుగురు. వీరు రాఁబోవుమనువులు. తొలుత విష్ణు భుక్కనువాఁ డింద్రుఁడు. విద్యుతి, విభువు, ప్రభువు, శిఖి, మనోజవుఁడు, ఓజస్వి (యిప్పటియింద్రుఁడు) బలి, (రాఁబోవునింద్రుఁడు) అద్భుతుఁడు, త్రిదివుఁడు, ఇంద్రుఁడు, సుసాత్వికుఁడు, కీర్తి, శతధాముఁడు, దివస్పతి అను నీపదునలుగురును భూతభవిష్యద్వర్తమానకాలికేంద్రులై యొప్పు చున్నారు. కశ్యపుఁడు, అత్రి, వశిష్ఠుఁడు, భరద్వాజుఁడు, గౌతముఁడు, విశ్వామిత్రుఁడు, జమదగ్ని అనువీరు సప్తర్షు లనంబడుదురు. తరువాత

---

అదిత్యామేవ తే ధీర కశ్యపస్యాత్మజాః స్మృతాః. ౧౭. విశ్వే చ వసవః సాధ్యా విజ్ఞేయా ధర్మసూనవః, ఏవం ధర్మసుతః సోమస్తృతీయో వసురిష్యతే. ౧౮. ధర్మోఽపి బ్రహ్మణః పుత్రః పురాణే నిశ్చయం గతః, అథ చేన్ద్రాన్వసూంశ్చైవ నామభిశ్చ నిబోధ మే. ౧౯. స్వాయంభువో మనుః పూర్వం తతః స్వారోచిషః స్మృతః, ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుషస్తథా. ౨౦. ఇత్యేతే షడతిక్రాంతాః సప్తమః సాంప్రతో మనుః, వైవస్వతేతి విజ్ఞేయో భవిష్యాః సప్త చాపరే. ౨౧. ఏషామాద్యో ర్కసావర్ణిర్బ్రహ్మసావర్ణిరేవ చ, తస్మాచ్చ భవసావర్ణిర్ధర్మసావర్ణిరిత్యత. ౨౨. పంచమో దక్షసావర్ణిః సావర్ణిః పంచ కీర్తితాః, రౌచ్యో భౌవ్యశ్చ ద్వావన్యావిత్యేతే మనవః స్మృతాః. ౨౩. ఇంద్రస్తు విష్ణుభుగ్జ్ఞేయో విద్యుతిస్తదనంతరమ్, విభుః ప్రభుశ్చైవ శిఖీ తథైవ చ మనోజవః. ౨౪. ఓజస్వీ సాంప్రతస్త్వింద్రో బలిర్భావ్యస్తతః పరమ్, అద్భుతస్త్రిదివశ్చైవ దశమస్త్వింద్ర ఉచ్యతే. ౨౫. సుసాత్వికశ్చ కీర్తిశ్చ శతధామా దివస్పతిః, ఇతి భూతా భవిష్యాశ్చ ఇంద్రా జ్ఞేయాశ్చతుర్దశ. ౨౬. కశ్యపోఽత్రిర్వశిష్ఠశ్చ భరద్వాజశ్చ గౌతమః, విశ్వామిత్రో జమదగ్నిః సప్తైతే ఋషయః స్మృతాః.

నగ్నిపరిగ్రహాము లగువాయువులను జెప్పెద నాకర్ణింపుము. ప్రవహాము, ఆవహాము, ఉద్వహాము, సంవహాము, వివహాము, పరివహాము, నివహాము ఈయేఁడును ప్రత్యేకమార్గములుగలవై ఆకాశమున సంచరించును. పేరు చేతనే శుద్ధమగు సూర్యాగ్ని శుచియనియు, వైద్యుతాగ్ని పావకుఁడనియు, మథితమగుపావనాగ్ని పవమానుఁడనియు మూఁడగ్నులు జెప్పఁబడినవి. ఈయగ్నులకుఁ బుత్రపౌత్రులు నలుబదిమంది గలరు. ఈరీతిగనే వాయువులకును పుత్రపౌత్రులు నలుబదితొమ్మండ్రు గలరు. ఋతువును, సంవత్సరమును అగ్నిస్వరూపములు. ఆయగ్నికి ఋతువులు జనియించెను. ఆఋతుపుత్రులు ఐదుగురు గలరు. ఇది సనాతనసృష్టిక్రమము. సంవత్సరుఁడు, పరివత్సరుఁడు, ఇద్వత్సరుఁడు, వత్సరుఁడు, అనువత్సరుఁడు నను వారలు. వారిలో అగ్ని సంవత్సరుఁడు, సూర్యుఁడు పరివత్సరుఁడు, సోముఁడు ఇద్వత్సరుఁడు, రుద్రుఁడు వత్సరుఁడు,వాయు వనువత్సరుఁడును. ఈ అయిదుగురును యుగదేవతలై వెలయుచుండిరి. ఋతుసంబంధులగు పితరులు గ్రతుసూనులని తెలియవలయును. పితామహులు బ్రహ్మయొక్క పంచాబ్దములని తెలియవలయును. బ్రహ్మకుమారులగు పితామహులు ఐదువత్సరములవయస్సుగలవారని తెలిసికొనవలయును. సౌమ్యుఁడు, బర్హిషదులు, అగ్నిష్వాత్తులును నీముప్వురును జీవత్పితృకులగు మను

---

౨౭. అతః పరం ప్రవక్ష్యామి మరుతోఽగ్నిపరిగ్రహాన్, ప్రవహోథావహశ్చైవ ఉద్వహః సంవహస్తథా. ౨౮. వివహో నివహశ్చైవ పరివాహస్తథైవ చ, అంతరిక్షచరా హ్యేతే పృథఙ్మార్గవిసారిణః. ౨౯. సూర్యోఽగ్నిశ్చ శుచిర్నామ్నా వైద్యుతః పావకః స్మృతః, నిర్మంథః పవమానోఽగ్నిస్త్రయః ప్రోక్తా ఇమేఽగ్నయః. ౩౦. అగ్నీనాం పుత్రపౌత్రాస్తు చత్వారింశత్తథైవ తు, మరుతామపి సర్వేషాం విజ్ఞేయాః సప్తసప్తకాః. ౩౧. ఋతుః సంవత్సరోఽప్యగ్నిరృతవస్తస్య జజ్ఞిరే, ఋతుపుత్రాశ్చ వై పంచ ఇతి సర్గః సనాతనః. ౩౨. సంవత్సరస్తు ప్రథమో ద్వితీయః పరివత్సరః, ఇద్వత్సరస్తృతీయస్తు చతుర్థస్త్వనువత్సరః. ౩౩. పంచమో వత్సరస్తేషామిత్యేవం పంచ తే స్మృతాః, తేషు సంవత్సరో హ్యగ్నిః సూర్యస్తు పరివత్సరః. ౩౪. సోమ ఇద్వత్సరస్తేషాం వాయుశ్చైవానువత్సరః, రుద్రస్తు వత్సరో జ్ఞేయః పంచైతా యుగదేవతాః. ౩౫. ఆర్తవాః పితరో జ్ఞేయా యే జాతాః క్రతుసూనవః, పితామహాస్తు విజ్ఞేయాః పంచాబ్దాః బ్రహ్మణః సుతాః. ౩౬. సౌమ్యా బర్హిషదశ్చైవ అగ్ని

ష్యులకుఁ (దండ్రులు) బితరులు ఆదిత్యుఁడును, సోముఁడు, లోహి తాంగుఁడు, బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శని, యుపరాగుఁడు, శిఖి యను నీతొమ్మండ్రును గ్రహములని చెప్పఁబడుదురు. ఈనవగ్రహములు మూఁడులోకములకున్ను భావాభావముల నివేదింతురు. సూర్యచంద్రులు మండలగ్రహములనియు, రాహువు ఛాయాగ్రహమనియు, శేషములు తారాగ్రహములనియుఁ దెలిసికొనవలెను. చంద్రుని నక్షత్రాధిపతిగను, సూర్యుని గ్రహరాజుగను జెప్పుచున్నారు. మఱియు సూర్యు నగ్నిగను, చంద్రు నుదకముగను, సూర్యుని బ్రహ్మనుగను, చంద్రుని విష్ణునిగను, బృహస్పతి నీశ్వరునిగను జెప్పుచున్నారు. మఱియు సూర్యుఁడు కశ్యపుని కొమరుఁడు. చంద్రుఁడు ధర్మసుతుఁడు. దేవాసురులగురువులు గురు శుక్రులను మహాగ్రహములని చెప్పఁబడుదురు. శుక్రబృహస్పతు లిద్దఱు ప్రజాపతి కొమరులు. బుధుఁడు చంద్రునికొమరుఁడు. శ్రీమంతుఁడగు శనైశ్చరుఁడు సూర్యునికొమరుఁడు. రాహువు సింహికకుమారుఁడు. కేతువు బ్రహ్మకుమారుఁడు. అని ఈరీతిగ మాతాపితృక్రమము నిర్ణ యింపఁబడెను. సూర్యుఁడు అన్నిగ్రహములకంటె నధోభాగమున సంచ రించుచుండును. సూర్యమండలమునకుఁ గొంచెము దూరమునఁ జంద్ర మండల ముండును. అటుపైని నక్షత్రమండలమును, తఱువాత కుజ

---

ష్వాత్తాశ్చ యే త్రయః, ఏతే వై పితరస్తేషాం యే జీవత్పితృకా నరాః. ౩౭. ఆదిత్యశ్చైవ సోమశ్చ లోహితాంగో బుధస్తథా, బృహస్పతిశ్చ శుక్రశ్చ తథా హేలి సుతశ్చ యః. ౩౮. ఉపరాగః శిఖీ చోభౌ నవైతే ను గ్రహాః స్మృతాః, త్రైలోక్యస్య త్విమే నిత్యం భావాభావనివేదకాః. ౩౯. ఆదిత్యశ్చైవ సోమశ్చ ద్వావేతౌ మండల గ్రహౌ, రాహుశ్ఛాయాగ్రహస్తేషాం శేషాస్తారాగ్రహాః స్మృతాః. ౪౦. నక్షత్రాధి పతిః సోమో గ్రహరాజో దివాకరః, పఠ్యతే చాగ్నిరాదిత్య ఉదకశ్చంద్రమాః స్మృతః. ౪౧. ఆదిత్యః పఠ్యతే బ్రహ్మ విష్ణుస్తేషాం తు చంద్రమాః, మహేశ్వరస్తు విజ్ఞేయస్తృతీయస్తారకగ్రహః. ౪౨. కశ్యపస్య సుతః సూర్యః సోమో ధర్మసుతః స్మృతః, దేవాసురగురూ ద్వౌతు నామతస్తౌ మహాగ్రహౌ. ౪౩. ప్రజాపతిసుతావేతౌ పుభౌ శుక్రబృహస్పతీ, బుధః సోమాత్మజః శ్రీమాఞ్ఛనీ రవిసుతః స్మృతః. ౪౪. సింహికాయాః సుతో రాహుః కేతుస్తు బ్రహ్మణః సుతః, సర్వేషాం చ గ్రహాణాం హి అధస్తాచ్చరతే రవిః. ౪౫. తతో దూరం స్మృతం తావద్విధోర్నక్షత్రమండలం,

బుధులును, ఆపైని శ్వేతాహ్వుఁడు, అటుపైని మాహేశ్వరుఁడును, ధిషణుఁడును, కృష్ణుఁడును, చిత్రశిఖండిజుఁడును అనువీరు కొంచెము కొంచెము దూరమున నుండిరి. స్వర్గము ధ్రువమండలాసక్తమై యుండెను. ఆదిత్యనిలయుఁడగు రాహువు చంద్రమార్గమును గూడ నొకప్పు డను సరించును. కేతు వెల్లప్పుడును సూర్యమార్గమునందె సంచరించును. భార్గవసంచారవిస్తారము తొమ్మిదివేల యోజనములు శనివిస్తారము సూర్య విస్తారమునకు (రెండింతలు) ద్విగుణముగా నుండును. నక్షత్రవిస్తారము చంద్రవిస్తారముకంటె త్రిగుణముగా నుండును. నక్షత్రవిస్తారముకంటె గురుమండలము నాల్గవవంతు తక్కువగను బృహస్పతికంటె శుక్రాంగార కులు నాల్గవవంతు తక్కువగను నుందురు. బుధుఁడు శుక్రాంగారకుల కంటె నాల్గవవంతు తక్కువగను నక్షత్రములు బుధతుల్యముగను నుందురు. మిగిలిన సామాన్యనక్షత్రములు యోజనము. అర్ధయోజనము అంతకుఁ దక్కువగాక యుండును. రాహువు సూర్యప్రమాణముగల వాఁడు ఒకప్పుడు చంద్రునితో సమానుఁడుగ నుండును. కేతువు అని యతుఁడు. నక్షత్రములకును గ్రహములకును సమానుఁడుగ నుండును. చంచలుఁడగుటవలన అజ్ఞాతగతియు బహురూపధరుఁడగుటచే నలక్షిత రూపుఁడు నగును. పృథివి భూర్లోకమనియు, అంతరిక్షము భువర్లోక

నక్షత్రేభ్యః కుజబుధౌ శ్వేతాహ్వ స్తదనంతరమ్. ౪౬. తస్మాన్మాహేశ్వరశ్చోర్ధ్వం ధిషణ స్తదనంతరం,కృష్ణశ్చోర్ధ్వం తత స్తస్మాదథ చిత్రశిఖండిజః. ౪౭. ఏషామేవ క్రమః ప్రోక్త శ్చాసక్తం త్రిదివం ధ్రువే, ఆదిత్యనిలయో రాహుః కదాచిత్సోమమార్గగః. ౪౮. సూర్యమండలసంస్థస్తు శిఖీ సర్పతి సర్వదా, నవయోజనసాహస్రో విస్తారో భార్గవస్య తు. ౪౯. ద్విగుణః సూర్యవిస్తారాద్విస్తారః శనినః స్మృతః, త్రిగుణం మండలం జ్ఞేయం నాక్షత్రం విస్తరాద్విధోః. ౫౦. నక్షత్రమండలా త్తత్ర పాదహీనో బృహస్పతిః, బృహస్పతేః పాదహీనః శుక్రో౽౦గారక ఏవ హి. ౫౧. విస్తారో మండలానాం తు పాదహీన స్తయోర్బుధః, బుధతుల్యాని ఋక్షాణి సర్వఋక్షాణి యాని తు. ౫౨. యోజనాన్యర్ధమాత్రాణి తేభ్యో హ్రస్వం న విద్యతే, రాహుః సూర్యప్రమాణశ్చ కదాచిత్సోమసన్నిభః. ౫౩. నక్షత్రగ్రహమానస్తు కేతు స్త్వనియతః స్మృతః, అవిజ్ఞాత గతిశ్చైవ చంచలత్వాన్నరాధిప. ౫౪. తథాలక్షితరూపస్తు బహురూపధరో హి సః, భూర్లోకః పృథివీ ప్రోక్తా అంతరిక్షం భువః స్మృతమ్. ౫౫. స్వర్లోకస్త్రిదివం జ్ఞేయం

మనియు, స్వర్గము స్వర్లోకమనియును దెలిసికొనవలెను. మిగిలినవి యథా క్రమముగ నూహింపనగును. అగ్ని దేవుఁడు ఎల్లప్పుడు భూపతియగుటచే భూపతియనియును, వాయువు నభస్పతియనియు, సూర్యుఁడు దివస్పతి యనియుఁ జెప్పుచుందురు. గంధర్వులు, అప్సరసలు, గుహ్యకులు, సిద్ధులు, రాక్షసలు మొదలగువారు భూర్లోకవాసులు. అంతరిక్షవాసులఁ జెప్పెద నాకర్ణింపుము. ఏడవస్కంధమున సప్తవాయువులు, నేకాదశరుద్రులు, నిద్దఅశ్వినులు, ద్వాదశాదిత్యులును, అష్టవసువులు, గోగణములు నివ సింతురు. నాల్గవదగు మహర్లోకమునందుఁ గల్పవాసులు ప్రజాపతు లతోఁ గూడియుందురు. ఐదవదగు జనలోకమం దెల్లప్పుడును భూమి జులు నివసింతురు. ఆఱవలోకమందు సనత్కుమారాదులు వైరాజులు ఆశ్రయముగొని వసింతురు. ఏఁడవలోకమునఁ బునర్జన్మరహితులగువారు సత్యవంతులై నివసింతురు. అయ్యది ప్రతిఘాతములేని బ్రహ్మలోకమని చెప్పఁబడును. ఓకురునందనా! ఆలోకమున నితిహాసపురాణవేత్తలు క్రీడించుచు నెల్లపుడు బురాణశ్రవణము చేయుదురు. భూలోకమునకు నూఱువేలయోజనములకుఁబైన సూర్యుఁడును, నూఱుకోట్లయోజన ములదూరమున ధ్రువుఁడు నుండిరి. అంతకు నిరువదిలక్షలయోజనముల దూరమునఁ ద్రైలోక్యోత్సేధమని చెప్పఁబడెను ధ్రువునికిఁబైన ననేకవేల

శేషాదూర్ధ్వం యథాక్రమం, భూపతిస్తు సదా త్వగ్నిస్తేనాసౌ భూపతిః స్మృతః. ౫౬. వాయుర్నభస్పతిస్తేన తథా సూర్యో దివస్పతిః, గంధర్వాప్సరసశ్చైవ గుహ్యకాః సిద్ధరాక్షసాః. ౫౭. భూర్లోకవాసినః సర్వే అంతరిక్షచరాఞ్ఛృణు, మరుతః సప్తమ స్కంధే రుద్రాస్తత్రైవ చాశ్వినౌ. ౫౮. ఆదిత్యా వసవః సర్వే తథైవ చ గవాం గణాః, చతుర్థే తు మహర్లోకే వసంతే కల్పవాసినః. ౫౯. ప్రజానాం పతిభిః సర్వైః సహితాః కురునందన, జనలోకే పంచమే చ వసంతే భూమిదాః సదా. ౬౦. ఋతుః సనత్కుమారాద్యా వైరాజశ్చ తథాశ్రయాః, సత్యస్తు సప్తమే లోకే హ్యపునర్మార్గ గామినాం. ౬౧. బ్రహ్మలోకః సమాఖ్యాతో హ్యప్రతీఘాతలక్షణః, ఇతిహాసవిదో యత్ర క్రీడంతే కురునందన. ౬౨. శృణ్వంతి చ పురాణాని యే సదా భీమనందన, మహీతలాత్సహస్రాణాం శతాదూర్ధ్వం దివాకరః. ౬౩. శతయోజనకోట్యాస్తు భూమే రూర్ధ్వం ధ్రువః స్థితః, తతో వింశతిలక్షస్తు త్రైలోక్యోత్సేధ ఉచ్యతే. ౬౪. ద్విగుణైస్తు

యోజనములదూరమున లోకాంతరము లుండెను. దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు, భూతములు, విద్యాధరులు అను నీయెనమండ్రు దేవయోనిసంభూతులు. ఏయాకాశము నందు ఏడులోకములు ప్రతిష్ఠితములై యుండెనో యావ్యోమమందు వాయువులును పితరులును అగ్నులును గ్రహములు నుండును. అష్టవిధ దేవయోనులు శరీరరహితులును శరీరధారులు నై యాకాశమందుండిరి. ఈరీతిగ నాకసము సర్వనివాసయోగ్యముగను సర్వగ్రహమయముగను సర్వదేవమయముగను నుండెను. ఆకారణముచే మనుజుఁ డాకాశము నర్చించినయెడల సర్వదేవతల నర్చించినవాఁడగునుగాన శుభమునుగోరు వాఁడు ప్రయత్నపూర్వకముగ నాకాశము నర్చింపవలెను. మనుష్యుఁడు శ్రద్ధాభక్తిసమన్వితుఁడై యాకాశార్చన మాచరించిన నిస్సంశయముగ నీశ్వరసదనముం బొందఁగలఁడు. ←

ఇది పంచవింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

సహస్రైస్తు యోజనానాం శతేషు చ, లోకాంతరమధో చైవం ధ్రువాదూర్ధ్వం విధీయతే. ౬౫. దేవదానవగంధర్వా యక్షరాక్షసపన్నగాః, భూతా విద్యాధరాశ్చైవ అష్టౌ తే దేవయోనయః. ౬౬. యస్మిన్వ్యోమ్ని త్విమే లోకాః సప్త వై సంప్రతిష్ఠితాః, మరుతః పితరో హ్యేతే తస్మిన్నేవాగ్నయో గ్రహాః. ౬౭. యాస్త్వష్టైతాః సమాఖ్యాతా మయాష్టౌ దేవయోనయః, మూర్తాశ్చామూర్తయశ్చైవ సర్వాస్తా వ్యోమ్ని సంస్థితాః. ౬౮. ఏవం విధమిదం వ్యోమ సర్వవ్యోమమయం స్మృతం, సర్వదేవమయం చైవ సర్వగ్రహమయం తథా. ౬౯. తస్మాద్వ్యోమ్యర్చయేద్వ్యోమ తేన సర్వేఽర్చితాః సురాః, తస్మాత్సర్వప్రయత్నేన శుభార్థీ వ్యోమ చార్చయేత్. ౭౦. యస్త్వర్చతే సదా వ్యోమ భక్త్యా శ్రద్ధాసమన్వితః, వృషధ్వజసదో రాజన్స గచ్ఛేన్నాత్ర సంశయః. ౭౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే వ్యోమమాహాత్మ్యే భువనకోశవర్ణనం నామ పంచవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## షడ్వింశత్యుత్తరశతతమాధ్యాయము.

ఆకాశము, ఖము, దిశలు, వ్యోమము, అంతరిక్షము, నభము, అంబరము, పుష్కరము, గగనము, మేరువు, విపులబిలము, ఆపోచ్ఛిద్రము, శూన్యము, తమము, రోదసి, అనునీపదములన్నియు వ్యోమ వాచకములుగాఁ జెప్పఁబడినవి. లవణసముద్రము, క్షీరసముద్రము, దధి సముద్రము, ఘృతసముద్రము, మధుసముద్రము, ఇక్షుసముద్రము, స్వాదూదకసముద్రము (అప్సుసముద్రము. ఇది మృగ్యము) అనునవి యేడుసముద్రములు జెప్పఁబడినవి. హిమవత్పర్వతము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగవంతము అను నీయాఱును వర్ష పర్వతములని చెప్పఁబడుచున్నవి. ఈయారింటికి మధ్యభాగమునఁ గైలాస పర్వత మొండు గలదు. మాహేంద్రి, యాగ్నేయి, యామ్య, నైరృతి, వారుణి, వాయవ్య, సౌమ్య, ఐశాని, అను నీయెనిమిది దేవతలకు నివాస భూతములగు దేశములు. ఓవీరా! భూలోకంబున లోకాలోక మను పేర నొక్కపర్వతము గలదు. ఆపర్వతమునుండి బ్రహ్మాండకపాలమును, తరువాత నగ్నియు, వాయువు, నాకాశమును, పిమ్మట భూతాదులును, తరువాత మహత్త్వంబు నహంకారంబును, బ్రకృతిబురుషుఁడుఁ బురుషునివలన నీశ్వరుండును కలిగెనని తెలియవలయును. ఈశివునిచే జగ మంతయు నావృతమైయుండె. ఈశ్వరుఁడన భగవంతుం డగుసూర్యుఁడే.

---

సుమంతురువాచ:—ఆకాశం ఖం దిశో వ్యోమ అంతరిక్షం నభోఽంబరం, పుష్కరం గగనం మేరుర్విపులం చ బలిం తథా. ౧. ఆపోఛిద్రం తథా శూన్యం తమో వై రోదసీ తథా, సామాన్యేతాని తే వ్యోమ్నః కీర్తితాని మహీపతే. ౨. లవణక్షీరదధ్యమ్లఘృతమధ్విక్షవస్తథా, స్వాదూదకశ్చ సప్తైతే సముద్రాః పరికీర్తితాః. ౩. హిమవాన్హేమకూటశ్చ నిషధో నీల ఏవ చ, శ్వేతశ్చ శృంగవాంశ్చైవ షడేతే వర్ష పర్వతాః. ౪. మధ్యసంస్థస్తథైతేషాం మహారాజతపర్వతః, మాహేన్ద్రీ చాప్యథాగ్నేయీ యామ్యా చ నైరృతీ తథా. ౫. వారుణీ చాథ వాయవ్యా సౌమ్యైశానీ తథైవ చ, ఏతాః పుర్యస్తు దేవానాం తథోపరి సమాశ్రితాః. ౬. పృథివ్యాం తు స్థితో వీర లోకాలోకస్తు పర్వతః, తతశ్చాండకపాలం తు తస్మాత్తత్పరతస్తు యః. ౭. తతోఽగ్ని ర్వాయురాకాశం తతో భూతాదిరుచ్యతే, తతో మహానహంకారః ప్రకృతిః పురుష స్తతః. ౮. పురుషాదీశ్వరో జ్ఞేయ ఈశ్వరేణావృతం జగత్, ఈశ్వరో భగవాన్భాను

ఈతనిచేతనే లోకమంతయు నిండియుండెను. మఱియు నీతండు సహస్రాంశుండును, తేజశ్శాలియు, నాల్గుబాహువులుగల్గువాడును, మహాబలశాలియు నై యుండును. పూర్వము నేనే యూర్ధ్వలోకాధోలోకములఁ జెప్పియుంటినో బ్రహ్మాండావరణహేతుభూతములగు నాలోకములను గూర్చి మఱలఁ జెప్పుచున్నాను. 1 భూర్లోకము, 2 భువర్లోకము, 3 స్వర్లోకము, 4 మహర్లోకము, 5. జనలోకము, 6 తపోలోకము, 7 సత్యలోకము నను నేడులోకములు ప్రసిద్ధములై యుండెను. పిదప వాత బ్రహ్మాండకపాలంబును, దానినుండి యుత్కృష్టమగుతేజమును, పిదప నగ్ని, వాయువు, నాకాశమును బిమ్మట భూతాదులు మహత్త్వముఁ బ్రధానము ప్రకృతియుఁ బురుషుడును నాపురుషునినుండి యీశ్వరుఁడు గలిగెను. అట్టి యీశ్వరునిచే జగంబంతయు నావరింపఁబడియుండెను. భూలోకమున కధోభాగముననున్న యేడులోకంబులం జెప్పెద నాకర్ణింపుము. తలము, సుతలము, పాతాలము, తలాతలము, అతలము, వితలము, రసాతలము, అను నీయేడు నధోలోకంబులు. ఆలోకములనుండియుఁ బూర్వము జెప్పఁబడిన యూర్ధ్వలోకములనుండివలె అగ్ని వాయ్వాకాశములు తరువాత భూతాదులు నటుపిమ్మట మహత్త్వము బురుషుఁడు, వానివలన నీశ్వరుండును జన్మించిరి అట్టి యీశ్వరునిచే నీజగమంతయు నావరింపఁబడియుండె ఈరీతిగనే మేరుపర్వతప్రమాణము గూడ జెప్పఁబడినది. మేరుపర్వతము నాలుగంచులు గలదియు నాల్గుశిఖరములు గలదియు

---

స్తేనేదం పూరితం జగత్. ౯. సహస్రాంశుర్మహాతేజాశ్చతుర్బాహుర్మహాబలః, ఊర్ధ్వమప్యథ లోకస్తు ప్రాజ్ఞయా యే ప్రకీర్తితాః ౧౦. భూయస్తాన్సంప్రవక్ష్యామి అండావరణకారకాన్, భూర్లోకస్తు భువర్లోకస్తృతీయః పరికీర్తితః. ౧౧. మహర్జనస్తపః సత్యః సప్తలోకాః ప్రకీర్తితాః, తతస్త్వండకపాలం తు తస్మాచ్చ పరతస్తపః. ౧౨. తతోఽగ్నిర్వాయురాకాశం తతో భూతాదిరుచ్యతే, తతో మహాన్ప్రధానశ్చ ప్రకృతిః పురుషస్తతః. ౧౩. పురుషాదీశ్వరో జ్ఞేయ ఈశ్వరేణావృతం జగత్, భూమేరధస్తాత్సప్తైవ లోకానభిమతాఞ్ఛృణు. ౧౪. తలం సుతలపాతాలే తలాతలం తథా తలం, వితలం చ కురుశ్రేష్ఠ సప్తమం చ రసాతలమ్. ౧౫. తతోఽగ్నిర్వాయురాకాశం తతో భూతాదిరుచ్యతే, తతో మహాన్ప్రధానశ్చ ప్రకృతిః పురుషస్తతః. ౧౬. పురుషాదీశ్వరో జ్ఞేయ ఈశ్వరేణావృతం జగత్, ఏవం మేరోః ప్రమాణం తు సర్వమేతత్ప్రకీర్తితమ్, ౧౭. చతురస్రశ్చతుః శృంగః స మేరుః కాంచనః శుభః,

సిద్ధగంధర్వులచే సేవింపఁబడినదియుఁ గాంచనవికారమయినదిగను భూమియందుఁ బ్రసిద్ధిఁజెసె. మఱియుఁ గాంచనమయములగు నాల్గుశిఖరములచే నాకాశము నొరపించుదానివలెనెనుబదినాల్గుయోజనములువృద్ధినొందెను. పర్యవసానమున నీపర్వతము క్రిందిభాగము పదునాఱుయోజనములును నిరువదియెనిమిదియోజనముల వెడల్పును నింతకు మూఁడురెట్లు వైశాల్యము గలిగి యుండెను. ఆపర్వతసంబంధమగు సౌమనసమనుశిఖరము కాంచనమయమును, రెండవదియగు జ్యోతిష్కమనుశిఖరము పద్మరాగమయమును, మూఁడవది యగుచిత్రశిఖరము శుభమగుసర్వదేవమయమును, నాల్గవదియగు చంద్రౌజస్కమనుశిఖరము రజతమయము నై యుండె. అందు సౌమనసశిఖరంబున సూర్యుఁ డుదయించుచు మనచే వీక్షింపఁబడుచుండెను. సూర్యుఁ డుత్తరమార్గముగా జంబూద్వీపమునకు వెడలి శిఖరమందున్నవాఁడై భూతములచేఁ జూడఁబడుచుండెను. మేరుపర్వతమునకును సూర్యునకును జాలసంబంధ ముండుటచే నుభయసంధ్యలను పూర్వపశ్చిమదిక్కులయందుఁ బ్రకాశించుచుండెను. సూర్యుఁ డుత్తరాయనమున సౌమనశ్శిఖరమందును, దక్షిణాయనంబున జ్యోతిష్కశిఖరంబునందును, విషువత్కాలమందు రెండుశిఖరముల మధ్యభాగంబున నుదయించును. ఈశేంద్రపర్వతము లీశాన్యభాగమందును, ఆగ్నేయ

---

పృథివ్యాం సంస్థితో మధ్యే సిద్ధగంధర్వసేవితః. ౧౮. చతుర్భిః కాంచనైః శృంగైర్దివై ర్వర్ధిదమివోల్లిఖన్, యోజనానాం సహస్రాణి చతురాశీతిరుచ్ఛ్రితః. ౧౯. ప్రవిష్టః షోడశాధస్తాదష్టవింశతివిస్తృతః, విస్తారస్త్రిగుణశ్చాస్య పరిణాహస్తతః స్మృతః. ౨౦. తస్య సౌమనసం నామ శృంగమేకం తు కాంచనం, ద్వితీయం పద్మరాగాభం జ్యోతిష్కం నామ నామతః. ౨౧. తృతీయం నామతశ్చిత్రం సర్వదేవమయం శుభం, చతుర్థం రాజతం శుక్లం చన్ద్రౌజస్కమితి స్మృతమ్. ౨౨. యత్తు సౌమనసం నామ శృంగం గాంగేయముచ్యతే, తదేవ చోదయో నామ్నా యత్రోద్యన్దృశ్యతే రవిః. ౨౩. ఉత్తరేణ పరిక్రమ్య జంబూద్వీపం దివాకరః, దృశ్యో భవతి భూతానాం శిఖరం చ సమాస్థితః. ౨౪. కాంచనస్య చ శైలస్య తేజసార్కస్య చాహృతే, ఉభే సంధ్యే ప్రకాశేతే ఆతామ్రే పూర్వపశ్చిమే. ౨౫. శృంగే సౌమనసే సూర్య ఉత్తిష్ఠత్యుత్తరాయణే, జ్యోతిషే దక్షిణే చాపి విషువే మధ్యతస్తయోః. ౨౬. ఈశేంద్రోద్రిశ్చ ఐశాన్యాం తత్రాగ్నిః పూర్వదక్షిణే, నైరృతేఽపి తతో జ్ఞేయో

భాగమున నగ్నియును నిర్ఋతి నైఋతమునను, వాయవ్యమున మరుత్తులును, మధ్యమము మొదలగుభాగంబుల బ్రహ్మయు గ్రహములు నక్షత్రము లుండెను. సూర్యుఁ డారూపము చేత నే యాకాశమునఁ బ్రతిష్ఠితుఁ డయ్యెను. ఈయాకాశము దేవమయముగను లోకమయముగను ఉండెను. రాజా! శుక్రుఁడు పూర్వకోణమందున్న శిఖరములలో నొక్కదానిపై నివసించియుండెను. మఱియు నింకొకశిఖరంబున శనైశ్చరుఁడును, వేఱొకదానిపైఁ గుబేరుండును, నాల్గవశృంగంబునఁ జంద్రుండును నివాసముఁ జేయుదురు. మధ్యభాగంబునఁ గేశులును సీశ్వరునిహుంకారంబు నుండెను. చంద్రాభావసమయమున సూర్యుఁడు పూర్వోత్తర శృంగములపై నుండెను. ఆపై భాగమున లోకపూజితుఁడును గోపతియు నగు నీశ్వరుఁ డుండును. పూర్వాగ్నేయిస్థితమగుశృంగంబున శాండిల కుమారుఁ డుండెను. అటుపైనఁ గీనాశులును శనైశ్చరులు నుండిరి. నైరృతశిఖరంబున మహాబలసంపన్నుఁడగు విరూపాక్షుండును, ఆపైన జలాధిదేవతయగు వరుణదేవతయు, నాపైన సర్వదేవనమస్కృతమగు వాయవ్యకోణమాశ్రయించి మహాతేజస్వియు, గొప్పబలశాలియు నగు మిత్రుఁ డుండెను. ఆమీఁద నరవాహనారూఢుండగు దశబలుండును, మధ్యభాగంబున బ్రహ్మదేవుండును, నాతని యధోభాగంబున శేషుండును, పైభాగంబున నుపేంద్రశంకరులు నుండిరి. మేరుపర్వతము వ్యోమ

---

వాయవ్యే మరుతస్తథా. ౨౭. మధ్యే తు కంజజః సాక్షాద్గ్రహా జ్యోతీంషి చైవ హి, ఆదిత్యస్తేన రూపేణ తస్మిన్వ్యోమ్ని ప్రతిష్ఠితః. ౨౮. ఇదం దేవమయం వ్యోమ తథా లోకమయం స్మృతం, పూర్వకోణస్థితే శృంగే స్థితః శుక్రో మహీపతే. ౨౯. హేలిజశ్చాపరే జ్ఞేయో ధననాథస్తథాపరే, సోమశ్చాపి చతుర్థే తు స్థితః శృంగే జనాధిప. ౩౦. మధ్యే కేశాస్థితో రాజన్ హుంకారశ్చ పినాకినః, శృంగే పూర్వోత్తరే రాజన్ స్థితో దేవో విదుక్షయే. ౩౧. తతః స్థితో మహాదేవో గోపతిర్లోకపూజితః, పూర్వాగ్నేయీస్థితే శృంగే స్థితో వై శాండిలః సుతః. ౩౨. తతః స్థితో మహాతేజాః కీనాశో హేలినందనః, స్థితో వై నైరృతే శృంగే విరూపాక్షో మహాబలః. ౩౩. తస్మాదనంతరో దేవః స్థితో వై యాదసాం పతిః, తతః స్థితో మహాతేజా వీర మిత్రో మహాబలః. ౩౪. వాయవ్యం శృంగమాశ్రిత్య సర్వదేవనమస్కృతం, తతః స్థితో దశబలో నరమారుహ్య భారత. ౩౫. బ్రహ్మా మధ్యే స్థితో దేవో హ్యనంతశ్చాధ ఏవ హి, ఉపేంద్రశంకరౌ దేవౌ బ్రహ్మణోఽంతే సమాస్థితౌ. ౩౬. ఏష మేరుస్తథా వ్యోమ ఏష ధర్మశ్చ పఠ్యతే,

ధర్మము నను నీమాటింగుఱించి వచించితిని. వీనిలో మేరువు, వ్యోమము, సర్వదేవమయములనియు, సర్వవేదమయములుగాఁ జెప్పఁబడినవి. మేరు పర్వతముయొక్క నాల్గుశిఖరములును నాల్గువేదములని ప్రాచీనులగు శృంగ్యాదులు చెప్పుచుందురు.

ఇది షడ్వింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

## సప్తవింశత్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! మహాతేజశ్శాలియగు సాంబుఁడు సూర్య నేవిధముగ నారాధించెను. సర్వరోగములనుండి యెట్లు విముక్తుండయ్యెనో దానిం దెలుప వేఁడెద ననిన సుమంతుఁ డిట్లనియె. రాజేంద్రా! నీవు నన్ను మంచిప్రశ్నము నడిగితివి. గాన సమస్తపాపనాశకమగు సాంబోపాఖ్యానమును విస్తరముగాఁ జెప్పెద నాకర్ణింపుము. పూర్వమొకప్పుడు సాంబుఁడు నారదువలన భాస్కరమాహాత్మ్యమును విని వినయపూర్వకముగాఁ దనతండ్రి కిట్లనియె. "అచ్యుతా! వ్యాధిజనితంబగు మలముచేతను కశ్మలముచేత నభిభూతుఁడనై యుంటిని. వైద్యులచేత నౌషధములచేతను నాకు శాంతి లభింపలేదు. గాన వనమునకుఁ బోవుట కనుజ్ఞ నొసఁగి శుభమగున ట్లాశీర్వదింపుమని తండ్రి నడిగి

---

సర్వదేవమయశ్చాయం మేరుర్వ్యోమ ఇతి స్మృతః. ౩౭. తథా వేదమయశ్చాపి పర్యతే నాత్ర సంశయః, శృంగాణి వేదాశ్చత్వారః పూర్వశృంగాదయో విదుః. ౩౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే వ్యోమమాహాత్మ్యవర్ణనం నామ
షడ్వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—కథమారాధితః సూర్యః సాంబేనామితతేజసా, విముక్తస్తు కథం రోగైర్బ్రూహి మాం ద్విజసత్తమ. ౧. సుమంతురువాచ:—సాధు పృష్టోఽస్మి రాజేన్ద్ర శృణు సాంబకథాం పురా, విస్తరాద్వచ్మి తే సర్వాం కథాం పాపవిమోచనీమ్ ౨. పురా సంశ్రుత్య మాహాత్మ్యం భాస్కరస్య స నారదాత్, వినయాదుపసంగమ్య వచః పితరమబ్రవీత్. ౩. కశ్మలేనాభిభూతోఽస్మి మలేన వ్యాధినాచ్యుత, వైద్యైరోషధిభిశ్చాపి న శాంతిర్మమ విద్యతే. ౪. వనం గచ్ఛామి భగవన్ననుజ్ఞాం

యతనిచే ననుజ్ఞాతుఁడై సింధునది యుత్తరతీరమునుండి ప్ర[illegible] చంద్రభాగానదిని దాఁటి త్రిలోకప్రసిద్ధమగు మిత్రవనమను తీర్థము నకుఁబోయి యుపవాసతత్పరుఁడై కృశించుటచే నాడులన్నియుఁ గన్పించు శరీరముగలవాఁడై సూర్యు నారాధించుటకై గుహ్యమును ఋగాది చతుర్వేదసమ్మితంబునగు స్తోత్రమును జపించెను. “శుక్లమును దివ్యము నజరమజన్యమనాశ్యము హరిదశ్వయుక్తమగు నేమండలము గలదో యది యాదిత్యమండలమని చెప్పఁబడును. ఈతఁడే త్రైలోక్యచక్షువగు పరమాత్మ. ఈపురుషుఁ డీమండలమున గొప్పవాఁడై ప్రకాశించుచుండెను. మఱియు నీతఁడే యచింత్యాత్ముఁడగు విష్ణువుఁ, బితామహుండగు బ్రహ్మయునై యున్నాఁడు. రుద్రుఁడు, మహేంద్రుఁడు, వరుణుఁడు, ఆకాశముఁ, బృథివి, జలము, వాయువుఁ, జంద్రుఁడు, మేఘుఁడుఁ, గుబేరుఁడు, సూర్యుఁడు మఱియు నితరు లెవ్వ రీమండలంబునఁ గలరో వారందఱును నీతఁడే యైయుండెను. ఉత్పత్తికారణమై కాలస్వరూపుఁడగు నెవ రీమండలములోనుండి తేజములచేఁ బూరించుచుండెనో వాయువులచే నవ్యవచ్ఛిన్నుఁడై భ్రమించుచుండెనో యమృతస్వరూపుఁడగు నాతనికంటెఁ దేజస్సుచేఁ బరతమ మెద్దియు లేదు. ఇట్లు ప్రకాశించు సూర్యదేవతయే

---

దాతుమర్హాసి, శివేన పుండరీకాక్ష ధ్యాయ మాం పురుషోత్తమ. ౫. అనుజ్ఞాతః స కృష్ణేన సింధోరుత్తరకూలతః, గత్వా సంతారయామాస చన్ద్రభాగాం మహానదీమ్. ౬. తతో మిత్రవనం గత్వా తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్, ఉపవాసపరః సాంబః శుష్కో-ధమనిసంతతః. ౭. ఆరాధనార్థం సూర్యస్య గుహ్యం స్తోత్రం జజాప హ, వేదైశ్చతుర్భిః సమితం పురాణాశ్రయబృంహితమ్. ౮. యదేతన్మండలం శుక్లం దివ్యం హ్యజరమవ్యయం, యుక్తం మనోజవైరశ్వై ర్హారీతైర్బ్రహ్మవాదిభిః. ౯. ఆదిరేష హి భూతానామాదిత్య ఇతి సంజ్ఞితః, త్రైలోక్యచక్షురేవాత్ర పరమాత్మా ప్రజాపతిః. ౧౦. ఏష వై మండలే హ్యస్మిన్పురుషో దీప్యతే మహాన్, ఏష విష్ణురచింత్యాత్మా బ్రహ్మా చైష పితామహః. ౧౧. రుద్రో మహేంద్రో వరుణ ఆకాశం పృథివీ జలం, వాయుః శశాంకః పర్జన్యో ధనాధ్యక్షో విభావసుః. ౧౨. య ఏష మండలే హ్యస్మిన్పురుషో దీప్యతే మహాన్, ఏకః సాక్షాన్మహాదేవో వృత్రమండనిభః సదా. ౧౩. కాలో హ్యేష మహాబాహుర్నిబోధోత్పత్తిలక్షణః, య ఏష మండలే హ్యస్మింస్తేజోభిః పూరయన్మహీమ్. ౧౪. భ్రామ్యతే హ్యవ్యవచ్ఛిన్నో వాతైర్యోఽమృతలక్షణః, నాతః పరతరం కించిత్తేజసా

దేవేశుల నమృతంబుచేఁ బోషించుచున్నాఁడు. భాస్కరా! అంతస్థులగు మ్లేచ్ఛజాతులను తిర్యగ్యోనిగతులను సర్వభూతములను దయచే రక్షించుచున్నావు. దేవా! బొల్లి, కుష్ఠు మొదలగురోగముగలవారలను అంధులను, బధిరులను, పంగులను, వాత్సల్యముచే నీరోగులనుగాఁ జేయుచున్నావు. దేవా! చక్రమండల మగ్నులను, నిర్ధనుల నల్పాయుష్మంతులను ప్రత్యక్షద్రష్టవై లీలచే నుద్ధరించుచుంటివి. ఆర్తుఁడును రోగపీడితుఁడు నగునాకు నిన్ను స్తోత్రముఁజేయు సామర్థ్య మెక్కడిది? నీవెల్లప్పుడును బ్రహ్మవిష్ణుమహేశ్వరులచేతను మహేంద్రసిద్ధగంధర్వాప్సరోగుహ్యకాదిదేవతలచేతను స్తోత్రము చేయఁబడుచుందువు దేవా! పూతములగు ఋగ్యజుస్సామములు మూఁడును నీమండలమం దుండఁగా నాచేఁ జేయఁబడుస్తోత్రములచే నేమిప్రయోజనము? మఱియు నోదేవా! ధ్యానముచేయువారలకు ధ్యేయుఁడవు, మోక్షార్థులకు మోక్షప్రదుఁడవు. అనంతమగుతేజముచే నచలుఁడవు, నచింత్యుఁడవు, నవ్యక్తుఁడవు, నిష్కలుండవు నైయున్నావు. గాన నోదేవరాజా! జగత్పతివగు నీవు యీస్తోత్రమునందుఁ జెప్పఁబడినరీతిగ నార్తిభక్తులం దెలిసికొని ప్రవర్తించుట కర్హుఁడవై యున్నావు." తరువాత సూర్యుఁడు జాంబవతీసుతుఁడగు సాంబునిం జూచి ప్రీతుఁడై వత్సా! నీతపంబునకు సంతసించితిని.

---

విద్యతే క్వచిత్. ౧౫. పుష్ణాతి సర్వభూతాని ఏష ఏవ సుధామృతైః, అంతస్థామ్లేచ్ఛజాతీయాం స్తిర్యగ్యోనిగతానపి. ౧౬. కారుణ్యాత్సర్వభూతాని పాసి త్వం చ విభావసో, శ్విత్రకుష్ఠ్యంధబధిరాన్పఙ్గూంశ్చాపి తథా విభో. ౧౭. ప్రపన్నవత్సలో దేవ కురుతే నీరుజో భవాన్, చక్రమండల మగ్నాంశ్చ నిర్ధనాల్పాయుష స్తథా. ౧౮. ప్రత్యక్షదర్శీ త్వం దేవ సముద్ధరసి లీలయా, కా మే శక్తిః స్తవైః స్తోతుమార్తోఽహం రోగపీడితః. ౧౯. స్తూయసే త్వం సదా దేవై ర్బ్రహ్మవిష్ణుశివాదిభిః, మహేంద్రసిద్ధగంధర్వై రప్సరోభిః సగుహ్యకైః. ౨౦. స్తుతిభిః కిం పవిత్రైర్వా తవ దేవ సమీరితైః, యస్య తే ఋగ్యజుః సామ్నాం త్రితయం మండలస్థితమ్. ౨౧. ధ్యానినాం త్వం పరం ధ్యానం మోక్షద్వారం చ మోక్షిణాం, అనంతతేజసా క్షోభ్యో హ్యచింత్యావ్యక్త నిష్కలః. ౨౨. యదయం వ్యాహృతః కించిత్స్తోత్రేఽస్మిఞ్జగతః పతిః, ఆర్తిం భక్తిం చ విజ్ఞాయ తత్సర్వం జ్ఞాతుమర్హసి. ౨౩. తమువాచ తతః సూర్యః ప్రీత్యా జాంబవతీ

నన్నేమి కోరెదవో చెప్పుమని చెప్పిన సాంబుఁ డిట్లనియె. సనాతనుఁడవగు నోదేవా! నీవు నాయందుఁ బ్రసన్నుఁడవైనయెడల నాకెల్లప్పుడును నీయందు భక్తికలుగునట్లుగా వరంబిమ్మనిన సూర్యుఁడు "సాంబా! నీవిషయమై నాకు సంతోషము కలిగెను. గాన నీ కీవరం బొసంగితిని. మఱియొండు గోరుకొమ్ము. ఇచ్చెదను" అనిన సాంబుం డిట్లనియె. "ఓసూర్యభగవానుఁడా! నాశరీరస్థమగుమలము సర్వము నీయనుగ్రహమున నశించునట్లును శుద్ధమగునట్లును చేయుము" అని వేఁడుకొనెను. సుమంతుం డిట్లనియె. అని యిట్లు సాంబుఁడు మహాత్ముఁడగు సూర్యుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై సర్పము కుబుసమును వదలినట్లు రోగముల నన్నిఁటిని వదలెను. అట్లు సర్వరోగవిముక్తుఁడై దివ్యరూపమును ధరించి శిరస్సుచేఁ బురస్థితుఁడగు సూర్యుని నమస్కరించి యెదుట నిలువఁగా మఱల సూర్యుఁడు "సాంబా! నేను సంతుష్టుఁడనై చెప్పువిషయమును శ్రద్ధతో నాకర్ణింపుము. ఈదినము మొదలు నాదేవాలయముల నన్నింటిని నీపేరుచే నెవ రీభూమియందు స్థాపించెదరో వారలకు సనాతనలోకములు సంభవించును. నీవు నన్నీచంద్రభాగానదీతీరంబున స్థాపింపుము. ఇదియును నీపేరుచేఁ బ్రఖ్యాతిఁ బొందఁగలదు. నీకు నక్షయమగు కీర్తియు లోకమునందుఁ బ్రఖ్యాతియుఁ గలుగును. మఱియు నీకుఁ బ్రతి

---

సుతమ్, ప్రీతోఽస్మి తపసా వత్స బ్రూహి త్వాం యదిచ్ఛసి. ౨౪. సాంబ ఉవాచ:—యది ప్రసన్నో భగవానేష ఏవ వరో మమ, భక్తిర్భవతు మేఽత్యర్థం త్వయి దేవ సనాతన. ౨౫. శ్రీసూర్య ఉవాచ:—భూయస్తుష్టోఽస్మి భద్రం తే వరం వరయ సువ్రత, స ద్వితీయం వరం వవ్రే తత్రైవ వరదం విభుమ్. ౨౬. మలః శరీరసంస్థో మే త్వత్ప్రసాదాత్ప్రణశ్యతు, యేన మే శుద్ధమఖిలం వపుర్భవతు గోపతే. ౨౭. సుమంతురువాచ:—స తథాస్త్వితి తేనోక్తో భాస్కరేణ మహాత్మనా, తాం ముమోచ రుజం సాంబో దేహాత్త్వచమివోరగః. ౨౮. తతో రూపేణ దివ్యేన రూపవానభవత్పునః, ప్రణమ్య శిరసా దేవం పురతోఽవస్థితోఽభవత్. ౨౯. శ్రీసూర్య ఉవాచ:—భూయశ్చ శృణు మే సాంబ తుష్టోఽహం యద్బ్రవీమి తే, అద్య ప్రభృతి త్వన్నామ్నా మమ స్థానాని సువ్రత, క్షితౌ యే స్థాపయిష్యంతి తేషాం లోకాః సనాతనాః. ౩౦. స్థాపయస్వైవ మామస్మింశ్చంద్రభాగాతటే శుభే, తవ నామ్నా చ సాంబేదం పరాం ఖ్యాంతిం గమిష్యతి. ౩౧. కీర్తిస్తవాక్షయా లోకే ఖ్యాతిం

దినమందును స్వప్నమున దర్శనమీయఁగలను.'' అని చెప్పెను. సుమంతుం డిట్లనియె ఆయదుసింహునకుఁ బ్రత్యక్షగతుఁడై వరములనిచ్చి సూర్యుఁ డచ్చటనే యంతర్హితుఁడయ్యెను. ఏమనుజుఁడు త్రికాలంబుల భక్తి పరుఁడై యీస్తోత్రము బఠించునో యిరువదియొక్కనూర్లు హోమంబులఁ జేయునో వాఁడు రాజ్యకామి యైనచో రాజ్యముఁ బొందఁగలఁడు. ధన కామియైన ధనము బొందఁగలఁడు. రోగార్తుఁడయినచో సాంబునివలెనే సర్వరోగవిముక్తుఁడగును సూర్యుని భక్తియుక్తుఁడై పూజించినను సూర్యలోకముం బొందఁగలఁడు. సమస్తదేవపరివృతుండైన యాపరతత్వ మగుసూర్యునియందే రమించుచుండును.—

ఇది సప్తవింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

## అష్టావింశత్యుత్తరశతతమాధ్యాయము.

తరువాత సాంబుఁడు శరీరమంతయుఁ గృశించి నాడులన్నియుఁ బైకిఁ గాన్పించుచుండ సహస్రనామములచే సూర్యుని స్తోత్రముఁజేసెను. తరువాత సూర్యుఁడు ఖేదయుక్తుఁడును కృష్ణనందనుఁడగు సాంబునిఁ

---

యాస్యతి సువ్రత, భూయశ్చ తే ప్రదాస్యామి ప్రత్యహం స్వప్నదర్శనమ్. ౩౨. సుమంతురువాచ:—ఏవం దత్త్వా వరం తస్మై వృష్ణిసింహాయ చాపరమ్, ప్రత్యక్షదర్శనం దత్త్వా తత్రైవాంతరధాద్ధరిః. ౩౩. య ఇదం పఠతే స్తోత్రం త్రికాలం భక్తిమాన్నరః, త్రిసప్తశతమావర్త్య హోమం వా సప్తరాత్రకమ్. ౩౪. రాజ్యకామో లభేద్రాజ్యం ధనకామో లభేద్ధనం, రోగార్తో ముచ్యతే రోగాద్యథా సాంబస్తథైవ సః. ౩౫. సూర్య లోకం వ్రజేచ్చాపి భక్త్యా పూజ్య దివాకరం, రమతే చ తథా తస్మిన్దేవైశ్చ పరివా రితః. ౩౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యప్రసాదవర్ణనం నామ
సప్తవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అస్తావీచ్చ తతః సాంబః కృశో ధమనిసంతతః రాజన్నామ సహస్రేణ సహస్రాంశుం దివాకరమ్. ౧. ఖిద్యమానం తతో దృష్ట్వా సూర్యః కృష్ణాత్మజం తదా, స్వప్నేస్మై దర్శనం దత్త్వా పునర్వచనమబ్రవీత్. ౨. శ్రీసూర్య ఉవాచ:—

జూచి స్వప్నమున సాక్షాత్కరించి యతనితో నిట్లనియె. జాంబవతీపుత్రా! నీ వీసహస్రనామస్తోత్రమును నిలిపి గుహ్యములు పవిత్రములు శుభకరములు నగు నేఁజెప్పఁబోవు స్తవమును పఠింపుము. శ్లో. "వైకర్తనో వివస్వాంశ్చ మార్తండో భాస్కరో రవిః, లోకప్రకాశక శ్శ్రీమాఙ్ లోకచక్షు ర్గ్రహేశ్వరః. లోకసాక్షీ త్రిలోకేశః కర్తా హర్తా తమిస్రహా, తపన స్తాపన శ్చైవ శుచి స్సప్తాశ్వవాహనః గభస్తిహస్తో బ్రహ్మా చ సర్వదేవ నమస్కృతః,......" అను నీస్తోత్రము నాకభిమతమై యున్నది. ఈ స్తోత్రము శరీరమున కారోగ్యమును ధనమును కీర్తినిఁ గలుగఁజేయుచుఁ ద్రిలోకములందును స్తవరాజమని ప్రసిద్ధిగాంచెను. ఏమనుజుఁ డుదయాస్తమయరూపములగు రెండుసంధ్యలయందుఁ బ్రణతుఁడై యీస్తోత్రమును బఠించునో వానికి సంబంధించిన వాక్కాయకృతములగు నెట్టి పాపములైనను నశించును. మఱియు నీమంత్రము జపోపయుక్తంబును, హోమోపయుక్తంబును, సంధ్యోపయుక్తంబును, బలిమంత్రోపయుక్తంబును, ధూపోపయుక్తంబు, నన్నప్రదానోపయుక్తంబును, నమస్కారోపయుక్తంబును, బ్రదక్షిణోపయుక్తంబును నై యుండె. మఱియు నీమహామంత్రం బన్నివ్రతంబులయందుఁ బూజితంబై సర్వపాపహరంబై శుభకరంబై యుండెను. అని యిట్లు కృష్ణనందనుఁ డగుసాంబునితోఁ జెప్పి

---

సాంబసాంబ మహాబాహో శ్రుణు జాంబవతీసుత, అలం నామసహస్రేణ పఠ చేమం శుభం స్తవమ్. ౩. యాని గుహ్యాని నామాని పవిత్రాణి శుభాని చ, తాని తే కీర్తయిష్యామి ప్రయత్నాదవధారయ. ౪. వైకర్తనో వివస్వాంశ్చ మార్తండో భాస్కరో రవిః, లోకప్రకాశకః శ్రీమాంల్లోకచక్షుర్గ్రహేశ్వరః. ౫. లోకసాక్షీ త్రిలోకేశః కర్తా హర్తా తమిస్రహా, తపనస్తాపనశ్చైవ శుచిః సప్తాశ్వవాహనః. ౬. గభస్తిహస్తో బ్రహ్మా చ సర్వదేవనమస్కృతః, ఏకవింశతిరిత్యేష స్తవ ఇష్టస్సదా మమ. ౭. శరీరారోగ్యదశ్చైవ ధనవృద్ధియశస్కరః, స్తవరాజ ఇతి ఖ్యాతస్త్రిషు లోకేషు విశ్రుతః. ౮. య ఏతేన మహాబాహో ద్వే సంధ్యేఽస్తమనోదయే, స్తౌతి మాం ప్రణతో భూత్వా సర్వపాపైః ప్రముచ్యతే. ౯. మానసం వాచికం వాపి కాయికం యచ్చ దుష్కృతం, ఏకజాప్యేన తత్సర్వం ప్రణశ్యతి మమాగ్రతః. ౧౦. ఏష జప్యశ్చ హోమశ్చ సంధ్యోపాసనమేవ చ, బలిమంత్రోఽర్ఘ్యమంత్రోఽథ ధూపమంత్రస్తథైవ చ, ౧౧. అన్నప్రదానే స్నానే చ ప్రణిపాతే ప్రదక్షిణే, పూజితోఽయం మహా

జగత్పతియగు సూర్యుఁ డంతర్థానమొందెను. సాంబుఁడును సూర్యుఁడు జెప్పిన స్తవరాజముచే సప్తాశ్వవాహనుండగు సూర్యుని స్తుతించి సంతుష్టాంతరంగుఁడై నీరోగుఁడును లక్ష్మీసంపన్నుఁడును సర్వరోగ విముక్తుఁడు నయ్యెను.

ఇది అష్టావింశత్యుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకోనత్రింశదుత్తరశతతమాధ్యాయము.

తరువాత సాంబుఁడు పూర్వోక్తప్రకారము సూర్యునిచే లబ్ధవరుఁడై సంతసించి యాశ్చర్యకరమగు సూర్యప్రత్యక్షవిషయముంగూర్చి విచారించుచుఁ బూర్వమునుండియు జరిగెడియభ్యాసముచే నితరులగు తపస్వులతోఁగూడ స్నానార్థము చంద్రభాగానదికి వెడలెను. ప్రతిదినంబును సూర్యమండలాకారమును రచించి స్నానముచేయించుచు నేరూపమిచ్చుటఁ బ్రతిష్ఠించిన బాగుండునని చింతించి పిమ్మట స్నానము చేయుచుండుతఱి నాప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచున్న సూర్యప్రతిమను గాంచి నమస్కరించి మనంబున నిట్లాలోచించెను. "భగవంతుఁడగు సూర్యుఁ డాజ్ఞాపించిన దిదియే యగును. ఈవిషయమున సందియము

---

మంత్రః సర్వపాపహరః శుభః. ౧౨. ఏవముక్త్వా స భగవాన్భాస్కరో జగతాం పతిః, ఆమంత్ర్య కృష్ణతనయం తత్రైవాంతర్హితోఽభవత్. ౧౩. సాంబోఽపి స్తవరాజేన స్తుత్వా సప్తాశ్వవాహనం, ప్రీతాత్మా నీరుజః శ్రీమాంస్తస్మాద్రోగాద్విముక్తవాన్. ౧౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబస్తవవర్ణనం నామ
అష్టావింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అథ లబ్ధవరః సాంబో వరం ప్రాప్య పురాతనం, మన్యమానస్తదాశ్చర్యం ప్రహృష్టేనాంతరాత్మనా. ౧. పూర్వాభ్యాసేన తేనైవ సార్థమన్యైస్తపస్విభిః, స్నానార్థం నాతిదూరం చంద్రభాగాం నదీం యయౌ. ౨. కృత్వాత్మమండలాకారం శ్రద్దధానో దినేదినే, సస్నౌ సంచితయామాస కిం రూపం స్థాపయామ్యహమ్. ౩. స స్నాతః సహసైవాథ ప్రణమ్య తు ప్రభావతీం, ఉహ్యమానాం జలౌఘేన ప్రతిమాం సంముఖం రవేః. ౪. తాం దృష్ట్వా తస్య వీరస్య సముత్పన్నమిదం యథా,

లేదు." అని తలంచి యాప్రతిమను నీటినుండి లేవనెత్తి మిత్రవనోద్దేశం బున దానిని స్థాపించెను. అట్లు బ్రతిష్ఠించి యాసూర్యప్రతిమకు నమస్కరించి, "జగన్నాథా! యీశుభాకృతిగల నీరూపంపుఁబ్రతిమ నెవ్వఁడు రచియించెనో తెల్పుము." అనిన విని యాప్రతిమ "నాయాకృతి యెవ్వరిచే నిర్మింపఁబడెనో చెప్పెద నాకర్ణింపుము. సాంబా! పురాకృతమగు నీరూప మతితేజోయుక్తం బగుటంజేసి సర్వభూతములకు నసహ్యం బయ్యె. నట్లు నాతేజమును సహింపనివారై సురలు నన్నర్చించి సర్వప్రాణులకును సహ్యంబగునట్లుగాఁ జేయుమని కోరిరి. తరువాత నేను మహాతపస్సంపన్నుఁడగు విశ్వకర్మంజూచి నాతేజము సంకోచింపఁజేసి రూపమును నిర్మింపుమని యాజ్ఞాపించితిని. తరువాత విశ్వకర్మ నాయాజ్ఞ ననుసరించి తననైపుణ్యముఁ బ్రకాశింపఁజేయుచు శాకద్వీపమున యంత్రము నిడి నారూపమును నిర్మించెను. ఈపనినంతను సర్వభూతము లందలి ప్రీతిచేఁ జేయించితిని. ఈప్రతిమను విశ్వకర్మ కల్పవృక్షమునుండి తెచ్చి సిద్ధనిషేవితంబగు హిమవత్పర్వతపృష్ఠంబున రచించి నీకొరకై యీచంద్రభాగానదియందు విడచెను. నిన్ను తరింపఁజేయుటకునై యీ చంద్రభాగానదీతీరమే శుభమైనది నీవెల్లప్పుడును నాసాన్నిధ్యముం

---

దేవేన యత్తదాజ్ఞప్తం తదిదం నాత్ర సంశయః. ౫. స తాముత్తార్య సలిలాదానీయ చ మహీపతే, తస్మిన్మిత్రవనోద్దేశే స్థాపయామాస తాం తదా. ౬. నిధాయ ప్రతిమాం ల్లోకే సాంబస్తస్య మహాత్మనః, మిత్రం మిత్రవనే రమ్యే స్థాపయిత్వా విధానతః. ౭. తతస్తామేవ పప్రచ్ఛ ప్రణమ్య ప్రతిమాం రవేః, కేనేయం నిర్మితా నాథ భవతో వ్యాకృతిః శుభా. ౮. ప్రతిమా తమువాచాథ శృణు సాంబ బ్రువే స్వయం, నిర్మితా యేన చాప్యేషా మదీయా పురుషాకృతిః. ౯. మమాతితేజసావిష్టం రూపమాసీత్పురాతనం, అసహ్యం సర్వభూతానాం తతోఽస్మ్యభ్యర్చితః సురైః, సహ్యం భవతు తే రూపం సర్వప్రాణభృతామితి. ౧౦. తతో మయా సమాదిష్టో విశ్వకర్మా మహాతపాః, తేజసాం శాతనం కుర్వన్రూపం నిర్వర్తయస్వ మే. ౧౧. తతస్తు మత్సమాదేశాత్తేనైవ నిపుణం తదా, శాకద్వీపే భ్రమిం కృత్వా రూపం నిర్వర్తితం మమ. ౧౨. ప్రీత్యా తేషాం ప్రపంచోఽయం స మయా కారితః పునః, తేనేయం కల్పవృక్షాత్తు నిర్మితా విశ్వకర్మణా. ౧౩. కృత్వా హిమవతః పృష్ఠే పురా సిద్ధనిషేవితే, త్వదర్థం చంద్రభాగాయాం తతస్తేనావతారితా. ౧౪. భవతస్తారణార్థం హి తతః స్థానమిదం శుభం,

బొందఁగలవు. పవిత్రమగు నీతీరమునందు జనులందఱును బూర్వాపర మధ్యాహ్నంబుల నాదఱిఁ జేరఁగలరు. పూర్వాహ్ణంబున బ్రహ్మదేవుఁ డును మధ్యాహ్నంబునఁ జక్రధరుం డగువిష్ణువును అపరాహ్ణంబున శంక రుఁడును నన్ను నిత్యముఁ బూజించుచుందు"రని చెప్పిన మహాభాగుండగు సాంబుఁడు పరమానందముం బొందెను. తరువాత భాస్కరుఁ డంతర్హితుఁ డయ్యె. —

ఇది ఏకోనత్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## త్రింశదుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! సాంబుఁడు సూర్య దేవతాప్రతిష్ఠ నెట్లు చేయించెను? ఎవ్వనివచనంబున సూర్యప్రాసాదము నిర్మించెనో చెప్పుము. అనిన సుమంతుం డిట్లనియె. రాజేంద్రా! సాంబుఁడు సూర్యప్రతిష్ఠ నెట్లు జేయించెనో తత్ప్రాసాద మెట్లు నిర్మించెనో నే నావిషయముం జెప్పెద నాకర్ణింపుము. రాజా! ఆసాంబుఁడు సూర్య ప్రతిమ ననాయాసమునఁ బొంది నారదునిఁ జింతింపఁగా నామహాత్ముఁ డాస్థలమునకు వచ్చెను. ప్రత్యక్షగతుండగు నారదుం జూచి యథావిధిగ

---

రుచిరం సర్వదా సాంబ సాన్నిధ్యం మే త్ర యాస్యతి. ౧౫. సాన్నిధ్యం మమ పూర్వాహ్ణే సుతీరే ద్రక్ష్యతే జనైః, కాలప్రియే చ మధ్యాహ్నేఽపరాహ్ణే చాత్ర నిత్యశః. ౧౬. పూర్వాహ్ణే పూజయేద్బ్రహ్మా మధ్యాహ్నే చక్రధృత్స్వయం, శంకర శ్చాపరాహ్ణే తు మాం పూజయతి సర్వదా. ౧౭. ఇత్యుక్తోసౌ భగవతా భాస్కరేణ స యాదవః, హర్షమాప మహాబాహో భాస్కరోంతర్దధే తతః. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సాంబకృతాదిత్యమూర్తిస్థాపనం నామ ఏకోనత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—కథం సాంబేన విప్రేంద్ర ప్రతిష్ఠా కారితా రవేః, కస్య వా వచనాత్తేన ప్రాసాదః కారితో రవేః. ౧. సుమంతురువాచ.—అత్ర తే వచ్మి రాజేంద్ర యథా సాంబేన ధీమతా, ప్రతిష్ఠా కారితా భానోః ప్రాసాదశ్చ మహీపతే. ౨. సులబ్ధ్వా ప్రతిమాం భానోశ్చింతయామాస నారదం, స చాపి చింతితశ్చాగాద్యత్ర

నర్ఘ్యపాద్యాదులచే నర్చించి కూర్చుండ నియమించి దేవర్షిసత్తమా! యే నరుఁడు భాస్కరునకుఁ బ్రాసాదము నిర్మించునో ప్రాసాదంబున భాస్కర ప్రతిమను బ్రతిష్ఠించునో యాతఁ డేఫలముం బొందును? అని యడిగిన నారదుం డిట్లనియె. శుభప్రదంబగు బ్రదేశంబున సూర్యునకుఁ బ్రాసాదము నిర్మించినవారు నిస్సంశయముగ సూర్యలోకముం బొందఁగలరు. అనిన సాంబుఁ డిట్లనియె. దేవర్షిసత్తమా! ఆప్రాసాద మేప్రదేశమునం దెట్లు నిర్మింపవలయునో దేవదేవుండగు సూర్యున కేయాలయము బ్రశస్తమో దానిఁ జెప్ప వేఁడెదను. అనిన నారదుం డిట్లనియె. ఆగమ-వినాశంబులయం దెచ్చట జలము ప్రభూతముగనుండునో ధర్మవృద్ధికొఱ కచ్చట నాలయ మొందు నిర్మించినఁ దన యిష్టములన్నియుఁ జేకూరును. మఱియు విభూషితములగు సూర్యలోకంబులఁ బొందును. సలిలారామము లెచ్చట నుండునో యచ్చటనే దేవాలయము నిర్మింపవలెను ఈస్థానంబులయందు దేవాలయము నిర్మించినయెడల దేవతలు సన్నిధానవర్తులై యుందురు. నలినీచ్ఛన్నంబులగుటచే సూర్యరశ్మిశూన్యంబులును, హంస విక్షిప్తకల్హారయుక్తజలయుతంబును, హంస. కారండవ క్రౌంచ చక్రవాక విరావవిరాజితంబును, ప్రాంతంబులయందు విమలసచ్ఛాయల విశ్రమించినజనులసంచరణ కుపయుక్తంబులగుసరస్సులఁ గ్రౌంచపక్షులయాలాపం

---

జాంబవతీసుతః. ౩. తమాగతమభిప్రేక్ష్య నారదం మునిసత్తమం, సంపూజ్య విధివత్సాంబో నారదం వాక్యమబ్రవీత్. ౪. ప్రాసాదం కారయేద్యస్తు భాస్కరస్య నరో ద్విజ, కిం ఫలం తస్య దేవర్షే ప్రతిష్ఠాం యశ్చ కారయేత్. ౫. నారద ఉవాచ.—— ప్రాసాదం శోభనే దేశే యస్తు కారయతే రవేః, స యాతి నరశార్దూల సూర్యలోకం న సంశయః. ౬. సాంబ ఉవాచ.——కథం కుర్యాదాయతనం కస్మిన్ దేశే ద్విజోత్తమ, కీదృక్ప్రశస్తం చాయతనం దేవదేవస్య వై ద్విజ. ౭. నారద ఉవాచ.——యత్ర ప్రభూతం సలిలమాగమే చ వినాశనే, దేవతాయతనం కుర్యాద్యశోధర్మవివృద్ధయే. ౮. ఇష్టాపూర్తేన లభతే లోకాంస్తాంశ్చ విభూషితాన్, దేవానామాలయం కార్యం ద్వయం యత్ర చ దృశ్యతే. ౯. సలిలాఢ్యం చ ఆరామః కృతేష్వాయతనేషు చ, స్థానేష్వేతేషు సాన్నిధ్యముపగచ్ఛంతి దేవతాః. ౧౦. సరఃసు నలినీచ్ఛన్ననిరస్తరవిరశ్మిషు, హంససంక్షిప్తకహ్లారవీథీవిమలవారిషు. ౧౧. హంసకారండవక్రౌంచచక్రవాకవిరావిషు, పర్యంతవిమలచ్ఛాయావిశ్రాంతజనచారిషు. ౧౨. క్రౌంచకాంచీసులాపాశ్చ కలహం

బులను కాంచీరవమును కలహంసకలస్వనంబులును శఫరీకృతమేఖలంబులును తోయకృతవసనములును ప్రవాహసంయోగమను శ్రోణిమండలమును, పులినాదులచే నున్నతోరస్కములు నగునదులు శైలవనప్రాంత భూములయందు నుద్యానవనములు గలపురములయందును నిర్మించిన యెడల సూర్యదేవుఁడు సంతసించును. వాస్తుకర్మయం దేభూములు దేవాయతనమున కుపయుక్తములుగఁ జెప్పఁబడినవో అవియే ముఖ్యములుగా శాసింపఁబడినవి. మఱియు దేవాలయముయొక్క నిర్మాణప్రకారముం జెప్పెద నాకర్ణింపుము. ఆలయమును అరువదినాల్గు అడుగుల పొడవుగలుగునట్లు నిర్మింపవలెను. ఆయరువదినాల్గడుగులలో మధ్యభాగంబున సమదిక్కులద్వార ముంచవలయును అట్లుంచినఁ బ్రశస్తము. విదిక్కులయం దెన్నఁడును ద్వార ముంచఁగూడదు. మఱియు నాలయముయొక్క వైశాల్య మెంతయుండునో దానికి ద్విగుణమైన యున్నతియుఁ ద్రిగుణమైన యుచ్ఛ్రియంబును గలిగియుండవలయును. దానికి సమముగఁ గటిప్రదేశంబును వలయు. భిన్నయోనియగు నాలయంపు విస్తారమునందు సగము గర్భముండవలయును. గర్భమున నాల్గవవంతుకు లోఁబడి ద్వారముయొక్క వైశాల్య ముండవలెను. అంతకు రెండింత లెత్తుగలిగియుండవలయును. ఉదుంబరశాఖ యొందు తెచ్చి యాద్వారమునకు నాల్గవవంతు తక్కువ వైశాల్యము కలిగియుండున ట్లొనరించి దానిలో నాలుగవవంతు ప్రతిమ వైశాల్యము కలిగియుండున ట్లొనరింపవలయు. ఆయుదుంబరశాఖనే ద్వారమునకై వినియోగింపవలయును.

---

సకలస్వనాః, నద్యస్తోయాంశుకా యత్ర శఫరీకృతమేఖలాః. ౧౩. ఫుల్లద్రుమోత్తమావాసాః సంగమశ్రోణిమండలాః, పులినాద్యున్నతోరస్కా రసహాసాశ్చ నిమ్నగాః. ౧౪. వనోపాంతనదీశైలసంస్కారోపాంతభూమిషు, రమతే దేవతా నిత్యం పురేషూద్యానవత్సు చ. ౧౫. భూమయో బ్రాహ్మణాదీనాం యాః ప్రోక్తా వాస్తుకర్మణి, తా ఏవ తేషాం శస్యంతే దేవతాయతనేష్వపి. ౧౬. చతుఃషష్టిపదం కుర్యాద్దేవతాయతనం సదా, ద్వారం చ మధ్యమం తస్మిన్సమదిక్స్థం ప్రశస్యతే. ౧౭. యో విస్తారో భవేత్తస్య ద్విగుణా తత్సమున్నతిః, ఉచ్ఛ్రయాస్తు తృతీయోఽథ తేన తుల్యా కటిర్భవేత్. ౧౮. విస్తారార్ధో భవేద్గర్భో భిన్నయోన్యాః సమంతతః, గర్భపాదోనవిస్తీర్ణం ద్వారం ద్విగుణముచ్ఛ్రితమ్. ౧౯. ఉచ్ఛ్రయాత్పాదవిస్తీర్ణా శాఖా తద్వదుదుంబరీ, విస్తరాత్పాద

అయిదేడుతొమ్మిది పురుషప్రమాణములుగల శాఖలతో ద్వారము నిర్మించుట యుత్తమము. ఆమీఁద నాశాఖల నాలుగుభాగములను ద్వారపాలకప్రతిమల నిలుపవలయును. ఆప్రతిమలు తాలతోడను, శ్రీవృక్షముతోడను, స్వస్తికఘటములతోడను నిర్మింపవలయును. మంగళచిహ్నములగు పక్షులయాకృతులు గూడఁ జేయవలయును. ఆశాఖాప్రమాణమున నెన్మిదవభాగము ప్రతిమవైశాల్య ముండవలయును. అందు రెండుభాగములు ప్రతిమగను మూఁడవభాగము పిండాకారముగ నుండనగును. మఱియు సోమహావీరా! పూర్వభాగమున మేరువును బశ్చిమభాగమున గైలాసాకృతియుఁ జేయవలయును. తక్కిన యిరువైపులను విమానాకృతులు చేయవలయును. సముద్రాకారముగను, పద్మాకారముగను, గరుడాకారముగను, నందివర్ధనాకారముగను, కుంజరాకారముగను గృహరాజముల నిర్మింపవచ్చును. మఱియు వృషభాకారమునను, హంసమాదిరిగను, సర్వతోభద్రమను నాభరణమువలెను, ఘటాకారముగను, సింహాకారముగను గూడఁ జేయనగును. నాల్గుకోణములు గలిగియుండునట్లును పదారుపలకలుగ నుండునట్లును నెన్మిదికోణములు గల్గియుండునట్లు నొనర్పవలయును. ఇట్లే పలుతెఱఁగుల మేడలు కట్టవచ్చునని పెద్దలు చెప్పుదురు. ఈసౌధములగుఱుతుల వివరింతు వినుము. అందు మేరుప్రాసాదము ముప్పదితొమ్మిది పురుషప్రమాణములుగలిగి పండ్రెండంతస్థులతో నుండవలయును. పలుతెఱఁగుల బిలము లుండవలయును. ముప్పదేసిచేతులు వైశాల్యముగల నాల్గువాకిళ్లుండవలయును. మందరప్రాసాదము ముప్పదిచేతుల నిడుపుగలిగి యేడుశిఖరములు గలిగియుండ

---

ప్రతిమాద్వాబహుల్యం శేషయోః స్మృతమ్. ౨౦. నృపంచసప్తనవభిః శాఖాభిస్తత్ప్రశస్యతే, అథ శాఖాచతుర్భాగే ప్రతిహారౌ నివేశయేత్. ౨౧. శైలమాంగల్యవిహాగః శ్రీవృక్షః స్వస్తికైర్ఘటైః, మానాష్టమేన భాగేన ప్రతిమా స్యాత్సపిండికా. ౨౨. ద్విభాగా ప్రతిమా తత్ర తృతీయో భాగపిండికా, పూర్వే మేరుర్మహాబాహో కైలాసశ్చ తథాపరే. ౨౩. భవంతి చాపరే వీర విమానచ్ఛదనం తథా, సముద్రపద్మగరుడనందివర్ధనకుంజరాః. ౨౪. గృహరాజో వృషో హంసః సర్వతోభద్రకో ఘటః, సింహో వృషశ్చతుష్కోణః షోడశాష్టాశ్రయస్తథా. ౨౫. ఇత్యేతే వింశతిః ప్రోక్తాః ప్రాసాదా యదునందన, యథోక్తానుక్రమేణైవ లక్షణాని వదామి తే. ౨౬. నవత్రింశదుచ్ఛ్రిత మేరుర్ద్వాదశభౌమో వివిధకుహరశ్చ, ద్వారైర్యుతశ్చతుర్భిర్ద్వాత్రింశద్ధస్తవిస్తీర్ణః. ౨౭.

వలయును. కైలాసప్రాసాదము గూడ నేడుశిఖరములు కలిగి యిరువ దెన్మిదిబాహువుల ప్రమాణముగలిగి యెనిమిదంతరములు గలిగియుండవల యును. విమానమను ప్రాసాదము పలువిధములగు గవాక్షములు గలిగి యిరువదియొక్కహస్తముల నిడుపుగల్గి యుండవలయును. నందనమను ప్రాసాదము ముప్పదిరెండుహస్తముల నిడివిగలిగి యుండవలయును. సముద్రమను ప్రాసాదము పదారుచేతుల కైవైశాల్యమై వర్తులమై యుండఁ జనును. పద్మాకృతియగుసౌధము నెన్మిదిచేతులవైశాల్యముతో నేకశృంగముతోఁడ నొక్కయంతరముతోఁడను నిర్మింపవలయును. గరుడప్రాసాదము గరుడాకృతిగను నందిప్రాసాదము నంద్యాకారముగనుండి యిరువదిచేతుల నిడుపుగలిగి యుండవలయును. కాయమను ప్రాసాదము సప్తాంతరోపేతమై యిరువదేడంగములతో రాజిల్లునట్లు చేయవలయును. కుంజరప్రాసాదము గజపృష్ఠాకారమై గర్భగోళమునఁ బదారుచేతులయెత్తు గలిగియుండవలయును. గృహరాజప్రాసాదము పదారుచేతులనిడుపును మూఁడుచక్రముల వైశాల్యముగల గవాక్షమును గలిగియుండవల యును. వృషప్రాసాదము భూశృంగములు గలిగి పండ్రెండుచేతుల యెత్తుగలిగి యుండవలయును గుండ్రముగ నుండవలయును. హంస ప్రాసాదము హంసవలె నుండును. ఘటప్రాసాదము నెన్మిదివేలకలశముల రూపమునఁ జేయవలయును. సర్వతోభద్రము నాల్గుద్వారములు పెక్కు శిఖరములును గలిగియుండవలెను. అందు మఱియు నందమగుమేడపై యంతరముగలిగి యిరువదియారుచేతుల యెత్తుండవలయును. సింహ

---

త్రింశద్ధస్తాయామో దశభౌమః సప్త మందరః, శిఖరయుతః కైలాసోఽపి శిఖరవానష్టా
వింశోష్టభౌమశ్చ. ౨౮. జాలగవాక్షైర్యుక్తో విమానసంజ్ఞస్త్రిసప్తకాయామః, నందన ఇతి
వై భౌమో ద్వాత్రింశత్షోడశాంగయుతః. ౨౯. వృత్తః సముద్గనామా పద్మాకృతిరయం
చాష్టౌ, శృంగేణైకేన భవేదేకేన చ భూమికా తస్య. ౩౦. గరుడాకృతిశ్చ గరుడో
నందీ వై షష్టివిస్తీర్ణః, కాయశ్చ సప్తభౌమో విభూషితోఽంగైశ్చ సప్తవింశతిభిః.
౩౧. కుంజర ఇతి గజపృష్ఠః షోడశహస్తోచ్ఛ్రితో మధ్యే, గృహరాజః షోడశకస్త్రిచక్ర
శాలా భవేద్వలభీ. ౩౨. వృష ఏవ భూమిశృంగో ద్వాదశహస్తః సమున్నతో వృత్తః,
హంసో హంసాకారో ఘటోఽష్టసహస్రకలశరూపః. ౩౩. ద్వారైర్యుతశ్చతుర్భిర్బహు
శిఖరో భవతి సర్వతోభద్రః, బహురుచిరచంద్రశాలః షడ్వింశద్భాగభూమిశ్చ. ౩౪.

ప్రాసాదము సింహాకారమై పండ్రెండుకోణములు నెన్మిదిచేతులు నిడుపును గలిగియుండవలయును. ఇప్పగిది విశ్వకర్మ మూఁడువేల తెఱఁగుల ప్రాసాదములఁ జెప్పియున్నాఁడు. ఇందుఁ గొందఱు ధీమంతులు స్థాపించువాని కెట్లభిమత మట్లుగూడఁ జేయవచ్చునందురు. అదియుఁ బెక్కుగవాక్షములతోఁ గూడియున్నచో వాని కెనయగును. అనిన విని సాంబుఁ డిట్లనియె. దేవర్షిసత్తమా! యిరువదివిధంబులగు ప్రాసాదంబులఁగూర్చి చెప్పితివి. ఆయిరువదింటిలో సూర్యున కేప్రాసాదమును నిర్మింపవలయును? అట్టిప్రాసాదమును నిర్మించుట కేయేస్థానములు యుక్తములు? ఆప్రాసాదనిర్మాణమునకు నీవు చెప్పినపురము వ్యయవంతులగునరులచే నిండియుండెను. అయిన నాప్రదేశమందే నిర్మింపవలయునా? యేదిగ్భాగంబునఁ జేయవలయును? ఈమొదలగువిషయములఁ జెప్పఁగోరెద ననిన నారదుం డిట్లనియె పట్టణమధ్యమునఁ బ్రవేశించి సూర్యదేవాలయమును నిర్మింపవలయును. దిగ్భాగంబులలోఁ బూర్వభాగముగాని పూర్వద్వార సమీపముగాని శ్రేష్ఠతమము. ప్రాసాదనిర్మాణమునకుఁ బూర్వము భూమినిఁ బరీక్షింపవలయును. మఱియు నిష్టగంధయుక్తమును, నిష్టరసయుక్తమును, పల్లమును నగుభూమి, దేవాలయనిర్మాణమునకుఁ బ్రశస్తము. మఱియు నీభూమియందు గులకరాలు, ఊక, వెంట్రుకలు, నెముకలు, నుప్పు, బొగ్గులు మొదలగువాటిని లేకుండఁ జేయవలయును

---

సింహః సింహాకారో ద్వాదశకోణోఽష్టహస్తశ్చ. ౩౫. సహస్రత్రితయం చైవ కథితం విశ్వకర్మణా, ప్రాహుః స్థాపయతశ్చాత్ర మతమేకం విపశ్చితః. ౩౬. కపోతపాలినీయుక్తమతో గచ్ఛతి తుల్యతామ్. ౩౭. సాంబ ఉవాచ.—య ఏతే కథితా విప్ర ప్రాసాదా వింశతిస్త్వయా, తేషాం సూర్యస్య కః కార్యః ప్రాసాదో భాస్కరస్య తు. ౩౮. స్థానాని యాని చోక్తాని ప్రాసాదస్య ద్విజోత్తమ, తేషాం త్వయోక్తం హి పురం వ్యయవద్భిర్నరైర్యుతమ్. ౩౯. తస్మిన్ప్రదేశే వై కార్యం భానోర్మందిరముత్తమం, దిశాం భాగే చ కతమే బ్రూహి శేషం ద్విజోత్తమ. ౪౦. నారద ఉవాచ.—పురమధ్యం సమాశ్రిత్య కుర్యాదాయతనం రవేః, దిశాం భాగేఽథ వా పూర్వే పూర్వద్వారసమీపతః. ౪౧. భూమిం పరీక్ష్య పూర్వం తు కుర్యాదాయతనం తతః, ఇష్టగంధరసోపేతా నిమ్నా భూమిః ప్రశస్యతే. ౪౨. శర్కరాతుషకేశాస్థిక్షారాంగారవివర్జితా, మేఘదుందుభినిర్ఘోషా సర్వబీజప్రరోహిణీ. ౪౩. శుక్లా రక్తా తథా పీతా కృష్ణా చ

మేఘదుందుభులతో సమానమగు నిర్ఘోషముగలదియు, సర్వబీజములను మొలపించునట్టిదియు నగు తెల్లభూమిగాని, యెఱ్ఱభూమిగాని, పచ్చభూమిగాని, నల్లభూమిగాని యుక్తమని చెప్పఁబడినది. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులచే యథాక్రమముగాఁ బరీక్షింపఁబడినభూమికి మధ్యభాగంబున ప్రమాణము ననుసరించి నాల్గుచతురపుగజముల ప్రదేశమును శుభ్రపఱచి దానిక్రింద నొకచతురపుహస్తప్రదేశమును శుభ్రపఱచి దానిమధ్యంబున దశాంగులపరిమితంబగు గోతిని ద్రవ్వి యామన్నుచేతనే యాఁగోతినిఁ బూడ్చవలయును. ఆమన్ను సమముగా సరిపోయిన యెడల సమగుణము గలది యగును. హీనమైనయెడల హీనగుణము గలదియగును. అధికమైనయెడల నధికగుణము గలదియగును. పురుషులకు వృద్ధిని గూడ గలుగఁజేయును. ఈదేవాలయమునకు ప్రాఙ్ముఖమున స్థానమును కల్పించుటచే సూర్యున కభిముఖముగను, నొకప్పుడు పశ్చిమముఖంబుగను, గృహమును నిర్మింపవలయును. ఈగృహమునకు దక్షిణభాగమున సూర్యుని స్నానగృహమును, సూర్యుని యుత్తరభాగమున శుభంబగు నగ్నిహోత్రగృహమును నిర్మింపవలయును. ఉదఙ్ముఖంబుగ శంభునిగృహంబును, మాతృదేవతాగృహంబులను నిర్మింపవలయును. బ్రహ్మదేవుని పశ్చిమదిక్కునందును, విష్ణువు నుత్తరదిక్కునందును స్థాపింపవలయును దక్షిణభాగమున బింబవృక్షమును, వామభాగంబున రాజ్ఞిని నుంచవలయును. సూర్యుని దక్షిణభాగంబునఁ బింగళుఁడును, వామ

---

కథితా క్షితిః, ద్విజరాజన్యవైశ్యానాం శూద్రాణాం చ యథాక్రమమ్. ౪౪. పరీక్షితానాం తస్యాం తు మధ్యే తస్యాః ప్రమాణతః, ఉపలిప్య చతుర్హస్తం చతురస్రం సమంతతః. ౪౫. హస్తమాత్రమధః కృత్వా మధ్యే తస్యా దశాంగులం, గర్తముత్కీర్య తేనైవ పాంసునా ప్రతిపూరయేత్. ౪౬. సమే సమగుణా జ్ఞేయా హీనే హీనగుణా భవేత్, వర్ధమానే తు వై పాంసౌ భవేద్వృద్ధికరీ క్షితిః. ౪౭ నిత్యం సంముఖమర్కస్య కదాచిత్పశ్చిమాముఖం, స్థాపనీయం గృహం సమ్యక్ప్రాఙ్ముఖస్థానకల్పనాత్. ౪౮. భవనాద్దక్షిణే పార్శ్వే రవేః స్నానగృహం భవేత్, అగ్నిహోత్రగృహం కార్యం రవేరుత్తరతః శుభం, ఉదఙ్ముఖం భవేచ్ఛంభోర్మాతౄణాం గృహమేవ చ. ౪౯. బ్రహ్మా పశ్చిమతః స్థాప్యో విష్ణురుత్తరతస్తథా, నింబస్తు దక్షిణే పార్శ్వే వామే రాజ్ఞీ

భాగమున దండనాయకుఁడును నుండవలయును. సూర్యగృహమున నెదుట శ్రీమహాశ్వేతలగృహము లుండవలయును. సూర్యగృహమునకు వెలుపలిభాగంబున నశ్వినీదేవతలగృహము లుండవలయును. రెండవ కక్ష్యయందు రాజ్ఞస్రౌషులును, మూఁడవకక్ష్యయందు కల్మాషపక్షులు దక్షిణభాగమున జండకామచరులు నుండవలయును. ఉత్తరదిక్కునందు లోకపూజితుండగు కుబేరుని సవినాయకుఁ డగు రైవతు నుంచవలయును. మఱియు నింకెచ్చట స్థానములు గలవో యాస్థానములయం దెల్లెడలను గుహుఁడు మొదలగువారిని స్థాపింపవలయును. సవ్యాపసవ్యంబులుగ నర్ఘ్యప్రదానంబులకొఱకు రెండుమండలంబులఁ జేయించవలయును. ఆ మండలంబులలో దక్షిణమండలంబున సూర్యోదయకాలంబున నుత్తర మండలంబున సూర్యాస్తమయకాలంబునను నర్ఘ్యప్రదానంబులఁ జేయవలయును. మఱియొకమండలమున చక్రాకృతంబగు సూర్యప్రతిమను రచియించి స్థాపింపవలయును. శుభప్రదంబులగు నాల్గు కలశములచేతను, నానావిధంబులగు తూర్యనినాదంబులచేతను,పుష్కలంబులగుశంఖధ్వనుల చేతను నీమూఁడవమండలమందున్న దివాకరునిఁ బూజింపవలయును. చతురస్రము, చతుశ్శృంగమగువ్యోమను సూర్యదేవతాగృహమున నెదురుగా నిర్మింపవలయును. తరువాత నాదిత్యాభిముఖముగా దిండిని

---

ప్రకీర్తితా. ౯౦. పింగలో దక్షిణే భానోర్వామతో దండనాయకః, శ్రీమహాశ్వేతయోః స్థానం పురతస్త్వంశుమాలినః. ౯౧. తతః స్థాప్యాశ్వినోః స్థానం పూర్వదేవగృహాద్బహి, ద్వితీయాయాం తు కక్షాయాం రాజ్ఞస్రౌషౌ వ్యవస్థితౌ. ౯౨. తృతీయాయాం తు కక్షాయాం స్థితౌ కల్మాషపక్షిణౌ, జండకామచరౌ స్థాప్యౌ దక్షిణాం దిశమాశ్రితౌ. ౯౩. ఉదీచ్యాం స్థాపనీయస్తు కుబేరో లోకపూజితః, ఉత్తరేణ తతస్తస్య రేవతః సవినాయకః. ౯౪. యత్ర వా విద్యతే స్థానం దిక్షు సర్వా గుహాదయః, ద్వే మండలే ఒర్ఘ్యదానార్థం కార్యే సవ్యాపసవ్యతః. ౯౫. దద్యాదుదయవేలాయామర్ఘ్యం సూర్యాయ దక్షిణే, ఉత్తరే మండలే దద్యాదర్ఘ్యమస్తమనే రవేః. ౯౬. చక్రాకృతాం తథాన్యస్మిన్దేవస్య ప్రతిమాం రవేః, స్థాపయేద్విధివద్వీర చతుర్భిః కలశైః శుభైః. ౯౭. నానాతూర్యనినాదైశ్చ శంఖశబ్దైశ్చ పుష్కలైః, తృతీయేమండలే హ్యేవం పూజనీయో దివాకరః. ౯౮. చతురస్రం చతుఃశృంగం వ్యోమ దేవగృహాగ్రతః, ప్రతిమాయాస్తు సూత్రేణ కార్యం మధ్యేఽస్య మండలమ్. ౯౯. దిండీ స్థాప్యః పుర

స్థాపింపవలయును. సర్వదేవమయంబగు నేవ్యోమను జెప్పితినో యా వ్యోమకు మధ్యాహ్న కాలమున నర్ఘ్యమీయవలయును. అట్లు చేయని యెడల మూఁడవదగు చక్రాకృతిమండలమున నున్న సూర్యునికే యర్ఘ్య ప్రదానమును జేయవలయును. వ్యోమస్థానమును దేవున కభిముఖము గనే సమీపమున నుంచవలయును. పురాణవాచకున కెచ్చట యిష్ట మగునో యచ్చటనే నియమింపవచ్చును. ఈప్రకారమున యథాక్రమ ముగా దేవతలయొక్క స్థానవిధినిఁగూర్చి చెప్పితిని. అందలి రాజ్ఞుఁడును, రుద్రుఁడును సూర్యున కిష్టులై యుందురు.

ఇది త్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకత్రింశదుత్తరశతతమాధ్యాయము.

పిమ్మట నారదుం డిట్లనియె. సాంబా! సమస్తదేవతలయొక్క ప్రతిమావిధిని విస్తరముగాఁ జెప్పెద నందును విశేషించి సూర్య ప్రతిమావిధిని జెప్పెద నాకర్ణింపుము. భక్తశుభాభివృద్ధికొఱకు విగ్రహ నిర్మాణ మేడువిధములుగఁ జెప్పఁబడియుండెను. అవి యేవియనిన స్వర్ణ మయీ, రజతమయీ, తామ్రమయీ, మృణ్మయీ, శిలామయీ, దారు

---

తస్మాదాదిత్యాభిముఖః స్థితః, య నేతత్కథితం వ్యోమ సర్వదేవమయం మయా. ౭౦. మధ్యాహ్నే తస్య దాతవ్యమర్ఘ్యమత్ర యదూత్తమ, అథ వా మండలం చాస్య తృతీయం చక్రసంమితమ్. ౭౧. స్థాపయిత్వా తు దేవేశం దాతవ్యోఽర్ఘ్యః సుపండితైః, దేవస్య పురతః కార్యం వ్యోమస్థానం సమీపతః, పుస్తకవాచనస్థానమథ వా యత్ర రోచతే. ౭౨. ఏష స్థానవిధిః ప్రోక్తో దేవతానాం యథాక్రమమ్, గృహరాజ్ఞోఽథ రుద్రస్తు ద్వావేతౌ భాస్కరప్రియౌ. ౭౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే ప్రాసాదలక్షణవర్ణనం నామ
త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచః—అథ తే సంప్రవక్ష్యామి ప్రతిమావిధివిస్తరం, సర్వేషామేవ దేవానామాదిత్యస్య విశేషతః. ౧. అర్చా సప్తవిధా ప్రోక్తా భక్తానాం శుభవృద్ధయే, కాంచనీ రాజతీ తామ్రీ పార్థివీ శైలజా స్మృతా. ౨. వార్క్షీ చాలేఖ్యకా చేతి

మయియా, యాలేఖ్యమయియా యగు నే ప్రతిమనైనను నిర్మింపవచ్చును. దారుమయప్రతిమావిధానమునుగూర్చి సమగ్రముగఁ జెప్పెద నాకర్ణింపుము. సంవత్సరమంతను బరిశీలించి కర్త కనుకూలమగు దినమును జూచి శుభనిమిత్తములను సూచించెడి శుభశకునములు గల్గుచుండఁగాఁ బ్రయాణముఁజేసి వనమును బ్రవేశింపవలయును క్షీరవృక్షంబులన్నియు దుర్బలంబులగుటచే వర్జనీయంబులు. చతుష్పథంబున నుండు వృక్షములును, పాలితవృక్షములును, గ్రాహ్యంబులుగావు. మఱియును దేవాలయంబులయందుండు వృక్షములును, వల్మీకములయందుండు వృక్షంబులును, గ్రాహ్యంబులు గానేరవు. దేవతాప్రతిమలు చెక్కిన వృక్షములును గ్రాహ్యంబులు గానేరవు. మఱియు శ్మశానమునఁ బుట్టిన వృక్షములును పక్షులకు నివాసభూతములగు వృక్షములును తొఱ్ఱలు గల వృక్షంబులును, శుష్కాగ్రంబులగు వృక్షంబులును, శస్త్రనిహతంబులగు వృక్షంబులును, గజభుక్తవృక్షంబులును, ఋగ్యజుస్సామవేదములు పఠింపఁబడుస్థలములయందుండు వృక్షములును, త్రిశాఖలుగల వృక్షములు వ్యాధిపీడితవృక్షములును, అకాలపుష్పితవృక్షంబులును, సకాలమునఁ బుష్పింపని వృక్షములున్ను ఆకులులేని వృక్షములున్ను, పిశాచకాకాశ్రితంబగు వృక్షములును, ఏకశాఖగల వృక్షములును, అతిశాఖలు గల వృక్షములును వర్జనీయంబు లగును. మధూక, దేవదారు, చందన, బిల్వ, ఆమ్రాతక, ఖదిర, అంజన, నింబ, శ్రీపర్ణ, పనస, సరల, అర్జున,

---

మూర్తిస్థానాని సప్త వై, వార్క్షీ విధానం తే వీర వర్ణయిష్యామ్యశేషతః. ౩. కర్త్రనుకూలే దివసే సంవత్సరవిశోధితే, శుభైర్నిమిత్తైః శకునైః ప్రస్థానైశ్చ వనం విశేత్. ౪. క్షీరిణో వర్జితాః సర్వే దుర్బలాస్తే స్వభావతః, చతుష్పథేషు న గ్రాహ్యా యే చ పుత్రకవృక్షకాః. ౫. దేవతాయతనస్థా యే తథా వల్మీకసంభవాః, ఉత్కీర్ణా దేవతా యేషు చైత్యవృక్షాశ్చ యే స్మృతాః. ౬. శ్మశానభూమిజా యే చ పక్షిణాం నిలయాశ్చ యే, సకోటరాశ్చ యే వృక్షాః శుష్కాగ్రా యే చ పాదపాః. ౭. శస్త్రేణ నిహతా యే చ కుంజరాశాస్తథా కృతాః, సామాద్యాః సరుజోఽధశ్చ వ్యాధినశ్చ తథైవ చ. ౮. అకాలే పుష్పితా యే చ కాలే తే చ వివర్జితాః, శీర్ణపర్ణాశ్చ తరవో రక్షోధ్వాంక్షనిషేవితాః, ఏకశాఖాతిశాఖాశ్చ త్రిశాఖాశ్చ తథాధమాః.౯. మధూకో దేవదారుశ్చ వృక్షరాజశ్చ చందనః, బిల్వశ్చామ్రాతకశ్చైవ ఖదిరో ఘాంజనస్తథా ౧౦.

రక్తచందనములు మొదలగు తత్ప్రాంతములయందుండు వృక్షములన్నియును ప్రతిమావిధానమునకు యుక్తముగా నుండును. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులను నాలుగువర్ణములకు నానుపూర్విగా నొక్కొక్కవర్ణమునకు రెండువృక్షముల చొప్పునఁ జెప్పఁబడినవి. నింబ మొదలు నంత్యమువఱకు నుండు వృక్షములన్నియు నన్నివర్ణములకును సాధారణములని తెలియనగును మఱియు నోసాంబా! దేవదారువు, శమీ, మధూకము, చందనము నను వృక్షములు బ్రాహ్మణులకు శుభప్రదంబులు. అశ్వత్థము, అరిష్టము, ఖదిరము, తిందుకము, కరకతమను నీవృక్షములు క్షత్రియునకు శుభములు. చందనము, ఖదిరము మొదలగునవి వైశ్యునకు శుభములు. కేసరము, సర్జకము, ఆమ్రము, సాలమను నీపుణ్యతరువులు శూద్రునకుఁ బుణ్యప్రదంబులై యుండును. లింగమును బ్రతిమను నొకచోటనుంచి పూర్వము చెప్పిన వృక్షములలో నభిమతమగువృక్షముకడ కేగి యథావిధిగఁ బుష్పంబులచేఁ బూజింపవలయును. పరిశుద్ధంబగు దేశంబునఁ గేశాంగారకవర్జితంబగు విజనప్రదేశమునందు లోకంపుఁ గష్టంబు లడఁగింపఁజాలునదియును, ప్రాక్పశ్చిమదిక్సూచకంబును నగు దేశమునందు విస్తీర్ణమగు స్కంధము కొమ్మలుగలట్టియుఁ, బత్రములుగలట్టియు, వక్రతాశూన్యమగునట్టియు, వర్ధిష్ణువైనట్టియు, త్వక్పర్ణసహితంబగు వృక్షము శుభప్రదము. స్వయ

---

నింబః శ్రీపర్ణవృక్షశ్చ పనసః సరలోఽర్జునః, రక్తచందనపర్యంతాః శ్రేష్ఠాః స్యుః ప్రతిమాద్రుమాః. ౧౧. వర్ణానామానుపూర్వ్యేణ ద్వౌ ద్వౌ వృక్షౌ ప్రకీర్తితౌ, నింబాద్యాః సర్వవర్ణానాం వృక్షాః సాధారణాః స్మృతాః. ౧౨. కథ్యమానాన్విశేషేణ శృణు వీర తథాపరాన్, సురదారుః శమీ చైవ మధూకశ్చందనస్తథా, ఏతే వై తరవస్తాత బ్రాహ్మణానాం శుభాః స్మృతాః. ౧౩. క్షత్రస్య చ తథారిష్టః ఖదిరస్తిందుకస్తథా, అశ్వత్థశ్చ తథా సాంబ ద్రుమః కరకతః శుభః. ౧౪. వైశ్యానాం తద్వదేవ స్యుః ఖదిరశ్చందనస్తథా, పుణ్యాశ్చ తరవశ్చైతే శుభదాస్తు తథైవ చ. ౧౫. కేసరః సర్జకశ్చామ్రః శాలవృక్షస్తథేతరః, ఏతేవై తరవః పుణ్యాః శూద్రాణాం శుభదాయకాః. ౧౬. లిఙ్గం చ ప్రతిమాం చైవమవస్థాప్య యథావిధి, వృక్షం చాభిమతం గత్వా పూజయేద్బలిపుష్పకైః. ౧౭. శుచౌ దేశే వివిక్తే చ కేశాంగారవివర్జితే, ప్రాగుదక్సూచకే దేశే లోకకష్టవివర్జితే. ౧౮. విస్తీర్ణస్కంధవిటపః పత్రవాన్ఋజువృద్ధిగః, ఆతంక

ముగాఁ బడినదియు నేనుఁగులచేఁ బడవేయఁబడినదియు, నెండినదియుఁ, గాలినదియును, పక్షులు లేనిదియు నగువృక్షము వర్జనీయమై యుండును పత్త్రపుష్పఫలసహితంబులగు వృక్షంబులు శుభదములగుట గ్రాహ్యము లగును. కార్తికము మొద లెనిమిదిమాసములయందును శుభదినంబులయందును గ్రహించుట యుక్తము. కార్తికము మొద లెనిమిదిమాసము లుపవసించి గాయత్త్రీ పరిపూతంబగు నుదకముచే నా వృక్షమూలమును బ్రోక్షించి యాభూమినంత నలికి శుద్ధవస్త్రము నా వృక్షమునకు ధరింపఁజేసి, గంధమాల్యాదులచేతను, ధూపదీపాదుల చేతను బూజింపవలయును. తరువాతఁ గుశాసనమునఁ గూర్చుండి యావృక్షసమీపమున దేవదారుసమిధలచే నగ్నిహోత్రమును వేల్చి "ఓమ్ భూర్భువస్సువః" అను నీమంత్రముచే హోమముఁజేసి యావృక్షమును బూజింపవలయును. "ఓం ప్రజాపతయే సత్యసదాయనిత్యం శ్రేష్ఠాంతరాత్మన్ సచరాచరాత్మన్, సాన్నిధ్యమస్మిన్ కురు దేవ వృక్షే సూర్యావృతం మండల మావిశేశ్చ. నమః" అను నీమంత్రవాక్యముచే సాంత్వనిగాఁ జేయుచు బాగుగాఁ బూజించి వృక్షలోకంబునకు శాంతి గల్గుటకొఱకు శుభప్రదంబగు దేవాలయమున కేగవలయును. దేవా! ఛేదదాహవివర్జితుండవగు నీవు వృక్షమూలమున నివసించి సకాలమున

---

హీనోవివశః సత్త్వకపర్ణః శుభస్తథా. ౧౯. స్వేనైవ పతితా యే చ హస్తిభిః పాతితాస్తథా, శుష్కాశ్చ వహ్నిదగ్ధాశ్చ పక్షిభిశ్చాపి వర్జితాః. ౨౦. తరవో వర్జనీయాశ్చ గ్రహీతవ్యాః శుభా ద్రుమాః, స్నిగ్ధరూపాః సపర్ణాశ్చ సపుష్పాః సఫలాస్తథా. ౨౧. తేషాం తు గ్రహణం చాష్టమాసేషు కార్తికాదిషు, భూత్వా శుభదినే చైవ సోపవాసోధివాసయేత్. ౨౨. సమంతాదుపలిప్యాథ తస్యాథస్తాద్వసుంధరామ్, గాయత్ర్యా పరిపూతేన పరితః ప్రోక్ష్య వారిణా. ౨౩. శుక్లే చ పరిధూతే చ పరిధాయ చ వాససీ, పూజయేద్గంధమాల్యైశ్చ సధూపబలికర్మభిః. ౨౪. తతః కుశైః పరిస్తీర్ణే హుత్వాగ్నౌ తస్య చాంతికే, దేవదారుసమిద్భిశ్చ మంత్రేణానేన తత్త్వవిత్. ౨౫. ఓం భూర్భువః సువరితి తతో వృక్షం చ పూజయేత్, ఓం ప్రజాపతయే సత్యసదాయ నిత్యం శ్రేష్ఠాంతరాత్మన్త్సచరాచరాత్మన్, సాన్నిధ్యమస్మిన్కురు దేవ వృక్షే సూర్యావృతం మండలమావిశేశ్చ నమః. ౨౬. నారద ఉవాచ:—ఏవం సంపూజయిత్వా తు వాక్యైరస్తం పరిసాంత్వయన్, వృక్షలోకస్య శాంత్యర్థం గచ్ఛ దేవాలయం శుభమ్.

ధూపదానములచేతను, పుష్పయుక్త బలికర్మలచేతను, జనులచేఁ బూజింపఁబడుచుందువు. దానిచేతనే తృప్తినిఁ బొందుచుందువు. అని స్తోత్రరూపంబులగు వాక్యములఁ బల్కి తరువాత కుఠారమును, ధూప మాల్యంబులచేఁ బూజించి, శిరస్సును తూర్పుదిక్కుగా నుంచవలయును. తరువాతఁ బరమాన్నము మోదకములు మొదలగు పిండివంటకంబులు, మద్యము, కుసుమములు, ధూపములు మొదలగువాటిచే వృక్షమును, బూజించి, సురలకును, పితరులకును, పిశాచంబులకును, రాక్షసులకును భుజంగంబులకును, వినాయకాదిగణంబులకును బూజసేసి రాత్రియందు వృక్షమును స్పృశించి "దేవదేవ నీవర్చలయందు దేవతలచే కల్పింపఁబడితివి. వృక్షరాజమా! నీకు నమస్కారము. విధ్యుక్తముగాఁ జేయు నీ పూజను గ్రహింపుము. ఏయేభూతంబు లీవృక్షమున నున్నవో యా భూతంబులన్నియు విధ్యుక్తప్రకారంబునఁ బ్రయుక్తంబులగు పూజల గ్రహించి మఱియొక్కస్థలమున వాసము నేర్పరచుకొనుగాక! భూతము లన్నియు క్షమించుఁగాక. భూతములకొఱకు నమస్కారము" అని ప్రార్థింపవలయును. మరల రాత్రియొక్క యవసానమున నావృక్షమును బూజించి భోజకులకును బ్రాహ్మణులకును దక్షిణలిచ్చి స్వస్తివాచకకృత స్వస్తివచనంబులచే వనస్పతిని ఛేదింపవలయును. ఛేదించినవృక్షమును

౨౭. దేవ త్వం స్థాస్యసే తత్ర చ్ఛేదదాహవివర్జితః, కాలే ధూపప్రదానేన సపుష్పైర్బలికర్మభిః. ౨౮. లోకాస్త్వాం పూజయిష్యంతి తతో యాస్యసి నిర్వృతిం, వృక్షమూలే కుఠారం తు ధూపమాల్యైః ప్రపూజ్య చ. ౨౯. పూర్వతస్తు శిరః కృత్వా స్థాపనీయః ప్రయత్నతః, పరమాన్నమోదకౌదనపలపూపికాదిభిర్భక్ష్యైః. ౩౦. మద్యైః కుసుమైర్ధూపైర్గంధైశ్చ తరుం సమభ్యర్చ్య, సురపితృపిశాచరాక్షసభుజంగసురగణ వినాయకాద్యానామ్. ౩౧. కృత్వా పూజాం రాత్రౌ వృక్షం సంస్పృశ్య చ బ్రూయాత్. ౩౨. అర్చాసు దేవదేవ త్వం దేవైశ్చ పరికల్పితః, నమస్తే వృక్ష పూజేయం విధివత్పరిగృహ్యతామ్. ౩౩. యానీహ భూతాని వసంతి తాని బలిం గృహీత్వా విధివత్ప్రయుక్తమ్, అన్యత్ర వాసం పరికల్పయంతు క్షమంతు తే చాద్య నమోఽస్తు తేభ్యః. ౩౪. ప్రభాతాయాం తు శర్వర్యాం పునః సంపూజ్య తం నగం, బ్రాహ్మణేభ్యస్తతో దత్త్వా భోజకేభ్యశ్చ దక్షిణాం, ఛింద్యాద్వనస్పతిం స్తైస్తైః

తూర్పుదిక్కునందుగాని, యీశాన్యదిక్కునందుగాని, ఉత్తరదిక్కునందు గాని పడవేయవలయును. మఱియొకవిధముగఁ బడవేయఁగూడదు. తూర్పు, ఈశాన్యము, నుత్తర మను నీమూఁడుదిక్కులయందే పడవేయ వలయునని చెప్పఁబడియున్నది. నైరృతదిక్కునందును, ఆగ్నేయదిక్కునందును, దక్షిణదిక్కునందును పడవేయుట శుభప్రదంబు గాదు. వాయవ్యదిశయందును, పశ్చిమదిశయందును బడవేయుట మధ్యమమని యెఱుంగునది. ఏవృక్షమునకు బాహ్యస్థితంబులగు శాఖలు నాల్గువైపులను నష్టములయ్యెనో యవి పడునపుడు పశ్చిమముగాఁ బడవలయు. శీఘ్రముగా ధ్వనిలేకుండునట్లుగాఁ బడుట యుత్తమము. పెట్టునప్పుడు మ్రాను పగిలిపోయినను రసమునుగాని తైలముంగాని స్రవించినను వృక్షముం ద్యజింపవలెను. సాంబా! నీకు మఱియొక విషయము జెప్పెద నాకర్ణింపుము. ప్రాతఃకాలమున వృక్షమును సలిలముచేఁ దడిపి పూర్వోత్తరదిక్కులయందు ఛేదించి తరువాత గొడ్డలికిఁ దేనెను నేతినిఁ బూసి సప్రదక్షిణముగా ఛేదింపవలెను. పూర్వోత్తరదిక్కులయందుఁ బడుట వృద్ధికరమైయుండును. ఆగ్నేయకోణమందుఁబడిన నగ్నిదాహము, దక్షిణ

కృతస్వస్తివాచనైః. ३५. పూర్వస్యాం దిశి పాతోఽస్య ఐశాన్యాం చాపి యో భవేత్, అథ వా ఉత్తరస్యాం తు తథా ఛింద్యాత్తు నాన్యథా. ३६. ఐంద్ర్యైశాన్యోరుదీచ్యాం చ పాతస్త్రిస్వపి శస్యతే, నైరృత్యాగ్నేయయామ్యాసు దిక్షు పాతో న శోభనః, వాయవ్యాం చైవ వారుణ్యాం తస్య పాతస్తు మధ్యమః. ३७. యస్య బాహ్యస్థితా శాఖా దిక్షు నష్టా చతసృషు, వాస్తుపూర్వం తతః స్థిత్వా తతః పశ్చాదవస్థితా. ३८. అవిలగ్నమశబ్దం తు పతనం తు ప్రశస్యతే, ఉత్పద్యేద్ద్విదలం యస్య ద్రావశ్చ మధురో భవేత్. ३९. సర్పిస్తైలం క్షరేద్యస్య పాదపం తం వివర్జయేత్, శుభదం యదుశార్దూల శృణు త్వం కథయే శుచి. ४०. వృక్షం ప్రభాతే సలిలైర్నిషిక్తం పూర్వోత్తరస్యాం దిశి సన్నికృత్య, మధ్వాజ్యదిగ్ధేన కుఠారకేణ ప్రదక్షిణం శేషమభిప్రహణ్యాత్. ४१. పూర్వోత్తరేఽప్యుత్తరదిగ్విభాగే పాతో యదా వృద్ధికరస్తదా స్యాత్, ఆగ్నేయకోణక్రమశోఽగ్నిదాహ ఉగ్రోగ్రరోగాః సుధనక్షయశ్చ. ४२. గారుడే దిశి పాషాణం కపోతో గృహగోధికా, సితవర్ణం జలం జ్ఞేయమంగుష్ఠాభం భవేత్కృమిః, దోషైరేతై

మందు భయంకరరోగంబులును, నైరృతమున నాశమును గల్గును. వరుణ దిక్కునందు ఫలము మధ్యమముగ నుండును.

ఇది ఏకత్రింశదుత్తరశతతమాధ్యాయము.

## ద్వాత్రింశదుత్తరశతతమాధ్యాయము.

సాంబా ! సమస్తదేవతలయొక్క ప్రతిమాలక్షణంబులఁ జెప్పెద నాకర్ణింపుము విశేషించి సూర్యప్రతిమాలక్షణంబుఁ జెప్పెదను. సూర్య ప్రతిమ యేకహస్తప్రమాణముగఁగాని ద్విహస్తప్రమాణముగాఁగాని త్రిహస్తప్రమాణముగాఁగాని సార్థత్రిహస్తపరిమితిగఁగాని యున్న యెడలఁ బ్రశస్తమగును. ప్రాసాదము ననుసరించిగాని ద్వారము ననుస రించిగాని, తదనుగుణ్యంబుగఁ బ్రతిమ నేర్పరుపవలెను. శుభార్థియగు పురుషుఁ డీవిధిప్రకారము విగ్రహప్రమాణ మేర్పరుపవలెను. విగ్రహ మేకహస్తపరిమితమైన సౌమ్యమైన దగును. ద్విహస్తప్రమాణమైన ధన ధాన్య సమృద్ధినిచ్చును. త్రిహస్తప్రమాణమైనయెడల సర్వకామప్రద మగును సార్థత్రిహస్తప్రమాణమైన సుభిక్షమును క్షేమమును కలుగఁ జేయును. ఆదిమధ్యాంతములయందు సమానముగానున్నయెడల నా ప్రతిమను గాంధర్వముగాఁ దెలియవలెను. ధనధాన్యప్రదంబగును. దేవాలయముయొక్క ద్వారములో నెనిమిదవభాగము విగ్రహ ముండ

ర్వినిర్ముక్తం ముదా కాలం సముద్ధరేత్. ౪౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే దారుపరీక్షావర్ణనం నామ
ఏకత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

నారద ఉవాచ:—హంత తే సర్వదేవానాం ప్రతిమాలక్షణం పరం, వచ్మి తే యదుశార్దూల ఆదిత్యస్య విశేషతః. ౧. ఏకహస్తా ద్విహస్తా వా త్రిహస్తా వా ప్రమాణతః, తథా సార్ధత్రిహస్తా చ సవితుః ప్రతిమా శుభా. ౨. ప్రాసాదాద్ద్వారతో వాపి ప్రమాణం చ ప్రకల్పితం, తద్వత్ప్రమాణం కర్తవ్యం సతతం శుభమిచ్ఛతా. ౩. ఏకహస్తా భవేత్సౌమ్యా ద్విహస్తా ధనధాన్యదా, త్రిహస్తా ప్రతిమా భానోః సర్వకామ ప్రదా స్మృతా. ౪. సార్ధత్రిహస్తా ప్రతిమా సుభిక్షక్షేమకారిణీ, అగ్రే మధ్యే చ మూలే చ ప్రతిమా సర్వతః సమా, గాంధర్వీ సా తు విజ్ఞేయా ధనధాన్యావహా స్మృతా. ౫. దేవాగారస్య యద్ద్వారం తస్మాదష్టాంశముద్యతా, త్రిభాగైః పిండికా

గవలెను. అందును మూఁడుభాగములు పీఠమును, రెండుభాగములు విగ్రహముగా నుండవలెను. ఎనుబదినాల్గంగుళములమూర్తియు విస్తారమును ఆయామము ననుసరించి పండ్రెండంగుళములవదనమును చేయవలయును. ముఖములో మూఁడు భాగములు చుబుకమును, లలాటమును, నాసికయు, తత్సమ్మితములగుకర్ణములు ననియతంబులగుపాదములును రెండంగుళముల వైశాల్యముగల నేత్రములును అందు మూఁడుభాగములు కనీనికయు దీనిలో మూఁడవభాగము దృష్టిని నిర్మింపవలెను. లలాటశిరముల యున్నతభాగమును సమముగాఁ జేయవలయును. శిరస్సుయొక్క వైశాల్య మిరువదిరెండంగుళములును మెడ నాసికకు సమానమగుపంక్తియందును వక్షఃస్థలము ఫాలభాగమువలెను, నాభి నిమ్నమై యాస్యంబువలె సూక్ష్మమై సుందరమగు శేఫంబును వక్షములో సగభాగము కటిస్థలియు బాహూరుజంఘలు ప్రవాహసదృశముగ నుండవలయును. చీలమండల కధోభాగమున నాల్గంగుళములయెత్తును వైశాల్య మారంగుళములకు మించకయు మూఁడంగుళములపొడవుగ నంగుష్టము నంతియపొడవుగల రెండవవ్రేలును గోళ్లతోఁ గూడ దానికన్న కొంచెము హీనమగు మిగిలినవ్రేళ్లును పదునాలుగంగుళములపొడవునుగల్గిన పాదము నిర్మింపవలయును. ఇట్లు నాచేఁ జెప్పఁబడిన లక్షణయుక్తమగుప్రతిమ యర్చారూపంబగును. ఈసూర్యునకు భుజములు

---

కార్యా ద్వౌ భాగౌ ప్రతిమా భవేత్. ౬. అంగులైశ్చ తథా మూర్తిశ్చతురశీతిసంమితైః, విస్తారాయామతః కార్యా వదనం ద్వాదశాంగులమ్. ౭. ముఖాత్త్రిభాగైశ్చిబుకం లలాటం నాసికా తథా, కర్ణౌ నాసికయా తుల్యౌ పాదౌ చానియతౌ తయోః. ౮. నయనే ద్వ్యంగులే స్యాతాం త్రిభాగా తారకా భవేత్, తృతీయతారకాభాగాత్కుర్యాద్దృష్టిం విచక్షణః. ౯. లలాటమస్తకోత్సేధం కుర్యాత్తత్సమమేవ చ, పరిణాహస్తు శిరసో భవేద్ద్వావింశదంగులః. ౧౦. తుల్యా నాసికయా గ్రీవా ముఖేన హృదయాంతరం, ముఖమాత్రా భవేన్నాభిస్తతో మేఢ్రమనంతరం, ముఖవిస్తారణమురస్తతోఽర్ధం తు కటిః స్మృతా. ౧౧. బాహూ ప్రవాహతుల్యౌ తు ఊరూ జంఘే చ తత్సమే, గుల్ఫాధస్తాత్తు పాదః స్యాదుచ్ఛ్రితశ్చతురంగులః. ౧౨. షడంగులసువిస్తారస్తస్యాంగుష్ఠాంగులత్రయం, ప్రదేశినీ చ తత్తుల్యా హీనా శేషా నఖైర్యుతాః. ౧౩. చతుర్దశాంగులః పాద ఆయామాత్పరికీర్తితః, ఏవంలక్షణసంయుక్తా ప్రతిమార్చ్యా భవే

నూరువులు లలాటము నాసిక నేత్రములు గండస్థలములు నున్నతము లుగాఁ జేయవలయును. మఱియు నేత్రములు విశాలంబులుగను సమంబు గను ధవళవర్ణంబుగ నుండుట స్మితయుక్తంబగును. సస్మితంబగు ముఖ పద్మంబును సుందరంబగు బింబాధరంబును, రత్నభాసితంబగు కిరీటంబును, కటకంబులును, భుజకీర్తులును, హారంబులును, సుందరంబగు మండలంబును, వాచిత్రంబులగు మణికుండలంబులును, కరంబునఁ గాంచనమాలాసరో రుహంబులను ధరించియుండునట్లుగాఁ బ్రతిమను నిర్మించినయెడల నానిర్మా తయు సర్వకామంబులఁ బొందును. ఈసూర్యుఁడు ప్రజల కారోగ్య మును శుభమును నిచ్చును. ఆప్రతిమ యల్పాంగములు గలదైనచో రాజభయంబును హీనాంగమైనఁ గామప్రదానాసమర్థంబును పెద్దకడుపు గలదియైనచో నాకలిబాధయుఁ జిన్నదియైనచో దారిద్ర్యము దెబ్బలతోఁ గూడిన భయమును శస్త్రవ్రణముగల్గిన మృత్యుకారిణియు దక్షిణభాగ మునకు వంగిన నాయుఃక్షయము నుత్తరభాగంబునకు వంగిన వియోగం బును సంభవించును ఆప్రతిమయొక్క సర్వావయవములు బ్రస్ఫుట ములై యుండవలెను. కాన నిహపరంబుల హితంబుఁగోరు భాస్కర భక్తుఁడు సూర్యప్రతిమానిర్మాణమందు జాగరూకుఁడై ప్రవర్తింపవలెను. సంపదలన్నియు నీప్రతిమాధీనములై యున్నవి. కాన నోసాంబా!

---

త్పదా. ౧౪. అంసౌ హారే స్తథైవోరూ లలాటం చ సనాసికం, నియతే నయనే గండౌ మూర్తేః కుర్యాత్సమున్నతే. ౧౫. విశాలధవలావామపక్ష్మలాయతలోచనే, సస్మితానన పద్మస్య చారుబింబాధర స్తథా. ౧౬. రత్నప్రోద్భాసిముకుటకటకాంగదహారవాన్, అవ్యంగపదమధ్యాదిసమాయోగోఽపి శోభితః. ౧౭. సుప్రభో మండలశ్చారుస్వైచిత్ర మణికుండలః, కరాభ్యాం కాంచనీం మాలాం ప్రోద్వహన్సరోరుహమ్. ౧౮. ఏవం లక్షణసంయుక్తాం కారయేదీహితప్రదాం, ప్రజాభ్యశ్చ సదా భానుః శివారోగ్యాభయ ప్రదః. ౧౯. అల్పాంగాయాం నృపభయం హీనాంగాయామకల్పతా, ఖాతోదర్యాం చ క్షుత్పీడా కృశాయాం తు దరిద్రతా. ౨౦. సక్షతాయాం భయం శస్త్రాత్స్ఫుటితా మృత్యుకారిణీ, దక్షిణావనతాయాం తు శశ్వదాయుఃక్షయో భవేత్. ౨౧. ఉత్తరావన తాయాం తు వియోగో భవతి ధ్రువం, నాలోక్యా నాప్యనాలోక్యా రక్ష్యా మూర్తిః ప్రశస్యతే. ౨౨. తస్మాద్భాస్కరభక్తేన లోకద్వయహితైషిణా, తన్మూర్తేశ్చాదరః కార్య

శిరము, నూరులు, గండంబులు, వదనము మొదలగు సర్వావయవముల చేతను బూర్వోక్తలక్షణోపేతంబుగా ప్రతిమను రచించిన నీకు శుభంబు గల్గును. గూఢములగుపాదములు నుదరంబుగలట్టియు కంచుకగుప్తం బగు శరీరముగలట్టియు ప్రసన్నమగుముఖముగల్గి రక్తోత్పలసదృశంబగు ప్రభామండలము గల్గియున్న యాదిత్యుఁడు మీకు శుభంబుఁ గల్గఁజేయును. కుండలభూషితవదనుండును ప్రలంబమానహారోద్భాసితుండును గృహావృత్తుండు నగుభాస్కరుండు నృపతినుండి భయమును బాపును. విశేషాంగమును హీనాంగమును గల్గియున్నచోఁ గర్తను ఫల మీయఁజాలఁడు. ఉదరము పెద్దదైయైన క్షుద్బాధయుఁ జిన్నదియైన ధన నాశము శస్త్రనిపాతంబున క్షతముఁ గల్గియున్నఁ గర్తకు మరణమును కలుగఁజేయును. వామభాగ మధికమైయున్న భార్యను దక్షిణభాగ మధికమైన నాయువును నశింపఁజేయును. ఊర్ధ్వదృష్టి గలిగియున్న నంధత్వ మును, అధోదృష్టికలిగినఁ జింతను గలుగఁజేయును. సర్వవిధములగు ప్రతిమలవిషయమున భాస్కరుఁడు శుభాశుభముల నిట్లు చెప్పెను. బ్రహ్మ దేవుఁడు కమండలువు ధరించి నాల్గుముఖములుకల్గి పంకజాసనుఁడై యుండవలెను. స్కందుఁడు కుమారరూపము ధరించి బర్హికేతుఁడై శక్తిని ధరించియుండవలెను. ఇంద్రుఁడు చతుర్విషాణములుగల యైరావతము నెక్కి వజ్రపాణియై యుండవలయును. ఈశ్వరుఁడు లలాటమునఁ

---

స్తదధీనాస్తు సంపదః. ౨౩. శిరోరుగండవదనైః సర్వాంగావయవై స్తథా, ఏవంలక్షణ సంపూర్ణా ప్రతిమా భవతే శుభా. ౨౪. నాసాలలాటజంఘోరుగండవక్షోభిరన్వితా, కుర్యాదాదిత్యవేషం తు గూఢపాదోదరం తథా. ౨౫. కమలోదరకాంతినిభః కంచుక గుప్తః ప్రసన్నముఖః, రక్తోత్పలప్రభామండలశ్చ కర్తుః శుభం కరోత్యర్కః. ౨౬. కుండలభూషితవదనః ప్రలంబహారోఽపి గృహావృత్తః, నృపతిభయం వ్యంగాయాం హీనాంగాయామకల్పనా కర్తుః. ౨౭. ఖాతోదర్యాం క్షుద్భయమర్థవినాశః కృశాం గాయాం, మరణం తు సక్షతాయాం శస్త్రనిపాతేన నిర్దిశేత్కర్తుః. ౨౮. వామోన్నతా తు పత్నీం దక్షిణావనతా హినస్త్యాయుః, అంధత్వమూర్ధ్వదృష్టిః కరోతి చింతామధో ముఖీ దృష్టిః. ౨౯. సర్వప్రతిమాస్వేవం శుభాశుభం భాస్కరేణోక్తం, బ్రహ్మా కమండ లుకరశ్చతుర్ముఖః పంకజస్థశ్చ. ౩౦. స్కందః కుమారరూపః శక్తిధరో బర్హికేతుశ్చ, శుక్లశ్చతుర్విషాణో ద్విపో మహేంద్రస్య వజ్రపాణిత్వమ్. ౩౧. తిర్యగూర్ధ్వలలాట

దృతీయలోచనముగలవాఁడై యుండును. ఇవి యితరదేవతల కధికచిహ్నములై యుండును.

ఇది ద్వాత్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## త్రయస్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

నారదుం డిట్లనియె. తరువాత శాస్త్రవిహితంబగుకర్మ ననుసరించి అధివాసంబులఁ జేయవలెను. ఈశాన్యదిగ్భాగమున నాల్గుతోరణముల చేత సర్వాభరణములచేతను భూషితంబయి యెనిమిది దిక్కులందును పతాకలచే నలంకరింపఁబడిన యధివాసమంటపమును రచింపవలయును. మఱియు నామంటపమునకు నాగ్నేయీదిక్కున రక్తపతాకంబులను యామ్యదిక్కునందుఁ గృష్ణపతాకంబులు నిట్లే నైరృతంబునను వాయవ్యదిక్కునఁ బాండురపతాకంబులును పశ్చిమదిక్కున శ్వేతపతాకంబులు నుత్తరదిక్కునఁ జిత్రపతాకంబులును పూర్వోత్తరదిగ్భాగంబులఁ బీత పతాకంబులను నిర్మింపవలయును. యదూత్తమా! అట్లు నిర్మించిన యెడల సంపదర్థమై చేయఁబడిన యాప్రతిమ సంపదలను ఆయువును, జయమును, బలమును, యశస్సును, నిస్సంశయముగ నాపాదించును. మృణ్మయంబగు ప్రతిమను నిర్మించిన సర్వలోకంబులకు హితమును

---

సంస్థం తృతీయమపి లోచనం చిహ్నమ్. ౩౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే శ్రీసూర్యప్రతిమాలక్షణవర్ణనం
నామ ద్వాత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచ:—తతోఽధివాసనం కుర్యాద్విధిదృష్టేన కర్మణా, ఐశాన్యాం దిశి వై కుర్యాదధివాసనమండపమ్. ౧. చతుస్తోరణసంపన్నం సర్వాభరణసంయుతం, దిశాసు విదిశాస్వేవ పతాకాభిస్తు భూషితమ్. ౨. ఆగ్నేయ్యాం దిశి రక్తాః స్యుః కృష్ణాః స్యుర్యామ్యనైరృతే, శ్వేతా దిశ్యపరస్యాం తు వాయవ్యామేవ పాండురా. ౩. చిత్రా చోత్తరపార్శ్వే తు పీతా పూర్వోత్తరే తథా, శ్రియమాయుర్జయం చైవ బలం యశో యదూత్తమ. ౪. దదాతి సా వీర కృతా సంపదర్థే న సంశయః, హితాయ

కలుగఁజేయును. మణిమయమగు ప్రతిమ సుభిక్షమును సర్వమణిమయాభరణములను కలుగఁజేయును. సువర్ణమయప్రతిమ శరీరమునకుఁ బుష్టినిఁ గలుగఁజేయును. రజతప్రతిమ కీర్తినిఁ గలుగఁజేయును. తామ్రప్రతిమ ప్రజావృద్ధిని శిలామయంబగు ప్రతిమ విపులంబగు భూలాభమును గలుగఁజేయును. ఇత్తడిది ప్రధానపురుషుని నశింపఁజేయునుగాని సర్వదేవమయుండగు సూర్యునివిగ్రహము పూర్వము నాచేఁ జెప్పఁబడిన వానిలో నిత్తడిగాక దేనిచేనైనను చేయింపవచ్చును. అనిన విని సాంబుఁ డిట్లనియె. ద్విజోత్తమా! సూర్యుఁడు సర్వదేవమయుఁడని యంటివి గదా! అదియెటుల సిద్ధించెను? నాకుఁ దెలుపుమనిన నారదుం డిట్లనియె. సాంబా! గొప్పవిషయము నడిగితివిగాన చెప్పెద నాకర్ణింపుము. ఆదిత్యునకు బుధసోములు నేత్రములయందును, ఈశ్వరుఁడు లలాటమునందును, సురజ్యేష్ఠుండగు దేవేంద్రుఁడు శిరస్సునందును, కపాలమున బృహస్పతియుఁ, గంఠమున నేకాదశరుద్రులు నాశ్రితులై యుండిరి. మఱియు నక్షత్రంబులు గ్రహములు దంతములయం దిమిడియుండిరి. ధర్మాధర్మములు దేవుని పెదవులయం దుండెను. సర్వశాస్త్రమయియగు సరస్వతి జిహ్వయందుండెను. సమస్తదిక్కులుఁ గర్ణభాగములయందును సర్వదేవపూజ్యులగు బ్రహ్మేంద్రులు తాలుభాగమున నుండిరి. ద్వాదశాదిత్యులు

---

సర్వలోకానాం మృన్మయీ ప్రతిమా భవేత్. ౫. సుభిక్షక్షేమదా నిత్యం సర్వా మణిమయీ కృతా, గాంగేయీ పుష్టిదా స్యాద్వై రౌప్యా కీర్తిప్రవర్తినీ. ౬. ప్రజావృద్ధిం తామ్రమయీ కుర్యాన్నిత్యమసంశయః, భూమేర్లాభం తు విపులం కుర్యాదశ్మమయీ సదా. ౭. ప్రధానపురుషం హంతి త్రపులోహమయీ సదా, సర్వదేవమయస్యైవ మర్చాం కుర్యాత్ప్రయత్నతః. ౮. సాంబ ఉవాచ.—సర్వదేవమయత్వం హి బ్రూహి మే భాస్కరస్య తు, సర్వదేవమయో హ్యేష కథం నారద కథ్యతే. ౯. నారద ఉవాచ.—సాధు సాంబ మహాబాహో శృణు మే పరమం వచః, బుధసోమౌ స్మృతౌ నేత్రే లలాటే చేశ్వరః స్థితః. ౧౦. సురజ్యేష్ఠః శిరస్తస్య కపాలేఽస్య బృహస్పతిః, ఏకాదశ తథా రుద్రాః కంఠమస్య సమాశ్రితాః. ౧౧. నక్షత్రాణి గ్రహాశ్చైవ దశనేషు సమాశ్రితాః, ధర్మాధర్మౌ చ దేవస్య ఓష్ఠసంపుటకే స్థితౌ. ౧౨. సర్వశాస్త్రమయీ దేవీ జిహ్వాయాం చ సరస్వతీ, దిశశ్చ విదిశశ్చైవ సర్వాః శ్రోత్రేషు సంస్థితాః. ౧౩. బ్రహ్మేంద్రౌ తాలుదేశే తు స్థితౌ దేవైశ్చ పూజితౌ, ఆదిత్యా ద్వాదశ విభోర్భ్రువో

భూ్రిమధ్యంబున నుండిరి. ఋషులు రోమకూపములందును, సముద్ర ములు కుక్షియందు నుండును. యక్షులు, కిన్నరులు, గంధర్వులు, పిశాచ ములు, దానవులు, రాక్షసులు, ప్రమథాదిగణములును హృదయమునం గూండిరి. నదులు బాహువులయందును, బర్వతములు కక్ష్యాంతరముల యందును, మేరుపర్వతము పృష్ఠభాగంబునను నుండును. స్తనాంతరమునః గుజుండును, నాభిమండలంబున సూర్యపుత్రుం డగుధర్మరాజును, కటి ప్రదేశంబునః బృథివ్యాదులును, లింగంబున సృష్టియు నాశ్రయించి యుండును. అశ్వినీదేవతలు జానువులయందును, వృక్షము లూరువుల యందును, సప్తపాతాళలోకంబులు నఖమధ్యంబులయందును నుండును. సాగరవలయితంబగు బృథివి పాదమధ్యంబున నుండును. దేవుండగు కాలాగ్నిరుద్రుఁడు దంతాంతములయం దుండును. గాన నోసాంబా! యీకారణముచే సూర్యుఁడు సర్వదేవమయుఁడును సర్వదేవాత్మకుం డయ్యెను. విశేషాంగములయందు వాయువును, చరాచరంబగు లోకా లోకపర్వతంబు నుండెను. కర్మశరీరము నాశ్రయించిన వాయువుచే నీప్రపంచ మావృతంబయ్యె. కాన నట్టిభాస్కరుఁడు భూతానుగ్రహతత్ప రుండై ప్రవర్తించుచుండెను. కాన నోసాంబా! యిదియే నీకు ముక్తి స్థానము నుత్తమజ్ఞానము నై యున్నది. ప్రతిమాస్థాపనము నెట్లు చేయ

ర్మధ్యే సమాశ్రితాః. ౧౪. ఋషయో రోమకూపేషు సముద్రా జఠరే స్థితాః, యక్ష కిన్నరగంధర్వాః పిశాచా దానవా స్తథా. ౧౫. రాక్షసాశ్చ గణాః సర్వే హృదయే స్యుః స్థితా రవేః, నద్యో బాహుగతాశ్చైవ నగాః కక్షాంతరే స్థితాః. ౧౬. పృష్ఠమధ్యే స్థితో మేరుః స్తనయోరంతరే కుజః, తస్య పుత్రో ధర్మరాజః స్థితో వై నాభిమండలే. ౧౭. కటిదేశే పృథివ్యాద్యా లింగే సృష్టిః సమాశ్రితా, జానునీ చాశ్వినీదేవా వూరూ తస్యాచలాః స్మృతాః. ౧౮. సప్త పాతాలలోకాస్తు నఖమధ్యే సమాశ్రితాః, ససాగర వనా పృథ్వీ పాదమధ్యేఽస్య వర్తతే. ౧౯. దేవః కాలాగ్నిరుద్రో యో దంతాంతేషు సమాశ్రితః, సర్వదేవమయో భానుః సర్వదేవాత్మక స్తథా. ౨౦. వ్యంగేషు వాయవశ్చైవ లోకాలోకం చరాచరం, వ్యాప్తం కర్మశరీరేణ వాయునా తస్య వై విభోః. ౨౧. స ఏష భగవానర్కో భూతానుగ్రహణే స్థితః, ఏతత్తే పరమం జ్ఞానమేతత్తే పరమం పదమ్. ౨౨. తస్య స్థానవిభాగేన ప్రతిమాస్థాపనం యథా, తత్తే సర్వం ప్రవక్ష్యామి

వలయునో యదియంతయు స్థానవిభాగముచేఁ బూర్వము బ్రహ్మదేవుఁడు చెప్పినట్లు చెప్పెదను వినుము.

ఇది త్రయస్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## చతుస్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

నారదుం డిట్లనియె. పాడ్యమి, విదియ, చవితి, పంచమి, దశమి, త్రయోదశి, పూర్ణిమలను తిథులును; సోమ, గురు, శుక్ర, బుధగ్రహములవారములును నీకర్మారంభమునకు శుభములని చెప్పఁబడినవి. మఱియు నుత్తరాత్రయము, రేవతి, యశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, ధనిష్ఠ, శ్రవణము, భరణి, యీనక్షత్రంబులతోఁగూడిన పూర్వోక్తతిథివారంబుల భూమిని తుషకేశవివర్జితంబుగఁజేసి యిసుక బొగ్గులు యెముకలు రాళ్లు మొదలగునవి లేనట్లుజేసి నాల్గుహస్తములపొడవుగల వేదినిఁ బదిహస్తములప్రమాణముగల మండపమును నిర్మింపవలయును. మండలమును విధిపూర్వకముగ వృక్షశాఖలచే నిర్మింపవలయును. నదీసంగమములుగల మృత్తికను దీసి యామృత్తికచే భూమి నలికి కుండములు

---

యథోక్తం బ్రహ్మణా పురా. ౨౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే
ప్రతిమాప్రతిష్ఠాకల్పే విశ్వరూపవర్ణనం నామ
త్రయస్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచః—ప్రతిపచ్చ ద్వితీయా చ చతుర్థీ పంచమీ తథా, దశమీ త్రయోదశీ చైవ పౌర్ణమాసీ చ కీర్తితా. ౧. సోమో బృహస్పతిశ్చైవ శుక్రశ్చైవ బుధస్తథా, ఏతే సౌమ్యా గ్రహాః ప్రోక్తాః ప్రతిష్ఠాయజ్ఞకర్మణి. ౨. త్రిషూత్తరాసు రేవత్యామశ్విన్యాం బ్రాహ్మభే తథా, పునర్వసోస్తథా హస్తే వాసవే శ్రవణేథ వా, భరణ్యాం చైవ నక్షత్రే భానోః స్థాపనముత్తమమ్. ౩. శోధయిత్వా తు వై భూమిం తుషకేశవివర్జితాం, వాలుకాంగారపాషాణాస్థివిహీనాం విశోధ్య తు. ౪. చతుర్హస్తసమాయుక్తా వేదీ విస్తరతో రచేః. ౫. మండపస్తు ప్రమాణేన దశహస్తః సమంతతః, మండలం వృక్షశాఖాభిః కారయేద్విధిపూర్వకమ్. ౬. నదీసంగమతీరోత్థాం మృత్తికాం చ సమానయేత్, ఉపలిప్య తతో భూమిం కారయేత్కుండముత్తమమ్. ౭. చతురస్రం

జేయవలయును. తూర్పుగుండము శోభస్కరంబగు నాల్గంచులు కలదిగ్గా యుండవలెను. కుండము దక్షిణభాగమున నర్ధచంద్రాకారముగను, పశ్చిమభాగమున వర్తులాకారముగ, నుత్తరదిగ్భాగమునఁ బద్మాకారముగ నుండవలయును. తరువాత నైదుహస్తముల ప్రమాణముగల తోరణములను నిర్మింపవలయును ఆతోరణములను, మఱ్ఱి, మేడి, మారేడు, మోదుగు, రావి, జమ్మి, మంచిగంధము ఇవియేవైన నుపయోగింపవచ్చును. ఆతోరణము నిర్మించునప్పుడు శుక్లవస్త్రధరుండును చిత్రపట్టసహితుండును జపమాలాయుక్తుండునై చేయవలెను. "అగ్నిమీళే" యను మంత్రముచేఁ బూర్వతోరణమును "ఇషేత్వోర్జేత్వా" యనుమంత్రముచే దక్షిణతోరణమును "అగ్న ఆయాహి" అనుమంత్రముచేఁ బశ్చిమతోరణమును. "శం నో దేవీ" అనుమంత్రముచే నుత్తరతోరణమును పూజింపవలెను. సువర్ణవికారంబులగు కలశంబులఁ గొనివచ్చి శ్వేతచందనపంకముచే గండస్వస్తికభూషణములు యవశాలియుక్తంబులగుశరావములు అన్నము వస్త్రములు నలంకారంబులు మొదలగువానిచే మిళితంబులగు విగ్రహములం దీసికొనివచ్చి, 'ఆజిఘ్ర' యనుమంత్రములచేఁ గలశములఁ బ్రవేశ పెట్టునది. దుకూలములచేతను చిత్రపట్టములచేతను స్తంభమాలికలఁ జుట్టవలయును. ధ్వజముచేతను, అద్దములచేతను, పతాకలచేతను, చామర వితానములచేతను, శంఖఘంటాదినాదంబులచేతను, గేయములగుమంగళ

---

శ్రియా యుక్తం పూర్వం కుండం తు కారయేత్, దక్షిణే చార్ధచంద్రం స్యాద్వారుణ్యాం దిశి వర్తులమ్. ౮. పద్మాకారం తు వై కుర్యాదుత్తరే చ విచక్షణః, తోరణాని తతః కుర్యాత్పంచహస్తాని సువ్రత. ౯. న్యగ్రోధోదుమ్బరౌ చైవ బిల్వపాలాశమేవ చ, అశ్వత్థశ్చ శమీ చైవ చందనశ్చేతి కీర్తితాః. ౧౦. శుక్లవస్త్రసమాయుక్తశ్చిత్రపట్టసమన్వితః, జపమాలాన్వితః కుర్యాత్తోరణాని విచక్షణః. ౧౧. అగ్నిమీళేతి మంత్రేణ యజేద్వై పూర్వతోరణం, ఇషేత్వోర్జేతి మంత్రేణ యజేద్దక్షిణతోరణమ్. ౧౨. అగ్న ఆయాహీతి మంత్రేణ పశ్చిమం తు సమర్చయేత్, శం నో దేవీతి మంత్రేణ యజేదుత్తరతోరణమ్. ౧౩. కలశాంస్తు సమాదాయ హేమగర్భసమన్వితాన్, శ్వేతచందనపంకేన కంఠస్వస్తికభూషణాన్. ౧౪. యవశాలిశరావాన్నవస్త్రాలంకారవిగ్రహాన్, ఆజిఘ్రేతి చ మంత్రేణ కలశాంస్తు నివేశయేత్. ౧౫. దుకూలైశ్చిత్రపట్టైశ్చ వేష్టయేత్తమ్భమాలికాం, ధ్వజాదర్శపతాకాభిశ్చామరైస్తు వితానకైః. ౧౬. శంఖఘంటా

వచనములచేతఁ, దూర్యభేరీనినాదములచేతను, వేదధ్వనులచేతను, జయశబ్దంబులచేతను మహోత్సవంబులఁ జేయవలయును. చిత్రంబులగు పతాకలచేతను, పూజామాలాదిశోభితంబును, వితానప్రకాశితంబును, కుసుమాకరంబునగు కుశాస్తీర్ణంబున సూర్యదేవునివిగ్రహమును స్థాపింపవలయును. పూర్వదిక్కున శుక్రునికొఱకుఁ బీతవర్ణపతాకమును, ఆగ్నేయీదిక్కున రక్తవర్ణపతాకంబును, యామ్యదిక్కున యమోపమంబును, నీలాంజనసదృశపతాకము నైరృతమందును పశ్చిమమున శ్వేతపతాకమును, వాయవ్యమునఁ గృష్ణపతాకంబు నుంచవలయును. యక్షరాజగు కుబేరునికి హారీతపతాకంబును నీశాన్యంబున సర్వవర్ణపతాకంబు నుంచవలయును. తరువాత శ్వేతరక్తచూర్ణంబులచే బద్మమును వ్రాయవలయును. "వేద్యావేది" అనుమంత్రముచేత వేది నిస్పృశింప (యాలంభనఁజేయ) వలయును కుశలఁ బూర్వోత్తరాగ్రములుగా "యోగే యోగే" యను మంత్రముచేతఁ గుశాస్తరణముఁ జేయవలయును. అచ్చటనే దివ్యాస్తరణయుక్తంబగుశయ్యను నిర్మించి రెండుగడులను వానిమధ్యయం దుంచవలయును. విచిత్రంబులగు దీపమాలికలచేతను భక్ష్యభోజ్యంబులచేతను, అన్నపానంబులచేతను, పిండివంటకంబులచేతను, మోదకంబులచేతను సంతోషపెట్టవలయును. తరువాతఁ బాయసంబుచేతను, గుడమిశ్రితంబు

---

నినాదైశ్చ గేయమంగలవాచనైః, తూర్యభేరీనినాదైశ్చ వేదధ్వనిసమన్వితైః. ౧౭. పుణ్యైశ్చ జయశబ్దైశ్చ కారయేత మహోత్సవం, పతాకాభిర్విచిత్రాభిః పూజామాల్యోపశోభితమ్. ౧౮. విచిత్రస్రగ్వితానాఢ్యం ప్రకీర్ణకుసుమాంకురం, తన్మధ్యే తు కుశాస్తీర్ణే దేవార్చాం స్థాపయేద్ బుధః. ౧౯. పతాకాం పీతవర్ణాం తు పూర్వే శక్రాయ దాపయేత్, ఆగ్నేయ్యాం రక్తవర్ణాభాం యమాశాయాం యమోపమామ్. ౨౦. నీలాంజనసమప్రఖ్యాం నైరృత్యాం చ ప్రదాపయేత్, వారుణ్యాం సితవర్ణాం చ కృష్ణాం వాయవ్యగోచరే. ౨౧. హారితాం యక్షరాజాయ ఐశాన్యాం సర్వవర్ణికాం, శ్వేతరక్తకచూర్ణేన పద్మమాలేఖయేత్తతః. ౨౨. వైద్యా వేదీతి మన్త్రేణ వేద్యా ఆలభనం భవేత్, పూర్వాగ్రానుత్తరాగ్రాంశ్చ కుశానాస్తీర్య యత్నతః. ౨౩. యోగేయోగేతి మన్త్రేణ కుశైశ్చాస్తరణం భవేత్, శయ్యా తత్రైవ కర్తవ్యా దివ్యాస్తరణసంయుతా. ౨౪. గడుకే ద్వే విచిత్రే తు తన్మధ్యే స్థాపయేద్బుధః, విచిత్రదీపమాలాభిర్భక్ష్యభోజ్యాన్నపానకైః. ౨౫. పూపకాన్సువిచిత్రాన్వై మోదకాంశ్చ ప్రదాపయేత్, పాయసం

లగు తిలలచేతను, దధ్యోదనంబుచేతను నైవేద్యవిధిని జరుపవలయును. చంద్రసమానధావళ్యముగల శ్వేతఛత్ర మచ్చట నుంచవలయును.

ఇది చతుస్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## పంచత్రింశదుత్తరశతతమాధ్యాయము.

తరువాత నీకు స్నానవిధింగూర్చి చెప్పెద నాకర్ణింపుము. స్నాపకుఁడు మహాప్రాజ్ఞుఁడును బ్రహ్మవంశసంజాతుఁడును వేదపారగుండును సర్వవృత్తాంతాభిజ్ఞుఁడును సౌరశాస్త్రవేత్తయు నై యుండవలయును. భోజకుఁ డితర బ్రాహ్మణభోజకపరివృతుఁడై యుండవలెను. మండలమున నీశాన్యదిగ్భాగంబున హస్తప్రమాణమగు భద్రపీఠమును క్రమానుసారంబుగ నుంచవలెను. ఏనుఁగుచేతను, రథముచేతను, బ్రహ్మరథముచేతను, మంగళవాద్యపురస్సరంబుగ దేవుని భక్తితో బ్రాసాదంబునకుఁ దోడ్కొని రావలయును. భద్రపీఠమును దెచ్చి "భద్రం కర్ణ" యను మంత్రములచే నచ్చట నుంచవలయును. సూత్రమును శుక్లాంబరమును ధరించి శుచియై కలశముం బుచ్చికొని దేవుఁడగు విభావసున కభిషేకమొనర్పవలయును. సముద్రోదకములు లేక గంగోదకములు లేక యము

---

కృశరం చైవ దధ్యోదనసమన్వితమ్. ౨౬. దధి చంద్రసమప్రఖ్యం శుభచ్ఛత్రం చ విన్యసేత్. ౨౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యప్రతిష్ఠాయాం మండలవిధివర్ణనం నామ చతుస్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచ:—అతః పరం ప్రవక్ష్యామి స్నానకర్మవిధిం తవ, స్నాపకస్తు మహాప్రాజ్ఞో బ్రాహ్మణో వేదపారగః. ౧. అభిజ్ఞః సౌరశాస్త్రాణామరుణో యదుసత్తమ, భోజకో భోజకైశ్చాన్యైర్బ్రాహ్మణైశ్చ తథా వృతః. ౨. దిశాభాగే మండలస్య ఈశానే వై యథాక్రమం, హస్తమాత్రప్రమాణం తు భద్రపీఠం తు విన్యసేత్. ౩. హస్తినా శకటేనాపి భక్త్యా బ్రహ్మరథేన చ, మంగళైర్బ్రహ్మఘోషైశ్చ దేవం ప్రాసాదమానయేత్. ౪. భద్రపీఠం సమాదాయ భద్రం కర్ణేతి మంత్రతః, సూత్రధారస్తథా ప్రోక్తః శుక్లాంబరధరః శుచిః. ౫. స్నాపయేత్కలశం గృహ్య దేవదేవం విభావసుం, సాముద్రం

నోదకంబులు లేక సరస్వతీజలంబులు లేక చంద్రభాగాజలంబులు లేక సింధునదీజలంబులు లేక సరెస్నునందలిజలంబులు నితరంబులగు నదీ జలంబులు సెలయేఱుల జలంబులుగాని తటాకజలంబులుగాని యథాశక్తి సంపాదించి సువర్ణాదికలశంబులచేఁ దెసికొనివచ్చి యెనిమిదికలశములచే సూర్యు నభిషేకింపవలయును. తరువాత మణులు, రత్నములు, సర్వబీజౌషధులు, సుగంధయుక్తములగు మాల్యములు స్థలజంబులగు పద్మములు చందనములు నన్నివిధములు గంధములు, శతావరి, బ్రాహ్మీ, సువర్చల, ముస్త, విష్ణుక్రాంత,దూర్వా, శ్రీపుష్పిక,ప్రియంగు, రజనీ, వచా, యను నీసంభారముల సంపాదించి స్నానవిధిని గుర్తెఱింగినపురుషుఁడు బలాశ్వత్థ శిరీషపల్లవంబులను కుశయుక్తంబులుగఁ జేసి కలశము పైభాగమునం దుంచి సూర్యున కర్ఘ్య మీయవలయును. సువర్ణమయము రజత మయము మృణ్మయము లగుకలశములు సాక్షతములు సహిరణ్యంబులు సర్వౌషధియుక్తంబులు గాయత్రీమంత్రపూతములుగాఁజేసి పదునాఱు కలశములచేత సూర్యు నభిషేకింపవలయును. కుశలయుత్తరభాగమున బండుటిటుకలతో వేదిని నిర్మించి యావేదిమధ్యమున వస్త్రద్వయధారి యగు సూర్యు నధిష్ఠింపఁజేసి యాదినమంతయుఁ బ్రయత్నపూర్వకముగ నుపవసించి యభిషేకములు జేయవలయును శిరమునందు సర్వౌషధు

---

తోయమాహృత్య జాహ్నవం యామునం తథా. ౬. సారస్వతం జలం పుణ్యం చాంద్రభాగం ససైంధవం, పుష్కరస్య జలం శ్రేష్ఠం గిరిప్రస్రవణోదకమ్. ౭. అన్యద్వాపి శుచి తోయం నదీనదతడాగజం, యథాశక్త్యా ఉపాహృత్య కలశైః కాంచనాదిభిః. ౮. భోజకాశ్చాష్టభిః సూర్యం కలశైః స్నాపయంతి వై, తతస్తు మణిరత్నాని సర్వబీజౌషధీస్తథా. ౯. సుగంధీని చ మాల్యాని స్థలజాన్యంబుజాని చ, చందనాని చ ముఖ్యాని గంధాశ్చ వివిధాస్తథా. ౧౦. బ్రాహ్మీ సువర్చలా ముస్తా విష్ణుక్రాంతా శతావరీ, దూర్వా చ శిబిపుష్పీ చ ప్రియంగూ రజనీ వచా. ౧౧. సంభృత్యైతాంస్తు సంభారాన్ స్నానకర్మవిభాగవిత్, బలాశ్వత్థశిరీషాణాం పల్లవైః కుశసంయుతైః. ౧౨. కలశోపరి విన్యస్య దద్యాదర్ఘ్యం రవేః సదా, కాంచనై రాజతైస్తామ్రైర్మృన్మయైః కలశైస్తథా. ౧౩. సాక్షతైః సహిరణ్యైశ్చ సర్వౌషధిసమన్వితైః, గాయత్ర్యా పరిపూతైస్తు షోడశైః స్నాపయేద్రవిమ్. ౧౪. కుశోత్తరాం తతః కృత్వా వేదిం పక్వేష్టకామయీం, తస్యాం వేద్యాం సమారోప్య పరిధాప్య చ వాససీ. ౧౫. ప్రతిమామభిషించేచ్చ సోపవాసః ప్రయత్నతః,

లను మోదకంబులనుంచి మంత్రములచే జలమృత్తికల నుంచి దేవీ! సమస్త దేవదానవులచేఁ బూజనీయురాలవగుటచే నిన్ను దేవునియొక్క శిరము నందు శుద్ధికై యుంచుచుంటిని. సర్వదేవతలకును సర్వభూతములకును నాదివై యగపడుచుంటివి. రసాధిదేవత వగునిన్ను నేనాహ్వానించితిని. అని యీప్రకారంబు లగుపౌరాణికములును వైదికములు నగుమంత్రములచే స్నానముం జేయింపవలయును. ఈవిషయమునఁ బండితు లిట్లు జెప్పుచు స్నానముఁ జేయించెదరు. బ్రహ్మావిష్ణుమహేశాదిదేవతలు నిన్ను నభిషేకముఁజేయుటకై గంగాజలపూర్ణమగు కనకకలశము వ్యోమగంగ రెండవకలశము నుపయోగించెదరు గాత సారస్వతజలపూర్ణమగుకలశముచే దేవేంద్రాద్యష్టదిక్పాలకులు నిన్నభిషేకింతురుగాక. సముద్రోదకపూర్ణమగు నాల్గవకుంభముచేతను పద్మపత్రసుగంధయుక్తమగు నైదవకలశముచేతను నాగలోకవాసు లభిషేకింతురుగాక హిమవత్పర్వతము హేమకూటపర్వతము మొదలగుపర్వతము లుదకములచేత భక్తితో నభిషేకించునుగాక. నైరృతుఁడు నుదకపూర్ణంబగు నాఱవకలశముచేతను సర్వనద్యుదకంబులచే నిండియున్న పద్మరాగసువాసితంబగు నేడవకలశముచేత సప్తమహర్షు లభిషేకముఁ జేయుదురుగాక. అష్టవసువులును అష్ట

మూర్ధ్ని సర్వౌషధీః కృత్వా తథైవామలకాని చ. ౧౬. మంత్రేణ మృత్తికాం చాపి మంత్రతశ్చ జలం తథా, త్వం దేవీ వందితా దేవైః సకలైర్దైత్యదానవైః. ౧౭. తేన సంస్థాపితా మూర్ధ్ని మయా దేవస్య శుద్ధయే, ఆదిస్త్వం సర్వభూతానాం దేవతానాం చ సర్వథా. ౧౮. రసానాం పతయే తుభ్యమాహ్వానం చ కృతం మయా, ఇత్థం పౌరాణికైర్మంత్రైర్వైదికైశ్చ విశేషతః. ౧౯. కార్యం హి వారుణం స్నానం దేవస్య యదునందన, ఇత్థముచ్చారయేద్వాచం కుర్యాత్స్నానం విచక్షణః. ౨౦. దేవాస్త్వామభిషించంతు బ్రహ్మావిష్ణుశివాదయః, వ్యోమగంగా చ పూర్ణేన ద్వితీయకలశేన తు. ౨౧. సారస్వతస్య పూర్ణేన కలశేన సురోత్తమ, శక్రాదయోఽభిషించంతు లోకపాలాః సురోత్తమాః. ౨౨. సాగరోదకపూర్ణేన చతుర్థకలశేన తు, వారిణా పరిపూర్ణేన పద్మపత్రసుగంధినా. ౨౩. పంచమేనాభిషించంతు నాగాశ్చ కలశేన తు, హిమవద్ధేమకూటాద్యాశ్చాభిషించంతు వారిణా. ౨౪. నైరృతోదకపూర్ణేన షష్ఠేన కలశేన తు, సర్వతీర్థాంబుపూర్ణేన పద్మరేణుసువాసినా. ౨౫. సప్తమేనాభిషించంతు ఋషయః సప్త యే వరాః, వసవశ్చాభిషించంతు కలశేనాష్టమేన వై. ౨౬. అష్టమంగలయుక్తేన దేవదేవ నమో

మంగళయుక్తములగు నష్టకలశములచే నిన్నభిషేకించెదరుగాక. ఈరీతిగ సమస్తదేవతలచే నభిషేకింపఁబడు దేవదేవా! నీకు నమస్కారము. తరువాత దివ్యకలశంబులచే స్నానకర్మ నారంభించి "సముద్రం గచ్ఛ" యను మంత్రమును "హిరణ్యగర్భ" యనుమంత్రమును ఉచ్చరింపవలెను. "సముద్రజ్యేష్ఠ" యనుమంత్రముచే మృత్తికాన్వితంబగు విగ్రహమున కభిషేకమొనర్పవలయును. "సినీవాలి" యనుమంత్రముచేఁ బుట్టమట్టినిఁ బూయవలయును. ఉదంబరము, శమి, అశ్వత్థము, న్యగ్రోధము, పలాశము, ఈనైదువస్తువులకషాయమును "యజ్ఞం యజ్ఞ" యనుమంత్రముచే నీయవలయును పవిత్రమగు పంచగవ్యమును రాగిపాత్రలతోఁ దీసికొని రావలయును. గోమూత్రమును గాయత్రీమంత్రముచేతను గోమయమును "గంధద్వారా" అనుమంత్రముచేతను క్షీరమును "ఆప్యాయస్వ" అనుమంత్రముచేతను దధిని "దధిక్రావిణ్ణో" అను మంత్రముచేతను ఘృతమును "తేజోసి" అనుమంత్రంబునఁ గుశోదకము "దేవస్యత్వా" అనుమంత్రంబున నొకపాత్రయం దుంచుచుండవలయును. ఇట్లు విధ్యుక్తముగాఁ జేసినయెడల నది పంచగవ్యమనఁబడును. "యా ఓషధీ" యనుమంత్రములచేఁ గ్రమముగా నోషధులచే స్నానమాచరింపఁజేయవలయును "ద్రుపదా" పదయుక్తమగుమంత్రముచే నుద్వర్తనముఁ జేయవలయును.తరువాత"మానస్తోక"యనుమంత్రంబున శిరస్స్నానముం జేయింపవలయును. "విష్ణోరరాటమసి" అనుమంత్రంబున శుభంబగు గంధోదక

---

ఽస్తు తే, తతో వై కలశైర్దివ్యైః స్నానకర్మ సమారభేత్. ౨౭. సముద్రం గచ్ఛ యః ప్రోక్తో మంత్రమేతముదీరయేత్, హిరణ్యగర్భేతి చ యో మంత్రస్తం సముదీరయేత్. ౨౮. సముద్రజ్యేష్ఠేతి మంత్రేణ క్షాలయేన్మృత్తికాన్వితం, సినీవాలీతి మంత్రేణ దద్యాద్వల్మీకమృత్తికామ్. ౨౯. శమ్యుదుంబరమశ్వత్థం న్యగ్రోధం చ పలాశకం, యజ్ఞం యజ్ఞేతి మంత్రేణ దద్యాత్పంచకషాయికమ్. ౩౦. పంచగవ్యం పవిత్రం చ ఆహరేత్తామ్రభాజనే, గాయత్ర్యా చైవ గోమూత్రం గంధద్వారేతి గోమయమ్. ౩౧. ఆప్యాయస్వేతి చ క్షీరం దధిక్రావ్ణేతి వై దధి, తేజోఽసీతి ఘృతం తద్వద్దేవస్య త్వా కుశోదకమ్. ౩౨. ఏవమాదివిధియుతం పంచగవ్యం ప్రకీర్తితమ్, యా ఓషధీతి మంత్రేణ స్నానమోషధిభిః క్రమాత్. ౩౩. ద్రుపదాభిః పునస్తస్య కుర్యాచ్చోద్వర్తనం బుధః, శిరఃస్నానం తతో దద్యాన్మానస్తోకాభిమంత్రితమ్. ౩౪. విష్ణోరరాటమంత్రేణ దద్యా

మీాయవలయును.పిమ్మట నద్యుద్భవంబులగుజలములచే క్షాళనముం జేయింపవలెను. "జాతవేదో" మంత్రంబున వస్త్రపూతమగు నుదకముచే దేవుని యావాహనఁ జేయవలెను. లోకానుగ్రహకరుఁడవగు సూర్యుఁడా! రమ్ము. నీకు నమస్కారము. అనిచెప్పి రక్తమాల్యాంబరధరుఁడగు దేవు నావాహన జేయవలయును. భగవంతుఁడవగు సూర్యుఁడా! లోకానుగ్రహకరుండవు గాన రమ్ము. యజ్ఞభాగముం గైకొనుము ఇదే యర్ఘ్యముం గ్రహింపుము. నీకు నమస్కారము. అని హిరణ్యపాత్రచే "ఇదం విష్ణుర్విచక్రమే" అను మంత్రముచే నర్ఘ్యమీాయవలయును. ప్రథమమున మృణ్మయకలశముచే భాస్కరుని స్నానముఁ జేయింపవలెను. తరువాత నౌదుంబరకలశముల చేతను బిమ్మట రజతకలశములచేతను అటుపిమ్మట సువర్ణకలశములచేతను స్నానముఁ జేయింపవలయును. తరువాత శంఖమున సర్వనదీజలంబులను సర్వౌషధిజలములను పుష్పములఁగూడ శిరమునందుంచి యాశంఖముచే జలములందీసి స్నానముం జేయింపవలయును. యదునందనా! ప్రథమమున నుదకముచేతను పిమ్మట పాలచేతను తరువాత పాయసముచేతను నెయ్యి తేనె చెఱకురసము వీనిచేఁగ్రమముగా స్నానము జేయింపవలయును అగ్నిష్టోమయాగమునకు గోమేధంబునకు వాజపేయంబునకు జ్యోతిష్టోమంబునకు రాజసూయాశ్వమేధంబుల కేఫలమో ఘృతాద్యభిషేకంబు

---

గ్గంధోదకం శుభం, తతో నద్యుద్భవేనైవ క్షాలయేచ్ఛుద్ధవారిణా. ౩౫. జాతవేదసముచ్చార్య వస్త్రపూతేన వారిణా, తత ఆవాహయేద్దేవం రక్తమాల్యాంబరం శుభమ్. ౩౬. ఏహ్యేహి భగవన్భానో లోకానుగ్రహకారక, యజ్ఞభాగం గృహాణార్ఘ్యమర్కదేవ నమోఽస్తు తే. ౩౭. హిరణ్యైన తు పాత్రేణ దేవాయార్ఘ్యం ప్రదాపయేత్, ఇదం విష్ణుర్విచక్రమే మంత్రేణార్ఘ్యం సమర్పయేత్. ౩౮. పార్థివైః ప్రథమం కలశైః స్నాపయేద్భాస్కరం బుధః, తతస్త్వౌదుంబరైర్వీర రాజతైస్తదనంతరమ్. ౩౯. తతస్తు కాంచనైర్దేవం స్నాపయేద్యదునందన, సర్వతీర్థజలైర్యుక్తం సర్వౌషధిసమన్వితమ్. ౪౦. శంఖమాదాయ దేవస్య తతో మూర్ధని శంకర, దత్త్వా పుష్పాణి దేవస్య మూర్ధ్ని యత్నాద్విచక్షణః. ౪౧. తోయముత్క్షిప్య యత్నేన తతః స్నపనమాచరేత్, ప్రథమం స్నాపయేద్దేవం వారిణా యదునందన. ౪౨. తతస్తు పయసా రాజన్పాయసేన తతస్తు వై, ఘృతేన మధునా వాపి తథా ఇక్షురసేన చ.౪౩. అగ్నిష్టోమస్య యజ్ఞస్య గోమేధస్య చ సువ్రత, జ్యోతిష్టోమస్య రాజేంద్ర వాజపేయస్య వై విభో. ౪౪. రాజసూయాశ్వ

నకుఁగూడ నట్టిఫలమే సంభవించును.పురుషుఁడు పూర్వము నేఁజెప్పినరీతిగ ఘృతాద్యభిషేకముం జేసినను చేయుచుండఁగఁజూచినను పూర్వోక్తయాగ ఫలముం బొందఁగలఁడు దేవునిప్రతిమం జూచియుఁ గొంతఫలమును బొందఁగలఁడు. కాన దేవదేవుండగు సూర్యుని స్నానముఁజేయిం చుట యావశ్యకము. ఈదేవదేవుని స్నానవిధి నెవ్వరు నతిక్రమింపఁగూ డదు. ఈయభిషేకతీర్థమును లోకగర్హితములగు కాకులు ప్రాశనఁజేయఁ గూడదు. భూగతమగుదేవుని స్నానోదకముగాని తత్పయస్సుఁగాని కాకు లుముట్టినచోఁ గర్త రోగమును కారయిత దుఃఖముం బొందఁగలరు. ఆ కారణముచే విభుండగు భాస్కరునకు స్నానము విధ్యుక్తముగఁ జేయింప వలయును. ఏతద్విధానవేత్తయగువాఁ డీరీతిని స్నానముఁజేయించి "ఉద్ధర ణిని తీసికొని మూఁడుసారు లాచమనమునకై యుదకమీఁయవలయును. "వేదోసి"యనుమంత్రముచే నుపవీతమును"బృహస్పతే"అనుమంత్రముచే వస్త్రయుగ్మమును యత్నక్రమ మనుసరించి పుష్పమాలను"ధూరసి"యను మంత్రముచే గుగ్గులుసహితమగుధూపమును "సమిద్ధోంజన" అనుమంత్ర ముచే నంజనమును "యుంజాని" యనుమంత్రముచే మృగరోచనమును

---

మేధాభ్యాం ఘృతాద్యైర్లభతే ఫలం, యస్తు కారయతే స్నానం యస్తు భక్త్యా ప్రప శ్యతి, క్రియమాణం తు దేవస్య స్నానం యదుకులోద్వహ. ౪౫. య ఏతే కథితా యజ్ఞా ఏతేషాం క్రమశః ఫలం, అర్చాం చ కురుశార్దూల దృష్ట్వా వై లభతే ఫలమ్. ౪౬. స్నానం తు యత్నతః కార్యం దేవదేవస్య సువ్రత, న లంఘయేత్కశ్చిద్దేవస్య స్నపనం విభోః. ౪౭. న ప్రాశ్నంతి యథా కాకా స్తీర్థం లోకవిగర్హితాః, స్నానోదకం తు దేవస్య అథ వా పయ ఏవ హి. ౪౮..భూమౌ గతం యథా చైవ ప్రాశ్నాతి యదు నందన, రోగం ప్రాప్నోతి కర్తా వై దుఃఖం కారయితా తథా. ౪౯. తస్మాద్యత్నేన కర్తవ్యం దేవస్య స్నపనం విభోః. ౫౦. స్నాపయిత్వా క్రమేణోత్థం స్నానకర్మ విధాన విత్, తతో వర్ధనికాం గృహ్య వారిధారాం సముత్సృజేత్. ౫౧. త్రివారాన్పురతో ఽర్కస్య ఆచమస్వేతి చ బ్రువన్, వేదోసీతి చ మంత్రేణ ఉపవీతం ప్రదాపయేత్. ౫౨. బృహస్పతేతి మంత్రేణ వస్త్రయుగ్మం ప్రదాపయేత్, యత్నక్రమం ప్రకుర్వాణః పుష్పమాలాం ప్రదాపయేత్. ౫౩. ధూరసీతి చ మంత్రేణ ధూపం దద్యాత్సగుగ్గులం, సమిద్ధోంజనమంత్రేణ అంజనం తు ప్రదాపయేత్. ౫౪. యుంజానీతి చ మంత్రేణ రోచనాం తస్య దాపయేత్, ఆరార్తికం చ వై కుర్యాద్దీర్ఘాయుష్ట్వాయ వర్చసే. ౫౫.

సమర్పింపవలయును. మహాత్ముఁడగు సూర్యునిస్నానకర్మ యిట్లు చెప్పఁబడినది. భోజకులును బ్రాహ్మణులును సప్రయత్నముగాఁ గ్రియలఁ జేయుచుందురు. బహ్వృచులును, నథర్వణులును, ఛాందోగ్యులును, నధ్వర్యులును, మూర్తిభూతులగువారలయొక్క చిహ్నములఁ జెప్పెద నాకర్ణింపుము. ఏకాగ్రమనస్కుఁడవై యాకర్ణింపుము. సంపూర్ణావయవవంతుఁడును, బుద్ధిమంతుఁడును, శాస్త్రజ్ఞుఁడును, ప్రియదర్శనుండును, సత్కులప్రసూతుండును, నాతిస్థూలుండును, శ్రద్ధాసమన్వితుండును, ఆర్యదేశోద్భవుండును, నాతికృశుండును, నాతిదీర్ఘుండును సౌరశాస్త్రవిశారదుండును, జితాత్మయు, గురుభక్తుండును, జితేంద్రియుండును, పంచవింశతి తత్త్వవేత్తయునగువాఁడు స్థాపకుఁడుగా నియమింపఁబడవలెను. వర్జనీయులఁగూడఁ జెప్పెద. స్థాపనకర్మానర్హులను వినుము హీనాంగుఁడును,అధికాంగుఁడును, వామనుఁడును, వికలాంగుఁడును, అతిగౌరవర్ణుఁడును, కృష్ణవర్ణుఁడును, స్నాపనవిధి కుపయోగింపఁదగఁడు. చార్వాకుఁడును, యాజకుఁడును, గోముఖదంభకుఁడును, నశుచివ్రతయుక్తుండును, కృష్ణదంతుఁడును మాత్సర్యయుక్తుండును, కోపస్వభావముగలవాఁడును, దుష్టశీలుఁడును నగు యావనుఁడుగాని, వృద్ధుఁడుగాని, బొల్లిగలవాఁడు, కుష్ఠురోగముగలవాఁడు, గ్రుడ్డివాఁడు, దుర్బుద్ధియు, సంకీర్ణుఁడును, జాతిహీనుండును, శూద్రస్త్రీభర్తయు, కుబ్జుఁడును, విశేషాంగుఁడును, బట్టతలవాఁడును,

---

స్నానకర్మ త్విదం ప్రోక్తం భాస్కరస్య మహాత్మనః, భోజకా బ్రాహ్మణాశ్చైవ క్రియాం కుర్యుః ప్రయత్నతః. ౧౬. బహ్వృచోఽథర్వణశ్చైవ ఛందోగోధ్వర్యురేవ చ, స్నాపకస్య చ చిహ్నాని యే చ మూర్తిధరాస్తథా. ౧౭. తేషాం ప్రవక్ష్యామి విభో శృణు చైకమనాః కిల, సంపూర్ణగాత్రో మతిమాన్ఛాస్త్రజ్ఞః ప్రియదర్శనః. ౧౮. కులీనః శ్రద్ధధానశ్చ ఆర్యదేశసముద్భవః, న స్థూలో న కృశో దీర్ఘః సౌరశాస్త్రవిశారదః. ౧౯. యశ్చ యుక్తో జితాత్మా చ గురుభక్తో జితేంద్రియః, పంచవింశతితత్త్వజ్ఞః స్థాపకః సముదాహృతః. ౨౦. వర్జనీయాంశ్చ వక్ష్యామి యైస్తు కర్మ న కారయేత్, హీనాంగశ్చాధికాంగశ్చ వామనో వికటస్తథా. ౨౧. నాతిగౌరో న కృష్ణశ్చ స్నాపనాయ ప్రయోజయేత్, చార్వాకో యాజకశ్చైవ నిత్యం గోముఖదంభకః. ౨౨. అశుచివ్రతసంయుక్తః శ్యావదంతోఽథ మత్సరీ, కోపనో దుష్టశీలశ్చ యువా వా వృద్ధ ఏవ చ. ౨౩. శ్విత్రీ కుష్ఠీ చ రోగీ చ కాణో దుర్మతిరేవ చ, సంకీర్ణో జాతిహీనశ్చ తథా చ వృషలీపతిః. ౨౪. కుబ్జశ్చాంధస్తథా వ్యంగః ఖల్వాటో వికలేం

వికలేంద్రియంబులుగలవాఁడును, నవినీతుండును, దురాత్ముండును, వికలుండును, కుంటివాఁడును, తిథివారనక్షత్రయోగములను సూచించువాఁడును, జీవనమునకై మూల్యమును గ్రహించి విద్యనభ్యసింపఁజేయువాఁడును నీరీతిగ నుండువారి నందఱిని స్నాపనకృత్యములయందు విసర్జింపవలయును. కాన విద్వాంసులగువారు స్నాపకులఁ బరీక్షింపవలయును.

ఇది పంచత్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## షట్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

నారదుం డిట్లనియె తరువాత నోసాంబా! నీకు నుత్తమంబగు నధివాసనమును జెప్పెద నాకర్ణింపుము. సహస్రశీర్షుం డగు దేవుని మండపమునఁ బ్రవేశింపఁజేయవలయును. తరువాత దేవతలందఱను గూడ ప్రవేశ పెట్టవలయును. శుచియగుప్రదేశమం దలికి పంచవర్ణములతోఁ జతురస్రమండలమును నిర్మింపవలయును. పతాకచ్ఛత్రమాల్యధ్వజములచే నలంకృతంబును విచిత్రంబులగువితానంబులచేఁ బ్రకాశితంబును నగుమండలమునఁ గుశాస్తరము నుంచి దానిపైని సూర్యవిగ్రహము నుంచవలయును తరువాత నచ్చట సూర్యు నావాహనఁ జేసి యర్ఘ్యము నియ్యవల

---

ద్రియః, అవినీతో దురాత్మా చ వికలః పంగురేవ చ. ౯౫. తిథినక్షత్రయోగానాం వారాణాం చ తథా విభో, సూచకో జీవికార్థం హి యశ్చ మూల్యేన పాఠయేత్. ౯౬. ఈదృశాన్ స్నాపకాన్సర్వాన్వర్జయేత ప్రయత్నతః, తస్మాత్సర్వప్రయత్నేన పరీక్ష్యాః స్నాపకా బుధైః. ౯౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యప్రతిష్ఠాస్నానవిధివర్ణనం నామ పంచత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచ:—అతః పరం ప్రవక్ష్యామి అధివాసనముత్తమం, సహస్రశీర్షా పురుషో మండపం యత్నతో విశేత్. ౧. తతోఽన్యే చ శుచౌ దేశే అసంస్పృష్టోపలేపనే, మండలం పంచవర్ణైస్తు ఆలిఖేచ్చతురస్రకమ్. ౨. పతాకాతోరణచ్ఛత్రధ్వజమాల్యాద్యలంకృతం, విచిత్రసువితానాఢ్యం ప్రకీర్ణకుసుమోత్కరైః. ౩. తస్య మధ్యే కుశాస్తీర్ణే మూర్తిః స్థాప్యా వివస్వతః, తత్రాస్యావాహనం కృత్వా దద్యాదర్ఘ్యం వివ

యును సువర్ణమధుపర్కములను విధ్యుక్తముగాఁజేసి సవత్సయు, రోహి
ణియు, శుభప్రదయునగు గోవును సూర్యునకుఁ జూపింపవలయును. ఓ
సహస్రాంశుఁడా! గోపతివగు నీకు నమస్కారము. నన్ననుగ్రహింపుము.
ఇట్లు చెప్పి యర్ఘ్యము నిచ్చి పూజించి వస్త్రముల ధరింపఁజేసి యజ్ఞోప
వీతములను, నాతిథ్యములను, నభ్యంగమును ప్రతిసంవత్సరమును నూతన
ముగాఁ జేయుచుండవలయును. రాజేంద్రా! శ్రావణమాసమున నా దేవు
నకుఁ బవిత్రము నియ్యవలయును. సూర్యనివేదితాన్నమును బ్రాహ్మణు
లచే భుజింపఁజేసి ప్రతివత్సరము నిట్లుఁ జేయుచుండవలయును. ఓ
యదూత్తమా! యవ్యంగుఁడగు భాస్కరుని శ్రావణమాసమున సర్వ
గంధములచేతను, చందనాగురుకుంకుమలచేతను, నలంకారములచేతను,
కుసుమములచేతను అనేకవిధవిచిత్రములగు మాలలచేతను నలంకరించి
తరువాత ధూపమును ప్రతిమాగ్రంబున నివేదించి "సహస్రశీర్షా" అను
మంత్రముచే మండపమునఁ బ్రవేశపెట్టవలయును. "నమశ్శంభవే" యను
మంత్రముచే శయ్యయం దుంచవలయును. "విశ్వతశ్చక్షుః" అనుమంత్ర
ముచేఁ గమలనిష్కలముఁ జేయవలయును. తరువాత సంకలీకరణంబును
జెప్పెద నాకర్ణింపుము. స్నాపనమున నిజాంగమున నంగన్యాసముచేయు
పగిదిఁ బ్రతిమయందును జేయవలయును. ఆలంభనము నట్లులే జేయవల

---

స్వతే. ౪. సువర్ణమధుపర్కాది కృత్వా తత్ర విధానతః, దేవస్య దర్శయేద్గాం చ
సవత్సాం రోహిణీం శుభామ్. ౫. నమో గోపతయే తుభ్యం సహస్రాంశో ప్రసీద మే,
ఏవమర్ఘ్యేణ సంపూజ్య పరిధాయ చ వాససీ. ౬. యజ్ఞోపవీతమాతిథ్యం తథాభ్యంగం
తథైవ చ, వత్సరే వత్సరే తస్య నవమవ్యంగమాహరేత్. ౭. శ్రావణే మాసి రాజేంద్ర
పవిత్రం తస్య తద్ధి వై, బ్రాహ్మణాన్భోజయిత్వా తు వర్షేవర్షే ప్రయోజయేత్. ౮.
అవ్యంగం యదుశార్దూల శ్రావణే మాసి భాస్కరం, సర్వగంధైః సమాలభ్య చంద
నాగురుకుంకుమైః. ౯. అలంకారైరలంకృత్య కుసుమైశ్చ సుగంధిభిః, మాలాభిశ్చ విచి
త్రాభిరాబద్ధాభిరనేకశః. ౧౦. తతో ధూపం నివేద్యాశు ప్రతిమాగ్రే ప్రయత్నతః,
సహస్రశీర్షా పురుషో మండపం చ ప్రవేశయేత్. ౧౧. నమః శంభవేతి మంత్రేణ
శయ్యాయాం వినివేశయేత్, విశ్వతశ్చక్షురిత్యేవ కుర్యాత్కమలనిష్కలమ్. ౧౨. ఏవ
రేవ చ వక్ష్యామి సంకలీకరణం శుభం, స్నాపనే తు యథా కార్యః స్వదేహే న్యాస
ఉత్తమః. ౧౩. ప్రతిమాయాం తథా కార్యో యథా చాలంభనం బుధః, ఓం హ్రాం

యును. "ఓం హ్రాం ఖఖోల్కాయ నమః" యనునిది మూలమంత్రంబుగాఁ బ్రసిద్ధంబయ్యె. ఆదిత్యుఁడగు నీదేవుఁ డక్షరముచే నుపబృంహితుఁడై యుండు. ఓంకారమును శిరమునందును, హ్రాంకారమును నాసికకుఁ బైభాగమునను, ఖకారము లలాటమునను, షకారము వదనంబునను, లకారము కంఠమునందును, కకారము హృదయమునందును, యకారము వామభుజమునందును, నకారము దక్షిణభుజమునందును, మకారము వామకుక్షియందును, విసర్గ దక్షిణకుక్షియందు నుంచవలయును. జ్వాలామాలలచే వ్యాప్తంబగు నోంకారము నెల్లప్పుడును ధ్యానించుచుండవలయును. శుద్ధవర్ణంబును, శుభంబును, నగుహ్రాంకారము నెల్లప్పుడును ధ్యానముఁ జేయుచుండవలయును. భిన్నాంజనసదృశంబగు ప్రభగలిగిన ఖకారమును బ్రాజ్ఞు లెల్లప్పుడును చింతించుచుండవలయును. హేమవర్ణంబగుషకారమును నర్లే యెల్లప్పుడును చింతించుచుండవలయును. శుక్లపద్మసమానంబుగ "అ"కారమును జాజిపువ్వులతో సమానమగు "హ్రీం" వర్ణకమును ధ్యానింపవలయును. క్షీరవర్ణంబగు సకారము నెల్లప్పుడును చింతింపవలయును. హిమకుందసదృశంబుగ నకారమును చింతింపవలయును. అమృతాక్షరంబుగ మకారమును ధ్యానింపవలయును. హ్రీంకారము విద్యుత్సదృశముగను, హ్రీంకారము సర్వవర్ణకంబుగను, సకారంబు క్షీరవర్ణంబుగను జింతింపవలయును. నకారము

---

ఖఖోల్కాయ నమో మూలమంత్రః ప్రకీర్తితః. ౧౪. ఆదిత్యోఽయం స్వయం దేవో హ్యక్షరేణోపబృంహితః, ఓంకారం విన్యసేన్మూర్ధ్ని హ్రాంకారం నాసికోపరి. ౧౫. ఖకారం చ లలాటే తు షకారం వదనే న్యసేత్, లకారం చైవ కంఠే తు కకారం హృదయే న్యసేత్. ౧౬. యకారం తు భుజే వామే నకారం దక్షిణే భుజే, మకారం వామకుక్షౌ చ విసర్గం దక్షిణే న్యసేత్. ౧౭. ఓంకారం తు సదా ధ్యాయేజ్జ్వాలామాలాసమాకులం, హ్రాంకారం శుద్ధవర్ణాభం ప్రసువంతమలం శుభమ్. ౧౮. ఖకారం చింతయే త్ప్రాజ్ఞో భిన్నాంజనసమప్రభం, తరుణాదిత్యవర్ణాభం ఖకారం చింతయేద్బుధః. ౧౯. షోకారం తు మహాబాహో హేమవర్ణం విచింతయేత్, శుక్లపద్మనిభాకారమకారం చింతయేద్బుధః. ౨౦. జాతీకుసుమసంకాశం హ్రీంకారం సర్వవర్ణకం, క్షీరవర్ణం సకారం తు చింతయేత్సతతం బుధః. ౨౧. నకారం హిమకుందాభం మకారమమృతాక్షరం, హ్రీంకారం విద్యుత్సంకాశం హ్రీంకారం సర్వవర్ణకమ్. ౨౨. క్షీరవర్ణం సకారం తు

సర్వవర్ణకాంతిగలదిగను, మకారము బంగారుకాంతిగలదిగను ధ్యానింప వలయును. తరువాత మహాత్ముండును, సహస్రకిరణుండును నగుసూర్యునిఁ బ్రాసాదమున కభిముఖముగా నొకపక్కయం దుంచవలయును. తరువాత బ్రాహ్మణు లగ్నికుండములం దగ్ని కార్యములఁ జేయవలయును. అరణు లచె మథించి పుట్టించిన యగ్నినిగాని లౌకికాగ్నినిగాని కుండమున నుంచి విధ్యుక్తంబుగాఁ బ్రజ్వలింపఁజేసి హోమమును జేయవలయును. బహ్వృక్ శాఖీయులు పూర్వకుండమునందును, మాధ్యందినశాఖీయులు యామ్య కుండమునందును, ఛాందోగ్యులు పశ్చిమకుండమునందును, అథర్వ లుత్తరకుండమునందును నుండవలయును. ఓయదూత్తమా! భోజకుఁడు మధ్యమకుండమున హోమముఁ జేయుచుండవలయును. జమ్మి మోదుగ మేడి సమిధలను పదిరెండువేలుగాని, లేక యెనిమిదివేలుగాని, లేక నాలుగువేలుగాని, మూఁడువేలుగాని, రెండువేలుగాని, ఆఖరున ఒక వెయ్యినను నుంచవలయును. "అగ్ని ర్మూర్ధా" యనుమంత్రముచేఁ గుండాలంభనమును జేయవలయును. ఈమంత్రముచేతనే యగ్నికుల్లేఖ నాభ్యుక్షణములఁ జేయవలయును. "సంబుధ్యస్వాగ్నే" యనుమంత్ర ముచే గర్భాధానమును జేయవలయును. మఱల "సీమంత" యను మంత్రముచే హోమముఁ జేయవలయును. అచ్చట జాతకర్మ నుద్దేశించి

---

చింతయేత్సతతం బుధః, నకారం స్వర్ణవర్ణాభం మకారం కనకప్రభమ్. ౨౩. తతో దేవం మహాత్మానం సహస్రకిరణం రవిం, ప్రసాదాభిముఖం దేవం శయనీయే నివేశ యేత్. ౨౪. అగ్నికార్యం తతః కుర్యురగ్నికుండేషు వై ద్విజాః, తతోఽరణ్యాం సము త్థాప్య అగ్నిం లౌకికమేవ వా. ౨౫. ప్రజ్వాల్యాగ్నిం విధానేన కుర్యాద్ధోమం విచక్షణః, బహ్వృచః పూర్వకాండేషు యామ్యాం మధ్యందినస్తథా. ౨౬. పశ్చిమే చైవ చ్ఛందోగ ఉత్తరేఽథర్వణో మతః, మధ్యే చ భోజకః కుర్యాద్ధోమం యజ్ఞే యదూ త్తమ. ౨౭. శమీపాలాశోదుంబరాణి హ్యపామార్గస్తథైవ చ, ద్వాదశ తు సహస్రాణి అష్టౌ చత్వారి ఏవ చ. ౨౮. ద్వే త్రీణి చ సహస్రాణి అథ వా ఏకమేవ హి, అగ్ని ర్మూర్ధేతి మంత్రేణ కుండస్యాలంభనం భవేత్. ౨౯. ఉల్లిఖ్యాభ్యుక్ష్య తేనైవ అగ్నిం దూతమితి స్మృతః, సంబుధ్యస్వాగ్నే మంత్రేణ గర్భాధానం తు కారయేత్. ౩౦. సీమంతేతి పునస్తత్ర మహామంత్రేణ హోమయేత్, జాతకర్మ తథా ప్రోక్తం ప్రాణా

ప్రాణాయామమును గూడఁ జేయవలయునని పెద్దలు చెప్పుదురు. "నమ స్స్వాహా" యనుమంత్రముచే నామకరణముఁ జేయవలయును అన్న ప్రాశనమంత్రముచే నన్నప్రాశనముఁ జేయవలయును. "జ్యేష్ఠమగ్రే"యను మంత్రముచేఁ జూడాకర్మయును, వ్రతబంధనమంత్రముచే వ్రతబంధన మునుం జేయవలయును "సమావర్తనం" "ఆకృష్ణ" యను నీరెండు మంత్రములచేతను హోమముఁ జేయవలయును. తరువాతఁ బత్నీసంయో జనమును స్వయముగనే కలుగఁజేయవలయును. మఱియు నగ్నిహోత్రాది కర్మలును, యజ్ఞకర్మలును, మహావ్యాహృతిమంత్రముచేఁ జేయవలయును. యజ్ఞభూతములకు మాతృదేవతలకు బలికర్మ నడుపవలయును. తరువాత సర్వకామసిద్ధికై యధివాసము జేయవలయును. ఐదురాత్రులు గాని లేక మూఁడురాత్రులుగాని లేక యొకరాత్రింబగలుకాని యధివాసమును జేయువలయును. పిమ్మట బాగుగ నలంకరించి మఱల స్నానముఁ జేయించి మణిరత్నాభరణధారియును, రక్షామంగళధారియును నగు ప్రతిమను నధివాసముఁ జేయవలయును. దేవాలయమున కీశాన్యదిగ్భాగమునందు దివ్యమగు నొకమందిరమును నిర్మించి, కుశలచేతను శ్రేష్ఠములగు పరి స్తరణలచేతను వ్యాప్తమగు మందిరమునందు శిరము తూర్పుభాగమున కుండునట్లుగా తెల్లనివస్త్రమును పక్కవేసి మఱియొక తెల్లనివస్త్రమును పైనఁగప్పి (సూర్యవిగ్రహమును) మహాశ్వేతులఁ దెచ్చి యాశయ్యపైఁ

---

యామం విదుర్బుధాః. ౩౧. నమః స్వాహేతి మంత్రేణ నామకరణమేవ చ, అన్న ప్రాశనమంత్రేణ అన్నప్రాశనమాదిశేత్. ౩౨. జ్యేష్ఠమగ్రేతి మంత్రేణ తేన చూడోప కర్మణి, వ్రతబంధస్య మంత్రేణ వ్రతబంధం సమాదిశేత్. ౩౩. సమావర్తనమిత్యేవ ఆకృష్ణేతి చ హోమయేత్, పత్నీసంయోజనం చైవ స్వయమేవ ప్రకల్పయేత్. ౩౪. అగ్నిహోత్రాదికం కర్మ యజ్ఞకర్మాణి యాని చ, మహావ్యాహృతిమంత్రేణ హోతవ్యాని సమంతతః. ౩౫. మాతౄణాం యజ్ఞభూతానాం బలికర్మ ప్రదాపయేత్, సర్వకామ సమృద్ధ్యర్థం కారయేదధివాసనమ్. ౩౬. త్రిరాత్రం పంచరాత్రం చ అహోరాత్ర మథాపి వా, తతః స్వలంకృతాం స్నాతాం మణిరత్నైర్విభూషితామ్. ౩౭. కృతరక్షాం ప్రయత్నేన ప్రతిమామధివాసయేత్, దేవాగారాదథైశానే దిగ్భాగే దివ్యమందిరమ్. ౩౮. కృత్వా కుశపరిస్తీర్ణే వరాస్తరణసంవృతే, పూర్వశీర్షాం తథా శయ్యాం శుక్లాంశుక్లాంబరోత్తరామ్. ౩౯. తస్యామావేశయేత్సమ్యఙ్మహాశ్వేతముపాహరేత్,

బరుండఁబెట్టవలయును. దక్షిణభాగమున నిక్షుభయు, వామభాగంబున రాజ్ఞియు నుండవలయును. దండనాయకపింగళకు లిసూర్యునిపాదము లయం దాశ్రయించి యుందురు.-ఈరీతిగ సూర్యప్రతిమను రాత్రియం దా మందిరమందుఁ బ్రవేశింపఁజేసి యారాత్రియందు నాల్గుదిక్కులను స్తోత్రము చేయుచుండవలయును. బ్రాహ్మణులు, స్తుతిపాఠకులు, సంగీత పాఠకులు, చారణులు మొదలగు సూర్యభక్తులతో నారాత్రి జాగ రముఁ జేయవలయును. తెల్లవారినపిమ్మట ఋగ్వేదవిహితప్రకారంబుగా హవిష్యమును భుజించుకోఁటకగల బ్రాహ్మణులఁబిలచి దక్షిణలచేఁ బూజించి వారలచేఁ జేయఁబడిన స్వస్తివచనములు గలవాఁడై గర్భగృహముయొక్క మధ్యభాగంబున నీప్రతిమ నుంచి శాస్త్రోక్తముగా సువర్ణమయంబును, సప్తాశ్వయుతం బగురథము నుంచవలయును సర్వబీజౌషధములను ధరి యించి విధ్యుక్తముగా నర్ఘ్యము నిచ్చి యజమానుఁడు ససహాయుఁడై యారథమునం దుంచవలయును. శంఖదుందుభినిర్ఘోషంబులచేతను, జల ధారాయుక్తంబులగు నక్షతలచేతను, పుణ్యాశబ్దంబులచేత నాలయమునకుఁ బ్రదక్షిణముఁజేసి శుభలగ్నమునందు, శుభదినమందు, శుభనక్షత్రము నందుఁ బూర్వాహ్ణంబున నిర్ణీతమగు ముహూర్తకాలమునందు భాను ప్రతిమను స్థాపింపవలయును. ఆప్రతిమ నధోముఖముగను, నూర్ధ్వ

---

నిక్షుభా దక్షిణే పార్శ్వే వామే రాజ్ఞీ చ కీర్తితా. ౪౦. దండపింగలకౌ చాస్య స్థితౌ పాదప్రవేశితౌ, తస్యాం సంవేశితాయాం తు శర్వర్యాం ప్రతిమాం రవేః. ౪౧. వసేత్తాం రజనీం తత్ర స్తూయమానశ్చతుర్దిశం, బ్రాహ్మణైర్వందిభిశ్చాపి గీతజ్ఞైశ్చారణైస్తథా. ౪౨. కుర్యాజ్జాగరణం తత్ర సూర్యభక్తిసమన్వితైః, ప్రభాతాయాం తు శర్వర్యాం బోధయేదృగ్విధానతః. ౪౩. హవిష్యం భోక్తుకామాంస్తు బ్రాహ్మణాన్భోజకాంస్తథా, దక్షిణాభిశ్చ సంపూజ్య తైః కృతస్వస్తివాచనః. ౪౪. తతో గర్భగృహస్యాథ మధ్యే కృత్వా తు పిండికాం, విధివత్తత్ర సౌవర్ణం న్యసేత్సప్తహయం రథమ్. ౪౫. సర్వబీజౌషధైశ్చైవ తత్ర ధృత్వా విధానవిత్, దత్త్వార్ఘ్యం స్థాపయేత్తత్ర యజమానః సహాయవాన్. ౪౬. శంఖదుందుభినిర్ఘోషైర్జలధారాసహాక్షతైః, కృత్వా పుణ్యాహశబ్దం తు ఆలయస్య ప్రదక్షిణామ్. ౪౭. శుభలగ్నే దినే ఋక్షే పూర్వాహ్ణే భానవేక్షణే, ముహూర్తే చ శుభే భానోః ప్రతిమాం స్థాపయేద్బుధః. ౪౮. నాధోముఖీం

ముఖముగను, నొకపార్శ్వమునకు వంగినదానిగను ప్రవేశపెట్టఁగూడదు. సమానముగ నుంచవలయును. ఈదేవునియొక్క భార్యలను గూడ నట్లే పార్శ్వములయం దుంచవలయును. నిక్షుభ యనుభార్యను దక్షిణ భాగమునను రాజ్ఞి యనుభార్యను వామభాగమున నుంచవలయును. తరువాత వారల కానుకలకొఱకు. నివేదించుటకు తీసికొనిరాఁబడిన సంభారములచేతను, మోదకములు మొదలగు పిండివంటకంబులచేతను, గుడమిశ్రితంబులగు తిలలచేతను, పాయసముచేతను, సర్వదిక్కులయందును బలి నుంచవలయును. దేవపతియును బలవంతుఁడును వజ్రపాణియు శతయజ్ఞాధిపతియు నగునింద్రునికొఱకు నమస్కారమని పల్కి "త్రాతారమింద్ర" మనుమంత్రముచే నింద్రుని యావాహన జేయవలయును. రక్తనేత్రుండును, జ్వాలామాలార్చితుండును శక్తిహస్తుండును, తీవ్రమునైనట్టి యగ్నికి నమస్కారము అని బలి నీయవలయును. ఆగ్నేయదిక్కునం దగ్నిమంత్రముచే నగ్నినావాహన జేయవలయును దండపాణియు, కృష్ణవర్ణుఁడు, మహిషవాహనుఁడు, సూర్యపుత్త్రుఁడు, దేవుండగు ధర్మరాజునకు నమస్కారము. అని పల్కి "యమాయ" అనుమంత్రముచే బలి నిచ్చి ముద్రలను వేయవలయును. ఖడ్గహస్తుఁడును, నీలలోహితుఁడును, సర్వబాహ్యవస్తువుల కధిపతియును, విరూపాక్షుఁడును నగు నైరృతికి నమ

---

నోర్ధ్వముఖీం న పార్శ్వావనతాం తథా, సమామభిముఖీం చేమాం ప్రతిమాం తు నివేశయేత్. ౪౯. పత్న్యౌ చాస్య తతః సమ్యక్పార్శ్వయోర్వినివేశయేత్, నిక్షుభా దక్షిణే పార్శ్వే రవే రాజ్ఞీ తు వామతః. ౫౦. తతస్తదుపహారార్థం సంభారైః ప్రాక్సమాహృతైః, మోదకాయూపశష్కులీభూతశీర్షకైః. ౫౧. కృశరైః పాయసోన్మిశ్రైః సర్వదిక్షు క్షిపేద్బలిం, ఇంద్రాయ దేవపతయే బలినే వజ్రపాణయే. ౫౨ శతయజ్ఞాధిపతయే తస్మై ఇంద్రాయ తే నమః, త్రాతారమింద్రమంత్రేణ ఇంద్రస్యావాహనం భవేత్. ౫౩. అగ్నయే రక్తనేత్రాయ జ్వాలామాలార్చితాయ వై, శక్తిహస్తాయ తీవ్రాయ తథా చైవాజవాహినే, ఆగ్నేయ్యామగ్నిమంత్రేణ వహ్నేరావాహనం స్మృతమ్. ౫౪. దండహస్తాయ కృష్ణాయ మహిషోత్తమవాహినే, సూర్యపుత్రాయ దేవాయ ధర్మరాజాయ వై నమః. ౫౫. యమాయ త్వితి మంత్రేణ ముద్రాస్తస్యైవ కీర్తితాః, నైరృతే ఖడ్గహస్తాయ నీలలోహితకాయ చ. ౫౬. సర్వభావ్యధిపతయే విరూపాఖ్యాయ వై నమః, ఆంధ్యం గారితి మంత్రేణ నైఋత్యాం

స్కారమని పల్కి "ఆయం గౌరి" అనుమంత్రముచే నైరృతదిక్కునం దావాహన జేయవలయును. పశ్చిమదిక్కునందు పాశహస్తుఁడగు వరుణుని కొఱకు నమస్కారమని పల్కి "పంచనద్యస్సరస్వతీం" అనుమంత్రముచే వరుణావాహనఁ జేయవలయును. "ప్రాణాత్మకుండును, ధూమస్వరూపుండును, నవిశేషాంగుఁడును, ధ్వజహస్తుఁడును, ననిలుండును, భీమరూపుండును, గంధవహుండును నగువాయుదేవునికి నమస్కారము" అని పల్కి దేవాదేవహేడనం, అనుమంత్రముచే వాయువు నావాహన జేయవలయును. గదాహస్తుఁడును, శుష్మఁడను,మనుష్యగతుండును,పట్టిసపాణియు నగుసోమరాజునకు నమస్కారము అని పల్కి యీశావాస్యము చేతను, గుహ్యమంత్రములచేతను, సోము నావాహనఁ జేయవలయును. చతుర్ముఖుండును, దేవుండును, పద్మాసనగతుండును, కృష్ణాజినోపవిష్టుండును నగు లంబోదరునకు నమస్కారము. గణాధిపతియును, నీలకంఠుఁడును, శూలపాణియు, విరూపాక్షుఁడును, త్రైలోక్యాధిపతియును, నగురుద్రునికి నమస్కారము. "అభిత్వా" యనుమంత్రముచే నీశానావాహనముఁ జేయవలయును. సమస్తసర్పములకు నధిరాజును, శ్వేతవర్ణుండును, భోగియును, సహస్రఫణియును నగుశేషునకు నమస్కారము ఇదియే మంత్రమగుటచే దీనిచేతనే శేషావాహనము జేయవలయును ఐదు రాత్రుల నంగన్యాసములు చేయవలయును. క్షీరపానము

తు ప్రకల్పయేత్. ౪౭. వారుణ్యాం పాశహస్తాయ వరుణాయేతి కల్పయేత్, మంత్రేణావాహనం విద్యాత్పంచనద్యః సరస్వతీమ్. ౪౮. ప్రాణాత్మకాయ ధూమాయ అవ్యంగాయానిలాయ చ, ధ్వజహస్తాయ భీమాయ నమో గంధవహాయ చ. ౪౯. తస్యాప్యావాహనం విద్యాద్యద్దేవా దేవహేడనం, గదాహస్తాయ సోమాయ శుష్మిణే నృగతాయ చ. ౫౦. గదాపట్టిశహస్తాయ సోమరాజాయ వై నమః, ఈశావాస్యం చ గుహ్యా వై సోమమంత్రః ప్రకీర్తితః. ౫౧. చతుర్ముఖాయ దేవాయ పద్మాసనగతాయ చ, కృష్ణాజిననిషణ్ణాయ నమో లంబోదరాయ చ. ౫౨. గణాధిపతయే దేవ నీలకంఠాయ శూలినే, విరూపాక్షాయ రుద్రాయ త్రైలోక్యాధిపతే నమః, అభి త్వా శూర నో మంత్ర ఈశానాయ ప్రకల్పయేత్. ౫౩. సర్వనాగాధిరాజాయ శ్వేతవర్ణాయ భోగినే, సహస్రఫణినే నిత్యమనంతాయ నమోనమః. ౫౪. నమోఽస్తు సర్పేభ్య ఇతి మంత్రశ్చైవ ప్రకీర్తితః, పంచరాత్రాదభిర్న్యాసో హ్యంగన్యాసః ప్రయుజ్యతే. ౫౫. తథోపక్షీర

చేతను, స్తోత్రములచేతను సూర్యునకు అంగన్యాసములఁ బ్రయోగింప వలయును. తరువాత భోజకులకును, బ్రాహ్మణులకును దక్షిణ లియ్య వలయును గొప్పదగు నీసూర్యయాగమును దక్షిణారహితముగఁ జేయఁ గూడదు. నేను పూర్వము చెప్పినప్రకారము సూర్యవిగ్రహమును భక్తులు ప్రతిష్ఠించినచో నాప్రతిమ సమస్తసంపత్సమృద్ధి నిచ్చి నిత్యమును సన్నిధానవర్తి యగును. మఱియు నాకర్త కేడుజన్మములలోపున నేరోగములు సంభవింపవు. సూర్యునియాత్రాధివాసమునందు మూఁడు రాత్రులు గంధమాల్యాదుల నర్పించి స్తోత్రముచేసినయెడల సూర్య లోకమును బొందుదురు ఎవఁడు స్వకీయముగాని పరకీయముగాని సూర్య ప్రతిమాస్థాపనముఁ జూచునో యామనుష్యుఁడు స్వర్గలోకమును బొందును. స్వయముగఁ బ్రతిష్ఠించినపురుషుఁడు పదియశ్వమేధయాగ ములఫలమును వాజపేయయాగశతఫలమును బొందఁగలఁడు. పుణ్య వంతుఁడగువాఁడు విగ్రహము దేవాలయములో నుండునంతపర్యంతము సూర్యలోకంబునఁ బ్రకాశించును. ఈసూర్యప్రతిమాస్థాపనమునందు లోకపూజితం బగుమంత్రం బొక్కటి గలదు. "ధ్రువా ద్యౌశ్చ ధ్రువా పృథ్వీ ధ్రువం విశ్వమిదం జగత్, శ్రేయసే యజమానస్య తథా త్వం ధ్రువతాం వ్రజ." యనుమంత్రముచే భక్తితో సూర్యప్రతిమను విధ్యుక్త

---

పానైశ్చ స్తుతిస్తోత్రైశ్చ భాస్కరం, విప్రేభ్యో భోజకేభ్యశ్చ తతో దద్యాచ్చ దక్షిణామ్. ౧౭. సూర్యక్రతుం మహాపుణ్యం నైవ కుర్యాదదక్షిణం, స్థాప్యతేఽనేన విధినా తద్భక్తైః ప్రతిమా చ యా. ౧౮. సా తు వృద్ధికరా నిత్యం సాంనిధ్యాచ్చ సదా భవేత్, సప్తజన్మసు తేషాం తు న రోగాః సంభవంతి హి. ౧౯. ఉపాసతే త్రిరాత్రం యే భానోర్యాత్రాభివాసనే, గంధమాల్యోపహారైస్తు తే యాంతి భువనం రవేః. ౧౯. ఆత్మీయం పరకీయం వా ప్రతిమాస్థాపనం రవేః, యః పశ్యతి పుమాన్భక్త్యా స స్వర్లోక మవాప్నుయాత్. ౨౦. దశానామశ్వమేధానాం వాజపేయశతస్య చ, ఫలం ప్రాప్నోతి పురుషః ప్రతిష్ఠాప్య దివాకరమ్. ౨౧. యావత్కీర్తిః పుణ్యకృతా భానోః స్థానే నివేశితే, తావత్స తు యదుశ్రేష్ఠ సూర్యలోకే మహీయతే. ౨౨. స్థాపనే చాస్య వై మంత్రః ప్రోక్తో లోకేషు పూజితః, ధ్రువా ద్యౌశ్చ ధ్రువా పృథ్వీ ధ్రువం విశ్వమిదం జగత్, శ్రేయసే యజమానస్య తథా త్వం ధ్రువతాం వ్రజ, ౨౩. స్థాపయిత్వా రవిం

ముగ స్థాపింపవలయును. అట్లుచేసిన ప్రతిమాసమునందును యజ్ఞమును జేసిన నేఫలమో యాఫలమును బొందఁగలరు. ఒక్కదినము భానునిఁ బూజించినఁ బొందెడిఫలమును నూరుయజ్ఞములు చేసినను పొందఁజాలరు. మహాపాపములను జేసినవాఁడైనను తరువాత సూర్యుని సేవించినయెడల విగతకల్మషుఁడై సూర్యలోకమును బొందఁగలఁడు. దేవాలయము నిర్మించినవాఁడు స్వర్గలోకంబున సౌఖ్య మనుభవించును. ఖండస్ఫుటితసంస్కారముఁజేసిన నేఫలముంబొందునో యాఫలమును వేయియజ్ఞములు చేసినను పొందఁజాలఁడు. ఇసుకయందైనను సూర్యున కాలయము నిర్మించిన సూర్యునకుఁ బ్రేమాస్పదుఁడై సూర్యునివలన వరముం బొందును. ఈ ప్రకారముగా భూతంబులకు స్థితిప్రసూతిలయహేతుభూతుఁడగు నా భానునకు దేవాలయము నిర్మించిన నైశ్వర్యసంపన్నుఁ డగును. గృహములు కట్టించినవాఁడు నూరుకల్పంబులు సూర్యునియొక్క సాన్నిధ్య మొందఁగలఁడు.

ఇది షట్త్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

భక్త్యా విధిదృష్టేన కర్మణా, మాసేమాసే క్రతుఫలం లభంతే నాత్ర సంశయః. ౨౪. ఏకాహేనాపి యద్భానోః పూజయా ప్రాప్యతే ఫలం, న తు క్రతుశతైర్వీర ప్రాప్యతే మానవైర్భువి. ౨౫. కృత్వాపి సుమహత్పాపం యః పశ్చాత్సేవతే రవిమ్, స యాతి సూర్యలోకం తు నరో విగతకల్మషః. ౨౬. న భవేదిష్టకానాం చ ద్రవణం భూమి సంమితి, స్వర్గే మహీయతే తావత్కారకో దేవవేశ్మనః. ౨౭. ఖండస్ఫుటితసంస్కారం కృత్వా యత్ఫలమాప్యతే, న తు క్రతుసహస్రైస్తు ప్రాప్యతే ఫలముత్తమమ్. ౨౮. సికతాయామపి గృహం యస్తు కుర్యాద్విభావసోః, గోపతేః స ప్రియసదః ప్రగచ్ఛేద్గోపతేర్వరమ్. ౨౯. ఇత్యేవం సురవరస్య తస్య భానోర్భూతానాం స్థితినిలయప్రసూతిహేతోః శ్రీభాగీ భవతి నరో నికేతకారీ కల్పానాం వసతి శతం స సూర్యలోకే. ౩౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యప్రతిష్ఠావర్ణనం నామ షట్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## సప్తత్రింశదుత్తరశతతమాధ్యాయము.

నారదుం డిట్లనియె. ఏమనుజుఁడు ప్రయత్నపూర్వకముగఁ బ్రీతిచే దేవతలకుఁ బ్రాసాదముల నిర్మించి వెంటనే భానుప్రతిష్ఠను చేయునో యామనుజుఁ డీదివ్యభోగముల ననుభవించును. తనయథేచ్ఛచే నపరిమితములగు కామముల ననుభవించి మఱల భూమియందుఁ జక్రవర్తియై ప్రకాశించును. ఏమనుజులు సత్పురుషులయొక్క దృష్టికి మనోహరంబులగు దేవాలయముల నిర్మింతురో వారు శరీరముచే మృతులయ్యును లోకమందుఁ గీర్తిమయమగు శరీరముచేఁ బరిభ్రమింతురు. ఓవీరుఁడా! దేవపూజ్యుఁడగు సూర్యునియొక్క స్థాపనమువలెనే ఆధానమునుఁ గూడఁ జెప్పితిని. దేవతాప్రతిష్ఠాపనయందు సాధారణవిధానముఁ జెప్పెద సావధానముగా వినుము. స్నానముజేసి భుజించి వస్త్రాలంకారకుసుమగంధములచే వ్యాప్తంబగుశయ్యయందుఁ బ్రతిమను స్థాపింపవలెను. ఆ ప్రతిమను నృత్యగీతజాగరణంబులచే బాగుగా నధివాసముజేసి దైవజ్ఞనిర్దిష్టంబగుకాలంబున సంస్థాపనము జేయవలయును. తరువాతఁ గుసుమగంధాదిలేపనములచేతను, శంఖతూర్యనిర్ఘోషములచేతను బూజించి బల్యర్థంబులగుద్రవ్యములను సప్రదక్షిణముగా దేవాలయమునకుఁ దీసికొనిరావలయును. తరువాతఁ బ్రతిమను సాధువులగుబ్రాహ్మణులను బూజించి హిరణ్యకలశము నిచ్చి విధిప్రకారంబుగాఁ బిండికామధ్యంబున గోతియం

---

నారద ఉవాచః— యః ప్రాసాదం రచయతి పుమాన్దేవతానాం ప్రయత్నాత్తత్ర ప్రీత్యా సపది కురుతే స్థాపనాం భానుభక్తః, దివ్యాన్భోగాన్ లభతి చ సదా కామతశ్చాప్రమేయాంస్తాన్భుక్త్వాసౌ పునరపి భవేచ్చక్రవర్తీ పృథివ్యామ్. ౧. యే మానవాస్త్రిదశమూర్తినికేతనాని కుర్వంతి సాధుజనదృష్టిమనోహరాణి, తేషాం మృతేఽప్య పరమార్థమయే శరీరే లోకే పరిభ్రమతి కీర్తిమయం శరీరమ్. ౨. ఇతి తే కథితమిదం దేవపూజ్యస్య సవితుః స్థాపనమివాధానమ్, సాధారణం విధానం శృణు దేవానాం ప్రతిష్ఠాపనే వీర. 3. స్నాతో భుక్త్వా వస్త్రాలంకృతకుసుమైర్గంధైః ప్రతిమాయా ఆస్తీర్ణాయాం శయ్యాయాం స్థాపనం కుర్యాత్, సుప్తాయాం తు స నృత్యగీతైర్జాగరణైః సమ్యగేవాధివాస్య దైవజ్ఞేన ప్రతిదిష్టకాలే సంస్థాపనం కుర్యాత్, అభ్యర్చ్య కుసుమగంధానులేపనైః శంఖతూర్యనిర్ఘోషైః ప్రాదక్షిణ్యేన నయేదాయతనస్య ప్రయత్నేన కృత్వా బలిం ప్రతిమామభ్యర్చ్య బ్రాహ్మణాంశ్చ సాధూన్దత్త్వా హిరణ్యకలశం విధినా

దుంచవలయును. స్థాపకుఁడు దైవజ్ఞులను ద్విజులను బూజించిన నిహపర లోకంబులం దాకల్పాంతము భోగియై సుఖించును. విష్ణుభక్తులు, సూర్య భక్తులు సమానులుగను, శివభక్తులు భస్మధారులుగను, శాక్తేయులు శక్తిమండలజ్ఞులుగా నుండవలయును. ఎవరెవ రేమేమి యుపాసన జేయు దురో వారలు తత్తద్దేవతాప్రీతికరంబులగు వేషముల ధరించినవారై యా దేవతాపూజలను విధిగా నెరవేర్పవలెను. సాంబా! దేవతలయొక్క సామాన్యాధివాసములఁ జెప్పియుంటిని ఈసామాన్యాధివాసమును దేవతాప్రతిష్ఠాపనము జేయుచుండఁగాఁ జూచినయెడల సమస్తములగు నైహికకామములను సర్వవిధపారలౌకికకామములను బొంది స్వర్గలోక మందు సుఖింతురు. రాజా! ప్రతిష్ఠాపనవిధి నాదినుండియుఁ జెప్పితిని. సవితృదేవతను స్నానముఁ జేయించిన మనుష్యులు మనసునందుఁగల వాంఛితమును బొందఁగలరు. ఈరీతిగా విద్వాంసులగుమనుష్యులు భక్తితో సూర్యస్థాపనముఁ జేయవలయును. భక్తితో నితరులతోఁగూడఁ జేయింపవలెను ఇతిహాసపురాణశ్రవణమువలనఁ బాపనాశంబు గలుగు. వానిచే సూర్యుఁడు సన్నిధానవర్తియై యుండును. ఆసూర్యునకు దేవా లయము నిర్మింపఁగా నితరదేవతలును ధర్మశ్రవణమువలన నాదేవాల యమునందు సాన్నిధ్యమును బొందుదురు. ఆదేవతలను వాచకునిఁ బూజించి బ్రాహ్మణులను బూజించి సూర్యునియెదుటఁ బురాణమును

---

నిక్షేపేత్పిండికామధ్యే సుశ్వభ్రే స్థాపకదైవజ్ఞద్విజాన్సమ్యగ్విశేషతోభ్యర్చ్యాప్యకల్పాంతం భోగీ భవతీహ పరత్ర సుఖీ. ౪. విష్ణోర్భాగవతా.మతాశ్చ సవితుః శంభోః సభస్మద్విజా మాతౄణామపి మాతృమండలవిదో విప్రా విదుర్బ్రాహ్మణాః, సర్వే యస్య విముక్తశుక్ల వసనా బుద్ధస్య రక్తాంబరా యే యం దేవముపాశ్రితాః సువిధినా తైస్తస్య కార్యా క్రియా. ౫. సామాన్యమిదం దేవానామధివాసనం భవతి మయా కథితమ్, క్రియమాణ మిదం దృష్ట్వా దేవానాం ప్రతిష్ఠాపనమ్, నరో భక్త్యా ఇహ కామానవాప్య సర్వా న్పరత్ర స్వర్గభాజనం భవతి. ౬. ఇదం తే కథితం రాజన్ప్రతిష్ఠాపనమాదితః, యత్కృ త్వా సవితుః స్నానం నరో యాతి మనోగతిమ్. ౭. ఇత్థం కుర్యాన్నరో భక్త్యా సవితుః స్థాపనం బుధః, కారయేత్పరతో భక్త్యా సవితుః స్థాపనం బుధః. ౮. ఇతిహాసపురాణస్య శ్రవణం పాపనాశనమ్, తాభ్యాం హి శ్రవణాద్వీర సాన్నిధ్యం యాతి భాస్కరః. ౯. కృతే త్వాయతనే తస్మిన్యే చాన్యే చాపి దేవతాః, తస్మాత్కార్యం బుధైర్నిత్యం ధర్మశ్రవణమాదితః. ౧౦. వాచకం పూజయిత్వా తు బ్రాహ్మణానుపపూజ్య చ, కారయే

జపివింపవలయును. చదువుచుండఁగా వచ్చినద్రవ్యమునంతను స్థాపకున
కియ్యవలయును లేకున్న గోదానమైన నిచ్చి యాస్థాపకునకు మానసిక
సంతోషమును గలుగఁజేయవలయును. ఈప్రకారముగాఁ బ్రతిష్ఠా
కల్పము నామూలాగ్రముగాఁ జెప్పితి. ఈప్రతిష్ఠాపనమును జేసినను జేయు
చుండఁగాఁ జూచినను వినినను మనుష్యుఁడు సూర్యలోకమును బొందును.

ఇది సప్తత్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## అష్టత్రింశదుత్తరశతతమాధ్యాయము.

నారదుం డిట్లనియె. సాంబా ! ఉత్తమమగు ధ్వజారోపణవిధి నీకుఁ
జెప్పితి. పూర్వము బ్రహ్మదేవుఁడు ఈశ్వరునియెదుట నీవిధముగాఁ
జెప్పెను. పూర్వము దేవాసురులయుద్ధమున జిగీషులగు దేవతలచే వాహ
నముల,ధ్వజములఁ జిహ్నములు నిర్మింపఁబడినవి.చిహ్నమనఁగా గుర్తనియు,
ధ్వజమనఁగా జెండాయనియును బర్యాయపదములచేఁ జెప్పఁబడుచున్నవి.
వానియొక్క ప్రమాణముఁ జెప్పెద నాకర్ణింపుము. కత్తి మొదలగు
వాటిచే దెబ్బలులేనిదియు, పుండు మొదలగునవి లేనిదియు నగు వెదురు
బొంగును ధ్వజముగాఁ జేయవలయును. ఆధ్వజము పెద్దమేడయెత్తుండ

---

ద్వాచనం వీర పుస్తకస్యాగ్రతో రవేః. ౧౧. సర్వస్వం స్థాపకే దద్యాద్యత్కించి
ద్గృహమాగతం, గోదానమథ వా దద్యాత్తస్య చిత్తం ప్రసాదయేత్. ౧౨. ఇత్యేష
కథితో వీర ప్రతిష్ఠాకల్ప ఆదితః, కృత్వా దృష్ట్వా చ శ్రుత్వా చ యం నరోఽర్క
మవాప్నుయాత్. ౧౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే
ప్రతిష్ఠాపనవిధివర్ణనం నామ
సప్తత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

నారద ఉవాచ:— హంత తే కథయిష్యామి ధ్వజారోపణముత్తమం, యదుక్తం
బ్రహ్మణా పూర్వం బుషభాధిపతేః పురః. ౧. పురా దేవాసురే యుద్ధే యాని దేవై
ర్జయేప్సుభిః, కృతాన్యుపరి చిహ్నాని వాహనాని ధ్వజాని తు. ౨. లక్ష్మ చిహ్న ధ్వజం
కేతురితి పర్యాయనామభిః, కీర్తితః స చ తస్యేహ ప్రమాణం గదతః శృణు. ౩. ధ్వజో
వంశస్య కర్తవ్య స్త్వవిద్ధ బుజురవ్రణః, ప్రాసాదవ్యాసతుల్యస్తు ధ్వజవంశప్రమాణతః,

వలెను. లేక దేవాలయంపుమంజరీకలశాదుల ప్రమాణముగనైనను, గర్భ గృహమందుండు వేదిప్రమాణమైనను లేక గర్భగృహమందుండు వ్యాస ప్రమాణమైన నుండవచ్చును. అనిమ్నంబును శ్రేష్ఠంబును నగువంశ మును గేతువుగాఁ జేయవలయును. ధ్వజమునందలిపత్రము యుగము, దానిపైచిత్రితమగు ప్రతిమయు నివియన్నియు నాల్గుహస్తములున్న యెడలఁ బ్రశస్తమగును. పదిహస్తములప్రమాణము నెనిమిదిహస్తముల ప్రమాణము కలిగియుండుట సామాన్యధ్వజస్తంభముయొక్క ప్రమా ణము. దండపాణియొక్క ధ్వజము పదునారుహస్తములప్రమాణ ముండ వలయును. సూర్యునిధ్వజము ఇరువదిహస్తములకు మించియుండఁ గూడదు. విద్వాంసులగువారు సరిసంఖ్యగల హస్తప్రమాణము గలుగు నట్లుగా ధ్వజమును నిర్మింపవలయును. నాల్గంగుళముల విస్తీర్ణమును, రెండంగుళములమీఁద వర్తులత్వంబును నాతిసూక్ష్మత్వంబును నాతిస్థూల త్వంబును గల్గియుండవలయును. కణుపులుగలుగునట్లుగాఁ జేయఁగూడదు. సామాన్యమైన కణుపులుగలుగునట్లుగను, సుదృఢముగను, సూక్ష్మము గను జేయవలయును. వక్రదండమును ధ్వజముగాఁ జేసినఁ బుత్రనాశ నము నాపాదించును. వ్రణయుక్తమగుదానిని ధ్వజముగాఁ జేసిన నర్థనాశ నము గల్గును. అయుగ్మహస్తప్రమాణము గలదానిని ధ్వజముగాఁ జేసిన రోగపీడ గలుగఁజేయును. భిన్నమైనయెడల ననంతమగు దుఃఖమును

---

౭. దేవాగారస్య యే ప్రోక్తా మంజరీకలశాదయః, అథ వా తత్ప్రమాణస్తు ధ్వజదండః ప్రకీర్తితః. ౫. అంతర్గృహస్య యా వేదీ సూత్రతః పరికల్పితా, తస్యా వ్యాసో భవే ద్వంశః ప్రసాదస్య యదూత్తమ. ౬. అథ వా మూలసూత్రేణ యో వ్యాసోన్తర్గృహస్య తు, ప్రాసాదవ్యాస ఇతి స ప్రోక్తశ్చేహ న సంశయః. ౭. కేతుర్భవేద్వరో వంశో న నిమ్నో న ఋజుస్తథా, పత్రం ధ్వజే యుగం చైవ నలికా పురుషస్తథా. ౮. చతు ర్హస్తా భవన్త్యేతే ప్రశస్తాః కృష్ణనందన, అష్టహస్తప్రమాణస్తు వింశార్ధస్య ప్రమాణతః. ౯. సామాన్యో ధ్వజదండస్తు సర్వసాధారణో మతః, దండపాణిధ్వజో యస్తు స్మృతః షోడశహస్తవాన్. ౧౦. వింశద్ధస్తాత్పరో దండో న కార్యః సర్వథా రవేః, యుగ్మ హస్తస్తు కర్తవ్యో ధ్వజదండో మనీషిభిః. ౧౧. చతురంగులవిస్తీర్ణః సువృత్తో ద్వ్యంగు లోపరి, నాతిసూక్ష్మో న చ స్థూలో న కార్యో నతపర్వకః. ౧౨. సమపర్వా తు కర్తవ్యః సుదృఢః సూక్ష్మ ఏవ హి, వక్రః పుత్రవినాశాయ సవ్రణోఽర్థవినాశనః. ౧౩. రోగదో యుగ్మహస్తస్తు భిన్నో దుఃఖమనంతకం, కరోతి హానిం ధర్మస్య హీనో యస్తు

గలుగఁజేయును. ప్రమాణహీనమైనచో ధర్మహాని కలుగును. అసమము లగుపర్వములుగలిగిన కష్టములు గలుగును ఉన్నతమైనయెడలఁ గష్టములు కల్గును. జయుఁడు, జయంతుఁడు, జైత్రేయుఁడు, శత్రుహంతకుఁడు, జయావహుఁడు, నందోపనందులు, ఇంద్రోపేంద్రులు నను నీపదిమందియు ధ్వజమున కానందసమ్మితులగు భేదములుగాఁ జెప్పఁబడిరి. రెండుహస్తములు ప్రమాణముగా నుండుధ్వజము జయమనియు, దానికి ద్విగుణ ప్రమాణముగలదండము జయంతమనియుఁ, బది రెండుహస్తముల ప్రమాణము గలదండము జైత్రేయమనియుఁ, గళాన్వితమగుదండము శత్రుహంతకమనియు, వింశార్ధప్రమాణము గలదండము జయావహమనియు, ఆదిత్యసన్నిభంబగుదండము నందమనియు, పదునాల్గుహస్తముల ప్రమాణముగలదండ ముపనందమనియు, పదునారుహస్తములు ప్రమాణము గలదండ మింద్రమనియు, పదునెనిమిదిహస్తముల ప్రమాణముగలదండ ముపేంద్రమనియుఁ జెప్పఁబడెను. ఇంద్రదండ మొకప్పు డిరువదిహస్తముల ప్రమాణముగఁ గూడ నుండును. భిన్నవక్రదండములను ధ్వజముగాఁ జేయఁగూడదు. మూలమంత్రముచే ధ్వజదండమును గృహవ్యాసప్రమాణముగఁ జేయవలయును. లేకున్న నీధ్వజదండము వాస్తుమానము ననుసరించిగాని మంజరీమానము ననుసరించిగాని దానిలో సగముప్రమాణము గలదిగఁగాని చేయనగును. ఆధ్వజము నానించి శుభమగుపతాకమును జేయవలయును. దేవాలయముయొక్క శిఖరమునుండి మూఁడు

---

ప్రమాణతః. ౧౪. వైషమ్యమసమపర్వా దద్యాత్కృచ్ఛ్రమ్ సోన్నతః, జయో జయంతో జైత్రేయః శత్రుహంతా జయావహః. ౧౫. నందోపనందనౌ చైవేన్ద్రో పేన్ద్రౌ గదితౌ తథా, దశైతే కీర్తితా భేదా ధ్వజస్యానందసంమితాః. ౧౬. ద్విహస్తస్తు జయో దండో జయంతో ద్విగుణో మతః, ద్వాదశహస్తస్తు జైత్రేయః శత్రుహస్తా కలాన్వితః. ౧౭. జయావహస్తు వింశార్ధో నంద ఆదిత్యసన్నిభః, చతుర్దశోపనందస్తు ఇంద్రః షోడశ ఉచ్యతే. ౧౮. ఉపేన్ద్రోఽష్టాదశః ప్రోక్తస్తథేన్ద్రో వింశతిః స్మృతః, భిన్నో వక్రోఽసాధితశ్చ న కార్యో దండఏవ హి. ౧౯. మూలమంత్రేణ కర్తవ్యో వ్యాసతోఽస్తగృహస్య తు, ధ్వజదండో మహాబాహో అథ వా వాస్తుమానతః. ౨౦. మంజరీమానతో వాపి తదర్ధేనాథ వా విభో, పతాకా వై శుభా కార్యా ధ్వజవంశావలంబినీ. ౨౧. దేవాగారస్య శిఖరాత్త్రిభాగపరిమార్జనీ, సా ప్రోక్తా దశధా వీర మానతో మానతస్తథా.

భాగములను పరిమార్జనజేయు నీధ్వజపతము పదివిధములుగాఁ జెప్పఁబడెను అంకురము, పల్లవము, స్కంధము, శాఖ, పతాక, కదళీ, కేతువు, లక్ష్మి, జయము, ధ్వజము నీపదింటిచేతను సర్వదేవమయుండగు నవ్యయుఁడు చెప్పఁబడుచున్నాఁడు. రెండంగుళముల ప్రమాణముగలది యంకురమనియు, నాలుగంగుళముల ప్రమాణముగలది పల్లవమనియు, ఆరంగుళముల ప్రమాణముగలది స్కంధమనియు, నెనిమిదంగుళముల ప్రమాణముగలది శాఖయనియు, పదునొకండంగుళముల ప్రమాణము గలది కదళియనియుఁ, బదునారంగుళములున్నఁ గేతువనియు, నష్టాదశాంగుళములది లక్ష్మియనియును చెప్పఁబడెను. ఇరువదియంగుళము లున్న జయనాఁబడును. అంకురపతాకము దేవాగారంపుఁ దోలికుంభమును దుడుచును. రెండవదానియొక్క మార్జని పల్లవమనియు, త్రిభాగ మార్జని స్కంధమనియు, నైదవభాగమునందలి మార్జని శాఖయనియు, ఆరవభాగమున మార్జనిపతాకమనియు, నేడవభాగమున మార్జనికదళి యనియు, నెనిమిదవభాగమున మార్జని కేతువనియు, తొమ్మిదవది లక్ష్మి యనియు, పదియవది జయంతమనియు చెప్పఁబడెను. ఇయ్యది వృషస్థానమును నధస్థానమును నవమార్జనము చేయునదియై ధ్వజమని చెప్పఁబడును. గజము, మేషము, మహిషము, కబంధము, వృషభము, హారిణము, నరుఁడును నీధ్వజమునకు స్థానములని తెలియనగును. తూర్పు

---

౨౨. అంకురః పల్లవశ్చైవ స్కన్ధః శాఖా తథైవ చ, పతాకా కదళీ వీర కేతుర్లక్ష్మి జయస్తథా. ౨౩. ధ్వజశ్చ దశమః ప్రోక్తః సర్వదేవమయోఽవ్యయః, అంకురో ద్వ్యంగులః ప్రోక్తః పల్లవశ్చతురంగులః. ౨౪. స్కన్ధః షడంగులః ప్రోక్తః శాఖా చాష్టాంగులా మతా, ఏకాదశపతాకా తు కదలీ చ చతుర్దశ. ౨౫. కేతుస్తు షోడశ ప్రోక్తో లక్ష్మ్యాష్టాదశముచ్యతే, జయా వింశతిర్వై ప్రోక్తా ఏతావత్త్వంగులాని తు. ౨౬. దేవాగారస్య కుంభస్య ప్రసన్నా సా ప్రమార్జనీ, అంకురేతి పతాకా సా విజ్ఞేయా యదునందన. ౨౭. పల్లవేతి ద్వితీయస్య మార్జనీ పరికీర్తితా, త్రిభాగమార్జనీస్కన్ధః శాఖా వై పంచమస్య తు. ౨౮. షష్ఠస్యోక్తా పతాకా తు కదళీ సప్తమస్య తు, అష్టమస్య తథా కేతుర్లక్ష్మి చ నవమస్య తు. ౨౯. తతస్తు దశమః ప్రోక్తో జయంతో యదునందన, వృషస్థానావమార్గీ తు ధ్వజస్తు పరికీర్తితః. ౩౦. గజో మేషోఽథ మహిషః కబన్ధస్తు వృషస్తథా, హారిణోఽథ నరశ్చైవ నరశ్చ నరసత్తమ. ౩౧. స్థానాన్యేతాని భూయో

భాగమున మొదలుకొని యన్ని దిక్కులయందును గ్రమముగా నీపతాకల నుంచవలయును. తత్త్వవేత్తలగుమహర్షులచే నీపదివిధములగుపతాకలు చెప్పఁబడినవి. రాజా! యది యెట్లు చేయవలయునో జెప్పెద నాకర్ణింపుము. శ్వేతవస్త్రమయమును, చిత్రంబును, ఘంటాసహితంబును, మనోహరంబును, బహువిధచామరయుక్తంబును, కింకిణీయుతంబును నగుపతాకను నిర్మించి దానిపై దేవతాసూచకమగు కాంచనరజతమణిరత్నములలో దేనిచేనైనను నిర్మింపఁబడినలింగము నుంచవలయును. విష్ణువునకు గరుడధ్వజము, ఈశ్వరునకు వృషభధ్వజము, బ్రహ్మదేవునకు పంకజధ్వజము, సూర్యునకు ధర్మధ్వజము, బలాధిపునకు హంసధ్వజమును, సోమునకు నరధ్వజమును, బలదేవునకు కాలధ్వజమును, మన్మథునకు మకరధ్వజమును, దుర్గాదేవికి సింహధ్వజమును, ఉమాదేవికి గోధాధ్వజమును, రైవతునకు హయధ్వజమును, వరుణునకు కచ్ఛపధ్వజమును, వాయువునకు హయధ్వజమును, పావకునకు మేషధ్వజమును, గణేశునకు మూషకధ్వజమును, బ్రహ్మర్షులకు కుశధ్వజమును జెప్పఁబడియున్నది గాన నాయాదేవాలయములయందు నాయాధ్వజముల నిర్మింపవలయును. నేదేవున కేది వాహనముగాఁ జెప్పఁబడినదో యాదేవున కదియే ధ్వజముగా నుండును. విష్ణువుయొక్కధ్వజమునకు సువర్ణదండమును,

---

౨థ ప్రయుక్తస్య ధ్వజస్య తు, దిశాభాగే తు పూర్వాత్తు క్రమేణ పరికల్పయేత్. ౩౨. ఏవం దశవిధా ప్రోక్తా పతాకా తత్త్వదర్శిభిః, కర్తవ్యా సా యథాపూర్వం తచ్ఛృణు త్వం నరాధిప. ౩౩. శుక్లవస్త్రమయీ చిత్రా సఘంటా సుమనోహరా, నానాచామరసంపన్నా కింకిణీజాలమండితా. ౩౪. ధ్వజాగ్రే చైవ కర్తవ్యో దేవతాలింగసూచకః, కాంచనో వాథ రౌప్యో వా మణిరత్నమయోఽపి వా. ౩౫. రంగైర్లింగ్యతే వాపి తద్వాహనసమాకృతిః, ధ్వజదండోఽత్ర విన్యస్తః కర్తవ్యో యదునందన. ౩౬. గరుత్మాంస్తు ధ్వజో విష్ణోరీశ్వరస్య ధ్వజో వృషః, బ్రహ్మణః పంకజం కార్యం రవేర్ధర్మః స్మృతో ధ్వజః. ౩౭. హంసో జలాధిపస్యోక్తః సోమస్య తు నరో ధ్వజః, బలదేవస్య కాలస్తు కామస్య మకరధ్వజః. ౩౮. సింహో ధ్వజస్తు దుర్గాయాః కీర్తితో యదునందన, గోధా చాపి ఉమాదేవ్యా రైవతస్య హయః స్మృతః. ౩౯. కచ్ఛపో వరుణస్యోక్తో వాతస్య హరిణో మతః, పావకస్య తథా మేష ఆఖుర్గణపతే ర్మతః. ౪౦. బ్రహ్మర్షీణాం కుశః ప్రోక్త ఇత్యేషా ధ్వజకల్పనా, యస్య యద్వాహనం ప్రోక్తం తత్తస్య ధ్వజ ఉచ్యతే. ౪౧. విష్ణోర్ధ్వజే తు సౌవర్ణం దండం కుర్యాద్విచ

పీతపతాకమును గరుడునకు సమీపమున నుంచవలయును. ఈశ్వరధ్వజమునకు రజతదండమును, శుక్లవర్ణపతాకమును వృషభమునకు సమీపముగా నుంచవలయును. బ్రహ్మదేవుని ధ్వజమునకు తామ్రదండమును, పద్మవర్ణపతాకమును, పద్మమునకు సమీపముగా నుంచవలయును. సూర్యధ్వజమునకు సువర్ణదండమును, పంచవర్ణపతాకమును ధర్మమున కధోభాగమున నుంచవలయును. మఱియు నాధ్వజమును బుద్బుదసమానములగు చిఱుగంటలచేతను పుష్పమాలలచేతను నలంకరింపవలయును. ఇంద్రధ్వజమునకుఁ గాంచనదండమును, బహువర్ణపతాకమును గుంజరసమీపముగా నుంచవలయును. యమునకు నినుముతోఁ జేయఁబడిన దండమును, కృష్ణవర్ణపతాకను మహిషమునకు సమీపముగా నుంచవలయును. జలాధిపునిధ్వజమునకు రజతదండమును, శ్వేతము విచిత్రము నగుపతాకమును జెప్పఁబడెను. కుబేరధ్వజమునకు మణిమయదండమును, రక్తవర్ణపతాకమును నరపాదమునకు సమీపముగా నుంచవలయును బలదేవధ్వజమునకు రజతదండమును, శుక్లవర్ణపతాకమును తాలమున కధోభాగమున నుంచవలయును. కామధ్వజమందు మూఁడులోహములను మకరపతాకము నుంచవలయును. రోహిణిపతాకము మకరసమీపముగా నుంచవలయును.

---

తుణః, పతాకా చాపి పీతాస్యాద్గరుడస్య సమీపగా. ౪౨. ఈశ్వరస్య ధ్వజే దండో రాజతో యదునందన, పతాకా చాపి శుక్లా స్యాద్వృషభస్య సమీపగా. ౪౩. పితామహధ్వజే దండః స్మృతస్తామ్రమయో బుధైః, పద్మవర్ణా పతాకా స్యాత్పంకజస్య సమీపగా. ౪౪. ఆదిత్యస్య చ సౌవర్ణో ధ్వజే దండః ప్రకీర్తితః, పంచవర్ణా పతాకా స్యాద్ధర్మస్యాధోగతా నృప. ౪౫. కింకిణీజాల సంపన్నా నానాబుద్బుదసన్నిభా, పుష్పమాలోపసంపన్నా నానావాదిభిరావృతా. ౪౬. దండ ఇంద్రధ్వజస్యోక్తః కాంచనో యదునందన, పతాకా బహువర్ణా స్యాత్కుంజరస్య సమీపగా. ౪౭. ఆయసశ్చాపి దండోక్తో యమచిహ్నం విచక్షణైః, పతాకా వర్ణతః కృష్ణా మహిషస్య సమీపగా. ౪౮. జలాధిపధ్వజో దండో రాజతః పరికీర్తితః, పతాకా సర్వతః శ్వేతా విచిత్రా సాచకథ్యతే. ౪౯. ధ్వజే చాపి కుబేరస్య దండో మణిమయః స్మృతః, పతాకాచాపి రక్తాస్యాన్నరపాదసమీపగా. ౫౦. బలదేవధ్వజే దండో రాజతో యదునన్దన, పతాకా వర్ణతః శుక్లా తాలస్యాధోగతా స్మృతా. ౫౧. కామధ్వజే త్రిలోహఃస్యాద్దండో యదుకులోద్వహ, పతాకా,

కార్తికేయునకు మయూరచిహ్నమని లోకమందు ప్రసిద్ధమై యున్నది. బహురత్నవిభూషితంబును ఆరూఢంబును నగు త్రిలోహదండమున్ను బహువర్ణచిత్రితపతాకమును జేయవలయును. గణేశునకు నేనుఁగుదంతముచేఁ జేసినదండమును జేయవలయును. సుప్రతిష్ఠితమగు తామ్రదండమున శ్వేతపతాకమును ప్రమాణయుక్తముగఁ జేయవలెను మాతృదేవతలకుఁ గూడ నానావిధము లగుపతాకాధ్వజములతో విశుద్ధముగాఁ బ్రతిష్ఠచేయవలయును. మఱియుఁ బ్రమాణయుక్తముగ శుక్లవర్ణపతాకముం జేయవలయును ఇట్లనేకవిధములగు పతాకలఁ జేయవచ్చును. రేవతునకు హయధ్వజమును రక్తవర్ణపతాకమును దుర్గాదేవికి శిరోమాలాకులధ్వజము నీలవర్ణపతాకలోహమయమగుదండమున్ను మాతృదేవతలకు రేవతునకు రీతిమయదండము, గౌరీదేవికి తామ్రధ్వజము గోసన్నిభపతాకము, వరుణునకు స్వర్ణదండము మేషధ్వజము బహురత్నద్యుతిమంతమగు పతాకయు, వాయువునకు పాషాణదండము, కృష్ణవర్ణపతాకము హరిణసమీపస్థితియు, భగవతియగు పార్వతీదేవికి సర్వరత్నమయదండము త్రివర్ణపతాకసింహాధోభాగస్థితియు నుండునట్లుగ

రోహిణీ తత్ర మకరస్య సమీపగా. ౫౨. మాయూరం కార్తికేయస్య చిహ్నం లోకేషు గీయతే, త్రిలోహదండమారూఢం బహురత్నవిభూషితమ్. ౫౩. బహువర్ణకచిత్రా తు పతాకా కథితా బుధైః, హస్తిదంతభవం దండం కుర్యాద్గణపతేర్నృప. ౫౪. తామ్రదండం సమారూఢం సంశుద్ధం సంప్రతిష్ఠితం, శుక్లా పతాకా కర్తవ్యా సుప్రమాణా మహీపతే. ౫౫. మాతౄణాం చాపి కర్తవ్యో నైకరూపో ధ్వజో బుధైః, పతాకాభిరనేకాభిర్బహురత్నాభిరన్వితః. ౫౬. రేవతస్యాపి కర్తవ్యో ధ్వజో వాజీ నరాధిప, రక్తా పతాకా తత్రాపి కర్తవ్యా యదునందన. ౫౭. చాముండామందిరే కార్యః శిరోమాలాకులో ధ్వజః, నీలా పతాకా కర్తవ్యా దండో లోహమయస్తథా. ౫౮. రీతిమయశ్చ మాతౄణాం రేవతస్య చ కారయేత్, గౌర్యా ధ్వజస్తామ్రమయః పతాకా గోపసన్నిభా. ౫౯. స్వర్ణదండస్తు వీరస్య ధ్వజో మేషసమన్వితః, పతాకా బహురత్నాఢ్యా కర్తవ్యా యదునందన. ౬౦. అశ్మసారమయో దండో ధ్వజో వా తస్య ఉచ్యతే, పతాకా కృష్ణవర్ణా తు హరిణస్య సమీపగా. ౬౧. భగవత్యా ధ్వజో దండః సర్వరత్నమయః స్మృతః, పతాకా తు త్రివర్ణా స్యాత్సింహస్యాధోగతా నృప. ౬౨.

నేర్పరుపవలయును. ఈరీతిగ సర్వలక్షణలక్షణ్యమగుధ్వజమును నిర్మించి యధివాసనాదిక్రియలం జరుపవలయును. తరువాత సర్వౌషధులచేతను స్నానముఁ జేయించి కంకణముల మధ్యభాగమునఁ గట్టవలయును. కల శోపశోభితమగు వేదిని నిర్మించి యా వేది నధిష్ఠింపఁజేసి యొకరాత్రి యధి వాసముం జేయవలయును. నానాకుసుమచిత్రంబులగుమాలల నాధ్వజ మునకు వ్రేలాడఁజేసి బాగుగఁ బూజించి ధూప మీయవలయును. పిమ్మట కృశరమపూపకము మొదలగువాటిచే బలికర్మఁజేసి దధిపాయసము మొదలగువాట్లచే లోకపాలకుల నుద్దేశించి బలినీయవలయును. బ్రాహ్మ ణులచే స్వస్తిజెప్పించి పుణ్యాహవాచనఁ జేయవలయును. వాద్యములచే జలముఁ దోడ్కొనివచ్చి యాకలశమునకు నవవస్త్రధారణఁజేసి శుభదిన లగ్నశుభనక్షత్రముల ధ్వజము నారోహణఁ జేయవలయును. శ్వభ్ర రాజం బగుకలశమును ధ్వజమున నుంచి యీప్రకారముగా దేవాలయ ముల పైభాగమున ధ్వజారోపణముఁ జేసినయెడల యాపురుషుఁడు నిత్య మును లక్ష్మీసంపన్నుఁడై యుండును. ఉత్కృష్టగతిఁ గూడ పొందును దేవాలయము నిర్మించి ధ్వజప్రతిష్ఠఁ జేయనియెడల నాదేవాలయమున రాక్షసు లుండవలెనని కోరుచుందురు. కాన ధ్వజహీనముగా దేవాలయ ముంచఁగూడదు. ధ్వజప్రతిష్ఠాభిజ్ఞులీప్రతిష్ఠాపనలకు మంత్రముఁ గూడఁ

---

ఏవంవిధమిమం కృత్వా ధ్వజం లక్షణలక్షితం, అధివాస్య తతో రాజం స్తత ఆరోపయే ద్బుధః. ౬౩. తతః సర్వౌషధీభిశ్చ స్నాపయిత్వా ప్రయత్నతః, సమాలభ్య చ బధ్నీయా న్మధ్యే ప్రతిసరాన్నృప. ౬౪. కల్పయిత్వా శుభాం వేదిం కలశైరుపశోభితాం, తస్యాం వేద్యాం సమారోప్య తాం రాత్రిమధివాసయేత్. ౬౫. నానాకుసుమచిత్రాం చ స్రజం తస్యానులంబయేత్, సమభ్యర్చ్య ప్రయత్నేన ధూపమస్య నివేదయేత్. ౬౬. బలికర్మ తతః కృత్వా కృశరాపూపకాదిభిః, పలాలాపూపికాభిశ్చ దధిపాయససూపకైః. ౬౭. ఉద్దిశ్య లోకపాలేభ్యో బలిం దద్యాచ్చ వాయసైః, బ్రాహ్మణాన్స్వస్తి వాచ్యాథ కృత్వా పుణ్యాహమంగలమ్. ౬౮. వాదిత్రకృతనిర్ఘోషం జలం సంస్కారసంయుతం, నానాబుద్బుదసంపన్నం వేష్టితం నవవాససా. ౬౯. శుభే లగ్నే దినే ఋక్షే ధ్వజం చారోపయేద్బుధః, విన్యస్య స్వర్ణకలశం శ్వభ్రరాజం ధ్వజస్య తు. ౭౦. ఏవమారోప యేద్యస్తు ధ్వజం దేవాలయోపరి, స శ్రియా వర్ధతే నిత్యం ప్రాప్నోతి పరమాం గతిమ్. ౭౧. అసురా వాసమిచ్ఛంతి ధ్వజహీనే సురాలయే, తస్మాద్దేవాలయం ప్రాజ్ఞో ధ్వజ

జెప్పిరి. శ్లో. "ఏహ్యేహి భగవన్దేవ దేవవాహనవై ఖగ, శ్రీకర శ్రీనివాసశ్చ జయ జైత్రోపశోభిత, వ్యోమరూప మహారూప ధర్మాత్మం స్త్వం చ వై గతేః. సాన్నిధ్యం కురు దండేఽస్మిన్ సాక్షీ చ ధ్రువతాం వ్రజ, కురు వృద్ధిం సదా కర్తుః ప్రాసాదస్యార్కవల్లభ. ఓం ఏహ్యేహి భగవన్నీశ్వర వినిర్మిత ఉపరిచరవాయుమార్గానుసారిన్ శ్రీనివాస రిపుధ్వంస యక్షనిలయ సర్వదేవ ప్రియంకురు సాన్నిధ్యం శాన్తిం స్వస్త్యయనం మే భయం సర్వవిఘ్నా వ్యపసరంతు." అనునీమంత్రంబుచే గోతియందు ధ్వజ దండముం బ్రవేశపెట్టవలయును. పూర్వోక్తమంత్రంబుచేఁ బ్రాఙ్ముఖుండై నిల్చి ప్రాసాదశిఖరముపైనుండి యెగురవేయవలయును. తరువాత యజమానుఁడు పతాకముం జూడవలయును. ప్రాసాదపూర్వభాగమునఁ బడవేసినయెడలఁ గర్త యింద్రలోకముం బొందును. ఆగ్నేయమందైన నగ్నిలోకమును దక్షిణమున యమలోకము నైరృతమున నిరృతలోకము పశ్చిమమున వరుణలోకముఁ బొందఁగలఁడు. ఏదేవునకు గృహమును నిర్మించునో కర్త వృషస్థానగతుఁడై యచ్చోటినుండి యాదేవునిసాన్నిధ్యముం జేరఁగలఁడు వాయవ్యదిక్కుగా పతాకముపడినయెడల వాయు

హీనం న కారయేత్. ౭౨. మంత్రశ్చ స్థాపనే ప్రోక్తో విధానజ్ఞైర్ధ్వజస్య తు, ఏహ్యేహి భగవన్దేవ దేవవాహన వై ఖగ. ౭౩. శ్రీకరః శ్రీనివాసశ్చ జయ జైత్రోపశోభిత, వ్యోమరూప మహారూప ధర్మాత్మం స్త్వం చ వై గతేః. ౭౪. సాన్నిధ్యం కురు దండేఽస్మిన్సాక్షీ చ ధ్రువతాం వ్రజ, కురు బుద్ధిం సదా కర్తుః ప్రాసాదస్యార్కవల్లభ. ౭౫. ఓం ఏహ్యేహి భగవన్నీశ్వరవినిర్మిత, ఉపరిచరవాయుమార్గానుసారిన్ శ్రీనివాస రిపుధ్వంస యక్షనిలయ సర్వదేవప్రియం, కురు సాన్నిధ్యం శాంతిం స్వస్త్యయనం చ మే భయం సర్వవిఘ్నా వ్యపసరంతు. ౭౬. మంత్రేణానేన రాజేన్ద్ర శ్వభ్రే దండే నివేశయేత్, పతాకాం పూర్వమంత్రేణ స్థిత్వా పూర్వముఖో నృప. ౭౭. క్షిపేదూర్ధ్వమథాకాశం ప్రాసాదశిఖరాద్విభోః, యజమానస్తతః పశ్యేత్పతాకాం యదునందన. ౭౮. ప్రాసాదపురతో వీర పతాకాం పాతయేద్యది, ఇంద్రలోకం తదా కర్తా విశేద్వై యదునందన. ౭౯. ఆగ్నేయ్యామగ్నిలోకం తు యామ్యాం యమసదో భజేత్, నైరృత్యాం నైరృతం లోకం వారుణ్యాః వారుణం వ్రజేత్. ౮౦. యస్య దేవస్య యద్వేశ్మ కృతం యదుకులోద్వహ, తస్య లోకమవాప్నోతి వృషస్థానగతో యది. ౮౧. వాయవ్యే వాయు

లోకముఁ బొందును. ఉదగ్భాగమందైన ధనదలోకముఁ బొందును. ఈశాన్యభాగమున నీశ్వరలోకముం బొందును. ఎవఁడు సూర్యునకు భక్తితో ధ్వజారోపణముఁ జేయునో వాఁడు లోకోత్తరములగు భోగములనుభవించి పిమ్మట సూర్యలోకముఁ జేరి సుఖించును. తేజమున నగ్ని సమానుఁడుగను, లావణ్యముచేఁ బద్మసదృశుఁడును, కాంతిచేఁ జంద్ర సమానుఁడును, విక్రమమున గోపతిసమానుఁడు నగును.

ఇది అష్టత్రింశదుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకోనచత్వారింశదుత్తరశతతమాధ్యాయము

సాంబుం డిట్లనియె. దేవర్షిసత్తమా! మీయనుగ్రహమువలన నాయొక్క తొల్లింటిరూపమును భాస్కరుని ప్రత్యక్షదర్శనభాగ్యమును పొందఁగల్గితిని. దీనినంతను పొందియు నామనంబు చింతాక్రాంతమైనది. ఈదేవునకుఁ బరిచర్యాపాలన మెవ్వఁడు చేయఁగలఁడో యట్టిపరిపాలన సమర్థుండును గుణయుక్తుండునగు బ్రాహ్మణుని నాకుఁ జెప్ప వేఁడుచుంటిని. అనిన నారదుం డిట్లనియె. సాంబా! విప్రులు దేవద్రవ్యముఁ బరిగ్రహింపరు. ఇచ్చట ధనము ప్రతిగృహీతమైనను గుణమునే గూర్చును. అయి

---

మాప్నోతి సౌమ్యాయాం సోమమాప్నుయాత్, ఐశాన్యామీశమాప్నోతి కర్తా వై దేవవేశ్మనః. ౧౨. య ఏవం కారయేద్భక్త్యా ధ్వజస్యారోపణం రవేః, స హి భుక్త్వా పరాన్భోగాన్సూర్యలోకే మహీయతే. ౧౩. తేజసాంబుజసంకాశః కాంత్యా చాంబుజసన్నిభః, ద్విజాతితుల్యః ప్రభయా విక్రమేణ చ గోపతేః. ౧౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే ధ్వజారోపణవిధివర్ణనం నామ అష్టత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సాంబ ఉవాచః—త్వత్ప్రసాదాన్మయా ప్రాప్తం రూపమేతత్పురాతనం, ప్రత్యక్షదర్శనం చాపి భాస్కరస్య మహాత్మనః. ౧. సర్వమేతత్తు సంప్రాప్య పునశ్చింతాకులం మనః, దేవస్య పరిచర్యాయాః పాలనం కః కరిష్యతి. ౨. గుణయుక్తం ద్విజం కించిత్సమర్థం పరిపాలనే, మమైవానుగ్రహాద్బ్రహ్మన్ద్విజం వ్యాఖ్యాతుమర్హసి. ౩. ఏవముక్తస్తు సాంబేన నారదః ప్రత్యువాచ తం, న ద్విజాః పరిగృహ్ణంతి దేవస్య స్వీకృతం ధనమ్. ౪. విద్యతే హి ధనం హ్యత్ర గుణశ్చాయం ప్రతిగ్రహః, దేవచర్యాగతై

నను దేవపరిచర్యనలన సంపాదించినద్రవ్యముచే జేయఁదగిన వ్యాపారా పశ్యకత బ్రాహ్మణులకు లేదు. ఒకవేళ బ్రాహ్మణులు లోభమోహితులై యట్లు చేసినయెడల వారపాంక్తేయు లగుదురు. దేవలకులు గూడ నగు చున్నారు. దేవబ్రాహ్మణద్రవ్యమును లోభావిష్టుడై జీవనార్థ ముపయో గించినచోఁ బాపాత్ముఁడై లోకమున గృధ్రోచ్ఛిష్టముచే జీవించును. ఆకారణమున బ్రాహ్మణు లెవ్వరును దేవచర్యను చేయరు. విధిజ్ఞుండును జ్ఞానవంతుండును పరిచర్యాసమర్థుండగువానిని సూర్యుఁడే తెలియఁజేయఁ గలఁడు కాన నాతనినే శరణువేఁడుము. లేదా యుగ్రసేన పురోహితుఁ డగు గౌరముఖునియొద్దకుఁ బోయి యడిగిన నాతఁడే నీకోర్కె నెరవేర్పఁ గలఁడనిన విని సాంబుఁడు స్వగృహమునఁ బూర్వాహ్ణకృత్యముల నిర్వ ర్తించి సుఖాసీనుఁడై యున్న ఉగ్రసేనపురోహితుండగు గౌరముఖుని సమీపించి బ్రాహ్మణోత్తమా! సూర్యునిప్రసాదంబుచే విపులంబగు నాలయమును నిర్మించియుంటిని. అది సపత్నీకముగను, ససైన్యముగను, పృథివియందు సారవంతముగా నుండెను. సమస్తమగుద్రవ్యము నా గృహమునుండియే యివ్వఁబడినది. మూర్తిమండలముఁ గూడ నిర్మింపఁ జేసితిని. గాన నీహోమమునుజేసి యవసానమున విశిష్టులగు బ్రాహ్మణు లకు దానములఁ జేయవలయును కాన మీరు నాయందనుగ్రహించు

---

ర్ద్రవైః క్రియా బ్రాహ్మీ న విద్యతే. ౫. అవజ్ఞయా చ కుర్వంతి యే క్రియాం లోభ మోహితాః, అపాంక్తేయా భవంతీహ తే వై దేవలకా ద్విజాః. ౬. దేవస్వం బ్రాహ్మ ణస్వం చ యో లోభాదుపజీవతి, స పాపాత్మా నరో లోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి, తతో న బ్రాహ్మణః కశ్చిద్దేవచర్యాం కరిష్యతి. ౭. విధిజ్ఞం జ్ఞానవంతం చ పరిచర్యా క్షమం తథా, దేవ ఏవ తమాఖ్యాతుం తస్మాత్తం శరణం వ్రజ. ౮. అథ వా యదు శార్దూల ఉగ్రసేనపురోహితమ్, గత్వా గౌరముఖం పృచ్ఛ స తే కామం విధాస్యతి. ౯. నారదేనైవముక్తస్తు సాంబో జాంబవతీసుతః, సుఖాసీనం గృహే వీర ఉగ్రసేన పురోహితమ్. ౧౦. కృతపూర్వాహ్ణికం వీర విప్రం గౌరముఖం నృప, వినయేనోప సంగమ్య సాంబో వాక్యమథాబ్రవీత్. ౧౧. మయా భానోః ప్రసాదేన కారితం విపులం గృహం, సపత్నీకం ససైన్యం చ పృథివ్యాం సారవత్ స్థితమ్. ౧౨. సర్వం తస్మిన్ మయా దత్తం కృతం మూర్తేశ్చ మండలం, తస్మాదిష్ట్వా విశిష్టేభ్యో దేయం దానం మనోగతమ్. ౧౩. తత్సర్వం మమ సంప్రీత్యా గృహాణ త్వం మహామునే, సాంబవాక్య

టకుఁ గౌరముఖుం డిట్లనియె. సాంబా! నేను బ్రాహ్మ ణుండను. నీచే నివ్వఁబడునది దేవద్రవ్యము. అది గ్రహించుట పరస్ప రము విరోధంబగు ద్విజాతులు బ్రహ్మవిద్యాప్రణీతంబు లగుస్వకార్య ములఁ జేయుచు భిన్నవృత్తులై స్వకార్యమును నశింపఁజేయరు. శాంతి, అధ్యాపనము, జాపము, సత్యము, ఇవి బ్రాహ్మణకృత్యములై యున్నవి. దేవద్రవ్యపరిగ్రహము బ్రాహ్మణకర్మ గాదు. దేవార్థదానముం గ్రహిం చినవిప్రులు దేవలకు లగుదురు. దేవద్రవ్యాభిలాషియైన బ్రాహ్మణుఁడు జాతిభ్రష్టుఁడగును. దేవద్వారమున నెవ్వండేని విప్రునకు దానముంజేసి నను గ్రహించినను వార లాత్మదోషముచే బాపులగుదురు. దేవార్థ మును గ్రహించి బ్రాహ్మణుఁడు శ్రాద్ధమునందుఁగాని యజ్ఞమందుఁగాని దానిని వినియోగించిన యెడల భిన్నవృత్తుఁడగు నాబ్రాహ్మణుఁడు రాక్ష సుఁడై జనించును. దేవలకుం డగువిప్రుఁడు పంక్తిలో భుజించిన నాయన్న మును నీచులు స్పృశింపవలయును. ఆపంక్తి పాపయుతమగును. దేవలకుం డగువిప్రుఁ డెవ్వనికై శ్రాద్ధాదిసంస్కార మొనర్చునో వాఁడధోముఖు లగు పితృదేవతల నాక్రమించి వారల నధోలోకంబునఁ బడవేయును. ఎవ్వఁడు తానే పతితుఁడగునో అట్టివాఁ డితరుల నెట్లు తరింపఁజేయఁ

---

మిదం శ్రుత్వా ప్రత్యువాచ మహామునిః. ౧౮. గౌరముఖ ఉవాచ:—బ్రవీమ్యహమశే షేణ యథావదనుపూర్వశః, అహం విప్రో భవాన్రాజా స చ దేవపరిగ్రహః, అపర స్పరమేవం తు గ్రహణం మే విరుధ్యతే. ౧౯. బ్రహ్మవిద్యాప్రణీతాని స్వకర్మాణి ద్విజాతయః, కుర్వాణా న ప్రహీయన్తే అన్యథా భిన్నవృత్తయః. ౧౬. శాంతిరధ్యా పనం జాపః సత్యం చ యదునందన, ఏతాని విప్రకర్మాణి న దేవార్థపరిగ్రహః. ౧౭. యది దేవార్థదానం స్యాత్తతో దేవలకా ద్విజాః, దేవద్రవ్యాభిలాషశ్చ బ్రాహ్మణ్యం తు విముంచతి. ౧౮. దేవద్వారే చ యద్దానం బ్రాహ్మణాయ ప్రయచ్ఛతి, ద్వావేతౌ పాప కర్తారావాత్మదోషేణ మానవౌ. ౧౯. దేవార్థదానం వార్ష్ణేయ యద్గృహీత్వా చ యో ద్విజః, శ్రాద్ధేవా యదివా సత్రే తజ్జుహోతి దదాతి వా, భిన్నవృత్తో ద్విజః పాపో రాక్షసః సోఽభిజాయతే. ౨౦. ద్విజో దేవలకో యత్ర పంక్త్యాం భుంక్తే మహీపతే, అన్యాన్స్పృశన్నీచా సా పంక్తిః పాపమాచరేత్. ౨౧. ద్విజో దేవలకో యస్య సంస్కారం సంప్రయచ్ఛతి, సోఽధోముఖాన్పితౄన్సర్వానాక్రమ్య వినిపాతయేత్. ౨౨. ఆత్మానం పాతయేద్యస్తు సోఽన్యానుద్ధరతే కథం, ఉద్ధరిష్యతి చాత్మానమిత్యేషా

గలఁడు? అట్టివాఁడు తనునుదానే యుద్ధరించుకొనును. అను నీకల్పన మధికతరముగ నాలోచించిన నధమమగును. దేవద్రవ్యపరిగ్రహము నకస్మాత్తుగగాని భయప్రాప్తిచేగాని యాచరించెడువాఁడు బ్రాహ్మణవృత్తిని మాత్రము చేయుచుఁ బతితుఁడగును. సప్రతిగ్రహమంత్రముగ ద్విజుఁడు పరిగ్రహమును భుజించుచున్నాఁడు. దేవప్రతిగ్రహార్థగ్రహణవిషయమున వేదానుమతిలేదు. కాన బ్రాహ్మణులు గ్రహింపఁగూడదు ఇచ్చుటయుఁ దగదు. ఇదిచేసినవాఁడు బ్రహ్మసూత్రచ్ఛేదన మొనర్చి పోవుచుంటినని చెప్పి పోవలయును అనిన సాంబుఁ డిట్లనియె. మహాత్మా! దేవద్రవ్యము విప్రుల కగ్రాహ్యమైనచో దీనిం గ్రహింపదగువా రెవ్వరు? అట్టివారు పూర్వమెచ్చటనైన వినఁబడియుండిరో చూడఁబడియుండిరో దానిం దెలియఁజేయ వేఁడుచున్నాను. అనిన గౌరముఖుం డిట్లనియె. ఈపట్టణంబున మగనాముఁడొకఁడు గలడు. ఆతనికి దేవతాపూజావిధియందును నైవేద్యవిధియందు నధికార మొసఁగఁబడెను కాన నాతని కొసఁగుము. అనిన సాంబుఁ డిట్లనియె. మగుఁడన నెవ్వఁడు? ఎచ్చట నివసించును? యెవ్వని కుమారుఁడు? ఈతనివ్యాపార మెద్ది, ఆకార మెట్టిదియో యీవిషయంబుల నాకుఁ దెల్పవేడెద. అనిన గౌరముఖుఁ డిట్లనియె. నాచేఁ జెప్పఁబడిన మగుండనువాఁడు దివ్యుండగుద్విజోత్తముఁడు ఆదిత్యునకు నిక్షు

---

కల్పనాధమా. ౨౩. యో హఠాచ్చ భయాచ్చైవ కురుతే రవిశేశ్మనః, వృత్తిం విధత్తే విప్రత్వాత్పతితస్స తు జాయతే. ౨౪. సప్రతిగ్రహమంత్రేణ ద్విజోశ్నాతి పరిగ్రహమ్, దేవప్రతిగ్రహార్థేషు వేదవాక్యం న విద్యతే. ౨౫. తస్మాద్రాజా న దేవార్థం విప్రే దద్యాత్కథంచన, బ్రహ్మసూత్రమహం ఛిత్వా గమిష్యామీతి గమ్యతామ్. ౨౬. సాంబఉవాచ—అగ్రాహ్యం చేద్ద్విజాతిభ్యః కస్మై దేయమిదం మయా, శ్రుతం వా దృష్టపూర్వం వా తన్మే వ్యాఖ్యాతుమర్హసి. ౨౭. గౌరముఖ ఉవాచ.—మగాయ సంప్రయచ్ఛ త్వం పురమేతచ్ఛుభం విభో, తస్యాధికారో దేవాన్నే దేవతానాం చ పూజనే. ౨౮. సాంబఉవాచ.—కోయం మగేతి తే ప్రోక్తః క్వ వాసోఽస్య తే విభో, కస్య పుత్రో ద్విజశ్రేష్ఠ కిమాచారః కిమాకృతిః. ౨౯. గౌరముఖ ఉవాచ.—యోఽయం మగేతి వై ప్రోక్తో మగో దివ్యో ద్విజోత్తమః, నిక్షుభాయాః సుతో వీర ఆదిత్యాత్మజ ఉచ్యతే. ౩౦. సాంబఉవాచ—కథం స నిక్షుభాపుత్రః కథం వీరసుతస్తథా, కథం చాదిత్యతనయో మగోఽసావుచ్యతేనఘ. ౩౧. గౌరముఖ ఉవాచ.—మానుష

భయనుస్త్రీయం దుత్పన్నుఁడయ్యె. అనిన విని సాంబుఁడు మగుఁడు నిక్షుభకుఁ బుత్త్రుం డెట్లయ్యె? ఆనిక్షుభ కాత్మజుఁ డెట్లయ్యె? మగుఁ డను నామం బెట్లువచ్చె? ఈవిషయములం జెప్ప వేఁడుచుంటి ననిన గౌరముఖుఁ డిట్లనియె. యదునందనా! దేవియగు నిక్షుభ మానుషత్వముఁబొంది భాస్కరునివలన శాపమువడసి మిహిరగోత్రుఁడగు సుజిహ్వుఁడను ఋషికిఁ గూతురై జనించె ఆనిక్షుభ రూపమున నప్రతిమయై హారలీల యనుపేరుతో వృద్ధిఁబొందె. తరువాత నాకన్య తండ్రియాదేశమున జాతవేదునితో విహరించెను అట్లు విహరించుచుండ నొక్కనాడు దేవదేవుండగు సూర్యుఁడు రూపయౌవనసంపన్నయగు నీమెం గాంచి కామవశంగతుఁడై యెట్లీమెను పొందఁగలనా? యని చింతించి లోకపూజితుఁడగు పావకుఁ డీమెను దవిలియున్నందున నిప్పు డీతనిం జేరి యాతన్వంగిని బొందవలెనని యాలోచించి పావకునిఁ బ్రవేశించి యీమెతో సంగమించెను. అప్పు డామెకుఁబుత్త్రుఁ డుద్భవించె. తరువాత రూపలావణ్యవిలాసవతి యగు నామె సమిద్ధమగువగ్నిని లంఘించి వెడలెను. అప్పుడగ్నిహోత్రుఁడు క్రుద్ధుఁడై నిజరూపముంబొంది కామపీడితుఁడై కన్యను జూచి కరముం గ్రహించి, భాస్కరప్రేరితుఁడై యిట్లనియె వేదోక్తవిధిని బరిత్యజించి

---

త్వం గతా దేవీ నిక్షుభా కిలయాదవ, గతా శాపమవాప్యేహ భాస్కరాల్లోకపూజితా. ౩౨. గోత్రం మిహిరమిత్యాహు స్తస్మై బ్రాహ్మణ్యముత్తమమ్, సుజిహ్వో నామ ధర్మాత్మా ఋషిపుత్త్రః పురానఘ. ౩౩. తస్యాత్మజా సముత్పన్నా నిక్షుభా సా వరాంగనా, రూపేణాప్రతిమా లోకే హారలీలా మతా తు సా. ౩౪. పితుర్నియోగాత్సా కన్యా విహరేజ్జాతవేదసి. ౩౫. విహరంతీ యథాన్యాయం సమిద్ధే పావకే తథా, అథ తాం దేవదేవేశో హ్యంశుమాలీ దదర్శ హ. ౩౬. రూపయౌవనసంపన్నాం తతః కామవశం గతః, చింతయామాస దేవేశః కథం తాం వై భజామ్యహమ్. ౩౭. అనయావహ్నితో యోఽయం పావకో దేవపూజితః, వనమావిశ్య తన్వంగీం భజేయం లోకపూజితామ్. ౩౮. ఇతి సంచిన్త్య దేవేశః సహస్రాంశుర్దివస్పతిః, వివేశ పావకం వీర తత్పుత్రశ్చాభవత్తదా. ౩౯. తతో విలాసలావణ్యరూపయౌవనశాలినీ, సమిద్ధం లంఘయిత్వాగ్నిం జగామాయతలోచనా. ౪౦. క్రుద్ధః స్వరూపమాస్థాయ దృష్ట్వా కన్యాం స పీడితః, కరం కరేణ సంగృహ్య తతస్తాం హవ్యవాహనః. ౪౧. ఉవాచ యదుశార్దూల నోదితో భాస్కరేణ తు, వేదోక్తం విధిముత్సృజ్య యథాహం లంఘితస్త్వయా. ౪౨. తస్మా

నీవు నన్ను లంఘించితివిగాన నానుండి నీకు జన్మించెడుపుత్త్రుం డపూజ్యుం డగును, అగ్నిజాతిచే మగులనియు, సోమజాతిచే ద్విజాతులనియు, భోజకాదిత్యజాతిచే దివ్యులనియుఁ బరిగణింపఁబడుదురు. ఇట్లామెతోఁ జెప్పినవెన్క రవి యంతర్ధానముం జెందెను. తరువాత సుజిహ్వుఁడు ధ్యానయోగముచే నీవిషయమునంతయుఁ దెలిసికొని కుపితుఁడై ఆత్మాపరాధంబువలన నీగర్భ మనలావృతంబయ్యెఁ గాన నీకుఁ బుట్టినవాఁ డపూజ్యుఁడు కాఁగలఁడు, అనినఁ బుత్త్రశోకాభిసంతప్తురాలగు నాబాల వ్యాకులదృష్టితో దుఃఖార్తురాలై జ్వలనాకృతిధారియగు నాయగ్నిదేవునిఁ గూర్చి చింతించెను. దేవశ్రేష్ఠుఁడవగు నీకు నాయందు జనించెడు పుత్త్రున కిట్టిశాపము సంభవించెను. నాపుత్త్రునిఁ బూజ్యునిగాఁ జేయుము అని యిట్లు ప్రార్థించెను. ఇట్లు ప్రార్థ్యమానుడయి భగవంతుఁడగు సూర్యుఁడు మఱల నాగ్నేయరూపముం దాల్చి శాంతుఁడై గంభీరస్వరముతో నీరీతిఁ బల్కెను. మహాశాపమును మఱియొకవిధముగాఁ జేయుట కిచ్చగింపను. అయినను కార్యభారంబుకతన నించుక యుపకరింపఁ జేతును. నీకుమారుఁ డపూజ్యుఁడయినను వేదపారగుఁడై యుండును. భూలోకమున

స్తత్ర సముత్పన్నో న చ పుత్రో భవిష్యతి, జరశబ్ద ఇతిఖ్యాతో వంశకీర్తివివర్ధనః. ౪౩. అగ్నిజాత్యా మగాః ప్రోక్తాః సోమజాత్యా ద్విజాతయః, భోజకాదిత్యజాత్యా హి దివ్యాస్తే పరికీర్తితాః. ౪౪. తామేవముక్త్వా భగవానాదిత్యోఽన్తరత స్తదా, అథోత్పన్నాం ప్రజాం జ్ఞాత్వా ధ్యానయోగేన వై ఋషిః. ౪౫. పతితః స్యాన్మహాతేజా ఋజిహ్వః సుమహామతిః, శాపముద్యమ్య తేజస్వీ ఋజిహ్వో వాక్యమబ్రవీత్. ౪౬. ఆత్మాపరాధాత్కామిన్యా యథా గర్భోఽనలావృతః, సంభూతస్తే మహాభాగే అపూజ్యోఽయం భవిష్యతి. ౪౭. పుత్రశోకాభిసంతప్తా బాలా పర్యాకులేక్షణా, చింతయామాస దుఃఖార్తా తమేకం జ్వలనాకృతిమ్. ౪౮. తతో దేవవరిష్ఠస్య మమ యోనిసముద్భవః, అయం దత్తో మహాశాపః పూజ్యతాం కర్తుమర్హసి. ౪౯. భవేత్పూజ్యో హి మే పుత్రో దేవేశ్వర తథా కురు, ఏవం చింతయమానస్తు భగవానర్యమా కిల. ౫౦. ఆగ్నేయం రూపమాశ్రిత్య చేదం వచనమబ్రవీత్, స్నిగ్ధో గంభీరనిర్ఘోషః శాంతో జ్వరవివర్జితః. ౫౧. ఋజిహ్వః సుమహాతేజా ధర్మం చరతి సువ్రత, తేనోత్సృష్టం మహాశాపం నాన్యథా కర్తుముత్సహే. ౫౨. కింతు కార్యగరీయస్త్వాదాత్మనో యోగ్యముత్తమమ్, తవ పుత్రం విధాస్యామి చాపూజ్యం వేదపారగమ్. ౫౩. వంశశ్చ సుమహాంస్తస్య

వానివంశము గొప్పదియై ప్రకాశించును. వసిష్ఠాదిమహర్షులు నన్నుఁ బాడుచు నావ్రతముల నాచరించుచు మనలనిద్దఱ న్యాయానుసారముగాఁ బూజించుచుందురు. అట్లు పూజించి విగతరజోగుణులై నన్ను జేరఁగలరు. నాభక్తులు జటాధారులై నాయం దాసక్తిగలిగి పంచకాలవిధానజ్ఞులై సకాలయాగశీలురై దక్షిణహస్తమునఁ గవచముల ధరించి వస్త్రముచే ముఖముం గప్పికొని మౌనముతో భుజింపవలయును. ఎవరు నియమాదులులేక వ్యాకులేంద్రియులై విధిమంత్రహీనముగా నన్నుఁ బూజించెదరో వారు స్వర్గభ్రష్టులైనను సూర్యలోకముం బొందగలరు. గాన నీకుమారుఁడు పూజ్యుఁడైనను నీరీతి ఫలమునుఁ బొందును. మగవంశమునఁ బుణ్యాత్ములును, మహాత్ములును, వేదవేదాంగపారగులును నగువారు జన్మింపఁగలరు. అని యీరీతిగా దేవి నూరడించి భాస్కరుఁ డంతర్హితుఁడయ్యెను. ఆమెయును సంతసించెను. కాన నోసాంబా! భోజకు లీరీతి నుత్పన్నులైరి వారు విష్ణుకాంతిగలవారై యాదిత్యునివలన నుత్పన్నులైరిగాన లోకపూజితులగు నీభోజకులకు నీపురమునందుండు నాలయమునఁ బూజాద్యధికారముల నొసంగుము. నీప్రతిగ్రహమునకు

---

నివసిష్యతి భూతలే, మహాంగాని మహాత్మానో వాసిష్ఠా బ్రహ్మవాదినః. ౫౪. మద్గాయనా మద్యజనా మద్భక్తా మత్పరాయణాః, మమ శుశ్రూషకాశ్చైవ మమ చ వ్రతచారిణః. ౫౫. త్వాం చ మాం చ యథాన్యాయం వేదతత్త్వార్థదర్శినః, పూజయిష్యంతి నిరతాః సదా మద్భావభావితాః. ౫౬. మత్కర్మణాం మదంగానాం మద్భావవినివేశనాత్, విరజా మత్ప్రసాదేన మామేవైష్యంత్యసంశయమ్. ౫౭. జటాశ్మశ్రుధరా నిత్యం సదా మయి పరాయణాః, పంచకాలవిధానజ్ఞా వీరకాలస్య యజ్వినః. ౫౮. పూర్తికదక్షిణే పాణౌ వర్మ వామేన ధారయన్, పరిదానేన వదనం ప్రచ్ఛాద్య నియతః శుచిః. ౫౯. ప్రాణం హి మహతాం కృత్వా తతో భుంజీత వాగ్యతః, అయమిచ్ఛాప్రసాదాచ్చ వ్యాకులేన్ద్రియచేతసా. ౬౦. విధిహీనం మన్త్రహీనం యేవై యక్ష్యంతి మామతః. తేపి స్వర్గాచ్చ్యుతాః క్లాంతా రమంతే సూర్యసన్నిధౌ. ౬౧. ఏవంవిధాస్తవ సుతా భవిష్యంతి మహీతలే, మగవంశే మహాత్మానో వేదవేదాంగపారగాః. ౬౨. ఏవమాశ్వాస్య తాం దేవీం భాస్కరో వారితస్కరః, అంతర్దధే మహాతేజాః సా చ హర్షమవాప హ. ౬౩. ఏవమేతే సముత్పన్నా భోజకాః కృష్ణనందన, విష్ణుభాస్తే తథాదిత్యా ఉత్పన్నా లోకపూజితాః. ౬౪. తేషామేతత్పురం దేహి పర్యాప్తాస్తే ప్రతిగ్రహే,

వారే తగియుందురు. నీసంబంధమగు భాస్కరపూజయందు వారే యర్హులగుదురు. అని యిట్లు గౌరముఖుని వాక్యములను విని జాంబవతీ పుత్త్రుండగు సాంబుఁడు నమస్కరించి మహాత్ములగు భోజకు లెచ్చట నుందురో వారల నేమార్గంబునఁ దీసికొనిరాఁగల్గుదునో యిది నా కానతీయుఁ డనిన గౌరముఖుం డిట్లనియె. సాంబా! యామగు లెచ్చటనుందురో నేనెఱుంగనుగాన సూర్యుని శరణమును వేడి యాతనివలననే తెలిసికొనుమనిన సాంబుఁడు సూర్యుని నమస్కరించి యెవఁడు నీపూజనుఁ జేయఁగలఁడని విజ్ఞాపనఁజేయగా నాసూర్యప్రతిమ యిట్లనియె సాంబా! జంబూద్వీపనివాసులు నాకుఁ బూజార్హులుగారు. నాపూజకర్హులగువారలను శాకద్వీపమునుండి తీసికొనిరావలయును లవణసముద్రము దాటిన తరువాత క్షీరసముద్రావృతంబై జంబూద్వీపమునకు పైనుండునది శాకద్వీపమని చెప్పఁబడును. ఆశాకద్వీపమునఁ బుణ్యములును చతుర్వర్ణసమన్వితములును నగుజనపదములు గలవు. ఆజనపదంబులయందు మగులు, మగగులు, గానగులు, మందగులను నాల్గుజాతులవారుందురు. మగు లనఁగా బ్రాహ్మణభూయిష్ఠులు, మగగు లనఁగా క్షత్త్రియులు, గానగు లనఁగా వైశ్యులు, మందగు లనఁగా శూద్రులనియుఁ జెప్పఁబడుదురు. ధర్మాశ్రయకృతంబగు సాంకర్యము వారల కుండదు. ఈధర్మవిచార

---

త్వదీయస్యాస్య మే వీర తథా భాస్కరపూజనే. ౧౫. తస్య గౌరముఖస్యేదం వాక్యం శ్రుత్వా స యాదవః, సాంబో జాంబవతీపుత్త్రః ప్రణమ్య శిరసోక్తవాన్. ౧౬. క్వ వసంతే మహాత్మాన ఏతే భాస్కరపుత్త్రకాః, భోజకా ద్విజశార్దూల యేన తానానయామ్యహమ్. ౧౭. గౌరముఖఉవాచ.—నాహం జానే మహాబాహో వసంతే యత్ర వై మగాః, జానీతే తాన్రవిర్వీర తస్మాత్తం శరణం వ్రజ. ౧౮. బ్రాహ్మణేనైవముక్తస్తు ప్రణమ్య శిరసా రవిమ్, జగాద భాస్కరం సాంబః కస్తే పూజాం కరిష్యతి. ౧౯. విజ్ఞప్తస్త్వేవ సాంబేన ప్రతిమా తమువాచ హ, న యోగ్యాః పరిచర్యాయాం జంబూద్వీపే మమానఘ. ౨౦. మమ పూజాకరం గత్వా శాకద్వీపాదిహానయ, లవణోదాత్పరే పారే క్షీరోదేన సమావృతః. ౨౧. జంబూద్వీపాత్పరో యస్మాచ్ఛాకద్వీప ఇతిస్మృతః, తత్ర పుణ్యా జనపదా శ్చతుర్వర్ణసమన్వితాః. ౨౨. మగాశ్చ మగగాశ్చైవ గానగా మందగాస్తథా, మగా బ్రాహ్మణభూయిష్ఠా మగగాః క్షత్త్రియాః స్మృతాః. ౨౩. వైశ్యాస్తు గానగా జ్ఞేయాః శూద్రాస్తేషాం తు మందగాః, న తేషాం సంకరః కశ్చిద్ధర్మాశ్రయకృతే

మొక్కరినుండియే జరుగును. నా తేజస్సువలన విశ్వకర్మచే వారు నిర్మింపఁ బడిరి. నాల్గువేదములను సరహస్యముగా నేను వారల కుపదేశించితిని. వేదోక్తంబులగు వివిధస్తోత్రంబులచే వారు నన్నే నిత్యమును ధ్యానించుచుఁ బూజించుచుందురు. మఱియు వారు మన్మనస్కులును, మద్యాజులును, మద్భక్తులును, మత్పరాయణులును, మద్వ్రతచారులు, మత్సేవకులు నై యుందురు. విధిదృష్టంబగు కర్మచే వికలాంగులుగాక నాపూజను భద్రముగాఁ జేయుచుందురు. మఱియు దేవగంధర్వసిద్ధచారణులు దృశ్యమానులై వారలతో విహరించుచుందురు నన్ను జంబూద్వీపంబున వేదవేదాంగంబులచే విష్ణునిగను, శాల్మలీద్వీపమున శక్రునిగను, క్రౌంచద్వీపంబున భగునిగను, ప్లక్షద్వీపంబున భానునిగను, శాకద్వీపంబున దివాకరునిగను, పుష్కరద్వీపంబున బ్రహ్మగను, మహేశ్వరునిగను పూజించుచుందురు. కాన నామగులను విచారింపక గరుడు నధిరోహించి శాకద్వీపంబునకుం జని తీసికొనిరమ్మనిన సాంబుఁడట్లే యని యామాజ్ఞను గ్రహించి మరల ద్వారవతీపురంబునకుం జని యతిశయితంబగు కాంతిగలిగియుండుటకుఁ గారణమైన సూర్యదేవతాప్రత్యక్షము మొదలగుకథ నంతనుఁ జెప్పి తండ్రియాజ్ఞచే గరుడు నధిరోహించి శాక

---

క్వచిత్. ౭౪. ధర్మస్యాస్య విచారో వా హ్యేకతః సుఖినః ప్రజాః, తేజసస్తే మదీయస్య నిర్మితా విశ్వకర్మణా. ౭౫. తేభ్యో వేదాస్తు చత్వారః సరహస్యా మయోదితాః, వేదోక్తైర్వివిధైః స్తోత్రైః పఠైర్గుహ్యైర్మయా కృతైః. ౭౬. తే చ ధ్యాయన్తి మామేవ యజంతే మాం చ నిత్యశః, మన్మానసా మద్యజనా మద్భక్తా మత్పరాయణాః. ౭౭. మమ శుశ్రూషకాశ్చైవ మమ చ వ్రతచారిణః, అవ్యంగధారిణశ్చైవ విధిదృష్టేన కర్మణా. ౭౮. కుర్వంతి తే సదా భద్రాం మమ పూజాం మమానుగాః, తథా దేవాః సగంధర్వాః సిద్ధాశ్చ సహచారణైః, విహరంతే రమంతే చ దృశ్యమానాశ్చ తైః సహ. ౭౯. జంబూద్వీపే త్వహం విష్ణుర్వేదవేదాంగపూజితః, శక్రోహం శాల్మలీద్వీపే క్రౌంచద్వీపే హ్యహం భగః. ౮౦. ప్లక్షద్వీపే త్వహం భానుః శాకద్వీపే దివాకరః, పుష్కరే చ స్మృతో బ్రహ్మా తతశ్చాహం మహేశ్వరః. ౮౧. తాన్మగాన్మమ పూజార్థం శాకద్వీపాదిహానయ, ఆరుహ్య గరుడం సాంబం శీఘ్రం గత్వా విచారయన్. ౮౨. తథేతి గృహ్య తామాజ్ఞాం రవేర్జాంబవతీసుతః, పునర్ద్వారవతీం గత్వా కాన్త్యాతీవ సమన్వితః. ౮౩. ఆఖ్యాతవాన్పితుః సర్వం స్వకీయం దేవదర్శనం, తస్మాచ్చ గరుడం

ద్వీపంబునకుఁబోయి సంతుష్టుఁడై యథోద్దిష్టతేజస్వులగు మగులం జూచెను. ఆసమయమున వారు శుభంబులగు ధూపదీపాదులచే వివస్వంతునిఁ బూజించుచుండిరి. అట్టి మగులనుఁ బ్రదక్షిణముఁజేసి నమస్కరించి ప్రశంసాపూర్వకముగాఁ గుశలమడిగి మీరు పుణ్యకర్మచారులు, ద్రష్టవ్యార్థంబునశుభార్థులు, అర్కపూజానిరతులు. సూర్యునుండి లబ్ధవరులు నైయున్నారు. నేను విష్ణునికుమారుఁడను. సాంబుఁడని పిలచుచుందురు. చంద్రభాగానదీతీరమున సూర్యదేవాలయమును బ్రతిష్ఠించితిని. ఆకారణముచే సూర్యుఁడు నన్నిచ్చటకుఁ బంపెను. కాన పోవుదము రండనిన సాంబా! నీవు జెప్పినది సరియే యగును. సంశయములేదు. ఇంతకుఁ బూర్వమే దేవుండగు సూర్యుఁడు నాకీవిషయముఁ జెప్పెను వేదవాదులగు మగులకులములు పదునెనిమిదిగలవనిన సాంబుఁడు వారలనందఱను గరుడునిపై నధిరోహింపఁజేసి స్వల్పకాలములో నందఱును మిత్రవనముం జేరిరి. సాంబుఁడును సూర్యునియాజ్ఞలను నెఱవేర్చి దీనినంతను నివేదించెను. సూర్యుఁడును బ్రసన్నుఁడై శుభబంగుగాక యని యాశీర్వదించి సాంబా! వీరు పూజావిధిని నెఱవేర్తురు. ప్రజలకు శాంతిని

---

లబ్ధ్వా యయా సాంబోధిరుహ్యా తమ్. ౮౪. శాకద్వీపమనుప్రాప్య సంప్రహృష్టతనూరుహః, తత్రాపశ్యద్యథోద్దిష్టాన్సాంబస్తేజస్వినో మగాన్. ౮౫. వివస్వంతం పూజయంతో ధూపదీపాదిభిః శుభైః, సోఽభివాద్య చ తాన్పూర్వం కృత్వా హ్యేషాం ప్రదక్షిణామ్. ౮౬. పృష్ట్వా చానామయం తేషాం ప్రశంసాసామపూర్వకం, యూయం హి పుణ్యకర్మాణో ద్రష్టవ్యార్థే శుభార్థినః, రతా యేఽర్కస్య పూజాయాం యేషాంచైవ వరప్రదః. ౮౭. తనయం విత్త మాం విష్ణోః సాంబం నామ్నా చ విశ్రుతం, చన్ద్రభాగా తటే చాపి మయా సూర్యో నివేశితః. ౮౮. తేనాహం ప్రేషితశ్చాత్ర ఉత్తిష్ఠధ్వం వ్రజామహే, తే తమూచుస్తతః సాంబమేవమేతన్న సంశయః. ౮౯. అస్మాకమపిదేవేన వ్యాఖ్యాతం పూర్వమేవహి, అష్టాదశ కులానీహ మగానాం వేదవాదినాం, యాస్యంతి యే త్వయా సార్థం యథా దేవేన భాషితమ్. ౯౦. తతస్తాని దశాష్టౌ చ కులానీహ సమం తతః, ఆరోప్య గరుడే సాంబస్త్వరితః పునరభ్యగాత్. ౯౧. సోఽల్పేనైవ తుకాలేన ప్రాప్తో మిత్రవనం తతః, కృత్వాజ్ఞాం తు రవేః సాంబః కృత్స్నం త్వేవం న్యవేదయత్. ౯౨. రవిః శోభనమిత్యుక్త్వా ప్రసన్నః సాంబమబ్రవీత్, మమ పూజాకరా

గలుగఁజేయుదురు. విధ్యుక్తంబుగా నాపూజనుఁ జేయగలరు. ఆవిషయమై మరల జింతింపఁబనిలేదు.

ఇది ఏకోనచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుఁ డిట్లనియె. రాజా! యీప్రకారముగా సాంబుఁడు మగులం దెచ్చి చంద్రభాగానదీతీరమున సూర్యదేవాలయమునకు సమీపమున నొకపురమును నిర్మించి యాపురమును ధనసమృద్ధంబుగాఁజేసి యాపట్టణమును భోజకులకు సమర్పించెను ఆపట్టణము సూర్యునిసంబంధము గలదగుటచేఁ బుణ్యప్రదమని మూఁడులోకంబులయందునుఁ బ్రసిద్ధినొందెను. మఱియు నీపట్టణము సాంబనిర్మితం బగుటంజేసి సాంబపురమనియుఁ బేరు గల్గెను. ఆసాంబపురంబునకు మధ్యభాగంబున సూర్యుఁడు స్థాపింపఁబడి యుండెను ఆమగులలో సదాచారసంపన్నుండగు నొకమగునిచే దేవశుశ్రూషనుగానమునుఁ జేయించి కృతకృత్యుండై వరమునుబొంది ఆదిదేవుండగుసూర్యుని నమస్కరించి తరువాత మగులను నమస్కరించి నిర్మలుఁడై సాంబుఁడు ద్వారకానగరంబునకుం జనియె. మగులనిమిత్తమై భోజవంశ

---

ష్యేతే ప్రజానాం శాంతికారకాః. ౯౩. మమ పూజాం కరిష్యన్తి విధానోక్తాం యదూత్తమ, తత్కృతే న పునశ్చిన్తా తవ కాచిద్భవిష్యతి. ౯౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే భోజకానయనం నామ
ఏకోనచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచః— ఏవం స ఆనయిత్వా తు మగాన్సాంబో మహీపతే, స మహాత్మా పురా సాంబశ్చన్ద్రభాగా సరిత్తటే. ౧. పురం నివేశయామాస స్థాపయిత్వా దివాకరమ్, కృత్వా ధనసమృద్ధం తు భోజకానాం సమార్పయత్. ౨. తత్పురం సవితుః పుణ్యం త్రిషు లోకేషు విశ్రుతమ్, సాంబేన కారితం యస్మాత్తస్మాత్సాంబపురం స్మృతమ్. ౩. తస్మిన్ప్రతిష్ఠితో దేవః పురమధ్యే దివాకరః, సత్కృత్య స్థాపితాః సర్వే ఆత్మనామాంకితే పురే. ౪. మగానాంతు సదాచారో దృష్టాచారకులోచితః, దేవశుశ్రూషణం గీతం వేదప్రోక్తేన కర్మణా. ౫. కృతకృత్యస్తదా సాంబో వరం లబ్ధ్వా పునర్యువా, ఆదిదేవం సురజ్యేష్ఠ మాదిత్యం ప్రణిపత్య సః. ౬. అనంతరం మగాన్సర్వాన్ప్రణిపత్యాభివాద్య చ, ప్రస్థితో నిర్మలః సాంబః పురీం ద్వారవతీం తదా. ౭. మగానాం కారణా

జాలు వసుదేవగోత్రోద్భవుండగు సాంబునిచేఁ బ్రార్థితులై మగులకు కన్యా దానములఁ జేసిరి. ఆకన్యలందఱును గలసి ప్రవాళమణిభూషితలై వారల నందఱ నర్చించి సూర్యదేవాలయంబునకుఁ బోయిరి. మరల సాంబుఁ డచ్చటకు వెళ్లి దివాకరునితో దేవా! యీమగులకు సాంగములగు వేదములను జ్ఞానవిద్యను జెప్పఁగోరెద నని చెప్పిన సూర్యుఁడు సాంబా! నీవు నారదునికడ కేగి యాతని నడుగుము. ఆతఁడే నీకు సమస్తముఁ జెప్పఁగలఁడని చెప్పెను. తరువాత సాంబుఁడు నారదునియొద్ద కేగి యావృత్తాంతమును నారదున కెఱింగించెను. అంత నారదుఁడు సాంబునిఁ జూచి నేను జ్ఞానమెఱుంగను. భోజకులలో వ్యాసమహర్షి జ్ఞానవంతుఁడు. కాన నచ్చటకుఁ బోయి యడుగుము. అతండును కృష్ణుని యనురోధంబున సమస్తముఁ జెప్పఁగలఁడనిన నట్లు జేసి వ్యాసమునికి నమస్కరించి కృతాంజలియై దేవా! శాకద్వీపంబునకుం బోయి మగపుంగవులఁ దోడితెచ్చితిని. వారు బాలురును, యౌవనసంపన్నులును, కార్యనిష్ణాతులు నై యుండిరి. వారలకు సత్కరించి యొక పురమును నిర్మించి యిచ్చితిని. వారాపురమును స్వీకరించి భోజవంశసంభూతలగు కన్యా

---

ష్ఠేన ప్రార్థితా భోజవంశజాః, వసుదేవస్య పౌత్రేణ గోత్రజేన మహాత్మనా. ౮. కన్యాదానం కృతం తేషాం మగానాం భోజకోత్తమైః, సర్వాస్తాః సహితాః కన్యాః ప్రవాలమణిభూషితాః. ౯. అర్చయిత్వా తు తాః సర్వాః ప్రేషితాః సవితుర్గృహమ్. పునర్గత్వా తు సాంబేన పృష్టో దేవో దివాకరః. ౧౦. మగానాం జ్ఞానమాఖ్యాహి వేదానవ్యంగమేవ చ, సాంబస్య వచనం శ్రుత్వా భాస్కరో వాక్యమబ్రవీత్. ౧౧. పృచ్ఛ త్వం నారదం గత్వా స తే సర్వం వదిష్యతి, ఏవముక్తోఽథ వై సాంబో గతవాన్నారదం ప్రతి. ౧౨. గత్వా కృత్స్నమిదం సర్వం తస్మై తేన నివేదితమ్, స చాప్యాహ తతః సాంబం న జానే జ్ఞానముత్తమమ్. ౧౩. భోజకానాం యదుశ్రేష్ఠ జ్ఞానం వ్యాసో మహామునిః, తం గత్వా పరిపృచ్ఛ త్వం ప్రణమ్య శిరసా మునిమ్. ౧౪. కృష్ణానురోధాత్తే సర్వం స వక్ష్యతి న సంశయః, నారదేనైవముక్తస్తు సాంబో జాంబవతీసుతః. ౧౫. వ్యాసాశ్రమం స గత్వా తు ప్రణమ్య శిరసా మునిమ్, కృతాంజలిపుటో భూత్వా ఇదం వచనమబ్రవీత్. ౧౬. శాకద్వీపం మయా గత్వా ఆనీతా మగపుంగవాః, బాలా యౌవనసంపన్నాః సంనివిష్టా మగోత్తమాః. ౧౭. సత్కృత్య పూజయిత్వా తు పురం తేషాం సమర్పితమ్, సంప్రాప్య తు పురం తే వై జ్యేష్ఠమధ్యకనీయసః. ౧౮. భోజవంశ

రత్నములఁ బరిణయంబాడిరి. వారు శ్లాఘనీయులును భాగ్యవంతులు నై యుండిరి. ఎవరు సూర్యదేవతారాధనమునం దాసక్తులై తత్ప్రసాదముఁ బొందుదురో వారిహాపరలోకములయందు సర్వసమృద్ధినిఁ బొందఁగలరు. దేవ! మగవంశీయులు పూజాకరులెట్లైరి? మగులనఁగా నెవ్వరు? భోజకులనఁగా నెవ్వరు? వారలకు పరమజ్ఞాన మెయ్యది? జ్ఞేయవస్తు వెయ్యది? వారలకు దివ్యులనునామ మెట్లుగల్గె? వారలు కూర్చలం ధరియించు టెందులకు? ఎందుచే వాచకులని పిలువంబడుచుండిరి? ఎందులకై తేజసంపన్నులై వేదముల నధ్యయనముఁ జేయుచుండిరి?అహికంచు కాంగ మెంత ప్రమాణము? అది యెవనిదై యుండును? ఏది యెవనికిఁ జెప్పఁబడెను? వారలు దేవతల నెట్లు గానముచేయుచుండిరి? యజ్ఞముల నెట్లు చేయుచుండిరి? వారల కగ్నిహోత్ర మెయ్యది? పంచదోల లెవ్వి? ఈ మొదలగుభోజకవ్యాపారముల నన్నింటినిఁ జెప్పుమను నీసాంబునివచనములను విని కాలీసుతుండును, మహాతేజస్సంపన్నుం డగుకృష్ణద్వైపాయనుం డిట్లనియె. యదూత్తమా! మంచిప్రశ్నము నడిగితివి. ఈభోజకవ్యాపారములు కొంచెము దుర్జ్ఞేయంబులగుట నిశ్చయము. నేనును భాస్కరానుగ్రహంబునఁ దెలిసి

---

సముత్పన్నాః కన్యకాః సమలంకృతాః, వరయిత్వా కృతం తేషాం విప్ర ప్రణాశనం శుభమ్. ౧౯. అహో సభాగ్యాః శ్లాఘ్యాశ్చ కృతపుణ్యాశ్చ తే సదా, పూజాయాం యే రతా భానోర్యేషాం చైవ వరప్రదః. ౨౦. పర్యాప్తం సర్వమేతేషామిహ చాముష్మికం ఫలమ్, అనిత్యే సతి మానుష్యే దేవపూజారతా హి యే. ౨౧. కిం తు చిన్తయతః సూర్యం చింతయిత్వా తు భోజకాన్, జ్ఞానం ప్రతి తథా చైషాం హృదయే సంశయో మమ. ౨౨. కథం పూజాకరా హ్యేతే కే మగాః కే చ భోజకాః, జ్ఞానం కిం పరమం తేషాం జ్ఞేయస్తేషాం క ఏవ తు ౨౩. దివ్యేతి తే కథం ప్రోక్తాః కిమర్థం కూర్చధారణమ్, సౌరవ్రతం కిమర్థం తు వాచకాస్తే కథం స్మృతాః. ౨౪. కిమర్థం తేజసా వేదాన్గాయన్తశ్చైవ తే కథమ్, అథాహికంచుకస్యాంగం కిం ప్రమాణం చ కస్య వై. ౨౫. కస్య వై కా సమాఖ్యాతా యదుత్పన్నం కథం స్మృతమ్, కథం దేవాంశ్చ గాయంతి యజ్ఞం కుర్వంతి తే కథమ్. ౨౬. అగ్నిహోత్రం చ కిం తేషాం పంచ దోలాశ్చ కాః స్మృతాః, ఏతత్సర్వం సమాఖ్యాహి భోజకానాం విచేష్టితమ్. ౨౭. సాంబస్య వచనం శ్రుత్వా కృష్ణద్వైపాయనో మునిః, కాలీసుతో మహాతేజా ఉవాచ పరమం వచః. ౨౮. సాధుసాధు యదుశ్రేష్ఠ సాధు పృష్టోఽస్మి సువ్రత, దుర్జ్ఞేయ చేష్టితం కించిద్భోజకానాం న సంశయః. ౨౯. భాస్కరస్య ప్రసాదేన మమాపి స్మృతి

కొనఁగల్గితిని. పూర్వము మగులనుగూర్చి వశిష్ఠమహర్షి చెప్పినవాక్యములఁ జెప్పెద. సావధానముగా వినుము. వీరందఱును జ్ఞానవేదులయ్యును కర్మయోగము నాశ్రయించిరి. మహర్షులందఱును మానముచేతనే నియతులై యుండినటుల వినుచున్నాము. మానముచేతనే ఫలమును గూడఁ బొందుచున్నారు శాకద్వీపవాసులును మునివ్రతమునే యాచరించుచుండిరి. కాన సగుణత్వమును గోరనివాఁడు మానముతో భుజింపవలయును. సూర్యునివాక్యము సూర్యదత్తంబగువరము నీరెండును వీర లర్చకులగుటకుఁ గారణము. భోజకన్యలయం దుత్పన్నులగుటంజేసి భోజకులని చెప్పఁబడిరి. బ్రహ్మదేవుఁడు ఋగ్యజుస్సామాథర్వణములను బ్రాహ్మణులకెట్లు చెప్పెనో యట్లే విశ్వమదవేదము విద్వద్వేదము వహ్నివేదము రసవేదమునను నీనాల్గువేదములను మగులకు బ్రహ్మదేవుఁడే యుపదేశించెను. ఈమగులు సాంగములుగాఁ జదివియుండిరి. శేషుఁడు మహాభాగుఁడు సర్వజంతుసుఖావహుఁడై సూర్యరథము నెక్కి రథికులతో వర్తించును. అతని కంచుకము సూర్యునకు మహానకము. దాని నస్త్రమంత్రముచే భోజకులు నిత్యము నమస్కరించుచుండవలయును. పూజాకాలమున బ్రాహ్మణులకుఁ

---

మాగతమ్, యథాఖ్యాతం వశిష్ఠేన తథా తే వచ్మి కృత్స్నశః. ౩౦. మగానాం చరితం శ్రేష్ఠం శృణు త్వం కృష్ణనందన, జ్ఞానవేదిన ఏవైతే కర్మయోగం సమాశ్రితాః. ౩౧. శ్రూయన్తే ఋషయః సర్వే మానేన నియమస్థితాః, భుంజతే చాపి మానేన సర్వే వై పరమర్షయః. ౩౨. మునిచర్యాకృతస్తేపి శాకద్వీపనివాసినః, తస్మాన్మానేన భోక్తవ్యమగుణత్వమనిచ్ఛతా. ౩౩. వచః సూర్యసమాఖ్యాతం కారణం చ వరం తథా, అర్చాయాం తే చ తే నిత్యమర్చయన్తశ్చ తే స్మృతాః. ౩౪. భోజకన్యాసుజాతత్వాద్భోజకాస్తేన తే స్మృతాః, బ్రాహ్మణానాం యథా ప్రోక్తా వేదాశ్చత్వార ఏవ తు. ౩౫. ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదస్త్వథర్వణః, బ్రహ్మణోక్తాస్తథా వేదా మగానామపి సువ్రత. ౩౬. త ఏవ విపరీతాస్తు తేషాం వేదాః ప్రకీర్తితాః, వేదో విశ్వమదశ్చైవ విద్వద్వహ్నిరసస్తథా. ౩౭. వేదా హ్యేతే మగానాం తు పురోవాచ ప్రజాపతిః, మగా వేదమధీయన్ తే వేదాంగాస్తేన తే స్మృతాః. ౩౮. శేషో న హి మహాభాగః సర్వసత్వసుఖావహః, స సూర్యరథమాసాద్య రథిభిః సహ వర్తతి. ౩౯. యస్తస్య తు పునర్లోకం స రవేర్హి మహానకః, వందితవ్యో మగానాం తు అస్త్రమంత్రేణ నిత్యశః. ౪౦. యథా స్రజో ద్విజానాం తు పూజాకాలే ప్రమీయతే, సర్వసంస్కార

బుష్పమాలికవలెను యజ్ఞములయందు దర్భలవలెను నివియన్నియు మగులకుఁ బవిత్రంబులు. వీట్లచే నీమగాధిపులు శాకద్వీపంబునఁ బ్రకాశించు చుందురు. మగులలో విద్యావంతులును, కులశ్రేష్ఠులును, శౌచాచార సమన్వితులును, యజ్ఞాసక్తులును, భక్తులును, మంత్రము నాదినుండియు జపించువారును నీరీతిగ నుండువారు భోజకు లనఁబడుదురు. మఱియు "అస్త్రమివ వై" యను వేదమంత్రమును బఠించుచుందురు. బ్రాహ్మణులకు కేవలము సావిత్రమంత్రమే చెప్పఁబడియున్నది. మనకు మహావ్యాహృతి పూర్వకంబగు సావిత్రీమంత్రము చెప్పఁబడినది. మోహమును మానమును విడచి మౌనిగ్రాయై యుండవలయును. మనమునం దితరవిషయముల వేట్లను స్మరింపరాదు. ప్రయత్నపూర్వకముగా నుచ్ఛ్వాస నిశ్వాసములఁ జేయక నిచ్ఛలేనివాఁడై యుండవలయును. స్వాభీష్టదేవత యగు సూర్యుని నమస్కరింపవలయును. బ్రాహ్మణులకు మంత్రముల తోడను, వేదోక్తకర్మలతోడను యజ్ఞములున్నట్లు ఈమగులకును విధి మంత్రపూతంబగు నచ్ఛనారూపయజ్ఞం బుండుటచే వీరును యజ్వలైరి. ద్విజుల కగ్నిహోత్రమున్నటుల వీరికధ్వహోత్రముఁ గలదు. వారి యధ్వరమున కచ్ఛమని పేరు. ఈవిషయమున మునివచనమే ప్రమాణము.

---

యజ్ఞేషు యథా దర్భా ద్విజాతిషు. ౪౧. పవిత్రాః కీర్తితాస్తేషాం తథా ధర్మో మగ స్యతు, ఏభిర్జయన్తి భూయిష్ఠం తస్మిన్ద్వీపే మగాధిపాః. ౪౨. విద్యావంతః కులశ్రేష్ఠాః శౌచాచారసమన్వితాః, యజ్ఞావసక్తా భక్తాశ్చ జపంతో మంత్రమాదితః. ౪౩. ప్రియాస్తు యదుశార్దూల భోజకా యదునందన, అస్త్రమివ వై మంత్రో వేదస్య పరిపఠ్యతే. ౪౪. సర్వేషాం బ్రాహ్మణానాం తు సావిత్రీ పరికల్ప్యతే, అస్మాకం తు యదుశ్రేష్ఠ మహావ్యాహృతిపూర్వికా. ౪౫. అమోహకేనాథ విమానభుంజీ మానేన చైవాపి యథా హి యుక్తమ్, న చాపి కించిత్స్మృతికం స్పృశేచ్చ తచ్చాపి నాత్రైవ చ సంస్పృశేద్ధి. ౪౬. శ్వసంత్యనిచ్ఛంస్తు పరిక్షిపేత్తు స్వాభీష్టసూర్యం తు నమేత్సదైవ, యథా యజ్ఞం హి మంత్రేణ వేదప్రోక్తేన కర్మణా. ౪౭. తత్త్వమన్యన్మగానాం తు విధిమంత్రపురస్కృతమ్, హవిః సంపద్యతే యస్మాత్తేన తే యజ్వినః స్మృతాః. ౪౮. యథాగ్నిహోత్రం ప్రథితం ద్విజానాం తథాధ్వహోత్రం విహితం మగానామ్, అచ్ఛం చ నామేతి తదధ్వరస్య మునేర్వచో నాత్ర విచారణాస్తి. ౪౯. పంచధూపాః

భాస్కరునికి త్రిసంధ్యలును దండనాయకవేళలు రెండు కలసి యీయైదు సమయములయందును నైవేద్యధూపముల నియ్యవలయును.

ఇది చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

సాంబుఁ డిట్లనియె. భోజకులకు దేహశోధకమగు నవ్యంగమును వారలజాతినిఁ గూడఁ వినఁగోరుచున్నాను. అనిన వ్యాసుం డిట్లనియె. సాంబా! నీవు భోజకకుమారుల నడిగితివి గద. వారలు చెప్పినదంతయు నాకుఁ జెప్పుము అనిన సాంబుఁ డిట్లనియె. భోజకులసన్నివేశమంతయు చెప్పియే యుంటిని. వారల వర్ణ మేదియో నివాసమెచ్చటనో అద్దానిని నీవే చెప్పవలెనని కోరుచుంటి ననిన వాక్యకోవిదుండగు వ్యాసమహర్షి సాంబా! నీచేఁ జెప్పఁబడిన భోజకకుమారులవిషయమై నేనెఱుంగుదును. అందు నెనమండ్రు శూద్రులు నాయంగమునుండి జనించిరి అనెను. ఈవాక్యము వినినతోడనే సూర్యునకు నమస్కరించి భోజకులోత్పన్న లగు పదుగురుకన్యల నుత్తములగు పదుగుర కొసఁగెను. తరువాత నిత

ప్రదాతవ్యాః సిద్ధిరస్యేహ సర్వదా, దండనాయకవేలే ద్వే త్రిసంధ్యం భాస్కరస్య తు.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే
భోజకోత్పత్తివర్ణనం నామ
చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సాంబ ఉవాచః—భోజకానాం యత్వయోక్తమవ్యంగో దేహశోధకః, వ్రతబంధస్త్వసౌ ప్రోక్తస్తేషాం జాతిశ్చ కా స్మృతా. ౧. వ్యాస ఉవాచ—తే పృష్టా భవతా సర్వే భోజకానాం కుమారకాః, కిమాఖ్యాతం తతస్తైస్తు తదేవాచక్ష్వ కృత్స్నశః. ౨. సాంబ ఉవాచ—సంనివేశా మయా ప్రోక్తా భోజకానాం సమంతతః, మమైవ బ్రూత తత్వం తద్వర్ణః కోఽత్ర కథం స్థితః. ౩. తతస్తు భగవాన్ప్రాహ వాక్యం వాక్యవిశారదః, యే త్వయోక్తాః శ్రుతాః సాంబ భోజకానాం కుమారకాః.౪.మమైవైతే మగా జ్ఞేయా అష్టౌ శూద్రా మదంగజాః, ఏతద్బుద్ధ్వా తు వచనం ప్రణమ్య శిరసా రవిమ్.౫.

రులగు నెనమండ్రుకన్యలం దెచ్చి యాయెనమండ్ర కిచ్చెను. మఱియు సాంబపురమునఁ బ్రవేశపెట్టెను. దాశకన్య లెనమండుగురును భోజకన్యలు పదుగురును వీరలకుమారులు పదునెనిమిదిమందియు నై యుండిరి భోజకన్యకలయందు బ్రాహ్మణులచే నుత్పాదింపఁబడినవారు భోజకులనియు దివ్యబ్రాహ్మణులనియుఁ జెప్పఁబడుదురు. దాసకన్యలయందు మందగులచే నుత్పాదితులైనవారు మందగులని చెప్పఁబడుదురు. ఈ రెండు జాతులవారును గలసి పుత్రదారసహితముగా స్వధర్మముల ననుష్ఠించుచు శాకద్వీపమ్మున బ్రాహ్మణపురమునందు సూర్యునిఁ బూజించుచుండిరి. వైదికమంత్రముచే మునీశ్వరులును మనుష్యులును దివస్పతి నవ్యంగధారులై పూజించుచుండిరి. అనిన సాంబుఁడు మునీంద్రా! యీయవ్యంగ మెవ్వనినుండి యుత్పన్నమయ్యె? శుచి యెట్లయ్యె? యెప్పుడిది బంధనీయంబై యుండును? ఎందులకై దీనిం ధరింపవలయును? దీనుల కేమి ప్రమాణము? 'అవ్యంగము' అను పే రెట్లు కలిగెను? అని యడిగెను. సుమంతుఁ డిట్లనియె రాజా! యిట్లు సాంబునిచేఁ జెప్పఁ

---

దత్తా భోజకులోత్పన్నా దశభ్యో దశకన్యకాః, తతస్తు మందకేభ్యోఽపి దత్తాశ్చాష్టౌ హి కన్యకాః. ౬. తతో నివేశితం తేషాం మయా సాంబ పురం స్మర, దాసకన్యాస్తు యాశ్చాష్టౌ భోజకన్యాశ్చ యా దశ. ౭. ఏతాస్తేషాం కుమారాణాం జ్ఞేయాస్తా దశ చాష్ట చ, తత్ర తే భోజకన్యాసు ద్విజైరుత్పాదితాః సుతాః. ౮. భోజకాంస్తాన్గణాన్ప్రాహుర్బ్రాహ్మణాన్దివ్యసంజ్ఞితాన్, దాసకన్యాసు యే జాతా మందగైరన్త్యసంజ్ఞితైః. ౯. మందగా నామ తే జ్ఞేయాః సవితుః పరిచారకాః, తే చ విప్రపురే తస్మిన్పుత్రదారశుభైర్వృతాః. ౧౦. స్వధర్మైర్యష్టుమారబ్ధైః శాకద్వీపేఽర్చితో రవిః, నానావిధైర్వైదికైస్తు మంత్రైర్మునివరోత్తమాః. ౧౧. అవ్యంగధారిణో మర్త్యాః పూజయంతే దివస్పతిమ్, దృష్ట్వా వ్యంగం తు వై తేషాం కౌతూహలసమన్వితః. ౧౨. సాంబః ప్రాహ నమస్కృత్య భూయః సత్యవతీసుతమ్, కథం వరోఽయమవ్యంగః కథితో మునిసత్తమ. ౧౩. కుత ఏష సముత్పన్నః కస్మాచ్చ స శుచిః స్మృతః, బంధనీయః కదా చాయం కిమర్థం చైవ ధార్యతే, కిం ప్రమాణం చ భగవన్వ్యంగశ్చాయం కిముచ్యతే. ౧౪. సుమంతురువాచ:—శ్రుత్వైవం వచనం వ్యాసో జాంబవత్యాః సుతస్య చ. ౧౫. ఉవాచ కురుశార్దూల సాంబం కాలీసుతః స తు. వ్యాస ఉవాచ:—ఏతచ్చ మే యథోక్తస్త్వం జాతిరేషాం న సంశయః. ౧౬. అవ్యంగస్యాపి

బడినవాక్యములను విని జాతింగూర్చి చెప్పితిని. అవ్యంగవృత్తాంతమును లక్షణమును చెప్పెద నాకర్ణింపుము. అని వ్యాసుం డాతని కిట్లనియె.

ఇది ఏకచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## ద్విచత్వారింశదుత్తరశతతమాధ్యాయము

వ్యాసుం డిట్లనియె. దేవతలు, మహర్షులు, నాగములు, గంధర్వులు, అప్సరోగణములు, యక్షరాక్షసులును ఋతుక్రమానుసారంబుగా సూర్యునియందు నివసింతురు. అందు వాసుకి సూర్యునియొద్దకుఁ బోయి నమస్కరించి సూర్యప్రీతికొఱకుఁ దనయవ్యంగము సమర్పించెను. గాంగేయభూషితంబును దివ్యంబును నాతిరక్తంబును నాతిసితంబును శుభంబును నగునవ్యంగమును వాసుకి ప్రీతికొఱకు మధ్యభాగమున ధరించెను. నాగరాజశరీరసంభూతం బగుదానిని భానుఁడు ప్రీతితో ధరించుటవలన సూర్యప్రీతిఁ గోరుమనుజుఁడు దానిని ధరింపవలయును. తద్విధానముచే భోజకుఁడు శుచియగును. నిత్యమును దానిని ధరించుట వలన దివాకరుఁడు ప్రీతుఁడగును. రవిపూజకులగు భోజకు లెవ్వరైనను

---

తే వచ్మి లక్షణం గదతః శృణు. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే భోజకజాతివర్ణనం నామ ఏకచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

వ్యాస ఉవాచః—దేవతా ఋషయో నాగా గంధర్వాప్సరసాం గణాః, యక్షరక్షాంసి వై భానౌ నివసంతి ఋతుక్రమాత్. ౧. తత్ర తు వాసుకిర్హ్యాబద్ధముద్యత్సూర్యరథం జవాత్, స్వస్థానమాజగామాశు నమస్కృత్య దివాకరమ్. ౨. అవ్యంగమేవ సూర్యాయ ప్రీత్యర్థం వై సమర్పయత్, గాంగేయభూషితం దివ్యం నాతిరక్తసితం శుభమ్. ౩. బబంధ తం చ తత్ప్రీత్యై మధ్యభాగే తమాత్మనః, నాగరాజాంగసంభూతో ధృతో యస్మాచ్చ భానునా. ౪. తత్తస్మాద్ధార్యతే సూర్యప్రీత్యై తద్భక్తిమిచ్ఛతా, విధానేన చ తత్త్వేన శుచిర్భవతి భోజకః. ౫. నిత్యం చ ధారణాత్తస్య భవేత్ప్రీతో దివాకరః, న ధారయంతి యే త్వేవం భోజకాః పూజకా రవేః. ౬.

దీనిం ధరింపనిచో సౌరహీనులై యాజ్యులు గాకపోవుటయేగాక నుచ్ఛిష్టులు గూడ నగుదురు. సందియములేదు. స్మృత్యాచారభగ్నులగువారు సూర్యపూజ కర్హులుగారు. అట్టివారు బూజించినను రౌరవాదినరకముం బొందుదురు. పూజ ముగియునంతదనుక నవ్వుట, కూర్చున్నస్థలమునుండి లేచుట మొదలగునవి చేయఁగూడదు. ధానుష్కులు కటిబంధహీనులైనచో నెట్లు ప్రమాదముం బొందుదురో భోజకులును నవ్యంగవిహీనులైన నట్లే రవిపూజాఫలముం బొందనేరరు. ఆయవ్యంగము నేకవర్ణముగఁ జేసిన నది కార్యసిద్ధిదము. అది రెండువందలయంగుళములుండిన నుత్తమము నూటయిరువది యంగుళములైన మధ్యమము. నూటయెనిమిదంగుళములుండిన హ్రస్వము. యింతకన్నఁ దక్కువ యుండఁగూడదు. దీనిలో మధ్యమమును భోజకులుధరింపవచ్చును. సంస్కృతుఁడైన నవ్యంగమును ధరింపనిచో నశుచియే యగును. అశుచియైనను దీనింధరించిన శుచియగును. అట్టివానికే హవిర్హోమాదిక్రియలు సుఖకరము లగును వికలాంగుఁడును పతితాంగుఁడును దీనిని ధరించినచో సకలాంగుఁడగును. దీనిని నామముచేతనే సారము కలదనియు దివ్యమైనదనియుఁ దెలియఁదగును. అహియొక్క యంగమునందున బుట్టుటచేఁగాని, యహియొక్క యంగమగుటచేఁగాని యవ్యంగమైనది. 'అర్హ పూజాయాం' అనుధాతువునకు

---

సౌరహీనా న తే యాజ్యా ఉచ్ఛిష్టా న్యాత్ర సంశయః, స్మృత్యాచారే తే హి భగ్నా రవిం నార్హంతి పూజితుమ్. ౭. పూజయంతో రవిం తే హి నరకం యాంతి రౌరవమ్, న వై హసేన్న ఉత్తిష్ఠేద్యావదర్చాం లభంతి తే. ౮. ఇత్థం జ్ఞాత్వా న సందేహో హ్యవ్యంగేన వినా రవిః, నాగరాజస్య సంస్పృష్టో హ్యరసుస్తేన సంస్మృతః. ౯. ఏకవర్ణః స కర్తవ్యః కార్యసిద్ధికరస్తథా, ప్రమాణేనాంగులానాం తు శతాద్ధి శతముత్తరమ్. ౧౦. ఉత్కృష్టోయం ప్రమాణేన మధ్యమో వింశదుత్తరః, శతమష్టోత్తరం హ్రస్వో న తు హ్రస్వాఽరస్తతః. ౧౧. తదాకృతిః కృతశ్చైష నిర్మితో విశ్వకర్మణా, మధ్యమే భోజకానాం తు పరః శత ఉదాహృతః. ౧౨. సంస్కృతోఽపి వినా తేన శుచిర్నైవ భవత్యుత, తేనాస్య ధారణాద్వీర శుచిరేవ తదా భవేత్. ౧౩. హవిర్హోమాదికాః సర్వా భవంత్యస్య క్రియాః శుభాః, అవ్యంగః పతితాంగశ్చ అవ్యంగోఽథ మహీపతే. ౧౪. ఏష సారశ్చ సా రమ్యా వై జ్ఞేయా జయనామభిః, అహేరంగాత్సముత్పన్నో హ్యవ్యంగస్తు తతః స్మృతః.౧౫.యస్మాదస్మాదహేరంగమవ్యంగస్తేన చోచ్యతే,

ణ్వుల్ ప్రత్యయముఁ జేయుటచే "అర్వ్యాక" మనుపేరును పవిత్రమనియుఁ బూజితమనియు నర్థము కలిగెను. దీనికి సారసమని కూడ పేరు గలదు. 'షణ భక్తౌ' అనుధాతువు ప్రధానరూపమును పొందెనుగాన "సారస" మనుపేరు కలిగెను. మఱియు నీయవ్యంగము వృద్ధికరము, కాయశుద్ధి కరమును, సర్వవేదసర్వభూతసర్వదేవ సర్వలోకమయము నైయున్నది. దీనికి మధ్యమున బ్రహ్మయు, మూలమున విష్ణువు, నంత్యమున శివుఁడును, మూలమున ఋగ్వేదము, మధ్యమున యజుర్వేదము, నగ్రమున సామ వేదము, గ్రంథియం దథర్వణవేదము నుండెను. పృథివీజలములు మూలము నను, వాయుతేజస్సులు మధ్యమునను, అంతమునం దాకాశము నుండెను. భూర్లోకము మూలమునను, భువర్లోకము మధ్యమునను, స్వర్లోక మంత్యమున నుండెను. ఈరీతిగ నవ్యంగము లోకదేవవేదభూతమయమునై యుండెను. కాన రవిప్రీతిని గోరువారు దీనిం ధరింపవలయును. ఇది లేక

అర్వేతి పూజయాం ధాతోః ప్రత్యయో ణ్వుల్తతః స్మృతః. ౧౬. పూజితశ్చ పవిత్రశ్చ యస్మాత్తేనార్వ్యకః స్మృతః, సారసార్థః స్మృతం రూపం ప్రధానం సార ఉచ్యతే. ౧౭. షణ భక్తౌ స్మృతో ధాతుస్తస్మాత్సారసనః స్మృతః, యస్మాదర్చితమేవం తు సువర్ణమణిమౌక్తికైః. ౧౮. స జ్ఞేయః పతితాంగస్తు నిత్యయజ్ఞైరుపాహృతః, ఇత్యేతే కథితా వీర అవ్యంగా వ్యంగభోజకాః. ౧౯. బుద్ధివృద్ధికరో నిత్యం కాయశుద్ధికరస్తథా, సర్వవేదమయశ్చాయం సర్వదేవమయస్తథా. ౨౦. సర్వభూతమయః సాంబ సర్వలోకమయస్తథా, మధ్యేఽస్యసంస్థితో బ్రహ్మా మూలే విష్ణుర్మహామతే. ౨౧. శశాంకమౌలిరన్త్యే తు సంస్థితో యదునందన, ఋగ్వేదోఽస్య స్థితో మూలే యజుర్వేదోఽస్య మధ్యగః. ౨౨. అగ్రే స్థితఃసామవేదో గ్రంథిరాంగిరసోఽనఘ, పృథివీమూలమాశ్రిత్య స్థితా చ యదుసత్తమ. ౨౩. మూలాశనాస్త్వపః సాంబ మధ్యే దేవో విభావసుః, తాసామనంతరం వాత ఆకాశోఽగ్రే సమాస్థితః. ౨౪. మూలే స్థితస్తు భూర్లోకో భువర్లోకస్తు మధ్యగః, స్వర్లోకశ్చాగ్రమాశ్రిత్య స్థితో వ్యంగస్య యావతా. ౨౫. ఏవం దేవమయః సాంబ ఏవం లోకమయస్తథా, ధారణీయో మహాభక్త్యా పూజకైః ప్రీతయే రవేః. ౨౬. పూజయంతి రవిం యే వై వినానేన యదూత్తమ, పూజాఫలం న తేషాం స్యాన్నరకం చ వ్రజంతి హి. ౨౭. తథా తేషాం భవేన్నిత్యమవ్యంగో భోజకః సదా, అన్యకాలే యదుశ్రేష్ఠ

పూజఁజేయువారు పూజాఫలముం బొంద జాలరు. అంతియగాక నరక మును పొందును. కాన మనుజుఁ డవ్యంగధారణఁ జేయవలయును.

ఇది ద్విచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## త్రిచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. ఈప్రకారంబుగా వ్యాసునిచేఁ జెప్పఁబడిన యవ్యంగోత్పత్తిని విని బుద్ధిశాలియగు సాంబుఁడు నారదమహర్షి యాశ్రమంబునకుం బోయి నారదునితో నిట్లనియె. ఓమునిసత్తమా! భోజ కులు సూర్యునకు ధూపము నెట్లీ వలయును? స్నానమును ఆచమన మును అర్ఘ్యమును నెట్లు చేయవలయునో చెప్పుమనిన నారదుం డిట్ల నియె. ఓయదువల్లభా! ధూపవిధినంతను సవిస్తరముగాఁ జెప్పెద నాకర్ణిం పుము. స్వర్ణదానమును, ఆచమనమును, నర్ఘ్యమును, స్నానమునుగూర్చి గూడఁ జెప్పెద. మూఁడుపర్యాయము లాచమనముఁజేసి తరువాత స్నానముఁజేసి నిర్మలంబులును, అనార్ద్రంబులును, శుభంబులును నగు వస్త్రములను ధరియించి ప్రాఙ్ముఖంబుగఁగాని యుదఙ్ముఖంబుగఁగాని కూర్చుండి యాచమనముఁ జేయవలయును. జలములయందుండి యాచ మనమును జేయఁగూడదు బైటికివచ్చియే యాచమనముఁ జేయవలయును.

---

ఇత్యేతత్కథితం తవ. ౨౮. బాధనే కారణం వీర భూషణాని చ సువ్రత. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే వ్యంగోత్పత్తిర్నామ
ద్విచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:— శ్రుత్వైవమేవ సాంబేన వ్యాసాత్సత్యవతీసుతాత్, అవ్యంగ స్య చ ఉత్పత్తిం పునరాగాన్మహామతిః. ౧. అథాగత్య మహాతేజాః సాంబో గత్వా శ్రమం పునః. ౨. నారదస్య మహాబాహోర్నారదం వాక్యమబ్రవీత్, కథముత్క్షిప్య వై ధూపం భోజకైః సవితుర్మనే. ౩. స్నానమాచమనం చైవమర్ఘ్యదానం మహాత్మనే, సాంబస్య వచనం శ్రుత్వా నారదో మునిసత్తమః. ౪. ఉవాచ కురుశార్దూల సాంబం జాంబవతీసుతమ్, హంత తే కథయిష్యామి రవేర్ధూపవిధిక్రమమ్. ౫. స్నానమాచమనం చైవ స్వర్ణదానం తథైవ చ, ఆచాంతస్త్రిస్తతః స్నాత్వా వాససీ నిర్మలే శుభే. ౬. అనార్ద్రే సంవసీతైవ పవిత్రే పరిధాయ చ, ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వాప్యాచామేచ్చ ప్రయత్నతః. ౭. జలే జలస్థో నాచామేజ్జలాదుత్తీర్య యత్నతః, అప్సు సూర్య స్తథా

జలమున సూర్యాగ్నులు సరస్వతియు నుండురుగాన జలాశయము నుండి పైకివచ్చియే యాచమనముఁ జేయవలయును. శుచియగు ప్రదేశమునఁ బ్రాఙ్ముఖంబుగఁగాని యుదఙ్ముఖంబుగఁగాని కూర్చుండి పాదప్రక్షాళనమును హస్తప్రక్షాళనమును జేసికొని హస్తముల జాన్వంతరములయం దిడుకొని సమాహితమనస్కుఁడై ప్రసన్నంబులగు జలములను మూఁడుపర్యాయములు త్రాగి, రెండుపర్యాయములు మార్జనచేయవలయును. శిరమును, ఇంద్రియములను క్రమానుసారముగా స్పృశింపవలయును. ఇట్లాచమనముఁజేసి సూర్యుని నమస్కరించి శౌచమును బొందవలయును. ఎవ్వరైనను మోహముచే నాచమనముఁజేయక నాస్తికుఁడై యాకర్మ ననుష్ఠించినచో నదియంతయు వ్యర్థమగును. ఇది నిశ్చయము. కావుననే దేవతలు శుచికాములని వేదములఁ జెప్పఁబడిరి. దేవతలందఱును సూర్యోపాసనమేఁ జేయుచుందురు. శుచియగుదానినే ప్రశంసింతురు. శౌచములగునంగములచేతనే కర్మ ననుష్ఠింపవలయును. ఆచమనానంతరము స్నానము నవలంబించి తరువాత దేవాలయంబునకుఁ బోవలయును. శ్వాసనిరోధముకొఱకు వస్త్రమును గప్పుకొనవలయును. కేశములనుండి నీరు క్రిందఁబడకుండుటకై వస్త్రమును జుట్టుకొనవలయును. తరువాత వివిధంబులగు కుసుమంబులచేఁ బూజచేయవలయును. తరువాత ప్రణవయుక్తంబగు గాయత్రిని జపించుచు గుగ్గిలసహితంబగు ధూపము నివ్వ

---

గ్నిశ్చ మాతా దేవీ సరస్వతీ. ౮. తస్మాదుత్తీర్య చాచామేన్నాచామేత్తు జలాశయే, ఉపవిశ్య శుచౌ దేశే ప్రయతః ప్రాగుదఙ్ముఖః. ౯. పాదౌ ప్రక్షాల్య హస్తౌ చ అంతర్జానుస్తథాచమేత్, ప్రసన్నాస్త్రిః పిబేత్త్వాపః ప్రయతః సుసమాహితః. ౧౦. సంమార్జనం తు ద్విః కుర్యాత్త్రిభిరభ్యుక్షణం పునః, మూర్ధానం ఖాని చాత్మానముపస్పృశ్యాను పూర్వశః. ౧౧. ఆచాంతోఽర్కం నమస్కృత్య శౌచేషు శుచితామియాత్, క్రియాం యః కురుతే మోహాదనాచమ్యేహ నాస్తికః. ౧౨. భవంతీహ క్రియాః సర్వా వృథా తస్య న సంశయః, శుచికామా హి వై దేవా వేదైరేవముదాహృతాః. ౧౩. ఇనోపాసా కృతశ్చైవ సర్వే దేవాః ప్రయత్నతః, శౌచమేవ ప్రశంసంతి శౌచాంగైర్హి విధీయతే. ౧౪. ఆచాన్తో స్నానమాస్థాయ దేవాగారం తతో వ్రజేత్, శ్వాసరోధనిమిత్తం తు ప్రాణమాచ్ఛాద్య వాససా. ౧౫. శిరః ప్రావృత్య యత్నేన కేశోదకనివృత్తయే, తతః పూజాం రవేః కుర్యాత్పుష్పైర్నానావిధైః శుభైః. ౧౬. గాయత్రీం సశిరస్కాం చ

వలయును. తరువాత పుష్పాంజలిని గ్రహించి సూర్యునిశిరంబున దేవ మంత్రము నుదహరించుచు నుంచవలయును. "ఓం వ్రతేన, యద్వ్రతినో వర్జయంతి దేవా మనుష్యాః పితరశ్చ సర్వే, తస్యాదిత్యం ప్రసరం చ మనామహే యస్తేజసా ప్రథమం నావిభాతి" పంచకాలములయందును పంచ ధూపముల నీయవలయును. హవనాదులగు పంచకర్మలను నేను రక్షింపఁ గలను. దండనాయకవేళలు రెండు నెల్లపుడు నక్షత్రదర్శనమునందును నీధూపమును చేయవలయును. జ్ఞానియై కార్యము నిర్వర్తించువానికి కాలము నాజ్ఞయు నివి రెండు నుండవు. సూర్యపూజను సూర్యదర్శన మగుచుండఁగా త్రికాలములయందును జేయవలయును. పూర్వాహ్ణంబున నర్ధోదితుండగుచుండఁగను నపరాహ్ణంబున నర్ధాస్తమితుండగుచుండఁగను జేయవలయును. పూర్వాహ్ణమున విలాసార్థముగను, మధ్యాహ్నాపరాహ్ణ ములయందు జ్వలనార్థముగను జేయవలయును. చందనోదకమిశ్రితంబు లును, గంధోదకయుతంబులు, నగుపద్మములను కరవీరంబులను, రక్తోత్ప లంబులను, కుసుమోదకమిశ్రితంబులగు కురంటకపుష్పములను, దివ్య గంధములను, తామ్రభాజనమునం దుంచి గుగ్గిలసహితమగు ధూపమును సమర్పించి యర్ఘ్యపాత్రమును గ్రహించి సూర్యుని "ఏహి సూర్య సహ

---

యజమానః ప్రయత్నతః, ధూపం తతోఽగ్నయే దద్యాత్ప్రథమం గుగ్గులాహుతిమ్. ౧౭. పుష్పాంజలిం తతో గృహ్య తచ్ఛిఖాయాం ప్రయత్నతః, రవేర్మూర్ధని తం దద్యాద్దేవ మన్త్రముదాహరన్. ౧౮. ఓం వ్రతేన యద్వ్రతినో వర్జయంతి దేవా మనుష్యాః పిత రశ్చ సర్వే, తస్యాదిత్యం ప్రసరం చ మనామహే యస్తేజసా ప్రథమం నావిభాతి. ౧౯. ధూపవేలాః స్మృతాః పఞ్చ ధూపేష్వేవ తు పఞ్చసు, హవనాద్యాః క్రియాః పఞ్చ రక్షిష్యేహం తథా పునః. ౨౦. దండనాయకవేలా తు ప్రత్యృక్షే ఋక్షదర్శ నాత్, నాజ్ఞావేలా ప్రదోషస్తు తత్త్వకార్యం విజానతా. ౨౧. త్రికాలం తు రవేః పూజా కర్తవ్యా సూర్యదర్శనాత్, అర్ధోదితస్తు పూర్వాహ్ణే తతోఽర్ధస్తు రవిర్విభుః. ౨౨. హేలయేతి చ పూర్వాహ్ణే మధ్యాహ్నే జ్వలనాయ చ, తథైవ మండలే దేయం నీచాహ్నే జ్వలనాయ చ. ౨౩. చందనోదకమిశ్రాణి గంధోదకయుతాని చ, పద్మాని కరవీరాణి తథా రక్తోత్పలాని చ. ౨౪. కుసుమోదకమిశ్రాణి కురుంటకుసుమం తథా, గంధాదీని చ దివ్యాని కృత్వా వై తామ్రభాజనే. ౨౫. ధూపం దత్త్వాగ్నయే వీర ప్రయత్నాద్గుగ్గులాహుతిం, అర్ఘ్యపాత్రం తదా గృహ్య కుర్యాదావాహనం రవేః.

స్రాంశో తేజోరాశే జగత్పతే, అనుకంపయ మాం దేవ గృహాణార్ఘ్యం దివాకర". అను నీమంత్రముచే నావాహనజేసి జానువులచే భూమిని స్పృశించి సూర్యున కర్ఘ్యము నియ్యవలయును. అట్లాదిత్యహృదయ గతుండై "ఓం నమోభగవతే,ఆదిత్యాయ,విశ్వాయ, ఖేశాయ, బ్రహ్మణే, లోకకర్తృణే. ఈశానాయపురాణాయసహస్రాక్షాయతే నమ. సోమాయ, ఋగ్యజురథర్వాయ, ఓం భూర్భువః స్వః. ఓం మహః, ఓం జనః. ఓం తపః, ఓం సత్యం, బ్రహ్మణేముండే మధ్యేపురతః ఆదిత్యాయ నమః" అని యర్ఘ్యమును సమర్పింపవలయును "సావిత్ర్యాశ్చ పరేతంత్రే త్రైలోక్య త్రాణకారిణే" యని చెప్పుచు ధూపము నెత్తవలయును. దేవా! వసు రుద్రులలో నీవొక్కఁడవె యాద్యుఁడవు. దేవతలచే స్తోత్రములఁజేయఁ బడుచు దివంబునశాశ్వతుండవై యుంటివి. పూర్వాహ్ణంబున దేవతలచేతను మధ్యాహ్నంబున నితరులచేతను నుతింపఁబడుచున్నావు. "ఓం నమో భగవత జ్ఞానాత్మనే త్వాం చ" "విష్ణోస్తత్పరమం పదం సదా పశ్యంతి సూరయః" అని ధూప మీయవలెను. సాయాహ్నంబునను దివాకరునకు ధూపము నిచ్చునపుడు "ఓం నమో వరుణాయ శంభవే, ఓం ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ. హిరణ్యయేన సవితా

---

౨౬. ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశే జగత్పతే, అనుకంపయ మాం దేవ గృహాణార్ఘ్యం దివాకర. ౨౭. అనేనావాహనం కృత్వా జానుభ్యామవనీం గతః, రవేర్నివేదయే దర్ఘ్యమాదిత్యహృదయే గతః. ౨౮. ఓం నమోభగవతే ఆదిత్యాయ విశ్వాయ ఖేశాయ బ్రహ్మణే లోకకర్తృణే, ఈశానాయ పురాణాయ సహస్రాక్షాయ తే నమః. ౨౯. సోమాయ ఋగ్యజురథర్వాయ, ఓం భూర్భువః స్వః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం బ్రహ్మణే ముండే మధ్యే పురతః, ఆదిత్యాయ నమః. ౩౦. నారద ఉవాచ:—సావిత్ర్యాశ్చ పరే తంత్రే త్రైలోక్యత్రాణకారిణే, పరితః పరిగృహ్యాథ ధూపభాజనముత్క్షిపేత్. ౩౧. నివేదయేత్తతో ధూపం వాచ మేతాముదీరయేత్, త్వమేక ఏవ రుద్రాణాం వసూనాం చ పురాతనః. ౩౨. దేవానాం గీర్భి రభితః సంస్తుతః శాశ్వతో దివి, పూర్వాహ్ణే చ తథా తేన మధ్యాహ్నే చాపరేణ తు. ౩౩. ఓం నమో భగవతే జ్ఞానాత్మనే త్వాం చ, విష్ణోస్తత్పరమం పదం సదా పశ్యంతి సూరయః. ౩౪. దివాకరస్తు సాయాహ్నే మంత్రేణార్ఘ్యం నివేదయేత్, ఓం నమో వరుణాయ శంభవే. ౩౫. ఓం ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం

రథేనాదేవోయాతి భువనాని పశ్యన్” అను నీమంత్రముచే భోజకుఁడు సూర్యునకు ధూపము నివ్వవలయును. ఈధూపముచేతనే గర్భగృహ మును బ్రవేశించి ప్రతిమకు “మిహిరాయ నిక్షుభాయ” యను మంత్రముచే నివేదనజేయవలయును. తరువాత రాజ్ఞి నిక్షుభలకును దండనాయకసంజ్ఞుఁడగు పింగళునకును, రాజ్ఞునకును, స్రౌషునకును, గరుత్మంతునకును నమస్కరించి సప్రదక్షిణంబుగా దిక్పాలకులకుఁ గూడ ధూపము నియ్యవలయును. తరువాత దిండికిని, హేమంతునకును, మహే శ్వరునకును, వ్యోమకును ధూపము నియ్యవలయును. “విశ్వేభ్యో దేవేభ్యో నమః రుద్రేభ్యో నమః, ఓం బ్రహ్మణే ముండపతయే, ఆది త్యాయ పురుషేశ్వరాయ, సూర్యాయ నమో నమః. ఓం అనేకకాంతయే నత్వా శేషాయ వాసుకి తక్షకకర్కోటకాయ పద్మశంఖకులికేభ్యో నాగరాజేభ్యో నమః. తలసుతలపాతాలాతలవితలరసాతలాదివాసిభ్యో దైత్యదానవపిశాచేభ్యోనమః” అని ప్రదక్షిణములను జేయువలయును. “మాతృకాభ్యో నమో నమః” యని మాతృకలకుఁ బ్రదక్షిణముఁ జేయ వలయును. “ఓం గ్రహేభ్యో నమః. ఓం దండనాయకాయ నమః. ఓం మార్తండాయనమః. ఓం వినాయకాయనమః” అనునామముల నుద్దేశించి

---

మర్త్యం చ, హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతి భువనాని పశ్యన్. ౩౬. అనేన విధినా దత్త్వా ధూపం సూర్యాయ భోజకః, ఉత్క్షిపేచ్చైవ ధూపేన విశేద్గర్భగృహం తతః. ౩౭. తతః ప్రవిశ్య ధూపం తు ప్రతిమాయై నివేదయేత్, మంత్రేణ మిహిరాయేతి నిక్షుభాయేతి నిత్యశః. ౩౮. తతో రాజ్ఞ్యై నమశ్చేతి నిక్షుభాయై తతో నమః, దండ నాయకసంజ్ఞాయ పింగలాయ చ వై నమః. ౩౯. తథా రాజ్ఞాయ స్రౌషాయ తథై శాయ గరుత్మతే, తతః ప్రదక్షిణం కుర్వన్దిగ్దేవేభ్యో నివేదయేత్. ౪౦. దిండినే తు తతో దద్యాద్ధేమంతాయ యదూత్తమ, మహేశ్వరాయ దద్యాత్తు తథా వ్యోమాయ యాదవ. ౪౧. విశ్వేభ్యో దేవేభ్యో నమః, రుద్రేభ్యో నమః. ఓం బ్రహ్మణే ముండ పతయే ఆదిత్యాయ పురుషేశ్వరాయ సూర్యాయ నమోనమః. ౪౨. ఓం అనేక కాంతయే నత్వా శేషాయ వాసుకితక్షకకర్కోటకాయ పద్మశంఖకులికేభ్యో నాగ రాజేభ్యో నమః. ౪౩. తలసుతలపాతాలాతలవితలరసాతలాదివాసిభ్యో దైత్యదానవ పిశాచేభ్యో నమః. తతః ప్రదక్షిణం కుర్యాన్మాతృకాభ్యో నమోనమః, ఓం గ్రహేభ్యో నమః. ౪౪. ఓం దండనాయకాయ నమః. ఓం మార్తండాయ నమః. ఓం వినాకాయ

ధూపము నిచ్చి ధూపపాత్ర నచ్చటనే విడువవలయును. గుప్తంబులగు స్తోత్రంబులచే సూర్యుని స్తోత్రముఁజేసి భగవంతుఁడవగు నో భాస్కరా! భక్తిచేనాశక్తికొలఁదిస్తోత్ర మొనర్చితిని ఐహికాముష్మికకార్యసిద్ధినిగలుగఁ జేయుము. ఇట్లు త్రికాలముల స్నానముఁజేసి ప్రణతులై సూర్యు నెవరు విధ్యుక్తముగా నర్చింతురో వా రశ్వమేధయాగఫలమును బొందుదురు. ఈధూపవిధిని యథోక్తవిధిని నిత్యముఁ జేయువాఁడు పుత్రవంతుఁడును, విగతరోగుఁడును నై మృతుండై నపిమ్మట సూర్యునియందు లీనమై యుండును. యథోక్తవిధిచే ననుష్ఠించినసర్వకార్యంబులును సఫలంబులగును. ఈ పూజావిధియందు పుష్పములు శ్రేష్ఠములు. అవి దొఱకనిచో పత్రములతో నైనను నిర్వర్తింపవలయును. అది లేనియెడల ధూపముతో నిర్వర్తింప వలయును. అదియును లేనిచో జలము నర్పింపవలయును. ఇవి యన్నియు నసంభవము లైనచో నమస్కారముచేతనే నిర్వర్తింపవలయును. నమస్కారమునకు నశక్తుఁడైనచో మనస్సుచేతనే నిర్వర్తింపవలయును. ద్రవ్యములు లేనప్పుడే యీవిధిగాన సంభవించినచో నుపహారములుగాఁ జేయవలయును. ఏమనుష్యుఁడు కర్మయుక్తుఁడై మంత్రములచే సూర్యునకు ధూపము నర్పించునో వానికి మంత్రోచ్చారణచేతనే సంతుష్టుండగు

---

నమః. ౪౫. ఏవముద్దిశ్య నామాని ధూపం దత్త్వా వరానన, ఉత్క్షిప్తో యత్ర వై ధూపో ముక్త్వా తత్రైవ తం పునః. ౪౬. సూర్యగుహ్యైరభిష్టూయ ఏవం విజ్ఞాయతే తతః, అర్చితస్త్వం యథా శక్త్యా మయా భక్త్యా విభావసో, ఐహికాముష్మికీం చాథ కార్యసిద్ధిం దదస్వ మే. ౪౭. ఏవం త్రిషవణం స్నాత్వా యోఽర్చయేత్ప్రణతో రవిమ్, విధినా తు యథోక్తేన సోఽశ్వమేధఫలం లభేత్. ౪౮. యశ్చైవం కురుతే నిత్యం యథోక్తం ధూపవిస్తరం, స పుత్రవానరోగీ చ మృతః సంలీయతే రవౌ. ౪౯. విధినా తు యథోక్తేన క్రియమాణాని యత్నతః, సర్వకార్యాణి సిద్ధ్యంతి సఫలాని భవంతి చ. ౫౦. పుష్పం శ్రేష్ఠం యదా న స్యాత్పత్రాణి సముపాహరేత్. పత్రం న స్యాత్తతో ధూపం ధూపో న స్యాత్తతో జలమ్. ౫౧. సర్వం న స్యాద్యదా చైవ ప్రణిపాతేన పూజయేత్, అశక్తః ప్రణిపాతస్య మనసా పూజయేద్రవిమ్. ౫౨. అసమ్భవే తు ద్రవ్యాణాం విధిరేష ప్రకీర్తితః, ద్రవ్యాణాం సంభవే చైవ సర్వమేవోపహారయేత్. ౫౩. మన్త్రైః కర్మయుతో యస్తు మిత్రే ధూపం నివేదయేత్, ఉచ్చారణాచ్చ వై

సూర్యుఁడు సంతోషమును గలుగఁజేయును. పూజాకాలమునందు ముక్కు నోరు వస్త్రముతో మూసికొనియే యుండవలయును. శిథిలముగాఁ జేయఁగూడదు. పద్మముతో ముఖనాసికలు మూసికొన్నచో సూర్యుని బొందును. కాన నెల్లప్పుడును ముఖనాసికల మూసికొనియే చేయవలయును. ఇట్లుచేసిన నశ్వమేధయాగఫలమును బొంది సూర్య లోకమును బొందును. ధూపముచేఁ బూజింపఁబడుచుండఁగా సూర్యునిఁ జూచినచో మహాత్ములకు నదృశ్యంబగు పరమపదమును బొందును పూజ చేసినను సర్వకామములను బొంది పరమపదమును బొందును.

ఇది త్రిచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## చతుశ్చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

రాజా! తరువాత వ్యాసమహర్షి శంఖచక్రగదాధరుండగు నారాయణుని జూచుటకై ద్వారకాపురంబునకుఁ బోయెను. నారాయణుం డావచ్చినవ్యాసమహర్షిని జూచి లేచి ఎదుర్కొని పూజించి స్వయము గనే యాసనముఁను తెచ్చి యిచ్చి అర్ఘ్యపాద్యాదుల నిచ్చి యాతనితో

---

తేషాం ధూపః ప్రీతో భవేద్రవిః. ౧౮. శిరో నాసా ముఖం చైవ భృశమావృత్య యత్న తః, పూజయేద్భాస్కరం వీర శిథిలం తు న కారయేత్. ౧౯. నలినేన తు రాజేంద్ర నరో యాతి దివాకరమ్, తస్మాద్యుక్తం సదా కార్యం పూజ్యతే చ దివాకరః. ౨౦. తేఽశ్వమేధఫలం ప్రాప్య సూర్యలోకం వ్రజంతి హి, ధూపేన పూజ్యమానం తు నరాః పశ్యంతి యాదవ. ౨౧. యాంతి తే పరమం స్థానం యన్న పశ్యంతి సూరయః, క్రియ మాణం తథార్కం చ భక్త్యా పశ్యంతి యే నరాః, సర్వాన్కామానిహ ప్రాప్య తే యాంతి పరమం పదమ్. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే ధూపాదివివిధవిధివర్ణనం
నామ త్రిచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అథాజగామ భగవాన్వ్యాసో ద్వారవతీం పురీమ్. ద్రష్టుం నారాయణం దేవం శంఖచక్రగదాధరమ్. ౧. తమాగతమృషిం దృష్ట్వా వాసుదేవో విశాంపతే, అభ్యుత్థాయ మహాతేజాః పూజయామాస భారత. ౨. స్వయమేవాసనం

నిట్లనియె ఋషిసత్తమా! నాకొమారుఁడగు సాంబుఁడు ఇచ్చటనుండి శాకద్వీపమునకుఁ బోయి జ్ఞానులును మోక్షార్థులును నగు భోజకులను తోడ్కొనివచ్చెను. వారలరూపమును జూచి ప్రవేశము మొదలుకొని కర్మలచే పరమానందభరితుఁడనై కౌతూహలమును బొందితిని. ఈభోజకులు ఎందులకై యీక్షణకాలము నివసించుచుండిరి. సూర్యుని సదా ఎవ్వరు పూజించుచుందురో వారలకు ముక్తి యాత్మయందే వసించునని చెప్పుదురు. ఎవ్వఁడును భోజకత్వమును బొందక ముక్తిని బొందనేరఁడు. అని యీప్రకారముగా నామనమునకుఁ దోఁచుచున్నది. అనిన వ్యాసుం డిట్లనియె శంఖచక్రగదాధర! నీవు చెప్పినదంతయు సత్యమే యగును. ఈభోజకులు మహాత్ములనుట నిస్సంశయము ఏమనుష్యులు భానుమంతుఁ డగు దివాకరు నెల్లపుడు పూజింతురో వారు జ్ఞానులును కర్మనిష్ఠులును నయి మోక్షమును బొందఁగలరు. మరియు నీభానుని బలిపుష్పముల చేతను, ఓషధులచేతను, అన్నముచేతను, ఆజ్యహోమములచేతను సమస్తములగు హోమములను జేసి, తరువాత పరహోమమును నాచరించవలయును. పరహోమమును జేయుటవలన అకల్మషులై పవిత్రాంతఃకరణులై దివ్యంబగు భాస్కరతేజంబునఁ బ్రవేశింతురు. కర్మసాధనంబులలో నొకటి అగ్నియందును, ఆకాశమునందు వాయుమార్గంబున అంతఃప్రకాశితయై

---

దత్త్వా పాద్యమర్ఘ్యం తథైవ చ, పప్రచ్ఛ ప్రయతో భూత్వా వ్యాసం సత్యవతీసుతమ్. 3. 'య ఏతే భోజకా విప్రా ఆనీతా మత్సుతేన వై, శాకద్వీపమితో గత్వా జ్ఞానినో మోక్షగామినః. ౪. తాన్దృష్ట్వా రూపతో విప్ర ప్రవేశాత్కర్మతస్తథా, కౌతూహలం సముత్పన్నం హర్షశ్చ పరమో మమ. ౫. కథమేతే క్షణమపి తిష్ఠంతే పృథివీతలే, యేషాం రవిః సదా పూజ్యస్తేషాం ముక్తిః సదా వసేత్. ౬. నాగత్వా భోజకత్వం హి మోక్షమాప్నోతి కశ్చన, ఇదం మే మనసో బ్రహ్మన్సదా సంప్రతిభాతి వై. ౭. వ్యాస ఉవాచ:—ఏవమేవ యథార్థ త్వం శంఖచక్రగదాధర, ధన్యా ఏతే మహాత్మానో భోజకా నాత్ర సంశయః. ౮. యే పూజయంతి సతతం భానుమంతం దివాకరమ్, జ్ఞానినః కర్మనిష్ఠాశ్చ సదా మోక్షగతిం గతాః. ౯. యజంతే సతతం భానుం బలిపుష్పఫలైస్తథా, అన్నైరోషధిభిశ్చైవ ఆజ్యహోమైశ్చ కృత్స్నశః. ౧౦. హోమం చ శాశ్వతం కృత్వా పరం హోమం తతః శ్రితాః, పరహోమస్య కరణాత్పూతాత్మానో హ్యకల్మషాః. ౧౧. విశంతి పరమాం దివ్యాం భాస్కరీం తైజసీం కలామ్, కర్మణః సాధనే చైకా తత్ర చాగ్నౌ ప్రతిష్ఠితా. ౧౨. వాయుమార్గస్థితా వ్యోమ్ని ద్వితీయాంతః

రెండవదియును, సూర్యమండలమున మూడవదియును నుండెను. ఆసూర్యమండలమే దివ్యము అజరము నాశరహితమైనది. ఆమండలము నకు మధ్యమున నీపురుషుఁడు సదసదాత్మకుఁడై నాశరహితుఁడు నాశ సహితుఁడుగను తెలియఁదగినవాఁడు. మఱియు నీసూర్యుఁడు కళాసహితుఁడును కళారహితుఁడునుఅని చెప్పఁబడియుండెను. సర్వభూతవ్యవస్థితంబగు సకలము నక్షరమనియు, తత్త్వసహితమనునది సకలమనియు, తత్త్వహీనమను నది నిష్కలము అనియుఁ జెప్పఁబడును. తృణము పొదలు లతలు వృక్షములు సింహములు పక్షులు సురసిద్ధమనుష్యులు మున్నగుస్థలజములు జలజములనుగూడ హరించును. ఆతఁడు సర్వస్థలములయందును, సర్వాంతరాత్మలయందును వ్యవస్థితుండై యుండును కల్పాత్మకుఁడై ద్వితీయ తనువు నాశ్రయించినవాఁడు తేజోరూపంబగు నాతనికల నాశ్రయించిన వాఁడై నిష్కలుండని చెప్పఁబడును. ఆతఁడే హిమఘర్మవర్షములను మూఁడులోకములయందుఁ గలుగఁ జేయుచున్నాఁడు. ఇఁకను రెండవది యగు శరీరము పరమపదమే యని చెప్పవచ్చును. ఆస్థానమును కర్మయోగముచే నధిష్ఠించియుందురు. మఱియు నాదిత్యసిద్ధాంతులును, సాంఖ్యయోగవేత్తలును నగువారు పొందుటచే మోక్షమని చెప్పఁబడుచుండెను. అప్రతిశూన్యమును గమనాశక్యమును నగునాస్థానమునుబొంది జీవుఁడు

ప్రకాశికా, తతః పరం తృతీయా తు తత్ స్మృతం సూర్యమండలే. ౧౩. మండలం తచ్చ సవితుర్దివ్యం హ్యజరమవ్యయం, తస్యాఽసౌ పురుషో మధ్యే యోఽసౌ సదసదాత్మకః. ౧౪. క్షరాక్షరస్తు విజ్ఞేయో మహాసూర్యస్తథైవ చ, నిష్కలః సకలశ్చాపి ద్వౌ చ తస్య ప్రకల్పితౌ. ౧౫. అక్షరః సకలశ్చైవ సర్వభూతవ్యవస్థితః, సతత్త్వః సకలః ప్రోక్త స్తత్త్వహీనస్తు నిష్కలః. ౧౬. తృణగుల్మలతావృక్షవృకసింహద్విజాధిపాన్, సురసిద్ధమనుష్యాంశ్చ స్థలజాఞ్జలజాన్హరేత్. ౧౭. వ్యవస్థితః స సర్వత్ర సర్వేషామంతరాత్మని, యదా కల్పాత్మకశ్చైవ ద్వితీయాం తనుమాశ్రితః. ౧౮. నిష్కలస్తు సదా జ్ఞేయః సంస్థితస్తైజసీం కలామ్, హిమం ఘర్మం చ వర్షం చ త్రైలోక్యే కురుతే సదా. ౧౯. ద్వితీయా యా తనుస్తస్య అక్షరం తత్పరం పదమ్, దేవయానం తు పంథానం కర్మయోగేన సంస్థితా. ౨౦. ఆదిత్యసిద్ధాంతరతాః సాంఖ్యయోగవిదశ్చ యే, తేఽభిగచ్ఛంతి తత్ స్థానం స మోక్షః పరికీర్తితః. ౨౧. నిర్ద్వన్ద్వో నిర్గమశ్చైవ తత్ర గత్వా న

దుఃఖింపఁడు. వేదములు బ్రహ్మను చెప్పుచున్నవి. తత్వవేత్తలు నాపర బ్రహ్మమునే ధ్యానించుచుందురు. ఓంకారము గూడ తత్వసహితముగా ధ్యానముఁజేయఁబడుచుండును. ఆయోంకారమున మూఁడక్షరములును మూఁడున్నరమాత్రలును గలవు. వ్యంజనాత్మకమగు మకారమును అర్ధమాత్రాక్షరముగా నెవరుధ్యానింతురో వారు మకారీయమగు జ్ఞానమును సదాత్మకమగుదానిని బొందుదురు. మకారముచే భగవంతుఁడగు భాస్కరుఁడు చెప్పఁబడుచున్నాఁడు. ఈమకారధ్యానముచేతనే వీరు మగులని చెప్పఁబడిరి. ధూపమాల్యంబులచేతను నుపహారములచేతను సహస్రాంశుని భుజింపఁజేయుదురుగాన వారు భోజకులని చెప్పఁబడిరి.

ఇది చతుశ్చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## పంచచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

వాసుదేవుం డిట్లనియె. ఓమునిపుంగవా! భోజకుల కీజ్ఞాన మెట్లు గల్గెనని తెలిసికొనుటకుఁ గుతూహలపడుచుంటి ననిన వ్యాసుం డిట్లనియె. యదునందనా! భోజకులయొక్క జ్ఞానోపలబ్ధినిఁగూర్చి చెప్పెద నాకర్ణింపుము. ఎముకలు, ప్రేవులు, రక్తమాంసములు వీట్లతోఁ గూడినది

---

శోచతి, వేదేషు బ్రహ్మ వదంతి ధ్యాయంతే తత్త్వవేదినః. ౨౨. ఓంకారం తత్త్వత శ్చాపి ధ్యాయంతే పురుషోత్తమ, త్ర్యక్షరం చ తమోంకారం సార్ధమాత్రాత్రయే స్థితమ్. ౨౩. వదంతి చార్ధమాత్రస్థం మకారం వ్యంజనాత్మకమ్, ధ్యాయంతి యే మకారీయం జ్ఞానం తే హి సదాత్మకమ్. ౨౪. మకారో భగవాన్దేవో భాస్కరః పరికీర్తితః, మకారధ్యానయోగాచ్చ మగా హ్యేతే ప్రకీర్తితాః, ౨౫. ధూపమాల్యైర్యత శ్చాపి ఉపహారైస్తథైవ చ, భోజయంతి సహస్రాంశుం తేన తే భోజకాః స్మృతాః.౨౬

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే భోజకస్యోత్పత్తివర్ణనం నామ చతుశ్చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

వాసుదేవ ఉవాచ:—జ్ఞానోపలబ్ధిం విప్రేంద్ర భోజకానాం మహామునే, బ్రూహి తత్త్వం ద్విజశ్రేష్ఠ కౌతుకం పరమం మమ. ౧. వ్యాస ఉవాచ:—ఇమాం జ్ఞానోపలబ్ధిం తు నిబోధ గదతో మమ, అస్థిస్థూలం స్నాయుయుతం మాంసశోణితలేప

యును, చర్మాచ్ఛాదితంబును, దుర్వాసనాయుక్తంబును మూత్రపురీష పూరితంబును, జరాగ్రస్తంబును, రోగపీడితంబును, సర్వవిధ కాలుష్యసహితంబును, నశ్వరంబునగు నీశరీరమునం దపేక్షను వదలవలయును. కపాలమును, వృక్షమును, జీర్ణవస్త్రమును సంపాదించి యసహాయుండై సర్వభూతములయందు సమబుద్ధిగల్గియుండుట జీవన్ముక్తునిలక్షణము. తిలలలో తైలమువలెను, గోవులయందు క్షీరములవలెను, కాష్ఠములయందుఁ బావకునివలె సర్వభూతస్థితుం డగునాత్మను సమాహితుండై పృథక్కరించి తెలిసికొనవలయును. చంచలమగుమనస్సును ప్రయత్నముచే నియమించి పంజరశుకములనువలె బుద్ధీంద్రియములనుగూడ నియమించి యట్టి నియమితేంద్రియంబులచే నమృతాస్వాదజనితతృప్తితోఁ దుల్యమైనతృప్తిని బొందఁగలఁడు ప్రాణాయామములచే దేహదోషములను, ధారణములచే నంతఃకాలుష్యమును, ప్రత్యాహారముచే సంసర్గములను, ధ్యానమున ననీశ్వరగుణములను దహించుకొనవలయును. అంతమునందగ్నిచే శరీరదోషములవలె ప్రాణాయామముచే నింద్రియకృతంబులగు దోషంబులు నశించును. చిత్తము చిత్తముచేతను, స్వభావంబు స్వభావంబుచేతను, నెమ్మనంబు నెమ్మనంబుచేతను, బుద్ధిని బుద్ధిచేతను, శోధించుకొనవలయును. చిత్తము మిక్కిలి పరిశుద్ధమైన దగుటచే శుభాశుభరూపంబగు కర్మ

---

నమ్, చర్మావనద్ధం దుర్గంధి పూర్ణం మూత్రపురీషయోః. ౨. జరాశోకసమావిష్టం రోగాయతనమాతురం, రజస్వలమనిత్యం చ భూతావాసమిమం త్యజేత్. ౩. కపాలం వృక్షమూలాని కుచైలమసహాయతా, సమతా సర్వభూతేషు ఏవం ముక్తస్య లక్షణమ్. ౪. తిలే తైలం గవి క్షీరం కాష్ఠే పావకసంతతిః, ఉపాయం చింతయేదస్య ధియా ధీరః సమాహితః. ౫. ప్రమాథి చ ప్రయత్నేన మనః సంయమ్య చంచలమ్, బుద్ధీంద్రియాణి సంయమ్య శకునానివ పంజరే. ౬. ఇంద్రియైర్నియతైర్దేహీ ధారాభిరివ తృప్యతే, సతతమమృతస్యైవ జనార్దన మహామతే. ౭. ప్రాణాయామైర్దహేద్దోషాన్ధారణాభిశ్చ కిల్బిషం, ప్రత్యాహారేణ సంసర్గాన్ధ్యానేనానీశ్వరాన్గుణాన్. ౮. ధ్యాయమానస్య దహ్యంతే చాంతే దోషా యథాగ్నినా, తథేంద్రియకృతా దోషా దహ్యంతే ప్రాణనిగ్రహాత్. ౯. చిత్తం చిత్తేన సంశోధ్య భావం భావేన శోధయేత్, మనస్తు మనసా శోధ్య బుద్ధిం బుద్ధ్యా తు శోధయేత్. ౧౦. చిత్తస్యాతిప్రసాదేన భాతి కర్మ శుభా

యంతయు దానియందు ప్రకాశించుచుండును. ఇట్టి శుభాశుభవినిర్ముక్తుం డగుపురుషుఁడు నిష్పరిగ్రహుండును, నిర్ద్వంద్వుండును, నిర్గతమమకారుఁ డును, నిరహంకారుఁడు నై తరువాత నుత్కృష్టలోకమును బొందఁ గలఁడు. సూర్యుని పూర్వాహ్ణంబున నుండురూపము లోహితవర్ణయు తంబును ఋఙ్మయంబును నై ప్రథమరూపంబని చెప్పఁబడుచున్నది. ద్వితీయరూపము యజుర్వేదమయమును, శ్వేతవర్ణయుక్తంబును నై మధ్యాహ్నమున నగపడుచుండును. తృతీయంబగురూపము సామవేద మయమును, కృష్ణవర్ణయుక్తంబునునై సాయాహ్నంబున నగపడును. మఱియుఁ బ్రథమరూపము సాత్త్వికమనియు, ద్వితీయరూపము రాజస మనియు, తృతీయరూపము తామసరూపమనియు నీదేవునకు సత్త్వ రజస్తమోగుణములు మూఁడును గల్పింపఁబడును. ఈమూఁడురూపంబుల కును వ్యతిరేకంబయి నాల్గవది యగుసూర్యమండల ముండెను. అయ్యది జ్యోతిః ప్రకాశముగను, సూక్ష్మముగను, నిరంజనముగను జెప్పఁబడెను. ఈనాల్గవరూపమును వేదవేత్తలును, సూర్యసిద్ధాంతవేదులును, ఓంకార ప్రణవయుక్తులును, ధ్యానముచే నిర్ధూతకల్మషులును నై పద్మాసనమునం దుండి హస్తముల నాభిప్రదేశమునం దునిచి సుషుమ్నానాడికామార్గ మును కుంభక-రేచక-పూరకంబులను మూఁడింటిచే శోధించి దేహమధ్య గతంబులగు పంచవాయువులను పాదాంగుష్ఠాన్వితుం డై క్రమముగా పై కెగుర వేయవలయును. నాభిదేశమున ననామయుండగు నగ్నిని, హృద

---

శుభం, శుభాశుభవినిర్ముక్తో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః, నిర్మమో నిరహంకార స్తతో యాతి పరాం గతిమ్. ౧౧. పూర్వాహ్ణే లోహితం రూపం ప్రథమమృఙ్మయం స్మృతం, యజుర్మయం ద్వితీయం తు శ్వేతం మాధ్యాహ్నికం స్మృతమ్. ౧౨. కృష్ణం తృతీయం సాయాహ్నే సామ్నో రూపం తు తత్ స్మృతమ్, ప్రథమం రాజసం దేవ ద్వితీయం సాత్త్వికం స్మృతమ్. ౧౩. తృతీయం తామసం రూపం త్రైగుణ్యాం తస్య కల్పితం, త్రయాణాం వ్యతిరేకేణ చతుర్థం సూర్యమండలమ్. ౧౪. జ్యోతిః ప్రకాశకం సూక్ష్మం ప్రోక్తం దేవనిరంజనం, చతుర్థం తు వేదవిదః సూర్యసిద్ధాంతవేదినః. ౧౫. ఓంకారప్రణవైర్యుక్తా ధ్యాననిర్ధూతకల్మషాః, స్థితాః పద్మాసనే వీరా నాభిసన్న్యస్త పాణయః. ౧౬. సుషుమ్నానాడికామార్గం కుంభరేచకపూరకైః, త్రిభిః సంశోధ్య తాన్పంచ మరుతో దేహమధ్యగాన్. ౧౭. పదాంగుష్ఠాన్వితాః స్విన్నమూర్ధ్వముత్క్షేపయేత్క్ర-

యమునందు సోముని జూచి, శిరంబున నగ్నిశిఖను జూచి, తరువాత రశ్మలచే నామండలమును భేదించికొని యోగస్థుఁడై పోయినయెడల, సర్వనాశకంబయి సూర్యసంబంధమగు పరమపదమును చూడవచ్చును. ఓకేశిసూదనా! దేవార్చననుగూర్చి చెప్పితిని. ప్రథమమగుస్థానము హృదయము, రెండవదగ్న్యాశ్రితము, మూఁడవది నాభిసంస్థము, నాల్గవది సూర్యమండలమనియు, నీసూర్యమండలమును తద్వేత్తలు సురేశుండగు భానుని పరమపదమని చెప్పుదురు. ఆస్థానమే జనులకు సంసారవిచ్ఛేదకం బగుమోక్షపదమని చెప్పుదురు. అమృతసమమును, వేద్యమును, జనహిత మును, పరతత్త్వభూతమును, ఋషిపూజితంబును, పరంబు నగుసూర్యుని కిరణసహస్రమును తెలిసికొని వ్యపగతమోహులై మోక్షమును బొందెదరు. ఇట్లు యానవరయుక్తంబగు మగవంశజులచరితమును జెప్పి తిని. దీనిని దెలిసికొని మోక్షవేత్తలు శుద్ధులై యాస్థానమును బొందఁ గలరు నేను జెప్పిన యీజ్ఞానమును శ్రద్ధావంతులగువారికేఁ జెప్పవల యును. నాస్తికులకును బుద్ధిహీనులకును నైశ్వర్యకాముఁడగువాఁ డెన్నండును జెప్పఁగూడదు. అని చెప్పెనని చెప్పి సుమంతుం డిట్లనియె. భగవత్స్వరూపుం డగువ్యాసుం డుత్తమంబగు భోజకజ్ఞానమును జెప్పి

---

మాత్, నాభిదేశే తు తం దృష్ట్వా దేవమగ్నిమనామయమ్. ౧౮. సోమం చ హృదయే దృష్ట్వా మూర్ధ్ని వాగ్నిశిఖాం తతః, వాతరశ్మిభిరాసాద్య తం భిత్వా మండలం పరమ్ ౧౯. తతః పరం తు యోగచ్ఛేద్యోగస్థః సూర్యమండలం, యత్ర గత్వా న శోచంతి తత్సారం పరమం పదమ్. ౨౦. దేవార్చనం మహాబాహో కీర్తితం కేశిసూదన, ప్రథమం హృదయం స్థానం ద్వితీయం చాగ్నిమాశ్రితమ్. ౨౧. తృతీయం నాభిసంస్థం చ చతుర్థం సూర్యమండలమ్. ౨౨. స్థానం పరం వై పరమాత్మసంస్థం భానోః సురేశస్య వదంతి తజ్జ్ఞాః, జ్ఞేయః స మోక్షశ్చ నృణాం స ఏవ సంసారవిచ్ఛిత్తికరం పదం తతః. ౨౩. ఇదమమృతసమం పరస్య వేద్యం కిరణసహస్రభృతో హితం జనానామ్, ఋషిచరిత మవేత్య తత్త్వసారం వ్యపగతమోహధియః ప్రయాంతి మోక్షమ్. ౨౪. ఇదం మగా నాం చరితం మయా తే ప్రఖ్యాపితం యానవరేణ యుక్తమ్, జ్ఞాత్వా త్విమం మోక్ష విదో వదంతి సిద్ధాశ్చ తత్స్థానమవాప్నువంతి. ౨౫. యస్మయోక్తమిదం జ్ఞానం దేయం శ్రద్ధావతాం నృణాం, నాస్తికానామబుద్ధీనాం న దేయం భూతిమిచ్ఛతా. ౨౬. సుమంతురువాచ—ఇత్యుక్త్వా భగవాన్వ్యాసో భోజకజ్ఞానముత్తమం, నారాయణం

నారాయణ మనుపేరుగల యాశ్రమము (విష్ణునిగృహంబు)న కరిగెను. ఈయాశ్రమము లోకత్రయమునందును విఖ్యాతమై గంగచేఁ బోషింపఁబడి బదరిచే నలంకృతంబయి నరనారాయణమను ప్రఖ్యాతిని వహించెను.

ఇది పంచచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## షట్చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. దేవదేవుండగు సూర్యునకు పూజకులగు నేభోజకులఁ జెప్పియుంటివో వారలకు నన్యమగు భోజ్యము లేదు. బ్రాహ్మణసంబంధమగుదాని గూడ భుజింపఁగూడదు! వీరు భాస్కరునకుఁ బ్రియులగుటచేఁ బూజ్యులైరి. ఆదిత్యుని స్వేదోదకమువలనఁ బుట్టిన వారుగాన దివ్యులైరి. ఈభోజకు లభోజ్యు లెట్లైరి ? నాకుఁ జెప్పుము. ఏకర్మము నాచరించిన మఱల భోజ్యత్వమును బొందఁగలరో యదియును దెలిసికొనఁ గోరుచున్నాను. అనిన విని సుమంతుం డిట్లనియె. పూర్వము కృతవర్మచే వాసుదేవుఁడును సాంబుఁడు నడుగఁబడిరి. ఒకప్పుడు కృష్ణసాంబులును నారదపర్వతకు లిద్దఱును సాంబపురంబునకు వెడలి యందఱును మహాత్ముండగు భోజకునియొక్క గృహంబున

---

మహాబాహో జగమాయతనం హరేః. ౨౭. ఖ్యాతో యస్త్రిషు లోకేషు గంగయా పరితోషితః, బదర్యా మండితో వీర నరనారాయణాశ్రమః. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే భోజకజ్ఞానవర్ణనం నామ
పఞ్చచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—య ఏతే భోజకాః ప్రోక్తా దేవదేవస్య పూజకాః, నాన్యం భోజ్యమథై తేషాం బ్రాహ్మణైశ్చ కదాచన. ౧. భాస్కరస్య ప్రియా హ్యేతే పూజ్యత్వం చ తథా గతాః, దివ్యాశ్చైతే స్మృతా విప్రా ఆదిత్యాంభఃసముద్భవాః. ౨. అభోజ్యత్వం కథం యాతా భోజకాస్తద్వదస్వ మే, కిం కుర్వాణాస్తథా కర్మ భోజ్యతాం యాంతి మే వద. ౩. సుమంతురువాచ:—ఇమమర్థం పురా పృష్టో వాసుదేవో మహీపతే, కృతవర్మణా పురా రాజంస్తథా సాంబో మహాబలః. ౪. గతౌ సాంబపురీం వీర తథా నారద పర్వతౌ, భుక్తవంతౌ గృహే సర్వే భోజకస్య మహాత్మనః. ౫.

భుజించిరి. ఆదిత్యకర్మవలన వారు దేవాన్నఖ్యాతిని బొందిరి. ఆభోజకులచే వారందఱును భక్తిచే వివిధభోజ్యములతోడ ననేకవిధములఁ బూజింపఁబడిరి. మఱల వారు పుణ్యంబగు ద్వారవతీపట్టణంబునకు వచ్చిరి. ఆమీఁద నారదపర్వతకు లిద్దఱును దివము నధిరోహించిరి. తరువాత మహాతేజుండగు హార్దిక్యుఁడు వాసుదేవు నిట్లు ప్రశ్నించెను. దేవా! భాస్కరపూజకులగు నేభోజకు లుండిరో వారలయన్నము విప్రులెట్లు భుజించిరి? దివ్యులని చెప్పఁబడు నానారదపర్వతకు లెవ్వరు? వీరలు బ్రాహ్మణుల కభోజ్యులు గదా! దానివిషయము నాకుం జెప్పుమనిన వాసుదేవుం డిట్లనియె. వారలు భోజ్యులు గారు. భోజవంశజులే యెల్లప్పుడును భోజ్యులు. వారలు సూర్యునివలెనే యభివాదనమును జేయఁ దగుదురు. ఆకర్మ నాచరించుచు భోజ్యత్వమును బొందిరి. ఓయదుశ్రేష్ఠుఁడా! వార లేకర్మ ననుష్ఠించిరో యేకాగ్రమనస్కుఁడవై యాకర్ణింపుము. ఎవ్వనిభార్య శూద్రవంశసంజాతయో ఎవ్వఁడు వ్యంగమును ధరింపఁడో వాఁడు భోజ్యుఁడని తెలియవలయును. వాఁడు భోజకుఁడే యగును. సందియము లేదు. ఎవ్వం డభ్యంజనము లేకయు స్నానముఁజేయకయు సూర్యుని శాస్త్రోక్తముగాఁ బూజించునో, సేవకుం

---

ఆదిత్యకర్మణో లోకే దేవాన్నఖ్యాతిమాగతాః, తేన తే పూజితాః సర్వే భక్త్యా భోజ్యైరనేకశః. ౬. ఆగతా స్తే పురీం వీర పుణ్యాం ద్వారవతీం విభో, తావృషీ దివమారూఢౌ రాజన్నారదపర్వతౌ. ౭. వాసుదేవం మహాతేజా హార్దిక్యో వాక్యమబ్రవీత్, య ఏతే భోజకా విప్ర పూజకా భాస్కరస్య తు. ౮. అన్నమేషాం కథం విప్రౌ భుక్తవంతౌ జనార్దన, తావృషీ దివ్యమాఖ్యాతౌ యౌ తౌ నారదపర్వతౌ, అభోజ్యాః కిల ఏతే వై బ్రాహ్మణానాం జనార్దన. ౯. వాసుదేవ ఉవాచ:—న తే భోజ్యా మహాబాహో భోజ్యా భోజాశ్చ సర్వదా, అభివాద్యాం ప్రయత్నేన యథాదిత్యో మహామతే. ౧౦. ఆచరంతశ్చ తత్కర్మ భోజ్యత్వం ప్రవ్రజంతి తే, తచ్ఛ్రూయతాం యదుశ్రేష్ఠ యత్కార్యం చాపి తైర్విభో, యతమానై ర్మహాబాహో తదిహైకమనాః శృణు. ౧౧. వృషలీ యస్య వై భార్యా యశ్చావ్యంగం న ధారయేత్, అభోజ్యః స తు విజ్ఞేయో భోజకో నాత్ర సంశయః. ౧౨. అస్నాతః పూజయేద్యస్తు తథాభ్యంగవివర్జితః, ఆదిత్యం యదుశార్దూల తథా చ విధినా విభో. ౧౩. సేవకో భోజకో యస్తు

డగు నేభోజకుఁడు శూద్రాన్నమును భుజించునో దేవతార్చనమును విడచి యెవ్వఁడు కృషినిఁ జేయుచుండునో యెవ్వనికి జాతకర్మాదిసంస్కారములు లేవో యెవ్వఁ డారుణేయమంత్రములతో సావిత్రినిఁ బఠింపఁడో యట్టి వాని గృహంబున బ్రాహ్మణుఁడు భుజించినయెడల నాలవపాలు కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తముం జేసికొనినఁ బరిశుద్ధుఁడగును. దేవపితృమనుష్యభూత ములకును భాస్కరునకును బూజావిధిని నెరవేర్పక యెవఁడు భుజించునో వాఁడు ధర్మహంతకుఁ డగును. అభ్యంజనవిహీనుఁడై శంఖములేక శిరము నందు లంబకేశములుగలవాఁడు భోజకాధముఁడని చెప్పందగు. దేవతార్చ నంబును హోమమును స్నానమును తర్పణమును దానమును బ్రాహ్మణ పూజనము భాస్కరపూజనముఁ జేయుచున్న నభ్యంజనవిహీనుఁడైన యెడల నివియన్నియు నిష్ఫలంబులగును. ఈయభ్యంజనము సర్వవేద సర్వదేవమయం బగుటం జేసి పరమపవిత్రమై వెలయుచున్నది.యదుశ్రేష్ఠా! దానికి మూలంబున విష్ణువు ఋగ్వేదమును, మధ్యంబున బ్రహ్మయు సామవేదంబును, నగ్రంబున నీశ్వరుఁడు నథర్వణవేదంబులును, నగ్ని త్రయము లోకత్రయముఁ గ్రమముగా నుండుటచే, నీభోజకాభ్యంజ నము పవిత్రమైనది. కాన నీయభ్యంజనవిహీనుఁ డయ్యె నేని భోజకుఁడు

---

శూద్రాన్నం యేన భుజ్యతే, కృషిం చ కురుతే యస్తు దేవార్చామపి వర్జయేత్. ౧౪. జాతకర్మాదయో యస్య న సంస్కారాః కృతా విభో, ఆరుణేయైశ్చ మంత్రైశ్చ సావిత్రీం న చ వై పఠేత్, తస్య గేహే ద్విజో భుక్త్వా కృచ్ఛ్రపాదేన శుధ్యతి. ౧౫. పితృదేవమనుష్యాణాం భూతానాం భాస్కరస్య తు, అకృత్వా విధివత్పూజాం యస్తు భుఙ్తే స ధర్మహా. ౧౬. అభ్యంగేన విహీనో యః శంఖహీనస్తథైవ చ, శిరసా ధారయే త్కేశాన్స జ్ఞేయో భోజకాధమః. ౧౭. దేవార్చనం తథా హోమం స్నానం తర్పణ మేవ చ, దానం బ్రాహ్మణపూజాం చ కుర్వతో భోజకస్య తు, అభ్యంగేన విహీనస్య సర్వం భవతి నిష్ఫలమ్. ౧౮. సర్వదేవమయో హ్యేష సర్వవేదమయస్తథా, అభ్యంగో యదుశార్దూల పవిత్రః పరమః స్మృతః. ౧౯. భోజకానాం యదుశ్రేష్ఠ తస్య మూలే స్థితో హరిః, మధ్యే బ్రహ్మ మహాతేజా అగ్రే గోశ్రుతిభూషణః. ౨౦. ఋగ్వేదో యస్య మూలస్థో మధ్యే సామాని కృత్స్నశః, యజుర్వేదస్తథా శ్రేష్ఠశ్చాథర్వసహితః స్థితః. ౨౧. త్రయోఽగ్నయస్తథా రాజంస్త్రయో లోకాః స్థితాః క్రమాత్, ఏవమేష పవిత్రస్తు అభ్యంగో భోజకస్య తు. ౨౨. యస్త్వనేన విహీనస్తు భోజకో భోజకాధమః,

భోజకాధముఁడనియు నభోజ్యుఁడనియుఁ దెలిసికోనవలయును. అశుచి యగుట నిస్సంశయము. దేవధనాపహారులగు నాభోజకులు దేవనిర్మాల్య మును నైవేద్యమును కుంకుమనుగాని దేవపరిహాసకులకిచ్చినను విక్ర యించినను వారు భోజకాధములని చెప్పఁబడుదురు. దేవేశునిఁ బూజింపక దేవద్రవ్యము హరించినవారు దేవప్రియులు కాకపోవుటయేగాక భోజ కాధములు గూడ నగుదురు. ఎవ్వఁడేని నైవేద్యముం భుజింపనిచో నా నైవేద్యము నీభోజకుఁడే భుజించినయెడల నానైవేద్యము నరకశాంతి నాపాదించుటకు బదులు నరకమునే యాపాదించును. కాన భాస్కర నైవేద్యమును నరుఁడు సర్వకాలములందును భుజింపవలయును. బ్రాహ్మణు లకుఁ బురోడాశ మెట్లు కాయశుద్ధికరమో యట్లే భోజకులకు నైవే ద్యము కాయశుద్ధికరమగును. అదియే ప్రథమమున దేహవిశుద్ధికరము.

ఇది షట్చత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## సప్తచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

వాసుదేవుం డిట్లనియె. తరువాత దేవదేవుండగు భాస్కరుం డరుణునిచేఁ బూజితుండయి మహాత్మా! యేభోజకులు నీకుఁ బ్రియ

---

అభోజ్యః స తు విజ్ఞేయః సోఽశుచిర్నాత్ర సంశయః. ౨౩. నిర్మాల్యమథ నైవేద్యం కుంకుమం దేవహేలినాం, యే ప్రయచ్ఛంతి శూద్రాణాం విక్రీణంతి చ భోజకాః, తేఽధమా భోజకా జ్ఞేయా యే చ దేవస్వహారిణః. ౨౪. న పూజయంతి దేవేశం జేవస్వం క్షపయంతి చ, న తే దేవప్రియాస్తాత విజ్ఞేయా భోజకాధమాః. ౨౫. యస్మిన్న భుక్తే నైవేద్యం భోజకోఽశ్నాతి మానద, తదన్నం భుంజత స్తస్య నరకాయ న శాంతయే. ౨౬. నైవేద్యం భోజయేత్తస్మాద్భాస్కరస్య నరః సదా, ప్రథమం యదు శార్దూల తచ్చ దేహవిశోధనమ్. ౨౭. బ్రాహ్మణానాం పురోడాశో యథా కాయవిశో ధనః, భోజకానాం తథా వీర నైవేద్యం కాయశోధనమ్. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే భోజకవర్ణనం నామ షట్చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

వాసుదేవ ఉవాచః—అత్ర పృష్టో యథా దేవో భాస్కరో దేవపూజితః, అథ

తములు? ఎవ్వరు నీపూజయందు నియుక్తులై యుండవలయును? ఎవ్వ రయోగ్యులో నాకుఁ జెప్పవలయునని యడిగిన దివాకరుం డిట్లనియె. ఎవ్వరు పరదారపరద్రవ్యాపహరణఁగావింపరో యెవ్వరు దేవతల నిందింపరో వారు నాకుఁ బ్రియతములు. ఏభోజకులు వాణిజ్యము కృషి సేవ (సేద్యమును) చేయుదురో వేదముల నెవ్వరు నిందింతురో వారు నాకెల్లప్పుడు విరోధులై యుందురు. ఎవ్వరు పరభార్యాసంగ్రహణమును పరుల కర్షణమును రాజసేవను జేయుదురో వారు పతితులగుదురు. ఎవ్వరు శూద్రాన్నమును భుజింతురో వారు నాకు శత్రువులగుదురు వారలు నాకర్ఘ్య మిచ్చినను నన్నుఁ బూజించినను, నాపూజార్ఘ్యములను నేను గ్రహింపను. ఈచెప్పినవారును శంఖవర్జితులును నాసంబంధమగు నిర్మాల్యమును నైవేద్య కుంకుమములను వైశ్యశూద్రులకిచ్చినవారును విక్రయించినవారును వీరందఱు నా కప్రియులే యగుదురు. మఱియు నెవ్వరు మహాశ్వేత యగు సావిత్రినిఁ బూజింతురో యెవ్వరు నాకింకరులయొక్కముద్ర నెఱుంగరో వారును నాయొక్కపూజావిధియందసమర్థులగుదురు. ఇఁక నాకుఁ బ్రియతములగు భోజకులఁ జెప్పెద నాకర్ణింపుము. దేవబ్రాహ్మణపితరులఁ

---

ణేన మహాబాహో కే ప్రియా భోజకాస్తథా. ౧. పూజాయాం తవ కే యోగ్యాః కే న యోగ్యా భవంతి చ, ఇతి పృష్టః స భగవానరుణేన దివాకరః, యదువాచ మహాబాహో తదిహైకమనాః శృణు. ౨. భాస్కర ఉవాచ.—పరదారాన్పరద్రవ్యం యే న హింసంతి భోజకాః, తే ప్రియా మమ వై నిత్యం యే న నిందంతి దైవతాన్. ౩. వాణిజ్యం కృషిసేవాం తు వేదానాం నిందనం చ యే, కుర్వంతి భోజకా జ్ఞేయాః సర్వే తే మమ వైరిణః. ౪. యేషాం భార్యాసంగ్రహణం కర్షణం యే ప్రకుర్వతే, నృపసేవాం ఖగశ్రేష్ఠ విజ్ఞేయాః పతితాస్తు తే, భుంజతే యే చ శూద్రాన్నం జ్ఞేయాస్తే శత్రవో మమ. ౫. పూజా కృతా తు యా తైస్తు తథార్ఘ్యం చ ఖగోత్తమ, పూజాం తామథ చాప్యర్ఘ్యం నాహం గృహ్ణామి ఖేచర. ౬. య ఏతే కథితా వీర యే చ శంఖవివర్జితాః, నిర్మాల్యం యే మదీయం తు నైవేద్యం కుంకుమం తథా. ౭. శూద్రాయ యే ప్రయచ్ఛంతి విక్రీణంతి చ యే ఖగ, యచ్ఛంతి యే చ వైశ్యాయ భోజకా మే న తే ప్రియాః. ౮. యజంతే యే చ సావిత్రీం మహాశ్వేతాం చ గోపతేః, యే న జానంతి మే ముద్రాం కింకరాణాం చ నామతః. ౯. య ఏతే కథితా వీర భోజకాస్తే మయా ఖగ, నైతే పూజయితుం శక్తా యే ప్రియా మమ భోజకాః, తాఞ్ఛృ

బూజించు భోజకులు నాకుఁ బ్రియులై నాపూజ కర్హులగుదురు. ఎవ్వరు శిరమును నిత్యమును ముండనముఁ జేయించుకొనెదరో నిత్యము నభ్యంజనముఁజేసికొనెదరో శంఖమును మ్రోయింతురో వారు దివ్యులగుభోజకులని చెప్పఁబడుదురు. మఱియు నోఖగోత్తమా! త్రికాలములయందుఁ గ్రోధవర్జితులై స్నానముఁజేసి నిత్యము నన్నుఁ బూజించువారు నాకుఁ బ్రియతములు. భానువారంబునను, షష్ఠితిథియందును నక్తవ్రతమును, సప్తమీతిథులయం దుపవాసము, సంక్రమణోపవాసమును జేసినయెడల, వారు దివ్యులగు బ్రాహ్మణులనియు, నాపూజకులనియుఁ దెలియవలయును. మత్పరాయణులై మద్భక్తులయి బ్రాహ్మణులను బూజించినయెడల, నాభోజకులు సతతము నాకుఁ బూజకులగుదురు. ఎవ్వరు నాయందు భక్తిలేక బ్రాహ్మణులను బూజింపరో వారు పూజార్హులును వందనార్హులును గానేఱరు. నన్ను ద్వేషించువారు గూడ నట్లే యగుదురు మఱియు నోగరుడాగ్రజా! యేభోజకులు దేవపితృమనుష్యపూజలకొఱకు మహాయజ్ఞములఁ జేయుదురో వారు నాకు మిక్కిలి ప్రియతములును భోజకోత్తములు నగుదురు. కాన సర్వప్రయత్నములచేతను పంచయజ్ఞములను జరుపుచుండవలయును ఏభక్తులు ప్రతిదినము నేకవారాశనముఁ జేయు

---

ణుష్వ ఖగశ్రేష్ఠ భూత్వా చైకాగ్రమానసః. ౧౦. దేవద్విజమనుష్యాణాం పితౄణాం చాపి పూజకాః, తే ప్రియా మమ వైనిత్యం శక్తాః పూజయితుం రవిమ్. ౧౧. యేషాం ముండం శిరో నిత్యం యే చాభ్యంగసమన్వితాః, వాదయంతి చ యే శంఖం దివ్యాస్తే భోజకా మతాః. ౧౨. త్రికాలం యే చ మాం నిత్యం సుస్నాతాః క్రోధవర్జితాః, పూజయంతి ఖగశ్రేష్ఠ తే ప్రియా మమ భోజకాః. ౧౩. వారే మదీయే నక్తం తు షష్ఠ్యాం యే చ ప్రకుర్వతే, సప్తమ్యాముపవాసం తు తథా సంక్రమణే మమ. ౧౪. దివ్యాస్తే బ్రాహ్మణా జ్ఞేయా భోజకా మమ పూజకాః, పూజయంతి చ యే విప్రాన్మద్భక్తా మత్పరాయణాః, తే ప్రియాః సతతం మహ్యం భోజకా గరుడాగ్రజ. ౧౫. మయి భక్తిం న కుర్వంతి బ్రాహ్మణాన్పూజయంతి నో, న తే పూజ్యా న వంద్యాశ్చ యే ద్విషంతి చ మాం సదా. ౧౬. యే కుర్వంతి మహాయజ్ఞాన్భోజకా గరుడాగ్రజ, పితృదేవమనుష్యాణాం పూజార్థం సంతతం ఖగ. ౧౭. ప్రియాస్తే సతతం వీర భోజకానాం తథోత్తమాః, తస్మాత్సర్వప్రయత్నేన పంచయజ్ఞాన్ప్రవర్తయేత్. ౧౮. ఏకభక్తేన యే

దురో వారు నాకుఁ బ్రియులగుదురు. రాత్రిభోజనము చేయనివారును నాకుఁ బ్రియులే. భానువారమునందును షష్ఠితిథియందును రాత్రిభుజింపని మగుఁడు నాకుఁ బ్రియుఁడు. ఎవ్వరు ప్రతివత్సరమును పితృమాతృదేవతలకు శ్రాద్ధముఁ జేయరో వారును నాకుఁ బ్రియులుగారు. ఇట్టి భోజకులును, మాఘమాసమున సప్తమియు, పుష్పములలోఁ గరవీరమును, రక్తచందనమును, బ్రాహ్మణులలోఁ బురాణవాచకుండును, నైవేద్యములలో మోదకములును, ఘృతాహుతులును, క్షీరస్నపనమును, వాద్యములలో శంఖశబ్దమును, నృత్యము నాట్యము పంచవర్ణపతాకములు శ్వేతచ్ఛత్రంబును మొదలగునవి యన్నియుఁ బ్రియతమములుగా భాసించును. ఓఖగోత్తమా! భోజకులచేఁ జేయఁబడిన పూజ నన్నెట్లు ప్రీతునిగాఁ జేయునో యన్యవర్ణములవారిచేఁ జేయఁబడిన పూజ యట్లు ప్రీతునిగాఁ జేయఁజాలదు. కాన భోజకు లన్యదేవతలను బ్రతిష్ఠింపఁగూడదు. వాసుదేవుం డిట్లనియె. భగవంతుఁ డగుదేవుఁడు పూర్వ మరుణున కిట్లుఁ జెప్పి, యామీఁద మేరుపర్వతము నాక్రమించెను. ఈరీతిగ భోజకులు భోజ్యులైరి. ఎన్నఁడు నభోజ్యులు గారు. అనుష్ఠానవిహీనులగుభోజకులు భోజ్యులు గానేరరు. భూమియం దుత్పన్నులగు

నిత్యం వర్తంతే కశ్యపాత్మజ, భుంజతే న చ యే రాత్రౌ భోజకాస్తే ప్రియా మమ. ౧౯. మమ వారే చ యే వీర తథా షష్ఠ్యాం చ కేశవ, న రాత్రౌ భుంజతే ప్రాజ్ఞా మత్ప్రియాస్తే మగాః ఖగ. ౨౦. ప్రతిసంవత్సరం యే తు భోజకా గరుడాగ్రజ, న యచ్ఛంతి పితుర్మాతుర్దివసే తేన మే ప్రియాః. ౨౧. ఇత్థం భూతా భోజకా యే మాఘమాసే చ సప్తమీ, పుష్పాణాం కరవీరాణి తథా రక్తం చ చందనమ్. ౨౨. వాచకో బ్రాహ్మణానాం తు నైవేద్యం మోదకాస్తథా, ఘృతాహుత్యో గుగ్గులశ్చ క్షీరేణ స్నపనం తథా. ౨౩. వాద్యానాం శంఖశబ్దశ్చ నృత్యం నాట్యం మతం మమ, పంచవర్ణాః పతాకాస్తు శ్వేతం ఛత్రం చ మే ప్రియమ్.౨౪. నాన్యవర్ణైః కృతా పూజా తథా ప్రీణాతి మాం ఖగ, యథా కృతా భోజకేన పూజా ప్రీణాతి మాం సదా,నాన్యదేవప్రతిష్ఠా తు కర్తవ్యా భోజకేన తు ౨౫. వాసుదేవ ఉవాచ.—ఇత్యుక్త్వా భగవాన్దేవశ్చారుణాయ పురానఘ, లక్షణం భోజకానాం తు తతో మేరుమథాక్రమత్. ౨౬. ఏవం భోజ్యా భోజకాస్తు న చాభోజ్యాః కదాచన, అనుష్ఠానవిహీనా యే న తే భోజ్యాస్తు భోజకాః. ౨౭. భౌమాస్తు బ్రాహ్మణా యే తు అనుష్ఠానవివర్జితాః, తేఽప్య

బ్రాహ్మణు లనుష్ఠానవిహీను లైనచో నభోజ్యులే యగుదురు. వికర్మస్థు లైనయెడల మఱియు నిస్సంశయము. నాల్గువర్ణములకును భోజకుని విడచి మాంగల్యమును, పావనమును, పూజ్యతమము నగువస్తు వేదియు లేదు. భోజకునిఁ బూజించినయెడల నాదిత్యునిఁ బూజించినట్లే యగును. ఎవ్వని గృహంబున భోజకులు భుజించుచుందురో యాగృహమున భానుఁడును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులును స్వయముగ భుజించుచుందురు సూర్యుఁడేవిధమున సర్వసత్త్వములకుఁ బ్రధానుఁడయ్యెనో యట్లే భోజకుఁడు గూడఁ బూజ్యుఁడయ్యెను. క్షేత్రములలోఁ గురుక్షేత్రము.సరస్సులలో,సాగరము నెట్లు పూజ్యతమములో యట్లే పూజ్యులలో భోజకుఁడును బూజ్యుఁడు. మఱియు నీభోజకుఁడు సూర్యభక్తులకు విశేషముగాఁ బూజనీయుఁడు. స్త్రీకి భర్తవలెను, శిష్యునకు గురువువలెను, సూర్యభక్తునకు భోజకుఁడు పూజ్యతముఁ డగును. గంధపుష్పాద్యర్చితుండై భోజకుం డెవ్వనిద్రవ్యమును భుజించునో వానిద్రవ్యమును భానుఁడును పితృదేవతలును స్వయముగ భుజించిన ట్లగును. భోజకు లీరీతిగఁ బూజ్యులును భోజ్యులు గూడ నైరి. మఱియు నేసూర్యభక్తులు నిర్వికల్పులై భోజకాన్నమును భుజింతురో వారు పాపవిముక్తులై సూర్యసాలోక్యమును బొందుదురు. పూర్వము చెప్పఁబడినట్లుగా భోజకుఁడు దుర్గుణరహితుఁడై యుండవల

---

భోజ్యా భవంతీహ వికర్మస్థా విశేషతః. ౨౮. నాస్తి పూజ్యతమం కించిన్మాంగల్యం పావనం తథా, చతుర్ణామిహ వర్ణానాం ముక్త్వా భోజకముత్తమం, పూజితే భోజకే వీర ఆదిత్యః పూజితో భవేత్. ౨౯. భుంజతే యస్య వై గేహే భోజకా యదునందన, తస్య భుంక్తే స్వయం భానుర్బ్రహ్మా విష్ణుస్తథా శివః. ౩౦. యథేహ సర్వసత్త్వానాం ప్రధానత్వే స్థితో రవిః, తథేహ సర్వభూతానాం భోజకః పూజ్య ఉచ్యతే. ౩౧. తీర్థానాం తు కురుక్షేత్రం సరసాం సాగరో యథా, తథా పూజ్యతమో జ్ఞేయః పూజ్యానాం భోజకో విభో. ౩౨. విశేషేణ చ సౌరాణాం భోజకః పూజ్య ఉచ్యతే, భర్తా పూజ్యో యథా స్త్రీణాం శిష్యాణాం చ యథా గురుః, భోజకస్తు తథా పూజ్యః సౌరాణాం హృదికాత్మజ. ౩౩. యస్య భుంక్తే భోజకస్తు గంధపుష్పాదినార్చితః, తస్య భుంక్తే స్వయం భానుః పితరో దేవతాస్తథా. ౩౪. ఏవం పూజ్యాస్తథా భోజ్యా భోజకా హృదికాత్మజ, యే సౌరా భోజకస్యాన్నం భుంజతే నిర్వికల్పతః, తే సర్వే పాపనిర్ముక్తా యాంతి సూర్యసలోకతామ్. ౩౫. కథితో యత్ర యో భోజ్యో యథా

యును. పెక్కుమాటలతోఁ బ్రయోజనంబేమి? పర్యవసానముఁ జెప్పెద నాకర్ణింపుము. వేదముకంటె నెక్కుడగు శాస్త్రమును, గంగతో సమాన మగు నదియును, అశ్వమేధముతో సమానమగు పుణ్యమును, పుత్రునితో సమానమగుసుఖమును, భానునితో సమానుఁడగు దేవుఁడును, తల్లితో సమమగు గతియును నెందును నుండదు. ఇవియన్నియు నెట్లుత్తమములో యట్లే భోజకుఁడును నుత్తముఁడని భాస్కరుఁడుఁ జెప్పెను.

ఇది సప్తచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

---

## అష్టచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. తరువాత మహాతేజస్సంపన్నుఁడగు సాంబుఁడు తండ్రిహస్తమున జ్వాలామాలలచే భయంకరంబును మహాతేజో యుక్తంబును నగు చక్రముఁ జూచి శ్రద్ధాసమన్వితంబగు భక్తితోఁ దండ్రి నడిగెను. తండ్రీ! యీసూర్యసదృశంబగు చక్రము నెవ్వరినుండి పొందియుంటివి? ఈదివ్యాయుధము నెందులకై ధరించుచుంటివి? ఈసర్వమును నాకుఁ జెప్ప వేఁడుచున్నాననిన వాసుదేవుఁ డిట్లనియె. సాంబా! నీవు చాలబాగుగఁ బ్రశ్నించితివి. ఈచక్రమునకుఁ గలచరిత్ర

---

భోజ్యాః స వర్జితాః, అథ కిం బహునోక్తేన శ్రూయతాం వచనం మమ. ౩౬. నాస్తి వేదాత్పరం శాస్త్రం నాస్తి గంగాసమా సరిత్, అశ్వమేధసమం పుణ్యం నాస్తి పుత్ర సమం సుఖమ్. ౩౭. నాస్తి భానుసమో దేవో నాస్తి మాతృసమా గతిః, యథైతాని సమస్తాని ఉత్తమాని యదూత్తమ, తథోత్తమో భోజకస్తు సంప్రోక్తో భాస్కరేణ తు.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే భోజకలక్షణవర్ణనం నామ సప్తచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అథ సాంబో మహాతేజా దృష్ట్వా చక్రం పితుః కరే, జ్వాలామాలాకరాలం తు మహతా తేజసాన్వితమ్. ౧. పప్రచ్ఛ పితరం సాంబో భక్త్యా శ్రద్ధాసమన్వితః, కుతస్తాత త్వయా ప్రాప్తం చక్రమాదిత్యసన్నిభమ్. ౨. కిమర్థం మహాతే దేవ దివ్యమాయుధముత్తమం, ఏతదాఖ్యాహి మే సర్వం శ్రోతుకామస్య కౌతుకాత్. ౩. వాసుదేవ ఉవాచ.—సాధుసాధు మహాబాహో సాధు పృష్టోఽస్మ్యహం త్వయా,

మును (విధినిర్ణయమును), జెప్పెద నాలకింపుము. సూర్యు నుద్దేశించి వేయిదివ్యసంవత్సరములు తపం బాచరించుటచే నాతఁడు ప్రసన్నుఁడై నా కీచక్రమును బ్రసాదించెను. ఆకాశగామియు, పంచకారూఢుండును, సోమాదిగ్రహములు నాభిమూలమునఁగలవాఁడును నగుదివాకరుండును, ద్వాదశాదిత్యులును నీచక్రముయొక్క ప్రతియాకులయందును గ్రమముగ నుండిరి. మఱియుఁ బృథివ్యాదులు మున్నగునవి యేతత్త్వమునందుఁ జెప్పఁబడినవో యాతత్త్వముచే గాలాత్మకంబగు నీచక్రము వ్యాప్తంబై యుండెను. పరాపరచక్రములవృత్తాంతము సంక్షేపముఁగాఁ జెప్పితి ననిన సాంబుం డిట్లనియె. ఈచక్రము కాలమయ మెట్లయ్యె? కమలమయమని చెప్పుట కేమికారణమో చెప్పుము. అనిన వాసుదేవుం డిట్లనియె. కమలము ఆరుబుుతువులను నారుదళములను ధరించియుండును. పురుషాధిష్ఠితమగు నాకమలమునందు రవి సాంగముగా నుండును ఏది కాలత్రయముగ లోకమునఁ జెప్పఁబడుచున్నదో అది నాభిత్రయమని చెప్పఁబడుచున్నది. పదిరెండుమాసంబులును పదిరెండాకులుగను, పక్షంబులు ప్రధులుగను జెప్పఁబడినవి. దక్షిణోత్తరాయణంబులు చక్రంబులుగఁ జెప్పఁబడెను. మార్గమునందు నాభులయందు యోగమునందును దపనాదియోగము లున్నవి. నక్షత్రములు గ్రహములు గూడ దీనియందే యుండును. ఇట్లు

---

శృణుష్వైకమనాః పుత్ర చక్రస్య విధినిర్ణయమ్. ౪. దివ్యం వర్షసహస్రం తు భాను మారాధ్య శ్రద్ధయా, ప్రాప్తం చక్రం మయా తస్మాద్భాస్కరా ల్లోకపూజితాత్. ౫. నభోగః పంచకారూఢః స్థితః సాక్షాద్దివాకరః, గ్రహాః సోమాదయో యస్య సంస్థితా నాభిమండలే. ౬. ఆదిత్యా ద్వాదశసమా అరేషు క్రమశ స్తథా, ప్రోక్తం పథిషు తత్త్వాని పృథివ్యాదీని యాని వై. ౭. ఏతై స్తత్త్వైః పరివ్యాప్తం చక్రం కాలాత్మకం పరం, సంక్షేపాత్తే మయా ఖ్యాతం దత్తం చక్రమివాపరమ్. ౮. సాంబ ఉవాచ.— కథం కాలమయం దేవ చక్రం కమలముచ్యతే, ఇదం తావన్మమాచక్ష్వ జ్ఞాతుమిచ్ఛామి తత్త్వతః. ౯. వాసుదేవ ఉవాచ.—కమలం హ్యృతుభిః షడ్భిః షడ్దలం చాక్ష యాశ్రితం, పురుషాధిష్ఠితం తద్ధి తత్ర సాంగో రవిః స్థితః. ౧౦. యచ్చ కాలత్రయం లోకే తన్నాభిత్రయముచ్యతే, మాసా అరా మహాబాహో పక్షాశ్చ ప్రధయః స్మృతాః. ౧౧. నేమీ చైవ పరే ప్రోక్తే అయనే దక్షిణోత్తరే, పథినాభిషు యోగే చ యోగాఖ్యా స్తపనాదిభిః. ౧౨. నక్షత్రాణి గ్రహాశ్చైవ సదా చాత్ర స్థితాః స్మృతాః,

స్థూలసూక్ష్మప్రభేదానుసారమున వీని నన్నింటిని నీచక్రము వ్యాపించియున్నది. ఇచ్చట నుద్దిష్టంబగు కాలంబును నాచే నుద్దేశింపఁబడని యుగాదికల్పాంతపర్యంతము గూడ దీనియందే యుండును. కాలాత్మకమగు చక్రమునుగూర్చి సంక్షేపముగాఁ జెప్పితిని ఇట్టి గుణములుగల చక్రముఁ బ్రదీప్తంబగు సూర్యమండలంబునుండి రాక్షససంహారము కొఱకు దివాకరునివలన నేను బొందితిని. నే నాసూర్యుని గొప్పదగు తపస్సుచే నారాధింప సంతుష్టుఁడై యాజగద్గురుఁడు నాకీచక్రమును బ్రసాదించెను కాన నెల్లప్పుడును గ్రహతత్త్వపరివృతుండగు సూర్యునిఁ బూజించుచుంటిని. భక్తుఁడగు నేపురుషుఁడు చక్రస్థుండగు సూర్యునిఁ బూజించునో వాఁడు తేజమున సూర్యసమానుఁడై పుష్పోత్తరపురమును జేరఁగలఁడు. కాన నాకులంబున కానందసంపాదకుండగు మిత్రునిఁ బూజించుచుంటిని. గ్రహతత్త్వపరివృతుండగు సూర్యుని స్వమంత్రంబులచే భక్తిపురస్సరంబుగాఁ బూజించుచుంటిని సప్తమీతిథియందు చక్రమును వ్రాసి దివాకరునిఁ బూజించినను రక్తచందనముచేతను కుంకుమచేతను, సుగంధయుక్తంబులగు చూర్ణాదులచేతను, రక్తవర్ణంబులచేతను, రక్తకమలంబులచేతను, శ్వేతకరవీరపుష్పములచేతను, నితరములగు పుష్పములచేతను, పక్వములగుఫలములచేతను, ఓషధులచేతను, దూర్వాంకు

---

ఏతైర్వ్యాప్త మిదం చక్రం స్థూలసూక్ష్మప్రభేదతః. ౧౩. అత్రోద్దిష్టేషు కాలేషు యే నోద్దిష్టా మయా తవ, యుగాదికల్పపర్యంతా స్తేఽపి చాత్ర స్థితాః క్రమాత్. ౧౪. యత్తే కాలాత్మకం చక్రమిదం సంక్షేపతో మయా, కథితం తద్వినిష్క్రాంతం ప్రదీప్తాత్సూర్యమండలాత్. ౧౫. అసురాణాం వధాయేదం మయా లబ్ధం దివాకరాత్, ఆరాధ్య తపసా సూర్యం పురాకల్పే జగద్గురుం, అతః సంపూజయామ్యేనం గ్రహైస్తత్త్వైర్వృతం సదా. ౧౬. అర్కం భక్తో హి చక్రస్థం యః పూజయతి భక్తిమాన్, తేజసా రవిసంకాశః పుష్పోత్తరపురం వ్రజేత్. ౧౭. తస్మాత్తం మత్కులానందం మిత్రం సంపూజయామ్యహం, గ్రహైస్తత్త్వైర్వృతం భక్త్యా స్వమంత్రైః సతతం విభుమ్. ౧౮. సప్తమ్యాం చక్రమాలిఖ్య యే యజంతి దివాకరం, రక్తచందనపూర్ణేన కుంకుమేన సుగంధినా. ౧౯. పిష్టగంధాదిభిర్వాపి రక్తవర్ణకమిశ్రకైః, రక్తైశ్చ కమలైః శుద్ధైః కరవీరైః సుగంధిభిః. ౨౦. అన్యైర్వా కుసుమైర్వన్యైః ప్రత్యగ్రైర్జంతువర్జితైః, అపర్యుషిత నిశ్ఛిద్రైః శుభధన్యైర్దళైరపి. ౨౧. ఫలైః పక్వైరోషధిభిస్తథా దూర్వాంకురైః కుశైః,

రములచేతను, కుశలచేతను, ననేకవిధంబులగు ధూపంబులచేతను, వస్త్రాభరణములచేతను, భక్ష్యభోజ్యములచేతను, పానీయంబులచేతను, రసములచేతను, లేహ్యంబులచేతను, వితానశోభగల పలాశంబుల చేతను, ఛత్రచామరఘంటాభూషణదర్పణాదులచేతను, నృత్యవాదిత్ర గీతంబులచేతను, వేదంబులచేతను, పుణ్యకథలచేతను, జయఘోషంబుల చేతను పూజింపవలయును. మఱియు నీపూజోపయుక్తంబులగు ఫల పుష్పంబులు నూతనములుగను అపర్యుషితంబులుగను, అచ్ఛిద్రంబులు గను నుండవలయును. అట్లు పూజించినయెడల సంపూర్ణములగు సర్వకామములను నిర్విఘ్నముగఁ బొందఁగలరు. ఒకసారి పూజించిన యెడల స్వచక్రము నిర్విఘ్నముగ వృద్ధిబొందును పరచక్రము హతం బగును. సంక్రమణములయందును, గ్రహణములయందును నీచక్రమును వ్రాసి దీనిని జపించినచో గ్రహములన్నియు సానుగ్రహములుగాఁగలవు మఱియు సర్వరోగవిహీనులును, సర్వదుఃఖవర్జితులును, ధర్మాత్ములునై సర్వభోగములు గలిగి చిరకాలము జీవింపఁగలరు. సాంబా! యీ చక్రయోగమును నీకుఁ జెప్పియుంటిని. ఈచక్రయోగము సూర్యుని సర్వయజ్ఞములలో శ్రేష్ఠమును, సిద్ధిప్రదంబును, పుణ్యంబును, ధర్మ యుక్తంబును, పుష్టికరంబును, శత్రుఘ్నంబును నయియుండెను. ఇయ్యది

---

ధూపైశ్చ వివిధైర్గంధై స్తథా వస్త్రైశ్చ భూషణైః. ౨౨. భక్ష్యైర్భోజ్యైశ్చ పేయైశ్చ చోష్యైర్లేహ్యైశ్చ శక్తితః, వితానశోభాసికతైః పలాశై రుపశోభితైః. ౨౩. ఛత్ర చామరఘంటాభిర్భూషణైర్దర్పణాదిభిః, నృత్యవాదిత్రగీతైశ్చ వేదైః పుణ్యకథాస్వనైః, ౨౪. సర్వత్ర జయఘోషైశ్చ సంపూర్ణే పూజయంతి యే, సంపూర్ణాన్వివిధాన్కామా న్నిర్విఘ్నా న్ప్రాప్నువంతి తే. ౨౫. స్వచక్రం చాపి నిర్విఘ్నం వృద్ధిమాయాతి సువ్రత, హన్యతే పరచక్రం చ యత్రేదం పూజ్యతే సకృత్. ౨౬. సంక్రాంతౌ గ్రహణే చాపి లిఖిత్వా యో జపేదిదమ్, భవంతి నియతాః సాంబ తస్య సానుగ్రహా గ్రహాః. ౨౭. సర్వరోగవిహీనస్తు సర్వదుఃఖవివర్జితః, చిరం జీవతి ధర్మాత్మా సర్వైశ్వర్యసమన్వితః. ౨౮. ఏష వై కథితో వత్స చక్రయోగో మయా తవ, అర్కస్య సర్వయజ్ఞానాం శ్రేష్ఠః సిద్ధిప్రదో భృశమ్. ౨౯. పుణ్యో ధర్మ్యస్తథా పుష్ట్యః శత్రుఘ్నశ్చ విశేషతః, శ్వేతో

శ్వేతరక్తపీతకృష్ణములను వేర్వేరువర్ణములచే విభక్తమై యుండెను.

ఇది అష్టచత్వారింశదుత్తరశతతమాధ్యాయము.

## ఏకోనపంచాశదుత్తరశతతమాధ్యాయము.

సాంబుం డిట్లనియె. తండ్రీ! యేప్రమాణముగా చక్రమును నిర్మింపవలయును? అచ్చట నేపద్మ ముంచవలయును? నేమి మొదలగు వాటియొక్క విభాగము నెట్లు చేయవలయును? అనిన వాసుదేవుం డిట్లనియె. అరువదినాల్గంగుళములు వర్తులమగుప్రమాణమునఁ జక్రమును నిర్మించి యెనిమిదంగుళముల నేమిని నిర్మింపవలయును. నాభిక్షేత్రమును నచ్లే యుంచవలయును. ఆపద్మము త్రిగుణ మనఁబడును. ఆనాభిక్షేత్రమునకు మూఁడింతలై అరక్షేత్రమును పద్మముఁయొక్క కర్ణికా కేసరములును నుండవలయును కేసరములకు నాలుగవభాగము శేషపత్రములను చేయవలయును. పత్రసంధి ఆపత్రములో నాలుగవవంతును గల్గి యుండవలయును. కమలమును నాభియందున్నతమై యుండునట్లు చేయవలయును. ఆకమలములకు ప్రధులన్నియును నాకీర్ణముగను సంవిభక్తంబుగను జేయవలయును. ఆకులయొక్క అగ్రభాగము అంగుళప్రమాణముగ స్థూలముగా నుండవలయును. తరువాత బాహ్యభూమియుఁ గర్ణికాకేసరంబులును పీతములుగ నుండవలయును. సితంబుగ నాభి

---

రక్తోఽథ పీతశ్చ కృష్ణశ్చాపి విభాగశః. ౩౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే కలాచక్రవర్ణనం
నామ అష్టచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సాంబ ఉవాచ.—కిం ప్రమాణం లిఖేచ్చక్రం తత్ర పద్మం చ కిం భవేత్, నేమిప్రధ్యారనాభీనాం విభాగః క్రియతే కథమ్. ౧. వాసుదేవ ఉవాచ.—చతుః షష్ట్యంగులం చక్రం కృత్వా వృత్తం ప్రమాణతః, అష్టాంగులా భవేన్నేమిః సేయం విభవతః సదా. ౨. నాభిక్షేత్రం తథైవ స్యాత్పద్మం తత్త్రిగుణం భవేత్, అరక్షేత్రం చ పద్మస్య కర్ణికా కేసరాణి చ. ౩. కేసరస్య చ పాదేన శేషపత్రాణి కల్పయేత్, పత్రసంధిశ్చ పాదాంగం క్రమాత్తత్రాపి భిద్యతే. ౪. ఉన్నతం కమలం తత్తు కుర్యాన్నాభ్యాం న సంశయః, ఆకీర్ణాః సంవిభక్తాశ్చ కర్తవ్యాః ప్రధయః క్రమాత్. ౫. అంగులస్థూలమూలం స్యాదరాగ్రం త్రిగుణం తతః, భూమిః పీతా బహిర్జ్ఞేయా కర్ణికా

స్థలంబు నుండవలెను. అందు ద్వారములను కల్పింపవలయును. ఆద్వార చక్రమునకుఁ బ్రమాణము. ద్వారసదృశముగా హస్తప్రమాణముగ నుండవలయును. మిగిలినదంతయు రక్తవర్ణమైయుండవలయును. పత్రము లన్నియును సంధులలోఁ గలసినవిగా నుండవలయును. నాభినేమ్యంతర ములయందు సితవర్ణంబులగు రేఖల నంగుళమాత్రమున నుంచవలయును. శ్వేతరక్తవర్ణములచేత శ్వేతముచేతను నంతట నుపశోభితమగు కపో లంబును ద్వారపద్మంబును ద్వారకోణంబున రచింపవలయును. ఇట్లు నాల్గు ద్వారములను నిర్మించి ఇంద్రద్వారమును నిర్మింపవలయును. తరువాతఁ బూర్వాపరాహ్ణంబులయందు వరుణుని ఆవాహనము చేయవలయును. ఇట్లు ద్వారములను నిర్మించి శాస్త్రోక్తపద్ధతిచే యథోక్తంబుగా దేవతల నందఱను బూజింపవలయును. ఇట్లు చక్రమును పూజార్థమై చెప్పితిని. ఈయజ్ఞముతో సంబంధముగలమనుజుఁడు అర్కమండలమున దీక్షితుఁడై యుండును. సాంబా! పూర్వము సూర్యుఁ డిట్లు నాకుఁ జెప్పియుండెను. అనిన సాంబుం డిట్లనియె. ఈచక్రయజ్ఞమునం దేమంత్రములు దేవతలకుఁ జెప్పఁబడినవి? ఈయజ్ఞమునకుఁ గ్రమం బెట్లు? వేర్వేరుగాఁ జెప్పుమనిన వాసుదేవుం డిట్లనియె. ఖషోల్కము హృదయాధ్యక్షమునుగ వెనుకటి

---

కేసరాణి చ. ౬. సితం నాభిస్థలం తత్ర ద్వారాణి పరికల్పయేత్, హస్తమాత్రం భవేత్తస్య తన్మానం ద్వారసన్నిభమ్. ౭. శేషం రక్తం సముద్దిష్టం సంహతాః పత్ర సంధయః, నాభినేమ్యంతరే లేఖాః సితాశ్చాంగులమానతః. ౮. సితరక్తసితాభిశ్చ సమంతాదుపశోభితమ్, కపోలం ద్వారపద్మం చ ద్వారకోణే ప్రకల్పయేత్. ౯. చతు ర్ద్వారం భవేదేవమైన్ద్రద్వారం ప్రకల్పయేత్, అపరాహ్ణేఽథ పూర్వాహ్ణే వరుణ మావాహయేత్సదా. ౧౦. ద్వారాణ్యేతాని సంవర్త్య యథోక్తవిధినా యజేత్, యథోక్తా దేవతాః సర్వాః స్వమంత్రైరేవ భక్తితః. ౧౧. చక్రమేవం సముద్దిష్టం యజనార్థం మయా తవ, యజ్ఞేనానేన సంబద్ధో దీక్షితశ్చార్కమండలే, ఇత్థం మే భానునా పూర్వమిదముక్తం వరానన. ౧౨. సాంబ ఉవాచ.—కే మంత్రాశ్చక్ర యజ్ఞేఽస్మిన్దేవతానాం ప్రకీర్తితాః, యజ్ఞక్రమశ్చ కః ప్రోక్తో రూపం కిం చ పృథక్పృ థక్. ౧౩. వాసుదేవ ఉవాచ.—ఖషోల్కం హృదయాధ్యక్షం పూర్వోక్తే కమలే

కమలమునఁ బూజింపవలయును. ఇటులనే కర్ణికదళములు మొదలగు వానిలోఁ గూడ నంగహృదయాదిన్యాసపూజ లొనర్పవలయును. నామ మంత్రములు చతుర్థ్యంతములుగా నుండవలయును. ఆచతుర్థ్యంతములకు పైన నమః యనుపదమును జేర్పవలయును. హోమకాలమున స్వాహాంత ములుగాఁ జేయవలయును. అన్నికర్మలయందును గర్మావసానంబుగాఁ బ్రయోగము ననుష్ఠింపవలయును (ఓంఖషోల్కాయవిద్మహే దివాకరాయ ధీమహి,తన్నఃసూర్యః ప్రచోదయాత్.)పుణ్యంబునుసర్వతత్త్వమయంబును బ్రహ్మగోత్రోద్భవంబును సూర్యప్రీతికరంబునునగు నీసావిత్రి యిరువది నాల్గక్షరములుగలదియై యుండెను. సర్వకర్మలయందును శ్రద్ధాళులగువా రీరీతిని మంత్రములను బ్రయోగింపవలయును. అట్లు ప్రయోగింపనిచో నిహపరలోకంబుల నాకర్మ వ్యర్థం బగును ఆకారణముచేఁ బ్రయత్న పూర్వముగ మంత్రములను ప్రయోగములను దెలిసికొని యథావిధిగఁ గర్మ ననుష్ఠించి యీప్సితార్థములను సాధింపవలయును. అనిన విని సాంబుఁ డిట్లనియె. తండ్రీ! యీయాదిత్యమండలమునందలిదీక్ష యెవనికిఁ గర్తవ్యము? దాని నెట్లు చేయవలయును? ఎప్పుడు చేయవలయును? ఎందు లకై చేయవలయును? ఎవఁడు చేయవలయును? అదియంతయు వివరముగా నాకుం జెప్ప వేఁడుచున్నాను. అనిన వాసుదేవుం డిట్లనియె. బ్రాహ్మణక్షత్రి యవైశ్యులలోఁగాని,కులీనుఁడగుశూద్రుఁడుగాని,యిట్టికులశీలములుగల

---

యజేత్, కర్ణికాయాం దలేష్వేవమంగాని హృదయాది చ. ౧౪. నామమంత్రాశ్చతు ర్థ్యంతా స్తేషాం పూర్వోక్తకోటయః, నమస్కారశ్చ సర్వత్ర ఏష ఏవ విధిః స్మృతః. ౧౫. స్వాహాంతా హోమకాలే చ కర్మస్వన్యేషు తే పునః, యథా కర్మావసానాశ్చ ప్రయోక్తవ్యాః సమాసతః. ౧౬. ఓం ఖషోల్కాయ విద్మహే దివాకరాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్. ౧౭. సావిత్రీ చ మహాబాహో చతుర్వింశాక్షరా మతా, సర్వతత్త్వమయీ పుణ్యా బ్రహ్మగోత్రార్కవల్లభా. ౧౮. ఏవం మంత్రాః ప్రయోక్తవ్యాః సర్వకర్మస్వతంద్రితైః, అన్యథా విఫలం కర్మ భవేదిహ పరత్ర చ. ౧౯. తస్మాత్సర్వప్రయత్నేన మంత్రాన్జ్ఞాత్వా విధిం తథా, యథావత్కర్మ తత్కృత్వా సాధయేదీప్సితం ఫలమ్. ౨౦. సాంబ ఉవాచ.—ఆదిత్యమండలే దీక్షా కస్య కార్యా కథం చ సా, కదా కేన కిమర్థం చ కథయేదం మమాఖిలమ్. ౨౧. వాసుదేవ ఉవాచ.— బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం కులీనం శూద్రమేవ చ, పురుషం వా స్త్రియం వాపి

స్త్రీయైనను అర్కమండలంబున దీక్షితులుగా నుండవలయును. దీక్షితుం డగువాడు స్వయముగా భక్తిపరుండై గురుసన్నిధానమున కరిగి నమస్కరింపవలయును. అటుపిమ్మట సత్యవాగ్వ్రతుడును, శుచియును, కల్పజ్ఞుడును, బ్రాహ్మణుడును నగు నాగురు వీశిష్యుని దీక్షయందు నియోగింపవలయును. షష్ఠితిథియందుఁ బూర్వోక్తవిధిచే నగ్న్యాధానముజేసి సూర్యునిఁ బూజించి అగ్నిహోత్రంబున హవిస్సుచే సూర్యునికి హోమంబు జేసినతరువాత స్నాతుడును, ఆచాంతుడును, ఖషోల్కాకృతిమంతుడును నగు శిష్యుని స్వాంగములచే నాలింగనముజేసికొని దర్భయుక్తంబులగు నక్షతలచేతను, పుష్పంబులచేతను అంగములను బూజించి బలివిధిని నెరవేర్చవలయును. ఆదిత్యుడు, అగ్ని, వరుణుడు, అర్కుడు వీరలను హృదయముచేతనే పూజింపవలయును. మఱియు ఘృతము, క్షీరము, తండులములు వీట్లచే సప్రమాణంబులుగా మూడుదోసిళ్లచేతను దేవుని నిమిత్తమై యగ్నియందు హోమముజేసి హుతశేషమగుదానిని శిష్టుండగు వాని కొసంగి విడచి పిమ్మట క్షీరవృక్షోద్భవంబగు పదిరెండంగుళముల పొడవుగల దంతకాష్ఠమును దంతధావనంబుకొఱ కొసంగి దానిని దంతములనుండి దీసి ప్రాగ్దిక్కునఁ బడవేయవలయును. ఆదంతకాష్ఠమునందే రసనామలమును గండూషజలమును నిష్ఠీవన చేయ

---

దీక్షయేత్సూర్యమండలే. ౨౨. స్వయం భక్త్యోపపన్నశ్చ ప్రణిపత్య గురుం తథా, గురుస్తం దీక్షయేద్విప్రః కల్పజ్ఞః సత్యవాక్శుచిః. ౨౩. షష్ఠ్యామగ్నిం సమాధాయ పూర్వోక్తవిధినా క్రమాత్, సంపూజ్యార్కం తథా పశ్చాద్ధుత్వా వై హవిషా రవిమ్. ౨౪. శిష్యం స్నాతమథాచాంతం ఖషోల్కాకృతివిగ్రహమ్, స్వాంగైరాలభ్య చాంగేషు దర్భవద్భిస్తథాక్షతైః. ౨౫. పుష్పైః సంపూజ్య చాంగాని దేయః కార్యో బలిస్తథా, ఆదిత్యో వరుణోఽర్కోఽగ్నిః సాధితో హృదయేన చ. ౨౬. భవేద్ ఘృతగుడక్షీరైస్తండులైశ్చ ప్రమాణతః, త్రిభిరంజలిభిర్హుత్వా దేవాయాగ్నౌ హుతం పునః. ౨౭. దత్త్వా శిష్టాయ ముక్త్వైవం దత్త్వాంతే దంతధావనమ్, క్షీరం వృక్షోద్భవం తస్మై ద్వాదశాంగులసన్నిభమ్. ౨౮. దంతక్లిష్టేఽపనీతే చ తేన ప్రాచ్యాం క్షిపేత్తతః, దంతధావనమాస్యం చ తదా తస్యోపరి క్షిపేత్. ౨౯. మైత్రావరుణమీశానం వక్త్రం సౌమ్యసమాశ్రితమ్, ప్రశస్తం దంతకాష్ఠస్య ముఖమన్యత్ర నిందితమ్. ౩౦. యాం దిశం దంతకాష్ఠస్య ముఖం పశ్యతి తత్ఫలిమ్, అర్చయేత్తేన శాంతిః స్యాదిత్యుక్తం

వలయును. అట్లు పడవేసిన దంతకాష్ఠముయొక్క మొగము ఈశాన్య దిక్కునందు పడుట ప్రశస్తము. ఉత్తరవర్తులమైయుండుట ప్రశస్తము. ఏదిక్కునకు పడునో యాదిక్పాలకునిఁ బూజింపవలయునని సూర్యుఁడానతిచ్చెను. మరల నావాక్యములను విని యంగములచే నాలంభనము జేసి లోచనములను బూజించి కించిత్కాల మాలోచించి జపంబుజేసి సంకల్పనమును నింద్రియసంయమనమును జరిపి సమాహితమనస్కుఁడై స్వయముగనే వరమును విని శయనింపఁజేయవలయును. ఆచమనమును జేసి కంకణపాణియును కృతద్రవ్యాధివాసుండునై యుదయముననే స్నానముచేసి అగ్నిలో హోమముజేసి హృదయపూర్వకముగ నమస్కరింప వలయును. రాత్రిజూడఁబడిన స్వప్నమునుగూర్చి శుభాశుభంబుల నడుగ వలయును. అశుభములను జూచినయెడలఁ దచ్ఛాంతినిఁ జేయవలయును. స్వప్నమునందు ప్రాసాదదేవతాగ్నిహోత్రములు, నదీయానములు, రమ్యములగు నుద్యానవనంబులు, పత్రపుష్పఫలసంయుతంబులగు నుపవనములును, కమలంబులును, రజతమయంబులగువస్తువులును, వేదపారగుఁడగు బ్రాహ్మణుఁడును, శౌర్యసంపన్నుఁడగురాజును, ధనాఢ్యుండగు వైశ్యుఁడును, శుశ్రూషణపరుఁడగు శూద్రుఁడును, తత్త్వార్థమును ప్రశస్తభాషణములు మొదలగువీట్లను చూచుటయు స్పృశించుటయు నధిరోహించుటయుఁ గూడ శ్రేష్ఠతమము. ప్రశస్తంబులగు వాహనంబు

---

భానునా స్వయమ్. ౩౧. పునస్తద్వచనం శ్రుత్వా అంగైరాలభ్య చ క్రమాత్, సంపూజ్య లోచనే తత్ర సంచింత్య పరిజప్య చ. ౩౨. కారయిత్వా చ సంకల్పం తథా చేంద్రియసంయమమ్, స్వాపయేత స్వయం చాపి వరం శ్రుత్వా సమాహితః. ౩౩. ఆచమ్య కృతరక్షస్తు కృతద్రవ్యాధివాసనః, హృదయేన నమేత్ప్రాతః స్నాత్వా హుత్వా హుతాశనమ్. ౩౪. స్వప్నం పృచ్ఛేద్యథా దృష్టం శుభం సంవాదయేచ్చ తమ్, హృదయేనాశుభే దృష్టే శతహోమం సమాచరేత్. ౩౫. స్వప్నే పశ్యతి హర్మ్యాణి దేవతానాం హుతాశనమ్, నదీయానాని రమ్యాణి ఉద్యానోపవనాని చ. ౩౬. పత్రపుష్పఫలాఢ్యాని కమలాని చ రాజతమ్, సంపశ్యతి యది స్వప్నే బ్రాహ్మణం వేదపారగమ్. ౩౭. రాజానం శౌర్యసంపన్నం ధనాఢ్యం క్షత్రియోత్తమమ్, శుశ్రూషణపరం శూద్రం యది తత్త్వార్థమాదిశేత్. ౩౮. ప్రశస్తం భాషణం చైవ యథా సంభవతో మతమ్, ఏతైః స్పర్శనమేతేషాం శ్రేష్ఠమారోహణం తతః. ౩౯. వాహనాని

లును ప్రాసాదంబులను నావను నధిష్ఠించినటుల స్వప్నమునందుఁ గనేనేని మహాదైశ్వర్యంబును బొందును. మఱియు నాజ్యము, క్షీరము, మాంసము, సోమము వీట్లను పానముజేసినను, హవిస్సును భుజించినను, కాశ్యపలోక మును బొందుదురు. వస్త్రములను, రత్నములను వివిధములగునాభరణ ములను భూమి గోవులు ధాన్యోపకరణంబులు వీట్లను బొందినట్లయిన శుభదర్శనంబగును అశుభానుగములగు స్వప్నము లశుభములనియు, శుభానుగ స్వప్నములు శుభములనియుఁ జెప్పఁబడును. అశుభమును కలుగఁజేయునదిగాన నశుభస్వప్నమునకు శాంతిఁజేయవలయును. క్రమం బుగ సప్తమీతిథియందు భాస్కరుని వ్రాసి ముక్తిభుక్తులకై పూజించి శిష్టులగువిప్రులఁ దృప్తులంజేసి పూర్వరీతి గురువర్యులకు నమస్కరింప వలయును. అన్యథా ప్రవర్తింపఁ గూడదు. మఱియుఁ బురుషుఁడు భాస్కరుని యథాక్రమముగ సమాలంభనముఁజేసి సర్వగ్రహంబుల తత్త్వంబులయం దాలేఖనమును నియోగింపవలయును. విశుద్ధులలో విశుద్ధుఁడగు నాభోజకు నాదిత్యువలెఁ బూజించి భూమియందంతట నేను చెప్పినరీతిగ సూర్యమండలమున నియోగింపవలయును. ఇట్లు మనంబున ధ్యానించి నూఱుపర్యాయములు హోమముఁ జేయవలయును. ఈరీతిగ సర్వమంత్రంబులచేఁ గ్రమంబుగఁ బరాపరంబుగ దీక్షనంతను చెప్పితిని.

---

ప్రశస్తాని ప్రాసాదం నావమేవ చ, పర్వతం చ సమారుహ్యా విపులాం భార్గవీం భజేత్. ౪౦. పీత్వా సురాం సముద్రం చ దధ్యాజ్యం క్షీరమేవ చ, సోమం మాంసం హవి ర్భుక్త్వా కాశ్యపీం లభతే నరః. ౪౧. లబ్ధ్వా వస్త్రాణి రత్నాని వివిధాభరణాని చ, వాహనాని మహీం గాశ్చ ధాన్యోపకరణాని చ. ౪౨. సమృద్ధిమాప్నుయాత్కించి త్స్వప్నానాం దర్శనం శుభమ్, శుభకర్మానుగం యచ్చ తత్సర్వం శుభముచ్యతే. ౪౩. తస్మాదన్యదనిష్టం స్యాత్తస్మాద్యుక్తా ప్రతిక్రియా, క్రమాదాలిఖ్య సప్తమ్యాం తత్ర సంపూజ్య భాస్కరమ్. ౪౪. తర్పయిత్వా ద్విజాఞ్ఛిష్టానానమ్య పూర్వవద్గురుమ్, సృష్టిక్రమేణ భృత్యర్థం ముక్త్యర్థం నాన్యథా భవేత్. ౪౫. దివాకరం సమాలభ్య పురుషోథ యథాక్రమమ్, సర్వగ్రహేషు తత్త్వేషు యథావత్తన్నియోజయేత్. ౪౬. విశుద్ధేషు విశుద్ధం తం ధ్యాత్వా చాదిత్యవత్క్రమాత్, నియోజయేత్పృథివ్యాశ్చ తతః ప్రభృతి సర్వశః. ౪౭. ఆదిత్యమండలం శుద్ధం సర్వముక్తం నియోజయేత్, ఏవం తు మనసా ధ్యాత్వా జుహుయాచ్చైవ తం శతమ్. ౪౮. సర్వైర్మంత్రైః క్రమాదేవం

తరువాత నాదిత్యమండలమునఁ బుష్పంబులఁ జల్లి యంజలిని ముఖసన్ని ధానమునం జేర్చి యంజలియందుఁ బుష్పము లుంచుకొని యాపుష్పాంజలిని కులవిశుద్ధికై యాతనిపైఁ బడవేయవలయును. ఆపుష్ప మాతని కేభాగమునఁ బడునో యాదిక్పాలునికుల మాతనిదని యెంచవలెను. ఆదిత్యసంయుక్తమగు నామంబుఁగూడఁ జెప్పవలయును. ఇట్లు పూజింపుచు నర్కభాషితములఁ బఠించి వినిపింపవలయును. మనుజుఁడు సర్వదినములఁ ద్రికాలంబుల సూర్యున కభిముఖుఁడై నిలచి యుపస్థానము నర్చనముం జేయుచుండవలయును. పగటియందు సూర్యుని దర్శింపక భుజింపఁ గూడదు. రాత్రుల నగ్నిదర్శనములేక భుజింపరాదు. మఱియు నీసూర్యాసనముఁ బాదములతో స్పృశింపరాదు. తిరస్కరింపనురాదు. విగ్రహాచ్ఛాయ నుల్లంఘింపఁగూడదు. మఱియు నక్షత్రములను గ్రహములను యోగంబులను మాసంబుల మాసాధిపతుల అయనంబుల ఋతువులను పక్షంబులను దివసములను కాలమును సంవత్సరము నితరంబులగు కాలసంజ్ఞకంబులను బ్రవర నుచ్చరింపుచు నమస్కరించి పూజింపవలయును కాన భగవంతుఁడగు సూర్యుడు కాలస్వరూపుఁడనియుఁ గాలాధిపుఁడనియుఁ జెప్పవలయును. మఱియు సకలజ్యోతిర్గణంబులకును

---

దీక్షా ప్రోక్తా పరాపరా, కృత్వైవ పుష్పపాతం తు తస్మిన్నాదిత్యమండలే. ४९. బద్ధ్వాస్యమంజలౌ పుష్పం కృత్వా దత్త్వా చ మంత్రితమ్, క్షిపేద్వై కులశుద్ధ్యర్థం నామార్థం చ విశేషతః. ౫౦. యత్ర తత్పతితం పుష్పం తస్య తత్కులమాదిశేత్, నామ చాదిత్యసంయుక్తమిత్యుక్తం భానునా స్వయమ్. ౫౧. సంపూజ్య శ్రావయేత్తత్ర సమయానర్కభాషితాన్, ప్రాతః సాయం చ మధ్యాహ్నే రవేరభిముఖః స్థితః. ౫౨. ఉపస్థానం సదా కుర్యాదర్చనం చ సదా నరః, అదృష్ట్వార్కం న భోక్తవ్యం దివా రాత్రౌ హుతాశనమ్. ౫౩. దృష్ట్వా భోక్తవ్యమర్కాఖ్యం న భోక్తవ్యం కదాచన, న చ పద్భ్యాం స్పృశేత్తద్వన్నాసనం పరివర్జయేత్. ౫४. న లంఘ్యా ప్రతిమాచ్ఛాయా న లంఘ్యా స్థితయః క్వచిత్, నక్షత్రాణి గ్రహా యోగా మాసా మాసాధిపాశ్చ యే. ౫౫. అయనే ఋతవః పక్షాస్తథైవ దివసాని చ, కాలః సంవత్సరశ్చాపి యః కశ్చిత్కాల ఉచ్యతే. ౫౬. అభివంద్యః స సర్వోఽపి నమస్యః పూజ్య ఏవ చ, తస్మాత్కాలాధిపః సూర్యః స్వయం కాలశ్చ పఠ్యతే. ౫౭. జ్యోతిర్గణస్య సర్వస్య

స్థావరజంగమంబులకును చేతనాచేతనంబులకును సర్వాత్మ యని ప్రసిద్ధుఁ డయ్యెఁ గాన నో రాజా! యీతనిఁ ద్రికరణశుద్ధిగ నమస్కరించి పూజింప వలయునేగాని మనోవాక్కాయకర్మాన్యతమంబులచేనైనను నిందింపఁ గూడదు. నిర్మాల్యమును దాటినయెడల హస్తపాదంబులఁ బ్రక్షాళనముఁ జేసికొని నమస్కరించి యాత్మ దేహము సూర్యునకు సమర్పింపవలయును. భుక్తిముక్తులఁ గలుగఁజేయు నుత్కృష్టమగు నీదీక్షను విభజించి నీకు సంక్షేపరూపముగాఁ జెప్పితిని.

ఇది ఏకోనపంచాశదుత్తరశతతమాధ్యాయము.

---

## పంచాశదుత్తరశతతమాధ్యాయము.

వాసుదేవుఁ డిట్లనియె. తరువాత స్థండిలంబున సూర్యు నెట్లా రాధింపవలయునో చెప్పెద నాకర్ణింపుము. సాంబా! యెనిమిదిమండలంబులచే శుభప్రదంబగు కాలచక్రమును నిర్మించి తన్మధ్యంబున ద్వాదశారయుక్తంబును పద్మాకారంబునగు చక్రమును రచింపవలయును. తన్మధ్యంబున నష్టదళయుక్తంబగు పద్మమును రచియించి తన్మధ్యంబున సహస్రకిరణాయుధుండును, చతుర్బాహుండును నగుసూర్యభగవాను

---

స్థావరాస్థావరస్య చ, చేతనాచేతనస్యాపి సర్వాత్మా యః ప్రకీర్తితః. ౫౯. స్తుత్యో వంద్యః సదా పూజ్యస్త్వయాయం సర్వథా నృప, మనసా కర్మణా వాచా దేవనిందాం పరిత్యజేత్. ౬౧. ప్రేక్షయిత్వా చ నిర్మాల్యం తదశ్వేభ్యో నివేదయేత్, ప్రక్షాల్య హస్తౌ పాదౌ చ నమస్కుర్యాద్దివాకరమ్. ౬౦. ఇత్యేషా పరమా దీక్షా తవ సంక్షేపతో మయా, భుక్తిముక్తికరీ చాపి కథితా ప్రవిభాగతః. ౬౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే సూర్యదీక్షావర్ణనం
నామ ఏకోనపంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

---

వాసుదేవ ఉవాచః—అతః పరం ప్రవక్ష్యామి యథా పూజ్యో దివాకరః, స్థండిలే యదుశార్దూల నిబోధైకాగ్రమానసః. ౧. మండలైరష్టభిః కార్యం చక్రం కాలాత్మకం శుభం, మధ్యే పద్మాకృతం చక్రమరైర్ద్వాదశభిర్యుతమ్. ౨. తన్మధ్యే కమలం ప్రోక్తం పత్రాష్టకసమన్వితం, సర్వాత్మా సకలో దేవః ఖషోల్కః కిరణోజ్జ్వలః. ౩.

నునిచి ప్రణవముతోఁ బూజింపవలయును. పిమ్మట దేవాగ్రజుం డగునరు ణునిఁ బూజింపవలయును. శ్రేయస్కాముఁ డగుపురుషుఁడు దక్షిణదిగ్భాగంబున దివాకరపత్నియగు నిక్షుభాదేవిని, దక్షిణపార్శ్వంబున రేవతుని నుత్తరపార్శ్వంబునఁ బింగళుని సంజ్ఞాదేవినిఁ బూజింపవలయును. ఆగ్నేయదిగ్భాగంబున లేఖకుని, నైరృతదిగ్భాగంబున నశ్వినీదేవతలను, వాయవ్యదిగ్భాగంబున విభుండగు వైవస్వతమనువును, నీశాన్యదిగ్భాగంబున లోకపావనియగు యమునానదినిఁ బూజింపవలయును. ఇట్లు ప్రథమావరణమునందుఁ జేయఁదగినవిధానముఁ జెప్పితిని. ద్వితీయావరణమునం దెట్లు చేయవలయునో చెప్పెద నాకర్ణింపు ద్వితీయావరణమునందుఁ బ్రాగ్భాగంబున నాకాశమును, దక్షిణభాగంబున దేవినిఁ, బశ్చిమభాగంబున గరుడుని, నుత్తరభాగంబున నాగరాజగు శేషుని, నాతనిపుత్త్రుండగు నైరావతుని, నాగ్నేయంబున హేళిని, నైరృతంబునఁ బ్రహేళిని, వాయవ్యంబున నూర్వశిని నీశాన్యంబున వినతను బూజింపవలయును. తృతీయావరణమునందుఁ బ్రాగ్భాగంబున గురునిఁ, బశ్చిమంబున నర్కపుత్త్రుని, నుత్తరంబున ధిషణుని, నీశాన్యంబున శశిపుత్త్రుని, నాగ్నేయమునందు సోముని, దక్షిణనైరృతములందు రాహువును, వాయవ్యంబున వికచునిఁ బూజింపవలయును.

---

పూజనీయః సదా మధ్యే సహస్రకిరణాయుధః, ప్రణవేన మహాబాహో చతుర్బాహుసమన్వితః. ౪. అరుణం పూజయేత్ప్రాజ్ఞః సదా దేవాగ్రజం శుభం, దక్షిణే పూజయేద్దేవీం నిక్షుభాం భాస్కరస్య తు. ౫. రేవతం దక్షిణే పార్శ్వే ఉత్తరే పింగలం సదా, సంజ్ఞాం చ యదుశార్దూల శ్రేయసే సతతం బుధః. ౬. ఆగ్నేయ్యాం లేఖకం వీర నైఋత్యామశ్వినా తథా, వాయవ్యాం పూజయేద్దేవం మనుం వైవస్వతం విభుమ్. ౭. ఐశాన్యాం పూజయేద్దేవీం యమునాం లోకపావనీం, ద్వితీయావరణే వీర పూర్వతః పూజయేద్వియత్. ౮. దక్షిణే చ తతో దేవీం పశ్చిమే గరుడం తథా, ఉత్తరే నాగరాజానం పుత్రమైరావతం శుభం. ౯. ఆగ్నేయ్యాం పూజయేద్ధేలిం ప్రహేలిం నైఋతే తథా, వాయవ్యాముర్వశీం దేవీమీశానే వినతాం తథా. ౧౦. తృతీయావరణే పూర్వే పూజయేద్గురుమాదరాత్, పశ్చిమే త్వర్కపుత్రం తు ఉత్తరే ధిషణం తథా. ౧౧. ఐశానే శశిపుత్రం తు సోమమాగ్నేయమండలే, పూజయేద్దక్షిణే కోణే నైఋతే రాహుమాదరాత్. ౧౨. వాయవ్యే వికచం వీర పూజయేత్సతతం బుధః,

చతుర్థావరణంబున లిఖితరూపుం డగుదేవునిఁ బూజింపవలయును. ఆగ్నేయంబున శాండిలీపుత్త్రుని, దక్షిణంబున దక్షిణదిగధిపుఁడగు యముని, నైరృతంబున విరూపాక్షునిఁ, బశ్చిమంబున జలేశుండగు వరుణుని, వాయవ్యమునందు వాయుపుత్త్రుని, నీశాన్యంబున నీశాన దేవుని, నుత్తరంబున యక్షరాజగు కుబేరునిఁ బూజింపవలయును. పంచమావరణంబున ద్విజులకు స్వావరణమగుటఁజేసి ద్విజులను బూజింప వలయును. ప్రాగ్భాగంబునఁ బరమదేవతయగు మహాశ్వేతను, లక్ష్మిని, వృద్ధిని, విభూతిని, ధృతిని, ఉన్నతిని, పృథివిని, మహాకీర్తిని, విష్ణుని, అర్యముని, భగుని, పర్జన్యుని, వివస్వంతుని, అర్కుని, త్వష్టను గూడ నాయావరణమందే పూజింపవలెను. ఆఱవయావరణమున నరుణుని దివాకరసంబంధములగు శిరోవర్మనేత్రఅస్త్రములను బూజింపవలయును. ఏడవయావరణంబున సరథుం డగునరుణునిఁ బూజింపవలయు. అశ్వము లను, యక్షరక్షోగంధర్వులను, మాసపక్షదినసంవత్సరములను బూజింప వలయును. ఇట్లు ఆయాదిక్కులయందుండెడి మండలంబులయందుఁ జెప్పఁబడిన దేవతలను బూజింపవలయును ఏమనుష్యుఁడు ఈరీతిగ భాస్కరునిఁ బూజించునో యామనుష్యుఁడు దుఃఖవినిర్ముక్తంబగు పరమ

---

చతుర్థావరణే దేవం పూజయేల్లేఖమాదరాత్. ౧౩. ఆగ్నేయే శాండిలీపుత్రం దక్షిణే దక్షిణాధిపం, విరూపాక్షం నైఋతే దేవం జలేశం పశ్చిమే తథా. ౧౪. వాయుపుత్రం చ వాయవ్యాం సతతం పూజయేన్నరః, ఈశానే దేవమీశానం పూజయేత్సతతం బుధః. ౧౫. ఉత్తరే యక్షరాజానం కుబేరం పూజయేద్బుధః, పంచమే పూజయేద్వీర సదా స్వావరణే ద్విజాః. ౧౬. పూర్వతః పరమాం దేవీం మహాశ్వేతాం మహామతిః, శ్రియ మృద్ధిం విభూతిం చ ధృతిం చైవోన్నతిం తథా. ౧౭. పృథివీం యదుశార్దూల మహా కీర్తిం తథైవ చ, ఇంద్రం విష్ణుం చార్యమణం భగం పర్జన్యమేవ చ. ౧౮. వివస్వంతం తథార్కం చ త్వష్టారం కిరణోజ్జ్వలం, పూజయేద్వరుణం షష్ఠే చైవమే తాన్దివాకరాన్. ౧౯. శిరో నేత్రే తథా వర్మ అస్త్రం చ యదుసత్తమ, అరుణం సరథం వీర సప్తమే పూజయేద్బుధః. ౨౦. తథాశ్వాన్యదుశార్దూల సదా చావరణే బుధః, యక్షరక్షాంసి గంధర్వాన్మాసాన్పక్షానహాని తు. ౨౧. సంవత్సరం తథా పుత్త్ర హ్యేతాంస్తత్సంపూజయే త్పురా, య ఏవం పూజయేద్దేవం భాస్కరం సతతం నరః, స గచ్ఛేత్పరమం స్థానం

పదమును బొందఁగలఁడు. "ఓమ్ ఖషోల్కాయ నమః" అను మూల మంత్రాక్షరముల నుచ్చరించుచుఁ బూర్వోక్తవిధిచే నుభయపక్షసప్తముల యందును దివాకరునిఁ బూజింపవలయును. అట్లుజేసినఁ బరమపదము లభింపఁగలదు. ఇట్లు చెప్పి భగవంతుఁడగు హరి స్వగృహంబునకుఁ జనియెను.

ఇది పంచాశదుత్తరశతతమాధ్యాయము.

## ఏకపంచాశదుత్తరశతతమాధ్యాయము.

సూతుం డిట్లనియె. తరువాత మహాతేజస్సంపన్నుఁడగు శతానీకమహారాజు ద్విజోత్తముఁడగు సుమంతునికి భక్తితోఁ బ్రణమిల్లి ద్విజోత్తమా! యమితౌజస్కుఁడగు భాస్కరదేవుని సర్వపాపవినాశకం బగు మాహాత్మ్యంబును నీమూలమున విని కృతార్థుఁడనైతి నందుచే లోకమునం దెచ్చటను నీతనికి సమానుఁడగుదేవుఁడు లేఁడని తలంచు చున్నాను. మఱియు నీతని కీలోకంబున గమనావసరంబును, గమనావకాశము గూడ గలుగదు. మఱియు నీసూర్యుఁడు సర్గస్థితిలయముల నాయాకాలములందుఁ జేయుచుండును శతాశ్వమేధములకంటె నుత్కృష్టంబగు భాస్కరదేవునిమాహాత్మ్యంబును వినఁగల్గితి. కాని నామనంబున

యత్ర గత్వా న శోచతి. ౨౨. (ఓం ఖషోల్కాయ నమః) మూలమంత్రాక్షరాణీహ చాంగాని పరిచక్షతే, అనేన విధినా యస్తు పూజయేత్సతతం రవిమ్. ౨౩. నిత్యముభయ సప్తమ్యాం స గచ్ఛేత్పరమం పదం, ఇత్యుక్త్వా భగవాన్దేవో జగామాశు గృహం హరిః.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సాంబోపాఖ్యానే ఆదిత్యపూజావిధివర్ణనం నామ
పఞ్చాశదుత్తరశతతమోఽధ్యాయః.

సూత ఉవాచః—అథ రాజా మహాతేజాః శతానీకో ద్విజోత్తమం, ప్రణమ్య శిరసా భక్త్యా సుమంతుం వాక్యమబ్రవీత్. ౧. అహో దేవస్య మాహాత్మ్యం భాస్కరస్యామితౌజసః, కీర్తితం భవతా మహ్యం సర్వపాపప్రణాశనమ్. ౨. తస్మాన్నార్కసమం దేవం లోకే పశ్యామి సువ్రత, న చాప్యస్య స్థితా విప్ర గతిర్లోకేషు విద్యతే. ౩. ప్రవర్తతే జగద్విప్ర సర్గకాలే దివాకరాత్, స్థితౌ పాలయతే చాపి కల్పాంతే సంహరేత్పునః. ౪. శ్రుత్వైవం దేవమాహాత్మ్యం భాస్కరస్యామితౌజసః,

నొక్కసందియంబు గలదు. ఏయుపాయముచే సుప్రసన్నుఁడగు వృష ధ్వజుని ప్రసాదముకంటెను గొప్పదియగు దివాకరుని ప్రసాదమున సంసారార్ణవముఁ దరింపఁగల్గుదుము? భగవంతుఁడగు సూర్యుఁ డేధర్మ ముచేఁ బరితుష్టుఁడగును? మఱియు నీవలన శ్రుతిస్మృత్యాదితధర్మంబు లను, శైవవైష్ణవపౌరాణికధర్మంబు లనేకముల వినియుంటి నైనను అనుపమంబగు సౌరధర్మంబును వినవలయునని కోరిక గల్గుచున్నది. సర్వజనులలో సౌరధర్మపరాయణులు ధన్యులగుదురుగాన దేవదేవుం డగు సూర్యునిధర్మంబులను నాకుఁ దెలియఁజేయుము నీచేఁ జెప్పఁబడిన ధర్మముల నెన్నిటి విన్న నమృతము ద్రావినవానికిఁ దృప్తిగలుగనటుల నాకును దృప్తి గలుగలేదు. అశ్వమేధాదియాగంబులు ఫలప్రదంబు లయినను నవి ప్రభూతధనసాధ్యంబు లగుటచేతను, బ్రాహ్మణు లల్పద్రవ్య వంతులగుటఁజేసియు బ్రాహ్మణుల కసాధ్యంబులై యుండును. కాన సర్వలోకహితాపేక్షివై ధర్మార్థకామమోక్షరూప చతుర్విధపురుషార్థ సాధకంబును, సర్వపాపభయాపహంబును, పాపనాశకంబునగు సౌరధర్మం బును నాకుఁ బ్రసాదింపుమని యడిగెను ఇట్టి రాజవాక్యంబులు విని వ్యాసశిష్యుండగు సుమంతుఁడు వ్యాసమహర్షిని నమస్కరించి రాజా! నీవు కోరిన సౌరధర్మముం జెప్పెద నాకర్ణింపుము. పూర్వము సూర్య

---

కీర్తితం భవతా మహ్యమశ్వమేధశతాద్వరమ్. ౫. కిం తు మే సంశయో బ్రహ్మన్సుమహా న్హృది వర్తతే, కేనోపాయేన విప్రేంద్ర ముచ్యతే సంభవార్ణవాత్. ౬. దివాకరప్రసా దాద్వై సుప్రసన్నాద్వృషధ్వజాత్, కథం తుష్యేత్సదా దేవో ధర్మేణ కతరేణ తు. ౭. శ్రుతా మే బహవో ధర్మాః శ్రుతిస్మృత్యుదితాస్తథా, వైష్ణవాః శైవధర్మాశ్చ తథా పౌరాణికాః శ్రుతాః. ౮. శ్రోతుకామో హ్యహం విప్ర సౌరం ధర్మమనౌపమం, భగవన్సర్వధన్యాస్తే సౌరధర్మపరాయణాః. ౯. బ్రూహి మే దేవదేవస్య భానోర్ధర్మ మనౌపమం, శృణ్వతో నాస్తి మే తృప్తిరమృతస్యైవమేవ చ. ౧౦. అశ్వమేధా దయో యజ్ఞా బహుసంభారవిస్తరాః, న శక్యాస్తే యతః కర్తుమల్పవిత్తైర్ద్విజాతిభిః. ౧౧. సుఖోపాయమతో బ్రూహి ధర్మకామార్థసాధకం, హితాయ సర్వమర్త్యానాం సర్వ పాపభయాపహమ్. ౧౨. సౌరధర్మపరం పుణ్యం పవిత్రం పాపనాశనం, శ్రుత్వా తు వచనం రాజ్ఞో వ్యాసశిష్యో మహామునిః, ప్రణమ్య శిరసా వ్యాసమిదం వచనమబ్రవీత్. ౧౩. సుమంతురువాచ.—శ్రూయతామభిధాస్యామి సుఖోపాయం మహాఫలం;

భగవానుఁ డీధర్మము నరుణున కుపదేశించె. ఈధర్మము త్రిమూర్తులకుం దక్కఁ దక్కినసంసారార్ణవమగ్ను లగువారందఱకిని జగత్తునకును హితాకాంక్షినై సూర్యభగవానుఁ డుపదేశించెను. ఏమనుష్యులు శాంతహృదయులును సూర్యభక్తులు నై ఈపరమధర్మమును సేవింతురో వారు సౌరులని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. ఒకటిరెండుమూఁడుపర్యాయములుగాని లేక నిత్యముగాని యప్పుడప్పుడుగాని సూర్యుని భక్తితోఁ స్మరించినయెడల నేడుజన్మములనుండి చేసినపాపములన్నియు నశించును. ఎల్లప్పుడు భాస్కరు నెవ్వరు స్తోత్రముజేయుదురో వారు ప్రాకృతపురుషులు మాత్రము గానేరరు. దివమునుండి యవతరించిన భాస్కరులే యని చెప్పఁదగుదురు. ఏలయన నర్కభిన్నుఁ డర్కుని స్మరింపఁడు, పూజింపఁడు, గీర్తింపఁడు, పొందను నేరఁడు. కాన వారు కేవలము భాస్కరులే యని చెప్పఁదగుదురు. మఱి యసౌరధర్మమునందు నిశ్చలమగు భక్తియే సారము. ఆభక్తియుఁ బదునారంగములతోఁ గూడినదని దేవతలకు సూర్యుఁ డానతిచ్చె. ప్రాతఃకాలమున స్నానముజేసి జపహోమదేవతార్చనంబుల నిర్వర్తించి గోబ్రాహ్మణాశ్వత్థపూజనంబులఁ జేసి భక్తిశ్రద్ధాసమన్వితంబుగ నితిహాసపురాణాదిశ్రవణంబును వేదాధ్యయనమును

---

పరమం సర్వధర్మాణాం సర్వధర్మమనాపమమ్. ౧౮. రవిణా కథితం పూర్వమరుణస్య విశాంపతే, కృష్ణస్య బ్రహ్మణో వీర శంకరస్య న విద్యతే. ౧౯. సంసారార్ణవమగ్నానాం సర్వేషాం ప్రాణినామయం, సౌరధర్మశమః శ్రీమాన్హితాయ జగతోదితః. ౧౬. యైరయం శాంతహృదయైః సూర్యభక్తైర్భగార్థిభిః, సంసేవ్యతే పరో ధర్మస్తే సౌరా నాత్ర సంశయః. ౧౭. ఏకకాలం ద్వికాలం వా త్రికాలం నిత్యమేవ చ, యే స్మరంతి రవిం భక్త్యా సకృదేవాపి భారత, సర్వపాపైర్విముచ్యంతే సప్తజన్మకృతైరపి. ౧౮. స్తువంతి యే సదా భానుం న తే ప్రకృతిమానుషాః, స్వర్గలోకాత్పరిభ్రష్టాస్తే జ్ఞేయా భాస్కరా భువి. ౧౯. నానర్కః స్మరతేఽర్కం వై నానర్కోఽర్కం సమర్చయేత్, నానర్కః కీర్తయేదర్కం నానర్కోఽర్కమవాప్నుయాత్. ౨౦. సౌరధర్మస్య సారోఽయం సూర్యభక్తిః సునిశ్చలా, షోడశాంగా చ సా ప్రోక్తా రవిణేహ దివౌకసామ్. ౨౧. ప్రాతఃస్నానం జపో హోమస్తథా దేవార్చనం నృప, ద్విజానాం పూజనం భక్త్యా పూజా గోశ్వత్థయోస్తథా. ౨౨. ఇతిహాసపురాణేభ్యో భక్తిశ్రద్ధాపురస్కృతం,

నాయందలిభక్తినిఁ బ్రజలయందు వాత్సల్యమును బూజచేయుటయం దుత్సాహమును గల్గియుండవలెను. అట్లుత్సాహముగలవాఁడై ప్రథమ మున స్వయముగ నన్నర్చింపవలయును. పిమ్మటఁ బురాణవాచకుని దేవ తలను క్రమముగాఁ బూజించుట నాకుఁ బ్రియము. మత్కథాశ్రవ ణముజేయుట శ్రద్ధాసమన్వితుఁడై నన్ను స్మరించు టీరీతిగా షోడ శాంగోపేతంబగు నీభక్తియే మ్లేచ్ఛునందుండినను నాతఁడె బ్రాహ్మణోత్త ముఁడును మునియును శ్రీమంతుఁడను కులీనుఁడును బండితుండును నగు చున్నాఁడు. చతుర్వేదంబులు నాకంటె వేరుగానేరవు. కానినాభక్తుఁడు చండాలుఁడైనను, వానికి వేదముల నభ్యసింపఁ జేయవచ్చును. వాని నుండి గ్రహింపవచ్చును. నావలెనే యాతఁడు గూడఁ బూజ్యుఁడగును. ఎవ్వఁడు భక్తితో నాకుఁ బత్రపుష్పతోయాన్యతమమును సమర్పించునో వాఁడు సంసారార్ణవమగ్నుఁడు గానేరఁడు. వానికి నేను ప్రాప్యుఁడ నగుదును. మఱియు నన్నెవ్వఁడు సర్వగతునిగను సర్వము నాయం దుండునట్లుగను జూచునో యట్టివానియందు నేనుండెద. ఆతఁడును నాయందుండు యమనియమాద్యష్టకష్టములచే నవరంధ్రవ్యాపారముల నిరోధించి జ్ఞానయోగముచే నంతఃకరణమును జయించి శరీరమనుపుర మునకు రాజగు జీవాత్మమును స్వాధీనపఱచుకొని మనస్సుచే నిశ్చల

శ్రవణం రాజశార్దూల వేదాభ్యాసస్తథైవ చ. ౨౩. మద్భక్త్యా జనవాత్సల్యం పూజాయాం చానుమోదనం, స్వయమభ్యర్చయేద్భక్త్యా మమాగ్రే వాచకం పరమ్. ౨౪. పుస్తకస్య సదా శ్రేష్ఠ మమాతీవ ప్రియం సురాః, మత్కథాశ్రవణం నిత్యం స్వరనేత్రాంగ విక్రియా. ౨౫. మమానుస్మరణం నిత్యం భక్త్యా శ్రద్ధాపురస్కృతం, షోడశాంగా భక్తి రియం యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే, విప్రేంద్రఃసమునిః శ్రీమాన్సజాత్యః స చ పండితః. ౨౬. న మే పృథక్చతుర్వేదా మద్భక్తః శ్వపచోఽపి యః, తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యహమ్. ౨౭. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౨౮. యో మాం సర్వగతం పశ్యేత్సర్వం చ మయి సంస్థితం, తస్యాహమాస్థితో నిత్యం స చ నిత్యం మయి స్థితః. ౨౯. అష్టాదశార్థకష్టాయాః పరం చాష్టభిరుద్భవైః, రోధయిత్వా మహా బాహో తథా జ్ఞానతరేణ తు. ౩౦. దర్గపాలం విజిత్యాశు భాస్కరార్థం తు దుర్జయం, జిత్వా చ పురరాజానం మహాతేజమనాపమమ్. ౩౧. మనసాచలయా భక్త్యా యో

భక్తితో నన్ను ధ్యానించినయెడల నేనెల్లప్పుడును వాని నాత్మవలెనే చింతించెదను.

ఇది ఏకపంచాశదుత్తరశతతమోఽధ్యాయము.

---

## ద్విపంచాశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుఁ డిట్లనియె. రాజా! సూర్యునియందలి భక్తియు, సూర్యపూజనము, సూర్యోద్దేశ్యకంబగుదానము, సూర్యోద్దేశ్యక హోమము, సూర్యసంబంధమగుజ్ఞానము, తదభ్యాసమును, నుత్తమం బగుఖషోల్కజ్ఞానంబును, భాస్కరజ్ఞానమును సుదుర్లభంబులు. అర్కమందిరమునం దేపాదములు ప్రదక్షిణముఁ జేయునో యాపాదములే ధన్యములు. ఏహస్తములు సూర్యునకుఁ బూజను జేయునో యవియే శ్లాఘ్యములు. ఏరసనేంద్రియము నిత్యమును సూర్యుని స్తోత్రముఁ జేయునో యదియే ధన్యమైనది. ఎవ్వని మనము నిశ్చలముఁ, నిర్భీకమునై క్రోధమును వర్జించి సూర్యునివిషయమై లీలగ విషయోపభోగంబుల న్విడచి వర్తించునో యదియే ధన్యమైనది. అనిన శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! సూర్యార్చనవిధినంతను నీప్రసాదమువలనఁ దెలిసికొన వలయునని కోర్కి యధికమగుచున్నది సూర్యదేవుని సూర్యాలయ

---

మాం ధ్యాయతి మానవః, అహం తమేవ చింతామి ఆత్మవత్సతతం నరమ్. ౩౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మవర్ణనం నామ
ఏకపంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:— సూర్యే చ దుర్లభా భక్తిర్దుర్లభం సూర్యపూజనం, సూర్యాయ దుర్లభం దానం సూర్యహోమశ్చ దుర్లభః. ౧. సుదుర్లభం రవేర్జ్ఞానం తదభ్యాసోఽపి దుర్లభః, సుదుర్లభతరం జ్ఞేయం ఖషోల్కజ్ఞానముత్తమమ్. ౨. సుదుర్లభతరం జ్ఞానం సదా వై భాస్కరస్య తు, ప్రదక్షిణాం చక్రతుర్యౌ పాదౌ భక్త్యాఽర్కమందిరే. ౩. తౌ కరౌ శ్లాఘ్యతాం ప్రాప్తౌ యౌ పూజాం చక్రతూ రవేః, సైవైకా రసనా ధన్యా స్తోత్రం యా కురుతే రవేః. ౪. తన్మనః పుణ్యతాం ప్రాప్తం యద్ధిత్వా విషయం నృప, నిశ్చలా చ రవేర్లీలా నిర్భీకా క్రోధవర్జితా. ౫. శతానీక ఉవాచ.—సూర్యార్చన విధిం కర్తుమిచ్ఛామి తత్త్వతః, త్వత్ప్రసాదాద్ద్విజశ్రేష్ఠ కౌతూహలమతీవ మే.

మున స్థాపించుటచే నేఫలము గల్గును? దేవాలయసమ్మార్జనమువలన నేఫలము గల్గునో అలుకుటవలన స్థానము నేర్పరచుటవలన నేఫలము గల్గునో నీరాంజనసమర్పణంబునను, నృత్యమంగలవాద్యంబుల వలనను, అర్ఘ్యప్రదానమువలనను, ఉదకాభిషేకమువలనను, పంచామృతాభిషేకమువలనను, దధిస్నానమునను, చక్రాభ్యంజనమువలనను, వజ్రస్నానంబునను, మధుక్షీరస్నానంబునను, ఇక్షురసస్నానమునను, శుచియగు ప్రదేశమునఁ గుశపుష్పోదకస్నానమునను, సువర్ణమిళితోదకస్నానమునను, సుగంధయుక్తంబగు చందనోదకస్నానంబునను, కర్పూరాగరుమిశ్రితోదకస్నానంబునను, స్వచ్ఛోదకస్నానంబునను, గంధయుక్తంబులగు లేపనములవలన నేమిఫలము గల్గునో నాకుఁ జెప్పుము. మఱియును విసనకఱ్ఱ దానంబునను, చామరవీవనవలనను, రక్తపుష్పార్చనంబునను, మాలాసమర్పణంబునను భక్తికృతపూజలచేను, పుష్పధూపవస్త్రాలంకారదానంబులచేతను నేఫలమును బొందుదురు? మఱియుఁ బుణ్యకథాశ్రవణములచేతను, పుణ్యకీర్తనముచేతను, నవ్యంగధారణముచేతను, భోజకులకు నమస్కరించుటచేతను, వ్యోమను అరుణుని నర్చించుటచేతను గల్గుఫలమును, మఱియు నీపూజాసాధనంబులగు పదార్థంబులలో నేను

---

౬. యత్పుణ్యం స్థాపితే సూర్యే కృతే సూర్యాలయే చ యత్, సమ్మార్జనే చ యత్పుణ్యం యత్పుణ్యముపలేపనే. ౭. స్థానే కృతే చ యత్పుణ్యం తథా నీరాజనే కృతే, నీతౌషధిప్రవాహేన నృత్యమంగలవాదితైః. ౮. అర్ఘ్యదానేన యత్పుణ్యం తోయస్నానేన యద్భవేత్, పంచామృతమయస్నానే దధిస్నానే చ యత్ఫలమ్. ౯. చక్రాభ్యంగే చ యత్ప్రోక్తం వజ్రస్నానే చ యత్ఫలం, మధుస్నానే పయఃస్నానే స్నాన ఇక్షురసస్య తు. ౧౦. ఉద్వర్తనం శుచిస్థానే కుశపుష్పోదకేన తు, సువర్ణరత్నతోయైశ్చ గంధచందనవారిభిః. ౧౧. కర్పూరాగురుతోయేన స్వచ్ఛతోయేన యత్ఫలం, విలేపనైశ్చ గంధాఢ్యైర్విలేపనఫలం లభేత్. ౧౨. తాలపత్రప్రదానే తు ప్రదానే చామరస్య తు, రక్తపుష్పార్చనే యచ్చ దామభిః పూజనేన చ. ౧౩. సుమానాం మండపే యచ్చ పుష్పమాలావలంబనాత్, పూజాభక్తివిశేషైశ్చ గృహమాలావలంబనే. ౧౪. పుష్పదానవిశేషేణ ధూపదీపైశ్చ యత్ఫలం, వస్త్రాలంకారదానే తు పుణ్యశ్రవణకీర్తనే. ౧౫. బ్రహ్మాశ్రవస్య దానే తు అవ్యంగస్య చ గోపతే, మగానాం మత్ప్రసాదేన అభివాదనపూజనే. ౧౬. వ్యోమపూజాఫలం యచ్చ అరుణస్య చ పూజనం,

చెప్పినవిగాక మిగిలినవాటివలన చేసిన నేమి ప్రయోజనము గల్గునో చెప్పఁగోరెదను.

ఇది ద్విపంచాశదుత్తరశతతమాధ్యాయము.

---

## త్రిపంచాశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. పాండవేయా! నీవు బుద్ధిమంతుఁడవు. సూర్యభక్తుఁడవుగాన నఖిలమును జెప్పెద నాకర్ణింపుము. రాజా! కల్పాదియందు సర్వప్రజాసృష్టికర్తయగు బ్రహ్మదేవునకును, సర్వప్రజాపాలకుండగు విష్ణువునకును, సంహారకర్తయగు నీశ్వరునకును, అహంకారనిమిత్తకమైన వాక్కలహము ప్రవృత్తమై సృష్టిస్థితిలయకారకుఁడను నేనే నని బ్రహ్మయు, నాకంటె నీప్రపంచమున సృష్టిస్థితిలయకారకు లింకెవరని రుద్రుఁడును, నాకంటె నీబ్రహ్మాండంబున సృష్టిస్థితిలయకారకు లుండియున్నారా? యని విష్ణువు నీరీతిగ మోహాత్మకంబగు నజ్ఞానమునంబడి యొకరిమొగ మొకరు చూచుకొనకుండునట్లు కలహించి భూమిపైఁ గూర్చుండిరి. ఆసమయంబున దివాకరునిగొల్చు నితరజనులును, తమస్సుచే మోహితులై నిద్రితులవలెనుండి కొంచెము జ్ఞానము మాత్రము గల్గి

---

తథాన్యదపి యత్ప్రోక్తమజ్ఞానాద్బ్రహ్మణోత్తమ. ౧౭. తత్సర్వం బ్రూహి మే బ్రహ్మన్ భక్తానామనుకంపయా. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సూర్యధర్మేషు ప్రశ్నవర్ణనం నామ ద్విపంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—సుమతిశ్చ రవేర్భక్తః పాండవేయ మహామతే, అతస్తే నిఖిలం వచ్మి శృణుష్వైకమనా నృప. ౧. కల్పాదౌ సృజతో వీర బ్రహ్మణో వివిధాః ప్రజాః, అహంకారో మహానాసీన్నాస్తి లోకే మదుత్తమః. ౨. తథా పాలయతో వీర కేశవస్య ధరాపతే, తథా సంహరతో జజ్ఞేఽహంకారస్త్ర్యంబకస్య చ. ౩. చింతయంతోఽథ తే దేవాః కేశవశ్చ నరాధిప, మిథస్తే స్పర్ధయా యుక్తాః పరస్పరవిరోధినః. ౪. వివాదస్తు మహానాసీత్కలంజజాంబునగౌకసాం, పరస్పరం మహాబాహో మనసా శ్రిత్య కేవలమ్. ౫. అహం కర్తా వికర్తాఽహం పాలకోఽహం జగత్ప్రభుః, ఇత్యాహ భగవా

యేమిచేయుటకును దెలియక మూఢులై యుండిరి తరువాత భూతాధిపుండును, నాగభూషణుండును, నర్ధచంద్రాలంకృతుండును నగు త్ర్యంబకుఁడు తమోమోహితుఁడై గొప్పదగునార్తిని బొంది లక్ష్మీపతింగాంచక కృష్ణా! నీవెచ్చటకుఁ బోయియుంటివి? బ్రహ్మదేవుం డెచ్చటకుఁ బోయెను? మీరిరువురును నాకగపడుటలేదు గొప్పదియగు మోహమనునజ్ఞానముచే నభిభూతుండనైతినిగాన నేనేమిచేయుదును? నేనెచ్చటికిఁ బోవుదును? నేనిపు డెచ్చటనుంటిని? విపులంబగుసాగరము గూడ నాకగపడుటలేదు కాన నేయుపాయముచే స్థావరజంగమాత్మకంబగు నీజగమును చూడఁగల్గుదునో నాకుఁ జెప్పుము నాకు లజ్జ యధికమగుచున్నది అన విని శంకరునకు విష్ణువు తమోమోహితుండై శోకగద్గదంబగు వాక్కులతో నిట్లనియె రుద్రదేవా! ఇప్పుడు నీవెచ్చటనుంటివో నేను తెలియలేకుంటిని నామనము మిక్కిలి యజ్ఞానముచే నావృతమై యున్నది నేనెచ్చటకుఁ బోవుదును? నేనెట్లు స్వాస్థ్యమును బొందుదును? ఈజగమంతయు తమఃపూరితంబై యుండెను కాన నంబుజోద్భవుండగు బ్రహ్మదేవుఁడు దర్శనమిచ్చినచో నామహాత్మునడుగవలయునని కోరిక గలదు అది నీకభిమతమైనచో నెఱవేర్చెద ననిన నీశ్వరుం డట్లే యనిన నారాయణుం డీసమస్తమును బ్రహ్మదేవునకుఁ జెప్పెను తరువాత బ్రహ్మదేవుఁడు

---

స్రష్టా కృష్ణభీమా సమర్చితే ౬. తథైత్య శంకరః క్రుద్ధః కః శక్తో మద్వృతే భువి, సంహర్తుం జగదేతద్ధి స్రష్టుం పాలయితుం తథా ౭ నారాయణోఽప్యేవమేవ మనాక్ క్రోధసమన్వితః, న వా శక్తో జగత్స్రష్టుం సంహర్తుం రక్షితుం తథా ౮ ఏవం తేషాం ప్రవదతాం క్రుద్ధానాం చ పరస్పరం, సమావిశత్తదాఽజ్ఞానం తమో మోహాత్మకం విభో ౯ తేన క్రాంతధియః సర్వే న పశ్యంతి పరస్పరం, అత్యర్థం మోహమాపన్నా న జానంతీహ కించన. ౧౦ అపశ్యంతో మిథస్తే తు నిషణ్ణాః క్ష్మాతలే విభో, అరమంతి హి యే చాన్యే తే దివాకరమాస్థితాః ౧౧ తమసా మోహితాః సర్వే నిద్రావత్క్రాంతచేతసః, మనాగ్జ్ఞానేన చాక్రాంతాః కిం కుర్యామేతి మోహితాః ౧౨. అథభూతాధిపో దేవో గోశ్రుతాభరణోజ్జ్వలః, చంద్రార్ధకృతశోభస్తు శీతలాంశువిశోధితః ౧౩ ఆర్తిమేత్య పరాం వీర మోహితస్తమసా విభో, అపశ్యన్నబ్రవీద్దేవం మాధవం భూధరం హరిమ్. ౧౪ మహాదేవ ఉవాచ — కృష్ణ కృష్ణ మహాబాహో క్వ గతస్త్వం మహామతే, బ్రహ్మా చ క్వ గతో వీర నాహంపశ్యామి వాం క్వచిత్. ౧౫. మోహేన

దర్పాహంకారములను వదలి సమభూమియందు నిలచి విష్ణునివాక్యములను విని వారలతో నిట్లనియె. కృష్ణా! ఈశ్వరా! మీ రెచ్చటనున్నారు? ఇంకను మీ రేమి చెప్పుచున్నారు? నామనోబుద్ధులు మిక్కిలి యజ్ఞానవశములైనవి. నేను నిద్రామోహాజ్ఞానావృతుండనై దేవాసురమానుషసహితంబగు నీజగమును చూచుటకును వినుటకును గూడ నసమర్థుఁడనైతిని. ఓవిష్ణుమహేశ్వరులారా! నాతేజమంతయు తమస్సుచే వ్యాహతమై యెచ్చటకుఁ బోయెనో యెఱుంగను. ఇట్లు పరస్పరము మాటలాడుచుండఁగా దర్పక్రోధభయార్తులును తమస్సుచే నాక్రాంతచేతస్కులును నగు నాబ్రహ్మాదిదేవతల గర్వాపహరణము కొఱకు మఱలఁ బ్రబోధము గలిగించుటకును, అష్టశృంగయుక్తమును పాపాత్మకంబగుతమస్సుచే నావృతులకలక్ష్యంబును, జ్వాలామాలావిరాజితంబును,

---

మహాతాహం వై తమసా చ విమోహితః, కిం కరోమి క్వ గచ్ఛామి క్వచాహమధునా స్థితః. ౧౬. క్ష్మాధరం పృథివీం వృక్షాన్దేవగంధర్వదానవాన్, విపులం సాగరం సింధూన్నాహం పశ్యామి కించన. ౧౭. కేనోపాయేన పశ్యేయం జగత్స్థావరజంగమం, బ్రూహి మే దేవశార్దూల వ్రీడామేఽతీవ జాయతే. ౧౮. శంకరస్య వచః శ్రుత్వా హరిర్వచనమబ్రవీత్, శోకగద్గదయా వాచా తమసా మోహితో నృప. ౧౯. విష్ణురువాచ.— భీమభీమ న జానేఽహం క్వ భవాన్వర్తతేఽధునా, మమాపి మోహితం చేతస్తమసాతీవ శంకర. ౨౦. క్వ గచ్ఛామి క్వ తిష్ఠామి కథం తత్స్వస్థతాం వ్రజేత్, తమసా పూరితం సర్వం జగద్ధి పరమేశ్వర. ౨౧. యద్యసౌ దృశ్యతే దేవః సురజ్యేష్ఠోఽంబుజోద్భవః, పృచ్ఛావస్తం మహాత్మానం యది తే రోచతే హర. ౨౨. హిత్వా దర్పమహంకారం సమమాస్థాయ కేవలం, పద్మాననం పద్మయోనిం పద్మపత్రనిభేక్షణమ్. ౨౩. ఇత్యేవం గదతో వాక్యం విష్ణోరమితతేజసః, శ్రుత్వోవాచ విభుర్బ్రహ్మా గంగాధరమహీధరౌ. ౨౪. కృష్ణకృష్ణ మహాబాహో భీమభీమ మహామతే, క్వ భవంతౌ బ్రూత కించ కిం యువామాచథుర్స్థితిః. ౨౫. మమాతీవ మనోబుద్ధీ తమసా వశమాగతే, న శృణోమి న పశ్యామి నిద్రామోహవశం గతః. ౨౬. అహో బత జగత్సర్వం సదేవాసురమానుషం, తమసా వ్యాప్తతం దేవౌ న జానే క్వ గతం మహః. ౨౭. అథ తేషాం ప్రవదతాం బ్రహ్మాదీనాం దివౌకసాం, దర్పక్రోధభయార్తానాం తమసాక్రాంతచేతసామ్. ౨౮. తేషాం దర్పాపహారాయ ప్రబోధార్థం చ గోపతేః, తేజోరూపం సముద్భూతమష్టశృంగమనౌపమమ్. ౨౯. అలక్ష్యం పాపతమసా మహద్వ్యోమ నరాధిప, జ్వాలామాలావృతం వీర

బహురూపంబును, శతయోజనవిస్తీర్ణంబును, నూర్ధ్వగతంబును నగు గోపతితేజంబుచే జగమంతయు వ్యాప్తంబై యుండె ఆగోమధ్యంబున నంబుజంబుననుండు బొడ్డువలె ప్రకాశమానంబగు నొకపదార్థము భాసిల్లుచుండెను. ఆకాంతులచేతనే పురంబులయందు లోపలిభాగములు గూడఁ బ్రకాశింపుచుండెను ఇట్లు విరాజమానంబగు తేజమును జూచి పరస్పరము హుంకారంబులఁ జేయుచు నాతేజముచే మోహితులైరి. వీరలుమాత్రమేగాక జగమంతయు మోహితమయ్యెను. ఆకాశమంతయు నీతనితేజముచే నిండియుండెను. ఇట్లాకాశమంతటను వ్యాపించియున్న గోపతితేజంబును జూచి విస్మయావిష్టులై త్రిమూర్తులు పరస్పర మిట్లు సంభాషించుటకు మొదలిడిరి. మనశ్రేయముకొఱకును, లోకప్రకాశము కొఱకును నీతేజం బుద్భవించెనని దీనిమూలమును దెలిసికొనవలయునని బ్రహ్మదేవుఁ డూర్ధ్వముగను, రుద్రుఁ డధోముఖముగను, విష్ణువు తిర్యఙ్ముఖముగను బోయి దానిప్రమాణము తెలియఁజాలక విస్మయో త్ఫుల్లనయనులై యందఱును తిరిగివచ్చి యీతేజోనిధి యెవ్వఁడు? ఏస్వరూపముగలవాఁడు? ఈతనిదర్శించుటచేతనే మనమందఱము జ్ఞానుల మైతిమి కాన నద్భుతదర్శనుండగు నీతనికి మనమందఱము నమస్కరించి

---

బహురూపం చ భాసతే. ౩౦. శతయోజనవిస్తీర్ణం గతమూర్ధ్వం భ్రమత్తథా, గోమ ధ్యతో మహారాజ కర్ణికేవాంబుజస్య తు. ౩౧. ప్రకాశం తేజసా తస్య జగత్సర్వమిదం నృప, పురేష్వంతర్యథా వీర అంబుజస్యార్చిభిః సదా. ౩౨. దృష్ట్వా పరస్పరం సర్వే హుంకారాదివికారిణః, తేజసా మోహితాస్తస్య జగత్సర్వమిదం నృప. ౩౩. తేజసా మోహితం తస్య మహద్వ్యోమ నరాధిప, తతో విస్మయమాసీనా దృష్టగోపతయో నృప. ౩౪. పశ్యమానా మహో వ్యోమ్ని మిథో వచనమబ్రువన్, అహో తేజః సము ద్భూతమస్మాకం శ్రేయసే నృప. ౩౫. ప్రకాశాయ చ లోకానాం సర్వే పశ్యామ కిం న్విదం, జ్ఞానాయోర్ధ్వం గతో బ్రహ్మా చాధస్తాత్త్రిపురాంతకః. ౩౬. తిర్యగ్జగామ దేవేశ శ్చక్రాంబుజగదాధరః, అలబ్ధ్వా తస్య తే సర్వే ప్రమాణం గైరికాధిపాః. ౩౭. విస్మ యోత్ఫుల్లనయనాః సమాగమ్య పరస్పరం, సర్వే కంజాదికా దేవా ఇదం వచనమబ్రు వన్. ౩౮. కోఽయం కిమాత్మకశ్చాయం కిమిదం తేజసాం నిధిః, అహోఽస్య దర్శనా త్సర్వే సంజాతా జ్ఞానినో వయమ్. ౩౯. తస్మాత్సర్వే ప్రణమ్యైనం స్తుమో ఽద్భుత

స్తోత్రముచేయుదమని నిటలఘటితకరాంజలులై దేవతలందఱును స్తోత్రముచేయ నారంభించిరి. స్తోత్రము చేయుచుండఁగా బ్రహ్మాదులభక్తి యమోఘం బని తలఁచి కృపావిష్టుఁడై సహస్రకిరణుండగు భాస్కరుఁడు నిజస్వరూపముఁ జూపించెను తరువాత బ్రహ్మాదిదేవతలు ఖషోల్కలోకాధినాథుండును, సహస్రకిరణోజ్వాలుండును, కృత్తికాసంస్పర్శవిహీనుండును, కార్త్తికాస్థితుండును, దుర్జయుండును, సప్తర్షివిరహితుండును, వర్షాబ్దారహితుండును, సప్తస్వరవివర్జితుండును, దేవుండును, సకలుండును, నిష్కలుండును, కామరూపుండును, ననేకశిరస్కుండును, ననేకపాదుండును, ననేకోదరుండును, ననేకబాహుండును, ననేకాంసుండును, ననేకాభరణాన్వితుండును, ననేకముఖుండును, నతీబుండును, సహస్రాక్షుండును, ననేకవర్ణరూపుండును, బహువిధమకుటవిరాజితుండును, దేవేశుండునగు పరమేశ్వరుని వ్యోమమునందు దర్శించిరి. ఇట్టిరూపమును దర్శించి విస్మయాకృష్టచేతస్కులై త్రిమూర్తులొకరొక్క రీరీతిగస్తోత్రము జేయ నారంభించిరి. ప్రథమమున బ్రహ్మదేవుఁడు దేవ సహస్రకిరణా! సహస్రకిరణోద్భాసితుండును, లోకదీపకుండును, కోణవల్లభుండును, భాస్కరుండును, ఖషోల్కుండును నగు నీకు నమస్కారము. విష్ణుఁడును,

---

దర్శనం, కృతాంజలిపుటాః సర్వే చాస్తువంస్త్రిదివౌకసః. ౪౦. స్తువతామప్యథ తేషాం సహస్రకిరణో రవిః, ఆత్మానం దర్శయామాస కృపయా పరయా వృతః. ౪౧. జ్ఞాత్వా భక్తిం మహాబాహో బ్రహ్మాదీనాం మహోపమాం, అథ తే వ్యోమ్ని దేవేశం దదృశుః పరమేశ్వరమ్. ౪౨. ఖషోల్కలోకనాథేశం సహస్రకిరణోజ్జ్వలం, కృత్తికాభిరసంస్పృష్టం యద్వా తత్కార్త్తికాస్థితమ్. ౪౩. దుర్జయం కృత్తికానాం తు తథైకేన వివర్జితం, తథా హస్తవిహీనం చ సప్తర్షిరహితం తథా. ౪౪. వర్షాబ్దారహితం దేవం సప్తస్వరవివర్జితం, సకలం నిష్కలం చైవ సదైకాకారరూపిణమ్. ౪౫. తద్దృష్ట్వానేకశిరసమనేకచరణం తథా, అనేకోదరబాహ్వంసమనేకాభరణాన్వితమ్. ౪౬. అనేకాననమతీబం సహస్రాక్షమనౌపమం, అనేకవర్ణరూపం చ అనేకముకుటోజ్జ్వలమ్. ౪౭. దృష్ట్వైవం దేవదేవస్య రూపం భానోర్మహాత్మనః, విస్మయోత్ఫుల్లనయనాస్తుష్టువుస్తే దివాకరమ్. ౪౮. కృతాంజలిపుటో భూత్వా బ్రహ్మా స్తోతుం ప్రచక్రమే, ప్రణమ్య శిరసా భానుమిదం వచనమబ్రవీత్. ౪౯. బ్రహ్మోవాచ.—నమస్తే దేవదేవేశ సహస్రకిరణోజ్జ్వల, లోకదీప నమస్తేఽస్తు నమస్తే కోణవల్లభ. ౫౦. భాస్కరాయ నమో

కాలచక్రంబును, సోముండును, నమితతేజస్కుండును నగు నీకు నమస్కారము. పంచకాలస్వరూపుండును, ఇంద్రుఁడును, వసురేతస్కుండును, ఖగుఁడును, లోకనాథుండును, నేకచక్రరథుండును, జగద్ధితుండును, దేవుండును, మంగళకరుండును, తమోనాశకుండును, సురూపుండును, తేజోనిధియు, ధర్మార్థకామమోక్షస్వరూపుండును నగు నీకు నమస్కారము. క్రోధలోభవిహీనుండును, ప్రపంచస్థితిహేతుభూతుండును, శుభరూపుండును, శుభప్రదుండును, శుభాత్మకుండును, శాంతస్వరూపుండు నగు నీకు నమస్కారము. బ్రహ్మరూపుండును, బ్రాహ్మణుండును, పరమాత్మయు నగు నీకు నమస్కారము. జగత్ప్రభూ! బ్రహ్మదేవుండ నగు నాకు నీయనుగ్రహమును బ్రసాదింపుమని యిట్లు శ్రద్ధాభక్తులచే స్తోత్రముచేసి సంతుష్టాంతరంగుఁడై మౌనము నవలంబించి యుండెను. తరువాత రుద్రుఁడు భాస్కరునికి నమస్కరించి భావ అజేయా! హంసా! దివాకరా! శంభూ! మహాబాహూ! ఖగ! గోచరా! భూధరా! జయింతువుగాక. జగత్ప్రభూ! సూర్యభగవానుఁడా! లోకప్రదీపనముచే బ్రకాశించుదువుగాక. కాలస్వరూపుండవును, అనంతుండవును, సంవత్సర

---

నిత్యం ఖషోల్కాయ నమో నమః, విష్ణవే కాలచక్రాయ సోమాయామితతేజసే. ౫౧. నమస్తే పంచకాలాయ ఇంద్రాయ వసురేతసే, ఖగాయ లోకనాథాయ ఏకచక్రరథాయ చ. ౫౨. జగద్ధితాయ దేవాయ శివాయామితతేజసే, తమోఘ్నాయ సురూపాయ తేజసాం నిధయే నమః. ౫౩. అర్థాయ కామరూపాయ ధర్మాయామితతేజసే, మోక్షాయ మోక్షరూపాయ సూర్యాయ చ నమోనమః. ౫౪. క్రోధలోభవిహీనాయ లోకానాం స్థితిహేతవే, శుభాయ శుభరూపాయ శుభదాయ శుభాత్మనే. ౫౫. శాంతాయ శాంతరూపాయ శాంతయేస్మాసు వై నమః, నమస్తే బ్రహ్మరూపాయ బ్రాహ్మణాయ నమోనమః. ౫౬. బ్రహ్మదేవాయ బ్రహ్మరూపాయ బ్రహ్మణే పరమాత్మనే, బ్రహ్మణే చ ప్రసాదం వై కురు దేవ జగత్పతే. ౫౭. ఏవం స్తుత్వా రవిం బ్రహ్మ శ్రద్ధయా పరయా విభో, తూష్ణీమాసీన్మహాభాగ ప్రహృష్టేనాంతరాత్మనా. ౫౮. బ్రహ్మణోఽనంతరం రుద్రః స్తోత్రం చక్రే విభావసోః, త్రిపురారిర్మహాతేజాః ప్రణమ్య శిరసా రవిమ్. ౫౯. మహాదేవ ఉవాచ.—జయ భావ జయాజేయ జయ హంస దివాకర, జయ శంభో మహాబాహో ఖగ గోచర భూధర. ౬౦. జయ లోకప్రదీపేన జయ భానో జగత్పతే, జయ కాలజయానంత సంవత్సర శుభానన. ౬౧. జయ దేవా

స్వరూపుండవును నగు నీవు జయించుదువు గాక. అదితిపుత్త్రుండును, కశ్యపానందవర్ధనుండును నగు నీకు నమస్కారము. తమోహంతయును, సప్తేశ్వరుండును, సప్తాశ్వవాహనుండును, గ్రహేశుండును, కాంతీశుండును, కాలేశుండును, శంకరుండును, అర్థకామేశుండును, ధర్మేశుండును, మోక్షేశుండును, సుఖప్రదుండును, వేదాంగరూపుండును, గ్రహరూపుండును నగు నీకు నమస్కారము. సత్యస్వరూపుండును, శుభుండును, క్రోధలోభవినాశుండును, కామధ్వంసకుఁడును, కల్మాషపక్షిరూపుండును, యతిరూపుండును, శంభుండును, విశ్వరూపుండును, విశ్వకర్మయునగు నీకు నమస్కారము. వషట్కారమయుఁడును, స్వాహాకారమయుఁడును, సుధాకరమయుఁడును, స్వధామయుఁడును నగు నీకు జయము గలుగుఁగాక. అశ్వమేధరూపుండును, నగ్నిరూపుండును, అర్యముండును నగు నీవు జయింతువుగాక. సంసారార్ణవమును పానముఁజేయునట్టియు, మోక్షద్వారమైనట్టియు నీవుసంసారార్ణవమగ్నుఁడనగు నాకు హస్తాలంబనమును చేయుదువుగాక. దేవా! జగత్ప్రభో! యని పలువిధముల జగత్ప్రభుండగుభాస్కరుని స్తోత్రముఁజేసి యంతట విరమించెను తరువాత నోరాజా! విష్ణువు శ్రద్ధాభక్తియుతుండై సూర్యుని నమస్కరించి దేవేశుండును, భూతభావనుండును, నవ్యయుండును, దివాకరుండును, రవియును,

---

దితేః పుత్ర కశ్యపానందవర్ధన, తమోఘ్న జయ సప్తేశ జయ సప్తాశ్వవాహన. ౬౨. గ్రహేశ జయ కాంతీశ జయకాలేశ శంకర, అర్థకామేశ ధర్మేశ జయ మోక్షేశ శర్మద. ౬౩. జయ వేదాంగరూపాయ గ్రహరూపాయ వై నమః, సత్యాయ సత్యరూపాయ సురూపాయ శుభాయ చ. ౬౪. క్రోధలోభవినాశాయ కామనాశాయ వై జయ, కల్మాషపక్షిరూపాయ యతిరూపాయ శంభవే. ౬౫. విశ్వాయ విశ్వరూపాయ విశ్వకర్మాయ వై జయ, జయోంకార వషట్కార స్వాహాకార స్వధామయ. ౬౬. జయాశ్వమేధరూపాయ చాగ్నిరూపార్యమాయ చ, సంసారార్ణవపీతాయ మోక్షద్వారప్రదాయ చ. ౬౭. సంసారార్ణవమగ్నస్య మమ దేవ జగత్పతే, హస్తావలంబనో దేవ భవ త్వం గోపతేద్భుత. ౬౮. ఈశో౽ప్యేవమహీనాంగం స్తుత్వా భానుం ప్రయత్నతః, విరరామ మహారాజ ప్రణమ్య శిరసా రవిమ్. ౬౯. అథవిష్ణుర్మహాతేజాః కృతాంజలిపుటో రవిం, ఉవాచ రాజశార్దూల భక్త్యా శ్రద్ధాసమన్వితః ౭౦. విష్ణురువాచ.— నమామి దేవదేవేశం భూతభావనమవ్యయం, దివాకరం రవిం భానుం మార్తండం

భానుండును, మార్తండుఁడును, భాస్కరుండును, భగుండును నగునిన్ను నమస్కరించుచున్నాను. ఇంద్రుఁడును, విష్ణువును, హరియును, హంసయును, అర్కుండును, లోకగురుఁడును, విభుండును, త్రినేత్రుండును, త్ర్యక్షరుండును, త్ర్యంగుఁడును, త్రిమూర్తియును నగు నీకు నమస్కారము. షణ్ముఖుండును, త్రినేత్రుండును, చతుర్వింశతిపాదుండును, ద్వాదశహస్తుండును, లోకపతియును, భూతపతియును, వర్ణపతియును, దేవపతియును నగు నీకు నమస్కారము. నీవే బ్రహ్మవు, నీవే ప్రజాపతివి, నీవే రుద్రుండవు, నీవే జగన్నాథుండవు, నీవే చంద్రుఁడవు, నీవే సూర్యుఁడవు, నీవే వేదములయందు శిరోభూషణముగా నుండునోంకారస్వరూపుండవు, నీవే బృహస్పతివి, నీవే బుధుండవు, నీవే శుక్రుండవు, నీవే విభావసుండవు, నీవే యముఁడవు, వరుణుఁడవు నై యున్న కశ్యపనందనా! నీకు నమస్కారము. స్థావరజంగమాత్మకంబును, సదేవాసురమానుషంబును నగుజగమంతయు నీనుండియే యుద్భవించి నీవలననే వృద్ధిఁబొందెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల మగు మేము ముువ్వురము కల్పాదియందు లోకముయొక్క సృష్టిస్థితిలయములకొఱకై నీచే సృష్టింపఁబడితిమి వేదరూపుండును, నహోరూపుండును, యజ్ఞరూపుండును, జ్ఞానరూపుండును నగు నీకు నమస్కారము. దేవేశా! భూతేశా! కిరణేశా! మమ్ముల

---

భాస్కరం భగమ్. ౨౧. ఇంద్రం విష్ణుం హరిం హంసమర్కం లోకగురుం విభుం, త్రినేత్రం త్ర్యక్షరం త్ర్యంగం త్రిమూర్తిం త్రిగతిం శుభమ్. ౨౨. షణ్ముఖాయ నమో నిత్యం త్రినేత్రాయ నమోనమః, చతుర్వింశతిపాదాయ నమో ద్వాదశపాణయే. ౨౩. నమస్తే భూతపతయే లోకానాం పతయే నమః, దేవానాం పతయే నిత్యం వర్ణానాం పతయే నమః. ౨౪. త్వం బ్రహ్మా త్వం జగన్నాథో రుద్రస్త్వం చ ప్రజాపతిః, త్వం సోమస్త్వం తథాదిత్యస్త్వమోంకారక ఏవ హి. ౨౫. బృహస్పతిర్బుధస్త్వం హి త్వం శుక్రస్త్వం విభావసుః, యమస్త్వం వరుణస్త్వం హి నమస్తే కశ్యపాత్మజ. ౨౬. త్వయా తతమిదం సర్వం జగత్స్థావరజంగమం, త్వత్త ఏవ సముత్పన్నం సదేవాసురమానుషమ్. ౨౭. బ్రహ్మా చాహం చ రుద్రశ్చ సముత్పన్నా జగత్పతే, కల్పాదౌ తు పురా దేవ స్థితయే జగతోఽనఘ. ౨౮. నమస్తే దేవరూపాయ అహోరూపాయ వై నమః, నమస్తే జ్ఞానరూపాయ యజ్ఞాయ చ నమోనమః. ౨౯. ప్రసీదాస్మాసు దేవేశ భూతేశ కిరణోజ్జ్వల, సంసారార్ణవమగ్నానాం ప్రసాదం కురు గోపతే,

ననుగ్రహింపుము. దివాకరా! సంసారార్ణవమగ్నులమగు మాకు నీయనుగ్రహమునుఁ బ్రసాదింపుము. వేదాంతమును యజ్ఞకలయు నగు నీకు నమస్కారము. సుమంతుం డిట్లనియె. భరతసత్తమా! విష్ణువుభక్తితో భాస్కరుని స్తోత్రముఁజేసి తద్గతమనస్కుఁడై సూర్యుని ధ్యానించుచుండెను. ఇట్లు బ్రహ్మవిష్ణుమహేశ్వరులచేఁ జేయఁబడిన స్తోత్రములకు సంతసించినవాఁడై స్వతేజంబులచే దిక్కులను బ్రజ్వలింపఁజేయుచు నాకాశము నధిరోహించి భూమియందు సాగిలఁబడి నమస్కరించుచున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులఁ జూచి పిలచి చతుర్ముఖా! నీభక్తికి సంతసించితిని. వరమును గోరుకొనుము. నీకు శుభంబగుఁగాక. నీకేది కావలయునో కోరుకొనుము. అని పల్కిన భానునివాక్యములను విని లోకగురుఁడగు బ్రహ్మదేవుఁడు కృతాంజలియై యిట్లనియె. దేవేశా! నేఁడు నీదర్శనముచేఁ గృతార్థుండను పూతుండ నైతిని. ధన్యుఁడను, అనుగృహీతుండను, పరమగతిని బొందినవాఁడనైతిని. దీనికిఁ గారణము షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగు నీవు సహస్రకిరణంబులచే సాక్షాత్కరించుటయేగదా. నిన్నుఁ జూడకపోవుటచే నేను మూఢుఁడనై యుంటిని. విభావసూ! నాయం దనుగ్రహముంచుము. ఆత్మబలమును భక్తినిఁ బ్రసాదింపుమని సాష్టాంగప్రణామం

---

వేదాంతాయ నమో నిత్యం నమో యజ్ఞకలాయ చ. ౮౦. సుమంతురువాచ.— స్తుత్వైవం భాస్కరం భక్త్యా విష్ణుర్భరతసత్తమ, ప్రదధ్యౌ నృపశార్దూల రవిం తద్గతమానసః. ౮౧. ఏవం తే నరశార్దూల దేవా బ్రహ్మాదయోఽనఘ, స్తువంతి తం మహాత్మానం సహస్రకిరణం రవిమ్. ౮౨. ఇత్యేవం స్తువతాం తేషాం రవిం భక్త్యా మహాత్మనాం, అథ తుష్టో రవిస్తేషాం బ్రహ్మాదీనాం జగత్పతిః. ౮౩. విజ్ఞాయ భక్తిం పరమాం శ్రద్ధాం చ పరమాం విభుః, ఉవాచ స మహాతేజాః ప్రహృష్టేనాంతరాత్మనా. ౮౪. గ్రహేశో వ్యోమ చారూఢస్తేజసా ప్రజ్వలందిశః, బ్రహ్మాణం విష్ణుమీశానమామంత్ర్య వితాన్విశాంపతే. ౮౫. దృష్ట్వా తాన్ప్రణతాన్ సర్వాఞ్ఛిరోభిరవనిం గతాన్, తుష్టోఽస్మి తే సురజ్యేష్ఠ చతుర్ముఖ జగత్పతే, వరం వరయ భద్రం తే మనసా త్వం యమిచ్ఛసి. ౮౬. శ్రుత్వా తు వచనం భానోర్బ్రహ్మా లోకగురుర్నృప, జగామ శిరసా భూమావువాచ స కృతాంజలిః. ౮౭. బ్రహ్మోవాచ.—కృతకృత్యోఽస్మి దేవేశ పూతశ్చాస్మి ఖగాధిప, ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి గతోఽస్మి పరమాం గతిం. ౮౮. సహస్రకిరణైర్యస్మే భవాన్దర్శనమాగతః, అపశ్యతశ్చ దేవేశ మూఢమాసీన్మనో మమ. ౮౯. భగవన్ త్వం ప్రసీద త్వం మమోపరి విభావసో, ప్రయచ్ఛ త్వం బలం భక్తిమాత్మనో

బాచరించి భక్తితో విన్నవించెను. తరువాత సూర్యుఁడు బ్రహ్మదేవుని వాక్యములను విని నీవడిగినవాని నన్నింటి నిచ్చితి ననిచెప్పి శశాంకశేఖరుం డగుశంకరునిఁ జూచి యిట్లనియె. భూతేశా! పార్వతీపతీ! నీవు దేనినిఁ గోరవలయునని తలంచుచుంటివో దానిని గోరుకొనుము. ఇచ్చెదనని చెప్పెను. ఇట్టివాక్యములను విని భాస్కరుని సమీపించి సాష్టాంగదండప్రణామం బాచరించి నేను పుణ్యాత్ముఁడను, పుణ్యకర్ముఁడను, నాకంటె ధన్యుఁ డెవ్వఁడును లేఁడు. పరంబగుసిద్ధిని పరమగతిని గూడ బొందితిని. నాక ప్రాప్యమును నసాధ్య మెద్దియును లేదు. భగవంతుఁడ వగునీవు నాకు ప్రసాదప్రవణుండ వగుటచే లభించినది. స్థావరజంగమాత్మకంబగు నీజగమంతయు నీవలననే వృద్ధిఁబొందెను. నీనుండియే యుత్పన్నంబయ్యెను. నీయందే లయమును బొందును. మహాత్మా! నేను దేవర కనుగ్రాహ్యుండనైతినేని దేవరకు సంతోషము గల్గెనేని యచలంబగుభక్తి నిచ్చి నీచరణసాన్నిధ్యమునకుఁ గొనిపొమ్ము. అనిన రుద్రునివాక్యములను విని దివాకరుఁ డట్లే యని చెప్పి హరితో నిట్లనియె. నారాయణా! నీవిషయమై పరితుష్టుండ నైతిని. నీకేమికావలయునో కోరుకొనుము. అనిన సూర్యుని

మమ గోపతే. ౯౦. గత్వా శిరోభిరవనిమష్టాంగైః పతితస్య చ, భక్త్యా విజ్ఞప్తిమాకర్ణ్య ప్రసాదం కురు గోపతే. ౯౧. బ్రహ్మణో వచనం శ్రుత్వా పూషా దేవో జగత్పతిః, తథేత్యాహ మహారాజ విరించిం ప్రశ్రయాన్వితమ్. ౯౨. బ్రహ్మణే చ వరం దత్త్వా రాజన్దేవో దివాకరః, ఉవాచ త్ర్యంబకం దేవం శశాంకకృతశేఖరమ్. ౯౩. వరం వరయ భూతేశ భూభృజ్జాదయితానఘ, యమిచ్ఛసి మహాదేవ దదేహం తదశేషతః. ౯౪. భాస్కరస్య వచః శ్రుత్వా ఈశ్వరస్త్రిపురాంతకః, గత్వా తు శిరసా భూమా ప్రణమ్యోవాచ భాస్కరమ్. ౯౫. మహాదేవ ఉవాచః—పుణ్యోఽహం పుణ్యకర్మాహం నాస్తి ధన్యతరో మమ, గతోఽహం పరమాం సిద్ధిం గతశ్చ పరమాం గతిమ్. ౯౬. నాప్రాప్యమస్తి దేవేశ నాసాధ్యం మమ కించన, యస్య మే భగవాన్దేవః ప్రసాదప్రవణః స్థితః. ౯౭. త్వయా తతమిదం సర్వం జగత్స్థావరజంగమం, త్వత్త ఏవ సముత్పన్నం లయం చ త్వయి యాస్యతి. ౯౮. యది తుష్టో మమ విభో అనుగ్రాహ్యోఽస్మి తే యది, అచలాం దేహి మే భక్తిమాత్మనశ్చరణం నయ. ౯౯. వ్యోమకేశవచః శ్రుత్వా పూషా దేవో దివాకరః, తథేత్యాహ హరం వీర తతో హరిమువాచహ. ౧౦౦. నారాయణ మహాబాహో వరం వరయ గోధర, పరితుష్టోఽస్మి తే దేవ యమిచ్ఛసి మహాబల. ౧౦౧. శ్రుత్వా తు భాస్కరవచః కీలాలజనకో హరిః, ఉవాచ పరయా భక్త్యా నత్వా

వాక్యములను విని నారాయణుఁడు దేవా! జగన్నాథా! నాయందను గ్రహముగలవాఁడవై నీయందు భక్తిని గలుగఁజేయుము. మఱియు సర్వదేవతలలో నుత్తముఁడ నగునట్లుగను దైత్యదానవరక్షస్సుల కజేయునిగను నీయందు భక్తిచేఁ బ్రవృద్ధబలుండ నగునట్లుగను వరము నిమ్ము ఏలనన, యీవరమును బొందినతరువాత మీయనుజ్ఞచేఁ జేయ వలసినకార్యములు పెక్కుగలవు. దేవతలను ప్రజలను పరిపాలించుటయు, వర్ణములను, వర్ణాశ్రమములను వర్ణధర్మములను రక్షించుటయు, దుష్టులగుదైత్యులను నాశనముఁజేయుటయు, లోకములను రక్షించుటయు మొదలగుకృత్యము లనేకములను నిర్వహించుటకై కల్పాదియందు నన్ను సృజించితివి దేవా! నీ వెవ్వనివిషయమై కొంచెము కోపింతువో వారికి వ్యాధిదుఃఖ మనారోగ్యము దారిద్ర్యము సంతాననాశము మొదలగుమనోవ్యాధులు సంభవించును. దానంజేసి నీవు బుధులచే స్తోత్రముఁ జేయఁబడుచుందువు. దేవా! శ్రద్ధాభక్తియుతుండనై యీరీతిగ నిన్న ర్చింపవలయునని కోరుచుంటిని. నన్ననుగ్రహింపుము

ఇది త్రిపంచాశదుత్తరశతతమాధ్యాయము.

---

చ శిరసా రవిమ్. ౧౦౨. నారాయణ ఉవాచ.—జయ దేవ జగన్నాథ జయ దేవ గురో రవే, ప్రసీద మమ దేవేశ భక్తిం యచ్ఛాత్మనో రవే. ౧౦౩. యేనాహం సర్వదేవానా ముత్తమః స్యాం జగత్పతే, అజేయశ్చ తథా దేవ దైత్యదానవరక్షసామ్. ౧౦౪. త్వద్భక్త్యా బృంహితబలస్తేజసా మహతాన్వితః, తతో మయా మహత్కార్యం కర్తవ్యం తవ శాసనాత్. ౧౦౫. ప్రజానాం పాలనం దేవ దేవానాం చ గ్రహాధిప, వర్ణానామాశ్రమాణాం చ వర్ణధర్మస్య వా విభో. ౧౦౬. దుష్టదైత్యవినాశాయ లోకానాం పాలనాయ చ, సృష్టోఽహం భవతా పూర్వం కల్పాదౌ ఛ కృతోఽనఘ. ౧౦౭. యస్య రుష్టో భవాన్స్యాద్వై కథంచిత్పురుషస్య తు, వ్యాధిర్దుఃఖమనారోగ్యం దారిద్ర్యం సంతతిక్షయః. ౧౦౮. తస్యైతాని భవంతీహ ఆధయో వివిధాస్తథా, తస్మాత్త్వం చ తతో దేవ సంస్తవ్యః సతతం బుధైః. ౧౦౯. ఏవం త్వాం గోపతే దేవ భక్త్యా శ్రద్ధాసమన్వితః, అహమర్చితుమిచ్ఛామి తస్మాన్మయి కృపాం కురు. ౧౧౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యతేజోవర్ణనం నామ త్రిపంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

## చతుఃపంచాశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. తరువాత సూర్యుఁడు విష్ణునివాక్యములను విని కృపాసమన్వితుండై కృష్ణా! పరమోత్కృష్టంబగు నేను చెప్పఁబోవు దానిని శ్రద్ధతో నాకర్ణింపుము. ఏయేవరములను నానుండి కోరితివో యవియన్నియు నీకు లభించునుగాక. దేవదానవయక్షగంధర్వోరగరక్షస్సులకు నీ వజేయుండ వగుదువు. నిస్సంశయము. ఈసమస్తజగమును పాలించుటకు సమర్థుఁడ వగుదువు. నీకు నాయం దచలమగుభక్తియుఁ గలుగఁగలదు. బ్రహ్మయు నీజగము నెల్లప్పుడును సృష్టించుటకు సమర్థుఁ డగును. శంకరుఁడును నాయనుగ్రహంబున సంహారించుటకు శక్తుం డగును. మీముువ్వురును నాయనుగ్రహముచే నాపూజాప్రసాదమువలన జ్ఞానవంతులలో నగ్రస్థానము నలంకరింపఁగలరు. ఎంతమాత్రమును సందియములేదు. అనిన సూర్యునివాక్యములను విని నాగభూషణుండును నియతేంద్రియుండును వృషభవాహనుండును నగుశివుం డిట్లనియె. దేవా! నిన్నారాధించి దేవతలలో నుత్తమపదమును పొందఁ గల్గుదుము. శ్రద్ధాన్వితులమై నిన్నెట్లారాధింపవలయునో మాశ్రేయము నభిలషించి యందలి యాథార్థ్యమును తెలియఁజేయుము. పరమపూజితంబగు నీమూర్తి యెచ్చటను నగపడుటలేదు. సముద్రమునుండి విడువఁబడిన యుదకమువలెనే నీతేజమును మాత్రమే జూచుచుంటిమి. ఆతేజము

---

సుమంతురువాచ:—శ్రుత్వా తు వచనం భానుర్విష్ణోరమితతేజసః, ఉవాచ కురుశార్దూల ఆదిత్యః కృపయాన్వితః. ౧. ఆదిత్య ఉవాచ.—కృష్ణకృష్ణమహాబాహో శృణు మే పరమం వచః, యదర్థం ప్రార్థితః కృష్ణ తత్సర్వం తే భవిష్యతి. ౨. దేవదానవయక్షాణాం గంధర్వోరగరక్షసాం, అజేయస్త్వం మహాబాహో భవిష్యసి న సంశయః. 3. జగత్పాలయితుం సర్వం సమర్థశ్చ భవిష్యసి, అచలా తవ భక్తిశ్చ భవిష్యతి మమోపరి. ౪. బ్రహ్మాపి సతతం శక్తో జగత్స్రష్టుం భవిష్యతి, సంహర్తుం శంకరశ్చాపి మత్ప్రసాదాద్భవిష్యతి. ౫. భవంతో మత్ప్రసాదేన జ్ఞానినాముత్తమం పదం, గమిష్యంతి న సందేహో మమ పూజాప్రసాదతః. ౬. రవేర్వచనమాకర్ణ్య గోశ్రుతాభరణో విభో, ఉవాచ గోపతిర్గోగో గోపతిం గోవృషధ్వజః. ౭. త్వామారాధ్య భవిష్యామో వయం సర్వే సురోత్తమాః, కథమారాధయామో హి భవంతం శ్రద్ధయాన్వితాః, శ్రేయసే సతతం దేవ బ్రూహి నస్తత్త్వమాత్మనః. ౮. భవతో హి న పశ్యామో మూర్తిం పరమ

జ్వాలామాలాకులంబుగను అనేకాకృతివిరాజితంబుగను అద్భుతముగను గన్పట్టుచున్నది ఆకారములేని వస్తువాలంబనము కానేరదు ఆలంబన శూన్యమగు వస్తువునం దెన్నఁడును చిత్తము రమింపదు చిత్తము రమింపనియెడలఁ బురుషులకు భక్తిగల్గుట దుర్లభము భక్తిశూన్యులైన దేవతలును పూజించుటకే యసమర్థులగుదురు నిన్నుఁ బూజించుటచేతనే పురుషులు ధర్మార్థకామమోక్షరూపంబులగు చతుర్విధ పురుషార్థంబులఁ బొందుచుండిరి కాన నీపరమోత్కృష్టం బగు మూర్తిని గాన్పింపుము అప్పుడు నిన్నుఁ బూజించి మేమును సిద్ధుల మయ్యెదము అనిన సూర్యుఁ డిట్లనియె మహాదేవా! చాలబాగుగ నడిగితివి సంతసించితిని సమస్తమును వచించెదను నిశ్చలమనస్కుఁడవై యాకర్ణింపుము మహాదేవ! నేను నాల్గుమూర్తులతో నీజగమంతటను లోకములకు శ్రేయమును గోరుచు ఆదిమధ్యాంతములఁ జేయుచు వ్యాపించియుంటిని ఆనాల్గింటిలో మొదటిది రాజసి యని చెప్పఁబడును అదియే బ్రహ్మయని గూడ చెప్పఁబడును ఆమూర్తి యెప్పుడును కల్పాదియందు జగమును సృష్టించుచుండును రెండవది సాత్త్వికమూర్తి యనియు విష్ణువనియుఁ గూడఁ జెప్పఁబడును అది దుష్టదైత్యవినాశినియై జగంబులఁ బ్రోచుచుండును మూఁడవదగు తామసమూర్తి యీశుఁడని

---

పూజితాం, పశ్యామః కేవలం తేజో హ్యత్ర్థేస్తోయమివోజ్ఝితమ్ ౯ జ్వాలామాలాకులం సర్వమనేకాకృతి చాద్భుతం, న చాకారవిహీనం తు చేతసో లంబనం భవేత్ ౧౦ ఆలంబనాదృతే దేవ న చిత్తరమణం క్వచిత్, చేతసోఽరమణే భక్తిర్న పుంసాం జాయతే క్వచిత్ ౧౧ భక్తిం వినా పూజయితుం న శక్యంతే దివాకరః, త్వత్పూజనే హి ప్రాప్యంతే దేవ ధర్మాదయో నరైః ౧౨ తస్మాద్దర్శయ తాం మూర్తిమాత్మనో యా పరా మతా, యేన త్వాం పూజయిత్వా తు వయం సిద్ధా భవామహే ౧౩ సూర్య ఉవాచ—సాధుసాధు మహాదేవ సాధు పృష్టోఽస్మి సువ్రత, శృణు చైకమనాః కృత్స్నం గదతో మమ మానద ౧౪ చతుర్మూర్తిరహం దేవ జగద్వ్యాప్య వ్యవస్థితః, శ్రేయసే సర్వలోకానామాదిమధ్యాంతకృత్సదా ౧౫ ఏకా మే రాజసీ మూర్తిర్బ్రహ్మేతి పరికీర్తితా, సృష్టిం కరోతి సా నిత్యం కల్పాదౌ జగతాం విభో ౧౬ ద్వితీయా సాత్త్వికీ ప్రోక్తా యా పరా పరికీర్తితా, జగత్సా పాలయేన్నిత్యం దుష్టదైత్యవినాశినీ, ౧౭ తృతీయా తామసీ జ్ఞేయా ఈశేతి పరికీర్తితా, త్రైలోక్యం సంహ

వ్యవహరింపఁబడును. ఆమూర్తియే కల్పాంతమున శూలమును ధరించి లోకత్రయమును సంహరించును. నాల్గవదియగుమూర్తి సత్త్వాదిగుణ విహీనం బగుటచే నిర్గుణంబును సర్వోత్తమంబును చతురింద్రియాగోచ రంబును నైయుండును. నేను చెప్పినదంతయు నామూర్తిచేతనే నిర్వర్తింపఁబడుచున్నది. ఈప్రపంచమంతయు నద్దానిచే విస్తృతమై యుండెను మఱియు నిష్కలయు, సకలయు, సురూపయు, రూపరహితయు నగునామూర్తి లోకాంతర్గతంబై కర్మఫలమును బొందక పద్మపత్రమువలె నిర్లిప్తయై యరిషడ్వర్గములచే స్పృశింపఁబడక సప్తవ్యసనముల దాఁటియుండెను. షడ్భావవికారశూన్యమును, చతుర్థపురుషార్థరూపమును, వ్యోమరూపముగల నన్నారాధింపక త్రిమూర్తులగు మీరు గూడ నామూర్తిని స్పృశించుట కర్హులు గానేరరు. ఏమూర్తి యహంకారతమోమూఢులగు మీప్రబోధముకొఱకును లోకప్రబోధముకొఱకును నుపస్థితమై జ్వాలమాలాసమాకులమై దేవభూపద్మమునకు గర్ణికవలె నున్నదో దేనిదర్శనమువలన మీరందఱును బ్రబోధము నొందితిరో దేనితేజముచే జగమంతయుఁ బ్రకాశింపఁజేయఁబడెనో యావ్యోమరూపము నారాధింపుఁడు. దానిచే నాదివ్యమూర్తినిఁ జూడఁ గలవు. ఏది యాద్యుఁడగు నీశ్వరుని గనెనో యదియే వ్యోమ యని

---

రేత్సా తు కల్పాంతే శూలపాణినీ. ౧౮. చతుర్థీ తు గుణైర్హీనా సత్త్వాదిభిరనుత్తమా, సా చాశక్యా క్వచిద్ద్రష్టుం స్థితా సా చాభవత్సదా. ౧౯. తయా తతమిదం సర్వం యచ్చోచ్ఛిద్దీక్షం తు మే గతిః, నిష్కలా సకలా సా తు సురూపా రూపవర్జితా. ౨౦. అంతర్గతా చ లోకానాం న చ కర్మఫలం గతా, తిష్ఠమానా ప్యలిప్తా సా పద్మపత్రమివాంభసా. ౨౧. అస్పృష్టా చ సదా షడ్భిః సప్తాతీత్య వ్యవస్థితా, చతుస్తనా చ సా షడ్భ్యస్తురీయాఖ్యా సుపూజితా. ౨౨. న సా స్ప్రష్టుం త్వయా శక్యా హరిణా బ్రహ్మణా న చ, మామనారాధ్య భూతేశ వ్యోమరూపం కదాచన. ౨౩. యదేతద్భవతాం దేవ ప్రబోధార్థముపస్థితం, అహంకారవిమూఢానాం తమసా చ త్రిలోచన. ౨౪. ప్రకాశాయ చ లోకానాం జ్వాలామాలాసమాకులం, కర్ణికేవ స్థితం దేవభూపద్మస్యాఖిలస్య చ. ౨౫. యస్య సందర్శనాదేవ యూయం సర్వే ప్రబోధితాః, ప్రకాశమభవద్వాపి జగత్సర్వమథార్చిభిః. ౨౬. తస్మాదారాధయస్వైనమస్పృష్టం గమనోపమం, మన్మూర్తిం యేన తాం దివ్యాం ద్రక్ష్యసి త్వం త్రిలోచన. ౨౭. యత్త్వాద్యమీశ్వరం

చెప్పఁబడును. ఈవ్యోమయందే దేవతలు కల్పాంతమున లయమును బొందుదురు. దక్షిణభాగంబున బ్రహ్మయు, వామభాగంబున జనార్దనుండును, త్రిపురాంతకుండ వగునీవు కచదేశంబునను లయమును బొందుదురు. గాయత్రియు లోకమాతలు హృదయంబున లీనమగుదురు. షడంగపదక్రమయుక్తంబగు వేదము శిరమునందును, స్థావరజంగమాత్మకంబగు జగంబంతయుఁ గుక్షియందును లయమును బొందుచున్నవి. ఏయేస్థానములయం దెవరు లయమును బొందుదురో యాయాస్థానములయందే బ్రహ్మాదిదేవతలును చరాచరవస్తుజాతమంతయు నుద్భవించును. ఆకాశమును వ్యోమయనియుఁ బృథివిని క్షితియనియుఁ జెప్పుదురు. భూతములకు శ్రేయోదాయక మగునాకాశము నేనే. నిక్షుభ నాప్రియురాలు. మాయిద్దఱచే నీజగమంతయు వ్యాప్తమై యుండెను. ఆకారణంబుచే నీవును బ్రహ్మయుఁ గేశవుండును వ్యోమ నారాధింపుఁడు. త్రిలోచనా! యందుచే నారూపంబగు నీమహాకాశమ్మును దేవమానానుసారముగ వేయిసంవత్సరములు గంధమాదనపర్వతమునందు భక్తితో నారాధించి యుత్కృష్టంబును శుభంబును షడంగోపేతంబు నగుసిద్ధిని బొందఁగలవు. శంఖచక్రగదాధరుండగు జనార్దనుండు కలాపగ్రామము నాశ్రయించి వ్యోమరూపుఁడ నగునన్ను భక్తితో నారాధించునుగాక. బ్రహ్మయు నంతరిక్షగతంబగు పుష్కరంబను లోకపావనంబగు తీర్థమునకుఁ బోయి

---

జజ్ఞే తద్వ్యోమ పరికీర్తితం, కల్పాంతే హ్యత్ర వై వ్యోమ్ని లీయంతే సర్వదేవతాః. ౨౮. దక్షిణే లీయతే బ్రహ్మా వామే తస్య జనార్దనః, త్వం సదా కచదేశే తు లీయసే త్రిపురాంతక. ౨౯. గాయత్రీ లీయతే తస్య హృదయే లోకమాతరః, లీయంతే మూర్ధ్ని వై వేదః సషడంగపదక్రమః. ౩౦. జఠరే లీయతే సర్వం జగత్స్థావరజంగమం, పునరుత్పద్యతే హ్యస్మాద్బ్రహ్మాద్యం సచరాచరమ్. ౩౧. ఆకాశం వ్యోమ ఇత్యాహుః పృథివీ నిక్షుభా మతా, భూతశ్రేయోహమాకాశో నిక్షుభా దయితా మమ. ౩౨. మయా నిక్షుభయా సర్వం జగద్వ్యాప్తం త్రిలోచన, తస్మాదారాధయ వ్యోమ త్వం బ్రహ్మా కేశవస్తథా. ౩౩. తస్మై రూపం మహద్వ్యోమ పూజయిత్వా త్రిలోచన, దివ్యం వర్షసహస్రం హి గిరౌ త్వం గంధమాదనే, తతో యాస్యసి సంసిద్ధిం షడంగాం పరమాం శుభామ్. ౩౪. కలాపగ్రామమాశ్రిత్య శంఖచక్రగదాధరః, ఆరాధయతు మాం భక్త్యా వ్యోమరూపం జనార్దనః. ౩౫. అంతరిక్షగతం తీర్థం పుష్కరం లోకపావనం, తత్ర

యెచ్చట వ్యోమరూపుండ నగు న న్నర్చించుచుండునో యిట్లు మీరు నన్నెల్ల ప్పుడు నారాధించి మూఁడు వేలదివ్యవత్సరముల కుత్కృష్టంబగు నారూప మును జూడఁగలరు మఱియు నారూపము కదంబముకుళాకారమును అశ్వమాలాకులంబునునై విబుధులచేఁ బరమమూర్తి యని చెప్పఁబడును అనవుడు నారాయణుండు కృతాంజలియై దేవా! వ్యోమయే యుత్కృ ష్టంబగు నీపరమరూపంబైనయెడల మేమందఱము నారూపమునే యారాధించి పరమశక్తిని బొందఁగలము నేనును బ్రహ్మయుఁ ద్రిపురాంత కుండును ఆత్మశ్రేయోభిలాషచే భక్తితో నెట్టి వ్యోమ నారాధించె దము? దాని నెఱింగి మిమ్మారాధించి సిద్ధిని బొందఁగోరెదము కాన నీవ్యోమలక్షణమును మాకుఁ జెప్ప వేఁడెదము

ఇది చతుఃపంచాశదుత్తరశతతమాధ్యాయము

## పంచపంచాశదుత్తరశతతమాధ్యాయము

ఆదిత్యుం డిట్లనియె చాల బాగుగఁ బ్రశ్నించితివి కృష్ణా! సావ

---

గత్వా విరించో మే వ్యోమరూపం సదార్చతు ౩౬ ఏవం మాం సతతం యూయం స్సమారాధ్య జగత్పతిం, సమానాం చ సుదివ్యానాం సహస్రత్రయమాదరాత్ ౩౭ తతో ద్రక్ష్యథ మే మూర్తిం పరమాం యాం విదుర్బుధాః, కదంబగోలకాకారాం రశ్మిమాలాకులాం పరామ్ ౩౮ అథ నారాయణో దేవః ప్రణమ్య శిరసా రవిం, కృతాంజలిపుటో భూత్వా ఇదం వచనమబ్రవీత్ ౩౯ విష్ణురువాచ — యది తే పరమం రూపం మతం వ్యోమ హ్యనౌపమం, తమారాధ్య వయం సర్వే యాస్యామః సిద్ధిముత్తమామ్ ౪౦ కీదృగ్వ్యోమ త్వహం బ్రహ్మా హరశ్చ త్రిపురాంతకః, ఆరాధయామ హే దేవ భక్త్యా శ్రేయోర్థమాత్మనః ౪౧ యేన సిద్ధిం గమిష్యామ స్తమారాధ్య దివా కరం, తస్మాన్నో లక్షణం బ్రూహి వ్యోమ్నః పరమపూజిత ౪౨

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే త్రయ్యుపాఖ్యానే చతుఃపంచాశదుత్తరశతతమోఽధ్యాయః

---

ఆదిత్య ఉవాచ — సాధు సాధు సురశ్రేష్ఠ సాధు పృష్టోఽస్మి భూధర, శృణు ష్వైకమనాః కృష్ణ గదతో నిఖిలం మమ ౧. ఆరాధయత్వయం దేవో మమ రూప

థానంబుగ నాకర్ణింపుము ఈబ్రహ్మదేవుఁడు చతుష్కోణంబును, ననుప
మంబును, నద్భుతంబును, గైరికోజ్జ్వలంబును నగు నావ్యోమరూపము
నారాధించును చక్రాంకంబగు నారూపమును నీవారాధింపుము
రుద్రుఁడు వర్తులము నారాధించును నన్ను ముగ్గురు త్రికాలముల
యందు నర్చింపవలయును తక్కుంగల దేవతలందఱును త్రికాలముల
యథేష్టముగాఁ బూజింతురుగాక ఈవాక్యమును వినినతరువాత బ్రహ్మాది
దేవతలు నమస్కరించి దేవా! మేమందఱము ధన్యులమైతిమి కృత
కృత్యులమైతిమి నీదర్శనముచే మేమందఱము జ్ఞానులమైతిమి మోహ
మును అజ్ఞానము నాలస్యమును చంచలమై యొక్కమారుగనె విడచి
పోయెను నీమూర్తుల మగు మేము నీతేజముచే నావృతులమై యుంటిమి
నీయాజ్ఞచే లోకముయొక్క సృష్టిస్థితిలయంబులకొఱకు మేమును దిక్పా
లకులునుఃనుంటిమి ఇప్పుడు వ్యోమపూజను జేయుటకై యేగెదమనిన
వారలవాక్యములను విని వారితస్కరుండగు భాస్కరుండు త్రిమూ
ర్తులఁ జూచి సామముగా నోదేవతలారా! మీరు చెప్పినదంతయు
సత్యమే యగును మీరందఱును నామూర్తులుగను నేను మీమూర్తి
గను నగుదుము దేవతలారా! యీదర్శన మెందువలననో యుత్తమం

---

మనౌపమం, చతుష్కోణం పరం వ్యోమ అద్భుతం గైరికోజ్జ్వలమ్ ౨ త్వామారాధ్య
చ చక్రాంకం శంకరో వృత్తమాదరాత్, శబ్దాదౌ సతతం బ్రహ్మ సగరాదౌ త్రిలోచనః
౩ మధ్యాహ్నే త్వం సదా దేవ భక్త్యా మామర్చయస్వ వై, యథేష్టమృభవః సర్వే
భక్త్యా మాం పూజయంతు వై ౪ తతో బ్రహ్మాదయో దేవాః శ్రుత్వా వాక్యం విభా
వసోః, ప్రణమ్య శిరసా సర్వ ఇదం వచనమబ్రువన్ ౫ ధన్యా దేవ వయం సర్వే
కృతకృత్యాస్తథైవ చ, అస్మాభిర్భగవాన్దృష్ట స్తేజసా ప్రజ్వలంతి చ ౬ సంభూతా
జ్ఞానినః సర్వే భవతో దర్శనాద్వయం, తమో మోహ స్తథా తంద్రా సర్వ మేకపదే
గతమ్ ౭ వయం త్వన్మూర్తయః సర్వే తేజసా తవ సంవృతాః, ఉత్పత్తిస్థితినాశాయ
లోకానాం తవ శాసనాత్ ౮ స్థితాః సర్వే సురజ్యేష్ఠ లోకపాలాశ్చ కృత్స్నశః,
అధునా సాధయామేహ వ్యోమ్నః పూజాం ప్రజామహే ౯ ఇత్థం తేషాం వచః
శ్రుత్వా భాస్కరో వారితస్కరః, ఉవాచ బ్రహ్మవిష్ణ్వీశా న్సామపూర్వమిదం వచః
౧౦ ఆదిత్య ఉవాచ — ఏవమేతన్న సందేహో యథావదథ సువ్రతాః, యూయం
మన్మూర్తయః సర్వే యుష్మాకమహమేవ హి ౧౧. యదేతద్దర్శనం దేవాః ప్రమాణం చ

బును జ్వాలమాలాకులంబును ఉజ్జ్వితంబగు శాండిలేయంబునుంబోలె శుభ్రంబును నగు నీదర్శన మెందువలననో దానినిఁ దెలిసికొనుఁడు అహం కారవిమూఢులై మీారు పరస్పరము కలహించుచుండఁగా మిమ్ములను ప్రబోధించుటకై మీాయజ్ఞానమును నశింపఁజేయుటకు మిమ్ములను సర్వకర్మ లయందుఁ ప్రవర్తింపఁజేయుటకును నీరూపమును బంపితిని గాన దీనినం తను తెలిసికొని యహంకారమును బొందకుఁడు మానదర్పాహంకార ములను వదలి శ్రద్ధాభక్తియుక్తులరై నన్నారాధింపుఁడు సకలంబును నిష్కలంబును నెవ్వనిదర్శనముచే దేవతలందఱును సిద్ధిఁబొందుచుండిరో యట్టిదియునగు నారూపమును జూడఁగలరు సిద్ధినిఁ బొందఁగలరు రాజా! భగవంతుఁడగు సూర్యుఁ డిట్లు చెప్పి వారలు చూచుచుండఁగనే యంతర్హితుండయ్యెను తరువాత బ్రహ్మావిష్ణుమహేశ్వరులు మహా జస్కుండగు భాస్కరునితేజముచే మోహి(విస్మి)తులై పరస్పరము నాశ్చర్యముగ నిట్లు మాట్లాడుకొనుచుండిరి అహో! యదితిపుత్త్రుఁ డగు దివస్పతి యెంతటిమహాత్ముఁడు? బృహద్భానుఁడును మహాతేజుఁడును లోక దీపకుఁడును తమోహంతయునగునీతనిచే మనమందఱమురక్షింపఁబడితిమి కాన నాతని సకలస్థానములకుఁ బోయి యారాధింతము ఆతని ప్రసాదము

---

యదుత్తమం, జ్వాల మాలాకులం శుభ్రం శాండిలేయమివోజ్ఝితమ్. ౧౨ యుష్మాకం దేవశార్దూలాస్తన్నిబోధత కారణం, అహంకారవిమూఢానాం మిథః కలహినాం తథా. ౧౩. ప్రబోధార్థం హి యుష్మాకం తమసో నాశనాయ చ, ప్రవర్తనాయ సర్వేషాం కర్మణాం చ ప్రదర్శితమ్ ౧౪ తస్మాదేవం విదిత్వా తు నాహంకారః కదాచన, కర్తవ్యో భూతిమిచ్ఛద్భిః సతతం దేవసత్తమాః ౧౫ మానం దర్పమహంకారం పూర్వం త్యక్త్వా సుదూరతః, ఆరాధయత మాం భక్త్యా సతతం శ్రద్ధయాన్వితాః ౧౬ తతో ద్రక్ష్యథ మే రూపం సకలం నిష్కలం చ యత్, యస్య సందర్శనాదేవ సర్వే సిద్ధి మవాప్స్యథ. ౧౭ ఏవముక్త్వా మహారాజ సహస్రకిరణో విభుః, జగామాదర్శనం తేషాం పశ్యతామేవ భారత ౧౮ అథ తే విస్మితాః సర్వే బ్రహ్మావిష్ణుపినాకినః, తేజసా తస్య దేవస్య భాస్కరస్య మహౌజసః ౧౯ పరస్పరమథోచుస్తే విస్మయేన తదా నృప, అహో మహాత్మాఽయం దేవోఽదితిపుత్రో దివస్పతిః ౨౦. బృహద్భానుర్మహాతేజా లోకదీపో విభావసుః, యేన సర్వే వయం త్రాతా నిఘ్నతా విపులం తమః ౨౧ ఆరా ధయామస్తం సర్వే గత్వా స్థానాని కృత్స్నశః, యేన సర్వే వయం తస్య ప్రసాదా

వలననే మనమందఱము సిద్ధినొందితిమి విభుస్వరూపంబగు నావ్యోమ నధికభక్తిచేఁ బూజించి యొకరినొకరుఁ దెలిసికొని సాదరంబుగఁ బుష్కర తీర్థంబునకు, బ్రహ్మయును సాలగ్రామమునకు జనార్దనుఁడును, గంధమాదనమునకు వృషభధ్వజుఁడును వెడలిపోయిరి. మానాహంకారముల విడచి యుత్తమంబగుతపంబుఁ జేయుచు వారితస్కరుఁడగు సూర్యు నారాధించుచుండిరి. బ్రహ్మదేవుఁ డాకసమున నిత్యము చతుష్కోణము జేసిఁ బూజించుచుండెను. జనార్దనుఁడు చక్రాంకితమగు వ్యోమం బూజించుచుండెను. ఈశ్వరుఁడును తేజంబుచే వహ్నిసదృశంబును వర్తులాకారమగువ్యోమను భక్తియుతుఁడై పూజించెను. ఈరీతిని దేవమానానుసారమున వేయివత్సరములు దివాకరు నారాధింపుచు గంధమాల్యోపహారంబులచేతను, నృత్తగీతవాద్యంబులచేతను, నచలంబగుభక్తిచేతను తపంబు జేయుచు మహాత్ముఁడగు వివస్వంతుని సంతుష్టుఁజేసిరి. రాజా! తరువాత భువనాధిపుఁడగు సూర్యుఁడు ప్రసన్నుఁడై యొక్కమారు లోకాత్మయు విభావసువుకృష్ణాత్మయు మహాతేజంబను నాల్గురూపంబులచే యోగమువలనఁ బ్రత్యక్షగతుఁడయ్యెను. ఆనాల్గురూపంబులలో నొక రూపముచే సురశ్రేష్ఠుఁడగు బ్రహ్మను మఱియొకరూపముచే శంకరుని మఱియొకరూపముచే గరుడధ్వజుని సమీపించి ప్రీతికరంబగువాక్యముఁ

---

త్సిద్ధిమాప్నుమః. ౨౨. తద్వ్యోమ పూజయిత్వా తు పరయా శ్రద్ధయా విభోః, ఆమంత్ర్య తే మిథః సర్వే గతాః పూజార్థమాదరాత్. ౨౩. జగామ పుష్కరం బ్రహ్మా శాలగ్రామం జనార్దనః, వృషభధ్వజో గతో వీర పర్వతం గంధమాదనమ్ ౨౪. త్యక్త్వా మానమహంకారం కుర్వంత స్తప ఉత్తమం, ఆరాధయంతి తం దేవం భాస్కరం వారితస్కరమ్. ౨౫. వ్యోమ్ని కృత్వా చతుష్కోణం బ్రహ్మా నిత్యమపూజయత్, చక్రాంకితం హరిర్నిత్యం సమ్యగ్వ్యోమ త్వపూజయత్. ౨౬. హరోఽపి సతతం వీర తేజసా వహ్నిసన్నిభం, అపూజయత్సదా వృత్తం వ్యోమ భక్త్యా సమన్వితః. ౨౭. దివ్యవర్ష సహస్రాంతే పూజయంతో దివాకరం, గంధమాల్యోపహారైస్తు నృత్యగీతప్రవాదితైః. ౨౮. అతోషయన్మహాత్మానం కుర్వాణా స్తప ఉత్తమం, భక్త్యాచలేన మనసా వివస్వంతమనుత్తమమ్. ౨౯. అథ తేషాం మహారాజ ప్రసన్నో భువనాధిపః, దర్శయామాస లోకాత్మా యుగపద్వై విభావసుః. ౩౦. కృష్ణాత్మా చ మహాతేజాశ్చతుర్ధా యోగతోఽనఘ, గత్వైకేన సురశ్రేష్ఠం సోఽబ్రవీత్పరమం వచః. ౩౧. అన్యేన శంకరం మన్యే అన్యేన గరుడధ్వజం,

బల్కెను. నాల్గవరూపముచే రథారూఢుఁడై దివమును దపింపజేసెను.
ఇట్లు యోగబలముచే భానుఁడు మహాద్భుతమును గలుగఁజేసెను. తరు
వాత నోరాజా! యుగ్రమగుతపంబున నున్నట్టియు, భూగతంబులగు
ముఖకమలంబులచే వ్యోమమును బూజించునట్టియు, చతురాననుండగు
బ్రహ్మదేవునితో నిట్లనియె. సురేశా! నీకు వరంబుల నిచ్చుటకై వచ్చితిని.
నన్నవలోకింపు మని పల్కిన సూర్యునివాక్యములను విని ప్రణతుఁడై
సూర్యునిఁ జూచెను. చూచి హర్షపులకితగాత్రుఁడై లేచి నిలువంబడి
కృతాంజలియై భాస్కరునితో నిట్లనియె. దేవదేవా! తిమిరాపహా! నీకు
నమస్కారము భూతభవ్యేశ! భూతాధిభూతుఁడవగు నీకు నమస్కా-
రము. భూతభావనా! దివాకరా! ప్రసన్నుండవై నన్ననుగ్రహింపుము.
నీవుదక్క నాకు వేరుగతి లేదనిన నాదిత్యుం డిట్లనియె. చతుర్ముఖా! నీవు
చెప్పినదంతయు యథార్థమే యగును. అసత్య మెంతమాత్రమును
గానేరదు. నీవు కారణమునకుఁ బూర్వమే జనించుటచేఁ బ్రథమపుత్త్రుండ
వైతివి. వరదుఁడనై నీయెదుట నిలచితిని. నీకేమి కావలయునో కోరు
కొనుము నీవెంతమాత్రమును శంకింపవలదనిన, బ్రహ్మదేవుఁ డిట్లనియె.
పూజ్యుఁడా! నీవు సంతుష్టుఁడవై యుత్తమవరంబుల నీయఁదలఁచినచో
నీయనుగ్రహమువలన నీసృష్టినిఁ జేయుటకు శక్తుఁడనగుదును. లేనిచో

---

స తతాప తథాన్యేన రథారూఢో దివం సదా. ౩౨. ఏవం యోగబలాద్భానుః కృతవా
న్మహదద్భుతం, ఉగ్రే తపసి వర్తంతం దృష్ట్వా చైనం చతుర్ముఖమ్. ౩౩. పూజయంతం
మహాద్వ్యోమ భూగతైర్ముఖపంకజైః, ఉవాచ తం మహారాజ భాస్కరశ్చతురాననమ్.
౩౪. పశ్యపశ్య సురజ్యేష్ఠ వరదం మాముపాగతం, శ్రుత్వైవం వచనం భానోర్విరించ స్త
మథైక్షత. ౩౫. దృష్ట్వా జగామ ప్రణతో హ్యవనిం ముఖపంకజైః, హర్షాదుత్ఫుల్ల
నయనః పునరుత్థాయ భాస్కరం, ఉవాచ పరమం వాక్యం కృతాంజలిపుటః స్థితః. ౩౬.
బ్రహ్మోవాచ.—నమస్తే దేవదేవేశ నమస్తే తిమిరాపహ, నమస్తే భూతభవ్యేశ భూతాదే
భూతభావన. ౩౭. ప్రసాదం కురు మే దేవ ప్రసన్నోఽథ దివాకరః, గతిరన్యా న మే
దేవ విద్యతే త్వదృతే విభో. ౩౮. ఆదిత్య ఉవాచ.—ఏవమేవ యథాత్థ త్వం నాస్తి
తత్ర విచారణా, త్వం మే ప్రథమజః పుత్రః సంభూతః కారణాత్పురా. ౩౯. వరం
వరయ భద్రం తే వరదోఽస్మి తవాగ్రతః, యమిచ్ఛసి సురజ్యేష్ఠ మా త్వం శంకాం కురు
ప్రభో. ౪౦. బ్రహ్మోవాచ.—యది మే భగవాంస్తుష్టో దదాతి వరముత్తమం, కర్తుం

కృతాకృతరూపంబగు నాసృష్టి లోకంబునఁ బ్రసిద్ధినొందదనిన విని యాదిత్యుం డిట్లనియె చతుర్ముఖా! నేను నీకుఁ బుత్రత్వమును బొందఁ జాలను నీవంశమునఁ బుట్టిన మరీచికిఁ బుత్రుఁడనయ్యెదను అప్పుడు సకలంబగు సృష్టియు సిద్ధిని బొందఁగలదు జగత్పతీ! నాయనుగ్రహము వలన నిది యంతయు నిస్సంశయముగా జరుగును రాజా! బ్రహ్మదేవుఁడు సూర్యునిచే నిట్లు చెప్పఁబడినవాఁడై లోకనాథుండును వివస్వంతుఁడును జగత్పతియును వ్యోమరూపుఁడు నగుభాస్కరుని నమస్కరించి మఱల నిట్లనియె జగన్నాథా! నాకు నివాస మెచ్చట నిశ్చితమైయున్నదో చెప్పఁ గోరెదననిన నాదిత్యుఁ డిట్లనియె నావ్యోమరూపంబునకుఁ బృష్ఠభాగం బున ననుత్తమంబగు శృంగం బొక్కటి గలదు దేవసమూహముతోఁ గూడ నచ్చట నీవు నివసింపవలయును పూర్వదిగ్భాగంబున నింద్రుఁ డును, ఆగ్నేయదిగ్భాగంబున శాండిలీసుతుండును, దక్షిణదిగ్భాగంబున యముఁడును, నైరృతదిగ్భాగంబున నిరృఋతియును, పశ్చిమదిగ్భా గంబున వరుణుఁడును, వాయవ్యదిగ్భాగంబున వాయువును, నుత్తర దిగ్భాగంబునఁ గుబేరుఁడును, నీశాన్యంబున శంకరుఁడును, మధ్యభాగం బున నీవును విష్ణువు నుండవలయును అను నీభాస్కరునివాక్యములను విని బ్రహ్మదేవుఁడు సంతుష్టుఁడై తనను కృతకృత్యునిగాఁ దలఁచుచు యథో

---

శక్ష్యామి సృష్టిం చ ప్రసాదాత్తవ గోపతే, కృతాకృతా హి మే దేవ సృష్టిర్నేహ ప్రసిధ్యతి ౪౧ ఆదిత్య ఉవాచ — న పుత్రత్వమహం ప్రాప్తస్తవదేవ చతుర్ముఖ, తవా న్వయే గమిష్యామి పుత్రత్వం హి మరీచయే ౪౨ తతో యాస్యతి తే సిద్ధిం కృత్స్నా సృష్టిశ్చతుర్ముఖ, భవిత్రైవం న సందేహో మత్ప్రసాదాజ్జగత్పతే ౪౩ ఏవముక్తో విరించి స్తు రవిణా పృథివీపతే, తం వై వ్యోధం వివస్వంతం లోకనాథం జగత్పతిమ్ ౪౪ పునరాహ సురజ్యేష్ఠః ప్రణమ్య శిరసా రవిం, క్వ మే వాసో జగన్నాథ భవిష్యతి దివ స్పతే ౪౫ ఆదిత్య ఉవాచ — యన్మే రూపం మహద్వ్యోమ పృష్ఠశృంగమనుత్తమం, తత్ర దేవకదంబైస్తు భవాన్నిత్యం నివత్స్యతి ౪౬ ఇంద్రః పూర్వదిశో భాగే ఆగ్నేయ్యాం శాండిలీసుతః, దక్షిణస్యాం యమో నిత్యం నైరృత్యామథ నిరృతిః ౪౭ పశ్చిమాయాం తు వరుణో వాయవ్యాం తు సదాగతిః, ఉత్తరే తు దిశో భాగే నివసేద్ధనదస్తతః ౪౮ ఐశాన్యాం శంకరో దేవో మధ్యే త్వం విష్ణునా సహ, శ్రుత్వైతత్వం వచనం భానోర్వేధాః ప్రీత్యా తమబ్రవీత్ ౪౯ కృతకృత్యం తథా

క్తంబుగా భాస్కరుఁడు చెప్పినదంతయుఁ జేసి భాస్కరప్రసాదమువలన సిద్ధిఁబొందెను ఆదిత్యుండును బ్రహ్మదేవునకు వరంబిచ్చి యతనితో గంధమాదనపర్వతంబునకుఁ బోయెను అచ్చట భూతేశుండును, తీవ్రమగు తపం బాచరించుచున్నట్టియుఁ గపర్దియును, శూలధరుండును, చంద్రార్కకృత శేఖరుండును, వ్యోమను బూజించునట్టియు సువ్రతుండును, తేజోన్వితుండును, గంధమాల్యోపహారములచేతను నృత్తగీతవాద్యములచేతను ప్రణవస్తోత్రగీతంబులచేతను పూజించునట్టియు శిరముచే భూమికిఁ జేరి నమస్కరించునట్టియు శంకరునిఁ జూచి భాస్కరుఁడు సంతుష్టుఁడై యిట్లనియె శంకరా! నీవిషయమై సంతసించితిని నీకు వరము నిచ్చుటకై భూతలంబునకు వచ్చి నీయెదుట నిలచితిని నావలన నీకేమిగావలయునో కోరుకొనుము రాజా! యీభానునివాక్యములను విని శంకరుఁడు ప్రజ్వలించుచున్న లోకనాథునిఁ జూచి అష్టాంగంబుల భూమియందు మోపి నమస్కరించి యిట్లనియె దేవేశా! ప్రభాకరా! దివాకరా! నీకు నమస్కారము శుభాలయా! శుభాధారా! వికర్తనా! నీకు నమస్కారము నీవు ప్రసన్నుఁడవై నీయనుగ్రహము నాయందుఁ బ్రసరింపఁ జేయుము నేను సంసారమనియెడు సముద్రమున మునుఁగుచుంటినిగాన నావవై నన్నుద్ధరింపుము నేను నీయంగసంభవుండ నగు పుత్త్రుఁడనుగాని

---

త్మానం మన్యతే చ నరాధిప, చకార చ తథా సర్వం భాస్కరోక్తమశేషతః. ॥౧౦ స చ సిద్ధిం గతో వీర ప్రసాదాద్భాస్కరస్య తు, ఆదిత్యోఽపి వరం దత్త్వా బ్రహ్మణ్యో బ్రహ్మణేఽనఘ ॥౧౧ జగామ సహ దేవేన పర్వతం గంధమాదనం, దదర్శ తత్ర భూతేశం తపస్తీవ్రం సమాశ్రితమ్ ॥౧౨ కపర్దినం శూలధరం చంద్రార్కకృతశేఖరం, పూజయంతం పరం వ్యోమ సువ్రతం తేజసాన్వితమ్ ॥౧౩ గంధమాల్యోపహారైశ్చ నృత్యగీతప్రవాదితైః, ముఖవాద్యైశ్చ బహుభిః ప్రణవస్తోత్రగీతిభిః, సంపూజ్యైవం మహాద్వ్యోమ జగామ శిరసా మహీమ్ ॥౧౪ దృష్ట్వైవం పూజయంతం చ భాస్కర స్త్రిపురాంతకం, తుష్టోవాచన్మహాతేజా గోశ్రుతాభరణం హరమ్ ॥౧౫ భీమ తుష్టోఽస్మి తే వత్స వరం మత్తో వృణుష్వ వై, తవాంతికమహం ప్రాప్తో వరదో భూభృదాలయ ॥౧౬ శ్రుత్వైవం వచనం భానోర్మహాదేవో మహీపతే, దదర్శ లోకనాథం తం ప్రజ్వలంతమనుత్తమం, ఉవాచ ప్రణతో భూత్వా అష్టాంగైర్భూతలం గతః ॥౧౭ నమో నమస్తే దేవేశ ప్రభాకర దివాకర, శుభాలయ శుభాధార వికర్తన శుభానన ॥౧౮ ప్రసాదం కురు దేవేశ ప్రసన్నస్త్వం వికర్తన, సంసారార్ణవమగ్నస్య భవ పోతో జగ

వేరుగాదు తండ్రి కుమారునకేది గలుగఁజేయునో తండ్రివగు నీవు కుమారుఁడనగు నాకు దానినిఁ గలుగఁజేయుము అనిన విని యాదిత్యుం డిట్లనియె శంకరా! నీవు చెప్పినదంతయు సత్యము పుత్రులందఱిలో శ్రేష్ఠుఁడవగు నీవు లలాటమున నుద్భవించితివి నీమనంబునఁ గలదానినిఁ గోరుకొనుము అది యివ్వకూడనిదైనను నిచ్చెదననిన శంకరుం డిట్లనియె దేవా! నీవు సంతుష్టుఁడవైనయెడల నేననుగ్రాహ్యుఁడ నైనయెడల నీయందచలంబగుభక్తినిఁ బ్రసాదింపుము దేవదానవయక్షరక్షోగంధర్వ గణంబుల నిర్జించి కల్పాంతంబున నెట్లు ప్రజలను సంహరింతునో యట్లును పరమంబగుస్థానమును బ్రసాదింపుము నాహేతిసర్వస్వమగు శూలము నకు జయముగా కితరము గలుగఁగూడదు అనిన నాదిత్యుఁ డిట్లనియె త్రిపురాంతకా! దేవదానవగంధర్వయక్షరక్షోగణంబులను జగంబును కల్పాంతంబున సంహరింపఁగలవు నీవు నిత్యము నేరూపమును బూజించి తివో ఆవ్యోమమయే త్రిశూలంబను గొప్పశస్త్రము గాఁగలదు వ్యోమ యొక్క యీశానభాగంబున నీకు నివాసమును గాఁగలదనిన మహా దేవుం డిట్లనియె దేవా! నీవు నాకు దేని నిచ్చుట కనుగ్రహించితివో

---

త్వతే ౧౯. తవాంగసంభవో దేవ పుత్రోఽహం వల్లభస్తవ, యత్కరోతి మహాదేవ పితా పుత్రస్య తత్కురు ౨౦ ఆదిత్య ఉవాచ—ఏవమేతన్న సందేహో యథా వదసి శంకర, లలాటాత్త్వం సముత్పన్నః పుత్రః పుత్రవతాం వర ౨౧ వరం వరయ భద్రం తే మనసా త్వం యమిచ్ఛసి, దుర్దేయం చాపి తే దాస్యే త్రిపురాంతక సుందర ౨౨ మహాదేవ ఉవాచ—యది తుష్టోఽసి మే దేవ అనుగ్రాహ్యోఽస్మి తే యది, ప్రయచ్ఛ మే వరం భానో దేహి భక్తిం మమాచలామ్ ౨౩. దేవదానవగంధర్వయక్షరక్షోగణాం స్తథా, నిర్జిత్యాహం యథా దేవ యుగాంతే సంహరే ప్రజామ్ ౨౪. తథా ప్రయచ్ఛ మే దేవ స్థానం చ పరమం విభో, యేనాహం హేతిసర్వం చ జయే దేవ జగత్ప్రభో ౨౫ ఆదిత్య ఉవాచ—దేవదానవగంధర్వయక్షరాక్షసపన్నగాన్, హరిష్యసి జగచ్చాపి యుగాంతే త్రిపురాంతక ౨౬. యదేతత్పూజితం నిత్యం మద్రూపం వ్యోమ చోత్తమమ్, ఏతత్త్రిశూలం పరమం తవ శస్త్రం భవిష్యతి, ఈశానే చ తథా భాగే వ్యోమ్నో వాసో భవిష్యతి. ౨౭ మహాదేవ ఉవాచ—ఏవం భవతు మే దేవ యః ప్రసాదస్త్వ

నీ ప్రసాదమువలన నదియంతయుఁ లభించును. నీవు నాకు వరప్రదుఁడ వగుటంజేసి కృతకృత్యుఁడనైతిని.

ఇది పంచపంచాశదుత్తరశతతమాధ్యాయము.

## షట్పంచాశదుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. ఇట్లు బ్రహ్మరుద్రులకు వరంబుల నిచ్చి విష్ణునకు వరంబుల నిచ్చుటకై శాలగ్రామంబున కేగెను. అచ్చట గొప్పతపమును జేయుచున్నట్టియు శ్రద్ధాసమన్వితుఁడై వ్యోమను బూజించునట్టియు శిరంబుచేఁ బ్రణామం బాచరించుచున్నట్టియు, హృదయమున దివాకరునిఁ బూజించునట్టియుఁ జక్రాకృతిగలవ్యోమను గంధపుష్పోపహారంబులచేతను నృత్తగీతవాద్యంబులచేతను బూజించుచున్న కృష్ణునిం గనెను. కని యోకృష్ణా! నేను వచ్చితిని నన్నుఁ జూడుమని సూర్యుఁడు చెప్పినవాక్యమును విని కేశవుఁడు సాష్టాంగప్రణామం బాచరించి, సర్వదేవేశా! ఆకాశసంచారా! నీకు నమస్కారము. జగత్ప్రభూ! గ్రహాధిపా! నీకు నమస్కారము. అనఘా! హంసా! దివస్పతీ నన్ననుగ్రహింపుము. దారిద్ర్యదుఃఖహారకా! భవనాశనా! నీకు నమస్కారము.

యా కృతః, కృతకృత్యోఽస్మి దేవేశ యస్మే దేవో వరప్రదః. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మనిరూపణం నామ పఞ్చపఞ్చాశదుత్తరశతతమోఽధ్యాయః.

సుమంతురువాచః—ఇత్థం దత్త్వా వరం భానురీశ్వరాయ విశాం పతే, శాలగ్రామం జగామాశు వరం దాతుం హరేర్నృప. ౧. దదర్శ స హరిం తత్ర తపంతం పరమం తపః, కృష్ణాజినధరం శాంతం ప్రజ్వలంతం స్వతేజసా. ౨. పూజయంతం మహావ్యోమ చక్రాకారమనోపమమ్, గంధమాల్యోపహారైశ్చ నృత్యగీతప్రవాదితైః. ౩. ఏవం సంపూజ్య తద్వ్యోమ భక్త్యా శ్రద్ధాసమన్వితః, జగామ శిరసా భూమిం హృది ధ్యాయన్దివాకరమ్. ౪. విష్ణుం తం ప్రణతం దృష్ట్వా తుష్టో దేవో విభావసుః, ఉవాచ విష్ణుమామంత్ర్య పశ్య మామాగతం హరే. ౫. తద్వాక్యం కేశవః శ్రుత్వా శిరసా చ మహీం గతః, నమస్తే సర్వదేవేశ నమస్తే ఖగ నేచర. ౬. జగత్పతే నమస్తేఽస్తు గ్రహాణాం పతయే నమః, దారిద్ర్యవ్యాధిదుఃఖఘ్న నమస్తే భవనాశన. ౭. ఆదిత్యార్క రవే భానో భగ పూర్ణ

ఆదిత్యా! అర్కా! రవీ! భానూ! భగా! పూర్ణా! దివాకరా! సర్వతంత్రజ్ఞా! సర్వపాపవివర్జితా! సంసారార్ణవమగ్నులగువారలకు నీవు దప్ప వేరెవ్వరును రక్షకులు గానేరరు. అనఘా! నేను నీకు ద్వితీయ పుత్రుండను, బ్రాహ్మణుండను. తండ్రి పుత్రునకువలె నీవును నాకు కామముల నిత్తువుగాక యని చెప్పెను. కురువల్లభా! యీకృష్ణునివాక్యములను విని దివాకరుఁడు హర్షపులకితగాత్రుండై యతనితో నిట్లనియె. పురుషోత్తమా! యుత్తమోత్తమంబులగు నీశ్రద్ధాభక్తులం జూచి మిగుల సంతసించితిని. నేను వరంబుల నిచ్చుటకై నీసమీపమున కేతెంచితిని. వత్సా! నీవు దేనిని గావలయునని తలంచుచుంటివో యద్దానిని గోరుకొనుము. నేను నీదుభక్తిచే నాక్రాంతుఁడనైతిని. అను నీభానునివాక్యములను విని శ్రద్ధాభక్తియుతుఁడై దోసిలియొగ్గి దేవేశా! నేను కృతకృత్యుండనైతిని. నాకంటె ధన్యుఁ డెవ్వఁడును లేఁడు. నాకు భగవంతుండవగు నీవు స్వయముగ వరప్రదుండవైతివి. నీవు సంతుష్టుండవై భక్తియనుమూల్యముచే నాచేఁ గొనఁబడితివేని, నీయందచలంబగు భక్తిని శత్రువులను పరాజితులనుగాఁ జేయుసామర్థ్యమును సమస్తశత్రువినాశనమును సర్వలోకనమస్కృతంబగు నివాసస్థానమును లోకపాలనమునందు యుక్తిని బలమును వీర్యమును యశస్సును సుఖమును నాకుఁ

---

దివాకర, నమస్తే సర్వతత్త్వజ్ఞ సర్వపాపవివర్జిత. ౯. ప్రసీద మే జగన్నాథ హంసానఘ దివస్పతే, సంసారార్ణవమగ్నానాం త్రాహి దేవ వృషధ్వజ. ౯. పుత్రోఽహం తవ దేవేశ ద్వితీయో బ్రాహ్మణోఽనఘ, పితేవ పుత్రస్య రవే దేహి కామాంజగత్పతే. ౧౦. విష్ణోర్వచనమాకర్ణ్య హర్షం ప్రాప్య దివాకరః, ఉవాచ కురుశార్దూల హర్షగద్గదయా గిరా. ౧౧. సాధు కృష్ణ మహాబాహో తుష్టోఽహం తవ కేశవ, నిశమ్య తే పరాం భక్తిం శ్రద్ధాం చ పురుషోత్తమ. ౧౨. వరం వరయ తస్మాత్త్వం వత్స యం మనసేచ్ఛసి, వరదోఽహమనుప్రాప్తో భక్త్యాక్రాంతస్తవానఘ. ౧౩. నిశమ్య వచనం భానోర్విష్ణుర్భక్త్యా సమన్వితః, కృతాంజలిపుటో భూత్వా ఇదం వచనమబ్రవీత్. ౧౪. కృతకృత్యోఽస్మి దేవేశ నాస్తి ధన్యతరో మమ, యస్య మే భగవంస్తుష్టో వరదస్త్వం గతః స్వయమ్. ౧౫. యది తుష్టో మమ విభుర్భక్త్యా క్రీతో మయా యది, ప్రయచ్ఛత్వచలాం భక్తిం యథా శత్రుం పరాజయే, తథా మమ వరం దేహి సర్వారాతివినాశనమ్. ౧౬. మమ స్థానం చ పరమం సర్వలోకనమస్కృతమ్, లోకానాం పాలనే యుక్తిం బలం వీర్యం

ప్రసాదింపుమని సవినయంబుగాఁ బలికిన విని సూర్యదేవుఁడు జగము
నంతను ప్రతిధ్వనిబుట్టించువానివలె కేశవా! నీవు బ్రహ్మకంటె కనిష్ఠుం
డవును, నీశ్వరునికంటె జ్యేష్ఠుఁడవును, సర్వదేవనమస్కృతుండవును,
నాకు మిక్కిలి భక్తుఁడవును, బ్రహ్మణ్యుండవు నగుదువు. ఆకారణంబుచే
నీకు నాయం దచలంబగుభక్తి కల్గును. నీచేఁ బూజింపఁబడు నీవ్యోమమే
చక్రముగా నుద్భవింపఁగలదు. నీచక్రము సర్వాయుధంబులలో శ్రేష్ఠం
బును సర్వశత్రువినాశకంబును నగును. నీస్థానమును నుత్కృష్టంబై సర్వ
లోకనమస్కృతంబగును ఇట్లు జగత్పతియగు భానునిచే విష్ణువు వరము
లను బొంది మహాప్రసాదమని చెప్పి నమస్కరించెను జనార్దనునకు వర
ముల నిచ్చినతరువాత భాస్కరుఁడు స్వపురంబునకుఁ బోయెను. మఱియు
నీకేశవునకు లోకపాలన సామర్థ్యమును బలమును వీర్యమును యశస్సును
సుఖమును నితరంబులగు కోరికలను గూడ నిచ్చెను. ఈరీతిగఁ ద్రిమూ
ర్తులు దివాకరునిఁ బూజించి శక్తిమంతులై సర్గస్థితిలయంబులయందుఁ
బ్రవర్తించిరి కురునందనా! పాపనాశకంబును, త్రిదైవత్యంబును, లోక
పూజితంబును, స్తోత్రత్రయసహితంబును, ధర్మకామార్థసాధనంబును,
ధర్మయుక్తంబును, స్వర్గప్రదంబును, నారోగ్యధనధాన్యప్రదంబును నగు

---

యశః సుఖమ్. ౧౭. ఏవముక్తో రవిర్భక్త్యా విష్ణునా వాక్యముత్తమమ్, ఉవాచ కురు
శార్దూల జగత్సన్నాదయన్నివ. ౧౮. సాధు సాధు మహాబాహో బ్రహ్మణస్త్వం జఘ
న్యజః, హరస్య అగ్రజశ్చాపి సర్వదేవనమస్కృతః. ౧౯. భక్తశ్చాపి మమాత్యంతం బ్రహ్మ
ణ్యశ్చ సదానఘ, తస్మాత్త్వాచలా భక్తిర్భవిష్యతి మమోపరి. ౨౦. ఏతదేవ మహద్వ్యోమ
చక్రం తే ప్రభవిష్యతి, సర్వాయుధవరం వీర సర్వారాతివినాశనమ్, తథా స్థానం చ
పరమం సర్వలోకనమస్కృతమ్. ౨౧. ఇత్థం భానోర్వరం ప్రాప్య హరిర్దేవో జగత్పతిః,
మహాప్రసాదమిత్యుక్త్వా జగామ శిరసా మహీమ్. ౨౨. భాస్కరోఽపి వరం దత్త్వా
కేశవాయామితౌజసే, జగామాశు మహారాజ స్వపురం విబుధాధిపః. ౨౩. లోకానాం
పాలనే శక్తిం బలం వీర్యం యశః సుఖమ్, దత్త్వా కృష్ణాయ దేవేశస్తథాన్యదపి కాంక్షి
తమ్. ౨౪. ఏవం బ్రహ్మాదయో దేవాః పూజయిత్వా దివాకరమ్, శక్తిమంతో బభూవుస్తే
సర్గాదీనాం ప్రవర్తనే. ౨౫. ఇతి తే కథితం పుణ్యమాఖ్యానం పాపనాశనమ్, త్రిదై
వత్యముపాఖ్యానం త్రైసురం లోకపూజితమ్. ౨౬. స్తోత్రత్రయసమాయుక్తం ధర్మ
కామార్థసాధనమ్, ధర్మ్యం స్వర్గ్యం తథా పుణ్యమారోగ్యధనధాన్యదమ్. ౨౭. య ఇదం

నీయుపాఖ్యానమును నీకుఁ జెప్పితిని. ఎవ్వఁ డీస్తోత్రమును నిత్యము పఠించునో వాఁడు ఆగ్నేయవాహన మధిష్ఠించి సూర్యునియొక్క పరమ పదముఁ బొందఁగలఁడు. మఱియుఁ బుత్రవిహీనుఁడు పుత్రుని, ధన హీనుఁడు ధనమును, విద్యార్థి విద్యను బడసి తేజముచే సూర్యసదృశుం డును ప్రభచేఁ బృశ్నిసమానుండు నై చాలకాలము జ్ఞానులయం దగ్ర గణ్యుఁడై వెలయుచుండును.

ఇది షట్పంచాశదుత్తరశతతమాధ్యాయము

---

## సప్తపంచాశదుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! ప్రపన్నజనాజ్ఞానహరుం డగుసూర్యుఁడు బ్రహ్మదేవునకు నీవంశమునఁ బుట్టిన కశ్యపునకుఁ బుత్త్రుఁడ నయ్యెదనని వరము నిచ్చెను. ఆసూర్యుఁడు భూమి నెట్లవతరించును? అది నాకాశ్చర్యమును గలుగఁజేయుచున్నది దానిం జెప్ప వేఁడెద. దేవత లందఱకు నెవ్వఁ డుత్పత్తి హేతువయ్యెనో యాదేవుఁ డీభూతలంబున జన్మభావము నెట్లు పొందఁగలఁడు. ఎందులకై దివ్యంబగునాత్మను జన్మకై వినియోగించును. ఏయొక్కఁడు మనోరమంబగు బ్రహ్మాండచక్ర

---

శృణుయాన్నిత్యం పఠేత్ స్తోత్రత్రయం చ యః, సోఽగ్నేయం యానమారూఢో యాతి భానోః పరం పదమ్. ౨౮. అపుత్రో లభతే పుత్రమధనో ధనమశ్నుతే, విద్యార్థీ లభతే విద్యాం ప్రసాదాద్భాస్కరస్య తు. ౨౯. తేజసా రవిసంకాశః ప్రభయా పృశ్నిసన్నిభః, మోదతే సుచిరం కాలం జ్ఞానినాముత్తమో భవేత్. ౩౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే త్రైసురోపాఖ్యానవర్ణనం నామ
షట్పంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—ఏతన్మే కౌతుకం బ్రహ్మన్యద్వరం బ్రహ్మణే రవిః, దత్తవాం స్తవ పుత్రత్వమన్వయే కశ్యపస్య తు. ౧. యాస్యామి ద్విజశార్దూల ప్రపన్నతిమిరాపహః, ఏతన్మే మహదాశ్చర్యం కథం భూమిం కథం వ్రజేత్. ౨. దేవాదీనాం ప్రణేతా యో యో భువి ప్రసవో విభుః, స కథం భూతలే వ్యోమ జన్మభావం గమిష్యతి. ౩. కిమర్థం దివ్యమాత్మానం జన్మనే స నియోక్ష్యతి, యశ్చక్రం వర్తయత్యేకో బ్రహ్మాదీనాం

మును ద్రిప్పుచుండునో యట్టి భగవంతుఁడు పుణ్యమగుబుద్ధిని జన్మమునం దెట్లుంచెను? ఎవ్వఁడు సర్వలోకరక్షణమును జేయుచుండునో సమస్త మును తనకిరణములచే రక్షించుచుండెనో భూతస్వరూపుఁడగు నెవ్వఁడు భూతములను సృష్టించి ధరించెనో యట్టి దివాకరుఁడు గర్భవిహీనుఁడై యు నుదరమునందలి గర్భము నెట్లు యాచించును? ఎవ్వనికిరణములచే నీపదు నాలుగుభువనము లాక్రమింపఁబడినవో, జగమునకుఁ ద్రివర్గప్రవరంబగు మార్గత్రయము స్థాపింపఁబడెనో, ఎవ్వఁడు కల్పాంతమున జగమునంతను పానముఁజేసి వజ్రమయమగు శరీరమును నిర్మించి లోకమునంతను నేకార్ణవంబుగఁజేసి స్వకర్మచేతనే చూచుచుండెనో, యెవ్వఁడు పురాణము నందు పురాణాత్ముఁడై వసుంధరను సృజించియుఁ దేజోమూర్తియై మఱల సృజించెనో, యవ్యయుండగు నెవ్వఁడు మూఁడులోకములను సృష్టించెనో, యేసురసత్తముఁడు వసుమతి నిర్మించి దేవతల కిచ్చెనో, యెవ్వఁ డనలపానముచేసి సంవత్సరమయుండై యుండెనో, యెవ్వఁడు పాతాళ స్థితుండై యర్ణవరసంబునకు మధ్యగతంబైన తోయమయహవిస్సును భుజించుచుండునో యట్టి సహస్రశిరుండును సహస్రాక్షుండు నగు నెవ్వని వేలకొలఁదిగ ప్రతియుగంబునం జెప్పుచుందురో, ముఖమునుండి యెవ్వరు లోకపితామహుండగు బ్రహ్మను గాంచెనో, విష్ణుదేవుం డెవ్వనివక్షంబున

---

మనోరమమ్. ౮. స జన్మని కథం పుణ్యాం బుద్ధిం చక్రే విదాంవర, గోపాయనం య త్కురుతే జగతః సర్వలౌకికమ్. ౫. గోభిః పాలయతే కృత్స్నమాత్మనో యః స్వయం రవిః, మహాభూతాని భూతాత్మా యశ్చకార దధార చ. ౬. అగర్భః స కథం గర్భ ముదరే యాచతే విభుః, యేన గోభిః సమాక్రాంతా విప్ర లోకాశ్చతుర్దశ. ౭. స్థాపితా జగతో మార్గాస్త్రివర్గప్రవరాస్త్రయః, యోఽన్తకాలే జగత్పీత్వా కృత్వా వజ్రమయం వపుః. ౮. లోకమేకార్ణవం చక్రే దృశ్యతే స్వేన కర్మణా, యః పురాణే పురాణాత్మా తేజసాం రూపమాస్థితః. ౯. అపి సృష్ట్వా ద్విజశ్రేష్ఠ యః ససర్జ వసుంధరామ్, చకార చ పురా యశ్చ త్రైలోక్యమిదమవ్యయః. ౧౦. దదౌ కృత్వా వసుమతీం సురాణాం సురసత్తమః, యః స్థితో హ్యనలం పీత్వా సంవత్సరమయశ్చ యః, పాతాలస్థోర్ణవరసం మధ్యతోయమయం హవిః. ౧౧. సహస్రశిరసం దేవం సహస్రాక్షం సహస్రశః, సహస్ర చరణం బ్రహ్మన్యమాహుర్వై యుగే యుగే. ౧౨. ముఖాద్యస్య సముత్పన్నో వేధా లోకపితామహః, హరిశ్చ వక్షసోయస్య లలాటాద్యస్య శంకరః. ౧౩. యేన తే నిహతా

నుద్భవించెనో, యెవ్వని లలాటమున శంకరుఁ డుదయమయ్యెనో, యెవ్వ
నిచే మందేహరాక్షసులు నిహతులైరో, యెవ్వఁడు బ్రహ్మాదులకును దురా
ధర్షుఁడై విఘ్ననాశకుండయ్యెనో, సర్వదేవమయంబును సర్వాయుధధరం
బును నగుశరీరమును జేసి యేకచక్రరథారూఢుఁడై గరుడాగ్రజుని
సారథిగా నునిచికొని కరాంతంబున దానవరాక్షససహితంబగు జగ
మంతయు ప్రకాశింపఁజేయు నస్పృష్టం బగుశరీరము గల్గియుండెనో,
నిత్యము పూర్వాచలమునుండి పశ్చిమాచలము నాక్రమించి లోకశాంతి
కొఱకు తమస్సును (చీఁకటిని) నశింపఁజేయుచుండునో చీఁకటిని నశింపఁజేసి
సర్వవ్యాపారములయందును బ్రవర్తింపఁజేయుచుండెనో యోక్త్రంబు
లను, ముసలంబులను, ఉలూఖలంబులను, గార్హపత్యవిధిచేతను ధార్య
కర్మచేతను నాహవనీయాగ్నిని, కుశమును, స్రువమును, ప్రోక్షణీయ
వ్రతమును, నవభృథంబును మొదలగు యజ్ఞంబులయందు హవ్య
భాగముల నెవ్వఁడు యజ్ఞముచేసెనో, యజ్ఞములయందు హవిర్భాగము
లను భుజించుటకు దేవతలను, కవ్యములను భుజించుటకుఁ బితరులను
నిర్మించెనో, మధుసంపాదనకై పూష దేవతను సోమమును పవిత్రమగు
నరణిని యజ్ఞోపయుక్తంబులగు ద్రవ్యంబులను యజ్ఞంబులను ఋత్విక్కు
లను, సదస్యులను యజమానులను మేధావులను నుత్తములను పరమేష్ఠి

---

దైత్యా మందేహా నామ నామతః, బ్రహ్మాదీనాం దురాధర్షో యః సదా విఘ్ననాశనః. ౧౪. సర్వదేవమయంకృత్వా సర్వాయుధధరం వపుః, ఏకచక్రరథారూఢో గరుడాగ్రజ సారథిః. ౧౫. కరాంతే యో జగత్సర్వం సహ దానవరాక్షసమ్, ప్రకాశతమమస్పృష్టం వపుర్యస్య సదా ద్విజ. ౧౬. పూర్వాం దిశం గతో నిత్యముదయాచలమక్రమమ్, నాశ యేద్యస్తు సతతం తమో లోకస్య శాంతయే. ౧౭. నాశయిత్వా తమో యస్తు క్రియాః సర్వాః ప్రవర్తతే, యోక్త్రాణి దక్షిణాదిక్ష్వ ముసలోలూఖలాని చ. ౧౮. గార్హపత్యేన విధినా తదర్ధార్యేణ కర్మణా, అగ్నిమాహవనీం చైవ వేదిం చైవ కుశం స్రుచమ్, ప్రోక్షణీయవ్రతం చైవ అవభృథం తథైవ చ. ౧౯. సర్వానిమాంశ్చ యశ్చక్రే హవ్యభాగప్రదాన్మఖే, హవ్యాదాంశ్చ సురాన్యజ్ఞే కవ్యాదాంశ్చ పితౄనపి. ౨౦. భాగార్థే మధుధానాయ చక్రే యో యజ్ఞకర్మణి, పూషణం చ సుతం సోమం పవిత్రా మరణీమపి. ౨౧. యజ్ఞియాని చ ద్రవ్యాణి యజ్ఞాంశ్చాపి సఋత్విజః, సదస్యాన్యజ మానాంశ్చ మేధావినస్తథోత్తమాన్. ౨౨. విబభాజ పురా సర్వం పారమేష్ఠ్యేన కర్మణా,

బ్రహ్మాకర్మచే విభజించెనో, యుగముల కనురూపుండై యనుపమంబుగ లోకముల నన్నింటిని నిర్మించి క్షణకలాకాష్ఠలను కాలవైకల్యములను, ముహూర్తంబులను, తిథులను, మాసంబులను, పక్షంబులను, సంవత్సరంబులను, ఋతువులను, కాలయోగంబులను, నరులయందలి వివిధ ప్రమాణంబులను, ఆయువును క్షేత్రములను వృద్ధిక్షయంబుల నెవ్వఁడు చేయుచుండెనో, యేజ్ఞానవర్త్మచే ననంతంబులగు నీలోకంబులు సృజింపఁబడెనో, సర్వభూతాత్ముండగు నెవ్వరిచే సర్వభూతగుణంబులు సృజింపఁబడెనో, నమస్కారత్రయపూర్ణంబగు యోగముచే నెవ్వఁడు నిత్యము రమించుచుండునో, యెవ్వఁడు గతాగతిపోతంబుచే రక్షకుండై యుండెనో, జ్ఞానయుక్తులకును అపాపులకును గతియైయుండెనో, చాతుర్వర్ణ్యప్రభావంబును హోత్రరక్షకుఁడును వైద్యునివలె ధాతువేత్తయును దిగంబరులచే ననుభూతుండును, వాయురూపుఁడును వాయుగుణుఁడును నగ్నిష్టోమాత్మకంబగు జ్యోతిస్సును రాత్ర్యంతకుండును యోగీశుండును నై పరంజ్యోతిగ నుత్తమతపంబుగను వినంబడుచుండెనో,యెవ్వని నుత్కృష్టుండనియుఁ బరమాత్మయనియుఁ జెప్పుచుందురో, యేదేవుఁడు దానవాంతకుఁడై బ్రహ్మాదులచే సంస్తుతింపఁబడెనో యుగాంతంబున నంతకుండై లోకాంతకోత్తముండని ప్రఖ్యాతివహించెనో, లోకంబునఁ గల్గునవధు

---

యుగానురూపోయః కృత్వా లోకాననువరం క్రమాత్. ౨౩. క్షణాన్కలాశ్చ కాష్ఠాశ్చ కాలవైకల్యమేవ చ, ముహూర్తాస్తిథయో మాసాః పక్షాః సంవత్సరాస్తథా. ౨౪. ఋతవః కాలయోగాశ్చ ప్రమాణం వివిధం నృషు, ఆయుః క్షేత్రాణ్యపచయోపచయాం శ్చైవ యోఽకరోత్. ౨౫. సృష్టా లోకాస్త్రయోఽనంతా యేన జ్ఞానేన వర్త్మనా, సర్వభూతగణాః సృష్టాః సర్వభూతాత్మనా సదా. ౨౬. ప్రణామత్రయపూర్వేణ యోగేన రమతే చ యః, యో గతాగతిపోతేన త్రాతాస్తి జగదీశ్వరః. ౨౭. యో గతిర్వృషయుక్తానాం గతిర్యోఽపాపకర్మణామ్, చాతుర్వర్ణ్యప్రభావశ్చ వపుర్హోత్రస్య రక్షితా. ౨౮. ధాతువైద్యస్య యో వేత్తా చతురాశ్రమసంశ్రయః, దిగంబరానుభూతశ్చ వాయుర్వాయువిభావనః. ౨౯. అగ్నిషోమాత్మకం జ్యోతిర్యోగీశః క్షణదాంతకః, యః పరం శ్రూయతే జ్యోతిర్యః పరం శ్రూయతే తపః. ౩౦. యం పరం పరమం ప్రాహుః పరమాత్మానమచ్యుతమ్, బ్రహ్మాదిభిః స్తుతో దేవో యశ్చ దైత్యాంతకృద్విభుః. ౩౧. యుగాంతేష్వంతకో యస్తు యశ్చ లోకాంతకోత్తమః, సేతుర్యో లోకసేతూనాం మధ్యే యో మధ్యకర్మణామ్. ౩౨. వేత్తా యో

లకు హూర్దేవండో, మధ్యకర్మములకు మధ్యవర్తియై యెవ్వఁడు భాసిల్లునో, వేదవేత్తలలో నెవ్వఁడు బాగుగఁ దెలిసినవాఁడో ప్రభవిష్ణులలో నెవ్వఁడు ప్రభువో సౌమ్యులలో సౌమ్యుండును, నగ్నివర్చస్కులలో నగ్నిభూతుండును మనుజులకు మనోభూతుండును తపస్సులకు తపోభూతుండును నయప్రవర్తకులకు వినయభూతుండును విరోధులకు విరోధభూతుండును, గతిమంతులకు గతియును, ఆకాశమునకుఁ గారణుఁడును, వాయుస్వరూపుఁడును, ప్రాణస్వరూపుఁడును, దేవాహుతివాహకుఁ డగుహుతాశనుఁడును, తమోనాశకుఁడగు నగ్నిస్వరూపుఁడును, రసమువలన శోణితంబును, శోణితంబువలన మాంసమును, మాంసమువలన మజ్జావసలును, మజ్జవలన నెముకలును, అస్థిమజ్జలనుండి శుక్రమును, శుక్రమువలన గర్భము, రసమూలంబగుకర్మచేత నుత్పత్తినొందునో యందలి ప్రథమభాగ ముదకము. అది సౌమ్యరాశియని చెప్పఁబడును. తరువాత భూమి యుద్భవించెను. అది రెండవరాశియని చెప్పఁబడును. శుక్రము సోమస్వరూపంబని యెఱుంగునది. ఆశుక్రశోణితాదులయుత్పత్తి రసాత్మకమైనది. వానివీర్యము శశిపావకరూపము. శుక్రము కఫవర్గమునందును, శోణితము పిత్తవర్గమునందును నుద్భవించెను కఫంబునకు స్థానము పృథివియు, పిత్తంబునకు నాభియై యుండెను. దీప్యమానమగు మనస్సునకు మధ్య హృదయము స్థానమని చెప్పఁబడెను. నాభికుక్షిపార్శ్వంబులయం

---

వేదవిదుషాం ప్రభుర్యః ప్రభవిష్ణునాం, సౌమ్యభూతస్తు సౌమ్యానామగ్నిభూతోఽగ్నివర్చసామ్. ౩౩. మానుషాణాం మనోభూత స్తపోభూత స్తపస్వినాం, వినయో నయవృత్తీనాం తేజ స్తేజస్వినామపి. ౩౪. విగ్రహో విగ్రహాణాం చ గతిర్గతిమతామపి, ఆకాశప్రసవో వాయుర్వాయుః ప్రాణో హుతాశనః, దేవాహుతిప్రదానోద్యత్పాణాగ్ని స్తమనాశనః. ౩౫. రసాద్ధి శోణితం భవతి శోణితాన్మాంసముచ్యతే, మాంసాన్మజ్జావసో ర్జన్మ మజ్జనోఽస్థీని జన్మతః. ౩౬. అస్థిమజ్జః సమభవత్తతో వై శుక్రమాదిశేత్, శుక్రాద్గర్భః సమభవద్రసమూలేన కర్మణా, తత్రాపః ప్రథమో భాగః స సౌమ్యో రాశిరుచ్యతే. ౩౭. తతః క్ష్మాసంభవో జ్ఞేయో ద్వితీయో రాశిరుచ్యతే, శుక్రం సోమాత్మకం విద్యాదాత్మరూపం యదాత్మకమ్. ౩౮. భవో రసాత్మక స్తేషాం వీర్యం చ శశిపావకం, కఫవర్గే భవేచ్ఛుక్రం పిత్తవర్గే చ శోణితమ్. ౩౯. కఫస్య పృథివీ స్థానం పిత్తం నాభౌ ప్రతిష్ఠితం, దేవస్య మధ్యహృదయం స్థానం తు మనసః స్మృతం, నాభికోష్ఠాంతరస్థం తు

ధుండెను. అందు దివాకరుండు వెలుఁగుచుండెను. మనస్సు ప్రజాపతియును కఫము సోముఁడును అగ్ని పిత్తస్వరూపుఁడునుగఁ జెప్పఁబడుటచే, జగమంతయు నగ్నిషోమాత్మకం బయ్యెను. ఇట్లు మేఘసన్నిభంబగు గర్భము ప్రవర్తింపఁగా నందుఁ బరమాత్మ సంగతుండై వాయువు ప్రవేశించెను. అచ్చటనుండి యంశములఁ జలింపఁజేయుచు గర్భమును గాపాడు చుండును. ప్రాణ-అపాన-సమాన-ఉదాన-వ్యానంబులను యథావిధంబులుగ విడచుచుండును. ప్రాణము హృదయమునను, అపాన మధఃకాయమునను, ఉచానము కంఠమునను, వ్యానము సర్వశరీరమునను, సమానము నాభియందు నుండును. ఆమీఁదఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములు పంచేంద్రియంబులను గలుగఁజేయును. ఈశరీరములో దేహము పార్థివమనియు, ప్రాణమును మారుతమనియు, నిద్ర యాకాశయోని యనియు, చక్షువు జ్యోతిషమనియు, స్వేదాదులు జలభాగమనియుఁ జెప్పఁబడును. గ్రామములు విషయము లెవని వీర్యప్రభవములో యెవ్వఁడు దేవాసురమానవసహితంబగు లోకమును సృజియించెనో యాసూర్యుఁడు గర్భము నెట్లు బొందునో

---

తత్ర దేవో దివాకరః. ౪౦. మనః ప్రజాపతిర్జ్ఞేయః కఫః సోమో విభావ్యతే, పిత్త
మగ్నిః స్మృతో యస్మాదగ్నీషోమాత్మకం జగత్. ౪౧. ఏవం ప్రవర్తితే గర్భే వర్ధితేం
ఽబుదసన్నిభే, వాయుః ప్రవేశం సంచక్రే సంగతః పరమాత్మనా. ౪౨. తతోఽంగాని
విసృజతే బిభర్తి పరివర్తయన్, ప్రాణోఽపానః సమానశ్చ ఉదానో వ్యాన ఏవ చ.
౪౩. ప్రాణోఽస్య ప్రథమం స్థానం వర్ధయన్పరివర్తతే, అపానం పశ్చిమే కాయ ఉదా
నోర్ధ్వం శరీరగః, వ్యానోఽథ వ్యాపకో దేహే సమానః సన్నివర్తతే. ౪౪. ఘూతా
వాప్తిస్తతస్తస్య జాయతేంద్రియగోచరా, పృథివీ వాయురాకాశ ఆపో జ్యోతిశ్చ
పంచమః. ౪౫. తస్యేంద్రియాణి పిష్టాని స్వం స్వం యోగం ప్రచక్రముః, పార్థివం దేహ
మాహుస్తు ప్రాణాత్మానం చ మారుతమ్. ౪౬. నిద్రా హ్యాకాశయోనిశ్చ జలాశ్రయే ప్రవ
ర్తతే, జ్యోతిశ్చక్షుషి తజ్జన్మ తదంశస్తామసః స్మృతః. ౪౭. గ్రామాశ్చ విషయాశ్చైవ
యస్య వీర్యం ప్రవర్తితం, ఏవం యః సృజతే లోకాన్సదేవాసురమానవాన్. ౪౮. స
కథం దేవదేవేశో గర్భమేష్యతి చాంశుమాన్, యథోదరమదిత్యాస్తు యః స్వయం
చావిశత్పురా. ౪౯. ఏవం మే సంశయో బ్రహ్మన్నేష మే విస్మయో మహాన్, కథం
రవిర్యయా గర్భభావం ద్విజవరేతి మే. ౫౦. ఆశ్చర్యం పరమం పృచ్ఛే త్వామహం

పూర్వ మదితి గర్భము నెట్లు జొచ్చెనో భానునకుఁ దృప్తి యెట్లు సంభ
వించునో యీయాశ్చర్యకరమగుకథను నాకుఁ జెప్పుము అమితతేజస్కు
డగు నాదేవునివీర్యబలములఁ గూడ బాగుగ వివరింపుము

ఇది సప్తపంచాశదుత్తరశతతమాధ్యాయము

---

## అష్టపంచాశదుత్తరశతతమాధ్యాయము.

నాపుడు సుమంతుఁడు రాజున కిట్లనియె మహారాజా! సూర్యుని విషయమైె దుర్ఘరంబగు ప్రశ్నము నడిగితివిగాన నాశక్తికొలఁది భాస్కరునియశము వివరించెదను నీవు భానునిప్రభావమును వినుటకుఁ గుతూహలపడుచుంటివిగాన నాచేఁ జెప్పఁబడు నీదివ్యంబగు భానునిప్రవృత్తిని నాకర్ణింపుము సహస్రాస్యుండును, సహస్రాక్షుండును, సహస్రకిరణుండును, సహస్రశిరస్కుండును, సహస్రహస్తుండును, ప్రభుండును, సహస్రదుండును, అవ్యయుండును, సహస్రజిహ్వుండును, భాస్వంతుఁడును, సహస్రమకుటుండును, సహస్రారియును, సహస్రభుజుండును, సవనమును, భవనమును, హవ్యంబును, హోతయు, పాత్రంబులును వేదదీక్షితుఁడును, చరువును, శుభుండును, శ్రోత్రియుండును, శూర్పంబును,

---

భాస్కరస్య వై, భానోరుత్పత్తిమాశ్చర్యం హృది మె పరివర్తతే ౧౯ ఏతదాశ్చర్యమాఖ్యానం కథయస్వ మహామునే, సమాఖ్యాహి బలం వీర్యం భానోరమితతేజసః ౨౦

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యావతారకథాప్రస్తావవర్ణనం నామ
సప్తపంచాశదుత్తరశతతమోఽధ్యాయః

---

సుమంతురువాచ — ప్రశ్నభారో మహాంస్తాత త్వయోక్తో రశ్మిమాలిని, యథాశక్తి తు వక్ష్యామి శ్రూయతాం భానపం యశః ౧ భానోః ప్రభావశ్రవణే యస్య తే మతిరుత్థితా, హంత భానోః ప్రవృత్తిం చ శృణు దివ్యాం మయేరితామ్ ౨. సహస్రాస్యం సహస్రాక్షం సహస్రకిరణం చ యం, సహస్రశిరసం దేవం సహస్రకరమవ్యయమ్ ౩ సహస్రజిహ్వాం భాస్వంతం సహస్రముకుటం ప్రభుం, సహస్రదం సహస్రారిం సహస్రభుజమవ్యయం ౪ సవనం భవనం చైవ హవ్యం హోతారమేవ చ, పాత్రాణి సమతీతాని వేదదీక్షీ చరుం శుభమ్ ౫ శ్రోత్రియం శూర్పముసలం ప్రోక్షణం

ముసలంబును, ప్రోక్షణంబును, దక్షిణాయనంబును, నధ్వర్యుండును, సామగుండును, విప్రుండును, సదస్యుండును, సదనంబును, యూపంబును, సత్తువు, స్రువంబును, దర్వియు, ముసలోలూఖలంబులును, ప్రాగ్వంశుండును, జయభూతియు, హోతయు, చయనంబును, ప్రతిష్ఠితంబులు రహస్యంబులు నగు స్థావరజంగమప్రమాణంబులును, దార్ఢ్యమును, స్థండిలంబులును, కుశలును, మంత్రయజ్ఞావహంబును, వహ్నిభాగంబును, భార్గవుండును, సోమభోక్తలలో నగ్రభోజుండును నని యెవ్వని మూఁడు లోకములలోఁ జెప్పుచుందురో శాశ్వతుండును, విభుండు నగు నెవ్వని నాయుర్వేదవేత్తలగు విప్రులు యజించుచుందురో యట్టి చందనమాలియును సురేశుండును నగుభానుని భావసహస్రంబు లతీతంబులయ్యె మఱల ననేకము లుద్భవింపఁగలవు అనేకములు ప్రతిదినమును నశింపఁగలవు మహారాజా! పుణ్యంబును దివ్యంబును శుభంబును నగు నేకథ నడిగియుంటివో యెందులకై సూర్యభగవానుఁడు కశ్యపసుతుండయ్యెనో దానినంతను సవిస్తరముగాఁ జెప్పెద నాకర్ణింపుము రాజా! సర్వభూతాత్ముండగు భానుఁడు సర్వలోకహితంబునకును, సర్వలోకోత్పత్తికిని తానే యనేకవిధముల నుద్భవింపఁగలఁడు అట్లే కశ్యపునకును,అదితికిని సుతుండై యుద్భవించెను ఇట్లు బ్రహ్మదేవునకు వరము నిచ్చినతరువాత నట జన్మించెను మున్ను మరీచి సంయోగమువలన నదితి గర్భమునం దేయేపుత్త్రు

---

దక్షిణాయనం, అధ్వర్యుం సామగం విప్రం సదస్యం సదనం తథా ౬ యూపం సమిత్స్రువం దర్వీం ముసలోలూఖలాని చ, ప్రాగ్వంశం జయభూతిం చ హోతారం చయనం చ యత్ ౭. రహస్యాని ప్రమాణాని స్థావరాణి చరాణి చ, ప్రతిష్ఠితాని దార్ఢ్యం చ స్థండిలాని కుశాంస్తథా ౮ మంత్రయజ్ఞవహం వహ్నిభాగం భార్గవమేవ చ, అగ్రేభుజీ సోమభుజాం యశ్చ త్రిషు ఉదాహృతః ౯ ఆయుర్వేదవిదో విప్రా యజంతే శాశ్వతం విభుం, తస్య భానోః సురేశస్య వీర చందనమాలినః ౧౦ ప్రాహుర్భావసహస్రాణి సమతీతాన్యనేకశః, భూయశ్చైవ భవిష్యంతి వినశ్యంతి దినేదినే ౧౧ యత్పృచ్ఛసి మహారాజ పుణ్యాం దివ్యాం కథాం శుభాం, యదర్థం భగవాన్భానుః కశ్యపస్య సుతోఽభవత్ ౧౨ తామహం త్వం ప్రవక్ష్యామి శృణు సర్వమశేషతః, హితార్థం సర్వమర్త్యానాం లోకానాం ప్రభవాయ చ ౧౩ బహుశః సర్వభూతాత్మా స్వయం సమభిజాయతే, తథా సమభవద్దేవః కశ్యపస్యాదితేః సుతః. ౧౪ తుష్టో దత్త్వా వరం

లుద్భవించిరో యాపుత్త్రులందఱు తత్క్షణమే వినాశమును బొందుచుండిరి తరువాత నదితి నష్టపుత్త్రులం జూచి శోకాన్వితయై కన్నీరు గార్చుచు గశ్యపునికడ కేగెను అచ్చటకుఁ బోయి దీప్తిమంతుఁడును, తపోనిధియు, దేవగురువులలో నాద్యుండును, విప్రుండును, తేజమున వహ్నిసమానుఁడును, సూర్యభక్తుండును, వృకసమప్రభుండును దండయుక్తుఁడును, కృష్ణాజినధారియు, వల్కలాజినసంవీతుఁడును, ప్రదీప్తుండును, దీప్తివర్చస్కుండును, అగ్నివలెఁ బ్రకాశమానుండును, భాస్కరుని వలెఁ దపించువాఁడు నగు మరీచిమహర్షినిఁ జూచెను అమితౌజస్కుండగు భర్తను జూచి యదితి శోకగద్గదంబగు వాక్కుతో నిట్లనియె భగవత్స్వరూపులగు దేవర యెందులకై తూష్ణీంభావము నవలంబించిరో నాకు విశదమగుటలేదు నాయం దుత్పన్నులగుపుత్త్రులందఱును తత్క్షణమే వినాశమును బొందుచుండిరనిన విని కశ్యపుఁడు బ్రహ్మలోకంబున కేగుటకై నిశ్చయించెను నానాభావయుక్తంబగు బ్రహ్మలోకంబునకరిగి దేవా! నాభార్యయం దుద్భవించుపుత్త్రులందఱును తత్క్షణమే వినాశమును బొందుచుండిరని నుడివిన విని బ్రహ్మదేవుఁడు పుత్త్రా! సుదుర్లభంబగు భానునిసదనమున కేగుదమని చెప్పి యాంగ్నేయం బగువాహనము

---

వీర విరంచస్య మహాత్మనః, యం యం జనయతే పుత్రమదితిః కశ్యపాద్విభోః ౧౫ స
స యాతి వినాశం వై తత్క్షణాదేవ భారత, దృష్ట్వా సుతాన్నశ్యమానాన్పుత్రశోకా
న్వితాఽదితిః ౧౬ జగామ కశ్యపాభ్యాశే శోకవ్యాకులితేక్షణా, సాపశ్యత్తం చ
మారీచం మునిం దీప్తం తపోనిధిమ్ ౧౭ ఆద్యం దేవగురుం విప్రం దివ్యం త్రిషవణాం
బుభిః, తేజసా వహ్నిసంకాశం సౌరం వృకసమప్రభమ్ ౧౮ న్యస్తదండశ్రియా
యుక్తం బద్ధకృష్ణాజినాంబరం, వల్కలాజినసంవీతం ప్రదీప్తం బ్రహ్మవర్చసమ్ ౧౯.
హుతాశమివ దీవ్యంతం తపంతమివ భాస్కరం, అథాదితిశ్చ దృష్ట్వైవం భర్తారమమితౌ
జసమ్ ౨౦ శోకగద్గదయా వాచా ఇదం వచనమబ్రవీత్, కిమర్థం భగవాన్దేవో నిరు
ద్యోగస్తు తిష్ఠతి ౨౧ జాతో జాతో హి మే పుత్రః సద్య ఏవ వినశ్యతి, శ్రుత్వా తు
వచనం తస్యాః కశ్యపో మునిసత్తమః. ౨౨ చకార గమనే బుద్ధిం బ్రహ్మలోకం ప్రతి
ప్రభో, స గత్వా బ్రహ్మభవనం నానాభావసమన్వితమ్ ౨౩ తద్వాక్యముక్తం తం
సర్వం యదుక్తం తస్య జాయయా, కశ్యపస్య వచః శ్రుత్వా కంజజో వాక్యమబ్రవీత్.
౨౪ పుత్ర గచ్ఛామ సదనం భానోః పరమదుర్లభం, ఇత్యుక్త్వా యానమారుహ్య

నధిష్ఠించియు, అదితియుఁ గశ్యపబ్రహ్మ మొదలగువారు వారివారి కర్మములగు కామ్యగములగు దివ్యయానముల నధిష్ఠించియు నాదిత్యు నడుగఁదలఁచినవారై సామగాయకులచేఁ జేయఁబడు మధుకరనినదంబు గల యాదిత్యునిపరమసభను బ్రవేశించిరి. ప్రవేశించియు బహ్వృచులు క్రతువులను స్తోత్రముచేయుచుండఁగాఁ జూచిరి. మఱియు నాసభ యందు పదక్రమవేత్తలును, వేదవేత్తలును నగుపరమర్షులఘోషముల చేతను నంతటను ప్రతిధ్వనించుచుండెను. యజ్ఞసంస్తవవేత్తలును, శిక్షావేత్తలు నగుబ్రాహ్మణులచేతను, సర్వవిద్యా విశారదులచేతను, నష్టాదశపురాణజ్ఞులచేతను, మీమాంసాహేతువాదజ్ఞులచేతను, సర్వ వాదవిశారదులచేతను, లోకాయతికముఖ్యులచేతను, నీసూర్యుఁడు స్తోత్రముచేయఁబడుచుండెను మఱియు నచ్చట శంసితవ్రతనియతులును. జపహోమపరులును, యోగ్యులును నగుబ్రాహ్మణోత్తములఁ జూచిరి. ఆసభయందే సురాసురగురుండును, శ్రీమంతుఁడును, అంశుమాలియు నగుదివాకరుఁడు మాయచేఁ బ్రకాశించు చుండెను మఱియు నాసభ యందే ప్రజాపతియగునీశ్వరుని దక్షప్రజాపతియు, వాల్మీకియు, పుల హుఁడును, మరీచియు, భృగువు, అత్రి, వశిష్ఠుఁడు, గౌతముఁడు, నార

---

ఆగ్నేయం పద్మలోచనః. ౨౫. వేధా జగామ భవనమాదిత్యస్య మహాత్మనః, అదితిః కశ్యపో బ్రహ్మా జగ్ముర్విపులమాశ్రితాః. ౨౬. తే ముహూర్తేన సంప్రాప్తా సూర్య లోకం సువర్చసం, దివ్యకామగమైర్యానైర్యథార్హం కురునందన. ౨౭. ఆదిత్యం ద్రష్టు మిచ్ఛంతి తేజసాం రాశిముత్తమం, గచ్ఛంతస్తే చ విస్తీర్ణామాదిత్యస్య పరాం సభామ్. ౨౮. షట్పదోద్గీతనినదాం సామగైస్తు సమీరితాం, క్రతవో బహ్వృచముఖాః ప్రోక్తాః పుణ్యపదక్షరాః. ౨౯. తుష్టువుః పురుషవ్యాఘ్రం వితతేషు చ కర్మసు, యజ్ఞసంధా వేద విదాం పదక్రమవిదాం తథా. ౩౦. ఘోషేణ పరమర్షీణాం సర్వం తత్ర నినాదితం, యజ్ఞసంస్తవవిద్భిశ్చ శిక్షావిద్భిస్తథా ద్విజైః. ౩౧. అష్టాదశపురాణజ్ఞైః సర్వవిద్యావిశా రదైః, మీమాంసాహేతువాదజ్ఞైః సర్వవాదవిశారదైః. ౩౨. లోకాయతికముఖ్యైశ్చ తుష్టువుః సూర్యమీరితం, తత్రతత్ర చ విప్రేంద్రాన్ నియతాఞ్ఛంసితవ్రతాన్. ౩౩. జపహోమపరాన్యోగ్యాన్దదృశుః కశ్యపాదయః, తస్యాం సభాయామాస్తే స రశ్మిమాలీ దివాకరః. ౩౪. సురాసురగురుః శ్రీమాఞ్ఛుభే వీర మాయయా, ఉపాసతే చ తత్రైవ ప్రజానాం పతిమీశ్వరమ్. ౩౫. దక్షః ప్రచేతాః పులహో మరీచిశ్చ ద్విజోత్తమః,

డుఁడు, దివ్యులు, ఆత్మ, అంతరిక్షము, వాయువు, తేజస్సు, బలము, భూమి, శబ్దము, స్పర్శ, స్వరూపము, రసగంధములు, ప్రకృతివికారములు, మఱియు నితరమగుకారణము, మహత్తు సాంగోపాంగములగు నాలుగు వేదంబులు లవములు,ఋతువులు, సంకల్ప ప్రణవంబులు నివియన్నియును నితరులనేకులును నెల్లప్పుడు భానుని స్తోత్రముఁ జేయుచుందురు. అర్థము, ధర్మము, కామము, మోక్షము, ద్వేషము, హర్షము, మోహము, మత్సరము, మానము విష్ణుసుతుఁ డగువృకుఁడు పుష్పజుఁడగుపుత్త్రుఁడును మాహేశ్వరుఁడగు బృహస్పతియు సౌరులగు వికచవిటపులును, మారుతుఁడగు విశ్వకర్మయు, అశ్వినులును, వీరందఱు నుపాసించుచుండిరి. అచ్చటఁ బ్రభవిష్ణుండగుభానునిఁ జూచి యాతనిచే సువచనముల నడుగఁబడినవాఁడై యాతనియాజ్ఞచేఁ గశ్యపుఁడు స్వభార్యయగు నదితితో నిజాశ్రమమునకు వచ్చెను తరువాత నదితి కేవల పరమాత్మస్వరూపుఁడగు భాస్కరునిగర్భమునందు వేయివత్సరంబులు ధరించెను. ఆగర్భము గర్భస్థుఁడగుశిశువుచేతనే రక్షింపఁబడుచుండెను. ముల్లోకముల నభిభవించెడి

---

భృగురత్త్రిర్వసిష్ఠశ్చ గౌతమో నారదస్తథా. ౩౬. దివ్యా ఆత్మాంతరిక్షం చ వాయుస్తేజో బలం మహీ, శబ్దః స్పర్శః స్వరూపం చ రసగంధౌ తథైవ చ. ౩౭. ప్రకృతిశ్చ వికారాశ్చ యచ్చాన్యత్కారణం మహత్, సాంగోపాంగాశ్చ చత్వారో వేదా లోకపతే తథా. ౩౮. లవాశ్చ ఋతవశ్చైవ సంకల్పప్రణవాస్తథా, ఏతే చాన్యే చ బహవో భానుమంతముపాసతే. ౩౯. అర్థో ధర్మశ్చ కామశ్చ మోక్షశ్చ సవిశేషతః, ద్వేషో హర్షశ్చ మోహశ్చ మత్సరో మాన ఏవ చ. ౪౦. వృకో విష్ణుసుతః పుత్త్రః పుష్పజో ధిషణస్తథా, మాహేశ్వరస్తథా సౌరో విటపో వికచస్తథా. ౪౧. మారుతో విశ్వకర్మా చ అశ్వినావన్యవాహనౌ, ఏవముక్తః సువచనైర్భానునా ప్రభవిష్ణునా. ౪౨. జగామ కశ్యపో వీర సహాదిత్యా స్వమాశ్రమం, అదితిర్దేవమాతా చ తం గర్భం నిదధే స్వయమ్. ౪౩. భూతాత్మానం మహాత్మానం దివ్యం వర్షసహస్రకం, పూర్ణే వర్షసహస్రే తు ప్రవృత్తో గర్భ ఉత్తమః. ౪౪. సురాణాం శరణం దేవశ్చాసురాణాం వినాశనః, గర్భస్థేన తు తేనైవ పరిత్రాతః సుతస్తథా. ౪౫. ఆదదానస్తు తేజాంసి త్రైలోక్యస్య నరాధిప, తస్మింజాతే తు దేవేశే త్రైలోక్యస్య సుఖావహే. ౪౬. ప్రహత్య దైత్యసంఘాంశ్చ

తేజముగలవాఁడై యీతఁడు జనింపఁగనే సురలందఱు రాక్షసులం జంపినంతటి సంతోషమును బొందిరి.

ఇది అష్టపంచాశదుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకోనషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె తరువాత సర్వాభరణభూషితుండును, విద్యోతమానుండును నగుదక్షప్రజాపతి నమస్కరించి యాకాశంబున గంధర్వులందఱును నాదములఁ జేయుచుండఁగా ఋషిగణంబులతోఁగూడ భాస్కరుని స్తోత్రముచేసెను. ఈరీతిగ దేవగంధర్వులు నుత్పన్నుండైన వారి తస్కరుండును ద్వాదశాత్మకుండును నగుభాస్కరుని గానము చేయుచుండిరి. ఆసూర్యుని ద్వాదశాత్మ లెవ్వియనిన, ఇంద్ర-వివస్వంత-పూష-త్వష్ట్ర-సవితృ-భర్గ-అంశుమంత-అర్యమ-అర్క - పృశ్ని - మార్తండులను నీపదునొకండును విష్ణువు పండ్రెండవస్వరూపమనియుఁ జెప్పుదురు. ఇట్లు పండ్రెండువిధంబుల నుత్పన్నుఁడగు నంశుమంతుని స్తోత్రముఁజేయుచు దేవతలెల్లరు వేవేగ భూమి కవతరించిరి. మృగవ్యాధుండు, చంద్రాం

---

సురాణాం నాదవర్ధనే, అభవత్పరమానందః సర్వేషాం తత్ర తస్థుషామ్. ౪౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యోత్పత్తిర్నామాష్ట
పంచాశదుత్తరశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—దక్షః ప్రజాపతిశ్చైవ నమస్కారం చకార హ, విద్యోతమానో వపుషా సర్వాభరణభూషితః. ౧. ఉపాతిష్ఠత దేవేశం భానుం చర్షిగణైః సహ, తతో గంధర్వముఖ్యేషు ప్రణదత్సు విహాయసి, బహుభిః సహ గంధర్వైః ప్రగాయత్సు మహీపతే. ౨. ఏవం తే దేవగంధర్వా ఉపాగాయంత భక్తితః, ఉత్పన్నం ద్వాదశాత్మానం భాస్కరం వారితస్కరమ్. ౩. ఇంద్రో వివస్వాన్పూషా చ త్వష్టా చ సవితా తథా, భర్గోంఽశుమానర్యమార్కః పృశ్నిర్మార్తండ ఏవ చ, ఇత్యేకాదశ ఏవైతే ద్వాదశో విష్ణురుచ్యతే. ౪. ఏవం ద్వాదశధా జాతమంశుమంతం మహాద్భుతం, స్తువంతి దేవతాః సర్వే గతాశ్చ తరసా మహీమ్. ౫. మృగవ్యాధశ్చ శర్వశ్చ మృగాంకాంశో

కుండును, మహాయశుండు నగుశర్వుండును, అజైకపాదుండును, దమనుండును, ఈశ్వరుండును, కపాలియు, అహిర్బుధ్న్యుండును, పీతుఁడును, కాచుఁడును, పరంతపుఁడును, స్థాణువు, భగుఁడు నను రుద్రులు నచ్చటకు విచ్చేసిరి. అశ్వినులు, అష్టవసువులు, మహాబలుం డగుగరుడుఁడు, విశ్వేదేవులు, సాధ్యులు, ప్రాంజలులై నిలచియుండిరి. మఱియు నితరులగు నాగాధిపులు, మహాబలులగు రాక్షసులును, నాగరాజగు వాసుకియు, తార్క్ష్యుఁడు, అరిష్టనేమి, యరుణుఁడు, ఆరుణి యీమొదలగువారందఱును ప్రాంజలులై నిలచియుండిరి. ఇట్లుండఁగా లోకస్రష్టయగు పితామహుం డేగుదెంచి సర్వఋషులంగూర్చి యిట్లనియె. ప్రభవిష్ణుండును సనాతనుండు నగు నీతఁ డేకారణమువలన సర్వమును జూపుచున్నాఁడో యాకారణంబుచే లోకేశుండును శ్రీమంతుఁడును వివస్వంతుఁడు నగును. మఱియు నెందువలన దేవదానవయక్షులకును, గంధర్వోరగరక్షస్సులకును నాదిదేవుఁడుగ నయ్యెనో యందుచే నాదిత్యుఁడయ్యెను. బ్రహ్మదేవుఁడిట్లు ఋషులతోఁ జెప్పి నమస్కరించి నిజసదనంబున కేగెను. యజ్ఞశీలులగువారల కేది గతియో పుణ్యకర్మాచరణుల కేది గతియో సిద్ధులగువారల కేది గతియో మహాత్ముల కేది గతియో అష్టైశ్వర్యసంపన్నుల కేది

---

మహాయశాః, అజైకపాదహిర్బుధ్న్యః పీతః కాచః పరంతపః. ౬. దమనశ్చేశ్వరశ్చైవ కపాలీ చ విశాంపతే, స్థాణుర్భగశ్చ భగవాన్ రుద్రాశ్చైతేఽవతస్థిరే. ౭. అశ్వినౌ వసవశ్చాష్టౌ గరుడశ్చ మహాబలః, విశ్వేదేవాశ్చ సాధ్యాశ్చ తస్థుః ప్రాంజలయో నృప. ౮. నాగరాజో మహారాజ వాసుకిః ప్రాంజలిః స్థితః, అన్యే చ బహవో నాగా రాక్షసాశ్చ మహాబలాః. ౯. తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ గరుడశ్చ మహాబలః, అరుణశ్చారుణిశ్చైవ తత్ర ప్రాంజలయః స్థితాః. ౧౦. పితామహశ్చ భగవాన్ స్వయమాగమ్య లోకకృత్, ప్రాహ దేవగురుః శ్రీమాన్ త్సురైః సర్వైర్మహర్షిభిః. ౧౧. యస్మాత్పేక్షయతే సర్వం ప్రభవిష్ణుః సనాతనః, తస్మాల్లోకేశ్వరః శ్రీమాన్వివస్వాంశ్చ భవత్వితి ౧౨. దేవదానవయక్షాణాం గంధర్వోరగరక్షసాం, యస్మాదయమాదిదేవస్తస్మాదాదిత్య ఏవ హి. ౧౩. ఏవముక్త్వా తు భగవాన్సార్ధం దేవర్షిభిః ప్రభుః, నమస్కృత్వా సుసంపూజ్య యయౌ తత్సదనం ప్రతి. ౧౪. యా గతిర్యజ్ఞశీలానాం యా గతిః పుణ్యకర్మిణాం, యా గతిః సిద్ధయోగానాం యా గతిశ్చ మహాత్మనామ్. ౧౫. యస్యాష్టగుణమైశ్వర్యం

గతియో, విప్రులు శాశ్వతుండగు నేదేవసత్తముని బొంది సంసారార్ణవ మందు భ్రమింపరో, వాలఖిల్యాదిమహర్షులందఱును దుశ్చరంబగుతపో నిష్ఠయందుండి నియతాత్ములై యెవ్వని స్తోత్రము చేయుచుందురో, యెవఁడు సర్పములలో శేషునివలె సర్వయోగములలో శ్రేష్ఠుఁడో, ఎవ్వఁడు శేషాదులచే సేవింపఁబడుచుండెనో, యెవ్వఁడు సుఖాకాంక్షులగు బ్రాహ్మణులచే యజ్ఞమని యర్చింపఁబడెనో, యెవ్వని బ్రహ్మరూపుఁడని నియతప్రాణులై ధ్యానించుచుందురో, వేదవేత్తలగుయోగులు వేద వేత్తయగు నెవ్వని గానముజేయుచుందురో, యట్టిద్వాదశాత్మకుం డగు తనయుని గాంచి భార్యయగు నదితితోఁగూడఁ గశ్యపుఁడు గొప్పసంతోష ము సుఖమును గూడఁ బొందెను. సమస్తలోకములును సంతసించెను. రాక్షసులు భయంబందిరి. మహాబాహుండును, కంబుగ్రీవుండును నగు మధుపింగళుం డనువాఁడు నవ్వుచు నింగుదీబద్ధమకుటుండై దిక్కులను ప్రజ్వలింపఁజేయువానివలె పుణ్యసత్తముండగు కశ్యపునితో నిట్లనియె. నేను గర్భశుద్ధికై నీకుఁ బుత్త్రుఁడనై జనించితిని. నేను పూర్వము బ్రహ్మ దేవున కిట్లు వరమిచ్చియుంటినిగాన ఋషిపుంగవా! యనుపమంబగు సృష్టినిఁ జేయుమని చెప్పియుండెను. రాజా! భాస్కరు నారాధించి బ్రహ్మ

---

సమభూద్దేవసత్తమం, యం ప్రాప్య శాశ్వతం విప్రా నావర్తంతే భవార్ణవే. ౧౬. వాల ఖిల్యాదయో యే చ సర్వాశ్రమ నివాసినః, సేవంతే యం యతాత్మానో దుశ్చరం వ్రతమాస్థితాః. ౧౭. యోఽనంత ఇవ నాగేషు యస్య తే సర్వయోగినః, సహస్ర మూర్ధా రక్తాక్షః శేషాదిభిరనుత్తమైః. ౧౮. యో యజ్ఞ ఇతి విప్రేంద్రైరర్చ్యతే సుఖ మీప్సుభిః, సర్వే చ యం యతప్రాణా ధ్యాయంతి బ్రహ్మరూపిణమ్. ౧౯. యం వేద విదో గాయంతి వేత్తారం యజ్ఞదాయినం, తం పుత్త్రం ద్వాదశాత్మానం కశ్యపః ప్రాప్య సత్తమమ్. ౨౦. ముదం లేభే సహాఽదిత్యా సుఖం చ పరమం విభో, లోకశ్చ ముముదే సర్వో రాక్షసా భయమాప్నువన్. ౨౧. మధుపింగలో మహాబాహుః కంబుగ్రీవో హసన్నివ, ఇంగుదీబద్ధముకుటో దిశః ప్రజ్వలయన్నివ. ౨౨. స ఉవాచ మహాతేజాః కశ్యపం చర్షిసత్తమం, ఏషోఽహం తవ పుత్రత్వం గతో గర్భస్య సిద్ధయే. ౨౩. దత్త్వా వరం పురా విప్ర విరించస్య మహాత్మనః, తస్మాత్త్వమృషిశార్దూల కురు సృష్టిమనౌపమామ్. ౨౪. ఏవ మారాధ్య దేవేశం బ్రహ్మా సృష్టిమవాప్తవాన్, ఆరాధ్య కశ్యపశ్చాపి భాస్కరం సుత

దేవుఁడు సృష్టికర్తృత్వమును కశ్యపుఁడు భాస్కరుఁడు తనకు సుతుఁడై యుంటను పొందిరి.

ఇది ఏకోనషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

## షష్ట్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. దేవుండగు భాస్కరుచరితము నెంత యాశ్చర్యకరముగఁ జెప్పియుంటివి! బ్రహ్మ మొదలగువార లందఱు నెవ్వని నెల్లపుడు ధ్యానమొనర్చెదరో బ్రహ్మయు విష్ణువు దేవతలును దివాకరు నారాధించి యెట్టిరూపముం గాంచిరో యది నాకుఁ దెల్పుమన సుమంతుం డిట్లనియె. రాజా! బ్రహ్మావిష్ణువులు దేవేశుండగు భాస్కరు నవతారము నారాధించి పశుపతిని జూచువేడుకతో హిమాచలంబున కరిగిరి. అటఁ జని గోపతియును కుందేందుసన్నిభుఁడు నర్ధచంద్రకృత శేఖరుఁడును మహాత్ముఁడు నగునీశ్వరుని వీరునివలె వివస్వంతుఁ బూజించు చుండ బ్రహ్మావిష్ణువులు సందర్శించి నమస్కరించి యాత్రిలోచనుతో నిట్లనిరి. సురజ్యేష్ఠా! మేము నీదర్శనాకాంక్షులమై వచ్చియుంటిమి.

---

మాస్తవాన్. ౨౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఉభయసప్తమీమాహాత్మ్యే సూర్యావతారవర్ణనం నామ ఏకోనషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—అహో దేవస్య చరితం భాస్కరస్య త్వయోదితం, బ్రహ్మాదయోఽపి యం నిత్యం పూజయంతి విధానతః. ౧. బ్రహ్మా విష్ణుః సురా బ్రహ్మంస్తమారాధ్య దివాకరం, దదృశుస్తస్య కింభూతం రూపం యత్తన్మహాద్భుతమ్. ౨. సుమంతురువాచ.—ఆరాధ్య దేవమీశానం భాస్కరం సూతివాచకం, కవిష్ణూ కురుశార్దూల జగ్మతుస్తౌ హిమాచలమ్. ౩. గోపతేరంతికం వీర ప్రహృష్టౌ విభుదర్శనే, కుందేందు సంనిభం ద్రష్టుం కంజజశ్చాచ్యుతశ్చ తౌ. ౪ దదృశతుర్మహాత్మానం చంద్రార్ధకృతశేఖరం, పూజయంతం వివస్వంతం భాస్కరం వీరవన్నృప. ౫. ఆరోచ్యచతుర్మహాత్మానం కవిష్ణూ తం త్రిలోచనం, భోభో భీమ సురజ్యేష్ఠ పశ్యావామిహ చాగతౌ. ౬. శ్రుత్వో

మమ్ములఁ జూడుము. అనిన వారలవాక్యము లాలించి నమస్కరించి విధ్యుక్తంబుగఁ బూజించి శివుఁడు మధురవాక్కులతో హర్షగద్గదుఁడై దిక్కులఁ బ్రతిధ్వనింపఁజేయుచుఁ బల్కెను. దేవోత్తములారా! సర్వ దేవోత్తముఁ డగుసూర్యు నారాధించి యేఫలమును వడసిరో దానిం దెలిసికొనవలె ననుకుతూహల మధికమగుచున్నది. గానఁ దెలియఁ జేయుఁడు. అవ్యయుఁడు నప్రమేయుఁడు నమితౌజస్కుఁడు నగుదివా కరుని మంగళకరమగు సూక్ష్మరూపంబు దిలకించితిరా అనవుడు వార లిట్లనిరి. ఆపరమాద్భుతం బగురూపముం జూడలేక నీసన్నిధానమున నాతని నారాధించుటకై వచ్చియుంటిమి. కాన మనమందఱముఁ గలసి యుదయగిరిం జేరి విభావసు నారాధించుదము. రాజా! యీశ్వరుఁడు వారల వాక్యముల విని హర్షోత్ఫుల్లలోచనుఁడై యట్లే యనియెను. అంతట వారందఱును వివిధగతులచేఁ బర్వతశ్రేష్ఠంబగు నుదయా చలముం జేరిరి. పుణ్యంబును శృంగత్రయాలంకృతంబును నానాధాతు పినద్ధాంగంబును నానాధాతువిభూషితంబు నగు నాపర్వతముం జేరి సూర్యు నారాధించుటకై శాస్త్రోక్తంబుగాఁ బ్రయత్నములం జరిపిరి. విభావసుని స్తోత్రముఁ జేయుచు నర్చించుచు ధ్యానించుచు దేవమానాను

---

వాచ తయోర్వాక్యం కంజజస్యాచ్యుతస్య చ, ప్రణమ్య శిరసా భూమౌ కృత్వా పూజాం విధానతః. ౭. ఉవాచ మధురం వాక్యం శిక్షాక్షరసమన్వితం, హర్షగద్గదయా వాచా దిశః సన్నాదయన్నివ. ౮. కిమారాధ్య రవిం ప్రాప్తా సర్వదేవవరం విభుం, కథ్యతాం నిఖిలం దేవా పరమం కౌతుకం మమ. ౯. దృష్టవంతౌ పరం కించిద్రూపం దేవస్య శంకరం, అవ్యయస్యాప్రమేయస్య భానోరమితతేజసః. ౧౦. నిశమ్య వచనం వీర శంక రస్య మహాత్మనః, ఊచతుస్తౌ మహాత్మానౌ కవిష్ణూ దేవసత్తమౌ. ౧౧. న తత్పశ్యావహే రూపం యత్తత్పరమమద్భుతం, ఆరాధయితుమేవాపి హ్యాగతౌ తేంతికం చ తమ్. ౧౨. తస్మాదారాధయామో హి ఏకీభూయ విభావసుం, గత్వోదయగిరిం పుణ్యం పర్వతం కనకోజ్జ్వలమ్. ౧౩. శ్రుత్వా తు వచనం వీర కంజజాచ్యుతయోర్హరః, తథేత్యాహ మహాబాహో హర్షాదుత్ఫుల్లలోచనః. ౧౪. అథ తే రాజశార్దూల వివిధోగతయో నృప, జగ్ముస్తం పర్వతశ్రేష్ఠముదయాచలమాశు వై. ౧౫. తమాసాద్య నగం పుణ్యం శృంగై స్త్రిభిరలంకృతం, నానాధాతుపినద్ధాంగం నానాధాతువిభూషితమ్. ౧౬. ఆరాధనాయ విధివద్యత్నం చక్రుర్విభావసోః, స్తువంతస్తే సమర్చంతో ధ్యాయంతశ్చ విభావసుమ్. ౧౭.

సారంబుగ వేయివత్సరము లానగంబునఁ దపమాచరింపుచు నుండిరి. పద్మాసనగతుండై బ్రహ్మ దివాకరు నారాధించుచుండెను. త్రిలోచనుఁడు స్థాణువువలెనుండి భూమియందు బాహువు లెత్తికొని ధ్యానించుచుండెను. విష్ణువు పంచాగ్నిమధ్యమునఁ దలక్రిందుగఁ దప మాచరింపుచుండె. నిట్లు వేయివత్సరములు విధ్యుక్తముగ సూర్యు నారాధింపఁగాఁ ద్రిమూర్తులం జూచి సూర్యుఁడు సంతోషించి బ్రహ్మవిష్ణుమహేశులారా! సంతసించితిని. నావలన మీకేమి కావలెనో కోరుఁడు. మీకు వరము లొసఁగుటకై స్వయముగ నేగుదెంచితి ననెను తరువాత నోరాజా! బ్రహ్మవిష్ణుమహేశులు శాంతమును హృద్యమునగు నా సూర్యవాక్యము విని నమస్కరించి యిట్లనిరి. దేవా! మేమందఱమును నీయనుగ్రహమువలనఁ గృతార్థులమైతిమి. పూర్వము నిన్నారాధించి నీవలన వరముంబొంది సృష్టిస్థితిలయములకు సమర్థులమై యుంటిమి అయినను నీనుండి యొక్కవరముం గోరుచుంటిమి. దేవా! దుర్లభంబును దుర్దర్శంబును నగు నీపరమరూప మేది గలదో యట్టి యచ్యుతంబగు నీరూపము మాకుఁ జూపింపుము. నారూపము సర్వదేవమయమని నీవే చెప్పియుంటివిగాన దానిం జూపుమన సూర్యుఁ డట్లే యని తనరూపముం

---

దివ్యవర్షసహస్రాంతే తపంతః సుస్థితా నగే, పద్మాసనగతో బ్రహ్మా ధ్యాయమానో దివాకరమ్. ౧౮. స్థాణువత్సంస్థితో భూమావూర్ధ్వబాహుస్త్రిలోచనః, పంచాగ్నిం భజమానస్తు స్థితో విష్ణురవాక్ఛిరాః. ౧౯. ఏవం వర్షసహస్రాంతే తపశ్చక్రుః సుదారుణం, ఆరాధయంతో విధివద్గోపతిం పుత్రమాలినమ్. ౨౦. అథ బ్రహ్మేశవిష్ణూనాం కుర్వతాం తప ఉత్తమం, తుతోష భగవాన్భానురువాచ చ మహీపతే. ౨౧. బ్రహ్మేశ్ఛంభో హరే బ్రూత మత్తః కిమభివాంఛథ, తుష్టోఽహం భవతాం దాతుమిహాయాతో వరం స్వయమ్. ౨౨. సుమంతురువాచ.—నిశమ్య వచనం భానోః శాంతం హృద్యం మనోరమం, ప్రణమ్య శిరసా కేశా ఇదం వచనమబ్రువన్. ౨౩. కృతకృత్యా వయం సర్వే ప్రసాదాత్తవ గోపతే, త్వామారాధ్య పురా దేవ త్వత్తః ప్రాప్య వరం శుభమ్. ౨౪. ఉత్పత్తిస్థితినాశానాం వయం సర్వే దివాకర, సంభూయేహ సమర్థా వై త్వత్ప్రసాదాన్న సంశయః. ౨౫. కిం త్వేకం దేవదేవేశ వరమిచ్ఛామహే విభో, యత్తే పరమకం రూపం దుర్లభం దుర్దృశం తథా. ౨౬. తస్మాదస్మాజ్జగన్నాథ రూపం దర్శయ తేఽచ్యుతం, సర్వదేవమయం యత్తే యత్త్వయోక్తం పురానఘ. ౨౭. తేషాం తద్వచనం శ్రుత్వా బ్రహ్మా

జూపెను. ఆరూప మనేకవక్త్రంబు లనేకశిరంబు లనేకాద్భుతదర్శనంబులు గలదియు సర్వదేవమయంబును సర్వలోకమయంబును దివ్యంబును భూమి పాదములుగను నాకాశము శిరముగ నగ్నిలోచనంబులుగఁ గలదై యుండెను. పిశాచంబులు పాదాంగుళులుగను, గుహ్యకులు హస్తాంగుళులుగను, సురోత్తములగు విశ్వేదేవులు జంఘాసంఘంబులుగ నుండిరి. యక్షులు కుక్షియందు లీనమై యుండిరి. అప్సరోగణములు కేశములుగ నుండిరి. వీరశ్రేష్ఠులందఱును దృష్టిధర్షణములగు కేశములైరి. తారకలు రోమరూపములుగను, మహర్షులు రోమంబులుగను, విదిక్కులు బాహువులుగను, దిక్కులు శ్రోత్రములుగ నుండెను. శ్రవణములయం దశ్విను లును మహాబలుండగు వాయువు నాసికయందు నుండెను. ఈతని మనము క్షమాపూరితముగను వాణి ధర్మసత్యపూరితముగ నుండెను. సరస్వతి జిహ్వయు, మహాదేవి యగునదితి గ్రీవముగను, వీర్యవంతుఁ డగు రుద్రుఁడు తాలువుగను, స్వర్గద్వారము నాభియుఁ, దృష్ట యుదరము గను, ముఖము వైశ్వానరుఁడుగను, భగుఁడు వృషణములుగను, సర్వసంధులయందును వాయువులును, సర్వఛందస్సులు దంతములుగను, నక్షత్రములు విమలంబులగు తేజోరూపములుగను, హృదయము భగవంతుఁడగు బ్రహ్మయు, నుదరము కశ్యపుఁడును, పృష్ఠమున వసువులు

---

విష్ణిశ్వెశభాషితం, దర్శయామాస తద్రూపమద్భుతం లోకపూజితమ్. ౨౮. అనేకవక్త్ర శిరసమనేకాద్భుతదర్శనం, సర్వదేవమయం దివ్యం సర్వలోకమయం తథా. ౨౯. భూః పాదౌ ద్యౌః శిరశ్చాపి తత్రాగ్నీ లోచనే మతే, పాదాంగుల్యః పిశాచాశ్చ హస్తాంగుల్యశ్చ గుహ్యకాః. ౩౦. విశ్వే దేవాః స్మృతా స్తస్య జంఘాసంఘాః సురోత్తమాః, యక్షాః కుక్షిషు సంలీనాః కేశాశ్చాప్సరసాం గణాః. ౩౧. దృష్టిధృష్టయశ్చ విపులాః కేశా వీరాంశవః స్మృతాః, తారకా రోమరూపాణి రోమాణి చ మహర్షయః. ౩౨. బాహవో విదిశ స్తస్య దిశః శ్రోత్రే నరాధిప, అశ్వినౌ శ్రవణే చాస్య నాసా వాయుర్మహాబలః. ౩౩. ప్రసాదశ్చ క్షమా చైవ మనో ధర్మ స్తథైవ చ, సత్యమస్యాభవద్వాణీ జిహ్వా దేవీ సరస్వతీ. ౩౪. గ్రీవాదితిర్మహాదేవీ తాలూ రుద్రశ్చ వీర్యవాన్, ద్వారం స్వర్గస్య నాభిరై మిత్ర స్త్వష్టా పిచండకః. ౩౫. ముఖం వైశ్వానరశ్చాస్య వృషణౌ చ భగ స్తదా, హృదయం భగవాన్బ్రహ్మా హ్యుదరం కశ్యపో మునిః. ౩౬. పృష్ఠేఽస్య ఘసవో దేవా మరుతః సర్వసంధిషు, సర్వచ్ఛందాంసి దశనా జ్యోతీంషి విమలా ప్రభా.

నుండిరి. మహాదేవుం డగురుద్రుఁడు ప్రాణమును, మహార్ణవములు కుక్షి యందు, నుదరమున గంధర్వులు భుజంగులు నుండిరి. లక్ష్మి ధృతి మేధ కాంతి. సమస్తవిద్యలును కంటియందును నీపరమాత్మ లలాటము. పరమం బగు గగనస్థానములును సర్వజ్యోతిస్సులు దేవరాజగు తపశ్చక్రంబును నిప్పగిది నిఖిలమును మహాత్ముండగు నాదిదేవునియొక్క శరీరమునందుండి నట్లు చెప్పిరి. స్తనములు కుక్షులు (కక్షములు) వేదములు ననునెన్ని దియు మఖమ్ములై యున్నవి. ద్విజులుచేయు పశుబంధము లాదేవుని వేష్టనములుగఁ జెప్పఁబడుచున్నవి. ఇట్లాత్రిమూర్తులు సర్వదేవమయం బగు నర్కునిరూపముఁ జూచి పరమాశ్చర్యమునంది దేవుని నమస్కరించి వడంకుచు భూమియం దవతరించి భయగద్గదంబగు వాక్కుతో నిట్లు వల్కిరి. దేవా! జ్వాలామాలావిరాజితంబును, ననేకముఖయుక్తంబును, ననేకబాహువిలసితంబును, అనేకోరుసంయుతంబును, భయంకరంబగు నీరూపముఁ జూచి భీతిల్లితిమి. జ్ఞానము గూడ నశించినది. మమ్ముల ననుగ్రహింపుము. నీవిశ్వరూపమును జూచుటకు శక్తులము గాము. కాన నుపసంహరింపుము ఇట్లు చెప్పినవారలవాక్యములను విని దివాకరుఁడు ప్రసన్నుఁడై నగుచు వారలతో నిట్లనియె. సురజ్యేష్ఠులారా! సర్వోత్కృష్టంబును, పుణ్యంబును, నద్భుతంబును, లోకపావనంబును, యోగు

---

3౭. ప్రాణో రుద్రో మహాదేవః కుక్షౌ చాస్య మహార్ణవాః, ఉదరే చాస్య గంధర్వా భుజంగాశ్చ మహాబలాః. 3౮. లక్ష్మీర్మేధా ధృతిః కాంతిః సర్వా విద్యాశ్చ వై కటౌ, లలాటమస్య పరమం వయఃస్థానం పరాత్మనః. 3౯. సర్వజ్యోతీంషి జానీహి తపశ్చక్రశ్చ దేవరాట్, తదేతదాదిదేవస్య తనౌ హ్యేహుర్మహాత్మనః. ౪౦. స్తనౌ కుక్షౌ చ వేదాశ్చ తేష్టా చాస్య మఖాః స్మృతాః, యజ్ఞవ్యపశుబంధాశ్చ ద్విజానాం వేష్టితాని చ. ౪౧. సర్వదేవమయం దృష్ట్వా రూపమర్కస్య తే నృప, బ్రహ్మా హరో హరిర్దేవాః పరం విస్మయమాగతాః. ౪౨. ప్రణమ్య శిరసా దేవం వేపమానా ధరాం గతాః, భయగద్గదయా వాచా ఇదం వచనమబ్రువన్. ౪3. సమీక్ష్య రూపం తే దేవ భీమం జ్వాలాసమాకులం, అనేకముఖబాహూరుచరణం చకితా వయమ్. ౪౪. దిఙ్జ్ఞానం హృతమస్మాకం తత్ప్రసీద జగత్పతే, ఉపసంహర విశ్వాత్మన్ద్రష్టుం శక్తా న తే వయమ్. ౪౫. ఇతి తేషాం వచః శ్రుత్వా దేవదేవో దివాకరః, ప్రసన్నో భగవానాహ వచస్తాన్ప్రహసన్నిదమ్. ౪౬. ఆదిత్య ఉవాచ.—యదేతత్పరమం పుణ్యమద్భుతం లోకభావనం, దృష్టం

లకు మహాలయంబును నగునారూపమును మీరు బూజించుటచే మీకుఁ బ్రసన్నుఁడనైతిని. దానిని మీశ్రేయముకొఱకే చూపియుంటి ననిన విని బ్రహ్మావిష్ణుమహేశ్వరులు దివాకరా! నీవన్నయర్థంబెల్ల నిజంబు. నీవు ప్రసన్నుఁడవై మాకుఁ జూపిన విశ్వరూపమును జూచుటకు యోగులును శక్తులుగారు. జగన్నాథుండవగు నిన్నారాధించినయెడల నప్రాప్యంబగు వస్తువెద్దియు నుండదు. అందుచే లోకంబున దేవతలలో నీకంటెఁ బూజింపఁదగినవాఁ డితరుఁడు మఱొక్కఁడు లేఁడు. అని చెప్పుచుండఁగనే యదితిపుత్రుండగు సూర్యుఁ డంతర్ధానము నొందెను. బ్రహ్మాదులును దేవదర్శనముచే గొప్పసంతోషమును బొందిరి. ఇట్లు బ్రహ్మాదిదేవతలు దివాకరు నారాధించి పరమసిద్ధిని బొందిరి. గంధర్వులును, ఋషులు నట్లే సిద్ధిని బొందిరి.

ఇది షష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! భాస్కరుఁడు పరతత్వమని చెప్పియుంటివి. అదియంతయు నిశ్చయము. భాస్కరుఁడే పరదైవము.

---

భవద్భిర్దేవేంద్రా మమ సర్వజగన్మయమ్. ४८. ఏతన్మయా ప్రసన్నేన యుష్మాకం శ్రేయసేఽనఘాః, దర్శితం పూజితేనేహ యోగినాం యన్మహాలయమ్. ४९. బ్రహ్మేశాచ్యుతా ఊచుః.—ఏవమేతన్న సందేహో యథార్థ త్వం దివస్పతే, యోగినామపి దేవేశ దర్శనం హ్యస్య దుర్లభమ్. ४८. త్వామారాధ్య జగన్నాథం నాప్రాప్యమిహ విద్యతే. తస్మాత్పూజ్యతమో లోకే నాన్యో దేవేషు విద్యతే. ७०. ఏవముక్త్వాఽదితేః పుత్రో జగామాదర్శనం రవిః, బ్రహ్మాదయోఽపి తే హర్షం ప్రాపుర్దేవస్య దర్శనాత్. ७१. ఏవం బ్రహ్మాదయో దేవాః పూజయిత్వా దివాకరం, గతాస్తే పరమాం సిద్ధిం గంధర్వా ఋషయస్తథా. ७२.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు బ్రహ్మాదీనాం సూర్యరూపదర్శనవర్ణనం నామ షష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ.—ఏవమేతద్యథార్థ త్వం భాస్కరో దైవతం పరం, నాస్త్యా

ఆదిత్యసముండగు దేవుఁడును, ఆదిత్యసమంబగు గతియును నెందును గానంబడదు. ఈమూఁడులోకంబులును నాదిత్యమూలంబులనుట నిస్సంశయము. సదేవాసురమానుషంబగు నీజగమంతయు నీతనినుండియే జన్మించినది. మఱియు రుద్రుఁడు, ఇంద్రుఁడు, వరుణుఁడు, ఉపేంద్రుఁడు, బ్రాహ్మణులు, దేవతలు మొదలగువారందఱకు నితఁడే జనకుఁడు. ఈతఁడే ధృతిమంతులలో ధృతియును, సార్వలౌకికంబగు జ్యోతియు మహాదేవుండును, ప్రజాపతియునై యుండెను. ఈసూర్యుఁడే త్రిలోకంబులకు మూలము. ఈతనినుండియే యీసర్వము నుత్పన్నమగును. అంతమున నాతనియందే లయమును బొందును. లోకమునకు భావాభావము లాదిత్యునివలననే వెలువడినవి. బ్రాహ్మణోత్తమా! జగజ్జ్యేష్ఠుండగు సూర్యుఁడు సర్వలోకదీపకుండును బ్రభుండునై యుండెను. అందఱును అచ్చటనే నాశమును బొందుచు మఱల నచ్చటనే పుట్టుచుందురు. క్షణములు, ముహూర్తంబులు, దివసంబులు, రాత్రులు, పక్షంబులు, మాసంబులు, సంవత్సరంబులు, ఋతువులు, యుగంబులు నీమొదలగుకాలంబును నగ్నియు, ద్వాదశాత్మకుండగు ప్రజాపతియు నగునీతఁడే సచరాచరంబగు నీమూఁడులోకంబులను ప్రకాశింపఁజేయుచుండెను. కాన నిట్టి భగవంతునిఁ బూజించిన నేమిఫలము లభించునో యనుగ్రహాయత్తచిత్తుండవై చెప్పుము ఇది ఏకషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

దిత్యసమో దేవో నాస్త్యాదిత్యసమా గతిః. ౧. ఆదిత్యమూలమఖిలం త్రైలోక్యం నాత్ర సంశయః, భవత్యస్మాజ్జగత్సర్వం సదేవాసురమానుషమ్. ౨. రుద్రేంద్రోపేంద్రకేంద్రాణాం విప్రేంద్ర త్రిదివౌకసాం, ద్యుతిర్ద్యుతిమతాం కృత్స్నం తేజో యత్సార్వలౌకికమ్. ౩. సర్వాత్మా సర్వలోకేశో మహాదేవః ప్రజాపతిః, సూర్య ఏవ త్రిలోకస్య మూలం పరమదైవతమ్. ౪. తతః సంజాయతే సర్వం తత్రైవ ప్రవిలీయతే, భావాభావౌ హి లోకానామాదిత్యాన్నిఃసృతౌ పురా. ౫. జగజ్జ్యేష్ఠో గ్రహో విప్ర ప్రదీప్తః ప్రభవో రవిః, తత్ర గచ్ఛంతి నిధనం జాయంతే చ పునః పునః. ౬. క్షణా ముహూర్తా దివసా రాత్రిపక్షాశ్చ కృత్స్నశః, మాసాః సంవత్సరాశ్చైవ ఋతవశ్చ యుగాని చ. ౭. స ఏష కాలశ్చాగ్నిశ్చ ద్వాదశాత్మా ప్రజాపతిః, ప్రభాసయతి విప్రేంద్ర త్రైలోక్యం సచరాచరమ్. ౮. తస్మాదస్య ద్విజశ్రేష్ఠ పూజనే యత్ఫలం భవేత్, తన్మే బ్రూహి ప్రయత్నేన ప్రసాదప్రవణో భవ. ౯. ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యపూజాఫలప్రశ్నవర్ణనం నామ ఏకషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

## ద్విషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. మానవుఁడు సర్వదేవమయుండగు భానునిఁ బ్రతిష్ఠించి తేజస్సుచే సూర్యప్రతిముఁడై యమరత్వమును బొందును. ఎవ్వఁడు సర్వదేవనమస్కృతుండగు భాను నజ్ఞానముచే ద్వేషించునో వాఁడు నరకమును బొందును. ఇష్టదైవంబగుభానునిఁ బ్రతిష్ఠించినయెడల నేమిఫలము గల్గునో జెప్పెద వినుము. సర్వయజ్ఞంబులయందును సర్వతపంబులయందును నేఫలము గలదో దానికిఁ గోటిగుణితంబగుఫలము సూర్యదేవతాప్రతిష్ఠవలన లభించును. రాజా! ఏమనుజుఁడు భక్తితో శాస్త్రోక్తముగా భానుని స్థాపించునో యామనుష్యుఁడు సర్వాంగముదితంబగు పుణ్యమును బొందును. మఱియు మాతాపితృవంశములను, పత్నీపితృవంశమును గూడ నుద్ధరించి యింద్రలోకంబునం బ్రకాశించుచుండును. ఆయింద్రలోకంబునం బ్రవేశించియు విపులంబులగు భోగంబుల ననుభవించి ప్రళయకాలము సమీపించినప్పుడు జ్ఞానయోగమును బొంది యిచ్చటనే ముక్తుఁడగును. లేకున్న రాజ్యకాంక్ష గల్గినయెడల జన్మాంతరమున సప్తద్వీపసముద్రయుక్తంబగు భూమికంతకును ప్రభువగును. మఱియుఁ బార్థివంబగువిగ్రహమునుఁ జేయించి వ్యోమమునం దర్చించినయెడల మూఁడులోకంబులను సమూలంబుగా నర్చించినట్లగును. అట్టివాఁడు ధనవంతుఁడై యీలోకమునందే వసించి యంత్య

---

సుమంతురువాచ:—భానుం ప్రతిష్ఠాప్య నరః సర్వదేవమయం విభుం, ప్రాప్నోత్యమరతాం వీర తేజసా రవిసన్నిభః. ౧. యో భానుం ద్వేష్టి సంమోహాత్సర్వదేవనమస్కృతమ్, నరో నరకగామీ స్యాత్తస్య సంభాషణాదపి. ౨. భానుమిష్టం ప్రతిష్ఠాప్య సర్వయత్నైర్విధానతః, యత్పుణ్యఫలమాప్నోతి తదేకాగ్రమనాః శృణు. ౩. సర్వయజ్ఞతపోదానతీర్థదేవేషు యత్ఫలం, తత్ఫలం కోటిగుణితం స్థాప్య భానుం లభేన్నరః. ౪. యో భానుం స్థాపయేద్భక్త్యా విధిపూర్వం నరాధిప, సర్వాంగముదితం పుణ్యం లభేత్కోటిగుణం నరః. ౫. మాతృజాన్పితృజాంశ్చైవ యత్ర చోద్వహతే స్త్రియం, కులత్రయం సముద్ధృత్య శక్రలోకే మహీయతే. ౬. భుక్త్వా తు విపులాన్భోగాన్ప్రలయే సముపస్థితే, జ్ఞానయోగం సమాసాద్య తత్రైవ ప్రవిముచ్యతే. ౭. అథ వా రాజ్యమాకాంక్షేజ్జాయతే సంభవాంతరే, సప్తద్వీపసముద్రాయాః క్షితేరధిపతిర్భవేత్. ౮. యత్కృత్వా పార్థివం వ్యోమ్ని అర్చయేత్సర్వదేవకం, సమూలమఖిలం తేన త్రైలోక్యం

కాలమున నర్కత్వమును బొందును. ఎవ్వఁడు పార్థివంబగు వ్యోమను బింబముతోఁ గూడఁ జేసి యాబింబమును త్రిసంధ్యలయందును కీర్తించిన యెడలఁ బదునొకండువందలయేండ్లవఱకు నాతనిపుణ్యము వివరింతు వినుము. ఈదేహముతో భానుఁడు భూలోకమునం దుండును. అట్లుండి దర్శించువారలను స్పృశించువారలను పాపవిముక్తులం జేయును. మఱియు నిరువదియొక్కపురుషాంతరములను తరింపఁజేయును. సర్వదేవతలతోఁగూడి స్వర్గంబున సూర్యునివలెనే సంతోషించుచుండును. ఎవ్వఁడు పిష్టమయంబగువ్యోమను నిర్మించి కుసుమంబులచేతను, సుగంధంబులచేతను, వివిధఫలంబులచేతను, భక్ష్యలేహ్యంబులచేతను, రసంబులచేతను, ఘృతదీపంబులచేతను, నలంకారంబులచేతను శోభాయుక్తంబుగఁజేసి, నానారత్నసమాయుక్తంబును, నానాగంధసమన్వితంబుగను జేసి యాపిష్టమయంబగు ప్రతిమకు దక్షిణభాగంబున నగరును, పశ్చిమభాగమున శుభంబగుశ్రీఖండమును, నుత్తరభాగంబున రక్తచందనమును, నదియే పూర్వభాగంబున నుంచవలయును. ఈరీతిగఁ దనద్రవ్యసామర్థ్యము ననుసరించి వైభవములను జరుపవలయును. ఇట్లుచేసి యిదియంతయుఁ గృష్ణపక్షమున సప్తమదివసంబున భాస్కరునకు నివేదింపవలయును. భరతసత్తమా! యెవ్వఁ డొక్కపర్యాయము వ్యోమను జేయునో వానిఫలమును జెప్పుచున్నాను. శ్రద్ధధానుండవై యాకర్ణింపుము. అట్టివాఁడు

పూజితం భవేత్. ౯. ఇహైవ ధనవాఞ్ఛ్రీమాన్సోంతేఽర్కత్వమవాప్నుయాత్, త్రిసంధ్యం కీర్తయేద్వ్యోమ కృత్వా బింబేన పార్థివమ్. ౧౦. శతైకాదశకం యావత్తస్య పుణ్యఫలం శృణు, అనేన సహ దేహేన భానుః సంతిష్ఠతే క్షితౌ. ౧౧. పాపహా సర్వమర్త్యానాం దర్శనాత్స్పర్శనాదపి, ఉద్ధారయేచ్చ సంస్థాప్య కులానామేకవింశతిమ్. ౧౨. గీర్వాణైః సహితో నిత్యం మోదతే దివి సూరవత్, యోఽపి పిష్టమయం వ్యోమ సర్వగంధోపశోభితమ్. ౧౩. కుసుమైః సుసుగంధైశ్చ ఫలైశ్చ వివిధైర్నృప, భక్ష్యలేహ్యరసైశ్చైవ ఘృతదీపైరలంకృతైః. ౧౪. నానారత్నసమాయుక్తం నానాగంధసమన్వితం, తస్య దక్షిణపార్శ్వే తు విన్యసేదగురుం బుధః. ౧౫. దద్యాద్వై పశ్చిమే భాగే శ్రీఖండం చందనం శుభం, ఉత్తరే చందనం దద్యాద్రక్తం దద్యాచ్చ పూర్వతః. ౧౬. ఏవం విత్తానుసారేణ కృత్వా విభవవిస్తరం, కృష్ణపక్షే తు సప్తమ్యాం భాస్కరస్య నివేదయేత్. ౧౭. సకృదేవ తు యః కుర్యాద్వ్యోమ భరతసత్తమ, యత్ఫలం హి భవేత్తస్య

సర్వపాపవినిర్ముక్తుండును, సర్వదుఃఖవివర్జితుండును, నిష్కలుండును, సర్వగుండునునై యవ్యయుండగు పరమపురుషునిఁ జేరఁగలఁడు. మఱియుఁ దేజమునఁ బ్రభను రవిసమానుఁ డగును. రాజా! యెవ్వఁడు మంటితో నాడుచు నప్రయత్నముగా వ్యోమను రచించునో వాఁడు పర్వతముల యందంతటను రాజగును. సమస్తపాత్రములలో విభావసుఁడు పరమ పాత్రమని చెప్పఁబడెను. కారణమేమన నీతఁడే నరకార్ణవమునుండి తరింపఁజేయునుగాన నట్లు చెప్పఁబడెను. అట్టి యీపాత్రమాహాత్మ్య మక్షయమని చెప్పుదురు. అందుచే నప్రమేయఫలార్థులగువా రతనికి సపర్య లిచ్చుచుండవలయును. దానము, హోమము, జపమును, బలిని, పూజను సూర్యునకుఁ జేయవలయును. అట్లుచేసిన ననంతఫలము లభించు నని బ్రహ్మాదిసురసత్తములు నుడివియుండిరి. మఱియు నెవ్వఁడు భక్తి పూర్వకంబుగ స్వవిత్తానుసారంబుగ సూర్యదేవాలయమును నిర్మించునో యామనుజుఁ డాగ్నేయయానము నధిష్ఠించి భానులోకంబునకేగి యాత నితోఁగూడ సంతోషించుచుండును. మహాధనసంపన్నుఁడైనను భక్తి శూన్యముగఁ జేసిన ఫలము గలుగదు. దరిద్రుఁ డల్పముగ నిర్మించినను ధనికుఁ డధికముగ నిర్మించినను సమానఫలమే గల్గును. మహాధనసం పన్నుఁడైనను లోభాక్రాంతచేతస్కుఁడై ధనవ్యయమునకై దిగులంది లోకనిందను భరింపఁజాలక చేయించినయెడల వాని కేవిధమగుఫలమును

---

తస్మై నిగదతః శృణు. ౧౮. సర్వపాపవినిర్ముక్తః సర్వదుఃఖవివర్జితః, నిష్కలః సర్వగో భూత్వా ప్రవిశేత్పరమవ్యయం, తేజసా రవిసంకాశః ప్రభయార్కసమప్రభః. ౧౯. పాంసునా క్రీడమానో యః కుర్యాద్వ్యోమ హ్యకార్యతః, స రాజన్భవతే రాజా పర్వతేషు సమంతతః. ౨౦. సర్వేషామేవ పాత్రాణాం పరం పాత్రం విభావసుః, వితత్సంతారయేద్యస్మాదతీవ నరకార్ణవాత్. ౨౧. తస్య పాత్రస్య మాహాత్మ్యం ధ్రువమక్షయమాదిశేత్, తస్మాత్తస్మై సదా దేయమప్రమేయఫలార్థిభిః. ౨౨. రవౌ దత్తం హుతం జప్తం బలిం పూజాం నివేదయేత్, అనంతఫలమాదిష్టం బ్రహ్మాదిసురసత్తమైః. ౨౩. భక్త్యా విత్తానుసారేణ యః కుర్యాదాలయం రవేః, సోఽగ్నేయం యానమారుహ్య మోదతే సహ భానునా. ౨౪. మహావిభవసారోఽపి యః కుర్యాద్భక్తివర్జితం, అల్పే మహతి వా తుల్యం ఫలమాఢ్యదరిద్రయోః. ౨౫. విత్తశాఠ్యేన యః కుర్యాద్విత్తవానపి మానవః, స

గలుగదు. కాన తనకుండెడి ద్రవ్యములో మూఁడుభాగములు తనజీవనమునకును, రెండుభాగములు ధర్మమునకును వినియోగింపవలయును. జీవిత మనిత్యము గావున నెప్పుడు నశించునో గుర్తెఱుంగము గాన ధర్మము ముందనుష్ఠింపవలయును. మానవుఁ డల్పధనుఁడైనను భక్తిచోదితుఁడై చేయవలయును. సంపన్నుఁడైనను భక్తితోఁ జేయనియెడల నిష్ఫలంబగును. సూర్యునకుఁ దన సర్వస్వమును సమర్పించిన మాత్రముననే ధర్మకామి గానేరఁడు. భక్తియే యిందులకుఁ బ్రధానకారణము. ఉగ్రంబులగుతపంబులచేతను, గొప్పయజ్ఞములచేతను గూడ భక్తితో సూర్యునికిఁ బూజ సమర్పించిన గలుగుఫలమును బొందఁజాలరు. భక్తియుతుండగు పురుషుఁడు మాత్రమే దివ్యంబగు నాసూర్యపురమును బొందును. ఎవ్వఁడుసూర్యమందిరమును రుచిరముగను, శుభంబుగను, శైలోత్థంబుగనునిర్మించునో వాఁడు నిరువదియొక్క పురుషాంతరములను వెంటఁబెట్టుకొని సూర్యలోకంబున కేగును. ఏప్రతిమ కోటిగుణితఫలదమని చెప్పియుంటినో యాప్రతిమ శైలజమైనను నిష్టకామనచే నారాధించిన ద్విపరార్ధగుణంబగుఫలము లభించును. మృత్ప్రతిమయైనను శిలాప్రతిమయైనను దరిద్రుఁడైనను ధనికుఁడైనను ఫలము సమానము. ఇచ్చవచ్చినయెడకుంబోయి యచ్చటనే సూర్యదేవాలయమును నిర్మింపవలయును. శిలాప్రతిమనుగాని, దారునిర్మితప్రతిమనుగాని, యిటుకలతో గట్టిగా గాని కట్టింప

---

స ఫలమవాప్నోతి ప్రలోభాక్రాంతమానసః. ౨౬. తస్మాత్త్రిభాగం విత్తస్య జీవనాయ ప్రకల్పయేత్, భాగద్వయం చ ధర్మార్థే అనిత్యం జీవనం యతః. ౨౭. భక్త్యా ప్రచోదితం కుర్యాదల్పవిత్తోఽపి యో నరః, మహావిభవసారోఽపి న కుర్యాద్భక్తివర్జితః. ౨౮. సర్వస్వమపి యో దద్యాదర్కే భక్తివివర్జితః, న తేన ధర్మభాగీ స్యాద్భక్తిరేవాత్ర కారణమ్. ౨౯. న తపోభిర్విభోరుగ్రైర్న చ సర్వైర్మహామఖైః, గచ్ఛేందేకం పురం దివ్యమర్కే భక్తియుతో నృప. ౩౦. రుచిరం శుభశైలోత్థం కుర్యాద్యస్తు రవేర్గృహం, త్రిసప్తకులసంయుక్తః సూర్యలోకమవాప్నుయాత్. ౩౧. యన్మయా కోటిగుణితం కృతం స్యాదిష్టకామ్యయా, ద్విపరార్ధగుణం పుణ్యం శైలజేఽపి విదుర్బుధాః. ౩౨. మృచ్ఛైలేన సమం జ్ఞేయం పుణ్యమాఢ్యదరిద్రయోః, యత్ర తత్ర గతః కుర్యాద్భక్త్యా పుణ్యం భగాలయమ్. ౩౩. శైలోత్థమిష్టకాభిర్వా దృఢం దారుమయం శుభం, స గచ్ఛే

వలయును. అట్లుచేసిన గైరికయానారూఢుఁడై సర్వాభరణభూషితుఁడై పరమమగు సూర్యపదముఁ జేరును. బాలభావమున నాడుకొనుచు నర్క మందిరంబు నిర్మించువాఁడును విమానవరము నధిష్ఠించి పుష్పమాలాలంకృతంబును, ధూపగంధాదివాసితంబును, అప్సరోగణసంకీర్ణంబును, సర్వకామసుఖప్రదంబును నగు నాదేవయానంబుతో సూర్యలోకమును బొందును. అచ్చట నధిష్ఠించినవాఁడై దేవతలచేఁ బూజింపఁబడుచు నొక వత్సరము మాత్రము భాస్కరపురమునందుండి మఱల నీలోకంబునకువచ్చి ధర్మాత్ముఁ డగురాజగును. ధర్మార్థకామసంపన్నుండును, యశస్సంపన్నుఁడునై యుండును. జంతువులను మృదుసూక్ష్మంబగుమార్జనిచే నీక్షించి పరిహరించుచు మెల్లఁగ మార్జనముచేసినయెడలఁ జాంద్రాయణఫలమును బొందును. పుత్రునికొఱకును, జీర్ణదేహాయు వంధ్యయు రోగార్తంబులు నగు భూతంబుల యారోగ్యము నిమిత్తము విశేషముగఁ బూజచేయ వలయును. శుభస్థానపతితంబును, స్వచ్ఛంబును, నూతనంబును, జంతువర్జితంబును నగుగోమయమును పైపైన కొంచెము తీసిపారవేసి మిగిలిన దానిని గ్రహించి వస్త్రపూతంబగు నాగోమయముతో మందిరము నలికిన యెడల సుఖము ననుభవించు జంతువులను చూడఁగల్గును. నూరుచాంద్రాయణములు చేసినఫలమును బొందును. ఎవ్వఁడు వస్త్రపూతంబగు నుదకంబుతో సర్వకార్యంబులఁ జేయునో వాఁడు మునియు, మహాసాధు

---

త్పరమం స్థానం భానోరమితతేజసః, గైరికం యానమారుహ్య యః కుర్యాద్ధృతభూషణః. ౩౪. క్రీడమానోఽపి యః కుర్యాద్బాలభావేఽర్కమందిరం, సోఽర్కలోకమవాప్నోతి విమానవరమాస్థితః. ౩౫. పుష్పమాలాకులం దివ్యం ధూపగంధాదివాసితం, అప్సరోగణసంకీర్ణం సర్వకామసుఖప్రదమ్. ౩౬. తత్ర రూఢో మహారాజ వత్సరం వృందముత్తమం, ఉషిత్వా భాస్కరపురే పూజ్యమానస్తు దైవతైః. ౩౭. క్రమాదాగత్య లోకేఽస్మి న్రాజా భవతి ధార్మికః, ధర్మార్థకామసంపన్నో యశసా చ నరాధిప. ౩౮. పశ్యన్పరిహరన్జంతూన్మార్జన్యా మృదుసూక్ష్మయా, శనైః సంమార్జనం కుర్యాచ్చాంద్రాయణఫలం భవేత్. ౩౯. పుత్రార్థం దేహజీర్ణాయా వంధ్యాయాశ్చ విశేషతః, రోగార్తానాం చ భూతానామారోగ్యార్థం ప్రపూజయేత్.౪౦. గృహీత్వా గోమయం స్వచ్ఛం స్థానే చ పతితం శుభే, ఉపర్యుపరి సంత్యజ్య ప్రత్యగ్రం జంతువర్జితమ్. ౪౧. వస్త్రపూతగోమయేన యః కుర్యాదుపలేపనం, పశ్యేత్తు సుఖితాన్ జంతూంశ్చాంద్రాయణశతం లభేత్.

వునై పరలోకమును బొందును. సమస్తదానంబులును, యజ్ఞములును హోమంబులును, బలిక్రియలును నశ్వరంబులు. ఇమ్మహాదానము సర్వ ప్రాణులకును సుఖప్రదంబగుట నక్షరంబయ్యె. నిరంతరము నొకపక్షం బును సమ్మార్జనార్చనములు చేసినయెడల నూరు దివ్యవత్సరంబులు సుర లోకంబునఁ బ్రకాశించుచుండును. నూరువత్సరముల యవసానంబునఁ జతుర్వేదపారగుండును, సురూపుఁడును, ప్రియదర్శనుండును, సర్వ గుణోపేతుండును, ధార్మికుండును నగు రాజుగా జన్మించును. ఎవ్వఁడు సంపర్కమువలననైనను, భగాలయంబునఁ గర్మనుఁ జేయునో వాఁడు నిత్యమును దేవపురమును జేరి క్రీడించుచుండును. శరీరధారులు ఎంతపర్యంతము భక్తిపూర్వకంబుగా రవిని సేవింపరో యంతపర్యంతము సంసారమను దుఃఖశోకప్రవాహములయందు మునుంగుచుఁ దేలుచు భ్రమించుచుందురు. ప్రాణిచిత్తము రూపాదివిషయములయందే యా సక్తమై యున్నప్పు డీప్రాణిని సూర్యుఁడనుదేవుఁడు లేకున్న బంధనము నుండి యెవఁడు విడిపించును? ఎవ్వఁడు దర్పణోదరముతో సమానంబగు రాలచే భూమినంతనుఁ గూర్చునో, మఱియు నానావర్ణవిచిత్రంబుగను, విచిత్రకుసుమోజ్జ్వలంబుగను, కొన్నిస్థలములయందు విన్యస్తకలశంబు గను, పంకజోపశోభితంబుగను, రమ్యంబును, మనోరమంబును, సౌమ్యంబు

---

౪౨. యః కుర్యాత్సర్వకార్యాణి వస్త్రపూతేన వారిణా, స మునిః స మహాసాధుః స గచ్ఛేత్పరమాం గతిమ్. ౪౩. క్షరంతి సర్వదానాని యజ్ఞహోమబలిక్రియాః, అక్షరం తు మహాదానం సుఖదం సర్వదేహినామ్. ౪౪. నైరంతర్యేణ యః కుర్యాత్పక్షం సంమార్జనార్చనం, వర్షమేకం శతం దివ్యం సురలోకే మహీయతే. ౪౫. తస్యాంతే చ చతుర్వేదసురూపః ప్రియదర్శనః, ఆద్యః సర్వగుణోపేతో రాజా భవతి ధార్మికః, ౪౬. సంపర్కేణాపి యః కుర్యాన్నరః కర్మ భగాలయే, సోఽపి సౌమనసం గత్వా పురం క్రీడతి నిత్యశః. ౪౭. తావద్భ్రమంతి సంసారే దుఃఖశోకపరిప్లుతాః, న భజంతి రవిం భక్త్యా యావత్సర్వేఽపి దేహినః. ౪౮. సమాసక్తం తథా చిత్తం జంతోర్విషయగోచరే, యద్యర్కో న భవద్దేవః కో ముంచేదేవ బంధనాత్. ౪౯. యః కుర్యాత్కుట్టిమాం భూమిం దర్పణోదరసన్నిభాం, నానావర్ణవిచిత్రాం చ విచిత్రకుసుమోజ్జ్వలామ్. ౫౦. క్వచిత్కలశవిన్యస్తాం పంకజైరుపశోభితాం, రమ్యాం మనోరమాం సౌమ్యామర్కాయ

నగు నర్కగృహము మధ్యభాగమంతటను రచియించునో వీట్లచే నీభూమి యెంత ప్రదేశమున సుశోభితమై ప్రకాశించునో యన్ని వేలయుగంబు లాతఁడు సురలోకంబునఁ బ్రకాశించుచుండును. చిత్రశాస్త్రజ్ఞులచేఁ జిత్ర కర్మనుఁ జేయించినచో విచిత్రంబగుయానము నధిష్ఠించి భానునిగృహ మును బొందును. ఆదేవునియొక్క దేవరూపంబుల నెన్నింటిని వ్రాయునో గ్రహరూపంబుల నెన్నింటిని వ్రాయునో యన్ని వేలయుగంబులు స్వర్గ లోకమునఁ బ్రకాశించుచుండును. ఎవ్వఁడీరీతిగ నర్కమందిరమును నిర్మించునో వాఁడు విశాలంబగుభూమిని నారామగృహాదిరూపంబగు నమూల్యఫలములను బొందును.

ఇది ద్విషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

## త్రిషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. మహారాజా! భాస్కరుని స్నానకాలమున జయశబ్దాదిరూపంబగు మంగళవాద్యములనుఁ జేయవలయును. వివిధ వర్ణములచేఁ జిత్రితములైన యక్షతలతోడను, స్వచ్ఛములై దధిమిశ్రిత ములగు తిలతండులములతోడను, రమ్యముగఁ బూరింపఁబడిన సువర్ణాది పాత్రంబులందు గోమయాదులచేఁ బద్మస్వస్తికశంఖశ్రీవత్సాదిముద్రలు

తనసంపది. ౫౧. యావద్దండా భవేద్భూమిః సమంతాచ్చ సుశోభనా, తావద్యుగసహస్రాణి సూరలోకే మహీయతే. ౫౨. కారయేచ్చిత్రశాస్త్రజ్ఞైశ్చిత్రకర్మార్కమందిరే, విచిత్రం యానమారుహ్య చిత్రభానోర్గృహం వ్రజేత్. ౫౩. యావత్స దేవరూపాణి గ్రహరూపాణి లేఖయేత్, తావద్యుగసహస్రాణి స్వర్గలోకే మహీయతే. ౫౪. భవేద్భూమిః సమంతాచ్చ యః కుర్యాదర్కమందిరం, ఆరామావసథాదీనాం లభేదామూల్యకం ఫలమ్. ౫౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మవర్ణనం నామ ద్విషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

సుమంతురువాచ:— భాస్కరస్య మహాబాహో భానోరమితతేజసః, స్నానకాలే ప్రకుర్వీత జయశబ్దాదిమంగలమ్. ౧. పద్మస్వస్తికశంఖం తు శ్రీవత్సం ద్విజసత్తమ,

గల్పించి సమృద్ధములగు నశ్వత్థాదిపత్రములచేతను, పవిత్రములగు నోషధులచేతను యవము మొదలగు నిఖిలబీజములచేతను, పూజా ద్రవ్యములను వానిపీఠములను ప్రదీపములను నేర్పరించు టుచితము. సప్తమినాఁ డుపక్రమించికాని షష్ఠినాఁ డుపక్రమించికాని యెల్లదినంబుల విశేషించి శంఖభేర్యాదులతో మంగళవాద్యములు చేయవలయును. త్రికాలములందును శంఖవాదిత్రమంగళఘోషంబులతోడను, వేదనిర్ఘోషములతోడను, నీరాజనమును సమర్పింపవలయును. ఎన్నిపర్వములయందు నీరాజనమును సమర్పించునో యన్నివేలయుగంబులు సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. కపిలగోసంబంధంబులగు పంచగవ్యంబులచేతను, మంత్రపూతంబగు కుశోదకముచేతను స్నానముచేయించిన నది బ్రహ్మస్నానమని చెప్పఁబడును. ఆబ్రహ్మస్నానమును సంవత్సరమునకొకపర్యాయమైనను చేయించినయెడల సర్వపాపవినిర్ముక్తుఁడై సూర్యలోకమున విరాజిల్లుచుండును. కపిలగోసంబంధమగు పంచగవ్యముచేతఁగాని తదితరపంచగవ్యముచేతఁగాని స్నానముఁజేయించిన దశగుణాధికంబగు ఫలము లభించునని తెలియవలయును. బ్రాహ్మణుఁడు వీర్యమును శాశ్వతమగు దేహశుద్ధినిఁ గోరినచో ముని దేవాగ్నినిర్మితంబగు కపిలగోవును సంపాదింపవలయును. దేవకార్యార్థమై నిర్మింపఁబడిన యీ

---

హేమరూపాదిపాత్రేషు కల్పితం గోమయాదిభిః. ౨. నానావర్ణకసంయుక్తైరక్షతైస్తిలతండులైః, స్వచ్ఛైశ్చ దధిసంమిశ్రైర్యథాశోభం ప్రపూరితైః. ౩. ద్రవ్యపీఠప్రదీపాశ్చ భూతాశ్వత్థాదిపల్లవైః, ఔషధీభిశ్చ మేధ్యాభిః సర్వబీజైర్యవాదిభిః. ౪. సప్తమ్యాదిషు సర్వేషు షష్ఠ్యాదిషు విశేషతః, శంఖభేర్యాదిభిః కుర్యాద్వాద్యఘోషం సుశోభనమ్. ౫. త్రిసంధ్యం వేదనిర్ఘోషం కుర్వీత ఫలముత్తమం, కుర్యాన్నీరాజనం చైవ శంఖవాదిత్రమంగళైః. ౬. యావన్నీరాజనం కుర్యాత్పర్వాణి విధివద్రవౌ, తావద్యుగసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౭. కపిలాపంచగవ్యేన కుశవారియుతేన వై, స్నాపయేన్మంత్రపూతేన బ్రహ్మస్నానం హి తత్ స్మృతమ్. ౮. యస్త్వేకమపి సర్వేద్దే బ్రహ్మస్నానం ప్రయచ్ఛతి, స ముక్తః సర్వపాపైస్తు సూర్యలోకే మహీయతే. ౯. కపిలాపంచగవ్యేన దధిక్షీరయుతేన చ, స్నానం దశగుణం జ్ఞేయం మహత్పుణ్యం నరాధిప. ౧౦. బుభవో వీరముద్దిశ్య దేహశుద్ధిం చ శాశ్వతీం, కపిలామాహరేన్నిత్యం మునిదేవాగ్నినిర్మితామ్. ౧౧. కాపిలం యః పిబేచ్ఛూద్రో దేవ

కాపిలపంచగవ్యమునే శూద్రుఁడైనను పానముచేసినయెడల ఘోరమగు నరకార్ణవంబునఁ బక్వముచేయఁబడును. సూర్యునకు ఘృతాభ్యంజనము చేసినయెడల వేయికోట్లయేండ్లనుండి యార్జించినపాపములనుగూడ నిస్సంశయముగ నశింపఁజేయును. వజ్రస్నానముచే వేయికోట్లకల్పముల పాపములైనను వహ్ని యింధనములవలె భస్మముచేయును. సప్తమినాడు కృతస్నానుఁడై యొక్కపర్యాయము సూర్యుని బూజించినయెడల నేడు పురుషాంతరముల నుద్ధరించి సూర్యలోకమునం బూజలందు. ఆపూజ ధనసువర్ణాదులఁ గూడియుండెనేని క్షీరస్నానసమంబగును. కుంచెడు పాలతో స్నానమిచ్చి వెండివిమానమునెక్కి సూర్యపురమునఁ బూజలందును. ఒక్కమారు సూర్యుని-దధిచే స్నానముఁ జేయించినవాఁడు మూఁడులోకములయందును బ్రకాశించుచుండును. మధువుచే స్నానము చేయించినయెడల శుక్రలోకంబునఁ బ్రకాశించుచుండును. శాలిపిష్టముచే వాయులోకమునఁ బూజితుఁడగును. ఇక్షురసముచే స్నానము చేయించిన సర్వకామసమృద్ధుఁడై గోపతిపురంబునఁ జేరఁగలఁడు. ఫలరసములచే నొక్కమారు స్నానముచేయించినను పాపకలితంబగు నీలోకమును త్యజించి పితృలోకమున భాసిల్లుచుండును. చందనోదకములతో స్నానముచేయించినఁ జంద్రాంశునిర్మలుఁడై చంద్రమండిరమున నివసిం

---

కార్యార్థనిర్మితమ్, స పచ్యతే మహాఘోరే సుచిరం నరకార్ణవే. ౧౨. వర్షకోటిసహస్రేణ యత్పాపం సముపార్జితమ్, ఘృతాభ్యంగేన సూర్యస్య దహేత్సర్వం న సంశయః. ౧౩. కల్పకోటిసహస్రైస్తు యత్పాపం సముపార్జితమ్, వజ్రస్నానేన తత్సర్వం దహత్యగ్నిరివేంధనమ్. ౧౪. సప్తమ్యాం చ కృతస్నానో యజేత్సూర్యం సకృన్నరః, కులాన్యుద్ధృత్య సప్తేహ సూర్యలోకే మహీయతే, వసుహేమాదియుక్తం చ క్షీరస్నానస్య తత్సమమ్. ౧౫. సకృదాఢకేన పయసా యో భానుం స్నాపయేన్నరః, రాజతేన విమానేన సోఽర్కలోకే మహీయతే. ౧౬. స్నాప్య దధ్నా సకృద్భానుం స త్రిలోకే మహీయతే, మధునా స్నపయిత్వా తం శుక్రలోకే మహీయతే. ౧౭. ఉద్ధృత్య శాలిపిష్టేన వాయులోకేషు పూజ్యతే, స్నానమిక్షురసేనేహ యః సూర్యే సకృదాచరేత్, స గోపతిపురం గచ్ఛేత్సర్వకామసమన్వితః. ౧౮. ఫలోదకేన యో భానుం సకృత్సాన్నపయతే నరః, ఉత్సృజ్య పాపకలిలం పితృలోకే మహీయతే. ౧౯. శ్రీఖండవారిణా స్నాప్య సకృద్భానుం నరాధిప, చంద్రాంశునిర్మలః శ్రీమాంశ్చరేదాత్రేయ

చును. వడపోసిననీటితో స్నానముచేయించిన సర్వకామములను తృప్తిగఁ బొంది రాకాధిపపురంబునఁ బ్రకాశించుచుండును. రాజా! "ఆపోహిష్ఠా" యనుమంత్రముచే గంగోదకంబుచే నభిషేకము జేసినయెడల గైరికంబగు విమానసాధనముచే బ్రహ్మలోకంబునకుంబోయి సుఖించును. కర్పూరాగరూదకంబులతో మంత్రపూర్వకంబుగ సప్తమినాఁ డభిషేకించి యాదివసముపవసించినయెడల నిరువదియొక్క పురుషాంతరముల నుద్ధరించి సూర్యుని బొందును. ఎవ్వఁడైనను పితరుల నుద్దేశించి శీతోదకంబుచే నాదిత్యు నభిషేకించినయెడల వానిపితరులు నరకమునుండి తృప్తులై స్వర్గమును బొందఁగలరు. భానుని శీతోదకంబులచేతను గుమ్మపాలచేతను, వ్రతస్నానముచేతను, స్నానముచేయించిన నగ్నిలోకంబున వెలుంగుచుండును. రాజా! త్రివిధములగు నీయభిషేకములను జేసినమనుష్యుఁడు సహస్రాశ్వమేధఫలమును బొందును మృత్కుంభములచేతను, తామ్రకుంభములచేతను స్నానముచేయించినయెడల శతగుణంబగును రజతమయంబగు ఘటముతోఁజేసిన నింకొకపాద మధికమగును. దర్శనముకంటె స్పర్శనమువలనను స్పర్శనముకంటె యర్చనమువలనను ఫల మధికముగఁ గల్గును. వీట్లకంటె ఘృతస్నానము మిక్కిలి శ్రేష్ఠము. ఇహపరంబులలోఁ జేసిన పాపములన్నియు ఘృతస్నానముచే నశించును ఏడుజన్మములనుండి

---

మందిరే. ౨౦. వస్త్రపూతేన తోయేన యద్యర్కం స్నాపయేత్సకృత్, స సర్వకామతృప్తాత్మా రాకాధిపపురం వ్రజేత్. ౨౧. ఆపో హిష్ఠేతి జప్యేన గంగాతోయేన భారత, గైరికేణ విమానేన బ్రహ్మలోకే మహీయతే. ౨౨. కర్పూరాగురుతోయేన యోఽర్కం స్నాపయతే సకృత్, స్నాప్య భానుం సకృన్మంత్రైః సప్తమ్యాం సముపోషితః, స కులానేకవింశతిముత్తార్య రవిమావ్రజేత్. ౨౩. పితౄనుద్దిశ్య యో భానుం స్నాపయేచ్ఛీతవారిణా, తృప్తాః స్వర్గం ప్రజంత్యాశు పితరో నరకాదపి. ౨౪. భానుం శీతాంబునా స్నాప్య ధారోష్ణపయసా సహ, స్నాప్య పశ్చాద్వ్రతేనేశమగ్నిలోకే మహీయతే. ౨౫. ఏతత్స్నానత్రయం కృత్వా పూజయిత్వా తు భారత, అశ్వమేధసహస్రస్య ఫలం ప్రాప్నోతి మానవః. ౨౬. మృత్కుమ్భాత్తామ్రకుమ్భైస్తు స్నానం శతగుణం మతమ్, రౌప్యైః పాదోత్తరం పుణ్యం దర్శనాత్స్పర్శనం పరమ్, స్పర్శనాదర్చనం శ్రేష్ఠం ఘృతస్నానమతః పరమ్. ౨౭. ఇహాముత్ర కృతం పాపం ఘృతస్నానేన నశ్యతి,

చేసినపాపము పురాణశ్రవణముచే నశించును. పదియపరాధములను తోయాభిషేకముచేతను, నూరపరాధములను క్షీరాభిషేకముచేతను, వేయియపరాధములను దధ్యభిషేకముచేతను, పదివేలయపరాధములను ఘృతాభిషేకముచేతను భానుఁడు క్షమించును ఎవ్వఁ డొక్కమాసము నిరంతరము ఘృతాభిషేకముఁ జేయునో వాఁడిరువదియొక్కపురుషాంతరములను సూర్యమందిరంబునకుఁ గొంపోఁగలఁడు. ఇరువదియైదుపలముల నేతితోఁ జేసినస్నానము ఘృతాభ్యంజన మనఁబడును. నూరుపలముల నేతితోఁ జేసినది స్నాన మనఁబడును. రెండువేలపలముల నేతితోఁజేసినది మహాస్నాన మనఁబడును. ఘృతాభ్యంజనము, ఘృతస్నానమును నిత్యమును సూర్యునకుఁ జేయవలయును. గోధూమచూర్ణముచేతను దర్భయుక్తమగు కషాయములచేతను సూర్యునకు నలుగిడినయెడలఁ బదివేల గోదానములఫలమును బొందును. పుష్పఫలోపేతంబగు నర్ఘ్యమును సూర్యున కొసంగిన సర్వలోకపూజితుండై సూర్యునివలెనే దివంబున సంతోషించుచుండును. గంధముతోఁ గూడినదియును పదిరెండురెట్లు పంచగవ్యముతోఁగూడినదియు నగునర్ఘ్యమును శీతగుణము అష్టాంగములను గలిపి భానుని కర్ఘ్యము నిచ్చినఁ బదివేలసంవత్సరములు సూర్యమందిరమున రమించును. అష్టాంగములనగా ఉదకము, క్షీరము, కుశాగ్ర

---

సప్తజన్మకృతం పాపం పురాణశ్రవణేన తు. ౨౮. దశాపరాధాంస్తోయేన క్షీరేణ తు శతం క్షమేత్, సహస్రం క్షమతే దధ్నా ఘృతేనాప్యయుతం క్షమేత్. ౨౯. నైరన్తర్యేణ యో మాసం ఘృతస్నానం సమాచరేత్, దశైకాదశ కులానీహ నయేత్సూర్యస్య మందిరమ్. ౩౦. స్నానం పలశతం జ్ఞేయమభ్యంగః పఞ్చవింశతిః, పలానాం ద్విసహస్రేణ మహాస్నానమితి శ్రుతిః. ౩౧. ఘృతాభ్యంగం ఘృతస్నానం భానోః కుర్యాద్ద్విజోత్తమ, యశ్చ గోధూమచూర్ణైస్తు కషాయైర్దర్భసంమిశ్రైః. ౩౨. దశధేనుసహస్రాణి యద్దత్వా లభతే ఫలమ్, తత్ఫలం లభతే సర్వమర్కస్యోద్వర్తనే కృతే. ౩౩. అర్ఘ్యం పుష్పఫలోపేతం యస్త్వర్కాయ నివేదయేత్, స పూజ్యః సర్వలోకేషు అర్కవన్మోదతే దివి. ౩౪. గంధతోయేన సంమిశ్రముదకాద్ద్వాదశోత్తరమ్, పఞ్చగవ్యసమాయుక్తమర్ఘ్యం శతగుణం నృప. ౩౫. యోష్టాంగగర్భమాపూర్య భానోర్మూర్ధ్ని నివేదయేత్, దశవర్షసహస్రాణి రమతే చార్కమందిరే. ౩౬. ఆపః క్షీరం కుశాగ్రాణి ఘృతం దధి తథా

ములు, ఘృతము, దధి, మధువు, రక్తకరవీరములు, చందనము, నీయెనిమి దియుఁ జెప్పఁబడును. వీనితోఁగూడినయర్ఘ్యము అష్టాంగార్ఘ్యమని బ్రహ్మ దేవుఁడు చెప్పెను. ఈయర్ఘ్య మెల్లప్పుడును భాస్కరునకుఁ బ్రీతిజనకము. వైణవపాత్రచే నర్ఘ్యమొసంగిన దాత కెట్టిఫలము లభించునో, దానికి నూరురెట్లఫలము మృత్పాత్రముతో నర్ఘ్యము నిచ్చినఁ గల్గును. తామ్రార్ఘ్యపాత్రను దానముచేసినను శతగుణంబగు ఫలము లభించును. పలాశపత్రంబులచేతను, పద్మపత్రంబులచేతను, తామ్రపాత్రతో నర్ఘ్యమిచ్చిన ఫలము లభించును రౌప్యపాత్రతో నిచ్చిన లక్షగుణితంబగు ఫలము లభించును. సువర్ణపాత్రముతో నర్ఘ్యము నిచ్చినఁ గోటిగుణితం బగుఫలము గల్గును. ఇట్లు క్రమంబుగ స్నాన-అర్ఘ్య-నైవేద్య-బలి-ధూపాదులయందు పాత్రవిశేషముచే ఫలవిశేషము చెప్పఁబడినది. వేదపారగునకు రౌప్యపాత్రప్రదానముచే నేపుణ్యముగల్గునో సూర్యుని యందు తామ్రపాత్రప్రదానముచేత నంతకంటె శతగుణంబగుఫలము లభించును. వేదపారగునందు కోటిగుణితంబగుఫలము నిచ్చుసువర్ణ పాత్రము నిచ్చినదానికంటె నధికముగ సూర్యునియందు రౌప్యపాత్ర ప్రదానముచేఁ గల్గును. ఈభానునికే యాసువర్ణపాత్రము నొసంగిన పాత్రవిశేషమహిమవలన నాపుణ్యము చెప్పశక్యముగాదు. ఐనను దరి

---

మధు, రక్తాని కరవీరాణి తథా రక్తం చ చన్దనమ్. ౩౭. అష్టాంగ ఏష అర్ఘో వై బ్రహ్మణా పరికీర్తితః, సతతం ప్రీతిజననో భాస్కరస్య నరాధిప. ౩౮. దాతుర్వైణవపాత్రేణ దత్తేఽర్ఘ్యే యత్ఫలం భవేత్, తస్మాచ్ఛతగుణం పుణ్యం మృత్పాత్రేణ నరాధిప. ౩౯. తామ్రార్ఘ్యపాత్రదానేన పుణ్యం శతగుణం మతమ్, పాలాశపద్మపత్రాభ్యాం తామ్రపాత్రే ఫలం లభేత్. ౪౦. రౌప్యపాత్రేణ విజ్ఞేయం లక్షార్ఘ్యం నాత్ర సంశయః, సువర్ణపాత్రవిన్యస్తమర్ఘ్యం కోటిగుణం భవేత్. ౪౧. ఏవం స్నానార్ఘ్య నైవేద్యబలిధూపాదిషు క్రమాత్, పాత్రాంతరవిశేషేణ తత్ఫలం తూత్తరోత్తరమ్. ౪౨. రౌప్యపాత్రప్రదానేన యత్పుణ్యం వేదపారగే, తామ్రపాత్రప్రదానేన తస్మాచ్ఛతగుణం రవౌ. ౪౩. ఫలం కోటిసువర్ణస్య యో దద్యాద్వేదపారగే, సూర్యాయ రూప్యపాత్రే తు భవేత్పుణ్యం తతోఽధికమ్. ౪౪. సువర్ణపాత్రం యో దద్యాద్భాస్కరాయ మహీపతే, న శక్యం తస్య తద్వక్తుం పుణ్యం పాత్రవిశేషతః. ౪౫. తుల్యమేవ

ద్రులకును ధనికులకును ఫలము సమానమే యగును. ఎవఁడు సూర్యు నధికముగ భావనచేయుచుండునో వానికిమాత్రము ఫల మధికముగ లభించును. దరిద్రత్వధనికత్వములు ఫలముయొక్క యాధిక్యాల్పత్వము లలో హేతువులు గానేరవు. ధనికుఁడై మోహావిష్టతచే విధివిస్తర మును నెఱవేర్పనియెడల లోభాక్రాంతుఁడుగాన ఫలమును బొందఁ జాలఁడు. కాన మంత్రములచేతను, ఫలములచేతను, ఉదకములచేతను, చందనాదులచేతను ప్రయత్నపూర్వకంబుగ నాదిత్యపూజఁ జేయవల యును. అట్లుచేసినయెడల ననంతమగుఫలము లభించును. ఇందులకు భక్తియే కారణము. భక్తితోఁజేసిన నూరుకోట్లదివ్యవత్సరంబులు సూర్య లోకంబున విరాజిల్లుచుండును. గంధద్రవ్యమును బూసినయెడల పుణ్యము గల్గును. చందనానులేపనమునుఁజేసిన ద్విగుణంబగుఫలము లభించును. గంధముకంటెఁ బుష్పము లెనిమిదిరెట్లు ఫలము నిచ్చును. కృష్ణాగరుచే ద్విగుణితఫలము గల్గును. కుంకుమమునకు శతగుణంబగు ఫలము చెప్పంబడెను. చందనాగరుకర్పూరంబులచేతను, శ్లక్ష్ణపిష్టము చేతను, కుంకుమచేతను, భాస్కరునకు సంపూర్ణముగ ననులేపనముం జేసినఁ గోటికల్పంబులు దివంబున నుండును. మఱియు దేవబృందముచే గంధవిలుప్తుఁడై ప్రకాశించుచుఁ బదివేలవత్సరములు సూర్యనగరంబున నుండును. రాజా! భక్తితో దేవదేవుఁడగు భాస్కరునకుఁ దాళవృంత మొసంగినఁ బదివేలవత్సరంబులు వీరలోకమున విరాజిల్లును. సూర్యున

---

ఫలం ప్రోక్తం సర్వమాఢ్యదరిద్రయోః, తయోరభ్యధికం తస్య యస్త్వర్కే భావనాధికః. ౮౬. విభవే సతి యో మోహాన్న కుర్యాద్విధివిస్తరమ్, నైవ తత్ఫలమాప్నోతి ప్రలోభాక్రాంతమానసః. ౮౭. తస్మాన్మంత్రైః ఫలైస్తోయైశ్చన్దనాద్యైశ్చ యత్నతః, తదనంత ఫలం జ్ఞేయం భక్తిరేవాత్ర కారణమ్. ౮౮. వర్షకోటిశతం దివ్యం సూర్యలోకే మహీయతే, గంధానులేపనం పుణ్యం ద్విగుణం చన్దనస్య తు. ౮౯. గంధాచ్చతుర్గుణం జ్ఞేయం పుష్పమష్టగుణం నృప, కృష్ణాగురు విశేషేణ ద్విగుణం ఫలమాదిశేత్, తస్మాచ్ఛత గుణం పుణ్యం కుంకుమస్య విధీయతే. ౯౦. చందనాగురుకర్పూరైః శ్లక్ష్ణపిష్టైః సకుంకుమైః,భానుం పర్యాప్తమాలిప్య కల్పకోటిం వసేద్దివి.౯౧. స దీవ్యేత్సురవృన్దేన పుణ్యగంధైః ప్రలేపితః,దశవర్ష సహస్రాణి వీర మిత్రపురే వసేత్.౯౨.భక్త్యా నివేద్య అర్కాయ తాలవృంతం నరాధిప, దశవర్షసహస్రాణి వీరలోకే మహీయతే. ౯౩. మాయూరం

కత్యంతప్రియదాయకంబగు మాయూరవృంత మొసంగిన నూఱుకోట్ల వత్సరంబులు వాయులోకంబున నివసించియుండును. అరణ్యసంభూతము లగు పుష్పములచేతను, గిరిజములగు పత్రములచేతను, నారామకుసుమంబులచేతను సూర్యునిఁ బూజింపవలయును. ఈవస్తువులు పూర్వదినమున సంపాదితములైనను సచ్ఛిద్రంబులైననుఁ బూజార్హంబులు కానేరవు. అచ్ఛిద్రములును నూతనంబులునై యుండవలెను. జంతువు లెవ్వియు నుండరాదు. పుష్పజాతివిశేషంబున ఫలవిశేషము కలదు. తపశ్శీలగుణోపేతుండును నితిహాసవేత్తయు నగుబ్రాహ్మణునకుఁ బదినిష్కములొసఁగిన నేఫలముం బొందునో కరవీరపుష్పము సూర్యున కొసంగిన నాఫలమందును. ఈరీతిగనే పుష్పవిశేషములచేఁ దదధికంబుగ ఫలము లభించును. రసజ్ఞులచేఁ బుణ్య మెట్లు జ్ఞేయమగునో యది నావలన నెఱుంగుమని రాజునకు సుమంతుఁ డిట్లనియె. పుష్పసాహస్రముకన్నఁ గరవీర మధికము. సహస్రబిల్వపత్రములకన్న నొక్కపద్మపత్ర మధికము. వేయి పద్మములకన్న నొకబకపుష్ప మధికము. వేయిబకపుష్పములకన్న నొక ముద్గర మధికము వేయికుశపుష్పంబులకన్న నొకశమీపత్ర మధికమనియు, వేయిశమీపుష్పములకన్న నొకనీలోత్పల మధికమనియుఁ జెప్పఁబడెను.ఇట్లు చెప్పుటచే నన్నికుసుమంబులలో·నీలోత్పల మధికముఁగఁ

---

వ్యజనం దత్వా సూర్యాయాతీవ శోభనమ్, వర్ష కోటిశతం పూర్ణం ప్రభంజనపురే వసేత్. ౫౮. పుష్పైరరణ్యసంభూతైః పత్త్రైర్వా గిరిసమ్భవైః, అపర్యుషితనిశ్ఛిద్రైః ప్రోక్షితైర్జంతువర్జితైః. ౫౯. ఆత్మారామభవైశ్చైవ పుష్పైః సంపూజయేద్రవిమ్, పుష్పజాతివిశేషేణ భవేత్పుణ్యం తతోఽధికమ్. ౬౦. తపఃశీలగుణోపేత ఇతిహాసవిది ద్విజే, దత్వా దశ సువర్ణస్య నిష్కాన్యల్లభతే ఫలమ్. ౬౧. కరవీరస్య కుసుమమర్కాయ వినివేదయేత్, లభతే తత్ఫలం వీర యథాహ భగవాన్రవిః, ఏవం పుష్పవిశేషేణ ఫలం తదధికం భవేత్, జ్ఞేయం పుణ్యం రసజ్ఞేన యథా స్యాత్తన్నిబోధ మే. ౬౨. సదా పుష్పసహస్రేభ్యః కరవీరం విశిష్యతే, బిల్వపత్రసహస్రేభ్యః పద్మమేకం నరాధిప. ౬౩. పద్మపుష్పసహస్రేభ్యో బకపుష్పం విశిష్యతే, బకపుష్పసహస్రేభ్యో ముద్గరం పరముచ్యతే. ౬౪. కుశీపుష్పసహస్రేభ్యః శమీపత్రం విశిష్యతే, శమీపుష్పసహస్రేభ్యో నృప నీలోత్పలం పరమ్, సర్వాసాం పుష్పజాతీనాం ప్రవరం నీలముత్పలమ్. ౬౫. రక్తో

జెప్పఁబడియె కాన సహస్రరక్తోత్పలంబులచేతను, నూఱునీలోత్పలంబుల చేతను, రక్తకరవీరములచేతను రవిం బూజింపఁ బడునొకండునూఱుకోట్ల కల్పంబులు శ్రీమంతుఁడు సూర్యతుల్యపరాక్రముండునై యర్కపురం బున వసించును శిష్టంబులగు పుష్పంబుల కేఫలము చెప్పఁబడెనో యా ఫలమున కనురూపంబుగ సూర్యలోకమున వసించును. శమీపుష్పము బృహస్పతీపుష్పము నీరెండును సమానములు. జాతీకుసుమములు, విజయ కుసుమములును, పాటలంబులు నీమూఁడును కరవీరమునకు సమములు. శ్వేతమందారము సితపుష్పమును కరవీరసమంబులే. నాగము, చంపకము, పున్నాగము, ముద్గరంబులు నివియన్నియు సమముగఁ జెప్పఁబడియెను. అపవిత్రకుసుమములు గంధవంతములైనను వర్జనీయములు. పవిత్రకుసు మములైనఁ గుశాదికమైనను గంధహీనములై యున్న నవి గ్రాహ్యం బులు. పవిత్రంబగుకుసుమము సాత్త్వికమనియు, నపవిత్రకుసుమము తామసమనియుఁ జెప్పఁబడెను. ముద్గరంబులును కదంబములును సూర్యు నకు రాత్రులయం దర్పింపవలయును. వాడియు నలిగియున్న కుసుమ ములను మొగ్గలను సూర్యున కర్పింపఁగూడదు. అపక్వపదార్థము నివే దింపఁగూడదు. క్షతమగుఫలమును డాగుకలఫలమును కాచవేసి పండిం చినపండ్లను నివేదింపఁగూడదు. పుష్పములు లభింపనిచోఁ బత్రముల నివేదింపవచ్చును. అవియు లేకున్న ఫలములను నవియు లభింపకున్న

---

త్పలసహస్రేణ నీలోత్పలశతేన చ, రక్తైశ్చ కరవీరైశ్చ యస్తు పూజయతే రవిమ్. ౬౨. కల్పకోటిసహస్రాణి కల్పకోటిశతాని చ, వసేదర్కపురే శ్రీమాన్సూర్యతుల్యపరాక్రమః. ౬౩. శేషాణాం పుష్పజాతీనాం యత్ఫలం పరికీర్తితం, తత్ఫలస్యానుసారేణ సూర్యలోకే మహీయతే. ౬౪. శమీపుష్పం బృహత్యాశ్చ కుసుమం తుల్యముచ్యతే, కరవీరసమా జ్ఞేయా జాతీవిజయపాటలాః. ౬౫. శ్వేతమందారకుసుమం సితపుష్పం చ తత్సమం, నాగచంపకపున్నాగముద్గరాణాం సమాః స్మృతాః. ౬౬. గంధవంత్యపవిత్రాణి కుసు మాని వివర్జయేత్, గంధహీనమపి గ్రాహ్యం పవిత్రం యత్కుశాదికమ్. ౬౭. సాత్త్వికం తద్ధి కుసుమ మపవిత్రం చ తామసమ్, ముద్గరాణి కదంబాని రాత్రౌ దేయాని సూరయే. ౬౮. దివా శేషాణి పుష్పాణి త్యజేదుపహతాని చ, ముకులైర్నార్చయేద్భాను మపక్వం న నివేదయేత్. ౬౯. ఫలం క్వథితవిద్ధం చ యత్నాత్పక్వమపి త్యజేత్, అలాభే బత పుష్పాణాం పత్రాణ్యపి నివేదయేత్. ౭౦. పత్రాణామప్యలాభే తు ఫలా

తృణములను గుల్మౌషధులనైన నివేదింపవచ్చును. అవియును లభింపని యెడల భక్తితోఁ బూజింపవలయును. ప్రత్యేకముగ ముక్తపుష్పముతోఁ బూజించినఁ బదిసువర్ణనిష్కము లొసఁగిన ఫలముం బొందును. మాఘమాసమునఁ గృష్ణపక్షమునందు గంధయుక్తంబులగు పుష్పంబులచే భానుని బాగుగ నారాధించిన ననంతఫలముం బొందుచున్నాఁడు మహారాజా! కరవీరకుసుమంబుల భాను నారాధింప సర్వపాపవిముక్తుఁడై సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును. అగస్త్యకుసుమంబులచే నెవ్వఁడు భానుం బూజించునో వాఁడు యేఁబదివేలగోవుల దానముఁజేసిన ఫలముం బొంది దివముం జేరును. మల్లెలు, గలువలు, జాజులు, సంపెంగలు మొదలగు పుష్పవిశేషంబులచేతఁ బద్మరాజిచేఁ బున్నాగంబులచే, నశోకములు, శ్వేతమందారములుఁ, గొండగోఁగులు, నంధుకములు, కరవీరములు, నర్కకల్హారములు, కేసరములు, శమీతగరములు, నగస్త్యంబులు, బకములు, శతపత్రంబులు వీట్లచే యథాలాభంబుగఁ బూజించి కోటిసూర్యసమానంబును సర్వకామప్రదంబును పుష్పమాలాలంకృతమును గీతవాద్యనాదయుక్తంబును తంత్రీమధురవాద్యంయుక్తంబును స్వేచ్ఛాగామియు సూర్యకాంతి సమాకీర్ణంబును దేవదుర్లభంబు నగువిమానం బధిష్ఠించి చామరంబులచే వీజ్యమానుఁడై దేవోత్తములచే స్తూయమానుఁడై

---

న్యపి నివేదయేత్, ఫలానామప్యలాభేన తృణగుల్మౌషధీరపి. ౨౧. ఔషధీనామభావే తు భక్త్యా భవతి పూజితః, ప్రత్యేకం ముక్తపుష్పేణ దశసౌవర్ణికం ఫలమ్. ౨౨. యః సుగన్ధైర్ముక్తపుష్పైః సమ్యగ్భానుం ప్రపూజయేత్, మాఘాసితేఽపి సుమనాః సోఽనన్తఫలమశ్నుతే. ౨౩. కరవీరైర్మహారాజ సంయతో భానుమర్చయేత్, సర్వపాపవినిర్ముక్తః సూర్యలోకే మహీయతే. ౨౪. అగస్త్యకుసుమైర్భక్త్యా యః సకృద్భానుమర్చయేత్, గవాం ప్రయుతదానస్య ఫలం ప్రాప్య దివం వ్రజేత్. ౨౫. మల్లికోత్పలపద్మైశ్చ జాతీపున్నాగచంపకైః, అశోకశ్వేతమందారకర్ణికారాంధుకైస్తథా. ౨౬. కరవీరార్కకహ్లార శమీతగరకేశరైః, అగస్తిబకపుష్పైస్తు శతపత్రైర్నరాధిప. ౨౭. పుష్పైరేతైర్యథాలాభం యో నరః పూజయేద్రవిమ్, స తత్ఫలమవాప్నోతి తదేకాగ్రమనాః శృణు. ౨౮. సూర్యకోటిప్రతీకాశైర్విమానైః సర్వకామిభిః. పుష్పమాలాపరిక్షిప్తైర్గీతవాదిత్రనాదితైః. ౨౯. తంత్రీమధురవాద్యైశ్చ స్వచ్ఛందగమనైర్నృప, సూర్యకన్యాసమాకీర్ణైర్దేవానాం చ సుదుర్లభైః. ౩౦. దోధూయమానశ్చమరైః స్తూయమానః సురాసురైః,

యాదిత్యపురమునకుఁబోయి యచ్చటఁ బూజితుఁడగును స్థలజన్యకుసుమంబులఁగాని జలజన్యములచేఁగాని శ్రద్ధాయుక్తుఁడై సూర్యు నారాధించిన సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును ఎవ్వఁడు సూర్యునిపై పుష్పసముదాయ ముంచునో యాపీఠాంతముఁ బుష్పమాలలచే నుపశోభితముం జేయునో యాతఁడు మిగుల నాశ్చర్యకరమగు యాన మధిష్ఠించి దివ్యపుష్పాలంకృతుఁడై సర్వలోకోత్తమంబగు సూర్యలోకమునకుం బోయి యచ్చట సుఖించును పలువిధంబులగు గీతవిశేషముల రాగవిన్యాసంబుల సూర్యగృహంబు నెవ్వఁ డుజ్జ్వలంబుగఁ జేయునో యాతఁడు పుష్పమాలాకీర్ణమగు పుష్పకవిమాన మధిష్ఠించి దివ్యంబగు పుష్పేతరపురము నాశ్రయించును సందియములేదు అక్షయంబగు కాల మతిరస్కృతశాసనుఁడై మోదముం బొందును సౌరాదిసర్వలోకంబుల నెద్ది యభిమతమో యచ్చటి కేగును

ఇది త్రిషష్ట్యుత్తరశతతమాధ్యాయము

## చతుష్షష్ట్యుత్తరశతతమాధ్యాయము

శతానీకుం డిట్లనియె బ్రాహ్మణోత్తమా! మహారాజస్కుండును దేవదేవుండు నగుభాస్కరునిఁ బూజించిన నేఫలము నీచేఁ జెప్పఁబడెనో

---

గచ్ఛేదర్కపురీం దివ్యాం తత్ర సంపూజితో భవేత్ ౧౧ యైస్తైశ్చ వాపి కుసుమైర్జలజైః స్థలజైర్నృప, సంపూజ్య శ్రద్ధయా భానుమర్కలోకే మహీయతే ౧౨ సూర్యస్యోపరి యః కుర్యాచ్ఛోభనం పుష్పమండలమ్, శోభితం పుష్పస్రగ్దామైరాపీఠాంతం ప్రలంబితైః ౧౩ అత్యాశ్చర్యమహాయానైర్దివ్యపుష్పోపశోభితః, సర్వేషాముపరిష్టాచ్చ వసేదర్కపురే సుఖీ ౧౪ అనేకరాగవిన్యస్తైః సుగన్ధైః కుసుమైర్గృహమ్, యః కుర్యాత్పర్వకాలే తు విచిత్రకుసుమోజ్జ్వలమ్ ౧౫ స పుష్పకవిమానేన పుష్పమాలాకులేన తు, పుష్పేతరపురం దివ్యం శ్రయతే నాత్ర సంశయః ౧౬ అక్షయం మోదతే కాల మతిరస్కృతశాసనః, సౌరాదిసర్వలోకేషు యత్రేష్టం తత్ర యాతి సః ౧౭

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు పుష్పపూజావర్ణనం నామ
త్రిషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః

శతానీక ఉవాచ.—పునస్త్వం దేవదేవస్య భాస్కరస్య మహాత్మనః, పూజనే

దానిని మఱల నింకొకపర్యాయము నాకుఁ జెప్పుఁడు. అనిన సుమంతుఁ డిట్లనియె. మహారాజా! సర్వఫలప్రదంబును లోకపూజితంబును నగు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సంవాదముఁ జెప్పెద నాకర్ణింపుము. మనోవతి యందు సుఖాసీనుండైన చతుర్ముఖుం డగుబ్రహ్మదేవుని నమస్కరించి శివ కేశవు లిట్లు పల్కిరి. దేవోత్తమా! షడ్గుణైశ్వర్యసంపన్నుండును, సహస్రకిరణుండును దేవుండు నగురవిం బూజింప నెట్టిపుణ్యము లభించునో దానిం జెప్పుమన బ్రహ్మ యిట్లనియె. ఓజగన్నాథులారా! మీచే నేను మంచిప్రశ్నము నడుగఁబడితిని. గాన సంపూర్ణముగ దానిం జెప్పెద సావధానులరై యాకర్ణింపుఁడు. ఎవ్వఁడు తానుత్పాదించిన పుష్పములచేఁ దానే సూర్యుఁ బూజించునో యాతనిభక్తిచే నాపుష్ప పూజను సూర్యుఁడు స్వయముగనే గ్రహించును ఎవ్వఁడేని మామిడి మారేడు వృక్షంబులచేతను, జాజి-విజయ-జిల్లేడు-గన్నేరు-కుంకుమ-మొదలగువానిచేతను, పున్నాగ-నాగ-పొగడ-యశోక-తిల-సంపెంగచెట్ల చేతను, నగస్తి-యరఁటి-శ్రీఖండము-వీట్లచే నుపశోభితంబగు నుద్యానమును సూర్యునకు నిర్మించినయెడల వాని కేఫలము గల్గునో చెప్పెద నాకర్ణింపుము. ఆయుద్యానంబున నెంతపర్యంతము పత్రముగాని, పుష్పముగాని, బీజముగాని, ఫలముగాని యుండునో యన్ని వేలవత్సరములు సూర్యలోకంబున విరాజిల్లుచుండును. ఘృతసహితంబుగను

---

యత్ఫలం ప్రోక్తం తన్మే బ్రూహి ద్విజోత్తమ. ౧. సుమంతురువాచ.—శృణు త్వం హి మహారాజ సర్వదం లోకపూజితమ్, బ్రహ్మేశోపేంద్రదేవానాం త్రయాణామపి భారత. ౨. సుఖాసీనం సురజ్యేష్ఠం మనోవత్యాం చతుర్ముఖమ్, ప్రణమ్య శిరసా భూమౌ విష్ణ్వీశౌ వాక్యమూచతుః. ౩. య ఏష భగవాన్దేవః సహస్రకిరణో రవిః, అస్య యత్పూజనే పుణ్యం ప్రాప్యతే తద్వదస్వ నౌ. ౪. బ్రహ్మోవాచ.—సాధు సాధు జగన్నాథ సాధు పృష్టోఽస్మి వామిహ, తస్మాచ్ఛృణుతమేకాగ్రౌ గదతో నిఖిలం మమ. ౫. స్వయముత్పాద్య పుష్పాణి యః సూర్యం పూజయేత్స్వయమ్, తాని సాక్షాత్ప్రగృహ్ణాతి తద్భక్త్యా సతతం రవిః. ౬. యస్త్వారామం రవేః కుర్యాదామ్రబిల్వాది శోభితమ్, జాతీవిజయరాజార్కకరవీరైః సకుంకుమైః. ౭. పున్నాగనాగబకులైరశోకతిలచంపకైః, అగస్తికదలీఖండైస్తస్య పుణ్యఫలం శృణు. ౮. యావద్ధి పత్రం కుసుమం బీజం సూతఫలాని చ, తావద్వర్షసహస్రాణి సూరలోకే మహీయతే. ౯. సఘృతం

గుగ్గులోపేతముగ ధూపము (కందురును) సూర్యున కర్పించినయెడలఁ జతుర్వేదిగృహంబున జన్మమంది యెల్లప్పుడును సుఖించుచుండును. ఎవ్వఁడు కృష్ణాగురుకర్పూరంబును, ధూపమును నిరంతరముగ నుంచునో యాతఁడు పొందుపుణ్యఫలముం జెప్పెద నాకర్ణింపుము. పదునొకండు నూఱుకోట్లయుగంబులు సూర్యపురంబున భోగములంబొంది తదంత్యంబున భూపతి యగును ఘృతసహితగుగ్గులంబును యక్షుఁడు ధ్వని చేయుచు గ్రహించును. అట్టి యక్షాహ్వాయుం డగునాతని కిచ్చినఁ దల్లోకంబునఁ బ్రకాశించుచుండును. అగ్నియందుఁ గృష్ణసప్తమి నాజ్యసహిత గుగ్గులమును దహింపఁజేయువాఁడు సౌరలోకములు పొంది పదియర్బుదములవత్సరములు సుఖించును. దేవదారువును, సురపున్నాగమును, శ్రీవాసమును, కుందురును, శ్రీఫలంబు మొదలగువానితోఁ జేర్చిన గుగ్గిలమును దహించినయెడల నాతనియాశ్రయమును బొందఁగలఁడు. ఈరీతిగ సౌగంధికధూపము ఆరువేలరెట్లధికమని చెప్పఁబడెను. అగరుధూపము పదివేలరెట్లుత్తమము. ఘృతసహితమైనయెడల నగురు ద్విగుణమగును. కుందురుసహితమైనయెడల ననంతఫలదమగును. మహిషాక్షగుగ్గిలము రెండువేలపలములు దహించిన సూర్యతుల్యుం డగును. తుషాగ్ని బంగారమును శోధించినట్లు కృష్ణాగురుధూపము పాపయుక్తుం డగుపురుషుని శోధించును. అంతఃపురగృహమును, సుగంధంబుతోఁ బూసి కవాటము

---

గుగ్గులం దద్యాద్రాజన్నాకుందురుం తథా, చతుర్వేదిగృహే జన్మ ప్రాప్నోతి సతతం సుఖీ. ౧౦. కృష్ణాగురుం చ కర్పూరధూపం దద్యాద్దివాకరే, నైరంతర్యేణ యస్తస్య రాజన్పుణ్యఫలం శృణు. ౧౧. కల్పకోటిసహస్రాణి కల్పకోటిశతాని చ, భుక్త్వా సూర్యపురే భోగాంస్తస్యాంతే క్ష్మాధిపో భవేత్. ౧౨. గుగ్గులుం ఘృతసంయుక్తం యక్షో గృహ్ణాతి శబ్దకృత్, యక్షాహ్వాయస్య దానేన తస్య లోకే మహీయతే. ౧౩. కృష్ణాంశో కృష్ణ సప్తమ్యాం యః సాజ్యం గుగ్గులం దహేత్, సచాసౌ సౌరమాసాద్య వర్షాణాం చ దశార్బుదమ్. ౧౪. దేవదారుం నమేరుం చ శ్రీవాసం కుందురుం తథా, శ్రీఫలం చాజ్యసంయుక్తం దగ్ధ్వాశ్రయమవాప్నుయాత్. ౧౫. ఏవం సౌగంధికం ధూపం షట్ససహస్రగుణోత్తరమ్, అగురుం దశసాహస్రం సఘృతం ద్విగుణం భవేత్. ౧౬. అనంతఫలదం చైవం సదా కుందురుకామకమ్, ద్విసహస్రపలానాం తు మహిషాక్షస్య గుగ్గులోః. ౧౭. దగ్ధ్వార్థమవిమిశ్రస్య సూర్యతుల్యః ప్రజాయతే, శోధయేత్పాపసంయుక్తం పురుషం నాత్ర సంశయః. ౧౮. కృష్ణాగురుభవం ధూపం తుషాగ్నిరివ

లను, ద్వారములను, గోడలను, వేదులను బూసి పుష్పమాలలచే నలంకరించి సుగంధయుక్తంబు లగుధూపంబులచేఁ బరిమళింపఁజేసినయెడల సుగంధంబులతో దిక్కుల నన్నింటిని బూరించుచుఁ దేజంబున వహ్ని సదృశుండై దేవేంద్రునివలెఁ బ్రజ్వలించుచు, నూరుకోట్లదివ్యకల్పంబులు సూర్యలోకంబునం బ్రకాశించుచుండును అవసానంబున ధర్మము మిగులుటచేఁ ద్రిలోకాధిపత్యమును బొందును పూర్వోక్తంబులగు నుపలేప ధూపములను నూరుపర్యాయములు జేసినచో సర్వసుఖసంగియై విష్ణు మహేశ్వరులచేఁ బూజింపఁబడుచు సూర్యునితో సమానమగు పరాక్రమము గల్గి సూర్యలోకమున నివసించును అట్లే శుక్లవర్ణంబులును పట్టసూత్రనిర్మితంబులు నగుయజ్ఞోపవీతములను సూర్యునకు సమర్పించిన యెడల వేదవేదాంగపారగుఁ డగును రమ్యంబులగు వస్త్రంబుల నిచ్చిన సూర్యలోకంబునం బ్రకాశించుచుండును త్రుటికాలమున్నిసంబంధమగు వస్త్రముచు పద్మమును భాస్కరు నుత్తమాంగమునం దుంచినయెడల పదునల్గురింద్రు లున్నంత కాలము ఇంద్రుని యర్ధాసనమున నుండును ఈరీతిగ విత్తము ననుసరించి చేయవలయునని తెలియనగును ఇట్లు సంక్షేపముగఁ జెప్పితిని పాత్రములు మకుటములు మొదలగునవన్నియు విత్తానుసారముగ హేమమయముగా నుండవలయును కుంకమచూర్ణమును

---

కాంచనమ్, యోఽంతః పురగృహం గంధైః సుగంధైః ప్రవిలేపయేత్ ౧౯ కపాటద్వారకుడ్యాదితిర్యగూర్ధ్వం సవేదికమ్, వాసయేత్పుష్పమాలాభిర్ధూపైశ్చాపి సుగంధిభిః ౨౦ తస్య పుణ్యం యథావత్తు యువయోర్వచ్మి కృత్స్నశః, ఆపూరయన్దిశః సర్వా నానాగంధ సమన్వితైః ౨౧ కల్పకోటిశతం దివ్యం తేజసా వహ్నిసన్నిభః, శక్రవత్ప్రజ్వలన్దేవః సూర్యలోకే మహీయతే ౨౨ తస్యాంతే ధర్మశేషేణ త్రైలోక్యాధిపతిర్భవేత్, శతావృతం తు యః కుర్యాదేవం గంధైర్భగాలయమ్ ౨౩ స సర్వశర్మసంయుక్తః సూర్యతుల్యపరాక్రమః, సూర్యలోకే వసేద్దేవో యువాభ్యాం సంప్రపూజితః ౨౪. తద్వచ్ఛుక్లైశ్చ సంవీతం పట్టసూత్రైర్వినిర్మితమ్, దత్వోపవీతం సూర్యాయ భవేద్వేదాంగపారగః ౨౫ వాసాంసి సువిచిత్రాణి సూరలోకే మహీయతే, త్రుటిమాత్రం తు యో దద్యాదూర్ణావస్త్రం సపంకజమ్ ౨౬ భాస్కరస్యోత్తమాంగేషు తస్య పుణ్యం బ్రవీమ్యహమ్, ఇంద్రస్యార్ధాసనే తిష్ఠేద్యావదింద్రాశ్చతుర్దశ ౨౭ ఏవం విత్తానుసారేణ సర్వం జ్ఞేయం సమాసతః, సర్వేషాం హేమపాత్రాణాం ముకుటానాం చ సర్వశః. ౨౮.

జిల్లేడుదొప్పయం దుంచి భాస్కరునకు నివేదించిన నశ్వమేధఫలము గల్గును. కుంచము ప్రమాణముగల వరిబియ్యమును కడిగి యన్నమును వండవలయును. వండి సప్తమిరోజున సూర్యునకు చరువు నిచ్చి సంయావము, కృశరము, పాయసము, యావకము మొదలగు వంటకవిశేషంబులను, దధ్యోదనంబును, మామిడిపండ్లను, అన్నమును, మోదకంబులను, గుడాపూపంబులను పరిసంఖ్యచే నైవేద్యము చేసినయెడల ప్రతినైవేద్యంబున నెన్నితండులంబు లుండునో యన్నిసంవత్సరంబులు సూర్యలోకంబున విరాజిల్లుచుండును. బెల్లముతోఁ జేసిన నేతితోముసిఁగిన భక్ష్యములను నివేదించినను శతగుణం బగుఫలము లభించును. మామిడిపండ్లు మొదలగుఫలములు సమర్పించినను ఫలము లభించును. లేనిచో సుగంధయుక్తమగు సలిలమునైనను నివేదింపవలయును. కాలానుసారముగ నుపలబ్ధంబులగు ఫలములను భక్ష్యములను నివేదించి పూజించినయెడల పరమంబగుస్థానమును బొందఁగలఁడు. భాస్కరదేవాలయమున శుభంబగు ఘృతదీపమును ప్రజ్వలింపఁజేసినచో నాగ్నేయంబగు విమానము నెక్కి స్వర్గమునకుఁ బోవును. భాస్కరాలయమునఁ గార్తికమాసమునందు సప్తమీ-షష్ఠీ - అమావాస్యలయందు దీపమాలిక నుంచినయెడల పదివేలభాస్కరులతేజమునుబొంది దిక్కులను భాసింపఁజేయుచు, దివ్యా

---

అర్కపత్రపుటం చూర్ణం మధుపర్ణసమన్వితమ్, యో నివేదయతేఽర్కాయ సోఽశ్వమేధఫలం లభేత్. ౨౯. శాలితండులప్రస్థస్య కుర్యాదన్నం సుసంస్కృతమ్, సూర్యాయ చ చరుం దత్వా సప్తమ్యాం తు విశేషతః. 3౦. సంయావం కృశరం పూపం పాయసం యావకం తథా, దధ్యోదనరసాలాన్న మోదకాన్గుడపూపకాన్. 3౧. యావంత స్తండులా స్తస్మిన్ నైవేద్యే పరిసంఖ్యయా, తావద్వర్ష సహస్రాణి సూరలోకే మహీయతే. 3౨. గుడఖండకృతానాం చ భక్ష్యాణాం వినివేదనే, ఘృతేన ప్లావితానాం చ ఫలం శతగుణం లభేత్. 33. రసాలఖాద్యకాద్యానాం భక్ష్యాణాం ఫలమిష్యతే, తదర్థం సలిలస్యాపి వాసితస్య నివేదయేత్. 3౪. యథాకాలోపలబ్ధాని భక్ష్యాణి వివిధాని చ, నివేద్యార్కాయ పరమం స్థానం ప్రాప్నోతి పూజనాత్. 3౫. ప్రజ్వాల్య ఘృతదీపం తు భాస్కరస్యాలయే శుభమ్, ఆగ్నేయం యానమారుహ్య గచ్ఛేత్సౌమనసం పురమ్. 3౬. యః కుర్యాత్కార్తికే మాసి శోభనాం దీపమాలికామ్, సప్తమ్యామథ షష్ఠ్యాం వామావాస్యాయామథాపి వా. 3౭. భాస్కరాయుతసంకాశ స్తేజసా భాసయన్దిశః, దివ్యా

భరణభూషితుఁడై కులమునంత నుద్ధరించి ఘృతపూరితంబులై యెన్ని దీపంబులు వెలిఁగించఁబడెనో యన్ని వేలవత్సరంబులు సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును. దీపవృక్షమును పర్వములయందు సూర్యదేవాలయంబున వెలిఁగించినచోఁ బూర్వముచెప్పిన దీపమాలాప్రజ్వాలనముకంటె ద్విగుణంబగుఫలమును బొందును. సర్వలోహమయంబగు దీపవృక్షమును సూర్యదేవాలయమునఁ బ్రజ్వలింపఁజేసిన భాస్కరలోకంబున విరాజిల్లుచుండును. రాత్రులందు సూర్యుని కభిముఖంబుగ దీపమును శిరంబునను లలాటముననను హస్తంబులయందును వక్షఃస్థలంబునను ధరించిన యెడల పదివేలభాస్కరులతో సమానుఁడై యర్కసన్నిభంబులగు విమానముల నెక్కి సూర్యలోకంబునకుం బోయి వేయికల్పంబులు ప్రకాశించును. అన్నదానముంజేయువాఁడు వీరలోకమున నుండును. భాస్కరుని యెదుట శ్వేతదర్పణ ముంచి శ్వేతమాల్యములచేతను చందనముచేతను పర్యంకమును శోభితంబుగఁజేసిన దివ్యాభరణభూషితుండయి చంద్రార్కసమప్రభగల్గి పదివేలకల్పంబులు సూర్యలోకంబున నుండును శ్రద్ధాభక్తియుక్తుఁడై సూర్యునకుఁ బ్రదక్షిణముఁజేసిన వేయియశ్వమేధములఁ జేసినఫలము సుఖముగ లభించును. ఏమనుష్యుఁడు ప్రదక్షిణపూర్వకమగు నమస్కారముఁజేయునో యాతఁడు రాజసూయాశ్వమేధయాగ

---

భరణసంపన్నః కులముద్ధృత్య సర్వశః. ౩౮. యావత్ప్రదీపసంఖ్యానం ఘృతేనాపూర్య బోధితమ్, తావద్వర్షసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౩౯. దీపవృక్షమధోద్బోధ్య పర్వస్వాయతనేషు వై, పూర్వస్మాద్ద్విగుణం పుణ్యం లభతే నాత్ర సంశయః. ౪౦. దీపవృక్షం సముద్బోధ్య భాస్కరాయతనేషు భోః, సర్వలోహమయం వీర రవిలోకే మహీయతే. ౪౧. శిరసా ధారయేద్దీపం భాస్కరస్యాగ్రతో నిశి, లలాటే చైవ హస్తాభ్యాం సముద్యుక్తస్తథో రసి. ౪౨. భాస్కరాయుతసంకాశో విమానైరర్కసన్నిభైః, కల్పాయుతశతం చైవ సూర్యలోకే మహీయతే. ౪౩. అన్నదాతా తు యో వీర వీరలోకే మహీయతే, భాస్కరస్యాగ్రతో దత్వా దర్పణం నిర్మలం శుభమ్. ౪౪. పర్యంకే శోభితం కృత్వా శ్వేతమాల్యైః సచన్దనైః, వృకార్కనిర్మలః శ్రీమాన్దివ్యాభరణరూపధృక్, కల్పాయుతసహస్రాణి సూరలోకే మహీయతే. ౪౫. కృత్వా ప్రదక్షిణం భక్త్యా శ్రద్దధానో రవేర్నరః, అశ్వమేధసహస్రస్య సుఖేన లభతే ఫలమ్. ౪౬. కృత్వా ప్రదక్షిణం యస్తు నమస్కారం ప్రయోజయేత్, రాజసూయాశ్వమే

ముల సకలఫలముం బొందును నమస్కారమే సర్వయజ్ఞములలో నుత్తమోత్తమమని చెప్పఁబడెఁగాన సహస్రాంశుఁడగు భానునకు నమస్కరించి యశ్వమేధఫల మందుదురు గాక భూమిపైఁ బడి సాష్టాంగనమస్కృతి యొనర్చినఁ గల్గెడిఫలమును నూఱుక్రతువు లొనర్చినఁ బొందఁజాలరు సర్వయజ్ఞంబు లొనర్చిన నుపవాసము లొనర్చిన సర్వతీర్థములు సేవించిన నేఫలము లభించునో యాఫలమంతయు సూర్యపూజోపహారములచేతనే లభించును కింకిణీజాలభూషితంబగు శ్వేతమహాధ్వజమును మయూరఛత్రసహితంబుగఁ జేసి తగరముతోఁ జాపముఁజేసి సూర్యున కర్పించిన యెడల విమానశతంబుతో సర్వదేవనమస్కృతుఁడై నూఱుమన్వంతరములు స్వర్గలోకంబున దేవునివలె సుఖించును భగాలయప్రాంతముల ధ్వజమాలలచే వ్యాప్తములుగ నెవ్వఁడు చేయునో మహాధ్వజాష్టకము నెనిమిదిదిక్కుల నెవ్వఁడు చేయునో వాఁడు ధ్వజమాలాకులవిమానసహస్రముచే నూఱుయుతంబుల దివ్యకల్పంబులు స్వర్గంబున సూర్యునివలె మోదమందును నూర్గురుచంద్రులకిరణములవలె విమలంబును ముక్తామాలలచే సుపశోభితమును నగుమణిమయదండముగాని కాంచనమయదండముగాని యిచ్చినయెడల హేమదండోపశోభితంబగు ధార్యమాణఛత్రంబుచే విమానవరము నధిష్ఠించి సూర్యలోకమున వసించును

---

ధాభ్యాం సకలం విన్దతే ఫలమ్ ౪౭ నమస్కారః స్మృతో యజ్ఞః సర్వయజ్ఞోత్తమోత్తమః, నమస్కృత్వా సహస్రాంశుమశ్వమేధఫలం లభేత్ ౪౮ ప్రణమ్య దండవద్భూమౌ నమస్కారేణ యోఽర్చయేత్, స యాం గతిమవాప్నోతి న తాం క్రతుశతైరపి ౪౯ సర్వయజ్ఞోపవాసేషు సర్వతీర్థేషు యత్ఫలమ్, అభిజ్ఞాప్యోపహారేణ పూజయా ఫలమశ్నుతే ౫౦ శ్వేతం మహాధ్వజం కృత్వా కృత్వా చాపం చ రంగకమ్, కింకిణీజాలనిర్ఘోషం మయూరచ్ఛత్రభూషితమ్, యస్త్వర్యష్టే నరో దద్యాచ్ఛ్రద్ధయా పరయాన్వితః ౫౧ స శతేన విమానానాం సర్వదేవనమస్కృతః, మన్వన్తరశతం దేవ మోదతే దివి దేవవత్ ౫౨ ధ్వజమాలాకులం కుర్యాద్యః ప్రాంతేషు భగాలయమ్, మహాధ్వజాష్టకం చాపి దిగ్విదిక్షు నివేదయేత్ ౫౩ స విమానసహస్రేణ ధ్వజమాలాకులేన తు, కల్పాయుతశతం దివ్యం మోదతే దివి సూర్యవత్ ౫౪ శతచన్ద్రాంశువిమలం ముక్తాదామోపశోభితమ్, మణిదండమయం ఛత్రం దద్యాద్వా కాంచనాదికమ్ ౫౫ స ధార్యమాణచ్ఛత్రేణ హేమదండోపశోభినా, మోదతే సూర్యలోకే తు విమానవరమాస్థితః ౫౬ తతస్తస్మాచ్చ్యుతో లోకాన్నిసర్గాద్భువ

తరువాత నాలోకమునుండి చ్యుతుఁడై సముద్రపర్యంతమగుభూమి నేకచ్ఛత్రంబుగఁ బాలించును. కాంస్యశృంఖలానిబద్ధంబును మహాస్వనయుక్తంబు నగుఘంటిక సమర్పించి భగాలయంబున బంధించినయెడల శోభనుండును శ్రీమంతుఁడును సూర్యున కత్యంతప్రియతముండు నగును. సూర్యునితో సమాన మగుబలము గలవాఁడునై సూర్యలోకంబున నుండును. భేరీమృదంగపటహఝర్ఝరీమర్దలాదికవాదిత్రములు సూర్యునకు నివేదించినయెడల వంశవీణారవయుతంబుగ మహార్హంబులగు విమానములచే నూఱుయుగాంతములు భగలోకమున రాజిల్లుచుండును. యోగ్యమగు సంగీతసాధనము దానముఁజేసిన నక్షయంబగుకాల మా లోకమున రమించును. గొప్ప ధ్వనిగల్గిన శంఖయుగ్మము సమర్పించిన నూఱుకోట్లయుగములు దివ్యలోకమున నుండును. బహువర్ణవిరాజమానంబును మధ్యపంకజశోభితంబును విచిత్రము నేకవర్ణవస్త్రములచే నుపశోభితంబును కింకిణీమాలాలంకృతము నగువిమానముం జేయించిన వస్త్రమున నెన్నితంతువులుండునో యన్నివేలయుగంబులు సూర్యలోకమున నుండును భగాహుతిచే జగమంతయు సృష్టిద్వారా ధరింపఁబడుచున్నది. భగుఁ డగ్నిద్వారకుఁడు గాన నగ్నిలో భగున కుద్దేశించి వైచినయాహుతి యాతనిం జేరును. అగ్ని యీతనికుమారుఁడు రాజా!

---

మాగతః, భుఙ్క్తే సముద్రపర్యంతా మేకచ్ఛత్రాం వసున్ధరామ్. ౫౭. యః శృంఖలాసమాయుక్తాం మహాఘణ్టాం మహాస్వనామ్, కాంస్యలోహమయీం వాపి నిబధ్నీయాద్భగాలయే. ౫౮. శోభనః స్యాన్నరః శ్రీమాన్భగస్యాతీవ వల్లభః, సూర్యతుల్యబలో భూత్వా సూర్యలోకే మహీయతే. ౫౯. భేరీమృదంగపటహఝర్ఝరీమర్దలాదికమ్, దంశకాంస్యాదివాదిత్రం యో భగాయ నివేదయేత్. ౬౦. స విమానై ర్మహాభాగై ర్వంశవీణాయుతస్వనైః, యుగాన్తకశతం దివ్యం భగలోకే మహీయతే. ౬౧. సుసంగీతకదానేన సవాద్యేన విశేషతః, యథేష్టం భాస్కరే లోకే మోదతే కాలమక్షయమ్. ౬౨. మహామహాస్వనం దత్వా శంఖయుగ్మం భగాలయే, యుగకోటిశతం దివ్యం భగలోకే మహీయతే. ౬౩. విమానం బహు వర్ణాభం మధ్యే పంకజభూషితమ్, విచిత్ర మేకవర్ణం వాసనవస్త్రోపకల్పితమ్. ౬౪. కింకిణీజాలసంపన్నం వర్ణకై శ్చోపశోభితమ్, పుష్పమాలాప్రభం వాపి ఘంటాచామరభూషితమ్. ౬౫. భగస్యోపరి యో దద్యాత్సర్వతో్నపశోభితమ్, దుకూలపట్టదేవాంగై ర్వస్త్రైర్వా వర్ణకాన్వితైః. ౬౬. పట్టాదివస్త్రతంతూనాం షష్ఠి

యెవ్వఁడు భగు నుద్దేశించి విధ్యుక్తము నగ్నికార్యముఁ జేయునో వాఁడు పరమంబగు స్థానముఁ జెందును. యావకోపేతాన్నము నిత్యవిధి యందు పుష్పధూపోపేతముగ సకాలంబున మహాశ్వేతాదిమాతృకలకుఁ ద్రికల్పంబులకుఁ దీసికొనిపోయి సర్వదిక్కుల బలినిచ్చినయెడల మూఁడు వేలకల్పంబులు శాండిలేయపురంబున నివసించును. సాయంకాలమున సౌరసంధ్యాబలి నిచ్చి నూఱయుతంబులవత్సరంబులు భగలోకమున నుండును. దధి, యోదనము, క్షీరము వీట్లచేఁ బూరితమగుపాత్రకు మూతవైచి పుష్పధూపంబులచే నర్చించి వితానముం గట్టి శిరమునం దిడి కొని సూర్యగృహంబున శంఖవీణాదిస్వనంబులతో, దర్పణంబులతోడను, ధూపమాలలచేతను, గేయములచేతను, నృత్యములచేతను, స్మృతిశీలుఁ డయి భానునకుఁ బ్రదక్షిణముఁ జేయవలయును. అట్లుచేసిన దివ్యవర్ష శతసహస్రములు తపం బాచరించిన నేమికల్గునో యదియే దీనిచేఁ గల్గును. భగునియందలిభక్తిచే నిర్మలాంతఃకరణుఁడైనచోఁ బాపియైనను భగలోక మున వసించుచు భగానుచరత్వముం బొందును. కృష్ణపక్షంబున షష్ఠి

---

సంఖ్యా తు యా భవేత్, తావద్యుగసహస్రాణి సూరలోకే మహీయతే. ౧౭. భగా హుత్యా జగత్సర్వం సృష్టిద్వారేణ ధార్యతే, అగ్నివర్ణా వచస్యుక్తో హ్యగ్నిరస్యాత్మజః సదా. ౧౮. యస్త్వగ్నికాయ విధివత్కుర్యాన్నిత్యం భగాలయే, భగముద్దిశ్య రాజేంద్ర స యాతి పరమాం గతిమ్. ౧౯. సర్వాన్నం యావకోపేతం యస్తు నిత్యవిధిం హరేత్, పుష్పధూపజలోపేతం కాలేకాలే విశేషతః. ౨౦. మహాశ్వేతాదిమాతౄణాం త్రికల్పానాం చ సర్వశః, యః కృత్వా సకృదప్యేవం సర్వదిక్షు బలిం హరేత్, స నరశ్చ సహస్రాణి శాండిలేయపురే వసేత్. ౨౧. సౌరసంధ్యాబలిం కృత్వా దినాంతే సతతం రవేః, వర్షాయుతశతం సాగ్రం భగలోకే మహీయతే. ౨౨. దధ్యోదనపయో భిర్యః పూరితం పాత్రమావృతమ్, పుష్పధూపార్చితం చైవ వితానోపరి శోభితమ్. ౨౩. శిరసా ధారయేత్పాత్రం శనైర్గచ్ఛేత్ప్రదక్షిణమ్, రవ్యాయతనపర్యంతే శంఖవీణాది నిస్వనైః. ౨౪. దర్పణైర్ధూపమాలాభిర్గేయనృత్యాదిశోభితమ్, భానోర్హి స్మృతిశీలశ్చ తస్య పుణ్యఫలం శృణు. ౨౫. దివ్యం వర్షసహస్రం తు దివ్యం వర్షశతం తథా, తపస్తప్తం మహత్తేన భవేదేవం న సంశయః. ౨౬. భగభక్తిప్రసన్నాత్మా యద్యపి స్యాత్స పాప కృత్, భగలోకే వసేన్నిత్యం భగానుచరతాం గతః. ౨౭. కృష్ణాం తు షష్ఠీం నక్తేన

సప్తములయందు రాత్రిమాత్రము భుజించెనేని యిహామున భోగంబును పరంబున శుభగతిం బొందఁగలఁడు. ఒకవత్సరము భగదినంబున రాత్రుల నిరంతరముగ బ్రహ్మచారియై జితక్రోధుఁడై భగార్చనపరుఁడైన నిహపరలోకంబుల గొప్పసుఖమందును. యాచితముగా నిద్దానిని దినుటకన్న వ్రతము శ్రేష్ఠముగాన నక్తవ్రత మాచరింపవలెను. మధ్యాహ్నంబున దేవతలును, పూర్వాహ్ణంబున ఋషులు, నపరాహ్ణంబునఁ బితరులును, సంధియందు గుహ్యకాదులును భుజింపుచుందురుగాన నీకాలముల నన్నిఁటి నతిక్రమించి తరువాత సౌరులు భుజింపవలయును సుమనస్కుఁడును, సుమనోవ్రతుండును, సూర్యభక్తిపరాయణుండు నగువాఁడు రాత్రికాలమున భుజించినయెడల సూర్యలోకమును బొందఁగలఁడు. సౌమనసలోకంబున భోగించి పిమ్మట భూతలంబున రాజై జనించును. హావిష్యభోజనము ఆహారమునందలి లాఘవము, అగ్నికార్యము, అధశ్శయనము, నక్తభోజనమును సౌరు లాచరింపవలయును. రాత్రిభోజనముఁజేసి మార్గశీర్ష మాసంబునఁ గృష్ణపక్షంబునందు షష్ఠినాఁడు విధ్యుక్తముగా నంశుమంతునిఁ బూజింపవలయును. విధివిహితరీతిగ నావుపంచితమును ప్రాశనముఁజేసి యారాత్రి నిద్రింపవలయును. ఇట్లుచేసిన నతిరాత్రయజ్ఞమును జేసినఫలమును బొందుదురు. పుష్యమాసంబున నంశుమంతు నీరీతిగ భానుమంతునిఁ బూజించి ఘృతమును పానముఁ జేసిన

---

యశ్చ కృష్ణాం చ సప్తమీమ్, ఇహ భోగానవాప్నోతి పరత్ర చ శుభాం గతిమ్. ౭౮. యోఽబ్దమేకం తు కుర్వీత నక్తం భగదినే నరః, బ్రహ్మచారీ జితక్రోధో భగార్చనపరో నరః, అయాచితాత్పరం నక్తం తస్మన్నాక్తేన వర్తయేత్. ౭౯. దేవైస్తు భుక్తం మధ్యాహ్నే పూర్వాహ్ణే ఋషిభిస్తథా, అపరాహ్ణే తు పితృభిః సంధ్యాయాం గుహ్యకాదిభిః. ౮౦. సర్వా వేలా హ్యతిక్రమ్య సౌరాణాం భోజనం పరమ్, భుంజానో నక్తకాలే తు సూర్యభక్తిపరాయణః. ౮౧. భగలోకమవాప్నోతి సుమనాః సుమనోవ్రతః, భుక్త్వా సౌమనసాంల్లోకాన్ రాజా భవతి భూతలే.౮౨.హవిష్యభోజనం స్నానమాహారస్య చ లాఘవమ్, అగ్నికార్యమధఃశయ్యాం నక్తభోజీ సమాచరేత్. ౮౩. కృష్ణషష్ఠ్యాం ప్రయత్నేన కృత్వా నక్తం విధానతః, నరో మార్గశిరే మాసి అంశుమానితి పూజయేత్. ౮౪. విధివత్ప్రాశ్య గోమూత్రమనాహారో నిశి స్వపేత్, అతిరాత్రస్య యజ్ఞస్య ఫలమాప్నోతి మానవః. ౮౫. పుష్యేప్యేవం సహస్రాంశుం భాను

యెడల వాజపేయయాగఫలము లభించును. మాఘబహుళషష్ఠిరోజున దివాకరుఁడను సూర్యు నీరీతి నారాధించి రాత్రియందు గోక్షీరమును ద్రావి పరుండిన గోమేధఫలంబు గలుగును. ఫాల్గునమాసంబున మార్తాండుఁ డను సూర్యు నారాధించి రాత్రి పూజించిన గోక్షీరమును పానము జేసిన సూర్యలోకంబునఁ బదివేలయయుతంబులు సంతోషించుచుండును. భక్తి మంతుఁ డగువాఁడు చైత్రమాసంబున వివస్వంతుఁ డను సూర్యునిఁ బూజించి హవిష్యమును భుజించిన సూర్యలోకంబున నచ్చరలతోఁ గూడి క్రీడించుచుండును. వైశాఖమాసమునఁ జండకిరణుఁ డనుసూర్యునిఁ బూజించి క్షీరములను పానము జేసినఁ బదివేలవత్సరంబులు సాంతముగా సూర్యసన్నిధియం దుండును. జ్యేష్ఠమాసంబునఁ దివస్పతినిఁ బూజించి గోశృంగంబులందలి యుదకమును ద్రావవలయును. అట్లు చేసినఁ గోటి గోదానములు చేసినఫలమును బొందును. ఆషాఢంబున నర్కనామక సూర్యునిఁ బూజించి గోమయమును భుజించినయెడలఁ బదివేలవత్సరంబులు సూర్యసాలోక్యమును బొందును. శ్రావణమాసంబునఁ బూజించి పాలను ద్రావినఁ బదివేలవత్సరంబులు పూర్ణముగా సూర్యగృహంబున నుండును. భాద్రపదషష్ఠిరోజున భాస్కరునిఁ బూజించి పంచగవ్యమును ద్రావి నచో నరమేధఫలము లభించును. ఆశ్వయుజషష్ఠిరోజున భగుఁ డను సూర్యునిఁ బూజించి ఫలమును గోమూత్రమును భుజించినయెడల నశ్వ

---

మంతముశంతి చ, వాజపేయఫలం ప్రాప్య ఘృతం ప్రాశ్య లభేన్నరః. ౭౬. మాఘే దివాకరం నామ కృష్ణషష్ఠ్యాం నరోత్తమ, నిశి పీత్వా తు గోక్షీరం గోమేధఫలమాప్నుయాత్. ౭౭. మార్తండం ఫాల్గునే మాసి పూజయిత్వా గవాం పయః, పిబేత్తతః సూర్యలోకే మోదతే సోఽయుతాయుతమ్. ౭౮. చైత్రే మాసి వివస్వంతం పూజయిత్వా సుభక్తిమాన్, హవిష్యాశీ సూర్యలోకేఽప్సరోభిః సహ మోదతే. ౭౯. వైశాఖే చణ్డకిరణం పూజయేచ్చ పయోవ్రతః, వర్షాణామయుతం సాగ్రం మోదతే సూర్యసంనిధౌ. ౮౦. జ్యేష్ఠే దివస్పతిం పూజ్య గవాం శృంగోదకం పిబేత్, గవాం కోటిప్రదానస్య నిఖిలం ఫలమాప్నుయాత్. ౮౧. ఆషాఢే త్వర్కనామానమిష్ట్వా ప్రాశ్య చ గోమయమ్, ప్రయాత్యర్కసలోకం తు వర్షాణాం చ శతంశతమ్. ౮౨. శ్రావణేఽర్యమనామానం పూజయిత్వా పయః పిబేత్, వర్షాణామయుతం సాగ్రం మోదతే భాస్కరాలయే. ౮౩. మాసి భాద్రపదే షష్ఠ్యాం భాస్కరం నామ పూజయేత్, భాస్కరం పంచగవ్యస్య సర్వమేధఫలం లభేత్. ౮౪. మాసి చాశ్వయుజే షష్ఠ్యాం

మేధఫలము గల్గును కార్తికమాసంబున శక్రాఖ్యఁ డగునీతనిఁ బూజించి దూర్వాంకురమును ప్రాశనఁజేసిన రాజసూయఫలము గల్గును సంవత్సరాంతమున సూర్యభక్తిపరాయణులగు బ్రాహ్మణులను భుజింపఁజేయవలయును ఆబ్రాహ్మణులకు మధువు పాయసమును బెట్టి శక్తికొలఁది సువర్ణమును వస్త్రముల నియ్యవలయును తరువాతఁ గృష్ణవర్ణయుక్తంబును సక్షీరంబును నగుగోవును సూర్యునకు దాన మొసంగవలయును ఎవ్వఁడైన నొకసంవత్సరము కృష్ణషష్ఠీవ్రతమును జరిపినయెడల సర్వపాపవిముక్తుండును సర్వకామసమన్వితుండును నై సూర్యలోకంబున శాశ్వతంబులగు సంవత్సరంబులు సంతోషించుచుండును పుణ్యదినంబులయందును, విషువద్గ్రహణాదులయందును, దానోపవాసహోమములచే నక్షయమగుఫలము గల్గును రాజా! భానుఁ డీరీతిగ నరుణునకుఁ జెప్పియుండెను పుణ్యంబును సర్వపాపభయనాశకంబును నగు నీకృష్ణషష్ఠీవ్రతమును భాస్కరునకు భక్తితోఁ జేసి పరమపదంబునకుఁ బోవును

ఇది చతుష్షష్ట్యుత్తరశతతమాధ్యాయము

---

భగాఖ్యం నామ పూజయేత్, పలగోమూత్రభుక్త్వైవ అశ్వమేధఫలం లభేత్ ౯౫ మాసే తు కార్తికే షష్ఠ్యాం శక్రాఖ్యం నామ పూజయేత్, దూర్వాంకురం సకృత్ప్రాశ్య రాజసూయఫలం లభేత్. ౯౬ వర్షాంతే భోజయేద్విప్రాన్సూర్యభక్తిపరాయణాన్, పాయసం మధుసంయుక్తం వజ్రేణ చ పరిప్లుతమ్ ౯౭ శక్త్యా హిరణ్యవాసాంసి భక్త్యా తేభ్యో నివేదయేత్, నివేదయేచ్చ సూర్యాయ కృష్ణాం గాం చ పయస్వినీమ్ ౯౮. వర్షమేకం చ దేవే వై నైరంతర్యేణ యో నయేత్, కృష్ణషష్ఠీవ్రతం భక్త్యా తస్య పుణ్యఫలం శృణు ౯౯ సర్వపాపవినిర్ముక్తః సర్వకామసమన్వితః, మోదతే సూర్యలోకే తు స నరః శాశ్వతీః సమాః ౧౦౦ పుణ్యేష్వహఃసు సర్వేషు విషువద్గ్రహణాదిషు, దానోపవాసహోమాద్యైరక్షయం ఖగ జాయతే ౧౦౧ సుమంతురువాచ —ఇత్యుక్తవాన్పురా భానురరుణాయ విశాంపతే, కృష్ణషష్ఠీవ్రతం పుణ్యం సర్వపాపభయాపహామ్ ౧౦౨ కృత్వేదం పురుషో భక్త్యా భాస్కరస్య మహాత్మనః, ప్రయాతి పరమం స్థానం భానోరమితతేజసః ౧౦౩

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యషష్ఠీవ్రతవర్ణనం నామ చతుఃషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

---

## పంచషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! ధర్మార్థకామమోక్షప్రతిపాదకం బును నను త్తమంబు నగుసూర్యవ్రతమును జెప్పెదను. జితేంద్రియుం డును సత్యవాదియు నగువాఁడు పుష్యమాసంబున రాత్రులయందు మాత్రము భుజించి వరిపిండి, గోధూమపిండి, పాలు వీట్లతో నుభయపక్ష సప్తములయందును సప్రయత్నంబుగ నుపవాసముఁ జేయవలయును. ఉపవసించి త్రిసంధ్యలయందును శాండిలపుత్రుం డగుసూర్యునిఁ బూజింప వలయును. సర్వభోగములను వర్జించి కేవల భూమియందే శయనింపవల యును. మాసము పూర్తియైనతరువాత సప్తమిరోజున ఘృతాదులతో స్నానముఁజేసి సూర్యదేవునకు మహాపూజను జేసి ప్రస్థప్రమాణముగల మోదకములను క్షీరంబులను నివేదింపవలయును. ఎనమండ్రు బ్రాహ్మణు లను భోజనముచేఁ దృప్తిపరుపవలయును. ఒకకపిలగోవును గూడ భాస్క రునకు దాన మొసంగవలయును. పుణ్యంబు ను త్తమంబును నగుసూర్య వ్రతమును చేసిన యాతఁడు కోటిసూర్యప్రభాసదృశంబులును, కామ గాములును నగువిమానంబులచేతను, అప్సరోగణములచేతను, మహా వైభవంబులతోడను, సంగీతనృత్యవాద్యంబులతోడను గంధర్వగణంబుల తోడను, వీవఁబడుచామరంబులతోడను, సురాసురులచే స్తూయమా నుండై సౌరులందఱును సహస్రకిరణుఁడో యనుకొనునట్లు భాస్కరుఁ

---

సుమంతురువాచః—అహం తే సంప్రవక్ష్యామి సూర్యస్య వ్రతము త్తమమ్, ధర్మకామార్థమోక్షాణాం ప్రతిపాదనము త్తమమ్. ౧. పౌషమాసే తు సంప్రాప్తే యః కుర్యాన్నక్తభోజనమ్, జితేంద్రియః సత్యవాదీ శాలిగోధూమగోరసైః. ౨. పక్షయోః సప్తమీం యత్నాదుపవాసేన యాపయేత్, త్రిసంధ్యమర్చయేద్భానుం శాండిలేయం చ సువ్రత. ౩. అధః శాయీ భవేన్నిత్యం సర్వభోగవివర్జితః, మాసి పూర్ణే తు సప్తమ్యాం ఘృతాదిభిరరిందమ. ౪. కృత్వా స్నానం మహాపూజాం సూర్యదేవస్య భారత, నైవేద్యం మోదకప్రస్థం క్షీరం సిద్ధిం నివేదయేత్. ౫. భోజయేచ్చ ద్విజానష్టౌ భగార్చాం శుభ లక్షణామ్, గాం చ దత్వా మహారాజ కపిలాం భాస్కరాయ తు. ౬. య ఏవం కురుతే పుణ్యాం సూర్యస్య వ్రతము త్తమమ్, తస్య పుణ్య ఫలం వచ్మి సర్వకామసమన్వితమ్. ౭. సూర్యకోటిప్రతీకాశైర్విమానైః సార్వకామికైః, అప్సరోగణసంకీర్ణైర్మహావిభవ సంయుతైః. ౮. సంగీతనృత్యవాద్యాద్యైర్గంధర్వగణశోభితైః, దోధూయమానశ్చమరైః స్తూయమానః సురాసురైః. ౯. సహస్రకిరణాభాసః సౌరైః సూర్యసమన్వితైః, స

డున్న పరమపదంబునకుఁ బోవును. దానము చేయఁబడినగోవున కెన్ని రోమము లుండునో తత్కులప్రసూతంబుల కెన్నిరోమము లుండునో యన్నివేలయుగంబులు సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. ఇరువదియొక్క పురుషాంతరంబులతోఁగూడ నీప్సితభోగంబు లనుభవించి జ్ఞానయోగముచే మఱల ముక్తుఁడగును. యోగంబుచే దుఃఖాంతముఁ బొందును. తరువాత జ్ఞానయోగము బ్రవృత్తమగును. సౌరధర్మమువలన జ్ఞానము గల్గును. భగార్చనమువలన సౌరధర్మముంగల్గు నీరీతిగ సౌరమోక్షోపాయమును సూర్యాశ్రయులచే నేవ్యమును సంసారార్ణవవ్యపోహనమునగు సూర్యసేవాప్రకారంబును సమగ్రంబుగ నీకుఁ జెప్పితిని. మాఘమాసంబున రాత్రిభోజనముఁ జేయుచు నుభయపక్షసప్తముల ఘృతమిశ్రితపిష్టముం భుజించి దినమంతయు నుపవసింపవలయు మఱునాఁ డష్టమిరోజున భానునకు ఘృతమును నభిషేకముం జేయవలయును. తరువాత నీలవర్ణమగు నొకలేగటియావును దాన మీయవలయును. అట్లు చేసిన నింద్రనీలసన్నిభములు మయూరయుక్తంబులునగు విమానముల నధిరోహించి యాదిత్యపురంబునకుంబోయి యీప్సితంబులగు భోగములనుభవించును. ఫాల్గునమాసంబున రాత్రిభోజనముఁజేసి జితక్రోధుండై శ్యామళక్షీరనీవారంబులచే షష్ఠినాఁడుగాని సప్తమియందుఁగాని యుప

యాతి పరమం స్థానం యత్రాస్తే రవిరంశుమాన్. ౧౦. రోమసంఖ్యా తు యా తస్యా స్తత్ప్రసూతిః కులేషు చ, తావద్యుగసహస్రాణి సూరలోకే మహీయతే. ౧౧. త్రిఃసప్తకులజైః సార్ధం భోగాన్భుక్త్వా యథేప్సితాన్, జ్ఞానయోగం సమాసాద్య పునరేవ ప్రముచ్యతే. ౧౨. యోగాద్దుఃఖాంతమాప్నోతి జ్ఞానయోగం ప్రవర్తతే, సౌరధర్మాద్భవేజ్జ్ఞానం సౌరధర్మో భగార్చనాత్. ౧౩. ఇత్యేవం తే సమాఖ్యాతం భవార్ణవవ్యపోహనమ్, సౌరమోక్షక్రమోపాయం సూరాశ్రయనిషేవణమ్. ౧౪. మాఘమాసే తు సంప్రాప్తే యః కుర్యాన్నక్తభోజనమ్, పిణ్యాకం ఘృతసంయుక్తం భుంజానః స జితేన్ద్రియః. ౧౫. సోపవాసశ్చ సప్తమ్యాం భవేదుభయపక్షయోః, ఘృతాభిషేకమష్టమ్యాం కుర్యాద్భానోర్నరాధిప, గాం చ దద్యాద్ద్విజేశాయ తరుణీం నీలసంనిభామ్. ౧౬. ఇంద్రనీలప్రతీకాశై ర్విమానైః శిఖిసంయుతైః, గత్వాదిత్యపురం రమ్యం భోగాన్భుంక్తే యథేప్సితాన్. ౧౭. రాజేంద్ర ఫాల్గునే మాసి యః కుర్యాన్నక్తభోజనమ్, శ్యామాకక్షీరనీవారై ర్జితక్రోధో జితేన్ద్రియః. ౧౮. షష్ఠ్యాం వాప్యథ సప్తమ్యాముపవాసపరో

వసించి యష్టమినాఁడు పంచగవ్యఘృతాదులచేతఁ బుట్టమన్నుచే నావు పంచితముచే గోమయంబుచేతఁ బాలచెట్లచర్మంబులచేత నాదిత్యుని మహాస్నానముఁ జేయించి తుడువవలయును. పిమ్మట నీసూర్యునికొఱకు రక్తవర్ణమగుగోవును దాన మీయవలయును. అట్లుచేసినఁ బద్మరాగసదృశంబులును హస్తిసంయుతములు నగువిమానంబులతో రమ్యంబగు నాదిత్యపురంబునకుఁబోయి శాశ్వతవత్సరము లచట సంతోషించుచుండును. చైత్రమాసమున వరియన్నముఁ బాయసమును రాత్రియందు భుజించి జితేంద్రియుఁడై పాటలవర్ణంబగు తరుణగోవును భాస్కరున కొసంగవలయును. అట్లుచేసినఁ బుష్పరాగప్రభగల్గు హంసయానములచే సూర్యలోకంబుం జేరి శాశ్వతవత్సరము లచట సంతసించుచుండును వైశాఖమాసంబున రాత్రి భుజించి సూర్యునకుఁ బేరిననేతితో మిశ్రితమగు నైవేద్య మర్పించి యొక్కగోదానము సూర్యున కీయవలయు. నాచేఁ బ్రయుక్తుఁడై సామాన్యమగు నీవిధి నెవ్వఁడు చేయునో యాతఁడు శుద్ధస్ఫటికసన్నిభంబులగు బర్హివాహనంబులచే నణిమాదిగుణయుక్తుండై సూర్యునివలె దివంబున సంచరించుచుండును. శ్రావణమాసమున రాత్రులయందు క్షీరంబులు (ఆరునెలలవంటివి.) షష్టికధాన్యములతో వండిన యన్నము భుజించి సర్వసత్వంబులకు హితుఁడై భాస్కరునికొఱకుఁ బీత

---

నరః, అష్టమ్యాం తు మహాస్నానం పఞ్చగవ్యఘృతాదిభిః. ౧౯. వల్మీకజాదిమృద్భిశ్చ గోమూత్రశకృదాదిభిః, త్వగ్భిశ్చ క్షీరవృక్షాణాం స్నాపయిత్వా ప్రమార్జయేత్. ౨౦. సౌరభేయీం తతో దద్యాద్రక్తాభాం రక్తమాలినే, పద్మరాగప్రతీకాశైర్విమానైర్హస్తిసంయుతైః, గత్వాదిత్యపురం రమ్యం మోదతే శాశ్వతీః సమాః. ౨౧. మాసి చైత్రే తు సంప్రాప్తే యః కుర్యాన్నక్తభోజనమ్, శాల్యన్నం పాయసైర్యుక్తం భుఞ్జానశ్చ జితేంద్రియః, భానవే పాటలాం దద్యాద్ధేనుం తరుణీం నృప. ౨౨. పుష్పరాగప్రభైర్యానైర్హంసాహం సాదియాయిభిః, గచ్ఛేత్సూర్యపురం రమ్యం మోదతే శాశ్వతీః సమాః. ౨౩. వైశాఖే వీర మాసే తు యః కుర్యాన్నక్తభోజనమ్, సూర్యే ఖండాజ్య సంమిశ్రం సకృద్దద్యాన్నివేదనమ్. ౨౪. గాం చ దద్యాన్మహారాజ భాస్కరాయ శుభానన, సామాన్యం చ విధిం కుర్యాత్ప్రయుక్తో యో మయా తవ. ౨౫. శుద్ధస్ఫటికసంకాశైర్యానైర్బర్హిణవాహనైః, అణిమాదిగుణైర్యుక్తః సూర్యవద్విచరేద్దివి. ౨౬. సంప్రాప్తే శ్రావణే మాసి యః కుర్యాన్నక్తభోజనమ్, క్షీరషష్టికభక్తేన సర్వసత్వహితే రతః. ౨౭. పీతవర్ణాం చ

వర్ణగోవు దానముఁజేసి మిగిలిన విధానమంతను పూర్వోక్తముగ నాచరింప హంససారసగాములగు విచిత్రయానంబులచే నాదిత్యపురముం జేరి శ్రీమంతుఁడై పూర్వోక్తఫలముం బొందును. భాద్రపదమాసంబున రాత్రులయందు హుతశిష్టంబగు హవిస్సు భుజించి వృక్షమూలము నాశ్రయించినవాఁడై సర్వభూతానుగ్రహము గల్గి రాత్రి గృహంబున నిద్రింపవలయును. రోహిణియు శ్రేష్ఠంబు నగుగోవును సమర్పింపవలయును. అట్లుచేసి చంద్రకిరణంబులతోడను వజ్రవైడూర్యంబులతోడను సదృశంబులును చక్రవాకసమాయుక్తంబులును సర్వకామదంబులు నగు విమానముల నధిష్ఠించి సురాసురసేవితమగు నాదిత్యపురముం జేరి యాకల్పాంతము సంతసింపుచుండును. ఆశ్వయుజమాసంబున రాత్రులయందు మాత్రము మితమగు నాహారము భుజించుచు జితక్రోధుండును జితేంద్రియుండునై పద్మవర్ణయుక్తమగు గోవును భాస్కరునకు దానమొసఁగవలయును. మఱియు నాదానపశువు దివ్యాభరణభూషితంబును పయస్వినియుఁ దరుణియునై యుండవలయు. అట్లు చేసిన స్వస్తిమౌక్తికసదృశంబును నింద్రనీలమాణిక్యములచే నుపశోభితమునగు విమానమధిష్ఠించి భానుసాలోక్యముం బొందును. జ్వలనార్కసమప్రభంబగు గోవును దాన మొసఁగి పూర్వోక్తవిధినంతను నెరవేర్చిన సూర్యతుల్యుం

---

గాం దద్యాద్భాస్కరాయ మహాత్మనే, సామాన్యమఖిలం కుర్యాద్విధానం యత్ప్రకీర్తితమ్. ౨౮. స విచిత్రైర్మహాయానైర్హంససారసగామిభిః, గత్వాదిత్యపురం శ్రీమాన్పూర్వోక్తం లభతే ఫలమ్. ౨౯. వీర భాద్రపదే మాసి యః కుర్యాన్నక్తభోజనమ్, హుతశేషహవిష్యాశీ వృక్షమూలముపాశ్రితః. ౩౦. స్వప్యాదాయతనే రాత్రౌ సర్వభూతానుకమ్పకః, దద్యాద్గాం రోహిణీం శ్రేష్ఠాం భాస్కరాయ మహాత్మనే. ౩౧. నిశాకరకరప్రఖ్యైర్వజ్రవైదూర్యసన్నిభైః, చక్రవాకసమాయుక్తైర్విమానైః సార్వకామికైః. ౩౨. గత్వాదిత్యపురం రమ్యం సురాసురసువన్దితమ్, మోదతే స మహాభాగో యావదాభూతసంప్లవమ్. ౩౩. శ్రీమానాశ్వయుజే మాసి యః కుర్యాన్నక్తభోజనమ్, మితాశనం ప్రభుఞ్జానో జితక్రోధో జితేన్ద్రియః. ౩౪. దద్యాద్గాం పద్మవర్ణాభాం భానవేఽమితతేజసే, దివ్యాభరణసంపన్నాం తరుణీం చ పయస్వినీమ్. ౩౫. స్వస్తికమౌక్తికసంకాశైరింద్రనీలోపశోభితైః, జీవో జీవకసంయుక్తవిమానైః సార్వకామికైః, గచ్ఛేద్భానుసలోకత్వం భుఞ్జానః స జితేన్ద్రియః. ౩౬. దివాకరాయ గాం దద్యాజ్జ్వలనార్కసమప్రభామ్,

డగును. మఱియుఁ గాలానలజ్వాలాసన్నిభంబులును పర్వతోపమంబులు నారూఢసింహంబులు నగువిమానంబులచే సూర్యునివలె సౌఖ్యమందు చుండును. మార్గశీర్షమాసంబున క్షీరమిశ్రాన్నము రాత్రులయందు భుజించుచుఁ బగలు భుజింపక జితేంద్రియుఁడై నానాభరణభూషితంబును రక్తవర్ణయుక్తము నగుగోవును సూర్యున కిచ్చి పూర్వోక్తవిధి యాచరింప సితపద్మసదృశంబులు శ్వేతాశ్వరథయుక్తంబులు నగుయానంబులచే రమ్యంబగుసూర్యపురముం జేరి సర్వోత్కృష్టం బగుతేజంబున భాసిల్లును. అహింసయు, సత్యవచనము, నస్తేయము, నార్జవము, క్షమయు గల్గి యుభయపక్షసప్తములఁ ద్రిషవణాగ్నిహోమమును భూశయ్యయు రాత్రిభోజనము నిట్టి గుణములు గల్గి యీవ్రత మాచరింప సర్వరోగ నాశనంబును సర్వపాపభయధ్వంసంబును సర్వకామఫలప్రదంబును నై వ్రతసిద్ధి గల్గును. భానుసంబంధమగు పరమపదము నెవ్వఁడు కోరునో వాఁడు సూర్యవ్రతపరుఁడై యీనియమంబుల నాచరింపవలయును.

ఇది పంచషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

పూర్వోక్తం చ విధిం కుర్యాత్సూర్యతుల్యో భవేన్నరః. ౩౭. కాలానలశిఖప్రఖ్యై ర్మహాయానైర్నగోపమైః, మహాసింహకృతారోపైః సూర్యవన్మోదతే సుఖీ. ౩౮. మార్గశీర్షే శుభే మాసి యః కుర్యాన్నక్తభోజనమ్, యచ్చాన్నం పయసా యుక్తం భుఞ్జానః స జితేన్ద్రియః. ౩౯. ప్రయచ్ఛేద్గాం తథా రక్తాం నానాలంకారభూషితామ్, సూర్యాయ కురుశార్దూల విధిం చాపి సమాచరేత్. ౪౦. సితపద్మనిభైర్యానైః శ్వేతాశ్వరథసంయుతైః, గత్వా తత్ర పురే రమ్యే ప్రభయా పరయాన్వితః. ౪౧. అహింసా సత్యవచనమస్తేయం క్షాంతిరార్జవమ్, త్రిషవణాగ్నిహవనం భూశయ్యా నక్తభోజనమ్. ౪౨. పక్షయోరుభయోర్మార్గే సప్తమ్యాం కురునందన, ఏతాన్గుణాన్సమాశ్రిత్య కుర్వాణో వ్రతముత్తమమ్. ౪౩. సప్తమ్యోభయవిఖ్యాతం సర్వపాపభయాపహమ్, సర్వరోగప్రశమనం సర్వకామఫలప్రదమ్ ౪౪. ఇత్యేవమాదీన్నియమాంశ్చరేత్సూర్యవ్రతీ సదా, య ఇచ్ఛేద్విపులస్థానం భానోరమితతేజసః. ౪౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే ఉభయసప్తమీవర్ణనం నామ పంచషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

## షట్షష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. స్త్రీ సూర్యభక్తురాలైనయెడల పురుషుం డగును. స్త్రీ యుత్తముండగు బుత్త్రుని గోరునెడల నవియోగకరంబును, ధర్మార్థకామసాధకంబును, ప్రీతివర్ధకంబును నగు నిక్షుభార్కవ్రతమను నొండు గలదు. ఆవ్రతమును షష్ఠీసప్తములయందును, సంక్రమణముల యందు నుపవసించి చేయవలయును. హవిస్సుచే హోమముం జేయవల యును. తరువాతం గాంస్యమయముగాని, స్వర్ణమయముగాని, రజత మయముగాని నిక్షుభాదేవివిగ్రహముసుం జేసి ఘృతాదులచే నభిషేకింప వలయును. గంధపుష్పంబులచేతను, వస్త్రయుగ్మములచేత నలంకరించి యశేషభక్ష్యంబులచేతను, వితానధ్వజచామరములచేతను సత్కరించి సూర్యభక్తులను భుజింపఁజేసి శుక్లవస్త్రములచే నవగుంఠితులనుగం జేసి గృహమధ్యంబున నాప్రతిమ నుంచవలయును వితానచ్ఛత్రశోభితంబగు నాప్రతిమను శిరమునం దిడుకొని ధ్వజశంఖాదివిభవంబులతోం గూడ భగాలయంబునకుం బోయి యచ్చట నావ్రతమును బూర్తిచేసి యాపీఠం బున శోభాసమన్వితంబగు నాప్రతిమ నుంచవలయును. తరువాత సూర్యునకుం బ్రదక్షిణం బాచరించి నన్ను క్షమింపుమని వేడుకొనవల యును. అట్టివ్రతమును సమాప్తియొనర్చినయెడల ద్వాదశాదిత్యసన్ని

---

సుమంతురువాచ:—సూర్యభక్తా తు యా నారీ ధ్రువం సా పురుషో భవేత్, స్త్రీ పుత్రముత్తమం సా చేత్కాంక్షతే శృణు తద్వ్రతమ్. ౧. నిక్షుభార్కాఖ్యమాఖ్యాతం సదా ప్రీతివివర్ధనమ్, అవియోగకరం వీర ధర్మకామార్థసాధకమ్. ౨. సప్తమ్యామథ షష్ఠ్యాం వా సంక్రాంతౌ చ రవేర్దినే, హవిషా హవిర్హోమం తు సోపవాసః సమాచరేత్. ౩. నిక్షుభాం కాంస్యనిష్పన్నాం కృత్వా స్వర్ణమయీం శుభామ్, రాజతీం వాథ వా వర్షం స్నాపయేచ్చ ఘృతాదిభిః. ౪. గంధమాల్యైరలంకృత్య వస్త్రయుగ్మైశ్చ శోభనైః, భక్ష్యభోజ్యైరశేషైశ్చ వితానధ్వజచామరైః. ౫. భోజయేత్సూర్యభక్తాంశ్చ శుక్లవస్త్రావగుణ్ఠితాన్, కృత్వాయతనమధ్యే తు ప్రతిమాముపకల్పయేత్. ౬. కృత్వా శిరసి తత్పాత్రం వితానచ్ఛత్రశోభితమ్, ధ్వజశంఖాదివిభవైర్భగస్యాయతనం నయేత్. ౭. నిక్షుభార్క దినేశస్య వ్రత మేతన్నివేదయేత్, తత్పిండ్యాం స్థాపయేత్పాత్రముపశోభాసమన్వితమ్. ౮. ప్రదక్షిణీకృత్య రవిం ప్రణిపత్య క్షమాపయేత్, సమాప్య తద్వ్రతం పుణ్యం శృణు యాత్ఫలమశ్నుతే. ౯. ద్వాదశాదిత్యసంకాశైర్మహాయానైర్నగోపమైః, యథేష్టం

భంబులగు మహాయానంబులచే యథేచ్ఛంబుగ భానులోకంబున సౌరులతోఁగూడఁ బ్రమోదమును బొందును. వేయికోట్ల సంవత్సరంబులు విష్ణులోకంబున వెలుంగుచుండును. తరువాతఁ గర్మవిశేషంబుచే సర్వకామసమన్వితంబగు బ్రహ్మలోకంబునకుఁ బోయి యుత్కృష్టసుఖంబులఁ బొందును. బ్రహ్మలోకభ్రష్టుండై శ్రీమంతుఁడును సురపూజితుండునై ప్రజాపతిత్వముఁ బొంది యిహపరలోకంబులఁ జాలకాల మనుభవించి పిమ్మట చంద్రలోకమునఁ బ్రకాశించుచుండును. అచ్చటనుండి యింద్రలోకంబున కేగి యచ్చట ప్రభువై యుండును. అచ్చటనుండి గంధర్వలోకమును బొంది సుఖించును. తరువాత ధర్మశేషంబుచే నాదిత్యభక్తుఁడై స్వకర్మప్రేరితుఁడై మఱల శుభకర్మలఁ జేయుట కుద్యోగించును. శుభంబువలన మఱల నిచ్చటకువచ్చి యనేకపర్యాయములు కర్మచే భ్రమించుచుండును. సర్వకర్మలయందలి నిష్ఫలత్వబుద్ధిచే వైరాగ్యమును, వైరాగ్యమువలన జ్ఞానమును, జ్ఞానమువలన యోగమును, యోగంబువలన నత్యంతదుఃఖధ్వంసము గల్గును.

ఇది షట్షష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

భానవే లోకే సౌరైః సార్ధం ప్రమోదతే. ౧౦. వర్షకోటిసహస్రాణి వర్షకోటిశతాని చ, నందతేఽసౌ మహాభాగ విష్ణులోకే మహీయతే. ౧౧. తతః కర్మవిశేషేణ సర్వకామసమన్వితమ్, బ్రహ్మలోకం సమాసాద్య పరం సుఖమవాప్నుయాత్. ౧౨. బ్రహ్మలోకాత్పరిభ్రష్టః శ్రీమాన్సురసుపూజితః, ప్రజాపతిమవాప్నోతి సురాసురనమస్కృతః. ౧౩. లోకానిహ చిరం భుక్త్వా సోమలోకే మహీయతే, సోమాదైంద్రం పునర్లోకమాసాద్యేంద్రపతిర్భవేత్. ౧౪. ఇంద్రలోకాచ్చ గంధర్వలోకం ప్రాప్య స మోదతే, తతస్తద్ధర్మశేషేణ భవత్యాదిత్యభావితః. ౧౫. స్వకర్మభావనోద్యోగాత్పునః ప్రారభతే శుభమ్, శుభాచ్చ పునరేత్యేహ స యాత్యతిసహస్రశః. ౧౬. యావన్నాప్నోతి మరణం తావద్భ్రమతి కర్మణా, సునిర్వేదాత్సువైరాగ్యం వైరాగ్యాజ్జ్ఞానసంభవః. ౧౭. జ్ఞానాత్ప్రవర్తతే యోగో యోగాద్దుఃఖాంతమాప్నుయాత్. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే నిక్షుభావ్రతవర్ణనం నామ
షట్షష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

## సప్తషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. షష్ఠీసప్తమీతిథులయందు బ్రహ్మచారిణీ వ్రతస్థయై జిగీషచే నొకసంవత్సరము భోజనము చేయకయుండి వర్షాంతంబున నిక్షుభాదేవిప్రతిమనుఁజేసి పూర్వోక్తరూపంబుగ స్నానాదివిధులం జల్పి పూర్వోక్తగుణంబులంబొంది సువర్ణమయంబులగు యానంబులతోఁ జతుర్ద్వారాలంకృతంబగు నాదిత్యపురంబున కేగి యశేషఫలంబులఁ బొందును సౌరాదిసర్వలోకంబులయందును నీప్సితంబులగు భోగంబుల ననుభవించి క్రమంబుగ వచ్చి యీలోకంబున రాజగుభర్తను బొందును. ఏస్త్రీ యొకకృష్ణసప్తమినాఁడు మాత్ర మీప్రకార ముపవసించునో యాస్త్రీ యమితతేజస్కుండగుభానునిపరమపదమును బొందును. వర్షాంతమున వరిపిండితో శుభంబగు ప్రతిమను జేసి పీతాను లేపనంబులచేతను, మాల్యంబులచేతను, పీతవస్త్రంబులచేతను బూజించి పూర్వము జెప్పిన విధినంతను జేసి భాస్కరునకు నివేదింపవలయును. అట్లుచేసిన భయంకరంబులును సువర్ణకాంతిమంతంబులు నగుసప్తయానంబులతో సూర్యలోకంబున కేగి యచ్చట నూరుకోట్లసంవత్సరంబులు సంపూర్ణముగ నివసించును. సౌరాదిలోకములయందలి భోగముల ననుభవించి క్రమంబుగ నీలోకంబునకు వచ్చి సర్వలక్షణసంపన్నుఁడును ధనధాన్యసమన్వితుండును

---

సుమంతురువాచ:—షష్ఠ్యాం చాప్యథ సప్తమ్యాం నియతా బ్రహ్మచారిణీ, వర్షమేకం న భుంక్తే యా మహాభాగజిగీషయా. ౧. వర్షాంతే ప్రతిమాం కృత్వా నిక్షుభాంకేతి విశ్రుతామ్, స్నానాద్యం చ విధిం కృత్వా పూర్వోక్తం లభతే గుణమ్. ౨. జాంబూనదమయైర్యానై శ్చతుర్ద్వారై రలంకృతే, గత్వాదిత్యపురే రమ్యే అశేషం విందతే ఫలమ్. ౩. సౌరాదిసర్వలోకేషు భోగాన్ భుక్త్వా యథేప్సితాన్, క్రమాదాగత్య లోకేఽస్మిన్రాజానం పతిమాప్నుయాత్. ౪. యా నార్యుపవసేదేవం కృష్ణామేకాం తు సప్తమీమ్, సా గచ్ఛేత్పరమం స్థానం భానోరమితతేజసః. ౫. వర్షాంతే ప్రతిమాం కృత్వా శాలిపిష్టమయీం శుభామ్, పీతానులేపనైర్మాల్యైః పీతవస్త్రైశ్చ పూజయేత్, పూర్వోక్తమఖిలం కృత్వా భాస్కరాయ నివేదయేత్. ౬. సప్తభీర్మైర్మహాయానైర్దంతిచామీకరప్రభైః, వర్షకోటిశతం సాగ్రం సూర్యలోకే మహీయతే. ౭. సౌరలోకాదిలోకేషు భుక్త్వా భోగాన్నరాధిప, క్రమాదాగత్య లోకేఽస్మిన్యథేష్టం

నగుభర్తను బొందఁగల్గును. రాజా! యేస్త్రీయైనను కృష్ణసప్తమియందు దృఢవ్రతయై సర్వభోగంబుల వర్జించి ఒక్కసంవత్సర ముపవాసముఁ జల్పి వర్షాంతంబున సర్వగంధాఢ్యంబగు నిక్షుభాప్రతిమనుజేసి మగ పత్నిని సువర్ణమణిముత్యంబులచేఁ దృప్తిపరచి భుజింపఁజేసినయెడల దివ్య గాంధర్వశోభితంబులగు విచిత్రమహాయానంబులతో సూర్యలోకంబు నకుంబోయి కొన్నివేలయుగంబు లచ్చట నివసించును. యథేష్టంబుగ భానులోకంబున సమస్తభోగముల ననుభవించి మఱల నీలోకంబునకు వచ్చి ప్రభువగుపతిని బడయఁగలదు. ఇ ట్లేవనిత సర్వపాపభయధ్వంసకం బగు నిక్షుభార్కం బనువ్రతమునుఁ జేయునో యావనిత పరమపదముఁ బొందును. కురునందనా! ఒకసంవత్సరము శ్రద్ధతోఁగూడియుండి సంవత్స రాంతంబున భోజకదంపతులను భుజింపఁజేయవలయును. తరువాత గంధ మాల్యంబులచేతను వస్త్రాలంకారములచేతను బూజించి తామ్రపాత్ర మున వజ్రాలంకృతంబును సువర్ణమయంబు నగునిక్షుభాప్రతిమ నాదంప తులకు దానమొసంగవలయును. యథాశక్తిగ దక్షిణనుగూడ సమ ర్పింపవలయును. ఈభోజకవనిత నిక్షుభయనియు భోజకుఁడు అర్కుఁ

---

విందతే పతిమ్, సర్వలక్షణసంపన్నం ధనధాన్యసమన్వితమ్. ౮. కృష్ణపక్షే తు సప్తమ్యాం యా నారీ తు దృఢవ్రతా, వర్ష మేకముపవసేత్సర్వభోగవివర్జితా. ౯. వర్షాంతే సర్వ గంధాఢ్యం నిక్షుభార్కం నివేదయేత్, సువర్ణమణిముక్తాభ్యాం భోజయిత్వా మగాంగ నామ్. ౧౦. సువిచిత్రైర్మహాయానైర్దివ్యగంధర్వశోభితైః, సా వై యుగసహస్రాణి సూర లోకే నరాధిప. ౧౧. యథేష్టం భానవే లోకే భోగాన్భుక్త్వా తు కృత్స్నశః, క్రమా దాగత్య లోకేఽస్మిన్రాజానం విందతే పతిమ్.౧౨. ఏవం యా కురుతే రాజన్వ్రతం పాప భయాపహమ్, నిక్షుభార్కమిదం పుణ్యం సా యాతి పరమం పదమ్. ౧౩. వర్ష మేకం మహాబాహో శ్రద్ధయా పరయాన్వితః, వర్షాంతే వై భోజయేద్వీర దాంపత్యం భోజ కేషు వై. ౧౪. భోజయిత్వా తు దాంపత్యం భోగకానాం మహాబలైః, పూజయే ద్గంధమాల్యైస్తు వాసోభిః కురునందన. ౧౫. కృత్వా తామ్రమయే పాత్రే వజ్ర పూర్ణైరలంకృతమ్, నిక్షుభార్కం తు సౌతువర్ణం దత్వా తాభ్యాం తు శక్తితః. ౧౬. నిక్షుభా భోజికా జ్ఞేయా భోజకోఽర్కః ప్రకీర్తితః, తస్మాత్తౌ పూజయేత్సౌరీశ్వర

డనియుఁ జెప్పఁబడియుండెను. కాన సూర్యభక్తు లెల్లప్పుడును సూర్యుని వలెనే యాభోజకులను శ్రద్ధతోఁ బూజింపవలయును.

ఇది సప్తషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

## అష్టషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

సూతుం డిట్లనియె. ఏవనితయేని కార్తికమాసమున బ్రహ్మచారిణీ వ్రతస్థయై యొకపూట యాహారముమాత్రము భుజించుచు బెల్లము నెయ్యి వీటిచే మిశ్రితంబగునన్నమును భాస్కరునకు నుభయపక్షము లందును శ్రద్ధావతియై నివేదించి కరవీరపుష్పంబులను నాజ్యసహితంబగు గుగ్గిలమును సమర్పించి సప్తమీరోజునఁగాని షష్ఠిరోజునఁగాని యుప వసించినయెడల నింద్రనీలసదృశంబులును, సర్వకామప్రదంబులు నగు విమానముల నధిష్ఠించి పదిలక్షలయేండ్లు సూర్యలోకంబున విరాజిల్లు చుండును. ఆరీతిగనే సర్వలోకములయందు భోగములఁబొంది తర్వాత నీలోకంబునకువచ్చి యనుపముం డగుభర్తను బొందును. ఈరీతిగ సర్వ యజ్ఞములందును విధి సమానమని చెప్పఁబడును ఏకభుక్తముగూడ నుప వాసమునకు సదృశమే యగును. క్షమ, సత్యము, దయ, దానము,

---

వచ్ఛ్రద్ధయాన్వితః. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్థసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు నిక్షుభార్కవ్రతం నామ సప్తషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

---

సురుంతురువాచ:—ఏకభక్తేన యా నారీ కార్తికం క్షపయేన్నృప, క్షమా హింసాదినియమైః సంయతా బ్రహ్మచారిణీ. ౧. గుడాజ్యమిశ్రం శాల్యన్నం భాస్క రాయ నివేదయేత్, పక్షయోరుభయోస్తాత శ్రద్ధయా పరయాన్వితా. ౨. పుష్పాణాం కరవీరాణాం గుగ్గులం సాజ్యమాదిశేత్, సప్తమ్యాం తాత షష్ఠ్యాం వై ఉపవాసరతి ర్భవేత్. 3. ఇంద్రనీలప్రతీకాశైర్విమానైః సార్వకామికైః, వర్షాయుతశతం సాగ్రం సూరలోకే మహీయతే. ౪. తథా చ సర్వలోకేషు భోగమాసాద్య యత్నతః, క్రమాదా గత్య లోకేఽస్మిన్నభీష్టం విందతే పతిమ్.౫.ఇత్యేవం సర్వయజ్ఞేషు విధిస్తుల్యః ప్రకీర్తితః, ఏకభక్తోపవాసస్య ఫలం చ సదృశం భవేత్. ౬. క్షమా సత్యం దయా దానం శౌచ

శౌచము, ఇంద్రియనిగ్రహము, సూర్యపూజనము, అగ్నిహోమము, సంతోషము, అచౌర్యము నను ఈపదిధర్మములు సర్వవ్రతసాధారణం బులు. మాసవ్రతంబును గురించి మాసముల నిశ్శేషముగఁ జెప్పెదను. మార్గశీర్షమాసమున వ్యోమపృష్ఠమున నిర్మించిన నిక్షుభార్కప్రతిమను గంధమాల్యంబులచే నలంకరించి తామ్రపాత్రయందుంచిన నప్సరోగణ ములతోఁగూడ మేరుపర్వతమగు సూర్యలోకంబునఁ బదివేలేండ్లు ప్రకా శించుచుండును. సర్వదేవసమూహములందును స్వచ్ఛంబగుయశమును లక్ష్మిని సంపాదించి మరల నీలోకంబున కరుదెంచి రాజును భర్తగాఁ బొందఁగలదు తరువాత నీప్రతిమను పుష్పంబులచేఁ బూజించి భాను నకు నివేదింపవలయును శుభాసనయుక్తంబును సమంబునగు నాప్రతి మను కాంస్యపాత్రమునందైనను లేక తామ్రపాత్రయందైన నునిచి నివే దింపవలయును. అట్లు నివేదించిన దివ్యగంధము ప్రవహించుపుష్పక విమానముచే దశసహస్రవిస్తీర్ణంబగు మేరుపర్వతమునందు సూర్యలోకం బున నివసించును. సర్వలోకంబులయందును భోగంబుల ననుభవించి క్రమంబుగ నీలోకంబున కేతెంచి యిష్టుండగుపతిని బొందును. మాఘ మాసమున రథము నశ్వయుక్తముగ దీపమాల్యాలంకృతంబుగ బిష్టసాను

---

మింద్రియనిగ్రహః, సూర్యపూజాగ్నిహవనం సంతోషః స్తేయవర్జనమ్. ౭. సర్వవ్రతే ష్వయం ధర్మః సామాన్యో దశధా స్మృతః, నిఃశేషమహం వక్ష్యామి మాసాన్మాసవ్రతం ప్రతి. ౮. మార్గశీర్షే శుభే మాసి వ్యోమపృష్ఠే వినిర్మితమ్, గంధమాల్యైరలంకృత్య శుభాననమనోపమమ్. ౯. తామ్రపాత్రాదికైశ్చైవాప్యప్సరోగణసేవితైః, సుమేరౌ దశసాహస్రే సూర్యలోకే మహీయతే. ౧౦. సర్వదేవకదంబేషు సంప్రాప్య విమలాం శ్రియమ్, క్రమాదాగత్య లోకేఽస్మిన్రాజానం పతిమాప్నుయాత్, పుష్పైరము మలంకృత్య భానవే వినివేదయేత్ ౧౧. గంధమాల్యైరలంకృత్య శుభాననమనోపమమ్, తామ్రపాత్రాదికాంస్యం వా కృత్వా తత్ర నివేదయేత్. ౧౨. మహాపుష్పకయానేన దివ్యగంధప్రవాహినా, సుమేరౌ దశసాహస్రం సూర్యలోకే మహీయతే. ౧౩. భుక్త్వా తు విపులాన్భోగాన్సర్వలోకేషు భారత, సంప్రాప్యైతం క్రమాల్లోకం యథేష్టం విందతే పతిమ్. ౧౪. మాఘే. రథమశ్వయుజం దీపమాల్యవిభూషితమ్, పిష్టసానుసమా

యుక్తంబుగఁ జేసి యాగృహమునకుఁ దీసికొనిపోవలయును. అట్లుచేసిన మహారథసదృశంబులగు శ్వేతాశ్వయానంబులతో నూరయుతవత్సరంబులు సంపూర్ణముగ సూర్యలోకంబున నుండును. సర్వలోకంబులయందును సర్వదేవతలలో నీప్సితంబులగు భోగంబుల ననుభవించి మఱల నీలోకంబునకు వచ్చి యిష్టార్థసంపాదకుం డగుపతిని బడయఁగలదు. ఫాల్గునమాసంబునఁ బిష్టమయంబగు భాస్కరప్రతిమనుజేసి గంధమాల్యంబులచే నలంకరించి భాస్కరాలయమున స్థాపించినయెడల గీతనాదయుక్తంబులు నసదృశంబులగు యానంబులచే సూర్యలోకంబున వెలుంగుచుండును సర్వాభిమతంబగు నీలోకంబున నీప్సితంబులగు భోగంబుల ననుభవించి మఱల నీలోకంబునకు వచ్చి యిష్టుండగువరుని బొందఁగల్గును. చైత్రమాసంబున నరుణుని నిర్మించి గంధమాల్యోపశోభితునిగఁ జేసి కాంస్యపాత్రమునందుఁ గాని లేక తామ్రపాత్రయందైననునిచి భాస్కరున కర్పించిన సర్వకామప్రదంబులును శరత్కాలచంద్రసదృశంబులును నగువిమానంబులతో సూర్యలోకంబునకుఁ బోయి నూరయుతవత్సరంబులు సమగ్రంబుగ సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. కర్మక్షయంబువలన నీలోకంబున కేతెంచి అభీష్టుం డగుభర్తను, పుత్రపౌత్రాదిసంతానమును బొంది దుర్లభంబులగు సర్వభోగంబుల ననుభవించును. బియ్యపుపిండిచేతను, కందిపిండిచేతను, నితుభార్కయుక్తం

యుక్తం కృత్వాయతనమానయేత్. ౧౫. మహారథోపమైర్యానైః శ్వేతాశ్వవరసంయుతైః, వర్షాయుతశతం సాగ్రం సూర్యలోకే మహీయతే. ౧౬. సర్వామరాణాం లోకేషు ప్రాప్య భోగాన్యథేప్సితాన్, క్రమాదాగత్య లోకేఽస్మిన్యథేష్టం పతిమాప్నుయాత్. ౧౭. ప్రతిమాం ఫాల్గునే మాసి కృత్వా పిష్టమయీం రవేః, గంధమాల్యైరలంకృత్య స్థాపయేద్భాస్కరాలయే. ౧౮. యానైరప్రతిమైర్దివ్యైర్గీతనాదసమాకులైః, సుమేరా దశసాహస్రం సూర్యలోకే మహీయతే. ౧౯. సర్వాభిమతలోకేఽస్మిన్ప్రాప్య భోగాన్యథేప్సితాన్, పునరేత్య ఇమం లోకం యథేష్టం విందతే పతిమ్. ౨౦. కృత్వారుణం తథా చైత్రే గంధమాల్యోపశోభితమ్, స్థాప్య పాత్రే యథోక్తే తు భాస్కరాయ నివేదయేత్. ౨౧. శరదిందుప్రతీకాశైర్విమానైః సార్వకామికైః, వర్షాయుతశతం సాగ్రం సూర్యలోకే మహీయతే. ౨౨. కర్మక్షయాదిహాగత్య పుత్రపౌత్రసమన్వితం, అభీష్టం పతిమాసాద్య లభేద్భోగాన్ సుదుర్లభాన్. ౨౩. తండులాఢకపిష్టేన కృత్వా

బును, సర్వధాతుభూషితంబును, ననేకాలంకారసంవృతంబును, నానా మాల్యభూషితంబును, సర్వరత్నయుక్తంబగు మేరుపర్వతముఁ జేసి భాస్కరాలయమున స్థాపింపవలయును. ఈమహాద్వ్యోమవ్రతమును వైశాఖమాసమున నెవ్వ రాచరింతురో వారు నానావిధంబులగు యానంబులచే సూర్యలోకంబున నశేషభోగంబుల ననుభవించి మఱల నీలోకంబునకు వచ్చి రాజగుపతినిఁ బడయుదురు. ఆషాఢమాసమునఁ బూర్వోక్త పిష్టమును సర్వబీజరసంబులచేఁ దడిపి శుభలక్షణయుక్తంబగుపద్మమును రచించి భాస్కరాలయమున స్థాపించిన నీయానములచేతఁగాని బంగారు వాహనంబులతోఁగాని సర్వభోగాన్వితంబులగు వాహనంబులచేఁగాని సూర్యలోకమున కేగి నూరుకోట్లయేండ్లు పూజలందును. సర్వలోకంబుల యందును క్రమంబుగ భోగంబుల నన్నింటి ననుభవించి సర్వభోగ సంపన్నుఁడును యౌవనవంతుఁడు నగుభర్తను బొందును. శ్రావణ మాసంబున సర్వధాతుయుక్తంబును, విచిత్రధ్వజనిర్మితంబును, తిలనిర్మితంబు నగుమేరుపర్వతమును భాస్కరాలయమున నివేదింపవలయును. నివేదించినచో సర్వవర్ణవిభూషితంబులును, స్వేచ్ఛాగాములు నగువిమానంబులచే నూరుకోట్లసంవత్సరంబులు పూర్ణముగ సూర్యలోకంబునుండి యాశ్చర్యజనకంబులగు సర్వభోగంబులం బొంది యీలోకంబునకు వచ్చి

---

వై మేరుపర్వతం, నిత్యభాస్కరసమాయుక్తం సర్వధాతువిభూషితమ్. ౨౪. నానాలంకారసంపన్నం నానామాల్యవిభూషితం, సర్వరత్నసమాయుక్తం స్థాపయేద్భాస్కరాలయే. ౨౫. మహాద్వ్యోమవ్రతం హ్యేతద్వైశాఖే యః సమాచరేత్, నానావిధైశ్చ యానైస్తు సూర్యలోకే మహీయతే. ౨౬. సౌరాదిసర్వలోకేషు భుక్త్వా భోగానశేషతః, క్రమాదాగత్య లోకేఽస్మిన్ రాజానం పతిమాప్నుయాత్. ౨౭. ద్వితీయం చ తథా పద్మమాషాఢే పిష్టముత్తమం, సర్వబీజరసైః పూర్ణం కృత్వా తు శుభలక్షణం, నానా కేశరగంధాఢ్యం సర్వరత్నవిభూషితమ్. ౨౮. ఏతైర్వా హైమభిర్యానైః సర్వభోగాన్వితైర్నృప, వర్షకోటిశతం సాగ్రం సూర్యలోకే మహీయతే. ౨౯. భుక్త్వా తు విపులాన్భోగాన్సర్వలోకేష్వనుక్రమాత్, ప్రాప్తా తు సర్వభోగాఢ్యం తరుణం విందతే పతిమ్. ౩౦. సర్వధాతుసమాకీర్ణం విచిత్రధ్వజశోభితం, నివేదయేత సూర్యాయ శ్రావణే తిల పర్వతమ్. ౩౧. స్వచ్ఛందగామిభిర్యానైర్నానావర్ణవిభూషితైః, వర్షకోటిశతం సాగ్రం సూర్యలోకే మహీయతే. ౩౨. సంప్రాప్య వివిధాన్భోగాన్మహాశ్చర్యసమన్వితాన్,

రాజును భర్తనుగాఁ బడయఁగల్గును. భాద్రపదమాసమునందు వితాన ధ్వజఛత్రయుక్తంబును, నానామాలావిభూషితంబు నగుశాలిమయ వ్యోమను నిర్మించి భాస్కరాలయమున నునిచినఁ దరుణార్కసన్నిభంబు లగు యానంబులతో వేయికోట్లవత్సరంబులు సూర్యలోకంబున నుండఁ గల్గును. అచ్చట దేవసంభవంబు లగుభోగంబుల నన్నింటినిఁ బొంది యీలోకంబున రాజగుభర్తను బొందును. ఆశ్వయుజమాసమున ధాన్య పర్వతమును సువర్ణవస్త్రగంధయుక్తముగ భాస్కరునకు నివేదించిన నుత్కృష్టభోగసమన్వితంబులును సూర్యసంబంధంబులు నగుమహా యానంబులతో వేయికోట్లవత్సరంబులు సూర్యలోకంబున వర్తించును. సూర్యలోకాదిలోకంబులయం దీప్సితంబు లగుభోగంబుల ననుభవించి యీలోకంబునకు వచ్చి రాజును భర్తనుగాఁ బొందును. చంద్రాగ్ని భాస్కరులతో సమానమగు తేజముగలపతిని బొందును. పురుషులు స్త్రీలు నపుంసకులుగాని యేయేకామములను మనములం దిడుకొని భాస్కరుని భక్తితో నీపూర్వోక్తరీతిగఁ బూజించుచుందురో యాకోర్కెల నన్నింటిని బొందఁగలరు.

ఇది అష్టషష్ట్యుత్తరశతతమాధ్యాయము.

---

క్రమాల్లోకమిమం ప్రాప్య రాజానం విందతే పతిమ్. ౩౩. కృత్వా భాద్రపదే మాసి వ్యోమ శాలిమయం నృప, వితానధ్వజఛత్రాఢ్యం నానామాలావిభూషితమ్. ౩౪. తరుణార్కకరప్రఖ్యైర్మహాయానైః సుశోభనైః, వర్షకోటిసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౩౫. సంప్రాప్య వివిధాన్భోగాన్ త్సర్వాన్నిమిషసంభవాన్, క్రమాదాగత్య లోకేఽస్మిన్రాజానం విందతే పతిమ్. ౩౬. కృత్వా చాశ్వయుజే మాసి విపులం ధాన్య పర్వతం, సువర్ణవస్త్రగంధాఢ్యం భాస్కరాయ నివేదయేత్. ౩౭. సావిత్రైశ్చ మహాయానైర్వరభోగసమన్వితైః, వర్షకోటిసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౩౮. సూర్యలోకాదిలోకేషు భుక్త్వా భోగాన్యథేప్సితాన్, అస్మింల్లోకే చ సంప్రాప్తా రాజానం విందతే పతిం, చంద్రాగ్నిభాస్కరాణాం తు కాంతితేజఃప్రభాన్వితమ్. ౩౯. యంయం కామం సముద్దిశ్య నరనారీనపుంసకాః. పూజయంతి రవిం భక్త్యా తత్సర్వం ప్రాప్నువంతి హి. ౪౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు కామప్రదస్త్రీవ్రతవర్ణనం నామ
అష్టషష్ట్యుత్తరశతతమోఽధ్యాయః.

## ఏకోనసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! మృణ్మయముగాని, దారుమయము గాని లేక పక్వేష్టికామయముగాని యగుమఠమునో గృహమునో నిర్మించి సర్వోపకరణయుక్తంబుగను సర్వధాన్యోపేతంబుగను జేసి సూర్యదేవున కొసంగిన సర్వకామంబులఁ బొందఁగల్గును. హేమంతంబున మాఘమాసంబున నేకభుక్తంబుఁజేసి మాసాంతమునఁ జిత్రవస్త్రోపశోభితం బగురథమును నిర్మించి యారథంబునకు నాల్గుశ్వేతహయంబుల నిర్మించి శ్వేతంబులగు ధ్వజపతాకలచేతను, ఛత్రచామరంబులచేతను, దర్పణం బులచేత నలంకరించి వరిపిండిచే భాస్కరప్రతిమను జేసి యాప్రతిమను సంజ్ఞాదేవితోఁగూడ రథమధ్యంబున నునిచి రాత్రియందు శంఖభేర్యాది నిస్వనంబులతో రాజమార్గంబున నూరేగించి తరువాత సూర్యాలయ మునఁ బ్రవేశపెట్టవలయును ఆదేవాలయమునందు జాగరముచేసి దీపావలులచేతను, పూజలచేతను, దృశ్యములచేతను, దానంబులచేతను రాత్రినంతను గడుపవలయును. ప్రాతఃకాలమున మధుక్షీరఘృతంబు లచే నభిషేకముఁజేసి దీనాంధకృపణులకు యథాశక్తి దక్షిణసహితంబుగ భోజనములనుబెట్టి సువాహనోపేతంబగురథమును భాస్కరునకు నివే దింపవలయును. బంధువులతోఁ గూడ భుజించి యర్కగృహంబునకు నమస్కరించి యరుగవలయును. సర్వవ్రతంబులలో నుత్తమంబగు నీ

---

సుమంతురువాచ.—మృన్మయం దారుజం శైలం పక్వేష్టకమథాపి వా, కృత్వా మఠం గృహం వాపి యథా విభవసంభవాత్. ౧. సర్వోపకరణోపేతం సర్వ ధాన్యసమన్వితం, సూర్యాయేత్థం గృహం దద్యాత్సర్వాన్కామానవాప్నుయాత్. ౨. కృత్వైకభక్తం హేమంతే మాఘమాసమతంద్రితః, మాసాంతేన రథం కుర్యాచ్చిత్ర వస్త్రోపశోభితమ్. ౩. శ్వేతైశ్చతుర్భిః సంయుక్తం తురంగైః సమలంకృతం, శ్వేతధ్వజ పతాకాభిశ్ఛత్రచామరదర్పణైః. ౪. తండులాఢకపిష్టేన కృత్వా భానుం నరాధిప, విన్యస్య తం రథోపస్థే సంజ్ఞయా సహ భూపతే. ౫. తం రాత్రౌ రాజమార్గేణ శంఖ భేర్యాదినిస్వనైః, భ్రమయిత్వా శనైః పశ్చాత్సూర్యాయతనమావిశేత్. ౬. తత్ర జాగర పూజాభిః ప్రదీపావలిశోభితైః, ప్రేక్షణీయైః ప్రదానైశ్చ క్షపయిత్వా శనైః క్షపామ్. ౭. ప్రభాతే స్నపనం కృత్వా మధుక్షీరఘృతేన చ, దీనాంధకృపణేభ్యోఽన్నం యథాశక్త్యా చ దక్షిణామ్. ౮. రథం సంవాహనోపేతం భాస్కరాయ నివేదయేత్, భుక్త్వా చ బాంధవైః సార్ధం ప్రణమ్యార్కగృహం వ్రజేత్. ౯. సర్వవ్రతానాం

సూర్యవ్రతమును మంత్రధర్మాన్వితుండై సర్వకామ్యార్థసిద్ధికొఱకు నొనర్చిన సర్వవ్రతంబులయం దేపుణ్యముగల్గునో సర్వయజ్ఞములయం దేఫలము గల్గునో యాఫలమునంతను నీరథముచే సంపాదింపనగును. పదివేల సూర్యులతో సమానంబులగు విమానంబులతో సూర్యలోకంబునకుఁ బోయి సర్వకామంబులం బొంది యిరువదియొక్క పురుషాంతరములతోఁ గూడ సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. తరువాత క్రమంబుగ నన్నిలోకంబులయందును నూఱయుతకల్పంబులు విస్తారభోగంబుల ననుభవించి మఱల భూలోకంబున ధార్మికుండగు రాజగును పంచబలియుక్తంబులును, మృదువులును, వాస్తుషట్కకల్పితంబులును, సర్వోపకరణయుక్తంబులును నగు సంజ్ఞాసూర్యులవిగ్రహములఁ జేయవలయును. సంజ్ఞాయుక్తంబును, పిష్టభాగయుక్తంబు నగునీసూర్యప్రతిమను సౌరజ్ఞానతత్వజ్ఞుండును, దయాన్వితుండును నగు నాచార్యు నర్చించి యాతనికి సమర్పించి తరువాత నశేషంబులగు భక్ష్యభోజ్యంబులఁ గుడువంబెట్టి శయ్య నర్పింపవలయును. అట్లొనర్చి ఆశయ్యయందలి ఉన్ని వస్త్రములసంఖ్య యెంతగా నుండునో యన్నివేలవత్సరంబులు సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. సూర్యలోకము మొదలగులోకము లన్నింటిలో నశేషభోగంబుల ననుభవించి క్రమంబుగ నీలోకంబున కేతెంచి ధార్మికుండగు రాజగును. పదిగోవులతోఁగూడ నొక్కవృషభమును

---

ప్రవరం మంత్రధర్మాన్వితః సదా, వ్రతం సూర్యవ్రతం నామ సర్వకామార్థసిద్ధయే. ౧౦. సర్వవ్రతేషు యత్పుణ్యం సర్వయజ్ఞేషు యత్ఫలం, సర్వం సూర్యరథేనేహ తత్పుణ్యం లభతే నృప. ౧౧. సూర్యాయుతప్రతీకాశైర్విమానైః సార్వకామికైః, త్రిసప్తకులజైః సార్థం సూర్యలోకే మహీయతే. ౧౨. భుక్త్వా తు విపులాన్భోగాన్సర్వలోకేష్వనుక్రమాత్, కల్పాయుతశతం సాగ్రం తతో రాజా భవేత్క్షితౌ. ౧౩. పంచబలిసమాయుక్తం మృదుషడ్వాస్తుకల్పితం,సర్వోపకరణోపేతం సూర్యం సంజ్ఞాం ప్రకల్పయేత్. ౧౪. సంజ్ఞాదేవీసమాయుక్తం పైష్టాంశాఢ్యం నివేదయేత్, సౌరజ్ఞానార్థతత్వజ్ఞమాచార్యముదయాన్వితమ్. ౧౫. సంపూజ్య గంధపుష్పాద్యైర్వస్త్రాలంకారచామరైః, భక్ష్యభోజ్యైరశేషైశ్చ తతః శయ్యాం నివేదయేత్. ౧౬. తదూర్ణాతూలవస్త్రాణాం పరిసంఖ్యా తు యావతీ, తావద్వర్షసహస్రాణి సూర్యలోకే మహీయతే. ౧౭. సురాదిసర్వలోకేషు భుక్త్వా భోగానశేషతః, కామాదాగత్య లోకేఽస్మిన్ రాజా భవతి ధార్మికః. ౧౮. దశ

గూర్చిన వృషైకాదశి మనఁబడును. ఆవృషైకాదశిమును సూర్యునకు నివేదించిన ద్వాదశాదిత్యతుల్యుండై యణిమాదిగుణంబులతోఁ గూడి యన్నిలోకంబులయందును సూర్యానుచరుండై సంతోషించుచుండును.

ఇది ఏకోనసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

## సప్తత్యుత్తరశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! వృషసహితంబగు గోశతమును భాస్కరునకు దాన మొసంగిన నిరువదియొక్క పురుషాంతరములతోఁ గూడ వరకోటిసమంబులును, సర్వకామసమన్వితంబులును, సురాసురపూజితంబులును, నసంఖ్యేయంబులు నగుయానంబులచే ద్వాదశాదిత్యసన్నిభుండై యపరదివాకరునిఁ బోలె రమ్యంబగు నాదిత్యపురంబున సూర్యమంటపంబునఁ గ్రీడించుచుండును. అచ్చట విపులంబులగుభోగంబుల ననుభవించి సర్వప్రాణిప్రళయంబున మోహమనుకంచుకమును వదలి యాదిత్యమండలంబునఁ జేరును. సర్వజ్ఞుఁడును, పరమశుద్ధుఁడు నగు సూర్యుఁడు స్వాత్మయం దుండుటచే సూర్యునివలెనే దీప్తిమంతుఁ డగును.

గోభిః సహ వృషం తా వృషైకాదశాః స్మృతాః, సూర్యాయ వినివేద్యేహ యత్ఫలం లభతే శృణు. ౧౯. ద్వాదశాదిత్యతుల్యాత్మా అణిమాదిగుణైర్యుతః, సర్వత్ర మోదతే రాజన్సూర్యస్యానుచరో భవేత్. ౨౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యవ్రతవర్ణనం నామ
ఏకోనసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

సుమంతురువాచః—సవృషం గోశతం దత్త్వా భాస్కరాయ నరాధిప, త్రిఃసప్తకులజైః సార్ధం శృణు యత్ఫలమాప్నుయాత్. ౧. వరకోటిప్రతీకాశైః సర్వకామసమన్వితైః, మహాయానై రసంఖ్యేయైరమరాసురపూజితైః. ౨. ద్వాదశాదిత్యసంకాశో దివాకర ఇవాపరః, గత్వాదిత్యపురం రమ్యం క్రీడతే సూర్యమండపే. ౩. భుక్త్వా తు విపులాన్భోగాన్ప్రలయే సర్వదేహినాం, మోహకంచుకముత్సృజ్య విశత్యాదిత్యమండలే. ౪. సర్వజ్ఞః సూరపరమః శుద్ధః స్వాత్మన్యవస్థితః, సర్వగః పరిపూర్ణత్వాత్సూర్యవద్దీప్తిమాన్భవేత్. ౫. యో దద్యాదుభయముఖం సౌరభేయీం దివాకరే, సప్తద్వీపాం

ప్రసవించుచున్న గోవును సూర్యునకు దానమొసంగిన యెడల శైలకానన నాక్రాంతంబులగు నీసప్తద్వీపంబులను దానమొసంగిన ఫలమునుబొందును

ఇది సప్తత్యుత్తరశతతమాధ్యాయము

---

## ఏకసప్తత్యుత్తరశతతమాధ్యాయము

శతానీకుం డిట్లనియె బ్రాహ్మణోత్తమా! మగధర్మములను సంక్షేపముగను విస్తరముగను జెప్పి, మగధర్మాచరణమువలన నేఫలము గల్గునో దానినిఁ గూడఁ జెప్పుము నావిని సుమంతుం డిట్లనియె రాజా! నేను నీ కేసూర్యధర్మములను జెప్పియుంటినో యవియే మగధర్మములని చెప్పఁబడెను అన్నివర్ణములవారికిని మగధర్మము లనుష్ఠేయంబులగును దీని ననుష్ఠించిన భవముక్తి గల్గును బ్రహ్మక్షత్రియవైశ్యస్త్రీశూద్రులలో నెవ్వరైనను మగాశ్రమస్థులై మార్తాండునిఁ బూజించిన పరమపదమును బొందుదురు త్రిసంధ్యలయందును భాను నర్చించి యగ్నికార్యమును జేయునప్పుడు ముఖమును కప్పుకొని యుండవలయును త్రిసంధ్యల యందుఁగాని లే కొకసంధ్యయందుఁగాని శ్రద్ధాభక్తియుక్తుఁడై రవినిఁ

---

మహీం దత్త్వా యత్ఫలం తదవాప్నుయాత్, పాదద్వయం శిరోఽర్ధం చ సశైలవన కాననా ౬

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే గోదానవర్ణనం నామ
సప్తత్యుత్తరశతతమోఽధ్యాయః

---

శతానీక ఉవాచ —మగానాం బ్రూహి మే ధర్మం సమాసవ్యాసయోగతః, ఫలం చ కిం భవేద్బ్రహ్మన్మగధర్మనిషేవణాత్ ౧ సుమంతురువాచ —య ఏష ధర్మః సూర్యేతి తవాఖ్యాతో మయానఘ, మగధర్మః స ఏవోక్తః సర్వపాపభయాపహః ౨ సర్వేషామేవ వర్ణానాం మగధర్మనిషేవణం, మగధర్మశ్చ సంప్రోక్త ఏతేషాం భవముక్తయే ౩ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః స్త్రీ శూద్రో వా మగాశ్రమీ, యః పూజయతి మార్తండం స యాతి పరమాం గతిమ్ ౪ త్రిసంధ్యమర్చయేద్భానుమగ్నికార్యం చ శక్తితః, కుర్యాన్మగో మహాబాహో ముఖమావృత్య యత్నతః ౫ త్రిసంధ్యమేకకాలం వా పూజయేచ్ఛ్రద్ధయా రవిం, అసంపూజ్య రవిం మోహాన్న భుంజీత కదాచన,

బూజింపవలయును. అజ్ఞానముచేనైనను సూర్యుని బూజింపక యొకప్పుడును భుజింపఁగూడదు. ఇది పరమధర్మంబని యెఱుంగునది. సూర్యునారాధింపక మగుఁడు భుజించినచోఁ బురీషమును భుజించినట్లగును. భగవదాశ్రితులగువారిపూజను త్రికరణశుద్ధిగఁ జేయవలయును. యోగీశ్వరులు మనస్సుచేతను అరణ్యసంభూతంబులగు పుష్పంబులచేతనుఁ బూజింపవలయును. దేవార్థమై పుష్పములను హింసించినను హింసకుఁడు గానేరఁడు. స్వల్పమైనను స్వార్థమై హింసించినయెడల హింసకుం డగును. మగుఁడు నిత్యము నగ్నికార్యాసక్తుండును, సూర్యభక్తుండును, నతిథిపూజకుండును నై యుండవలయును. తనభార్యతోఁగూడ మైథునమును వర్జించి శ్రీమంతుఁడై గృహస్థుఁడై యుండవలయును. దేవాగ్న్యతిథులకొఱకును తనకొఱకు నన్నమును వండెదరు. అట్లుగాక కేవల మాత్మార్థమైయే యెవఁడు వండునో యామగుఁడు నిస్సంశయముగా నరకమును బొందును. అజ్ఞానమువల్లనైనను, స్వార్థమై యన్నమును వండినయెడల నరకమును బొందును. దేవార్థమై పచనము, సంతానార్థమై మైథునము, దానార్థమై ధనమనియుఁ జెప్పఁబడెను. పచనము స్వార్థమైనను, మైథునము కామకృతమైనను, ధనము స్వానుభవమునకైనను నరకము నిశ్చయము. తనజీవితమున కుపయుక్తమగుద్రవ్యముతో నర్చనానియమము లేదు. తాను విత్తార్జకుఁడైనచో నందలిసగముచే నర్చనమును జేయవలయును. జీవిత మనిత్యము గాన నన్యాయమును పరిహరింపవలయును.

---

౬. ఏష ధర్మః పరో జ్ఞేయః శేషో భవతి మానవః, అపూజయిత్వా భుంజానో విష్ఠాం భుఙ్క్తే చ వై మగః. ౭. దేవం సమాశ్రితైః పూజా కర్తవ్యేయం త్రిభిః సదా, మనసా పూజయేద్యోగీ పుష్పైశ్చారణ్యసంభవైః. ౮. దేవార్థపుష్పహింసాయాం న భవేత్తస్య హింసకః, యద్యల్పమపి చాత్మార్థం నిహన్యాద్ధింసకస్తదా. ౯. మగశ్చాగ్నిపరో నిత్యం తద్భక్తోఽతిథిపూజకః, మగీ మైథునవర్జ్యః స్యాచ్ఛ్రీమాన్ గృహమగాశ్రమీ. ౧౦. దేవాగ్నిస్వతిథౌ భక్తం పచంతే చాత్మకారణాత్, ఆత్మార్థే యః పచేన్మోహాత్స మగో నరకం వ్రజేత్. ౧౧. దేవార్థే పచనం యేషాం సంతానార్థం తు మైథునం, అర్థో దానార్థ ఉద్దిష్టో నరకం హి విపర్యయాత్. ౧౨. జీవత్తృతీయభాగేఽపి న ప్రకుర్వీత వార్చనం, విత్తార్జనే తదర్ధేన యతో నిత్యం హి జీవితమ్. ౧౩. న్యాయోపార్జితవిత్తః స్యాదన్యాయం పరివర్జయేత్, అన్యాయార్జితవిత్తైస్తు కుర్వన్నరకమాప్నుయాత్. ౧౪.

న్యాయమార్గముచే ధనములను సంపాదింపవలయును అన్యాయ్యంబుగా నార్జించినధనముతోఁ బూజించి నరకమును బొందుట నిశ్చయము వాజ్నియమముగలవాఁడును, బ్రహ్మచారియు సూర్యపూజాగ్నిహోమములయం దాసక్తుండును సంగనివృత్తుండును, నిరంతరము సూర్యధ్యానరతుండును, జితేంద్రియుండును, శాంతుఁడును, భౌతికుండును నైష్ఠికుండును సర్వగంధవినిర్ముక్తుండును కందమూలఫలభోజియు నగుమగుఁడు వైఖానసుఁ డనంబడును ఆవైఖానసుఁడు సూర్యపూజనమునందు నగ్నియందు నాసక్తిగల్గి సంగనివృత్తుఁడై సూర్యభక్తులకును యతీంద్రులకును నిత్యముఁ బూజలు సల్పుచు ననుదినంబును ముండనమును జేయించుకొని సర్పచర్మమును ధరించి శుభ్రవస్త్రధారియై సూర్యార్చనాస్థానంబున నుండ వలయును రాజా! యీసర్పచర్మమును ధరియించువాఁడు, సర్వపాపములను నశింపఁజేయునట్టియు దుష్టులను శిక్షించునట్టియు నితరుల కలభ్యంబు నగుసూర్యలోకంబును బొందును నిర్మలమైన మనస్సుగల్గి సూర్యు నారాధింపవలయును గంధలేపశూన్యుఁడైనను, శుద్ధభావముతోఁజేసినపూజ నిష్ఫలము గానేఱదు దూష్యముగూడ గానేరదు కాన భావమునందు శౌచ ముండవలయును వస్త్రముచే వడపోసినయుదకమునే త్రాగవలయును దృష్టి కింపైనప్రదేశమునందే పాదముల నుంచవలయును సత్యవాక్యములనే పల్కవలయును మఱియు నన్నియాశ్రమంబులవారును భాస్కరనియంగంబునుండి యుద్భవించిరి గాన

వాచోర్థే బ్రహ్మచారీ యః సూర్యపూజాగ్నితత్పరః, భవేజ్జితేంద్రియః శాంతో నైష్ఠికో భౌతికోఽపి వా ౧౫ సర్వగంధవినిర్ముక్తః కందమూలఫలాశనః, మమ వైఖానసో జ్ఞేయః సూర్యపూజాగ్నితత్పరః ౧౬ నివృత్తః సంగమేభ్యస్తు సూర్యధ్యానరతః సదా, జ్ఞేయః సౌరయతీంద్రాయ పూజానిష్ఠో జితేంద్రియః ౧౭ ముండోపనయనో వ్యంగీ శుక్లవాసః సమన్వితః, జ్ఞేయం తదర్చనస్థానమేతత్కార్యం ప్రయత్నతః ౧౮ అథావ్యంగో మహారాజ ధారయేద్యస్తు భోజకః, అగమ్యం సర్వసత్త్వానాం సూర్యలోకం స గచ్ఛతి ౧౯ ధ్వంసనం సర్వదుష్టానాం సర్వపాపభయాపహం, భావశుద్ధేన సతత మర్చనీయో దివాకరః ౨౦. గంధలేపవిహీనోఽపి భావశుద్ధో న దుష్యతి, భావేషు చ చరేచ్ఛౌచం వస్త్రపూతం జలం పిబేత్ ౨౧ దృష్టిపూతం న్యసేత్పాదం సత్యపూతం వచో వదేత్, సౌరధ్యానరతాః శాంతాః సౌరదర్మపరాయణాః. ౨౨. సర్వ ఏవా

సూర్యగుణములను ధ్యానించుట కాసక్తులై శాంతగుణముగల్గి సౌర ధర్మముల నాచరించుచుండవలయును. పూర్వము సూర్యుఁడు భోజకులకు సర్వవ్రతంబులలో నుత్తమంబును ధర్మస్థానభూతంబును అసమాన ఫలదంబు నగునష్టవ్రతమును జెప్పియుండెను. అష్టవ్రతమనఁగా క్షమ, అహింస, శాంతము, సంతోషము, సత్యము, అచౌర్యము, బ్రహ్మచర్యము అను నీయేడును మనోవాక్కాయములచే యథాశక్తిగ పూజను సల్పుట అనుదానితో నెనిమిదియు భోజకునకు నిత్యవ్రతములు కాన భోజకుల యందును సౌరులయందును భక్తిపరులై యుండవలయును. స్వదేహముతో సమముగ భోజకులను పాలించుచుండవలయును. ఇది బుద్ధిమంతునిలక్షణము. భయము దారిద్ర్యము రోగము వీని నివృత్తికొఱకు భోజకప్రియము నాచరింపవలయును. పరిపూర్ణుండగు సూర్యునకు మనుష్యు లేవిధముగఁ బూజసేయఁజాలుదురు? భోజకులవిషయమై యేమిచేయుదురో యది సూర్యునకుఁ జేసినట్లే యగును. చాలదూరమందుండినను మగు లెచ్చటనుందురో యచ్చటికే యరుగవలయును. ఆమగులను ప్రయత్నపూర్వకముగాఁ జూచుచుండవలయును. వారలయందే సూర్యుఁడు సన్నిహితుండై యుండును సూర్యపూజారతుండగు భోజకుని యాజ్ఞను యథాన్యాయంబుగ నెఱవేర్చిన నశ్వమేధ యాగఫలమును బొందుదురు. దేవాలయంబునకుఁబోయి దేవవిగ్రహమును బూజింపవలయును. భోజకులను, స్వాగతంబును, ఆసనంబును,

---

క్రమాజ్జ్ఞేయా భాస్కరాంగసముద్భవాః, భోజకాష్టవ్రతం ధార్యం రవిణోక్తమనౌపమమ్. ౨౩. సర్వవ్రతానాం పరమం ధర్మాలయమనుత్తమం, సౌరభక్తే సదా క్షాంతిరహింసా సర్వదా శమః. ౨౪. సంతోషః సత్యమస్తేయం బ్రహ్మచర్యం తథాష్టమం, యథాసంభవపూజాభిః కర్మణా మనసా గిరా. ౨౫. సౌరభక్తిః సదా కార్యా భోజకేషు విశేషతః, స్వదేహాన్నిర్విశేషం హి భోజకాన్పాలయేద్బుధః. ౨౬. భయదారిద్ర్యరోగేభ్యస్తేషాం కుర్యాత్ప్రియాణి వై, సూర్యస్య పరిపూర్ణస్య కిం నామ క్రియతే నరైః. ౨౭. యత్కృతం భోజకానాం వై తత్కృతం స్యాద్రవేర్నృప, సుదూరమపి గంతవ్యం మగానాం యత్ర వై గణః. ౨౮. స చ ప్రయత్నాద్ద్రష్టవ్యస్తత్ర సంనిహితో రవిః, భోజకస్య తు భక్తస్య సూర్యపూజారతస్య చ. ౨౯. ఆజ్ఞాం కృత్వా యథాన్యాయమశ్వమేధఫలం లభేత్, దేవాశ్రమగతో భక్త్యా దేవార్చాం పూజయేన్నృప. ౩౦.

పాద్యంబును, అర్ఘ్యమును, మధుపర్కమును క్రమంబుగ నిచ్చి భుజింపఁ జేసిన సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. భోజకునకు గృహము నొసంగిన రాజగును. శుభ్రంబగుస్థానము నొసంగిన వరుణలోకమును బొందఁగల్గును. చమటబిందువులచే వ్యాప్తంబును, ధ్యానశ్రమచే కృశంబును నగుభోజకశరీరమును విసనకఱ్ఱతో విసరినచో వాయులోకంబునఁ బ్రకాశించుచుండును. ఆఁకలిదప్పులచేఁ బీడితుండును, శ్రాంతుఁడును, మురికివాఁడును, రోగపీడితుఁడును నగుభోజకుని శక్తికొలఁది పాలించిన యెడల నన్నికోర్కెలం బొందఁగలఁడు పాపులకు నశుభులకును, సంకర జాతులకును, చండాలురకును, పక్షులకును, సర్వభూతంబులకును దయ చేత శక్తికొలఁది యన్నంబు నిడవలయును. దయతో నిచ్చునది స్వల్ప మైనను నక్షయంబగుఫలమును గాంచును. కాననే సర్వభూతముల యందును దయగలిగి యుండవలయునని చెప్పుదురు. అన్నములేనప్పుడు తృణము, భూమి, పత్రములు, ధనంబులు, ఫలంబులు వీట్లను ప్రేమతో నిచ్చిన స్వర్గముననుండు. ఈలోకంబునం బ్రియంబగువాక్యముగూడ స్వర్గప్రాప్తిహేతు వగును ఎవ్వరి వాక్కు మధురమై యుండునో యాతని కిహపరసౌఖ్యము లుండును. అమృత మొలుకునట్టియు, మన మును చందనస్పర్శచేతవలె చల్లగఁజేయునట్టియు, ధర్మమును విరోధింప నివియు నగువాక్యములఁ జెప్పిన నక్షయం బగుసుఖమును బొందును.

---

స్వాగతాసనపాద్యార్ఘ్యమధుపర్కాద్యనుక్రమాత్, భోజయిత్వా యథాన్యాయం సూర్యలోకే మహీయతే. ౩౧. ప్రతిశ్రయప్రదానేన రాజా భవతి భారత, దత్త్వా స్థానం తథా శౌచం వారుణం లోకమాప్నుయాత్. ౩౨. శ్వేతబిందుపరీతాంగం ధ్యానశ్రమవికర్శితం, సంవీజ్య తాలవృంతేన వాయులోకే మహీయతే. ౩౩. క్షుత్పిపాసాతురం శ్రాంతం మలినం రోగిణం తథా, పాలయిత్వా యథా శక్త్యా సర్వాన్కామానవాప్నుయాత్. ౩౪. పతితాశస్తసంకీర్ణచండాలాదీనాం పక్షిణాం, కారుణ్యాత్సర్వభూతానాం దేయమన్నం స్వశక్తితః. ౩౫. అత్యల్పమపి కారుణ్యాద్దత్తం భవతి చాక్షయం, తస్మాత్సర్వేషు భూతేషు దేవ కారుణ్యముచ్యతే. ౩౬. అభావే తృణభూమ్యన్నం పత్రం ధనఫలాని చ, దత్త్వాఽఽగతాయ ప్రణతః స్వర్గం యాతి ప్రియేణ వా. ౩౭. న హీదృక్స్వర్గయానాయ యథా లోకే ప్రియం వచః, ఇహాముత్ర సుఖం తేషాం వాగ్యేషాం మధురా భవేత్. ౩౮. అమృతస్యందినీం వాచం చందనస్పర్శశీతలాం, ధర్మా

రాజా! దానంబులతోడను, పూజనంబులతోడను, అధ్యాపనముతోడను నేమియుఁ బ్రయోజనము లేదు. స్థిరంబగు ప్రియవాక్యమే స్వర్గమునకు సోపానమని చెప్పుదురు. పూజించుట, సాదరముగ సంభాషించుట, ప్రేమతోఁ జూచుటయు నీమూఁడును ప్రత్యేకముగా స్వర్గప్రాప్తిహేతువులు. తనయింటికివచ్చిన యతిథి నాదరపూర్వకంబుగాఁ గుశలప్రశ్నము నడుగవలయును. అతఁడు వెళ్లునప్పుడు నీమార్గంబులు శుభకరంబులగుఁగాక. నిత్యమును నీకు శుభముకలుగుగాక. నీకార్యములన్నియు సిద్ధించుఁగాక యను నీరూపంబులగు నాశీర్వాదవాక్యంబుల నుపయోగింపవలయును. నమస్కారాదివాక్యములయందు స్వస్తియని చెప్పవలయు. నీకెల్లప్పుడును శుభమగుఁగాకయని సర్వకర్మలందును జెప్పవలయును. ఈయాచారముల ననుష్ఠించి సర్వపాపవిముక్తుఁడై సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. సద్భక్తులగువారు సూర్యభక్తునియందు సూర్యునియందువలె భక్తి నునిచి పూజించుచుండఁగ తాడితుఁడైనను, ఏదృక యుండినచో వాఁడు స్వస్థుఁడై దుఃఖవిముక్తుఁడగును. అన్నింటిలో నోర్పు మిక్కిలి పూజనీయమై యున్నది. కాన నన్నికార్యములయందును మొదట నోరిమిగలిగి యుండవలెను. క్రోపకలితుం డగువానికి జ్ఞానయోగము, తపము, యజ్ఞములు, దానములు, సత్కారములు నివి

విరోధినీముక్త్వా సుఖమత్యన్తమాప్నుయాత్. ౩౯. అలం దానేన రాజేంద్ర పూజయాధ్యాపనేన వా, ఇదం స్వర్గస్య సోపానమచలం యత్ప్రియం వచః. ౪౦. పూజాభిభాషణం దృష్టిః ప్రత్యేకం స్వర్గహేతవః, సంపృచ్ఛేదాగతం భక్త్యా కుశలం ప్రశ్నమాదరాత్. ౪౧. గమనే తస్య వక్తవ్యం పంథానః సంతు తే శివాః, సుఖం భవతు తే నిత్యం సర్వకార్యకరం భృశమ్. ౪౨. ఆశీర్వాదమిదం వాక్యం సర్వకాలేషు సర్వదా, నమస్కారాదివాక్యేషు స్వస్తి మంగలవాదనే. ౪౩. శివం భవతు తే నిత్యం తం బ్రూయాత్సర్వకర్మసు, ఏవమాది చ వాచారమనుష్ఠాయ సదాశ్రమీ. ౪౪. అశేషపాపనిర్ముక్తః సూర్యలోకే మహీయతే, సూర్యభక్తే తు యా భక్తిః సద్భక్తైః క్రియతే నరైః, సూర్యే భక్తిసమా నిత్యం భక్తే భక్తిరనుష్ఠితా. ౪౫. ఆక్రుష్టే తాడితే వాపి యో నాక్రోశేన్న తాడయేత్, వాక్యాదధికృతః స్వస్థః స దుఃఖాత్పరిముచ్యతే. ౪౬. సర్వేషామేవ తీర్థానాం క్షాంతిః పరమపూజితా, తస్మాత్పూర్వం ప్రయత్నేన క్షాంతిః కార్యా క్రియాసు వై. ౪౭. జ్ఞానయోగతపో యస్య యజ్ఞదానాని సత్క్రియాః, క్రోధనస్య

యన్నియు క్రోధము వర్జించువరకును నిరర్థకంబులు అప్రియవాక్యము మర్మస్థానమును, నెముకలను, ప్రాణమును, హృదయమును దహించును కాన భోజకులవిషయమై యప్రియవాక్యము నెన్నఁడునుఁ బ్రయోగింపఁగూడదు ఓరిమి, దానము, తేజము, సత్యము, శాంతము, అహింస యను నీగుణంబులు సూర్యునియం దుత్పన్నంబులయ్యె ఈరీతిగ సంక్షేపముగాఁ జెప్పియుంటిని విస్తరముగాఁ జెప్పవలయునన్నచో నూరువత్సరంబులైనను వ్యవధిచాలదు

ఇది ఏకసప్తత్యుత్తరశతతమాధ్యాయము

## ద్విసప్తత్యుత్తరశతతమాధ్యాయము

సుమంతుం డిట్లనియె రాజా! సూర్యసమ్మతంబును, తద్భక్తులకుఁ బ్రియంబును, పవిత్రంబును, పాపనాశకంబును నగుసూర్యధర్మమును మరలఁ జెప్పెద నాకర్ణింపుము ఎచ్చటికైనను వెళ్లుచుండఁగా మార్గమధ్యమున సూర్యవిగ్రహారాధనమునుఁ జూచినను బూజ జరుగుస్థలంబునకుఁ బోయినను నచ్చట తనవైభవము ననుసరించి వస్త్రనైవేద్యాలంకారంబులచేఁ బూజించి స్తోత్రములనుజేసి నమస్కరించి పోవలయును మార్గమధ్యమున నదిగాని, పర్వతముగాని లేక ప్రయాణముచేయు

వృథా యస్మాత్తస్మాత్క్రోధం వివర్జయేత్ ౭౮ మర్మాస్థిప్రాణహృదయం నిర్దహేదప్రియం వచః, న వచో హ్యప్రియం తస్మాద్భోజకేషు విశేషతః ౭౯ క్షమా దానం త్విషః సత్యం క్షమాహింసార్కసంభవాః, న శక్యా విస్తరాద్వక్తుమపి వర్షశతైరపి ౮౦

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే భోజకభోజనానుష్ఠానవర్ణనం నామ ఏకసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః

సుమంతురువాచ — పునః శృణు మహారాజ ధర్మమాదిత్యసంమతం, సౌరప్రియకరి సదా సౌరం పవిత్రం పాపనాశనమ్ ౧ క్వచిద్గచ్ఛన్యదా పశ్యేత్సూర్యార్చాసంప్రపూజనం, యత్ర పూజా తతో గచ్ఛేత్స సూర్యో నాత్ర సంశయః ౨ స్నాననైవేద్యవస్త్రైశ్చ నానాలంకారభూషణైః, యథావిభవమాశ్రిత్య నమస్కారాదిసంస్తవైః
౩ దృష్ట్వాయతనమాక్రమ్య నమస్కృత్యా రవిం వ్రజేత్, క్వచిత్పథి నదీం శైలం గచ్ఛ

భోజకుఁడుగాని సమీపించినయెడల సాష్టాంగ ప్రణామం బాచరించి పూజింపవలయును. ఆకాలమున రథమునందు లేక గుఱ్ఱమునందు మత్తే వాహనమునం దుండినను దిగి తరువాత నీభోజకులకు భక్తితో శక్తి కొలఁది దానముల నిచ్చి భుజింపఁజేయవలయును. అట్లుచేసి యిరువది యొక్కపురుషాంతరములతోఁగూడ భాస్కరస్థానంబునకుఁ బోవును. దేవతలయొక్క పర్వోత్సవంబులయందును శ్రాద్ధంబులయందును, పుణ్యాదినంబులయందును విధ్యుక్తముగా భాస్కరునిఁ బూజించి భోజకులను భుజింపఁజేయవలయును. సర్వదేవతలును, పితరులును, సూర్యు నాశ్రయించియుండుటచే సూర్యుఁడు సంతుష్టుఁడైన సర్వదేవతలును సంతుష్టులగుదురు. శ్రద్ధచేఁ జేయఁబడురవిపూజ ప్రసక్తమైనయెడలనే శ్రాద్ధంబులఁజేసి యందు భక్తితో భోజకుని భుజింపఁజేయవలయును. మహారాజా! భోజకున కొక్కరోజు పూజచేసినచో నేఫలము లభించునో యాఫల మితరస్థలములయందు నూఱువత్సరములుచేసినను లభింపదు ఎవ్వఁడు నిర్మలాంతఃకరణుఁడై యితరుల ద్వేషింపకుండునో మఱియు నేవస్తువులంగాని రూపరసగంధశబ్దస్పర్శాదులఁగాని కోరఁడో యట్టివాఁడు జితేంద్రియుఁడని చెప్పఁబడును. జ్ఞానవిజ్ఞానయుక్తుఁడును సూర్యభక్తిసమన్వితుఁడును పాషండయోగముచే విముక్తుఁ డగువాఁడును భోజకుఁడని చెప్పవలెను. సూర్యధర్మాచరణశ్రవణంబులవలన జ్ఞాన

---

మానం చ భోజకమ్. ౪. ఉపశ్రుత్యావనిం గత్వా భోజకం పూజయేద్బుధః, రథాశ్వగజయానేభ్యో హ్యవతీర్య మగాన్నృప, మగానాం భోజనం భక్త్యా శక్త్యా దానం ప్రకల్పయేత్. ౫. దశపూర్వాన్దశ పరానాత్మనా సహ భారత, సమాదాయ వ్రజేత్ స్థానం రవేరమితతేజసః. ౬. దైవపర్వోత్సవే శ్రాద్ధే పుణ్యేషు దివసేషు చ, భానుం సంపూజ్య విధివద్భోజకాన్భోజయేత్తతః. ౭. పితరః సర్వదేవానాం సూర్యమాశ్రిత్య సంస్థితాః, ప్రీతే సూర్యే తు తే సర్వే ప్రీతాః స్యుర్నాత్ర సంశయః. ౮. యదా చ శ్రద్ధయా యుక్తం ప్రసక్తం రవిపూజనం, భోజయేద్భోజకం భక్త్యా శ్రాద్ధేషు విధివన్నృప. ౯. భోజకస్య మహారాజ దివసేనాపి యత్ఫలం, న తచ్ఛక్యమిదం తేన ప్రాప్తుం వర్షశతైరపి. ౧౦. యః పశ్యతి ప్రసన్నాత్మా యో న ద్వేష్టి న కాంక్షతి, శబ్దాదీనాం తు సంభోగం సవిజ్ఞేయో జితేంద్రియః. ౧౧. జ్ఞానవిజ్ఞానసంపన్నః సూర్యభక్త్యా సమన్వితః, పాషండయోగముక్తశ్చ స వై భోజక ఉచ్యతే. ౧౨. సూర్యధర్మాద్భవేజ్జ్ఞానం

ముద్భవించును. జ్ఞానముచే వైరాగ్యము వైరాగ్యమున సూర్య
యోగము దానిచే సర్వజ్ఞతయుఁ బరిపూర్ణసుఖమును కలుగును. మఱియు
శుద్ధంబగుపరమాత్మయందుండి దివంబున సూర్యునివలె సంతసించుచుం
డును. సర్వభూతంబులఁ బురుషుఁ డుత్తముఁడు, పురుషులలో బ్రాహ్మణుఁ
డును వారలలో విద్యావంతుండును వారలలో వేదాధ్యయనపరుండును
వారికంటె తత్త్వార్థచింతనముఁ జేయువాఁడును వార్లకన్న జ్ఞానార్థప్రతి
బుద్ధులు నధికులు. కోటికోట్లజ్ఞానార్థులకన్న యోగు లుత్తములు. కోటి
కోట్లయోగులకన్న నొకభోజకుఁ డుత్తముఁడు. యోగముఁ దెలిసిన
వారు ననుష్ఠించువారును యోగసంభవులును భోజకుని భుజింపఁజేసిన
యెడల వారిపితరులు సంతుష్టులగుదురు. సర్వవిధజ్ఞానతపోదానప్రము
ఖంబులఁ జేసిన నెట్టిఫలము లభించునో యాఫలము భోజకుని భుజింపఁ
జేసినమాత్రన సిద్ధించును. ద్రవ్యసముదాయ సుసాధ్యంబును బహు
దక్షిణాయుక్తంబును, హవిస్సు ఋత్విక్కు ఋగ్యజుస్సామవేదములు
యోగము వీట్లతోఁగూడునదియు దేవయజ్ఞమని చెప్పఁబడును. బ్రహ్మ
చర్యముఁ, దపము, క్షమ, మౌనము, లఘ్వాశనము నీయైదునుఁ దపో
లక్షణములు. పురాకృతకర్మచేఁ బ్రాప్తంబై శుభాశుభఫలము నిచ్చు
విశేషద్రవ్యంబును న్యాయప్రాప్తంబగుదానిని గుణవంతున కొసంగవల

---

జ్ఞానాద్వైరాగ్యసంభవః, జ్ఞానవైరాగ్యయుక్తస్య సూర్యయోగః ప్రవర్తతే. ౧౩.
సూర్యయోగాచ్చ సర్వజ్ఞః పరిపూర్ణః సునిర్వృతః, ఆత్మన్యవస్థితః శుద్ధః సూర్యవద్దివి
మోదతే. ౧౪. సర్వేషామేవ భూతానాముత్తమః పురుషః స్మృతః, పురుషేభ్యో ద్విజః
శ్రేష్ఠో ద్విజేభ్యో గ్రంథపారగః. ౧౫. గ్రంథిభ్యో వేదవిద్వాంసస్తేభ్యస్తత్త్వార్థచింతకాః,
అర్థవిద్భ్యశ్చ జ్ఞానార్థప్రతిబుద్ధో విశిష్యతే. ౧౬. జ్ఞానార్థకోటికోటిభ్యో వరిష్ఠా
యోగినో మతాః, యోగినాం కోటికోటిభ్యో భోజకశ్చోత్తమో భవేత్. ౧౭.
యోగజ్ఞా యోగనిష్ఠాశ్చ పితరో యోగసంభవాః, భోజితే భోజకే సర్వే ప్రీతాః
స్యుస్తే న సంశయః. ౧౮. సర్వజ్ఞానతపోదానైః కృతైర్దత్తైశ్చ యత్ఫలం, తత్ఫలం లభతే
సర్వం విధివద్భోజ్య భోజకమ్. ౧౯. యశ్చ ద్రవ్యకలాపాత్మా దక్షిణా హవిఋత్విజః,
ఋగ్యజుః సామయోగైశ్చ దేవయజ్ఞః ప్రకీర్తితః. ౨౦. బ్రహ్మచర్యం తపో మౌనం
క్షాంతిరాహారలాఘవం, ఇత్యేతత్తపసాం రూపం సుధీరం పంచలక్షణమ్. ౨౧. యచ్చ
దిష్టం విశిష్టం చ న్యాయప్రాప్తం చ యద్భవేత్, తత్తద్గుణవతే దేయమిత్యేతద్దానలక్ష

యును. ఇది దానలక్షణము. ఒకటిని వేయిగా వృద్ధిఁబొందించునట్టియు సర్వసస్యంబులు మొలచునట్టియు జలసమృద్ధంబు నగుభూమిని దానముఁ జేసిన నది భూదాన మందురు. భూమి నేకఖండంబుగఁజేసి పర్వతారణ్యయుక్తంబుగ బ్రాహ్మణుల కిచ్చిన నది యొకభూదాన మందురు. కన్యక నలంకరించి నిర్ధనుండును, విద్వాంసుఁడు నగుబ్రాహ్మణున కొసంగిన నది కన్యాదాన మందురు. మఱియు నాకన్య దోషహీనరాయె యుండవలయును. ఉత్తమంబులుగాని మధ్యమంబులునైన ఛిద్రరహితములగువస్త్రము లొసంగిన నద్దాని వస్త్రదాన మందురు. ఇట్లు సంక్షేపంబుగాఁ జెప్పితిని. బ్రహ్మవిష్ణులతో సమానమగుకాంతినిగాని యధికమగుకాంతినిగాని కోరి వచో నహోరాత్రములు భుజింపక యుపవసింపవలెను. ఇది యుపవాస లక్షణము. రెండువందలయిరువదినాల్గుకబళముల నొక్కమాసము యథేచ్ఛగ భుజించినఁ జాంద్రాయణవ్రతమని చెప్పుదురు. దేవతలచేతను, ఋషులచేతను భూమియందు సేవింపఁబడు నుదకము తీర్థమని చెప్పఁ బడును. సూర్యుని యవాంతరస్థానంబులు పుణ్యక్షేత్రములని చెప్పఁ బడును. ఆసౌరక్షేత్రములయందు మృతులగు దేహధారులకు సూర్యత్వము కల్గును. తీర్థతీరములయందు దానములనుచేసినను సత్రముల నుద్యానంబుల దేవతాయతనముల నిర్మించిన నక్షయంబగు ఫలముం

---

ణమ్. ౨౨. వివర్ధనీం సహస్రాణాం సర్వసస్యప్రరోహిణీం, దద్యాద్భూమిం జలోపేతాం భూమిదానం తదుచ్యతే. ౨౩. ఏకచ్ఛత్రాం మహీంకృత్వా ద్విజేభ్యః ప్రతిపాదయేత్, సంపూర్ణాం పర్వతారణ్యైర్భూమిదానం తదుచ్యతే. ౨౪. కన్యామలంకృతాం దద్యాదధనాయ నరాధిప, ద్విజాయ వేదవిదుషే కన్యాదానం తదుచ్యతే. ౨౫. సర్వదోషవినిర్ముక్తాం కులయోగ్యామలంకృతాం, మధ్యమోత్తమవస్త్రాణాం యో దద్యాదహతాని చ. ౨౬. ఏతత్సమాసతో జ్ఞేయం వస్త్రదానస్య లక్షణం, బ్రహ్మవిష్ణుసమాధిక్యకాంతిశీలపరాయణః, అహోరాత్రం న భుంజీత హ్యుపవాసస్య లక్షణమ్. ౨౭. చత్వారింశత్సమాయుక్తం పిండానాం హి శతద్వయం, మాసే హ్యద్యాద్యథాకామమిదం చాంద్రాయణం స్మృతమ్. ౨౮. ఋషిభిః సర్వశాస్త్రజ్ఞైస్తపోనిష్ఠైర్జితేంద్రియైః, దేవైశ్చ సేవితం తోయం క్షితౌ తత్తీర్థముచ్యతే. ౨౯. సూర్యావాంతరస్థానాని పుణ్యక్షేత్రాణి నిర్దిశేత్, మృతానాం తేషు సూర్యత్వం సౌరక్షేత్రేషు దేహినామ్. ౩౦. దానాన్యావసథం కుర్యాదుద్యానం దేవతాగృహం, తీర్థేష్వేతాని యః కుర్యాత్సోఽక్షయం లభతే ఫలమ్.

బొందఁగలఁడు. క్షాంతి, వస్తువాంఛ, సత్యము, దానము, సుస్వభావము, తపము, పాండిత్యము యివి కల్గియుండుట సత్పాత్రలక్షణము. యజ్ఞము, ఉపవాసము, దానము, తపముఁజేసినను తీర్థముల సేవించిన నేఫలము కల్గునో యాఫలము భోజకుని భుజింపఁజేయుటవలననే లభించును. సూర్యునియందు భక్తియు, శాంతము, సత్యము, క్షాంతి, యింద్రియ నిగ్రహము, స్నేహభావము నివియన్నియుఁ గల్గియుండుట సూర్యధర్మ లక్షణము. సూర్యభక్తుండగు బ్రాహ్మణు నెవ్వఁడు శ్రాద్ధంబులయందు భుజింపఁజేయునో యాతఁ డేడుతరంబుల నుద్ధరించి సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును పలువిధంబులఁ జెప్పుటచే నేమి ప్రయోజనము? సూర్యభక్తులనే శ్రాద్ధములందు భుజింపఁజేయవలయును. సూర్యభక్తులు భుజించినయెడల సూర్యభగవానుఁడే భుజించినట్లగును. వేదాధ్యయనము జేసినవారలను కోటిమందిని భుజింపఁజేయుటకంటె నొకభోజకుని భుజింపఁ జేసిన నెక్కువఫలము గలుగునుగాన శ్రాద్ధంబులందును పుణ్యదినంబు లందును సూర్యు నుద్దేశించి భోజకుని భుజింపఁజేయవలయును నియమ వంతులయినను గాకున్నను సర్వావస్థలు బొందినవారైనను రవిభక్తులు పూజనీయులగుదురు. స్నేహసంబంధమువల్లనుకాని, లోభమువల్లను కాని ఎవరైనను భోజకుని భుజింపఁజేసినచో వారు పొందెడిఫలమును

---

౩౧. క్షాంతిః స్పృహా తథా సత్యం దానం శీలం తపః శ్రుతం, ఏతదష్టాంగముద్దిష్టం పరం పాత్రస్య లక్షణమ్. ౩౨. యజ్ఞోపవాసదానాని తపస్తీర్థఫలాని చ, సంపూర్ణం లభతే భక్త్యా భోజయిత్వా తు భోజకాన్. ౩౩. సూరే భక్తిః క్షమా సత్యం దశేంద్రియవినిగ్రహః, సుఖితేషు చ మైత్రీ చ సూర్యధర్మస్య లక్షణమ్. ౩౪. సూర్యభక్తం ద్విజం భక్త్యా యః శ్రాద్ధేషు చ భోజయేత్, కులసప్తకముద్ధృత్య సూర్యలోకే మహీయతే. ౩౫. బహునాత్ర కిముక్తేన సూర్యభక్తం తు భోజయేత్, సూర్యభక్తేన యద్భుక్తం భానునామాశ్రయం నృప. ౩౬. న వేదవిదుషాం కోట్యా లభ్యతే చేహ తత్ఫలం, తత్ఫలం లభతే రాజన్భోజం భోజ్య విధానతః. ౩౭. తస్మాచ్ఛ్రాద్ధే విశేషేణ పుణ్యేషు దివసేషు చ, సూర్యముద్దిశ్య విప్రేంద్ర భోజం సంభోజయేన్నృప. ౩౮. అసంయతః సంయతో వా సర్వావస్థాం గతోఽపి వా, యశ్చాసౌ రవిభక్తః స్యాత్పూజ్య ఏవ హి. ౩౯. సంసర్గాద్వాపి వా లోభాద్భోజకం యస్తు భోజయేత్, సోఽపి యాం గతిమాప్నోతి న తాం యజ్ఞశతైరపి. ౪౦. తస్మాన్మాన్యశ్చ పూజ్యశ్చ రక్షణీ

నూఱుయజ్ఞములు జేసియైనను పొందఁజాలఁడు. కాన నోరాజా! సౌర లోకము గోఱువానికి భోజకుఁడు మాన్యుఁడును రక్షణీయుఁడు నగును. సూర్యునివిషయమై భోజకుడు నామమాత్రప్రయత్నముగల వాఁడైనను సూర్యునివలె పూజనీయుఁడును మాననీయుఁడు నగును. శ్రాద్ధమును గృహమునందుఁ జేయుటకంటె యరణ్యమునందుఁ జేసిననూఱు రెట్లు ఫలము గలుగును. సౌరాశ్రమమందుఁజేసినఁ బదివేలరెట్లు ఫలము గలుగును. భోజకునకు నాసనము నొసంగి దానియందు నానావర్ణ వికారంబగు పరిచ్ఛదము నొసంగిన భూతలంబున రాజగును. నిర్మలంబు లగువస్త్రంబు లిచ్చిన, నూఱువేలమంది నుద్ధరించి సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును రాజా! భోజకునకు రోమనిర్మితంబగుకంబళము నొసంగినఁ బ్రతిరోమమునందు సువర్ణము నిచ్చినఫలమును బొందుదురు. ఈభోజకునకు శంఖమును, పాదుకలను నొసంగిన తేజస్సుచే సూర్య సదృశుఁడై సూర్యలోకమును పొందఁగలఁడు. ఎవఁడు పురాణరూపం బగుగ్రంథమును భక్తితో వ్రాయించునో వాఁడు నూఱుకోట్లయుగ ములు సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. మరల నీలోకంబునకు వచ్చి లక్ష్మీసంపన్నుఁడై సుఖవంతుఁడును వేదపారగుఁడును నగును. ఎవ్వఁడు భాస్కరునకు గృహమును నిర్మించునో వానికి నుత్తమంబగు స్థానము లభించును. ఈభోజకుఁడే యాసూర్యుఁడు, ఆసూర్యుఁడే భోజ

---

యశ్చ సర్వదా, భోజకః కురుశార్దూల సౌరేఽ గతిమిచ్ఛతా. ౪౧. నామమాత్రప్రయ త్నోఽపి యది స్యాద్భోజకో రవేః,సూర్యవత్స హి ద్రష్టవ్యః పూజనీయశ్చ భారత.౪౨. గృహే శ్రాద్ధస్య యత్పుణ్యమరణ్యే తచ్ఛతాధికం, సౌరాశ్రమేషు విజ్ఞేయం తత్పుణ్యా మయుతాధికమ్. ౪౩. దత్త్వా తు భోజకే సౌమ్యం హ్యాసనం సపరిచ్ఛదం, ధాతుదంత మయం చాపి రాజా భవతి భూతలే. ౪౪. విమలే వాససీదత్త్వా భోజకాయ మహీపతే, ఉద్ధృత్య శతసాహస్రం సూర్యలోకే మహీయతే. ౪౫. దత్త్వా తు లోమశాం రాజ న్భోజకాయ శుభాం బృహత్, రోమ్ణిరోమ్ణి సువర్ణస్య దత్తస్య ఫలమాప్నుయాత్.౪౬. శంఖం దదాతి యో భక్త్యా తథా దివ్యే చ పాదుకే, సూర్యలోకమవాప్నోతి తేజసా రవిసన్నిభః. ౪౭. లిఖాపయతి యో భక్త్యా పురాణేన తు పుస్తకం, యుగకోటిశతం దివ్యం సూర్యలోకే మహీయతే. ౪౮. భవేదిహాగతః శ్రీమాన్సుఖాఢ్యో వేదపారగః, యః కరోతి గృహం భానోస్తత్థానం చోత్తమం భవేత్. ౪౯. తత్సూర్యో భోజకః

కుఁడుగాన, భోజకబ్రాహ్మణుల కిచ్చినదాన మక్షయమని చెప్పఁబడినది గాన, ఎది యెవరి కుపయోగించునో ప్రయత్నపూర్వకముగా విమర్శించి యొసఁగవలయును. సౌరధర్మములఁ జెప్పునపు డామలకఫలమును పుష్ప పత్రాదులతో శోభింపఁజేసి సూర్యపూజాసాధనంబగు దీనిని మాల్యాదులచే నలంకరించి, యాచార్యుల కభిముఖంబుగా నుంచి ప్రథమమున నాచార్యునిఁ బూజింపవలయును. ఎవ్వఁ డిసౌరధర్మమును న్యాయముగాఁ జెప్పునో వినునో యాతఁడు ఆయువును గీర్తిని విద్యనుబొంది సూర్యుని జపించుచుండును. వినువారుగూడ ఫలమును బొందుదురు. ఇట్టి యుత్తమ సౌరధర్మమును వాచకునివలన నెఱింగి విపులయశంబు గోరువాఁడామీఁద వాచకునిఁ బూజింపవలయును.

ఇది ద్విసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

---

## త్రిసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! ఇంతకుఁ బూర్వము సౌరధర్మమును సంక్షేపముగఁ జెప్పియుంటివి మరల విస్తరంబుగఁ జెప్ప

---

సోత్ర భోజకః సూర్య ఏవ హి, తేన భోజకవిప్రేషు దానమక్షయ్యమిత్యపి. ౫౦.
యద్యద్యస్యోపయుజ్యేత దేయం తత్తస్య యత్నతః, ఉపయోగపరో నిత్యం సూర్యస్తదుభయోరపి. ౫౧. వ్యాఖ్యానే సౌరధర్మస్య కృత్వా ఆమలకం మహత్, శోభితం పుష్పపత్రాద్యైర్న్యసేత్తత్రాసనే సురాః. ౫౨. శోభితం మాల్యగంధైస్తు సూర్యస్య సాధనం మహత్, పురస్తాత్తస్య సంస్థాప్య ఆచార్యం పూజయేత్సదా, సూర్యవత్సౌరధర్మే చ తుల్యమేతద్ద్వయం వచః. ౫౩. య ఏవం న్యాయతో వక్తి సౌరధర్మం శృణోతి చ, ఆయుర్విద్యాం యశః కీర్తిముపలభ్య రవిం జపేత్, వదంత్యన్యే పిబన్త్యన్యే సర్వే తే ఫలభాగినః. ౫౪. తస్మాదేవంవిధో ధర్మో వాచకైశ్చ విదుర్బుధాః, తస్యాంతే పూజయేద్భక్త్యా య ఇచ్ఛేద్విపులం యశః. ౫౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే
ద్విసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—పునర్మే బ్రూహి విప్రేంద్ర సౌరం ధర్మమనుత్తమం,

వేఁడుచున్నాను. అనిన సుమంతుఁ డిట్లనియె. రాజా! మంచిప్రశ్నము నడిగితివి. ఈలోకంబున నీతో సమానుఁడగు సూర్యభక్తుఁడు గానఁబడఁడు. పుణ్యంబును పాపనాశకంబును నై పూర్వము గరుడారుణులకు జరిగినసంవాదముఁ జెప్పెద నాకర్ణింపుము. రాజా! పూర్వ మొకానొకప్పుడు గరుత్మంతుఁడు సుఖాసీనుఁడై యున్న సూర్యునిసారథియగు నరుణునియొద్దకేగి ఖగోత్తమా! సర్వధర్మంబులలో నుత్తమంబును సర్వపాపధ్వంసకంబగు సౌరధర్మము నంతను నాకెఱింగింపు మనిన నరుణుం డిట్లనియె. వత్సా! సౌరధర్మములను వినుటకు కోరికగలవాఁడ వగుటచే మహానుభావుఁడవు ధన్యుఁడవు సర్వపాపవర్జితుఁడవు నయితివి. కాన మహాఫలవంతంబగు సౌరధర్మంబును జెప్పెద నాకర్ణింపుము అజ్ఞానమను సముద్రమున మునుఁగుచున్నవారల నీసౌరధర్మ మొకయొడ్డునఁ జేర్చును. ఎవ్వరు సూర్యుని భక్తితో స్మరింతురో యెవరు కీర్తింతురో యెవరు పూజింతురో వారందఱును పరమపదమును బొందఁగలరు. ఖగాధిపా! దేవేశ్వరుఁడగు భాస్కరునిఁ బూజింపనివాఁ డాత్మద్రోహి యగును. దుఃఖజనకంబును, జరయను, మహాగ్రాహంబులుగల్గిన తృష్ణ యనువేలచే నాకులంబయిన సంసారమనుసాగరంబున చాలకాలము భ్రమించుచుం

---

సమాసాత్కథితం బ్రహ్మన్విస్తరేణ ప్రకీర్తయ. ౧. సుమంతురువాచ.—సాధుసాధు మహాబాహో సాధు పృష్టోఽస్మి భారత, త్వత్సమో నాస్తి లోకేఽస్మిన్సౌరః పార్థివ సత్తమ. ౨. కీర్తయామ్యద్య తం పుణ్యం సంవాదం పాపనాశనం, గరుడారుణయోరాజన్పురావృత్తం నరాధిప. ౩. సుఖాసీనం పురా రాజన్నరుణం సూర్యసారథిం, ఉపగమ్య మహాబాహో గరుడో వాక్యమబ్రవీత్ ౪. ధర్మాణాముత్తమం ధర్మం సర్వపాపప్రణాశనం, సౌరధర్మం ఖగశ్రేష్ఠ బ్రూహి మే కృత్స్నశోనఘ. ౫. అరుణ ఉవాచ.—సాధు వత్స మహాత్మాసి ధన్యస్త్వం పాపవర్జితః, శ్రోతుకామోఽసి యత్పుత్ర సౌరధర్మమనుత్తమమ్. ౬. శృణు త్వం కీర్తయామ్యేష సుఖోపాయం మహత్ఫలం, పరమం సర్వధర్మాణాం సౌరధర్మమనుత్తమమ్. ౭. అజ్ఞానార్ణవమగ్నానాం సర్వేషాం ప్రాణినామయం, సౌరధర్మో హ్యయం శ్రీమాన్పరతీరప్రదో యతః. ౮. యే స్మరంతి రవిం భక్త్యా కీర్తయంతి చ యే ఖగ, పూజయంతి చ యే నిత్యం తే గతాః పరమం పదమ్. ౯. ఆత్మద్రోహః కృతస్తేన జాతేనేహ ఖగాధిప, నార్చితో యేన దేవేశః సహస్రకిరణో రవిః. ౧౦. సుచిరం సంభ్రమత్యస్మిన్ దుఃఖదే చ భవార్ణవే, జరాభూతమహాగ్రాహే

డును. దుర్లభంబగు మనుష్యజన్మమును బొంది యెవరు దివాకరు నర్చిం
తురో వారిజన్మమే సార్థకము; వారే కృతార్థులు. ఎవరు సూర్యభక్తిపరులో
ఎవ్వరు నిరతము సూర్యుని నమస్కరింతురో వారందఱును దుఃఖమును
బొందఁజాలరు ఎవ్వరు స్వర్గలోకమున మహాభోగంబులను, ఇహలోకం
బున రాజ్యముఁ గోరుదురో వారందఱును సుభగత్వమును, అసమానం
బగు కాంతిని, భోగమును, త్యాగమును, యశంబును, సంపదను, ధర్మార్థ
కామరూపంబులగు త్రివిధపురుషార్థములను బొందఁగలరు. మఱియు
ననేకములగు మనోహరద్రవ్యములను వివిధాభరణభూషితలగు వనిత
లును, ధనమును కూడ నీసూర్యారాధనమునకు ఫలములు. కాన, సర్వ
దేవసముదాయంబులచే నర్చితుండగు భాస్కరునిఁ బూజింపవలయును.
భాస్కరునియందు భక్తియు, తదారాధనము, ఆతని నుద్దేశించిన
హోమము, అతనివిజ్ఞానము తద్ధ్యానాభ్యాసము దుర్లభంబులు. సూర్యు
శరణము బొందినవారు ఇట్టి ద్రవ్యమును బోఁగొట్టుకొనుట కిచ్చగించక
లాభమును బొందవలయును. నమస్కారపదసహోచ్చారితంబు లగురవి
యను రెండక్షరము లెవ్వనిజిహ్వాగ్రమున నుండునో యాతనిజీవితము
సఫలమైనది. ఎవ్వఁడు శ్రద్ధతో భానునిఁ బూజించునో యాతఁడు సర్వ

తృష్ణావేలాకులాపరే. ౧౧. మానుష్యం దుర్లభం ప్రాప్య యేఽర్చయంతి దివాకరం,
తేషాం హి సఫలం జన్మ కృతార్థాస్తే నరోత్తమాః. ౧౨. సూర్యభక్తిపరా యే చ యే
చ తద్గతమానసాః, యే స్మరంతి సదా సూర్యం న తే దుఃఖస్య భాగినః. ౧౩. వివిధాని
మనోజ్ఞాని వివిధాభరణాః స్త్రియః, ధనం వా దృష్టపర్యంతం సూర్యపూజావిధేః ఫలమ్.
౧౪. యే వాంఛంతి మహాభోగాన్రాజ్యం వా త్రిదశాలయే, సౌభాగ్యం కాంతిమతులాం
భోగం త్యాగం యశః శ్రియమ్. ౧౫. సౌందర్యం జగతః ఖ్యాతిః కీర్తిర్ధర్మాదయః
స్మృతాః, ఫలాన్యేతాని వై పుత్ర సూర్యభక్తివిధేర్బుధ. ౧౬. తస్మాత్సంపూజయే
త్సూర్యం సర్వదేవగణార్చితం, దుర్లభా భాస్కరే భక్తిర్దుర్లభం చ తదర్చనమ్. ౧౭.
దానం చ దుర్లభం తస్మై తద్ధోమశ్చ సుదుర్లభః, దుర్లభం తస్య విజ్ఞానం తదభ్యాసోఽపి
దుర్లభః. ౧౮. సుదుర్లభతరం జ్ఞేయం తదారాధనముత్తమం, లాభస్తేషాం మనుష్యాణాం
యే రవిం శరణం గతాః. ౧౯. యేషామిహేశ్వరే భానౌ నిత్యం సూర్యే గతం మనః,
నమస్కారాదిసంయుక్తం రవిరిత్యక్షరద్వయమ్. ౨౦. జిహ్వాగ్రే వర్తతే యస్య సఫలం
తస్య జీవితం, య ఏవం పూజయేద్భానుం శ్రద్ధయా పరయాన్వితః, ముచ్యతే సర్వ

పాపవిముక్తుం డగును ఢాకినులును, నానావిధాకారములుగల రాక్షసులును, పిశాచంబులును, నితరంబులగు భయంకరజంతువులును నాతనిఁ బీడింపఁజాలవు శత్రువులందఱు నశింతురు యుద్ధంబున జయముగల్గును రోగపీడ యుండదు ఆపద లంటనేరవు ధనము, ఆయువు, యశము, విద్యాప్రభావము నివియున్నియు సమానంబులుగా సంపూర్ణ మనోరథంబులై వృద్ధిఁబొందుచుండును

ఇది త్రిసప్తత్యుత్తరశతతమాధ్యాయము

---

## చతుస్సప్తత్యుత్తరశతతమాధ్యాయము

అరుణుం డిట్లనియె ఖగాధిపా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్వురును సూర్యుని బూజించియే బ్రహ్మ బ్రహ్మత్వమును, విష్ణువు విష్ణుత్వమును, మహేశ్వరుఁడు మహాదేవపదవిని బొందిరి సహస్రాక్షుం డగుదేవేంద్రుఁడును నీతనిఁ బూజించియే యింద్రత్వమును బొందెను మాతృదేవతలును, దేవగంధర్వయక్షులును, పిశాచోరగ రాక్షసులును నిరంతర మీతనిఁ బూజించుచుందురు ఈజగమంతయు నిత్య మీభానుని

---

పాపేభ్యః స నరో నాత్ర సంశయః ౨౧ డాకిన్యో వివిధాకారా రాక్షసాః సపిశాచకాః, న తస్య పీడాం కుర్వంతి తథాన్యాశ్చ విభీషణాః ౨౨ శత్రవో నాశమాయాంతి సంగ్రామే జయమాప్నుయాత్, న రోగైః పీడ్యతే వీర ఆపదో న స్పృశంతి తమ్ ౨౩ ధనమాయుర్యశో విద్యా ప్రభావోఽప్యతులం తథా, శుభేనోపచయం యాంతి నిత్యం పూర్ణమనోరథాః ౨౪

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే గరుడారుణసంవాదే సౌరధర్మవర్ణనం నామ
త్రిసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః

---

అరుణ ఉవాచ —పూజయిత్వా రవిం భక్త్యా బ్రహ్మా బ్రహ్మత్వమాగతః, విష్ణుత్వం చాపి దేవేశో విష్ణురాప తదర్చనాత్ ౧ శంకరోఽపి జగన్నాథః పూజయిత్వా దివాకరం, మహాదేవత్వమగమత్తత్ప్రసాదాత్ఖగాధిప ౨ సహస్రాక్షోఽపి దేవేశ ఇంద్రో భానుం తమోపహం, ఇంద్రత్వమగమద్దేవం పూజయిత్వా దివాకరమ్ ౩ మాతరో దేవగంధర్వాః పిశాచోరగరాక్షసాః, పూజయంతి సదా భానుమీశానం సురనాయకమ్ ౪.

యందే ప్రతిష్ఠితమై యుండెను. కాన నక్షయస్వభావముగల స్వర్గము నభిలషించువాఁడు భానునిఁ బూజించుచుండవలయును. భాస్కరునిఁ బూజింపనిమనుజుఁడు ధర్మార్థకామమోక్షరూపంబులగు నాల్గుపురుషార్థంబులకును భాజనము గానేరఁడు కాన బ్రతికియున్నంతకాలము ప్రతిజ్ఞఁజేసి భాస్కరారాధనమునుఁ జేయవలయును. ఆపన్నుఁడైనను విధిగ భాను నర్చింపవలయును. ఎవ్వఁడు నిత్యము సూర్యపూజనముఁ జేయకయుండునో వాఁడు బ్రతుకుటకంటె చచ్చినను తలతెగ వేయఁబడినను కొంచెము; మంచిది. కాన సర్వదేవతలకును బ్రభువగుదివాకరునిఁ బూజించి భుజింపవలయును. ఇట్లు బ్రతికియున్నంతకాలము సూర్యపూజనమును నిర్వహించినయెడల నాతఁడు మనుష్యచర్మబద్ధుఁ డగు సూర్యుఁడని చెప్పుట కెంతమాత్రమును సందియము లేదు. భాస్కరారాధనముకంటె నధికమగుపుణ్య మెద్దియు లేదని తెలిసికొని ప్రయత్నపూర్వకంబుగ దివాకరునిఁ బూజింపవలయును. సూర్యభక్తులశాస్త్రంబులు సూర్యార్చనపరులు ధర్మసంపన్నులగు సంయములును ధర్మార్థకామమోక్షంబులను సాధింతురు. సర్వద్వంద్వములను సహించువారును నీతిశాస్త్రానుగంబగుమనస్సుగలవారును, పరోపకారపారీణులును, గురుశుశ్రూషాతత్పరులును, నహంకారశూన్యులును, బుద్ధిమంతులును, నవ్యక్తకోపస్వభావులును, నిరస్తమోహులును, శాంతమనస్కులును, మంగళ

---

సర్వమేతజ్జగన్నిత్యం భానౌ దేవే ప్రతిష్ఠితం, తస్మాత్సంపూజయేద్భానుం య ఇచ్ఛేత్స్వర్గమక్షయమ్. ౫. యో న పూజయతే సూర్యం భాస్కరం తమసూదనం, ధర్మార్థకామమోక్షాణాం న నరో భాజనం భవేత్. ౬. తస్మాత్కార్యం హి తద్ధ్యానం యావజ్జీవం ప్రతిజ్ఞయా, అర్చయేత సదా భానుమాపన్నోఽపి సదా ఖగ. ౭. యస్తు సంతిష్ఠతే నిత్యం వినా సూర్యస్య పూజనాత్, వరం ప్రాణపరిత్యాగః శిరసో వాథ చ్ఛేదనమ్. ౮. సూర్యం సంపూజ్య భుంజీత త్రిదశేశం దివాకరం, ఇత్థం నిర్వహతే యస్య యావజ్జీవం తదర్చనం, మనుష్యచర్మణా నద్ధః స రవిర్నాత్ర సంశయః. ౯. న హి ఆర్కార్చనాదన్యత్పుణ్యమప్యధికం భవేత్, ఇతి విజ్ఞాయ యత్నేన పూజయస్వ దివాకరమ్. ౧౦. సూర్యభక్తాగమాశ్చైవ సూర్యార్చనపరాయణాః, సంయతా ధర్మసంపన్నా ధర్మాదీన్సాధయంతి తే. ౧౧. సర్వద్వంద్వసహా వీరా నీతివిధ్యుక్తచేతసః, పరోపకారనిరతా గురుశుశ్రూషణే రతాః. ౧౨. అమానినో బుద్ధిమంతోఽవ్యక్తస్పర్ధా గతస్పృహాః, శాంతా స్వాంతగతా భద్రా నిత్యం స్వాగతవాదినః. ౧౩. స్వల్పవాచః సుమ

కరులును, నిత్యము స్వాగతమును జెప్పువారు, మితముగ సంభాషించు వారు, విద్వాంసులును, పరాక్రమవంతులును, శాస్త్రవేత్తలును, శౌచాచారసంపన్నులును, దయాదాక్షిణ్యవంతులును, డాంబికమాత్సర్యంబులనువదలినవారును, తృష్ణాలోభశూన్యులును, కుత్సితశూన్యులును, నలినీపత్రముగలె విషయాదులయందు నిర్లిప్తులగువారును, అదీనులు, నరోగులును, భావితాత్మకులును, స్నేహయుక్తులును, సత్పురుషులను సేవించువారును, సత్పురుషులచే సేవింపఁబడువారును, పాణిపాదాదీంద్రియంబులయం దాసక్తిలేనివారును, సర్వసంగపరిత్యాగులై చపలకర్మలఁ జేయనివారును, నిట్టియాచారములతోఁ గూడినవారు నగుమనుష్యులు ఏకాంతంబగుభక్తిని బొంది దివాకరునిఁ బూజింప నర్హులగుదురు. వారికి ధర్మాదులు లభించును దివాకరుఁ డెప్పుడు నిట్టిగుణములలో నుండును. అన్నిపాత్రములలో దివాకరుఁడే అతిపాత్రమని చెప్పఁబడియుండెను. పడిపోవువానిని నరకసముద్రమునుండి రక్షించునుగాన నతిపాత్రం బయ్యె. దానము స్వల్పమైనను పాత్రంబులలో నతిపాత్రంబగు సూర్యునిమాహాత్మ్య మిహపరలోకములయందుఁ గూడ ఫలవంతముగాఁ జెప్పఁబడియుండెను. ఎవఁడు ద్రవ్యముచేనైనను తదాలయంబునఁ గార్యములఁ జేయునో యానరుఁడు దేహావసానంబున జ్ఞానమును శాంతిని

---

నసః శూరాః శాస్త్రవిశారదాః, శౌచాచారసుసంపన్నా దయాదాక్షిణ్యగోచరాః. ౧౪. దంభమత్సరనిర్ముక్తాస్తృష్ణాలోభవివర్జితాః, సంవిభాగపరాః ప్రోక్తా న శఠాశ్చాప్యకుత్సితాః. ౧౫. విషయేష్వపి నిర్లేపాః పద్మపత్రమివాంభసా, న దీనా మానినశ్చైవ న చ రోగవశానుగాః. ౧౬. భవంతి భావితాత్మానః సుస్నిగ్ధాః సాధుసేవితాః, న పాణిపాదవాక్చక్షుః శ్రోత్రశిశ్నోదరే రతాః. ౧౭. చపలాని న కుర్వంతి సర్వవ్యాసంగవర్జితాః, సూర్యాసనరతాః శాంతాః షడక్షరమనోగతాః. ౧౮. ఇత్యాచారసమాయుక్తా భవంతి భువి మానవాః, ఏకాంతభక్తిమాస్థాయ ధర్మకామార్థసిద్ధయే. ౧౯. పూజనీయో రవిర్నిత్యం గుణేష్వేతేషు వర్తతే, సర్వేషామేవ పాత్రాణామతిపాత్రం దివాకరః, పతంతం త్రాయతే యస్మాదతీవ నరకార్ణవాత్. ౨౦. తస్య పాత్రాతిపాత్రస్య మాహాత్మ్యం దానమణ్వపి, అనేన ఫలమాదిష్టమిహలోకే పరత్ర చ. ౨౧. ద్రవ్యేణాపి హి యః కుర్యాన్నరః కర్మ తదాలయే, సోఽపి దేహక్షయే జ్ఞానం ప్రాప్య శాంతిమవాప్నుయాత్. ౨౨. సర్వద్విజకదంబేషు కశ్చిజ్జ్ఞానమవాప్నుయాత్, కశ్చిదేతత్తు మే దివ్యం

బొందును. సమస్తబ్రాహ్మణులును దివ్యజ్ఞానమును బొంది విషయాదులను విడచునంతపర్యంతమును దుఃఖప్రవాహమున మునుఁగుచుఁ దేలుచు తిరుగుచుందురు. పెక్కురు బ్రాహ్మణులలో నొక్కఁడే జ్ఞాని యగును. పెక్కురు జ్ఞానవంతులలో నొక్కఁడే మోక్షమును బొందును. సూర్యభక్తి కలుగువరకును సంసారమున భ్రమించుచునే యుందురు. మిగిలిన వారందఱును భక్తులు గానేరరు. సూర్యునకు లేపనముజేసిన పుణ్యము గల్గును. చందనలేపమును జేసిన ద్విగుణం బగుఫలము గల్గును. అగరు పూసినయెడల నెనిమిదిరెట్లపుణ్యము గల్గును కృష్ణాగరులేపనముచే నింతకు రెండురెట్లపుణ్యము గల్గును. కుంకుమను బూసిన నూఱురెట్ల ఫలము గల్గునని చెప్పఁబడెను. సూర్యయజ్ఞంబుల కుపకరణంబుల శక్తి కొలఁది యల్పంబులుగాని యధికంబులుగాని చేసినయెడల సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. ఇష్టవస్తువులనుగాని, అనిష్టవస్తువులనుగాని న్యాయముగా వచ్చినయెడల గొప్పఫలమును గోరుచో సూర్యునకు నివేదింపవలయును కర్మయం దాసక్తుఁడై పిత్రాదినియంత్రితుఁడై విసిగికొనుచు నర్చనముఁ జేసినను వాఁడీకర్మ ననుష్ఠించుటచే పాపవర్జితుండై దివంబున కేఁగును. ఎవ్వఁడు తనశ్రేయమును గోరునో వాఁడు సర్వకర్మలను పరిత్యజించి సూర్యునియందే మనము నుంచి విధిప్రకారంబుగ సూర్యపూజను జేయవలెను. జీవిత మస్థిరము. యౌవనము చంచలము. ఈశరీరమునకు వ్యాధులును సన్నిహితములై యుండును. కాన

---

లబ్ధ్వా జ్ఞానం విముంచతి. ౨౩. తావద్భ్రమంతి సంసారే దుఃఖశోకపరిప్లుతాః, న భవంతి రవేర్భక్తా యావత్సర్వేఽపి దేహినః. ౨౪. సూర్యస్యాలేపనం పుణ్యం ద్విగుణం చందనస్య తు, చందనాదగురౌ జ్ఞేయం పుణ్యమష్టగుణోత్తరమ్. ౨౫. కృష్ణాగురౌ విశేషేణ ద్విగుణం ఫలమిష్యతే, తస్మాచ్ఛతగుణం పుణ్యం కుంకుమస్య విధీయతే. ౨౬. సూర్యయజ్ఞోపకరణం కృత్వాల్పం యది వా బహు, భావాద్విత్తానుసారేణ సూర్యలోకే మహీయతే. ౨౭. యదపీష్టమనిష్టం చ న్యాయేనోభయమాగతం, తత్సూర్యాయ నివేద్యం సద్భక్త్యానంతఫలార్థినా. ౨౮. కర్మశాఠ్యేన యః కుర్యాద్దుఃఖేనాపి తదర్చనం, సోఽపి ద్విజో దివం యాతి కర్మణా పాపవర్జితః. ౨౯. సర్వమన్యత్పరిత్యజ్య సూర్యే చైకమనాః సదా, సూర్యపూజావిధిం కుర్యాద్య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః. ౩౦. త్వరితం జీవితం యాతి త్వరితం యౌవనం తథా, త్వరితం వ్యాధిరభ్యేతి తస్మాన్నిత్యం రవిం వ్రజేత్.

తప్పక సూర్యునిబొందుటకై తదారాధనమును జేయవలయును. మానవుఁడు జీవించినంత కాలము ముసలితన మాక్రమింపనంత కాలము ఇంద్రియ వైకల్యము గలుగనంత కాలము దివాకరు నర్చింపవలయును. ఈసూర్యార్చనముకంటె నధికమైనధర్మము లేకపోవుటయేగాక సమానమగుధర్మము గూడ లేదని తెలిసికొని దివాకరునిఁ బూజింపుము ఎవ్వఁడు దేవదేవుం డగు భాస్కరునిఁ బూజించునో వాఁ డీలోకంబున సుఖంబులఁబొంది తరువాత పరమపదమును బొందును పూర్వము బ్రహ్మదేవుఁడు ప్రహృష్టాంతరంగుఁడై సూర్యునిఁ బూజించి కృతాంజలియై యిట్లు పల్కెను. భగవంతుఁడును, భగకరుఁడును, శాంతచిత్తుండును, సర్వోత్తముండును, దేవమార్గంబులకుఁ గారకుండును నగుసూర్యుని నమస్కరించుచున్నాను. శాశ్వతుండును, ఆద్యంతశూన్యుండును, నిర్మలుండును, చిత్రంబులగు కిరణసముదాయంబులుగలవాఁడును, దివస్పతియు, దేవతల కీశ్వరుఁడును నగుదివాకరుని నమస్కరించుచున్నాను. సర్వదుఃఖంబుల హరించునట్టియు వరంబగు ముఖముగలట్టియు వరంబులగు నంగములుగలట్టియు వరముల నిచ్చునట్టి విభావసుని ప్రార్థించుచున్నాను. అర్కుఁడును, అర్యముఁడును, ఇంద్రుఁడును, విష్ణువును, నీశుండును, దివాకరుండు నగువిభావసుని నమస్కరించుచున్నాను. ఎవఁ డీబ్రహ్మోక్తంబగు స్తవమును వినునో

---

౩౧. యావన్నాభ్యేతి మరణం యావన్నాక్రమతే జరా, యావన్నేంద్రియవైకల్యం తావదర్చేద్దివాకరమ్. ౩౨. న సూర్యార్చనతుల్యోఽపి న ధర్మోఽన్యో జగత్త్రయే,ఇత్థం విజ్ఞాయ దేవేశం పూజయస్వ దివాకరమ్. ౩౩. యే భక్త్యా దేవదేవేశం సూర్యం శాంతమజం ప్రభుమ్, ఇహ లోకే సుఖం ప్రాప్య తే గతాః పరమం పదమ్. ౩౪. గోపతిం పూజయిత్వా తు ప్రహృష్టేనాంతరాత్మనా, కృతాంజలిపుటో భూత్వా పురా బ్రహ్మ బ్రవీదిదమ్. ౩౫. బ్రహ్మోవాచ.—భగవంతం భగకరం శాంతచిత్తమనుత్తమం, దేవమార్గప్రణేతారం ప్రణతోఽస్మి రవిం సదా. ౩౬. శాశ్వతం శోభనం శుద్ధం చిత్రభానుం దివస్పతిం, దేవదేవేశమీశేశం ప్రణతోఽస్మి దివాకరమ్. ౩౭. సర్వదుఃఖహారం దేవం సర్వదుఃఖహరం రవిం, వరాననం వరాంగం చ వరస్థానం వరప్రదమ్. ౩౮. వరేణ్యం వరదం నిత్యం ప్రణతోఽస్మి విభావసుం, అర్కమర్యమణం చేంద్రం విష్ణుమీశం దివాకరమ్. ౩౯. దేవేశ్వరం దేవరతం ప్రణతోఽస్మి విభావసుం, య ఇదం శృణుయా

యాతఁడు గొప్పకీర్తినిఁ బొంది మఱల సూర్యలోకమును బొందును.

ఇది చతుస్సప్తత్యుత్తరశతతమాధ్యాయము.

---

## పంచసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

గరుడుం డిట్లనియె ఎవ్వరు మానసికచింతచేతను, వ్యాధుల చేతను గూడియుందురో వివిధశత్రుగ్రహవిఘ్నపీడితులగుదురో వారాత్మశ్రేయముకొఱకు దేనినిఁ జేయవలయునో నాకుఁ జెప్పుమనిన నరుణుం డిట్లనియె. ఖగోత్తమా! నానారోగములచేతను, గ్రహములచేతను బీడితులగువారలకు సూర్యారాధనముకంటె శ్రేయస్కరమైనది వేరొండు లేదు. గాన సర్వరోగవినాశకుండును, సర్వగ్రహబాధానివారకుండును, రాజోపద్రవనివారకుండు నగుసూర్యు నారాధింపవలయును గరుడుఁ డిట్లనియె. మహాత్మా! నాకొక బ్రహ్మవాదినిశాపముచే నేరోగము లేకయే రెక్కలు రాలిపోయినవి. నాశరీరముఁ జూడుము ఈరీతిగ పక్షివిముక్తుఁడనగు నాకుఁ జేయవలసినకార్య మేమున్నది? యేకార్యాచరణముచే నాకు రెక్కలు మఱల నెట్లు వచ్చును? భక్తుఁడ నగు నాకు దానిని బ్రసా

---

న్నిత్యం బ్రహ్మణోక్తం స్తవం పరం, స హి కీర్తిం పరాం ప్రాప్య పునః సూర్యపురం వ్రజేత్. ౪౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే గరుడారుణసంవాదే సూర్యస్తుతిర్నామ చతుఃసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

గరుడ ఉవాచ:—సర్వరోగహతా యే తు ఆధివ్యాధిసమన్వితాః, గ్రహోపఘాతైర్వివిధైరర్దితా యే చ మానవాః. ౧. అరిభిః పీడితా యే చ వినాయకహతాశ్చ యే, కర్తవ్యం కిం భవేత్తేషామాత్మనః శ్రేయసేఽనఘ. ౨. అరుణ ఉవాచ.—నానారోగహతానాం తు అర్దితానాం తథారిభిః, ఆదిత్యారాధనం ముక్త్వా నాన్యచ్ఛ్రేయస్కరం పరమ్. ౩. తస్మాదారాధయేన్నిత్యం సర్వరోగవినాశనం, గ్రహోపఘాతహంతారం రాజోపద్రవనాశనమ్. ౪. గరుడ ఉవాచ.—సర్వపత్రవిహీనం మే సర్వరోగవివర్జితం, శాపేన బ్రహ్మవాదిన్యాః పశ్యాంగం ద్విజసత్తమ. ౫. ఏవం మత్తస్య మే తాత కిం కార్యమవశిష్యతే, యేనాహం కర్మణా కల్పో భవేయం పత్రవాన్పునః. ౬.

దింపుము. ఏ కార్యమును జేసిన సూర్యపూజనమును జేయుటకు సామర్థ్యము గల్గునో యానతిమ్మనిన నరుణుం డిట్లనియె. జగచ్చక్షుకుండును, అంధకార నాశకుండు నగుభాస్కరునిఁ బూజింపుము. నిర్మలమనస్కుండవై సూర్య హోమమును జేయుము. అది సర్వోపద్రవనివారణంబును, సర్వగ్రహ బాధానివర్తకంబును, శుభకార్యము నగు ననిన గరుడుం డిట్లనియె. నేను వికలాంగుఁడ నగుటచే దేవుండగుదివాకరునిఁ బూజింపఁజాలను. అగ్ని కార్యమును జేయుటకుఁ గూడ నాకు శక్తి చాలదు. అగ్ని కార్యము మహాశాంతికరమని చెప్పియుంటివిగాన నాశాంతికొఱకై యగ్నికార్య మును నీవే యాచరింపుమనిన నరుణుం డిట్లనియె వైనతేయా! నీవు చెప్పినది సత్య మట్లే చేసెదను. నీవు మహావ్యాధిపీడితుండవగుటచే నీకార్యమును జేయుటకు శక్తుఁడవు గావు కావున నీశాంతినిమిత్త మగ్ని కార్యమును నేనొనర్చెదను వైనతేయా! పూర్వము నాశాంతినిమిత్తము సూర్యభగవానుఁడు సర్వపాపహరంబును, పుణ్యంబును, విఘ్ననాశ కంబును, మహాఫలజనకంబును, అకాలమృత్యుహారకంబును, సర్వవ్యాధి హరంబును, శత్రునాశకమును, విజయప్రాపకంబును, సర్వదేవప్రియం బును, తృప్తికరంబును నగులక్షహోమమును జేసియుండెను. దానివిధాన

---

తస్మే బ్రూహి ఖగశ్రేష్ఠ ప్రపన్నస్య ఖగాధిప, యత్కృత్వా కల్పతాం ప్రాప్య పూజ యామి దివాకరమ్. ౭. అరుణ ఉవాచ.—పూజయస్వ జగన్నాథం భాస్కరం తిమిరా పహం, సూర్యాగ్నికార్యం సతతం శుద్ధచిత్తః సమాచర. ౮. మహాశాంతికరం ఖ్యాతం సర్వోపద్రవనాశనం, గ్రహోపఘాతహంతారం శుభకార్యకరం పరమ్. ౯. గరుడ ఉవాచ.—నాహం శక్తోఽస్మి వై కర్తుం పూజాం దినకరస్య చ, న చాగ్నికార్యం శక్నోమి కర్తుం వికలతాంగతః. ౧౦. తస్మాన్నే కురు శాంత్యర్థమగ్నికార్యం ఖగాధిప, మహాశాంతిరితి ఖ్యాతం శాంతయే మమ సువ్రత. ౧౧. అరుణ ఉవాచ.—ఏవమేవ యదాత్థ త్వం వైనతేయ ఖగాధిప, అకల్పస్త్వం న శక్నోషి మహావ్యాధిప్రపీడితః. ౧౨. అహం కరోమి తే పుత్ర శాంతయే పావకార్చనం, యత్కృతం మమ చార్కేణ పురా శాంతిదమాదరాత్. ౧౩. సర్వపాపహరం పుణ్యం మహావిఘ్నవినాశనం, మహో దయం శాంతికరం లక్షహోమవిధిస్మృతమ్. ౧౪. అపమృత్యుహరం వీర సర్వవ్యాధి హరం పరం, పరచక్రప్రమథనం సదా విజయవర్ధనమ్. ౧౫. తృప్తిదం సర్వదేవానాం

మెట్టిది యన దేవాలయమున కాగ్నేయభాగంబున స్థండిలంబును నిర్మించి గోమయముతో నలికి దానియం దగ్నిని ప్రజ్వలింపఁజేయవలయును. తరువాత మహావ్యాహృతిపూర్వకముగా లక్షహోమమును జేయవలయును. "ఓం భూర్భువస్స్వరితి స్వాహా. ఆరక్తదేహరూపాయ రక్తాక్షాయ మహాత్మనే, ధరాధరాయ శాన్తాయ సహస్రాక్షిశిరాయచ అధోముఖాయ శ్వేతాయ స్వాహా." యని యాహుతిని విడువవలయును. "చతుర్ముఖాయ శాంతాయ పద్మాసనగతాయ చ, పద్మవర్ణాయ వేధాయ కమండలుధరాయ చ. ద్వితీయోర్ధ్వముఖాయేహ స్వాహా." యని యాహుతిని విడువవలయును. "హేమవర్ణాయ దేహాయ ఐరావతగతాయ చ, సహస్రాక్షశరీరాయ పూర్వదిశ్యున్ముఖాయ చ, దేవాధిపాయ చేంద్రాయ విహస్తాయ శుభాయ చ తృతీయవదనాయ చ స్వాహా." యని విడువవలయును. "దీప్తాయ వ్యక్తదేహాయ జ్వాలామాలాకులాయ చ,ఇంద్రనీలాభదేహాయ సర్వారోగ్యకరాయ చ. యమాయ ధర్మరాజాయ దక్షిణాశాముఖాయ చ, కృష్ణాంబరధరాయేహ స్వాహా." యని యాహుతిని విడువవలయును "నీలజీమూతవర్ణాయ రక్తాంబరధరాయ చ, ముక్తాఫలశరీరాయ పింగాక్షాయ మహాత్మనే. శుక్లవస్త్రాయ పీతాయ దివ్యపాశధరాయ చ, స్వాహా

---

భాస్కరప్రియముత్తమం, ఆగ్నేయ్యాం దిశి లిప్యాథ స్థడిలం గోమయేన తు.౧౬. దేవాలయస్య విధివత్కుర్యాదగ్నిప్రబోధనం, మహావ్యాహృతిభిర్వీర లక్షహోమం సమాచరేత్. ౧౭. భూర్భువస్స్వరితి స్వాహా ప్రణవేన సమన్వితం, ఆరక్తదేహరూపాయ రక్తాక్షాయ మహాత్మనే. ౧౮. ధరాధరాయ శాంతాయ సహస్రాక్షిశిరాయ చ. ౧౯. అధోముఖాయ శ్వేతాయ స్వాహా పూర్వాహుతిం సృజేత్, చతుర్ముఖాయ శాంతాయ పద్మాసనగతాయ చ. ౨౦. పద్మవర్ణాయ వేధాయ కమండలుధరాయ చ, ద్వితీయోర్ధ్వముఖాయేహ స్వాహాకారాహుతిం సృజేత్. ౨౧. హేమవర్ణాయ దేహాయ ఐరావతగతాయ చ, సహస్రాక్షశరీరాయ పూర్వదిశ్యున్ముఖాయ చ. ౨౨. దేవాధిపాయ చేంద్రాయ విహస్తాయ శుభాయ చ, స్వాహాకారం చోత్సృజేదేవ తృతీయవదనాయ చ. ౨౩. దీప్తాయ వ్యక్తదేహాయ జ్వాలామాలాకులాయ చ, ఇంద్రనీలాభదేహాయ సర్వారోగ్యకరాయ చ. ౨౪. యమాయ ధర్మరాజాయ దక్షిణాశాముఖాయ చ, కృష్ణాంబరధరాయేహ స్వాహాహుతిమనుత్సృజేత్. ౨౫. నీలజీమూతవర్ణాయ రక్తాంబరధరాయ చ, ముక్తాఫలశరీరాయ పింగాక్షాయ మహాత్మనే. ౨౬. శుక్లవస్త్రాయ పీతాయ

కారాయ చ తథా పశ్చిమాభిముఖాయ చ. కృష్ణపింగళనేత్రాయ వాయవ్యాభిముఖాయ చ. నీలధ్వజాయ వీరాయ తథా చేంద్రాయ వేధసే పవనాయస్వాహా." యని యాహుతిని విడువవలయును. "గదాహస్తాయ సూర్యాయ చిత్రస్రగ్భూషణాయ చ, మహాదేవాయ శాంతాయ స్వాహాధిపతయే తథా. ఉత్తరాభిముఖాయేహ మహాదేవప్రియాయ చ, శ్వేతాయ శ్వేతవర్ణాయ చిత్రాక్షాయ మహాత్మనే, శాంతాయ శాంతరూపాయ పినాకవరధారిణే. ఈశానాభిముఖాయ స్వాహా" యని యీశ్వరున కాహుతి నియ్యవలయును. ఆత్మశ్రేయంబుకొఱకు కీవిధంబుగ శాస్త్రోక్తంబుగ నాహుతిని విడువవలయును. ఈరీతిగ దేవుఁడు సత్త్వసంపన్నుఁడును, మహాత్ముఁడు నగుపావకు నుద్దేశించియే హోమముఁ జేయవలయును. అట్లు చేసిన నది సూర్యసంబంధమే యగును. లక్షహోమము జేసి శాంతినిఁ జేసికొనవలయును. "ఓంభూర్భువఃస్వరితి స్వాహా." యిది లక్షహోమమని చెప్పుదురు. మహాహోమంబునఁ గూడ నిదియే విధి. భోజకుఁడు భాస్కరునికొఱకు కీయగ్ని కార్యమును జేసి సర్వలోకంబులశాంతికొఱకు శాంతికర్మఁ జేయవలయును. సింధూరాసనమువలె రక్తవర్ణముగలవాఁడును, రక్తపద్మసదృశంబులగు నేత్రంబులుగలవాఁడును, వేయికిరణంబులుగలవాఁడును, నేడుగుఱ్ఱములచే మోయఁబడు

---

దివ్యపాశధరాయ చ, స్వాహాకారాయ చ తథా పశ్చిమాభిముఖాయ చ. ౨౭. కృష్ణపింగలనేత్రాయ వాయవ్యాభిముఖాయ చ, నీలధ్వజాయ వీరాయ తథా చేంద్రాయ వేధసే. ౨౮. స్వాహేతి పవనాయేహ ఆహుతిం చోత్సృజేద్బుధః, గదాహస్తాయ సూర్యాయ చిత్రస్రగ్భూషణాయ చ. ౨౯. మహోదరాయ శాంతాయ స్వాహాధిపతయే తథా, ఉత్తరాభిముఖాయేహ మహాదేవప్రియాయ చ. ౩౦. శ్వేతాయ శ్వేతవర్ణాయ చిత్రాక్షాయ మహాత్మనే, శాంతాయ శాంతరూపాయ పినాకవరధారిణే. ౩౧. ఈశానాభిముఖాయేహ దద్యాదీశాయ చాహుతిం, విసృజేత్ఖగశార్దూల విధివచ్ఛ్రియసేనఘ. ౩౨. ఏవం దేవం మహాత్మానం పావకం విధివత్ఖగ, ఆహ్వేదితి తు యత్కార్యం తత్సౌరం ఖగసత్తమ. ౩౩. లక్షహోమం చ విధివత్కృత్వా శాంతికమాచరేత్, భూర్భువస్వరితి స్వాహా లక్షహోమవిధిః స్మృతః ౩౪. మహాహోమే చ వై సౌర ఏష ఏవ విధిః పరః, కృత్వైవమగ్నికార్యం తు భోజకో భాస్కరాయ వై. ౩౫. శాంత్యర్థం సర్వలోకానాం తతః శాంతికమాచరేత్, సిందూరాసనరక్తాభః రక్తపద్మాభలోచనః. ౩౬.

రథము వాహనముగాఁగలవాఁడును, కిరణమాలలుగలవాఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, సర్వదేవపూజితుండును, గ్రహరాజు నగు సూర్యుఁడు గ్రహపీడానివారణరూపం బగుశాంతినిఁ గలుగఁజేయుఁగాక మూఁడుచక్రములుగల జలసారరూపంబగు రథము నెక్కిన వాఁడును, పదిగుఱ్ఱములచే మోయఁబడువాహనముగలవాఁడును, అత్రిసంభవుండును, అమృతమును స్రవించువాఁడును, చల్లనిస్వభావముగల వాఁడును, నమృతస్వరూపుఁడును, క్షయవృద్ధిసమన్వితుండును నగు చంద్రుఁడు సౌమ్యభావముతో నీకు గ్రహపీడను తొలఁగించుఁగాక. పద్మరాగసదృశుండును, భూమిపుత్రుండును, తేనెవలె పింగళవర్ణంబులగు నేత్రములుగలవాఁడును, నగ్నిసదృశవర్ణుండు నగునంగారకుఁడు గ్రహపీడను నివారించుఁగాక. పుష్యరాగసన్నిభంబగు దేహముగలవాఁడును, పింగళవర్ణుండును, పీతమాల్యంబులను, వస్త్రములను ధరించినవాఁడును నగుబుధగ్రహము గ్రహపీడను నివారించునుగాక. వహ్నితప్తంబగు సువర్ణముతో సమానమగు వర్ణముగలవాఁడును, సర్వశాస్త్రప్రవీణుండును, సర్వదేవతాచార్యుండును, బ్రహ్మవంశసంజాతుండును, అథర్వణమంత్రవేత్తలలో నగ్రేసరుండును, మునియు, నర్థశాస్త్రప్రవీణుండును నగుబృహస్పతి శాంతమనస్కుఁడై గ్రహపీడను జయించి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. ఎల్లప్పుడు సూర్యార్చనపరుండును, కుందేందుసదృశం

---

సహస్రకిరణో దేవః సప్తాశ్వరథవాహనః, గభస్తిమాలీ భగవాన్సర్వదేవనమస్కృతః. ౩౭. కరోతు తే మహాశాంతిం గ్రహపీడానివారిణీం, త్రిచక్రరథమారూఢ అపాం సారమయం తు యః. ౩౮. దశాశ్వవాహనో దేవ ఆత్రేయశ్చామృతస్రవః, శీతాంశురమృతాత్మా చ క్షయవృద్ధిసమన్వితః, సోమః సౌమ్యేన భావేన గ్రహపీడాం వ్యపోహతు. ౩౯. పద్మరాగనిభో భౌమో మధుపింగలలోచనః, అంగారకోఽగ్నిసదృశో గ్రహపీడాం వ్యపోహతు. ౪౦. పుష్పరాగనిభేనేహ దేహేన పరిపింగలః, పీతమాల్యాంబరధరో బుధః పీడాం వ్యపోహతు. ౪౧. తప్తగైరికసంకాశః సర్వశాస్త్రవిశారదః, సర్వదేవగురుర్విప్రో హ్యథర్వణవరో మునిః. ౪౨. బృహస్పతిరితి ఖ్యాత అర్థశాస్త్రపరశ్చ యః, శాంతేన చేతసా సోఽపి పరేణ సుసమాహితః ౪౩. గ్రహపీడాం వినిర్జిత్య కరోతు తవ శాంతికం, సూర్యార్చనపరో నిత్యం ప్రసాదాద్భాస్కరస్య తు. ౪౪. హిమకుందేందువర్ణాభో దైత్యదానవపూజితః, మహేశ్వరస్తతో ధీమాన్మహాసారో మహా

బగు దేహముగలవాఁడును, సూర్యభక్తాగ్రేసరుండును, మహాబుద్ధియు శుక్లపక్షసమానుండును, నీతిశాస్త్రపారంగతుండును నగుశుక్రుఁడు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. నానారూపధరుండును, నవిజ్ఞాతగతియు, నవ్యక్తుఁడును, నజుఁడును, నేకచూడుండును, ద్విత్రిపంచచూడుండును, సహస్రశిరస్కుండును, బ్రహ్మవిష్ణుశివాత్ముఁడును, చంద్రకేతువును, సూర్యపుత్త్రుం డగుకేతువు గ్రహపీడను బోఁగొట్టుఁగాక. సూర్యార్చనతత్పరులును మహాత్ములు నగు నీగ్రహములు సంతసించి నీహితమునుగోఱి యెల్లప్పుడును నీకు శాంతినిఁ గలుగఁజేయుదురుగాక.

ఇది పంచసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

## షట్సప్తత్యుత్తరశతతమాధ్యాయము.

అరుణుం డిట్లనియె. పద్మాసనాసీనుండును, పద్మవర్ణుండును, పద్మనేత్రుండును, కమండలుధారియు, శోభాయుక్తుండును, దేవగంధర్వపూజితుండును, నాల్గుముఖంబులుగలవాఁడును, దేవతలకందఱకును బతియును, సూర్యపూజాతత్పరుండును, సురజ్యేష్ఠుండును, మహాతేజస్సంపన్నుఁడును, సర్వలోకసృష్టికర్తయు నగుబ్రహ్మదేవుఁడు బ్రహ్మశబ్ద

---

మతిః. ౪౫. సూర్యార్చనపరో నిత్యం శుక్రః శుక్లనిభస్తదా, నీతిశాస్త్రపరో నిత్యం గ్రహపీడాం వ్యపోహతు. ౪౬. నానారూపధరోవ్యక్త అవిజ్ఞాతగతిశ్చ యః, నోత్పత్తిర్జాయతే యస్య నోదయపీడితైరపి. ౪౭. ఏకచూలో ద్విచూలశ్చ త్రిశిఖః పంచచూలకః, సహస్రశిరరూపస్తు చంద్రకేతురివ స్థితః. ౪౮. సూర్యపుత్రోఽగ్నిపుత్రస్తు బ్రహ్మవిష్ణుశివాత్మకః, అనేకశిఖరః కేతుః స తే పీడాం వ్యపోహతు. ౪౯. ఏతే గ్రహమహాత్మానః సూర్యార్చనపరాః సదా, శాంతిం కుర్వంతు తే హృష్టాః సదా కాలం హితేక్షణాః. ౫౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యాగ్నికర్మణి
పంచసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

అరుణ ఉవాచ:—పద్మాసనః పద్మవర్ణః పద్మపత్రనిభేక్షణః, కమండలుధరః శ్రీమాన్దేవగంధర్వపూజితః. ౧. చతుర్ముఖో దేవపతిః సూర్యార్చనపరః సదా, సురజ్యేష్ఠో మహాతేజాః సర్వలోకప్రజాపతిః, బ్రహ్మశబ్దేన దివ్యేన బ్రహ్మా శాంతిం కరోతు

ముచే గ్రహశాంతిని జేయుఁగాక. పీతాంబరధారియు, నాత్రేయీభర్తయు, శంఖచక్రగదాపాణియు, నీలమేఘసదృశవర్ణుండును, యజ్ఞస్వరూపుఁడును, చతుర్భుజుండును, త్రివిక్రముండును, లక్ష్మీపతియును, మధుఁడనురాక్షసుని జంపినవాఁడును, నిత్యము సూర్యభక్తులతోఁ గూడియుండెడివాఁడును, విశేషగతిమంతుఁడును, గతిశూన్యుండును, విగతంబగు గుణత్రయముగలవాఁడును, సూర్యధ్యానాసక్తుఁడు నగు విష్ణువు శాంతిని గలుగఁజేయుఁగాక. సర్వాభరణంబులచే కుందేందుసదృశదేహుండును, చతుర్భుజుండును, మహాతేజస్కుఁడును, పుష్పార్ధాభరణుండును, చతుర్ముఖుండును, భస్మధారియు, శ్మశానవాసియు, గోత్రారియు, విశ్వవ్యాపకుండును, దక్షయజ్ఞధ్వంసకుండును, సర్వశ్రేష్ఠుండును, కామ్యుండును, కామప్రదుండును, దేవదేవుండును, ఆదిత్యదేహసంభూతుండును నగుమహేశ్వరుఁడు శాంతినిఁ గలుగఁజేయుఁగాక.

ఇది షట్సప్తత్యుత్తరశతతమాధ్యాయము.

---

## సప్తసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

అరుణుం డిట్లనియె. పద్మరాగములతో సమానమగుకాంతిగలదియు, నాల్గుముఖంబులుగలదియు, హస్తమందు జపమాలగలదియు,

---

తే. ౨. పీతాంబరధరో దేవ ఆత్రేయీదయితః సదా, శంఖచక్రగదాపాణిః శ్యామవర్ణశ్చతుర్భుజః. ౩. యజ్ఞదేహః క్రమో దేవ ఆత్రేయీదయితః సదా, శంఖచక్రగదాపాణిర్మాధవో మధుసూదనః. ౪. సూర్యభక్తాన్వితో నిత్యం విగతిర్విగతత్రయః, సూర్యధ్యానపరో నిత్యం విష్ణుః శాంతిం కరోతు తే.౫. శశికుందేందుసంకాశో విశ్రుతాభరణైరిహ, చతుర్భుజో మహాతేజాః పుష్పార్ధకృతశేఖరః. ౬. చతుర్ముఖో భస్మధరః శ్మశాననిలయః సదా, గోత్రారిర్విశ్వనిలయస్తథా చ క్రతుదూషణః. ౭. వరో వరేణ్యో వరదో దేవదేవో మహేశ్వరః,ఆదిత్యదేహసంభూతః స తే శాంతిం కరోతు వై.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు
షట్సప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

అరుణ ఉవాచః—పద్మరాగప్రభా దేవీ చతుర్వదనపంకజా, అక్షమాలార్పిత

కమండలువును ధరించునదియు, శుభముల నిచ్చునదియు, సౌమ్యమగు ముఖముగలదియు, నాదిత్యారాధనమునం దాసక్తిగలదియు నగుబ్రహ్మాణీ దేవి సంతుష్టయై నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. మహాశ్వేత యని విఖ్యాతిని బొందినదియు, నాదిత్యపూజయం దాసక్తిగలదియు, కుందేందు సమానయు, వృషభవాహనము నధిష్ఠించునదియు, హస్తంబునఁ ద్రిశూలముగలదియు, సర్వభూషణములను ధరించునదియు, నాల్గుభుజంబులు గలదియు, నాల్గువక్త్రంబులుగలదియు, మూఁడుకండ్లుగలదియు, పాపముల నశింపఁజేయునదియు, నీశ్వరపూజయం దాసక్తయు నగురుద్రాణీదేవి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. మయూరవాహనము నధిష్ఠించునదియు, సింధూరమువలె నెఱ్ఱనైనదేహముగలదియు, శక్తిని హస్తమందు ధరించినదియు, గొప్పశరీరముగలదియు, సర్వాలంకారభూషితయు, సూర్యుని యందు భక్తిగలదియు, గొప్పబలముగలదియు నగుకౌమారీదేవి నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. గదాచక్రంబులధరించినదియు, నల్లని శరీరముగలదియు, పీతాంబరంబులధరించునదియు, నాల్గుభుజంబులు గలదియు, సర్వదేవతలచేఁ బూజింపఁబడునదియు, సూర్యారాధనమునం దాసక్తిగలదియు, సర్వరాక్షససంహారిణియును, నగువైష్ణవీ దేవి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. వెల్లయేనుఁగు నెక్కినదియు, వజ్రము ధరించినదియు, గొప్పబలముగలదియు, శరీరమంతటను నేత్ర

---

కరా కమండలుధరా శుభా. ౧. బ్రహ్మాణీ సౌమ్యవదనా ఆదిత్యారాధనే రతా, శాంతిం కరోతు సుప్రీతా ఆశీర్వాదపరా ఖగ. ౨. మహాశ్వేతేతి విఖ్యాతా ఆదిత్య దయితా సదా, హిమకుందేందుసదృశా మహావృషభవాహినీ. ౩. త్రిశూలహస్తావరణా విశ్రుతాభరణా సతీ, చతుర్భుజా చతుర్వక్త్రా త్రినేత్రా పాపనాశినీ, వృషధ్వజార్చన రతా రుద్రాణీ శాంతిదా భవేత్. ౪. మయూరవాహనా దేవీ సింధూరారుణవిగ్రహా, శక్తిహస్తా మహాకాయా సర్వాలంకారభూషితా. ౫. సూర్యభక్తా మహావీర్యా సూర్యార్చనరతా సదా, కౌమారీ వరదా దేవీ శాంతిమాశు కరోతు తే. ౬. గదాచక్రధరా శ్యామా పీతాంబరధరా ఖగ, చతుర్భుజా హి సా దేవీ వైష్ణవీ సురపూజితా. ౭. సూర్యార్చనపరా నిత్యం సూర్యైకగతమానసా, శాంతిం కరోతు తే నిత్యం సర్వాసుర విమర్దినీ. ౮. ఐరావతగజారూఢా వజ్రహస్తా మహాబలా, సర్వత్రలోచనా దేవీ వర్ణతః

ములుగలదియు, కర్బురారుణవర్ణములుగలదియు, సిద్ధగంధర్వులచే నమస్కరింపఁబడునదియు, సర్వాలంకారభూషితయు నగునింద్రాణీదేవి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. వరాహమువలె వికటమగు నాసికగలదియు, వరాహవాహన మెక్కునదియు, శ్యామశ్వేతవర్ణములుగలదియు, శంఖచక్రగదలను ధరించునదియు, ప్రాణులను బ్రకాశింపఁజేయుటకై నిత్యము సూర్యునారాధించునదియు, కోర్కెల నిచ్చునట్టి వారాహీదేవి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. అర్ధకోశంబులుగలదియు, నరములతో బంధించుటచే కృశించిన కటిప్రదేశముగలదియు, తీక్ష్ణంబగుముఖము గలదియు, భయంకరమైనదియు, ఖడ్గమును గంటలను ధరించునదియును, కపాలమును ధరించినదియును, క్రూరస్వభావముగలదియు, ఖట్వాంగమును ధరించినదియు, రక్తదేహముగలదియు, పింగళవర్ణంబులగు నేత్రంబులుగలదియు, గజచర్మమును గప్పుకొనినదియు, భుజంగాభరణంబుల ధరించినదియు, ప్రేతస్థానంబున నివసించునదియు, మంగళకరరూపమునకు భయమును గలుగఁజేయునదియు నగుచాముండాదేవి చండరూపముతో నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. భయంకరమగు ముండమును ఛేయునదియును, ముండదేహమును బొందినదియు, కపాలమాలియు, క్రూరవిగ్రహముగలదియు, ఖట్వాంగమును ధరించినదియు నగుచాముండాదేవి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. ఆకాశమాతలు, లోకమాతలు, భూతమాతలు, పితృమాతలు, వృద్ధిశ్రాద్ధంబులయందుఁ బూజింపఁబడు

---

కర్బురారుణా. ౯. సిద్ధగంధర్వనమితా సర్వాలంకారభూషితా, ఇంద్రాణీ తే సదా దేవీ శాంతిమాశు కరోతు వై. ౧౦. వరాహఘోణా వికటా వరాహవరవాహినీ, శ్యామావదాతా యా దేవీ శంఖచక్రగదాధరా. ౧౧. తేజయంతీతి నిమిషాన్పూజయంతీ సదా రవిమ్, వారాహీ వరదా దేవీ తవ శాంతిం కరోతు వై. ౧౨. అర్ధకోశా కటీక్షామా నిర్మాంసా స్నాయుబంధనాత్, కరాలవదనా ఘోరా ఖడ్గఘంటోద్ధతా సతీ. ౧౩. కపాలమాలినీ క్రూరా ఖట్వాంగవరధారిణీ, ఆరక్తా పింగనయనా గజచర్మావగుంఠితా. ౧౪. గోశ్రుతాభరణా దేవీ ప్రేతస్థాననివాసినీ, శివారూపేణ ఘోరేణ శివరూపభయంకరీ, చాముండా చండరూపేణ సదా శాంతిం కరోతు తే. ౧౫. చండముండకరా దేవీ ముండదేహగతా సతీ, కపాలమాలినీ క్రూరా ఖట్వాంగవరధారిణీ. ౧౬. ఆకాశమాతరో దేవ్యస్తథాన్యా లోకమాతరః, భూతానాం మాతరః సర్వాస్తథాన్యాః పితృమాతరః. ౧౭. వృద్ధిశ్రాద్ధేషు పూజ్యంతే యాస్తు దేవ్యో మనీషిభిః, మాత్రే ప్రమాత్రే

నితరదేవతలు, 'మాత్రే ప్రమాత్రే తన్మాత్రే' యని చెప్పఁబడువారు, పితామహాపత్నులును, వృద్ధపితామహియును నీకు శాంతినిఁ గలుగఁ జేయుదురుగాక. శాంతిప్రదయు, సద్గాత్రియు, సుమధ్యయు, సువర్ణ చ్ఛాయగలదియు, యౌవనమధ్యస్థయు, లావణ్యవతియు, లలాటము నందు చంద్రార్ధరేఖలను తిలకముగా ధరించినదియు, చిత్రాంబరధారి ణియు, సర్వాభరణభూషితయు, స్త్రీరత్నమును గుణసంపన్నయును, ధ్యానమాత్రముచే సంతోషించునదియును నగు నుమాదేవి శాంతరూప ముతో ప్రత్యక్షమై నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక.

ఇది సప్తసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

---

## అష్టసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

అరుణుం డిట్లనియె. అబాలసత్త్వుండును, ఖట్వాంగుఁడును, శిఖి వాహనుండును, శ్రీమంతుఁడును, శక్తిమంతుఁడును, కృత్తికలకును,

---

తన్మాత్రే ఇతి మాతృముఖాస్తథా. ౧౮. పితామహీ తు తన్మాతా వృద్ధా యా చ పితామహీ, ఇత్యేతాస్తు పితామహ్యః శాంతిం తే పితృమాతరః. ౧౯. సర్వా మాతృమహాదేవ్యః స్వాయుధావ్యగ్రపాణయః, జగద్వ్యాప్య ప్రతిష్ఠంత్యో బలికామా మహోదయాః. ౨౦. శాంతిం కుర్వంతు తా నిత్యమాదిత్యారాధనే రతాః, శాంతేన చేతసా శాంత్యః శాంతయే తవ శాంతిదా. ౨౧. సర్వావయవముఖ్యేన గాత్రేణ చ సుమధ్యమా, పీతశ్యామాతి సౌమ్యేన స్నిగ్ధవర్ణేన శోభనా. ౨౨. లలాటతిలకోపేతా చంద్రరేఖార్ధధారిణీ, చిత్రాంబరధరా దేవీ సర్వాభరణభూషితా. ౨౩. వరా స్త్రీమయరూపాణాం శోభా గుణసుసంపదా, భావనామాత్రసంతుష్టా ఉమా దేవీ వరప్రదా. ౨౪. సాక్షాదాగత్య రూపేణ శాంతేనామితతేజసా, శాంతిం కరోతు తే ప్రీతా ఆదిత్యారాధనే రతా. ౨౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు దశముఖే అగ్నికార్యవిధౌ
సప్తసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

అరుణ ఉవాచ:—అబలో బాలరూపేణ ఖట్వాంగశిఖివాహనః, పూర్వేణ షడనః శ్రీమాంస్త్రిశిఖః శక్తిసంయుతః. ౧. కృత్తికాయాశ్చ రుద్రస్య చాంగోద్భూతః

రుద్రుననును, శరీరసంభవుఁడును, దేవపూజితుండును, సూర్యవరముచే గర్వితుండును, మహాతేజస్సంపన్నుండు నగుకుమారస్వామి నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. బలమును సౌఖ్యము నిచ్చుఁగాక. ఆత్రేయితో సమానమగు బలముగలవాఁడును, శ్వేతవస్త్రము పరిధానముగాఁగల వాఁడును, త్రినేత్రుఁడును, సువర్ణప్రభాయుక్తుఁడును, శూలహస్తుఁడును, బుద్ధిశాలియు, సూర్యధ్యానపరుండు నగునందికేశ్వరుఁడు నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. ధర్మబుద్ధి నర్థకామంబులఁ గూడ నెల్లప్పుడిచ్చుచుండుఁగాక. పెద్దదగు నుదరముగలవాఁడును, గొప్పశరీరముగల వాఁడును, కాటుకవలె నల్లనైనదేహముగలవాఁడును, ఒక్కదంతముగల వాఁడును, ఏనుఁగుముఖముగలవాఁడును, మహాబలసంపన్నుఁడును, సర్పములను యజ్ఞోపవీతములనుగా ధరించువాఁడును, నానావిధంబులగు నాభరణంబుల ధరించువాఁడును, సమస్తజనుల నర్థసంపదలచే నుద్ధరించు వాఁడును, గణాధ్యక్షుండును, వరప్రదుండును, మహేశ్వరపుత్రుండును, భాస్కరారాధనతత్పరుండును నగువినాయకదేవుఁడు నీకు శాంతిఁ గలుగఁజేయుఁగాక. ఇంద్రనీలమణిసమవర్ణుండును, త్రినేత్రుండును, తీక్ష్ణమగు శూలాయుధముచేఁ బ్రకాశించువాఁడును, రక్తాంబరధారియు, శ్రీమంతుఁడును, నీలదేహుఁడగు నాగభూషణుఁడు లక్ష్యుఁడై యసదృశంబగు పాపనాశనమును శాంతినిఁ గలుగఁజేయుఁగాక. అమూల్యాంబరం

---

సురార్చితః, కార్తికేయో మహాతేజా ఆదిత్యవరదర్పితః, శాంతిం కరోతు తే నిత్యం బలం సౌఖ్యం చ తేజసా. ౨. ఆత్రేయీబలవాన్దేవ ఆరోగ్యం చ ఖగాధిప, శ్వేతవస్త్రపరీధానస్త్ర్యక్షః కనకసుప్రభః. ౩. శూలహస్తో మహాప్రాజ్ఞో నందీశో రవిభావితః, శాంతిం కరోతు తే శాంతో ధర్మే చ మతిముత్తమామ్. ౪. ధర్మేతరావుభౌ నిత్యమచలః సంప్రయచ్ఛతు, మహోదరో మహాకాయః స్నిగ్ధాంజనసమప్రభః. ౫. ఏకదంష్ట్రోత్కటో దేవో గజవక్త్రో మహాబలః, నాగయజ్ఞోపవీతేన నానాభరణభూషితః. ౬. సర్వార్థసంపదోద్ధారో గణాధ్యక్షో వరప్రదః, భీమస్య తనయో దేవో నాయకోఽథ వినాయకః, కరోతు తే మహాశాంతిం భాస్కరార్చనతత్పరః. ౭. ఇంద్రనీలనిభస్త్ర్యక్షో దీప్తశూలాయుధోద్యతః, రక్తాంబరధరః శ్రీమాన్కృష్ణాంగో నాగభూషణః. ౮. పాపాపనోదమతులమలక్ష్యో మలనాశనః, కరోతు తే మహాశాంతిం ప్రీతః ప్రీతేన చేతసా. ౯.

బుల ధరించునదియు, కన్యయు, నానాలంకారభూషితయు, దేవతలంద ఱకుఁ దల్లియు, సర్వలోకనమస్కృతయు, పుణ్యాత్మయు, సర్వసిద్ధుల గలుగఁజేయునదియు అనుగ్రహంబునకు ముఖ్యస్థానమైనట్టి లోకమాత నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. స్నిగ్ధంబగు శ్యామవర్ణముచే నొప్పు నదియు, మహిషాసురసంహారిణియు, ధనువు చక్రము నీరెండాయుధ ములను ధరించునదియు, ఖడ్గపట్టిసములను ధరించునదియు, తర్జనీపర్యం తము వ్యాపించియున్న విస్తారమైన హస్తముగలదియు, సర్వోపద్రవ ముల నశింపఁజేయునదియు, మహేశ్వరపత్నియగుదుర్గయు, శివయు నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక అతిసూక్ష్ముండును, అతికోపియు, త్రినేత్ర ధారియు, సూర్యాత్మకుండును, మహావీరుండును, సూర్యధ్యానైక మనస్కుండును, నిత్యము సూర్యపూజను జేయువాఁడు నగు భృంగీశ్వ రుఁడు నీకు మంగళముల నిచ్చుఁగాక. ప్రచండంబులగు సైన్యంబుల కధీ శుండును, ఘంటలచే నిర్మితంబగు జపమాలను ధరించువాఁడును, భయం కరంబులగు పాపంబుల నపహరించువాఁడును, బ్రహ్మహత్యాజనితంబగు పాపమును గూడ నశింపఁజేయువాఁడును నగుచండీశ్వరుఁడు నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. మహాయోగియగు నీతఁడు కల్యాణపరంపర నిచ్చుఁ గాక. ఆకాశమాతలు, ఇతరులగుదేవమాతలును, సూర్యార్చనపరులగు దేవులును, జగమును వ్యాపించియుండి సురపూజితులగుమాతలును నీకు

---

వరాంబరధరా కన్యా నానాలంకారభూషితా, త్రిదశానాం చ జననీ పుణ్యా లోకనమ స్కృతా. ౧౦. సర్వసిద్ధికరా దేవీ ప్రసాదపరమాస్పదా, శాంతిం కరోతు తే మాతా భువనస్య ఖగాధిప. ౧౧. స్నిగ్ధశ్యామేన వర్ణేన మహామహిషమర్దనీ, ధనుశ్చక్రప్రహ రణా ఖడ్గపట్టిశధారిణీ. ౧౨. ఆతర్జన్యాయతకరా సర్వోపద్రవనాశినీ, శాంతిం కరోతు తే దుర్గా భవానీ చ శివా తథా. ౧౩. అతిసూక్ష్మో హ్యతిక్రోధస్త్ర్యక్షో భృంగిరిటి ర్మహాన్, సూర్యాత్మకో మహావీరః సూర్యైకగతమానసః, సూర్యభక్తికరో నిత్యం శివం తే సంప్రయచ్ఛతు. ౧౪. ప్రచండగణసైన్యేశో మహాఘంటాక్షధారకః, అక్షమాలా ర్పితకరశ్చాక్షచండేశ్వరో వరః. ౧౫. చండపాపహరో నిత్యం బ్రహ్మహత్యా వినా శనః, శాంతిం కరోతు తే నిత్యమాదిత్యారాధనే రతః, కరోతి చ మహాయోగీ కల్యా ణానాం పరంపరామ్. ౧౬. ఆకాశమాతరో దివ్యాస్తథాన్యా దేవమాతరః, సూర్యా యణపరా దేవ్యో జగద్వ్యాప్య వ్యవస్థితాః, శాంతిం కుర్వంతు మే నిత్యం మాతరః

శాంతినిఁ గలుగఁజేయుదురుగాక. రౌద్రకర్ములును, రౌద్రస్థానవాసులు నగురుద్రులును, రుద్రరూపంబు లగుమాతలును, గణాధిపతులును, దిక్కులయందును విదిక్కులయందును నాశ్రయించియుండిన విఘ్న భూతులును మొదలగువారందఱును ప్రీతాత్ములై నాచే నొసంగఁబడు బలిని గ్రహింతురుగాక. సర్వసిద్ధులను గలుగఁజేయుదురుగాక. సర్వవిధ భయంబులనుండి రక్షించుగాక వజ్రహస్తులును, మహాబలులును, హిమ కుందేందుసదృశులును, నీలకృష్ణలోహితాంగులును, దివ్యులును, అంతరిక్ష వాసులును, భూవాసులును, పాతాలవాసులును నైంద్రాదిగణంబులు, ఐంద్రులును మాటిమాటికిని శాంతిని మంగళంబులను గలుగఁజేయుఁ గాక. ధ్రువహాత్ర్యానుసారులగు నెవ్వ రాగ్నేయదిక్కునందు భరింపఁ బడిరో సూర్యునియం దనురక్తులును, రక్తవర్ణశోభితులును, జపాకుసుమ సదృశులును, లోహితవర్ణులును, దివ్యులును, భాస్కరారాధనపరులును, ఆదిత్యగతమనస్కులు నగుభాస్కరాదు లగువారందఱు నాగ్నేయ దిక్కుననుండి నీకు శాంతిని నిత్యమును గలుగఁజేయుదురుగాక. ఎవ్వరు ప్రభచే సూర్యసములును దండపాణులు సూర్యారాధనతత్పరులు నగు దురో వారు బలము నిత్తురుగాక. ప్రశాంతులును, శూలపాణులును, భస్మోద్ధూళితదేహులును, నీలకంఠులును, లోహితవర్ణులు నగుదివ్యాంత

---

సూరపూజితాః. ౧౭. యే రుద్రా రౌద్రకర్మాణో రౌద్రస్థాననివాసినః, మాతరో రుద్ర రూపాశ్చ గణానామధిపాశ్చ యే. ౧౮. విఘ్నభూతా స్తథా చాన్యే దిగ్విదిక్షు సమా శ్రితాః, సర్వే తే ప్రీతమనసః ప్రతిగృహ్ణంతు మే బలిమ్, సిద్ధిం కుర్వంతు తే నిత్యం భయేభ్యః పాంతు సర్వతః. ౧౯. ఐంద్రాదయో గణా యే తు వజ్రహస్తా మహాబలాః, హిమకుందేందుసదృశా నీలకృష్ణాంగలోహితాః. ౨౦. దివ్యాంతరిక్షా భౌమాశ్చ పాతాల తలవాసినః, ఐంద్రాః శాంతిం ప్రకుర్వంతు భద్రాణి చ పునః పునః. ౨౧. ఆగ్నేయ్యాం యే ధృతాః సర్వే ధ్రువహాత్ర్యానుషంగిణః, సూర్యానురక్తా రక్తాభా జపాసుమనిభా స్తథా. ౨౨. విరక్తలోహితా దివ్యా ఆగ్నేయ్యాం భాస్కరాదయః, ఆదిత్యారాధన పరా ఆదిత్యగతమానసాః. ౨౩. శాంతిం కుర్వంతు తే నిత్యం ప్రయచ్ఛంతు బలిం మమ, భయాఽఽదిత్యసమా యే తు సతతం దండపాణయః, ఆదిత్యారాధనపరాః కం ప్రయచ్ఛంతు తే సదా. ౨౪. ఐశాన్యాం సంస్థితా యే తు ప్రశాంతాః శూలపా ణయః, భస్మోద్ధూలితదేహాశ్చ నీలకంఠా విలోహితాః. ౨౫. దివ్యాంతరిక్షా భౌమాశ్చ

రిక్షభౌమపాతాళవాసు లెవ్వ రైశానదిక్కుననుండిరో సూర్యపూజాకరులగువా రందఱును సూర్యుని పూజించి సంతుష్టాంతరంగులై లోకపాలకులతోఁ గూడి యుండి నాకు శాంతినిఁ కలుగఁజేయుదురుగాక. నిత్యమును సుఖము నిచ్చుచుందురుగాక. పూర్వదిగ్భాగంబున విద్యాధరగణాకీర్ణంబును, సిద్ధవిద్యాధరసేవితంబును, రత్నప్రాకారరమ్యంబును, మహారత్నశోభితంబు నగు నమరావతి యనుపట్టణ మొండు గలదు. అందు శోభాసంపన్నుఁడును, వజ్రహస్తుండును, మహాబలసంపన్నుఁడును, శోభాయుక్తమగు గోసహస్రముచే విరాజమానుఁడగు నింద్రుఁడు ప్రకాశించుచుండును. ఆతఁ డైరావతమను తెల్లయేనుఁగు నెక్కి సువర్ణచ్ఛాయయుఁ దేజముం గల్గి సూర్యధ్యానరతుండై యెల్లపుడు సూర్యజ్ఞానమే పరమమని భక్తియుక్తంబుగఁజేసిన నమస్కారమునకు శాంతిం గల్గఁజేయుఁగాత. ఆగ్నేయదిగ్భాగంబున నానాదేవగణాకీర్ణంబును నానారత్నశోభితంబు నగు తేజస్వతీపురము గలదు. ఆపట్టణమున దహనస్వరూపుండును పాపనాశనుఁడు నాదిత్యారాధనపరుండు నగుజ్వలనుఁడు నీకు పాపనాశనమును శాంతినిఁ గలుగఁజేయుఁగాత. నానారత్నశోభితమగు వైవస్వతీపురము దక్షిణదిగ్భాగంబునఁ గలదు. ఆనగరమునఁ గుందేందు

---

పాతాలతలవాసినః, సూర్యపూజాకరా నిత్యం పూజయిత్వాంశుమాలినమ్. ౨౬. తతః సుప్రీతమనసో లోకపాలైః సమన్వితాః, శాంతిం కుర్వంతు మే నిత్యం కం ప్రయచ్ఛంతు పూజితాః. ౨౭. అమరావతీ పురీ నామ పూర్వభాగే వ్యవస్థితా, విద్యాధరగణాకీర్ణా సిద్ధగంధర్వసేవితా. ౨౮. రత్నప్రాకారరుచిరా మహారత్నోపశోభితా, తత్ర దేవపతిః శ్రీమాన్వజ్రపాణిర్మహాబలః, గోపతిర్గోసహస్రేణ శోభమానేన శోభతే. ౨౯. ఐరావతగజారూఢో గైరికాభో మహాద్యుతిః, దేవేంద్రః సతతం హృష్ట ఆదిత్యారాధనే రతః. ౩౦. సూర్యజ్ఞానైకపరమః సూర్యభక్తిసమన్వితః, సూర్యప్రణామః పరమాం శాంతిం తేఽద్య ప్రయచ్ఛతు. ౩౧. ఆగ్నేయదిగ్విభాగే తు పురీ తేజస్వతీ శుభా, నానాదేవగణాకీర్ణా నానారత్నోపశోభితా. ౩౨. తత్ర జ్వాలా సమాకీర్ణో దీప్తాంగారసమద్యుతిః, పురగో దహనో దేవో జ్వలనః పాపనాశనః. ౩౩. ఆదిత్యారాధనరత ఆదిత్యగతమానసః, శాంతిం కరోతు తే దేవస్తథా పాపపరిక్షయమ్. ౩౪. వైవస్వతీ పురీ రమ్యా దక్షిణేన మహాత్మనః, సురాసురశతాకీర్ణా నానారత్నోపశోభితా. ౩౫. తత్ర కుందేందుసంకాశో హరిపింగలలోచనః, మహామహిషమారూఢః కృష్ణస్రగ్వస్త్రభూషణః. ౩౬.

సదృశుఁడును, హరిపింగలలోచనుండును, మహిషవాహనారూఢుండును, కృష్ణవస్త్రమాల్యాలంకృతుండును, సూర్యధర్మాసక్తుండును, సూర్యారాధన పరుండు నగునంతకుండు నీకు క్షేమము నారోగ్యంబు నొసంగుఁగాక. నైరృతదిగ్భాగంబున మోహావిష్టులగు రక్షోగణంబులచేతను నశుచు లగు పిశాచప్రేతములతోడను సంకులంబగు కృష్ణపురము గలదు. ఆపురంబున రక్తవస్త్రమాల్యభూషితుండును ఖడ్గపాణియు మహాతేజస్వియు భయంకరవదనోజ్జ్వలుండు నాదిత్యారాధనరతుండు నగురాక్షసుఁడుండును. ఆతఁడు నీకు శాంతినిఁ గలుగఁజేయుగాక. విశేషధనధాన్యము లొసంగుఁగాత. పశ్చిమదిగ్భాగంబున నానాభోగసమాకీర్ణంబును కిన్నరగణసేవితంబు నగుసిద్ధపురంబు గలదు. ఆపురమున హరిపింగళనేత్రుఁడగువరుణుఁ డుండును. ఆతఁడు సంతుష్టుఁడై శాంతమనస్కుఁడై నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. ఈశాన్యదిగ్భాగంబున నానాగణసమాకీర్ణంబును బహువిధంబులగు గృహములచేఁ బ్రకాశించునదియుఁ బ్రాకారవేష్టితంబు నుజ్జ్వలంబు నగుయశోవతి యనుపురము గలదు. ఆపురమునఁ ద్రినేత్రుఁడు నానాలంకారవిభూషితుఁడు శాంతరూపుఁడుఁ బరదైవంబు నగు నీశానుఁ డుండును. ఆతఁడు నీకు శాంతి నొసఁగుఁగాక. భూర్భువర్లోకములం దే దేవతలు శుభయుక్తులై నివసించియుందురో వారందఱు నెల్లప్పుడు నీకు శాంతినిఁ గలుగఁజేయుదురుగాక. మహర్లోకజనోలోకపర

---

అంతకోఽథ మహాతేజాః సూర్యధర్మపరాయణః, ఆదిత్యారాధనపరః క్షేమారోగ్యే దదాతు తే. ౩౭. నైఋతే దిగ్విభాగే తు పురీ కృష్ణేతి విశ్రుతా, మోహరక్షోగణాశౌచపిశాచప్రేతసంకులా. ౩౮. తత్ర కుందనిభో దేవో రక్తస్రగ్వస్త్రభూషణః, ఖడ్గపాణిర్మహాతేజాః కరాలవదనోజ్జ్వలః. ౩౯. రక్షేంద్రో వసతే నిత్యమాదిత్యారాధనే రతః, కరోతు తే సదా శాంతిం ధనం ధాన్యం ప్రయచ్ఛతు. ౪౦. పశ్చిమే తు దిశో భాగే పురీ శుద్ధవతీ సదా, నానాభోగిసమాకీర్ణా నానాకిన్నరసేవితా. ౪౧. తత్ర కున్దేందుసంకాశో హరిపింగలలోచనః, శాంతిం కరోతు తే ప్రీతః శాంతః శాంతేన చేతసా. ౪౨. యశోవతీ పురీ రమ్యా ఐశానీం దిశమాశ్రితా, నానాగణసమాకీర్ణా నానాకృత శుభాలయా, తేజః ప్రాకారపర్యంతా అనౌపమ్యా సదోజ్జ్వలా. ౪౩. తత్ర కుందేందుసంకాశశ్చాంబుజాక్షో విభూషితః, త్రినేత్రః శాంతరూపాత్మా అక్షమాలాధరాధరః, ఈశానః పరమో దేవః సదా శాంతిం ప్రయచ్ఛతు. ౪౪. భూలోకే తు భువర్లోకే నివసంతి చ యే సదా, దేవాదేవాః శుభాయుక్తాః శాంతిం కుర్వంతు తే సదా. ౪౫. మహర్లోకే జనోలోకే పరలోకే గతాశ్చ యే, తే సర్వే ముదితా దేవాః

లోకములం దేదేవత లుందురో వారందఱు నీకు శాంతిఁ గల్గఁజేయు దురుగాక. సూర్యభక్తయగు సరస్వతి నీకు శాంతి నిచ్చుఁగాక; సుందరం బగు సువర్ణాసనంబున నుండునదియును పద్మసదృశంబులగు కరంబులుగల దియు సూర్యభక్తురాలు నగుదేవి నీ కైశ్వర్య మొసఁగుఁగాక. విచిత్ర హారవిరాజమానయు మేఖలోపశోభితయు నగు నపరాజితాదేవి నీకు విజయము నిచ్చుఁగాక.

ఇది అష్టసప్తత్యుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకోనాశీత్యుత్తరశతతమాధ్యాయము.

అరుణుం డిట్లనియె. పరమదేవి యగుకృత్తికయు, వరానన యగు రోహిణియు, శ్రీమంతమగు మృగశిరంబును, మంగళకరి యగునార్ద్రియు, నుజ్జ్వల యగు పునర్వసుపుష్యమి ఆశ్లేషయును వీరందఱు సూర్యధ్యాన పరాయణలై సూర్యు నెల్లప్పుడు తూర్పుదిక్కునం దర్చింపుచుందురు. వీరందఱును ప్రభామాలావిభూషితలగు నక్షత్రమాతలు. మఖయు, సర్వగుణోపేతయగు పూర్వఫల్గునియు, స్వాతివిశాఖలు, వీరందఱును దక్షిణదిక్కు నాశ్రయించినవారలై సురపూజితుఁడగు నాదిత్యు

---

శాంతిం కుర్వంతు తే సదా. ౪౬. సరస్వతీ సూర్యభక్తా శాంతిదా విదధాతు తే, చారుచామీకరస్థా యా సరోజకరపల్లవా, సూర్యభక్త్యాశ్రితా దేవీ విభూతిం తే ప్రయచ్ఛతు. ౪౭. హారేణ సువిచిత్రేణ భాస్వత్కనకమేఖలా, అపరాజితా సూర్యభక్తా కరోతు విజయం తవ. ౪౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మవర్ణనం నామ
అష్టసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

అరుణ ఉవాచ:—కృత్తికా పరమా దేవీ రోహిణీ చ వరాననా, శ్రీమన్మృగశిరో భద్రా ఆర్ద్రా చాప్యపరోజ్జ్వలా. ౧. పునర్వసుస్తథా పుష్య ఆశ్లేషా చ తథాధిప, సూర్యార్చనరతా నిత్యం సూర్యభావానుభావితాః. ౨. అర్చయంతి సదా దేవమాదిత్యం సురతే సదా, నక్షత్రమాతరో హ్యేతాః ప్రభామాలావిభూషితాః. ౩. మఘా సర్వగుణోపేతా పూర్వా చైవ తు ఫాల్గునీ, స్వాతీ విశాఖా వరదా దక్షిణాం దిశమాశ్రితాః. ౪. అర్చయంతి సదా దేవమాదిత్యం సురపూజితమ్, తవాపి శాంతికం ద్యోతం

నర్చించుచు గగనోదితులై నీకు శాంతిని గల్గఁజేయుదురుగాక. అనూరాధ జ్యేష్ఠ మూల సూర్యపురస్సరంబగు పూర్వాషాఢ మహావీర్యయగు నుత్తరాషాఢ యభిజిత్తు శ్రవణము ఇవియన్నియు పశ్చిమదిక్కున నుద యించి మూర్తుల ననుసరించి ప్రకాశించుచుండును వీరందఱును సర్వకాలంబులయందు భాస్కరుని బూజించుచు నీకు నిత్యమును శాంతిని వృద్ధికరంబగు నైశ్వర్యము నిత్తురుగాక. ధనిష్ఠ, శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్వని, భరణి ఇవి నిత్య ముత్తర దిక్కుననుండి సూర్యారాధనఁ జేయుచు నీకు నిత్యమును శాంతినిఁ గల్గఁజేయుఁగాక. వృద్ధికరంబగు విభూతి నిచ్చుఁగాక. మేషము, మృగాధిప మగుసింహము, దీప్తిమంతమగుధనువు, సూర్యయోగపరంబులగు నీమూఁ డును సూర్యపదాంబుజములయందలి భక్తిచే నీకు శాంతి నొనగూర్తురు గాక. వృషభము, కన్య, మకరము పరంబగుభక్తిచే దక్షిణభాగంబున సూర్యుని పూజించుచు నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక మిథునము, తుల, కుంభము, ఈమూఁడును బశ్చిమభాగముననుండి యాదిత్యజ్ఞాన తత్పరులై గ్రహాధిపతియగు నాదిత్యుని జపించుచు శాంతిని గలుగఁ జేయునుగాక. ఎల్లపుడు నెవరు విద్వాంసులచే ధ్రువునిపర్యంతము సప్త

---

కుర్వంతు గగనోదితాః. ౫. అనురాధా తథా జ్యేష్ఠా మూలం సూర్యపురఃసరా, పూర్వా షాఢా మహావీర్యా ఆషాఢా చోత్తరా తథా. ౬. అభిజిన్నామ నక్షత్రం శ్రవణం చ బహుశ్రుతమ్, ఏతాః పశ్చిమతో దీప్తా రాజంతే చాను మూర్తయః. ౭. భాస్కరం పూజయంత్యేతాః సర్వకాలం సుభావితాః, శాంతిం కుర్వంతు తే నిత్యం విభూతిం చ మహర్ధికామ్. ౮. ధనిష్ఠా శతభిషా తు పూర్వభాద్రపదా తథా. ౯. ఉత్తరాభాద్ర రేవత్యౌ చాశ్వినీ చ మహామతే, భరణీ చ మహాదేవీ నిత్యముత్తరతః స్థితాః. ౧౦. సూర్యార్చనరతా నిత్యమాదిత్యగతమానసాః, శాంతిం కుర్వంతు తే నిత్యం విభూతిం చ మహర్ధికామ్. ౧౧. మేషో మృగాధిపః సింహో ధనుర్దీప్తిమతాం వరః, పూర్వేణ భాసయంత్యేతే సూర్యయోగపరాః శుభాః, శాంతిం కుర్వంతు తే నిత్యం భక్త్యా సూర్యపదాంబుజే. ౧౨. వృషః కన్యా చ పరమా మకరశ్చాపి బుద్ధిమాన్, ఏతే దక్షిణ భాగే తు పూజయంతి రవిం సదా, భక్త్యా పరమయా నిత్యం శాంతిం కుర్వంతు తే సదా. ౧౩. మిథునం చ తులా కుంభః పశ్చిమే చ వ్యవస్థితాః, జపంత్యేతే సదాకాల మాదిత్యం గ్రహనాయకమ్. ౧౪. శాంతిం కుర్వంతు తే నిత్యం ఖఖోల్కజ్ఞాన తత్పరాః, సతపోదత్తపుష్పాభ్యాం యే స్మృతా సతతం బుధైః. ౧౫. ఋషయః సప్త

ఋషులని విఖ్యాతిని బొందిరో వారలందఱును భానుని ప్రసాదముచే నీకు నెల్లప్పుడు శాంతి నిత్తురుగాక. కశ్యపుఁడు, గాలవుఁడు, గార్గ్యుఁడు, విశ్వామిత్రుఁడు, దక్షుఁడు, వశిష్ఠుఁడు, మార్కండేయుఁడు, పులహుఁడు, క్రతువు, నారదుఁడు, భృగుఁడు, ఆత్రేయుఁడు, భరద్వాజుఁడు, వాల్మీకి, కౌశికుఁడు, వాత్స్యుఁడు, శాకల్యుఁడు, పునర్వసుఁడు, శాలంకాయనుఁడు సూర్యధ్యానమే యుక్తంబని తలంచు నీమహర్షులందఱును నీకెల్లప్పుడును శాంతిని గలుగఁజేయుదురుగాక. మహానుభావలగు మునికన్యలును, అల్పవయస్కలగు ఋషికుమారికలును సూర్యపూజను జేయుచు నీకు శాంతి నిత్తురుగాక. సంపూర్ణతపస్సిద్ధి గలసిద్ధులును, మహాతపస్సంపన్నులగు నితరులును, ఆదిత్యుఁడే పరదైవంబని యెంచి ఆదిత్యపూజాపరులగు విద్యాధరులును, నీతోఁగూడిన గరుడులును, వీరలందఱును నాశీర్వాదపరులై నీకు సిద్ధి నిత్తురుగాక. దైత్యరాజేంద్రుఁడగు నముచియు, మహాబలుండగు శంకుకర్ణుండును, మహానాథుండును ప్రసిద్ధిబొందిన పరమవీర్యవంతుఁ డగురాక్షసుఁడును వీరందఱును గ్రహాధిపతియగు సూర్యునిఁ బూజించుచు బలమును వీర్యమును వృద్ధిని ఆరోగ్యమును గలుగఁజేయుదురుగాక సమృద్ధుండగు హయగ్రీవుండును, బ్రభాసమేతుండగు ప్రహ్లాదుండును, తానైకాగ్నిముఖుం డనుదైత్యుఁడును, మహా

---

విఖ్యాతా భ్రువాంతాః పరమోజ్జ్వలాః, భానుప్రసాదాత్సంపన్నాః శాంతిం కుర్వంతు తే సదా. ౧౬. కశ్యపో గాలవో గార్గ్యో విశ్వామిత్రో మహామునిః, మునిర్దక్షో వశిష్ఠశ్చ మార్కండ్డః పులహః క్రతుః. ౧౭. నారదో భృగురాత్రేయో భారద్వాజశ్చ వై మునిః, వాల్మీకిః కౌశికో వాత్స్యః శాకల్యోఽథ పునర్వసుః. ౧౮. శాలంకాయన ఇత్యేతే ఋషయోఽథ మహాతపాః, సూర్యధ్యానైకపరమాః శాంతిం కుర్వంతు తే సదా. ౧౯. మునికన్యా మహాభాగా ఋషికన్యాః కుమారికాః, సూర్యార్చనరతా నిత్యం శాంతిం కుర్వంతు తే సదా. ౨౦. సిద్ధాః సమృద్ధతపసో యే చాన్యే వై మహాతపాః, విద్యాధరా మహాత్మానో గరుడశ్చ త్వయా సహ. ౨౧. ఆదిత్యపరమా హ్యేతే ఆదిత్యారాధనే రతాః, సిద్ధిం తే సంప్రయచ్ఛంతు ఆశీర్వాదపరాయణాః. ౨౨. నముచిర్దైత్యరాజేంద్రః శంకుకర్ణో మహాబలః, మహానాథోఽథ విఖ్యాతో దైత్యః పరమవీర్యవాన్. ౨౩. గ్రహాధిపస్య దేవస్య నిత్యం పూజాపరాయణాః, బలం వీర్యం చ తే బుద్ధిమారోగ్యం చ బ్రువంతు తే. ౨౪. మహోఘో యో హయగ్రీవః ప్రహ్లాదః

బలుఁడగు కాలనేమియు, మహాత్ములగు వీరు సూర్యుని భావించుచు సంతోషమును బలమును నారోగ్యము నిత్తురుగాక. వైరోచనుఁడు,హిరణ్యాక్షుఁడు, తుర్వసుఁడు, సులోచనుఁడు, ముచికుందుఁడు, ముకుందుఁడు, దైత్యుఁడు, రైవతకుఁడు వీరందఱును గొప్పభక్తిచే సూర్యు నారాధించి శుభస్వరూపులై పుష్టిని గలుగఁజేయుదురుగాక మహాభాగినులగు దైత్య భార్యలును, శుభస్వరూపలగు దైత్యకన్యలును, రక్తదేహులు విశాల లోచనులు మహానుభావులగు దైత్యకుమారులును నీకెల్లప్పుడును శాంతినిఁ గలుగఁజేయుదురుగాక. అనంతుఁడను నాగరాజేంద్రుఁడు సూర్యధ్యానతత్పరుఁడై సర్వంబులగు దుష్టవిషంబుల నశింపఁజేసి శాంతినిఁ గలుగఁజేయుఁగాక. పీతవర్ణముగల దేహముతోఁ బ్రకాశించుచున్నట్టియు, పడగలతోఁగూడినట్టియు, మంగళద్రవ్యలాంఛితుండును, శ్రీమంతుఁడును కోటినామములచే నుపలక్షితుండును నగు తక్షకుండను నాగరాజు సర్వ పాపవిషంబుల నశింపఁజేసి మహాశాంతిని గలుగఁజేయుఁగాక మిక్కిలి నల్లనగువర్ణముచే స్ఫుటంబులగు గండస్థలంబులు శిరంబును గలవాఁడును, మూఁడు కంఠరేఖలచేఁ బ్రకాశించువాఁడును, భయంకరంబులగు కోరలనెడు నాయుధంబులచే సన్నద్ధుండును, విషగర్వముచే బలయుక్తుండు నగుకర్కోటకుండను మహానాగము విషశస్త్రమువలని యగ్నిసంతాప

---

ప్రభయాన్వితః, తామ్రైకాగ్నిముఖో దైత్యః కాలనేమిర్మహాబలః. ౨౫. ఏతే దైత్యా మహాత్మానః సూర్యభావేన భావితాః, తుష్టిం బలం తథాఽఽరోగ్యం ప్రయచ్ఛంతు సురారయః. ౨౬. వైరోచనో హిరణ్యాక్షస్తుర్వసుశ్చ సులోచనః, ముచకుందో ముకుందశ్చ దైత్యో రైవతకస్తథా. ౨౭. భావేన పరమేణేమం యజంతే సతతం రవిమ్, సతతం చ శుభాత్మానః పుష్టిం కుర్వంతు తే సదా. ౨౮. దైత్యపత్న్యశ్చ మహాభాగా దైత్యానాం కన్యకాః శుభాః, కుమారా యే చ దైత్యానాం శాంతిం కుర్వంతు తే సదా. ౨౯. ఆరక్తేన శరీరేణ రక్తాంతాయతలోచనాః, మహాభాగాః కృతాటోపాః శంఖాద్యాః కృతలక్షణాః. ౩౦. అనంతో నాగరాజేంద్ర అదిత్యారాధనే రతః, మహాపాపవిషం హత్వా శాంతిమాశు కరోతు తే. ౩౧. అతిపీతేన దేహేన విస్ఫురద్భోగసంపదా, తేజసా చాతిదీప్తేన కృతస్వస్తికలాంఛనః. ౩౨. నాగరాట్ తక్షకః శ్రీమాన్నామకోట్యా సమన్వితః, కరోతు తే మహాశాంతిం సర్వదోషవిషాపహామ్. ౩౩. అతికృష్ణేన వర్ణేన స్ఫుటాధికటమస్తకః, కంఠరేఖాత్రయోపేతో ఘోరదంష్ట్రాయుధో వృతః. ౩౪. కర్కోటకో మహానాగో విషదర్పబలాన్వితః, విషశస్త్రాగ్నిసంతాపం

మును మాన్పి నీకు శాంతిని గలుగఁజేయుగాక. పద్మవర్ణుండును, పద్మకాంతియుక్తుండును, వికసితపద్మాయతనేత్రుండును, అనవరతభాస్కరపూజకుండును నగుపద్ముఁడను మహానాగము శాంతిని అచలంబగు శుభము నిచ్చుఁగాక. శ్యామంబగు దేహభారముచే నొప్పువాఁడును, విషగర్వమనెడిబలముచే నొప్పువాఁడును, కంఠంబున రేఖలుగలవాఁడును, లక్ష్మిచేఁ బ్రకాశితుండును, సూర్యపదాబ్జపూజకుండును, శ్రీమంతుఁ డగు కమలలోచనుఁడు నగుశంఖపాలుఁడు గరళంబులలో శ్రేష్ఠంబగు మహావిషమును సంహరించి నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. మిక్కిలి తెల్లనగుశరీరముచేఁ బ్రకాశించుచు నర్ధచంద్రు నాభరణముగా ధరించినట్టియు, దీపభాగంబున చేయఁబడినయాడంబరంబులచే శుభలక్షణయుక్తుండును, సూర్యధ్యానపరాయణుండు నగుకులికుండను నాగరాజు ఘోరవిషము నపహరించి నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. అంతరిక్షవాసులును స్వర్గవాసులును, పర్వతవాసులును, భూవాసులును, పాతాళవాసులును సూర్యార్చనాసక్తులగు నీనాగరాజులందఱును నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక. సూర్యభక్తులును, సహృదయులును నగునాగవనితలును, నాగకన్యకలును, నాగకుమారులును నీకెల్లప్పుడును శాంతిని గలుగఁజేయుదురుగాక. ఎవ్వఁ డీనామసంస్థానమును పఠించునో లేక

---

హత్వా శాంతిం కరోతు తే. ౩౫. పద్మవర్ణః పద్మకాన్తిః ఫుల్లపద్మాయతేక్షణః, ఖ్యాతః పద్మో మహానాగో నిత్యం భాస్కరపూజకః. ౩౬. స తే శాంతిం శుభం శీఘ్రమచలం సంప్రయచ్ఛతు, శ్యామేన దేహభారేణ శ్రీమత్కమలలోచనః. ౩౭. విషదర్పబలోన్మత్తో గ్రీవాయాం రేఖయాన్వితః, శంఖపాలః శ్రియా దీప్తః సూర్యపాదాబ్జపూజకః. ౩౮. మహావిషం గరశ్రేష్ఠం హత్వా శాంతిం కరోతు తే, అతిగౌరేణ దేహేన చంద్రార్ధకృతశేఖరః. ౩౯. దీపభాగే కృతాటోపశుభలక్షణలక్షితః, కులికో నామ నాగేన్ద్రో నిత్యం సూర్యపరాయణః, అపహృత్య విషం ఘోరం కరోతు తవ శాంతికమ్. ౪౦. అంతరిక్షే చ యే నాగా యే నాగాః స్వర్గసంస్థితాః, గిరికందరదుర్గేషు యే నాగా భువి సంస్థితాః. ౪౧. పాతాలే యే స్థితా నాగాః సర్వే యత్ర సమాహితాః, సూర్యపాదార్చనాసక్తాః శాంతిం కుర్వంతు తే సదా. ౪౨. నాగిన్యో నాగకన్యాశ్చ తథా నాగకుమారకాః, సూర్యభక్తాః సుమనసః శాంతిం కుర్వంతు తే సదా. ౪౩. య

వినునో యాతనిని సర్పంబులు హింసింపనేరవు. కఱచినను విషముద్ధ మింపఁజాలదు.

ఇది ఏకోనాశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

## అశీత్యుత్తరశతతమాధ్యాయము.

పుణ్యవతియగు గంగానదియు,మహాదేవియగు యమునయు,నర్మద, గౌతమి, కావేరియు,వరుణాదేవియు వీరందఱును, సర్వగ్రహాధిపతియును లోకేశ్వరుండును, లోకప్రవర్తకుండును, నగుదేవునిఁ బూజించి సద్భావముచే భావించుచు నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక నిరంజన యనునది, శోణమనునదము, మందాకిని యీనదులున్ను నివిగాక భూమ్యంతరిక్షంబులయందుండు, సూర్యార్చనారతంబు లగునదులన్నియు నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. యక్షేశ్వరుండును, యక్షకోటిపరివారుండును నగు వైశ్రవణుఁడు మహావిభవసంపన్నుఁడై సూర్యపాదంబుల నర్చించుచు సంతుష్టుఁడై నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. మహాయక్షుండును, మణి

---

ఇదం నామసంస్థానం కీర్తయేచ్ఛృణుయాత్తథా, న తం సర్పా విహింసంతి న విషం క్రమతే సదా. ౪౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మవర్ణనం నామ
ఏకోనాశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

గంగా పుణ్యా మహాదేవీ యమునా నర్మదా నదీ, గౌతమీ చాపి కావేరీ వరుణా దేవికా తథా. ౧. సర్వగ్రహపతిం దేవం లోకేశం లోకనాయకమ్, పూజయంతి సదా నద్యః సూర్యసద్భావభావితాః, శాంతిం కుర్వంతు తే నిత్యం సూర్యధ్యానైకమానసాః. ౨. నిరంజనా నామ నదీ శోణశ్చాపి మహానదః, మందాకినీ చ పరమా తథా సన్నిహితా శుభా. ౩. ఏతాశ్చాన్యాశ్చ బహవో భువి దివ్యంతరిక్షకే, సూర్యార్చనరతా నద్యః కుర్వంతు తవ శాంతికమ్. ౪. మహావైశ్రవణో దేవో యక్షరాజో మహర్ధికః, యక్షకోటిపరీవారో యక్షసంఖ్యేయసంయుతః. ౫. మహావిభవసంపన్నః సూర్యపాదార్చనే రతః, సూర్యధ్యానైకపరమః సూర్యభావేన భావితః. ౬. శాంతిం కరోతు తే ప్రీతః పద్మపత్రాయతేక్షణః, మాణిభద్రో మహాయక్షో మణిరత్న

రత్నాలంకృతుండును నగుమణిభద్రుఁడు యక్షభార్యలతోడను, యక్ష కన్యలతోడను గూడి సూర్యు నారాధించుచు నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. మణికుండలభూషితుండును, ముఖంబున హేమపట్ట బంధంబుచే విరాజమానుండును, అనేకులగు యక్షులచే సేవ్యమా నుండును నగుసుచిరుఁడను యక్షేశ్వరుఁడు నీకు శాంతిని గలుగఁజేయుఁ గాక. కంఠాభరణాలంకృతుండును, బహురత్నయుతంబగు విచిత్రకుక్కు టంబుచేఁ బ్రకాశమానుండును, యక్షబృందంబులచే సేవితుండును, యక్షకోటియుక్తుండును, సూర్యపూజకుఁడును, శ్రీమంతుఁడు నగు పాంచికుఁడను యక్షేశ్వరుఁడు నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. వైనతే యా!దివ్యవస్త్రధారియు శ్వేతచ్ఛత్రధారియు,మణికాంచనభూషితుండును, సూర్యభక్తుండును నగుధృతరాష్ట్రుం డనుయక్షేశ్వరుఁడు నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. శ్వేతవస్త్రధారియు, గొప్పకాంతిగలవాఁడును, అనేక విధంబులగు కాంచనమాలలచే శోభితంబగు కంఠముగలవాఁడును, కమ లమువంటి నేత్రములుగలవాఁడును, తేజంబున నాదిత్యసదృశుండునునగు విరూపాక్షుఁడు నీకు శాంతినిఁ గలుగఁజేయుఁగాక. అంతరిక్షనివాసులును, స్వర్గనివాసులును, నానారూపధరులగు యక్షులును వీరందఱు సూర్య పూజాసక్తులై నీకుశాంతిని గలుగఁజేయుదురుగాక నానావిధాకారధారిణు

---

విభూషితః. ౭. మనోహరేణ హారేణ కంఠలగ్నేన రాజతే, యక్షిణీయక్షకన్యాభిః పరివారితవిగ్రహః, సూర్యార్చనసమాసక్తః కరోతు తవ శాంతికమ్. ౮. సుచిరో నామ యక్షేంద్రో మణికుండలభూషితః, లలాటే హేమపటలప్రబద్ధేన విరాజతే. ౯. బహు యక్షసమాకీర్ణో యక్షైర్నమితవిగ్రహః, సూర్యపూజాపరో యుక్తః కరోతు తవ శాంతి కమ్. ౧౦. పాంచికో నామ యక్షేంద్రః కంఠాభరణభూషితః, కుక్కుటేన విచిత్రేణ బహురత్నాన్వితేన తు. ౧౧. యక్షబృందసమాకీర్ణో యక్షకోటిసమన్వితః, సూర్యార్చన కరః శ్రీమాన్కరోతు తవ శాంతికమ్. ౧౨. ధృతరాష్ట్రో మహాతేజా నానాయక్షాధిపః ఖగ, దివ్యపట్టః శుక్లచ్ఛత్రో మణికాంచనభూషితః. ౧౩. సూర్యభక్తః సూర్యరతః సూర్యపూజాపరాయణః, సూర్యప్రసాదసంపన్నః కరోతు తవ శాంతికమ్. ౧౪. విరూ పాక్షశ్చ యక్షేంద్రః శ్వేతవాసా మహాద్యుతిః, నానాకాంచనమాలాభిరుపశోభిత కంధరః. ౧౫. సూర్యపూజాపరో భక్తః కంజాక్షః కంజసన్నిభః, తేజసాదిత్యసంకాశః కరోతు తవ శాంతికమ్. ౧౬. అంతరిక్షగతా యక్షా యే యక్షాః స్వర్గగామినః, నానా

లగు యక్షవనితలు, యక్షకుమారులును, సూర్యారాధనతత్పరలగు యక్షకన్యకలును నీకు శాంతిని, స్వస్త్యయనమును, క్షేమమును, బలమును, కల్యాణము నిత్తురుగాక. ఎల్లప్పుడును సావధానులై శీఘ్రముగ సిద్ధిని గూడ నిత్తురుగాక. అన్నిదిక్కులయం దుండెడి పర్వతములును, వృక్షంబులును, సూర్యభక్తులందఱును నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక. సూర్యారాధనతత్పరంబులగు సర్వసాగరంబులును, సర్వగృహారణ్యంబులును నీకు శాంతిని గలుగఁజేయును గాక. ఘోరరూపులు, మహాబలసంపన్నులు, సూర్యార్చనాసక్తులు నగురాక్షసులును, స్థలాంతరిక్షవాసులగురాక్షసులును, పాతాలవాసు లగురాక్షసులును, వీరందఱు తేజముచేఁ బ్రకాశితులై నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక. సమస్తప్రేతములు, ప్రేతగణంబులు, సర్వతోముఖంబులగు ప్రేతములు, నతిదీప్తములగుప్రేతములు, రుధిరాశనములగుప్రేతములును, అంతరిక్షచరములగుప్రేతములు, స్వర్గమందలిప్రేతములు, పాతాలమందలిప్రేతములు మొదలగు కామరూపములగు ప్రేతములన్నియు నేకచక్రరథారూఢుండగు వృషధ్వజుని తేజస్సుచే నీకు శాంతిని కలుగఁజేయుఁగాత. మహావీర్యసంపన్నములును, వృద్ధిమంతములును, స్వేచ్ఛారూపములధరించునవియును, గుణోత్తరములును నగుస్వర్గాంతరిక్షపాతాళములయందుండు పిశాచములన్నియు

---

రూపధరా యక్షాః సూర్యభక్తా దృఢవ్రతాః. ౧౭. తద్భక్తాస్తద్గమనసః సూర్యపూజాసముత్సుకాః, శాంతిం కుర్వంతు తే హృష్టాః శాంతాః శాంతిపరాయణాః. ౧౮. యక్షిణ్యో వివిధాకారాస్తథా యక్షకుమారకాః, యక్షకన్యా మహాభాగాః సూర్యారాధనతత్పరాః. ౧౯. శాంతిం స్వస్త్యయనం క్షేమం బలం కల్యాణముత్తమమ్, సిద్ధిం చాశు ప్రయచ్ఛంతు నిత్యం చ సుసమాహితాః. ౨౦. పర్వతాః సర్వతః సర్వే వృక్షాశ్చైవ మహర్ధికాః, సూర్యభక్తాః సదా సర్వే శాంతిం కుర్వంతు తే సదా. ౨౧. సాగరాః సర్వతః సర్వే గృహారణ్యాని కృత్స్నశః, సూర్యస్యారాధనపరాః కుర్వంతు తవ శాంతికమ్. ౨౨. రాక్షసాః సర్వతః సర్వే ఘోరరూపా మహాబలాః, స్థలజా రాక్షసా యే తు అంతరిక్షగతాశ్చ యే. ౨౩. పాతాలే రాక్షసా యే తు నిత్యం సూర్యార్చనే రతాః, శాంతిం కుర్వంతు తే సర్వే తేజసా నిత్యదీపితాః. ౨౪. ప్రేతాః ప్రేతగణాః సర్వే యే ప్రేతాః సర్వతోముఖాః, అతిదీప్తాశ్చ యే ప్రేతా యే ప్రేతా రుధిరాశనాః. ౨౫. అంతరిక్షే చ యే ప్రేతాస్తథా యే స్వర్గవాసినః, పాతాలే భూతలే వాపి యే ప్రేతాః కామరూపిణః. ౨౬. ఏకచక్రో రథో యస్య యస్తు దేవో వృషధ్వజః, తేజసా తస్య దేవస్య శాంతిం కుర్వంతు తే సదా. ౨౭. యే పిశాచా మహావీర్యా

నాదగు రథికునియొక్కయు, నీచే వహింపఁబడువానియొక్కయు తేజముచే నీకు శాంతిని గలుగఁజేయుఁగాక. సర్వాపస్మారగ్రహంబులు, జ్వరగ్రహములు, స్వర్గమర్త్యపాతాళలోకవాసులగు గ్రహములు, నెవ్వనిదక్షిణకిరణమున విష్ణువును వామకిరణమున నీశ్వరుఁడును లలాటమున బ్రహ్మయు నుండెనో యట్టిసూర్యదేవుఁడును తేజస్సుచే నీకు శాంతిని గలుగఁజేయుదురుగాక. ఈరీతిగ సూర్యయజ్ఞకర్తలగు దేవతలందఱును సూర్యభక్తునివిషయమై జగత్తునకు శాంతిని గలుగఁజేయుదురుగాక. తమోనాశకుఁడును, వివస్వంతుఁడును, దివోవాసియు నగుభాస్కరా! నీకు నమస్కారము. గ్రహాధిపతీ! దేవుఁడవగు నీకు జయము గలుగుఁగాక. మంగళాత్మకుఁడవగు నీకు జయమగుఁగాక; పద్మవికాసకుండును, బుధరూపుండవు నగు నీకు నమస్కారము. కాంతిని శాంతిని నిచ్చెడివాఁడవు నంధకారధ్వంసకుఁడవు జయస్వరూపుఁడవు నజేయుఁడవు నగునీకు నమస్కారము. భాస్కరా! జయింపుము. కాంతిమంతులలో నగ్రగణ్యుఁడవగు నోసహస్రాంశూ! జయింపుము. లోకంబులన్నియు నిర్మిం

---

వృద్ధిమంతో మహాబలాః, నానారూపధరాః సర్వే సర్వే చ గుణవత్తరాః. ౨౮. అంతరిక్షే పిశాచా యే స్వర్గే యే చ మహాబలాః, పాతాలే భూతలే యే చ బహురూపా మనోజవాః. ౨౯. యస్యాహం సారథిర్వీర యస్య త్వం తురగః సదా, తేజసా తస్య దేవస్య శాంతిం కుర్వంతు తేఽజసా. ౩౦. అపస్మారగ్రహాః సర్వే సర్వే చాపి జ్వరగ్రహాః, యే చ స్వర్గస్థితాః సర్వే భూమిగా యే గ్రహోత్తమాః. ౩౧. పాతాలే తు గ్రహా యే చ యే గ్రహాః సర్వతో గతాః, దక్షిణే కిరణే యస్య సూర్యస్య చ స్థితో హరిః. ౩౨. హరో యస్య సదా వామే లలాటే కంజజః స్థితః, తేజసా తస్య దేవస్య శాంతిం కుర్వంతు తే సదా. ౩౩. ఇతి దేవాదయః సర్వే సూర్యయజ్ఞవిధాయినః, కుర్వంతు జగతః శాంతిం సూర్యభక్తేషు సర్వదా. ౩౪. జయః సూర్యాయ దేవాయ తమోహంత్రే వివస్వతే, జయప్రదాయ సూర్యాయ భాస్కరాయ నమోఽస్తు తే. ౩౫. గ్రహోత్తమాయ దేవాయ జయః కల్యాణకారిణే, జయః పద్మవికాసాయ బుధరూపాయ తే నమః. ౩౬. జయః దీప్తివిధానాయ జయః శాంతివిధాయినే, తమోఘ్నాయ జయాయైవ అజితాయ నమోనమః. ౩౭. జయార్క జయదీప్తీశ సహస్రకిరణోజ్జ్వల, జయ నిర్మితలోకస్త్వమజితాయ నమోనమః. ౩౮. గాయత్రీదేహ

చిన నీకు నమస్కారము. గాయత్రీరూపుండును, సావిత్రీప్రియుండు నగు నీకు నమస్కారము. భూభారవాహకుండు మార్తండరూపుఁడు నగు నీకు నమస్కారము. రాజా! యీరీతిగ నరుణుఁడు మహానుభావుఁడగు గరుడుని శ్రేయముకొఱకై శాంతింజేయుచుండ సుపర్ణుఁడు ఱెక్కలు గలవాఁడయ్యెను. తేజముచే బుధతుల్యుఁడును, సామర్థ్యమున విష్ణుతుల్యుండును, సంపూర్ణావయవుండును నై భాస్కరానుగ్రహంబునఁ బూర్వదేహముం బొందెను ఈరీతిగనే రోగులయ్యు నగ్నికార్య మొనర్తురేని విగతరోగు లయ్యెదరు. కాన రోగావిష్టులైన మనుజులు విధ్యుక్తముగఁ బ్రయత్నపూర్వకముగ నీయగ్నికార్యముం జేయవలయున ట్లొనర్చిన విగతరోగు లయ్యెదరు. గ్రహబాధ గలుగునప్పుడు దుర్భిక్షము సంభవించినప్పుడు నుత్పాతము సంభవించిన యవసరముల మేఘుఁడు వర్షింపకున్న లక్షహోమయుక్తంబుగఁ బ్రత్యక్షగతుఁడగు సూర్యుని పూజించి ధ్యానించి వారుణసూక్తములతో హోమ మాచరింపవలయు. ప్రసన్నచేతస్కుఁడై నువ్వులు బియ్యము తేనె నెయ్యి వీట్లతో హోమముం జేయవలెను. ఈవిధంబగు శాంతినిఁ జేసి వాయసబలి నీయవలెను. ఇట్లు చేసినయెడల దేవతలు మనుజులకు లక్ష్మిని కామము

---

రూపాయ సావిత్రీదయితాయ చ. ధరాధరాయ సూర్యాయ మార్తండాయ నమో నమః. ౩౯. సుమంతురువాచ.—ఏవం హి కుర్వతః శాంతిమరుణస్య మహీపతే, శ్రేయసే వైనతేయస్య గరుడస్య మహాత్మనః. ౪౦. ఏతస్మిన్నేవ కాలే తు సుపర్ణః పత్రవానభూత్, తేజసా బుధసంకాశో బలేన హరిణా సమః. ౪౧. సంపూర్ణావయవో రాజన్యథాపూర్వం తథాభవత్, ప్రసాదా ద్దేవదేవస్య భాస్కరస్య మహాత్మనః. ౪౨. ఏవమన్యేఽపి రాజేంద్ర మానవా యే చ రోగిణః, అస్మిన్కృతేఽగ్నికార్యే తు విరుజాస్తే భవంతి హి, తస్మాద్యత్నేన కర్తవ్యమగ్నికార్యం విధానతః. ౪౩. కరణీయం చ రాజేంద్ర మానవైశ్చ ప్రరోగిభిః, అస్మిన్కృతే అగ్నికాయే విరుజాస్తే భవంతి హి. ౪౪. గ్రహోపఘాతే దుర్భిక్ష ఉత్పాతేషు చ కృత్స్నశః, అవర్షమాణే పర్జన్యే లక్షహోమసమన్వితః. ౪౫. పూజయిత్వా ప్రసూక్తం తు ధ్యాత్వా వీరం ప్రయత్నతః, వారుణైశ్చ తథా సూక్తైర్హోమం కుర్యాద్విచక్షణః. ౪౬. చేతసా సుప్రసన్నేన సర్పిషా మధునా సహ, తిలైర్యవైశ్చ సహితైః పాయసం మధునా తథా. ౪౭. ఇదం చ శాంతికం కుర్యాద్బలిం దద్యాత్ప్రయత్నతః, ఏవం కృతే శ్రియం దేవా వర్షంతే

లను వర్షింతురు. ఈవిధంబగుశాంతికాధ్యాయ మెవ్వఁడేని బఠించిన విను చున్న సర్వలోక స్తుత్యుండగు దివాకరుని ధ్యానించినను యుద్ధమున శత్రుల జయించి గొప్పగౌరవమును బొందును. అతిరస్కృతశాసనుఁడై జీవించినంత కాలము సంతోషించును. వ్యాధిగ్రస్తుఁడు కానేరఁడు. పుత్ర పౌత్రసమన్వితుఁడగును. తేజస్సుచే నాదిత్యతుల్యుండగును. వాచకుఁడు భూమియందు వేట్లనుగుఱించి పఠించునో వాతపిత్తకఫాత్మకంబులగు నారోగంబులచేఁ బీడింపఁబడఁడు. మఱియు నకాలమరణ మాతనికి సంభ వింపదు. సర్పము లాతని నేమియుం జేయవు. కఱచినను విషబాధ యుండదు. జాడ్యము నంధత మూకత్వము నాతనికిఁ గల్గవు. పుట్టుకవలని భయ ముండదు. ఆభిచారికకర్మజన్యభయంబులును గలుగనేరవు. రాజా! దీనిని వినుటవలన రోగంబులు నుత్పాతంబులు మహావిషసర్పంబులును శాంతిని బొందును. మఱియు గంగాతీర్థసేవనంబునఁ గల్గు పుణ్యమునకు కోటిరెట్లు పుణ్యము సంపాదించినవాఁడగును. పదిరాజసూయంబులు నితరయాగంబులును జేసినఫలముంబొందును. సర్వవ్యాధులనుండి తొలఁగి నూఱుసంవత్సరములు సంపూర్ణముగ జీవించును. గోహత్యాపాతకియు, బ్రహ్మఘ్నుఁడుఁ, కృతఘ్నుఁడు, గురుపత్నీగామి, శరణాగతహంత, విశ్వాసఘాతుకుఁడు, దీనహంత, దుర్మార్గుఁడు, పాపవర్తనుఁడు, పితృమాతృ

---

కామనా నృణామ్. ౮౮. ఇత్యేవం శాంతికాధ్యాయం యః పఠేచ్ఛృణుయాదపి, విధినా సర్వలోకస్తు ధ్యాయమానో దివాకరమ్. ౮౯. స విజిత్య రణే శత్రుం మానం చ పరమం లభేత్, అక్షయం మోదతే కాలమతిరస్కృతశాసనః. ౯౦. వ్యాధిభిర్నాభి భూయేత పుత్రపౌత్రైః ప్రతిష్ఠితః, భవేదాదిత్యసదృశస్తేజసా ప్రభయా తథా. ౯౧. యానుద్దిశ్య పఠేద్వీర వాచకో మానవో భువి, న పీడ్యతే చ తై రోగైర్వాతపిత్తకఫా త్మకైః. ౯౨. నాకాలే మరణం తస్య న సర్పైశ్చాపి దశ్యతే, న విషం క్రమతే దేహే న జడాంధ్యం న మూకతా. ౯౩. న చోత్పత్తి భయం తస్య నాభిచారకజం భవేత్, యే రోగా యే మహోత్పాతా యేఽహయశ్చ మహావిషాః, తే సర్వే ప్రశమం యాంతి శ్రవణాదస్య భారత. ౯౪. యత్పుణ్యం సర్వతీర్థానాం గంగాదీనాం విశేషతః, తత్పుణ్యం కోటిగుణితం ప్రాప్నోతి శ్రవణాదిభిః. ౯౫. దశానాం రాజసూయానా మన్యేషాం చ విశేషతః, జీవేద్వర్షశతం సాగ్రం సర్వవ్యాధివివర్జితః. ౯౬. గోఘ్నాశ్చైవ కృతఘ్నశ్చ బ్రహ్మహా గురుతల్పగః, శరణాగతదీనార్తమిత్రవిశ్రంభఘాతకః. ౯౭.

హంత, వీరలయినను దీనిని వినుటచేఁ దమపాపమునుండి విముక్తులగుదురు. ఈ యితిహాసము నుత్తమంబగు నగ్నికార్యంబును కలుషాత్మకుఁడగు మూర్ఖునకుఁ జెప్పరాదు. సూర్యభక్తునకే చెప్పవలెనని సూర్యుఁ డరుణున కాజ్ఞయొసఁగెను. ఆతనివలన గరుడుఁడు విని పూర్వము సూర్యశర్మ, సుఖాదులగు భోజకులకు శాకద్వీపమునఁ జెప్పియుండెను. భోజకులు వ్యాసమహర్షికిఁ జెప్పిరి. వ్యాసమహర్షి భూమిపై వ్యాపింపఁజేసె.

ఇది అశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

## ఏకాశీత్యుత్తరశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! అయిదువిధములగు స్మార్తధర్మము లడుగుటకుఁ గుతూహలము ప్రేరేపించుచున్నది. సంక్షేపముగాఁగాని విస్తరముగఁగాని చెప్ప వేఁడెద ననిన సుమంతుం డిట్లనియె. రాజా! సంక్షేపముగా ధర్మ మైదువిధములని భాస్కరుఁ డరుణునకుం జెప్పెను. దాని నెఱింగింతు వినుము. సహస్రకిరణుండును నుద్యమానుండు నగుదివాకరదేవుని నమస్కరించి గరుడాగ్రజుం డడిగెను.

---

దుష్టః పాపసమాచారః పితృహా మాతృహా తథా, శ్రవణాదస్య పాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః. ౧౮. ఇతిహాసమిమం పుణ్యమగ్నికార్యమనుత్తమమ్, న దద్యాత్కస్యచిద్వీర మూర్ఖస్య కలుషాత్మనః. ౧౯. సూర్యభక్తే సదా దేయం సూర్యేణ కథితం పురా, అరుణస్య మహాబాహో గరుడస్యారుణేన చ. ౨౦. గరుడేన పురా ప్రోక్తం భోజకానాం మహాత్మనామ్, సూర్యశర్మసుఖాదీనాం శాకద్వీపే మహీపతే. ౨౧. తైశ్చాపి కథితం పుణ్యం మునేర్వ్యాసస్య ధీమతః, తేనాపి కథితం పుణ్యం సర్వపాపభయాపహమ్. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే గరుడారుణసంవాదే శాంతికవర్ణనం నామ అశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచ:—పంచప్రకారం ధర్మం మే వద స్మార్తం యథాక్రమమ్, కౌతుకం పృచ్ఛతే బ్రహ్మన్సమాసవ్యాసయోగతః. ౧. సుమంతురువాచ.—పంచధా వర్ణితం ధర్మం శృణు రాజన్సమాసతః, యథోక్తం భాస్కరేణేహ అరుణస్య మహాత్మనః. ౨. సహస్రకిరణం భానుముదయస్థం దివాకరమ్, ప్రణమ్య శిరసా దేవమువాచ

భగవంతుఁడా! దేవదేవేశా! సహస్రకిరణోజ్జ్వలా! స్మృతిధర్మంబుల నాకు యథావస్థితంబులుగాఁ జెప్పుమని యరుణునిచే నడుగఁబడినవాఁడై అధిక ప్రీతితో భాస్కరుం డిట్లనియె. గరుడాగ్రజా! వేదమూలంబగు స్మృతిధర్మము నాకర్ణింపుము. పూర్వానుభూతంబగు నేధ్యానము గలదో దానిని స్మరించుటయే స్మృతియని చెప్పఁబడును. శ్రేయోభ్యుదయ రూపంబగు క్రియయే ధర్మముగాఁ జెప్పఁబడెను. వేదమూలంబును సనాతనంబు నగునాధర్మ మైదువిధంబులని చెప్పఁబడియె. ఈధర్మానుష్ఠానము వలన స్వర్గమును, మోక్షమును, ఇహలోకంబున సుఖమును, సంపూర్ణంబగు నైశ్వర్యంబును గలుగుననిన నరుణుం డిట్లనియె. దేవోత్తమా! ఈసనాతనం బగుధర్మ మైదువిధంబులని యెట్లు చెప్పఁబడె నీయైదును దేనిభేదంబులో నాకుఁ జెప్పఁగోరెదను. అనిన విని భాస్కరుం డిట్లనియె. వర్ణధర్మము, ఆశ్రమధర్మము, వర్ణాశ్రమధర్మము, గుణధర్మము, నైమిత్తికధర్మము అని ధర్మ మైదువిధములు. వర్ణధర్మమనఁగా యాజనాదులు. ఆశ్రమధర్మమనఁగా భిక్షాటనాదులు. వర్ణాశ్రమధర్మమనఁగా బ్రాహ్మణునకు పాలాశదండము మొదలగునవి. గుణధర్మమనఁగా మూర్ధాభిషిక్తుఁడగుక్షత్రియునకు ప్రజాపాలనము మొదలయినది. నైమిత్తికమనఁగా

---

గరుడాగ్రజః. ౩. భగవన్దేవదేవేశ సహస్రకిరణోజ్జ్వల, స్మృతిధర్మాన్యథాతత్త్వం వక్తుమర్హసి పృచ్ఛతః. ౪. ఏవం పృష్టస్తు భగవానరుణేన ఖగాధిపః, ఉవాచ పరయా ప్రీత్యా పూజయిత్వా మహీపతే. ౫. భాస్కర ఉవాచ.—స్మృతిధర్మం వేదమూలం శృణు త్వం గరుడాగ్రజ, పూర్వానుభూతం యద్ధ్యానమథ తత్స్మరణం స్మృతిః. ౬. ధర్మః క్రియాత్మా నిర్దిష్టః శ్రేయోభ్యుదయలక్షణః, స చ పంచవిధః ప్రోక్తో వేదమూలః సనాతనః. ౭. అస్య శబ్దస్యానుష్ఠానాత్స్వర్గో మోక్షశ్చ జాయతే, ఇహ లోకే సుఖైశ్వర్యమలం యచ్ఛ ఖగాధిప. ౮. అనూరురువాచ.—కథం పంచవిధో హ్యేష ప్రోక్తో ధర్మః సనాతనః, కస్య భేదాస్తు తే పంచ బ్రూహి మే దేవసత్తమ. ౯. భాస్కర ఉవాచ.—వేదధర్మః స్మృతస్త్వేక ఆశ్రమాణాం స తత్పరః, వర్ణాశ్రమస్తృతీయస్తు గుణనైమిత్తికో యథా. ౧౦. వర్ణత్వమేకమాశ్రిత్య అధికారే ప్రవర్తతే, సవర్ణాశ్రమ దండస్తు భిక్షా దండాదికో యథా. ౧౧. వర్ణాశ్రమాశ్రమత్వం చ యోధికృత్య ప్రవర్తతే. స వర్ణాశ్రమధర్మస్తు దండాద్యా మేఖలా యథా. ౧౨. యో గుణేన ప్రవర్తేత స గుణో ధర్మ ఉచ్యతే, యథా మూర్ధాభిషిక్తస్య ప్రజానాం పాలనం పరమ్. ౧౩.

ప్రాయశ్చిత్తాదులు. జాతిద్రవ్యగుణాశ్రయంబగు నీనైమిత్తికము సామా న్యవిశేషభేదమున ద్వివిధము. ధర్మము సామాన్యముగా స్వరూపఫల సాధన ప్రమాణభేదముచే నాల్గుతెగలయ్యెఁ బ్రమాణభేదముచేత నే మఱియు రెండువిధములు. శ్రౌతమనియు, స్మార్తమనియు, శ్రుతితో విరోధము గలిగినప్పుడు స్మృతి బాధింపఁబడును. ఒకానొకచోట విషయ భేదముచే విరోధము పరిహరింపఁబడును స్మృతితో విరోధమువచ్చినప్పు డర్థశాస్త్రము బాధింపఁబడును. శ్రుతులలోఁ బరస్పరవిరోధము వచ్చి నప్పుడు స్మృతులచేతను, స్మృతులలో విరోధమువచ్చినప్పు డర్థశాస్త్రము చేతను నిర్ణయింపవలయును అదియదృష్టమైనచో వ్యవస్థ సంభవింపనపుడు వికల్ప మాశ్రయింపఁబడును. ఆకాంక్ష పూర్ణమగునప్పుడు స్మృతికి వికల్పము సంభవించును పరస్పరవిరుద్ధశాస్త్రములు పరస్పరసాపేక్షము లైనచో వికల్పము. నిరపేక్షములైనచో బాధ్యబాధకభావము చెప్పఁ బడెను శాస్త్రము విధియనియు నిషేధమనియు రెండువిధములు. కొంద ఱేకవిధమే యందురు బహురూపమని కొందఱుచెప్పుదురు. స్మృతులు పంచప్రకారములు. దృష్టార్థమనియు, నదృష్టార్థమనియు, అనువాద మనియు, న్యాయమూలమనియు, దృష్టాదృష్టార్థమనియు నైదువిధ

---

నిమిత్తమేకమాశ్రిత్య యో ధర్మః సంప్రవర్తతే, నైమిత్తికః స విజ్ఞేయో జాతిద్రవ్య గుణాశ్రయః ౧౪. ఏష తు ద్వివిధః ప్రోక్తః సమాసాదవిశేషతః, నైమిత్తికః స విజ్ఞేయః ప్రాయశ్చిత్తవిధిర్యథా. ౧౫. స చతుర్ధా నిరూప్యస్తు స్వరూపఫలసాధనైః, ప్రమాణతస్తు ప్రత్యేకం సమస్తైశ్చ యథాక్రమమ్. ౧౬. శ్రుత్యా సహ విరోధే తు బాధ్యతే విషయం వినా, వ్యవస్థయా విరోధేన కార్యో యత్నః పరీక్ష్యతే. ౧౭. స్మృత్యా సహ విరోధేన చార్థశాస్త్రస్య సాధనమ్, పరస్పరవిరోధే తు అర్థశాస్త్రస్య సాధనమ్. ౧౮. అదృష్టార్థే వికల్పస్తు వ్యవస్థాసంభవే సతి, స్మృతిశాస్త్రవికల్పస్తు ఆకాంక్షాపూరణే సతి. ౧౯. వేదమూలే స్థితం త్వేతదనుష్ఠానం క్రియాసతీ, ఏవం శక్యవిధానం తు న్యాయో హ్యేవం వ్యవస్థితః. ౨౦. నిషేధవిధిరూపం తు ద్విధా శాస్త్రం ఖగాధిప, ఏకరూపం వదంత్యన్యే బహురూపమథాపరే. ౨౧. పంచప్రకారాః స్మృతయ ఏవం శిష్యవ్యవ స్థితాః, త్రిధా చతుర్ధా ద్వేధా వా ఏకధా బహుధా ఖగ. ౨౨. దృష్టార్థా తు స్మృతిః కాచిదదృష్టార్థా తథాపరా, అనువాదస్మృతిస్త్వన్యా దృష్టాదృష్టా తు పంచమీ, సర్వా

## ద్వ్యశీత్యుత్తరశతతమాధ్యాయము.

ఆదిత్యుం డిట్లనియె ఖగోత్తమా! యధికారపూర్వకంబుగ సనాతనంబగు ధర్మరూపమునంతను జెప్పితిని. ఇక నాశ్రమస్థులధర్మములఁ జెప్పెద. బ్రహ్మచారి, గృహస్థుఁడు, వానప్రస్థుఁడు, భిక్షువు అను నాలు గాశ్రమములు చెప్పఁబడినవి. అందు బ్రహ్మచారి గాయత్రీబ్రహ్మచారి యనియు, ప్రాజాపత్యబ్రహ్మచారియనియు, దేవవ్రతబ్రహ్మచారియనియు, నైష్ఠికబ్రహ్మచారియనియు నాల్గువిధంబులు. సమానధర్మయుక్తంబులును, సమానవేదయుతంబులును నగు నాశ్రమములు నాలుగని చెప్పఁబడెను. తరువాత ధర్మసిద్ధికొఱకు సంస్కారములఁ జెప్పుచున్నాను. ఋతుదినంబున సమంత్రకంబుగ గర్భాధానమును జేయవలయును. తల్లికి మూఁడవ మాసంబున పుంసవనమును జేయవలయును. గర్భముమొదలు నారవ మాసంబునఁగాని యేడవమాసంబునఁగాని సీమంతమును జేయవలయును. గర్భాధానము పుంసవనము సీమంతము నీమూఁడును పాత్రసంస్కారములు. జాతకర్మ మొదలగునవన్నియు పురుషసంస్కారంబులుగాఁ జెప్పఁబడినవి. పుట్టినశిశువునకు సమంత్రకంబుగా సువర్ణాదులచే ప్రాశనచేయుట జాతకర్మయని చెప్పుదురు. అప్పుడే రహస్యనామకరణము చేయనగు. పదునొకండవదినమున నర్థయుక్తంబు ప్రకాశము నగునామను జేయవలయును. ఆరవమాసంబున ధర్మశాస్త్రాదియుక్తంబుగ నన్నప్రాశనమును

---

ఆదిత్య ఉవాచః—ఉక్తం ధర్మస్య రూపం తు సాధికారం సనాతనమ్, అతః పరం ప్రవక్ష్యామి ధర్మమాశ్రమిణాం ఖగ. ౧. బ్రహ్మచారీ గృహస్థశ్చ వనస్థో భిక్షురేవ చ, చత్వార ఆశ్రమాః ప్రోక్తా ఏక ఏవ చతుర్విధః. ౨. గాయత్రో బ్రహ్మచారీ తు ప్రాజాపత్యో ద్వితీయకః, దేవవ్రతస్తృతీయస్తు నైష్ఠికస్తు చతుర్థకః. ౩. చత్వార ఆశ్రమాః ప్రోక్తాః సవేదాః సమధర్మకాః, అతః పరం ప్రవక్ష్యామి సంస్కారం ధర్మసిద్ధయే. ౪. గర్భాధానమృతౌ కార్యం హృష్టయోస్తు సమన్త్రకమ్, కార్యం పుంసవనం మాతుస్తృతీయే మాసి సంయుతైః. ౫. సీమంతః సప్తమే గర్భే షష్ఠే వా సప్తమేఽపి వా, పాత్రసంస్కారకా ఇష్టా గర్భాధానాదయస్త్రయః. ౬. జాతకర్మాదయః సర్వే సంస్కారాః పురుషస్య తు, జాతస్య ప్రాశనం యత్ర స్వర్ణాదీనాం సమన్త్రకమ్. ౭. జాతకర్మేతి తత్ప్రోక్తం గుహ్యం నామ తదైవ తు, ప్రకాశో నామ కర్తవ్యం దినే త్వేకాదశేఽర్థవత్. ౮. ధర్మశాస్త్రాదిసంయుక్తం షష్ఠేఽన్నప్రాశనం ఖగ, ప్రథమేఽబ్దే

జేయవలయును. మొదటిసంవత్సరమునఁగాని లేక మూఁడవసంవత్సరమున గాని చూడాకర్మఁ జేయవలయును. బ్రాహ్మణబాలున కెనిమిదవవత్సరం బునఁగాని పదియవవత్సరంబునఁగాని యుపనయనముఁ జేయవలయును. ఇతరజాతులకు విశేషముగఁ జెప్పెద. క్షత్రియవైశ్యుల కుపనయనమును పదునొకండవవత్సరంబునఁగాని పదిరెండవవత్సరంబునఁగాని చేయవల యును. సావిత్రమనియు, వైదికమనియు, మహావ్రతమనియు, ఔప నిషదంబనియు, అబ్దంబనియు, గోదానంబనియు, సువర్ణకంబనియుఁ జెప్పఁ బడు నీవ్రతములన్నియు వేదాధ్యయనస్వీకారప్రయోజకములు. వేద ములో కొంతభాగమునకు విస్తరముగా గృహ్యాసూత్రములయందు చెప్పఁబడినది. ఆగృహ్యాసూత్రములయందు దృష్టాదృష్టప్రయోజకం బగు గురుశుశ్రూష చెప్పఁబడెను. గురుశిష్యుల పరస్పరవర్తనము గూడ చెప్పఁబడియుండెను. ఆశుశ్రూష కాయిక—మానసిక—వాచికము లను భేదముచే మూఁడువిధములు. గురుశిష్యులు పరస్పరసంతోషావహులై యుండవలయును. స్వధర్మముననుష్ఠింపఁగోరువాఁడు వేదమును సంపూర్ణ ముగా నధ్యయనము జేయవలయును. నైష్ఠికబ్రహ్మచారి వేదమును గ్రంథార్థమును ఇతరములను తెలిసికొని జితేంద్రియుఁడై యుండవల యును. అనైష్ఠికుఁ డధ్యయనమును జేసి యనంతరంబు నభీష్టదానము నొసంగవలయును. తరువాత గురునిచే ననుజ్ఞాతుఁడై గురుగృహము

---

తృతీయే వా చూడాకర్మ విధీయతే. ౯. అష్టమే దశమే వాపి బ్రాహ్మణస్యోపనాయ నమ్, పురుషస్య తథా చాన్యజాతీయానాం విశేషతః ౧౦. ఏకాదశే ద్వాదశే వా కార్యం క్షత్రియవైశ్యయోః, వేదసంస్కారకం వచ్మి మన్యంతే త్వౌపనాయనమ్. ౧౧. పురుషస్య తథా చాన్య ఉభయోశ్చ బ్రవీమ్యహమ్, సావిత్రం వైదికం చైవ మహా నామ్నామహావ్రతమ్. ౧౨. తథౌపనిషదం చాబ్దం గోదానం చ సువర్ణకమ్, వ్రతాని గ్రహణార్థాని వేదస్యేతి మనోర్మతమ్. ౧౩. వేదైకదేశపాఠస్య ఉక్తం గృహ్యే ప్రపం చకమ్, ఉక్తా గురోస్తు శుశ్రూషా దృష్టాదృష్టార్థసాధనమ్. ౧౪. ఉభయోర్వా తథా చాన్యా యథాన్యాయం యథాశ్రుతమ్, గురోరప్యేవ తం విద్యాత్తద్ధ్యానం త్రివిధం స్మృతమ్. ౧౫. తోషః పరస్పరస్యేతి ఏతావాన్ధర్మసంగ్రహః, కృత్స్నో వేదోఽధిగం తవ్యః స్వధర్మమనుతిష్ఠతా. ౧౬. జ్ఞాత్వా వేదం బ్రహ్మచారీ గ్రంథార్థాన్యాన్యథావిధి, నైష్ఠికశ్చ విధానం తు మాపత్నీకంబం విధీయతే, విద్యాంతేఽభీష్టదానం చ అనుజ్ఞాతో

నుండి బైటికి వెడలివచ్చుటకు నిమిత్తంబగు గృహస్థాశ్రమస్వీకారంబున కై యథావిధిగ స్నాతకవ్రతమును జేసికొని తరువాత సజాతివంశసంభవయు సులక్షణాన్విత యగుకన్నియను భార్యగా స్వీకరింపవలయును. ఇట్టివివాహమున కచంచలమగు బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించువారలే యధికారులు. మఱికొందఱు బ్రాహ్మణులు స్వతంత్రమగునధికారమును గోరుచుందురు. తల్లివంశమునఁగాని లేక తండ్రివంశమునఁగాని యేడు పురుషాంతరములు లేక యైదుపురుషాంతరములకుఁ బూర్వపుసంతతియందుద్భవించినకన్యను బ్రాహ్మణుఁడు పరిణయంబొడవలయును. మఱియు నాకన్నియ సమానవర్ణసంజాతయై భిన్నఋషిగోత్రములు గలదియై యుండవలయును. సంఖ్యావిధివివాహంబులయందు గోత్రములవిషయమై విధి చెప్పఁబడియుండ లేదు. ఋషివాక్యములు వివిధములుగా నున్నప్పుడు వికల్పమని చెప్పఁబడును. నాల్గువర్ణములకును సంస్కారరూపంబులగు వివాహము లెనిమిదియని శ్రుతియందుఁ జెప్పఁబడెను. ఏమనుజుఁడు దోషవతియగు కన్యనాదోషమును వెల్లడిచేయక దానమొసంగునో యాదాతకు రాజు స్వయముగా తొంబదియాఱుపణముల నపరాధమును విధింపవలయును. ఏకన్య వివాహంబునకుఁ బూర్వము పితృగృహంబుననుండియే రజోవతి యగునో యాపెతల్లిదండ్రులు పతితులగుదురు. ఆకన్యయు శూద్రతుల్య యగును. ఏబ్రాహ్మణుఁడైనను మందమతియై యట్టికన్యను పరిణయంబొడినచో నాతఁడు శ్రాద్ధకర్మానర్హుఁడును అపాం

---

గృహీ భవేత్. ౧౭. నిష్కాసనం గురుగృహాద్గృహస్థస్య యథా భవేత్, నైష్ఠికశ్చ తథా స్నానం కుర్యాత్సమ్యగ్యథావిధి. ౧౮. ఉద్వహేద్వై తతో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్, అవిప్లుతబ్రహ్మచర్యశ్చాధికారీ ఖగోత్తమ. ౧౯. స్వతంత్రమన్యే చేచ్ఛంతి హ్యధికారం ద్విజోత్తమాః, సప్తమీం పంచమీంచైవ కన్యకాం పితృమాతృతః. ౨౦. ఉద్వహేత ద్విజో భార్యామసమానార్షగోత్రజామ్, సంఖ్యావిధివివాహేషు గోత్రార్థం విధివర్జితమ్. ౨౧. వికల్పేనైవ మంతవ్యమృషీణాం వివిధా శ్రుతిః, అష్టౌ వివాహా వర్ణానాం సంస్కారాఖ్యా ఇతి శ్రుతిః. ౨౨. యస్తు దోషవతీం కన్యామనాఖ్యాయ ప్రయచ్ఛతి, తస్య కుర్యాన్నృపో దండం స్వయం షణ్ణవతిం పణాన్. ౨౩. పితుర్గృహే తు యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా, పతంతి పితరస్తస్య కన్యా చ వృషలీ భవేత్. ౨౪. యస్తు తాం వరయేత్కన్యాం బ్రాహ్మణో జ్ఞానదుర్బలః, అశ్రాద్ధే

క్షేయుఁడును నగును. గాన స్త్రీసంబంధంబులుగాని పురుషసంబంధంబులు గాని సర్వదోషములను స్త్రీపురుషుల కిద్దఱకును జెప్పి సంబంధముఁజేయ వలెను. గౌరి యనుకన్య యుత్తమురాలు. రోహిణి కొంచెమించుగా దానితో సమానమగునదిగాన మధ్యమ. రజస్వలయగుకన్య యధమురాలని చెప్పిన విని యరుణుం డిట్లనియె. దేవా! గౌరి, రోహిణి, రజస్వల, నగ్నిక, కన్యలనఁగా విశదీకరింపుము. అనిన భాస్కరుం డిట్లనియె. రజస్సు ప్రాప్తింపనప్పుడు గౌరి యనియు, ప్రాప్తావస్థయం దున్నపుడు రోహిణి యనియు, స్త్రీచిహ్నము లవ్యక్తముగా నుండినఁ గన్యయు, స్తనము లవ్యక్తములైన నగ్నికయు నని యెఱుంగునది. సప్తవర్షములవయస్సుగలది గౌరి యనియు, దశవర్షములవయస్సుగలది నగ్నికయనియు, ద్వాదశవర్షంబులవయస్సుగలది కన్య యనియు, అటుపైని రజస్వల యనియుఁ జెప్పఁబడెను. స్త్రీలక్షణములు వ్యక్తములైనయవస్థలో నాస్త్రీని సోముఁ డనుభవించును. పయోధరము లుద్భవింపఁగనే గంధర్వులును రజస్సుద్భవింపఁగనే యగ్నియు ననుభవించును. మఱియు స్త్రీలక్షణములు వ్యక్తములైనచో పుత్రులను పయోధరము లుత్పన్నంబులైనచో కులమును రజఃప్రాదుర్భావముచే తండ్రియొక్క యిష్టలోకగమనమును నశింపఁజేయును. గాన వ్యంజనహీనయు పయోధరహీనయు రజోహీనయు సోమగంధర్వాగ్నులచే ననుభవింపఁబడనిదియు ననన్యపూర్వయు నగుకన్యను దాన

---

యమపాంక్తేయం తం విద్యాద్వృషలీపతిమ్. ౨౫. సర్వదోషాన్వివిఖ్యాప్య స్త్రియా వా పురుషస్య వా, ఉభయోరపి విఖ్యాప్య తతః సంబంధమాచరేత్. ౨౬. గౌరీ కన్యా ప్రధానా వై మధ్యమా కన్యకా స్మృతా, రోహిణీ తత్సమా జ్ఞేయా అధమా తు రజస్వలా. ౨౭. అనూరురువాచ.—గౌరీ తు కా మతా కన్యా రోహిణీ చ జగత్పతే, రజస్వలా నగ్నికా చ దేవకన్యా చ కా భవేత్. ౨౮. భాస్కర ఉవాచ.—అసంప్రాప్తరజా గౌరీ ప్రాప్తే రజసి రోహిణీ, అవ్యంజనయుతా కన్యా కుచహీనా చ నగ్నికా. ౨౯. సప్తవర్షా భవేద్గౌరీ దశవర్షా తు నగ్నికా, ద్వాదశే తు భవేత్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా. ౩౦. వ్యంజనేన సమోపేతాం సోమో భుంక్తే హి కన్యకామ్, పయోధరేషు గంధర్వా రజస్యగ్నిః ప్రకీర్తితః. ౩౧. హినస్తి వ్యంజనైః పుత్రాన్కులం హన్యాత్పయోధరైః, గతిమిష్టాం తథా లోకాన్ హన్యాత్తు రజసా పితుః. ౩౨. తస్మాదవ్యంజనోపేతామరజస్కపయోధరామ్, నాన్యోపభుక్తాం సోమాద్యైర్దద్యాద్దుహితరం

మొసఁగవలయును. అటుకాదేని అన్యపురుషులచే నుపభుక్తురాలగును గాన మహాదోషమని చెప్పఁబడెను. సోమాద్యుపభుక్త యగువనితను తండ్రి దాన మొసంగఁగూడదు. అట్లు చేసిన యాతనియన్నము భుజింపఁ గూడదు. ఆపాకము వృథచేయవలయును. దానికి వృథాపాక మనిపేరు. అట్టి యన్నము భుజించినయెడల ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. మూఁడుమార్లు ప్రాణాయామముఁజేసి ఘృతమును త్రాగిన శుద్ధుఁడగును. ఖగశ్రేష్ఠా! సమానగోత్రప్రవరలు గలకన్యను వివాహమైనచో దానిని విడచి యతికృచ్ఛ్రంబను ప్రాయశ్చిత్తమును జేయవలెను. ఋషితుల్యుఁడైనను సగోత్రయగుకన్యను మేనమామకుమారికను పరిణయంబాడిన బ్రాహ్మణుఁడు చాంద్రాయణ మొనర్పవలయును తండ్రికి భిన్నగోత్రోద్భవయు తల్లికి సపిండవంశోద్భవయు నగుకన్య మిథునసంబంధమందును, దారకర్మయందు నుత్తమముగా నర్హురాలగు ననిన నరుణుం డిట్లనియె. దేవా! నీవుచెప్పిన దారకర్మయనఁగా నేమి? అది ద్విజాతులకు మైథునమునందును దారకర్మయందును ప్రశస్తమని చెప్పియుంటివి. దానిని నాకుఁ జెప్పుమనిన భాస్కరుం డిట్లనియె. వైనతేయా! వైదికంబులగు నగ్నిహోత్రాదికర్మలన్నియు దారకర్మయనియు, ఇద్దఱియోగము వలన మైథునమనియుఁ జెప్పఁబడును. కపిలకన్య అధికాంగి రోగిణి రోమహీన అధికరోమ గుహ్యములేనిది పింగళవర్ణముగలదియు నగుకన్యను వృక్షపర్వతనదీనక్షత్రనామములు గలకన్యను యక్షసర్పగూఢచారుల

---

పితా. ౩౩. అన్నం తస్య న భోక్తవ్యం వృథా పాకో హి స స్మృతః, వృథా పాకస్య భుక్త్వాన్నం ప్రాయశ్చిత్తం సమాచరేత్. ౩౪. ప్రాణాయామం త్రిరభ్యస్య ఘృతం ప్రాశ్య విశుద్ధ్యతి, వివాహయేదేకగోత్రాం సమానప్రవరాం ఖగ, కృత్వా తస్యాం సముత్సర్గమతికృచ్ఛ్రో విశోధనమ్. ౩౫. ఉద్వాహయేత్సగోత్రాం చ తనయాం మాతులస్య చ, ఋషిభిశ్చైవ తుల్యో యో ద్విజశ్చాంద్రాయణం చరేత్. ౩౬. అసపిండా తు యా మాతురసగోత్రా చ యా పితుః, సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే. ౩౭. అరుణ ఉవాచ.—దారకర్మ కిముక్తం వై యదుక్తం భవతా ఇదమ్, సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే. ౩౮. ఆదిత్య ఉవాచ.—అగ్నిహోత్రాది యత్కర్మ వైదికం వినతాత్మజ, తదుక్తం దారకర్మేతి ద్వాభ్యాం యోగాత్తు మైథునే. ౩౯. నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్, నాలోమికాం నాతిలోమాం న చాటూటాం న పింగలామ్. ౪౦. ఋక్షవృక్షనదీనామ్నీం నాన్యపర్వతనామికామ్, న

పేర్లు గలకన్యలను భయంకరనామము గలకన్యను అన్నదమ్ములు లేక తండ్రియెవరో తెలియనికన్యను వివాహము చేసికొనఁగూడదు. అన్న దమ్ములు లేకున్నచో నాపెతండ్రి దీనియందుఁగల్గు సంతానము నావంశము నకుఁ జెందవలెనని సంకల్పించుకొనునుగానఁ బ్రాజ్ఞుఁడు దానిని విడువ వలెను. హంసస్వరము తేనెవలె పింగళవర్ణము గలనేత్రములు ఏకవర్ణము గలకన్యను గృహార్థియగువాఁడు పరిణయంబాడవలయును. అగ్రజుఁ డుండఁగా దారసంగ్రహణమును జేసినచిన్నవాఁడు పరివేత్త యనఁబడును అగ్రజుఁడు పరివిత్తి యగును. ఈపరివేత్త పరివిత్తులు ఏవనితచే నిట్లౌరో అదియు దాతయు పురోహితుఁడు నీరైదుగురు నరకమును బొందుదురు. జ్యేష్ఠుఁడు నపుంసకుఁడైనను దేశాంతరగతుఁడును పతితుఁడునైనను సన్యాసియైనను యోగశాస్త్రాభిలాషచే తపస్వియైనను కనిష్ఠుఁడు వివా హముఁ జేసికొనుట దోషముగాదు. కుంటివాఁడైనను వామనుఁడైనను పుట్టంధుఁడైనను చెవిటివాఁడైనను గద్గదస్వరము గలవాఁడైనను మూఢుఁ డైన మూగవాఁడైనను పరిణయంబాడిన దోషముగాదు. శ్రాద్ధంబు చిన్న వానికిని కన్యను హీనవయస్కునకును కులహీనునకును నివ్వఁగూడదు. వరుఁడు కులశీలంబులచే నెన్నఁడును శుద్ధుఁడు గానేరఁడు మంత్రములు వరునిఁగాఁ జేయఁజాలవు. వివాహముచేయఁబడినను మిథునకర్మను బొందని యెడల పూర్వపుకన్యాత్వమును విడువక మఱియొకభర్తను వరించుటకై

యథాహి ప్రేష్యనామ్నీం చాతిభీషణనామికామ్. ౪౧. యస్యాస్తు న భవేద్భ్రాతా న విజ్ఞాయేత వై పితా, నోపగచ్ఛేద్ధి తాం ప్రాజ్ఞః పుత్రికాధర్మశంకయా. ౪౨. హంస స్వరామేకవర్ణాం మధుపింగలలోచనామ్, తాదృశీం వరయేత్కన్యాం గృహార్థీ ఖగ సత్తమ. ౪౩. దారాగ్నిహోత్రసంయోగం కురుతే యోఽగ్రజే స్థితే, పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః. ౪౪. పరివిత్తిః పరివేత్తా చ యయా స పరివిద్యతే, సర్వే తే నరకం యాంతి దాతృయాజకపంచమాః. ౪౫. క్లీబే దేశాంతరస్థే వా పతితే వ్రజితే తథా, యోగశాస్త్రాభియుక్తే చ న దోషః పరివేదనే. ౪౬. ఖంజవామనకుబ్జేషు గద్గదేషు జడేషు చ, జాత్యంధే బధిరే మూకే న దోషః పరివేదనే. ౪౭. న శ్రాద్ధం తు కనిష్ఠస్య వికులాయ చ కన్యకా, వరశ్చ కులశీలాభ్యాం న శుద్ధ్యేత కదాచన, న మంత్రాః కారణం తత్ర న చ కన్యా వృతా భవేత్. ౪౮. ఉద్వాహితా తు యా కన్యా న చ ప్రాప్తా తు మైథునమ్, పునరభ్యేతి భర్తారం యథా కన్యా తథైవ సా. ౪౯. సమాక్షిప్య

యవకాశము గల్గును. గానఁ గన్యయు వరింపఁబడినది కానేరదు అట్టి యక్షతయోని యగుకన్యను తీసికొనివచ్చి కులశీలసంపన్నుఁడగువాని కొసంగినఁ గన్యాపితకు దోషముండదు అరుణుం డిట్లనియె. దేవా! యెనిమిదివివాహములని చెప్పియుంటివి. వానిలక్షణములను సంక్షేపముగాఁ జెప్పుమనిన నాదిత్యుం డిట్లనియె. శుభలక్షణయుక్తయు కులశీలవతియు నగుకన్య నలంకరించి యోగ్యునకు దానమొసంగిన నది బ్రాహ్మవివాహ మనంబడును సహధర్మాచరణముకొఱకు శపథపూర్వకముగా నలంకృతయగుకన్యను దానమొసంగిన ప్రాజాపత్య మనంబడును. గోమిథునముతోఁగూడ కన్యను దానముచేసిన నార్ష మందురు. కనకభూషణాలంకృత యగుకన్యను యజ్ఞకాలమున (అంతర్వేదికయందుంచి) ఋత్విజునకు దానమొసంగిన దైవవివాహ మనంబడును. ఈనాల్గువివాహములును ధర్మార్థకామదాయకంబులు. ఈనాల్గును శుల్కరహితంబులగుటచే నుభయ కులోద్ధారకంబు లగును. ఈనాల్గువిధులలో దేనిచేనైనను పరిణీత యగు వనితయం దుత్పన్నుఁడైనకుమారుఁ డుభయకులంబులలో నేడుతరములను పవిత్రములనుగాఁ జేయును. విజనప్రదేశమునం దన్యోన్యప్రీతిపూర్వకం బగుస్త్రీపురుషసమాగమము గాంధర్వమని చెప్పఁబడును. ఇది

---

మతాం కన్యాం పితా త్వక్షతయోనికామ్, కులశీలవతే దద్యాన్న స్యాద్దోషః ఖగాధిప. ౧౦. అనూరురువాచ.—ఏతేఽష్టౌ ప్రభవాః ప్రోక్తా వివాహా యే జగత్పతే, లక్షణం బ్రూహి చైతేషాం సమాసాత్తిమిరాపహ. ౧౧. ఆదిత్య ఉవాచ.—శుభాం లక్షణసంపన్నాం కులశీలగుణాన్వితామ్, అలంకృత్యార్హతే దానం వివాహో బ్రాహ్మ ఉచ్యతే. ౧౨. సహధర్మక్రియాహేతోర్దానం సమయబంధనాత్, అలంకృత్యైవ కన్యాయాః ప్రాజాపత్యః స ఉచ్యతే. ౧౩. ప్రదానం యత్ర కన్యాయాః సహగోమిథునేన తు, సవర్ణాయాః సగోత్రాయాస్తమార్షమృషయో విదుః. ౧౪. అంతర్వేద్యాం సమానీయ కన్యాం కనకమండితామ్, ఋత్విజే చైవ యద్దానం వివాహో దైవసంజ్ఞకః. ౧౫. ఏతే వివాహాశ్చత్వారో ధర్మకామార్థదాయకాః, అశుల్కా బ్రహ్మణా ప్రోక్తాస్తారయంతి కులద్వయమ్. ౧౬. చతుర్ష్వేతేషు దత్తాయాముత్పన్నో యః సుతః స్త్రియామ్, దాతుః ప్రతిగ్రహీతుశ్చ పునాత్యాసప్తమాన్పితౄన్. ౧౭. వివిక్తే స్వయమన్యోఽన్యం స్త్రీపుంసోర్యః సమాగమః, ప్రీతిహేతుః స గాంధర్వో వివాహః పంచమో మతః. ౧౮.

నైయెదవది కొట్టి తిట్టి భయపెట్టి యనేకవిధముల హింసించి యేడ్చుచున్న వనితను గృహమునుండి తీసుకొనివచ్చి పరిణయంబాడుట రాక్షస మనంబడును. శుల్కమునిచ్చి కన్యను తెచ్చుట యాసురమని చెప్పఁబడును. నిద్రించుచున్నను ప్రమత్తురాలైనను నాస్త్రీని రహస్యముగా సంగమించిన నది యన్నింటిలో పాపిష్ఠంబగు పైశాచవివాహ మనంబడును. సశుల్కంబులగు నీనాల్గింటిని సామాన్యవివాహములని చెప్పుదురు. రాక్షసవివాహము ఛేదనయుక్తమగుటచే క్షత్రియునకే యర్హమగును. పూర్వపూర్వవివాహము లభించినపుడు విధిప్రకారముగ నట్టివివాహము చేసికొనుట యుక్తము, శుభకరము. మూఁడువర్ణములవారును సామాన్యముగ నగ్నిసాక్షికమగు వివాహమునే చేసికొనవలయును. దోషవతి యగుకన్యను శుల్కము గైకొనినను లేకున్నను దానమునిచ్చినదాతకు తొంబదియారునాణెము లపరాధము విధింపఁబడును. ఆకన్యను గూడఁ ద్యజింపవలయును. మోక్షోపరోధమునను ద్వేషమునను ధనవిభాగమునందును లోభమునను తీర్థోపరోధమునను స్త్రీపురుషులు పరస్పరసంబంధమును విడుచుట తటస్థించును. ఇరువురునిష్టపడక విడిపోవుట మోక్షము. పతి భార్యను బాధించినచో ద్వేషమనఁబడును స్త్రీజీవితధనము, ఆభరణములు, శుల్కము మొదలగునవి స్త్రీధనమని చెప్పఁబడును. వ్యర్థముగా

---

హత్వా ఛిత్త్వా చ భిత్త్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్, ప్రసహ్య కన్యాహరణం రాక్షసోద్వాహ ఉచ్యతే. ౫౯. శుల్కం ప్రదాయ కన్యాయా హరణం వ్యసనాదపి, ప్రసాదహేతురుక్తోయమాసురః సప్తమస్తథా. ౬౦. సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి, స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః. ౬౧. ఏతాన్సశుల్కాన్సామాన్యాన్వివాహాంశ్చతురో విదుః, కేవలం క్షత్రియస్యైవ వీర్యం ఛిత్త్వా హి రాక్షసః. ౬౨. ప్రాప్తే పూర్వవివాహే తు విధిర్వైవాహికః శివః, కర్తవ్యస్తు త్రిభిర్వర్ణైః సమయేనాగ్నిసాక్షికః. ౬౩. దోషవత్యాః ప్రదానే తు దాతుః షణ్ణవతిర్దమః, స్యాత్తు శుల్కప్రదానే చ కన్యాయాశ్చాపవర్జనే. ౬౪. మోక్షోపవర్తనం ద్వేషః స్త్రీధనస్య నివర్తనమ్, ఆకాంక్షా తీర్థసంరోధస్త్యాగహేతుశ్చ వక్ష్యతే. ౬౫. పరస్పరస్య సంబంధాన్మోక్షః స్త్రీపుంసయోః స్మృతః, న స్యాదన్యతరః ప్రీతో రోషాత్సాం ప్రతికాదపి. ౬౬. బాధతే చేత్పతిర్భార్యాం స తు ద్వేష ఇతి స్మృతః, వృత్తిరాభరణం శుల్కం లాభశ్చ స్త్రీధనం భవేత్. ౬౭. భోక్తుస్తు స్వయమేవేదం ప్రతిజ్ఞా

స్త్రీని త్యజించినను, భోగించుచున్నను, ఆధనమును వడ్డితోఁగూడ నిచ్చుచుండవలయును ఆపత్సమయమున స్త్రీధనమును గూడ ననుభవింపవచ్చును ఎనిమిదిసంవత్సరములవరకు తనభార్యయందు సంతానమునకై నిరీక్షింపవలయును అంతపర్యంత మామెయందు సంతానము గలుగనిచో పుత్త్రార్థియగువాఁడు మఱియొకస్త్రీని వివాహమాడవచ్చును అట్లు చేయునపుడు పూర్వపుభార్యను ధనములతో సంతోషపెట్టవలయును శూద్రునకొక్కతెయు, వైశ్యునకిద్దఱును, క్షత్త్రియునకు ముప్వురును, బ్రాహ్మణునకు, నల్వురును రాజునకు యథేచ్ఛముగను భార్యలుండును పురుషుఁడు లేకయే స్త్రీమాత్రమే తీర్థసేవకుఁబోయిన నుభయులకును ధర్మలోపమగునుగాన తీర్థనిరోధముఁ జేయవలయును జీవనము జరుగుచుండఁగా భర్త జీవించియుండఁగా నాతని విడచి తీర్థసేవయొనర్చుట విశేషదోషము బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, గాంధర్వము, ఆసురము, రాక్షసము, పైశాచము నను నీయెనిమిదివివాహములును బ్రహ్మక్షత్త్రియులకుఁ బ్రశస్తములు ఇందు మంత్రబద్ధములుఁ బ్రతిగ్రహాయుతములు నగువివాహములు బ్రాహ్మణులకును, బ్రతిగ్రహ

---

హానం భవేత్, వృథా మోక్షేణ భోగేన స్త్రియై దద్యాత్సవృద్ధికమ్ ౧౮ ఆపత్తి
సమయే జాతే స్త్రీధనం భోక్తుమర్హతి, ఆకాంక్షేతాష్టవర్షాణి భర్తాపి ప్రసవం
స్త్రియాః ౧౯ జాయంతే యది నో పుత్త్రాస్తస్యాం యత్నే మహత్యపి, తతో విందేత
పుత్త్రార్థీ ధర్మతః కులజాం స్త్రియమ్ ౨౦ పుత్త్రలాభాత్పరం లోకే నాస్తి హి ప్రస
వార్థినః, ఏతాం శుల్కస్య తాం భుక్త్వా అన్యాం లబ్ధుం యదీచ్ఛతి, సమస్తాంస్తోష
యిత్వార్థైః సూర్యోఢాం పరమాం వరేత్ ౨౧ ఏకా శూద్రస్య వైశ్యస్య ద్వే తిస్రః
క్షత్త్రియస్య తు, చతస్రో బ్రాహ్మణస్య స్యుర్భార్యా రాజ్ఞో యథేష్టతః ౨౨ అతీర్థ
గమనాత్పుంస స్తీర్థే సంగాహనాత్స్త్రియాః, ఉభయోర్ధర్మలోపః స్యాత్సేవ ష్వేవ తు
విశేషతః ౨౩ యాగపద్యే తు తీర్థానాం వివాహ క్రమశో వ్రజేత్, తత్సామ్యం జీవ
పుత్త్రా వా గ్రామాణక్రమశోపి వా ౨౪ బ్రాహ్మాభిర్వివాహైస్తు సంస్కృతౌ తౌ ఖగా
ధిప, అష్టౌ వివాహా వర్ణానాం వైనతేయ ఉశంతి వై ౨౫ బ్రహ్మో దైవస్తథార్షశ్చ
ప్రాజాపత్యః ఖగాధిప, గాంధర్వశ్చాసురో రక్షః పైశాచస్త్వష్టమోఽధమః ౨౬
ప్రశస్తాః క్షత్త్రియాదీనాం విప్రాదీనాంతు మానతః, ప్రతిగ్రహాదయో బద్ధా వివాహా
బ్రాహ్మణస్య తు ౨౭ క్షత్త్రియస్యాపి దేయా తు ప్రతిగ్రహవివర్జితా, ప్రవృత్తిం

వివర్జితవివాహము క్షత్రియులకును బ్రశస్తములు స్త్రీకి స్వయంప్రవృత్తి యని కొందఱును దానమని కొందఱు నందురు.వివాహము దానపూర్వక మగునదియే పవిత్రతరము.

ఇది ద్వ్యశీత్యుత్తరశతతమాధ్యాయము.

## త్ర్యశీత్యుత్తరశతతమాధ్యాయము.

భాస్కరుం డిట్లనియె. బ్రాహ్మణుఁడు పంచమహాయజ్ఞములం జేయవలెను. ఆయజ్ఞములఁ జేయుటకు బ్రాహ్మణులకు మాత్రమే యధికారము గలదు. భూత - పితృ - దేవ - బ్రహ్మ - మనుష్య యజ్ఞముల యథావిధిగ బ్రాహ్మణులే చేయనర్హులు. భూతంబులకుఁ బితృదేవతలకు మనుష్యులకు యథావిధిగ నెల్లప్పుడు దానకృత్యములకు ఫలార్థమై యితరులుండిరి. కొందఱు ఫలము నిత్యానిత్యమని చెప్పుదురు అతిథిపరితోషమునకుఁ బరిచర్యఁ జేయవలయు. మూఁడష్టకా శ్రాద్ధములఁ జేయవలయు.మధ్యమా-వర్తక - చతుర్థికలను నీమూఁడును అష్టకా శ్రాద్ధములందురు. కూరలు, పాయసము, మాంసము వీట్లతోఁ జేయు శ్రాద్ధముఁ జతుర్థిక యందురు. ప్రతిపత్తిథియందు స్వగృహ్యసూత్రోక్తవిధిచేఁ జతుష్పార్వణమాచరింపఁ బడూదియని చెప్పఁబడును నిత్యము, నైమిత్తికము, కామ్యము, వృద్ధి

---

కేచిదిచ్ఛంతి దానమిత్యపరే స్త్రియాః, పావనం పురుషాణాం తు వివాహం పరిచక్షతే. ౭౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం సప్తమీకల్పే బ్రాహ్మే పర్వణి సూర్యారుణసంవాదే వివాహవిధివర్ణనం నామ ద్వ్యశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

భాస్కర ఉవాచ:—కుర్యాత్పంచమహాయజ్ఞానధికారో ద్విజస్య సః, భూతపితృమరబ్రహ్మమనుష్యాణాం యథావిధి. ౧. సదా సదాన కృత్యానాం ఫలార్థమపరే స్థితాః, నిత్యానిత్యమితి ప్రాహురనుషంగాత్ఫలం పరే. ౨. అతిథేః పరితోషాయ పరిచర్యా విధీయతే, అదృష్టనియమాదృష్టమారోగ్యాంతం చ వర్జనమ్. ౩. తిస్రోష్టకాస్తు కర్తవ్యా మధ్యావర్తా చతుర్థికా, శాకపాయసపూపైస్తు మాంసేన తు చతుర్థికా. ౪. ప్రతిపది క్రియతే యత్తు చతుష్పార్వణముచ్యతే, స్వగృహ్యోక్తవిధానేన తత్తు

శ్రాద్ధము, సపిండశ్రాద్ధము, పార్వణశ్రాద్ధము, గోష్ఠశ్రాద్ధము, శుద్ధ్యర్థ శ్రాద్ధము, కర్మాంగశ్రాద్ధము, వైదికశ్రాద్ధము, అని యిట్లు శ్రాద్ధములు పదివిధములుగఁ జెప్పఁబడియె. నావిని అనూరుండు మహాత్మా! పక్షాద్యష్టకలు నీపదియు నగుశ్రాద్ధనామంబుల నాకుఁ దెల్పితివి కాని నిత్యనైమిత్తికాదిశ్రాద్ధంబులలక్షణంబు లెఱింగింపవే యని వేఁడుటయు నాదిత్యుం డిట్లనియె. వైనతేయా! ప్రతిదినమును సల్పునది నిత్యశ్రాద్ధ మనఁబడును. వైశ్వదేవ మశక్తుఁడైనచో మానవచ్చును. ఉదకముతోఁ జేసినను జేయవచ్చును. ఏకోద్దిష్టశ్రాద్ధము నైమిత్తికమని చెప్పఁబడును. అం దొక్క విప్రుని భుజింపఁజేయవలయును. అభిప్రేతార్థసిద్ధికొఱకు చేయునది కామ్యశ్రాద్ధ మనంబడు. ఇది పార్వణవిధానంబుగఁ గూడఁ జేయవచ్చును. వృద్ధియందు చేయునది వృద్ధిశ్రాద్ధ మనంబడును. పూర్వాహ్ణమున నచ్చట నుండుపదార్థముల నుపవీతిగఁ బ్రదక్షిణముఁ జేసి గంధోదకతిలలతోఁ గూడిన నాలుగుపాత్రల నర్ఘ్యార్థ ముంచుకొనవలయును. పితృపాత్రలలోఁ బ్రేతపాత్ర యవసరములేదు. "యే సమానా" అను రెండుమంత్రములచేఁ బిండసంయోజనముం జేయవలయును. ఇదియే సపిండనము. శేషము నిత్యవిధితో సమానముగాను చేయుశ్రాద్ధము సపిండన మనం

---

పక్షాది కీర్త్యతే. ౫. నిత్యం నైమిత్తికం కామ్యం వృద్ధిశ్రాద్ధం సపిండనమ్, పార్వణం చేతి విజ్ఞేయం గోష్ఠశుద్ధ్యర్థముత్తమమ్, కర్మాంగం నవమం ప్రోక్తం వైదికం దశమం స్మృతమ్. ౬. అనూరురువాచ.—యదేతద్భవతా ప్రోక్తం శ్రాద్ధం ద్వాదశధా విభో, తస్య సర్వస్య మాం బ్రూహి లక్షణం వై పృథక్పృథక్. ౭. నిత్యం కిముచ్యతే శ్రాద్ధం కిం వా నైమిత్తికం భవేత్, కామ్యాది దేవదేవేశ ఏతేషాం లక్షణం వద. ౮. ఆదిత్య ఉవాచ.—అహన్యహని యచ్ఛ్రాద్ధం తన్నిత్యం ఖగ కీర్తితమ్, వైశ్వదేవవిహీనం తు అశక్తావుదకేన తు. ౯. ఏకోద్దిష్టం తు యచ్ఛ్రాద్ధం తన్నైమిత్తికముచ్యతే, తత్సదైవ ప్రకర్తవ్యమయుగ్మాన్భోజయేద్ద్విజాన్. ౧౦. కామయుక్తం హి తత్కామ్యమభిప్రేతార్థసిద్ధయే, పార్వణేన విధానేన తదప్యుక్తం ఖగాధిప. ౧౧. వృద్ధౌ యత్క్రియతే శ్రాద్ధం వృద్ధిశ్రాద్ధం తదుచ్యతే, సర్వం ప్రదక్షిణం కార్యం పూర్వాహ్ణే తూపవీతినా. ౧౨. గంధోదకతిలైర్యుక్తం కుర్యాత్పాత్రచతుష్టయమ్, అర్ఘ్యార్థం పితృపాత్రేషు ప్రేతపాత్రం ప్రమోచయేత్. ౧౩. యే సమానా ఇతి ద్వాభ్యామేతజ్జ్ఞేయం సపిండనమ్, నిత్యేన తుల్యం శేషం స్యాదేకోద్దిష్టం స్త్రియా అపి. ౧౪. దర్శే వై క్రియతే యత్తు

బడు. ఏకోద్దిష్టశ్రాద్ధము స్త్రీలకును జెప్పఁబడినది. దర్శయందు నితర పర్వములందును జేయునది పార్వణశ్రాద్ధము. గోవులనుద్దేశించి చేయునది గోష్ఠశ్రాద్ధము. సంపదకొఱకును శుభముకొఱకును పితృతృప్తికొఱకును శుద్ధికొఱకును జేయునది శుధ్యర్థశ్రాద్ధ మనఁబడు. ఇందు బ్రాహ్మణులను భుజింపఁజేయవలయును. నిషేకకాలమందును సోమయాగమునందును సీమంతోన్నయనంబులను పుంసవనమునను జేయఁబడునది కర్మాంగశ్రాద్ధ మనంబడును. దానిం గర్మాంగముగనే జేయవలయు వైదికశ్రాద్ధమన దేవతల నుద్దేశించి సప్తమ్యాదులందు యత్నార్థంబుగను అశ్వవృద్ధికొఱకును పుష్టికొఱకును చేయఁబడునది ఈయన్నింటికంటె మానవుఁడు మృతుఁడైనదినమునఁ బ్రతిసంవత్సరముఁ జేయఁబడు సాంవత్సరికశ్రాద్ధ ముత్తమమని చెప్పుదురు. తలిదండ్రులకు సంవత్సరశ్రాద్ధము చేయనిచో వానిపూజను నేనును బ్రహ్మాయు విష్ణువు రుద్రుఁడును గ్రహింపము కాన నీకారణముచే మృతదినంబునఁ బ్రతిసంవత్సరమునందును విధిగా శ్రాద్ధమును జేయవలెను భోజకుఁడు తప్పక చేయవలయును. వైనతేయా! భోజకుఁడు ప్రతివత్సరమునందును మృతదినం

తత్పార్వణముదాహృతమ్, పర్వణి క్రియతే యచ్చ తత్పార్వణమితి స్థితిః, గోభ్యశ్చ క్రియతే శ్రాద్ధం తద్గోష్ఠశ్రాద్ధముచ్యతే. ౧౫. బహూనాం విదుషాం సంపత్సుఖార్థం పితృతృప్తయే, క్రియతే శుద్ధయే యద్వై బ్రాహ్మణానాం చ భోజనమ్, శుద్ధ్యర్థమితి తత్ప్రోక్తం వైనతేయ మనీషిభిః. ౧౬. నిషేకకాలే సోమే చ సీమంతోన్నయనే తథా, జ్ఞేయం పుంసవనే శ్రాద్ధం తచ్చ కర్మాంగమేవ చ. ౧౭. క్రియతే దేవముద్దిశ్య సప్తమ్యాదిషు యత్నతః, గచ్ఛేద్దేశాంతరే యస్తు శ్రాద్ధం కుర్యాత్తు సర్పిషా, తద్యత్నార్థమితి ప్రోక్తం ప్రదిశేచ్చ న సంశయః. ౧౮. శరీరోపచయే శ్రాద్ధమశ్వవృద్ధ్యర్థమేవ చ, పుష్ట్యర్థమేతద్విజ్ఞేయమౌపచారికముచ్యతే. ౧౯. సర్వేషామేవ శ్రాద్ధానాం శ్రేష్ఠం సాంవత్సరం మతమ్, క్రియతే యత్ఖగశ్రేష్ఠ మృతేఽహని బుధైః సహ. ౨౦. మృతేఽహని పునర్యస్తు న కుర్యాచ్ఛ్రాద్ధమాదరాత్, మాతుశ్చ ఖగశార్దూల వత్సరాంతే మృతేఽహని. ౨౧. నాహం తస్య ఖగశ్రేష్ఠ పూజాం గృహ్ణామి నో హరిః, న బ్రహ్మా న చ వై రుద్రో న చాన్యే దేవతాగణాః. ౨౨. తస్మాద్యత్నేన కర్తవ్యం వర్షేవర్షే మృతేఽహని, నరేణ ఖగశార్దూల భోజకేన విశేషతః. ౨౩. భోజకో యస్తు వై శ్రాద్ధం న

బున శ్రాద్ధమును జేయనిచో తలిదండ్రులతో తామిస్రంబనులోకమున కేగును. కాలాంతరమున నూఱుబందిరియై యాదుష్టాత్ముండు పుట్టును. అన విని అనూరుండు దేవా! తల్లిదండ్రు లేమాసమున నేతిథియందు మృతులైరో యామాసతిథుల నెఱుంగనివాఁడు వత్సరశ్రాద్ధము నెట్లు చేయవలయునో నాకుఁ జెప్పుమనిన నాదిత్యుం డిట్లనియె. అట్లెఱుంగని వాఁడు మార్గశీర్షమాసమునఁగాని మాఘమాసమునఁగాని యమావాస్య నాఁడు సంవత్సరశ్రాద్ధమును జేయవలయును విశేషముగ భోజనముచే నన్నెవ్వరు పూజింతురో వారు నాప్రీతికై పితరులనుఁ బూజింపవలెను. పితరులు, గోవులు, బ్రాహ్మణులు నాకుఁ బ్రియులుగాన నాభక్తులగు వారందఱును వార్లను విధిగ పూజింపవలయును.

ఇది త్ర్యశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

కరోతి ఖగాధిప, మాతాపితృభ్యాం సతతం వర్షేవర్షే మృతేఽహని. ౨౪. స యాతి నరకం ఘోరం తామిస్రం నామ నామతః, తతో భవతి దుష్టాత్మా నగరే సూకరః ఖగ. ౨౫. అనూరురువాచ.— న జానాతి దినం యస్తు న మాసం విబుధాధిప, మృతౌ యత్ర మహాప్రాజ్ఞ పితరౌ స కథం నరః, శ్రాద్ధం కరోతు వై తాభ్యాం విధివద్వత్స రాత్మకమ్. ౨౬. ఆదిత్య ఉవాచ.—న జానాతి నరో యస్తు మృతానాం వినతాత్మజ, మాసం దినం మృతానాం తు పితౄణాం ఖగసత్తమ. ౨౭. యథా కుర్యాత్ఖగశ్రేష్ఠ శృణు కృత్స్నం సమాసతః, మృతాహం యో న జానాతి మానవో వినతాత్మజ. ౨౮. తేన కార్యమమాయాం చ శ్రాద్ధం సాంవత్సరం ఖగ, మాసే మార్గశిరే వీర మాఘే వా విధివత్ఖగ. ౨౯. విశేషతో భోజనేన యో మాం పూజయతే సదా, ప్రీతయే మమ వై తేన సంపూజ్యాః పితరః సదా. ౩౦. మమేష్టాః పితరో నిత్యం గావో విప్రాశ్చ సువ్రత, తస్మాచ్చ తే సదా పూజ్యా సద్భక్తేన విశేషతః. ౩౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే శ్రాద్ధవిధికథనం నామ
త్ర్యశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

## చతురశీత్యుత్తరశతతమాధ్యాయము.

పండితులను ప్రఖ్యాతినిబట్టియు, పరిచయమునుబట్టియు, యాచనావృత్తిచేతను యాజనాధ్యాపనములచేతను సంపాదింపఁబడిన ద్రవ్యము వేదవిక్రయధన మనఁబడును. వేదవిక్రయమువలన సంపాదింపఁబడిన ద్రవ్యమును స్త్రీలచే సంపాదింపంబడిన ద్రవ్యమును నపుంసకద్రవ్యమును పితృదేవతల కుపయోగింపఁగూడదు. బ్రాహ్మణుఁడు ధనము నడిగినను, అడిగినతరువాత నిచ్చినను ఆయిద్దఱును నరకమును బొందుదురు. ధననిమిత్తమై యెన్ని వేదాక్షరములను విక్రయించునో యన్ని భ్రూణహత్యలు చేసినపాపమును బొందును. వైశ్వదేవవిహీనులును, సూర్యకర్మవిహీనులును బ్రాహ్మణులైనను శూద్రులని తెలియవలెను. శ్రోత్రియకులమునందుఁ బుట్టినను అధ్యయనాగ్నికార్యవిహీనులైనచో శూద్రధర్ము లగుదురు. వైశ్వదేవముఁ జేయక నెవ్వఁడు భుజించునో వాఁ డజ్ఞుఁడగును. ఆయన్నపాకము వృథ యగును. అట్టివాఁడు యమయోనిం బొందును. వైశ్వదేవమున వచ్చినయతిథి ప్రియుఁడైనను, ద్వేష్యుఁడైనను, మూర్ఖుఁడైనను నాతని స్వర్గమునుండి వచ్చినవానినిగా భావింపవలయును. వాఁడే యతిథినాఁబడును. భిన్నగ్రామవాసియగు బ్రాహ్మణుఁ

---

ప్రఖ్యాతే ప్రత్యయే నైవ ప్రశ్నపూర్వం ప్రతిగ్రహాః, యజనేఽధ్యాపనే వాదే షడ్విధో వేదవిక్రయః. ౧. వేదవిక్రయనిర్దిష్టం స్త్రీయూ చావర్జితం ధనమ్, న దేయం పితృదేవేభ్యో యచ్చ క్లీబాత్ఖగాధిప. ౨. అనుయోగేన యో దద్యాద్బ్రాహ్మణాయ ప్రతిగ్రహమ్, స పూర్వం నరకం యాతి బ్రాహ్మణాస్తదనంతరమ్. ౩. వేదాక్షరాణి యావంతి నియుజ్యంతేర్థకారణాత్, తావత్యో భ్రూణహత్యా వై వేదవిక్రయమాప్నుయాత్. ౪. వైశ్వదేవేన యో హీన ఆదిత్యస్య చ కర్మణః, సర్వే తే వృషలా జ్ఞేయాః ప్రాప్తవేదాశ్చ బ్రాహ్మణాః. ౫. యేషామధ్యయనం నాస్తి యే చ కేచిదనగ్నయః, కులం వాఽశ్రోత్రియం యేషాం సర్వే తే శూద్రధర్మిణః. ౬. అకృత్వా వైశ్వదేవం తు యో భుఙ్క్తే సోఽబుధః ఖగ, వృథా తేనాన్నపాకేన యమయోనిం ప్రజేత్తు సః. ౭. ప్రియో వా యది వా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవ చ, వైశ్వదేవే తు సంప్రాప్తే సోఽతిథిః స్వర్గసంక్రమః. ౮. నైకగ్రామిణమతిథిం విప్రసాంగతికం తథా, అచింత్యోఽభ్యాగతో యస్మాత్తస్మాదతిధిరుచ్యతే. ౯. అచింత్యః స తు వైనామ్నా వైశ్వదేవ ఉపాగతః, అతిథిం తం విజానీయాన్న పునః పూర్వమాగతః. ౧౦.

డతిథి యనఁబడును. అభ్యాగతుఁ డచింత్యుఁ డగుటచే నతిథి యని చెప్పఁబడెను వైశ్వదేవమునందు వచ్చినయతిథిని వేరుగా చింతింపఁ గూడదు. అతిథి యనఁగ నాతఁడే యని చెప్పవలయును. అంతకు పూర్వము వచ్చినవాఁ డతిథి గానేరఁడు. స్నాతకుఁడైన బ్రాహ్మణుఁడు కృతాశీర్వాదుఁడై యెంత యన్నమును బొందునో యందు నాల్గవ భాగము హంతకారమని చెప్పుదురు. చతుష్కాలములయందును చతుర్గుణంబుగా గ్రాసమాత్ర మివ్వఁబడునది భిక్షయని చెప్పఁబడును. నైష్ఠిక ధర్మము నాచరించుచు మఱల దానినుండి భ్రష్టుఁడైనచో నొకమాసము చాంద్రాయణముఁ జేయవలయును. ఆరూఢపతితసంతానము బ్రాహ్మణ స్త్రీయందు వృషలసంతానము చండాలు లనఁబడుదురు. బ్రాహ్మణయువతి కులటయై తనపతిని వదలి మఱియొక బ్రాహ్మణునితో భోగింపఁగాఁ బుట్టిన పుత్త్రుఁడు బ్రాహ్మణోత్పన్నుఁడైనను చండాలుఁడే యగును. వాఁడు మహాచండాలుఁ డనఁబడును. ప్రథమమున సన్యాసాశ్రమమును స్వీకరించి తరువాత మైథునము నాచరించినచో నాతఁ డరువదివేలసంవత్సరములు పురీషమున పురుగై జనించును. పంచగవ్యప్రాశన దీనికి ప్రాయశ్చిత్తమని నాదేహమును నిర్మించిన విశ్వకర్మ చెప్పియుండెను. వృషలునిచే నిమంత్రితంబగు బ్రాహ్మణాన్నము భుజింపఁదగినదిగాదు. బ్రాహ్మణునిచే నిమంత్రితంబగు శూద్రాన్నమును భోజ్యముగాదు. వీరిరువురును

---

యావచ్చ ప్రాప్నుయాదన్నం కృతాశీః స్నాతకో ద్విజః, తస్యాన్నస్య చతుర్భాగం హంతకారం విదుః ఖగ. ౧౧. గ్రాసమాత్రా భవేద్భిక్షా చతుష్కాలం చతుర్గుణమ్, పుష్కలాని చ చత్వారి హంతకారో విధీయతే. ౧౨. ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్య ప్రచ్యవతే పునః, చాంద్రాయణం చరేన్మాసమితి విద్ధి ఖగాధిప. ౧౩. ఆరూఢపతితా పత్యా బ్రాహ్మణో వృషలేన చ, ద్వావేతౌ విద్ధి చాండాలౌ వేదిత్రాద్యశ్చ జాయతే. ౧౪. బ్రాహ్మణీ కులటా నిత్యం స్వకం త్యక్త్వా పతిం ఖగ, అన్యస్య విశతే గేహే బ్రాహ్మణస్య ఖగాధిప. ౧౫. ఉత్పద్యతే తు యస్తస్యా బ్రాహ్మణేన మహామతే, స చాండాలో మహానొప్రోక్తో మహాచాండాల ఇత్యుత. ౧౬. యస్తు ప్రవ్రజితో భూత్వా పునః సేవతి మైథునమ్, షష్టివర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః, పంచగవ్యేన శుద్ధిః స్యాదిత్యాహ మమ దేహకృత్. ౧౭. అభోజ్యం బ్రాహ్మణస్యాన్నం వృషలేన నిమంత్రితమ్, తథైవ వృషలస్యాన్నం బ్రాహ్మణేన నిమంత్రితమ్. ౧౮. బ్రాహ్మణాన్నం దదచ్ఛూద్రః

భోజ్యాన్నులు కారు. ఈయన్నములను భుజించినచో చాంద్రాయణ మొనర్పవలయును. వేతనమును గ్రహించి బ్రాహ్మణుఁడు శూద్రున కన్నమును వండిన నెవ్వఁడును తినకూడదు. శూద్రునియన్నమును దినుట, సహవాసముచేయుట, ఆతనినుండి జ్ఞానమును బొందుట వీనివలన పరిశుద్ధుఁడైనను పతితుఁ డగును బ్రాహ్మణులు శూద్రాన్నమును దిని విహ్వాలులై రతిలంపటులై విషములేనిపామువలె కుపితులైన నేమిచేయఁ గల్గుదురు? ఉప్పు వ్యంజనము మొదలగువాట్లను చేతిలోఁ బెట్టగూడదు. అట్లిచ్చిన నవి దాతకు దొరకనేరవు. ప్రతిగృహీతకు పాపము గల్గును ఇనుపపాత్రతో నన్నముఁబెట్టిన నాభోక్త పురీషమును భుజించినట్లగును. అన్నమును బెట్టినవారును నరకమును బొందుదురు. వ్రేలితో దంతములను తోముకొనుట, కేవల ముప్పును దినుట, మృత్తికను దినుట యివి యన్నియు గోమాంసభక్షణముతో సమానములు. ముఖమలమును బోఁగొట్టుకొనుటకై పచ్చిదిగాని యెండుదిగాని దంతకాష్ఠముల నుపయోగింపవలయును. ముఖము మలసహితమైనచో బుద్ధి సరిగా నుండదు. ఉపవాసములయందును బుష్పాలంకారవస్త్రగంధమాల్యానులేపనదంతధావనాభ్యంజనములు దూష్యములు గావు. సమీపమందున్న మూర్ఖుని విడచి దూరమందున్న గుణాన్వితునకే దాన మొసంగవలయును మూర్ఖ

---

శూద్రాన్నం బ్రాహ్మణో దదత్, ఉభావేతావభోజ్యాన్నౌ భుక్త్వా చాంద్రాయణం చరేత్. ౧౯. ఉపనిక్షేపధర్మేణ శూద్రాన్నం చ పచేద్ద్విజః, అభోజ్యం తద్భవేదన్నం స చ విప్రః పురోహితః. ౨౦. శూద్రాన్నం శూద్రసంపర్కం శూద్రేణ సహ వాసనమ్, శూద్రాజ్జ్ఞానాగమః కశ్చిజ్జ్వలంతమపి పాతయేత్. ౨౧. శూద్రాన్నోపహతా విప్రా విహ్వలా రతిలాలసాః, కుపితాః కిం కరిష్యంతి నిర్విషా ఇవ పన్నగాః. ౨౨. హస్తదత్తాస్తు యే స్నేహాల్లవణవ్యంజనాదయః, దాతారం నాధితిష్ఠంతి భోక్తా భుంక్తే తు కిల్బిషమ్. ౨౩. ఆయసేన తు పాత్రేణ యదన్నముపదీయతే, భోక్తా విష్ఠాశనం భుంక్తే దాతా తు నరకం వ్రజేత్. ౨౪. అంగుల్యా దంతకాష్ఠం యత్ప్రత్యక్షలవణం చ యత్, మృత్తికాభక్షణం చైవ తుల్యం గోమాంసభక్షణైః. ౨౫. ముఖే పర్యుషితే నిత్యం భవత్యప్రయతో ద్విజః, తస్మాచ్ఛుష్కమథార్ద్రం వా భక్షయేద్దంతధావనమ్. ౨౬. పుష్పాలంకారవస్త్రాణి గంధమాల్యానులేపనమ్, ఉపవాసే న దుష్యంతి దంతధావనమంజనమ్. ౨౭. గృహాంతే వసతే మూర్ఖో దూరే చాస్య గుణాన్వితః, గుణాన్వితే చ

నతిక్రమించుట దోషముగాదు. అగ్నిని విడచి భస్మమునందు హోమము చేయువా రుండరు గదా! అధ్యయనపరుండగు బ్రాహ్మణుఁడు దగ్గరనున్నపుడు భోజనదానములలో నాతని నతిక్రమించిన సప్తకులములు దహింపఁబడును. అనిన ననూరుం డిట్లనియె. నీవు చెప్పినదంతయు నిజము అయినను పూర్వము నారదుఁడు చెప్పినదానిఁ జెప్పెద వినుము. సత్యనిష్ఠుఁడును, పరిశుద్ధకులసంభవుఁడును, ప్రియంవదుఁ డగు బ్రాహ్మణుఁడు మూర్ఖుఁడైనను పాషండుఁడైనను వాని నతిక్రమించినచో పూర్వోత్తరంబులయందు సప్తపురుషాంతరములు ఘోరనరకమును బొందును కాన రాజు పొరుగింటి బ్రాహ్మణు నతిక్రమింపఁగూడదు. దౌహిత్రుని మేనల్లుని సంబంధుని ఉక్తలక్షణశూన్యుఁడైనను బరిత్యజింపఁగూడదు. అతిక్రమించిన మహారౌరవనరకమును బొందుదురు. అని నారదుఁడు నీకెఱింగించియుండెఁగదా యన విని యాదిత్యుఁ డిట్లనియె. దీని విషయంబున సందేహము లేదని నాకును దెలియును. బ్రాహ్మణుల నెన్నఁడును బరీక్షింపరాదు. బ్రాహ్మణుఁడు సర్వదేవమయుఁడు సర్వలోకమయుఁడుగాన నాతనిఁ బూజింపవలయునేగాని పరీక్షింపఁగూడదు.

---

దాతవ్యం నాస్తి మూర్ఖవ్యతిక్రమః. ౨౮. బ్రాహ్మణాతిక్రమో నాస్తి విప్రే వేదవివర్జితే, జ్వలంతమగ్నిముత్సృజ్య న హి భస్మని హూయతే. ౨౯. సన్నికృష్టమధీయానం బ్రాహ్మణం యో వ్యతిక్రమేత్. భోజనే చైవ దానే చ దహత్యాసప్తమం కులమ్. ౩౦. అనూరురువాచ.—ఏవమేవ జగన్నాథ దేవదేవ జగత్పతే, కింతు యత్తే పురా దేవ శ్రుతం వాక్యం మహాత్మనః. ౩౧. గదతో నారదస్యైవ శృణు త్వం విబుధాధిప, గదతో మే సురశ్రేష్ఠ ధర్మ్యమర్థం సుఖావహమ్. ౩౨. సత్యనిష్ఠం ద్విజం యస్తు శుక్లజాతిం ప్రియంవదమ్, మూర్ఖం పాషండినం వాపి వృత్తిహీనమథాపి వా. ౩౩. అతిక్రమ్య నరో ఘోరం నరకం పాతయేత్ఖగ, సప్త పరాన్ సప్త పూర్వాన్పురుషానాత్మనా సహ. ౩౪. తస్మాన్నాతిక్రమేద్రాజా బ్రాహ్మణం ప్రాతివేశికమ్, సంబంధతస్తథాసన్నం దౌహిత్రం విద్యతే తథా. ౩౫. భాగినేయం విశేషేణ తథా బంధుం గ్రహాధిప, నాతిక్రమేన్నరస్త్వేతాన్సుమూర్ఖానపి గోపతే, అతిక్రమ్య మహద్రౌద్రం రౌరవం నరకం వ్రజేత్. ౩౬. ఆదిత్య ఉవాచ.—ఏవమేతన్న సందేహో యథా వదసి ఖేచర, మమాప్యవగతం వీర బ్రాహ్మణం న పరీక్షయేత్. ౩౭. సర్వదేవమయం విప్రం సర్వలోక

జాతినిమాత్రము పరీక్షింపవలయును. ప్రథమమున సమీపమందున్న బ్రాహ్మణునే పిలువవలయును. ఎవఁడపతితుఁడగు బ్రాహ్మణుఁడు సమీపమందుండఁగా నాతని విడచి దూరమందున్న గుణాఢ్యునిఁ బూజించునో వాఁడు నరకమును బొందును. దేవకర్మను నశింపఁజేసి బ్రహ్మస్వమును హరించి దేవద్రవ్యమును, ద్విజాన్నమును, బ్రాహ్మణార్జితధనమును, నసత్పాత్రయందు వినియోగించిన దుర్జన్మమును బొందును. ఎవఁడు గవాగ్నిబ్రాహ్మణులయందు దానమును నివారించునో వాఁడు నూరు పర్యాయములు తిర్యగ్జంతువుగా జనించి యనేకచండాలజన్మలనొందును. ఎవఁడు వాగ్రూపప్రతిజ్ఞనుజేసి క్రియచే నెఱవేర్పఁడో వాఁ డిహపరలోకములయం దాఋణమును దీర్చుకొనును. వేదవ్రతముల నాచరించి స్నాతకుఁడైన శ్రోత్రియుం డగు బ్రాహ్మణుఁడు గృహంబునకు వచ్చిన వెంటనే యోషధులన్నియుఁ బరమగతిని బొందితిమని సంతోషించును. తేనె, మాంసము, కల్లు, సోమము, లక్క, ఉప్పు వీటి నమ్మినచో బ్రాహ్మణుఁడు చాంద్రాయణమును జేయవలయును. బెల్లము, నువ్వులు, నీలిమందు, నవరములు, గోధూమలు, యవలు, ఆవులు వీని నమ్మినచో సాంతపనకృచ్ఛ్రమనుప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ఒంటెపాలు, గొఱ్ఱె

మయం తథా, తస్మాత్సంపూజయేదేనం న గుణాం స్తస్య చింతయేత్. ३౮. కేవలం చింతయేజ్జాతిం న గుణాన్వినతాత్మజ, తస్మాదామంత్రయేత్పూర్వమాసన్నం బ్రాహ్మణం బుధః. ३౯. యస్త్వాసన్నమతిక్రమ్య బ్రాహ్మణం పతితాదృతే, దూరస్థాన్పూజయేన్మూఢో గుణాఢ్యాన్నరకం వ్రజేత్. ४౦. దేవకర్మవినాశేన బ్రహ్మస్వహరణేన చ, దేవద్రవ్యం ద్విజాన్నం చ బ్రహ్మస్వం బ్రాహ్మణార్జితమ్, వియోన్యాం క్షిపతే యస్తు వియోనిమధిగచ్ఛతి. ४౧. మా దదస్వేతి యో బ్రూయాద్గవాగ్నిబ్రాహ్మణేషు వై, తిర్యగ్యోనిశతం గత్వా చాండాలేష్వభిజాయతే. ४౨. యత్తు వాచా ప్రతిజ్ఞాతం కర్మణా నోపపాదితమ్, తదృణం ధర్మసంయుక్తమిహ లోకే పరత్ర చ. ४३. వేదవిద్యావ్రతస్నాతే శ్రోత్రియే గృహమాగతే, క్రీడంత్యోషధయః సర్వా యాస్యామః పరమాం గతిమ్. ४४. మధు మాంసం సురాం సోమం లాక్షాద్యం లవణం తథా, విక్రీయాన్యతమం తేషాం ద్విజశ్చాంద్రాయణం చరేత్. ४౫. గుడం తిలం తథా నీలం కేశాన్గోధూమకాన్యవాన్, విక్రీయ బ్రాహ్మణో గాం చ కృచ్ఛ్రం సాంతపనం చరేత్. ४౬. ఔష్ట్ర

పాలు, జాతమృతాశౌచాన్నములు, చోరాన్నము, మృతశ్రాద్ధాన్నమును దినినచో చాంద్రాయణమును జేయవలయును. కుక్క యెవనినైనను నాకినయెడల గోశృంగోదకముచేతను మహానదీసంగమమునందు స్నానముచేతను సముద్రమును దర్శించుటను శుద్ధుఁడగును. వేదవ్రతముల నాచరించి స్నాతకుఁడైనవాఁడు శ్వదష్టుఁడైనచో హిరణ్యోదక మిశ్రితమగు ఘృతమును ప్రాశనఁజేసిన శుద్ధుఁడగును. నిలచియున్నను నడచుచుండఁగానైనను కుక్క కఱచినచో వజ్రప్రాశనమును జేయవలయును అని మనువు చెప్పెను. దీక్షితుఁడగువానినిఁ గఱచినచో మూఁడురాత్రు లుపవసించి ఘృతప్రాశనజేసి వ్రతశేషమును జరుపవలయును. బ్రాహ్మణస్త్రీని కఱచినయెడల చంద్రదర్శనముఁ జేయవలయును. చంద్రుఁడగపడనిచో చంద్రుఁడుండుదిక్కును జూడవలెను. తరువాత పంచగవ్యప్రాశన జేయవలెను. బ్రాహ్మణునకు బ్రహ్మరంధ్రమున చీము నెత్తురు మొదలగు దుష్టపదార్థములుచేరినను గోమయముచే త్రికాలస్నానమును జేయవలయును. నాభియందును పాదమునందును కృమిదష్టుఁడైనచో దధిక్షీరఘృతములఁ బ్రాశనచేయవలయును నాభికంఠములమధ్య దష్టుఁడైనచో నారురాత్రు లుపవసింపవలయును. శిరమునందైనచో కృచ్ఛ్రముఁ

---

మావికదుగ్ధం చ అన్నం మృతకసూతకే, చౌరస్యాన్నం మృతశ్రాద్ధే భుక్త్వా చాంద్రాయణం చరేత్. ౪౭. గవాం శృంగోదకే స్నాతో మహానద్యాశ్చ సంగమే, సముద్రదర్శనాద్వాపి శునా దష్టః శుచిర్భవేత్. ౪౮. వేదవిద్యావ్రతస్నాతః శునా దష్టో ద్విజః ఖగ, హిరణ్యోదకమిశ్రం తు ఘృతం ప్రాశ్య విశుధ్యతి. ౪౯. తిష్ఠన్వాప్యథ వా గచ్ఛఞ్ఛునా దష్టో ద్విజః ఖగ, వజ్రం ప్రాశ్య శుచిః స్యాదైవ యథాహ భగవాన్మనుః. ౫౦. వ్రతినశ్చాపి దష్టస్య త్రిరాత్రం క్షపణం స్మృతమ్, సఘృతం చ తతో భుక్త్వా వ్రతశేషం సమాచరేత్. ౫౧. బ్రాహ్మణీ తు శునా దష్టా సోమే దృష్టం సమాచరేత్, యదా న దృశ్యతే సోమః ప్రాయశ్చిత్తం కథం భవేత్. ౫౨. యాం దిశం వ్రజతే సోమస్తాం దిశం చావలోకయేత్, సోమమార్గేణ సా పూర్వా పంచపూతేన శుధ్యతి. ౫౩. బ్రాహ్మణస్య బ్రహ్మద్వారే పూయశోణితసంభవే, క్రిమిభిర్దశ్యతే యశ్చ నిష్కృతిం తస్య వచ్మి తే. ౫౪. గవాం తత్ర పురీషేణ త్రికాలం స్నానమాచరేత్, దధి క్షీరం ఘృతం పీత్వా కృమిదష్టో విశుధ్యతి. ౫౫. అథ నాభ్యాః ప్రదష్టస్య ఆపాదాద్వినతాత్మజ, ఏతద్వినిర్దిశేత్ప్రాజ్ఞః ప్రాయశ్చిత్తం ఖగాధిప. ౫౬. నాభికంఠాంతరే వీర యదా

జేయవలయును మృతాన్నము, సారాయి, మాంసము వీనిని భుజించిన బ్రాహ్మణుఁడు మూఁడురోజు లుపవసించి నాల్గవదినమున జలాధివాసముఁ జేయవలయును.

ఇది చతురశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

## పంచాశీత్యుత్తరశతతమాధ్యాయము.

ఆదిత్యుం డిట్లనియె. రాత్రులందు శ్రాద్ధమును జేయఁగూడదు. అట్లుచేసిన రాక్షసశ్రాద్ధ మనఁబడును. ఉభయసంధ్యలయందును సూర్యుఁ డంతర్హితుఁడై యున్నప్పుడును, మాతృయజ్ఞమును జేయక శ్రాద్ధముఁ జేసినయెడల మహాక్రోధముతోఁ దారుణంబగు పితృహింసను చేసినవా రగుదురు. అన విని యనూరుండు మహాత్మా! మాతృశ్రాద్ధము నెట్లు చేయవలెను? ఆమాతృదేవత లెవ్వరు? నాందీముఖపితరు లెట్లు పూజితు లైరని నా కానతిమ్మనిన సూర్యుం డిట్లనియె. వైనతేయా! మాతృశ్రాద్ధవిధానమును సంపూర్ణముగఁ జెప్పుచుంటిని శ్రద్ధతో నాలకింపుము. పూర్వాహ్ణంబున నెనమండ్రబ్రాహ్మణులను దక్షిణాయుక్తముగ భుజింపఁ జేయవలయును. అట్లే తొమ్మిదవవానినిఁగూడ భుజింపఁజేయవలయును.

---

చోత్పద్యతే కృమిః, షడ్రాత్రం తు తదా ప్రోక్తం ప్రాయశ్చిత్తం మనీషిభిః. ౫౭. యదా దశంతి శిరసి కృమయో వినతాత్మజ, కృచ్ఛ్రం తదా చరేత్ప్రాజ్ఞః శుద్ధయే కశ్యపాత్మజ. ౫౮. మృతాన్నం మధు మాంసం చ యస్తు భుంజీత బ్రాహ్మణః, స త్రీణ్యహాన్యుపవసేదేకాహం చోదకే వసేత్. ౫౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పేఽనూర్వాదిత్యసంవాదే బ్రాహ్మణధర్మవర్ణనం నామ చతురశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

ఆదిత్య ఉవాచ.—రాత్రౌ శ్రాద్ధం న కుర్వీత రాక్షసీ కీర్తితా హి సా, సంధ్యయోరుభయోర్వీర సూర్యే చైవ తిరోహితే. ౧. అకృత్వా మాతృయజ్ఞం తు యః శ్రాద్ధం పరివేషయేత్, తాతస్య క్రోధసంయుక్తాం హింసామిచ్ఛంతి దారుణామ్. ౨. అనూరురువాచ.—మాతృశ్రాద్ధం కథం కార్యం కాశ్చ తా మాతరః స్మృతాః, నాందీముఖాశ్చ పితరః కథం పూజామవాప్నుయుః. ౩. ఆదిత్య ఉవాచ.—హంత తే సంప్రవక్ష్యామి మాతృశ్రాద్ధవిధిం ఖగ, శృణు త్వం ఖగశార్దూల గదతో మమ కృత్స్నశః. ౪. పూర్వాహ్ణే భోజయేద్విప్రానష్టౌ సర్వాన్సదక్షిణాన్, తథాన్యం నవమం విప్రం చతు

అవక్రములగు నాల్గుకుతపములను సత్యముచే విధిపూర్వకంబుగా నిచ్చి యవలచేతను దధిమిశ్రితంబులగు యవలచేత నర్చనలఁజేసి గంధపుష్పాది సహితంబుగ విప్రునకుఁ బ్రదక్షిణముఁ జేయవలయును. తరువాత గుడ మిశ్రంబగునోదనంబును, రసంబులతోఁజేసిన మోదకంబులను, కటురస పదార్థములనుజేసి వస్త్రదానపూర్వకంబుగ భుజింపఁజేయవలయును. బ్రాహ్మణు లీరీతిగ భుజించినతరువాత సమాహితమనస్కుఁడై పిండముల నీయవలయును. దధ్యక్షతలచే మిశ్రితంబులగు రేగుపండ్లతో పిండములనుఁ జేయవలయును. తరువాత చతురస్రంబగు మండపమును జేసి యా మండపమునందు పూర్వాగ్రంబుగ దర్భలను పుష్పంబుల నుంచి సవ్య హస్తముతో విధిపూర్వకంబుగా తల్లికిని, తల్లితల్లికిని, యామెతల్లికినిఁ బూర్వముఖుండై తర్పణోదకంబుల విడువవలెను. తండ్రితల్లికి నామె తల్లికిని గూడ విడువవలెను. వృద్ధపితామహికిఁ గూడ నొకతర్పణాంజలిని విడువవలెను. ఈయార్గురుమాతల నుద్దేశించి పిండముల నీయవలెను. మాతృశ్రాద్ధంబున నెనమండ్రబ్రాహ్మణులను సర్వదైవత్యశ్రాద్ధంబున తొమ్మిదవబ్రాహ్మణుని భుజింపఁజేయవలెను. తరువాత నాందీముఖపితరుల నుద్దేశించి వృద్ధిశ్రాద్ధంబున నైదుగురుబ్రాహ్మణులను దక్షిణాపూర్వకంబుగ భుజింపఁజేయవలెను. వైనతేయా! వృద్ధియందు నీరెండుశ్రాద్ధము

---

రశ్చ ఖగాధిప. ౫. బుజూన్వై కుతపాన్దత్త్వా సత్యేన విధివత్ఖగ, కృత్వా యవైస్తి లార్థం తు దధిమిశ్రం క్రమేణ చ. ౬. గంధపుష్పాదికం సర్వం కుర్యాద్విప్రప్రదక్షిణమ్, బ్రాహ్మణేభ్యస్తతో దద్యాన్మధురం భోజనం ఖగ. ౭. గుడమిశ్రం ఖగశ్రేష్ఠ సవస్త్రమోదనం పరమ్, రసానాం మోదకాంశ్చైవ న చ తాన్కటుకాంస్తథా. ౮. ఏవం భుక్తేషు విప్రేషు దద్యాత్పిండాన్ త్సమాహితః, దధ్యక్షతవిమిశ్రాంస్తు బదరైశ్చ ఖగాధిప. ౯. కృత్వా తు మండపం వీర చతురస్రం ప్రదక్షిణమ్, పూర్వాగ్రాంశ్చ కుశాన్దత్త్వా పుష్పాణాం ప్రకరం తథా. ౧౦. సవ్యేన పాణినా వీర విధివత్ఖగసత్తమ, మాత్రే ప్రమాత్రే తన్మాత్రే నిర్వపేత్పూర్వతోముఖః. ౧౧. పితుర్మాత్రే తు తన్మాత్రే నిర్వపేద్విధివత్ఖగ, వృద్ధాయై ప్రపితామహ్యై తథాన్యం నిర్వపేద్బుధః. ౧౨. ఏవముద్దిశ్య వై మాతౄః షట్పిండాన్నిర్వపేత్ఖగ, అష్టాశయేద్ద్విజాన్వీర మాతృశ్రాద్ధే ఖగాధిప, నవమం సర్వదైవత్యం భోజయేద్విధివత్ఖగ. ౧౩. నాందీముఖాంస్తానుద్దిశ్య పితౄన్పంచ ద్విజోత్తమాన్, భోజయేద్విధివచ్ఛ్రాద్ధే వృద్ధిశ్రాద్ధే ప్రదక్షిణమ్. ౧౪. ఇత్థం శ్రాద్ధ

లను జేయవలెను. ఈరెండునుగాక మఱియొక శ్రాద్ధవిధిని గూడఁ జెప్పె దను ఈరెండుశ్రాద్ధములకుఁ బూర్వ మారంభించి యాశ్రాద్ధంబున బ్రాహ్మణులను భుజింపఁజేయవలెను అట్లు చేయనియెడల దేవాసుర మానవులు లోపించినవారగుదురు. బ్రాహ్మణున కగ్ని లేనియెడల హస్తము నందే యుంచవలెను. ఏ బ్రాహ్మణున కగ్ని యుండునో యాతఁడే బ్రాహ్మ ణుఁడని మంత్రవేత్తలు చెప్పుదురు. ప్రథమమున భోజనపాత్రయం దుంచినయన్నమును, తరువాత హోమశిష్టాన్నమును కలిపి భుజింపవలెను. ఆరెంటిని వేరుచేయఁగూడదు. తరువాత దైవశ్రాద్ధంబున మాంత్రికులు నచ్ఛిద్రులగు నిద్దఱుబ్రాహ్మణుల భుజింపఁజేయవలెను. వారు భుజించు నపుడు ప్రాఙ్ముఖులై కూరుచుండవలెను పితృశ్రాద్ధంబున ముగ్గురు బ్రాహ్మణు లుత్తరముఖముగా కూర్చుండి భుజింపవలెను వృద్ధిశ్రాద్ధము నందు యజుర్వేదవేత్తలను భుజింపఁజేయవలెను. శ్రాద్ధంబున దౌహిత్రము తిలలు కుతపకాలము నీమూఁడును పవిత్రంబులు శుచిభావము క్రోధము లేకపోవుటయు తొందరలేకపోవుటయు నివి శ్రాద్ధంబునఁ బ్రశంసనీయం బులు. ఖడ్గమృగముయొక్క లలాటంబునఁ బుట్టినశృంగముచేఁ జేయఁ బడినపాత్రమును దౌహిత్రమని యందురు. సవ్యభుజమునుండి జారిన వస్త్రముగల్గి నాభిదేశమందున్న వస్త్రమున్నవాఁడును నేకవస్త్రుఁడగును. ఏకవస్త్రుఁడగువానిని దేవకర్మలయందును పితృకర్మలయందును వర్జింపవల

---

ద్వయం కుర్యాద్వృద్ధౌ కశ్యపనందన, తథాన్యమపి తే వచ్మి పరం శ్రాద్ధవిధిం తవ. ౧౫. అద్వైపం భోజయేచ్ఛ్రాద్ధే తత్పూర్వం తు ప్రవర్తయేత్, అన్యథా తత్ర లుంపంతి సదేవా సురమానుషాః. ౧౬. అగ్న్యభావే తు విప్రస్య పాణావేవోపపాదయేత్, యో హ్యగ్నిః స ద్విజో వీంద్ర మంత్రదర్శిభిరుచ్యతే. ౧౭. పూర్వం పాత్రే యదన్నం చ యచ్చా న్నముపకల్పితమ్, తేనైవ సహ భోక్తవ్యం పృథగ్భావో న విద్యతే. ౧౮. ద్వౌ దైవే ఽథర్వణౌ విప్రౌ ప్రాఙ్ముఖావుపవేశయేత్, పిత్ర్యే త్రీనుదగాస్యాంశ్చ వృద్ధౌ చాధ్వర్యుసంగమాన్. ౧౯. త్రీణి శ్రాద్ధే పవిత్రాణి దౌహిత్రః కుతుపాస్తిలాః, త్రీణి చాత్ర ప్రశంసంతి శౌచమక్రోధమత్వరమ్. ౨౦. దౌహిత్రం ఖండమిత్యుక్తం లలా టాయ ప్రజాపతే, తత్ర శృంగస్య యత్పాత్రం తద్దౌహిత్రమితి స్మృతమ్. ౨౧. సవ్యాదంసాత్పరిభ్రష్టం నాభిదేశే వ్యవస్థితమ్, ఏకవస్త్రం తు తం విద్యాద్దైవే పిత్ర్యే చ

యును. పితృదేవమనుష్యపూజనమును భోజనము నుత్తరీయవిహీనుఁడై చేయఁగూడదు. అట్లు చేసినకర్మ నిష్ఫలంబగును. భుజములయందు వస్త్రమును గప్పుకొని గృహస్థుఁడు పితరుల నర్చించినయెడల కపటయోగి వలె నాకర్మఫలమును బొందఁజాలఁడు. వైనతేయా! యతులకును వానప్రస్థులకు సిద్ధికొఱకు యోగపట్టముఁ జెప్పఁబడెను. అజ్ఞానుఁడై యెవ్వఁడేని హస్తములను కడిగికొని గండూషజలమును పానముచేయునో యాతఁడు పితృకార్యముల నశింపఁజేయుటయేగాక, యాత్మను గూడ పాడుచేసికొనినవాఁ డగును. "దాతారో నోఽభివర్ధన్తాం వేదాస్సన్తతిరేవ (నః) చ, శ్రద్ధా చ నో మావ్యగమద్బహుదేయం చ నోఽస్త్వితి." మాకిచ్చువార లభివృద్ధిని బొందుదురుగాక. వేదములు సంతతియు వృద్ధిని బొందుఁగాక. మాకు శ్రద్ధపోకుండుఁగాక; మాకు ధన మధికముగఁ గల్గుఁగాక యని బ్రాహ్మణులు భోజనముచేసినవెనుక కర్త ప్రార్థింపఁగా భోక్త లాశీర్వదింపవలయును. భోజనముచేయుచు నిట్లాకాంక్షితుఁడై యాశీర్వదింపరాదు.

ఇది పంచాశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

వర్జయేత్. ౨౨. పితృదేవమనుష్యాణాం పూజనం భోజనం తథా, నోత్తరీయం వినా కార్యం కృతం స్యాన్నిష్ఫలం యతః. ౨౩. పరిధానకృతే స్కంధే గృహస్థో యోఽర్చయేత్పితౄన్, న స తత్ఫలమాప్నోతి యథా యోగపటావృతః. ౨౪. వనస్థానాం ఖగశ్రేష్ఠ యతీనాం చ మహామతే, సిద్ధయే కర్మణాం వీర యోగపట్టకముచ్యతే. ౨౫. హస్తౌ ప్రక్షాల్య గండూషం యః పిబేదవిచక్షణః, స తు దైవం చ పిత్ర్యం చ ఆత్మానం చోపఘాతయేత్. ౨౬. భోజనేష్వేవ తిష్ఠంతి స్వస్తి కుర్వంతి యే ద్విజాః, ఆసురం తద్భవేచ్ఛ్రాద్ధం పిత్రూణాం నోపతిష్ఠతే. ౨౭. దాతారో నోభివర్ధంతాం వేదాః సంతతిరేవ చ, శ్రద్ధా చ నో మా వ్యగమద్బహుదేయం చ నోఽస్త్వితి. ౨౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే అరుణాదిత్యసంవాదే మాతృశ్రాద్ధవిధివర్ణనం నామ పంచాశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

## షడశీత్యుత్తరశతతమాధ్యాయము.

భాస్కరుం డిట్లనియె. సుఖము నభిలషించువాఁడు శ్రావణమాసమున మంత్రయుతంబుగ శయనారోహణపూర్వకంబుగ సర్పంబులకు బలి నొసంగవలెను. మార్గశీర్షమాసమునఁ బ్రత్యవరోహశ్రాద్ధమును జేయవలెను. నిత్యకర్మలను ఫలము నపేక్షింపకయే చేయవలయునని ప్రసిద్ధమై యుండెనుగాన ఫలమువిషయమై సంశయింపఁగూడదు. కామ్యనైమిత్తిక కర్మలను తమకోరికలు సఫలములగుటకును దురితనివృత్తికొఱకును జేయవలెను. కర్మలకు మూఁడువిధంబులగు ఫలములు చెప్పఁబడినవి. కొందఱుకర్మలు పుట్టినదురితముల నశింపఁజేయుననియు, మఱికొందఱు దురితములు పుట్టకుండఁజేయుననియు, కొందఱు నిత్యకర్మల కానుషంగిక ఫలము వచ్చుననియుఁ జెప్పుదురు. అగ్న్యాధేయము, దర్శపౌర్ణమాసములు, చాతుర్మాస్యము, అగ్నిహోత్రము, నిరూఢపశుబంధము, సౌత్రామణియు నివి శ్రుతిచోదితంబులగు హవిర్యాగంబులు. అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, సంషోడశి, వాజపేయము, అతిరాత్రము, ఆప్తోర్యామము అనునివి పాకయాగములని వేదమునఁ జెప్పఁబడెను. సర్వభూతంబులయందలిదయ, అసూయలేకుండుట, మంగళమునుగోరుట, యోర్పు, అనాయాసము, శుచిత్వము, స్పృహలేకుండుట అను బ్రహ్మప్రాప్తినిమిత్తంబులగు సంస్కారంబులు బాగుగ నిరూపింపఁబడినవి. తరు

---

భాస్కర ఉవాచ:—శ్రావణ్యాం తు బలిః కార్యః సర్పాణాం మంత్రపూర్వకః, శయనారోహణే చైవ కార్యే సుఖమభీప్సతా. ౧. కార్యః ప్రత్యవరోహస్తు మార్గశీర్ష్యాం న సంశయః, ఫలం వినా త్వనుష్ఠానం నిత్యానామిష్యతే స్ఫుటమ్. ౨. కామ్యానాం సఫలార్థం తు దోషప్రాప్త్యర్థమేవ చ, నైమిత్తికానాం కరణం త్రివిధం కర్మణాం ఫలమ్. ౩. ఫలం కేచిదుపాత్తస్య దురితస్య ప్రచక్షతే, అనుత్పత్తిం తథా చాన్యే ప్రత్యేత్యాభ్యుపమంత్ర్య చ. ౪. నిత్యక్రియం తథా చాన్యే అనుషంగాత్ఫలం శ్రుతిః, అగ్న్యాధేయం తథా దర్శం పౌర్ణమాసం ద్వితీయకమ్. ౫. చాతుర్మాస్యమగ్నిహోత్రం పశుబంధో నిరూఢకాః, సౌత్రామణీ చ సంస్థాః స్యుర్హవిషః శ్రుతినోదితాః. ౬. అగ్నిష్టోమో౽త్యగ్నిష్టోమ ఉక్థ్యః సంషోడశీ తథా, వాజపేయాతిరాత్రశ్చ ఆప్తోర్యామః శ్రుతౌ శ్రుతః. ౭. దయా స్యాత్సర్వభూతేషు అనసూయాథ మంగలమ్, క్షాంతిర్దయా త్వనాయాసః శౌచమస్పృహతా వ్రతమ్. ౮. సమ్యగుక్తాస్తు సంస్కారా బ్రహ్మప్రాప్తి

వాత బ్రాహ్మణులశుభజీవనోపాయముల(వృత్తుల)ఁ జెప్పెద నాకర్ణింపుము. ఋతామృతములు, మృతము, ప్రమృతము, ప్రతిగ్రహము, వాణిజ్యము నివియన్నియు జీవనవృత్తులు. ఇందలి ఉత్తరోత్తరములు న్యూనములు. వీనిలో నేదే నొకవృత్తితో జీవింపవచ్చును. నిత్యమును శుచియై స్నానముఁ జేసి దేవునిఁ బూజింపవలయును. దేవకార్యములయందు స్వయముగఁ బ్రవర్తింపవలయును. సూర్యుని దిగంబరయగుస్త్రీని, మిథున కర్మాచరణఁ జేయుపురుషునిఁ జూడఁగూడదు. ఉదకములందు మూత్ర పురీషంబుల విడువఁగూడదు. అశుచియై రాత్రులందు నక్షత్రములను జూడఁగూడదు. శాస్త్రోక్తంబులగు నియమము లెవ్వియో వానినే జేయ వలెను శాస్త్రానుక్తంబగువ్రతములఁ జేయఁగూడదు స్వర్గార్థము శక్తి మంతుఁడై కర్మల సాధింపవలయును. కొందఱు నిత్యకర్మలను కొందఱు కామ్యకర్మలను గోరుచుందురు. కామ్యంబులయందు మిక్కిలి ప్రవర్తింప కుండుటకును మిక్కిలి సంగమంబుతో నుంటకును ప్రాయశ్చిత్తము విధింపఁబడెను. వ్రతముల నుద్దేశించి మనంబున నేది సంకల్పింపఁబడునో యది మానస మనంబడును. అంతరాగతఫలంబులు ఋషివాదంబు లని చెప్పఁబడినవి. ఫలసాధనంబగు ననధ్యయమును స్వయముగ వర్జింపవలెను. తా నశుద్ధుఁడైనను, అశుద్ధంబగు దేశము, ప్రాణా పాయకరంబగుదేశము, అశుభనిమిత్తములు, ఉత్పాతములు, వికార ములు, పర్వదినంబులు, చిత్తాశుద్ధి ఇవి యన్నియు ననధ్యయన

---

నిమిత్తకాః, అనంతరం ప్రవక్ష్యామి విప్రాణాం వృత్తయః శుభాః. ౯. ఋతామృతే చ విప్రాణామృతం ప్రమృతమేవ చ, ప్రతిగ్రహవణిజ్యాది శ్రేయసీ నోత్తరోత్తరా. ౧౦. ఆజీవికావృత్తయస్తు ఇత్యాద్యాః సంప్రవర్తితాః, తాసాం కయాపి జీవేత్తు అనుతిష్ఠే ద్యథావిధి. ౧౧. నిత్యం శుచిః సుగంధశ్చ స్నానశీలః ప్రియంవదః, పూజ్యశ్చ పూజయే ద్దేవాన్కార్యాణి స్వయమాచరేత్. ౧౨. నేక్షేతార్కం న నగ్నాం స్త్రీం న చ సంసృష్టమైథునమ్, నాప్సు మూత్రం పురీషం వా నాశుచీ రాత్రితారకాః. ౧౩. శాస్త్రోక్తా యంత్రణా యా తు నానుక్తాని వ్రతాని చ, స్వర్గార్థం సాధయేత్తైశ్చ శక్తిమాన్మనసా తథా. ౧౪. నిత్యాని కేచిదిచ్ఛంతి కామ్యాని చ తథాపరే, కామ్యాప్రవృత్తౌ సంగే చ ప్రాయశ్చిత్తం విధీయతే. ౧౫. వ్రతాని మనసా ల్విష్టసంకల్ప ఇతి మానసః, అంతరానుఫలం యత్తదృషివాదాః ప్రకీర్తితాః. ౧౬. అనధ్యాయం స్వయం సమ్య గ్వర్జయేత్ఫలసాధనమ్, ఆత్మాశుద్ధస్తథా దేశో హ్యాసుహారః ప్రజాపదః. ౧౭. అశుభాని నిమిత్తాని ఉత్పాతో వికృతం తథా, పర్వాణి మనసోఽశుద్ధిరనధ్యాయ ఇతి స్మృతః.

హేతువులు అనధ్యయనంబులలోఁగొన్నింటికి దృష్టంబగు ప్రయోజనము గలదు కొన్ని యదృష్టార్థములే యగును. అధ్యయనము మాత్రము దృష్టప్రయోజనమే యని చెప్పఁబడెను. కొన్ని యదృష్టప్రయోజకంబు లని గూడ చెప్పఁబడెను. అనధ్యయనములయందు నాధ్యానమును వేదాధ్యయనతుల్యంబగును. మృతాశౌచగ్రస్తులయన్నమును భుజించుట యన్నివర్ణములకును నిషిద్ధము. ద్రవ్యశుద్ధి గూడ నాశౌచనివృత్త్యనంతరమే యగును. జాతిదుష్టంబులు, క్రియాదుష్టంబులు, కాలదుష్టంబులు, సంసర్గదుష్టంబులు, ఆశ్రయదుష్టంబులు, సహృల్లేఖదుష్టంబులు, స్వభావదుష్టంబు లనియు నిన్నివిధములగు వస్తువులు దుష్టములగును. అందుల్లిపాయ, గంజాయి, కవకధాన్యము, వంకాయ, ముల్లంగి దుంప ఇవి జాతిదుష్టములు పాపక్రియలచే దుష్టంబగునది క్రియాదుష్టంబనంబడును. దానిని భుజింపఁగూడదు. చాలకాలము నిలవయుండుటచే హానిని గలుగఁజేయుపదార్థములు కాలదుష్టంబులు. దధి తేనె గాక మిగిలినభక్ష్యవిశేషంబులుగూడ కాలదుష్టంబులు సురాలశునమిశ్రితంబులగుపదార్థములు, శునోచ్ఛిష్టము మొదలగునవి సంసర్గదుష్టంబులు. శూద్రునిచే స్పృశింపఁబడినయన్నము షండునిచే స్పృశింపఁబడిన యన్నము నివి యాశ్రయదుష్టంబులని చెప్పఁబడెను. ఏభక్ష్యమువిషయమై చిత్తమున సంశయము గల్గునో యది సహృల్లేఖ మనఁబడును పురీషము స్వభావదుష్టము, రసము దుష్టమైనయెడల రసమునకు వికా

---

౧౮. అనధ్యాయాశ్చ దృష్టార్థా అదృష్టార్థా స్తథాపరే, వేదాధ్యయనమేవేతి త్రిధా మద్ధ్యానదర్శనమ్. ౧౯. అభక్ష్యం సర్వవర్ణానాం శావాశౌచం ఖగాధిప, ద్రవ్యశుద్ధి స్తథైవ స్యాదన్యథా త్వసమంజసమ్. ౨౦. జాతిదుష్టం క్రియాదుష్టం కాలదుష్టం విభూషితమ్, సంసర్గాశ్రయదుష్టం చ సహృల్లేఖం స్వభావతః. ౨౧. లశునం గృంజనం చైవ పలాండుం కవకాని చ, వార్తాకం నాలికేరం తు మూలకం జాతిదుష్టకమ్. ౨౨. నో భుంజీత క్రియాదుష్టం దుష్టం చ పతితైః పృథక్, కాలదుష్టం తు విజ్ఞేయం హానిదం చిరసంస్థితమ్. ౨౩. దధిభక్ష్యవికారాశ్చ మధువర్జ్యా స్తదిష్యతే. ౨౪. సురాలశునసంస్పృష్టం పేయూషాదిసమన్వితమ్, సంసర్గదుష్టమేతద్ధి శునోచ్ఛిష్టం ఖగేశ్వర. ౨౫. శూద్రసక్తం ఖండసక్తం జ్ఞేయమాశ్రయదూషితమ్, విచికిత్సా తు హృదయే భక్ష్యే యస్మిన్ ప్రజాయతే. ౨౬. సహృల్లేఖం తు తజ్జ్ఞేయం పురీషం తు స్వభావతః, రసదుష్టే

రముగూడఁ గల్గును. కాన పాయసము మొదలగుక్షీరపక్వపదార్థముల నాదినమే భక్షింపవలయును మరుదినము భక్షింపఁగూడదు. వైనతేయా! యీరీతిగ భక్ష్యాభక్ష్యపదార్థముల నిరూపించితిని. ప్రాణాపాయము నందును, యజ్ఞపశువును హోమముచేయఁగా మిగిలిన ప్రోక్షితమాంస మును శ్రాద్ధనియంత్రితుఁడగు బ్రాహ్మణుఁడు కోరి భుజించునప్పుడును, దేవపితృతృప్తిఁజేయునప్పుడును, మాంసభక్షణము నిషిద్ధముగాదు. మను ష్యుఁడు మృతినొందిన సపిండులకాదినము మొదలు పదిదినము లాశౌచము బ్రాహ్మణులకును, పదిరెండుదినములు క్షత్రియునకును, పదునైదుదినం బులు వైశ్యునకు, ఒక్కమాసము శూద్రునకు నాశౌచ ముండును. అంత వఱకును వారు భోజ్యాన్నులు కారు. పదిదినంబులు గడచినతరువాత బ్రాహ్మణుఁడు భోజ్యాన్నుఁడగును. పదిదినములు గడచినతరువాత బ్రాహ్మణుఁ డాశౌచమును విన్నచో నొక్కరాత్రి మాత్ర మాశౌచ మునుబట్టి మఱునాఁడు శుద్ధుఁడగును. సంవత్సరము గడచినతరువాత వినినచో స్నానమాత్రముననే శుద్ధుఁడగును సపిండులనఁగ నేడుపురు షాంతరములవారని వేదమునందుఁ జెప్పఁబడెను జన్మనామము లెఱుంగు నంతవఱకు సమానోదకు లగుదురు దంతములు వచ్చువఱకు సద్యః స్నానము, చూడాకర్మయైన బాలురవఱకును నొకరాత్రి యాశౌచమని చెప్పఁబడెను. సపిండులలో నుపనయనపర్యంతము త్రిరాత్ర మాశౌచము ననుభవింపవలయును. ఉపనయనవయస్సు వచ్చినతరువాత నుపనయనము

---

వికారోఽపి రసస్యేతి ప్రదర్శితః. ౨౭. పాయసం క్షీరపాకాది తస్మిన్నేవ దినే తథా, యథాశాస్త్రం ఖగశ్రేష్ఠ భక్ష్యాభక్ష్యే నిరూపయేత్. ౨౮. ప్రాణాత్యయే ప్రోక్షితం చ శ్రాద్ధే చ ద్విజకామ్యయా, పితౄన్దేవాంశ్చార్చయిత్వా భుంజన్మాంసం న దోషభాక్. ౨౯. ప్రేతాశుద్ధిః సపిండానాం తస్మిన్నేవ మృతే సతి, దశాహం ద్వాదశాహం వా పక్షం మాసం త్వశుద్ధతా. ౩౦. దశాహాదిత్రికే భాగే వర్ణశో న భవంతి హి, దశా హేన తు భోజ్యాః స్యుః సూతకాశౌచయోస్తథా. ౩౧. ఊర్ధ్వం దశాహాదేకాహ శ్రవణే సతి జాయతే, సంవత్సరే వ్యతీతే తు స్నానాదేవ విశుధ్యతి. ౩౨. సమానోద కతా ప్రోక్తా జన్మనామ్నోరపర్యయే, సపిండాః సప్త పురుషాః శ్రుతావేతన్నిదర్శనమ్. ౩౩. ఆ దంతజన్మనః సద్య ఆచూడాన్నైశికీ స్మృతా, త్రిరాత్రమావ్రతాదేశాత్స పిండేషు మృతేషు చ. ౩౪. తేషామపి తదేకం స్యాద్వయోవస్థాప్యపేక్ష్యతే, సమానోదకా

గాకపోయినను వానికి సంస్కారములన్నియు నుపనీతునివలెనే జరుగ వలయును. వయోవస్థయే ముఖ్యము. ఏడుపురుషాంతరములకు పై వారు సమానోదకులని చెప్పఁబడుదురు వారలకు జాతమృతాశౌచములు మూఁడురాత్రులచే ముక్తంబులగును. స్త్రీకి గర్భస్రావముగల్గిన త్రిరాత్రానంతరము స్నానముచే పరిశుద్ధి కలుగును. అనేకములగు జాతాశౌచ మృతాశౌచములు వచ్చినప్పుడు ప్రథమమున ననుభవించెడి యాశౌచ శేషముచేతనే శుద్ధుఁడగును. ఇది ద్విజులకు పితృమాతృకర్మలవిషయమై యిట్లు జరుగవలెను. అగ్నిహోత్రవిషయమైనచో నప్పుడే స్నానము చేసిన శుద్ధుఁడగును. ఇయ్యది లోకమర్యాదయై యున్నది. అసపిండుఁడు మృతినొందినయెడల నాశవమును పారవేయుటకుఁ బోయినచో మూఁడు రాత్రులైన నాశౌచమును బట్టవలెను. శవముతోఁగూడ వెళ్లుటమాత్రమైనచో స్నానముచేతనే నివృత్తమగును. బ్రాహ్మణులకు నాల్గువర్ణముల కన్యలను వివాహము చేసికొనుట కధికారము గలదు. గావున నందలి బ్రాహ్మణస్త్రీయం దుత్పన్నుఁడగు పుత్త్రుఁడు మృతినొందినచో పదిదినములాశౌచమును, క్షత్రియస్త్రీయందుఁ బుట్టినపుత్త్రుఁడు మృతినొందినచో నారుదినంబులును, వైశ్యస్త్రీయం దుత్పన్నుఁడైనపుత్త్రుఁడు మృతుఁడైనచో మూఁడుదినంబులును, శూద్రస్త్రీపుత్త్రుఁడు మృతినొందిన నొక్కదినమాశౌచమును బట్టవలెను. తత్త్వవేత్తలచే శరీరవిషయమగు శౌచ మిట్లు చెప్పఁబడెను. ఇటుపైన ద్రవ్యశుద్ధివిధానమును జెప్పెద. తేజస్సుచేతను, మృత్తికచేతను, జలముచేతను ద్రవ్యములకు శుద్ధి యేర్పడును. అశుద్ధ ద్రవ్యలిప్తమైనయెడల కడగిన శుద్ధి యగును. స్పర్శమాత్రమే యైనచో

---

త్రిరాత్రేణ శుధ్యేద్వై మృత్యుజన్మనోః. ౩౫. గర్భస్రావే త్రిరాత్రేణ ఉదక్యా శుధ్యతే తథా, అనంతజన్మమరణే తచ్ఛేషేణ విశుధ్యతి. ౩౬. ద్విజానాం త్వేవమేవ స్యాత్పిత్రర్థం మాతురేవ వా, అగ్నిహోత్రార్థం విజ్ఞేయం సద్యః శౌచమితి స్థితిః. ౩౭. అసపిండే తు నిర్హారాత్త్రిరాత్రమపి మానవః, తస్యైవానుగతో జ్ఞేయం సద్యః శౌచం ఖగాధిప. ౩౮. శుధ్యేద్ద్విజో దశాహేన జన్మహానౌ ద్వియోనిషు, షడ్భిస్త్రిభిరథైకేన క్షత్రవిట్శూద్రయోనిషు. ౩౯. ఉక్తశౌచం యథాన్యాయం శారీరం తత్త్వదర్శిభిః, ద్రవ్యశుద్ధివిధానం తు యథావదభిధీయతే ౪౦. తైజసీ మార్త్తికీ వీర వారిశుద్ధిః స్మృతా తథా, నిర్లేపక్షాలనే నైవ స్పర్శే తు ప్రోక్షణేన వై. ౪౧. అశుద్ధం నైవ

ప్రోక్షణము మాత్రము చాలును. వైనతేయా! స్వభావముచేతనే శుద్ధం బగుపదార్థం బెద్దియుఁ గానంబడదు ద్రవ్యమునకు సంబంధించినశుద్ధ్యశుద్ధులు వచనమాత్రవిజ్ఞేయములు స్వతోగ్రాహ్యంబులు గానేరవు. ద్రవ్యశౌచముఁ జేసినతరువాత స్నానరూపంబగు శౌచమును జేయవలెను. ప్రాతస్స్నానము నిత్యమైనను గ్రహణాదులయందు కామ్యము గూడఁ గావచ్చును. క్షురాశౌచమనునది నైమిత్తికాశౌచము. దానిచే పాపవిముక్తుఁడగును. ఇప్పుడు చెప్పినశౌచమంతయు దోషక్షయకరమగుటచే స్వతంత్రముగను కర్మాంగముగఁ గూడఁ జేయఁబడుచుండును. నిత్యనైమిత్తికకామ్యశౌచములు మూఁడు దోషక్షయకరములనియుఁ, గర్మాంగములనియు, భేదద్వయముచే నారువిధములు. త్రైవర్ణికులకు విశేషముగ నాచమనమును గూడ నీతీరే యని తెలిసికొనవలెను. బ్రాహ్మణులైనను తనచేఁ గర్మకాండములు చేయించుకొనఁదగినవారు మృతినొందినచో శవసమక్షమున నమంత్రకముగ నాచమనముఁ జేయవలెను. ఇతరులగుబ్రాహ్మణులు స్వేచ్ఛగఁ జేయవలెను. కన్య పుత్త్రులం గని పితృపాపనివృత్తిని జేయవలెను. కలాశిల్పంబుల నన్నింటిని భర్తృపరితోషము కొఱకై గ్రహింపవలయును. భర్త యేరీతిగ సంతోషించునో ఆరీతిగ శుశ్రూష జేయవలెను. అత్తమామలు పరితోషమునకు పాత్రురాలగుటఁ గూడ స్త్రీధర్మమై యున్నది. వృద్ధవనిత సంతానములేక గతించినచో నామె సొత్తు భర్తృజ్ఞాతులులేనినాఁడు రాజును జెందును. పుత్రహీనయు, నష్టసంతానయు, వార్ధకంబున నుత్పన్నమగు సంతానముగలదియు, అపతి

---

కించిద్ధి ద్రవ్యమస్తీతి ఖేచర, వచనాచ్ఛుద్ధ్యశుద్ధీ తు ద్రవ్యాణామిహ ఖేచర. ४౨. స్నానం శౌచం చ కర్తవ్యం ద్రవ్యశౌచాదనంతరమ్, ప్రాతఃస్నానం తు నిత్యం స్యాద్గ్రహణే కామ్యమేవ చ. ४३. నైమిత్తికం క్షురాశౌచం తేన పాపాద్విశుధ్యతి, ఉక్తం తు శౌచం విజ్ఞేయం దోషక్షయకరం ఖగ. ४४. కర్మాంగం చేతి విజ్ఞేయం షట్ప్రకారాః సమాసతః, ఏవమాచమనం విద్యాద్విశిష్టం తు ద్విజన్మనామ్. ४५. యదా మృతానాం తద్వత్స్యాదన్యేషాం తు యథాసుఖమ్, కన్యానివృత్తిం పుత్రైస్తు యథాన్యాయం సమాచరేత్. ४౬. కలాశిల్పాని సర్వాణి గృహ్ణీయాత్పరితుష్టయే. ४౭. శుశ్రూషేత పతిం భార్యా పరితోషం యథా వ్రజేత్, గురూణాం పరితోషశ్చ ధర్మః స్త్రీణాం సనాతనః. ४౮. వృద్ధాఽపుత్రా యది మృతా తదభావే నృపస్య తు, మృతాపత్యాప్యగర్భా

వ్రతయు వీరలు భర్తజీవించినను మృతినొందినను నాతనికి దుఃఖమును గలుగఁజేసినవా రగుదురు. ధర్మము ననుష్ఠించిన భర్తృలోకమును బొందుదురు. ధర్మచారిణియు సాధ్వియు నగుస్త్రీ మృతినొందినచో గార్హపత్యాగ్నిచే దహింపవలెను భిన్నవర్తనముగలస్త్రీ మృతినొందినచో నీయగ్నిచే దహింపఁగూడదు. మఱల వివాహము మాత్రము చేసికొనవచ్చును. అపుత్త్రుఁడై భర్త మృతినొందిన బ్రహ్మచర్యరూపంబగు నియోగము స్త్రీలకు చెప్పఁబడియున్నది (నియోగమనఁగా వంశము నశించుచుండఁగా స్త్రీ మఱఁదితోఁగాని సపిండులలో నొక పురుషునితోఁగాని గురుజనుల యాజ్ఞచే సంభోగించుట నియోగ మనఁబడును.) దృష్టాదృష్టఫలకంబులగు నీధర్మంబుల శాస్త్రప్రకార మనుష్ఠింపవలెను. కాన నెల్లప్పుడును ధర్మములను జేయవలెను. అట్లుచేసిన స్వర్గమును బొందును.

ఇది షడశీత్యుత్తరశతతమాధ్యాయము.

---

## సప్తాశీత్యధికశతతమాధ్యాయము.

అనూరుం డిట్లనియె. భాస్కరా! మానవు లేపుణ్యాంబులఁ జేసి స్వర్గమున కేగుదురు? మనుష్యలోకమున నుద్భవించినవారలకు స్వర్గలోకగమన మెట్లు గలుగును ? కర్మయజ్ఞము, తపోయజ్ఞము, స్వాధ్యాయము, ధ్యానము, జ్ఞానయజ్ఞమని యైదుయజ్ఞములు చెప్పఁబడియుండెను. ఈ

---

చ వృద్ధాపత్యా పతివ్రతా. ౪౯. కుర్యాదనిర్వృతం భర్తుర్గతే సన్నిహితేఽపి వా, ఏతాం ధర్మసమాం నిష్ఠాం భర్తృలోకమవాప్నుయాత్. ౫౦. స్త్రీ ధర్మచారిణీ సాధ్వీ మృతా దాహ్యా ఽథాగ్నిభిః, విపరీతాదదాహ్యా తు పునర్దారక్రియా ఽథా. ౫౧. స్త్రీణాం నియోగో విహితో మరణాద్బ్రహ్మచారకమ్, ప్రాప్తవ్యశ్చ యథాధర్మో దృష్టాదృష్టఫలప్రదః. ౫౨. తస్మాద్ధర్మం సదా కుర్యాత్కుర్వతీ స్వర్గ మాప్నుయాత్. ౫౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు శుద్ధిప్రకరణవర్ణనం నామ షడశీత్యుత్తరశతతమోఽధ్యాయః.

---

అనూరురువాచః——కాని పుణ్యాని కృత్వేహ స్వర్గం గచ్ఛంతి మానవాః, మనుష్యలోకే సంభూతాః స్వర్లోకే గామినః పరమ్. ౧. కర్మయజ్ఞస్తపోయజ్ఞః స్వాధ్యాయో ధ్యాననిర్మితః, జ్ఞానయజ్ఞశ్చ పంచైతే మహాయజ్ఞాః ప్రకీర్తితాః. ౨.

యైదింటిలో నేది యుత్తమమైనది? ఈయజ్ఞంబులకు ఫలం బెద్ది? దాని వలన నేగతి గల్గును? ధర్మాధర్మములయొక్క యవాంతరభేదము లెన్ని? తత్సాధనము లెన్ని? వానికి గతులెయ్యవి? నరకమునకుఁ బోయి భుక్త శేషంబగుకర్మచే భూమియం దుత్పన్నులగువారల కేయే చిహ్నములు గల్గును? గర్భము మొదలు దుఃఖసంకలితమగుట ఫేనయుక్తంబును ధర్మాధర్మసంకులంబును నగు నీసంసారమహార్ణవమునుండి దేహు లెట్లు ముక్తలగుదురో నాకుఁ జెప్పుమనిన నాదిత్యుం డిట్లనియె వైనతేయా! స్వర్గాపవర్గముల నిచ్చునదియు, సంసారమహార్ణవమును తరింపఁజేయునదియు, పాపమును హరించునదియును, పుణ్యంబు నగుధర్మమును జెప్పెద. సావధానుఁడవై యాలకింపుము. ధర్మము శ్రద్ధయందే ప్రతిష్ఠితమై యుండును. శ్రద్ధయే ధర్మమని చెప్పఁబడెను. శ్రుతిమంత్రంబులు, రసములు, పరమపురుషుఁడు నివియన్నియు సూక్ష్మములుగాన శ్రద్ధామాత్రముచేతనే తెలియఁదగినవిగాని చక్షురాదీంద్రియంబులచేఁ దెలియఁదగినవి గావు. కాయక్లేశముచేత బహుధనములచేతను గూడ సాధ్యములు గానేరవు. శ్రద్ధాహీనులైనచో దేవతలైనను ధర్మమును బొందఁజాలరు. శ్రద్ధయే ధర్మము. శ్రద్ధయే సూక్ష్మమగుపరమాత్మ. శ్రద్ధయే యజ్ఞాహుతి. తపము మోక్షము స్వర్గము గూడ శ్రద్ధయే యగును. వేయేల నీజగమంతయు

---

ఏతేషామేవ యజ్ఞానాముత్తమః కతమః స్మృతః, ఏతద్యజ్ఞఫలానాం చ కిం ఫలం కా గతిర్భవేత్. ౩. ధర్మాధర్మప్రభేదాశ్చ కియంతః పరికీర్తితాః, తత్సాధనాని కతిధా గతయశ్చ యథా వద. ౪. ఖగ నారకిణాం పుంసామాగతానాం పునః క్షితౌ, కాని చిహ్నాని జాయంతే భుక్తశేషేణ కర్మణా. ౫. మహాభవార్ణవాద్ఘోరాద్ధర్మాధర్మాభిసంకులాత్, గర్భాదిదుఃఖఫేనాఢ్యాన్ముచ్యంతే దేహినః కథమ్. ౬. ఇత్యుక్తో భగవాన్భానుః సర్వప్రశ్నార్థమాదరాత్, ప్రత్యువాచ మహాతేజాః సమాసవ్యాసయోగతః. ౭. ఆదిత్య ఉవాచ.—స్వర్గాపవర్గఫలదం నరకార్ణవతారణమ్, ధర్మం పాపహరం పుణ్యం శృణు శూర ప్రభాషతః. ౮. శ్రద్ధాపూర్వః సదా ధర్మః శ్రద్ధామధ్యాంతసంస్థితః, శ్రద్ధానిష్ఠప్రతిష్ఠశ్చ ధర్మః శ్రద్ధా ప్రకీర్తితా. ౯. శ్రుతిమంత్రరసాః సూక్ష్మాః ప్రధానపురుషేశ్వరః, శ్రద్ధామాత్రేణ గృహ్యంతే న పరేణ చ చక్షుషా. ౧౦. కాయక్లేశైర్న బహుభిర్న చైవార్థస్య రాశిభిః, ధర్మః సంప్రాప్యతే సూక్ష్మః శ్రద్ధాహీనైః సురైరపి. ౧౧. శ్రద్ధా ధర్మః పరః సూక్ష్మః శ్రద్ధా యజ్ఞాహుతం తపః, శ్రద్ధా మోక్షశ్చ స్వర్గశ్చ

శ్రద్ధామయమై యుండెను ఎవ్వఁడైనను శ్రద్ధాహీనుఁడై తనజీవితమును తనసర్వస్వమును ధారపోసినను తత్ఫలమును బొందఁజాలఁడు. శ్రద్ధావంతుఁడైనచో తప్పక ఫలము నందును. ఈరీతిగ నాధర్మములన్నియు శ్రద్ధామయములై యుండవలెను. నన్ను శ్రద్ధచేతనే పూజింపవలెను. శ్రద్ధచే ధ్యానముచేయవలెను. అధికారప్రాప్తికొఱకు మహాసారంబగు ముక్తి నిచ్చునదియును, అజ్ఞానోక్తంబగుటచే సందిగ్ధంబును, అనేకసిద్ధులను గలుగఁజేయునదియును, ప్రజలచిత్తమును రంజింపఁజేయునదియును, నిశ్చితార్థంబును, గంభీరంబును, మనోరమంబును నగునావాక్యము రెండు స్థానములు గలమానససముద్రమని చెప్పుదురు. ఆసముద్రము ఖషోల్కయని ప్రసిద్ధమయ్యెను. ఆఖషోల్కుఁడు సత్వరజస్తమోగుణాతీతుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వవేత్తయు, ప్రభువును నై యుండెను. నాయొక్క పరమరూపమగు ఖషోల్కము "ఓం" అను నేకాక్షరమంత్రమున నిమిడి యుండెను. ఈఘోరంబగు సంసార మెట్లనాదియో యట్లే యీసంసారశోధకుం డగుఖషోల్కుఁడు గూడ ననాద్యుఁడు. వ్యాధులకు మందెట్లు స్వభావప్రతిపక్షమో యట్లే యీఖషోల్కుఁడును సంసారప్రతిపక్షియై ముముక్షువులకు ముక్తిని గలుగఁజేయును. ఇది నాకభిధానమంత్రమని చెప్పఁబడెను. అభిధానముల కభిధేయుండనై మంత్రసిద్ధుఁడనైతిని. వేదము మానవాగమమునం దారక్షరములుగల మంత్రమునం దుండెను.

---

శ్రద్ధా సర్వమిదం జగత్. ౧౨. సర్వస్వం జీవితం వాపి దద్యాదశ్రద్ధయా చ యః, నాప్నుయాత్స ఫలం కించిత్తస్మాచ్ఛ్రద్ధాపరో భవేత్. ౧౩. ఏవం శ్రద్ధామయాః సర్వే మమ ధర్మాః ప్రకీర్తితాః, పూజ్యస్తు శ్రద్ధయా పుంసా ధ్యేయః పూజ్యశ్చ శ్రద్ధయా. ౧౪. అధికారస్య ప్రాప్త్యర్థం మహాసారవిముక్తిదమ్, అజ్ఞాదుక్తం ససందిగ్ధం వాక్యమేతన్మమాద్భుతమ్. ౧౫. నానాసిద్ధికరం దివ్యం లోకచిత్తానురంజనమ్, సునిశ్చితార్థగంభీరం వాక్యం మమ మనోరమమ్. ౧౬. మన్మానససముద్రో హి ద్విపదోయం విదుర్బుధాః, స ఖషోల్కేతి విఖ్యాతః సశివం మండలం ఖగ. ౧౭. దేవత్రయగుణాతీతః సర్వజ్ఞః సర్వవిత్ప్రభుః, ఓమిత్యేకాక్షరే మంత్రే స్థితః స పరమో మమ. ౧౮. యథానాదిప్రవృత్తోయం ఘోరః సంసారసాగరః, ఖషోల్కోఽపి తథానాదిః సంసారార్ణవశోధనః. ౧౯. వ్యాధీనాం భేషజం యద్వత్ప్రతిపక్షస్వభావతః, మోక్షిణాం ముక్తిహేతుశ్చ సిద్ధః సర్వార్థసాధకః. ౨౦. మమాభిధానమంత్రోయమభిధేయః సదా స్మృతః, అభిధానాభిధేయోహం మంత్రసిద్ధోఽస్మి ఖేచర. ౨౧. వేదో మనోగమే చాత్ర షడక్షరమంత్ర

ఒకయక్షరమును విడచి లోకంబున పంచాక్షరంబని చెప్పఁబడును. ఈ మంత్రముకలవాని కనేకమంత్రములచేతను శాస్త్రంబులచేతను నేమి ప్రయోజనము? "ఓం నమః ఖషోల్క!" యను నీమంత్ర మెవ్వనిహృదయంబున నుండునో వాఁడు శాస్త్రములఁ జదివి యనుష్ఠించినవాఁడగును. "ఓం నమః ఖషోల్క!" యను నీషడక్షరవాక్యము విధివాక్యమేగాని (యర్థవాదము) స్తుతి గానేరదు. ఈనావాక్యార్థవిశేషమును నీ కీతఁడు వివరింపఁగలఁడు. ప్రాంజలివై నమస్కరించి యిప్పుడే యడుగుము. నావు డనూరుఁడు భానునివాక్యము విని చెంతనున్న సప్తాశ్వుని తిలకమునకుఁ బ్రణమిల్లి సూర్యవాక్యంబునందలి యర్థంబుఁ జెప్పుమన నాసప్తాశ్వతిలకుఁ డిట్లనియె. అశేషదోషవిముక్తుఁడును సర్వజ్ఞుండు నగుభగునిచేఁ బ్రణీతం బగు నిర్మలవాక్యము ప్రమాణము నిస్సంశయము. ఏవాక్యమువలన మార్తాండుఁ డనుపేరుగల యాదిత్యుఁడు చెప్పఁబడునో యదియే వాక్యమని పెద్దలు చెప్పుదురు. చెప్పినరీతిగ వాక్యమును స్మరించిన పుణ్యమును బొందుదురు. అశ్రద్ధతోఁ జేసిన నధోలోకంబులఁ బొందుదురు. సౌర వాక్యము నుపదేశించుగురువును సూర్యునివలె పూజింపవలయును. ఘోరమగు సంసారార్ణవమున మునుఁగుమనుజు నెవ్వఁ డుద్ధరించునో

---

స్థితః, యద్వా ముక్తోఽక్షరై కేన లోకే పంచాక్షరః స్మృతః. ౨౨. కిం తస్య బహుభిర్మంత్రైః శాస్త్రైర్వా బహువిస్తరైః,యస్యోం నమః ఖషోల్కేతి మంత్రోఽయం హృది సంస్థితః. ౨౩. తేనాధీతం శ్రుతం తేన తేన సర్వమనుష్ఠితమ్, యేనోం నమః ఖషోల్కేతి మమ వాక్యం షడక్షరమ్. ౨౪. విధివాక్యమిదం సర్వం నార్థవాదం వచో మమ, ఏతత్తే వక్ష్యతేఽశేషం మమ వాక్యార్థముత్తమమ్, పృచ్ఛస్వేమం ప్రణమ్యాశు వైనతేయ మహామతే. ౨౫. సుమంతురువాచ.—శ్రుత్వా తు వచనం భానో ర్వైనతేయో మహాబలః, సప్తాశ్వతిలకం భక్త్యా ప్రణమ్యోవాచ భారత. ౨౬. అనూరురువాచ.—బ్రూహి మాం దేవశార్దూల యత్పృచ్ఛామి మహామతే, కీదృగ్వాక్యమిదం భానోర్వాక్యార్థం బ్రూహి చ ప్రభో. ౨౭. సప్తాశ్వతిలక ఉవాచ.—విముక్తాశేషదోషేణ సర్వజ్ఞేన భగేన యత్, ప్రణీతమమలం వాక్యం తత్ప్రమాణం న సంశయః. ౨౮. యస్మాన్మార్తండ నామాసౌ కథ్యతే చ మనీషిభిః, యథార్థం పుణ్యమాప్నోతి పతత్యశ్రద్ధయా త్వధః. ౨౯. సౌరవాక్యప్రవక్తారం సూరవత్పూజయేద్గురుమ్, సంసారార్ణవనిర్మగ్నం

యాతఁడు గురువని చెప్పఁబడును అజ్ఞానమనెడి వహ్నియందు తప్తుఁడగువాని నెవ్వఁడాయగ్నిని చల్లార్చి రక్షించునో యాతని భక్తులను పూజింపనిచో వాని ధనరాసులతో నేమియుఁ బ్రయోజనము లేదు. పొందఁబడిన యీయజ్ఞానశమనంబునకు ఫలము పరలోకసుఖము స్వర్గమోక్షములసిద్ధికొఱకు దేవదేవుండగు సూర్యునిచేఁ జెప్పఁబడు వాక్యమెద్ది గలదో యది నీకుఁ దెలిసికొనఁదగినది. రాగద్వేషక్షమాక్రోధతృష్ణాయుక్తులవాక్యములు నరకహేతువులుగాన నవి దుర్భాషితములని చెప్పఁబడును సంస్కరింపఁబడి మృదులంబులగు మాటలుగలదైనను నజ్ఞానయుక్తంబగుటఁజేసి సంసారహేతువగు వాక్యమున నేమి ప్రయోజనము? ఏవాక్యము వినినతోడనే రాగాదినాశము పుణ్యమును గల్గించునో యావాక్యము విరూపమైన నతిశోభనమని యెఱుంగునది. స్మృతులు, వేదములు, భారతము, శాస్త్రములును ఆయుర్నాశకంబులుగాని ధర్మార్థసాధకంబులు గానేరవు. ధర్మార్థంబుల నొండొంటి ముడిచి (మూఢచేతస్కులగుమనుష్యులకు పుత్రదారాదిరూపంబగు సంసారంబున) సంసారవేత్తలకు శాస్త్ర మనాదియగుపరతత్వముయొక్క ముఖమునుండి నిర్గతమయ్యెను. కాన వారికి మాత్ర ముపయోగించును నీవు సమస్తమును తెలిసికొనవలెనని కోరుచుంటివిగాన నిదియే శ్రేష్ఠము. ఇదియే తెలిసికొనఁదగినవిశేషము. వేయిసంవత్సరము లాయువు గల్గినను శాస్త్రములను

యః సముద్ధరతే జనమ్. ౩౦. సౌరధర్మామ్బుహస్తేన కస్తేన సదృశో గురుః, అజ్ఞానవహ్ని సంతప్తం నిర్వాపయతి యః శనైః, జ్ఞానామృతేన వై భక్తాన్కస్తం న ప్రతిపూజయేత్. ౩౧. నైవ రాజ్యేన మహతా న చైవార్థస్య రాశిభిః, ప్రాప్తమజ్ఞానశమనం పరలోకే సుఖావహమ్. ౩౨. స్వర్గాపవర్గసిద్ధ్యర్థం భాషితం యత్తు శోభనమ్, వాక్యం తే దేవదేవేన తద్విజ్ఞేయం సుభాషితమ్. ౩౩. రాగద్వేషాక్షమాక్రోధకామతృష్ణానుసారిణామ్, వాక్యం నిరయహేతుత్వాత్తద్దుర్భాషితముచ్యతే. ౩౪. సంస్కృతేనాపి కిం తేన మృదులాలాపసంగినా, అవిద్యారామవాక్యేన సంసారక్లేశహేతునా. ౩౫. యచ్ఛ్రుత్వా జాయతే పుణ్యం రాగాదీనాం చ సంక్షయః, విరూపమపి తద్వాక్యం విజ్ఞేయమతిశోభనమ్. ౩౬. స్మృతయో భారతం వేదాః శాస్త్రాణి సుమహాంతి చ, స్వాయుషః క్షపణాయైవ ధర్మోఽర్థసమగ్రస్థితః. ౩౭. పుత్రదారాదిసంసారే నరాణాం మూఢచేతసామ్, సంసారవిదుషాం శాస్త్రమనాది ముఖనిర్గతమ్. ౩౮. ఇదం శ్రేష్ఠమిదం జ్ఞేయం సర్వం త్వం జ్ఞాతుమిచ్ఛసి, అపి వర్షసహస్రాయుః శాస్త్రాంతం నాధిగచ్ఛతి. ౩౯. 'విజ్ఞాయా

సమగ్రముగ మానవుఁడు చదువఁజాలఁడు. కాన నక్షరతన్మాత్రుండగు పరమాత్మను దెలిసికొని వంచనారూపంబగు నీజీవితమును సర్వశాస్త్రంబులను విడచి పారలౌకికమునే చేయవలెను. ఎవ్వఁడు పారలౌకికమగు పుణ్యభాగమును వహించుట కశక్తుఁడో యాతఁడు పండితుఁడైనను మనుష్యులలో సమర్థుఁడైనను ఫలము లేదు. ఎవ్వఁడు సౌరజ్ఞానమాహాత్మ్యము నుచ్చరించుటకు సమర్థుఁడు గాఁడో యాతఁడు పండితుఁడైనను మూర్ఖుఁడు. శక్తియుక్తుఁడైనను శక్తిహీనుఁడు. ఎవ్వఁడు సౌరసద్భావము నాలోచించుట కుద్యుక్తుఁడౌనో యాతఁడే పండితుఁడు, తపశ్శాలి. ఏ రాజు సమస్తమగుధనమును భూమిని సువర్ణము నిచ్చివేయునో, యెవ్వఁడు న్యాయవిరుద్ధముగ నడుగునో యీయిద్దఱికిని నీగురు వుపదేశింపఁగూడదు. ఎవ్వఁడు సౌరధర్మమును న్యాయముగ వినునో, లేక చెప్పునో యాతఁడు సుస్థానమును బొందును. అట్లు గానిచో నరకమును బొందును వేకువజామున నీషడక్షరమంత్రవిధానమువలన సూర్యుఁడు పూజితుండగుటచే మనుష్యులకు సూర్యతుల్యత్వముగల్గును. పూర్వము దేవదానవులు క్షీరసముద్రమును మథించుచుండఁగా నందు సర్వలోకముల తల్లులగు నంద, సుభద్ర, సురభి, సుమన, శోభన లనునైదుగోవు లుత్పన్నంబులయ్యెను ఈగోవులు సూర్యసన్నిభంబులై వెలుఁగుచు సర్వ

క్షరతన్మాత్రం జీవితం చాతివంచనమ్, విహాయ సర్వశాస్త్రాణి పరలోకం సమాచరేత్. ౪౦. పండితేనాపి కిం తేన సమర్థేన చ దేహినామ్, యః పుణ్యభారముద్వోఢుమశక్తః పారలౌకికమ్. ౪౧. పండితోఽపి స మూర్ఖః స్యాచ్ఛక్తియుక్తోఽప్యశక్తికః, యః సౌరజ్ఞానమాహాత్మ్యముచ్చారయితుమక్షమః. ౪౨. తస్మాత్స పండితః శక్తః స తపస్వీ జితేంద్రియః, యః సౌరజ్ఞానసద్భావమాలోచయితుముద్యతః. ౪౩. యః ప్రదద్యాన్నృపః కృత్స్నాం క్ష్మాం ధనం కాంచనం తథా, సర్వమన్యాయతః పృచ్ఛేన్న తస్యోపదిశేద్గురుః. ౪౪. యః శృణోతి రవేర్ధర్మం న్యాయతః స చ వక్తి చ, తతో గచ్ఛతి సుస్థానం నరకం తద్విపర్యయే. ౪౫. దత్తగోదోహసంభూతః షడక్షరవిధానతః, రవిః సంపూజితః శీఘ్రం నరాణాం తుల్యతా భృశమ్. ౪౬. సురాసురైర్మథ్యమానాత్క్షీరోదాత్సాగరాత్పురా, పంచ గావః సముత్పన్నాః సర్వలోకస్య మాతరః. ౪౭. నందా సుభద్రా సురభీ సుమనా శోభనావతీ, గావః సూర్యసమా భాసా ఉత్పన్నాః కృతిమా

లోకోపకారముకొఱకును, దేవతర్పణంబులకొఱకును, భాస్కరాభిషేకముకొఱకును నన్నాశ్రయించియుండెను. పవిత్రములగు నాగోవుల షడంగములే షడ్రసము లనఁబడుచున్నవి. సర్వఖగంబులయందును నీయారంగములే స్థిరరూపంబులని తెలిసికొనవలయును. గోమయము, గోరోచనము, గోమూత్రము, క్షీరము, దధిఘృతమను నీయాఱంగంబులును పవిత్రంబులు, సర్వసిద్ధికరంబులు. సూర్యునకుఁ బ్రియంబగు మారేడువృక్షము గోమయమందుఁ బుట్టెను ఆవృక్షమునందు పద్మహస్తయగులక్ష్మి యుండుటచే శ్రీవృక్షమని చెప్పఁబడెను పంకజములు, కలువలు, పద్మములును గూడ గోమయమునుండియే పుట్టినవి. మంగళప్రదంబును, పవిత్రంబును, సర్వకామప్రదంబును నగుగోరోచనముగూడ దానిచే నుత్పన్నంబయ్యెను. గోమూత్రమువలన సుగంధయుక్తంబగు గుగ్గిలము బుట్టెను. సర్వదేవతలకును విశేషముగ భాస్కరునకును, జగమునకును ఆహారహేతు వేదియో యది క్షీరమునుండి పుట్టినదని యెఱుంగునది. దధినుండి సర్వమంగళద్రవ్యంబులు నర్థసిద్ధికొఱ కుత్పన్నంబులయ్యె. ఘృతమునుండి దేవతల కత్యంతప్రీతికరంబగు నమృత ముద్భవించెను. ఆకారణముచే ఘృతక్షీరదధులచే నెవ్వరైనను భాస్కరు నభిషేకించి యనంతరము వేడినీరు కషాయములు మొదలగువానిచే స్నానము చేయించి, తరువాతఁ జన్నీట జలకమార్చి గోరోచనమును బూయవల

---

గతాః. ౪౮. సర్వలోకోపకారార్థం దేవానాం తర్పణాయ చ, మామాశ్రిత్య స్థితా గావః స్నానార్థం భాస్కరస్య తు. ౪౯. తాసామంగాని పుణ్యాని షడ్రసాః ఖగసత్తమ, ఖగాదిషు చ సర్వేషు స్థిరాణీత్యుపధారయ. ౫౦.గోమయం రోచనం మూత్రం క్షీరం దధి ఘృతం గవామ్, షడంగాని పవిత్రాణి సర్వసిద్ధికరాణి చ. ౫౧. గోమయా దుత్థితః శ్రీమాన్బిల్వవృక్షోఽర్కవల్లభః, తత్రాస్తే పద్మహస్తా శ్రీర్వృక్షస్తేన చ సస్మృతః. ౫౨. పంకాన్యుత్పలపద్మాని పునర్జాతాని గోమయాత్, గోరోచనం చ మంగల్యం పవిత్రం సర్వకామదమ్. ౫౩. గోమూత్రాద్గుగ్గులుర్జాతః సుగంధిః ప్రియదర్శనః, ఆహారః సర్వదేవానాం భాస్కరస్య విశేషతః. ౫౪. యద్బీజం జగతః కించి త్తజ్జ్ఞేయం క్షీరసంభవమ్, దధ్నః సర్వాణి జాతాని మాంగల్యాన్యర్థసిద్ధయే. ౫౫. ఘృతాదమృతముత్పన్నమమరాణామతిప్రియమ్, తస్మాద్ఘృతేన పయసా దధ్నా యః స్నాపయేద్రవిమ్. ౫౬. తదంతే చోష్ణతోయేన కషాయైశ్చ నిరూపయేత్, స్నాప్య శీతాంబునా

యును తరువాత మారేడుపత్రి, నల్లకలువలు, పద్మములు మొదలగు వానిచేఁ బూజింపవలెను తరువాత వజ్రసహితంబగు గుగ్గిలధూపము నిచ్చి యర్ఘ్యము నియ్యవలయును. తరువాత పాయసము, దధ్యోదనము మొదలగు ననేకవిధంబులగు భక్ష్యములను నివేదించి ప్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి రక్షింపుమని వేఁడవలెను. ఈరీతిగ భాస్కరు నారాధించినమనుజుఁ డిహపరలోకంబులయందు సర్వకామములఁ బొందఁ గలఁడు. ఈషడంగవిధిచే దివాకరునిఁ బూజించినమనుజుఁ డిరువదియొక్క పురుషాంతరములతోఁ గూడ స్వర్గమునకుఁ బోయి వారల నచ్చట నుంచి తాను జ్యోతిషలోకంబున కేగును. భోజకులు సూర్యాంశజు లగుటచే దేవకార్యంబున నియుక్తులైనయెడల కర్తతోఁ గూడ భానుతేజంబును బొందుదురు. తరువాత తల్లోకంబునకుఁ బోయియుందురు. ఈభోజకుఁడు విపులంబులగు భోగంబుల నందనుభవించి మఱల భూమియం దవతరించి చక్రవర్తి యగును. ఎవ్వఁడు పత్రపుష్పఫలతోయములలో దేనిచేనైనను యథాశక్తిగ భాస్కరుని బూజించునో యాతఁడు సూర్యలోకమును బొందును. ఆదేవున కర్పించినపత్రపుష్పఫలాదులును గోవులును నిశ్శంకముగ నాదేవునిసన్నిధిఁ జేరఁగలవు. గోక్షీరమును సూర్యునకు నివేదింపక త్రాగినయెడల తప్పక నరకమును బొందును. సూర్య

---

పశ్చాద్భానుం రోచనయాలభేత్. ౫౭. పూజయేద్బిల్వపత్రైశ్చ పద్మైర్నీలోత్పలైస్తథా, అర్ఘ్యం దద్యాత్తతః పశ్చాత్సవజ్రం గుగ్గులం ఖగ. ౫౮. పాయసం దధిభక్తం చ వజ్రం చ మధునా సహ, నివేదయేచ్చ సద్భక్త్యా భక్ష్యాణి వివిధాని చ. ౫౯. కృత్వా ప్రదక్షిణం పశ్చాత్ప్రణిపత్య క్షమాపయేత్, అనేన విధినా భానుం షడంగేన దివస్పతిమ్. ౬౦. ఇహ లోకే పరే చైవ సర్వాన్కామానవాప్నుయాత్ ... గచ్ఛతి, షడంగవిధినా తం చాపూజ్యైవం సుమనా రవిమ్. ౬౧. స్వర్గం నయేత్సధీమాంస్తు కులానామేకవింశతిమ్, స్వర్గే స్థాప్య స్వయం గచ్ఛేజ్జ్యోతిషం నామ తత్పదమ్. ౬౨. అంశేన భోజకా వీర దేవకార్యే నియోజితాః, ప్రయాంతి స్వామినా సార్ధం శ్రీమద్భానుం పరం మహః. ౬౩. భుక్త్వా భోగాంస్తు విపులాన్భోజకో భోగసంమితః, కాలాత్పునరిహాయాతః పృథివ్యామేకరాడ్భవేత్. ౬౪. పుష్పం పత్రం ఫలం తోయం యద్గతం భాస్కరార్చనే, సౌరా గావశ్చ గచ్ఛంతి సూర్యలోకం న సంశయః. ౬౫. యః పిబేద్భోజనే క్షీరం దత్త్వా భానవే పయః, స గచ్ఛేన్నరకం ఘోరమపత్త్వం స్త్రపణం రవేః. ౬౬. ఏక

తృప్తిచేయకపోవుటయే దీనికి కారణము. సూర్యగోవులపాల నొక్క యొక పూట మాత్రమే తాననుభవింపవలెను. ప్రాతఃకాలపుపాలన్నియు సూర్యాభిషేకమునకే యొసంగవలెను. సూర్యునకు గోక్షీరముచే స్నానము చేయింపక నివేదింపక తాను ద్రాగినచో గోశరీరమున నెన్ని రోమము లుండునో యన్నివేలవత్సరంబులు నరకంబున నుండును. పూజితుఁ డగుసూర్యునిఁ జూచినను పూజించుచుండఁగఁ జూచినను విని నను సంతోషించువాఁడు యజ్ఞఫలమును బొందును. భాస్కరునిఁ బూజించుచుండఁగఁ జూచిన సర్వపాపవిముక్తుం డగును సంతోషముతో భానుని నమస్కరించి యాతనిలోకంబునఁ బ్రకాశించుచుండును. సూర్య పూజను విని యానందించువాఁడు నిఖిలయజ్ఞఫలమును బొందును. జప యజ్ఞమును సమాప్తియొనర్చినవారికి దానమొసంగినచో సూర్యప్రసా దమువలన నితరుల కిచ్చుదానమునకన్న వేయిరెట్లఫలము గల్గును. అది భూతసంప్లవమువఱకు ఫలమునిచ్చును. వాచకునకు శక్తికొలది దాన మిచ్చిన నది మహాప్రళయపర్యంతము దాతకు భోగముల నిచ్చును. జ్ఞానులకు దానమునం దల్పత్వమహత్వములు గల్గఁజాలవు. దేశకాలవిధి శ్రద్ధాయుక్తంబులైనయెడల నక్షయంబు లగుఫలంబులఁ బొందుదురు.

---

కాలం పిబేత్క్షీరం ధేనూనాం భాస్కరస్య తు, అనేన స్నాపయేద్దేవం క్షీరేణ ఖగసత్తమ. ౼౭. ప్రత్యూషే యద్భవేత్క్షీరం ధేనూనాం భాస్కరస్య తు, స్నాపయేత్తేన వై భానుం కృత్స్నేన గరుడాగ్రజ. ౼౮. యస్తు లోకో భవేత్సర్వం న దేవాయ నివేద యేత్, యావంతో రోమకూపాశ్చ గవాం దేహే ఖగాధిప, తావద్వర్ష సహస్రాణి నరకే పచ్యతే ఖగ. ౼౯. పూజితం పూజ్యమానం వా యః కశ్చిచ్ఛృణుయాద్రవిమ్, శ్రుత్వానుమోదతే యస్తు స యజ్ఞఫలమశ్నుతే. ౨౦. భాస్కరం పూజితం దృష్ట్వా సర్వపాపైః ప్రముచ్యతే, హర్షాత్ప్రణమ్య వై భానుం తస్య లోకే మహీయతే. ౨౧. పూజ్యమానం రవిం భక్త్యా యః పశ్యేన్మానవః ఖగ, సోఽపి యజ్ఞఫలం కృత్స్నం ప్రాప్నుయాన్నాత్ర సంశయః. ౨౨. శ్రుత్వానుమోదతే యస్తు పూజ్యమానం దివా కరమ్, తత్సర్వం ఫలమాప్నోతి ప్రసాదాద్భాస్కరస్య తు. ౨౩. ఏకజన్మానుగం దానం భక్త్యా యచ్చ నివేదితమ్, జపయజ్ఞాన్వియుక్తేభ్యః సహస్రభవికం స్మృతమ్, ఆభూత సంప్లవస్థాయి ప్రదానం జపజీవినామ్. ౨౪. అత్యల్పమపి యద్దత్తం వాచకాయ ఖగా ధిప, తన్మహాప్రలయం యావద్దాతుర్భోగాయ కల్పతే. ౨౫. న దానమల్పం బహుధా కించిదస్తి విజానతామ్, దేశకాలవిధిశ్రద్ధాపాత్రయుక్తం తదక్షయమ్. ౨౬. పాత్రే

సత్పాత్రయందు దేశకాలములయందు విధిశ్రద్ధలతో దాన మొసంగి నను హోమముఁజేసినను అనంతఫలము గల్గును. వైనతేయా! భక్తితో సత్పాత్రయందు తిలార్థము నిచ్చినను, అది సర్వకామప్రదంబగును. జ్ఞానోదకముచే స్నానము చేయఁబడినదియు శీలమనుభస్మచే తుడువఁబడి నదియు నగుపాత్రము సర్వపాత్రములకంటె నుత్తమమైనది. జపము, శాంతి, ఇంద్రియనిగ్రహము నివి పురుషులను సంసారమునుండి రక్షించును ఈమూఁడుగుణములు గలిగినపాత్ర గొప్పది యని చెప్పఁబడెను. శాస్త్రము జ్ఞానమనునావచేఁ గూడినయెడల దానిచేఁ బాపమను మహా సముద్రమును తరింపవచ్చును. అది లేకున్న ఱాయి ఱాతిని దాటింప నట్లగును. వైదికులయాతిథ్య మెట్టిఫలమునిచ్చు నాఫలము జపజీవుల కగును. ఎవ్వని గృహమున నొకజీవుఁడు సత్కృతుఁడై భుజించునో యాతనికులమును నరకార్ణవమునుండి తరింపఁజేయును. యజ్ఞ - అగ్నిహోత్ర-తీర్థంబులయం దేఫలములు చెప్పఁబడెనో యవియన్నియు జపముఁ జేయువారల కన్నదానముచేతనే గల్గును. ధ్యానరతుండును శాంత చిత్తుఁడు నగుభోజకున కొక్కమా రన్నమును బెట్టినచో సర్వపాప విముక్తు లగుదురు. శాంతియుక్తులను జపముచేయువారలను సూర్యార్పితమనస్కుఁడై యొక్కమారు భుజింపఁజేసిన సర్వకామములనుబొందును.

---

దేశే చ కాలే చ విధినా శ్రద్ధయా చ యత్, దత్తం హుతం కృతం చైవ తదనంత ఫలం భవేత్. ౭౭. తిలార్థమపి యద్వీర దీయతే శ్రద్ధయా ద్విజ, సత్పాత్రే విధివద్భక్త్యా తద్భవేత్సర్వకామికమ్. ౭౮. యత్స్నానం జ్ఞానసలిలైః శీలభస్మప్రమార్జితమ్, తత్పాత్రం సర్వపాత్రేభ్య ఉత్తమం పరికీర్తితమ్. ౭౯. జపో దమో యమః పుంసాం త్రాతా సంసారసాగరాత్, అజ్ఞానాం పాపనేత్రాణాం తత్పాత్రం పరమం స్మృతమ్. ౮౦. జ్ఞానప్లవేన చోపేతం శాస్త్రం పాపమహార్ణవాత్, అజ్ఞాన్సంతారయేన్నూనం కిం శిలా తారయేచ్ఛిలామ్. ౮౧. ద్విజానాం వేదవిదుషాం కటిసంభోగి యత్ఫలమ్, హంత కారప్రదానేన తత్ఫలం జపజీవినే. ౮౨. జీవో యస్యైత్య గృహే చ భుక్తే సత్కృతిసత్కృతః, కులముత్తారయేత్తస్య నరకార్ణవసంస్థితమ్. ౮౩. యజ్ఞాగ్నిహోమ తీర్థేషు యత్ఫలం పరికీర్తితమ్, జపినామన్నదానేన తత్సమగ్రం ఫలం లభేత్. ౮౪. భోజినే శాంతచిత్తాయ పరిధ్యానరతాయ చ, శ్రద్ధయాన్నం సకృద్దత్త్వా సర్వపాపైః ప్రముచ్యతే. ౮౫. జపకాంచాంతిసంయుక్తానాదిత్యార్పితచేతసః, భోజయిత్వా సకృద్భక్త్యా సర్వాన్కామానవాప్నుయాత్. ౮౬. ధ్యాయమానో రవేః సూక్తం భోజయే

సూర్యసూక్తమును బఠించుచు భుజింపఁజేసినయెడల నతిథి తినినయన్న మితఁడే తినినట్లగును. శ్రాద్ధంబునఁ బితృదేవతల నుద్దేశించి భోజకుల భుజింపఁజేసినచో సూర్యస్థానమును బొందును.

ఇది సప్తాశీత్యధికశతతమాధ్యాయము.

---

## అష్టాశీత్యధికశతతమాధ్యాయము.

సప్తాశ్వుం డిట్లనియె. సర్వపాకములను సూర్యునకు నివేదించి యగ్నియందు హోమముఁ జేయవలెను. అట్లుచేసి దిక్కులయందు బలిని వేయవలెను. సూర్యాగ్నిగురువిప్రులకు నెల్లప్పు డాయన్నమును ముందు పెట్టక తాను భుజించిన పాపమును బొందును. కృషిపాశుపాల్య వాణిజ్యములయందు క్రోధముచేతను, సత్యాక్షయాదులచేతను, పంచ సూనాదోషంబులచేతను పురుషులకు పాపము వృద్ధిఁబొందును కత్తి, రోలు, పొయ్యి, చీపురు, నీళ్లకుండ యీయైదును గృహస్థునకు సూనంబులు. వీనిచే స్వర్గమును బొందఁజాలఁడు. సూర్యాగ్నిగురుపూజలఁ జేసిన నీపాపము లంటనేరవు. ఇతరమహాపాతకంబులు గూడ నంటనేరవు. అందుచే సూర్యాగ్నిగురువులను పూజింపవలెను. సూర్యాగ్నిగురువుల

---

తృతతం చ యః, తతః సాక్షాదసేనైవ తద్భుక్తమశనం భవేత్. ౧౭. పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే భోజయేద్భోజకం నరః, సః స్థానం సమవాప్నోతి భానవీయమసంశయః.౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే ధేనుమాహాత్మ్యవర్ణనం నామ సప్తాశీత్యధికశతతమోఽధ్యాయః.

---

సప్తాశ్వ ఉవాచః—సూర్యాయ సర్వపాకాన్నం నివేద్యాగ్నౌ చ హోమయేత్, హుత్వాగ్నౌ ప్రక్షిపేద్వీర బలిం దిక్షు సమంతతః. ౧. సూర్యాగ్నిగురువిప్రాణాం సర్వపాకాన్నమన్వహమ్, యోఽనివేద్యాత్మనా భుంక్తే స భుంక్తే కిల్బిషం నరః. ౨. కృషిపాల్యే చ వాణిజ్యే క్రోధసత్యక్షయాదిభిః, పుంసాం పాపాని వర్ధంతే సూనాదోషైశ్చ పంచభిః. ౩. కండనీ పేషణీ చుల్లీ ఉదకుంభః ప్రమార్జనీ, పంచ సూనా గృహస్థస్య తేన స్వర్గం న గచ్ఛతి. ౪. సూర్యాగ్నిగురుపూజాభిః పాపైరేతైర్న లిప్యతే, . అన్యైశ్చ పాతకైర్ఘోరైస్తస్మాత్సంపూజయేత్సదా. ౫. సూర్యాగ్నిగురు

నైవేద్య మెంత ప్రమాణము గలయన్నిసంఖ్యతోఁ జేయునో దాత యన్నివేల సంవత్సరములు సూర్యపురంబున నుండును. ఘృతాపూపముల చేతను, సిక్తంబులచేతను నైవేద్యముఁజేసినఁ బదిరెట్లపుణ్యము గల్గును. ఉపదంశయుక్తముగాఁజేసిన నూరురెట్లఫలము గల్గును. షష్టికధాన్యము యొక్క యన్నమును నివేదించిన వేయిరెట్లఫలము గల్గును. సుగంధ శాలియగు నైవేద్యమునుజేసినఁ బదివేలరెట్లుఫలము గల్గును. భక్ష్యాన్న పానదానములు ఆయారీతుల నాయాఫలముల నిచ్చును. ఏది యెట్లుండి నను సూర్యాగ్నిగురుసాధులయం దెల్లప్పుడు నిచ్చుచుండవలెను. భక్ష్య మును నివేదించిన పూర్వోక్తంబగు నక్షయఫలమును బొందును. ఈ ప్రకారముగ నెవ్వఁడు దేవదేవుండగు దివాకరునియందు భక్తిఁజేయునో వాఁడు పితృదేవతలను సర్వపాపవిముక్తులఁ జేసి స్వర్గమునకుఁ దీసికొని పోవును. సూర్యుని దర్శించుటవలన గంగాస్నానపుణ్యమును బొందును. నమస్కరించినయెడల సమస్తనదులయందును స్నానముఁజేసినఫలమును బొందును. సూర్యుని శిరస్సుచే నమస్కరించి సర్వపాపములనుండి విముక్తుఁడగును సూర్యుఁడు పూజింపఁబడినయెడల బ్రహ్మవిష్ణుమహేశ్వ రులు పితృదేవతలు సమస్తదేవతలును ఒక్కమారుగ పూజింపఁబడినవా రగుదురు. ఆతనిపితరులు సంతోషించుదురు. ఎవ్వఁడు శ్రాద్ధంబున జప

---

నైవేద్యం యావత్స్యాదన్నసంఖ్యయా, తావద్వర్ష సహస్రాణి దాతా సూర్యపురే వసేత్. ౬. ఘృతపూపయుతైః సిక్తైః పుణ్యం దశగుణోత్తరమ్, అవదంశగుణైర్యుక్తం పుణ్యం శత గుణం ఖగ. ౭. షష్టికౌదననైవేద్యం సహస్రగుణితం ఫలమ్, సుగంధశాలి నైవేద్యం విజ్ఞేయమయుతోత్తరమ్. ౮. భక్ష్యాన్నపానదానాని తత్ఫలాని తథాతథా, యద్వా తద్వా సదా దేయం సూర్యాగ్నిగురుసాధుషు, భక్ష్యం నివేద్య పూర్వోక్తమక్షయం లభతే ఫలమ్. ౯. ఏవం యః కురుతే భక్తిం దేవదేవే దివాకరే, స పితౄన్ సర్వ పాపేభ్యః సముద్ధృత్య దివం నయేత్. ౧౦. గంగాస్నానమిదం పుణ్యం దర్శనా త్ప్రోక్తం యాదృవేః, సర్వతీర్థాభిషేకం చ ప్రణామాద్వింద తే ఖగ. ౧౧. ముచ్యతే సర్వపాపేభ్యః ప్రణమ్య శిరసా రవిమ్, శుశ్రూషేత చ సంధ్యాయాం సూర్యలోకే మహీయతే. ౧౨. యుగపత్పూజితాస్తేన బ్రహ్మవిష్ణుమహేశ్వరాః, పితరః సర్వదేవాశ్చ భవేయుః పూజితా రవౌ. ౧౩. తుష్యంతి పితరస్తస్య సుకృప్తే నైవ కర్షకాః, యః

ముచే జీవించెడిబ్రాహ్మణుని భుజింపఁజేయునో యాతఁడు తనకులంబునే నెవ్వరినైన నుద్ధరించును ఎవ్వఁడు సూర్యుని పూజించి జపజీవిని భుజింపఁ జేయునో యాతనిపితరులు తృప్తిఁజెందుదురు. పితామహులు గానముఁ జేయుదురు. ఎవ్వఁడు మాకులంబున వాచకుని భుజింపఁజేయునో యాతఁడు బుద్ధిమంతుఁడు పురాణవేత్తను వచ్చుచుండఁగఁ జూచి లేచి నిలచువాఁ డక్షయమగు స్వర్గమును బొందును. అట్టివాఁడు మావంశ మునఁ బుట్టుటచే నేమును ముక్తులమగుదుము. అని పితరులు తలంచు చుందురు. అట్టివానికి భోజనము పెట్టినచో మాకు స్వర్గము లభించెనని యోషధులు సంతసించును. లోకములయనుగ్రహముకొఱకు శ్రద్ధాపరీ క్షయం దాసక్తులై యతిథిరూపంబుగాఁ బితృదేవతలు సంచరించుచుందురు గాన నతిథి వచ్చుచుండఁగాఁ గృతాంజలివై యెదురేగవలయును. స్వాగ తముచేతను, ఆసనపాద్యంబులచేతను, స్నానాన్నశయనాదులచేతను తృప్తిపరుపవలయును. రూపవంతుఁడైనను, కురూపియైనను, మలినుఁ డైనను, మలినాంబరధారియైనను వేళయందువచ్చిన యతిథిని బుద్ధిమంతు లగువారు విచారింపఁగూడదు. భోజకులయందు సూర్యుఁడు సన్ని హితుఁడై యుండునుగాన నెవ్వరును భోజకులను ద్యజింపఁగూడదు. అట్లుచేసిన నధోముఖులు నూర్ధ్వపాదులై నరకజ్వాలలయందు పడుదురు. పురుగులచేఁ దినఁబడుచున్నముఖముగలవారై వహ్నిచేఁ దపింపఁబడుచు

---

శ్రాద్ధే భోజయేద్భక్త్యా బ్రాహ్మణం జపజీవినమ్. ౧౪. అపి నః స కులే కంచిదుద్ధరేత్కులం ఖగేశ్వర, యః సంపూజ్య రవిం శ్రాద్ధే భోజయేజ్జపజీవినమ్. ౧౫. తృప్యంతి పితరస్తస్య గాయంతి చ పితామహాః, అద్య నః స కులే ప్రాజ్ఞో వాచకం భోజయిష్యతి. ౧౬. పురాణవిదమాయాంతం దృష్ట్వైవ సహ సంస్థితాః, క్రీడంత్యోషధయః సర్వా యాస్యామః స్వర్గమక్షయమ్. ౧౭. అనుగ్రహాయ లోకానాం శ్రద్ధాయాశ్చ పరీక్షణే, చరంత్యతిథిరూపేణ పితరో దేవతాస్తథా. ౧౮. తస్మాదతిథిమాయాంతమగ్రే గచ్ఛే త్కృతాంజలిః, స్వాగతాసనపాద్యార్ఘ్యస్నానాన్నశయనాదిభిః. ౧౯. రూపాన్వితం విరూపం వా మలినం మలినాంబరమ్, వేలాయామతిథిం ప్రాప్తం పండితో న విచార యేత్. ౨౦. భోజకానాం శరీరేషు నిత్యం సన్నిహితో రవిః, యే భోజకాస్త్యజం త్యన్యే సర్వపాపేష్వవస్థితాః, అధోముఖోర్ధ్వపాదాస్తే పతంతి నరకాగ్నిషు. ౨౧.

ఆయుధపీడితులై పదునలుగురింద్రు లున్నంత కాలము బాధపడుచుందురు ఎవ్వరు విమూఢులై బ్రాహ్మణులయం దపవాదమును వినుచుందురో వారు నాయిచ్ఛచే విశేషముగ బాధల ననుభవించుచుందురు అందఱిలో జపముఁజేయువాఁడే సత్పాత్రుఁడు అందుచే నాతని సర్వప్రయత్నముల చేతను నిశ్చలమనస్కుఁడై పూజింపవలయును

ఇది అష్టాశీత్యధికశతతమాధ్యాయము

## ఏకోననవత్యధికశతతమాధ్యాయము

సప్తాశ్వతిలకుం డిట్లనియె కాల్చనికుండలో రసము నుంచిన నది యెట్లు దానితోఁ గూడ చెడిపోవునో యట్లే జపహీనుఁడగు బ్రాహ్మణున కిచ్చినదానము పాత్రముతోఁ గూడ నశించును చవిటినేలయందు మంచివిత్తనములను జల్లిన నెట్లు నిష్ఫలమగునో భస్మమునందు హోమమునుజేసిన హోత కేరీతిగ ఫలము గలుగదో యట్లే జపహీనుఁడగు బ్రాహ్మణునియందు దానము కూడ నిరర్థకమగును నపుంసకుఁడు స్త్రీల విషయమై యెట్లు ప్రయోజనహీనుఁడో యట్లే జపహీనుఁడగు బ్రాహ్మణుఁడు దానమువిషయమై వ్యర్థుఁడగును అట్టివానికి దానమిచ్చినచో

---

కృమిభిశ్ఛిన్నవదనా స్తప్యమానాశ్చ వహ్నినా, పీడ్యంతే చాయుధైర్ఘోరై ర్యావదింద్రాశ్చతుర్దశ ౨౨ యే చాపవాదం శృణ్వంతి విమూఢా బ్రాహ్మణేషు వై, తే విశేషేణ పచ్యంతే నరకేషు మదిచ్ఛయా. ౨౩ సర్వేషామేవ పాత్రాణాం సత్పాత్రం జాపకః పరః, తస్మాత్సర్వప్రయత్నేన పూజయేత్సుసమాహితః ౨౪

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు భోజకసత్కారవర్ణనం నామ అష్టాశీత్యధికశతతమోఽధ్యాయః

---

సప్తాశ్వతిలక ఉవాచ —ఆమపాత్రరసా యద్వన్నశ్యంతే నశ్యభాజనే, జపోపేక్షే తథా దానం సహ పాత్రేణ నశ్యతి, సద్బీజమూషరే యద్వత్సముప్తం నిష్ఫలం భవేత్. ౧ భస్మనీవ హుతం హవ్యం యథా హోతుశ్చ నిష్ఫలమ్, జపేన రహితే విప్రే తథా దానం నిరర్థకమ్ ౨ యథా షండోఽఫలః స్త్రీషు యథా గౌర్గవి ఛాఫలా, బ్రాహ్మణస్య తథా జన్మ జపహీనస్య నిష్ఫలమ్ ౩ లోహహోడుపేన ప్రతరన్ని

లోహమయమగు తెప్పచే నుదకమును దాటుచు దానితో మునిగిపోవు నట్లు దాతయు ప్రతిగ్రహీతయు నజ్ఞానమను గాఢాంధకారమునం బడుదురు. వైనతేయా! సర్వభూతంబులయందు దయగల్గి శ్రద్ధచే దేని నిత్తురో యదియే సర్వకామప్రదంబును నుత్తమంబు నగుదానము. దీనులకును, అంధులకును, నీచులకును, బాలురకును, వృద్ధులకును, అన్నాతురులకును దేని నిత్తురో దాని కనంతంబగుఫలము గల్గును. సత్పురుషులు స్వార్థము నుద్దేశించి దానమును గ్రహింపరు. దాతలయుపకారమునకై యే శ్రావణాదిమునులు గ్రహించిరట. యాచకుఁడు దాతయొక్కయుపకారముకొఱకే యిమ్మని చెప్పును. దాత ఊర్ధ్వలోకము నధిష్ఠించును. ప్రతిగృహీత యధోలోకమున నుండును గదా! యాజకులు యాచించుట హీనజనులకు బోధించుటగాని యాచించుట గాదు. పూర్వజన్మమున దానమును జేయకపోవుటయే మాయాచకత్వమునకు కారణమని చెప్పుదురు. యాచకుఁడు ప్రతిదినము వచ్చి యాచించుచున్నను పూజ్యుఁడే యగును. దాతను పీడించి యాచించినను, అది శిష్టాపూర్వకోపదేశ మనఁబడును. ఎవఁడు వచ్చినయతిథికి దానమివ్వక పాత్రాపాత్రవిచారమును చేయునో వాఁడు సర్వకర్మయుక్తుఁడగుటచేఁ బారమార్థికుఁడు గానేరఁడు యాచకులు లేనియెడల దానధర్మ మెట్లు

---

మజ్జత్యుదకే యథా, తథా దాతా గ్రహీతా చ పతత్యంధే తమస్యథ. ౮. కారుణ్యాత్సర్వభూతేషు శ్రద్ధయా యత్ప్రదీయతే, దానం తద్వై ఖగ జ్ఞేయం సార్వకామిక ముత్తమమ్. ౯. దీనాంధకృపణానాం చ బాలవృద్ధాతురేషు చ, యద్దీయతే ఖగశ్రేష్ఠ తస్యానంతఫలం భవేత్. ౬. న హి స్వార్థం సముద్దిశ్య ప్రతిగృహ్ణంతి సాధవః, దాతురేవోపకారాయ జగృహుః శ్రావణాదయః. ౭. దాతురేవోపకారాయ వదత్యర్థీ దదస్వమే, యస్మాద్దాతా ప్రయాత్యూర్ధ్వమధస్తిష్ఠేత్ప్రతిగ్రహీ. ౮. దేహీతి సువదన్నర్థీ ధనం బోధయతీవ సః, యన్మయా కృతమర్థిత్వం ప్రాగేవాదానఫలం హి తత్. ౯. బోధయంతి న యాచంతే దేహీతి కృపణా జనాః, అవస్థేయమదానస్య యద్యాచామో గృహేగృహే. ౧౦. ఆయాత్యర్థీ గృహం యస్తు కస్త్వం న ప్రతిపూజయేత్, కోయమర్థీ న పూజ్యః స్యాద్యాచమానో దినేదినే. ౧౧. యద్బలాదప్యనిచ్ఛంతం యోజయంతి నరాశ్రయాన్, అహన్యహని యాచంతే దాతుస్తే దర్శయంతి హి. ౧౨. ఏకస్తిష్ఠతి చాధస్తాదన్యశ్చోపరి తిష్ఠతి, దాతృయాచకయోర్భేదః కరాభ్యామేవ సూచితః. ౧౩.

గల్గును? యాచకులయందు ప్రియంబగు స్వాగతమిచ్చి దానము నియ్య వలెను, తరువాత ననుగమనము చేయవలెను. సాంసారిక బాధలను యాచకనివర్తనములో హేతువులనుగా దీసికొనఁగూడదు. తన గ్రాసములో సగమునైనను యాచకున కియ్యవలెను. ఆదరరహితదానము వ్యర్థము కాన ఫలమును గోరువాఁడు సత్కారపూర్వకముగా నియ్యవలెను. అసత్కారపూర్వకమగు దానము దాన మనంబడదు. క్రోధముతోఁ జేయఁబడు దాననియమయజ్ఞధ్యానహోమతపస్సులు నిష్ఫలంబులు. తత్ఫలమును క్రోధము హరించును. సత్కరించి యిచ్చుదాతయు సత్కారపూర్వకదానమును గ్రహించు ప్రతిగ్రహీతయు స్వర్గమును బొందుదురు. విపర్యయమైన నరకమును జెందుదురు. ఔదార్యము, స్వాగతము, మైత్రి, యనుకంప యితరపాత్రలకంటె తనపాత్రయందు విశిష్టత్వాభిమానము ఇవి దాత కుండవలసినగుణములు. వారాణాసి, కురుక్షేత్రము, ప్రయాగ, పుష్కరము, గంగాతటము, సముద్రము, నైమిశారణ్యము, మూలస్థానము, పండరీక్షేత్రము, మహాకాళక్షేత్రము, క్షీరికావాసము,

---

యః ప్రాప్తాయార్థినే దానం త్యక్త్వా పాత్రముదీక్షతే, సర్వకర్మసు యుక్తత్వాన్న దాతా పారమార్థికః. ౧౪. యద్యర్థినో నరా న స్యుర్దానధర్మః కథం భవేత్, తదర్థిషు భవేద్దానం స్వాగతం స్వాగతం ప్రియమ్. ౧౫. పాదోదకమనువ్రజ్యాత్స్వర్గసోపాన సప్తకమ్, చింతాచింతానురూపేణ కదా కస్య వినశ్యతి. ౧౬. గ్రాసాదర్ధమపి గ్రాసం యుక్తం దాతుం సదార్థినామ్, దానం ప్రియవినిర్ముక్తం నష్టమాహుర్మనీషిణః. ౧౭. తస్మాత్సత్కృత్య దాతవ్యమనంతఫలమిచ్ఛతా, ప్రేత్యాఖ్యానమపి శ్రేయః ప్రియానునయపేశలమ్. ౧౮. న తద్దానమసత్కారపారుష్యమలినీకృతమ్, వరం న దత్తమర్థిభ్యః సంక్రుద్ధేనాంతరాత్మనా. ౧౯. న తద్ధనం న చ ప్రీతిర్న ధర్మః ప్రియవర్జితః, దానప్రదాననియమయజ్ఞధ్యానం హుతం తపః, యత్నేనాపి కృతం సర్వం క్రోధోఽస్య నిష్ఫలం ఖగ. ౨౦. యః శ్రద్ధయార్చితం దద్యాత్ప్రతిగృహ్ణాతి చార్చితమ్, తావుభౌ గచ్ఛతః స్వర్గం నరకం తద్విపర్యయాత్. ౨౧. ఔదార్యం స్వాగతం మైత్రీ హ్యనుకంపా చ మత్సరః, పంచభిస్తు గుణై దానం దాతుర్దానే మహాఫలమ్. ౨౨. వారాణసీ కురుక్షేత్రం ప్రయాగం పుష్కరాణి చ, గంగాతటం సముద్రశ్చ నైమిషారణ్యమేవ. చ. ౨౩. మూలస్థానం మహాపుణ్యం పుండీరస్వామికం తథా; కాలప్రియం ఖగశ్రేష్ఠ క్షీరికావాస ఏవ చ. ౨౪. ఇత్యేతే కీర్తితా దేశాః సురసిద్ధనిషేవితాః, సర్వే సూర్యా

సూర్యాశ్రమములు, మహానదులు, మహాపర్వతములు, ఇతరపవిత్రదేశములు వీటియందు చేయఁబడుదానములు, సూర్యచంద్రగ్రహణములు, ఉత్తరాయణము, విషువత్కాలము, వ్యతీపాతము, షడశీతిపుణ్యకాలము, సంక్రమణము ఇవి దానకాలములు ఈకాలములయందుఁ జేయఁబడిన దానములును పాత్రప్రభావముచే ననంతఫలమును గలుగఁజేయును అది భోజకునకే యొసంగఁబడినచో మఱియు ఫలము గల్గును భక్తిభావము, ఉత్కృష్టంబగుప్రీతి, ధర్మము, ధర్మతత్పరత్వము, ప్రతిపత్తి యను నీవైదును శ్రద్ధాపంచక మనఁబడును శ్రద్ధతో సత్పాత్రయందు విధిపూర్వముగ నొసంగినదాన ముత్తమంబగును కాన దానమునకు నక్షయంబగుఫలము నపేక్షించువాఁడు శ్రద్ధావంతుఁడై చేయవలయును శ్రద్ధతో సత్పాత్రయం దేదానము విధ్యుక్తంబుగ నొసంగఁబడునో యది యనంతఫలప్రదంబగునని యెఱుంగునది ఎవ్వఁడు గుణాన్వితులగు ఆర్తులకును, దీనులకును, స్వల్పమైనను దాన మొసంగునో యాతఁడు సర్వకామంబులను ఉత్తమలోకంబులను బొందును కాన శ్రద్ధాయుక్తముగఁ జేసినదానమే దానమని పెద్దలు చెప్పుదురు శ్రద్ధయే గొప్పదగు తపము యజ్ఞము, ఉపవాసము అనియుఁ గూడఁ జెప్పుదురు అహింస, క్షమ, సత్యము, లజ్జ, శ్రద్ధ, యింద్రియనిగ్రహము, దానము, యాగము,

---

శ్రమాః పుణ్యాః సర్వా నద్యః సపర్వతాః, గోసిద్ధమునివాసాశ్చ దేశాః పుణ్యాః ప్రకీర్తితాః ౨౫ సూర్యాయతనసంస్థానాం యద్యదల్పం తు దీయతే, తదనంతపలం జ్ఞేయం వచః క్షేత్రానుభావతః ౨౬ గ్రహణం చంద్రసూర్యాభ్యాముత్తరాయణముత్తమమ్, విషువం సవ్యతీపాతం షడశీతిముఖం తథా ౨౭ దినచ్ఛిద్రాణి సంక్రాంతిః పుణ్యం విషుపదం ఖగ, ఇతి కాలః సమాఖ్యాతః పుంసాం ౨౮ భక్తిభావః పరా ప్రీతిర్ధర్మో ధర్మైకభావనః, ప్రతిపత్తిరితి జ్ఞేయం శ్రద్ధాపర్యాయపంచకమ్ ౨౯ శ్రద్ధయా విధివత్పాత్రే ప్రతిపాదితముత్తమమ్, తస్మాచ్ఛ్రద్ధాం సమాస్థాయ దేయమక్షయమిచ్ఛతా ౩౦ యద్దానం శ్రద్ధయా పాత్రే విధివత్ప్రతిపాదితమ్, తదనంతఫలం జ్ఞేయమపి వా భారమాత్రకమ్. ౩౧. ఆర్తేషు దీనేషు గుణాన్వితేషు యః శ్రద్ధయా స్వల్పమపి ప్రదద్యాత్, స సర్వకామాన్సముపైతి లోకాంచ్ఛ్రద్ధైవ దానం ప్రవదంతి తజ్జ్ఞాః ౩౨ శ్రద్ధా దానం పరం జ్ఞేయం శ్రద్ధా ఏవ తపః పరమ్, శ్రద్ధాం యజ్ఞముశంతీహ శ్రద్ధా పరముపోషితమ్ ౩౩ అథాహింసా క్షమా సత్యం హ్రీః శ్రద్ధేంద్రియ

తపస్సు, ధ్యానము నీపదియును ధర్మసాధనములు. ఈసూర్యధర్మముల నన్నిటినిగాని లేక కొన్నింటినిఁగాని అనుష్ఠించినవారల కందఱకు నొక్కటియే గతియని చెప్పఁబడియెను. నాలోకమును గోరువారు మహాపుణ్యమును జేయవలయును. ఎవ్వఁడు పరస్త్రీలయందును పరద్రవ్యముల యందును అపేక్షారూపంబగు సంకల్పంబును బొందునో, యెవ్వఁడు గురువు ఆర్తుఁడైనను, అశక్తుఁడైనను, దేశాంతరగతుఁడైనను, శత్రుపరాభూతుఁడైన నూరకుండునో, యెవ్వఁడు గురుభార్యా గురుపుత్రులయందవమానమును జేయునో వీరందఱును మహాపాతకులని చెప్పఁబడుదురు. వారిచేఁ జేయఁబడునివియే మహాపాతకములని చెప్పఁబడును. బ్రహ్మహంత, సురాపాయి, చోరుఁడు, గురుతల్పగుఁడు యీనలుగురును వీరి సహవాసము జేయువారును పంచమహాపాతకులని చెప్పఁబడుదురు. క్రోధమువలనఁగాని, ద్వేషమువలనఁగాని, భయమునఁగాని, లోభమునఁగాని బ్రాహ్మణునకు ప్రాణాంతకమైనవాక్యమును బల్కిన యాతఁడు బ్రహ్మహంతయని చెప్పఁబడును. బీదవాఁడగు యాచకబ్రాహ్మణునిఁ బిలచి లేదనియన్న యెడల యాతఁడు చండాలుఁడని పిలువఁబడును. దేవబ్రాహ్మణులకు మున్నొసంగినభూమిని హరించినను కాలక్రమమున నశింపఁజేసి

---

సంయమః, దానమిష్టం తపో ధ్యానం దశకం ధర్మసాధనమ్. ३४. హంత వ్యస్తైః సమస్తైర్వా సూర్యధర్మైరనుష్ఠితైః, సూర్యాకసాం చ సంప్రాప్తేర్గతిరేకా ప్రకీర్తితా. ३५. యథా భూః సర్వభూతానాం శాంతేరతిశయః స్మృతః, కుర్యాత్పుణ్యం మహత్తస్మాన్మమ లోకేప్సయా సుధీః. ३६. పరస్త్రీద్రవ్యసంకల్పం యః సాపేక్షం కరోతి చ, గురుమార్తమశక్తం వా విదేశే ప్రస్థితం తథా, అరిభిః పరిభూతం చ సంత్యజేచ్చైవ పాపకృత్. ३७. తద్భార్యామిత్రపుత్రేషు యశ్చావజ్ఞాం కరోతి చ, ఇత్యేతత్పాతకం జ్ఞేయం గురునిందాసమం భవేత్. ३८. బ్రహ్మఘ్నశ్చ సురాపశ్చ స్తేయీ చ గురుతల్పగః, మహాపాతకినస్త్వేతే తత్సంయోగీ చ పంచమః. ३९. క్రోధాద్ద్వేషాద్భయాల్లోభాద్బ్రాహ్మణస్య వదేత యః, ప్రాణాంతికం మహాదోషం బ్రహ్మహా స ఉదాహృతః. ४०. బ్రాహ్మణం చ సమాహూయ యాచమానమకించనమ్, యస్నాస్తీతి చ యో బ్రూయాత్స చాండాల ఉదాహృతః. ४१. దేవద్విజగవాం భూమిం పూర్వదత్తాం హరేత యః, ప్రనష్టామపి కాలే తు తమాహుర్బ్రహ్మఘాతకమ్. ४२. అధీత్య యో రవే

నను వాఁడు బ్రహ్మఘాతకుఁ డందురు. సూర్యజ్ఞానముం జవివి మంద బుద్ధియై పరిత్యజించినచో సురాపానమును జేసినపాపమును బొందును. పంచయజ్ఞపరిత్యాగము, అగ్నిహోత్రపరిత్యాగము, మాతృపితృపరిత్యాగము, కూటసాక్ష్యము, మిత్రద్రోహము, అభక్ష్యభక్షణము, సూర్యభక్తాప్రియము, నిరపరాధజీవహింసయును జేయువారలకు దేవపురంబున సర్వాధిపత్యము లభింపదు ఈతని లోకాధిపత్యమును మాత్రము నొసంగును. కొందఱు జనులు జ్ఞానయోగముచే నీలోకంబుననే ముక్తులగుదురు. మఱికొందరు భోగతత్పరులై సంసారమున భ్రమించుచుందురు. మోక్షము నభిలషించువాఁడు భోగాసక్తిని విడచి విరాగియై శాంతచిత్తుఁడైనచో సౌరలోకమును బొందును ఆతనియం దనాసక్తహృదయులై జపించినచో వారలకును స్వానుభావమునకు తగినట్లు ఫలము గలుగును. ఉచ్ఛిష్టదేహులై ఒక్కపర్యాయమైనను భాను నారాధింపనివారికి పిశాచలోకంబున భోగంబులఁ గల్పించును. క్రూరులును, క్రుద్ధలోచనులును నైయెవ్వరు భానుని రెండుమాఱులు జపింతురో వారలకు రక్షోలోకంబున మహాభాగ్యంబుల నిచ్చును మద్యమాంసరతులగు మనుష్యులు మూఁడుమారు లర్చించిన వారలకు ఋషిలోకంబున దివ్యభోగంబుల నిచ్చును. మూఁడునాల్గుపర్యాయములుసూర్యునియెదుట నృత్యగీతంబులఁజేయించిన

---

జ్ఞానం పతిత్యజతి మందధీః, సురాపేన సమం జ్ఞేయం తస్య పాపం చ సువ్రత. ౪౩. అగ్నిహోత్రపరిత్యాగః పంచయజ్ఞియకర్మణామ్, మాతాపితృపరిత్యాగః కూటసాక్ష్యం సుహృద్వధః. ౪౪. అప్రియం సూర్యభక్తానామభక్ష్యస్య చ భక్షణమ్, ఏవం నిరపరాధానాం ప్రాణినాం చ ప్రమారణమ్. ౪౫. సర్వాధిపత్యమే తేషాం నాస్తి దేవపురోత్తమే, ఆత్మలోకాధిపత్యం తు యచ్ఛేత్సర్వజగత్పతిః. ౪౬. కేచిదత్రైవ ముచ్యంతే జ్ఞానయోగపరా నరాః, ఆవర్తంతే పునశ్చాన్యే సంసారే భోగతత్పరాః. ౪౭. తస్మాద్వై మోక్షమన్విచ్ఛన్భోగాసక్తిం వివర్జయేత్, విరక్తః శాంతచిత్తాత్మా సౌరలోకమవాప్నుయాత్. ౪౮. యచ్చాప్యసక్తహృదయా జపంతీమం ప్రసంగతః, తేషామపి వదత్యేకః స్వానుభావానురూపతః. ౪౯. తన్నార్చయంతి యే భానుం సకృదుచ్ఛిష్టదేహినః, తేషాం పిశాచలోకే తు భోగాన్భానుః ప్రయచ్ఛతి. ౫౦. ద్విర్జపంతి చ యే భానుం క్రూరాః సంక్రుద్ధలోచనాః, రక్షోలోకే రవిస్తేషాం మహాభాగ్యం ప్రయచ్ఛతి ౫౧. త్రిరర్చయంతి యే భానుం మద్యమాంసరతా నరాః, ఋషిలోకే రవిస్తేషాం భోగాన్ దివ్యాన్ప్రయచ్ఛతి. ౫౨. యే నృత్యగీతం కుర్వంతి త్రిశ్చతుర్థా యదృచ్ఛయా, సూర్య

గంధర్వభవనంబున కేగుదురు ఖ్యాతి నపేక్షించి గోపతిని పూజించినవార
లకు స్వర్గలోకంబున సర్వకామంబుల నొసంగును కామాసక్తచిత్తుఁడై
యారుపర్యాయములు భానుని పూజించినవానికి భానుఁడు ప్రాజాపత్య
లోకంబున సర్వభోగంబుల నిచ్చును వైనతేయా! తొమ్మిదిపర్యాయములు
చిత్రభాను నారాధించిన విష్ణుసాలోక్యమును బొంది విష్ణువుతోఁ గూడ
సంతోషించుచుండును బ్రాహ్మణులను పూజించువా రింతకంటె సర్వోత్త
మంబును భూతంబులలో మనోహరంబును, అప్రమేయములగు గుణ
ములచేతను, సర్వకామాతీతంబులగు విమానములచేతను, అగణ్యములగు
వస్తుజాలములచేతను, వ్యాప్తంబును, సువర్ణమయంబులును, రక్తచిత్రం
బులును నగునానాగృహంబులచే నాకీర్ణంబును, సూర్యకోటిసమప్రభంబు
నగు నాస్థానంబును బొందుదురు వైనతేయా! యాస్థానంబుననే నివసించి
విహరించుచుందురు జ్యోతిర్లోక మింతకంటె శ్రేష్ఠతమస్థానమని చెప్పఁ
బడుచున్నది అదియే సౌరలోకము ఈరీతిగ నీచకర్ముఁడైనను సూర్యాను
భావయుక్తుఁడై నన్ను శ్రద్ధతో భావన జేసినయెడల శ్రద్ధానురూపంబగు
నాస్థానంబును బొందును

ఇది ఏకోననవత్యధికశతతమాధ్యాయము

---

స్వర్గే తు తే యాంతి గందర్వభవనం ఖగ ౫౩ లోకాః ఖ్యాతిం సముద్దిశ్య పూజ
యంతి చ గోపతిమ్, తేషాం శక్రాలయే భానుః కామాన్త్సర్వాన్ప్రయచ్ఛతి ౫౪
కామాసక్తేన చిత్తేన యః షడర్చయతే రవిమ్, ప్రాజాపత్యే రవిస్తస్య లోకే భోగా
న్ప్రయచ్ఛతి ౫౫ నవకృత్వోఽర్చయేద్యస్తు చిత్రభానుం ఖగాధిప, స యాతి విష్ణు
సాలోక్యం విష్ణునా సహ మోదతే ౫౬ తస్మాదపి పరం స్థానం యద్భూతానాం మనో
హరమ్, అప్రమేయగుణైర్దివ్యైర్విమానైః సార్వకామికైః ౫౭ అసంఖ్యైర్వస్తుభి
ర్వ్యాప్తం హైరికై రక్తచిత్రకైః, నానాగృహసమాకీర్ణైః సూర్యకోటిసమప్రభమ్ ౫౮
తత్స్థానం తే ప్రగచ్ఛంతి అర్చయంతి చ యే ద్విజాన్, తత్ర లోకే ఖగశ్రేష్ఠ వసంతి
విహరంతి చ, తస్మాదపి పరం స్థానం జ్యోతిష్కం సౌరముచ్యతే ౫౯ ఏవం సూర్యాను
భావేన నికృష్టేనాపి కర్మణా, నరైః స్థానాన్యవాప్యంతే శ్రద్ధాభావానురూపతః ౬౦

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సప్తాశ్వానూరుసంవాదో నామ
ఏకోననవత్యధికశతతమోఽధ్యాయః

## నవత్యధికశతతమాధ్యాయము.

సప్తాశ్వతిలకుం డిట్లనియె. తారారూపంబులగు విమానకోటులు నమస్కారమును జేయునాతనికే ఫలము గలుగును. ఈవిధముగ సౌర ధర్మాచరణులకు గతులను జెప్పియుంటిని కనుక సుఖమునుగోరు సూర్య భక్తుఁ డెల్లపుడును ధర్మము నాచరింపవలయును. ఇప్పుడు నరకహేతువు లగు స్థూలపాపసముదాయము లెన్నిగలవో వాట్లనుద్దేశించి సంక్షేప ముగాఁ జెప్పెద నాకర్ణింపుము. గోసంచారప్రదేశమునందును అరణ్య పట్టణగ్రామములయందు నగ్ని నుంచుట సురాపానముతో సమానమైనది అరణ్యమున సర్వమును హరించుట, మానవులను, స్త్రీలను, గుఱ్ఱము, నేనుఁగును హరించుట, గోవును, భూమి, నోషధులను హరించుట, చందనము, అగరు, కస్తూరి, కర్పూరము, నారవస్త్రములను, దాచుట కిచ్చిన వస్తువును హరించుటయు స్వర్ణస్తేయమున కెనయైనవి. వివాహ యోగ్యలగుకన్యల నెత్తుకొనిపోవుట యసంగతము. పుత్త్రునిభార్య, మిత్త్రునిభార్య, సోదరి, పుత్త్రిక, శూద్రస్త్రీ, సవర్ణస్త్రీ వీర్లతో సంగమించిన వాఁడు గురుతల్పగునితో సమానుఁడగును. వైనతేయా! మహాపాతక తుల్యములని చెప్పిన ఈపాపములన్నియుఁ బాతకములని వ్యవహరింపఁ బడును. వాటినిఁ జెప్పితిని ఉపపాతకములఁ జెప్పెద నాకర్ణింపుము.

---

సప్తాశ్వతిలక ఉవాచ:—తారారూపవిమానానామిమాః సంతి చ కోటయః, యః కుర్యాత్తు నమస్కారం తస్యైవ చ ఫలం భవేత్. ౧. ఇత్యేతా గతయః ప్రోక్తా మహాత్యః సౌరధర్మిణామ్, తస్మాత్సౌరః సదా ధర్మః కర్తవ్యః సుఖమిచ్ఛతా. ౨. ఇదానీం పాపనిచయాః స్థూలా నరకహేతవః, తే.సమాసేన కథ్యంతే మనోవాక్కాయసాధనైః. ౩. గవాం మార్గే వనే చాగ్నేః పురే గ్రామే సమర్పణమ్, ఇత్యేతానీహ పాపాని సురాపానసమాని చ. ౪. వనే సర్వస్య హరణం నరస్త్రీగజవాజినామ్, గోభూసమీప జాతానామోషధీనాం చ ఖేచర. ౫. చందనాగురుకర్పూరకస్తూరీపట్టవాససామ్, హస్త న్యాసాపహరణం రుక్మస్తేయసమం స్మృతమ్. ౬. కన్యానాం వరయోగ్యానామాకర్షణ మసంగతః, పుత్రమిత్రకలత్రేషు గమనం భగినీషు చ. ౭. కుమారీసాహసం ఘోరమంత్యజ స్త్రీనిషేవణమ్, సవర్ణాయాశ్చ గమనం గురుతల్పసమం స్మృతమ్. ౮. మహాపాతక తుల్యాని పాపాన్యుక్తాని యాని తు, తాని పాతకసంజ్ఞాని బ్రూమహే చోపపాతకమ్.

బ్రాహ్మణునకు ధనము నిచ్చెదనని ప్రతిజ్ఞఁజేసి, యివ్వనివాఁడును, యోగ్యురాలగుభార్యను త్యజించినవాఁడును, సాధువులను బంధువులను తపస్వులను త్యజించినవాఁడును, గోభూమి సువర్ణములను వస్త్రముల నప హరించినవాఁడును, ఈశ్వరధ్యానము చేయువారలను పీడించువాఁడును, ఆశ్రమస్థుల పీడించువాఁడును, కూపధాన్య పశుస్తేయములఁ జేసిన వాఁడును, యజ్ఞముఁజేయఁగూడనివానిచేఁ జేయించువాఁడును, యజ్ఞ ఆరామతటాకములను భార్యను విక్రయించినవాఁడును, సంతానమును విక్రయించినవాఁడును, పాపకర్మచే స్త్రీధనమును బలాత్కారముగ హరించినవాఁడును, స్త్రీలను రక్షింపనివాఁడును, మద్యము ద్రావినస్త్రీ ననుభవించువాఁడును, ఋషులకు దానము నియ్యనివాఁడును, ధాన్య వ్యాపారము వడ్డీవ్యాపారములఁ జేయువాఁడును, దేవాగ్నిసాధువులను సాధ్వులను నిందించువాఁడును, గోబ్రాహ్మణుల నిందించువాఁడును, ఎదుటగాని చాటునఁగాని రాజులను నిందించువాఁడును, నశించిన పితృ దేవతలు గలవాఁడును, స్వకర్మలను త్యజించినవాఁడును, దుస్స్వభావము గలవాఁడును, నాస్తికుఁడు, పాపుఁడు, సదసచ్ఛాస్త్రవాదులు నీరీతిగనే కామముచే విజాతియోనియందును, పశుయోనియందును, రజస్వలా యోనియందును, మనుష్యసంభోగానర్హమగు యోనియందును,

---

౯. ద్విజాయార్థం పరిశ్రుత్య న ప్రయచ్ఛతి యో ద్విజ, సద్భార్యాణాం చ సంత్యాగః సాధుబంధుతపస్వినామ్. ౧౦. గోభూహిరణ్యవస్త్రాణామపహారః ప్రయత్నతః, ఈశ్వ రార్పితబుద్ధీనాం పీడనం సమహాత్కృతమ్. ౧౧. యః పీడామాశ్రమస్థాన ఆచరేదల్పికా మపి, తద్భృత్యపరిభూతస్య పశుధాన్యధనస్య చ. ౧౨. కూపధాన్యపశుస్తేయమయా జ్యానాం చ యాజనమ్, యజ్ఞారామతడాగానాం దారాపత్యస్య విక్రయః. ౧౩. తీర్థ యాత్రోపవాసానాం వ్రతే చ జపకర్మణి, స్త్రీధనాన్యుపకర్షంతి యే జనాః పాప కర్మణా. ౧౪. అరక్షణం చ నారీణాం మద్యపస్త్రీనిషేవణమ్, ఋషీణామప్రదానం చ ధాన్యవృద్ధ్యుపసేవనమ్. ౧౫. దేవాగ్నిసాధుసాధ్వీనాం నిందా గోబ్రాహ్మణస్య చ, ప్రత్యక్షం వా పరోక్షం వా రాజమాండలికానపి. ౧౬. ఉత్పన్నపితృదేవాశ్చ స్వకర్మ త్యాగినశ్చ యే, దుఃశీలా నాస్తికాః పాపాః సదసచ్ఛాస్త్రవాదినః. ౧౭. ఏవం కామే ప్రవృత్తే తు వియోనౌ పశుయోనిషు, రజస్వలాస్వయోనౌ తు మైథునం యః సమాచ

మైథునముఁజేయువాఁడును, స్త్రీపుత్రమిత్రసంప్రీతికొఱకు కారామమును ఛేదించువాఁడును, జనుల కప్రియమును బల్కువాఁడును, జనాభిప్రాయమును భేదించువాఁడును, ప్రాకారంబులను తటాకంబులను భేదించువాఁడును, ఏకపంక్తియందు పంక్తిభేదముఁజేయువాఁడును వీరం దఱియందుఁ నీయీపాపము లుండుటచే నుపపాతకులని చెప్పఁబడుదురు

ఇది నవత్యధికశతతమాధ్యాయము

---

## ఏకనవత్యధికశతతమాధ్యాయము

సప్తాశ్వతిలకుం డిట్లనియె గోబ్రాహ్మణసస్యంబులను హరించువారును, సాధుతపస్వులను దూషించువారును, నరకగాము లగుదురు తన్ను నిందింపనివారలను నిందించినచో శ్రమచే తప్పుఁడగును పరదారలయం దాసక్తహృదయులును, కన్యలఁజెఱచువారును, గోష్ఠాగ్నిజలంబులయందును రమ్యంబగు ప్రదేశమునందును తరుచ్ఛాయలయందును పర్వతములయందును దేవాలయమునందును ఉద్యానవనమునందు మూత్రపురీషంబుల విడచువారును, మద్యపానాసక్తులు, గీతవాద్యాసక్తులు, క్రోధమదావిష్టులు, రంధ్రాన్వేషణతత్పరులు, పాషండమతాను

---

రేత్ ౧౮ స్త్రీపుత్రమిత్రసంప్రీతేరారామోచ్ఛేదకాశ్చ యే, జనస్యాప్రియవక్తారో జనాభిప్రాయభేదినః ౧౯ భేత్తా తడాగవప్రాణాం సంక్రమాణాం రసస్య చ, ఏకపంక్తిస్థితానాం చ పంక్తిభేదం కరోతి యః ౨౦ ఇత్యేతైస్తు నరాః పాపైరుపపాతకినః స్మృతాః ౨౧

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యానూరుసంవాదే
నవత్యధికశతతమోఽధ్యాయః

---

సప్తాశ్వతిలక ఉవాచ —యే గోబ్రాహ్మణసస్యానాం సాధూనాం తు తపస్వినామ్, దూషకాశ్చైవ వర్తంతే నరా నరకగామినః ౧ పరిశ్రమేణ తప్యంతే యేఽపరే తస్య సూచకాః, పరదారరతానాం చ కన్యాయా దూషకాశ్చ యే ౨ గోష్ఠాగ్నిజలరమ్యాసు తరుచ్ఛాయానగేషు చ, త్యజంతి యే పురీషాణి ఆరామాయతనేషు చ 3. మద్యపానరతా నిత్యం గీతవాద్యరతా నరాః, కామక్రోధమదావిష్టా రంధ్రాన్వేషణ

[redacted] వ్యర్థప్రలాపులు, మార్గోపరోధకులు, పరులహద్దు నాక్రమించువారును, కూటశాసనములను కూటకర్మలను జేయువారును, ధనుస్సును శస్త్రంబులను జేయువాఁడు, విక్రయించువాఁడును, భృత్యులయందు దయలేనివారును, పశువులను బీడించువారును, అబద్ధములనాడువారును, విని సహించువాఁడును, స్వామిద్రోహగురుద్రోహమిత్రద్రోహములఁ జేసినవారును, మాయావులును చంచలచిత్తులును శఠులును దారపుత్త్రమిత్త్రులను అతిథులను విడచినవారును, ఆకలిగొన్నవారిని విడచి తాము మాత్రము పక్వమైనభక్ష్యముల భుజించినవారును, బ్రాహ్మణుల కన్నమును బెట్టనివారును, నియమమును గ్రహించి యింద్రియనిగ్రహము చేయలేక నియమమును విడచినవారును, సన్న్యాసమును స్వీకరించి విడచినవారును, రహస్యభేదకులును, గోవులను కొట్టినవారును, భయపెట్టినవారును, దుర్బలుని పోషింపనివారును, నశించినవారి నన్వేషింపనివారును, మోయలేనిబరువును మోయించువారును, వృషభంబులకు వృషణంబులఁ దీయువారును, వంధ్యయగునావుచే భారమును మోయించువారును, దరిద్రుని వికలాంగుని హీనాంగుని బాలవృద్ధులను దయఁజూడనివారును వీరందఱు పాపిష్ఠులగు నరాధములని చెప్పఁబడుదురు

---

ఠత్పరాః ౪ పాఖండమతసంయుక్తా వృథా సంలాపకౌతుకాః, యే మార్గానుపరుంధంతి పరసీమాం హరంతి చ ౫ కూటశాసనకర్తారః కూటకర్మకృతో నరాః, ధనుషః శిల్పిశస్త్రాణాం యః కర్తా యశ్చ విక్రయీ ౬ నిర్దయోఽతీవ భృత్యేషు పశూనాం దమకశ్చ యః, మిథ్యా ప్రవదతో వాచమాకర్ణయతి యః శనైః, స్వామిమిత్రగురుద్రోహీ మాయావీ చపలః శఠః ౭ యే భార్యాపుత్రమిత్రాణి బాలవృద్ధకృశాతురాన్, భృత్యానతిథిబంధూంశ్చ త్యజంతి చ బుభుక్షితాన్ ౮ యః స్వయం పక్వమశ్నాతి విప్రాయాన్నం న యచ్ఛతి, వృథా పాకః స విజ్ఞేయో బ్రహ్మవాదిషు గర్హితః ౯ నియమం స్వయమాదాయ యే త్యజంత్యజితేంద్రియాః, ప్రవ్రజ్యావసితా యే చ రహస్యానాం తు భేదకాః ౧౦ యే తాడయంతి గాం మూఢా స్త్రాసయంతి ముహుర్ముహుః, దుర్బలం న చ పుష్ణంతి ప్రనష్టాన్నాన్వీషంతి చ ౧౧ పీడయంత్యలభారేణ అక్షయం వాహయంతి చ, వృషాణాం వృషణాన్యే పాపిష్ఠా గాలయంతి హి, వాహయంతి చ గాం వంధ్యాం తే పాపిష్ఠా నరాధమాః ౧౨ అనర్థవికలం హీనం బాలవృద్ధకృశానుగమ్, నానుకంపంతి యే మూఢాస్తే యాంతి నరకం నరాః ౧౩ అజావికా మాహిషికాః

వీరందఱును నరకమున కేగుదురు శిల్పులు, కారులు, వేశ్యలు, క్షేమ కారులు వీరందఱును జ్యోతిర్జ్ఞాతులై నరకమున కేగుదురు. తైలంబులను, అనుపానంబులను, మధుమాంసంబులను, మద్యంబులను, సారాయిని, బెల్లము, చెఱకులు, పాలు, పెరుఁగు, కూరలు, దుంపలు, ఫలములు, గడ్డి, కట్టెలు, పుష్పములు, విత్తనములు, ఓషధులు, పాదుకలు, గొడుగు, బండి, ఆసనము, శయ్య, మృత్-తామ్ర-సీస-త్రపు-కాంస్య మయంబులుగాని వృక్షోద్భవంబులుగాని గృహోపకరణంబులను, ఉన్ని, దూది, పట్టు, నార మొదలగు స్థూలసూక్ష్మవస్తువుల నపహరించినవారు, నిటువంటియితరద్రవ్యంబులను హరించినవారును నరకమును బొందఁగలరు పరోక్షమందు ఆవగింజయంతప్రమాణము గలవస్తువును హరించినను నరకమును బొందుననుట నిస్సంశయము. అత్యుత్కటంబులగు నీ మొదలగుపాపములచే మనుష్యుఁడు శరీరయాతనలకొఱకు పూర్వదేహమును బొందుచుండును. యమలోకంబున యమునియాజ్ఞచే యమదూతలచేఁ దీసికొనిపోఁబడినవాఁడై దుఃఖించుచుండును. అధర్మాసక్తులగు దేవమానవులు మొదలగుజీవుల కందఱకు ఘోరంబులగు నానావిధవధలచే యముఁడు శాసకుఁడని చెప్పఁబడెను. వినయప్రవర్తకులకు ప్రమాదవశమునఁ జేయఁబడినపాపకార్యములకు ప్రాయశ్చిత్తముచే

---

సవిత్రీవృషలీపతిః, క్షత్రవిట్శూద్రవృద్ధాశ్చ స్వధర్మవిహతాః సదా. ౧౪. శిల్పినః కారుకా వేశ్యాః క్షేమకారన్నపధ్వజాః, నర్తక్యో జ్యోతిషి హతాః సర్వే నరకగామినః. ౧౫. ఘృతతైలానుపానాని మధుమాంసరసాసవమ్, గుడేక్షుక్షీరశాకాన్ని దధిమూలఫలాని చ. ౧౬. తృణాని కాష్ఠం పుష్పాణి బీజౌషధిమనుత్తమామ్, ఉపానచ్ఛత్రశకటమాసనం శయనం మృదః. ౧౭. తామ్రం సీసం త్రపుం కాంస్యం శంఖాద్యం చ జలోద్భవమ్, వార్క్షం వా వైణవం వాపి గృహోపకరణాని చ. ౧౮. ఔర్ణకార్పాసకౌశేయభంగపట్టోద్భవాని చ, స్థూలసూక్ష్మాణి సంమూఢా యే చ లోకా హరంతి వై. ౧౯. ఏవమాదీని చాన్యాని ద్రవ్యాణి వివిధాని చ, నరకేషు ధ్రువం గచ్ఛేద్యో హరేత పుమాన్బలాత్. ౨౦. యద్వా తద్వా తు పారోక్ష్యమపి సర్షపమాత్రకమ్, అపహృత్య నరో యాతి నరకం నాత్ర సంశయః. ౨౧. ఏవమాద్యైర్నరః పాపైరుత్క్రాంతేః సమనంతరమ్, శరీరయాతనార్థం తత్పూర్వకాయమవాప్నుయాత్. ౨౨. యమలోకే వ్రజే దేవం శరీరేణ యమాజ్ఞయా, యమదూతైర్మహాఘోరైర్నీయమానః సుదుఃఖితః. ౨౩.

పాపము శమించునని చెప్పఁబడియుండెను. పరదారసంగతులకును, చోర్యులకును, అన్యాయప్రవర్తకులకును ఆదేశము నేలురాజే శాసకుఁడు. ఈ దోషము లప్రత్యక్షములైనచో యముఁడే శాసకుఁడు గానఁ జేసిన పాపము నివర్తించుటకై ప్రాయశ్చిత్తమును జేసికొనవలెను. ఏపాపమైన ననుభవింపక నూరుకోట్లకల్పంబులకైనను నాశముఁబొందదు. ఎవ్వఁడైనను శుభకర్మను జేయుచున్నయెడల తాను గూడఁ జేయవలెను లేక చూచి సంతోషించవలెను. మనోవాక్కాయరూపంబులగు త్రికరణంబులచే నుత్తమంబగుసుఖమును గోరవలెను. పాపభేదమువలన మూఁడువిధములగుగతులను జెప్పితిని. అట్లే యితరంబులగు చిత్రగతులను కర్మభేదంబునఁజేసి చెప్పెద నాకర్ణింపుము.

ఇది ఏకనవత్యధికశతతమాధ్యాయము.

---

## ద్వినవత్యధికశతతమాధ్యాయము.

సప్తాశ్వతిలకుం డిట్లనియె. పాపాత్ములగు శరీరులయొక్క పాపములకు తగినఘోరమగుదండనమును గర్భస్థులు, పుట్టఁబోవువారు, బాలులు, వృద్ధులు, పురుషులు, స్త్రీలు, నపుంసకులు మొదలగు సర్వజంతు

---

దేవమానుషజీవానామధర్మనిరతాత్మనామ్, ధర్మరాజః స్మృతః శాస్తా సుఘోరైర్వివిధైర్వధైః. ౨౪. వినయాభావయుక్తానాం ప్రమాదాత్స్ఖలితాత్మనామ్, ప్రాయశ్చిత్తైర్బహువిధైః పాతకం నష్టతామియాత్. ౨౫. పారదారికచోరాణామన్యాయవ్యవహారిణామ్, శాస్తా క్షితిపతిః ప్రోక్తః ప్రచ్ఛన్నానాం చ ధర్మరాట్. ౨౬. తస్మాత్కృతస్య పాపస్య ప్రాయశ్చిత్తం సమాచరేత్, నాభుక్తస్యాన్యథా నాశః కల్పకోటిశతైరపి. ౨౭. యః కరోతి శుభం కర్మ కారయేదనుమోదయేత్, కాయేన మనసా వాచా స విందేతోత్తమం సుఖమ్. ౨౮. ఇతి సంక్షేపతః ప్రోక్తా పాపభేదాత్త్రిధా గతిః, తథాన్యాగతయశ్చిత్రాః కథ్యంతే కర్మభేదతః. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సప్తాశ్వతిలకారుణసంవాద
ఏకనవత్యధికశతతమోఽధ్యాయః.

---

సప్తాశ్వతిలక ఉవాచ.—సంత్రాసజననం ఘోరం పాపానాం పాపకారిణామ్, గర్భస్థైర్జాయమానైశ్చ బాలైస్తరుణమధ్యమైః. ౧. స్త్రీపుంనపుంసకైర్వృద్ధైర్గంతవ్యం

వులును బొందవలెను. యమలోకమున శుభాశుభఫలమును తప్పక యను భవింపవలెను. ధర్మాధికారంబున నియుక్తులగు చిత్రగుప్తాదులు యమ ధర్మరాజు సమ్ముఖంబున శుభాశుభరూపంబులగు నేకర్మల నేమానవులకై యెఱింగించిరో యట్టి చేసినకర్మనంతను తప్పక యనుభవింపవలయును. అందు శుభకర్మలఁ జేయువారును, మృదుస్వభావులును, దయాయుక్తులును, సుఖముగా యమనికేతనంబున కేగుదురు. ఎవ్వఁడు బ్రాహ్మణునకు పాదుకలను, ఛత్రమును, దండము నిచ్చునో యాంతఁడు సుఖముగ యమసదనమున కేగును ఏమనుష్యుఁడు పాదుకలను ధరించి దేవాలయమున కేగునో విశేషించి గర్భాలయంబున కేగునో యాతఁడు (సంత్రాస మనునరకమును) విశేషమగుభయమును బొందును. పాదుకాసహితంబులగుదానములను, అన్నదానమును జేసినమనుష్యుఁ డీధర్మవిశేషంబుచే సుఖముగ యమలోకంబున కేగును. కాన యమలోకమున సుఖమును బొందుటకై ధర్మము నాచరింపవలెను. క్రూరకర్మాచరణులును పాప కార్యాసక్తులు నగుమనుష్యులు దక్షిణముననున్న యమసదనంబునకు బాధల ననుభవించుటకై యేగుదురు నానారూపములుగల యమపట్టణ మెనుబదియారువేల యెనుబది (86080) యోజనములు వైశాల్యము గలిగియుండెను. శుభకర్మాచరణులగు మనుష్యులకు యమసదన మతి సమీపమున నున్నదానివలెను, పాపకర్మాసక్తులకు అతిఘోరముగా

---

సర్వజంతుషు, శుభాశుభఫలం తత్ర భోక్తవ్యం దేహిభిస్తథా. ౨. చిత్రగుప్తాదిభిః సర్వైర్ధర్మస్థైః సత్యవాదిభిః, ప్రోక్తం వై ధర్మరాజస్య నికటే యచ్ఛుభాశుభమ్, అవశ్యం హి కృతం కర్మ భోక్తవ్యం తద్విచారితమ్. ౩. తత్ర యే శుభకర్మాణః సౌమ్యచిత్తా దయాన్వితాః, తే నరా యాంతి సౌమ్యేన యథా యమనికేతనమ్. ౪. యః ప్రదద్యాద్ద్విజేంద్రాణాముపానత్కాష్ఠఛత్రకమ్, స చ ధర్మేణ మహతా సుఖం యాతి యమాలయమ్. ౫. సోపానత్కో నరో యస్తు దేవాయతనమావిశేత్, విశేషతో గర్భగృహం స సంత్రాసముపాశ్నుతే. ౬. సోపానత్కాని దానాని తథాన్నం తు విశేషతః, ఏవం దానవిశేషేణ ధర్మరాజపురం నరః, యస్మాద్యాతి సుఖేనైవ తస్మాద్ధర్మం సమాచరేత్. ౭. యే పునః క్రూరకర్మాణో నరాః పాపరతాః ఖగ, తే ఘోరేణ తథా యాంతి దక్షిణేన యమాలయమ్. ౮. షడశీతిసహస్రాణి యోజనానామశీతి చ, వైవస్వతపురం జ్ఞేయం నానారూపమితి స్థితమ్. ౯. సమీపస్థమివాభాతి నరాణాం శుభచారిణామ్, పాపానా

వెళ్లుటచే నతిదూరముగ నగపడుచుండును. తీక్ష్ణమగు ముండ్లతోఁ గూడి నట్టియు, గులకరాలతో నిండినట్టియు, మంగలకత్తులవలె తీక్ష్ణమైన యాయుధములతోడను, పాషాణంబులతోడను కొన్నిస్థలములయందు తీవ్రమైనయెండచేతను, ఇనుపమేకులచేతను, పలుగులచేతను, ఖడ్గముల చేతను గూడినట్టియు పర్వతవృక్షసంకులంబును ప్రేతప్రాకారయుక్తంబు నగుమార్గంబున దుఃఖించుచు యమసదనంబున కేగుదురు. హెచ్చుతగ్గు ప్రదేశములచేతను, గడ్డలచేతను, కాలినయిసుకచేతను, దట్టములగు వెదురుపొదలచేతను గూడినమార్గమునందు గాఢాంధకారమున నిరాలంబమగుప్రదేశమునందు నాల్గువైపుల దావాగ్నులచేఁ దపింపఁబడుచుఁ దప్తశిలలచేఁ దపింపఁబడుచు మంచుచేఁ బీడితులగుచు నిసుకలో కంఠము వరకు పాతిపెట్టఁబడుచు, పిడకనిప్పులతోడను, సింహశార్దూలాదిక్రూర మృగంబులతోడను, దంశాదికీటంబులతోడను, జలజంతువులతోడను, కొండచిలువలతోడను గూడినట్టియు, ఈఁగలతోడను, గజములతోడను, తీక్ష్ణశృంగములు గలవృషభములతోడను, విషసర్పంబులతోడను, మహిషంబులతోడను, మదించిన యొంటెలతోడను, డాకిన్యాదిరాక్షసుల

---

మతిదూరస్థం తథా రౌద్రేణ గచ్ఛతామ్. ౧౦. తీక్ష్ణకంటకయుక్తేన శర్కరానిచితేన చ, క్షురధారాతినిస్త్రింశైః పాషాణైశ్చింతితేన చ. ౧౧. క్వచిదర్కేణ మహతా దురంతైశ్చైవ ఖాతకైః, లోహశంకుభిరాచ్ఛిన్నా స్తథా ఖడ్గైః సమన్వితాః. ౧౨. తతః పతద్భిర్విమలైః పర్వతైర్వృక్షసంకులైః, ప్రేతప్రాకారయుక్తేన యాంతి మార్గేణ దుఃఖితాః. ౧౩. క్వచిద్విషమగర్తాభిః క్వచిల్లోష్టైః సపిచ్ఛలైః, సుతప్తవాలుకాభిశ్చ తథా తీక్ష్ణైశ్చ శంకుభిః. ౧౪. అనేకశాఖారచితైర్వ్యాప్తైర్వంశవనైః క్వచిత్, కష్టేన తమసః మార్గ అనాలంబే సుదారుణే. ౧౫. అథ శృంగాటకైర్వ్యాప్తైః క్వచిద్దావాగ్నినా పునః, క్వచిత్తప్తశిలాభిశ్చ క్వచిద్వ్యాప్తం హిమేన తు. ౧౬. క్వచిద్వాలుకయా వ్యాప్తమాకంఠాంతం ప్రవేశయేత్, క్వచిదుష్ణాంబునా వ్యాప్తం క్వచిచ్చ కరిషాగ్నినా. ౧౭. క్వచిత్సింహైః క్వచిద్వ్యాఘ్రైర్దంశైః కీటైశ్చ దారుణైః, క్వచిన్మహాజలౌకాభిః క్వచిద్వాజగరైః పునః. ౧౮. మక్షికాభిశ్చ రౌద్రాభిః క్వచిత్సర్పైర్విషోల్బణైః, మహాగజేంద్రయూథైశ్చ బలోన్మత్తైః ప్రమాథిభిః. ౧౯. పంథానముల్లిఖద్భిశ్చ తీక్ష్ణశృంగైర్మహావృషైః, మహాశృంగైశ్చ మహిషైరుష్ట్రైర్మత్తైర్మదాతురైః. ౨౦. డాకినీ

తోడను గూడినమార్గమున మహాబాధల ననుభవించుచు మహావ్యాధుల చేతను, ప్రచండమారుతముచేతను, పాషాణవర్షంబులచేతను, పిడుగుల చేత శరీరము చీల్చుకొనిపోవుచు వజ్రఘాతంబులచేతను, ఉల్కాపాతంబులచేతను, నిప్పులవర్షముచేతను దహింపఁబడుచు నాలోకమున కేగుదురు. ఈరీతిగ నిరాధారమగుమార్గమున దారిబత్యములేక భయపెట్టుచు పాపులగు ప్రాణులను యమభటులు యమలోకంబునకుఁ గొంపోదురు. ఇదియంతయుఁ దెలిసినమనుష్యుఁడు పాపములను వర్జించి పుణ్యములను జేయవలెను. పుణ్యముఁజేసిన దేవత్వమును పాపమును జేసిన నరకమును బొందుదురు. దేవదేవుఁడగుభాస్కరు నొక్కపర్యాయము మనస్సుచేనైన నారాధించినను అతఁడు యమునిముఖమునైనఁ జూడఁజాలఁడు. కాని తొల్తఁజేసిన మహాఘోరపాపంబులచేఁ గొంత కాలము ప్రేతరాజులైయుండి యనంతరము సూర్యపురంబునకుఁ బోవుదురు. ఎవ్వరు భాస్కరుని సర్వాత్మకుండని యారాధింతురో వారు నీటిచేఁ బద్మపత్రమువలె పాపములచే లిప్తులు గానేరరు. కాన మనుష్యు

---

భిశ్చ రౌద్రాభిర్వికరాలైశ్చ రాక్షసైః, వ్యాధిభిశ్చ మహాఘోరైః పీడ్యమానా వ్రజంతి హి. ౨౧. మహాపాశవిమిశ్రేణ మహాచండేన వాయునా, మహాపాషాణవర్షేణ హన్యమానా నిరాశ్రయాః. ౨౨. క్వచిద్విద్యుత్ప్రపాతేన దీర్యమాణా వ్రజంతి హి, పతద్భిర్వజ్రసంఘాతైరుల్కాపాతైశ్చ దారుణైః. ౨౩. ప్రదీప్తాంగారవర్షేణ దహ్యమానా వ్రజంతి హి, మహాంధకారశుక్రేణ పీడ్యమానా వ్రజంతి హి. ౨౪. మహామేఘరవైర్ఘోరైర్విత్రాస్యంతే ముహుర్ముహుః, తీక్ష్ణపాషాణయుక్తేన పూర్యమాణాః సమంతతః. ౨౫. మహాక్షురాంబుధారాభిః సేవ్యమానా వ్రజంతి హి, మహామేఘరవైర్ఘోరైర్విత్రాస్యంతే ముహుర్ముహుః. ౨౬. భృశం శీతేన తీక్ష్ణేన రూక్షేణ మారుతేన చ, ఇత్థం మార్గేణ రౌద్రేణ పాథేయరహితేన చ. ౨౭. నిరాలంబేన దుర్గేణ నిర్జనేన సమంతతః, అవిశ్రామేణ మహతా విగతాపాయదుర్ధరైః. ౨౮. నీయంతే దేహినః సర్వే యే మూఢాః పాపకారిణః, ఇతి జ్ఞాత్వా నరః కుర్యాత్పుణ్యం పాపం చ వర్జయేత్, పుణ్యేన యాతి దేవత్వం పాపేన నరకం వ్రజేత్. ౨౯. యైర్మనాగపి దేవేశో మనసా పూజితో రవిః, తే కదాపి న పశ్యంతి యమస్య వదనం ఖగ. ౩౦. కిం తు పాపైర్మహాఘోరైః కించిత్కాలం తవాజ్ఞయా, భవంతి ప్రేతరాజానస్తతో యాంతి రవేః పురమ్. ౩౧. యే పునః సర్వభావేన భజంతే భువి భాస్కరమ్, న తే లిమ్పంతి పాపేన పద్మపత్ర

లెల్లప్పుడును భాస్కరునియందు భక్తిగల్గియుండవలెను. విపులంబగుధనమును గోరువారు శ్రద్ధచే భాను నారాధింపవలెను.

ఇది ద్వినవత్యధికశతతమాధ్యాయము.

## త్రినవత్యధికశతతమాధ్యాయము.

అయనమునందును, విషువత్కాలమునందును, సంక్రమణములయందును, గ్రహణములయందును, ఆదిత్యవారమునందును భానునిం దప్పక పూజింపవలెను. విశేషించి సప్తమిరోజున పూజింపవలెను. సప్తమీవ్రతవిధానముం జెప్పెద నాకర్ణింపుము. ఇది పరమ రహస్యంబగు సూర్యుని యుత్కృష్టారాధనము. ప్రథమసప్తమినాఁడు తెల్లావాలతోను, రెండవసప్తమినాఁడు జిల్లేడాకులతోడను, మూఁడవనాఁడు మిరియములతోడను, నాల్గవనాఁడు నువ్వులతోడను, ఐదవనాటినుండి యన్నముతోడను నీరీతిగ నేడుసప్తములయందు వ్రతము ననుష్ఠింపవలెను. అట్లు చేసిన నైశ్వర్యము గల్గును. ఈయేడింటిలక్షణంబుల నను క్రమంబుగఁ జెప్పెద. మాఘమాసమునఁగాని, మార్గశిరమాసమునఁగాని శుద్ధసప్తమిరోజున నీవ్రతమును జేయవలెను. రోగాదులచే నార్తులగువారికి పక్షమాసదివసకృతనియమ ముండదు. రాత్రియం దరజాము

మివాంభసా. ౩౨. తస్మాత్ప్రకుర్యాద్భక్తిం వై భాస్కరే సతతం నరః, శ్రద్ధయా పూజయేద్భానుం య ఇచ్ఛేద్విపులం ధనమ్. ౩౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సప్తాశ్వతిలకానూరుసంవాదే ద్వినవత్యధికశతతమోఽధ్యాయః.

సప్తాశ్వతిలక ఉవాచ:—అయనే విషువే వారే సంక్రాంతౌ గ్రహణే తథా, పూజయేత్సతతం భానుం సప్తమ్యాం తు విశేషతః. ౧. వైనతేయ నిబోధ త్వం విధానం సప్తమీవ్రతే, ఏతద్ధి పరమం గుహ్యం రవేరారాధనం పరమ్. ౨. సిద్ధార్థకైస్తు ప్రథమా ద్వితీయా చార్కసంపుటైః, తృతీయా మరిచైః కార్యా చతుర్థీ తిలసప్తమీ. ౩. సప్తమీ చౌదనైర్వీర సప్తమీ పరికీర్తితా, ఇత్యేతాః సప్త సప్తమ్యః కర్తవ్యా భూతిమిచ్ఛతా. ౪. తథా చానుక్రమే తాసాం లక్షణం కథయామ్యహమ్, మాఘే వా మార్గశీర్షే వా కార్యా శుక్లా తు సప్తమీ. ౫. ఆర్తస్య తు న నియమః పక్షమాసకృతో

మిగిలియుండఁగా నిద్ర మేల్కొని దంతధావనముఁ జేసికొనవలెను. ఐదవ సప్తమినాఁ డేవృక్షములు కామప్రదంబులో చెప్పెద. విప్పచెట్టు పుత్ర లాభకరము. గుంటగలగరచెట్టు దుఃఖధ్వంసకము, రేగు వాకుడు రోగ విమోచకంబులు మారేడు ఐశ్వర్యప్రదము. చండ్ర ధనసముదాయ మును గల్గఁజేయును. కడిమి శత్రునాశమును, మాధవీలత యర్థలాభ మును, రావిచెట్టు జ్ఞాతిప్రాధాన్యమును బొందించి యశం బిచ్చును గన్నేరుచెట్టుచే నిశ్చలమగుజ్ఞానముగల్గును. దిరిశనచెట్టుచే సమృద్ధంబగు జ్ఞానమును బొందును. ప్రేంకణవృక్షమును సేవించువానికి పరమ సౌభాగ్యము గల్గును. ఈప్సితార్థసిద్ధికొఱకు సుఖాసీనుండై తరువాత మౌనమును ధరించి తనకోరికను యథేచ్ఛముగా హృదయమం దుంచు కొని మంత్రించుచు "వరం దత్వాభిజానాసి కామదం చ వనస్పతే, సిద్ధిం ప్రయచ్ఛ మే నిత్యం దంతకాష్ఠ నమోఽస్తు తే." అను నీమంత్రమును మూఁడుపర్యాయములు జపించి దంతధావనమును జేయవలెను. తరు వాత నాదంతకాష్ఠమును నీటితో కడిగి శుచి యగుప్రదేశమునఁ బార వేయవలెను అటు పారవేసిన దంతకాష్ఠ మూర్ధ్వభాగంబునఁ బడినను, అభిముఖంబుగఁబడినను కార్యసిద్ధిగల్గును. విరుద్ధముగఁ బడినయెడల మఱల

---

భవేత్, అర్ధప్రహరశేషే తు కుర్యాద్వై దంతధావనమ్. ౬. పంచమ్యాం తత్ర యే వృక్షాః కామితాస్తాన్వదామ్యహమ్, మధూకే పుత్రలాభః స్యాద్దుఃఖహా మార్కవో భవేత్. ౭. బదర్యా చ బృహత్యా చ క్షిప్రం రోగాత్ప్రముచ్యతే, ఐశ్వర్యం చ భవే ద్బిల్వైః ఖదిరేణ చ సంచయః. ౮. శత్రుక్షయః కదంబేషు అర్థలాభోఽతిముక్తకే, గురుతాం యాతి సర్వత్ర ఆటరూషకసంభవైః. ౯. జ్ఞాతిప్రధానతాం యాతి అశ్వత్థో యచ్ఛతే యశః, కరవీరాత్పరిజ్ఞానమచలం స్యాన్న సంశయః. ౧౦. శ్రియం ప్రాప్నోతి విపులాం శిరీషస్య నివేశనే, ప్రియంగుం సేవ్యమానస్య సౌభాగ్యం పరమం భవేత్. ౧౧. అభీప్సితార్థసిద్ధ్యర్థం సుఖాసీనోఽథ వాగ్యతః, కామం యథేష్టం హృదయే కృత్వా సమభిమంత్ర్య చ, మంత్రేణానేన మతిమానశ్నీయాద్దంతధావనమ్. ౧౨. వరం దత్వాభి జానాసి కామదం చ వనస్పతే, సిద్ధిం ప్రయచ్ఛ మే నిత్యం దంతకాష్ఠ నమోఽస్తుతే. ౧౩. త్రీన్వారాన్పరిజప్యైవం భక్షయేద్దంతధావనమ్, ప్రక్షాల్య త్యక్త్వా కాష్ఠం తు శుచౌ దేశే వినిక్షిపేత్. ౧౪. ఊర్ధ్వే నిపతితే సిద్ధిస్తథా చాభిముఖే స్థితే, అతో

దానిందెచ్చి యభిముఖముగ పడునంతవఱకు మూఁడుతడవలు పార వేయుచుండవలెను. మూఁడుమార్లును పరాఙ్ముఖముగానే పడినయెడల వరములు సిద్ధింపవు. కాన నాసప్తమిని విడువవలెను. వ్రతానుష్ఠాత యారాత్రి బ్రహ్మచారియై మంగళములను సేవించుచు నిద్రింపవలెను. తెల్లవారినతరువాత చిరిగినవస్త్రములను ధరించి శుచియై యుదయంబున లేచి దంతధావనముఁజేసి సూర్యునకు నమస్కరించి యభీష్టముగా జపించి యగ్నిహోత్రమున హోమమును జేయవలెను. తరువాత నప రాహ్ణంబున ఆవుపేడ మన్నుకలసినయుదకముతో స్నానముఁజేసి విధి ప్రకారముగా నియమము ననుష్ఠించుచు మౌనియై శుభ్రవస్త్రముల ధరించి దేవదేవుండగు దివాకరు నారాధించి గాయత్రీజపతత్పరుఁడై నిద్రింపవలెను.

ఇది త్రినవత్యధికశతతమాధ్యాయము.

---

న్యథా తు పతితే ఆసీయ పునరుత్సృజేత్. ౧౫. పరాఙ్ముఖం యది భవేత్త్రీన్వారాం దంతధావనమ్, అసిద్ధాం తు విజానీయాన్న గ్రాహ్యా సా తు సప్తమీ. ౧౬. బ్రహ్మచారీ తు తాం రాత్రిం స్వప్యాన్మంగలసేవయా, బిభ్రద్వాసోనుపహతం శుచిరాచారసంయుతః. ౧౭. తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాతరుత్థాయ వై ఖగ, ప్రక్షాలయేన్ముఖం ధీమానశ్నీయాద్దంతధావనమ్. ౧౮. ఉపవిశ్య శుచిర్భూత్వా ప్రణమ్య శిరసా రవిమ్, జపం యథేష్టం కృత్వా తు జుహుయాచ్చ హుతాశనే. ౧౯. తతోఽపరాహ్ణసమయే స్నాత్వా మృద్గోమయాంబుభిః, విధివన్నియమం కృత్వా మౌనీ శుక్లాంబరః శుచిః. ౨౦. పూజయిత్వా విధిం భక్త్యా దేవదేవం దివాకరమ్, స్వప్యాద్దేవస్య పురతో గాయత్రీ జపతత్పరః. ౨౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే దంతకాష్ఠవిధివర్ణనం నామ త్రినవత్యధికశతతమోఽధ్యాయః.

## చతుర్నవత్యధికశతతమాధ్యాయము.

సప్తాశ్వతిలకుం డిట్లనియె. ఇఁకమీఁద వ్రతస్థుఁడు స్వప్నము గాంచినచో నేయేస్వప్నముల కేయేఫలములను బొందునో చెప్పెద. సప్తమినాఁడు నియతవ్రతుఁ డగుపురుషుఁడు జపహోమాదిక్రియనంతను విధిప్రకారము సమాప్తినిబొందించి భూమియందు శయనించి దేవదేవుని చింతించుచు నిద్రించిన స్వప్నమున దివాకరునిగాని, శక్రధ్వజమును గాని, చంద్రునిగాని చూచినయెడల సర్వసమృద్ధులు గల్గును. బంగారు, వెండి, చామరములు, సువర్ణాభరణములు, దర్పణము, రక్తస్రావము, కేశపాతము నివియన్నియు నైశ్వర్యకారకంబులగును. వృక్షము నధిరోహించిన శీఘ్రముగ నైశ్వర్యము గల్గును. గేదె, ఆడసింహము, గోవు మొదలగు పాలిచ్చుజంతువులను తనచేతిలో పాలుపితుకుట వానిని బంధించుట యివి రాజ్యప్రాప్తిహేతువులు. నాభిస్పర్శమున దుర్మతి యగును. గొఱ్ఱెను స్వయముగఁ జంపి తినినను, సింహమును జలజంతువులను చంపి తినినను, స్వాంగమును తినినను, సురాపానముఁజేసినను, పాయసమును స్వర్ణపాత్రమునందుగాని రజతపాత్రమునందుగాని భుజించినను, పద్మపత్రమునఁ దినినను, సదృశంబగు నైశ్వర్యము ప్రాప్తించును. జూదమునందుగాని యుద్ధమునందుగాని విజయముగొన్నట్లు గనిన సుఖము లభించును. తనశరీరము మండుట, శిరోబంధమును ఐశ్వర్య

---

సప్తాశ్వతిలక ఉవాచ:—అతః పరం ప్రవక్ష్యామి యైరైశ్వర్యఫలమశ్నుతే, స్వప్నే దృష్టే తు సప్తమ్యాం పురుషో నియతవ్రతః. ౧. సమాప్య విధివత్సర్వాం జపహోమాదికాం క్రియామ్, భూమౌ శయ్యాం సమాస్థాయ దేవదేవం విచింతయేత్. ౨. హంత సుప్తో యది నరః పశ్యేత్స్వప్నే దివాకరమ్, శక్రధ్వజం వా చంద్రం వా తస్య సర్వాః సమృద్ధయః. ౩. భృంగారచామరాదర్శకనకాభరణాని చ, రుధిరస్య స్రుతిః కేశపాత ఐశ్వర్యకారకః, స్వప్నే వృక్షాధిరోహే తు క్షిప్రమైశ్వర్యమావహేత్. ౪. దోహనం మహిషీసింహీగోధేనూనాం కరే స్వకే, బంధశ్చాసాం రాజ్యలాభో నాభేః స్పర్శే తు దుర్మతిః. ౫. అవిం హత్వా స్వయం ఖాదేత్సింహమంబుజమేవ చ, స్వాంగమస్థి హుతాశం చ సురాపానం ఖగాధిప. ౬. హైమే వా రాజతే వాపి యో భుంక్తే పాయసం నరః, పాత్రే తు పద్మపత్రే వా తస్యైశ్వర్యం సమం భవేత్. ౭. ద్యూతే చ వాథ వా యుద్ధే విజయో హి సుఖావహః, గాత్రస్య స్వస్య జ్వలనం శిరోబంధశ్చ

హేతు వగును. శుక్లమాల్యాంబరంబులు శ్వేతహయంబులు పశుపక్షులు వీట్లనుఁ జూచుట అమేధ్యమును శరీరమునకుఁ బూసికొనుట యివి యెల్లప్పుడును లాభహేతువులు. హయయానమును రథయానము నధిష్ఠించిన శీఘ్రముగ సంతానము గల్గును. అనేకబాహువులు శిరములు గల్గియుండుట, లక్ష్మిని గృహమునం దుండుదానిగఁ జేయును. అగమ్యాగమనమును జేసిన వేదాధ్యయనముఁజేసి ధన్యతఁ గాంచును. దేవతలు, బ్రాహ్మణులు, గురువులు, తపోనిష్ఠులును స్వప్నమున సాక్షాత్కరించి చెప్పినదంతయు యథార్థమగునని చెప్పుదురు. వీరలదర్శనము ఆశీర్వాదము గూడ ప్రశస్తము. స్వశిరశ్ఛేదమైనయెడల రాజ్యము, బహుజనవధంబున ధనమును గల్గును రోదనముఁజేసిన భక్ష్యసంప్రాప్తియు, బద్ధుఁడైనచో రాజ్యప్రాప్తియు, పర్వతము సింహము వృషభము ఏనుఁగు గుఱ్ఱములను పరాక్రమించి యధిష్ఠించిన మహదైశ్వర్యము గల్గును గ్రహములను నక్షత్రములను కిరణములను త్రిప్పుచు, పర్వతమును పెల్లగించినచో నాతఁడు భూలోకంబున రాజగును. ప్రేవులు శరీరమునుండి తొలఁగిపోవుట సముద్రములను నదులను పానముఁజేయుట నైశ్వర్యమును సుఖమును గలుగఁజేయును. బలముచే సముద్రమును గాని నదినిగాని దాటినచో నచలము వీర్యవంతము నగుసంతాన మేర్ప

---

భూతయే. ౮. మాల్యాంబరాణాం శుక్లానాం హయానాం పశుపక్షిణామ్, సదా లాభం ప్రశంసంతి విష్ఠానాం చానులేపనమ్. ౯. హయయానే భవేత్క్షిప్రం రథయానే ప్రజాగమః, నానాశిరోబాహుతా చ గృహస్థాం కురుతే శ్రియమ్. ౧౦. అగమ్యాగమనం ధన్యం వేదాధ్యయనముత్తమమ్, దేవద్విజశ్రేష్ఠవీరగురువృద్ధతపస్వినః. ౧౧. యద్వదంతి నరం స్వప్నే సత్యమేవేతి తద్విదుః, ప్రశస్తం దర్శనం చైషామాశీర్వాదః ఖగాధిప. ౧౨. రాజ్యం స్యాత్స్వశిరశ్ఛేదే ధనం బహువధే భవేత్, రుదితే భక్ష్యసంప్రాప్తీ రాజ్యం నిగడబంధనే. ౧౩. పర్వతం తురగం సింహం వృషభం గజమేవ హి, మహదైశ్వర్యమాప్నోతి యో విక్రమ్యాధిరోహతి. ౧౪. ఆగృహ్ణానో గ్రహాంస్తారా మరీచిం పరివర్తయన్, ఉన్మూలయతి పర్వతాంశ్చ రాజా భవతి భూతలే. ౧౫. దేహాన్నిష్క్రాంతి రంత్రాణాం సర్వేషాం చ ఖగాధిప, పానం సముద్రసరితామైశ్వర్యసుఖకారకమ్. ౧౬. బలం చాంబునిధిం వాపి తీర్థపారం ప్రయాతి యః, తస్యాపత్యం భవేద్వీర అచలం చ

డును. కృములను భక్షించినచో శీఘ్రముగ ధనప్రాప్తి యగును. సురూపంబుగల సుందరాంగనలను గాంచుట, పొందుట, మంగళవస్తువులను ధరించుట యివియన్నియు నారోగ్యమును ధనమును ఐశ్వర్యమును రాజ్యలాభమును గల్గఁజేయును. ఇందులో నేస్వప్నమున కేవి ఫలములుగాఁ జెప్పఁబడెనో యవియన్నియు నిస్సందేహముగా గల్గును. స్వప్నమును నలువురు వినిన నుత్తమంబగు ఏవురువిన బహుపుత్రులనున్నా ఆర్గురిచే సుతులను ధనమును నాయువును నేడ్గురిచే సమస్తకామంబులను నెనమండ్రచే గొప్పయశంబును బొందును.

ఇది చతుర్నవత్యధికశతతమాధ్యాయము.

---

## పంచనవత్యధికశతతమాధ్యాయము.

అనూరుం డిట్లనియె. దేవేశా! సర్వసప్తమీవిధానములను వినఁగోరుచుంటిని. చెప్పుమనిన సప్తాశ్వతిలకుం డిట్లనియె. వైనతేయా! నీవడిగినదంతయు వరుసగ నెఱింగింతు నాకర్ణింపుము. వివస్వంతుఁ డెట్లు చెప్పిన నవియన్నియు సమానంబులే యగును. ఉత్తరాయణమునందు శుక్లపక్షంబున భానువాసరమునందు పుత్రదారధన క్షేత్రంబున సప్తమీ

---

ఖగాధిప. ౧౬. భవత్యర్థాగమః శీఘ్రం కృమిర్వా యది భక్షయేత్, అంగానాం చ సురూపాణాం లాభో దర్శనమేవ చ, సంయోగశ్చైవ మాంగల్యైరారోగ్యం ధనమేవ చ. ౧౭. ఐశ్వర్యం రాజ్యలాభశ్చ యస్మిన్స్వప్న ఉదాహృతః, సప్త స్యాన్నాత్ర సందేహశ్చతుర్భిః శ్రుత ఉత్తమః.౧౯. పంచభిః పుత్రబాహుల్యం షడ్భిరాయుః సుతాన్ ధనమ్, సప్తభిర్వివిధాన్కామానష్టభిర్వివిధం యశః. ౨౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యారుణసంవాదే స్వప్నవర్ణనం నామ
చతుర్నవత్యధికశతతమోఽధ్యాయః.

---

అనూరురువాచః—భగవంఛ్రోతుమిచ్ఛామి సప్తమీనాం పరం విధిమ్, సర్వాసామనురూపాణాం కథయస్వ మహామునే. ౧. సప్తాశ్వతిలక ఉవాచ.—శృణు వీర ఖగశ్రేష్ఠ సప్తమీనాం పరం విధిమ్, కీర్తయిష్యామి తే సర్వం యథావత్పరిపృచ్ఛతే. ౨. తుల్యం కిల ఖగశ్రేష్ఠ యథాఖ్యాతం వివస్వతా, శుక్లపక్షే రవిదినే ప్రవృత్తే చోత్త

వ్రతమును గ్రహింపవలెను. జ్ఞానసంపన్నులును సర్వకామప్రదులు నగు ఋషిపుంగవులచే నేడు సప్తములు చెప్పఁబడినవి. వానినామములఁ జెప్పెద వినుము. అర్కసంపుటిక మొదటిదియు, మరీచిక రెండవదియు, నింబపత్రసప్తమి మూఁడవదియు, ఫలసప్తమి నాలుగవదియు, యేడవది కామికసప్తమి యనియుఁ జెప్పఁబడినవి. (అయిదవ, ఆరవ సప్తములు శ్లోకములో లేవు.) వీనివిధి ననుక్రమముగ నెఱింగింతు నాకర్ణింపుము పంచమినాఁ డేకభుక్తమును జేయవలెను. ఫలాహారమునుగూడఁ జేయఁ గూడదు. మిథునకర్మను వర్జింపవలెను. మధుమాంసములను మిక్కిలి పులుసును విడువవలెను. షష్ఠినాఁ డొంటియాకు దొన్నెయందు ఘృతమిశ్రితం బగుశాల్యన్నము నుంచి విధిప్రకారము భుజింపవలెను. దీని కంటె నితరమగునన్నమును భుజింపక సప్తమినాఁడు భుజింపవలెను. రోజున కొకకబళముచొప్పున హెచ్చింపవలయు. ఇట్టినియమములతోఁ బ్రథమసప్తమీవ్రతము సల్పవలయును. ఇతరసప్తములయందు మిరియములను వేపాకులను భక్షింపవలెను. ఈరీతిగ నాల్గవసప్తమినిఁగూడఁ నుభయపక్షములయందును లభించిన ఫలముల భుజింపవలయును. యత్నముతో నన్నాదిరహితుండగుటంజేసి యనోదనుఁడనంబడును. ఆవ్రతమనోదనవ్రత మనఁబడును. విధిప్రకారము భక్తితో విభావసు నారాధించి యహోరాత్రంబులు వాయుభక్షణముఁ జేయుచు విజయసప్తమీవ్రత

---

రాయణే. 3. పుత్రదారధనక్షేత్రే గృహ్ణీయాత్సప్తమీవ్రతమ్, ఋషిభిర్జ్ఞానసంపన్నైః సర్వకామఫలప్రదైః. 4. సప్తమ్యః సప్త ఆఖ్యాతాస్తాసాం నామాని మే శృణు, అర్కసంపుటకైకా ద్వితీయా మరిచైస్తథా. 5. తృతీయా నింబపత్రైశ్చ చతుర్థీ ఫలసప్తమీ, సప్తమీ కామికా నామ్నా విధిమాసాం నిబోధ మే. 6. పంచమ్యామేకభక్తం తు కుర్యాన్నియతమానసః, అల్పాహారం న కుర్వీత మైథునం దూరతస్త్యజేత్. 7. వర్జయేన్మధు మాంసం చ అత్యమ్లం చ ఖగాధిప, ప్రభాతే చైవ షష్ఠ్యాం తు ఏకైకపర్ణసంపుటే. 8. ఘృతశాల్యోదనం కృత్వా భక్షయేత్తు విధానతః, అన్యదన్నమభుంజానః సప్తమ్యాం భోజనం భవేత్. 9. ఏకైకవృద్ధ్యాభియుక్తై ర్గ్రాసై వసేత్తు ఖగేశ్వర, అన్యత్ర మరిచం భక్షేన్నింబపత్రాణ్యతః పరమ్. 10. ఏవం లబ్ధఫలాశీహ పక్షయోరుభయోరపి, అన్నాద్యైశ్చ రహితో యత్నాదనోదన ఇతి స్మృతః. 11. ఆచరేద్విధివద్భక్త్యా పూజయిత్వా విభావసుమ్, అహోరాత్రం వాయుభక్షః కుర్యాద్విజయసప్తమీమ్. 12.

మును జేయవలెను. ఈయేడుసప్తములలో నొక్కొకసప్తమిని విధిగాఁ జేయవలెను. ఈసప్తములపేర్లను ప్రత్యేకముగ పత్రములపై వ్రాసి తెల్లగంధముఁ బూసి మాలలతో నలంకృతమై యేడువిధములగు ధాన్యములచేతను హిరణ్యముచేతను నింపి చంద్రునింబోలి తెల్లనివర్ణముగలిగి రావియాకులతోడను అశోకపత్రములతోడను గూడియున్న దధ్యన్నమునఁ గూడ నీ యేడుసప్తములనామములు వ్రాయవలెను. ఆమీఁద దొరకినదానితోఁ బూజింపవలయును. శుభంబగుస్వప్నమును జూచి మఱల పరుండి నిద్రింపఁగూడదు. ప్రాతఃకాలమునఁ గనినస్వప్నమును భోజకులకును, విప్రులకును, హితులకును జెప్పవలెను. తరువాత స్నానముఁజేసి మధ్యాహ్నమున నియతమనస్కుఁడై యాభాస్కరుని విధిప్రకారము పూజించి బాగుగ జపముఁజేసి మౌనియై యగ్నిని వ్రేల్చి దేవాయతనమునుండి బయలుదేరి భోజకునకు నివేదింపవలెను. భోజకులు లభింపనిచో పురాణవేత్తలగు బ్రాహ్మణులు దాని కర్హులగుదురు. ఆబ్రాహ్మణులు మంత్రములందును వేదాంగములను నిపుణులయి కర్మానుష్ఠానముచే స్వర్గమును జయించినవారై యుండవలెను. ఈమాదిరిగా సప్తసప్తమీవ్రతముల నాచరించినవాఁ డెట్లు ఫలమును బొందకుండును? భక్తితో సప్తమీవ్రతముల నాచరించినఁ బదియశ్వమేధయాగములను

---

ఏకైకం సప్త సప్తమీరత్రైవ విధివచ్చరేత్, ప్రాలేఖ్య తాసాం నామాని పత్రకేషు పృథక్పృథక్. ౧౩. తాని సర్వాణి నామాని విలేఖ్య సుసమాహితః, శ్వేతచందనదిగ్ధాంగే మాల్యదామోపశోభితే. ౧౪. సప్తధాన్యహిరణ్యాఢ్యే శశికుందేందుసన్నిభే, అశ్వత్థాశోకపత్రాఢ్యే దధ్యోదనసమన్వితే. ౧౫. తదర్థం పూజయేద్భక్త్యా తైస్తైర్ద్రవ్యైర్న సంశయః, దృష్ట్వా తు శోభనం స్వప్నం న భూయః శయనం స్వపేత్. ౧౬. ప్రాతశ్చ కీర్తయేత్స్వప్నం యథాదృష్టం ఖగాధిప, ప్రాజ్ఞభోజకవిప్రేభ్యః సుహృద్భ్యశ్చ ఖగాధిప. ౧౭. తతో మధ్యాహ్నసమయే స్నాతః ప్రయతమానసః, తం చైవ దేవం విధివత్పూజయిత్వా దివాకరమ్. ౧౮. సమ్యక్కృతజపో మౌనీ నరో హుతహుతాశనః, నిష్క్రమ్య దేవాయతనాద్భోజకాయ నివేదయేత్. ౧౯. భవేదలాభో యది భోజకానాం విప్రాస్తమర్హంతి పురాణవిజ్ఞాః, యే మంత్రవేదావయవేషు నిశ్చితా విభుం సమభ్యర్చ్య దివం ప్రజేయుః. ౨౦. కృత్వైవం సప్తమీః సప్త నరో భక్తిసమన్వితః, శ్రద్దధానోఽపి సూర్యస్య స కథం నాప్నుయాత్ఫలమ్. ౨౧. దశానామశ్వమేధానాం

జేసినఫలమును బొందును. కాన వైనతేయా! సప్తమీవ్రతముచే దహింపఁబడని దుష్పాప మేదియును లేదు. ఈవ్రతముచే శాంతింపని రోగ మీలోకంబున లేదు. వైద్యులచే ననివార్యములగు మహాకష్టంబులును, గరుడునిచేఁ బన్నగంబులవలె హరింపఁబడును. సకలదేవమాన్యుఁడును భక్తవరప్రదుఁడు నగుసూర్యు నారాధించువారలు సుతధనకులభోగములచే నీలోకమున సౌఖ్యమొంది యంతంబునఁ దైజసశరీరము నొందుదురు

ఇది పంచనవత్యధికశతతమాధ్యాయము.

---

## షణ్ణవత్యధికశతతమాధ్యాయము.

వైనతేయా! పురుషుఁడు సప్తమినాఁడు భోజనమును మానివైచి యన్నింటియందును మైత్రిం జల్పుచు జీవహింసను వర్జింపవలెను. సప్తమినాఁడు తైలమును స్పృశింపఁగూడదు. నీలవస్త్రమును ధరింపఁగూడదు. స్త్రీతోఁ గూడ నేకశయ్యయందు శయనింపఁగూడదు. ద్యూతక్రీడ సలుపఁగూడదు. కన్నీరు గార్చుచు నేడ్వఁగూడదు. పిశాచంబుల

---

కృతానాం యత్ఫలం భవేత్, తత్ఫలం సప్తమీః సప్త కృత్వా భక్త్యా లభేత నా. ౨౨. దుష్పాపం నాస్తి తద్వీర సప్తమ్యాం యన్న దహ్యతే, న చ రోగోఽస్త్యసౌ లోకే య ఏతాభిర్న శామ్యతి. ౨౩. కష్టాని యాని రౌద్రాణి దుశ్ఛేద్యాని భిషగ్వరైః, నీయంతే తాని సర్వాణి గరుడేనేవ పన్నగాః. ౨౪. సకలవిబుధమాన్యం స్వప్రకాశం జనానామభిమతఫలదానే దీక్షితం తం సుపూజ్యమ్, సుతధనకులభోగైః సౌఖ్యపుష్ట్యైరుపేతో వ్రజతి చ సుతనుం తాం శాశ్వతాం తిగ్మరశ్మేః. ౨౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యారుణసంవాదే స్వప్నవర్ణనం నామ పంచనవత్యధికశతతమోఽధ్యాయః.

---

సప్తాశ్వతిలక ఉవాచ.—అతీత్య భుక్తం పురుషః సప్తమ్యాం గరుడాగ్రజ, మైత్రీం విదధ్యాత్సర్వత్ర జీవహింసాం వివర్జయేత్. ౧. సప్తమ్యాం న స్పృశేత్తైలం నీలం వస్త్రం న ధారయేత్, న శయీత స్త్రియా సార్ధం న సేవేత దురోదరమ్. ౨. న రుద్యాదశ్రుపాతేన న వా ధ్యాయేత్పిశాచకాన్, నాకృషేచ్ఛిరసో యూకా న పృథా

ధ్యానింపఁగూడదు. తలలోనిపేలను లాగికొనఁగూడదు. వ్యర్థముగ వాదింపరాదు. పరున కనిష్టముఁజెప్పుట, యతివాదముసల్పుటయు మానవలెను. ఏజంతువులను కొట్టఁగూడదు. సూర్యగృహమును ప్రవేశింపఁగూడదు. సూర్యగృహమునఁ బ్రవేశించిన బ్రహ్మహత్య చేసినంతపాపమును బొందును. వైనతేయా! యీనియమములు సూర్యభక్తులకై యేర్పరుపఁబడినవి. అందును విశేషించి భోజకులకని పూర్వము భానుఁడు నాకుఁ జెప్పియుండెను. వైనతేయా! యేభోజకుఁడు వడ్డీకి ద్రవ్యము నప్పిచ్చునో యాతఁడు తప్పక నరకమును బొందును స్వల్పద్రవ్యముచే వందలకొలఁది ధనమార్జింప నెంచి కులధర్మము వీడి వర్తించెనేని యేనూరురూకలకుఁ బైఁబడినలాభము నామార్గమున గడించి ప్రాయశ్చిత్తార్హుఁడగును. భోజకుఁడు ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. అంత పర్యంతము సూర్యపూజ కర్హుఁడు గానేరఁడు. సాంతపనరూపమగు కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొని సూర్యపూజయందుఁ బ్రవర్తింపవలెను. భోజకుఁ డెన్నఁడు నితరదేవతలను బ్రతిష్ఠింపఁగూడదు. అట్లు చేసినఁ బ్రాయశ్చిత్తార్హుఁడగును కాన భోజకుఁ డెన్నఁడు నట్లు చేయఁగూడదు. భాస్కరదేవుని విడచి యితరదేవునకు నివేదింపఁగూడదు. బ్రహ్మాదిదేవతల కధివేశముఁ (ప్రతిష్ఠ) జేసి భోజకుఁడు సూర్యుని స్పృశింపఁగూడదు. శుద్ధికొఱకై కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొన

---

వాదమాచరేత్, పరస్యానిష్టకథనమతివాదం చ వర్జయేత్. ౩. న కంచిత్తాడయేజ్జంతుం న విశేత కదాచన, బ్రహ్మహత్యామవాప్నోతి విశమానో రవేర్గృహమ్. ౪. ఇత్యేతే సమయాః ప్రోక్తాః సౌరాణాం గరుడాగ్రజ, భోజకానాం విశేషేణ పురా మే భానునానఘ. ౫. భోజకః ఖగశార్దూల యో లోభాద్ద్రవ్యముత్సృజేత్, వృద్ధ్యై తు సతతం వీర స గచ్ఛేన్నరకం ధ్రువమ్. ౬. విశేషే చాల్పకశతే కామయానే ఖగాధిప, ప్రయుజ్యమానో భోజకస్తు పంచకేన శతేన వై. ౭. ప్రాయశ్చిత్తీ భవేద్వీర న చార్హః పూజనే రవేః, కృత్వా సాంతపనం కృచ్ఛ్రం తతః సంపూజయేద్రవిమ్. ౮. నాన్యదేవప్రతిష్ఠా తు కర్తవ్యా భోజకేన తు, కృత్వా తు తాం ఖగశ్రేష్ఠ ప్రాయశ్చిత్తీయతే నరః. ౯. తస్మాత్తు తాం న కుర్యాద్వై భోజకః ఖగసత్తమ, ముక్త్వా తు భాస్కరం దేవం నాన్యం దేవం నివేదయేత్. ౧౦. కృత్వాధివేశం దేవానాం బ్రహ్మాదీనాం ఖగాధిప, భోజకో న స్పృశేద్భానుం కుర్యాత్కృచ్ఛ్రం చ శుద్ధయే. ౧౧. కృత్వా తు

వలెను. తరువాత సూర్యపూజార్హుఁ డగును. బుద్ధిమంతుఁడగువాఁడు వాడినవస్తువులను, దూషితవస్తువులను, పర్యుషితంబులగుమాలలను సూర్యుని కర్పింపఁగూడదు. పుష్పలోభముచే నెవ్వఁడు దేవుని వివర్ణునిఁగాఁ జేయునో ఆతఁడు మర్త్యార్హుఁడగును. సుగంధిపుష్పంబులనే యర్పింపవలెను. భోజకుఁడు లోభియైనచో బ్రహ్మహత్యచేసిన పాపమును బొందును. మహారౌరవనరకముఁ బొంది శాశ్వతంబు లగుసంవత్సరంబులు బాధపడుచుండును వైనతేయా! తరువాత ధూపదానవిధిని జెప్పెద నాకర్ణింపుము. చందనధూపము నిచ్చిన భాస్కరుఁడు సన్నిధానంబుననుండి యేది గోరిన దాని నిచ్చుచుండును. అగరుధూపము నొసంగిన నభీప్సితంబుల నొసంగును. ఆరోగ్యమును స్త్రీని గోరువాఁడు గుగ్గిలధూపము నర్పింపవలెను. ధూపదానముచే భాస్కరుఁ డెల్లప్పుడును మంగళముల నిచ్చుచుండును ఆరోగ్యమును స్త్రీని సుఖమును గూడ నిచ్చును. శ్రీఖండధూపము నొసంగిన వ్యాపారము సఫలమగును సర్వరసోపేతంబగు రసము నొసంగిన ధృవముగ ధనము లభించును. దేవదారుధూపము నొసంగిన నక్షయం బగునన్నము గల్గును. కుంకుమతో లేపనముఁ జేసిన సర్వకామంబులు సఫలంబు లగును. ఇట్లు చేసినవాఁ డిహ

---

కృచ్ఛ్రం విధివచ్ఛుద్ధేన్ప్రోతుం ఖగాధిప, తతః పూజయితుం భానుమధికారీ భవేన్నరః. ౧౨. న విజ్ఞాత్రం ప్రదాతవ్యం న మ్లానం న చ దూషితమ్, న చ పర్యుషితం మాల్యం దాతవ్యమృద్ధిమిచ్ఛతా. ౧౩. దేవముల్లోచయేద్యస్తు స ఖలః పుష్పలోభతః, పుష్పాణి చ సుగంధీని భోజకో నేతరాణి చ. ౧౪. బ్రహ్మహత్యామవాప్నోతి భోజకో లోభమోహితః, మహారౌరవమాసాద్య పచ్యతే శాశ్వతీః సమాః. ౧౫. హంత తే కీర్తయిష్యామి ధూపదానవిధిం పరమ్, ప్రదానే దేవదేవస్య యేన ధూపేన యత్ఫలమ్. ౧౬. సదా చందనధూపేన సాన్నిధ్యం కురుతే రవిః, ప్రదద్యాన్మానసే చైవ యద్యదిచ్ఛతి మానవః. ౧౭. తథైవాగురుధూపేన వరం దద్యాదభీప్సితమ్, ఆరోగ్యం వా స్త్రియం ప్రేప్సుర్నిత్యదా గుగ్గులం దహేత్. ౧౮. మంగలం ధూపదానేన సదా యచ్ఛతి భానుమాన్, ఆరోగ్యం చ స్త్రియం దద్యాత్సౌఖ్యం చ పరమం భవేత్. ౧౯. సదా కుంకుమధూపేన సౌభాగ్యం లభతే నరః, శ్రీవాసకస్య ధూపేన వాణిజ్యం సఫలం భవేత్. ౨౦. రసం సర్వరసోపేతం దదతోऽర్థాగమో ధ్రువమ్, దేవదారుం చ దహతో భవత్యన్నమథాక్షయమ్. ౨౧. విలేపనం కుంకుమేన సర్వకామఫలప్రదమ్, ఇహ లోకే

లోకంబున సుఖములఁ బొంది యనంతరము స్వర్గమును బొందును చందనము నొసంగిన లక్ష్మి నాయువును గూడఁ బొందును రక్తచందనము నొసంగిన సర్వము లభించును అనేకరోగములచేఁ బీడింపఁబడుచున్నను శీఘ్రముగ నారోగ్యమును బొందును వర్తిగంధము నొసంగిన గొప్ప సుగంధమును బొందును కస్తూరిలేపనముఁ జేసినయెడల నసదృశంబగు నైశ్వర్యము లభించును కర్పూరమిశ్రితంబగు గంధమును బూసినచో ధరాధినాథుఁ డగును దేవాలయము నలికినవాఁడు రోగములనుండి విముక్తుఁడగును భోగి గూడ నగును దేవాలయమును మన్ను వేసి యలికినఁ బదునెనిమిదికుష్ఠములును ఇతరవ్యాధులన్నియును బ్రలయమును బొందఁగలవు లేపనద్రవ్యములన్నింటిలో రక్తచందన ముత్తమమైనది ఇంతకంటె నుత్తమమైనదియు, సూర్యునకుఁ దుష్టినిఁ గలుగఁజేయునదియు లేదుగాన నీరక్తచందనలేపనము చేసినవాని కేలోకము లభింపదు? సర్వకామసమృద్ధుఁడై సూర్యలోకమునఁ బ్రకాశించుచుండును సూర్యాలయము నలికి మండలమును జేయవలెను ఈమండలముచేతనే యారోగ్యమును భోగములను బొందును ఈవ్రతానుష్ఠానంబున వయోనియమము లేదు ఒకసారి లేపనముచే నిట్టిఫలము నొందును మూఁడుమారులు నేడుమారులు నిట్లు లేపనము జేసిన నక్షయసుఖభోగములఁ బొందనగును ఈతీరుగ శుశ్రూషచే దేవతలను బ్రసన్నులఁజేయ

---

సుఖీ భూత్వా దాతా స్వర్గమవాప్నుయాత్ ౨౨ చందనస్య ప్రదానేన శ్రియమాయుశ్చ విందతి, రక్తచందనదానేన సర్వం దద్యాద్దివాకరః ౨౩ అపి రోగశతైర్గ్రస్తైః క్షిప్రారోగ్యమవాప్నుయాత్, వర్తిగంధైశ్చ సౌగంధ్యం పరమం విందతే నరః ౨౪ కస్తూరికాలేపనకైరైశ్వర్యమతులం లభేత్, కర్పూరసంయుతైర్గంధైః క్ష్మాధిపాధిపతిర్భవేత్ ౨౫ చతుఃసమేన గంధేన కిం తుల్యం ప్రాప్నుయాన్నరః, దేవాగారం తు తన్మన్యే భక్త్యా య ఉపలేపయేత్ ౨౬ స రోగాన్ముచ్యతే క్షిప్రం పురుషో భోగవాన్భవేత్, అష్టాదశేహ కుష్ఠాని యే చాన్యే వ్యాధయో నృణామ్, ప్రలయం యాంతి తే సర్వే మృదా యద్యుపలేపయేత్ ౨౭ ప్రలేపనానాం సర్వేషాం రక్తచందనముత్తమమ్, నాతః పరతరం కించిద్భానోస్తుష్టికరం పరమ్. ౨౮ కిం తస్య న భవేల్లోకో యో హ్యనేన ప్రలేపయేత్, సర్వకామసమృద్ధోఽసౌ సూర్యలోకే మహీయతే ౨౯ ఉపలిప్య రవేర్గేహం కుర్యాద్వై మండలం పునః, ఏకేనాథ సమాప్నోతి భాగ్యమారోగ్యముత్తమమ్. 30. త్రిభిః సప్తభిరచ్ఛిన్నా బాలో వాన్యోఽపి యో నరః, తేన ప్రదా

వలయును. కర్మలు చేయుచుండవలెను. చేయువారి నెన్నండును నివారింపరాదు. ఏడుసప్తముల నీరీతిగనే చేయవలెను. ఈసప్తములను భానుఁడు చెప్పినట్లు భక్తితోఁజేసిన మనుష్యుఁడు సర్వపాపములనుండి విముక్తుండగును. జిల్లేడాకులతోఁ జేసిన ధనమును, మిరియములతోఁ జేసిన ప్రియసంగమము, వేపాకుతోఁజేసిన రోగనాశనము, ఫలములతో పుత్త్రులు, ధనధాన్యసువర్ణంబుల నిచ్చిన సర్వస్థలములయందు జయమును కామకుఁడు సర్వకామములను బొందును. పురుషుఁడైనను స్త్రీయైనను యథోక్తంబుగ నీసప్తమీవ్రతము ననుష్ఠించినయెడల పరమపదమును బొందును. వారికి మూఁడులోకంబులయందును దుర్లభంబగున దేదియు నుండదు. ఎవ్వరు భక్తితో లోకనాథుండగు భాస్కరునివ్రతమును ఇంద్రియనిగ్రహముగల్గి చేయుదురో వారలకు వేదమునందుఁ జెప్పఁబడిన సర్వయజ్ఞఫలములు లభించును. బ్రహ్మేంద్రవిష్ణులు గూడ పూజింపఁబడినవారగుదురు. సందేహములేదు. సప్తమీవ్రతమును జేయువాఁ డెవ్వఁడును అంధుఁడు, కుష్ఠురోగి, వికలాంగుఁడు, నిర్ధనుఁడును గాఁజాలఁడుఁ పుత్త్రులనుగోరువాఁడు శాస్త్రవేత్తలై చిరాయువులగుపుత్త్రులను బడయగలఁడు. వారలకు మూఁడులోకంబులయందును దుర్లభంబగున దేదియు నుండదు. భోగముల నపేక్షించువాఁ డీవ్రతానుష్ఠానముచే సర్వభోగ

---

పయేద్దేవాన్కుర్యాత్తాన్న నివారయేత్, అనేన విధినా కుర్యాద్యావత్సః సప్త సప్తమీః. ౩౧. ఏతా వై సప్త సప్తమ్యో యథాప్రోక్తా వివస్వతా, కుర్వీత యో నరో భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే. ౩౨. అర్కసంపుటకైర్విత్తం మరిచైః ప్రియసంగమమ్, నింబపత్రై రోగనాశం ఫలైః పుత్రాన్యథేప్సితాన్, ధనం ధాన్యం సువర్ణం చ తతో దద్యాద్వివస్వతే. ౩౩. జయం ప్రాప్నోతి విపులం కృత్వా సర్వత్ర ఖేచర, సర్వాన్కామాన్కామికస్తు ప్రాప్నుయాన్నాత్ర సంశయః. ౩౪. నరో వా యది వా నారీ యథోక్తం సప్తమీవ్రతమ్, యః కరోతి ఖగశ్రేష్ఠ స యాతి పరమం పదమ్. ౩౫. న తేషాం త్రిషు లోకేషు కించిదస్తీతి దుర్లభమ్, యే భక్త్యా లోకనాథస్య వ్రతినః సంయతేంద్రియాః. ౩౬. సర్వయజ్ఞఫలం తేషాం యథా వేదోదితం భవేత్, బ్రహ్మేంద్రవిష్ణవస్తేన పూజితా నాత్ర సంశయః. ౩౭. నాంధో న కుష్ఠీ న క్లీబో న వ్యంగో న చ నిర్ధనః, కదాపి చ భవేత్కశ్చిద్యశ్చరేత్సప్తమీవ్రతమ్. ౩౮. పుత్రార్థీ శ్రుతిసంపన్నాఁల్లభేత్పుత్రాంశ్చిరాయుషః, న తేషాం త్రిషు లోకేషు కించిదస్తీతి దుర్ల

ముల ననుభవించును. క్రోధలోభప్రమాదాదులచే వ్రతభంగమైనచోఁ బ్రాయశ్చిత్తమును జేసికొని వ్రతము నారంభింపవలెను. వైనతేయా! గురువారముతో నెన్ని సప్తములు చేరియుండెనో యాసప్తములయందు మాల్యధూపదీపాదులచే భాస్కరు నర్చించి యథాశక్తిగ బ్రాహ్మణులను భుజింపఁజేసిన నక్షయంబగు స్వర్గము గల్గును. సప్తమినాఁడు బ్రాహ్మణశ్రేష్ఠుల కన్నము నొసంగిన నాయన్న మాతని కక్షయం బగును. ఆతఁడు సూర్యగృహంబున నుండును. ఇట్లు సప్తమీవ్రతము నుపదేశించితిని. మఱియు నేవ్రతప్రభావముచేఁ గామితఫలమును బొందుదురో యాపది రెండు పేర్లుగల శుద్ధసప్తమిని వివరింతు వినుము. గోమయము, గోమూత్రము నాహారముగాఁ గల్గి లేక వరిపిండి యాహారముగాఁ గల్గి లేక రాలిపోయినయాకు లాహారముగాఁగల్గి లేక పాలను ద్రావి వండినపిండి వస్తువులను దిని లేక జలమును ద్రావి భాస్కరుని పూజింపవలెను. నానావిధంబులగు పుష్పోపహారంబులచేతను,పద్మములచేతను, తెల్లకలువలచేతను, నల్లకలువలచేతను, నానావిధంబులగు గంధంబులచేతను, గుగ్గిలము చందనము మొదలగు ధూపంబులచేతను,కృసరము పాయసము మొదలగునాహారపదార్థంబులచేతను, భూషణంబులచేతను,భక్ష్యవస్త్రాదులచేతను నర్చించిన

---

భమ్, భోగార్థీ లభతే భోగాన్వ్రతేనానేన సువ్రత. ౩౯. క్రోధాత్ప్రమాదాల్లోభాచ్చ వ్రతభంగో యదా భవేత్, ప్రాయశ్చిత్తమిదం కృత్వా పునరేవ వ్రతీ భవేత్. ౪౦. సప్తైవ యావత్సప్తమ్యః సంప్రాప్తా గురుణా ఖగ, తాసు భాస్కరమభ్యర్చ్య మాల్యధూపాదిభిర్నరః, భోజయిత్వా ద్విజాంశ్చక్త్యా ప్రాప్నుయాత్స్వర్గమక్షయమ్. ౪౧. సప్తమ్యాం విప్రముఖ్యేభ్యో యోఽన్నం దద్యాత్ఖగేశ్వర, తదక్షయం భవేత్తస్య స చ సూర్యగృహం వ్రజేత్. ౪౨. ఇతి తే కీర్తితం వీర సప్తమీవ్రతముత్తమమ్, భూయ ఏవాభిధాస్యామి శృణు మే వదతోఽనఘ. ౪౩. యేన వ్రతప్రభావేణ కామికం ఫలమశ్నుతే, సప్తమీం ఖగశార్దూల శుక్లాం ద్వాదశనామికామ్. ౪౪. గోమూత్ర గోమయాహారః షష్ట్యన్నాహార ఏవ చ, అథ వా యావకాహారః శీర్ణపర్ణాశనోఽపి వా. ౪౫. క్షీరాశీ చైవ భక్తం వా సిక్థాహారోఽథ వా పునః, జలాహారోఽథ వా విద్వాన్పూజయేత దివాకరమ్. ౪౬. పుష్పోపహారైర్వివిధైః పద్మసౌగంధికోత్పలైః, నానాప్రకారైర్గంధైశ్చ ధూపైర్గుగ్గులుచందనైః. ౪౭. కృశరైః పాయసాన్నైర్వా వివిధైశ్చ విభూషణైః, అర్చయిత్వా ద్విజశ్రేష్ఠ భక్ష్యవస్త్రాదిభూషణైః. ౪౮. సర్వపక్షఫలం ప్రాప్య

సర్వపతిః ఫలమును బొంది తరువాత సూర్యలోకమును బొందును తపాం తమున గొప్పకులమున జన్మించును. యథాక్రమముగఁ బ్రయత్నపూర్వక ముగ నామములను కీర్తింపవలెను. వైనతేయా! మాఘాది పదిరెండుమాసం బులయందును భాస్కరుని నీరీతిగఁ బూజించుచుండవలెను. రవి, విభావసుఁ డు, వివస్వంతుఁడు, వికర్తనుఁడు, పతంగుఁడు, సహస్రాంశుఁడు అను నీ మొదలగు పండ్రెండునామములు కీర్తించి పై మాసములయందు దేవదుర్ల భుండగు దేవేశునిఁ బూజింపవలెను. సూర్యునినామముల నుచ్చరించుచు నిట్లు పూజింపవలెను. వైనతేయా! గుహ్యంబగు నీవ్రతమును జెప్పితిని. అభక్తునకును, అశిష్యునకు నెన్నఁడును దీనినిఁ జెప్పఁగూడదు. పాప కార్యములను జేయువాని కుపదేశింపఁగూడదు. వ్యాధినాశనమునకై బ్రాహ్మణునకు మాత్ర ముపదేశింపవలెను. అట్లొసంగిన స్వర్గమును బొందును. ఈవ్రతవిధానమును వినిన మానవుఁడు స్వర్గమును బొందును.

ఇది షణ్ణవత్యధికశతతమాధ్యాయము.

---

సూర్యలోకం తతో వ్రజేత్, తపసోంతే తతో వీర కులే మహతి జాయతే. ౪౯. యథాక్రమం ప్రయత్నేన నామాని పరికీర్తయేత్, మాఘే చ ఫాల్గునే మాసి చైత్రే చ గరుడాగ్రజ. ౫౦. వైశాఖే త్వథ జ్యేష్ఠే తు ఆషాఢే శ్రావణే తథా, మాసి భాద్ర పదే వీర తథా చాశ్వయుజే ఖగ. ౫౧. మార్గశీర్షే తథా పౌషే పూజయేత్సతతం రవిమ్, విభావసుం వివస్వంతం భాస్కరం పక్షిసత్తమ. ౫౨. వికర్తనం పతంగం చ సహ స్రాంశుం ఖగాధిప, ఏతాని దేవనామాని మాసేష్వేతేషు ఖేచర. ౫౩. పూజయేద్దేవ దేవేశం దేవానామపి దుర్లభమ్, ఏవం క్రమేణ తీక్ష్ణాంశుం నామభిః పరిపూజయేత్. ౫౪. ఇత్యేవం తే సమాఖ్యాతం మయా గుహ్యమిదం ఖగ, అభక్తాయ న దాతవ్యం నాశిష్యాయ కథంచన. ౫౫. న చ పాపకృతే వీర దాతవ్యం వినతాత్మజ, వ్యాధేస్తు నాశనార్థాయ దేయం విప్రాయ సువ్రత. ౫౬. దత్త్వా స్వర్గమవాప్నోతి శ్రుత్వా చ విధివత్ఖగ. ౫౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సౌరధర్మే సప్తమీకల్పే నామపూజావిధివర్ణనం నామ షణ్ణవత్యధికశతతమోఽధ్యాయః.

## సప్తనవత్యధికశతతమాధ్యాయము.

సప్తాశ్వతిలకుం డిట్లనియె. వైనతేయా! యేయే పుష్పములతోఁ బూజించిన నేయే ఫలము గల్గునో జెప్పెద నాకర్ణింపుము. సూర్యుని మాలతీ కుసుమంబులతోఁ బూజించిన సూర్యునిసన్నిధానవర్తినిగఁ జేయును. గన్నేరు పువ్వులతోఁ జేసిన నారోగ్యమును, శాశ్వతంబగుధనమును, అసమానం బగు నైశ్వర్యమును, విస్తారమగుయశస్సును గల్గును. మల్లికాకుసుమంబులతోఁ జేసిన భగవత్సమ్ముఖంబున నుండును. పుండరీకంబులతోఁ జేసిన సౌభాగ్యమును పరమైశ్వర్యమును బొందును. ఉత్పలములచేతను మల్లెల చేతను చేసిన యశస్సు విద్య బలము గల్గును. నానావిధంబులగు కుసుమంబులతోఁ జేసిన శీఘ్రముగ రోగవిముక్తుండగును అనుదినము సూర్యు నర్చించు మానవునకు అక్షయమగునన్నము గల్గియుండును. మందార కుసుమములతోఁజేసిన సర్వకుష్ఠములు నశించును. మారేడుపత్రితోను పువ్వులతోను జేసిన గొప్పసంపదను బొందును. జిల్లేడుపువ్వులదండ నొసంగిన సూర్యుఁడెప్పుడువరదానసమర్థుఁడై యుండును. పొగడపూలమాలచేఁ బూజించిన రూపవతి యగుకన్య లభించును. కింశుకపుష్పములచేఁ బూజించిన భాస్కరుఁడు పీడింపఁడు. అగస్త్యకుసుమంబులచేఁ జేసిన అనుకూలసిద్ధి గలుగును. సంపెంగమాలతోఁ బూజించిన రూపవతియగుకన్యను స్వయ

---

సప్తాశ్వతిలక ఉవాచః—అతః పరం ప్రవక్ష్యామి పుష్పధూపాదికావికమ్, యేన యేన తు దానేన తత్తత్ఫలమవాప్నుయాత్. ౧. మాలతీకుసుమైః పూజా భవేత్సాన్నిధ్యకారికా, ఆరోగ్యం కరవీరైస్తు భవత్యర్థశ్చ శాశ్వతః. ౨. ఐశ్వర్యమతులం చైవ యశశ్చ విపులం తథా, మల్లికాయాశ్చ కుసుమైర్భగవత్సమ్ముఖో భవేత్. ౩. సౌభాగ్యం పుండరీకైస్తు పరమైశ్వర్యమాప్నుయాత్, కమలోత్పలకుందైస్తు యశో విద్యాబలం భవేత్. ౪. నానావిధైః సుకుసుమైః క్షిప్రం రోగాత్ప్రముచ్యతే, భవత్యక్షయమన్నం చ నిత్యమర్చయతో రవిమ్. ౫. మందారకుసుమైః పూజా సర్వకుష్ఠనివారిణీ, బిల్వస్య పత్రకుసుమైర్మహతీం శ్రియమాప్నుయాత్. ౬. అర్కస్రజా భవత్యర్కః సర్వదా వరదః ప్రభుః, ప్రదద్యాద్రూపిణీం కన్యామర్చితో బకులస్రజా. ౭. కింశుకైః పూజితో దేవో న పీడయతి భాస్కరః, అగస్త్యకుసుమైః సిద్ధిం సానుకూల్యం ప్రయచ్ఛతి. ౮. స్వయం రూపవతీం దద్యాత్పూజితశ్చంపకస్రజా, నిరుద్వేగో భవేన్నిత్యం

ముగ నిచ్చును. పుష్పమాలచేఁ బూజించిన దిగులు లేనివాఁడగును. అశోక కుసుమములచే నర్చించిన శోకరహితుఁడగును. ఆమ్రాతక కుసుమము నిర్మాల్యమువలె నగపడును. క్రొత్తవిగాక పర్యుషితంబు లగుపదార్థములు పూజోపయుక్తంబులు గావు గాన వానిని వర్జింపవలెను. తొమ్మిదింటిచేఁ బూజించిన నచలంబగుకీర్తిని పదింటిచే నుత్తమంబగు సుఖమును పదునొక టింటిచే నిహలోకంబున భోగంబులను బొందును. సందేహము లేదు. పది రెండింటిచే నచలంబగు రాజ్యమును ద్వాదశాఖ్యను బొందును. ప్రథ మమున భూరూపమును భక్తితోఁ బూజింపవలెను. తరువాత భువర్రూప మును నమస్కరింపవలెను. తరువాత స్వర్గరూపమును నమస్కరింపవలెను. తరువాత నాల్గవదగు మహర్రూపమునకు నైదవదగు జనరూపంబు నకును నారవదగు తపోరూపంబునకును నేడవదగు సత్యరూపంబునకును నమస్కరింపవలెను ఎనిమిదవదగు భూర్భువర్రూపంబును తొమ్మిదవదగు భూర్భువస్సువర్రూపంబును పదియవదగు భూర్భువస్సువర్మహర్జనస్తపో రూపంబును పదునొకండగునుల్కారూపంబునకును నమస్కారమును జేయ వలెను పదిరెండవదగుఖషోల్కారూపంబునకును నామముల నుచ్చరించుచు నమస్కరింపవలెను. ప్రణవపూర్వకముగ నామము లుచ్చరింపవలయును. ఈరీతిగ మండలములను జేయువాఁడు క్రమముగా నిట్టి వెనుకటి ఫలమును బొందును. ఘృతదీపము నొసంగుటచేఁ జక్షుష్మంతుఁ డగును.

---

పూజితః పుష్పమాలయా. ౯. అశోకకుసుమైర్దేవమర్చయేద్యో దివాకరమ్, ఆమ్రాతకస్య కుసుమం నిర్మాల్యమివ దృశ్యతే. ౧౦ అప్రత్యగ్రం బహిర్యస్మాత్తస్మాత్తత్పరివర్జయేత్, నవభిస్త్వచలాం కీర్తిం దశభిః సుఖముత్తమమ్. ౧౧. భోగానేకాదశేనేహ ప్రాప్నుయా న్నాత్ర సంశయః, ద్వాదశేనాచలం రాజ్యం ద్వాదశాఖ్యమవాప్నుయాత్. ౧౨. ప్రథమం పూజయేద్భక్త్యా భూరూపం ప్రణమేత్సదా, భువర్నమో ద్వితీయం చ తృతీయం స్వర్నమేన్నరః. ౧౩. మహర్నమశ్చతుర్థం తు పంచమం తు జనో నమః, తపో నమస్తథా షష్ఠం నమః సత్యం తు సప్తమమ్. ౧౪. అష్టమం భూర్భువశ్చేతి నవమం ఖగసత్తమ, దశమం షడతో వీర నమోల్కాయ తథా పరమ్. ౧౫. ద్వాదశం తు ఖషోల్కేతి ఓం నమః పూజయేత్ఖగ, ఏవం మండలకారీ తు క్రమాదేవం ఫలం లభేత్. ౧౬. ఘృతదీపప్రదానేన చక్షుష్మాఞ్జాయతే నరః, కటుతైలస్య దీపేన.

కటురసయుక్తంబు లగుతైలంబులచే దీపము నొసంగిన శత్రువులు నశింతురు. ఇప్పనూనెతో దీపముంచిన సౌభాగ్యము గల్గును. పుష్పధూపాదులచే విధిప్రకారము పూజించి తరువాత శక్తికొలఁది నైవేద్యమును సమర్పింపవలెను. పుష్పంబులలో జాజిపుష్పంబులును, ధూపంబులలో చందనము, గంధంబులలో కుంకుమ, నివేద్యపదార్థములలో మోదకములును సూర్యునకుఁ బ్రియములుగాన వానిని సమర్పించిన భాస్కరుఁడు సంతోషించి సన్నిధానవర్తియై మెలంగును. ఇష్టములగు వరముల నిచ్చి దాతకు స్వర్గమును గలుగఁజేయును. ఈవిధి ప్రకారము పూజించి ప్రదక్షిణం బొనర్చి నమస్కరించిన మంచివిమానమునెక్కి సూర్యసాలోక్యమును బొందును. మఱలఁ బూజించి యథేష్టముగా జపముఁ జేయవలెను. శాస్త్రప్రకార మగ్నిహోత్రమున హోమమును జేయవలెను. ఈరీతిగ నొక్కొక్కటి చొప్పున నేడుసప్తములఁ జేయవలెను. ఉదకము మొదలగువాటిని పానముఁజేసి యేసప్తమిని జేయుదురో యిదియే శుభప్రదంబగు నుదకసప్తమి యని చెప్పఁబడును. ఏసప్తమి నిదివఱకు నీకుఁ జెప్పకుంటినో దానినిఁ జెప్పెద వినుము. దానిని వరాటిక యందురు క్రమప్రాప్తంబగున దెద్దియైనను నెంతయైనను భక్షింపవలయును. ఈదగిన

---

శత్రూణాం సంక్షయో భవేత్, మధూకానాం తు తైలేన సౌభాగ్యం పరమం లభేత్. ౧౭. సంపూజ్య విధివద్దేవం పుష్పధూపాదిభిర్నరః, యథాశక్త్యా తతః పశ్చాన్నైవేద్యం తు ప్రకల్పయేత్. ౧౮. పుష్పాణాం ప్రవరా జాతీ ధూపానాం చైవ చందనమ్, గంధానాం కుంకుమం శ్రేష్ఠం మోదకాశ్చ నివేదనే. ౧౯. ఏభిస్తుష్యతి దేవేశః సాన్నిధ్యం చాధిగచ్ఛతి, దదాతి ప్రవరానిష్టాన్దాతుశ్చ స్వర్గతిం తథా. ౨౦. ఏవం సంపూజ్య విధివత్కృత్వా చాపి ప్రదక్షిణామ్, ప్రణమ్య శిరసా దేవం భాస్కరం తిమిరాపహమ్, ఆరూహ్య సువిమానం స యాతి భానోః సలోకతామ్. ౨౧. పునః సంపూజ్య దేవేశం జపం కుర్యాద్యథేష్టకమ్, హుతాశనే చ జుహుయాద్విధిదృష్టేన కర్మణా, ఏవమేకైకశః కార్యాః సప్తమ్యః సప్త సర్వదా. ౨౨. ఉదకప్రసృతిం పీత్వా క్రియతే యా తు సప్తమీ, సా జ్ఞేయా సుఖదా వీర సద్దైవోదకసప్తమీ. ౨౩. యా కాచిత్సప్తమీ నోక్తా తాం తే వక్ష్యామి సర్వదా, వరాటికా క్రమేణాప్తం యత్కించిత్ప్రతిభక్షయేత్. ౨౪. అనేన దేయమూల్యేన యల్లబ్ధం తత్ప్రభక్షయేత్, అభక్ష్యం

మూల్యముచే నెంత లబ్ధమగునో దానిని భక్షింపవలెను. ఈవిషయంబున నది భక్ష్యము నిది యభక్ష్యమని విచారింపఁదగదు.

ఇది సప్తనవత్యధికశతతమాధ్యాయము.

---

## అష్టనవత్యధికశతతమాధ్యాయము.

శతానీకుఁ డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! లోకంబున ముఖ్యదైవత మెద్ది? ఎవ్వని పూజాస్తోత్రములచే మానవులు శుభముల నొందుదురు? సర్వధర్మములలో నేది యుత్తమము? బ్రహ్మాదు లెవ్వనిఁ బూజించు చుందురు? దేవతలలో నాద్యుఁ డెవ్వఁడు? తెల్పుమన సుమంతుఁ డిట్లనియె. మహారాజా! యీవిషయమున పాపనాశకంబగు భీష్మవ్యాసులసంవాద మును దెల్పెద నాకర్ణింపుము. గంగాతటంబున సుఖాసీనుఁడై యున్న నారాయణసదృశుఁడుగు వ్యాసునిఁ జూచి భీష్ముఁ డాతని నమస్కరించి బ్రాహ్మణభక్తితో దేవదేవుఁడగు భాస్కరుని హృదయస్థంబగు మాహాత్మ్య మును దెల్పుమని యీరీతిగ నడిగెను. భగవన్ బ్రాహ్మణోత్తమా! పరా

---

చాపి భక్ష్యం వా నాత్ర కార్యా విచారణా. ౨౫.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు వరాటికావర్ణనం నామ సప్తనవత్యధికశతతమోఽధ్యాయః.

---

శతానీక ఉవాచః—కిమేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణమ్, స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాః శుభమ్. ౧. కో ధర్మః సర్వధర్మాణాం కశ్చ పూజ్యో మతస్తవ, బ్రహ్మాదయః కమర్చంతి కశ్చాదిస్త్రిదివౌకసామ్. ౨. సుమంతు రువాచ.—అత్రాహం తే ప్రవక్ష్యామి సంవాదం పాపనాశనమ్, భీష్మస్య నరశార్దూల వ్యాసస్య చ మహాత్మనః. ౩. సుఖాసీనం మహావ్యాసం గంగాకూలే ద్విజోత్తమ, తం దృష్ట్వా సుమహాతేజా జ్వలంతమివ పావకమ్. ౪. సాక్షాన్నారాయణం దేవం తేజసా దివ్యసన్నిభమ్, ప్రణమ్య శిరసా వీర సర్వశాస్త్రాలయం పరమ్. ౫. మహాభారతకర్తారం వేదార్థనికషం పరమ్, ఆచార్యం పరమర్షీణాం రాజర్షీణాం చ భారత. ౬. కర్తారం కురు వంశస్య దైవతం పరమం మమ, పప్రచ్ఛ కురుశార్దూలో ద్విజభక్త్యా సమన్వితః. ౭. దేవదేవస్య మాహాత్మ్యం చిత్తస్థం భాస్కరస్య తు, స మహాత్మా మహాతేజా భీష్మః పూర్వం మునిం తథా. ౮. భీష్మ ఉవాచ.—భగవన్ ద్విజశార్దూల పారాశర్య మహా

శరపుత్రా! సచరాచరవిషయకంబగు వాఙ్మయమునంతయు నాకుఁ జెప్పితివి. భాస్కరువిషయమై సంశయ మిప్పటికిని వదలలేదు రుద్రాదులాదియందు సూర్యునకు ననంతరము బ్రహ్మాదులకు నమస్కరింపవలె ననుటకుఁ గారణంబును యథార్థముగా నాకుఁ బ్రసాదింపుము. ఈయాదిత్యుఁ డెవఁడు? ఎవనినుండి యుత్పన్నుఁడయ్యె? ఎవ్వఁ డీపేరుతో వ్యవహరింపఁబడును? యథాన్యాయముగఁ జెప్పి నాకు సంతోషము గల్గఁజేయుము. అన వ్యాసుఁ డిట్లనియె. వత్సా! దీని నెఱుఁగుట చాల కష్టము. నీవు మూఢుఁడవై యుంటివి. బ్రహ్మాదులాతని యర్చనాదులచే స్తోత్రములఁజేయుచు బ్రహ్మత్వాది సిద్ధులఁ బొందిరి. సర్వదేవతల కాదిభూతుఁడగు దైవత మాదిత్యుఁడే. ఆతఁడే దిక్కులయందలి యంధకారమును నశింపఁజేయును. ఆతనిధర్మమే పరమధర్మము ఆతఁడే పూజ్యతముఁడగుదైవము బ్రహ్మాదులందఱు నాతని నర్చించుచుందురు. ఆతఁడే దేవతల కాదిభూతుఁడు. కశ్యపునిభార్య యదితి యగుటవలన నామెయం దుద్భవించుటంజేసి యాదిత్యుఁ డయ్యెను. లేదా దేవాసురగంధర్వసహితంబును యక్షరక్షోగణసహితంబును రుద్రోపేంద్రబ్రహ్మాదియుతంబగు నీజగమునకంతకు నాదికర్త యగుటంజేసి యాదిత్యుఁ డయ్యెను. బ్రహ్మదేవుఁడు ముఖంబునుండియు, రుద్రుఁడు వక్షమునుండి యుపేంద్రుఁడు దక్షిణహస్తమునుండి, విధాత వామ

---

మతే, మమాఖ్యాతం త్వయాసర్వం వాఙ్మయం సచరాచరమ్. ౯. భాస్కరస్య మునిశ్రేష్ఠ సంశయోద్యాపి వర్తతే, ఆదౌ తస్య నమస్కారమన్యేషాం తదనంతరమ్. ౧౦. బ్రహ్మాదీనాం తు రుద్రాద్యైర్బ్రూహి తత్త్వేన హేతునా, క ఏష భాస్కరో బ్రహ్మన్కుతో జాతః క ఉచ్యతే. ౧౧. కీర్తయస్వ యథాన్యాయం కౌతుకం హి పరం మమ, కుశలో హి భవాఁల్లోకే తస్మాత్త్వం వక్తుమర్హసి. ౧౨. వ్యాస ఉవాచ.—అహో తవ మహత్కష్టం ప్రమూఢోఽసి న సంశయః, స్తువంతశ్చ తమర్చాభిః సిద్ధా బ్రహ్మాదయః సురాః. ౧౩. సర్వేషామేవ దేవానామాదిరాదిత్య ఉచ్యతే, స హంతి తిమిరం సర్వం దిగ్విదిక్షు వ్యవస్థితమ్. ౧౪. స ధర్మః సర్వధర్మాణాం స చ పూజ్యతమో మతః, బ్రహ్మాదయస్తమర్చంతి స చాదిస్త్రిదివౌకసామ్. ౧౫. అదితిః కశ్యపసతీ ఆదిత్యస్తేన చోచ్యతే, ఆదికర్తాథ వా యస్మాత్తస్మాదాదిత్య ఉచ్యతే. ౧౬. తస్మాదేతజ్జగత్సర్వమాదిత్యాత్సంప్రవర్తతే, సదేవాసురగంధర్వం సయక్షోరగరాక్షసమ్. ౧౭. రుద్రోపేంద్రౌ తథేంద్రశ్చ బ్రహ్మా దక్షోథ కశ్యపః, ఆదిత్యదేవతాః సర్వే తథాన్యే దేవదానవాః. ౧౮. ముఖా

హస్తమునుండి, దక్షుఁడు వామపాదతలంబునుండి, కశ్యపుఁడు దక్షిణపాద తలమునుండియు నుద్భవించెను. ఈరీతిగ దేవాసురమనుష్యపక్షిజాతంబు లన్నియు నుత్పన్నంబు లాయెను. ఈకారణముచే సర్వదేవతలయందు నాదిత్యుఁడు పూజ్యుఁడు. నావిని భీష్ముఁ డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! యీరీతిగ దిక్కులయందుఁ బ్రకాశించు నాతనికిఁ బ్రభావముండినచోఁ ద్రిసంధ్యలయందును రాక్షసులచే నెందులకై పరిభవింపఁబడుచుండెను? బ్రాహ్మణులు రక్షింపవలసిన యవసర మేల గల్గె? ఎందులకై చక్రమువలె భ్రమించుచుండెను? అగ్రాహ్యుఁడగు నీతఁ డెందులకై రాహుగ్రస్తుఁ డగునో చెప్పుమన వ్యాసుఁ డిట్లనియె. పిశాచోరగరాక్షసదానవులను దక్షిణాగ్ని దహించును. భాస్కరుఁడు క్రోధమువలన దానినాక్రమించును. త్రిసంధ్యలయందును ద్రిమూర్తులు రవిమండలమున నుందురు. ఆసమయ ప్రభావ మట్టిది. అప్పుడు పూజించినవారికి దృష్టాదృష్టఫలంబులు గల్గును. ఆతని నొక్కనినే యుద్దేశించి యీధర్మము ప్రవృత్తమాయెను. ఆతని నమస్కరించినను స్తోత్రముజేసినను సర్వదేవతల నమస్కరించినటులను స్తోత్రము జేసినటుల నగును. బ్రాహ్మణులచే మూఁడు సంధ్యలయందును మూఁడుపర్యాయములు నమస్కరింపఁబడును. రాహు వాదిత్యబింబమున కధోభాగమున నుండెను. అమృతార్థియై రాహువు సూర్యునినుండి

---

ద్భూతో విరించిస్తు రుద్రో వక్షస్థలాత్తతః, ఉపేంద్రో దక్షిణాద్ధస్తాద్ధాతా వామకరాత్తథా. ౧౯. వామపాదతలాద్దక్షో దక్షిణాత్కశ్యపస్తథా, ఇత్యుత్పన్నాస్తథా చాన్యే దేవాసురనరాః ఖగాః, తేనాసౌ దేవ ఆదిత్యః సర్వదేవేషు పూజితః. ౨౦. భీష్మ ఉవాచ.— యదీత్థం గీయతే వీర దిగ్విదిక్షు స భాస్కరః, యది తస్య ప్రభావోఽయం పారాశర్య జగత్పతేః. ౨౧. స కిమర్థం త్రిసంధ్యం తు రాక్షసైః పరిభూయతే, ద్విజైః సంరక్ష్యతే భూయశ్చక్రవద్భ్రమతే పునః, రాహుణా గృహ్యతేఽగ్రాహ్యస్తత్కిమర్థం ద్విజోత్తమ. ౨౨. వ్యాస ఉవాచ.—పిశాచోరగరక్షాంసి డాకినీదానవాంస్తథా, దక్షిణాగ్నిర్దహేత్క్రోధాత్తమాక్రామతి భాస్కరః. ౨౩. త్రిసంధ్యం తు త్రయో దేవాః సాన్నిధ్యం రవిమండలే, ముహూర్తస్య ప్రభావోఽయమసాధ్యే దృష్టకే తథా. ౨౪. తమేకమేవ ముద్దిశ్య లోకే ధర్మః ప్రవర్తతే, నమస్కృతే స్తుతే తస్మిన్సర్వే దేవా నమస్కృతాః. ౨౫. త్రిసంధ్యం వసుధాదేవైర్వ్యాపకస్త్రిః ప్రణమ్యతే, రాహురాదిత్యబింబస్య స్థితోఽధస్తాన్న సంశయః. ౨౬. అమృతార్థి విమానస్థో యావత్సంస్రవతేఽమృతమ్, విమ్భానాం

యమృతమును పానముచేయునప్పుడు రాహువిమానముచే నంతరిత మగుబింబము గ్రస్త మనఁబడును. అంతియేగాని యెవ్వఁడును సూర్యుని గ్రసింపఁజాలఁడు. ఆతఁడే దహించును. దివారాత్రిముహూర్తజ్ఞానము నకై తిరుగుచుండును. ఆదిత్యుఁడు లేనిచో దినముగాని రాత్రిగాని తర్ప ణముగాని లేదు. ధర్మాధర్మచరాచరంబు లాతనిచేఁ జూడఁబడుచుండును. ఆదిత్యుఁడే సర్వరక్షకుఁడు; సర్వస్రష్ట. నీవు నన్నేమి యడిగితివో దాని నంతయుఁ దెల్పితిని.

ఇది అష్టనవత్యధికశతతమాధ్యాయము.

---

## ఏకోనద్విశతతమాధ్యాయము.

భీష్ముఁ డిట్లనియె. దేనిచే నాదిత్యుఁడు శీఘ్రముగ వర మొసఁగునో దాని వినఁగోరెద నన వ్యాసుఁ డిట్లనియె. పూజాహోమజపధారణలచేత మండలమును జేసి తద్దీక్షానియమ మూని తద్గతమనస్కుఁడై భక్తితో నారాధించువాని కచిరకాలమున భాస్కరుఁడు వరప్రదుఁడగును. బల సిద్ధిని వీర్యమును ధనధాన్యములను సువర్ణమును సౌభాగ్యసంపదలను

---

తరితం బింబమాదిశేద్గ్రహణం తతః. ౨౭. న కశ్చిద్ధర్షితుం శక్త ఆదిత్యో దహతే ధ్రువమ్, దివారాత్రిముహూర్తానాం జ్ఞానాయాక్రమతే రవిః. ౨౮. నాదిత్యేన వినా రాత్రిర్న దినం న చ తర్పణమ్, నాధర్మో నాథ వా ధర్మస్తేన దృష్టం చరాచరమ్. ౨౯. ఆదిత్యః పాతి వై సర్వమాదిత్యః సృజతే సదా, ఏతత్సర్వం సమాఖ్యాతం యత్పృష్టం భవతా మమ. ౩౦.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే వ్యాసభీష్మసంవాదే
అష్టనవత్యధికశతతమోఽధ్యాయః.

---

భీష్మ ఉవాచః—స ఆదిత్యో భవేద్యేన అచిరాత్తు వరప్రదః, తదహం శ్రోతు మిచ్ఛామి విప్ర మాం బ్రూహి తత్త్వతః. ౧. వ్యాస ఉవాచ.—పూజయా జపహో మేన ధ్యానధారణయా సహ, సకలం మండలం కృత్వా తద్దీక్షాం సమయం తథా. ౨. లబ్ధ్వారాధయతే యస్తు భక్త్యా తద్గతమానసః, తస్య భానుర్భవేద్వీర అచిరాత్తు వరప్రదః. ౩. బలసిద్ధిం మహద్వీర్యం ప్రతాపం చ స్వకాయనమ్, ధనం ధాన్యం సువర్ణం చ

ఆయురారోగ్యకీర్తులను పుత్రులను నిచ్చును. సౌరవిధిచే దివాకరునిఁ బూజించిన సర్వకామములఁబొంది యనంతర మాదిత్యలోకము నొందును. భీష్ముఁ డిట్లనియె. మహాత్మా! యేస్నానముచే మానవుఁ డమలుఁడై రవి పూజార్హుఁ డగునో రహస్యమగు నాసౌరస్నానవిధిని నాకెఱిఁగింపుమన వ్యాసుఁ డిట్లనియె. శుభ్రమగుస్థానమున మంత్రముతో మృత్తికను గ్రహించి, హకారటకార రేఫఫకారములను కలిపి యుచ్చరించిన మృత్తికాహరణమంత్రమగును. ఆమృత్తికతో స్నానముఁ జేయవలెను తరువాత మిగిలినమంటితో శరీరమందలి మలము పోవుటకై మఱల స్నానముఁ జేయవలెను. తోల్త గడ్డి మొదలగునవిలేని శుద్ధమృత్తికను మూఁడున్నర పాలుగావించి భాస్కరమంత్రము నుచ్చరించుచు నస్త్రమంత్రముతో నొకపాలును భాస్కరమంత్రముతో నొకపాలు నొసంగి మంత్రముచే మూఁడవపాలును స్పృశించి జపించి నీట నలుదిక్కులఁ జల్లిన జలము శుద్ధమగును. ఆజలమునుకలంచి స్నానమాడవలయును. తనశరీరమున నాజలమును ప్రోక్షించుకొని విఘ్ననివృత్తికొఱకు నలుదిక్కులయందుఁ బ్రోక్షింపవలెను. తరువాత ముండనముఁజేసుకొని తూర్యధ్వనులు జరుగు

రూపం సౌభాగ్యసంపదమ్. ౪. ఆరోగ్యమాయుః కీర్తిం చ యశః పుత్రాంశ్చ మానద, దదతే నాత్ర సందేహో యస్య తుష్టో దివాకరః. ౫. ధర్మమర్థం తథా కామం విద్యాం మోక్షశ్రియం తథా, దదతే భాస్కరస్తుష్టో నరాణాం నాత్ర సంశయః. ౬. సౌరేణ విధినా తాత పూజయిత్వా దివాకరమ్, సర్వాన్కామానవాప్నోతి తథాదిత్యాలయం నృప. ౭. భీష్మ ఉవాచ.—సౌరస్నానవిధిం బ్రూహి సరహస్యం మహామతే, యేన స్నాతోఽమలో యాతి నరః పూజయితుం రవిమ్. ౮. వ్యాస ఉవాచ.—హంత తే సంప్రవక్ష్యామి స్నానం పాపప్రణాశనమ్, శుచౌ మనోరమే స్థానే సంగృహ్యాస్త్రేణ మృత్తికామ్. ౯. సంధిసంఘో హకారస్తు టరేఫోఫసమన్వితే, అనేనాస్త్రేణ సంగృహ్య తతః స్నానం సమాచరేత్. ౧౦. మలస్నానం తతః పశ్చాచ్ఛేషార్ధేన తు కారయేత్, భాగత్రయం తు సార్ధం తు తృణపాషాణవర్జితమ్. ౧౧. ఏకమస్త్రేణ చాలభ్య తథాన్యం భాస్కరేణ తు, అంగం చైవ తృతీయేన అభిమంత్ర్య సకృత్సకృత్. ౧౨. జప్త్వాస్త్రేణ క్షిపేద్దిక్షు నిర్విఘ్నం తు జలం భవేత్, సూర్యతీర్థే ద్వితీయేన అభిమంత్ర్య సకృత్సకృత్. ౧౩. గుండయిత్వా తతః స్నాయాదితి తీర్థేషు మానవః, తూర్యశంఖనినాదేన

చుండఁగా స్నానముఁజేసి యాచమనముఁజేసి మంత్రరాజము నుచ్చరించి మఱల స్నానముఁ జేయవలెను. "హ్రామ్ హ్రీమ్ సః" అను నిది మంత్రరాజమగును. తరువాత దేవఋషి పితృతర్పణములను జేయవలెను. మఱల స్నానముఁజేసి సూర్యున కుదకాంజలి నిచ్చి యాత్ర్యక్షరమంత్రమును జపింపవలెను. ఏకచిత్తుఁడై రాగిపళ్లెములోఁ గరవీరపుష్పములు తిలతండులకుశగంధరక్తచందనధూపముల నుంచుకొని యాపళ్లెమును తలనిడుకొని భూమిపై మోఁకాళ్లను మోపి సూర్యున కర్ఘ్యము నియ్యవలెను. ఇట్లుచేసిన సర్వపాప వినిర్ముక్తుఁడగును. పూర్వోక్తదానయోగ్యకాలములయందుఁ జేయఁబడిన సహస్రదానము లీయర్ఘ్యమునకు సరిరావు. ఇట్లర్ఘ్యము నిచ్చువాఁడు భాస్కరసాయుజ్యమును బొందును. దీక్షామంత్రవిహీనుఁడైనను ఒకసంవత్సర మర్ఘ్యము నిట్లిచ్చిన ననంతఫలము

---

ధ్యాత్వా దేవం దివాకరమ్. ౧౮. స్నాత్వా రాజోపచారేణ పునరాచమ్య యత్నతః, స్నానం కృత్వా తతో భీష్మ మంత్రరాజేన సంయుతమ్.౧౫. హరేఫా బిందుయుక్తశ్చ తథాన్యో దీర్ఘయా-సహ, మాత్రయా రేఫసంయుక్తో హాకారో బిందునా సహ. ౧౬. సకారః సవిసర్గస్తు మంత్రరాజోఽయముచ్యతే, తతస్తు తర్పయేన్మంత్రాన్సర్వాంస్తాంస్తు కరాగ్రజైః. ౧౭. పర్వణామూర్ధ్వతో దేవాః సవ్యేన మునయస్తథా, పితరశ్చాపసవ్యేన తద్బీజేన ప్రతర్పయేత్. ౧౮. యద్గీతం ప్రవరం లోకే అక్షరాణాం మనీషిభిః, తద్బిందుసహితం ప్రోక్తం హృద్బీజం నాత్ర సంశయః. ౧౯. కృత్వా వామకరే హస్తాద్ధ్యాత్వా ప్రాజ్ఞో విధానవిత్, ఏవం స్నాత్వా విధానేన సంధ్యాం వందేద్విధానతః. ౨౦. తతో విద్వాన్ క్షిపేత్పశ్చాద్భాస్కరాయోదకాంజలిమ్,జపేచ్చ త్ర్యక్షరంమంత్రం షణ్ముఖం వా యదిచ్ఛయా. ౨౧. మంత్రరాజేతి యః పూర్వం తవాఖ్యాతో మయా నృప, పశ్చాత్తీర్థే తు మంత్రాంస్తు సంహృత్య హృదయం న్యసేత్. ౨౨. మంత్రైరాత్మాన మేకత్ర కృత్వా హ్యర్ఘ్యం ప్రదాపయేత్, రక్తచందనగంధైస్తు శుచిస్నాతో మహీతలే. ౨౩. కృత్వా మండలకం విత్తమేకచిత్తో వ్యవస్థితః, గృహీత్వా కరవీరాణి సంస్థాప్య తామ్రభాజనే. ౨౪. తిలతండులసంయుక్తం కుశగంధోదకేన తు, రక్తచందనధూపేన యుక్తమర్ఘ్యం ప్రసాధ్య తత్. ౨౫. కృత్వా శిరసి తత్పాత్రం జానుభ్యామవనిం గతః, పూర్వమంత్రేణ సంయుక్తమర్ఘ్యం దద్యాత్తు భానవే. ౨౬. ముచ్యతే సర్వపాపైస్తు యో హ్యేవం వినివేదయేత్, యద్వ్యగాదిసహస్రేణ వ్యతీపాతశతేన చ. ౨౭. అయనానాం సహస్రేణ చంద్రస్య గ్రహణే తథా, గవాం శతసహస్రేణ యత్ఫలం

గల్గును దీక్షితునిఁ గూర్చి వేర చెప్పనేల? ఆతఁడు మఱల జన్మింపఁడు సూర్యునందే యెల్లప్పుడును లీనుఁడై యుండును ఈజన్మంబున సౌభాగ్యాయురారోగ్యసంపదలుఁ బరంబున ముక్తియు నాతనికిఁ గల్గును లోకోపకారమునకై యీస్నానము నాచేఁ జెప్పఁబడినది

ఇది ఏకోనద్విశతతమాధ్యాయము

---

## ద్విశతతమాధ్యాయము

భీష్ముం డిట్లనియె మహాత్మా! స్నానవిధిని జెప్పితివి అర్చనావిధిని జెప్పఁగోరెద ననిన వ్యాసుం డిట్లనియె వివిక్తదేశమున భద్రాసనారూఢుఁడై సరళీకృతవిగ్రహుఁడై ప్రాఙ్ముఖుఁడై యంగన్యాసమును జేయవలెను అంగుష్ఠాదికనిష్ఠికాంతము హృదయాదిషడంతము (అస్త్రాయ ఫట్) అంగన్యాసమును జేయవలెను నేత్రబీజమును జెప్పుచు నేత్రపర్యంత మెత్తి యర్ఘ్యమును విడువవలెను తరువాత ప్రాణాయామ

---

జ్యేష్ఠపుష్కరే, దత్తే కురుకులశ్రేష్ఠ తదర్ఘ్యేణ ఫలం లభేత్ ౨౮ దీక్షామంత్రవిహీనోఽపి భక్త్యా సంవత్సరేణ తు, ఫలమర్ఘ్యేణ వై వీర లభతే నాత్ర సంశయః ౨౯ యః పునర్దీక్షితో విద్వాన్విధినార్ఘ్యం నివేదయేత్, నాసావుత్పద్యతే భూమౌ స లయం యాతి భాస్కరే ౩౦ ఇహ జన్మని సౌభాగ్యమాయురారోగ్యసంపదామ్, అచిరాద్భవతే వీర స భార్యాసుఖభాజనమ్ ౩౧ ఏష స్నానవిధిః ప్రోక్తో మయా సంక్షేపతస్తవ, హితాయ మానవేంద్రాణాం సర్వపాపప్రణాశనః ౩౨

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు భీష్మవ్యాససంవాద ఏకోనద్విశతతమోఽధ్యాయః

---

భీష్మ ఉవాచ — కథితస్తే స్నానవిధిర్బ్రహ్మన్పాపహారకః, సమ్యగ్బ్రూహ్యర్చనవిధిం పూజయిష్యామి యేన వై ౧ వ్యాస ఉవాచ — హంత తే సంప్రవక్ష్యామి విధిమాదిత్యపూజనే, వివిక్తే విజయస్థానే సుప్రసన్నే శుభోభనే ౨ పూజయేద్భాస్కరం మంత్రీ సరళీకృతవిగ్రహః, భద్రాసనసమారూఢః ప్రాఙ్ముఖః సాధకోత్తమః ౩ అస్త్రబీజేన మంత్రేణ నరః స్వాంగాని విన్యసేత్, అంగుష్ఠమాదితః కృత్వా కనిష్ఠాంతం సువిన్యసేత్ ౪ హృదయాదీన్షడంతాంస్తాన్విన్యసేత్క్రమతః సదా, నేత్రపాణితలేవీర న్యస్య

మును జేసి హోమమును మూఁడుసార్లు చేయవలెను. హృదయమందు హృదయమును, శిరమున శిరస్సును, హృద్బీజమును చెప్పుచు విన్యసింపవలెను. శిఖయందు శిఖను, శరీరమందు కవచమును, నేత్రమునందు నేత్రమును, కరములయం దస్త్రమును విన్యసింపవలెను. ఇట్లు చేసిన శత్రువులు మిత్రు లగుదురు. లాభములేనిదానియందును లాభము గల్గును. తనను సూర్యునిగా నుపాసించుచు స్థండిలమున భాస్కరవిగ్రహము నుంచుకొని దక్షిణపార్శ్వమున పుష్పభాజనమును వామభాగమున జలపూర్ణ తామ్రకుంభమును నుంచుకొని సర్వద్రవ్యములను బ్రోక్షించి మంత్రమును జపించవలెను. భీష్ముం డిట్లనియె. పురాణోక్తమంత్రసహితవిధిని

---

అర్ఘ్యాది మంత్రవిత్. ౫. యవర్గే యచతుర్థం తు కర్ణబిందుసమన్వితమ్, నేత్రబీజమితి ప్రోక్తం జ్యోతీరూపం న సంశయః. ౬. పశ్చాత్తు త్ర్యక్షరం సూర్యం కవచం విన్యసే ద్బుధః, కథితం తన్మయా వీర మంత్రరాజేతి పృచ్ఛతః. ౭. ప్రాణాయామం తతః కుర్యాత్ప్రథమం బీజముద్గిరన్, శేషక్రమేణ హుత్వాయం విరజే భీష్మ శక్తితః. ౮. త్రిభిరేవ తతో ఘోరై రాత్మశుద్ధిః కృతా భవేత్, ఇతి సంశోధ్య చాత్మానం సూర్యం సర్వాంతికం న్యసేత్. ౯. హృదయే హృదయం న్యస్య శిరః శిరసి విన్యసేత్, ఏకవింశతిమాత్రికాయా అక్షరం యత్ప్రకీర్తితమ్. ౧౦. హృద్బీజమితి విఖ్యాతం బ్రహ్మస్థానమనోపమమ్, శిరసార్కస్య పూజా తు లోకేర్కః ప్రతికథ్యతే. ౧౧. శిఖాయాం తు శిఖాం న్యస్యేచ్ఛరీరే కవచం న్యసేత్, నేత్రయోర్విన్యసేన్నేత్రం కరయోరస్త్రమేవ చ. ౧౨. మహావ్యాహృతయోరాజం స్తథారజ్వాలినీ శిఖా, హకారశ్చ రకారశ్చ ఉకారో బిందునా సహ. ౧౩. ఏతేషాం సమయాశ్చైవ కవచం పరికథ్యతే, నేత్రయోర్విన్యసేన్నేత్రం కరయోరస్త్రమేవ చ. ౧౪. ఏవమంగాని విన్యస్య నాసౌ కేనాపి బాధ్యతే, శత్రవో మిత్రతాం యాంతి అలాభే లాభమాప్నుయాత్. ౧౫. ఆత్మానం భాస్కరం జ్ఞాత్వా యథోక్తం తత్త్వదర్శిభిః, తతస్తు పూజయేద్భానుం స్థండిలే విధివత్పునః. ౧౬. కృత్వా తు దక్షిణే పార్శ్వే దివ్యపుష్పకరండకమ్, కృత్వా సుశోభితే వామే తామ్రపూర్ణేన వారిణా. ౧౭. అస్త్రేణ క్షాలితాం పూర్ణాం శేషం మంత్రైర్జలైస్తథా, అభిమంత్ర్య తతః స్థాప్య కవచేనావగుంఠితామ్. ౧౮. స్థండిలే చైవ ద్రవ్యాణి పూజార్థం కల్పితాని తు, సర్వాణి ప్రోక్షయేద్విద్వానర్ఘ్యపాత్రం జలేన తు, తతో మంత్రం జపేత్పశ్చాదేకచిత్తేన మంత్రవిత్. ౧౯. భీష్మ ఉవాచ.—పురాణసహితైర్మంత్రైర్యో విధిః కథితో బుధైః. ౨౦. స మయా విదితః కృత్స్నః కథితో నైకశో ద్విజైః, వేదోక్తై

నేనెఱుఁగుదును. వేదోక్తమంత్రసహితవిధిని వినఁగోరుచున్నాను. దయతో దాని నెఱింగింపుము.

ఇది ద్విశతతమాధ్యాయము.

---

## ఏకాధికద్విశతతమాధ్యాయము.

వ్యాసుం డిట్లనియె. ధర్మవర్ధకంబగు బ్రహ్మావిష్ణులసంవాదమును జెప్పెద నాకర్ణింపుము. విష్ణుం డొకనాఁడు సుఖాసీనుఁడగు బ్రహ్మకు నమస్కరించి యిట్లనియె. సురజ్యేష్ఠుఁడా! సూర్యారాధనవిధిని నాకు విస్తరముగఁ దెల్పు మనిన చతుర్ముఖుం డిట్లనియె. ఆదిత్యునిఁ బూజించి హృదయబీజముచే నష్టదిక్కులయం దాసనముల నిచ్చి శక్త్యష్టకము నుంచి సర్వతోముఖియగు నవమశక్తినిమధ్యయందుంచి సూర్యునావాహ

---

ర్వివిధైర్మంత్రైర్యథా సంపూజ్యతే రవిః. ౨౧. తథా మే బ్రూహి సకలం వైదికం విధి సత్తమమ్. ౨౨.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే
ద్విశతతమోఽధ్యాయః.

---

వ్యాస ఉవాచః—అథ త్వాం కథయిష్యేహం సంవాదం ధర్మవర్ధనమ్, సురజ్యేష్ఠస్య దేవస్య కేశవస్య చ భారత. ౧. మనోవత్యాం సురజ్యేష్ఠం సుఖాసీనం చతుర్ముఖమ్, ప్రణమ్య శిరసా విష్ణురిదం వచనమబ్రవీత్. ౨. విష్ణురువాచ.—భగవన్దేవ దేవేశ సురజ్యేష్ఠ చతుర్ముఖ, ఆరాధనవిధిం బ్రూహి భాస్కరస్య మహాత్మనః. ౩. కథమారాధయేద్భానుం మండలస్థం దివస్పతిమ్, బ్రూహి మేఽత్ర గణం దేవం యేనాహం పూజయే విభుమ్. ౪. సాధుసాధు మహాబాహో సాధు పృష్టోఽస్మి భూధర, శృణు చైకమనా దేవ భాస్కరారాధనే విధిమ్. ౫. ఖషోల్కం నిర్మలం దేవం పూజయిత్వా విభావసుమ్, పూర్వే మధ్యే తథాగ్నేయ్యాం విరూపాక్షే ప్రభంజనే. ౬. క్రమేణ యావదీశానీం హృది బీజేన విన్యసేత్, ఖషోల్కాసనమేతత్తు విన్యస్తం మానవోత్తమైః. ౭. తతస్తస్యోపరిష్టాత్తు హృదయేన తు కంచుకమ్, సప్తావరణసంయుక్తమష్టపత్రం సకర్ణికమ్. ౮. కేసరాలంబదేవత్వం పంచవర్ణం మహాద్భుతమ్, పరీక్షాభూమివిధివచ్ఛాస్త్రోక్త

నంజేసి కర్ణికయందుంచి "ఉదుత్యం జాతవేదసం" అనుమంత్రముచే నుప స్థానముఁ జేయవలెను. "అగ్నిం దూతేన" ఆకృష్ణేన" "హగ్ంసశ్శుచి షత్" అను నీమంత్రములచే సూర్యునిఁ బూజింపవలెను. "అపత్యేతారకం" అనుమంత్రముచేఁ బూర్వోక్తంబులగు నష్టశక్తులలో దీప్తాశక్తినిఁ బూజింప వలెను. "అదృశ్రమస్యకేతవః" అనుమంత్రముచే సూక్ష్మాదేవిని "తరణి ర్విశ్వదర్శా" అనుమంత్రముచే జయాదేవిని "ప్రత్యఙ్ దేవానాం విశా" అనుమంత్రముచే భద్రాదేవిని "యేనాపావకచక్షుసా" అనుమంత్రముచే విభూతిదేవిని, "విద్యామేషీ" అనుమంత్రముచే విమలాదేవిని అమోఘా దేవిని విద్యుతాదేవినిఁ బూజింపవలెను "కృష్ణస్యోద్వయంత" మనుమంత్ర ముచే నవమయగు సర్వతోముఖదేవినిఁ బూజింపవలెను. "ఉద్యన్" "శుక్లేషుహారిమాహావే" "ఉదగాదయమాదిత్యః" "తత్సవితుర్వరేణ్య" "మహితో మహితోయ" "హిరణ్యగర్భస్సమవర్తతా" "సవితాపశ్చాత్. పురస్తాత్." ఈమంత్రములచే నాదిత్యుని స్థాపించి పూజింపవలెను.

---

విధినా కృతమ్. ౯. దీప్తాది పూర్వాద్యారభ్య యావదీశానగోచరమ్, న్యసేచ్ఛక్త్యష్టకం మంత్రీ మధ్యతః సర్వతోముఖీమ్. ౧౦. దీప్తా సూక్ష్మా జయా భద్రా విభూతిర్విమలా తథా, అమోఘా విద్యుతా చైవ నవమీ సర్వతోముఖీ. ౧౧. తత ఆవాహయేద్భానుం స్థాపయేత్కర్ణికోపరి, ఉపస్థానం తు వై కృత్వా మంత్రేణానేన సువ్రత. ౧౨. ఉదుత్యం జాతవేదసమితి మంత్రః ప్రకీర్తితః, అగ్నిం దూతేన మంత్రేణ అనేన విశ్వ సువ్రత. ౧౩. ఆకృష్ణేన రజసా మంత్రేణానేన చార్చయేత్, హంసశ్శుచిషదితి చ మంత్రేణార్కం ప్రపూజయేత్. ౧౪. అపత్యేతారకం దేవీదీప్తానేన ప్రపూజయేత్, అదృశ్రమస్యకేతవః సూక్ష్మాం దేవీం సమర్చయేత్. ౧౫. తరణిర్విశ్వదర్శేతి అనేన సతతం జయమ్, ప్రత్యఙ్దేవానాం విశేతి భద్రాం దేవీం సమర్చయేత్. ౧౬. విభూతి మర్చయేన్నిత్యం యేనాపావకచక్షుసా, విద్యామేషీతి మంత్రేణ హ్యనేన విమలాం సదా. ౧౭. అమోఘాం పూజయేన్నిత్యం మంత్రేణానేన సువ్రత, నవమీం పూజయేద్దేవీం సతతం సర్వతోముఖీమ్. ౧౮. మంత్రేణానేన కృష్ణస్య ఉద్వయంతమితీహ చ, ఉద్యన ద్యామిత్రహోమం ప్రథమమక్షరం ప్రజేత్. ౧౯. ద్వితీయం పూజయేత్కృష్ణం శుక్లేషు హరిమాహావే, ఉదగాదయమాదిత్యో అనేనాపి తృతీయకమ్. ౨౦. తత్సవితు ర్వరేణ్యేతి చతుర్థం పరికీర్తితమ్, మహితోమహితోయేతి పంచర్చం పరికీర్తయేత్. ౨౧. హిరణ్యగర్భః సమవర్తతా షష్ఠం బీజం ప్రకీర్తితమ్, సవితా పశ్చాతాత్పురస్తాత్సప్తమం

బహిర్భాగమున నింద్రాదులఁ బూజింపవలెను. రక్తవర్ణుఁడును, శ్వేతపద్మాసనుఁడును, ద్విభుజుండును, ఏకచక్రుఁడును, పద్మధనుష్కుండును నగు నాదిత్యునిఁ బూజించిన సర్వశ్రేయములు గల్గును.

ఇది ఏకాధికద్విశతతమాధ్యాయము.

---

## ద్వ్యధికద్విశతతమాధ్యాయము.

విష్ణు విట్లనియె. సురజ్యేష్ఠా! యేవిధిచే మండలస్థుఁడగు భాస్కరునిఁ బూజింపవలెనో పద్మసంభవుఁడగు భాస్కరు నేవిధిచేఁ బూజింపవలెనో, సర్వమూర్తిగతుండును సురాసురార్చితుండు నగుదేవు నెట్లు పూజింపవలెనో, నాకుఁ దెల్పుమనిన బ్రహ్మదేవుం డిట్లనియె. కృష్ణా! సర్వమూర్తిగతుండగు దేవు నేవిధిచేఁ బూజింపవలెనో ముందు చెప్పెద వినుము. "ఇషేత్వా" యనుమంత్రముచే శిరము నర్చింపవలెను. అగ్నిమీళే" యనుమంత్రముచే దక్షిణకరమును, "అగ్న ఆయాహి" యను

---

దేవసత్తమ. ౨౨. ఏవం బీజాని విన్యస్య ఆదిత్యం స్థాపయేద్ద్విజః, ఆదిత్యం స్థాపయేద్ధ్యానే సర్వేషాం పూజయేద్బుధః. ౨౩. బాహ్యతో దేవశార్దూల ఇంద్రాదీనాం సమమంతతః, రక్తవర్ణం మహాతేజం సితపద్మోపరి స్థితమ్. ౨౪. సర్వలక్షణసంయుక్తం సర్వాభరణభూషితమ్, ద్విభుజం చైకచక్రం చ సౌమ్యం పద్మధనుష్కరమ్. ౨౫. వర్తులం తేన బింబేన మధ్యస్థమతితేజసమ్, ఆదిత్యస్య త్విదం రూపం సర్వలోకేషు పూజితమ్. ౨౬. ధ్యాత్వా సంపూజయేన్నిత్యం స్థండిలం మండలాశ్రితమ్. ౨౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యమండలదేవతార్చనవిధివర్ణనం నామ ఏకాధికద్విశతతమోఽధ్యాయః.

---

విష్ణురువాచ:—మండలస్థం సురశ్రేష్ఠ విధినా యేన భాస్కరమ్, పూజయేన్మానవో భక్త్యా స విధిః కథ్యతాం మమ. ౧. పూజయేద్విధినా యేన భాస్కరం పద్మసంభవమ్, మూర్తిస్థం సర్వగం దేవం బూజితం ససురాసురైః. ౨. బ్రహ్మోవాచ.—సాధు కృష్ణ మహాబాహో సాధు పృష్టోఽస్మి సువ్రత, శృణు చైకమనాః పూర్వం మూర్తిస్థం యేన పూజయేత్. ౩. ఇషే త్వేతి చ మంత్రేణ ఉత్తమాంగం సదార్చయేత్, అగ్నిమీళేతి మంత్రేణ పూజయేద్దక్షిణే కరే. ౪. అగ్న ఆయాహి మంత్రేణ పాదౌ దేవస్య పూజ

మంత్రముచే దేవునిపాదములను, "ఆజిఘ్ర" యనుమంత్రముచేఁ బుష్పమాలచేతను, "యోగేయోగ" యనుమంత్రముచేఁ బుష్పాంజలిచేతను, పూజింపవలెను. "సముద్రం గచ్ఛ" యనుమంత్రముతో దేవు నభిషేకింపవలెను "ఇమం మే గంగే" యనుమంత్రముచేతను, నభిషేకింపవలెను. "సముద్రజ్యోతిః"అనుమంత్రముచేఁ గషాయములచేతను బూయవలెను. "ఆప్యాయస్వ" యనుమంత్రముచేఁ బాలతో నభిషేకింపవలెను. 'దధిక్రావ్ణో' యనుమంత్రముచే దధిచే నభిషేకింపవలెను. 'శుక్రమసితేజోసి' యనుమంత్రముచే ఘృతముతో నభిషేకింపవలెను. "యా ఔషధీ" అను మంత్రముతో నోషధులచే స్నానముఁ జేయింపవలెను తరువాత సూర్యుని ద్విపదామంత్రములచే నలుగిడి "మానస్తోకే"యనుమంత్రముచే నొక్కమారు స్నానముఁ జేయింపవలెను. "విష్ణోరరాటమసి" యనుమంత్రముచే గంధోదకంబులచే స్నానముఁ జేయింపవలెను. "సౌవర్ణేన" యనుమంత్రముచే అర్ఘ్యపాద్యములను నైవేద్యము నీవలయును. "ఇదం విష్ణుర్విచక్రమే" యనుమంత్రముచే నర్ఘ్యము నీయవలెను. "వేదోసి" యనుమంత్రముచే యజ్ఞోపవీతమును సమర్పింపవలెను. "యేన శ్రియం ప్రకుర్వాణా" అనుమంత్రముచే బుష్పమాల నర్పింపవలెను. "ధూరసి" యనుమంత్రముచే గుగ్గిలసహితమగుధూపము నీయవలయును. "సమిద్ధోం

---

యేత్, ఆజిఘ్రేతి చ మంత్రేణ పూజయేత్పుష్పమాలయా. ౫. యోగయోగేతి మంత్రేణ ముక్తపుష్పాంజలిం క్షిపేత్, సముద్రం గచ్ఛ యత్ప్రోక్తమనేన స్నాపయేద్రవిమ్. ౬. ఇమం మే గంగేతి యత్ప్రోక్తమనేనాపి చ భూధర, సముద్రజ్యేతి మంత్రేణ కషాయైః పరిరూషయేత్. ౭. స్నాపయేత్పయసా కృష్ణ ఆప్యాయస్వేతి మంత్రతః, దధిక్రాణ్ణేతి వై దధ్నా స్నాపయేద్దధివద్రవిమ్. ౮. తేజోఽసి శుక్రమితి చ ఘృతేన స్నపనం పరమ్, యా ఔషధీతి మంత్రేణ స్నానమోషధిభిః స్మృతమ్. ౯. ఉద్వర్తయేత్తతో భానుం ద్విపదాభిః సురాధిప, మానస్తోకేతి మంత్రేణ యుగపత్స్నానమాచరేత్. ౧౦. విష్ణోరరాటమంత్రేణ స్నాపయేద్గంధవారిణా, సౌవర్ణేన తు మంత్రేణ అర్ఘ్యం పాద్యం నివేదయేత్. ౧౧. ఇదం విష్ణుర్విచక్రమే మంత్రేణార్ఘ్యం ప్రదాపయేత్, వేదోఽసీతి హి మంత్రేణ ఉపవీతం ప్రదాపయేత్. ౧౨. బృహస్పతేతి మంత్రేణ దద్యాద్వస్త్రాణి భానవే, యేన శ్రియం ప్రకుర్వాణాం పుష్పమాలాం ప్రయోజయేత్. ౧౩. ధూరసీతి చ మంత్రేణ ధూపం దద్యాత్సగుగ్గులమ్, సమిద్ధోంఽజనమంత్రేణ అంజనం తు ప్రయ

జనం” అనుమంత్రముచేఁ గాటుకఁ బెట్టవలయును. “యుంజానీ” యను మంత్రముచేఁ గస్తూరితో నర్చింపవలెను జ్ఞానసంపన్నుఁడు దీర్ఘాయుష్యముకొఱకు దేహమునంతను రక్తవర్ణముగ జేయవలెను. “సహస్రశీర్షా” యనుమంత్రముచే శిరమును బూజింపవలెను. “సంభావయ” యనుమంత్రముచేఁ బద్మనేత్రములను పరామర్శింపవలెను “విశ్వతశ్చక్షుః” అనుమంత్రముచే భానునిశరీరమును స్పృశింపవలెను “శ్రీశ్చతే లక్ష్మీశ్చ” యనుమంత్రముచేఁ బూజింపవలెను.

ఇది ద్వ్యధికద్విశతతమాధ్యాయము.

---

## త్ర్యధికద్విశతతమాధ్యాయము.

పద్మసంభవా! భాస్కరునియష్టశృంగంబగువ్యోమ నెట్లు పూజింపవలెనో యావిధానమును నాకుఁ జెప్పుమని విష్ణు వడుగఁ జతుర్ముఖుం డిట్లనియె. కృష్ణా! జ్ఞానసంపన్నులగువారు సువర్ణముచేతఁగాని, వెండిచేతఁగాని, రాగిచేతఁగాని, రాతిచేతఁగాని యష్టశృంగంబగు వ్యోమవిగ్రహమును జేసి యీవిధిప్రకారము పూజింపవలెను. ప్రథమమున భానుని “మహిషావోమహాయ” యనుమంత్రముచే వివిధపుష్పములతో మధ్య

---

చ్ఛుతి. ౧౪. యుంజానీతి చ మంత్రేణ భానుం రోచనయార్చయేత్, ఆరక్తకం చ వై కుర్యాద్దీర్ఘాయుష్ట్వాయ వై బుధః. ౧౫. సహస్రశీర్షా పురుషో రవిం సరసి పూజయేత్, సంభావయేతి మంత్రేణ పద్మనేత్రే పరామృశేత్. ౧౬. విశ్వతశ్చక్షురిత్యేవం భానోర్దేహం సమాలభేత్, శ్రీశ్చ తే లక్ష్మీశ్చేతి మంత్రేణానేన పూజయేత్. ౧౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే ఆదిత్యపూజావిధివర్ణనం నామ
ద్వ్యధికద్విశతతమోఽధ్యాయః.

---

విష్ణురువాచ:—వ్యోమపూజావిధిం బ్రూహి సమాసాచ్చతురానన, అష్టశృంగం కథం వ్యోమ పూజయేద్భాస్కరస్య తు. ౧. బ్రహ్మోవాచ.—వ్యోమపూజావిధిం కృష్ణ నిబోధ గదతో మమ, అష్టశృంగం యథా వ్యోమ పూజయంతి మనీషిణః. ౨. సౌవర్ణం రాజతం తామ్రం కృత్వా చాశ్మమయం తథా, అష్టశృంగం మహాబాహో అనేన విధినార్చయేత్. ౩. ప్రథమం పూజయేద్భానుం మధ్యే మంత్రేణ సువ్రత, మహిషా వో

యందుఁ బూజింపవలెను. "త్రాతారమింద్ర" మనుమంత్రముచే సర్వ శృంగములను నిత్యము పూజింపవలెను. లేదా, "ఉదీరతామవర" యను మంత్రముచే నైనఁ బూజింపవలెను. "ఆయంగౌః" అనుమంత్రముచే నైరృతశిఖరమును బూజింపవలెను. "రక్షోహణం" అనుమంత్రముచేఁ గాని, "వాజినం వా" మ్మనుమంత్రముచేఁగాని, యసురాంతకునిఁ బూజింప వలెను "ఇంద్రసోమాంతపతయే" యనుదానిచేనైనఁ బూజింపవలెను. "అభిత్వాశూరనోనుమ" అనుదానిచే నీశాన్యశృంగము నర్చింపవలెను. ఈరీతిగ భాను నంతటను బూజించుదురు. "యేనేదంభూత" మ్మనుదానిచే నైనను పూజింపవలెను. "నమోస్తు స్వపాపేభ్యః" అని వ్యోమపీఠము నెల్లప్పుడు నర్చింపవలెను. ఇట్లుచేసిన మనుష్యులు సర్వకామములను బొందుట నిస్సంశయము. "త్వమేకో రుద్రాణాం వసూనాం" అనుమంత్ర ముచే నుదయమున పూజచేయవలెను. "తద్విష్ణోః పరమంపదం" అనుదాని చేతను "హంసశ్శుచిషత్" అనుమంత్రముచేతను అపరాహ్ణంబునఁ బూజింపవలెను ఈరీతిగ భాను నవగ్రహములతోఁగూడ నర్చించువారు సర్వకామములను బొందుదురు. పవిత్రసహితంబుగ ధౌతవస్త్రములను పాదుకలను సువర్ణాంగులీయకమును చిత్రగంధపుష్పంబులను, అనేక భక్ష్యభోజ్యంబుల నిచ్చి గురునిఁ బూజింపవలెను. ఈవిధిప్రకార ముప

---

మహాయేతి నానాపుష్పకదంబకైః. ౪. త్రాతారమింద్రం మంత్రేణ సర్వశృంగం సదా ర్చయేత్, ఉదీరతామవర ఇత్యథ వానేన పూజయేత్. ౫. ఆయం గౌరితి మంత్రేణ నైరృతం శృంగమర్చయేత్, రక్షోహణం వాజినం వా పూజయేదసురాంతకమ్. ౬. ఇంద్రసోమాంతపతయే ఇత్యథ వానేన పూజయేత్, అభిత్వా శూర నో నుమ ఐశానం శృంగమర్చయేత్. ౭. ఏవం భానుం చ పరితః పూజయంతి సదాచ్యుత, యేనేదం భూతమితి వై అథ వానేన పూజయేత్. ౮. నమోఽస్తు సర్వపాపేభ్యో వ్యోమపీఠం సదార్చయేత్, తే నరాః సతతం కామానాప్నువంతి న సంశయః. ౯. త్వమేకో రుద్రాణాం వసూనాం పూర్వాహ్ణే తేన పూజయేత్, తద్విష్ణోః పరమం పదం హంసః శుచిషదితి వై అపరాహ్ణే సదార్చయేత్. ౧౦. ఏవం భానుం గ్రహైః సార్ధం పూజ యంతి సదస్పతే, తే సర్వాన్వివిధాన్కామానాప్నువంతి న సంశయః. ౧౧. విమలే వాససీ దత్త్వా గురవే సపవిత్రకే, ఉపానహౌ తథా కృష్ణ సౌవర్ణమంగులీయకమ్. ౧౨. గంధపుష్పాణి చిత్రాణి భక్ష్యభోజ్యాన్యనేకశః, అనేన విధినా యస్తు సోపవాసోఽర్చయే

వసించి సూర్యునిఁ బూజించిన యాతఁడు బహుపుత్రవంతుఁడును, బహు ధనవంతుఁడును, మంగళనిలయుఁడు నగును. ఉత్తరాయణంబున నెవ్వఁ డుపవాసపూర్వకముగా సూర్యు నారాధించునో యాతఁ డశ్వమేధ యాగఫలమును బొందుటయేగాక బహుపుత్రవంతుఁడు గూడనగును. విషువమునం దుపవాసముఁజేసి సూర్యు నారాధించిన బహుపుత్రవంతులును, బహుధనసంపన్నులును, కీర్తివంతులు నగుదురు. సూర్యచంద్ర గ్రహణములయందు విధిప్రకార ముపవసించి భక్తితో భాస్కరునిఁ బూజించిన యాతఁడు బ్రహ్మలోకంబునకుఁ బోవును. ఈవిధానమును వినినను, చేసినను, చూచినను నాలోకమునఁ బూజితుఁ డగును. కాలాంతగమునఁ బుడమిఁజేరి బహుపుత్రవంతుఁడును, బహుధనసంపన్నుఁడును నగును యుద్ధమున నపరాజితుండై భూలోకంబున రాజగును.

ఇది త్ర్యధికద్విశతతమాధ్యాయము.

---

## చతురధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! రత్నవ్యోమప్రతిష్ఠయందు భాను నెట్లు పూజింపవలెనో యావిధిని జెప్పెద నాలకింపుము. గంధపుష్పాక్ష

---

ద్రవిమ్, బహుపుత్రో బహుధనః స నరో భవ్యవాన్భవేత్. ౧౩. ఉత్తరే చాయనే యస్తు సోపవాసోఽర్చయేద్రవిమ్, సోఽశ్వమేధఫలం విద్యాద్బహుపుత్రశ్చ జాయతే. ౧౪. కృతోపవాసం విషువే యస్తు పూజయతే రవిమ్, బహుపుత్రో బహుధనో కీర్తిమాంశ్చాపి జాయతే. ౧౫. కృతోపవాసం గ్రహణే విధివచ్చంద్రసూర్యయోః, పూజయేద్భాస్కరం భక్త్యా బ్రహ్మలోకం స గచ్ఛతి. ౧౬. ఇతి తే కథితో విష్ణో భాస్కరారాధనే విధిః, యం శ్రుత్వా పురుషో భక్త్యా మమ లోకే మహీయతే. ౧౭. పునరేత్య మహీం కృష్ణ రాజా భవతి భూతలే, బహుపుత్రో బహుధనః సమరేష్వపరాజితః. ౧౮.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే భాస్కరారాధనవిధిర్ణనం నామ త్ర్యధికద్విశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—అతః పరం ప్రవక్ష్యామి విధిం పరమపూజితమ్, రత్నవ్యోమ ప్రతిష్ఠాయాం యథా భానుం ప్రపూజయేత్. ౧. అర్చయిత్వా తు ప్రకృతిం గంధ

తలచేఁ బ్రకృతి నర్చించి పుష్పాక్షతసహితం బగు నుదకాంజలిచే నందు ఖషోల్కుండును మహాదేవుండు నగుభాస్కరు నావాహన జేయవలెను "ఓం ప్రత్యక్షకిరణాయ నమః, ఓం ఖషోల్కమావాహయామి, ఓం భూర్భువస్స్వరోమ్" ఈమంత్రముచే నావాహన చేయవలెను "ఆపోహిష్ఠా" "హిరణ్యగర్భస్సమవర్తత" అను నీరెండుమంత్రములచేఁ బాత్రప్రక్షాళన చేయవలెను. "సవితాపశ్చాత్" దీనిచే పాత్రయం దుదకము నుంచి పుష్పాక్షత నుంచవలెను. ఆపాత్ర ఔదుంబరమై యుండవలెను. ఆపాత్రను "ఉదుత్యం జాతవేదసం" అనుమంత్రమును జెప్పుచు ఎత్తి సూర్యునకుఁ బ్రదర్శింపవలెను. ఆకాశమున నుంచవలెను. "హంసశ్శుచిషత్" అనుమంత్రముచే పాద్యము నియ్యవలెను. తరువాత ఖషోల్కుని స్నానము చేయింపవలెను. "అగ్నిస్తు" మొదలగు నేడుబుక్కులచే జలమును గీర్తించి త్రయమును "ఆపోహిష్ఠా హిరణ్యవర్ణా" చతుష్టయము నగుబుక్కుల నుచ్చరించుచు జలము నభిమంత్రించి మూఁడు బుక్కులచేఁ గ్రిందనిక్షేపింపవలెను. స్నానముఁ జేయింపవలెను. "కృణుష్వపాజ వాజినంగిరః" "పతిమింద్రస్తవాచామ పతిమింద్రస్తు శుద్ధోన

పుష్పాక్షతైర్విభో, సహోదకేనాంజలినా సహపుష్పాక్షతేన వా. ౨. ఆవాహయే న్మహాదేవం ఖషోల్కం భాస్కరం విభుమ్, మంత్రేణ కురుశార్దూల ప్రత్యక్షకిరణాయ వై. ౩. ఓం ఖషోల్కమావాహయామి ఓం భూర్భువః స్వరోం ఆదిత్యారాధనే మంత్రః. ౪. అభిమంత్ర్య ఖవే మాత్రం సావిత్ర్యా చ బుచావిభో, ఆపోహిష్ఠేతి యా ప్రోక్తా పృథా సూర్యస్య సర్వదా. ౫. యథాన్యాయం తు సంక్షాల్య పూరయేచ్చాన్యతో యతః, హిరణ్యగర్భః సమవర్తతేత్యనయా క్షాలయేద్బుధః. ౬. సవితా పశ్చాతాత్సవితా హ్యనయా పూరయేద్బుధః, ఇత్యేవం పూరయిత్వా తు వారి పుష్పాక్షతైర్బుధః. ౭. పాత్రమౌదుమ్బరం గృహ్య కృత్స్నం సూర్యస్య దర్శయేత్, ఉదుత్యం జాతవేదస మనయా వ్యోమ్ని నిక్షిపేత్. ౮. హంసః శుచిషదితి పాద్యం దద్యాద్విచక్షణః, నిర్వాపయేచ్చ పయసా ఖషోల్కం స్నాపయేత్తతః. ౯. అగ్నిస్తు సప్తభిర్వీర కీర్తితాస్తాశ్చ కృత్స్నశః, ఆపోహిష్ఠేతి చ క్రమాత్తిసృభిః కురునందన. ౧౦. హిరణ్యవర్ణేతి క్రమాచ్చతుర్భిశ్చ నరాధిప, అభిమంత్ర్యోదకమృగ్భిస్తిసృభిర్నిక్షిపేన్నృప.౧౧. భానోః ప్రదక్షిణం కృత్వా కృణుష్వపాజ ఇత్యపి, ఇత్యమూషు వాజినం గిరః ప్రథమా పరికీర్తితా. ౧౨ పతిమింద్రస్తవాచామ ద్వితీయా పరికీర్తితా, పతిమింద్రస్తు శుద్ధో న ఆగహి

ఆగహి” అను నీమంత్రంబుల నుచ్చరించుచుఁ బ్రదక్షిణము చేయవలెను. “సిద్ధ్యైవృత్రాణిజఘ్నే” ఈమంత్రముచే గంధముచేఁ బూజింపవలెను. “అస్యవామస్య” మంత్రముచే అక్షతలచేతను, “సప్తయుంజంతి రథం” అనుమంత్రముచేఁ బుష్పములచేతను బూజింపవలెను. ‘కో దదర్శప్రథమం’ అనుమంత్రముచే ధూపమును, “పాకఃపృచ్ఛామి” యనుమంత్రముచేఁ జందనమును “ఉద్దీప్యస్వ” యనుమంత్రముచే దీపమును, “శీర్ష్ణంక్షురం” అనుమంత్రముచేత కుంకుమను, “యుక్తామాతాసి” యనుమంత్రముచే నైవేద్యమును, “గౌరీర్మిమాయ” అనుమంత్రముచే శుక్లవస్త్రయుగళమును, “తస్యాస్సముద్రా” ఋక్కుచే నుపవీతమును సమర్పింపవలెను. ఇట్లు పూజించిన తరువాత స్తోత్రము చేయవలయును. “ఉక్షాణంపృశ్నిః” “చత్వారివాక్” “ఇంద్రంమిత్రం కృష్ణంనియానం” వీటిచే స్తోత్రము చేయవలెను. “యోరత్నవాహీ” మంత్రముచేఁ గిరీటమును సమర్పింపవలెను. “గతేహానాం” అనుమంత్రముచే నవ్యంగము నుంచవలెను. “ఇయమదదాద్రభసమృణచ్యుతం” ఇత్యాద్యష్టఋక్కులచే దేవుని యష్టశక్తులను పూజింపవలెను. ఇట్లు బ్రహ్మదేవుఁడు విష్ణునకుఁ జెప్పిన పూజావిధినిఁ జెప్పితి. ఈవిధిచే సతతము రవినిఁ బూజించువాఁ డిహపరలోకముల

---

తృతీయా పరికీర్తితా. ౧౩. సిధ్యై వృత్రాణి జిఘ్నే శగంధైర్భానుం ప్రపూజయేత్, అస్య వామ స్యేత్యనయా అక్షతైః పూజయేద్రవిమ్. ౧౪. సప్త యుంజంతి రథమనయా పూజయేద్రవిమ్, పుష్పైర్భరతశార్దూల సతతం తమనాశనమ్. ౧౫. కో దదర్శ ప్రథమమనయా ధూపమాదిశేత్, పాకః పృచ్ఛామ్యనయా చందనం ప్రతిపాదయేత్. ౧౬. ఉద్దీప్యస్వేత్యనయా దీపం దద్యాద్విభావసోః, అర్చిత్వా కుంకుమం చైవ శీర్ష్ణం క్షీరం తు మండలమ్. ౧౭. యుక్తా మాతాసీత్యనయా నైవేద్యం ప్రతిపాదయేత్, గౌరీర్మిమాయేతి దద్యాత్తథా శుక్లే చ వాససీ. ౧౮. తస్యాః సముద్రేత్యనయా ఉపవీతం నివేదయేత్, ఇతి సంపూజ్య దేవేశం తతః కుర్యాత్పరాం స్తుతిమ్. ౧౯. ఋగ్భిరేవ పంచభిస్తాత శృణు చైకమనాదృతః, ఉక్షాణం పృశ్నిరితి చ ప్రథమా పరికీర్తితా. ౨౦. చత్వారి వాగితి భవేద్ద్వితీయా పరికీర్తితా, ఇంద్రం మిత్రం తృతీయా తు వరాధిక్యే ప్రకీర్తితా. ౨౧. కృష్ణం నియానం హి తథా చతుర్థీ పరికీర్తితా, యో రత్నవాహీత్యనయా కిరీటం యోజయేద్రవౌ. ౨౨. గతేహానామిత్యనయా అవ్యంగం భాస్కరం న్యసేత్, ఇయమదదాద్రభసమృణచ్యుతమితి ఋగాదితః. ౨౩. కృత్వా పూజాం తత

యందు సర్వకామములను బొందును. నిష్కాముఁడై చేసిన మోక్షము నొందును. ఈవిధిచే నాదిత్యునిఁ బూజించియే బ్రహ్మాదిదేవత లుత్తమగతి నొందిరి.

ఇది చతురధికద్విశతతమాధ్యాయము.

---

## పంచాధికద్విశతతమాధ్యాయము.

వ్యాసుం డిట్లనియె. భీష్మా! యేవిధిచే మహాదేవుండగు భాస్కరుని నిత్యము పూజింపవలెనో యావిధానమును నీకుఁ జెప్పెద నాకర్ణింపుము. అధికమును నిర్మలమును నగుపరమతేజము నారాధించి మొదట లోపలను, తరువాత నాగ్నేయమునందును, తరువాత నైరృతమునందును, ఆపైన వాయవ్యమునందును క్రమముగాదిక్పాలకులందఱియొక్క హృదయమున బీజము నుంచవలెను. జ్ఞానసంపన్నులగువారు భాస్కరాసనము నుంచవలెను. దానిపైన నష్టపత్రము కింజల్కసహితమును పంచవర్ణయుక్త

శ్చర్గిభిరష్టాభిరితి చాచ్యుత, దేవస్య శక్తయోఽష్టౌ చ పూజయేద్విధివత్క్రమాత్. ౨౪. ఇత్యేష తే మయాఖ్యాతః ప్రతిమాపూజనే విధిః, యః పురోక్తో మహాబాహో బ్రహ్మణా విష్ణవే తథా. ౨౫. అనేన విధినా యస్తు సతతం పూజయేద్రవిమ్, స ప్రాప్నోత్యఖిలాన్కామానిహ లోకే పరత్ర చ. ౨౬. పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ లభతే ధనమ్, కన్యార్థీ లభతే కన్యాం వేదార్థీ వేదవిద్భవేత్. ౨౭. నిష్కామః పూజయేద్యస్తు స మోక్షం ప్రాప్నుయాన్నరః, అనేన విధినా పూజ్య గతః సిద్ధిం స వైష్ణవః. ౨౮. బ్రహ్మాదయస్తథా దేవం పూజయిత్వా విభావసుమ్, అనేన విధినా పూజ్య సంతః సిద్ధిం పరాం గతాః. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే వ్యోమార్చనవిధివర్ణనం నామ
చతురధికద్విశతతమోఽధ్యాయః.

---

వ్యాస ఉవాచః—పునర్నిబోధ మే భీష్మ గదతః పరమం విధిమ్, యేన పూజయతే నిత్యం మహాదేవం దివాకరమ్. ౧. ప్రభూతం నిర్మలం తేజ ఆరాధ్య పరమం సుఖమ్, పూర్వమంతస్తథాగ్నేయ్యాం నైఋత్యాం పవనాలయే. ౨. క్రమేణ యావదీశానం హృది బీజం చ విన్యసేత్, భాస్కరాసనమేతత్తు న్యస్తవ్యం తత్త్వదర్శిభిః. ౩.

మగుపంకజము నుంచవలెను. తరువాతఁ దూర్పు మొదలుకొని మహాదేవ పర్యంతము నెనిమిది శక్తులను తొలుత సర్వతోముఖిశక్తిని మంత్రములచే నుంచవలెను. బీజ శూన్యములగువాటిచే కేసరాగ్రములయందుఁ బూజింపవలెను. తరువాత భానునావాహన చేయవలెను. మంత్రపూర్వకంబుగ నర్చనమును, అర్ఘ్యపాద్యములను, ఆచమనమును, స్నానమును వస్త్రగంధాదిభూషణంబులను, కరవీరపుష్పములను, నైవేద్యమును,ధూపమును, భక్తితో శ్రద్ధగాఁ జేయవలెను. అట్లుచేసిన భాస్కరుఁడు సంతోషించును. అట్లు చేసినవారు మహాపాతకులైనను వాంఛితమును బొందఁ గలరు. ఆదిత్యునిఁ బూజించి తరువాత నంగములను బూజింపవలెను. దీప్త యందు హృదమునుంచి భవానియందు శిరస్సునుంచవలెను.దిక్కులయందు ఇంద్రాద్యస్త్రముల నుత్తరముగానుంచవలెను. కర్ణికయందు నేత్రమునుంచి యాబీజముచే నర్చింపవలెను. పుష్పగంధధూపములచేఁ గ్రమముగా హృదయాదులను బూజించి తరువాత గర్భమును బూజింపవలెను. తూర్పుదిక్కునందును బహిర్భాగంబునను శనిగ్రహమును, దక్షిణమున బుధగ్రహమును పూజింపవలెను. పశ్చిమంబున విషాణమును, బూజించి

---

ఉపరిష్టాత్తతస్తస్య హృదయేన తు పంకజమ్, అష్టపత్రం కేశరాలం పంచవర్ణం సకేశరమ్. ౪. దీప్తాది పూర్వమారభ్య ఆమహాదేవగోచరమ్, శక్త్యష్టకం న్యసేన్మంత్రై రాదితః సర్వతోముఖీమ్. ౫. అబీజైః కేసరాగ్రేషు క్రమేణైవ చ పూజయేత్, తతస్త్వావాహయేద్భానుం స్థాపయేత్కర్ణికోపరి. ౬. తస్యోపహృత్య తం చాన్యం వేదితవ్యం ఖపుష్కరమ్, తేనైవావాహనం చార్చ్యం స్థాపనం చార్ఘ్యమేవ చ. ౭. పాద్యమాచమనం స్థానం వస్త్రగంధాదిభూషణమ్, విధినా వీరపుష్పాణి నైవేద్యం ధూపమేవ చ. ౮. కర్తవ్యం శ్రద్ధయా భక్త్యా ఏవం తుష్యతి భాస్కరః, మహాపాతకినోఽప్యాశు లభంతే చింతితం ఫలమ్. ౯. ఆదిత్యం పూజయిత్వా తు పశ్చాదంగాని పూజయేత్, దీప్తాయాం హృదయం న్యస్య భవాన్యాం శిరసో న్యసేత్. ౧౦. దిగ్విదిక్షు న్యసేదస్త్రమింద్రాది దిశోత్తరాంతికమ్, కర్ణికాయాం న్యసేన్నేత్రం స్వబీజేన తు వార్చయేత్. ౧౧. పుష్పైర్గంధైశ్చ ధూపైశ్చ హృదయాని క్రమేణ తు, పూజయిత్వా తు విధివద్గర్భం పశ్చాత్తు మంత్రవిత్. ౧౨. బాహ్యతః పూర్వతో మందం దక్షిణేన బుధం తథా, విషాణం పశ్చిమే

యుత్తరదిక్కున శుక్రుని, నాగ్నేయంబునఁ గుజుని, నైరృతంబున భానుదేహజుని, వాయవ్యంబునఁ గృష్ణు నీశానంబున వికచునిఁ బూజింపవలెను. తరువాత నింద్రాద్యష్టదిక్పాలకులను బూజింపవలెను. తరువాత లోకపాలగ్రహసహితంబుగ భాస్కరుని వివిధగంధములచేతను మనోహరంబులగు పుష్పధూపంబులచేతను క్రమముగా మంత్రములతో నాత్మశ్రేయముఁ గోరువాఁడు పూజింపవలెను. ఈవిధిచే భాస్కరుఁ డెచ్చట పూజింపఁబడునో యచ్చట చోరాగ్నిశనిపాతాదులవలనఁగాని నరకమువలనఁగాని భయము గలుగదు. అచ్చటివాఁడు ఆరోగ్యము, ఆనందము, సుఖము, సుభిక్షము, నిశ్చల యగులక్ష్మిని బొందును. బింబాంతమధ్యస్థ తేజోరూపుండగు నాదిత్యుఁడు సాధకులచే నెల్లప్పుడును పూజింపఁబడఁదగియున్నాఁడు. రథాశ్వాదులచేఁ గార్యసిద్ధి కలుగనేరదు. వత్సా! యీరీతిగ సమస్తమగువిధానముఁ జెప్పితినిగాన నీవిధిచే భాస్కరుని నిత్యమును బూజింపవలెను. ఈవిధిచే మహాదేవుఁడు భాస్కరునిఁ బూజించుచుండును. ఇట్లు భానుని హృదయబీజముతోఁ బూజించి విడువవలెను. ఎవఁ డీరీతిగ భానునిఁ బూజించునో వాఁడు పరమపదమును బొందును.

ఇది పంచాధికద్విశతతమాధ్యాయము.

---

పూజ్య ఉత్తరేణ తు భార్గవమ్. ౧౩. ఆగ్నేయ్యాం చ కుజం పూజ్య నైరృత్యాం భానుదేహజమ్, వాయవ్యాం పూజయేత్కృష్ణమైశాన్యాం వికచం నృప. ౧౪. ఇంద్రాది లోకపాలాంశ్చ తతోఽష్టౌ పూజయేద్బుధః, సుగంధైర్వివిధైః పుష్పైర్ధూపైశ్చైవ మనోరమైః. ౧౫. క్రమేణ పూజయేద్భానుం లోకపాలైర్గ్రహైః సహ, మంత్రైః కురుకులశ్రేష్ఠ య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః. ౧౬. అనేన విధినా యత్ర దేవః సంపూజ్యతే రవిః, న చౌరాగ్నిభయం తత్ర న చాపి నరకాద్భయమ్. ౧౭. వర్షోపలవిషాదిభ్యో భయం తత్ర న విద్యతే, సుఖమారోగ్యమానందం సుభిక్షమచలాం శ్రియమ్. ౧౮. తేజోబింబాంతమధ్యస్థ ఆదిత్యః పరమార్థతః, యష్టవ్యః సాధకైర్నిత్యం న రథో న చ వాజినః. ౧౯. ఇత్యేష విధిరాఖ్యాతో మయా భీష్మ తవానఘ, యేన పూజయతే నిత్యం మహాదేవో దివాకరమ్. ౨౦. ఇత్థం పూజ్య వివస్వంతం హృద్బీజేన విసర్జయేత్, య ఏవం పూజయేద్భానుం స యాతి పరమాం గతిమ్. ౨౧.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే భీష్మవ్యాస
సంవాదే మహాదేవార్చనవిధివర్ణనం నామ
పంచాధికద్విశతతమోఽధ్యాయః.

## షడుత్తరద్విశతతమాధ్యాయము.

భీష్ముం డిట్లనియె మహాత్మా! ముద్రాశక్తి సమన్వితమగు పౌరాణికమంత్రోద్ధారశక్తిని నాకుఁ జెప్పుమనిన వ్యాసుం డిట్లనియె. రేఫవర్ణయుక్తంబును, విద్రుమభూషితంబును, అంతస్థాంత్యము నగునది బ్రహ్మదైవత్యమగును. బిందురేఫదీర్ఘమాత్రాయుతమగునది విష్ణుదైవతము. సవిసర్గము రుద్రదైవతము. భాస్కరునియొక్క త్ర్యక్షరమంత్రమును జపించువాఁడు పరమగతి నొందును. ఇఁకను ముద్రావిధిని జెప్పెదను. కరములను పద్మాకారముగఁజేసి మధ్యమాంగుళులను కలిపి ప్రసారించిన విముద్రయని చెప్పఁబడును ఈముద్ర భాస్కరునకుఁ జాల ప్రియము. మహాభయములలో నిది తల్లివలెఁ గాఁచును. విద్రుమాలంకృతమగు నక్షరవరము సూర్యుని హృదయమంత్రము. "అర్కం" అనునది శిరోమంత్రము. మూఁడు మహావ్యాహృతులు, ఆరజ్వాలినీ, సూర్యుని శిఖామంత్రము. అర్కమంత్రముతోఁగూడ నిదియంతయు సూర్యునియష్టాక్షరి, "అర్కమోంభూర్భువస్స్వః" ఇది ఆదిత్యాష్టాక్షరీ యనఁబడును.

---

భీష్మ ఉవాచ:—మంత్రోద్ధారం పరం బ్రూహి ముద్రాశక్తిసమన్వితమ్, రూపవర్ణసమం చైవ పౌరాణికమనుత్తమమ్. ౧. వ్యాస ఉవాచ.—శృణు భీష్మ మహాబాహో యథా వక్ష్యామి తేనఘ, పౌరాణికానాం మంత్రాణాముద్ధారం వైదికాదృతే. ౨. వర్ణరేఫసమాయుక్తం విద్రుమేణైవ భూషితమ్, అంతస్థానాం హి అంత్యం వై బ్రహ్మదైవత్యముచ్యతే. ౩. బిందురేఫసమాయుక్తం దీర్ఘయా మాత్రయా తథా, దీక్షాక్షరం సముద్దిష్టం ద్వితీయం విష్ణుదైవతమ్. ౪. తృతీయం తు తథా ప్రోక్తం సవిసర్గం జనాధిప, స తృతీయో బుధైః ప్రోక్తో రుద్రదేవత ఏవ హి. ౫. భాస్కరోఽయం మహాన్సాక్షాన్మంత్రమూర్తిస్త్రిరక్షరః, దుర్లభః పరమో గుహ్యస్త్రిదేవో దేవపూజితః. ౬. యస్త్విదం జపతే భక్త్యా స యాతి పరమాం గతిమ్, తతశ్చ ముద్రాం వక్ష్యామి సాన్నిధ్యకారణం పరమ్. ౭. పద్మాకారౌ కరౌ కృత్వా మధ్యే శ్లిష్టే తు మధ్యమే, అంగులిం క్షారయేత్తస్మిన్విముద్రేతి చ సోచ్యతే. ౮. అనయా బద్ధయా రాజన్భాస్కరస్య ప్రియో భవేత్, మహాభయేషు సర్వేషు మాతృవత్పరిరక్షతి. ౯. హృదయం తస్య విజ్ఞేయం యదక్షరవరం స్మృతమ్, విద్రుమోపరి సంఛన్నం హృద్గతం తద్గతం సదా. ౧౦. శిరస్యర్కమితి ప్రోక్తం దేవదేవస్య భారత, మహావ్యాహృతయస్తిస్రస్తథారజ్వాలినీ శిఖా. ౧౧. అష్టాక్షరా తు విద్యేయమాదిత్యస్య మహాత్మనః, యః స్మరేత్సాధకస్త్వేనం నాసౌ

పై జెప్పినముద్రనువేసి యీమంత్రమును [redacted]చిన మహాఫలము గల్గును అకారాధానుస్వారరేఫయుక్తమగు హకార మగ్నిదైవత్యము దానియాకృతి ‘అంర్హ్’’ అని యీయేకాక్షరకవచము సూర్యునకుఁ బ్రియము ఈయభేద్యకవచమును స్మరించిన సర్వవిఘ్నములు నశించును “రః” అను అస్త్రము సూర్యునకుఁ బ్రియము ఇయ్యది సాధకుని దోషమును హరించును హస్తాంగుళుల నభిముఖముగఁజేసి ఒకదానియంతరమున నొకదానినిఁ జేర్చి హృదయమునఁగాని శిరమునఁగాని యుంచిన వ్యోమముద్ర యనఁబడును సవ్యహస్తతర్జనిని ముష్టివక్రోచ్ఛ్రితమునుగాఁజేసిన త్రాసనీ ముద్ర యనంబడును అవర్ణబిందుయుతమగు వర్గచతుర్థవర్ణము అగ్నిదైవత్యమై భాస్కరుని నేత్రమగు సవ్యహస్తమధ్యమాతర్జనులను ఉచ్ఛ్రితములనుగాఁజేసి కనిష్ఠికానామికలను వంచి యంగుష్ఠముచే నేత్రములను స్పృశించిన నేత్రముద్ర యగును “దీప్తా, సూక్ష్మా, జయా, ఉభాహ్వా, విమలా, విద్యుతా” అనునామములుగల “రాం, రిం, రీం, రూం, రైం, రౌం, రం” అనునవి బీజరూపశక్తులు చేతులను వెల్లికిల చేసి అంగుష్ఠేతరాంగుళులను ముడిచి వాటిపైన నంగుష్ఠము నుంచి కరమును చలింపఁజేసిన గోవృషముద్ర యనఁబడును సంక్షేపముగా శక్తి బీజములను చెప్పితిని శక్తినామములు పూర్వమే చెప్పఁబడినవి గ్రహ

---

కేనాపి బాధ్యతే ౧౨ అకారేణ సమాయుక్తం బిందురేఫసమన్వితమ్, హకారమగ్నిదైవత్యం కవచం భాస్కరప్రియమ్ ౧౩ ఏకాక్షరమిదం ప్రోక్తమభేద్యం యః స్మరేదిదమ్, దుష్టానాం చైవ విఘ్నానాం నాశనం నాత్ర సంశయః ౧౪ సవిసర్గో రేఫ ఇతి అస్త్రమేకాక్షరం స్మృతమ్, నాశయేద్దుష్టకర్మాణి సాధకస్య న సంశయః ౧౫ సంముఖౌ తౌ కరౌ కృత్వా శ్లిష్టౌ తు గ్రథితాంగులీ, కనిష్ఠేనామికే యోజ్యే తర్జన్యౌ మధ్యమే తథా ౧౬ హృచ్ఛిరః శిఖా చర్మా ముద్రేయం వ్యోమసంజ్ఞితా, ముష్టివక్రోచ్ఛ్రితం కుర్యాత్సవ్యహస్తస్య తర్జనీమ్ ౧౭ మాలశబ్దకృతాదిస్తు ముద్రా హ్యస్త్రస్య కీర్తితా, త్రాసనీ నామ విఖ్యాతా సర్వవిఘ్నభయంకరీ ౧౮ కర్ణబిందుసమాయుక్తం యం చతుర్థం మహామతే, భాస్కరస్య త్విదం నేత్రమగ్నిదైవతముచ్యతే ౧౯ స్మరః స్యాత్సాధకేంద్రాణాం దురంతో నాశనే ధ్రువమ్, మధ్యమా తర్జనీ చైవ సవ్యహస్తస్య చోచ్ఛ్రితమ్ ౨౦ కనిష్ఠానామికే కుంచ్య అంగుష్ఠేన తతః క్రమేత్, నేత్రాభ్యాం స్పర్శయేదేనాం నేత్రముద్రా ప్రకీర్తితా ౨౧. గోవృషా నామ విఖ్యాతా దర్శయే

బీజములను రూపములను జెప్పెదను. 'భం, ఖం, ఓం' వీట్లను నమః పదాంతములనుగాఁజేసి పూజాకాలమునందు జపకాలమందు నుపయోగింపవలెను. హోమకాలమున స్వాహాంత వషట్కారయుక్తముగా నుపయోగింపవలెను. సోమగ్రహము మొదలు కేతువువఱకు నన్నిగ్రహములును బిందుయుతంబులును శిఖాబింద్వలంకృతములు నై యుండును. సర్వసిద్ధుల నిచ్చు నీగ్రహముద్రలఁ జెప్పెద వినుము హస్తములను సుముఖములుగను, శ్లిష్టములుగను ప్రసారితములుగనుజేసి నమస్కరించిన గ్రహసాన్నిధ్యకారకమగుముద్ర యగును. రహస్యమగు మంత్రోద్ధారముఁ జెప్పితిని. ధ్యానకాలమున దేవతలరూపముఁ జెప్పెద. జపాకుసుమవర్ణుఁడును, శ్వేతపద్మాసనుఁడును, ఏకవక్త్రుఁడును, ద్విభుజుఁడును, సోమపంకజకంధరుఁడును, రక్తవసనుఁడును నగుసూర్యుని శుచియై జితేంద్రియుఁడై ధ్యానించిన సమస్తసంపదలు గల్గును. హృదయము, శిరము, శిఖ, ముఖమును రక్తవర్ణములుగను, నితరములన్నియు శ్యామవర్ణముగలిగి యున్నటులుగను ఆభరణములతోఁ గూడియున్నట్లు వరదాభయహస్త

---

ద్దివ్యగోచరమ్, రాం దీప్తా రిం తతః సూక్ష్మా రీం జయా భీష్మ ఉచ్యతే. ౨౨. ఉభాహ్వ రూం విభూతిశ్చ విమలా రైం ప్రకీర్తితా, అఘహా చ మహాబాహో విద్యుతా రౌ ప్రకీర్తితా. ౨౩. గోవృషా నామ రం సర్వ వీరభద్రకరీ తథా, ఇత్యేతా బీజరూపాస్తు కథితాశ్చైవ శక్తయః. ౨౪. ఉత్తానౌ తు కరౌ కృత్వా సవ్యాకుంచ్య తతోంగులీః, కుర్యాదుపరి చాంగుష్ఠౌ చాలయేత పునఃపునః. ౨౫. సర్వాసాం చైవ శక్తీనామేతా ముద్రాః ప్రదర్శయేత్, నామ్నా చ విద్యుతా చైవ నవమీ సర్వతోముఖీ. ౨౬. నామాన్యేతాని శక్తీనాం సమాసాత్కథితాని తు, సబీజాని మహాబాహో మయా స్నేహేన భారత. ౨౭. గ్రహాణాం శృణు బీజాని రూపం చ గదతో మమ, సర్వత్ర భం తథా ఖం చ కంజకూతుహలోద్వహ. ౨౮. ఓంకారా దీప్తితాః సర్వే నమస్కారాంతయోజితాః, పూజాకాలే ప్రయోక్తవ్యా జపకాలే తథైవ చ. ౨౯. హోమకాలే తు స్వాహాంతం మంత్రం షట్కారసంయుతమ్, సర్వే బిందుయుతా భీష్మ శిఖా బిందు విభూషితాః. ౩౦. సోమాద్యాః కేతుపర్యంతా గ్రహా హ్యేవం ప్రకీర్తితాః, ఏతా ముద్రాః ప్రవక్ష్యామి సర్వసిద్ధిప్రదాయికాః. ౩౧. సుముఖౌ తు కరౌ కృత్వా శ్లిష్టౌ చైవ ప్రసారితౌ, ఇయం ముద్రా నమస్కారే గ్రహసాన్నిధ్యకారికా. ౩౨. మంత్రోద్ధారస్తవాఖ్యాతో రహస్యో దుర్లభో నృప, శృణుష్వ రూపం దేవానాం ధ్యానకాలే హ్యుపస్థితే. ౩౩. జపావర్ణం మహాతేజం శ్వేతపద్మోపరి స్థితమ్, సర్వలక్షణసంపన్నం

లుగను సాధకునిచే ధ్యానింపఁదగుదురు. మెఱుపుతో సమమగుశస్త్రమును చంద్రుఁడు కపాలముగలిగి యున్నట్లు రుద్రరూపము దలఁపవలెను. దీప్తాగ్నితుల్యములగు నాశక్తులన్నియు నీరీతి ధ్యానముచేయవలయునని భాస్కరునిచే స్వయముగఁ జెప్పఁబడెను. సోముఁడు, శ్వేతవర్ణుఁడు, కుజుఁడు రక్తవర్ణుఁడు, బుధుఁడు సువర్ణవర్ణుఁడు, గురుఁడు పీతవర్ణుఁడు, శుక్రుఁడు శ్వేతవర్ణుఁడును, శనియంజనాభుఁడు, రాహువు రజోవర్ణుఁడు, కేతువు ధూమ్రవర్ణుఁడునుగాఁ జెప్పఁబడిరి. కటిన్యస్తవామహస్తుఁడును, అభయప్రదదక్షిణహస్తుఁడును నగుభానుని ఇతరగ్రహములతోఁగూడ ధ్యానించిన బ్రహ్మహత్యాదిదోషములుగూడ తొలఁగును. ఈతని నిప్పగిదిగ నారాధించి సర్వసిద్ధియుతుఁడై మహాదేవత్వము నొందును.

ఇది షడుత్తరద్విశతతమాధ్యాయము.

---

సర్వాభరణభూషితమ్. ౩౪. తత్రైకవక్త్రం ద్విభుజం సోమపంకజకంధరమ్, మండలేన చ రూపం తు మధ్యస్థం రక్తవాససమ్. ౩౫. మార్తండస్య ఇదం రూపం శుచిః స్నాతో జితేంద్రియః, త్రికాలం యః స్మరేద్భీమ ఏకచిత్తో వ్యవస్థితః. ౩౬. సోఽచిరాద్భవతే లోకే విత్తేన ధనదోపమః, ముచ్యతే సర్వరోగైస్తు తేజస్వీ బలవాన్భవేత్. ౩౭. హృదయం చోత్తమాంగం చ శిఖా వై వక్త్రమేవ చ, రక్తవర్ణా ఇమే శ్యామాః సర్వాభరణభూషితాః. ౩౮. వరదాఽభయహస్తాశ్చ ధ్యాతవ్యాః సాధకేన తు, తడిత్పుంజనిభం శస్త్రం రౌద్రం చంద్రకరాలినమ్. ౩౯. విశేషః కథితో హ్యేష కామరూపః స్వభావతః, దీప్తా దీప్తశిఖాకారా ధ్యాతవ్యా మమ శక్తయః. ౪౦. శ్వేతవర్ణం స్మరేత్సోమం రక్తవర్ణం కుజం స్మరేత్, సౌమ్యమష్టాపదాభం చ గురుం చ పీతవర్ణకమ్. ౪౧. శంఖక్షీరనిభం శ్వేతం కాణం చాంజనసంనిభమ్, రజావర్తనిభం రాహుం ధూమ్రం చ వికచం స్మరేత్. ౪౨. వామహస్తౌ కటిన్యస్తౌ దక్షిణౌ చాభయప్రదౌ, రక్తభ్రూరక్తనేత్రాస్య అర్ధకాయకృతాంజలిః. ౪౩. ఇతి భానుం గ్రహైః సార్ధం యే ధ్యాయంతి నృపోత్తమ, లభంతే తే మహాసిద్ధిమచిరాన్నాత్ర సంశయః. ౪౪. తవాఖ్యాతమిదం వక్త్రం గ్రహాణాం భీష్మ కృత్స్నశః, యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యంతే భువి మానవాః. ౪౫. అనేన విధినా భీష్మ సదా దేవం దివాకరమ్, త్రికాలం పూజయేద్భక్త్యా వీర శ్రద్ధాసమన్వితః. ౪౬. ఇత్థం పూజయమానస్తు సర్వదేవం దివాకరమ్, బ్రహ్మహత్యావినిర్ముక్తో మహాదేవత్వమాప్నుయాత్. ౪౭.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యపూజామాహాత్మ్యవర్ణనం నామ షడుత్తరద్విశతతమోఽధ్యాయః.

## సప్తాధికద్విశతతమాధ్యాయము.

భీష్ముం డిట్లనియె. మహాత్మా! సూర్యదేవుని బ్రహ్మ, విష్ణు, శివాది దేవతలుగూడ నారాధించుచున్నారంటివి. ఆతని మహిమ యింత యొప్పునే! ఇది సత్యమా! అనిన వ్యాసుం డిట్లనియె. భరతసత్తమా! నీవుచెప్పినదంతయు నిజమే యగును. సూర్యునితో సముఁడగు దేవుఁడును గతియును పరబ్రహ్మయు లేదు సూర్యునకు సాటియగుహోమద్రవ్యము లేదు. సూర్యునకు సాటియగు ద్రవ్యము ధనమును లేదు. సూర్యుఁడుదక్క వేఱకామంబును వేఱుస్థానంబును లేదు సూర్యునితో సమానుఁడగుబంధువును, మిత్త్రుఁడును, తల్లియు, గురువును తీర్థమును లేవు. సూర్యునికంటె పవిత్రమగున దెందును లేదు. లోకమున దేవతల లోను పితరులలో నాతనినొక్కనినే పరదైవముగా నెఱుంగవలెను. ఆతని నర్చించినను స్తోత్రముఁజేసినను మానవులు పరమపదమును బొందుదురు. సంసారసాగరమునుండి భక్తిచే నెవ్వరు ముక్తులగుదురో వారు ప్రపన్నులని చెప్పఁబడుదురు. భాస్కరుఁడు ప్రసన్నుఁడైనచో రాజు, చోరులు, గ్రహములు, సర్పములు, దారిద్ర్యము, దుఃఖము నీతని పీడింపనేరవు. ఈరీతిగ భాస్కరారాధనతత్పరుఁ డగువాఁడు నమస్కార్యుఁడు. ఆతఁడే ధ్యానముచేయఁదగినవాఁడు. ఆతఁడే ప్రత్యక్షదైవము.

---

భీష్మ ఉవాచః—అహో దేవస్య మాహాత్మ్యం భాస్కరస్య త్వయోదితమ్, పూజయంతి సదా హ్యేనం బ్రహ్మవిష్ణుశివాదయః. ౧. వ్యాస ఉవాచ.—ఏవమేతన్న సందేహో యథా వదసి భారత, నాస్తి సూర్యసమో దేవో నాస్తి సూర్యసమా గతిః. ౨. నాస్తి సూర్యసమం బ్రహ్మ నాస్తి సూర్యసమం హుతమ్, నాస్తి సూర్యసమో ధర్మో నాస్తి సూర్యసమం ధనమ్. ౩. నాస్తి సూర్యాదృతే కామో నాస్తి సూర్యాదృతే పదమ్, నాస్తి సూర్యసమో బంధుర్నాస్తి సూర్యసమం సుహృత్. ౪. నాస్తి సూర్యసమా మాతా నాస్తిసూర్యసమో గురుః, నాస్తి సూర్యసమం తీర్థం న పవిత్రం తతః పరమ్. ౫. తమేకం దైవతం విద్యాన్నైవాప్యర్కపరాయణమ్, లోకానాం దేవతానాం చ పితౄణాం చాపి భారత. ౬. తమర్చంతః స్తువంతశ్చ ప్రాప్నువంతి పరాం గతిమ్, తే ప్రపన్నాస్తు యే భక్త్యా ముక్తాస్తే భవసాగరాత్. ౭. రాజా చోరా గ్రహాః సర్పా దారిద్ర్యం దుఃఖసంపదాః, నైతే పీడయితుం శక్తాః ప్రసన్నే భాస్కరే సతి. ౮. వ్యాస ఉవాచ.—ఏవం తాత మహాబాహో దేవో భాస్కరతత్పరః, స పూజ్యః స

వేయేల? నేనొక్కటి చెప్పెదను వినుము. నీతిమార్గము దప్పినవారైనను పాపాత్ములైనను ప్రతిభానువాసరమున నేమనుష్యులు దేవదేవుండగు భాస్కరునిఁ బూజింతురో వారు పరమపదమును బొందుదురు. భానువారమువచ్చినప్పుడు శ్రద్ధాభక్తులచే భానునిఁ బూజించి నక్తవ్రతము జేసినపురుషుఁ డమరలోకమును బొందును ఎవరు సూర్యునకుఁ బంచరత్నసహితమగు నైవేద్యమును మంత్రసహితముగా నర్పింతురో వారు స్వర్గలోకమును బొందుదురు. సూర్యప్రీతికొఱకు సంక్రమణములయందును, అయనములయందును విధిప్రకారము శ్రాద్ధముఁజేసిన సూర్యలోకమును బొందును. ఎవ్వఁడు షష్ఠినాఁ డుపవసించి సప్తమినాఁడు సూర్యుఁడు సంతోషించుఁగాక యని శ్రాద్ధముఁజేయునో యాతఁడు సర్వదోషవిముక్తుఁడై సూర్యలోకంబునఁ బ్రకాశించుచుండును. ఏమానవుఁడైనను ఏవనితయైనను సప్తమినాఁడు దివాకరుం డగుభాస్కరునిఁ బూజించిన సర్వకామంబులఁ బొందును. విశేషముగ సూర్యతిథివారములయందును, గ్రహణదినంబులయందును పూజించిన తప్పక పొందుదురు. భరతసత్తమా! భాస్కరునికంటె ప్రియుండగుదేవుఁ డెచ్చటను లేఁడు. సూర్యునొక్కనినే పరదేవతగాను, సర్వదేవపూజితునిగా నెఱుంగుము. భూమియందు రాజులు రత్నపర్వత మధిరోహించి తమసత్వము

---

నమస్కార్యః స హి ధ్యాతవ్య ఏవ చ. ౯. ప్రత్యక్షదేవతా హ్యేషా దేవదేవోయమాదరాత్, అథ కిం బహునోక్తేన యద్వక్ష్యామి నిబోధ మే. ౧౦. పూజయేత్తనయః పాపీ తథాదిత్యదినైరపి, పూజయంతి నరా యే వై తే యాంతి పరమాం గతిమ్. ౧౧. ప్రాప్తే సూర్యదినే భక్త్యా భానుం సంపూజ్య శ్రద్ధయా, నక్తం కరోతి పురుషః స యాత్యమరలోకతామ్. ౧౨. యస్తు పూర్వం రవేర్భక్త్యా పంచరత్నసమన్వితమ్, నివేదయతి మంత్రేణ స యాత్యమరలోకతామ్. ౧౩. మార్తండప్రీతయే యస్తు కుర్యాచ్ఛ్రాద్ధం విధానతః, సంక్రాంతావయనే వీర సూర్యలోకం స గచ్ఛతి. ౧౪. కృతోపవాసం షష్ఠ్యాం తు సప్తమ్యాం యస్తు మానవః, కరోతి విధివచ్ఛ్రాద్ధం భాస్కరః ప్రీయతామితి. ౧౫. సర్వదోషవినిర్ముక్తః సూర్యలోకే మహీయతే, మానవో యస్తు సప్తమ్యాం యోషిద్వాపి దివాకరమ్. ౧౬. ప్రపూజ్య విధివద్భానుం సర్వాన్కామానవాప్నుయాత్, విశేషతస్తస్య దినే గ్రహణే చ నరాధిప. ౧౭. ఇతి భీష్మ విజానీహి న దేవో భాస్కరాత్ప్రియః, ఆదిత్యమేకం పరమం దేవదేవేషు పూజితమ్. ౧౮. రత్నపర్వతమారుహ్య

లకుఁ దగినట్లు రత్నభాగముల నెట్లు బొందుదురో యట్లే భానునిఁబూజిం చినమనుజులు తమసత్త్వానుసారముగ ఫలమును బొందుదురు. ధనమును గోరువారు ధనమును, పుత్త్రునిగోరువారు పుత్త్రుని, మోక్షమునుగోరు వారు మోక్షమును, దేవత్వమునుగోరువారు దేవత్వమును బొందు దురు. అనేకప్రకారములుగాఁ జెప్పిన నేమిప్రయోజనము? బ్రహ్మాదిదేవ గణంబులన్నియు భాస్కరు నారాధించియే మనోహరంబులును దివ్యం బులు నచలంబులును సర్వపాపహరంబులు నగుస్థానంబులను దివంబునం బడయఁగల్గిరి. సుమంతుం డిట్లనియె. ఇట్లుచెప్పి వ్యాసుఁ డచ్చటనే యంతర్హితుండయ్యెను. భీష్ముఁడు తరువాత విధిప్రకారముగా భాను నారాధించెను రాజేంద్రా! యట్లే నీవును భాను నారాధింపుము. భక్తితో భాను నారాధించిన శాశ్వతమగుస్థానమును బొందఁగలవు. ఎట్లు భగవత్స్వరూపుఁడగు వ్యాసుఁడును భీష్ముఁడును సప్తమినాఁడు భానునిఁ బూజించి శాశ్వతపదవిని బొందిరో యట్లే నీవును బొందఁగలవు.

ఇది సప్తాధికద్విశతతమాధ్యాయము.



---

యథా భువి నరాధిపాః, సత్త్వానురూపం గచ్ఛంతి రత్నభాగానశేషతః. ౧౯. యథా భానుం సమారాధ్య ప్రాప్నువంతి నరాః ఫలమ్, ధనార్థీ ప్రాప్నుయాదర్థం పుత్రార్థీ ప్రాప్ను యాత్సుతమ్. ౨౦. మోక్షార్థీ మోక్షమాప్నోతి చాథ వాఽమరతాం వ్రజేత్, అథ కిం బహునోక్తేన శృణు త్వం వచనం మమ. ౨౧. బ్రహ్మాదయో దేవగణా భానుమారాధ్య భారత, మనోహరాణి దివ్యాని దివి స్థానాన్యవాప్నువన్. ౨౨. అచలాని మహాభాగాః సర్వపాపహరాణి చ. ౨౩. సుమంతురువాచ.—ఇత్యుక్త్వా భగవాన్వ్యాసస్తత్రైవాంత రధీయత, భీష్మోఽపి పూజయామాస భక్త్యా భానుం విధానతః. ౨౪. తథా త్వమపి రాజేంద్ర పూజయేమం దివాకరమ్, పూజయిత్వా రవిం భక్త్యా స్థానం యాస్యసి శాశ్వ తమ్.౨౫. యథా గతః స భగవాన్వ్యాసో భీష్మశ్చ మానద, సకృత్ప్రపూజ్య సప్తమ్యాం భక్త్యా దేవం దివాకరమ్. ౨౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే వ్యాసభీష్మసంవాదే
ఆదిత్యపూజామాహాత్మ్యవర్ణనం నామ
సప్తాధికద్విశతతమోఽధ్యాయః.

---

## అష్టాధికద్విశతతమాధ్యాయము.

శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! సప్తమినాఁడు భాస్కర ప్రీతికొఱ కుపవసించిన మనుష్యునిఫలవిశేషమును మఱల నింకొకమారు దెల్పుమనిన సుమంతుం డిట్లనియె. రాజా! యింతకుఁబూర్వ మేడుసప్తములఁ జెప్పియుంటిని. మఱల నాదిత్యునిచేఁ జెప్పఁబడిన యనేకసప్తములఁ జెప్పెద అరుణునకుఁ బూజనీయంబు లగుసప్తము లేడు సూర్యుని చేతనే చెప్పఁబడినవి. అర్కసంపుటికాసప్తమీ 1, మరీచసప్తమీ 2, నింబసప్తమీ 3, ఫలసప్తమీ 4, అనోదనసప్తమీ 5, విజయసప్తమీ 6, కామికాసప్తమీ 7. ఈయేడింటికి నివి నామములు వీనివిధానమును గూడఁ జెప్పెద నాకర్ణింపుము శుక్లపక్షంబున రవిదినమునందు, దక్షిణోత్తరాయణంబులయందును, గ్రహణములయందును, సూర్యనక్షత్రము నందును, సప్తసప్తమీవ్రతమును గ్రహింపవలెను. ఈవ్రతమును జల్పువాఁడు బ్రహ్మచారియు, శౌచయుక్తుఁడును, జితేంద్రియుఁడును, భాస్కరారాధననిరతుండును, శాంతుఁడును, జపహోమాసక్తుఁడునై పంచమినాఁడనాత్మకంబగు నిత్యకర్మ నాచరింపవలెను. షష్ఠినాఁడు మిథునకర్మను మధుమాంసములను వర్జింపవలెను. ప్రథమసప్తమిని జిల్లేడాకులతో గడుపవలెను రెండవసప్తమిని మిరియఁపుటాకులతోను, మూఁడవసప్త

---

శతానీక ఉవాచః—పునర్మే బ్రూహి సప్తమ్యాం ప్రీతయే భాస్కరస్య తు, ఉపోషితో భవతీహ నరో యస్తు ద్విజోత్తమ. ౧. సుమంతురువాచః కథితాః సప్త సప్తమ్యః పునరస్మిన్మహామతే, బహవః కురుశార్దూల భూయస్త్వేతాః శృణుష్వ మే. ౨. స్వయం యాః కథితాః పూర్వమాదిత్యేన ఖగాధిప, అరుణస్య మహాబాహో సప్తమ్యః సప్తపూజితాః. ౩. అర్కసంపుటకైరేకా ద్వితీయా మరిచైస్తథా, తృతీయా నింబపత్రైశ్చ చతుర్థీ ఫలసప్తమీ. ౪. అనోదనా పంచమీ స్యాత్షష్ఠీ విజయసప్తమీ, సప్తమీ కామికా జ్ఞేయా విధిం తాసాం నిబోధ మే. ౫. శుక్లపక్షే రవిదినే దక్షిణే చోత్తరాయణే, గ్రహణే సూర్యనక్షత్రే గృహ్ణీయాత్సప్త సప్తమీః. ౬. స తాం సు బ్రహ్మచారీ స్యాచ్ఛౌచయుక్తో జితేంద్రియః, సూర్యార్చనరతో దాంతో జపహోమపరస్తథా. ౭. పంచమ్యామేవ పురుషః కుర్యాన్నిత్య మనాత్మకమ్, షష్ఠ్యాం న మైథునం గచ్ఛేన్మధుమాంసం చ వర్జయేత్. ౮. అర్కసంపుటకైరేకాం తథాన్యాం మరిచైర్నయేత్, తథాపరాం నింబపత్రైః ఫలాఖ్యాయాం ఫలం చరేత్. ౯. అనోదనామన్నర

మిని వేపాకుతోను, ఫలసప్తమిని ఫలములతోను, అయిదవసప్తమి నన్నములేని యుపవాసముతోడను, ఆరవ విజయసప్తమి నహోరాత్రములు వాయుభక్షణముఁజేసియు గడుపవలెను ప్రతిమాస మొక్కొక సప్తమినిఁ జేసి తరువాత యథావిధిగ కామికాసప్తమినిఁ జేయవలెను ఈసప్తసప్తముల నామములను ప్రత్యేక పత్త్రంబులయందు వ్రాసి యాపత్త్రంబుల నొక క్రొత్తకుండయం దుంచి వీనియర్థము నెఱుంగని లోకబాహ్యుఁడగు మనుష్యునిచేనైన విచారణచేయక యాపత్త్రము నెత్తింపనలెను ఆవిధిచేఁ బ్రతిమాసమునందును తపముఁజేసిన నీసప్తములన్నియుఁ గలసి కామికాసప్తము లనఁబడును ఈరీతిగ సప్తసప్తములను భాస్కరుఁడరుణునకుఁ జెప్పెను ఏమనుష్యుఁడు భక్తితో దీనిఁ జేయునో యామనుష్యుఁడు సూర్యలోకమును బొందును జిల్లేడాకులతో సప్తమినిఁ జేసినఁ బౌరుషము, మిరియఁపుటాకులతోఁ జేసినఁ బ్రియపుత్త్రసంగమము, వేపాకుతోఁ జేసిన సర్వరోగనాశనము, ఫలములతోఁ జేసిన పుత్త్రపౌత్త్రులు మొదలగుసంతానసమృద్ధి గల్గును అధికములగు ధనధాన్యములను, వెండి బంగారములను, పశువులను, ఆరోగ్యమును పొందును విజయసప్తమినాఁడుపవసించిన నిత్యము శత్త్రువులను జయించును కామికాసప్తమినాఁడు విధిప్రకారము ముపవసించిన సర్వకార్యములను సాధించును పుత్త్రులను

---

హిత ఉపాసీత యథావిధి, అహోరాత్రం వాయుభక్షః కుర్యాద్విజయసప్తమీమ్ ౧౦ తత్త్రైకాం సప్తమీం కృత్వా ప్రతిమాసం విచక్షణః, కుర్యాద్యథావిధి ముదా అతః కుర్వీత కామికామ్ ౧౧ ఆసాం లిఖిత్వా నామాని పత్త్రకేషు పృథక్పృథక్, తాని సర్వాణి పత్త్రాణి క్షిపేదభినవే ఘటే ౧౨ తదర్థం యో న జానాతి లోకబాహ్యోఽపి వా నరః, తేన హ్యుద్ధారయేదేకం న కుర్యాచ్చ విచారణామ్. ౧౩ తేనైవ విధినా యస్తు ప్రతిమాసం చ తత్తపః, సప్తైవ యావత్సప్తమ్యో విజ్ఞేయా సా తు కామికా ౧౪ ఇత్యేతాః సప్త సప్తమ్యః స్వయం ప్రోక్తా వివస్వతా, కుర్వీత యో నరో భక్త్యా స యాత్యర్కసదో నృప ౧౫ అర్కసంపుటకైర్విత్తమచలం సప్తపౌరుషమ్, మరిచైః సంగమః స్యాద్వై ప్రియైః పుత్త్రాదిభిః సదా ౧౬ సర్వరోగాః ప్రణశ్యంతి నింబపత్త్రైర్న సంశయః, ఫలైస్తు పుత్త్రపౌత్త్రాశ్చ దౌహిత్రాశ్చాపి పుష్కలాః ౧౭ అతో ఘనం ధనం ధాన్యం సువర్ణం రజతం తథా, తథా పశుర్హిరణ్యం చ ఆరోగ్యం సతతం నృప ౧౮, ఉపోష్య విజయాం శత్రూన్రాజన్ జయతి నిత్యశః, సాధయేత్కా

గోరువారు పుత్త్రులను, ధనమునుగోరువారు ధనమును, రాజ్యమును గోరువారు రాజ్యమును, విద్యనుగోరువారు విద్యను బొందుదురు బహువిధములఁ జెప్పుటచే నేమి ప్రయోజనము? ఈకామికాసప్తమి సమస్తకామముల నిచ్చును స్త్రీయైనను పురుషుఁడైనను యథోక్తముగా నీసప్తమీవ్రతమును నిశ్చలమనస్సుతోఁ జేసినయెడల నిస్సంశయముగా పరమపదమును బొందును వారలకు మూఁడులోకంబులయందును దుర్లభంబగున దెద్దియు నుండదు ఎవ్వరు భక్తితో వ్రతదీక్షగల్గి సూర్య వ్రతమును జేయుదురో వారు పొందెడిఫలమును అనేకవ్రతములచేతను, దుష్కరంబులగు తపములచేతను, బహుదక్షిణాకంబులగు యజ్ఞంబుల చేతను గూడఁ బొందఁజాలరు సప్తమినాఁడు మోక్షప్రదుండగు దేవునిఁ బూజించి యేఫలమును బొందుదురో యాఫలమును తీర్థాదులచేతను, దానహోమార్చనములచేతను (గూడఁ బడయఁజాలరు మనుష్యుఁడు సప్తమినాఁడు సూర్యసన్నిధానమునఁజేరి మోక్షార్థియై భగవంతుఁడగు సూర్యుఁడు చెప్పినట్లు చేసిన మోక్షముఁ గూడఁ గాంచును ఆదిత్యదినం బున భక్తితో భాస్కరుని బూజింపవలెను అట్లు భాస్కరునిఁ బూజించిన మనుష్యుఁ డచలంబగుస్థానమును బొందును నియతమగు సూర్యలోక వాసము గల్గును సప్తమినాఁడు భాస్కరునిఁ బూజించినవానికి బ్రహ్మేంద్ర రుద్రలోకంబుల నడ్డులేనిగమనము గల్గును అంధుఁడును, కుష్ఠరోగము

---

మదా కామాన్విధివత్సముపాసితా ౧౯ పుత్త్రకామో లభేత్పుత్త్రమర్థకామోఽర్థమక్ష యమ్, విద్యాకామో లభేద్విద్యాం రాజ్యార్థీ రాజ్యమాప్నుయాత్, కృత్స్నాన్కా మాన్ దదాత్యేషా కామదా కురునందన ౨౦ నరో వా యది వా నారీ యథోక్తం సప్తమీవ్రతమ్, కరోతి నియతాత్మా వై స యాతి పరమాం గతిమ్ ౨౧ న తేషాం త్రిషు లోకేషు కించిదస్తీతి దుర్లభమ్, యే భక్త్యా లోకనాథస్య వ్రతినః సంశితవ్రతాః. ౨౨ వ్రతైస్తు వివిధైర్వీర తపోభిర్వా సుదుష్కరైః, న తత్ఫలమవాప్నోతి యజ్ఞైర్వా బహుదక్షిణైః ౨౩ తీర్థాభిషేచనైర్వాపి దానహోమార్చనైస్తథా, యత్ఫలం చ పూజ యితుం సప్తమ్యాం ప్రాప్య మోక్షదమ్, మోక్షార్థీ పార్థివశ్రేష్ఠ యథాహ భగవాన్రవిః. ౨౪ కృత్వాదిత్యదినే నక్తం భక్త్యా సంపూజయేద్రవిమ్, అచలం స్థానమాప్నోతి మానవః శ్రద్ధయాన్వితః, సూర్యలోకే చ నియతం తస్య వాసో న సంశయః ౨౫ యస్తు పూజయతే భక్త్యా సప్తమ్యాం భాస్కరం నరః, బ్రహ్మేంద్రరుద్రలోకేషు తస్యా

గలవాఁడును, నపుంసకుఁడును, విశేషాంగముగలవాఁడును, దరిద్రుఁడును సప్తమీవ్రతమును జేసిన వానివంశమునఁ బుట్టనేరరు. విద్యను గోరువారు విద్యను, ధనముగోరువారు ధనమును, భార్యనుగోరువారు రూపవతియగుభార్యను, పుత్త్రులనుగోరువారు పుత్త్రులను బడయఁగలరు. లోభమువలనఁగాని, ప్రమాదమువలనఁగాని, అజ్ఞానమువలనఁగాని వ్రతభంగము గల్గినచో మూఁడురాత్రు లాహారములేక యుపవసింపవలెను లేనిచో ముండనమును జేసికొనవలెను. ఇట్టిప్రాయశ్చిత్తమును జేసికొని మఱల వ్రతము నారంభింపవలెను. ఈరీతిగ నన్ని సప్తములఁ జేసి సూర్యసప్తమినాఁడు మాల్యధూపాదులచే నర్చించి శక్తికొలఁది బ్రాహ్మణులను భుజింపఁజేసిన నక్షయముగ స్వర్గమును బొందును. ఆనాఁడు విప్రముఖ్యులకు హిరణ్యమిచ్చి యక్షయఫలమునొంది సూర్యలోకమును గూడఁ బొందఁగలఁడు. రాజా! యీరీతిగ సప్తమీవ్రతము నంతను జెప్పితిని. మఱలఁజెప్పెదను నిశ్చలమనస్కుఁడవై యాకర్ణింపుము.

ఇది అష్టాధికద్విశతతమాధ్యాయము.

---

ప్రతిహతా గతిః. ౨౬. నాంధో న కుష్ఠీ న క్లీబో న వ్యంగో న చ నిర్ధనః, కులే తస్య భవేద్వీర యశ్చరేత్సప్తమీవ్రతమ్. ౨౭. విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ ధనమాప్నుయాత్, భార్యార్థీ రూపసంపన్నాం స్త్రియం పుత్రాంశ్చ భారత. ౨౮. లోభాత్ప్రమాదాన్మోహాచ్చ వ్రతభంగో యదా భవేత్, తదా త్రిరాత్రం నాశ్నీయాత్కుర్యాద్వా కేశముండనమ్. ౨౯. ప్రాయశ్చిత్తమిదం కృత్వా పునరేవ వ్రతీ భవేత్, సప్తైవ యావత్సప్తమ్యో భవంతి చ ఖగేశ్వర. ౩౦. అభ్యర్చ్య సూర్యసప్తమ్యాం మాల్యధూపాదిభిర్నరః, భోజయిత్వా ద్విజాంఛక్త్యా ప్రాప్నుయాత్స్వర్గమక్షయమ్. ౩౧. సప్తమ్యాం విప్రముఖ్యేభ్యో హిరణ్యం యః ప్రయచ్ఛతి, స తదక్షయ్యమాప్నోతి సూర్యలోకం చ గచ్ఛతి. ౩౨. ఇతీదం కీర్తితం వీర సప్తమీవ్రతముత్తమమ్, భూయ ఏవాభిధాస్యామి శృణుష్వైకమనా నృప. ౩౩.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యారుణ
సంవాదే సప్తసప్తమీవ్రతవర్ణనం నామ
అష్టాధికద్విశతతమోఽధ్యాయః.

## నవాధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. శుద్ధసప్తమీవ్రతమును గోమయాహారుఁడై చేసినను, శాలిపిష్టాహారుఁడై చేసినను, జీర్ణభ్రష్టపత్రాహారుఁడై చేసినను, క్షీరాహారుఁడై చేసినను, ఏకభుక్తముతోఁ జేసినను, భిక్షాహారముతోఁ జేసినను, జలాహారముతోఁ జేసినను, దివాకరుని వివిధపుష్పోపహారంబులచేతను, పద్మసౌగంధికోత్పలంబులచేతను, నానావిధగంధంబులచేతను, విచిత్రభూషణంబులచేతను బూజించి హిరణ్యాన్నదానాదులచే బ్రాహ్మణోత్తములను దృప్తిపఱిచినచో బహుదక్షిణాకంబులగు యజ్ఞంబులను జేసినఫలమును బొందుననుట నిస్సంశయము. ఎప్పు డీలోకమున సూర్యు నుద్దేశించి తపం బాచరించునో యప్పుడే విమానవరము నధిరోహించి సూర్యలోకంబున కేగి ప్రకాశించుచుండును రాజా! ఆపుణ్యము నశించినతరువాత నుత్తమకులంబున జన్మించును. ఈరీతిగఁ బ్రతిమాసమునందును భక్తితో సమాహితచిత్తుఁడై వివస్వంతునిఁ బూజింపవలెను. శ్రద్ధతో నాతని నామసంకీర్తనము చేయవలెను. చైత్రమాసంబున విష్ణువనియు, వైశాఖమాసంబున అర్యముండనియు, జ్యేష్ఠమాసంబున వివస్వంతుఁడనియు, ఆషాఢమాసంబున దివాకరుండనియు, శ్రావణమాసంబునఁ బర్జన్యుఁడనియు, భాద్రపదమాసంబున వరుణుండనియు, కార్తికంబున మార్తండుండనియు, మార్గశీర్షంబున మిత్రుఁ

---

సుమంతురువాచ:—యః క్షీపేద్గోమయాహారః శుక్లా ద్వాదశ సప్తమీః, అథవా యావకాహారః శీర్ణపర్ణాశనోఽపి వా. ౧. క్షీరాశీ చైకభక్తో వా భిక్షాహారోథ వా పునః, జలాహారోఽపి వా విద్వాన్సూజయిత్వా దివాకరమ్. ౨. పుష్పోపహారైర్వివిధైః పద్మసౌగంధికోత్పలైః, నానాప్రకారైర్గంధైశ్చ ధూపైర్గుగ్గులుచందనైః. ౩. కృష్ణగంధపాయసాద్యైర్విచిత్రైః సువిభూషణైః, అర్చయిత్వా ద్విజాంచ్ఛ్రేష్ఠాన్హిరణ్యాన్నాదిభిర్నరః. ౪. స తత్ఫలమవాప్నోతి క్రతుభిర్భూరిదక్షిణైః, యదేహ తప్యతే వీర ప్రాప్యతే కేవలం రవేః. ౫. విమానవరమారూఢః సూర్యలోకే మహీయతే, తతః పుణ్యక్షయా ద్రాజన్కులే మహతి జాయతే. ౬. ఏవం భక్త్యా వివస్వంతం ప్రతిమాసం సమాహితః, పూజయేద్విధివద్భక్త్యా నామాని పరికీర్తయేత్. ౭. చైత్రికే మాసి విష్ణుశ్చ మాధవే హ్యర్యమేతి వై, శుక్రే వివస్వాన్మాసే తు శుచౌ మాసే దివాకరః. ౮. పర్జన్యః శ్రావణే మాసి నభస్యే వరుణస్తథా, మార్తండేతి చ విజ్ఞేయః కార్తికే భార్గవః పునః. ౯. మార్గ

డనియుఁ బుష్యమాసంబునఁ బూష యని, మాఘమునందు భగుఁడనియు, ఫాల్గునమునందు త్వష్టయనియు నాయామాసములయం దాయానామములచే భాస్కరునిఁ బూజింపవలెను. ఈనామములను సూర్యప్రీతికై యుచ్చరించుచుండవలెను. సప్తమినాఁడు సమాహితమనస్కుఁడై భక్తితో ధూపార్చనవిధినిఁ జేసి పరమపదమును బొందును. పరమరహస్యంబగు దీనిని అశిష్యునకును, భక్తిహీనునకును, పాపికిని, నాస్తికునకును, కృతఘ్నునకు నుపదేశింపఁగూడదు. ఎవ్వరైన నీసప్తమీవ్రతమును శ్రద్ధతో వినినను చదివినను వ్రాసినను ఇహలోకంబున సుఖమును బొంది పరంబున సూర్యలోకంబునఁ బ్రకాశించుచుందురు. పుణ్యము నశించినతరువాత నిహలోకంబున కేతెంచి భూతలమునకు రాజగును.

ఇది నవాధికద్విశతతమాధ్యాయము.

---

## దశాధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! యీరీతిగ సప్తమీవ్రతమునంతను సంక్షేపముగాఁ జెప్పియుంటిని. దీనినే విస్తరింతును. నిశ్చలమనస్కుం

---

శిశిరేఽపి మిత్రస్తు కీర్తితః సతతం బుధైః, పూషా పౌషే తు వై మాసే పూజనీయః ప్రయత్నతః. ౧౦. మాఘే భగేతి విజ్ఞేయస్త్వష్టా చైవాథ ఫాల్గునే, ఏవం క్రమేణ నామాని కీర్తయేత్ప్రీతయే రవేః. ౧౧. ధూపార్చనవిధిమిమం సప్తమ్యాం సుసమాహితః, యః కరోతి నరో భక్త్యా స యాతి పరమాం గతిమ్. ౧౨. తత స్తే సర్వమాఖ్యాతం యథాగుహ్యతమం విభో, నైవ దేయమశిష్యాయ నాభక్తాయ కదాచన. ౧౩. న చ పాపకృతే దేయం న దేయం నాస్తికాయ వా, కృతఘ్నే నాస్తికే వీర న దేయం క్రూరకర్మణి. ౧౪. య ఇదం శృణుయాన్నిత్యం సప్తమీవ్రతముత్తమమ్, పఠేద్యశ్చాపి నియతః శ్రద్ధయా పరయాన్వితః. ౧౫. ఇహ లోకే సుఖం ప్రాప్య సూర్యలోకే మహీయతే, పుణ్యక్షయాదిహాగత్య రాజా భవతి భూతలే. ౧౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సూర్యారుణసంవాదే
ప్రతిమాసప్తమీవ్రతవర్ణనం నామ
నవాధికద్విశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచః—ఇత్యేవ సప్తమీకల్పః సమాసాత్కథితస్తవ, విస్తరాత్తే పున

డవై యాలకింపుము ఫాల్గునశుద్ధషష్ఠినాఁ డుపవసించి స్నానముఁజేసి గంధలేపనంబులచేతను, అర్కపుష్పంబులచేతను, సుగంధయుక్తమగు గుగ్గిలముచేతను, తెల్లగన్నేరుపూలచేతను, చందనముచేతను భాస్కరునిఁ బూజించి భాస్కరప్రీతికొఱకు గుడోదకమును నివేదింపవలెను ఈరీతిగఁ బగలంతయు భాను నారాధించి రాత్రి యాభాస్కరునియెదుటనే నిద్రింపవలెను లేదా నిద్రమాని పరమంబగు భానుమంత్రమును జపించుచుండవలయును శతానీకుం డిట్లనియె బ్రాహ్మణోత్తమా! భగవంతునకుఁ బ్రియంబగుమంత్ర మెద్ది? భాస్కరునియెదుట నేమంత్రమును జపింపవలెను? ఆమంత్రమును ధూపవీపంబులను నాకుఁ జెప్పుమనిన సుమంతుం డిట్లనియె భరతసత్తమా! సంక్షేపముగ నేఁ జెప్పెద విస్తరముగఁ జెప్పుట కవకాశము లేదు షడక్షరమంత్రముచే సమాహితమనస్కుఁడై సర్వముఁ జేయవలెను హోమపూజనములను నూఱుమార్లు జపమునుఁ జేయవలెను మొదట సావిత్రిని వెయ్యినూఱుసార్లు జపించి తరువాత హోమాదికమును జేయవలెను "ఓం భోః సావిత్రి భాస్కరాయ సహస్రరశ్మిం ధీమహి తేన సూర్యః ప్రచోదయాత్" ఈమంత్రజపము సప్తమినాఁ డుత్తమమని భాస్కరుఁడే చెప్పియుండెను ఈమంత్రము నొక్కమారు జపించినమానవుఁడు పవిత్రుఁ

---

ర్వచ్మి శృణు చైకమనా విభో। ౧ ఫాల్గునామలపక్షస్య షష్ఠ్యాం చ సముపోషితః, పూజయేద్భాస్కరం స్నాత్వా గంధపుష్పవిలేపనైః ౨ అర్కపుష్పైర్మహాబాహో గుగ్గులేన సుగంధినా, శ్వేతేన కరవీరేణ చందనేన దివాకరమ్ ౩ గుడోదకేన నైవేద్యం నివేద్యం ప్రీతయే రవేః, ఏవం పూజ్య దివా భానుం రాత్రౌ తస్యాగ్రతః స్వపేత్, జపస్శ్వాభమం పరం జాప్యం వినిద్రః సతతం బుధః ౪ శతానీక ఉవాచ — కిం తత్పరం భగవతః ప్రియం జాప్యమనుత్తమమ్ ౫ జప్తవ్యో యత్పరైర్భక్త్యా భానుస్తస్యాగ్రతో నరైః, తస్మై బ్రూహి తథా మంత్రాన్ ధూపదీపాన్విశేషతః, యేనాహం తం జపన్ జప్యం పూజయామి దివాకరమ్. ౬ సుమంతురువాచ — వచ్మి తే భరతశ్రేష్ఠ సమాసాన్న తు విస్తరాత్ ౭ షడక్షరేణ మంత్రేణ కుర్యాత్సర్వం సమాహితః. జపం హోమం తథా పూజాం శతజప్తేన సర్వదా. ౮ సావిత్ర్యా చ జపం పూర్వం కృత్వా శతసహస్రశః, పశ్చాత్సర్వం ప్రకుర్వీత జపాదికమనాకులమ్ ౯ ఓం భోః సావిత్రి భాస్కరాయ సహస్రరశ్మిం ధీమహి, తెన సూర్యః ప్రచోదయాత్ ౧౦ జప ఏష పరః ప్రోక్తః సప్తమ్యాం భానునా స్వయమ్, జప్త్వా సకృద్భవేత్పూతో మానవో నాత్ర సంశయః,

డగు ననుట నిస్సంశయము. తరువాత సప్తమినాఁడు ప్రభాతంబున నియత మనస్కుండై జపించుచు భక్తిపూర్వకంబుగాఁ బూర్వోక్తవిధిచే భాస్కరునిఁ బూజించి తనశక్తికొలఁది బ్రాహ్మణులకు దివ్యభోగంబుల నిచ్చి యనేకభక్ష్యభోజ్యంబులతో భుజింపఁజేయవలెను. ద్రవ్యమునం దెంత మాత్రమును లోభింపఁగూడదు. భోజకులను గూడ భుజింపఁజేయవలెను. సూర్యభక్తులు గానివారలను భుజింపఁజేయఁగూడదు. ప్రయత్నపూర్వకముగా సూర్యభక్తులనే భుజింపఁజేయవలెను. శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణులలో నెవ్వరు భోజనీయులు, ఎవ్వరు భోజనీయులుగారో, యెవ్వారిమనస్సులందు దివాకరుఁడు సప్తమిని వసించునో నాకుఁ జెప్పుమనిన సుమంతుం డిట్లనియె. రాజా! సప్తమీవ్రతమును జేయువిప్రుఁడు భోజనీయుఁడు. సప్తమీవ్రతమును జేయుఘటియును భోజనీయుఁడగును. సౌరభిన్నులతో భుజింపనివారును సౌరవ్రతులు మొదలగు నీబ్రాహ్మణులు భోజ్యులగుదురని యాదిత్యుఁడే చెప్పియుండెను. ఇక నభోజ్యులఁ జెప్పెద నాకర్ణింపుము. అన్యగామియగుభార్యగలవాఁడును, కుష్ఠరోగముగలవాఁడును, అన్యదేవోపాసకుఁడును, నక్షత్రసూచకుండును, పరులయపవాదోద్ఘాటనమునం దాసక్తుఁడును, దేవలకుఁడును వీరందఱు నభోజ్యులని భాస్కరుఁడే చెప్పియుండెను. శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! యేబ్రాహ్మణులు భోజ

౧౧. ప్రభాతే త్వథ సప్తమ్యాం జపన్నియతమానసః, పూజయేద్భాస్కరం భక్త్యా పూర్వోక్తవిధినా నృప. ౧౨. శ్రద్ధయా భోజయేచ్చాపి బ్రాహ్మణాంఛక్తితో నృప, దివ్యాన్భోగాంశ్చ విధివద్భక్ష్యభోజ్యైరనేకశః. ౧౩. విత్తశాఠ్యం న కుర్వీత భోజకాంశ్చ ప్రభోజయేత్, న భోజయేత్తథాఽసౌరాన్సౌరాన్యత్నేన భోజయేత్. ౧౪. శతానీక ఉవాచః—కే భోజ్యా కే న వా భోజ్యా బ్రాహ్మణా బ్రహ్మవిత్తమ, కేషు చిత్తేషు సప్తమ్యాం దేవదేవో దివాకరః. ౧౫. సుమంతురువాచః—ఘటీభోజ్యో భవేద్విప్రః సప్తమీం కురుతే చ యః, సౌరభిన్నేష్వభోజ్యో యో యశ్చ భక్తో దివాకరే. ౧౬. ఏతే భోజ్యా ద్విజా రాజన్నాదిత్యేన సమాసతః, ప్రోక్తాః కురుకులశ్రేష్ఠ తథాఽభోజ్యాఞ్ఛృణుష్వ మే. ౧౭. సభార్యః సపతిర్యస్తు కుష్ఠరోగైర్వృతశ్చ యః, యశ్చాన్యదేవతాభక్తస్తథా నక్షత్రసూచకః. ౧౮. పరాపవాదనిరతో యశ్చ దేవలకస్తథా, ఏతేఽభోజ్యాః సవిత్రా తు స్వయం దేవేన చింతితాః. ౧౯. శతానీక ఉవాచః—యే

నీయులలో నెవరు కారో వారిగురుతులను నాకు విశదముగాఁ జెప్పుమనిన సుమంతుం డిట్లనియె. రాజేంద్రా! వేదవిద్యను పఠించు బ్రాహ్మణసముదాయము ఘటయని చెప్పఁబడును. ఆఘటగల బ్రాహ్మణుఁడు ఘటి యనఁబడును. విధ్యుక్తరీతిఁ బవిత్రమగు పుస్తకవాచనమును భక్తితో విను బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులసమూహమును ఘటి యని చెప్పఁబడు ననియును, ప్రతిమాసమున నిబద్ధములగుహోమముల ననుష్ఠించువాఁడు ఘటి యనియును, గగనగామి యగుభానునిచేతనే స్వయముగఁ జెప్పఁబడినది. ఏ బ్రాహ్మణుఁడు తనకు విహితములైన యెల్లకర్మములఁ జేయునో యాతఁడు సూర్యునకుఁ బ్రియుఁడై కరకుఁ డనఁబడును. భాస్కరుఁడు చెప్పిన జయశబ్దవాచ్యంబులగు నష్టాదశపురాణముల నితిహాసములను జదివి చెప్పి జీవించువాఁడు ఒక బ్రాహ్మణు నాశ్రయించి వెనుకఁ జెప్పిన వానితో జీవించుచో నా బ్రాహ్మణుఁడు జయోపజీవి యనఁబడును. ఆతనినే వాచకుఁడని గూడఁ జెప్పుదురు. ఈజయోపజీవియు వ్యాసుఁడును సములయి జీవకు లనఁబడుదురు. ఎవ్వఁ డారుణేయాదిశాస్త్రములను సప్తాశ్వతిలకమును సౌరధర్మముల నెఱుంగునో తత్త్వవేత్తయగు నా విప్రుఁడు సౌరుఁడని చెప్పఁబడును. రాజా! ఏనరుం డెల్లప్పుడును భాస్కరుని, భాస్కరునివలెనే భోజకులను పూజించునో యాతఁడే భాస్కరభక్తుఁ

---

భోజ్యా బ్రాహ్మణాః ప్రోక్తా యే చాభోజ్యా ద్విజోత్తమాః, ఏతేషాం లక్షణం బ్రూహి సర్వేషాం వై సమాహితః. ౨౦. సుమంతురువాచ.—సాధు పృష్టోఽస్మి రాజేంద్ర కీర్తయామ్యేష కృత్స్నశః, పఠతాం తు త్రయీవిద్యాం బ్రాహ్మణానాం కదంబకః. ౨౧. ఘటేత్యుక్తా తు సా రాజన్స్వయం దేవేన భానునా, సా ఘటా విద్యతే యస్య స ఘటీత్యుచ్యతే ద్విజః. ౨౨. బ్రహ్మక్షత్రవిశాం వీర శూద్రాణాం చ కదంబకః, శృణ్వతాం విధివత్పుణ్యం భక్త్యా పుస్తకవాచనమ్. ౨౩. ఇతి మాసే నిబద్ధస్య హోమస్యేతి చ భానునా, కథితం కురుశార్దూల స్వయమాకాశగామినా. ౨౪. యస్యాః కర్తా భవేద్యస్తు మమ స్యాత్కరకో మతః, స విప్రో రాజశార్దూల సదేష్టో భాస్కరస్య తు. ౨౫. జయోపజీవీ వ్యాసశ్చ సమః స్యాజ్జీవకస్తథా, యాన్యేతాని పురాణాని సేతిహాసాని భారత, జయేతి కథితానీహ స్వయం దేవేన భాస్వతా. ౨౬. ఏకం నివాసయన్యస్తు బ్రాహ్మణం తూపజీవతి, జయోపజీవీ స జ్ఞేయో వాచకశ్చ తథా నృప. ౨౭. ఆరుణేయాదిశాస్త్రాణి సప్తాశ్వతిలకం తథా, యస్తు జానాతి సౌరాణి విప్రః సౌరస్స తత్త్వవిత్. ౨౮. పూజయేత్సతతం యస్తు భాస్కరం నృపసత్తమ, భోజకాంశ్చ తథా రాజ

డని చెప్పఁబడును ప్రయత్నపూర్వకముగ నాతనినే భుజింపఁజేయ వలెను ఇవి యన్నియు భోజ్యానిలక్షణములు అభోజ్యలక్షణములఁ జెప్పెద వినుము శూద్రస్త్రీ భార్యగాఁగలవాఁడును, పరభార్యలఁబొందు గోరెడివాఁడును, దైవనిహతుఁడును, కుష్ఠరోగియు, బ్రాహ్మణహంత కుఁడును, భోజకుఁడు తనగృహమునకు వచ్చినప్పుడు తెలిసికొనక పూజిం పనివాఁడును, ఇతరదేవతారాధనతత్పరుండును, సూర్యుని బూజింపని వాఁడు నగుబ్రాహ్మణుఁ డభోజ్యుఁడని తెలియవలెను భోజకుఁడు భానునిదేహమునుండి పుట్టినవాఁడని తెలియవలెను ఆదిత్యునిఁ బూజిం పనివాని నెన్నఁడును భుజింపఁజేయఁగూడదు ముండితశిరస్కుఁడును, అవ్యంగమును ధరించినవాఁడును, గౌరవర్ణుఁడును శంఖపుష్పములను ధరించినవాఁడును నగుభోజకుఁ డేమానవునిగృహమ్మున కేగునో యాతని గృహంబునకు దేవతలును, పితరులు నేతెంతురు ఆభోజకు లొక్కవేళ భుజించిన నేడేండ్లు భాస్కరుఁడు తృప్తుఁడగునుగాన, దివ్యులగు నాభోజకుల నెల్లప్పుడు విద్వాంసుఁ డగువాఁడు భోక్తలనుగా నియ మింపవలెను వారలను నిందించుబ్రాహ్మణు నెన్నఁడును భోక్తనుగా నియమింపఁగూడదు ఏస్త్రీ సూర్యభక్తుఁడగు తనపతిని వదలి యితరునిఁ బొందునో యాస్త్రీ స్వైరిణీ, పాపిష్ఠ, కులదూషణి యనఁబడును రాజా!

---

న్యథా దేవం దివాకరమ్ ౨౯ స జ్ఞేయో భాస్కరే భక్తో భోజనీయః ప్రయత్నతః, భోజ్యానాం లక్షణం హ్యేతదభోజ్యానాం శృణుష్వ మే ౩౦ వృషలీ యస్య వై భార్యా బ్రాహ్మణస్య విశేషతః, పరభార్యాపతిరసౌ బ్రాహ్మణో బ్రాహ్మణాధమః ౩౧ దైవేన నిహతః కుష్ఠీ బ్రాహ్మణో బ్రహ్మఘాతకః, భోజకో విందతే యస్తు న చ తం పూజయేత్తథా ౩౨ జ్ఞేయోఽన్యదేవభక్తోఽసౌ స విప్రః కురునందన,ఆదిత్యం భోజకం విద్యాద్భానోర్దేహసముద్భవమ్ ౩౩ నాదిత్యం పూజయేద్యస్తు స భోజ్యో న కదాచన, ముండో వ్యంగధరో గౌరః శంఖపుష్పధరస్తథా ౩౪ యస్య యాతి గృహే రాజ న్భోజకో మానవస్య తు, తస్య యాంతి గృహే దేవాః పితరో భాస్కరస్య తు ౩౫ రక్షోభూతపిశాచాశ్చ యోగిన్యోఽపి పలాయితాః,సకృద్భుక్తే గృహే యస్య భోజకో గృహధర్మిణః ౩౬ సప్తసంవత్సరం యావత్తృప్తో భవతి భాస్కరః, తస్మాత్తాన్భోజయే ద్దివ్యాన్భోజకాన్సతతం బుధః, యస్తు తాన్నిందతే విప్రః స న భోజ్యః కదాచన ౩౭ నిజం భర్తారముత్సృజ్య స్వైరం యాన్యత్ర గచ్ఛతి, స్వైరిణీ సా తు వై ప్రోక్తా

యేస్త్రీ జన్మదోషమువలనఁ బరపురుషుని రహస్యముగా పొందునో ఆస్త్రీకూడ స్వైరిణి అని చెప్పఁబడును కులమునుగూడ నశింపఁజేయును బ్రాహ్మణుఁడు అట్టిస్త్రీయందు ఆసక్తిగలవాఁడగుచో స్వైరిణీరతుఁడని చెప్పఁబడును నాటకములతో జీవించువాఁడును, ప్రాకృతనాట్యముచేయు వాఁడును కథకుఁడని చెప్పఁబడును మఱియు నీకథకునకు రంగోపజీవి యనియు, బహుయాచకుఁడనియు రెండుపేర్లు కలవు వీని నుద్వృత్తుఁ డందురు ఏబ్రాహ్మణుఁడు, బహుజనసభయందు స్తోత్రములను బిగ్గరగాఁ జేయునో వాఁడు రెండవరంగోపజీవియని చెప్పఁబడును కథనమనఁగా సూచనమగుట సర్వశాస్త్రములయందు దెలియుటచేత అర్థమును సూచించు వాఁడు కథకుఁడని చెప్పఁబడును ఎవఁడు నక్షత్రములు సూచించునో అతఁడు నక్షత్రసూచకుఁడని చెప్పఁబడును శతానీకుం డిట్లనియె జ్యోతి శ్శాస్త్రము వేదాంగమనియు దాని నభ్యసింపనివాఁడు షడంగవేది కాఁడ నియుఁ జెప్పుదురుగదా? అట్టిచో జ్యోతిర్వేత్త యభోజ్యుఁ డెట్లగును? అనిన సుమంతుం డిట్లనియె జ్యోతిశ్శాస్త్రమును జీవికకై వినియోగించు వాఁ డభోజ్యుఁడగును దేవకార్యార్థమై వినియోగించువాఁడు భోజ్యుం డగును కారణములేకయే పరుల నిందించువాఁడు పరివాదకుఁడు జీతము

---

పాపిష్ఠా కులదూషిణీ. ౩౮ ప్రచ్ఛన్నం రోచతే రాజన్యా నారీ భవదోషతః, జ్ఞేయా సా స్వైరిణీ రాజన్కులే భవతి నాశినీ ౩౯. యోఽస్యాం రతో భవేద్విప్రః స జ్ఞేయః స్వైరిణీరతః, రంగోపజీవీ కథకో యశ్చ ప్రాకృతనర్తకః ౪౦ రంగోపజీవీ రాజేంద్ర తథా చ బహుయాచకః, ద్వే ఏతే నామనీ రాజన్కథకస్య ప్రకీర్తితే, కృతే నానేన యాదృక్చ ఉద్వృత్తః కురునందన ౪౧ యః స్తుతిం గాయతే విప్రః ప్రోచ్చైర్బహు జనసంసది, రంగోపజీవీ ప్రోక్తోఽయం ద్వితీయః పరికీర్తితః ౪౨ సూచనం కథనం ప్రోక్తం సర్వశాస్త్రేషు భారత, సూచయేద్యస్తు ఋక్షాణి స వై నక్షత్రసూచకః ౪౩ శతానీక ఉవాచ — అహో బత మహత్కష్టం భవతో యద్ద్విజాన్ప్రతి, వేదాంగం జ్యోతిః శాస్త్రం తు షష్ఠం ప్రోక్తం మనీషిభిః ౪౪ షడంగో న భవేత్తేన రహితేన ద్విజేన చ, అభోజ్యః పరనాత్తస్య యద్వత్స్యాద్బ్రాహ్మణో ద్విజ ౪౫ భోజ్యోఽఖండం యయా విప్రోఽనర్థకేన త్వనర్థకమ్, విమృశ్య కథ్యతాం విప్ర అత్ర మే సంశయో మహాన్ ౪౬. సుమంతురువాచ — సాధు పృష్టోఽస్మి భవతా శ్రూయతామత్ర నిర్ణయః, యస్య జీవ్యా మిదం జ్ఞేయమంగం విప్రస్య వై భవేత్ ౪౭ సాంవత్సరేణ జ్యోతిషా జ్ఞానసక్షత్ర

పుచ్చుకొని దేవపూజచేయువాఁడును, దేవునకు నివేదింపక నైవేద్య
మును భక్షించువాఁడును, దేవకు లను పేరుతో నధములుగాఁ జెప్పఁబడిరి
వీరు నరకమును బొందుదురు భృతిని గ్రహించి దేవకార్యములను
జేయుట నరకహేతువగును పారమార్థికబుద్ధితోఁ జేసినదేవకార్యములు
పరమపదప్రాప్తిహేతువులగును భోజకులయాజ్ఞను గైకొనియే బ్రాహ్మ
ణులును పూజార్హులు అట్లు పూజించినవారు బ్రాహ్మణభోజనమును
జేయింపవలెను శాల్యోదనములు, ముద్గములు, అపూపములు, గుడా
పూపములు, దధిపయస్సులు, నైవేద్యద్రవ్యములు వీటిచే భాస్కరుఁడు
ప్రీతుఁడగును కుళుత్థ - మసూర - సిస్రుక - రాజమాషములు, వృక్ష

---

సూచకః, న స భోజ్యో భవేద్రాజన్యస్యేయం జీవికా భవేత్ ౪౮ నిష్కారణం
పరాణాం చ పరోక్షం దోషకీర్తనమ్, గుణానాం చ యథా గుప్తిః పరివాదపరస్తు సః
౪౯ బ్రాహ్మణో యస్తు రాజేంద్ర వృత్త్యా కర్మ కరోతి వై, దేవతాయతనే చేహ
దేవానాం పూజనం తథా ౫౦ ఆధిపత్యం భక్షణం చ నైవేద్యస్య పరంతప, స జ్ఞేయో
దేవలో రాజన్బ్రాహ్మణో బ్రాహ్మణాధమః ౫౧ నాధికారస్తు విప్రాణాం భౌమానాం
దేవపూజనే, వృత్త్యా భరతశార్దూల ఆధిపత్యే విశేషతః ౫౨ యస్తు పూజయతే దేవం
బ్రాహ్మణో ద్రవ్యలోభతః, వృత్త్యై కురుకులశ్రేష్ఠ స యాతి నరకం ధ్రువమ్ ౫౩
దేవాలయేషు సర్వేషు అగ్నికార్యం చ సువ్రత, యః కుర్యాద్ద్రవ్యలోభేన అధోగతి
మవాప్నుయాత్. ౫౪ దేవాలయేషు సర్వేషు వర్జయిత్వా శివాలయమ్, దేవానాం
పూజనం రాజన్నగ్నికార్యేషు వా విభో ౫౫ అధికారః స్మృతో రాజన్భోజకానాం
న సంశయః, పూజయంతస్తు తే దేవాన్ప్రాప్నువంతి పరాం గతిమ్ ౫౬ నైవేద్యం
భుంజతే యస్మాద్భోజయంతి చ భాస్కరమ్, పూజయంతి చ దేవానాం దివ్యతంత్రేణ
తే గతాః ౫౭ పూజయిత్వా తు వై దేవాన్నైవేద్యం భక్ష్య చ ప్రభోః, యాంతి
తే పరమం స్థానం యత్ర దేవో దివాకరః ౫౮ బ్రాహ్మణశ్చాపి తం బ్రూయా త్రీణ్ణే
సవి మహామతే, ఏవం కరిష్యే శ్రేయోర్థం నాత్మనస్తవ వా విభో. ౫౯. ఇత్యామంత్ర్య
తతో గచ్ఛేత్స్వగృహం కురునందన, తథా పరేఽహ్ని సంపూజ్య దేవం భక్త్యా దివా
కరమ్ ౬౦ కృత్వా చ పావకం రాజన్బ్రాహ్మణాన్భోజయేత్తతః, శాల్యోదనం తథా
ముద్గం సుగంధం ముద్గమేవ హి. ౬౧ అపూపాన్గుడపూపాంశ్చ పయో దధి తథా
నృప, ఏతైస్తు తృప్తిమాయాతి భాస్కరో నరసత్తమ ౬౨ వర్జ్యాని భరతశ్రేష్ఠ శృణు
త్వం గదతో మమ, కులత్థకాన్మసూరాంశ్చ నిష్పావాదీంస్తథైవ చ ౬౩ సిస్రుకం చ
తథాన్యచ్చ రాజమాషాంస్తథైవ చ, నైతాని భాస్కరే దద్యాద్య ఇచ్ఛేచ్ఛ్రేయ

నిర్యాసాదులును నిషిద్ధములు దుర్గంధద్రవ్యములు, కటుద్రవ్యములు, అల్పద్రవ్యములు, విమిశ్రములును నిషిద్ధములే యగును అనత్యుచ్ఛం బును, నాతినీచంబును, నగుపరిశుద్ధదేశంబునఁ బుట్టినయుత్తమంబగు నర్కవృక్షమును (జిల్లేడు) గాంచి పూజించి దాని యీశానదిక్కు కొమ్మలచెంత కేఁగి యాకొమ్మచివరనున్న సూక్ష్మపల్లవములనడుమనున్న మృదువైన రెండుపత్రములు గొని యింటికేఁగి యర్కపుష్పములఁ నాదిత్యు నర్చించి వెనుకఁజెప్పినచొప్పున బ్రాహ్మణులకు భోజన మిడి యీయర్కపత్రపుటములలోని నీరుద్రావించి తానును "అర్కో మే ప్రీయతామ్" అనుమంత్రముచే నందలిజలంబుఁ బ్రాశింపవలెను. ఆమీఁద నాయర్కపుటభక్షణమును దంతస్పర్శతగులకుండునట్లుగాఁ జేయవలెను. "ఓం అర్కసంపుట భద్రంతే భద్రం తేస్తు సదార్క వై, మమాపి కురు భద్రం చ ప్రాయశ్చిత్తప్రదో భవ" ఈమంత్రమును జపించుచుఁ బూర్వ ముఖుఁడై బ్రహ్మతీర్థముతోఁగూడ భక్షింపవలెను. ఇట నిమంత్రితుఁడైన బ్రాహ్మణుఁడు లోభముచే నితరత్ర భుజించెనేని వానిపితరులు దేవత లును,వానియన్నముదిననేరరు. ఇట్లుచేసినవారు పరమగతినిఁ బొందుదురు.

---

ఆత్మనః. ౧౪. దుర్గంధం యచ్చ కటుకమత్యల్పం భాస్కరస్య తు, విమిశ్రాంస్తండులాం శ్చాపి న దద్యాద్భాస్కరాయ వై. ౧౫. ఇత్థం భోజ్య ద్విజం రాజన్ప్రాశయేదర్క సంపుటమ్, ప్రణమ్య శిరసా దేవముదకేన సమన్వితమ్. ౧౬. గృహీత్వా కేతనం యస్తు భజతేఽన్యత్ర లోకతః, నాశ్నంతి పితరస్తస్య న దేవా న చ మానవాః. ౧౭. నిష్క్రమ్య నగరాద్రాజన్గత్వా పూర్వోత్తరాం దిశమ్, నాత్యుచ్చే నాతినీచే చ శుచౌ దేశేఽర్కముత్తమమ్. ౧౮. జాతం దృష్ట్వా మహాబాహో పూజయిత్వా ఖగోత్తమ, పూర్వోత్తరగతాశ్చైవ తస్య శాఖా దిశన్నృప. ౧౯. శాఖాయా అగ్రతః పాత్రే సుసూక్ష్మే పల్లవాశ్రితే, సుశ్లిష్టే న పృథగ్భూతే సంపూజ్య గృహమావ్రజేత్. ౨౦. స్నాతః పూజ్య వివస్వంతమర్కపుష్పైః ఖగోత్తమ, బ్రాహ్మణాన్భోజయిత్వా తు అర్కో మే ప్రీయతామితి. ౨౧. ప్రాశ్య మంత్రేణార్కపుటం తతో భుంజీత వాగ్యతః, దేవస్య పురతో వీర త్వస్పృశన్ దశనైః పుటమ్. ౨౨. ఓం అర్కసంపుట భద్రం తే భద్రం తేఽర్క సదాస్తు వై, మమాపి కురు భద్రం చ ప్రాయశ్చిత్తప్రదో భవ. ౨౩. ఇమం మంత్రం జపన్రాజన్ స్మరన్నర్కం మహామతే, స్థిత్వా పూర్వముఖో బ్రహ్మవారిణా సహితం నృప. ౨౪. ప్రాశ్య భుంక్తే చ యో రాజన్స యాతి పరమాం గతిమ్, దంతై రస్పృశ్య హే వీర తత్పుటం చార్కసంజ్ఞితమ్. ౨౫. అనేన విధినా భక్త్యా కర్తవ్యా

ఏ పేట నీవ్రతము భాస్కరప్రీతికై భక్తితోఁ జేయవలయును ఈసప్తమీ వ్రతముఁ జేయువానికి సప్తపురుషాంతరముల కక్షయవిత్తము గల్గును ఈసప్తమీవ్రతము నాచరించియే కౌథుమి సిద్ధినొందెను కుష్ఠరోగము నుండి విముక్తుఁడయ్యెను జయస్తోముఁడనురాజు దీనింజేసి సిద్ధిఁబొందెను బృహద్బలధ్వజుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, సాంబుఁడు మొదలగువారంద ఱును సూర్యు నారాధించియె సూర్యసామీప్యమును బొందిరి ఈసప్తమి ధన్యతమమై పవిత్రమై పాపనాశనమైనది ఈగాథను చదివినను, విని నను, విశేషించి యాచరించినను ప్రభూతఫలము గల్గును కావున శ్రేయ స్కాముఁ డెల్లప్పుడును దీనిఁ జేయవలెను శతానీకుం డిట్లనియె మహాత్మా! దీనివలన జనకాదులు సిద్ధినిఁబొందుట వినియుంటిని ఈకౌథుమి యెవఁడు? ఈతనికిఁ గుష్ఠరోగ మేవిధిఁగల్గె? ఎట్లు సిద్ధినిఁబొందెనో యెట్లా రాధించెనో సంగ్రహించి చెప్పవేడెదను

ఇది దశాధికద్విశతతమాధ్యాయము

---

సప్తమీ సదా, యావద్వర్షే మహాబాహో ప్రీతయేఽర్కస్య శ్రద్ధయా ౭౬ యశ్చేమాం సప్తమీం కుర్యాద్భాస్కరం ప్రీణయన్నరః, తస్యాక్షయం భవేద్విత్తమచలం సాప్త పౌరుషమ్ ౭౭ సువర్ణం రజతం తామ్రం హిరణ్యం చ తథాక్షయమ్, కృత్వేమాం సిద్ధి మాయాతః కౌథుమిః సహసా గతః ౭౮. కుష్ఠరోగాచ్చ వై ముక్తో జయస్తోమో మహీపతిః, బృహద్బలధ్వజః కోపీ యాజ్ఞవల్క్యోఽథ కృష్ణజః ౭౯ అర్కం చైవ సమారాధ్య తతోఽగుస్తేఽర్కసామ్యతామ్, ఇయం ధన్యతమా పుణ్యా సప్తమీ పాప నాశినీ ౮౦ పఠతాం శృణ్వతాం రాజన్కుర్వతాం చ విశేషతః, తస్మాదేషా సదా కార్యా విధివచ్ఛ్రేయసేఽనఘ ౮౧ శతానీక ఉవాచ —జనకాదయో యథా సిద్ధిం గతా భానుం ప్రపూజ్య చ, శ్రుతం మయా తు బహుశో న శ్రుతం కౌథుమిర్యథా ౮౨ సిద్ధిం గతోఽర్కమారాధ్య కుష్ఠాన్ముక్తశ్చ సువ్రత, కశ్చాసౌ కౌథుమిర్విప్రః కథం కుష్ఠమవాప్తవాన్ ౮౩ కథమారాధయామాస భానుం దేవపతిం ద్విజ, ఏతన్మే విప్ర నిఖిలం కీర్తయస్వ సమాసతః ౮౪.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేషు సూర్యపూజాదివర్ణనం నామ దశాధికద్విశతతమోఽధ్యాయః.

## ఏకాదశాధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! మంచిప్రశ్నల నడిగితివి. సవిస్తరముగాఁ జెప్పెద నాకర్ణింపుము పూర్వకాలమున మహావిద్వాంసుఁడగు బ్రాహ్మణోత్తముఁడు కలఁడు ఒకనాఁ డాబ్రాహ్మణుఁడు పుత్రసహితుఁడై జనకుని ఆశ్రమమున కేగెను. అచ్చట నాబ్రాహ్మణునకును అచ్చట నుండెడి యితరబ్రాహ్మణులకును వివాదము జరిగెను. వారిలో కౌథుమి యనువాఁడు మిక్కిలి కోపించి ఆబ్రాహ్మణునిఁ గొట్టెను. అట్లు గొట్టుచుండఁగా చూచి తండ్రి యీకౌథుమిని పరిత్యజించెను. తరువాత సోదరులును, యితరులను, శిష్యులును ప్రతివచనపూర్వకముగా పరిత్యజించిరి. తరువాత కౌథుమి, శోకతప్తుఁడై తీర్థయాత్రలకును దివ్యక్షేత్రయాత్రలకును బోయెను. అట్లుచేసినను ఆకౌథుమి బ్రహ్మహత్యనుండి విముక్తుఁడు కాలేదు. కాకపోవుటయేకాక ఆతనిశరీరమునందు గొప్పవ్యాధికూడ జనించెను ముక్కుచెవులులేనివాఁడై చీము నెత్తురు స్రవించుచు, పృథివియంతయుఁ దిరిగి మరల తనతండ్రియింటి కేతెంచి దుఃఖోపహతచిత్తుఁడై తండ్రినిగూర్చి తండ్రీ! పుణ్యతీర్థములను, పుణ్యక్షేత్రములను దర్శించినను క్రూరమగుబ్రహ్మహత్యాపాతకముచే విముక్తుఁడను కాకపోతిని. ప్రాయశ్చిత్తముచేసికొనినను విముక్తుఁడను కాకపోతిని. నేనేమి చేయుదును? ఎచ్చటి కేగుదును? నాకు వ్యాధి అధికమగుచున్నది. అనా

---

సుమంతురువాచః—సాధు పృష్టోఽస్మి రాజేంద్ర శృణుష్వ గదతో మమ, ఆసీత్పురా మహావిద్వాన్బ్రాహ్మణః స్థానగోత్తమః. ౧. స గతః పుత్రసహితో జనకస్యాశ్రమం ద్విజః, తత్ర వాదోఽభవత్తేషాం విప్రైరన్యైర్నృపోత్తమ. ౨. క్రోధావిష్టేన వై తత్ర హతః కౌథుమినా ద్విజః, తేన దృష్ట్వా హతం విప్రం త్యక్తః పిత్రా స కౌథుమిః. ౩. భ్రాతృభిశ్చ మహాబాహో తథా శిష్యైశ్చ కృత్స్నశః, ప్రత్యుక్తః స చ సర్వైస్తు శోకదుఃఖసమన్వితః. ౪. తీర్థాని స జగామాథ దివ్యాన్యాయతనాని చ, న చ ముక్తస్త్వసౌ విప్రః సహసా బ్రహ్మహత్యయా. ౫. అముక్తేఽథ తయా విప్రే, పరో వ్యాధిరజాయత, కర్ణనాసావిహీనస్తు పూయశోణితవిస్రవః. ౬. పృథివీం పర్యటన్సర్వాం పునరాగాత్పితుర్గృహమ్, దుఃఖోపహతచిత్తస్తు పితరం వాక్యమబ్రవీత్. ౭. పితర్గతస్తు తీర్థాని పుణ్యాన్యాయతనాని చ, ముక్తోఽస్మి నానయా తాత క్రూరయా బ్రహ్మహత్యయా. ౮. కృతేఽపి హి పరే తాత ప్రాయశ్చిత్తే తు మేఽనఘ, కిం కరోమి క్వ గచ్ఛామి తాతాతీవ రుజో మమ. ౯. కృతేన కర్మణా యేన అల్పాయాసేన మే విభో,

యాసమగు నేకర్మాచరణముచే బ్రహ్మహత్యయును వ్యాధియు నశించునో ఆకర్మను శీఘ్రముగ నుపదేశించి, నాకు మోక్షమును కలుగఁజేయుము. అనిన కుమారునివాక్యములను విని తండ్రియగు హిరణ్యనాభుఁడు శోకాభిభూతుఁడై కుమారునితో నిట్లనియె కుమారా! నీకష్టముల నన్నిటిని నేనెఱుంగుదును కాన నీవు బ్రహ్మహత్యాపాతకమునుండి విముక్తుఁడవయ్యెడు నుపాయం బొండుచెప్పెద. ఆకార్యము అల్పాయాసముచే సాధ్యమగును. దానిం జెప్పెద నాకర్ణింపుము. కౌథుమి యిట్లనియె. తండ్రీ! బ్రహ్మాదిదేవతలలో నేదేవు నారాధింపవలయును? సర్వకర్మలకును శరీరము సాధనమగుటచే నేను శరీరవిహీనుఁడనై యుంటిని గాన నెట్లారాధింపఁగలుగుదును? అనిన హిరణ్యనాభుం డిట్లనియె. దేవతలు సిద్ధియుక్తకర్మలచే సంతోషమును బొందుదురు గంధాదిమైపూతలచేతను, అభిషేకములచేతను, భాస్కరుఁ డొక్కఁడే పూజింపఁదగినవాఁడనియు దేవతలకుఁగూడఁ బూజనీయుఁడనియును పెద్దలు చెప్పుదురు. కుమారా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు వరుణుఁడు కుబేరుఁడు మొదలగు వారందఱును భాస్కరు నారాధించియే దినమును సంతోషించుచుండిరి. కాన భానునితో సమానమగుదేవు నెందును జూడలేదు. ఈరీతిగా సమస్త జనమాన్యుండును, సర్వకామప్రదుండును నగుభానునిమంత్రమును జపిం

---

నశ్యేత్తు బ్రహ్మహత్యేయం వ్యాధిశ్చాయం పరంతప. ౧౦. కథ్యతాం మా చిరం తాత కురు నిఃశ్రేయసం మమ, హిరణ్యనాభో విప్రస్తు శ్రుత్వా వాక్యం సుతస్య తు, శోకదుఃఖాభిభూతస్తు వాక్యం పుత్రమువాచ హ. ౧౧. హిరణ్యనాభ ఉవాచ.—జ్ఞాతః పుత్ర తవ క్లేశః ప్రాప్తో యస్త్వటతా మహీమ్. ౧౨. తీర్థాని చ త్వయా వత్స ప్రాయశ్చిత్తాని కుర్వతా, న చాపి బ్రహ్మహత్యా త్వాం ముంచతే మత్కులోద్వహ. ౧౩. ఉపాయమేకం వక్ష్యామి యేన త్వం మోక్షమాప్స్యసి, అల్పాయాసేన వై పుత్ర శృణుష్వ గదతో మమ. ౧౪. కౌథుమిరువాచ.—ఆరాధయామి కం దేవం బ్రహ్మాదీనాం కథం విభో, శరీరేణ విహీనోఽస్మి హేతునా సర్వకర్మణామ్.౧౫. హిరణ్యనాభ ఉవాచ.—సిద్ధిసంతతియుక్తేన కర్మణా తుష్టిమాప్నుయుః, దేవైరపి సుపూజ్యోఽయము పలేపనమార్జనైః. ౧౬. భానురేకో ద్విజశ్రేష్ఠ ఊచురేవం మనీషిణః, బ్రహ్మా విష్ణుర్మహాదేవో జలేశో ధనదస్తథా. ౧౭. భానుమాశ్రిత్య సర్వే తే మోదంతే దివి పుత్రక, తస్మాద్భానోః సమం దేవం నాహం పశ్యామి కంచన. ౧౮. ఏవం భానుం సర్వమాన్య

చుచు, భక్తితో నారాధింపుచు శ్రద్ధాయుక్తుఁడవై పురాణములు వినుచుండుము భక్తితో సూర్యు నారాధించుచు, సామమును జపించుచు, పురాణంబుల వినుచు తరువాత నీలోకంబున బ్రహ్మహత్యావిమోక్షంబును బొందఁగలవు. కౌథుమి యిట్లనియె. తండ్రీ! శ్రేష్ఠతమంబులగు సామల నుపదేశింపుము. ఓంకారము, ప్రవరము, ఉద్గీథము, ప్రస్థానము, పరిహారము, మహోద్భృతము, నిధన మనునివి యేడువిధములు చెప్పఁబడినవి. హింకార ప్రణవములయందు సాప్తవిధ్యము చెప్పఁబడెను. శాక్యం, వామదేవికం, జ్యేష్ఠం యివి బ్రహ్మదేవునకు మిక్కిలి ప్రియతమంబులు. ఈసామములు కంఠమున జపింపవలెను. శక్తికొలఁది యీసామలను జపించి పరమపదమును బొందుదును అనిన హిరణ్యనాభుం డిట్లనియె. కుమారా! మంచిది నీవు పుత్రుఁడవగుటచే కులము పవిత్రమైనది. నీవిట్టివాఁడవయ్యును విధిస్మృతి గల్గియుంటివి నీవుచెప్పిన ట్లీసామము లిట్టివగుటకు సంశయములేదు. బ్రహ్మదేవుఁడు సామలలో నుత్కృష్టంబులగు కొన్నింటిని జెప్పియుండెను. వానిలో రెండుసామలు ముఖ్యముగా జపింపఁదగియున్నవి. వానిని జపించిన సర్వపాపభయంబులు నశించును. కౌథుమి యిట్లనియె. తండ్రీ! యేసామద్వయము ముఖ్యముగా జపింపఁ

---

మధునాఖిలకామదమ్, పితరం మాతరం తాత నరాణాం నాత్ర సంశయః. ౧౯. తమారాధయ వై భక్త్యా జపన్మంత్రమనుత్తమమ్, ఇతిహాసపురాణాని శృణు శ్రద్ధాసమన్వితః. ౨౦. ఆరాధయన్ రవిం భక్త్యా జపన్సామ మహామతే, పురాణాని తతో లోకే మోక్షం ప్రాప్స్యసి పుత్రక. ౨౧. కౌథుమిరువాచ.—దిశ సామాని వై తాత ప్రవరాణి మహామతే, ఓంకారప్రవరోద్గీతం ప్రస్థానం చ చతుష్టయమ్. ౨౨. పంచమః పరిహారోత్ర షష్ఠమాహుస్తమద్భృతమ్, నిధనం సప్తమం సామ్నాం సాప్తవిధ్యమితి స్మృతమ్. ౨౩. సాప్తవిధ్యమితి ప్రోక్తం హింకారప్రణవేషు చ, అష్టమం చ తవ శాక్యం నవమం వామదేవికమ్. ౨౪. జ్యేష్ఠం తు దశమం సామ వేధసే ప్రియముత్తమమ్. ఏతేషాం తాత సామ్నాం వై కంఠే జాప్యం పరం మతమ్, జపిత్వా తు అహం శక్త్యా గచ్ఛామి పరమం పదమ్. ౨౫. హిరణ్యనాభ ఉవాచ.—సాధు పుత్ర కులం పూతం త్వత్పుత్రేణ సమేన చ. ౨౬. ఏవం గతస్యాపి హి తే జాతా పుత్ర విధేః స్మృతిః, ఏవం తాత న సందేహః సామాన్యేతాని పుత్రక. ౨౭. ప్రవరాణి హి సామ్నా వై బ్రహ్మణా కథితాని హ, ఏషామపి పరం ప్రోక్తం సామద్వయమనుత్తమమ్, తస్మాదేకం పరం జాప్యం సర్వపాపభయాపహమ్. ౨౮. కౌథుమిరువాచ.—కథ్యతాం తాత

దగినదో యేవి యనవసరమో వాని నన్నింటిని శీఘ్రముగాఁ జెప్పుము అనిన హిరణ్యనాభుం డిట్లనియె ముఖ్యముగా జపింపఁదగినది జ్యేష్ఠసామ దానికంటె ముక్తినిగోరువారు మూఁడవదగు నుద్గీథసామును జపింపవలెను అది యన్నిట నుత్తమంబని భాస్కరుఁడు స్వయముగఁ జెప్పియుండెను అధిదేవతచే స్వయముగ నావేశింపఁబడినదియు వేదవ్రతములలో నుత్తమ మైనదియు, నెల్లప్పుడును సూర్యునకుఁ బ్రియంబును నగుజపమును వ్రత మును వినియోగమును వీనిలక్షణములను నావలనఁ దెలిసికొనుము స్వరభ్రంశమైనయెడల పెద్దలచే శూకరాది యని చెప్పఁబడును ఋతువు, భావము, ధర్మము, విధర్మము, సత్యకృద్ధర్మాధర్మములు, కార్యాకార్య ములు, ధర్మవేదనము, యీశబ్దములచే సుందరముగ గానముచేయుట యేదిగలదో యది పరమమగు జపమంత్రమని యాదిత్యుఁడే చెప్పియుం డెను ఈసామను జపించి మఱల జన్మింపఁడు సర్వరోగవినిర్ముక్తుఁడై బ్రహ్మహత్యచేఁ గూడ విముక్తుఁడగును కాన నీజపమంత్రమును జపించి భాస్కరు నారాధింపుము నీ కుపదేశించినసామను గానముచేయుచుఁ బురాణగాథను వినుచుండుము జ్యేష్ఠసామలక్షణమును గూడఁ జెప్పెద నాకర్ణింపుము "ఆద్యాయాదాజ్యదోహ" అనునది జ్యేష్ఠసామలక్షణము ఈజ్యేష్ఠసామచే సూర్యుని జపించుచుండవలెను పురాణమును వినుచు

---

తచ్ఛీఘ్రం యత్తు సామద్వయం పరమ్, ఏతేషాం తాత సామ్నాం తు నాన్యజ్జాప్యం చ యద్భవేత్ ౨౯ హిరణ్యనాభ ఉవాచ — జ్యేష్ఠసామపరం పూర్వం ద్వితీయం గదతః శృణు ౩౦ తతః శ్రావ్యం తృతీయం తు జప్తవ్యం ముక్తిమిచ్ఛతా, తతశ్చ పరమం ప్రోక్తం స్వయం దేవేన భానునా ౩౧ స్వయం దైవతమాదిష్టం ఛందసాముత్తమం వ్రతమ్, ప్రియం హిరణ్యగర్భస్య ప్రియం సూర్యస్య సర్వదా ౩౨ జపశ్చ వినియో గోఽపి లక్షణం చ నిబోధ మే, సత్యేన స్వరలీనస్తు శూకరాది స్మృతం బుధైః ౩౩ ఋతుర్భావస్తథా ధర్మో విధర్మః సత్యకృత్తథా, ధర్మాధర్మౌ తథా కార్యా ధర్మవేదన మేవ చ ౩౪ యదేభిర్గీయతే శబ్దై రుచిరం సమయైర్గిరైః, జాప్యం తత్పరమం ప్రోక్తం స్వయం దేవేన భానునా ౩౫ ఏతద్వై జపమానస్తు పునరావర్తతే న తు, సర్వరోగ వినిర్ముక్తో ముచ్యతే బ్రహ్మహత్యయా ౩౬ ఏతజ్జాప్యం తు సంజప్య ఆరాధయ దివా కరమ్, గాయన్సామ తవ ప్రోక్తం శృణు పౌరాణికం సుత ౩౭ జ్యేష్ఠసామ్నోఽపి తే పుత్ర లక్షణం కథయామి హి, ఆద్యాయాదాజ్యదోహేతి జ్యేష్ఠసామ్నోఽపి లక్షణమ్ ౩౮, తవ శ్రావ్యం జపం పుత్ర జ్యేష్ఠగాయీ రవిః సదా, సమారాధయ శృణ్వన్నైవ పుత్రా

సూర్యు నారాధింపుము. ఈరీతిగ భాస్కరు నారాధించి తరువాత దుఃఖ మును విడువఁగలవు. సుమంతుం డిట్లనియె. తరువాత నో రాజా! కౌథుమి తండ్రి వాక్యములను విని సామగానము చేయుచు శ్రద్ధాభక్తులతో సూర్యు నారాధించెను. తరువాత శ్రావ్యమగు మంత్రమును త్రికాల ములయందును సూర్యునియెదుట జపించుచుఁ బురాణంబుల న్వినుచు బ్రహ్మహత్యావిముక్తుండయ్యెను. ఇట్లు చేయుచుండఁగా వ్యాధిగూడ నశిం చెను జపపూజనములచే నేఫలము లభించెనో యాఫలము శ్రవణము చేతనే కలుగును. ఇట్లు పూజించి యాతఁడు సూర్యునిఁబొందెను. రాజా! ఆబ్రాహ్మణుఁ డీశరీరముతోడనే భాస్కరప్రసాదమువలన పరమపదంబగు భానుమండలమును బ్రవేశించెను. ఇప్పటికిని తిరిగి వచ్చుటలేదు. ఇప్పగిది నామహాబ్రాహ్మణుఁడు సిద్ధిఁబొందినరీతినిఁ జెప్పితిని. కౌథుమి భాస్కర ప్రసాదమువలన జపించుచుఁ బురాణశ్రవణమును జేయుచు సప్తమినాఁ డుపవసించుచు భాస్కరునిఁ బొందెను. రాజా! ఈరీతిగ ప్రథమాసప్తమి నంతను జెప్పితిని. ధనాదిఫలములను గలుగఁజేయు నిదియే యర్కసంపు టికాసప్తమి యనఁబడును. ఇది సూర్యునకుఁ బ్రియమైనది.

ఇది ఏకాదశాధికద్విశతతమాధ్యాయము.

---

ణామివ పుత్రక, ఏవమారాధ్య దేవేశం తతో దుఃఖం ప్రహాస్యసి. 39. సుమంతు రువాచ.—తతః శ్రుత్వా పితుర్వాక్యం సామగః కౌథుమిస్తథా. ४०. ఆరాధయామాస రవిం భక్త్యా శ్రద్ధాసమన్వితః, తతః శ్రావ్యం జపన్రాజంస్త్రికాలే పురతో రవేః. ४१. శృణ్వతస్తు పురాణాని బ్రహ్మహత్యా గతా తదా, వ్యాధిశ్చ కురుశార్దూల ఫలమేత చ్ఛ్రుతస్య వై. ४२. జపతా యత్ఫలం తేన దేవం పూజయతా నృప, సోఽపి ప్రాప్తో రవిం రాజఞ్ఛృణ్వన్నేకమనా నృప. ४३. స గతో మూర్తిమాన్విప్రః ప్రసాదా ద్భాస్కరస్య తు, ప్రవిశ్య మండలం భానోః పదం యత్పరమం విభోః. ४४. ఆవర్తతే న చాద్యాపి గతోఽసౌ పరమం పదమ్, ఇతి తే కథితం రాజన్గతః సిద్ధిం మహాద్విజః. ४५. ఉపోష్యైమాం భవేద్వీర సప్తమీం యాతి భాస్కరమ్, కౌథుమిర్నరశార్దూల ప్రసాదాద్భాస్కరస్య తు. ४६. జపమానస్తు వై సోఽపి పురాణశ్రవణస్తథా, ఇత్యేషా కథితా రాజన్ప్రథమా సప్తమీ తథా. ४७. అర్కస్య పుటికా పుణ్యా విత్తదా యా ప్రియా రవేః. ४८.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మేఽర్క
సంపుటికానామ సప్తమీవ్రతవర్ణనం నామ
ఏకాదశాధికద్విశతతమోఽధ్యాయః.

## ద్వాదశాధికద్విశతతమాధ్యాయము

సుమంతుం డిట్లనియె. రాజా! ప్రథమసప్తమి తరువాత రెండవదగు మరీచసప్తమిని జెప్పుచుంటిని. చైత్రమాసమున శుక్లపక్షమునందు షష్ఠినాఁ డుపవసించి సౌరధర్మవిధి ననుసరించి భాస్కరుని భక్తితోఁ బూజింపవలెను. శతానీకుం డిట్లనియె. బ్రాహ్మణోత్తమా! యాదిత్యహృదయము, శిరోన్యాసయుతంబులు నగుసమస్తపుణ్యమంత్రములను జెప్పుము అనిన సుమంతుం డిట్లనియె. రాజా! నేను నీకొఱకు లోకపరమరహస్యమును జెప్పెద నాకర్ణింపుము. ఈపరమరహస్యమును బూర్వము బ్రహ్మదేవునితో భానుఁడు చెప్పియుండెను. దీనిని వినిన సర్వపాపంబులు నశించును. కాన దీనిని వినుము సర్వపాపహారకుండును, పుణ్యస్వరూపుండును, లోకపూజితుండును, శిఖాదామయుక్తుండును, ఉత్తముండు నగునాదిత్యుని "ఓం, వం, ఫట్ ఓం" ఈమంత్రానుస్మరణమువలన ధ్యానించుచు మధురభోజనముగలవాఁడై సంవత్సరములో భానుదర్శనమునుఁ బొందఁగలఁడు. వ్యాధి మృత్యువులనుండి విముక్తుఁడై సూర్యలోకమును బొందును. మంత్రవేత్తయగువాఁడు మనోవాక్కాయకర్మలచేఁ ద్రికరణశుద్ధిగా పాలనే యాహారముగఁ గొనుచు విజనప్రదేశమునందు మౌనము నవలంబించి నియతేంద్రియుఁడై పదిరెండులక్షలు

---

సుమంతురువాచ:—ఇత్యేషా కథితా వీర అర్కసంపుటికా తవ, ద్వితీయా మరిచైర్యా తు శృణుష్వ గదతో మమ. ౧. శుక్లపక్షే తు చైత్రస్య షష్ఠ్యాం సమ్యగుపోషితః, పూజయేద్భాస్కరం భక్త్యా సౌరధర్మవిధానతః. ౨. శతానీక ఉవాచ.—బ్రూహి సర్వాన్మమ బ్రహ్మన్మంత్రాన్పుణ్యాన్విశేషతః, సూర్యాదిహృదయం చాపి శిరోన్యాసయుతాం స్తథా. ౩. సుమంతురువాచ.—అహం తే కథయిష్యామి రహస్యం పరమం విభో, యదుక్తం బ్రహ్మణా పూర్వం భక్త్యా భానోర్మహాత్మనః. ౪. సర్వపాపక్షయార్థాయ తచ్ఛృణుష్వ మహామతే, సర్వపాపహరం పుణ్యమాదిత్యం లోకపూజితమ్. ౫. శిఖాదామసమాయుక్తం వకారామృతముత్తమమ్, ఓం వం ఫట్. ఓం ఏష సూర్యః స్వయం తాత మంత్రమూర్తిర్మహాబలః. ౬. అస్యానుస్మరణాన్మంత్రీ నిత్యం మధురభోజనః, సంవత్సరేణ దేవేశం సాక్షాద్భానుం ప్రపశ్యతి. ౭. వ్యాధిమృత్యోర్వ్యవశ్చ నిర్ముక్తః సూర్యలోకం స గచ్ఛతి, సతతం జపమానస్తు రాజన్మంత్రవిదాంవరః. ౮. మనసా కర్మణా వాచా శాపానుగ్రహతోఽపి వా, క్షీరాశీ మౌనమాశ్రిత్య వివిక్తే నియతేం

జపించి శరీరముతోడనే దివంబున కేగును. చింతామణివలెనే మూఁడు లోకములు స్వేచ్ఛగా తిరుగును. తరువాత నాదిత్యహృదయమును జెప్పెద నాకర్ణింపుము. సర్వపాపభయనివారణసమర్థంబును, వియుక్తంబును, చంద్రసంయుక్తంబును, ఋకారసంయుక్తంబును నగుమంత్రమును శుచియై నిత్యమును స్మరించుచుండవలెను. ఓంకారవిరాజితంబగునది హృదయమని చెప్పఁబడును. యకారబిందుయుక్తంబగునది శిఖ యని చెప్పఁబడును యకార వకార మాత్రాబిందువులు కవచము. ప్రణవ దుకారానుస్వారకటములు అస్త్రము. బిందుచంద్రయుక్తమగువకారము అమృతము. ఓం బ్రహ్మా అనుదానితో అస్త్ర, అమృత, గాయత్రులఁ జేర్చి తే రో రాం అని చేర్చిన ధేనువనఁబడును. యకారవకారములు రి రో నేత్రద్వయములు నేత్రము ఇవియన్నియు సూర్యునియంగములు. ఆదిత్యునిశిరమునం దుంచుకొని హృదయమున హృదయన్యాసమును కంఠమున సావిత్రీన్యాసమును, మిగిలిన సమస్తమును శిరమునందును చింతింపవలెను. ఏకాక్షరసూర్యార్చనావిధిని చెప్పెదను. హృదయమున మొదట కింకిణీముద్రను ధరించి ప్రాణాయామమును జేసి పరివారసమన్వితమగు నేకాక్షరమును ఆత్మశుద్ధికొఱకై యాదరముతో నెఱుంగవల

---

ద్రియః. ౯. జపిత్వా ద్వాదశలక్షం సశరీరో దివం వ్రజేత్, త్రైలోక్యం చరతే రాజం శ్చింతామణిరివేచ్ఛయా. ౧౦. అథేదం పరమం వామం సూర్యస్య హృదయం శృణు, స్మర్తవ్యం శుచినా నిత్యం సర్వపాపభయాపహమ్. ౧౧. వియుక్తం చంద్రసంయుక్త మృకారేణ చ భారత, ఓంకారదీపితం చైవ హృదయం పరికీర్తితమ్. ౧౨. యకార బిందుసంయుక్తం వైశాఖః కథితో బుధైః, యకారశ్చ వకారశ్చ మాత్రా బిందుస్తథా నృప. ౧౩. ఇష్టం కవచమాదిష్టమస్త్రం వక్ష్యే నిబోధ మే, ప్రణవాదిం దుకారం చ సానుస్వారం కటస్తథా. ౧౪. ఇదమస్త్రం స్మృతం రాజన్నమృతం చ నిబోధ మే, బిందుచంద్రసమాయుక్తం వకారమమృతం స్మృతమ్. ౧౫. ఓం బ్రహ్మాన్నస్త్రమమృతం గాయత్రీం చాపి తేరోరాం ధేనుర్వై పరికీర్తితమ్, యకారశ్చ వకారశ్చ రిరో నేత్ర మాదిశేత్. ౧౬. ద్వనేత్ర ఏతాన్యంగాని సూర్యస్యామితతేజసః, ఆదిత్యం మూర్ధ్ని విన్యస్య హృదయే హృదయం న్యసేత్. ౧౭. సావిత్రీం కంఠదేశే తు అశేషం మూర్ధ్ని చింతయేత్, అర్కన్యాసో మయాఖ్యాతో విద్యాన్న్యాసం ప్రకల్పయేత్. ౧౮. ఏకాక్షరస్య సూర్యస్య శృణ్వర్చనవిధిం పరమ్, ప్రథమం కింకిణీముద్రాం బద్ధ్వా తు హృదయే నృప. ౧౯. ప్రాణాయామే చ తథా పరివీరసమన్వితమ్, ఏకాక్షరం సమా

యును. 'పునస్త్వామేవ' అనుమంత్రమును వకారమంత్రమును జపించి నచో నాదిత్యుఁడు తనయందుఁ జూరబడును. ఇట్లుచేసినచో నిశ్శంకము నాదిత్యతుల్యుఁడగును. ఇప్పగిది ప్రాసాదముద్ర ధరించి అస్త్రమంత్ర మును జపింపవలెను. ఈముద్రను ధరించినచోఁ బ్రాసాదరాజము లభించును. కవచమంత్రము జపించువాఁడు శత్రువుల యభివృద్ధిని కడిగివైచును. ఈరీతిగ జపించుచు నర్ఘ్యపాత్రమును బుష్పాలతో విధ్యుక్తముగఁ బూజింపవలెను. పురుషుఁడు హృదయమున దేవు నభిషేకింపవలెను. ఆమీఁద పూజింపవలెను. పద్మముద్రచేఁ బుష్పములను దేవుని శిరమున నుంచవలెను. ఈపగిది చిత్తమున దేవదేవుఁడగు దివాకరు నావహింపఁజేయవలయును. హృదయముననే అర్ఘ్యాదిపూజ లొసంగి శక్తికొలఁది నైవేద్య మొసంగవలయును. శ్రద్ధాభక్తులతో దీనినిఁజేసిన మనుష్యుఁడు నిస్సంశయముగా నాదిత్యసమానుఁ డగును. సంయతేంద్రియుఁడై తనశక్తికొలఁది జపముఁ జేయవలెను. ఈవిధిప్రకారము చేసిన సర్వకామములను సాధింపవచ్చును. ఏవిషయంబునను అడ్డుగలుగదు. ఏపాపమును అంటనేరదు. వ్యోమముద్రను బంధించి ప్రదక్షిణముఁజేసి తరువాత హృదయముతో దేవుని విడువవలెను.

ఇది ద్వాదశాధికద్విశతతమాధ్యాయము.

---

వేత్తి ఆత్మశుద్ధ్యర్థమాదరాత్. ౨౦. పునస్త్వామేవ బధ్యం తు వకారేణాత్మనా లభేత్. ౨౧. ఏతత్కృత్వాదిత్యసమో భవతీతి న సంశయః, కృత్వా చ ముద్రాం ప్రాసాదే అస్త్రం యోజ్య మహీపతే. ౨౨. ప్రాసాదశోభనం స్యాద్వై కృత్వా తద్భరతర్షభ, కవచేనార్కవాంఛత్రుం శాలయేద్వర్ధనక్రియామ్. ౨౩. తతోఽర్ఘ్యపాత్రం పుష్పైశ్చ పూజయేద్విధివన్నృప, హృది నా స్నాపయేద్దేవం తతః పూజాం సమాచరేత్. ౨౪. పద్మముద్రా పుష్పగర్భా దేవం శిరసి విన్యసేత్, ఆవాహితో భవేదేవం దేవదేవో దివాకరః. ౨౫. హృదయేనార్ఘ్యసంయుక్తాం పూజాం బధ్నీత భారత, హృదయేన చ నైవేద్యం దాతవ్యం శక్తితో విభోః. ౨౬. యథాశక్తి జపం కుర్యాత్సువ్రతీ వాగ్యతేంద్రియః, అనేన విధినా రాజన్సర్వకార్యాణి సాధయేత్. ౨౭. న క్వచిత్ప్రతిఘాతః స్యాన్న చాపి దురితం భవేత్, వ్యోమముద్రాం పరాం బద్ధ్వా కృత్వా చాపి ప్రదక్షిణమ్. ౨౮. దేవం విసర్జయేత్పశ్చాద్ధృదయేన మహీపతే. ౨౯.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సౌరార్చనవిధివర్ణనం నామ
ద్వాదశాధికద్విశతతమోఽధ్యాయః.

## త్రయోదశాధికద్విశతతమాధ్యాయము

సుమంతుం డిట్లనియె పావకుని పావకస్థుం డగుదివాకరునిఁ జూచి సపరివారముగా రక్షించి ఘుంకారమును కీర్తింపవలెను ఇట్లుచేసిన పావకునకు శోధనంబగును తరువాత పద్మగర్భునియందు హృదయాగ్నియందుంచవలెను అట్లుచేసిన దేవదేవుఁడగు భాస్కరుఁ డావాహనచేయఁబడినవాఁడగును తరువాత నంగముల ప్రీతికొఱకు నోంకారముతో నూరాహుతులను నేత్రాంజనసమాధితో నైదాహుతుల నీవలయును తరువాత హృదయముతో విసర్జనచేయవలెను

ఇది త్రయోదశాధికద్విశతతమాధ్యాయము

---

## చతుర్దశాధికద్విశతతమాధ్యాయము

సుమంతుం డిట్లనియె పద్మిన్యాదిముద్రావిధానం బెఱింగించెదను పద్మినీ, మధ్యమా, అర్కిణీ, జ్వాలినీ, తేజినీ, గభస్తినీ, శంఖముద్రా, సూర్యవక్త్ర, సహస్రకిరణ అని పండ్రెండుముద్రలు కలవు వెనుకటివానితోఁగూడ పద్మినీముద్రచే నర్ఘ్యంబు నీయవలెను వ్యోమముద్రతో జపించిన శ్రేయముగల్గును మధ్యమాముద్ర వ్యాధినాశకంబు అర్కిణీ,

---

సుమంతురువాచ — దృష్ట్వా తు పావకం దేవం పావకస్థం దివాకరమ్, అవ్యాత్తు సపరీవారం ఘుంకారం పరికీర్తయేత్ ౧ ఏవం కృతే శోధనం స్యాత్పావకస్య న సంశయః, పద్మగర్భే తతో వాథ హృదయాగ్నౌ సమాక్షిపేత్. ౨. ఆవాహితో భవేద్దేవదేవః సాక్షాన్న సంశయః, ఓంకారేణాహుతిశతం నేత్రాంజనసమాధినా ౩ పంచాహుతీస్తతో దద్యాదంగానాం ప్రీతయే నృప, విసర్జనం తతః కుర్యాద్ధృదయేన విచక్షణః ౪

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరార్చనవిధివర్ణనం నామ త్రయోదశాధికద్విశతతమోఽధ్యాయః

---

సుమంతురువాచ — పద్మినీ చ తథాన్యా తు మధ్యమానామనీ తథా, అర్కిణీ జ్వాలినీ చైవ తేజనీ చ గభస్తినీ. ౧ శంఖముద్రా చ దశమీ సూర్యవక్త్రా తథాపరా, సహస్రకిరణా చైవ ముద్రా ద్వాదశ కీర్తితాః ౨ దద్యాదర్ఘ్యం తు పద్మిన్యా వ్యోమ బద్ధ్వా జపేద్బుధః, ఉదయాశ్రయః సమాకర్షే మధ్యమా వ్యాధినాశినీ ౩ అర్కిణ్యా

జ్వాలినీ ముద్రలచే సూర్యాభిముఖుండై సూర్యునిఁ జూచుచు జపించిన సప్తదినంబులలో సిద్ధిగల్గును. సూర్యునుండి పద్మఖండమును తొలఁగించి యభిముఖుఁడై లక్షజపించునేని యక్షయనిధులఁ బొందును. అహో రాత్రంబు లుపవసించి కృతపద్మాసనుండై సూర్యాభిముఖుఁడై శంఖ ముద్రాదులతో మంత్రము పదివేలమారులు జపించిన మూఁడుదినంబు లలో మానససిద్ధికలుగు. నాభిదఘ్నజలస్థితుండై పదివేలమారులు జపిం చిన పుష్కలసిద్ధికలుగు. సకలప్రాణినిగ్రహానుగ్రహసమర్థుండగును. చీల మండలు పరస్పరముకలియునట్లు నిలఁబడి వామదక్షిణానామికలతో దక్షిణవామకనిష్ఠికలఁ గలియంజేసిన వ్యోమముద్ర యగును ఈముద్ర వలన సర్వవ్యాధులు నశించును. ఏతన్ముద్రారహితుండు సిద్ధినిఁబొంద నేరఁడు. ఇయ్యది సర్వోత్తమంబు. ఇయ్యది సూర్యునిహృదయమగుటచే నర్కముద్రయనియు, మంత్రసిద్ధిదాయకంబగుటచే మంత్రముష్టియనియు జెప్పఁబడును. సూర్యమండలాభిముఖుఁడై సూర్యోదయకాలమున

---

పశ్యతే సూర్యం విధిస్థస్తు భవేద్యది, జ్వాలినీముపసంగంతుం బద్ధ్వా సూర్యముఖో జపేత్. ౪. సప్తాహాద్వీక్షతే సూర్యం సిధ్యతే చ తతః స్వయమ్, అవతీర్య పద్మఖండం సూర్యాదభిముఖో నరః. ౫. జపఞ్ఛతసహస్రం హి అక్షయం లభతే నిధిమ్, శంఖ ముద్రాదిభిరిమం సూర్యచక్రవిధిం శృణు. ౬. అహోరాత్రోషితో భూత్వా బద్ధ్వా సూర్యముఖో నరః, స్థితః పద్మాసనే రాజఞ్జపంశ్చాప్యయుతం మనుమ్. ౭. పశ్యతే తు త్ర్యహాత్సూర్యం వివేత్సిద్ధిశ్చ మానసీ, సహస్రకిరణం బద్ధ్వా నాభిమాత్రజలే స్థితః. ౮. జపేదయుతమాత్రం తు భవేత్తద్గతమానసః, సహస్రకిరణం దేవం పరం రశ్మిభిరా వృతమ్. ౯. స పశ్యతి పరం ధామ భవేత్సిద్ధిశ్చ పుష్కలా, శాపానుగ్రహకర్తాసౌ సర్వేషాం ప్రాణినాం భవేత్. ౧౦. సర్వతః కంచుకం ముక్త్వా భవేద్వై విగతజ్వరః. ౧౧. పరౌ గుల్ఫౌ కరౌ కృత్వా సంలగ్నౌ చ పరస్పరమ్, వామానామికయాక్రమ్య దక్షిణాం తు కనీయసీమ్. ౧౨. వామా దక్షిణయా చైవ దక్షిణా వామయా తథా, ముద్రైషా హి మహాపుణ్యా వ్యోమముద్రా ప్రకీర్తితా. ౧౩. బద్ధయా చానయా సద్యో హీయంతే వ్యాధయో నృణామ్, నానయా రహితః కశ్చిత్సిద్ధిం ప్రాప్నోతి సాధకః. ౧౪. సర్వత్రైవోత్తమా హ్యేషా మంత్రముష్టిరితి స్మృతా, సూర్యస్య హృదయం సేయమర్కముద్రేతి విశ్రుతా. ౧౫. బద్ధ్వైయాత్సతతం మంత్రైరాయురారోగ్యవృద్ధయే, సూర్యమండల అభ్యగ్రే మంత్రీ సూర్యోదయే స్థితః. ౧౬. స సూర్యాభిముఖో

నాయురారోగ్యసిద్ధికై యర్కముద్ర ధరించి మంత్రమును జపించినచో మూఁడుదినములలో నాదిత్యదర్శనముచే మృత్యుభయంబువాసి దుఃఖ దూరుఁడై యుత్తమంబగు సూర్యపదంబుఁబొందును హస్తముల నుత్తాన ములుగాను పృష్ఠలగ్నములుగాను అంగుళులను సుప్రకీర్ణముగా నొన ర్చిన నుదయాముద్ర యగును. దీనిని సూర్యోదయకాలమున ననుష్ఠింప వలయును ఈముద్రధరించినవాఁడు 12 దినములలో నాదిత్యుని దర్శింపఁ గలఁడు. సందియము లేదు. ఇది సర్వపాపహారకము ఈయుదయముద్రకు అంగుళీమూలముల నంగుష్ఠమూలములచే నాక్రమింపవలయును. వామ మును విడచి మధ్యక్షేపముచేసిన మధ్యమముద్ర యనఁబడును. ఇది మధ్యాహ్నకాలమం దనుష్ఠింపవలయును. అంగుళీపరభాగమున అంగుష్ఠ గ్రథనముచేసిన అస్తమనీముద్ర యగును. దీనిని సూర్యాస్తమయకాల మున ధరించి జపింపవలయును ఈముద్ర దాల్చి నూరింటినిఁగాని వేయింటినిఁగాని జపించిన నేడుదినములలో సర్వరోగవిముక్తుఁడై శుభ ములఁ గాంచును. కరములను బరస్పరసంలగ్నములుగను, అంగుష్ఠము లూర్ధ్వసంలగ్నములుగ నొనర్చిన మాలినీముద్ర యగును. ఇయ్యది బ్రహ్మహత్యాదిపాతకములను దొలఁగించును. సాంతరాళముగ నంగుళీ

---

భూత్వా జపేన్మంత్రం తు సాధకః, దినత్రయేణ వీక్షేత ధ్యానీ జపపరాయణః. ౧౭. తం దృష్ట్వా నాశ్నుతే మృత్యుం దుఃఖీ న చ న సంశయః, ప్రాప్నోతి చ పరం స్థానం యత్ర దేవో దివాకరః. ౧౮. ఉత్తానౌ తు కరౌ కృత్వా పృష్ఠలగ్నౌ పరస్పరమ్, బద్ధ్వా త్వంగులయః సర్వాః సుప్రకీర్ణా న సంశయః. ౧౯. ఆక్రమ్య చాంగులీమూల మంగుష్ఠాభ్యాం యథాక్రమమ్, ఉదయా నామ ముద్రైషా బధ్నీయాదుదయే రవేః. ౨౦. ద్వాదశాద్వీక్షతే సూర్యం దినాత్స హి న సంశయః, సర్వపాపహరా చైవ సర్వ పాపవినాశినీ. ౨౧. ఉదయా చ వినా వామం మధ్యతశ్చైవ తం క్షిపేత్, మధ్యమా నామ విఖ్యాతా మధ్యసూర్యే తు చింతయేత్. ౨౨. మధ్యమా విధినా తేన బద్ధ్వా ముద్రాం తు సాధకః, అంగుల్యోః పరమంగుష్ఠౌ విధినా తావుభౌ గ్రథేత్. ౨౩. ముద్రా సాస్తమనీ హ్యేషా సర్వతంత్రేశ్వరీ శుభా, సూర్యస్యాస్తమనే ముద్రాం బద్ధ్వా జప్తం సమారభేత్. ౨౪. సహస్రం హి శతం వాపి ముద్రాం బద్ధ్వా జపేద్బుధః, సర్వ పాతకసంముక్తః సప్తాహాదనుశోభనమ్. ౨౫. కరౌ పరస్పరం లగ్నావంగుష్ఠౌ చోర్ధ్వ సంస్థితౌ, ఉభౌ చాంగుష్ఠకౌ చోర్ధ్వౌ సంలగ్నౌ మూర్ధ్ని సంస్థితౌ. ౨౬. ముద్రా సు మాలినీ చైవ నిర్దహేత్పాపపంజరమ్, బ్రహ్మహత్యాది యత్పాపం యోజితా సా తు

గ్రథనంబు నొనరించి యంగుష్ఠముల నూర్ధ్వస్థితములుగాఁ జేసిన తర్జనీ ముద్ర యగును దీనిని ధరించిన సర్వవ్యాధినాశనము సర్వరిపుస్తంభన మును నగును. హస్తములను బ్రసారించి మధ్యయందు సార్థసంస్థితము లనుగాఁ జేసి వామదక్షిణాంగుష్ఠములను దక్షిణవామానామికలతో సంలగ్నములనుగా నొనర్చిన గభస్తినీముద్ర యగును. ఇది సూర్య హృదయము ఇది సూర్యోదయమున ధరించువారికి మృత్యుహరమగును. అర్ఘ్యకాలమున సూర్యార్చనకై దీనిని ధరింపవలెను. జపకాలమున మంత్రసిద్ధికై దీనిని దాల్పవలెను. ఇట్లుచేసిన నాయాఫలములు తప్పక లభించును. దక్షిణహస్తంపు చిటికెనవ్రేలువిడచి రెండుచూపుడువ్రేళ్లను జేర్చి బొటనవ్రేళ్లతోఁ గలిపిన సూర్యవక్త్ర యనంబడును. ఈముద్ర ధరించి మూఁడుమాసములు జపించినచో విశుద్ధుఁడు కాఁగలఁడు. రెండు చేతులు దొప్పలుగఁజేసి చూపుడువ్రేళ్లువంచిన సహస్రకిరణ యనఁబడును ఇయ్యది సర్వముద్రల కధీశ్వరి మూఁడు సంధ్యలను దీనిని ధరించి జపించు వాఁడు సూర్యుఁడు చీఁకట్లఁ బాపినట్లు సర్వపాపములను నశింపఁజేసి కొనును."ముద్రాముద్రకకుంభా" అను మంత్రముతో ముద్రను బంధించి

---

మూర్ధని. ౨౭. విదర్భ్యంగులయః సర్వా ఈషన్మధ్యస్తథాగ్రతః, ఊర్ధ్వస్థితౌ గథాంగుష్ఠౌ ముద్రేయం తర్జనీ స్మృతా. ౨౮. సర్వవ్యాధిహరా దేవీ సర్వశత్రువినాశినీ, ఏతాం బద్ధ్వా మహాపుణ్యాం సర్వాన్ స్తమ్భయతే రిపూన్. ౨౯. ఉభౌ ప్రసార్య వై హస్తౌ మధ్యే సార్ధేన సంస్థితౌ, శేషానామ్యా తతశ్చైవ అంగుష్ఠాగ్రం తథా క్రమాత్. ౩౦. ముద్రా గభస్తినీ నామ సూర్యస్య హృదయం పరమ్, మృత్యుం నాశయతే హ్యేషా బద్ధ్వా సూర్యోదయే శుభా. ౩౧. అర్ఘ్యకాలే తు బధ్నీయాదర్చయాగ్నిం ప్రపూజయేత్, జపకాలే చ బధ్నీయాన్మంత్రాణాం నాత్ర సంశయః. ౩౨. విదక్షిణకనిష్ఠికాభ్యాం తర్జనీభ్యాం తథా భవేత్, తర్జనీభ్యాం తథాంగుష్ఠౌ సంలగ్నౌ తు పరస్పరమ్, జపం యః కురుతే నిత్యం త్రిభిర్మాసైర్విశుద్ధ్యతి. ౩౩. కరౌ తు సంపుటౌ కృత్వా తర్జన్యౌ ద్వే చ కుంచయేత్. ౩౪. సహస్రకిరణా హ్యేషా సర్వముద్రేశ్వరేశ్వరీ, త్రిసంధ్యమేతాం బధ్నీయాత్సాధకో మంత్రమూర్ధని, నాశయేత్సర్వపాపాని తమోరాశిమివాంశుమాన్. ౩౫. ముద్రా ముద్రకకుంభేతి బద్ధ్వా పశ్చాత్తు మంత్రయేత్, మాసేన నాశయేత్కుష్ఠం త్రిభిర్మాసైర్న సంశయః, ఇతి ముద్రాంగసహితం సూర్యం పూజయతే తు యః. ౩౬. అనేన విధినా రాజన్కృష్ణో పూజయతే రవిమ్, తస్మాత్త్వమపి రాజేంద్ర పూజయానేన

జపించినచో నొకనెలలో కుష్ఠరోగవిముక్తుఁ డగును మూఁడుమాసములు జపించినచో నిస్సంశయముగ సర్వరోగములు సర్వపాపములు నశించి సుఖము గల్గును ఇట్లు ముద్రాంగయుక్తముగ నాదిత్యుఁ బూజించిన సర్వసిద్ధులు గలుగును ఈవిధానముచే బ్రహ్మ రవినిఁ బూజించెను నీవును బూజింపుము ఇట్లు రవిని బూజించి బ్రాహ్మణ భోజనమును జేయించి సప్తమినాఁడు ఉద్గ్రణము ను దృఢము నగుమరీచమును గ్రహించి జలసహితముగా మంత్రపూర్వకముగా భక్షించి తరువాత భుజింపవలెను ఇట్లు చేసిన నిష్టఫలమును బొందఁగలఁడు ఒకయేఁడీవ్రతము సల్పి సర్వ కామములఁ బొందును కావున నీవు దీని ననుష్ఠించి పుత్త్రాదులఁ బడయుము ఈమరీచసప్తమీవ్రతము నాచరించి ఇంద్రుఁడు, నలుఁడు, రాముఁడును, శచీ - దమయంతీ - సీతలను బొందిరి

ఇది చతుర్దశాధికద్విశతతమాధ్యాయము

---

భాస్కరమ్ ౩౭ తతః సూర్యమవాప్యేహ సూర్యలోకం స గచ్ఛతి, అనేన విధినా యస్తు పూజయేత్సతతం రవిమ్, ౩౮ స యాతి పరమం స్థానం యత్ర దేవో దివాకరః, ఇత్థం పూజ్య చ దేవేశమనేన విధినా నృప ౩౯ భోజయిత్వా యథాశక్తి బ్రాహ్మణాంశ్చ విధానతః, సప్తమ్యాం ప్రాశయేద్వాపి మరిచం మంత్రతస్తథా ౪౦ ఏకం గృహీత్వా మరిచమవ్రణం చ దృఢం పరమ్, సజలం ప్రాశయేద్రాజన్మంత్రేణానేన వా స్మృతమ్ ౪౧ యథోక్తేన విధానేన పూజయిత్వా దివాకరమ్, ఇతి సంప్రాశ్య మరిచం తతో భుంజీత వాగ్యతః ౪౨ ప్రియసంగమమాప్నోతి తత్క్షణాదేవ నాన్యథా, ఇతీయం సప్తమీ పుణ్యా ప్రియసంగమదాయినీ ౪౩ కుర్యాదేకేన కామాంస్తు వత్సరేణ స గచ్ఛతి, పుత్రాదిభిర్నరశ్రేష్ఠ పునః సంగమమృచ్ఛతి ౪౪ కురు తస్మాన్మహాబాహో త్వమేవ ప్రియదాయినీమ్, ఉపోష్య ఇంద్రో విధివత్సురామరిచసప్తమీమ్ ౪౫ సంయోగం కృతవాన్వీర సహ శచ్యా విధానతః, ఉపోష్యైనాం నలశ్చాపి దమయంత్యా మహాబలః ౪౬ రామోఽగాత్సీతయా సార్ధముపోష్యైనాం నరాధిప ౪౭

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే మరిచసప్తమీవ్రతవర్ణనం నామ చతుర్దశాధికద్విశతతమోఽధ్యాయః

## పంచదశాధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. రాజా! తృతీయసప్తమీవ్రతమును జెప్పెదను. నింబపత్రములతోఁ జేయవలయును. అట్లు చేసిన వ్యాధిహారమగునని చెప్పియుంటిని. దేవదేవుఁడైనటువంటి శ్రీకృష్ణుఁడు రవి నేవిధముగఁ బూజించెనో ఆమంత్రోద్ధారమును జెప్పెద తెలిసికొనుము. "ఓం ఖషోల్కాయ నమః." యిది మూలమంత్రము. "ఓం విటి 2 శిరము. ఓం సహస్రరశ్మయే అస్త్రం. ఓం సహస్రకిరణాయ 200 ఊర్ధ్వబంధము. ఓం ఘనాయ భూతభావినే నమః." అని భూతబంధము. "ఓం జ్వల 2 ప్రజ్వల 2 అగ్నిప్రకర. ఓం ఆదిత్యాయ విద్మహే విశ్వభాగాయ ధీమహి, తన్నస్సూర్యః ప్రచోదయాత్" అని గాయత్రీసంకలీకరణము "ఓం ధర్మాత్మనే నమః ఐశాన్యాం ఓం దక్షిణాయ నమః ఆగ్నేయ్యాం ఓం వజ్రపాణయేఽనంతాయ నమః ఉత్తరతః. ఓం శ్యామపింగళాయ నమః ఐశాన్యాం. ఓం అమృతాయ నమః ఆగ్నేయ్యాం. ఓం బుధాయ సోమసుతాయ నమో దక్షిణతః. ఓం వాగీశ్వరాయ సర్వవిద్యాధిపతయే నైరృత్యాం. ఓం శుక్రాయ మహర్షయే భూతాయ పశ్చిమతః. ఓం ఈశ్వరాయ సూర్యాత్మనే నమో వాయవ్యాం ఓం కృతవతే నమః ఉత్తరతః. ఓం రాహవే నమః ఐశాన్యాం. ఓం అంతరాయ సూర్యాత్మనే నమః

---

సుమంతురువాచ:—తృతీయాం సప్తమీం వీర శృణుష్వ గదతో మమ, నింబపత్రైః స్మృతా యాతు పరమా రోగనాశినీ. ౧. యథార్చనవిధిర్వాన్యో యేన పూజయతే రవిమ్, దేవదేవః శార్ఙ్గపాణిః శంఖచక్రగదాధరః. ౨. అథార్చనవిధిం వచ్మి మంత్రోద్ధారం నిబోధ మే. ౩. ఓం ఖషోల్కాయ నమః. మూలమంత్రః. ఓం విటి ౨ శిరః. ఓం సహస్రరశ్మయే అస్త్రమ్. ఓం సహస్రకిరణాయ ౨౦౦ ఊర్ధ్వబంధః. ఓం ఘనాయ భూతభావినే నమః ఇతి భూతబంధః. ఓం జ్వల ౨ ప్రజ్వల ౨ అగ్నిప్రకర. ౪. ఓం ఆదిత్యాయ విద్మహే విశ్వభాగాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్. ౫. గాయత్రీసంకలీకరణమిదమ్. ఓం ధర్మాత్మనే నమః ఐశాన్యామ్. ఓం దక్షిణాయ నమః ఆగ్నేయ్యామ్. ఓం వజ్రపాణయేఽనంతాయ నమః ఉత్తరతః. ఓం శ్యామపింగలాయ నమః ఐశాన్యామ్. ఓం అమృతాయ నమః ఆగ్నేయ్యామ్. ఓం బుధాయ సోమసుతాయ నమో దక్షిణతః. ఓం వాగీశ్వరాయ సర్వవిద్యాధిపతయే నైరృత్యామ్. ఓం శుక్రాయ మహర్షయే భూతాయ పశ్చిమతః. ఓం ఈశ్వరాయ సూర్యాత్మనే నమో వాయవ్యామ్. ఓం కృతవతే నమః ఉత్తరతః. ఓం రాహవే నమః ఐశాన్యామ్. ఓం

పూర్వతః. ఓం ధ్రువాయ నమః ఐశాన్యాం. ఓం భగవతే పూషన్ మాలిన్ సకలజగత్పతే సప్తాశ్వవాహనభూభుజ. పరమసిద్ధిశిరసి గతం గృహ్ణాన్ తేజోగ్రహరూప అనంతజ్వాల 2 అనునది ఆవాహనమంత్రము. ఓం నమో భగవతే ఆదిత్యాయ సహస్రకిరణాయ యథా సుఖం పున రాగమనాయ" అనునది విసర్జనమంత్రము. ఈరీతిగ మంత్రోద్ధారము నంతను జెప్పితిని

ఇది పంచదశాధికద్విశతతమాధ్యాయము.

---

## షోడశాధికద్విశతతమాధ్యాయము.

సుమంతుం డిట్లనియె. అర్చావిధిని వినుమా! మంత్రపూతమగు నుదకముచే సమాహితుండై హృదయాద్యంగములందు మంత్రవిన్యాస పూర్వకముగాఁ బ్రోక్షించి భాస్కరుని ధ్యానించి సమ్మార్జనీముద్ర ప్రద ర్శించి దిక్ప్రబోధనంబుఁజేసి భూనభః పాతాళశోధనంబు గావింపవలయు సర్వాభీష్టప్రదమగు నీయర్చావిధికిఁ బద్మనామము బుధు లొసంగిరి. పరి శుద్ధమగు ప్రదేశంబున నష్టపత్రంబును సకర్ణికంబు నగుపద్మంబును

---

అంతరాయ సూర్యాత్మనే నమః పూర్వతః. ఓం ధ్రువాయ నమ ఐశాన్యామ్. ఓం భగ వతే పూషన్మాలిన్సకలజగత్పతే సప్తాశ్వవాహన భూభుజ పరమసిద్ధిశిరసి గతం గృహ్ణాన్ తేజోగ్రహరూప అనంతజ్వాల ౨. ఆవాహనమంత్రః. ఓం నమో భగవతే ఆదిత్యాయ సహస్రకిరణాయ యథాసుఖం పునరాగమనాయ ఇతి. ౬.

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే సూర్యమంత్రోద్ధారవర్ణనం నామ పంచదశాధికద్విశతతమోఽధ్యాయః.

---

సుమంతురువాచ:—శృణుష్వార్చావిధిం రాజన్మంత్రపూతేన వారిణా, ప్రోక్ష ణీయం ప్రయత్నేన కిమర్థం సుసమాహితః. ౧. హృదయాదిష్వథాంగేషు మంత్రం విన్యస్య మంత్రవిత్, ఆత్మానం భాస్కరం ధ్యాత్వా పరిచారసమన్వితః. ౨. కుర్యాత్సం మార్జనీం ముద్రాం దిశాం చ ప్రతిబోధనమ్, పాతాలే భూశోధనం చైవ నభసశ్చ తథా మతమ్. 3. అర్చనస్య ప్రకారోఽయం సర్వేషామీప్సితప్రదః, సర్వైరపి బుధైర్వీర పద్మమేతత్ప్రకీర్తితమ్. ౪. అష్టపత్రం లిఖేత్పద్మం శుచౌ దేశే సకర్ణికమ్, ఆవాహనీం

నిర్మించి ఆవాహినీముద్రాప్రదర్శనంబు జేసి రవినావాహించి మంత్ర పూర్వకస్నానము చేయింపవలయు. ఆగ్నేయంబున హృదయంబును, ఐశా నంబున శిరస్సును, నైరృతియందు శిఖను, ప్రాగ్దిశయందు నేత్రకవచము లను, పశ్చిమమున నస్త్రంబును విన్యసింపవలయు. ఐశానంబున సోముని, పూర్వదిక్కున లోహితుని, ఆగ్నేయంబున సోమతపనుని, దక్షిణమున బృహస్పతిని, నైరృతమున శుక్రుని, పశ్చిమమున శనైశ్చరుని, వాయవ్య మునఁ గేతువును, ఉత్తరమున రాహుని, ద్వితీయకక్ష్యయందు ద్వాదశా దిత్యులను స్థాపింపవలయును పూర్వదిక్కున నింద్రుని, దక్షిణమున యముని, పశ్చిమమున వరుణుని, ఉత్తరమునఁ గుబేరుని, ఐశానమున ఈశానుని, ఆగ్నేయమున నగ్నిని, నైరృతియందుఁ బితృదేవతలను, వాయవ్యమున వాయువును, పురోభాగంబున జయావిజయాజయంత్య పరాజితాశేషవాసుకి రేవతీవినాయక మహాశ్వేతాసువర్చలలను స్థాపింప వలయు దక్షిణపార్శ్వమున సిద్ధివృద్ధిస్మృతి శ్రీదేవులను స్థాపింపవలయు.

---

తతో బద్ధ్వా ముద్రామావాహయేద్రవిమ్. ౫. ఖషోల్కం స్నాపయేత్తత్ర స్వరూపం లోభదాయకమ్, స్థాపయేత్స్నాపయేచ్చైవ మంత్రైర్మంత్రశరీరిణమ్. ౬. ఆగ్నేయ్యాం దిశి దేవస్య హృదయం స్థాపయేన్నరః, ఐశాన్యాం తు శిరః స్థాప్య నైరృత్యాం విన్యసే చ్ఛిఖామ్. ౭. పౌరందర్యాం న్యసేన్నేత్రే ఏకాగ్రహృదయస్తు సః, ఆవాహ్య చైకం కవచం వారుణ్యామస్త్రమేవ చ. ౮. ఐశాన్యాం స్థాపయేత్సోమం పౌరందర్యాం తు లోహితమ్, ఆగ్నేయ్యాం సోమతపనం యామ్యాం చైవ బృహస్పతిమ్. ౯. నైరృత్యాం దానవం శుక్రం వారుణ్యాం చ శనైశ్చరమ్, వాయవ్యాం చ తథా కేతుం కౌబేర్యాం రాహుమేవ చ. ౧౦. ద్వితీయాయాం తు కక్షాయాం దేవతేజః సముద్భవాన్, స్థాపయే ద్ద్వాదశాదిత్యాన్కాశ్యపేయాన్మహాబలాన్. ౧౧. భగః సూర్యోఽర్యమా చైవ మిత్రో వరుణ ఏవ చ, సవితా చైవ ధాతా చ వివస్వాంశ్చ మహాబలః. ౧౨. త్వష్టా పూషా తథా చంద్రో ద్వాదశో విష్ణురుచ్యతే, పూర్వే చేంద్రాయ దక్షిణే యమాయ పశ్చిమే వరుణాయ ఉత్తరే కుబేరాయ ఐశాన్యామీశ్వరాయ ఆగ్నేయ్యామగ్నిదేవతాయై నైరృత్యాం పితృదేవేభ్యో వాయవ్యాం వాయవే. జయా చ విజయా చైవ జయంతీ చాపరాజితా, శేషశ్చ వాసుకిశ్చైవ రేవతీ చ వినాయకః, మహాశ్వేతా మహాదేవీ రాజ్ఞీ చైవ సువర్చలా. ౧౩. తథాన్యో వాపి దేవానాం సమూహస్తత్ర తత్ర హ, తథాన్యో లోకవిఖ్యాతో యోగః ప్రోక్తశ్చ దక్షిణే. ౧౪. పురస్తాద్భాసురస్థానే స్థాప

ప్రజ్ఞావతీ క్షుధాహారీతబుద్ధిబుద్ధివిసృష్టిపౌర్ణమాసీ విభావరీ శక్తులను సోత్తరపార్శ్వమున స్థాపింపవలయు సానుచరుండగు దేవదేవునకు దీప అలంకారవస్త్రపుష్పాదుల సమర్పింపవలయును ఇట్లు పూజించి జపంబు జేసి బ్రాహ్మణభోజనంబు చేయించి యథాశక్తి దక్షిణల నిచ్చి క్షారవర్జితముగా మధురాహారముల భుజింపవలెను ఇట్లీసప్తమి నొకసంవత్సరం బాచరింపవలెను ఇట్లు చేసిన సర్వకామప్రాప్తియుఁ సర్వరోగనివృత్తియు, గల్గును సూర్యసాలోక్యమును బొందును సుమంతుం డిట్లనియె భాద్రపదశుద్ధసప్తమియం దుపవసించి మాహేశ్వరవిధానంబుచే సూర్యునిఁ బూజింపవలెను మఱల నష్టమినాఁడు స్నాతుఁడై పూజింపవలెను "మార్తండః ప్రీయతాం" అని ఖర్జూర, నాలికేర, మాతులుంగ, ఆమ్ర ఫలములను దేవునకు నివేదించి బ్రాహ్మణుల కివ్వవలెను ఈపుణ్యగాథను

---

నీయా విజానతా, సిద్ధిర్వృద్ధిః స్మృతిర్దేవీ శ్రీశ్చైవోత్పలమాలినీ ౧౫ స్థాప్యా స్వదక్షిణే పార్శ్వే లోకపూజ్యా సమంతతః, ప్రజ్ఞావతీ క్షుధా వీర హారీతా బుద్ధిరేవ చ ౧౬ స్థాప్య బుద్ధిమతీ నిత్యం శ్రీకామైర్వా వివస్వతః, బుద్ధిశ్చైవ విసృష్టిశ్చ పౌర్ణమాసీ విభావరీ, స్థాప్యాశ్చ సోత్తరే పార్శ్వే ఇత్యేతా దేవశక్తయః ౧౭ దీపశ్చాన్నమలంకారో వాసః పుష్పాణి మంత్రతః, దేయాని దేవదేవాయ సానుగాయ సమూర్తయే ౧౮ విధినానేన సతతం సదా యోర్చయతి భాస్కరమ్, సంప్రాప్య పరమాన్కామాంస్తతో భానుసదో వ్రజేత్ ౧౯ అనేన విధినా యస్తు భోజయేద్భాస్కరం నృప, త్వం నింబ కటుకాత్మాసి ఆదిత్యనిలయస్తథా, సర్వరోగహరః శాంతో భవ మే ప్రాశనం సదా ౨౦ ఇత్థం ప్రాశ్య జపేద్భూమౌ దేవస్య పురతో నృప, బ్రాహ్మణాన్భోజయిత్వా తు శక్త్యా దత్త్వా తు దక్షిణామ్ ౨౧ భుంజీత వాగ్యతః పశ్చాన్మధురం క్షారవర్జితమ్, ఇత్యేషా వర్షపర్యంతం కర్తవ్యా చైవ సప్తమీ ౨౨ కుర్వాణః సప్తమీమేతాం సర్వరోగైః ప్రముచ్యతే, సర్వరోగ వినిర్ముక్తః సూర్యలోకం స గచ్ఛతి ౨౩ సుమంతురువాచ —అథ భాద్రపదే మాసి సితే పక్షే మహీపతే, కృత్వోపవాసం సప్తమ్యాం విధివత్పూజయేద్రవిమ్ ౨౪ మహేశ్వరేణ విధినా పూజయేదత్ర భాస్కరమ్, అష్టమ్యాం తు పునః స్నాతః పూజయిత్వా దివాకరమ్ ౨౫ దద్యాత్ఫలాని విప్రేభ్యో మార్తండః ప్రీయతామితి, ఖర్జూరం నాలికేరం చ మాతులింగఫలాని చ ౨౬ దేవస్య పురతో దత్త్వా తథా చామ్రఫలాని చ, ఇతి తే కథితం రాజన్సప్తమీఫలమాదితః ౨౭, మహాతపో మహాశ్రేష్ఠం భాస్కరస్య విశాంపతే, యచ్ఛ్రుత్వా మానవో

వినిన బ్రహ్మహత్యాదిపాపనివృత్తియు, అశ్వమేధాదియజ్ఞఫలంబును గల్గును. నీచజాతివా రుచ్చజాతియందు జన్మించుదురు. ఇతిహాసపురాణ శ్రవణముకంటె పావనంబగునది వేరొండు లేదు. శతానీకుం డిట్లనియె. భారతరామచరిత పురాణ వైష్ణవశివధర్మ సౌరధర్మ శ్రవణవిధానమును, వాచకకృత్యమును తల్లక్షణమును, ఖఖోల్కస్వరూపమును, వాచక పూజాఫలమును, వాచకపూజాప్రకారంబును చెప్పుమనిన సుమంతుం డిట్లనియె. ఈవిషయమునుగూర్చి పూర్వము బ్రహ్మ నా కిట్లు చెప్పెను. శుచియై ప్రాతస్సాయంరాత్రులయందు పురాణశ్రవణం బొనరించిన యథాక్రమముగా బ్రహ్మవిష్ణుమహేశులు సంతసించెదరు. వాచకుఁడు

---

రాజన్ముచ్యతే బ్రహ్మహత్యయా. ౨౮. తథేదం పరమం పర్వ కథితం బ్రహ్మసంజ్ఞితమ్, యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యంతే మానవా నృప. ౨౯. అశ్వమేధసహస్రస్య వాజపేయశతస్య చ, సర్వతీర్థాభిగమనే వేదాభ్యాసే చ యత్ఫలమ్, యత్ఫలం పృథివీ దానే తత్సర్వం ప్రాప్నుయాన్నరః. ౩౦. రాజసూయసహస్రస్య వాజపేయశతస్య చ, సహస్రశతదానస్య ఫలం విందతి మానవః. ౩౧. లేఖత్వం బ్రాహ్మణో గచ్ఛేత్క్షత్త్రియో విప్రతాం వ్రజేత్, వైశ్యోఽపి క్షత్త్రతాం యాతి శూద్రో వైశ్యత్వమేవ చ. ౩౨. సూతమాగధవంద్యాద్యా యే చాన్యే సంకరోద్భవాః, తేఽపి యాంత్యుత్తమం స్థానం పురాణశ్రవణాద్విభో. ౩౩. ఇతిహాసపురాణాభ్యాం నత్వన్యత్పావనం నృణామ్, యేషాం శ్రవణమాత్రేణ ముచ్యతే సర్వకిల్బిషైః. ౩౪. విధినా రాజశార్దూల శృణ్వతాం యత్ఫలం కిల, యథోక్తం నాత్ర సందేహః పఠతాం చ విశాంపతే. ౩౫. శతానీక ఉవాచ.—భగవన్కేన విధినా శ్రోతవ్యం భారతం నరైః, చరితం రామభద్రస్య పురాణాని విశేషతః. ౩౬. కథం తు వైష్ణవా ధర్మాః శివధర్మా అశేషతః, సౌరాణాం చాపి విప్రేంద్ర ఉచ్యతాం శ్రవణే విధిః. ౩౭. వాచనీయం కథం చాపి వాచకో ద్విజ సత్తమ, లక్షణం చాస్య మే బ్రూహి వాచకస్య మహాత్మనః. ౩౮. స్వరూపం చాస్య మే బ్రూహి ఖఖోల్కస్య మహాత్మనః, ఫలం చ పూజితే కిం స్యాద్వాచకే విధివద్ద్విజ. ౩౯. పారణేపారణే పూజ్యో వాచకః శ్రావకైః కథమ్, సమాప్తే భగవన్కింకిం దేయం పర్వణి వాచకే. ౪౦. న చ కిం కార్యసిద్ధిం యత్సిద్ధం పర్వణి పర్వణి, సుమంతు రువాచ.—సమ్యక్పృష్టోఽస్మి రాజేంద్ర ఇతిహాసపురాణయోః. ౪౧. శ్రవణే తు మహాబాహో శ్రూయతాం యన్మయా పురా, పృష్టోవాచన్మహాతేజా విరించో భగవా న్గురుః. ౪౨. హంత తే కథయామ్యేష పురాణశ్రవణే విధిమ్, ఇతిహాసపురాణాని

శుద్ధవసనుండై సమయమునకు స్థానమునకుఁ బ్రదక్షిణముగా వచ్చి నాత్యుచ్చనీచాసనంబు నధిష్ఠించి బోధింపవలెను. ఆయాసనమునకు వ్యాస పీఠమని పేరు. శ్రోతలు వాచకునియాసనం బెన్నఁడు నధిష్ఠింపరాదు. వాచకుఁడు బాలుఁడైనను శ్రోతలకు పూజ్యుఁడే యగును. శ్రోతలు దేవబ్రాహ్మణార్చనమును జేసి యందఱిని బిలచి పుస్తకములకు నమస్క రించి పుస్తకమును దీసికొనివచ్చి వాచకునకు సమర్పింపవలెను. వాచ కుఁడు పుస్తకగ్రంథిని విడిపింపవలెను. మరల బంధించి విప్పి చదువవలెను ఈపుస్తకములు మూఁడుతెగలుగ వర్ణింతురు. సూత్రము వాసుకిస్వరూ పము. పత్రములు బ్రహ్మస్వరూపములు. అక్షరములు జనార్దనస్వరూప ములు. సూత్రము శంకరస్వరూపము. పంక్తులు సర్వదేవతాస్వరూప ములు. సూత్రాదియందు పావకుండును, మధ్యయం దాదిత్యుఁడును, అగ్ర

---

శ్రుత్వా భక్త్యా విశేషతః, ముచ్యతే సర్వపాపేభ్యో బ్రహ్మహత్యాదిభిర్విభో. ४३. సాయం ప్రాతస్తథా రాత్రౌ శుచిర్భూత్వా శృణోతి యః, తస్య విష్ణుస్తథా బ్రహ్మా తుష్యతే శంకరస్తథా. ४४. ప్రత్యూషే భగవాన్బ్రహ్మా దినాంతే తుష్యతే హరిః, మహాదేవస్తథా రాత్రౌ శృణ్వతాం పుష్యతే విభుః. పారణాని దశాహేషు ఏకే కుర్వంతి తాని భోః. ४५. భవేద్వై రాజశార్దూల శృణు తేషాం చ యత్ఫలమ్, విధానం వాచకస్యేహ శృణ్వతాం చ విశాంపతే. ४६. శుద్ధవాసా గృహాదేత్య స్థానం యత్సమయాన్వితమ్, ప్రదక్షిణం తతో గత్వా యస్తస్మిందేవ ఏవ హి. ४७. నాత్యుచ్చం నాతినీచం చ హ్యాసనం భజతే తతః, ఆసనం తస్య వై రాజన్బోధకస్య సదా భవేత్. ४८. వందనీయం ప్రపూజ్యం చ శ్రోతృభిః కురునందన, వ్యాసపీఠం తు తత్ప్రోక్తం గురోరాసనమాదిశేత్. ४९. న స్థేయం శ్రావకైస్తస్మాద్వాచకస్యాసనే నృప, రాజాసనే యథా భృత్యైర్యథా పుత్రైః పితుర్నృప. ५०. యథా శిశుర్గురో ర్వీర స తేషాం హి గురుర్మతః, దేవార్చామగ్రతః కృత్వా బ్రాహ్మణార్చాం విశేషతః. ५१. ఉపవిశ్య తతః పశ్చాచ్ఛ్రావకః శృణుయాన్నృప, సమస్తానాగతాన్కృత్వా తతః పుస్తకమాదదేత్. ५२. ప్రణమ్య శిరసా తస్య పుస్తకస్య విశాంపతే, గ్రంథిం చ శిథిలాం కుర్యాద్వాచకః కురునందన, పునర్బద్ధ్వేత తత్సూత్రం తస్ముక్త్వా వాచయేత్క్వ చిత్. ५३. త్రివిధం పుస్తకం విద్యాత్సూత్రం వాసుకిరుచ్యతే, పత్రాణి భగవాన్బ్రహ్మా అక్షరాణి జనార్దనః. ५४. శంకరశ్చ తథా సూత్రం పంక్తయః సర్వదేవతాః, పావ కశ్చ తథా సూత్రే మధ్యే భానుః సమాశ్రితః. ५५. అగ్నే స్థితా గ్రహాః సర్వే దిశో

భాగమున సర్వగ్రహము లాశ్రయించియుండును. దిక్కులును దానినే యాశ్రయించును శంకువు మేరుస్వరూపము, ఛిద్ర మాకాశస్వరూపము, ఊర్ధ్వాధఃకాష్ఠములు ద్యావాపృథివీస్వరూపములు, శంఖము చంద్రస్వరూపము. ఇప్పుగిది సర్వదేవమయమగు పురాణమును శ్రేయము గోరువా రెల్లప్పుడును గృహమున నుంచుకొనవలయును. దీనికి సూత్రముగు సమర్పించువాఁడు సూర్యలోకమును బొందును. వాచకుఁడు శుద్ధపాత్రము కేలంగొని లేచి బ్రహ్మాదులను వాల్మీకి విష్ణుశివాదిత్య వ్యాసులను నమస్కారములు చదువుచు నమస్కరించి కథ నారంభింపవలెను. ద్రుతవిలంబరహితముగను, ఊర్జితముగను, అసంసక్తాక్షరపదముగను, సప్తస్వరసమన్వితముగను, రసభావసమన్వితముగను చెప్పవలెను. ఇట్టి వాచకునుండి పురాణశ్రవణం బొనర్చిన అశ్వమేధాదియజ్ఞఫలములును రోగాదినివృత్తియుఁ గల్గును. తుదకు పవిత్రమై యుత్తమమగు పరమ పదము నొందును శ్రోతలకు సంశయము గల్గిన స్నాతులై వాచకుని

---

వాపి తథా విభో, స్మృతో మేరుః సదా శంకుశ్ఛిద్రమాకాశముచ్యతే. ౫౬. యంత్రద్వయం కాష్ఠమయమథోర్ధ్వం యదుదాహృతమ్, ద్యావాపృథివ్యోశ్చ శంఖస్తథా చంద్ర ఉదాహృతః. ౫౭. ఇత్థం దేవమయం హ్యేతత్పుస్తకం దేవపూజితమ్, నమస్యం పూజనీయంచ గృహే స్థాప్యం విభూతయే. ౫౮. యోఽస్య సూత్రం బృహత్కృత్వా ప్రయచ్ఛతి నరోత్తమః, స యాతి పరమం స్థానం యత్ర దేవో దివాకరః. ౫౯. నిరూప్య పాత్రం రాజేంద్ర కరాభ్యాం గృహ్య వాచకః, ప్రణమ్య శిరసా సర్వాన్బ్రహ్మాదీన్వ్యాసమేవ చ, వాల్మీకం చ తథా రాజన్విధిం విష్ణుం శివం రవిమ్. ౬౦. నమస్కారమథైషాం తు పఠిత్వా కురునందన, తతోఽసౌ వ్యాహరేద్విప్రో వాచకః శ్రద్ధయాన్వితః. ౬౧. అలంబితమత స్తబ్ధమద్భుతం వీరమూర్జితమ్, అసంసక్తాక్షరపదం రసభావసమన్వితమ్. ౬౨. సప్తస్వరసమాయుక్తం కాలేకాలే విశాంపతే, ప్రదర్శయన్రసాన్సర్వాన్వాచకో వ్యాహరేన్నృప. ౬౩. ఈదృశాద్వాచకాద్విప్రాచ్ఛ్రుత్వా శ్రద్ధాసమన్వితః, ఇతిహాసపురాణాని రామస్య చరితం తథా. ౬౪. నియమస్థః శుచిః శ్రోతా శృణుయాత్ఫలమశ్నుతే, బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చాపి విశేషతః. ౬౫. అశ్వమేధమవాప్నోతి సర్వాన్కామానవాప్నుతే, రోగైశ్చ ముచ్యతే సర్వైర్బ్రహ్మహత్యాం చ విందతి, గచ్ఛేద్వాపి పరం స్థానం దేవస్యాద్భుతముత్తమమ్. ౬౬. స్నాతైర్గృహం సమా

గృహంబునకుం జని నమస్కరించి వాచకునిచే 'శివమస్తు' అని యాశీర్వదింపఁబడి సందేహవిషయముల నడుగవలెను. సందేహములేనిచో కుశంకలఁ జేయరాదు. వాచకుఁడును దయచే సందేహమును దీర్పవలెను. వాచకుఁడు బ్రాహ్మణుఁడై యుండవలెను. బ్రాహ్మణేతరులనుండి వినిన రౌరవాదినరకమును బొందును. కొందఱు పదిదినముల కొకమారు పారణమును జేయుదురు. సాధారణముగా మాసమున కొకమారు చేయుదురు. మాసమున కొకమారు వాచకునకుఁ బూజను సల్పి బ్రాహ్మణుఁడు స్వర్ణమాషమును, క్షత్రియుఁడు స్వర్ణమాషద్వయమును, వైశ్యుఁడు త్రయమును, శూద్రుఁడు చతుష్టయమును ఇచ్చుచుండవలెను. ఇట్లు కార్తికమున నారంభించి తిరిగి కార్తీకమువఱకు నాచరించిన

---

గమ్య శ్రోతృభిర్వాచకస్య తు, ప్రణమ్య శిరసా విప్రం వాచకం శ్రద్ధయా నృప. ౧౭. ఆసనం చ సమాశ్రిత్య స్థాతవ్యం వాచకస్య తు, సంముఖం రాజశార్దూల వాగ్యతైః సుసమాహితైః. ౧౮. వాచకేన నమస్కారే కృతే వ్యాసస్య భూపతే, న వక్తవ్యం మహాబాహో శ్రావకైః సంశయాదృతే. ౧౯. సంశయే సతి ప్రష్టవ్యో వాచకః సంప్రసాద్య తు, యతశ్చ స గురుస్తేషాం ధర్మతో బంధురుచ్యతే. ౨౦. వాచకేనాపి వక్తవ్యం యత్నాత్తేషాం నిబోధనమ్, అనుగ్రహాయ సర్వేషామశేషా గురవో నృప. ౨౧. నమస్కారాదయః శ్రావ్యాః శివమస్త్వితి వోద్యతైః, వాగ్యతైర్నృపశార్దూల వర్ణైః సర్వైర్మహీపతే. ౨౨. శూద్రాణాం పురతో వైశ్యా వైశ్యానాం క్షత్రిణస్తథా, మధ్యస్థితోఽథ సర్వేషాం వాచకో వ్యాహరేన్నృప, యే చ సంకరజా రాజన్నరాస్తే శూద్రపృష్ఠతః. ౨౩. బ్రాహ్మణం వాచకం విద్యాన్నాన్యవర్ణజమాదరేత్, శ్రుత్వాన్యవర్ణజాద్వాచం వాచకాన్నరకం వ్రజేత్. ౨౪. ఇత్థం హి శృణ్వతాం తేషాం వర్ణానామనుపూర్వశః, మాసిమాసి భవేద్రాజన్పారణం కురునందన. ౨౫. శ్రేయోఽర్థమాత్మనో రాజన్పూజయేద్వాచకం బుధః, మాసి పూర్ణే ద్విజశ్రేష్ఠే దాతవ్యం స్వర్ణమాషకమ్. ౨౬. బ్రాహ్మణేన మహాబాహో ద్వే దేయే క్షత్రియస్య తు, వాచకాయ ద్విజశ్రేష్ఠ వైశ్యేనాపి త్రయం తథా. ౨౭. శూద్రేణైవ చ చత్వారో దాతవ్యాః స్వర్ణమాషకాః, మాసిమాసి ద్విజశ్రేష్ఠ శ్రద్ధయా వాచకాయ తు. ౨౮. ప్రథమే పారణే రాజన్వాచకం పూజ్య శక్తితః, అగ్నిష్టోమస్య యజ్ఞస్య ఫలం విందతి మానవః. ౨౯. కార్తికాదీన్సమారభ్య యావత్కార్తికమచ్యుత, అగ్నిష్టోమం గోసవం చ జ్యోతిష్టోమం తథా

సర్వయజ్ఞఫలములు గల్గును. దివ్యవిమానారూఢుఁడై సమస్తలోకములు సంచరించును. పర్వము పూర్తియైనచో వాచకుని గంధమాల్యాదులచేఁ బూజించి విశేషముగా స్వర్ణరజతగోదక్షిణల నీయవలెను. వాచకునిఁ బూజించి బ్రాహ్మణులఁ బూజింపవలెను. వాచకసదృశంబగు దానపాత్రము వేరొండు లేదు. వాచకుఁడు తృప్తినొందిన బ్రహ్మాదిదేవతలందఱును దృప్తినొందుదురు. వాచకుఁడు సర్వదా యర్థవిచారమును

---

నృప. ౮౦. సౌత్రామణిం వాజపేయం వైష్ణవం చ తథా విభో, మాహేశ్వరం తథా బ్రాహ్మం పుండరీకం యజేత యః. ౮౧. ఆదిత్యయజ్ఞస్య తథా రాజసూయాశ్వమేధయోః. ఫలం ప్రాప్నోతి రాజేంద్ర మాసైర్ద్వాదశభిః క్రమాత్, ఇత్థం యజ్ఞఫలం ప్రాప్య యాతి లోకాంస్తథోత్తమాన్. ౮౨. వజ్రవేదికసంపన్నం మణిరత్నవిభూషితమ్, విమానమాస్థితో రాజన్మోదతే శక్రమందిరే. ౮౩. తతశ్చంద్రస్య భవనే వారుణే భవనే తతః, శోచిష్కేశగృహే గత్వా గచ్ఛేచ్చైలబిలే గృహే. ౮౪. ధిషణస్య గృహం గత్వా తతశ్చిత్రశిఖండినః, పృథక్శ్రవసమాసాద్య గచ్ఛేత్కంజజమందిరే, ఏవమేవ నృపశ్రేష్ఠ నాత్ర కార్యా విచారణా. ౮౫. ఫలమేతత్సముద్దిష్టం శృణ్వతాం సతతం నృణామ్, ఏతత్ఫలం వత్సరేణ శృణ్వతో విధితో నృప. ౮౬. ఏతాని పరిమాణాని వత్సరేణ భవంతి వై, శృణ్వతాం నృపశార్దూల దదతాం వాచకాయ వై. ౮౭. ఏకం చ ద్వే తథా త్రీణి చత్వారి చ విశాంపతే, దేయాని వాచకాయేహ మాసిమాసి నరాధిప. ౮౮. బ్రహ్మణాద్యైర్నృపశ్రేష్ఠ సర్వవర్ణవిభాగశః, సమాప్తే పర్వణి తథా వాచకం పూజయేత్పునః. ౮౯. వాచకం బ్రాహ్మణం చైవ సర్వకామైః ప్రపూజయేత్, గంధమాల్యాదిభిర్దివ్యైర్వాసోభిర్వివిధైరపి. ౯౦. వాచకాయ ప్రదత్త్వా తు తతో విప్రాన్ప్రపూజయేత్, హిరణ్యం రజతం రుక్మం గాశ్చ కాంస్యోపదోహనాః. ౯౧. దత్త్వా చ వాచకాయేహ శ్రుతస్య ప్రాప్యతే ఫలమ్, యథా సదక్షిణం చాన్నం శ్రాద్ధకాలే ప్రకీర్తితమ్, తథా శ్రుతం నృపశ్రేష్ఠ సదక్షిణముదాహృతమ్. ౯౨. వాచకం పూజయేద్యస్మాత్పశ్చాల్లేఖకపూజనమ్, సమాప్తే పర్వణి విభో విశేషేణైవ చార్చయేత్. ౯౩. వాచకః పూజితో యేన పూజితాస్తేన దేవతాః, వాచకే పరితుష్టే చ మమ ప్రీతిరనుత్తమా. ౯౪. ఇతి వేధాః సదా ప్రాహ దేవానాం పురతః పురా, తస్మింస్తుష్టే జగత్సర్వం తుష్టం భవతి నిత్యశః. ౯౫. తస్మాత్ప్రపూజయేద్విప్రం వాచకం నృపసత్తమ, న తుల్యం వాచకేనేహ పాత్రం దానస్య విద్యతే. ౯౬. తిష్ఠంతి యస్య శాస్త్రాణి జిహ్వాగ్రే పృథివీపతే, దృష్టశ్చ గోచరస్తాత కస్తేన సదృశో ద్విజః. ౯౭. న తుల్యం విద్యతే తేన భువి పాత్రం

జేయుచు చెప్పుచుండవలెను. వాచకుఁడు వ్యాసస్వరూపుఁడు యీ వ్యాసుఁడు నివసించుప్రదేశములు ధన్యములు. పద్మవిహీనజలాశయంబు మాఁడ్కి వ్యాసవిహీనమగుపురము భాసింపదు. వేదసమంబగు నాగమమును, కురుక్షేత్రసమంబగు తీర్థమును, భాస్కరసముం డగు దేవుఁడును, గంగాతుల్యంబగు నదియు, అశ్వమేధసమంబగు యజ్ఞమును, పుత్రజన్మసదృశంబగు సుఖమును, వాచకసముండగు బ్రాహ్మణుఁడును, బ్రహ్మహత్యాసమం బగుపాపమును లేవు. వ్యాసుఁడు జయోపజీవి యని

---

నరేషు వై, తస్మాదన్నం సదా పూర్వం తస్మై దేయం విదుర్బుధాః, శ్రాద్ధే యస్య ద్విజో భుంక్తే వాచకః శ్రద్ధయాన్వితః, భవంతి పితరస్తస్య తృప్తా వర్షశతం నృప. ౯౮. యథేహ సర్వదేవానాం భాస్కరః ప్రవరః స్మృతః, విస్పష్టమద్భుతం శాంతం స్పష్టాక్షరపదం తథా, కలస్వరసమాయుక్తం రసభావసమన్వితమ్. ౯౯. బుధ్యమానః సదాత్వర్థం గ్రంథార్థం కృత్స్నశో నృప, బ్రాహ్మణాదిషు వర్ణేషు గ్రంథార్థం వాచయేన్నృప. ౧౦౦. య ఏవం వాచయేద్రాజన్ స విప్రో వ్యాస ఉచ్యతే, అతోఽన్యథా కథయితా జ్ఞేయో ఽసౌ వక్తృనామకః. ౧౦౧. ఇత్థంభూతో వసేద్యస్మిన్వాచకో వ్యాససన్నిభః, దేశే ఽథ పత్తనే రాజన్స దేశః ప్రవరః స్మృతః. ౧౦౨. తే ధన్యాస్తే మహాత్మానస్తే కృతార్థా న సంశయః, వసంతి యత్నతో యస్మిన్ స దేశః ప్రవరః స్మృతః. ౧౦౩. న శోభతే పురం వీర వ్యాసహీనం కదాచన, యథార్కహీనం హి దినం చంద్రహీనా యథా నిశా. ౧౦౪. న రాజతే సరో యద్వత్పద్మనీరహితం నృప, తథా వ్యాసవిహీనం తు రాజతే న పురం క్వచిత్. ౧౦౫. ప్రణమ్య వాచకం భక్త్యా యత్ఫలం ప్రాప్యతే నరైః, న తత్క్రతుసహస్రేణ ప్రాప్యతే కురునందన. ౧౦౬. యథైకతో గ్రహాః సర్వే ఏకతస్తు దివాకరః, తథైకతో ద్విజాః సర్వే ఏకతస్తు చ వాచకః. ౧౦౭. యథా వేదసమో నాస్తి ఆగమో భువి కశ్చన, తథా వ్యాససమో నాస్తి బ్రాహ్మణో భువి కశ్చన. ౧౦౮. కురుక్షేత్రసమం తీర్థం న ద్వితీయం ప్రచక్షతే, న నదీ గంగయా తుల్యా న దేవో భాస్కరాద్వరః. ౧౦౯. నాశ్వమేధసమం పుణ్యం న పాపం బ్రహ్మహత్యయా, పుత్రజన్మసుఖైస్తుల్యం న సుఖం విద్యతే యథా. ౧౧౦. తథా వ్యాససమో విప్రో న క్వచిత్ప్రాప్యతే నృప, దైవే కర్మణి పిత్ర్యే చ పావనః పరమో నృణామ్. ౧౧౧. నాస్తి వ్యాససమః శ్రేష్ఠ ఇతీయం వైదికీ శ్రుతిః, అథ విప్రసహస్రాణాం విప్రోఽయం శ్రేష్ఠ ఈరితః, ఉపవిష్టో యథా భుంక్తే వ్యాసో వై విప్రమండలే. ౧౧౨. శ్రాద్ధే తాత పవిత్రాణి కథితాని పురా మమ, బ్రహ్మణా రాజశార్దూల శృణు తాని యథావిధి. ౧౧౩.

రెండునామంబు లీతనికిఁ గలవు. ఇతిహాసపురాణంబులు జయ యనఁబడును. తత్ప్రవచనమే జీవితప్రయోజనముగాఁ గలవాఁడుగాన జయోపజీవి యనఁబడును. విస్పష్టముగాఁ జెప్పువాఁడగుటచే వ్యాసుఁడని చెప్పఁబడును. వాచకుఁడును శ్రోతయు తామసరాజససాత్త్విక భేదములచే మూఁడు తెఱంగులుగా నుండిరి. అతిద్రుతముగను, అస్పష్టముగను, అతివిస్తృతముగను, స్వరవర్జితముగను, పదచ్ఛేదవిహీనముగను, భావవర్జితముగను, ఉత్సాహవర్జితముగను క్రోధనుఁడై యప్రియములఁ బల్కుచు నర్థము తెలియక యజ్ఞానముచే గ్రంథమును దూషింపుచుఁ జెప్పువాఁడు తామసవాచకుఁ డనఁబడును. గ్రంథార్థమును వెలియనివాఁడై విస్పష్టముగను, శాంతముగను, రసభావసమన్వితముగను జెప్పువాఁడు రాజసవాచకుఁ డనఁబడును. గ్రంథార్థమును బాగుగా నెఱింగి విస్పష్టతాది

---

మధు పాయసం కాలశాకస్తిలాశ్చ కుతపస్తథా, రాజతం చాపి పాత్రేషు బ్రాహ్మణేష్వథ వాచకః. ౧౧౪ దైవే కర్మణి పిత్ర్యే చ స జ్ఞేయః పంక్తిపావనః, వాచకశ్చ యతిశ్చైవ తథా యశ్చ షడంగవిత్. ౧౧౫. ఏతే సర్వే నృపశ్రేష్ఠ విజ్ఞేయాః పంక్తిపావనాః, నామనీ వాచకస్యైతే శృణుష్వార్థమథైతయోః. ౧౧౬. ఇతిహాసపురాణాని జయేతి విదితాని వై, ఉపజీవతి యస్మాద్వై వాచయానో ద్విజో నృప, జయోపజీవీ తేనాసౌ గతః ఖ్యాతిం తు వాచకః. ౧౧౭. విస్పష్టమద్భుతం శాంతం స్పష్టాక్షరమిదం తథా, కలస్వరసమాయుక్తం రసభావసమన్వితమ్. ౧౧౮. బుధ్యమానోథ వాత్యర్థం గ్రంథార్థం కృత్స్నశో నృప, బ్రాహ్మణాదిషు వర్ణేషు గ్రంథార్థం చార్పయేత్తథా. ౧౧౯. య ఏవం వాచయేద్రాజన్స విప్రో వ్యాస ఉచ్యతే, అతోఽన్యథా వాచయితా న గచ్ఛేద్వ్యాసతాం క్వచిత్. ౧౨౦. త్రివిధం వాచకం విద్యాత్సదా గుణవిభేదతః, శ్రావకం చ మహాబాహో త్రివిధం గుణభేదతః. ౧౨౧. ద్వావేతౌ కథ్యమానౌ తు నిబోధ గదతో మమ, అభిద్రుతం తథాస్పష్టం విస్తరం స్వరవర్జితమ్. ౧౨౨. పదచ్ఛేదవిహీనం చ తథా భావవివర్జితమ్, అబుధ్యమానో గ్రంథార్థమభీష్టోత్సాహవర్జితః. ౧౨౩. ఈదృశం వాచయేద్యస్తు వాచకః క్ష్మాధిపేశ్వర, క్రోధనోఽప్రియవాదీ చ అజ్ఞానాద్గ్రంథదూషకః. ౧౨౪. బుధ్యతే న చ కష్టాచ్చ స జ్ఞేయో వాచకాధమః, విస్పష్టమద్భుతం శాంతం రసభావసమన్వితమ్. ౧౨౫. అబుధ్యమానో గ్రంథార్థం వాచయేద్యస్తు వాచకః, స జ్ఞేయో రాజసో రాజన్నిదానీం సాత్త్వికం శృణు. ౧౨౬. విస్పష్టమద్భుతం శాంతం స్పష్టాక్షరపదం తథా, కలస్వరసమాయుక్తం రసభావసమన్వితమ్. ౧౨౭. అత్త్వర్థం బుధ్యమానస్తు

సకలగుణసహితముగాఁ జెప్పువాఁడు సాత్త్వికవాచకుఁ డనఁబడును. శ్రద్ధాభక్తివిహీనుండును, లోభియును, కటుస్వభావుండును, హేతువాదపరుండును, అసూయాపరుండును, నిత్యనైమిత్తికకామ్యరూపంబు లగు త్రివిధదక్షిణలనివ్వనివాఁడు, తామసశ్రోత యనంబడును. శ్రద్ధాభక్తివివర్జితుఁడై అనిచ్ఛాపూర్వకముగ శ్రవణముఁ జేయుచు నుపేక్షాస్వభావముగలవాఁడు రాజసశ్రోత యనంబడును. ఇతర సర్వకార్యములను వదలి భక్తిశ్రద్ధాసమన్వితుఁడై సతతపూజాతత్పరుఁడై నిత్యనైమిత్తిక కామ్యదక్షిణల నొసంగుచు శ్రవణమును జేయువాఁడు సాత్త్వికశ్రోత యనఁబడును. శ్రోతలకు వ్యాసుఁడు పూజ్యతముఁడు. చతుర్వర్ణములకును మాతృపితృగురుస్థానీయుఁడు. వాచకున కిచ్చు మాసదక్షిణయు అమావాస్యాద్వాదశీ రవిసంక్రమములయం దిచ్చుదక్షిణయు నిత్యదక్షిణ

---

గ్రంథార్థం కృత్స్నశో నృప, బ్రాహ్మణాదిషు వర్ణేషు ఆచార్యో విధివన్నృప. ౧౨౮. య ఏవం వాచయేద్రాజన్స జ్ఞేయః సాత్త్వికో బుధైః, శ్రద్ధాభక్తివిహీనో యో లోభిష్ఠః కటుకో యథా. ౧౨౯. హేతువాదపరో రాజం స్తథాసూయాసమన్వితః, నిత్యాం నైమిత్తికాం కామ్యామాదదద్దక్షిణాం నృప. ౧౩౦. వాచకో యో మహాబాహో శృణుయాద్యస్తు మానవః, స జ్ఞేయస్తామసో రాజంచ్ఛ్రావకో మానవోఽపి సః. ౧౩౧. న తస్య పురతో వీర వాచయేత్ప్రాజ్ఞ ఏవ హి, ప్రసంగాచ్ఛృణుయాద్యస్తు శ్రద్ధాభక్తివివర్జితః. ౧౩౨. రాజన్కౌతుకపాత్రం తు స జ్ఞేయో రాజసో భవేత్, సంత్యజ్య సర్వకార్యాణి భక్త్యా శ్రద్ధాసమన్వితః. ౧౩౩. సతతం పూజయేద్యస్తు వాచకం శ్రద్ధయా ముదా, నిత్యే నైమిత్తికే కామ్యే గురూనైవ దేవతాస్తథా. ౧౩౪. య ఏవం శృణుయాద్వీర స జ్ఞేయః సాత్త్వికో బుధైః, వ్యాసః పూజ్యః శ్రావకాణాం యథా వ్యాసవచో నృప. ౧౩౫. తస్మాత్పూజ్యతమో నాన్యః శ్రావకాణాం నృపోత్తమ, యతః స వై గురుస్తేషాం జ్ఞానదాతా సదా నృప. ౧౩౬. చతుర్ణామిహ వర్ణానాం నాన్యో బంధుః ప్రచక్ష్యతే, వ్యాసాదృతే నృపశ్రేష్ఠ ఇతీయం వైదికీ శ్రుతిః. ౧౩౭. తస్మాత్సర్వప్రయత్నేన పూజయేద్వాచకం సదా, స గురుః స పితా మాతా స బంధుః స సుహృత్తథా. ౧౩౮. వాచకో నృపశార్దూల విప్రాదీనామశేషతః, ఇత్థం వ్యాసో గురుర్జ్ఞేయః పూజ్యో మాన్యో ద్విజాతిభిః. ౧౩౯. శృణ్వంతి యే నరా రాజన్స తేషాం గురురుచ్యతే, పూజార్థం తస్య సమయః శ్రావకాణాముదాహృతః. ౧౪౦. యే శృణ్వంతి నృపశ్రేష్ఠ మాసి మాసి దదంతి తే, స్వర్ణమాషకమేకస్మై వాచ

యనంబడును. అయనవిషువసూర్యచంద్రగ్రహణాపరపక్షములయం దిచ్చు దక్షిణ నైమిత్తికదక్షిణ యనంబడును. స్వకామనచే నిచ్చునది కామ్య దక్షిణ యనంబడును. పురాణశ్రోతలు వాచకునకు దక్షిణ యొసంగక యితరుల కిచ్చినచో వాచకు నవమానించినవారగుదురు. వాచకు నవమానించిన బ్రాహ్మణుఁడు శూద్రత్వమును బొందును. క్షత్రియుఁడు వైశ్యుఁడును కాకిజన్మమునందును. శూద్రుఁడు చండాలత్వమును బొందును. మఱియు నీవాచకుని నిఖిలపర్వదినంబులయందును బూజింపవలెను. మధురాన్నంబులను బెట్టుచుండవలెను. సర్వవిధముల నతనికి సుఖము గల్గునట్లు ప్రయత్నింపవలెను. శీతకాలంబున శాలువలను, వర్షకాలంబున ఛత్రమును, గ్రీష్మకాలంబున పాదరక్షల నివ్వవలెను. శీతోష్ణాదిద్వంద్వబాధ కలుగకుండునట్లు ప్రయత్నింపవలయును. తనకు భూత్యతిశయమును గోరువాఁడు నిత్యమును సువర్ణమునుగాని లేనిచో రజతమునుగాని లేనిచో తామ్రమైనను అదియు లేనిచో మృత్తికనైనను

---

కాయ పృథక్పృథక్. ౧౪౧. ద్వాదశ్యాం చామావాస్యాయామథ వా రవిసంక్రమే, సా నిత్యా దక్షిణా తస్యాం యా చ శ్రేయోఽర్థమాత్మతః. ౧౪౨. అయనే విషువే చైవ చంద్రసూర్యగ్రహే తథా, ప్రాప్తే వాపరపక్షే చ దానం తస్మై స్వశక్తితః. ౧౪౩. దేయం స్యాచ్ఛ్రావకైస్తాత తం ముక్త్వా నాన్యతో నృప, ప్రథమం తస్య దాతవ్యం శ్రేయోఽర్థం శ్రావకైః సదా. ౧౪౪. అదత్త్వా తస్య యేఽన్యస్మై సంప్రయచ్ఛంతి శ్రావకాః, అవమానః కృతస్తైస్తు వాచకస్య భవేన్నృప. ౧౪౫. కృత్వావమానమథ తైః ప్రాప్యతే యత్ఫలం నృప, బ్రాహ్మణాద్యైః సమస్తైశ్చ తచ్ఛృణుష్వ వరానన. ౧౪౬. శూద్రత్వం బ్రాహ్మణో యాతి క్షత్రియో యాతి కాకతామ్, జాయతే చ తథా వైశ్యః శూద్రశ్చాండాలతాం వ్రజేత్. ౧౪౭. తస్మాత్పూజ్యో నృపశ్రేష్ఠ ప్రథమం వాచకో బుధైః, ఆపత్కాలేచ వృద్ధౌ చ యతశ్చాసౌ గురుః స్మృతః. ౧౪౮. వైశాఖ్యామయనే వీర తృతీయాయాం చ సువ్రత, కార్తిక్యామథ మార్గ్యాం చ సంపూజ్యః ప్రథమం భవేత్. ౧౪౯. పర్వస్వన్యేషు చ విభో సంపూజ్యో ధర్మతః స్మృతః, హిరణ్యం చ సువర్ణం చ ధనం ధాన్యం తథైవ చ. ౧౫౦. అన్నం చాపి తథా పక్వం మాంసం చ కురునందన, దాతవ్యం ప్రథమం తస్మై శ్రావకైర్నృపసత్తమ. ౧౫౧. వాచకస్తు యథా నిత్యం సుఖమాస్తే నరాధిప, న పీడ్యతే యథా ద్వంద్వైస్తథా కార్యం వరానన. ౧౫౨. హేమంతే లోమశా దేయాశ్ఛత్రం ప్రావృషి సత్తమ, ఉపానహౌ కాల

మాషప్రమాణమునకు హీనముగాకుండునట్లుగా నివ్వవలెను. దానికిఁ దగుఫలమును బొందును. గ్రంథసమాప్తియందుఁ దనకు శక్తిలేనిచోఁ దన్ను విక్రయించియైనను వాచకునిఁ బూజింపవలెను. నిత్యనైమిత్తిక దక్షిణావిహీనంబగు శ్రవణము వ్యర్థము. నేను వినిన ప్రకారము

---

యోగ్యే కాలే చైవానులోమశః. ౧౫౩. ఇత్థం ద్వంద్వవినిర్ముక్తః స యేషాం వాచకో నృప, తే ధన్యాః శ్రావకా లోకే తే గతాః పరమం పదమ్. ౧౫౪. ఆత్మనా తు కథం వీర సుఖమిచ్ఛేద్విచక్షణః, విషమస్థే గురౌ రాజన్యతశ్చ స గురుః స్మృతః. ౧౫౫. వాచకశ్రావకాణాం చ తస్మాద్ద్వంద్వం విఘాతయేత్, యత్నః కార్యః శ్రావకైశ్చ వాచకస్య జనాధిప. ౧౫౬. ఇత్థం పూజ్యః సదా వ్యాసః శ్రేయోఽర్థం ప్రథమం నృప, భర్తా పూజ్యో యథా స్త్రీణాం సర్వాసాం వై మహీపతే. ౧౫౭. శ్రావకాణాం తథా రాజన్వాచకః పూజ్య ఉచ్యతే, ఉపాధ్యాయస్తు శిష్యాణాం యథా భాగవతో హరిః. ౧౫౮. సౌరాణాం చ యథా భానుః శైవానాం శంకరో యథా, వాచకస్తు తథా పూజ్యః శ్రావకాణాం నరాధిప. ౧౫౯. దక్షిణాం దదతా నిత్యం శ్రోతవ్యం భూతిమిచ్ఛతా, పూర్వోక్తమాషకం తస్మై వాచకాయ జనాధిప. ౧౬౦. యదా దాతుం న శక్నోతి మాషకం కాంచనస్య తు, రజతస్య తదా దేయం మాషకం శ్రేయసే నృప. ౧౬౧. తదభావే హిరణ్యం చ విత్తశాఠ్యవివర్జితః, మృత్తికాపి హి దాతవ్యా ప్రాప్నోతి సత్ఫలం శుభమ్. ౧౬౨. ఇత్యేషా దక్షిణా నిత్యా మాసిమాసి భవేన్నృప, నైమిత్తికా భవేద్రాజన్గ్రహణాదిషు పర్వసు. ౧౬౩, అమలే వాససీ రాజన్గంధమాల్యవిభూషణే, సమాప్తే పర్వణి విభో దాతవ్యే భూతిమిచ్ఛతా. ౧౬౪. జ్ఞాత్వా సర్వసమాప్తిం తు పూజయేచ్ఛ్రావకో ధ్రువమ్, ఆత్మానమపి విక్రీయ య ఇచ్ఛేత్సఫలం శ్రుతమ్. ౧౬౫. నైమిత్తికాం చ నిత్యాం చ దక్షిణామప్రదాయ చ, శృణోతి చ సదా యస్తు తస్య తన్నిష్ఫలం శ్రుతమ్. ౧౬౬. యథా చ దక్షిణాహీనాద్యజ్ఞాన్న ఫలమశ్నుతే, తథా శ్రుతం చ రాజేంద్ర దక్షిణారహితం స్మృతమ్. ౧౬౭. చతుర్గుణా భవేద్రాజన్యా నిత్యా దక్షిణా విభో, సమాప్తే పర్వణి విభో ఇత్యాహ భగవాఞ్ఛివః. ౧౬౮. ఇత్యేష కథితో రాజన్పురాణశ్రవణే విధిః, యతశ్చ విధిహీనం తు న కర్మఫలముద్యతే. ౧౬౯. స్నానం దానం జపో హోమః పితృదేవాభిపూజనమ్, విధిపూర్వం స్మృతం జ్ఞేయం యథేహ కురునందన. ౧౭౦. ఫలదం నృపశార్దూల పురాణశ్రవణం తథా, యథార్థం కథితం తుభ్యం విధినా శ్రవణం మయా. ౧౭౧. యథోక్తం తు యథా జీవం యథోక్తం బ్రహ్మవాదినా, స బ్రాహ్మణో మహారాజ సర్వలోకేషు పూజితః. ౧౭౨. యథాశ్రుతం

భాస్కరమాహాత్మ్యము, వాచకమాహాత్మ్యము, సప్తమీమాహాత్మ్యమును నీకుఁ జెప్పితిని ఈవిధిచేఁ బూజించువాఁడు భగలోకంబునకుం జని యుల్లోకంబులఁ గీర్తినొంది యర్కలోకంబునకుం జని తరువాత చిత్రశిఖండిలోకంబునకుఁ బోయి తరువాత గోలోకమును బొంది సత్యలోకమును బొందును ఈగాధను వినినవారలకు నిఖిలయజ్ఞఫలము గల్గును

ఇది షోడశాధికద్విశతతమాధ్యాయము

శ్రీభవిష్యమహాపురాణంబున మొదటిది యగు

బ్రాహ్మపర్వము సమాప్తము

---

మహాబాహో తథేదం కథితం తవ, భాస్కరస్య తు మాహాత్మ్యం మాహాత్మ్యం వాచకస్య తు ౧౭౩ తథా చ సప్తమీకల్పః సర్వపాపభయాపహః, అనేన విధినా యస్తు పూజయేత్సతతం నరః ౧౭౪ భగలోకం సమాసాద్య త్రిషు లోకేషు గీయతే, తతో౽ర్కలోకమాసాద్య గచ్ఛేచ్చిత్రశిఖండినః ౧౭౫ తస్మాదపి మహాబాహో గచ్ఛేల్లోకం దివాకరమ్, అర్కలోకే తతో యాత స్తతో గోలోకమశ్నుతే ౧౭౬ ఋతస్య చ తతో గచ్ఛేత్కంజజస్య తతః పరమ్, దశానాం రాజసూయానామగ్నిష్టోమశతస్య చ ౧౭౭ శ్రవణాత్ఫలమాప్నోతి పితామహవచో యథా ౧౭౮

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే శతార్ధసాహస్ర్యాం సంహితాయాం
బ్రాహ్మే పర్వణి సప్తమీకల్పే సౌరధర్మే ఆదిత్యమాహాత్మ్య
వాచకమాహాత్మ్యపురాణశ్రవణవిధివర్ణనం నామ
షోడశాధికద్విశతతమో౽ధ్యాయః

పూర్వార్ధః సమాప్తో౽యమ్

శ్రీనారాయణార్పణమస్తు

ఇతి శ్రీభవిష్యే మహాపురాణే ప్రథమం బ్రాహ్మపర్వ సమాప్తమ్

---

చెన్నపురి వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1938.

# సంస్కృత గ్రంథములు.

## ఇతిహాసపురాణములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| కార్తీకమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| దేవీభాగవతము, సవ్యాఖ్యానము | ... | 12 | 0 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యానసహితము 3 సంపుటములు, క్రొత్తకూర్పు | | 30 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము, 2 వాల్యములు | ... | 10 | 0 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము, రెండువాల్యములు, దళసరికాగితములు | | 6 | 0 |
| డిటో సాధారణప్రతి, ఒకటేవాల్యము | ... | 3 | 8 |
| డిటో ఉత్తరకాండము | ... | 1 | 0 |
| డిటో సుందరకాండము, చిన్నసైజు | ... | 1 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు, చిన్నసైజున చక్కగముద్రితము | ... | 15 | 0 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు, 15 వాల్యములు | ... | 70 | 0 |
| డిటో బాలకాండము 2 సంపుటములు | ... | 10 | 0 |
| డిటో అయోధ్యాకాండము 3 ,, | ... | 15 | 0 |
| డిటో అరణ్యకాండము 2 ,, | ... | 10 | 0 |
| డిటో కిష్కింధాకాండము 2 ,, | ... | 10 | 0 |
| డిటో సుందరకాండము 2 ,, | ... | 10 | 0 |
| డిటో యుద్ధకాండము 4 ,, | ... | 20 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహ, ఆంధ్రతాత్పర్యసహితము, 7 వాల్యములు | | 17 | 0 |
| డిటో బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| డిటో అయోధ్యాకాండము ,, | ... | 3 | 0 |
| డిటో అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| డిటో సుందరకాండము ,, | ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| డిటో ఉత్తరకాండము ,, | ... | 2 | 8 |

## వైదికగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము, మేలుప్రతి | ... | 2 | 0 |
| తైత్తిరీయఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము | | 3 | 0 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము—అనేకవిషయముల జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁబరిష్కరించి ముద్రించియున్నాము | | 2 | 0 |
| రుద్రాధ్యాయము, రుద్రభాష్యాంధ్రవివరణసహితము | ... | 1 | 4 |
| వ్రతచూడామణి, (సంస్కృతము) చక్కని ప్రతి | ... | 2 | 0 |
| వ్రతరత్నాకరము, 6 వ్రతములు గలవు | ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, 24 వ్రతములు గలవు | ... | 1 | 0 |

## వేదాంతగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అష్టోత్తరశతోపనిషత్తులు, చక్కనికూర్పు, మూలము | ... | 6 | 0 |
| ఉత్తరగీతా, సాంధ్రటీకాతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 12 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యవివరణసహితము | ... | 2 | 8 |
| కామకలావిలాసము ,, | ... | 2 | 0 |
| గోపికాగీతలు, సవ్యాఖ్యాసాంధ్రపద్యతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| జ్ఞానవాసిష్ఠము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, టీకాతాత్పర్యసహితము | ... | 3 | 8 |
| పంచదశీప్రకరణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 5 | 0 |
| బ్రహ్మసూత్రభాష్యము, (సంస్కృతము) శారీరకమీమాంసాభాష్యముతోడను, శ్రీగోవిందానంద భగవత్పాదవిరచితరత్నప్రభాఖ్యవ్యాఖ్యతోడను, శ్రీసదాశివేంద్రవిరచిత బ్రహ్మతత్వప్రకాశికవృత్తితోడను, గ్రంథాంతమున శ్రీ సుబ్రహ్మణ్యసూరివిరచిత భాష్యార్థరత్నమాలయును చేర్చి ముద్రించినారము | ... | 8 | 0 |
| బ్రహ్మసూత్రార్థచంద్రిక, తెనుఁగువచనము, శ్రీశంకరాచార్యులవారిభాష్యము అందరికిని తెలియుట దుర్లభమని తలఁచి చక్కనిశైలిలో అనేకవృత్తుల ననుసరించి తెనుఁగువ్యాఖ్యానమును ప్రకటించినారము, 2సంపుటములు | | 12 | 0 |
| మహావాక్యదర్పణము, శంకరాచార్యవిరచితము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | | 1 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 0 |
| శివగీతా, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు | ... | 0 | 12 |
| హఠయోగప్రదీపిక, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, మదరాసు.